


- శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రి

# మహాభారతతత్త్వ కథనము



'బాలవ్యాస'

బ్రి. వే. వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

శ్రీ వేదవ్యాసాయ గురవే నమః.

# మహాభారత తత్త్వకథనము.



## అనేకకర్తృత్వ నిరాకరణము.

ప్రథమ భాగము



'బాలవ్యాస, తర్క, వ్యాకరణ, వేదాన్త కేసరి'

వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే

రచియింపబడి,

భట్నవిల్లి గ్రామస్థాపిత శ్రీ శారదాముద్రణాలయమునందు
ముద్రింపబడి,

బులుసు వెంకటశాస్త్రిచే ప్రకటింపబడియె.

ప్రతులు: 1000.

**8—5—1948**

 మూల్యం: **1—4—0.**

# విషయసూచిక.

శ్రీగురుభ్యో నమః.

# ఉపోద్ఘాతము.

"వాగీశాద్యా స్సుమనస స్సర్వార్థానా ముపక్రమే।
యం నత్వా కృతకృత్యా స్స్యు స్తం నమామి గజాననమ్ ॥"

"ఇద మన్ధం తమః కృత్స్నం జాయేత భువనత్రయమ్ ।
యది శబ్దాహ్వయం జ్యోతి రాసంసారం న దీప్యతే ॥
అతః ప్రజానాం వ్యుత్పత్తి మభిసన్ధాయ సూరయః ।
వాచాం విచిత్రమార్గాణాం నిబబన్ధుః క్రియావిధిమ్ ॥"

అను ఆచార్యదండివచనానుసారము దేశాంతరకాలాంతరవర్తులును, ఇంద్రియాగోచరములును అగుపదార్థములను ప్రకాశింపజేయు శబ్దాత్మకజ్యోతిస్సు లేనినాడు యీ భువనత్రయమును అంధకారబంధురమే యనుట నిర్వివాదము. అట్టి శబ్దజాలమునే లోకోపకారమును కోరి ప్రజలయొక్క బుద్ధివైజాత్యమును బట్టి సుగమముగా లోకులు గ్రహించి తరించుట కుపయుక్తముగా మహర్షిప్రభృతులు శాస్త్రకావ్యపురాణేతిహాసరూపమున బహువిధవాఙ్మయము నిర్మించి, మనల ననుగ్రహించిరి.

అందు వేదవ్యాసప్రణీత మగు మహాభారత మొకటి. దీని ప్రాశస్త్యము— "ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ! య దిహాస్తి త దన్యత్ర య న్నేహాస్తి న తత్క్వచిత్ ॥" అను వచనముచే చతుర్విధపురుషార్థములలో నీభారతమందు లేని దేగ్రంథమందు లేదనియు దీనియం దున్నదే గ్రంథాంతరమం దుండె ననియు బోధింపబడుచున్నది.

ఈ యుద్గ్రంథము పఠనశ్రవణప్రక్రియలచే పాపహారమై, ఐహికాముష్మికశ్రేయస్సాధనమై, భారతీయభాగధేయమై భాసించుచున్నదనుట జగద్విదితము.

కాని యార్షవిద్యాసంప్రదాయము దూరమైయున్న యీకాలమందు ఆర్షగ్రంథతాత్పర్యము దుర్జ్ఞేయమగుటచే స్వబుద్ధిప్రాభవమున బరిశీలించువారికి విరుద్ధముగా నుండినట్లు కనబడుటనుబట్టి యీమహాభారతమందు ఇటీవల పాశ్చాత్యవిజ్ఞానసంపన్నులును, తదనుయాయులును అగు కొందరు హస్తనిక్షేపము చేసి సంప్రదాయవిరుద్ధముగా బహిరంగపరీక్ష యను పేరుతో నేమేమో వ్రాసి విమర్శనము లనబడు కొన్ని గ్రంథములను లేవదీసిరి.

అందు సత్యవ్రపండితునిచే హిందీలో వ్రాయబడి, చర్ల నారాయణశాస్త్రిగారిచే నాంధ్రీకరింపబడిన మహాభారతమీమాంస, బంకించంద్రచట్టోపాధ్యాయునిచే వంగభాషలో వ్రాయబడి, బాలాంత్రపు సూర్యనారాయణరావుగారిచే నాంధ్రీకరింపబడిన శ్రీకృష్ణచరిత్రము, కోటమర్తి చినరఘుపతిరావుగారి సుయోధనవిజయము, పెండ్యాల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారి మహాభారతచరిత్రము ఇత్యాదులు కలవు.

ఈ విమర్శనము లుద్భవించి యీ మహాభారతమందు నిరూఢమగు లోకవిశ్వాసమును సడలింప మొదలిడినవి. అట్లావిశ్వాసము సడలుటచే గ్రంథకర్తయగు మహర్షికి గూడ నజ్ఞత నాపాదించుటకు లోకము సిద్ధపడుచున్నది.

ఆహా! మన మేమాత్రమైనను లోకోత్తరమగు విజ్ఞానము నార్జింపగలిగితి మేని యది యార్షగ్రంథమూలకమే యని మున్ముందుకే చెప్పక తప్పదు.

అట్టి యసాధారణము లగు గ్రంథరత్నములను లోకానుగ్రహ బుద్ధితో మన కొసగిన మహర్షిప్రవరులయెడ మనము యావజ్జీవము జూపవలసియున్న కృతజ్ఞతకు బదులు కృతఘ్నత నాశ్రయించి వారల దూషించుటకు గూడ సిద్ధపడుటకంటె పాపకార్య మేమున్నది? కనుక నార్షవిద్యాసంప్రదాయప్రవర్తకులలో నాచార్యపీఠము నధిష్ఠించి, యార్షవిద్యోపజీవుల కహరహస్స్మరణీయుడై యున్న వేదవ్యాసమునీంద్రుని మహాభారతమందు నవ్యుల విమర్శనములచే ప్రదర్శింపబడిన సంప్రదాయవిరుద్ధాంశములకు యథామతి గొన్ని సమాధానములు చూపి యా ఋషిఋణము నేమాత్రము నైన తీర్చుకొనవలె ననుతలంపుతో నీ 'మహాభారతతత్త్వకథనము' అను గ్రంథము వ్రాయబూనితిని. పై జూపబడిన విమర్శనగ్రంథములలో కడపటి దగు మహాభారతచరిత్రముపై ఖండనములు—

1. 'పండితప్రవర' మల్లాది రామకృష్ణవిద్వచ్ఛ్రయనులవారి 'మహాభారతకథాతత్త్వనిర్ణయము' 2. మహామహోపాధ్యాయ, కవిసార్వభౌమ శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రిగారి 'మహాభారతచరిత్రనిరాకరణము' 3. శిష్ట్లా సూర్యనారాయణశాస్త్రిగారి 'మహాభారతరహస్యము' మున్నగునవి బయలువెడలినవి. ఈ మూడవ మహాభారతరహస్యమందు గూడ విరుద్ధాంశము లుండుటచే కవిసార్వభౌములచేతనే 'మహాభారతరహస్యవిమర్శనము' అను గ్రంథము కూడ వ్రాయబడినది. ఐనను సంప్రదాయసిద్ధార్థమునకు ప్రమాణసమ్మతిని; ప్రతివాదమునకు ప్రమాణవిరోధమును ప్రతిపాదించు పద్ధతిని వ్రాయబడెడి యీగ్రంథము విశేషాంశములను బోధింపగలుగుటచే పాఠకలోకమున కావశ్యకమే యని తోచకపోదని నా నమ్మకము.

వైదికమార్గప్రకాశక మగు మహాభారతమును గూర్చి అక్రమప్రసంగములు జరుగుచుండ శక్తికొలది నివారింపబూని యీగ్రం

థరచనలో బ్రవర్తించితిని. ఈ ప్రవృత్తికి మూలమీ యార్షవచనములే—

"స్థాపయధ్వ మిమం మార్గం ప్రయత్నే నాపి హే ద్విజాః!
స్థాపితే వైదికే మార్గే సకలం సుస్థిరం భవేత్ ॥
యో హి స్థాపయితుం శక్తో న కుర్యా న్మోహితో జనః ।
తస్య హన్తా న పాపీయా నితి వేదాంతనిర్ణయః ॥
యః స్థాపయితు ముద్యుక్త శ్శ్రద్ధ యైవాక్షమోఽపి సన్ ।
సర్వపాపవినిర్ముక్త స్సాక్షా జ్జ్ఞాన మవాప్నుయాత్ ॥
యస్తు విద్యాభిమానేన వేదమార్గప్రవర్తకమ్ ।
ఛలజాత్యాదిభి ర్జియా త్స మహాపాతకీ భవేత్ ॥

ఇచ్చట వైదికమార్గమును స్థాపింపు డనియు, నది స్థాపింపబడిన సకలము స్థిరపడుననియు, దానిని స్థాపింపసమర్థుడై యుండి యెవ్వ డుపేక్షించునో వాని నేమి చేసినను పాపము లేదని వేదాంతనిర్ణయ మనియు, అసమర్థుడైనను శ్రద్ధతో వైదికమార్గమును స్థాపింప నుద్యమించువాడు పాపవిముక్తుడై జ్ఞానమును పొందు ననియు, వేదమార్గ ప్రవర్తకుని అక్రమమార్గముల నోడించువాడు మహాపాతకి యగు ననియు నుపదేశింపబడినది.

ఇందు అశక్తుడైనను శ్రద్ధతో వేదమార్గమును స్థాపింప నుద్యమించువాడు పాపవిముక్తు డగును. అన్న యుపదేశమే యీగ్రంథ రచనలో నేనుద్యమించుటకు మూలము.

ఇట్లు:
గ్రంథకర్త.



శుభమస్తు.

అవిఘ్నమస్తు

# మహాభారతతత్త్వకథనము.

## అనేక కర్తృత్వ నిరాకరణము.



'జయతి పరాశరసూను స్సత్యవతీహృదయనన్దనో వ్యాసః ।
యస్యాస్యకమలగళితం వాఙ్మయ మమృతం జగ త్పిబతి ॥

'నమోఽస్తు తే వ్యాసవిశాలబుద్ధే!
ఫుల్లారవిన్దాయతపత్రనేత్ర! ।
యేన త్వయా భారతతైలపూర్ణః
ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః ॥

సమ్య గ్జ్ఞాయకలాపేన మహతా భారతేన చ ।
ఉపబృంహితవేదాయ నమో వ్యాసాయ విష్ణవే ॥''

పరమకారుణికుడును, పరాశరపుత్రుడును అగు శ్రీమద్వేదవ్యాసమహర్షి లోకానుగ్రహతత్పరుడై చతుర్దశవిద్యాస్థానరహస్యముల నొక్కచోట బ్రదర్శించుచు, మందమధ్యమాధికారులనుగూడ ననుగ్రహించుటకై వైశంపాయనజనమేజయసంవాదరూపమునను సౌతిశౌనకసంవాదరూపమునను హరివంశాంతము లక్షగ్రంథాత్మకమై హరివంశముకాక అష్టాదశమహాపర్వములును, హరివంశముతోగూడ నవాంతరపర్వశతమును కల మహాభారత మను ఇతిహాసమును సాక్షాద్గణపతి లేఖకత్వమున రచించి యీ మనుష్యలోకమున బ్రతిష్ఠింపజేసెను.

ఈగ్రంథము—"భారతం పంచమో వేదః" అనియు, "సర్వ శ్రుతిసమూహోఽయం" అనియు గీర్తింపబడుటచే వేదార్థవివరణరూపమైన ప్రమాణగ్రంథ మనుటలో సంశయము లేదు. ఇట్టి యీమహాభారతము శబ్దార్థగాంభీర్యయుక్తమై మూలమాత్రావలోకనమున దురవగాహమై, సకలశాస్త్రసంప్రదాయసమంచితమై, అజ్ఞాతాశ్చర్యకరానేకాంశోపశోభితమై, అతీంద్రియపదార్థప్రకాశకమై, జగద్ధితమై, విద్వన్మనోజ్ఞమై విరాజిల్లుచున్నది

దీనికి అనేకటీక లున్నను ప్రస్తుతము సంపూర్ణముగా మన కుపలబ్ధమగుచు క్లిష్టస్థలములయందు విపులముగా చర్చించి శంకానిరాకరణపూర్వకముగా ప్రమాణప్రదర్శనముతో సిద్ధాంతమును నిరూపించుచున్నది నీలకంఠీయటీకయే. ఆటీకాకారుడు ఆదియం దిట్లు వ్రాసెను—

"బహూ న్ సమాహృత్య విభిన్నదేశ్యా న్
కోశా న్ వినిశ్చిత్య చ పాఠ మగ్ర్యమ్।
ప్రాచాం గురూణా మనుసృత్య వాచ
మారభ్యతే భారతభావదీపః"

భిన్నదేశములం దున్న బహుకోశములను సంగ్రహించి సాంప్రదాయికమగు పాఠము నిశ్చయించి గురుపరంపరోపదిష్టము లగు వాక్యముల నాధారము చేసికొని 'భారతభావదీపము' అను టీకను ఆరంభించుచున్నాను. అని తాత్పర్యము

దీనిచే, టీకాకారుడు తనకు లభించిన యేదో యొక కోశమందలి పాఠమును బట్టుకొని తనకు తోచినట్లు ఏదోవిధముగా వ్రాసిన టీక కాక నానాదేశీయబహుగ్రంథపర్యాలోచనముతో సాంప్రదాయికపాఠనిర్ణయముతో గురుపరంపరాప్రసిద్ధమగు ప్రామాణికార్థమును పూర్వోత్తరసందర్భశుద్ధితో నిరూపించుచు వ్రాసినదే యీటీక యని స్పష్ట మగుచున్నది.

కావున మహాభారత తాత్పర్యజిజ్ఞాసువులకు ఈటీక అవశ్యాశ్రయణీయము. అందుచే నీలకంఠీయటీకానుసారముగనే మహాభారతమును గూర్చి మనము కొన్ని మాట లనుకొందము.

## —♦ మహాభారతనామనిర్వచనము ♦—

"ఏకత శ్చతురో వేదా భారతం చైత దేకతః ।
(అ।)పురా కిల సురై స్సర్వై స్సమేత్య తులయా ధృతమ్ ॥
చతుర్భ్య స్సరహస్యేభ్యో వేదేభ్యో హ్యాధికం యదా ।
తదాప్రభృతి లోకేఽస్మిన్ మహాభారత ముచ్యతే ॥
మహత్త్వేచ గురుత్వేచ ధ్రియమాణం యతోఽధికమ్
మహత్త్వా ద్భారవత్త్వా చ్చ మహాభారత ముచ్యతే"

దేవతలు చతుర్వేదములను భారతమును న్యూనాధికభావమున బరీక్షింప నుపనిషత్తులతో గూడిన చతుర్వేదములకంటె అర్థగౌరవరూపమగు నాధిక్యము శబ్దాధిక్యము దీనియం దుండుటచే నీభారతమే మహాభారతమని చెప్పబడుచున్నదని తాత్పర్యము.

దీనిచే, భారతము మహాభారతము భిన్నగ్రంథములు కాక యేకగ్రంథమే యని మనకు స్పష్టమైనది.

## —♦ మహాభారతరచనాపద్ధతి ♦—

ఈ మహాభారతరచనాపద్ధతిని గూర్చి గ్రంథమందిట్లు చెప్పబడినది—

"ఇతిహాసా స్సవైఖ్యా వివిధా శ్శ్రుతయోఽపిచ ।
ఇహ సర్వమనుక్రాన్త ముక్తం గ్రన్థస్య లక్షణమ్ ॥
విస్తీర్యైత న్మహజ్జ్ఞాన మృషి స్సంక్షిప్య చాబ్రవీత్ ।
దృష్టం హి విదుషాం లోకే సమాసవ్యాసధారణమ్"

టీ "సవైయాఖ్యాః వ్యాఖ్యాన మధికృత్య కృతో గ్రన్థః వైయాఖ్యః. తద్యుక్తాః । యథా—"బ్రహ్మవి దాప్నోతి పరమ్" ఇతి సూత్రస్య వ్యాఖ్యా 'సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ' ఇతి మన్త్రః। అనువ్యాఖ్యానం । 'తస్మా ద్వా ఏతస్మాత్' ఇతి బ్రాహ్మణమ్ । ఏవ మత్రాపి ప్రథమేఽధ్యాయే సూత్రిత తస్యార్థస్య ద్వితీయతృతీయాభ్యాం వ్యాఖ్యాన ముత్తరగ్రన్థే నాఽనువ్యాఖ్యానం చ ।

అనగా వ్యాఖ్యానము నుద్దేశించి చెప్పబడిన గ్రంథము వైయాఖ్య మనబడును. ఆవైయాఖ్యముతో గూడినవి సవైయాఖ్యములు. (కుంభకోణపుప్రతిలో 'సహ వ్యాఖ్యాః' అని పాఠ మున్నది ) కనుక వ్యాఖ్యానరూపములైన యుపాఖ్యానములతో గూడిన యితిహాసములును, వివిధశ్రుతులును యీ గ్రంథమందు ప్రతిపాదింపబడినవి. ఆనందవల్లిలో 'బ్రహ్మవి దాప్నోతి పరమ్' అనునది యీ వల్లికంతకు సూత్రభూతము. దానికి 'సత్యం జ్ఞానమ్' అను మంత్రము వ్యాఖ్యానము; 'తస్మా ద్వా ఏతస్మాత్' అను బ్రాహ్మణము అనువ్యాఖ్యానము. అట్లే యీ మహాభారతమందు ప్రథమాధ్యాయము సూత్రభూతము; ద్వితీయతృతీయములు వ్యాఖ్యానభూతములు; ఉత్తరగ్రంథమనువ్యాఖ్యానము.

లోకమందు విద్వాంసులకు సంక్షేపించియు, విస్తరించియు గ్రంథధారణము దృష్టమే కనుక వ్యాసమహర్షి మహాత్మ్యము కలదై జ్ఞానప్రదమైన యీ గ్రంథమును సంక్షేపించియు, విస్తరించియు చెప్పెను. అని తాత్పర్యము.

దీనిచే ఆనందవల్లియందు 'బ్రహ్మవి దాప్నోతి పరమ్' అను వాక్య మొకకాలమందును, 'సత్యం జ్ఞానమ్' అనునది మఱియొక కాలమందును, 'తస్మా ద్వా ఏతస్మాత్' ఇత్యాదికము వేఱొక కాలమం

దును ఆవిర్భవింపక ఆవల్లి యంతయు నారూపముతో నేకకాలమందే యావిర్భవించినట్లు యీమహాభారతముకూడ నేకకాలమునందే యథాశ్రుతరూపముతో వ్యాసమహర్షి చేతనే యావిర్భూతమైనదని యర్థము.

ఈపద్ధతి యొక్క మహాభారతమందే కాక ఆర్ష గ్రంథములయందు సుప్రసిద్ధమే. వాల్మీకిరామాయణమందు ప్రథమసర్గ మగు బాలరామాయణము సూత్రభూత మనియు పైగ్రంథము దానికి వ్యాఖ్యానభూత మనియు తజ్జ్ఞులకు విదితమే. భగవద్గీతలోగూడ పంచమాధ్యాయాంతమందు "స్పర్శాన్ కృత్వా బహిర్బాహ్యాన్" ఇత్యాదిశ్లోకత్రయముచే ధ్యానయోగమును సూత్రప్రాయముగా జెప్పి దానినే షష్ఠాధ్యాయములో విస్తరించి చెప్పెను. ఈవిషయమై షష్ఠాధ్యాయారంభమందు శాంకరభాష్య మిట్లున్నది—

"అతీతానన్తరాధ్యాయాన్తే ధ్యానయోగస్య సమ్యగ్దర్శనం ప్రత్యన్తరఙ్గస్య సూత్రభూతా శ్లోకాః 'స్పర్శాన్ కృత్వా బహిః" ఇత్యాదయ ఉపదిష్టా స్తేషాం వృత్తిస్థానీయోఽయం షష్ఠాధ్యాయ ఆరభ్యతే"

ఇట్లు చూడగా మొదట సూత్రప్రాయముగా జెప్పి తరువాత దానినివివరించి చెప్పుచుండుట ఆర్షగ్రంథలక్షణ మని విజ్ఞులకు విదితమే. కనుక నీమహాభారతము కూడ నట్టి రచనతో కలిగి యున్నదనుట అపూర్వము కాదు.

## — •మహాభారతకర్తృ ప్రభావము •—

ఇక మనము మహాభారతకర్తృప్రభావమును గూడ నొకింత గ్రహింపవలసియున్నది. అది యిట్లు చెప్పబడినది—

"భూతస్థానాని సర్వాణి రహస్యం త్రివిధం చ యత్।

వేదా యోగ స్సవిజ్ఞానో ధర్మోఽర్థః కామ ఏవచ॥
ధర్మకామార్థయుక్తాని శాస్త్రాణి వివిధాని చ।
లోకయాత్రావిధానం చ సర్వం తద్దృష్టవా నృషిః॥ (అ. 1.)

అనగా దుర్గనగరాదులను, తీర్థక్షేత్రాదులను, ధర్మార్థకామ రహస్యములను, కర్మకాండమును, ఉపాసనాకాండమును, జ్ఞానకాండమును, స్మార్తధర్మమును, లోకప్రసిద్ధములగు అర్థకామములను, ధర్మార్థకామప్రతిపాదకములగు వివిధశాస్త్రములను, లోకయాత్రానిర్వాహకములగు ఆయుర్వేదధనుర్వేదగాంధర్వవేదముల విధులను, సర్వమును యోగశక్తిచే మహర్షి ప్రత్యక్షము చేసికొనెను. అని తాత్పర్యము. మఱియు సౌతి శౌనకున కిట్లు చెప్పెను—

"ఏత త్తే సర్వ మాఖ్యాతం వైశంపాయనకీర్తితమ్।
వ్యాసాజ్ఞయా సమాజ్ఞాతం సర్పసత్రే నృపస్య హి॥
పుణ్యోఽయ మితిహాసాఖ్యః పవిత్రం చేద ముత్తమమ్।
కృష్ణేన మునినా విప్ర నిర్మితం సత్యవాదినా॥
సర్వజ్ఞేన విధిజ్ఞేన ధర్మజ్ఞానవతా సతా।
అతీన్ద్రియేణ శుచినా తపసా భావితాత్మనా॥
ఐశ్వర్యే వర్తతా చైవ సాంఖ్యయోగవతా తథా।
నైకతంత్రవిబుద్ధేన దృష్ట్వా దివ్యేన చక్షుషా॥
కీర్తిం ప్రథయతా లోకే పాండవానాం మహాత్మనామ్॥
అన్యేషాం క్షత్రియాణాం చ భూరిద్రవిణతేజసామ్।
క్రీడాంచ వాసుదేవస్య దేవదేవస్య శార్ఙ్గిణః॥
విశ్వేషాం దేవభాగానాంజన్మసాయుజ్యమేవచ।"(స్వర్గ.ప. శ్లో 34-39)

శౌనకమహర్షీ! జనమేజయుని సర్పసత్రమందు వ్యాసమహర్షి యాజ్ఞచే వైశంపాయనకీర్తితమై చక్కఁగా దెలిసికొనబడిన దీనినంతను

నీకు చెప్పితిని. ఈయితిహాసము పుణ్యమైనది. పవిత్రము, సర్వోత్తమము అగునీగ్రంథము సత్యవాది, సర్వజ్ఞుడు, విధిజ్ఞుడు, ధర్మజ్ఞుడు, అతీంద్రియవిషయవిశేషజ్ఞుడు, శుచి, తపశ్శుద్ధుడు, ఐశ్వర్యోపేతుడు, సాంఖ్యయోగనిరూఢుడు, నానాతంత్రనిష్ణాతుడు నగు వేదవ్యాసమహర్షిచే దివ్యదృష్టితో జూచి మహాత్ములగు పాండవులయొక్కయు, ఘనతేజస్సమృద్ధు లగు అన్యక్షత్రియులయొక్కయు కీర్తిని, దేవదేవుడగు వాసుదేవుని క్రీడను, దేవాంశజాతులగు నందఱియొక్క జన్మము క్తులను లోకమందు విస్తరింపజేయ దలచి యీయితిహాసము నిర్మింపబడినది అని చెప్పెను.

దీనిచే మనమహాభారతకర్త ప్రామాణికమూర్ధన్యుడనియు, మహాప్రభావసంపన్నుడనియు, భ్రమప్రమాదరహితుడనియు, ధర్మసూక్ష్మాభిజ్ఞుడనియు, తత్త్వకథనతత్పరుడనియు స్పష్టమైనది. మఱియు ధృతరాష్ట్రుడాశ్రమవాసియైయుండ వ్యాసమహర్షి సాక్షాత్కరించి యిట్లనెను—

"సంశయచ్ఛేదనార్థాయ ప్రాప్తం మాం విద్ధి పుత్రక!
న కృతం యైః పురా కైశ్చిత్కర్మ లోకే మహర్షిభిః॥
ఆశ్చర్యభూతం తపసః ఫలం తద్దర్శయామి వః।
కి మిచ్ఛసి మహీపాల మత్తః ప్రాప్తు మభీప్సితమ్॥
ద్రష్టుం స్ప్రష్టు మథ శ్రోతుం తత్కర్తాస్మి తవానఘ!"

వత్సా! నీసంశయనివారణార్థము వచ్చితిని. ఇంతకు పూర్వమేమహర్షులచేతను లోకమందేపని చేయబడియుండలేదో అట్టి ఆశ్చర్యకరమగు కార్యమును తపశ్శక్తిచే నీకు ప్రదర్శించుచున్నాడను. నీవు దేనియొక్క ప్రాప్తినికాని, దర్శనమునుకాని, స్పర్శనమునుకాని, శ్రవణమునుకాని కోరెదవో అద్దానిని నీకు కలుగజేయుదును. ఇట్లు చెప్ప

గా 'యుద్ధమందు మరణించినవారిని జూచగోరిక కల'దని తెలిపినంతనే నాటి రాత్రియందు మహర్షి గంగాజలమం దవగాహనము చేసి యా హ్వానింప కురుపాండవపక్షములలోనివా రందఱు యథాపూర్వముగా స్త్రీయాభరణాయుధవాహనాదులతో గంగాజలమునుండి యావిర్భవించి తీరము జేరగా మహర్షిచే గటాక్షింపబడిన దివ్యదృష్టిచే ధృతరాష్ట్రుడు అందఱితో బ్రసంగించుచు నారాత్రి యంతయు గడపెను. (ఈగాథా విశేషము ముందు వేదవ్యాసనిందానిరాకరణఘట్టములో విపులముగా తెలుపబడును)

ఇట్టివృత్తాంతమును వైశంపాయనుడు చెప్పగా వినుచుండిన జనమేజయునకు "ఇట్లుండునా?" అని సందేహము కలిగి వైశంపాయనునితో నిట్లనెను-

"మమాపి వరదో వ్యాసో దర్శయే త్పితరం యది।
తద్రూపవేషవయసం శ్రద్దధ్యాం సర్వ మేవ తత్॥
ప్రసాదా దృషిముఖ్యస్య మమ కామ స్సమృధ్యతామ్!"

వరదుడగు వ్యాసమహర్షి నాకుగూడ నాతండ్రిని ఆరూపవేషవయస్సులతో జూపునేని దానినంతను నేను విశ్వసింతును. ఋషిముఖ్యుని కటాక్షమున నాకోరిక యీడేరుగాక.

అనుచు తన యుత్కంఠేచ్ఛను వెల్లడించునంతలో వేదవ్యాసమహర్షి ప్రత్యక్షమై అట్లే పరీక్షిత్తును కనుపఱుపగా—

"తత స్తద్రూపవయస మాగతం నృపతిం దివః।
శ్రీమన్తం పితరం రాజా దదర్శ స పరీక్షితమ్॥"

తాను కోరినట్లే యుండి స్వర్గమునుండి వచ్చి ప్రత్యక్షమైన తండ్రియగు పరీక్షిత్తును జనమేజయుడు సందర్శించెను.

పాఠకులారా! ఈయాశ్రమవాసికపర్వవృత్తాంతముచే మన వ్యాసమహర్షి యొక్క అనితరసాధారణతపఃప్రభావము మనకు స్పష్టమైనది. ఈమహానీయుడే మన మహాభారతేతిహాసకర్త. కనుక నీమహాభారతము తెలిసినదికొంత; తెలియనిదికొంత; వినినదికొంత; కనినదికొంతకల్పించినది కొంతయుజేర్చి గ్రంథప్రతిపాద్యవ్యక్తులకు స్వభావవిరుద్ధాంశములగూర్చి చర్మచక్షుస్సులచే గ్రహించి మలినాంతఃకరణములచే నూహించి ధర్మసేతువుల నుల్లంఘించి ధనసంగ్రహేచ్ఛతో నధునాతనులచే రంచింప బడెడి క్షుద్రగ్రంథములవంటిదికాక యోగబలము, తపశ్శక్తి, దివ్యదృష్టి, యనుపరికరముతో, కాలాంతరదేశాంతరవస్తుసాక్షాత్కారముతో, తత్తద్వ్యక్తిహృదయగ్రహణముతో, వివిధవేదార్థపరిష్కరణముతో, యథార్థేతివృత్తముతో, లోకానుగ్రహేచ్ఛతో, రచింపబడిన దీపవిత్రగ్రంథ మని యీగ్రంథకర్తృప్రభావమును గ్రంథస్వభావమును స్పష్టముగా గ్రహించితిమి.

—♦ గ్రంథాంతరస్థమహాభారతప్రశంస ♦—

ఇక మహాభారతమంతయు వ్యాసమహర్షిప్రణీతమే అనువిషయము గ్రంథాంతరసంవాదముతోగూడ గ్రహింతము-

మార్కండేయపురాణము. అ1.

"తపస్స్వాధ్యాయనిరతం మార్కండేయం మహామునిమ్।
వ్యాసశిష్యో మహాతేజా జైమినిః పర్యపృచ్ఛత॥
భగవన్! భారతాఖ్యానం వ్యాసేనోక్తం మహాత్మనా।
పూర్ణ మస్తమలై శ్శుభ్రై ర్నానాశాస్త్రసముచ్చయైః॥
జాతిశుద్ధసమాయుక్తం సాధుశబ్దోపశోభితమ్।
పూర్వపక్షోక్తిసిద్ధాన్తపరినిష్ఠాసమన్వితమ్॥
త్రిదశానాం యథావిష్ణు ర్ద్విపదాం బ్రాహ్మణో యథా।

భూషణానాంచ సర్వేషాం యథా చూడామణి ర్వరః॥
యథాయుధానాం కులిశ మింద్రియాణాం యథా మనః।
తథేహ సర్వశాస్త్రాణాం మహాభారత ముత్తమమ్॥
అత్రార్థశ్చైవ ధర్మశ్చ కామో మోక్షశ్చ వర్ణ్యతే।
పరస్పరానుబద్ధాశ్చ సానుబంధాశ్చ తే పృథక్॥
ధర్మశాస్త్ర మిదం శ్రేష్ఠ మర్థశాస్త్ర మిదం పరమ్।
కామశాస్త్ర మిదం చాగ్ర్యం మోక్షశాస్త్రం తథోత్తమమ్॥
చతురాశ్రమధర్మాణా మాచారస్థితిసాధనమ్।
ప్రోక్త మేత న్మహాభాగ వేదవ్యాసేన ధీమతా॥
తథా తాతకృతం హ్యేత ద్వ్యాసే నోదారకర్మణా।
యథా వ్యాప్తం మహాశాస్త్రం విరోధై ర్నాభిభూయతే॥
వ్యాసవాక్యజలౌఘేన కుతర్క-తరుహారిణా।
వేదశైలావతీర్ణేన నీరజస్కా మహీ కృతా॥
కలశబ్దమహాహంసం మహాఖ్యానపరాంబుజమ్।
కథావిస్తీర్ణసలిలం కార్ష్ణం వేదం మహాహ్రదమ్॥
తదిదం భారతాఖ్యానం బహ్వర్థశ్రుతివిస్తరమ్।
తత్త్వతో జ్ఞాతుకామోఽహం భగవం స్త్వా ముపస్థితః॥"

తపస్స్వాధ్యాయనిరతు డగు మార్కండేయమహర్షిని వ్యాస శిష్యుడు, మహాతేజశ్శాలియునగు జైమినిముని సమీపించి యిట్లనెను- మహర్షీ! వ్యాసప్రోక్తమగు భారతాఖ్యానము పరిశుద్ధములగు శాస్త్రస ముచ్చయములతో పూరింపబడియున్నది. పూర్వపక్షసిద్ధాంతశోభి తమై, సర్వశాస్త్రసారమై యీమహాభారత మొప్పుచున్నది. దీనియందు ధర్మార్థకామమోక్షములు వేర్వేరుగను, పరస్పరానుబంధముగను వర్ణింపబడుటచే నిది ధర్మశాస్త్రము, అర్థశాస్త్రము, కామశాస్త్రము, మోక్షశాస్త్రము నైయున్నది. చతురాశ్రమధర్మసాధనమైన యీగ్రం

థము విరోధములకు ప్రసక్తి లేకుండునట్లు ఉదారహృదయుడగు మహా గ్నిచే రచింపబడినది. వేదపర్వతమునుండి యవతరించి కుతర్కతరువుల నున్మూలించెడి వ్యాసవాక్యజలప్రవాహముచే భూమియందు రజస్సు అంతరింపజేయబడినది. యీకార్ష్ణవేద మను మహాహ్రదము మధుర శబ్దము లను మహాహంసములు, మహోపాఖ్యానము లను పద్మములు, విస్తృతకథ లను జలము కలిగి యున్నది అని తాత్పర్యము.

దీనిచే నుపాఖ్యానసహితమగు మహాభారతము వ్యాసప్రణీతమే యనియు, భారతమహాభారతనామములు కలది యొక్కగ్రంథమే యని యు, నందు విరోధము లేమియు లేవనియు, అది సకలశాస్త్రసంప్రదా యసమన్వితమై యున్న దనియు తేలినది.

—♦ సూతసంహిత — అ॥ 1. ♦ —

"వ్యస్తవేదతయా వ్యాస ఇతి లోకే ప్రుతో మునిః।
అయం సాక్షా న్మహాయోగీ వ్యాస స్సర్వజ్ఞ ఈశ్వరః॥
మహాభారత మాశ్చర్యం నిర్మమే భగవాన్ గురుః।"

విష్ణుపురాణము:— అ॥ 3.

"కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుమ్।
కో హ్యన్యః పుండరీకాక్షా న్మహాభారతకృ ద్భవేత్॥ "

దేవీ భాగవతము— అ॥ 3.

"అష్టాదశపురాణాని కృత్వా సత్యవతీసుతః।
భారతాఖ్యాన మతులం చక్రే తదుపబృంహితమ్॥"

పద్మపురాణము — సృష్టిఖండము. అ: 1.

మతిమంథాన మావిధ్య యేనాస్మా చ్ఛ్రుతిసాగరాత్।

ప్రకాశో జనితో లోకే మహాభారతచంద్రమాః॥
భారతం భానుమా నిన్దు ర్యది న స్యు రమీ త్రయః।
తతోఽజ్ఞానతమోన్ధస్య కాఽవస్థా జగతో భవేత్ ॥
కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుమ్।
కో హ్యన్యః పుండరీకాక్షా న్మహాభారతకృ ద్భవేత్॥ ''

శ్రీమద్భాగవతము—స్క॥ 1. అ॥ 5.

"స్త్రీశూద్రద్విజబంధూనాం త్రయీ న శ్రుతిగోచరా।
కర్మశ్రేయసి మూఢానాం శ్రేయ ఏవం భవే దిహ॥
ఇతి భారత మాఖ్యానం కృపయా మునినా కృతమ్। ''

మత్స్యపురాణము— అ॥ 55.

అష్టాదశపురాణాని కృత్వా సత్యవతీసుతః।
భారతాఖ్యాన మఖిలం చక్రే తదుపబృంహితమ్॥
లక్షే ణైకేన యత్ప్రోక్తం వేదార్థపరిబృంహితమ్।''

పద్మపురాణము.

''నిస్తారయతు లోకానాం స్వయం నారాయణః ప్రభుః।
వ్యాసరూపేణ కృతవా న్పురాణాని మహీతలే॥
పఠనా చ్ఛ్రవణా ద్యేషాం నృణాం పాపక్షయో భవేత్।
ధర్మాధర్మపరిజ్ఞానం సదాచారప్రవర్తనమ్॥
గతిశ్చ పరమా తద్వ ద్భక్తి ర్భగవతి ప్రభౌ।
తాని తే కథయిష్యామి సప్రమాణాని భూతలే॥
పురాణాని చతుర్లక్షా ణ్యేతాని ధరణీతలే।
తథా మహాభారతం చ లక్షసంఖ్యం ప్రకీర్తితమ్॥''

స్కాందము-ప్రభాసఖండము. అ॥2.

"అష్టాదశపురాణాని కృత్వా సత్యవతీసుతః।
భారతాఖ్యాన మకరోత్ వేదార్థై రుపబృంహితమ్॥
లక్షేణైకేన త త్ప్రోక్తం ద్వాపరాన్తే మహాత్మనా।"

శౌనకోక్తచరణవ్యూహపరిశిష్టము. ఖం॥ 5.

"లక్షం తు చతురో వేదా లక్షం భారత మేవచ।"

గీతాధ్యాయాంతగ్రంథము.

"శ్రీమహాభారతే శతసాహస్ర్యాంసంహితాయాం వైయాసిక్యాం"

ఆర్యాసప్తశతి-(గోవర్ధనాచార్యః-1080-1140 మధ్య)

"వ్యాసగిరాం నిర్యాసం సారం విశ్వస్య భారతం వన్దే।
భూషణతయైవ సంజ్ఞాం యదంకితాం భారతీ వహతి॥"

ఈవచనము లన్నియు వేదవ్యాసమహర్షి నారాయణస్వరూపు డనియు, ఆత డష్టాదశపురాణములు రచించి వేదార్థప్రకాశకము, శ్రేయోదాయకము నగు మహాభారతమును రచించెననియు, నామహాభారతము అంధకారము నణచు సూర్యచంద్రులవలె నజ్ఞానాంధకారము నణచుచుండుటచే లోకోపకారకమనియు, నది లక్షగ్రంథాత్మకమనియు, ద్వాపరాంతమందు రచింపబడె ననియు, భారతమహాభారత నామములుకల గ్రంథ మొక్కటే యనియు నైకకంఠ్యముతో నుద్ఘోషించుచున్నవి.

ఇట్లు మహర్షిని గూర్చియు, మహాభారతమును గూర్చియు నిస్సంశయముగా నార్షగ్రంథములు మనకు బోధించుచుండ వానిని విశ్వసింపక కొంద ఱాధునికు లపమార్గమున బడి స్వబుద్ధిప్రాభవమాత్రమున విమర్శింపమొదలిడి మహర్షియొక్కయు, మహాభారతము యొక్కయు పేరు లేకుండ జేయువలెనని యెంచియో, అట్లు వ్రాసినగాని తమకు పేరు రాదని యెంచియో తలక్రిందుగా గొన్ని పుస్తకము

లను వ్రాసియుండిరి. మన మాపుస్తకములను పరామర్శించుచు వారి విమర్శనపాటవ మేపాటిదో కొంచెము పరీక్షింతము.

—♦ ప్రతివాదిప్రసంగపరామర్శము ♦—

మహాభారతమునకు వేదవ్యాసమహర్షి యొక్కడే కర్త కాడనియు, వ్యాసుడు, వైశంపాయనుడు, సౌతి యను ముగ్గురు కర్తలనియు, నందు వ్యాసుడు వ్రాసిన గ్రంథమునకు జయ మనియు, వైశంపాయనుడు వ్రాసిన గ్రంథమునకు భారత మనియు, సౌతి వ్రాసిన గ్రంథమునకు మహాభారత మనియు పేర్లనియు, ఆమహాభారతములోనే జయము, భారతము ఇమిడి యుండె ననియు, నవి విడదీయుటకు వీలుగా లేవనియు, నీసంగతు లాశ్వలాయనసూత్ర, మహాభారతవచనములచే స్పష్టమగుచుండె ననియు 'మహాభారతమీమాంస' 'శ్రీకృష్ణచరిత్రము' 'మహాభారతచరిత్రము' మున్నగు గ్రంథములు ప్రతిపాదించు చున్నవి. అందు ప్రదర్శింపబడిన ప్రమాణము లీవిధముగా నున్నవి:—

(1) "వేదా నధ్యాపయామాస మహాభారతపంచమాన్ ।
సుమన్తుం జైమినిం పైలం శుకం చైవ స్వ మాత్మజమ్ ॥
"ప్రభు ర్వరిష్ఠో వరదో వైశంపాయన మేవ చ ।
సంహితా స్తైః పృథక్త్వేన భారతస్య ప్రకాశితాః ॥" (ఆదిపర్వము)

(2) 'సుమంతు జైమిని వైశంపాయన పైల సూత్రభాష్య భారత మహాభారత ధర్మాచార్యాః'

(3) "అస్మింస్తు మానుషే లోకే వైశంపాయన ఉక్తవాన్ ।
ఏకం శతసహస్రన్తు మయోక్తం వై నిబోధత ॥"

(అనుక్రమణికాధ్యాయము)

(4) "ఇదం శతసహస్రాఖ్యం శ్లోకానాం పుణ్యకర్మణామ్ ।

ఉపాఖ్యానై స్సహ జ్ఞేయం శ్రావ్యం భారత ముత్తమమ్ ।
చతుర్వింశతిసాహస్రీం చక్రే భారతసంహితామ్ ।
ఉపాఖ్యానై ర్వినై తావ ద్భారతం ప్రోచ్యతే బుధైః ।
తతో౽ధ్యర్థశతం భూయ స్సంక్షేపం కృతవా నృషిః ॥" (ఆది. అ1)

(5) "మన్వాదిభారతం కేచి దాస్తీకాది తథా౽పరే ।
తథోపరిచరా ద్యన్యే విప్రా స్సమ్య గధీయతే ॥ " (ఆదిప. అ 1)

ఇత్యాదులు. ఈవచనములు ప్రతివాదుల కెంత యనుకూలము లో పరిశీలింతము-

## అనేకకర్తృత్వనిరాకరణము

(1) "వేదా నధ్యాపయామాస మహాభారతపంచమాన్ ।
సుమన్తుం జైమినిం పైలం శుకంచైవ స్వ మాత్మజమ్ ॥
ప్రభు ర్వరిష్ఠో వరదో వైశంపాయన మేవచ ।
సంహితా స్తైః పృథక్త్వేన భారతస్య ప్రకాశితాః॥

ఇచ్చట వేదములను, మహాభారతమును వేదవ్యాసమహర్షి సుమంత్వాదులకు అధ్యాపనము చేసెను. ఆసుమంత్వాదులచే భారత సంబంధములైన సంహితలు విడిగా ప్రకాశింపజేయబడినవి. అని చెప్ప బడుటచే సుమంత్వాదులకు ప్రకాశకత్వమేకాని ప్రణేతృత్వము చెప్ప బడలేదు. ఇచ్చట 'వ్యాసునిది జయము, వైశంపానునిది భారతము, సౌతిది మహాభారతము' అనివ్రాసిన ప్రతివాదుల నడుగవలసియున్నది. సుమంత్వాదులు వ్యాసమహర్షి యొద్ద జదువుకొన్నది మీావిభాగప్ర కారము జయము కావలసియుండగా నదికాక మహాభారత మెట్లైనది? అట్లు సుమంత్వాదులు వ్యాసమహర్షియొద్ద నేమహాభారతమును చదు వుకొనిన ట్లున్నదో ఆమహాభారతమే వ్యాసకర్తృక మనకతప్పునా?

మఱియు వారు మహర్షి యొద్ద జదువుకొనినది మహాభారతము. ఇక. 'భారతస్య సంహితాః స్తైః ప్రకాశితాః' అనునపుడు మీయూహనుబట్టి వారిచే రచింపబడినది 'భారతస్య సంహితా' అనుశబ్దనిర్దేశముచే భారతము యొక్క సంహితలుకదా, ఇచ్చట భారత మనగా వేదవ్యాసునియొద్ద వారు చదువుకొనిన మహాభారతమా? లేక మీర న్నట్లు వారిచే రచింపబడిన భారత మను గ్రంథాంతరమా? మహాభారతమే యైనయెడల మహాభారతముయొక్క సంహితలను చేసి రను మాటకు అర్థమేమి? సంహితాశబ్దమునకు మూలగ్రంథమని యర్థమా? వ్యాఖ్యానగ్రంథమని యర్థమా? మూలగ్రంథమనినచో వేదవ్యాసుని మహాభారతము జదువుకొని వేదవ్యాసశిష్యులు వేదవ్యాసమహాభారతమునకు మూలగ్రంథము వ్రాసినారనుట హాస్యాస్పదము. ఇకవ్యాఖ్యానగ్రంథ మనినచో మహాభారతవ్యాఖ్యాతలు కావలసిన వైశంపాయనాదులకు వ్యాఖ్యానరూపముకాని భారతగ్రంథమునకు కర్తృత్వము పొసగదు.

ఇక నిచ్చట భారత మనగా వారు చదివిన మహాభారతము కాక వారు రచించిన గ్రంథాంతరమగు భారతమే యందురా?

అట్లైన వారు భారతములను వ్రాసిరా? భారతముయొక్క సంహితలను వ్రాసిరా? భారతము లనినను భారతము యొక్కసంహిత లనినను ఒకటే యందురా? అట్లైన 'భారతస్య సంహితాః' అనునపుడు షష్ఠ్యర్థమును భ్రంశపఱిచినారన్నమాట.

మఱియు మీయభీష్టానుసారము 'వేదవ్యాసమహర్షి మహాభారతము సుమంత్వాదులకు జెప్పెను. వారిచేభారతసంహితలు చేయుబడినవి' అని యింతమాత్రమే చెప్పక 'వేదా నధ్యాపయామాస, మహా

భారతపంచమాః' అనుచు వేదములను గూడ మహాభారతముతో జదివించె నను టెందులకు?

వారిచే జదివించినవాని నన్నిటిని జెప్పుట కందురా? అట్లైన వేదవ్యాసకర్తృకము లగు అష్టాదశపురాణములు, బ్రహ్మసూత్రములు, మున్నగువానిని గూడ జదివించియే యుండును గనుక వానిని బేర్కొనకుండుట న్యూనత కాదా? కనుక వేదములతో మహాభారతమును చదివించె ననుటకును, వారిచే భారతముయొక్క సంహితలు ప్రకాశింపజేయబడిన వనుటకును సంబంధము (హేతుహేతుమద్భావము)వర్ణింపవలసియున్నది. అది యశక్య మందురేమో! ఈ నీలకంఠీయటీకను చూడుడు!!

"భారతస్య మూలభూతా స్సంహితాః మంత్రబ్రాహ్మణరూపా వేదాః। తైః స్సుమంతుప్రభృతిభిః ప్రకాశితా ఇద మస్య మూల మిద మస్య మూల మితి స్పష్టీకృతా స్తేన ప్రత్యక్షవేదమూల మేత దితి భావః।"

అనగా—"సంహితా స్తైః పృథక్త్వేన భారతస్య ప్రకాశితాః" అనునపుడు సంహిత లనగా మంత్రబ్రాహ్మణరూపములగు వేదములే. భారత మనగా వారు చదువుకొనిన మహాభారతమే. ఇప్పుడు సమన్వయింపగా భారతమునకు మూలభూతములైన మంత్రబ్రాహ్మణరూప వేదములు సుమంత్వాదులచే వేఱువేఱుగా "భారతములోని యీ భాగమునకు ఈవేదభాగము మూలము" అని ప్రకాశింప (స్పష్టీకరింప) బడినవి. అని నిర్దుష్టార్థము. ఇట్లు చెప్పినపుడు 'భారతస్య సంహితాః' అను షష్ఠీవిభక్తి యుపపన్నమైనది. ఆ సుమంత్వాదులు వేదములతో మహాభారతమును చదువుకొనినందులకు ఫలము తామా మహాభారతమున కర్థము చెప్పునపుడు ఆయా భాగముల కాయా వేదభాగ

ములు మూలము లని యుదాహరించి చెప్పగల్గుటే యని సిద్ధించినది. వారు చదువుకొనిన వేదవ్యాసమహాభారతమునకు వేదభాగోదాహరణములతో వివరించి యర్థము చెప్పినవారేకాని తలకొక భారతము వ్రాసినవారు గారని కూడ తేలినది

కనుకనే "భారతం పంచమో వేదః, సర్వశ్రుతిసమూహోయమ్" అని వేదవ్యాసమహర్షి యీమహాభారతము వేదమూలకమని యుపదేశించెను. ఇట్లు పరిశీలింపగా ప్రతివాదులు చూపియున్న 'వేదానధ్యాపయామాస మహాభారతపంచమాన్" ఇత్యాది శ్లోకములు సుమంత్వాదులు భారతములు వ్రాయలేదనియే చెప్పుచుండ వ్రాసినారనియే చెప్పుచున్నవను ప్రతివాదుల వ్రాత హేయము. గీతారహస్యము (పు 719) లో 'సుమంతుడు జైమిని పైలుడు శుకుడు వైశంపాయనుడు అను నీ యైదుగురును వేర్వేరుగ నైదుభారతసంహితలను లేక మహాభారతములను వ్రాసి రని స్పష్టముగ జెప్పబడినది' (అ. 63-90) అను వ్రాతకూడ పరాస్తము.

ప్రతివాదులు కల్పించిన విభాగమును బట్టి చూడ జయ మను గ్రంథాంతరమును వ్రాసిన వ్యాసమహర్షి సుమంత్వాదులకు తనగ్రంథమును పాఠము జెప్పుటకాక యెక్కడో సౌతి వ్రాసిన మహాభారతమును పాఠము చెప్పె ననుట ప్రతివాదుల కెంత యుక్తముగా నున్నదో పాఠకు లూహింతురు గాక.

ఇఁక 'భారతము మహాభారతము అని రెండుగ్రంథములు భిన్నముగా నుండినట్లు ఆశ్వలాయనగృహ్యసూత్రము బోధించుచున్న, దను ప్రతివాదుల వ్రాతను పరిశీలింతము.

(2) "సుమన్తుజైమినివైశంపాయనపైలసూత్రభాష్యభారతమహాభారతధర్మాచార్యాః"

ఈసూత్రము ఆశ్వలాయనుల బ్రహ్మయజ్ఞమునందు ఆచార్య తర్పణప్రకరణములోనిది. ఇందు భారత మహాభారతశబ్దములు వినబడు టచే మహాభారతమునకు అనేకకర్తృకత్వమును కల్పింప నుద్యమించు వారలకు ఇది కల్పవృక్షముగా గన్పట్టినది; అందుచే క్రమికాన్వయము నూహించి వైశంపాయనునకును భారతమునకును, కర్తృత్వసంబంధము నెట్లో కల్పించిరి. కాని యీసూత్రమందే వారి యన్వయ ప్రకారము పైలస్థానమునకు వచ్చిన మహాభారతమును సౌతి కంటగట్టుటకు జంకు గాని, సూత్రాంతమందున్న ధర్మాచార్యపదమునకు కర్తృత్వార్థము లేదనెడి యాలోచనకాని కలుగకుండుట చిత్రమే! మఱియు "వేదా నధ్యాపయామాస" అను పూర్వోక్తశ్లోకములలో నేసుమంత్వాదులు గ్రహింపబడిరో వారే యీయాశ్వలాయనసూత్రములో గూడ గ్రహింపబడియుండ ప్రతివాదు లీసూత్రములో సుమన్తు జైమిని వైశంపాయన పైలులకు యథాక్రమముగా సూత్రభాష్య భారత మహా భారతము లనబడు గ్రంథములకు కర్తృత్వమును కల్పించి 'వేదా నధ్యా పయామాస' అన్నపుడు ఆసుమంత్వాదు లందరు భారతములనే చేసి నారని చెప్పుటలో విరోధము స్ఫురింపకుండుటయు చిత్రమే!

అది యటుండనిచ్చి యీయాశ్వలాయనసూత్రమునకు ప్రమా ణాంతరసమ్మతమగు నర్థము గ్రహింతము.

—• దేవీభాగవతము—స్కం 11. అ॥ 20. •—

"సుమన్తు జైమినీ వైశంపాయనః పైలసూత్రయుక్ ।
భాష్యభారతపూర్వశ్చ మహాభారత ఇత్యపి ।
ధర్మాచార్యా ఇమే సర్వే తృప్యన్త్వితిచ కీర్తయేత్ ॥

... ఇది ప్రతివాదు లుదహరించిన ఆశ్వలాయనసూత్రమునకు శ్లోకరూపమైన వివరణము. ఇచ్చట 'పైలసూత్రయుక్' అనునపుడు

'సూత్రేణయుజ్యతే సూత్రియుక్ పైలశ్చాసౌ సూత్రియుక్చ పైల
సూత్రియుక్' అని కర్మధారయసమాసము. సూత్రునితో గూడిన
పైలుడని యర్థము ఇందు సుమంతుశబ్దము మొదలు మహాభారత
శబ్దాంతము ఆచార్యనామములే కాని గ్రంథనామములు లేవను సం
గతి "ఇమే సర్వే ధర్మాచార్యాః" అని నిర్దేశింపబడిన ధర్మాచార్యు
లందరు 'తృప్యన్తు' అని కీర్తింపుమనుటచే స్పష్టమగుచున్నది. ఇట్టిశ్లోక
ములలో క్రమికాన్వయ ధోరణి లేకుండుట, గ్రంథనామములు కాకుం
డుట ధ్రువమగుటచే నాసూత్రమున కిట్లేయర్థము చెప్పవలెను.

ఇట్టి ప్రమాణాంతరసిద్ధమగు నీసూత్రార్థమును ప్రమాదము
ననో, ప్రతారణముననో అస్తవ్యస్తముచేసి యెవ్వరో లోకమున బ్రి
వేశపెట్టగా "అంథగోలాంగూల' న్యాయమున దాని నందుకొని
యెందరో ప్రమాదమునకు పాలైరి.

ఇట్లుండగా మహాభారతచరిత్రకారులు 'వేదా నధ్యాపయా
మాస( అను పైశ్లోకముల గూర్చియు, ఆశ్వలాయనుని పైసూత్రమును
గూర్చియు నీక్రింద జెప్పబడు పండితులు విశేషముగా విమర్శించి నేచె
ప్పిన యర్థమునేచెప్పిరనుచు లోకమాన్యబాలగంగాధరతిలకు మొదలు
తేవప్పెరుమాళ్ళయ్యగారివరకు 11 మంది పేర్ల నుదాహరించిరి. అం
దులో మహారాష్ట్రభాషలో గీతారహస్యకర్తను, ఆంధ్రములో గీతా
రహస్య అనువాదకర్తను, వంగభాషలో శ్రీకృష్ణచరిత్రకర్తను, ఆంధ్ర
ములో శ్రీకృష్ణచరిత్ర అనువాదకర్తను, హిందీలో భారతమీమాంసా
కర్తను, ఆంధ్రములో భారతమీమాంసానువాదకర్తను కలిపి యీ 11
మందిని చూపినారు. ఆపై తేవప్పెరుమాళ్ళయ్యగారి వచనగ్రంథము
నుదాహరించిరి. అది యిట్లున్నది. "విద్వాంసుడునుసమర్థుడును...అగు
నాబ్రహ్మర్షి సుమంతుడు జైమిని... ...అనెడి యేవురు శిష్యులను

బిలిచి...నాల్గు వేదములను, ఐదవ వేదమైన మహాభారతమును నధ్యయ
నమును చేయించెను. ఆశిష్యులచే వేదసంహితలును, భారతసంహిత
లును వేఱువేఱ చెప్పబడినవి' (మ. భా. చ. ఉపోద్ఘాతము-పు 16)

ఈగ్రంథములోని కడపటివాక్యము 'సంహితాస్తైః పృథక్త్వేన
భారతస్య ప్రకాశితాః' అనుదాని యర్థమే. 'ప్రకాశితాః' అనుదానికి
చెప్పబడిన వని యర్థము వ్రాయబడెనేకాని చేయబడిన వని యర్థము
వ్రాయబడలేదు. వేదసంహితలును, భారతసంహితలును చెప్పబడిన
వనుటలో వేదసంహిత లెట్లుచేయబడినవికావో, అట్లే వారలచేత భారత
సంహితలు చేయబడినవి కావనియు, అర్థము చెప్పబడిన వనియు ఆచె
ప్పుటలో వేదసంహిత లుదాహరింపబడిన వనియు స్పష్టముగా గోచ
రించుచున్నది. ఇది విద్వన్మార్గమునకు చెందియున్నది. ఇట్టి యీగ్రం
థమును, సుమంత్వాదు లొక్కొక్క-భారతము చేసినారను తమ
వాదమునకు ప్రమాణముగా చూపు ప్రతివాదులకు ఎంతసాహసమో!

ఈ తేవప్పెరుమాళ్లయ్యగారి గ్రంథమును చూపినతరువాత వారి
వ్రాత యిట్లున్నది—"పై బదునొకండుమందియు పైశ్లోకములకు వ్యా
సుడు- సుమంత్వాదులకు వేదములను మహాభారతమును చెప్పెననియు,
సుమంత్వాదులు వేర్వేఱు భారతసంహితల జేసి రనియే తాత్పర్యములు
జేసిరి. మొదట యెనిమిది మందిపండితులును పైశ్లోకములకు బలము
కలిగించుటకు ఆశ్వలాయనుని గృహ్యసూత్రమును సాక్ష్యముగాజూపిరి"
(మ. భా. చ. ఉపో. 17పు)

ఆహా! మహాభారతశ్లోకములకు నీలకంఠీయము, ఆశ్వలాయన
సూత్రమునకు దేవీభాగవతశ్లోకములు న్యాయముగా నర్థనిర్ణయము
చేసియుండ నట్టి ప్రామాణికార్థమును గ్రహింపలేక తమకు దోచినట్లు
పూర్వోత్తరవిరుద్ధముగను, అసంగతముగను ఎంతమందికల్పించిన

యర్థమైనను ప్రమాణవిరుద్ధమైనదగుట తేటపడుచున్నది. ఈవిషయము మ. భా. చ. కారులు ఒప్పినదే. ఒకచోట వారిట్లు వ్రాసియున్నారు—"లోక మాన్య తిలకు, భాసునకు కాళిదాసునకుంటె బూర్వుఁడైనను క్రీ. త. 1-2-శతాబ్దములనాటివాఁడై యుండవచ్చు ననియెంచియు నున్నాఁడు. గణపతి శాస్త్రులవారి శ్లోకదృష్టాంతపూర్వక మగు నిదర్శనము లోకమాన్యుని తలపుకంటె ప్రమాణము" (పు32)

ఇట్లు లోకమాన్యుని తలపుకంటె శ్లోకనిదర్శనము ప్రమాణమనిన మ. భా. చ. కారు లీయాశ్వలాయనసూత్రమునకు ఆలోకమాన్య ప్రభృతు లూహించిన యర్థముకంటె దేవీభాగవతశ్లోకనిదర్శనపూర్వక మగు నర్థమే ప్రమాణ మనక తప్పునా?

కనుక భారతమహాభారతములు భిన్నగ్రంథము లనియు, భిన్న కర్తృకము లనియు నిర్ణయించుటకు బ్రతివాదు లాధారముగా బట్టుకొనిన ఆశ్వలాయనసూత్రము వారిని భంగపఱచినది.

కాబట్టి గీతారహస్యము (718 పు) లో "ఆశ్వలాయనగృహ్య సూత్రమందు సుమంతు, జైమిని, వైశంపాయన, పైల, సూత్ర, భాష్య, భారత, మహాభారత, ధర్మాచార్యాః" (ఆ గృ 3-4-4) అని ఋషితర్పణమందు భారత, మహాభారతము లనునవి రెండు వేర్వేఱు గ్రంథము లని స్పష్టముగ జెప్పబడి యుండుటచే నైతి మీయనుమానమే దృఢ మగుచున్నది" అను మాటయు, మహాభారతమీమాంస (సంపుటం 15. సంచిక 4) లో "ఆశ్వలాయనుని యొక్క సూత్రమున భిన్నభిన్ననామముల నైకొని 'భారత మహాభారతధర్మాచార్యాః' అని చెప్పబడియున్నది. ఇంతియగాక వైశంపాయనాదిఋషులకు భారతాచార్యబిరుదము ప్రసిద్ధమయ్యెను. అందుచే, భారతమహాభారతనామకము లగు భిన్నభిన్నగ్రంథము లోకమునందు ప్రచలితములయ్యె ననియు ననుమితి కలుగుచున్నది" అను మాటయు అప్రస్తుతము లైనవి.

(3) “అస్మింస్తు మానుషే లోకే వైశంపాయన ఉక్తవాన్” అను వాక్యము నిక బరీక్షింతము. అందుకై ముందిచ్చుట గ్రంథసందర్భము నవలోకింపవలసియున్నది.

సౌతి వచనము— (ఆది. అ. 1)

“మాతుర్నియోగా ద్ధర్మాత్మా గాంగేయస్య చ ధీమతః ।
క్షేత్రే విచిత్రవీర్యస్య కృష్ణద్వైపాయనః పురా ॥ 94 ॥
త్రీ నగ్నీ నివ కౌరవ్యాన్ జనయామాస వీర్యవాన్ ।
ఉత్పాద్య ధృతరాష్ట్రం చ పాండుం విదుర మేవచ ॥ 95 ॥
జగామ తపసే ధీమాన్ పున రేవాశ్రమం ప్రతి ।
తేషు జాతేషు వృద్ధేషు గతేషు పరమాం గతిమ్ ॥ 96 ॥”

టీ॥ తేషు= ధృతరాష్ట్రాదిషు; జాతేషు = పుత్రపౌత్రాదిరూపేణ ప్రాదుర్భూతేషు; వృద్ధేషు= రాజ్యభాగిషు; పరమాం గతిం = మృత్యుం గతేషు ॥

“అబ్రవీ ద్భారతం లోకే మానుషేస్మి న్మహా నృషిః ।
జనమేజయేన పృష్టస్సన్ బ్రాహ్మణైశ్చ సహస్రశః ॥ 97 ॥
శశాస శిష్య మాసీనం వైశంపాయన మంతికే ।
స సదస్యై స్సహాసీన శ్శ్రావయామాస భారతమ్ ॥ 98 ॥
కర్మాంతరేషు యజ్ఞస్య చోద్యమానః పునః పునః ।
విస్తరం కురువంశస్య గాంధార్యా ధర్మశీలతామ్ ॥ 99 ॥
క్షత్తుః ప్రజ్ఞాం ధృతిం కుంత్యా స్సమ్య గ్ద్వైపాయనోబ్రవీత్ ।
వాసుదేవస్య మాహాత్మ్యం పాండవానాం చ సత్యతామ్ ॥
దుర్వృత్తం ధార్తరాష్ట్రాణా ముక్తవాన్ భగవా నృషిః । 100 ।
ఇదం శతసహస్రం తు శ్లోకానాం పుణ్యకర్మణామ్ ।
ఉపాఖ్యానై స్సహ జ్ఞేయ మాద్యం భారత ముత్తమమ్ ॥ 101 ॥

చతుర్వింశతిసాహస్రీం చక్రే భారతసంహితామ్ ।
ఉపాఖ్యానై ర్వినా తావ ద్భారతం ప్రోచ్యతే బుధైః ॥ 102 ॥
తతోఽధ్యర్థశతం భూయ స్సంక్షేపం కృతవా నృషిః ।
అనుక్రమణికాధ్యాయం వృత్తాంతానాం సపర్వణామ్ ॥ 103 ॥
ఇదం ద్వైపాయనః పూర్వం పుత్ర మధ్యాపయ చ్ఛుకమ్ ।
తతోఽన్యేభ్యోఽనురూపేభ్య శ్శిష్యేభ్యః ప్రదదౌ విభుః ॥104॥
షష్టిం శతసహస్రాణి చకారాన్యాం ససంహితామ్ ।
త్రింశ చ్ఛతసహస్రం చ దేవలోకే ప్రతిష్ఠితమ్ ॥ 105 ॥
పిత్రే పంచదశ ప్రోక్తం గంధర్వేషు చతుర్దశ ।
ఏకం శతసహస్రం తు మానుషేషు ప్రతిష్ఠితమ్ ॥ 106 ॥
నారదోఽశ్రావయ ద్దేవా నసితో దేవలః పితౄన్ ।
గంధర్వయక్షరక్షాంసి శ్రావయామాస వై శుకః ॥ 107 ॥
అస్మిం స్తు మానుషే లోకే వైశంపాయన ఉక్తవాన్ ।
శిష్యో వ్యాసస్య ధర్మాత్మా సర్వవేదవిదాం వరః ॥ 108 ॥
ఏకం శతసహస్రం తు మయోక్తం వై నిబోధత" ॥ 109 ॥

ఈగ్రంథములో 108 గా నున్న శ్లోకమునే ప్రతివాదులు తమ వాదమునకు మూడవప్రమాణముగాను, దాని తరువాతపాదమునే నాల్గవప్రమాణముగాను, చూపియున్నారు.

పై గ్రంథమునకు తాత్పర్యము:—— ధర్మాత్ము డగు వేదవ్యాసమహర్షి జనని యొక్కయు, భీష్ముని యొక్కయు నియోగముచేతనే ధృతరాష్ట్రపాండువిదురులను జనింపజేసి మఱల తపస్సునకై యాశ్రమమున కేగెను. ఆధృతరాష్ట్రాదులు పుత్రపౌత్రాదిరూపమున ప్రాదుర్భూతులై, రాజ్యప్రాప్తిచే ప్రవర్ధమానులై పరలోకగతులు కాగా నావేదవ్యాసమహర్షి యీ మానుషలోకమందు భారతమునుజెప్పెను.

(ఇక్కడ ధృతరాష్ట్రాదులు గతించినతరువాత భారతమును మహర్షి చెప్పె ననగా రచించె నని యర్థము కాదు. పూర్వము బహుకాలమై రచింపబడియున్న గ్రంథమును ప్రకటించెనని యర్థము. అప్పుడాప్రకటించుట మనుష్యలోకవిషయము, వక్ష్యమాణప్రకారము దేవపితృగంధర్వలోకములలో గూడ ప్రకటింపబడియుండుటచే నిచట 'మనుష్యలోక మందు' అను విశేషణ ముపపన్నము. మనుష్యలోక మందు ఎప్పుడు ఎట్లు ప్రకటించెను? అను ప్రశ్నముపై సమాధాన ముగా నుత్తరగ్రంథము)

అ దెట్లనిన? సర్పసత్రయాగమందు జనమేజయునిచేతను, అచట వేలకొలది బ్రాహ్మణప్రవరులచేతను—

"కురూణాం పాండవానాం చ భవాన్ ప్రత్యక్షదర్శివాన్ ।
తేషాం చరిత మిచ్ఛామి కథ్యమానం త్వయా ద్విజ!"
(ఆది- అ. 60)

అని యడుగబడిన వ్యాసమహర్షి తన శిష్యు డగు వైశంపా యనునకు—

"కురూణాం పాండవానాం చ యథా భేదోఽభవ త్పురా ।
త దస్మై సర్వ మాచక్ష్వ య న్మత్త శ్శ్రుతవా నసి॥"(ఆది–అ60)

అని నావలన తెలిసికొనిన భారతమునంతను నీ వీతనికి చెప్పు మని యాజ్ఞాపింప నావైశంపాయనుడు ఆయా సమయములందు ప్రేరే పింపబడుచు, భారతమును వినిపించెను. ఆవినిపింపబడిన భారతమందు కురువంశవిస్తారమును, గాంధారీధర్మశీలతను, విదురప్రజ్ఞను, కుంతీధై ర్యమును, వాసుదేవమాహాత్మ్యమును, పాండవుల సత్యతను, ధార్త రాష్ట్రుల దుర్వృత్తమును, భగవాను డగు వ్యాసమహర్షి చెప్పెను.

పుణ్యాత్ముల యుపాఖ్యానములతో గూడి యుత్తమమై ఆద్యమైన యీభారతము లక్షగ్రంథముగా దెలిసికొనవలసినది.

(ఈవాక్యము 'ఇదం శతసహస్రం తు' అనుదాని యర్థము. ఈ 'ఇదమ్' శబ్దము వేదవ్యాసవిరచితమై వైశంపాయనునిచే వినిపింపబడిన భారతమునే చెప్పుచుండుటవలన ఆభారతమే లక్షగ్రంథము అదియే ఆద్యము)

ఉపాఖ్యానములను విడిచి 24వేల భారతసంహితను చేసెను. దీనినిఉపాఖ్యానరహితభారత మని చెప్పుదురు.

(ఈ24వేలభారతసంహితను చేయుటలో కర్తృత్వము పూర్వ సందర్భమునుబట్టి వ్యాసమహర్షిదేకాని వినిపించెడి వైశంపాయనునది కాదని విజ్ఞులకు తెలిసినవిషయమే. ఉపాఖ్యానములు విడిచి 24వేలు చేసె ననగా ఆలక్షగ్రంథములోనే ఉపాఖ్యానభాగములు విడిచిపరిగణించిన యెడలనది24వేలగ్రంథ మని భావము)

మఱియు వ్యాసమహర్షి పర్వములతోగూడిన వృత్తాంతములయొక్క అనుక్రమణికాధ్యాయమును మఱల150శ్లోకములుగా సంక్షేపించెను.

(ఇచ్చట. భూయః సంక్షేపమ్' అని భూయః పదమును. 101శ్లోక ములోని 'ఆద్యమ్' అనుపదమును పరిశీలింప మొదటిది లక్షగ్రంథ మనియు దానిసంక్షేపము 24వేలనియు మఱలసంక్షేపము 150శ్లోకము లనియు ఇదంతయు వ్యాసకృతమే అనియు మహాభారతఘటకమే యనియు స్పష్టము)

ఈభారతమును వ్యాసమహర్షి మొదట శుకునకును, తరువాత తగిన శిష్యులకును అధ్యాపనము చేసెను. ఇంతేగాక ఆవ్యాసమహర్షి

60లక్షల భారతసంహితను చేసెను. అందు 30లక్షలు దేవలోకమందును, 15లక్షలు పితృలోకమందును, 14లక్షలు గంధర్వలోకమందును, 1లక్ష మనుష్యలోకమందును ప్రతిష్ఠితమై యున్నది.

అందు దేవతలకు నారదుడును, పితృదేవతలకు అసితదేవలుడును, గంధర్వాదులకు శుకుడును వినిపించిరి.

(ఈవాక్యము "నారదోఽశ్రావయద్దేవాన్" 'గంధర్వయక్షరక్షాంసి శ్రావయామాస వై శుకః' అను శ్లోకార్థమే ఇచ్చట 'అశ్రావయత్' 'శ్రావయామాస' అనుటచే వినిపించె ననియే యర్థ మనుట నిర్వివాదము)

ఈమనుష్యలోకమునకు వ్యాసశిష్యుడు ధర్మాత్ముడు నగు వైశంపాయనుడు చెప్పెను, అనగా వినిపించెను. అని.

ఇట్లు ఎవ్వరెచ్చట వినిపించిరో చెప్పెడి సందర్భములో నున్న "అస్మింస్తు మానుషేలోకే వైశంపాయన ఉక్తవాన్" అను వాక్యమందలి 'ఉక్తవాన్' అను పదమునకు రచించెనని యర్థమును ప్రతివాదులు చెప్పుట అక్రమము. మఱియు "అబ్రవీద్భారతం లోకే మానుషేఽస్మిన్మహా నృషిః। జనమేజయేన పృష్టస్సన్' 97 'శశాస శిష్య మాసీనం వైశంపాయన మన్తికే। స సదస్యైః సహాసీనః శ్రావయామాస భారతమ్" 98 అను పూర్వోక్తశ్లోకములలో సత్రయాగములో జనమేజయునకు నీవు వినిపింపుమని శిష్యుడగు వైశంపాయనునకు ఆజ్ఞాపించిన వ్యాసమహర్షియే 'అబ్రవీ ద్భారతం లోకే మానుషేఽస్మిన్' ఈమనుష్యలోకములో చెప్పెనని యుండుటచే దానికిగూడ ప్రతివాదులవ్రాత విరుద్ధము. మరియు ఆవైశంపాయనుడు "శ్రావయామాస భారతమ్" భారతము వినిపించెను అని యుండుటచే దానికి విరుద్ధము.

మరియు 'షష్టిం శతసహస్రాణి చకారాన్యాం స సంహితామ్' అను 106వ శ్లోకముండి, వ్యాసవిరచితమై 60 లక్షలగ్రంథముకల భారతసంహితలో నేలోకమున నెంత కలదో ఎవ్వనిచే వినిపింపబడినదో చెప్పెడి సందర్భములో దేవలోకమందున్నది 30 లక్షలు వినిపించిన వాడు నారదు డనియు, పితృలోకమం దున్నది 15 లక్షలు వినిపించిన వాడు అసిత దేవలు డనియు, గంధర్వలోకమం దున్నది 14 లక్షలు వినిపించినవాడు శుక యోగియనియు చెప్పి 'ఏకం శతసహస్రంతు మానుషేషు ప్రతిష్ఠితమ్' 'అస్మింస్తు మానుషే లోకే వైశంపాయన ఉక్త వాన్' అనుచు మనుష్యలోకమందున్నది 1 లక్ష. వినిపించినవాడు వైశంపాయనుడు అని చెప్పినపుడు, 30-15-14-1 కలిపినగాని ఆ 60 లక్షలు పూర్తిగా సిద్ధింపకున్నపుడు ఏ సందర్భము గమనింపక "వైశంపాయన ఉక్తవాన్' అను వాక్యమును చూపి భారతకర్త వైశంపాయనుడనుచు వ్రాసిన ప్రతివాదులు మతిమంతులనిపించుకొనరు మఱియు "ఇదం శతసహస్రంహి శ్లోకానామ్ పుణ్యకర్మణామ్ । సత్యవత్యాత్మజే నేహ వ్యాఖ్యాతే మమితౌజసా" (ఆది. 62 అ) అనుచు ఈలక్షగ్రంథము వ్యాసప్రోక్తమని జనమేజయునకు వైశంపాయనుడే చెప్పియుండెను ఇట్లు పరీక్షింపగా వైశంపాయనునకు భారతకర్తృత్వము తొలగిపోయినది. వ్యాసమహర్షికే కర్తృత్వము స్థిరపడినది.

(4) ఇఁక సౌతికి మహాభారతకర్తృత్వము సాధించుటకు ప్రతివాదులు చూపిన వాక్య మిది.

"ఏకం శతసహస్రంతు మయోక్తం వై నిబోధత"

టీ॥ మయా ఉచ్యమానం, వైశంపాయనే నోక్తం, నిబోధత అర్థతో బుధ్యధ్వమ్'

అనగా, పూర్వము వైశంపాయనునిచే చెప్పబడినట్టియు మీాకో

రికపై నాచే చెప్పబడుచున్నట్టియు లక్షగ్రంథమును అర్థముతో తెలిసి కొనుడు. అని సౌతి శౌనకాదులకు చెప్పెనని ఆవాక్యమున కర్థము.

ఇట్లుండ ప్రతివాదులు 'నాచే చెప్పబడిన లక్షగ్రంథమునువినుడు' అని యర్థము చెప్పి లక్షగ్రంథమునకు సౌతి కర్తయని సాగించినారు.

పూర్వము నిరూపింపబడినట్లు వ్యాసమహర్షికి తప్ప మఱెవ్వరికిని. కర్తృత్వసంబంధము లేదు అదియటుండగా. ప్రతివాదులన్నట్లు సౌతి, శౌనకాదులకు చెప్పె ననవలెనో, లేక నీలకంఠీయుపకారము చెప్పె ననవలెనో పూర్వప్రసంగమును చూచిన తేలును.

నైమిశారణ్యమందు కులపతియగు శౌనకమహర్షియొక్క ద్వాదశవార్షికసత్రయాగమందు సత్కథాశ్రవణతత్పరులగు తపస్వుల సమావేశము కలిగియుండ నచ్చటికి వచ్చిన సౌతికి ఉచితాసన మిచ్చి నీరాక యెచ్చటనుండి? యింతవరకు కాలక్షేపము ఎచ్చట? అని ప్రశ్నించిన మహర్షులకు సౌతి యిట్లు చెప్పెను—

"జనమేజయస్య రాజర్షేః సర్పసత్రే మహాత్మనః ।
సమీపే పార్థివేన్ద్రస్య సమ్యక్పారిక్షితస్య చ ॥
కృష్ణద్వైపాయనప్రోక్తా స్సుపుణ్యా వివిధాః కథాః ।
కథితా శ్చాపి విధివ ద్యా వైశంపాయనేన వై ॥
శ్రుత్వాఽహం తా విచిత్రార్థా మహాభారతసంశ్రితాః ।
బహూని సంపరిక్రమ్య తీర్థా న్యాయతనానిచ ॥
సమంతపంచకం నామ పుణ్యం ద్విజనిషేవితమ్ ।
గతవా నస్మి తం దేశం యుద్ధం యత్రాఽభవ త్పురా ॥
కురూణాం పాండవానాంచ సర్వేషాంచ మహీక్షితామ్ ।
దిదృక్షు రాగత స్తస్మా త్సమీపం భవతా మిహ ॥" ఆది. 1. అ.

జనమేజయుని సర్పయాగమందు వ్యాసమహర్షిప్రోక్తములై,

వైశంపాయనునిచే వినిపింపబడిన వివిధములై విచిత్రార్థములై యున్న మహాభారతకథలను విని, బహుతీర్థములు సేవించి, కురుపాండవయుద్ధము జరిగిన సమంతపంచక మను పుణ్యస్థలము దర్శించి, యచ్చట నుండి మీదర్శనము చేయదలచి యిచ్చటికి వచ్చితిని.

ఇట్లు చెప్పగా ఋషు లాతనిని కోరిరి—

"ద్వైపాయనేన యత్ప్రోక్తం పురాణం పరమర్షిణా ।
సురై ర్బ్రహ్మర్షిభి శ్చైవ శ్రుత్వా యదభిపూజితమ్ ॥ 17.
తస్యాఖ్యానవరిష్ఠస్య విచిత్రపదపర్వణః ।
సూక్ష్మార్థన్యాయయుక్తస్య వేదార్థై ర్భూషితస్యచ ॥. 18.
భారత స్యేతిహాసస్య పుణ్యాం గ్రంథార్థసంయుతామ్ ।
సంస్కారోపగతాం బ్రాహ్మీం నానాశాస్త్రోపబృంహితామ్ ॥. 9.
"జనమేజయస్య యాం రాజ్ఞో వైశంపాయన ఉక్తవాన్ ।
యథా వత్స! ఋషి స్తుష్ట్యా సత్రే ద్వైపాయనాజ్ఞయా ॥ 20 ॥
వేదై శ్చతుర్భి స్సంయుక్తాం వ్యాస స్యాద్భుతకర్మణః ।
సంహితాం శ్రోతు మిచ్ఛామః పుణ్యాం పాపభయాపహామ్ ॥21॥

అనగా వ్యాసమహర్షిప్రోక్తమైనట్టియు, దేవతలచేతను, బ్రహ్మర్షులచేతను విని పూజింపబడినట్టియు, అతర్క్యములగుటచే సూక్ష్మములగు ఆత్మతత్త్వాదిరూపము లైన అర్థములచేతను, తదుపయుక్తములగు యుక్తులచేతను, వేదతాత్పర్యవిషయభూతము లైన అర్థములచేతను, అలంకరింపబడినట్టియు, నానాశాస్త్రవిషయములచే నుద్దీపితమైనట్టియు, వ్యాసమహర్షి యాజ్ఞవలన జనమేజయునకు వైశంపాయనునిచే వినిపింపబడినట్టియు, వ్యాసమహర్షియొక్క సంహితను (మహాభారతమును) వినగోరుచున్నాము. అని అర్థము. ఇట్లు కోరియున్న ఋషులకు అట్లే చెప్పెదు నని సౌతి యుపక్రమించుటలో వెనుక జూపిన 'మాతు ర్నియోగా ద్ధర్మాత్మా' (94) అను శ్లోకముతో నారంభించి

చెప్పుచు వచ్చి, 'ఏకం శతసహస్రం తు మయోక్తం వై నిబోధత' (109) అని చెప్పెను. ఈసందర్భమును పరిశీలింపగా వ్యాసప్రోక్తమహాభారతమును సర్పసత్రములో వైశంపాయనుడు జనమేజయునకు వినిపింపగా నేను విని క్రమముగా నిక్కడకు వచ్చితి నని సౌతి చెప్పిన మాటమీద ఋషులు- మీరు విని వచ్చిన ఆవ్యాసప్రోక్తమహాభారతమునే మాకు చెప్పు మని కోరినమీదట చెప్పుట కుపక్రమించిన ఆ సౌతి ఆవ్యాసప్రోక్తమహాభారతమునే ఋషిప్రశ్నానుగుణముగా శౌనకాదులకు చెప్పినట్లు స్పష్టమగుచుండ దీని నంతను కప్పిపుచ్చి 'ఏకం శతసహస్రం తు మయోక్తం వై నిబోధత' అను వాక్యమును మాత్రము చూపి దీనిని బట్టి సౌతి లక్షగ్రంథమగు మహాభారతమునకు కర్తయని వ్రాసిన ప్రతివాదు లెంతమోసము చేసిరో చూడుడు!

మఱియు సౌతియే ఋషిప్రశ్నానుసారము తాను చెప్పబూనిన మహాభారతేతిహాసమునకు కర్త వ్యాసమహర్షి యని చెప్పెను. చూడుడు!—

"ఇదం తు త్రిషు లోకేషు మహజ్జ్ఞానం ప్రతిష్ఠితమ్ ।
తపసా బ్రహ్మచర్యేణ వ్యస్య వేదం సనాతనమ్ ॥
ఇతిహాస మిమం చక్రే పుణ్యం సత్యవతీసుతః ॥" (ఆది. అ. 1)

ఇట్లు పరీక్షింపగా మహాభారతములో వైశంపాయనునకు గాని, సౌతికి గాని కర్తృత్వసంబంధ మెంతమాత్రము లేదనియు, వేదవ్యాసమహర్షియే కర్త యనియు, ఆమహాభారతమునే జనమేజయునకు వినిపించినవాడు వైశంపాయనుడు, శౌనకాదులకు వినిపించినవాడు సౌతి యనియు ధ్రువమైనది.

ఇక ప్రతివాదులు చూపిన మఱియొకప్రమాణము నందుకొందము—

(5) 'మన్వాది భారతం కేచి దాస్తీకాది తథాపరే ।
తథోపరిచరా ద్యన్యే విప్రా స్సమ్య గధీయతే ॥' (ఆది. 1 అ)

ఈశ్లోకమును మహాభారతమునకు మూఁడుకర్తలనుటకు ప్రమాణముగా ప్రతివాదులు ప్రదర్శించిరి. దీనిని పరిశీలింతము.

ప్రతివాదులు—వ్యాసునిది జయమనియు, వైశంపాయనునిది భారతమనియు, సౌతిది మహాభారతమనియు, సౌతి మహాభారతములోనే ఆజయము, ఆభారతము, ఇమిడి యున్న వనియు, వ్రాసి యీ 'మన్వాది భారతమ్' అను శ్లోకమును చూపి యిందు భారతాదిని గూర్చిన మూడు వికల్పములే పైజూపిన గ్రంథములు మూడు కలవనియు, మూడుగ్రంథములకు మూడువిధములైన ఆరంభములు కలవనియు, తెలిసికొనుటకై యూత యగుచున్న వనియు వ్రాసిరి. వారి నొకింత యడుగవలసి యున్నది.

మీ నిర్ణయప్రకారము వ్యాసునిజయములో వైశంపాయనుని భారతము కాని, సౌతి మహాభారతము కాని అంతర్భూతముగాలేదనియు, వైశంపాయనుని భారతములో వ్యాసుని జయ మంతర్భూతమైయున్నను, సౌతి మహాభారత మంతర్భూతము గాలేదనియు, సౌతి మహాభారతములో మాత్రి మా భారతము, ఆజయము అంతర్భూతములై యున్న వనియుగదా తేలుచున్నది. ఈస్థితిలో 'మన్వాదిభారతం కేచిత్' అను శ్లోకము భారతశబ్దనిర్దేశముచే వైశంపాయనభారతము యొక్క ఆరంభప్రభేదములనే చెప్పుచుండ భారత మహాభారతములు భిన్నగ్రంథము లను మీసిద్ధాంతములో మహాభారతారంభప్రభేదములను చెప్పుచుండె ననుటెట్లు?

మఱియు మహాభారతాంతర్గతమగు వైశంపాయనభారతము యొక్క ఆరంభమే మూఁడువిధములుగా నున్నట్లు ఈశ్లోకముచే గ్రి

హింపవలసియుండగా నాభారతమందు మీయూహను బట్టి వ్యాసుని జయము మాత్రమే అంతర్భూతమై యుండగా జయమునకును భారతమునకును ఆరంభభేదములు రెండే చెప్పవలసియుండ మూడవభేదమును చెప్పుట కేమి యుపపత్తిని చెప్పగలరు? దాని నెచ్చట లగింపగలరు?

మఱియు ఈ 'మన్వాదిభారతమ్' అనుశ్లోకము "సౌతి రువాచ" అని యుపక్రమించి చెప్పబడిన గ్రంథములోని దగుటచే మీదృష్టిని బట్టి చూడగా నిది సౌతికృతమే యని చెప్పవలసియుండును. అప్పుడు సౌతి గురుశిష్యసంప్రదాయముచే తనకు సువ్యక్త మగు గ్రంథారంభమును గూర్చి చెప్పినపుడు మీయూహానుగుణముగా తన మహాభారతములో చేర్చుకొనిన వైశంపాయనభారతమునకు ఇది యాది యనియు, వ్యాసుని జయమునకు ఇది యాదియనియు, తన మహాభారతమునకు ఇది ఆది యనియు స్పష్టముగా చెప్పవలసి యుండ తనకుగూడ సందిగ్ధమే యన్నట్లు 'కేచిత్' ఇత్యాదిశబ్దములతో చెప్పుట యనుచితము కాదా? అన్యగ్రంథములమాట యటుండనిచ్చినను తన గ్రంథమునకు గూడ నారంభమేదో తనకు తెలియనట్లు సూచించుట యుక్తమా?

ఇక నీతగవు వచ్చునని మ. భా. చ. కారు లన్నట్లు "ఇది వ్యాసాదిసంస్కృతకవిత్రయకృతములోనిదై యుండదు" (పు37) అనగా ప్రక్షిప్త మందురా? అట్టి ప్రక్షిప్తమును మీకల్పనకు ప్రమాణముగా మీరెట్లు ప్రదర్శించిరి? మఱియు అది ప్రక్షిప్తమే యనుటకు మీకాధార మేమి? మీబుద్ధికి లొంగలేదని ప్రక్షిప్త మందురేని మీబుద్ధికి లొంగని మహాభారతగ్రంథమున కంతకును అగతియే పట్టును.

ఇక మహాభారత మేకకర్తృకమనువారికైనను ఈచిక్కుతప్పనందున ప్రక్షిప్త మనవలసినదే కనుక ఇది మాకు మాత్రమే తటస్థించిన

దోషము కాదందురా? అటులైన నీలకంఠీయమును చూడుడు—

'వర్ణానుపూర్వీభేదేఽపి ప్రతికల్పమర్థానాం సమాననామరూప కర్మత్వాత్ భారతారంభే మతభేద మాహ-మన్వాదీతి। మనుర్మన్త్రో నారాయణం నమస్కృత్యేతి। ఓం నమో భగవతే వాసుదేవాయేతి వా। తదాదీతి ప్రాఞ్చః దివః పుత్రో వైవస్వతసవ్యాసంజ్ఞో మనుః తదాదీతి తత్త్వమ్''

శ్రీదేవబోధకృతమహాభారత తాత్పర్యటీకా. జ్ఞానదీపికా—

"కి మాది భారత మిత్యాహ—మన్వాదీతి. మనుః=ఆదిరాజః; ఆస్తీకో=జరత్కారుసుతః; ఉపరిచరో=వసువిశేషః; తచ్చరితప్రస్తావ నాది భారత మితి మునీనాం మతభేదః ॥

ఈటీకాకారు లాశ్లోకమును ప్రక్షిప్త మనలేదు. ఆయారంభ వికల్పముల కౌచిత్యమునే వర్ణించిరి. అ దెట్లనగా—

సృష్టితో గూడిన కాలమునకు కల్ప మని పేరు. ఆసృష్టినశించిన కాలమునకు ప్రళయ మని పేరు. సృష్ట్యనంతరము ప్రలయము, ప్రలయా నంతరము సృష్టి కలుగుచుండును. ఆయాకల్పములలో సృష్టములగు పదార్థములు వెనుకటి కల్పములలోని పదార్థములతో సమాననామ రూపకర్మములు కలిగియే యుండును. ఈవిషయమై వ్యాసమహర్షితో బ్రహ్మ యేమి చెప్పెనో చూడుడు:—

పద్మపురాణము-భూమిఖండము-అ21

"హన్త తే కీర్తయిష్యామి సర్వసందేహనాశనమ్ ।
దేవస్య లీలాసృష్ట్యర్థం వర్తతే ద్విజసత్తమ ॥
యథా వారాశ్చ పక్షాశ్చ మాసాశ్చ ఋతవో యథా ।
సంవత్సరాశ్చ మనవో యథాఽఽయాన్తి యుగానిచ ॥

తథా కల్పా స్సమాయాన్తి వ్రజామ్యేవం జనార్దనమ్ ।
అహమేవ మహాప్రాజ్ఞ మయి యాన్తి చరాచరాః ॥
పున స్సృజతి యోగాత్మా పూర్వవ ద్విశ్వ మేవహి ।
పున శ్చాహం పున ర్వేదాః పున స్తే దేవతా ద్విజాః ॥
తథా భూపాశ్చ తే సర్వే ప్రజాశ్చైవ తథాఽఖిలాః ।
ప్రభవన్తి మహాభాగ విద్వాం స్తత్ర న ముహ్యతి ॥
రామాదయో మహాప్రాజ్ఞా యయాతినహుషాదయః ।
మన్వాదయో మహాత్మానః ప్రభవన్తి లయన్తిచ ॥
ఏవం దేవాశ్చ వేదాశ్చ పురాణస్మృతిపూర్వకాః ॥"

అనగా, వారములు, పక్షములు, మాసములు, ఋతువులు, సంవత్సరములు, యుగములు, మనువులు, తిరిగి యెట్లు వచ్చుచుండెనో, అట్లే కల్పములు వచ్చుచుండును. బ్రహ్మనైన నేను శ్రీహరిలో జేరి యుందును. చరాచరములు నాలో చేరి యుందును. ఆశ్రీహరి, మఱల సృష్టికాలము రాగా పూర్వమువలెనే, ప్రపంచమును సృజింపగా మఱల నేను, వేదములు, దేవతలు, ద్విజులు, భూపతులు, సకలప్రజలు, ప్రభవించుట జరుగును. మహనీయులైన రామాదులు, యయాతినహుషాదులు, మన్వాదులు, దేవతలు, వేదములు, పురాణములు, స్మృతులు, ఇత్యాదును ప్రభవించుచుండును. అని భావము.

దీనినిబట్టి ఆయాకల్పములలో వెనుకటి కల్పములలోవలెనే ఆయాపేర్లు కల వ్యక్తులు ఆచర్యలు ఆకథ వానిని చెప్పెడి పురాణేతిహాసగ్రంథములు యథాపూర్వముగా నుద్భవించుచుండుటవలన కల్ప భేదమును బట్టి భిన్నములగు భారతగ్రంథములయందలి ఆరంభమును గూర్చిన వికల్పములనే "మన్వాది భారతమ్' అనుశ్లోకము వెల్లడించుచున్నది. కనుక విద్వత్సిద్ధాంతములో విమర్శకుల కల్పనలో దటస్థించిన దోషము లేదు. కల్పభేదమున భిన్నములైన భారతగ్రంథములు పౌరు

మేయము లగుటచే వర్ణానుపూర్వీభేదము కలిగియుండును. కనుక భిన్న కల్పములలోని ఆయాభారతారంభములు మన్వాదిగను, ఆస్తీకచరిత్రాదిగను, ఉపరిచరవసుచరిత్రాదిగను ఉన్నవనుట యుచితమే.

"భారతం పంచమో వేదః" 'సర్వశ్రుతిసమూహోఽయమ్' అని కీర్తింపబడిన భారతము వేదార్థవివరణరూపము. ఆవేదమందలి జ్ఞానకాండమునకు బ్రహ్మసూత్రములను రచించిన మహనీయుడు ఈ మహాభారతకర్తయే. ఆబ్రహ్మసూత్రములలో 'సమాననామరూపత్వాచ్చావృత్తావప్యవిరోధో దర్శనాత్స్మృతేశ్చ' (సూ. 1-3-30) అనునదియొకసూత్రము. ఈసూత్రము 'సూర్యాచంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్' దివంచ పృథివీం చాంతరిక్ష మథో స్వః' (ఋ.10. 190-3) ఇత్యాది శ్రుతిమూలకము. ఇట్టిస్థితిలో శ్రుతిమూలకమగు బ్రహ్మసూత్రమందలి సమాననామరూపత్వహేతువు నుల్లేఖించి భిన్న కల్పములలోని భిన్నభారతముల ప్రారంభభేదమును నీలకంఠాచార్యులు సమర్థించుట విద్వన్మనోజ్ఞమే.

బ్రహ్మసూత్రములయందేకాక యీమహాభారతమందే 'మన్వాదిభారతం కేచిత్' అనుశ్లోకమునకు వెనుక

"యథర్తావృతులింగాని నానారూపాణి పర్యయే ।
దృశ్యన్తే తాని తాన్యేవ తథా భావా యుగాదిషు ॥ 39.
ఏవ మేత దనాద్యన్తం భూతసంహారకారకమ్ ।
అనాదినిధనం లోకే చక్రం సంపరివర్తతే ॥" 40 ఆది. అ. 1)

గడచిన ఋతువుల కుండెడి చిహ్నములే మఱల వచ్చుచున్న ఋతువులలో గూడ గనబడుచున్నట్లు గడచిన యుగములలోని విషయములే మఱల నాయుగములు వచ్చునప్పుడు ప్రాప్తించుచుండును. లోకమం దీవిధముగానే ఆద్యంతములు లేక కాలచక్రము తిరుగు

చున్నది అని చెప్పుటలో సమాననామరూపత్వము ప్రతిపాదింపబడినది. కనుక నీలకంఠీయోక్తప్రకార మీశ్లోకము సందర్భశుద్ధికలదేకాని ప్రక్షిప్తము కాదు. ఇక వెనుక జూపబడిన 'జ్ఞానదీపికా' వ్యాఖ్యానమును బట్టి చూచినయెడల వర్తమానమహాభారతమందే మనువును గూర్చి యొకచోట, ఆ స్త్రీకచరిత మొకచోట, ఉపరిచరవసుచరిత్ర మొకచోట వర్ణింపబడుటచేతను,అవి భారతోపాఖ్యానమునకుసంబధించినవే అగుట చేతను భారతోపాఖ్యానమున కాదని నిర్ణయించుటలో మూడు విధములుగా మునిమతభేదము ప్రదర్శింపబడినట్లు సమన్వయ మైనందున నాశ్లోకము ప్రక్షిప్తము కాదు. ప్రక్షిప్తత్వకల్పన ప్రతివాదులకు మాత్రమే. ఇట్లు పరీక్షింపగా నీశ్లోకము సర్వవిధముల ప్రతివాదులకే ప్రతికూలము.

(6)ఇక మ॥ భా॥ చ॥ కారులు॥ 'వ్యాసుడు 3సంవత్సరములురచించిన గ్రంథము 8800శ్లోకములు మాత్రమే' (పు33) అనుచు చూపియున్న ప్రమాణమును పరిశీలింతము—

"గ్రంథగ్రంథిం తదా చక్రే ముని ర్గూఢం కుతూహలాత్ ।
యస్మిన్ ప్రతిజ్ఞయా ప్రాహ ముని ర్ద్వైపాయన స్త్విదమ్ ॥
అష్టౌ శ్లోకసహస్రాణి హ్యష్టౌ శ్లోకశతానిచ ।
అహం వేద్మి శుకో వేత్తి సంజయో వేత్తివా న వా ॥
తచ్ఛ్లోకకూట మద్యాపి గ్రథితం సుదృఢం మునే ।
భేత్తుం న శక్యతేఽర్థస్య గూఢత్వా త్ప్రశ్రితస్యచ ॥" అని.

ఇచ్చట ముందుగా పూర్వోత్తరగ్రంథసందర్భము నవలోకింతము—

వ్యాసమహర్షి భారతగ్రంథము బుద్ధిసముగా జేసికొని దీనిని శిష్యులకు అధ్యాపనముచేయుట యెట్లని యాలోచించుచుండ నది గ్రహించి బ్రహ్మ మహర్షికి ప్రత్యక్షమై పూజింపబడి సుఖాసీనుడై

యుండ వ్యాసమహర్షి తాను బుద్ధిస్థముగా జేసియున్న భారతమందు గల విషయములను సంగ్రహముగా చెప్పి—

"పరం న లేఖకః కశ్చి దేతస్య భువి విద్యతే ॥"

అని యీగ్రంథమునకు లేఖకుడు మాత్రము ఇక్కడ లేడని చెప్పగా బ్రహ్మ—ఆగ్రంథకర్తృత్వమును, మహర్షి యోగ్యతను ప్రశంసించి—

"కావ్యస్య లేఖనార్థాయ గణేశ స్స్మర్యతాం మునే ॥"

గ్రంథమునకు లేఖకునిగా గణపతిని స్మరింపుమని బోధించి వెళ్లెను.

"తత స్సస్మార హేరంబం వ్యాస స్సత్యవతీసుతః ।
స్మృతమాత్రో గణేశానో భక్తచింతితపూరకః ॥ 75.
తత్రాజగామ విఘ్నేశో వేదవ్యాసో యతః స్థితః ।
పూజిత శ్చోపవిష్టశ్చ వ్యాసే నోక్త స్తదానఘ ॥
లేఖకో భారత స్యాస్య భవ త్వం గణనాయక ।
మయైవ ప్రోచ్యమానస్య మనసా కల్పితస్య చ ॥
శ్రుత్వేత త్ప్రాహ విఘ్నేశో యది మే లేఖనీ క్షణమ్ ।
లిఖతో నావతిష్ఠేత తదా స్యాం లేఖకో హ్యహమ్ ॥
వ్యాసోఽప్యువాచ తం దేవ మబుద్ధ్వా మాలిఖ క్వచిత్ ।
ఓ మి త్యుక్త్వా గణేశోఽపి బభూవ కిల లేఖకః ॥" 79.

తరువాత మహర్షి స్మరింపగా వెంటనే దర్శన మిచ్చిన గణపతిని వ్యాసమహర్షి పూజించి—'నాబుద్ధిస్థమై నాచే జెప్పబడు భారతమునకు నీవు లేఖకుడవు కావలె' నని ప్రార్థింపగా, గణపతి—'వ్రాయునపుడు నాకలము క్షణమైనను ఆగకుండెడి పద్ధతిని నీవు చెప్పగలవేని నేను వ్రాయుదు' ననగా, వ్యాసమహర్షి—'నీవర్థము చేసికొనుచు వ్రాసిన యెడల నట్లే చెప్పెద' నని ప్రతిజ్ఞచేయ, దాని కంగీకరించి గణపతి వ్రాసెను.

## అనేక కర్తృత్వ నిరాకరణము.

ఇంతవరకు ప్రతివాదులు చూపిన 'గ్రంథగ్రంథిం తదా' అను శ్లోకములకు పూర్వగ్రంథము. తరువాత 80. 81. 82. శ్లోకములు ప్రతివాదు లుదాహరించినవే. ఆపైనున్న 83వశ్లోకమిది—

"సర్వజ్ఞోపి గణేశో యత్ క్షణ మాస్తే విచారయన్ ।
తావ చ్చకార వ్యాసోఽపి శ్లోకా నన్యాన్ బహూనపి ॥"

'గ్రంథగ్రంథిమ్' ఇత్యాది నాల్గుశ్లోకములకు తాత్పర్య మేమనగా—

గణతి వ్రాయునపుడు మహర్షి కుతూహలముతో గూఢముగా గ్రంథగ్రంథిని చేసెను. ఆగ్రంథులవిషయమై చెప్పుచు 8800శ్లోకములు నాకు శుకునకు తప్ప అన్యులకు దురవగాహము లని ప్రతిజ్ఞచేసెను. ఆశ్లోకకూట మిప్పటికి అర్థము గూఢమగుట చేతను, శాణ్వాదివ్యుత్పత్తిభేదమున శబ్దము గూఢమగుటచేతను అభేద్యమైయున్నది. సర్వజ్ఞుడగు గణపతికూడ నాశ్లోకములు వినినప్పుడు వ్రాయుట మాని యర్థగ్రహణమునకై క్షణకాలము ఆలోచించుచుండువాడు అంతలో వ్యాసమహర్షి యితరములైన బహుశ్లోకములను చెప్పుచుండువాడు. అని.

దీనినిబట్టి గణపతి వ్రాతలోని వేగమునరికట్టుటకై మహర్షి నడుమ గూఢశ్లోకములు చొప్పించె ననియు, నట్టిగూఢశ్లోకములే 8800లనియు, అవికాక గ్రంథ మెంతో కలదనియు స్పష్టముగా జెప్ప బడియుండ, నావిషయము తెలియకుండుటకై 74 మొదలు 79వరకు గల పూర్వశ్లోకములను, కడపటి 83 వశ్లోకమును ప్రదర్శింపక ప్రతి వాదులు మాయచేసినారు.

మఱియు 'గ్రంథగ్రంథిమ్' అనునపుడు శబ్దజ్ఞాన మున్నవానికి

తత్పరుమసమానమునుబట్టి గ్రంథకంటె వేలుగా గ్రంథ మున్నదని తెలియుచునే యున్నది. మఱియు ప్రతివాదులలో నొకరగు మహాభారతమీమాంసాకారులు— 'మేక్డనాల్డు వేబరు మొదలైన పాశ్చాత్యవిద్వాంసులు ఆశ్లోకముల (జయమందలిశ్లోకముల) సంఖ్య 8800 అయియుండె నని చెప్పుచున్నారు కాని యీమతము మనకు గ్రహింపదగినది కాదు... మహాభారతమున 8800 సంఖ్యయొక్క యుచ్చారణము వ్యాసమహర్షియొక్క కూటశ్లోకముల నుద్దేశించి వచ్చినది' అనుచు నీ మ॥ భా॥ చ॥ కారుల వాదమును త్రోసివేసియే యున్నారు.

మఱియు ప్రతివాదులలోనే మఱియొకరగు శ్రీకృష్ణచరిత్రకారులుకూడ ఏకాదశపరిచ్ఛేదమున నిట్లు వ్రాసియున్నారు.—

"మహాభారతమును అనేకపర్యాయములు చదివియును... విచారణచేసియును గ్రంథవిషయమును ముందు వేరువేరు అంతరములుగ విభజింపవచ్చునని యోజించితిమి. మొదటిది మూలకథ ... అందు పాండవుల జీవనవృత్తాంతమును, తత్సంబంధమగు కృష్ణకథయును తప్ప నురేమియును లేదు ... ఇదియే చతుర్వింశసహస్రి (24 వేల) శ్లోకాత్మకమైన భారతసంహితగా కనబడుచున్నది"

ఇట్లు వ్రాసిన వీరుకూడ 8800 శ్లోకములే మొదటిగ్రంథమను మ॥భా॥చ॥ కారులవాదమును త్రోసివేసియే యున్నారు ఇట్లు ప్రతివాదులలోగూడ కొందరిచే త్రోసివేయబడి ప్రకరణవిరుద్ధమై యున్న యీవాదము హేయమే. (ఇచ్చట 24 వేలగ్రంథమే మొదటిది. (వ్యాసునిది) అనువాదము వెనుక విమర్శింపబడి లక్షగ్రంథము మొదటిది. దాని సంగ్రహము 24 వేలు అని నిరూపింపబడిన దను సంగతిని మఱువకుడు)

## — ◆ గణేశ లేఖకత్వసమర్థనము ◆ —

ఇట్లు మనము మ॥ భా॥ చ॥ కారుల వాదమును పరీక్షించుటలో మహాభారతమునకు లేఖకుడు గణపతి యని సిద్ధించినది ఇట్లుండ మ॥ భా॥ చ॥ కారులే 13-1-40 ఆంధ్రపత్రికలో 'విఘ్నేశ్వరుడు లేఖకుడా?' అని యొక వ్యాసము ప్రకటించి అందు 'విఘ్నేశ్వరుడు లేఖకు డను గాథ ఇటీవల సంస్కృతభారతమున గూర్పబడెను' అని వ్రాసి కొన్ని కారణములు చూపినారు. వానిని పరిశీలింతము.

(1) "విఘ్నేశ్వరుడు భారతసంహితను వ్రాసినయంశము దాక్షిణాత్యభారతపుప్రాచీనప్రతులలో లేదనియు, ఔత్తరాహుల ప్రతులలోనే ఇటీవల చేర్చబడె ననియు మదాసుప్రెసిడెన్సీకాలేజీలోని సంస్కృతపండితులగు శ్రీ పి. పి శాస్త్రిగారు తాము పరిష్కరించిన వావిళ్ళవారి నాగరలిపిభారతపీఠికలో విమర్శించి వ్రాసియున్నారు" అనునది యొక కారణము.

మన మిప్పుడు ఆపీఠికలోనే పి. పి. శాస్త్రిగారి కొన్నిమాటలు చూతము—

"1834 సం॥ మొదలు 1906 సం॥ వరకు దేవనాగరలిపి ఆంధ్రలిపి గ్రంథలిపులలో ఆరువిధములగు మహాభారతప్రతులు ముద్రింపబడినవి... ఆముద్రింపబడిన ప్రతు లారింటిలోను గణేశవృత్తాంత మున్నది. మేముగ్రహించిన దాక్షిణాత్యశాఖావలంబిమాతృకలలో గణేశవృత్తాంతములేదు"

"అస్మాభిశ్చ పరీక్షితాసు వస్తుతో దాక్షిణాత్యాసు బహ్వీషు మాతృకాసు గణేశోపాఖ్యానం నదృశ్యతే! ఇతి గణేశవృత్తాన్తోపన్యాసాభావ ఏవ దాక్షిణాత్యాయా మహాభారతమాతృకాశాఖాయా శ్చిహ్న మితి వక్తుం ప్రభవామః"

ఈవాక్యములచే పూర్వము ముద్రితములైన ఆరుప్రతులలోను గణేశవృత్తాంత మున్నది. మేము గ్రహించిన ప్రతిలో నావృత్తాంతము లేదు. మేము పరీక్షించిన దాక్షిణాత్యబహుకోశములలో గణేశవృత్తాంతము లేనందున గణేశవృత్తాంతము లేకుండుటే దాక్షిణాత్యభారత కోశములకు చిహ్న మని చెప్పగలము. అని తెలుపబడినది

ఇక, పి. పి. శాస్త్రిగా రన్న ఆరుప్రతులలో నొకటగు కుంభకోణప్రతిలో ముద్రాపకు లేమని వ్రాసిరో చూడుడు.

"అనేకేషాం విదుషాం సాహాయ్యేన దాక్షిణాత్యబహుకోశానుసారేణ సంశోధ్య...ప్రకాశితమ్''

దీనినిబట్టి కుంభకోణప్రతి దాక్షిణాత్యబహుకోశముల నాధారముచేసికొనియే పరిష్కరింపబడినట్లును, ఆబహుకోశములయందు గణేశవృత్తాంత మున్నట్లును స్పష్టమగుచుండ, దాక్షిణాత్యకోశములలో గణేశవృత్తాంతము లేనేలేదను పి. పి శాస్త్రిగారి మాటను విశ్వసించు టెట్లు ?

మఱియు గణేశవృత్తాంతము లేకుండ పి. పి. శాస్త్రిగారిచే పరిష్కరింపబడిన గ్రంథములోని పాఠక్రమమునందు ఔచిత్యము కనబడదు. చూడుడు!—

"అనుక్రమణికాధ్యాయం వృత్తాన్తం సర్వపర్వణామ్ ।
తస్యాఖ్యానవరిష్ఠస్య కృత్వా ద్వైపాయనః ప్రభుః ॥
కథ మధ్యాపయామీహ శిష్యా నిత్యన్వచిన్తయత్ ।
తస్య చిన్తయమానస్య ఋషే ర్ద్వైపాయనస్యచ ॥
స్మృత్వాఽఽజగామ భగవాన్ బ్రహ్మా లోకగురు స్స్వయమ్ ।
ప్రియార్థం మహర్షేశ్చాపి లోకానాం హితకామ్యయా ॥

మహాభారతేతిహాసమునకు సర్వపర్వవృత్తాంతరూపమైన అను క్రమణికాధ్యాయమును చేసి వ్యాసమహర్షి శిష్యుల కధ్యాపనముచే యుట ఎట్లని చింతించెను. అప్పుడు బ్రహ్మ-మహర్షికి ప్రీతినిమిత్తము, లోకులకు హితమునిమిత్తము దర్శనమిచ్చెను. అని యున్నది.

తరువాత మహర్షి బ్రహ్మను పూజించుట, భారతవృత్తాంతము చెప్పుట యున్నది. కాని యితరములైన ప్రతులలో నున్నట్లు—

'పరం న లేఖకః కశ్చి దేతస్య భువి విద్యతే' అని చెప్పినట్లు లేదు. బ్రహ్మ-మహర్షిని, భారతమును శ్లాఘించి వెళ్ళిపోయె నని యున్నది. ఇతరములైన ప్రతులలో నున్నట్లు 'కావ్య లేఖనార్థాయ గణేశ స్స్మర్య తాం మునే' అని చెప్పి వెళ్ళినట్లు లేదు. ఈపాఠక్రమములో తాను సిద్ధము చేసిన గ్రంథమును శిష్యులకు చెప్పుట కేమి లోప మున్న దని వ్యాసమహర్షి చింతించెనో తెలలేదు. ఆమహర్షి చింతించుచుండగా తెలిసి వచ్చిన బ్రహ్మ ఆచింత నేయుపాయమున దీర్చెనో తెలలేదు. ఆమహర్షి యెందులకో చింతించుచుండ నాచింత తీరకయే బ్రహ్మ దర్శనముచే మహర్షికి ప్రీతి, లోకులకు హితము ఎట్లయ్యెనో తెలియలేదు.

గణేశవృత్తాంతఘటితపాఠమందు ఇట్టిలోపములు లేవు ఏమ నగా శిష్యులకు చెప్పుట యెట్లని మహర్షికి కలిగిన చింత లేఖకుని గూర్చియే యని తేలినది. ఆచింతను గ్రహించియే దర్శన మిచ్చిన బ్రహ్మ గణపతిని ప్రార్థించి లేఖకునిగా జేసికొను మని యుపాయము చెప్పి ఆచింత దీర్చె నని తేలినది, అట్లు లేఖకునిమాట చెప్పుటను బట్టియే మహర్షికి ప్రీతియు, తన్మూలమున గ్రంథముఖ్యాత మగు టచే లోకులకు హితము కలిగె నని తెలిసినది.

కనుక పి. పి. శాస్త్రిగారి పరిష్కరణములో గ్రంథము లుప్త మైనట్లు స్పష్టముగా గనబడుచుండుటచే గూడ గణేశవృత్తాంతము ప్రక్షిప్తము కాదు.

ఒకవేళ పి.పి. శాస్త్రిగారి పాఠమే ప్రమాణ మని మ॥ భా॥ చ॥ కారు లందురేని "వ్యాసుని గ్రంథము 8800 మాత్రమే" అను తమ వాదమునకు ప్రమాణముగా నీయబడిన "గ్రన్థగ్రంథిమ్" 'అష్టౌ శ్లోక సహస్రాణి' అను శ్లోకములు గణేశవృత్తాంతఘటకములును పి. పి. శాస్త్రిగారి పాఠములో లేనివియు గనుక తమవాదమునకు ఆఘాతమే. ఆవాదము నిలవబెట్టుకొనుటకు గణేశవృత్తాంతము నంగీకరింతురా? అప్పుడు పి. పి. శాస్త్రిగారి పరిష్కరణమునుబట్టి గణేశవృత్తాంతము ప్రక్షిప్త మను తమవాదమునకు ఆఘాతము. ఇది ప్రతివాదులకు 'ఉభయత స్పాశా రజ్జుః' అన్నటులైనది.

ఇట్లు 'విఘ్నేశ్వరుడు లేఖకుడా' అను వ్యాసములోని యొక కారణము విగళిత మైనది. మఱియొక కారణము పరిశీలింపవలసియున్నది.

(2) "లిపిశాస్త్రజ్ఞులు ప్రాచీనయుగములలో భరతఖండమున లిపి లేదనియు, అప్పటిపూర్వులు గురువుచెప్పగా శిష్యులు విని వల్లించుకొనువారె యనియు, అందువలననే భారతీయుల ప్రాచీనగ్రంథము లగు వేదములకు శ్రుతులు అను పేరు కల్గెననియు చెప్పుచున్నారు. ఇందుకై ఆంధ్రవిజ్ఞానసర్వస్వములోని 'అక్షర' వ్యాసము చదువవగినది. ఇందువలన విఘ్నేశ్వరుడు భారతసంహితను వ్రాసె ననుట పొసగదని చెప్పవలసియున్నది'

ఈప్రతివాదులకు ప్రాచీనయుగములలో లిపి యున్నదో లేదో చూపుదము——

రామాయణము. సుందరకాండము. స॥ 36.

"వానరోఽహం మహాభాగే! దూతో రామస్య ధీమతః।
రామనామాంకితం చేదం పశ్య దే వ్యంగుళీయకమ్ ॥"

మహాభారతము. ద్రోణపర్వ. అ 99.

"రథమార్గప్రమాణం తు కౌంతేయో నిశితై శ్శరైః ।
చకార తత్ర పంథానం యయౌ యేన జనార్దనః ॥"
తేతు నామాంకితాః పీతాః కాలజ్వలనసన్నిభాః ।
స్నాయునద్ధా స్సుపర్వాణః పృథవో దీర్ఘగామినః ॥"

స్కాందము, ధర్మారణ్యఖండము. అ॥ 34.

"శాసనం తత్ర రామస్య రాఘవస్య చ నామతః ।
శృణు తామ్రాశ్రయం తత్ర లిఖితం ధర్మశాస్త్రతః॥"

పద్మపురాణము. రామాశ్వమేధము అ. 10.

'బబన్ధ భాస్వరం పత్రం తప్తహాటకనిర్మితమ్ ।
తత్రాలిఖ ద్దాశరథేః ప్రతాపబల మూర్జితమ్ ॥'

ఇత్యాది వచనము లెన్నియో లిపి అనాదిగా నున్నదని యుద్ఘోషించుచున్నవి.

ఇక ప్రతివాదులు చూడవలసిన దన్న ఆంధ్రవిజ్ఞానసర్వస్వము లోని అక్షరవ్యాసము ఇదిగో చూడుడు—

"...ఇట్లు తేలిన సారాంశ మేమనగా ఋగ్వేదకాలమునుండియు...హిందువులు లిపి నెరుంగుదురు" ఇంతపురాతనకాలము క్రిందట పూర్ణమైన అక్షరాత్మకలిపి నెరిగిన జాతి మరియొకటి లేదు. ఇట్లు వైదికకాలమునుండియు లిపి వాడుకయం దున్న యెడల వేదమును జనులు ముఖతః 'నేర్చుకొను నభ్యాసమును' దానికి శ్రుతి యని పేరును ఏలవచ్చెను?...అని ప్రతిపక్షులు ప్రశ్న లడుగవచ్చును...శ్రుతిశబ్దమునకు విన్నదియని యర్థము

చేయునెడల 'పరమేశ్వరునివలన ఋషులు విన్నది' యని యేల అర్థము చేయగూడదు? ఋషులు కేవలము మంత్రద్రష్టలు కాని మంత్రకర్తలు కారనికదా మనవారి అభిప్రాయము... పుస్తకమును జూచి వేదము నేర్చికొనుట మంచిది కాదన్న యూహ ఈదేశమందు పుట్టెనే కాని అక్షరలోపమువల్ల కాదు''

పాఠకులారా! మ భా. చ కారులు ఎంత మోసము చేసినారో చూడుడు! వారు పూర్వము లిపియే లేదను టొకటి, దానికి బలముగా 'అక్షరవ్యాసము చదువు' మను టొకటి. మన మావ్యాసము చూచు నప్పటికి లిపి అనాదిసిద్ధమని నిరూపింపబడియున్నది. దీనిని బట్టి యీ మ. భా. చ. కారులు అపార్థములు చెప్పుటకు, అసత్యము లాడుటకు జంకులేనివారని తెలిసినది. ఇట్లు వీరిరెండవ కారణము కూడ విగళితమైనది.

(3) ఇక 'నన్నయభట్టారకుని పాఠములో నీగాథ లేకుండుటచే గణేశవృత్తాంతము ప్రక్షిప్తము' అనునది యొకటి.

ఈవిషయమై మహాభారతములో వారు వ్రాసిన దేవారికి సమాధానము.

"అనుక్రమణికాధ్యాయములో మూలభారతమున పాండవులను గుంతి వనమునుండి తీసికొని వచ్చినపుడు పౌరులలో గొందరనుమానించిరి ... ఆభాగమును తెలిగింపలేదు. లాక్షాగృహదహనానంతరము పాండవులు భీతులై పలాయితులైరని సంస్కృత భారతమున నుండగా దాని నాంధ్రీకరణమున సూచింపనేలేదు'' (పు) 69.

అని మ. భా. చ. కారులే నన్నయ విడిచివేసిన భాగములు ఉన్నవని నిర్ణయించియున్నపుడు గణేశవృత్తాంతముకూడ నట్లే విడువ

బడినదని సమాధానము మనము చెప్పుట సులభమే. ఇట్లు వారు చెప్పిన కారణము లన్నియు విగళితము లైనవి. విఘ్నేశ్వరుడు లేఖకుడే యని స్థిరపడినది. ఆగాథ ఇటీవల కల్పింపబడినది కాదు. అనుటకు మరియొక నిదర్శన మున్నది.

అతిప్రాచీను డైన రాజశేఖరకవి 'బాలభారతము' అను తన గ్రంథమున భారతసంహితకు గణపతి లేఖకు డని వ్యాసవాల్మీకిసంవాదములో వ్యాసునిచే జెప్పబడినట్లు వ్రాసెను. చూడుడు!—

వాల్మీకిః:—

వత్స! కృష్ణద్వైపాయన! కస్య పునః కవే ర్వాచః భారతస్య షోడశీ మపి కలాం కలయన్తి। యతః— 'ధర్మే చార్థే చ కామే చ మోక్షే చ భరతర్షభ!, య దిహాస్తి త దన్యత్ర య న్నేహాస్తి న త త్క్వచిత్'...కిన్తు పృత మస్మాభి ర్యదు తాతివిరసే కావ్యకర్మ ణ్యభినివిష్టోసి! వ్యాసః— ఇద ముపాధ్యాయపాదేభ్యో విజ్ఞాప్యతే ॥ 'వినాయకో య శ్శివయో రపత్య మర్థం పుమా నర్ధ మిభశ్చ దేవః। స వర్తతే భారతసంహితాయాం వృత స్తపోభి ర్మమ లేఖకోత్ర' తేన చ ఛలయతు మహా ముపక్రాన్తః, యదుత బాఢ మహం తే లిపికారః కిం పున ర్యేన రంహసా లిఖేయం తేన యది న సంద్రుభసే త త్తే విఘ్న స్స్యాత్। తతో మయాపి ప్రతిచ్ఛలితః ఓమిత్యస్తు। కిం పున ర్భవతా భావయతా లిఖితవ్య మితి। అతః కావ్యకర్మ ణ్యభినివిష్టోస్మి।

ఇట్లు వ్యాసమహర్షి కఠినశైలిలో శ్లోకములు చెప్పుటకు హేతువు గణపతి యర్థము చేసుకొనునపుడు వ్రాతలోని వేగము తగ్గించుటకే యని చెప్పెను.

ఈవిధముగా మహాభారతమం దున్న గణేశవృత్తాంతమునే భఙ్గ్యంతరమున తన గ్రంథ మందు ప్రతిపాదించిన యీ రాజశేఖర కవి కాలము ఆబాలభారతోపోద్ఘాతములో నిట్లు చెప్పబడెను.

> "అథచ 881 మితే శకే 959 మితే వా ఖస్తాబ్దే జైనసోమ దేవేన యశస్తిలకచంపూః ప్రణీతా। తత్ర తృతీయాశ్వాసే మాఘాదికవినామసు రాజశేఖరస్యాపి నామ వర్తతే। తస్మా త్తత్కాలా త్ప్రాచీనో రాజశేఖరః।"

అనగా క్రీ. శ. 959 సంవత్సరములో జైనసోమదేవునిచే రచింపబడిన 'యశస్తిలకచంపులో' మాఘాదికవుల నామములలో రాజశేఖర కవి నామము కూడ తృతీయాశ్వాసములో పేర్కొనబడుటచే అంతకు వెనుక కాలము రాజశేఖరకవిది. అని తాత్పర్యము. ఈనిర్ణయమునుబట్టి ఇప్పటికి వేయిసంవత్సరములకు పూర్వుడు రాజశేఖరకవి. ఆతడు కూడ గణేశవృత్తాంతమును చెప్పినాడు. కనుక విఘ్నేశ్వరుడు లేఖకుడే.

ఇట్లు అనేకకర్తృత్వనిరాకరణప్రస్తావములో ప్రసక్తానుప్రసక్తముగ ప్రాప్తించిన గణేశలేఖకత్వవిషయము సంచలి ఆక్షేపములు పరిహరింపబడినవి ఇక ప్రకృతము నందుకొందము—

> (7) మహాభారతమీమాంసాకారులు మఱియొకపద్ధతిని కర్తృభేదము నిరూపించిరి—"ముందు వ్యాసమహర్షి 100 పర్వములను రచించెను. పిమ్మట సూతపుత్రుడు రౌమహర్షణి నైమిశారణ్యమందు 18 పర్వములను మాత్రము పఠించెను—

"ఏత త్పర్వశతం పూర్ణం వ్యాసే నోక్తం మహాత్మనా।
యథావ త్సూతపుత్రేణ లౌమహర్షణినా తతః॥
ఉక్తాని నైమిశారణ్యే పర్వా ణ్యష్టాదశైవ తు।" ఆది. అ2.)

దీనివలన 18 పర్వముల విభాగమును సౌతియే చేసె నని నిర్వి వాదముగా సిద్ధించుచున్నది''

వీరి వెనుకటి వ్రాత యిట్లున్నది—

''సౌతి తన గ్రంథమునకు 18 పర్వముల నేర్పరచెను. ఈపర్వ విభాగము క్రొత్తదియును, నతడే కావించినదియు నైయున్నది. వైశంపాయనుడు భారతమం దేపర్వములనేర్పఱిచెనో అవి మఱి యొకవిధముగానున్నవి. చిన్నవి. మఱియును వాని సంఖ్య 100 అయియున్నది... ఇందువల్ల నుక్తమైన రెండు ప్రకారముల విభాగములు భిన్నభిన్నగ్రంథకారులు చేసినవే యని స్పష్ట ముగా తెలియుచున్నది. అనగా వైశంపాయనుని భారతగ్రంథ మందు పర్వములని పేర్లు కల విభాగము లుండెను. అవిమిక్కిలి చిన్నచిన్నవిగా నుండెను. సౌతి యీచిన్నపర్వములను ఒక్కచో జేర్చి తన బృహద్గ్రంథములోని 18 భాగములను చేసెను''

ఈవ్రాతలలో నొకచోట 'ముందు వ్యాసమహర్షి 100 పర్వము లను రచించెను' అని చెప్పి, మఱియొకచోట 'వైశంపాయనుని భారత గ్రంథమందు ఆతడు చిన్న-చిన్న 100 పర్వముల నేర్పఱిచెను' అని చెప్పుట పరస్పరవిరుద్ధము.

'ఏత త్పర్వశతం పూర్ణం వ్యాసే నోక్తం మహాత్మనా' అని వారు చూపిన ప్రమాణము పర్వశతము వ్యాసరచితమని చెప్పుచుం డగా వైశంపాయనునకు ఆపర్వశతసంబంధము కల్పించుట విరుద్ధము.

ఇక, వ్యాసప్రోక్తగ్రంథమునే, పర్వశతముగా విభాగము చేసిన వాడు వైశంపాయనుడని యొకవేళ అందురేమో. అమాట'నాటకము వ్రాసిన వా డొకడు, అందు అంకములను విభజించినవాడు మఱియొ

డు. కావ్యము వ్రాసిన వాడొకడు అందు సర్గములు విభజించిన
ాడు మఱియొకడు' అన్నట్లు హాస్యాస్పదము

ఇక ఆ 100పర్వములను 18పర్వములుగా సౌతి చేసెనను వారి
ాదమునకు వారు చూపిన ప్రమాణము బలకర మగునేమో
ూతము—

శౌనకాదులకు సౌతి చెప్పుచున్న సందర్భములో నిట్లున్నది—

'భారత స్యేతిహాసస్య శ్రూయతాం పర్వసంగ్రహః' అ॥2. శ్లో॥41.
ని ప్రారంభించి... "భవిష్యపర్వచా ప్యుక్తం ఖిలే ష్వేవాద్భుతం
ుహత్" 81. అనువరకు 100 పర్వములు చెప్పి, తరువాత—

"ఏత త్పర్వశతం పూర్ణం వ్యాసే నోక్తం మహాత్మనా।
యథావ త్సూతపుత్రేణ లోమహర్షణినా తతః ॥
ఉక్తాని నైమిశారణ్యే పర్వా ణ్యష్టాదశైవ తు ॥")

అని చెప్పబడినది ఇచ్చట 'ఏత త్పర్వశతం వ్యాసే నోక్తమ్'
నునపుడు రచింపబడిన దని యర్థము. 'సూతపుత్రేణ అష్టాదశప
్వాణి నైమిశారణ్యే ఉక్తా న్యేవ' అనునపుడు ఋషిప్రశ్నానుగుణము
వ్యాసప్రోక్తమునే వినిపింప నారంభించిన సౌతిచే వినిపింపబడి
వనియే యర్థము ఇచ్చట 'గ్రంథ మంతయు వ్యాసకర్తృకమే యైన
యెడల వ్యాసుడే 'వ్యాసే నోక్తమ్' అని అన్యులు చెప్పినట్లు చెప్పుట
సంగత' మని ప్రతివాదులు ఆక్షేపింతురేమో—

"అనుక్రమణికాపర్వము, పర్వసంగ్రహపర్వము, పౌలోమపర్వము, పౌష్యపర్వము సౌతి కావించిన వనుటకు సంశయము
లేదు"

అని వ్రాసిన మ. భా. మీ. కారులు సౌతియే తనగ్రంథ మందు 'సూతపుత్రేణోక్తాని' అని అన్యులు చెప్పినట్లు చెప్పుట అసంగతము అను ఆక్షేపమునకు ఏమిసమాధాన మిచ్చెదరో? కనుక ఆర్ష శైలి యట్లుండు నని గ్రహింపవలెను.

పర్వశతమునకు కర్తయైన వ్యాసమహర్షియే అష్టాదశపర్వ విభాగమునకు కర్తకాని, వినిపించెడిసౌతి కర్తకాడు. ఆసంగతి గ్రంథమే చెప్పుచున్నది. నూరు అవాంతరపర్వములలో ఏయేపర్వములు ఏమహా పర్వములో నంతర్భూతములో ఆమహాపర్వములోని శ్లోకసంఖ్య యెంతో అధ్యాయము లెన్నియో చెప్పిన సందర్భములో వ్యాసమహర్షియే కీర్తింపబడియుండెను. చూడుడు—

"ఇత్యేతదాదిపర్వోక్తం ప్రథమం బహువిస్తరమ్ ।
అధ్యాయానాం శతే ద్వేతు సంఖ్యాతే పరమర్షిణా ॥
సప్తవింశతి రధ్యాయా వ్యాసే నోత్తమతేజసా ।
ఉద్యోగపర్వనిర్దిష్టం సంధివిగ్రహమిశ్రితమ్ ॥
వ్యాసే నోదారమతినా పర్వ ణ్యస్మిం స్తపోధనాః ।
సప్తమం భారతే పర్వ మహ దేత దుదాహృతమ్ ॥
పారాశర్యేణ మునినా సంచిత్య ద్రోణపర్వణి ।
స్వర్గపర్వ తతో జ్ఞేయం దివ్యం య త్త దమానుషమ్ ॥
ఏత దష్టాదశం పర్వ ప్రోక్తం వ్యాసేన ధీమతా ।
అష్టాదశైవ మేతాని పర్వా ణ్యేతా న్యశేషతః ॥
ఖిలేషు హరివంశశ్చ భవిష్యం చ ప్రకీర్తితమ్ ।
దశశ్లోకసహస్రాణి వింశచ్ఛ్లోకశతాని చ ॥
ఖిలేషు హరివంశేచ సంఖ్యాతాని మహర్షిణా ।
ఏత త్సర్వం సమాఖ్యాతం భారతే పర్వసంగ్రహః॥"

ఈవిధముగా అష్టాదశపర్వవిభాగము, హరివంశము, ఆయాపర్వములయందును హరివంశమందును శ్లోకపరిగణనము వ్యాసమహర్షియే చేసినట్లు కంఠోక్తిగా చెప్పబడియుండ ప్రతివాదులు దానిని తిరస్కరించి తమకు దోచినట్లు వ్రాయుట అన్యాయము.

హరివంశాంతము వ్యాసకర్తృకమైన భారతమే అని చెప్పు పై శ్లోకములను బట్టి మ॥ భా॥ చ॥ కారులు 'వ్యాసుని భారతము సౌప్తిక పర్వాంతము వఱకే యని వ్రాయబోవుచున్నాను' (పు. 32) అని వ్రాసినది పరాస్తమైనది. మ॥ భా॥ మీ॥ కారులు హరివంశమును గూర్చి యిట్లు వ్రాసిరి—

"హరివంశము ఖిలపర్వమని చెప్పబడుచున్నది. ఖిలశబ్దమునకు తరువాత గలుపబడిన దనియర్థము. దీనియొక్క పర్వసంఖ్య 18 కంటెను 100 కంటెను వేరై యున్నది. దీనిని సౌతి గ్రంథవిషయముయొక్క పూర్తికై కలిపియున్నాడు. కనుకనే దానికి ఖిలపర్వ మని పేరు పెట్టి 19వ పర్వమును చేసెను. అందు చిన్నచిన్నవి 3 పర్వము లున్నవి. ఈపర్వములకు కర్త సౌతి కాడని తెలియుచున్నది"

ఈవ్రాతలోని తప్పులు తెలిసికొందము—

నీలకంఠీయములో 'యచ్చ శాఖాన్తరస్థం శాఖాన్తరే ప్రయోజనవశాత్ పఠ్యతే తత్ ఖిల మితి వైదికీ ప్రసిద్ధిః' అను నిర్వచనమును బట్టి విష్ణుపురాణాదిగతమై భారతేతిహాసమందు ఆకాంక్షావశమున పఠింపబడిన హరివంశమునకు ఖిల మను పేరు పెట్టబడియుండ 'తరువాత గలుపబడినది ఖిలము' అనివ్రాయుట తప్పు.

అనుక్రమణికాధ్యాయమందు 100 పర్వములను చెప్పుచు—

"హరివంశ స్తతః పర్వ పురాణం ఖిల సంజ్ఞితమ్ ।

విష్ణుపర్వ శిశో శ్చర్యా విష్ణోః కంసవధ స్తథా ॥
భవిష్యం పర్వచా ప్యుక్తం ఖిలే ష్వేవాద్భుతం మహత్ ।
ఏత త్పర్వశతం పూర్ణం వ్యాసే నోక్తం మహాత్మనా ॥''

అనుచు హరివంశపర్వ విష్ణుపర్వ భవిష్యపర్వములతో నూరు పర్వములుపూర్ణముగా వ్యాసప్రోక్తము లని చెప్పబడి యుండగా 'దీని యొక్క పర్వసంఖ్య 100 కంటెను వేరైయున్నది''అనుటతప్పు. 'దీనిని సౌతి గ్రంథవిషయముయొక్క పూర్తికై కలిపియున్నాడు' అనుటతప్పు.

భారతేతిహాసమందు సూచింపబడిన కృష్ణమహాత్మ్యము యొక్కయు, మోక్షధర్మోపయుక్తముగు వైరాగ్యము యొక్కయు, నుపబృంహణార్థమై శౌనకాదుల జిజ్ఞాసావశమున నుపదేశింపబడినహరి వంశాదిపర్వములు భారతఘటకములే. సారాంశమే యనగా—

వ్యాసకర్తృకమైన భారతము అవాంతరపర్వశతాత్మకమగుట చేతను, హరివంశమును విడిచినపర్వశతపూర్తి కాకుండుటచేతను 'ఏకం శతసహస్రంతు మానుషేషు ప్రతిష్ఠితమ్'' అని చెప్పబడిన లక్షగ్రంథ సంఖ్య కూడ హరివంశము కలిపినగాని సిద్ధింపకుండుటచేతను, హరివం శాంతమందు "భవిష్యోత్తర మేత త్తే కథితం భారతం మయా'' అని భారతశబ్దముచేతనే ఉపసంహరింపబడుటచేతను, హరివంశము భార తాంతర్గత మనక తప్పదు. ఇట్లు నీలకంఠీయములోనిరూపించి సిద్ధాంతీ కరింపబడియున్నది.

ఇక, హరివంశము చేర్చిన లక్షగ్రంథసంఖ్య యెట్లు సిద్ధించు నందురా? చూడుడు—

నీలకంఠీయమ్—దశశ్లోకసహస్రాణీతి. హరివంశే భవిష్యాన్త గ్రన్థస్య ద్వాదశసహస్రాన్మితత్వమ్. నతు కృత్స్న హరివంశస్య అధి

కస్య గ్రన్థస్య దర్శనాత్. తావన్మాత్రప్రవేశయోంచ లక్షపూర్తే రయోగాత్. తథాహి—అత్రకంఠోక్తాయా స్సంఖ్యాయా స్సంకలనే షణ్ణవతిస్సహస్రాణి ద్వే శతే షోడశచ శ్లోకాః (96216) పరిశేషా త్పుష్కరప్రాదుర్భావాద్యుపరితనగ్రంథే కైలాసయాత్రాసహితే కించి దూనం సహస్రచతుష్టయం జ్ఞేయం। తేన "తతోఽధ్యర్ధశతం భూయ స్సంక్షేపం కృతవా నృషిః। అనుక్రమణికాధ్యాయమ్" ఇత్యాద్యా భూయశ్శబ్దా దధ్యర్ధశతాధికం లక్షం పరిపూర్ణం జ్ఞేయమ్॥

అనుక్రమణికాధ్యాయమునందు కంఠోక్తిగా జెప్పబడిన సంఖ్యను సంకలముచేయగా 96216 శ్లోకములు, అందు హరివంశ సంఖ్యగా జెప్పబడిన 12 వేలు భవిష్యపర్వపర్యంతగ్రంథసంఖ్యయే. యావద్గ్రంథసంఖ్యకాదు అధికగ్రంథము కనబడుచున్నది. అందుచే పైనున్న పుష్కరప్రాదుర్భావాదికైలాసయాత్రాంతగ్రంథసంఖ్య కించి న్న్యూనముగా 4 వేలు. ఇట్లు లక్షసంఖ్యాపూర్తియైనది ఆపై 'అధ్యర్ధ శతం భూయ స్సంక్షేపం కృతవా నృషిః' అనుటచే లక్షమీద అధ్యర్ధ శతము (150) ఇట్లు మనుష్యలోకప్రతిష్ఠితమైన భారతముయొక్క సంఖ్య సిద్ధించినది అని తాత్పర్యము.

ఇట్లు లక్షకు పైగా నున్నందున 'భారతము సపాదలక్షగ్రంథము' అనువ్యవహారముకూడ సశేషముగా లక్షగ్రంథ మను తాత్పర్యముతో నుపపన్నమే. ఇంత గ్రంథమునకు వ్యాసమహర్షి యొకడె కర్త యనుట ప్రతివాదులకు కిట్టదు. మహాభారతమీమాంసాకారు లేమనిరో చూడుడు—

> "వస్తుస్థితిని బట్టి మహాభారతగ్రంథమందు దగ్గర దగ్గరగా నొక లక్ష శ్లోకము లున్నవని తేలుచున్నది. ఇంతటి పెద్ద గ్రంథముయొక్క రచన నొక మనుష్యుడే గావించి యుండుట

అసంభవముగా నగపడుచున్నది. దీనిబట్టి మహాభారతకర్తలు ఒకనికంటె నెక్కువమై యుందురని అనుమానింపవలసివచ్చు చున్నది." (ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక- సంపు 15)

ఇట్టి యూహ పుట్టుటచేతనే అనేకకర్తృత్వమును కల్పించుటకు అసంబద్ధముగా వ్రాసి, అపార్థములు చెప్పి పడరానిపాట్లు పడినారు. ఆ మహర్షియొక్క అసాధారణశక్తిని గ్రహింపగలిగినచో వీరి కీకుసృష్టు లుండకపోవును గురుకులవాసముతో నార్షవిద్యాభ్యాసము చేసియున్న యెడల వీరికి ఆమహర్షి యసాధారణశక్తి కొంచము గోచరించి యుండును

"అభక్తానా మనర్థానాం సచ్ఛాస్త్రం శ్రూయతేఽపివా ।
అన్యథా ప్రతిభాత్యేవ విషాక్తానాం యథా పయః॥"

అన్నట్లు విషసర్పము గ్రహించినక్షీరము విషముగు విధమున అర్హతనుసంపాదించుకొనక, భక్తివిశ్వాసములు లేక వర్తించువారికి సచ్ఛాస్త్రము విరుద్ధముగానే గోచరించును. అది గ్రాహకదోషముకాని శాస్త్రదోషము కాదు. ఇన్నిపాట్లు పడి ముగ్గురు కర్తలని చెప్పి అంత టితో జాలక యితరులుకూడ మరికొన్నిభాగములు చేసి భారతములో కలిపివేసినా రని చెప్పి, ఆయాగ్రంథభాగములు విడదీయుటకు వీలుకా నట్లు చేసినారని చెప్పి యేమేమో అల్లికలల్లి అప్రమాణముగా వ్రాత సాగించిన ప్రతివాదులు గ్రంథమందు చెప్పబడినట్లు యథార్థముగా గ్రహించి ఆమహర్షిశక్తిని విశ్వసించిన కృతార్థులై యుందురుకదా!

ఇక ప్రకృతమునకు వత్తము. మ॥భా॥చ॥కారులు 'తతోఽధ్యర్థ శతం భూయ స్సంక్షేపం కృతవా నృషిః । అనుక్రమణికాధ్యాయం వృత్తాంతం సర్వపర్వణామ్' అను శ్లోకము నందుకొని యిట్లువ్రాసిరి-

"అధ్యర్థశతమ్" అను పదమునకు నూటయేబదిశ్లోకము లని

పెక్కండ్రర్థముచేయుచున్నారు. కాని అనుక్రమణికాధ్యాయము 280 శ్లోకములు కలిగి యున్నది. వివిధశ్లోకనిబద్ధమై యున్నది. అనుక్రమణికలటుల నుండవు. అనుక్రమణికాధ్యాయమందు శౌనకాదులకు, సౌతికి జరిగిన యుత్తరప్రత్యుత్తరములతో 94 శ్లోకములును, శేషించిన 133 శ్లోకములలోను 108 శ్లోకములు ధృతరాష్ట్రపరివేదనము, సంజయునోదార్పు నను గాధగా పోగా 78 శ్లోకములే మిగిలి యున్నవి'' (39 పు.)

ఆయనుక్రమణికాధ్యాయము నీలకంఠీయటీకతో నున్న గ్రంథమందు 275 శ్లోకములు కలిగియున్నది. అందు సౌతి శౌనకాదుల ప్రశ్నప్రతివచనాదులతో 'ఏకం శతసహస్రం తు మయోక్తం వై నిబోధత' అనువఱకు 109 శ్లోకము లైనవి ఆపై 'దుర్యోధనో మన్యుమయో మహాద్రుమః' అని యారంభించి చెప్పబడిన సర్వపర్వవృత్తాంతరూప మగు భారతకథాసంగ్రహము– 'అధ్యాత్మం శ్రూయతే యచ్చ పంచభూతగుణాత్మకమ్ । అవ్యక్తాదిపరం యచ్చ స ఏవ పరిగీయతే ॥ యత్తద్యతివరా ముక్తా ధ్యానయోగబలాన్వితాః । ప్రతిబింబ మివాదర్శే పశ్యం త్యాత్మ న్యవస్థితమ్॥' అనువఱకు చెప్పబడి, ఆపై 'శ్రద్దధాన స్సదా యుక్తః' అను శ్లోకముతో నారంభించి ఫలశ్రుతి చెప్పబడినది. ఆఫలశ్రుతిశ్లోకములు 15, కథాసంగ్రహమునకు పూర్వశ్లోకములు 109 కలిసి 124 అయినవి ఇక 275 ప్రాప్తికి కలియవలసిన 151 కథాసంగ్రహమై యున్నది. అవి 'అధ్యర్థశతమ్' అని చెప్పబడినవి.

ఇచ్చట సోపాఖ్యానభారతము లక్షగ్రంథము. అందుపాఖ్యానరహితము 24 వేలు. అని చెప్పి 'తతోఽధ్యర్థశతం భూయ స్సంక్షేపం కృతవా నృషిః। అనుక్రమణికాధ్యాయం।' అని చెప్పుటలో భూయ

శ్శబ్దమును బట్టి 150 శ్లోకములు లక్షకు పై నున్న వని నీలకంఠాచా ర్యులు నిర్ణయించెను అవి యెక్కడ నున్నవో చెప్పుటకే శ్లోకము లోని అనుక్రమణికాధ్యాయశబ్దప్రయోగము.

కనుక 150 శ్లోకములే ఆయధ్యాయమం దుండవలె నను నియ మము లేదు ఇట్లు చూచిన 'అనుక్రమణికాధ్యాయం వృత్తాంతం సర్వపర్వణామ్' అనుటను బట్టి సర్వపర్వవృత్తాంతరూపమైన అనుక్రమ ణికాధ్యాయ మదియే అగుటచే నీయధ్యర్ధశతశబ్దమునకు పెక్కండ్రు చేసియున్న 150 అను నర్థమే సమంజసమైనది. మ భా. చ. కారులు చెప్పినది సమంజసము కాదు. ఆపై 'అనుక్రమణికాధ్యాయము వివిధ శ్లోకనిబద్ధమై యున్నది అనుక్రమణిక లట్లుండవు' అందురే!

గ్రంథకారు డగు మహర్షి పేరుపెట్టి చెప్పిన అనుక్రమణికా ధ్యాయముపై అనుక్రమణిక లట్లుండ వని వీరి ఆక్షేపమా? ఇట్లాక్షే పించిన యీ మ. భా. చ. కారులే "పరిశోధించినచో వ్యాసకృతా నుక్రమణికాధ్యాయము ఆదిపర్వములోని ప్రథమాధ్యాయము కాదని యు, అది సౌతియొక్క మహాభారతమునకు ననుక్రమణికాధ్యాయ మనియు విశద మగును" (పు 39) అను టేమి బాగున్నది? అది వ్యాసునిది కాకూడ దట! సౌతి మహాభారతమునకు అనుక్రమణికా ధ్యాయము కావచ్చునట! ఆహా! వీ రాడిన దాట! పాడినది పాట! సౌతికి మహాభారతకర్తృత్వము సిద్ధింపనే లేదు కనుక వీరి యీ వ్రాత హేయము.

అధ్యర్ధశతశబ్దమునకు వీరు చెప్పిన యర్థమును దానికి తగిన యధ్యాయమును చూపుచు చేసిన సమన్వయమును చూడుడు!—

"అధ్యర్ధశతశబ్దమునకు ఇదివరకు చెప్పిన గ్రంథమున కధిక ముగా నర్ధశతము (50) అను నర్థము పొసగియున్నది. అట్టి

యధ్యాయము ఆదిపర్వములో 61న యధ్యాయము. దానికికథా సంక్షేపాధ్యాయమని పేరు. దానియందు 56శ్లోకము లున్నవి. మొదటి యైదుశ్లోకములును వైశంపాయనుడు జనమేజయునకు చెప్పిన వాక్యములు. కడపటిశ్లోకము కూడ వైశంపాయనుని వాక్యమే. నడుమనుండిన 50 శ్లోకములలో భారతేతిహాసము నిరూపింపబడినది. కడపటి శ్లోకమునందు ఈ యనుక్రమణికాధ్యాయములోని గాథకు జయ మని పేరు గల దని చెప్పబడినది" (పు 40)

ఈప్రతివాదులు అధ్యర్థశతశబ్దమునకు 150 అని యర్థము అనుక్రమణికాధ్యాయ మం దధికశ్లోకము లున్నందున సరిపడదని తాము 50 అనిఅర్థముచెప్పి, అంతమాత్రమే శ్లోకము లున్న అనుక్రమణికాధ్యాయమును చూపలేక, కథాసంక్షేపాధ్యాయమును తాము చెప్పిన 50 శ్లోకములకంటె నధికశ్లోకములు కలదానినె చూపి, యిది యనుక్రమణికాధ్యాయమే యని చెప్పి, ముందువెనుక నున్న శ్లోకములు విడిచి, నడుమశ్లోకములే లెక్కించి, తమయర్థమునకు సరిపుచ్చినట్లు చేసినారు.

వీరీపనిని ఆయనుక్రమణికాధ్యాయమందే యేల చేయరాదో! అట్లు ఆయధ్యాయమందే చేసినచో అనుక్రమణికాధ్యాయము కాని దానిని అనుక్రమణికాధ్యాయ మని చెప్పినారను నేరము లేకనేపోవును.

ఈప్రతివాదులు తాము చూపిన 61 వ అధ్యాయము అనుక్రమణికాధ్యాయ మనియే చెప్పబడె నని వ్రాసినారు. దానిని చూతము—

"ఆ యధ్యాయమే అనుక్రమణికాధ్యాయ మని కూడ 62 వ అధ్యాయము 12 వ శ్లోకమునందు చెప్పబడి యున్నది" (పు40) ప్రతివాదులు చెప్పిన ఆశ్లోక మేది యనగా—

"క్షణం కురు మహారాజ విపులోఽయ మనుక్రమః।
పుణ్యాఖ్యానస్య వక్తవ్యః కృష్ణద్వైపాయనేరితః ॥"

అనునది. ఇక్కడ మ. భా. చ. కారుల వ్రాతనుబట్టి 'అయ మనుక్రమః' ఈపూర్వాధ్యాయము అనుక్రమణికాధ్యాయము' అని యర్థ మన్నమాట. ఔను. 'నిరంకుశాః హ్యే తుండస్య' అన్నట్లు వారి కద్దేమున్నది!

మనము శ్లోకసమన్వయము చేయుదము—

"పుణ్యాఖ్యానస్య కృష్ణద్వైపాయనేరితః విపులః అయ మనుక్రమః వక్తవ్యః మహారాజ క్షణం కురు"

ఇట్టియన్వయములో 'అయమ్' అనుపదముచే పూర్వాధ్యాయమునే గ్రహించినయెడల నది ఉక్త మగుటచే వక్తవ్యపదముతో నన్వయింపదు. మఱియు, వారు ఆయధ్యాయమందు 50 శ్లోకములనే పరిగ్రహించుటవలన నది సంక్షిప్తమే కనుక దానికి విపులపదముతో నన్వయము కుదరదు. ఆపూర్వాధ్యాయమును వినియే యున్న జనమేజయుని వినుటకు ప్రోత్సహించుటకై సావధానుడవు కమ్మను మాటకు ఆవశ్యకత కలుగదు. కనుక వారి యన్వయము దుష్టము.

ఇక్కడ 'అయమ్' అనుపదముచే బుద్ధిస్థమైన వక్ష్యమాణమునే గ్రహింపవలెను అది విపులమైనదియు, వక్తవ్యమై యున్నదియు, గనుక నాపదద్వయముతో సమన్వయించును. అది పూర్వాధ్యాయోక్తసంక్షిప్తగాథను అనుసరించి నడచునదికనుక ననుక్రమ మనబడును. అట్టి విపులమైన గాథను వినుటకు సావధానుడవై యుండు మనుమాట కావశ్యకత కలుగును. ఇదియే విద్వత్సమన్వయమార్గము

ఇక మ॥భా॥చ॥ కారుల పెనుకచూపిన వ్రాతలోని యంశ మొకటి మిగిలినది అది యేదనగా ఆ 61వ అధ్యాయములోని కడపటి

శ్లోకమందు ఈయనుక్రమణికాధ్యాయములోని గాథకు జయమనిపేరు గలదని చెప్పబడినదట. వారన్న ఆకడపటిశ్లోక మిదిగో—

"ఏవ మేత త్పురావృత్తం తేషా మక్లిష్టకర్మణామ్ ।
భేదో రాజ్యవినాశశ్చ జయశ్చ జయతాంవర ॥"

ఇంతకు పూర్వగాథలో జనమేజయునితో కురుపాండవులకు రాజ్యార్థమై ద్యూతప్రయుక్తమైన కలహము, వనవాసము, యుద్ధము, ఎట్లాయినదో చెప్పుచున్నాను విను మని వైశంపాయనుడు క్రమముగా చెప్పుకొనివచ్చి యాకడపటిశ్లోకమునకు వెనుక—

"తత స్తే క్షత్రి ముత్సాద్య హత్వా దుర్యోధనం నృపమ్ ।
రాజ్యం విహతభూయిష్టం ప్రత్యపద్యన్త పాండవాః ॥"

ఆపాండవులు సపరివారముగా దుర్యోధనుని వధించి రాజ్యమును పొందిరి. అని చెప్పి యాకడపటి శ్లోకముతో వారి కీవిధముగా విరోధము, రాజ్యనాశనము, జయము కలిగిన దని చెప్పెను.

ఇట్లు పాండవులకు గలిగిన జయముమాట శ్లోకములో జెప్పబడియుండగా నాయధ్యాయములోని గాథకు జయ మని పేరు చెప్పబడిన దనుట యెంతమోసమో చూడుడు. ఇట్టి యర్థరహితమైన ప్రతివాదుల వ్రాతలు విమర్శనములట. ఇట్టి విమర్శనశక్తి విద్వాంసులకు లేదట. ఇటువంటి విమర్శనశక్తి విద్వాంసుల కుండదన్న మాట నిజము. వారికుండెడిది యిట్టి దుర్విమర్శనములను ప్రమాణోపపత్తులతో విదళించెడి శక్తి. ఇక దీనిని విడిచి మరియొక విషయ మను కొందము—

ఈమహాభారతములో ప్రథమాధ్యాయము అనుక్రమణికాపర్వము. ద్వితీయాధ్యాయము పర్వసంగ్రహపర్వము. ఈరెండధ్యాయములలో గూడ భారతకథాసంగ్రహమే ప్రతిపాదింపబడినది. అందు

ప్రథమాధ్యాయస్థకథాసంగ్రహముకంటె ద్వితీయాధ్యాయస్థకథాసంగ్రహము విపులముగానున్నది. అవ్యవహితాధ్యాయద్వయమందు కథాసంగ్రహవైచిత్ర్యము, ఆంద్యాధ్యాయమున కాయధ్యాయమునకే, ఫలశ్రుతియు, కలిగియుండుటకు తాత్పర్యము తెలిసికొనవలసియున్నది.

టీ. అత్ర కేవలస్య సోపాఖ్యానస్య చ భారతస్య స్మరణే ఆద్యయోః పర్వణో స్తాత్పర్యమ్ ॥

అని చెప్పబడుటచే, 24 వేలని చెప్పబడిన కేవలభారతము నందలి కథాసంగ్రహము ప్రథమాధ్యాయ మందును, లక్షసంఖ్యకల సోపాఖ్యానభారతమునందలి కథాసంగ్రము ద్వితీయాధ్యాయ మందును వర్ణింపబడిన దని భావము.

ప్రథమాధ్యాయమాత్రపాఠమునకు ప్రథమాధ్యాయమందును, భారతపాఠమునకు ద్వితీయాధ్యాయమందును ఫలశ్రుతి చెప్పబడినది.

—•అనుక్రమణికాధ్యాయ ఫలశ్రుతిః—

"శ్రద్దధాన స్సదా యుక్త స్సదా ధర్మపరాయణః ।
ఆసేవ న్నిమ మధ్యాయం నరః పాపా త్ప్రముచ్యతే ॥
అనుక్రమణికాధ్యాయం భారత స్యేమ మాదితః ।
ఆస్తిక స్సతతం శృణ్వ న్న కృచ్ఛ్రే ష్వవసీదతి ॥
భారతస్య వపు ర్హ్యేత త్సత్యం చామృత మేవ చ ।
నవనీతం యథా దధ్నో ద్విపదాం బ్రాహ్మణో యథా ॥
య ఇమం శుచి రధ్యాయం పఠే త్పర్వణి పర్వణి ।
అధీతం భారతం తేన కృత్స్నం స్యా దితి మే మతిః॥
కార్ష్ణం వేద మిమం విద్వాన్ శ్రావయిత్వా ఽర్థ మశ్నుతే ।
భ్రూణహత్యాదికం చాపి పాపం జహ్యా దసంశయమ్ ॥"

టీ॥ యుక్తో = నియమవాన్; ఆసేవన్ = జపన్; ఆదితః = నారా

యణం సమస్తత్త్వేత్యారభ్య; అనేన భారతకథాంశమాత్రం 'పరాశ రాత్మజో విద్వాన్' ఇత్యతఏవ ఆరభ్య తదుక్తవ్య మితి నాదర్తవ్య మితి భావః॥ ఏతద్భారతస్య వపుః = శరీరమ్; సత్యం = బ్రహ్మ; అమృతం = దేవభావ ప్రాప్తిరస్తీత్యర్థః, ఉత్తరగ్రన్థ స్త్వస్య రాజ్ఞఇవ పరిహారస్థానీయః తత్త్వం త్వత్రైవ సూత్రిత మిత్యర్థః"

ఇచ్చట శ్రద్ధయు నియమము కలిగి యీయధ్యాయము జపించినవాడు పాపవిముక్తుడగును. భారతముయొక్క ఈయనుక్రమణికాధ్యాయమును ఆదినుండియు శ్రవణముచేసిన ఆస్తికునకు కష్టములు తొలగును. ప్రతి పర్వకాలమందును శుచియై యీ యధ్యామును పఠించినవాడు భారత మంతను పఠించినఫలము నొందును. ఈకార్ష్ణ (వ్యాసప్రోక్త) వేదమును వినిపించిన విద్వాంసుడు పాపవిముక్తుడగును. అని అనుక్రమణికాధ్యాయపఠనశ్రవణఫలము చెప్పబడినది.

దీనినిబట్టి 'అనుక్రమణికాధ్యాయమందు ... సౌతి భారతపఠనశ్రవణములచే నగు ఫలము జెప్పియుండెను' (పు 39) అను మ॥భా॥చ కారుల వ్రాత నిరస్త మైనది"

మఱియొకవిషయము మనుకొనవలసియున్నది —

మహాభారతారంభమునశౌనకుడు సౌతిని ప్రశ్నించినపుడు జనమేజయునకు వైశంపాయనుడు వినిపించిన వ్యాసప్రోక్తభారతమును నీవు మాకు వినిపింపు మని కోరినట్లును, సౌతి యట్లే వినిపింతునని చెప్పి యుపక్రమము చేసినట్లును చెప్పబడినది. తరువాత సౌతి చెప్పుటలో పర్వసంగ్రహపర్వానంతరము ఆ వైశంపాయనుడు జనమేజయునకు చెప్పినట్లున్న గాథనే యెత్తుకొనక, పౌష్య పౌలోమాస్తీకపర్వములను ముందు చెప్పినట్లు ప్రతిపాదింపబడినది శౌనకాదులు కోరినదానికంటె నధికముగా జెప్పబడిన ట్లున్న యీగ్రంథము వైశంపాయనుడు వినిపిం

చీన భారతమునకు ఆదియం దున్న దే యనియు, సౌతి అధిక ముపదే శింపలేదనియు బోధింపబడినది. చూడుడు—

"యత్తు శౌనక సత్రే తే భారతాఖ్యాన ముత్తమమ్ ।
జనమేజయస్య తత్సత్రే వ్యాసశిష్యేణ ధీమతా ॥
కథితం విస్తరార్థంచ యశోవీర్యం మహీక్షితామ్ ।
పౌష్యం తత్రచ పౌలోమ మాస్తీకంచాదిత స్స్మృతమ్ ॥" ఆ. 2అ.

టీ॥ కథిత మితి. సత్రే వ్యాసశిష్యేణ యత్ కథితం తత్ర భారతే పౌష్యం పౌలోమ మాస్తీకంచ మహీక్షితాం యశో వీర్యంచ వక్తు మితి శేషః. ఆదితః స్మృత మితి యోజనా. స్మరణన్తు విస్తరార్థమ్. అయం భావః—'తద్విజ్ఞానార్థం స గురు మేవాభిగచ్ఛే త్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్' 'అవిద్యయా మృత్యుం తీర్త్వా' ఇత్యాది శ్రుతేః గురుసేవామాహాత్మ్యం గురూణాం చ మాహాత్మ్యం యజ్ఞాదీనాం విద్యార్థత్వం చ నిరూపణీయమ్. తే ష్వన్యతమాభావేఽపి విద్యా నైవో దేతు మర్హతీతి తదర్థ మాతాచార్యేణాఖ్యాయికాముఖే నైవ పౌష్యే గురుశుశ్రూషామాహాత్మ్యం పౌలోమే భార్గవాణాం గురూణాం మహాభాగ్య ముక్తమ్। ఆస్తీకే జరత్కారో రపత్రిపన్న గార్హస్థ్య స్యాకృతార్థత్వదర్శనేన యజ్ఞాదీనా మావిద్యకానా మపి విద్యాంగత్వ ముక్తం, 'వివిదిషన్తి యజ్ఞేన' ఇత్యాదిశ్రుతేః ।

తస్మా న్మహోపనిషదారంభే ఏతత్త్రయకథన మావశ్యక మితి ఆఖ్యాయికాముఖేన కథ్యమానగహనో ఽప్యర్థ స్సుగ్రహో భవతీతి అభిప్రేత్య మహీభృతాం యశో వీర్యం చోక్త మితి ॥

ఓశౌనకా! నీసత్రయాగమందు ఏభారతాఖ్యానము నావలన ప్రవృత్తమైనదో అది జనమేజయుని సత్రమందు వ్యాసశిష్యునిచే జెప్ప బడినది. ఆవ్యాసశిష్యునిచే జెప్పబడిన భారతమందు పౌష్యపౌలోమా

స్తీకపర్వములు ఆదిని ఘటన చేయబడినవి. గురుసేవామాహాత్మ్యము, గురుమహాత్మ్యము, విద్యోపకారకములైన యజ్ఞాదులు, అనువానిలో నేయొక్కటి లోపించినను విద్యోత్పత్తికానేరదు. కనుక తదర్థమై ఆచార్యునిచే ఆఖ్యాయికాముఖమున పౌష్యమునందు గురుశుశ్రూషామాహాత్మ్యము, పౌలోమమునందు భార్గవులైన గురువులయొక్క మాహాత్మ్యము, ఆస్తీకమునందు జరత్కారువృత్తాంతముచే యజ్ఞాదులకు విద్యాంగత్వము చెప్పబడినది. మహోపనిషదారంభమందు ఈత్రయము చెప్పుట ఆవశ్యక మనియు, అర్థము గహనమైనను ఆఖ్యాయికాముఖమున జెప్పబడినపుడు సుబోధ మగుననియు, తాత్పర్యముతో మహనీయులయొక్క యశోవీర్యములు ప్రతిపాదింపబడినవి. అని భావము.

"భారత స్యేతిహాసస్య శ్రూయతాం పర్వసంగ్రహః ।
పర్వానుక్రమణీపూర్వం ద్వితీయః పర్వసంగ్రహః ॥
పౌష్యం పౌలోమ మాస్తీక మాది రంశావతారణమ్ ।
తత స్సంభవపర్వోక్త మద్భుతం రోమహర్షణమ్ ॥"

టీ॥ అత్ర కేవలస్య సోపాఖ్యానస్య చ భారతస్య స్మరణే ఆద్యయోః పర్వణో స్తాత్పర్యం, పౌష్యాదిత్రయస్య తూక్త మేవేతి పర్వపంచకతాత్పర్య ముక్తం। తత్రాస్తీకే కర్మప్రాధాన్య ముక్తం। తత్కర్మిణో దేవభావం ప్రాప్యాపీహ జన్మ లభన్తే ఇత్యాదా వంశావతరణముక్తం షష్ఠే । అంశావతరణం దేవానాం భూమౌ భాగశోఽవతరణ మాదిః ప్రథమం పర్వేత్యర్థః । తేన పూర్వోక్తా సాతిప్రతిజ్ఞా సంగచ్ఛతే ॥

సంభవే, అత్ర లబ్ధజన్మనా మపి న తేషాం నియమేన స్వర్గతిః। కిన్తు సర్పనాగాదితామసయోనిప్రాప్తి రపి కర్మవశా ద్భవతీ త్యుక్తం సప్తమే, తత్ర హ్యర్థార్థినో బన్ధూ న ప్యన్యాయేన ఘ్నన్తీతి జాతుషే దర్శిత మష్టమే, తథా కాముకాః స్త్రియః బన్ధూ నపి ఘాతయన్తీతి

అవిశ్వసనీయా స్త్రా ఇతి హిడింబే నవమే దర్శితమ్। శ్వనూకరభక్ష్య స్యాపి శరీరస్యార్థే పరప్రాణానపి పాపరాః ప్రత్యూహ మాదధత ఇతి బకవధే దశమే సూచితం। తతః కష్టతరాం గతిం లమఃప్రధానాః ప్రాణినః ప్రాప్నువ న్తీతి ప్రబన్ధేన 'పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రా హ్మణో నిర్వేద మాయా న్నా స్త్య కృతః కృతేన' ఇతి శ్రుత్యర్థ ఉప బృంహితః। ఏవ మగ్రేఽపి తత్తదాఖ్యానతాత్పర్యోన్నయనేన రాజసా నాం సాత్త్వికానాం చ గతిః పరీక్షణీయా, అగ్రేప్రతిప్రకరణం వక్ష్య మాణత్వా దిహ గ్రన్థవిస్తరభయా న్న ప్రపంచ్యతే॥

వెనుక నైదుపర్వములకు తాత్పర్యము వర్ణింపబడినది. అందు ఆస్తీకమునందు- కర్మప్రాధాన్యము చెప్పబడినది. అట్లు కర్మచేసిన వారు దేవభావమును పొందియు, నిచ్చట జన్మింతురని ఆఱవదైన ఆది పర్వమందు- అంశావతరణము చెప్పబడినది. (అంశావతరణ మనగా దేవతలు తమతమ యంశములతో భూమియం దవతరించుట.) శ్లోకములో "ఆది రంశావతరణమ్" అనుటచే అంశావతరణపర్వము ప్రథమ మని యర్థము (భారతకథ కన్నమాట) కనుక సౌతి ప్రతిజ్ఞ సంగతమగుచున్నది. (ఇదిప్రథమమనుటచేత నంతవఱకున్న గ్రంథము దీని యనుబంధమే కాని యప్రస్తుతముకాదని సూచింపబడినది)

సప్తమమైన సంభవపర్వమందు- ఇచ్చట జన్మించినవారందరికి నియమితముగా స్వర్గతి కలుగ దనియు, కర్మవశమున సర్పాది తామస జన్మములు కలుగు ననియు చెప్పబడినది. అష్టమమైన జాతుమపర్వ మందు- అర్థార్థులు బంధువులను గూడ నన్యాయముచే హింసించు చుందురని చెప్పబడినది. నవమమైన హిడింబపర్వమందు- కాముక స్త్రీలు, బంధువులనుగూడ హింసింపజేయుదురు, వారిని విశ్వసించి యుండరాదని చెప్పబడినది. దశమమైన బకవధపర్వమందు- శునక

సూకరాదులకు భక్ష్యమగు శరీరమునిమిత్తము పామరులు నిత్యము పరుల ప్రాణములుకూడ పుచ్చుకొనుచుందు రని చెప్పబడినది. దాని వలన తామసప్రాణులు కష్టతరమైన గతి నొందుదు రని చెప్పి విషయ భోగములందు విరక్తి వహింపవలె నను శ్రుత్యర్థము వివరింపబడినది. ఇట్లే ముందు కూడ నాయా ఆఖ్యానముల తాత్పర్య మూహించి రాజససాత్త్వికప్రాణుల గతి పరిశీలింపదగినది. ముందు ప్రతిప్రకరణ మునకు తాత్పర్యము చెప్పబడుచుండుటవలన నిచ్చట గ్రంథవిస్తర భీతిచే వివరింపబడలేదు అని యా నీలకంఠీయమునకు భావము. ఈవిధ మున జూడగా వేదవ్యాసకర్తృకమైన మహాభారతము బ్రహ్మవిద్యా ప్రతిపాదనమున ముఖ్యతాత్పర్యము కలదై, తత్ప్రాప్త్యుపాయాదులను సుబోధ మగుటకు ఆఖ్యాయికాముఖమున వెల్లడించుచున్న దగుటచే నాయాస్థలములలోని తాత్పర్యవిశేషములు విద్వద్వ్యాఖ్యానమూల మునసే గ్రహించి శ్రేయస్సాము లానందింపవలసినది. పర్యవసాన మేమనగా—

"వేదా నధ్యాపయామాస మహాభారతపంచమాన్"

అనుటనుబట్టి వేదవ్యాసమహర్షి శిష్యులగు వైశంపాయనాదులు ఆమహర్షి కృతిమైన మహాభారతము నే మహర్షియొద్ద జదువుకొని యుం డుటచేతను, జనమేజయుసర్పసత్రములో దర్శన మిచ్చిన వ్యాస మహర్షి ని కురుపాండవచరిత్రము నీవలన వినదలచి యుంటినని జనమే జయుడు ప్రార్థింప—

"తస్య తద్వచనం శ్రుత్వా కృష్ణద్వైపాయన స్తదా ।
శశాస శిష్య మాసీనం వైశంపాయన మన్తికే ॥
కురూణాం పాండవానాం చ యథా భేదోఽ భవత్పురా ।
తదస్మై సర్వ మాచక్ష్వ యన్మత్త శ్శ్రుతవా నసి ॥
గురో ర్వచన మాజ్ఞాయ స తు విప్రర్షభ స్తదా ।

ఆచచక్షే తత స్సర్వ మితిహాసం పురాతనమ్ ॥" (ఆది. అ60)

అనుటనుబట్టి వ్యాసమహర్షి శిష్యుడగు వైశంపాయనునకు, 'ఇది వరలో నాయొద్ద నీవు చదువుకొనియున్న దాని నంతను ఈజనమేజయునకు నీవు చెప్పు' మని యాజ్ఞాపించి వైశంపాయను డప్పుడు పురాతనమైన యితిహాసమును సర్వము వినిపించినట్లుండుటచేతను ఆసమయమం దక్కడనే యుండి ఆయితిహాసము నంతను విని శౌనకసత్రమునకు వచ్చిన సౌతిని శౌనకాదు లాదరించి యెక్కడనుండి యీరాక యని యడిగినపుడు అతడు చెప్పిన సందర్భమున జనమేజయసర్పసత్రము నందు వ్యాసప్రోక్తములై వైశంపాయనునిచే వినిపింపబడిన మహాభారతగాధలను విని యిట్లు వచ్చితి నని చెప్పగా ఋషులు—

"ద్వైపాయనేన యత్ప్రోక్తం పురాణం పరమర్షిణా ।
సురై ర్బ్రహ్మర్షిభిశ్చైవ శ్రుత్వా యదభిపూజితమ్ ॥
తస్యాఖ్యానవరిష్ఠస్య విచిత్రపదపర్వణః ।
భారత స్యేతిహాసస్య పుణ్యాం గ్రన్థార్థసంయుతామ్ ॥
జనమేజయస్య యాం రాజ్ఞో వైశంపాయన ఉక్తవాన్ ।
వేదై శ్చతుర్భి స్సంయుక్తాం వ్యాస స్యాద్భుతకర్మణః ॥
సంహితాం శ్రోతు మిచ్ఛామః పుణ్యాం పాపభయాపహామ్॥(ఆ1అ)

అనుటనుబట్టి వైశంపాయనుడు వినిపించిన ఆవ్యాసప్రోక్తభారతమునే మాకు వినిపింపు మని సౌతిని కోరగా దానినే సౌతి వినిపించినట్లుండుటచేతను, ఆభార తేతిహాసముయొక్క నూరుపర్వములు చెప్పుటలో

"భారత స్యేతిహాసస్య శ్రూయతాం పర్వసంగ్రహః ।
పర్వానుక్రమణీపూర్వం ద్వితీయః పర్వసంగ్రహః ॥
పౌష్యం పౌలోమ మాస్తీక మాది రంశావతారణమ్ ।
తత స్సంభవపర్వోక్త మద్భుతం రోమహర్షణమ్ ॥"

అని చెప్పుకొనుచువచ్చి —

"మహాప్రాస్థానికం పర్వ స్వర్గారోహణికం తతః ।
హరివంశ స్తతః పర్వ పురాణం ఖిలసంజ్ఞితమ్ ॥
విష్ణుపర్వ శిశో శ్చర్యా విష్ణోః కంసవధ స్తథా ।
భవిష్యం పర్వచా ప్యుక్తం ఖిలే ష్వేవాద్భుతం మహత్ ॥
ఏత త్పర్వశతం పూర్ణం వ్యాసే నోక్తం మహాత్మనా ।"(ఆది 2అ)

అనుటబట్టి అనుక్రమణికాపర్వము మొదలు హరివంశాంతము కల నూరుపర్వముల గ్రంథము భారతేతిహాస మనియు, నూరు పర్వములు పూర్ణముగా వ్యాసప్రోక్తములే యనియు సౌతియే చెప్పి యుండుటచేతను,

ఆనూరుపర్వములలో అష్టాదశమహాపర్వాంతర్గతములు—

"స్వధర్మనిర్జితం స్థానం స్వర్గే ప్రాప్య స ధర్మరాట్ ।
ముముదే పూజిత స్సర్వై స్సేంద్రై స్సురగణైస్సహ ॥
ఏత దష్టాదశం పర్వ ప్రోక్తం వ్యాసేన ధీమతా ।
అష్టాదశైవ మేతాని పర్వా ణ్యేతా న్యశేషతః ॥
ఖిలేషు హరివంశశ్చ భవిష్యం చ ప్రకీర్తితమ్ ।" (ఆది. 2అ)

అనుటనుబట్టి అనుక్రమణికాపర్వము మొదలు స్వర్గారోహణ పర్వాంతముకల 97 పర్వములే యనియు, మిగిలినవి హరివంశములోని వనియు, అష్టాదశపర్వవిభాగము వ్యాసకృతమే యనియు, సౌతియే చెప్పియుండుటచేతను మహాభారతకర్త వేదవ్యాసమహర్షియే.

వ్యాసమహాభారతి మట్టి యసాధారణరచనాదికము కలది కనుకనే—

"కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుమ్ ।
కోహ్యన్యః పుండరీకాక్షా న్మహాభారతకృ ద్భవేత్ ॥"

అని విష్ణుపురాణవచనము నారాయణునికంటె నన్యుఁడెవ్వఁడు మహాభారతకర్త కాఁగల డనుచు మహాభారతకర్తృత్వమును బట్టియే వేదవ్యాసమహర్షి నారాయణావతారమే యని నిరూపించినది.

ఇట్టిస్థితిలో ప్రతివాదులు ఎవ్వారెవ్వరో కర్త లనుచు ప్రమాణవిరుద్ధముగా శబ్దమర్యాదను పాటింపకయే, స్వకపోలకల్పితములతో, పూజ్యమైన మహాభారతమును నానాదురవస్థలకు పాలుచేసినారు. మనము వారి వ్రాతలలోని దోషములను నిరూపించుకొనుచువచ్చినాము ఆప్రతివాదులు మహాభారతములోని వ్యాసకృతగ్రంథమునకు జయమనియే పేరనుటచే జయశబ్దార్థమును గూడ పరిశీలింతము—

ప్రతిపురాణమునకు ఆదిని "నారాయణం నమస్కృత్య. తతో జయ ముదీరయేత్" అని యున్నది. శ్రీమద్భాగవతద్వితీయాధ్యాయమున కథారంభము చేయు సూతుఁడు గురునమస్కారానంతరము—

"నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్ ।
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయే ॥"

అని జయమును చెప్పుచున్నా ననియే వచించెను. అచ్చట శ్రీధరీయమున—

"జయ త్యనేన సంసార మితి జయో గ్రన్థః ॥

అని వ్యుత్పత్తి చెప్పఁబడినది. ఇట్లు సర్వగ్రంథసాధారణముగా ప్రయోగింపఁబడియున్న జయశబ్దమును బట్టుకొని మహాభారతమందు కొంతభాగమునకు జయ మని పేరని వ్రాయుట యుక్తముకాదు. మహాభారతాదియందు దున్న 'నారాయణం నమస్కృత్య తతో జయ ముదీరయేత్' అనుచోట నీలకంఠీయ మిట్లున్నది—

టీ॥ జయం- జయోనామేతిహాసోఽయ మితి వక్ష్యమాణత్వాత్ జయసంజ్ఞం భారతాఖ్య మితిహాసంవా । "అష్టాదశపురాణాని రామస్య చరితం తథా । కార్ష్ణం వేదం పంచమంచ యన్మహాభారతం విదుః । తథైవ విష్ణుధర్మాశ్చ శివధర్మాశ్చ శాశ్వతాః । జయేతి నామ తేషాంచ ప్రవదంతి మనీషిణః॥" ఇతి భవిష్యవచనా త్పురాణాదికం వా । "చతుర్ణాం పురుషార్థానా మపి హేతౌ జయోఽస్త్రియామ్॥" ఇతి కోశా దన్యం వా సర్వపురుషార్థప్రతిపాదికం గ్రంథం శారీరకసూత్రభాష్యాదిరూప ముదీరయేత్ ॥"

అనగా అష్టాదశపురాణములు, రామచరితము, పంచమవేద మగు వేదవ్యాసమహాభారతము, విష్ణుధర్మములు, శివధర్మములు, వీని కన్నిటికి జయ మని వ్యవహార మున్నదని భవిష్యపురాణవచనము బోధించుచున్నది. సర్వపురుషార్థప్రతిపాదకమైన గ్రంథము జయమని కోశము బోధించుచున్నది. మహాభారతమందు— 'జయోనామేతిహాసోఽయమ్' అని చెప్పబడుటచేత భారతేతిహాసము జయ మని బోధింపబడినది. అని భావము.

ఈ ప్రమాణములచే మహాభారతమంతయు జయ మనబడును కాని, అం దేదో కొంతభాగము జయ మనబడ దని స్పష్టము

దీనిచే గీతారహస్యము (718 పు) లో 'జయశబ్దముచే భారతయుద్ధమందు ప్రాప్తమైన పాండవులయొక్క జయ మర్థమని వివక్షితముగ గన్పట్టుచున్నది. మఱియు నటు లర్థము గావించి కొంటిమేని భారతయుద్ధముయొక్క వర్ణనము జయ మను పేరు గలిగిన గ్రంథమున వర్ణింపబడిన దనియు, పిదప దానికే మైతిహాసికగ్రంథములలోని యుపాఖ్యానములు చేరుటవలన నితిహాసము, ధర్మాధర్మవివేచన మను నీరెండింటిని నిరూపించుట

వలన మహాభారతము నను గొప్పగ్రంథ మైనదనియు గాన్పిం చుచున్నది' అని వ్రాయబడినదియు,—

మహాభారతమీమాంస (సంపు 15. సంచిక 5) లో—
"ఆదిపర్వమందును, అంత్యపర్వమందును 'జయోనామేతిహాసోయమ్' అని యున్నది. అనగా మూలగ్రంథ మైతిహాసికమై యున్నది. దానిపేరు జయము. ఒక కొంత గడచిన పిదప నీగ్రంథమునకు భారతనామము ప్రాప్త మయ్యెను. మిక్కిలి విస్తరిల్లినపుడు దానిని మహాభారత మని పిలువనారంభించిరి. ఈ మూడు పేరులు భిన్నభిన్నులైన ముగ్గురు కర్తలయొక్క కృతులకు జక్కగా నుపయుక్తము లైనవి" అని వ్రాయబడిన దియు పరాస్తము.

ఇతిహాస మనగా కేవలచరిత్రమే యనుకొను ప్రతివాదులకు ఇతిహాసపదనిర్వచన మెట్లున్నదో ప్రదర్శింతము—

కావ్యమీమాంసావివృతి—
ధర్మార్థకామమోక్షాణా ముపదేశసమన్వితమ్ ।
పూర్వవృత్తకథాయుక్త మితిహాసం ప్రచక్షతే ॥

ఈ నిర్వచనమును బట్టి ధర్మార్థకామమోక్షముల నుపదేశించు నదై పూర్వప్రవృత్త కథను బోధించునదే ఇతిహాసము. ఆయితిహాసమే 'జయోనామేతిహాసోయం' అనుటచే జయమను పేరుకలది. ఆజయము—

"కార్ష్ణం వేదం పంచమం చ యన్మహాభారతం విదుః ।
జయేతి నామ తేషాం చ ప్రవదంతి మనీషిణః ॥"

అను పూర్వోక్త భవిష్యపురాణవచనమును బట్టి వేదవ్యాసమ

హాభారతమే. అదియే 'భారతం పంచమో వేదః' అనుచు పంచమ వేద మని కీర్తింపబడినది. పురుషార్థప్రతిపాదకము కాన నిది పంచమ వేద మనబడును.

'ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్ ॥'

అనుచు వేదోపబృంహణమునకు ఇతిహాసము సాధన మనుట ఆయితిహాసము పురుషార్థప్రతిపాదకము కాకున్న సంభవింపదు.

కనుక జయ, ఇతిహాస, భారత, మహాభారత శబ్దము లేకార్థము లే. కనుకనే రాజశేఖరకవి కావ్యమీమాంసలో వేదోపవేదవివరణ ప్రస్తావమున "ఇతిహాసవేదధనుర్వేదౌ గాంధర్వాయుర్వేదౌ వప్యుప వేదాః" అనుచు ఇతిహాసవేద మని కీర్తించెను. తరువాత ఇతిహాసస్వరూపమును—

యుదాహుః— "పరక్రియా పురాకల్ప ఇతిహాసగతి ర్ద్విధా ।
స్యాదేకనాయకా పూర్వా ద్వితీయా బహునాయకా"

"తత్ర రామాయణం భారతం చోదాహరణే" అని బోధించెను. అనంతరము—

"సతు మహామునిః ప్రవృత్తవచనో రామాయణ మితిహాసం సమదృభత్। ద్వైపాయనస్తు ... శతసాహస్రీం సంహితాం భారతమ్" అని ప్రతిపాదించెను. ఇప్పటికి వేయిసంవత్సరములకు పూర్వుడైన రాజశేఖరకవి యిట్లు భారతమును ఇతిహాస మనియును, ఆయితిహాస ముపవేద మనియును, ఆ భారతేతిహాసము లక్షగ్రంథాత్మక మనియును, దానికి కర్త వేదవ్యాసమహర్షి యనియును విస్పష్టముగా నుద్ఘోషించి యుండుటచే గూడ ప్రతివాదుల విరుద్ధప్రవాదులు నిరస్తము లైనవి.

ఇక మహాభారతమున కంతకు వేదవ్యాసమహర్షియే కర్త యైన

యెడల నందున్న వ్యాసవృత్తాంతశ్లోకములు వ్యాసమహర్షియే రచించె ననుటయు, నవి పరు లుపదేశింపఁ బూనుకొనుటయు నసంగత మని ప్రతి వాదు లాక్షేపింతురు కాబోలు.

ముగ్గురు కర్తలను కల్పించిన ప్రతివాదులైనను వ్యాసవృత్తాంతశ్లోకములు వైశంపాయనకృతము లనియు, వైశంపాయనవృత్తాంత శ్లోకములు సౌతికృతము లనియు, చెప్పఁగలుగుదురు కాని సౌతివృత్తాంతశ్లోకముల మాట నేమని చెప్పఁగలరు?

మ, భా. చ. కారులు వ్రాయుటలో—

"ఉపరిచరనుండి ప్రారంభింపబడినది వ్యాసభారత మగును. దానికే జయ మని పేరు. అది యాదిపర్వమునందు 63వ అధ్యాయమునుండి యారంభ మగుచున్నది. వ్యాసుఁడు గ్రంథరచనకు ముందు తన వృత్తాంతము జెప్పుకొనుట యుక్తమై యున్నది. గాన వ్యాసుఁడు తన మాతామహుఁ డగు నుపరిచరవసువు గాథనే యారంభించి చెప్పి యున్నాఁడు" (పు 58)

అని వెల్లడించినారుకనుక వ్యాసుఁ డచ్చట తనవృత్తాంతమును పరు లుపదేశించినట్లే చెప్పుకొనెనో మఱియొకవిధముగా జెప్పుకొనెనో చూతము— వైశంపాయన ఉవాచ—(అ. 63)

"రాజో పరిచారోనామ ధర్మనిత్యో మహామతిః ।
జజ్ఞేచ యమునాద్వీపే పారాశర్య స్సవీర్యవాన్ ॥
స మాతర మనుజ్ఞాప్య తప స్యేవ మనో దధే ।
స్మృతోఽహం దర్శయిష్యామి కృత్యే ష్వితి చ సోఽబ్రవీత్ ॥
వివ్యాస వేదాన్ యస్మా త్స తస్మా ద్వ్యాస ఇతి స్మృతః ।

"వేదా నధ్యాపయామాస మహాభారతపంచమాన్ ॥
ప్రభు ర్వరిష్ఠో వరదో వైశంపాయన మేవచ ।"

ఈగ్రంథములో "స వీర్యవాన్ పారాశర్యో యమునాద్వీపే జజ్ఞేస వేదాన్ వివ్యాస, ప్రభుః వరిష్ఠః వరదశ్చ స వైశంపాయనం చాధ్యాపయామాస"

అని యున్న వాక్యములలో వ్యాసుడు తనను చెప్పుకొనుచు పరులు చెప్పినట్లు తచ్ఛబ్దములను ప్రయోగించుట, పరోక్షార్థకలిడంత ప్రయోగములు చేయుట, వీర్యవాన్. ప్రభుః. వరిష్ఠః వరదః ఇత్యాది విశేషణములతో తాను ఆత్మప్రశంస చేసికొనుట ప్రతివాదిమతమున మాత్రము అసంగతము కాదా?

ఇక నీయధ్యాయమున కాదిని 'వైశంపాయన ఉవాచ' అని చెప్పబడుటచే నవి వైశంపాయనకృతము లందురా? అప్పుడైనను 'వైశంపాయనం చాధ్యాపయామాస' అని వైశంపాయనుడు పరులు చెప్పినట్లు చెప్పుకొనుట అసంగతమే అగును. మఱియు మ. భా. చ. కారులు (పు. 30)

> "సూతి శౌనకాదులకును, వైశంపాయనజనమేజయులకును, నైన ప్రశ్నోత్తరములు మాత్రము వ్యాసుని జయములోనివి కావు"

అని వ్రాయుటచే వైశంపాయనజనమేజయప్రశ్నోత్తరరూపముగనే ఆడుపరిచరనుండి ప్రారంభింపబడిన గ్రంథ ముండుటవలన నది వ్యాసభారత మనుట వారి వ్రాతకే విరుద్ధము

ఇక దీనిని విడిచి వ్యాసవృత్తాంతశ్లోకములను వ్యాసమహర్షియే రచించుటయు, నది పరు లుపదేశించిన ట్లుండుటయును ఆర్షశైలీసిద్ధమని తెలుపుటకు ప్రమాణములను ప్రదర్శింతము—

## — ఆర్షనైజపరిచయము —

### – పరాశరస్మృతి –

"అథాతో హిమశైలాగ్రే దేవదారువనాలయే ।
వ్యాస మేకాగ్ర మాసీన మపృచ్ఛ న్నృషయః పురా॥
మానుషాణాం హితం ధర్మం వర్తమానే కలౌ యుగే।
శౌచాచారం యథావచ్చ వద సత్యవతీసుత ! ॥
త చ్ఛ్రుత్వా మునివాక్యస్తు సశిష్యోఽగ్న్యర్కసన్నిభః ।
ప్రత్యువాచ మహాతేజా శ్శ్రుతిస్మృతివిశారదః ॥
నచాహం సర్వతత్త్వజ్ఞః కథం ధర్మం వదా మ్యహమ్ ।
అస్మత్పితైవ ప్రష్టవ్య ఇతి వ్యాస స్సుతోఽబ్రవీత్ ॥
తత స్తే ఋషయ స్సర్వే ధర్మతత్త్వార్థకాంక్షిణః ।
ఋషిం వ్యాసం పురస్కృత్య గత్వా బదరికాశ్రమమ్ ॥"

మాధవీయమ్— సుతో వ్యాస ఇత్యుక్తే రయమాశయః; కలిధర్మసంప్రదాయోపేతస్యాపి పరాశరసుతస్య యదా తద్ధర్మరహస్యాభివదనే సంకోచ స్తదా ... వక్తవ్య మన్యేషా మితి, తదేవం వ్యాసముఖేన పరాశరే గౌరవాతిశయ ముత్పాదయితుం పరాశరస్మృత్యవతారేఽపి వ్యాసం ప్రతి ప్రశ్నో న వ్యధికరణ ఇత్యవగన్తవ్యమ్ ॥

"తస్మి న్నృషిసభామధ్యే శక్తిపుత్రం పరాశరమ్ ।
సుఖాసీనం మహాతేజా మునిముఖ్యగణావృతమ్ ॥
కృతాంజలిపుటో భూత్వా వ్యాసస్తు ఋషిభిస్సహ ।
ప్రదక్షిణాభివాదైశ్చ స్తుతిభి స్సమపూజయత్ ॥
తత స్సంతుష్టహృదయః పరాశరమహామునిః ।
ఆహ సుస్వాగతం బ్రూహి త్యాసీనో మునిపుంగవః ॥
కుశలం సమ్య గిత్యుక్త్వా వ్యాసః పృచ్ఛ త్యతః పరమ్ ।

చతుర్ణా మపి వర్ణానాం క_ర్తవ్యం ధర్మకోవిదైః ॥
బ్రూహి ధర్మస్వరూపజ్ఞ సూక్ష్మం స్థూలంచ వి_స్తరాత్ ।
వ్యాసవాక్యావసానేతు మునిముఖ్యః పరాశరః ॥
ధర్మస్య నిర్ణయం ప్రాహ సూక్ష్మం స్థూలంచ వి_స్తరాత్ ।" 19.

మాధవీయమ్—19. నను కస్యాయం శ్లోకః, నతావ ద్వ్యాస స్య, ప్రశ్నరూపత్వాభావాత్. నాపి పరాశరస్య, ఉ_త్తరరూపతాయా అభావాత్, నన్వత్యల్ప మిద ముచ్యతే ఆద్యశ్లోకేపి సమానమిదం చో ద్యమ్, ఏవం త_ర్హి ద్విశేషు స_ర్వేషుపరిహారో న్వేష్టవ్యః, ఉచ్యతే-పరాశర ఏవ భావిశిష్యబుద్ధిసమాధానాయ స్వకీయవృత్తాంతాదిజ్ఞాపకా నీదృశ శ్లోకా న్నిర్మమ ఇతి ద్రష్టవ్యం, భారతాదౌ వ్యాసవృత్తాంతశ్లోకానాం వ్యాసేనైవ నిర్మితత్వేన సర్వసంప్రతిప_త్తేః ॥

ఈపరాశరస్మృతిలో-హిమాలయశిఖర మందున్న వ్యాసమహ ర్షిని ఋషులు సమీపించి, వ_ర్తమానకలియుగమందు మనుష్యులకు హితమైన ధర్మమును శౌచాచారములను ఉపదేశింపు మని కోరగా, శ్రుతిస్మృతివిశారదుడు, మహాతేజశ్శాలియు, సుతుడు నగు వ్యాసుడు-'సర్వత_త్త్వజ్ఞుడను నేను కాను. మాతండ్రియే అడుగదగినవాడు' అని చెప్పగా నాఋషులు వ్యాసమహర్షిని పురస్కరించుకొని పరాశరదర్శ నార్థము బదరికాశ్రమమునకు వెళ్లిరి.

అచ్చట ఋషిసభామధ్యమందు సుఖాసీనుడైయున్న పరాశరుని ఋషులతోగూడ ప్రదక్షిణనమస్కారములు స్తుతులు చేసి వ్యాసుడు పూజించెను. అంతట సంతుష్టహృదయుడైన పరాశరమహాముని స్వాగత మడిగెను. తరువాత వ్యాసుడు- ఓధర్మస్వరూపజ్ఞా! చాతు ర్వర్ణ్యముయొక్క స్థూలసూక్ష్మధర్మములను వి_స్తరించి చెప్పు మని యడిగెను.

వ్యాసప్రశ్నానంతరము మాటిమాటికిని పరాశరుడు స్థూల సూక్ష్మధర్మముల నిర్ణయమును విస్తరించి చెప్పెను. అని యున్నది. ఇందు పరాశరమహర్షి తన వృత్తాంతమును చెప్పుటలో పలుమారు చెప్పినట్లే చెప్పెను. ధర్మస్వరూపనిరూపణములో తన కుమారుని వ్యాసముఖమున వ్యక్తీకరించెను. మూలపఠనములోని విచారణ చేయుచుండగా—

ప్రశ్నోత్తరరూపమైన ఈగ్రంథములో ప్రశ్నభాగము వ్యాసునిది. ఉత్తరభాగము పరాశరునిది అని తేలుచున్నది ప్రశ్నోత్తరరూపము కానట్టి ఆద్యశ్లోకము, 'వ్యాసవాక్యావసానే తు' అను శ్లోకము ఎవ్వనిది? అని శంకించి పరాశరమహర్షియే ముందుముందు ఈగ్రంథము నధ్యయనముచేయు శిష్యుల బుద్ధికి విశ్వాసము కలిగించుటకై స్వకీయ వృత్తాంతజ్ఞాపకము లైన ఇట్టి శ్లోకములను రచించియుండెను. భారతాది గ్రంథములయందు వ్యాసవృత్తాంతశ్లోకములు వ్యాసరచితములే యని సర్వసమ్మతము కనుక నట్లే యీశ్లోకములు పరాశరునివి. అని స్థిరపరుపబడినది. ఇట్లుచూడగా—

పరాశరస్మృతిలోని పరాశరవృత్తాంతబోధకశ్లోకములు పరాశరునివే. వేదవ్యాసమహాభారతములోని వేదవ్యాసవృత్తాంతబోధక శ్లోకములు వేదవ్యాసునివే. అని సారాంశము.

**మనుస్మృతి—**

"మను మేకాగ్ర మాసీన మభిగమ్య మహర్షయః ।
ప్రతిపూజ్య యథాన్యాయ మిదం వచన మబ్రువన్ ॥
భగవన్ సర్వవర్ణానాం యథావ దనుపూర్వశః ।
అన్తరప్రభవాణాంచ ధర్మా న్నో వక్తు మర్హసి ॥
త్వ మేకో హ్యస్య సర్వస్య విధానస్య స్వయంభువః ।

అచిన్త్యస్యాప్రమేయస్య కార్యతత్త్వార్థవిత్ప్రభో ॥
స తైః పృష్ట స్తథా సమ్యగమితౌజా మహాత్మభిః ।
ప్రత్యువాచార్చ్య తాన్ సర్వాన్ మహర్షీన్ శ్రూయతామితి ॥"

కుల్లూకభట్టీయమ్—నను మనుప్రణీతత్వేఽస్య శాస్త్రస్య 'స పృష్టః ప్రత్యువాచేతి న యుక్తమ్. 'అహం పృష్టో బ్రవీమీతి యుజ్యతే. అన్యప్రణీతత్వేచ కథం మానవీయసంహితేతి. ఉచ్యతే—

ప్రాయేణాచార్యాణా మియం శైలీ యత్స్వాభిప్రాయ మపి పరోపదేశమివ వర్ణయన్తి. అతఏవ 'కర్మాణ్యపి జైమినిః ఫలార్థత్వాత్' ఇతి జైమినేరేవ సూత్రమ్. అతఏవ "తదుపర్యపి బాదరాయణ స్సంభవాత్" ఇతి బాదరాయణ స్యైవ శారీరకసూత్రమ్ ॥

ఈమనుస్మృతిలో— మహర్షులేకాగ్రత కలిగియున్న మనువును ప్రజలకు ఆచరణీయములైన ధర్మములను చెప్పుమని యథాన్యాయముగా పూజించి యడిగిరి. ఓభగవానుడా! నీవు అద్వితీయుడవు. అపౌరుషేయము, అచిన్త్యము, దురవగాహము నగు వేదమునందు కర్మబ్రహ్మస్వరూపాభిజ్ఞుడవు. అని యిట్లు అడుగబడిన ఆమనువు ఆమహర్షుల నాదరించి విను డని బదులు చెప్పెను. అని యున్నది.

ఇచ్చట మనువు తన వృత్తాంతమును పరులు చెప్పినట్లే చెప్పుట, తచ్ఛబ్దప్రయోగము చేయుట, తనయందున్న ఘనతను చెప్పుట స్పష్టము. కుల్లూకభట్టీయములోని విచారణ ఏమనగా—

ఈ శాస్త్రము మనుప్రణీతమైనపుడు 'అహం పృష్టోబ్రవీమి' (అడుగబడిన నేను చెప్పుచున్నాను) అని యుండవలెను. కాని 'స పృష్టః ప్రత్యువాచ' (అతడు అడుగబడి పలికెను) అని యుండరాదు. ఈశాస్త్ర మన్యప్రణీతమే యైనపుడు దీనికి మనుస్మృతి

యను పేరు యుక్తము కాదు. అని శంకించి స్వాభిప్రాయ
మునుగూడ పరోపదేశమువలె వర్ణించుట ఆచార్యుల (ఋషుల)
శైలి. కనుకనే జైమిని తన సూత్రములో జైమినిశబ్దమునే
కాని అహంశబ్దమును వాడలేదు బాదరాయణుడు కూడ తన
సూత్రములో బాదరాయణ శబ్దమునే కాని అహంశబ్దమును వాడ
లేదు అని స్థిరపరుపబడినది. ఇట్లుచూడగా, మనుస్మృతిలోని మను
వృత్తాంతశ్లోకములు మనువిరచితములే యైనట్లు మహాభారతములోని
వ్యాసవృత్తాంతశ్లోకములు వ్యాసవిరచితము లని సారాంశము.

యాజ్ఞవల్క్యస్మృతి —

"యోగీశ్వరం యాజ్ఞవల్క్యం సంపూజ్య మునయోఽబ్రువన్ ।
వర్ణాశ్రమేతరాణాం నో బ్రూహి ధర్మా నశేషతః ॥
మిథిలాస్థ స్సయోగీన్ద్రః క్షణం ధ్యాత్వాఽబ్రవీ న్మునీన్ ॥"

అపరార్కవ్యాఖ్యా— 'యాజ్ఞవల్క్యప్రణీతే ఽప్యత్ర శ్లోకే "యాజ్ఞవల్క్యం సంపూజ్య' ఇతి వచనం. తథోత్తరశ్లోకే 'యోగీన్ద్రో ఽబ్రవీత్' ఇతి ప్రథమపురుషప్రయోగశ్చ నాయుక్తః, దృశ్యతే హి మానవే గ్రన్థే 'మను రబ్రవీత్' ఇతి ప్రయోగః, బౌధాయనేచ 'స హాస్మాహ బోధాయనః' ఇతి నచ మను రబ్రవీ దితి భృగో ర్వచన మిదం న మనో రితి వాచ్యమ్. యత ఏతదుత్తరకాల మేవ మను రాహ— 'ఏతద్వోఽయం భృగు శ్శాస్త్రం శ్రావయిష్య త్యశేషతః । ఏతద్ధి మత్తోఽధిజగే సర్వమేషోఽఖిలం మునిః' ఇతి. అధిజగే అధీతవాన్।

అస్యాశ్చ సంహితాయా యాజ్ఞవల్క్యః ప్రణేతేతి వ్యాఖ్యాతౄణాం స్మృతి రేవ ప్రమాణమ్। న చార్థమేవ యాజ్ఞవల్కీయ తయా తే స్మరంతీతి వాచ్యమ్ । గ్రంథే హి ప్రణేతృతయా తస్యాఽసాధారణ్యం సంభవతి, న చార్థే ద్రష్టృతయా, ము

స్యంతరై ऽపి తస్య దృష్టత్వాత్ । అసాధారణ్యేన చ వ్యపదేశో న సాధారణ్యే ఘటతే। అసాధారణ్యేన హి వ్యపదేశా భవంతి... యాజ్ఞవల్క్యప్రోక్తతాం శాస్త్రే వక్తుం స ఇత్యుక్తం। న పున రహమితి। న పున రహంశబ్దా ద్యాజ్ఞవల్క్యసంప్రత్యయః । స ఇతి శబ్దాత్ప్రకృతవాచినః యాజ్ఞవల్క్య ఏవ ప్రకృతే బుద్ధి ముపైతీతి తమేవ ప్రయుక్తవాన్ । తత్సామానాధికరణ్యా చ్చ అబ్రవీ దితి ప్రథమపురుష ఏవ యుజ్యతే, న పున రబ్రువ మి త్యుత్తమః ॥

విశ్వరూపాచార్యకృత బాలక్రీడావ్యాఖ్యా—

మిథిలాస్థ స్స యోగీంద్రః। కథం యోగీంద్ర ఏవైవం బ్రూయాత్ । 'యోగీశ్వరం యాజ్ఞవల్క్యం, మిథిలాస్థ స్స యోగీంద్రః' ఇతి చ। నా ప్యన్యః కర్తేతి శక్యం వక్తుం। 'శ్లోకత్రయ మపి హ్యాస్మాత్' ఇతి వక్ష్యమాణత్వా ద్గ్రంథకర్తాపి భగవా నేవేతి గమ్యతే। నైవాన్యకృతత్వం ధర్మశాస్త్రస్యేతి బ్రూమః । కింతు భగవతైవ పరోక్షీకృత్యాత్మా నిర్దిశ్యతే స్వప్రశంసానిషేధాత్ । యదిహి మాం యోగీశ్వరం 'అహం యోగీశ్వరః' ఇతి బ్రూయా త్తదాऽऽత్మస్తుతి రాపద్యేత, వక్తవ్యం చైత దాత్మప్రవృత్తి ప్రయోజనకథనాయ। అతో హేతుత్వా దాత్మనః ప్రకరణాయోగాచ్చ పరోక్షతయాऽభిధానా న్నాయ ముపాలంభః ॥

ఈ యాజ్ఞవల్క్యస్మృతిలో-యోగీశ్వరుడైన యాజ్ఞవల్క్యుని పూజించి యశేషధర్మములను చెప్పు మని ఋషు లడుగగా, మిథిలావాసియగు నాయోగీశ్వరుడు క్షణకాలము ధ్యానించి చెప్పెను. అని యున్నది ఇచ్చట పరులు చెప్పినట్లే చెప్పుట, తచ్ఛబ్దమును ప్రయోగించుట, యోగీంద్ర డను విశేషణముతో తన ఘనత దెలుపుట సుస్పష్టము.

అపరార్క వ్యాఖ్యలోని విచారణ యేమనగా—

యాజ్ఞవల్క్యప్రోక్తమైన యీ శ్లోకమందు 'యాజ్ఞవల్క్యం సంపూజ్య' అనియు, 'యోగీంద్రో బ్రవీత్' అనియు ప్రయోగించుట అయుక్తము కాదు. బోధాయనగ్రంథములో 'సహ స్మాహ బోధాయనః' అనియు, మనుస్మృతిలో- 'మను రబ్రవీత్' అనియు, నున్నట్లే యీ గ్రంథమందు గూడ నున్నది

'మను రబ్రవీత్' అని మను వన్నది కాదు భృగు వన్నదే యని భావింపరాదు. "ఈశాస్త్రమును ఈభృగువు మీకు పూర్తిగా వినిపింపగలడు. ఈ ముని ఈశాస్త్రము నంతను నావలన నధ్యయనముచేసి యున్నాడు" అని ఋషులతో మనువు చెప్పినట్లు ముందుండుటవలన భృగువు వినిపించినవాడే కాని రచించినవాడు కాడు. ఈయాజ్ఞవల్క్యస్మృతికి కర్త యాజ్ఞవల్క్యుడే యనుటకు వ్యాఖ్యాతలు అట్లు స్మరించుచుండుటే ప్రమాణము. గ్రంథరచన కాక స్మృత్యర్థముమాత్రమే యాజ్ఞవల్క్యుని దని వ్యాఖ్యాతలు భావించుచున్నారని యనుకొనరాదు. గ్రంథమునకు అసాధారణనామము రచననుబట్టి కాని అర్థజ్ఞానమునుబట్టి కాదు ఈయాజ్ఞవల్క్యస్మృతిలో ప్రతిపాదింపబడిన విషయము శ్రుత్యుక్తమే కనుక ఆ యర్థజ్ఞానము ఇతరఋషులకు లేదనుట కవకాశము లేనందున 'యాజ్ఞవల్క్యస్మృతి' యని దానికి అసాధారణనామము యాజ్ఞవల్క్యరచిత మగుటచేతనే కలిగె ననక తప్పదు. అని స్థిరపరుపబడినది.

బాలక్రీడావ్యాఖ్యలోని విచారణ యేమనగా—

ఈయాజ్ఞవల్క్యస్మృతిలో యాజ్ఞవల్క్యుడే 'యోగీశ్వరం యాజ్ఞవల్క్యమ్' "మిథిలాస్థ స్సయోగీన్ద్రః' అని యెట్లనును? ఈస్మృతికి అన్యుడు కర్త యనుటకు అవకాశము లేదు. గ్రంథాంతమందు—

'శ్రుత్వైతాన్ ఋషయో ధర్మాన్ యాజ్ఞవల్క్యేన భాషితాన్ ।
ఇద మూచు ర్మహాత్మానం యోగీన్ద్ర మమితౌజసమ్ ॥
శ్లోకత్రయ మపి హ్యస్మా ద్యశ్శ్రాద్ధే శ్రావయిష్యతి ।
పితౄణాం తస్య తృప్తి స్స్యా దక్షయా నాత్ర సంశయః ।'

అని యాజ్ఞవల్క్యభాషితధర్మములను ఋషులు విని యీధర్మశాస్త్రమునుండి శ్లోకత్రయము నైనను శ్రాద్ధకాలమందు వినిపించిన, పితరులకు అక్షయతృప్తి నిస్సంశయముగా గలుగును. అని యాజ్ఞవల్క్యునితో సంభాషించినట్లుండుటచే యాజ్ఞవల్క్యప్రోక్తగ్రంథము శ్లోకాత్మకమే యని స్పష్టమగుచున్నందున యీస్మృతి యన్యకృతము కాదు. యాజ్ఞవల్క్యకృతమే. తానీస్మృతి రచనయందు ప్రవర్తించుటలో ప్రయోజనము చెప్పుట తనస్వరూపపరిచయము కలిగించుట అవసరము అందుకై ఆత్మస్తవము లేనట్లు అహంశబ్దము మాని తచ్ఛబ్దముతో పరోక్షనిర్దేశము చేయబడినది. అని స్థిరపరుపబడినది.

ఇక మనుస్మృతిలోని యాశ్లోకములు భృగుమహర్షివనియు, యాజ్ఞవల్క్యస్మృలోని యీశ్లోకములు యాజ్ఞవల్క్యశిష్యుని వనియు, కల్పింపబూనినను 'కర్మాణ్యపి జైమినిః ఫలార్థత్వాత్' "తదుపర్యపి బాదరాయణ స్సంభవాత్' అను సూత్రములలోని పరోక్షనిర్దేశములకు గత్యంతరము లేదుకనుక సర్వసాధారణముగా పరోపదేశములోవలె పరోక్షనిర్దేశములు కలిగియుండుట ఆర్షశైలియే యనుట నిర్వివాదము.

అత్రిస్మృతి —

"హుతాగ్నిహోత్ర మాసీన మత్రిం వేదవిదాం వరమ్ ।
సర్వశాస్త్రవిధిజ్ఞం త మృషిభి శ్చ నమస్కృతమ్ ॥
నమస్కృత్య చ తే సర్వ ఇదం వచన మబ్రువన్ ।"

విష్ణుస్మృతి —

'విష్ణు మేకాగ్ర మాసీనం శ్రుతిస్మృతివిశారదమ్ ।
పప్రచ్ఛు ర్మునయః సర్వే కలాపగ్రామవాసినః ॥'

యమస్మృతి—

శ్రుతిస్మృత్యుదితం ధర్మం వర్ణానా మనుపూర్వశః ।
ప్రబ్రవీ ద్వృషిభిః పృష్టో మునీనా మగ్రణీ ర్యమః ॥''

ఈవిధముగా నార్షగ్రంథములయందు ఋషులు తమ విషయమును పరు లుపదేశించినట్లు చెప్పుట వారి శైలి.

“తప స్స్వాధ్యాయనిరతం తపస్వీ వాగ్విదాం వరమ్ ।
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్మునిపుంగవమ్॥''

అను వాల్మీకిరామాయణప్రథమశ్లోక శైలియు నట్లేయున్నది.

కనుక మహాభారతమందు వ్యాసవృత్తాంతశ్లోకములు వ్యాసవిరచితములే కాని యన్యవిరచితములు కావని నిర్ధారితార్థము.

ఇక మహాభారతమును వ్యాసమహర్షి యెప్పుడు రచించెను ? అను విషయము పరిశీలింప దగియున్నది. ఈవిషయమై విమర్శకులు ఏమనివ్రాసిరో చూతము—

## —• మహాభారతరచనాకాలము •—

మహాభారతమీమాంసాకారు లిట్లు వ్రాసిరి—

'భారతీయయుద్ధమునకు పిదప వ్యాసుడు జయనామకమైన యితిహాసమును రచించెను''

'వ్యాసమహాకవి యొక తెగక మూడు సంవత్సరములదాక ప్రయత్నించి యుద్ధము సమాప్తమైన వెంటనే తన గ్రంథము రచించెను''

మహాభారతచరిత్రకారు లిట్లు వ్రాసిరి—

'వ్యాసుడు భారతయుద్ధ మిక నగు ననగా ధృతరాష్ట్రునికడకు వచ్చి మహోత్పాతములను వర్ణించి యుద్ధము ఘోరముగ దప్పక యగుననియు, అందు గౌరవులు నశింతురనియు, వారికీర్తిని గ్రంథరూపముతో లోకమున వ్యాపింపజేయుదు ననియు జెప్పి, యుద్ధవృత్తాంతముల జెప్పుటకు సంజయుని నియోగించి, హిమాలయారణ్యమున కేగెను. అత డచట మూడేండ్లు భారతమును రచించె నని యీక్రింది శ్లోకార్థములు చెప్పుచున్నవి.

"త్రిభి ర్వర్షై స్సదోత్థాయీ కృష్ణద్వైపాయనో మునిః।
మహాభారత మాఖ్యానం కృతవా నిద మద్భుతమ్ ॥' (పు. 33)

మహాభారతరహస్యకర్త లిట్లు వ్రాసిరి—

"ఆశ్రమవాసమునందు వృద్ధులందరు గతించునంతవరకు గ్రంథ రచనకై వ్యాసుడు హిమాలయమున కరుగుట కవకాశమే లేదు. కనుక అందరు గతించిన పిమ్మట హిమాలయమునకరిగి విశ్రాంతిగా 3 సం॥లలో యావద్గ్రంథమును రచించెను. ఈ మహాభారత రచనను గురించిన యొక పాశ్చాత్యపండితుని వ్రాతను మహాః బిలాసశారదాగారు తమగ్రంథములో నీక్రిందిరీతిగా నుదాహరించి యున్నారు.

"సంపూర్ణత యను గుణము ఒక్క హిందువులకే తెలియును. కవి యైరోపీయు డైనచో పాండవుల జయముతో యుద్ధము పరిసమాప్తి యగుటతోడనే కథను పూర్తిచేసి విడిచెడివాడు. కాని యా సంస్కృతకవి... యెట్టి యవశేషము నుండనీయక పాండవుల స్వర్గారోహణమును గూడ వర్ణించి కథను సంపూర్ణమైన దానినిగా జేసెను" కాన యావద్గ్రంథము పాండవుల మరణానంతరముననే వ్రాయబడె ననుటలో సంశయ మేమియు లేదు" (పు. 107)

ఈ వ్రాతలవలన యుద్ధము సమాప్తమైన వెంటనే వ్యాసుడు రచించె నని మ. భా. మీ. కారులును, 'యుద్ధ మిక నగు ననగా రచించె' నని మ. భా. చ. కారులును, 'పాండవుల మరణానంతరము రచించె' నని రహస్యకారులును పరస్పరవిరుద్ధముగా నిర్ణయించినా రని స్పష్టమైనది.

వీరిలో మ. భా. చ. కారులు తమ నిర్ణయమునకు శ్లోకము నుదాహరించినందున దానిని పరిశీలింతము.

వా రుదాహరించిన శ్లోక మిది—

"త్రిభి ర్వర్షై స్సదోత్థాయీ కృష్ణద్వైపాయనో మునిః ।
మహాభారత మాఖ్యానం కృతవా నిద మద్భుతమ్ ॥
ఋషిణా కీర్త్యత స్తస్మై ఇతిహాసం పురాతనమ్ ।"

ఇది ఆదిపర్వము 62 వ అధ్యాయములో కొన నున్నది. వైశంపాయనవాక్య మిది. దీనిలో మూడు సంవత్సరములు నిష్ఠతో జేసె ననియే యున్నది కాని 'యుద్ధవృత్తాంతముల జెప్పుటకు సంజయుని నియోగించి హిమాలయారణ్యమున కేగి అత డచట మూడేండ్లు భారతమును రచించెను' అని వా రన్నట్లు లేదు. ఇక యుద్ధ మిక నగు ననగా వ్యాసమహర్షి ధృతరాష్ట్రునితో మాట్లాడినట్లు వారు వ్రాసిన విషయ మును చూతము—

భీష్మపర్వము— అధ్యాయము 2.

"భవిష్యతి రణే ఘోరే భరతానాం పితామహః ।
ప్రత్యక్షదర్శీ భగవాన్ భూతభవ్యభవిష్యవిత్ ॥
వైచిత్రవీర్యం రాజానం రహస్య మిద మబ్రవీత్ ।
శోచంత మార్తం ధ్యాయంతం పుత్రాణా మనయాం

రాజన్! పరీతకాలా స్తే పుత్రా శ్చాన్యేచ పార్థివాః ।
తే హింసంతీవ సంగ్రామే సమాసా ద్యేత రేతరమ్ ॥
తేషు కాలపరీతేషు వినశ్య త్స్వేవ భారత!
కాలపర్యాయ మాజ్ఞాయ మాస్మ శోకే మనః కృథాః ॥
యది చేచ్ఛసి సంగ్రామం ద్రష్టు మేనం విశాంపతే!
చక్షుర్దదాని తే పుత్ర! యుద్ధ మేత న్నిశామయ ॥"

ధృతరాష్ట్రః—

న రోచయే జ్ఞాతివధం ద్రష్టుం బ్రహ్మర్షి సత్తమ ।
యుద్ధ మేత త్త్వశేషేణ శృణుయాం తవ తేజసా ॥
తస్మి న్ననిచ్ఛతి ద్రష్టుం సంగ్రామం శ్రోతు మిచ్ఛతి ।
వరాణా మీశ్వరో వ్యాస స్సంజయాయ వరం దదౌ ॥
ఏష తే సంజయో రాజ న్! యుద్ధ మేత ద్వదిష్యతి ।
ఏతస్య సర్వం సంగ్రామే న పరోక్షం భవిష్యతి ॥
అహం తు కీర్తి మేతేషాం కురూణాం భరతర్షభ!
పాండవానాంచ సర్వేషాం ప్రథయిష్యామి మాశుచః ॥
దిష్ట మేత న్నరవ్యాఘ్ర! నాభిశోచితు మర్హసి ।
న చైవ శక్యం సంయంతుం యతో ధర్మ స్తతో జయః ॥"

అనగా భూతభవిష్యద్వర్తమానవృత్తాంతాభిజ్ఞుడైన వ్యాసమహర్షి - దుర్యోధనాదుల అవినీతిని గూర్చి శోకించుచున్న ధృతరాష్ట్రునకు దర్శన మిచ్చి 'నీ పుత్రులు, ఇతరులు అన్యోన్యము హింసించుకొందురు. నీవు దుఃఖింపకుము. నీకు యుద్ధముజూడ సంకల్ప మున్న యెడల దృష్టి నిచ్చెదను చూడు' మనగా ధృతరాష్ట్రుడు వారి హింసనే చూడజాలను. నీయనుగ్రహముచే యుద్ధవృత్తాంతము సాకల్యముగా వింతునని చెప్పగా మహర్షి సంజయునకు వర మిచ్చి యుద్ధములో

నీతనికి తెలియని దేదియు నుండదు. నీ కీతడు చెప్పును. నేను కురు పాండవుల కీర్తిని విస్తరింపజేయుదును. భవితవ్య మిట్లున్నది. నీవు శోకింపకుము. ఎక్కడ ధర్మమో అక్కడ జయము. అని బోధించె నని భావము.

ఇట్లుండ మ. భా. చ. కారులు "వారి కీర్తిని గ్రంథరూపము తో లోకమున వ్యాపింపజేయుదు" నని చెప్పినట్లు వ్రాయుట అన్యాయము.

ధృతరాష్ట్రున కిట్లు చెప్పినతరువాత దుర్నిమిత్తములను, జయ సిద్ధిలక్షణములను చెప్పి వ్యాసమహర్షి వెళ్ళె ననుచు—

'ఏవ ముక్త్వా యయౌ వ్యాసో ధృతరాష్ట్రాయ ధీమతే॥' భీష్మ అ4

అని చెప్పబడినదికాని అట్లు వెళ్ళి భారతము వ్రాసెనని చెప్ప బడలేదు.

ఇట్లుండ మ. భా. చ. కారులు అక్కడనుండి వెళ్ళి భారతము వ్రాసిన ట్లుల్లేఖించుట నిరాధారము. మనము చూచియున్న ఆదిపర్వ ములోని గ్రంథముకాని, భీష్మపర్వములోని గ్రంథము కాని మహా భారతరచన యిట్టి సమయ మం దైన దని తెలుపుట లేదు.

ఆదిపర్వప్రథమాధ్యాయమున—

"ఉత్పాద్య ధృతరాష్ట్రం చ పాండుం విదుర మేవచ।
జగామ తపసే ధీమాన్ పున రేవాశ్రమం ప్రతి॥
తేషు జాతేషు వృద్ధేషు గతేషు పరమాం గతిం।
అబ్రవీ ద్భారతం లోకే మానుషేస్మి న్మహా నృషిః॥
జనమేజయేన పృష్ట స్సన్ బ్రాహ్మణైశ్చ సహస్రశః।
శశాస శిష్య మాసీనం వైశంపాయన మంతికే॥
స సదస్యై స్సహాసీన శ్శ్రావయామాస భారతమ్॥"

అని యున్న శ్లోకములలో "తేషు జాతేషు వృద్ధేషు గతేషు పరమాం గతిం। అబ్రవీ ద్భారతం లోకే మానుషేస్మి న్మహానృషిః" అని యుండుటచే ధృతరాష్ట్రాదులు గతించినతరువాత భారతము రచింపబడిన దని యనిపించును. కాని యాశ్లోకములోనే 'మానుషే లోకే భారత మబ్రవీత్ ॥' అనుటలో 'మానుషే లోకే' అనునది యెందులకు భారతము రచించెను? అన్నపుడు మనుష్యలోకములో గాక మరెక్కడ రచించును. కాబట్టి దానికి వైయర్థ్యము కలుగుచున్నది. 'అబ్రవీత్' వెల్లడించెను. అని యర్థము చేసినయెడల 'మానుషే లోకే' అనునది సార్థక మగును ఎట్లనగా, మహర్షి భారతమును జనమేజయుడు, వేలకొలది బ్రాహ్మణులు అడిగినపుడు ఈమనుష్యలోకములో వెల్లడించెను అని చెప్పినపుడు ఉత్తరశ్లోకములలో—

'షష్టిం శతసహస్రాణి చకారాన్యాం స సంహితాం ।
త్రింశ చ్ఛతసహస్రం చ దేవలోకే ప్రతిష్ఠితమ్ ॥
పిత్ర్యే పంచదశ ప్రోక్తం గంధర్వేషు చతుర్దశ ।'

అనుటనుబట్టి దేవపితృగంధర్వలోకములలో గూడ నది వెల్లడింపబడుటచే నీమనుష్యలోకములో జనమేజయసర్పసత్రసమయమున వెల్లడింపబడినది అనుటలో మనుష్యలోకమందు అనుమాటకు సార్థక్యము స్పష్టమే.

వ్యాసమహర్షి ఆజ్ఞచే వైశంపాయనుడు అప్పుడు వెల్లడించి యుండగా వ్యాసుడు వెల్లడించె నను మాట యెట్లు పొసగును? అని ప్రశ్నింపవచ్చును 'అబ్రవీ ద్భారతమ్' అను శ్లోకముచే వ్యాసమహర్షి భారతమును వెల్లడించెను. అనిచెప్పి అదెట్లనగా 'శశాస శిష్య మాసీనం వైశంపాయన మన్తికే' 'స శ్రావయామాస భారతమ్' అనుచు దాని వివరణమే చేయబడినది. కనుక పర్యవసానములో భారతమును ఈ

మనుష్యలోకమున వ్యాసమహర్షి వైశంపాయనముఖమున వెల్లడించెను. అని యర్థము సిద్ధించును కనుక విరోధములేదు.

నన్నయభట్టారకుడు గూడ ఉపపర్వమహాపర్వములుకల మహాభారతమును వ్యాసమహర్షియే రచించె ననియు, దాని వ్యాప్తి లోకాంతరములందును, ఈలోకమందును కలిగె ననియు వ్రాసియుండెను. చూడుడు—

'ఇట్టి మహాభారతంబు ననేకవిధపదార్థప్రపంచసంచితంబు, నుపపర్వమహాపర్వోపశోభితంబు, నుపద్వీపమహాద్వీపసంభృతం బయిన భువనం బజుండు నిర్మించినట్లు కృష్ణద్వైపాయనుండు నిఖిలలోకహితార్థంబు దత్తావధానుండై సంవత్సరత్రయంబు నిర్మించి దాని దేవలోకంబునందు వక్కాణింప నారదుం బనిచె. పితృలోకంబున వక్కాణింప నసితుండైన దేవలుం బనిచె. గరుడగంధర్వయక్షరాక్షసలోకంబులందు వక్కాణింప శుకుం బనిచె. నాగలోకంబునందు వక్కాణింప సుమంతుం బనిచె. మనుష్యలోకంబున జనమేజయునకు వక్కాణింప వైశంపాయనుని బనిచె నే నావైశంపాయనమహామునివలన వినివచ్చితిని''

ఇట్లు పూర్వోక్తగ్రంథపరిశీలనమువలన మహాభారతరచన యుద్ధము సమాప్తమైన వెంటనే జరిగెనో, యుద్ధ మిక నగు ననగా నారంభింపబడి జరిగెనో, అందరు గతించిపోయిన తరువాత జరిగెనో యేమియు చెప్పబడలే దని తేలినది. అవిమర్శకులు మాత్రము వచనాధారము లేకయే తమ తమ యూహాలను బట్టి పలువిధముల వ్రాసి యున్నారు.

మహాభారతరచన యెప్పుడు జరిగెనో తెలిసికొనుటకు ఒక మార్గ మున్నది. మహాభారతము రచించిన తరువాత వ్యాసమహర్షి

శ్రీమద్భాగవతమును రచించె ననియు నాభాగవతమును వ్యాసమహా ర్షియొద్ద శుకయోగి ద్వాపరయుగాంతమందు జదువుకొనె ననియు శ్రీమద్భాగవతమందు చెప్పబడియున్నది.

1 స్కంధము— అ 4.

'ద్వాపరే సమనుప్రాప్తే తృతీయే యుగపర్యయే ।
జాతః పరాశరా ద్యోగీ వాసవ్యాం కలయా హరేః ॥'

(శ్రీ) ధరీయమ్—ద్వాపరే సమనుప్రాప్తే, కదేత్యపేక్షాయా మాహ తృతీయే యుగస్య పర్యయే పరివర్తే (కృతయుగాపేక్షయా తృతీయే ద్వాపరే సమనుప్రాప్తే కింభూతే యుగస్య పర్యయో ఽవసానం యత్ర తస్మిన్ ద్వాపరాన్త ఇత్యర్థ మాహ తీర్థః) వాసవ్యా ముపరిచరస్య వసో ర్వీర్యా జ్జాతాయాం సత్యవత్యాం యోగీ జ్ఞానీ వ్యాసోజాతః.

"నాతిప్రసీదద్ధృదయ స్సరస్వత్యా స్తటే శుచౌ ।
వితర్కయన్ వివిక్తస్థ ఇదం ప్రోవాచ ధర్మవిత్ ॥
ధృతవ్రతేన హి మయా ఛందాంసి గురవోఽగ్నయః ।
మానితా నిర్వ్యలీకేన గృహీతం చానుశాసనమ్ ॥
భారతవ్యపదేశేన హ్యామ్నాయార్థశ్చ దర్శితః ।
దృశ్యతే యత్ర ధర్మాది స్త్రీశూద్రాదిభి రప్యుత ॥
అథాపి బత మే దైహ్యో హ్యాత్మా చైవాత్మనా విభుః ।
అసంపన్న ఇవాభాతి బ్రహ్మవర్చస్యసత్తమః ॥"

వ్యా. దేహ్యః— దేహే భవః ఆత్మా— జీవః వస్తుతో విభుః పరిపూర్ణఏవ ఆత్మనా స్వేన రూపేణాసంపన్నః తాదాత్మ్య మప్రాప్త ఇవాభాతి. బ్రహ్మవర్చసం వేదశ్రవణాధ్యాపనోత్కర్షజం తేజః తత్ర సాధవః బ్రహ్మవర్చస్యాః తేషు సత్తమః అతిశ్రేష్ఠోఽపి.

(2 స్కంధము. అ. 1.) శుకః—

'ఇదం భాగవతం నామ పురాణం బ్రహ్మసమ్మితమ్ ।
అధీతవాన్ ద్వాపరాదౌ పితుర్ద్వైపాయనాదహమ్ ॥'

వ్యా- బ్రహ్మసమ్మితం- సర్వవేదతుల్యం; ... కుత స్త్వయా ప్రాప్తం తత్రాహ- అధీతవానితి, కదా ద్వాపరాదౌ, ద్వాపర ఆదిర్యస్య కాలస్య తస్మిన్ ద్వాపరాన్త ఇత్యర్థః, శక్తనుసమకాలే వ్యాసావతారాత్.

ద్వాపరయుగాంతమందు వ్యాసమహర్షి యావిర్భవించెను. వేదవిభాగాదికార్యములు చేసి భారతము రచించెను కర్తవ్యాంతరమున్నట్లు ఏకాగ్రత కలుగకుండుటచే సరస్వతీనదీతీరమున గూర్చుండి వితర్కించుకొనుటలో నిట్టి లోకోపకారకార్యములు చేసియున్నను ఏకాగ్రత కలుగకుండెనే యని చింతించుచుండ నారదు డేతెంచి భాగవతము రచింపవలసిన దని యుపదేశింప నట్లే యని భాగవతము రచించెను. దానిని శుకయోగి ద్వాపరయుగాంతమందధ్యయనము చేసెను. అని భావము.

ఈభాగవతము ద్వాపరాంతమందు రచింపబడినట్లు కంఠోక్తిగా జెప్పబడుటచే దానికి పూర్వము రచింపబడిన మహాభారతముకూడ ద్వాపరాంతమందే రచింపబడినట్లు తేలుచున్నది.

భారతము రచించియే వ్యాసమహర్షి భాగవతము రచించె నని వీరరాఘవీయవ్యాఖ్యానమునందు చెప్పబడినది. చూడుడు—

'తత్ర భవాన్ పారాశర్య స్సత్యవత్యాం భగవదంశేనావతీర్ణో బాదరాయణః ...పంచమవేదత్వేన ప్రసిద్ధం శ్రీమహాభారతాఖ్య మితిహాసం నిర్మాయ ప్రాధాన్యేన వేదాన్తార్థోపబృంహణాత్మకం శ్రీమద్భాగవతాఖ్యం పురాణరత్నం చికీర్షు స్తావ

డిష్టదేవతోపాసనాత్మకం మంగళ మాచరతి ప్రథమశ్లోకేన.'

మ. భా. చ. కారులుకూడ 'భారతము వ్రాసి వ్యాసుడే చింతించి నారదోపదేశముచే భాగవతము రచించియుండెను" (పు. 294) అని వ్రాసిరి. కాని వీరు 14-10-48 గోలకొండపత్రికలో నిట్లువ్రాసిరి.

> "నేను భాగవతము వ్యాసకృతముగానే కాన్పించుచున్నదనుట ...కల్గెను. ఇటీవల ... హరివంశభాగవతవిష్ణుపురాణాదులను సంస్కృతవాఙ్మయచరిత్రలను చదువగా నేను తొలుత వ్రాసిన యంశములు పొరపాటని భావించితిని ... భాగవతము వ్యాసనిర్మితముకాక బోపదేవుడు అనునాతడు రచించి వ్యాసుని పేరు పెట్టె నని పెద్దవాదము"

దీనినిబట్టి వీరు తమకు పొరపాట్లున్నవని భావించుచున్నవారే యని తేలినది. భాగవతము వ్యాసకర్తృకమే యని ప్రమాణము లుద్ఘోషించుచున్నవి—

భాగవతము— స్క॥ 1. అ॥ 3—

"ఉత్తమశ్లోకచరితం చకార భగవా నృషిః ।
నిశ్శ్రేయసాయ లోకస్య ధన్యం స్వస్త్యయనం మహత్ ॥
త దిదం గ్రాహయామాస సుత మాత్మవిదాం వరం ।
అనర్థోపశమం సాక్షా ద్భక్తియోగ మధోక్షజే ॥
లోకస్యాజానతో వ్యాస శ్చక్రే సాత్వతసంహితామ్ ॥"

ద్వితీయస్కంధము— అ॥ 1—

"ఇదం భాగవతం నామ పురాణం బ్రహ్మసమ్మితమ్ ।
అధీతవా న్ద్వాపరాదౌ పితు ర్ద్వైపాయనా దహమ్ ॥"

నవమస్కంధము— అ॥ 22—

"యస్యాం పరాశరా త్సాక్షా దవతీర్ణో హరేః కలా ।

వేదకర్త్రే మునిః కృష్ణో యతోహి మమ మన్మగామ్ ।
హిత్వా స్వశిష్యాన్ వైరాగే భగవాన్ బాదరాయణః ।
మహ్యం ప్రశాన్తాయ రహస్యం పరం గుహ్య మిదం జగౌ ."

స్కాందము—

"పరీక్షిచ్ఛుకసంవాదో యోఽత్ర వ్యాసేన వర్ణితః ।
గ్రంథోఽష్టాదశసాహస్రో సోఽత్ర భాగవతాభిధః ॥"

నారదీయము—

"మరీచే శృణు వక్ష్యామి వేదవ్యాసేన యత్కృతమ్ ।
శ్రీమద్భాగవతం నామ పురాణం వేదసమ్మితమ్ ॥"

ఇట్లనేకప్రమాణములు శ్రీమద్భాగవతము వ్యాసకృతమేయని యుద్ఘోషించుచుండ బోపదేవకృత మను వాదము నిరాధారము.

బోపదేవుడు వ్రాసి, వ్యాసుని పేరు పెట్టెనట. ఆహా! భాగవతములో, స్కాందములో, నారదీయపురాణములో వ్యాసుని పేరు బోపదేవుడే పెట్టెనా? బోపదేవుడు వ్రాసిన భాగవతమును వ్యాసునియొద్ద శుకయోగి ద్వాపరయుగాంతమున జదువుకొనెనా? స్పష్టముగా జెప్పబడిన గ్రంథకారుని పేరును తిరస్కరించి మరియొకని పేరు పెట్టుట కుపక్రమించిన యెడల నేగ్రంథమందు పేరును బట్టి గ్రంథకారుని నిర్ణయింప వీలిచ్చును?

ఇంతకును శ్రీభాగవతముయొక్క పూజ్యత యెట్టిదో, అందలి విషయవిన్యాసవిశేషము లెట్టివో, దానిని పరమప్రమాణముగా భావించెడి విద్వత్పుంగవులు, మతాచార్యులు, వ్యాఖ్యాతలు ఎట్టివారో, ఏమాత్రము తెలియనిదోషమే యిట్టి వాదమునకు మూలము.

ఈ వాదమును గూర్చి 'వంశీధరీయవ్యాఖ్యాన' ప్రస్తావనలో నిట్లు సమాధానము చెప్పబడినది—

"నను భాగవతం న వ్యాసదేవకృతం, కింతు బోపదేవాదిభిః కృతం స్యా దితి ప్రాయః పుష్కలా శ్శంకా భవంతి । త దేత దత్ర సమాధానకదంబక మవధేయమ్— బోపదేవేన భాగవతం యది కృతం తర్హి :వ్యాసనామ సమాప్తౌ కి మితి లిఖితం? గ్రంథకర్తు ర్నామ్ని యది సందేహ స్తర్హి మహాభాష్యాదిగ్రంథేష్వపి సందేహో దుర్వారః ।

కించ బోపదేవా త్ప్రాగుత్పన్నై శ్చిత్సుఖాచార్యైః భాగవతే టీకా కృతా । విజయధ్వజేనాపి భాగవతే టీకా కృతా । త త్రాదా, అష్టౌ టీకా అవలోక్య ఇత్యుక్తమ్— 'హనుమట్టీకాం, శంకరాచార్యటీకాం దృష్ట్వా' ఇతి వర్ణితమ్ । త త్కథం సంగచ్ఛేత? శంకరాచార్యాణాం సప్తశతసంవత్సరాణాం వ్యతీతౌ బోపదేవస్య పంచశతీ వ్యతీ తేతి రామాశ్రమేణ లిఖితమ్ ।

అన్య చ్చ భట్టోజీదీక్షితై ర్బృహుప్రకారై ర్భాగవతం స్తుతమ్। శివతత్త్వవివేకాదౌ సమ్మతిత్వేన గృహీతం, మధుసూదనసరస్వతీభిః భక్తిరసాయనగ్రంథే భాగవతం వ్యాఖ్యాతం । విద్యారణ్యగురుభి రపి నూతసంహితాదిటీకాదౌ భాగవతం సమ్మతిత్వేన గృహీతం । శంకరాచార్యై ర్గోవిందాష్టకే 'మృత్స్నామత్సీ' త్యాద్యుక్తం, తచ్చ భాగవతా దన్యత్ర నాస్తి, ఏవ మేకనాథప్రభృతిభిః ప్రాకృతగ్రంథకారై రపి స్వీకృతం । ఏత దధికః కోవా పండితః యో భాగవతం నిన్దేత్ ?

కించ భాగవతం వామమార్గిణో నిన్దంతి । తే నిన్దంతునామ! తేషా మపి భాగవతే నిందితత్వాత్। చోరా శ్చంద్రమివ, ఉపపతయో

ముఖ్యపతి మివ, పాఖండినో వేదమివ, చైద్యః కృష్ణమివ, రజకో రామ మివ, గతశ్రీ ర్గణక మివ, గతాయు శ్చికిత్సక మివ, ఉభయ వర్జితో బ్రాహ్మణ మివ తాదృశా స్సర్వపురుషార్థభ్రష్టా నిందంతు భాగవతం న నః కించిచ్ఛిద్యతే!

కించ మహాభాగవత మేవ సర్వపురాణప్రసిద్ధ మితి దామోదర శాస్త్రిభి రపి నిర్ణీతం! త ద్యథా— "అష్టాదశపురాణానాం కర్తా సత్యవతీసుతః॥" ఇతి!

ఇది యిట్లుండగా మ. భా. చ. కారులు చూచితి మని చెప్పిన సంస్కృతవాఙ్మయచరిత్రములో నేమని యున్నదో చూడుడు!

భాగవతకర్తృనిర్ణయము— (పు. 69)

"భాగవతపురాణమహాత్మ్యము బహువిధముల గరుడ, మత్స్య స్కందపురాణములు ప్రశంశించియున్న మాట యటుండ క్రీ. శ. ఎని మిదవశతాబ్దికడపట నున్న శంకరభగవత్పాదులు భాగవతమునకు వ్యాఖ్య రచించి యున్నారని దీనికి ద్వైతవ్యాఖ్య రచించిన విజయధ్వ జాచార్యులు చెప్పుచుండ నేటికి ఆరునందల యేండ్ల క్రిందటి బోపదే వుడు భాగవతము రచించియుండె ననుటకంటె నసంగతమైన మాట వేరుండునా?"

కావున బహువిధముల హరివంశవిష్ణుపురాణముల ననుసరించిన యిది కొన్ని యితరపురాణములవలె ప్రాచీనమే కాని మొన్న మొన్న టిది కాదని విశ్వసింపవచ్చును. ఇట్లున్న సంస్కృతవాఙ్మయచరిత్రను చూచి మ. భా. చ. కారులు భాగవతము బోపదేవకృతమే యని వ్రాసినపుడు వారి నేమనవలసియున్నది?

ఇంతవరకు భారతరచనాకాలనిర్ణయమునకై భాగవతరచనా

కాలపరీక్షణముచేయుచుండ ప్రసంగవశమున భాగవతముబోపదేవకృత మను వాదము ప్రా ప్తింప దానిని నిరసించుటచే భాగవతము వ్యాస కర్తృకమేయని స్థిరపడినది. అట్టిభాగవతమును వ్యాసమహర్షి ద్వాప రాంతమందు రచించె ననియు పూర్వోక్తవచనములచేత నిశ్చితమైనది. ఇటుపై నొక శంక కలుగుచున్నది—

వ్యాసమహర్షిచే ద్వాపరమందు రచింపబడిన భాగవతము శుక పరీక్షిత్సంవాదసూతశౌనకసంవాదములతో ఘటితమై యున్నది. ఆపరీ క్షిత్తునకు శుకయోగి భాగవత ముపదేశించుట—

ఆకృష్ణనిర్గమా త్త్రింశ ద్వర్షాధికగ తే కలౌ ।
నవమీతో నభస్యేచ కథారంభం శుకోఽకరోత్ ॥

వ్యా—ఆకృష్ణనిర్గమాత్=కృష్ణస్య స్వధామగమనం మర్యాదీకృత్య; త్రింశద్వర్షాధికగతే=త్రింశద్వర్షేభ్యః అధికం కాలం గతః। తథా భూతే కలౌ సతి నభస్యే=భాద్రపదే మాసే; నవమీతః కథా రంభం శుకః అకరోత్=కృతవాన్ ॥

అను భాగవతమాహాత్మ్యములోని వచనమునుబట్టి కలియుగ ప్రవేశోత్తరము ౩0సంవత్సరములు గడచిన తరువాత జరిగెను. ఇట్టి స్థితిలో ముం దెప్పుడో జరుగబోవు విషయమును వ్యాసమహర్షి వెను కనే వ్రాసియుంచె ననియు, దానిని శుకయోగిచే జదివించె ననియు చెప్పుట స్వభావవిరుద్ధము కాదా? అనిపించును.

ఇది మనుష్యస్వభావమునకు విరుద్ధమే కాని, మహర్షిస్వభా వమునకు విరుద్ధము కాదు. త్రికాలజ్ఞానసంపన్నులగు ఋషులు మను ష్యులకంటె మహామహిమకలవారు. వారిస్వభావమును మనుష్యజాతి స్వభావముతో పోల్చరాదు. చూడుడు!

యోగదర్శనము—4-33—

"మనుష్యజాతి శ్శ్రేయసీ న వా శ్రేయసీ త్యేవం పరిపృష్టే విభజ్య వచనీయః ప్రశ్నః పశూ నధికృత్య శ్రేయసీ దేవా నృషీ నధికృత్య నేతి ॥

అనగా మనుష్యజాతి గొప్పది యగునా కాదా? అని ప్రశ్నించి నపుడు పశువులకంటె గొప్పది. దేవతలకంటెను ఋషులకంటెను కొద్దిది యనియే సమాధాన మని భావము.

మనకు శంకలు కలిగినపుడు శాస్త్రములు చూచియో శాస్త్రజ్ఞుల నడిగియో తొలగించుకొనవలెను కనుక భాగవతరచనావిషయమైన శంకను కూలంకషజ్ఞానముకల వ్యాఖ్యాతలు ఏమని పరిహరించి యుండిరో చూతము—

"నిగమకల్పతరో ర్గళితం ఫలం శుకముఖా దమృతద్రవసంయుతమ్" శ్రీధరీయమ్—ఏత చ్చ భవిష్యదపి భూతవ న్నిర్దిష్టమ్. అనాగతాఖ్యానేనై వాస్య శాస్త్రస్య ప్రవృత్తేః ॥

వీరరాఘవీయమ్—

యద్య ప్యేత త్ప్రబన్ధనిర్మాణోపక్రమదశాయా మస్య శుకముఖాస్వాదితత్వం న విద్యతే, తథాపి భవిష్య దభిప్రాయేణ త్రైకాలజ్ఞస్య నిర్మాతు రేవ ముక్తిః ॥

తదేవ మనుస్థితత్రివిధమంగళః ... భగవాన్ బాదరాయణః త్రైకాల్యజ్ఞః అస్య చికీర్షితస్య వేదాన్తార్థోపబృంహణాత్మకస్య పురాణస్య పరీక్షిచ్ఛౌనకశుకసూతాదిప్రష్టృప్రతివక్తృప్రశ్నోత్తరముఖేన భావినీం ప్రవృత్తి మాలోచ్య తత్ర తేషాం ప్రశ్నోత్తరరూపాన్ శ్లోకాన్ స్వయమేవ తత్ర తత్ర నిర్మిత్సుః

తావ త్తదుపోద్ఘాతరూపేఽస్మిన్ ప్రథమస్కన్ధే ప్రథమప్రష్టుః
పరీక్షితః ప్రతివక్తు శ్శుకస్య చైకత్ర సమావేశం ప్రతివక్తు శ్శు
కస్య సమాగమం పరీక్షితః ప్రష్టుప్రశ్నోద్యోగ హేతుం ప్రా
యోపవేశం తన్నిమిత్తవిప్రశాపంచ వివక్షుః ప్రాయోపవేశా
త్ప్రాక్తనం జన్మావధికం పారీక్షితం వృత్తాంతం తతః ప్రాక్త
నం తత్పిత్రాదివృత్తాన్తం తథైవ తత్ప్రబన్ధకర్తుః వ్యా స్యైతన్ని
ర్మాణనిమిత్తదర్శనసమాగత దేవర్షేశ్చ సంవాదం తదాజ్ఞ యైత
త్ప్రబన్ధనిర్మాణం చ శౌనకసూతప్రశ్నో త్తరముఖేన వివక్షు
స్తావ చ్ఛౌనకాదిప్రశ్నప్రకారం వక్తుం తదుపోద్ఘాత మాహ-
నైమిశ ఇతి॥ అత్ర కేచిత్ శౌనకాదిప్రశ్నాదిరూపాశ్శ్లోకా స్త
దర్వాచీనైః నిర్మా యాత్ర తత్రతత్ర నిబద్ధాః పరీక్షిదాది
ప్రశ్నాదిరూపాస్తు సూతేనేతి వద న్తి

తదసారమ్ త్రైకాల్యజ్ఞస్య ప్రబన్ధప్రబన్ధు రేవ తన్నిర్మాణోపపత్తేః
నహి సద్విద్యానన్దవల్లీ ప్రతర్దనవిద్యాదిషు 'శ్వేతకేతు ర్హారు
ణేయ ఆసతగ్ం హ పితోవాచ శ్వేతకేతో' 'భృగు ర్వై వా
రుణిః వరుణం పితర ముపససార' 'ప్రతర్దనో హ వై దైవో
దాసి రిన్ద్రస్య ప్రియం ధామోజగామ'

ఇత్యాదీనాం ప్రశ్నప్రతివచనాదిరూపాణాం శ్రౌతవచసా మా
ధునికత్వం వక్తుం యుక్తం, నను వేదే కర్తు రభావాత్ స్వయ
మేవ వేదః ప్రశ్నో త్తరరూపేణ ప్రతిపిపాదయిషితా నర్థాన్
ప్రతిపాదయతి. అత్ర తు పౌరుషేయేఽ న్యకర్తృకాణా మపి
వచసాం సందర్భ స్తత్ర తత్ర నదోషావహ ఇతిచేన్న। ఏవమపి
కృత్స్నప్రబన్ధ స్యైకకర్తృత్వాసిద్ధేః కృత్స్నస్య పురాణప్రపం
చస్య ప్రశ్నో త్తరరూపత్వేన కాని గ్రన్థకర్తు ర్వచాంసి కాని
చేతరేషా మితి విభాగ స్యాశక్యత్వాచ్చ తస్మా ద్యథోక్తమేవ
న్యాయ్యమ్॥

ఈవ్యాఖ్యానముల సారాంశము—

ఈభాగవతగ్రంథనిర్మాణకాలమునకుపూర్వము శుకోపదేశము పరీక్షిత్తునకు జరిగియుండలేదు. అయినను జరుగబోవువిషయముతోడనే యీగ్రంథము మహర్షివలన ప్రవృత్తమైనది. త్రైకాలజ్ఞాననిధియగు బాదరాయణు డనబడు వ్యాసభగవానుడు పరీక్షిచ్ఛుకయోగుల యొక్కయు, శౌనకసూతుల యొక్కయు, ప్రశ్నప్రతివచనముఖముననే భవిష్యద్వృత్తాంతమును గ్రహించి ప్రశ్నోత్తరరూపశ్లోకములను స్వయముగా రచించి ఉపోద్ఘాతరూపమైన పూర్వగాథను ప్రతిపాదించియుండెను. కొందరిచ్చట శౌనకాదిప్రశ్నోత్తరరూపశ్లోకములు నవీనులచే రచింపబడి అచ్చటచ్చట జేర్పబడిన వనియు పరీక్షిదాదిప్రశ్నోత్తరశ్లోకములు సూతునిచే జేర్పబడినవనియు చెప్పుచున్నారు. ఆమాట నిస్సారము. అట్లైన యెడల యావద్గ్రంథమునకు సుప్రసిద్ధమైన యేకకర్తృత్వప్రతీతికి హాని కలుగును. యావద్గ్రంథము ప్రశ్నప్రతివచనసరణి కలిగియే యుండుట వలన నేవి గ్రంథకారునివచనములో ఏవి యితరుల వచనములో నిర్ణయింప శక్యముకూడ కాదు. కనుక యావద్గ్రంథము వ్యాసరచిత మనుటయే న్యాయము. అని.

దీనిని బట్టి భవిష్యదాఖ్యానముతోడనే భాగవతము ద్వాపరాంతమందు వ్యాసమహర్షి రచించియుండె ననుట విద్వన్మార్గ మని తేలినది. దీని నిటుంచి మ. భా. చ. కారులు భాగవతము వ్యాసకృతము కాద నుచు దానికి కారణమును గోలకొండపత్రికలో వ్రాసినందున దానిని జూతము—

"పరీక్షిత్తునకు భాగవతాంశముల జెప్పిన శ్రీశుకులవారు పరీక్షిత్తు పుట్టుకపూర్వమె దివంగతు డయ్యె నని మహాభారతమున... కలదు. అట్టి శ్రీశుకుల నిర్యాణమునకు వ్యాసులవారు విచారించు

చుండగా శివుడు వచ్చి వ్యాసులవారి నోదార్చె ననియు ఈయంశ మును భీష్ముడు ధర్మరాజుతో జెప్పె ననియు”

ఈవ్రాతవలన శుకుడు పూర్వమే నిర్వాణమును పొందినపుడు మరల పరీక్షిత్తుదగ్గరకు వచ్చుట, భాగవతము చెప్పుట అసంభవము కనుక భాగవతము వ్యాసకృతము కాదని ప్రతివాదులు తేల్చిరి. వారి కొకింత చెప్పవలెను.

శుకయోగి కప్పుడు దేహత్యాగము కాలేదు. దేహముతోడనే యోగసిద్ధినిబట్టి యదృశ్యు డయ్యెను. భారతము చూడుడు—

“లోకేషు సర్వభూతాని ప్రవేక్ష్యామి స సంశయః ।
పశ్యన్తు యోగవీర్యం మే సర్వే దేవాః స్వహర్షిభిః ॥
అన్తర్హితః ప్రభావన్తు దర్శయిత్వా శుక స్తదా ।
గుణాన్ సంత్యజ్య శబ్దాదీన్ పద మభ్యగమ త్పరమ్ ॥
మహిమానంతు తం దృష్ట్వా పుత్ర స్యామితతేజసః ।
నిషసాద గిరిప్రస్థే పుత్ర మేవానుచిన్తయన్ ॥
పినాకహస్తో భగవా నభ్యాగచ్ఛత శంకరః ।
త మువాచ మహాదేవ స్సాంత్వపూర్వ మిదం వచః ॥
అగ్నే ర్భూమే రపాం వాయో రంతరిక్షస్య చైవ హ ।
వీర్యేణ సదృశః పుత్రః పురా మ త్త స్త్వయా వృతః ॥
స గతిం పరమాం ప్రాప్తో దుష్ప్రాపా మజితేన్ద్రియైః ।
దైవతై రపి విప్రర్షే తం త్వం కి మనుశోచసి ॥
ఛాయాం స్వపుత్ర సదృశీం సర్వతోఽనపగాం సదా ।
ద్రక్ష్యసే త్వం చ లోకేఽస్మిన్ మత్ప్రసాదా న్మహామునే ।”

ఈవచనములు యోగప్రభావముచే సర్వభూతములయందు ప్రవేశింతు నని యాప్రభావము జూపి యంతర్హితుడైన శుకుని మహి

మను జూచి పుత్రుని యెడబాటు సహింపలేక చింతించుచుండిన వ్యాసునకు శంకరుడు దర్శనమిచ్చి నీవు పంచభూతముల ప్రభావము కల పుత్రుని కోరగా నట్టివాడే జన్మించి యితరుల కసాధ్యమైన పరమ గతిని బొందెను. నీకాతని ఛాయ అవినాభావముగా గోచరించు చుండును. అని యనుగ్రహించెను. అని చెప్పుచున్నవి.

ఈవిషయమునకే భాగవతమున కాదియందున్న "యం ప్రవ్ర జన్త మనుపేత మపేతకృత్యం ద్వైపాయనో విరహకాతర ఆజుహావ పుత్రేతి" అనుశ్లోకము ఈశ్లోకార్థమునే "సముడై యెవ్వడు ముక్తకర్మ చయుడై సంన్యాసియై యొంటి బోవ" అను ఆంధ్రభాగవతపద్యము వెల్లడి చేయుచున్నది

శుకయోగి పరీక్షిన్నరేంద్రుడు ప్రాయోపవేశము నొంది మహర్షిగణపరివేష్టితుడై యున్నపుడు దైవికముగా మనోహరరూప ముతో షోడశవర్షవయస్కుడై యచ్చటికి వచ్చెను చూడుడు—

"తత్రాభవ ద్భగవాన్ వ్యాసపుత్రో యదృచ్ఛయా గా మటమానో౽నపేక్షః । అలక్ష్యలింగో నిజలాభతుష్టో వృత శ్చ్రీబాలైరవ ధూతవేషః ॥"

ఇత్యాదిశ్లోకములలో శుకయోగి రూపవిశేషము వర్ణింపబడి యున్నది.

అట్లు వచ్చిన శుకయోగి పరీక్షిత్తుతో నిట్లనియె—

"ప్రాయేణ మునయో రాజ న్నివృత్తా విధిషేధతః ।
నైర్గుణ్యస్థా రమన్తే స్మ గుణానుకథనే హరేః ॥
ఇదం భాగవతం నామ పురాణం బ్రహ్మసమ్మితమ్ ।
అధీతవాన్ ద్వాపరాదౌ పితు ర్ద్వైపాయనా దహమ్ ॥

పరినిష్ఠితోఽపి నైర్గుణ్య ఉత్తమశ్లోకలీలయా ।
గృహీతచేతా రాజర్షే ఆఖ్యానం య దధీతవాన్ ।
త దహం తేభిధాస్యామి మహాపౌరుషికో భవాన్ ."

బ్రహ్మనిష్ఠులైన మునులు కూడ శ్రీహరిలీలలను కీర్తించుటలో నానందించుచుందురు. నేను జన్మసిద్ధమైన బ్రహ్మనిష్ఠకలవాడనై యుండియు హరిలీలామాధుర్యపారవశ్యమున ద్వాపరాంతమందు తండ్రియొద్దనే నధ్యయనము చేసియున్న భాగవతమును నీకు జెప్పెదను. అని.

కనుక ప్రతివాదులు యోగసిద్ధికలిగి శుకయోగి యసంగుడై యూర్ధ్వలోకసంచారముచేసెనుకాని వెనుకనే విదేహకైవల్యము నొందలేదని తెలిసికొందురు గాక.

ఇక ప్రకృతమునకు వత్తము. మహాభారతము రచించిన తరువాత వ్యాసమహర్షిచే రచింపబడిన భాగవతము ద్వాపరాంతమందు శుకయోగిచే నధ్యయనము చేయబడినట్లు కంఠోక్తిగా జెప్పబడినందున ద్వాపరయుగాంతమందే భారతరచన జరిగెను. ప్రమాణాంతరము కూడగలదు.

స్కాందము. ప్రభాసఖండము. అ. 2—

'అష్టాదశపురాణాని కృత్వా సత్యవతీసుతః ।
భారతాఖ్యాన మకరో ద్వేదార్థై రుపబృంహితమ్ ॥
లక్షే ణైకేన తత్ప్రోక్తం ద్వాపరాన్తే మహాత్మనా ।'

ఈప్రమాణము స్పష్టముగా ద్వాపరాంతమందు మహాభారత రచన జరిగినదని చెప్పుచున్నది. ఇట్లు రచింపబడిన యీమహాభారతముకూడ ముందు జరుగబోవు జనమేజయసర్పసత్రమున వైశంపాయనుడు శౌనకసత్రయాగమున సౌతి యుపదేశించిన విధమున భవిష్య

ద్వృత్తాంతఘటితమై శ్రీమద్భాగవతమువలెనే ప్రవృత్తమైనది. దేవీ భాగవతరచనకూడ నీవిధముగానే యున్నది. అందు శుకునకు దేవీభాగవతోపదేశము చేయు సందర్భమున జనమేజయున కిది యుపదేశింపబడినదని చెప్పబడినదిట. విషయమై నీలకంఠీయవ్యాఖ్యానములో శంకా సమాధానము లిట్లున్నవి— స్కం. 2. అ 6. ప్ర. 8.

> "నను శుకాయ భాగవతోపదేశసమయే జనమేజయోత్పత్త్యభావేన జనమేజయా యోపదిష్టం భాగవత మితి కథా శుకోపదిష్టభాగవతేఽసంగతేతి చేన్న. వ్యాసస్య సర్వజ్ఞత్వేన జనమేజయం ప్రత్యేవం వక్తాస్మీ త్యభిప్రాయేణ పూర్వమేవ గ్రన్థం భవిష్యాఖ్యానఘటితం కృత్వా శుకాయోపదిదేశేతి కల్పనాత్"
> అనగా శుకునకు భాగవత ముపదేశించు కాలమున జనమేజయోత్పత్తియే లేనపుడు శుకోపదిష్టభాగవతములో జనమేజయున కిది యుపదేశింపబడిన దను కథ యెట్లు సరిపడును? అని శంకింపరాదు వ్యాసమహర్షి సర్వజ్ఞుడగుటచే జనమేజయున కీవిధముగా చెప్పగలననే యభిప్రాయముతో భవిష్యాఖ్యానఘటితమైన గ్రంథమును ముందుగా రచించి శుకున కుపదేశించె నని యనుకొనవచ్చును అని భావము.

ఇట్లే మహాభారతవిషయములో గూడ "వేదా నధ్యాపయామాస మహాభారతపంచమాన్ । సుమన్తుం, జైమినిం, పైలం, ...శుకం చైవ స్వమాత్మజమ్" అని యున్నందున శుకప్రభృతులు వైశంపాయనుడు మహాభారతము నధ్యయనము చేయు కాలమునకు జనమేజయోత్పత్తి లేదుకనుక జనమేజయునకు వైశంపాయనుడు చెప్పినట్లు భవిష్యాఖ్యానఘటితముగనే మహర్షి రచించియుండె నని స్పష్టమగుచున్నది.

పురాణములు ముందెప్పుడో జరిగెడి గాథలను కూడ చెప్పునా?

అను సంశయమును వ్యాసభగవానుడే తీర్చెను- కాశీఖండములో, అగస్త్యునకు కుమారస్వామి ద్రౌపదాదితో పాఖ్యానము చెప్పుచు ద్రౌపదిచే నాదిత్యుడు ఆరాధింపబడినట్లు చెప్పెనను సంగతి సూతుడు వ్యాసునివలన విని యిట్లు శంకించెను—— అ. 49.

'పారాశర్యమునే! వ్యాస! కుమారః కుంభజన్మనే ।
యదాఽవద త్కథా మేతాం తదా క్వ ద్రుపదాత్మజా ॥'

వ్యాసః——

"పురాణసంహితా సూత! బ్రూతే త్రైకాలికీం కథామ్ ।
సందేహో నాత్ర కర్తవ్యో యత స్తద్గోచరోఖిలమ్ ॥

అనగా 'మహర్షీ! కుమారస్వామి కుంభసంభవునకు ఈ కథ నుపదేశించునాటికి ద్రౌపది యేది?' అను ప్రశ్న విని, సూతా! పురాణసంహిత త్రైకాలికకథలను చెప్పును. దానికి గోచరింపని విషయము లేదు. సందేహపడరాదు' అని వ్యాసమహర్షి చెప్పెను.

కనుక పురాణములు త్రికాలవృత్తాంతబోధకములు. ఆపురాణకర్తయే యీమహాభారతకర్త.

మఱియు ఋషులు అగతానాగతవిషయములను ఆర్షదృష్టిచే గ్రహింతురు. వారి వాక్కులను త్రోసివేయరాదు.' అని భర్తృహరి చెప్పుచుండెను. చూడుడు!

వాక్యపదీయము, బ్రహ్మకాండము——

"ఆవిర్భూతప్రకాశానా మనుపప్లుతచేతసామ్ ।
అతీతానాగతజ్ఞానం ప్రత్యక్షా న్న విశిష్యతే ॥

వ్యా॥ న ఉపప్లుతాని=రజస్తమోభి రాక్రాంతాని చేతాంసి యేషాం

తేషా మనుపప్లుతచేతసాం । తపసా క్షీణకల్మషాణాం, అత ఏవ అవిర్భూతః=ఆవరణరహితః; ప్రకాశో=జ్ఞానం యేషాం తేషాం ... నిరావరణఖ్యాతీనాం యోగినాం యదతీతానాగతజ్ఞానం జాయతే తత్=ప్రత్యక్షాత్; అస్మదాదిప్రత్యక్షాత్=న విశిష్యతే న భిద్యతే, న విలక్షణ మితి యావత్ ।

"అతీన్ద్రియా న సంవేద్యాన్ పశ్యం త్యార్షేణ చక్షుషా ।
యే భావాన్ వచనం తేషాం నానుమానేన బాధ్యతే ॥"

వ్యా ॥ అతీన్ద్రియాన్=ఇంద్రియై రగ్రాహ్యాన్; అతఏవాసంవేద్యాన్= ప్రత్యక్షపూర్వకై రనుమానాదిభి రప్యగ్రాహ్యాన్; భావాన్ యే ఋషయః ఆర్షేణ= వ్యావహారికా దన్యేన; అలౌకికసమాధిరూపతపోలబ్ధేన చక్షుషా=చక్షుస్సదృశేన యోగజధర్మేణ పశ్యంతి తేషాం వచనం అనుమానేన అవ్యవస్థితేన అతీంద్రియార్థే ప్రవర్తితు మశక్తేన చ న బాధ్యత ఇత్యర్థః ॥

అనగా తపస్సుచే క్షీణించిన చిత్తదోషములు కలిగి అనావృత జ్ఞానసంపన్నులైన యోగులకు గలుగు అతీతానాగతజ్ఞానము అస్మదాదిప్రత్యక్షము వంటిదే. ఏఋషులు అతీంద్రియపదార్థములను యోగశక్తిరూపమైన ఆర్షజ్ఞానముచే గ్రహించుచుండిరో వారి వాక్కులు అవ్యవస్థితములైనట్టియు, నతీంద్రియపదార్థముల యెడ నుపయోగింపనట్టియు నూహలచే బాధితములు కానేరవు. అని భావము.

దీనిచే నార్షవచనములను అవ్యవస్థితములగు మన యూహలచే త్రోసివేయరాదని బోధింపబడినది.

ఈ యార్షజ్ఞానమునుగూర్చి వైశేషిక దర్శన మిట్లు చెప్పుచున్నది—

సూ॥ "ఆర్షం సిద్ధదర్శనం చ ధర్మేభ్యః" (354)

ప్రశస్తపాదభాష్యమ్—

ఆమ్నాయవిధాతౄణా మృషీణా మతీతానాగతవర్తమానే ష్వతీంద్రియే ష్వర్థేషు ధర్మాదిషు గ్రంథోపనిబద్ధే ష్వనుపనిబద్ధేషు ఆత్మమనసో స్సంయోగా ద్ధర్మవిశేషాచ్చ యత్ ప్రాతిభమ్। (ఇన్ద్రియలింగాద్యభావే య దర్థభానం సా ప్రతిభా। సైవచ ప్రాతిభ మిత్యుచ్యతే— ఆర్షాపరపర్యాయమ్। భాష్యవివరణమ్) యథార్థనివేదనం జ్ఞానముత్పద్యతే తదార్ష మిత్యాచక్షతే। తత్తు ప్రస్తారేణ (బాహుళ్యేన) దేవర్షీణాం కదాచి దేవ లౌకికానాం యథా కన్యకా బ్రవీతి 'శ్వో మే భ్రాతాఽఽగన్తేతి హృదయం మే కథయతీతి"

అనగా ఋషులకు అతీంద్రియపదార్థములవిషయమై ఆత్మమనస్సంయోగమువలన ధర్మాతిశయమును బట్టి కలిగెడి యథార్థజ్ఞానము ప్రాతిభ మనియును, ఆర్ష మనియును చెప్పబడును. అది ఋషులకు, దేవతలకు బహుళముగా నుండును లౌకికముగా క్వాచిత్కమై యుండును. కనుకనే 'రేపు నా సోదరుడు వచ్చు నని నా హృదయము చెప్పుచున్నది' అని కన్యక చెప్పును. ఈప్రమాణములు చూడగా ఋషులు మనవంటివారు కారనియు, మనకు అస్వాభావికమైనది ఋషులకు స్వాభావికమే అగు ననియు, త్రైకాలికజ్ఞానము వారికి తపఃప్రభావమున కల దనియు స్పష్టమగుచున్నది.

మన వేదవ్యాసమహర్షి తానఖండతపస్సు చేసి త్రైకాలికజ్ఞానమును పొందినట్లు తన శిష్యులకు జెప్పెను. చూడుడు!

శాంతిపర్వము— అ॥ 340—

"పరాశరసుత శ్శ్రీమాన్ వ్యాసో వాక్య మథాబ్రవీత్।
మయా హి సుమహత్తప్తం తపః పరమదారుణమ్॥"

"భూతం భవ్యం భవిష్యంచ జానీయా మితి సత్తమాః ।
తస్య మే తప్తతపసో నిగృహీతేన్ద్రియస్యచ ॥
నారాయణప్రసాదేన క్షీరోద స్యానుకూలతః ।
త్రైకాలిక మిదం జ్ఞానం ప్రాదుర్భూతం యథేప్సితమ్ ॥
తచ్ఛృణుష్వం యథాన్యాయం వక్ష్యే సంశయ ముత్తమమ్ ।
యథావృత్తంహి కల్పాదౌ దృష్టం మే జ్ఞానచక్షుషా ॥

అనగా నేను భూతభవిష్యద్వర్తమానవృత్తాంతములను తెలిసి కొనుటకై దారుణతపస్సు చేయగా నారాయణానుగ్రహమువలన నీత్రైకాలికజ్ఞానము కోరినట్లు ప్రాప్తించినది. కల్పాదియం దేమి జరిగి నదో దివ్యదృష్టికి గోచరించినది. చెప్పెదను వినుడు, అనిభావము. కను కనే "అయం పారాశర్యో మహాయోగీ వ్యాస స్సర్వజ్ఞ ఈశ్వరః ।

మహాభారత మాశ్చర్యం నిర్మమే భగవాన్ గురుః ॥"

అనుచు వ్యాసమహర్షి మహత్త్వము కీర్తింపబడెను.

ఇక పర్యవసానమేమనగా త్రైకాలికకథలను చెప్పుట పురాణ ములకు స్వాభావికమే యని వ్యాసమహర్షియే చెప్పియుండుటచేతను శ్రీమద్భాగవత, దేవీభాగవతములు భవిష్యాఖ్యానఘటితములే యని నిరూపింపబడి యుండుటచేతను ఋషులు ఆర్షదృష్టినిబట్టి అతీతానాగ తవిషయములను గ్రహింతురని, వాక్యపదీయ, వైశేషికదర్శన, యోగ దర్శనములు బోధించుచుండుటచేతను వ్యాసమహర్షియే తనకు తపః ప్రభావమున త్రైకాలికజ్ఞానము సంభవించెనని చెప్పియుండుటచేతను భవిష్యద్విషయములతో మహాభారతము ద్వాపరాంతమందే రచింపబ డెనని నిర్ణళితార్థము. దీనికి సందేహింపనేల.

ఏనాడో రచింపబడిన 'నందినాడి, గణేశనాడి, సత్యనాడి' ము న్నగు నాడీగ్రంథములు ఈనాటివారి జాతకములను పేర్లతో విద్యా

విశేషములతో, ఆచాయవ్యయములతో, లాభనష్టములతో, సంపద్వి పద్విశేషములతో, కుటుంబవృత్తాంతములతో స్పష్టముగా బోధించు చుండుట నేడు చూచుచున్నదే. ఈజాతకు లందరు పుట్టినతరువాతనే ఆనాడీగ్రంథములు వ్రాయబడినవని యనుకొనువారున్నారా?

మన మహాభారతచరిత్రకారులుకూడ నొకప్పుడు మాట్లాడుచు 'బృహజ్జాతక మను గ్రంథములో నాజాతకమునుగూర్చి చెప్పబడినది. అందు ఈజాతకుడు అపమార్గమున ప్రతిష్ఠ సంపాదించును' అని యున్నదని తమసంగతిని చెప్పినారు. వారు, తామిట్టి మార్గము నవ లంబించిన తరువాతనే ఆబృహజ్జాతకగ్రంథము రచింపబడెనని యన గలరా?

కనుక దురవగాహములగు నార్షగ్రంథములను అసంగతప్రసంగ ములతో నాక్షేపములకు పాలుచేయుట విమర్శకులకు తగదు.

మరియొకవిషయము. ఈయార్షగ్రంథములను గూర్చి రెండు మార్గములున్నవి. అందొకటి యనాదిసిద్ధమైన విద్వన్మార్గము. రెండ వది యాధునికమైన విమర్శకమార్గము. విద్వన్మార్గములో శబ్దార్థపరి శీలనము, గ్రంథసమన్వయము, ప్రమాణాంతరసంవాదము, పూర్వో త్తరవిరోధపరిహారము, సందర్భశుద్ధి, శాస్త్రమర్యాదానుసరణము. మున్నగునవి ముఖ్యాంశములు. విమర్శకమార్గములో నివియన్నియు మృగ్యములగుట, ఉన్నదున్నట్లు గ్రంథమును వెల్లడింపకుండుట, స్పష్ట ముగానున్న విషయమును కప్పిపుచ్చి దానికి విరుద్ధముగా గల్పించు చుండుట, ఏకవాక్యతతో బనిలేకయే గ్రంథములకు తోచిన ట్లర్థము చెప్పుచుండుట, పూర్వోత్తరవిరోధములను లక్ష్యపెట్టకుండుట, శబ్దమ ర్యాదనుపాటింపకుండుట ఇత్యాదులు ముఖ్యములు.

ఈరెండుమార్గములలో శ్రేయస్కాముల కాశ్రయణీయమైన మార్గమేది? అనునది విచారణీయాంశము.

ఈయార్షగ్రంథములను పఠనపాఠనములలో బెట్టి వ్యాఖ్యానములు వ్రాసి నిబన్ధనగ్రంథములు రచించి చిరకాలాభ్యాసవిశేషమున గ్రంథస్థవిషయమును అమూలాగ్రముగ గ్రహించి అదియే తమజీవిత సర్వస్వమని భావించి కృతకృత్యులై కూలంకషపాండిత్యప్రతిభకల వారు విద్వాంసులు.

ఆర్షవిద్యాభ్యాసవిశేషములేక ఆంగ్లభాషాపరిచయము, ఆంగ్లేయగ్రంథదర్శనము, ఆంగ్లేయసంప్రదాయాభిరుచి కలిగి ఆర్షసంప్రదాయవిముఖులై విద్వన్మార్గదూషణోద్యమము కలవారు విమర్శకులు. ఇట్టి స్థితిలో నార్షగ్రంథతత్త్వము, విద్వద్వేద్యమా? విమర్శకవేద్యమా? అని పరిశీలింపవలెను.

లోకములో ప్రముఖులైన రత్నపరీక్షకుల బోధల ననుసరించుచు రత్నపరిశీలనము సతతము చేయు రత్నవర్తకులకు రత్నతత్త్వమవగతమైనట్లు అప్పుటికప్పుడు చూచు వ్యక్తులకు అవగతముకాదని ప్రసిద్ధమే.

అదేవిధమున గురూపదేశక్రమము ననుసరించి యార్షవిద్యాభ్యాసపాటవముతో నార్షగ్రంథములను సతతపరిశీలనము చేయు విద్వద్వరేణ్యులకు అయార్షగ్రంథతత్త్వమవగతమగునుకాని అప్పుటికప్పుడు చూచు విమర్శకులకు అవగతము కాదనుట నిర్వివాదము.

ఇట్లుండ, రత్నగతవిశేషములను గ్రహింపదలచినవారు ఆరత్నములతో వ్యవహరించువారినే ఆశ్రయించి తెలిసికొనునట్లు ఆర్షగ్రంథగతవిశేషములను తెలిసికొనగోరువారు ఆయార్షగ్రంథముతోడనే పఠనపాఠనాదివ్యవహారము చేయువారి నాశ్రయించి తెలిసికొనవలెను. కనుక శ్రేయస్కాములకు ఆశ్రయణీయము విద్వన్మార్గమే. అట్టి విద్వన్మార్గమునకు తీర్థకరులు పరమపూజ్యులైన వ్యాఖ్యాతలు, కవ్యా

ఖ్యాత లార్షగ్రంథములలో మునిగి తేలినవా రగుటచే వారి యుపదే శము ననువర్తించుటచే యాస్తికలోకమునకు అభ్యుదయావహము.

కాబట్టి శ్రీధరీయ, వంశీధరీయ, వీరరాఘవీయ, నీలకంఠీయాది వ్యాఖ్యానములు నిరూపించి చెప్పుచున్నట్లు పరిశీలించుచురాగా విమ ర్శకుల యాక్షేపపరంపర విగళితమైనది. మహాభారత మేకకర్తృకమే కాని యనేకకర్తృకముకాదని తేలినది. విమర్శకులు చూపిన యుక్తులు అయుక్తములని తేలినది. మహాభారతరచనాకాలము ద్వాపరయుగాం తమని తేలినది.

ప్రతివాదులు తమ అనేకకర్తృకత్వవాదమునకు సాధకముగా మహాభారతము కొన్నిచోట్ల సందర్భశుద్ధి లేకున్న దని వ్రాసియు న్నారు. దానిని కూడ బరిశీలింతము.

## —♦ మహాభారతసందర్భశుద్ధి ♦—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది—

> 'దృశ్యమానమహాభారతము సందర్భశుద్ధి లేకుండగ గూడగొన్ని చోటుల గూర్పబడిన దని వ్రాసినందులకు తద్జ్ఞులు నన్ను క్షమింతురుగాక. ఇందులకు రెండు మూడు నిదర్శనములను మాత్రమే వ్రాయుచున్నాను' (పు. 53)

ఇచ్చట కొన్నిచోట్ల సందర్భశుద్ధి లేదని వ్రాయు ప్రతివాదులు తద్జ్ఞులను క్షమింప గోరుచున్నారు. ఇచ్చట తద్జ్ఞులనగా సందర్భ శుద్ధి లేదనుకొనువారా? ఉన్నదనుకొనువారా? లేదనుకొనువారికి తమ మాట బలకరమే కనుక క్షమింపగోరుట నిరర్థకము ఇక సందర్భశుద్ధి యున్న దనుకొనువారు దానిని నిరూపించి తీరుదురుగాని యుపేక్షింప లేరు కనుక, వారిని క్షమింపుమనుట కూడ నిరర్థకమే

కాని వీరి యీమాటచే తాము వ్రాయుచున్నది తప్పని తెలిసి కూడ వ్రాసినారనిమాత్రము తోచుచున్నది. ఇక వారన్న నిదర్శనములు చూతము—

> "పాండురాజు శతశృంగపర్వతమున మృతినొందగా మాద్రి, పాండురాజుతో చితాగ్నినొంది న'' దని ఆదిపర్వముయొక్క 125 అధ్యాయమున వర్ణింపబడినది. కాని 127 అధ్యాయమున మాద్రీపాండుల శరీరములు హస్తినాపురికి గొని తేబడి...... దహింపబడినటుల వర్ణింపబడి యున్నది'' (పుట 53)
>
> 'కృష్ణమూర్తిశాస్త్రిగారు దేహములన నస్థిక లని కలవనిరి. అట్లే వ్యాఖ్యాత వ్రాసెను. కాని ఆఘట్టమున దేహశరీరశబ్దములు వాడబడియుండుటచే నది సందేహాస్పదముగా నున్నది. ఆశబ్దములకు అస్థిక లను నర్థము ఏనిఘంటువునను గానరాదు''

ఇచ్చట, శతశృంగపర్వతముకడ మాద్రీపాండు శరీరములు దగ్ధములైన వనియు, తరువాత హస్తినాపురికి వారిశరీరములు గొని తేబడి దహింపజేయబడిన వనియు గ్రంథములో నున్న దని వ్రాసియున్నారు. ఇది సందర్భశుద్ధి లేదనుటకై చూపిన నిదర్శనము. ఇచ్చట, పూర్వమే దగ్ధమై యుండగా మరల దహింపబడిన దన్నమాట సందర్భశుద్ధి లేని దనియా? పూర్వము దగ్ధమైన శరీరములు తీసికొనిరాబడిన వన్నమాట సందర్భశుద్ధి లేనిదనియా? 'వారివ్రాతలోనన్న యభట్టుడియసందర్భము జూచికాబోలు మాద్రీపాండుల యంగములు కొనిదేబడి హస్తిపురిలో సంస్కరింపబడిన వని వ్రాసియున్నాడు'' (పు53)

అనుటనుబట్టి వారాక్షేపించునది పునస్సంస్కారవిషయము కాదని తోచుచున్నది. ఇక నచ్చట దగ్ధములైన శరీరములను తీసికొన వచ్చు టెట్లు? అనునదే ఆక్షేపణీయాంశ మన్నమాట, పునస్సంస్కా-

రము యుక్తమని వారంగీకరించియున్నపుడు అట్టి సంస్కారమునకు సంస్కరణీయము ముండవలసియున్నపుడు అది పూర్వదగ్ధశరీరభాగమే కావలసియున్నపుడు ఆశరీరభాగమైయున్న అస్థియే శరీరశబ్దముచే జెప్పబడిన దని తెలిసికొనలేక గ్రంథము నాక్షేపించుటా? "దేహం దేహయో రస్థీని. అగ్నిహోత్రాగ్నిభి స్సంస్కారలంభనార్థమ్" అని వ్యాఖ్యాత వ్రాసె నని యొకమూల చెప్పుచు గ్రంథము నాక్షేపించుటయు, వ్యాఖ్యాతను నిరసించుటయునా? శరీర దేహశబ్దములకు ఏనిఘంటువుల లోను అస్థికలను నర్థము లేదట. నిఘంటువులు శక్యార్థములను కాని ప్రాకరణికార్థములను చెప్పవని వీరెరుగ రన్నమాట.

"సముదాయేషు హి శబ్దాః ప్రవృత్తా అవయవే ష్వపి వర్తన్తే"

అనున్యాయమున శరీరావయవమైన అస్థిని శరీరశబ్దము ఈప్రకరణమున జెప్పుచున్న దని నీలకంఠీయము బోధించుచున్నది. కనుక సందర్భశుద్ధి కేమియు లోపము లేదు. ఇక వారు చెప్పిన రెండవ

నిదర్శనము—

"ఆదిపర్వమున కర్ణుడు సద్యోగర్భజనితుడుగా వర్ణింపబడినాడు. ఆగాథ అచట నిష్ప్రశ్నముగా జెప్పబడియున్నది. అరణ్యపర్వాంతమున జనమేజయుని ప్రశ్నకు వైశంపాయనుడు కర్ణవృత్తాంతము జెప్పుచు కర్ణుని గుంతి పదిమాసములు గూఢముగా మోసి కనినది యని చెప్పియున్నాడు, కర్ణుని గాథను నన్నయభట్టవరాప్రగ్గడకవులు యథామాతృకముగానే యాంధ్రీకరించియున్నారు" (పు54)

ఆదిపర్వమున, సద్యోగర్భజనితుడుగా వర్ణింపబడలేదు. చూడుడు—

"మత్ప్రసాదా న్న తే రాజ్ఞి భవితా దోష ఇత్యుత ।
ప్రకాశకర్తా తపన స్సంబభూవ తయా సహ ॥
తత్ర వీర స్సమభవ త్సర్వశస్త్రభృతాం వరః ।

ఆముక్తకవచ శ్శ్రీమాన్ దేవగర్భ శ్శ్రియాన్వితః।
సహజం కవచం బిభ్ర త్కుండలోద్యోతితాననః।
అజాయత సుతః కర్ణ స్సర్వలోకేషు విశ్రుతః॥"

ఇచ్చట సూర్యసంబంధనిమిత్తమున జన్మించినట్లు మాత్రమే వర్ణింపబడెను సద్యోగర్భజనితుడు గాలేదు ఈగాధ ప్రతివాదు లన్నట్లు నిష్ప్రశ్నముగా జెప్పబడలేదు సంభవపర్వగాధలను వినుచున్న జనమేజయుడు —

"భగవన్ శ్రోతు మిచ్ఛామి పూరో ర్వంశకరా న్నృపాన్"

అని ప్రశ్నింప పురువంశ్యులను జెప్పుకొని వచ్చుచు ధృతరాష్ట్రాదుల జన్మములు చెప్పి పాండురాజవివాహప్రసంగములో కుంతీ చరిత్రములో జెప్పబడిన యీగాధ నిష్ప్రశ్నముగా గాక సప్రశ్నముగనే చెప్పబడినది.

ఈగాధను నన్నయభట్టు యథామాతృకముగానే యాంధ్రీకరించియుండెనట. ఆంధ్రభారత మిట్లున్నది.

"సూర్యుండు దానికి గరుణించి నీకు సద్యోగర్భంబున బుత్రుడుద్భవిల్లు నీకన్యాత్వంబు దూషితంబు గా దోడకుండు మని వరం బిచ్చిన దత్క్షణంబ యక్కన్యకకు నంశుమంతు నంశంబునం గానీనుండై ...... సుపుత్రుడు గర్ణుడు పుట్టె"

ఇది యథామాతృకముగా, లేదని విశద మగుచునే యున్నది. ఇక వనపర్వములో కర్ణోత్పత్తివృత్తాంత మిట్లున్నది —

"తతో గర్భ స్సమభవ త్పృథాయాః పృథివీపతే!
శుక్లే దశోత్తరే పక్షే తారాపతి రివాంబరే॥"

వ్యా॥ దశోత్తరే-పకాదశే; శుక్లేపక్షే ప్రతిపది చంద్ర ఇవ ఉద్భూతః.

మాఘశుక్లప్రతిపది కర్ణనిషేకజన్మేత్యర్థః॥

"సా బాంధవభయా ద్బాలా గర్భం తం వినిగూహతీ।
ధారయామాస సుశ్రోణీ న చైనాం బుబుధే జనః॥
నహి తాం వేద నార్యన్యా కాచి ద్ధాత్రేయికా మృతే।
కన్యాపురగతాం బాలాం నిపుణాం పరిరక్షణే॥
తతః కాలేన సా గర్భం సుషువే వరవర్ణినీ।
కన్యైవ తస్య దేవస్య ప్రసాదా దమరప్రభమ్॥"

దీనికాంధ్రభారతము—

"సూర్యుండు...గగనంబున కరిగె నంత బూర్వపక్షంబున చంద్రుండునుం బోలె గర్భంబున గ్రమంబున బ్రవర్ధనంబు నొందుచు గర్భం బభివ్యక్తం బయ్యెను బ్రభాకరు మహిమం జేసి లోకవిదితంబు గాకుండెం దత్ప్రకారంబు దాదికూతు రొక్కతియ యెఱుంగు నిట్లు వర్ధిల్లుచుం బదియగు మాసంబున నొక్కనాటి నిశాసమయంబునం గన్యాంతఃపురంబునందు, కొడుకుం గనియె"

ఈగ్రంథము మాత్రము యథామాతృక మనవచ్చును సంస్కృతభారతములో సంభవపర్వమున కర్ణుని యుత్పత్తి మాత్రము చెప్పబడి వనపర్వములో విపులముగా గర్భధారణగోపనసకాలప్రసవాదులు చెప్పబడినవి. కనుక సంస్కృతభారతములో సందర్భశుద్ధి కేమియు లోపము లేదు. ఆంధ్రభారతమందు విరోధముగోచరింప నది యథామాతృకముగానే యాంధ్రీకరింపబడిన దని నిర్దుష్టమగు సంస్కృతభారతముమీద దోష మాపాదింప బూనుట మంచిపని కాదు. పాఠభేదములను జూపెడి కుంభకోణపుప్రతి కూడ నీవిషయమై పాఠభేదమును చూపలేదు. ఇక వారి మూడవ నిదర్శనము—

"అరణ్యపర్వమున రామాయణగాథ కలదు. అందు కుంభకర్ణుని లక్ష్మణస్వామి వధించినట్లు గలదు, ఇది సంస్కృతము ననుసరించియే యాంధ్రీకరింపబడి యున్నది. లక్ష్మణస్వామి కుంభకర్ణుని జంపుట రామాయణగాథాప్రతిపాదకములగు గ్రంథములలో చెప్పుటను గానము" (పు. ౫౭)

ఈరామాయణగాథ అరణ్యవాసము చేయు పాండవులు కామ్యకవనమం దుండగా దర్శన మిచ్చిన మార్కండేయమహర్షి ధర్మజునకు చెప్పినది. ఇందు వాల్మీకిరామాయణగాథకంటె విలక్షణముగా గొన్ని విషయము లున్నవి. మార్కండేయమహర్షిచే జెప్పబడిన ఆ గాథ కల్పాంతరగాథ యనుకొనవలెను కాని యది యసందర్భపుగాథ యనుకొనుట మతిమంతులకు దగదు.

'కల్పభేదం సమాదాయ కథాభేదం జగాదహ ।
థీదోషకల్పనం చాత్ర సర్వజ్ఞేనహి సంభవేత్ ॥"

అను స్కాందవచనము సర్వజ్ఞుడగు వ్యాసమహర్షికి బుద్ధిప్రమాదదోషమును కల్పింపరాదు. కల్పభేదమును బట్టి వచ్చిన కథాభేదములనే మహర్షి బోధించెను. అని తెలుపుచున్నందున వేదవ్యాసుని మహాభారతమందున్న ఆకథాభేదములు సందర్భశుద్ధి లేకున్నవనుట పొరపాటు.

తాను చెప్పిన యారామోపాఖ్యానము కల్పాంతరగాథ యని మార్కండేయమహర్షియే చెప్పెను. ఆప్రసంగ మేమనగా.

పాండవులు మహాప్రస్థానము జేయుటకు ముందు ధర్మజుడు పరీక్షిత్తును రాజ్యాభిషిక్తుని జేసి యాదవులకు జెందియున్న వజ్రుని యింద్రప్రస్థరాజ్యమునకు రాజును చేసి—

'దుఃఖార్త శ్చాబ్రవీ ద్రాజా సుభద్రాం పాండవాగ్రజః ।
ఏష పుత్రస్య పుత్రస్తే కురురాజో భవిష్యతి ॥
యదూనాం పరిశేషశ్చ వజ్రో రాజా కృతశ్చహ ।
పరీక్షి ద్ధాస్తినపురే శక్రప్రస్థే చ యాదవః ॥
వజ్రో రాజా త్వయా రక్ష్యో మాచాధర్మే మనః కృథాః ।''

టీ॥ అధర్మే=పరీక్షిద్వజ్రయో ర్వ్యాయో రరక్షణజే; మహాప్రస్థాన మియం మాకుర్యా దితి భావః॥

సుభద్రతో నీపౌత్రు డగు పరీక్షిత్తును, వజ్రుని, రక్షించుచుండుము. మహాప్రస్థానముచేయవద్దని చెప్పి వెళ్ళినతరువాత నొకప్పుడు వజ్రుడు మార్కండేయమహర్షివలన విష్ణుధర్మములు తెలిసికొను సందర్భమున కల్పములను గూర్చిన ప్రసంగములో కల్పములకు సాదృశ్యము భేదము కూడగలదని చెప్పబడినపుడు వజ్రు డిట్లు ప్రశ్నించెను. విష్ణుధర్మోత్తరము—అ 81.

''కల్పానాం సతి సాదృశ్యే యో భేదో భృగునందన ।
త మహం శ్రోతు మిచ్ఛామి తత్ర మే కౌతుకం మహత్ ॥''

మార్కండేయః—

''కల్పానాం సతి సాదృశ్యే శృణు భేదం నరాధిప ।
సమతీతే యథా కల్పే షష్ఠే మన్వంతరే గతే ॥
సప్తమస్య చతుర్వింశే రాజం స్త్రేతాయుగే తదా ।
యదా రామేణ సమరే సగణో రావణో హతః ॥
లక్ష్మణేన తథా రాజన్ కుంభకర్ణో నిపాతితః ।
వర్తమానే తథా కల్పే షష్ఠే మన్వంతరే గతే ॥
తస్యైవ చ చతుర్వింశే రాజం స్త్రేతాయుగే తదా ।

యదా రామేణ సమరే సగణో రావణో హతః।
రామే నైవ తదా రాజన్ కుంభకర్ణో నిపాతితః।
వర్తమానేతు యద్వృత్తం కల్పే యమకులోద్వహ।
రామస్య చరితం బద్ధం తదా వాల్మీకినా శుభమ్।
అతీతకల్పే యద్వృత్తం మయా తత్కామ్యకే వనే।
యుధిష్ఠిరాయ కథితం ధర్మపుత్రాయ పార్థివ।
కల్పానాం సతి సాదృశ్యే భేద ఏష తవోదితః।
సాదృశ్య భేదా విహా భూమిపాల కల్పస్య కల్పస్య మయోదితా స్తే।''

అనగా సదృశములైన కల్పములకు భేద మెట్టిదో వినగోరుచు చున్నాను. అని ప్రశ్నించినపుడు మార్కండేయమహర్షి యిట్లు చెప్పెను. గడచిన కల్పములో వైవస్వతమన్వంతరములోని 24వ త్రేతాయుగమందు శ్రీరామునిచే రావణసంహారము చేయబడి నపుడు కుంభకర్ణుని లక్ష్మణుడు వధించెను. ఈకల్పములో వైవస్వతమన్వంతరములోని 24వ త్రేతాయుగమందు శ్రీరాముడు రావణసంహారము చేసి నపుడు కుంభకర్ణుని శ్రీరాముడే సంహరించెను. ఈకల్పమందలి రామ చరిత్రమునే వాల్మీకిమహర్షి గ్రంథముగా రచించెను. గడచిన కల్పములో నేమిజరిగెనో దానిని నేను ధర్మజునకు కామ్యకవనమం దున్నపుడు చెప్పియుంటిని. ఈవిధముగనే ఒకకల్పమునకు మరొకకల్పముతో సాదృశ్యము' భేదము కలిగియుండును. అని.

దీనిని బట్టి ధర్మజునకు కామ్యకవనమందు చెప్పిన మహాభారత గతరామోపాఖ్యానము గతకల్పవృత్తాంత మనియు, నప్పుడు లక్ష్మణుని చేతనే కుంభకర్ణుడు వధింపబడె ననియు నాధర్మజున కాకథ జెప్పిన మార్కండేయమహర్షియే చెప్పుటచేరి నారామోపాఖ్యానమందు సందర్భశుద్ధి కెంతమాత్రము లోపము లేదని ప్రతివాదులు గ్రహింతురుగాక.

మహాభారతరహస్యకర్తలు వ్రాయుటలో—

'మహాభారతగ్రంథకారుడు రామాయణగాథను తన గ్రంథమునం దుదహరించుచు లక్ష్మణునిచే కుంభకర్ణుడు వధింపబడె నని వ్రాసియున్నాడు... అచ్చట శ్రీరామచరిత్రకు ప్రధాన గ్రంథము వాల్మీకిరామాయణముగాని మహాభారతము కాదు. శ్రీరామచరితోదాహరణముచే ధర్మజుని దుఃఖోపశమనమే మహాభారతగ్రంథకారునకు ప్రయోజనము కాని కథాప్రాధాన్యము కాదు' (పు. 3) అని సరిపుచ్చినారు.

ఈవజ్రిమార్కండేయసంవాదమునుబట్టి కల్పాంతరశ్రీరామచరిత్రకథనముచే మహాభారతము రామోపాఖ్యానములో కథాప్రాధాన్యము కలదే యని గ్రహింపవలెను.

దీనిచే 'ఇట్టి యసందర్భములు మహాభారతమున చెక్కులు కలవు. కాని గ్రంథవిస్తరభీతిచే వ్రాయలేదు' (పు.56) అను మ. భా. చ. కారుల వ్రాత ప్రత్యుక్తమైంది గ్రంథవిస్తరభీతిచేతనే ప్రధానముగా కొన్నింటికి మాత్రమే సమాధానములు చెప్పి మిగిలినవి విడువబడుచున్నవి.

మహాభారతమీమాంసాకారుల వ్రాత యిట్లున్నది—

'సౌతి విషయమున విచారము చేయు నపుడు ఈవిషయమై ధ్యాన ముంచవలెను. ఏది యనగా సూతులు తరచు కథలను జదివెడు పని చేయుచుండెడివారు. అట్లయ్యును లోమహర్షణునికి పుత్రుడగు నుగ్రశ్రవుని సౌతి యనుటకు గారణమేమియు నగపడదు. ఎందుచేత ననగా సూతశబ్దము జాతివాచకనామమై యున్నది. సూతుడు శౌనకునికి ననేక కథలను వినిపించె నని గూడ బురాణముల యందు నున్నది''

వీరి యాక్షేప మేమనగా, మహాభారతమున శౌనకాదుల కుప దేశించువాడు సౌతి సౌతి యని చెప్పబడుచుండెను. సౌతి యను పద ము సూతశబ్దమునుండియే నిష్పన్న మగును. సూతశబ్దము జాతివాచ కము. సూతజాతీయులకు కథలు చెప్పుచుండుట వృత్తి. ఇట్టి స్థితిలో రోమహర్షణు డనబడు సూతుని పుత్రుడగు నుగ్రశ్రవుని కూడ సూతు డనియే చెప్పక, సౌతి యని చెప్పుటకు కారణము కనబడదు. అని.

దీనిని పరిశీలింతము. సౌతిశబ్దప్రయోగౌచిత్యము– మహాభారత మందిట్లున్నది—

> "లోమహర్షణపుత్ర ఉగ్రశ్రవా స్సౌతిః పౌరాణికో నైమిశార ణ్యే శౌనకస్య కులపతే ర్ద్వాదశవార్షికే సత్రే ఋషీ నభ్యాగ తా నుపతస్థే, పౌరాణికః పురాణే కృతశ్రమ స్స కృతాంజలి స్తా నువాచ"

నీ॥ టీ॥ పౌరాణికః పురాణం పణ్యం జీవికాఽస్యేతి వ్యుత్పత్తిం నిరా కరోతి పురాణే కృతశ్రమ ఇతి. అత్ర "బ్రాహ్మణ్యాం క్షత్రియా త్సూతః" ఇతి స్మృత్యుక్తో విలోమజో జాతిసూత స్సంజయాఽధిరథాది రన్యః, యస్య జీవికా, సారథ్యం పురాణరాజ్ఞాం శౌర్యౌదార్యాదివర్ణ నేన స్వామిప్రోత్సాహనంచ, అతఏవాస్య పౌరాణిక ఇతి సంజ్ఞా, ఉగ్ర శ్రవాస్తు సౌతిరేవ న జాతిసూతః తథాత్వే తత్రాపి సూతశబ్దప్ర యోగోపపత్తే స్సౌతి రిత్యపత్యార్థస్య తద్ధిత స్యానర్థక్యం స్యాత్.

కింత్వార్తి "అగ్నికుండసముద్భూత సూత నిర్మలమానస' ఇతి రోమహర్షణం ప్రతి శౌనకవచనస్య పురాణాన్తరే దర్శనా దగ్నిజో రోమహర్షణః, తస్యచ బ్రాహ్మణసంకల్పా ద్బ్రహ్మసనార్హత్వం, ధృ ష్టద్యుమ్నస్య క్షత్రియత్వవత్, బ్రహ్మసనంచ వైశంపాయనశాంత వ్రత మార్కండేయాదితుల్య సజాతీయఏవార్హతి న హీనః, నహి

మహాంత శ్శౌనకాదయో హీనా త్పరం రహస్యం జగృహు రితి వక్తుం యుక్తం 'నహీనతః పర మభ్యాదదీత' ఇత్యత్రైవ తన్నిషేధాత్, 'సీ చా దప్యుత్తమా విద్యా గ్రాహ్యా' ఇతితు ఆపద్విషయ మేతత్. అత ఏవ తద్వధా ద్బలరామేణ బ్రహ్మహత్యావ్రతం చీర్ణమితి స్మర్యతే.

తత్ర సూతశబ్దస్తు కథాప్రవక్తృత్వసామ్యాత్. పౌరాణికపదం న జాతిసూతపర మపితు పురాణాధ్యేతృబ్రాహ్మణపర మితి।

అనగా సూతశబ్దము జాతివిశేషవాచక మొకటి, వ్యక్తివిశేష వాచక మొకటి అందు సంజయుని అధిరథుని (కర్ణుని పెంచినవాని) చెప్పునది జాతివాచకము. అనగా అట్టివారు జాతిసూతులు. వారికి సారథ్యము చేయుట, పురాణరాజుల శౌర్యౌదార్యములను వర్ణించుచు ప్రభువులను ప్రోత్సహించుట వృత్తి. అట్టివానికి పురాణము జీవికగా కలవాడు కనుక పౌరాణికు డని సంజ్ఞ. ఉగ్రశ్రవుడు సౌతియే (సూత పుత్రుడే) కాని సంజయాదులవలె జాతిసూతుడు కాడు. ఏమనగా నీయుగ్రశ్రవుని తండ్రిని చెప్పు సూతశబ్దము వ్యక్తివిశేషవాచకము గాని జాతివాచకము కాదు. అదిజాతివాచకమే యైన యెడల 'కాకా జ్జాతః కాకః' అను న్యాయమున సూతపుత్రుడు కూడ సూతుడే కావలసియుండుటచే సౌతి యనబడకపోవును. ఇక నీసూతుని విషయ మేమనగా కాశీఖండములో 'అగ్నికుండసముద్భూత సూత నిర్మలమానస' అనుచు శౌనకుడు సూతుని అగ్నికుండసముద్భూత! అని సంబోధించుటవలన రోమహర్షణు డనబడు సూతుడు అగ్నికుండ సముద్భూతుడు ధృష్టద్యుమ్నునకు క్షత్రియత్వమువలె అగ్నికుండ సముద్భూతునకు బ్రాహ్మణసంకల్పవిశేషమున బహ్మాసనార్హత. అట్టి యర్హత, వైశంపాయనశాంతవ్రతమార్కండేయాదితుల్యుడైన తత్స జాతీయునకే కలుగును కాని హీనునకు గలుగదు. మహనీయులైన

శౌనకాదులు ఎవ్వని వల్లనో పరమరహస్యములు గ్రహించినా రనుట యుక్తము కాదు.

కనుకనే అట్టి సూతుని వధించిన బలరాముకు బ్రహ్మహత్యా ప్రాయశ్చిత్తము చేసికొనునట్లు చెప్పబడినది. అట్టివానిని సూతుడనివాకుట, జాతిసూతునియందు వలె కథాప్రవచనధర్మ మాతని యందుండుటను బట్టి కలిగినది ఆతనియందు పౌరాణికపదప్రయోగము పురాణాధ్యయనమును బట్టియే. కనుకనే 'పురాణే కృతశ్రమః' అని పౌరాణికశబ్దవివరణము మూలమందే చేయబడినది అని భావము.

విమర్శకమార్గమునకును, విద్వన్మార్గమునకును ఇట్టి యంతరమున్నది. విమర్శకులు సూతుడని చెప్పవలసియుండ సౌతి యనుట యుక్తముగా లేదని యాక్షేపమాత్రముతో విడిచివేసిరి.

ఇక విద్వాంసులు, సూతుడనవలసియుండగా సౌతియనుటను బట్టి యీసూతశబ్దము జాతివాచకము కాదుకనుకనే ఆత డయోనిజుడనియు, వహ్నికుండసముద్భూతు డనియు గ్రంథాంతరములు చెప్పుచున్నవి అని భావించి వచనాంతరసంవాదములతో సౌతిశబ్దప్రయోగతాత్పర్యము విశదీకరించియున్నారు ఇట్లుచూడ శౌనకాదులకు పురాణప్రవచనము చేసిన లోమహర్షణు డనబడు సూతుడు జాతిసూతుడు కాడు కనుకనే యాతని పుత్రుడును శౌనకాదులకు భారతప్రవచనము చేసినవాడును అగు నుగ్రశ్రవుడు సూతు డనబడక సౌతి యనబడెను. అని తేలినది

ఈయంశములో గ్రంథాంతరములు చూతము.

—◆ కౌటిల్యార్థశాస్త్రోపోద్ఘాతగ్రంథము ◆—

"కౌటిల్య స్తావ దర్థశాస్త్రస్య చతుష్షష్టితమాధ్యాయే ప్రతిలోమజవృత్తిప్రస్తావే—వైశ్యాత్ క్షత్రియాయాం జాతో మాగధః, క్ష

త్రియాత్ బ్రాహ్మణ్యాం జాత స్సూతః, ఇత్యుక్త్వా పృథుయజ్ఞభూమ్యుత్పన్నస్య, పౌరాణికస్య, సూతాఖ్యస్య, మాగధాఖ్యస్యచ పృథుస్తుతివిధాయినః ప్రతిలోమజత్వశంకాప్రాప్తిం మనసి కుర్వం స్తాం

పరిహరతి''—

"పౌరాణిక స్తథాన్య స్సూతో మాగధశ్చ బ్రహ్మక్షత్ర ద్విశేషతః'' అస్యార్థః-పురాణప్రవక్తా రోమహర్షణాపరనామా య స్సూత స్సోఽన్యః. ఉక్తా త్ప్రతిలోమజసూతా ద్భిన్నః. య స్తత్సహపఠితః పురాణేషు మాగధో నామ సచ ప్రతిలోమజమాగధా ద్భిన్నః 'బ్రహ్మక్షత్ర ద్విశేషతః' విశేషేణ యుక్తః సూతో బ్రాహ్మణా ద్విశిష్టః. మాగధః క్షత్రియా ద్విశిష్ట ఇతి. తథ్యంచైతత్-

యతః—

"హస్తేతు దక్షిణే తస్య దృష్ట్వా చక్రం పితామహః ।
విష్ణో రంశం పృథుం మత్వా పరితోషం పరం యయౌ ॥
తస్యైవ జాతమాత్రస్య యజ్ఞే పైతామహే శుభే ।
సూత స్సూత్యాం సముత్పన్న స్సౌత్యేఽహని మహామతే॥
తస్మిన్నేవ మహాయజ్ఞే జజ్ఞే ప్రాజ్ఞోథ మాగధః ।''

ఇతి విష్ణుపురాణప్రథమాంశత్రయోదశాధ్యాయే,

"బ్రహ్మణః పౌష్కరే యజ్ఞే సుత్యాహే వితతే సతి ।
పృషదాజ్యా త్సముత్పన్న స్సూతః పౌరాణికో ద్విజః ॥
వక్తా వేదాదిశాస్త్రాణాం త్రికాలామలధర్మవిత్ ।''

ఇత్యగ్నిపురాణ ప్రథమాధ్యాయే,

"త్వయా సూత మహాబుద్ధే భగవాన్ బ్రహ్మవిత్తమః ।
ఇతిహాసపురాణార్థం వ్యాస స్సమ్య గుపాసితః ॥

త్వం హి స్వాయంభువే యజ్ఞే సుత్యాహే వితతే సతి।
సంభూత స్సంహితాం వక్తుం స్వాంశేన పురుషోత్తమః॥"

ఇతి కౌర్మపురాణప్రథమాధ్యాయేచ వ్యాసశిష్యపౌరాణికసూత స్యాయోనిత ఏవోత్పత్తిః ప్రతిలోమసూతవిలక్షణా కథ్యతే. తథా తస్య ద్విజత్వంచ విష్ణ్వంశసంభూతత్వంచ వర్ణ్యత ఇతి.

ఈగ్రంథముకూడ, కౌటిల్యార్థశాస్త్రమును బట్టియు, విష్ణుపురాణాగ్నిపురాణకూర్మపురాణవచనములను బట్టియు వ్యాసశిష్యుడైన పౌరాణికసూతుడు అయోనిసంభూతుడనియు, ద్విజుడనియు, విష్ణ్వంశ సంజాతుడనియు, జాతిసూతుడుకాడనియు జెప్పబడె నని తెలుపు చున్నది.

మహాభారతటీక. నీలకంఠీయము—

"సూతోత్పత్తి రుక్తా వాయుపురాణే—
వైన్యస్య తు పృథో ర్యజ్ఞే వర్తమానే మహాత్మనః।
సుత్యాయా మభవ త్సూతః ప్రథమం వర్ణవైకృతమ్॥
ఐంద్రేణ హవిషా తత్ర హవిః పృక్తం బృహస్పతేః।
జుహా వేంద్రాయ దైవేన తత స్సూతో వ్యజాయత॥
శిష్యహవ్యేన సంపృక్త మభిభూతం గురో ర్హవిః।
అధరోత్తరచారేణ జజ్ఞే తద్వర్ణవైకృతమ్॥"

ఇతి వర్ణవైకృతమితి "బ్రాహ్మణ్యాంక్షత్రియాత్సూతః" ఇతి యాజ్ఞవల్క్యోక్తం విలోమజత్వమ్"

అనగా, పృథుచక్రవర్తి యజ్ఞము జరుగుచున్నపుడు ఇంద్రదేవతాకమైన హవిస్సుతో— బృహస్పతిదేవతాకమైన హవిస్సు సంకీర్ణము కాగా నది దైవికముగా నింద్రు నుద్దేశించి హోమము చేయబడినది.

దానివలన సూతుడు జన్మించెను. శిష్యుడగు నిందుని హవిస్సుతో గురువగు బృహస్పతి హవిస్సు సంకీర్ణమై అభిభూతమైనది. ఆఅధరోత్తరభావముచేత విలోమజత్వ మేర్పడినది. అని భావము.

దీనిని బట్టి అక్కడక్కడ విలోమజుడనియు, ప్రతిలోమజుడనియు సూతుని వాడుటకు గారణము చరునిక్షేపవైపరీత్యమే కాని, వేరొకటి కాదనియు నాసూతు డయోనిజుడే యనియు స్పష్టము.

ఇక శ్రీమద్భాగవతములో బ్రహ్మాసనాసీనుడై శౌనకాది మహర్షులకు బోధించుచున్న సూతుని జూచి బలరామస్వామి కోపించి వధించెననియు, మహర్షులు చెప్పిన మాటలపై బ్రహ్మహత్యాప్రాయశ్చిత్తము చేసికొనె ననియు నున్న గాథలో బలరాముడు సూతుని ప్రతిలోమజు డనియు, బ్రహ్మాసనానర్హుడనియు భావించినట్లున్నది.

ఆగ్రంథమును గూడ పరిశీలింతము—

"తమాగత మభిప్రేత్య మునయో దీర్ఘసత్రిణః ।
అభినంద్య యథాన్యాయం ప్రణమ్యోత్థాయ చార్చయన్ ॥
సోఽర్చిత స్సపరీవారకృతాసనపరిగ్రహః ।
రోమహర్షణ మాసీనం మహర్షే శ్శిష్య మైక్షత ॥
అప్రత్యుత్థాయినం సూత మకృతప్రహ్వాణాంజలిమ్ ।
అధ్యాసీనం చ తా న్విప్రాం శ్చుకోపోద్వీక్ష్య మాధవః ॥"

శ్రీధరీయమ్— అధ్యాసీనంచ తాన్ తేభ్యోఽప్యుచ్చై రాసీన మిత్యర్థః"

"కస్మా దసా విమా న్విప్రా నధ్యాస్తే ప్రతిలోమజః ।
ధర్మపాలాం స్తథైవాస్మా న్వధ మర్హతి దుర్మతిః ॥"

వంశీధరీయమ్— "తస్య అగ్నికుండోద్భూతత్వేన జాతిసూతత్వా

భావేఽపి చయనిక్యేవైపరీత్యాత్ ప్రతిలోమజత్వోక్తిః. అన్యః కశ్చి త్ప్రతిలోమజః విప్రా మాభ్యస్తామ్... అన్యథా—

"విప్రో వక్తా సుధీః శాస్త్రీ విశుద్ధోభృగువంశజః ।
ఇతిహాసపురాణానాం విప్రక్యో ధర్మపాఠకృత్ ॥"

ఇతి సంహితోక్తి రసమంజసా స్యాత్. కించ నాయం జాతిసూ దః ఇతి జ్ఞాత్వా నివృత్తేఽపి భగవతి భావిత్వా త్తద్వధో జాతః. అత ఏవ తస్య ప్రాయశ్చిత్తే ప్రవృత్తిః ॥"

'ఋషే ర్భగవతో భూత్వా శిష్యోఽధీత్య బహూనిచ ।
సేతిహాసపురాణాని ధర్మశాస్త్రాణి సర్వశః ॥
అదాన్త స్యావినీతస్య వృథాపండితమానినః ॥
న గుణాయ భవన్తి స్మ నట స్యేవాజితాత్మనః ॥
ఏతదర్థోహి లోకేఽస్మి న్నవతారో మయా కృతః ।
వధ్యా మేధర్మధ్వజిన స్తేహి పాతకినోఽధికాః ॥
ఏతావ దుక్త్వా భగవా న్నివృత్తోఽ సద్వధా దపి ।
భావిత్వా త్తం కుశాగ్రేణ కరస్థె నాహన త్ప్రభుః ॥
హాహేతివాదిన స్సర్వే మునయః ఖిన్నమానసాః ।
ఊచు స్సంకర్షణం దేవ మధర్మస్తే కృతః ప్రభో ॥
అస్య బ్రహ్మాసనం దత్త మస్మాభి ర్యదునందన ।
ఆయు శ్చాత్మాక్లమం తావ ద్యావ త్సత్రం సమాప్యతే ॥"

శ్రీధరీయమ్— అధార్మికప్రతిలోమజవధః కోఽయ మధర్మ ఇతి చే త్తత్రాహుః- అస్యేతి'

వంశీధరీయమ్— అధార్మికేత్యాదిభగవదాక్షేపం సమాదధిరే— అస్య, సూతస్య, 'అగ్ని ర్వై బ్రాహ్మణ' ఇతి శ్రుతే స్తదుద్భూతత్వా

దయం బ్రాహ్మణ ఏవ అతఏవ! 'బ్రహ్మాసనం' వేదేతిహాసపురాణవక్తృ బ్రాహ్మణయోగ్యాసనం తత్ర మితి.

శ్రీధరీయమ్— పురాణప్రవచనాయ ఆత్మనః—శరీరస్య నాస్తి క్లమో (గ్లానిః) యస్మిం స్తదాయుశ్చ తత్ర మితి॥

'అజానతేవాచరిత స్త్వయా బ్రహ్మవధో యథా ।
యోగేశ్వరస్య భవతో నాఽఽమ్నాయోఽపి నియామకః ॥'

శ్రీధరీయమ్— బ్రహ్మవధేఽపి కిం మహేశ్వరస్యేతి చే త్సత్యమేవ తథాపి ప్రాయశ్చిత్తం కర్తవ్య మేవే త్యాశయే నాహుః. యోగేశ్వర స్యేతి సార్థేన ఆమ్నాయః బ్రాహ్మణో న హంతవ్య ఇత్యాదిలక్షణః।

వంశీధరీయమ్— అజానతేవ, ఇవ యథాశబ్దాభ్యాం జానతైవ బ్రహ్మవధః కృత ఇతి ప్రతీయత ఇత్యాహ— బ్రహ్మవధేఽపీతి—

"య ద్యేత ద్బ్రహ్మహత్యాయాః పావనం లోకపావన ।
చరిష్యతి భవాన్ లోకసంగ్రహోఽనన్యచోదితః ॥"

శ్రీధరీయమ్— తథా ప్యేతస్యా బ్రహ్మహత్యాయాః పావనం ప్రాయశ్చిత్తం హే లోకపావన అనన్యచోదితః స్వయమేవ భవాన్ యది కరిష్యతి తర్హి లోకసంగ్రహో భవిష్యతి నాన్యథేతి ॥
శ్రీభగవానువాచ—

"కరిష్యే వధనిర్వేశం లోకానుగ్రహకామ్యయా ।
నియమః ప్రథమే కల్పే యావాన్ సతు విధీయతామ్ ॥"

ఇచ్చట బలరామస్వామి వచ్చునప్పటికి ఋషులందరు దిగ్గున లేచి ప్రణామపూర్వకముగా బూజించి యుచితాసనాసీనుని జేయ నట్లు కూర్చుండి తనను జూచి లేచుటగాని నమస్కరించుట గాని,

**విధేయత** జూపుట గాని లేక నైమిశారణ్యఋషులకంటె నున్నతాసన **మందు** గూర్చుండిన సూతుని జూచి క్రుద్ధుడై ఋషులను, ధర్మపాలకుల **మైన** మమ్ములను అలక్ష్యముచేసి ప్రాతిలోమజుడు ఇట్లు కూర్చుం డునా? ఈతడు వ్యాసునివద్ద సకల ఇతిహాసపురాణధర్మశాస్త్ర **ములను** జదివి వినయశిక్షణలేని పండితమ్మన్యాభిమానముగల యీ **తని** లక్షణములు నటునికి సరిపోవుచున్నవి. అని చెప్పుచు నిది కూడని పని యని చింతింపక భవితవ్యబలమున కుశాగ్రముచే సూతుని వధించెను తరువాత ఋషులు హాహాకారములు చేసిరి. బలరామస్వామి బ్రహ్మహత్యాప్రాయశ్చిత్తము చేసికొనెను. అని చెప్పబడినది.

ప్రత్యుత్థానాభివాదనములు ఋషులు తనకు జేయుటయు సూ తుడు చేయక యున్నతాసనమందు గూర్చుండుటయు జూచినతోడనే క్రుద్ధుడగుటయు, భవితవ్యబలముచేతను సంభవింప సూతుని గుణములు దోషములుగా గోచరించుటవలన అహంకారియనియు, నవి నీతు డనియు, పండితమ్మన్యాభిమాని యనియు నన్నట్లే సూతుని ప్రతి లోమజు డని కూడ సూతజాతివాచకసూతశబ్దసాదృశ్యమును బట్టియే యని యుండెను నిజమైన ప్రాతిలోమజుడే యైన యెడల ఋషులట్టి బ్రహ్మాసన మిచ్చుటయే అసంభవము. కనుక నీబలరామవాక్యము లోని ప్రతిలోమజశబ్దము చమునిషేధనైమిత్తికమగుటచే బు రాణప్రవక్త యగు సూతుడు సూతజాతీయుడు కాడనియే నిర్ణయము. మఱియు సూతజన్మలక్షణము లిట్లు చెప్పబడినవి—

పద్మపురాణము—భూమిఖండము—అ. 27

"తస్మిన్ శాసతి దుర్ధర్షే రాజరాజే నృపాత్మజే।
ఏతస్మిన్నన్తరే కాలే యజ్ఞే పైతామహే శుభే॥

సూత స్యాత్మాం సముత్పన్న స్స్వాయమ్భువ హాని మహామతిః ।
తస్మిన్నేవ మహాయజ్ఞే జజ్ఞే ప్రాజ్ఞోఽథ మాగధః ॥
సూతస్య లక్షణం వక్ష్యే మహాపుణ్యాం ద్విజోత్తమాః ।
శిఖాసూత్రేణ సంయుక్తః స్తోత్రా (వేదా) ధ్యయనతత్పరః ॥
సర్వశాస్త్రార్థవేత్తాఽసా వగ్నిహోత్ర ముపాసతే ।
దానాధ్యయనసంయుక్తో బ్రహ్మచారపరాయణః ॥
దేవానాం బ్రాహ్మణానాంచ పూజనాభిరత స్సదా ।
యాజక స్స్వసక్తైః పుణ్యై ర్వేదమన్త్రై ర్యజే త్త్రికాల ॥
సదాచారపరో నిత్యం సంభోజ్యో బాహ్మణై స్సహ ।
ఏవంహి మాగధో జజ్ఞే వేదాధ్యయనవర్జితః ॥"

ఈగ్రంథసందర్భమును బట్టి కూడ పురాణప్రవక్తయైన సూతుడు అయోనిజు డనియు, బ్రహ్మసనాన్వత కల విప్రు డనియు, సూత జాతీయుడు కాడనియు ధ్రువ మగుచున్నది. ఇట్లు సూతజాతీయుడు కానట్టి సూతుని పుత్రుడు సూతుడు కానేరడు కనుక నాసూతపుత్రు డగు నుగ్రశ్రవుని గూర్చి మహాభారతములో సౌతిసౌతి యనియే వాడబడెను. కనుక మ. భా. మీ. కారుల ఆక్షేపము పరాస్తము. ఇట్లు గ్రంథాంతరములను విద్వద్వ్యాఖ్యానములను, పరిశీలించిన కొలది సామాన్యముగా గలిగెడి శంకలకు సమాధానములు దొరకుచునే యుండును. కనుక బహుగ్రంథదర్శన మపేక్షితము. ఆగ్రంథము లన్నియు శాస్త్రసంప్రదాయానుబద్ధము లగుటచే శాస్త్రజ్ఞాన మావశ్యకము. ఆశాస్త్రజ్ఞానమునకై దైవభక్తి గురుశుశ్రూష ప్రధానములు. కనుకనే—

"యస్య దేవే పరా భక్తి ర్యథా దేవే తథా గురౌ ।
తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః ॥"

దేవునియందు గురువునందు పరమభక్తి యెవ్వని కుండునో ఆమహానీయునకే చెప్పబడిన విషయములు చక్కగా ప్రకాశించును. అదిలేనివానికి అందలి తత్త్వము మరుగుపడియే యుండును, అని బోధింపబడినది. ఆర్షగ్రంథతత్త్వము దెలిసికొనుట కింత కష్టమున్నది. మరియు, ఆర్షసంప్రదాయగ్రంథముల గమనిక వేరు. అనార్షసంప్రదాయగ్రంథముల గమనిక వేరు. ఆర్షసంప్రదాయగ్రంథములలో మంత్రశక్తులు, అణిమాదియోగసిద్ధులు, తపః ప్రభావములు, శాపానుగ్రహసామర్థ్యములు, పాతివ్రత్యమహిమలు, దేవతాసాక్షాత్కారములు, వరప్రభావములు, దివ్యదృష్టులు, త్రికాలజ్ఞానములు మొదలగు శాస్త్రసిద్ధవిషయములు అనితరసాధారణములై తాండవించుచుండును. ఈస్థితి యనార్షసంప్రదాయగ్రంథములలో గానరాదు. అందుచేత ననార్షసంప్రదాయగ్రంథావలోకనముతో గాలము గడుపును నార్షసంప్రదాయము నతిక్రమించి సంచరించువారి కార్షసంప్రదాయగ్రంథములు ఎట్లో కనబడుట కభ్యంతరము లేదు. కనుకనే అనార్షసంప్రదాయగ్రంథదృష్టితో నార్షసంప్రదాయగ్రంథములను విమర్శించుటలో నెంతయో హాని సంభవించినది. ఏగ్రంథ మేసంప్రదాయమునకు జెందినదో ఆసంప్రదాయము ననుసరించియే ఆగ్రంథమును పరిశీలింపవలెననునది విజ్ఞులకు దెలియనిది కాదు ఇట్టిస్థితిలో భారతీయులకు ఐహికాముష్మికశ్రేయస్సాధనములై జీవితసర్వస్వము లైయున్న ఆర్షసంప్రదాయగ్రంథములను దుర్విమర్శనజాలమునుండి యుద్ధరించి యార్షగ్రంథములను స్వస్వరూపములతో నిలవబెట్టి శ్రేయస్సాములను భారతీయుల కందింపవలసిన భారము ఆర్షవిద్యోపజీవుల యందును, ఆర్షవిద్యాభిమానులయందును కలదు కనుక యావచ్ఛక్తి యత్నించుచుదురు గాక. ప్రస్తుతవిషయములో మహాభారత మనేకకర్తృకమను వాదములలో కొన్ని ప్రధానాంశములు పరిశీలించి ప్రమాణాంతరప్రదర్శనములతో విద్వద్వ్యాఖ్యానాధాగమున నింతవరకు

మహాభారతమునకు వ్యాసమహర్షియే కర్తయనియు, భారత మన్నను, మహాభారతమన్నను ఒకే గ్రంథమనియు, ఆశ్వలాయనసూత్రమందు పేర్కొనబడిన భారతమహాభారతశబ్దములు ఆచార్యబోధకములే కాని ప్రతివాదు లన్నట్లు గ్రంథబోధకములు కావనియు, వైశంపాయనుడు కాని సౌతి కాని వ్యాసప్రోక్తగ్రంథమును వినిపించినవారే కాని రచించినవారు కారనియు, మహాభారత మనేకకర్తృకమనుటకై ప్రతివాదులు చూపిన వచనములు ఏకకర్తృకత్వవాదమునకే సాధకములనియు, ప్రతివాదు లాయాస్థలములలో స్వతంత్రించి వ్యాఖ్యాతలను గూడ తృణీకరించి చెప్పిన యర్థములు అసంగతము లనియు నిరూపించుచు విద్వన్మార్గమును గూర్చి దిక్ప్రదర్శనమే చేయబడినది. ఇటుమీద గూడ గలుగు శంకలను నివారించుకొనుటకును, ప్రతివాద్యాక్షేపపరిహారములకొరకును, ఆమహాభారతమును, ఆవ్యాఖ్యానములను స్వక్రమముగా జదివి తత్త్వగ్రహణము జేసి కృతార్థత నొందవలసినది. గ్రంథము జూడక దీనికి వారేమి చెప్పెదరో, వీరేమి చెప్పెదరో చూతమనియుహించుటచేల్లాభము లేదు. గ్రంథావలోకనమేసర్వశంకానిరాసమునకుమూలము. ఈనాడుకలుగుచున్న శంకలను ఆనాడేగ్రంథములయందుద్ధాటించి సమాధానములు చెప్పబడుటచే నట్టి గ్రంథములను చూడకపోవుటవలన మనయందు లోప మున్నది కాని గ్రంథములయందు లేదు. ఆర్షసాంప్రదాయానువర్తులకు ఆర్షగ్రంథములే శరణ్యములు. అవి కొందరికి రుచికరములు కాకపోవచ్చును.

"సూర్యో జగత్ప్రకాశాయ సముదేతి జగత్ప్రభో!
ఉలూకానాం రుచికరో న భవే త్తత్ర కా క్షతిః ॥"

జగత్ప్రకాశమునకై యుదయించి విరాజిల్లుచుండిన సూర్యుడు

ఉలూకము (గుడ్లగూబ) లకు రుచికరము కాకున్న నష్టమేమి? అట్లే ఆర్షసంప్రదాయానువర్తులకు కొందరు వెగటుపడినంతమాత్రమున నష్టము లేదు.

ఇది.

“బాలవ్యాస న్యాయవ్యాకరణవేదాన్తవిద్యాప్రవీణ”

వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిప్రణీతమైన,

మహాభారత తత్త్వకథనమున

అనేకకర్తృత్వనిరాకరణమనెడి

ప్రథమభాగము.



శ్రీ గురుభ్యో నమః

# మహాభారత తత్త్వకథనము.

## వేదవ్యాసనిందానిరాకరణము.

ద్వితీయ భాగము.



'బాలవ్యాస, తర్క, వ్యాకరణ, వేదాన్త కేసరి'


వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే


రచియింపబడి,


భట్నవిల్లి గ్రామస్థాపిత శ్రీ శారదాముద్రణాలయమునందు
ముద్రింపబడి,

బులుసు వెంకటశాస్త్రిచే ప్రకటింపబడియె.





ప్రతులు: 1000.

**24—8—1948.**





మూల్యం: **1—4—0.**

# వి ష య సూ చి కం

శ్రీగురుమూర్తయే నమః.

# శ్రీ పాండవ పట్టాభిషేక మహోత్సవము.

## పీఠికాపుర పౌర ప్రశంస.

చ. కరము నుతింతు నిట్టి కలికాలమునన్ సయితంబు పీఠికా
పురజను లిట్లు దీక్ష గొని, పూర్తిగ భారతరూపవేదమున్
బరమవివేకబుద్ధి సముపాసన సేసి తదంతరార్థముల్
కరబదరంముగా నెఱుఁగఁగల్గిన తత్సుకృతాతిరేకమున్.

సీ. దేవతాభక్తి నిర్జీవమై యల్లాడ
వర్ణాశ్రమస్థితుల్ వఱదఁ గలియ
దాంపత్యధర్మముల్ తరలిపోవఁగ-ముండ్ల
కంచెల వేదమార్గములు చెడఁగ
స్మృతివాఙ్మయము దుర్వివృతులఁ గ్రుంగఁగ నిర
క్షరకుక్షులకు బుధస్థాన మబ్బ
వంచనానిపుణుండు వాచంయముఁడు గాఁగ
నాత్మబుద్ధి ప్రమాణమై తనర్ప

గీ. దినదిన మ్మిట్టు చెలరేఁగి దెసలు గ్రమ్ము
కొను కలివిలాసమున కోటగొనక, భార
తీయధర్మము వెలయించితిరి ప్రశస్తి
పాత్రముగఁ బీఠికాపురీపౌరులార!

శా. బాలవ్యాసుఁడు వారణాసికులసుబ్రహ్మణ్యదోషజ్ఞచూ
డాలంకారము వత్సరత్రయ మఖండశ్రద్ధఁ బ్రత్యక్షరం
బాలోకించుచు దుర్విమర్శములఁ బాయంద్రోచి, బోధింపమీ
రాలింపన్ గనినారు భారతము నాహా యెంత పుణ్యాత్ములో!

సీ. చదివె వ్యాకరణశాస్త్రము మహాభాష్యాంత
మ్ముగ సూర్యబుధచంద్రముని భజించి
న్యాయశాస్త్రంబు నధ్యయనించె లక్ష్మీనృ
సింహపండితసింహు శిష్యుఁ డగుచు
నాపోశనించె వేదాంతామృతాంభోధి
దెందుకూరినృసింహాధీరుఁ గొలిచి
తనయంత లేసి వారినిగ దిద్దెను శత
సంఖ్య శిష్యుల సర్వశాస్త్రములను
గీ. సహజశమదమశౌర్యాదిసద్గుణగణ
శాలి యైన సుబ్రహ్మణ్యశాస్త్రిమాలి!
యట్టి మహనీయు దయ భారతామృతంబు
నానితిరి పీఠపురవాసులార! యార!

శా. కుంతీమాధవకుక్కుటేశ్వరులు సాక్షుల్గా మహాభారత
స్వాంతం బారసి "ధర్మ మిద్ది" యని సుబ్రహ్మణ్యవిద్వాంసుఁ డా
వంతే స్వార్థ మెఱుంగ కన్వహము నోరారంగ బోధింప, న
శ్రాంతాస్తిక్యము శ్రోతృమానసములన్ రాజిల్లు టబ్రం బొకో!

శా. భద్రేభంబున నిల్పి, పాండవులఁ, దత్పట్టాభిషేకంబు భ
క్త్యుద్రేకంబున సల్పి, భారతరహస్యోద్ఘాటనాప్తిన్ దమో
నిద్రాముద్రితమైన భారతమహిన్ మేల్కొల్పి రత్యాస్థ నీ
భద్రాచారులు పీఠికాపురజనుల్ పాత్రుల్గదా ఖ్యాతికిన్.

శా. కుంతీదేవికి ద్రౌపదీసతికి ఱంకుల్ గట్టి "ధర్మాత్మజో
దంతం బంతయు ధర్మదూర మనియున్ ధర్మంబు దుర్యోధనో
దంతం" బంచును భారతీయులకు మందాక్షంబు చేకూర—ధీ
మంతుల్ భారతమున్ గలంచి రెటు నిర్మందాక్షులై యుందురో!

## ఉ త్ప ల మా లి క.

“భారతనాయకుల్ దురితవర్తను, లందలి నాయికల్ సదా
చారవిదూర”లంచు మది జంకక, ఖ్యాతిని గాంచ నెంచి, పెం
పారు స్వజాతి కెన్నఁటికి నాఱని ఘోరకళంక మేమొ యం
చారయు లేక సత్యము బయల్పడఁ జెప్పు మిషంబుతో మహా
భారతముం దురర్థముల పాలొనరించి,–జగన్నిదాన మా
కీఱున ధర్మమార్గముల దిద్దిన వ్యాసునిఁ గొలఁ చేయుఁగాఁ
దీరిచి–దేవుఁగా ననుమతించి సమస్తజనుల్ భజింప నా
ధారముగా నరాకృతి వతారము నొందిన వాసుదేవు సా
ధారణహీనమర్త్యునిగ ధర్మవిహారుఁగఁ వక్రబుద్ధిగా
జారునిగా లిఖించి, కలుషక్రియులైన సుయోధనాదులన్
‘ధీరులు ధర్మవీరు’ లని నిర్ణయముం బచరించి యక్కటా!
భారతమాతృపుత్రులము, భారతవాక్ప్రమాణ మాను మా
కారయ, భారతక్షితి నిరంకుశ సాహసదోహలంబు, మా
భారతజాతి యుత్తమము భారతశిల్ప మనల్ప మంచుఁ బొం
గారెడు ఆత్మ్మ గుద్దుకొను చన్వహముం సభలందు వాక్ప్రవ
త్కారముఁ జూపి యజ్ఞజనతత్సమయోచితమోదవాక్ప్రర
స్కారము జాఱఁ దామును విచక్షణులైనక్రియన్ సుధీతిర
స్కారము సేసి, ఘోరకలికాలమహత్త్ర జయంబు గాంచి ల
జ్జారహితప్రవృత్తు లయి జాతికి నీతికి ఘాత గూర్చు దు
ర్వారదురంతచింతనుల పా లయి నీరసపడ్డ భారతో
దారచరిత్రవాస్తవికతన్ గజరాజమునందు నిల్పి, భే
రీరవముల్ దెసల్ గమిచి మ్రింగఁగ ‘ఫెళ్ళు’ మటంచుఁ జాటి, త
ద్భారతకీర్తిపైఁ బడిన పాంసువు లూడ్చి, పటీరసారమం
దారసుమార్హణంబుల యథాస్థితి మించ వెలార్చి, ధర్మర

తూరుచి నేర్పి లోకులు ప్రశంసలఁ గాంచిన పీఠికాపురీ
పౌరుల వారి కొజ్జ లగుపండితులన్ హితులన్ నుతింప కె
ట్లూరక యేఁగఁ జాలుదు? నహో మును కుక్కుటలింగమూర్తి క
వ్వారిగ నూఱుఘస్రములు భక్తి నొనర్పరె కోటి బిల్వప
త్త్రిరచితార్చనంబుల? సమృద్ధిగ షడ్రసయుక్తభుక్తినా
నూఱు దినంబు లందఱ మనుష్యుల దన్పరె? వారణాసిన
ద్వారణరాజుచే దశరథక్షితిపాత్మజవృత్తకావ్య మిం
పారఁగ నాలకించి ముదితాత్ములరై మణిమండితంబు బం
గారపు సింహకంకణయుగంబును గాన్కగ నిచ్చి, గొప్పస
త్కార మొనర్పరే? మఱియు గాటపు భక్తిని నేఁడు నమ్మహో
దారు ననర్ఘకమ్రకనకాంబరభూషితుఁ జేయలేదె? యె
వ్వారలయందునేని గనవచ్చునె యింతటి యాస్తికత్వ, మీ
ఱగు దైవభక్తియు సుధీజనరక్తియు ధర్మసక్తియున్?
భారతదేశ మెల్ల నొకనాటికినేనియు వీరిఁ గాంచి యీ
దారినిబట్టి ధర్మసుకృతంబుల ధన్యతఁ గాంచు నంచు ని
ర్ధారణ మాచరింపఁ గలధైర్యము గంటి సపుత్రపౌత్రులై
వీరలు ధర్మమార్గమును వీడక పాఁడియుఁ బంటలున్ సిరుల్
తోరముగాఁగ వర్ధిలుత ధూర్జటి కుక్కుటనాథు సత్కృపన్

పీఠికాపురము.
సర్వజిన్మాఘశుద్ధ
ద్వాదశీశనివారము.

ఇట్లు.
'విద్వాన్, కవితాభూషణ'
వెంపరాల సూర్యనారాయణశాస్త్రి.

శ్రీ గు రు భ్యో న మః

# మహాభారత తత్త్వకథనము.

## వేదవ్యాస నిందా నిరాకరణము.



"రామా దపి శ్లాఘ్యగుణః శ్రియేఽస్తు
వ్యాసో ముని శ్శ్రీదయితావతారః ।
వినిర్మితో యేన పరార్థ మేవ
భవార్ణవే భారత సేతుబన్ధః॥"
(మహాకవి రమరచంద్రసూరిః)

"యథేచ్ఛం యాః కృతా నిన్దాః కైశ్చి ద్వ్యాసమునీశ్వరే ।
తన్నిరాకరణం కుర్మః ప్రమాణై రుపపత్తిభిః" ॥

### వేదవ్యాసనిందానిరాకరణము

వేదవ్యాసమహర్షిని గూర్చి మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది.

"బ్రాహ్మణునకు శూద్ర స్త్రీయం దుద్భవించినవాడు నిషాదుడు, లేక పారశవుడు. అను ననులోమజాతీయు డగు నని మనుస్మృతిలో గలదు. నిషాదుడే చండాలు డని అమరకోశమున గలదు. నిషాదుడు బోయజాతిలో నొక తెరగతివా డని వేఱు నిఘంటువులలో గలదు. వాల్మీకిమహర్షి ఆతెరగతినిషాదుడే అని ధర్మఖండాదులలో గలదు. వ్యాసుని తండ్రి బ్రహ్మర్షి యగు పరాశరుడు. తల్లి దాశకన్య. కాన వీరికి బుట్టిన వ్యాసుడు నిషాదుడు. లేక పారశవుడై యుండెను, జన్మముచే పారశవు డైనను నిషాదు

డైనను కృష్ణద్వైపాయనుడు, వాల్మీకి అనువారు కర్మములచే తప స్సుచే వేదర్షులు, మహాకవులు నైరి. జన్మముచే బ్రాహ్మణు డైన గాని వేదర్షి కాడని చెప్పుట నెట్లు. ఒకవేళ వ్యాసుడు జన్మముచే బ్రాహ్మణు డని త్రికమకపడి సాధించినను వాల్మీకిని జన్మముచే బ్రాహ్మణు డని సాధింప శక్యముకాదు. (146 పు.)

ఈప్రతివాదిప్రసంగములో వాల్మీకిమహర్షి నిషాదుడే అను విషయముపై ముందు ప్రస్తావింతము.

—♦ వాల్మీకి నిషాదత్వ నిరాకరణము ♦—

వాల్మీకిశబ్దార్థనిర్వచన మిట్లున్నది.

గోవిందరాజీయవ్యాఖ్యానము—

ఉక్తంచ బ్రహ్మవైవర్తే—

అథాబ్రవీ న్మహాతేజా బ్రహ్మ లోకపితామహః।
వల్మీకప్రభవో యస్మా త్తస్మా ద్వాల్మీకి రిత్యసౌ ॥

ఈవచనము, వల్మీకభవుడగుటచే వాల్మీకి యయ్యె నని చెప్పు చున్నది. బ్రాహ్మణునకు శూద్రస్త్రీయం దుద్భవించినవాడు నిషా దుడు అని ప్రతివాదులు అనుచున్నారు. అట్టినిషాదత్వము వల్మీకసంభ వుడైన వాల్మీకియం దుండు టెట్లు? నిషాదశరీరము వేరు. వాల్మీకిశరీరము వేరు. కనుక వాల్మీకిత్వనిషాదత్వములు విరుద్ధధర్మములు. వాల్మీకి నిషాదుడే అని ధర్మఖండాదులలో గలదందురా? అట్లు లేదు. వాల్మీకి బ్రహ్మర్షి యనియు విప్రు డనియు ద్విజు డనియు నున్నది విజయుడను వాడు నిషాదుడని యున్నది. విజయుడు నిషాదుడని యున్నపుడు ఆవి జయుడే తుదకు వాల్మీకి యయ్యెనుకనుక వాల్మీకిని నిషాదు డని చెప్పి నట్లే యని భావింపరాదు. వాల్మీకి తపోవినిహతపూర్వదేహుడై తేజ

రిల్లె నని యాగ్రంథము చెప్పుచున్నది. అట్లు నిషాదశరీర మంతరింప వాల్మీకిస్వరూప మావిర్భూతమైనందున వాల్మీకిని నిషాదుడనుట తప్పు. ఈదరపల్లి భవానీశంకరకవిచే నాంధ్రీకరింపబడిన ధర్మఖండమందలి కథాసందర్భ మెట్లున్నదో చూడుడు—"విజయుడను నిషాదు డొకడు క్రూరుడై చౌర్యవృత్తి నవలంబించి యరణ్యమందు గాచియుండ దన పూర్వజన్మ సుకృతపరిపాకవిశేషమున నాతనికి వసిష్ఠాదిమునిపుంగవులు గోచరించి కొన్నివిషయము లుపదేశింపగా తన్మూలమున నాతడు తనదుర్వ్యాపారములు గర్హించుకొనుచు, సంసారవిరక్తుడై నా కొక మంత్ర ముపదేశించి రక్షింపు డని వేడుచు నిర్బంధింప వసిష్ఠమహర్షి యీతనికి మంత్రోపదేశ మెట్లని ధ్యానించి ఆసమయమున తనకు స్ఫురించిన ప్రకారము వ్యత్యస్తరామమంత్ర ముపదేశింపదలంచి—

ఆ. చోర! చోర! రార సుగుణోత్తరుండవు
మంత్ర మొసగువాడ మసల కిపుడు
జపము చేసెదేని యపవర్గ మొదవు నీ
కనిన వాడు ప్రముదితాత్ము డగుచు.

వ. నమస్కరించి యిట్లనియె.

క. గురువర! నీసత్కరుణా
గరిమన్ భవసాగరంబు గడిచెద మును సా
గరతరణం బొనరించిన
హరిసేవకుడైన హనుమయున్ కపిరేతిన్.

వ. అనిన విని వసిష్ఠుండు తనమనంబున నిట్లని వితర్కించె.

చ. ధనహరణార్థబుద్ధియగు తస్కరు డీగతి బల్కువాడె సాం
పున మునిరీతి వీని మది బూని విరక్తి జనింపబోలు నె

మ్మనమున నున్న చందములు మాటలచే నెఱుగంగ బాడి యీ
ఘను నుపదేశపాత్రు డగు గామితసిద్ధియు నబ్బు వీనికిన్.

క. పాపాత్ములకుం బశ్చా
త్తాపం బుదయించెనేని తత్పాపంబుల్
రూపఱు చిత్తము విమలత
బ్రాపించు ననారతంబు భద్రము లొదవున్.

ఇట్లనుకొని మునీంద్రు డామంత్రి మావోరున కుపదేశించెను.

శా. చోరుం డీగతి మంత్రలబ్ధి గని సంశుద్ధాత్ముడై యత్తఱిన్
వైరాగ్యంబున సర్వవస్తువితతుల్ వర్జించి నిస్సంగుడై
ప్రారబ్ధాశుభకర్మసంహతుల బాయన్ మీఱి నిర్బంధతన్
ప్రారంభించె దపంబు సల్ప సుజనప్రాతంబు లోహో! యనన్.

వ. అనుదినంబును త్రిషవణస్నాయియు, యతవాక్కాయమానసుండును, సర్వభూతదయాయుక్తుండును, అధశ్శాయియు, జితేంద్రియుండును నగుచు ఫలమూలజలపర్ణానిలశాకభక్షణంబు లొనరింపుచు నియతాహారుండై ... బాహ్యంబు మఱచి పవనంబు బంధించి తపంబు సలుపుచుండె. ...

క. ఖగములు శిరమున గూళ్ళిడ
మృగములు శృంగముల గ్రుమ్మి మేనుల నొరయన్
నగముగతి కదల కాతడు
జగములు భీతిల్ల దపము సలుపగ దొడగెన్.

తే. గీ. మశకపంక్తులు చీమలు మక్షికములు
కరచి రక్తంబు గ్రోలుచు నెఱచి దినగ
జర్జరితగాత్రు డయ్యు నిశ్చలత నతడు
సద్గురూక్తక్రమంబున జపము సేయు.

తే. గీ. అట్లు శ్రీరామమంత్రాసక్తాత్ముఁ డగుచు
దపము గావింప వెక్కువత్సరము లరిగె
బోయె వెక్కు యుగాంతరంబులు ననేక
దివ్యవర్షాయుతములు నతిక్రమించె.

వ. ఇట్లాతఁడు నిశ్చలతఁబూని చేయు దపము గని భీతుఁడైన యింద్రు
నితో బృహస్పతి యిట్లనెను.

తే. గీ. అతని కత నీకు భయమేల యమరరాజ!
అతఁడు వల్మీకమున బుట్టి యతులతేజ
మమర వాల్మీకి యనఁగ బ్రహ్మర్షి యగుచు
వెలసి రామాయణము సేయఁగలఁడు సుమ్ము.

వ. అది విని యింద్రుం డిట్లనియె.

ఆ. తనదు మేనితోడ మనుజుఁ డచ్చెరువుగ
నెట్లు పుట్టఁబుట్టు నిదియుఁగాక
బహుళజన్మదుర్లభం బగు విప్రత్వ
మెట్లు గలుగు నతని కెఱుఁగఁ జెపుమ.

వ. అన విని యాబృహస్పతి యిట్లనియె.

ఉ. చీమలు పాము లీఁగలును జేరఁగ జెందఁగరాని యట్లుగా
నామహితాత్ము మేనిపయి నావరణంబుగ నొక్కపుట్ట శ్రీ
రాము డొనర్పు భక్తజనరక్షణదక్షుఁడు గాన వాతవ
ర్షామితబాధ నొందఁ డతఁ డందు వసించు ననేకవర్షముల్.

తే. గీ. అతఁడు కారణదేహపర్యంత మట్లు
దగ్ధకల్మషుఁడై యుండు దపము సల్పి

యంత గ్రిమ్మర దివ్యదేహంబు దాల్చి
పుట్టుబ్రహ్మర్షి యగుచు నప్పుట్టజుండు.

తే. గీ. వస్నైతక్కువహేమంబు వహ్నియోగ
మహిమ గుందన మగుగతి మహితరామ
మనుజపంబున నఘకదంబములఁ దోలి
యాపులిందుడు ద్విజు డగు నమరవర్య.

వ. అట్లుచ్చోరుండు తపంబు సేయుచుండ ననేకమన్వంతరంబులు గడ చిన యనంతరంబ...(ఒకప్పుడు నారదపురస్కృతులై వసిష్ఠాదులు) ఖనిత్రిపత్రిముఖసాధనంబులు గొని వల్మీకప్రాంతంబునకు నరిగి చిరకాలావృతంబైన యప్పుట్టం గొ్రిచ్చి యందు.

సీ. పుటపాకశోభితభూరిప్రభాసాంద్రు
నజినవల్కలనిచయావృతాంగు
బాటలస్ఫుటజటాపటలాభిశోభితు
రామనామాక్షరరమ్యరసను
సద్గురువరపాదజలజార్పితేక్షణు
దీవ్యమానానలదివ్యతేజు
నవిదితబాహ్యలోకానీకవర్తను
శ్రీరామచరణాబ్జచింతనాత్ము

తే. గీ. బద్ధపద్మాసనస్థు దపఃప్రదీప్తు
మునివరు నొకని గాంచి యమ్మునులు వివిధ
విధుల బోధించి విసివి రాద్విజుడు వారి
పలుకు వినడయ్యె నిశ్చలభావమునను.

వ. వసిష్ఠమునిచంద్రుం డమ్మునీంద్రు నిరీక్షించి.

క. దేశికుడం జనుదెంచితి
నోశిష్యుడ పూజసేయు మొగి భద్రము నీ

కాంచగతి గల్గు నాయుప
దేశమునను దపము సల్పితివి నిష్ఠమెయిన్.

క. అని పల్కిన నమ్మునియు న
యనయుగళము దెఱచి లేచి యభివాదనము
బ్బున జేసి యోగురూత్తమ
ఘనపుణ్యుడ నైతి మిమ్ము గాంచుట కతనన్.

వ. అని పల్కె నాసమయంబున భగవంతుండైన వసిష్ఠమునీంద్రుం డతనికింబ్రచేతసునిచేత వేదోక్తక్రమంబున జాతకర్మాద్యఖిలసం స్కారంబులు సేయించి శ్రీపూర్వకంబుగా రామనామమంత్రం బుపదేశించిన నవ్వాల్మీకియుం దపోవినిహతపూర్వదేహుండును, గృతకృత్యుండును నై నిర్మలత్వంబునం దేజరిల్లి...యిట్లనియె''

ఇదియే ప్రతివాదులు తమమాటకు ప్రమాణముగా జూపిన ధర్మఖండములోని కథ ఇందున్న దొకటి. ప్రతివాదు లన్నదొకటి.

ఈగ్రంథములో నిందబ్రృహస్పతిసంవాదమున నున్న విషయ ములు గమనింపదగినవి—"అతడు కారణదేహపర్యంతము దగ్ధకల్మ షుడై యంత గ్రమ్మర దివ్యదేహంబు దాల్చి పుట్టుబ్రహ్మర్షి యగుచు నప్పట్టమందు వన్నెతక్కువ హేమంబు వహ్నియోగమహిమ గుం దన మగు గతి నాపుళిందుడు ద్విజు డగు నమరవర్య'' అని యుండుట చేతను, కడపటి వచనములో 'తపోవినిహతపూర్వదేహుడు' అని చెప్ప బడుటచేతను, నిషాదుడైన విజయుని శరీరము తపోవిశేషముచే నిహ తము కాగా మరల దివ్యదేహము దాల్చి బ్రహ్మర్షియై వాల్మీకి పుట్టె ననియు, వన్నెతక్కువహేమము వహ్నియోగమున కుందనమైనట్లు ఆవిజయుడు తపోవిశేషమున బ్రహ్మర్షి యగుట యుపపన్న మనియు బోధింపబడినది. ఇట్టిస్థితిలో కుందనమును వన్నెతక్కువబంగార మని

యెట్లనరాదో అట్లే బ్రహ్మర్షియైన వాల్మీకిని నిషాదుడనరాదు. కనుక 'వాల్మీకిమహర్షి నిషాదుడే యని ధర్మఖండాదులలో గలదు' అను ప్రతివాదుల మాట పరాస్తమైనది. 'వాల్మీకిని జన్మముచే బ్రాహ్మణు డని సాధింపశక్యముకాదు' అను మాటకూడ ప్రహతమైనది.

'వసిష్ఠమునీంద్రు డతనికి ప్రచేతసునిచేత వేదోక్తక్రమంబున జాతకర్మాద్యఖిలసంస్కారంబులు సేయించె' నని చెప్పబడుటచే వాల్మీకిది జన్మాంతర మనియు వైదికసంస్కారము లన్నియు ప్రచేతసునిచే బొందుటవలన వాల్మీకి ప్రాచేతసు డయ్యె ననియు స్పష్టమైనది.

'జన్మముచే బ్రాహ్మణు డైనగాని వేదర్షి కాదనుట వెఱ్ఱి' అని వ్రాసిన ప్రతివాదుల కెంతవెఱ్ఱియో! వేదవ్యాసుడు, వాల్మీకి జన్మముచే బ్రాహ్మణులే యగుచుండ వాల్మీకి జన్మముచే బ్రాహ్మణుడే యని వారు పేర్కొనిన ధర్మఖండమే నిరూపించియుండ నట్లు వ్రాసిన ప్రతివాదులకు వెఱ్ఱియా? బుద్ధియా?

ఇక దీనిని విడిచి వేదవ్యాసమహర్షియందు ప్రతివాదు లారోపించిన నిషాదత్వమును గూర్చి పరిశీలింతము.

## — వేదవ్యాసనిషాదత్వనిరాకరణము —

"బ్రాహ్మణునకు శూద్రస్త్రీయం దుద్భవించినవాడు నిషాదుడు. వ్యాసుని తండ్రి బ్రహ్మర్షి యగు పరాశరుడు. తల్లి దాశకన్య. కాన వీరికిబుట్టిన వ్యాసుడు నిషాదుడు" అని ప్రతివాదుల వ్రాత.

వీరిట్లు వ్రాయుట కాధారము మనుస్మృతివచనము. అది యిట్లున్నది.

బ్రాహ్మణా ద్వైశ్యకన్యాయా మంబష్ఠో నామ జాయతే।
నిషాద శ్శూద్రకన్యాయాం యః పారశవ ఉచ్యతే॥

కుల్లూకభట్టీయమ్—

కన్యాగ్రహణా ప్రతోద్ఢాయా మిత్యధ్యాహార్యం 'వినాప్యేష విధి స్స్మృతః' ఇతియాజ్ఞవల్క్యేన స్ఫుటీకృతత్వాచ్చ బ్రాహ్మణా ద్వైశ్యకన్యాయా మూఢాయా మంబష్ఠాఖ్యో జాయతే. శూద్రకన్యాయా మూఢాయాం నిషాద ఉత్పద్యతే. య స్పంజ్ఞాన్తరేణ పారశవ శ్చోచ్యతే.

దీనినిబట్టి వివాహిత యైనశూద్రకాంతయందు బ్రాహ్మణుని వలన జన్మించినవాఁడు నిషాదు డని తేలినది. ఇప్పుడు దాశకన్య యన బడుచున్న వ్యాసజనని యగు సత్యవతీదేవి పరాశరునిచే వివాహితయు, శూద్రకాంతయు నైననాఁడు ప్రతివాదుల మాట నెగ్గును. ఆమె పరాశరునిచే వివాహిత కాదనుట నిర్వివాదము. శూద్రకాంతకూడ కాదు. ఆమె యుత్పత్తి యెట్లు చెప్పబడెనో చూడుఁడు— ఉపరిచరవసువు వీర్యమును డేగ తీసికొనిపోవునపుడు యమునానదియం దది పడగా నచ్చట నద్రికయను నప్సరస బ్రహ్మశాపమున మత్స్యమైయుండుటచే నామత్స్యము దానిని గ్రహించెను. అంతట మత్స్యము గర్భధారణ చేసియుండెను. పదవమాసమున దానిని జాలరులు పట్టి తీసి దాని కడుపున స్త్రీపురుషరూపములతో నున్న మనుష్యశిశువుల నిరువుర జూచి యాశ్చర్యపడి యా వసురాజున కాశిశువుల జూపి వీరు మత్స్య శరీరమునుండి సంభవించిన మనుష్యశిశువు లని చెప్పగా నుపరిచర వసువు అందు మగశిశువును గ్రహించెను. ఆశిశువు ధార్మికుఁడై మత్స్యరాజను ప్రసిద్ధి గాంచెను. ఆడశిశువు మత్స్యముతో సమానమైన వాసన కలిగియున్నది. ఆశిశువును దాశరాజున కు పెంచుకొను మని యిచ్చెను. ఆమె సత్యవతి యనుపేరుతో రూపలావణ్యములు కలిగి గుణవతియై యుండెను. ఆమె మత్స్యవాసన

కలిగియే పితృశుశ్రూషార్థము నావ నడుపుచుండెను. ఈయర్థముగల శ్లోకములు చూడుడు—

"శ్యేనపాదపరిభ్రష్టం తద్వీర్యం మథ వాసవమ్ ।
జగ్రాహ తరసోపేత్య సాఽద్రికా మత్స్యరూపిణీ ॥
కదాచి దపి మత్సీం తాం బబన్ధు ర్మత్స్యజీవినః ।
మాసేచ దశమే ప్రాప్తే తదా భరతసత్తమ ॥
ఉజ్జహ్రు రుదరా త్తస్యాః స్త్రీం పుమాంసంచ మానుషమ్ ।
ఆశ్చర్యభూతం తద్గత్వా రాజ్ఞోఽథ ప్రత్యవేదయన్ ॥
కాయే మత్స్యా ఇమౌ రాజన్ సంభూతౌ మానుషావితి ।
తయోః పుమాంసం జగ్రాహ రాజోపరిచర స్తదా ॥
స మత్స్యో నామ రాజాసీ ద్ధార్మికః సత్యసంగరః ।
సా కన్యా దుహితా తస్యా మత్స్యా మత్స్యసగన్ధినీ ॥
రాజ్ఞా దత్తాచ దాశాయ కన్యేయం తే భవిష్యతి ।
రూపసత్త్వసమాయుక్తా సర్వైః స్సముదితా గుణైః ॥
సాతు సత్యవతీనామ మత్స్యఘాత్యభిసంశ్రయాత్ ।
ఆసీ త్సా మత్స్యగంధైవ కంచిత్కాలం శుచిస్మితా ।
శుశ్రూషార్థం పితు ర్నావం వాహయన్తీ జలేచ తామ్ ।

(ఆది 63 అ)

ఈగ్రంథసందర్భమునుబట్టి వసురాజు వీర్యమున మత్స్యోదరమునుండి జన్మించిన సత్యవతీదేవిని శూద్రకాంత యను టెట్లు? ఆమె శూద్రకాంత కానపుడు వ్యాసమహర్షి నిషాదు డగు టెట్లు? కనుక ప్రతివాదుల మాట పరాస్తమైనది. ఇక సత్యవతీదేవి క్షత్రియ యను వాదమునకు ప్రతివాదుల యాక్షేపములు కొన్ని కలవు. వానిని జూతము—

—♦ సత్యవతీదేవి క్షత్రియయే ♦—

"ఆమెక్షత్రియయే యైనచో పల్లెవానికి వసురాజు పెంపకమున కిచ్చుట యేల? తాను పెంచలేకయా? (పు 150 ను. భా. చ.) అని ప్రతివాదుల యాక్షేపము. ఆమె క్షత్రియ యైనను ఆమె దేహము మత్స్యవాసనకలిగియుండుటవలన నావాసన కలవాటుపడిన దాశుడే యీమెను పోషింపదగినవాడని భావించి యావసురాజు దాశున కామెను పెంపకమున కిచ్చె నని సమాధానము.

క్షత్రియయైనచో నామెను దాశుడు తనవృత్తిలో నెట్లు ప్రవర్తింపజేయును?" (పు. 151) అని యాక్షేపము.

దాశుని పోషణములో నానుండుటచే దాశుని వృత్తి యదియే యగుటవలన నాతని శుశ్రూషకై యామె యట్లు చేసియుండె నని సమాధానము.

"వసురాజు వీర్యమున జన్మించుటచే సత్యవతిని క్షత్రియాంగన యందురా? అదియును బొసగదు. వీర్యప్రాధాన్యమునే లెక్క-గొనవలసియుండినచో వ్యాసుని వీర్యమువలన బుట్టిన శ్రీశుకుడు మహర్షియు, ధృతరాష్ట్రపాండురాజులు క్షత్రియులు, విదురుడు శూద్రు డెట్లయిరి? యిచ్చట వీర్యప్రధానత కాక క్షేత్రప్రాధాన్యమే వక్కాణింపబడెను" (పు. 151) అని యాక్షేపము.

ఇచ్చట సత్యవతీదేవి జన్మవిషయమై వీర్యప్రాధాన్యము చెప్పరా దని వ్రాసిన వీరే మరియొకచోట "వ్యాసుడు మొదలగువారు వారితల్లు లేజాతివారైనను బీజప్రాధాన్యతపోవిశేషములచే మహర్షులైరి." (72 పు.)

అని వ్రాసి వీర్యప్రాధాన్యమును సంతతివిషయం దంగీకరించి వ్యాసునియందు వీర్యప్రాధాన్యమును కంఠోక్తిగా జెప్పియేయున్నారు. మరియు తల్లులు భిన్నజాతివారై యున్నపుడే వీర్యప్రాధాన్య మంగీకరించియున్న ప్రతివాదులు తల్లియే లేక మత్స్యోదరమునుండి వసురాజు వీర్యమున జన్మించిన సత్యవతీదేవివిషయమై వీర్యప్రాధాన్యము గ్రహింపరా దనుట చిత్రముగా నున్నది. ఇచ్చట వీ క్షేత్రప్రాధాన్యమును చెప్పదలచిరో!

మఱియు వారిచే శూద్రస్త్రీ యని భావింపబడిన సత్యవతియందు జన్మించిన వ్యాసుని-వారియూహను బట్టి నిషాదు డని చెప్పిన మనుస్మృతి ఆనిషాదునివలన క్షత్రియస్త్రీలయందు జన్మించినవారు క్షత్రియు లగుదు రనియు, శూద్రస్త్రీయందు జన్మించినవాడు శూద్రు డగు ననియు జెప్పినా?

"యథైవ శూద్రో బ్రాహ్మణ్యాం బాహ్యం జన్తుం ప్రసూయతే।
తథా బాహ్యతరం బాహ్య శ్చాతుర్వర్ణ్యే ప్రసూయతే॥ (అ 10)

అని యుత్తమజాతిస్త్రీలయందు హీనజాతీయులచే జన్మించినవారు అతిహీనజాతీయు లగుదు రని కదా చెప్పుచున్నది. ఈస్థితిలో ప్రతివాద్యభిప్రాయమును బట్టి నిషాదుడైన వ్యాసునివలన జన్మించిన ధృతరాష్ట్రాదులు తల్లి క్షత్రియకాంత యైనను హీనజాతీయులు కాక క్షత్రియు లెట్లయిరి?

అట్లే విదురుని తల్లి శూద్రయైనను నిషాదునివలన జన్మించినపుడు "జాతో నిషాదా చ్ఛూద్రాయాం జాత్యా భవతి పుక్కసః"(అ 10) అనుమనువచనముచే పుక్కసుడు కావలసిన విదురుడు శూద్రు డెట్లయ్యెను?

అట్లు కానప్పుడు "వ్యాసుని వీర్యమున బుట్టిన ధృతరాష్ట్ర పాండురాజులు క్షత్రియులు, విదురుడు శూద్రుడు నెట్లయిరి? యిచ్చట క్షేత్రప్రాధాన్యమే వచ్చెకదా" అనుచు ప్రతివాది దృష్టాంతముతో సత్యవతీదేవికి వీర్యప్రాధాన్యము కాక క్షేత్రప్రాధాన్యమే చెప్పవలె నని యెట్లు ప్రతిఘటింపగలడు?

అట్లు ప్రతిఘటించుటకు దృష్టాంతసిద్ధి గావలెను. ఆ దృష్టాంతసిద్ధికై ధృతరాష్ట్రాదులు ప్రతిలోమజాతులు. (నిషాదసంజాతులు) కావలెను. అట్లనుటకు వ్యాసుడు నిషాదుడు కాడనవలెను. అట్లు నిషాదుడు కాడనుటకు తల్లి యగు సత్యవతీదేవి శూద్రకాంత కాదనవలెను. అట్లనుటకు సత్యవతీదేవి జన్మమందు వీర్యప్రాధాన్యమే యొప్పుకొని తీరవలెను. కనుక వ్యాసమహర్షి విప్రుడే. సత్యవతీదేవి క్షత్రియయే; అని సమాధానము. వ్యాసమహర్షివలన జన్మించిన ధృతరాష్ట్రాదులయందు క్షత్రియత్వాదులు ఎట్లు? అను విషయము ముందు చర్చింపబడును.

"ఇంతకును మహాభారతమున సత్యవతికి దాశకన్య, దాశేయి, దాశరాజకన్య అను శబ్దములే చెప్పబడినవి. కాని 'వాసవి, వసురాజకన్య' అను శబ్దములు వ్యర్థములు" (పు 151) అని యాక్షేపము.

వారికి గనబడక యిట్లనుచున్నారు. కనపరచుట మనధర్మము.

"తత్రాజగామ భగవాన్ బ్రహ్మా లోకగురు స్స్వయమ్ ।
హిరణ్యగర్భ మాసీనం తస్మింస్తు పరమాసనే ॥
పరివృత్త్యాఽసనాభ్యాసే వాసవేయః స్థితోఽభవత్ (ఆది. అ 1)
"సాతు సత్యవతీనామ మత్స్యఘాత్యభిసంశ్రయాత్ ।
దృష్ట్వైవ సచ తాం ధీమాన్ చకమే చారుహాసినీమ్ ॥
దివ్యాం తాం వాసవీం కన్యాం రంభోరుం మునిపుంగవః (ఆది. అ63)

పితరః—"అస్మాకం మానసీం కన్యా మత్స్యచ్ఛాపేన వాసవీమ్ ॥
(ఆది. అ64)

జాతః పరాశరా ద్యోగీ వాసవ్యాం కలయా హరేః ॥
(భాగ-స్క-1-అ4)

ఇత్యాది వాసవీశబ్దప్రయోగములుచాల కలవని సమాధానము.

"వసురాజు రాజైనను ఆతని వీర్యముచే నేజాలరివనితయందో పుత్రీపుత్రు లుద్భవింప బుత్రు జేకొని మత్స్యాధీశం జేసి పుత్రి కను దాశునకే పెంచ నిచ్చియుండును" (పు152) అనియాక్షేపము

ఆహా! వసురాజు వీర్యము మ్రింగిన మత్స్యమునుండి సత్యవతీ దేవి జన్మించె నని గ్రంథమునం దుండ ప్రతివాదుల దృష్టి జాలరివని తయందు ప్రసరించుటకు కారణ మేమో? ఇప్పట్టున "స్వయం మూఢో ఽన్యాంశ్చ వ్యామోహయతి. శాస్త్రార్థసంప్రదాయరహితత్వాత్. శ్రుతహాని మశ్రుతకల్పనాంచ కుర్వన్" అను గీతాభాష్య మందలి శంకరభగవత్పాదుల వాక్యము జ్ఞప్తికి వచ్చుచున్నది. ఆసత్యవతీదేవిని పోషించిన దాశుడైనను ఈప్రతివాదు లన్నట్లనియుండలేదు. 'వసు రాజు వీర్యమున జన్మించినది, శంతనుమహారాజు వివాహము చేసికొన దగినది' యనియే చెప్పెను. సత్యవతీవివాహసందర్భములో భీష్ముడు క్షత్రియవర్గమును వెంటబెట్టుకొనివెళ్ళి దాశరాజు నడిగినపుడు ఆత డిట్లు చెప్పెను—

"కోహి సంబన్ధకం శ్లాఘ్య మీప్సితం యౌన మీదృశమ్।
అతిక్రామ న్న తప్యేత సాక్షా దపి శతక్రతుః ॥
అపత్యం చైత దార్యస్య యో యుష్మాకం సమో గుణైః।
యస్య శుక్రా త్సత్యవతీ సంభూతా వరవర్ణినీ ॥

తేన మే బహుశః స్తాత పితా తే పరికీర్తితః ।
అర్థ స్సత్యవతీం వోఢుం ధర్మజ్ఞ స్స నరాధిపః ॥ (ఆది. అ100)

జ్ఞానదీపికా—అర్యస్య=ఉపరిచరస్య; సత్యవతీం వోఢుమర్హః= ఉచిత ఇత్యన్వయః ॥

ఇచ్చట (అపత్యం చైత దార్యస్య) ఈమె యుపరిచరవసువు యొక్క పుత్రిక అని చెప్పి 'యస్యాశుక్రా త్సత్యవతీ సంభూతా' ఎవ్వని వీర్యముువలన సత్యవతి జన్మించినదో అనుటవలన స్త్రీసంబంధము లేకయే కలిగెనని స్పష్టీకరింపబడినది. తరువాత ఉపరిచరవసువు ఈమెను వివాహముచేసికొన దగినవాడు శంతనుమహారాజే యని బహుప్రకారముల జెప్పియుండె ననుటచే సత్యవతీదేవి క్షత్రియయే యని ప్రకటింపంబడినది. ఇట్లే-ఆంధ్రభారతము. (ఆది_4అ.)

ఎవ్వనియోని వీర్యంబున నిక్కన్య యుద్భవిల్లె నట్టి యుపరిచరుండను రాజర్షి యీసత్యవతి నొరుల కీవలదు. శంతనునక యిచ్చునది. అనుటం జేసి ... యిట్టి సంబంధ మెవ్వరికి బడయ నగు"

మరియు నీవత్రిత వాదు లోకచోట వ్రాయుచు "సత్యవతి ... క్షత్రియుడగు శంతనునివలన చిత్రాంగదవిచిత్రవీర్యు లను క్షత్రియులు పుట్టిరి" (పు72) అనిచెప్పియున్నారు. ఆసత్యవతీదేవినే జాలరివనిత యనియు, శూద్ర స్త్రీ యనియు వాడినారు. ఆమె శూద్ర స్త్రీయేయైన యెడల నామెకు జన్మించిన చిత్రాంగదవిచిత్రవీర్యులు క్షత్రియులగుట అసంభవము. చూడుడు. మనుస్మృతి. (అ. 10)

"క్షత్రియా చ్ఛూద్రకన్యాయాం క్రూరాచారవిహారవాన్ ।
క్షత్రశూద్రవపు ర్జన్తు రుగ్రోనామ ప్రజాయతే ॥

వ్యా—క్షత్రియా చ్ఛూద్రకన్యాయా మూఢాయాం క్రూర

చేష్టః క్రూరకర్మరతి శ్చ క్షత్రశూద్రస్వభావ ఉగ్రాఖ్యః పుత్రో జాయతే.

ఈవచనమును బట్టి శంతనమహారాజుచే వివాహము చేసికొన బడినట్టియు, ప్రతివాదిమతప్రకారము శూద్రస్త్రీ యైనట్టియు సత్యవతియందు జన్మించిన చిత్రాంగదవిచిత్రవీర్యులు ఉగ్రజాతీయు లగుదురు కాని క్షత్రియులు కానేరరు. కనుక ప్రతివాదులకు స్వవచన వ్యాఘాతముకూడ ప్రాప్తించినది. ఈకారణములచే సత్యవతీదేవి జాలరివనితయందు పుట్టె ననుట హేయము. సత్యవతీదేవి ప్రతివాదు లన్నట్లు జాలరివనిత కాదు. శూద్రస్త్రీ కాదు. క్షత్రియయే యని సమాధానము.

"ఆవనిత (సత్యవతి) అందకత్తె యగుటచే బరాశరశంతనులు వరింప నర్హయై యుండెను. ... సత్యవతీసౌందర్యలాలసు లయియే పైవా రామెను కోరుచుండిరిగాని ఉత్తమక్షత్రియాంగన యను కారణమున గాదు" (పు. 152) అని యాక్షేపము.

వారాసత్యవతీదేవిని వరించుటలో కేవల సౌందర్యము కాక కేవల క్షత్రియత్వముగాక నుభయము కారణము. ప్రతివాదిమత ప్రకారము చూడగా శంతను సత్యవతీసంతతికి క్షత్రియత్వమే అసంభవము. ఉభయకారణత్వపక్షములో శంతను సత్యవతీ సంతతికి క్షత్రియత్వము సిద్ధించును కనుక సత్యవతీదేవి క్షత్రియయే యని సమాధానము.

"వ్యాసుని తల్లి కైవర్తకన్యయే యనియు, బ్రాహ్మణేతర వనితలకు జన్మించినవారును బ్రహ్మర్షులు కావచ్చు ననియు వజ్రసూచికోపనిషత్తులో గల వాక్యము నింతకు ముందు చూపి యున్నాను. మఱియు భవిష్యదేవీభాగవతవిష్ణుపురాణాదులు

వ్యాసుడు దాశకన్య, లేక కైవర్తకన్యాసంజాతుడే యని స్పష్ట వాక్యములతో చెప్పియున్నవి" (పు. 152) అని యాక్షేపము.

ఐతే వ్యాసుని తల్లి దాశకన్య, లేక కైవర్తకన్య యనుటకు ప్రతివాదు లన్నిగ్రంథనామములు కీర్తింపవలెనా? సీతామహాదేవి అయోనిజయై భూతలమునుండి యావిర్భవించినను జనకుని పోషణ ముచే జానకి యనబడినట్లు వ్యాసజనని క్షత్రియయైనను దాశుని పోషణముచే దాశకన్య యనబడుట కభ్యంతరము లేదు.

వజ్రసూచికోపనిషత్తులో బ్రాహ్మణేతరవనితలకు జన్మించినవారును బ్రహ్మర్షులు కావచ్చుననియు, వ్యాసుడు దాని కుదాహరణ మనియు నున్నదట. దీనికై వ్యాసజనని బ్రాహ్మణేతరవనితకదా కావలసి యున్నది. క్షత్రియస్త్రీకనుక బ్రాహ్మణేతరవనితయే. ఇక నాయుప నిషత్తులోని "వ్యాసః కైవర్తకన్యాయామ్" అను వాక్యార్థసిద్ధి యెట్లం దురు కాబోలు. జానకీశబ్దవ్యవహారము అయోనిజయనుటకును, భూ పుత్రియనుటకును భంగకరము కానట్లు ఈకైవర్తకన్యాశబ్దము సత్య వతీదేవి క్షత్రియత్వమునకు భంజకము గాదు. క్షత్రియయై యుం డియు కైవర్తపోషణమును బట్టి కైవర్తకన్య యని వ్యవహరింపబడెను చూడుడు—(భాగవతము 9 స్కం. అ. 22)

"శంతనో ర్దాశకన్యాయాం జజ్ఞే చిత్రాంగద స్సుతః ॥"

శ్రీధరీయమ్—

దాశకన్యాయా మితి. ఉపరిచరవసో ర్వీర్యేణ మత్స్యాగర్భా దుత్పన్నా కన్యా దాశైః కైవర్తైః పాలితా. అతో దాశకన్యేతి ప్రసిద్ధాయామ్ ॥

ఈగ్రంథము పైవిషయమునే ధ్రువపరచుచున్నది. కనుక సత్యవతీదేవి ప్రతివాదు లన్నట్లు కైవర్తజాతిస్త్రీ కాదు. క్షత్రియజాతిస్త్రీయే యని సమాధానము. ఇంతవరకు సత్యవతీదేవి క్షత్రియయే యను సిద్ధాంతముపై ప్రతివాదుల ఆక్షేపపరంపర ప్రమాణోపపత్తులతోడను, ప్రతివాదిపూర్వాపరవచనవిరోధప్రదర్శనములతోడను పరిహరింపబడి సమాధానపరంపరచే వ్యాసజనని యగు సత్యవతీదేవి క్షత్రియయే యని స్థిరపరుపబడినది. ఇక నీయంశమును విడిచి వ్యాసభగవానునిపై ప్రతివాదుల ఆక్షేపముల నవలోకింతము.—

—♦ వ్యాసుడు చండాలజాతిజుడనుప్రసంగము-తన్నిరాకరణము ♦—

"బ్రాహ్మణుడు సితవర్ణుడుగా నుండవలయు నని శాంతిపర్వమున గలదు. వ్యాసు డసితవర్ణుడు. మరియు కైవర్తజాతి షోడశవిధచండాలజాతియందును నధమ మని హేమాద్రికృత చతుర్వర్గచింతామణిలో గలదు. అందువలననే వ్యాసుని చండాలజాతిజుడని చెప్పితిని. కాని బ్రహ్మర్షియే" (మ. భా. చ. పు. 153)

ఆహా! చండాలజాతిజు డట! బ్రహ్మర్షి యట! ఇది యజ్ఞానవిలసితము. అన్యజాతీయునకు ఆశరీరముతో బ్రహ్మర్షిత్వ మసంభవమను సంగతి వెనుక వాల్మీకినిషాదత్వనిరాకరణఘట్టములో ధర్మఖండకథాసందర్భమున నిందబృహస్పతిసంవాదమువలన స్పష్టీకరింపబడి యున్నందున ప్రతివాదుల వ్రాత హేయము.

ఇచ్చట 'చండాలజాతిజు డని చెప్పితిని' అను వాక్యములోని చండాలజాతిపదముచే మరల సత్యవతీదేవిని స్పృశించుచున్న ట్లున్నది. "సతికుడ్యే చిత్రరచనా" అన్నట్లు సత్యవతీదేవియందు ఆ కైవర్తజాతి సిద్ధించినపుడుకదా, దానిపై ప్రతివాదుల మనోరథసౌధనిర్మాణము! అది యున్మూలిత మగుటచే వారి మనోరథసౌధము పతితమైనది.

మరియు వెనుక "వ్యాసుడు మొదలగువారు వారి తల్లు లే జాతివారైనను బీజప్రాధాన్యతపోవిశేషములచే మహాత్ము లైరి... జాలరివనిత యగు సత్యవతికి... క్షత్రియు డగు శంతనునివలన చిత్రాంగద విచిత్రవీర్యులను క్షత్రియులు పుట్టిరి" (పు. 72)

అని వ్రాసిన మ. భా. చ. కారులు పరాశరపుత్రు డగు వ్యాసునియందును, శంతనుపుత్రు లగు చిత్రాంగదవిచిత్రవీర్యుల యందును క్షేత్రప్రాధాన్యము కాక వీర్యప్రాధాన్యమునే మొకమూల నంగీకరించుచున్న ఆనోటితోనే నిచ్చట 'వ్యాసుని చండాలజాతిజు డని చెప్పితిని' అనుట పెత్రియా? బుద్ధియా? బ్రాహ్మణుడు సితవర్ణుడుగా నుండవలె నని శాంతిపర్వమున గలదట! వ్యాసు డసితవర్ణు డట! అనగా నసితవర్ణు డగుటచే వ్యాసుడు బ్రాహ్మణుడు కాడట! (చండాల జాతిజు డన్నమాట.) కాని బ్రహ్మర్షియేనట! ఔరా! బ్రహ్మర్షి, రాజర్షి, దేవర్షిశబ్దములు ఆయాఋషులయందలి జాతివిశేషమునకు స్ఫోరకము లగుచుండ, వ్యాసుని బ్రహ్మర్షియే యనుచు బ్రాహ్మణేతరు డనుటయు, పరాశరపుత్రు డగు వ్యాసుని జన్మమునందు వీర్యప్రాధాన్యమేకాని క్షేత్రప్రాధాన్యము కాదనుచు వ్యాసుని అబ్రాహ్మణు డనుటయు పాపభీతిలేని మ. భా. చ. కారులకే చెల్లినది.

బ్రాహ్మణుడు సితవర్ణుడుగా నుండవలె నని శాంతిపర్వమున గలదట! ఆసందర్భ మేమో చూతము— శాంతిపర్వ (అ. 188)

భృగుః—

"బ్రాహ్మణానాం సితో వర్ణః క్షత్రియాణాన్తు లోహితః ।
వైశ్యానాం పీతకో వర్ణ శ్శూద్రాణా మసిత స్తథా ॥"

మ. భా. చ. కారు లన్న విషయ మిది. ఇచ్చట వారి యర్థ

మును జెట్టి బ్రాహ్మణులకు సితవర్ణము, (తెలుపు) క్షత్రియులకు లోహితవర్ణము, (ఎరుపు) వైశ్యులకు పీతవర్ణము, (పసుపు) శూద్రులకు అసితవర్ణము, (నలుపు) లక్షణ మని చెప్పబడిన దన్నమాట. వ్యాసుని యందు బ్రాహ్మణునకు లక్షణముగా జెప్పబడిన రంగు లేదను ప్రతివాదులు ఇతరవర్ణములవారికి లక్షణముగా జెప్పబడినవి ఆయా వర్ణములవారి కందరకు నున్న వందురా? అన్యుల మాటకేమి. బ్రాహ్మణున కుండవలసిన ఆ సితవర్ణము ముందీప్రతివాదులయం దున్నదా? నీలమేఘశ్యాము డగు శ్రీరాముసియందు క్షత్రియున కుండవలసినట్లు చెప్పబడిన లోహితవర్ణము లేదు కనుక క్షత్రియుడు కా డనసలసిన దేనా? లోకవిరుద్ధ మైన యిట్టి యర్థమును ఆశ్లోకమునకు చెప్పుట తగునా? కనుక వాస్తవార్థమును ఆశ్లోకమునకు గ్రహించుటకు వ్యాఖ్యానమే శరణ్యము. అందుకై ఆసందర్భము జూతము—

భృగుః—

"అసృజ న్బ్రాహ్మణానేవ పూర్వం బ్రహ్మ ప్రజాపతీన్ ।
ఆత్మతేజోఽభినిర్వృత్తాన్ భాస్కరాగ్నిసమప్రభాన్ ॥
తత స్సత్యంచ ధర్మంచ తపో బ్రహ్మచ శాశ్వతమ్ ।
ఆచారం చైవ శౌచంచ స్వర్గాయ విదధే ప్రభుః ॥"

నీలకంఠీయమ్—

కథం సృష్టాని భూతా నీత్యస్యోత్తర ముక్త్వా కథం వర్ణవిభక్తయ ఇత్య స్యోత్తర మాహ. అసృజ దిత్యాది. తత్ర పూర్వం చిత్తప్రసాదే నాన న్య మస్మితఇత్యుక్తం. చిత్తప్రసాదశ్చ ధర్మఫల మతో ధర్మం నిరూపయతి—బ్రాహ్మణాన్=బ్రహ్మనిష్ఠాన్; ప్రజాపతీన్=మరీచ్యంగిరఆదీన్; ఆత్మన స్తేజః=సత్యసంకల్పత్వాదిసామర్థ్యమ్; తేన నిర్వృత్తాః=నుత్పాదితాన్; ధర్మం=యజ్ఞాదిం; తపః=కృచ్ఛ్ర

చాంద్రాయణాది; శాశ్వతం బ్రహ్మ=నిత్యం వేదం; ఆచారం=స్నా
నాదిం; శౌచం=ప్రాయశ్చిత్తాది;

దేవదానవగంధర్వా దైత్యాసురమహోరగాః ।
యక్షరాక్షసనాగాశ్చ పిశాచా మనుజా స్తథా ॥
బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా శ్శూద్రాశ్చ ద్విజసత్తమ! ।
యే చాన్యే భూతసంఘానాం వర్ణా స్తాం శ్చాపి నిర్మమే ॥
బ్రాహ్మణానాం సితో వర్ణః క్షత్రియాణాన్తు లోహితః ।
వైశ్యానాం పీతకో వర్ణ శ్శూద్రాణా మసిత స్తథా ॥

టీ—వర్ణాః=సాత్వికం రాజసం తామసం మిశ్రంచేతి. స్వచ్ఛ
త్వాదిసామ్యాత్ గుణవృత్తం వర్ణశబ్దే నోచ్యతే; సితః=స్వచ్ఛః సత్వ
గుణః ప్రకాశాత్మా శమదమాదిస్వభావః; లోహితో=రజోగుణః
ప్రవృత్త్యాత్మా శౌర్యతేజఆదిస్వభావః; పీతకః=రజస్తమోభ్యామిశ్రః
కృష్యాదినిహీనకర్మప్రవర్తకః; అసితః=కృష్ణః ఆవరణాత్మా తమో
గుణః స్వతఃప్రకాశప్రవృత్తిహీనః శకటవ త్పరప్రేర్యః ॥

ఇచ్చట చిత్తశుద్ధిహేతు వగు ధర్మము నిరూపింపబడుచున్నది.
బ్రహ్మ, పూర్వము బ్రహ్మనిష్ఠులగు మరీచిప్రభృతులైన ప్రజాపతు
లను సృజించి సత్యము, యజ్ఞాదిధర్మము, కృచ్ఛ్రచాంద్రాయణాదిత
పస్సు, నిత్యమైనవేదము, స్నానాద్యాచారము, ప్రాయశ్చిత్తాదిరూ
పమైన శౌచము, అను స్వర్గసాధనములను విధించెను. దేవదానవగంధ
ర్వాదులయొక్కయు, బ్రాహ్మణాదిచతుర్వర్ణములయొక్కయు వర్ణము
లను—అనగా సాత్త్వికరాజసతామసమిశ్రము లనబడు సత్త్వాదిగుణకృ
తవ్యాపారములను నిర్మించెను. బ్రాహ్మణులకు సితవర్ణము—అనగా
ప్రకాశాత్మకమై శమదమాదిస్వభావముకల సత్త్వగుణము, క్షత్రియు
లకు లోహితవర్ణము—అనగా ప్రవృత్త్యాత్మకమై శౌర్యాదిస్వభావము

కల రజోగుణము, వైశ్యులకు పీతవర్ణము-అనగా కృష్యాదినిహీనకర్మ ప్రవర్తకమైన రజస్తమోవ్యామిశ్రగుణము శూద్రులకు, అసితవర్ణము-అనగా ఆవరణాత్మకమై స్వతః ప్రకాశప్రవృత్తిరహితమైన తమోగుణము నిర్మింపబడెను. అని యర్థముచెప్పబడెనే కాని రంగులని చెప్పబడలేదు. ఇటుపైనున్న శంకాసమాధానగ్రంథముచే చాతుర్వర్ణ్యములకును అసాధారణధర్మములు చెప్పి వేసినిబట్టి బ్రాహ్మణాదివర్ణవిభాగము గ్రాహ్యమనుచు సాత్త్వికత్వాదిరూపవర్ణవిభాగమునకు కారణము ధర్మమే యని చెప్పబడెను. ఇట్లు పరిశీలింపగా "బ్రాహ్మణానాం సితో వర్ణః" అను శాంతిపర్వశ్లోకమున కపార్థము చెప్పి వ్యాసభగవానుని నిందించిన మ. భా. చ. కారుల హాస్యాస్పదప్రసంగ మసాస్త్రమైనది. అంశాంతరమందుకొందము.

## నిషాదుఁడైన వ్యాసునకు బ్రాహ్మ్యసంస్కారము లను ప్రసంగము-తన్నిరాకరణము.

"వ్యాసుడు వాల్మీకివలె గాక మొదటనే బ్రాహ్మ్యసంస్కారముల నొంది వినుతి కెక్కిన గ్రంథము రచించెను"

(మ. భా. చ. పు 159)

ఈప్రతివాదులు వాల్మీకి మొదట బ్రాహ్మ్యసంస్కారముల నొందలే దనుచున్నారు. వాల్మీకి యనగా వల్మీకప్రభవుడు. వసిష్ఠాదులాతనిని వల్మీకమునుండి యభివ్యక్తము జేసినతరువాత "వసిష్ఠమునీంద్రుండతనికి ప్రచేతసునిచేత వేదోక్తక్రమంబున జాతకర్మాద్యఖిలసంస్కారంబులు చేయించెను" అని వెనుక జూపబడిన ధర్మఖండమునుబట్టి వాల్మీకికి బ్రాహ్మ్యసంస్కారములు వెంటనే జరిగినందున ప్రతివాదుల వ్రాత తప్పు. వ్యాసునకు బ్రాహ్మ్యసంస్కారములు మొదటనే జరిగినవనుచున్న ప్రతివాదుల నడుగవలసియున్నది. బ్రాహ్మ్య

సంస్కారములనగా బ్రాహ్మణునకు జేయు సంస్కారములా? అబ్రాహ్మణునకు జేయు సంస్కారములా? మీ మతమున నిషాదుడు, చండాలజాతిజుడు నగు వ్యాసునకు, బ్రాహ్మణునకు జేయబడు సంస్కారము లెట్లు చేయబడినవి? ఇక నబ్రాహ్మణునకు బ్రాహ్మ్యమునిమిత్తము చేయబడు సంస్కారము లందురా? అట్టిసంస్కారములేవి? వానిని బోధించు విధులేవి? పాలౌకికవిషయమైన ధర్మఖండములో జెప్పబడినట్లు అవి వేదోక్తసంస్కారములే యనవలెను. అవి "బ్రాహ్మణ ముపనయీత" ఇత్యాదివచనములచే బ్రాహ్మణజాతికి జేయవలసినవే కాని నిషాదాదులకు జేయువలసినవి కావు. కనుక నిది యసంగతప్రసంగము.

"వ్యాసశ్చ భగవాన్ విప్రః దేవర్షిగణసేవితః" అని మహాభారతమున బహుస్థలములలో వ్యాసుడు విప్రుడని చెప్పబడుటచేతను, బ్రాహ్మ్యసంస్కారముల నొందుటచేతను తద్విరుద్ధమగు ప్రతివాదుల ఈవ్రాత పరాస్తము.

అంశాంతరమందుకొందము —

వ్యాసు డంబికాదులయందు ప్రవర్తించుటచే
దోషియను ప్రసంగము—తన్నిరాకరణము.

"తల్లి యానతి యను నెపమున రాణివాసము జేరి రాణులను గూడి తన నైష్ఠికబ్రహ్మచర్యవ్రతమునకు లోపము కలుగజేసికొనెను. అవకీర్ణి చేయదగిన గర్దభేష్టిం జేసెనో లేదో కాని వ్యాసునంతటివాడు వ్రతభ్రష్టు డగుట యెట్టిదని పూర్వమీమాంసాశాస్త్రజ్ఞులు 'ధర్మవ్యతిరిక్తసాహస' విచారణములో నానావిధము లగు తిప్పలుపడి మహాత్రిజ్ఞ కాన వ్యాసుడు దోషి కాడని సరిపెట్టుకొనిరి" (మ. భా. చ. పు. 159)

ఆహా! ఈప్రతివాదులది దివ్యదృష్టికనుక వ్యాసుడు రాణులను కూడుటలో తల్లి యాసతి యనునది నెపమే యని వ్యాసభగవానుని హృదయము తెలిసికొని చెప్పుచున్నారు. వీరు వ్యాసభగవానునకు నైష్ఠికబ్రహ్మచర్యవ్రతలోపము కలిగె ననుచున్నారు. ఔను; దివాంధమునకు మహోజ్జ్వల మగు మధ్యాహ్నమార్తాండమండలమందు గాఢాంధకారానుభవ మని లోకప్రసిద్ధి. ఈప్రతివాదులు పూర్వమీమాంసాశాస్త్రమును కీర్తించుచున్నారు. కనుక దానిని జూతము.

“అపివా కారణాగ్రహణే ప్రయుక్తాని ప్రతీయేరన్” (జై. సూ. 1 అ. 3 పా)

తన్త్రవార్తికము—

అత్ర సదాచారా నుదాహృత్య త్రివర్గసిద్ధ్యర్థం విచార్యతే. తద్విపరీతసంకీర్ణవ్యవహారిషు శిష్టేష్వపథ్యకారి వైద్యాతురవదవిస్రంభణీయచరితత్వాత్. సంభావ్యమానవేదమూలత్వాచ్చ ధర్మసంశయం దర్శయిత్వా సదాచారేషు హి దృష్టో ధర్మవ్యతిక్రమః సాహసంచ మహతామ్॥

న్యాయసుధా—

తద్విపరీతేతి. త్రివర్గవిపరీతై రధర్మాఽనర్థదుఃఖసాధనై రాచారై స్సంకీర్ణో వ్యవహారో యేషా మితి విగ్రహః. వైద్యశ్చాసావాతురశ్చేతి కర్మధారయం కృత్వా పూర్వపదేన కర్మధారయః కార్యః॥ లోభాద్యభిభవా త్సన్నిహితాఽనర్థాఽదర్శనే నాధర్మాచరణం ధర్మవ్యతిక్రమః దృష్ట స్యాప్యనర్థస్య బలవత్త్వే నానాదరా దధర్మాచరణం సాహసమ్॥

తన్త్రవార్తికమ్—

"కృష్ణద్వైపాయనస్యాపి గృహీతనైష్ఠికబ్రహ్మచర్యస్య విచిత్రవీర్యదారేష్వపత్యోత్పాదనప్రసంగః"... ఇతి ప్రాప్తేఽభిధీయతే—'అపివా కారణాగ్రహణే ప్రయుక్తాని ప్రతీయేరన్,' ఇతి।

"దృష్టకారణహీనాని యాని కర్మాణి సాధుభిః ।
ప్రయుక్తాని ప్రతీయేరన్ ధర్మత్వే నేహ తాన్యపి ॥
శరీరస్థితయే యాని సుఖార్థంవా ప్రయుంజతే ।
అర్థార్థం వా నతేష్వస్తి శిష్టానా మేవ ధర్మధీః"

తపోబలారూఢస్య చరితం తత్ 'సర్వం బలవతః పథ్యమ్' ఇతి న్యాయేన మహాన్తిప తపాంసి కృత్వా తాని క్షయం నయతః ఉత్తరకాలంవా పాపవిశుద్ధిం ప్రాయశ్చిత్తైః ప్రతికుర్వాణస్య జీర్యత్యపి. మన్దతపసా మగజైరివ మహావటకాష్ఠాదిభక్షణ మాత్మవినాశాయైవ స్యాత్. ద్వైపాయనస్యాపి గురునియోగాత్ "అపతి రపత్యలిప్సుర్దేవరా ద్గురుప్రేరితా దృతుమతీయాత్" ఇత్యేవ మాగమాత్ మాతృసంబన్ధభ్రాతృజాయాపుత్రజననం ప్రాక్కృతపశ్చాత్కరిష్యమాణతపోబలేన నాతిదుష్కరమ్. అన్యోఽపి య స్తాదృ క్తపోబలో నిర్వహేత్స కుర్యాదేవ ॥

ఈగ్రంథమునకు తాత్పర్య మిది—రోగులకు పథ్య ముపదేశించుచు తాను రోగగ్రస్తుడై యపథ్యము జేయు వైద్యునియందు విశ్వాస ముండనట్లు అధర్మానర్థదుఃఖమూలములైన యాచరణముల చేత సంకీర్ణవ్యవహారముకల శిష్టుల చరిత్రము శంకింపదగియుండుటవలనను, వేదమూలకత్వము సంభావింపబడుచుండుట వలనను ధర్మసంశయమును ప్రదర్శించి విచారణ చేయబడుచున్నది.

సదాచారములలో ధర్మవ్యతిక్రమము (లోభాద్యావేశమున సన్నిహితానర్థమును గమనింపక యధర్మ మాచరించుట) సాహసము (దృష్టమైన యనర్థమును బలదర్పమున గణింపక యధర్మ మాచరించుట) గోచరించుచున్నవి. నైష్ఠికబ్రహ్మచర్యము గ్రహించిన కృష్ణద్వైపాయనునకు విచిత్రవీర్యుని భార్యలయందు సంతతిగలిగించుట ధర్మవ్యతిక్రమము. అని పూర్వపక్షము రాగా సమాధానము చెప్పబడుచున్నది. దృష్టఫలరహితములై సత్పురుషులచే నాచరింపబడిన కార్యములు ధర్మములు. శరీరస్థితికొరకు, సుఖముకొరకు, ధనముకొరకు ఆచరింపబడు కార్యములను ధర్మములని శిష్టులుభావింపరు. ఇక వ్యాసమహర్షి విషయ మేమనగా. "సర్వం బలవతః పథ్యమ్" అను న్యాయమునుబట్టి, మహాతపస్సులు చేసి వాని నవసరమును బట్టి యొకానొక కార్యములో వినియోగించునట్టియు, ననంతరమైనను దోషనివృత్తికై ప్రతిక్రియ లాచరించునట్టియు, తపోబలాఢ్యుని కృత్యము వటకాష్ఠభక్షణము గజములకువలె జీర్ణించునుగాని బాధింపదు. ఆత పశ్శక్తి లేనివానికట్టి కృత్యము, వటకాష్ఠభక్షణ మన్యజంతువునకువలె నాత్మవినాశకరమే యగును. గురుజననియోగమును బట్టియు, శాస్త్రమును బట్టియు, పూర్వము చేయబడినదియు, పరమందు చేయబడునదియు నగు తపముయొక్క బలముచే విచిత్రవీర్యభార్యలయందు సంతతి గలిగించుట మహర్షికి దుష్కరము కాదు. అట్టి తపోబలము కలవా డెవ్వడైన నిర్వహింపవచ్చును. అని

ఇట్లు పూర్వమీమాంసాశాస్త్రము చర్చించి, గురుజననియోగమును బట్టియు, శాస్త్రమును బట్టియు, తపోబలముచే వ్యాసమహర్షి కది చెల్లినదని నిరూపించియుండగా 'పూర్వమీమాంసాశాస్త్రజ్ఞులు నానావిధములగు తిప్పలు పడి సరిపెట్టుకొనిరి' అని ప్రతివాదులందురే! వారు పడిన తిప్పలేమున్నవి? మాతాజ్ఞ, ప్రమాణబలము,

తపోబలము, వ్యాసభగవానుని ప్రవృత్తికి మూలమనుట త్రిప్పలు పడుటా? (తుదకు దోషి కాడని సరిపెట్టుకొని రట.) శాస్త్రకారులు పూర్వపక్షసిద్ధాంతములతో గ్రంథములు వ్రాయుట తాము సరిపెట్టు కొనుటకా? మందమతుల బుద్ధిమాంద్యమును పోగొట్టుటకా? శబ్ద వ్యాపారము పరులకు బోధించుట కని ప్రతివాదులకు తెలియదు కా బోలు. వారు సరిపెట్టుకొని రనగా తమకు సరిపడలేదని తాత్పర్యము కాబోలు. ఆర్షవచనములందుఁ ఆదరాతిశయముకలిగి సంచరించు టకు అట్టి యదృష్ట ముండవద్దా?

"నైష స్థాణో రపరాధః యదేన మన్ధో న పశ్యతి. పురుషా పరాధ స్సభవతి" అనునట్లు శాస్త్రములను విశ్వసింపకుండుట విశ్వ సింపనివాని దోషమే కాని శాస్త్రముల దోషము కాదు. కనుకనే కృష్ణద్వైపాయనుని ధర్మవ్యతిరిక్తకార్యమును గూర్చి శాస్త్రములో చూపిన పూర్వపక్షము మ. భా. చ. కారులకు ప్రియమై దాని సమాధానము వెగటైనది. అదియే హృదయదోషము.

ఈప్రతివాదులు శాస్త్రకారులు చెప్పియున్న విషయము నిట్లు తృణీకరించుచు "మాతాజ్ఞకు వ్యతిరేకముగా దాసిం గూడుటకు పూర్వమీమాంసకు లెట్టి సమాధాన మిచ్చెదరో" (పు 159)

అని యడుగుచున్నారు. అణీమాండవ్యమహర్షి యమధర్మ రాజును "శూద్రయోనా వతో ధర్మ! మానుష స్సంభవిష్యసి" అని శపించియుండుటను బట్టి త్రికాలజ్ఞాననిధి యగు వ్యాసభగవానుడు ఆయముధర్మరాజు అంశము ఆమెయందు తనమూలమున జన్మింపవలసి యున్న విధిని గ్రహించి మహాతపశ్శక్తికలవాడు కనుక నట్లు వ్యవహ రించె ననుచు సమాధాన మిచ్చెద రని తెలుపుచున్నాము. ఇట్లు పూర్వమీమాంసకులు వ్యాసమహర్షికి పుత్రోత్పాదనప్రసంగము తపోబలముచే దోషావహము కాదని బోధించినారు.

ఉత్తరమీమాంసకులుగూడ యావదధికారాధికరణమున వేద వ్యాసప్రభృతులు ఆధికారికపురుషు లనియు, బ్రహ్మనిష్ఠు లనియు, అధికారసమాప్తిపర్యంతము వారు జీవన్ముక్తులై యుందురనియు, వారి కాగామిసంచితకర్మము లంటవనియు, శ్రుతిస్మృతిప్రమాణము లతో నిరూపించి—

"యథైధాంసి సమిద్ధో గ్ని ర్భస్మసా త్కురుతేఽర్జున।
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసా త్కురుతే తథా॥"

అను గీతావచన ముదాహరించి యాజ్ఞాననిష్ఠుల సర్వవిధకర్మ ములు జ్ఞానాగ్నిదగ్ధములగును. కనుక వారి కేవిధమైన దోష ముంట దని చెప్పియున్నారు. ఇట్టిస్థితిలో శాస్త్రమర్యాదను పాటింపక వ్యాస భగవానుని నిందింపబూనిన మ. భా. చ. కారుల నేమనవలెనో.

ఇక దీని నిట్లుంచి తల్లి యానతి యనునది నెప మనుచున్న మ. భా. చ. కారులకు ఆతల్లి యాజ్ఞ గ్రంథమం దెట్లున్నదో వినిపింతము—

విచిత్రవీర్యు డపుత్రకుడై గతింప సత్యవతీదేవి భీష్మునితో నీవు సర్వధర్మవిదుడవు. ఈభరతవంశము నిన్నాధారపడియున్నది. అనుచు నిట్లుపదేశించెను—

"కార్యే త్వాం వినియోక్ష్యామి తచ్ఛ్రుత్వా కర్తు మర్హసి।
మమ పుత్ర స్తవ భ్రాతా వీర్యవాన్ సుప్రియ శ్చ తే॥
బాల ఏవ గత స్స్వర్గ మపుత్రః పురుషర్షభ।
ఇమే మహిష్యౌ భ్రాతు స్తే కాశిరాజసుతే శుభే॥
రూపయౌవనసంపన్నే పుత్రకామే చ భారత।
తయో రుత్పాదయాపత్యం సంతానాయ కులస్య నః॥

మన్నియోగా న్మహాబాహో! ధర్మం కర్తు మిహార్హసి।
రాజ్యే చైవాభిషిచ్యస్వ భారతా ననుశాధి చ॥
దారాంశ్చ కురు ధర్మేణ మా నిమజ్జీః పితామహాన్॥"

నీలకంఠీయమ్—

రాజ్యేచైవ=రాజ్యఏవవా; ఆత్మాన మభిషిచ్యస్వ=అభిషేచయ; కురు=బ్రహ్మచర్యసంకల్పా త్ప్రభృతి త్యక్తాన్ సంతత్యర్థ మంగీకురు; **మా నిమజ్జీః=మా నిమజ్జయ...**

నిన్నొక కార్యమందు నియోగించుచున్నాను. నీ వట్లు చేయ దగినవాడవు. నాపుత్రుడు, నీసోదరుడునైన విచిత్రవీర్యునిభార్యలు పుత్రార్థినులై యున్నారు. వంశవృద్ధికై నానియోగముచే నీవు వార లకు సంతతి గలిగింపుము; ఈధర్మ మంగీకరింపుము. లేక రాజ్యమం దైనను నీవభిషిక్తుడవు కమ్ము. బ్రహ్మచర్యసంకల్పము మొదలుకొని త్యజింపబడిన దారలను సంతతికై యంగీకరింపుము. ఇది సత్యవతీదేవి భీష్మున కుపదేశించిన విషయము.

భీష్మునకు వింతతూద్వాహ ప్రేరణ మను ప్రసంగము—
తన్నిరాకరణము.

ను. భా. చ. కారు లీవచనములనే ప్రదర్శించి "ఆనాడు వితంతూద్వాహము తప్పుగా నెన్నబడలేదు" (పు 76) అనుటకు నిదర్శన మిదియే యనిరి. ఆశ్లోకముల కర్థము వ్రాయుచు "నీ సోదరుని భార్యలయందు సంతతి గనుమా! రాజ్యమునం దభిషిక్తు డవు కమ్ము. ఈ నీసోదరభార్యలను నీభార్యలగా జేసికొనుము" అని వ్రాసిరి.

అసలిచ్చట వంశవృద్ధి, రాజ్యపరిపాలనము ప్రస్తుతాంశము. కాని వింతతూద్వాహము కాదు. అందు వంశవృద్ధికై నియోగవిధిని బట్టి నీసోదరభార్యలయందుగాని లేక బ్రహ్మచర్యసంకల్పము మొదలు భార్యాపరిగ్రహములేని నీవు భార్యాపరిగ్రహము చేసి యిచ్చట గాని సంతతి గను మనియు, రాజ్యాభిషిక్తుడవు కమ్మనియు, చెప్పియుండ నీసోదరభార్యలను నీభార్యలుగా జేసికొను మని సత్యవతీదేవి భీష్ముని వితంతూద్వాహమునకు పురికొల్పె నను మ, భా, చ, కారుల వ్రాత హేయము. మఱియు,

"న వివాహవిధా వుక్తం విధవావేదనం పునః"

వ్యా—"నచ వివాహవిధాయక శాస్త్రేఽన్యేన పురుషేణ పున ర్వివాహ ఉక్తః" అని వింతతూద్వాహము వివాహవిధాయకశాస్త్ర మందు చెప్పబడలే దని మనుస్మృతి యుద్ఘోషించుచుండుటను బట్టి కూడ ప్రతివాదిప్రసంగము నింద్యము.

మఱియు సత్యవతిదేవిచే భీష్ముని కుపదేశింపబడినవి మూడు విషయములు. అందు 'తయో రుత్పాదయాపత్యం మన్నియోగాత్' నా నియోగమువలన అంబికాంబాలికలయందు సంతతి ననుగ్రహింపుము, అని యొకటి "రాజ్యే చైవాభిషిచ్యస్వ" రాజ్యమందైన నభిషిక్తుడవు కమ్ము. అని యొకటి. "దారాంశ్చ కురు ధర్మేణ" 'బ్రహ్మచర్యసంకల్పాత్ప్రభృతి త్యక్తాః సంతత్యర్థ మంగీకురు' బ్రహ్మచర్య సంకల్పము మొదలుత్యజింపబడిన దారలనుసంతతికై యంగీకరింపుము. అని యొకటి. ఇచ్చట 'దారాంశ్చ కురు ధర్మేణ' అను మూడవ విషయము కూడ నంబికాంబాలికల నుద్దేశించియే చెప్పబడిన దనుచున్న ప్రతివాదుల నడుగవలసియున్నది— "నీసోదరభార్యలయందు సంతతి గనుము, ఈ నీసోదరభార్యలను నీభార్యలుగా జేసికొనుము" అను విూ వ్రాతకు సంతతిగని యామెపై భార్యలుగా జేసికొను మని తాత్పర్యమా? లేక భార్యలుగా జేసికొని యామెపై సంతతి గను మని తాత్పర్యమా?

ప్రథమపక్షములో—

"దేవరాద్వా సపిండాద్వా స్త్రియా సమ్యఙ్నియుక్తయా ।
ప్రజేప్సితాధిగన్తవ్యా సన్తానస్య పరిక్షయే ॥" (శ్లో. 59 అ. 9)

అను మనువచనముచే నియోగవిధివలన సోదరభార్యలయందు సంతతి గను మనెననుట యుక్తమే కాని యూపై వారలఁ భార్యలుగా జేసికొను మనెననుట అయుక్తము. చూడుఁడు—

"విధవాయాం నియోగార్థే నిర్వృత్తేతు యథావిధి ।
గురువచ్చ స్నుషావచ్చ వర్తేయాతాం పరస్పరమ్ ॥" (అ 9)

అనగా నియోగఫలము సిద్ధించినతరువాత నా పురుషుఁడు గురువువలెను, స్త్రీ కోడలువలెను వర్తింపవలెను. అనిభావము. కనుక ప్రథమపక్షము హేయము.

ఇక భార్యలఁ జేసికొని సంతతిఁగనుట, యను ద్వితీయపక్షములో ప్రతివాదికల్పించిన వితంతూద్వాహము.

"న వివాహవిధా వుక్తం విధవావేదనం పునః ।"

అను పూర్వోక్తమనువచనముచే దూష్యమే కద. ఇంకొకటి.

వితంతువులగు సోదరభార్యలను ప్రతివాదు లన్నట్లు భీష్ముఁడు వివాహము చేసికొనుటే తటస్థించినపుడు వారు భీష్మభార్య లనబడుదురే కాని సోదరభార్య లనబడరు. ఇట్లుండ "నీసోదరభార్యలయందు సంతతి గనుము" అని చెప్పినట్లున్న ప్రతివాదుల వ్రాతకిప్పుడు గతియే మున్నది? మఱియొకటి. సత్యవతీదేవి వాక్యము లిట్లున్నవి—

"మమ పుత్ర స్తవ భ్రాతా. బాలఏవ గత స్స్వర్గ మపుత్రః.

ఇమే మహిష్యౌ భ్రాతుస్తే. పుత్రకామే, తయో రుత్పాదయాపత్యం సంతానాయ కులస్య నః. మన్నియోగా న్మహాబాహో ధర్మం కర్తు మిహార్హసి”

ఈవాక్యములు నియోగవిధికి జెందినవికాని వితంతూద్వాహము నకు జెందినవి కావు. నియోగపద్ధతి క్షేత్రజసంతతి నపేక్షించియుండును వివాహపద్ధతి వివాహము జేసికొనినవాని యౌరససంతతి నపేక్షించి యుండును. భీష్ముడు వివాహము చేసికొనియే వారలయందు సంతతిగ నుట తటస్థించిన యెడల నది భీష్ముని కౌరససంతతి యగును కానివిచి త్రవీర్యునకు క్షేత్రజసంతతి కానేరదు. ఇట్టిస్థితిలో విచిత్రవీర్యునకు క్షేత్రజసంతతితాత్పర్యముతో “నీసోదరభార్యలయందు సంతతిగ నుము” అని చెప్పబడినట్లు వ్రాసిన ప్రతివాదుల కీద్వితీయపక్షముబా ధకమే. మఱియు వితంతువుల భార్యల జేసికొనుట వివాహ విధికే. గాక, నియోగవిధికిగూడ విరుద్ధమే. చూడుడు—

“విధవాయాం నియుక్తస్తు ఘృతాక్తో వాగ్యతో నిశి.
ఏక ముత్పాదయే త్పుత్రమ్”

వ్యా-ఘృతాక్తసర్వగాత్రోమౌనీ రాత్రా వేకపుత్రంజనయేత్॥
“నియుక్తాయా మపి పుమా న్నార్యాం జాతో ఒవిధానతః।
నైవార్హః పైతృకం రిక్థం పతితోత్పాదితో హి సః॥”
“యాని యుక్తా ఒ న్యతః పుత్రం దేవరా ద్వా ప్యవాప్నుయాత్।
తం కామజ మరిక్థీయం వృథోత్పన్నం ప్రచక్షతే॥”

వ్యా-యా స్త్రీ గుర్వాదిభిరనుజ్ఞాతా దేవరాద్వా ఒన్యతోవా సపిండాద్వా పుత్ర ముత్పాదయేత్. సయుని కామజో భవతి. తదా త మరిక్థభాజం మన్వాదయో వదన్తి. అకామజ ఏవ రిక్థభాక్. సచ వ్యాహృతో నారదేన—

"ముఖా న్ముఖం పరిహరన్ గాత్రై ర్గాత్రా ణ్యసంస్పృశన్ ।
కులే తదవశేషేచ సంతానార్థం న కామతః" ఇతి.

వితంతుస్త్రీయందు నియోగింపబడినవాడు దేహ మంతటను నెయ్యి బూసికొని, మౌనము వహించి, ఋతియందు పుత్రుని కలిగింప వలెను. యోగింపబడిన స్త్రీయందైనను విధివిరుద్ధముగా జన్మించిన పుత్రుడు పతితోత్పాదితు డగుటవలన దాయభాగమున కధికారి కాడు. గురుజననియుక్తురాలైన స్త్రీ కామపూర్వకప్రవృత్తికలదై పుత్రుని గని నవుడు ఆపుత్రుడు దాయభాగమున కర్హుడు కాడని మన్వాదులు చెప్పు చున్నారు. కామమూలకప్రవృత్తివలనబుట్టినవాడే దాయార్హుడనినార దుడనెను. ఎట్లనగా—"కులక్షయము ప్రాప్తించినపుడు నియోగవిధి నాశ్రయించి స్త్రీపురుషులు పరస్పరముఖసంబంధమును, పరస్పర శరీర సంబంధమును వర్జించి సంతానార్థమే ప్రవర్తింపవలెను. కామముతో బ్రవర్తింపరాదు" అని.

ఇట్టి యసిధారావ్రతమీనియోగవిధి. భార్యాభర్తృభావములో నిట్టి నిర్బంధములు లేవు. కామపూర్వకప్రవృత్తి యచ్చట నింద్య ము కాదు.

సత్యవతీదేవి నియోగవిధి ననుసరించియే భీష్మున కుపదేశించి నది. అందులో ప్రతివాదుల వితంతూద్వాహప్రసంగము అజ్ఞానవిలసిత మగుటచే హేయము.

భీష్ము డాసత్యవతీదేవి వాక్యములు విని నీవు చెప్పినది యావ ద్ధర్మమేకాని నాబ్రహ్మచర్యనియమప్రతిజ్ఞ నేను విడువజాలను ఒక మార్గము చెప్పెదను—

"పున ర్భరతవంశస్య హేతుం సంతానవృద్ధయే ।
వక్ష్యామి నియతం మాత! స్తన్మే నిగదత శ్శృణు ॥
బ్రాహ్మణో గుణవాన్ కశ్చి ద్ధనే నోపనిమ న్త్ర్యతామ్ ।
విచిత్రవీర్యక్షేత్రేషు యః సముత్పాదయే త్ప్రజాః ॥"

విచిత్రవీర్యక్షేత్రములయందు సంతతి ననుగ్రహింపగల గుణవంతు డగు బ్రాహ్మణుని ధన మిచ్చి నియోగింపవలెను. అని చెప్పగా నప్పు డాసత్యవతీదేవి వ్యాసమహర్షి జన్మవృత్తాంతము చెప్పి—

"స హి మా ము క్తవాం స్తత్ర స్మరేః కృచ్ఛ్రేషు మా మితి ।
తం స్మరిష్యే మహాబాహో! యది భీష్మ! త్వ మిచ్ఛసి ॥
తవ హ్యానుమతే భీష్మ! నియతం స మహాతపాః ।
విచిత్రవీర్యక్షేత్రేషు పుత్రా నుత్పాదయిష్యతి ॥"

ఆమహర్షి వెనుక కష్టసమయములయందు నన్ను స్మరింపు మని చెప్పెను. నీవంగీకరించినయెడల మహర్షిని స్మరింతును. నీయనుమతిపై యాతడు తప్పక పుత్రుల ననుగ్రహింపగలడు. ఇట్లనగా—

భీష్ముడు—

"తదిదం ధర్మయుక్తం చ హితం చైవ కులస్య నః ।
ఉక్తం భవత్యా యచ్ఛ్రేయ స్త న్మహ్యం రోచతే భృశమ్ ॥

నీవన్నది ధర్మయుక్తము, హితమునై యున్నది. శ్రేయస్కరమగు నీసంకల్పము నాకు చాల ఇష్టమైనది; అని చెప్పగా నపుడు—

"కృష్ణద్వైపాయనం కాలీ చింతయామాస వై మునిమ్ ।
స వేదాన్ విబ్రువన్ ధీమాన్ మాతు ర్విజ్ఞాయ చిన్తితమ్ ॥
ప్రాదుర్బభూ వావిదితః క్షణేన కురునందన! ॥"

సత్యవతీదేవి యామునిని తలచుకొను నంతలో వేదములను పఠించుచున్న ముని తల్లిసంకల్పము గ్రహించి తెలియకుండగనే క్షణములో ప్రత్యక్ష మయ్యెను. అట్లు దర్శనమిచ్చి—

"భవత్యా యదభిప్రేతం తదహం కర్తు మాగతః ।
శాధి మాం ధర్మతత్త్వజ్ఞే! కరవాణి ప్రియం తవ॥"

ధర్మతత్త్వజ్ఞురాలవగు తల్లీ! నీసంకల్పము నెరవేర్ప వచ్చితిని. ఆజ్ఞ యేమి? అనగా సత్యవతీదేవి—

"స త్వం వ్యపేక్షయా భ్రాతుః స్సంతానాయ కులస్యచ ।
భీష్మస్య చాస్య వచనా న్నియోగా చ్చ మమానఘ! ॥
అనుక్రోశాచ్చ భూతానాం సర్వేషాం రక్షణాయచ ।
ఆనృశంస్యాచ్చ య ద్బ్రూయాం త చ్ఛ్రుత్వా కర్తుమర్హసి ।
యవీయస స్తవ భ్రాతు ర్భార్యే సురసుతోపమే ।
రూపయౌవనసంపన్నే పుత్రకామేచ ధర్మతః ॥
తయో రుత్పాద యాపత్యం సమర్థోహ్యసి పుత్రక! ।
అనురూపం కులస్యాస్య సంతత్యాః ప్రసవస్యచ॥"
టీ–వ్యపేక్షయా=స్నేహానుబంధేన; నియోగాత్=ఆజ్ఞాతః;
అనుక్రోశాత్=కృపాతః; ఆనృశంస్యాత్=అనైష్ఠుర్యాత్."

నీవు సోదరుని స్నేహానుబంధమునుబట్టియు, భీష్ముని వాక్యమునుబట్టియు, నాయాజ్ఞనుబట్టియు, భూతదయనుబట్టియు, మృదుస్వభావమునుబట్టియు, భరతవంశమునకు సంతానముకొరకును, ప్రజారక్షణముకొరకును నేను చెప్పబోవు విషయమును విని యావనిని జేయదగినవాడవు నీయనుజుని భార్యలు ధర్మబుద్ధితో పుత్రసంతతిని గోరుచుండిరి. నీవుతపోబలమున సమర్థుడవు. భరతవంశమునకు అనురూపమైన పుత్రసంతతి ననుగ్రహింపుము. ఇట్లు చెప్పగా మహర్షి—

"వేత్థ ధర్మం సత్యవతి! పరం చాపర మేవచ ।
తథా తవ మహాప్రాజ్ఞే! ధర్మే ప్రణిహితా మతిః ॥"

టీ "పరం ధర్మం=నివృత్తిరూపమ్; అపరం ధర్మం=ప్రవృత్తిరూపమ్; ఆముష్మిక, మైహిక మితివా"

"తస్మా దహం త్వన్నియోగా ద్ధర్మ ముద్దిశ్య కారణమ్ ।
ఈప్సితం తే కరిష్యామి దృష్టం హ్యేత త్సనాతనమ్ ॥
భ్రాతుః పుత్రా న్ప్రదాస్యామి మిత్రావరుణయో స్సమాన్ ।"

తల్లీ! నీవు ఐహికాముష్మికధర్మములు తెలిసినదానవు. నీబుద్ధియు ధర్మానుబద్ధమే. కనుక నీయాజ్ఞవలన ధర్మము నుద్దేశించి నీసంకల్పము నెరవేర్తును. ఇది ప్రమాణసమ్మతమే. అనుజునకు అర్హులగు పుత్రుల నొసంగుదును.

"వ్రతం చరేతాం తే దేవ్యౌ నిర్దిష్ట మిహ యన్మయా ।
సంవత్సరం యథా న్యాయం తత శ్శుద్ధే భవిష్యతః ॥"
నహి మా మవ్రతోపేతా ఉపేయా త్కాచి దంగనా"

వారిరువురు నేచెప్పెడి వ్రతమును యథాన్యాయముగా నొకసంవత్సరము చేయవలెను. అప్పుడు వారు పరిశుద్ధురాం డ్రగుదురు. వ్రతాచరణములేని స్త్రీ నన్ను పొందజాలదు.
ఇట్లు చెప్పగావిని సత్యవతీదేవి—

"సద్యో యథా ప్రపద్యేతే దేవ్యౌ గర్భం తథా కురు ।
అరాజకేషు రాష్ట్రేషు ప్రజాఽనాథా వినశ్యతి॥
నశ్యన్తిచ క్రియా స్సర్వా నాస్తి వృష్టి ర్న దేవతా ।
కథం చారాజకం రాష్ట్రం శక్యం ధారయితుం ప్రభో ॥
తస్మా ద్గర్భం సమాధత్స్వ భీష్మ స్సంవర్ధయిష్యతి ।"

వత్సా! వారు వెంటనే గర్భధారణము చేయునట్లు చేయుము. రాష్ట్ర మరాజక మైనపుడు ప్రజలకు చేటు కలుగును. సత్క్రియలు లోపించును వర్షముండదు దేవతారాధన ముండదు. అరాజకమగు రాష్ట్రము నెవ్వడు భరింపగలడు? కనుక వెంటనే సంతతి ననుగ్రహింపుము

అని కోరగా మహర్షి—

"యది పుత్రః ప్రదాతవ్యో మయాభ్రాతు రకాలికః ।
విరూపతాం మే సహతాం తయో రేతత్పరం వ్రతం ॥
యది మే సహతే గన్ధం రూపం వేషం తథా వపుః ।
అద్యైవ గర్భం కౌసల్యా విశిష్టం ప్రతిపద్యతామ్ ॥"

నేను చెప్పియున్నట్లు కాక యిపుడే పుత్రప్రదానము చేయవల సియున్నచో నావిరూపత్వమును సహింపవలెను. వారికిదిగొప్పవ్రతము. నారూపవేషగంధశరీరములను సహించెనేని యాకౌసల్య కుత్తమసంతానము కలుగును.

"ఏవ ముక్త్వా మహాతేజా వ్యాస స్సత్యవతీం తదా ।
శయనే సాచ కౌసల్యా శుచివస్త్రా హ్యలంకృతా॥
సమాగమన మాకాంక్షే దితి సోఽ న్తర్హితో మునిః ।"

ఇట్లు చెప్పి, వస్త్రాద్యలంకృతయై కౌసల్య శయనమున సమాగమన మాకాంక్షింపవలెను. అని సత్యవతీదేవితో జెప్పి వ్యాసమహర్షి అంతర్హితుడయ్యెను.

ఈగ్రంథసందర్భము జూడ, సత్యవతీదేవియు భీష్ముడును భరత వంశోద్ధరణమునకై ఆపద్ధర్మ మాలోచించి యొక్కడనో తపోనిష్ఠతో కాలముగడుపు పరమపావనుడగు మహర్షియే యిందుకు సమర్థుడని

యొంచి యాతని స్మరించు నంతట మహర్షి ప్రత్యక్షమై యేమి యాజ్ఞ
యని యడుగ నామె చెప్పినపుడు ధర్మ్యముగనే నాయాజ్ఞను, భీష్మ
నుమతిని, భూతదయను, కోమలహృదయమును, పురస్కరించుకొని
లోకరక్షణమునకై నీవుత్తమసంతాన మీయవలెనని కోరుటయు,
మహర్షి ధర్మదృష్టితోడనే నీవు చెప్పినట్లు చేయుదును. ఒకసంవత్స
రము వారు నేను చెప్పెడి వ్రత మాచరింపవలె ననుటయు, ఆవ్రత
మేమో అడుగకయే కాలహరణము కాకూడదని తల్లి వెంటనే అను
గ్రహింప గోరుటయు, అట్లైన నారూపవేషాదులను సహించిన నుత్త
మసంతతి కలుగునని చెప్పి యంతర్ధానమగుటయు జరిగినట్లు స్పష్టమేకద.

దీనిని ప్రతివాదులు కాముకవ్యాపారముగా భావించి "తల్లి
యానతి యను నెపమున రాణివాసము చేరెను." అని మహర్షిని
నిందించినారు.

ఆహా! పురుష ధౌరేయు డగు భీష్ముని యనుజ్ఞయా! ఆభీష్ముని
సమక్షమందే తల్లి యాజ్ఞయా! లోకరక్షణాది ప్రయోజనములతో
ధర్మము ధర్మ మనుచు ప్రార్థించుటా! ధర్మమునే యాధారపడి మహర్షి
యంగీకరించుటా! సంవత్సర మైన తరువాత దానికి కాల మనుటా!
తత్క్షణమే కావలె నని సహేతుకముగా తల్లి ప్రార్థించుటా! అట్లైన
నారూపవేషాదులను వారు సహింపవలె నని మహర్షి యనుటా!
దీనిని కాముకవ్యాపార మని ప్రతివాదు లెంచుటా!

అట్లెంచుటకు స్వయముగా మహర్షియే ఆపనికి ప్రోత్స
హించెనా? ఆరాజభార్యల మొగ మెరుగునా? ఎప్పుడో చేయుమన్న
పనిని అప్పుడే చేయుదు ననెనా? ఆకాంక్షల మక్కువను గోరి తన
రూపవేషాదులను చక్కబరచుకొనెనా? కాముకవ్యాపారరహస్యములు
ప్రతివాదులకు తెలియకుండెనా?

"బుద్ధి ర్యథావిధా యస్య స తథా మన్యతే జగత్" అను పద్మపురాణవచనము, ఎవ్వని కేవిధమైన బుద్ధి యుండునో ఆవిధము గానే అతడు లోకమును తలచుచుండు ననుటవలన వ్యాసమహర్షి యెడల ఈప్రతివాదుల భావన ఆజాతిదే.

విధినిషేధములు లేక సంచరించెడి అజ్ఞాని ప్రవృత్తివలెనే జ్ఞాని ప్రవృత్తి యొకప్పుడు కనబడినను చిత్తవృత్తులలో నపార మైన భేద ముండును. క్రియాసామ్య మున్నను భావశుద్ధినిబట్టి పవిత్రతకనుకనే—

"భావశుద్ధిః పరం శౌచం ప్రమాణం సర్వకర్మసు।
అన్యథాఽఽలిఙ్గ్యతే కాన్తా భావేన దుహితాఽన్యథా॥
అన్యథైవ స్తనం పుత్త్ర శ్చిన్తయ త్యన్యథా పతిః।
చిత్తం విశోధయే త్తస్మా త్కిమన్యై ర్బాహ్యశోధనైః॥"

అను స్కాందవచనము, కాంతాలింగనపుత్రికాలింగనములలో నాలింగనక్రియ యేకరూపముగా నున్నను, ఆసమయములలోని భావ ములలో గొప్పభేద మున్నది. కాంతాస్తనచింతనము పుత్రుడు చేయు టలోను పతి చేయుటలోను సామ్యము కనబడినను, వారల భావము లలో గొప్పభేద మున్నది. కనుక భావశుద్ధి పరమపవిత్రము. అందుచే బాహ్యశుద్ధులతో సమాప్తిచేయక చిత్తశుద్ధికై పాటుపడవలె నని బోధించుచున్నది. అట్టి చిత్తశుద్ధి యోగుల సొమ్ము. వ్యాసభగవా నుడు మహాయోగి. కనుకనే—

"అయం సాక్షా న్మహాయోగీ వ్యాస స్సర్వజ్ఞ ఈశ్వరః"

అని చెప్పబడెను. అట్లు పరమపవిత్రమైన భావశుద్ధికల మహా యోగియగు వ్యాసభగవానుని పరప్రేరణాపూర్వకప్రవృత్తిని కాము కవ్యాపారముగా గ్రహించుట అజ్ఞానము. జ్ఞానియొక్క ప్రవృత్తి యెట్లుండునో యీశ్లోకము జూడుడు—

"ఉద్బోధితోఽపి కబళే కబళే జనన్యా
నిద్రాలస శ్శిశురి వావిదితాన్యభావః ।
ఆలోకయన్నపి దృశా జగ దింద్రజాల
మంతః కయాపి కలయా న పరిచ్యుతోఽస్తి ॥"

నిద్రలో నున్న బాలునకు అన్నము బెట్టెడి తల్లి ముద్దముద్దకు లేపుచు బెట్టుచుండ బాలుడు రుచిగ్రహణములేకయే ప్రేరణనుబట్టి తినుచుండును. అట్లే జ్ఞాననిష్ఠుని ప్రవృత్తి, రాగద్వేషాదిరహితమై యుండు నని భావము. ఈయంశ మింతటితో విడిచి విషయాంతర మును పరిశీలింతము—

—♦ వ్యాసుడు పూతిగంధుడను ప్రసంగము—తన్నిరాకరణము ♦—

పూర్వోక్తమైన వ్యాససత్యవతీసంవాదములో—

"వ్రతం చరేతాం తే దేవ్యౌ నిర్దిష్ట మిహ యన్మయా ।
సంవత్సరం యథాన్యాయం తత శ్శుద్ధే భవిష్యతః ॥"

అని యొకసంవత్సర మారాజభార్యలు నేచెప్పెడి వ్రతము యథా న్యాయముగా నాచరించిన శుద్ధురాం డ్రగుదు రని వ్యాసమహర్షి చెప్పగా సత్యవతీదేవి కాలహరణము కాకూడదని వెంటనే యనుగ్రహింపగోరగా నపుడు—

"యది పుత్రః ప్రదాతవ్యో మయా భ్రాతు రకాలికః ।
విరూపతాం మే సహతాం తయో రేత త్పరం వ్రతం ॥
యది మే సహతే గంధం రూపం వేషం తథా వపుః ।
అద్యైవ గర్భం కౌసల్యా విశిష్టం ప్రతిపద్యతామ్ ॥"

అని మహర్షి తెల్పెను. ఇచ్చట మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది—

"మత్స్యగంధి పరాశరుం డిచ్చిన కస్తూరికావిచే యోజనగంధియైనను, వ్యాసుడు మాత్రము వికారరూపుఁడై పూతిగంధుడుగానె యుండె నని మహాభారతములోని వర్ణనమువలన దెలియనగును. సత్యవతి వ్యాసు నంబికాంబాలికలయందు బిడ్డల గనుమని నియోగించినప్పుడు వ్యాసుడు తన వికృతరూపమును, దుర్వాసనను మహారాజభార్యలు సహింపలేరని తలచి ఒకసంవత్సరము వ్రతము చేయవలె ననెను. (మ. భా. చ. పు. 147)

"అవికారరూపసహిష్ణుత్వము ఒకవత్సరమున కలవడునని తలచి యీవ్రతము జేయు మనినాడు. 'ఆఱునెలల సహవాసముచే వారు వీ రగుదురు' అనినటులు (మ. భా. చ. పు. 148)

"అంబిక వికృతరూపముతో నుండిన వ్యాసుని జూచి సహింప లేనిదై యారాత్రి యొకమాఱైన గన్ను దెరవక మూసికొనియే యుండెను ... అంబాలికకూడ వ్యాసుని వికృతరూపమును జూచి తెల్లవోయినది." (మ. భా. చ. పు. 147)

ఈవ్రాతలోని యంశములను క్రమముగా బరిశీలింతము—

మత్స్యగంధి కస్తూరికావిచే యోజనగంధియైనను వ్యాసుడు మాత్రము పూతిగంధుడుగానె యుండెనట! ఇట్లనుటలో వ్యాసుని యందు పూతిగంధమును స్థిరపరచి దానిని బట్టి తల్లి మత్స్యగంధియే కాని యోజనగంధి కాదనుటయందు ప్రతివాదులకు తాత్పర్యమా? లేక ఆమె యోజనగంధియే. వ్యాసుడుమాత్రము పూతిగంధు డనుట యందు తాత్పర్యమా?

"మత్స్యగంధో మహా నాసీ త్పురా మమ జుగుప్సితః ।
త మపాస్య శుభం గంధ మిమం ప్రాదా త్స మే మునిః ॥"

(ఆ. అ. 104)

నా శరీరమందు బూర్వము జనుప్రసిద్ధమైన మత్స్యగంధ మధికముగా నుండెడిది. పరాశరమహర్షి దానిని తొలగించి నాశరీరమున కీసుగంధ మనుగ్రహించెను. అని యున్న సత్యవతీదేవి వాక్యమువలన పరాశరానుగ్రహమునకు బూర్వము మత్స్యగంధియు, పరాశరానుగ్రహమున యోజనగంధియు నని స్పష్ట మగుచుండ యోజనగంధి కాదనుట తప్పు.

మహాభారతరహస్యకర్తలు వ్రాయుచు— "స్వతస్సిద్ధముగా నామె శరీరము మత్స్యగంధభూయిష్ఠమైనది గాదు" (పు. 78) అనుట కూడ పైసత్యవతీవాక్యముచే ప్రతిహతమైనది మఱియు—

"సత్యవతి తన శరీరము మత్స్యగంధభూయిష్ఠ మని చెప్పుటలో పరాశరునకు తనయం దసహ్యము గలుగవలయు ననియు, నా కారణమున నాతనివలన విముక్తిని బడయవలయు ననియు చెప్పిన వాక్యముకాని స్వతస్సిద్ధముగా నామె శరీరము మత్స్యగంధభూయిష్ఠమైనది గాదు. తాను పల్లెత యై యున్నదగుటచే తద్వృత్త్యనుసారముగా వాక్రుచ్చెను." (మ. భా. ర. పు. 78)

ఇది రహస్యకర్తల వ్రాత. మత్స్యగంధము తన శరీరమందు లేకున్నను పరాశరునకు తనయం దసహ్యము కలుగుటకై యట్లు చెప్పెనట. పరాశరున కసహ్యము కలుగనేలేదు. కనుక నిట్టి నిరర్థక ప్రసంగము ప్రతివాదుల దనుట మంచిదా? ఆసత్యవతీదేవి దనుట మంచిదా? మఱియు, సత్యవతీశరీరమందు మత్స్యగంధమే లేనియెడల ఉపరిచరవసుమహారాజపుత్త్రికయైన యామె దాశుని పోషణములో నుండవలసినపని యేమున్నది, మత్స్యగంధ ముండుటనుబట్టియే యట్లు జరిగినది. మత్స్యగంధ ముండుటచేతనే యామె వరము కోరుటలో కన్యాత్వమును, సౌగంధ్యమును కోరెను మహర్షి యనుగ్రహమున

సౌగంధ్యము ప్రసిద్ధించినతరువాతనే మహర్షి కూడెను కనుక యుక్తి యుక్తము, ప్రామాణికము కాని రహస్యకర్తల వ్రాత పరాస్తము.

మఱియు—

"వృణీష్వచ వరం భీరు యం త్వ మిచ్ఛసి భావిని ।
వృథా హి న ప్రసాదో మే భూతపూర్వ శ్శుచిస్మితే ॥
ఏవ ముక్తా వరం వవ్రే గాత్రసౌగంధ్య ముత్తమమ్ ।
సచాస్యై భగవాన్ ప్రాదా న్మనసః కాంక్షితం భువి ॥
తతో లబ్ధవరా ప్రీతా స్త్రీభావగుణభూషితా ।
జగామ సహ సంసర్గ మృషిణాఽద్భుత కర్మణా ॥"
టీక-వరం = కన్యాభావం సౌగంధ్యం చ లబ్ధ్వా...
"తేన గంధవతీ త్యేవం నామాస్యాః ప్రథితం భువి ।
తస్యాస్తు యోజనాద్గంధ మాజిఘ్రన్త నరా భువి ॥
తస్యా యోజనగంధేతి తతో నామాపరం స్మృతమ్" (అ.63.అ)

అని యున్నగ్రంథము- సత్యవతీదేవితో నేమి కావలెనో నీవు వరము కోరుము. నాయనుగ్రహము వ్యర్థ మెన్నడును కాదు. అని పరాశరమహర్షి చెప్పగా నామె తన శరీరమున కుత్తమమైన సౌగంధ్యమును కోరగా నామహర్షి యట్లే యనుగ్రహించెను. దానిని బట్టి యామె గంధవతి యనుపేరును, ఆగంధమును యోజనపర్యంతము మనుజులు ఆఘ్రాణించుటనుబట్టి యోజనగంధి యనుపేరును పొందెను. అని స్పష్టముగా జెప్పుచుండ, దీనికి విరుద్ధముగా రహస్యకర్తలు—

"పరాశరుడు యోజనగంధి వగుదువని వరమిచ్చె ననుటలో నామె నిరుత్తర యగుటకు ప్రతిగా జెప్పిన వాక్యముగాని, యోజనములు కొలది సుగంధవ్యాప్తిగల శరీరముగలదానినిగా జేసెననియుగాదు" (పు.78)అనితోచినట్లుశబ్దమర్యాదను పాటింపకవ్రాయుటనింద్యము.

యోజనగంధి వగుదు నని వరమిచ్చె ననుమాటకు ఆమె నిరుత్తరయగుటకు చెప్పిన వాక్యమును జొప్పవ్వడము. నీవు యోజనగంధి వగుదువని యర్థములేనిమాటను మహర్షి చెప్పిన యెడల నేనట్లు కాలేదేమని సత్యవతీదేవి వెంటనే ప్రశ్నించునా? నిరుత్తరయగునా? యోజనగంధి యైనపుడే నిరుత్తరయగును. కనుక యుక్తికిని ప్రమాణమునకును విరుద్ధమైన యీవ్రాతకూడ పరాస్తము.

ఇక మ. భా. చ. కారుల వ్రాతనే అందుకొందము——

పూర్వోక్తప్రకారము యోజనగంధి యైన తరువాత జన్మించిన వ్యాసుడు పూతిగంధుడుగా నుండె నను ప్రతివాదులమాట నిరాధారము, విరుద్ధమునై యున్నది. 'యది మే సహతే గంధమ్' అను వ్యాసవాక్యమే యాధార మందురు కాబోలు. ఆవాక్యములో దుర్వాసన యని యున్నదా?

నిరంతర తపోనిష్ఠచే విలాసజనాదరణీయములగు శరీరసంస్కారముల నాశ్రయింపని మహర్షి అట్లనియుండెను. కాని దుర్వాసనయని కాదు, ఇంకొకటి. వ్యాసమహర్షి మహాయోగి. యోగప్రవృత్తికి ప్రథమచిహ్నములలో జెప్పబడినది సుగంధ మొకటి చూడుడు——

మార్కండేయపురాణము——

“అలౌల్య మారోగ్య మనిష్ఠురత్వం గన్ధశ్శుభో మూత్రపురీషమల్పం,
కాన్తిః ప్రసాద స్స్వరసౌమ్యతా చ యోగప్రవృత్తేః ప్రథమం
హి చిహ్నమ్॥” (అ.37)

కనుక దుర్వాసన యనుట దురూహ. అంబికాదులకు రాగమూలకప్రవృత్తి లేకుండుటకై వ్రతస్థానీయముగా తత్కాలమందు అవి, వారి కుపదేశింపబడిన నియమము లగుటచే తన సౌగంధ్యాదుల

నప్పు డావిష్కరించకే [illegible] కనుక నట్లు చెప్పలేమో

మరియొక నిదర్శనము కలదు— వ్యాసమహర్షి సాన్నిధ్యమున నంబికయు, నంబాలికయు నేమి చేసిన ట్లున్నది?

"తస్య కృష్ణస్య కపిలాం జటాం దీప్తే చ లోచనే ।
బభ్రూణి చైవ శ్మశ్రూణి దృష్ట్వా దేవీ న్యమీలయత్ ॥
అంబాలికా మథాఽభ్యాగా దృషిం దృష్ట్వాచ సాపి తమ్ ।
వివర్ణా పాండుసంకాశా సమపద్యత భారత! ॥"

మ. భా. చ. కారు లీశ్లోకములకు వ్రాసిన యర్థ మెట్లున్నది? "వ్యాసునియొక్క కపిలజటను, ప్రజ్వలించుచుండిన నేత్రములను కపిలవర్ణములు గల పొడుగుమీసముల జూచి రాణి కన్నులను మూసుకొనెను.

అంబాలిక కూడ వ్యాసుని వికృతరూపమును జూచి తెల్లవో యినది" అని యున్నది. ఇందు అంబిక కన్నులను మూసుకొనినది. అంబాలిక తెల్లవోయినది' అనియే యున్నది. కాని యొక్కరును ముక్కు మూసికొనినట్లు లేదు. మ. భా. చ. కారు లన్నట్లు వ్యాసుని యందు దుర్వాసనయే నిజమైనయెడల వారు ముక్కు మూసుకొన వద్దా? దుర్వాసన కలిగినపుడు కండ్లు మూసికొనుటయు! తెల్లబోవుట యునా? కనుక అంబికాంబాలికలు ముక్కుమూసికొనినట్లు లేనందున నీనిదర్శనముచే ప్రతివాదులన్న దుర్వాసన, ప్రతివాదుల అంతఃకరణ మందున్నదే కాని, వ్యాసునియందున్నది కాదు. ఇక దీనిని విడచి మ. భా. చ. కారుల వ్రాతలోని యంశాంతర మవలోకింతము—

"వ్యాసునిచే జెప్పబడిన వ్రతము చేయకపోవుటచేతను, ఆతము

చెప్పిన వికృతరూపమును సహింపకపోవుటచేతను, మాతృదోష
ముచే బుట్టుగ్రుడ్డియు, పాండురోగియు, గలిగిరని కొందరందురు.
కాని వ్యాసుడుచెప్పిన వ్రత మేదియు గాన్పింపదు ''

''విరూపతాం మే సహతాం తయో రేతత్పరం వ్రతమ్ ।''

అనుటచే నాయొక్క వికారరూపమును సహింపవలెను. వా
రిద్దఱికి నిదియె గొప్ప వ్రతము. అనుటచే వికారరూపసహనమే
వ్రత మని యర్థము. ఆవికారరూపసహిష్ణుత్వ మొకవత్సరమున
కలవడు నని తలచి యావ్రతము జేయు మనినాడు. ''ఆఱునెలల
సహవాసముచే వారు వీ రగుదురు'' అనినటులు వ్యాసునితో
నొకయేడాది రూపగంధాదికములను సహించి యంబికాదు లుండి
నచో వారి కలవాటయి దాంపత్యానుకూలత గలిగి యుక్త
సంతానము వారికి గలిగియుండును. అట్లు కాకుండుటచేతనే
యయుక్తసంతతి రాణులకు గలిగెను.'' (మ. భా. చ. పు 148)

ఈవ్రాతలో బుట్టుగ్రుడ్డియు, పాండురోగియు గలుగుటకు
హేతువు వ్యాసునిచే జెప్పబడిన వ్రతము చేయకపోవుట. అతడుచెప్పిన
వికృతరూపమును సహింపకపోవుట యనుమాతృదోషమే యని కొంద
రన్నా రనుచు వారిమాటను ప్రతివాదులు నిరసించినారు. ఆకొంద
రన్నమాటలో వ్రతము చేయకపోవుట, విరూపతను సహింపక
పోవుట అను రెండు దోషము లుదాహరింపబడియున్నవి. అట్లు వా
రనుటకు—

'' వ్రతం చరేతాం తే దేవ్యౌ నిర్దిష్ట మిహ యు స్మయా ।
సంవత్సరం యథాన్యాయం తత శ్శుద్ధే భవిష్యతః ॥
యది పుత్రః ప్రదాతవ్యో మయా భ్రాతు రకాలికః ।
విరూపతాం మే సహతాం తయో రేత త్పరం వ్రతమ్ ॥''

అని వ్యాసమహర్షి చెప్పిన వాక్యములే ప్రమాణము. ఇచ్చట నాచే జెప్పబడిన వ్రతమును యథాన్యాయముగా సంవత్సర మాచరింతురేని యారాజభార్యలు పరిశుద్ధురాం డ్రగుదురు. అట్లు కాక అకాలమందే పుత్రప్రదానము కావలసివచ్చినప్పుడు నా విరూపత్వము వారు సహింపవలెను. అది గొప్పవ్రతము

అనుచు సంవత్సరవ్రత మొకటియు, తాత్కాలికవ్రత మొకటియు నుపదేశింపబడెను. ఆసంవత్సరవ్రత మెట్టిదో కాలవిలంబమున కిష్టపడని సత్యవతీదేవి యడుగనే లేదు. అందుచే మహర్షి చెప్పలేదు. తాత్కాలికవ్రతస్వరూపమే చెప్పబడెను.

ఇట్లుండ మ. భా. చ. కారులు వికారరూపసహన మొక్కటియే వ్రతమనియు, నది యొకవత్సరమున కలవడునని తలచి యావ్రతము జేయు మనినాడనియు వ్రాసి "ఆఱునెలలసహవాసముచే వారు వీరగుదురు" అను సామెతను తమకల్పనకు బలకరముగా వైవానము జూపి నిరసింపబూనిరి. వ్యాసమహర్షి యీసామెతను బట్టియే చెప్పిన యెడల నారుమాసములకే వారు వీరగుచుండ సంవత్సరమని యేలచెప్పెను? "యది పుత్రః ప్రదాతవ్యో మయా భ్రాతు రకాలికః; విరూపతాం మే సహతామ్" అనుచు విరూపత్వసహనము అకాలపుత్రప్రదానమునకు అవలంబింపవలసిన వ్రతమని యుండగా సంవత్సరవ్రతమే యిది యనుట యెట్లుపొసగును? కనుక నిది యసంగతము. వ్యాసునితో నొక యేడాది రూపగంధాదికములను సహించి యంబికాదు లుండినచో యుక్తసంతానము వారికి గలిగియుండునట! ఆహా! సత్యవతీదేవితో ప్రసంగించి యావ్రతవిషయము జెప్పి—

"సమాగమన మాకాంక్షే దితి సోఽన్తర్హితో మునిః"

నారాకను కోరవలె నని చెప్పి యంతర్ధానమైన వ్యాసభగవానునితో రాజభార్యలకు సంవత్సరసహవాసమా? సత్యవతీదేవికి దర్శన

యిచ్చినది మొదలు రాజభార్యలు తననుస్మరించు నంతవరకైనను
అచ్చటనిలువక అంతర్ధానమైన మహాయోగితో నేడాది సహవా
సమా? కనుక నిదియంతయు నసంగతప్రసంగమగుటచే హేయము.
అంశాంతర మవలోకింతము—

### వ్యాసుడు మరియొకప్పుడును స్త్రీలోలుడే అనుప్రసంగము తన్నిరాకరణము.

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది—"వ్యాసుడు మరి
యొకప్పుడును స్త్రీలోలుడే అయ్యెను. శాంతిపర్వమున నీగాథ
కలదు"—సత్యవతీసూనుం డగ్నికార్యపరుండై యొకప్పు డరణి
పుచ్చుకొని మథింపదొడంగిన ఘృతాచియను నప్సరోవనిత లోచ
న గోచరయగుటయు, దానును గామగోచరత్వంబు నొందిన న
య్యిందువదన యతని తెరం గెఱింగి వంచనం జిలుకయై యుండె
నతండును ధైర్యంబవలంబించి యరణికార్యప్రవణుండై యుండ
ప్రబలుండగు నంగజుని చేయి నప్సరోరూపాతిశయసక్తచిత్తుండైన
యా సంయమి శుక్లం బయ్యరణియందుం బడియె. నవ్విప్రుండు
నిర్వికారంబగు నంతఃకరణంబుతో నరణిమథనం బొనరించె"
పిమ్మట శ్రీశుకుడు పుట్టె నను నంశముతో మనకు నిమిత్తము
లేదు. కాని వేదవ్యాసు నంతటివాడు పవిత్రమగు నరణిమథనస
మయమున వేశ్యాంగనపై దృష్టిబరపుటయె కాదు. వలచుట. అం
తమాత్రమే కాదు. అరణిని స్వశుక్లముచే నపవిత్రముచేయుట.
యెట్టి ధర్మము? " (పు. 160)

ఈప్రతివాదులకు శుక్లనిస్సరణముతోనే పనిగాని సుతో
త్పత్తితో బనిలేదట. వారి కంత మాత్రమే అపేక్షిత మన్నమాట.
పుత్రార్థియై తపము జేసి యీశ్వరవరము నందుకొనియున్న వేదవ్యా

సభగవానునికిపూత్రిము సుతోత్పత్తియే అపేక్షితము. వేదవ్యాసునకు బరమేశ్వరుడు—

"ఏవంవిధ స్తే తనయో ద్వైపాయన! భవిష్యతి !
యథా హ్యగ్ని ర్యథా వాయు ర్యథా భూమి ర్యథా జలమ్ ॥
యథాచ ఖం తథా శుద్ధో భవితా తే సుతో మహాన్ ।
తేజసావృత్య లోకాం స్త్రీ న్యశః ప్రాప్స్యతి తే సుతః॥"

అని వర మిచ్చెను. అద్వితీయుడగు వేదవ్యాసమునీంద్రునకు అట్టిపరమపవిత్రుడైన శుకయోగి జన్మించుటకై కావలసిన కారణ సామగ్రి ఘటించుటలో నగ్నికై యరణిని మథించుచున్న మహర్షికీశ్వరవరప్రభావమున భవితవ్యబలముచే నయత్నసిద్ధముగ ఘృతాచీ దర్శనము, ఆపై దైవికముగా మనోవికారము, ఆపైని మనోనిగ్రహ సామర్థ్యము, ఆపైన శుక్రనిస్సరణము, అపుడె యరణినుండి శుకయోగిందాప్రవిర్భావము, ఇట్లు జరిగినది చూడుడు. శాంతిపర్వము (3:4 అ)

"సతు ధైర్యేణ మహతా నిగృహ్ణన్ హృచ్ఛయం మునిః ।
న శశాక నియన్తుం త ద్వ్యాసః ప్రవిసృతం మనః ॥
భావిత్వా చ్చైవ భావస్య ఘృతాచ్యా వపుషా హృతః ।
యత్నా న్నియచ్ఛత స్తస్య మునే రగ్నిచికీర్షయా ॥
అరణ్యామేవ సహసా తస్య శుక్ర మవాపతత్ ।
సోఽవిశంకేన మనసా తథైవ ద్విజసత్తమః ॥
అరణీ మమన్థ బ్రహ్మర్షి స్తస్యాం జజ్ఞే శుకో నృప ।
శుక్రే నిర్మథ్యమానే స శుకో జజ్ఞే మహాతపాః ॥"

టీ "శుక్రే నిర్మథ్యమానే జాతత్వా చ్ఛుక ఇతి రేఫలోపేన నామ కృతమ్.

"పరమర్షి ర్మహాయోగీ అరణీగర్భసంభవః ।
యథాఽధ్వరే సమిద్ధోఽగ్ని ర్భాతి హవ్య ముదావహన్॥
తథారూప శ్శుకో జజ్ఞే ప్రజ్వలన్నివ తేజసా ।
బిభ్రత్పితుశ్చ కౌరవ్య! రూపవర్ణమను త్తమమ్॥
బభౌ తథా భావితాత్మా విధూమోఽగ్ని రివ జ్వలన్ ।
ఉత్పన్నమాత్రం తం వేదా స్సరహస్యా స్ససంగ్రహాః ॥
ఉపతస్థు ర్మహారాజ! యథాఽస్య పితరం తథా ।"

అట్లు అరణీగర్భసంభవుడైన శుకయోగి తండ్రియగు వ్యాస మహర్షితో సమానమై యుత్తమమగు రూపమును ధరించెననియు, పుట్టినతోడనె వేదవేదాంగవిద్యలు వ్యాసమహర్షికివలెనే శుకయోగికి గూడ స్వయముగా ప్రతిభాసించినవనియు చెప్పబడినది.

ఇట్లు శుకయోగి అరణినుండి శుక్రనిర్మంథనమూలమున నయోనిజుడై జన్మించినట్లుగ్రంథము చెప్పుచుండ దీనికి విరుద్ధముగా రహస్యకర్తలు "అరణి కాదు, అరణ్యా యను నొక ఋషికన్యయందు శుకుడు కలిగెను" (పు 82.) అని వ్రాయుట హేయము. "అరణ్యామేవ సహసా తస్యశుక్ర మవాప తత్" అనుటలో 'అరణ్యామ్' అనుపదముచే నరణి యందు కలిగినట్లు చెప్పబడినది. 'అరణికాదు, అరణ్యయను కన్య యందు కలిగెను' అని వ్రాసిన రహస్యకర్తలు ఏమిచూచివ్రాసినట్లు? శ్లోకమందు 'అరణ్యామ్' అని యున్నది. వారియూహ నిజమైనయెడల 'అరణ్యాయామ్' అని యుండవలయును.

మరియు—

'పరమర్షి ర్మహాయోగీ అరణీగర్భసంభవః' అని యున్నదిగాని 'అరణ్యాగర్భసంభవః' అని లేదు. మరియు— దేవీభాగవతములో వ్యాసమహర్షి శుకునితో బ్రసంగించునపుడు "తప స్తప్త్వా మహాఘోరం

ప్రాప్తోఽసి త్వ మయోనిజః ' అని నీవయోనిజుడవై మహాతపఃఫలము గా ప్రాప్తించితివని చెప్పెను. ఇన్ని వచనములకు విరుద్ధముగానున్న రహస్యకర్తలవ్రాత నింద్యము.

మ. భా. చ. కారులు శుకయోగి జన్మప్రస్తావముకల శాంతి పర్వగాథను చూపి, శుకుడు పుట్టె నను నంశముతో మనకు నిమిత్తము లేదని "వ్యాసుడు మఱియొకప్పుడును స్త్రీలోలుడే అయ్యెను. పేరటాం డ్రపై దృష్టిబరపెను వలచెను' అని వ్రాయుట వారి దోషదృష్టినే వెల్లడించుచున్నది. ఈ మ. భా. చ. కారులే యొకచోట "యోగ శక్తిచేతను, నింద్రియజయముచేతను వ్యాసు డంతదీర్ఘకాలము జీవిం చియుండె ననుటలో నతిశయోక్తిలేదు" (పు 45) అనుచు వ్యాసుని జితేంద్రియుడన్నారు. ఇచ్చట స్త్రీలోలు డన్నారు. వారినోటి కడ్డేమున్నది? వెనుక వేదవ్యాసుని ఖండాలజాతిజు డన్న మ. భా. చ. కారులకు వారు చూపిన శాంతిపర్వ వచనగ్రంథములో వ్యాసుడు విప్రుడనియే యున్నదిసుమా. యని తెలుపుచు నంశాంతర మందుకొ నుచున్నాము—

"దృష్టో ధర్మవ్యతిక్రమః" అను ఆపస్తంబసూత్రము
వ్యాసునియందు వర్తించె నను ప్రసంగము—తన్నిరాకరణము.

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది—

"దృష్టో ధర్మవ్యతిక్రమ స్సాహసం చ ' అను నాపస్తంబుని సూత్ర ము వ్యాసునియందు వర్తించెను. కాన వాల్మీకివలె వ్యాసుడు ధర్మ ప్రతిపాదకస్వభావముగలఋషి కాడనితలంపవలసియున్నది' (పు 160)

వ్యాసునియందు ధర్మవ్యతిక్రమము దృష్టమయ్యెనట. అందుచే నాతడు ధర్మప్రతిపాదకస్వభావముగల ఋషి కాడట. వ్యాసుడుతాను

చేసియున్న ధర్మవ్యతిక్రమమునే, లోకులను చేయుమని ప్రతిపాదించి నపుడు వ్యాసుడు ధర్మప్రతిపాదకస్వభావముకలవాడు కాడనవచ్చు నేమో కాని యాతడు ప్రతిపాదించినది ధర్మవ్యతిక్రమము కాక ధర్మమే యగుటచే నట్లనుట ప్రతివాదుల కయుక్తము. ఆధర్మవ్యతిక్రమముచే దోషము వారికి లేదనికూడ నాపస్తంబసూత్రమే చెప్పుచున్నది. చూడుడు—

ఆపస్తంబధర్మసూత్రము—(ప్ర. 2 ఖ13)

"దృష్టో ధర్మవ్యతిక్రమ స్సాహసంచ పూర్వేషామ్ ॥
"తేషాం తేజోవిశేషేణ ప్రత్యవాయో న విద్యతే॥"

వ్యా. కి మిదానీం తేషాం దోషః? నే త్యాహ—తాదృశంహి తేషాం తేజః యదేవంవిధైః పాప్మభి ర్న ప్రత్యవయన్తి తథాచ ఛాందోగ్యే శ్రూయతే—తద్యథైషీకాతూల మగ్నౌ ప్రోతం ప్రదూయే తైవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయన్తే" ఇతి.

"త దన్వీక్ష్య ప్రయుంజాన స్సీద త్యవరః"

వ్యా...తం చ వ్యతిక్రమం తచ్చ సాహస మన్వీక్ష్య దృష్ట్వా స్వయమపి తథా ప్రయుంజానో ఒవరః ఇదానీన్తనః సీదతి ప్రత్యవైతి నహ్యగ్ని స్సర్వం దహతీ త్యస్మాక మపి తథా శక్తి రితి"

పూర్వులయందు గోచరించిన ధర్మవ్యతిక్రమము సాహసము. వారి తేజోవిశేషముచే నగ్నియందు పడిన దూదివలె భస్మమై వారికి దోష మాపాదింపదు. సర్వమును దహించెడి శక్తి యగ్నికున్నట్లు అన్యులకు లేదు కనుక వారు చేసినట్లు అన్యుడు చేసిన చేటు తప్పదు. అని భావము.

ఇట్లు ప్రతివాదులు వ్రాసిన విధముగా "దృష్టో ధర్మవ్యతి క్రమ స్సాహసం చ" అను నాపస్తంబసూత్రము వ్యాసునియందు వర్తించినట్లే—

"తేషాం తేజోవిశేషేణ ప్రత్యవాయో న విద్యతే" అను సూత్రముకూడ వర్తించినది. కనుక వ్యాసభగవానుడు పరమపావను డని ప్రతివాదులకు వారి యాపస్తంబుడే గట్టిగా బోధించెను.

ఆపస్తంబుడు చెప్పినట్లే వ్యాసమహర్షికూడ "యావదధికార మవస్థితి రాధికారికాణామ్" అను బ్రహ్మసూత్రముచేతను, శ్రీమద్భాగవతములో నొకానొకప్రస్తావమున "తేజీయసాం న దోషాయ వహ్నే స్సర్వభుజో యథా" అను వాక్యముచేతను మహాతేజశ్శాలులకు ధర్మ వ్యతిక్రమములు తటస్థించినను వారి కవి దోషావహములు కావని చెప్పుచు నన్యు లావిధముగా జేయరాదని బోధించియుండెను. మహ ర్షులు తమకు తటస్థించిన ధర్మవ్యతిక్రమములను మీరుకూడ జేయు డని లోకులకు జెప్పినవారు కారు. వేదవిధుల ననుసరించి యధికారాను గుణముగా లోకులకు ధర్మములను బోధించినవారే. కనుకనే—

అనుష్ఠితంచ య ద్దైవై ర్మునిభి ర్యదనుష్ఠితమ్ ।
నానుష్ఠేయం మనుష్యై స్త దుక్తం కర్మ సమాచరేత్ ॥"

అను బోధాయనోక్తి దేవతలు చేసిన పనులను, మునులుచేసిన పనులను చేయక మనుష్యులు, ఆదేవతలు మునులు చేయుమనిచెప్పిన పనులనే చేయవలసిన దని తెలుపుచున్నది. ఇట్లుండ వ్యాసునియందు ధర్మవ్యతిక్రమము దృష్ట మయ్యెనట! అందుచే వ్యాసుడు ధర్మప్రతి పాదకస్వభావుడు కాడట! ఆహా! అష్టాదశమహాపురాణములను, మహా భారతమును, బ్రహ్మసూత్రములను, వేదభాగమును లోకుల కనుగ్ర హించి నారాయణావతారమై అణిమాదిశక్తులుకలిగి విరాజిల్లు వ్యాస

భగవానుడు ధర్మప్రతిపాదకస్వభావుడు కాడా? మహాభారతమంతయు గాలించి మహాభారతచరిత్రము వ్రాసిన ప్రతివాదులకు తుదకు తెలిసిన దిదియా?

"యస్య నాస్తి వివేకస్తు కేవలం యో బహుశ్రుతః।
న స జానాతి శాస్త్రార్థాన్ దర్వీ పాకరసా నివ॥"

అను శ్లోకము జ్ఞప్తికి వచ్చుచున్నది. పాయసపాత్రిలో మునిగిన గరిటెకు రుచి తెలియునా?

"వాల్మీకివలె వ్యాసుడు ధర్మప్రతిపాదకస్వభావముగల ఋషి కా" డను ప్రతివాదుల మాటకు రామాయణమువలె మహాభారతము ధర్మప్రతిపాదకము కాదను తాత్పర్య మూహ్యా మగుచున్నది.

ఈవిషయమై రామాయణ మహాభారతములను గూర్చి లోకమాన్యుడు వ్రాసిన విషయమును మాత్రమే వారికి వినిపింతము—గీతారహస్యపరిశిష్టము—(పు. 717)

"మహాభారతమువలెనే రామాయణముసైతము ఎల్లవారును గౌరవించునదియు, గొప్పదియు నగు నార్షమహాకావ్యము గాన దానియందును కథాసందర్భమునుబట్టి సత్యములును, పుత్రధర్మములును, మాతృధర్మములును, రాజధర్మములును మొదలగువాని యందలి రహస్యము వివేచింపబడినది. కాని యీరామాయణము మహాభారతమువలె ననేకసమయాన్వితము కాదుకనుక (అనగా సూక్ష్మములగు ధర్మాధర్మములయొక్క అనేకన్యాయములతో నిండి, యెల్లరకు ననిన్నవిధములచేతను శీలచరిత్రాదులను బోధించుటకై వాల్మీకి రచియింపలేదు గాన) ధర్మాధర్మములనుగాని, కార్యాకార్యములనుగాని, నీతినిగాని, బోధించువిషయమున మహాభారత

ముతో సమానమైనది గాదని వేఱుగ చెప్పవలదు. మహాభారత
మనునది కేవల మార్ష కావ్యముగగాని, కేవలమితిహాసముగగాని,
యుండక ధర్మాధర్మములయందలి సూక్ష్మవిషయములను నిరూపిం
చు నొక సంహితగ నున్నది"

దీనిని బట్టి మహాభారతకర్తయగు వ్యాసభగవానుడు ధర్మప్ర
తిపాదకస్వభావుడే యనిస్పష్టమైనది. ప్రతివాదు లుదాహరించినఆపస్తం
బుని సూత్రమును బట్టి వ్యాసమహర్షి పరమపావనుడని స్పష్టమైనది.
వెనుక ప్రదర్శింపబడిన పూర్వోత్తరమీమాంసాశాస్త్రములుకూడ
వ్యాసమహర్షిని పరమపావను డనియే నిరూపించినవి. కనుక మ. భా.
చ. కారుల అసంగతప్రసంగ మపాస్తమైనది.
అంశాంతర మవలోకింతము—

ధర్మమును క్రిందుగా నిరూపించినవాడు వ్యాసు డను వాదము-
తన్నిరాకరణము.

"మొత్తమునకు ధర్మమును అర్థకామములచే గ్రిందుగా నిరూపించి
నవాడు వ్యాసుడు" (మ. భా. చ. పు160)

ఈ మ. భా. చ. కారులు మహాభారతమును తా మేపద్ధతిని
విమర్శింపబూనిరో తెలుపుచు వెనుక నిట్లు వ్రాసియున్నారు—

"రామాయణమహాభారతములు పాశ్చాత్యవిద్యాపద్ధతి ననుస
రించి బహిరంగపరీక్షకు లోనగుచున్నవి. అంతరంగపరీక్షకంటె
బహిరంగపరీక్ష జనసామాన్యదృష్టి నాకర్షించి విశేషవివాదములకు
గారణ మగును. (బహిరంగపరీక్ష యనగా గాథ జరిగిన కాలము,
కవి కాలము, గాథావిశేషములు మొదలగువాని విమర్శనము.

కొలది మహాభారతమును బహిరంగపరీక్షచే సంగ్రహముగ విమర్శించుచున్నాడను.'' (పు 4)

దీనినిబట్టి వీరిది పాశ్చాత్యవిద్యాపద్ధతి యనియు, బహిరంగ పరీక్ష యనియు స్పష్టము. ఆబహిరంగపరీక్షలో శబ్దార్థాదివిమర్శన విశేషము లుండవని వారే చెప్పినారు. శబ్దార్థవిమర్శనవిశేషము లేనిదే గ్రంథస్థవిషయ మెట్లు తెలియును? అది తెలియనపుడు గ్రంథ మం దేమున్నదో యెట్లున్నదో చెప్పుటకు వీ రనధికారులు. కనుక ధర్మమును క్రిందుగా నిరూపించినవాడు వ్యాసుడను వీరిమాట హాస్యా స్పదము. ఇట్టిప్రతివాదుల కితోధికము చెప్పుట యనావశ్యక మగుటచే సింతటితో దీనిని విడిచి యంశాంతర మందుకొందము.

## —♦ కర్ణోత్పత్తిప్రస్తావము ♦—

కన్యకలు బిడ్డల గనుట దోషముకాదను వాదము—తన్నిరాకరణము.

"నాడు కన్యకలు బిడ్డల గనుట దోషము కాదని యాశ్రమ వాసపర్వములోని కుంతీవ్యాసుల సంభాషణము చెప్పుచున్నది''

"వ్యాసుని తల్లి యగుసత్యవతికూడ కుంతివలె రహస్యముగా వ్యాసుని గని కన్యాభావము నొందుట గమనింపతగినవిషయము.

"మామయగు వ్యాసునితో గుంతి తన చిన్నతనపుచేష్టను వెల్ల డించినటులు వ్యాసుని తల్లి సత్యవతి సవతికొడుకగు భీష్మునికడ తన చిన్నతనపుజేష్ట నిట్లు సంతోషపూర్వకముగానే చెప్పినది''

"వ్యాసభీష్ములవంటి మహానుభావు లట్టి యధర్మమును ధర్మముగా నంగీకరించుట కానాటి దేశకాల పరిస్థితులే కా రణమై యున్నవా? లేక వ్యాసభీష్ములుకూడ ధర్మవైరుధ్యమున కిష్టపడియుండిరా? ఆలోచింప నాటి పరిస్థితులే అట్టివి కావచ్చు నని తోచెడి'' (పు. 77. 80)

ఈప్రతివాదులు— కన్యకయైయుండి వ్యాసుని గని కన్యాత్వము నే వహించిన సత్యవతీదేవిని, కన్యకయైయుండి కర్ణుని గని కన్యాత్వ మునే వహించిన కుంతీదేవిని, నిదర్శనముగా జూపి 'నాడు కన్యకలు బిడ్డల గనుట దోషము కా' దని సామాన్యముగా వ్రాసి దాని కాశ్రి మవాసపర్వములోని కుంతీ వ్యాససంభాషణము ప్రమాణ మనిరి. అందుకై ముందాసంభాషణమును జూతము—

ఆశ్రిమవాసపర్వ—(అ. 30)

"భగవన్! శ్వశురో మేఽసి దైవతస్యాపి దైవతమ్ ।
సమే దేవాతిదేవ స్త్వం శృణు సత్యాం గిరం మమ ॥
తపస్వీ కోపనో విప్రో దుర్వాసానామ మే పితుః ।
భిక్షా ముపాగతో భోక్తుం త మహం పర్యతోషయమ్ ॥
శౌచేన త్వాగస స్త్యాగై శ్శుద్ధేన మనసా తథా ।
కోపస్థానే ష్వపి మహా త్స్వకుప్య న్న కదాచన ॥
స ప్రీతో వరదో మేఽభూ త్కృతకృత్యో మహామునిః ।
అవశ్యం తే గ్రహీతవ్య మితి మాం సోఽబ్రవీ ద్వచః ॥
తత శ్శాపభయా ద్విప్ర మవోచం పున రేవ తమ్ ।
ఏవ మస్త్వితిచ ప్రాహ పున రేవ సమే ద్విజః ॥
ధర్మస్య జననీ భద్రే భవిత్రీ త్వం శుభాననే ।
వశే స్థాస్యన్తి తే దేవా యాం స్త్వ మావాహయిష్యసి ॥
ఇత్యుక్త్వాఽన్తర్హితో విప్ర స్తతోఽహం విస్మితాఽభవమ్ !
నచ సర్వా స్వవస్థాసు స్మృతి ర్మే విప్రణశ్యతి ॥
అథ హర్మ్యతలస్థాఽహం రవి ముద్యన్త మీక్షతీ ।
సంస్మృత్య తదృషే ర్వాక్యం స్పృహయన్తీ దివాకరమ్ ॥
స్థితాఽహం బాలభావేన తత్ర దోష మబుధ్యతీ ।
అథ దేవస్సహస్రాంశు ర్మత్సమీపగతోఽభవత్ ॥

ద్విధా కృత్వాత్మనో దేహం భూమౌ చ గగనేఽపిచ ॥
తతాప లోకా నేకేన ద్వితీయే నాగమ త్తు మామ్ ।
స మా ముువాచ వేపన్తీం వరం మత్తో వృణీష్వహ ॥
గమ్యతా మితి తం చాహం ప్రణమ్య శిరసాఽవదమ్ ॥
స మా మువాచ తిగ్మాంశు ర్వృథాహ్వానం న మే క్షమమ్ ।
ధక్ష్యామి త్వాంచ విప్రంచ యేన దత్తో వర స్తవ ॥
త మహం రక్షతీ విప్రం శాపా దనపకారిణమ్ ।
పుత్రో మే త్వత్సమో దేవ భవే దితి తతోఽబ్రువమ్ ॥
తతో మాం తేజసాఽఽవిశ్య మోహయిత్వాచ భానుమా న్ ।
ఉవాచ భవితా పుత్ర స్తవే త్యభ్యగమ ద్దివమ్ ॥
తతోఽహ మ న్తర్భవనే పితు ర్వృత్తా న్తరక్షిణీ ।
గూఢోత్పన్నం సుతం బాలం జలే కర్ణ మవాసృజమ్ ॥
నూనం తస్యైవ దేవస్య ప్రసాదా త్పున రేవ తు ।
కన్యాఽహ మభవం విప్ర యథా ప్రాహ స మా మృషిః ॥
స మయా మూఢయా పుత్రో జ్ఞాయమానోఽ ప్యుపేక్షితః ।
త న్మాం దహతి విప్రర్షే యథా సువిదితం తవ ॥
యది పాప మపాపంవా యదేత ద్వివృతం మయా ।
ఇత్యుక్తః ప్రత్యువాచేదం వ్యాసో వేదవిదాం వరః ॥
సాధు సర్వ మిదం భావ్య మేవ మేత ద్యథాత్థ మామ్ ।
అపరాధశ్చ తే నాస్తి కన్యాభావం గతా హ్యసి॥
దేవా శ్చైశ్వర్యవన్తో వై శరీరా ణ్యావిశ న్తివై ।
స న్తి దేవనికాయాశ్చ సంకల్పా జ్జనయ న్తి యే ॥
వాచా దృష్ట్యా తథా స్పర్శా త్సంఘర్షేణేతి పంచధా ।
మనుష్యధర్మో దైవేన ధర్మేణహి న దుష్యతి ॥
ఇతి కున్తి విజానీహి వ్యేతు తే మానసో జ్వరః ।

ఇచ్చట కుంతీదేవి యిట్లు చెప్పుచున్నది—

ఓవ్యాసభగవానుడా! నీవు దేవాతిదేవుడవు. నాసత్యవచనము వినుము. వెనుక నొకప్పుడు మహర్షియగు దుర్వాసుడు నాతండ్రియింటికి భిక్షార్థము వచ్చియున్నప్పుడు మహాతపస్వియు, మహాకోపియు నైన ఆమహర్షికి పరిశుద్ధమనస్సుతో నెన్నియో కష్టములను సహించి పరిచర్య జేసితిని. అంతట వరదుడైన మహర్షి సంతుష్టుడై వర మిచ్చి మంత్రముపదేశించి నీ వేదేవతల నాహ్వానింతువో వారు నీకువశులగుదురు. నీవు ధర్మజనని వయ్యెదవు. అని చెప్పి యంతర్హితుడయ్యెను. నేనాశ్చర్యపడితిని. ఆమహర్షి యుపదేశము సర్వావస్థలయందును నాకు స్మృతికి వచ్చుచునే యుండెను. అంతట ప్రాసాదముపైనున్న నే నుదయించుచున్న సూర్యుని జూచి ఋషివాక్యమును స్మరించి బాల్యముచే నేమి చిక్కువచ్చునో యెరుగక సూర్యుని భావన జేసితిని. అప్పుడాసూర్యుడు దేహాంతరమును ధరించి నాసమీపమునకు వచ్చి వరము కోరుమనగా నేను వందనము జేసి వెళ్ళుమంటిని.

అప్పుడు సూర్యుడు- నాయాహ్వానము వ్యర్థము కాకూడదు. నీకును నీకు, వరమిచ్చిన విప్రునకును హాని గలిగింతును. అని చెప్పగా సూర్యశాపమునుండి దుర్వాసుని రక్షింపదలచి నీతో సమానుడగు పుత్రుడు నాకు గలుగవలెనని కోరితిని. అంతట తేజస్సుచే నన్నావేశించి వ్యామోహితురాలిని జేసి నీకు బుత్రుడు కలుగునని చెప్పి దివమున కేగెను.

తరువాత నేనంతఃపురమందు గూఢోత్పన్నుడైన బాలుని-పితృమర్యాదను కాపాడుదాననై జలమందు విడిచితిని. నిజముగా నాసూర్యదేవుని కటాక్షమున మరల నాకు కన్యాత్వము ప్రాప్తించినది. దుర్వాసోమహర్షి చెప్పినట్లే జరిగినది. నేను మూఢురాలనై పుత్రు

ను పేక్షించితిని. పుణ్యమో పాపమో నీయొద్ద వివరింపబడిన యీవిష యము నన్ను పీడించుచున్నది. నీకు విదితమే. ఈకుంతీదేవి ప్రసంగ ముపై వ్యాసభగవానుడు- నీవెట్లు చెప్పితివో అట్లది జరుగవలసిన విధియై యున్నది. (నీకు సూర్యాంశమున సుతుడు గూఢముగా బుట్టి దూరమై పోయి దుర్యోధనుని జేరి యుద్ధహేతువుకావలసిన విధి యట్లు న్నది.) నీ కపరాధము లేదు. నీవుకన్యకవైకదా అప్పుడుంటివి. అణిమా దిసిద్ధులుకల దేవతలు శరీరముల నావేశింతురు. సంకల్పముచేతను, వాక్కుచేతను, దృష్టిచేతను, స్పర్శచేతను, రతిచేతను, ఐదువిధములు గా దేవతలు సంతతి నిచ్చుచుందురు. మనుష్యధర్మము దైవధర్మముచే దూషితము కాదు. కుంతీదేవీ! నీకు మనోవ్యధతో బనిలేదు. అని చెప్పెను.

ఇందు, కుంతీదేవి మాటలలో కన్యావస్థయందు సూర్యసంబం ధమున తనకు గూఢముగా సుతుడు గలుగుట, తండ్రి మర్యాదను కాపాడుటకై శిశువును జలమందు విడుచుట జరిగె నని యున్నది. అట్లు ఆమె విడుచుట లోకాపవాదభీతిచేతనే యని స్పష్టమగుచున్నది.

వ్యాసభగవానుని మాటలలో గూడ దుర్వాసోమహర్షి యుప దేశముమొదలు సూర్యసంబంధసుతోత్పత్తిసుతపరిత్యాగాంతకృత్య ములు విధివశమున జరిగినవి ఆఘటన యంతయు నీకు కన్యాదశ యందు అట్టి యిచ్ఛ లేనప్పుడు తటస్థించినది కనుకను, దేవతలు సంక ల్పాదులచే నైదువిధములుగా సంతతినిచ్చువారు కనుక దేవధర్మముచే మనుష్యధర్మము దూషితము కాదు కనుకను నీతప్పు లేదు. అని యున్నది. ఈకుంతీవ్యాససంభాషణములో కన్యకలు బిడ్డల గనుట దోషము కాదని యున్నదా? సూర్యానుగ్రహమున సుతుని గన్న కుంతీదేవి కది దోషము కాదని యున్నదా? మ భా.చ. కారులన్నట్లు నాడు కన్యకలు బిడ్డల గనుట దోషము కానియెడల సమాజ

కవచకుండలశోభితుడై యున్న శిశువును ఆమె యేల విడిచినది? విడువని యెడల తండ్రికి కమర్యాద యేమున్నది? వ్యాసభగవానుడైనను లోకములో కన్యకలు బిడ్డల గనుట ధర్మమే కనుక నీవాబిడ్డను విడిచి వేయుటచే తప్పుచేసినా వని యేల చెప్పలేదు? ఎవ్వనివలన గన్యకలు బిడ్డల గనినను దోషములేనప్పుడు మనుష్యధర్మము దేవధర్మముచే దూషితము కాదని యేలచెప్పెను? కనుక "నాడు కన్యకలు బిడ్డల గనుట దోషము కాదని...కుంతీవ్యాసుల సంభాషణము చెప్పుచున్నది" అను వ్రాత నింద్యము.

రహస్యకర్తలు—వ్యాసమహర్షి కుంతి కిడిన ప్రత్యుత్తరవాక్యమును విచారింతము. అని యిట్లు వ్రాసిరి—ఉత్తమమానవు డొకప్పుడు తన పాపకర్మకు పశ్చాత్తాపతప్తు డగుట యుక్తమేకాని జీవితకాల మంతయు చింతింపగూడదు...పశ్చాత్తాపముచే పాపపరిహారము గావించుకొని యంతటితో నాపాపచింతను వీడి నిర్మలమైన మనస్సుగలవాడై యిక నాపాపకర్మలవెంట బోవక స్వోచితప్రవర్తనుడై మెలంగవలయును ఈ హేతువుచేతనే వ్యాసుడు కుంతితో "ఇక నీకాచింత యుండగూడదు" అని స్పష్టముగా జెప్పియున్నాడు" (పు. 41)

ఈప్రతివాదుల విచారములో— కుంతికి పాపము తటస్థించనవియు, నది యామె పశ్చాత్తాపముచే బరిహృతమైన దనియు నిక నీకాచింత యుండగూడదని మహర్షి బోధించె ననియు తేలినది.

ఇక గ్రంథమందు 'అపరాధశ్చ తే నాస్తి' 'మనుష్యధర్మో దైవేన ధర్మేణ హి న దుష్యతి । ఇతి కుంతి విజానీహి వ్యేతు తే మానసో జ్వరః" అనుటలో నీకు పాపమే లేదని బోధించె నని యున్నది. కనుక వీరిది దుర్విచారమే. పశ్చాత్తాపముచే బాపపరిహారము గావించుకొనవలెనట. జీవితకాలమంతయు చింతింపరాదట. ఇంత

కాలము చింతించిన పాపపరిహార మగునని వీరు చెప్పగలరా? కనుక వీరి యసంగతప్రసంగము హేయము.

మఱియు కుంతీదేవి వ్యాసభగవానునియొద్ద దుర్వాసోమహర్షి యుపదేశము మొదలు సుతుని విడుచుపర్యంతము వివరించి చెప్పి—

"త న్మాం దహతి విప్రర్షే... యది పాప మపాపం వా య దే త ద్వివృతం మయా" అనుచు నీయొద్ద వివరింపబడిన యీవిషయము పాపమో పుణ్యమో నన్ను పీడించుచున్న దని తన విచారమును వెల్లడించెను. ఇట్లుండ మ. భా. చ కారులు ఈశ్లోకముల కర్థము జెప్పుచు— "కుంతికి రహస్యముగా బిడ్డం గంటి నను విచారము లేదు కాని ఆబిడ్డను దెలిసియు, నుపేక్షించితి నను నదియే విచారకారణము" (పు. 78)

అని వ్రాయుటయు నింద్యమే

"అథ హర్మ్యతలస్థాహం రవి ముద్యంత మీక్షతీ।
సంస్మృత్య తద్వృషే ర్వాక్యం స్పృహయంతీ దివాకరమ్॥
స్థితాహం బాలభావేన తత్ర దోష మబుద్ధ్యతీ।"

అనుచు బాల్యముచే సూర్యభగవానుని భావన జేసిన వచ్చెడి దోష మెఱుగక హర్మ్యతలమం దుండి సూర్యుని భావన చేసితిని. అని చెప్పుకొనుటలో సూర్యుని భావన జేయుటే తప్పైన దని యామె విచారించినట్లు కనబడ లేదా? ప్రతివాదు లన్నట్లు రహస్యముగా బిడ్డను గంటి నని కుంతీదేవికి విచారమే లేని యెడల వ్యాసభగవానుని మాటలలో—

"అపరాధశ్చ తే నాస్తి కన్యాభావం గతా హ్యసి।
దేవా శ్చైశ్వర్యవంతో వై శరీరా ణ్యావిశంతి వై॥

మనుష్యధర్మో దైవేన ధర్మేణ హి న దుష్యతి ।
ఇతి కుంతి! విజానీహి వ్యేతు తే మానసో జ్వరః ॥''

అనుచు కన్యకవై యున్న నీ కపరాధ మేమియు లేదు. దేవతలు శరీరముల నావేశింతురు. దైవధర్మముచే మనుష్యధర్మము దూషితము కాదు. నీమనోవ్యథను తొలగించుకొనుము. అను ప్రసంగమున కవసర మేమి?

రహస్యముగా బిడ్డను గన్న విచార మామెకు పరిహరించుటకే ఆప్రసంగ మవసరమైనది. కనుక నీ మ భా. చ. కారుల వ్రాత హేయము.

— కర్ణోత్పత్తిని గూర్చి రహస్యకర్తల వాదము-తన్నిరాకరణము —

ఈవిషయములో రహస్యకర్త లెంతవిరుద్ధముగా వ్రాసిరో చూడుడు—

"కుంతీపరిచర్యచే తృప్తుండైన యతి యామెకు మంత్రోపదేశ మొనరించినపుడు యౌవనవతి యగు కుంతి యాత్సుక్యముచే మంత్రిసత్త్వమును గ్రహింపగోరి సూర్యమండలాంతర్వర్తి యగు నాధిదైవికపురుషునియందు మనసుంచి తన మంత్రి మొక సత్త్వవంతునియందు ప్రయోగింప నామంత్రశక్తిచే ప్రేరితుండైన పురుషునియందు మంత్రమూర్తి యగు సూర్యు నావహింపజేసి తన్మూర్తియందే లక్ష్య ముంచి యాసత్త్వవంతునితో భోగించెను. అందుచే నామె గర్భమునందు సూర్యసన్నిభుం డగు కుమారుడు జన్మించెను'' (పు. 439)

"ఈకర్ణజననమునుగూర్చి కొందరు విమర్శకులు ఈమె దుర్వాసునకు పరిచర్యచేయుచున్న సమయమున నీమెయందు కామమోహితుడైన దుర్వాసునివలననే యీామె గర్భవతియై యుండును

గానిదుర్వాసుని మంత్రప్రభావమున గాదనియు, గర్భవతి యైన పిమ్మట తద్రహస్యగోపనమునకై యీరీతిగా ప్రవర్తింపు మని దుర్వాసుడే యామెకు బోధించియుండు ననియు, నటుపిమ్మట తన దుష్కృత్యమునకు దాను పశ్చాత్తాపము నొందుచు విధిలేక నామె యట్లే ప్రవర్తించియుండు ననియు చెప్పుచున్నారు.

కాని యిందు సత్య మెంతవరకు గలదో మన మూహింపలేము. దుర్వాసునివంటి దివ్యర్షి యిటువంటి యకృత్యమును గావించెనను టయు సందేహాస్పదముగా నున్నది. కాని యనవసరక్రోధమునకు వశుడైనట్లే కామమునకు గూడ వశుడై యుండవచ్చుననియు తోచుచున్నది. పరాశరుని వంటి తపోధనుడు అవివాహితగా నున్న సత్యవతిని భోగించెను. అట్లే యిచ్చట దుర్వాసుడు కూడ కుంతిని భోగించెనేమో?" (పు 219)

ఔరా! వీరి దెంత వక్రమార్గమో ' చూడుడు—కుంతీదేవికి మంత్రోపదేశముచేసినవాడు యతి యగు దుర్వాసుడట. ఆమంత్ర మూర్తి సూర్యుడేనట. సూర్యమండలాంతర్వర్తియందే కుంతీదేవి మన సుంచెనట. తనమంత్రమును మాత్రము సత్త్వవంతుడగు నొక పురుషునియందు ప్రయోగించి యాపురుషునియం దామంత్రశక్తిచే సూర్యు నావహింపజేసెనట సూర్యునియందే లక్ష్యముంచి యాసత్త్వ వంతునితో భోగించెనట. అందుచే సూర్యసన్నిభు డగు కుమారుడు జన్మించెనట. వీరి వ్రాతనుబట్టికూడ మంత్రమూర్తి సూర్యుడే యైయుండ, కుంతీదేవి తనకు లక్ష్యమైయున్న సూర్యునియందే తన మనస్సు నిలిపియుండ, మంత్రశక్తి నంగీకరింపక గత్యంతరము వీరికి లేనిదైయుండ, మంత్రశక్తిచే నాసూర్యుడు వచ్చి యెవ్వనియందో

ఆవహించెనని చెప్పుట తప్పనిసరియైయుండ, నామంత్రశక్తిచే నాసూర్యుడే దేహాంతరధారియై వచ్చి స్వయముగా కుంతీదేవికి పుత్రునను గ్రహించెనని గ్రంథమందు చెప్పబడినట్లు భావింపక కుకల్పనతో సత్త్వవంతుడనుచు నెవ్వనినో సూచించిన వీరి కీలకబంధనప్రయాస మేలనో!

ఒకడు బకమును బంధింపదలచి దానియొద్దకుబోయి యింత వెన్న దాని నెత్తిపై నుంచి యది కరగి దానికండ్లలోనికి కారినతరువాత బకమును బంధించెనట. దానినెత్తిపై వెన్న బెట్టినపుడే బంధింపదగియుండ నాపైచర్య వ్యర్థప్రయాసమగుటచే నది బకబంధనప్రయాసమనబడినది.

పాప మీరహస్యకర్తలకు సూర్యుడేమి? శరీరధారియై కుంతీదేవియొద్దకు వచ్చి సంతాన మిచ్చుటయేమి? అనిపించినది కాబోలు. వీరికి శాస్త్రమర్యాద నొకింత వినిపింతము.—

దేవతాధికరణము— బ్రహ్మసూత్రము—

"భావంతు బాదరాయణోఽస్తి హి"

భాష్యమ్—అస్తి హ్యైశ్వర్యయోగా ద్దేవతానాం జ్యోతిరాద్యాత్మభిశ్చావస్థాతుం యథేష్టంచ తం తం విగ్రహం గ్రహీతుం సామర్థ్యం! తథాహి శ్రూయతే... మేధాతిథిం హ కాణ్వాయన మిన్ద్రో మేషో భూత్వా జహార.

స్మర్యతేచ—ఆదిత్యః పురుషోభూత్వా కున్తీ ముపజగామహ" ఇతి ...యాదృశం మన్త్రార్థవాదయో రిందాదీనాం స్వరూప మవగతం న తత్తాదృశం శబ్దప్రమాణకేన ప్రత్యాఖ్యాతుం యుక్తమ్, ఇతిహాసపురాణమపి వ్యాఖ్యాతేన మార్గేణ సంభవన్మన్త్రార్థవాదమూలత్వా త్ప్రభవతి దేవతావిగ్రహాదిసాధయితుం ప్రత్యక్షాదిమూలమపిసంభవతి. భవతి. హ్యస్మాక మప్రత్యక్షమపి చిరంతనానాం ప్రత్యక్షం తథా!

చ వ్యాసాదయో దేవాదిభిః ప్రత్యక్షం వ్యవహరన్తీతి స్మర్యతే। య
స్తు బ్రూయా దిదానీన్తనానామివ పూర్వేషామపి నాస్తి దేవాదిభి
ర్వ్యవహర్తుం సామర్థ్య మితి స జగ ద్వైచిత్ర్యం ప్రతిషేధేత్. ఇదానీ
మివచ నాన్యదాపి సార్వభౌమః క్షత్రియోస్తీతి బ్రూయాత్. తత
శ్చ రాజసూయాదిచోదనా ఉపరుధ్యాత్. ఇదానీమివచ కాలాన్తరే
ప్యవ్యవస్థితప్రాయాన్ వర్ణాశ్రమధర్మాన్ ప్రతిజానీత. తతశ్చ వ్యవస్థావి
ధాయిశాస్త్ర మనర్థకం స్యాత్.

తస్మా ద్ధర్మోత్కర్షవశా చ్చిరన్తనా దేవాదిభిః ప్రత్యక్షం
వ్యవజహ్రు రితి శ్లిష్యతే... యోగోఽప్యణిమాద్యైశ్వర్యప్రాప్తిఫలః
స్మర్యమాణో న శక్యతే సాహసమాత్రేణ ప్రత్యాఖ్యాతుం। శ్రుతిశ్చ
యోగమాహాత్మ్యం ప్రఖ్యాపయతి ... ఋషీణా మపి మన్త్రబ్రాహ్మణ
దర్శినాం సామర్థ్యం నాస్మదీయేన సామర్థ్యే నోపమాతుం యుక్తం
తస్మా త్సమూల మితిహాసపురాణమ్'

దీనికి తాత్పర్య మేమనగా—యోగశక్తులను బట్టి సూర్యాది
దేవతలకు జ్యోతిర్మండలాదిరూపములతో నుండుటకును, ఇష్టము
వచ్చిన విగ్రహము ధరించుటకును గూడ సామర్థ్యముకలదు. కనుకనే
ఇంద్రుడు మేషమై మేధాతిథిని యెత్తుకొనిపోయె నని వేదమందును,
సూర్యుడు పురుషరూపముధరించి కున్తీదేవిని బొందె నని యితిహాస
మందును చెప్పబడినది. మంత్రార్థవాదములయందు ఇంద్రాదిదేవతల
కెట్టి స్వరూపము మనకవగత మగుచున్నదో దానిని శబ్దము ప్రమాణ
మనువాడు నిరాకరింప వీలులేదు. మంత్రార్థవాదమూలకము లైన
పురాణేతిహాసములుకూడ దేవతావిగ్రహాదికమును సాధింప సమర్థము
లగుచున్నవి.

మనకు ప్రత్యక్షము కాకున్నను పూర్వులకు ప్రత్యక్షమగుటచే

నాదేవతావిగ్రహాదికము ప్రత్యక్షసిద్ధము కూడ నగుచున్నది. కనుకనే వేదవ్యాసాదులు దేవతలతో బ్రత్యక్షముగా వ్యవహరించి రని చెప్ప బడినది. ఇప్పటివారికివలెనే పూర్వులకు కూడ దేవతలతో వ్యవహ రించెడి సామర్థ్యము లేదని యెవ్వఁ డనునో అతఁడు జగత్సృష్టియందు విచి త్రతయే లేదనువాడగును. ఇప్పటివలెనే యెన్నఁడును సార్వభౌముడగు క్షత్రియుఁడు లేడనును. దానిచే రాజనూయాదివిధులను భగ్నము చేయును. ఇప్పటివలెనే కాలాంతరమందు గూడ వర్ణాశ్రమధర్మము లవ్యవస్థితములే యనును. దానివలన వ్యవస్థావిధాయకమైన శాస్త్రము నిరర్థక మగును.

కనుక ధర్మాతిశయమును బట్టి పూర్వులు దేవతలతో వ్యవహ రించినా రనుటే యుక్తము. యోగశాస్త్రోక్తమై అణిమాదిశక్తిసంపా దకమైయున్న యోగమును సాహసమాత్రమున నిరాకరించుట అయు క్తము. వేదముకూడ యోగమహిమలను ప్రతిపాదించుచున్నది. మంత్రద్రష్ట లగు మహర్షుల సామర్థ్యము కూడ మనసామర్థ్యము వంటిదే యనుట అయుక్తము. కనుక పురాణేతిహాసములు సప్రమాణ ములే అని.

పరిశీలింపగా మనశాస్త్రమర్యాద యిట్లున్నది. ప్రతివాది ప్రసంగము లట్లున్నవి. కనుక రహస్యకర్తల అప్రామాణికప్రసంగము నింద్యము. వెనుక జూపిన కుంతీదేవి వాక్యములో—

"స్థితాఽహం బాలభావేన తత్ర దోష మపశ్యతీ ।"

అని యామె బాల్యమందున్నట్లుండ రహస్యకర్తలు "యౌవన వతియగు కుంతి యని వ్రాయుట" అక్రమము.

"గమ్యతా మితి తం చాహం ప్రణమ్య శిరసాఽవదమ్ ।"

"తతో మాం తేజసాఽఽవిశ్య" అని కుంతీదేవి అట్టి కోరికకలది కాదు. సూర్యనిర్బంధమువననే అట్లు జరిగిన దని గ్రంథమం దుండ "కుంతీదేవి సత్త్వవంతునితో భోగించెను" అని ఆమెయే ప్రేరేపించి నట్లు వ్రాయుట అక్రమము. ఇట్లు పరీక్షింపగా కర్ణోత్పత్తిని గూర్చి రహస్యకర్తల ప్రథమప్రసంగము ప్రతిహతమైనది.
ఇక వారి ద్వితీయప్రసంగవైఖరిని జూడుడు:—

దుర్వాసునకు పరిచర్య చేయుచున్నపుడు కామమోహితుడైన దుర్వాసునివలననే యామె గర్భవతి యై యుండును గాని దుర్వాసుని మంత్రప్రభావమున గాదని కొందరు విమర్శకులు చెప్పుచున్నారట. ఇందు సత్య మెంతవరకు గలదో మన మూహింపలేమట. దుర్వాసుని వంటి దివ్యర్షి యిటువంటి అకృత్యమును చేసె ననుటయు సందేహాస్పదముగా నున్నదట కాని యనవసరక్రోధమునకు వశుడైనట్లే కామమునకు గూడ వశుడై యుండవచ్చు ననియు తోచుచున్నదట. పరాశరునివంటి తపోధనుడు అవివాహితగా నున్న సత్యవతిని భోగించి నట్లే దుర్వాసుడు గూడ గుంతిని భోగించె నేమో అట.

ఇదిమహాభారతగ్రంథవిరుద్ధము, బ్రహ్మసూత్రభాష్యవిరుద్ధము, రహస్యకర్తల ప్రథమప్రసంగమునకు విరుద్ధము.

మఱియు, ఆమె దుర్వాసునివలననే గర్భవతియై యుండును గాని దుర్వాసుని మంత్రప్రభావమున గాదను వారి మాటలో సత్య మెంతవరకు గలదో మన మూహింప లేమందురే. వారికల్పన నిరాధార మనియు, గ్రంథవిరుద్ధమనియు త్రోసివేయక యీరహస్యకర్తలను అందలి సత్య మూహింపు మని కోరినవా రెవరు?

అందు సత్య మెంతవరకు గలదో మన మూహింపలేమన్న వీరు తుదకు దుర్వాసుడు 'కుంతినిభోగించెనేమో' అనియూహించుటకు

సిద్ధపడుట హాస్యాస్పదముకాదా? ఒకవేళ మీరూహింప లేమన్నది సత్య మును గూర్చి కనుక నీయూహించినది యసత్యమన్నయెడల స్వవచన వ్యాఘాత ముండదేమో.

పరాశరుడు సత్యవతియందు ప్రవర్తించినట్లు దుర్వాసుడు కుంతి యందు ప్రవర్తించెనేమో! అందురే. పరాశరుని యాప్రవృత్తి గ్రంథస్థమైయున్నట్లు దుర్వాసుని ప్రవృత్తి గ్రంథస్థముగా లేదేమి? దుర్వాసు డట్లు ప్రవర్తించుటే నిజమైనయెడల నదియు గ్రంథస్థమై యుండదా? పరాశరప్రవృత్తి నున్న దున్నట్లు చెప్పిన మహా భారతకర్త దుర్వాసుని ప్రవృత్తిని దాచునా? అనవసరక్రోధమునకు వశుడైనట్లే కామమునకు గూడ వశుడైయుండవచ్చునని తోచుచున్న దందురా? క్రోధమునకు వశుడైనసంగతి గ్రంథస్థ మగుటచే ప్రామా ణికము. ఆక్రోధవశుడగుటకూడ నెవ్వనియం దయ్యెనని గ్రంథము చెప్పెనోఅదియేప్రామాణికముగాని మరెవ్వనియందో కల్పించిచెప్పినది యప్రామాణికము.

ఇట్టి స్థితిలో కామవశుడైనట్లు గ్రంథమందు లేనపుడు రహస్య కర్తల యూహ అప్రామాణికమే. ఇంద్రియగోచరముగాని విషయము గ్రహించుట కార్షగ్రంథమే శరణ్యము ఇట్లు రహస్యకర్తల ద్వితీయ ప్రసంగముకూడ పరాస్తమైనది"

ఇంతవరకు మ. భా. చ. కారుల వ్రాతను పరీక్షించుచు ప్రస క్తానుప్రసక్తముగా కర్ణోత్పత్తినిగూర్చిన రహస్యకర్తల వ్రాతను గూడ బరీక్షించి యా ప్రతివాదిప్రసంగములు హేయములని నిరూపించి నాము—

ఇక మరల మ. భా. చ.కారుల వ్రాతనే అందుకొందము. వారి

వ్రాతలో "నాడుకన్యకలు బిడ్డల గనుట దోషముకాదని యాశ్రమ వాసపర్వములోని కుంతీవ్యాసుల సంభాషణము చెప్పుచున్నది."

అను విషయము ప్రమాణోపపత్తులతో నిరస్తమైనది. "అంశా స్త్రర మిట్లున్నది.

—♦ కుంతీసత్యవతుల కన్యాత్వము. ♦—

"వ్యాసుని తల్లియగు సత్యవతికూడ కుంతివలె రహస్యముగా వ్యాసుని గని కన్యాభావము నొందుట గమనింపదగిన విషయము.

మ.భా.చ. కారు లీవ్రాతచే- కర్ణజన్మానంతరము కుంతీదేవికిని, వ్యాసజన్మానంతరము సత్యవతీదేవికిని అనుగ్రహింపబడిన కన్యాత్వము లో నాక్షేపమును సూచించుచున్నారు. గ్రంథమందు ప్రామాణ్య బుద్ధిలేనివారి ధోరణి యిట్లేయుండును. ఇట్టివారు ప్రమాణగ్రంథముల విమర్శించుటకు అనధికారులు. అప్రమాణగ్రంథస్థవిషయములను శా స్త్రకర్తలు ప్రామాణికములని కీర్తించుచుండ వాని నప్రామాణికము లనుచున్న వీరివ్రాత హేయము.

సత్యవతీదేవికి పరాశరమహర్షియు, కుంతీదేవికి సూర్యభగవాను డును కన్యాత్వము ననుగ్రహించినట్లు మహాభారతము స్పష్టముగా జె ప్పుచున్నది. దీనిని వ్యాకరణశాస్త్రకర్తలు కీర్తించియున్నారుచూడుడు.

"కన్యాయాః కనీనచ"

కాశికా- కన్యాయా అపత్యం కానీనః కర్ణః కానీనో వ్యాసః. కాశికావ్యాఖ్యాపదమంజరీ—

"మునిదేవతామాహాత్మ్యాత్ యా పుంయోగేఽపి స

కన్యాత్వం జహాతి. యథా కున్తీ, యథా సత్యవతీ సాఽత్రోదా
హరణ మితి తదాహ. కానీనః కర్ణః కానీనో వ్యాస ఇతి''

కైయటగ్రంథః—

మునిదేవతామాహాత్మ్యా ద్వా పుంయోగేఽప్యక్షతయోని
ర్భవతి. యథా కున్తీ మన్త్రాహూతదినకరోత్పాదితకర్ణాఖ్యపుత్రాపి
పునః కన్యై వాభూత్ తదపత్యం కానీనశబ్దాభిధేయమ్.

దీని తాత్పర్య మేమనగా— కానీనశబ్దమునకు కన్యయొక్క
పుత్రు డని యర్థము. కన్య యైనచో బుత్రు డెట్లు? పుత్రుడున్నచో
గన్య యెట్లగును? అని విరోధము తటస్థింపగా మునిమహిమచేతను,
దేవతామహిమచేతను పురుషసంబంధము కలిగినను ఏ స్త్రీ అక్షత
యోనిత్వరూపమైన కన్యాత్వము కలిగియుండునో అట్టి కుంతీదేవియు,
సత్యవతీదేవియు నుదాహరణ మగును కనుక విరోధము లేదు. కుంతీ
దేవి మంత్రముచే నాహూతుడైన సూర్యునివలన పుత్రవతి యైనను
మరల కన్యకయే యైనది'' అని

కుంతీదేవికి కన్యాత్వము సూర్యానుగ్రహమున సిద్ధించినట్లు
వెనుక జూపబడిన కుంతీవ్యాససంభాషణగ్రంథములో స్పష్టము. ఇక
సత్యవతీదేవికి పరాశరు డనుగ్రహించిన కన్యాత్వమునుగూర్చిచూతుము

"తతో మాం మాహ సముని ర్గర్భ ముత్సృజ్య మామకమ్।
ద్వీపేఽస్యా ఏవ సరితః కన్యైవ త్వం భవిష్యసి॥'' (ఆది. 105 అ.)

నీలకంఠీయమ్—

మామకం గర్భ ముత్సృజ్య కన్యైవ త్వం భవిష్యసీతి ముని

మునివచనాత్ జాతాపత్యాయా అపి కన్యాత్వావినాశాత్ పున ర్దాశసంసర్గజం హీనవర్ణత్వం నాభూత్. కన్యాత్వావస్థాయాం కామభక్షాదినిషేధాభావాత్. కించ పృథాసత్యవత్యోరనిచ్ఛన్త్యోరేవసూర్యపరాశరాభ్యా మపత్యోత్పాదనం కృత మతో న ద్వయోః కన్యాత్వోచ్ఛిత్తి రితి భావః''

అనగా ఈ నదీసంబంధమైన ద్వీపమందు నాసంబంధమైన గర్భమును విడిచి నీవు కన్యకవే యగుదువని యాపరాశరమహర్షి నాకు చెప్పెను. (ఇది సత్యవతీదేవి వచనము) నీలకంఠీయటీక యేమనగా—

నాసంబంధమైన గర్భమును విడిచి నీవు కన్యకవే యగుదువను మునివచనము వలన, పుత్రుడు కలిగినను ఆమెకు కన్యాత్వభంగము కలుగలేదు గనుక, కన్యాత్వావస్థయందు కామభక్షణాదినిషేధము లేనందున మరల దాసుని సంసర్గమును బట్టి కలిగెడి హీనవర్ణత్వము క్షత్రియయైన యాసత్యవతీదేవికి తటస్థింపలేదు. మఱియు కుంతీసత్యవతులు పురుషసంబంధవాంఛలేని దశలో నున్నపుడేసూర్యపరాశరుల వలన వారికి సంతతి కలిగింపబడినందున నాసంతతి కలిగెడికాలమునకు గూడ వారిది కన్యాత్వమే యైయుండున వారల కన్యాత్వమునకు విచ్ఛేదమే కలుగలే దని భావము'' అని.

ఇట్లు ప్రమాణగ్రంథములు కుంతీసత్యవతుల కన్యాత్వమును విశదీకరించుచున్నందున "వ్యాసుని గని కన్యాభావము నొందుట గమనింపదగిన విషయము'' అన్న మ.భా.చ.కారులకు ఆకన్యాత్వమునకై యీచూపిన ప్రమాణగ్రంథసందర్భమును గమనింపుడని చెప్పుచు నంశాంతర మందుకొనుచున్నాము—

"వ్యాసునితో గుంతి తన చిన్నతనపుచేష్టను వెల్లడించినటులు, సత్యవతి భీష్మునికడ తన చిన్నతనపుచేష్టను చెప్పినది. వ్యాసభీష్ము

లవంటి మహానుభావులు అట్టి యధర్మమును ధర్మముగా నంగీక
రించుట కానాటి దేశకాలపరిస్థితులే కారణమై యున్నవా? వేద
వ్యాసభీష్ములు కూడ ధర్మవైరుధ్యమున చిక్కుపడియుండిరా? ఆలో
చింప నాటి పరిస్థితులే అట్టివి కావచ్చు నని తోచెను."

కర్ణోత్పత్తిని గూర్చి కన్యాదశలోని తన వృత్తాంతమును కుంతీదేవి వ్యాసమహర్షితోడను, వ్యాసోత్పత్తిని గూర్చి కన్యాదశలోని తనవృత్తాంతమును సత్యవతీదేవి భీష్మునితోడను చెప్పినపుడు ఆమహానుభావులు అట్టి యధర్మమును ధర్మముగా నంగీకరించిరట! అది యధర్మమే యైన యెడల వారు ధర్మముగా నంగీకరింపరు. వారట్లు అంగీకరించినపుడు అది యధర్మము కాదు. కనుక నధర్మమును ధర్మముగా నంగీకరించి రనుమాట విరుద్ధము. పూర్వోక్తగ్రంథసందర్భమేమి? యోగశక్తితపోమహిమలచే జరిగిన యాలోకోత్తరఘటనయేమి? అక్షతయోనిత్వరూప కన్యాత్వవరప్రాప్తియేమి? భీష్మవేదవ్యాసులు దానిని ధర్మముగా నంగీకరించుట యేమి? దానిని యీను భా. చ. కారులు అధర్మ మనుటేమి? ధర్మాధర్మనిర్ణాయకుడా వ్యాసమునియా? యీవ్యత్యాసమూర్తియా? "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ" అనుటనుబట్టి అకార్య మేదియో కార్య మేదియో తెలిసికొనుటకు శాస్త్రమే ప్రమాణముకాని మనుష్యబుద్ధికాదు. అట్టిస్థితిలో శాస్త్రకర్తయగు వ్యాసభగవానుడును శాస్త్రనిష్ణాతుడగు భీష్ముడును చెప్పినదే నిజము. "వారట్లు చెప్పుటకు నాటి పరిస్థితులే కారణము" అనుట తప్పు. పరిస్థితులను బట్టి అధర్మ మెప్పుడును ధర్మము కానేరదు. ధర్మాధర్మనిర్ణాయకము శాస్త్రము కనుక నెట్టి పరిస్థితులలో నైనను శాస్త్రీయమే ధర్మము. అశాస్త్రీయ మధర్మమే.

ఈప్రతివాదులు ఆకుంతీ సత్యవతీచరిత్రములలో రహస్యముగా బిడ్డలను గనుటనుమాత్రమే గ్రహించిరి గాని ఆపై ముఖ్యమైన గన్యా

త్త్వసిద్ధిని గ్రహింపలేము. అదియే వారి హృదయదోషము. ఇంతటితో దీనిని విడిచి విషయాంతర మందుకొందము.

### — కాశీప్రభువు వ్యాసుని కాశీనుండి తరిమెనను ప్రసంగము —
### — తన్నిరాకరణము —

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది—

> “స్కాందపురాణాంతర్గతమని చెప్పబడు భీమఖండకాశీఖండములలోని గాథల బరిశీలించినయెడల వ్యాసుని కాశిలో నుండ నీయక కాశీప్రభు వాతనిని దక్షిణదిశకు దరిమినటులను, కాశిలో నాతనికిని, శిష్యులకుగూడ భిక్షముగూడ లభింపనటులను గాన్పించును” (పు 161)

వేదవ్యాసమహర్షికి కాశిలో బిక్ష పుట్టకుండుటెట్టిదో చూడుడు! కాశీఖండ కథాసందర్భ మేమనగా— వేదవ్యాసమహర్షి శిష్యసంఘముతో భిక్షాటనము జేయుచు కాశీనివాసము చేయుచుండ—

“ఏకదా తస్య జిజ్ఞాసాం కర్తుం దేవీం హరోఽవదత్ ।
అద్య భిక్షాటనం ప్రాప్తే వ్యాసే పరమధార్మికే ॥
అథ సర్వగతే క్వాపి భిక్షాం మా యచ్ఛ సుందరి ।
తథేత్యుక్త్వా భవానీ సా భవం భవనివారణమ్ ॥
నమస్కృత్వా ప్రతిగృహం తస్య భిక్షాం న్యషేధత్ । (అ 96)

ఒకప్పుడు విశ్వేశ్వరదేవుడు మహర్షిని పరీక్షింపదలచి పరమేశ్వరితో నిట్లనెను. పరమధార్మికుడగు వ్యాసమహర్షి నేడు భిక్షాటనము చేయునపుడు ఎక్కడను భిక్ష దొరకనీయకుము. అదివిని అట్లే యని పరమేశ్వరి-శిష్యసంఘము, వ్యాసమహర్షియు నేయింటికిబోయిన నా యింటనే లోపలనుండి తానే వచ్చి దొఱకదనుచుండ వేళ మించుటచే

నిట్లనుచుండిరి కాబోలు. నగరమంతయు తిరిగి తిరిగి తుదకు భిక్షలభింపక అన్యభిక్షువులకు లభించియుండ నాడు శిష్యులతో మహర్షి నిరాహారుడై యుండెను. మఱునాడు మాధ్యాహ్నికము నిర్వర్తించుకొని ప్రతిగృహము దిరిగిరి. కాని యానాడు కూడ దొరకలేదు. అప్పుడు మహర్షి-శిష్యులతో మీకు కూడ దొరకనట్లే కనబడుచున్నది. యిట్లు జరుగుట కేమి కారణమో! యని చింతించి యేదేని యుపద్రవముచే పెట్టుట మానిరో, ఈర్ష్యచే నెవ్వనిచే నైన మాన్పింపబడినదో మీరు తెలిసికొని త్వరితముగా రండని బోధింప గొందరు శిష్యులు వెళ్లి స్థితిగతులు తెలిసికొని వచ్చి మహర్షితో నిట్లు చెప్పిరి.—

"శ్రీమ న్త్వారాధ్యచరణా నోపసర్గోఽత్ర కశ్చన ।
నాన్నక్షయోవా సర్వస్యాం నగర్యామిహ కుత్రచిత్ ॥
యత్ర విశ్వేశ్వర స్సాక్షాత్ యత్రామరధునీ స్వయమ్ ।
త్వాదృశా యత్ర మునయః క్వభీ స్తత్రోపసర్గజా ॥
విద్యానాం సదనం కాశీ కాశీ లక్ష్మ్యాః పరాలయః ।
ముక్తిక్షేత్ర మిదం కాశీ కాశీ సర్వా త్రయీమయీ ॥"

మహామునీ! ఈపురమం దెట్టి యుపద్రవము లేదు. అన్నక్షయము సంభవింపలేదు. ఏది విశ్వేశ్వరరాజధానియో, యేది అమరనదీపరిశోభితమో, ఏది భవాదృశమునిజనావాసమో అద్దాని కుపద్రవభయమా? ఈకాశీపురము విద్యాసదనము, లక్ష్మీనిలయము, ముక్తిక్షేత్రము అని చెప్పగా విని క్షుత్పీడితులైన శిష్యుల జూచి క్రుద్ధుడై వ్యాసమహర్షి—

"మాభూ త్త్రైపూరుషీ విద్యా మాభూ త్త్రైపూరుషం ధనమ్ ।
మాభూ త్త్రైపూరుషీ ముక్తిః కాశీం వ్యాసోఽశప త్త్వితి ॥

గర్వః కర్తోఽత్ర విద్యానాం ధనగర్వోఽత్ర వై మహాన్ ।
ముక్తిగర్వేణ నో భిక్షాం ప్రయచ్ఛ స్త్వత్రి వాసినః ॥"

ఇచ్చటి వారు విద్యాగర్వము, ధనగర్వము కలిగి ముక్తి మాన పాత్రను గర్వముచే భిక్షను పెట్టకుండి రని "విద్యకాని, ధనముకాని, ముక్తికాని త్రిపురుషవ్యాప్తిగా వీరికి లేకుండుగాక" అని శపించెను. తరువాత మఱల భిక్షకై వెళ్ళి ప్రతిగృహము తిరిగెను. లభింపలేదు. అప్పుడు సాయంకాల మగుచుండుట జూచి భిక్షాపాత్రము పారవైచి యాశ్రమమునకు వచ్చుచుండ నొక గృహద్వారమందు ప్రాకృత స్త్రీరూపముతో పరమేశ్వరి కూర్చుండి మహర్షితో నిట్లనెను—

'భగవన్ భిక్షుకా స్తావ దద్య దృష్టా న కుత్రచిత్ ।
అసత్కృత్యాతిథిం నాథో న మే భోక్ష్యతి కర్హిచిత్ ॥
వైశ్వదేవాదికం కర్మ కృత్వా గృహపతి ర్మమ ।
ప్రతీక్షతేఽతిథిపథం తస్మా త్త్వ మతిథి ర్భవ ।

మహాత్మా! నేడు భిక్షుకులు లభింపలేదు. అతిథిసత్కారము చేసికాని నానాథుడు భుజింపడు. నీ వతిథివి కమ్ము. ఇట్లనగా వ్యాస మహర్షి—

"భద్రే! కా త్వం కుతః ప్రాప్తా పూర్వం దృష్టా న కుత్రచిత్ ।
పరమా నస్మ్యహం జాత స్తవ దర్శనతోఽధునా ॥
అవశ్యమేవ కర్తాస్మి తవాదేశ్యం తదాదిశ ।
ఏకం తపోవ్యయం హిత్వా కారయిష్యసి యత్పునః ॥
తదేవాహం కరిష్యామి విధేయ స్త్వభలోచనే ।
న వచ స్త్వాదృశీనాంహి మహాత్త్వం హాపయే త్సతామ్ ॥
పరం త్వం కాసి సుభగే సత్యం బ్రూహి మమాగ్రతః ।"

అమ్మా! నిన్నింతవఱ కెవ్వరును జూచియుండలేదు, నీ వెక్కడనుండి వచ్చినావు. నీదర్శనము నన్ను పరవశునిఁ జేయుచున్నది. ఒక్క తపోవ్యయమును తప్పించి నీవు దేని నాజ్ఞాపించిన దానిని నేను విధేయుడనై చేయుదును. నీవంటి సాధ్వీమణుల వాక్కులు సత్పురుషుల మహాత్త్వమునకు భంగకరములు కానేరవు. నీవిషయమును చెప్పుము. అని యడుగ నామె నేనిచ్చటి గృహస్థునకు భార్యను. నీవు మాత్రము నన్నెఱుఁగవుగాని నిత్యము భిక్షాటనము చేయు నిన్ను నేను చూచుచునే యున్నాను తపస్వీ! ఆలస్యము చేయక సూర్యాస్తమయముకాకపూర్వమే నానాథుని యాతిథ్యము స్వీకరింపుము ఇట్లు చెప్పగామహర్షి, సూర్యాస్తమయముకాకపూర్వమే, పదివేలమందిశిష్యులతో నేను సహపంక్తిచేయవలసియున్నది. నేనొక్కడనే భుజింపను అని చెప్పగా నీశిష్యులతో వెంటనే రమ్ము, సర్వము సిద్ధమై యున్న దనగా నట్లే వచ్చి యభూతపూర్వమైన యాతిథ్యముచే మహర్షి విస్మితు డయ్యెను. తరువాత పరమేశ్వరుడు వ్యాసునిశాపము కాశీపురమునకు వర్తింపకుండునట్లు వ్యాసవాక్యములచేతనే చేయించెను.

ఇప్పు డీగాధనుబట్టి శిష్యసహితుడైన వ్యాసమహర్షికి భిక్ష యెట్లు లభింపలేదో తెలిసినదా? “కాశిలో నాతనికిని, శిష్యులకుగూడ భిక్షము గూడ లభింపనటుల గాన్పించును” అన్న మ. భా. చ కారుల వ్రాతను జూచినారా? అది పార్వతీపరమేశ్వరులు స్వయముగా జరిపినదై చేసిన పనియై యుండ, గృహస్థులు భిక్షమైన పెట్టలేదని లోకులకు దోచునట్లు వ్రాయుట యెంత నింద్యము? ఇక కాశీప్రభు వాతనిని దక్షిణదిశకు దఱుముట యెట్టిదో చూడుడు— భీమఖండకథాసందర్భ మిట్లున్నది—

కాశీఖండోక్తప్రకారమే భిక్షలభింపక క్రుద్ధుడై శాపముబెట్ట నుద్యమింప పరమేశ్వరి యాతిథ్యమున కాహ్వానించుటయు, మహర్షి

యుభూతపూర్వమైన యాతిథ్యముచే సంతుష్టు డగుటయు జరిగిన తరు వాత పార్వతీసహితముగా నీశ్వరుడు సమీపించి యిట్లనెను—

"త్వ మాగతోవా శప్తుం మే పత్నీం శ్రీకాశికాపురీమ్ ।
సదా కైవల్యకల్యాణజన్మభూమి మకారణమ్ ॥
గచ్ఛాన్యదేశం దుర్భాగ్య నిర్గత్య నగరా న్మమ ।
త్వ మన్తేవాసిభి స్సాక మస్మి న్నేవ క్షణేఽఖిలైః ॥"

సకలకల్యాణములకును, కైవల్యమునకును జన్మభూమియై నాకు పరమప్రేమాస్పదము, అర్ధాంగియు నగు కాశీపురిని శపించుటకు వచ్చితివా? నీవిప్పుడే నీశిష్యులతో నితరప్రదేశమునకు వెళ్ళిపొమ్ము. అని కఠినముగా బలుక నాపార్వతీపరమేశ్వరుల పాదములపై బడి నమస్కరించి, మహర్షి గమనోన్ముఖుడై యుండ నాపరమేశ్వరి—

"భయాకులత్వం మాగా స్త్వం కుమార! బహుధాప్యహమ్।
న విస్మరామి హృదయే కృపయా త్వాం కదాచన ॥
అన్యదేశే జిగమిషాం విహాయ త్వం సుఖేన తామ్ ।
శ్రీదక్షవాటికాం గచ్ఛ ప్రమోదాపూర్ణమానసః ॥
శరణం వ్రజ భీమేశం శరణాగతవత్సలమ్ ।
సమస్తాభ్యుదయా స్తుభ్యం భవన్తు తదనుగ్రహాత్ ।"

వత్సా! నీవు భయపడకుము. దయాపాత్రుండవగు నిన్ను నే నెన్నడును మఱచుదానను గాను. నీవన్యస్థలమున కేగక సంతోషముతో దక్షవాటిక కరుగుము. శరణాగతవత్సలుడగు భీమనాథుని శరణు నొందుము. ఆభీమేశ్వరానుగ్రహముచే నీకు సర్వాభ్యుదయములు కలుగును" అని సుధామయోక్తుల నుల్లసింపజేయ మహర్షి యట్లే దక్షవాటికకు వచ్చెను అనియున్నది.

ఇచ్చట పరమేశ్వరుడు మహర్షిని కఠినోక్తులాడి శప్య మను టలో మహర్షిని దోషి యని భావించినట్లా? లేక మహర్షిని దక్ష వాటికయందు ప్రవేశపెట్టుటకు అట్టి నిమిత్తమును కల్పించినట్లా? అని విచారణీయము.

దోషియనియే పరమేశ్వరతాత్పర్యమైనయెడల పరమేశ్వర సమక్షమందు అపరమేశ్వరి మహర్షి నాదరింపబూనుకోనను. వత్సా! నీవు దయాపాత్రుడవు; నిన్ను నే మరువను. నీవు దక్షవాటికకే యేగి భీమేశ్వరు నాశ్రయించి ఆతని యనుగ్రహము నొందుమని ప్రసం గింపబోదు అట్లామె ప్రసంగించినపుడు వినుచున్న ఈశ్వరుడు కోపిం పక శాంతుడై యుండుట తటస్థింపదు.

పరమేశ్వరుని పాదములపై బడి నమస్కరించిన మహర్షిని ఉపే క్షించియున్న యీశ్వరు డాలకించుచుండ నీవు భీమేశ్వరు నాశ్ర యింపుము. ఆతడు శరణాగతవత్సలుడు. అని పరమేశ్వరి ఆయీశ్వరు నెత్తిపొడిచినట్లు భీమేశ్వరోత్కర్షము నుద్ఘాటింపజాలదు. అట్లుద్ఘా టించినపుడు శాంతుడై యీశ్వరు డుండజాలడు. కనుక నీశ్వరునకు గూడ పరమేశ్వరికి వలెనే అసాధారణవాత్సల్యమే మహర్షియం దున్నది. అది పరమేశ్వరీముఖమున ప్రకటింపబడుట యీశ్వరుని కభి మతము. వాస్తవములో నామభేదము తప్ప విశ్వేశ్వరు డొకడు, భీమే శ్వరు డొకడును కాడు. గనుక నాపరమేశ్వరి చేసిన భీమేశ్వరోత్కర్ష విశ్వేశ్వరోత్కర్షప్రశంసయే.

మహర్షిపై యాగ్రహించుటలో భావము స్వర్గాపవర్గాస్పదమై తనకు పరమ ప్రేమాస్పదమై యున్న కాశీపురికి యేమాత్రమైన హాని యెంత ముఖ్యుడు తలపెట్టినను శంకరుడు సహింపబోడనియే గ్రహింపవలెను.

ఇక దక్షవాటికకు వెళ్ళుమని యుపదేశించుటలో, వ్యాసమహర్షి కాశీవియోగగ్లాని నది యుపశమింపజేయుగలదనియు, అది కాశీపురమున కీడైన దనియు, ఈసిద్ధాంతము సకలమునిజనాదర్శభూతుడు, సర్వవంద్యుడు నగు వేదవ్యాసమునీంద్రుని కాప్పదమైనగాని లోకమున కభివ్యక్తము కాదనియు పరమేశ్వరుని సంకల్పమని గ్రహింపవలెను.

ఇట్లుపరిశీలింపగా వ్యాసమహర్షిని కాశీపురినుండి దక్షవాటికకు బంపి తన్మూలమున దక్షవాటికాపవిత్రతను ప్రకటీకరింపదలచి విశ్వనాథదేవుడు అట్టి నిమిత్తమును కల్పించెనేకాని మఱొకటి కాదని తేలినది. కనుకనే చతుర్దశాధ్యాయమందు వ్యాసమహర్షి దక్షవాటికకు వెళ్ళినతరువాత ఋషివర్యులు—

"శిష్యసందోహసహితం మునీంద్రం బాదరాయణమ్ ।
ద్వైపాయనం ధిక్కృతవాన్ కోఽపి కాశీపురీపతిః ॥
ప్రాణై రస్మా నత్ర కథం కృపయా ధారయిష్యతి ।
తస్మా దస్మాక ముచితం సర్వేషాం తత్ర వర్తనమ్ ॥
సుఖేన వర్తతే యత్ర కృష్ణద్వైపాయనో మునిః ।
ఇతి కాశీపురా త్సర్వే నిర్గత్య వ్యాసపద్ధతిమ్ ॥
జ్ఞాత్వా శాఖోపశాఖాభి ర్దాక్షారామం సమాయయుః ।"

శిష్యసహితుడైన వ్యాసమహర్షిని ధిక్కరించిన విశ్వేశ్వరుడు ఇచ్చట మనల బ్రతుకనిచ్చునా? మన మందర మక్కడకే పోవుదమని వసిష్ఠాత్రి భరద్వాజ భార్గవ వాంగిరసాదులు కాశీపురమునుండి దాక్షారామమునకే వచ్చిరి; అని చెప్పబడినది.

ఇట్లుండ "కాశీప్రభువు వ్యాసుని దక్షిణదిశకు దఱిమె" నని దుర్వ్యుత్పత్తితో వ్రాసినది. నింద్యము.

ఈప్రస్తావములో 'వ్యాసునకు బాదరాయణు డను పేరు లేదు,' అను మ. భా. చ. కారులకు ఈశ్లోకములలో 'మునీంద్రం బాదరాయణం ద్వైపాయనమ్' అని బాదరాయణుడనుపేరు వ్యాసమహర్షికి గలదనియే చెప్పబడినదిసుమా? అని తెలుపుచు విషయాంతర మందు కొనుచున్నాము—

పతిలోకము కలుగు నని నమ్మించి దుర్యోధనా దుల భార్యలను
— వ్యాసుడు గంగలో ప్రవేశింపజేసె నను ప్రసంగము—
—తన్నిరాకరణము—

మ. భా. చ. కారులు వ్రాసి యిట్లున్నది—'వ్యాసు డావితం తువులకు యుద్ధమృతుల జూపు నెపమున ధృతరాష్ట్రునివనవాసకాలమునధార్తరాష్ట్రభార్యలను మోహపెట్టి, వారికిపతిలోకముకలుగు ననినమ్మించి,యాదుర్యోధనాదుల భార్యలనుగంగలో ప్రవేశించున టులచేసెను.గ్రంథవిస్తరభీతిచే గాధ నంతయు వ్రాయ లేదు' పు158

ఆహా ! దుర్యోధనాదుల భార్యలను యుద్ధమృతుల జూపు నెపమున మోహపెట్టెనట! వారికి పతిలోకము కలుగునని నమ్మించెనట! వారు గంగలో ప్రవేశించునటుల చేసెనట ! గ్రంథవిస్తరభీతిచే గాధ వ్రాయలేదట! పతిలోకము కలుగునని నమ్మించె నను మాటకు వారికి ప్రాణత్యాగమే తప్ప పతిలోకప్రాప్తి కలుగ లేదని తాత్పర్యము కాబోలు. ఈప్రతివాదుల కీలోకమే ఆనదే! ఆలోక మానినదా?

వారు భీతిచే వ్రాయనిగాధయే మనకు నిజము తెలుపును. ఆ గాధయిట్లున్నది—

యుద్ధానంతరము ధృతరాష్ట్రుడు ధర్మరాజాదుల సమ్మతింపజేసి గాంధారియు, కుంతీదేవియు శుశ్రూష జేయుచుండ, నాశ్రమవాసము

చేయు నవసరమున ధర్మరాజాదులు కూడ సపరివారముగా సేనలతో వచ్చి, యావనమందే నివసించియున్నపుడు వ్యాసమహర్షి ధృతరాష్ట్రాశ్రమమందు ప్రత్యక్షమై—

"ధృతరాష్ట్ర మహాబాహో కచ్చి త్తే వర్తతే తపః ।
కచ్చి న్మన స్తే ప్రీణాతి వనవాసే నరాధిప ॥
కచ్చి ద్ధృది న తే శోకో రాజన్ పుత్రవినాశజః ।
సంశయచ్ఛేదనార్థాయ ప్రాప్తం మాం విద్ధి పుత్రక ॥
న కృతం యైః పురా కైశ్చి త్కర్మ లోకే మహర్షిభిః ।
ఆశ్చర్యభూతం తపసః ఫలం త ద్దర్శయామి వః ॥
కి మిచ్ఛసి మహీపాల మత్తః ప్రాప్తు మభీప్సితమ్ ।
ద్రష్టుం స్ప్రష్టుమథ శ్రోతుం త త్కర్తాస్మి తవానఘ ॥
శ్రుత్వా సమాగమ మిమం సర్వేషాం వ స్తతో నృప ।
సంశయచ్ఛేదనార్థాయ ప్రాప్తః కౌరవనందన ॥
ఇమే చ దేవగంధర్వా స్సర్వే చేమే మహర్షయః ।
పశ్యన్తు తపసో వీర్య మద్య మే చిరసంభృతమ్ ॥
త దుచ్యతాం మహాప్రాజ్ఞ కం కామం ప్రదదామి తే ।
ప్రవణోఽస్మి వరం దాతుం పశ్య మే తపసో బలమ్ ॥"

ధృతరాష్ట్రా! నీకు తపస్సు జరుగుచున్నదా? పుత్రదుఃఖము లేకుండెనా? నేను సంశయవిచ్ఛేదము చేయుటకు వచ్చితి నని తెలిసికొనుము. ఇదివరలో లోకమునం దేమహర్షులచేతను చేయబడని దేది కలదో అట్టి యాశ్చర్యకరమైన విషయమును నాతపఃఫలముగా మీకు ప్రదర్శించుచున్నాను. నీవు దేనియొక్క దర్శనస్పర్శనశ్రవణముల నపేక్షింతువో. దానిని నీకు ఘటింపజేయుదును.

మీయందఱి సమాగమము గ్రహించి సంశయచ్ఛేదనార్థ

మే తెంచితిని. ఈదేవతలు, గంధర్వులు, ఈమహర్షులు చిరకాలార్జితమైన నాతపశ్శక్తిని యిప్పుడు చూతురుగాక. నీకోరిక నిచ్చెదను. కోరిక యేదో చెప్పుము. నాతపోబలము జూతువు.

"ఏవ ముక్త స్స రాజేన్ద్రో వ్యాసే నామితబుద్ధినా ।
ముహూర్త మివ సంచిన్త్య వచనా యోపచక్రమే ॥
ధన్యోఽస్మ్యనుగృహీతశ్చ సఫలం జీవితం చ మే ।
య న్మే సమాగమో ఽద్యేహ భవద్భి స్సహ సాధుభిః ॥
కిన్తు తస్య సుదుర్బుద్ధే ర్మన్ద స్యాపనయై ర్భృశమ్ ।
దూయతే మే మనో నిత్యం స్మరతః పుత్రగృద్ధినః ॥
అపాపాః పాండవా యేన నికృతాః పాపబుద్ధినా ।
ఘాతితా పృథివీ యేన సహాయా సనరద్విపా ।
రాజానశ్చ మహాత్మానో నానాజనపదేశ్వరాః ॥
ఆగమ్య మమ పుత్రార్థే సర్వే మృత్యువశం గతాః ।
యే తే పితౄంశ్చ దారాంశ్చ ప్రాణాంశ్చ మనసః ప్రియాన్ ॥
పరిత్యజ్య గతా శ్శూరాః ప్రేతరాజనివేశనమ్ ।
కాను తేషాం గతి ర్బ్రహ్మన్ మిత్రార్థే యే హతా మృధే ।
తథైవ పుత్రపౌత్రాణాం మమ యే నిహతా యుధి ।
ఏత త్సర్వం మనస్కృత్య దహ్యమానో దివానిశమ్ ॥
న శాన్తి మధిగచ్ఛామి దుఃఖశోకసమాహతః ।
ఇతి మే చిన్తయానస్య పిత శ్శాన్తి ర్న విద్యతే ॥"

ఇట్లు ప్రశ్నింపబడిన ధృతరాష్ట్రుడు—మహనీయులగు మీరెల్లరు నిచ్చటికి విచ్చేయుటచే నే ధన్యుడను. కాని, దురాలోచన కల దుర్యోధనుని యవినీతులచేత పుత్రప్రేమ కల నామనస్సు నిత్యము ఖేదపడుచునే యున్నది. ఏపాపము నెఱుగని పాండవులు ఆతనిచే వంచితులైరి, ఆతని మూలమున అనేకజీవవర్గములకు ప్రాణాపాయము కలి

గినది ఎందరో మహారాజులు నాపుత్రుని పక్షమున వచ్చి దారపుత్రాదులను విడిచి ప్రాణముల నొసంగిరి. మిత్రకార్యార్థము యుద్ధములో గతించినట్టి యామహారాజులకును, నాపుత్రపౌత్రాదులకును యెట్టి గతి సంభవించినదో అని యహర్నిశము చింతించుచున్న నామనస్సునకు శాంతి లేదు. అని చెప్పుచుండ వినుచున్న గాంధారికి, కుంతిదేవికి, ద్రౌపదికి, సుభద్రకు, ధార్తరాష్ట్రభార్యలకు యుద్ధమృతులనే గూర్చిన శోకము రేగినది. అప్పుడు—

"పుత్రశోకసమావిష్టా గాంధారీ త్విద మబ్రవీత్ ।
శ్వశురం బద్ధనయనా దేవీ ప్రాంజలి రుత్థితా ॥
షోడశ శేమాని వర్షాణి గతాని మునిపుంగవ ।
అస్య రాజ్ఞో హతాన్ పుత్రాన్ శోచతో న శమో విభో ॥
పుత్రశోకసమావిష్టో నిశ్వసన్ హ్యేష భూమిపః ।
న శేతే వసతీ స్సర్వా ధృతరాష్ట్రో మహామునే ॥
లోకా నన్యాన్ సమర్థోఽసి స్రష్టుం సర్వాం స్తపోబలాత్ ।
కిము లోకా న్తరగతాన్ రాజ్ఞో దర్శయితుం సుతాన్ ॥"

భర్త యంధుడగుటను బట్టి తానుగూడ కన్నులు కట్టుకొని యున్న గాంధారి లేచి యంజలి ఘటించి మహర్షితో నిట్లనెను. మునీంద్రా! గతించిన పుత్రులనుగూర్చి శోకించుచున్న యీమహారాజున కిప్పటికి పదియారు వత్సరములు గడచినను శాంతి కలుగలేదు. పుత్రశోకముతో నిట్టూర్పులు విడుచుచు శయనించుటగూడ లేకుండెను. నీవు తపోబలమున లోకాంతరములను సృజింప సమర్థుడవు. లోకాన్తరగతులగు సుతులను మహారాజునకు జూపలేవా?" అని కోరుచు ద్రౌపదీ ప్రభృతులు కూడ సుతులనుగూర్చియు, హితులను గూర్చియు శోకించుచుండిరని చెప్పి—

"పుత్రస్య తే పుత్రశతం నిహతం యుద్ధదుర్మదం।
తస్యభార్యాశత మిదం దుఃఖశోకసమాహతమ్॥
తవ ప్రసాదా ద్భగవన్ విశోకోఽయం మహీపతిః।
కుర్యా త్కాల మహం చేయం వధూ స్తవ మహామునే॥"

మరణించిన పుత్రశతముయొక్క యీభార్యాశతము దుఃఖా క్రాంతమై యున్నది. ఈమహారాజు, నేనును నీయనుగ్రహమున శోక ములేక కాలము గడుపవలెను. ఇట్లు గాంధారి చెప్పగా కుంతీదేవి కర్ణునిగూర్చిన తన చింతను వెల్లడింప మహర్షి నీయందు దోషము లే దని చెప్పి గాంధారితో నిట్లనెను—

"భద్రే! ద్రక్ష్యసి గాంధారి పుత్రాన్ భ్రాతౄన్ స్వకాన్ గణాన్।
వధూశ్చ పతిభి స్సార్థం నిశి సుప్తోత్థితా ఇవ॥
కర్ణం ద్రక్ష్యతి కుంతీచ సౌభద్రం చాపి యాదవీ।
ద్రౌపదీ పంచ పుత్రాంశ్చ పితౄన్ భ్రాతౄం స్తథైవచ॥"

నీవు పుత్రులను, భ్రాతలను, ఆత్మీయులను, పతులతో గలసి యుండెడి కోడండ్రను సుప్తోత్థితులవలె జూడగలవు. కుంతీ ద్రౌపదీ సుభద్రలుకూడ తమతమవారిని జూడగలరు అనిచెప్పి యుద్ధమృతులు మొదలగువారు ఏయే యంశముల జన్మించిరో, మరణించి యెచ్చటి కేగిరో చెప్పి—

"యచ్చ వై హృది సర్వేషాం దుఃఖ మేత చ్చిరం స్థితమ్।
త దద్య వ్యపనేష్యామి పరలోకకృతా ద్భయాత్॥
సర్వే భవన్తో గచ్ఛన్తు నదీం భాగీరథీం ప్రతి।
తత్ర ద్రక్ష్యథ తాన్ సర్వాన్ యే హతా స్తత్ర సంయుగే॥"

యుద్ధమృతుల కేదుర్గతులు కలిగినవో యని చిరకాలమునుండి

పరితపించు మీతుగల చింతను తొలగింతును. మీరెల్లరు గంగానది యొద్దకు వెళ్ళియుండుడు. అచ్చట మృతుల నందరను జూడగలరు.

ఇతి వ్యాసస్య వచనం శ్రుత్వా సర్వో జన స్తదా ।
మహాత్మా సింహనాదేన గంగా మభిముఖో యయౌ ॥
తతో గంగాం సమాసాద్య క్రమేణ స జనార్ణవః ।
నివాస మకరో త్సర్వో యథాప్రీతి యథాసుఖమ్ ॥
జగామ త ద్దహశ్చాపి తేషాం వర్షశతం యథా ।
నిశాం ప్రతీక్షమాణానాం దిదృక్షూణాం మృతాన్ నృపాన్ ॥
తతో నిశాయాం ప్రాప్తాయాం కృతసాయాహ్నికక్రియాః ।
వ్యాస మభ్యాగమన్ సర్వే యే తత్రాసన్ సమాగతాః ॥
తతో వ్యాసో మహాతేజాః పుణ్యం భాగీరథీజలమ్ ।
అవతీర్యాఽఽజుహా వాథ సర్వాన్ లోకాన్ మహామునిః ॥
తత స్సుతుముల శ్శబ్దో జలాన్తే జనమేజయ ।
ప్రాదురాసీ ద్యథాయోగం కురుపాండవసేనయోః ॥
తత స్తే పార్థివా స్సర్వే భీష్మద్రోణపురోగమాః ।
ససైన్యా స్సలిలా త్తస్మా త్సము త్తస్థు స్సహస్రశః ॥
సర్వే భాసురదేహా స్తే సము త్తస్థు ర్జలా త్తతః ।
యస్య వీరస్య యో వేషో యో ధ్వజో యచ్చ వాహనమ్ ॥
య ద్వర్మ య త్ప్రహరణం తేన తేన స దృశ్యతే ।
దివ్యాంబరధరా స్సర్వే సర్వే భ్రాజిష్ణుకుండలాః ॥
నిర్వైరా నిరహంకారా విగతక్రోధమత్సరాః ।
ధృతరాష్ట్రస్యచ తదా దివ్యం చక్షు ర్నరాధిప ।
ముని స్సత్యవతీపుత్రః ప్రీతః ప్రాదా త్తపోబలాత్ ॥
త దద్భుత మచి న్త్యంచ సుమహా ద్రోమహర్షణమ్ ।
విస్మిత స్సజన స్సర్వో దదర్శానిమిషేక్షణః ॥"

ఇట్లు వ్యాసమహర్షి చెప్పగా విని యందరు సింహనాదముతో గంగానదికి బయనమైరి సముద్రమువలె నున్న జనసమూహమును క్రమముగా గంగానదిని జేరి, యెప్పు డెప్పు డని చూచుచుండ సాయం కాలము కాగా సాయంకాలకృత్యములు నిర్వర్తించుకొని యచ్చటివా రందరు వ్యాసమహర్షిని జేరిరి. తరువాత వ్యాసమహర్షి గంగానదిలో ప్రవేశించి యాహ్వానింపగా నాజలమునుండి కురుపాండవసేనల కల కలధ్వని యుత్పన్నమైనది. తరువాత భీష్మద్రోణాదులు, సైన్యము లతో వేలకొలది జలమునుండి పైకి వచ్చినారు. అం దేవీరుని దే వే షమో, యే ధ్వజమో, యే వాహనమో, యే కవచమో, యే యా యుధమో, వానితోడనే యాతకు కనబడుచుండెను. అందరు దివ్యాం బరధరులు, కుండలాలంకృతులు, వైరరహితులు, నిరహంకారులు నై యుండిరి. వ్యాసభగవానుడు తపోబలముచే ధృతరాష్ట్రునకు దివ్యదృష్టి ననుగ్రహించెను. అచింత్యమై, శరీరమునకు గగుర్పాటు గలిగించెడి యా యద్భుతమును జనులు విస్మితులై రెప్పపాటు లేక చూచిరి.

"ఏవం సమాగతా స్సర్వే గురుభి ర్బాంధవై స్సహ ।
పుత్రై శ్చ పురుషవ్యాఘ్రాః కురవో న్యే చ పార్థివాః
తాం రాత్రి మఖిలా మేవం విహృత్య ప్రీతమానసాః ।
మేనిరే పరితోషేణ నృపా స్స్వర్గసదో యథా ॥
సమాగతా స్తాః పితృభి ర్భ్రాతృభిః పతిభిస్సుతైః ।
ముదం పరమికాం ప్రాప్య నార్యో దుఃఖ మథా త్యజన్ ॥
ఏకాం రాత్రిం విహృ త్యైవం తే వీరా స్తాశ్చ యోషితః ।
ఆమ న్త్ర్యాఽన్యోన్య మాశ్లిష్య తతో జగ్ము ర్యథాగతమ్ ॥
తతో విసర్జయామాస లోకాం స్తా న్మునిపుంగవః ।
క్షణే నాన్తర్హితా శ్చైవ పశ్యతా మేవ తేఽభవన్ ॥
అవగాహ్య మహాత్మానః పుణ్యాం భాగీరథీం నదీమ్ ।

గతేషు తేషు సర్వేషు సలిలస్థో మహామునిః ॥
ధర్మశీలో మహాతేజాః కురూణాం హితకృత్తథా ।
తతః ప్రోవాచ తాః సర్వాః క్షత్రియా నిహతేశ్వరాః ॥
యా యాః పతికృతాన్ లోకా నిచ్ఛన్తి పరమస్త్రియః ।
తా జాహ్నవీజలం క్షిప్ర మవగాహ న్త్వతంద్రితాః ॥
తత స్తస్య వచ శ్శ్రుత్వా శ్రద్దధానా వరాంగనాః ।
శ్వశురం సమనుజ్ఞాప్య వివిశు ర్జాహ్నవీజలమ్ ॥
విముక్తా మానుషై ర్దేహై స్తత స్తా భర్తృభి స్సహ
సమాజగ్ము స్తదా సాధ్వ్య స్సర్వావవ విశాంపతే ॥
ప్రవిశ్య క్షత్రియా ముక్తా జగ్ము ర్భర్తృసలోకతామ్ ।"

ఇట్లు కురువంశీయులును, ఇతరులు నైన పార్థివులు గురుపుత్రి బంధుజనముతో గలిసి ప్రీతితో నారాత్రి యంతయు విహరించిరి. ఆ స్త్రీలు తమతమ పతులతోడను, సుతులతోడను, భ్రాతృపితృవర్గము తోకలసికొని పరమానందమునొందిరి. ఒకరాత్రియావీరులును, ఆ స్త్రీలును పరస్పరప్రేమానుబంధమున ప్రసంగించుకొని వ్యాసమహర్షి విడిచిపెట్టగా నందరు చూచుచుండ గంగానదియందు మునిగి క్షణములో నెల్లరు నంతర్ధాన మైరి.

వారందరు నంతర్ధాన మైనతరువాత ధర్మశీలు డగు మహర్షి జలగతు డైయుండి మృతభర్తృక లగు క్షత్రియకాంతలను గూర్చి యిట్లనెను. ఏపతివ్రతలు పతిలోకము నపేక్షింతురో వారిగంగాజలమం దవగాహనము చేయుడు, అని. ఆమాట విని పతిలోకము గోరిన యా పతివ్రతలు శ్వశురు డగు ధృతరాష్ట్రుని యనుజ్ఞ దీసికొని గంగాజలమం దవగాహనము జేసి మనుష్యదేహము లను విడిచి భర్తృసాలోక్యమును పొందిరి.

ఇదియే మ. భా. చ. కారులు దాచియుంచిన గాథ. ఇందు పతిలోకప్రాప్తి నపేక్షించువారికి దానిని ఘటింపజేతు నని మహర్షి చెప్పినట్లున్నది. పతివ్రతలగు దుర్యోధనాదుల భార్యలు దాని నపేక్షించి ధృతరాష్ట్రుని యనుజ్ఞఁదీసికొనియే గంగావగాహనపూర్వకముగా పతిలోకమును పొందినట్లున్నది. మహాజనసమక్షమున గాంధారీధృతరాష్ట్రాదుల యంగీకారముతో సంతోషించుచు నాడావితంతువులు పతిలోకము నొందు టేమి? నేఁడీ మ. భా. చ. కారులు వారికై పరితపించు టేమి?

పతిలోకమును ప్రాప్తింపజేతు ననుట వ్యాసమహర్షికి తప్పైన యెడల దానికై యనుజ్ఞ నిచ్చిన ధృతరాష్ట్రునిది తప్పు కాదా? అందుల కంగీకరించి చూచుచుండిన గాంధారిది తప్పు కాదా? అది యటుండ యుద్ధమృతులను చూడవలె నను కుతూహలము ధృతరాష్ట్రునిది. ఆతని కట్లు చూపవలసిన దను ప్రార్థన గాంధారిది. అట్లు చూపిన వాఁడు వ్యాసమహర్షి. చూచిన యందరిలోను జేరినవా రావితంతువులు.

మహర్షి యుద్ధమృతులను జూపుట. మ. భా. చ. కారు లన్నట్లు ఆవితంతువులను మోహపెట్టుటకే యైనయెడల జూపవలసిన దని ప్రార్థించిన గాంధారీధృతరాష్ట్రుల చర్య కూడ తమ కోడండ్రను ఆవిధముగా మోహపెట్టి వారి నావిధముగా వదల్చుకొనుటకే యైయుండు నని యూహింపబడదా? ప్రమాణముల ధిక్కరించి తమపైత్యము జేర్చి ప్రసంగింపబూనిన యెవ్వనివ్రాతనింద్యము కాదు? కనుక వ్యాసభగవానుని నిందించు దుర్వ్యాప్తితో గూడిన మ. భా చ కారుల వ్రాత నింద్యము.

ఇక మరణించినవారి పునర్దర్శనము సంభవమా? అను సందేహము కలుగును. అందుకై యీగ్రంథము జూచుడు—

నీలకంఠీయమ్—"తతో నిశాయా మిత్యస్మి న్నధ్యాయద్వయే మృతానాం పునర్దర్శన ముక్తం. తేన తేషాం సత్త్వ మస్తీతి స్పష్ట ముక్తమ్. అతో మృతానాం సత్త్వ మస్తి నవేతి సంశయః పరాస్తః. అథ భస్మీభూతానాం కథం ప్రత్యక్షేణ దర్శనమ్. స్వప్నవ దితి చేత్. వ్యాస స్యైంద్రజాలికత్వాపత్త్యా సంశయోచ్ఛేదకత్వానుపపత్తిః. అథ దేవతాభావం గతానాం తేషాం పునర్భీష్మాదిభావేన యోగబలా దభివ్యక్తి ర్భవతి. తర్హి భస్మీభూతస్య దేహస్య పునరుదయాయోగా త్తత్సదృశై ర్దేహాన్తరై రుపేతానామేవ తేషాం దర్శన మితి వాచ్యం. తథాపి దేహాన్తరే మమాయం భర్తేతి బుద్ధిమతీనాం స్త్రీణాం భ్రాన్తి రేవ. పూర్వదేహనాశస్య దృఢతరస్మరణాత్. అస్మరణేపున స్స్వప్నతుల్యతేతి తుల్యమ్.

అత్రబ్రూమః—

హార్దవిద్యాం ప్రకృత్య శ్రూయతే. "త ఇమే సత్యాః కామా అనృతాపిధానాః" ఇతి. దహరాకాశం ప్రకృత్య "ఏతత్సత్యం బ్రహ్మపుర మస్మిన్ సర్వే కామాస్సమాహితా" ఇతి. తథా "యో యో హ్యస్యేతః ప్రైతి న త మిహ దర్శనాయోపలభతే" ఇత్యుపక్రమ్య "యేచాస్యేహ జీవా యేచ ప్రేతా యచ్చాన్య దిచ్ఛ న్నలభతే సర్వం తదత్ర గత్వా విన్దతే" ఇత్యాది। సత్యం బ్రహ్మపురం హృదంబర మిత్యర్థః.

'సమస్త స్సదా న స్నైవా స్త్యతఏవ తత్ర మునయః పశ్యన్త్యతీతాదికం. మిథ్యాబ్రహ్మపురం శరీర, మమునా సత్యపురం

ఛాదితం సర్పేణ స్రగివ త్వయముష్మా ద్విలయే సత్యం పురం ప్రకా శతే. తస్మా దవిద్యాప్రత్యుపస్థాపిత మపారమార్థికం జైవం రూపం కర్తృభోక్తృరాగద్వేషాద్యనేకానర్థకలుషితం తద్విపరీత మపహత పాప్మత్వాదివిశిష్టం పారమేశ్వరం రూపం విద్యయా ప్రతిపద్యతే. సర్పాదివిలయనే రజ్జ్వాదివత్' ఇతి భాష్యాచ్చ.

బ్రాహ్మలౌకికా ఏవ సత్యా భీష్మాదయో ఽన్యత్రై ర్జన్మాదిభి ర్భావవికారై రావిర్భూయ తిరోభూతా స్సన్తో మహర్షివిద్యయా ఽఽవిర్భూయ స్త్ర్యాదిభిశ్చ యాథాత్మ్యేన గృహీతా స్సన్తస్తాభి స్సహ రేమిరే ఇతి యుక్త ముత్పశ్యామః। విశేష స్త్వస్మత్కృతే వేదాన్తకతకే దహరాధికరణే ద్రష్టవ్యః।

ఇచ్చట సారాంశము—మరణించినవారి పునర్దర్శనము చెప్ప బడుటచే మరణించినవా రుందు రని స్పష్టపరుపబడినది. దీనివలన మరణించినవా రుండిరా? లేరా? అను సంశయము తొలగింపబడినది. ఇక పూర్వపక్షము— భస్మీభూతులైనవారి స్వరూపము లెట్లు ప్రత్య క్ష మైనవి? స్వప్నపదార్థములవలెనా? అట్లైన వ్యాసమహర్షి యైంద్ర జాలికు డగును. కాని 'సంశయచ్ఛేదనార్థాయ ప్రాప్తం మాం విద్ధి' అన్నట్లు సంశయవిచ్ఛేదకుడు కానేరడు.

ఇక మరణించి దేవతాభావము నొందియున్న వారందరకు మహర్షి యోగబలమున మరల భీష్మాదిరూపములతో నభివ్యక్తి యయ్యెనా? అట్లైన భస్మీభూతదేహములకు పునరుత్పత్తి యసంభ వము కనుక తత్తుల్యములైన దేహాంతరములతో వారల దర్శన మైన దని చెప్పవలెను. అప్పుడు వారల పూర్వదేహములు నష్టములైనట్లు దృఢజ్ఞానముకల ఆ స్త్రీలకు ఆ దేహాంతరధారులందు 'ఈతడు నాభర్త' యను బుద్ధి భ్రాంతియే యగును. పూర్వదేహనాశస్మృతి వారికప్పుడు

లేనియెడల మరల స్వప్నతుల్యమే యగును. అను పూర్వపక్షముపై
సమాధానము చెప్పబడుచున్నది — ఛాందోగ్యోపనిషత్తునందు అష్టమ
ప్రపాఠికమున నిట్లున్నది ఈశరీరమందలి హృదయపుండరీకము బ్రహ్మ
స్థానము బ్రహ్మస్వరూపమే సర్వవ్యవహారాస్పదమగుటబట్టి పుర మన
బడును. అట్టి బ్రహ్మపురము సత్యము. బాహ్యప్రపంచమందు కోర
బడు యావత్పదార్థములు ఆబ్రహ్మపురమందే యున్నవి. కనుక
బాహ్యవిషయాసక్తిని విడిచి బ్రహ్మస్వరూపప్రాప్త్యుపాయములనే ఆశ్ర
యింపవలెను. శాస్త్రాచార్యోపదేశక్రమమున బ్రహ్మస్వరూపావగతి
యెవ్వరికి కలుగునో వారికి సర్వలోకసంచారము సంభవించును.

అట్టివాడు పితృలోకకాముడైన యెడల వాని సంకల్పమాత్ర
మున పితరు లావిర్భవింతురు. ఆతడు కోరెడి పదార్థము లన్నియు
సంకల్పమాత్రముననే సంభవించును. ఆత్మగతములై పొందశక్యములై
యున్న సత్యములైన (అవితథములైన) కామములు బాహ్యవిషయా
సక్తిమూలకమైన స్వేచ్ఛాప్రచార మనెడి యనృతముచే నాచ్ఛాదింప
బడినవి. కనుకనే మరణించిన పుత్రాదులు తన హృదయాకాశమందే
యుండియున్నను వారినిజూడవలెనను సంకల్పము తనకు గాఢముగా
నున్నను దర్శనలాభము కలుగుటలేదు.

దహరోపాసనాపరినిష్ఠితుడైన జ్ఞానికి మాత్రము జీవించియున్న
వారుకాని, మరణించినవారుకాని దుర్లభములైన యితరపదార్థములు
కాని హృదయాకాశాత్మకబ్రహ్మస్వరూపమందు సులభములే.

నిధిని దెలిసికొనక నిధికి పైభాగమందు సంచరించువానికి నిధి
లభ్యముకానట్లు అవిద్యోపహతులకు హృదయాకాశమందే యున్న
సత్యకామములు లభ్యములు కాకున్నవి.

అని ఛాందోగ్యమందును, భాష్యమందును చెప్పబడుటవలన బ్రహ్మస్వరూపగతులై సత్యాత్మకులైన భీష్మాదులు అస్మృతములైన జన్మాదివికారములచే నావిర్భవించి యదృశ్యులై వ్యాసమహర్షి విద్యామహత్త్వమును బట్టి యావిర్భవించి స్త్రీపురుషసామాన్యముచే యథార్థముగా గ్రహింపబడి వారలతో విహరించి రనుట యుక్తము.

ఇతోఽధికవిశేషము మా 'వేదాంతికతిలకము' అను గ్రంథమందు దహరాధికరణమున జూడనగును. ఇది నీలకంఠీయములోని విషయము.

ఈగ్రంథసందర్భమునుబట్టి మరణించినవారి పునర్దర్శనము సంభవమే యనియు, నీవిషయ మూపనిషత్ప్రతిపాదితమే యనియు, వేదవ్యాసభగవానుని యసాధారణ విద్యాప్రభావమున నాడు ధృతరాష్ట్రాదుల కది ఘటించినదనియు, స్పష్టమైనది. ఈవిషయము శాస్త్రజ్ఞానశూన్యులకు తెలియునదికాదు. కనుకనే ప్రతివాదులు ఆ లోకోత్తర ప్రజ్ఞుని, ఆపరమపావనుని, ఆమునిజనమూర్ధన్యుని, ఆకలికల్మషహారుని యేమేమో దుర్భాషలాడినారు. అవి యసంగతములని ప్రమాణోపపత్తులతో నిరూపించినాము. ఇక దీనిని విడిచి విషయాంతర మందుకొందము—

### వ్యాసుడు పాండవపక్షముగా వ్రాసిన జయమును సంజయునకు గూడ జూపలేదను వాదము—తన్నిరాకరణము:—

మ.భా.చ. కారులవ్రాత యిట్లున్నది—"యుద్ధమిక సగునవగా ధృతరాష్ట్రునితో వ్యాసుడిట్లనెను. ఓధృతరాష్ట్రా! ఈకౌరవులయొక్కయు, పాండవులయొక్కయు, అంవటియొక్కయు కీర్తినినేను ప్రకటనజేయగలను. విచారింపకుమా' ఇట్లని వ్యాసుడు మూడేండ్లు 'జయ' గ్రంథము జేసి ధృతరాష్ట్రాదులు గతించిన పిమ్మటగాని

లోకమున వెల్లడింపలేదు. జయమును సంజయునకుగూడ వ్యాసుడు చూపినటుల లేదని సౌతి యనుక్రమణికాధ్యాయములో వ్యాసుని 8800 శ్లోకములను 'సంజయో వేత్తివా నవా' సంజయుడు కూడ నెఱుగునో యెఱుగడో అని చెప్పుటచే నూహింపబడుచున్నది. మొత్తమునకు వ్యాసుడు పాండవపక్షపాతియై జయమును పాండవపక్షముగా వ్రాసియుండుటచే బ్రత్యక్షముగా వ్యవహారముల జూచిన సంజయునకుగూడ జయమును చూపకుండుటలో నాశ్చర్యములేదు. వ్యాసుడు వాల్మీకివలె ధర్మాతిశయనిరూపకకవి గాక, అర్థాతిశయనిరూపకకవియై యన్యాయమున కొడబడినవాడుగా గాన్పించును" (పు 158)

మ.భా.చ. కారులిచ్చట మహర్షిపై నారోపించిన నిందలు మూడు. అందు ధృతరాష్ట్రునితో నేనందరికీర్తిని ప్రకటింతునని చెప్పి వ్రాసిన జయమును ధృతరాష్ట్రాదులు గతించినపిమ్మటగాని వెల్లడింపకపోవుట యొకటి. సంజయునకుగూడ జయమును చూపకుండుట యొకటి. వీనిని క్రమముగా పరిశీలింతము

ధృతరాష్ట్రునితో వ్యాసమహర్షి యేమని చెప్పెను?
"అహంతు కీర్తిమేతేషాం కురూణాం భరతర్షభ ।
పాండవానాంచ సర్వేషాం ప్రథయిష్యామి మానుచః॥"

అనియేకదా! ఇందు అందరి కీర్తిని ప్రకటింపగలను. అని మాత్రమే యున్నదికాని ధృతరాష్ట్రాదులు జీవించియుండగనే ప్రకటింతునని కాని, గ్రంథము ధృతరాష్ట్రాదులకు వినిపింతుననికాని లేదే. ఇట్టి స్థితిలో ధృతరాష్ట్రాదులు గతించిన తరువాత వెల్లడించిన నేరమేమి? ప్రతివాదుల యూహానుబట్టి పాండవపక్షముగా వ్రాయబడిన గ్రంథమును పాండవు లుండగా వెల్లడించుటకాని, పాండవులకు వినిపించుట

కాని జరిగెనా? పరీక్షిత్కాలములోఁగూడ వెల్లడింపక జనమేజయుసర్ప సత్రమందు వైశంపాయనముఖమున ప్రసక్తిని బట్టి వెల్లడించె నని కదా యున్నది. ఇట్లుండ ధృతరాష్ట్రాదు లుండగా వెల్లడింపలేదని యొక నేరమా? ధార్తరాష్ట్రుల కీర్తిని తనగ్రంథమందు వర్ణింపక పోవుటే అప్పుడు వెల్లడింపకపోవుటకు కారణ మందురా? వారలకీర్తిని వర్ణింపక బోవుటేమి?

"శౌర్య శ్లాఘా భవే త్కీర్తి ర్యశ శ్శతుప్రవథే ప్రథా" అను నిర్వచనమును బట్టి శౌర్యమును శ్లాఘించుట కీర్తియగును. కనుక దుశ్శాసనాదుల శౌర్యమును 'ద్యూతిసభకు ద్రౌపది నీడ్చుకొని వచ్చెను' అని వర్ణింపలేదా? ఈ మ. భా. చ. కారులే దుశ్శాసనుని గూర్చి వ్రాయుచు—

> "దుశ్శాసనుడు బాహుబలశాలి, శస్త్రాస్త్రవిద్యాకోవిదుడు. కీచక సైంధవులంగూడ బోరగిలం ద్రోయఁగలిగిన ద్రౌపతి నీడ్చి తీసికొనిరాగలిగెను" (పు271)

అని దుశ్శాసనుని యాశౌర్యమును శ్లాఘింపలేదా? కనుక మొదటినింద నిరస్తమైనది ఇక రెండవదానిని జూతము—

వ్యాసుడు తనగ్రంథమును సంజయునకుగూడ జూపినట్లు లేదట. ఇట్లనుట కాధారము—

> "గ్రన్థగ్రన్థిం తదా చక్రే ముని ర్గూఢం కుతూహలాత్ ।
> యస్మిన్ ప్రతిజ్ఞయా ప్రాహ ముని ర్ద్వైపాయన స్త్విదమ్ ॥
> అష్టౌ శ్లోకసహస్రాణి వ్యాష్టౌ శ్లోకశతానిచ ।
> అహం వేద్మి శుకో వేత్తి సంజయో వేత్తి వా నవా ॥"

అను గ్రంథమట. ఇచ్చట, గ్రంథగ్రంథిరూపములై యున్నవి.

యెనిమిదివేల యెనిమిదివందల శ్లోకము లనియు, వానిని సంజయుడెఱుగునో యెఱుగడో అనియు జెప్పబడినదికాని వ్యాసుని గ్రంథమే కావన్మాత్ర మని చెప్పబడలేదు. వ్యాసునిది లక్షగ్రంథము. 'అనేకకర్తృత్వ నిరాకరణము' లో నీవిషయము నిర్ధారితమైయున్నది. ఇప్పుడు ప్రతివాదు లన్నట్లాలోచించినను లక్షగ్రంథములోని 8800 ఘట్టశ్లోకములనుమాత్రము సంజయునకు జూపకున్న నేరమేమి? అది తప్ప కథాసందర్భముకంటె యావద్గ్రంథము జూపబడినట్లేకదా.

మఱియు "సంజయో వేత్తివా నవా" అని యుండుటను బట్టి సంజయునకు గ్రంథము జూపినట్లు లేదందురే. చూపనట్లు మాత్రమున్నదా? 'వేత్తివా నవా' అనుదానికి చూపనట్లర్థమా?

మఱియు వ్యాసమహర్షి యన్నమాట యేమి? గ్రంథగ్రంథులైన 8800 శ్లోకములను నేనెఱుగుదును. శుకుడెఱుగును. సంజయుడెఱుగునో యెఱుగడో అని కదా! దీనితాత్పర్యము, ఆశ్లోకముల గూఢార్థము నాకును శుకునకును తెలియును. సంజయునకట్లు గూఢార్థము తెలియునో లేదో అనియేకదా.

ఇప్పుడు సంజయుడు ఆ 8800 శ్లోకముల నొకమే యెఱుగకుండుట నిజమైనయెడల నాతని కాశ్లోకముల గూఢార్థము తెలిసెనో లేదో యను సంశయమే అసంభవము. శ్లోకోక్తమైయున్న యీసంశయమును బట్టియే సంజయుడా 8800 శ్లోకములను తప్పక చూచియుండెనని నిర్ణయింపవలసియున్నది. అట్లు సంజయుడు చూచుట వ్యాసమహర్షి చూపుటచేతనే అనవలసియున్నది. కనుక మహర్షి సంజయునకు చూపినట్లు లేదను మ.భా.చ. కారులవ్రాత హేతువు.

దీనినిబట్టియే "వ్యాసుడు పాండవపక్షముగా వ్రాసియుండు

టచే ప్రత్యక్షముగా వ్యవహారములు జూచిన సంజయునకుగూడ జూప కుండుటలో సామర్థ్యము లేదు” అను వ్రాతగూడ బరాస్తమైనది.

ప్రత్యక్షముగా వ్యవహారముల జూచిన సంజయునకు పూర్వో క్తప్రకారము వ్యాసమహర్షి తనగ్రంథమును చూపినట్లే సిద్ధించుట చేతగూడ మహర్షి న్యాయముగనే గ్రంథము వ్రాసెనని ధృవప డుచున్నది.

ఇట్లుండుటచే, సంజయునకు జూపినట్లు లేదను కల్పనమీద మహర్షి యన్యాయమున కొడబడె నన్న మూడవనిందకూడ బరాస్తమైనది.

సంజయుడు ప్రత్యక్షముగా జూచిన వ్యవహారములలో యుద్ధ వ్యవహారములు వ్యాసభగవానుని కటాక్షముచేతనే చూడగలిగెను సుమా. యని మ. భా. చ. కారులకు దెలుపుచున్నాము. ధృత రాష్ట్రుడు యుద్ధమును సాకల్యముగా దెలిసికొనగోరుచున్నా నని ప్రార్థింపగా-వ్యాసమహర్షి —

“ఏష తే సంజయో రాజన్ యుద్ధ మేత ద్వదిష్యతి ।
చక్షుషా సంజయో రాజన్ దివ్యేనైవ సమన్వితః ॥
కథయిష్యతి తే యుద్ధం సర్వజ్ఞశ్చ భవిష్యతి ।
ప్రకాశంవాఽప్రకాశంవా దివావా యదివా నిశి ॥
మనసా చిన్తిత మపి సర్వం వేత్స్యతి సంజయః ।”

సంజయుడు దివ్యదృష్టికలిగి ప్రకాశముగా గాని, ప్రచ్ఛన్న ముగా గాని, పగటియందుగాని, రాత్రియందుగాని, యేమి జరిగినను, మనస్సులలో నేమేమి యాలోచింపబడినను సర్వము దెలిసికొని నీకు జెప్పును. అని వర మిచ్చియుండెను. కనుకనే యావద్వృత్తాంతమును

ధృతరాష్ట్రునకు సంజయుడు చెప్పగలిగెను జరిగినది జరిగినట్లు కాక ప్రతివాదు లన్నట్లు అన్యాయముగా గ్రంథము రచించినయెడల మహర్షి యథార్థము గ్రహింపగల దివ్యదృష్టిని సంజయున కిచ్చి కూర్చుండబెట్టునా? కనుక 'అన్యాయమున కొడబడెను' అను మ. భా. చ. కారుల మాట నింద్యము.

> దీనిచే "వ్యాసుడు వ్రాసిన జయము రణరంగమునకు సైన్యము నడచువఱకు మాత్రమె విపులముగా జెప్పబడి యుద్ధవృత్తాంత మేసంజయునివలననో విని యావ్యాసుడు ముక్తసరుగా జెప్పి యుండును." (మ భా. చ. పు. 68)

అనువ్రాత నిరస్తము. యుద్ధవృత్తాంతమును వ్యాసునకు వచ్చి సంజయుడే చెప్పుచుండె ననునది కేవలము దురూహ. విషయాంతర మందుకొందము—

వ్యాసుడు సంకీర్ణజాతీయు డగుటచే సంకీర్ణజాతీయులగు పాండవులకు దోడ్పడెనన్న ప్రసంగము—తన్నిరాకరణము.

> మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది—"వ్యాసుడు సంకీర్ణ జాతీయు డగుటచేతనే సంకీర్ణజాతివారగు పాండవులకు బెక్కు-చోట్టుల బెక్కుభంగుల దోడ్పడెను" (పు. 149) ఇతరులనుగూర్చి వ్రాత కూడ నిట్లే యున్నది.
>
> "ఎట్లైనను విదురుడు సంకీర్ణుడే. అందువలననే సంకీర్ణజాతివా రగు పాండవులపై ననురాగము." (పు. 128)
>
> "కృపుడు ... సంకీర్ణుడు ... కౌరవుల కూడు దినుటచే నీతడు కౌరవపక్షముగా బోరెనుకాని సంకీర్ణులగు పాండవులపక్షమున మాటలాడువాడు" (పు. 126)

"ద్రోణుడు తానవలె సంకీర్ణసంభవుల పటుచేగాబోలు పాండవు లపై నభిమానము జూపుచుండెను." (పు. 124)

"భీష్ముడు, పాండవులు గాలికి నాకదేవత మొదలగువారికి బుట్టినటుల దాను నదికి బుట్టిన సంకీర్ణుడుగాన పూర్వాచారపరు డగు దుర్యోధనున కపకృతిని, సంకీర్ణులగు ధర్మరాజాదుల కుపకృతిని జేసియున్నా డని ముమ్మాటికిని జెప్పవచ్చును" (పు. 121)

"పాండవపక్షపాతు లెవరు? నేటి కాలపు సామాన్యజను లందరు పాండవపక్షపాతులే" (పు 120)

ఈవ్రాతచే పాండవులు సంకీర్ణజాతీయు లనియు, నట్టి పాండవుల యందు వేదవ్యాసాదులు పక్షపాతము కలవా రనియు, వారి కాపక్షపాతము తామునుకూడ సంకీర్ణజాతీయు లగుటచేతనే కలిగె ననియు తేల్చి ధర్మతత్త్వవిదులగు వేదవ్యాస భీష్మద్రోణ కృపాచార్య విదురులను సంకీర్ణజాతీయు లనియు, పక్షపాతు లనియు చులకనగా దీసి వేసినారు. ఈప్రతివాదుల నోటిమాటను బట్టుకొనియే ముందు పరిశీలింతము—

సంకీర్ణజాతివారికి సంకీర్ణజాతివారియందే పక్షపాత మని వ్రాత లోని సారాంశము. ప్రతివాదినిర్ణయప్రకారము వ్యాసాదులవలె భిన్న జాతీయస్త్రీపురుషసంబంధమును బట్టి ధృతరాష్ట్రుని, కర్ణుని గూడ సంకీర్ణజాతివా రని యనవలసినదే. వీరిరువురు సంకీర్ణజాతీయులై యుం డియు సంకీర్ణజాతీయు లనబడిన పాండవులయందు పక్షపాతము లేని వారు. అందుచే 'సంకీర్ణజాతివారికి సంకీర్ణజాతివారియందే పక్షపాతము' అను మాట ప్రతిహత మైనది. ఇంతేగాక సంకీర్ణజాతివా రగు కర్ణ ధృతరాష్ట్రులకు పూర్వాచారపరు డని ప్రతివాదు లన్న దుర్యోధనుని

యందే పక్షపాత ముండుటను బట్టి సంకీర్ణజాతివారికైనను పూర్వాచారపరులయందును పక్షపాత ముండు నని యేర్పడినది.

మఱియు, పాండవులయందు సంకీర్ణజాతీయులైయుండియు ధృతరాష్ట్రిన కనాదరణము కర్ణునకు ద్వేషము నుండుటనుబట్టి ప్రతివాదు లన్నట్లు ఒక్కపాండవపక్షపాతులే సంకీర్ణజాతివారు కాక పాండవద్వేషులుగూడ సంకీర్ణజాతివారే యని సిద్ధించినది. పాండవద్వేషులే గాక దుర్యోధనపక్షపాతులుగూడ సంకీర్ణజాతివా రని సిద్ధించినది.

ఇట్లు ప్రతివాదుల నోటిమాటలనే తీసికొని చూచినను పాండవపక్షపాతమునకును, సంకీర్ణజాతికిని యేమాత్రము సంబంధము లేదని తేలినది.

ఈప్రస్తావములో పుత్రుడగు దుర్యోధనుని మందలించిన గాంధారి యుపదేశమును చూడవలసియున్నది. ప్రతివాదు లీగాంధారిని గూర్చి—

"మరణసంశయమగు యుద్ధమున కేగుచు దన్ను దీవింపు మని వచ్చిన కుమారుని "యతోధర్మ స్తతో జయః" అని ధర్మైకాగ్రచిత్తయై దీవించిన ధర్మైవనితామతల్లిక" మ. భా. చ. (పు268) అని ప్రశంసించియే యున్నారు.

ప్రతివాదు లుదాహరించిన యీదీవనకు తాత్పర్యము ముందు గ్రహింపవలసియున్నది జయము ధర్మాధీనముకనుక ధర్మ మెచ్చటనో జయ మచ్చట, అని 'యతో ధర్మ స్తతోజయః' అనుమాటకు తాత్పర్యము.

ఇది దుర్యోధనుని విజయమునకు జేసిన దీవనకాదు. అట్టిదీవనయే యైన మహాపతివ్రత దీవన వ్యర్థమగునా? అట్టిదీవన 'విజయీభవ' అనియో, 'నీధర్మమే నీకు విజయమిచ్చుగాత' అనియోయుండును.

ధర్మము దుర్యోధనునివద్ద లేదుకనుకనే 'యతో ధర్మ స్తతో జయః' అని యున్న దన్నమాట. ఇదివరకునుబట్టి దుర్యోధనునిది ధర్మ మని ప్రతివాదులు భ్రాంతిపడిరి గాబోలు. పాండవులదే ధర్మ మని గాంధారి పుత్రునకు జెప్పియున్నది ఆప్రసంగము జూతము—

"దుర్యోధన యదాహ త్వాం పితా భరతసత్తమ।
భీష్మో ద్రోణః కృపః క్షత్తా సుహృదాం కురు తద్వచః॥
యథా భీష్మ శ్శాంతనవో ద్రోణశ్చాపి మహారథః।
ఆహతు స్తాత తత్సత్య మజేయౌ కృష్ణపాండవౌ॥
శ్రీమద్భి రాత్మవద్భి స్తై ర్బుద్ధిమద్భి ర్జితేన్ద్రియైః।
పాండవై ర్విగ్రహ స్తాత భ్రంశయే న్మహత స్సుఖాత్॥
యచ్చ త్వం మన్యసే మూఢ భీష్మద్రోణకృపాదయః।
యోత్స్యన్తే సర్వశక్త్యేతి నైత దద్యోపపద్యతే॥
సమం హి రాజ్యం ప్రీతిశ్చ స్థానం హి విదితాత్మనామ్।
పాండవే ష్వథ యుష్మాసు ధర్మ స్త్వభ్యధిక స్తతః॥"
(ఉద్యో అ. 129)

దుర్యోధనా! నీతండ్రియు, భీష్మద్రోణకృపవిదురులు నీకు చెప్పియున్న విధముగనే నీవు చేయుము. వారు ప్రేమకలవారు. పూజ్యులైన భీష్మద్రోణులు చెప్పినది సత్యము. కృష్ణార్జునులు అజేయులే. గుణవంతులగు పాండవులతో విరోధము సుఖభ్రష్టత కలుగ జేయును. మూఢుడా! భీష్మద్రోణకృపాచార్యాదులు సర్వశక్తులతో యుద్ధము జేయుదు రని భావించుచున్నావు; కాని యిప్పుడది సాగదు. మీయందును, పాండవులయందును ప్రీతిమొదలైనవి విదితాత్ములకు సమానములే యైయున్నను ఆపాండవులయందు ధర్మ మభ్యధికము. ఈయుపదేశములో భీష్మద్రోణకృపవిదురులు దుర్యోధనునియందు సౌహార్దము కలవా రని గాంధారి యన్నది. ఆభీష్మాదులు సంకీర్ణ

జాతీయులు, పాండవపక్షపాతులు, దుర్యోధనున కపకారులు అని మ. భా. చ. కారు లన్నారు. ధర్మము పాండవపక్షమందున్న దని గాంధారి యన్నది. కౌరవపక్షమందే యున్నట్లు మ. భా. చ. కారు లందురు. ఇందెవ్వ రెట్టివారో ఆగాంధారికి తెలియునా? ఈ మ. భా. చ. కారులకు తెలియునా?

మఱియు పాండవులు సంకీర్ణజాతివా రని మ. భా. చ. కారు లన్నారు. తనతో సమానజాతివారే పాండవు లనిదుర్యోధనుడన్నాడు. చూడుడు—

ధృతరాష్ట్రుడు, సంజయునితో పాండవు లధికబలులు— వారికి జయము తప్పదు. నేవలదనుచున్నను దుష్పుత్రుడు యుద్ధమునే కోరు చుండెను. అన్నవుడు దుర్యోధనుడు—

"ఉభా స్వ ఏకజాతీయాః తథోభా భూమిగోచరా ।
అథ కస్మా త్పాండవానా మేకతో మన్యసే జయమ్ ॥"ఉద్యో అ57

"మే మిరువురము నేకజాతివారము, భూపతులము నైయుండ నొక్కపాండవులకే జయ మని తలచెదవేమి?" అనెను. దీనిచే పాండవులకును, దుర్యోధనాదులకును జాతిభేదము లేదని సిద్ధించినది. ఇప్పుడాలోచింప పాండవుల జాతి యేదో ఆదుర్యోధనునకు దెలియునా? ఈ మ. భా. చ. కారులకు దెలియునా?

మఱియు. ద్రోణకృపులను సంకీర్ణజాతివారని (భిన్నజాతీయ స్త్రీపురుషసంజాతులని) మ. భా. చ. కారు లన్నారు.

వారినిగూర్చిదుర్యోధను డయోనిజు లని చెప్పెను. చూడుడు—
"బ్రహ్మర్షేశ్చ భరద్వాజా ద్ద్రోణో ద్రోణ్యా మజాయత ।
కృప శ్చాచార్యముఖ్యోఽయం మహర్షే ర్గౌతమా దపి ॥

శర స్తంబోద్భవ శ్శ్రీమా నవధ్య ఇతి మే మతిః
అయోనిజా త్రయో హ్యేతే పితా మాతా చ మాతులః ।
అశ్వత్థామ్నో మహారాజ సచ శూరః స్థితో మమ ।" ఉద్యో అ55

ఇచ్చట బ్రహ్మర్షి యగు భరద్వాజుని వలన ద్రోణి (పాత్రవిశేషము) నుండి జన్మించినవాడు ద్రోణుడనియు, గౌతమమహర్షి వలన శరస్తంబమునుండి జన్మించినవాడు కృపాచార్యుడనియు, అశ్వత్థామ యొక్క తండ్రియగు ద్రోణాచార్యులు, తల్లియగు కృపి, మేనమామ యగు కృపాచార్యులు నను ముగ్గురును అయోనిజు లనియు జెప్పబడినది.

ఇట్లుండ ద్రోణాదులను గూర్చి దుర్యోధనునకు తెలియునా? ఈ మ. భా. చ. కారులకు తెలియునా? కనుక మ. భా. చ. కారుల వ్రాత నింద్యము. అయోనిజజన్మప్రామాణికత్వము 'ద్రౌపదీ నిందానిరాకరణ' మను ప్రకరణమున నిరూపింపబడును. ఇక వ్యాస మహర్షినిగూర్చి చెప్పవలసియున్నది.

మహర్షి విప్రుడే యని వెనుక గొంత చెప్పియుంటిమి. అవిషయ మింకను ముందు చెప్పబడును కనుక "వ్యాసుడు సంకీర్ణ జాతీయు డగుటచేతనే సంకీర్ణ జాతివా రగు పాండవులకు బెక్కుచోటుల బెక్కుభంగుల దోడ్పడెను" అను మ. భా. చ. కారుల మాటలో వ్యాసుడు సంకీర్ణ జాతీయు డను మాట త్రోసివేయబడినది.

పాండవులు సంకీర్ణజాతివా రను మాట, పూర్వము చూపిన దుర్యోధనవాక్యముచే నిరస్తము. ఇక వ్యాసమహర్షి పాండవులకు దోడ్పడెను. అన్నమాట యున్నది. ఆపన్నులైన పాండవులకు దోడ్పడుట వ్యాస మహర్షికి తప్పా? ఇటు కౌరవులయందును, అటు పాండవులయందును సమానదృష్టియే మహర్షి కున్నను ఆపన్ను లగుటచే పాండవులయందు కరుణాతిశయము కలిగినది. అదియే ధర్మా

త్ముల లక్షణము. ఈవిషయమును ధృతరాష్ట్రునితో సంభాషించునపుడు శక్రసురభిసంవాద మ్ముదాహరించుచు వ్యాసమహర్షియే చెప్పియుం డెను. చూడుడు—

సురభిః—

"యది పుత్రసహస్రాణి సర్వత్ర సమ మేవ మే।
దీనస్యతు సతః శ్శక్ర పుత్ర స్యాభ్యధికా కృపా॥
తద్వథా సురభిః ప్రాహ సమ మేవాఽస్తు తే తథా।
సు తేషు రాజన్ సర్వేషు హీనే ష్వభ్యధికా కృపా॥
యాదృశో మే సుతః పాండు స్తాదృశో మేఽసి పుత్రక।
విదురశ్చ మహాప్రాజ్ఞః స్నేహా దేత ద్బ్రవీ మ్యహమ్॥
చిరాయ తవ పుత్రాణాం శత మేకశ్చ భారత।
పాండోః పంచైవ లక్ష్యన్తే తేఽపి మన్దాస్సుదుఃఖితాః॥"

నీలకంఠీయమ్—

"మన్దాఽత్యత్పుత్రవత్ కపటానభిజ్ఞాః।"
కథం జీవేయు రత్యన్తం కథం వర్ధయేయు రిత్యపి॥
ఇతి దీనేషు పార్థేషు మనో మే పరితప్యతే।
భవన్తి హి నరవ్యాఘ్ర పురుషా ధర్మచేతసః॥
దీనాభిపాతినో రాజ న్నాత్ర కార్యా విచారణా।
పాండో స్సుతా యాదృశా మే తాదృశా స్తవ భారత॥
దీనా ఇతీవ మే బుద్ధి రభిపన్నాఽద్య తాన్ ప్రతి॥" (వనప. అ9)

ధృతరాష్ట్రా! సురభియను దేవధేనువు—దున్నుచు దుర్బలస్థితి లోనుండి దెబ్బలుతినుచున్న పుత్రుని జూచి ఖేదపడి యింద్రునితో పుత్రులందఱియందు నాకు సమానదృష్టియే కాని యాపన్నుడైన పుత్రునియందు దధికదయ యనిచెప్పియున్నది.

ఆసురభి చెప్పినట్లు నీకు పుత్రులందరియందును సమబుద్ధి యుండవలసినదే. ఆపన్నులయందు మాత్ర మధికదయ యుండవలెను. నాకు పాండురాజు, నీవు, విదురుడు అను ముగ్గురు సమానులే నీకు చిరకాలమునకు శతాధికసుతులుకలిగిరి. పాండురాజునకు గలిగినవా రైదుగురే. వారు నీపుత్రులవలెగాక కపట మెఱుగనివారును, దుఃఖాక్రాంతులునై యున్నారు. వారెట్లు జీవింతురు? ఎట్లు వర్ధిల్లుదురు? అని నామనస్సు పాండవులను చూచి పరితపించుచున్నది. ధృతరాష్ట్రా! ధర్మాత్ములకు దీనోద్ధరణము కర్తవ్యమే కదా. నాకు పాండుపుత్రు లెట్టివారో నీపుత్రులు నట్టివారే వారు దీనులైయున్నా రని యిప్పుడు నాబుద్ధి వారియందు సంసక్తమైనది. అని తాత్పర్యము.

ఇట్లే లక్కయింటినుండి తప్పించుకొని జటాధారులై తాపసవేషములతో కుంతీసహితముగా నేకచక్రపురమందు పాండవులు ప్రవేశించబోవు నపుడు మహర్షి దర్శన మిచ్చి చెప్పెను—

"మమేదం వ్యసనం పూర్వం విదితం భరతర్షభాః।
యథాతు తై రధర్మేణ ధార్తరాష్ట్రై ర్వివాసితాః॥
తద్విదిత్వాఽస్మి సంప్రాప్త శ్చికీర్షుః పరమం హితమ్।
న విషాదోఽత్ర కర్తవ్య స్సర్వ మేత త్సుఖాయ వః॥
సమాస్తే చైవ మే సర్వే యూయం చైవం న సంశయః।
దీనతో బాలత శ్చైవ స్నేహం కుర్వన్తి మానవాః॥
తస్మా దభ్యధిక స్నేహో యుష్మాసు మమ సాంప్రతమ్।
(ఆది అ. 156)

దుర్యోధనాదులు అధర్మబుద్ధితో హస్తినాపురమునుండి మిమ్ములను వెడలగొట్టిన విధానము నేను ముందే గ్రహించితిని. మీకు హితము గలిగింప వచ్చితిని. ఇది మీకు మంచికే వచ్చినది. ఖేద

పడకుము. నాకు దుర్యోధనాదులును, మీరును సమానులే. దీనులయం దును, బాలురయందును ప్రేమాతిశయ ముండుట మనుష్యసామాన్య ధర్మముకనుక నా కిప్పుడు మీయందు ప్రేమాతిశయము. అని తాత్పర్యము.

ఇట్లున్న వేదవ్యాసవాక్యములను చూడగా ధృతరాష్ట్రునితో సంభాషించునపు డెట్లు కౌరవులును, పాండవులును నాకు సమానులే యని చెప్పెనో, అట్లే కేవలము పాండవులతో మాట్లాడునపుడుగూడ మీరును, దుర్యోధనాదులును నాకు సమానులే. యనుటవలన కౌర వుల యందు దయారహితు డనుట ప్రతివాదుల తప్పు. పాండవులు దీనులై యున్నందున ప్రేమాతిశయ మనుటచే 'వ్యాసుడు పాండవ పక్షపాతి' అను తమ బుద్ధిని 'వ్యాసమహర్షి దీనదయాపరుడు' అని దిద్దుకొనవలెను. దీనదయాపరు డగు వ్యాసమహర్షి దీనులైయున్న పాండవులకు దోడ్పడుట దోష మని ప్రతివాదుల కనిపించినది కాని ప్రాజ్ఞుల కనిపింపదు కనుక ప్రతివాదుల వ్రాత హేయము.

## —♦ వేదవ్యాససంకీర్ణజాతీయతానిరాకరణము ♦—

వేదవ్యాసమహర్షిని సంకీర్ణజాతీయుడన్న మ. భా. చ. కారులు అచ్చటచ్చట మహర్షిని గూర్చి యెట్లు వ్రాసిరో చూడవలసి యున్నది—

"వ్యాసుడు, జాబాలి, కవషుడు మొదలగువారు వారితల్లు లేజాతివారైనను బీజప్రాధాన్య తపోవిశేషములచే మహర్షులైరి."

"జన్మముచే స్మృతుల ననుసరించి నిషాదుడును, తపోమహిమ బీజప్రాధాన్యముల ననుసరించి బ్రహ్మర్షియు నగువ్యాసునకు క్షత్రి యాంగనలయందు రాజులగు ధృతరాష్ట్ర పాండురాజు లుద్భ వించిరి." (పు. 72)

అని వ్రాసియున్నారు. ఇందు బీజప్రాధాన్యము బీజప్రాధాన్య మనుటవలన పరాశరమహర్షిని బట్టి మహర్షియందు బ్రాహ్మణత్వమే కలదని వారన్నట్లేకద.

ఇక 'జన్మముచే స్మృతుల ననుసరించి నిషాదుడు' అన్నమాట కర్థమేమి? బీజప్రాధాన్య మనునది స్మృతుల ననుసరించి కాదా? స్మృతులే బీజప్రాధాన్యమును చెప్పి, జన్మముచే నిషాదు డని యాస్మృతులెట్లు చెప్పును? జాతి జన్మసిద్ధముకనుక నిషాదుడే యైనయెడల బీజప్రాధాన్యమే పోయినది. బీజప్రాధాన్యమే యున్నయెడల నిషాదత్వము పోయినది. ఇట్టిస్థితిలో బీజప్రాధాన్య మనుట, నిషాదు డనుట విరుద్ధము. అట్టి నిషాదునకు క్షత్రియాంగనలయందు జన్మించిన ధృతరాష్ట్రాదులు క్షత్రియు లగుటకూడ స్మృతులనుబట్టి విరుద్ధమే. అసలు నిషాదు డనుటకు గల వారి యూహలు వెనుక నిరసింపబడియే యున్నవి.

ఇంకొకటి, యెవ్వరో, 'వ్యాసజననియగు సత్యవతీదేవి బ్రాహ్మణియే' యన్నా రని యావాదమును త్రోసివేయుటకు గొన్ని ప్రమాణములు చూపుచు మ. భా. చ. కారు లిట్లు వ్రాసిరి——

"ధర్మశాస్త్రగ్రంథములలో నుత్కృష్టగ్రంథమగు మనుస్మృతికి వ్యాఖ్యానమగు 'మన్వర్థముక్తావళి' యందు కుల్లూకభట్టు బీజక్షేత్రప్రాధాన్యముగూర్చి వ్రాయుచు వ్యాసధృతరాష్ట్రాదులం జేర్కొని నాడు. చూడుడు——

"విశిష్టం కుత్రచి ద్బీజం స్త్రీయోని స్త్వేవ కుత్రచిత్॥ మను. 9అ

వ్యా...క్వచి ద్బీజం ప్రధానం జాయతే. యదర్థ ముష్ట్రోయ మితి న్యాయేన ఉత్పన్నో బీజినో బుధఇవ సోమస్య. తథా వ్యాసబు

శృశృంగాదయః బీజినామేవ సుతాః. క్వచిత్ క్షేత్రస్య ప్రాధాన్యమ్ ...అతఏవ విచిత్రవీర్య క్షేత్రే క్షత్రియాయాం బ్రాహ్మణోత్పాదితా అపి ధృతరాష్ట్రాదయః క్షత్రియాః క్షేత్రిణఏవ పుత్రా బభూవుః. మన్వర్థముక్తావళి.

ఒక్కొక్కచోట బీజము ప్రధాన మగును. "ఎందుకై పుట్టింపబడె నతడు" అనున్యాయముచే బీజివలన బుట్టింపబడినవాడు-సోమునకు బుధునివలె. అట్లే వ్యాసఋష్యశృంగాదులు బీజముకలవారికే సుతులైరి. ఒక్కొకచోట క్షేత్రమునకు ప్రాధాన్యము కలదు. కనుకనే విచిత్రవీర్యుని క్షేత్రమగు క్షత్రియయందు బ్రాహ్మణోత్పాదితులైనను ధృతరాష్ట్రాదులు క్షత్రియులే యైరి" (మ భా. చ. పు 66)

ఇందాక చిత్రమున్నది కుల్లూకభట్టీయములో "క్వచి ద్బీజం ప్రధానం జాయతే యదర్థ ముత్పాద్య మితి న్యాయే నోత్పన్నో బీజినః" అని యున్నదని, దాని కర్థము-ఒక్కొకచోట బీజము ప్రధాన మగును 'ఎందుకై పుట్టింపబడె నతడు' అను న్యాయముచే బీజివలన బుట్టింపబడినవాడు. అని వ్రాసిరికదా. 'యదర్థ ముత్పాద్యమ్' అను న్యాయస్వరూప మేమి? దానికి 'ఎందుకై పుట్టింపబడె నతడు' అని యర్థ మేమి? అట్టిన్యాయముచే బీజప్రాధాన్యపక్షమున కుపోద్బల మేమి? అని విచారింపకయే ప్రతివాదులు కనబడినదానికి తోచిన ట్లర్థము జెప్పినారు. ఇదియే చిత్రము! కుల్లూకభట్టీయములో 'యదర్థ ముత్పాద్యమ్' అనికాక 'యాదృశ ముప్యతే బీజమ్' అనిపాఠము.

"యాదృశన్నుప్యతే బీజం క్షేత్రే కాలోపపాదితే।
తాదృ గ్రోహతి తత్తస్మిన్ బీజం స్వై ర్వ్యంజితం గుణైః ॥"

అనునది మనుస్మృతిలో నుత్తరశ్లోకము. అది బీజప్రాధాన్య

పక్షనిరూపణమునకై చెప్పబడినది. అదియే కుల్లూకభట్టీయమునం దుదాహృతమైన న్యాయము.

ఇక ప్రకృతమునకు వత్తము—ఎవ్వరో వ్యాసజనని యగు సత్యవతీదేవిని బ్రాహ్మణి యనగా నామాట తప్పనుటకు మనుస్మృతి వచనమును, వ్యాఖ్యానమును మ. భా. చ కారులు ప్రదర్శించిరో అవియే 'విశిష్టం కుత్రచి ద్బీజమ్' అనియు, 'వ్యాసఋశ్యశృంగాదయో బీజినా మేవ సుతాః' అనియు, 'విచిత్రవీర్యక్షేత్రే క్షత్రియాయాం బ్రాహ్మణోత్పాదితాః' అనియు వ్యాసమహర్షి బీజప్రాధాన్యమును బట్టి బ్రాహ్మణుడే యని స్పష్టముగా జెప్పియుండగా నట్టి ప్రమాణములకు విరుద్ధముగా వ్యాసుడు సంకీర్ణజాతీయు డనుట నింద్యము. ఆమనుస్మృతివచనము, ఆవ్యాఖ్యానము పరుల వాదమును ఖండించుటకే ప్రమాణముకాని తమ వాదమును ఖండించుటకు బ్రమాణము కావుకాబోలు.

ఇక బీజప్రాధాన్య మన్నను, సంకీర్ణజాతియన్నను ఒకటే యనుటకు సిద్ధపడుదురేమో! వాని భేదము దెలుపుదము. బీజప్రాధాన్య పక్షములో పితృజాతి, క్షేత్రప్రాధాన్యపక్షములో మాతృజాతి, ఆ రెండుపక్షములు కానపుడు సంకీర్ణజాతి. ఈవిషయము ఆమనుస్మృతి వ్యాఖ్యానమందే యున్నది చూడుడు—"సంకీర్ణజాతీనాన్తు అశ్వతరవన్మాతాపితృజాతివ్యతిరిక్తజాత్యన్తరత్వమ్"

ఇట్లు పరిశీలింపగా వ్యాసుడు సంకీర్ణజాతీయు డను ప్రతివాదుల వ్రాత ప్రమాణవిరుద్ధము, స్వవచనవ్యాహతము, సందర్భవిరుద్ధము నగుటచే హేయము

వేదవ్యాసమహర్షి బీజప్రాధాన్యమున బ్రాహ్మణుడేకనుక "సంకీర్ణజాతీయమగు ద్వైపాయన పక్షముపై నీసు వహించి వైదికఋషులు

తమవాఙ్మయములో ద్వైపాయనపక్షోద్ధర్తృయుక్తధర్మజాశ్వమేధము పేరుగూడ జెప్పరైరి." (పు. 156)

అను మ.భా.చ. కారుల దుష్ప్రసంగము మూరాపాస్తమైనది. పాపము వీరి కొక్క-ధర్మరాజాశ్వమేధము పేరు వైదికవాఙ్మయము లో జెప్పనట్లు కనబడినదట! రామాయణప్రసిద్ధములైన దశరథాశ్వమేధము, సగరాశ్వమేధము, రామాశ్వమేధము మున్నగువాని పేరులు వీరికి గనబడినవి కాబోలు! అపై వైదికఋషులు సంకీర్ణజాతీయమగు ద్వైపాయనపక్షముపై నీసు వహించిరట! ఈ సంకీర్ణజాతిప్రసంగ మింక మానవలసిన దని చెప్పియున్నాము. వైదికవాఙ్మయములో "సహోవాచ వ్యాసః పారాశర్యః" అని వ్యాసమహర్షి కీర్తింపబడియుండ వైదికఋషులకు ద్వైపాయనపక్షముపై నీసా? కనుక వీరి వ్రాత హేయము.

ఇక దీనిని విడిచి పూర్వము ప్రస్తావింపబడిన బీజప్రాధాన్యక్షేత్రప్రాధాన్యపక్షములలో నెప్పు డేపక్షము గ్రాహ్యమని యున్నదో చూతము.—

—♦ బీజప్రాధాన్యక్షేత్రప్రాధాన్యవ్యవస్థ ♦—

"య స్తల్పజః ప్రమీతస్య క్లీబస్య వ్యాధితస్య వా।
స్వధర్మేణ నియుక్తాయాం స పుత్రః క్షేత్రజ స్స్మృతః ।"మను అ9

వ్యా "యో మృతస్య, నపుంసకస్య, ప్రసవవిరోధివ్యాధ్యుపేతస్య భార్యాయాం భ్రాతృత్వాదినియోగధర్మేణ గురునియుక్తాయాం జాతః స క్షేత్రజః పుత్రో మన్వాదిభిః స్మృతః"

మరణించినవాని భార్యయు, నపుంసకుని భార్యయు, సంతానప్రతిబంధమైనవ్యాధికలవాని భార్యయు, పుత్రసంతతికై గురుజన

ముచే నియోగింపబడినపుడు అట్టి స్త్రీయందు, దేహమంతట నెయ్యి పూసికొనుట మొదలగు నియోగధర్మ మవలంబించినవానిచే గలిగిన పుత్రుడు క్షేత్రజుడు. అట్టివానియందు క్షేత్రప్రాధాన్య మన్నమాట. కనుకనే—

"విశిష్టం కుత్రచి ద్బీజం స్త్రీయోని స్త్వేవ కుత్రచిత్"

అను శ్లోకమునకు వ్యాఖ్యానములో 'క్వచిత్ క్షేత్రస్య ప్రాధాన్యం, యథా యస్తల్పజః ప్రమీతస్యేతి వక్ష్యతి, అతఏవ విచిత్రవీర్యక్షేత్రే క్షత్రియాయాం బ్రాహ్మణోత్పాదితా అపి ధృతరాష్ట్రాదయః క్షత్రియాః క్షేత్రిణఏవ పుత్రా బభూవుః' అని క్షేత్రప్రాధాన్యపక్షమునకు నియోగవిధినిబట్టి కలిగిన ధృతరాష్ట్రాదులు నిదర్శనముగా జూపబడిరి.

"తపోబీజప్రభావైస్తు తే గచ్ఛన్తి యుగేయుగే ।
ఉత్కర్షమ్" (అ10, 42శ్లో॥

వ్యా "సజాతిజానన్తరజాః తపఃప్రభావేణ విశ్వామిత్రవత్. బీజప్రభావేణ ఋశ్యశృంగాదివత్. కృతత్రేతాదా మనుష్యమధ్యే జాత్యుత్కర్షం గచ్ఛన్తి"

"జాతో నార్యా మనార్యాయా మార్యా దార్యో భవే ద్గుణైః ।
జాతో ఽప్యనార్యా దార్యాయా మనార్య ఇతి నిశ్చయః ॥
యస్మా ద్బీజప్రభావేణ తిర్యగ్జా ఋషయోఽభవన్ ।
పూజితాశ్చ ప్రశస్తాశ్చ తస్మాద్బీజం ప్రశస్యతే ॥"

వ్యా—యస్మా ద్బీజమాహాత్మ్యేన తిర్యగ్జాతిహరిణ్యాదిజాతా అపి ఋశ్యశృంగాదయో మునిత్వం ప్రాప్తాః పూజితా శ్చాభివాద్యత్వాదినా వేదజ్ఞానాదినా ప్రశస్తా వాచా సంస్తుతాః"

ఇచ్చట సమానజాతి స్త్రీలయందుగాని, యనన్తరజాతి స్త్రీల యందుగాని జన్మించినవారు విశ్వామిత్రునివలె తపఃప్రభావముచేతను, ఋశ్యశృంగాదులవలె బీజప్రాభావముచేతను కృత త్రేతాదియుగము లలో జాత్యుత్కర్షమును పొందిరి. అనార్య స్త్రీయందు ఆర్యునివలన జన్మించినవాడు ఆర్యు డగును, యార్యస్త్రీయందనార్యునివలన జన్మించినవా డనార్యుడే యగునని నిర్ణయము హరిణ్యాదులయందు జన్మించినను ఋశ్యశృంగాదులు బీజప్రాభావమున మునులై వేదవిదులై పూజితు లగుటచే బీజము ప్రధాన మైనది; అని చెప్పబడినది. దీనిచే నియోగసంబంధము లేనపుడు ఋష్యాదుల విషయమై బీజప్రాధాన్య పక్ష మని స్పష్టమైనది.

కనుకనే "విశిష్టం కుత్రచి ద్బీజం" అన్నపుడు వ్యాఖ్యానములో "వ్యాస ఋశ్యశృంగాదయో బీజినా మేవ సుతాః" అని వేదవ్యాసాదులు బీజప్రాధాన్యపక్షమునకు నిదర్శనముగా జూపబడిరి.

"వ్యభిచారేణ వర్ణానా మవేద్యావేదనేనచ ।
స్వకర్మణాంచ త్యాగేన జాయన్తే వర్ణసంకరాః ॥" (10-24)

వ్యా—బ్రాహ్మణాదివర్ణానా మన్యోన్య స్త్రీగమనేన సగోత్రాదివివాహేన ఉపనయనరూపస్వకర్మత్యాగేన వర్ణసంకరోనామ జాయతే.

దీనినిబట్టి అన్నివర్ణములవారును అన్యోన్య స్త్రీగమనరూపమగు వ్యభిచారము చేయగా గలిగెడి సంతతియందు బీజప్రాధాన్య ములే నందున పితృజాతియు క్షేత్రప్రాధాన్యము లేనందున మాతృజాతియు కాక సంకీర్ణజాతి యని తేలినది. ఇది యీపక్షములయొక్క వ్యవస్థ. ఇప్పుడు క్షత్రియకాంత లగు పాండురాజధర్మపత్నులయందు పాండురాజనియోగమును బట్టి దేవతానుగ్రహమున జన్మించిన

పాండవులు మ. భా. చ. కారు అన్నట్లు సంకీర్ణజాతివా రెల్లగుదురు. వారును ధృతరాష్ట్రాదులవలె క్షేత్రజు లగుటచే క్షేత్రప్రాధాన్యమున క్షత్రియులే యైయుండ మ. భా. చ. కారులు వారిని సంకీర్ణజాతివా రనుట నింద్యము.

ఈవ్యవస్థచేతనే "వీర్యప్రాధాన్యమునే లెక్కగొనవలసి యుండి నచో వ్యాసుని వీర్యమునబుట్టిన శ్రీశుకుడు మహర్షియు, ధృత రాష్ట్ర పాండురాజులు క్షత్రియులు, విదురుడు శూద్రుడు నె ట్లయిరి? యిచ్చట వీర్యప్రాధానత కాక క్షేత్రప్రాధాన్యమే వన్నె కెక్కెను." (మ. భా. చ. పు. 151)

అను వ్రాతకు శ్రీశుకు డయోనిజుడగుటచేగూడ వీర్యప్రాధా న్యమే యనియు, ధృతరాష్ట్రాదులు నియోగవిధిచే గలిగినందున వారి యందు క్షేత్రప్రాధాన్యమే అనియు సమాధానము చెప్పబడినది.

ఇంకొక విశేషము— ఋషులలో బ్రాహ్మణదంపతులకు జన్మిం పని కొందఱికి బ్రాహ్మణ్యము చెప్పబడియున్నది. దాని కుపపత్తి యే మనగా వేదమంత్రములు వారికి స్వయముగా ప్రతిభాసించుటవలన వారికి బ్రాహ్మణ్య మని. కనుకనే—

"స్వయంప్రతిభాత వేదమంత్రిత్వాఖ్య మేవ బ్రాహ్మణ్యమ్. బ్రా హ్మణ్యం బ్రాహ్మణా దజాతానా మపి" (ధర్మప్రదీపము)

అని చెప్పబడినది. వేదము లట్లు స్వయముగా ప్రతిభాసించు టకు నిదర్శనము వేదవ్యాసమహర్షియు, శుకయోగియు. శుకయోగిని గూర్చి యిట్లు చెప్పబడినది.

"ఉత్పన్నమాత్రం తం వేదా స్సరహస్యా స్ససంగ్రహాః।
ఉపతిష్ఠు ర్మహారాజ యథాఽస్య పితరం తథా ॥" (శాం॥ అ 324)

పుట్టినతోడనే శుకయోగిని వేదములు సాకల్యముగా నీతని తండ్రి యగు వ్యాసమహర్షి నాశీర్వదించిన ట్లాశీర్వదించిన వని భావము.

ఇట్లే ఆయాఋషులు గూడ స్వయంప్రతిభాతవేదవశమున బ్రాహ్మణ్యముకలవారైరని గ్రహింపబడుచున్నది.

ఇక దీని నిటుంచి క్షేత్రప్రాధాన్యపక్షమున కాధారమైన నియోగమును గూర్చి మనుస్మృతివ్యాఖ్యానములో నుదాహరింపబడిన బృహస్పతివచనము లవలోకింతము—

"ఉక్తా నియోగా మనునా నిషిద్ధా స్వయమేవ తు ।
యుగక్రమా దశక్యోఽయం కర్తు మన్యై ర్విధానతః ॥
తపోజ్ఞానసమాయుక్తాః కృతత్రేతాయుగే నరాః ।
ద్వాపరేచ కలౌ నౄణాం శక్తిహాని ర్హి నిర్మితా ॥
అనేకధా కృతాః పుత్రా ఋషిభిశ్చ పురాతనైః ।
న శక్యతేఽధునా కర్తుం శక్తిహీనై రిదంతనైః ॥"

అనగా- నియోగపద్ధతిని మను వుపదేశించియు, యుగక్రమము నుబట్టి యానియోగవిధి యథోక్తముగా నన్యులచే నిర్వహింపశక్యము కాదని నిషేధించెను. కృతత్రేతాద్వాపరములలోనివారు తపోబలము, జ్ఞానబలము గలవారు. కలియుగమందు మనుజులశక్తి క్షీణమైనది. పురాతనులైన ఋషులు మంత్రశక్తులతో పుత్రేష్టులతో నొకటేమి అనేకవిధముల బుత్రుల ననుగ్రహించిరి. ఇప్పుడు శక్తిహీనుల కది యశక్యము. అని తాత్పర్యము. ఈనియోగవిధి ననుసరించువారి నియమములు వెనుక 'వితంతూద్వాహప్రసంగనిరాకరణ' సందర్భములో జెప్పబడినవి. ఇచ్చట వాని ననుసంధింపవలెను.

ఇట్లు పరిశీలింపగా నాటి నియోగవిధి కర్తిపై సాముకాని, కామకేళి కాదనియు, దానిని ధర్మోక్తవిధానములతో నిర్వహింప గల సమర్థత అప్పటివారికే యుండెడి దనియు స్పష్టమైనది. ఇక దీనిని విడిచి విషయాంతర మందుకొందము—

వ్యాసుడు భారత మన్యాయముగా వ్రాయుటచే చింతించి భాగవతము రచించె నను ప్రసంగము—తన్నిరాకరణము.

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది—"న్యాయ మన్యాయ ముగాను, అన్యాయము న్యాయముగాను వ్రాయుటచే వ్యాసుడే చింతించి నారదోపదేశముచే భాగవతమును రచించియుండుటయే కాక మనసింకను బాధించుటచే గాబోలును సుయోధనునకు స్వర్గ సౌఖ్యప్రాప్తిని పాండవులకు గొంతకాలము నరకప్రాప్తినిగూడ బిమ్మట జెప్పియున్నాడు" (పు. 94)

ఈవ్రాతలో వెల్లడింపబడిన యంశములు రెండు; వ్యాసుడు భారత మన్యాయముగా రచించి దానికి తాను చింతించి నారదోపదే శమున భాగవతము రచించియుండె నని యొకటి. ఆచింతచేతనే సుయోధనునకు స్వర్గసౌఖ్యప్రాప్తిని చెప్పి పాండవులకు గొంతకాలము నరకప్రాప్తిని జెప్పెనని యొకటి. వీనిని గ్రమముగా బరిశీలింతము.

భారతకథలో దుర్యోధనపక్ష మొకటియు, పాండవపక్ష మొక టియు కలదు. మ. భా. చ. కారులు, 'న్యాయ మన్యాయముగా వ్రాసె' నను మాట దుర్యోధనపక్షమును గూర్చి యన్నట్లున్నది. మ. భా. చ. కారులకుగూడ మహాభారతమునుబట్టి దుర్యోధనపక్ష మన్యాయముగా బ్రవర్తించినట్లర్థమైన దన్నమాటే. కాని దుర్యోధ నాదు లన్యాయముగా బ్రవర్తించినట్లు మహర్షి వ్రాసెనేకాని వారు న్యాయమునగనే ప్రవర్తించినారని వీరికల్పన. ఈకల్పన కాధార మేమో?

దుర్యోధనాదులది న్యాయమని చెప్పెడి యార్షగ్రంథ మేదైన గలదా? మహర్షిగ్రంథ మక్రమమును మ. భా. చ. కారుల కల్పన సక్రమమునా? ప్రమాణగ్రంథమునే అప్రమాణమనువారిమాట యెవ్వనికి ప్రమాణ మగును?

ఆప్తవాక్యము ప్రమాణ మని జగత్ప్రసిద్ధము. ఆప్తు లెవ్వరో యీచరకసంహితావచనములు చెప్పుచున్నవి. చూడుడు—

"ఆప్తా స్తావత్—

రజ స్తమోభ్యాం నిర్ముక్తా స్తపోజ్ఞానబలేన యే ।
యేషాం త్రికాల మమలం జ్ఞాన మవ్యాహతం సదా ॥
ఆప్తా శ్శిష్టా విబుద్ధా స్తే తేషాం వాక్య మసంశయమ్ ।
సత్యం వక్ష్యన్తి తే కస్మా దసత్యం నీరజ స్తమాః ॥"

అనగా- తపోబలజ్ఞానబలములచే నెవ్వరు రజ స్తమస్సుల నంత రింపజేసికొనినారో, నిర్మలమైన త్రికాలజ్ఞాన మవ్యాహతముగా నెవ్వ రికి గలదో, అజ్ఞానులు అశిష్టులు ఆప్తులు. వారివాక్యము నిస్సంశ యము. రజ స్తమోరహితులై శుద్ధసత్త్వసంపన్నులైనవారు సత్యమే చెప్పుదురు. అసత్యము జెప్పరు. అని భావము.

ఇప్పుడు మహాభారతమం దున్నది ప్రమాణమా? మ. భా. చ. కారు లన్నది ప్రమాణమా? ఆతపోబలజ్ఞానబలములు మహర్షి కున్నవా? మ. భా. చ. కారుల కున్నవా? ఆత్రికాలజ్ఞానము మహ ర్షిదా? మ. భా. చ. కారులవా? ఆరజ స్తమోరహితుడు మహర్షియా మ. భా. చ. కారులా? ఆఅసత్యమాడనివాడు మహర్షియా? మ. భా. చ. కారులారా? మనకట్టి యాప్తుడు మహర్షియా? మ. భా. చ. కారులా? కనుక ప్రతివాదుల వ్రాత హేయము.

న్యాయముగా బ్రవర్తించినారని భారతములో జెప్పబడిన పాండవుల నుద్దేశించి యన్యాయము న్యాయముగా వ్రాసెనని యన్న మాటకూడ హేయమే

మఱియొకటి. కౌరవపాండవుల న్యాయాన్యాయముల వ్యత్యాసము చేసి భారతము వ్రాసి వ్యాసుడే చింతించి నారదోపదేశమున భాగవతము రచించెనట! వీరన్నదే నిజమైనయెడల వ్యాసుడు చింతించినట్లున్న గ్రంథములో నేను వ్యత్యాసము జేసి వ్రాసితినని చింత పడిన ట్లుండవలెను. నీవావ్యత్యాసము జేయనేల! ఈచింతపడనేలయని నారదుడు మందలించిన ట్లుండవలెను. ఆచింతమీాదనే వ్రాసిన భాగవతములో దుర్యోధనాదులది న్యాయమని, పాండవుల దన్యాయ్యమని యాయాప్రసంగములలో జెప్పియుండవలెను.

వ్యాసమహర్షిచింత యట్లుండనప్పుడును, నారదమహర్షి యట్లు మందలింపనప్పుడును, దుర్యోధనాదులను గూర్చి భాగవతమం దట్లు చెప్పనప్పుడును ఈప్రతివాదులవ్రాతకు త్రోసివేతయేకద. ఇంక జూడుడు—వ్యాసమహర్షి చింతించినట్లున్నగ్రంథము శ్రీమద్భాగవతము. అందిట్లున్నది.

**సూతః—**

"స్త్రీశూద్రద్విజబన్ధూనాం త్రయీ న శ్రుతిగోచరా।
కర్మశ్రేయసి మూఢానాం శ్రేయ ఏవం భవేదిహ॥
ఇతి భారత మాఖ్యానం కృపయా మునినా కృతమ్।
ఏవం ప్రవృత్తస్య సదా భూతానాం శ్రేయసి ద్విజాః॥
సర్వాత్మకేనాపి యదా నాతుష్య ద్ధృదయం తతః।
నాతిప్రసన్నహృదయ స్సరస్వత్యా స్తటే శుచౌ॥
వితర్కయ న్వివిక్తస్థ ఇదం చోవాచ ధర్మవిత్।

ధృతవ్రతేన హి మయా ఛందాంసి గురవోఽగ్నయః ।
మానితా నిర్వ్యలీకేన గృహీతం చానుశాసనమ్ ।
భారతవ్యపదేశేన హ్యామ్నాయార్థః ప్రదర్శితః ॥
దృశ్యతే యత్ర ధర్మాదిః స్త్రీశూద్రాదిభి రప్యుత ।
తథాపి బత మే దైహ్యో హ్యాత్మా చైవాత్మనా విభుః ॥
అసంపన్న ఇవాభాతి బ్రహ్మవర్చస్యసత్తమః ।
కింవా భాగవతా ధర్మా న ప్రాయేణ నిరూపితాః ॥
ప్రియాః పరమహంసానాం తఏవ హ్యచ్యుతప్రియాః (భా స1) అని

ఇచ్చట సూతు డిట్లు చెప్పెను—శ్రేయస్సాధనమైన కర్మమార్గమందు మాహాత్మ్యము వహించినవారికి గూడ మహాభారత మూలమున శ్రేయస్సు కలుగవలె నని యెంచి మహర్షి లోకానుగ్రహబుద్ధితో మహాభారతమును రచించినప్పటికిని హృదయమునకు సంతుష్టి యేర్పడక సరస్వతీనదీతీరమందలి పవిత్రప్రదేశమందు గూర్చుండి మహర్షి యిట్లనుకొనెను—నియమపూర్వకముగా వేదములు, గురువులు, అగ్నులు నాచే నిష్కపటముగా నారాధింపబడినవి సర్వసామాన్యముగా ధర్మాదు లవగతము లగునట్లు భారతగ్రంథముతో వేదార్థము వివరింపబడినది. అయినను నాకు బరమాత్మతాదాత్మ్యము కలుగకున్నది. కార్యశేష మున్నట్లున్నది పరమహంసప్రియము లైన భాగవతధర్మములు బహుళముగా నిరూపింపబడ లే దనియేమో! అని.

ఇది యీగ్రంథతాత్పర్యము ఇందు మ. భా. మ. గారు లన్నట్లు మహర్షి భారతములో తాను వ్యత్యాసముగా వ్రాసితి నని చింతింపలేదు సరికదా శ్రేయస్కరమైన గ్రంథము రచించితి ననియే యనుకొనెను. ఇక నారదమహర్షి ప్రసంగము జూతము—

"జిజ్ఞాసితం సుసంపన్న మపి తే మహ దద్భుతమ్ ।
కృతవాన్ భారతం యస్త్వం సర్వార్థపరిబృంహితమ్ ॥
జిజ్ఞాసిత మధీతంచ బ్రహ్మ యత్తత్సనాతనమ్ ।
తథాపి శోచ స్యాత్మాన మకృతార్థ ఇవ ప్రభో ॥
భవతాఽనుదితప్రాయం యశో భగవతోఽమలమ్ ।
యథా ధర్మాదయ శ్చార్థా మునివర్యాఽనువర్ణితాః ॥
న తథా వాసుదేవస్య మహిమా హ్యనువర్ణితః ।"

సర్వార్థోపబృంహితమై, మహోత్తరమై, యద్భుతమైన భారతమును రచించుటచే నీకపేక్షితార్థసిద్ధియైనది ఐనను నీవకృతార్థునివలె జింతించుచున్నావు.

నీవు భగవానుని మహిమను ధర్మాదులనువలె వర్ణింపలేదు. అని నారదమహర్షి వ్యాసమహర్షితో బ్రసంగించెను. ఇందుగూడ నీవు భారతమును వ్యత్యాసముజేసి వ్రాసినావని మందలింపలేదు సరికదా నీవుయుత్తమగ్రంథమును వ్రాసినావనియే నారదమహర్షి శ్లాఘించెను.

ఇక భాగవతములో, నేప్రసంగములయందైనను కౌరవుల న్యాయము, పాండవుల అన్యాయము జెప్పినట్లున్నదేమో చూచుట మిగిలియున్నది. కుంతీదేవి- శ్రీకృష్ణస్తవము జేయునపు డిట్లు ప్రసంగించెను__

"యథా హృషీకేశ ఖలేన దేవకీ
కంసేన రుద్ధా సుచిరం శుచార్పితా ।
విమోచితాఽహంచ సహాత్మజా విభో
త్వయైవ నాథేన ముహు ర్విపద్గణాత్ ॥

"విషా న్మహాగ్నేః పురుషా దదర్శనా
దసత్సభాయా వనవాసకృచ్ఛ్రతః!
మృధే మృధే౽నేకమహారథా స్త్రతో ద్రౌణ్య
స్త్రత శ్చా౽స్మ హరే౽భిరక్షితాః ॥" (స్క-1-అ8)

కృష్ణా! కంసునిచే బాధింపబడిన నీతల్లి దేవకీదేవి నుద్ధరించుట కంటె నెక్కువగా నున్న, నాబిడ్డలను, ఎన్నిసారులో ననేకవిపత్తుల నుండి యుద్ధరించినావు, నాడు భీమునకు పెట్టబడిన విషాన్నమునుండి రక్షించినావు; లక్కయింటినుండి కాపాడినావు; హిడింబాదిరాక్షసుల నుండి కాచినావు; ద్యూతసభనుండి తేల్చినావు; వనవాసక్లేశములను వదల్చినావు; మహారథుల యస్త్రజ్వాలలనుండి రక్షించినావు ఈకుంతీ దేవి మాటలు భారతోక్తములైన దుర్యోధనాదుల దుశ్చేష్టలనే యుట్టంకించుచున్నవి.

శరతల్పగతుడై భీష్ముడు ధర్మరాజాదులతో నిట్లనును—

"అహో కష్ట మహో౽న్యాయం యద్యూయం ధర్మనందన!
జీవితుం నార్హథ క్లిష్టం విప్రధర్మాచ్యుతాశ్రయాః ॥" (స్క-1 అ9)

ధర్మజా! విప్రులను, ధర్మమును, అచ్యుతు (శ్రీకృష్ణు) నాశ్రయించియున్న మీరు జీవించుట కర్హత లేకపోయెను. ఎంత కష్టము. ఎంత యన్యాయము

ఈభీష్ముని మాటలు భారతోక్తమైన పాండవుల న్యాయప్రవృత్తినే వెల్లడించుచున్నవి.

విదురమైత్రేయసంవాదోపక్రమములో శ్రీశుకుడిట్లు చెప్పెను—

"ద్యూతే త్వధర్మేణ జితస్య సాధో
స్సత్యావలంబస్య వనాగతస్య!

న యాచతో౽దాత్సమయేన దాశుం
తమోజుషాణో యదజాతశత్రోః ॥"

ద్యూతమందధర్మముగా జయింపబడినవాడు, సత్యసంధుడు, వనవాసాజ్ఞాతవాసములను పూర్తిజేసి వచ్చినవాడు, సత్పురుషుడు నగు ధర్మజుడు, ద్యూతకాలనిర్ణయప్రకారము మా రాజ్య మిమ్మని యాచింప దామసుడై యివ్వలేదు. అని.

ఈమాటలు పాండవుల యోగ్యతను, కౌరవుల అయోగ్యతను భారతోక్త ప్రకారమే తెలుపుచున్నవి. ఇట్లేఅనేకస్థలములయందున్నది.

దీనిని బట్టి భారతమందు యెట్లు చెప్పెనో అట్లే భాగవతమందుగూడ కౌరవుల అన్యాయమును, పాండవుల న్యాయమును ఆయా ప్రసంగములలో మహర్షి చెప్పియే యుండుటచే 'ద్విర్బద్ధం సుబద్ధం భవతి' అన్నట్లు కౌరవుల అన్యాయ్యప్రవృత్తియు, పాండవుల న్యాయ్యప్రవృత్తియు స్థిరపడినది. కనుక నక్రియమైన మ. భా. చ. కారుల వ్రాత కింక త్రోసివేతయే. భాగవతము వ్యాసకృతమని యున్న యీవ్రాతచే నది బోపదేవకృతమను తమ వ్రాతకు గూడ త్రోసివేతయే.

అంశాంతరము జూతము—

—♦దుర్యోధనస్వర్గ,పాండవనరకవృత్తాంతము♦—

మ. భా. చ. కారుల వ్రాతలో మిగిలిన యంశ మిది— 'భాగవతము రచించియు, మన సింకను బాధించుటచే గాబోలును! సుయోధనునకు స్వర్గసౌఖ్యప్రాప్తిని, పాండవులకు గొంతకాలము నరకప్రాప్తిం గూడ బిమ్మట జెప్పియున్నాడు.

సుయోధనునకు స్వర్గము స్వర్గారోహణపర్వమందు జెప్పబడి

నది. ఆపర్వము భారతాంతర్గతమే. ఇట్లుండ భారతము రచించి భాగవతము వ్రాసెను. పిదప స్వర్గారోహణపర్వము వ్రాసెను' అన్నట్లున్న వీరి వ్రాత విరుద్ధము.

ప్రతివాదులు- దుర్యోధనునికి స్వర్గము, పాండవులకు నరకము చెప్పబడెనని, స్వర్గము న్యాయస్థునకుగాని రాదని, నరకము అన్యాయస్థునకు గాని రాదని యూహించి దుర్యోధనునిది న్యాయమేయనియు, పాండవుల దన్యాయ మనియు వ్రాసినారు. ప్రతివాదుల కిప్పుడు ఆ స్వర్గనరకముల పరిస్థితిని వెల్లడింతము—— దుర్యోధనునకు యుద్ధమరణమును బట్టి వచ్చిన స్వర్గము గాని, ధర్మాత్ముం డని వచ్చిన స్వర్గము కాదు. గ్రంథసందర్భ మిట్లున్నది——

మనుష్యశరీరముతోడనే స్వర్గమునకు వెళ్ళిన ధర్మజుడు ఆసనాసీనుడై యచ్చట గూర్చుండి యున్న దుర్యోధనుని జూచి యిట్లనెను.

"ఎవ్వని మూలమున వనవాసులమై, కష్టపడిన మాచే సుహృద్బాంధవవర్గము యుద్ధమున హతమైనదో, ఎవ్వనివలన ధర్మచారిణి యగు ద్రౌపది మహాసభ క్లేశంబడినదో అట్టి యీ దుర్యోధనుని మొగము నే జూడను" ఇట్లనగా నారదు డిట్లనెను——

'యుధిష్ఠిర! మహాబాహో! మైవం వోచః కథంచన ।
దుర్యోధనం ప్రతి నృపం శృణు చేదం వచో మమ ॥
ఏష దుర్యోధనో రాజా పూజ్యతే త్రిదశైః స్సహ ।
సద్భి శ్చ రాజప్రవరై ర్య ఇమే స్వర్గవాసినః ॥
వీరలోకగతిం ప్రాప్తా యుద్ధే హుత్వాఽఽత్మన స్తనుం ।
"స ఏష క్షత్రధర్మేణ స్థాన మేత దవాప్తవాన్ ।
భయే మహతి యోఽభీతో బభూవ పృథివీపతిః ॥
న తన్మనసి కర్తవ్యం పుత్ర యద్ద్యూతకారితమ్ ।

ద్రౌపద్యాశ్చ పరిక్లేశం న చిన్తయితు మర్హసి ॥
యేచాన్యేపి పరిక్లేశా యుష్మాకం జ్ఞాతికారితాః ।
సంగ్రామే ష్వథవాఽన్యత్ర న తాన్ సంస్మర్తు మర్హసి ॥"

యుధిష్ఠిరా! నీవట్లనవద్దు. దుర్యోధనునిగూర్చి యీమాట వినుము. ఈతడు దేవతలచే బూజింపబడుచున్నాడు. ఈస్వర్గవాసు లందరు యుద్ధమందు శరీరములు విడిచి వీరస్వర్గము నొందినవారు. ఈ దుర్యోధనుడు భయంకరసమయములో నిర్భయుడై క్షత్రధర్మమైన యుద్ధమరణముచే నీస్థానము నొందెను. ద్యూతమందుగాని, ద్రౌపదీ విషయమైగాని, మరెప్పుడుగాని మీకు జ్ఞాతులచే నేయేకష్టములు కలిగింపబడినవో వానిని స్మరింపవద్దు. అని.

అంతట ధర్మజుడు- అనుజులను, ద్రౌపదిని జూడదలచి దేవ దూతను పురస్కరించుకొని వెళ్ళుచుండగా సమీపములో నరక యాతనలనుభవించు వారి యాక్రందనధ్వనులు వినబడెను. తన యను జులును, ద్రౌపదియు బాధలు పడుచున్నట్లు గోచరించెను. అప్పుడు దుఃఖితుడై ఆశత్రువునకు స్వర్గము, అనుజులకు నరకమునా? అని క్రుద్ధుడై ధర్మమును గర్హించి, దేవతలను గర్హించి చీకాకుపడుచుండ నచ్చటి కిందుడును ధర్మదేవతయు సపరివారముగా వచ్చిరి. ఆక్షణ మందే ఆనరకయాతనలు, ఆయార్తనాదములు అదృశ్యమైనవి. అప్పు డింద్రు డిట్లనెను—

"నచ మన్యు స్త్వయా కార్య శ్శృణు చేదం వచో మమ ।
అవశ్యం నరక స్తాత ద్రష్టవ్య స్సర్వరాజభిః ॥
శుభానా మశుభానాంచ ద్వౌ రాశీ పురుషర్షభ ।
యః పూర్వం సుకృతం భుఙ్క్తే పశ్చా న్నిరయమేవ సః ॥
పూర్వం నరకభాగ్యస్తు పశ్చా త్స్వర్గ ముపైతి సః ।

భూయిష్ఠం పాపకర్మా యః స పూర్వం స్వర్గ మశ్నుతే ॥
తేన త్వమేవం గమితో మయా శ్రేయోఽర్థినా నృప ॥
వ్యాజేనహి త్వయా ద్రోణ ఉపచీర్ణ స్సుతం ప్రతి ।

టీ-హతః కుంజర ఇత్యశ్వత్థామవధే ద్రోణ ఉపచీర్ణః వంచితః. గజవాచీశబ్దో మనుష్యపరత్వేన జ్ఞాపిత ఇత్యుపచారచ్ఛలేనేత్యర్థః.

వ్యాజేనైవ తతో రాజన్ దర్శితో నరక స్తవ ।
యథైవ త్వం తథా భీమ స్తథా పార్థో యమౌ తథా ॥
ద్రౌపదీచ తథా కృష్ణా వ్యాజేన నరకం గతాః ।"

యుధిష్ఠిరా! ఆగ్రహింపకుము. రాజుల కందరకును నరక దర్శనము తప్పదు. శత్రువునకు స్వర్గము, అనుజులకు నరకమునా? అని విషాదపడకుము. పుణ్యరాశి యొకటి, పాపరాశి యొకటి. ముందు పుణ్యఫలమైనస్వర్గ మనుభవించినవాడు తరువాత పాపఫలమైన నరక మనుభవించును. ముందు నరక మనుభవించినవాడు తరువాత స్వర్గ మనుభవించును. ఆపుణ్యపాపములలో నేది యల్పమైయుండునో దాని ఫలము ముందును, ఏది యధికమై యుండునో దాని ఫలము తరువాతను అనుభవింపబడును. పాపకర్మఫల మత్యధికకాల మనుభవింప వలసినవానికి అల్పకాలానుభవనీయమైన స్వర్గము ముందు ప్రాప్తించును. నీవశ్వత్థామవిషయమై ద్రోణునకు జెప్పునప్పుడు 'హతః కుంజరః' అని గజవాచకశబ్దమును పురుషపరముగా వ్యాజముతో దెలుపుటవలన నీకును వ్యాజముచేతనే నరకము ప్రదర్శింపబడినది. నీకువలెనే అనుజులకును, ద్రౌపదికిని ప్రదర్శింపబడినవి. అని.

ఈగ్రంథసందర్భమును బట్టి దుర్యోధనునకప్పుడు ప్రాప్తించిన స్వర్గముయుద్ధమరణమూలకమే అనియు, నదిస్వల్పకాలానుభవనీయమే.

యనియు, పిమ్మట విశేషకాలము పాపఫలానుభవ మున్నదనియు స్పష్ట మైనది. పాండవులకు ద్రోణునితో నశ్వత్థామవిషయము జెప్పుటలో వచ్చిన దోషము తప్ప యితరదోషము లేదనియు, నదియానరకదర్శన మాత్రముచే క్షణమాత్రమే అనుభూతమైన దనియు, నిక చిర కాలము పుణ్యఫలానుభవమే యనియు స్పష్టము. ఇందుకు చెప్పిన తరువాత ధర్మదేవత యిట్లు చెప్పెను.

"విశుద్ధోఽసి మహాభాగ సుఖీ విగతకల్మషః ।
నచ తే భ్రాతరః పార్థ నరకార్హా విశాంపతే ॥
న కృష్ణా రాజపుత్రీచ నరకార్హా కథంచన ।
మాయైషా దేవరాజేన మహేన్ద్రేణ ప్రయోజితా ।
అవశ్యం నరకా స్తాత ద్రష్టవ్యా స్సర్వరాజభిః ।
తత స్త్వయా ప్రాప్త మిదం ముహూర్తం దుఃఖ ముత్తమమ్ ॥"

మహానీయా! నీవు నిష్కల్మషుడవై పరిశుద్ధుడ వైతివి. నీసోద రులు కాని, ద్రౌపదికాని నరక మనుభవింపదగినవారు కారు. మాయామాత్రమైన యీదృశ్య మిందునిచే గల్పింపబడినది. నరక దర్శనము తప్పని దగుటచే నీవీముహూర్తకాలము దుఃఖము నొంది తివి. ఇట్లు చెప్పి ఆకాశగంగాస్నానపూర్వకముగా దివ్యదేహము ప్రాప్తింపజేసెను

ఇట్లుండుటచే పాండవులు, ద్రౌపదియు నరకార్హులు కారని యే స్పష్టమైనది. ప్రతివాదు లాదుర్యోధనుని యాస్వర్గప్రాప్తిని జూచి యెట్లు ప్రవర్తించినను దుర్యోధనదృష్టాంతముచే స్వర్గము వచ్చు నని భ్రాంతిపడరాదనియు, నాతని దుష్ప్రవృత్తిఫలము ముందున్నదనుటచే దానికి భయపడవలసినదే యనియు, తెలిసికొనవలసి యున్నది. ఆదు ర్యోధనస్వర్గమును బట్టి దుర్యోధనునిది న్యాయమే యను దుర్భ్రమ

మును, ఆధర్మరాజాదినరకదర్శనమును బట్టి వారల దన్యాయమే యను దుర్భ్రమమును పొందవల దని ప్రతివాదులకు దెలుపుచు, విషయాంతర మందుకొనుచున్నాము.

—•సంస్కృతాంధ్రభారతములు సుయోధనాపకర్షగా రచింపబడిన వను ప్రసంగము—తన్నిరాకరణము•—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— "జయము రచించిన వ్యాసుడు పాండవహితు డగుటచేతను, భారతమును రచించిన వైశంపాయనుడు, అర్జునప్రపౌత్రు డగు జనమేజయున కిష్టముగా భారతగాథను జెప్పవలసివచ్చుటచేతను, సౌతి కృష్ణద్వైపాయనుని శిష్యపుత్రు డగుటచేతను, సంస్కృతమహాభారతము సుయోధనాపకర్షముగా రచింపబడె నని తిరిగి చెప్పవలసి యున్నది.

ఆంధ్రీకృతభారతములో- నన్నయ కేవలము పాండవవంశసంభూతుడ నని చెప్పుకొను రాజనరేంద్రునకు గృతి నిచ్చుటచేతను, తిక్కన, యెఱ్ఱనలు సూర్యచంద్రవంశస్థు లగు రాజుల నాశ్రయించువారే యగుటచేతను, ఆంధ్రభారతములో గూడ దుర్యోధనయశోపకర్షణమె వర్ణింపబడెను" (పు 268)

ప్రతివాదులు సంస్కృతమహాభారతమునకు ముగ్గురు కర్త లని కల్పించి, యందు వ్యాసుడు పాండవహితు డని, వైశంపాయనుడు కథ వినెడి జనమేజయున కిష్టముగా జెప్పినవా డని, సౌతి వ్యాసశిష్యుని పుత్రుడేయని, యీకారణముచే నాగ్రంథము సుయోధనాపకర్షముగా రచింపబడె నని తిరిగి చెప్పవలసియున్నదని యనుచున్నారు.

వీరి కిప్పుడు సౌతివైశంపాయనులు మహాభారతమును వినిపించినవారే కాని రచించినవారు కారనియు, భవిష్యద్గాథతో మహాభా

రతమును రచించినవాఁడు త్రికాలజ్ఞాననిధి యగు వేదవ్యాసభగవాను డే యనియు, నాతఁడు చెప్పినదే సత్యమనియు, నాతఁడు దీనదయాపరుఁడే కాని రాగద్వేషములు కలవాఁడు కాఁడనియు, సుయోధను డపకర్షముగా సంచరించుటచేతనే యాతని విషయము అపకర్షముగా జెప్పఁబడిన దనియు మరల జెప్పుచున్నాము.

ఆంధ్రభారతకర్త లగు నన్నయాదులు వేదవ్యాసభారతము నాంధ్రీకరించినవా రగుటచే యథార్థమైన మూలము ననుసరించి వ్రాసియుండ నన్నయాదులపై దోషారోపణము జేయుట దుర్న యము.

ఒకని నాశ్రయించి యున్నవాఁడు ప్రమాణవిరుద్ధమైనను ఆతని యిష్టప్రకారమే గ్రంథమును సాగింపవలె ననునది మ. భా. చ. కారుల కనుభవసిద్ధమేమో కాని ప్రమాణబద్ధులైన నన్నయాదుల లక్షణమది కాదు. వారిచే నాంధ్రీకరింపజేసిన రాజనరేంద్రాదిప్రభువులు గూడ వేదవ్యాసమహాభారతప్రతిపాదితార్థమునే చెప్పవలసిన దని కోరినవారు కాని తమ కిష్టమైనట్లు వ్రాయవలసిన దన్నవారు కారు. రాజనరేంద్రుఁడు నన్నయార్యునితో నేమని చెప్పినట్లున్నదో చూడుఁడు!

క. జననుత కృష్ణద్వైపా
యనమునివృషభాభిహితమహాభారతబ
ద్ధనిరూపితార్థ మేర్పడ
దెనుఁగున రచియింపు మధికధీయుక్తి మెయిన్.

దీనిని బట్టి సంస్కృతభారతము నాధారముగా జేసికొని యాంధ్రీకరించి యున్న నన్నయాదులపై 'ప్రభుప్రీతికై దుర్యోధనయశోపకర్షణము వర్ణించినారు' అను దోషము నాపాదించుట దుర్నయము కాక మరేమగును? కనుక ప్రతివాదుల వ్రాత హేయము.

ఈపద్దెములో దెనిగింపఁబడినది మహాభారత మనియు, నది కృష్ణద్వైపాయనమునీంద్రప్రణీత మనియు స్పష్టముగా నున్నందున సంస్కృతమహాభారతమునకు ముగ్గురు కర్తలనెడి మ. భా. చ. కారుల మాట త్రోసివేయఁబడినది. అంశాంతరము—

—♦ వ్యాసాదులు దుర్యోధనునిపై గల యీర్ష్యను గాంధారిపై కూడ దొరలించిరను ప్రసంగము—తన్నిరాకరణము ♦—

మ. భా. చ. కారులవ్రాఁత యిట్లున్నది— "దుర్యోధనునిపై గల యీర్ష్యను మహాపతివ్రత యగు గాంధారిపై కూడ వ్యాసాదులు కొంత దొరలించి యామె తనతోడికోడలగు కుంతి బిడ్డల గనుచున్న దని తాను కడుపు బాదుకొని మాంసఖండము గనిన దనిప్రకృతివిరుద్ధపుగాథ నొకదాని గల్పించిరి. అట్టిది తోడికోడల సంతతి జూచి కడుపు బాదుకొనునా?" (పు. 268)

వ్యాసాదులకు దుర్యోధనునిపై యీర్ష్యయట. ఆయీర్ష్యను వారు గాంధారిపై కూడ దొరలించిరట వ్యాసాదు లనగా సంస్కృతాంధ్రమహాభారతకర్తలన్నమాట. ఈప్రతివాదులు వెనుక 'సంస్కృతాంధ్రభారతములు సుయోధనాపకర్షముగా రచింపబడినవి.' అనుటకు హేతువులు 'వ్యాసుడు పాండవహితుఁ డగుట, మిగిలినవారు ప్రభుప్రీతి నపేక్షించినవా రగుటయు, నని చెప్పిరేకాని వ్యాసాదులకు దుర్యోధనునియందుగల యీర్ష్య యని చెప్పలేదు. ఇక్కడ జెప్పిన యీర్ష్యనే అక్కడ జెప్పినయెడల నన్ని కుకల్పనలు ప్రతివాదుల కవసరము లేకపోవును

వ్యాసమహర్షికి దుర్యోధనునియం దీర్ష్య యని ప్రతివాదులనుట నింద్యము. మహర్షి పాండవులకు దోడ్పడిన విషయము నిరూపించినపు డుదాహరింపబడిన శక్రసురభిసంవాదవచనము, వేదవ్యాసవచనమును మఱియొకసారి చూడుడు—

సురభిః—

"యది పుత్రసహస్రాణి సర్వత్ర సమమేవ మే ।
దీనస్యతు సత శ్శక్ర పుత్ర స్యాభ్యధికా కృపా ॥"

నాకు బుత్రసహస్రమందును సమత్వమే కాని యాపన్నుడైన పుత్రునియం దధికదయ. అని సురభి చెప్పినమాట. ఇచ్చట నాపన్ను నియం దున్న దయాధిక్యమును బట్టి యన్యులయం దీర్ష్య యన వచ్చునా?

వ్యాసః—

"పాండో స్సుతా యాదృశా మే తాదృశా స్తవ భారత!
దీనా ఇతీవ మే బుద్ధి రభిపన్నాఽద్య తాన్ ప్రతి ॥"

'ధృతరాష్ట్రా! నాకు పాండుపుత్రు లెట్టివారో, నీ పుత్రులు నట్టివారే. వా రాపన్నులై యుండిరని యిప్పుడు నాబుద్ధి వారియందు సంసక్తమైనది' అని మహర్షి చెప్పినమాట. ఇట్లుండ దుర్యోధనుని యం దీర్ష్య యనుట లోకజ్ఞానశూన్యతను వెల్లడించుచున్నది.

వ్యాసుడు మహాసతివ్రత యగు గాంధారిపై గూడ నీర్ష్యవహించెనట. కుంతి బిడ్డల గనుచున్నదని యామె తన కడుపు బాదుకొనెనని వ్రాసెనట. గాంధారి మహాపతివ్రత యని చెప్పినవాడును, ఆమె గర్భతాడనము జేసికొనె నని చెప్పినవాడును గూడ మహర్షియే. మహాపతివ్రత యనుటలో లేని యీర్ష్య గర్భతాడనకథనములో వచ్చిపడెనా? ఆగర్భతాడనప్రస్తావ మెట్లున్నదో చూడుడు—

"క్షుచ్ఛ్రమాభిపరిగ్లానం ద్వైపాయన ముపస్థితమ్ ।
తోషయామాస గాంధారీ వ్యాస స్తస్యై వరం దదౌ ॥
సా వవ్రే సదృశం భర్తుః పుత్రాణాం శత మాత్మనః ।

తతః కాలేన సా గర్భం ధృతరాష్ట్రా దధాగ్రహీత్ ॥
సంవత్సరద్వయం తంతు గాంధారీ గర్భ మాహితమ్ ।
అప్రజా ధారయామాస తత స్తాం దుఃఖ మావిశత్ ॥
శ్రుత్వా కుంతీసుతం జాతం బాలార్కసమ తేజసమ్ ।
ఉదర స్యాత్మనః స్థైర్య ముపలభ్యాఽన్వచింతయత్ ॥
అజ్ఞాతం ధృతరాష్ట్రస్య యత్నేన మహతా తతః ।
సోదరం ఘాతయామాస గాంధారీ దుఃఖమూర్ఛితా॥" ఆది.అ.15

ఒకప్పుడు వ్యాసమహర్షికి గాంధారి శుశ్రూష జేసి యామహర్షిని తనకు నూర్గురు పుత్రులు కలుగునట్లు వర మిమ్మని కోరెను. మహర్షి యట్లే వర మిచ్చెను. తరువాత నామె ధృతరాష్ట్రునివలన గర్భవతి యయ్యెను. ఆగర్భమును ఆమె రెండు సంవత్సరములు ధరించియుండియు పుత్రోత్పత్తి కాక దుఃఖపడినది. కుంతీదేవికి పుత్రుడు పుట్టుట విని తన గర్భము కదలిక లేక స్థిరమై యుండుటను జూచి చింతించి దుఃఖాతిరేకమున గర్భతాడనము జేసికొనెను. అని తాత్పర్యము.

దీనిని బట్టి చిరకాలగర్భధారణక్లేశ మనుభవించుచున్న గాంధారికంటె ముందుగా కుంతీదేవికి పురుడు వచ్చుటను బట్టియు, తనకు పురుడు వచ్చు సూచన గోచరింపకుండుటనుబట్టియు పరితాపము హెచ్చి యట్లు చేసినదని తెలియుచున్నది. గర్భవతులకు గాలాతిక్రమణమైనకొలది భారముచే క్లేశము కలుగుచుండుటయు, నందులో నొకరు ప్రసవించినపుడు తమ కట్టి ప్రసవసమయము రాకపోయెనని దిగులు పడుచుండుటయు సహజము. అట్టి దిగులే గాంధారికి సంభవించినది. ఆపై గర్భమునకు చలనము కూడ లేకున్నపుడు ఆమె కెంతయైన పరితాప ముండును. కనుక ప్రతివాదులు 'కుంతి బిడ్డల గనుచున్న దని గాంధారి కడుపు బాదుకొనె' నని వ్రాయబడినట్లు తెలుపుట అక్రమము.

ఇక గర్భతాడనము కాగా జరిగిన విషయము మేమో చూతుము—

"తతో జజ్ఞే మాంసపేశీ లోహాష్ఠీలేవ సంహతా ।
ద్వివర్షసంభృతా కుక్షౌ తా ముత్స్రష్టుం ప్రచక్రమే ॥
అథ ద్వైపాయనో జ్ఞాత్వా త్వరిత స్సముపాగమత్ ।
తాం స మాంసమయీం పేశీం దదర్శ జపతాం వరః ॥
తతో౽బ్రవీ త్సౌబలేయీం కి మిదంతే చికీర్షితమ్ ।
సా చాత్మనో మతం సత్యం శశంస పరమర్షయే ॥
జ్యేష్ఠం కున్తీసుతం జాతం శ్రుత్వా రవిసమప్రభమ్ ।
దుఃఖేన పరమే ణేద ముదరం ఘాతితం మయా ॥
శతంచ కిల పుత్రాణాం వితీర్ణం మే త్వయా పురా ।
ఇయం చ మే మాంసపేశీ జాతా పుత్రశతాయ వై ॥"

టీ—లోహాష్ఠీలా=లోహమయా గండికా; తద్వత్సంహతా= కఠినా;

గర్భతాడనమువలన లోహఖండమువలె కఠినమైన మాంసపేశి బహిర్యాతము కాగా రెండుసంవత్సరములు కుక్షియందుండి తుద కారూపముతో వెలువడిన మాంసపేశిని పారవేయుటకు గాంధారి యత్నించుచునంతలో వ్యాసభగవానుడు తెలిసికొని ప్రత్యక్షమై మాంస పేశిని జూచి గాంధారీ! నీవిట్లు చేసితి వేమని యడుగ ముందుగా కుంతీదేవి ప్రసవించి చక్కని పుత్రుని కన్న దని విని నే నిట్లే యుండి పోతి నని పరమదుఃఖముచే గర్భతాడనము జేసికొంటి నని సత్యము చెప్పి మహర్షీ! నాకు నూర్గురు పుత్రులు కలుగుదు రని వరమిచ్చితివి. దానికి బదులు నాకీమాంసపేశి కలిగినది. అని పలుకగా మహర్షి—

"ఏవ మేత త్సౌబలేయి నైత జ్జా త్వన్యథా భవేత్ ।
వితథం నోక్తపూర్వం మే స్వైరేష్వపి కుతో౽న్యథా ॥";

గాంధారీ! అపుత్రశతము దీనినుండియే యుద్భవించును. నే నెన్నడును అసత్య మాడినవాడను గాను. అని చెప్పి మహర్షి స్వయముగనే యామాంసపేశిని శీతోదకముతో తడిపి, అంగుష్ఠపర్వప్రమాణముగల భాగములుగా విడదీసి యొక్కొక్కభాగమును ఒక్కొక్క ఘృతకుంభమునందు పెట్టించి పదిలముగా కాపాడవలసిన దని చెప్పి అంతర్ధాన మయ్యెను. ఈవిషయ మీశ్లోకములలో నున్నది.—

"తాం మాంసపేశీం భగవాన్ స్వయమేవ మహాతపాః ।
శీతాభి రద్భి రాసిచ్య భాగం భాగ మకల్పయత్ ॥
"యో యథా కల్పితో భాగ స్తం తం ధాత్ర్యా తథా నృప ।
ఘృతపూర్ణేషు కుండేషు ఏకైకం ప్రాక్షిప త్తదా ॥" (ఆది అ116)

ఈకథాసందర్భము జూడగ, గాంధారిచే నారాధింపబడినవాడును, గాంధారికి పుత్రశతవర మిచ్చినవాడును, ఆ మాంసపేశిని స్వహస్తములతో విభజించి యిచ్చి పుత్రుల నావిర్భవింపజేసినవాడును వ్యాసభగవానుడే యని స్పష్ట మగుచుండ నామహర్షికి గాంధారియం దీర్ష్య యనియు, నది దుర్యోధనుని యందలి యీర్ష్యనుబట్టి కలిగిన దనియు నున్న ప్రతివాదులవ్రాత నింద్యము. దుర్యోధనుడు పుట్టక పూర్వము పుట్టినది మాంసపేశి. అది గర్భతాడనమునుబట్టి పుట్టినది. ఆగర్భతాడనకథనములో 'దుర్యోధనునియందు గల యీర్ష్యను గాంధారియందు దొరలించెను' అన్న ప్రతివాదులకు వెఱ్ఱియా? బుద్ధియా?

కడుపు బాదుకొని మాంసఖండము గనినదని ప్రకృతివిరుద్ధపు గాథ నొకదానిని కల్పించిరట. "ప్రకృతిసిద్ధ మిదం హి దురాత్మనామ్" అన్నారుకనుక నందఱిప్రకృతులు నొకవిధమైనవి కావు. అందుచే ప్రతివాదుల ప్రకృతికి విరుద్ధమైనను యున్యుల ప్రకృతికది యవిరుద్ధమే. ఈస్కాందపురాణవచనములను కూడ జూడుడు.—

"మాయామయ మిదం విశ్వం దృశ్యతే శ్రూయతేచ యత్ ।
కిం భావ్యం కిమభావ్యంచ సంసారేఽస్మిన్ క్షణాత్మకే ॥
అనిరూప్య మభూతార్థం మాయయా జాయతేస్ఫుటమ్ ।
ఈశ్వరస్య వశే మాయా తస్య కో వేద చేష్టితమ్ ॥
దేవతానాం మహర్షీణాం శాపేనచ వరేణచ ।
అయుక్త మపి యత్కర్మ యుజ్యతే నాత్ర సంశయః ॥"

అనగా, నీప్రపంచ మంతయు మాయామయము. క్షణభంగు రమైన యీసంసారమం దేమూలనో పుట్టిపోవువారికి సంభావ్యమేమి? అసంభావ్య మేమి? అనిరూప్యము, అభూతపూర్వము నైనది మాయ చే స్ఫుటముగా గలుగుచున్నది. అట్టిమాయ యీశ్వరున కధీనము. ఆ యీశ్వరుని చర్య యెవ్వని కెరుక? దేవతలయొక్కయు, మహ ర్షుల యొక్కయు శాపముచేగాని, వరముచేగాని అఘటితఘటన జరు గును. సంశయము లేదు, అని భావము.

కనుక, మాంసపేశి కలిగిన దనుట ప్రకృతివిరుద్ధ మను ప్రతి వాదులకు శాస్త్రజ్ఞానము, తన్మూలకమగు లోకజ్ఞానము లేనందున వారి వ్రాత హేయము

ఇట్లు పూర్వోక్తప్రకారము వ్యాసమహర్షి యనుగ్రహమున గాంధారికి దుర్యోధనాదిపుత్రశతము ఏకగర్భముననే యామాంసపేశి నుండి జన్మించె నని తెలిసినది. ఈశ్లోక మందీవిషయము చెప్పబడినది.

''కథితో భార్తరాష్ట్రాణా మార్ష స్సంభవ ఉత్తమః ।
అమనుష్యో మనుష్యాణాం భవతాబ్రహ్మవాదినా ॥"

టీ॥ ఆర్షః=ఋషిప్రసాద హేతుకః; అమనుష్యో=మనుష్యేష్వదృష్టః; యుగప ద్భహూనాం జనాత్ ॥ ఈ శ్లోకవిషయముచే-

“ఈమె (గాంధారి) కుమారులలో నల్వురే యౌరసులుగా గాన్పింతురు. ఔరసులుండినను స్వయందత్తాదులను పుత్రులుగా నంగీకరింప పూర్వపుస్మృతు లంగీకరించుచున్నవి. ఈస్వయందత్తాదులన్య జాతిజులుగా గూడ నుండవచ్చును. ఇట్టివారే గాంధారి యొక్క తొంబదియాఱుగురు పుత్రులును” (పు.264) అను మ. భా. చ. కారుల అసంగతప్రసంగ సమాప్తము.

—•గాంధారీపుత్రుల కపార్థముల నిచ్చు నామములను వ్యాసాదులే పెట్టి రను ప్రసంగము—తన్నిరాకరణము•—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— “గాంధారీపుత్రుల కపార్థముల నిచ్చు దుర్ముఖాదినామములను వ్యాసాదులు కల్పించి యుందు రని తలతును. నామకరణముల జేయునపుడు గృహ్యసూత్రకారులు శుభచిహ్నముగా నుంపు మనిరే కాని యశుభచిహ్నముగా నుంపు మనలేదు. పెంటయ్య మొదలగు నవీననామములును, శునశ్శేపాదిప్రాచీననామములును, కారణాంతరముచే బెట్టబడియుండును. వ్యాసాదులు దుర్యోధనుపక్షము గ్రిందుపరచు రీతిని వ్రాసిన ప్రక్రియముం గమనింప కుండాశ్యాదినామములు వ్యాసకృత మగునని చెప్పవలసియున్నది.” (పు. 269)

ఈ మ. భా. చ కారులే గాంధారీధృతరాష్ట్రుల ఔరసపుత్రులు నలువురే యనియు, వారు దుర్యోధన, దుశ్శాసన, వికర్ణ, చిత్రసేను లనియు, మిగిలిన 96 గురు స్వయందత్తాదు లనియు వెనుక వ్రాసి యున్నారు. (పు. 105)

ఇప్పు డిచ్చట గాంధారీపుత్రుల కపార్థ మిచ్చు దుర్ముఖ కుండాశ్యాదినామములను వ్యాసుడు కల్పించె నని వ్రాసినారు. ఆదుర్ముఖకుండాశ్యాదినామధారులు ప్రతివాదుల వ్రాతను బట్టి గాంధారీ

గర్భసంభూతులు కారు. గాంధారీగర్భసంభూతు లగు దుర్యోధన, దుశ్శాసన, వికర్ణ, చిత్రసేనుల నామములు అపార్థ మిచ్చునవి వ్యాసునిచే గల్పింపబడినవి. యని ప్రతివాదులే అనలేదు.

ఇట్టిస్థితిలో కథానాయకు లగు దుర్యోధన, దుశ్శాసనాదులకే అపార్థ మిచ్చెడి నామములను కల్పించి యెరుగని మహర్షి—యప్రసిద్ధులైయున్న దుర్ముఖాదులకు ఆనామములు కల్పించునా?

ఇంకొకటి— దుర్యోధన దుశ్శాసననామములను వారి తల్లిదండ్రులే పెట్టుకొనియున్నట్లు దుర్ముఖాదినామములు వారల తల్లిదండ్రులే పెట్టుకొనినవి యేల గావు? ఇంకొకటి దుర్ముఖాదినామములు వ్యాసకల్పితము లనువారు వారి కసలు తల్లిదండ్రులుచేసిన నామకరణ మేదో చెప్పగలరా? శునశ్శేఫాదినామములకు ప్రతివాదు లేకారణాంతర మున్న దనిరో అదియే యీ దుర్ముఖాదినామములకు గూడ గారణ మేల గాదు? కనుక నీప్రతివాదుల యసంబద్ధప్రవాత నింద్యము.

—✦పరాశరుడే సమస్తపురాణప్రవర్తకుడు కాని కృష్ణద్వైపాయనుడు కాడను ప్రసంగము—తన్నిరాకరణము✦—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— పరాశరుడే సమస్తపురాణప్రవర్తకు డని విష్ణుపురాణములో గలదు. వ్యాసబిరుదముచే సమస్తపురాణకర్తృత్వము కృష్ణద్వైపాయనునకే స్థూలదృష్టిచే లోకము కట్టిపెట్టుచున్నది. విష్ణుపురాణములోని ఈ యంశమును జెప్పు పరాశరవాక్యములగు రెండుపద్యముల నిట వ్రాయుచున్నాను—

మ. విను మైత్రేయ! మదీయశైశవకథావృత్తాంత మంభోరుహాసనపుత్రుండు జగన్నుతుం డగు పులస్త్యబ్రహ్మ యేతెంచి మ

నన్నన లేపారగ నన్ను గన్గొని పురాణశ్రేణికిం గర్త వీ
వని నాకుఁ వరమిచ్చి పోయె బ్రహ్మదవ్యాపార మేపారఁగన్.

క. అది కారణంబుగా నా
కొదవె పురాణప్రవీణయోగ్యత నీవె
ట్టిది గోరి నన్ను నడిగితి
వది నీకుం జెప్పువాఁడ నాద్యంతంబున్.

పై కారణములచే బురాణకర్త యగు వ్యాసుడు పరాశరుడే
కాని కృష్ణద్వైపాయనుడు కాడు" (పు. 141)

అహా! కృష్ణద్వైపాయనుడు సమస్తపురాణకర్త యని లోక మనుచున్న దని జెప్పుచు నాతడు పురాణకర్త కాడను ప్రతివాదులు లోకాతీతు లన్నమాట. స్థూలదృష్టిచే లోక మనుచున్న దనుటవలన వీరి కాస్థూలదృష్టి లేదన్నమాట పరాశరుడు పురాణకర్తయని చెప్పు పద్యములకు కృష్ణద్వైపాయనుడు పురాణకర్త కాడని యర్థ మన్నమాట. వీరికి లోకానుసరణముతో బని లేదన్నమాట. ఆ విష్ణుపురాణము లోనే ముం దేమున్నదో చూచుకొనవలసిన పని కూడ లేదన్నమాట. ఇదియే విమర్శకలక్షణ మన్నమాట. కానిండు. మన మిప్పుడు లోక మనుచున్నది నిజమో, ఈ లోకాతీతు లన్నది నిజమో వారు చూపిన విష్ణుపురాణమును బట్టియే నిర్ణయింతము
చతుర్థాశ్వాసమం దిట్లున్నది—

ఈవైవస్వతమన్వంతరమం దతీతము లయిన అష్టావింశతి (28) మహాయుగంబులలోని ద్వాపరయుగములందు గల వ్యాసులను మైత్రేయునకు పరాశరు డుపదేశించు ప్రస్తావములో—

"పద్మజనకుం డైన శక్తియును, నేనును, జాతుకర్ణుండును, మత్పుత్రుం డయిన కృష్ణద్వైపాయనుండును వేదవ్యాసరూపంబులు ధరించి

వేదవేదాంగధర్మశాస్త్రపురాణాగమంబులు మొదలుగా బదునెనిమిది విద్యలు జగంబులం బ్రసిద్ధంబు జేసితిమి. ద్రోణపుత్రుం డయిన యశ్వత్థామ ముందటి ద్వాపరయుగంబున వేదవ్యాసుండు కాగలవాడు' అని చెప్పబడినది.

దీనినిబట్టి యీమన్వంతరములో నిప్పటి కిరువదియెనిమిది ద్వాపరయుగములుగడచినవనియు, నొక్కొక్క ద్వాపరయుగమం దొక్కొక్కతపోధనుడు వేదవ్యాసుడగుచుపురాణములురచించి యష్టాదశవిద్యలనులోకమునవ్యాపింపజేయుచుండు ననియు, నట్లుపరాశరుడు వెనుక నొకద్వాపరమున వేదవ్యాసుడును, కృష్ణద్వైపాయను డీకలియుగమునకు వెనుకటి ద్వాపరమందు వేదవ్యాసుడును అయియుండి రనియు స్పష్టమైనది. ఇప్పుడు పరాశరు డెట్లు సమస్తపురాణకర్తయో అట్లు కృష్ణద్వైపాయనుడునుసమస్తపురాణకర్తయే. ప్రతివాదులుచూపినపద్యములుపరాశరుడు పురాణకర్త యనునవేకాని కృష్ణద్వైపాయనునకు పురాణకర్త కాడనునవి కావు. ఇప్పుడు లోకమనుకొనుచున్నదే నిజమైనది. లోకము ననుసరింపనివారి పాట్లు తుద కిట్టివే. దీని నింతమాత్రముతో విడిచి విషయాంతర మందుకొందము.

– బ్రహ్మసూత్రకర్త కృష్ణద్వైపాయనుడు కాడను ప్రసంగము– –
తన్నిరాకరణము.

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది–"బ్రహ్మసూత్రకర్తయగు బాదరాయణుడు కృష్ణద్వైపాయనుడు కాడని లోకమాన్య తిలకుగారు గీతారహస్యములోను, శ్రీపురాణపంచమల్లయ్యశాస్త్రిగారాంధ్రబ్రహ్మసూత్రభాష్యపీఠికలోను స్పష్టపరచినసంగతి జదువగా బ్రహ్మసూత్రకర్తృబాదరాయణసంబంధము సాత్యవతేయునకు లేదని తలతును" (పు144)

ఈప్రతివాదుల మాట యెంత సత్యమో వీరుదాహరించిన

గ్రంథములు చూచిన తేలును. అందుకై క్రమముగా నాగ్రంథముల లోని నిర్ణయము ప్రదర్శింపబడుచున్నది—

గీతారహస్యపరిశిష్టము—పు. (784)

"మామతమున నీసందేహము నివృత్తియగుటకు మార్గ మొకటియే యున్నది. బ్రహ్మసూత్రములను రచించినవారే మూలభారతమును గీతలనుకూడ ప్రకృతమున్నరీతిగ రచియించినా రందుమేని యేమియు విరోధ ముండనేరదు. బ్రహ్మసూత్రములను వ్యాససూత్రము లని చెప్పుట పరిపాటియై యున్నది" "శేషత్వా త్పురుషార్థవాదో-ఽథాన్యే ష్వితి జైమినిః" అను వేదాంతసూత్రముయొక్క-శాంకరభాష్యమునకు టీకజేయుచు 'జైమిని వేదాంతసూత్రకారులగు వ్యాసులకు శిష్యుడని యానందగిరి చెప్పెను. మఱియు నారంభమందు చేసిన మంగళాచరణములో సైతము "శ్రీమద్వ్యాసపయోనిధి ర్నిధిరసౌ" అని బ్రహ్మసూత్రములను వర్ణించెను... ఈవిషయములను మనస్సున నునిచికొని విచారించితిమేని మూలభారతమునకును, తదంతర్గతగీతలకును, ప్రకృతమునందున్న స్వరూపమును వ్రాయుటయు, బ్రహ్మసూత్రములను రచించుటయు, నను కార్యముల నొక బాదరాయణు లగు వ్యాసులే చేసియుందురని యూహింపవచ్చును"

ఇది, తిలకుగారు గీతారహస్యములో స్పష్టపరచిన సంగతి. యిందులో బ్రహ్మసూత్రకర్త యగు బాదరాయణుడు వ్యాసు డనబడు కృష్ణద్వైపాయనుడే యని నిర్ణయింపబడినదికదా. రెండవదానిని జూడుడు—

ఆంధ్రబ్రహ్మసూత్రభాష్యపీఠిక—"ఏదియెట్లున్నను సంప్రదాయజ్ఞులగు భాష్యవ్యాఖ్యాతలు సూత్రకర్త వ్యాసులే యనిచెప్పుటచేతను, పౌరాణికులును వ్యాసబాదరాయణ లొక్కరే యని వ్యవహరించినట్లు కాన్పించుటచేతను వారిద్దరు నొక్కరే యనునిర్ణయము చేయవలసియున్నది"

ఇది మల్లయ్యశాస్త్రిగారి టీక. దీనిలోగూడ వ్యాసబాదరాయణు లొక్కరే యని నిర్ణయింపబడినదికదా! ఈగ్రంథములు రెండును బ్రహ్మసూత్రములు వ్యాససూత్రములే యని చెప్పుచుండ వ్యాససూత్రములు కావని చెప్పుచున్నవని వంచకులై యెంత యన్యాయముగా వ్రాసిరో చూడుడు.

వీరు 27-12-45 తేదీనుండి ఆంధ్రపత్రికలో 'బాదరాయణుడు వ్యాసుడు కాడు' అను పేరుతో వ్యాసములు ప్రకటించినారు. ఆవ్యాసములలోని విషయము లసంగతము లని నిరూపించుచు 'కల్పవల్లి' 'దివ్యవాణి' పత్రికలలో ప్రకటించితిని. తరువాత 4-5-47 తేదీ శ్రీ అన్నవరదేవస్థానమున విద్వత్సభలో సభ్యుల కోరికపై ముగ్గురు మధ్యవర్తులను పురస్కరించుకొని వాదోపవాదతత్త్వనిర్ణయము చేయసంకల్పింపబడినది. అప్పుడు ఆంధ్రపత్రికలో బ్రకటించిన వ్యాసములనే వారు చదువగా, నే ప్రకటించిన ఖండనవ్యాసములు నేను చదివి యాపై యనేకప్రమాణములను గూడ నప్పుడు ప్రదర్శించితిని. ఆవాదోపవాదముల స్వరూపము, ఆమధ్యస్థుల తీర్మానములు 'బ్రహ్మసూత్రకర్తృనిర్ణయము' అను గ్రంథమున విశదము కాగలవు. కనుక బ్రహ్మసూత్రకర్త వేదవ్యాసమహర్షియే యనుటకు మనకు ప్రమాణము ప్రతివాదులు పరిగ్రహించిన గ్రంథములే యగుటచే నితోఽధికనిరూపణముతో బనిలేకయే ప్రతివాదుల వ్రాత నిరస్తమైనది.

## —వ్యాసభగవానుని ఘనత—

మనమిప్పుడొకసారి వ్యాసభగవానుని ఘనత ననుసంధింతము. వేదవిభాగము జేసెను; బ్రహ్మసూత్రములు నిర్మించెను; అష్టాదశమహాపురాణములు రచించెను; మహాభారతము ననుగ్రహించెను; తన యనన్యసాధారణతపశ్శక్తిచే ధృతరాష్ట్రాదులకు యుద్ధమృతుల జూపి పరస్పరసంభాషణాదుల జరిపించెను; జాత్యంధునకు దృష్టి నప్పు డనుగ్రహించెను; సంజయునకు యుద్ధమందలి యావద్వృత్తాంతము కర

తలామలకముగా దెలిసికొనుటకు దివ్యదృష్టి బ్రసాదించెను; గాంధారికి బుత్రశతోత్పత్తి నరమిచ్చెను;బహిర్యాతమై,యగోచరమై,యతికఠినమై యున్న మాంసపేశిని శీతోదకసేచనముతో నంగుష్ఠపర్వప్రమాణముగా విభజించి దుర్యోధనాదులనుత్పాదింపజేసెను; ఎప్పటికప్పుడు తనయోగశక్తిచే బ్రత్యక్ష మగుచు వచ్చెను. పరాశరపుత్రుడై, యాజన్మసిద్ధుడై, స్వయంప్రతిభాతవేదమంత్రవిరాజితుడై, బ్రహ్మర్షియై, శ్రీహరియవతారమై, జీవన్ముక్తుడై, లోకోద్ధరణదీక్షాధురంధరుడై, దీనావనతత్పరుడై, త్రికాలజ్ఞాననిధియై విలసిల్లెను. ఇట్టి మునిజనమూర్ధన్యుని ఇట్టి జగద్వంద్యుని, యీప్రతివాదు లేమని నిందించిరో యిపుడొక్కసారి మనము స్మృతిపథమునకు దెచ్చుకొందము.

— ♦ప్రతివాదివైఖరి♦ —

వ్యాసుడు నిషాదు డనిరి; చండాలజాతిజు డనిరి. రాణివాసము జేరి రాణుల గూడినా డనిరి; దుర్వాసనకలవా డనిరి; మఱియొకప్పుడను స్త్రీలోలుడే యనిరి; ధర్మప్రతిపాదకస్వభావుడు కాడనిరి; కాశీప్రభువుచే కాశీనుండి తఱుముబడె ననిరి; కాశీలో భిక్షకూడ దొరకలే దనిరి; దుర్యోధనాదుల భార్యలను పతిలోకము కలుగు నని నమ్మించి గంగలో బ్రవేశపెట్టె ననిరి; భారతమును పాండవపక్షముగా వ్రాసినా డనిరి; తాను సంకీర్ణజాతివాడు కనుక సంకీర్ణజాతివారగు పాండవులకు దోడ్పడినా డనిరి; కౌరవపాండవుల న్యాయాన్యాయములు వ్యత్యస్తము జేసి భారతము వ్రాసినా డనిరి; దుర్యోధనుని యందీర్ష్య కలవా డనిరి; ఆయీర్ష్యను గాంధారియందుకూడ జూపి యామె గర్భతాడనము జేసికొన్న దని వ్రాసినా డనిరి; గాంధారీపుత్రుల కపార్థ మిచ్చు నామములను పెట్టినా డనిరి; బ్రహ్మసూత్రకర్తయీతడు కాడనిరి; పురాణము లీతడు రచించినవి కావనిరి.

ఈసందర్భములన్నియు ప్రమాణోపపత్తులతో, స్వవచనవ్యాఘాతములతో, స్వోదాహృతవచనవిరోధములతో నిరాకృతము లయినవి.

మహాశ్రితత్త్వము, మ. భా. చ. కారుల మతిరాహిత్యము అభివ్యక్త మయినది.

ఈప్రస్తావములో మహాభారతవచనములు కొన్ని స్మృతికి వచ్చుచున్నవి.

"అన్యాన్ పరివద న్సాధు ర్యథా హి పరితప్యతే।
తథా పరివద న్నన్యాం స్తుష్టో భవతి దుర్జనః॥
అభివాద్య యథా వృద్ధాన్ సంతో గచ్ఛంతి నిర్వృతిమ్।
ఏవం సజ్జన మాకృశ్య మూర్ఖో భవతి నిర్వృతః॥
అతో హాస్యతరం లోకే కించి దన్య న్న విద్యతే।
యత్ర దుర్జన మిత్యాహ దుర్జన స్సజ్జన స్స్వయమ్॥
సత్యధర్మచ్యుతా త్పుంసః క్రుద్ధా దాసీవిషాదివ।
అనాస్తికోఽప్యుద్విజతే జనః కిం పున రాస్తికః॥" (ఆది, అ. 74)

టీ. అనాస్తికః= ఆస్తికా ద్భిన్నః;

ఇతరులను నిందించి సజ్జను డెంత పరితపించునో, దుర్జను డితరుల నిందించి యంతె సంతోషించును. పెద్దలకు నమస్కరించి సజ్జను లెంత యానందింతురో, సజ్జనుల నిందించి దుర్జను డంతె యానందించును. దుర్జనుడు సజ్జనుని దుర్జను డని చెప్పుచుండును. ఇంతకంటె లోకమం దపహాసపాత్రము మరియొకటి లేదు. క్రోధము కల విషసర్పమువలన భయపడినట్లు సత్యమును, ధర్మమును విడిచిపెట్టిన మనుజునివలన నాస్తికుడు కూడ భయపడుచుండును. ఆస్తికుని మాట నికనేమి చెప్పవలయును? అని భావము. వేదవ్యాసభగవానుని దిగంతవిశ్రాంతమైన యశస్సును తిరస్కరింప బూనిన ప్రతివాదుల చర్యమెట్టిదో తెలియుటకై యీసంక్షేపశారీరకాచార్యసూక్తి నవలోకింపుడు-

'మహానుహిమ్నా మపి య శ్చికీర్షతి
స్వభావసంశుద్ధతరం తిరో యశః।
స నూన మాచ్ఛాదయితుం సమీహతే
వివస్వతో హ స్తతలేన మండలమ్॥"

స్వభావసిద్ధమై, అతిసంశుద్ధమై యున్న మహామహిమ కలవార ల యశస్సు నెవ్వడు తిరస్కరింపదలచునో వాడు- జగత్ప్రకాశకమైన సూర్యమండలమును గప్పివేయుటకై తన యరచేతిని యడ్డుపెట్టుటకు దలపెట్టిన వా డగును అని భావము.

ఈప్రతివాదులు వేదవ్యాసభగవానుని నిందించుట, ప్రమాణ గ్రంథములను తిరస్కరించుట, విద్వన్మార్గమును ద్వేషించుట, మొద లగు చర్యలు చూడగా "సుభాషితరత్నభాండాగారములోని యొకమ హాకవిసూక్తి జ్ఞప్తికి వచ్చుచున్నది.

"వ్యాసాదీన్ కవిపుంగవా ననుచితై ర్వాక్యై స్సలీలం హస
న్నుచ్చై ర్జల్ప నిమీల్యలోచనయుగం శ్లోకాన్ సగర్వం పఠ।
కావ్యం ధిక్కురు యత్పరైర్విరచితం స్పర్ధస్వ సార్థం బుధైః
య ద్యభ్యర్థయసే శ్రుతేన రహితః పాండిత్య మాప్తుంబలాత్"

ఓజనుడా! చదువులేని నీవు పాండిత్యమును బలాత్కారముగా సంపాదింప గోరెదవేని యీయుపాయముల నాశ్రయింపుము. ఏవ నగా. వ్యాసాదికవిపుంగవులను నవ్వుచు నిర్లక్ష్యముగా ననుచితప్రసం గములకు పాలుచేయుము. (అనగా నిందింపుము ) కన్నులుమూసికొని యేవో శ్లోకములను గర్వముతో జదువుము. అన్యులు రచించిన గ్రం థములను ధిక్కరింపుము. విద్వాంసులతో స్పర్ధ కలిగియుండుము. ఇట్లు చేయుదువేని విద్య లేకపోయినను నీవు పండితుడ వనిపించుకొన గలవు. అని తాత్పర్యము.

'బాలవ్యాస న్యాయవ్యాకరణవేదాంతవిద్యాప్రవీణ' వారణాసి
సుబ్రహ్మణ్యశాస్త్రిప్రణీతమైన, మహాభారతతత్త్వకథన
మున వేదవ్యాసనిందానిరాకరణ మనెడి

శ్రీ గురుభ్యో నమః.

# మహాభారతతత్త్వకథనము.

## శ్రీకృష్ణనిందానిరాకరణము.

తృతీయభాగము.

శ్రీగౌతమీవిద్యాపీఠ విమర్శశాఖా ప్రచురణము,
రాజమహేంద్రవరము.

'బాలవ్యాస, తర్క, వ్యాకరణ, వేదాన్త కేసరి'

**వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే**

రచియింపబడి,

భాష్యవిల్లి గారిస్థాపిత శ్రీ శారదాముద్రణాలయమునందు
ముద్రింపబడినది.

పబ్లిషర్:— శ్రీగౌతమీవిద్యాపీఠవిమర్శశాఖాతరఫున

**కాండ్రేగుల జగన్నాథరావు గోపాలరావు,**

బి. ఎ; బి. ఎల్. అడ్వొకేటు,
కార్యదర్శి అండ్ కోశాధిపతి, రాజమహేంద్రవరం.

ప్రతులు: 1000.

**13—3—1950**

 [మూల్యం: **1-12-0**

# విషయసూచిక.

విషయము. పుట.

విషయము. పుట.

విషయము. పుట.

# మహాభారతతత్త్వకథనము.



## శ్రీకృష్ణనిందానిరాకరణము.



పుంజీభూతం ప్రేమ గోపాఙ్గనానాం
మూర్తీభూతం భాగధేయం యదూనామ్ ।
ఏకీభూతం గుప్తవిత్తం శ్రుతీనాం
శ్యామీభూతం బ్రహ్మ మే సన్నిధత్తామ్ ॥
యన్నిష్ఠం యత్నః కృతో నిన్ద్యః ద్విడ్భిః శ్రీకృష్ణస్యోపరి ।
తన్నిరాకరణం కుర్మః ప్రమాణైః సయుక్తిభిః ॥

### —♦ మహాభారతసంగ్రహతాత్పర్యము. ♦—

చేతనాచేతనరూపమైన యీ ప్రపంచమునకు మూలాధారమైన యేపరమార్థతత్త్వము కలదో దాని స్వరూపజ్ఞానమే మోక్షసాధక మగుటచే దాని నుపదేశింపదలచి, విషయసుఖమే పరమార్థ మని భావించుచు, అవిద్యోపహతులైయున్న ప్రజలకు కేవలమాతత్త్వమునే యుపదేశించినయెడల మనస్సునకు రాదని యెంచి ప్రజల కనుభవసిద్ధమైన గర్భవాసజన్మజరామరణాదిరూప మగు సంసారమును వర్ణించుచు, నందలి దోషముల నుద్ఘాటించుచు, తన్మూలమున నీసంసారము హేయ మను బుద్ధిని ప్రజలకు గలిగించుచు, నడుమనడుమ నాపరమార్థతత్త్వము నుపదేశించుచు వచ్చినయెడల ప్రజల కప్పుడది మనస్సున నాటుకొనునని భావించి జ్ఞానశక్త్యవతారమైన వేదవ్యాసభగవానుడు లోకోద్ధరణార్థమై మహాభారతము నావిధముగా రచించి యనుగ్రహించెను.

ఖములను వర్ణించుట, అగ్రామ్యసుఖలోలురు తమస్వాంతములను శ్రీహరి కథలయందు తమబుద్ధిని చేర్చి బాగుపడుటకే కాముకుని కామమును, లోభి లోభమును వర్ణించి చెప్పె అంధుని గోతిలోనికి దోసినట్లు అజ్ఞులగు ప్రజలను అపమార్గమునకు నెట్టినవా రేమి ఫలము నొందుదురు? లోకులు చిత్తములను మరల్పదలచి వారల కభిమతమైయున్న అర్థకామములనే వర్ణించి యీభారతమందే ఆవ్యాసమహర్షి మొదలి పవిత్రములైన యితిహాసములచే నర్థకామములను నిందించియుండెను. అట్లు కానియెడల జ్ఞానియు, మునియు, కరుణామయుడు నగు మహర్షి జనులకు ఘోరమైన సంసారబంధమునకు హేతువులైయున్న అర్థకామములను వర్ణించునా? అనిభావము.

దీనినిబట్టి యీ ప్రపంచమునకు మూలకారణమైయున్న భగవత్తత్త్వమును, అంతటి సాకారనిరాకారవిశేషములను, అనంతకల్యాణగుణములను అజ్ఞులగు ప్రజలకు ముఖ్యముగా తెలుపవలెనను తాత్పర్యముచేతనే మహాభారతరచనను మహర్షి ప్రారంభించె నని తెలిసెను.

ఆనిరాకారభగవత్తత్త్వమే కృష్ణనామము గ్రహించెనని మహాభారతమునం దనేకప్రసంగములలో నిరూపింపబడినది. ఇక భగవద్గీతలో నీవిషయము స్పష్టముగా నున్న దనుట సుప్రసిద్ధమే. ఇట్లుండ శ్రీకృష్ణపరమాత్మను గూర్చి విమర్శకులు ప్రమాణములను ధిక్కరించి యూహలతో నేదేదో వ్రాసియున్నారు.

—శ్రీకృష్ణు నిది పరమేశ్వరావతారము కాదను వాదము తన్నిరాకరణము—

శ్రీలాలా లజపతిరాయిగారిచే వ్రాయబడి యాంధ్రీకరింపబడిన 'శ్రీకృష్ణుని జీవితచారిత్రము' అను పుస్తకములో నీవిధముగా నున్నది—

“శ్రీకృష్ణుఁడు పరమేశ్వరావతారమా? [illegible]

దేహమును ధరించునా? భగవంతు డొకడు గలడని సమ్మతించి యాస్తికులందరును ఆతనిని సర్వవ్యాపకునిగను, సర్వశక్తియుతు నిగను, అజన్మునిగను, అమరునిగను, ఆద్యంతరహితునిగను భావిం పుచున్నారు. ఇక నిట్టి స్థితియందా సర్వశక్తి గల పరమాత్ము నికి తన సృష్టిలోని మానవసమూహమునకు బోధించుటకొర కును, మార్గదర్శకము కొరకును మానవదేహమును ధరించు టావశ్యక మగుచున్న దన్నచో నీవిషయ మెటుల సత్యము గాగలదు? మానవదేహములోనికి వచ్చుటంజేసి యాతడు కొంత మితమునకు లోబడినవాడయి సర్వవ్యాప్తి గాజాలకపోవును.

ఏకాలమున పరమాత్ముడు శ్రీకృష్ణుడుగ మానవావతార మెత్తి యుండెనో యాకాలమున తక్కిన భౌతికప్రపంచవ్యవస్థ సంతను నెవరు జేయుచుండిరో, మరియు శ్రీకృష్ణుడు కౌరవులతో బోరాడునప్పుడును, శిశుపాలునితో వాదాడునప్పుడును జరాసంధునకు బెదరిపారిపోయి యందందు దిరుగాడుచున్నప్పుడును నీసృష్టియంతయు నెవరి స్వాధీనమునందుండెనో, ఎటుల జరుగుచుండెనో ఆవివరము నీశ్వరుని యవతారముల నొప్పుకొనెడివారు మాకు దెల్పగలరా?" (పు 270)

ఇందలి యాక్షేపాంశములు రెండు. అజుడును, అవ్యయుడునగు పరమేశ్వరుడు మానవదేహము ధరింపడు. అనగా నవతారము లెత్తడని యొకటి. శ్రీకృష్ణుడుగా నవతారమెత్తియున్న కాలములో సకలప్రపంచవ్యవస్థను నడిపెడి యీశ్వరుడు లేకపోవు ననునది యొకటి. వీనిని క్రమముగా బరిశీలింతము.

భగవద్గీతలో చతుర్థాధ్యాయారంభమందు అర్జునునకు చెప్పుటలో "ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్" అనెను

పూర్వాధ్యాయములలో జెప్పబడిన కర్మయోగసహితమైన యీ జ్ఞానయోగమును సృష్ట్యాదియందు సూర్యున కుపదేశించియున్నాననియు, "స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః" దానినే నీకిప్పు డుపదేశించితి ననియు భగవానుడు చెప్పగా నర్జునుడు ప్రశ్నించెను.

"అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః ।
కథమేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవా నితి ॥"

వసుదేవగృహమందు జన్మించియున్న నీవు సృష్ట్యాదియందు సూర్యునకు జెప్పితి ననుట యెట్లు సరిపడును? అని. దీనిపై శ్రీకృష్ణుని సమాధాన మిట్లున్నది.

"బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।
తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప ॥"

నాకు బహుజన్మము లతీతములైనవి. నాకేగాక నీకును అయినవి. కాని వానిని నేనెరుగుదును నీ వెరుగవు. నాది యనావృతజ్ఞానము, నీది యావృతజ్ఞానము నగుటయే దానికి కారణము. అనావృతజ్ఞానశక్తి కలిగి కర్మబంధము లేని యీశ్వరుడ వగు నీకు జన్మ మెట్లని శంకింతువేమో ఆప్రక్రియను వినుము.

"అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్ ।
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా ॥"

నే నజుడను, అవ్యయుడను, ఈశ్వరుడను, అయియున్నను నా యధీనమై యున్నట్టియు, జగత్తును మోహపెట్టునట్టియు, వ్యాపకము, త్రిగుణాత్మకము నగు మాయ నవలంబించి జన్మించుచున్నాను. అనగా కర్మనిబంధనమైన లోకసామాన్యముయొక్క జన్మము వంటిది కాక నాది మాయామయమైన జన్మము.

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే।
జన్మ కర్మచ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః।
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సోఽర్జున॥"

ఇట్టి జన్మమునకు సాధుపరిత్రాణము, అసాధువినాశనము ధర్మసంస్థాపనము అనునవి ప్రయోజనములు. ఇట్లు నాజన్మము ఐచ్ఛికము, మాయారూపము ననియు, కర్మ ఈశ్వరైకసాధ్యమైన సాధుపరిత్రాణాదిరూప మనియు నిజముగా గ్రహించినవాడు ముక్తు డగును.

శ్రీకృష్ణభగవానుని వాక్యములే—

"శ్రీకృష్ణునది పరమేశ్వరావతారమా? పరమేశ్వరుడు మానవదేహమును ధరించునా? ఆసర్వశక్తికల పరమాత్మునికి మానవసమూహమునకు బోధించుకొరకును మార్గదర్శకముకొరకును మానవదేహముధరించు టావశ్యకమగుచున్న దన్నచో నీవిషయ మెటుల సత్యము గాగలదు?"

అను ఆక్షేపములను నిరాకరించుచున్నవి. మరియు—
"అవజానన్తి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్।
పరంభావ మజానన్తో మమ భూతమహేశ్వరమ్॥" (గీ 9. 11)

సకలభూతములకు నీశ్వరుడనై మనుష్యశరీరముతో వ్యవహరించుచున్న నన్ను నాసర్వోత్కృష్టత నెరుగని మూఢులు తిరస్కరించుచున్నారు. అని కృష్ణభగవానుడు చెప్పుటచేగూడ శ్రీకృష్ణునిది పరమేశ్వరావతారమే అనియు, పరమేశ్వరుడు లోకానుగ్రహార్థము మానవదేహమును ధరించు ననియు, నిది సత్యమే యనియు ప్రతివాదులు గ్రహింతురుగాక ఈప్రమాణములచే మొదటియాక్షేప మపాస్తమైనది.

ఇక "ఏకాలమున పరమాత్మకు శ్రీకృష్ణుడుగ మానవావతారమెత్తియుండెనో ఆకాలమున నీసృష్టి యంతయు నెవరి యధీనమున నుండెనో ఎటుల జరుగుచుండెనో ఆవివరమును ఈశ్వరుని యవతారముల నొప్పుకొనెడివారు మాకు దెల్పగలరా?" అను నాక్షేపమున్నది.

దీనిని గూర్చి ద్రోణపర్వములో భగదత్తవధసందర్భమున నరునకు కృష్ణభగవానుడు చెప్పిన యీవిషయము జూడుడు—

"చతుర్మూర్తి రహం శశ్వ ల్లోకత్రాణార్థ ముద్యతః।
ఆత్మానం ప్రవిభజ్యేహ లోకానాం హిత మాదధే ॥
ఏకా మూర్తి స్తపశ్చర్యాం కురుతే మే భువి స్థితా।
అపరా పశ్యతి జగత్ కుర్వాణం సాధ్వసాధునీ ॥"

టీ. ఏకా మూర్తిః బదరికాశ్రమే నారాయణరూపా, అపరా పరమాత్మరూపా.

"అపరా కురుతే కర్మ మానుషం లోక మాశ్రితా।
శేతే చతుర్థీ త్వపరా నిద్రాం వర్షసహస్రికామ్॥

టీ. అపరా క్షేత్రజ్ఞరూపా అపరా జలశాయినీ.

యాఽసౌ వర్షసహస్రాన్తే మూర్తి రుత్తిష్ఠతే మమ।
వరార్హేభ్యో వరాన్ శ్రేష్ఠాం స్తస్మిన్ కాలే దదాతి సా॥"
(ద్రోణప॥ అ29)

అనగా లోకరక్షణమున కుద్యమించెడి నేను నాలుగుమూర్తులను ధరించి లోకులకు హితము గలుగజేయుచున్నాను. అందొకమూర్తి బదరికాశ్రమమందు నారాయణరూపమై తపశ్చర్యయందున్నది. మరియొక మూర్తి పరమాత్మరూపమై మంచిచెడ్డలను చేయుచున్న జగత్తును

కనిపెట్టుచున్నది. మరియొకమూర్తి జీవరూపమై మనుష్యలోకము నాశ్రయించి కర్మ చేయుచున్నది. మరియొక మూర్తి జలశాయియై సహస్రయుగములు యోగనిద్రచే శయనించి సృష్టిసమయమందు లేచి యప్పుడు సగము సేయుచున్నవారికి వరము లిచ్చుచున్నది. అని తాత్పర్యము.

ఈప్రమాణమునుబట్టి కృష్ణావతారకాలమునందును సృష్టిసంరక్షణను పరికించెడి పరమాత్మ వేరుగా నుండెనని యీశ్వరుని యవతారములు నొప్పుకొనెడివారు ప్రతివాదులకు తెలుపగలరని చెప్పుచున్నాము. ఏకకాలమం దనేకశరీరధారణము యోగులకుగూడ సుప్రసిద్ధమైనప్పుడు జన్మసిద్ధులైన దేవతల కనేకశరీరధారణము మాత్ర మసిద్ధమని చెప్పవే మని వేదాంతశాస్త్రము బోధించుచున్నది యెట్లనగా—

'విరోధః కర్మణీతి చేన్నానేకప్రతిపత్తేర్దర్శనాత్' (బ్ర.సూ.1.3.27)

భాష్యమ్—"స్మృతిరపి—

"ఆత్మనో వై శరీరాణి బహూని భరతర్షభ।
యోగీ కుర్యా ద్బలం ప్రాప్య తైశ్చ సర్వై ర్మహీం చరేత్॥
ప్రాప్నుయా ద్విషయాన్ కైశ్చి త్కైశ్చి దుగ్రం తపశ్చరేత్।
సంక్షిపేచ్చ పున స్తాని సూర్యో రశ్మిగణానివ॥"

ఇత్యేవంజాతీయకా ప్రాప్తాణిమాద్యైశ్వర్యాణాం యోగినామపి యుగపదనేకశరీరయోగం దర్శయతి కిము వక్తవ్య మాజానసిద్ధానాం దేవానామ్॥

దీనిచే యోగి యోగబలముచే నేకకాలమం దనేకశరీరములు ధరించి కొన్నిశరీరములచే విషయానుభవము, కొన్నిశరీరములచే తపస్సు జరిపి మరల సూర్యుడు కిరణములనువలె నా శరీరములను సంక్షే

పింపజేయు నని చెప్పబడినది. యోగికే యిట్టి శక్తి యుండగా 'యత్ర యోగేశ్వరః కృష్ణః' అని యోగేశ్వరుడగు కృష్ణభగవానున కుండుట లోసందేహమా? —కనుక రెండవ ఆక్షేపముగూడ పరాస్తము.

—శ్రీకృష్ణు డెప్పుడును దానీశ్వరుని యవతారమైనట్లు సాధింప బూనలేదు" అనుప్రసంగము, తన్నిరాకరణము—

"శ్రీకృష్ణు డెప్పుడైన దా నీశ్వరుని యవతారమైనట్లు సాధింప బూనెనా? ఒక్కభగవద్గీతలోదప్ప దక్కినమహాభారతమున నేభాగమునందైనను నీవిషయమునకు బలము నొసంగెడి సాక్ష్యము గానరాదు. భగవద్గీత కృష్ణునిచే రచియింపబడిన గ్రంథము కాదుకావున నీయంశమున కది తృప్తికరమగు సాక్ష్యము కాజాలదు"
(శ్రీకృష్ణునిజీవితచారిత్రము—పు273)

దీనివలన తేలిన దేమనగా, శ్రీకృష్ణుడు తానీశ్వరుని యవతారమైనట్లు చెప్పె నని భగవద్గీతలో దప్ప మహాభారతమం దెక్కడను లేదనియు, భగవద్గీత కృష్ణునిచే రచింపబడినది కానందున ప్రమాణము కాదనియు తేలినది. భగవద్గీత కృష్ణునిచే రచింపబడలే దనుచున్నవీరు కృష్ణునిచే నుపదేశింపబడలేదనికూడ జెప్పుదురాయేమి?

అట్లే చెప్పినయెడల 'భగవంతునిచే నుపదేశింపబడినది' అని యర్థముకల 'భగవద్గీత' యను పేరును వ్యర్థము జేసినా రన్నమాట.

ఇక 'కృష్ణునిచే రచింపబడిన గ్రంథముకాదు' అని వ్రాయుటచే నుపదేశింపబడిన ట్లంగీకరింతురా? అట్లైన నది యేల ప్రమాణము కాదు? రచింపబడినదే ప్రమాణమై, ఉపదేశింపబడినది యప్రమాణమైన పక్షములో కృష్ణునిచే రచింపబడి వీరికి ప్రమాణమైన గ్రంథ మేమున్నది?

మరియు, శ్రీకృష్ణుడు తానీశ్వరుని యవతార మని చెప్పినట్లు మహాభారతమందు ఏభాగమునను లేదనుచున్న వీరు కృష్ణునిచే రచింపబడని వేదవ్యాసమహాభారతము నేల పేర్కొనినారు?

వేదవ్యాసమహాభారతమం దున్నది ప్రమాణ మైనపుడు వేదవ్యాసమహాభారతాంతర్గతమైన భగవద్గీతయందున్నది ప్రమాణమేల గాదు? — భగవద్గీత మహాభారతాంతర్గతమే —

మహాభారతములో నూరవాంతరపర్వము లున్న వని చెప్పబడెను. ఆపర్వముల పేళ్లు పర్వసంగ్రహాపర్వములో పేర్కొనబడినవి. అందొకటి భగవద్గీతాపర్వ మని స్పష్టముగా నున్నది, చూడుడు—

"పర్వోక్తం భగవద్గీతా పర్వ భీష్మవధ స్తతః" (68శ్లో.)

మరియు మహాభారతములోని 18 మహాపర్వములలో నేమహాపర్వమం దేయే గాథ లున్నవో చెప్పబడినవి. అందు భీష్మపర్వగాథలను పేర్కొనునపుడు యుద్ధారంభమున విషాదము నొందిన పార్థుని మోహమును మోక్షోపాయోపదేశముచే కృష్ణభగవానుడు పోగొట్టె నని చెప్పబడినది. చూడుడు—

"అతః పరం విచిత్రార్థం భీష్మపర్వ ప్రచక్షతే।
"కశ్మలం యత్ర పార్థస్య వాసుదేవో మహామతిః।
మోహజం నాశయామాస హేతుభి ర్మోక్షదర్శిభిః॥ (అ 2)

మరియు నూరవాంతరపర్వములలో నొకటియై మొదటి దగు ననుక్రమణికాపర్వమున ధృతరాష్ట్రుడు పరితపించుసందర్భములో రథమందు పార్థుడు చింతాక్రాంతుడై యున్నపుడు కృష్ణుడు తన శరీరమందు లోకములను ప్రదర్శించెను (విశ్వరూపము జూపెను) అని

విన్నపుడే నేను జయ మాశింపలేదు. అనుచు భగవద్గీతలోని విశ్వ రూపవృత్తాంతమును స్మరించె నని చెప్పబడినది. చూడుడు—

"యదాఽశ్రౌషం కశ్మలేనాభిపన్నే రథోపస్థే సీదమానేఽర్జునే వై।
కృష్ణం లోకాన్ దర్శయానం శరీరే, తదా నాశంసే విజయాయ సంజయ!" (అ 1 )

మరియు నూరు పర్వములలో నొకటగు ననుగీతాపర్వమున నర్జునుడు వెనుకగీతలో జెప్పబడిన విషయము విస్మృతమైనది. మరల జెప్పుమని యడిగినపుడు కృష్ణభగవానుడు అనుగీతను చెప్పి పూర్వము యుద్ధకాలమందుగూడ నిదియే చెప్పబడిన దని తెలిపెను. చూడుడు—

"పూర్వ మప్యేత దేవోక్తం యుద్ధకాల ఉపస్థితే!
మయా తవ మహాబాహో తస్మాదత్ర మనః కురు"
(అశ్వమేధపర్వ-అ. 51.)

ఈఅనుగీత ప్రక్షిప్త మని బకంచెందిచిట్టోపాధ్యాయులు శ్రీకృష్ణచరితములో నిట్లు వ్రాసిరి —"ఆదిపర్వమునందలి ద్వితీయాధ్యాయము పర్వసంగ్రహాధ్యాయ మని చెప్పబడినది. ఇందు మహాభారతము నందలి విషయము లన్నియును వరుసవెంబడిని సంగ్రహముగ దెలుపబడియున్నవి. అశ్వమేధపర్వమున ననుగీతయును, బ్రాహ్మణగీతయును గన్పట్టుచున్నవి. పర్వసంగ్రహాధ్యాయములో నివి యెంతమాత్రము చేర్కొనబడియుండలేదు. కాబట్టి యివి ప్రక్షిప్తము లని మనము యోచింపవచ్చును" (9పరిచ్ఛేదము. పు53)

వీరిట్లు వ్రాయుట చిత్రముగానున్నది. మహాభారతములోని మహాపర్వములలో బదునాలుగవది యాశ్వమేధికపర్వము, ఇక నవాంతరశతపర్వములలో తొంబదెవది యశ్వమేధపర్వము. తొంబదియొక

టపడి యను గీతపర్వమున్నై యుండెను. వారన్న బ్రాహ్మణగీత, అనుగీ తాంతర్గతమే. ఈయనుగీత పర్వసంగ్రహాధ్యాయములో జెప్పఁబడినది. చూడుడు—

"తతో౽శ్వమేధికం పర్వ సర్వపాపప్రణాశనమ్ ।
అనుగీతా తతః పర్వ జ్ఞేయ మధ్యాత్మవాచకమ్ ॥" (శ్లో. 79)

ఇందు పర్వశతములోని యశ్వమేధపర్వానుగీతాపర్వములు పేర్కొనఁబడినట్లు స్పష్టమేకనుక నుపాధ్యాయుల వ్రాత పథ్యాస్థమైనది.

ఇట్లు పరిశీలింపగా భగవద్గీత నూరు పర్వములలో నొకపర్వమై యుండుటచేతను, భీష్మపర్వగాథలలో భగవద్గీత సూచింపబడుటచేతను, ధృతరాష్ట్రుఁడు భగవద్గీతలలోని విశ్వరూపవృత్తాంతమును స్మరించుట చేతను, అనుగీతలో భగవద్గీతావిషయ మెత్తుకొనబడుటచేతను, భగవద్గీత మహాభారతాంతర్గతమే. అది ప్రమాణికమూర్ధన్యులగు భాష్యకారులచేతను, విద్వత్పుంగవులచేతను పరిగ్రహింపబడినదగుటచే ప్రమాణ మనక తప్పదు. అట్టి భగవద్గీత శ్రీకృష్ణుఁడు పరమేశ్వరుని యవతార మని చెప్పుచుండ నది తృప్తికరమైన సాక్ష్యము కాదను ప్రతివాదుల వాదము యెంతవరకు సమంజసమో ప్రాజ్ఞులు గ్రహింతురు గాక.

ఇక భగవద్గీతలోని యీవిషయ మిట్లుంచి మహాభారతమున స్థలాంతరములలో గూడ వారికి ప్రదర్శింతము.

ఇంతకు బూర్వము భగదత్తవధసందర్భములో శ్రీకృష్ణభగవానుఁడు

"చతుర్మూర్తి రహం శశ్వ ల్లోకత్రాణార్థ ముద్యతః ।"

అనుచు దా నీశ్వరుఁడ నని ద్రోణపర్వములో జెప్పెనని చూపఁబడిన స్థల మొకటి.

మఱియొక స్థల మేమనగా ఆశ్వమేధికపర్వములో నుత్తంకో పాఖ్యానములో నుత్తంకునకు కృష్ణభగవానుడు తన స్వరూపమును గూర్చి చెప్పినది. అది యిట్లున్నది—

"అహం విష్ణు రహం బ్రహ్మా శక్రోఽథ ప్రభవాప్యయః।
భూతగ్రామస్య సర్వస్య స్రష్టా సంహార ఏవ చ॥
అధర్మే వర్తమానానాం సర్వేషా మహ మచ్యుతః।
ధర్మస్య సేతుం బధ్నామి చలితే చలితే యుగే॥
తా స్తా యోనీః ప్రవిశ్యాహం ప్రజానాం హితకామ్యయా।
యదా త్వహం దేవయోనౌ వర్తామి భృగునందన॥
తదాఽహం దేవవ త్సర్వ మాచరామి న సంశయః।
మానుష్యే వర్తమానేతు కృపణం యాచితా మయా॥
న చ తే జాతసంమోహా వచోఽగృహ్ణన్త మోహితాః।
భయం చ మహ దుద్దిశ్య త్రాసితాః కురవో మయా॥" (అ. 54)

ఓ ఉత్తంకమహర్షీ! బ్రహ్మ, విష్ణువు రుద్రుడు నేనే. ప్రజ లధర్మ పరులైనపుడు ప్రజాహితము గోరి, ఆయాజన్మము లెత్తి ఆయా యుగ ములలో ధర్మసేతువులను బంధించుచుందును. నేనే యేజాతిశరీరములు ధరింతునో ఆజాతి ధర్మములతో సంచరించుచుందును. ఇప్పుడుమనుష్య శరీరము ధరించిన నేను కౌరవులను యాచించితిని. భయంకరఘటనలు చూపి భయపెట్టితిని. (విశ్వరూపము జూపితి నన్నమాట) అయినను మూఢులైనవారు నామాట నాదరింపలేదు. అని భావము. ఈనిదర్శన ములచే కృష్ణభగవానుడు పరమేశ్వరావతారమే యని ప్రతివాదులకు తెలుపబడినది.

"పరమేశ్వరుడు స్వయముగా మానవదేహమునుధరించుచున్నా డన్నయెడల వేదములందును ఉపనిషత్తులందును పరమాత్మకుచెప్ప బడిన అజుడు, అమరుడు, అవినాశి, అకాయుడు ఇత్యాది లక్షణ ములు అసత్యములై పోవుచున్నవి." (పు. 272)

అను నీయాక్షేపము కూడ అట్టి లక్షణములు కల పరమాత్మ ఆయాఅవతారములలో గూడ నట్లే యుండె ననియు, నవతారమును బట్టి యాస్వరూపమునకు భంగము లేదనియు, వెనుక నిరూపింపబడు టచే పరాస్తమైనది. మరియు వేదాంతశాస్త్రమందు 'అన్తరధికరణ మున' హిరణ్యశ్మశ్రుత్వాదిరూపము పరమేశ్వరునకు సంభవింప దను పూర్వపక్షముపై సంభవించునని సిద్ధాంతము చేయబడినది.చూడుడు!

"అన్త స్తద్ధర్మోపదేశాత్ ।" (బ్ర. 1. 1. 20)

భాష్యే —

"యత్తూక్తం హిరణ్యశ్మశ్రు రిత్యాదిరూపశ్రవణం పరమేశ్వరే నోపపద్యత ఇతి.

అత్రబ్రూమః —

స్యాత్పరమేశ్వరస్యా ప్యిచ్ఛావశా న్మాయామయం రూపం సాధకానుగ్రహార్థమ్ —

"మాయా హ్యేషా మయా సృష్టా య న్మాం పశ్యసి నారద ।
సర్వభూతగుణై ర్యుక్తం నైవం మాం జ్ఞాతుమర్హసి ॥

ఇతిస్మరణాత్. అపిచ, యత్రతు నిరస్తసర్వవిశేషం పారమేశ్వరం రూప ముపదిశ్యతే భవతి తత్ర శాస్త్రమ్—'అశబ్ద మస్పర్శమ రూప మవ్యయమ్' ఇత్యాది. సర్వకారణత్వాత్తు వికారధర్మై రపి కైశ్చి ద్విశిష్టః పరమేశ్వర స ఉపాస్యత్వేన నిర్దిశ్యతే—"సర్వకర్మా సర్వకామ స్సర్వగన్ధస్సర్వరసః" ఇత్యాదినా,తథా హిరణ్యశ్మశ్రుత్వాది నిర్దేశోఽపి భవిష్యతి" దీనిచే "హిరణ్యశ్మశ్రు ర్హిరణ్యకేశ ఆప్రణఖా త్సర్వఏవసువర్ణః" అనుఛాందోగ్యశ్రుతిని బట్టి పరమాత్మకు రూపవిశేష ముపపన్నమేయని చెప్పబడెను. శాస్త్రములజూచిన యెడల నిట్టి యాక్షేపము లుద్భవింపవు.

—కృష్ణుని సమకాలికు లాతనిని పరమేశ్వరుని యవతారముగ భావింపలేదనుటకు యుధిష్ఠిరాదులే నిదర్శనము? అను ప్రసంగము-తన్నిరాకరణము—

"కృష్ణుని సమకాలికు లాతని పరమేశ్వరుని యవతారముగ భావింపుచుండిరా? యుధిష్ఠిరుడును, భీష్ముడును, అర్జునుడును, ద్రోణుడును, దుర్యోధనుడును, జరాసంధుడును, ఇంక నితరులు నగు కృష్ణుని సమకాలికులయొక్క వర్తనలుగూడ వారిలో నెవర యినను నాతని పరమేశ్వరావతారముగ భావింపలేదని తెలుపు చున్నవి. ఇందుకు నిదర్శనములు.— జరాసంధునితో బోరుటకు కృష్ణుని బంపు నపుడుయుధిష్ఠిరుడు సందేహించుట, జరాసంధుడును శిశుపాలుడును కృష్ణునితో బ్రతిఘటించుట, భీష్మద్రోణులు యుద్ధ మందు కృష్ణుని కెదురై నిలచుట, భగవద్గీతను వినియు నర్జునుడు భీష్మద్రోణులకు వ్యతిరేకముగా బోరాడకపోవుట, అశ్వత్థామ చచ్చినట్లు ప్రచురింపుమని బోధించిన కృష్ణుని యుపాయమునకు అర్జును డంగీకరింపక హేయభావమునగుపరచుటఅనునవి"(పు274)

ఇక నీమాటలకు సమాధానము :— కృష్ణుని సమకాలికులైన సాత్వికప్రకృతులగు యుధిష్ఠిరాదులు అతనిని పరమేశ్వరుని యవతార ముగ భావించియే యుండిరి.

—: కృష్ణావతార రహస్యము :—

కృష్ణభగవానుడు తానేజాతిశరీరము ధరించునో ఆజాతిధర్మ ముల నవలంబించుచుండు నని యుత్తంకమహర్షితో జెప్పిన విష యము వెనుక ప్రదర్శింపబడినది. అది యుక్తమే.

నాటకములలో నటుడు తా నొక పాత్రను ధరించినపుడు ఆపాత్ర

కనుగుణములైన లక్షణములతో నటించుచుండునే కాని తనసహజలక్ష ణములతో నటింపడు. తానుధరించిన పాత్రయొక్క ధర్మములను తాన భినయించునపుడు సమయోచితముగా నాట్యమందో, గానమందో కల తన సహజశక్తిని మాత్రము వెల్లడించుచునే యుండును. కనుకనే నట దృష్టాంతముతో పరమేశ్వరియొక్క యవతారసందర్భమున దేవీభా గవతమందిట్లు చెప్పబడినది:— (స్క-౫—అ౮)

"యథా నటో రంగగతో నానారూపో భవ త్యసౌ।
ఏకరూపస్వభావోఽపి లోకరంజన హేతవే॥
త ద్వైషా దేవకార్యార్థ మరూపాపి స్వలీలయా।
కరోతి బహురూపాణి నిర్గుణా సగుణాని చ॥

అనగా, నేకవిధమైన స్వరూపము, స్వభావము కల నటుఁడు రంగ స్థలప్రవేశములో లోకరంజనమునకై నానారూపములను ధరించునట్లు నిర్గుణము నీరూపము నగు స్వభావము కల పరమేశ్వరి దేవకార్యా ర్థమై లీలామాత్రమున సగుణములగు బహురూపములను ధరించుచు న్నదని భావము.

అట్లే మానవశరీరము ధరించిన కృష్ణభగవానునకు ప్రతివాదు లన్నట్లు "కౌరవులతో బోరాడుట శిశుపాలునితో వాదాడుట జరా సంధునకు బెదరి పారిపోయి యందందు తిరుగాడుట" అనునవి మానవ లక్షణములే కనుక నవి యుక్తములే. ఆలక్షణములతో నటించుచుం డియే సమయోచితముగా తన సహజశక్తిని వినియోగించి యాకౌర వులను, ఆశిశుపాలుని, ఆజరాసంధుని నాయాఘటనలనుబట్టి నిర్మూ లింపజేసెను. ఈవిషయము విష్ణుపురాణమందు గూడ జెప్పబడినది.—

"సర్వే ష్వేతేషు యుద్ధేషు యాదవై స్సపరాజితః।
అపక్రాన్తో జరాసంధ స్స్వల్పసైన్యై ర్బలాధికః॥"

న తద్బలం యాదవానాం విజితం యదనేకశః ।
తత్తు సన్నిధిమాహాత్మ్యం విష్ణో రంశస్య చక్రిణః ॥
మనుష్యధర్మశీలస్య లీలా సా జగతీపతేః ।
అస్త్రాణ్యనేకరూపాణి యదరాతిషు ముంచతి ॥

శ్రీధరీయమ్—

నను చక్రిణ స్సన్నిధిమాత్రమహాత్మ్యాత్త న్నభవతి. స్వయమేవానేకవిధాస్త్రప్రయోగా త్తత్రాహ—మనుష్యధర్మశీలస్యసాలీలేతి.

"మనసైవ జగత్సృష్టిం సంహారం చ కరోతి యః ।
తస్యారిపక్షక్షపణే కియా నుద్యమవిస్తరః ॥
తథాపి యో మనుష్యాణాం ధర్మ స్త మనువర్తతే ।
కుర్వన్ బలవతా సన్ధిం హీనై ర్యుద్ధం కరో త్యసౌ ॥
సామ చోపప్రదానం చ తథాభేదం చ దర్శయన్ ।
కరోతి దండపాతం చ క్వచి దేవ పలాయనమ్ ॥
మనుష్యదేహినాం చేష్టా మిత్యేవ మనువర్తతే ।
లీలా జగత్పతే స్తస్య ఛన్దతః పరివర్తతే ॥ (అం.5.అ23)

అనగా, జరాసంధు డనేకయుద్ధములలో యాదవుల కోడిపోవుటకు శ్రీకృష్ణసాన్నిధ్యప్రభావమే హేతువు. అతడు సృష్టిసంహారములను సంకల్పమాత్రమున జేయగలవాడైనను మనుష్యధర్మము లనతిక్రమించుచు నొకప్పుడుజయించుట, ఒకప్పుడు పారిపోవుట, మొదలగుచేష్టలను చేయుచుండును. అవన్నియు జగదీశుడైన శ్రీకృష్ణునిలీలలే అనిభావము.

ఇదియే కృష్ణావతారమందలి రహస్యము. ఈతత్త్వ మెరుగక భగవానుని మానవధర్మాభినయమును చూచి యీతడు మానవుడే యని శాస్త్రజ్ఞానభక్తి విశ్వాసములు లేని కొందరు భ్రాంతు లగుచున్నారు.

ఈవిషయమై సంజయుఁడాయబారమైన తరువాత వచ్చిన సంజయుఁడు ధృతరాష్ట్రునితో బ్రసంగించునపుడు కృష్ణభగవానునిగూర్చి యిట్లు చెప్పెను—

"భస్మ కుర్యా జ్జగ దిదం మనసైవ జనార్దనః ।
న తు కృత్స్నం జగ చ్ఛక్తం కించి త్కర్తుం జనార్దనే ॥
యత స్సత్యం యతో ధర్మో యతో హ్రీ రార్జవం యతః ।
తతో భవతి గోవిందో యతః కృష్ణ స్తతో జయః ॥
ఈశన్నపి మహాయోగీ సర్వస్య జగతో హరిః ।
కర్మా ణ్యారభతే కర్తుం కీనాశ ఇవ దుర్బలః ॥

టీ. ఈశన్నపి ఈశానోఽపి. కీనాశః కర్షకః ॥

తేన వంచయతే లోకా న్మాయాయోగేన కేశవః ।
యేతమేవ ప్రపద్యన్తే న తే ముహ్యన్తి మానవాః ॥"

శ్రీకృష్ణుఁడు సంకల్పముచేతనే యీజగత్తు నంతను భస్మముఁజేయగలఁడు. జగత్తంతయు నేకమైనను కృష్ణు నేమియు జేయజాలదు. సత్యము, ధర్మము, ఆర్జవము నెక్కడనో అక్కడ కృష్ణుఁడు. కృష్ణుఁ డెక్కడనో అక్కడ జయము. మహాయోగియు, జగదీశ్వరుఁడు నైయుండియు కృష్ణుఁడు దుర్బలుడువలె బనులు చేయుచుండును. అందుచే లోకులు మోహపడి గ్రహింపలేకున్నారు. ఆతనినే భజించువారు మోహితులు కారు. అని. ఇక ఫలితార్థ మేమనగా, ఒకానొకనటుఁడు ఏస్త్రీవేషమునో ధరించి తదనుగుణము లైన చేష్టలతో రంగస్థలమున నటించునపుడు అప్పటి కప్పుడు చూచి యీవ్యక్తి నిజముగా స్త్రీయే యని యనుకొనెడి పామరులు కొందరుందురు. అట్లు నటించుచున్న నటుని పూర్వస్వరూపము తెలిసి యావేషధారణ ప్రస్తావము తెలిసి, వేషమున కనుగుణము లైన చేష్టలతో నీత డెంత చాతుర్యము జూపుచున్నాడో అని

యానటుని పూర్వనామరూపములను స్మరించుచునే యానందించెడి ప్రాజ్ఞులు కొందరుందురు. అట్లే పరమేశ్వరుడు మనుష్యరూపము ధరించి తదనుగుణము లగు చేష్టలతో నటించునపుడు అప్పటి కప్పుడు చూచినవారును, వారి ననుసరించినవారును యీతడు మనుష్యమాత్రుడే అనుకొనెడి పామరులైరి. ఆపరమేశ్వరుని పూర్వస్వరూపమును, అవతారప్రస్తావమును యథార్థముగా తెలిసియున్న మహర్షులును, వారి ననుసరించినవారును ఈతడు పరమేశ్వరుడే యనుకొనెడి ప్రాజ్ఞులైరి. కనుక శ్రీకృష్ణుడు మనుష్యమాత్రుడే యనుకొనువారు మతిమంతులనబడరు.

ఇట్లు మనుష్యధర్మముల నభినయించుచున్న కృష్ణభగవానుని యీశ్వరావతార మని గ్రహించియే యున్న యుధిష్ఠిరాదుల ప్రవర్తనములగూర్చి ప్రతివాదుల కింక జెప్పవలసియున్నది—

— • యుధిష్ఠిరనిదర్శనపరిశీలనము •—

“జరాసంధునితో బోరుటకు కృష్ణుని బంపునపుడు యుధిష్ఠిరుడు సందేహించుట, కృష్ణు డీశ్వరావతార మని యాతడు భావింపలేదనుటకు నిదర్శనమట.”

ఎవని కెట్టి వరము లున్నవో, ఎవ డెవ్వనిచే సంహరింపబడవలసినవాడో, ఏది యెవనికి సంహారకాలమో తెలిసిన పరమేశ్వరావతారమగు కృష్ణభగవానుడు ఆనిర్ణయముల ననుసరించియే దుష్టసంహారమార్గమును కల్పించుచుండుటవలన బట్టి, రాజసూయయాగము జేయుటనుగూర్చి ప్రశంసించిన యుధిష్ఠిరునకు చెప్పుటలో ముందు జరాసంధుని వధించినగాని రాజసూయము నెరవేర దనియు, జరాసంధు డిప్పుడు తాను జయించి బంధించిన మహారాజులను బలి యిచ్చుటకు

సిద్ధపడుచున్నా డనియు, నామహారాజులను విడిపించి యాతని వధింప వలసిన సమయ మిదియే యనియు, మేముగూడ జరాసంధునకు భయ పడి దుర్గముల నాశ్రయించియున్నా మనియు (ఇది మనుష్యలక్షణాభి నయము) జెప్పగా యుధిష్ఠిరుడు—

"అహం హి తవ దుర్ధర్ష భుజవీర్యాశ్రయః ప్రభో ।
నాత్మానం బలినం మన్యే త్వయి తస్మా ద్విశంకితే ॥
త్వత్సకాశాచ్చ రామాచ్చ భీమసేనాచ్చ మాధవ ।
అర్జునాద్వా మహాబాహో హన్తుం శక్యో న వేతివై ॥
ఏవం జానన్హి వార్ష్ణేయ విమృశామి పునః పునః ॥" (సభాప.అ15)

కృష్ణా! నీభుజబలము నాశ్రయించి యున్నవాడను నేను. నీవే యాతనికి భయపడి నప్పుడు నేను బలవంతుడనా? నీకుగాని, బలరాము నకుగాని, భీమార్జునులకుగాని యాతనిని వధింప శక్య మగునో కాదో అని యాలోచించుచున్నాను. అనెను. ప్రతివాదు లన్న యుధిష్ఠిరుని సందేహ మిదియే.

తరువాతప్రసంగములో కృష్ణభగవానుడు జరాసంధుని యు త్పత్తి వరములు వివరించి చెప్పి భీమార్జునులను నాకు నప్పగింతువేని కార్యము నిర్వహించుకొని వత్తుము.

"అలం తస్య మహాబాహు ర్భీమసేనో మహాబలః ।
లోకస్య సముదీర్ణస్య నిధనా యాన్తకో యథా ॥
యది మే హృదయం వేత్సి యది తే ప్రత్యయో మయి ।
భీమసేనార్జునౌ శీఘ్రం న్యాసభూతౌ ప్రయచ్ఛ మే ॥" (అ 20,

అంతకుడు లోకమునంతను కడ తేర్చునట్లు భీమసేనుడు అతనిని కడ తేర్చును. నాహృదయము నీకు తెలిసినయెడల, నాయందు నీకువిశ్వాస మున్నయెడల భీమార్జునులను శీఘ్రముగా నాకునప్పగింపుము. అనిపలి కెను. ఈమాట విని యుధిష్ఠిరుడు—

"అచ్యుతాచ్యుత మా హైవం వ్యాహర్తామిత్రకర్శన!
పాండవానాం భవా న్నాథో భవంతం చాశ్రితా వయమ్ ॥
యథా వదసి గోవిన్ద సర్వం తముపపద్యతే ।
నిహతశ్చ జరాసన్ధో మోక్షితాశ్చ మహీక్షితః ॥
క్షిప్రమేవ యథా త్వేత త్కార్యం సముపపద్యతే ।
అప్రమత్తో జగన్నాథ తథా కురు నరోత్తమ ॥"

కృష్ణా! కృష్ణా! నీవంతమాటననకుము. మాకు నీవే నాథుడవు. నీమాటనుబట్టి జరాసంధవినాశనము, మహారాజవిమోచనము జరిగిన దన్నమాటే. ఓజగన్నాథా! త్వరలో కార్యసిద్ధి యగునట్లు చేయుము. అని చెప్పి వారిని బంపెను. సైంధవవధానంతరము యుధిష్ఠిరుడు కృష్ణ భగవానుని యెట్లు స్తుతించెనో చూడుడు —

"పరమేశ పరేశేశ తిర్యగీశ నరేశ్వర ।
సర్వేశ్వరేశ్వరేశేశ నమస్తే పురుషోత్తమ ॥
మార్కండేయః పురాణర్షి శ్చరితజ్ఞ స్తవానఘ ।
మాహాత్మ్య మనుభావంచ పురా కీర్తితవా న్మునిః ॥
అసితో దేవలశ్చైవ నారదశ్చ మహాతపాః ।
పితామహాశ్చ మే వ్యాస స్త్వా మహు ర్విధి ముత్తమమ్ ॥

(ద్రోణ-ప అ 149)

ఇట్లు పరమేశ్వరుడ వని స్తుతించి, తనకంటె చిన్నవయస్సుకల శ్రీకృష్ణుని నమస్కరించి, మార్కండేయాదిమహర్షులు నీమహత్వ మును నాకు దెలిపియున్నా రని ప్రసంగించెను.

ఇట్టి యుధిష్ఠిరవ్యవహారము కృష్ణుడు పరమేశ్వరావతార మని భావించినట్లు లేదనుట అన్యాయ్యము.

## —:జరాసంధశిశుపాలనిదర్శనపరిశీలనము:—

ఇక జరాసంధుడును శిశుపాలుడును కృష్ణునితో ప్రతిఘటించుట మరియొక నిదర్శనమట.

వారు ప్రతిఘటించుట—కృష్ణునిది పరమేశ్వరావతారము కాదనుటకు నిదర్శన మని మాత్రమనిపించి యట్టి వారి నవలీలగా సంహరించుటలో జూపబడిన కృష్ణభగవానునియద్భుతప్రక్రియ పరమేశ్వరావతారమే యనుటకు నిదర్శనమని ప్రతివాదుల కనిపింపకుండుట చిత్రము!

జరాసంధునిమీదికి వెళ్ళుటలో నిరాయుధులై వెళ్ళుట, పురగిరియం దుంచబడిన భేరీత్రయమును బగులగొట్టుట, అచ్చటి రక్షకభటులాయుధపాణులై యెదుటకు వచ్చుచుండ చైత్యకగిరిమీది కెక్కి-యాగిరిశృంగమును దోర్దండములతో బడగొట్టిపురమందుప్రవేశించుట, ప్రేక్షకుల కాశ్చర్యము గలిగించుచు రాజమార్గమున జనాకీర్ణములైన మూడు కక్ష్యలు దాటి జరాసంధుని సమీపించుట, జరాసంధునితో బ్రసంగించునప్పుడు—

"శౌరి రస్మి హృషీకేశో నృవీరౌ పాండవా విమౌ।
అనయో ర్మాతులేయం చ కృష్ణం మాం విద్ధి తే రిపుమ్॥
త్వా మాహ్వయామహే రాజన్ స్థిరో యుధ్యస్వ మాగధ!
ముంచ వా నృపతీన్ సర్వాన్ గచ్ఛ వా త్వం యమక్షయమ్॥"

వీరిరువురు పాండవవీరులు, నేను నీశత్రువైన కృష్ణుడను. నిన్ను యుద్ధమున కాహ్వానించుచున్నాము. నీవు బంధించియున్న నృపతుల్లను విడిచెదవా? లేక యమలోకమున కేగెదవా? అని యడుగుట, అప్పుడు జరాసంధుడు—నేను బలియిచ్చుటకు దెచ్చి తొత్తుమునకు భంగకరముగా భయపడి యెట్లు విడిచిపెట్టెదను. మీలోనొక్కొక్కనితో నొక్కొ-

క్కసారి కాని, యొకేసారి యందరితోఁగాని, యుద్ధమే చేయఁదుననగా, మాలో నెవ్వనితో యుద్ధముజేయవలె నని నీకనిపించుచున్నదో ఆతని తోనే చేయు మనుట, అప్పుడు భీముని గోరి యుద్ధము చేయునపుడు 13 రోజులు గడచినతరువాత 14వ నాటి రాత్రి కృష్ణా ఈపాపిని బల ముచే నిగ్రహించుట అశక్యముగా నున్నదని భీమసేను డనగా—

"యత్తే దైవం పరం సత్త్వం యచ్చ తే మాతరిశ్వనః ।
బలం భీమ! జరాసంధే దర్శయాశు తదద్య వై ॥"

భీమసేనా! నీదైవబలమును, నీవాయుబలమును శీఘ్రముగానిప్పుడు జరాసంధునియందు జూపుమని శ్రీకృష్ణుడు పలుకుట తడవుగా భీముడు మహాబలము వహించుట, జరాసంధుని గిరగిర ద్రిప్పి యాతని పాదము లొకచేతితోడను హస్తము లొకచేతితోడను అదిమిపట్టి యాతని వీపును తన జానువుల కాని విరిచివేయుట అను విషయములును,

శిశుపాలుని విషయమై ధర్మజుని రాజసూయయాగములో పూజ్యులకు జేయవలసినచ్చిన పూజాసందర్భమున ముందుగా నీమహా సభలో పరమపూజ్యుడగు శ్రీకృష్ణుని పూజింపుమని చెప్పిన భీష్ముని మాటపై శ్రీకృష్ణుని పూజించునపుడు చూచి సహింపని శిశుపాలుడు- శ్రీకృష్ణుడు పూజ్యుడని చెప్పిన భీష్ముని,శ్రీకృష్ణుని నిందింప భీష్ముడు—

"కృష్ణఏవ హి లోకానా ముత్పత్తి రపి చావ్యయః ।
కృష్ణస్యహి కృతే విశ్వ మిదం భూతం చరాచరమ్ ॥

టీ. ఉత్పత్తిరపి ఉపాదాన మపి. అవ్యయః అవినాశీ అపరిణామి త్వాత్. కృష్ణస్య కృతే కృష్ణార్థం. సర్వశేషిత్వాత్ కృతే ఇత్యవ్యయం తాదర్థ్యే నిపాత్యతే భూత ముత్పన్నం తేన వినాశ్యప్యేతత్ కృష్ణ ఏవ సత్య ఇతి జ్ఞేయమ్.

"ఏష ప్రకృతి రవ్యక్తా కర్తా చైవ సనాతనః ।
పరశ్చ సర్వభూతేభ్య స్తస్మా త్పూజ్యతమో౽చ్యుతః (సభాపఅ38)

శ్రీకృష్ణుడే యీజగత్తునకు మూలకారణమైన పరమేశ్వరుడు. కనుక పూజ్యతము డని చెప్పగా శిశుపాలు డుద్రేకించి మహారాజమండలిని యుద్ధమునకు బ్రోత్సహింప సంఘములో సముద్రమంత సంచలన మేర్పడుటయు తరువాత భీష్ముడు—

"ఏష తిష్ఠతి గోవిన్దః పూజితో౽స్మాభి రచ్యుతః ।
యస్య వస్త్వరతే బుద్ధి ర్మరణాయ స మాధవమ్ ॥
కృష్ణ మాహ్వయతా మద్య యుద్ధే చక్రగదాధరమ్ ।
యాదవస్యైవ దేవస్య దేహం విశతు పాతితః ॥"

మాచే బూజింపబడిన శ్రీకృష్ణు డిక్కడనే యుండెను. మీలో నెవ్వని బుద్ధి మరణమునకు త్వరపడుచుండెనో ఆతడిప్పుడు యుద్ధమునకు శ్రీకృష్ణుని పిలువవచ్చును. శ్రీకృష్ణునిచే వధింపబడి కృష్ణభగవానుని దేహమున లగ్నము కావచ్చును. అని పలుకగా శిశుపాలు డుద్యమించి శ్రీకృష్ణునితో—

"ఆహ్వయే త్వాం రణం గచ్ఛ మయాసార్ధం జనార్దన ।
యావ దద్య నిహన్మి త్వాం సహితం సర్వపాండవైః ॥" (అ. 45)

నిన్ను పిలుచుచున్నాను. నాతో యుద్ధమునకు రమ్ము. నిన్నిపుడు పాండవసహితముగా వధింతును. అని గర్జించుచు లేచియుండ కృష్ణభగవానుడు మృదుభాషణములతో సభ్యులకు శిశుపాలుని వెనుకటి యపరాధములను వివరించి చెప్పి యీశిశుపాలుని తల్లి కోరుటను బట్టియింతవరకు అపరాధములను సహించితిని. ఇప్పుడింక క్షమింపను. అని చెప్పగా శిశుపాలుడు నీవు క్రుద్ధుడవైన నేమి? ప్రసన్నుడవైన నేమి? యని ధిక్కరించుచుండ కృష్ణభగవానుడు—.

"తథా బ్రువత ఏవాస్య భగవా న్మధుసూదనః ।
మనసాఽచింతయ చ్చక్రం దైత్యవర్గనిషూదనమ్ ॥
ఏతస్మిన్నేవ కాలేతు చక్రే హస్తగతే సతి ।
ఉవాచ భగవా నుచ్చై ర్వాక్యం వాక్యవిశారదః ॥
శృణ్వన్తు మే మహీపాలా యే నైత త్క్షమితం మయా ।
అపరాధశతం క్షామ్యం మాతు ర స్యైవ యాచనే ॥
దత్తం మయా యాచితంచ తాని పూర్ణాని పార్థివాః ।
అధునా వధయిష్యామి పశ్యతాం వో మహీక్షితామ్ ॥
ఏవ ముక్త్వా యదు శ్రేష్ఠ శ్చేదిరాజస్య తత్క్షణాత్ ।
వ్యపారహ చ్ఛిరః క్రుద్ధ శ్చక్రే ణాఽమిత్రకర్షణః ॥"

స్మరించినంతమాత్రమునఁ వచ్చి చక్రము హస్తము నలంకరింప మహీపతులారా! నేనింతవరకు నీతని తప్పులను క్షమించుటకు కారణ మేమనగా నీతనితల్లి యాచించినపుడు నూరు తప్పులను క్షమింతు నని ప్రతిజ్ఞ జేసితిని. ఇప్పుడా సంఖ్య పూర్తియైనది. ఇక మీరందరు చూచు చుండగా వధించుచున్నాను. అని వెంటనే చక్రముచే శిశుపాలుని శిరస్సు ఛేదించెను.

"తత శ్చేదిపతే ర్దేహా త్తేజోఽగ్ర్యం దదృశు ర్నృపాః ।
ఉత్పత న్తం మహారాజ గగనాదివ భాస్కరమ్ ॥
తతః కమలపత్రాక్షం కృష్ణం లోకనమస్కృతమ్ ।
వవన్దే త త్తదా తేజో వివేశచ నరాధిప ॥
తదద్భుత మమన్యన్త దృష్ట్వా సర్వే మహీక్షితః ।
యద్వివేశ మహాబాహుం త త్తేజః పురుషోత్తమమ్ ॥"

టీ. తేజః లింగశరీరమ్. అగ్ర్యం సంసారానాదితయాఽనాది. తచ్చ భగవతా స్వమహిమానం ప్రకాశయతా సర్వేషాం దృష్టివిషయా

కృతం. తేనాద్భుతతమ మేత ద్దర్శనమ్. "యద్వివేశ మహాబాహుం తత్తేజః పురుషోత్తమమ్" ఇత్యన్తస్య శిశుపాలవధస్య తాత్పర్యమ్. ద్వేషాదినాప్యన్తే భగవత్స్మరణం తత్ప్రాప్తిహేతురితి యదుక్తం శ్రీమద్భాగవతే— "గోప్యః కామా ద్భయా త్కంసో ద్వేషాచ్చైద్యాదయో నృపాః। సంబన్ధా ద్వృష్ణయ స్స్నేహా ద్యూయం భక్త్యా వయం ప్రభో ॥" ఇతి కృష్ణం ప్రాప్తా ఇతి శేషః

తరువాత శిశుపాలుని దేహమునుండి తేజస్సు (లింగశరీరము) ఉద్గమింపగా నందరుజూచిరి. ఆ తేజస్సు కృష్ణభగవానునిలో ప్రవేశించినది. ఆస్థితిని మహీపతులందరు జూచి యత్యద్భుతమని తలంచిరి.

మానవదృష్టికి గోచరింపని యాలింగరూపశరీరమైన తేజస్సు తనమహిమను ప్రఖ్యాపన చేయదలచిన కృష్ణభగవానునిచే సర్వ దృష్టికి గోచరింపజేయబడినది. అందుచేతనే యది యద్భుతదర్శనమైనది. ఈశిశుపాలవధగాథకు తాత్పర్యము— ద్వేషాదులచేతనైనను అవసానకాలమందు జరిగిన భగవత్స్మరణము భగవత్ప్రాప్తిహేతువగు. ఈవిషయము శ్రీమద్భాగవతమందు చెప్పబడినది.

అను విషయములును, కృష్ణభగవానుడు పరమేశ్వరావతారమే యనుటకు నిదర్శనము లని ప్రతివాదులకు దోచకపోయినది. ప్రమాణ ప్రసిద్ధములై విద్వదనుభవసిద్ధములై లోకనిరూఢములై యున్న విషయములను తమబుద్ధి కవిశ్వసనీయములుగా దోచె నని త్రోసివేయుట కలికాలమహిమ కాక మరేమి? శాస్త్రకర్తలు విశ్వసించిన యిట్టి విషయములను ప్రతివాదులుమాత్రము విశ్వసింపరట!

"విప్రచిత్తి రితి ఖ్యాతో య ఆసీ ద్దానవర్షభః।
జరాసన్ధ ఇతి ఖ్యాత స్స ఆసీ న్మనుజర్షభః ॥

దితేః పుత్రస్తు యో రాజన్ హిరణ్యకశిపు స్స్మృతః ।
స జజ్ఞే మానుషే లోకే శిశుపాలో నరర్షభః ॥ ” (ఆది-అ 67)

విప్రచిత్తి యను దానవుడు జరాసంధుడై పుట్టెననియు, హిరణ్యకశిపుడను దైత్యుడు శిశుపాలుడై పుట్టెననియు జెప్పబడుటచేతను, దైత్యదానవప్రకృతులకు భగవంతునితో గూడ ప్రతిఘటించుట సహజమగుటచేతను, జరాసంధశిశుపాలురు కృష్ణభగవానునితో నీవెంతయని ప్రతిఘటించుట వారిప్రకృతులనుబట్టి సముచితముకాని వారి నవలీలగా వధించిన కృష్ణభగవానుని యమానుషచర్యను తిరస్కరించి, యాజరాసంధశిశుపాలుర ప్రతిఘటనమునుమాత్రము పురస్కరించుకొని చేసిన ప్రతివాదులప్రసంగ మనుచితమే.

— :భీష్మద్రోణనిపర్శనపరిశీలనము: —

౩౪. “కృష్ణుని పరమేశ్వరావతారముగా భావింపలేదనుటకు భీష్మద్రోణులు యుద్ధమునందు కృష్ణుని కెదురై నిలుచుటయే యొక నిదర్శనము.”

కృష్ణుడు పూజ్యుడని రాజసూయమున ప్రసంగించిన శిశుపాలుని నుందలించునపుడు “కృష్ణ ఏవహి లోకానా ముత్పత్తిరపి చావ్యయః ” అనుచు కృష్ణుడు పరమేశ్వరు డగుటచే పూజ్యతము డని వెనుక జూపబడినట్లు ప్రసంగించిన భీష్ముడు కృష్ణుని పరమేశ్వరావతారముగా భావింపనివాడా?

యుద్ధ మారంభించి నాలుగు రోజులైన తరువాత నచ్చుగిన నాటిరాత్రి దుర్యోధనుడు భీష్మునియొద్దకు వచ్చి మనపక్షమందున్న మహారథులందరు నోడిపోవుచుండిరి. ప్రతిక్షణము ననలన్న పాండవులే జయించుచుండిరి. పాండవులకుగల బలమేమని యడిగినపుడు భీష్ముడు.

కృష్ణభగవాను నాశ్రయించియుండుటే బలమనుచు విశ్వోపాఖ్యానము చెప్పుచు పరశురామ మార్కండేయ వేదవ్యాస నారదమహర్షులవలన తాను వినియున్న బ్రహ్మగీతల నుపదేశించుచున్నాడు—

"తస్మా త్సేంద్రై స్సురై స్సర్వై ర్లోకై శ్చామితవిక్రమః ।
నావజ్ఞేయో వాసుదేవో మానుషోఽయమితి ప్రభుః ॥
యశ్చ మానుషమాత్రోఽయ మితి బ్రూయా త్స మన్దధీః ।
హృషీకేశ మవజ్ఞానా త్త మాహుః పురుషాధమమ్ ॥
వారితోఽసి మయా తాత మునిభి ర్వేదపారగైః ।
మాగచ్ఛ సంయుగం తేన వాసుదేవేన ధన్వినా ॥
మాపాండవై స్సార్థ మితి త త్త్వం మోహా న్న బుధ్యసే ।
మన్యే త్వాం రాక్షసం క్రూరం తథాచాసి తమోవృతః ॥ "
(భీష్మ ప—అ ౬౬)

ఇంద్రాదిదేవతలు సర్వలోకములు వాసుదేవుని గూర్చి మనుష్యు డీత డని తిరస్కరింపరాదనియు, నేమందమతి కృష్ణభగవానుని మనుష్యమాత్రుడని చెప్పుచు నీసడించునో, అతడు పురుషాధము డనబడు ననియు బ్రహ్మ బోధించెను. దుర్యోధనా! కృష్ణునితోడను పాండవుల తోడను యుద్ధమునకు సిద్ధపడబోకు మని నేనును వేదపారంగతులగు మునులును నిన్ను వారించినాము. నీవు మూఢత్వముచే తెలిసికొనలేదు. నీతామసలక్షణమునుబట్టి నిన్ను క్రూరుడగు రాక్షసునిగా భావించుచున్నాను. అని బోధించెను. ఇట్టి భీష్ముడు కృష్ణుని పరమేశ్వరావతారముగా భావింపనివాడా? తొమ్మిదవనాటి భీష్మార్జునయుద్ధములో నర్జునుడు భీష్ముని ధనస్సులను ఛేదించుచుండగ భీష్ముడు "సాధుసాధు మహాబాహో" అని మెచ్చుకొనుచు ప్రచండయుద్ధము చేయుచుండుటయు, అర్జునుడు మృదుపూర్వకముగ యుద్ధము చేయుచుండుటయు గూచి

కృష్ణభగవానుడు రథమునుండి క్రింది కురికి సింహనాదము చేసి కృష్ణుడై భీష్ముని మీదికి వడివడి వచ్చునప్పుడు చూచుచు నందరు "హతో భీష్మ హతో భీష్మః" అనుచుండ తనమీదికి వచ్చు శ్రీకృష్ణుని జూచి భీష్ముడు—

"ఏహ్యేహి పుండరీకాక్ష దేవదేవ నమోఽస్తు తే ।
మామద్య సాత్వతశ్రేష్ఠ పాతయస్వ మహాహవే ।
త్వయాహి దేవసంగ్రామే హతస్యాపి మమానఘ ।
శ్రేయఏవ పరం కృష్ణ లోకే భవతి సర్వతః ॥
సంభావితోఽస్మి గోవింద త్రైలోక్యేనాద్య సంయుగే ।
ప్రహరస్వ యథేష్టం వై దాసోఽస్మి తవచానఘ । (భీష్మ-అ 106)

దేవదేవా! రమ్ము రమ్ము. నీకు నమస్కారము. నీచే హతుడనైనను నాకు పరమశ్రేయస్సే. ఇప్పుడు యుద్ధములో త్రైలోక్యగౌరవము నొందితిని. నీయిష్టము వచ్చినట్లు నాపై ప్రహారములు గావింపుము. నీకు నే దాసుడను అనెను. ఇట్టి భీష్ముడు కృష్ణుని పరమేశ్వరావతారముగా భావింపనివాడా?

భీష్మద్రోణులు యుద్ధమందు కృష్ణుని కెదురై నిలిచినట్లు ప్రతివాదులు వ్రాసినారు. కాని భీష్మద్రోణులు, శ్రీకృష్ణునిగాని శ్రీకృష్ణరక్షితులగు పాండవులనుగాని జయింపగలమని యుద్ధమునకు దిగలేదు. వారెప్పుడు చెప్పినను 'అజేయౌ కృష్ణపాండవౌ' అనియే చెప్పుచు వచ్చిరి. దుర్యోధనుడు వారలను ప్రార్థించి రప్పించినాడు. ఎట్లు భీష్ముని ప్రార్థించెనో చూడుడు—

"భవా నుశనసా తుల్యో హితైషీ చ సదా మమ ।
అసంహార్యః స్థితో ధర్మే స నస్సేనాపతి ర్భవ ॥

టీ. ఉశనసా సమక్రోణ అసంహార్యః సురాసురదానవా త్వం-త్వేః సంహర్తు మశక్యః.

"భవతా హి వయం గుప్తా శ్శక్రేణేవ దివౌకసః ।
అనాధృష్యా భవిష్యామ త్రిదశానా మపి ధ్రువమ్ ॥
ప్రయాతు నో భవా నగ్రే దేవానా మివ పావకిః ।
వయం త్వా మనుయాస్యామ సౌరభేయా ఇవర్షభమ్ ॥

పితామహా! నీవు శుక్రునితో సమానుడవు. ఎవ్వరును నాపహ- తము గొనవాడవు. నీతండ్రిచే నీయబడిన స్వచ్ఛందమరణవరము కల వాడవగుటచే నీవన్యులచే సంహరింపబడనివాడవు. ధర్మబద్ధుడవు. కావున నీవు సేనానాయకుడవు కావలసిన దని ప్రార్థించుచున్నాను. నీచే రక్షితులమైన మేము దేవతలనుగూడ లక్ష్యపెట్టనివారమై యుందుము. దేవ తాసేనలకు కుమారస్వామి ముందు నడచినట్లు మాకు ముందు నీవు నడువవలెను. నీవెంట మేము వత్తుము. అని ప్రార్థింప భీష్ముడు—

"ఏవ మేత న్మహాబాహో యథా వదసి భారత ।
యథైవహి భవన్తో మే తథైవ మమ పాండవాః ॥
అపిచైవ మయా శ్రేయో వాచ్యం తేషాం నరాధిప ।
సంయోద్ధవ్యం తవార్థాయ యథా మే సమయః కృతః ।
న త్వేవోత్సాదనీయా మే పాండోః పుత్రా జనాధిప ॥" (ఉద్యో. అ. 156)

నీవన్నది నిజమే. నాకు మీరెట్టివారో అట్టివారే పాండవులు. పాండవులకు శ్రేయస్సును చెప్పవలెను. మీనిమిత్తమై యుద్ధము చేయ వలెను. అని నిర్ణయించుకొంటిని. పాండవులు నాచేత నశింపజేయశక్యము కానివారు. (న మే మయా ఉత్సాదనీయాః నాశయితుం శక్యాః. టీ)

అని చెప్పెను. దీనిచే పార్థునకైక క్షాత్రధర్మమునుబట్టి యుద్ధమున చావలెననియు, పాండవులకు శ్రేయస్సు నుపదేశింపవలెనను మాటచే తన మరణోపాయప్రకటనమున క్షత్రియవిహితమైన యుద్ధమరణము నాతడపేక్షించె ననియు గోచరించుచునే యున్నది.

(శ్రీ) కృష్ణునిరాయబారము ను త్రోసివేసి దుర్యోధనుడు యుద్ధోద్యుక్తుడై యుండ భీష్మద్రోణులు బోధించినను వినకుండిన దుర్యోధనునితో మరల ద్రోణుడేమనెనో చూడుడు—

"దత్తం హుత మధీతంచ బ్రాహ్మణాస్సంతర్పితా ధనైః।
ఆవయో ర్గత మాయుశ్చ కృతకృత్యౌచ విద్ధి నౌ॥
త్వంతు హిత్వా సుఖం రాజ్యం మిత్రాణిచ ధనానిచ।
విగ్రహం పాండవైః కృత్వా మహ ద్వ్యసన మాప్స్యసి॥
యస్య మంత్రీ జనార్దనో యస్య భ్రాతా యస్య ధనంజయః॥
సర్వశస్త్రభృతాం శ్రేష్ఠః కథం జేష్యసి పాండవం॥" (ఉద్యో. అ 139)

దుర్యోధనా! భీష్ముడును నేనును దానములు హోమములు అధ్యయనము మొదలగు జన్మసార్థక్యహేతువులగు కార్యములను చేసి కొంటిమి. మా కాయువుగూడ గతించినది. మేము కృతార్థులమే. నీవు మాత్రము సుఖమును రాజ్యమును మిత్రులను ధనమును విడనాడి పాండవవిరోధమూలమున గొప్ప ఆపదను పొందుదువు. ఎవ్వనికి మంత్రి జనార్దనుడో సర్వశస్త్రజ్ఞుడగు నర్జునుడు సోదరుడో అట్టి యుధిష్ఠిరుని నీవెట్లు జయింపగలవు? అనెను.

దీనిలో మా ఆయుః పరిసమాప్తి కీయుద్ధము సూచకమనియు, కృష్ణభగవాను నాశ్రయించియున్న పాండవులను నీవు జయించుట సున్న యనియు జెప్పుటనుబట్టి క్షాత్రధర్మము నవలంబించి యుండుటవలన భీష్మునితోపాటు ద్రోణునకుకూడ యుద్ధమరణము నపేక్షించినదే యుద్ధములో చావగోరెనని గోచరించుచునే యున్నది.

కనుక భీష్మద్రోణులు ప్రతివాదు లన్నట్లు కృష్ణుఁడు పరమేశ్వరావతారము కాఁడని భావించి యుద్ధమునకు దిగలేదనుట స్పష్టమైనసందున ప్రతివాదుల యీనిదర్శనము ప్రతిహతమైనది.

## — ♦ అర్జున నిదర్శన పరిశీలనము ♦ —

ఇక "భగవద్గీతను వినియు నర్జునుఁడు భీష్మద్రోణులకు వ్యతిరేకముగా పోరాడకపోవుట, అశ్వత్థామ చచ్చినట్లు ప్రచురింపుమని బోధించిన కృష్ణుని యుపాయమున కర్జును డంగీకరింపక హేయభావము నగపరచుట" అనున దొక నిదర్శనమట.

ప్రతివాదు లుదహరించిన యీవిషయములు అర్జునునకు భీష్మద్రోణులయందుగల భక్తివిశేషమునకు నిదర్శనములగునా? శ్రీకృష్ణుఁడు పరమేశ్వరావతారము కాఁడనుటకు నిదర్శనము లగునా? మొట్టమొదట యుద్ధభూమిలో బ్రవేశించి చూచిన యర్జునుఁడు—

"కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన ।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన ॥"

అనుచు పూజ్యులైన భీష్మద్రోణుల నెదుర్కొని యుద్ధమెట్లు చేయగలనని విరమింపఁబూనినపుడు భగవద్గీతను వినియే యుద్ధమునకు బూనుకొనెను. భీష్మునితో యుద్ధము తటస్థించినపుడు మహాస్త్రములను ప్రయోగింపక భీష్మునియందలి భక్తిచే మృదుమార్గమున యుద్ధము నడుపుచుండ కృష్ణభగవానుడే వధించునట్లు భీష్మునిమీదికి రథము దిగి పరుగిడు సమయమున నర్జునుఁడు పరుగిడి శ్రీకృష్ణుని చరణములు బిగియఁబట్టుకొని మహానీయా? నీవు వెనుక యుద్ధము చేయనని ప్రతిజ్ఞ జేసియున్నావు. నీవీ కార్యమునుండి మరలుము. అని ప్రార్థించునప్పుడు —

"మమైష భార స్సర్వోహి హనిష్యామి పితామహమ్ ।
శపే కేశవ శస్త్రేణ సత్యేన సుకృతేనచ ॥" (భీష్మ. అ. 106)

కృష్ణా! ఈకార్యభారమంతయు నాపై నున్నది. భీష్మపితామహుని వధింతును నాశస్త్రము నాసత్యము నాసుకృతములతోడుగా శపథము చేయుచున్నాను. అనెను.

దశమదివసయుద్ధములో సమీపములో నున్న యుధిష్ఠిరుని జూచి భీష్ముడు —

"యుధిష్ఠిర మహాప్రాజ్ఞ సర్వశాస్త్రవిశారద ।
శృణుష్వ వచనం తాత ధర్మ్యం స్వర్గ్యంచ జల్పతః ॥
నిర్విణ్ణోఽస్మి భృశం తాత దేహే నానేన భారత ।
ఘ్నతశ్చ మే గతః కాల స్సుబహూన్ ప్రాణినో రణే ॥
తస్మా త్పార్థం పురోధాయ పంచాలాన్ సృంజయాం స్తథా ।
మద్వధే క్రియతాం యత్నో మమచే దిచ్ఛసి ప్రియమ్ ॥
(భీష్మ—అ 115)

ఓయుధిష్ఠిరా! ధర్మబద్ధము స్వర్గసాధనము నైన నాయీ మాటనువినుము. రణరంగమం దసంఖ్యాకముగా ప్రాణులను వధించుచున్న నాకు కాలము గడచినది. ఈశరీరముతో నాకత్యంతము విరక్తి కలిగినది. కనుక నాకుప్రీతి కలిగింపదలతువేని అర్జునుని పురస్కరించుకొని మహావీరులతో నన్ను వధించు ప్రయత్నము చేయవలెను. అని ధర్మాధర్మము లెరిగినవాడు కనుక మరణముకూడ తనయిష్టానుసారము రావలసిన వరము కలవాడు కనుక జెప్పెను.

తరువాత సంకులయుద్ధము ప్రచండముగా జరిగినది. అందు భీష్మార్జునులు డీకొనిరి, అర్జును డఖండశరాక్రమము జూపుచు భీష్ముడు

ధరించు ధనస్సుల నెల్ల ఖండించి భీష్మునిచే ప్రయోగింపబడిన శక్తిని ఛేదించి భీష్ముని కెదుట నిలిచి యుద్ధముచేయు శిఖండిని కాపాడి ఆగ్నత్తముగా పోరెను. అప్పు డర్జునబాణములచే భిన్నహృదయుడగుచున్న భీష్ముడు తనపై శిఖండిబాణములుకూడ పడుచున్నను తన శరీరమును ఛేదించి వేదనకలిగించెడి యీబాణములు అర్జుననివికాని శిఖండివి కావనుచు దుశ్శాసనునితో చెప్పిన సందర్భ మిట్లున్నది—

" అర్జునస్య ఇమే బాణా నేమే బాణా శ్శిఖండినః।
కృన్తన్తి మమ గాత్రాణి మాఘమాసే గవాఇవ ॥

టీ॥ 'మాఘమా కర్కటీ ప్రోక్తా తదపత్యాన్తు సేగవా' యథా మాఘమాం కర్కటీం మాతరం సేగవా స్తదపత్యాని కృన్తన్తి ఉదర స్థా న్యపత్యాని పృష్ఠం విదార్య బహి ర్నిర్గచ్ఛన్తి తద్వ దిత్యర్థః. తేన ప్రాణాపహారి వేదనాజనకత్వం బాణానాం, నేదం శిఖండిబాణేషు సంభవతి. తేషాం మదంగే పుష్పతుల్యత్వాత్ ॥

"సర్వేప్యాపి న మే దుఃఖం కుర్యు రన్యే నరాధిపాః।
వీరం గాండీవధన్వాన మృతే జిష్ణుం కపిధ్వజమ్ ॥" (అ 119)

అనగా, పీతకడుపులో నుండిసంతానము పృష్ఠభాగమును ఛేదించుకొని యీవలకు వచ్చినట్లు శరీరమును ఛేదించుచు ప్రాణాంతకములగుచున్న యీబాణము లర్జుననివి కాని శిఖండివి కావు. ఒక్క అర్జునుడు తప్ప ఇతరనరపతులెల్లరు కలిసియు నాకు దుఃఖము గలిగింపజాలరు. అని భావము. ఇట్లుపోరి భీష్ముని పడగొట్టినవాడు కృష్ణభగవానునివలన భగవద్గీతను విన్నట్టి యర్జునుడే.

—:ఇక ద్రోణవిషయము:—

ద్రోణుని దైవదవనాటియుద్ధములో నుండిపడుచు దివ్యాస్త్రములను ప్రయోగించుచు పాండవసేనాసమూహమును ప్రవేశించి సర్వసేనా

సంహారము గావించుచు వీరవిహారము జేయుచున్న ద్రోణుని జూచి, గురుభక్తిచే నెదుర్కొనకుండిన యర్జునుని మూలమున నిర్వీర్యులు నిరుత్సాహులు నగుచున్న పాండవులతో కృష్ణభగవాను డిట్లనెను.

"నైష యుద్ధేన సంగ్రామే జేతుం శక్యః కథంచన ।
సధను ర్ధన్వినాం శ్రేష్ఠో దేవైరపి సవాసవైః ॥
న్యస్తశస్త్రస్తు సంగ్రామే శక్యో హన్తుం భవే న్నృభిః ।
ఆస్థీయతాం జయే యోగో ధర్మ ముత్సృజ్య పాండవాః ॥
యథా వస్సంయుగే సర్వా న్నహన్యా ద్రుక్మవాహనః ।
అశ్వత్థామ్ని హతే నైష యుధ్యే దితి మతిర్మమ ॥
తం హతం సంయుగే కశ్చి దస్మై శంసతు మానవః ।
ఏత న్నారోచయ ద్రాజన్ కున్తీపుత్రో ధనంజయః ॥
అన్యే త్వరోచయన్ సర్వే కృచ్ఛ్రేణతు యుధిష్ఠిరః (ద్రోణ—అ190)

ఈద్రోణాచార్యుని చేతిలో ధనుస్సున్నంతవరకు ఇంద్రాదులు కూడ నేవిధమునను ద్రోణుని జయింపలేరు. శస్త్రసంన్యాసముజేసినచో మనుజులకు వధింప శక్యమగును. పాండవులారా! ఈతఁడు మనల నందరను వధింపకుండుటకై ధర్మమును విడిచి జయోపాయము నాశ్రయింపవలెను అశ్వత్థామ హతుఁడైనపు డీతఁడు యుద్ధమునుండి విరమించునని నావిశ్వాసము. ఆయశ్వత్థామ యుద్ధములో హతుఁడయ్యె నని ద్రోణున కెవ్వఁడేని చెప్పవలెను. అని పలుకగా నర్జును డందు కంగీకరింపలేదు. ఇతరు లంగీకరించిరి యుధిష్ఠిరుఁడు అతికష్టముమీఁద నంగీకరించెను.

అస లిచ్చట వచ్చిన చిక్కే మనగా నాఁడు గురుఁడై సర్వసంహారము జేయుచున్న ద్రోణుఁడు మరియొకపూట యుద్ధ మావిధముగా జేసినయెడల పాండవపక్ష మంతయు నిర్మూలనము కావలసిన స్థితి సంభవించి నది ఈమాట యుధిష్ఠిరునితో కృష్ణభగవానుఁ డనెను.

"యద్యర్ధదివసం ద్రోణో యుధ్యతే మన్యు మాస్థితః ।
సత్యం బ్రవీమి తే సేనా వినాశం సముపైష్యతి ॥
స భవాన్ త్రాతు నో ద్రోణా త్సత్యాజ్జ్యాయో ఽనృతం వచః "

ఈద్రోణుడు ఈవిధముగా క్రుద్ధుడై యింకొకపూట యుద్ధము చేసిన యెడల నిజముగా నీసేనకు వినాశము తప్పదు. కనుక నీవు ద్రోణుని నుండి మమ్మందరిని కాపాడుము. ఇప్పుడు సత్యముకంటె నన్నృతమే యుక్తము. అని. ఇట్టిస్థితిలో ద్రోణు డస్త్రసంన్యాసము చేసినగాని పాండవపక్షమునకు రక్షణ మేర్పడదు. అశ్వత్థామ హతుడయ్యెనని వినినపుడు కాని యాతడస్త్రసంన్యాసము చేయడు. అసత్యమాడినగాని ద్రోణు డట్టి మాటను వినుట సంభవింపదు. ఆ యసత్యము విశ్వసనీయుడు చెప్పినపుడు కాని కార్యకారి కానేరదు.

ఇట్టి యాపత్సమయములో సహస్రసంఖ్యాకులగు యోధుల ప్రాణములను కాపాడుటకై ఆడిన యసత్యము యొక్క దోషము గొప్పదా? లేక సత్యవ్రతముతో నపాయమాశ్రయించక యుండి తమవారి ప్రాణములను ద్రోణాచార్యమహాస్త్రజ్వాలల కర్పణము చేసిన సత్యాశ్రిత దోషము గొప్పదా? అని యాలోచించి సర్వసంహారమూలకదోషముకంటె నసత్యదోష మల్పమనియెంచి "ధర్మాజ్జేతు మశక్యం చేద్ధర్మం త్యక్త్వా పరిజయేత్ " ధర్మముచే జయించుట శక్యము కానపుడు ధర్మమును విడిచియైనను శత్రువును జయింపవలెను. అను న్యాయమును ధర్మమును విడిచి యీసమయమం దసత్యమాడి సేనను కాపాడుమని శ్రీకృష్ణుడు యుధిష్ఠిరునకు బోధించెను. ఈసమయమం దాడిన యసత్యము అసత్యాభాసమే కాని యసత్యము కాదు. ఈసంగతి కర్ణపర్వారంభమున నీలకంఠీయమందు చెప్పబడినది. చూడుడు —

"శరణాగతస్యాస్య సికతాత్రాణార్థ మన్యాయేనాఽపి కృతో బ్రహ్మవధో నేతరబ్రహ్మవధవ దస్థానేఽపితు అనర్థాఽభాస ఏవ. (న చ తేన బ్రహ్మహా భవేత్) ఇత్యాతతాయివధే దోషాభావస్మరణాత్ "

యుధిష్ఠిరుడు, ఎన్నడును నసత్యమాడి యెరుగని తనచే పల్కిం చిన చిక్కునకు చింతించి, భీష్మవధసందర్భములో బృహస్పతివచన ముదాహరించుచు కృష్ణభగవానుడు—

"జహి భీష్మం స్థిరో భూత్వా శృణు చేదం వచో మమ ।
యథోవాచ పురా శక్రం మహాబుద్ధి ర్బృహస్పతిః ॥
జ్యాయాంస మపి చేద్వృద్ధం గుణై రపి సమన్వితమ్ ।
ఆతతాయిన మాయాన్తం హన్యా ద్ఘాతక మాత్మనః ॥"

టీ. ఆతతాయినమిత్యస్య ఘాతకమితి విశేషణమన్యేభ్య ఆతతా యిభ్యో వ్యవచ్ఛేదాయోక్తమ్"

"శాశ్వతోఽయం స్థితో ధర్మః క్షత్రియాణాం ధనంజయ ।
యోద్ధవ్యం రక్షితవ్యం చ యష్టవ్యం చానసూయుభిః ॥ (భీష్మ—అ107)

స్థైర్యము వహించి భీష్ముని వధింపుము. పూజ్యుడైనను వృద్ధుడైనను గుణవంతుడైనను తన్ను హింసింపవచ్చువానిని వధింపవలసినదే యని పూర్వ మింద్రునికి మహాబుద్ధికల బృహస్పతి బోధించెను. క్షత్రియుల కిది శాశ్వతధర్మమై యున్నది. యుద్ధము చేయవలెను. ప్రజలను పాలింపవలెను. యాగములు చేయవలెను. అని బోధించిన విషయ మును స్మరించి, అభిమన్యువధ సందర్భములో—

"అన్తరిక్షే చ భూతాని ప్రాక్రోశన్త విశాంపతే ।
దృష్ట్వా నిపతితం వీరం చ్యుతం చన్ద్రమివామ్బరాత్ ॥
ద్రోణకర్ణముఖైః షడ్భి ర్ధార్తరాష్ట్రై ర్మహారథైః ।
ఏకోఽయం నిహతశ్శేతే నైష ధర్మో మతో హి నః ॥ (ద్రోణ..అ49)

ఆర్గురు ద్రోణాదిమహారథులు ఒక్క అభిమన్యునిపై బడి వధిం చినారు. ఇది యధర్మమని యంతరిక్షమునందున్న వా రాక్రోశించినట్లు

కర్ణ, శల్య, కృప, కృతవర్మాశ్వత్థామ సహితుఁ డగుచు ద్రోణుఁడు అభి
మన్యు నధర్మవిషయమై యవలంబించిన యధర్మమును స్మరించి, అధర్మ
మవలంబించిన వాని విషయమై యధర్మ మవలంబింపవచ్చు నను పద్ధ
తిని తాన ప్పు డసత్యమాడుట యను నధర్మమునకు కష్టముమీఁద సమ్మ
తించెను.

అర్జునుఁడు తాను జగదేకవీరుఁ డగుటను కారణభూతుఁడను 'పార్థ
వనే ధనుర్ధరః' అను మహాయశస్సును తన కనుగ్రహించినవాఁడును,
గురువు నగు ద్రోణాచార్యునివిషయమై అట్లు చేయుటను సమ్మ
తింపలేదు.

ఇప్పుడు ప్రతివాదులు కృష్ణుని పరమేశ్వరావతారమని భావిం
చిన యర్జునుఁడు కృష్ణుని యుపదేశమున కేల సమ్మతింపలేదు? అని
యడుగుదురు కాఁబోలు. ఆ చేయున దధర్మమే యని యాకృష్ణుఁడు చెప్పు
టచేత సమ్మతింపలేదు. అది యెట్లైనను పరమేశ్వరావతారము చెప్పి
న పుడు భక్తితో నంగీకరింపలేదేమందురు కాఁబోలు. "యస్య దేవే
పరా భక్తిర్యథా దేవే తథా గురౌ" అనుటనుబట్టి శ్రీకృష్ణునియం
దెంత భక్తియో, అంతభక్తియు గురువగు ద్రోణాచార్యునియం దుం
డుటచేత నంగీకరింపలేదు.

ఇట్లు పరిశీలింపఁగా కృష్ణునకు పరమేశ్వరావతారము కాదను
టకు అర్జునుని చర్య కూడ ప్రతివాదు లన్నట్లు నిదర్శనము కాకపోయి
నది. కాని కృష్ణునకు సమకాలికులైన యుధిష్ఠిరాదులచర్యలు కృష్ణు
నిది పరమేశ్వరావతారము కాదనుటకు నిదర్శనము లని ప్రతివాదులు
చేసినయసంగతప్రసంగములు వారుమహాభారతతాత్పర్య మెఱుగరనియు,
శాస్త్రవాసన లేనివారనియు, ఆర్షసంప్రదాయము తెలియనివారనియు,
అనాదిసిద్ధ నిర్దుష్టవిద్వాన్మార్గదూషణోద్యుక్తు లనియు, ప్రాజ్ఞులు నిశ్చ

యించుటకుమాత్రము నిదర్శనములైనవి. ఇంతవరకు పరమేశ్వరరూప
మగు శ్రీకృష్ణభగవానుని శిష్టరక్షణ దుష్టశిక్షణాదిగుణములనుపదేశించి
భగవత్స్వరూపజ్ఞానముకలుగజేసిలోకులనుద్ధరించుటయందే మహాభారత
మునకుముఖ్యతాత్పర్యమనియు, పరమేశ్వరునవతారములెత్తుట అసంభ
వముకాదనియు, భగవద్గీతయందీవిషయముస్పష్టమనియు, భగవద్గీతమహా
భారతాంతర్గతమేననియు, భగవద్గీతయందే గాక మహాభారతమందన్యస్థ
లములలోగూడ శ్రీకృష్ణుడు పరమేశ్వరావతారమని యనేకప్రసంగము
లలో నిరూపింపబడియున్నదనియు, శ్రీకృష్ణుడు తానీశ్వరుని యవతార
మని భగవద్గీతలో జెప్పుటేకాక మహాభారతమందలి తదితరస్థలములలో
గూడ నాయా సందర్భములలో చెప్పుచు వచ్చెననియు, శ్రీకృష్ణుని
సమకాలికులు, ఆతనిని పరమేశ్వరావతారముగా భావించుచునే యుం
డిరనియు, ప్రమాణోపపత్తులతో ప్రతివాద్యాక్షేపపరిహారపూర్వక
ముగా నిరూపించి దిక్ప్రదర్శనము చేయబడినది. ఇంతటితో లజపతి
రాయిగారి గ్రంథవిషయమును విడిచిపెట్టి ఇక మ. భా. చ. కారుల
వ్రాతల నందుకొందము.

—శ్రీకృష్ణబలరాములు విష్ణుమూర్తియొక్క నల్లని తెల్లని వెండ్రుకలు
అను ప్రసంగము—తన్నిరాకరణము—

మ. భా. చ. (మహాభారతచరిత్ర) కారుల వ్రాత యిట్లున్నది—

"మహాభారతములో వర్ణింపబడిన దేవతామహిమల గొన్నిటి
నిందుసూచించుచున్నాను. అందు భారతగాథకు ప్రధానపురుషుడగు
శ్రీకృష్ణునియందారోపించిన దేవతామహిమల ముందుగ బేర్కొనె
దను. శ్రీకృష్ణబలరాములు సాక్షాద్విష్ణువుయొక్క యవతారము లని
పెక్కు పురాణములలో గలదు. కాని మహాభారతముయొక్క ఆదిప
ర్వములోనిట్లు వ్రాయబడినది—విష్ణుమూర్తి తెల్లనిదియు, నల్లని

దియు, నగు రెండు వెంట్రుకలను పెరికి యాదవకులమునందలి దేవకీ రోహిణులయందు బ్రవేశపెట్టెను. ఆ రెండు వెంట్రుకలలో దెల్లని వెంట్రుక బలరాముడయ్యెను. నల్లని వెంట్రుక శ్రీకృష్ణుడయ్యెను." (పు 0)

"శ్రీమద్భాగవతపురాణము కృష్ణబలరాములు భగవంతుని నల్లని, తెల్లని, వెంట్రుకలనిద్వితీయస్కంధమున జెప్పెను. కాని దశమస్కంధము వచ్చునప్పటికి కాసంగతిని మఱచి కాబోలు కేవలాపర విష్ణుడే దేవకీగర్భమునం జన్మించె నని చెప్పెను. బమ్మెరపోతన దాని నాంధ్రీకరించుటలో దన్మయుడై పెంచి యాంధ్రీకరించెను." (పు 204)

ఈవ్రాతలో మొదట "మహాభారతములో వర్ణింపబడిన దేవతామహిమల గొన్నిటిని సూచించుచున్నాను" అని చెప్పి "అందు శ్రీకృష్ణునియం దారోపించిన దేవతామహిమల ముందుగ జేర్కొనెదను" అని ప్రతిజ్ఞ చేసి "శ్రీకృష్ణబలరాములు సాక్షాద్విష్ణువుయొక్కయవతారము లని పెక్కుపురాణములలో గలదు. కాని మహాభారతాదిపర్వములో విష్ణుమూర్తి దేవకీరోహిణులయందు బ్రవేశపెట్టిన నల్లని తెల్లని వెంట్రుకలే శ్రీకృష్ణబలరాములయ్యెనని వ్రాయబడినది" అని వ్రాసిన ప్రతివాదుల నడుగవలసియున్నది.

మహాభారతములో వర్ణింపబడి శ్రీకృష్ణునియం దారోపించిన దేవతామహిమల జేర్కొనెద నని కదా మీరు చేసిన ప్రతిజ్ఞ. అట్లని మీరు పేర్కొనినవి "శ్రీకృష్ణబలరాములు సాక్షాద్విష్ణువుయొక్క యవతారములని పెక్కు పురాణములలో గలదు" అని యొక విషయము. 'మహాభారతములో దేవకీరోహిణులయందు విష్ణుమూర్తి ప్రవేశపెట్టిన నల్లని తెల్లని వెంట్రుకలే శ్రీకృష్ణబలరాములయ్యె నని వ్రాయబడినది' అనున దొక విషయము కదా,

ఇందు కృష్ణునియం దారోపించిన దేవతామహిమయని మీర నునదేది? పురాణములలో సాక్షాద్విష్ణువుయొక్క యవతార నుని యున్న విషయ మున్నదా? అది మీరు చేసిన ప్రతిజ్ఞనుబట్టి మహా భారతములో వర్ణింపబడినది కాదుకనుక మీరు దానినిచూపుటకు వీలు లేదు. ఇక దేవకియందు విష్ణుమూర్తి ప్రవేశపెట్టిన నల్లనిరెం డుశ్రీక కృష్ణు డయ్యెనను విషయమున్నదా?

అప్పుడు విష్ణుమూర్తి నల్లనివెంట్రుకి కృష్ణు డయ్యెననుటలో కృష్ణునియం దారోపించిన దేవతామహిమ యేమున్నది? తన కేశ మునే శ్రీకృష్ణు నావిర్భవింపజేసిన విష్ణుమూర్తి దామహిమ యనవ లెను. మీరు, సాక్షాద్విష్ణువుయొక్క అవతారమే శ్రీకృష్ణుడని మహా భారతమందున్నదని చూపినపుడే "కృష్ణునియందారోపించిన దేవతామ హిమలను చేర్కొనెదను" అని మొదట చేసిన ప్రతిజ్ఞకు, తరువాత వ్రాసినయీవ్రాతకు సంబంధ మేమున్నది? పురాణములలో నొకవిధ ముగా నున్నది. మహాభారతములో మరొకవిధముగా నున్నదనుచు తమప్రతిజ్ఞకు సంబంధము లేని విషయము వ్రాయుట యప్రస్తుతప్రసం గము. ఇట్లు పరిశీలింపగా తా మేమనుచున్నారో, ఏమివ్రాయుచు న్నారో తెలియని ధోరణిలో మీరివ్రాత సాగినట్లు గోచరించుచున్నది. ఏది యెట్లున్నను ప్రతివాదు లన్నట్లు పురాణములకు, మహాభారతము నకు శ్రీమద్భాగవతమునకు శ్రీకృష్ణావతారవిషయమై పరస్పరవిరోధ మున్నదో లేదో తెలుపుటకై ప్రమాణములు ప్రదర్శింపబడుచున్నవి.

శ్రీమద్భాగవతము—స్క 2. అ 7.—

"భూమే స్సురేతరవరూథవిమర్దితాయాః
క్లేశవ్యయాయ కలయా సితకృష్ణకేశః ॥
జాతః కరిష్యతి జనా నుపలక్ష్యమార్గః
కర్మాణి చాత్మమహిమోపనిబన్ధనాని ॥"

శ్రీధరీయమ్—

శ్రీకృష్ణావతార మాహాత్మ్యభి:— సురేతరా అసురాంశసంభూతా రాజానః తేషాం వధార్థం సైన్యైః విమర్దితాయాః భారేణ పీడితాయాః కలయా రామేణ సహ జాతస్సన్ నను కోఽసౌ జాతః. సిత కృష్ణౌ కేశౌ యస్య భగవతః స ఏవ సాక్షాత్. సితకృష్ణకేశత్వం శోభైవ న తు వయఃపరిణామకృతమ్. అవికారిత్వాత్. (అజరామర స్యైవ స్యార్థపలితత్వాసంభవా దేక కేశ ఉక్తేచ్ఛయా రామస్య శ్వేతరూప జ్ఞాపనార్థం తదైవ శ్వేతోఽభూదితి గమ్యతే వంశీధరీయమ్)

యత్తూక్తం విష్ణుపురాణే — "ఉజ్జహా రాత్మనః కేశౌ సితకృష్ణౌ మహామునే" ఇతి. భారతేఽపి —

"సచాపి కేశౌ హరి రుజ్జహార శుక్ల మేక మపరంచాపి కృష్ణం ।
తౌ చాపి కేశా వావిశేతాం యదూనాం కులే స్త్రియౌ దేవకీం
రోహిణీంచ ॥
తయో రేకో బలభద్రో బభూవ యోఽసౌ శ్వేత స్తస్య దేవస్య కేశః ।
కృష్ణో ద్వితీయః కేశవ స్సంబభూవ కేశో యోఽసౌ వర్ణతః కృష్ణ
ఉక్తః ॥"

ఇతి తత్తు న కేశమాత్రావతారాభిప్రాయమ్, కిన్తు భూభారావతరణరూపం కార్యం కియ దేతత్, మత్కేశా వేవ తత్కర్తుం శక్తా వితి ద్యోతనార్థం, రామకృష్ణయో ర్వర్ణసూచనార్థంచ కేశోద్ధరణ మితి గమ్యతే. అన్యథా తత్రైవ పూర్వాపరవిరోధాపత్తేః

("తత్రైవ విష్ణుపురాణే భారతేచ తథాహి విష్ణుపురాణే.... ...
"కృష్ణాష్టమ్యా మహం భాద్రే ఉత్పత్స్యామి న సంశయః" ఇత్యాదిషు తత్రైవ స్వావతారోక్తే ర్విరోధాత్. భారతేఽపి "అహం బ్రహ్మా పరం

ధామ” ఇతి గీతాయా మష్టునం ప్రతి స్వస్య స్వాయమేవ పరబ్రహ్మ త్వోక్తే ర్విరోధాత్. వంశీధరీయమ్) కష్ణస్తు భగవాన్ స్వయ మిత్యేత ద్విరోధాపత్తేశ్చ కథం భూతః, పరమేశ్వరతయా జన్నై రనుపలక్ష్యో మార్గో యస్య, తర్హీశ్వరత్వే కిం ప్రమాణమ్? అతిమానుషకర్మాఽ న్యథాఽనుపపత్తి రేవే త్యాహ-ఆత్మనో మహిమోపనిబధ్యాతే అభి వ్యజ్యతే యేషు తాని”

ఇకయే “శ్రీమద్భాగవతపురాణము కృష్ణబలరాములు భగవం తుని నల్లని తెల్లని వెండ్రుకలని ద్వితీయస్కంధమున జెప్పెను” అని మ. భా. చ. కారు లన్న శ్రీమద్భాగవత ద్వితీయస్కంధస్థశ్లోకము. దాని వ్యాఖ్యానమును ఈశ్లోకములో 'కలయా సహ సితకృష్ణకేశః భూమేః క్లేశవ్యయాయ జాతస్సన్ కర్మాణి కరిష్యతి' అని యన్వయము.

'సితకృష్ణకేశః' అనునప్పుడు “సితకృష్ణౌ కేశౌ యస్యసః” అని బహువ్రీహిసమాసము. కనుక తెల్లని నల్లని కేశములు కల భగవం తుడు అని దానికర్థము. అట్టి భగవంతుడు భూభారహరణమునకై బలరామునితోగూడ బుట్టి పరమేశ్వరుడుగా జనులకు దెలియబడని వాడై యమానుషకర్మలను జేయు నని శ్లోకార్థము.

ఇచ్చట (సితకృష్ణకేశః జాతః) అను పదము లేకవచనాంతము లగుటచే సితకృష్ణకేశుడు పుట్టెను. అని యర్థమేకాని సితకృష్ణకేశములు పుట్టినవి అని యర్థ మెట్లు? ఆపై (కలయా) బలరామునితోగూడ, సితకృష్ణకేశుడు పుట్టెనని యీశ్లోకమందుండగా బలరాముడు సితకే శము కృష్ణుడు కృష్ణకేశము అని మ. భా. చ. కారులు చెప్పిన యర్థము ఈశ్లోకమునుండి యెట్లు వచ్చినది?

ఈశ్లోకములో బుట్టినట్లు చెప్పబడినవాడు సితకృష్ణకేశు డగు విష్ణువే. దశమస్కంధమందు గూడ నట్టి విష్ణువే దేవకీగర్భమున జన్మిం

చెనని చెప్పబడెను. కాని యీశ్లోకమునకు విరుద్ధముగా చెప్పబడ లేదు. ఇట్టి స్థితిలో ప్రతివాదులు "కృష్ణబలరాములు భగవంతుని కేశములని ద్వితీయస్కంధమున జెప్పెను కాని దశమస్కంధము వచ్చు నప్పటి కాసంగతిని మఱచి కాబోలు కేవలాంశావిష్ణుడే దేవకీగర్భమునం జన్మించె నని చెప్పెను. బమ్మెరపోతన తన్మయుడై యాంధ్రీకరించెను" అని వ్రాయుట హేయము. శ్లోకమర్థము చేసికొనలేని తమ యజ్ఞాన మునకు వగవక, శ్రీమద్భాగవతమును నిందింపబూనుట—"నిస్తతికంచు కకారం ప్రాయ శ్చుష్క స్తనీ నారీ" వక్షోజ భవము లేని వనిత కంచు కకారుని నిందించుచున్నట్లున్నది.

ఇక శ్రీమద్భాగవతశ్లోకములో కేశములు పుట్టినట్లు లేకున్నను శ్రీధరీయవ్యాఖ్యానములో నుదాహరింపబడిన భారతవిష్ణుపురాణ వచన ములలో కేశములు పుట్టినట్లే యుండుటనుబట్టియు, శ్లోకములో 'సిత కృష్ణకేశుడను' విశేషణమునుబట్టియు నట్లు చెప్పితిరా? ఆవిశేషణము బలరామకృష్ణుల దేహకాంతిని శేషములను సూచించునేకాని 'విష్ణుమూ ర్తి జన్మింపలేదు. కేశములే జన్మించినవి' అని చెప్పునా? శ్రీధరీయములోను దాహరింపబడిన గ్రంథాంతరవచనములను బట్టి భాగవతశ్లోకమునకిట్టి యర్థముచెప్పువారు భాగవతశ్లోకమునుబట్టి యాగ్రంథాంతరవచనము లకేఅర్థము నేల వర్ణింపలేదు. ఆవచనముల కాశ్రీధరీయములోనేపరస్ప రవిరోధము లేని యర్థము నిరూపింపబడియుండ దానిని త్రోసివేసిపర స్పరవిరుద్ధార్థము జెప్పుటకు మీరేల సిద్ధపడిరి? కనుక నిది యసంగత ప్రసంగము. భాగవతములో ద్వితీయస్కంధ దశమస్కంధములకు పర స్పరవిరోధము లేదు.

ఇక విష్ణుపురాణములో 61వ శ్లోకములో కేశావతార మన్న ట్లుండి తరువాత 78వ శ్లోకములో "కృష్ణాష్టమ్యాం మహాం నిశి ఉత్ప త్స్యామి" అనుచు కృష్ణాష్టమినాటి రాత్రియందు నేనవతరింతు నని దేవ

తలత్రో విష్ణుమూర్తి చెప్పెనని యుండుటచే శ్రీకృష్ణుడు సాక్షాద్విష్ణు మూర్తి యవతారమే అనియు, అజరామరుఁడగు భగవంతుని సంకల్పమున నప్పటి కప్పుడు తెల్లబడిన కేశమును, కృష్ణకేశమును, ప్రదర్శించుటలోని తాత్పర్యము—దేవతలచే భూభారహరణమునకై ప్రార్థింపబడిన భగవంతుడు ఈ భూభారహరణ మెంతటి కార్యము! ఈ కార్యమును నాకేశములే చేయగల వని తెలుపుటయందును, పుట్టబోవు బలరామకృష్ణుల దేహము లీయీరంగులుగా నుండు నని తెలుపుటయందును తాత్పర్య మనియు, కనుక విష్ణుపురాణములోకూడ బూర్వోత్తర విరోధము లేదనియు,

మహాభారతములోగూడ భగవద్గీతలలో శ్రీకృష్ణుడు "అహం బ్రహ్మ పరం ధామ" ఇత్యాదివచనములచే తాను పరమేశ్వరుడ నని చెప్పిన పూర్వోత్తరసందర్భములనుబట్టి కేశములవతరించినట్లున్న శ్లోకమునకు వెనుక జెప్పినట్లే తాత్పర్యము కనుక మహాభారతములోగూడ బూర్వోత్తరవిరోధము లేదనియు,

శ్రీధరస్వామి నిరూపించియున్నందున విష్ణుపురాణ మహాభారత శ్రీమద్భాగవతగ్రంథములు ప్రతివాదు లన్నట్లు పరస్పరవిరోధము లేక శ్రీకృష్ణుడు పరమేశ్వరావతార మనియే చాటుచున్నవి.

ఐతే విష్ణుపురాణములో విష్ణుమూర్తి దేవతలతో "కృష్ణాష్టమ్యా మహం నిశి ఉత్పత్స్యామి" నేను కృష్ణాష్టమినాఁ డుద్భవింతు నని చెప్పినట్లున్నది కదా! కృష్ణుడు పుట్టినతరువాత కదా కృష్ణాష్టమి యైనది. ఇట్టిస్థితిలో కృష్ణాష్టమినాఁడు నేనుద్భవింతు నని విష్ణుమూర్తి యన్నట్లున్నమాట విరుద్ధము కాదా యని యనిపించును. కాని 'సూత్రశాటకన్యాయ' ముచే నిది విరుద్ధము కాదు.

లోకములో నూలిచ్చుచు బట్టను నేయుమని చెప్పుదుము. నేత పూర్తియైనగాని బట్ట యను పేరు సంభవింపదు. బట్టయే యైనయెడల నేయుట సంభవింపదు. ఇట్టిస్థితిలో 'బట్టను నేయుము' అను వ్యవహారము లోకప్రసిద్ధమై యున్నది. దీనికి నేత యైనతరువాత నేది బట్ట యనబడునో అట్టిదానిని నేయు మనుటలో తాత్పర్యము. అట్లే, నేను ధ్వనించినతరువాత నేది కృష్ణాష్టమి యనబడునో అట్టి తిథియం దుద్భవింతు నని భావిసంజ్ఞను గ్రహించి చెప్పబడుటచే నిది న్యాయసిద్ధమే కాని విరుద్ధముకాదు. కృష్ణపక్షాష్టమి యనుకొనిన బాధయే లేదు. ఇంతవరకు శ్రీమద్భాగవత శ్లోకమునకు శ్రీధరీయవ్యాఖ్యానము చూపబడినది. ఇక విష్ణుపురాణవచనములకు శ్రీధరీయ విష్ణుచిత్తీయవ్యాఖ్యములు చూపబడుచున్నవి.—

విష్ణుపురాణము అం. 5. అ1 —

"ఏవం సంస్తూయమానస్తు భగవాన్ పరమేశ్వరః ।
ఉజ్జహారాత్మనః కేశౌ సితకృష్ణౌ మహామునే ॥
ఉవాచ చ సురానేతౌ మత్కేశౌ వసుధాతలే ।
అవతీర్య భువో భారక్లేశహానిం కరిష్యతః ॥"

శ్రీధరీయమ్—

ఉజ్జహార ఉత్పాటితవాన్. ఉవాచేతి. అయం భావః మమ దుష్కరం చేద్యుష్మాభిః కార్యం సాహాయ్యం స్యాత్. నత్విద మస్తి. భూభారహరణాదౌ మహత్యపి కార్యే మత్కేశమాత్రస్యైవ సమర్థత్వాదితి. నతు కేశమాత్రావతార ఇతి మన్తవ్యం "మత్ప్రకాశావిమూర్ధ్నితౌ" ఇతి (63శ్లో) "కృష్ణాష్టమ్యాం మహం నిశి ఉత్పత్స్యామి" (78శ్లో) ఇత్యాదిషు సాక్షా త్స్వావతార స్యోక్తత్వాత్ ॥

విష్ణుచిత్తీయమ్—

"కేశో తేజసి. క ఆత్మా తస్మిన్ శేత ఇతి కేశః మోక్షధర్మే కేశవనామ నిర్వచనే "సూర్యస్య తపతో లోకా నగ్నేస్సోమస్య చైవహి। అంశవో యే ప్రకాశన్తే మమ తే కేశసంజ్ఞితాః" ఇతి ఇచ్చట శ్రీధరీయమునకు వెనుక జెప్పబడిన యర్థమే.

విష్ణుచిత్తీయమున కర్థ మేమనగా మోక్షధర్మపర్వములో కేశవ నామనిర్వచనములో సూర్యచంద్రులయొక్కయు, నగ్నియొక్కయు, ప్రకాశమానములగు కిరణము లేవి కలవో అవి నాకేశము లనబడును. అని చెప్పబడుటచే నీశ్లోకములో కేశములనగా తేజస్సు లనియేయర్థమని.

ఇక మహాభారతశ్లోకములు వెనుక శ్రీధరీయవ్యాఖ్యానములో వ్రాయబడియున్నవి కనుక నిచ్చట నాశ్లోకములను నీలకంఠీయటీకయే చూపబడుచున్నది—

నీలకంఠీయమ్—

'అత్ర కేశా నేవ కేతో రూపౌ పాండవానా మివ రామకృష్ణయో రపి ప్రకరణసంగత్యర్థం సాక్షాద్దేవ కేతుః ఉత్పత్తి రవశ్యవక్తవ్యత్వాత్. అతఏవ దేవక్యాం రోహిణ్యాంచ సాక్షా త్కేశప్రవేశ ఉచ్యతే. నతు వసుదేవే. తథా సతితు 'దేవానాం కేతో నర్షం వర్షస్య కేత ఓషధయః' ఇత్యాదిప్రమాణాద్యాఽస్మదాదివ త్తయో రపి వ్యవధానేన దేవప్రభ వత్వం స్యాత్. తథాచ "ఏత న్నానావతారాణాంనిధానం బీజ మవ్య యమ్" ఇతి భగవత స్సాక్షా న్మత్స్యాద్యవతారబీజత్వ ముచ్యమానం విరుధ్యేత.

అపిచ. కేశకేతసో ర్దేహజత్వే సమానేఽపి కేతఃప్రభవత్వేఽ ర్వాక్ స్త్రోతస్త్వేన మానుష్యత్వం పుత్రత్వం చ స్యాత్. తథాచ 'కృష్ణ

స్తు భగవాన్ స్వయమ్" ఇతి శ్రీమద్భాగవతోక్తిర్న సంగచ్ఛేత. నచ కేశోద్ధరణాత్కృష్ణస్యాంశత్వం ప్రతీయత ఇతి వాచ్యం, కేశస్య దేహావయవత్వాభావాత్.

తస్మాన్నముచివధే కర్తవ్యే యథాఽపాం ఫేనే వజ్రస్య ప్రవేశ ఏవం దేవకీరోహిణ్యోర్జఠరప్రవేశే కర్తవ్యే కేశద్వయేన ద్వారభూతేన భగవతః కార్త్స్న్యేనైవావిర్భావో ద్రష్టవ్య ఇతి యుక్తమ్ ||

అనగా, నింతకు బూర్వము పాండవులు దేవరేతస్సున బుట్టినట్లు చెప్పబడిన ప్రస్తావ మగుటచే నీరామకృష్ణుల యుత్పత్తికూడ సాక్షాద్దేవరేతస్సుననే జరిగె నని చెప్పవలసియున్నది. అందుచే శ్లోకములో జెప్పబడిన కేశములు రేతస్థానీయములు. కనుకనే యాకేశములను వసుదేవునియందు ప్రవేశము చెప్పబడక దేవకీరోహిణులయందే సాక్షాత్ప్రవేశము చెప్పబడినది. వసుదేవుని ద్వారా చెప్పబడినయెడల లోకసామాన్యముతోపాటే వారి యుత్పత్తికూడ నైపోవును. అప్పుడు మత్స్యాద్యవతారములకు కృష్ణభగవానుడే మూలాధారమను వాక్యము విరుద్ధమగును.

రేతఃప్రభవత్వములో మనుష్యత్వము పుత్రత్వము ప్రాప్తించును. కేశప్రభవత్వములో నట్టివి ప్రాప్తింపవని కేశప్రభవత్వము చెప్పబడినది. కనుకనే కృష్ణుడు సాక్షాద్భగవంతు డను వాక్యము సంగతమైనది. ఈకేశోద్భవత్వమునుబట్టి కృష్ణునిది యంశావతార మనుకొనరాదు. కేశము దేహావయవము కాదు కనుక నట్లనుకొనుట భ్రాంతియే.

కనుక నముచియను రాక్షసుని వధించుటలో నురుగుద్వారా వజ్రమున కెట్లు ప్రవేశము జరిగెనో అట్లే దేవకీరోహిణుల గర్భమున బ్రవేశించుటలో కేశద్వయమును ద్వారముగా జేసికొని పరిపూర్ణరూప

ముతో భగవంతు డావిర్భవించె నని గ్రహింపవలసిన దని తాత్ప ర్యము. ఈనముచివధవృత్తాంతము ఋగ్వేదమున జెప్పబడి యున్నది— "అపాం ఫేనేన నముచే శ్శిర ఇన్ద్రోదవర్తయః" (అష్ట 6—1—13)

భాష్యమ్:—

పురాకిలేన్ద్రోఽసురాన్ హత్వా నముచి మసురం గ్రహీతుం న శశాక స చ యుధ్యమాన స్తేనాఽసురేణ జగృహే. సచ గృహీత మిన్ద్ర మేవ మవోచత్. త్వాం విసృజామి రాత్రావహ్నిచ శుష్కేణార్ద్రేణచాయుధేన యది మాం మాహింసీ రితి. స ఇన్ద్ర స్తేన విసృ ష్టస్స న్నహోరాత్రయో స్సన్ధౌ శుష్కార్ద్రవిలక్షణేన ఫేనేన తస్య శిర శ్చిచ్ఛేద. అయమర్థోఽస్యాం ప్రతిపాద్యతే — హే ఇన్ద్ర అపాంఫేనేన వజ్రీభూతేన నముచేః అసురస్య శిరః ఉదవర్తయః శరీరా దుద్గత మప గ్నయః. ఉచ్చైశ్ఛిన్ది రిత్యర్థః.

ఇట్లు శ్రీధరీయ విష్ణుచిత్తీయ నీలకంఠీయ వ్యాఖ్యానములు విరో ధపరిహారమున కనేకమార్గములు చూపియుండుటచేత పురాణ మహా భారతశ్రీమద్భాగవతగ్రంథములకు పరస్పరవిరోధము లేదనిస్పష్టమైనది.

—: శ్రీకృష్ణుడు సాక్షాద్విష్ణువే అని యమరసింహుని సాక్ష్యము :—

అమరసింహుడు తన యమరకోశములో విష్ణుపర్యాయములను చెప్పుచు "విష్ణుర్నారాయణః కృష్ణః ... వాసుదేవ స్త్రివిక్రమః ... దేవకీ నందనశ్శౌరిశ్శ్రీపతిః ... కంసారాతిరధోక్షజః" అని కృష్ణవాసుదేవ దేవకీనందన శౌరి కంసారాతి శబ్దములు, విష్ణు నారాయణ త్రివిక్రమ శ్రీపతి శబ్దములతోబాటు విష్ణుమూర్తినే బోధించుచున్న వని చెప్పెను. ఇట్లు విష్ణునామములను జెప్పినతరువాత "వసుదేవోఽస్య జనకః" అని యీచెప్పబడినవాడు వసుదేవుని పుత్రు డని బోధించెను. దీనిచే వసుదేవపుత్రుడగు కృష్ణునకును విష్ణుమూర్తికి భేదము లేదని ప్రతిపా దింపబడినది.

సంస్కృతవాఙ్మయములో నేయేశబ్దముల కేయే యర్థములు చెప్పవలెనో తెలుపు నిఘంటువమరకోశము. ఆయమరకోశకర్త యగు నమరసింహుడు అనాదికసంప్రదాయజ్ఞుడు. అట్టి విమర్శకుడే కృష్ణుడు సాక్షాద్విష్ణుమూర్తి యని చెప్పుచుండ కావని తగవులాడు ప్రతివాదుల సంప్రదాయ మేదో దురవగాహముగా నున్నది. ఈవిషయమై సంశోధనీయము లోనిట్లు చెప్పబడినది.— "విష్ణునామా న్యుక్త్వా 'వసుదేవోఽస్యజనక' ఇత్యనేనామరసింహేనానాదికేనాపి శ్రీకృష్ణస్యైవవిష్ణుపదవాచ్యబ్రహ్మత్వంధ్వనితమ్, అన్యథా 'కశ్యపో హ్యస్య జనకః' ఇత్యాది వదేత్. తథాచ. "శత్రుఘ్నఘ్నోహి యో యోధ స్స శూరః పరికీర్తితః" ఇతి న్యాయోఽప్యత్ర మాన మనుసన్ధేయమ్" (భాగ—2స్క—7 అ.) ఇంతటితో దీనిని విడిచి విషయాంతర మందుకొందము —

కృష్ణుడు పూతనను వధించెనను గాథకు పూతన యను రోగము కృష్ణునికి సోకి నివృత్తి యయ్యె నని భావమును ప్రసంగము [illegible]రాకణము. —

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది.—

"పూతనారోగము నిదానము. బాలుడు స్రస్తాంగుడై రేయింబవలు నిద్ర లేనివాడై కాకివాసనవేయుచుండిన పలుచని విరేచనమును విడుచుచుండును. వమనములు కలవాడై నిక్కపొడుచుకున్న రోమములు కలవాడై దాహము కలవాడై యుండును. (రోగనివారణోయమును గ్రంథవిస్తరభీతిచే వ్రాయలేదు ఇట్టి రోగమే శ్రీకృష్ణునకు చిన్నతనమున సోకి యది నివృత్తియై యుండును. దానిని కాలాంతరమున రక్కసిగాను, దానిని శ్రీకృష్ణుడు వధించినట్టులను గ్రంథకర్తలు తమగ్రంథములలోని కెక్కించియుందురు. భాషాంతరీకరణమందు దానికి వన్నెలు చిన్నెలు ప్రవేశించినవి"

"స్రస్తాంగ స్స్వపితి సుఖం దివా న రాత్రౌ
విడ్భిన్నం సృజతి చ కాకతుల్యగంధః ।
ఛర్ద్యార్తో హృషితతనూరుహః కుమారః
స్తృష్ణాలు ర్భవతిచ పూతనాగృహీతః ॥ (పు. 81 సుశ్రుతమ్")

ఇది. మ. భా. చ. కారులవ్రాత. ఇక బంకించంద్రచట్టోపాధ్యాయుని వ్రాత యిట్లున్నది —

"మహాభారతమునందుశిశుపాలవధపర్వాధ్యాయమునబూతనావధనుగూర్చిన ప్రసంగము కలదు. శిశుపాలుడు పూతనను శకుని యని చెప్పియుండెను. శకుని యనగా గృధ్రజాతిలో జేరిన యొక పక్షివిశేషము. బలవంతుడైన శిశువొక పక్షిని వధించె ననుటలో నాశ్చర్యమేమియును లేదు. పూతనయనగ మరియొకయర్థము కలదు. సూతికాగారమున శిశువులకు వచ్చు రోగవిశేషమునకు బూతన యను పేరు కలదు. శిశువులు బలముగ స్తన్యపానము చేయ గలిగినయెడల వారల కట్టి రోగము రాదను విషయ మందఱెఱిగినదే. ఇదియే పూతనావధ" (శ్రీకృష్ణచరిత్రము—పరి 3—పు 119")

ఇది యుపాధ్యాయుని ధోరణి. యుపాధ్యాయుని పుస్తకము 1917సం రములోనిది. మ. భా. చ. కారుల పుస్తకము 1928సం రము లోనిది. కనుక మ. భా. చ. కారులవ్రాత యుపాధ్యాయుని వ్రాత మూల మనవచ్చును. ఏది యెట్లున్నను శ్రీకృష్ణునిచే వధింపబడిన పూతన నుగూర్చి ప్రతివాదుల కొకింత తెలుపవలసి యున్నది. అందుకై ముందు సుశ్రుతగ్రంథప్రసంగము చూపబడుచున్నది—

"బాలగ్రహాణాం విజ్ఞానం సాధనం చాప్యనన్తరమ్।
ఉత్పత్తిః కారణం చైవ సుశ్రుతైకమనా శ్శృణు"(3. అ. 57)

అని బాలగ్రహముల స్వరూపము, సాధనము, ఉత్పత్తి, కారణము, చెప్పెద నని యారంభించి యాగ్రహములను గూర్చి యిట్లు చెప్పెను—

1 స్కందగ్రహము, 2 స్కందాపస్మారగ్రహము, 3 శకుని, 4 రేవతి, 5 పూతన, 6 అంధపూతన, 7 శీతపూతన, 8 ముఖమండిక, 9 నైగమేష మనబడు పితృగ్రహము, అను నీగ్రహములు శౌచభ్రష్టులు, మంగళాచారహీనులు, నగుచు, భయపడుటో, మిక్కిలి నవ్వుటో, యేడ్చుటో, తటస్థించియున్న బాలురను గాపాడుచున్నవారి ప్రమాదమునుబట్టి యావేశించి హింసించును. కామరూపములు అణిమాదిశక్తులు కల బాలగ్రహములు బాలుల నావేశించు నపుడు మానవులకు గోచరింపవు. అవి యావేశించినపుడు దేహమునందు గలుగు వికారముల నాప్తవాక్యములను బట్టి చెప్పుచున్నాను అని చెప్పుచు మ. భా. చ. కారులు చూపిన "స్త్రీనాంగ స్న్యపితి" అను శ్లోకమును చెప్పెను.

పిమ్మట బాలగ్రహోత్పత్తిప్రకార మిట్లు చెప్పబడియున్నది—

"పణే గుహస్య రక్షార్థం కృత్తికోమాగ్నిశూలిభిః ।
సృష్టా శ్శరవనస్థస్య రక్షిత స్యాత్మ తేజసా ॥
స్త్రీసిగ్రహా గ్రహా యే తు నానారూపా మయేరితాః ।
గంగోమా కృత్తికానాం తే భాగా రాజసతామసాః ॥"

అనగా, శరవనమందు ప్రాదుర్భవించియున్న కుమారస్వామి రక్షణమునకై యాగ్రహములు సృజింపబడిన వనియు, నందు స్త్రీవిగ్రహగ్రహములు గంగ యొక్కయు, ఉమయొక్కయు, కృత్తికలయొక్కయు రాజసతామసాంశము లనియు భావము.

దీనిచే ప్రతివాదులు పేర్కొనిన బాలగ్రహ మగు పూతన గం గోమాతృత్రికల యంశములోని దనియు, కుమారస్వామి రక్షణార్థము సృజింపబడిన దనియు, సుశ్రుతగ్రంథమే బోధించుచున్న దని స్పష్టము.

ఇక శ్రీకృష్ణునకు విషభరిత స్తన్య మిచ్చుట కేతెంచి యామనో రథముతో ముక్తి నొందిన పూతన యెవ్వతెయో తెలిసికొనవలసి యున్నది— కృష్ణజన్మఖండము—(అ10.) నారదః—

"సా చ కా రాక్షసీరూపా కథం పుణ్యవతీ సతీ ।
కేన పుణ్యేన తం దృష్ట్వా జగామ కృష్ణమందిరమ్ ॥

శ్రీనారాయణ ఉవాచ—

"బలియజ్ఞే వామనస్య దృష్ట్వా రూపం మనోహరమ్ ।
బలికన్యా రత్నమాలా పుత్రస్నేహం చకార తమ్ ॥
మనసా మానసం చక్రే పుత్రస్యైవం స్మృతో మమ ।
పిబే ద్యది స్తనం కృష్ణః కరోమి తంచ వక్షసి ॥
హరి స్తన్మానసం జ్ఞాత్వా పపౌ జన్మాన్తరే స్తనమ్ ।
దదౌ మాతృగతిం తస్యై కామపూరః కృపానిధిః ॥
దత్వా విష స్తనం కృష్ణం పూతనా రాక్షసీ మునే ।
భక్త్యా మాతృగతిం ప్రాప కం భజామి వినా హరిమ్ ॥"

అనగా నారాయణునివలన పూతనాసంహారకథను వినిన నారద మహర్షి ఆరాక్షసి యెవ్వతె యేపుణ్యముచే కృష్ణభగవానుని సంద ర్శించి ముక్తి నొందెను. అని ప్రశ్నింపగా నారాయణు డిట్లు చెప్పెను. బలియజ్ఞమునకు వెళ్ళిన వామనమూర్తి యొక్క మనోహరరూపమును జూచి, బలిపుత్రిక యగు రత్నమాల పుత్రప్రేమతో నిట్టి మహనీయుడు నా స్తన్యము గ్రహించిన బాగుండు

నని సంకల్పింపగా యామె సంకల్పము గ్రహించిన శ్రీహరి జన్మాంత రమున పూతనయై పుట్టియున్న యామె స్తన్యమును తాను కృష్ణభగ వానుడై యుండి స్వీకరించి యామెకు మాతృగతి ననుగ్రహించెను. మహర్షి! శ్రీకృష్ణునకు విష స్తన్య మిచ్చిన పూతనయను రాక్షసి భక్తిచే మాతృగతి నొందినది. అట్టి శ్రీకృష్ణుని గాక మరెవ్వరిని భజించుట? అని భావము. గర్గసంహితలో గూడ గోలోకఖండత్రయోదశాధ్యా యమునం దిట్లే చెప్పబడియున్నది.

దీనినిబట్టి తేలిన సారాంశము శ్రీకృష్ణునకు విషస్తన్యమిచ్చిన పూతన తొలిజన్మమున బలిపుత్రిక యగు రత్నమాలయగుటచే నీపూ తనవేరు. ప్రతివాదులు చెప్పిన సుశ్రుతోక్తబాలగ్రహపూతన కుమార స్వామిరక్షణమునకై గంగోమాకృత్తికల యంశములలోనిదై యుద్భ వించిన దగుటచే నాపూతన వేరు.

ఇంకొకటి— హరివంశములో విష్ణుపర్వమున చెప్పబడిన పూత నాసంహారవిషయమును వివరించుచు నిది వేదమంత్రప్రసిద్ధమే యని కూడ నీలకంఠాచార్యులు నిరూపించెను చూడుడు—

“కస్యచి త్త్వథ కాలస్య శకునీవేషధారిణీ ।
ధాత్రీ కంసస్య భోజస్య పూతనేతి పరిశ్రుతా ॥” (అ6)

టీ. శకునీ పక్షిణీ బకానుజాత్వాత్ । వేషధారిణీ మనుష్యవేష ధారిణీ, కంసస్య ధాత్రీతి వ్రజస్థైః శ్రుతా. మంత్రః—

“హేతిః పక్షిణీ న దభాత్యస్మా నాష్ట్రీ పదం కృణుతే అగ్ని ధానే. శం నో గోభ్య శ్చ పురుషేభ్య శ్చాస్తు మా నో హింసీ దిహ దేవాః కపోతః” (అష్టక. 8. అ. 8. వర్గ 23. ఋక్ 1) ఇతి.

హేతి రాయుధపస్యధ కారిణీ, పక్షిణీ పూతనారూపా అస్మాక్ ప్రజస్థా న దభ్నోతి నాభిభవతి ప్రత్యుత అగ్నిధానే జారరాగ్నే ర్ధానే నిమిత్తే శిశో ర్హాకర మస్మిం స్తనదానేన తర్పయితుం ఆస్థాస్యామ్ ఆప గమిదీస్త్యాద్యదానేషు. అపయతి పరలోకం గమయతి మృత్యునా గ్రాహయతి వా దేహం దీపయతివా. ఆస్థ్రీ కృష్ణతనుః తస్యాం పదం స్థానం కృణుతే కృష్ణం పాయయితుం స్వ మృత్యురూపాం తాం తనుం స్పృశతి స్మేత్యర్థః॥

ఇట్లీపూతనావిషయము ఋగ్వేదమంత్రమునుబట్టి కూడ సిద్ధించుచున్నదని మంత్రార్థము వర్ణింపబడినది. హరివంశశ్లోకములో 'శకుని' అను శబ్దము మంత్రములో 'పక్షిణీ' అను శబ్దము పూతనయందు వాడబడినవి. రాక్షసస్త్రీయై కామరూపిణియై యున్న పూతన బకాసురుని సోదరి యగుటవలన బకము పక్షిజాతిలోని దగుటచే నుత్పత్తిసంబంధమునుబట్టి వాడబడినది కాని క్షుద్రపక్షియే యను భావముతో నుపాధ్యాయు లన్నట్లు వాడబడలేదు. ఉపాధ్యాయుని వ్రాతలో "శిశుపాలుడు పూతనను శకుని యని చెప్పియుండెను. శకుని యనగా గృధ్రజాతిలో చేరిన యొకపక్షివిశేషము. బలవంతుడైన శిశు వొక క్షుద్రపక్షిని వధించె ననుటలో నాశ్చర్య మేమియును లేదు." అని యున్నది.

ఇది శిశుపాలుని ప్రసంగమే. శ్రీకృష్ణద్వేషి యగు శిశుపాలుడు యుధిష్ఠిరరాజసూయములో బూజింపబడు శ్రీకృష్ణుని ధిక్కరించునపుడు భీష్ముడు— శ్రీకృష్ణుడు బాల్యమునుండియు జేసిన యమానుష కృత్యములే యామహనీయుని మహత్త్వమును చాటుచున్న వని చెప్పగా శిశుపాలుడు—"పూతనాఘాతపూర్వాణి కర్మాణ్యస్య విశేషతః। త్వయా కీర్తయతాఽస్మాకం భూయః ప్రవ్యథితం మనః॥ యద్యనేన హతా బాల్యే శకుని శ్చిత్ర మత్ర కిమ్॥" (సభాప. అ41)

భీష్ముడా! నీవీకృష్ణుని పూతనాసంహారాది కార్యములను కీర్తించుచు నామనస్సును వ్యథపెట్టుచున్నావు. బాల్యమం దీతనిచే నొక పక్షిహింసింపబడినంతమాత్రమున జిత్రమేమున్నది? అని ప్రసంగించెను. దీనినే సత్యమని యెంచి యుపాధ్యాయు డుల్లేఖించెను.

కాని. యాప్రకరణములోనే భీష్మనారదవేదవ్యాసాదులు శ్రీకృష్ణునిగూర్చి చేసిన ప్రసంగము లసత్యములనిపించి "హిరణ్యకశిపో రంశశ్శిశుపాల ఉదాహృతః" అని చెప్పినట్లుహిరణ్యకశిపువుయొక్కఅంశమై పుట్టిన శిశుపాలుని తామసప్రసంగమే సత్యమని యుపాధ్యాయుని కని పించుటలో గల హేతు వూహ్యము.

ఆనాడాశిశుపాలుడైనను పూతన (పక్షి) వధింపబడినట్లే చెప్పెను కాని "సూతికాగారమున శిశువునకు వచ్చు రోగవిశేషమునకు పూతన యనుపేరు. శిశువు బలముగ స్తన్యపానము జేసిన నట్టి రోగము రాదు, ఇదియే పూతనావధ" అని యుపాధ్యాయుడు వ్రాసినట్లుగాని. "విరేచనములు వమనములు కల రోగమే పూతన. ఇట్టి రోగమే శ్రీకృష్ణునకు చిన్నతనమున సోకి నివృత్తి యైయుండును" అని మ. భా. చ. కారులు వ్రాసినట్లుగాని ప్రసంగింపలేదు. శ్రీకృష్ణద్వేషముతో శాపదగ్ధుడై జన్మించుచు వచ్చినట్టి శిశుపాలుని నోటినుండి కూడ రాని యీవిరుద్ధప్రసంగము ప్రతివాదులనుండి వచ్చుట శోచనీయము. వెనుక నిరూపింపబడినట్లు శ్రీకృష్ణుచే వధింపబడిన రాక్షసి యగు పూతన వేరు. ప్రతివాదులన్న బాలగ్రహపూతన వేరు. కనుక ప్రతివాదుల ప్రసంగము దూరాపాస్తమైనది. ఇంతటితో దీనిని విడిచి యంశాంతర మందుకొందము.

—: "శకటాసుర, ఉలూఖల బంధనాదిగాథలుకూడ సోకుడుగ్రహము లను సంబంధించినవే" అను ప్రసంగము—తన్నిరాకరణము—

ము. భా. చ. కారులు వ్రాతయిట్లున్నది— "శ్రీకృష్ణుడు శకటాసురుని వధించెననియు, ఉలూఖలమునకు గట్టబడెననియు, శంఖచూడుడను గుహ్యకుని, కేశియను రాక్షసుని వధించెననియు, పురాణములలో గలదు కాని యవి పిల్లలకు గలుగు పీడాభేదములే యని జాతకర్మములో జెప్పబడు మంత్రములచేత దెలియవచ్చుచున్నది ... శకటాసుర ఉలూఖలబంధనాదులగూర్చి మంత్రప్రశ్నములో నిట్లుగలదు —

"1 శండేరథ శ్శౌండికేర ఉలూఖలః చ్యవనో నశ్యతా దిత స్స్వాహా.
2అయ శ్శండో మర్క ఉపవీర ఉలూఖలః చ్యవనో... ...
3. కేశినీ శ్వలోమినీః ఖజాపోఽజోపకాశినీ అపేత... ...
4.మిశ్రవాససః కౌబేరకారక్షోరాజేన ప్రేషితాః
గ్రామగ్ం సజానయో గచ్ఛన్తీచ్ఛన్తో ..."...

పై మంత్రముల నుచ్చరించుచు జాతకర్మములో హోమముజేతురు. ఈహోమము శిశువులకు గలుగు సోకుడురోగములు పోవుటకయి యున్నది. పైమంత్రములలోని శండేరథుడు శకటాసురుడుగాను ఉలూఖలుడు ఉలూఖలబంధముగాను కేశిని కేశిగాను కౌబేరకరక్షోగ్రహ మేదియో శంఖచూడుడను గుహ్యకుడుగాను భాగవతాదులలో వర్ణింపబడిరి. పై సోకుడుగ్రహములను శ్రీకృష్ణుడే చంపి యుండినచో నేడు ద్విజులు తమయిండ్లలో జాతకర్మసమయమున పైహోమములు చేయనవసర ముండకపోవును. పైసోకుడురోగములు శ్రీకృష్ణునకు గలుగగా నాతడారోగములనుండి విముక్తుడయ్యెననియో మనము గ్రహింపవలసియున్నది"(28)

ఆహా! ఈప్రతివాదుల దేమి యద్భూతకల్పన! మంత్రప్రశ్నము లలో గనబడు శంకరాచార్యాదులే భాగవతాదులలో జెప్పబడిన శకటాసురాదులట, మృచ్ఛకటిక నాటకములో శకారుడని యొకపాత్రము కలదు. అత్యంతవిరుద్ధములు వ్యర్థములు అపార్థములు నగు మాటలు శకారుని వని లక్షణగ్రంథములందు చెప్పబడినవి. చూడుడు—

"ఆగమలింగవిహీనం దేశకలాన్యాయవిపరీతమ్ ।
వ్యర్థైకార్థ మపార్థం భవతిహి వచనం శకారస్య ॥.

శకారుని మాటలవైఖరి— "మమ వశ మనుయాతా రావణస్యేవ కుంతీ" "ఝుణఝ్ఝుణ మితి బహుభూషణ శబ్దమిశ్రం కిం ద్రౌపదీవ పలాయసే రామభీతా. ఏషహరామి సహసేతి యథా హనూమాన్ విశ్వావసో ర్భగినీ మివ తాం సుభద్రామ్"

అనగా. కుంతి రావణునకు వశమైనట్లు నీవు నాకు వశమైతివి. నీవు రామునకు భయపడిన ద్రౌపదివలె పరుగిడుచున్నావేమి? విశ్వావసువునకు సోదరియగు సుభద్రను హనుమంతు డెత్తుకొనిపోయినట్లు నిన్ను నేనెత్తుకొని పోవుచున్నాను. అని యీశకారునిమాటల కర్థము.

శ్రీకృష్ణద్వేషియై పుట్టిన శిశుపాలుడైనను శకటభంగమును గూర్చి యీ మ. భా. చ. కారులన్న ట్లనలేదు. చూడుడు—

చేతనారహితం కాష్ఠం యద్యనేన నిపాతితమ్ ।
పాదేన శకటం భీష్మ తత్ర కిం కృత మద్భుతమ్ ॥" (సభా. అ41)

ఓభీష్ముడా! అచేతనమైన శకటమును (బండిని) కృష్ణుడు పాదముచే బడగొట్టినంతమాత్రమున నాశ్చర్య మేమున్నది? అనెను. ఈమాటలో శిశుపాలుడు శకటభంగము జరిగినట్లే యొప్పుకొనెను. ఇక మ. భా. చ. కారులు అది శకటముకాదు 'శంకరాచు ర్యాన్నారు' అనగా

పోసుడురోగ మన్నారు. ఈశకటభంజనమునుగూర్చిహరివంశశ్లోకమును, నీలకంఠీయమును చూడుడు—

"శకటస్య త్వధ స్సుప్తం కదాచిత్పుత్రగృద్ధినీ ।
యశోదా తం సముత్సృజ్య జగామ యమునానదీమ్ ॥"

నీలకంఠీయమ్—

"పృథూ రథో దక్షిణాయా అయోజ్యైనం దేవాసో అమృతాసో అస్థుః కృష్ణా దుదస్థా దర్యా 3 విహాయాశ్చికిత్సన్తి మానుషాయ క్షయాయ్యై తేన" (అష్ట—2—అ 1— వ 4)

ఇతి మన్త్రోక్త మర్థ ముపబృంహయతి. శకటస్యేతి మన్త్రార్థస్తు—పృథు ర్మహాన్ రథ శ్శకటం. దక్షిణాయాదిశస్సంబన్ధీ. మృత్యుకరమిత్యర్థః. అయోజి. యోజితః. శత్రుభిరిత్యర్థాల్లభ్యతే. త మేనం రథం దేవాసో దేవా అమృతాసోఽమృతా ఆసమన్తాత్ అస్థుః పరివార్య స్థితవన్తః. ఏతస్మిన్నన్తరే స రథః కృష్ణాత్ కృష్ణం ప్రాప్య. తత్ప్రేరణేన. ఉదస్థాత్ ఉత్థితః. విహాయాః ఆకాశాశ్రితః. విశేషేణ హాయత్ గచ్ఛతీతి వా యన్త్రోక్తి ప్రక్రేలకవ దాకాశమార్గేణోత్థాయ పతితస్సన్నష్ట ఇత్యర్థః. తతశ్చ అర్యా ఈశ్వరీ స్వామినీ మాతా తత్రోత్పత్తిజా చికిత్సన్తి సంశయవత్. మానుషాయ మానుషస్య క్షయాయ నాశాయ ఏతేన పతతా రథేన నాఽయం బాలకః కథం న నాశిత ఇత్యత్ర కారణవిశేష మపశ్యన్తీ సందిహానైవతిష్ఠత్. నన్వీశ్వరకృత్యమేత దిత్యవేదీ దితి భావః. ఏవమేవ సర్వేషా మర్థానాం శ్రుతిమూలకత్వ మున్నేయం వేదోపబృంహణత్వా దస్య శాస్త్రస్య"

ఇచ్చట శకటమునకు క్రిందిభాగమున శయనించియున్న శిశువును విడిచి యశోద స్నానమునకై యమునానదికి వెళ్ళెననియు, శ్రీకృష్ణు డాశకటమును తన్ని భగ్నము చేసెననియు నున్న శకటభంజన

గాథకు ఋగ్వేదమంత్రములు మూలమని యామంత్రార్థము వర్ణింపబడినది. ఈ మహాభారత మను శాస్త్రము వేదార్థప్రకాశక మని చెప్పబడుటచే నిందున్న విషయములకు ప్రత్యక్షశ్రుతిమూలకత్వ మూహింపవలసినదని కూడ నీలకంఠాచార్యునిచే నుపదేశింపబడినది. కనుక ప్రతివాదుల విరుద్ధోక్తులు హేయములు ఉలూఖలబంధన ప్రకార మిట్లున్నది—

"తం నత్వాత్మజ మవ్యక్తం మర్త్యలింగ మధోక్షజమ్ ।
గోపికోలూఖలే దామ్నా బబన్ధ ప్రాకృతం యథా ।" (భాగ.

పరమేశ్వరుడుగా వ్యక్తముగాక మనుష్యచిహ్నములతో నున్న శ్రీహరిని తన బిడ్డనుగా భావించిన యశోద, ప్రాకృతపురుషుని గట్టినట్లు ఆ అప్రాకృతపురుషుని త్రాటితో(ఉలూఖలమునకు) రోటికిగట్టెను. అని ఈ ఉలూఖలము మంత్రపన్నములలో జూపబడినఉలూఖలమేలని మ. భా. చ. కారు లన్నారు. ఆ మంత్రపన్నములలో నైనను ఉలూఖలమొక్కటిగా లేక ప్రథమమంత్రములో నొకఉలూఖలమున్నది. ద్వితీయమంత్రములో నొక ఉలూఖలమున్నది. ఎక్కడనున్న యులూఖలములను ఏకముచేయంబూని మంత్రములను తడవిన మ. భా. చ. కారులకు ఆ మంత్రములలోనే రెండులూఖలములు నచ్చిపడినవి కదా.

అవి యటుండ లోకములో 'రోలు' అనబడుచున్న యులూఖలము నొప్పకున్నప్రతివాదులకు గత్యంతరము లేనే లేదు. ఈ లోకప్రసిద్ధమైనయులూఖలమునే సంబంధించియున్న 'ఉలూఖలబంధన'గాథ కపార్థముగల్పించిన ప్రతివాదుల వ్రాత యెట్లు గ్రాహ్యము?

ఫలిత మేమనగా, శకటభంజనములోని శకటము వేఱు. ప్రతివాదులశం జేరథుడు వేఱు. ఉలూఖలబంధనములోనియులూఖలము వేఱు. ప్రతివాదుల యులూఖలము వేఱు కేశి సంహారములోని కేశి వేఱు.

ప్రతివాదుల కేశిని వేఱు. శంఖచూడుడు వేఱు. ప్రతివాదుల కొంటెకర్తగోగ్రహము వేఱు కనుక ప్రతివాదు లన్నట్లు సోకుడుగ్రహములను శ్రీకృష్ణుడు చంపియుండలేదు. అవి యట్లే యున్నవి. వానిని తొలగించుకొనుటకై హోమములు జరుగుచునే యున్నవి. శ్రీకృష్ణునిచే వధింపబడిన స్వరూపములు వేఱే. దీనిచే "పై సోకుడు గ్రహములను శ్రీకృష్ణుడే చంపియుండినచో నేడు ద్విజులు తమయిండ్లలో పైహోమముల జేయు నవసర ముండకపోవును." అను వ్రాతనిరస్తము. ఇంతటితో దీనిని విడిచి యంశాంతర మందుకొందము.

— శ్రీకృష్ణుని తృప్తిచే శిష్యులతో దుర్వాసుడు తృప్తు డయ్యె నను గాథ అసత్యమును ప్రసంగము — తన్నిరాకరణము. —

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది —

"దుర్వాసుడు దుర్యోధనప్రేరితుడై వనమున నున్న పాండవుల బరాభవింప ననేకశతశిష్యులతో సకాలమున వచ్చి ధర్మజు నన్నము నడిగెను. ఆతడు స్నానముచేసి రండని దుర్వాసునితో జెప్పి వీరి తృప్తి నొందింపుమని ద్రౌపదితో జెప్పగెను. సూర్యవరప్రాప్తమగు పాత్రములోని భోజ్యపదార్థములు ద్రౌపదీభోజన మగువరకే యక్షయ మగును గాని యామె భుజించిన తరువాత నందే వస్తువు మరునాటివరకు నుత్పన్నమింపదు. నాడు ద్రౌపది దుర్వాసుడు వచ్చినప్పటికే భుజించుటచే చింతానిమగ్నురాలై కృష్ణా! ఈ యాపదనుండి నన్నెట్లు రక్షింతు వని వేడగా శ్రీకృష్ణుడు ద్రౌపదియెదుట ప్రత్యక్షమయి 'నా కాకలి యగుచున్నది నా కేదేని పెట్టు'మని కోరగా ద్రౌపది వంటతప్పెలాలోని కూరాకును కృష్ణుని కిడెనట! అంతమాత్రముననే శ్రీకృష్ణుడు తృప్తి నొంది త్రేన్పగా శిష్యులకును దుర్వాసునకునుగూడ విశేషాజీర్తిచిహ్నములు కలుగగా శ్రీకృ

ష్ణపాలితులగు పాండవుల బరిభవింప భయపడి సశిష్యుఁడగు దుర్వా
సుడు పలాయితుఁ డయ్యెనట!

ఈ గాథ యసందర్భముగా నుండుటచేతనుగాబోలు నెఱ్ఱాప్రె
గ్గడ యాంధ్రీకరింపలేదు. (పు 85_86)

"దుర్వాసు గాథ మృష యని యెఱ్ఱాప్రగ్గడ భాషాంతరీకర
ణము చేయకపోవుటచే స్పష్టమైనది" (పు. 94)

ఈ దుర్వాసు గాథ, ఆంధ్రభారతములో లేనందున మృషయని
వ్రాసిన యీప్రతివాదులు ఆంధ్రభారతములో నున్న ద్రౌపదీవస్త్రాప
హరణగాథకూడ మృష యనియే వ్రాసినారు. వీరిమాట సత్యమనుట
యెట్లు —

ఈదుర్వాసుని గాథ వనపర్వములో రెండధ్యాయములలో(262
4 _263) నున్నది. పర్వసంగ్రహపర్వములో గూడ "దుర్వాససోఽ
ప్యుపాఖ్యాన మత్రైవ పరికీర్తితమ్" అని చెప్పబడియే యున్నది. శ్రీమ
ద్భాగవతములో గూడ గలదు—

"యో నో జుగోప వనమేత్య దురన్తకృచ్ఛ్రా
ద్దుర్వాససోఽరిరచితా దయుతాగ్రభుగ్యః ।
శాకాన్నశిష్ట ముపయుజ్య యత స్త్రిలోకీం
తృప్తా మమంస్త సలిలే వినిమగ్నసంఘః ॥" (స్క- 1_అ 15)

శ్రీధరీయమ్ —

శిష్యాణా మయుతస్యాగ్రే తత్పంక్తౌ భుఙ్క్తే యస్తస్మాద్దుర్వా
ససో హేతోః అరిణా దుర్యోధనేన రచితం యద్దురన్తం కృచ్ఛ్రం శాప
లక్షణం తస్మాత్సకాశా న్నోఽస్మా న్వన మేత్య జుగోప. కిం కృత్వా.
శాక-మేవాన్నం తస్మిన్నేవ పాత్రేఽవశిష్ట ముపయుజ్య జగ్ధ్వా. యత

ఉపయోగాత్ సలిలే నిమగ్నో మునీనాం సంఘ స్త్రిలోకీం తృప్తా మమంస్త ఏవంహి భారతే కథా—

"కదాచి ద్దుర్వాససో దుర్యోధనే నాతిథ్యం కృతం. తేనచ పరితుష్టేన వరం వృణీ ష్వేత్యుక్తే దుర్వాసస శ్శాపా త్పాండవా నశ్యేయురితి మనసి నిధాయ దుర్యోధనే నోక్తం. యుధిష్ఠిరోఽస్మత్కుల ముఖ్యః. అత స్తస్యాపి భవతైవ మేవ శిష్యాయుతసహితే నాఽతిథినా భవితవ్యః. కిన్తు ద్రౌపదీ యథా క్షుధా న సీదే త్తథా తస్యాం భుక్తవత్యాం తద్గృహం గన్తవ్య మితి. తతశ్చ తథైవ దుర్వాససి ప్రాప్తే పర మాగతేన యుధిష్ఠిరేణ మాధ్యాహ్నికం కృత్వా ఆగమ్యతా మితి విజ్ఞాపితో మునిసంఘో ఽఘమర్షణాయ జలే నిమమజ్జ. తతో చిన్తాతురయా ద్రౌపద్యా స్మృతమాత్రః శ్రీకృష్ణోఽఙ్కస్థాం రుక్మిణీం హిత్వా తత్క్షణమేవ భక్తవత్సలతయా చాగతః. తయా చావేదితే వృత్తాన్తే భగవతోక్తం. హే ద్రౌపద్యహంచ బుభుక్షితోఽస్మి ప్రథమం మాం భోజయేతి. తయా చాతిలజ్జయోక్తం. స్వామిన్ మద్భోజనపర్యన్తం మక్షయ మప్యన్నం సూర్యదత్తస్థాల్యాం మయాచ సర్వాన్ సంభోజ్య భుక్తం మయా నాస్త్యన్న మితి. తథాప్యతినిర్బన్ధేన స్థాలీ మానాయ్య తత్కణ్ఠలగ్నం కించిచ్ఛాకాన్నం ప్రాశ్యోక్తం మనేన విశ్వాత్మా భగవాన్ ప్రీయతాం. అథ భోక్తుం మునిసంఘ మాహ్వయేతి భీమం ప్రహితవాన్ సచతావ తాఽతితృప్తో వృథాపాకభయేన పలాయిత ఇతి॥"

ఇచ్చట శ్రీమద్భాగవతశ్లోకములో వనపర్వములోని దుర్వాసుని గాథయు, శ్రీకృష్ణుని వలన రక్షింపబడుటయు నుదాహరింపబడినది. శ్రీధరీయములో నాగాథ యంతయు భారతములో నున్న దని ప్రతిపాదింపబడినది. దీని యర్థ మించుమించుగా మ. భా. చ. కారులు వ్రాసియున్నదే. కనుక నీగాథ అసత్యము కాదు" ఇంకను జూచుడు—

—శివపురాణము—శతరుద్రీయసంహిత :—

"సుయోధనజితా స్తే తే పాండవాః ప్రవరాశ్చ తే |
ద్రౌపద్యాచ తయా సార్ధం ద్వైతాఖ్యం వన మాయయుః ||
తత్రైవ సూర్యదత్తాం తే స్థాలీం చాశ్రిత్య తేతదా |
కాలంచ వాహయామాసు స్సుఖేన కిల పాండవాః ||
ఛలార్థం ప్రేరిత స్తేన దుర్వాసా మునిపుంగవః |
సుయోధనేన విప్రేన్ద్ర పాండవాన్తిక మాయయౌ ||
ఛాత్రైః స్వైరయుతైః స్వార్థం యయాచే తత్ర తాన్ముదా |
భోజ్యం చిత్తేప్సితం తే స తేభ్యశ్చైవ సమాగతః ||
స్వీకృత్య పాండవై స్తైస్తే స్నానార్థం ప్రేషితా స్తదా |
దుర్వాసఃప్రముఖాశ్చైవ మునయశ్చ తపస్వినః ||
అథ తే పాండవా స్సర్వే అన్నాభావా న్మునీశ్వర |
దుఃఖితాశ్చ తదాఽప్రాణాం స్త్యక్తుం చిత్తే సమాదధుః ||
ద్రౌపద్యాచ స్మృతః కృష్ణ ఆగత స్తత్ క్షణా దపి |
శాకంచ భక్షయిత్వా తు తేషాం తృప్తిం సమాదధత్ ||
దుర్వాసాశ్చ తదా శిష్యాం స్తృప్తాన్ జ్ఞాత్వా యయౌ పునః |
పాండవాః కృచ్ఛ్రనిర్ముక్తాః కృష్ణస్య కృపయా తదా ||"

ఈ గ్రంథముచే గూడ దుర్వాసుని గాథ సత్యమే. ఇంకను నీల కంఠాచార్యునిచే నుదాహరింపబడిన శ్లోకము జూడుడు—బ్రహ్మాణం ప్రతి భగవద్వాక్యమ్—

"విధేఽహం సర్వోఽస్మి వ్రజ పృథుకగోవత్సవదహం
బిభర్మి బ్రహ్మాండం గిరివ దహ మద్మి జ్వలనవత్ |
సృజామి ద్రౌపద్యా వసనవ దహం ప్రాణ భృదహం
యదా త్రాహం తృప్తో ముని రితి మదన్య న్న కిమపి ||"

ఓబ్రహ్మ! నందవ్రజమున గోపబాలకులు, గోవత్సములు నేనే యైనట్లు సర్వమునేనే. గోవర్ధనగిరిని ధరించినట్లు బ్రహ్మాండమును ధరించువాడను నేనే. దవాగ్నిని కబళించినట్లు సర్వమును కబళించువాడను నేనే. ద్రౌపదికి వస్త్రములు సృజించినట్లు సర్వము సృజించువాడను నేనే. నాతృప్తినిబట్టి ముని (దుర్వాసుడు) తృప్తు డగుటవలన ప్రాణభర్తను నేనే. నాకంటె వేఱైన దేదియు లేదు. అని భావము. ప్రాణభర్తయనుటలో "బుభుక్షా చ పిపాసా చ ప్రాణస్య" అని ఆకలిదప్పికలు ప్రాణధర్మములు. శ్రీకృష్ణుని తృప్తిచే ప్రాణధర్మమైన ఆకలిశాంతించి మునిబృందమునకు తృప్తికలుగుటవలన శ్రీకృష్ణుడే ప్రాణభర్త యని తాత్పర్యము.

ఈ శ్లోకార్థపర్యాలోచనముచే శ్రీకృష్ణభగవాను డాయాయద్భుతకార్యములను మచ్చునకై చూపుచు తన సర్వేశ్వరత్వమును చాటుచునే వచ్చె ననియు, నది పుణ్యాత్ములకు మాత్రమే గోచరించుచుండెడి దనియు దెలియుచు దుర్వాసుని గాథ సత్యమే యని తెలిసినది.

ఈ దుర్వాసుని గాథలో మునిబృందమునకు నే నకాలమున భోజన మెట్లు పెట్టగల నని యేమియు లేనిస్థితిలో ద్రౌపదీదేవి-కృష్ణా నన్నీ యాపదనుండి యుద్ధరింపు మని ప్రార్థింపగా దర్శనమిచ్చిన శ్రీకృష్ణుడు- నాకిప్పు డేదైన బెట్టుము ఆకలి వేయుచున్న దనుట పరిహాసమునకా! లేక నిజమేనా? ఆపై యేమాత్రమో శాకలేశమును శ్రీకృష్ణుడు నోటిలో వేసికొని "విశ్వాత్మా ప్రీయతాం దేవః" అని యున్నంతమాత్రమున మునిబృందమునకు సంతృప్తి కలుగునా? అని శంకలు కలుగును. కాని శ్రీకృష్ణున కాకలి కలుగుట నిజమే. అది యామునిబృందముయొక్క ఆకలిచే గలిగిన యాకలియే. అది శాంతించుటకే ద్రౌపదివలన గొంచెము గ్రహించి తాను తృప్తుడయ్యెను. తనతృప్తియే మునిబృందముయొక్క తృప్తి యయ్యెను.

ఇట్లు మునిబృందము యొక్క క్షుత్తుచే దనకు క్షుత్తు. తనతృప్తిచే మునిబృందమునకు తృప్తియు గలుగుట మూలమున కృష్ణపరమాత్మ తన యంతరాత్మభావమును ప్రకటించి యుండెను.

ఈ విషయమును మహాభారతహృదయాభిజ్ఞు డగు నీలకంఠాచార్యులు వనపర్వవ్యాఖ్యారంభమున మంగళశ్లోకములో వెల్లడించి యుండెను. ఆ శ్లోకమిదిగో—

"యో దేవో మునినిచయక్షుధా క్షుధావా-
యత్తృప్త్యా మునినివహోఽపి తృప్తి మాప।
తస్యైవం నిజజగదన్తరాత్మభావం
వ్యాకర్తుః పద ముపయామి గోపసూనోః॥"

ఇట్లు చూడగా యుక్తియుక్తము, బహుప్రమాణసమ్మతము, విద్వన్మనోజ్ఞము నగు దుర్వాసుని గాథను గూర్చి ప్రతివాదులువ్రాసినది విరుద్ధ మగుటచే త్రోసివేయబడినది.

—: "ద్రౌపదీవస్త్రాపహారణము జరుగను లేదు. కృష్ణు డక్షయవస్త్రము లివ్వను లేదు" అను ప్రసంగము - తన్నిరాకరణము —

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— "ద్రౌపదిని దుశ్శాసనుడు కట్టినబట్టల నొలిచి మానభంగము గావింప నామె శ్రీకృష్ణుని స్మరించె ననియు, నామె వస్త్రము లక్షయమైన వనియు, నొలిచిన వస్త్రములు రాశిగా సభలో నుండిన వనియు, సభాపర్వముయొక్క యరువదియేడవ యధ్యాయమున వర్ణింపబడియున్నది. ద్రౌపదీవస్త్రాపహరణకాలమున శ్రీకృష్ణుడు వస్త్రము లక్షయ మగునటుల జేసె ననునది లోకమునం దతిప్రసిద్ధముగా నున్నది. అందువలన ద్రౌపదీమానరక్షకు డను నపూర్వబిరుదము శ్రీకృష్ణునకు

గలిగినవి. దాని ననుసరించి కథలలో జిలువలు పలువలు కలిగినవి. ఈకింద్రిదికారణములచే ద్రౌపదీవస్త్రాపహరణమే జరుగలేదని తలపవలసి యున్నది. మహాభారతమందు నాకు దెలిసినంతలో ద్రౌపదీపరిభవప్రశంస పదమూడు స్థలములలో జెప్పబడినది. ...... పైపదమూడుసమయములలో 1 దుశ్శాసనుడు ద్యూతకాలమున ద్రౌపదిజుట్టుపట్టుకొనిలాగి వస్త్రములొలుచునపుడును 10దుశ్శాసనవధసమయమునను, 11 దుర్యోధనవధసమయమునను మాత్రమే వస్త్రాపహరణప్రశంస కలదు. ద్రౌపది శ్రీకృష్ణునితో తనకు వస్త్రాపహరణ మైన దనికాని, నావస్త్రాపహరణసమయమున నిన్ను దలపగా నక్షయవస్త్రముల నిచ్చి నన్నురక్షించితి వని కాని చెప్పలేదు. సూచింపనైన సూచింపలేదు. ద్రౌపదిమాత్రమె కాదు పాండవు లెవ్వరు నేసమయమునను ద్రౌపదీపరిభవము జెప్పినపుడు వస్త్రాపహరణము నెత్తుకొనలేదు. అన్ని యపరాధములకంటె వస్త్రాపహరణాపరాధము హెచ్చైనది. దాని నంతగ నెత్తికొనకపోవుటచేతను, అనుక్రమణికలో జెప్పబడకపోవుటచేతను ద్రౌపదీవస్త్రాపహరణము జరుగలేదనియు, శ్రీకృష్ణునకు ద్రౌపదీమానరక్షకు డను బిరుదు ఆమెకు వస్త్రముల నిచ్చుటచే రాలేదనియు వ్రాయ సాహసించుచున్నాను. ప్రాచీనమహాకవులగు భాస, భారవి, క్షేమేంద్రకవులు గూడ భారతగాథాప్రతిపాదకములగు తమగ్రంథములలో సభాప్రవేశ కచగ్రహణములను మాత్రమె చెప్పిరికాని వస్త్రాపహరణవృత్తాంతమును సూచింపలేదు. ఆమె యేకవస్త్రయై రజస్వలగా నుండుటకూడ సత్యము కాదు. (పు. 85—90)

ఈ వ్రాతలో 'సాహసించుచున్నాడను' అని చెప్పు ప్రతివాదులకు దాని నిషిద్ధత్వమును గూర్చి గొంచము బోధింతము. మనోవ్యాపారముయొక్కయు, వాగ్వ్యాపారముయొక్కయు, శరీరవ్యాపారము

యొక్కయు, నసాలోచితములును ననర్థకరములైన వేగములుసాహసము లనబడును. అరికట్టరాని వేగములు కొన్ని, అరికట్టవలసిన వేగములు కొన్ని. మూత్రపురీష వేగము లరికట్టరానివి, సాహసములనబడు మనో వాక్కాయవ్యాపార వేగములు అరికట్టవలసినవి.

ఈ విషయము ఆయుర్వేదగ్రంథమగు చరకసంహితలో నున్నది చూడుడు—

న వేగాన్ ధారయే ద్ధీమాన్ జాతా న్మూత్రపురీషయోః ।
ఇమాంస్తు ధారయే ద్వేగాన్ హితార్థీ ప్రేత్యచేహచ ॥
సాహసానా మశస్తానాం మనోవాక్కాయకర్మణామ్ ।"

ఇట్లు నిషిద్ధమై యున్న సాహసమును ప్రతివాదులు పూని ప్రసిద్ధినొందనై యున్నారన్నమాట! ఇక వస్త్రాపహరణవిషయ మిట్లున్నది.

దుశ్శాసనుడు ద్రౌపదిని జుట్టుపట్టుకొని సభకు లాగుచున్నపుడు ఆమె వడకుచు "శ్నైరువాచాథ రజస్వలాస్మి ఏకంచ వాసో మమ మందబుద్ధే! సభాం నేతుం నార్హసి మా మనార్య" అనుచు నేను రజస్వలను ఏకవస్త్రను సభకు రాదగను అని చెప్పుచుండ దుశ్శాసనుడు— "రజస్వలా వా భవ యాజ్ఞసేని ఏకాంబరావాప్యథవా వివస్త్రా! ద్యూతే జితా చాసి కృతాచ దాసీ దాసీషు వాసశ్చ యథోపజోషమ్॥" అనుచు నీవు రజస్వలవైనను సరియే. ఏకవస్త్రవైనను సరియే. తుదకు వివస్త్రవైనను సరియే. ద్యూతమున జయింపబడి దాసివైతివి. దాసీజనమందు వస్త్రపరిస్థితి యభిరుచి ననుసరించి యుండును. అని కర్ణకఠోరముగా బలుక ద్రౌపది— "ధిగస్తు నష్టః ఖలు భారతానాం ధర్మ స్తథా క్షత్రవిదాంచ వృత్తం । యత్ర హ్యతీతాం కురుధర్మవేలాం ప్రేక్షన్తి సర్వే కురవ స్సభాయామ్ ॥"

అనుచు ఛీ! భారతధర్మ మడుగంటినది. అధర్మనిర్మూలన క్షమ మగు క్షాత్రము నశించినది. కురువంశధర్మసేతువు భగ్నమై పోవు చుండ సభలో కురువంశపురాజు లెల్లరు చూచుచుండిరి. అని యార్త నాదములు చేయుచుండ, సభ్యులు ఖిన్నులై కటకటబడుచుండ, పాం డవు లపారదుఃఖభారమున నవనతశిరస్కులైయుండ, దుశ్శాసను డా సాధ్విని దాసియని పరిహసించుచుండ, ధృతరాష్ట్రపుత్రుడగు వికర్ణు డా దుశ్శాసనుని దుర్నయమును సహింపలేక యిందలి న్యాయ మేదియో నేను చెప్పుచున్నా నని పూనుకొని, ధర్మజుడు ద్యూతవ్యసనియై యుండుట, జితుడై యుండుట, పరప్రవర్తితుడై యుండుట, ద్రౌపది ధర్మజునకే కాక పాండవు లందరకు బత్నియై యుండుట అను నాల్గు హేతువులచే నీసాధ్వీమణి జయింపబడలేదని యుద్ఘోషించుచుండ కర్ణు డప్పుడు దుశ్శాసనున కిట్లు చెప్పెను—

"దుశ్శాసన! సుబాలోఽయం వికర్ణః ప్రాజ్ఞవాదికః ।
పాండవానాం చ వాసాంసి ద్రౌపద్యా శ్చాప్యుపాహర ॥"

దుశ్శాసనా! ఈ వికర్ణుడు తెలియనివాడు. పాండవులయొక్కయు, ద్రౌపదియొక్కయు, వస్త్రములను తీసికొనుము.

"తచ్ఛ్రుత్వా పాండవా స్సర్వే స్వాని వాసాంసి భారత ।
అవకీ ర్యోత్తరీయాణి సభాయాం సముపావిశన్ ॥"

పాండవు లామాటను విని తమ యుత్తరీయములను తామే తీసి యక్కడబెట్టి కూర్చుండిరి. దుశ్శాసనుడు ద్రౌపదీదేవి వస్త్రము లాగుట కారభించెను.

"ఆకృష్యమాణే వసనే ద్రౌపద్యా చిన్తితో హరిః ।
గోవిన్ద ద్వారకావాసిన్ కృష్ణ గోపీజనప్రియ ॥

"కౌరవైః పరిభూతాం మాం కిం న జానాసి కేశవ ।
హే నాథ హే రమానాథ వ్రజనాథార్తినాశన ॥
కౌరవార్ణవమగ్నాం మా ముద్ధరస్వ జనార్దన ।
కృష్ణ కృష్ణ మహాయోగిన్ విశ్వాత్మన్ విశ్వభావన ।।"

టీ. విశ్వాత్మన్ విశ్వాన్తర్యామి న్నిత్యర్థః, విశ్వభావన విశ్వకర్తః, అన్తర్యామిత్వేన శత్రుంవాఽస్మి న్నర్థే ఉదాసీనంకురు. అథవా విశ్వకర్తృత్వేన వస్త్రాణి బహూని సమర్పయేతి భావః.

"ప్రపన్నాం పాహి గోవిన్ద కురుమధ్యేఽవసీదతీమ్।
ఇత్యనుస్మృత్య కృష్ణం సా హరిం త్రిభువనేశ్వరమ్॥
ప్రారుదద్దుఃఖితా రాజన్ ముఖ మాచ్ఛాద్య భామినీ ।
యాజ్ఞసేన్యా వచః శ్రుత్వా కృష్ణో గహ్వరితోఽభవత్ ॥
త్యక్త్వా శయ్యాసనం పద్భ్యాం కృపాలుః కృపయాఽభ్యగాత్.

టీ. గహ్వరితః కరుణాతిశయా ద్గద్గదకంఠః ॥

"కృష్ణం చ విష్ణుం చ హరిం నరం చ త్రాణాయ విక్రోశతి యాజ్ఞసేనీ।
తతస్తు ధర్మోఽన్తరితో మహాత్మా సమావృణోద్వై వివిధైస్సువస్త్రైః"

టీ. ధర్మోఽన్తరితః ధర్మ ఏవ అన్తరం వస్త్రం తద్భావం గతవాన్. గత్వా చ తాం వస్త్రపూగై స్సమావృణోత్ ॥

"ఆకృష్యమాణే వసనే ద్రౌపద్యాస్తు విశాంపతే ।
తద్రూప మపరం వస్త్రం ప్రాదురాసీ దనేకశః ॥
నానారాగవిరాగాణి వసనాన్యథ వై ప్రభో ।
ప్రాదుర్భవన్తి శతశో ధర్మస్య పరిపాలనాత్ ॥
తదద్భుతతమం లోకే వీక్ష్య సర్వే మహీభృతః ।
శశంసు ర్ద్రౌపదీం తత్ర కుత్సన్తో ధృతరాష్ట్రజమ్ ॥
యదాతు వాససాం రాశి స్సభామధ్యే సమాచితః ।
తతో దుశ్శాసన శ్శ్రాన్తో వ్రీడిత స్సముపావిశత్ ।।" (సభా. అ68)

దుశ్శాసనుడు తనవస్త్రమును పట్టిలాగుచుండ ద్రౌపదీదేవి కృష్ణభగవానుని ప్రార్థించెను. యీకౌరవార్ణవములో మునిగిపోవుచున్న నన్నుద్ధరింపుము. కృష్ణా! నీవు సర్వాంతర్యామివికనుక శత్రువున కీదుష్కార్యము చేయరాదను బుద్ధినైన బుట్టింపుము. లేదా, నీవు విశ్వకర్తవుకనుక నాకనంతవస్త్రములనైన గల్పించి కాపాడుము. అను భావముతో స్మరించి దుఃఖింప నాసాధ్వీమణి యార్తాలాపములను కృష్ణపరమాత్మ హృదయము ద్రవింప తానక్కడ నిలువలేక లేచిరాగా నార్తత్రాణపరాయణుడగు కృష్ణపరమాత్మ సంకల్పమాత్రమున ద్రౌపదీదేవి యొక్క ధర్మమే వస్త్రభావమును పొంది యామె నావరించియుండ దుశ్శాసనుడు వస్త్రములాగునప్పటి కట్టిది మరియొకటి యుద్భవించుచు ననేకరంగులతో వందలకొలది వస్త్రములు ధర్మము రక్షకమై యుండుటచే నుద్భవించినవి. ఆయద్భుతమును చూచి సభ్యులు ద్రౌపదీదేవిని ప్రశంసించువారును ధార్తరాష్ట్రుని నిందించువారు నైరి. ఎప్పుడు సభామధ్యమున లాగిన వస్త్రములు పోగుపడుచు నింకను బుట్టుచునేయున్నవో అప్పుడు దుశ్శాసనుడు అలసి సిగ్గుపడి కూర్చుండెను.

ఇదియే సభాపర్వములోని ద్రౌపదీవస్త్రాపహరణవృత్తాంతము. మ. భా. చ. కారులు తమవ్రాతలో దీని నొప్పుకొనియే యున్నారు. ఇక వారనుక్రమణికలో నిది చెప్పబడలేదన్నారు. చెప్పబడినది చూతుము—

మహాభారతములో ప్రథమాధ్యాయమునకు అనుక్రమణికాధ్యాయమని పేరు. అందు పాండవుల విజయహేతువులను, కౌరవుల అపజయహేతువులను మొదటినుండియు తానుగ్రహించుచునే వచ్చినట్లు వాని నన్నింటిని ధృతరాష్ట్రుడు సంజయునకు దెలుపుచున్న సందర్భముగా భారతార్థసంగ్రహము అరువదియేడుశ్లోకములలో జెప్పబడినవి. ఆప్రస్తావములో ధృతరాష్ట్రుడే వస్త్రాపహరణమును, అనంతవస్త్రావిర్భావమును, రజస్వలావస్థను ఇట్లు కీర్తించినాడు—

"యదాశ్రౌషం ద్రౌపదీ మశ్రుకంఠీం సభాం నీతాం దుఃఖితా మేక వస్త్రామ్। రజస్వలాం నాథవతీ మనాథవత్తదా నాశంసే విజయాయ సంజయ ॥

యదాశ్రౌషం వాససాం తత్ర రాశిం సమాక్షిపత్కితవో మన్దబుద్ధిః। దుశ్శాసనో గతవాన్ సైన్న చాన్తం తదా నాశంసే విజయాయ సంజయ ॥"

"టీ. యదాశ్రౌషం ద్రౌపదీమితి. పతివ్రతాకోపాత్ పాండవానాం క్షోభాచ్చ నష్టా జయాశేత్యర్థః" దీనిచే ననుక్రమణికలో జెప్పబడ లేదను మాట బూటకమని తేలినది.

ఇక ద్రౌపదీపరిభవప్రశంస కల 13స్థలములలో 3స్థలములలో దప్ప మిగిలిన 10స్థలములలో వస్త్రాపహారణము చెప్పబడకపోవుటచే జరుగలే దను వ్రాతనుగూర్చి చెప్పవలసియున్నది.

కొన్నిచోట్ల గంఠోక్తిగా జెప్పబడిన విషయము మరికొన్ని చోట్ల జెప్పబడకున్న నసత్యమైపోదు. ఈసంగతిని "నహి క్వచి దశ్రవణ మన్యత్ర శ్రుతం వారయతి" అను న్యాయము బోధించుచున్నందున ప్రతివాదు లట్లు వ్రాయుట యజ్ఞానము. ఇంకొకటి, వారు చెప్ప బడలేదన్న స్థలములలోగూడ జెప్పబడినట్లు కొంతవరకు చూపుచు న్నాము —

"ద్రుపదపురోహితుడు కౌరవసభలో మాటలాడు నపుడు వస్త్రాపహారణముమాట చెప్పలేదట" చెప్పెను చూడుడు —

"పునశ్చ వర్ధితం రాజ్యం స్వబలేన మహాత్మభిః।
ఛద్మనాఽపహృతం క్షుద్రై ర్ధార్తరాష్ట్రైః స్ససౌబలైః ॥
తదప్యనుమతం కర్మ యథా యుక్త మనేనవై।

వాసితాశ్చ మహారణ్యే వర్షాణీహ త్రయోదశ ।
సభాయాం క్లేశితైర్నిత్యం తైస్సహభార్యైస్తథా భృశమ్॥
అరణ్యే వివిధాః క్లేశాస్సంప్రాప్తాస్తైస్సుదారుణాః ॥" (ఉద్యో. అ20)

ఇచ్చట మూడవశ్లోకములో "సహ భార్యైః సభాయాం తథా క్లేశితైః" అనుటలో ద్రౌపదితోఁగూడ నాటిసభయందు దావిధముగా బాధింపబడినారే యని 'తథా' శబ్దముతో నాటి ద్యూతసభయందు జరిగిన దుష్కార్యములను వస్త్రాపహరణాంతము నుద్ఘాటించియే యుండెను. ద్యూతసభలో వస్త్రాపహరణము జరిగినట్లున్నదని ప్రతివాదులు వ్రాసియే యున్నారు. ఆద్యూతసభావృత్తాంతమునే 'తథా' (ఆవిధముగా) అను శబ్దముచే నుట్టంకించెను. ఈశ్లోకముల కాంధ్రభారత మర్థము వర్ణించినది. చూడుడు—

ఉద్యోగపర్వము— 1 ఆశ్వాసము—

తే. బాహుబల మొప్ప నిజరాజ్యపదవి బొంది
యున్న వంచనమెయి మహిఁగొన్న తెఱఁగు
నెఱుఁగుదుర కాదె దీనికి నెల్ల నియ్యఁ
కొనియె నీపెద్దరాజు నేమనఁగ నేర్తు.

శా. నారీరత్నము నట్లు దెచ్చి సభలోనన్ వారలుం జూడఁగా
జీరల్ ప్రోవులు గాఁగ నొల్చుటయు లక్ష్యింబుచ్చికోలున్ మహో
గ్రారణ్యస్థలి నిల్వ బంచుటయు దైన్యవ్యక్తిమై పల్కులున్
సైరింపం జను పాండవేయులకు నీసంధిక్రమం బొప్పదే॥

ఇక "శ్రీకృష్ణుడు కౌరవసభలో కౌరవుల దుష్టకార్యముల జెప్పినపుడు వస్త్రాపహరణముమాట జెప్పలేదట" చెప్పెను. చూడుడు—

"తస్యా శ్చాన్యో భ్రాతృభార్యాం స నై విప్రకర్తుం తథాఽర్హతి !
ఆనీయచ సభాం వ్యక్తం యథోక్తా ద్రౌపదీ త్వయా॥
కులీనా శీలసంపన్నా ప్రాణేభ్యోఽపి గరీయసీ ।
మహిషీ పాండుపుత్రాణాం తథా వినికృతా త్వయా ॥"

ఇచ్చటగూడ 'తథా వినికృతా' అనుమాటలో వస్త్రాపహరణ ముద్ఘాటింపబడియే యున్నది. ఆంధ్రభారత మిచ్చట జూడుడు—

తే. అన్నదమ్ములు నెత్తంబు లాడి సతుల
తలలు పట్టి సభాస్థలంబులకు నీడ్చి
చీర లొలిపింతురే యిట్టి వారి నెందు
వడవుమా నీవొకండవు దక్క నధిప.

ఇక "సజంయు రాయభారసమయమున వస్త్రాపహరణము మాట చెప్పబడలేదట" శ్రీకృష్ణునిచే జెప్పబడెను. చూడుడు—

"దుశ్శాసనః ప్రాతిలోమ్యా న్నినాయ
సభామధ్యే శ్వశురాణాం చ కృష్ణామ్ ।
కృష్ణా త్వేత త్కర్మ చకార శుద్ధమ్
సుదుష్కరం తత్ర సభాం సమేత్య ।
యేన కృచ్ఛ్రా త్పాండవా నుజ్జహార
తథాత్మానం నౌ రివ సాగరౌఘాత్ ॥"

ఇచ్చట దుశ్శాసనుడు అక్రమముగా ద్రౌపదీదేవిని సభలోనికి లాగికొనివచ్చినాడనియు, నాటియాపత్సముద్రమునుండి తాను, పాండవులు, ఉద్ధరింపబడుటకై ద్రౌపదీదేవియే సభలో నుజ్జ్వలము దుష్కరము నగు పనిని చేసియుండె ననియు కృష్ణభగవానుడు సంజయునితో సంభాషించెను.

ఆదుష్కరమైన కార్యము సభాపర్వోక్తమై యున్న అనంత వస్త్రోత్పత్తిరూపమగు మహిమను ద్రౌపది వెల్లడించుటే. అది వస్త్రాపహరణమూలకము కనుక వస్త్రాపహరణ ముక్తప్రాయమే.

ఈసందర్భమున నాంధ్రభారత మిట్లున్నది—

చ. అది దగ దంచు నడ్డపడునంతకు నేరక సభ్యులందరున్
మదిమదినున్నయట్టియెడ మానినికిం దనుదాన కాచికో
లోవవిన దానజేసి సభ నొచ్చెము దక్కిన బాండునందనుల్
బ్రతికిరిగాక యయ్యెడరు రాచకొమారుల కోర్చునట్టిదే.

ఈపద్దెములో తన్ను దానే రక్షించుకొనుట తటస్థించె ననుటచే ననంతవస్త్రోత్పత్తి చెప్పబడినది.

ఇక "సంధికేగు శ్రీకృష్ణునితో ద్రౌపది తాను పడిన కష్టముల జెప్పినపుడు వస్త్రాపహరణముమాట జెప్పలేదట" చెప్పెననూడుదు—

"సాహం కేశగ్రహం ప్రాప్తా పరిక్లిష్టా సభాంగతా ।
నిరసుగ్ధే ష్వచేష్టేషు ప్రేక్షమాణేషు పాండుషు ॥
పాహి మా మితి గోవిన్ద మనసా చిన్తితోఽసి మే ।
యత్ర మాం భగవా న్రాజా శ్వశురో వాక్య మబ్రవీత్ ॥
వరం వృణీష్వ పాంచాలి వరార్హాసి మతా మమ ।"

ఇచ్చట 'కేశగ్రహం ప్రాప్తా' అను మాటచే జుట్టుపట్టుకొనుట, 'సభాంగతా' అను మాటచే సభకీడ్చుట, 'పరిక్లిష్టా' అనుమాటచే వస్త్రాపహరణముచేయుట చెప్పబడినవి. పాండవు లేమియు గలుగ జేసికొనక చూచుచున్నపుడు కృష్ణా! రక్షింపు మని నిన్ను ధ్యానించితిని. ఆ ధ్యానమునుబట్టియే వస్త్రాపహరణాదులలో మందలింప కూరకుండిన ధృతరాష్ట్రుడు పాంచాలీ! నీవు పూజ్యురాలవు నీవు వరము గోరికొను మని గౌరవించెను. అని యున్నది.

ఇక్కడ జెప్పబడిన శ్రీకృష్ణచింతనము- సభాపర్వములో "ఆకృష్యమాణే వసనే ద్రౌపద్యా చిన్తితో హరిః" అని చెప్పబడిన వస్త్రాపహారణసమయమందలి శ్రీకృష్ణచింతనమే. దీనిచే వస్త్రాపహారణము చెప్పినట్లైనది. ఆ శ్రీకృష్ణచింతనమునుబట్టియే ధృతరాష్ట్రు డాదరించి వరమిచ్చెదనని పలికెననుటచే నా శ్రీకృష్ణచింతనఫలముగా సంభవించిన యనంతవస్త్రోత్పత్తి, తన్మూలమున దుశ్శాసనదౌష్ట్యోపశాంతి, ధృతరాష్ట్రు వరప్రోత్సాహము అను సభాపర్వోక్తక్రమము చెప్పబడినట్లయినది. ఇంకొకటి-వనవాసములో శిష్యసంఘముతో దుర్వాసోమహర్షి అకాలమున భోజనాపేక్షతో వచ్చినపుడు పెట్టుట కేమియు లేక ద్రౌపది శ్రీకృష్ణుని ధ్యానించునపుడు నాడు ద్యూతసభలో దుశ్శాసనునివలన నన్నెట్లు విడిపించితివో అట్లే యీ యాపదనుండి నన్నుద్ధరింపు మని వేడుకొనినది. చూడుడు—

"దుశ్శాసనా దహం పూర్వం సభాయాం మోచితా యథా।
తథైవ సంకటా దస్మా న్మాముద్ధర్తు మిహార్హసి।" (వన. అ262)

అప్పుడు దుశ్శాసనునివలన కృష్ణుడు వస్త్రాపహారణసమయమందిచ్చిన అక్షయ వస్త్రములచేతనే విడిపించెననుట స్పష్టము—

ఇది ప్రతివాదు లుదాహరింపనిదై దుశ్శాసనునిచే వస్త్రాపహారణము, కృష్ణభగవానునిచే ననంతవస్త్రదానము చేయబడినట్లు ద్రౌపది తలపోసికొనిన స్థలము.—

ఇట్లు రెండు స్థలములలోను ద్రౌపదీప్రసంగ మిట్లుండగా ప్రతివాదులు "తనకు వస్త్రాపహారణమైన దని ద్రౌపది చెప్పలేదు" అని వ్రాసినారు. మానహీనులవలె మానధనులు మర్మభేదకములగు విషయములను సూచించుచుందురే. కాని నోటితో నుచ్చరించి చెప్పలేరు. ఈ సం

గతి మ. భా. చ. కారులకు దెలియదా? వస్త్రాపహరణమైనదని ద్రౌపది చెప్పలేదనుట యనాలోచితము. పూర్వోక్తప్రకారము సూచించి యుండ "సూచింపనైనన సూచింపలేదు" అనుట సాహసము. రాయ బారపు సందర్భమున శ్రీకృష్ణునితో నర్జునుడుకూడ —

"జానాసి హి యథా తేన ద్రౌపదీ పాపబుద్ధినా ।
పరిక్లిష్టా సభామధ్యే తచ్చ తస్యాపమర్షితమ్ ॥"

ద్రౌపది సభామధ్యమున పాపాత్మునిచే నెట్లు కష్టపెట్టబడెనో నీవెరుగుదువుకదా యనుచు వస్త్రాపహరణము నుద్ఘాటించెను. సహదేవుడుకూడ—

"కథంను దృష్ట్వా పాంచాలీం తథా కృష్ణ! సభాగతామ్ ।
అవధేన ప్రశామ్యేత మమ మన్యుస్సుయోధనే ॥"

కృష్ణా! సభలో ద్రౌపది నావిధముగా జూచియున్న నాకోప్రాగ్ని సుయోధనుని వధింపక యెట్లు చల్లారును? అనుచు వస్త్రాపహరణము నుద్ఘాటించెను. ఇంతయేల దుర్యోధనపక్షపాతులై వస్త్రాపహరణము జరుగలేదనుచున్న మ. భా, చ. కారులకు దుర్యోధనుని వాక్యములనే సాక్ష్యముగా జూపుదము.

కర్ణసంహార మైనవుడు దుఃఖించుచున్న దుర్యోధనునితో కృపాచార్యులు— ఇప్పుడైన సంధిచేసికొనుట మంచిదని బోధింప, పాండవు లందు కంగీకరింప రనుచు దుర్యోధనుడు కారణ మిట్లుచెప్పెను—

"దుశ్శాసనేన యత్కృష్ణా ఏకవస్త్రా రజస్వలా।
పరిక్లిష్టా సభామధ్యే సర్వలోకస్య పశ్యతః ।
తథా వివసనాం దీనాం స్మరన్త్యద్యాఽపి పాండవాః ।
న నివారయితుం శక్యా స్సంగ్రామాత్తే పరంతపాః ॥" (శల్య. అ4)

రజస్వలనై యేకవస్త్రనైయున్న ద్రౌపది సభామధ్యమున సర్వజనసమక్షమున దుశ్శాసనునిచే పరిక్లిష్టురాలైనది. అవిధముగా వివస్త్రయై దీనురాలైన యామె స్వరూపమును పాండవు లిప్పటికిని మనస్సులో బెట్టుకొనియున్నారు. ఆశూరులను యుద్ధమునుండి మరల్ప శక్యము కాదు, అని. ఈమాటలలో దుశ్శాసనుడు వస్త్రాపహరణము జేసె ననియు, నప్పుడామె రజస్వలయే యనియు దుర్యోధనుడే చెప్పుట వలనకూడ దీనికి విరుద్ధమైన ప్రతివాదిప్రసంగమునకు త్రోసివేతయైనది. సుయోధనవిజయగ్రంథకర్త —

అప్పు డిద్రోసివిచ్చినట్టి యా కాంత వస్త్రంబు తనయంత బడెనుక్రింద
నంతమాత్రంబున నలివను పరిభవించితి మంచు నెత్తెత్తి చెప్పిరకట"

అని దుర్యోధనుని మాటగా నిట్లు కవిత్వమల్లినారు. ద్రౌపదీ వస్త్రము దానికదే పడిపోయినదట! వీరొకవిమర్శకులు, వీరి పరిజ్ఞానము లోకాతీతము. యుక్తాయుక్త పరిశీలనము లేని యీవ్రాత లోకవిరుద్ధ మగుటచేతను, ఈసుయోధనవిజయగ్రంథకర్తయే యనుడగు సుయోధనుని మాటలకే విరుద్ధమగుటచేతను త్రోసివేయబడినది.

ఇక మ. భా. చ. కారులు "ప్రాచీనమహాకవులగు భాస, భారవి, క్షేమేంద్రకవులుగూడ తమగ్రంథములలో వస్త్రాపహరణ వృత్తాంత మును సూచింపలేదు" అని వ్రాసిన విషయ మున్నది. ఆమహాకవులు స్పష్టముగా జెప్పియే యున్నారు. అది యథాక్రమముగా జూపబడు చున్నది. చూడుడు —

భాసమహాకవి 'దూతవాక్యము' —

"దుర్యోధనః—కోనుఖలు మమా ప్రత్యుత్థానస్యోపాయః? హాస్తి దృష్ట ఉపాయః. బాదరాయణ! ఆనీయతాం సచిత్రపటో నను యత్ర ద్రౌపదీ కేశాంబరాపకర్షణ మాలిఖితం తస్మిన్ దృష్టివిన్యాసం కుర్వ న్నోత్థాస్యామి కేశవస్య"

ఈప్రస్తావ మేమనగా కృష్ణభగవానుడు రాయబారిగా కురుసభకు వచ్చుచున్న సమయమున దుర్యోధనుడు శ్రీకృష్ణుని జూచిసభలో మీారెవ్వరును లేచి ప్రత్యుత్థానము చేయరా దని సభ్యులకు శాసించి, శ్రీకృష్ణుని జూచునప్పటికి తనకే ప్రత్యుత్థానము జేయ బుద్ధిపుట్టునేమో యనుకొని యట్లు జరుగకుండుట కుపాయమాలోచించి, యనుచరుని బిలిచి ద్రౌపదీకేశవస్త్రాపకర్షణము వ్రాయబడిన యాచిత్రపటమును తెమ్ము. దానిని చూచుచుండి కృష్ణునకు ప్రత్యుత్థానము చేయకుందును. అని యాజ్ఞాపించెను. ఈగ్రంధములో వస్త్రాపహరణము చెప్పబడినది కద, "ఈభాసమహాకవి నేటికి రెండువేలేండ్లవాడు". ఈమాట మ. భా. చ. కారులన్నదే. (పు 314)

భారవికావ్యము_ స. 3.

"ప్రసహ్య యోఽస్మాసు పరైః ప్రయుక్తః స్మర్తుం న శక్యః కిముతాధికర్తుం। నవీకరిష్య త్యుపశుష్యదార్ద్రః స త్వద్వినా మే హృదయం నికారః ॥"

మల్లినాథవ్యాఖ్యా—

"పరైః శ్శత్రుభిః అస్మాసు ప్రసహ్య ప్రయుక్తః ఆచరితః యో నికారః పరిభవః కేశాంబరాకర్షణరూపః స్మర్తుం న శక్యః అనుభవితుం కిముత" ఇచ్చట సూచింపబడినదికద.

క్షేమేంద్రకవి 'భారతమంజరి' (పు 145)

"హర దుశ్శాసనాఽస్యా స్స్వం వాసః పశ్యన్తు కౌరవాః।
ఏనాం గా మివ నిర్లజ్జాంకిం సతీగౌరవైర్వృథా ॥
ఇత్యుక్తే సూతపుత్రేణ కాలపాశవశీకృతః।
కేశపాశం వికృష్యాఽస్యా వాసో జగ్రాహ కౌరవః ॥

యథాయథా జహారాసౌ స తస్యా రుచిరాంబరమ్ ।
తథా తథా వచనవం ప్రాదురాసీ త్తత స్తనా ॥"

ఇచ్చట వస్త్రాపహరణము జేయు మని కర్ణుడు చెప్పగా దుశ్శాసనుడు చేయ నారంభించె ననియు, నాతడట్లు చేయుచుండ నూతనవస్త్రములు ఆమె శరీరమందు కనబడుచునే యుండె ననియు మహాభారతములో జెప్పినట్లే చెప్పబడె నని స్పష్టమే కద.

ఇక్కడకు ప్రతివాదులు లేదన్న గ్రంథములలో నున్న దని చూపియున్నాము. మరియొకటి చూపుదము—

క్షేమేంద్రునికంటె బూర్వుడు భట్టనారాయణకవి. కనుకనే సువృత్తతిలక మను తన గ్రంథములో 'యథా భట్టనారాయణస్య' అని క్షేమేంద్రు డుదాహరించెను. అట్టి భట్టనారాయణకవి రచించిన వేణీసంహారనాటకములో నిట్లున్నది—

"య త్సత్యవ్రతభంగభీరుమనసా యత్నేన మందీకృతం
య ద్విస్మర్తు మపీహితం శమవతా శాన్తిం కుల స్యేచ్ఛతా ।
తద్ద్యూతారణిసంభృతం నృపవధూకేశాంబరాకర్షణైః
క్రోధజ్యోతి రిదం మహ త్కురువనే యౌధిష్ఠిరం జృంభతే ॥"

ద్యూత మనెడి యరణినుండి ద్రౌపదీకేశాకర్షణ, వస్త్రాకర్షణములను మథనములచే నుద్భవించి, యుధిష్ఠిరుని సత్యవ్రతభంగభీతిచే యత్నముతో నాపబడి, శాంతుడై కురువంశశాంతికాముడై యున్న యుధిష్ఠిరునిచే విస్మరణావస్థకుగూడ దీసికొని రాబడిన యౌధిష్ఠిరమహాక్రోధాగ్ని కౌరవారణ్యమం దిప్పుడు విజృంభించుచున్నది. అని యున్న యీ శ్లోకములో వస్త్రాపహరణము చెప్పబడినది. ఇట్లెందరో మహాకవు లీవిషయమును చెప్పియేయున్నారు.

ఇంతేగాక యీ మ. భా. చ. కారులు వేదవ్యాసభగవానుని వాక్యములకంటె వేమనపద్దెములను ప్రమాణముగా భావించుచుం దురు. ఒకచోట "ప్రఖ్యాతమహాకవి వేమన" (పు294) అని కీర్తించి నారు. కనుక 'యథౌనురూపో బలిః' అను న్యాయమున ద్రౌపదికి శ్రీకృష్ణుడు వలువలిచ్చినట్లు తెలుపుచున్న వేమనమహాకవి పద్దెమునే చూపుదము—

ఆ. గోగణంబు లెల్ల గొల్లడై పోషించి
కృష్ణు డనగ నెగడె కృతముఖుండు
కృష్ణ కొసగె వలువ కీల్గొన పదివేలు
విశ్వదాభిరామ వినుర వేమ. (భా౨. పు32)

దీనిచేగూడ వస్త్రాపహరణ మయ్యెననియు, నప్పుడు శ్రీకృష్ణుడు ద్రౌపది కక్షయముగా వస్త్రములిచ్చెననియు, గనుకనే ద్రౌపదీమాన రక్షకుడయ్యెననియు, కావుననే అది లోకప్రసిద్ధ మయ్యె ననియు స్థిరప డినది. దీనినిబట్టి మ. భా. చ. కారులు వ్రాసినవి సాహసమూలము.

—"కృష్ణు డక్షయవస్త్రము లిచ్చె ననుట సౌంభకవధగాథకు విరుద్ధ మనుప్రసంగము:— తన్నిరాకరణము—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది—"కృష్ణుడు సాళ్వునితో దెరపి లేకుండ బోరునపుడే పాండవులు ద్యూతజితులై అరణ్యవాస మున కేగిరి. ద్యూతకాలమున కృష్ణుడు ద్వారకలో నుండె ననియు, ద్రౌపదీవస్త్రాపహరణకాలమునందామె "హాకృష్ణాద్వారకావాసా" యనునంతనె 'అశరీర'రూపముతో వచ్చి యామెకక్షయవస్త్రముల నిచ్చె ననియు జెప్పువాక్యమున కీసౌంభకవధగాథ ప్రబలవిరోధము గా నున్నది "నేను ద్వారకలోనే యుండినయెడల ద్యూతకాలమున కనాహూతుడగా నైన వచ్చి ద్యూతమును నివారింపనా" యని శ్రీకృష్ణు డనుట గమనింపదగిన యంశమై యున్నది" (పు 172)

పీకీవార్తిచే శ్రీకృష్ణుడు ద్యూతసమయమున సాళ్వయుద్ధములో నుండెను గాని ద్వారకలో లేడనియు, కనుకనే శ్రీకృష్ణుడు నేను ద్వారకలోనే యుండినయెడల ననాహూతుడనైనను వచ్చి ద్యూతమును నివారింపనా అని సంభాషించె ననియు, దీనివలనద్రౌపది 'కృష్ణా ద్వారకావాసా 'అనుసంతనే అశరీరరూపముతో వచ్చి యామె కక్షయవస్త్రము లిచ్చె ననుట విరుద్ధమనియు దెలుపుచున్నారు. ద్వారకలో నున్నయెడల వచ్చి యివ్వవచ్చునుగాని సాళ్వయుద్ధములో నున్నవా డెట్లువచ్చి యిచ్చెను. అనివీరియాక్షేపమన్నమాట. వారన్నట్లు ద్వారకలో నున్నను అనాహూతుడైన కృష్ణుడు హస్తినాపురములోని ద్యూతము నెట్లు తెలిసికొనగలుగును? అది తెలియనపు డెట్లు వచ్చి వలువలివ్వగలుగును? అని ప్రతివాదుల నడుగవలసియున్నది. మరియు వారు చూపిన శ్రీకృష్ణుని మాటలో ద్యూతకాలమున దాను ద్వారకలో లేకపోవుటచే నట్టి కష్టము పాండవులకు ప్రాప్తించె నని యున్నట్లున్నది కాని తన కాద్యూతవృత్తాంతము తెలియకపోవుటచే నట్లు కష్టము ప్రాప్తించె నని యన్నట్లు లేదు.

అందుచే ద్యూతసందర్భము శ్రీకృష్ణునకు దెలిసియే యున్న దన్నమాట. ఆ తెలసియుంకుట ప్రతివాదు లన్నట్లు సాళ్వయుద్ధసమయములోనే అన్నమాట. ఇట్టి స్థితిలో మీద్యూతసమయము నాకు సాళ్వయుద్ధసమయమైనందున మీకిట్టి కష్టము వచ్చిపడె నని చెప్పక తాను ద్వారకలో లేనందున కష్టము వచ్చెనని చెప్పిన శ్రీకృష్ణుని తాత్పర్యమేమని మీరు గ్రహించినా రని ప్రతివాదుల నడుగుచున్నాము.

ఇంకొకటి "నేనుద్వారకలోనే యుండినయెడల ద్యూతకాలమున ననాహూతుడగానైన వచ్చి ద్యూతమును నివారింపనా" అన్నట్లు మీరు చూపియున్న కృష్ణవాక్యమునకు ద్రౌపది 'కృష్ణా ద్వారకా

హాసా' యనునంతనె యశరీరరూపముతో వచ్చి యామె కక్షయవ
స్త్రము లిచ్చె నను మాట విరుద్ధ మనిపించిన మీకు ముందీకృష్ణవా
క్యము విరుద్ధ మనిపించెనా? అవిరుద్ధమనిపించెనా?

ద్యూతసందర్భ మెరుగని స్థితిలో సాళ్వయుద్ధములో నుండికాని,
ద్వారకలో నుండికాని రాలేకపోవుట సమానమే. ద్యూతసందర్భ మెరి
గియే యున్నస్థితిలో ద్వారకలోనుండికాని, సాళ్వయుద్ధములోనుండి
కాని యీయశరీరరూపముతో రాగలుగుటయు సమానమే. ఇట్లుండగా
'ద్వారకలోనే నేనుండినయెడల ద్యూతమును నివారించియుందును' అను
కృష్ణవాక్యము విరుద్ధమే యని మీకనిపించిన పక్షములో నిట్టి విరుద్ధ
వాక్యముతో బహుప్రమాణానుబద్ధము సుప్రసిద్ధము నై యున్న ద్రౌప
దీమానరక్షణవృత్తాంతము విరోధించుచున్న దనుట సమంజసమా?

అకృష్ణవాక్య మవిరుద్ధమైన పక్షములో ద్రౌపదీమానరక్షణ
వృత్తాంతము దాని కవిరుద్ధమే. దేని కేమర్థమో తెలియనివారు విద్వ
న్మార్గమున కడ్డునచ్చుట కాలమహిమమునఁగావచ్చును. ఇప్పుడాశ్రీకృ
ష్ణవాక్య మేమో దాని తాత్పర్య మేమో గ్రంథసందర్భమును బట్టి
గ్రహింతము.

పాండవులు ద్యూతజితులై వనవాసమునకు వెళ్ళియుండ శ్రీకృ
ష్ణుడు సపరివారముగా పాండవులను జూడవచ్చి దుర్యోధనాదుల దుండ
గములను స్మరించుచు క్రుద్ధుడు కాగా నర్జునుడు శాంతింపజేసినతరు
వాత ద్రౌపది— ద్యూతసభలో జరిగిన దుష్కార్యములను చెప్పుచు—

"అధర్మేణ హృతం రాజ్యం సర్వే దాసాః కృతా స్తథా।
సభాయాం పరిక్లిష్టాఽహ మేకవస్త్రా రజస్వలా॥
ధి గ్బలం భీమసేనస్య ధి క్పార్థస్యచ పౌరుషమ్।
యత్ర దుర్యోధనః కృష్ణ ముహూర్త మపి జీవతి॥" (వన-అ 12)

అనుచు అధర్మముతో రాజ్యము హరించి యందరను దాసుల నుగా జేసి రజస్వలనైన నావిషయమై యకృత్యములు చేసినట్టి దుర్యోధనుని జీవింపనిచ్చిన భీమార్జునుల బలపౌరుషములు నింద్యములైన వని దుఃఖింపగా, శ్రీకృష్ణుడు నీక్రోధమునకు ఎవ్వరు పాత్రులైరో వారు నశింతురు. దుఃఖింపకుము. నేను కావలసినపనిని జక్కబరతునని పలికి తరువాత యుధిష్ఠిరునితో నిట్లు ప్రసంగించెను—

"నైత త్కృచ్ఛ్ర మనుప్రాప్తో భవాన్ స్యా ద్వసుధాధిప।
యద్యహం ద్వారకాయాం స్యాం రాజన్ సన్నిహితః పురా ॥
ఆగచ్ఛేయ మహం ద్యూత మనాహూతోఽపి కౌరవైః।
అంబికేయేన దుర్ధర్షరాజ్ఞా దుర్యోధనేనచ।
వారయేయ మహం ద్యూతం బహూన్ దోషాన్ ప్రదర్శయన్।
అసాన్నిధ్యన్తు కౌరవ్య మమానర్తే ష్వభూ త్తదా ॥
యేనేదం వ్యసనం ప్రాప్తా భవన్తో ద్యూతకారితమ్।
సోఽహ మేత్య కురుశ్రేష్ఠ ద్వారకాం పాండునన్దన ॥
అశ్రౌషం త్వాం వ్యసనినం యుయుధానా ద్యథాతథమ్।" (అ13

నీలకంఠీయమ్—

సంప్రతి భగవత్స్మరణమేవ తత్సాన్నిధ్యహేతుః. సాన్నిధ్యంచ సర్వాపత్తరణకృదితి భంగ్యన్తరేణ ప్రతిపాద్యతే నైత దిత్యాదినాఽధ్యాయేన. యద్యహం ద్వారకాయాం నవద్వారవత్యాం దేహనగర్యాం తవ మాం చిన్తయతః సన్నిహితస్స్యాం తర్హి ఏత త్కృచ్ఛ్రం వనవాస సంకటం భవాన్ నానుప్రాప్తస్స్యాత్. యథా ద్రౌపదీ కృచ్ఛ్రకాలే మాం స్మృతవతీ వస్త్రరాశిప్రదానేన మయా సభాయాం కృచ్ఛ్రాన్మోచితాతథాత్వమపిఅక్షపాతనకాలేమాంయదిస్మరేః స్వర్హి నైతత్కృచ్ఛ్రం ప్రాప్నుయాః ప్రత్యుత తత్రైవ జయస్స్యాదితి భావః. అనాహూ

తోఽపి స్వపక్షేమార్థ మప్యర్థితోఽపి వారయేయం ద్యూతమ న్తర్యామి త్వేన. కథాపక్షే త్వృజు రేవార్థః. ఆన ర్తేషు ఆసన్నస్తాన్న ర్థయ న్తి తేషు ధీవిలాసేషు. పక్షే దేశవిశేషేషు. కథా న్తర మవతారయితుం కథా పక్ష మేవానుసరతి—సోఽహ మిత్యాదినా—

అనగా యుధిష్ఠిరా! నేనప్పుడు ద్వారకయందు సన్నిహితుడనై యున్నయెడల నీకీవనవాసక్లేశము ప్రాప్తింపకపోవును. కౌరవులచేతను ధృతరాష్ట్ర, దుర్యోధనులచేతను ద్యూతమునకనాహూతుడనైనను(తమ క్షేమమునకై ప్రార్థింపబడకున్నను) వచ్చియుందును. దోషములను ప్రదర్శించి ద్యూతమును నివారించియుందును. అప్పుడానర్తములలో (ఆనర్తదేశములలో) నా అసాన్నిధ్యము కలిగెను. కనుకనే ద్యూత ప్రయుక్తమైన యీకష్టమును పొందినారు. తరువాత నేను ద్వారకకు వచ్చి సాత్యకివలన మీకష్టమునువిని యిట్లు వచ్చితిని అని కథాపక్షము లోని యర్థము.

ఇక నీలకంఠాచార్యుడు వర్ణించిన యంతరార్థము—

భగవత్స్మరణమును బట్టియే భగవత్సాన్నిధ్య మేర్పడును భగవత్సాన్నిధ్యము కలిగినపుడు ఆపదలన్నియు నంతరించును. అనువిషయ మిచ్చట భంగ్యంతరముగా జెప్పబడినది—

ఇచ్చట మొదటి శ్లోకములోని "యద్యహం ద్వారకాయాం సన్నిహితస్స్యామ్" అను వాక్యమందలి 'ద్వారక' యనగా నవద్వారములు కల దేహనగరి. అది, యుధిష్ఠిరునితో జెప్పెడి ప్రస్తావమును బట్టి యుధిష్ఠిరునిది. ఆ యుధిష్ఠిరుని దేహనగరిలో భగవత్సాన్నిధ్యము యుధిష్ఠిరు డప్పుడు భగవచ్చిన్తనము చేసియున్న సంభవించెడిది. ఆత డట్లాచింతన మప్పుడు చేయలేదు.

అదికారణముగా శ్రీకృష్ణుడు యుధిష్ఠిరా! నేనప్పుడు ద్వారక యందు అనగా నీదేహనగరమందు సన్నిహితుడనై యుంటినేని అనగా నన్ను చింతించుటను బట్టి నీకు నాసాన్నిధ్యము కలిగియుండెనేని యీ కష్టము నీకు ప్రాప్తింపకపోవును అని పలికెను.

కృష్ణభగవానుడు మొదట ద్రౌపదితో సంభాషించినపు డిట్లుప లుకక యుధిష్ఠిరునితో సంభాషించునపుడే ద్రౌపదీసమక్షములో నిట్లు పలుకుటవలన ద్రౌపది, కష్టకాలములో నన్ను స్మరించి నాచే నీయబ డిన వస్త్రరాశిమూలమున కష్టము నుండి విముక్తురాలైనట్లు నీవాద్యూ తసమయములో నన్ను స్మరించియుంటివేని నీకీకష్టము రాకుండుటేకాక జయము నీకే యగునే! యను భావమును సూచించెను. నేనట్లు సన్నిహి తుడనై యున్నయెడల ద్యూతమును దోషప్రదర్శనముతో నివారించి యుందు ననుటలో దనయంతర్యామిరూపమున ద్యూతమును కల్పించిన దుర్యోధనాదుల మనస్సునకే ద్యూతదోషములను స్ఫురింపజేసి నివారిం చియుందు ను భావమును సూచించెను.

'అప్పుడా డానర్థములలో నాఅసాన్నిధ్యమునుబట్టి మీరీకష్టమును పొందినారు' అనుటలో అనర్థములనగా 'ఆ సమన్తాత్ నర్దయన్తీ త్యానర్తాః' అను వ్యుత్పత్తిచే చిత్తవృత్తులు. అప్పుడా చిత్తవృత్తులలో నేను సన్నిహితుడను కాకపోతినే అని సూచించెను.

ఇక కడపటిశ్లోకములో ద్వారకకు వచ్చినతరువాత మీవిష యము విని యిట్లువచ్చితినను మాట కథాపక్షమునసనుసరించి యుత్తర కథావతరణమునకు సంబంధించిన దగుటచే దానికి ద్వారకాపుర మనియే యర్థము. ఇది విద్వత్పుంగవుడగు నీలకంఠాచార్యునిచే వెల్ల డింపబడిన యంరార్థము.

ఇప్పుడు ప్రతివాదులన్నట్లు “ నేను ద్వారకలోనేయుండిన యుండి నయెడల ద్యూతకాలమున కనాహూతుడగా నైన వచ్చి ద్యూతమును నివారింపనా” అను శ్రీకృష్ణవాక్య మవిరుద్ధమై యున్నది. ఈశ్రీకృష్ణ వాక్యమునకు-ప్రతివాదు లన్నట్లు “ద్రౌపది స్మరించినంతనే అశరీరరూపముతో వచ్చి యామె కక్షయవస్త్రముల నిచ్చెను” అను ద్రౌపదీ మానరక్షణవృత్తాంతముకూడ నవిరుద్ధమై యున్నది.

‘శ్రీకృష్ణునిది పరమేశ్వరావతారము కాదు’ అను వాదమును నిరాకరించు సందర్భములో నిరూపింపబడినట్లు ఏకకాల మందనేకరూపములతో వ్యవహరించుట శ్రీకృష్ణపరమాత్మ కసంభవము కాదుకనుక సాళ్వయుద్ధములో నున్నను అన్తర్యామిరూపముతో ద్యూతమును నివారింపగలడు, ద్రౌపదీమానరక్షణము చేయగలడు. కనుక ద్రౌపదీమానరక్షణగాథకు సాళ్వవధగాథ విరోధింపదు. ప్రతివాదులకు మాత్రమే విరుద్ధముగా కనిపించిన కనిపింపవచ్చును.

ఇట్లు బహుప్రమాణములను బట్టియు, ననేకమహాకవినిబన్ధనములనుబట్టియు, యుక్తులను బట్టియు, లోకప్రసిద్ధిని బట్టియు “కృష్ణభగవానుడు ద్రౌపదీమానరక్షకుడను” అని నిరూపితమైయున్న విద్వత్సిద్ధాంతము అప్రతిహతమే యని సారాంశము.

—: “వస్త్రాపహరణప్రయత్నము మాత్రమెకాని వస్త్రాపహరణము జరుగలే” దను రహస్యకర్తల ప్రసంగము-తన్నిరాకరణము :—

మహాభారతరహస్యకర్తల వ్రాత యిట్లున్నది—

1. “మనశాస్త్రిగారు(మహాభారతచరిత్రకారులగుశాస్త్రిగారు) ద్రౌపదీవస్త్రాపహరణఘట్ట మంతయు నబద్ధమనియు, నది కేవలముకల్పితమనియు వ్రాసియున్నారు. అది కేవలము పొరపాటు”

2. "సర్వవిధములచేతను కురుసభయందు ద్రౌపదీవస్త్రాపహరణప్రయత్నముమాత్రమే జరిగియుండును కాని వస్త్రాపహరణము జరుగలేదని నానిశ్చయాభిప్రాయము" (పు 358)

3. "వస్త్రాపహరణసమయమున భీష్మద్రోణులు చూచుచు నూరకుండిరని చెప్పుటకంటె వస్త్రాపహరణము జరుగలేదనుటయుక్తము. జరిగినదని చెప్పినయెడల భీష్మద్రోణులకు తీర్పరాని యపకీర్తి సంభవించును" (పు 354)

4. "లౌక్యజ్ఞానము లేని పండితులు కేవలము భక్తిమహత్త్వానుకూలములైన గాథలను తమ కనుకూలముగా గనబడిన ప్రదేశములలో నెల్ల నిరికించిరి" (పు 355)

5. దుశ్శాసనుడు ద్రౌపదీవస్త్రాపకర్షణ చేయుచుండ ద్రౌపది శ్రీకృష్ణుని ప్రార్థించుటచే శ్రీకృష్ణప్రభావమువలన నామె కక్షయవస్త్రములు కలిగినచో నాదృశ్యమును చూచుచున్న దుర్యోధనాదులు ద్రౌపదీపాండవులకు పాదాక్రాంతులై శ్రీకృష్ణునకు దాసానుదాసులై యుండియుందురు" (పు 357)

6. "శ్రీకృష్ణసమక్షములో విశ్వరూపమును జూచి యతడింద్రజాలము చేయుచున్నాడని తలచియున్నాడు కాని యిచ్చట శ్రీకృష్ణుని పరోక్షమందు జరిగిన యీకృత్యమును జూచి యాతడు దివ్యపురుషుండని తలంచి వెంటనే యాతనికి దాసానుదాసుడు కావలసియుండును" (పు 357)

7. "దుశ్శాసనుడు వస్త్రాపకర్షణచేయుటకు సమీపించిన సమయమున భయసంభ్రమాక్రాంతయైన ద్రౌపది యొక్కపెట్టున శ్రీకృ

ష్ణునిఁగూర్చి యాక్రోశించుటతోఁ జనించిన భయకంపములతో దిగ్భ్రమచెంది చిత్తము వికలమై దుశ్శాసనుఁడు స్వయముగానైనను విరమించియుండును. లేక స్వశరీరముచేతనైనను విడవఁబడి యుండును."

8. "ఇక నచ్చట రక్షణలేదని గ్రహించి శ్రీకృష్ణుని గూర్చి యెలుగెత్తి యొక్కపెట్టున నాక్రోశించి ప్రపంచము భరింపరానంతటి విపత్సముద్రము దాటఁగల్గెను. ఈ హేతువుచేతనే శ్రీకృష్ణుఁడు ద్రౌపదీమానరక్షకుం డయ్యెను" (పు. ౩౬౦)

ఈ యెనిమిది యంశములు రహస్యకర్తల వ్రాతలోని సారాంశములు. వస్త్రాపహరణము జరుగలేదని వ్రాసిన మ. భా. చ. గారలను మొదటియంశములో నిరసించినట్లు వీరు రెండవయంశములో 'వస్త్రాపహరణము జరుగలేదని నా నిశ్చయాభిప్రాయము' అని యనుట విచిత్రాంశము.

మ. భా. చ. గారు ఉన్నమాటకును "ద్రౌపదీవస్త్రాపహరణము జరుగలేదనియు, శ్రీకృష్ణునకు ద్రౌపదీమానరక్షకుఁడను బిరుదు అసంగతమనియు వస్త్రములిచ్చెనని నే నొప్పుకొననియు, వ్రాయ సాహసించుచున్నాను"

అనియే కాని మరియొకటికాదు. మ. భా. చ. గారలు 'ద్రౌపదీమానరక్షకుఁడను బిరుదు వస్త్రము లిచ్చుటచే రాలేదు' అని మాత్రమె చెప్పి ఎట్లువచ్చెనో చెప్పలేదు. ఈ రహస్యకర్తలు ఎనిమిదవ యంశములో 'శ్రీకృష్ణుని గూర్చి యెలుగెత్తి యాక్రోశించి విపత్సముద్రమును దాటుటచే నాబిరుదు వచ్చె' నని వారు చెప్పనిలోటు తీర్చి వారు సూచించినదానిని నీరు వ్యాఖ్యానించి వారివాదమునే దృఢపర

చిన వీరు మొదటియంశములో "వారిది కేవలము పొరపాటు" అని వ్రాయుట యెంత లోకజ్ఞానమో! ఇక నింతటితో వారి పరస్పరవిరుద్ధ ప్రసంగపరామర్శమును విడిచి ద్రౌపదీవస్త్రాపహరణవృత్తాంతమునకు వీరు చెప్పిన యర్థాంతరమును పరిశీలింతము—

'వస్త్రాపహరణము జరిగిన దని, యప్పుడు భీష్మద్రోణులు చూచుచు నూరకుండిరని చెప్పినయెడల భీష్మద్రోణులకు తీర్పరాని యపకీర్తి సంభవించును' అని మూడవసారాంశము.

ఇచ్చట రెండవ యంశములో "సర్వవిధములచేతను కురుసభయందు ద్రౌపదీవస్త్రాపహరణప్రయత్నము జరిగె" నని వ్రాసిన యీప్రతివాదుల నడుగవలసియున్నది. మీరు కురుసభయందే, వస్త్రాపహరణప్రయత్నము నొప్పుకొనినారు. దుశ్శాసనబలాత్కారమువలననే ద్రౌపది కాకురుసభాప్రవేశము, ఆబలాత్కారములోనే ద్రౌపదీకేశగ్రహణము, ఆకేశగ్రహణముతోడనే సభాసమీపాకర్షణము, ఆసభాసమీపమందే ఆమెను గుంజుట, ఆగుంజు నప్పుడే సభాసదులను గూర్చి ఆమె యార్తనాదములు, ఆయార్తనాదములలోనే సర్వజ్ఞులు సర్వసమర్థులు నగు మీయెదుట నాకిట్టి యవస్థయేనా? అనియు, రజస్వలనైన నన్నుపట్టి పీడించుచుండ మందలించువా డొక్కడు లేకపోయెనే అనియు, భారతధర్మము నశించె ననియు, భీష్మద్రోణులు నిర్వీర్యులైనా రనియు దుఃఖపడినది. గ్రంథమును చూడుడు—

"తతో జవే నాభిససార రోషా ద్దుశ్శాసన స్తా మభిగర్జమానః।
దీర్ఘేషు నీలేష్వథచోర్మిమత్సు జగ్రాహ కేశేషు నరేన్ద్రపత్నీమ్॥
స తాం పరాకృష్య సభాసమీప మానీయ కృష్ణా మతిదీర్ఘకేశీమ్।
దుశ్శాసనో నాథవతీ మనాథవ చ్చకర్ష వాయుః కదళీ మివార్తామ్॥
ప్రకీర్ణకేశీ పతితార్ధవస్త్రా దుశ్శాసనేన వ్యవధూయమానా।

ప్రాణాత్యయస్థేంచ సహ్యమానా శక్నోరిదం వాక్యమువాచకృష్ణా।
ఇమే సభాయాముపనీతశాస్త్రాః క్రియావన్తః సర్వ ఏవేన్ద్రకల్పాః।
గురుస్థానా గురవశ్చైవ సర్వే తేషామగ్రే నోత్సహే స్థాతుమేవమ్॥
ఇదం త్వకార్యం కురువీరమధ్యే రజస్వలాం యత్పరికర్షసే మామ్।
నచాపి కశ్చిత్కురుతేఽత్ర కుత్సాం ధ్రువం తవేదం మతమభ్యుపేతః।
ధిగస్తు నష్టః ఖలు భారతానాం ధర్మస్తథా క్షత్త్రవిదాంచ వృత్తమ్।
యత్రాభ్యతీతాం కురుధర్మవేలాం ప్రేక్షన్తి సర్వే కురవస్సభాయామ్॥
ద్రోణస్య భీష్మస్యచ నాస్తి సత్త్వం ధ్రువం తథైవాస్య మహాత్మనోఽపి।
రాజ్ఞస్తథా హీమమధర్మముగ్రం నలక్షయన్తే కురువృద్ధముఖ్యాః॥
(సభా.అ67)

ఈ ప్రకారముగా కచగ్రహణాదివస్త్రాపహరణప్రయత్నపర్యంతము జరిగినటు లొప్పుకొనుచున్న మీరు పూర్వోక్తప్రకారము ద్రౌపది గోలపెట్టుచున్నను దుశ్శాసనుని యేమాదుచ్ఛెప్పక నెదుర్కొనక చూచుచుండిన భీష్మద్రోణుల కపకీర్తి యెట్లు లేదనిపించెను?

కృష్ణాకేశబలాత్కర్షణము, స్త్రీధర్మిణీకర్షణము, ద్రౌపదీసభాకర్షణము, సభాస్థితిదుర్భాషణము, వస్త్రాపకర్షణప్రయత్నము, ఊరుప్రదర్శనము. అను దుష్కార్యముల జూచుచు సహించుకొనిన భీష్మద్రోణుల కపకీర్తి నాపాదించునది కొంచెమైనను వారికిలేదని ధర్మదృష్టికల మీకు అది యపకీర్తికరము కాదనిపించిన దెన్నమాట.

మీరువ్రాయుటలో "ద్రౌపదిని సభకీడ్చి తెచ్చుట యనుకృత్యమే ఉత్తములు సమర్థులు నగువారిచే చూచుచు సహింపఁబడవలసినకృత్యము కానిదై యుండె" (పు 360) అని అది భీష్మద్రోణు లుపేక్షింపదగినది కాదని యొకమాట జెప్పుచు తానన్యాత్రమున వారికపకీర్తి లేనట్లు మీరు వ్రాయుటవలన మీ దూరదృష్టియు తెల్పుచున్నది.

వీరాదు వ్రాయుటలో "ద్రౌపదిని సభకీడ్చి తెచ్చినప్పుడింకొక్క త్రుటికాలము ధృతరాష్ట్రుడాలసించినచో భీష్మాదులచే దుర్యోధనాదులప్పుడే హతులయి యుందురు. కాని నేర్పరి యగు ధృతరాష్ట్రుడు ద్రౌపది నోదార్చి యావత్సామ్రాజ్య మామె కర్పించుటమూలకముగా నొక్కత్రుటిలో నాముప్పును దప్పించెను" (పు 350)

అని చెప్పుట జూడగా సభ కీడ్చి తెచ్చుచున్నపుడే స్వయముగా జూచుచుండిన భీష్మద్రోణులు తత్క్షణమే దుశ్శాసనుని హింసిపబూనక ద్రౌపది సంభాషాలాపములను బట్టియో, అన్యులుచెప్పుటను బట్టియో, ముందు విపత్తును గ్రహించి యంధు డగు ధృతరాష్ట్రుడు తప్పక ద్రౌపది నోదార్చి యావత్సామ్రాజ్య మామెకిచ్చి సంతోషపెట్టి, దుశ్శాసనుడు సభ కీడ్చుకొని వచ్చుటచే గలిగిన యామె దుఃఖమును తొలగించితీరు ననిదూరదృష్టితో నిశ్చయించి యుపేక్షించి యున్నారన్నట్లు మీరనుట మీదూరదృష్టికి నిదర్శనము.

ఇప్పుడు మీమార్గములో నొక్క వస్త్రాపహరణము తప్పమిగిలిన వన్నియు మీకొప్పుకొనవలసినవే. ధృతరాష్ట్రునివలన నేదియో మేలు కలిగితీరు నని భావించి భీష్మద్రోణు లుపేక్షించియున్నా రని మీకొప్పక తప్పనిదే. అది యటుండనిండు.

వస్త్రాపహరణవిషయ మొకటియే కాక గ్రంథస్థమై యున్న మరి కొన్ని విషయములుకూడ మీచే మార్పుచేయబడినవి. 'ద్రౌపదిని సభకీడ్చి తెచ్చినపుడు ఇం కొక్క త్రుటికాలము ధృతరాష్ట్రు డాలసించినచో' అని మీరువ్రాయుటలో ద్రౌపది నీడ్చి తెచ్చిన వెంటనే ధృతరాష్ట్రు డామె నోదార్చి నట్లు చెప్పుచున్నారు. అది యబద్ధము.

క్రమ మిట్లున్నది—సభకీడ్వబడిన ద్రౌపది సభ్యులను జెప్పుకొనుచు తాను దాసియగునో కాదో తేర్చి చెప్పుడనియడుగుట, ఆమె

దాసి కాదని వికర్ణు డనుట, కర్ణు డామాటను త్రోసివేసి దుశ్శాసనుని వస్త్రాపహరణమునకు ప్రోత్సహించుట ఆతడు వస్త్రాపహరణము చేయుట, శ్రీకృష్ణానుగ్రహమున ద్రౌపదికి రక్షణముజరుగుట, భీముని ప్రతిజ్ఞ, ద్రౌపది సభ్యులను మరల ప్రశ్నించుట, భీష్మవాక్యము, ద్రౌపది నుద్దేశించి దుర్యోధనవాక్యము, భీముని పరాక్రమప్రకటనము, ద్రౌపది నుద్దేశించి కర్ణవాక్యము దుర్యోధనుడు ద్రౌపదికి తనయెడమతొడను జూపుట, అప్పుడు దుర్యోధనుని గూర్చి భీమప్రతిజ్ఞ, విదురవాక్యము, దుర్యోధనవాక్యము, అర్జునవాక్యము,

ఇంత తడవు జరిగినమీదట—దుశ్శకునములు కలిగినమీదట ధృతరాష్ట్రుడు ద్రౌపది నాదరించి వరములు కోరుకొనుమనుట, ప్రేరేపింపబడి రెండువరములుగా తనభర్తలు పాండవులు దాసత్వమునుండి విముక్తులై వారి రథములతో ఆయుధములతో వారి పరాధీనులు కాకుండునట్లు కోరుట,

ఆ వరములిచ్చి మూడవవరమును కోరుమని ధృతరాష్ట్రుడు ప్రోత్సహించుట, క్షత్రియస్త్రీకి రెండు వరములకంటె నెక్కువ కోరుట కధికారము లేదని చెప్పి ద్రౌపది యూరకుండుట,

తరువాత భీమవాక్యము, అర్జునవాక్యము, క్రుద్ధుడైయున్న భీమసేనుని ధర్మరాజు సంజ్ఞచేసి యూరకుంచుట, తరువాత ధర్మరాజు ధృతరాష్ట్రుని—

“రాజన్ కిం కరవామస్తే ప్రశాధ్యస్మాంస్త్వమీశ్వరః |
నిత్యం హి స్థాతుమిచ్ఛామస్తవ భారత శాసనే ||

మహారాజా! మాకు నీవు ప్రభువువు. ఎల్లప్పుడు మేమునీయాజ్ఞానువర్తులము. మమ్ముల నేమిచేయుడని యాజ్ఞాపింతువు? అనియడుగుట, ధృతరాష్ట్రుడు—

"అజాతశత్రో! భద్రం తే అరిష్టం స్వస్తి గచ్ఛత !
అనుజ్ఞాతా స్సహధనాః స్వరాజ్య మనుశాసత ||"

ఓ అజాతశత్రుడా! మీకు శుభమగుగాక, నిర్విఘ్నముగా వెళ్ళి మీ సొత్తుతో మీరాజ్యము నేలుకొనుడు, నేననుజ్ఞ నిచ్చితి ననుట యును నివి జరిగిన విషయములు.

క్రమ మిట్లుండ సభ కీడ్చి తేబడిన వెంటనే ధృతరాష్ట్రుడు ద్రౌపది నాదరించె ననుట, యావత్సామ్రాజ్య మామె కర్పించె ననుట రెండబద్ధములు. అదియు నటుండనిండు. సభ కీడ్చి తేబడినపుడు ద్రౌపది "ద్రోణస్య, భీష్మస్య చ నాస్తి సత్త్వమ్" అని యాకష్టకాలములో నెవ్వరి నామములను కీర్తించుచు వచ్చెనదో ఆ భీష్మద్రోణులు తత్త్రాణము స్వయముగా తాము కలుగజేసికొనవలసినవారై యుండ ధృతరాష్ట్రుడు కలుగ జేసికొనుట జూచి యుపేక్షించినారన్నట్లు చెప్పుట అసంగతము—

మరియు ద్రౌపదిని బట్టుకొని బాధించు దుశ్శాసనుని నెంత మాత్రము మందలింపని ధృతరాష్ట్రుడు, ద్రౌపది నోదార్చె నని మీర నుటలో నర్థ మున్నదా! దుశ్శాసనుని విషయమై యధిస్పందము చేయకయే దుశ్శాసనునిచే బీడింపబడు ద్రౌపది నోదార్చెనా! ఇది యసంగతము—

ఇంకొకటి—మీ గ్రంథములో ధృతరాష్ట్రునిగూర్చి "మహాభారతయుద్ధమునకు మూలకందము" "పాండవులను వారణావతమునకు పంపుట, లాక్షాగృహదహనము, పాండవులమృతికి తిలోదకములర్పించుట, మొదలగు కృత్యములయం దతని రాజ్యతంత్రకౌశలము సంపూర్ణము" "శత్రువులనుండి రక్తపాతరహితముగా రాజ్యమును గ్రహించి సునాయాసముగా శత్రువును జయించు నతని మహా[illegible]శేషము" (పుట 347)

అనుచు నిూచే వ్రాయబడిన చరిత్రకలవాఁడును, ఆది నుండియు ననేకబాధకములు చెప్పుచు నిది కూడని పని, యిది కూడని పని యని నిషేధించుచున్న విదురుని మాటలు లక్ష్యము చేయక దుర్యోధనవశుఁడై ద్యూతసభకు వచ్చి కూర్చుండి కార్యక్రమ మెప్పటి కప్పుడు తెలిసికొనుచుండి సభయందే దుర్యోధనుఁడు దుశ్శాసనునితో 'నీవు వెళ్ళి ద్రౌపదిని బట్టి తీసికొని రమ్ము పరాధీనులైన యీశత్రువు లేమిచేయగలరు' అని చెప్పి పంపునపుడు దుర్యోధనునిగాని దుశ్శాసనునిగాని నిందలింపక చూచుచు నూరకున్నవాఁడును, అప్పుడైన భీష్మద్రోణు లేమందురో అను భయము లేనివాఁడును అగు ధృతరాష్ట్రుఁడు వెంటనే ద్రౌపది నోదార్చినట్లును, కనుకనే తమ కనులయెదుట జరుగుచున్న దుశ్శాసనుని దుశ్చేష్టలను భీష్మద్రోణు లుపేక్షించినట్లును చెప్పుమాటల కర్థమున్నదా?

దుర్యోధనాదుల వ్యవహారములకు సమ్మతి, పాండవుల పరాజయమునకు హర్షము కలిగి కూర్చుండిన ధృతరాష్ట్రుఁ డంతలో నామెనోదార్చునా? కనుక నిదియు నసంగతమే—

ఇంకొకటి—అంత మహాసభను లెక్కించి నిూరన్నట్లు వస్త్రాపహరణము నకు ప్రయత్నించిన మదోన్మత్తుఁ డగు దుశ్శాసనుఁడు తన ప్రయత్నమున కవరోధ మేమి వచ్చెనని విరమించెను?

ఏడవ సారాంశములో నున్నట్లు 'వస్త్రాపకర్షణ చేయుటకు సమీపింపగా ద్రౌపది శ్రీకృష్ణుని గురించి భయ సంభ్రమాక్రాంతమై యాక్రోశించుట విని దుశ్శాసనుఁడు భయకంపములతో దిగ్భ్రమ జెంది చిత్తము వికలమై స్వయముగానో, ధృతరాష్ట్రునిచే నివారింపబడియో విరమించి యుండును' అను నిూమాట కర్థ మున్నదా?

ఆరణ్యధీరునకు–ఆమదోన్మత్తునకు ద్రౌపది యాక్రోశించినంతమాత్రమున భయమా! కంపమా! దిగ్భ్రమమా! చిత్తచాంచల్యమా!

ప్రథమమములో ద్రౌపదియొద్దకు బోయి యామెపై బడి జుట్టుపట్టుకొనునపుడే ఆమె యాక్రోశించియుండవచ్చును. అప్పుడు లేని భయకంపములు, దిగ్భ్రమము ఇప్పుడు ప్రోత్సాహకుల సమక్షములో వచ్చినవా? ఒకసారి వినబడిన ఆర్తధ్వని రెండవసారి వినబడినపుడు స్థాయిభేద మేమున్నను అలవాటులోనే పడును. కనుక దుశ్శాసనుడు స్వయముగా విరమించె ననుట అసంగతము. పూర్వోక్తక్రమమునుబట్టి యావిషయమై యేమియు బలుకని ధృతరాష్ట్రుడు నివారించె ననుటయు నసంగతమే.

ఇట్లు పరిశీలింపగా మీవాదములో వస్త్రాపహరణమునకు ప్రయత్నించిన దుశ్శాసను డాప్రయత్నమునుండి విరమించుటకు దగిన హేతువు దొరకలేదు. ఆసమయములో ధృతరాష్ట్రుడు ద్రౌపదిని మీరన్నట్లో దార్చియుండలేదు. అప్పు డుపేక్షించుటలో భీష్మద్రోణులకు మీరు తెచ్చిపెట్టిన అపకీర్తి మీకల్పనలో తొలగలేదు కనుక మీ కల్పితయు నక్కాండతాండవమే.

ఆలోచింపగా, తనవారిచే ప్రేరేపింపబడి యన్యులచే నివారింపబడని స్థితిలో నుండి వస్త్రాపహరణదుష్కార్యమున కొడిగట్టిన దుశ్శాసనుడు విరమించుటకై, తనకాపని శక్యము కాకుండుటకును, ప్రేరకులు మరల ప్రేరేపింపకుండుటకును తగినంత పరిస్థితి ఘటించియుండవలయును. అట్టిది గ్రంథస్థమైయున్న వస్త్రాపహరణసమయమందలి యనంత వస్త్రోత్పత్తియే. దానినిబట్టియే దుష్టులు నిశ్చేష్టులైనారనక తప్పదు. అదియే ద్రౌపదీ మాహాత్మ్యఫలము,

ఆమహాత్మ్యమును గుర్తించియే పెద్దలను తృణీకరించి, మదోన్మత్తులై యొడలెరుగక సంచరించెడి యీదుష్టులకు ఇప్పుడే ఈసాధ్వీమణి స్వరూపస్వభావములు విశదమై తగిన శాస్తియై మద మణగు ననియు, శ్రీకృష్ణానుగ్రహపాత్రమగు ద్రౌపది తనమహాత్మ్యముమీందనే ఆధారపడి తనరక్షణమును తానే చేసికొనినపుడు, అన్యులచే రక్షణ మేర్పడినపుడు కలుగునంతటి సంతాపము పతులగు పాండవులకు గలుగబోద నియు, అన్యు లిప్పుడు కలుగజేసికొనినయెడల దుష్టులకు శాంతముగా జరుగదగిన శాస్తికి బదులు కోలాహలమైపోవు ననియు దూరముగా భావించిన భీష్మద్రోణులు—సమయోచితముగా శక్తిని వినియోగించువారు కనుకను, వస్తుతత్త్వ మెరిగినవారు కనుకను, తొందరపడక మరియొక క్షణము నిరీక్షించినా రనుటే యుక్తము. పూర్వోక్తప్రకారము బహుగ్రంథములలో గ్రంథస్థమై, బహుప్రమాణసమ్మతమై, అనేకమహాకవినిబద్ధమై, యుక్తియుక్తమై యున్న వస్త్రాపహరణవృత్తాంతము సత్యమనుటయే యుక్తము. ఫలకారియైన భీష్మద్రోణుల యుపేక్షకు ప్రతివాదులు తెచ్చిపెట్టిన అపార్థ సంబంధము దనుట సత్యము. కనుక రహస్యకర్తల మూడవసారాంశము, ఏడవసారాంశము నిరస్తములైనవి.

ఇక "ద్రౌపదీవస్త్రాపకర్షణ చేయుచుండగా నామె కక్షయవస్త్రములు శ్రీకృష్ణానుగ్రహమున కలిగినచో నాదృశ్యమును చూచుచున్న దుర్యోధనాదులు ద్రౌపదీపాండవులను పాదాక్రాంతులును, శ్రీకృష్ణునకు దాసానుదాసులు నయియుందురు"

"శ్రీకృష్ణసమక్షములో జూచిన విశ్వరూపము నింద్రజాలమను కొనినను పరోక్షములోని యీకృత్యమునుచూచి యాతడు దివ్యపురుషు డని తలచి దాసుడు కావలసియుండును" అను 5-6 సారాంశములను పరిశీలింతము—

అందరి యంతఃకరణవృత్తులు నొకవిధమైనవి కావని విమర్శకుల కు విదితమే. మ. భా. చ. కారులు— "దుశ్శాసనుఁడు బాహుబలశాలి. ద్రౌపది నీడ్చి తీసికొని రాఁగలిగెను" (పు 271) అని ద్రౌపదినీడ్చి తెచ్చిన దుశ్శాసను నభినందించినారు.

> ఈరహస్యకర్తలు "మానవసమాజమైనసిగ్గును మొదలంట త్యజించిన యొక నీచు డవమానించుటకై సమీపించుచుండ" (పు612)

అని యాదుశ్శాసనునే నీచుఁడని నిందించినారు. ఇట్లే ద్రౌపదీవస్త్రాపహరణము జరుగలేదని మ. భా. చ. కారులన్నారు. వస్త్రాపహరణప్రయత్నము జరిగిన దని యీరహస్యకర్త లన్నారు. ఆమె వస్త్రము దానికదే పడిపోయిన దని "సుయోధనవిజయ" కర్త లన్నారు. ఇందరును చూచెడి గ్రంథ మొక్కటియే. భావములు వేఱు.

ఇట్లు ద్రౌపదీ వస్త్రాపహరణ, ద్రౌపదీమానరక్షణ వృత్తాంతము మహాభారతాంతర్గతమై, యేకవాక్యతాపన్నమై, నీలకంఠాచార్యాదివ్యాఖ్యాతలచే ప్రక్షిప్తము కాదట్లు నిరూపింపబడి, భాసాదిమహాకవులచే నిబంధింపబడియుండ రహస్యకర్తలకు అది ప్రక్షిప్తమే అనిపించినది. ఇట్లు స్పష్టముగా గనులకు గనబడు గ్రంథమునకే ఈరహస్యకర్తల దృష్టిలో నిట్టి యవస్థ తటస్థించినపుడు వీరిచే నింద్యు లనబడిన దుర్యోధనాదులకు ద్రౌపదియందు గోచరించిన యనంతవస్త్రోత్పత్తిరూపమగు దృశ్యము నాఁడు చూచిన వదుగురికినవలె నిది శ్రీకృష్ణమహత్త్వసంభూతమని యనిపించుట యసంభవము. శ్రీకృష్ణసమక్షములో తాను ప్రత్యక్షముగా కురుసభలో జూచిన విశ్వరూపమునే, నాటి ప్రేక్షకులందరికంటె విరుద్ధముగా నింద్రజాల మని భావించిన ప్రబుద్ధుఁడు–శ్రీకృష్ణుని పరోక్షములో కృష్ణా! అని ద్రౌపది యాక్రోశించినపుడు కలిగిన యనంత వస్త్రోత్పత్తిఘటనను ఏకనుకట్టో అనుకొనక దానినిబట్టి శ్రీకృష్ణుఁడు దివ్యపురుషుఁడని తెలిసి యాతనికి దాసానుదాసు డగునా?

ప్రత్యక్షమునే అపలాపన చేయువారు పరోక్షప్రభావము నంగీకరించుదురా? ప్రత్యక్షమై యున్న గ్రంథమును త్రోసివేసి 'ద్రౌపదీ మానరక్షణ' రూపమైన శ్రీకృష్ణుని ప్రభావమును అప్రత్యక్ష మగుటచే దురభిప్రాయముతో త్రోసివేసిన యీ ప్రతివాదుల చర్యయే నాడు స్మరణమాత్రముచేతనే శ్రీకృష్ణప్రభావమున ద్రౌపదియందు గోచరించిన యనంతవస్త్రోత్పత్తిని దుర్యోధనుడు దురభిప్రాయముతో త్రోసివేసినా డనుటకు నిదర్శనము.

కాబట్టి దుర్యోధనాదులు పాదాక్రాంతులు కాకపోవుటచే నట్టి దృశ్యము జరుగలేదనుట అజ్ఞానము. కనుక 5, 6 సారాంశముల లోని ప్రసంగ మవాస్తవమైనది.

ఇక "అచ్చట రక్షణ లేదని గ్రహించి శ్రీకృష్ణుని గురించి యెల్గెత్తియొక్కపెట్టున నాక్రోశించి విపత్సముద్రము దాటగల్గెను. ఈ హేతువుచేతనే శ్రీకృష్ణుడు ద్రౌపదీమానరక్షకు డయ్యెను" అను ఎనిమిదవ సారాంశమును బరిశీలింతము—

ఈ ప్రతివాదులు శ్రీకృష్ణుని స్మరించి యాక్రోశించినట్లు ఒప్పుకొనియున్నారు. మరియొకచోట "నను దేవుడగు సాక్షాత్పరమేశ్వరుం డగు శ్రీకృష్ణుడు జన్మించెను" (పు311) అనుచు శ్రీకృష్ణుడుసాక్షాత్పరమేశ్వరు డని యొప్పుకొనియున్నారు. అట్టిశ్రీకృష్ణుడు అక్షయవస్త్రము లివ్వలేనివాడు కాడు. అంత శ్రీకృష్ణానుగ్రహస్థానము ద్రౌపది కాకపోలేదు. అప్పుడు రక్షింపుమని యాక్రోశింపకపోలేదు. కాని ప్రతివాదుల బుద్ధికి వస్త్రాపహరణము జరుగలేదనవలె నని తోచినది. అందుచే శ్రీకృష్ణుని పనిలేకుండ బోయినది. అది కారణముగా వీరి వాదము వక్రమార్గమున బడినది.

మఱియు "ద్రౌపదీ వస్త్రాపహరణ ప్రయత్నసమయమున శ్రీకృష్ణుడు సాల్వయుద్ధములో నున్నాడుగాని ద్వారకయందు లేడు. ద్యూతము ద్రౌపదీవస్త్రాపహరణ ప్రయత్నము నేనెరుంగ నని ధర్మజునితో స్వయముగా చెప్పి యున్నాడు" (పు357) అని వ్రాసియున్నారు.

ఈ విషయమై విపులముగా వెనుక చర్చింపబడి యున్నది. దానిచే నీవ్రాతపరాస్తము. ఈ ప్రతివాదిమతప్రకారము ఎక్కడనో దేశాంతరమందున్న శ్రీకృష్ణుని, తన యాక్రోశమును తెలిసికొనలేని శ్రీకృష్ణుని, తనయాపద కడ్డుపడలేని శ్రీకృష్ణుని, అప్పుడా ద్రౌపది యేమని స్మరించెనో! రక్షింపుడు, రక్షింపుడని అక్కడనున్నవారిని గూర్చియే గోలపెట్టిన పౌరుషమువచ్చి యడ్డుపడుదురని భావింపక అక్కరకురాని శ్రీకృష్ణుని గూర్చి గోలపెట్టవలెనను బుద్ధి యామె కేల పుట్టెనో!

ఆమె కాముప్పు దప్పించి యామె నోదార్చినట్లు ప్రతివాదులచే ప్రశంసింపబడిన ధృతరాష్ట్రునే రక్షింపుమని యామె యేల వేడుకొనలేదో! ఈ ప్రతివాదులు 'ద్రౌపది శ్రీకృష్ణునిగూర్చి యాక్రోశించి విపత్సముద్రము దాటగలిగినది ఈ హేతువుచే శ్రీకృష్ణుడు ద్రౌపదీ మానరక్షకు డయ్యెను' అని వ్రాసియున్నారు. ద్రౌపదీమానరక్షకుడను మాటకు ద్రౌపదికి మానభంగము కాకుండ గాపాడిన వాడని యర్థము. అట్లు కాపాడబడుటె ఆమె విపత్సముద్రమును దాటగలుగుట. ఇట్టి స్థితిలో ప్రతివాదు లన్నట్లు దుశ్శాసనుడు ద్రౌపదీవస్త్రాపహరణ ప్రయత్నమునే విరమించినప్పుడు ఆమెకు మానభంగమే అప్రసక్తము కనుక మానరక్షకత్వ మా శ్రీకృష్ణున కెట్లు ప్రసక్త మగును?

ఇక ద్రౌపదికి మానభంగము జేయకుండుటే మానరక్షకత్వమందురేని యా మానభంగము జేయకుండినవాడు ప్రతివాదులన్నట్లు దుశ్శాసనుడు కనుక ప్రతివాదిమతప్రకారము ద్రౌపదీమానరక్షకుడు దుశ్శాసనుడే అన్నమాట. లేదా పక్షాంతరములో నామె కాముప్పు దప్పించినవాడు కాబట్టి ధృతరాష్ట్రుడన్నమాట.

పాపము! ద్రౌపదీమానరక్షకుడను లోకప్రసిద్ధిని యీ ప్రతివాదులు శ్రీకృష్ణునకే దక్కకుండ యత్నించినారుకాని తుదకు "వినాయకం ప్రకుర్వాణో రచయామాస వానరమ్" అన్నట్లు చేసినారు.

వాస్తవములో నా డామె కృష్ణభగవానునే తనరక్షణమునకై వేడుకొనుటచేతను, తనహస్తములచుననే యామె కాపాడుచ తొలగిపోవుట చేతను, శ్రీకృష్ణుడు ద్రౌపదీమానరక్షకు డను లోకప్రసిద్ధి రూఢమై యుండుటచేతను, దుశ్శాసనుడు వస్త్రాపహరణముచేసినట్లును, శ్రీకృష్ణు డక్షయవస్త్రము లిచ్చినట్లును, బహుప్రమాణములు చాటుచుండుట చేతను ఈ యెనిమిదవసారాంశముకూడ త్రోసివేయబడినది.

> ఇక, "తాత్త్వజ్ఞానము లేని పండితులు కేవలము భక్తిమహాత్మ్యానుకూలము లైన గాథలను తమ కనుకూలముగా గనబడిన ప్రదేశములలో నెల్ల నిరికించిరి"

అను నాలుగవ సారాంశము ఏరీతియున్నది దీనిని జూతము— ఇరికింపబడిన గాథలు భక్తిమహాత్మ్యమున కనుకూలము లైనవేనట! ఇరికింపబడుటయు ననుకూలప్రదేశములలోనే యట! అవి యిరికింపబడినవి యెట్లగును? ఇరికించినవారు తాత్త్వజ్ఞానములేని పండితులట! భక్తిమహాత్మ్యానుకూలగాథలు చెప్పుటను బట్టి పండితులకు తాత్త్వజ్ఞానము లేదని కాబోలు. తమకున్నదనియు పండితులకు లేదనియు వీరు చెప్పెడి తాత్త్వజ్ఞానము జ్ఞానములో చేరునా? అజ్ఞానములో చేరునా? ఘృణాకోశప్రాయమై అజ్ఞానాంతర్భూతమైన ఆ తాత్త్వజ్ఞానము లేకుండుట పండితలక్షణమే. ఆతాత్త్వజ్ఞానమే జ్ఞానమనుకొనుట అపండితలక్షణము. భగవంతుడు, భగవద్భక్తులు, భక్తిలక్షణములు, భక్తిరక్షణములు, అనువిషయములే ప్రాణముగాగల యార్షగ్రంథము లెక్కడ? ఆవిషయములకే వెగటుపడు విపరీతబుద్ధు లెక్కడ? ఆర్షగ్రంథములను గూర్చి ప్రసంగించుట కధికార ముండవలదా? **కనుక** నీయంశముగూడ నిరస్తమైనది.

ఇంతవఱకును విద్వన్మార్గమును నిరాకరించి నూతనమార్గమునునిరూపింప నారంభించి తుద కాపని జేయలేకపోయిన యీప్రతివాదుల వాగాడంబరము—"నిమిత్తాదపరాద్ధేషోర్ధానుష్కస్యేవ వల్గితమ్" అన్నట్లు గుఱి తప్పిపోవునట్లు బాణములు కుప్పించు విలుకాని నిలకడలోని యాడంబరమువలె వ్యర్థమైపోయినది. లౌక్యజ్ఞానము లేనివారని నిర్హేతుకముగా బండితుల నాక్షేపించిన యీప్రతివాదుల లౌక్యజ్ఞానమునకు వినతులు. ఇంతటితో నీవిషయమును విడిచి విషయాంతర మందుకొందము.—

—"శ్రీకృష్ణునకు భగవదవతారసిద్ధియు, మఱియొకనికి లేకపోవుటయునా" అను ప్రసంగము–తన్నిరాకరణము —

మ. భా. చ. కారులవ్రాత యిట్లున్న—"అద్వైతమతమున బ్రతిపురుషుడు నీశ్వరాంశసంభూతుడే. ప్రతివ్యక్తికి నీశ్వరత్వము నొందుట కర్హత కలదు. అట్టి యద్వైతముచే గృష్ణునకు భగవదవతారసిద్ధియు, మఱియొకనికి లేకపోవుటయు సంభవింపదు. కాని శ్రోత్రిలోని స్వల్పాధిక భేదమువలె శ్రీకృష్ణునియందు భగవదంశము సాధారణమనుష్యులం దున్నదానికంటె వెక్కుడందల మహిమలు హెచ్చుగ నున్నదనుటమాత్రము నిర్వివాదాంశము" (పు 161)

ఈ వ్రాతచే సాధారణమనుష్యులకును, శ్రీకృష్ణునకును ఇంచుమించుగా సామ్యము చెప్పబూనిన ప్రతివాదుల కొకింత బోధింపవలసియున్నది.—

భగవదంశములుగా జెప్పబడువారు జీవులు, భగవదవతారముగా జెప్పబడువాడు శ్రీకృష్ణుడు. అసలు భగవంతునియందు అకుంఠితములైన యేయేశక్తులు కలవో ఆ శక్తులతో నవతరించుటను బట్టి

శ్రీకృష్ణుఁడు భగవదవతార మనఁబడెను. ఆ శక్తులులేని జీవులు భగవ
దంశములు. అనావృతజ్ఞానముకల శ్రీకృష్ణుఁడు భగవదవతారము. ఆవృత
జ్ఞానముకల జీవులు భగవదంశములు. ఐచ్ఛికదివ్యదేహము కల శ్రీకృష్ణు
నది భగవదవతారము. కర్మాయత్తదేహము కల జీవులు భగవదంశ
ములు. నిరతిశయోపాధిసంపన్నుఁడగు శ్రీకృష్ణునిది భగవదవతారము.
నిహీనోపాధిసంపన్నులగు జీవులు భగవదంశములు.

ఇట్లద్వైతముచేతనే ఉపాధిభేదమువలన కృష్ణభగవానునకును,
లోకులకును, పర్వతమునకును, బరమాణువునకు నున్నంత యంతర
మున్నది. ప్రతివ్యక్తికి నీశ్వరత్వమునొందుట కర్హత కల దని యీశ్వర
త్వమేనా? అర్హతయే యీశ్వరత్వమా?

శ్రీశుకు డంతటివాఁడు కృష్ణభగవానుని చరిత్రమును కీర్తించి
తన్మయుఁ డగుచుండువాఁడు. నేను కృష్ణభగవాను డంతటివాఁడనని యను
కొని యెరుఁగడు. హిరణ్యకశిపువుమాత్ర మట్లనుకొనిన ట్లున్నది. ఆ
యంశమునకు జెందినవా రట్లనుకొందురు.

అట్టి హిరణ్యకశిపువును అవలీలగా హరించినవాఁడు భగవంతుఁడో
ఆహిరణ్యకశిపువే భగవంతుఁడో నాఁడు స్పష్టమైనది. కృష్ణభగవానుని
యందు మనుష్యబుద్ధిని జీవబుద్ధిని పెట్టుకొనియున్న ప్రతివాదులకు
ఆ శ్రీకృష్ణస్వరూపపరిచయమునకై శ్రీ మధుసూదనసరస్వతీస్వామి
సూక్తుల నుదాహరింతము—

"జన్మకాలేఽపి సర్వయోగిధ్యేయం శ్రీవైకుంఠస్థ మైశ్వర్యమేవ
రూప మావిర్భావితవతి, సంప్రతిచ శ్రీవత్సకౌస్తుభవనమాలాకిరీ
టకుండలాది దివ్యోపకరణశాలిని, కంబుకమలకౌమోదకీచక్రవర
ధారిచతుర్భుజే, శ్రీమద్వైనతేయవాహనే, నిఖిలసురలోకసంపా

చితరాజరాజేశ్వరాభిషేకాదిమహావైభవే, సర్వసురాసురజేతరి, వివిధదివ్యలీలావిలాసశీలే, సర్వావతారశిరోమణౌ, సాక్షాద్వైకుంఠనాయకే, నిఖిలలోకదుఃఖనిస్తారాయ భువ మవతీర్ణే, విరించిప్రపంచాఽసంభవినిరతిశయసౌందర్యసారసర్వస్వమూర్తౌ, బాలలీలావిమోహితవిధాతరి, తరణికిరణోజ్జ్వలదివ్యపీతాంబరే, నిరుపమశ్యామసుందరే, కరదీకృతపారిజాతార్థ పరాజితపురందరే, బాణయుద్ధవిజితశశాంకశేఖరే, సమస్తసురాసురవిజయినరకప్రభృతిమహాదైతేయ ప్రకరప్రాణపర్యన్తసర్వస్వహారిణి శ్రీదామాదిపరమరంకమహావైభవకారిణి, షోడశసహస్రదివ్యరూపధారిణి, అపరిమేయగుణగరిమణి, మహామహిమని, నారదమార్కండేయాదిమహామునిగణస్తుతే, త్వయి కథ మవివేకినోఽపి మనుష్యబుద్ధి ర్జీవబుద్ధిర్వా"

శ్రీకృష్ణపరమాత్మా! నీవు జన్మకాలమందు వైకుంఠమున విహరించెడి యోగిధ్యేయమైన యీశ్వరస్వరూపమునే యావిర్భవింపజేసినవాడవు. తరువాత శ్రీవత్సకౌస్తుభవనమాలాది దివ్యాభరణములతోడనే విరాజిల్లువాడవు. శంఖచక్రాద్యలంకృతచతుర్భుజప్రకాశమానుడవు, గరుడగమనుడవు, అఖిలసురవర్గవిరచితరాజరాజేశ్వరాభిషేకాదిమహావైభవుడవు, సకలసురాసురవిజేతవు, దివ్యవిలాసశీలుడవు, సర్వావతారశిరోమణివి, సాక్షాద్వైకుంఠనాయకుడవై నిఖిలలోకదుఃఖనిరాకరణమునకై భూమియందవతరించినవాడవు, బ్రహ్మసృష్టిలో సంభవింపనినిరతిశయసౌందర్యసారమునకుసర్వస్వమూర్తివి, బాలలీలలచే బ్రహ్మనువ్యామోహితుని జేసినవాడవు, దివ్యపీతాంబరుడవు, నిరుపమశ్యామసుందరుడవు, పరాజితపురందరుడవు, బాణాసురయుద్ధవిజితశంకరుడవు, సమస్తసురాసురవిజయులగు నరకాసురాదుల ప్రాణపర్యంతసర్వస్వహారివి, కుచేలమహైశ్వర్యదాయివి, షోడశసహస్ర (పదియాఱువేల) దివ్యరూప

ధారివి, నారదమార్కండేయాదిమహామునిగణసంస్తుతకీర్తివి, యిట్టి నీయందు మనుష్యబుద్ధి కాని, జీవబుద్ధి కాని యెంత అవివేకి కైనను ఎట్లు కలుగును? అని భావము. దీనిని బట్టి ప్రతివాదిప్రసంగము అత్యంతావివేకమూలక మగుటచే హేయము. అంశాంతర మందుకొందము—

— “శ్రీకృష్ణుడు దశావతారములలో కీర్తింపబడలేదు”
అను ప్రసంగము-తన్నిరాకరణము—

ప. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— “పురాణపురుషులలో శ్రీరాముని మించినచో శ్రీకృష్ణుని మించిన యవతారపురుషుడు భారతీయ వాఙ్మయమున గాన్పింపదు. అవతారనిర్ణయములో శ్రీకృష్ణుని పౌరాణికులు దశావతారములతో నెన్నకపోవుటకు గారణమేమియో? బలరాముని దశావతారములలో చేర్చి శ్రీకృష్ణుని చేర్చకపోవుట మాత్రము విచిత్రముగనే యున్నది” (పు161-162)—

తెలియక, తెలిసికొనక వీరట్లు వ్రాసినారు. దశావతారములలో శ్రీకృష్ణుడు చేర్పబడిన విషయము నీక్రింది కొన్ని యుదాహరణములతో దెలుపుదము—

“సత్యవ్రత ధరాధీశ మత్స్యరూపాయ తే నమః ।
అమృతాప్తికరేశాన కూర్మరూపాయ తే నమః ॥
మహ్యుద్ధారకృతోద్యోగ కోలరూపాయ తే నమః ।
... ... ... ... ... ... తస్మై నృహరయే నమః ॥
బలిం సంఛలయామాస తస్మై వామనరూపిణే ।
రేణుకాగర్భజాతాయ జామదగ్న్యాయ తే నమః ॥
శ్రీమద్దాశరథే తుభ్యం నమోఽనంతక్రమాయ చ ।
కంసదుర్యోధనాద్యైశ్చ దైత్యైః పృథ్వీశలాంఛనైః ॥

భారాక్రాన్తాం మహీం యోఽసౌ వృజహార సుహావిభుః ।
ధర్మం సంస్థాపయామాస పాపం కృత్వా సుమారతః ॥
తస్మై కృష్ణాయ దేవాయ నమోఽస్తు బహుధా విభో ।
బౌద్ధం రూపం దధౌ యోఽసౌ తస్మై దేవాయ తే నమః ॥
కల్కి-రూపం సమాదధ్యౌ దేవదేవాయ తే నమః ।
దశావతారాస్తే దేవ భక్తానాం రక్షణాయ వై ॥
దుష్టదైత్యవిఘాతాయ తస్మాత్త్వం సర్వదుఃఖహృత్ ।
దేవీభాగవతము — (స్కం.10-అ5)

"తతో హరిః ప్రాదురభూ న్మహాత్మా నృసింహనామా ।
తతో హరి ర్భగవా న్వామనోఽభూత్ ॥
తతో హరి ర్జమదగ్నే స్సుతోఽభూత్ ।
తతో హరీ రఘువంశేఽవతీర్ణః

తతో హరిః కృష్ణరూపీ బభూవ। దేవక్యాం వై వసుదేవాత్సవిష్ణుః
కంసాదీన్వై నితరాం హన్తుకామ స్సమ్యక్పాతుం పాండవాంశ్చాపివీంద్ర

అవతారా హ్యసంఖ్యాతా విష్ణో ర్నారాయణస్య చ ।
స్వయం నారాయణా స్తే తే నాణుమాత్రం విభిద్యతే ॥
(గరుడపురాణము—బ్రహ్మఖండము— అ15)

ఇట్లే ఆగ్నేయాదిపురాణములలో గూడ గలదు. ఇచట,దశావతారములలో కృష్ణావతారముకీర్తింపబడుచు కంసదుర్యోధనాదిసంహారార్థము పాండవరక్షణార్థముధర్మసంస్థాపనార్థము దేవకీవసుదేవులనుండి కృష్ణావతార మావిర్భవించినట్లు చెప్పబడినది.

ఈ ప్రతివాదులు వ్రాయుటలో "బలరాముని దశావతారములలో చేర్కొని, శ్రీకృష్ణుని చేర్కొనకపోవుట విచిత్రాంశము" అనుటను బట్టి చూడగా "రామోరామశ్చ రామశ్చ" అను దశావతార సంగ్రహశ్లోకమును వీరు మనస్సులో బెట్టుకొని యిట్లు వ్రాసినారని తోచుచున్నది. అందుచే నిక దానినిగూర్చి చెప్పెదము—

భగవానువాచ—

"శృణు నారద తత్త్వేన ప్రాదుర్భావా న్మహామునే ।
మత్స్యః కూర్మో వరాహశ్చ నారసింహోఽథ వామనః ॥
రామో రామశ్చ రామశ్చ బుద్ధః కల్కీతి తే దశ ।"
(కుంభకోణప్రతి. శాంతిపర్వము — (అ348)

అని మత్స్యాదిదశావతారములను చెప్పి ఆయవతారములలో జేయుకార్యములను క్రమముగా జెప్పుకొనుచు వచ్చుటలో పరశురామావతారమును, క్షత్రియసంహారమును, రఘురామావతారమును, రావణసంహారమును చెప్పి పై శ్లోకములోని మూడవ రామశబ్దార్థమై యున్న అవతారమును, కార్యములను ఇట్లు ప్రశంసించెను—

"ద్వాపరస్య కలే శ్చైవ సన్ధౌ పర్యవసానికే ।
ప్రాదుర్భావః కంసహేతో ర్మథురాయాం భవిష్యతి ॥
శిశుపాలం వధిష్యామి యజ్ఞే ధర్మసుతస్య వై ।
సమాగతేషు బలిషు పృథివ్యాం సర్వరాజసు ॥
వాసవి స్సుసహాయో వై మమ త్వేకో భవిష్యతి ।
యుధిష్ఠిరం స్థాపయిష్యే స్వరాజ్యే భ్రాతృభి స్సహ ॥"

శ్రీమహావిష్ణువు నారదున కుపదేశించెడి యీప్రస్తావములో కలిద్వాపరసన్ధిచరమభాగమున మథురాపురమందు తాను కంసుని కొరకై యవతరింతు ననియు, తరువాత ధర్మజుని యజ్ఞములో శిశుపాలుని వధింతు ననియు, అర్జునుడు సహాయుడై యుండుననియు, సోదరులతో యుధిష్ఠిరుని స్వరాజ్యమందు స్థాపింతు ననియు చెప్పుచు కృష్ణావతారమును కృష్ణావతారచర్యలను వివరించియుండెను.

ఈవివరణవాక్యములను బట్టి సంగ్రహశ్లోకములోని మూడవ రామశబ్దమునకు బలరామసహచరితు డగు శ్రీకృష్ణు డర్థ మని స్పష్ట

మగుచున్నది. ఆయధ్యాయములోనే యొకనిపేరు జెప్పినను అవినాభావముచే నిరువురును గ్రహింపబడుదురు కాన రామపదప్రయోగపాఠసరణిని బట్టి రామపదమే ప్రయోగింపబడినది.

ఇట్లు పురాణములందును, మహాభారతమందును శ్రీకృష్ణుఁ డవతారపురుషుఁ డని చెప్పబడియుండుటచే ప్రతివాదుల వ్రాత పరాస్తము.

— "శ్రీకృష్ణునియందు అధర్మము అసత్యము సర్వాంగోపేతములై యున్న" వను ప్రసంగము—తన్నిరాకరణము —

మ. భా. చ. కారులవ్రాత యిట్లున్నది— "రాజకీయధురంధరునకు స్వపక్షవిజయము పరపక్షపరాజయమే ప్రధానము. అందు ధర్మము వాక్కులలో ప్రధానము, చేతలలో నప్రధానము. పరపక్షాధర్మమును గోరంతదానిని కొండంతగాను స్వపక్షాధర్మమును కొండంతదానిని గోరంతగాను, లేక తనయందించుకమాత్రము అధర్మము లేదనియు, జాటించి శత్రుపక్షమునకు దౌర్బల్యమును గలిగించును. ఇట్టి రాజకీయలక్షణములు వేదకాలమునుండి నేటివరకు సమస్త రాజపురుషులలోను నించుమించు ప్రతిఫలించుచున్నవి. అవి సర్వాంగోపేతమై శ్రీకృష్ణునిలో నిండియున్నవి, శ్రీకృష్ణుఁడు రాజకీయధురంధరాగ్రేసరప్రపితామహుఁ డని కాని, రాజకీయపురుషవంశవృక్షమునకు మూల మని కాని చెప్పుట యుక్తము. శ్రీకృష్ణుని రాజకీయలక్షణములు మహాభారతమున సంపూర్ణముగ ద్యోతకమగును" (పు 163)

"శ్రీకృష్ణావతారగాథ మహాభారతము ననుసరించి రాజకీయాంశములతో గూడి యున్నది. భగవద్గీతోత్తరగీతలలో వేదాంతప్రతిపాదకముగా నతని చరితము స్థూలదృష్టిని గాన్పించును. కాని

సూక్ష్మదృష్టిచే భగవద్గీతలో గూడ రాజకీయములు కూర్పబడియే యున్నవని కొందరు తలచుచున్నారు. 'చచ్చినచో స్వర్గము నొందుదువు. జయించినచో భూమి నేలుదువు. కాన యుద్ధము జేయ కృతనిశ్చయుండవై లెమ్ము.' అని శ్రీకృష్ణు డర్జునున కుప దేశించుట యెటులు తటస్థించునందురు? (పు 162)

వీరుచెప్పిన రాజకీయలక్షణము లనునవి యీ రాజకీయశబ్దము నుండివచ్చినవా? వీరి ముఖమునుండి వచ్చినవా? 'రాజా ప్రకృతిరంజ నాత్' అను నిర్వచనమును బట్టి ప్రజలను రంజింపజేయు ప్రభువునుచె ప్పెడి రాజశబ్దము దానికి పరమందున్న ప్రత్యయము కలిసిరాజకీయ శ బ్దమైనది. అందుచే ప్రజలను రంజింపజేయు ప్రభువుయొక్క కర్మ రా జకీయ శబ్దార్థము కాని అసత్యము, అధర్మము, అక్రమము, రాజకీ యశబ్దార్థముకాదు. ఇక వీరినోటినుండియేవచ్చినవి అప్రామాణికములు కనుక హేయములే. వేదకాలమునుండి నేటివఱకును సమస్త రాజపురు షులలోను రాజకీయలక్షణము లనబడు, అసత్యము, అధర్మము, అక్ర మము, ప్రతిఫలించుచునే యున్నవట! 'శ్రీకృష్ణునియందు సర్వాంగోపేత మై నిండియున్నవట'

ఇచ్చట వేదకాల మనుచున్న ప్రతివాదుల కొకంత బోధింతము. 'యో బ్రహ్మాణంవిదధాతిపూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై' అనుశ్రుతి, పరమేశ్వరుడు బ్రహ్మను సృజించి యాబ్రహ్మకు వేదముల నుపదేశించినట్లు చెప్పుచున్నది. ఆబ్రహ్మయే జగత్తును సృష్టించెను. దీని నిబట్టి సృష్టికి పూర్వము బ్రహ్మ, బ్రహ్మకుపూర్వము పరమేశ్వరుడు. ఆపరమేశ్వరునితో బాటు వేదములు, అని తేలినది. కనుక, పరమేశ్వ రుడు లేని కాల మొకటి యెట్లు లేదో, అట్లే వేదములు లేనికాలము కూడ లేదని సిద్ధాంతము.

వేదమున కొక కర్తయున్నప్పుడు, ఆకర్తయొక్క కాలమును బట్టి వేదకాల మనుటకు వీలిచ్చునుకాని "నకశ్చి ద్వేదకర్తాఽస్తి" అని వేదమునకు కర్త లేడని పరాశరమహర్షి, తనస్మృతిలో కంఠోక్తిగా జెప్పుచుండ ప్రతివాదులు వేదకాల మనుచుండుట అసంగతము.

వేదకాలనిర్ణయమునకై పూనుకొనిన నేటి పరిశోధకులు గూడ నప్పుడప్పుడు గోచరించుచున్న నిదర్శనములవలన భిన్నభిన్నకల్పనల జేయుచు నేటివరకు వెనుకకు వెళ్లుచునేయుండిరికాని యొక నిర్ణీతకాలమునకు వచ్చియుండలేదని విజ్ఞులకు విదితమే.

కాబట్టి ప్రతివాదులన్న వేదకాలము సృష్టికి బూర్వకాల మగుచుండుటచే ప్రతివాదుల మాటజూడగా అసత్యము, అధర్మము, అక్రమము అను లక్షణములు లేనట్టి మహారాజులు సృష్టిలో లేరన్నట్లు పర్యవసించునది. ఇంతకంటె నవివేకములేదు. పరమపావన మగు పూర్వకాలమహారాజుల చరిత్రము, పరమేశ్వరుడై ధర్మసంస్థాపనార్థమే నాయవతారమని చాటిన శ్రీకృష్ణునిచరిత్రము వీరి కిట్లనిపించుట ప్రచండమగు దినకరదీప్తి దివాంధమున కంధకార మనిపించుటవంటిదే. కనుక వీరివ్రాత హేయము.

"న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే నరాధమాః ।
మాయయాఽపహృతజ్ఞానా ఆసురంభావ మాశ్రితాః ॥"

అని గీతలో కృష్ణభగవానుడు చెప్పినట్లు ప్రతివాదుల వైఖరి కనబడుచున్నది.

"శ్రీకృష్ణావతారగాథ భగవద్గీతోత్తరగీతలలో స్థూలదృష్టికి వేదాంతప్రతిపాదకముగా గాన్పించునుకాని, సూక్ష్మదృష్టికట్లుకాదట" భారతములో భగవద్గీతోత్తరగీతలలో నేమున్నదో గ్రహింపగల

సూక్ష్మదృష్టి- గురుకులవాససాధ్యమైన కూలంకషవిద్యాపరిభావమున గాని కలుగదు. కనుక నట్టి విద్యలేని వానికి ఆ సూక్ష్మదృష్టి యసంభవము. విద్యాపరియుక్తమైన సూక్ష్మదృష్టిలేనట్టి వీరి మాట హేయమే.

—"శ్రీకృష్ణుడు జరాసంధుని బాధ తప్పించుకొనుటకై పాండవుల నాశ్రయించె" నను ప్రసంగము-తన్నిరాకరణము—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది- "పాండవులతో కృష్ణుడు దృఢమైత్రిగలిపియున్నాడు. ఇట్లు మైత్రిగలిగించుకొనుటకు గల కారణము నాటికాలమున దమ్ము మిగుల బాధించు జరాసంధుని దాడులు నరికట్టుటకై యుండు నని తలపవలసి యుండును" (పు165)

వీరు చెప్పిన జరాసంధుని దాడులు ఆ సమయమున శ్రీకృష్ణుని చర్యలు శ్రీమద్భాగవతమున జెప్పబడి యున్నవి. ఆ విషయమునే మన మీ ప్రతివాదులకు వినిపింతము—

"అక్షౌహిణీభి ర్వింశత్యా తిసృభిశ్చాపి సంవృతః ।
యదురాజధానీం మథురాం న్యరుణ త్సర్వతోదిశమ్ ॥
నిరీక్ష్య తద్బలం కృష్ణ ఉద్వేల మివ సాగరమ్ ।
స్వపురం తేన సంరుద్ధం స్వజనం చ భయాకులమ్ ॥
చిన్తయామాస భగవా న్హరిః కారణమానుషః ।
తద్దేశకాలానుగుణం స్వావతారప్రయోజనమ్ ॥
(స్క-౦-10. అ50)

శ్రీధరీయమ్—

కిం బల మేవ హన్మి న మాగధమ్ మాగధంవా హత్వాబలం గృహ్ణామి యద్వా సమాగధం సర్వం హన్మి ఇతి చిన్తయామాస. నను

ప్రథమం కథం చేష్ట్వా విమాత్యేనం చిన్తయితుం యుక్తం తత్రాహ-కారణమానుషఇతి. భూభారావతారకారణేన మానుషః స తత్త్వత ఇతి.

"హనిష్యామి బలం హ్యేత ద్భువి భారం సమాహితమ్ ।
మాగధేన సమానీతం పశ్యతాం సర్వభూభుజామ్ ॥
అక్షౌహిణీభి స్సంఖ్యాతం భటాశ్వరథకుంజరైః ।
మాగధస్తు న హన్తవ్యో భూయః కర్తా బలోద్యమమ్ ॥
ఏతదర్థోఽవతారోఽయం భూభారహరణాయ మే ।
సంరక్షణాయ సాధూనాం కృతోఽన్యేషాం వధాయ చ ॥"

అనగా జరాసంధుడు 23 అక్షౌహిణుల సేనతో వచ్చి మధురాపురము నరికట్టగా జూచి కృష్ణభగవాను డాలోచించెను. ఇప్పుడు సైన్యమును కడతేర్చి జరాసంధుని మిగుల్చుటా? జరాంధుని కడతేర్చి సైన్యము స్వాధీనముచేసికొనుటా? సైన్యమును, జరాసంధుని గూడ కడతేర్చుటా? అని.

ఇట్లు మూడువిధములైన వికల్పములే కలిగినవి కాని, యీతని జయింపగలనా? అను చింత కలుగలేదు. భూభారహరణమునకై యవతరించి మనుష్యరూపముతో నటించు పరమేశ్వరుడుకనుకనే యది కలుగలేదు. ఆమూడు విధములుగా వికల్పించుకొని యీసేనలను సంహరించి జరాసంధుని మిగిల్చినయెడల నీతడు మరల మూకను ప్రోవు చేసికొని వచ్చుచుండును. ఆవచ్చిన మూకలను అంత మొదించుటలో దుష్టనిగ్రహపూర్వకమైన భూభారహరణ మను నాయవతారప్రయోజనము సిద్ధించును. అని నిశ్చయించి యట్లే చేసెను. అని భావము.

అప్పుడు బలరామకృష్ణులు యుద్ధము చేసి సైన్యము నంత మొదించిన పిదప—

"జగ్రాహ విరథం రామో జరాసంధం మహాబలమ్ ।
హతానీకావశిష్టాసుం సింహః క్షుద్రమృగం యథా ॥
బధ్యమానం హతారాతిం పాశైర్వారుణమానుషైః ।
వారయామాస గోవిన్దస్తేన కార్యచికీర్షయా ॥

బలరాముడు జరాసంధునిపై బడి వారుణపాశాదులచే బంధించుచుండ జరాసంధునివలన గొంతకార్యము మున్నదని యెంచి యాతని సంహారకృత్యకారణ వైరియగు శ్రీకృష్ణభగవానుడాతనిని విడిపింపజేసెను. అని చెప్పబడినది.

విషయ మిట్లుండుటచే, శ్రీకృష్ణునకు జరాసంధభయముండెదన్నది ధృవమైనదని ప్రతివాదులు తెలిసికొందురుగాక.

— ♦ "జరాసంధశిశుపాలురను కపటముగానే వధించి"
రనుప్రసంగము — తన్నిరాకరణము —

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది — "జరాసంధశిశుపాలురను కపటముగానే వధించిరి (పు 172)

"ప్రత్యక్షముగా యాదవులు కాని, పాండవులుకాని, యుభయులు కలిసికొని జరాసంధుని జయింపగల శక్తి సామర్థ్యములు కలిగియుండలేదు. అందువలన కృష్ణుడు భీమపార్థులతో గూడిన బ్రాహ్మణవేషములను వేసికొని జరాసంధుని రాజధానియగు గిరివ్రజపురికేగి రాజబాటనుగాక పెడదారినే జరాసంధగృహము నర్ధరాత్రమున బ్రవేశించిరి "(పు 167)

ఇచ్చట జరాసంధుని యుదంత మొకింత గ్రహింపవలసియున్నది. ఆతనికి గల వరములనుబట్టి శస్త్రాస్త్రయుద్ధములో నాతడు సంహరింపబడడు, బాహుయుద్ధము చేతనే సంహరింపదగియున్నవాడు. అట్టి

యాజరాసంధుడు కొందరు మహారాజులను బంధించి యుంచి రు ద్రునకు బలియిచ్చు సన్నాహములో నుండెను. ఆదుష్కార్యము జరుగ కుండ జరాసంధునిసమీపించి యాతనికి బోధించి యాపై బాహుయుద్ధ ప్రక్రియ జరిపింపవలెనని కృష్ణభగవానుడాలోచించిభీమపార్థులను వెంట బెట్టుకొనివెళ్లెను. ఆవెళ్లుటలో స్వస్వరూపముతో వెళ్లినయెడల పుర మందుప్రవేశమే కలుగదనిభావించి స్నాతకులగు బ్రాహ్మణులని అగ్ర రాత్రిమండైనను భక్తిశ్రద్ధలతో బూజించుట యను లోకవిఖ్యాతవ్రి తము జరాసంధుని కున్నందున నట్టి వేషములతోడనే వారువెళ్ళిరి. ఆ వేషములలో గూడ తమక్షత్రియత్వమును సూచించుటకై స్నాతకవ్రి తులగు క్షత్రియులే ధరింపవలసిన పుష్పమాలికలు, గంధము అను చిహ్నములు ధరించియే యుండిరి.

వారు గిరివ్రజపురద్వారముజేరి తమకది శత్రుస్థానమని సూచిం చుటకై యాద్వారము నుండియే పురములో బ్రవేశింపక పురగిరి మీాది కెక్కి యచ్చట సుప్రసిద్ధమైయున్న భేరీత్రయమును బగులగొట్టి యాపై చైత్యకప్రాకారము మీాదికి బోయి యచ్చట గిరిశృంగమును దోర్దండములతో బడగొట్టి, యాపై గిరివ్రజపురములో ప్రవేశించిరి. ఇట్లు పెడదారిని గిరివ్రజపురములో బ్రవేశించి యాపై రాజమార్గ మును బట్టియే వెళ్ళుచు భక్ష్యములు, మాల్యములు, మొదలగువానితో గూడిన అంగళ్ళ శోభను, రాజవీధిలోని వస్తుసమృద్ధిని జూచుచు జను లతో గిక్కిరిసియున్న మూడుకక్ష్యలను దాటి జరాసంధుని సమీాపిం చిరి. పురములోబ్రవేశించినతరువాత వారు రాజమార్గముననే జరాసం ధుని గృహమునకు జేరినా రనియు, వారు పురములో నడచునప్పుడు ఊరు మాటుమడిగియుండక అంగళ్ళతో కలకలలాడుచు జనాకీర్ణమై యున్నదనియు జెప్పెడి యీా శ్లోకమును చూడుడు—

“స్నాతకవ్రతిన స్తేతు బాహుశస్త్రా నిరాయుధాః ।
యుయుత్సవః ప్రవివిశు ర్జరాసంధేన భారత ॥

భక్ష్యమాల్యాపణానాంచ దదృశు శ్శ్రియ ముత్తమామ్ ।
తాం తు దృష్ట్వా సమృద్ధిం తే వీథ్యాం తస్యాం నరోత్తమాః ॥
రాజమార్గేణ గచ్ఛన్తః కృష్ణభీమధనంజయాః ।
నివేశన మథాజగ్ము ర్జరాసంధస్య ధీమతః ॥
తాన్ దృష్ట్వా ద్విరద ప్రఖ్యాన్ శాలస్కంధా నివోద్గతాన్ ।
వ్యూఢోరస్కాన్ మాగధానాం విస్మయ స్సమపద్యత ॥
తే త్వతీత్య జనాకీర్ణాః కక్ష్యా స్తిస్రో నరర్షభాః ।
అహంకారేణ రాజాన ముపతస్థు ర్గతవ్యథాః ॥" (సభాప, అ21)

గ్రిఫిథ మిస్టరు చెప్పుచుండెడు మ. భా. చ. కారులు "రాజబాటను గాక పెడదారినే జరాసంధగృహము సర్థరాత్రమున బ్రవేశించిరి" అని వ్రాయుట హాస్యాస్పదము—

ఇక "జరాసంధుని కపటముగానె వధించిరి" అని ప్రతివాదులు వ్రాసియున్నారు. అది యెంత సత్యమో చూతము—

కృష్ణభీమార్జునులు సమీపింపగా జరాసంధుడు వారి కాసనము లిచ్చి కూర్చుండబెట్టి పరిసంగించుటలో 'మీరు పురద్వారమునుండి వచ్చుట మాని చైత్యకగిరి శృంగమును ఛేదించి పరిభుభయము లేక యిట్లేల వచ్చిరి? మీరెవ్వరు? నిజము చెప్పు'డని యడుగ శ్రీకృష్ణుడు చెప్పెను—

"అద్వారేణ రిపో ర్గేహం ద్వారేణ సుహృదో గృహాన్ ।
ప్రవిశన్తి నరా ధీరా ద్వారా ణ్యేతాని ధర్మతః ॥"

శత్రుస్థానమందు పెడదారిని ప్రవేశించుట, మిత్రస్థానమందు ద్వారమునుండి ప్రవేశించుట ధర్మమనిసమాధానము చెప్ప'నేనుమీకు శత్రువునా! నేను మీయెడల జేసిన తప్పేమి? అని యడిగిన జరాసంధునితో—

"త్వయా చోపహృతా రాజన్ క్షత్రియా లోకవాసినః ।
తదాగః క్రూర ముత్పాద్య మన్యసే కి మనాగసమ్ ॥
రాజా రాజ్ఞః కథం సాధూన్ హింస్యా న్నృపతిసత్తమ ।
తద్రాజ్ఞ స్సం నిగృహ్య త్వం రుద్రా యోపజిహీర్షసి ।
అస్మాం స్తదేనో గచ్ఛేద్ధి కృతం బార్హద్రథ త్వయా ।
వయంహి శక్తా ధర్మస్య రక్షణే ధర్మచారిణః ॥"

నీవు క్రౌర్యముతో క్షత్రియులను బలియిచ్చుటకు దెచ్చి నేజేసిన తప్పేమనుచుంటివా? ఇట్టి పని జేయవచ్చునా? మేము ధర్మశీలులము. ధర్మరక్షణసమర్థులము. నీవాదుష్కార్యము చేసినయెడలమాకా దోషము ఘటించును. అని చెప్పి యాశ్రీకృష్ణులో—

"యుయుత్సుమానా స్త్వత్తోహి న వయం బ్రాహ్మణా ధ్రువం ।
శౌరి రస్మి హృషీకేశో నృవీరౌ పాండవా విమౌ ॥
అనయో ర్మాతులేయం చ కృష్ణం మాం విద్ధి తే రిపుం ।
త్వా మాహ్వయామహే రాజన్ స్థిరో యుధ్యస్వ మాగధ ॥
ముంచ వా నృపతీన్ సర్వాన్ గచ్ఛ వా త్వం యమక్షయమ్ ॥"

మేము బ్రాహ్మణులము కాము. నీతో డీకొనుటకే వచ్చినాము. వీరు వీరశిరోమణులగు భీమార్జునులు. నేను నీశత్రువగు కృష్ణుడను. నిన్నాహ్వానించుచున్నాను. స్థిరుడవై యుద్ధముచేయుము. రాజులనందరనువిడిచెదవా? యమలోకమున కేగెదవా? అనిస్పష్టముగా జెప్పెను.

ఇందు కపట మేమియు లేదుకదా! ఇక జరాసంధు డామాటలు విని నేనాసంకల్పమును నెరవేర్చుకొనుపూటత్రముకలవాడను కాని భయపడి విడిచి పెట్టువాడనుకాను. నేను విడివిడిగానొక్కొక్కనితో గాని,యొక్కసారిగా నందరితో గాని యుద్ధము సేయగలను. అని చెప్పగా శ్రీకృష్ణుడు—

త్రయాణాం కేన తే రాజన్ యోద్ధుముత్సహతే మనః ।
అస్మదన్యతమేనేహ సజ్జీభవతు కో యుధి ॥

నీకు మాలో నెవ్వనితో యుద్ధముజేయ గుతూహల మున్నదని ప్రశ్నింప భీమునితో నని సిద్ధపడెను. అప్పుడు—

తయో ర్యుద్ధం తతో ద్రష్టుం సమేతాః పురవాసినః ।
బ్రాహ్మణా వణిజశ్చైవ క్షత్రియాశ్చ సహస్రశః ॥
శూద్రాశ్చ నరశార్దూల స్త్రియో వృద్ధాశ్చ సర్వశః ।
నిరన్తర మభూ త్తత్ర జనౌఘై రభిసంవృతమ్ ॥

వారిరువురయుద్ధము జూచుటకై చాతుర్వర్ణ్యప్రజలు వేలకొలది వచ్చిరి. స్త్రీలు వృద్ధులుకూడ వచ్చిరి. జనులు క్రిక్కిరిసి యుండిరి. ఆయుద్ధము కార్త్తికశుద్ధపాడ్యమి మొదలుకొని చతుర్దశివరకు విరామములేక జరిగి చతుర్దశినాటి రాత్రి జరాసంధసంహారముతో ముగిసినది. ఈవిషయమును చెప్పుచున్న గ్రంథభాగమును చూడుడు—

“కార్త్తికస్య తు మాసస్య ప్రవృత్తం ప్రథమేఽహని ।
అనాహారం దివారాత్ర మవిశ్రాన్త మవర్త్తత ॥”

నీ. “అనాహారం నాస్తి ఆహరణం ఆహారః ఉపసంహారో యస్య తత్. అవిశ్రాన్తం న విశేషేణ శ్రాన్తో ఽన్యతరో యస్మిం స్తత్తథా”
“తద్వృత్తం తు త్రయోదశ్యాం సమవేతం మహాత్మనోః”

నీ. “తద్వృత్తం తాదృశప్రకారం యుద్ధం త్రయోదశ్యాం సమవేతం, త్రయోదశీపర్యన్తం, జాత మితి శేషః”
“చతుర్దశ్యాం నిశాయాన్తు నివృత్తో మాగధః క్లమాత్”
దీనిచే బదునాలుగురోజులు యుద్ధ మఖండమగా జరిగినమీదట జరాసంధుడు భీమసేనునిచే వధింపబడె నని స్పష్ట మగుచున్నది.

అన్నిరోజులు బహుజనసమక్షములో జరిగిన బాహుయుద్ధములో తుదకు మృతుడైన జరాసంధుని కపటముగానె వధించిరనిన ప్రతివాదుల సాహసమును ఏమనవలెను? దీనినిటుంచి మ. భా. చ. కారుల యీవ్రాతనుగూడ చూడుడు—

“కార్తికశుద్ధపాడ్యమి మొదలు త్రయోదశివరకు యుద్ధము ప్రవర్తించె ననియు, చతుర్దశినాటి యర్ధరాత్రమున భీముడు జరాసంధుం జంపె ననియు, మహాభారతమున గలదు. ఈయుద్ధములో భీము డలసటకొందగా కృష్ణుడు- వాయుబలమును నీబలముగూడ జూపుమా యనగా భీముడు వాయువుదలచి శక్తిసంపన్నుడై జరాసంధుంజంపె నట. ఈగాథాసందర్భము నాలోచింపగా గార్తికశుద్ధపాడ్యమినాడు ఇంద్రప్రస్థములో నాలోచనము జరిగి త్రయోదశినాటికిగిరివ్రజము జేరి చతుర్దశినాటి రాత్రి జరాసంధుని గృహము దొంగదారిం ప్రవేశించి యగ్నిహోత్రగృహమున జరాసంధుని భీముడు చంపియుండును. ఆఘోరంతఃపురమున నిర్వాతమగు నగ్నిగృహమున జరిగి యుండుటచే భీమున కాయాసము రాగా కృష్ణు డెటులనో భీమునకు గాలిలో విశ్రాంతిం గల్పించి జరాసంధుం జంపించియుండుననియు వితర్కముచే నూహింపబడుచున్నది” (పు 167—168)

ప్రతివాదు లీవ్రాతలో ‘దొంగదారిని జరాసంధుని గృహములో ప్రవేశించి భీముడాతనిని చంపియుండును’ అనుటనుబట్టి అకస్మాత్తుగా నాతనిపై బడి హత్య చేసె నన్నట్లు తేలుచున్నది. “ఆఘోరంతఃపురమున నగ్నిహోత్రగృహమందు జరిగెను” “కృష్ణుడు భీమునకు గాలిలో విశ్రాంతిని కల్పించి జరాసంధుని జంపించియుండును” అనుటను బట్టి హత్యచేయబడలేదు వారిరువురు బాహుబలముతో పోరినారని తేలుచున్నది. అట్లుపోయినప్పుడు కృష్ణుడు భీముని ఎట్లు విశ

దీయగలిగెను? ఎట్లు గాలిలో విశ్రాంతి గల్పింపగలిగెను? ఈ ప్రతివాదు లేవెనుకజూపినట్లు 'యాదవులకుగాని పాండవులకుగాని యుభయులకుగాని జరాసంధుని జయింపగల శక్తిసామర్థ్యములు లేవు' అని వ్రాసియుండ నట్టి జరాసంధుని చేతికిచిక్కిన భీముని శ్రీకృష్ణుడు విడిపించి గాలిలో విశ్రాంతి నెట్లు కల్పింపగలిగెను? అంత పరాక్రమశాలియగు జరాసంధుడు ప్రతివాదులన్నట్లు అసమర్థుడైన భీమునితో నేస్వల్పకాలమో యుద్ధముచేసి యెట్లు మరణించెను? స్వవచనవ్యాఘాతములతోగూడిన యీ ప్రతివాదుల ప్రసంగములు లోకమున కపకారములనుటకు సంశయమున్నదా? ఇంతటితో దీనిని విడిచి శిశుపాలవధవిషయ మందుకొందము.

—"ఆచార్య ఋత్విక్స్నాతకాదులలో జేరని కృష్ణునకు
రాజసూయమున సభాతాంబూల" మను ప్రసంగము—
తన్నిరాకరణము.—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— "ధర్మజుడు తనకు విశేషోపకారముచేసిన కృష్ణునకేదేని మహాగౌరవము జేయదలచి యుండెను. తదనుగుణముగా భీష్ముని ప్రోత్సాహముచే నర్ఘ్యప్రదానము జరిగెను. ఆచార్యఋత్విక్స్నాతకాదుల కీయదగిన సభాతాంబూలము నట్టి పరిస్థితు లేమియు లేని కృష్ణున కిచ్చుటచే రాజసూయము జూడవచ్చిన రాజలోకమునకసూయ కలిగెను. కృష్ణునకు బూర్వవైరియగు శిశుపాలుడు దాని నాక్షేపించెను. సహదేవుడు 'మేము చేసినదానిని కాదనినవారి పని పట్టెద'మని తామపుడుత్కృష్టబలవంతులుగా నుండుటచే వచ్చిన రాజులను బెదరించెను.

శిశుపాలుడుమాత్రము జంకక కృష్ణు డర్ఘ్యము గ్రహించుట కెంతమాత్రము నర్హుడు కాడని ప్రోత్సాహకుడగు భీష్ముని, అర్ఘ్యమిచ్చిన ధర్మజుని, దానిం బుచ్చుకొనిన కృష్ణునిగూడ నిరసించెను.

శిశుపాలుడు సభను వదలి యుద్ధప్రయత్నమునకై బయటి కేగగా ధర్మజు డనునయవాక్యములతో శిశుపాలుని దిరిగి సభలోనికి దీసి కొనివచ్చెను. అప్పుడు కృష్ణశిశుపాలురకు కొంతవాక్కలహము జరిగెను. ఆ వాక్కలహములోనే తటాలున శ్రీకృష్ణుడు చక్రము బ్రయోగించి శిశుపాలుని శిరశ్ఛేదము చేసెను. ఈ శిశుపాలవధము కూడ జరాసంధునివధమువలె గుప్తముగా జేయబడినదే" (పు.169)

ప్రతివాదు లీవ్రాతలలో" తమకు విశేషోపకారము జేసిన కృష్ణునకు ధర్మజుడు ఏదో మహాగౌరవము జేయదలచియుండ రాజసూయములో నగ్ర్యపూజాప్రదానము జేసినట్లును, అది భీష్ముని ప్రోత్సాహముచే జరిగినట్లును చెప్పుట పరస్పరవిరుద్ధము. కృష్ణునకు ధర్మజుడు స్వయముగనే చేయదలచియున్న మహాగౌరవములో భీష్ముని ప్రోత్సాహ మేల కావలసివచ్చినది? అది భీష్మప్రోత్సాహముచే జరిగినపుడు ధర్మజుడు స్వయముగా జేయదలచిన దెట్లగును?

మఱియు, కృష్ణున కట్టిగౌరవము ధర్మజుడు చేయదలచుటలో దానాతనివలన విశేషోపకారమును పొందుటే కారణమని చెప్పిన ప్రతివాదులు నిష్కారణముగనే భీష్ముని ప్రోత్సాహము జరిగినట్లుచెప్పుటవలన ధర్మజుని యెడల గావించిన కుకల్పన యని తెలియుచున్నది.

ఇంకొకటి_ఆసభలో ధర్మరాజు స్వయముగా కృష్ణు డింతటివాడు కనుక నేనీతనికి ప్రథమపూజనము చేయుచున్నా నని చెప్పి చేసినట్లైన లేనపుడు ప్రతివాదుల యూహ నేమనవలెను.

అసలచ్చటి పూజాప్రస్తావ మేమనగా రాజసూయాంగమైన సోమయాగవిశేషమున నంతర్వేదియను స్థానమందు సత్కారార్హులైన విప్రులు, క్షత్రియులు, నారదాదిమహర్షులు, రాజర్షులు కూర్చుండి ప్రసంగములు చేయుచుండ —

"తతో భీష్మోఽబ్రవీ ద్రాజన్ ధర్మరాజం యుధిష్ఠిరమ్ ।
క్రియతా మర్హణం రాజ్ఞాం యథార్హ మితి భారత ॥
ఆచార్య మృత్విజం చైవ సంయుజంచ యుధిష్ఠిర ।
స్నాతకంచ ప్రియం ప్రాహు ష్షడర్ఘ్యార్హా న్నృపం తథా ॥
ఏషా మేకైకశో రాజ న్నర్ఘ్య ఆనీయతా మితి ।
అథ చైషాం వరిష్ఠాయ సమర్థా యోపనీయతామ్ ॥" (సభాప.అ36)

నీ. "సంయుజం సంబన్ధినం శ్వశురాదిం ప్రియం మిత్రమ్ ఏకైకశః ప్రత్యేకం అథ అథాపి ఏషాం మధ్యే వరిష్ఠాయ ప్రథమ మితి శేషః"

భీష్ముడు—'యుధిష్ఠిరా! యథార్హముగా పూజ్యులను పూజింపుము. ఆచార్యుడు, ఋత్విక్కు, బంధువు, స్నాతకుడు, మిత్రుడు, నృపుడు, అను నార్గురు పూజార్హులు. వీరికి ప్రత్యేకముగా నర్ఘ్యమిమ్ము. వీరిలో పూజ్యతముని ముందు పూజింపుము.' అని చెప్పగా యుధిష్ఠిరుడు—

"కస్మై భవా న్మన్యతేఽర్ఘ్య మేకస్మై కురునందన ।
ఉపనీయమానం యుక్తంచ తన్మే బ్రూహి పితామహ ॥

అట్లు ముందు పూజింపదగిన పూజ్యతముని నీవే చెప్పుమని కోరెను.

"తతో భీష్మ శ్శాన్తనవో బుద్ధ్యా నిశ్చిత్య వీర్యవాన్ ।
వార్ష్ణేయం మన్యతే కృష్ణ మర్హణీయతమం భువి ॥
ఏష హ్యేషాం సమస్తానాం తేజోబలపరాక్రమైః ।
మధ్యే తపన్నివాభాతి జ్యోతిషామివ భాస్కరః ॥
అసూర్యమివ సూర్యేణ నిర్వాతమివ వాయునా ।
భాసితం హ్లాదితం చైవ కృష్ణేనేదం సదోహి నః ॥"

అంతట భీష్ముఁడు పరిశీలించి శ్రీకృష్ణుఁడే పూజ్యతముఁడని నిశ్చయించి యీసమస్తసభ్యులలో తేజోబలపరాక్రమములతో జ్యోతిశ్చక్రమున సూర్యమండలమువలె శ్రీకృష్ణుఁడు విరాజిల్లుచుండె ననియు, సూర్యునివలె వాయువువలె శ్రీకృష్ణుఁడు ఈసభకు ప్రకాశము ప్రమోదము నిచ్చుచున్నాఁ డనియు జెప్పెను.

"తస్మై భీష్మాభ్యనుజ్ఞాత స్సహదేవః ప్రతాపవాన్ ।
ఉపజహ్రేఽథ విధివ ద్వార్ష్ణేయాయార్ఘ్య ముత్తమమ్॥
ప్రతిజగ్రాహ తత్ కృష్ణ శ్శాస్త్రదృష్టేన కర్మణా ।
శిశుపాలస్తు తాం పూజాం వాసుదేవే న చ క్షమే ॥

అపుడు సహదేవుఁడు భీష్మానుజ్ఞపై శ్రీకృష్ణునికి విధ్యుక్తముగా నర్ఘ్య మీయఁగా నది శాస్త్రీయమని శ్రీకృష్ణుఁడు ప్రతిగ్రహించెను. శిశుపాలుఁడు మాత్రము దానినిచూచి సహింపలేకపోయెను. ఇట్లు భీష్ముఁడువిమర్శించి ప్రథమపూజ్యుఁడు శ్రీకృష్ణుఁడే యని చెప్పిన మీఁదట జరిగిన యర్ఘ్యప్రదానము యజ్ఞాంగమైయుండ ప్రతివాదులు—దానిని ప్రత్యుపకారతాత్పర్యముతో యుధిష్ఠిరుఁడు చేసినట్లు వ్రాయుట నింద్యము. ఇట్టి దురభిప్రాయమును నిరసించుటకే శిశుపాలుని మొదలించుచు నపుడు భీష్ముఁ డిట్లు చెప్పెను—

న కేవలం వయం కామా చ్చేదిరాజ జనార్దనమ్।
న సంబన్ధం పురస్కృత్య కృతార్థంవా కథంచన॥
అర్చామహేఽర్చితం సద్భి ర్భువి భూతసుఖావహమ్ ॥

"ఓశిశుపాల! మేమీశ్రీకృష్ణునికోరికనుబట్టికాని, బంధుత్వమును బట్టికాని, ప్రయోజనాంతరమును బట్టికాని పూజింపలేదు. భూలోకమందు, సత్పురుషులచే బూజింపబడినవాఁడని భూతకోటికి సుఖావహుఁడని పూజించుచున్నాము" అని. ఇది శిశుపాలాభిమానులగు ప్రతివాదులకుగూడ సమాధానమే,

ఇక "ఆచార్యాదులకీయదగిన సభాతాంబూలము నట్టి పరిస్థితులేమి యు లేని శ్రీకృష్ణున కిచ్చి" రట! ఆచార్యాదు లాప్తురిలో జేరినవాడు మిత్రుడొకడు. అది భీష్మవాక్యములలో స్పష్టీకరింపబడియున్నది. ఇట్టి స్థితిలో—

> ధర్మే స్థితాః పాండవేయాః కస్తాన్ కిం నక్ష్యత్యమ్మ్యతి।
> యస్తాన్ ద్వేష్టి స మాం ద్వేష్టి యస్తా నను సమా మను॥
> ఐకాత్మ్యం మాం గతం విద్ధి పాండవైర్ధర్మచారిభిః' ఉద్యోగప।

అనుచు పాండవులు ధర్మాత్ములు వారియందు తప్పున్నదని యెవ్వ డనగలడు? వారిని ద్వేషించినవాడు నన్నే ద్వేషించినవాడు, వాడిని పూజించినవాడు నన్నుపూజించినవాడే. వారే నేను, అని, రాయబారమునకు వెళ్ళినపుడు దుర్యోధనునితో బ్రసంగించిన శ్రీకృష్ణుడు పాండవులకు మిత్రుడను జ్ఞానముకూడ లేకున్న యీప్రతివాదుల వ్రాత నింద్యము.

ఆనాడిట్లే యాక్షేపింపమొదలిడిన శిశుపాలునకు బుద్ధిజెప్పుచు భీష్ముడేమనిచెప్పెనో చూడుడు—

> న చ కశ్చిదిహాస్మాభి స్సుబాలోఽప్యపరీక్షితః।
> పూజ్యతాయాం చ గోవిందే హేతూ ద్వావపి సంస్థితౌ॥
> వేదవేదాంగవిజ్ఞానం బలంచాభ్యధికం తథా।
> నృణాం లోకేహి కోఽన్యోఽస్తి విశిష్టః కేశవాదృతే॥
> త మిమం లోకసంపన్న మాచార్యం పితరం గురుమ్!
> అర్ఘ్య మర్చిత మర్చార్హం సర్వే సహన్తు మర్హథ॥
> ఋత్విగ్గురు ర్వివాహ్యశ్చ స్నాతకో నృపతిః ప్రియః।
> సర్వ మేత ద్ధృషీకేశ స్తస్మా దభ్యర్చితోఽచ్యుతః।

కృష్ణ ఏవ హి లోకానా ముత్పత్తి రపి చావ్యయః।
కృష్ణస్య హి కృతే విశ్వ మిదం భూతం చరాచరమ్ ||
ఏష ప్రకృతి రవ్యక్తా కర్తా చైవ సనాతనః।
పరశ్చ సర్వభూతేభ్య స్తస్మా త్పూజ్యతమోఽచ్యుతః||
ఆదిత్య శ్చంద్రమాశ్చైవ నక్షత్రాణి గ్రహాశ్చ యే।
దిశశ్చ విదిశశ్చైవ సర్వం కృష్ణే ప్రతిష్ఠితమ్||
నహి కేవల మస్మాక మయ మర్చ్యతమోఽచ్యుతః।
త్రయాణా మపి లోకానా మర్చనీయో మహాభుజః||
జ్ఞానవృద్ధా మయా రాజన్ బహవః పర్యుపాసితాః।
తేషాం కథయతాం శౌరే రహం గుణవతో గుణాన్ ||
సమాగతానా మశ్రౌషం బహూన్ బహుమతాన్ సతామ్।
కర్మాణ్యపిచ యాన్యస్య జన్మప్రభృతి ధీమతః||
బహుశః కథ్యమానాని నరై ర్భూయ శ్శ్రుతాని మే।
అయన్తు పురుషో బాల శ్శిశుపాలో న బుధ్యతే ||
సర్వత్ర సర్వదా కృష్ణం తస్మా దేవం ప్రభాషతే।
యో హి ధర్మం విచినుయా దుత్కృష్టం మతిమా న్నరః||
స వై పశ్యే ద్యథాధర్మం న తథా చేదిరా డయమ్।
సవృద్ధబాలే ష్వథవా పార్థివేషు మహాత్మసు ||
కో నార్హం మన్యతే కృష్ణం కోవాప్యేనం న పూజయేత్

(సభా ప అ_38)

అనగా_మేలిసభలో ప్రథమపూజ్యతను గూర్చి బాలునిగూడ బహిష్కరించక విడువలేదు. శ్రీకృష్ణుని పూజ్యతలో రెండు హేతువు లున్నవి. అత్యధికమైన వేదవేదాంగ విజ్ఞాన మొకటి. అత్యధికమైన బల మొకటి. ఈనరలోకములో శ్రీకృష్ణుని కంటె నధికు డెవ్వడు? ఈయాచార్యత్వ గుణప్రయుక్తుని, పూజ్యుని, పూజితుని బూజించుట కందరు సమ్మతింపదగినదే.

ఆచార్యుడు, ఋత్విక్కు, స్నాతకుడు, బాంధువు (కన్యాదాత)
నృపతి మిత్రుడుగూడ శ్రీకృష్ణుడే కనుక బూజింపబడెను. సూర్యచం
ద్రులు, నక్షత్రములు, గ్రహములు, దిక్కులు, విదిక్కులు
సర్వము శ్రీకృష్ణునియందే ప్రతిష్ఠితమై యున్నది. ఈశ్రీకృష్ణుడు
మాకుమాత్రమె కాదు ముల్లోకములకుబూజ్యతముడే. నేనెందరినో జ్ఞా
నవృద్ధులను సేవించితిని వారుసత్పురుషసమ్మతమైన శ్రీకృష్ణుని గుణగ
ణమును జెప్పగావినియున్నాను. జన్మప్రభృతి కృష్ణుడు చేసినచర్యలను
లోకులు బహుళముగా జెప్పుకొనుచుండ నేనెంతయో వినియున్నాడను.
శ్రీకృష్ణుడు సర్వత్ర కలడు; సర్వదా కలడు. అసబాలుడైన యీశిశుపా
లు డెరుగక యిట్లనుచున్నాడు. ఏబుద్ధిమంతుడధికముగా ధర్మమాచ
రించునో ఆతడే శ్రీకృష్ణమహత్త్వము గ్రహింపగలుగును. శిశుపాలు
డట్లు గ్రహింపజాలడు. బాలురలోగాని, వృద్ధులలోగాని, పృథివీపతుల
లోగానికృష్ణుడు పూజ్యుడుకాడనువాడెవడు? కృష్ణుని పూజింపని వాడె
వడు? అనిభావము.

ఆనాడు శిశుపాలుని మందలించుచు జెప్పిన భీష్ముని వచనముతే
యీనాడుఆశిశుపాలుని పాటనే పాడిన ప్రతివాదులకు ప్రదర్శింపబడి
నవి కనుక శ్రీకృష్ణు డాచార్యాది స్వరూపుడే యని ప్రతివాదులు గ్ర
హింపనియెడల వీరును శిశుపాలతుల్యులే. ఇక అట్లుపూజింపగా "రా
జసూయము జూడవచ్చినరాజలోకమున కసూయ కలిగె" నట! ఔరా!
"శిశుపాలస్తు తాం పూజాం వాసుదేవే న చక్షమే" అని శిశుపాలుడు
మాత్రము ఆపూజను సహింపలేకపోయెను. అని గ్రంథమందుండ
రాజలోకమునకంతకు నిందను బుట్టబెట్టుట విపరీతము. ఇక "కృష్ణునకు
బూర్వవైరియగు శిశుపాలుడు దాని నాక్షేపించె" నట! బాగుగానున్నది.
ఈమాటచే శిశుపాలు డాక్షేపించుటకు కృష్ణున కాతడు పూర్వవైరి య
గుటయే కారణముకాని కృష్ణుడు పూజ్యతముడు కాకుండుట కాదని
ప్రతివాదులే మరల చెప్పుచున్నారు. ఇది సత్యము ఈప్రతివాదు లా
క్షేపించుటకు మాత్రము కారణము వారి విమర్శనవైపరీత్యముకంటె
వేరొకటి కనపడదు.

ఇక "సహదేవుఁడు మేముచేసినదానిని కాదనినవారి పని పట్టెద మని రాజులను బెదరించె" నట! ఆసహదేవవాక్యసందర్భ మెట్లున్నదో చూడుఁడు___

కేశవం కేశిహన్తార మప్రమేయపరాక్రమమ్।
పూజ్యమానం మయా యోవః కృష్ణం న సహతే నృపాః॥
సర్వేషాం బలినాం మూర్ధ్ని మయేదం నిహితం పదమ్।
ఏవ ముక్తే మయా సమ్య గుత్తరం ప్రబ్రవీతు సః॥
సఏవ హి మయా వధ్యో భవిష్యతి న సంశయః।
మతిమన్తశ్చ యే కేచి దాచార్యం పితరం గురుమ్।
అర్చ్య మర్చిత మర్చార్హ మనుజానన్తు తే నృపాః।
తతో న వ్యాజహా రైషాం కశ్చి ద్బుద్ధిమతాం సతామ్।
మానినాం బలినాం రాజ్ఞాం మధ్యే వై దర్శితే పదే।
తతోఽపతత్ పుష్పవృష్టి స్సహదేవస్య మూర్ధని।
అస్పష్టరూపా వాచ శ్చాప్యబ్రువన్ సాధు సాధ్వితి॥"

'ఓనృపతులారా! అప్రమేయపరాక్రముఁడై నాచే బూజింపబడుచున్న ఈకృష్ణునిజూచి మీలో నెవ్వఁడు సహింపఁడో అట్టివాఁడు తనశిరస్సుపైని ఎత్తిన యీపాద ముంచినట్లు భావించునట్టివాఁడను నేనని స్పష్టముగా జెప్పవలెను. అప్పు డాతనిని వధింతును. ఓనృపతులారా! మీలో మతిమంతులైనవారందరు, ఆచార్య పితృ గురు స్వరూపుఁడు, పూజ్యుఁడు పూజితుఁడునగు కృష్ణునిఁగూర్చి యనుజ్ఞనీయవలసినది.' అనిసహదేవు డనగా బుద్ధిమంతులలో నొక్కఁడును మారుపలుకక యంగీకారమును సూచించిరి. బలవంతులైన రాజులలో సహదేవుఁడు శ్రీకృష్ణుని మహాత్మ్యము నుద్ఘాటించుచు పాదమెత్తినప్పుడు సహదేవుని శిరస్సుపై పుష్పవృష్టి కురిసినది. అదృశ్యమూర్తుల సాధువాదనులు వినబడినవి.

ఈగ్రంథసందర్భము జూడగా నారదుడు సహదేవుడు చేసిన శ్రీకృష్ణమహాత్మ్యోద్ఘాటనము సత్యమే యని పుష్పవృష్టిచేతను అదృశ్యమూర్తుల సాధువాదములచేతను ధ్రువపరుపబడినట్లు స్పష్టమగుచున్నది. ఇట్లుండ "సహదేవుడు రాజలోకమును బెదరించెను" అని ప్రవ్రాతిదు లనుట హేయము.

మరియు నీప్రతివాదులే దుర్యోధనుని గూర్చి వ్రాయుచు—
"ఊరుభంగానంతరము కృష్ణ దుర్యోధనసంవాదములో, దుర్యోధనునిదే న్యాయమని దేవతలు పుష్పవృష్టిని గలిగింపగా కృష్ణాదులు సిగ్గుపడి" రట! (పు266) అనివ్రాసియున్నారు.

దుర్యోధనునిదే న్యాయ మనుట కాపుష్పవృష్టిని ప్రమాణముగా గ్రహించి యున్న ప్రతివాదులు-శ్రీకృష్ణుని లోకోత్తరమహాత్మ్యము నుద్ఘాటించిన సహదేవుని సంభాషణము న్యాయ్య మనుటకై ప్రదర్శింపబడినయీపుష్పవృష్టిని ప్రమాణముగా గ్రహింపకత్రోసివేసిరి. ఆదుర్యోధనవధసందర్భములోని పుష్పవృష్ట్యాదులను గూర్చి ముందు తెలుపబడును. ఆపుష్పవృష్టిని చూచి శ్రీకృష్ణాదులైనను సిగ్గుపడిరటకాని యీపుష్పవృష్టినిచెప్పెడు గ్రంథమును చూడలేకపోవుటయు, చూచినను గ్రహింపలేకపోవుటయు ప్రతివాదుల నిష్పాక్షికవిమర్శన పద్ధతికాబోలును.

శ్రీకృష్ణుండు జగత్పూజ్యుడను నిర్ణయమునకు నారదాదిమహర్షులే హర్షింప; కాదని చెలరేగినవాడు శిశుపాలుడు, శిశుపాలునిపాటనే పాడినవారు ప్రతివాదులు. ఈప్రతివాదుల కామహాసభలో నారదమహర్షి చెప్పిన విషయమునే వినిపింతము—

సర్వసంశయనిర్మోక్తా నారద స్సర్వలోకవిత్ ।
ఉవాచాఖిలభూతానాం మధ్యే స్పష్టతరం వచః॥

కృష్ణం కమలపత్రాక్షం నార్చయిష్యన్తి యే నరాః।
జీవన్మృతాస్తు తే జ్ఞేయా న సంభాష్యాః కదాచన ॥" (సభాప-39.)

శ్రీకృష్ణుని బూజింపనినరులుజీవన్మృతులు, అసంభాష్యులు,అనియర్థము.

"ఇక శిశుపాలుడు మాత్రము జాడక భీష్ముని,ధర్మజుని, కృష్ణుని గూడ నిరసించి సభను వదలి యుద్ధప్రయత్నమునకై బయట కేగగా ధర్మజు డనునయవాక్యములతో శిశుపాలుని దీసికొని వచ్చి నప్పుడు కృష్ణశిశుపాలులకు జరిగిన వాక్కలహములోనే తటాలున శ్రీకృష్ణుడు చక్రము బ్రయోగించి శిశుపాలుని శిరశ్ఛేదము జేసె" నట!

ఈవ్రాతలో యాగము జూడవచ్చిన శిశుపాలుడు యుద్ధమున కుద్యమించినట్లు ప్రతివాదులేచెప్పుచున్నారు. కృష్ణశిశుపాలుల వాక్కలహములోనే తటాలున శ్రీకృష్ణుడు వధించెనట!ఈవిషయములో గొంత చెప్పవలసియున్నది.

శిశుపాలుడు తిరిగి సభలోనికి వచ్చి శ్రీకృష్ణుని, ధర్మజుని నిందించుచు భీష్ముని నిందించునపుడుభీష్ము డిట్లనెను—

"ఏష తిష్ఠతి గోవిన్దః పూజితోఽస్మాభి రచ్యుతః ।
యస్య వ స్త్వరతే బుద్ధి ర్మరణాయ స మాధవః ॥
కృష్ణ మాహ్వయతా మద్య యుద్ధే చక్రగదాధరమ్!
యాదవస్యైవ దేవస్య దేహం విశతు పాతితః" ॥ (అ44)

మాచే బూజింపబడినశ్రీకృష్ణు డిడుగో, మీలో నెవ్వని బుద్ధి మరణమునకు త్వరపడుచుండెనో ఆతడుశ్రీకృష్ణుని యుద్ధమునకుబిలువవచ్చును. శ్రీకృష్ణునిచే హరింపబడి శ్రీకృష్ణదేహ మం దైక్యము నొందవచ్చును. శిశుపాలు డీమాటవిని శ్రీకృష్ణునితో నిట్లనెను—

"ఆహ్వాయే త్వాం రణం గచ్ఛ మయా సార్థం జనార్దన!
యావ దద్య నిహన్మి త్వాం సహితం సర్వపాండవైః ॥ "(అ45)

కృష్ణా! నిన్నాహ్వానించుచున్నాను. నాతో యుద్ధముచేయుము. పాండవసహితముగా నిన్నిప్పుడు వధింతును. శిశుపాలు డిట్లు యుద్ధమునకు గాలు దువ్వినతరువాత శ్రీకృష్ణుడు మహారాజమండలితో మొదటినుండియు శిశుపాలుడు చేయుచు వచ్చిన దుష్కార్యముల నుద్ఘాటించి చెప్పి ఇప్పుడు మీసమక్షములో జరుగుచున్న యీదుర్మార్గము క్షమింపదగినది కాదని చెప్పగా మహారాజులు శిశుపాలుని గర్హించుకొనుచుండ శిశుపాలుడు పకపకనవ్వుచు మాటలాడునప్పుడు—

"క్షమ వా యది తే శ్రద్ధా మా వా కృష్ణ మమ క్షమ ।
క్రుద్ధాద్వాపి ప్రసన్నాద్వా కిం మే త్వత్తో భవిష్యతి ॥" (అ 45)

కృష్ణా!నీవు క్షమింపుము మానుము. నీవుక్రుద్ధుడవైన నాకేమి? ప్రసన్నుడవైన నాకేమి? అనెను. అంతట కృష్ణభగవానుని సంకల్పమాత్రమున చక్రము హస్తము నలంకరింప కృష్ణభగవాను డిట్లనెను—

"శృణ్వన్తు మే మహీపాలా యేనైతత్ క్షమితం మయా ।
అపరాధశతం క్షామ్యం మాతు రస్యైవ యాచనే ॥
దత్తం మయా యాచితంచ తాని పూర్ణాని పార్థివాః ।
అధునా వధయిష్యామి పశ్యతాం వో మహీక్షితామ్ ॥
ఏవ ముక్త్వా యదుశ్రేష్ఠ శ్చేదిరాజస్య తత్ క్షణాత్ ।
వ్యపాహర చ్ఛిరః క్రుద్ధ శ్చక్రేణామిత్రకర్షణః ॥" (అ 45)

ఓమహీపతులారా! వినుడు. ఈశిశుపాలుని తల్లి ఈతని నూరపరాధములను క్షమింపవలసినదని నన్ను యాచించినది. అట్లే యని వరమిచ్చితిని. ఆసంఖ్య పూర్తియైనది. ఇప్పుడుమీరందరుచూచుచుండగా

నీతని వధించుచున్నాను. అని చెప్పి కృష్ణభగవానుడు శిశుపాలుని శిర స్సును చక్రముచే ఛేదించెను. అని యర్థము.

ఈగ్రంథసందర్భమునుబట్టి "నాతోఁ యుద్ధమునకురమ్ము. పాండవసహితముగా నిన్ను వధింతును" అనిశిశుపాలుఁడు కాలుదువ్వుటయు, 'నీయాగ్రహ మెంత. నీయనుగ్రహ మెంత' అని తిరస్కరించుటయు, జరిగిన తరువాత మహారాజమండలితో నిప్పు డీతని వధించుచున్నానని చెప్పి యమోఘచక్రప్రయోగమున శ్రీకృష్ణుడు శిశుపాలశిరశ్ఛేదము జేసినట్లు స్పష్టమగుచుండ "వాక్కలహములోనే తుపాలున శిశుపాలుని శిరశ్ఛేదము జేసెను" అనుచు శిశుపాలు డేమియు దెలియని స్థితిలో బరాకుగా నుండగాశ్రీకృష్ణుడువధించెనన్నట్లువ్రాయుటఎంతసాహసము! ఈసందర్భములోని యీవ్రాతనుగూడ చూడుడు—

పరాకుగా నుండిన శిశుపాలుని కృష్ణుడు వధించెనని యూహించిన సాళ్వవాక్యము చెప్పుచున్నది—

"అద్య తం పాపకర్మాణం క్షుద్రం విశ్వాసఘాతినమ్ ।
శిశుపాలవధామర్షా ద్గమయిష్యే యమక్షయమ్ ॥
మమ పాపస్వభావేన భ్రాతా యేన నిపాతితః ।
శిశుపాలో మహీపాల స్తం వధిష్యే మహీతలే ॥
భ్రాతా బాలశ్చ రాజాచ నచ సంగ్రామమూర్ధని ।
ప్రమత్తశ్చ హతో వీర స్తం హనిష్యే జనార్దనమ్ ॥ "

నాకు సోదరుడు, వీరుడు, బాలుడు యుద్ధభూమియందు లేక ప్రమాదము నొందిన శిశుపాలు నెవడు చంపెనో యాజనార్దనుని జంపెదను" (పు 170)

ఈసాళ్వవాక్యము పరాకుగా నున్నపుడు చంపబడెననుటకు ప్రమాణమట! 'నీ వెంత! రమ్ము యుద్ధమునకు' అని కాలుదువ్విన శిశు

పాలుని వాక్యము ప్రమాణము కాదన్నమాట! తనసోదరుడగు వీరుడు అట్లు పోవుటచే దమకుగల న్యూనత బాపుకొనుటకై ఆ సాళ్వుడు 'ప్రమత్తుడై యుండ నట్లు జరిగిన' దనినాడు. తనకంటె జిన్నవాడుగనుక బాలు డనినాడు. తమపు సైనికనుక శ్రీకృష్ణుని దుర్భాష లాడినాడు. కనుక పరాకుగా నుండెననుటకిది ప్రమాణమనుట చిత్రముగానున్నది.

ఈసాళ్వుడైనను 'బంధుత్వమునుబట్టి రాజసూయము జూడ వచ్చిన మాశిశుపాలుని యాగపశువుగా వధింపజేసినారని పాండవులను నిందింపకుండుటవలనను శ్రీకృష్ణునిగూడ నావిధముగా నిందింపకుండుట వలనను 'శిశుపాలుని యాగపశువుగా వధించిరి' అను విపరీతవాదము కూడ దూరాపాస్తమైనది.

ఇట్లీశిశుపాలవధము జరాసంధవధము వలెనే నిష్కపటముగాజెప్ప చేయబడుటచే "ఈశిశుపాలవధముకూడ జరాసంధవధము వలె గపటముగా జేయబడినదే" అను మ. భా. చ. కారుల వ్రాతత్రోసివేతమైనది.

ఇంతవరకు శిశుపాలవధమునుగూర్చి మహాభారతచరిత్రములో ప్రతివాదులు వ్రాసిన విషయము చర్చింపబడినది. ఈప్రతివాదులే 'రాజసూయరహస్యము' అను పేరుతో నొకపుస్తకము నభూతకల్పనలతో వ్రాసియున్నారు. దాని వైఖరికూడ లోకులకు తెలియబడుటకై కొన్ని ముఖ్యాంశముల నెత్తుకొని పరీక్షింతము. అది విద్యాధికులచే మెచ్చుకొనబడినదట! అది సత్యకథన మట!

### — "రాజు ఖండింపబడు యాగమె రాజసూయ" మను ప్రసంగము— తన్నిరాకరణము.

రాజసూయరహస్యమందలి వ్రాత యిట్లున్నది —"రాజసూయశబ్దమునకర్థ మేమనగా రాజుచే (పునరభిషేకము ద్వారా) సిద్ధింపజేయ బడునది. లేక లతాత్మకసోమరాజు (సోమలత)ఖండిం

పబడునది. అను వ్యుత్పత్తులను వైయాకరణులు చెప్పియున్నారు. సూ... రాజసూయ...(3-1-114)పాణినీయవృత్తిః -రాజ్ఞా సోత వ్యో ఽభిషవద్వారా నిష్పాదయితవ్యః. యద్వా, లతాత్మకసోమో రాజా స సూయతే ఖండ్యతే ...రాజసూయయాగమున సోమలతాఖండనమునుయాగాంతమున పునరభిషేకమునొంది రాజు యాగసమాప్తి నొందించుచుండుటయు గలుటయే గాక-పునరభిషేకమునకు బూర్వమున నగు "ఉదవసానీయము" అను నొక యిష్టియం దొక క్షత్రియుడు పశువుగా బంధింపబడు సూచన లుండుటచే "రాజు ఖండింపబడు యాగము" అని ధ్వనికూడ నగుచున్నది" (పు 18)

ప్రతివాదులిచ్చట రాజసూయశబ్దమున కర్థము జెప్పుచు కౌముదీగ్రంథమును ప్రమాణముగా జూపిరి. ఆకౌముదిలో "రాజ్ఞాసోతవ్యః అభిషవద్వారా నిష్పాదయితవ్యః" అనుగ్రంథమునుజూపి దాని కర్థము- రాజుచే బునరభిషేకముద్వారా సిద్ధింపజేయబడునది అని వ్రాసినారు. అభిషవశబ్దమునకు పునరభిషేక మని యర్థము లేదు.

"సుత్యాఽభిషవ సవనం చ నా" అని యమరము.
'త్రీణి సోమలతాకండనస్య' అని అమరసుధావ్యాఖ్య.

ఇట్లు సోమలతాకండన మర్థముగా గల అభిషవశబ్దమునకు పునరభిషేకమని యర్థము వ్రాయుట అపూర్వపాండిత్యము.

ఇక వీరు చూపిన కౌముదీగ్రంథము వీరు కనిపెట్టిన రహస్యార్థమున కనుకూలమో ప్రతికూలమో పరిశీలింతము—

కౌముదీకారుడే కౌముదికి మనోరమ యను వ్యాఖ్య వ్రాసెను. కనుక, ముందాగ్రంథముల ననుసంధింతము.

సూ— రాజసూయ... సప్త క్యబన్తా నిపాత్యన్తే రాజ్ఞా సోతవ్యోఽభి షవద్వారా నిష్పాదయితవ్యః. యద్వా లతాత్మక స్సోమో రాజా స సూయతే కండ్యతేఽత్రేత్యధికరణే క్యప్. (కౌముది)

మనోరమా— యద్వేతి. రాజానం క్రీణన్తీత్యాదౌ తథా దర్శనా దితి భావః. రూఢ్యర్థం నిపాతనం తేనాద్యపక్షేఽశ్వమేధాదౌ ద్వితీయే జ్యోతిష్టోమాదౌ చ నాతిప్రసంగః.

ఇచ్చట రాజసూయశబ్దమునకు రెండువిధముల వ్యుత్పత్తి చెప్పబడినది. రాజసూయశబ్దములోని రాజశబ్దము మొదటివ్యుత్పత్తిలో యాగకర్తయగు రాజునే చెప్పును. రెండవ వ్యుత్పత్తిలో నారాజశబ్దము సోమలతను చెప్పును. సోమలతకు రాజశబ్దమును వాడుట వేదములో 'రాజానం క్రీణన్తి' అనుచోట బ్రసిద్ధము. రాజసూయశబ్దము అవయవార్థమును మాత్రమే చెప్పినయెడల రాజుచే జేయబడునట్టియు, సోమలతాకండనము కలిగియున్నట్టియు అశ్వమేధము కాని, రెండవవ్యుత్పత్తినిబట్టి బ్రాహ్మణాదులచే జేయబడుచు సోమలతాకండనముకల జ్యోతిష్టోమముకాని రాజసూయ మనబడవలసివచ్చు నని యీదోషము వారించుటకై రూఢ్యర్థము నిపాతనము చేయబడినది. ఫలితార్థ మేమన సోమలతాకండనము, రాజసూయ మందున్నట్లు అశ్వమేధమందును, జ్యోతిష్టోమమందును గూడ గలదు. కనుక నవయవార్థమాత్రమున నవి కూడ రాజసూయశబ్దముచే జెప్పబడకుండుటకు రూఢ్యర్థము (సంజ్ఞారూపార్థము) గ్రహింపబడినది. అని తాత్పర్యము.

ఇప్పుడు నస్మితివాదులన్నట్లు రాజును (క్షత్రియుని) ఖండించునట్టిది రాజసూయ మైనప్పుడు అట్టిపని యశ్వమేధమందుగాని, జ్యోతిష్టోమమందుగాని యుండదు కనుక నవయవార్థమాత్రమున గతార్థ మగుచున్న రాజసూయశబ్దమునకు రూఢ్యర్థాశ్రయణము వ్యర్థమే అగు

చున్నది. కనుక ప్రతివాదుల రహస్యార్థము వ్యాకరణగ్రంథవిరుద్ధము. వీరి విచిత్రసమన్వయము లోకవిరుద్ధము.

— "రాజసూయయాగకర్త చేయవలసిన విధులనుబట్టి ధర్మజుని రాజసూయమందు శిశుపాలుడు విశసింపబడె" నను ప్రసంగము—

తన్నిరాకరణము—

మ. భా. చ. కారుల రాజసూయరహస్యములోని వ్రాత యిట్లున్నది— "రాజసూయయాగకర్త చేయవలసినవిధులు (1)సోమయాగమైన మఱునాడు 'పశువిశసనము' అది క్షత్రియపశువు. లేక బ్రాహ్మణపశువుబంధింప బడుటతో గూడిన 'ఉదవసానీయము' అను నొక యిష్టి జరుగును. ఐతరేయబ్రాహ్మణమునందలి శునశ్శేపుని యితిహాసము ఉదవసానీయేష్టికాలమున గలిగినదియే. ధర్మజుని రాజసూయమందును సోమయాగమైన మఱునాడే ఉదవసానీయేష్టికాలముననే శిశుపాలుడు విశ్లేషింపబడెనని స్పష్టమగుచున్నది. (పు 3)

(2) "శునశ్శేపునిగూర్చి చూతము. మహర్షులు రాజసూయము చేయించుచుండగా మనుష్యపశువును బంధింప ననువగు కర్మమే తెంచినది. శునశ్శేపుని పశువుగా బంధించు సమయ మాసన్నమైనది. విశసింపబడుపశువును 'ఉపాకృతము' అను సంస్కారము చేసినవెంటనే రెండుచేటలు వేయబడి రెండుబారలు పొడవుగల రెండు కుశనిర్మితములగు త్రాళ్ళతో కాళ్ళను తలను గట్టిగా బంధించిమూడుచేటలు గలిగి మూడు బారలు పొడవుగల త్రాటిచే మధ్యభాగమును యూపస్తంభమున కంటగట్టవలయును." (పు. 31)

(3) "అప్పుడతన్ని యుద్దె తెంచి బంధించుడగు శునశ్శేపునకు "ఉపాకృత, నియుక్త, అభ్రీణన, పర్యగ్నికరణములు" అనుకర్మములు జేసెను. పై కర్మములు వధ్యపశువునకు బ్రతియజ్ఞమునను జేతురు" (పు. 3)

(4) "విమ్మట శునశ్శేపుడు వధింపబడుటకు సిద్ధముగానుండి పరమేశ్వరుని, ఇంద్రాగ్నివరుణాది దేవతలను పలువిధములబ్రార్థించెను. కట్టకడకు 'ఉషస్సును' స్తోత్రము చేయుచుండగా పటాలుమని కట్లు తెగిపోగా శునశ్శేపుకు విశ్వామిత్రు నంకతలము జేరెను" (పు. 34.35)

(5) "విశసితపశువుచే జేయదగు కర్మకలాపము పూర్తికాకుండుటచే హరిశ్చంద్రుని రాజసూయము పూర్తికాలేదను సందియ ముద్భవించుచున్నది. కాని విశ్వామిత్రాదు లట్లో యాగపూర్తిని జేసి 'అంజస్సవము' అను నొక కర్మము చేయించి శునశ్శేపహరిశ్చంద్రు లన్యోన్యము స్పృశించునట్లు చేయుటచే యాగము పూర్తి యగుటయు, హరిశ్చంద్రునకు రోగవిముక్తి యగుటయు కలిగె నని 'ఐతరేయబ్రాహ్మణము' న చెప్పబడియున్నది." (పు. 36-37)

(6) "హరిశ్చంద్రశునశ్శేపుల గాథలు హోత చెప్పుచుండగా రాజసూయయాగకర్త వినవలయు నని యైతరేయబ్రాహ్మణమున గలదు." (పు. 38)

ప్రతివాదుల వ్రాతలోని యీ యాంశములనుగూర్చి ముందనుకొందము.— ఐతరేయబ్రాహ్మణమునందు హరిశ్చంద్రుని రాజసూయమునకు సంబంధించి చెప్పబడిన శునశ్శేపుని యితిహాసములో శునశ్శేపుడు యజ్ఞపశువుగా జేయబడుటనుబట్టి ధర్మజుని రాజసూయములో వధింపబడిన శిశుపాలుడు యజ్ఞపశువుగానె వధింపబడె నని మొదటి యంశములో నున్నది.

యజ్ఞపశువును కాళ్ళను, తలను, త్రాళ్ళతో గట్టిగా బంధించి యూపస్తంభమున కంటగట్టవలె ననియు, శునశ్శేపునకు అధ్వర్యుడు చేసిన ఉపాకృత నియుక్తాత్రేణాన పర్యగ్నికరణము లను కార్యములు ప్రతి

యజ్ఞమునను యజ్ఞపశువునను జేయబడునవియే యనియు రెండుమూడంశములలో నున్నది.

యూపస్తంభమునకు బంధింపబడిన శునశ్శేపుడు దేవతలను స్తుతించి వారియనుగ్రహముచే బంధవిముక్తుడై వధింపబడకయేయుండెననియు 'అంజస్సవము' అను కర్మతో యాగము పూర్తియై హరిశ్చంద్రునకు రోగవిముక్తి యయ్యెనని యైతరేయబ్రాహ్మణమున జెప్పబడియున్నదనియు, హరిశ్చంద్రశునశ్శేపుల గాథలు రాజసూయకర్త వినవలెనని యైతరేయబ్రాహ్మణమందున్నదనియు గ్రమముగా 4. 5. 6. అంశములలో నున్నది.

రాజసూయశబ్దమునకు రాజు ఖండింపబడు యాగమర్థమని ప్రతివాదుల వాదము. వారుదాహరించిన హరిశ్చంద్రునిరాజసూయము రాజు ఖండింపబడనిదియు బ్రాహ్మణుడగు శునశ్శేపుడు యజ్ఞపశువుగా గ్రహింపబడి యాతడుగూడ వధింపబడకయే పూర్తియై రోగవిముక్తి యను ప్రత్యక్షఫలమును గూడ నిచ్చినదియు నైయున్నది. కనుక వారు దృష్టాంతముగా జూపిన హరిశ్చంద్రరాజసూయమే వారు రాజసూయశబ్దమునకు జెప్పినయర్థ మసంబద్ధమని ధ్రువపరచుచున్నది.

మరియు, హరిశ్చంద్రశునశ్శేపుల గాథలు రాజసూయకర్త వినవలెనని విధింపబడినదని యారవయంశములో నుండుటవలన రాజుకాని బ్రాహ్మణుడుకాని వధింపబడకుండునదే రాజసూయానుష్ఠానము రాజసూయకర్తకు గలిగితీరును. కనుక నావిధమున గూడ రాజసూయశబ్దమునకు ప్రతివాదులుచెప్పిన దసంగతార్థమే. మరియు, యూపబద్ధుడై యుండి యాయా దేవతల నాయాఋక్కులతో నుపాసించి స్వయముగా దేవతానుగ్రహమున బంధవిముక్తుడై యున్న శునశ్శేపుని యీయాగపూర్తిని జేయింపుమని విశ్వామిత్రాదిఋత్విక్కులు కోరగా

నాతడా యాగము 'అంజస్సవముగా (సోమాభిషవము కలదానినిగా) దెలిసికొని యా ప్రయోగము జరిపించెనని యున్నది. ఐతరేయ బ్రాహ్మణము జూడుఁడు —

"త మృత్విజ ఊచు స్త్వమేవ నోఽస్యాహ్నస్సంస్థామధిగచ్ఛేత్యథ హైతం శునశ్శేపో ఽఞ్జస్సవం దదర్శ, త మేతాభి శ్చతసృభి రభి సుషావ"

భాష్యమ్ —

ఋగ్గనాన్ముక్తస్య శునశ్శేపస్యోత్తరకాలీనం వృత్తాన్తం దర్శ యతి, దేవతానుగ్రహాయుక్తం తం శునశ్శేపం విశ్వామిత్రాదయ స్సర్వఋత్విజస్సన మూచుః హే శునశ్శేప! త్వమేవ నోఽస్మాక మస్య అహ్నోఽభిషేచనీయాఖ్యస్య సంస్థాం సమాప్తి మధిగచ్ఛ ప్రాప్నుహి అనుష్ఠాపయేత్యర్థః. తై రేవ ముక్తేస త్యన స్తరం శునశ్శేప ఏత మభిషేచనీయాఖ్యం సోమయాగ మఞ్జస్సవం దదర్శ. అఞ్జసా ఋజుమార్గేణ సవ స్సోమాభిషవో యస్మిన్ యాగే సోఽఞ్జస్సవః తాదృశం ప్రయోగప్రకారం నిశ్చితవాన్. నిశ్చిత్య చ తం సోమం 'యచ్చిద్ధి' త్యాదిభి శ్చతసృభి ర్ఋగ్భి రభిషుతం కృతవాన్ ||

దీనిచే సోమాభిషవముతో బూర్తికావలసియున్న యాగము మనుష్యవిశసనముతో బూర్తియగునట్లు వ్రాయుటయు నసంగతమే.

"హరిశ్చంద్రుని రాజసూయము పూర్తికాలేదను సందియముద్భవించుచున్నది" అను 5వ యంశములోని మాట హాస్యాస్పదము.

"యాగము పూర్తి యగుట, హరిశ్చంద్రునకు రోగవిముక్తి యగుట కలిగెనని యైతరేయబ్రాహ్మణమున జెప్పబడి యున్నది."

అని యక్కడనే ప్రతివాదులు వ్రాసియున్నమాటకు విరుద్ధము— దీని నిటుంచి శిశుపాలునిగూర్చి వ్రాసినదానిని జూతము —

"పెదతల్లి కుమారుడు చేయు రాజసూయమును జూడవచ్చిన శిశుపాలుని భీష్మశ్రీకృష్ణుల ప్రోత్సాహముచే ధర్మజుడు పశువుగాజేయ నియ్యకొని యుండును" (పు 95)

ఇది వీరి యూహ! దీని కాధారము వీరిబుద్ధియేకాని వేఱొకగ్రంథమును లేదు. యజ్ఞపశువును ముందు సంగ్రహించి యజ్ఞమారంభింతురా? యజ్ఞము జూడవచ్చినవాని నెవ్వనినో యజ్ఞపశువుగాజేసి వధింతురా? అట్లైన నీసభకు నెవ్వనిపై బడునో యను భీతిచే నెవ్వడైన వచ్చునా? దీనితో వీరి లోకజ్ఞానము విదితమైనది.

ఇంకొకటి— "శిశుపాలుడు తన్నట్లు చేయుదురని తలంపక పరాకుగా నుండినపుడె తటాలున శ్రీకృష్ణుడు చక్రముచే శిశుపాలు గొట్టియున్నా డనుట స్పష్టమగుచున్నది" (పు 100)

ఈవ్రాత వెనుకటివ్రాత కత్యంతవిరుద్ధము— శిశుపాలుడు యాగపశువట! యాగపశువును త్రాళ్ళతో కాళ్ళను తలను గట్టిగా బంధించి యూపస్తంభమున కంటగట్టవలెనట! అప్పుడధ్వర్యుడు ఉపాకృత నియుక్తాదిసంస్కారముల జేయవలయునట! అవి వధ్యపశువునకు ప్రతియజ్ఞమున జేతురట! ప్రతివాదులన్నట్లు ఇన్నిసంస్కారములు జరిగి యూపస్తంభమున కంటగట్టబడినగాని శిశుపాలుడు యాగపశువు కానేరడు గదా! అట్లు జరిగియున్న యెడల శిశుపాలుడు తన్నట్లుచేయుదురని తలంపకుండుట, పరాకుగా నుండుట, అసంభవము. కనుక నిది విరుద్ధము. మరియు వెనుకటి ప్రస్తావములో జూపబడినట్లు—

"ఆహ్వయే త్వాం రణం గచ్ఛ మయా సార్ధం జనార్దన।
యావదద్య నిహన్మి త్వాం సహితం సర్వపాండవైః॥"

అనుచు పాండవసహితముగా నిన్ను వధింతును. రమ్ము నాతో యుద్ధమున కని శ్రీకృష్ణునిట్లు కాలుదువ్విన శిశుపాలుడు పరాకుగా నుండె ననుటయు, శ్రీకృష్ణుఁ డట్లు చేయునని యెరుగడనుటయు నత్యంత విరుద్ధము.

ఇంకొకటి మాతము— "శిశుపాలుని దేహమును వేగముగా సంస్కరింపుడని ధర్మజుడు దగ్గరనుండిన పుత్రుని నియోగింపక తన తమ్ములను నియోగించినట్లున్నది. శిశుపాలుని వేగముగా సంస్కరింపుడనుటలో 'ఇష్టిక్రియ' కాలక్షేపము లేకుండగ జేయుటకై యుండును" (పు 97) ఈవిషయమై ప్రమాణ మిట్లు చూపెరి—

"పాండవ స్త్వబ్రవీ ద్భ్రాతౄన్ సత్కారేణ మహీపతిమ్ ।
దమఘోషాత్మజం వీరం సంస్కారయత మా చిరమ్ ॥
తథాచ కృతవన్త స్తే భ్రాతు ర్వై శాసనం తదా ॥"

ఈశ్లోకమునకు పీఠివ్రాసినది విరుద్ధము— శ్లోకములో 'పాండవః దమఘోషాత్మజం సంస్కారయత ఇతి భ్రాతౄ నబ్రవీత్' అనియున్నది. 'సంస్కారయత' అనుపదమునకు సంస్కరింప జేయుడు. అని ప్రేరణార్థము. సంస్కరింపుడు అని ప్రతివాదులు వ్రాసిన యర్థము. ప్రతివాదుల యర్థములో 'సంస్కురుత' అని యుండవలెను. కనుక ధర్మజుడు తమ్ములనుసంస్కరించుటకుగాదు, సంస్కరింపజేయుటకునియోగించెను. ఇక సంస్కరించువారు ప్రతివాదు లన్నట్లు సన్నిధానవర్తియగు శిశుపాలపుత్రుడే. అత డామృతశరీరమునకు జేసినది దహనసంస్కారమే. దానిని జేయించుటకు నియోగింపబడినవారే యుధిష్ఠిరసోదరులు. ఇట్లుండ శబ్దజ్ఞానములేక యుధిష్ఠిరసోదరులు సంస్కరించినా రని వ్రాయుట సాహసము.

—: "ధర్మజుని ద్యూతము రాజసూయయాగాంగ" మను పలుకులు—విస్మరణీయము—

రాజసూయరహస్యములోని వ్రాత యిట్లున్నది—

"కాత్యాయనహిరణ్యకేశిసూత్రానుసారము పునరభిషేకానంతరము రాజు తన మిత్రులతో సుహృద్ద్యూతము నాడవలె నని యున్నది. ధర్మజుని పునరభిషేకానంతరమును నైదుగురు మిత్రులు గాంచియుండిన సభలోనె సుహృద్ద్యూతము నాడినట్లు కలదు. చూడుడు—

ద్యూతమునకు పిలువవచ్చినవిదురునితో ధర్మజుడు సుహృద్ద్యూతసభలో నే కితవు లున్నా రన విదురు డిట్లనియున్నాడు.

గాంధారరాజ శ్శకుని ర్విశాంపతే రాజాఽతిదేవీ కృతహస్తో మతాక్షః। వివింశతి శ్చిత్రసేన శ్చ రాజా సత్యవ్రతః పురుమిత్రో జయశ్చ.॥

(1) శకుని, (2) వివింశతి, (3) చిత్రసేనుడు, (4) పురుమిత్రుడు, (5) జయుడు అను వారు కలరు. అని చెప్పియున్నాడు. మఱియు యాగాంగద్యూతమున బంగరువస్తువుల నే యుపయోగింపవలె నని కలదు. ధర్మజుడు తొలుత రత్నములు పొదిగిన మణిహారము నే యొడ్డియున్నాడు. (పు 102)

ఇది యొక యసంబద్ధవాదము. పరిశీలకులు రాజసూయయాగ మధ్యమున జరుగునది పునరభిషేక మని వ్రాసియున్నారు. ఆపునరభిషేకానంతరమే యాగకర్త సుహృద్ద్యూతము జరుపవలెనట! అదియైదుగురితో నాడవలెనట! అట్లు జరిగినదే ధర్మజుని ద్యూతమట! ద్యూతసభలో నైదుగు రున్నారని యేధర్మజునితో విదురుడు చెప్పియుండెనట!

ఈ మాటలలోని వైరుధ్యముల జూడుడు— ప్రతివాదులుచూపిన శ్లోకములో చిత్రసేనపురుమిత్రులమధ్య నున్న సత్యవ్రతుని గణించినచో వారారుగురగుదురు. కనుకవిరుద్ధము. అని యుండవలెను యాగకర్త యైదుగురితో ద్యూతమాడవలెనన్నమాటకు అయిదుగురితో బ్రత్యేకముగా నాడవలెననియర్థమైనచో ధర్మజు డొక్క శకునితో దప్ప మరెవ్వనితో నాడనే లేదు. కనుకవిరుద్ధము. ఇక "నైదుగురు జూదగాండ్రుండిన సభలో నాడవలెను" అని యర్థమన్నచో నైదుగురితో జూద మాడవలెనని యున్నది. అను వెనుకటి వాక్యమునకు విరుద్ధము. ఆపై సుహృద్ద్యూత మాడవలెనని యాగకర్తకు జెప్పబడెననుచు ధర్మజునకు బ్రాప్తించిన దుష్టద్యూతమును, అదే యని ప్రదర్శించుట విరుద్ధము. ఆపై "యాగాంగద్యూతమున బంగరు వస్తువులనే యుపయోగింపవలెనని కలదు" అనుచు మనుష్యులతో బాటు సర్వస్వముపయోగింపబడిన ధర్మజద్యూతము యాగాంగద్యూతమే యనుట విరుద్ధము. కనుక నిది యసంబద్ధవాద మనవలసివచ్చినది.

ఇంకను జూడుడు— రాజసూయకర్త ధర్మరాజు. రాజసూయము జరిగిన స్థల మింద్రప్రస్థము. ప్రతివాదు లన్న ద్యూతమును సంకల్పించి ధృతరాష్ట్రుని వేధించి శకుని బలము చూచుకొని ధృతరాష్ట్రునిచే విదురునిద్వారా నిర్బంధముతో ధర్మజుని బిలిపించి ద్యూతమున బ్రవర్తింపజేసినవాడు దుర్యోధనుడు. ఆద్యూతము జరిగిన స్థలముహాస్తినాపురము. ఆ ద్యూతమునకు బిలువవచ్చిన విదురునితో ధర్మజుడు—

"ద్యూతే క్షత్తః కలహో విద్యతే నః కో వై ద్యూతం రోచతే బుధ్యమానః"

ద్యూతము కలహహేతువు. బుద్ధిమంతు డెవ్వడు ద్యూతమున కష్టపడును. అని పలికి ధృతరాష్ట్రుని యాజ్ఞ యట్లున్నదని చెప్పిన విదు

రునిమాటపై ద్యూతమువలన నిహలోకహాని, గుర్వాజ్ఞోల్లంఘనము వలన బరలోకహాని. కనుక నాముష్మికహితముగోరి వెళ్ళుట మంచి దని యెంచి——

“నాహం రాజ్ఞో ధృతరాష్ట్రస్య శాసనా న్న గన్తు మిచ్ఛామి కవే దురోదరమ్। ఇష్టో హి పుత్రస్య పితా సదైవ తదస్మి కర్తా విదురాత్థ మాం యథా।” (సభా. అ౫౮)

ధృతరాష్ట్రాజ్ఞ నుల్లంఘింపలేను. అన్నె వచ్చెద నని వచ్చిన వాడు ధర్మజుడు.

ఆ ద్యూతముజరిగినది—— అవభృథాంతము రాజసూయము పూర్తయై వచ్చినవారందరు స్వస్థానముల కేగిన తరువాత దుర్యోధను డాయాగవైభవము జూచి యసూయతో నందరికంటె వెనుక నింటికి వెళ్ళినతరువాత, శ్రీకృష్ణుడుకూడ వెళ్ళిపోయినతరువాత గొంతకాలము నకు. ఇట్టి ద్యూతమును యాగాంగద్యూత మనుట యసంబద్ధము.

యాగాంగద్యూతము యాగకాలములోనే జరుగవలెను. యాగస్థలమునందే జరుగవలెను. అది విహితమగుటవలన యాగకర్తయగు ధర్మజుడు స్వయముగా బ్రవర్తింపవలెను, యాగాంగద్యూత మెప్పుడు జరుగవలసినట్లున్నదో చూడుడు——

జైమినీయన్యాయమాలా ౩–౪–౨ పూర్వపక్షః—— “యదేత ద్దేవనాదికం మజ్ఞ మిత్యుక్తం; త దేత దభిషేచనీయస్యైకస్య సోమయాగస్యాఙ్గమ్.”

సిద్ధాన్తః—“రాజసూయశబ్దశ్చాఽనుమత్యాదికా యాగసఙ్ఘ ప్రేతి తిన్నాత్సర్వేషా మేత దఙ్గమ్. అనుష్ఠానన్తు రాజసూయమధ్యే క్వచిద పేక్షిత ముప వచనబలా దభిషేచనీయగతమాహేన్ద్రస్తోత్రానన్తరే తద నుష్ఠీయతే.”

అనగా రాజసూయయాగాంగద్యూతము రాజసూయములో, అభిషేచనీయమంత్రైన మహేంద్రస్తోత్రకాలమందుజరుపవలెనని తాత్పర్యము. ఇట్లుండ దుర్యోధనుని దుర్వృత్తితో జరిగిన హస్తినాపురద్యూతము, ధర్మజుని యింద్రప్రస్థరాజసూయాంగమే అను ప్రతివాదులమాట "పృష్ఠతాడనాద్దంతభంగః" అనుమాటవలె నున్నది. ఇదియే వీరి రాజసూయరహస్యము.

## —♦ లోకసారస్వతములకు ప్రతివాదులు చూపిన యపమార్గములు ♦—

ప్రతివాదులు ఆర్షగ్రంథముల నర్థముచేసికొనలేక, వానిమూలమున బొందవలసిన శ్రేయస్సును తాము పొందలేకపోవుటేకాక, అపార్థములు చెప్పి, యసత్యమును సత్యమని ప్రకటించి, ప్రామాణ్యుల నప్రామాణ్యులని వచించి, యమాయకప్రజలను మోసపుచ్చి, వారికిగూడ శ్రేయస్సంటకుండ జేయుట నింద్యము.

వీరి దెంత పాండిత్యమో! అనిలోకులు భ్రమపడుటకు "ఇదిగో ఐతరేయబ్రాహ్మణము; ఇదిగో కాత్యాయన సూత్రము; ఇదిగో వ్యాకరణసూత్రము: ఇదిగో భారతము" అనుచు నేగ్రంథము జూడని లోకులను నమ్మించి యక్రమముగా వ్రాసి శ్రేయోహాని గలిగించుట లోకద్రోహమే కాదు, సారస్వతద్రోహము కూడను.

ప్రతివాదులు తమకు తెలిసినంత పండితులకు దెలియదని ప్రకటించుటకై రాజసూయరహస్యములో నుపోద్ఘాతమందు వ్రాసినది చూడుడు—

"పిఠాపురసంస్థానపండితులై 'ఆమ్నాయార్థవాచస్పతి' బిరుదు నొందిన బ్ర. శ్రీ. వడలి లక్ష్మీనారాయణశాస్త్రిగారి నడిగి వారి వ్రాతలను ననుసరించి మూడుసారులు దర్శింప నేనంతకు బూర్వమే

చూచుకొని యున్న యంశములు తప్ప వేఱు స్థలములలో లేవ నియు గమకర్తకంటె దెలియవనియు జెప్పియున్నారు.

మాపట్టణమునను పండితులు బహుపురాణదర్శకులు నగు బ్రి. శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిని భారతవ్యతిరిక్తపురాణములలో నెచటనైన రాజసూయయాగము గూర్చి చదివియున్నారా? యని యడుగ నవి యెచటను గాన్పింపలే దనిరి." (పు.3)

దీనిని జూడగా తమపరిజ్ఞానప్రశంసకంటెను పండితనిగ్రహము కంటెను వేఱొకప్రయోజనము వ్రాతకు లేదని విజ్ఞులకు విదితమే.

తమకు తెలియనిది తెలియనట్లును, తాము చూడనిది చూడ నట్లును చెప్పెడివారు పండితులు. తమకు తెలియనిది తెలిసినట్లును, తాముచూడనిది చూచినట్లును ప్రకటించువారు ప్రతివాదులు. ప్రతివాదుల పాండిత్యపరిజ్ఞానముల వైఖరి బరీక్షించి ప్రదర్శించియే యున్నాము.

— ♦ రాజసూయరహస్యకారులధన్యత —

ప్రతివాదులు తమ ధన్యతనుగూర్చి యిట్లు వ్రాసియున్నారు—

"ఒక్కటిమాత్రము నాయందు వారు (శ్రీరామలింగారెడ్డిగారు) చూచినదానిలో యదార్థము కలదు. అది, నామనస్సునకు నిజమని తోచినదానిని దాచక వ్రాసితి ననుట.

ఇపుడు విద్యాధికులును విద్యాధిరాజులు నగు శ్రీరామలింగా రెడ్డిగారు నిర్భీతిగ దోచిన సత్యమునే వ్రాయువాడ నని యీపుస్తకపీఠికలో వ్రాయుటచేత, నేను ధన్యుడ నని తలచుచున్నాను"

(పు. 8.9)

ఇచ్చట 'తోచిన సత్యమునే వ్రాయువారు' అను విద్యార్థికుల మాటకు తోచిన సత్యమునే, అనగా సత్యమని తోచినదానినే వ్రాయుదురు. అసలు సత్యమును వ్రాయరు. అని యర్థము. ఈ సంగతినే నా మ న స్సు న కు ని జ మ ని తో చి న దా ని ని దా చ క వ్రా సితి ననుట యథార్థము' అను పూర్వవాక్యములోని తమమాటచే బ్రతివాదులే వివరించిరి. వారన్నట్లు మనస్సునకు నిజమని తోచినదే నిజమైనయెడల నెవ్వనిమనస్సునకు అట్లు దోచినదైనను నిజమే కావలసివచ్చును అప్పుడురాగద్వేషదూషితములై యవ్యవస్థితములై యుండు మనస్సులనుబట్టి నిజము, అనగా సత్యముకూడ నవ్యవస్థితమే అయిపోవును. అట్లవ్యస్థితమైనది సత్యమెట్లగును? కనుక యుక్తిప్రమాణప్రసిద్ధమైనదే సత్యము. అట్టి సత్యము ప్రతివాదుల వ్రాతలో లేదని నిరూపించియే యున్నాము. కనుక బ్రతివాదులు ధన్యుడ నని తలచుట సాహసము. తోచిన సత్యమునుగాక అసలు సత్యమునే వెల్లడించిప్రామాణికమార్గము నవలంబించి ధన్యతనపహింపగోరుచున్నాము.

— ♦ కుచేలవరదునిగూర్చి రాజసూయరహస్యకారుల ప్రార్థన ♦ —

"అటుకులనే యీయ నర్థి కర్థంబు
దటుకున నిచ్చిన దాత వీవనుచు
నర్థవాదం బొందు హావణీల్లె భువిని
సార్థకంబుగ జేయ సమకట్టి దాని
శ్రుతిధర్మ మెంతయు జెప్పెడు నట్టి
సత్యావాదంబును సలిపెడునట్టి
యీాకృతి గొని నాకు నీశ్వరా నీవు
కానక కని చేయు కలుషముల్ బాపి
జ్ఞాను లొందెడునట్టి సద్గతి నిమ్ము"

అటుకుల నీయ నర్థి కర్థమిచ్చె నను కథ, శ్రీమద్భాగవతములోని కుచేలోపాఖ్యాన మందున్నది. ఆభాగవతము వేదవ్యాసకృతము కాక

బోపదేవకృతమై వ్యాసుని పేరు పెట్టబడిన దని, ది. 14-10-46 గోల్కొండపత్రికలో రాజసూయరహస్యకారులే వ్రాసియున్నారు. కాని యీకుచేలోపాఖ్యానాంశమే వీరి కృతిప్రదానమునుపట్ల దృష్టాంతముగా గ్రహింపబడినది. ఆభాగవతము బోపదేవకృతము కాక మహర్షికృతమై నపుడే ప్రమాణ మగును. అది ప్రమాణమైనప్పుడే ఆకథ ప్రామాణిక మగును. ఆకథ ప్రామాణికమైనప్పుడే యీదృష్టాంతముతో జేసిన వీరి ప్రార్థన ఫలింప గలుగును. ఆకథ కపోలకల్పితమే యైనప్పుడు ఈప్రార్థనాఫలితముకూడ తత్తుల్యమే. ఇంకొకటి ఆయటుకుల నిచ్చినట్టి యర్థి కుచేలుడు. ఆయర్థి కర్థమిచ్చిన దాత శ్రీకృష్ణుడు. ఆశ్రీకృష్ణునే 'యీకృతి గొనుమీశ్వరా!' అని సంబోధించినారు. దీనినిబట్టి శ్రీకృష్ణు డీశ్వరావతారమే. యని వీరు నిశ్చయించుకొనినట్లు కనబడుచున్నది.

ఇక వ్రాతలలో శ్రీకృష్ణుయం దేరకముగా నిందారోపణము వీరు చేయుచు వచ్చినారో ప్రదర్శింపబడియే యున్నది. ముందింకను ప్రదర్శింపబడుచున్నది. ఇట్లు అవ్యవస్థితముగా వ్యవహరించుచున్న వీరి వ్రాతలనుబట్టి శ్రీకృష్ణు డాగ్రహించునా? అప్రసన్నునట్టి యనుగ్రహించునా? అనునది సందేహమే.

ఇంకొకటి. వీరికృతిలో దోషములు స్పష్టమగుచుండుటచే శ్రీకృష్ణునిచే బరిగ్రహింపబడిన యటుకులలోనున్న నిర్దుష్టత వీరికృతిలో నున్నపుడే పరిగ్రహించునా? లేకున్నను పరిగ్రహించునా? అనునదియు సందేహమే. ఇంకొకటి, 'శ్రుతిధర్మ మెంతయు జెప్పెడునట్టి సత్యవాహంబును సలిపెడునట్టి యీకృతి గొనుము' అని వీరు సమర్పించుటలో కుచేలవరదుడైన ఆయీశ్వరు డీకృతిలోని యసత్యమును, అధర్మమును తెలిసినవాడుకనుక గూడ బరిగ్రహించునా? లేదా? అనునది సందియమే.

అయినను 'కానక కనిచేయు కలుషముల్ బాపి, సద్గతి నిమ్ము' అనికోరుటచే బతితపావనుడు కనుక గలుషములను బాపునేమో. కాని యట్టివి మఱల జేయకున్నప్పుడే ప్రార్థనాసిద్ధియేమో. ఏది యెట్లున్నను శ్రీకృష్ణు నాశ్రయించినందులకు మీ రభినంద్యులే.

దేవా! "ఏకాత్మ్యం మాం గతం విద్ధి పాండవైర్ధర్మచారిభిః" అనుచు నేనే పాండవులు, పాండవులే నేను. అని నీచేప్రశంసింపబడిన పాండవులను నోటికివచ్చినట్లు వీరు నిందించినను, సాధ్వీమణియు, నీపరిపూర్ణానుగ్రహపాత్రమునైన ద్రౌపదీదేవిని కర్ణకఠోరముగా వీరునిందించినను, నిన్ను అధర్మాసత్యపరుడనని వీరు నిందించినను, తుదకు నీపాదములబట్టుకొనెను కనుక అన్నిటిని క్షమించి వీరి ప్రార్థన నెరవేర్పవలసినదని మేముకూడ శ్రీకృష్ణభగవానుని ప్రార్థించుచు విషయాంతర మందుకొనుచున్నాము.

— • "శ్రీకృష్ణుడు రోదనముచేసినట్లున్న" దను ప్రసంగము—
తన్నిరాకరణము.—

మ—భా—చ కారుల వ్రాత యిట్లున్నది— "శ్రీకృష్ణచరితము జూడగా నాతడు రెండుమాఱులు రోదనము జేసినటుల గాన్పించును. ఒకటి సాళ్వయుద్ధసమయమున, రెండు, సంశప్తకు లర్జునుని, దన్ను, రథమున గాలు చేతులు కదల్పకుండగా మీదపడినప్పుడు" అరణ్యపర్వ. 21 అ॥ ద్రోణపర్వ. 19 అ. (పు 171. 172)

ప్రతివాదులు రోదనము చేసినట్లున్నదనుటలో సూచించిన యధ్యాయమే కాని శ్లోకము కాదు. అట్టి శ్లోకము లేకుండుటచేత నేవారట్టి మోసము జేసినారు. వనపర్వములోని ఆయధ్యాయములో 'విహ్వలః' 'మోహ ఆవిశత్' అను పదములే కాని రోదనార్థకపదము లేదు. ద్రోణపర్వములో సూచించిన స్థలములో గూడ—

"తతః ప్రసిద్ధే కృష్ణః స్విన్న శ్చాప్తన మబ్రవీత్"

అని స్విన్నుడైనట్లు అనగా చెమట పట్టినట్లు చెప్పబడినది. ఇక్కడ 'ఖిన్నశ్చ' అనుపాఠములో నైనను 'ఖిద దైన్యే' 'రుదిర్ అశ్రువిమోచనే' అని యున్నందున ఖేదము వేరు. రోదనము వేరు. కనుక ప్రతివాదుల వ్రాత త్యాజ్యము.

శ్రీకృష్ణభగవానుడు రోదనము జేసినటుల ప్రతివాదులకు గాన్పించుట యమంగళకరము. ప్రసన్నుడై కాన్పించుట మంగళకరము. ఇక దీనిని విసర్జించి విషయాంతర మందుకొందము—

— "శమంతకమణివిషయమై కృష్ణబలరాముల ప్రవర్తనము పామరజనత్వమును సూచింపుచున్న" దను ప్రసంగము—
తన్నిరాకరణము.—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది—

"శతధన్వుడు సత్రాజిత్తుం జంపె శమంతకమణి నపహరించి యక్రూరునకు దాప నిచ్చి పలాయితుడయ్యెను. కృష్ణబలరాములు శతధన్వుని వెంటాడిరి. కృష్ణు డరణ్యములో బరువిడు శతధన్వుం జంపి పరిశీలింపగా మణి కాన్పింపలేదు. మణి కాన్పింపలేదని బలదేవునితో కృష్ణుడు చెప్పగా వెన్నతోడనె దొంగతనము నేర్చినవాడని కాబోలు బలదేవుడు నమ్మక నీవే యామణి నపహరించితి వని కోపగించి మిథిలాపురి కేగి మూడేండ్లచట గాపురముండె నని విష్ణుపురాణములో గలదు.

హరివంశములో నిట్లు కలదు.—

**కృష్ణుడు వెంబడించి చక్రముచే శతధన్వు మస్తకము ఖండించి—**

క. తలయును జీరయు నోరు మొ
దలుగా శోధించి చూచి తత్ప్రనువున న
వ్విలసితరత్నము గానక
హలధరుడును గూడ వచ్చె నంతటిలోన్.

వ. ఆతం డవ్విధం బాతనికిం జెప్పి శతధన్వు వధంబు విధంబయ్యె నను పలుకు బలికిన నది బొంకను తలంపునంగటకలంబడి బలుండు అతని శపథవాక్యంబులు విశ్వసింపక సాత్వనంబులు కైకొనక యిమ్మాయ సేసెఅనంగనియదియె. యనంగు మని పాసి యెక్కటుండును మిథిలాపురంబునకుం జని జనకరాజుచేత సత్కృతుండై తత్సదనంబున నుండె" ఇచట కృష్ణబలరాముల ప్రవర్తనము కేవల మానుషత్వము — మానుషత్వమె కాదు, పామరజనత్వమును సూచింపుచున్నది. భగవదవతారపురుషులైనను కేవలపామరజనుల వలె మెలగుట విచిత్రము. కృష్ణుడు ఒట్టులు సత్యములు పెట్టుకొనక రాయబారసమయమునను అర్జునుని మోహావిష్టసమయమునను జూపిన విశ్వరూపము నేల బలదేవునకు చూపలేదో! శమంతకమణి నక్రూరుడు చేకొని కృష్ణభయముచే గాశింజేరి కాపుర ముండెను" (పు 175)

ప్రతివాదు లుదాహరించిన విష్ణుపురాణహరివంశములలో గల విషయములో శతధన్వుడు మణి నక్రూరున కిచ్చి పలాయితు డయ్యెను. శతధన్వు జంపి చూడ మణి కాన్పింపలేదు. 'కృష్ణుడు కాన్పింపలేదని చెప్పగా బలదేవుడు నమ్మక నీవే యామణి నపహరించితివని కోపగించెను' అని యున్నది. ఇచ్చట మణి లేనందున లేదని చెప్పిన శ్రీకృష్ణుని మాట సత్యమే. ఆ మాట నమ్మకుండిన బలదేవుని విషయము విచారణీయము. అర్థాసక్తి యెట్టిభావముల నైన బుట్టించును. మొదట సత్రాజిత్తుకూడ మణికి సంబంధించిన అర్థాసక్తినిబట్టియే శ్రీకృష్ణుని

యందు నిందారోపణము జేసెను. అట్లే బలదేవుడుకూడ వ్యవహరించెను. అర్థ మెంత యనర్థహేతువో బోధించెడి గాథయే యది. అందు సత్యవాదియైన శ్రీకృష్ణుని ప్రవర్తనము పామరజనత్వసూచక మెట్లైనది? ఇక బలదేవుడైనను శ్రీకృష్ణుని మాట నమ్మక కోపగించి యచ్చటనుండియే మిథిల కేగినను తత్కాలమనోవైకల్యమునుబట్టి శ్రీకృష్ణుడిట్లుచేసె నని యెవ్వనితోగాని ప్రసంగించినట్లున్నదా? ఆ విషయమై యధరస్పందము చేసినట్లు లేదే. తనకు గలిగిన చిత్తవైకల్యమును అన్యులలో ప్రకటింపక సమాలోచనముచే సవరించుకొనినవాడు ప్రశంసనీయు డగునా? పామరజను డగునా? పామరజనులకే కృష్ణబలరాములు పామరజనులుగా దోచెదరు.

పూర్వము నిరూపింపబడినట్లు సత్యమైన శ్రీకృష్ణచరిత్రములో "ద్రౌపదికి వస్త్రము లిచ్చుట అసత్యము. దుర్వాసునికి సంతృప్తి గలిగించుట అసత్యము" అనుచు ప్రకటించినవారు ప్రతివాదులు.

'భగవదవతారపురుషు లైనను కేవలపామరజనుల వలె మెలంగుట విచిత్రమట!' అది యవతారపురుషుల నటనాకౌశలము. తాను ధరించిన వేషమునకు సహజమైనట్లు నటించుటే కౌశలము. ఈ విషయము గ్రంథాదియందు వివరింపబడినది.

'కృష్ణుడు ఒట్టులు, సత్యములు, పెట్టుకొనక విశ్వరూపము నేల బలదేవునకు జూపలేదో' అనినారు.— బలదేవుని భ్రాంతి తొలగుటకు కట యవసరము లేదని భావించియుండును.

'వెన్నతోడనె దొంగతనము నేర్చినవాడ' ని శ్రీకృష్ణభగవానుని యెత్తిపొడిచినారు. భగవంతుడు నేర్వని విషయము లేమున్నవి?

"తస్కరాణాం పతయే నమో నమః" అను మంత్రమెరుగరు

కాబోలు! శ్రీకృష్ణభగవానుని దొంగతనములోని శక్తిని ప్రతివాదులకు బోధించి విడిచివేయుదము.

"చోరస్య చౌర్యం జగతి ప్రసిద్ధం, చౌర్యస్య చౌర్యం న తు దృష్టపూర్వమ్ । చౌర్యాద్యకార్యాణి బత శ్రుతాని, కృష్ణస్య ముష్ణన్తి తమాం తమాంసి"

లోకములో దొంగ దొంగిలించుట కలదుకాని దొంగతనము దొంగిలించు టెచ్చటను లేదు. శ్రీకృష్ణుని దొంగతనము మొదలగున కార్యములు శ్రవణరంధ్రముల ద్వార అంతర్గతము లయి శ్రోతల యజ్ఞానములను దొంగిలించుచున్నవి. ఆశ్చర్యము, అని భావము. కనుక ప్రతివాదుల ప్రసంగము హేయము. ఇకవిషయాంతరమందుకొందము.

— "కృష్ణుని మాయచేతనె పాండవులు జయింప బ్రయత్నించిరి."
అనుప్రసంగము— తన్నిరాకరణము—

మ.భా.చ. కారుల వ్రాత యిట్లున్నది —"కృష్ణుని మాయచేతనె విస్తారమగు కురుబలము జయింప బాండవులు ప్రయత్నించుచున్నా రని సంజయుడు ధృతరాష్ట్రునితో జెప్పియున్నాడు. ఉద్యోగ. స. 69."

ఇచ్చటకూడ నట్టిశ్లోకము లేనందున నధ్యాయమును చూపి మోసము చేసినారు. ఈయధ్యాయమున బదునైదుశ్లోకములున్నవి. అందు మాయాశబ్దము కలవి రెండు శ్లోకములున్నవి. వానిని జూడుడు—

"వ్యామాన్తరం సమాస్థాయ యథా ముక్తం మనస్వినః।
చక్రం తద్వాసుదేవస్య మాయయా వర్తతే విభో॥"

సీ. వ్యామాన్తరం ప్రసారితయో ర్హస్తయో ర్వ్యావాన్ విస్తారః

పంచహస్తమితః తావత్ అన్తరం మధ్యప్రమాణం యస్య తద్వ్యా మాన్తరం యథా ముక్తం యథారూపం యావత్ప్రమాణం చిన్తితం తావత్ప్రమాణా భూత్వా యత్ ముక్తం భవతి మాయయా దుర్గ త్యరూపేణేత్యర్థః" బాణమునకుఁ బ్రమాణముఁకలశ్రీకృష్ణచక్రము ఎంతపరిమాణము కలది కావలెనని భావించి విడువబడునో అంతపరిమాణము కలదై దుర్గత్యరూపముతో నుండును. అనియే సంజయుఁడుచెప్పినమాట. ఇందు ప్రతివాదులు వ్రాసినట్లు లేదు.

"ఈశన్నపి మహాయోగీ సర్వస్య జగతో హరిః ।
కర్మాణ్యారభతే కర్తుం కీనాశ ఇవ దుర్బలః ॥
తేన వంచయతే లోకాన్ మాయాయోగేన కేశవః ।
యే తమేవ ప్రపద్యన్తే న తే ముహ్యన్తి మానవాః ॥"

ఇది రెండవ స్థలము. మహాయోగియు జగదీశ్వరుఁడు నయియుండియు దుర్బలుఁడగు కర్షకునివలె బనులు చేయుచుండును. మానవులాతని యోగమాయచే మోహితులై యుండి యాశ్రీకృష్ణునితత్త్వము నెరుగలేకున్నారు. ఆశ్రీకృష్ణుని భజించువారు మోహితులు కారు. అని దీనియర్థము. ఇదికూడ ప్రతివాదులు వ్రాసిన వైఖరిగా లేదు. ఇంకొకవిశేషము సంజయోక్తులలో గలదు. సంజయుఁడు శ్రీకృష్ణమహత్త్వము నుపదేశింపగా విని ధృతరాష్ట్రుఁడు "కథం త్వం మాధవం వేత్థ సర్వలోకమహేశ్వరమ్" అని కృష్ణుని సర్వేశ్వరునిగా నీవెట్లు తెలిసికొనినావు. నాకు తెలియలేదేమి? అనియడుగగా సంజయుఁడిట్లుచెప్పెను—

"శృణు రాజన్న తే విద్యా మమ విద్యా న హీయతే ।
విద్యాహీనస్తమోధ్వస్తో నాభిజానాతి కేశవమ్ ॥
శుద్ధభావం గతో భక్త్యా శాస్త్రాద్వేద్మి జనార్దనమ్ ।"

నావలె విద్య నీకు లేదు. విద్యాహీనుడు, తామసుడు కృష్ణభగవానుని తెలిసికొనలేడు. శాస్త్రాధారమున, భక్తినిబట్టి భావశుద్ధిని పొందినవాడనై కృష్ణపరమాత్మను నేను తెలిసికొనగలిగితిని. అని ధృతరాష్ట్రునికి చెప్పబడిన యీసంజయవచనములే ప్రతివాదులు గమనింపదగినవి. ధృతరాష్ట్రుడంతటివాడు తెలిసికొనలేకపోయినపుడు ప్రతివాదులు శ్రీకృష్ణమహత్త్వమును తెలిసికొన గలుగుదురా? మొత్తము మీద శాస్త్రజ్ఞానము, భక్తి, భావశుద్ధి లేనివారికి శ్రీకృష్ణమహత్త్వము తెలియదనియే సంజయుడు చెప్పినమాట. కనుకప్రతివాదుల వ్రాత పరాస్తము. విషయాంతరమందుకొందము —

— *"కృష్ణార్జునులు త్రాగి మత్తులై యుండిరి" అను ప్రసంగము.
తన్నిరాకరణము. —

మ.భా. వ.క.పు. ... వ్రాయుచున్నది — "మద్యపానము — ఋగ్వేదకాలమునుండి నేటివఱకు నేకోత్తరాభివృద్ధిగ బ్రబలుచున్నది. మహాభారతకాలమున మద్యపానము మితిమీఱి యున్నదని చెప్ప సాహసించుచున్నాను. రాజసూయయాగమునకు ధర్మరాజు గృహమునకు వచ్చినవారిలో త్రాగనివాఁడొకఁడును లేడట, ధర్మరాజుని యశ్వమేధయాగమునందును, సురా మైరేయ (కల్లుసారాలు)ప్రవాహము ప్రేమగా కలిగినదట.

... బలరామునివంటి యుత్తమపురుషుడు తెగద్రాగుచుండెను గనుక నతనికి హాలిప్రియ యను పేరు కలిగినది. నామలింగానుశాసనము.
సంజయుడు సంధికేగినపుడు కృష్ణార్జునులు త్రాగి మత్తులై యుండిరి. ఉద్యో. 59అ.
... కృష్ణార్జునులంతటి సత్పురుషులు మద్యపానము చేయుచుండగా?
[illegible]

గుఱించి కుమారిలభట్టుడు 'తంత్రవార్తికమున' నిటుల సమాధానము జెప్పుకొని యున్నాడు— అన్నవికారసురామాత్రమె (రమ్ సారామాత్రమే) త్రైవర్ణికులకు నిషేధము. అందువలన బ్రాహ్మ క్షత్రియవైశ్యులు కల్లు త్రాగరాదు. ద్రాక్ష చెరకు సారాయిలు మాత్రము క్షత్రియవైశ్యులకు ప్రతిషేధము లేదు. అవి బ్రాహ్మణులకు ప్రతిషేధము. కుమారిలు నిట్టి సమాధానము చెప్పుకొనుటకంటె నాటికాలమున సూరాపానము నిసిద్ధము కాదని చెప్పిన యెడల యుక్తముగా నుండును" (పు 97)

ప్రతివాదు లీవ్రాతచే శాస్త్రనిషిద్ధమైన మద్యపానమును ఆ నాటి క్షత్రియవర్గము, బలరాముడు, కృష్ణార్జునులు, యథేష్టముగా జేసియున్నారని చెప్పుచున్నారు. ఈ విషయమై కొంచెము తెలుపవలసియున్నది. సుర యనబడునదొకటి, మద్యమనబడునదొకటి. అన్నవికారమైనదిసుర, అదియేకవిధమే. పనస ఖర్జూర తాళనారికేళ ద్రాక్షాది జన్యమైమదకరమైనది మద్యము. అది బహువిధము.

అన్నవికారమైన సురకు, పిష్టము (పిండి)చే నిర్మితమగుటనుబట్టి పైష్టి యని పేరు. ఆపైష్టియే సురాశబ్దమునకు ముఖ్యార్థము. ఇక గుడము (బెల్లము) చే నిర్మితమైన గౌడి, విప్పపూవులు మొదలగు వానిచే నిర్మితమైన మాధ్వి, యనబడునవి సురాశబ్దమునకు గౌణార్థములు కాని ముఖ్యార్థములు కావు. కనుక సురయనబడునది ముఖ్యముగా పైష్టియే. కనుకనే మద్యపానప్రాయశ్చిత్తము వేఱుగను సురాపాన ప్రాయశ్చిత్తము వేఱుగను చెప్పబడినది.

బ్రాహ్మణునకు సురాపానముకాని మద్యపానముకాని కూడదని నిషేధింపబడినది. క్షత్రియవైశ్యులకు సురాపానము నిషిద్ధమే

యనియు, మద్యపానము నిషిద్ధము కాదనియు జెప్పబడినది. ఈవిష యములను బోధించుచున్న యీవచనములను చూడుడు—

పరాశరమాధవీయమ్ —మద్యపాన ప్రాయశ్చిత్తమ్—

"మద్యపశ్చ ద్విజః కుర్యా న్నదీం గత్వా సముద్రగామ్ ।
చాంద్రాయణే తత శ్చీర్ణే కుర్యా ద్బ్రాహ్మణభోజనమ్ ॥
అనడుత్సహితాం గాంచ దద్యా ద్విప్రేషు దక్షిణామ్ ।

మాధవీయన్— పనసాదిజన్యం మదకారణం ద్రవ్యం మద్యం తదాహ

పులస్త్యః —

"పానసం ద్రాక్షమాధూకం ఖార్జూరం తాళ మైక్షవమ్ ।
మధూత్థం సైరమారిష్ట మైరేయం నారికేళజమ్ ॥
సమానాని విజానీయా న్మద్యా న్యేకాదశైవతు"

...తదేతన్మద్యపానప్రాయశ్చిత్తం బ్రాహ్మణస్యైవ నతు క్షత్రియ వైశ్యయోః. మద్యపానస్య బ్రాహ్మణం ప్రత్యేవ నిషేధాత్—

"యక్షరక్షఃపిశాచానాం మద్యం మాంసం సురాసవమ్ ।
తద్బ్రాహ్మణేన నాత్తవ్యం దేవానా మశ్నతా హవిః" ఇతి.

బృహద్విష్ణుః—

మాధూక మైక్షవం సైరం తాళం ఖార్జూరపానసమ్ ।
మధూత్థంచైవ మాధ్వీకం మైరేయం నారికేళజమ్ ॥
అమేధ్యాని దశైతాని మద్యాని బ్రాహ్మణస్య తు ।"

ఇతి. రాజన్యవైశ్యయోస్తు మద్యపాన మనుజానాతిబృహద్యాజ్ఞవల్క్యః—
"కామా ద్యది చ రాజన్యో వైశ్యో వాపి కథంచన ।
మద్యమేవ సురాం పీత్వా న దోషం ప్రతిపద్యతే ॥" ఇతి.

వ్యాసోపి —

"ఉభౌ మధ్వాసవక్షీబౌ ఉభౌ చందనచర్చితౌ ।
ఏకపర్యంకశయితౌ దృష్టౌ మే కేశవార్జునౌ ॥" ఇతి.

ఇచ్చట, మద్య మనఁగనిషమనియు, బ్రాహ్మణునిగూర్చియే మద్యపానము శాస్త్రకారులచే నిషేధింపఁబడిన దనియు, క్షత్రియవైశ్యులకు నిషేధము లేనందున చేసినను దోషము లేదనియు, బృహద్విష్ణు, బృహద్యాజ్ఞ్యవల్క్య, వేదవ్యాసవచనములట్లు చెప్పుచున్నవనియు ప్రతిపాదింపఁబడినది..

ఇక్కడ వేదవ్యాసవచనముగా నుంపఁబడిన శ్లోకమే "సంజయుఁడు సంధి కేగినపుడు కృష్ణార్జునులు తాగి మత్తులై యుండిరి" (ఉద్యో అ58) అను ప్రతివాదులచే చేర్కొనఁబడినది.

ఆశ్లోకము సంజయుఁడు సంధి కేగినపుడు అంతఃపురములో కృష్ణార్జునులుండఁగా విడిగా వారియొద్దకు తానువెళ్లి వారిని జూచి మాటలాడుటలో దనకు వారు చెప్పిన విషయములను ధృతరాష్ట్రున కుపదేశించుప్రస్తావములోనిది. ప్రతివాదు లన్నట్లు వారప్పుడు తాగి మత్తులై యున్నయెడల వారియొద్దకు సంజయునకు ప్రవేశముగాని సంజయునితో వారి ప్రసంగముకాని యసంభవము.

కనుక 'క్షీబృ మదే' 'మద హర్షగ్లేపనయోః' అను ధాత్వర్థములను బట్టి యాశ్లోకములోని 'మధ్వాసవక్షీబౌ' అనుపదమునకు మధ్వాసవమును పరిగ్రహించి హెచ్చరికగా నున్నారనియే భావము.

మొత్తముమీఁద శాస్త్రములో మద్యపానని షేధము క్షత్రియులకు లేకున్నను కనే "తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్య

వ్యవస్థితౌ" అని యుపదేశించిన శ్రీకృష్ణుడును, ఉపదేశింపబడిన అర్జునుడును యథోచితమగుపరిగ్రహమును చేసినట్లు వ్యాసమహర్షి చెప్పెనని సారాంశము.

పరాశరమాధవీయము. సురాపానప్రాయశ్చిత్తమ్—

"సురాపానం సకృత్కృత్వా అగ్నివర్ణాం సురాం పిబేత్ ।
స పాతయేత్ తథాత్మాన మిహలోకే పరత్రచ ॥"

మాధవీయమ్— మద్యపానస్య ప్రాయశ్చిత్త ముక్త్వా సురాపానస్య ప్రాయశ్చిత్త మాహ— సురాపాన మితి. పిష్టాదిజన్యో ద్రవవిశేషః సురా. తథాచ మనుః— గౌడీ పైష్టీచ మాధ్వీచ విజ్ఞేయా త్రివిధా సురా.

యథైవైకా న పాతవ్యా తథా సర్వా ద్విజోత్తమైః ఇతి. తత్ర పైష్ట్యాం సురాశబ్దో ముఖ్యః. గౌడీమాధ్వ్యౌ గౌణౌ. పులస్త్యేనైకాదశసు గౌడీమాధ్వ్యౌ అనుక్రమ్య "సురాయా స్సకృత్పానే గౌడీమాధ్వ్యో రసకృత్పానే అగ్నిసమానవర్ణోత్పత్తిపర్యన్తసంతప్తా మత్యుష్ణాం సురాం పీత్వా బ్రాహ్మణో మ్రియేత" ఇత్యుక్తత్వాత్.

ఇచ్చట. మద్యపానప్రాయశ్చిత్తమునకు భిన్నముగా సురాపానప్రాయశ్చిత్తము చెప్పబడినదనియు, సుర యనగా పైష్టియే యనియు, మనుస్మృతిలో పైష్టి, గౌడి, మాధ్వి, అని త్రివిధము సుర, యని చెప్పబడినను ముఖ్యార్థము పైష్టియు గౌణార్థము గౌడీ మాధ్వులనియు, కనుకనే పులస్త్యవచనములో గౌడీమాధ్వులు ఏకాదశవిధమద్యములలో బరిగణింపబడి సకృత్సురాపానము అసకృద్గౌడీమాధ్వీపానము జేసిన బ్రాహ్మణునకు సమానప్రాయశ్చిత్తము చెప్పబడిన దనియు ప్రతిపాదింపబడినది.

మనుస్మృతి— అ11.—

"సురాం పీత్వా ద్విజో మోహా దగ్నివర్ణాం సురాం పిబేత్ ॥"

వ్యాఖ్యా— సురాశబ్దః పైష్టీమాత్రే ముఖ్యో నతు గౌడీమాధ్వ్యోః గౌడ్యాదిమదిరాసు గుణవృత్త్యాఽపి సురాశబ్దప్రయోగోపపత్తేః.

అతఏవ భవిష్యపురాణే —

"సురా చ పైష్టీ ముఖ్యోక్తా న తస్యా స్త్వితరే సమే ।
పైష్ట్యాః పానేన చైతేషాం ప్రాయశ్చిత్తం నిబోధత ॥"

యమేనోక్తం— "మహాబాహో ఇమాః సర్వా మదిరా మధు యోగతః" ఇతి ఇచ్చట గూడ మాధవీయములోవలెనే చెప్పబడియున్నది. విజ్ఞానేశ్వరీయములోగూడ విశేషముగా చర్చించి పూర్వోక్తప్రకారమే సిద్ధాంతము చేసి క్షత్రియవైశ్యులకు మద్యపానము నిషిద్ధము కాదనియే ప్రతిపాదింపబడినది.

తంత్రవార్తికనే —

"యత్తు వాసుదేవార్జునయో ర్మద్యపానం స్మృతివిరుద్ధ ముప న్యస్తం. తత్రాన్నసురామాత్రస్యైవ త్రైవర్ణికానాం ప్రతిషేధః. "సురా వై మల మన్నానాం పాప్మా చ మల ముచ్యతే । తస్మా ద్బ్రాహ్మణరాజన్యౌ వైశ్యశ్చ న సురాం పిబేత్" ఇతి. మధ్వసీధ్వోస్తు (సీధుర్గౌడీ) క్షత్రియవైశ్యయో ర్నైవ ప్రతిషేధః కేవల బ్రాహ్మణవిషయత్వాత్"

ఇది కుమారిలభట్టవిరచితపూర్వమీమాంసాగ్రంథము. ఇచ్చట గూడ కృష్ణార్జునులు చేసినట్లు చెప్పబడిన మద్యపానము స్మృతివిరుద్ధము కాదనియు పైష్టి యనబడు అన్నవికారమైన సురయే బ్రాహ్మ

ణులకువలె క్షత్రియవైశ్యులకుగూడ నిషిద్ధముకాని గౌడి, మాధ్వి, అన బడు మద్యములు మాత్రము క్షత్రియవైశ్యులకు నిషిద్ధములు కావ నియు పూర్వోక్తగ్రంథములలో జెప్పబడినట్లే చెప్పబడినది.

ప్రతివాదు లీతంత్రవార్తికము నుదాహరించి "కుమారిలు డిట్టి సమాధానము చెప్పవలసినటకులైనాటి కాలమున సురాపానము నిషి ద్ధము కాదని చెప్పినయెడల యుక్తముగా నుండును"

అని శాస్త్రమునే విడ్డనలె నన్నారు. వీరు తలను బట్టి టోపీని కత్తిరించుటకాదు. టోపీని బట్టి తలనే కత్తిరింపవలెననుచున్నవారు. వీరచ్చటచ్చట తాముప్రమాణముగా దీసికొనినపుడు కుమారిలభట్టుని గూర్చి యెట్లువ్రాసిరో చూడుడు —

"కుమారస్వామియొక్క యవతారమని శంకరవిజయాదులలో బొగడబడిన కుమారిలభట్టపాదుడు" (పు91)

"కుమారిలభట్టాచార్యుడు చేసిన యర్థము గ్రాహ్యమో కృష్ణ మూర్తిశాస్త్రిగారి యర్థము గ్రాహ్యమో చదువరులే యోచించు కొందురుగాక" (పుం91)

"శ్రుతి స్మృతి పురాణేతిహాసోక్తధర్మములను సమర్థించువారిలో పూర్వమీమాంసాశాస్త్రజ్ఞులు ముఖ్యులు. అందు కుమారిలభట్టా చార్యునకు ముఖ్యతమునను" (పు225)

ఇట్లు ప్రశంసించిన నోటితో నిచ్చట తృణీకరించుట చూడ వీరి కెవ్వరియందును ప్రమాణబుద్ధి లేదనుట స్పష్టము.

"నాటికాలమున సురాపానము నిషిద్ధము కాదు" అని వ్రాసిన ప్రతివాదుల నడుగవలసియున్నది. వీరా యీ సురాపాన ప్రసంగము

పైష్టిరసము గూర్చియా? ఇతరమును గూర్చియా? పైష్టిని గూర్చియే
యైన యెడల నది యెప్పుడును త్రైవర్ణికులకు శాస్త్రనిషిద్ధమే. కనుక
'నాటికాలమున నిషిద్ధము కాదనుట విరుద్ధము. ఇక మిగిలినసురా
పానప్రసంగము సమస్తమును గూర్చి యైన యెడల నది క్షత్రియాదుల
కెప్పుడును నిషిద్ధము కాదు కనుక 'నాటికాలమున నిషిద్ధము కాదు'
అనుట విరుద్ధమే.

మఱియు సుర, మద్యము అను విభాగముతో నేను నాడు అని
లేక, సుర త్రైవర్ణికులకు నిషిద్ధమే యనియు, మద్యము క్షత్రియాదు
లకు నిషిద్ధమే కాదనియు శాస్త్రముద్ఘోషించుచుండ సురావిశేష వర్ణ
విశేషముల నెత్తుకొనకుండ శాస్త్రోక్తము కాని కాలవిశేషమును తెచ్చి
పెట్టి 'నాడు నిషిద్ధము కాదు' అనుట అసంగతప్రసంగము. ఇట్టి యసం
గతవాక్యమును చూచి 'కుమారిలు డిట్లు చెప్పిన యెడల యుక్తముగా
నుండును' అనుటలో ప్రతివాదుల వివేచనపాటవము నుత్కృష్టము.

చరకసంహితలో మద్యమును గూర్చి గుణదోషములను చర్చించి
యిట్లుపదేశించెను— చికిత్సాస్థానము— (అ 24)

"యత్రైకః స్మృతివిభ్రంశ స్తత్ర సర్వ మసాధువత్ ।
ఇత్యేవం మద్యదోషజ్ఞా మద్యం గర్హన్తి యన్నతః ॥
సత్య మేతే మహాదోషా మద్యస్యోక్తా న సంశయః ।
అహితస్యాతిమాత్రస్య పీతస్య విధివర్జితమ్ ॥
కిన్తు మద్యం స్వభావేన యథైవాన్నం తథా స్మృతమ్ ।
అయుక్తియుక్తం రోగాయ యుక్తియుక్తం యథా ఒమృతమ్ ॥
ప్రాణాః ప్రాణభృతా మన్నం తదయుక్త్యా నిహన్త్యసూన్ ।
విషం ప్రాణహరం తచ్చ యుక్తియుక్తం రసాయనమ్ ॥"

స్మృతిలేకుండజేసెడి మద్యమునందు దోషము లున్నవనుట సత్యమే. ఆ దోషములు మద్యమును వినియోగింపవలసిన విధానము విడిచి హితాహితము లెరుగక అధికముగా స్వీకరించినపుడే కలుగును.

అన్నమువలె హితముగను, మితముగను వాడబడిన మద్యము అమృత మగును. లేకున్న రోగహేతు వగును.

ప్రాణాధారమైన యన్నమే అయుక్తముగా గ్రహింపబడిన యెడల ప్రాణములను హరించును. ప్రాణహరమైన విషము యుక్తి యుక్తముగా వాడబడినచో రసాయన మగును.

ఇట్లు పరిశీలింపగా క్షత్రియవర్గము, బలరాముడు, కృష్ణార్జునులు పరిగ్రహించినట్లు గ్రంథములో జెప్పబడినది యుక్తమై, వారికి నిషిద్ధము కానట్టి మధువిశేషము కనుక ప్రతివాదులవ్రాత పరాస్తమైనది. విషయాంతర మందుకొందము.

— "శ్రీకృష్ణుడు సంధి పొసగనీయకుండ జేసె" నను ప్రసంగము— తన్నిరాకరణము —

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది—

"కృష్ణుడు, పాండవులు తమ యభిప్రాయముల దెలుపు సమయమున – అందు భీము బురికొల్పుటలోను, ద్రౌపది నోదార్చుట లోను గూడ సంధి పొసగనీయకుండ జేయు తలంపు కలుగు రీతినె సంభాషించి యీప్రకారమె చేసెను" (పు 178)

వీరివ్రాతచే సంధి జరుగుట శ్రీకృష్ణున కిష్టము లేదన్ని తెలుపు చున్నారు. ఇచ్చట కొంత పూర్వవృత్తాంతము ముఖ్యముగా నన్ను సంధింపవలసి యున్నది—

యుధిష్ఠిరుడు దిగ్విజయపూర్వకముగా రాజసూయము జేసి యఖండైశ్వర్యవంతుడై యుండ దుర్యోధను డసహనము వహించి యాయైశ్వర్య మపహరింప దలపెట్టి శకుని చెప్పిన యుపాయ మాశ్రయించి తండ్రియగు ధృతరాష్ట్రుని యొప్పించి తండ్రిచే బాండవులను ద్యూతమున కాహ్వానింపజేసి ధర్మజుని ద్యూతమునకు దింపి తనపక్షమున శకుని యాడునటు లేర్పరుపగా ద్యూత మాడుచున్న శకుని పున ర్ద్యూతములో నిట్లు చెప్పెను—

యుధిష్ఠిరా! ఈ పందె మెట్టిదో వినుము. ఇందు మే మోడిన యెడల పండ్రెండేండ్లు వనవాసము చేసి పదమూడవయేడు జనపదములో నజ్ఞాతవాసము చేయుదుము. ఆయజ్ఞాతవాసకాలములో దెలియబడితిమేని మఱల పండ్రెండేండ్లు వనవాసము, ఆపై సంవత్సర మజ్ఞాతవాసము చేయుదుము. ఇందు మీరోడిన యెడల ద్రౌపదితో గలిసి యట్లే వనవాసాజ్ఞాతవాసముల జేయవలెను.

"త్రయోదశే చ నిర్వృత్తే పున రేవ యథోచితమ్।
స్వరాజ్యం ప్రతిపత్తవ్య మితరై రథవేతరైః॥"

అజ్ఞాతవాస మెప్పుడు సక్రమముగా జరుగునో అప్పుడు ఓడిపోయియున్న మేముకాని, మీరుకాని మరల స్వరాజ్యమును పొందచ్చును అని. ఇట్టినిర్ణయముతో జరిగిన ద్యూతములో నోడిపోయిన పాండవులు సక్రమముగా నజ్ఞాతవాసమును పూర్తి చేసియున్నను స్వరాజ్య మీయక దుర్యోధను డాక్రమించియే యుండెను.

విరాటనగరమున పాండవు లజ్ఞాతవాసము జేయుచుండగావారిని కనిపెట్టదలచి చతురంగసేనలతో భీష్మద్రోణాదులను పురస్కరించుకొని విరాటనగరము మీదికి వచ్చి విరాటునిగోవుల నపహరింప దుర్యో

ధనాదు లుద్యమించినపుడు ధనుష్టంకారము చేయుచు గాండీవము ధరించి యసహాయశూరుడైన యర్జునుడు కౌరవసేనలపై వచ్చి పడు నపుడు ద్రోణాచార్యు లావచ్చువాడు పార్థుడే యని ప్రశంసింపగా దుర్యోధను డిట్లనెను —

"తేషాం న తావ న్నిర్వృత్తం వర్తతే తు త్రయోదశమ్।
అనివృత్తే తు నిర్వాసే యది బీభత్సు రాగతః॥
పున ర్ద్వాదశవర్షాణి వనే వత్స్యన్తి పాండవాః।
లోభాద్వా తేన జానీయు రస్మా న్వా మోహ ఆవిశత్॥
హీనాతిరిక్త మేతేషాం భీష్మో వేదితు మర్హతి। (విరాటప-అ.47)

వారికింకను అజ్ఞాతవాసకాలము పూర్తి కాలేదు. అర్జును డిప్పుడే వచ్చినయెడల మఱల పాండవులకు ద్వాదశవర్షవనవాసము కర్తవ్యమే. ఇట్టి స్థితిలో బూర్తి కాకుండ దెలియబడుచున్న పాండవుల దజ్ఞానమా? పూర్తి కాలేదను కొనుచున్నమనదజ్ఞానమా? ఈవిమయమైభీష్ముడే తెలిసి నవాడు. అని ప్రసంగింపగా భీష్ముడు, అధిక మాసములతో లెక్కించిన త్రయోదశవర్షములు పూర్తియైనవి, కనుకనే కృతార్థుల మైతి మని నిస్సంశయముగా వచ్చి పడుచున్నాడెను. ఇంతకాలము కష్టముల కోర్చియుండిన వారు గడువు దాటనిదే కనబడుదురా? వారు ధర్మప్రధానులు కాని రాజ్యప్రధానులుకారు. లేకున్న వారానాడే యెదుర్కొని యుందురు.

"తస్మా ద్యుద్ధోచితం కర్మ కర్మవా ధర్మసంహితమ్।
క్రియతా మాశు రాజేన్ద్ర సంప్రాప్తశ్చ ధనంజయః" (అ52)

నీ— "ధర్మసంహితం కర్మ అయుద్ధేన ఏతైస్సహ ఐక్యం గత్వా రాజ్యప్రదానమ్" కనుక, పార్థుడు వచ్చి పడుచున్నాడు, యుద్ధసన్నా

హావో, లేక వారిరాజ్యమును ధర్మబద్ధముగా వారికిచ్చి మైత్రియో జరుపవలెను. అని చెప్పగా విని దుర్యోధను డిట్లనెను—

"నాహం రాజ్యం ప్రదాస్యామి పాండవానాం పితామహ ।
యుద్ధోపచారికం యత్తు తచ్ఛీఘ్రం ప్రవిధీయతామ్॥"

నేను పాండవులకు రాజ్య మిచ్చువాడనుకాను. యుద్ధసన్నాహము చేయవలసినది, అని. దీనిని బట్టి సంధిచేసికొను తలంపు దుర్యోధనున కేకోశమునను లేదని స్పష్టమైనది.

తరువాత, అభిమన్యువివాహమునకు విచ్చేసిన బంధువర్గము సమావేశమైనపుడు శ్రీకృష్ణుడు, పాండవులకు ప్రాప్తించిన కష్టములను, ద్యూతములో రాజ్యాపహరణమును. త్రయోదశవర్షములు పూర్తిగా గడుపబడుటయును వారందరితో జెప్పి —

"దుర్యోధన స్యాపి మతం యథావ న్న జ్ఞాయతే కిన్ను కరిష్యతీతి॥

ఈపై దుర్యోధను డేమిచేయదలచెనో స్పష్టముగా దెలియకున్నది. కనుక మాతగా నొక గుణవంతుడు దుర్యోధనుని యొద్దకు వెళ్లి యను రాగముతో రాజ్యమిచ్చునట్లుచెప్పి రావలసియున్నదనియుపన్యసించెను.

అపుడు సాత్యకి, భీష్మ ద్రోణ విదురులు చెప్పినను పాండవులకు రాజ్యమీయనని కూర్చుండిన వాడు యుద్ధప్రక్రియచే గాని లొంగడని చెప్పగా ద్రుపదు డౌనని యుద్ధసన్నాహమునకై మహారాజుల నాహ్వానించుచు నాపురోహితుని మాతగా బంపుదు నని చెప్పెను. శ్రీకృష్ణుడు మంచివని ద్వారకకు వెళ్లెను. తరువాత నొకప్పుడు దుర్యోధనుడు శ్రీకృష్ణ సహాయాపేక్షియై ద్వారకకు వెళ్లి శ్రీకృష్ణుడు శయనించి యున్నపుడు సమీపించి యొక యాసనముపై తలవైపున గూర్చుండెను. ఆ వెంటనే అర్జునుడు కూడ శ్రీకృష్ణసహాయమున పేక్షించియే వచ్చి పాద ములకడ నిలచియుండెను. శ్రీకృష్ణుడు మేలుకొని స్వాగతమడిగి ప్రశ్నింప. దుర్యోధనుడు తన రాకను గూర్చి యిట్లుచెప్పెను.

"తతో దుర్యోధనః కృష్ణ మువాచ ప్రహసన్నివ ।
విగ్రహేఽస్మిన్ భవాన్ సాహ్యం మమ దాతు మిహార్హతి॥
సమం హి భవత స్సఖ్యం మయి చైవార్జునేఽపి చ ।
తథా సంబన్ధకం తుల్య మస్మాకం త్వయి మాధవ" (ఉ-అ7)

"ఈయుద్ధమందు నాకు నీసహాయమీయవలెను, నాయందును అర్జునునియందును నీకు సఖ్యము సమానమే, మాకును నీసంబధము సమానమే" అని. ఇట్లు యుద్ధమునకు సిద్ధపడి సహాయ మపేక్షించెనుగాని సంధికై సంకల్పింపలేదని స్పష్టము.

అప్పు డర్జునుడుకూడ వచ్చియుండుటచే నాతనికి సహాయపడకుండ దనకే సహాయపడవలసియున్న దనుట కొకమాట జెప్పెను —

"అహం చాభిగతః పూర్వం త్వామద్య మధుసూదన ।
పూర్వం చాభిగతం సన్తో భజన్తే పూర్వసారిణః ॥"

నీయొద్దకు వచ్చుటలో ముందువాడను నేను ముందువచ్చినవాని కోరికనెరవేర్చుట సత్పురుషస్వభావము, అని. ఆపై శ్రీకృష్ణు డిట్లనెను —

"భవా నభిగతః పూర్వ మత్ర మే నాస్తి సంశయః ।
దృష్టస్తు ప్రథమం రాజన్ మయా పార్థో ధనంజయః ॥"
తవ పూర్వాభిగమనా త్పూర్వం చాప్యస్య దర్శనాత్ ।
సాహాయ్య ముభయో రేవ కరిష్యామి సుయోధన ॥
ప్రవారణన్తు బాలానాం పూర్వం కార్య మితి శ్రుతిః ।
తస్మా త్ప్రవారణం పూర్వ మర్హః పార్థో ధనంజయః ॥"

సుయోధనా! నీవు ముందువచ్చుట నిజమే నాకు ముందు కనబడిన

వాఁడు అర్జునుడు. ముందువచ్చిననీకును ముందుకనపడినఅర్జునునకునుగూడ సాహాయ్యముచేయుదును. చిన్నవారికోరికను ముందు తీర్పవలెనని శ్రుతి చెప్పు చున్నది. కనుక నీకంటె జిన్నవాడగు పార్థుడు కోరినదాని నాతని కిచ్చి తరువాత నీ కీయవలసియున్నది. అని చెప్పి బలపరాక్రమసంపత్తి కల లక్షగోపాలనారాయణసేన యొకటి, యుద్ధముచేయక ఆయుధము బట్టక యుండెడి నేనొక్కడను ఒకటి. ఇందు నీకిష్టమువచ్చిన దానిని గోరికొనుము. అని యడుగ నర్జునుడు శ్రీకృష్ణునిగోరెను. దుర్యోధనుడు సైన్యమునే కోరితీసుకొనివెళ్లెను. శ్రీకృష్ణుడు యుద్ధము జేయనివాడై యుండెనని దుర్యోధనుడు పరమానందము నొందెను.

ఇచ్చట పాండవవిద్వేషియగు దుర్యోధనుడు, నిరపరాధులగు పాండవులపై గత్తిగట్టుటకు పాండవప్రాణప్రియుడగు శ్రీకృష్ణునే స్వయముగా వచ్చి సహాయము కోరుటలోను, అందులోఁగూడ బాండవులకుగాక ముందు వచ్చితిననుచు దనకే సహాయము చేయవలసినదని కోరుటలోను దుర్యోధనుని లజ్జాశూన్యమైన నిశ్శంకప్రవృత్తి గమనింపదగినది. అట్టి దుర్వృత్తికలవాడై యున్నను నర్థియై వచ్చినట్టి యాదుర్యోధనుని—వెనుకటిదుష్కార్యముల నుద్ఘాటించి నిరసించి వ్యర్థముగా బంపక ఆదరించి సహాయమిచ్చి పంపిన శ్రీకృష్ణుని లోకోత్తర స్వభావము కూడ గమనింపదగినదే.

ఇది యిట్లుండగా బాండవులకు సహాయపడుటకై సేనలతో వచ్చుచున్న శల్యునికి మార్గమధ్యమున నివాసస్థానములు కల్పించియు ప్రతివిశ్రాంతిస్థానమందును భోజ్యపదార్థములు సిద్ధపరచుచుండియు దుర్యోధను డీపనిజేయుచున్నాడని శల్యునకు దెలియనీయక యుధిష్ఠిరుడే యింత యాదరణము చేయుచున్నాడని శల్యు డానందించునట్లు వ్యవహరించి, అదిచూచి యుప్పొంగుచున్న శల్యుడొక సమయమున మమ్మింతగా నాదరించుచున్న యుధిష్ఠిరుని పరివారమునకభీష్టము లిచ్చెదను.

సమీపమునకు రావలసిన దని ప్రసంగింప నప్పు డచ్చటివా రిదియంత యు దుర్యోధనకృతసత్కారమే యని ప్రశంసించునంతట గూఢముగా సంచరించుచున్న దుర్యోధను డిదియే తరుణమని యెదుటికి వచ్చియుండ, సంతోషించుచున్న శల్యుఁడు నీయభీష్ట మేమని యడిగినపుడు, దుర్యోధనుడు—

"సత్యవా గ్భవ కల్యాణవరో వై మమ దీయతామ్ ।
సర్వ సేనాప్రణేతా వై భవా న్భవితు మర్హతి ॥"

సర్వసేనా నాయకుడవై నాపక్షమున నీవుండుటే నేను కోరెడి వరము దీనిననుగ్రహింపుము. అని ప్రార్థించి శల్యుని వంచనోపాయముతో దన పక్షమునకు మరలించుకొనెను. ఈవ్యవహారమును బట్టికూడ దుర్యోధనునకు సంధిజేసికొను సంకల్పము లేదని స్పష్టము. ఇది యిట్లుండగా ద్రుపదపురోహితుడు దూతగా వెళ్లి కురుసభలో బ్రసంగించుచు తుద కిట్లు చెప్పెను—

"తే భవన్తో యథా ధర్మం యథా సమయ మేవ చ ।
ప్రయచ్ఛన్తు ప్రదాతవ్యం మావః కాలోఽత్యగా దయమ్" (అ 20)

మీరు ధర్మమును బట్టియు "ద్యూతకాల నిర్ణయమునుబట్టియు పాండవుల కీయవలసిన దానినిచ్చివేయుడు. కాలహరణము జేయకుడు" అని. దీనినిబట్టి పాండవులు సంధినే సంకల్పించినారు కాని యుద్ధమును కాదని స్పష్టము. అపుడు భీష్ము డాద్రుపదపురోహితుడు చేసిన ప్రసంగము యుక్తమే యని సమ్మతించెను. కర్ణుడప్పుడు దుర్యోధనుని మొకము జూచి దూతకుసమాధానము ధార్ష్ట్యముతో నిట్లు సంభాషించెను—

"దుర్యోధనార్థే శకుని ర్ద్యూతే నిర్జితవా న్పురా।
సమయేన గతోఽరణ్యం పాండుపుత్రో యుధిష్ఠిరః॥
స తం సమయ మాశ్రిత్య రాజ్యం నేచ్ఛతి పైతృకమ్ ।

శ్లో. "తంసమయం కాలం తచ్చ సంకేతవాక్యం— త్రయోదశ వర్షే జ్ఞాతైఃపునర్వనే వస్తవ్యమిత్యేవం రూపంవా ఆశ్రిత్యనిర్యాహ్య"

"బల మాశ్రిత్య మత్స్యానాం పాంచాలానాం చ మూర్ఖవత్ ।
దుర్యోధనో భయా ద్విగ్నన్న దద్యాత్తా ఎద మన్మతః॥
ధర్మతస్తు మహీం కృత్స్నాం ప్రదద్యా చ్ఛత్రవేపచ ।
యది కాంక్షన్తి తే రాజ్యం పితృపైతామహం పునః॥
యథా ప్రతిజ్ఞం కాలం తం చరన్తు వన మాశ్రితాః।" (అ2 )

"యుధిష్ఠిరుడు ద్యూతనిర్ణయమును బట్టియే అరణ్యవాసము చేసి యుండి, యజ్ఞాతవాసములో దెలియబడుటచే మరల వనవాసమే చేయ వలసియుండ దానా నిర్ణయప్రకారము నడువక మత్స్యపాంచాలబలము జూచి రాజ్యము సంపాదింపజూచుచున్నాడు. దుర్యోధనుడు భయపడి త్రుద్దకు పాదమాత్రమైన నిచ్చువాడుకాడు. ధర్మమార్గమున రాజ్యమం తయుశత్రువునకై నిచ్చువాడే, పాండవులకు రాజ్యకాంక్షయున్న యెడల ప్రతిజ్ఞాప్రకారము మరల వెంటనే వనవాసము చేయవలసినదే" అని.

ఈ ప్రసంగమును బట్టి కర్ణ దుర్యోధనులకు సంధి జేసికొను సంకల్పమే లేదనియు, పాండవులు వనవాసము చేయవలసినవారను సంకల్పమే వారికున్నదనియు మతిమంతులకు స్పష్టమేకద! దీనిచే —

"ద్రుపదపురోహితునివలన సంధివాక్యముల నందియ్యేకముందె పాండవులు సైన్యముల గూర్చుకొనిరి. దాని దెలిసియె సుయోధను డు సైన్యముల గూర్చుకొనెను గాని తొలుత యుద్ధమునకు సిద్ధపడ లేదు. తొలుత సమరసన్నాహము చేయక సామమె పాండవులు న డపినచో సమయబద్ధులు పాండవులని దుర్యోధను డేల రాజ్యమీ యడు? "(పు263)

అను మ,భా,చ,కారులవ్రాత పర్యాప్తమైనది ఉత్తరగోగ్రహణ కాలము నందే పాండవుల కేమియు నీయరాదను దుర్బుద్ధి దుర్యోధను

నకు పుట్టినది. అది భీష్మునితో స్పష్టముగా జెప్పియే యుండెను. ఆదు ర్బుద్ధిని బట్టియే పాండవులకు సమరసన్నాహ మవసరమైనది. పాండవు లు సంధికిష్టపడిన వారుకనుకనే రాయబారములు జరుపుచునే వచ్చినా రు. దుర్యోధనుడు గాని, కర్ణుడుగాని మీరు సమరసన్నాహము జేయు చుండు టెందులకు? మీది మీకీయమని చెప్పినామా? అని యెన్నడు ననియుండలేదు. కనుక బ్రతివాదుల మాట యప్రమాణము.

ఉత్తరగోగ్రహణకాలములో నర్జునుడు కనపడినపుడు గడువు దాటకుండ గనబడె ననుకొనిన దుర్యోధనుడు "హీనాతిరిక్తమేతాషాం భీష్మో వేదితు మర్హతి "అని గడువు దాటెనో లేదో తెలిసికొన గల వాడుభీష్ముడేయ నుటయు, నధికమాసములు కలిపి పూర్తియైనదని భీష్ము డు చెప్పుటయు, జరిగియుండ దానుకాలేదని సహేతుకముగా నిరూపిం పలేక మిన్నకుండి, నేడా భీష్ముని సమక్షములోనే అజ్ఞాతవాసము పూ ర్తికాలేదని ప్రసగించిన కర్ణదుర్యోధనుల దుర్నయము జూడుడు.

గడువుదాటిన తరువాతనే పార్థుడు తెలియపడెనని చెప్పిన భీష్ము నిమాట సత్యమనుటకు మఱియొక ప్రమాణము కలదు — వనవాస కాలము పూర్తియై యజ్ఞాతవాస మారంభింప బోవునపుడు ధర్మజుని బరీక్షింపవచ్చిన ధర్మదేవత యక్షరూపముతో తాను జేసిన యక్షప్ర శ్నముల కుత్తరము జక్కగా ధర్మజుడు జెప్పినపుడు సంతుష్టినొంది వ రములిచ్చెదను, కోరుమనగా ధర్మజుడు —

"వర్షాణి ద్వాదశారణ్యే త్రయోదశ ముపస్థితమ్ ।
తత్ర నో నాభిజానీయు ర్వసతో మనుజాః క్వచిత్ ॥

మాకు, అజ్ఞాతవాసము చేయవలసిన పదమూడవ వత్సరముప్రా ప్తమైనది. ఆసంవత్సరము మమ్మెవ్వరును తెలిసికొనకుండునట్లు వర మీయవలసినది. అనికోరగా ధర్మదేవత వర మనుగ్రహించుటలో నిట్లు చెప్పెను —

"యద్యపి స్వేన రూపేణ చరిష్యథ మహీ మిమామ్ ।
న వో విజ్ఞాస్యతే కశ్చి త్త్రిషు లోకేషు భారత ॥
వర్షం త్రయోదశ మిదం మత్ప్రసాదా త్కురూద్వహాః ।
విరాటనగరే గూఢా అవిజ్ఞాతా శ్చరిష్యథ ॥
య ద్వ స్సంకల్పితం రూపం మనసా యస్య యాదృశమ్ ।
తాదృశం తాదృశం సర్వే ఛన్దతో ధారయిష్యథ ॥ (వనప. అ. 314

మీరు స్వస్వరూపములతో సంచరించుచున్నను త్రిలోకములలో నెవ్వనికిని దెలియబడకుందురు. నాయనుగ్రహమున నీపదుమూడవసంత్సరమువిరాటనగరమందు ఎవ్వరికి దెలియకుండ సంచరింపగలుగుదురు. మీరు మనస్సులో నేయేరూపమును సంకల్పించుకొనెదరో ఆయా రూపమును మీయిచ్ఛానుసారము ధరింపగలుగుదురు ,, అని.

ఇట్టి వరముండగా నజ్ఞాతవాస సంవత్సరము పూర్తి కానిదే యర్జునుడు తెలియబడుటే అసంభవము. కనుక తెలియబడిననాటికి పూర్తియైపోయిన దన్నమాటే. అట్టిపూర్తి యధిక మాసములతోడనేయైన దన్నమాట. కనుక భీష్మవాక్యము సత్యమే. కర్ణదుర్యోధనులది దుర్న యమే. ప్రకృతము ననుసరింతము ——

అట్లు కర్ణుడు ద్రుపదపురోహితునకు సమాధానవాక్యము చెప్పిన పిమ్మట భీష్ముడు— ఇక పాండవులవలన మనము హతులమై పోవుదు మనెను. అంతట ధృతరాష్ట్రుడు కర్ణుని మందలించి, భీష్ముని శాంతింప జేసి, నేను పాండవహితముగను జగద్ధితముగను నాలోచించి పాండవులకడకు సంజయుని బంపుచున్నాను. అని యాద్రుపదపురోహితుని బంపివేసెను.

తరువాత ధృతరాష్ట్రుడు సంజయునితో పాండవులు మొదటి నుండియు యోగ్యులే యనియు "తేషాం ద్వేష్టా నాస్త్యజమీఢస్య

పక్షే” “అన్యత్ర పాపా ద్విషమా న్మన్దబుద్ధే ర్దుర్యోధనాత్ క్షుద్రతరా చ్చ కర్ణాత్” వారిని ద్వేషించువాఁడు, పాపియగు దుర్యోధనుని కంటెను, క్షుద్రుడగు కర్ణునికంటెను అన్యుఁడు లేడనియు, వారితో యుద్ధము దెచ్చి పెట్టుకొనుటకంటె వారిది వారికిచ్చివేయుటే మేల నియు సంభాషించి, దుర్యోధను డొకవేళ మీది మీకియ్యకపోయినను మీరు యుద్ధమునకు వచ్చుట మీధార్మికత్వమునకు లక్షణము కాదని నేను చెప్పితి నని పాండవులతో జెప్పుమనుచు తన సందేశసారాంశ మును వెల్లడించెను.

అంతట సంజయుడు వెళ్ళి శ్రీకృష్ణసహితులై యున్న పాండవులతో సందేశవిషయములను చెప్పగా క్షత్రియునకు యుద్ధము కర్తవ్యమా కాదా? అను విషయమును చర్చించి శ్రీకృష్ణుడు, తమ సంపదల ననుభవించెడి సన్మార్గవర్తుల సొత్తు నక్రమముగా నపహరించు దుర్మార్గుల శిక్షించుటకే శస్త్రాస్త్రవిద్యలుద్భవించినవని నిరూపించి క్షత్రియునకు యుద్ధమధర్మము కాదని చెప్పి తుదకు సారాంశ మిట్లుచెప్పెను—

స్థితాః శుశ్రూషితుం పార్థాః స్థితా యోద్ధు మరిందమాః।
యత్కృత్యం ధృతరాష్ట్రస్య తత్కరోతు నరాధిపః ॥
స్థితా శ్చ మే మహాత్మానః పాండవా ధర్మచారిణః।
యోధా స్సమర్థా స్తద్విద్వ న్నాచక్షీథా యథా తథమ్॥ (అ_29)

ధర్మాత్ములు శాంతులునై యున్న పాండవులు సంధి చేసికొను టకుగాని, యుద్ధము జేయుటకుగాని సిద్ధముగా నున్నారనియు, ధృతరాష్ట్రుని కేదికర్తవ్య మనిపించునో దానినాతడు చేయవచ్చునని చెప్పుమనియు నుపదేశించెను. మఱియు — “స్వయం త్వహం ప్రార్థయే తత్ర గన్తుం సమాధాతుం కార్య మేత ద్విపన్నమ్” ఈచెడిపోయిన కార్యమును చక్కబరచుటకై కురుసభకు నేనే స్వయముగా రావలచి

యున్నాడని కూడజెప్పెను. ఇందులో ప్రతివాదులన్నట్లు శ్రీకృష్ణుడే మైన సంధి పొసగనీయకుండు నట్లుచేసెనా?
అప్పుడు ధర్మజుడు కూడ సంజయునితో నిట్లు చెప్పెను—

“భ్రాతౄణాం దేహి పంచానాం పంచగ్రామాన్ సుయోధన ।
శాన్తి ర్నోఽస్తు మహాప్రాజ్ఞ జ్ఞాతిభి స్సహ సంజయ ॥
అల మేవ శమాయాస్మి తథా యుద్ధాయ సంజయ ।
ధర్మార్థయో రలం చాహం మృదవే దారుణాయచ ॥ (అ-31)

సంజయా! దుర్యోధనునితో నొక్కొక్కని కొక్కొక్కటి చొప్పున నైదుగురి కైదుగ్రామముల నైన కనీసమిమ్మని చెప్పుము. అంతటితో శాంతింతుము, నేను సంధికై సిద్ధముగానున్నాను. యుద్ధమునకును సిద్ధముగా నున్నాను. నేను ధర్మార్థములను జెడగొట్టుకొను వాడనుకాను. నేను మార్దవమునకును, దారుణమునకును గూడ తగిన వాడను. అని.

ఇట్లుండ, పాండవులును, శ్రీకృష్ణుడును యుద్ధమునకే కాలుదువ్వినారని ప్రతివాదుల కనుపించినట్లు ప్రాజ్ఞుల కనిపించునా?

తరువాత సంజయుడు వెళ్ళి శ్రీకృష్ణసందేశమును, పాండవ సందేశమును వినిపింపగా ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో నీవు సంధి చేసికొనుము. వారు బలాఢ్యులు; వారిభాగము వారికిచ్చివేయుము. అని చెప్పగా దుర్యోధనుడు—

“యుధిష్ఠిరః పురం హిత్వా పంచగ్రామాన్ స యాచతే ।
భీతో హి మామకా త్సైన్యా త్ప్రభావా చ్చైవ మే విభో ॥” (అ55)

నాప్రభావమునకును, నాసైన్యమునకును భీతుడై యుధిష్ఠిరుడు ఐదుగ్రామములను యాచించుచున్నాడు. చూచితివా! వారి నవలీలగా జయింప గలము. అనెను. ఇది దుర్యోధనుని సంధిసంకల్పమే యని ప్రతి

వాదుల కనుపించెనన్న మాట. తరువాత ధృతరాష్ట్రుడు —

"దుర్యోధన నివర్తస్వ యుద్ధా ద్భరతసత్తమ ।
అల మర్థం పృథివ్యాస్తే సహా మాత్యస్య జీవితుమ్ ॥ "

దుర్యోధనా! యుద్ధము మానుము. నీయర్థరాజ్యము సపరివారముగా నీవు జీవించుటకు చాలును. అని చెప్పి భీష్మ ద్రోణ కృపాశ్వత్థామ విదుర సంజయ ప్రభృతులును, నేనును యుద్ధమున క్లిష్టపడమని చెప్పి—

న త్వం కరోషి కామేన కర్ణః కారయితా తవ ।
దుశ్శాసన శ్చ పాపాత్మా శకుని శ్చా పి సౌబలః ॥ " (అ_58)

యుద్ధమే చేయవలెననునది నీకుబుట్టిన బుద్ధియేకాదు. పాపాత్ములగు కర్ణ, దుశ్శాసన, శకునులు నీకు ప్రోత్సాహకులై యున్నారు. అని మందలింపగా నెవ్వరిష్టపడక పోయినను లోటులేదు. మేము నిగ్రహింపగల మనుచు దుర్యోధను డిట్లు చెప్పెను—

"అహం చ తాత కర్ణశ్చ భ్రాతా దుశ్శాసన శ్చ మే ।
ఏ తే వయం హనిష్యామః పాండవా న్సమరే త్రయః ॥
అహం హి పాండవా న్హత్వా ప్రశాస్తా పృథివీ మిమామ్ ।
మాం వా హత్వా పాండుపుత్రా భోక్తారః పృథివీ మిమామ్ ॥
యావద్ధి సూచ్యా స్తీక్ష్ణాయా విధ్యే దగ్రేణ మారిష ।
తావ దప్యపరిత్యాజ్యం భూమే ర్నః పాండవా న్ప్రతి ॥" (అ58)

"నేను, కర్ణుడు, దుశ్శాసనుడు కలిసి పాండవులను వధింపగలము. పాండవులను వధించి నేనో, నన్ను వధించి పాండవులో రాజ్యమేలుకొనవలెను. సూదిమొన మోపినంత భూమినైన నేను పాండవుల కిచ్చువాడను కాను" అని. ఇది దుర్యోధనుని సంధవాక్యమే యనిప్రతివాదుల కనిపించిన దన్నమాట.

ఇది శ్రీకృష్ణుని కురుసభాప్రయాణోద్యమమునకు బూర్వవృత్తాంతము. ఇక నిప్పుడు ప్రతివాదిసంధిప్రసంగము నందుకొందము—

సంధిపొసగనీయకుండ శ్రీకృష్ణుడు చేసెనట! పాండవరాజ్యమాక్రమించి కూర్చుండిన దుర్యోధనుడు వారిది వారికిచ్చుటయను సంధికంగీకరించినపుడు కదా సంధిపొసగుట. సంధికై వాంఛించినవారుపాండవులు. అట్టి సంధిపొసగనీయకుండ జేసినవాడు —"పాండవులు మఱల వనవాసమే చేయవలెను, 'వారికేమాత్రము నేనిచ్చువాడను కాను' 'యుద్ధము జేసి వారిని సంహరింతుము" అని ప్రసంగించిన దుర్యోధనుడా? లేక యావచ్ఛక్తిని వినియోగించి యిరుపక్షముల కైక్యసఖ్యము కలిగింప వలెననియే పాటుపడిన శ్రీకృష్ణుడా? రాయబారమునకై వెళ్ల దలచిన శ్రీకృష్ణునితో యుధిష్ఠిరుడు- శ్రీకృష్ణా! వారిలక్షణము పూర్తిగా దెలిసియే యున్నది. నీవువెళ్లుట నిరర్థక మనిపించుచున్నదనగా శ్రీకృష్ణుడు—

"న జాతు గమనం పార్థ భవే త్తత్ర నిరర్థకమ్ ।
అర్థప్రాప్తిః కదాచి త్స్యాద న్తతో వా ప్యవాచ్యతా" ॥ (అ.71)

అక్కడకువెళ్ళుట నిరర్థకముకాదు. అయ్యెనా అర్థసిద్ధియగును. లేదా మనమున్యాయముగా చెప్పలేదను నింద లేకుండపోవును. అని చెప్పివెళ్ళిన శ్రీకృష్ణుడు సంధిపొసగనీయకుండ జేసెనా?

సంధి జేయుటకై హస్తినాపురమునకు వెళ్ళిన శ్రీకృష్ణునితో విదురుడు దర్పితుడైయున్న దుర్యోధనుడు శ్రేయస్కరమైన నీమాటను వినువాడుకాడు. దుర్వృత్తికలిగియున్న వారిమధ్యమున నీవుప్రవేశించుటే నాకిష్టముకాకున్నది. అనిచెప్పగా శ్రీకృష్ణుడు—

"ఆకేశగ్రహణా న్మిత్ర మకార్యా త్సన్నివర్తయన్ ।
అవాచ్యః కస్య చిద్భవతి కృతయత్నో యథాబలమ్॥

న మాం బ్రూయు రధర్మిష్ఠా మూఢా హ్యసుహృద స్తథా।
శక్తో నావారయ త్కృష్ణ స్సంరబ్ధాన్ కురుపాండవాన్॥
ఉభయో స్సాధయన్న ర్థ మహ మాగత ఇత్యుత।
తత్ర యత్న మహంకృత్వా గచ్ఛేయంనృష్వవాచ్యతామ్" (అ93)

అకార్యమునకు సిద్ధపడుచున్న తనమిత్రునకు తనజుట్టు పట్టుకొనియైనను యాతడు గుంజునంతవరకు హితము నుపదేశించుటలో శక్తివంచనలేకుండ పాటుపడినపుడు లోకనిందతనకుండదు. సర్వసమర్థుడైనశ్రీకృష్ణుడు యుద్ధసంరబ్ధులైన కురుపాండవులను నివారింపకపోయెనని మూఢులు నన్ననకుండుటకై, యిరుపక్షములకు చేటు లేకుండ జేయుటకై నేను వచ్చితినికనుకయత్నముజేసిలోకనింద లేకుండ జేసికొనెదనుఅనిచెప్పెను

ఇట్టి శ్రీకృష్ణుడు సంధి పొసగనీయకుండు నట్లు చేసినవాడా? వెనుక జూపినటు లుత్తరగోగ్రహణకాలములోనే పాండవులరాజ్యమింక వారికిచ్చివేయుట మంచిదని బోధించిన భీష్మునితో "నాహం రాజ్యం ప్రదాస్యామి పాండవానాం పితామహ" అని చెప్పి దుర్యోధనుడు వారిరాజ్యము వారికిచ్చి సంధిజేసికొనవలసినదని చెప్పవచ్చిన ద్రుపద పురోహితునితో వారికి రాజ్యకాంక్ష యున్నయెడల మరల వారికివన వాసమే కర్తవ్యమని చెప్పినకర్ణుడును, సంధిపొసగనీయకుండ జేసియే యున్నారు. అది శ్రీకృష్ణుడు చేసినది కాదు.

అట్లు చెడిపోయి యున్న వ్యవహారమును చక్కబరచుటకై నేనే స్వయముగా వచ్చుచున్నానని సంజయునితో జెప్పి పంపి యచ్చటికి వెళ్ళి సంధి పొసగుటకై యాచచ్చుక్తి వినియోగించిచూచిన శ్రీకృష్ణుని సంధి పొసగనీయకుండ జేసినవాడని యనుట ప్రతివాదుల దెంత సాహసమో!

"భీముని బుఱ్ఱకొల్పుటలోను ద్రౌపది నోదార్చుటలోను సంధి పొసగనీయకుండజేయు తలంపుకలుగురీతిని సంభాషించెనట."

రాయబారమునకై శ్రీకృష్ణుడు వెళ్ళబోవునపుడు కురుసభలో నిట్లు ప్రసంగింపవలసినదని తమతమయభిప్రాయముల నొక్కొక్కరే చెప్పునపుడు భీమసేనుడు— మేము యుద్ధార్థులము కాము. కౌరవులతో సౌభ్రాత్రమే మాకుకావలెను. యుద్ధము లేనిపద్ధతినే కార్యము జక్క బరుపవలసినది. అనిచెప్పి దుర్యోధనుడు దురభిమాని, శ్రేయో ద్వేషి, కనుక.

"నోగ్రం దుర్యోధనో వాచ్య స్సామ్నై వైనం సమాచరేః ।

అతనితో నుగ్రముగా భాషింపక సామముచేతనే కార్యము జక్కబరపుము. అని చెప్పినపుడు శ్రీకృష్ణుడు— దుర్యోధనుడు యుద్ధములో జయించినపుడుకాని రాజ్యప్రాప్తి లేదని యొకమూల చాటు చుండ నీసమయమున క్షాత్రమును గణింపక భీమసేను డిట్లు మాట లాడుచుండెనే యని, యాతని కుత్తేజనము కలిగింపదలచి భీమసేనా! నీవింతకు బూర్వము యుద్ధమునే ప్రశంసించుచు కౌరవులుచేసిన దుండగములను స్మరించుకొనుచు బుసకొట్టుచు చిత్తశాంతిలేక పరితపించి యిప్పుడు యుద్ధకాలము ప్రాప్తింపగా భయపడినట్లు కనబడుచున్నావు. ఇది క్షాత్రలక్షణము కాదు. నాకిది చిత్రముగా నున్నది.

"స దృష్ట్వా స్వాని కర్మాణి కులే జన్మ చ భారత ।
ఉత్తిష్ఠస్వ విషాదం మా కృథా వీర స్థిరోభవ ॥" (అ–75)

నీకులీనత్వమును నీపరాక్రమవిశేషములను తలచుకొనుము. విషాదపడకుము; స్థిరుడవై యుండుము. అని చెప్పగా భీమసేనుడు—

"సర్వాలోకా దభిక్రుద్ధా న్న భయం విద్యతే మమ ।
కిన్తు సౌహృద మేవై తత్ కృపయా మధుసూదన ॥

నాకు భయమా? సర్వలోకము లేకమై వచ్చినను భయము లేని వాడను. సౌహార్దముచేతనే యిట్లు చెప్పియున్నాను. అనినపుడు నీభావము గ్రహించుటకే నేనిట్లు ప్రసంగించితి నని చెప్పి శ్రీకృష్ణుడు—

"శ్వో భూతే ధృతరాష్ట్రస్య సమీపం ప్రాప్య పాండవ ।
యతిష్యే ప్రశమం కర్తుం యుష్మదర్థ మహాపయన్ ॥
శమం తే చేత్కరిష్యన్తి తతో ఽనన్తం యశో మమ ।
భవతాం చ కృతః కామ స్తేషాం చ శ్రేయ ఉత్తమమ్ ॥
తే చే దభినివేక్ష్యన్తే నాభ్యుపైష్యన్తి మే వచః ।
కురవో యుద్ధ మేవాత్ర ఘోరం కర్మ భవిష్యతి" ॥ (అ-77)

రేపు ధృతరాష్ట్రుని యొద్దకు వెళ్లి మీకు అర్థహాని కలుగకుండు నట్లు సంధికై ప్రయత్నింతును. వారంగీకరించినయెడల మీ కోరిక నెర వేరును. నాకు యశస్సు కలుగును. వారికి శ్రేయస్సు కలుగును. ఆకౌ రవులు పట్టుదలతో నామాట వినకున్నపుడు ఘోరయుద్ధము జరుగును" అని చెప్పి అప్పుడు కార్యభారము నీయందుండు నని బోధించెను.

ఇట్లు నేను సంధికై ప్రయత్నింతును. వారు వినని పక్షములో యుద్ధమే జరుగును. నీవప్పుడు కార్యభారము వహింపవలెనని చెప్పిన శ్రీకృష్ణుని 'సంధి పొసగనీయకుండ జేయుతలంపు కలుగురీతిని సంభాషిం చెను. అను ప్రతివాదుల సాహసము మెచ్చ దగినది.

ద్రౌపదీదేవి శ్రీకృష్ణునితో నాటి ద్యూతసభలో దాను పొంది యున్న దుర్భరము దుర్వచనమునైన దుఃఖమును చెప్పుకొనగా శ్రీకృష్ణుడు
"ధార్తరాష్ట్రాః కాలపక్వా న చేచ్ఛృణ్వన్తి మే వచః ।
శేష్యన్తే నిహతా భూమౌ శ్వసృగాలాదనీకృతాః ॥"

కౌరవుల కాయువు పూర్తియై నామాట విని సంధి చేసికొన కున్న పక్షములో హతులై తీరుదురు. అని సమాధానపరచిన శ్రీకృష్ణుని 'సంధి పొసగనీయకుండ జేయు తలంపు కలుగురీతిని సంభాషించెను' అనుటయు పాండవులసమ్మతిపై సంధి పొసగజేయుటకై వచ్చిన శ్రీకృ

ష్ణునితో సంధి పొసగనీయకుండచేయు తలంపు కలిగి సంభాషించిన వాడు దుర్యోధనుఁడై యుండ, శ్రీకృష్ణునిపై దాని నారోపించు ప్రతి వాదుల పాండితి నేమనవలెనో!

శ్రీకృష్ణుడు కురుసభకు సంధి జెడగొట్టుటకే వెళ్ళె నన్నట్లు తేల్చిన ప్రతివాదులకు– ఆశ్రీకృష్ణుడు కురుసభనుండి మరలివచ్చిన తరు వాత కర్ణాదులతో సంభాషించినదుర్యోధనునివాక్యమునుచూపుదము–

"అకృతేనైవ కార్యేణ గతః పార్థా నధోక్షజః।
సఏనా న్మన్యు నాఽఽవిష్టో ధ్రువంధక్ష్య త్యసంశయమ్ ॥"(అ.153)

ఇచ్చట, 'అకృతేన కార్యేణ గతః' కార్యసిద్ధి కాకయే వెళ్ళెను. అత డాగ్రహావిష్టుడై మనలను దగ్ధము చేయుననుట నిశ్చయము. అని దుర్యోధను డనెను. ఇప్పుడు శ్రీకృష్ణుడు సంధిజేయుట యను కార్యము కొరకు వచ్చినపుడే దుర్యోధనునిచే నది చెడగొట్టబడుటవలన వెళ్ళి పోయిన శ్రీకృష్ణుడు కార్యసిద్ధికాక వెళ్ళినవాడును, ఆగ్రహావేశము కల వాడును అగును కాని సంధిజెడగొట్టుటకే వచ్చినయెడల నది సిద్ధించి నది కనుక దుర్యోధను డిట్లనుకొనుట అసంభవమగును.

క. తన వచ్చినకార్యము మన
మనుకూలత జేయకున్న హరి యలుక మెయిం
జని యప్పాండుతనూజులు
మనమున గినుకూనునట్టి మాటలు సెప్పున్. (ఆం-భా)

మఱియు, అర్జునుడు సైంధవుని వధింతునని ప్రతిజ్ఞ చేసినట్లు విని చింతించెడి ధృతరాష్ట్రుడు సంజయునితో జెప్పుకొనిన విషయము జూతుము–––

"యదా ప్రభృత్యుపప్లావ్యా చ్ఛాన్తి మిచ్ఛన్ జనార్దన ।
ఆగత స్సర్వభూతానా మనుకంపార్థ మచ్యుతః ॥
తతోఽహ మబ్రువం సూత మందం దుర్యోధనం తదా।
వాసుదేవేన తీర్థేన పుత్ర సంశామ్య పాండవైః
ప్రత్యాచష్ట స దాశార్హ మృషభం సర్వధన్వినామ్
అనునేయాని జల్పన్త మనయా న్నా న్వపద్యతా॥" (ద్రోణ-అ85)

ఇచ్చట, శ్రీకృష్ణుడు లోకానుగ్రహబుద్ధితో సంధి జేయుటకై వచ్చినపుడు మందుడగుదుర్యోధనునితో శ్రీకృష్ణుని బురస్కరించుకొని నీవు పాండవులతో సంధిజేసికొను మని చెప్పియున్నాను. అనునయముగా సంభాషించినశ్రీకృష్ణుని దుర్యోధను డవినీతుడై తిరస్కరించినాడు.

తే. "నేను ద్రోణుండు భీష్ముండు బూనిచెప్ప
శౌరిమాటలు మీరాజు సరకుగొనడ
సంధి గానీక కర్ణుండు సౌబలుండు,
దుస్ససేనుండు నందర ద్రుంచికొనిరి." (ద్రోణ-అ3)

మఱియు భీమసేనగదాఘాతమున తొడలు విరిగి పడియున్న దుర్యోధనుడు అశ్వత్థామాదులతో నిట్లు చెప్పెను—

"యది వేదాః ప్రమాణం వో జితా లోకా మయా ఽక్షయాః।
మన్యమానః ప్రభావం చ కృష్ణ స్యామిత తేజసః
తేన నచ్యావిత శ్చాఽహం క్షత్రధర్మాత్స్వనుష్ఠితాత్." (శల్య-అ5)

వేదములు ప్రమాణములైనపుడు నే నక్షయలోకముల జయించితినన్నమాటే. శ్రీకృష్ణప్రభావ మెఱిగియుండియు సంధిజేసికొను మని బోధించిన శ్రీకృష్ణునిచే నేనీ యుద్ధమరణమను క్షత్రధర్మము నుండి తొలగింప బడలేను అని తాత్పర్యము. ఇట్లెన్నియో ప్రమాణములున్నవి. శ్రీకృష్ణుడు సంధిజేయుటకే ప్రయత్నించెను. దుర్యోధనుడే దానిని జెడగొట్టి యుద్ధమునకు సిద్ధపడెను. కనుక ప్రతివాది ప్రసంగము దూరాపాస్తమైనది.

## —: దుర్యోధనుడు నిరపరాధు డను ప్రసంగము, తన్నిరాకరణము :—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది—

"శ్రీకృష్ణునితో రాయబారసమయమున దుర్యోధనుడనిన యీ క్రింది వాక్యములు సుయోధనానపరాధత్వము జెప్పును—

క. వనితం బరచి రరణ్యం
బున నిడుమల బడితి మనుచు బోటరులై చం
పను జెరుప బూని మాదెస
గనలుదు రప్పాండుసుతు లకారణము కదూ "

మ. అరయం దప్పొక యింతనావలన లేదా ధర్మపుత్రుండు జూ
దరి వెంటందమకించి సౌబలుని చేతం భూమి గోల్పోయి ము
ష్కరుడై వెండియు నొడ్డగా నతడు నత్యప్రౌఢిమై గెల్వ నే
తెర్వువై నం(దన యిచ్చతో మెలగె నింతేగాక యేఖూటయే.

గీ. మాత్స్య పాంచాల పాండ్యాది మనుజపతుల
గూర్చికొని తార య్యంబు గోరి యెత్తి
విడిసి రింతియకాక యివ్విధము నుగ్ర
కర్మమున కేము దొడరుట గలదె చెపుమ" (పు-264)

ప్రతివాదులు, దుర్యోధనవాక్యముల జూపుటలో నింతమాత్రము చూపి సంధి కంగీకరింపనని చెప్పినవాక్యమును చూపలేదు, దానిని జూతుడు—

ఉ. ఏమును వారు బంచికొని యేలుట గల్గదు పల్కకుండు మిం
కేమియు వాఁడిసూదిమొన యించుక మోపినయంతమాత్రముగా

భూమి యొనర్చి పాండునృపపుత్రుల కిత్తునె యెవ్వరైన సం
గ్రామమునం జయంబు గొని రాజ్యము సేయుట నిశ్చయించితిఁ”

సంధి కంగీకరింపనివాడు దుర్యోధనుడే యని లోకులనుకొని పోవుదురని యీవాక్యమును ప్రతివాదులు దాచియుంచినారు. ఇట్టి ఈ వాక్యము దుర్యోధనాపరాధమును ప్రతివాదులన్యాయదృష్టిని గూడ వ్యక్తము జేసినది. కురుసభలో దుర్యోధనుడు తానవపరాధి నని శ్రీకృష్ణునితో జెప్పగా శ్రీకృష్ణు డనిన మాటలు చూడుడు—

సీ. అరయంగ దప్పు లేదంటి నీవలన గీ డొకనాడు సేసియునొక్కనాడు
సేయవె నీజనించినయది యాదిగా నుడుగక పాండవేయులకు జాల
నెగ్గు సేసితి విష మిడి పెనుబాముల గఱపించి నీరిలో గట్టి త్రోచి
లక్కయిల్ గాలిచి పెక్కుభంగుల జంప, దలచిన జావక ధర్మరక్ష.
ఆ. జేసి నెగడి రాచసిరి నొందియున్న జూ
పోపకీవు తీవ్ర పాపబుద్ధి.
గనమి జూద మొకటి కల్పించి కపటంబు
సేయు దాన నెల్ల జేటు బుట్టె.
తే. అన్నదమ్ములు నెత్తంబు లాడి సతుల
తలలు వట్టి సభాస్థలంబులకు నీడ్చి
చీర లొలిపింతు రే యిట్టి వారి నెందు
దడవ్వమా నీవొకండవు దక్క నధిప.
ఉ. అప్పుడు నీవు కర్ణుడును నాడిన మాటలు గొల్వులోపలం
జెప్పెడు నట్టివే కులము శీలము గల్గిన పుణ్యకాంత క
ట్లొప్పమి సేయు టెల్ల గనియున్న జనంబులు వించునుండగా
దప్పొక యింత లేదను విధం బది నీక చనుం గుమారకా.”
తే. ఎత్తి విడిసినవారని యెల్ల తప్పు
బండవుల మీద బెట్టిన బ్రతుకు గలదె

ద్రోణభీష్ములు తండ్రియు దోడు తోడ
జెప్పు తగుమాట నేమియు జెవుల సొరవు.

క. శాంతి బొందుట నీకుం
గుంతీపుత్రులకు మేలగుఁ దానిక యే
నింతయు నాడెద నది నీ
కెంతయు రుచియింపకునికి యెరిగి యెరిగియుఁ. (ఉద్యో-అ3)

ఈకృష్ణవాక్యములలో దుర్యోధను డాదినుండియు దుష్కార్యములే జేసియుండెనని యనినట్లును, ద్యూతమును కల్పించి కపటకృత్యము జరిపి ద్యూతసభలో జేసిన వస్త్రాపహరణాదిదుష్కార్యములు దుర్భాషణములు సభలో జెప్పదగినవా? నాడు నీదుశ్చేష్టలను కనులతో జూచియున్నవారి యెదుటనే నాతప్పులేదనుట నీకే చెల్లినది దుర్యోధనా! అని యన్నట్లును స్పష్టము.

తన దుశ్చేష్టలను ప్రత్యక్షముగా జూచినవారియెదుటనే నాతప్పేమియు లేదనిన దుర్యోధనుని నిర్లజ్జప్రవృత్తిపై యాసభ్యులనేసాక్షులుగా జూపి నిరుత్తరుని జేసి దుర్యోధనాపరాధములను శ్రీకృష్ణుడే ధృవపరచియుండెను. ఆదుర్యోధనుని మాటలనే పాటబాడిన ప్రతివాదుల కదే సమాధానము. కనుక ప్రతివాదుల వ్రాత పరాస్తము.

## కురుసభలో జూపిన శ్రీకృష్ణుని విశ్వరూపము కార్యకారి కాలేదు అను ప్రసంగము— తన్నిరాకరణము.

మ. భా. చ. కారులవ్రాత యిట్లున్నది— "అందరి మనస్సుల దనపక్షమునుండి మార్చుచున్న కృష్ణుని బంధింప సుయోధనుడు తలంచెనుగాని విదురాదుల యడ్డంకిచే నటులు చేయలేదు. ఈ సమయమున జూపిన విశ్వరూపము సూహావిష్టుడగు నర్జునునకు

జూపిన విశ్వరూపమువలె గార్యకారి కాలేదు. కార్యకారియే యైనచో ధృతరాష్ట్రు డర్ధరాజ్యమును దప్పక యొసగియే యుండును." (పు178)

ఈవ్రాతలో కృష్ణుని దుర్యోధనుడు బంధింపదలచినట్లును, ఆసమయమున విశ్వరూపము జూపబడినట్లును ప్రతివాదులే చెప్పుచు బంధించు సంకల్పము జరుగుటకును, విశ్వరూపప్రదర్శనమునకును సంబంధము లేదని చెప్పుచున్నారు. కృష్ణుని బంధించుటకు అందరి మనస్సుల దనపక్షమునుండి మార్చుటే కారణమని చెప్పినారు. దీనిచే నాటి శ్రీకృష్ణప్రసంగ మంత మనోహరము, హితావహము నని స్పష్టమైనది. అట్టి శ్రీకృష్ణునే ప్రతివాదుల కభిమానపాత్రుడగు దుర్యోధనుడు బంధింపదలచినాడన్నమాట!

ఈవ్రాతకును, "శ్రీకృష్ణుడు తనను దుర్యోధనుడు బంధిప నుద్యమించుటకు ధర్మజునితో జెప్ప లేదు. బంధింప యత్నించె నను గాధ మృష యనియు, నది సౌతికాలమున కల్పింపబడిన దనియు జెప్పెడి భారతమీమాంసావాక్యము సత్యమె యని చెప్ప సాహసించుచునాడను" (179) అనుతమవ్రాతకును బరస్పరవిరోధము.

దుర్యోధనుడు తన్ను బంధింపదలచె నని శ్రీకృష్ణుడు ధర్మజునితో జెప్పియే యుండెను. చూడుడు—

"నైష కామయతే ధర్మం నైష కామయతే యశః ।
జితంస మన్యతే సర్వం దురాత్మా కర్ణ మాశ్రితః ॥
బన్ధ మాజ్ఞాపయామాస మమ చాపి సుయోధనః ।
నచ తం లబ్ధవా& కామం దురాత్మా శాపనిశ్చయః॥" (ఉ.అ_154)

ఇట్లుండ, భారతమీమాంసాకారులును; మ. భా. చ. కారు

లును చేసినది లోకద్రోహమే! ఇక దుర్యోధనుడు శ్రీకృష్ణుని బంధింప తలపెట్టిన దెప్పుడో తెలుపవలసియున్నది.

అసలు శ్రీకృష్ణుడు హస్తినాపురము జేరకపూర్వమే బయలు వెరినట్లును, మార్గమధ్యమున వృకస్థలమునం దాగినట్లును, చారుల వలన తెలిసికొని రేపువచ్చెడి శ్రీకృష్ణున కిట్టి సత్కారములు చేయ వలె నని ధృతరాష్ట్రుడు చెప్పినపుడే దుర్యోధను డిట్లనెను—

"ఇదన్తు సుమహ త్కార్యం శృణు మే యత్సమర్థితమ్ ।
పరాయణం పాండవానాం నియచ్ఛామి జనార్దనమ్ ॥
తస్మిన్ బద్ధే భవిష్యన్తి వృష్ణయః పృథివీ తథా ।
పాండవాశ్చ విధేయా మే స చ ప్రాతరిహైష్యతి ॥
తత్రోపాయాన్ యథా సమ్య జ్ఞబుధ్యేత జనార్దనః ।
నచాపాయో భవేత్కశ్చి త్తత్భవాన్ ప్రబ్రవీతు మే ॥" (ఉ.అ-88)

నేనొక మహాకార్యము తలపెట్టితిని. పాండవుల కాధారభూతు డైన కృష్ణుని బంధింతును. అతడు బద్ధుడైనపుడు సర్వము నాకు విధే యమై యుండును. ఆబంధించుటలో కృష్ణునకు దెలియకుండునట్లు నిర పాయములైన యుపాయములను నాకు నీవు చెప్పవలెను. అని.

కనుక శ్రీకృష్ణుడు రాకపూర్వమే యీదుర్బుద్ధి దుర్యోధనునకు బుట్టినది. దానికి దగినయత్నముగూడ జేసియే శక్యముకాక విరమించు కొనెను. ప్రతివాదులు, విదురాదుల యడ్డంకిచే బంధింపలేదని వ్రాసి నారు.

ద్రౌపదీ కేశాకర్షణ వస్త్రాకర్షణాది దుష్కార్యములలో నావిదు రాదుల యడ్డంకి యేమైనది? అప్పుడేల పనిచేయలేదు? కనుక యడ్డంకిచే నూరకుండెనే? దకముపాడా? నాడా ద్రౌపదీప్రభావముచేతనే యీదు

ప్కార్యము లుడిగినవి. అట్లే నేడిశ్రీకృష్ణభగవానుని విశ్వరూపప్రదర్శన ప్రభావముచేతనే యీ దుర్వృత్తి యుడిగినది. గ్రంథసందర్భము జూడుడు —

కురుసభలో గోష్ఠిజరుగుచుండ దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శకునులు సభనుండి లేచిపోయి, యిట్లాలోచించిరి; ధృతరాష్ట్రుడు, భీష్ముడు, శ్రీకృష్ణునిచే మనల బట్టింపజేయుదు రని తోచుచున్నది. అందుచే మనమే ముందుగా నేకాకియై యున్న కృష్ణుని ధృతరాష్ట్రుడా క్రోశించుచున్నను గణింపక బంధింతము. అని. ఇట్లా దుష్టచతుష్టయ మాలోచించి సన్నాహముజేయుచుండుటను సాత్యకి గ్రహించి సభలో జెప్పెను. అంతట విదురుడు వారిదుర్నయమును జూచితివా? యని ధృతరాష్ట్రునితో జెప్పెను. అప్పుడు కృష్ణభగవానుడు —

“ఏష దుర్యోధనో రాజన్ యథేచ్ఛతి తథాస్తు తత్!
అహన్తు సర్వాంస్తనయా ననుజానామి పార్థివ”॥

ధృతరాష్ట్రా! దుర్యోధను డెట్లు సంకల్పించెనో అట్లు కానిమ్ము మీరుతలపెట్టిన పని జరుపవచ్చునని నేను నీపుత్రుల కనుజ్ఞ నిచ్చుచున్నాను. అని చెప్పగా ధృతరాష్ట్రుడు విదురునితో —

“క్షిప్రమానయతం పాపం రాజ్యలుబ్ధం సుయోధనమ్!
సహామిత్రం సహామాత్యం ససోదర్యం సహానుగమ్”॥

త్వరగా బాపాత్ముడైన దుర్యోధనుని సపరివారముగా దీసికొనితెమ్ము. అని చెప్పగా విదురుడు వెళ్లి చెప్పినమీదట దుర్యోధనాదివర్గము సభలోనికి వచ్చియుండగా మందలించి “దుర్గ్రాహ్యః కేశవో బలాత్” అనుచు దేవదానవులకు అజేయుడగు కృష్ణుని బంధింపగలవా? అని నిందించెను.

అప్పుడు దుర్యోధనుడు విని యూరకుండెను కాని నాకాసంక ల్పము లేదని చెప్పుటకాని, విరమించినట్లు సూచించుటకాని జరుగలేదు. ముఖవైఖరిని బట్టి విరమించినట్లు కనబడక పోవుటచే విదురుడుగూడ శ్రీకృష్ణుని మహిమను స్మరింపజేసి, నీవాదుస్సంకల్పమును విరమించు కొనని యెడల సపరివారముగా నీకు హాని తప్పదని బోధించెను. అప్ప టికిగూడ దుర్యోధనుని దుస్సంకల్పము తొలగలేదని ముఖవైఖరినిబట్టి గ్రహించి తనశక్తిని బ్రదర్శింపదలచి కృష్ణభగవాను డిట్లనెను—

"ఏకోఽహ మితి యన్మోహా న్మన్యసే మాం సుయోధన!
పరిభూయ సుదుర్బుద్ధే గ్రహీతుం మాం చికీర్షసి
ఇహైవ పాండవా స్సర్వే తథైవాన్ధకవృష్ణయః॥
ఇహాదిత్యాశ్చ రుద్రాశ్చ వసవశ్చ మహర్షిభిః॥
ఏవ ముక్త్వా జహాసోచ్చైః కేశవః పరవీరహా" (అ131)

దుర్యోధనా! నేనొకడనని తలంచి మోహమున నన్ను దుర్బుద్ధీ! పట్టికొనదలచుచున్నావా? ఇక్కడ నేనొక్కడనే యుంటి ననుకొనుచు న్నావా? పాండవు లిక్కడనే యున్నారు. వృష్ణి, అంధక, వీరు లందరు నిక్కడనే యున్నారు ద్వాదశాదిత్యులి క్కడనే యున్నారు. ఏకాదశరు ద్రులును, అష్టవసువులును, మహర్షులందరును యిక్కడనేయున్నారు. అనుచు కృష్ణభగవానుడు అట్టహాసముగా నవ్వెను.

అంతట కృష్ణభగవానుని సర్వావయవములనుండియునొక్కసారి బ్రహ్మాదిదేవతలు, ఇంద్రాదిలోకపాలకులు ఆయుధపాణులైన బలదే వార్జునయుధిష్ఠిరాదులు యదువృష్ణిభోజాంధకవీరులు నుద్భవించిరి.

వ. "నేత్రశ్రోత్రనాసావివరంబుల సధూమధూమకేతు జ్వాలా జాలంబులు నిగిడె రోమకూపకలాపంబులం దరణికిరణనిభప్రభలు వెడలె. నిట్లు దుర్నిరీక్ష్యంబగు నత్తేజోరూపంబు గనుంగొనం గొలదిగాక సకలజనంబులు నయనంబులు మొగిడ్చి అద్భుతభ

యానకరసంబులతోఁడ గడలకుండ, నప్పుండరీకాక్షుండును నార
దాదిమహామునుల యందును, భీష్మవిదురద్రోణసంజయులయందును
కరుణాతరంగితంబగు కటాక్షవీక్షణంబులయ వారలను దివ్యదృష్టి
యొసగిన నాపుణ్యపురుషులు సాంద్రానందంబునం దేలుచుండిరి"
(ఆం-భా)

ఇట్లు విశ్వరూపమును ప్రదర్శించి, దుర్యోధనాదుల దుస్సంకల్ప
మున్మూలిత మొనర్చెను. ఇట్లు దుర్యోధనదుస్సంకల్పోన్మూలనమున
గార్యకారియైన విశ్వరూపమును కార్యకారి కాలేదనుచున్నారు ప్రతి
వాదులు. ఆహా! యేమి విమర్శనము! నేనసహాయుడనో సహాయుడనో
చూడుమని చూపిన విశ్వరూపమునకును, అర్ధరాజ్యప్రదానమునకును
సంబంధ మేమున్నది? అప్పుడు శ్రీకృష్ణానుగ్రహమున దివ్యదృష్టినొంది
విశ్వరూపము దర్శించిన ధృతరాష్ట్రు డర్ధరాజ్య మేల యిచ్చియుండ
లేదని శంకింతురు కాబోలు. ధృతరాష్ట్రు డిట్లు చెప్పియుండెను—

"యావద్బలం మే పుత్రేషు పశ్యామి స్త్వే జనార్దన ।
ప్రత్యక్షం తే న తే కించి త్పరోక్షం శత్రుకర్శన ॥
కురూణాం శమ మిచ్ఛన్తం యతమానం చ కేశవ ।
విదిత్వైతా మవస్థాం మే నాతిశంకితు మర్హసి ॥
న మే పాపోఽస్త్యభిప్రాయః పాండవాన్ ప్రతి కేశవ । "

శ్రీకృష్ణా! నాపుత్రులవిషయమై నాశక్తి యెంతయుపయోగిం
చునో నీకు ప్రత్యక్షమైనదికదా! నాకు పాండవులయెడ బాపిష్ఠాభిప్రా
యము లేదు. కౌరవులకు శాంతినిగోరి యావచ్ఛక్తి యత్నించుచున్న
నాయవస్థ నెఱిఁగియున్న నీవు నన్ను శంకింపకుందువుగాక. అని.

ఆపై శ్రీకృష్ణుడు వెళ్ళబోవునపుడు— "వద త్యనీశ మాత్మానం
ధృతరాష్ట్రో మహీపతిః" అని, ధృతరాష్ట్రుడు తాను పరిష్కరించుట

కసమర్థుడనని చెప్పుచున్నాడు. కనుక మీయనుజ్ఞ దీసికొని వెళ్ళు చున్నానని చెప్పి వెళ్ళెను. ఈసందర్భమును బట్టి దుర్యోధనున కభి మతముకాని పనిని స్వతంత్రించి చేయగల శక్తి ధృతరాష్ట్రునకు లేకుం డుటచేతనే యాతడర్ధరాజ్య మీయ లేకపోయె నని విశద మగుచున్నది.

దుర్యోధనవశుడై మెలగెడి ధృతరాష్ట్రుడు దుర్యోధన సమ్మతిపై పాండవభాగ మిచ్చినప్పుడే ప్రశాంతి కలుగునుగాని, యాత డీయ ననియు, పాండవుల నవలీలగా వధింతు ననియు గర్జించు చూరుచుండ ధృతరాష్ట్రు డిచ్చినను లాభ మేమున్నది? కనుక విశ్వరూపదర్శనము జేసియు, పాండవులకు రాజ్యమీయదలచియు దుర్యోధనుడు పడనీయ డని ధృతరాష్ట్రుడు విరమించెను. కనుక విశ్వరూపప్రదర్శనము కార్యకారి కాకపోలేదు.

ఇట్లుండ ప్రతివాదులు—. "ఈవిశ్వరూపసందర్శనగాథ సౌతి కాలమున గూర్పబడియుండు నని భారతమీమాంసాగ్రంథకర్త తలపోయుట యుక్తముగానె యున్నది" (పు-179) అని వ్రాయుట యెంత యుక్తమైనదో గ్రహింపుడు. అనేకకర్తృత్వనిరాకరణమను ప్రథమ భాగములో సౌతికి గ్రంథకర్తృత్వము లేదని నిరూపించియేయున్నాము

—• పదేపదే చూపు విశ్వరూపము లింద్రజాలములుగానే కాన్పించును. అనుప్రసంగము— తన్నిరాకరణము—

మ. భా. చ. కారులవ్రాత యిట్లున్నది— "యుద్ధానంతరము ద్వారకకుబోవు మార్గములో ఉదంకుడను ముని కృష్ణుడు కురుపాండవులను సంధి సేయక వృథాగా కురునాశనము చేయించె నని కోపితుడు కాగా నాతనికిగూడ విశ్వరూపము జూపి యాతనిని లోబరచుకొనె నని కలదు. పదేపదే చూపు నీవిశ్వరూపములు జ్ఞానుల పక్షమున నెటులున్నను శత్రువులపక్షమున నింద్రజాలములు గానే కాన్పించునుగదా" (పు180)

ఇచ్చట ప్రతివాదుల నడుగవలసియున్నది— జ్ఞానుల పక్షము, శత్రువుల పక్షము అని వ్రాయుటలో శత్రువులనగా జ్ఞానులకు శత్రువులా? లేక విశ్వరూపికే శత్రువులా? ఎట్లైనను మీరన్న శత్రుశబ్దమునకు అజ్ఞానులనియే యర్థము పర్యవసించుచున్నది. ఇప్పుడు మీవ్రాతను జ్ఞానుల పక్షమొకటి అజ్ఞానుల పక్ష మొకటి, అని తాత్పర్యమేర్పడినది. ఇప్పుడు మీ రేపక్షములోనివారు; విశ్వరూపమింద్రజాలమని గ్రహించినవారు దుర్యోధనునివలె జ్ఞానులలో జేరరు దినకరదీప్తి దివాంధములకొరకు గానట్లు విశ్వరూపప్రదర్శనము అజ్ఞానులకొరకు గాదు. దివాంధములు దినకరదీప్తి నంధకార మనుకొనినట్లు అజ్ఞానులు విశ్వరూప మింద్రజాల మనుకొనవచ్చును. నాడు కృష్ణపరమాత్మ దివ్యదృష్టి నిచ్చి యెవ్వరికి విశ్వరూపదర్శనయోగ్యత ననుగ్రహించెనో వారికొరకే ఆ విశ్వరూపము. ఇతరులు తబ్బిబ్బై నిస్తేజస్కులై పడియుండుటకుమాత్రమే.

మరియు, నేనైనెంద్రజాలికుడైనను అట్టి విశ్వరూపమును జూపగలిగినపుడు శ్రీకృష్ణుడు చూపిన దింద్రజాల మని భావింపవచ్చునేమో కాని యది లేనపు డట్లు భావించుట యజ్ఞానమే.

ఇంకొకటి 'పదేపదేచూపు విశ్వరూపము లింద్రజాలములు గానే కాన్పించును' అను మాట ఇంద్రజాలములుగా గాన్పించునేకాని (అజ్ఞానులకన్నమాట) ఇంద్రజాలములుమాత్రము కావని ధ్వనింపర చుచునే యున్నది.

ఇంకొకటి ఇంద్రజాలములుగా గాన్పించునవి. పదేపదేచూపు విశ్వరూపము లనుటవలన పదేపదే చూపకున్నపు డావిశ్వరూపము లింద్రజాలములుగా గాన్పింపక సత్యముగనేకాన్పించునని తెలుచున్నది.

ఇప్పుడు పదేపదే చూపు టనగా ఒకొక్కని కొకొక్కసారి చూపుటా? ఒక్కనికే అనేకసారులు చూపుటా? ఒక్కని కనేక

సారులు జూపనే లేదు. ఒక్కొక్కని కొక్కొక్కసారి చూపినను ఆ యజ్ఞునునకుగాని, యాయుదంకమహర్షికిగాని, ఆకురుసభలోనినారదాది మునిపుంగవులకుగాని భీష్మద్రోణ, విదుర, సంజయ, ప్రభృతులకుగాని యింద్రజాలముగా గాన్పింపనేలేదు. దురదృష్టవశమున దుర్యోధనాదిగణమునకుమాత్రము అజ్ఞానముచే నట్లు కాన్పించెనో యేమో, ఆవిశ్వరూప మెట్టిదో యెఱుగని ప్రతివాదులకు దుర్యోధనునకు దోచినట్లు తోచుట విచిత్రాంశము.

ఇక 'కురుపాండవులకు సంధిసేయక కృష్ణుఁడు కురునాశనము చేయించె నని ఉదంకముని కుపితుడయ్యె' నను విషయమున్నది.

దుర్యోధనునకు సంధి యను మాటయే కిట్టకపోవుటచే సంధి జరుగలేదు. కాని శ్రీకృష్ణుడు సంధి సేయక జరుగకపోలేదని నిరూపించియే యున్నాము.

ఉదంకమహర్షి— శ్రీకృష్ణా! నీయుపదేశముచే కౌరవులు శాంతింపగా పాండవులు స్వరాజ్యమందు సుఖించుచున్నారా? అని ప్రశ్నించెను. అపుడు శ్రీకృష్ణుడు. మహర్షీ! కౌరవులను శాంతింపజేయుటకు చాలప్రయత్నించితిని. నాకు శక్యము కాలేదు. బుద్ధిచేగాని, బలముచేగాని, దైవము అతిక్రమింప శక్యము కాదని నీకు విదితమే. భీష్మాదుల యొక్కయు, నాయొక్కయు, హితోపదేశముల నతిక్రమించి కౌరవులు యుద్ధము చేసి మరణించిరి,

ఇట్లు చెప్పగా మహర్షి— సర్వసమర్థుడ వగు నీవు కౌరవులను రక్షింపకపోవుటవలన నిన్ను శపించుచున్నా ననెను. అపుడు శ్రీకృష్ణుడు నీకు నే నధ్యాత్మవిషయుమును చెప్పెదను. అదివిని యాపై శాపము గానిమ్ము.నన్ను అల్పతపముచే దిరస్కరింప లేరు. నీతపోహాని నాకిష్టము

లేదు. అని యుత్తరము చెప్పగా మహర్షి— యధ్యాత్మవిషయము జెప్పుము. ఆటుపై నేమిచేయవలెనో చూతును. అని కోరగా శ్రీకృష్ణు డుపదేశించుచు—

"అహం విష్ణు రహం బ్రహ్మా శక్రోఽథ ప్రభవాప్యయః!
భూతగ్రామస్య సర్వస్య స్రష్టా సంహారఏవచ"||
'అధర్మే వర్తమానానాం సర్వేషా మహ మచ్యుతః|
ధర్మస్య సేతుం బధ్నామి చలితే చలితే యుగే"
మానుష్యే వర్తమానేన కృపణం యాచితా మయా|
న చ తే జాతసంమోహా వచోఽగృహ్ణన్త మోహితాః||"

బ్రహ్మవిష్ణ్వాదిస్వరూపుడను నేనే, సృష్టిస్థితిలయకర్తను నేనే. అధర్మ భూయిష్ఠమైన కాలములో ధర్మసేతువును బంధించుచుండువా డను నేనే. మనుష్యరూపముతో నున్న నేను కౌరవులనె తరమో సంధి కై యాచించితిని. వారు మూఢులై గ్రహింపలేదు. ఇట్లు బోధింప గా మహర్షి—

"అభిజానామి జగతః కర్తారం త్వాం జనార్దన|
నూనం భవత్ప్రసాదోఽయ మితి మే నాస్తి సంశయః||
చిత్తంచ సుప్రసన్నం మే త్వద్భావగత మచ్యుత|
వినివృత్తం చ మే శాపా దితి విద్ధి పరంతప|
ద్రష్టుమిచ్ఛామి తే రూప మైశ్వరం తన్నిదర్శయ ||"

శ్రీకృష్ణా! నిన్ను జగత్కర్తగా దెలిసికొంటిని. యిది నీయనుగ్ర మే. నాచిత్తము పరిశుద్ధమైనది. శాపసంకల్ప మంతరించినది. నీయై శ్వరస్వరూపమును దర్శింప నిచ్ఛ యున్నది. అనుగ్రహింపుము"

అని ప్రార్థింప నప్పుడు విశ్వరూపము బ్రదర్శించి యనుగ్రహిం చెను. ఇట్లు అధ్యాత్మోపదేశమాత్రముతో చిత్తశుద్ధి కలిగి విధేయు

ధైర్యాపై విశ్వరూపము జూడగోరెనని గ్రంథమం దుండగా లోబర చుకొనుటకే విశ్వరూపము జూపి కుపితుని లోబరచుకొనె నని ప్రతి వాదులు వ్రాయుట నేమనవలెనో!

ఈయుదంకవృత్తాంతమువలన శ్రీకృష్ణునిది నిష్కపటవృత్తియే యని స్పష్టమగుచున్నందున ప్రతివాదులు — "శ్రీకృష్ణుడు పాండవపక్షముగా మెలగి దుర్యోధనాదుల కెటులనైన వంచన సేయవలయు ననియే తలచియుండెను" (పు-180) అని వ్రాసినదికూడ పరాస్తమైనది.

—: శ్రీకృష్ణుడు సామముతో సంధివాక్యము లారంభింపక దుర్యోధనాదులకు కోప ముద్రేకింపజేసె నను ప్రసంగము. తన్నిరాకరణము:—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది—

"శ్రీకృష్ణుడు సంధవాక్యముల నించుకంతయు సామారంభముగా గాక దుర్యోధనాదుల యపకృతులను ముందర నుద్ఘాటింపుచునే ప్రారంభించి దుర్యోధనాదుల కోపము నుద్రేకింపజేసెను, ద్రౌపదీపరిణయానంతరము పాండవుల కర్ధరాజ్య మిచ్చుటతో ముగిసిన దుర్యోధనాపరాధముల నేల కృష్ణుడు సంధిసమయమున దవ్వ్వుకొనవలెను" (పు-264)

శ్రీకృష్ణుని సంధివాక్యములు సామారంభముగా లేవనుచున్న ప్రతివాదులు–'దుర్యోధనుడు తన్ను బంధింప బూనెను' అను ఘటనను యుధిష్ఠిరునితో శ్రీకృష్ణుడు చెప్పనందున నాగాథ యసత్యమని వ్రాసినవారు కనుక యుధిష్ఠిరునితో శ్రీకృష్ణుడు కురుసభలో నేమి జరిగినట్లు చెప్పెనో అది సత్యమని వారంగీకరింపవలసియే యున్నది. కనుక యుధిష్ఠిరునితో శ్రీకృష్ణుడు తానెట్లు సంధివాక్యములు నడిపితి నని చెప్పెనో ప్రతివాదులకు వినిపింతును—

"సామ్య మాదౌ ప్రయుక్తం మే రాజన్ సౌభ్రాత్ర మిచ్ఛతా।
యదా నాద్రియత తే వాక్యం సామపూర్వం సుయోధనః
తదా మయా సమానీయ భేదితా స్సర్వపార్థివాః
మ్యాతతో ధార్తరాష్ట్రాణాం నిన్దాం కృత్వా తథా పునః
భేదయిత్వా నృపాన్ సర్వాన్ వాగ్భిర్మన్త్రేణ చాసకృత్
పున స్సామాభిసంయుక్తం సంప్రదాన మథాబ్రువమ్
సర్వం భవతు తే రాజ్యం పంచగ్రామా న్విసర్జయ
అవశ్యం భరణీయా హి పితు స్తే రాజసత్తమ
ఏవ ముక్తోఽపి దుష్టాత్మా నైవ భాగం వ్యముంచత
దండం చతుర్థం పశ్యామి తేషు పాపేషునాన్యథా."।(ఉద్యో అ150)

యుధిష్ఠిరా! మొదట సామోపాయముతో బోధించితిని. దాని కాతడు సమ్మతింపలేదు. అప్పుడు ఆతని దుశ్చేష్టల నెత్తుకొని భేదోపాయముతో సభాసదుల కాతనియందు ప్రీతి లేకుండ భేదింపజేసితిని. మరల సామపూర్వకముగా దానోపాయము నాశ్రయించి, నీకే రాజ్యముండనిమ్ము పాండవులను మీరు పోషింపవలసియున్నది కనుక నైదుగురి కైదు గ్రామములు విడిచిపెట్టుము. అని బోధించితిని. ఆదుష్టుడు దానికి నంగీకరింపలేదు. ఇక చతుర్థోపాయమగు దండమే శరణ్యము. అని శ్రీకృష్ణుడు చెప్పెను.

దీనివలన సంధివాక్యములుసామారంభముగనేజరిగినట్లుస్పష్టము. కానప్రతివాదిప్రసంగము త్యాజ్యము, 'ఎప్పుడో ముగిసిపోయిన దుర్యోధనాపరాధములను సంధిసమయమున శ్రీకృష్ణు డేల త్రవ్వికొనవలసి వచ్చెనో' అను ప్రతివాదులకు దెల్పుదుము. ఆదినుండియు పాండవుల యెడ నీవెన్నియపరాధములు చేసియున్నను సహించి పడియున్న యాసత్పురుషులయందు నీ వింత శత్రుత్వము వహింపవచ్చునా! అని బోధించుటకై వానిని త్రవ్వవలసివచ్చెను.

మరియు నేను నిరపరాధుడ నని యీప్రతివాదులు వెనుకజూపి నట్లుపలికినదుర్యోధనునకు ఆతడాదినుండియు జేసియున్న యపరాధములనువెనుకజూపబడినట్లు తెలుపుటకై అవి త్రవ్వవలసివచ్చెను.

మఱియు — అది భేదోపాయము. దుర్యోధను డెవ్వరి బలము జూచుకొని యుద్ధమునకు గాలు దువ్వుచుండెనో వారి కాతనియందు ప్రీతి లేకుండ జేయుటకు జ్ఞాతిద్రోహరూపములైన దుర్యోధనుని దుర్మార్గము లుద్ఘాటింపబడినవి.

'శ్రీకృష్ణుడు సంభాషించునపుడు దుర్యోధనాదుల కోపము నుద్రేకింపజేసెను' అని వ్రాసిన ప్రతివాదుల నడుగవలసియున్నది. ఎట్లు సంభాషించిన వారల కోప ముద్రేకింపకుండునో చెప్పగలరా? వారిది వారికిమ్మని, లేక స్వల్పముగానైన నిమ్మని చెప్పుటకింతె సంధి నిమిత్తమైన సంభాషణము ఏముండును? ఆమాట, సూదిమొనమోపి నంతైన నేను వారికీయనని కూర్చుండిన దుర్యోధనునకు కర్ణకఠోరమే. ఇమ్మని చెప్పక సంధికై సంభాషించుటెట్లు. ఇయ్యననువాని కామాటపై కోపముద్రేకింపకుండు టెట్లు? కనుక ప్రతివాదుల దసంగత ప్రసంగము.

నాటి కురుసభలో నున్న కణ్వ, నారద, జామదగ్న్యాదిమహర్షులుకూడ శ్రీకృష్ణోపదేశమును బహునిదర్శనములతో వివరించి యిదియే హితావహమని బోధించినారు. భీష్మ, ద్రోణ, విదుర, ధృతరాష్ట్ర, ప్రభృతులు శ్రీకృష్ణోపదేశ మవశ్యాశ్రయణీయ మని నొక్కిచెప్పిరి. గాంధారికూడ భీష్మద్రోణులు చెప్పినట్లు కృష్ణార్జును లజేయులే కనుక దుర్యోధనా!

"ప్రపద్యస్వ మహాబాహుం కృష్ణ మక్లిష్టకారిణమ్ ।
ప్రసన్నోహి సుఖాయ స్యా దుభయోరేవ కేశవః ॥"

నీవు శ్రీకృష్ణు నాశ్రయింపుము. ఆతని ప్రసన్నత ఉభయపక్షములకు సౌఖ్యావహము. అనియే చెప్పుచువచ్చెను.

ఇట్లు మహర్షులు, ఆప్తులు, తల్లిదండ్రులుకూడ శ్రీకృష్ణోపదేశమునకు హర్షించి యట్లు చేసిసుఖింపుమని యెంతచెప్పినను వినక చం

పుటో చచ్చుటో కావలసినదే యని మూర్ఖత వహించిన దుర్యోధనుడు నిరపరాధుడనియు, శ్రీకృష్ణుడు సంధిజరుగకుండ జేసె ననియు ప్రతివాదులనుట యెంతయు వింత!

—♦ "శ్రీకృష్ణుడే సంధి పొసగకుండ జేసెనని గాంధారీవాక్యములచే స్పష్టము" అను ప్రసంగము— తన్నిరాకరణము ♦—

మ. భా. చ. కారులు వ్రాత ఇట్లున్నది— "ఈగాంధారీవాక్యములచేగూడ కృష్ణుడే సంధి పొసగకుండ జేసెననిస్పష్టమగుచున్నది—

"ఇచ్ఛతోపేక్షితో నాశః కురూణాం మధుసూదన।
యస్మాత్త్వయా మహాబాహో ఫలం తస్మాదవాప్నుహి ॥"

ఓకృష్ణా! నీవిచ్ఛయించుట వలననే కౌరవుల నాశ ముపేక్షింపబడెను. అందువలన నీవాఫలము ననుభవింతువుగాక. ఇది గాంధారిపాలికలనిలో యుద్ధమృతుల జూచునప్పుడనిన మాట" (పు183)

ఈగాంధారీవాక్యములో 'నాశః ఉపేక్షితః' అని యుండుటవలన ఇష్టమై నీ వుపేక్షించుటనుబట్టి నాశము కలిగినది. నీవు కలుగజేసికొనిన నశింతురా? అని దుఃఖించినట్లు స్పష్ట మగుచున్నది. అంతియకాని నీవు కలుగజేసికొని సంధ పొసగకుండ జేసి యిట్లు నశింపజేసితివన్నట్లు లేదు. కృష్ణభగవానుడు-సంకల్పసిద్ధుడుకనుక వీరు నశింపకుండవలెనని సంకల్పించినయెడల జీవించియుందురుకదా! అని పుత్రశోకసంతప్తురాలగు గాంధారి కష్టపడసిరించినది.

ఇంకొకటి—ప్రతివాదులు చూపిన శ్లోకమునకు వెనుక గాంధారి వాక్యము లిట్లున్నవి.—

"తదైవ నిహతాః కృష్ణ మమ పుత్రాస్తరస్వినః।
యదైవాఽకృతకామ స్త్వ ముపప్లావ్యం గతః పునః ॥"

శ్రీకృష్ణా! సంధికై వచ్చిన నీవు అకృతకాముడవై అనగా కోరిక నెరవేరనివాడవై తిరిగి పాండవులకడకు, ఎప్పుడు వెళ్లియుంటివో అప్పుడే పుత్రులు మరణించిరి. అని చెప్పి, భీష్మద్రోణులు, నాతో నీవు పుత్రప్రేమను వదలుకొనుమని దూరదృష్టితో నాడే చెప్పియున్నారు. అని దుఃఖించి భూమిపై బడి— "శోకమూర్ఛితా, దుఃఖోపహతవిజ్ఞానా, కోపపరీతాంగీ, పుత్రశోకపరిప్లుతా, జగాద శౌరిమ్" ఒడలెరుగని స్థితిలో పుత్రశోకమున ప్రతివాదులు చూపిన వాక్యము లనినది.

అట్లు 'యద్వై వాకృతకామ స్త్వమ్' అనుచు సంధికై వచ్చిన నీకోరిక నెరవేరకపోయె నని యామె విలపించియుండ, సంధి పొసగ కుండజేసితివని విలపించినదని ప్రతివాదు లపలపించుట విచిత్రాంశము.

'నీవాఫల మనుభవించుదువుగాక' అని ప్రతివాదులన్నట్లుగాంధారి యనినది. ఇంకను, శపించుచున్నానని చెప్పి నీజ్ఞాతులు హతు లగుదురు. పుత్రమిత్రాదులు హతులుకాగా నీవుకూడ కుత్సితోపాయమున నిధనము నొందుదువు. అనికూడ ననినది. అట్లనునప్పటి కామె శోకమూర్ఛిత, దుఃఖోపహతవిజ్ఞాన, పుత్రశోకపరిప్లుత, కోపపరీతాంగి మైయున్నది. ఒడలెరుగనిస్థితిలో నాడిన యామెమాటలనుబట్టికొని కృష్ణభగవానుని నిందింపబూనిరి ప్రతివాదులు. ఆగాంధారీశాపవాక్యములపై కృష్ణభగవాను డేమనెనో చూడుడు—

క. అనిఘోరంబుగ బలికిన విని విపులమనస్కుఁడైన విష్ణుడు చిఱునవ్వున నానన మొప్పగ నవ్వనితకు నిట్లనియె గౌరవస్తుత్యముగన్.

తే. మున్నకాదె యాదవులకు మునివరేణ్య
కలితదారుణశాపంబు గలదు నీకు
నేల చర్వితచర్వణ మిట్లు సేయ
దీన నీవేమి త్రివ్వితి బాసి జెపుము.

క. యదువంశజాతులకు తప్పదు నాశము వారి సుకలు బరిమార్పగ లే
రది కారణంబుగాగ దెగుదు రొండొరుచేత రణముఘోరత్వముగన్.
వ. ఇట్లు పలికిన యచ్యుతుండు, అద్దేవి నుద్దేశించి లేవమ్మా! మృతు
లైన సకలబంధుమిత్రులకు నగ్నికార్యంబులు సేయింపవలయు నని
వెండియు —

సీ. "వినుము గాంధారి నీతనయుండు చేయు దు
ర్నయము లెఱుంగవె నాకు నీకు
శాంతనవునకు నాచార్యునకును బాహ్లి
కునకు దండ్రికి మాన్ప గొలదిగాని
దుర్మానమున నట్లు దొడరి యిట్లయ్యె మీ
యపరాధమున వచ్చినట్టి కీడు
నకు నింత నొవ్వంగ నను బల్క దగునె యు
మ్మలికంబు ధృతిఁ బట్టి మాన్పు మింకఁ
తే. జేటునకుఁ జావునకు వగఁజెందు జనుల
కినుమడింపదె మానసమున నలంత
రాచకూతుండ్రు సుతుల సంగ్రామనిరత
హృదయులగువారి గాంచ గోరుదురు కాదె"

వ. అని చెవిసూడినట్లు పలికినవిని నిరుత్తరయైగాంధారియూరకుండెను.

ఈగ్రంథముచే కృష్ణభగవానుని సౌమనస్యము, పుత్రశోకార్తు
రాలగు గాంధారి తొందరపాటు స్పష్టము. నీవు, నేను, ధృతరాష్ట్రుడు
అందరము చెప్పి నీపుత్రుని యుద్ధసంకల్పమును మాన్పలేకపోతి మని
కృష్ణభగవానుడు పలికి మీయపరాధమున జరిగిన పనికి నన్నిట్లన
వచ్చునా? అని యడిగినట్లును, గాంధారి నిరుత్తరయై యున్నట్లును
స్పష్టము కనుక, తల్లితండ్రులవలె సంధి జేసికొనుమని యుపదేశించిన

కృష్ణభగవానుని గూర్చి ప్రతివాదు లెంత విరుద్ధముగా వ్రాసిరో ప్రాజ్ఞు లెఱిగికొందురుగాక.

ఇంకొకటి :- యుద్ధమృతులను జూచెడి యాసమయమందే యుధిష్ఠిరుడు గాంధారికి వందనము జేయవచ్చినపుడు ఆమె యాతనిని శపింప నుంకుటకై వేదవ్యాసభగవానుడు ప్రత్యక్షమై గాంధారితో నిట్లనెను.

దుర్యోధనుడు యుద్ధారంభములో నీయొద్దకు వచ్చి అమ్మా నాకు నీవిజయాశీర్వచన మిమ్మని నిన్ను యాచించినపుడు 'యతో ధర్మ స్తతో జయః' అని పలికితివి. అట్లు పలుకుటలో పాండవపక్షమున ధర్మ మున్నదని యేకదా నీతాత్పర్యము. అప్పు డంత సహనశీలవై యిప్పుడేల సహింపవు? ధర్మజ్ఞురాల! నీవధర్మము విడువుము. నీవు నాడు పలికిన మాటను, ధర్మమును స్మరించి నీసుతులగు పాండవులయందు శాంతి వహించియుండుము.

ఈమాటలను విని గాంధారి—

"భగవ న్నాభ్యసూయామి నైతా నిచ్ఛామి నశ్యతః।
పుత్రశోకేన తు బలా న్మనో విహ్వలతీవ మే॥
దుశ్శాసనాపరాధేన శకునే స్సౌబలస్య చ
కర్ణదుర్యోధనాభ్యాంచ కృతోఽయం కులసంక్షయః॥
నాపరాధ్యతి బీభత్సు ర్న చ పార్థో వృకోదరః।
నకుల స్సహదేవశ్చ నైవ రాజా యుధిష్ఠిరః॥" (స్త్రీపర్వ)

మహర్షీ! పాండవులపై నా కసూయ లేదు. వారికి చేటుకలుగవలె నని కోరెడిదానను కాను. పుత్రశోకముచే నామనస్సు తొట్రుపడిపోవుచున్నది. శకుని దుశ్శాసనుల దుర్మార్గులను బట్టి కర్ణదుర్యోధనుల మూలమున కులక్షయము సంభవించినది. పాండవు లెవ్వరి

యందును అపరాధము లేదు అని పలికినది. కనుక కౌరవకులక్షయమునకు— అదృష్టచతుష్టయమే మూలముకాని పాండవులు, శ్రీకృష్ణుఁడు కారనుట కీగాంధారీవచనమే సాక్షి.

ఇంకొకటి— యుద్ధమృతులను జూడవచ్చి శోకించు ధృతరాష్ట్రుఁడు— నేను దుర్మతినై యాప్తులు చెప్పినట్లు చేయకపోవుటవలన నింత దుఃఖము కలిగిన దని పరితపించుటలో నిట్లనుకొనెను.—

"న కృతం సుహృదాం వాక్యం జామదగ్న్యస్య జల్పతః ।
నారదస్య చ దేవర్షేః కృష్ణద్వైపాయనస్య చ
సభామధ్యేతు కృష్ణేన యచ్ఛ్రేయోఽభిహితం మమ
అలం వైరేణ తే రాజన్ పుత్రి స్సంగృహ్యతా మితి
తచ్చ వాక్య మకృత్వాఽహం భృశం తప్యామి దుర్మతిః
నహి శ్రోతాస్మి భీష్మస్య శర్మయుక్తం ప్రభాషితమ్."

నాటికురుసభలో శ్రీకృష్ణుఁడు, పాండవులతో వైరము మాని వారిని జేరదీయుమని నాకుహితోపదేశముజేసియుండ దుర్మతినై వినకపోతిని. జామదగ్న్యుఁడు చెప్పినను వినకపోతిని. నారదమహర్షి చెప్పినను వినకపోతిని. వ్యాసమహర్షి చెప్పినను వినకపోతిని. భీష్ముఁడు చెప్పినను వినకపోతిని. ఇప్పుడు దాని ఫల మనుభవించుచున్నాను. అని.

ఇట్లు పుత్రశోకముతోనుండికూడ సంధి జేయవచ్చిన శ్రీకృష్ణుని మాటలను తిరస్కరించినందువలన నిట్టి కష్టము ప్రాప్తించినదని ధృతరాష్ట్రుఁడు గోలపెట్టియుండ ప్రతివాదులు శ్రీకృష్ణుడే సంధి చెడగొట్టె నని వ్రాయుట యెంత చిత్రమో కదా! ఇట్టి వ్రాతలు లోకమున కెంత హానికరములు! ఇక దీనిని విడిచి విషయాంతర మందుకొందము.

—: "యావద్భగవద్గీతయొక్క కర్తృత్వము శ్రీకృష్ణునకు లేదు"
అనుప్రసంగము—తన్నిరాకరణము :—

మ. భా. చ. కారులవ్రాత యిట్లున్నది—

"యావద్భగవద్గీతయొక్క కర్తృత్వము శ్రీకృష్ణునకు లేదని తలచువారు గలరు. అది సత్యమేయై యుండును. కారణ మేమన మహాయుద్ధము సంప్రాప్తమై యిక బాణములను విడువబోవుచుండగా నర్జునునకు నాలుగువందలయిరువదిశ్లోకముల నాశువుగా గవిత్వము చెప్పి యుపదేశించె ననుట యయుక్తముగానె కాన్పించును. ఆసమయమున కృష్ణార్జునులకు జరిగిన సంభాషణము నేసంజయుఁడో విని హిమాలయమున భారతరచనము చేయు వ్యాసునకు జెప్పగా నాతడు కొంత పెంచి వ్రాసియుండును" (పు-185)

ఈప్రతివాదుల కొకింత బోధితము. ఏగ్రంథమునకు 'భగవద్గీత' అను పేరు కలదో! ఆపేరే యాపేరులోని భగవచ్ఛబ్దమున కర్థమైయున్న కృష్ణభగవానుని సంబంధము ఆగ్రంథమంతకును గలదని తెలుపుచుండ యావద్గ్రంథసంబంధము శ్రీకృష్ణునకు లేదనుట వింత. అన్నిశ్లోకముల నంతలో నాశుకవిత్వము జెప్పి యెట్లుపదేశించెనందురా! మహాభారత కర్త వ్యాసమహర్షియైయుండ మహాభారతాంతర్గతమగు భగవద్గీతకు శ్రీకృష్ణుడు కర్తయని చెప్పవా డెవ్వడు? అట్లైన భగవద్గీతకు వ్యాససంబంధమే కాని శ్రీకృష్ణసంబంధ మెట్లందురా! వినుడు— ప్రవృత్తిధర్మము, నివృత్తిధర్మము అని ద్వివిధమైయున్న వేదోక్తధర్మమును శోకమోహామహోదధిమగ్నుడైన యర్జునునకు కృష్ణభగవాను డుపదేశించెను. ఆయుపదేశింపబడిన విషయమునే సర్వజ్ఞుడగు వ్యాసమహర్షి యేడువందల శ్లోకములుగా రచించెను. ఇట్లు గీతావిషయోపదేశమునుబట్టి శ్రీకృష్ణసంబంధము, గీతాగ్రంథరచననుబట్టి వ్యాససంబం

ఖము గీతకు గలిగినది. చూడుడు— శాంకరభాష్యము—

"వైదికం హి ధర్మద్వయ మర్జునాయ శోకమోహమహోదధౌ నిమగ్నా యోపదిదేశ తం ధర్మం భగవతా యథోపదిష్టం వేద వ్యాస స్సర్వజ్ఞో భగవాన్ గీతాఖ్యై స్సప్తభి శ్శ్లోకశతై రుపనిబబన్ధ"

ఇక, బాణముల విడువబోవుచుండగా నంతవిషయ ముపదేశించుట, అయుక్తమందురా? గీతోపదేశ మెప్పుడో బాణప్రయోగ మెప్పుడో చూడుడు—

"గీతాప్రస్తావః. యుధిష్ఠిరేణ రథా దవరుహ్య భీష్మాద్యభివాద నపూర్వకం తేభ్యో జయాశీర్గ్రహణమ్. యుధిష్ఠిరే పునర్భ్రాతృభిస్సహ రథారూఢే సన్నాహభేరీవాదనమ్. కురుపాండవ సేనయో ర్యుద్ధారంభః"

ఈక్రమమంనుబట్టి సన్నాహభేరీవాదనమైనగాని యుద్ధారంభము లేదు. ఉభయపక్ష సేనలు వ్యూహములు పన్నుకొని సిద్ధముగా నుండు సమయమున గీతోపదేశము ముందైనది. తరువాతనే యుధిష్ఠిరుడు— సోదరులు వెనుకవచ్చుచుండ కౌరవసేనయొద్దకు పాదరిచారియై వెళ్ళి భీష్మద్రోణాదులకు నమస్కరించి వారి జయాశీర్వాదములు స్వీకరించి, మరల వచ్చి సోదరులతో రథము లధిష్ఠించి సన్నాహభేరీ వాదనము గావించినపిమ్మట బాణప్రయోగము జరిగినది. కనుక గీతా విషయోపదేశమున కది సమయము కాకపోలేదు. "అప్పుడు కృష్ణార్జునులకు జరిగిన సంభాషణము నేసంజయుడో చెప్పగా హిమాలయమందు భారతము వ్రాయుచున్న వ్యాసుడు పెంచి వ్రాసియుండు" నను ప్రతివాదుని యూహ మెచ్చదగినది. "ఇట్టి వేదాంతోపదేశములు— తెగింపుమాటలు. పిమ్మట నేడువందలశ్లోకములకు మించిన భగవద్గీతగా బరిణమించినది" (పు-185) అను ప్రతివాదులకు విద్యాగంధ మెంత కలదో స్పష్టమైనది.

— "శ్రీకృష్ణునకు అడ్డబొట్టు, ఊర్ధ్వపుండ్రము, అంగారముద్రలు కలవు" అను ప్రసంగము— తన్నిరాకరణము—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— భారతీయవాఙ్మయమున భగవద్గీతకు గల పూజ్యత యద్వితీయము. శ్రీశంకరాచార్యాదులగు మహామహులు ఉత్తమభాష్యములను వ్రాసిరి. అనూహ్యమతచిహ్నితుడగు శ్రీకృష్ణునకు అద్వైతు లడ్డబొట్టును, విశిష్టాద్వైతులు ద్వాదశోర్ధ్వపుండ్రములను, ద్వైతు లంగారముద్రలను దగిల్చిరి. ఇపుడు క్రైస్తవులు మహమ్మదీయులుకూడ గీతలను పఠించుచుండుటచే భవిష్యత్తున సిలువ చిహ్నమును, చంద్రాంకితమునుగూడ శ్రీకృష్ణుడు ధరించువాడు కావచ్చునట." (పు 86)

ఇది యొకరకమైన యెత్తిపొడుపు. 'శ్రీకృష్ణు డనూహ్యమతచిహ్నితు డట' అనగా నూహింపనలవికాని మతచిహ్నము కలవాడని యర్థము, అది నిజమే భగవంతుని స్వరూపస్వభావములు, ఊహకు (అనుమానమునకు) గోచరించునవి కావనియు, శాస్త్రైకసమధిగమ్యములే యనియు, శాస్త్రయోనిత్వాధికరణమున విశదీకరింపబడి యుండలేదా.

'ద్వైతాద్వైతవిశిష్టాద్వైతు లొక్కొక్క-బొట్టును తగిల్చిరట' ఔను. వైదికసంప్రదాయానువర్తు లందరు తమతమ సంప్రదాయముల కనుగుణముగా నలంకరించి భజించుట— శ్రీకృష్ణుడు భగవంతు డనుటకు తార్కాణము.

"క్రైస్తవులు, మహమ్మదీయులు ముందు తనమతచిహ్నములుగూడ ధరింపజేయుదురట, జగదీశ్వరుడు. ఆయాసంప్రదాయములకు జెందిన మనుజులు స్వకీయసంప్రదాయపద్ధతుల ననుసరించి తన్నారాధించినపుడే సంతుష్టుడగును వారుకోరిన ఫలము నిచ్చుచుండును. కనుకనే "యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్" అని భగవంతుడు చెప్పెను.

కనుక, ప్రతివాదులు కృష్ణభగవానుని నిందించి చేటుదెచ్చు కొనక స్వకీయ సంప్రదాయానుగుణముగా భజించి బాగుపడగోరు చున్నాము.

—: "శ్రీకృష్ణుని గీతోపదేశముసరిగా బోధపడ లేదని యర్జునుడు మరల జెప్పుమని యడిగెను" అను ప్రసంగము-తన్నిరాకరణము :—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— "కురుక్షేత్రమున జెప్పిన యంశములు తొందరలో నుండుటచే నాకు సరిగా బోధపడ లేదుగానఆగీతాంశముల మరలజెప్పుమని యర్జునుడుఇంద్రప్రస్థపురిలో శ్రీకృష్ణు నడిగెను. శ్రీకృష్ణుడును ఆ యంశములు నాకును సరిగా జ్ఞాపకము లేవని 'అనుగీత, చెప్పెను"(పు186)

ఆహా! భగవద్గీతసరిగా బోధపడ లేదని యర్జునుడన్నాడట! గీత నుపదేశించి—

"కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా!
కచ్చి దజ్ఞానసంమోహః ప్రనష్ట స్తే ధనంజయ"!।

పార్థా! ఏకాగ్రతతో వింటివా? నీయజ్ఞానమోహములు తొలగెనా? అని యడుగగ పార్థుడు —

"నష్టో మోహః స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాఽచ్యుత!
స్థితోఽస్మి గతసందేహః కరిష్యే వచనం తవ"॥

అనుచు శ్రీకృష్ణా! నీయనుగ్రహమున నాకు దెలిసినది. మోహము తొలగినది. సందేహనివృత్తి యైనది. నీవు చెప్పినట్లు చేయుదును. అని చెప్పియుండెను.

దీనినిబట్టి యర్జునునకు బోధపడుటయేగాదు- బోధకు ఫలితమైన మోహనివృత్తియు, దానికి ఫలితమైన స్వధర్మాచరణముకూడ కలిగినది. కనుక ప్రతివాదులమాట యప్రమాణము. 'శ్రీకృష్ణుడుకూడ నాకును సరిగా జ్ఞాపకము లేదని యనుగీత చెప్పె' నట! ఈయను గీతకు ప్రస్తావ మేమనగా, శ్రీకృష్ణా! నీవు ద్వారకకు వెళ్ళబోవుచున్నావు. నాదొక ప్రార్థన కలదు -

"యత్తద్భగవతా ప్రోక్తం పురా కేశవ సౌహృదాత్ ।
తత్సర్వం పురుషవ్యాఘ్ర నష్టం మే భ్రష్టచేతసః ॥"

నాకు నీవప్పు డుపదేశించిన విషయమునకు మరపుతగిలినది. దానిని వినగోరుచున్నాను. అని ప్రార్థించెను. ఇక్కడ 'నష్టమైనది' అను మాటకు బోధపడలేదని యర్థము కాదు విస్మృతి కలిగిన దని యర్థము. అనుగీతావతరణికలో శ్రీగౌడపాదాచార్యులవారిట్లు వ్రాసి యున్నారు. చూడుడు —

"కురుక్షేత్రే భగవదుపదిష్ట మాత్మతత్త్వోపదేశం విషయభోగ ప్రావణ్యేన విస్మృత్య పున స్తదేవాత్మతత్త్వం జ్ఞాతుం భగవన్తం పృచ్ఛతి"

అట్లడిగినపుడు చెప్పబడినది యనుగీత. అనగా గీత ననుసరించి చెప్పబడిన దని యర్థము. ఇట్టిస్థితిలో 'శ్రీకృష్ణుడు నాకును సరిగా జ్ఞాపకములేదనె' ననిన ప్రతివాదుల దెంత సాహసము!

అపుడు శ్రీకృష్ణుడు, అది యావిధముగా జెప్పుటకు శక్యము కాదు.

"ఇతిహాసన్తు వక్ష్యామి తస్మిన్నర్థే పురాతనమ్"

ఆవిషయమైన యితిహాసమును నీకు జెప్పెదను. అనుచు అనుగీతాపర్వము 16వ అధ్యాయమునుండి యారంభించి చెప్పుచువచ్చి, 19వ అధ్యాయములో—

"కచ్చి దేత చ్ఛ్రుతం పార్థ త్వయైకాగ్రేణ చేతసా ।
తదాపిహి రథస్థస్త్వం శ్రుతవా నేత దేవహి ॥ "

పార్థా! ఏకాగ్రతతో వింటివా? నాడుకూడ రథమందుండి వినిన దిదియేన అని చెప్పెను. మరల 51వ అధ్యాయములో—

"త్వత్ప్రీత్యా గుహ్య మేతచ్చ కథితం తే ధనంజయ ।
పూర్వ మప్యేత దేవోక్తం యుద్ధకాల ఉపస్థితే ॥ "

నీయందలి ప్రీతిచే జెప్పితేని వెనుక యుద్ధసమయములోగూడ నిదియే చెప్పబడినది. అని చెప్పెను. ఇట్టి శ్రీకృష్ణుడు నాస్తిక జ్ఞాపకము లేదనెనా! కనుక ప్రీతివాదుల ప్రసంగము మూరాపాస్తమైనది.

—: "గీత ప్రవృత్తిపరముగా జెప్పబడిన బ్రహ్మవిద్య" అను ప్రసంగము—తన్నిరాకరణము :—

మహాభారతరహస్యకారుల వ్రాత యిట్లున్నది— "గీత ప్రవృత్తిపరముగా జెప్పబడిన బ్రహ్మవిద్య యని యావద్గ్రంథమునందును ఘంటాపథముగా చెప్పబడియున్నను సాంప్రదాయసిద్ధమైన పట్టుదలగల వ్యాఖ్యానకర్తలందరు తమతమసాంప్రదాయముల కనుకూలముగా భగవద్గీతపై భాష్యములను వ్రాయుటలో నించుకేనియు మహాభారతాభిప్రాయమును గమనింపక దానిని మహాభారతమునుండి పూర్తిగా వేరుచేయుచున్నారు. (పు–190)

ఈభాష్యకర్తలలో శంకరాచార్యమతమే గీతాహృదయమనుటలో సంశయము లేదు. శంకరభాష్యానుసారముగా మతములో వివాద మేమియు లేదుకాని, తమ సంన్యాససాంప్రదాయమే గీతలో ప్రతిపాదింపబడియున్న దనుటలోమాత్రము కొంచెమురుచిభేదమున్నది" (పు–194) ప్రవృత్తిమార్గము–కర్మమార్గము.(పు196)

వీరి మాటలను పరిశీలింతము——"గీత ప్రవృత్తి (కర్మ) పరముగా జెప్పబడిన బ్రహ్మవిద్యయట, బ్రహ్మపరముగా జెప్పబడినవిద్యయే బ్రహ్మవిద్య యగును కాని కర్మపరముగా జెప్పబడినది బ్రహ్మవిద్య కానేరదు. బ్రహ్మ. కర్మ. అనునవి తేజస్తిమిరములవంటివి. అట్టిస్థితిలో కర్మపరముగా జెప్పబడిన బ్రహ్మవిద్య యనుట అత్యంతాసంగతము.

మఱియు 'ప్రవృత్తిపరమైన బ్రహ్మవిద్య, అని యనక 'ప్రవృత్తి పరముగా జెప్పబడిన బ్రహ్మవిద్య, అని యనుటవలన ప్రవృత్తిపరము కానిది (నివృత్తిపరమైనది) ప్రవృత్తిపరముగా జెప్పబడినది. అని యర్థ మిచ్చుచున్నది. దీనిని పట్టి, నివృత్తిపరమైన బ్రహ్మవిద్యను శ్రీకృష్ణుడు ప్రవృత్తిపరముగా జెప్పెనని, కృష్ణభగవానునిది యథార్థకథనము కాద నికూడ తేలుచున్నది.

పోనిండు. "గీత ప్రవృత్తిపరముగా జెప్పబడిన బ్రహ్మవిద్య' అనుమాటకు 'ప్రవృత్తిపరమైన బ్రహ్మవిద్య' యనియే యర్థ మను కొందము. అపుడు ప్రవృత్తిపరమైనదే బ్రహ్మవిద్యయైన పక్షములో నివృత్తిపరమైన దేది? అవిద్యామూలకము రాగద్వేషాదిపూర్వకము సహజము నగు ప్రవృత్తిని బ్రహ్మవిద్యాలభ్యమని చెప్పుటకూడ అసం గతము.

మఱియొకటి_ 'మహాభారతాభిప్రాయమును గనునింపక గీత మీద దోచినట్లు భాష్యములు వ్రాసి గీతను మహాభారతమునుండి పూర్తిగా వేరు చేసినారట' మహాభారతకర్తయే, గీతాతాత్పర్యము వర్ణించుటలో——

"కశ్మలం యత్ప్రి పార్థస్య వాసుదేవో మహామతిః ।
మోహజం నాశయామాస హేతుభి ర్మోక్షదర్శిభిః ॥" (ఆది_అ)

అనుచు మోక్షసాధనప్రదర్శనమే గీతాతాత్పర్యమని చెప్పియుండెను. మహాభారతమునకుగూడ పరమతాత్పర్య మదియే యని 'అనేకకర్తృత్వ నిరాకరణము' అను ప్రథమభాగములో నిరూపితమై యున్నది. 'మోక్షసాధనప్రదర్శనప్రక్రియతోడనే భాష్యములు వ్రాసినవారు, మహాభారతమునుండి గీతను పూర్తిగా వేరుజేసినారు' అని వ్రాయుట హేయము.

మఱియొకటి— 'శంకరాచార్యమతమే గీతాహృదయ మనుటలో సంశయము లేదట' 'శంకరభాష్యానుసారముగా మతములో వివాద మేమియును లేదట' 'సంన్యాససంప్రదాయమే ప్రతిపాదింపబడిన దనుటలోమాత్రము రుచిభేద మున్నదట'

సంన్యాససంప్రదాయము చేరనిది శంకరాచార్యమత మగునా? ఆశంకరాచార్యమతమే గీతాహృదయమైనపుడు సంన్యాసము గీతా హృదయము కాకుండునా? అట్టి సంన్యాసము ప్రతివాదులకు రుచింపనిచో శాంకరభాష్యమునకులోపమా? గీతకులోపమా? శాస్త్రీయవిషయములయందరుచికలిగి మార్గాంతరమును కల్పించిన ప్రతివాదులు శాస్త్రానుసారులుకాక స్వేచ్ఛాచారు లని తేలినది. కనుక వీరివ్రాత హేయము.

—: "శాంకరభాష్యఖండితమైనది కాక వేరొక జ్ఞానకర్మసముచ్చయము గీతకు తాత్పర్యము" అను ప్రసంగముతన్నిరాకరణము : —

రహస్యకారుల వ్రాత యిట్లున్నది— "ఇతః పూర్వము గీతపై వ్రాయబడియున్న జ్ఞానకర్మ సముచ్చయవాదానుకూలములైన భాష్యములకు విరుద్ధముగా శ్రీశంకరులు సాంఖ్యసిద్ధాంతమే గీతయందు ప్రతిపాదింపబడియున్న దని గొప్పభాష్యము రచించిరి. ఆసముచ్చయవాద మేమనగా, "కర్మసముచ్చితమగు జ్ఞానముచేతనే

మోక్షము సిద్ధించును. జ్ఞానమాత్రముచే సిద్ధింపదు.' అని" దానిని భగవత్పాదపూజ్యపాదులవారు పూర్ణముగా ఖండించిరి. గీతాతాత్పర్య మైన సముచ్చయ మేమనగా జ్ఞానముతోగూడ జ్ఞానియగువాడు మరణపర్యంతముస్వధర్మోక్తకర్మ జేయవలయును: అనునది" పు 193

ఈప్రతివాదులు_ ఇతః పూర్వము కల జ్ఞానకర్మసముచ్చయ వాదము శాంకరభాష్యములో ఖండింపబడిన దగుటచే నది దురుద్ధర మని వేరొకసముచ్చయవాదమును కల్పించియున్నారు.

జ్ఞానము కలిగిన తరువాతగూడ కర్మానుష్ఠానము మోక్షసిద్ధికై యావజ్జీవము చేయవలసినదే, అనునది యాసముచ్చయవాదమట.

జ్ఞానియగువాడు మరణపర్యంతము స్వధర్మోక్తకర్మ చేయవల యును. అనునది, వీరిసముచ్చయవాదమట.

ఈరెంకువాదములలో భేద మేమున్నది? వెనుకటి వాదములో మోక్షసిద్ధికి ముడిపెట్టి చెప్పబడినది. వీరివాదములో దానిని విడిచిపెట్టి చెప్పబడినది. ఇంతకంటె భేద మేమియు లేదు. జ్ఞానకర్మసముచ్చయమే అత్యంతానుపపన్నమనియు, గీత కట్టి తాత్పర్యము వర్ణించుట యుక్తము మనియు భగవత్పాదు లెంతో నిరూపించి ఖండించియుండగా, నాఖం డనమునకు వీరి సముచ్చయవాదముమాత్రము గురికాకుండు టెట్లు?

జ్ఞానకర్మసముచ్చయవాదముపై భగవత్పాదభాష్యోక్తఖండ నాంశములు దిఙ్మాత్ర ముదాహరింపబడుచున్నవి. జూడుడు:—

సాంఖ్యబుద్ధి యనియు, యోగబుద్ధి యనియు. బుద్ధి ద్వివిధము. అందు 'సమ్యక్ ఖ్యాయతే ప్రకాశ్యతే, నా వైదికీ సమ్యగ్బుద్ధి స్సంఖ్యా తయా ప్రకాశ్యత్వేన సంబన్ధి ప్రకృతం తత్త్వం సాంఖ్యమ్'

అను వ్యుత్పత్తిచే "అశోచ్యాన్" అని మొదలిడి 'స్వధర్మ మపి చావేక్ష్య' అనువరకు గల గీతాగ్రంథముచే నేపదార్థాత్మతత్త్వము నిరూపింపబడినదో అది సాంఖ్యము. అట్టి సాంఖ్యమైన ఆత్మతత్త్వము 'న జాయతే మ్రియతే వా' ఇత్యాదిప్రకరణార్థనిరూపణమునుబట్టి షడ్భావవికారశూన్య మగుటవలన 'ఆత్మ అకర్త' అని యే బుద్ధికలుగు చున్నదో అది సాంఖ్యబుద్ధి, అట్టి సాంఖ్యబుద్ధికల జ్ఞానులు సాంఖ్యులు.

ఇక. యోగబుద్ధి యెట్టిదనగా. (యుజ్యతే యోగ్య స్సంపద్యతే ఽనేన మోక్షాయేతి యోగః' అనువ్యుత్పత్తిచే సాంఖ్యబుద్ధికిపూర్వకాలి కమై ఆత్మ దేహాదివ్యతిరిక్తము కర్త, భోక్త, అనుభావనను పురస్కరించుకొనినదై మోక్షసిద్ధికి పరంపరాసాధనమై నిష్కామకర్మరూపమై యున్న స్వధర్మానుష్ఠానము యోగము. తద్విషయకబుద్ధి యోగబుద్ధి. ఆయోగబుద్ధికల కర్ములు యోగులు.

ఈసాంఖ్యయోగబుద్ధిద్వయము భగవానునిచేతనే "ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధి ర్యోగే త్విమాంశృణు" అను వాక్యముచే నిర్దేశింపబడినది. ఆపైగూడ —

"లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయాఽనఘ।
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్"॥

అని సాంఖ్యబుద్ధ్యాశ్రితముగా జ్ఞానయోగనిష్ఠను, యోగబుద్ధ్యాశ్రితముగ కర్మయోగనిష్ఠను విభజించి చెప్పియుండెను.

అనేకత్వకర్తృత్వబుద్ధ్యాశ్రితమైనదికర్మనిష్ఠయనియు,ఏకత్వాకర్తృత్వబుద్ధ్యాశ్రితమైనది జ్ఞాననిష్ఠ యనియు, నీరెండునిష్ఠలునొకపురుషునకే యొక అవస్థయందే సంభవింపవని, సాంఖ్యయోగబుద్ధిభేదమునుబట్టి నిష్ఠాభేదము విభజింపబడినది, జ్ఞానకర్మసముచ్చయవాదములో నీవిభాగ మనుపపన్నమగును.

మరియు, జ్ఞానకర్మనిష్ఠలు రెంటిను నేకకాలమునందే నొకపురుషా నుష్ఠేయములుగా నుపదేశింపబడినయెడల "జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన । తత్కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ" అనుచు, తన కనుష్ఠేయమే యైయున్న యుద్ధకర్మను నాకెందుకు జెప్పెదవు. అని యర్జునుడు ప్రశ్నించుట యసంగత మగును. కర్మకంటె జ్ఞానమే యుత్తమ మని భగవంతుని యభిప్రాయమైనట్లు (జ్యాయసీచేత్కర్మణస్తే) అని యనటకూడ అసంభవ మగును.

మరియు, పంచమాధ్యాయములో జ్ఞానకర్మనిష్ఠలలో నేది శ్రేష్ఠమో దానినే యుపదేశింపు మనుచు "యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్" అని యడ్గను నడుగుటకూడ నసంభవమగును. సముచ్చయమే భగవదుపదిష్టమైనపుడు రెండు నవశ్యాశ్రయణీయములగుచుండ శ్రేష్ఠమైన దొక్కదానిని జెప్పుమని యెట్లడుగును?

అతడడిగినను నీకు జ్ఞానకర్మసముచ్చయము నుపదేశింపగా నేదో యొకదాని నడిగెదవేమని భగవంతుడేల తెలుపలేదు?

ఇత్యాది ఖండనాంశములు భాష్యమందున్నవి. అవి నీరి సముచ్చయవాదమునకు కూడ ఖండనములే.

చూడు డీభగవత్పాదప్రతిజ్ఞ — "తస్మాద్గీతాశాస్త్రే ఈషన్మాత్రేణాపి శ్రౌతేన స్మార్తేనవా కర్మణాఽఽత్మజ్ఞానస్య సముచ్చయో న కేనచి ద్దర్శయితుం శక్యః."

ఇంకొకటి గీత మోక్షసాధనము నుపదేశించినది. ఆమోక్షసాధనము కర్మసహితజ్ఞానమెకాని కేవలజ్ఞానము కాదని ప్రాచీనుల సముచ్చయవాదము. కేవలజ్ఞానమే మోక్షసాధనము. జ్ఞానముచేగలిగెడి

మోక్షములో కర్మసహాయ మపేక్షితము కాదు. జ్ఞానసిద్ధికిమాత్రము కర్మానుష్ఠాన మావశ్యకమే. అది భగవత్పాదసిద్ధాంతము. మోక్షసాధనము కేవలజ్ఞానమేకాని జ్ఞానికూడ మరణపర్యంతము స్వధర్మోక్త కర్మ చేయవలెను. అది వృత్తికారాదుల సముచ్చయవాదము. ఈవాదములో కర్మ, మోక్షసిద్ధి కక్కరకు రానిదే జ్ఞానసిద్ధికై కర్మ భగవత్పాదు లొప్పినదే. జ్ఞానికి కర్మ అసంభవమని భగవత్పాదులు నిరూపించినదే. ఇట్లుండ నాభగవత్పాదసిద్ధాంతమునకు జేరక, ప్రాచీనసముచ్చయవాదమునకు జేరక మధ్యలో వ్రేలాడుచు యుక్తిసహముకాని యీవాదము హేయము.

—సాంఖ్యమార్గముకంటె కర్మమార్గ మత్యుత్తమ మను ప్రసంగము—
తన్నిరాకరణము—

భారతరహస్యకారుల వ్రాత యిట్లున్నది—"వ్యాసుడు సన్న్యాసనిష్ఠాపరుడై జనకునివలె తిరుగుచున్న సమాసక్తుడైన శుకునకు ప్రవృత్తిమార్గ ముపదేశించి తదుపదేశార్థమై జనకునికడకు బంపి చివరకు ప్రవృత్తిమార్గమున బ్రవేశింపజేసెను.

సాంఖ్యమార్గముకంటె కర్మమార్గ మత్యుత్తమ మగుటచేతనే కదా వ్యాసుడింత శ్రమపడెను" (పు 201)

ఈవ్రాత అక్రమము. శుకునకు జేసిన వ్యాసోపదేశ మెట్లున్నదో చూడుడు—

"ఆశ్రమా దాశ్రమం గచ్ఛే దితి ధర్మవిదో విదుః।
తస్మా దగ్నిం సమాధాయ కురు కర్మా ణ్యతన్ద్రితః
దేవాన్ పితౄన్ మనుష్యాంశ్చ సంతర్ప్య విధివత్సుత
పుత్రముత్పాద్య ధర్మజ్ఞ సంయోజ్యచ గృహాశ్రమే

త్యక్త్వా గృహం వనం గత్వా కర్తాసి వ్రతముత్తమమ్
వానప్రస్థాశ్రమం కృత్వా సంన్యాసం చ తతఃపరమ్
ఇన్ద్రియాణి మహాభాగ మాదకాని సునిశ్చితమ్
అదారస్య దురన్తాని పంచైవ మనసాసహ
తస్మా ద్దారాన్ ప్రకుర్వీత తజ్జయాయ మహామతే"॥
(దేవీభా॥ 1 స్క—14 అ)

ఇచ్చట, ఇంద్రియములు ప్రమాదకరము లగుటచే నాశ్రమక్రమము ననుసరించి యింద్రియజయముతో సంన్యాసము స్వీకరింపవలసినదని యుపదేశింపబడెనుకాని ప్రతివాదు లన్నట్లు సాంఖ్యమార్గముకంటె కర్మమార్గము అత్యుత్తమ మని యుపదేశింపబడలేదు. సంన్యాసమాశ్రయింపదగిన దనియే చెప్పబడెను.

ఇక జనకోపదేశ మెట్లున్నదో చూడుడు—

"వసేత్తుర్యాశ్రమే శాన్తశ్శుద్ధే వైరాగ్యసంభవే।
విరక్తస్యాఽధికారోఽస్తి సంన్యాసే నాఽన్యథా క్వచిత్
వేదవాక్య మిదం తథ్యం నాన్యథేతి మతి ర్మమ
ఇంద్రియాణి బలిష్ఠాని న నియుక్తాని మానద
అపక్వస్య ప్రకుర్వన్తి వికారాం స్తా ననేకశః
భోజనేచ్ఛాం సుఖేచ్ఛాంచ శయ్యేచ్ఛా మాత్మజస్య చ
యతీభూత్వా కథం కుర్యా ద్వికారే సముపస్థితే
దుర్జరం వాసనాజాలం న శాన్తి ముపయాతి వై
అత స్తచ్ఛమనార్థాయ క్రమేణ చ పరిత్యజేత్ ॥" (అ18 దే. భా)

ఇచ్చటగూడ శుద్ధవైరాగ్యము కలవానికే సంన్యాసమం దధికారము. తాత్కాలికముగా వైరాగ్యమున్నను విశ్వసింపరాదు. బలిష్ఠములైన యింద్రియములు నానావికారములను కలిగించును. ఇం

ద్రియజయమునకై ఆశ్రమక్రమమునే ఆశ్రయింపవలెను. అనుచు సర్వోత్తమమైన సంన్యాసాశ్రమము అనధికారుల కాశ్రయణీయము కాదనియే చెప్పబడెను. కాని కర్మమార్గమె సాంఖ్యమార్గముకంటె నత్యుత్తమమని చెప్పబడలేదు. కనుక ప్రతివాదుల వ్రాత హేయము.

## — • "వ్యాసుడును, శ్రీకృష్ణుడును, సాంఖ్యయోగులు కారు. కర్మయోగులే" అను ప్రసంగము— తన్నిరాకరణము • —

"రహస్యకారుల వ్రాత యిట్లున్నది— "మహాభారతగ్రంథకారుడు, గీతారచయితయు నైన వ్యాసుడు కర్మయోగికాని సాంఖ్యయోగి కాడు. వేయేల గీతోపదేశకుండగు శ్రీకృష్ణుడు కర్మయోగి" (పు201)

మహాభారతగ్రంథకారుడైన వ్యాసుడు సాంఖ్యయోగి కాడు కర్మయోగియే అనుటలో సాంఖ్యయోగియైనయెడల మహాభారత రచన జేయడని తాత్పర్యమా? సాంఖ్యయోగికి రావలసిన విదేహకైవల్యమే వ్యాసునకు వచ్చియుండదు నని తాత్పర్యమా? వీరి కొకింత బోధింతము.

లోకరక్షణహేతువులైన వ్యవస్థలలో ఆధిపత్యము, అధికారమనబడును. అట్టి యధికారము కల తపస్సంపన్నులగు మహనీయులు ఆధికారికపురుషులనబడుదురు. అట్టివారి స్థితి ఆ యధికారప్రాపకమైన ప్రారబ్ధ మెంతకాల ముండునో అంతకాలము జీవన్ముక్తభావముతో నుండును. ప్రారబ్ధక్షయ మగుటతోడనే ప్రతిబంధకము లేదుకనుక విదేహకైవల్యము కలుగును. వేదాంతదర్శనము జూడుడు— "యావదధికార మవస్థితి రాధికారికాణామ్." (బ్ర. సూ. 3-3-32)

భాష్యమ్— యథా చ వర్తమానా బ్రహ్మవిదః ప్రారబ్ధభోగక్షయే కైవల్య మనుభవన్తి 'తస్య తావదేవ చిరం యావన్న విమో

త్యే౽థ సంపత్స్య' ఇతి శ్రుతేః ఏవ మపాన్తరతమః (వ్యాసనామాన్తరమ్) ప్రభృతయో౽పీశ్వరాః పరమేశ్వరేణ తేషు తేష్వధికారేషునియుక్తాః సన్తః సత్యపిసమ్యగ్దర్శనే కైవల్యహేతౌ నక్షీణకర్మాణో యావదధికార మవతిష్ఠన్తే తదవసానే చాపవృజ్యన్త ఇత్యవిరుద్ధం సకృత్ప్రవృత్త మేవహి తే౽ధికారఫలదానాయ కర్మాశయమతివాహయన్తః స్వాతంత్ర్యేణైవ గృహాదివ గృహాన్తర మన్యమన్యం దేహం సంచరన్తః స్వాధికారనిర్వర్తనాయా౽పరిముషితస్మృతయ ఏవ దేహేన్ద్రియప్రకృతివశిత్వా న్నిర్మాయ దేహా న్యుగపత్క్రమేణ వా౽ధితిష్ఠన్తి.

దీనినిబట్టి యాధికారికపురుషులైన వ్యాసవసిష్ఠాదులు సాంఖ్యనిష్ఠులే యనియు, వారు స్వతంత్రముగా దేహములను నిర్మించుకొనుచు నధికారనిర్వాహణమునకై యొక గృహమునుండి వేరొకగృహమునకుసంచారము చేసినట్లు, భిన్నభిన్న దేహములందు జ్ఞాననిష్ఠకు చ్యుతి లేకుండ సంచారముచేయుచుందు రనియు, నధికారకాలము పూర్తియైనతోడనే కైవల్యము నొందుదు రనియు స్పష్టమైనది.

ఫలాభిసంధి లేక, దేహాదులయం దహంకారాదులు లేక ప్రవర్తించెడి జ్ఞాననిష్ఠుల ప్రవృత్తిని కర్మయోగముగా భావింపరాదు. చూడుడు. గీతాభాష్యమ్ —"యస్య త్వజ్ఞానా ద్రాగాదిదోషతో వా కర్మణి ప్రవృత్తస్య యజ్ఞేన దానేన తపసా వా విశుద్ధసత్త్వస్య జ్ఞాన ముత్పన్నం పరమార్థతత్త్వవిషయ' మేక మేవేదం సర్వం బ్రహ్మా౽కర్తృ చేతి' తస్య కర్మణి కర్మప్రయోజనేచ నివృత్తే౽పి లోకసంగ్రహార్థం యత్నపూర్వం యథాప్రవృత్త స్తథైవ కర్మణి ప్రవృత్తస్య యత్ప్రవృత్తిరూపం దృశ్యతే న తత్కర్మ. యథా భగవతో వాసుదేవస్య క్షాత్రకర్మచేష్టితమ్"

అనగా అజ్ఞానమును, రాగాదిదోషములనుబట్టి కర్మానుష్ఠానము జేయుచున్నవానికి యజ్ఞమనవో, దానమనవో, తపమునవో, అంతఃకరణశుద్ధి కలిగి 'ఇదం సర్వం బ్రహ్మ' అని పరమార్థతత్త్వజ్ఞానము కలిగినపుడు కర్మ, కర్మఫలము. తనకు నివర్తించినను లోకసంగ్రహము నకై యత్నపూర్వకముగా జేయువానివలెనే తానుకూడ కర్మయందు ప్రవర్తించుచున్నట్టున్న జ్ఞానిప్రవృత్తి, కర్మకానేరదు. కృష్ణపరమాత్మ యొత్రికర్మచేష్టితము కర్మ కానట్లు అని తాత్పర్యము. ఇచ్చట గమనింపదగిన విషయ మేమనగా—

వర్ణాశ్రమనిమిత్తముగా విధింపబడిన కర్మవిశేషమే ధర్మ మన బడును. కనుక దేహమును సంబంధించిన వర్ణాశ్రమాభిమానము కలవాడే ధర్మాచరణమున కధికారి, తత్త్వవేత్త, దేహాభిమానశూన్యుడే కనుక నట్టి ధర్మాచరణమున కనధికారి. అట్టి తత్త్వవేత్తచే కేవల లోకసంగ్రహతాత్పర్యములో జేయబడునది కర్మాభాసమె కాని కర్మయోగము కర్మ కాదు.

వర్ణాశ్రమాభిమానపురస్సరముగా శాస్త్రీయమై ఫలాభిసంధితో జేయబడునది కర్మ ఇది కర్మఫలసాధనమె కాని మోక్షసాధనముకాదు. కనుక కర్మయోగ మనబడును. ఇక ఫలాభిసంధిలేక వర్ణాశ్రమాభిమానముతో శాస్త్రీయముగా జేయబడు నిష్కామకర్మ చిత్తశుద్ధిద్వారా మోక్షసాధన మగుటవలన నవి కర్మయోగ మనబడును. ఇక దైహికమైన వర్ణాశ్రమాభిమానముకాని ఫలాభిసంధికాని లేక కేవలలోకసంగ్రహార్థమై జ్ఞాననిష్ఠులచే జేయబడునది కర్మాభాసమే. శ్రీకృష్ణవేదవ్యాసులయందు గోచరించునది యీకర్మాభాసమే.

ఇట్టిస్థితిలో విషయవిభాగ మెరుగక శాస్త్రములను ధిక్కరించి తోచినట్లు వ్రాయు ప్రతివాదులు "వ్యాసుడును శ్రీకృష్ణుడును కర్మ

కూగియే" అని వ్రాయుట యెంత సాహసమో! శ్రీకృష్ణవేదవ్యాసాదులు జ్ఞాన, (సాంఖ్య) నిష్ఠులే. గీతయందు శ్రేష్ఠమోత్తమమని బోధింపబడినది సాంఖ్యనిష్ఠయే. అది యధికారానుగుణముగా గ్రాహ్యమే. కనుక ప్రతివాదుల వ్రాత పరాస్తము. ఇంతటితో దీనిని విడిచి యిక మ.భా.చ.కారులవ్రాతనే అందుకొందము.

— దుర్యోధనునితో "పాపాలభైరవుడనునేనే" అనికృష్ణుడనెను.
అను ప్రసంగము—తన్నిరాకరణము—

మ.భా.చ.కారుల వ్రాత యిట్లున్నది —"ఊరుభంగానంతరము కృష్ణదుర్యోధనసంవాదములో దుర్యోధనునిదే న్యాయమని దేవతలు పుష్పవృష్టిని, దేవదుందుభి నిస్వానములను గలిగింపగా కృష్ణాదులు సిగ్గుపడిరట. ఆతడు పుట్టినపుడు నక్కలఱచెనట. అట్టి యశుభమును సూచించిన దేవత లిపుడేల పుష్పవృష్టిని వర్షించిరో! కాని కృష్ణుడే సిగ్గును విడిచి యన్యాయముల నన్నిటిని జేయించిన పాపాలభైరవుడను, నేన యనుటమాత్ర మాట సమయనూర్ధ్వగ నున్నది. దుర్యోధనుడు రావణునివంటిదుర్మార్గుడు కాడు" (పు2-7)

ప్రతివాదులు సూచించిన కృష్ణదుర్యోధనసంవాద మేమనగా భీమసేనగదాఘాతమున దుర్యోధనుడు నేలపై బడియుండినపుడు పాండవపక్షవీరులు దుర్యోధనదూషణపూర్వకముగా భీమసేనుని శ్లాఘించుచుండ శ్రీకృష్ణుడు వారలతో నిట్లనెను.— హతుడైన శత్రువునువాక్కులచే బీడించుట న్యాయము కాదు. నిర్లజ్జుడైన యీదుర్యోధనుడు బహువిధముల భీష్మ, ద్రోణ, విదుర, సంజయ, కృపాచార్యాదులచే జెప్పబడినను పాండవ రాజ్యము నీయక నిందింపబడినపుడే యీతడు నిహతుడయ్యెను. తుదకు సపరివారముగా హతు డయ్యెను. అని,

దుర్యోధను డీయాక్షేపము విని క్రుద్ధుడై శ్రీకృష్ణుని నిందించుచు గదాయుద్ధములో నధర్మముగా తొడపై గొట్టుమని భీమునకు అర్జునునిచే సంజ్ఞ చేయించిన నీకు లజ్జ లేదా?

"ఘాతయిత్వా మహీపాలాన్ ఋజుయుద్ధాన్ సహస్రశః।
జిహ్మై రుపాయై ర్బహుభి ర్న తే లజ్జా న తే ఘృణా॥
పాతిత స్సమరే కర్ణ శ్చక్రవ్యగ్రో౽గ్రణీ ర్నృణామ్।
యది మాం చాపి కర్ణం చ భీష్మద్రోణౌ చ సంయుతౌ।
ఋజునా ప్రతియుధ్యేథా న తే స్యా ద్విజయో ధ్రువమ్।
త్వయా పున రనార్యేణ జిహ్మమార్గేణ పార్థివాః।
స్వధర్మ మనుతిష్ఠన్తో వయం చాన్యే చ ఘాతితాః"॥

ఋజుమార్గమున యుద్ధము చేయు వీరుల నందరను కపటోపాయములతో వధింపజేసిన నీకు లజ్జ లేదు. రథచక్రము దిగబడియుండ వ్యగ్రుడై యున్న కర్ణుని వధింపజేసితివి. నన్ను, కర్ణుని, భీష్ముని, ద్రోణుని ఋజుమార్గముతో నెదుర్కొనినచో నిశ్చయముగా మీకు విజయము రాదు. అనార్యుడవైన నీవు, స్వధర్మతత్పరుల మగు మమ్ము గపటమార్గములతో వధింపజేసినావు. అని దూషించెను. అపుడు శ్రీకృష్ణు డిట్లనెను—

"హత స్త్వమసి గాంధారే సభ్రాతృసుతబాంధవః।
సగణ స్ససుహృచ్చైవ పాపం మార్గ మనుష్ఠితః"
తవైవ దుష్కృతై ర్వీరౌ భీష్మద్రోణౌ నిపాతితౌ
కర్ణశ్చ నిహత స్సంఖ్యే తవ శీలానువర్తకః
యాచ్యమానం మయా మూఢ పిత్ర్య మంశం న దిత్ససి
పాండవేభ్య స్స్వరాజ్యం చ లోభా చ్ఛకుని నిశ్చయాత్
విషం తే భీమసేనాయ దత్తం సర్వే చ పాండవాః

ప్రదీపితా జతుగృహే మాత్రా సహ సుదుర్మతే
సభాయాం యాజ్ఞసేనీచ కృష్టా ద్యూతే రజస్వలా
తదైవ తావ ద్దుష్టాత్మన్ వధ్య స్త్వం నిరపత్రప
అనక్షజ్ఞం చ ధర్మజ్ఞం సౌబలే నాక్షవేదినా
నికృత్యా యత్పరాజైషీ స్తస్మా దసి హతో రణే
జయద్రథేన పాపేన యత్కృష్ణా క్లేశితా వనే
యాతేషు మృగయాం చైవ తృణబిన్దో రథాశ్రమమ్
అభిమన్యుశ్చ యద్బాల ఏకో బహుభి రాహవే
త్వద్దోషై ర్నిహతః పాప తస్మా దసి హతో రణే
యా న్యకార్యాణి చాస్మాకం కృతా నీతి ప్రభాషసే
వైగుణ్యేన తవాత్యర్థం సర్వం హి తదనుష్ఠితమ్
బృహస్పతే రుశనసో నోపదేశ శ్శ్రుత స్త్వయా
వృద్ధా నోపాసితా శ్చైవ హితం వాక్యం న తే శ్రుతమ్
లోభేనాఽతిబలేన త్వం తృష్ణయా చ వశీకృతః
కృతవానస్య కార్యాణి విపాక స్తస్య భుజ్యతామ్ ||"

దుర్యోధనా! పాపిష్ఠమార్గము నాశ్రయించుటచే సపరివారముగా నీవు హతుడ వైతివి. నీదుష్కృతములనుబట్టియే భీష్మద్రోణులు నిహతు లైరి. నీదుర్వృత్తి ననుసరించుటచేతనే కర్ణుడు నిహతుడయ్యెను. పాండవుల రాజ్యము పాండవుల కిమ్మని నేనెంత యాచించినను మూఢుడా! నీవు లోభి వై యీయకపోతివి. భీమసేనునకు విషము బెట్టితివి. కుంతీసహితముగా పాండవులను లక్కయింట దహింపబూనితివి. ఓదుష్టుడా! రజస్వలయైయున్న ద్రౌపదీదేవిని ద్యూతసభకు నీవేనా ఈడ్చి తెచ్చితివో ఆనాడే వధ్యుడ వైతివి. ద్యూతప్రక్రియ నెరుగనట్టి ధర్మజుని ద్యూతసిద్ధు డైన శకునిచే గపటమార్గమున నోడించిన నీదుష్కార్యముయొక్క ఫలమే యీనీమరణము. వనవాసకాలములో పాండవులు దగ్గరలేనపుడు పాపాత్ము డైన సైంధవుడు ద్రౌపదీదేవిని నెత్తు

కొనిపోయిన దుష్కార్యముయొక్క ఫలమే యీనీమరణము. ఒక్కడై పద్మవ్యూహములో బ్రవేశించిన బాలుడగు నభిమన్యుని, నిన్ను బుర స్కరించుకొని పలువురు యోధులు పైబడి సంహరించిన దుష్కార్య ముయొక్క ఫలమే యీనీమరణము. ఏమేమి యకార్యములు మేము చేసితి మనుచుంటివో అవన్నియు నీవు చేసియున్న అకార్యములకు బ్రతి క్రియగా జేయబడినవి. నీవు బృహస్పతి, శుక్రాచార్యుల యుపదేశ ములను వినలేదు. పెద్దల నుపాసింపలేదు. వారి హితోపదేశముల నాలకింపలేదు. బలిష్ఠమైన లోభమునకు తృష్ణకు లోనై నీవెన్నియో అకార్యములను చేసియుంటివి. తత్ఫల మనుభవింపుము. అని.

ఈ కృష్ణప్రసంగములో పాపాల భైరవుడు దుర్యోధను డని యున్నట్లున్నదా? లేక, తానే యని శ్రీకృష్ణు డొప్పుకొనినట్లున్నదా? అని ప్రతివాదుల నడుగుచున్నాను. ఇంకొకటి, "యాచ్యమానం మయా మూఢ పిత్ర్య మంశం న దిత్ససి" అని దుర్యోధనునితో సంభా షించియున్నపుడు శ్రీకృష్ణుడు సంధి జరుగకుండ జేసినట్లున్నదా? లేక, దుర్యోధనుడు సంధి జరుగకుండ జేసినట్లున్నదా? అని కూడ ప్రతివా దుల నడుగుచున్నాము.

ఈ విధముగా కృష్ణభగవానుడు మందలించినపుడు ఈ విషయ ములకు సమాధానము దుర్యోధనుడు చెప్పనే లేదు. ఆ నేరములన్నియు తనయందుండుటచేతనే యావిషయములకు బదులు చెప్పక విషయాం తర మెత్తుకొని యపుడు దుర్యోధను డిట్లనెను.—

"అధీతం విధివ ద్దత్తం భూః ప్రశాస్తా ససాగరా ।
మూర్ధ్ని స్థిత మమిత్రాణాం కోను స్వంతతరో మయా
యదిష్టం క్షత్రబన్ధూనాం స్వధర్మ మనుపశ్యతామ్
తదిదం నిధనం ప్రాప్తం కోను స్వంతతరో మయా

దేవార్హా మానుషా భోగాః ప్రాప్తా అసులభా న్నృపైః
ఐశ్వర్యం చోత్తమం ప్రాప్తం కోను స్వంతతరో మయా
ససుహృత్సానుగశ్చైవ స్వర్గం గన్తాఽహ మచ్యుత
యూయం నిహతసంకల్పా శ్శోచన్తో వర్తయిష్యథ
అస్య వాక్యస్య నిధనే కురురాజస్య ధీమతః
అపత త్సుమహద్వర్షం పుష్పాణాం పుణ్యగన్ధినామ్
అవాదయ న్త గన్ధర్వా వాదిత్రం సుమనోహరమ్
జగుశ్చాఽప్సరసో రాజ్ఞో యశస్సంబద్ధ మేవచ ॥

నేను విధ్యుక్తముగా నధ్యయనము జేసితిని, దానములు చేసితిని, భూమండల మేలితిని, శత్రువుల నెత్తిపై నుంటిని. నాకంటె సుఖించిన వాడెవడు? స్వధర్మనిష్ఠులగు క్షత్రియు లపేక్షించెడి యుద్ధమరణమును నేం డనాకంటె సుఖించిన వాడెవడు? నృపతుల కలభ్యమును, దేవతార్హ ములు నైనమానుషభోగము లనుభవించితిని. ఉత్తమైశ్వర్యము నొంది తిని. నాకంటె సుఖించినవా డెవడు? సుహృద్వర్గముతో ననుచరవర్గ ముతో నేను స్వర్గమునకు వెళ్ళుచున్నాను. మీరు దుఃఖించుచు బ్రతి యుండుడు అని.

దుర్యోధను డీమాటాడినతోడనే పుష్పవృష్టి జరిగినది. గంధ ర్వుల మనోహరవాద్యములు జరిగినవి. (శౌర్యాదిప్రభవం యశః) అను టవలన అప్సరసల దుర్యోధనశౌర్యాదిరూపయశోగానము జరిగినది"

ఇట్లు నేను స్వర్గమునకు వెళ్ళుచున్నాను, అని దుర్యోధను డని నపుడు జరిగిన పుష్పవృష్టి, యుద్ధమరణమునుబట్టి యీతడు స్వర్గము నకు వెళ్ళుట నిజమని సూచించినదికాని దుర్యోధనునిదే న్యాయమని సూచింపలేదు. దుర్యోధను డట్టి ప్రసంగమునే చేయునపుడు దానిని సూచించు టెట్లు?

వెనుక జూపబడినట్లు శిశుపాలవధప్రసంగములో శ్రీకృష్ణుడు జగత్పూజ్యుడని సహదేవుడు సంభాషించినపుడు "తతోఽపత త్పుష్ప వృష్టి స్సహదేవస్య మూర్ధని" అని సహదేవునిపై జరిగిన పుష్పవర్షము కృష్ణభగవానుని జగత్పూజ్యతను చాటినది. ఇచ్చట "స్వర్గం గన్తా ఉహామచ్యుత" అని దుర్యోధనుడనినపుడు జరిగిన పుష్పవర్షము దుర్యోధనునకు యుద్ధమరణనిమిత్తమైన స్వర్గప్రాప్తి నిజ మని చాటినది.

"దుర్యోధనుడు పుట్టినపుడు నక్క లఱచెనట. అప్పుడట్టి యశుభమును సూచించిన దేవత లివ్వేల పుష్పవృష్టిని వర్షించిరో?"

అను ప్రతివాదులకు గొంచెము చెప్పవలసియున్నది. ఈతడు సర్వసంహారకారకుడుగా పుట్టియున్నాడని సూచించుటకై దేవత లప్పుడా దుర్నిమిత్తములను ప్రదర్శించి, ఇప్పుడు యుద్ధమరణనిమిత్తమైన స్వర్గమునకు బోవుచున్నాడని సూచించుచు పుష్పవృష్టిని వర్షించి రని ప్రతివాదులు తెలిసికొనవలెను.

ఇట్లు పుష్పవృష్టి జరిగినతరువాత నేమైనదో చూతము —

"అత్యద్భుతాని తే దృష్ట్వా వాసుదేవపురోగమాః ।
దుర్యోధనస్య పూజాన్తు దృష్ట్వా వ్రీడా ముపాగమన్
హతాం శ్చాఽధర్మత శ్శ్రుత్వా శోకార్తా శ్శుశుచు ర్హి తే
భీష్మం, ద్రోణం, తథా కర్ణం, భూరిశ్రవస మేవచ
తాంస్తు చిన్తాపరాన్ దృష్ట్వా పాండవాన్ దీనచేతసః
ప్రోవాచేదం వచః కృష్ణో మేఘదున్దుభినిస్స్వనః
నైష శక్యః కదాచిత్తు హన్తుం ధర్మేణ పార్థివః
తే వా భీష్మముఖా స్సర్వే మహేష్వాసా మహారథాః
మయాఽనేకై రుపాయైస్తు మాయాయోగేన చాసకృత్
హతా స్తే సర్వ ఏవాజౌ భవతాం హితమిచ్ఛతా

న చ వో హృది కర్తవ్యం యదయం ఘాతితో రిపుః
మిథ్యావధ్యా స్తథోపాయై ర్బహవ శ్శత్రవోఽధికాః
పూర్వై రనుగతో మార్గో దేవై రసురఘాతిభిః
సద్భి శ్చాఽనుగతః పన్థా స్స సర్వై రనుగమ్యతే ॥" (శల్య.అ-61)

దేవతాకృతమైన దుర్యోధనప్రశంసను జూచి శ్రీకృష్ణాదులు సిగ్గుపడిరి. భీష్మద్రోణాదులు అధర్మముతో వధింపబడిరని విని చింతాక్రాంతులైన పాండవులకు శ్రీకృష్ణు డిట్లనెను. ఈదుర్యోధనుడు, ఆ భీష్మాదులు కేవలధర్మమార్గముతో జయింప శక్యమైనవారు కారు. మీహితముగోరిన నాయొక్క మాయాప్రయోగాది బహువిధోపాయములచే వారు హతులైరి. మీరు చింతింపవలసిన పని లేదు. అధిక శక్తికల శత్రువులు మిథ్యోపాయములచే వధింపదగినవారే, ఇది యసురఘాతులగు దేవతలు చూపిన మార్గమే, సత్పురుషానుగతమార్గమే సర్వలోకాశ్రయణీయము. అని,

"ఇచ్ఛట (వాసుదేవపురోగమాః దుర్యోధనస్య పూజాం దృష్ట్వా వ్రీడా ముపాగమన్" అనుచు శ్రీకృష్ణుడు సిగ్గుపడె నను విషయము—

"మనుష్యదేహినాం చేష్టా మిత్యేవ మనువర్తతే।
లీలా జగత్పతే స్తస్య ఛన్దతః పరివర్తతే॥"

అని (కృష్ణావతారరహస్యము, అను ప్రకరణములో నిరూపింపబడినట్లు మనుష్యచేష్టాభినయమాత్రము.

కనుకనే, శ్రీఅప్పయదీక్షితసార్వభౌమవిరచిత బ్రహ్మతర్కస్తవగ్రంథములో, దుర్యోధనసందర్భములో సిగ్గుపడిన విషయమునుశంకించి "నారాయణే శంక్యమానశోకమోహాది రభినయమాత్రమ్.అనుచితవిషయం క్రౌర్యంసర్వం తత్తద్వధ్యదుష్కర్మాయత్తమ్ ఇత్థమేవ తత్రతత్ర పురాణేషు రామాయణభారతయోశ్చ పరిహారః కృతో ద్రష్టవ్యః" (పు.43)

అనుచు నది యభినయమాత్రమే యని నిర్ణయించినారు. అదియే సత్యము. లేకున్న యాశ్చర్యావతారమైన శ్రీకృష్ణభగవాను డేమి? దుర్వృత్తుడగు దుర్యోధనుని గూర్చి నిర్ణయ మేమి?

ఇక, భీష్మాదు లధర్మముగా వధింపబడినారని విని పాండవులు చింతించినారనువిషయము పాండవుల యోగ్యతావిశేషమును చాటుచున్నది. ద్యూతములో పాండవుల సర్వస్వ మపహరించి కాని, కచాకర్షణ, వస్త్రాపకర్షణ దుష్కార్యములతో పాండవధర్మపత్నిని దుఃఖపెట్టి కాని, పాండవుల నరణ్యమునకు బంపి కాని, లక్కయింటిలో వారు మరణించినట్లు విని కాని, ద్రోణద్రౌణికర్ణశల్యాకృపకృతవర్మ లను ఆరుగురు మహావీరు లొక్కసారి యసహాయుడై పద్మవ్యూహములో బ్రవేశించిన అభిమన్యునిపై బడి వధించునపుడు "ఏకోఽయం నిహత స్త్వేతై ర్బహుభి ర్ధర్మో మతో హి నః" అనుచు నిది యధర్మ మని యంతరిక్షమునుండి పలికిన దేవతల వాక్యములు విని కాని, దుర్యోధనుడు చింతింపలేదని ప్రతివాదులు గమనింపవలెను. కనుకనే దుర్యోధనుడయోగ్యుడు. యుద్ధరంగములో బడిన తరువాత చేయక తప్పని పనులు "ధర్మ్యా జేతు మశక్యం చే ద్ధర్మం త్యక్త్వాఽప్యరిం జయేత్" అను న్యాయమున జేసియు పశ్చాత్తప్తులైన పాండవులు ఎంతయు యోగ్యులు.

ఇక నట్లు పశ్చాత్తప్తులగు పాండవులకు 'మీరు చింతింపవలదు. ధర్మముగా వారిని జయించుట శక్యముకాదు. కనుకనే మాయాప్రయోగాద్యుపాయముల నేను ప్రయోగించి వారిని వధింపజేసితిని. శత్రువు లధికశక్తిగలవారైనపుడా మార్గమే యాశ్రయణీయము. ఇది సత్పురుషులచే ననుసరింపబడినదే' అని కృష్ణభగవానుడు చెప్పిన విషయమును జూచి ప్రతివాదులు 'కృష్ణుడు సేసే పాపాలభైరవుడను' అని పలికెను. అట్లు వ్రాసినందుకేమో! వారికొంత బోధింతును—

పాపాత్ములను వధించుటకు అవియే యుపాయము లని పలికెను గాని తాను పాపాలభైరవుడ నని పలుకలేదు. నీపాపకృత్యములను బట్టియే భీష్మాదు లట్లు హతులైనారని దుర్యోధనుని నిందించిన వెనుకటి ప్రసంగములో కృష్ణభగవానుడు, దుర్యోధనుడే పాపాలభైరవు డని నిరూపించి దుర్యోధనుని నిరుత్తరుని జేసెను.

ఎవ్వరివలనగాని యెవ్వరే యే వరములను బొందియున్నను వానికి విరోధము లేని పద్ధతిని లోకరక్షణోపాయముల నాశ్రయించి కార్యము సాధించెడి యకుంఠితశక్తి కలవాడు భగవంతుడు. కనుకనే రాక్షసులకుగూడ నీయబడిన వరములకు విఘాతము లేకుండ జేయునట్టి యుపాయములతో వారల వధించి లోకరక్షణము జేయుచుండుట జరుగుచు వచ్చినది. అతడే కృష్ణభగవానుడు. కనుక భీష్మాదులకు గల వరములను విరోధము లేనిపద్ధతిని న్యాయా యుపాయముల నాశ్రయించి కార్యసాధనము గావించెను.

రాజధర్మానుశాసనప్రస్తావములో శరతల్పగతుడై యుధిష్ఠిరున కుపదేశించు భీష్ముడు—విజిగీషువులకు ధర్మాధర్మములు రెండింటిచే విజయసిద్ధి కాని కేవలధర్మముచే గాదని చెప్పెను. చూడుడు—

“ధర్మాధర్మేణ రాజాన శ్చరన్తి విజిగీషవః ।” (శా న్తి. అ80)
నీ. “కేవలేన ధర్మేణ విజిగీషవో న సిద్ధ్యన్తీత్యర్థః ॥”

మరియొకవిషయము. దుర్యోధనుడు వెనుక జూపినట్లు శ్రీకృష్ణుని నిందించుటలో—

“త్వయా పున రనార్యేణ జిహ్మమార్గేణ పార్థివాః ।
స్వధర్మ మనుతిష్ఠన్తో వయం చాన్యే చ ఘాతితాః ॥”

కృష్ణా! స్వధర్మతత్పరుల మగు మేమందరము నీచే కపటమార్గమున వధింపబడినాము, నీవు క్రూరుడవు. అనగా దుష్టుడవు, అని నిందించియుండెను.

ఈ దుర్యోధనుడే ద్యూతమునకు సన్నాహముచేసి ధృతరాష్ట్రునితో చెప్పినపుడు ధృతరాష్ట్రుడది యధర్మము, అట్టి సంకల్పము కూడదు, అని బోధింపగా దుర్యోధనుడు తండ్రికి చెప్పిన రాజనీతిని జూడుడు—

"లోకవృత్తా ద్రాజవృత్త మన్య దాహ బృహస్పతిః।
తస్మా ద్రాజ్ఞా౽ప్రమత్తేన స్వార్థ శ్చిన్త్య స్సదైవ హి
క్షత్రియస్య మహారాజ జయే వృత్తి స్సమాహితా
సవై ధర్మ స్త్వధర్మో వా స్వవృత్తౌ కా పరీక్షణా
ప్రచ్ఛన్నో వా ప్రకాశో వా యోగో యో౽రిం ప్రబాధతే।
తద్వై శస్త్రం శస్త్రవిదాం న శస్త్రం ఛేదనం స్మృతమ్
యో వై సంతాపయతి యం స శత్రుః ప్రోచ్యతే నృప
అద్రోహసమయం కృత్వా చిచ్ఛేద నముచే శ్శిరః
శక్ర స్సా౽భిమతా తస్య రిపౌ వృత్తి స్సనాతనీ
నాప్రాస్య పాండవైశ్వర్యం సంశయో మే భవిష్యతి
అవాప్స్యే వా శ్రియం తాంహి శేష్యేవా నిహతో యుధి ॥"

టీ. నాప్రాప్స్యతి. పాండవైశ్వర్య మప్రాప్య అనవాప్య అదృష్ట్వేతి యావత్. సంశయో వితర్కో న భవిష్యతి. నాభవిష్యత్. వితర్కమే వాహ- అవాప్స్యే ఇతి. పాండవైశ్వర్యం దృష్ట్వా ఇదం హర్తవ్యం వా మయా మర్తవ్యం వేత్యేవ వితర్కో జాత ఇత్యర్థః

ఏతాదృశస్య కిం మే౽ద్య జీవితేన విశాంపతే!
వర్ధన్తే పాండవా నిత్యం వయన్త్వస్థిరవృద్ధయః"। (సభాప-అ55)

టీ. అస్థిరా వృద్ధిరహితా వృద్ధిః సంపత్ యేషామ్"

అనగా, తండ్రీ! లోకవ్యవహారము వేఱు, రాజవ్యవహారము వేఱు, అని బృహస్పతి చెప్పెను. అందుచే నప్రమత్తుడై రాజు స్వార్థము

నెప్పుడును చింతించుచునే యుండవలెను. క్షత్రియునకు జయించుటే వృత్తి. అది ధర్మము గానిమ్ము. అధర్మము గానిమ్ము. స్వవృత్తివిషయమై పరిశీలన మేమున్నది? ప్రచ్ఛన్నముగాగాని ప్రకాశముగా గాని శత్రువును బాధించెడి యుపాయమే శస్త్రమగునుకాని ఛేదించునదే శస్త్రమని లేదు. ఎవ్వ డెవ్వనికి సంతాపము కలిగించునో అతడాతనికి శత్రువని చెప్పబడును. ద్రోహము చేయకుండునట్లు నిర్ణయించుకొని యింద్రుడు నముచి యను రాక్షసుని శిరస్సును ఛేదించెను. శత్రువులయం దట్లు వర్తించుట సనాతనమార్గమే. పాండవుల నైశ్వర్యము నేనపహరించుటో, లేక నేను మరణించుటో. కావలెను. వారు దినదిన ప్రవర్ధమానులగుచుండ నాకీజీవితముతో నేమి పని? అని బోధించెను.

దీనినిబట్టి ప్రచ్ఛన్నముగాగాని, ప్రకాశముగాగాని, ధర్మము గాగాని, యధర్మముగాగాని శత్రువును జయించుటే రాజునకు ముఖ్య వృత్తి కనుక తనవృత్తిలో విచారణకు అవసరములేదని దుర్యోధన సిద్ధాంతము తేలినది. ఇట్టి స్థితిలో ఈదుర్యోధననైతికసిద్ధాంతమును బట్టి కూడ దుర్యోధనుని జయించిన పాండవుల తప్పేమున్నది? శ్రీకృష్ణుని తప్పేమున్నది? కనుక దుర్యోధనపక్షపాతులగు ప్రతివాదులు దుర్యోధనసిద్ధాంతమునుబట్టి, శ్రీకృష్ణునిపైగాని, పాండవులపైగాని నింద మోపుటకు వీలులేదు.

అసలు రాజ్యము పాండవులది కాని కౌరవులది కాదు. ఈవిం యము 'పాండవనిందానిరాకరణము' అను భాగములో నిరూపింప బడును. ఇట్టిస్థితిలో నధర్మముగా బాండవరాజ్య మాక్రమించి సమూత కాలనిర్ణయానుసార మీయవలసిన పాండవరాజ్య మీయక పాండవులను చంపుటో, తాను చచ్చుటో కావలెనేగాని, నేనించుకైన యీయ నని కూర్చుండి, తల్లియు, దండ్రియు, భీష్ముడు, ద్రోణుడు, విదురుడు మున్నగువారు వారిది వారికిమ్ము. ఈయకుండుట అధర్మము. అని యెంత పోరినను వినిపించుకొనక, రాయబారమునకు వచ్చి- మహాత్ము

ప్రభృతులగు సభ్యులందరు మెచ్చుకొనునట్లు సంధిచేసికొని సుఖింపు మని బోధించినట్టి కృష్ణభగవానుని హస్తినాపురమును జేరకమునుపే దురాలోచనముతో నుండి బంధింపబూనిన దుర్యోధనునిది ధర్మ మని యెవ్వడనగలడు?

సుయోధనవిజయకర్త, అవినీతిగా వ్రాసి దుర్యోధనునితో కృష్ణుడు చెప్పె నని యెట్టి కవిత్వ మల్లెనో చూడుడు—

"పాండవపతి యింక ప్రభువైన నేమైన నాకేల? ఇక ధర్మశా సంబులెల్ల | పాలించుకొనవిమ్ము కపటపాతంబుచే నీపాత్ర మెల్ల జే యించినాడ | ఓసు సుయోధన! నీ వె యుత్తమపురుషుండ వఖిలధర్మములు నీయందె గలవు | ధర్మంబు పేర యధర్మయుద్ధంబును నన్యాయ మార్గంబునందు నిన్ను | నొంటిగా జేయుచు నుక్కడగించితి నిది యెల్ల నాకృత్యమే.|
నైతికవిజయంబు న్యాయంబుగాని ధర్మరాజునది ధర్మజయము"

ఇట్లు వ్రాయుట, లోకవంచనము కాదా! జయ మేమో పాం డవులదేనట! అది యధర్మజయమట! యుద్ధమునకు బోవునపుడు విజ యాపేక్షియగు దుర్యోధనునకు తల్లియగు గాంధారి "యతో ధర్మ స్తతో జయః" ధర్మపక్షమునకే జయ మని పలికినది. అధర్మపక్షము నకు జయ మబ్బె నని వ్రాసిన సుయోధనవిజయకర్త, పరమపతివ్రత యగు గాంధారి వాక్కునకు గూడ భంగము కలిగించిన వాడు. తల్లి, దుర్యోధనుని యధర్మ్ము మని భావించియుండ కాదు తనిదే ధర్మమని భావించిన మతిమంతుడు. ఈసుయోధనవిజయకర్త, భీష్ముడుత్తమపు రుషు డని చెప్పుచు "సద్బ్రహ్మచారి, సచ్ఛాస్త్రవేత్త, పరమభక్తుండు శుభంకరుండు" అని శ్లాఘించి యుండెను. అట్టి భీష్మపితామహుడే, శరతల్పగతుడై యుండి యుధిష్ఠిరునకు రాజధర్మములను ప్రశ్నాను గుణముగా నుపదేశించునపుడు కామక్రోధలోభమోహఈర్ష్యాఅసూ యాప్రభృతులగు పదమూడు దోషములను గూర్చి చెప్పి వానికి సత్సాంగత్యాదులను బట్టి నివారణము చెప్పి యిట్లనెను—

"ఏతే హి ధార్తరాష్ట్రాణాం సర్వే దోషా స్త్రయోదశ।
త్వయా సత్త్వార్థినా నిత్యం విజితా జ్యేష్ఠసేవనాత్॥" (శాంతి.అ163

ఈదోషము లన్నియు ధృతరాష్ట్ర పుత్రులయం దుండినవి. సత్పురుషసేవనుబట్టి సత్యనిష్ఠుడవైన నీచే నివి యన్నియు నిరాకరింపబడినవి. అని. ఈభీష్మవాక్యమే, దుర్యోధనాదులు దుష్టు లనుటకును, యుధిష్ఠిరాదులు నిర్దుష్టు లనుటకును సాక్షి. ఇట్లుండ దుర్యోధను డుత్తమపురుషుడనియు, ధర్మాత్ముడనియు కవిత్వ మల్లుట నింద్యము.

ఇక.మ.భా.చ.కారుల వ్రాతలో జూపబడిన యంశమిదియొకటి మిగిలినది. "దుర్యోధనుడు రావణునివంటి దుర్మార్గుడు కాడు"

ఈమాట, పాండవులకంటె దుర్యోధను డుత్తము డని వ్రాసిన దుర్యోధనపక్షపాతులకు బాగుండనేమోకాని శ్రీరామునికంటె రావణు డుత్తము డని వ్రాసిన రావణపక్షపాతులకు సహ్యముగానుండునా? దుర్యోధను డెంత దుర్మార్గుడో రావణపక్షపాతులు చెప్పవలెను. రావణుడెంతదుర్మార్గుడో దుర్యోధనపక్షపాతులు చెప్పవలెను.

మేమాయుభయులనుగూర్చి (భారతసావిత్రి)యందు జెప్పబడిన విషయమునుమాత్రమె వెల్లడించుచున్నాము—

"ద్వా విమౌ పురుషౌ మూర్ఖౌ దుర్యోధనదశాననౌ।
గోగ్రహం వనభంగం చ దృష్ట్వా యుద్ధం పునః పునః॥"

ఏకాకియై వచ్చిన వానరము రాక్షసరక్షితమైన తనయశోకవనమును నిర్భయముగా భగ్నముజేసియున్నరీతినిచూచియు, వానరసేనా పరివృతుడగు శ్రీరామప్రభువుపై యుద్ధమునకు గాలుదువ్విన రావణుడును, ఏకియైవచ్చి యుత్తరగోగ్రహణకాలములో మహారథాధిష్ఠితములైన కౌరవసేనలను చెండాడి గోవులను మరలించుకొనివెళ్లిన పార్థుని

పరాక్రమము జూచియు మహాసేనావరివృతులగు పాండవవీరులపై మాటి మాటికి యుద్ధమునకు కాలుదువ్విన దుర్యోధనుడును అనుపురుషు లిద్దరు మూర్ఖులే యని భావము. దీని నింతటితో విడిచి విషయాంతర మందుకొందము.

—: "భక్తి యను నది ప్రాచీనకాలమున లేకుండెను" అను ప్రసంగము-తన్నిరాకరణము :—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— "భక్తి యనునది ప్రాచీనకాలమున లేకుండె ననియు, కర్మ, జ్ఞానము అనునవియే యుండె ననియు, కృష్ణవిషయకభక్తి మధ్యకాలమున నేర్పడె ననియు శ్రీలోకమాన్యతిలకు చర్చించియున్నాడు. కాని నాకు దోచిన రీతి నింకొకసంగతిని వ్రాయుచున్నాడను. శాకటాయనుడు పాణిని, పతంజలి అను వ్యాకరణ భాష్యకర్తలు వాసుదేవార్జునుల యందు భక్తికలవా రుండి రని చెప్పియున్నారు. పతంజల్యాదులు ఋషులుగానె పరిగణింపబడిరి. పతంజలి, క్రీ. పూ. 2 శతాబ్దము నను, పాణిని, క్రీ. పూ. 8 శతాబ్దముననను, శాకటాయనుడు, క్రీ. పూ. 12 శతాబ్దమున నుండిరి. శాకటాయనుని కాలమున వాసుదే వార్జునులను వీరులనుగా మాత్రమె తలచి భక్తి సేయువారుం డిరి. పాణిని కాలమునకు వారిని భగవదవతారముగా దలచుచుం డిరి. పతంజలి కాలమున వాసుదేవుని భగవంతునిగా దలచుచుం డిరి. గాని యర్జును నటుల దలపరైరి.

శాకటాయనుడు 'భక్తి' అను అధికారసూత్రమునకు పిమ్మట "వాసుదేవార్జునాభ్యాంవుఞ్" అని చెప్పెను. శబ్దనిష్పత్తిలో వాసు దేవుని భక్తుడు వాసుదేవకుడు. అర్జునుని భక్తుడు అర్జునకుడు అగు ననెను.

పాణిన్యాచార్యులుకూడ తన యష్టాధ్యాయిలో 'వాసుదేవార్జునాభ్యాం వుఞ్' అని చెప్పెను. దీనివలనగూడ పైవిధముగనే రూపనిష్పత్తి యగును. కాని శాకటాయనుడు 'వుఞ్' అనగా పాణిని 'వుఞ్' అనెను.

పతంజలి మహాభాష్యమున జెప్పిన యీ క్రిందివాక్యములచే శాకటాయనుని వాసుదేవార్జునభక్తులకును పాణినియొక్క వాసుదేవార్జునభక్తులకును భేదముకలదని తెలియనగును.

మహాభాష్యమ్— కిమర్థం వాసుదేవశబ్దాత్ వుఞ్ విధీయతే 'గోత్రక్షత్రియాఖ్యేభ్యో బహులం వుఞ్' ఇత్యేవ సిద్ధమ్ నహ్యస్తి విశేషః వాసుదేవశబ్దాత్ వుఞో వా వునో వా తదేవ రూపం సపవ స్వరః ఇదంత్వర్థి ప్రయోజనం, వాసుదేవశబ్దస్య పూర్వనిపాతం వక్ష్యామీతి అథవా నైషా క్షత్రియాఖ్యా సంజ్ఞైషా తత్ర భగవతః.

పైభాష్యవాక్యములబట్టి 'వుఞ్' క్షత్రియమాత్రనియందుండు భక్తిని 'వుఞ్' భగవత్పరముగా నగుభక్తిని జెప్పునని స్పష్టమగుచున్నది. పతంజలి అర్జునశబ్దముపైనైన దలపెట్టకుండుటచే నర్జునుడు భగవత్పదవినుండి నాటివారిచే దొలగింపబడెనని స్పష్టమగుచున్నది." (పు203)

గోపాలతాపిన్యుపనిషదాదులు, సంతానగోపాలమంత్రాదులు దీనికి బిమ్మటనే పుట్టియుండును. పు204)

అహా! వ్యాకరణశాస్త్రములోగూడ మేము వ్రేలుపెట్టినామని యజ్ఞులకుమోసపుచ్చుటకై ప్రతివాదులీరసాభాసపువ్రాత వ్రాసినారు.

"వాసుదేవార్జునాద్వుఞ్" అని శకటాయనసూత్రి మట! 'వాసుదేవాభ్యాం వుఞ్' అని పాణినిసూత్రమట! "వుఞ్" ప్రత్యయమును చేసినను "వుఞ్" ప్రత్యయమును చేసినను వాసుదేవుకు అర్జునకుడు అని రూపనిష్పత్తి సమానమేనట! ఎంత అవివేకమో!

వాసుదేవశబ్దములో మొదటయక్షరములో దీర్ఘ మున్నది. అర్జునశబ్దములో మొదటయక్షరము దీర్ఘముకాక హ్రస్వమై యున్నది. వుఞ్ ప్రత్యయము జేసినపుడు మొదటియక్షరములో నేమియు మార్పు కలుగదు. వుఞ్ ప్రత్యయము జేసినపుడుమాత్రము మొదటిహ్రస్వాకారము దీర్ఘాకార మగును. ఇట్లుండుటచే అర్జునశబ్దమునకు వుఞ్ ప్రత్యయము జేసినపుడు "ఆర్జునకః" అని యగును. వుఞ్ ప్రత్యయము జేసినపుడు "అర్జునకః" అని యగును. వాసుదేశబ్దమునకు ఏప్రత్యయము జేసినను "వాసుదేవకః" అనియేయగును. అట్టిస్థితిలో అర్జునశబ్దమున కేప్రత్యయము జేసినను "అర్జునకుడు" అను రూపనిష్పత్తి సమానమే అను ప్రతివాదుల వ్యాకరణశాస్త్రమందలి విపరీతపాండితి నుత్యము.

ప్రతివాదులు చూపియున్న పతంజలిభాష్యమునకు తాత్పర్యమిది. 'గోత్రక్షత్రియాఖ్యేభ్యో బహులం వుఞ్' అను పాణినిసూత్రమందు క్షత్రియుల జెప్పెడి శబ్దములకు వుఞ్ ప్రత్యయము వచ్చునని చెప్పబడెను. అర్జునశబ్దము క్షత్రియుని జెప్పునదేకనుక నాసూత్రముచే వుఞ్ ప్రత్యయము వచ్చిన 'ఆర్జునకః' అని యైపోవును. "అర్జునకః" అనియే కావలసియున్నది. అని భావించి "వాసుదేవార్జునాభ్యాం వుఞ్" అని సూత్రము చేసి అర్జునశబ్దమునకు వుఞ్ ప్రత్యయమునే విధించి అర్జునకః అని రూపమును సాధించుట యుక్తమే కాని యాసూత్రముచే వాసుదేవశబ్దమునకుగూడ వుఞ్ ప్రత్యయమునే విధింపవలసిన పని లేదు. వసుదేవుని పుత్రుడు అని యర్థముగల వాసుదేవశబ్దము క్షత్రియుని

జెప్పనదేకనుక వృద్ధప్రత్యయము వచ్చుచునేయున్నది. దానిచేత 'వాసుదేవకః' అనురూపము సిద్ధించుచునే యున్నది. ఇట్లుండ అర్జునశబ్దముతోబాటు వాసుదేవశబ్దమునకుగూడ వుఞ్ప్రత్యయ మేల విధించెను? అను శంకకు సమాధాన మేమనగా వాసుదేవశబ్దము "వసుదేవస్యాపత్యమ్" (వసుదేవుని పుత్రుడు) అని యర్థము కలదైనపుడు క్షత్రియుని జెప్పగలుగును. కాని 'వాసు X దేవ' అనువ్యుత్పత్తిని గ్రహించినపుడు భగవంతునికే పేరగును. వాసుదేవశబ్దనిర్వచనమిట్లున్నది—

"సర్వత్రాఽసౌ సమస్తం చ వసత్యత్రేతి వై యతః ।
తతోఽసౌ వాసుదేవేతి విద్వద్భిః పరిగీయతే ॥"

సర్వత్రాఽసౌ వసతి సర్వమత్ర వసతీతి వా వ్యుత్పత్త్యా వాసుః వాసుశ్చాఽసౌ దేవశ్చః వాసుదేవః.

ఇట్లు సర్వాధారుడు, సర్వాంతర్యామి యైన దేవుడు వాసుదేవశబ్దముచే జెప్పబడుచుండుటవలన దీనికి ప్రత్యయము ప్రత్యేకము విధింపబడినది. అని. ఇదియే పతంజలిభాష్యతాత్పర్యము.

ఈభాష్యములో— 'వసుదేవస్యాపత్యమ్' వసుదేవుని పుత్రుడు క్షత్రియుడే. యని చెప్పబడియుండుటచే భగవంతుడగు శ్రీకృష్ణుడు వసుదేవసంబంధమువలన, క్షత్రియుడై యుండుటవలన "కృష్ణుడు క్షత్రియుడుకాడు" (ప్ర-201) అను మ. భా. చ. కారుల విపరీతసిద్ధాంతమపాస్తమైనది.

ఆభాష్యములో సూత్రోక్తమై యున్న అర్జునశబ్దమునుగూర్చి చర్చింపకుండుటకు దానికి ప్రత్యయాంతరమును విధించుటలో ఫలముండుటే కారణము. వాసుదేవశబ్దమునుగూర్చి చర్చించుటకు దానికి ప్రత్యయాంతరవిధానములో ఫలము కనబడకుండుటే కారణము.

ఇక భక్తి యనుదానినిగూర్చి చెప్పవలసియున్నది. 'భక్తిః' సూ. 4-3-95. సోఽస్యేత్యనువర్తతే. భజ్యతే సేవ్యతే ఇతి భక్తిః స్రుఘ్నోభక్తిరస్య స్రౌఘ్నః, అపూపాభక్తిరస్య ఆపూపికః, పాయసికః, వాసుదేవకః, అర్జునకః, అంగాః క్షత్రియాః భక్తిరస్యాంగకః"

ఇచ్చట భక్తిశబ్దమునకు సేవింపబడుచున్న దని యర్థము. ఉదాహరణములు — స్రుఘ్నదేశ మెవ్వనిచే సేవింపబడుచున్నదో అతడు స్రౌఘ్నుడు. అపూపము లెవ్వనిచే సేవింపబడుచున్నవో అతడు ఆపూపికుడు. పాయస మెవ్వనిచే సేవింపబడుచున్నదో అతడు పాయసికుడు, వాసుదేవు డెవ్వనిచే సేవింపబడుచుండెనో అతడు వాసుదేవకుడు. అట్లే అర్జునకుడు. అంగకుడు

ప్రతివాదుల ధోరణిజూడుడు — శాకటాయనుని కాలమున వాసుదేవార్జునులను వీరులనుగా మాత్రమే తలచి భక్తి సేయువారట! పాణిని కాలమున భగవదవతారముగా దలచిరట! పతంజలికాలమున వాసుదేవుని భగవంతునిగా దలచిరట! అర్జునునట్టుల దలపలేదట! దీనికి ప్రమాణములు వ్యాకరణసూత్రములు, భాష్యములునట! పతంజలి అర్జునశబ్దము పేరైన దలపెట్టకుండుటచే నర్జునుడు భగవత్పదవినుండి నాటివారిచే దొలగింపబడె నని స్పష్ట మయ్యెనట!

ఆహా! ఆవ్యాకరణశాస్త్రమునకును, ఈధోరణికిని యేమైన సంబంధ మున్నదా? వెనుకజూపిన ఆమృచ్ఛకటికలోని శకారునిమాటలకు ఈ మ. భా. చ. కారునిమాటలు తీసిపోవునా?

భజధాతువునకు క్తిన్ ప్రత్యయము జేసిన భక్తి యని యగును. భక్తి యనునది ప్రాచీనకాలమున లేకుండె నను ప్రతివాదుల నడుగవలసియున్నది— ప్రాచీనకాలమున భజధాతువు లేదా? క్తిన్ ప్రత్య

యము లేదా? పతిభక్తి లేదా? పితృభక్తి లేదా? మాతృభక్తి లేదా? గురుభక్తి లేదా? భగవద్భక్తి లేదా? మొట్టమొదట నిరూపించినట్లు భగవంతుడే శ్రీకృష్ణుడుకనుక కృష్ణభక్తి ప్రాచీనకాలములో లేకపోవు టేమి? భగవద్గీతలోనే బహుస్థలములలో భక్తిప్రశంస కలదు. చూడుడు.

"మయి చానన్యయోగేన భక్తి రవ్యభిచారిణీ' 'భక్త్యా యుక్తో యోగబలేన చైవ' 'మాంచ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।'

ఇట్లుండుటచే "స్వయంమూఢోఽన్యాంశ్చ వ్యామోహయతి. శాస్త్రార్థసంప్రదాయరహితత్వాత్ శ్రుతహాని మశ్రుతకల్పనాం చ కుర్వన్" అను భగవత్పాదవాక్యము స్మృతికి వచ్చుచున్నది. దీని నింతటితో విసర్జించి విషయాంతర మందుకొందము.

—:కృష్ణభగవానుని జారత్వమునుగూర్చి, శంకాసమాధానములు:—

పద్మపురాణోత్తరఖండము—అ—27౩

పార్వత్యువాచ— "ధర్మసంరక్షణార్థాయ జగత్యా మవతీర్య సః।
పరదారాభిగమనం కథం కుర్యా జ్జనార్దనః ॥"

రుద్ర ఉవాచ— "స్వశరీరే పరిష్వంగభేదో నాస్తి శుభాననే,
సర్వం జగచ్చ తస్యాంగం పృథ గత్ర న విద్యతే.
దోషోఽత్ర నాస్తి సుభగే దేవస్య పరమాత్మనః,
నైసర్గికస్య భర్తృత్వా దాత్మేశత్వా జ్జగత్పతేః.
తథాఽపహతపాప్మన స్సామర్థ్యా ద్వ్యాపినః ప్రభోః,
స్త్రీపుంభేదో న సుభగే పురుషస్య మహాత్మనః,
స్వాంగాలింగే రతి ర్యస్యా దంగనాలింగనే రతిః.
యస్యాంగం జగదీశస్య తస్య రాగాదయః కుతః."

శ్రీమద్భాగవతమ్ — స్క-10. అ33॥

రాజా— "సంస్థాపనాయ ధర్మస్య ప్రశమాయేతరస్య చ ।
అవతీర్ణో హి భగవానంశేన జగదీశ్వరః ॥
స కథం ధర్మసేతూనాం వక్తా కర్తాఽభిరక్షితా ।
ప్రతీపమాచరద్బ్రహ్మన్ పరదారాఽభిమర్శనమ్ ॥
ఆప్తకామో యదుపతిః కృతవాన్ వై జుగుప్సితమ్ ।
కిమభిప్రాయ ఏతం మే సంశయం ఛిన్ధి సువ్రత ॥"

శ్రీశుకః— "గోపీనాం తత్పతీనాం చ సర్వేషాం చాపి దేహినామ్ ।
యోఽన్తశ్చరతి సోఽధ్యక్షః ఏష క్రీడనదేహభాక్ ॥
అనుగ్రహాయ భూతానాం మానుషం దేహమాశ్రితః ।
భజతే తాదృశీం క్రీడా యాః శ్రుత్వా తత్పరో భవేత్ ॥
నాసూయన్ ఖలు కృష్ణాయ మోహితాస్తస్య మాయయా ।
మన్యమానాః స్వపార్శ్వస్థాన్ స్వాన్ స్వాన్ దారాన్ వ్రజౌకసః

ఇచ్చట, ధర్మసంస్థాపనముకై యవతరించిన కృష్ణభగవానుడు పరదారాభిగమన మెట్లు చేసెను? అని పార్వతీదేవి ప్రశ్నింప పరమేశ్వరు డిట్లు చెప్పెను— జగత్తంతయు శ్రీకృష్ణశరీరమే. భిన్నముగా లేదు. గోపికలునున్నగువారు శ్రీకృష్ణునిబట్టిచూచిన శ్రీకృష్ణశరీరావయవములై యున్నవారే. తన శరీరావయవముల నాలింగనము జేసికొనుట రతిసుఖ మగునా? శ్రీకృష్ణుడు జగద్భర్త యగుటవలనను, ఆత్మేశ్వరు డగుటవలనను, అపహతపాప్మత్వాదిగుణములు గలవాడగుటవలనను, సర్వవ్యాపి యగుటవలనను, స్త్రీపురుషవిభేద మాకృష్ణుని దృష్టిలో లేకుండుటవలనను దోషశంక కవకాశము లేదు. లోకములో కాంతాలింగనములో రతిసుఖముకాని, స్వాంగాలింగనములో రతిసుఖము లేదు. జగత్తంతయు స్వాంగమైయున్న కృష్ణభగవానునకు రాగాదుల కవకాశమే లేదు. అని.

పరీక్షిత్ప్రశ్నములోఁగూడ, ధర్మసంస్థాపనమునకును, అధర్మనిర్మూలనమునకును అవతరించిన జగదీశ్వరుడగు శ్రీకృష్ణుఁడు విరుద్ధమైన పరదారాభిమర్శనము నేల జేసెను? ఆప్తకాముడు కనుక నాతని కధర్మము కాదందుమా? కామములేనివాడు నింద్యమైన పని నేయభిప్రాయముతోఁ జేసియుండును? ఈసంశయము దీర్పుమని యడుగ శ్రీశుకుడిట్లు చెప్పెను—గోపికలకును, గోపికాపతులకును, సకలదేహధారులకును అంతర్యామియైయున్న పరమాత్మయే లీలార్థమై దేహధారణము జేసి లోకానుగ్రహమునకై మానుషదేహము నాశ్రయించెను.

అట్టి శ్రీకృష్ణుడు, శృంగారరసాకృష్టచిత్తులై బహిర్ముఖవృత్తి కలిగియున్న లోకులనుగూడ తనశృంగారలీలలచే నాకర్షించి తన్మూలమున భగవంతుడగు తనయందు వారల మనస్సులు లగ్నమగునట్లు జేసి యాలోకుల నుద్ధరింపవలెనను తాత్పర్యముతోఁ దాను కామము లేనివాడైయుండియు లోకానుగ్రహమునకై యట్లు విహరించెను.

రాసక్రీడాదులలో శ్రీకృష్ణసన్నిధానములో గోపిక లున్నను వారల భర్తలకు తమసమీపమందే యున్నట్లు శ్రీకృష్ణుని యోగమాయచే గోచరించెను. వారల కెట్టి యసూయయు కలుగలేదు. అందుచే లోకములో దురాచారపరులు తమదుశ్చేష్టలను శ్రీకృష్ణచేష్టలతోఁ బోల్చి వ్యవహరించుచుండుట సాహసహేతువు. అని.

'ఉజ్జ్వలనీలమణి' యనుగ్రంథమం దిట్లు చెప్పబడినది—

"శృంగారరససర్వస్వం శిఖిపించ్ఛవిభూషణమ్
అంగీకృతనరాకార మాశ్రయే భువనాశ్రయమ్
లఘుత్వ మత్ర యత్ప్రోక్తం తత్తు ప్రాకృతనాయకే
న కృష్ణే రసనిర్యాసస్వాదార్థ మవతారిణి
యత్పరోఢోపపత్యోస్తు గౌణత్వం కథితం బుధైః
తత్తు కృష్ణం చ గోపీశ్చ వినేతి ప్రతిపద్యతామ్॥" (నాటకచంద్రికా)

పరకీయకును, ఉపపతికిని, సంబంధించియున్న శృంగారము అధర్మ హేతువగుటచే యుక్తము కాదను మాట ప్రాకృతనాయకుని విషయము. శృంగారరససాగము నాస్వాదింపజేయ నవతరించిన దివ్యమంగళవిగ్రహుఁడైయున్న శ్రీకృష్ణుని విషయము కాదు. గోపికలు పరకీయలు కారు. శ్రీకృష్ణుఁ డుపపతి కాఁడు. అని తాత్పర్యము.

'జన్మ కర్మ చ మే దివ్యమ్' అని శ్రీకృష్ణభగవానుఁడే గీతలో తనజన్మము, తన చేష్టలు దివ్యములని యుపదేశించియే యుండెను. మరియు, కృష్ణభగవానుఁడు బ్రహ్మతో చెప్పినట్లు వెనుక జూపిబడిన శ్లోకముగూడ నీసందర్భములో స్మరణీయము—

"విధేఽహం సర్వోఽస్మి వ్రజసుహృదుకగోవత్సపదహమ్ ।
బిభర్మి బ్రహ్మాణ్డం గిరివ దహ మద్మి జ్వలనవత్
సృజామి ద్రాసద్యావసనవదహం ప్రాణభృ దహమ్
యద త్రాఽహం తృప్తో మునిరితి మదన్య న్న కిమపి ॥"

దీనిచే సర్వము నాస్వరూపమే నేను కాని దేమియు లేదని చెప్పబడెను. కనుక కృష్ణభగవానునియందు జారత్వాశంక పాపహేతువని సారాంశము.

—• "శ్రీకృష్ణు డనదయ్యై యేమియు దోఁపక శయనించి బాణములో గొట్టబడి మృతి నొందెను." అనుప్రసంగము—
తన్నిరాకరణము •—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— "శ్రీకృష్ణు డనదయ్యై యేమియు దోఁపక శూన్యవనమున శయనించి కురువంశజులు యెట్లయ్యెనో యాదవవంశజులు యట్లయ్యెగదా యని గాంధారీ శాపవాక్యమును స్మరించుచుండగా నొక వ్యాధుఁడు శయనించిన

కృష్ణుని మృగముగా దలచి బాణముతో గొట్టెను. అది కృష్ణుని పాదాగ్రమున దగిలి దానితోనె మృతి నొందెను.

"కృష్ణు డెంతటి యవతారపురుషుడైనను మృతయాదవయగు ద్వారకలో నుండలేను. తపస్సు జేయ బోయెదను. అర్జునుడు వచ్చి తక్కినపనుల జక్కజేయు నని వసుదేవునితో జెప్పి వనములో విచారించుచు శయనించుటలో సంపూర్ణమానవత్వము నొందిన రీతి గోచరించును. ఏతపస్సును జేయలేదు. అత్యాసన్నమరణము గూడ శ్రీకృష్ణునకు దెలియలేదు. ఇది సంపూర్ణమానవత్వము కాదా?" (పు196)

ప్రతివాదుల వ్రాత యిట్లున్నదికదా! గ్రంథమెట్లున్నదో చూడుడు—

ముందు బలరామస్వామి వనమందు యోగనిష్ఠతో నుండగా శేషాహియొక్క యవతారమగుటచే నాసమయమందు బలరామస్వామి ముఖమునుండి యొకమహాసర్పము నిర్గమించి వెళ్ళుటను కృష్ణభగవానుడు చూచెను— "అథాపశ్య ద్యోగయుక్తస్య తస్య నాగం ముఖా న్నిశ్చరన్తం మహాన్తమ్" (మౌసలప. అ4)
ఇట్లున్నగ్రంథమునకు ప్రతివాదులదురూహ యెట్లున్నదో చూడుడు—

"బలరాముని శ్రీకృష్ణుడుచూడబోగా నాతనిముఖమునుండి మహాసర్ప మొకటి వెడలి యాగ్నిర్గత మయ్యె నని చెప్పబడుటచే బలరాముడు మత్తుడై యేవృక్షముక్రిందనో పండుకొని యేదుష్టసర్పముచాతనో పడి మృతుడయ్యె నని తలపవలసియున్నది!"

ఆవ్యాసమహర్షి చెప్పిన దసత్యమని, యీవిపరీతసిద్ధాంతము సత్యమని భావించెడి మందభాగ్యు డెవ్వడో! ప్రతివాదుల నైజమిదియే. తరువాతగ్రంథమునందు కృష్ణభగవానుని విషయ మిట్లున్నది —

"తతో గతే భ్రాతరి వాసుదేవో జానన్ సర్వా గతయో దివ్యదృష్టిః,
వనే శూన్యే విచరంశ్చింతయానో భూమౌ చాఽథ సంవివేశాగ్ర్య తేజాః.
సర్వం తేన ప్రాక్తదా విత్తమాసీద్గాంధార్యా యద్వాక్యముక్తం స్వధర్మాత్,
దుర్వాససా పాయసోచ్ఛిష్టలిప్తే యచ్చాప్యుక్తం తచ్చ సస్మార కృష్ణః.
సంచింతయ న్నంధకవృష్ణినాశం కురుక్షయం చైవ మహానుభావః.
మేనే తతః సంక్రమణస్య కాలం తత శ్చకారేంద్రియసన్నిరోధమ్.
యథాచ లోకత్రయపాలనార్థం దుర్వాసవాక్యప్రతిపాలనాయ,
దేవోఽపిసన్ దేహవిమోక్షహేతో ర్నిమిత్తమైచ్ఛత్సకలార్థతత్త్వవిత్
స సన్నిరుద్ధేంద్రియవాఙ్మనాస్తు శిశ్యే మహాయోగ ముపేత్య కృష్ణః,
జరోఽథ తం దేశ ముపాజగామ లుబ్ధ స్తదానీం మృగలిప్సురుగ్రః.
స కేశవం యోగయుక్తం శయానం మృగాసక్తో లుబ్ధక స్సాయకేన,
జరోఽవిధ్య త్పాదతలే త్వరావాం స్తం చాఽభిత స్తంజిఘృక్షు ర్జగామ
అథాఽపశ్య త్పురుషం యోగయుక్తం పీతాంబరం లుబ్ధకోఽనేక బాహుమ్,
మత్వాత్మానం త్వపరాద్ధం స తస్య పాదౌ జరో జగృహే శంకితాత్మా
ఆశ్వాసయ త్తం మహాత్మా తదానీం గచ్ఛ న్నూర్ధ్వం రోదసీ వ్యాప్యలక్ష్మ్యా,
తతో రాజన్ భగవా నుగ్రతేజా నారాయణః ప్రభవ శ్చావ్యయశ్చ,
యోగాచార్యో రోదసీ వ్యాప్య లక్ష్మ్యా స్థానం ప్రాప స్వం మహాత్మా ఉప్రమేయమ్.(మౌసలప-అ-4)

సర్వజ్ఞుడైన దివ్యదృష్టిగల కృష్ణభగవానుడు ఆలోచింపుచు వన భూమియం దుండెను. అప్పుడు, వెనుక పుత్రశోకముతో పతివ్రతయగు గాంధారి యాడిన మాటను, అంతకు బూర్వము ఉన్మత్త వేషముతో వచ్చిన దుర్వాసునకు ద్వారకలో దానాతిథ్య మిచ్చినపుడు దుర్వాసుడు పాయసము భుజించి మిగిలినదానిని కృష్ణా! నీవాపాదమస్తకము బూసి

కొను మని యాజ్ఞాపింపనట్లే చేసి విప్రోచ్ఛిష్టము పాదస్పృష్టము కాకూడదని పాదతలమునకుమాత్రము బూసికొనుట మానగా మహర్షి చూచి-"న తు పాదతలే విప్తే తస్మాత్తే మృత్యుతో భయం" (అనుశాసనప" అ264) అనుచు నీవరికాలుకు బూసికొనలేదు కనుక నదియే నీకు మృత్యుస్థానము. అని పలుకుటను స్మరించి కురువంశీయము, యాదవుల పరలోకగమనము, జరిగెను గనుక నిక మన మవతారమును చాలించెడి సమయ మిది యని భావించి తాను దేవుడే యైనను దుర్వాసోమహర్షి వాక్యమును పరిపాలించుటకై దేహవిమోచనమునకు నిమిత్తమును సంకల్పించి సర్వేంద్రియనిరోధము జేసి శయనించి మహాయోగనిష్ఠలో నుండెను. అంతట నాప్రాంతమునకు జరు డను కిరాతుడు వచ్చి యెత్తి పెట్టియున్న పాదతలముపై మృగమును భ్రాంతిచే బాణము వేసి వెంటనే సమీపమునకు వచ్చి చూచునంతట పీతాంబరధారియై, చతుర్బాహుసమన్వితుడై, యోగనిష్ఠుడై యున్న యాదివ్యవిగ్రహమును జూచి యపరాధము జేసితి నని పరితపించి, యాశ్రీకృష్ణభగవానుని పాదములపై బడెను.

అపు డాకిరాతుని కభయ మిచ్చి యానారాయణుడు- ఆజగత్సృష్టిస్థితిలయకారుడు- ఆయోగాచార్యుడు దిక్తటములను వ్యాపించిన తన తేజస్సుతో స్వస్థానము నలంకరించెను.

ఇది గ్రంథమం దున్న విషయము. ఇట్లుండ, 'వనములో విచారించుచు శయనించుటలో సంపూర్ణమానవత్వము నొందినరీతి గోచరించునట! అత్యాసన్నమరణముగూడ శ్రీకృష్ణునకు దెలియలేదట' ఆహా! ఆశ్రీకృష్ణునకు దెలియలేదా? ఈప్రతివాదులకు తెలివిలేదా?

## —శ్రీకృష్ణనిర్యాణవిషయమై గ్రంథవిరోధపరిహారము—

మహాభారతములో శ్రీకృష్ణశరీరమునకు దహనసంస్కారము జరిగినట్లు చెప్పబడినది. శ్రీమద్భాగతములోగూడ ప్రథమస్కంధములో

"యయాఽహరద్భువో భారం తాం తనుం విజహౌ వశః" అని శరీర త్యాగము చెప్పబడినది. ఏకాదశస్కంధములో మాత్రము శరీరత్యాగము జేయకయె వెళ్ళినట్లు చెప్పబడినది. ఈవిరోధమునకు బరిహారము వాఖ్యాతలే చేసియున్నారు. చూడుడు—

శ్రీమద్భాగవతమ్— స్కం.11 అ31

"లోకాభిరామాం స్వతనుం ధారణాధ్యానమంగలమ్ ।
యోగధారణయాఽఽగ్నేయ్యాఽదగ్ధ్వా ధామాఽవిశత్స్వకమ్ ॥"

శ్రీధరీయమ్— యోగినామివ స్వచ్ఛన్దమృత్యుభ్రమం వారయతి. అయమర్థః— యోగినో హి స్వచ్ఛన్దమృత్యవః స్వాం తను మాగ్నేయ్యా యోగధారణయా దగ్ధ్వా లోకాన్తరం ప్రవిశన్తి భగవాంస్తు న తథా, కిన్తు, అదగ్ధ్వైవ స్వతనుసహితఏవ స్వకం ధామ వైకుంఠాఖ్య మవిశత్. తత్ర హేతుః లోకాభిరామాం లోకానా మభిరామో ఽభితో రమణం స్థితిః యస్యాం తామ్. జగదాశ్రయత్వేన జగతోఽపి దాహప్రసంగా దిత్యర్థః కించ ధారణాయా ధ్యానస్యచ మంగలం, శోభనవిషయమ్. ఇతరథా తయోర్నిర్విషయత్వం స్యాత్. దృశ్యతే చాఽద్యాపి తదుపాసకానాంతథైవ తదూపసాక్షాత్కారః ఫలప్రాప్తిశ్చేతి భావః.

ఇచ్ఛాశరీరాఽభిప్రాయేణ వా యథాశ్రుత మేవాస్తు తత్రాఽపి లోకాభిరామా మిత్యాదీనాం విశేషణానా మానర్థక్యప్రసంగా త్తదప్యదగ్ధ్వా తిరోధాయ నిర్గత ఇత్యేవ సాంప్రతమ్.

శ్రీధరీయవ్యాఖ్యా వం॥ధరీయా— శుద్ధసత్త్వమయస్యవిద్యమానత్వేఽపి తత్ప్రతికృత్యభిప్రాయేణయథాశ్రుతార్థస్వీకారేఽపి న దోష ఇత్యాహ-ఇచ్ఛాశరీరేతి. తత్రాపి యథాశ్రుతార్థాంగీకారేఽపి తదపి తత్ప్రతికృతిరూపమపి. సాంప్రతమ్, ఉచితమ్, భారతే యదుక్తం మౌసలే—

"తత శ్శరీరే రామస్య వాసుదేవస్య చోభయోః ।
అన్విష్య దాహయామాస పురుషై రాప్తకారిభిః ॥" ఇతి.

తదా సురజనమోహార్థమేవ. తదుక్తం బ్రహ్మాండే—

"స్త్రీపుంమలానుషంగాత్మా దేహో నాస్య విజాయతే ।
కిన్తు నిర్దోషచైతన్యం సుఖనిత్యాం స్వకాం తనుమ్ ॥
ప్రకాశయతి సై వేయం జని ర్విష్ణో ర్నచాఽపరా ।
తథాఽప్యసురమోహార్థం పరేషాఞ్చ క్వచి త్క్వచిత్ ॥
దుఃఖాఽజ్ఞానశ్రమాదీంశ్చ దర్శయే చ్ఛుద్ధసద్గుణః ।
క్వ వ్రణాది క్వచాఽజ్ఞానం స్వతన్త్రోఽచిన్త్యసద్గుణే॥
మోహాభావాయ తేషాన్తు దర్శయే త్తా నజో హరిః ।
కృష్ణో హ్యత్యక్తదేహోఽపి త్యక్తదేహస్య దేహవత్ ॥
లోకానాం దర్శయామాస స్వరూపసదృశాకృతిమ్ ।
ఏతేన "యయాఽహర ద్భువో భారం తాం తనుం విజహా వజః"
ఇతి ప్రథమస్కన్ధోక్తి రపి సమంజసా స్యా దితి సర్వ మనవద్యమ్॥

అనగా స్వచ్ఛందమృత్యువులగు యోగులు తమశరీరములను యోగాగ్నిచే దగ్ధముచేసి లోకాంతరములకు వెళ్ళినట్లుకాక కృష్ణ పరమాత్మ స్వశరీరముతోడనే వైకుంఠమునకేగెను. సకలజగదాధార మైన స్వశరీరము దగ్ధమైనయెడల జగత్తు దగ్ధమై పోవును. ధ్యానధార ణలకు విషయము లేకయే పోవును. ఆశ్రీకృష్ణశరీర మట్లే యున్న హేతువుచేతనే ఉపాసకులకు నేటికిని యారూపముయొక్క సాక్షాత్కా రము, ఆఫలప్రాప్తి యనుభవసిద్ధములై యున్నవి. ఆశ్రీకృష్ణశరీరము ఇచ్ఛాశరీరమన్ననుఅదియుదగ్ధముకాలేదనుటయుక్తము.(శ్రీధరీయము)

మౌసలపర్వములో శ్రీకృష్ణశరీరమును దగ్ధము జేసినట్లు చెప్ప బడిన విషయమునకు బ్రహ్మాండపురాణములో సమాధానమిట్లున్నది—

అవతారసందర్భములో భగవచ్ఛరీరము శుక్రశోణితసంబంధముకలది కాదు. తనస్వరూపమును ప్రకాశింపజేయుటే భగవంతుని జన్మ యనబడును. ఐనను దుఃఖమును, అజ్ఞానమును, ప్రయాసమును అసురమోహార్థము తన కున్నట్లు ప్రదర్శించుచుండును. నిజముగా తనయందు అత్యంతాసంభవములైన దుఃఖాజ్ఞానాదులను అనధికారులకు మోక్షము రాకుండుటకే భగవానుడు ప్రదర్శించుచుండును. శ్రీకృష్ణుడు దేహమును త్యజింపకుండియే త్యజించిన దేహానుమువలె స్వస్వరూపముతో సమానమైన యొక యాకృతిని జూపియుండెను. అని.

దీనిచే దగ్ధముచేయబడినట్లుచెప్పబడియున్న ఆకారము అప్పటి కప్పుడు చూపబడినదగుటచే దానికే యట్టిసంస్కారము జరిగె ననియు, స్వస్వరూపముతోడనే వైకుంఠము నలంకరించె ననియు విరోధపరిహారము బ్రహ్మాండపురాణమునందు జేయబడియున్నట్లు స్పష్టము.

అప్పయదీక్షితస్వామివారిచే విరచితి (బ్రహ్మతర్కస్తవ, గ్రంథములోగూడ నెనుకజూపబడిన బ్రహ్మాండపురాణవచనము లుదాహరించి భగవంతుని శరీరము శుక్రశోణితసంబంధము కలదికాదని నిరూపింపబడెను. ఇంకను ఇట్లున్నది—

"శుక్లేన జని రన్యేషాం హరే స్స్వతనున్న తు।
నిత్యోదితజ్ఞానతనోః సుత స్స్వేచ్ఛయా జనిః॥
నావతారే ష్వపి హరే ర్దేహే శుక్లాదసంభవః।
తథాఽపి శుక్లసంస్థస్సన్ మాతృదేహం ప్రవిశ్య చ।
వినాఽపి శుక్లం తత్రైవ కేవలం జ్ఞానరూపకః।
ఉదేతి భగవా న్విష్ణు ర్మాయయా లోకం విమోహయన్"॥

అని గారుడవారహాదివచనములు ప్రమాణముగా జూపి స్థిరపరుపబడినది.

## శ్రీకృష్ణుడు బోయలచే గోలుపోయిన తన యంతఃపురస్త్రీల భవిష్యద్వృత్తాంతమునే యెరుగనివాడు" అనుప్రసంగము—తన్నిరాకరణము :—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— శ్రీకృష్ణునకు "అట్టి మానవత్వమె లేకుండినయెడల బోయెలచే గోలుపోయిన కృష్ణాంతఃపురస్త్రీల భవిష్యద్వృత్తాంతము దెలిసికొనలేకపోవునా" (పు196)

మన మిచ్చట చర్చింపవలసిన దేమనగా కృష్ణభగవానునకు తనయంతఃపురస్త్రీల భవిష్యద్వృత్తాంతము తెలిసెనా? లేదా? అని యొకటి. దుష్టనిగ్రహపూర్వకముగా భూభారహరణమునకై యవతరించిన కృష్ణభగవానుడు తానవతారము చాలించునాటికి పూర్తిగా దుష్టనిగ్రహము చేయవలసియుండ తననిర్యాణోత్తరకాలమే అర్జునుని వెంటబెట్టుకొనిపోవు యాదవకాంతలను, తనపత్నులను దోచిన దుష్టులను నిగ్రహింప కుపేక్షించినపుడు భూభారహరణము చేసినట్లగునా? వారట్లు చేయుదు రని తెలియక యుపేక్షించె ననినచో భగవంతున కట్లు తెలియకుండుట తగునా? అను విషయ మొకటి. ఈ రెండవవిషయ మైన శంకాసమాధానములు దేవీభాగవతమునం దిట్లున్నవి—

స్క—6. అ—11.

"యై స్తుంతితం ధనం సర్వం హృతాశ్చ హరియోషితః ।
కథం న నాశితా దుష్టా యే స్థితా పృథివీతలే ॥
ఆభీరాశ్చ శకా మ్లేచ్ఛా నిషాదాః కోటిశ స్తథా ।
భారావతరణం కిం త త్కృతం కృష్ణేన ధీమతా ॥
సన్దేహోఽయం మహాభాగే న నివర్తతి చిత్తతః ।
కలా వస్మిన్ ప్రజా స్సర్వాః పశ్యతః పాపనిశ్చయాః ॥"

వ్యాస ఉవాచ—

"రాజన్ యస్మిన్ యుగే యాదృ క్ప్రజా భవతి కాలతః ।
నాన్యథా తద్భవే న్న్యూనం యుగధర్మోఽత్ర కారణమ్ ॥
యే ధర్మరసికా జీవా స్తే వై సత్యయుగేఽ భవన్ ।
ధర్మార్థరసికా యే తు తే వై త్రేతాయుగేఽ భవన్ ॥
ధర్మార్థకామరసికా ద్వాపరే చాఽభవన్ యుగే ।
అర్థకామపరా స్సర్వే కలౌ వస్మిన్ భవన్తి హి ॥
యుగధర్మస్తు రాజేన్ద్ర న యాతి వ్యత్యయం పునః ।
కాలః కర్తాస్తి ధర్మస్య హ్యాధర్మస్య చ వై పునః ॥ "

నీలకంఠీయవ్యాఖ్యా—

సమాధత్తే రాజన్నితి. అయంభావః— దుష్టాచారా ద్వివిధాః పురుషాః. ఏకే యుగధర్మేణ దుష్టాచారాః పరే వేదధర్మోచ్ఛేదార్థ మవతీర్ణా దైత్యా దురాచారాః. తత్రావతారం గృహీత్వా యే వేద ధర్మోచ్ఛేదం కర్తుం క్షత్రియగృహేఽ వతీర్ణా దైత్యకులే వా యేఽ వతీర్ణా దైత్యా స్త ఏవ నాశితాః.

న తు కాలస్వభావేన దురాచారా స్తేన నాశితాః. తేషాం నాశనే సర్వేఽపి కలిస్వభావదుష్టా స్సన్తీతి సర్వేషాం మారణప్రసం గేన ప్రజోచ్ఛేదఏవ స్యా దితి. నాన్యథా తద్భవే దితి. న తా న్నాశ యితుం శక్యత ఇత్యర్థః. తానేవ యుగధర్మా నుపపాదయతి. యే ధర్మరసికా ఇతి.

అనగా, శ్రీకృష్ణపత్నుల నపహరించి ధనము హరించినట్టి యసంఖ్యాకులైన దుష్టులను నిగ్రహింపక విడిచిన శ్రీకృష్ణుడు భూభా రహరణము నేమి చేసినట్లు? అను సందేహము, పాపాత్ములగుకలియు గప్రజలను చూచుచున్ననాకు అకృష్ణభగవానుని యొడలకలుగుచున్నది.

ఈసందేహమును తీర్పుమని కోరిన జనమేజయునకు వ్యాసభగవాను డిట్లు చెప్పెను —దుష్టులు ద్వివిధముగా నుందురు. అందు యుగధర్మమును బట్టి దురాచారులై యుండువారు కొందరు. వేదధర్మముల నుచ్ఛేదించుటకై క్షత్రియగృహములందును, దైత్యకులములయందును పుట్టియున్న దైత్యులే శ్రీకృష్ణునిచే నశింపజేయబడిరి. కాలస్వభావమున దురాచారులుమాత్రము నశింపజేయబడలేదు. ఇట్టివారినిగూడ నశింపజేసినయెడల ప్రజలందరును కలిస్వభావదుష్టులే యగుదురుకనుక ప్రజానాశనమే తటస్థించును. కనుక కలిస్వభావమునుబట్టి దురాచారులగు వారిని నశింపజేయుటభగవత్సంకల్పము కాదు కనుక వారి నుపేక్షించి వేదధర్మోచ్ఛేదము చేయుటకై పుట్టిన మనుష్యాకారులగు దైత్యులనే వధించి భూభారహరణము చేసెను'' అని. దీనిచే కలిస్వభావముచే దురాచారులగు వారిని నాశనముచేయుట, భూభారహరణములోని పని కానందున వారుపేక్షింపబడినారని వ్యాసభగవానుడే కంఠోక్తిగా జెప్పె నని స్పష్టము.

ఇక, నిగ్రహానుగ్రహసమర్థుడైన కృష్ణభగవానుడు తనపత్నులకు గలుగబోవు కష్టములను వారింపకపోవుట యుక్తమా? అనుసందేహము కలుగును. కాని, అష్టావక్రశాపమునుబట్టి వారట్టి కష్టము ననుభవింపవలసినవా రగుటవలన వారికష్టములు నివారింపబడలేదు. ఈవిషయము విష్ణుపురాణములో జెప్పబడియున్నది. చూడుడు —

చోరులచే బీడింపబడినతరువాత వెళ్ళుచున్న అర్జునకు వేదవ్యాసమహర్షి దర్శన మిచ్చి జరిగిన విషయ మాతడు చింతించుచు జెప్పగా విని యోదార్చి యర్జునునకువ్యాసభగవానుడిట్లుచెప్పెను—

విష్ణుపురాణమ్—5 అం. 38అ.

"గృహీతా దస్యుభి ర్యాశ్చ భవాన్ శోచతి తాః స్త్రియః ।

ఏతస్యాఽహం యథావృత్తం కథయామి తవార్జున ||
అష్టావక్రః పురా విప్రః జలవాసరతోఽభవత్ |
బహూ న్వర్షగణాన్ పార్థ గృణన్ బ్రహ్మ సనాతనమ్ ||
జితే ష్వసురసంఘేషు మేరుపృష్ఠే మహోత్సవః |
బభూవ తత్ర గచ్ఛన్త్యో దదృశు స్తం సురస్త్రియః ||
రంభాతిలోత్తమాద్యాస్తు శతశోఽథ సహస్రశః |
తుష్టువు స్తం మహాత్మానం ప్రశశంసుశ్చ పాండవ ||
ఆకంఠమగ్నం సలిలే జటాభారవహం మునిమ్ |
వినయావనతా శ్చైనం ప్రణేముః స్తోత్రతత్పరాః ||
యథాయథా ప్రసన్నోఽసౌ తుష్టువు స్తం తథాతథా |
సర్వా స్తాః కౌరవశ్రేష్ఠ తం వరిష్ఠం ద్విజన్మనామ్ || ”

అష్టావక్ర ఉవాచ—

"ప్రసన్నోఽహం మహాభాగా భవతీనాం యదిష్యతే |
మత్త స్తద్వ్రియతాం సర్వం ప్రదాస్యా మ్యతిదుర్లభమ్ ||
రంభాతిలోత్తమాద్యా స్తం వైదిక్యోఽ ప్సరసోఽబ్రువన్ |
ప్రసన్నే త్వ య్యపర్యాప్తం కి మస్మాక మితి ద్విజ ||
ఇతరా స్త్వబ్రువన్ విప్ర ప్రసన్నో భగవాన్ యది |
తదిచ్ఛామః పతిం ప్రాప్తుం విప్రేన్ద్ర పురుషోత్తమమ్ || ”

వ్యాస ఉవాచ—

"ఏవం భవిష్యతీ త్యుక్త్వా హ్యుత్తతార జలా న్మునిః |
తముత్తీర్ణం చ దదృశు ర్విరూపం వక్ర మష్టధా ||
తం దృష్ట్వా గూహమానానాం యాసాం హాసః స్ఫుటోఽభవత్ |
తా శ్శశాప మునిః కోప మవాప్య కురునందన||
యస్మా ద్వికృతరూపం మాం మత్వా హాసా వమాననా|

భవతీభిః కృతా తస్మా దేతం శాపం దదామి వః॥
మత్ప్రసాదేన భర్తారం లబ్ధ్వా తు పురుషోత్తమమ్ ।
మచ్ఛాపోపహతా స్సర్వా దస్యుహస్తం గమిష్యథ ।
ఇత్యుదీరిత మాకర్ణ్య ముని స్తాభిః ప్రసాదితః ।
పున స్సురేన్ద్రలోకం వై ప్రాహ భూయో గమిష్యథ ॥ ”

వ్యాసః—

“తత్త్వయా నాత్ర కర్తవ్య శ్శోకోఽల్పోఽపి హి పాండవ ।
తేనై వాఖిలనాథేన సర్వం తదుపసంహృతమ్ ॥ ”

అర్జునా! చోరులచే బీడింపబడిన యేస్త్రీలనుగూర్చి నీవు శోకించుచుంటివో ఆస్త్రీల పూర్వవృత్తాంతము జెప్పెదను వినుము.

పూర్వము అష్టావక్రమహర్షి, జలములోనుండి చిరకాలము తపము చేసెను. ఆసమయమున జరిగిన దేవాసురసంగ్రామములో నసురులను జయించిన దేవతలు మేరుపర్వతమందు మహోత్సవము జరిపిరి. ఆమహోత్సవమునకు రంభాతిలోత్తమాది దేవతాస్త్రీలు నేల కొలది వెళ్ళుచు కంఠమగ్నముగా జలములోనుండి జటాభారమును వహించియున్న మహర్షిని దర్శించి, వినయవిధేయతలతో నమస్కరించి స్తుతించి యామహర్షి యెట్లు ప్రసన్నుడగునో అట్లు ప్రశంసించిరి. అపుడామహర్షి ప్రసన్నుడై మీ కేమికావలయునో కోరవలసినది. మీకు వరమిచ్చెద నని పలుకగా రంభాతిలోత్తమాదులు—నీయనుగ్రహమే మాకు చాలుననిరి. మిగిలిన వారందరును పురుషోత్తముడు (శ్రీకృష్ణుడు) మాకు పతి యగునట్లు వరమిమ్మని ప్రార్థించిరి. అట్లే యగు నని యామహర్షి వర మిచ్చి జలమునుండి యావలకు వచ్చునంతట, నాస్త్రీలు అష్టవక్రముగా నున్న మహర్షిస్వరూపమును జూచి పక్కున నవ్విరి. అది చూచి మహర్షి కుపితుడై నాది వికృతరూప

మని యెంచి నన్నీ నన్ను మీ రవమానించినారు కనుక నేనిచ్చిన వర మునుబట్టి పురుషోత్తముని పత్నులైన మీరు నాయీశాపమువలన చోరుల చేతులలో బడెదరు. అని శపించెను. అపు డాస్త్రీలు విచారించి వేడుకొనగా వారికి దేవలోకప్రాప్తి ననుగ్రహించెను.

కనుక, అర్జునా! నీ వెంతమాత్రము శోకింపకుము, ఆకృష్ణపరమాత్మ చేతనే సర్వ మూపసంహరింపబడినది" అని.

ఈగ్రంథసందర్భమునుబట్టి, తపశ్శక్తులచేతనో పాతివ్రత్యమహిమచేతనో అమోఘవాక్కులగు లోకోత్తరవ్యక్తులయొక్క వరములను, శాపములను పరిపాలించుచుండి భగవంతుఁడు మహర్షివరమునుబట్టియే తన పత్నులైన యాస్త్రీలకు అనుహ్యమ్మ శాపవశమున ఘటించు భవిష్యద్దుఃఖము అని వార్య మని గ్రహించియే యుపేక్షించెను గాని వారల భవిష్యద్వృత్తాంతము తనకు తెలియక కాదు అని తేలినది. పూర్వోక్తప్రకారము గాంధారీప్రభృతులు శాపమును తానే యనుభవించినపుడు అన్యులకు జెప్పవలసిన దేమున్నది?

ఈ సందర్భములో మ. భా. చ. కారులు "అర్జునునకు వ్యాసుడు అంతఃపురస్త్రీల యపహరణమునుగూర్చిన గాథ కేదియో శాపసంబంధము జెప్పినటుల గ్రంథాంతరములు గలదు. కాని యది నవీనకల్పితమై యుండును" (పు199) అని వ్రాయుట హేయము.

'శాపసంబంధము నవీనకల్పితమై యుండును' అను ప్రతివాదులు అంతఃపురస్త్రీల యపహరణము గూర్చిన గాథయే నవీనకల్పితమై యుండునని యేల వ్రాయలేదు? అపహరణము సత్యమై శాపము కల్పితమయ్యేనా? ఇది సజ్జనలక్షణము కాదు. కనుకనే—

"మూర్ఖో హి జల్పతాం పుంసాం శ్రుత్వా వాచ శ్శుభాఽశుభాః।
అశుభం వాక్య మాదత్తే పురీష మివ సూకరః ॥" (ఆదిప. 74అ)

అని చెప్పల శుభాశుభవిషయములను చెప్పినపుడు మూర్ఖుడు వినీ- నూకరము పురీషమునే గ్రహించినట్లు తా నశుభమునే గ్రహించును. అని చెప్పబడినది. ఈ మ. భా. చ, కారుడే- భోగులపహరించునపుడు దుఃఖపడెడి స్త్రీలనుగూర్చి చెప్పబడిన శ్లోకమునకు వ్రాసిన యర్థమును చూడుడు—

"మిషతాం సర్వయోధానాం తతస్తాః ప్రమదోత్తమాః ।
సమన్తతోఽవకృష్యన్త కామాచ్చాన్యాః ప్రవవ్రజుః ।"

"కొందరు యాదవకాంతలు కామాతురలై కిరాతులు గూడుటకు జెదరిపోయి రని యీ శ్లోకార్థము చెప్పుచున్నది ।।" (ఘ) ।98)

ఆహా! ఆసమయము, ఆయాదవకాంతలు తమతమ భర్తలు చనిపోవుటచేతను, శ్రీకృష్ణనిర్యాణమై యుండుటచేతను జీవితేచ్ఛను విడిచి మహాదుఃఖములో మునిగియున్న సమయము. అదిగాక "గండస్యోపరి పిటకా సంవృత్తా" అన్నట్లు కిరాతులు మీదపడి దోచుకొను సమయము. అట్టి మహాదుఃఖసమయములో ఆ యాదవకాంతలు- ఆప్రమదోత్తమలు కామాతురలైరట! కిరాతులతో గూడుటకు చెదరిపోయిరట! అట్టి దుఃఖసమయములో కామాతురత్వ మనునది మన ప్రతివాదులకెట్లు దోచినదో చిత్రము! ఇదిలోకవిరుద్ధమైనవిషయము! ప్రమదోత్తమల కత్యంతవిరుద్ధము.

శ్లోకములో నున్న దేమనగా ఆయుత్తమస్త్రీలలో గొందరు నలుదెసల కీడ్వబడిరి. 'అన్యాః' మరికొందరు 'కామాత్' ఇచ్ఛను బట్టి అనగా నాకిరాతులనుండి తప్పించుకొనుట కెటుపోవలె నని యిచ్ఛయుంచిరో అటు 'ప్రవవ్రజుః' పారిపోయిరి. అని యున్నది. ఆస్త్రీలందరు ప్రమదోత్తమలని చెప్పబడినది. అట్టివారిమీద ప్రతివాదులకు సంభవించిన విపరీతదృష్టికి, భారతదేశదౌర్భాగ్యమే కారణ మనవలెను.

ఇట్లు చోరులచే బీడింపబడవలసినట్లున్న అష్టావక్రశాపము అమోఘ మని యాస్త్రీల భవిష్యద్వృత్తాంతమును గ్రహించియే కృష్ణ పరమాత్మ యుపేక్షించినట్లున్నందున "శ్రీకృష్ణుడు తన స్త్రీల భవిష్య ద్వృత్తాంతమునే యెఱుగనివాడు" అను ప్రతివాదుల వ్రాత పరాస్త మైనది.

శ్రీకృష్ణుడు భగవంతుడే కాని మానవమాత్రుడు కాడని ప్రస్తుతప్రసంగములోని వేదవ్యాసోక్తులచేగూడ నిర్ధారితమైనది.

ఇంతవరకు విమర్శకులని వ్యవహరింపబడుచున్న ప్రతివాదుల యొక్క— 'శ్రీకృష్ణజీవితచరిత్రము' 'శ్రీకృష్ణచరిత్రము' "సుయోధనవిజ యము" "మహాభారతరహస్యము" "రామాయణరహస్యము" 'మహా భారతచరిత్రము' అను గ్రంథములలోని యంశములను పరామర్శించియే కృష్ణభగవానునిగూర్చిన నిందలు నిరాకరింపబడి, శ్రీకృష్ణుడు భగవం తుడని నిరూపింపబడినది.

ఇంకను— "పరమార్థప్రప" అను భగవద్గీతావ్యాఖ్యానమందు శ్రీకృష్ణావతారచర్యలు వేదప్రసిద్ధము లని ప్రదర్శింపబడి యుండెను. చూడుడు—

తత్ర శ్రుతయః— "జజ్ఞాన ఏవ వ్యబాధత స్పృధః ప్రాపశ్య ద్వీరో అభిపౌంస్యం రణమ్ । అవృశ్చ దద్రి మవ సస్యదః సృజ దస్తభ్నా న్నాకం స్వపస్యయా పృథుమ్ ॥"

అత్ర చతుర్వేదస్వామికృతభాష్యమ్— "యః పరమేశ్వరో జజ్ఞానః ప్రాదుర్భూతమాత్రో మాయయా బాలదశాం స్వీకుర్వా ణోఽపిసన్ స్పృధః స్పర్ధాం కృతవతః శత్రూన్ పూతనాదీన్ కం సాన్తాన్ వ్యబాధత బాధితవాన్. న కేవలం దైత్యాన్ అపితు శక్రా దీనాం గర్వ మపీత్యాహ— యోఽద్రిం పర్వతం గోవర్ధన మవృశ్చిత్ ఉద్దధార. సస్యదో ధాన్యధాత్ర్యా న్మేఘా ననవరతం వర్షమాణా నవసృ జత్ విసర్జితవాన్. తేనపృథుం సామర్థ్యవన్తం నాక మిన్ద్రలోకం స్వప

స్యయా అస్తభ్నాత్ స్తంభితవాన్ స్తంభితశక్తిమకరోత్. అథ యౌవ
నదశాయామపి అభిమాంస్యు సర్వపురుషార్థసాధకం రణం కురుపాం
డవసంగ్రామం వీరోఽపి సన్నపశ్యత్ తాటస్థ్యేన దృష్టవాన్ న
స్వయం యుయుధే. అత్రోపిరపదేన భీష్మపరాభూతస్వభక్తపక్షపాతా
దశస్త్రోఽపి శస్త్ర మగ్రహీదితి సూచితమ్"

అథ కంసాదివధార్థం గోకులాన్మథురామాగచ్ఛతోః కృష్ణ
**రామయో** శ్చరితశంసినీ శ్రుతిస్తైత్తిరీయకబ్రాహ్మణే ఋగ్ద్వయన్—

"ద్వే విరూపే చరతః స్వర్థే అన్యాఽన్యా వత్స ముపధాపయేతే
హరి రన్యస్యాం భవతి స్వధావాన్ శుక్రో అన్యస్యాం దదృశే సువర్చాః
పూర్వాపరం చరతో మాయయైతౌ శిశూ క్రీడన్తౌ పరియాతో అధ్వరమ్
విశ్వా న్యన్యో భువనాని చష్ట ఋతూ నన్యో విదధ జ్జాయతే పునః॥"

భాష్యమ్— "ధనుర్యాగోత్సవవ్యాజేన కృష్ణరామయో రాన
యనార్థం కంసేన ప్రేషితః సుష్ఠు వర్చోయస్యాఽసౌ సువర్చా అక్రూరః
చరతో విచరతో ద్వే విసదృశే రూపే విరూపే దదృశే దృష్టవాన్.
కింభూతే స్వర్థే సుష్ఠు అర్థః ప్రయోజనం **యయో** స్తే నహి నృసిం
హవదేకస్యాం మూర్తౌ కిన్తు అన్యా, అన్యా పృథగవస్థితే పునః కిం
భూతే వత్స ముపధాపయేతే వత్స మితి జాత్యభిప్రాయే ణైకవచనం
తేన గోసందోహనావసరే స్వసమీపే వర్తమానై ర్గోష్ఠైః కృత్వా
వత్సాన్ ధాపయేతే పాయయేతే. అథ విసదృశరూపత్వమేవాహ—
హరిరితి. అన్యస్యా మన్యతరస్యాం మూర్తౌ హరిద్వర్ణత్వాద్ధరిః మేఘ
శ్యామః కృష్ణోఽస్తి. తథా అన్యస్యాం శుక్రో గౌరవర్ణో బల
దేవోఽస్తి. కింభూతో హరిః స్వధావాన్ స్వస్య ధా స్వధా తద్వాన్
అలుప్తనిజైశ్వర్యవా నిత్యర్థః. కింభూతే రూపే పూర్వాపరం చరతః
ప్రాగపరం పరిసరణం కురుతః. పరన్తు న ప్రాకృతా విత్యాహ— ఏతౌ
కృష్ణరామౌ మాయయా కృత్వా శిశూ బాల్యదశాం ప్రాప్తౌ. పర
మార్థతో విచార్యమాణే వయోఽవస్థారహితౌ. ఏవం మాయయైవ
రజకవధాదిభిః క్రీడన్తౌ సన్తౌ అధ్వరం ధనుర్యాగస్థానం పరితః సమ

స్మృతిః కువలయాపీడకంసచాణూరాద్యస్థానాని. యాతః జగ్మతుః. అథ పూర్వం విరూప ఇత్యనేన ఆకారతో విసదృశత్వం ద్యోతిత మిదానీం సామర్థ్యతోఽప్యాహ- అన్య ఇతి. అస్య కృష్ణః విశ్వాని సర్వాణి భువనాని భూర్భువస్స్వరాదీని విచష్టే. సంకల్పేనైవ జ్ఞాతవాన్. తథా ఽన్యో బలదేవః ఋతూన్ గర్భాన్ సుత్యాద్యవతారాన్ విదధత్ గృహ్ణన్ సన్ పునఃపున ర్జాయతే ఆవిర్భవతీతి.

ఈగ్రంథసందర్భమునుబట్టి కృష్ణపరమాత్మయొక్క పూతనాది సంహారము, గోవర్ధనోద్ధరణము, కురుపాండవసంగ్రామసాహాయ్యము అను కార్యములును, శ్రీకృష్ణబలరాములు గోవత్సపరిపాలనము, అక్రూరునకు శ్రీకృష్ణబలరామసందర్శనము, శ్రీకృష్ణబలరాములరూపభేదము, సామర్థ్యభేదము. అక్రూరునితో శ్రీకృష్ణబలరాములు కంసుని ధనుర్యాగమునకు వచ్చుట, కంససంహారాదికార్యములు చేయుట, అనంతశక్తి కలిగియుండియు మాయామయములైన క్రీడలు చేయుట యను విషయములును వేదబోధితములై యున్నవని స్పష్టమైనది. ఇట్లు వేదప్రసిద్ధమైయున్న శ్రీకృష్ణచరిత్రమును ఆర్షగ్రంథములు వివరించియుండ శాస్త్రజ్ఞానభక్తివిశ్వాసములు లేని ప్రతివాదులు ఆగ్రంథముల నర్థముచేసికొనలేక తమబుద్ధికి తోచినట్లు యాదరమువాదనము ఆగు గ్రంథముల కపార్థములు చెప్పి చేసిన కోలాహలము ప్రమాణోపపత్తిప్రదర్శనపూర్వకముగా పరిహరింపబడినది. శ్రీకృష్ణుడు పరమేశ్వరావతారమే యని స్థిరపడినది. ఆశ్రీకృష్ణపరమాత్మయొక్క పరిపూర్ణస్వరూపజ్ఞానమును లోకులకు గలుగజేసి తన్మార్గమున లోకుల నుద్ధరించుటకే వేదవ్యాసభగవానుడు మహాభారతరచన జేసియుండె నని విశదీకరింపబడినది.

ఇక మహాభారతరహస్యకారులు వ్రాసిన విమర్శకలక్షణము లను గూర్చి కొన్నిమాట లనుకొందము —

— విమర్శకలక్షణపరిశీలనము —

“విమర్శకుడు సాంప్రదాయానుకూలమైన దురాగ్రహమునకు తన హృదయమునందు తావీయక గ్రంథకర్తయొక్కయు, తద్గ్రంథముయొక్కయు నిశ్చయాభిప్రాయమును గ్రహించుటకు ప్రయత్నింపవలయును”

ముందుగా స్వీయమైన సంప్రదాయమును చిత్తమం దతికించుకొనక స్వచ్ఛమైన చిత్తముతో గ్రంథపరిశీలనము గావింపవలెను”

వీరి నడుగవలసియున్నది— విమర్శకుడు సంప్రదాయము నను సరింపనిహృదయముతో గ్రంథపరిశీలనము చేయవలె ననుటలో నేసంప్రదాయమునకును జెందని గ్రంథము నట్లు పరిశీలింపవలెనా? ఏసంప్రదాయమునకు జెందిన గ్రంథమునైనను అట్లు పరిశీలింపవలెనా?

అవాంతరభేదము లెన్నియున్నను వైదికసంప్రదాయము, అవైదికసంప్రదాయము అని కాని, ఆస్తికసంప్రదాయము నాస్తికసంప్రదాయము అని కాని, సంప్రదాయము ద్వివిధమై యున్నది. అందే సంప్రదాయమునకును జెందని గ్రంథమే అసంభవము కనుక ప్రథమపక్ష మసంగతము.

ద్వితీయపక్షములో నేగ్రంథ మేసంప్రదాయమునకు జెందయుండునో ఆసంప్రదాయము ననుసరింపని హృదయముతో దానిని పరిశీలించినపుడు ఆగ్రంథముయొక్క నిశ్చయాభిప్రాయమును గ్రహించుట అసంభవము. కనుక ద్వితీయపక్షముకూడ నసంగతమే.

ఇక స్వీయసంప్రదాయమును చిత్తమం దతికించుకొనక స్వచ్ఛమైన చిత్తముతో గ్రంథపరిశీలనము చేయవలె ననుచున్న ప్రతివాదులకు బోధింపవలసియున్నది.

తన జన్మాంతరసంస్కారానుగుణమైన యేదో యొక సంప్రదాయము చిత్తమం దతుకుకొనినవా డుండడు. కనుక గ్రొత్తగా నతికించుకొనకున్నను అతుకుకొనియున్నదే చాలును. సృష్టిస్వభావ మిట్లు చెప్పబడినది—

తేషాం యే యాని కర్మాణి ప్రాక్ సృష్ట్యాం ప్రతిపేదిరే ।
తాన్యేవ తే ప్రపద్యన్తే సృజ్యమానాః పునః పునః ॥
హింస్రాఽహింస్రే మృదుక్రూరే ధర్మాఽధర్మావృతానృతే ।
తద్భావితాః ప్రపద్యన్తే తస్మాత్తత్తస్య రోచతే ॥

అనగా పూర్వజన్మమందు విహితములో నిషిద్ధములో అగు నేజాతికర్మలను చేసియుందురో ఆసంస్కారములను బట్టి మరల బుట్టి నపు డాజాతికర్మలనే చేయుచుందురు. కనుకనే స్వతస్సిద్ధముగా గొందరికి పుణ్యకర్మలయం దభిరుచి, కొందరకు పాపకర్మలయం దభిరుచి కనబడుచున్నది. అని తాత్పర్యము. దీనిని బట్టి పూర్వజన్మసంస్కారము లేని వ్యక్తి యుండడనియు, వారివారి పుణ్యపాపకర్మాభిరుచిని బట్టి వారి పూర్వజన్మసంస్కార మట్టిదని గ్రహింపవలయుననియు తేలినది.

కనుక నేదో యొక సంప్రదాయమునకు జెందిన సంస్కారము జన్మసిద్ధమై చిత్తమున దగులుకొనియే యున్నది. విమర్శకుల చర్యలు చూడగా వారి దవైదికసంప్రదాయమునకు జెందిన సంస్కారమని తెలియుచున్నది. వారు విమర్శించిన మహాభారతము వైదికసంప్రదాయమునకు జెందిన గ్రంథము.

ఈరహస్యకర్తలే ద్రౌపదిని గూర్చి వ్రాయుచు "ఈమె ద్రుపదునకు దృష్టద్యుమ్నునితోబాటు నొక పుత్రికయని నాయభిప్రాయము. అగ్నియందుత్పత్తి యయ్యె ననుటమాత్రము నాకయుక్తముగా కనిపించుచున్నది." (పు 589) అని మహాభారతములో వేదవ్యాసమహర్షిచే జెప్పబడిన విషయము తమ మనస్సునకు అయుక్తముగా గనబడిన దనుటయు, శ్రీశుకుడయోనిజుడై అరణినుండి జన్మించెనని గ్రంథమందుండ "కాదు అరణ్యయను స్త్రీయందు జన్మించె" ననుటయు మొదలగు విషయములు చూడ వీరి దవైదికసంప్రదాయమునకు జెందిన సంస్కారమని ధ్రువ మగుచున్నది.

వైదికసంప్రదాయమునకు జెందియున్న గ్రంథము అవైదిక సంప్రయాభినివిష్టచిత్తులగు విమర్శకమ్మన్యుల చేతులలో బడి భ్రష్టమైనది. ఇట్టి దురవస్థ వచ్చుటచేతనే మహాభారతతత్త్వకథనము అపేక్షితమైనది. అసంగతమైయున్న రహస్యకర్తల విమరక్షలక్షణ మపాస్తమైనది.

—♦ మ. భా. చ. కారుల వైఖరి ♦—

శ్రీకృష్ణభగవానుడు ఒక వెండ్రుకయని, పూతనయను రోగము సోకి తొలగినవాడని, కృష్ణునకు భగవదవతారసిద్ధియు, మరి మొకనికి లేకపోవుటయునా? అని, కృష్ణునియందు అధర్మము, అసత్యము సర్వాంగోపేతములై యున్నవని, త్రాగుబోతని, అతని విశ్వరూపమింద్రజాలమని, పాపాలభైరవుడని ఏమేమో వారికి వచ్చినట్లు మహాభారతచరిత్రములో వ్రాసియున్నారు.

ఆగ్రంథముయొక్క ప్రథమముద్రణము 19?8 క్రీ॥ సం॥ గములో జరిగినది. ద్వితీయముద్రణము 1933 లో జరిగినది. అందుపోద్ఘాతములో మ. భా. చ. కారులిట్లు వ్రాసియున్నారు.—

"ఆంధ్రభాషలో విమర్శన గ్రంథములు తక్కువ. మహాభారతమును, తత్రస్థవ్యక్తులను విమర్శించుట మరియును దక్కువ. దుర్బలమానసుల కిట్లు విమర్శించుట భీతావహాముగా నుండును. విమర్శించినవారి కేదేని యనిష్టము సంభవించునని వారు తలంతురు. నా నేత్రవ్యాధికి గారణ మిదియ యని యసూయాపరులు హేళనము చేయుటయే కాదు. కొందరు మిత్రులును వయోవృద్ధులును నయని ష్ఠురోక్తులతో గూడ న్నను నీ కార్యమునుండి మరలింప బ్రయత్నించిరి. కాని నా నేత్రవ్యాధికిని విమర్శనఫలమునకును సంబంధ మించుకంతయు లేదను దృఢవిశ్వాసము నాకుండుటచేతనె తిరుగి విమర్శించి కొంత యిపుడు విస్తరము చేసితిని"

దీనినిబట్టి ఈప్రతివాదులకు, తాము విమర్శించినతరువాత నచిరకాలములోనే నేత్రవ్యాధి యంకురించినదనియు, జ్ఞానిఫలమే యిది యని లోకు లనియున్నా రనియు, దానిని తృణీకరించి మరికొన్నినూతనాంశములు చేర్చి పునర్ముద్రణము జరిపించినారనియు స్పష్టము. తరువాత పీగే 1938క్రీసంవత్సరములో రాజసూయరహస్యమును వ్రాసియున్నారు. అందు "కృతిసమర్పణము— స్వచరిత్రము" అనుపేరుతో న్విషద వ్రాసియున్నారు. అందిట్లున్నది—

"సంధిల్లె నంధత, సంధిల్లె నవ్వు,
సంధిల్లె నేకత,సంధిల్లె జింత,
సంధిల్లె దీనత, సంధిల్లె భీతి,
సంధిల్లకున్నది సంతుష్టి సుంత,
సిద్ధింపకున్నది చిత్తసంశుద్ధి.
సిద్ధింపకున్నది శ్రీశ నీసేవ,
ఇట్లు తా కట్టించి యిప్పుడు కాలమును
మెల్లగా గడపుదు మెరమెరతోడ
నుసీమాన్యములు లేవు మనువెట్లు గడచు
కడదశలో నని కళవళపడుదు
ఇన నాకంధత యధికమౌచుండ,
బోనెట్లు సమకూరు పౌరుగూరి కకట
ముందెట్లు జరుగును ముప్పున నెట్లు?
సందేహభయములు సమకూరె దేవ" అని,

ఆహా! అంత మహాభారతచరిత్రమును వ్రాసియు, అంత విమర్శకపదవి నధిష్ఠించియు, అంతసాహసమున కొంగికట్టి సత్యమిదియే యని ప్రకటించియు, అంతవ్యాసభగవానుని దూషించియు, అంత దుర్యోధనాదుల నభినందించియు, అంత పాండవుల నిందించియు, అంత ద్రౌపదీదేవిని దూషించియు, అంత శ్రీకృష్ణపరమాత్మను, నిందించియు

రాజసూయరహస్యము వ్రాయునప్పటికి మ.భా.చ.కారుల జీవితమున కెంత మార్పు రానా? అంధత్వాదులు సంధిల్లనా? చిత్తశుద్ధి లేకుండ బోనా? మను వెట్లు గడచు నని కళవళపడనా? అంధత్వ మధికమై పోనా? ముందు ముప్పెట్లు గడచు నని భయపడనా? ఏమి దైవవిలాసము! పాపము వీరికి అర్థలాభము లేకపోగా అనర్థపరంపరాప్రాప్తి యైనదన్నమాట, ఈయనర్థప్రాప్తికి మూలము "యదన్తరం యజ్జాయతే తత్తజ్జన్యమ్" అనున్యాయమున వీరి మహాభారతచరిత్రరచనయే కావలసియున్నది. ఒకదుష్కార్యము చేసినతరువాత వచ్చెడి ఫలము ననుభవించుచు నిది యాదుష్కార్యఫలితమే యని యాస్తికు డనుకొనును, తన యనుభవమునకును, తానుచేసిన దుష్కార్యమునకును సంబంధము లేదని నాస్తికు డనుకొనును, అట్లనుకొనినను ఆ నాస్తికునకు ఫలానుభవము తప్పనిదే. మ. భా. చ. కారులు చేసిన మహాపురుష దూషణము సామాన్యమా? మహావైరియగు శిశుపాలుడుకూడ జేయలేనట్టి శ్రీకృష్ణనిందలను వీరు చేసినపుడు అవి యూరకపోవునా?

కనుక. మ.భా.చ.కారులచే గ్రంథోక్తిగా జెప్పబడిన స్వచరిత్రాంశములలో పూర్వోత్తరములను బాగుగా తెలిసికొని లోకులు-వ్యాసమహర్షి, పాండవులు, ద్రౌపది, భీష్ముడు, శ్రీకృష్ణపరమాత్మ, మున్నగు మహావ్యక్తులయందు భక్తిశ్రద్ధలు కలిగి, వేదవ్యాసమహాభారతోక్తము సత్య మని గ్రహించి, విమర్శకోక్తుల దిరస్కరించి యిహపరసుఖముల నొందుగోరుచున్నాము.

'బాలవ్యాస' న్యాయ వ్యాకరణ వేదాంత విద్యాపారీణ'
వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిప్రణీతమైన
మహాభారతతత్త్వకథనమున "శ్రీకృష్ణనిందానిరాకరణ"
మను తృతీయభాగము
సంపూర్ణము.

శ్రీ గురుభ్యో నమః.

# మహాభారత తత్త్వకథనము.

## పాండవనిందానిరాకరణము.

చతుర్థభాగము.

'బాలవ్యాస, తర్క, వ్యాకరణ, వేదాన్తపారీణ'

వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే

రచియింపబడి,

భట్నవిల్లి గ్రామస్థాపిత శ్రీశారదాముద్రణాలయమునందు
ముద్రింపబడి,

ప్రకటింపబడియె.

ప్రతులు: 1000.

12-4-1951



మూల్యం: 2-8-0

# విషయసూచిక.

విషయము. పుట.

విషయము. ‌ ‌ ‌ ‌ ‌ ‌ ‌ ‌ ‌ ‌ పుట

విషయము. పుట.



---

సూచన; 726 పేజీ మొదలు 751 పేజీవరకు పేజీనంబరులు తప్పుగా ముద్రితమైనవి. వాటిని యథాక్రమముగ గ్రహించవలెను.

శ్రీమహాగణాధిపతయే నమః.

# మహాభారత తాత్పర్యకథనము.



## పాండవసందానిరాకరణము.



"ధర్మో వివర్ధతి యుధిష్ఠిరకీర్తనేన,
పాపం ప్రణశ్యతి వృకోదరకీర్తనేన।
శత్రుర్వినశ్యతి ధనంజయకీర్తనేన
మాద్రీసుతౌ కథయతాం న భవన్తి రోగాః।" (భారతసావిత్రి)

"యాః కృతాః పాండుపుత్రేషు నిన్దాః కైశ్చిన్నిరంకుశమ్।
తన్నిరాకరణం కుర్మః ప్రమాణై రుపపత్తిభిః॥

— భారతతాత్పర్యసంగ్రహము —

"దుర్యోధనో మన్యుమయో మహాద్రుమః
స్కన్ధః కర్ణ శ్శకుని స్తస్య శాఖాః।
దుశ్శాసనః ఫలపుష్పే సమృద్ధే
మూలం రాజా ధృతరాష్ట్రోఽమనీషీ॥

నీలకంఠీయమ్— భారతతాత్పర్యసంగ్రహకో ద్వౌ శ్లోకౌ పఠతి — దుర్యోధన ఇతి। మన్యుః క్రోధః తేన ద్వేషేర్ష్యాఽసూయాదికమపి గ్రాహ్యం। తన్మయో మహా న్నుచ్ఛ్రేయో ద్రుమో దుర్యోధనః, తేన సహోఽత్పన్న మైక్యం ప్రాప్తాః కర్ణశకునిదుశ్శాసనా స్తస్య స్కన్ధశాఖాపుష్పాదితుల్యా స్తాదృశా ఏవ, తస్య మూలం

రాజా ధృతరాష్ట్రః, స చ అమనీషీ మనోనిగ్రహాసమర్థః, తేనైవ హి పుత్రస్నేహాన్ధేన దత్తావసరో దుర్యోధనో దృఢమూలోఽభవత్, అన్యథా బాల్య ఏవ విదురాదివచసా తస్య త్యాగే కృతే సతి, గరాఽగ్నిదానద్రౌపదీకచగ్రహణాదిమూలః కులక్షయో న జాతస్స్యాత్। ఏతేన దృఢాఽజ్ఞానమూలో దైన్యతరుః క్రోధలోభాదిస్కన్ధో హింసాస్తేయాదిశాఖో వధబన్ధనరకాదిఫలపుష్పః పురుషార్థకామై ర్మూలాజ్ఞానచ్ఛేదేన నాశనీయ ఇతి సూచితం। "మన్యుః పుమాన్ క్రోధే దైన్యే శోకే చ యజ్ఞే చ" ఇతి మేదినీకోశః ॥

"యుధిష్ఠిరో ధర్మమయో మహాద్రుమః
స్కన్ధోఽర్జునో భీమసేనోఽస్య శాఖాః,
మాద్రీసుతౌ పుష్పఫలే సమృద్ధే
మూలం కృష్ణో బ్రహ్మ చ బ్రాహ్మణాశ్చ ." (ఆది_అ1)

నీలకంఠీయం___ యుధిష్ఠిర ఇతి। ధర్మః పుణ్యం, తేనతత్కారణీభూతశమదమసత్యాఽహింసాదికం గ్రాహ్యం। తన్మయో మహాద్రుమో యుధిష్ఠిరః తదేకాత్మానోఽర్జునభీమమాద్రేయాః తస్య స్కన్ధాదితుల్యాః స్తద్వశా ఏవ। తస్య మూలం కృష్ణః శుద్ధసత్త్వమయజ్ఞానవిగ్రహః పరమాత్మా తేన హి దృఢం జ్ఞాతేన ధర్మో దృఢమూలో భవేత్, అన్యథా కామాదిభి రుపహత స్స్యాత్। "యో వా ఏత దక్షరం గార్గ్యవిదిత్వాఽస్మిన్ లోకే యజతి దదాతి తపస్తప్యతేఽపి బహూని వర్షసహస్రాణి। అన్తవదేవాఽస్య త ద్భవతి" ఇతి శ్రుతేః। జ్ఞానస్య మూలం బ్రహ్మ వేదః। వేదాద్ధి యోగక్రియాఖ్యపరాపరధర్మజ్ఞానం జాయతే। "ధర్మస్య శబ్దమూలత్వాత్" ఇతి న్యాయాత్। వేదస్యాపి మూలం బ్రాహ్మణాః, తత్సంప్రదాయప్రవర్తకత్వాత్। ఏవం చ బ్రాహ్మణానా ముపదేష్టృత్వేన పరమా

త్మనో౽నుగ్రాహకత్వేన చ ధర్మమూలత్వం । ఏతేన దేవబ్రాహ్మణ భక్తేన సంపాద్యమానో వేదోక్తో యాగాదిధర్మవృక్షః అహింసా సత్యాదిస్కన్ధో ధారణాధ్యానాదిశాఖ స్తత్వసాక్షాత్కారఫలః పురుషార్థకామేన భగవదారాధనబలేన సంపాదనీయ ఇతి సూచితమ్॥

క్రోధమయమైన మహావృక్షము దుర్యోధనుడు. దుర్యోధనసదృశులే అయియుండి దుర్యోధనునితో నైక్యము నొందిన కర్ణ, శకుని, దుశ్శాసనులలో గర్ణుడావృక్షమునకు స్కంధ (మాను) స్థానీయుడు. శకుని శాఖాస్థానీయుడు. దుశ్శాసనుడు పుష్పఫలస్థానీయుడు. అట్టి దుర్యోధనుడను క్రోధమయమహావృక్షమునకు మూలముమనోనిగ్రహసమర్థత లేని ధృతరాష్ట్రుడు. అట్టి ధృతరాష్ట్రునిచే గల్పింపబడిన యవకాశములను బట్టియే దృఢపడిన దుర్యోధనుడు దుష్కార్యములు చేసి కులక్షయమునకు హేతువయ్యెను. కనుక, క్రోధలోభాదిస్కంధములు కలిగి, హింసాస్తేయాదిశాఖలు కలిగి, వధ, బంధ, నరకాది పుష్పఫలములు కలిగి యజ్ఞానమూలకమై యున్న దైన్యతరువును పురుషార్థకాములు మూలాజ్ఞాననాశనమున నశింపజేయవలె నని సారాంశము.

పుణ్యమయమైన మహావృక్షము యుధిష్ఠిరుడు. యుధిష్ఠిరసదృశులే అయియుండి యుధిష్ఠిరునితో నైక్యము నొందిన అర్జున, భీమసేన, నకుల, సహదేవులలో నర్జునడావృక్షమునకు స్కంధస్థానీయుడు. భీమసేనుడు శాఖాస్థానీయుడు. నకులసహదేవులు పుష్పఫలస్థానీయులు. అట్టి యుధిష్ఠిరుడను ధర్మమయమహావృక్షమునకు కృష్ణపరమాత్మ, వేదములు, బ్రాహ్మణులు మూలభూతములు. పరమాత్మజ్ఞానమును బట్టియే ధర్మము దృఢపడును. లేకున్న కామాదిదోషములచే ధర్మమునకు చేటు కలుగును, అట్టి జ్ఞానమునకు మూలము వేదములు. ఆవేదములకు మూలము సంప్రదాయప్రవర్తకులగు బ్రాహ్మణులు. ఈవిధ

ముగా నుపదేశకులగుటచే బ్రాహ్మణులును, ప్రమాణములగుటచే వేదములును, అనుగ్రహించువాడగుటచే కృష్ణపరమాత్మయు ధర్మమునకు మూలభూతులు. కనుక, అహింసాసత్యాదిస్కంధములు కలిగి ధ్యానధారణాదిశాఖలు కలిగి తత్త్వసాక్షాత్కారఫలము కలిగి వేదోక్తమై యున్న ధర్మవృక్షమును సంపాదింపదలచిన పురుషార్థకాముడు—దేవబ్రాహ్మణభక్తితో, భగవదారాధనబలముతో దానిని సంపాదింపవలయు నని సారాంశము.

ఇట్లు దుర్యోధనాదుల స్వరూపస్వభావములను, పాండవుల స్వరూపస్వభావములను కంఠోక్తిగా జెప్పిన వేదవ్యాసభగవానుడు—పాండవులు ధర్మాత్ము లనియు, శమదమసత్యాహింసాదిధార్మికలక్షణములు కలవారనియు, కృష్ణపరమాత్మయు, వేదములును, మహర్షులును పాండవుల కాదర్శస్థానము లనియు బోధించియుండెను.

ఇట్టి పాండవులను గూర్చి చేసిన ప్రతివాదులప్రసంగముల నింక పరిశీలింపవలసియున్నది—

## —♦ పాండవోత్పత్తిప్రస్తావము ♦—

### —♦ "పాండవుల జన్మకర్మాదులు కౌరవాచారవిరుద్ధములును, భారతీయాచారవిరుద్ధములును" అను ప్రసంగము-తన్నిరాకరణము ♦—

మ.భా.చ.కారుల వ్రాత యిటులున్నది. (1)కుంతీదేవి చాల గుట్టుగల స్త్రీ. ఆమె అర్జునుని దప్ప మిగిలిన నలువుర నెటులనో సంపాదించుకొని (అర్జునుని గనియుండును.) లేక వ్యభిచారముచే దాను ముగ్గుర గని సవతిచేగూడ నటుల గన్పించి కాని, కౌరవుల లో భాగస్వాములుగా దీసికొనివచ్చియుండును. ...పాండవుల జన్మకర్మాదుల కౌరవాచారవిరుద్ధములుగను, భారతీయాచారవిరు

ద్ధములుగ నుండుటచేతనె... శల్యుడు మొదలగువారు సయితము పాండవులలో జేరక కౌరవులలో జేరిరి" (పు117)

(2)"ఆర్యులు నియోగపద్ధతిచే సంతతి నొందుచుండిరి. ధృతరాష్ట్ర పాండురాజులు, పాండవులు నియోగపద్ధతిచే జన్మించినవారే. ఆదిపర్వాంతర్గతచైత్రరథపర్వముచేతను, బ్రహ్మాండపురాణములోని సగరచరిత్రముచేతను, నియోగపద్ధతివృత్తాంతము స్పష్టము కాగలదు" (పు71)

3"శల్యుని బాండవుల చేరకుండ గపటము పన్నిన దుర్యోధనుని కపటమునుమించి యా శల్యునే కర్ణుని వధమునకు సహాయునిగా జేసుకొని తానే యాశల్యుని రణనిహతుని జేయుట మొదలగు వ్యవహారములలో ధర్మజుని రాజకీయధురంధరత్వము శోభించినది' (పు244)

ప్రతివాదిప్రసంగములు మూడు స్థలములలో మూడువిధములుగానున్నవి అవి యన్యోన్యవిరుద్ధముగా నున్నవి. చూడుడు—ప్రథమ ప్రసంగములో "కుంతీదేవి యెటులనో పాండవులను సంపాదించుకొని, లేక కుంతియు మాద్రియు వ్యభిచరించి కనిగాని కౌరవులలో భాగస్వాములుగా దీసికొని వచ్చియుండును" అనునది యొక యంశము.

ఇక దీనికివిరుద్ధముగా ద్వితీయప్రసంగములో 'ధృతరాష్ట్రపాండురాజులు, పాండవులు, నియోగపద్ధతిచే జన్మించినవారే. నియోగపద్ధతి భారత, బ్రహ్మాండపురాణములలో, స్పష్టము' అనియున్నది.

ప్రథమప్రసంగములో 'పాండవులనెటులనో సంపాదించుకొని, వ్యభిచరించి కనిగాని తీసికొనివచ్చియుండును' అనుటలో నదియూహించిచెప్పినటులును, ద్వితీయప్రసంగములో గ్రంథోదాహరణముతో 'ధృతరాష్ట్రపాండురాజులును, పాండవులును, నియోగపద్ధతిచే జన్మించి

నవారే' అనుటలో నిది నిర్ధారణముచేసిచెప్పినటులును స్పష్టమగుటవ లన ప్రథమప్రసంగములోని తమయూహ, దురూహ యని, తమ వాక్యములే, ధృవపరచుటను బట్టి ప్రథమప్రసంగములోని యీయంశము నింద్యము.

ప్రథమప్రసంగములోని ద్వితీయాంశ మిటులున్నది—'పాండవుల జన్మకర్మాదులు కౌరవాచార భారతీయాచార విరుద్ధములుకనుకనే శల్యుడు మొదలగువారు పాండవులలో జేరక కౌరవులలో జేరిరి' అని.

ఈప్రతివాదులే ద్వితీయ ప్రసంగములో జెప్పినటులు, ధృతరాష్ట్రుని జన్మమువంటిదే పాండవుల జన్మమయినపుడుధృతరాష్ట్రజన్మము కౌరవాచార భారతీయాచార సిద్ధమై పాండవజన్మము తద్విరుద్ధమెట్లయినదో! పాండవజన్మమువలెనే ధృతరాష్ట్రజన్మముకౌరవాచార భారతీయాచారవిరుద్ధమైయుండ పాండవులలో జేరనిశల్యాదులు మొదలగువారు ఆధృతరాష్ట్రసంతతియగు కౌరవులలో నెటులుచేరిరో! కనుకనిదియసంగతప్రసంగము.

మరియు, తృతీయప్రసంగములో శల్యుడు పాండవుల జేరకుండుటకు దుర్యోధనుడు పన్నిన కపటము కారణమని చెప్పిన ప్రతివాదులు, పాండవులజన్మకర్మాదులు భారతీయాచారవిరుద్ధములు కనుకనే శల్యుడువారిలో జేరలేదనుట, అసంబద్ధప్రలాపము.

మరియు, తమ దురాచారములను బట్టియే తమలో జేరనపుడు, ఆశల్యుని ధర్మజుడు కర్ణవధకు సహాయునిగా జేసికొనె నను తృతీయ ప్రసంగములోని మాట విరుద్ధము.

వ్యభిచారమున బుట్టినటులొకచోటను, నియోగపద్ధతిని బుట్టినటులు మరియొకచోటను వ్రాసినప్రతివాదులకు, వ్యభిచారము వేఱు. నియోగపద్ధతి వేఱు. అనువివేచనమున్నదా! లేదా!

వ్యభిచారమున బుట్టినవారు వర్ణసంకరు లనబడుదురు. కనుకనే—

"వ్యభిచారేణ వర్ణానా మవేద్యావేదనేన చ ।
స్వకర్మణాం చ త్యాగేన జాయంతే వర్ణసంకరాః॥" (మను. 10.24)

అని మనుస్మృతి బోధించుచున్నది. అట్టివారియందు మాతృజాతి యుండక, పితృజాతియునుండక వేరొకజాతియేర్పడును. అశ్వమునకును, గార్దభమునకును జన్మించినది అశ్వమనబడక, గార్దభమనబడక, అశ్వతర మను జాత్యంతరమగునట్లు. కనుకనే — "సంకీర్ణజాతీనాన్తు అశ్వతరవత్ మాతాపితృజాతివ్యతిరిక్త జాత్యన్తరం" అని చెప్పబడినది.

ఇక నియోగపద్ధతినిజన్మించినవారు క్షేత్రజులనబడుదురు. వారియందు క్షేత్రప్రాధాన్యమున మాతృజాతియే సిద్ధించును. ఈవిషయము 'వేదవ్యాసనిందానిరాకరణము'లో వివరింపబడియున్నది.

ఇట్టి స్థితిలో పాండవోత్పత్తి ప్రతివాదు లన్నట్లు వ్యభిచారమూలకమే యైనయెడల వారియందు మాతృజాతి యగు క్షత్రియత్వము లేకపోవలసివచ్చును. అప్పుడు 'పాండవు లేజాతికిజెందినవారో ఆజాతికిజెందినవాడనే నేనును, పాండవులఘనతయేమి?' అనుచుధృతరాష్ట్రునితో —

"ఉభౌ స్వ ఏకజాతీయౌ తథోభౌ భూమిగోచరౌ ।
అథ కస్మాత్పాండవానా మేకతో మన్యసే జయం ॥" (ఉ-అ57)

అను దుర్యోధనుని వాక్యము అసంబద్ధమగును. ఈ దుర్యోధనవాక్యమే- దుర్యోధనునియందున్న క్షత్రియత్వమే పాండవులయందుకూడ గలదని ధ్రువపరచుచున్నది. పాండవులయందు క్షత్రియత్వము మాతృజాతినిబట్టియే యని చెప్పక తప్పదు. ఆమాతృజాతి క్షేత్రప్రాధాన్యమూలక మనియు, నాక్షేత్రప్రాధాన్యము నియోగవిధిమూలకమనియుజెప్పకతప్పదు కనుకపాండవోత్పత్తినియోగవిధిమూలకమే. ఆనియోగవిధి వెనుకటియుగములలో అపద్ధర్మముగా శాస్త్రీ

క్తమై యున్నదే. ధృతరాష్ట్రోత్పత్తి విషయమై యాశ్రయింపబడిన దానియోగవిధియే.

ఇట్టిస్థితిలో రాజ్యలుబ్ధుడై పాండవులపై శత్రుత్వము వహించిన దుర్యోధనునకైనను పాండవోత్పత్తివిషయమై కలుగనట్టి దురూహ, ప్రతివాదులకు గలుగుట నింద్యము.

## —♦ పాండవజన్మప్రకారము ♦—

'పాండవుల జన్మము కౌరవాచారభారతీయాచారవిరుద్ధము' అను ప్రతివాదులకు వారి జన్మమునుగూర్చి గ్రంథమం దెట్లున్నదో వివరింతము—

"పాండు ర్జిత్వా బహూన్ దేశాన్ బుద్ధ్యా విక్రమణేన చ ।
మృగవ్యవాయనిధనా త్కృచ్ఛ్రాం ప్రాప స ఆపదం ॥
జన్మప్రభృతి పార్థానాం తత్రాచారవిధిక్రమః,"

నీలకంఠీయమ్— మృగవ్యవాయనిధనాత్ మృగరూపిణో ఋషే ర్వ్యవాయనిధనం మైథునకాలే మారణం, తస్మా ద్ధేతోః కృచ్ఛ్రా మతికష్టా మాపదం ప్రజోత్పత్తిప్రతిబంధకం త్వమపి వ్యవాయకాలే మరిష్యసీతి శాపం ప్రాప। తత్ర ఆపద్యేవం సత్యామపి, పార్థానాం పాండవానాం జన్మప్రభృతి జాతకర్మాదిసంస్కారః ప్రభృతి శబ్దార్థః । తచ్చ ఆచారవిధేః క్రమశ్చ శీలరత్నాఖ్యః అభూదితి శేషః।

"మాత్రో రభ్యుపపత్తిశ్చ ధర్మోపనిషదం ప్రతి,
ధర్మస్య వాయో శ్శక్రస్య దేవయోశ్చ తథాశ్వినోః." (ఆది–అ1)

నీలకంఠీయమ్— న చైత ద్ద్వయం విరుద్ధ మిత్యాహ—మాత్రో రితి। చ శబ్దో హేతౌ । యస్మా ద్ధర్మోపనిషదం ప్రతి ధర్మః 'కుల స్త్రీభి రాప ద్యపత్యార్థో విశిష్టః పుమాన్ ప్రార్థనీయ' ఇత్యేవం రూపః వ్యాసవశిష్ఠాదిభ్యోఽపత్యోత్పత్తౌ విచిత్రవీర్యకల్మాషపాదాది

రాజదారేషు దృష్టః, తస్య సంరక్షణార్థా ఉపనిషత్ దుర్వాససా దత్తా విద్యా తామావర్త్య తాం ప్రతి ప్రతీత్య ధర్మాదీనాం మాతర్ర్యాతరాప్రతి అభ్యుపపత్తిః రేతస్సేకార్థం గమన ముపపన్నం। తస్మాత్సత్యా మప్యాపదీ పాండోః పుత్రజన్మాదికం న విరుద్ధమిత్యర్థః॥

పాండుమహారాజు, మునిమిథునము మృగమిథునమై విహరించునపుడు మృగరూపియైయున్న మునిని బాణముచే గొట్టగా మరణించెడి ముని 'నీవును నీభార్యతో కలసినపుడు మరణింతువు' అని సంతానము కలుగుటకు ప్రతిబంధకమయిన శాపమునిచ్చెను. అట్టిశాపము పాండు రాజునకున్నను పాండవుల జన్మము, జాతకర్మాదిసంస్కారములు, ఆచారవిధి ప్రాప్తించినవి.

ఇది విరుద్ధముకాదు. ఏమనగా— 'కులస్త్రీలు ఆపత్కాలమున సంతతినిమిత్తము ఉత్తమపురుషుని ప్రార్థింపవచ్చును, అని పూర్వయుగమునం దున్నట్టియు, విచిత్రవీర్య కల్మాషపాదాది రాజదారల యందు ప్రసిద్ధమైనట్టియు నేధర్మము కలదో దానిని బాలింపదలచియే అనాగతవేదియగు దుర్వాసోమహర్షిః— బాల్యమున కుంతీదేవి కనుగ్రహించిన మంత్రము ననుసరించి ప్రత్యక్షమైన ధర్మదేవ, వాయుదేవ, దేవేంద్ర, అశ్వినీదేవతల అనుగ్రహమునుబట్టి పాండవుల జన్మ ముపపన్నమైనది. కనుక శాపతప్తుడైనను పాండురాజునకు పుత్రజన్మాదికము విరుద్ధము కాదు. అని చెప్పబడినది కనుక, ధృతరాష్ట్రాది జన్మమువలెనే పాండవజన్మము భారతీయాచారసిద్ధము, కౌరవాచార సిద్ధమునని ప్రతివాదులకు తెలుపుచున్నాము.

ప్రతివాదుల కౌరవాచార మను మాటలోని కౌరవశబ్దము దుర్యోధనాదులనే చెప్పదు. కురువంశసంభూతులను చెప్పును. అందు లోనివాడే ధృతరాష్ట్రుడు. ఆతని జన్మమువంటిదే పాండవుల జన్మము కనుక ప్రతివాదిప్రసంగ మసంగతము.

—♦ కుంతీదేవికి పాండురాజనియోగప్రకారము ♦—

"ధర్మపత్నులు తనవలె తపస్వినులై వెంటనుండ శతశృంగ పర్వతమున బాండురాజు మునిబృంద మాశ్చర్యపడునట్లు ఘోరతపము జేయు నవసరమం దొకప్పుడు బ్రహ్మలోకమునకు బోవు మునిబృందముతో బాండురాజు ప్రసంగించుచు నే నపుత్రకుడనై తి నేమిసేయుదు ననిన మునులిట్లు చెప్పిరి—

"అస్తి వై తవ ధర్మాత్మన్ విద్మ దేవోపమం శుభం,
అపత్య మనఘుం రాజన్ వయం దివ్యేన చక్షుషా ॥
దైవోద్దిష్టం నరవ్యాఘ్ర కర్మ ణేహోపపాదయ ॥"

(ఆది_అ 120)

మేము దివ్యదృష్టివలన తెలిసికొనినాము. నీకుపూజ్యమైన సంతానముదైవవిహితమైయున్నది. ప్రయత్నము చేయుము. అని.

అపుడు పాండురాజు తనకు తటస్థించిన శాపమునుబట్టి యౌరససంతానమున కవకాశము లేదని యెంచి క్షేత్రజసంతతి నుద్దేశించి కుంతీదేవితో నిట్లనియె—

"ఔరస క్షేత్రజ దత్తక కృత్రిమ గూఢోత్పన్నాపవిద్ధులను నార్వురు పుత్రులు బంధువులు దాయాదులు నగుదురు. కానీనసహోఢ క్రీతపౌనర్భవ స్వయందత్తజ్ఞాతు లను నార్వురు బంధువు లగుదురు కాని దాయాదులు కారు' (ఆంధ్ర భా)

"ఉత్తమా ద్దేవరా త్పుంసః కాంక్షన్తే పుత్ర మాపది,
అపత్యం ధర్మఫలదం శ్రేష్ఠం విన్దన్తి మానవాః ॥
ఆత్మశుక్రా దపి పృథే మనుః స్వాయంభువోబ్రవీత్,
తస్మా త్ప్రహేష్యా మ్యద్య త్వాం హీనః ప్రజననా త్స్వయం ॥
సదృశా చ్ఛ్రేయసో వా త్వం విద్ధ్యపత్యం యశస్విని,
మన్నియోగా ద్యత క్షిప్ర మపత్యోత్పాదనం ప్రతి"

(ఆది_అ 120)

నీలకంఠీయమ్ — ప్రణీతే (క్షేత్రజే) విశేష మాహ—ఉత్తమా దితి। శ్రేష్ఠం-పితుః కులా దపి యః శ్రేష్ఠః ప్రశస్యతమః తజ్జం, శ్రేష్ఠ మపత్య మితి సామానాధికరణ్యం. శ్రేష్ఠా దనన్యత్వా దపత్యస్య, ప్రహేష్యామి-గతివృద్ధి కర్మణో హినోతే రూపం. అద్యేతి క్షిప్రవ చనసంయోగాల్లృట్ । త్వాం శరణం గతో౽స్మి, వర్ధయామి వేలి చార్థః॥

ఆపత్కాలమందు దేవరునివలనగాని, యుత్తమునివలనగాని క్షేత్రజసంతతిని గోరుటకలదు. పితృకులముకంటెను శ్రేష్ఠునివలన గలిగిన సంతతి, ధర్మఫలప్రద మని స్వాయంభువమనువు చెప్పెను. ఈకార్య సిద్ధిలో నాకు శరణ్యము నీవే. నానియోగమున, సమానునివలనగాని, శ్రేష్ఠునివలనగాని సంతతి నిమిత్తము నీవు యత్నింపుము.

ఇట్లు నియోగింపగా కుంతీదేవి యిట్లనియె —

"న మా మర్హసి ధర్మజ్ఞ వక్తు మేవం కథంచన,
ధర్మపత్నీ మభిరతాం త్వయి రాజీవలోచనే ॥
న హ్యాహం మనసా ప్యన్యం గచ్ఛేయం త్వదృతే నరమ్,
త్వత్తః ప్రతివిశిష్టశ్చ కో౽న్యో౽స్తి భువి మానవః"

నీధర్మపత్నినై నీయందు గాఢానురాగము కలిగియున్న నాకు నీవిట్లు చెప్పుట యేవిధమునను తగదు. నేను నిన్నుదప్ప మరియొక్క పురుషుని మనస్సుచేఁగూడ బొందుదానను గాను. నీకంటె నుత్తముఁడు లోకమం దెవ్వఁడు? అని.

ఇట్లు నియోగపద్ధతి కంగీకరింపని కుంతీదేవి నంగీకరింపచేయదలచిన పాండురాజు- భర్త యేమిచెప్పినను చేయుట భార్యకు విధియైయున్న దనియు, అట్లు చేయకున్నచో పాప మనియు, బోధించుటకై మహర్షియగు శ్వేతకేతువు చేసియున్న నిర్ణయమును తెలుపదలచి యాప్రస్తావనమునకై పురాతనవిషయముగా నిట్లు చెప్పెను.

"అథ త్విదం ప్రవక్ష్యామి ధర్మతత్త్వం నిబోధ మే,
పురాణ మృషిభి ర్దృష్టం ధర్మవిద్భి ర్మహాత్మభిః ॥
అనావృతాః కిల పురా స్త్రియ ఆసన్ వరాననే,
కామచారవిహారిణ్య స్స్వతంత్రా శ్చారుహాసిని ॥"

టీ—అనావృతాః—సర్వై ర్ద్రష్టుం యోగ్యాః; కామచారో రతి సుఖం తదర్థం విహారిణ్యః పర్యటనశీలాః; స్వతంత్రాః భర్త్రాదిభి రనివార్యాః;

"తాసాం వ్యుచ్చరమాణానాం కౌమారా త్సుభగే పతీన్,
నాఽధర్మోఽభూ ద్వరారోహే స హి ధర్మః పురాఽభవత్ ॥
తం చైవ ధర్మం పౌరాణం తిర్యగ్యోనిగతాః ప్రజాః,
అద్యా ప్యనువిధీయన్తే కామక్రోధవివర్జితాః ॥"

టీ.పతీన్ వ్యుచ్చరమాణానాం వ్యభిచరన్తీనాం చ, అనువిధీయన్తే అనుసార్యన్తే ఈశ్వరేణ.

"ప్రమాణదృష్టో ధర్మోఽయం పూజ్యతే చ మహర్షిభిః,
ఉత్తరేషు చ రంభోరు కురుష్వద్యాపి పూజ్యతే॥"

టీ— దృశ్యతే చ వేదే. "న కాంచన పరిహరేత్" ఇతి వామదేవ్యవ్రతేషు మైథునార్థిన్యాః స్త్రియాః ప్రత్యాఖ్యాననిషేధః.

"స్త్రీణామనుగ్రహకర స్స హి ధర్మ స్సనాతనః,
అస్మింస్తులోకే నచిరా న్మర్యాదేయం శుచిస్మితే ॥
స్థాపితా యేన యస్మాచ్చ తన్మే విస్తరత శ్శృణు"

టీ. న చిరాత్=అల్పకాలతః ॥

"బభూ వోద్దాలకో నామ మహర్షి రితి న శ్శ్రుతమ్,
శ్వేతకేతు రితి ఖ్యాతః పుత్ర స్తస్యాఽభవ న్మునిః॥
మర్యాదేయం కృతా తేన ధర్మ్యా వై శ్వేతకేతునా,
కోపాత్కమలపత్రాక్షి యదర్థం త న్నిబోధ మే ॥

శ్వేతకేతోః కిల పురా సమక్షం మాతరం పితుః,
జగ్రాహ బ్రాహ్మణః పాణౌ గచ్ఛావ ఇతి చాఽబ్రవీత్ ॥
టీ. శ్వేతకేతో ర్మాతరం పితుస్సమక్షమ్.
ఋషిపుత్త్ర స్తతః కోపం చకారామర్షచోదితః,
మాతరం తాం తథా దృష్ట్వా నీయమానాం బలా దివ ॥
క్రుద్ధం తం తు పితా దృష్ట్వా శ్వేతకేతు మువాచ హ,
మా తాత కోపం కార్షీ స్త్వ మేష ధర్మ స్సనాతనః ॥
అనావృతా హి సర్వేషాం వర్ణానా మఙ్గనా భువి,
యథా గావః స్థితా స్తాత స్వే స్వే వర్ణే తథా ప్రజాః ॥
టీ. స్థితాః= వ్యవస్థితాః.
"ఋషిపుత్త్రోఽథ తం ధర్మం శ్వేతకేతు ర్న చ క్షమే,
చకార చైవ మర్యాదా మిమాం స్త్రీపుంసయో ర్భువి ॥
టీ. న చ క్షమే. న క్షమాం కృతవాన్.
మానుషేషు మహాభాగే న త్వేవాఽన్యేషు జన్తుషు,
తదా ప్రభృతి మర్యాదా స్థితేయ మితి నశ్శ్రుతం ॥
వ్యుచ్చరన్త్యాః పతిం నార్యా అద్య ప్రభృతి పాతకమ్,
భ్రూణహత్యాసమం ఘోరం భవిష్య త్యసుఖావహమ్ ॥
భార్యాం తథా వ్యుచ్చరతః కౌమారబ్రహ్మచారిణీమ్,
పతివ్రతా మేత దేవ భవితా పాతకం భువి ॥

టీ. "యథా స్తేనో యథా భ్రూణహైవ మేష భవతి యోఽయోనౌ రేత స్సించతి" ఇత్యయోనావదారేషుపుంసాంగమనా త్ప్రత్యవాయశ్శ్రుతిసిద్ధః. తథా 'అమీషాం నిష్కృతం జారిణీవ' ఇతిమన్త్రే జారిణ్యానిష్కృతేః పీడాయాశ్చ దర్శనాత్, స్త్రీణామపి పరసంగే దోషోఽన్యేవోక్తః. తథాపి శ్వేతకేతునైవ కయా చిద్భంగ్యా వ్యవస్థేయం విహితేతి జ్ఞేయమ్.

అథవా, వ్యుచ్చరణే తేజస్వినాం న దోషః, కిన్తు పృథగ్గ నానా మేవేతి తాత్పర్యం! అన్యథా కృష్ణస్యాఽపి పారదార్యదోషప్రసక్తేః; అహల్యాది జారాణాం తదప్రసక్తేశ్చే త్యాస్తాంతావత్,,

"పత్యా నియుక్తా యాచైవ పత్నీ పుత్రార్థ మేవ చ,
న కరిష్యతి తస్యాశ్చ భవిష్యతి తదేవ హి ॥
ఇతి తేన పురా భీరు మర్యాదా,స్థాపితా బలాత్,
ఉద్దాలకస్య పుత్రేణ ధర్మ్యా వై శ్వేతకేతునా ॥ "

టీ. ప్రకృతోపయుక్త మాహ– పత్యేతి! అయుక్తమపి భర్త్రాజ్ఞయా స్త్రీభి రవశ్యం కర్తవ్యమితి భావః.

మానినీ! పురాతనమైనట్టియు, ఋషులచే నవలంబింపడినట్టియు, ధర్మతత్త్వమును నీకు జెప్పెదను వినుము.—పూర్వకాలమందు స్త్రీలు అందరును దర్శింపదగినట్లుండి కామచారము కలిగి భర్త్రాదులచే నని వారితలై యుండెడివారు. వారు భర్తలనతిక్రమించి విహరించుచున్నను అధర్మము కాలేదు. అది పూర్వము ధర్మము. ఆపురాతనధర్మమే తిర్యగ్జంతువులచే నిప్పటికిని యనుసరింపజేయబడుచున్నది. వామదేవ్యవ్రతములలో–"న కాం చన పరిహరేత్, అనువేదవాక్యముచే ప్రమాణ సిద్ధమైన యీ ధర్మము మహర్షులచే బూజింపబడుచున్నది. ఉత్తరకురు దేశములలో నది నేటికిని బూజింపబడుచున్నది. స్త్రీల కనుగ్రహకర మైన యది పురాతనధర్మము.

ఈలోకములో గొంతకాలమునుండి యొక వ్యవస్థ కావింపబడి నది. అది యెట్టిదనగా—ఉద్దాలకుడను మహర్షికి శ్వేతకేతువను పుత్రు డుండెను. ఆశ్వేతకేతువుయొక్క తల్లిని తండ్రిసమక్షములో నొక బ్రాహ్మణుడు (ఋషి) హస్తముబట్టుకొని నిర్బంధపరచుచునట్లు తీసికొనివెళ్ళునపుడు ఆశ్వేతకేతువు కుపితుడు కాగా, తండ్రి యాతని తో నిట్లనెను—

'నీవు కోపింపకుము. ఇది పురాతనమైన ధర్మము. స్త్రీలు తమతమవర్ణములలో నందరకును గోవులవలె దర్శనయోగ్యత కలిగి యుండుట వ్యవస్థితమై యున్నది' అని. శ్వేతకేతు వాపద్ధతిని సహింపక మనుష్యులలో స్త్రీపురుషుల కొరక నిర్ణయము జేసెను. 'ఇది మొదలు భర్త నతిక్రమించి వ్యభిచరించిన స్త్రీకి ఘోరమైన భ్రూణహత్యాసమపాతకము కలుగును. అట్లే సాధ్వియగు భార్య నతిక్రమించి వ్యభిచరించిన పురుషునకును ఆపాతకమే కలుగును. పుత్రార్థమై పతిచే వియోగింపబడిన స్త్రీ యట్లు చేయకున్నపు డదే పాతకము కలుగును'' అని.

ఇచ్చట, భర్త్రాజ్ఞపై నియోగపద్ధతి భార్య కవశ్యకర్తవ్యమని కుంతీదేవికి పాండురాజు, ఆఖ్యాయికాముఖమున బోధించినట్లున్నది—

— శ్వేతకేతుగాథాతాత్పర్యము —

ఈయాఖ్యాయికలో, పూర్వమొకప్పుడు పరస్త్రీలకు, పరపురుషులకు సంబంధము దోషావహము కాకుండె నని వర్ణింపబడినది.

ఇది ప్రకృతమైన నియోగవిధికి, అర్థవాదరూపము కనుక దీనికి నియోగవిధిని బలపరచుటయందే తాత్పర్యముకాని యితరాంశమును ప్రతిపాదించుటయందు తాత్పర్యము కాదు. ఒక ప్రస్తుతాంశమును సమర్థించుటకై అర్థవాదముగా చెప్పబడిన కథ సత్యమైయై యుండవలయు నను నియమము లేదని విజ్ఞులకు విదితమే.

మహాభారతమునందు అర్థవాదము లున్న వని మ. భా. చ. కారులు వ్రాసియేయున్నారు. చూడుడు—

''వేదములందుండిన విధులూ అర్థవాదములు (విధులను స్తుతించు రూపమున జెప్పబడు గాధలు) మొదలగునవి మహాభారతమున నుండెను. గుణస్తుతిరూపకములై పరకృత్యాదిచతుర్విధార్థవాదములు విపులముగానిందు చెప్పబడియున్నవి. అర్థవాదములునాలుగువిధములు. నిందార్థవాదములు, 2. ప్రశంసార్థవాదములు, 3 పరకృత్యర్థవాదములు, 4. పురాకల్పార్థవాదములు.'' (పుట 2)

ఇట్లుండుటచే నియోగవిధిప్రశంసార్థమే ఆగాథ యెత్తుకొనబడి నదికనుక నది సత్యమే అనుకొనుట అయుక్తము.

ఇంకొకటి, "పురాణ మృషిభి ర్జుష్టమ్" అని యది ఋషిధర్మముగా నుపక్రమింపబడినది. మనుష్యవర్గముకంటె దేవవర్గము, అసుర వర్గము, ఎట్లు విలక్షణమైనదో అట్లు ఋషి వర్గముకూడ విలక్షణమైనదే. కనుకనే యీవర్గములు విభిన్నములుగా జెప్పఁబడినవి— "దేవా మనుష్యా అసురాః పితర ఋషయః"

(అథర్వ—10-10-26)

"మనుష్యజాతిః శ్రేయసీ నవా శ్రేయసీత్యేవం పరిపృష్టే విభజ్య వచనీయః ప్రశ్నః, పశూ నధీకృత్య శ్రేయసీ, దేవాన్ ఋషీ నధికృత్య నేతి" (యోగదర్శనం—4-33)

ఈవచనములచే పశువులకంటె నధికులు, ఋషులకంటెహీనులు నగు మనుష్యుల శక్తికంటె ఋషిశక్తులు విలక్షణములు. అట్టిఋషుల నుగూర్చి యాపస్తంబసూత్రములో నిట్లున్నది —

"దృష్టో ధర్మవ్యతిక్రమ స్సాహసం చ పూర్వేషామ్"

"తేషాం తేజోవిశేషేణ ప్రత్యవాయో న విద్యతే"

ఛాందోగ్యమునం దిట్లున్నది.—"త ద్యథైషీకా తూల మగ్నౌ ప్రోతం ప్రదూయే తైవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయన్తే"

ఈవచనములచేతను, "తేజీయసాం న దోషాయ వహ్నే స్సర్వభుజో యథా" అను న్యాయముచేతను మహాత్ములగు ఋషులకు విహితాచరణమువలనగాని, నిషిద్ధాచరణమువలనగాని, జన్మాంతరహేతువులగు పుణ్యాపాపములు సంక్రమింపవని స్పష్టము. కనుకనే "జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతేఽర్జున" అని బోధింపబడినది.

జన్మాంతరహేతువులై తముచే జేయబడిన పుణ్యాపాపము లెవ్వారి కనుభవింపక తప్పవో, అట్టి మనుష్యులే సుఖప్రాప్తికని, దుఃఖనివృత్తి

క్తిని, విధినిషేధశాస్త్రముల ననుసరించి సంచరింపవలసినవారు. జ్ఞానులగు ఋషుల శరీరములు ప్రారబ్ధకర్మఫలోపభోగహేతువులేకాని కర్మహేతువులు కావు. తిర్యగ్జంతువుల శరీరములుగూడ నట్టివే, కనుకనే పైయాఖ్యాయికలో—

తం చైవ ధర్మం పౌరాణం తిర్యగ్యోనిగతాః ప్రజాః,
అద్యాప్యనువిధీయన్తే"

అనుచు తిర్యగ్జాతియందే యను విధానము బోధింపబడుట యుక్తమగుచున్నది. కనుక నది మనుష్యసామాన్యమున కన్వయించు విషయము కాదు.

యింకొకటి—స్త్రీపురుషులకు వ్యభిచారముచే పాతకము కలుగుననియేకదా శ్వేతకేతువుచేసిన వ్యవస్థ, అది వెనుకజూపబడిన నీలకంఠీయములో నున్నట్లు వేదోక్తమై యున్నవిషయమేకాని నూతనవిషయము కాదు.

కనుక, వేదోక్తమైన విషయమునకే శ్వేతకేతువాక్యముఖమున, భంగ్యంతరముగా వ్యవస్థ చూపబడిన దని తెలిసికొనవలెను.

యింకొకటి—"భారతం పంచమో వేదః" 'సర్వశ్రుతిసమూహాయమ్" అని చెప్పబడిన మహాభారతము వేదార్థవివరణరూపము. అందుచే నాయాగాథలతో వేదార్థవివరణమే చేయబడుచు వచ్చుట వలన వేదవ్యాసభగవానుడు స్త్రీపురుషవ్యవస్థారూపమైన వేదోక్తార్థమునే శ్వేతకేతుగాథారూపమున వెల్లడించియుండె నని గ్రహింపవలయును.

యింకొకటి—ఆశ్వేతకేతుకృతవ్యవస్థలో—

వ్యుచ్చరంత్యాః పతిం నార్యా అద్య ప్రభృతి పాతకం,
భ్రూణహత్యాసమం ఘోరం భవిష్య త్యసుఖావహం।
భార్యాం తథా వ్యుచ్చరతః కౌమారబ్రహ్మచారిణీం,

పతివ్రతా మేతదేవ భవితా భువి పాతకం ॥
పత్యా నియుక్తా యాచైవ పత్నీ పుత్రార్థ మేవ చ,
న కరిష్యతి తస్యాశ్చ భవిష్యతి తదేవ హి ॥"

అనుచు పతిపత్నులు ఒండొరుల నతిక్రమించి వ్యభిచరించిన యెడల భ్రూణహత్యాసమపాతకము కలుగు నని చెప్పి వ్యభిచారము నిషేధింపబడెను. పుత్రార్థమై పతిచే నియోగింపబడిన పత్ని యీ నియోగమును తిరస్కరించినయెడల నామెకును అదే పాతకము కలుగు నని చెప్పి నియోగవిధి యనుసరణీయ మని బోధింపబడెను.

దీనిచే నియోగవిధి వేఱు, వ్యభిచారము వేఱు; అని తెలుపబడినది కనుక నియోగవిధిని వ్యభిచారముగా గ్రహించువారు మతిమంతులు కారు. వ్యభిచారము వేదనిషిద్ధమైయుండ, వేదార్థమునే మహాభారతము వివరించియుండ, నట్టి మహాభారతమునుబట్టుకొని పూర్వము వ్యభిచారము దోషావహముగా నెంచబడలేదని చెప్పబూనువారు భ్రాంతులు.

—"శ్వేతకేతువే వివాహబంధ మేర్పరచె"నను ప్రసంగము.—
తన్నిరాకరణము.

మ. భా. చ. కారులవ్రాత యిట్లున్నది—

వివాహనియమము-శ్వేతకేతువు... ఈనిబంధనము జనమేజయుని కాలముననే యైమె యున్నది" (పు337-339)

రహస్యకర్తలవ్రాతఇట్లున్నది—"ఈదేశములో మొదట వివాహబంధము లేక కొంతకాలము గడచినది. పిమ్మట కొంతకాలమునకు శ్వేతకేతుడు వివాహబంధ మేర్పరచి పరస్త్రీసమాగమము సంపూర్ణముగా తొలగించెను" (పు6)

ఇది కేవల మవైదికసంస్కారప్రసాదము. ఈప్రతివాదుల కొకింత బోధింతము—

"అష్టాదశ పురాణాని కృత్వా సత్యవతీసుతః,
భారతాఖ్యాన మకరో ద్వేదార్థై రుపబృంహితం ||
లక్షే ణైకేన తత్ప్రోక్తం ద్వాపరాన్తే మహాత్మనా ||"
(స్కాందపద్మభాసఖం)

"వేదా నధ్యాపయామాస మహాభారతపంచమాన్,
సుమన్తుం జైమినిం పైలం శుకంచైవ స్వ మాత్మజం ||
ప్రభు ర్వరిష్ఠో వరదో వైశంపాయన మేవ చ,
సంహితా స్తైః పృథక్త్వేన భారతస్య ప్రకాశితాః ||
(ఆదిపర్వము)

నీలకంఠీయం — భారతస్య మూలభూతా స్సంహితా మన్త్ర బ్రాహ్మణరూపా వేదాః. తై స్సుమన్తుప్రభృతిభిః ప్రకాశితాః. ఇద మస్య మూల మిద మస్య మూల మితి స్పష్టీకృతాః. తేన ప్రత్యక్షవేదమూల మేత దితి భావః ||

ఈగ్రంథసందర్భముచే మహాభారతము వేదమూలకము, వేదార్థవివరణరూపము నని స్పష్టము.

ఆవేదము—"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై" ఇత్యాదిశ్రుతివచనములను బట్టియు,

"న కశ్చి ద్వేదకర్తాస్తి"ఇత్యాది స్మృతివచనములను బట్టియు సృష్ట్యాదినుండియు సుప్రసిద్ధమై విధినిషేధములతో ధర్మాధర్మప్రకాశకమైయధ్యయనాధ్యాపనపరంపరాప్రాప్తమై యున్నది. అందున్నవిషయములే స్మృతిసూత్రపురాణేతిహాసరూపమై యున్న ఆర్షవాఙ్మయముచే వివిధమార్గముల నుపదేశింపబడుచున్నవి.

అట్టి వేదములోనే వివాహనియమ ముండగా జనమేజయుని కాలములో నది యేర్పడె ననియును, ఆవివాహనియమము శ్వేతకేతువుచే జేయబడెననియు ప్రతివాదులు వ్రాయుట వెఱ్ఱియా? బుద్ధియా?

మఱియు శ్వేతకేతుగాథను కుంతీదేవికి జెప్పినవాడు పాండు రాజై యుండుటచే శ్వేతకేతు వాపాండురాజునకు బూర్వుడని స్పష్ట మగుచుండ, జనమేజయుని కాలములోనివాడు శ్వేతకేతుడను మ. భా. చ. కారుల వ్రాత హేయము.

మఱియు శ్వేతకేతువు జనమేజయుని కాలములోనివా డని యిచ్చట వ్రాసిన ప్రతివాదులే స్థలాంతరమున జనమేజయునకు బిమ్మ టివాడని వ్రాసినారు చూడుడు—

> డాక్టరు 'బూలరు' గారు— ఆపస్తంబ, శ్వేతకేతులు సమ కాలీను లనియు, ఆపస్తంబుడు క్రీ. పూ. ఐదవ శతాబ్దమువాడని యు, వ్రాసియున్నారు. కాని శాకటాయనునిచేతను, పాణినిచేతను దమ వ్యాకరణములలో నుచ్చరింపబడిన యాపస్తంబుడును, ఉపని షత్తులలో జెప్పబడిన శ్వేతకేతుడును క్రీ. పూ. ఐదవశతాబ్దపువా రని చెప్పుటకు వీలులేదు. కాని జనమేజయునకు బిమ్మటివారు'
>
> (పు. 58)

వీరిమాటలకు పరస్పరసంబంధము లేదు. ఆపస్తంబశ్వేతకేతు వులు జనమేజయునకు బిమ్మటివారైనపుడు వ్యాకరణములలో నుచ్చ రింపబడుట, ఉపనిషత్తులలో జెప్పబడుట సరిపడునుకాబోలు!

మఱియు 'ఈతనిని (శ్వేతకేతువును) గురించిన విశేషాంశములు శతపథబ్రాహ్మణ, ఛాందోగ్య, బృహదారణ్యకోపనిషత్తులలోను, మ హాభారతమునను విపులముగా వర్ణింపబడి యున్నవి'' (పు. 338) అని వ్రాసిన మ. భా. చ. కారులు జనమేజయుని కాలమువాడే శ్వేతకే తు వనుటనుబట్టియు, పిమ్మటివా డనుటనుబట్టియు' ఆ యుపనిషత్తులు కూడ నప్పటివే యని యూహించినట్లున్నది. ఇంతకంటె అపోహ మ రొకటి లేదు. ఇది యవైదికసంప్రదాయప్రసాదమే.

౩. కొకటి. శ్వేతకేతువు చేసినది వివాహనియమమా? వ్యభిచారనిషేధమా? చూడుడు!

"వ్యుచ్చరన్త్యాః పతిం నార్యాః అద్య ప్రభృతి పాతకమ్।
భార్యాం తథా వ్యుచ్చరతః...ఏతదేవ భవితా భువి పాతకమ్"

ఇచట పతి నతిక్రమించి విహరించిన స్త్రీయును, భార్య నతిక్రమించి విహరించిన పురుషుడును పాపు లగుదురని శ్వేతకేతువు చెప్పినట్లున్నది. దీనిని బట్టి భార్యకును, భర్తకును వ్యభిచారము దోషావహమని వ్యభిచారనివారణమే చేయబడినది. పతియనియు, పత్నియనియు వ్యవహారము వివాహనిబంధనమైనదే. అది శ్వేతకేతువునాటికే యున్నదన్నమాట. ఆపతిపత్నులు వ్యభిచరింపరాదనియే శ్వేతకేతువు నిషేధించెను. ఇట్టి స్థితిలో 'వివాహనియమము-శ్వేతకేతువు' అని మ. భా. చ. కారులును- "ఈ దేశములో మొదట వివాహబంధము లేక కొంతకాలము గడచినది. పిమ్మట కొంతకాలమునకు శ్వేతకేతుడు వివాహబంధ మేర్పరచి పరస్త్రీసమాగమము సంపూర్ణముగా తొలగించెను' అని రహస్యకర్తలును వ్రాసిన దసంగతము. రహస్యకర్తలు వ్రాసినట్లు శ్వేతకేతువుచే తొలగింపబడినది పరస్త్రీసమాగమము. శ్వేతకేతువునాటికి వివాహబంధమే లేకున్నయెడల పరస్త్రీ యనుమాట యెట్లు? కనుక వివాహనిబంధన మంతకు బూర్వమే యున్నదనక తప్పదు.

మఱియొకటి- వ్యభిచారమును శ్వేతకేతువు తొలగించె నని వ్రాసిన ప్రతివాదులైనను అది పాప మని చెప్పి తొలగించినట్లే వ్రాసియున్నారు. అది పాపమని చెప్పుటకు శ్వేతకేతుమహర్షికి ప్రమాణము వేదమే. కనుకనే మహాభాష్యకారులు-

"శబ్దప్రమాణకా వయం యచ్ఛబ్ద ఆహ తదస్మాకం ప్రమాణం"

అని యుపదేశించిరి. అట్లు వేదబోధితమై యున్న పాపము నే శ్వేతకేతుమహర్షి ప్రకటించె ననియు, పాపభీతిచేతనే వ్యభిచారము లేకుండె ననియు, నిట్టి పాపభీతి యనాదిసిద్ధమే యనియు గ్రహింప వలయును.

ఈరహస్యకర్తలు, శ్వేతకేతువు నుండియే వివాహబంధ మేర్పడెననివ్రాసి, కామసూత్రములోని "శ్వేతకేతు స్పంచిక్షేప" అను తొమ్మిదవ సూత్రము నుదాహరించి కొంతగ్రంథమును ప్రదర్శించినారు. ఆకామసూత్రగ్రంథములోనే పూర్వసూత్రములలో వివాహాది నిబంధన మనాదిసిద్ధ మని చెప్పబడినట్లున్నది. చూడుడు—

"ప్రజాపతిర్హి ప్రజాస్సృష్ట్వా తాసాం స్థితినిబన్ధనం త్రివర్గస్య సాధన మధ్యాయానాం శతసహస్రేణాగ్రే ప్రోవాచ" 5.

ప్రజాపతిర్హీతి హిశబ్దో యస్మాదర్థే, అవిపరీతోఽయమాగమః గురుపరంపరయాఽన్వాఖ్యాయతే. యతః స్థితినిబాధనమితి. ప్రజానాం తిస్రోఽవస్థాః సర్గస్థితిప్రలయలక్షణాః. తత్ర సర్గాదూర్ధ్వం ప్రబన్ధేనావస్థానం స్థితిః। సా చ ద్వివిధా । శుభాచాఽశుభాచ। త్రివర్గోపి ద్వివిధః ఉపాదేయోఽనుపాదేయశ్చ। తత్ర పూర్వో ధర్మోఽర్థః కామ ఇతి । ద్వితీయోప్యధర్మోఽనర్థో ద్వేష ఇతి । తత్ర ధర్మా దముత్ర శుభాగతిః । అధర్మా దశుభా । అర్థా దిహైవ శరీరపరిభోగో ధర్మప్రవర్తనం చ । అనర్థాత్క్లిష్టజీవన మధర్మప్రవర్తనం చ । కామాత్సుఖం ప్రజోత్పత్తిశ్చ । ద్వేషా న్నో భయం । తస్య చ నిస్సుఖస్యాఽప్రజస్య తృణస్యేవ స్థితిః । ఇత్యేవం స్థితేః త్రివర్గో నిబంధనం । తస్యోపేయాఽనుపేయస్య ప్రాప్తిపరిహారా నోపాయం వినేతి తదుపాయశాసనత్వాచ్ఛాస్త్ర మప్యుపచారాత్ స్థితినిబంధనం। శతసహస్రేణేతి లక్షేణ అగ్రే ప్రోవాచేతి । తదానీం శాస్త్రాంతరాభావా దిద మేవాగ్ర్య మితి శ్రుతిరపి సర్వజనవిషయేతి తామేవ హృదిస్థితా మనుసంచిన్త్య సాధారణభూతం స్మార్తశాస్త్రం ప్రకర్షేణోవాచ ॥

"తస్స్యైకదేశం స్వాయంభువో మను ర్ధర్మాధికారికం పృథక్చచార । 6.

తస్యేతి—ప్రజాపతిప్రోక్తస్య్యైకదేశా స్త్రియః । తత్ర యత్ర ధర్మోఽధికృత స్తత్ మనుః పృథక్చచార । యత్రార్థ స్తం బృహస్పతిః యత్ర కామ స్తం నన్దీతి స్వాయంభువ ఇతి వైవస్వతనివృత్త్యర్థం. ధర్మాధికారికమితి ధర్మప్రస్తావో యత్రాస్తి తత్ ధర్మశాస్త్రమిత్యర్థః ॥

"బృహస్పతి రర్థాధికారికమ్" 7.

"మహాదేవానుచరశ్చ నన్దీ సహస్రేణాధ్యాయానాం పృథక్కామసూత్రం ప్రోవాచ ॥" 8.

"తదేవ తు పంచభి రధ్యాయశతై రౌద్దాలకిః శ్వేతకేతు స్సంచిక్షేప ॥"

తదేవత్వితి నన్దిప్రోక్తం తస్స్యైకదేశం తుశబ్దో విశేషణార్థః । ...పరదారాభిగమనం లోకే ప్రాగాసీత్ ...... ॥

అనగా బ్రహ్మ ప్రజలను సృష్టించి, యాప్రజల శుభస్థితి కాధారమై యాముష్మికసుఖసాధనమైన ధర్మము, భోగమునకును ధర్మాచరణమునకును సాధనమైన అర్థము, సంతతికిని సుఖమునకు సాధనమైన కామము అను త్రివర్గమును శాసించుటకు లక్షాధ్యాయములు కల శాస్త్రమును రచించెను. తన హృదయగతమై యుండి సర్వజన సాధారణముగా హితాహితముల బోధించెడి వేదము ననుసంధానించియే యాశాస్త్రము నాదియందు నిర్మించెను. ఆబ్రహ్మప్రోక్తశాస్త్రము లోని త్రివర్గములో నొకటగు ధర్మమును పురస్కరించుకొని స్వాయంభువమనువు ధర్మశాస్త్రమును రచించెను. రెండవదానిని పురస్కరించుకొని బృహస్పతి యర్థశాస్త్రమును రచించెను. మూడవదానిని పురస్కరించుకొని నందికేశ్వరుడు సహస్రాధ్యాయములు కల కామశాస్త్రమును రచించెను. ఆనందికేశ్వరప్రోక్తకామశాస్త్రమునే సంక్షేపించి

యైదువందల యధ్యాయములుకల గ్రంథమును శ్వేతకేతువు చేసెను. పరదారాభిగమనము పూర్వముండెను. దానిని శ్వేతకేతువు నివర్తింప జేసి గమ్యాగమ్యవ్యవస్థతో శాస్త్రము రచించెను. అని తాత్పర్యము.

ఈగ్రంథసందర్భమును చూడగా శ్వేతకేతుప్రోక్తగ్రంథము నందిప్రోక్తకామశాస్త్రమునకు సంక్షేపరూప మని తేలినది. కనుక శ్వేతకేతుప్రోక్తగ్రంథమునకు బూర్వము నందిప్రోక్త కామశాస్త్రమున్నది. బృహస్పతిప్రోక్తార్థశాస్త్రమున్నది. స్వాయంభువమనుప్రోక్త ధర్మశాస్త్రమున్నది. బ్రహ్మకు ఒక్కొకయహస్సులో మనువులు పదు నలుగురు వెళ్ళుచుందురు. నేటిమనువు సప్తముడైన వైవస్వతమనువు. స్వాయంభువమనువు ప్రథముడు ఒక్కొకమన్వంతరకాలము—

"త్రింశత్కోట్యస్తు సంపూర్ణా స్సంఖ్యాతా స్సంఖ్యయా ద్విజ,
సప్తషష్టిస్తథాన్యాని నియుతాని మహామునే ॥
వింశతిస్తు సహస్రాణి కాలోయ మధికం వినా,
మన్వన్తరస్య సంఖ్యేయం మానుషై ర్వత్సరై ర్ద్విజ ॥"

అను విష్ణుపురాణవచనములనుబట్టి 30 కోట్ల 67 లక్షల 20 వేల సంవత్సరములు. ఇట్లారుమన్వంతరములకాలమున కాదియందున్న స్వాయంభువమనువు చేసినది మనుధర్మశాస్త్రము. ఆమనువే "యద్వై మను రవద త్తద్భేషజమ్" అని వేదములో బ్రశంసింపబడినవాడు. ఆతని ధర్మశాస్త్రములో వివాహాదిసర్వవిధినియమములు విరాజిల్లు చున్నవనుట స్పష్టమే. అట్టి మనుధర్మశాస్త్రమునకు బూర్వ మున్నది బ్రహ్మప్రోక్తశాస్త్రము. ఆబ్రహ్మయే సృష్టికర్త. ఈపరిస్థితి నాలో చింపగా బ్రజలను సృష్టించిన బ్రహ్మయే- ఆప్రజలు ఎట్లు నడచుకొన వలెనో, వారి కైహికాముష్మికసుఖము లెట్లు ప్రాప్తించునో తెలుపు టకు లక్షాధ్యాయములుకల మహానిబంధనము చేసియుండె నని స్పష్ట మైనది. ఆనిబంధనమున కాధారభూతము వేదమే యని కూడ స్పష్ట మైనది.

ఆవేదశాస్త్రములనే అధ్యయనాధ్యాపనపరంపరలో నను ష్ఠాపనరూపమున ప్రవర్తింపజేయుచువచ్చినవారు మహర్షులు. వారా యా సమయములలో వేదశాస్త్రవిషయములను సంక్షేపించియు, విస్త రించియు నిబంధించి కామక్రోధాదిదూషితులగు ప్రజలకు హితాహిత ముల దెలుపుచుండువారు. వారిలో నొకడు శ్వేతకేతుమహర్షి, అతడు వ్రాసినది కామశాస్త్రముకనుక పరదారగమనమే కామమున కున్న దుర్లక్షణమగుటచే దానిని నిషేధించి గమ్యాగమ్యవ్యవస్థ జూపె నని తెలుపబడినది.

ఇట్లు సృష్ట్యాదినుండియు వివాహాదినియమము లున్నట్లు వాత్స్యాయనమహర్షిప్రోక్త కామసూత్రగ్రంథముచే బోధింపబడుట వలన శ్వేతకేతువునకు బూర్వము వివాహబంధము లేదనియు జనమే జయుని కాలములోనే యానియమ మేర్పడిన దనియు వ్రాసిన ప్రతి వాదుల వ్రాతలు పరాస్తములు.

"వ్యభిచారము, ద్యూతము, మద్యపానము మహాభారతకాల మున దోషములు కావు" (పు 94).

అను మ. భా. చ. కారులవ్రాతకూడపరాస్తమైనది. దోషమో కాదో నిరూపించునది శాస్త్రము. ఆశాస్త్రము, ఆనాటికిని ఈనాటి కిని యొక్కటే, దానిని సంబంధించినదే నాటిపరిపాలనము. కనుక నిది యసంగతప్రసంగము.

—♦ "ఏస్త్రీతో నైనను పురుషుడు బలాత్కరించి కలియవచ్చు నని యున్న" దను ప్రసంగము—తన్నిరాకరణము ♦—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— "ఋతుస్నాతయైన స్త్రీ యెవతె యైనను పురుషుడు చేరి మంచిమాటలతోగాని, ధన వస్త్రాదుల నిచ్చిగాని యామెను గూడి సంతతి గనవచ్చు ననియు,

అట్లా స్త్రీ యంగీకరింపనిచో నామెను బలాత్కరించియు, రజ్జువుతో గాని, దండముతోగాని కొట్టియు ఆస్త్రీనిలోబరచుకొని యామెను కూడవచ్చుననియు ఉద్దాలకుడేగాక నాకకుమారహారీతులనుఋషుల వాక్యములును బృహదారణ్యకోపనిషత్తుయొక్క యెనిమిదవ యధ్యాయము నాల్గవబ్రాహ్మణమున గలవు. గ్రంథవిస్తరభీతిచే నావాక్యములను వ్రాయలేదు" (పు 340).

వీరు భీతిచేవ్రాయని వాక్యములే పరిశీలింపబడుచున్నవి. వానిని బట్టి వీరి దుర్నయమును గ్రహింపవచ్చును.

గ్రంథమును జూతుము—

"ఏత ద్ధస్మ వై తద్విద్వా నుద్ధాలక ఆరుణి రాహైత ద్ధస్మ వై తద్విద్వా న్నాకో మౌద్గల్య ఆహైతద్ధస్మ వై తద్విద్వాన్ కుమార హారితఆహ- బహవో మర్యా బ్రాహ్మణాయనానిరిన్ద్రియావిసుకృతో ఽస్మాల్లోకాత్ప్రయన్తి యఇదమవిద్వాగ్ంసో ఽధోపహాసంచరన్తీతి" (6.4)

భాష్యమ్— ఏతద్ధస్మవై తద్విద్వా నుద్దాలక ఆరుణి రాహ- అధోపహాసాత్మకం మైథునకర్మ వాజపేయసంపన్నం విద్వా నిత్యర్థః। తథా నాకో మౌద్గల్యః కుమారహారీతశ్చ కిం త ఆహు రిత్యుచ్యతే- బహవోమర్త్యామరణధర్మిణోమనుష్యాః బ్రాహ్మణాఅయనం యేషాం తే బ్రాహ్మణాయనా బ్రహ్మబన్ధవో జాతిమాత్రోపజీవినఇత్యేతత్ । నిరిన్ద్రియావిశ్లిష్టేన్ద్రియాః విసుకృతో విగతసుకృతకర్మాణోఽవిద్వాంసో మైథునకర్మాసక్తాఇత్యర్థః। తే కిమస్మా ల్లోకా త్ప్రయన్తి పరలోకాత్పరిభ్రష్టాఇతి । మైథునకర్మణోత్యన్తపాప హేతుత్వం దర్శయతి-య ఇద మవిద్వాంసో ఽధోపహాసం చరన్తీతి ॥

ఇచ్చట ఉద్దాలక నాకకుమార హారీతులనిన విషయ మేమనగా మరణధర్ములును, బ్రహ్మబంధువులును, (బ్రాహ్మణాభాసులు), సుకృత హీనులును మైథునకర్మాసక్తులు నగు నజ్ఞానులు పరలోకభ్రష్టులు కనుక నేలోకమునకు బోపుదురో, అని.

ఇట్లు మైథునకర్మాసక్తులై పరలోకభ్రష్టులగు నజ్ఞానులను ఆ మహర్షులు నిందిచినట్లు ఉపనిషత్తులలో నుండగా, ప్రతివాదు లేమని వ్రాసినారు? ఏస్త్రీనైనను కొట్టియైన బలాత్కరించి యేపురుషుడైనను కలియవచ్చునని యా ఋషు లన్నట్లు గ్రంథములో నున్నదని వ్రాసి నారు. ఇది నీతియేనా? దీనివలన సారస్వతమున కెంత ద్రోహము! లోకమున కెంతహాని?

సంతానార్థియైన భర్త ఋతుస్నాతయైన భార్యను సంతోష పెట్టి యామెతో గలియవలసినదనియు; ఆమె నిరాకరించినయెడల వస్త్రాభరణాదులతో తనప్రేమను ప్రదర్శించియో, వేరొక విధమున మందలించియో ఆమెను లోబరచుకొని సంతుష్టురాలై యున్నస్థితిలో తనపత్నితో కూడిన సత్సంతానము కలుగుననియు ఆగ్రంథములో జెప్ప బడియున్నది. కాని యేస్త్రీనైనను బలాత్కరించియైన కూడవచ్చునని లేదు. చూడుడు—

"శ్రీ ర్హ వా ఏషా స్త్రీణాం యన్మలోద్వాసా స్తస్మా న్మలో ద్వాససం యశస్వినీ మభిక్రమ్యోపమన్త్రయేత"

భాష్యమ్— శ్రీర్హవాఏషాపత్నీస్త్రీణాం మధ్యే యద్యస్మా న్మలోద్వాసా ఉద్గతమలవద్వాసా స్తస్మాత్తాం మలోద్వాససం యశ స్వినీం శ్రీమతీ మభిక్రమ్యాభిగ త్యోపమన్త్రయే తేదమద్యావాభ్యాం కార్యం యత్పుత్రోత్పాదన మితి త్రిరాత్రా న్త ఆప్లుతామ్" ॥

"సా చే దస్మై న దద్యా త్కామ మేనా మవక్రీణీయా త్సా చే దస్మై నైవ దద్యా త్కామ మేనాం యష్ట్యావా పాణినావోప హత్యాఽతిక్రామె "దిన్ద్రియేణ తే యశసా యశ ఆదద" ఇత్యయశా ఏవ భవతి" ॥

ఇట్లు పతి తన పత్నియెడలప్రవర్తింపవలసిన పద్ధతి చెప్పబడి యుండ ఏస్త్రీయందైనను బలాత్కరించి ప్రవర్తింపవచ్చునని యున్న దను ప్రతివాదుల వ్రాత హేయము.

—: "మహాభారతమునాటికి సంకరసంతాన మెక్కువ యైనది" అనుప్రసంగము—తన్నిరాకరణము :—

1. మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— "మహాభారతమునాటికి సంకరసంతాన మెక్కువయైనది. అందువలననే నాటి స్మృతికర్తలు ద్వాదశవిధసంతానములను తమ గ్రంథముల నెక్కించిరి" (73)

2. భగవద్గీతలలోని యీక్రింది యర్జునవాక్యము కూడ నాటి జాతిభ్రంశవిధానమును సూచించుచున్నది—

ఓకృష్ణా! కులక్షయకృతమగు దోషమును జూచుచున్న మనచే నీపాపమునుండి నివర్తించుట యెటులో తెలిసికొన శక్యము కాకున్నది.

కులక్షయమగుటచే సనాతనకులధర్మములు నశించుచున్నవి. కులధర్మములు నష్టమగుటచే నధర్మ మభివృద్ధి యగుచున్నది. అధర్మవృద్ధివలన కులస్త్రీలు దోషయుక్తురాం డ్రగుచున్నారు. స్త్రీలు దుష్టురాం డ్రగుటచే వర్ణసంకర మగుచున్నది. వర్ణసంకరము కులమునకు కులఘ్నులకు నరకముకొరకే యగుచున్నది. వీరల పితరులు లుప్తపిండోదకక్రియలుకలవారై యధోగతు లగుచున్నారు. కులఘ్నుల వర్ణసంకరకారకములగు నీదోషములచే జాతిధర్మములును, శాశ్వతమగు కులధర్మములును నశింపజేయబడుచున్నవి. (పు 74)

3. అర్జునునకు వర్ణసంకరము యుద్ధముచే భవిష్యత్తునం దగునని కాక నాటికే—అప్పుడే యగుచుండినట్లు వర్తమానార్థక్రియలచే దృఢపరుపబడుచున్నది. ఈవర్తమానార్థకక్రియ ప్రతిపదోక్తమగుటచే నాటికే వర్ణసంకరమై యున్న దను నర్థము బలవత్తరమై యున్నది.(పు 76)

4. అర్జునవిషాదహేతువుల కన్నిటికి శ్రీకృష్ణుడు సమాధాన మిచ్చె ననియు, వర్ణసంకర మగుచున్న దను నీ యంశమునకు మాత్రముసమాధాన మీయలే దనియు, నందువలన వర్ణసంకరభీతి శ్రీకృష్ణునకును గల దనియు గొందరు చెప్పుచున్నారు.

కాని యిది తప్పు. సందిగ్ధము లేకుండగ శ్రీకృష్ణుడు శాస్త్ర యుక్తముగ సమాధానము నిచ్చియున్నాడు. శ్రీకృష్ణభగవానుడు చెప్పిన యీ క్రిందిశ్లోకములోని యర్జునవిషాదహేతువులలో నొకటి యగు స్త్రీల ప్రవర్తనమును గూర్చిన సందేహము నివర్తింపబడి నది. శ్రీకృష్ణమూర్తిచెప్పిన సూత్రప్రాయ మగు వాక్య మిది—

కుతస్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్ ।
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున ॥

తా॥ అర్జునా! నీకీవిషమసమయమున నెచటనుండి యార్యులు పొందరానట్టియు, స్వర్గము నొందరానట్టియు, అపకీర్తికరమగు తెలివితక్కువ దాపరించినది?" (పు 74-75)

5. అర్జునుని కాలమునకు సంతానమునకై యే స్త్రీనైన ఋతు కాలమున నేపురుషుడైన గోరి పొందవచ్చును. అప్పటికుండిన యార్యధర్మముం దూషించుటచే శ్రీకృష్ణు డది యనార్యజుష్టమని సమాధాన మిచ్చియున్నాడు. అట్లు స్త్రీల ప్రవర్తనమును గూర్చి యుగ్గడించుట, అకీర్తికరమనికూడ చెప్పియున్నాడు. కారణ మేమ నగా అర్జునుని తల్లియగు కుంతి, నాయనమ్మ యగు నంబాలిక, ప్రపితామహి యగు సత్యవతి, భార్యయగు ద్రౌపది, వీరివృత్తాంత ములు దీనివలన నుద్ఘాటితము లగుచున్నవి. అందువలననే యర్జును డావిషయముగూర్చి తిరిగి ప్రశ్నింపనేలేదు" (పు 75)

ఈ రెండంశములను బరిశీలింతము. ప్రథమాంశములోని విషయ మిది— మహాభారతమునాటికి సంకరసంతాన మెక్కువైనందున నాటి

స్మృతికర్తలు ద్వాదశవిధసంతానములను తమగ్రంథముల నెక్కించి రట. ఈమాటనుబట్టి లోకసామాన్యముయొక్క ప్రవృత్తి యెట్లుం డునో దాని కనుకూలముగా స్మృతులు రచింపబడినవని వీరూహించి నట్లు తేలినది. ఈపద్ధతిలో వెనుక వీరు వ్రాసినట్లు, వివాహవిధానము లేక స్వేచ్ఛగా సంచరించెడి ప్రజలలో, శ్వేతకేతువు అది ధర్మమే యని వ్రాయక, వివాహనియమము చేసి దురాచారమును తొలగించె ననుట విరుద్ధముగాదా? కనుక స్మృతులు పరిస్థితిని సమర్థించుటకై రచింపబడు నను మాటకు త్రోసివేత యైనది.

ఇంకొకటి. మహాభారతమునాటి స్మృతికర్తలు తమ గ్రంథ ములలో ద్వాదశవిధసంతానముల నెక్కించిరట. మనుస్మృతిలో నెట్లు న్నదో చూడుడు—"పుత్రాన్ ద్వాదశ యా నాహ నృణాం స్వాయం భువో మనుః। తేషాం షడ్బంధుదాయాదా షడదాయాదబాన్ధవాః ॥
(అ 9-158)

దీనిచే స్వాయంభువమనువే ద్వాదశవిధసంతానములను చెప్పి యున్నట్లు స్పష్టము. ఆ స్వాయంభువమనువు మహాభారతమునాటి వాడా? "యాతా షణ్మనవో యుగాని భమితా న్యన్యద్యుగాంఘ్రి త్రియమ్" అను సిద్ధాంతశిరోమణివచనానుసారము ఈసప్తమవైవస్వత మనువునకు పూర్వము గడచిపోయిన మనువులార్గురిలో మొదటివాడు. ఒక్కొకమన్వంతరకాలపరిమాణము 30కోట్ల 67లక్షల 20వేల సంవత్స రములని వెనుక నిరూపింపబడినది. అప్పటి స్వాయంభువమనువే ద్వాదశవిధసంతానములను చెప్పి యుండుటచే మహాభారతమునాటి స్మృతికర్త లెక్కించినా రను మాటకు త్రోసివేత యైనది.

యుద్ధానంతరము యుధిష్ఠిరునకు దేవస్థానమహర్షి యుప దేశించుచు—

"అద్రోహ స్సత్యవచనం సంవిభాగో దయా దమః।
ప్రజనం స్వేషు దారేషు మార్దవం హ్రీరచాపలమ్ ॥

ఏవం ధర్మం ప్రధానేష్టం మను స్స్వాయంభువో౽బ్రవీత్" ||
(శాంతి-అ21)

సీ॥ ప్రజనం పుత్రోత్పాదనం ॥

అనుచు తనధర్మపత్నియందే పుత్రోత్పాదనము ముఖ్యధర్మ మని స్వాయంభువమనువే చెప్పినట్లు బోధించెను. అట్లుచెప్పి సంతానము ద్వాదశవిధముగా సంభవించుననియు, నందుముఖ్యధర్మముగాను ఆపద్ధర్మముగాను కొన్ని గ్రాహ్యాము లనియు, నాస్వాయంభువమనువు చెప్పియుండ సంకరసంతానము పెరిగినతరువాత నట్లు చెప్పబడిన దనుటయు, వెనుకవివాహబంధము లేకుండె ననుటయును అవివేకము.

వేదశాస్త్రాధ్యయనము చేసినట్టియు, శాస్త్రపద్ధతిని ప్రజలను పాలించినట్టియు మహారాజులును, ఆమహారాజులకు మార్గదర్శకులైన మహర్షులును విరాజిల్లుచున్న మహాభారతకాలమనబడు ద్వాపరాంతమున సంకరసంతాన మెక్కువయైన దనుట దుర్నయము.

ఇక రెండవయంశమును పరిశీలితము—

యుద్ధమే స్వధర్మమను నిశ్చయముతో చతురంగబలములతో రణరంగమున బ్రవేశించి రథారూఢుడై యుభయసేనామధ్యమున నిలిచి చూచి బంధుజనదర్శనముచే శోకమోహము లావహింప యుద్ధము పాపహేతువని భావించి యాపాపము ఁటక్షింపసుండుటకై యుద్ధమునుండి విరమింపదలచిన యర్జునుడు యుద్ధమూలకముగా తటస్థించెడి యనర్థపరంపర నాలోచించి—

"ఏతా న్న హన్తు మిచ్ఛామి ఘ్నతో౽పి మధుసూదన.
పాప మేవాశ్రయే దస్మాన్ హత్వైతా నాతతాయినః".

అనుచు వీరలను వధించుటచే పాపము ఘటించును కనుక నన్ను వారు వధింపబూనినను నేను వధింపను. అని చెప్పి రాజ్యలుబ్ధులుకనుక కులక్షయమిత్రద్రోహములను బట్టి కలిగెడి పాపమును ధార్తరాష్ట్రులు

గమనింపకపోయినను ఆపాపము ఘటింపకుండుటకై యత్నింపవలసిన మనము దానిని గమనింపవద్దా? అని కులక్షయముజరిగినప్పుడు వచ్చెడి దోషముల నిట్లువెల్లడించెను —

"కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మాః సనాతనాః ।
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోఽభిభవ త్యుత ॥
అధర్మాభిభవా త్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః ।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః" ॥

ఇత్యాదివచనములచే కులక్షయమూలమున గలిగెడిదోషములు చెప్పి —

"అహో బత మహ త్పాపం కర్తుం వ్యవసితా వయమ్ ।
య ద్రాజ్యసుఖలోభేన హన్తుం స్వజన ముద్యతాః" ॥

రాజ్యసుఖలోభమున బంధుజనమును వధించుట కుద్యమించిన మేము మహాపాపమును చేయుటకై నిశ్చయించినాము. ఎంతకష్టము! అని పలికెను. దీనినిబట్టి యుద్ధముచేసినయెడల కులక్షయమగును. కులక్షయమైనయెడల కులధర్మములు నశించి, కులస్త్రీలు చెడెదరు. అప్పుడు వర్ణసాంకర్యాదిదోషము లుద్భవించును. కనుక యుద్ధముచేయ జాలను, అని చెప్పినట్లు స్పష్టము.

ప్రతివాదు లీయర్జునవాక్యములను చూపి "ఈ యర్జునవాక్యములు కూడ నాటి జాతిభ్రంశవిధానమును సూచించుచున్నవి" అని రెండయంశములో వ్రాయుట అవివేకము. యుద్ధమే జరిగినయెడల నిటులైపోవుననియాతడుపదితపించినట్లుఆయఅర్జునవాక్యములు తెలుపుచుండ నప్పటికే జాతిభ్రంశమై యున్నదని తెలుపుచున్నవనుట మతిమంతుల లక్షణమా? కులక్షయమూలకమైన పాపము లేవి ప్రాప్తించునని యర్జునుడు యుద్ధమును చేయననెనో ఆపాపములకును యుద్ధమునకును ప్రతివాదిమతమున లో సంబంధమే లేదన్న మాట. యుద్ధము చేయకపోయినను అవి సిద్ధములే అన్నమాట. యుద్ధమును చేయనను

టకు హేతువులుగా వానిని పేర్కొనిన యర్జును డవివేకి యన్నమాట. ఆహా! గ్రంథమునకు సంబంధింపని వీరి యీమాటలు హేయములు.

ఇక మూడవయంశములో నిట్లున్నది — "వర్తమానార్థకక్రియలచే అర్జునునకువర్ణసంకరము యుద్ధముచేభవిష్యత్తునందగునని కాక నాటికే— అప్పుడే యగుచుండినట్లు దృఢపరుపబడుచున్నది. ఈ వర్తమానార్థక క్రియ ప్రతిపదోక్తము" అని.

భవిష్యదర్థకముగా గాక వర్తమానార్థకముగా నర్థము జెప్పిన యెడల నర్థ మసంగత మగునని తెలిపియున్నాము. 'వర్తమానే లట్' అనుసూత్రముచే వచ్చిన ప్రత్యయ మని యెంచి యర్థము చెడినను ప్రతివాదులు వర్తమానార్థకమని భావించియున్నారు. "వర్తమాన సామీప్యే వర్తమానవద్వా" అను సూత్రమువలన వర్తమానసామీప్యార్థమందు అనగా సన్నిహితభవిష్యత్తునందువచ్చినప్రత్యయమనియు, అర్థము సంగతమే యని పాపము భావింపలేకపోయినారు. ఇట్లు వర్తమాన సామీప్యార్థకక్రియ వారనుకొనిన ప్రతిపదోక్త మగును గనుక ప్రతివాదుల వ్రాత హేయము. ఈప్రతివాదులే తమ ఉత్తరభారతములో నెట్లు వ్రాసిరో చూడుడు—

"ఉభయసైన్యములు అన్యోన్యప్రహారములకు గడంగునపుడు బీభత్సుండు స్వజనసంహారమునకు భీతుండయ్యె, ఘోరప్రళయముచే భవిష్యత్తునందు స్త్రీదౌష్ట్యకారణమున వర్ణసంకర మగునను భీతిం జెందియు విహ్వాలుం డయ్యెను". (పుట 21)

వీరే "అర్జునునకు వర్ణసంకరము యుద్ధముచే భవిష్యత్తునం దగునని కాక, నాటికే అప్పుడే యగుచుండినట్లు దృఢపరుపబడుచున్నది" అని వెనుకజూపినట్లు వ్రాసినవారు. వీరు తమ వెనుకటివ్రాతను తామే రద్దుచేసుకొని భవిష్యత్తునందు వర్ణసంకర మగునను భయమే అర్జును

నకు గలిగినట్లు నవీనముగా వ్రాసియుండుటచే గూడ వారి వ్రాత పరాస్తమైనది.

నాలుగవయంశ మిట్లున్నది– "అర్జునవిషాద హేతువులలో వర్ణ సంకర మగుచున్నదను సంశయమునకుమాత్రము శ్రీకృష్ణుడు సమాధాన మీయనందువలన వర్ణసంకరభీతి శ్రీకృష్ణునకు గలదని కొందరు చెప్పుచున్నారు. కాని యది తప్పు. శ్రీకృష్ణుడు శాస్త్రయుక్తముగ సమాధాన మిచ్చియున్నాడు. "కుత స్త్వా కశ్మల మిదమ్" అనుసూత్ర ప్రాయమగు శ్లోకముచే నర్జునవిషాద హేతువులలో నొకటి యగు స్త్రీల ప్రవర్తనమును గూర్చిన సందేహము నివర్తింపబడినది. అని.

ఇచ్చట కొందరు చెప్పుచున్నది తప్పను ప్రతివాదుల నడుగు చున్నాము– సంకరము ధర్మమేకనుక వర్ణసంకరభీతి శ్రీకృష్ణునకు గా దని చెప్పుట తప్పందురా? దానికి శ్రీకృష్ణుడు సమాధాన మీయలే దని చెప్పుట తప్పందురా?

"యది హ్యహం న వర్తేయ జాతు కర్మ ణ్యతంద్రితః ।
మమ వర్త్మాఽనువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః ॥
ఉత్సీదేయు రిమే లోకా న కుర్యాం కర్మ చే దహమ్ ।
సంకరస్య చ కర్తా స్యా ముపహన్యా మిమాః ప్రజాః ॥"

(గీ. 3–24)

ఇవి శ్రీకృష్ణవాక్యములే. ఇచ్చట నే నొకప్పుడైన కర్మమార్గ మును విడిచి యున్నయెడల ననుజూచి లోకు లందరు విడిచివేయుదురు. దానిచే లోకులకు హానికలుగును. లోకోద్ధరణమునకై యావిర్భవించిన నేను కర్మమార్గమును విడచుటవలన సంకరముచేసినవాడను, లోకహాని జేసినవాడను అయిపోవుదును అని చెప్పియుండెను.

దీని సారాంశము– వర్ణసాంకర్యము లేకుండుటకై విధ్యుక్త ముగా లోకులు నామూలమున కర్మమార్గనిష్ఠులై యుండవలయుననియే నేను కర్మమార్గనిష్ఠుడనై యుంటిని. అని.

ఇట్లు 'న కుర్యాం కర్మ చే దహం, సంకరస్య చ కర్తా స్యామ్' అని యున్న శ్రీకృష్ణవాక్యము సంకర మధర్మ మనియు, నాడెంతమాత్రము వర్ణసాంకర్యము లేదనియు ధ్రువపరచుటను బట్టి "మహాభారతమునాటికి సంకరసంతాన మెక్కువయైనది" "ఆనాడు ఏ స్త్రీనైనను ఏ పురుషు డైనను పొందవచ్చును" అను ప్రతివాదిదుష్ప్రసంగము మూరాపాస్త మైనది.

దీనిని బట్టి అర్జును డూహించినట్లు మాత్రము కాక కర్మమార్గ భ్రంశమూలకమగు వర్ణసంకరభీతి శ్రీకృష్ణునకున్నదని స్పష్టమే. కనుక వర్ణసంకరభీతి శ్రీకృష్ణునకు గలదని చెప్పుట తప్పు. అను ప్రతివాదుల వ్రాత హేయము.

ఇక వర్ణసాంకర్యసందేహమునకు "కుత స్త్వా కశ్మల మిదమ్" అనుశ్లోకముచే సమాధానమీయబడినదను విషయము బరిశీలింతము— ఐదవ యంశములోని విషయ మిది—

"అర్జునుని కాలమునకు సంతానమునకై యేస్త్రీనైనను ఋతుకాలమున నేపురుషుడైన గోరి పొందవచ్చును. అప్పటికుండిన యార్యధర్మముం దూషించుటచే శ్రీకృష్ణు డది యనార్యజుష్ట మని సమాధాన మిచ్చియున్నాడు. అట్లు స్త్రీల ప్రవర్తనమునుగూర్చి యుగ్గడించుట అకీర్తికరము అని కూడ చెప్పినాడు. కారణ మేమనగా, అర్జునుని మాతృపితామహీప్రపితామహీగణముయొక్కయు, భార్యయొక్కయు వృత్తాంతములు దీనివలన సుఘాటితము లగుచున్నవి",

ఈవ్రాతనుబట్టి 'అనార్యజుష్టమ్' అనుపదముచే వర్ణసాంకర్య ప్రశ్నమునకు సమాధాన మీయబడిన దని ప్రతివాదుల తాత్పర్యము.

ఆపదమునకు అర్థము నాల్గవయంశములో జూపినట్లు అర్జునా! నీకు దాపరించిన తెలివితక్కువ ఆర్యులు పొందరానట్టిది. అని వ్రాయ

బడుటచే 'అనార్యజుష్ట' మనగా నార్యులుపొందరానిదని వారియర్థము, శ్రీకృష్ణునిచే నిట్లు మందలింపబడిన యర్జునుడు ఆర్యుడా? ఆనార్యుడా? అని ప్రతివాదుల నడుగుచున్నాను. అనార్యు డను పక్షములో అనార్యులు పొందిన తెలివితక్కువనుగూర్చి యిది యార్యులు పొందరానట్టి దని మందలించుట అయుక్తము. ఆర్యుడవైన నీవు పొందరానట్టిది. అని మందలించినపుడే అది యుక్తము. కనుక నర్జును డార్యుడే యన వలెను.

ప్రతివాదులు, 'ఋతుకాలములో నేస్త్రీనైన నేపురుషుడైనను సంతానమునకై అర్జునుని కాలములో గోరి పొందవచ్చును. అదియప్పటి కుండిన యార్యధర్మము, అనివ్రాసి 'యాధర్మమును దూషించినా డర్జునుడు' అని వ్రాసినారు. అది ధర్మమై యాపై యార్యధర్మమై యుండినయెడల ఆర్యుడైన యర్జునుడు దాని నెట్లు దూషించును? స్త్రీ పురుషులకు ప్రతివాదులు తెచ్చిపెట్టిన వ్యభిచారపద్ధతి, వేదశాస్త్ర నిషిద్ధమనియును, ఆనాటి మహారాజులు శాస్త్రీయమార్గమున ప్రజా పరిపాలనము చేసిన వారనియును, వారికి మార్గదర్శకులు ధర్మవ్యవస్థాపకులగు మహర్షు లనియును బృహదారణ్యకాదులలో వ్యభిచరింప వచ్చునని యున్నదని వ్రాసిన ప్రతివాదుల దసత్యమనియును, శ్వేత కేతుగాథ, నియోగవిధిని బలపరచుటకై చెప్పబడినకథయేకాని మరొ కటి కాదనియును, నిషిద్ధమైన వ్యభిచారమూలకమగు సాంకర్యము లేకుండ ధర్మప్రతిష్ఠాపనము చేయుటే నాకృత్యమని కృష్ణభగవానుడు చెప్పియుండె ననియును నిరూపించియున్నాము. ప్రతివాదుల నోటి మాటలనుకూడ జూతము___

స్త్రీపురుషులకు స్వేచ్ఛావిహారము ధర్మమా? అదియు ననా ర్యధర్మము కాక వేదశాస్త్రమూలక మనబడెడి యార్యధర్మమా? ఆయార్యధర్మమును దూషించుటా? అదూషించినవాడు అనార్యుడు కాక యార్యుడైన యర్జునుడా? ఆర్యధర్మము నార్యుడుదూషించునా?

"అధర్మాఽభిభవా త్కృష్ణ ప్రదుష్యన్తి కులస్త్రియః ... జాయతే వర్ణ సంకరః" అనుచు వర్ణసంకర మధర్మకార్య మని యర్జును డనియుండ నది ధర్మమే యను ప్రతివాదులకు పాపభీతియున్నదా?

అర్జునుడు ఆర్యధర్మమును దూషించెనట! అదియనార్యజుష్టము అనగా నార్యులు పొందరానట్టి తెలివితక్కువ యని శ్రీకృష్ణుడు సమాధానము చెప్పెనట! అట్లు స్త్రీల పరివర్తనము నుగ్గడించుటలో కుంతీ, అంబాలికా, సత్యవతీ, ద్రౌపదుల వృత్తాంతము లుద్ఘాటితము లగుటచే 'అకీర్తికరమ్' అని కూడ చెప్పినాడట! ఆపై యర్జునుడు మరు మాటాడక పడియుండెనట! ఏమి సమన్వయము?

శ్రీకృష్ణు డేది యనార్యజుష్టమని చెప్పెనో, ఏది యకీర్తికర మనిచెప్పెనో అది యస్వర్గ్యమనికూడ జెప్పెను. అనగా స్వర్గప్రదము కానిదని యర్థము. అట్టిదేది? వ్యభిచారదూషణ మన్నమాటా? వ్యభిచారమును దూషింపకున్న స్వర్గముప్రాప్తించు నని సమాధాన మిచ్చె నన్నమాటా? ఈసమాధాన మెవ్వనిది?

"య శ్శాస్త్రవిధి ముత్సృజ్య వర్తతే కామకారతః ।
న స సిద్ధి మవాప్నోతి న సుఖం న పరాం గతిమ్ ॥
తస్మా చ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ" (గీ16-24)

కర్తవ్య మేదియో అకర్తవ్య మేదియో తెలుపునది శాస్త్రమే యని బోధించిన కృష్ణభగవానునిదా? ఆశాస్త్ర మెట్లున్నది?

"యథా స్తేనో యథా భ్రూణహైవ మేవ భవతి యోఽయోనౌ రేత స్సించతి" భాష్యమ్— అయోనౌ ప్రతిషిద్ధయోనౌ యో రేత స్సించతి ఏవ సువర్ణస్తేయకారిణాశ్చ భ్రూణహత్యాకారిణా చ సమో భవతి".

"నాన్యస్త్రియ మభిలషే న్నాన్యశ్రియమ్"

తన పత్నితో దప్ప పరస్త్రీతో సంచరించుట మహాపాప మని చెప్పుచున్నది.

ఇట్లు శాస్త్రదూష్యమై యున్న వ్యభిచారమునుబట్టికొని యది యార్యధర్మమనియు, వ్యభిచారమును దూషించినయర్జునునకు స్వర్గము లభింపదని శ్రీకృష్ణుడు చెప్పెననియు వ్రాసిన సాగించిన ప్రతివాదులకు ఎంత నిరంకుశత్వము?

యుద్ధమువలన కులక్షయము, కులధర్మనాశనము, కులస్త్రీలకు దోషప్రాప్తి, వర్ణసంకరము కలుగును అని యర్జును డనుటలో కుంతీ సత్యవతీ అంబాలికా ద్రౌపదుల వృత్తాంతము లుద్ఘాటితము లైనవట. ఇది యసంబద్ధప్రలాపము. నియోగవిధిని, పంచపతిత్వమును వ్యభిచారమని చెప్పుట నింద్యము. నియోగవిధి వేరు. వ్యభిచారము వేరు. అని వెనుక నిరూపించియే యున్నాము. కుంతీసత్యవతుల పవిత్రతను గూర్చి వేదవ్యాసనిందానిరాకరణములో నిరూపించియున్నాము. ద్రౌపదీనిందానిరాకరణములో పంచపతిత్వమును గూర్చి నిరూపింపబడును. కనుక నీప్రతివాదిప్రసంగము హేయము.

"కుత స్త్వా కశ్మలమిదమ్" అను శ్లోకమునకు తాత్పర్య మే మనగా శత్రువులు శస్త్రధారులై హింసించుటకు సిద్ధముగా నున్న యీవిషమసమయములో యుద్ధముచేయరాదను చిత్తసంమోహము నీ కెట్లు ప్రాప్తించినది. ఇది యనార్యజుష్టము. అనగా పామరసేవితము. అస్వర్గ్యము. అనగా దుర్గతిహేతువు, అకీర్తికరము. కనుక నిహపరలోకహాని. అని.

'ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య నవిద్యతే' అను సిద్ధాంతమును బట్టి స్వధర్మమైన యుద్ధమును మానివేయుటవలన నిహపరలోకహాని యని యుపదేశసారాంశము.

యుద్ధమూలకమైన వర్ణసంకరమును గూర్చి శ్రీకృష్ణు డేమిసమాధానము చెప్పినట్లు? అని ప్రశ్నించు ప్రతివాదులకు కొంచెము చెప్పవలసియున్నది—

"స్వధర్మ మపి చావేక్ష్య న వికంపితు మర్హసి ।
ధర్మ్యాద్ధి యుద్ధా చ్ఛ్రేయో౽న్యత్ క్షత్రియస్య న విద్యతే ॥"

అను భగవద్వాక్యము క్షత్రియునకు స్వధర్మము యుద్ధమని తెలుపుచున్నది. తన వర్ణమునకు, తన యాశ్రమమునకు నవశ్యకర్తవ్యముగా శాస్త్రముచే విధింపబడినదే స్వధర్మము. స్వధర్మరూపమైన యావశ్యకకార్యము దోషసంభావనామాత్రమున బరిత్యజింపతగినది కాదు. ప్రాప్తించినపుడాదోషములకు పరిహారోపాయ మాశ్రయణీయము. ఈవిషయమై మహాభాష్యకారవచనము లిట్లున్నవి—

"న హి భిక్షుకాః స్సన్తీతి స్థాల్యో నాధిశ్రీయన్తే, న హి మృగాస్సన్తీతి యవా నోప్యన్తే ప్రతివిధేయం చ దోషేషు"

భిక్షుకులు వచ్చియున్నారని పెట్టలేక వంట మానుకొనువారుండరు. మృగములు తినిపోవునని సస్యములు నాటనివారుండరు. బాధకము లేర్పడినపుడు పరిహారోపాయము లాశ్రయింపబడును. అని భావము.

అర్జునుడు స్వధర్మమైన యే యుద్ధమును పాపహేతు వనుకొనెనో అది స్వధర్మమగుటవలన నట్టి యుద్ధమును పరిత్యజించుట పాపహేతువని భగవాను డుపదేశించెను. యుద్ధమూలకముగ నేయే పాపములు ప్రాప్తించునని యర్జును డనుకొనెనో అవి ప్రాప్తింపకుండెడి మార్గమును భగవాను డిట్లుపదేశించెను —

"సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ ।
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాప మవాప్స్యసి ॥"

(గీ. 2-38)

రాగద్వేషరహితుడవై యుద్ధఫలనిరపేక్షుడవై యిది క్షత్రియుడనైన నాకు విహితమైన ధర్మమను తాత్పర్యముతో యుద్ధము జేసిన నీకు పాపము ప్రాప్తింపదు. అని.

ఈయుపదేశములో యుద్ధానంతరము ధర్మబద్ధమైన పరిపాలనమును బట్టి నీవ్రూహించిన వర్ణసాంకర్య మీుండదని చెప్పినట్లే. కనుకనే యుద్ధమైనతరువాత పరితపించుచు నేను రాజ్యమును స్వీకరింపనని చెప్పిన యుధిష్ఠిరునితో నర్జును డిట్లనెను—

"రాజదండభయా దేకే పాపాః పాపం న కుర్వతే ।
యమదండభయా దేకే పరలోకభయా దపి ॥
పరస్పరభయా దేకే పాపాః పాపం న కుర్వతే ।
ఏవం సాంసిద్ధికే లోకే సర్వం దండే ప్రతిష్ఠితమ్ ॥
న కన్యోద్వాహనం గచ్ఛే ద్యది దండో న పాలయేత్ ।
న తిష్ఠే ద్యువతీ ధర్మే యది దండో న పాలయేత్ ॥"

(శాంతి ప—అ 15)

దండనీతి ననుసరించి రాజు పరిపాలనమునుచేసినపుడు పాపాత్ములుకూడ బాపము లాచరింపరు. రాజదండనమే లేకున్న కన్యక వివాహమునే చేసికొనదు. యువతి ధర్మమార్గమం దుండనేయుండదు. కనుక నీవు రాజ్యపరిగ్రహముజేసి ప్రజలను సన్మార్గవర్తులనుచేయుము. అని.

దీనివలన రాజదండనముచే సాంకర్యాదిదోషము లుండవని శ్రీకృష్ణోపదిష్టుడైన యర్జునుడు వెల్లడించినట్లు స్పష్టము.

ఇంతవరకు భగవద్గీతావచనములకు ప్రతివాదులు చెప్పిన దంతయు విరుద్ధార్థ మనియు, పరిత్యాజ్య మనియు నిరూపించినాము.

నాటిసంకరమునకు సంబంధించియున్న దనుచు వ్రాసిన ఇంకొక విషయ మున్నది. దానిని గూడ బరిశీలింతము—

## —♦ నహుషధర్మజసంవాదాంశ పరిశీలనము ♦—

"దేశమునం దెవ డేవర్ణమువాడో తెలిసికొనలేమని ఈక్రింది ధర్మజ నహుషసంవాదములోని శ్లోకార్థములు చెప్పుచున్నవి —

"జాతి రత్ర మహాసర్ప మనుష్యత్వే మహామతే ।
సంకరా త్సర్వవర్ణానాం దుష్పరీక్ష్యేతి మే మతిః ॥

సర్వే సర్వా స్వపత్యాని జనయన్తి సదా నరాః ।"(వనప॥180)

ఓమహాసర్పమా! ఈమనుష్యజాతియం దిప్పుడు సర్వవర్ణముల యొక్క సాంకర్యమువలన జాతిని బరీక్షింపలేమని నా యభిప్రాయము. అన్నివర్ణములవారు నన్నిజాతిస్త్రీలయందును సంతానము గనుచున్నారు". (మ. భా. చ. పు 71)

ప్రతివాదులు పైశ్లోకములోని 'అత్ర మనుష్యత్వే' అను పదములకు 'ఈమనుష్యజాతియందు' అని యర్థమువ్రాసి, పిమ్మట 'ఇపుడు' అని యొకమాటను చేర్చినారు. ఆయర్థము నిచ్చు పదము ఆవాక్యములలో లేదు. అది 'సదా' అనుపదమునకు విరుద్ధము. ఆతప్పు నటుండనిచ్చి, యుధర్మజనహుషసంవాదప్రకారము నవలోకింతము—నహుషు డగస్త్య మహర్షిశాపమును బట్టి యజగరమై పూర్వజ్ఞానము కలిగియుండి భీమసేనుని బంధించి యున్నపుడు యుధిష్ఠిరుడు సమీపించి సంభాషింప నహుషు డిట్లనెను—

"నాహ మేనం విమోక్ష్యామి నచా న్యదపి కామయే ।
ప్రశ్నా నుచ్చారితా నద్య వ్యాహరిష్యసి చే న్మమ ॥
అథ పశ్చా ద్విమోక్ష్యామి భ్రాతరం తే వృకోదరం ।"

నీలకంఠీయం— నహుషస్తు జ్ఞానమేవ పురుషార్థ ఇతి మత్వా 'న చాన్య దపి కామయే' ఇతి స్వస్య జ్ఞానా దన్యత్ర వైరాగ్య ప్రదర్శనకామః ప్రశ్నమేవ వృణోతి ప్రశ్నానితి ।

యుధిష్ఠిరా! నేనీ భీమసేనుని విడువను. నా కితరమైన కోరిక లేదు. నేనడిగిన ప్రశ్నములకు సమాధానము జెప్పెదవేని నీసోదరిని

విడిచివేయుదును. అని. ఇట్లనుటలో నహుషుడు జ్ఞానమే పురుషార్థ మనియు, తనకు జ్ఞానముకన్న మిగిలినవిషయములయందు వైరాగ్యమే యనియు వెల్లడించెను.

యుధిష్ఠిరః—

"బ్రూహి సర్ప యథా కామం ప్రతివక్ష్యామి తే వచః ।
అపి చేచ్ఛక్నుయాం ప్రీతి మాహర్తుం తే భుజంగమ ॥
వేద్యం చ బ్రాహ్మణే నేహ తద్భవా న్వేత్తి కేవలమ్ ।
సర్పరాజ తత శ్శ్రుత్వా ప్రతివక్ష్యామి తే వచః ॥"

నీలకంఠీయమ్— బ్రాహ్మణేనేతి । ఘటంకరోతీతి వద్భావినీం వృత్తి మాశ్రిత్య అబ్రాహ్మణేఽపి ముముక్షౌ బ్రహ్మవిద్వాచి బ్రాహ్మణశబ్దప్రయోగః । శ్రుతౌ "అమానం చ మానం చ నిర్విద్యాఽథ బ్రాహ్మణః" ఇతి శ్రవణమననాత్మక మమానం నిదిధ్యాసనాత్మకం మానం చ నిర్విద్య నిష్పాద్య బ్రాహ్మణో బ్రహ్మవిద్భవతీతి దర్శనాత్ । కేవలం నిర్విశేషం వేత్తి పురుషార్థత్వేన జానాతి చేత్తర్హి తద్వక్ష్యామి మతిసంవాదాయ"

యుధిష్ఠిరు డిట్లనెను— నీవడుగుము. నీకు ప్రీతిగలిగించుటకై నేను చెప్పగలుగుదు నేని సమాధానము జెప్పెదను. నీవు బ్రాహ్మణునకు వేద్యమైన నిర్విశేషస్వరూపము పురుషార్థమని గ్రహించితివేని నా సమ్మతిని ప్రదర్శించుటకై చెప్పెదను. అని.

ఇచ్చట 'బ్రాహ్మణునకు వేద్యము' అనుటలో బ్రాహ్మణశబ్దము జాతివాచకముగా గాక శ్రుతిసమ్మతినిబట్టి బ్రహ్మవిద్వాచకముగా వాడబడినది. ఇచ్చట 'ఘటమునుచేయుచున్నాడు' అనునపుడు చేత పూర్తియైనప్పుడు వాడవలసిన ఘటపదమును ముందే వాడినట్లు బ్రహ్మవేద్యమైన తరువాతవాడవలసిన బ్రాహ్మణశబ్దము ముందే వాడబడినది. బ్రాహ్మణశబ్దము జాతివాచక మొకటి, బ్రహ్మవిద్వాచక మొకటి. ఇచ్చట బ్రహ్మవిద్వాచకమే వాడబడినది.

సర్పః—

"బ్రాహ్మణః కో భవే ద్రాజన్ వేద్యం కిం చ యుధిష్ఠిర ।
బ్రవీహ్యతిమతిం త్వాం హి వాక్యై రనుమిమీమహే ।"

నీలకంఠీయమ్— తత్ర యాన్యేవ బ్రహ్మవిల్లక్షణాని తాని బ్రహ్మవిద్యాసాధకానీతి మన్వానో బ్రహ్మవిదో లక్షణం బ్రహ్మస్వరూపం చ పృచ్ఛతి—బ్రాహ్మణ ఇతి ॥

ఈపై నహుషు డిట్లు ప్రశ్నించెను— యుధిష్ఠిరా! నీవాక్యములచే నీవు అతిమతిమంతుడవని గ్రహించితిని. బ్రాహ్మణు డెట్టివాడో వేద్య మెట్టిదో చెప్పుము. అని.

ఇట్లు ప్రశ్నింటలో బ్రహ్మవేత్త కేవి లక్షణములో అవియే బ్రహ్మవిద్యకు సాధనములని గ్రహించి యాబ్రహ్మవేత్తలక్షణముల నడిగెను.

యుధిష్ఠిరః—

"సత్యం దానం క్షమా శీల మానృశంస్యం తపో ఘృణా ।
దృశ్యన్తే యత్ర నాగేన్ద్ర స బ్రాహ్మణ ఇతి స్మృతః ॥
వేద్యం సర్ప పరం బ్రహ్మ నిర్దుఃఖ మసుఖం చ యత్ ।
యత్ర గత్వా న శోచంతి భవతః కిం వివక్షితం ॥"

నీలకంఠీయం—సత్యం యథార్థ మహింస్రం చ వచనం । ఆనృశంస్య మనైష్ఠుర్యం । తపః స్వధర్మాచరణం । ఘృణా కృపా ।పరం నిర్విశేషం । సవిశేషస్య వాఙ్మనసగోచరస్య క్షరిత్వావాఽబ్రహ్మత్వోక్తేః... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ...

ఏవం స్వమత ముక్త్వా పరమతం జిజ్ఞాసతే 'భవతః కిం వివక్షిత' మితి ।

యుధిష్ఠిరుడు బ్రాహ్మణలక్షణప్రశ్నమున కిట్లు సమాధాన మిచ్చెను— సత్యము, దానము, క్షమ, సదాచారము, అనైష్ఠుర్యము,

స్వధర్మాచరణము, దయ. అను లక్షణము లున్నవాడు బ్రాహ్మణుడు' అని.

ఇట్లు స్వమతమును చెప్పి నీ వేమనెదవని నహుషు నడిగెను.

సర్పః—

"చాతుర్వర్ణ్యం ప్రమాణం చ సత్యంచ బ్రహ్మ చైవ హి ।
శూద్రే ష్వపి చ సంత్యం చ దాన మక్రోధ ఏవ చ ॥
ఆనృశంస్య మహింసా చ ఘృణా చైవ యుధిష్ఠిర ।"

నీలకంఠీయమ్— సర్పస్తు బ్రాహ్మణపదేన జాతిమాత్రం వివక్షిత్వా శూద్రే తల్లక్షణం వ్యభిచారయతి– చాతుర్వర్ణ్యమితి। స్వార్థేన చతుర్ణాం వర్ణానాం హితమ్ । సత్యం ప్రమాణం చ ధర్మవ్యవస్థాపకం బ్రహ్మ వేదః । శూద్రాచారస్మృతే రపి వేదమూలత్వాత్ । సర్వోఽప్యాచారాదిః శ్రుతిమూలక ఇత్యర్థః । ఏవం చ సత్యాదికం యది శూద్రేఽప్యస్తి తర్హి సోఽపి బ్రాహ్మణ ఏవ స్యాదిత్యాహ— శూద్రేష్వపీతి ।

అపుడు నహుషుడు, బ్రాహ్మణజాతియందు వాడబడవలసి యున్నది బ్రాహ్మణపదము అను భావ మవలంబించి, శంకింపదలచి సత్యాదిలక్షణములుకలవానియందు వాడబడినయెడల చాతుర్వర్ణ్యము నకును హితమై, ధర్మవ్యవస్థాపకమై, వారివారి యాచారములను బోధించునది వేదమే యగుటచే సత్యాదిలక్షణములను బట్టి శూద్ర సాధారణముగా బ్రాహ్మణశబ్దము వాడబడినపుడు అతివ్యాప్తిదోషము రాదా? యని యడిగెను.

ఇట్లడుగుటలో జాతినివిడిచి, కేవలలక్షణములను బట్టి బ్రాహ్మణ శబ్దప్రయోగము యుక్తముగాదని భావము.

యుధిష్ఠిరః—

"శూద్రే తు య ద్భవే ల్లక్ష్మ ద్విజే తచ్చ నవిద్యతే ।

న వై శూద్రో భవే చ్ఛూద్రో బ్రాహ్మణో న చ బ్రాహ్మణః ॥
యత్రైత ల్లక్ష్యతే సర్ప వృత్తం స బ్రాహ్మణ స్స్మృతః ।
యత్రైత న్న భవే త్సర్ప తం శూద్ర మితి నిర్దిశేత్ ॥"

నీలకంఠీయమ్— ఇతరస్తు బ్రాహ్మణపదేన బ్రహ్మవిదం వివక్షిత్వా శూద్రాదే రపి బ్రాహ్మణత్వ మభ్యుపగమ్య పరిహరతి— శూద్రేత్వితి। శూద్రలక్ష్మ కామాదికం న బ్రాహ్మణేఽస్తి, నాపి బ్రాహ్మణలక్ష్మ శమాదికం శూద్రేఽస్తీత్యర్థః । శూద్రోఽపి శమాద్యుపేతో బ్రాహ్మణ ఏవ । బ్రాహ్మణోఽపి కామాద్యుపేత శ్శూద్ర ఏవేత్యర్థః ।

ఆపై యుధిష్ఠిరుడు తానువాడిన బ్రాహ్మణశబ్దము జాతిని చెప్పక బ్రహ్మవేత్తను చెప్పునదే యను భావముతో బ్రహ్మవేత్తయైనపుడు శూద్రాదులయందు అట్టి బ్రాహ్మణశబ్దప్రయోగమునంగీకరించి యిట్లనెను— బ్రాహ్మణలక్షణములు శమదమాదులు, శూద్రలక్షణములు కామాదులు. శమాదిలక్షణములు కలిగి శూద్రు డున్నపుడు లక్షణములను బట్టి వాడబడు బ్రాహ్మణశబ్ద మాతనిని చెప్పును. కామాదిలక్షణములు కలిగి బ్రాహ్మణు డున్నపుడు లక్షణములను బట్టి వాడబడు శూద్రశబ్ద మాతనిని చెప్పును. అని.

సర్పః —

"యది తే వృత్తతో రాజన్ బ్రాహ్మణః ప్రసమీక్షితః ।
వృథా జాతి స్తదాఽఽయుష్మన్ కృతి ర్యావ న్న విద్యతే"

ఆపై నహుషు డిట్లనెను— జాతిని గణింపక నీ వనినట్లు వృత్తమును బట్టియే బ్రాహ్మణత్వనిర్ణయ మైనయెడల నట్టి వృత్తము గోచరింపనంతవరకు జాతి వ్యర్థము కాదా? అని.

యుధిష్ఠిరః—

"జాతి రత్ర మహాసర్ప మనుష్యత్వే మహామతే ।
సంకరా త్సర్వవర్ణానాం దుష్పరీక్ష్యేతి మే మతిః ॥

సర్వే సర్వాస్వపత్యాని జనయన్తి సదా నరాః ।
వాఙ్మైథున మథో జన్మ మరణం చ సమం నృణామ్ ॥
తస్మాచ్ఛీలం ప్రధానేష్టం విదుర్యే తత్త్వదర్శినః ।
ప్రాఙ్నాభివర్ధనాత్పుంసో జాతకర్మ విధీయతే ॥
తత్రోపనయనం ప్రోక్తం ద్విజాతీనాం యథాక్రమమ్ ।
తత్రాఽస్య మాతా సావిత్రీ పితా త్వాచార్య ఉచ్యతే ॥
తావచ్ఛూద్రసమో హ్యేష యావద్వేదేన జాయతే ।
తస్మిన్నేవం మతిద్వైధే మనుః స్వాయంభువోఽబ్రవీత్ ॥
కృతకృత్యాః పునర్వర్ణా యది వృత్తం న విద్యతే।
సంకర స్తత్ర నాగేన్ద్ర బలవాన్ ప్రసమీక్షితః ॥
యత్రేదానీం మహాసర్ప సంస్కృతం వృత్త మిష్యతే ।
తం బ్రాహ్మణ మహం పూర్వ ముక్తవాన్ భుజగోత్తమ ॥"

నీలకంఠీయమ్— ఉత్తరమాహ । జాతిరితి । వాగాదీనా మివ మైథునస్యాపి సాధారణ్యా జ్జాతి ర్దుజ్ఞేయా ... ... ... ...ఆచార ఏవ బ్రాహ్మణ్యనిశ్చయే హేతు ర్వేదప్రామాణ్యా దిత్యుపసంహరతి— తస్మాదితి । ప్రధానం చ తదిష్టంచేతి కర్మధారయః । కర్మైవ బ్రాహ్మణ్యహేతు రిత్యాహ— ప్రాగితి । నాభివర్ధనాత్ నాలచ్ఛేదనాత్ । జాయతే సంయుజ్యతే। వేదసంయోగానన్తరమేవ బ్రాహ్మణ్యముదేతి... ద్వైధే జాతే సంశయేసతి। వృత్తం వైదికసంస్కారో యది న విద్యతే తర్హి సర్వాః ప్రజాః కృతకృత్యాః శూద్రతుల్యాః । తథా చ స్మృతిః—

"న శూద్రే పాతకం కించి న్న చ సంస్కార మర్హతి" ఇతి । తేషాం సంస్కారానర్హత్వనిష్పాపత్వాభిధానాత్ కృతకృత్యత్వం దర్శయతి । తద్వత్ త్రైవర్ణికా అపి స్యురిత్యర్థః । అత్ర వృత్తాఽభావే ఉపసంహరతి— యత్రేతి ।

అపుడు యుధిష్ఠిరు డిట్లుచెప్పను— ఈతని దీజాతియని తెలిసికొనుటకు వృత్తమునే ఆధారపడవలయును. ఆకృతిభేదములేని మనుష్యులలోని జాతులు దుర్జ్ఞేయములై యుండును. జన్మమునుబట్టియే జాతిని నిర్ణయించవలయును. ఆజన్మము స్త్రీపురుషసంబంధమూలకము. ఆసంబంధము సజాతీయమే కాకవిజాతీయముకూడ గావచ్చును. వాగ్వ్యాపారము జననము మరణమువలె స్త్రీపురుషాన్యోన్యసంబంధముకూడ సర్వసాధారణ మగుటవలన ఏపురుషు డైనను ఏస్త్రీయం దైనను రాగమూలమున ప్రవర్తించి సంతతిగలిగించుచుండుటే జాతిదుర్జ్ఞేయ మనుటకు హేతువు.

కనుక వేదప్రాణ్యమును బట్టి శీలమే(ఆచారమే) బ్రాహ్మణ్యనిశ్చయమునకు ప్రధానకారణము. జాతికర్మాదులు, ఉపనయనసంస్కారము బ్రాహ్మణ్యహేతువులుగా ద్విజులకు విధింపబడినవి. ఉపనయనసంస్కారనిమిత్తమున సావిత్రి మాతయు, ఆచార్యుడు పితయు నగుదురు. వేదసంబంధములేనంతవరకు జాతిబ్రాహ్మణుడు కూడ శూద్రసముడే. వైదికసంస్కారములేనపుడు త్రైవర్ణికులును శూద్రతుల్యులే యని స్వాయంభువమనువు చెప్పెను. సంస్కారముతో పనిలేకయే యెట్టిపాతకనులేని శూద్రులు కృతకృత్యులనబడుదురు. వృత్తము లేనపుడు సంకరముహాహ్యము. కనుక మహాసర్పమా! వృత్తము, వైదికసంస్కారము నెవ్వనియందుండునో అతనినె బ్రాహ్మణుడని నేను చెప్పియుంటిని. అని. ఇట్లుచెప్పుటలో జన్మసిద్ధమైన జాతివిశేషము పై లక్షణములచేతనే గ్రహింపదగినదని బోధింపబడెను.

కనుక జాతిని, వృత్తమునుబట్టి పరీక్షింపవలయునని ధర్మజుడు చెప్పెనే కాని జాతిని పరీక్షింపనే లేమనిచెప్పలేదు.

## —సారాంశము—

ఇచ్చట, బ్రహ్మవేత్తలక్షణములను గూర్చియే నహుషధర్మజుల ప్రశ్నోత్తరములు నడచినవి. అందు "బ్రాహ్మణః కోభవే ద్రాజన్"

అనుచు నహుషుడు బ్రాహ్మణుని (బ్రహ్మవిదుని) లక్షణములడిగెను. దానికి —

"సత్యం దానం క్షమా శీల మానృశంస్యం తపో ఘృణా.
దృశ్యన్తే యత్ర నాగేన్ద్ర స బ్రాహ్మణ ఇతి స్మృతః"

అని యుధిష్ఠిరుడు సమాధానము చెప్పెను. ఆపైనహుషుడు, బ్రాహ్మణశబ్దమును జాతివాచకముగా వాడక సత్యాదిలక్షణములను బట్టి వాడినపుడు ఇతరజాతీయులయందు కూడ సత్యాదిలక్షణములను బట్టి వాడవలసియుండును కనుక నతివ్యాప్తి రాదా? యని ప్రశ్నించెను.

దానికి యుధిష్ఠిరుడు. నేనువాడిన ఈబ్రాహ్మణశబ్దము జాతివాచకము కాక బ్రహ్మవిద్వాచకమగుటచే నాలక్షణములు కలవాని నెవ్వనినైన యీబ్రాహ్మణశబ్దము చెప్పుటలో దోషములేదని సమాధానమిచ్చెను.

ఆపైనహుషుడు. — యుధిష్ఠిరా! నీవనినట్లు బ్రాహ్మణశబ్దార్థము వృత్తమునుబట్టియే నిర్ణీతమగునెడల నదిగోచరింపనపుడు జాతి వ్యర్థము కాదా? అని ప్రశ్నించెను ఇట్లుప్రశ్నించుటలో కేవలవృత్తమునే కాక జాతినిగూడ యోజనచేసి బ్రాహ్మణశబ్దమును వ్యవహరించుట యుక్తమని ప్రష్టకు తాత్పర్యము.

దానిపై యుధిష్ఠిరుని సమాధాన మిది —

"జాతి రత్ర మహాసర్ప మనుష్యత్వే మహామతే!
సంకరా త్సర్వ వర్ణా నాం దుష్పరీక్ష్యేతి మే మతిః.
సర్వే సర్వా స్వపత్యాని జనయన్తి సదా నరాః!
వాజ్మైథున మథో జన్మమరణంచ సమం నృణామ్.
తస్మాచ్ఛీలం ప్రధానేష్టం విదు ర్యే తత్త్వదర్శినః"

అనగా సర్వవర్ణసాంకర్యమువలన మనుష్యులలోనిజాతిదుర్జ్ఞేయము. జననమరణవాగ్వ్యాపారమైథునములు సర్వులకు స్వాభావికములు కనుక సర్వపురుషులు సర్వస్త్రీలయందును సదా సంతతిని గలిగించు

చుందురు. ఇట్లు దుర్జ్ఞేయమై యున్న జాతికి ముఖ్యమైన అభివ్యంజకము ఆచార మనబడు శీలమే. కనుకనే వృత్తము కలవాడు బ్రాహ్మణుడని చెప్పితిని. అని.

ఈసమాధానములో జాతి నిరసింపబడలేదు. 'ఆచారఃకులమాఖ్యాతి' అనున్యాయమున జాతినిర్ణాయక మగు ముఖ్యమైన వృత్తమును బట్టి జాతికూడ సంగృహీతమైనది. వేదసంబంధము, వైదికసంస్కారములు లేని కేవలజాతి ప్రశంసనీయము కాదని కూడ సమాధానములో జెప్పబడినది.

సర్వే సర్వా స్వపత్యాని జనయన్తి సదా నరాః।

అని సార్వకాలికముగా జెప్పబడిన విషయముపై ప్రతివాదులు "ఇపుడుసర్వవర్ణముల యొక్క సాంకర్యము వలన జాతిని బరీక్షింపలేము" అని చెప్పినట్లు వ్రాయుట అన్యాయము.

జన్మహేతువగు స్త్రీపురుషసంబంధములో సాంకర్యముకూడ సంభవింపవచ్చునుకనుక నట్లు సంభవించినప్పుడు దుర్జ్ఞేయమైన జాతిని వ్యంజకములైన లక్షణములనుబట్టియే గ్రహింపవలసియున్నదని జాతి వ్యంజకములైన లక్షణములలోని వృత్తమునుబట్టి బ్రాహ్మణ్యనిర్ణయమును ధర్మజుడు చేసినట్లు శ్లోకములు చెప్పుచుండ "దేశమునం దెవ డేవర్ణపువాడో తెలిసికొనలేమని శ్లోకార్థములుచెప్పుచున్నవి" అనుచు దేశమున కంతకును సాంకర్యమునే కల్పించుట ప్రతివాదుల కయుక్తము.

సంకరజాతులును శీలమునుబట్టి లత్పరీక్షయును ధర్మజుని నాటి విషయమే కాదు, ఏనాటిదో అయి నమననుస్మృతిలోనున్నది. చూడుడు—

"వర్ణాపేత మవిజ్ఞాతం నరం కలుషయోనిజమ్ ।
ఆర్యరూప మివానార్యం కర్మభి స్స్వై ర్విభావయేత్ ॥
అనార్యతా నిష్ఠురతా క్రూరతా నిష్క్రియాత్మతా ।
పురుషం వ్యంజయన్తీహ లోకే కలుషయోనిజమ్ ॥

పిత్ర్యం వా భజతే శీలం మాతుర్వో భయ మేవ వా ।
న కథం చ న దుర్యోనిః ప్రకృతిం స్వాం నియచ్ఛతి ॥
కులే ముఖ్యేఽపి జాతస్య యస్య స్యా ద్యోనిసంకరః ।
సంశ్రియత్యేవ తచ్ఛీలం నరోఽల్ప మపి వా బహు ॥ "

అనగా వానివానసజన్మవిశేషమును శీలమే వెల్లడించుచుండు నని భావము. దీనిచే ధర్మజునివాక్యములు నాటి సంకరస్థితిని వెల్ల డించుచున్నవను ప్రతివాదుల వ్రాత నిరస్తము.

ఆంధ్రభారతములో గూడ నహుషధర్మజసంవాద మెట్లున్నదో చూడుడు—

సీ. సత్యాది మాదమశౌచదయాతపో
దానశీలంబు నెందేని గాన
నగు నట్టివాడు బ్రాహ్మణు డగు సుఖముదుః
ఖమ్ము నైనెడ విమోహమును బొంద
కునికియ వానికి నుత్తమం బగు వేద్య
మనిన నీచెప్పిన యగ్గుణములు
క్రియ శూద్రునందు గల్గిన నతం డుత్తమ
ద్విజుడుగా నేర్చునే నిజము విడిచి

ఆ. యట్టులయిన బ్రాహ్మణాదివర్ణవిభాగ మెట్లుగలుగునయ్యాహీనులధికు లనువివేకమదియపార్థకం బగుగాదె యనిననని యెనంతకాత్మజుండు.

వ. ప్రమాదంబున వర్ణసంకరంబయినపుడు వర్ణపరీక్షార్థంబుగా బ్రాహ్మణాదులకు వృత్తంబువేఱువేఱ స్వాయంభువుం డైన మనువుసెప్పె. సత్యాదిగుణంబులు శూద్రునందు గలిగెనేని వాడు సచ్ఛూద్రుం డగుగాక, బ్రాహ్మణుండు గానేర్చునే. యవియు బ్రాహ్మణునందు లేనివాడు శూద్రుండ యనంబడుం గావున వృత్తంబులయుత్తమంబులు.

తే। పిత్తహీనుండు వెండియు వివిధవిధుల
విత్తవంతుండు గానేర్చు వృత్తహీను

శైనవాడు విహీనుండ యందు గాన
విత్తరక్షకు గడు మేలు వృత్తరక్ష.

ఇందు "ప్రమాదంబున వర్ణసంకరం బయినప్పుడు పరీక్షార్థము వృత్తము మనువు చెప్పెను" అనియున్న దేకాని ప్రతివాదు లన్నట్లు యుధిష్ఠిరునినాటికి దేశమంతయు సంకరిమైపోయినదని చెప్పబడినట్లు లేదు కనుకగూడ ప్రతివాదిప్రసంగ మసంగతము.

బ్రాహ్మణ్యనిర్ణాయకము వృత్తమే యని యిచ్చట చెప్పినధర్మజుడు యక్షప్రశ్నములలో గూడ జెప్పెను. జూడుడు—

యక్షః—

"రాజన్ కులేన వృత్తేన స్వాధ్యాయేన శ్రుతేన వా।
బ్రాహ్మణ్యం కేన భవతి ప్రబ్రూహ్యేత త్సునిశ్చితమ్॥

నీలకంఠీయమ్— స్వాధ్యాయేన అక్షరావాప్త్యా శ్రుతేన తదర్థగ్రహణేన సార్థవేదాఽధిగమేనేత్యర్థః॥

అనగా బ్రాహ్మణ్యము కులమును బట్టియా? వృత్తమును బట్టియా? అర్థసహితవేదజ్ఞానమునుబట్టియా? అని యక్షు డడిగెను. ఇచ్చట కులవృత్తస్వాధ్యాయములలో నేది ముఖ్యకారణము? అని ప్రశ్నాభిప్రాయము.

యుధిష్ఠిరః—

"శ్రుణు యక్ష కులం తాత న స్వాధ్యాయో న చ శ్రుతమ్।
కారణం హి ద్విజత్వే చ వృత్తమేవ న సంశయః॥

నీలకంఠీయమ్— కులం న కారణం స్వాధ్యాయః శ్రుతం చ ద్వయం మిలిత్వైక మేవ। తదపి న కారణ మితి యోజ్యమ్॥

"వృత్తం యత్నేన సంరక్ష్యం బ్రాహ్మణేన విశేషతః।
అక్షీణవృత్తో న క్షీణో వృత్తతస్తు హతోహతః॥"

యుధిష్ఠిరు డిట్లు చెప్పెను— కులముకాని, అర్థసహితవేద

జ్ఞానము కాని బ్రాహ్మణత్వములో ముఖ్యకారణముగాదు. వృత్తమే ముఖ్యకారణము. వృత్తమును యత్నముతో బ్రాహ్మణుడు సంరక్షించు కొనవలెను (ఇచ్చట బ్రాహ్మణుడుజాతిబ్రాహ్మణు డన్నమాట) వృత్తమునకు చేటుదెచ్చుకొను బ్రాహ్మణుడు చెడిపోవును. అని. ఈచెప్పుటలో బ్రాహ్మణజాతియెడల వృత్తమునకు ప్రాధాన్యము చెప్పబడెనే కాని కులస్వాధ్యాయశ్రుతములకు వైయర్థ్యము చెప్పబడలే దని గ్రహింపవలయును.

కనుక నే నఞ్ సూత్రమహాభాష్యములో నిట్లు చెప్పబడినది—

"తప శ్శ్రుతం చ యోనిశ్చేత్యేత ద్బ్రాహ్మణకారకమ్ ।
తప శ్శ్రుతాభ్యాం యో హీనో జాతిబ్రాహ్మణ ఏవ సః ॥"

స్వధర్మాచరణము, వేదార్థజ్ఞానము, జన్మము ననునవి బ్రాహ్మణ్యకారకములు, తపశ్శ్రుతవిహీనుడు జాతిబ్రాహ్మణుడే యగును. అని. పరాశరమాధవీయములో గూడ నిట్లు చెప్పబడినది—

తథాహాంగిరాః—

"జన్మశారీరవిద్యాభి రాచారేణ శ్రుతేన చ ।
ధర్మేణ చ యథోక్తేన బ్రాహ్మణత్వం విధీయతే ॥"

ఇతి యే తు గాయత్రీం సమ్యఙ్నజానన్తి దూరే తదనుష్ఠానం తే విశిష్టమాతాపితృజన్యా అపి బ్రాహ్మణనామమాత్రం ధారయంతి । న తు యథోక్తబ్రాహ్మణశబ్దార్థత్వం తేషు విద్యతే... ...

"గ్రామస్థానం యథా శూన్యం యథా కూపస్తు నిర్జలః ।
యథా హుత మనగ్నౌ చ అమంత్రబ్రాహ్మణా స్తథా ॥"

(అ 8-17)

మాధవీయమ్— నను బ్రాహ్మణశబ్దస్య అవయవార్థ స్తస్మిన్మాభూత్, జాతిస్తు విద్యతే, విశిష్టమాతాపితృజన్యత్వం బ్రాహ్మణత్వజాతిః । తథా చ బ్రాహ్మణశబ్దస్య తస్మిన్ యౌగికత్వాఽసంభ

వేఽపి రూఢిసద్భావా ద్వివమా దృష్టాన్తా వితాహ- గ్రామేతి। గ్రామశబ్దో హి జననివాసస్థానే భూభాగవిశేషే ముఖ్యయా వృత్త్యా వర్తతే, కూపశబ్దశ్చ జలాధారే ఖాతే, హోమశబ్దార్థశ్చ శాస్త్ర సంస్కృతవహ్నౌ హవిః ప్రక్షేపరూపః।

తత్ర జనవిశిష్టస్థానం ముఖ్యో గ్రామః, జనశూన్యస్థానం తు గ్రామాభాసః, కూపహోమయోరప్యాభాసత్వ మేవం యోజనీయమ్। తైత్తిరీయశ్రుతౌ దృష్టాన్తై రయం నామధారకో జాతిమాత్రసద్భావేఽపి బ్రాహ్మణాభాసో న తు ముఖ్యః।

పంకజశబ్దస్య చ యద్యపి జాతిః ప్రవృత్తినిమిత్తమ్, తథాప్యవయవార్థ స్తస్మిన్నిమిత్తేఽనుస్యూతశ్చైవ। తతో యోగరూఢ ఇతి వ్యవహ్రియతే। ఏవం బ్రాహ్మణశబ్దస్యాఽపి యోగరూఢత్వా జ్జాతి సద్భావేఽపి యోగహీనత్వా దాభాసత్వం ద్రష్టవ్యమ్॥

దీనిచే బ్రాహ్మణశబ్దము పంకజశబ్దమువలె యోగరూఢమనియు, అంగిరస్స్మృతిలో జెప్పబడిన జన్మవైదికసంస్కారవిద్యాచారాదులు అవయవార్థము లనియు, నవి యున్న బ్రాహ్మణుడే బ్రాహ్మణశబ్దమునకు ముఖ్యార్థ మనియు, జాతిమాత్రముకలవాడు ముఖ్యార్థము కాదనియు బోధింపబడినది.

జాతిబ్రాహ్మణ్యము మంత్రసంస్కారాదులచే నుత్కృష్టతను వహించు నని కూడ పరాశరస్మృతిలో జెప్పబడినది చూడుడు—

"చిత్రకర్మ యథానేకై రంగై రున్మీల్యతే శనైః॥
బ్రాహ్మణ్య మపి తద్వద్ధి సంస్కారై ర్మన్త్రపూర్వకైః॥"

**మాధవీయమ్**— దృష్టాన్తేన సంస్కారకృతోత్కర్షం సంభావయతి- చిత్రకర్మేతి। చిత్రకారః ప్రథమం పటాదౌ మషీరేఖాభి స్సర్వావయవాభిసంపూర్ణాని మనుష్యాదిరూపాణి లిఖతి, న చ తాని తావతా దర్శనీయత్వ మాపద్యన్తే, పున స్తా న్యేవ రూపాణి నానా

విధవర్ణప్రక్షేపే ణోన్మీలితాని దర్శనీయతా మాపద్యన్తే, ఏవం జాతి బ్రాహ్మణ్యం శాస్త్రీయసంస్కారై రుత్కృష్యతే । మంత్రసంస్కారేణ విద్యాదయోఽప్యుపలక్ష్యన్తే ।

అత ఏవాంగిరాః—

"జన్మ శారీరవిద్యాభి రాచారేణ శ్రుతేన చ ।
ధర్మేణ చ యథోక్తేన బ్రాహ్మణత్వం విధీయతే ॥
చిత్రకర్మ యథాఽనేకై రంగై రున్మీల్యతే శనైః ।
బ్రాహ్మణ్య మపి తద్వత్స్యా త్సంస్కారై ర్విధిపూర్వకైః ॥" ఇతి।

అనగా చిత్రకారుడు పటమునందు మొదటి రేఖామాత్రముగా సర్వావయవసంపూర్ణములైన మనుష్యాదిరూపములను లిఖించును. అంతమాత్రముచే నవి దర్శనీయములు కాకున్నను తరువాత నానా రంగులు వేయబడినపుడు క్రమముగా ఆరూపములే ప్రస్ఫుటములై దర్శనీయము లగుచున్నవి. అట్లే జాతిబ్రాహ్మణ్యము శాస్త్రీయ సంస్కారములచే నుత్కృష్టతను వహించుచున్నది. అని తాత్పర్యము.

"తావ చ్ఛూద్రసమో హ్యేష యావ ద్వేదే న జాయతే"

అను పూర్వోక్త ధర్మజవాక్యమునకు గూడ వేదసంబంధము కలిగినగాని జన్మసిద్ధమగు జాతి కుత్కర్షసిద్ధి కాదనియే తాత్పర్యము.

ఇట్లు వచనానంతరసంవాదముతో బరిశీలింపగా జన్మసిద్ధమే జాతి యనియు, నట్టిబ్రాహ్మణజాతి, వైదికసంస్కారవిద్యాచారాదులు లేనపుడు ప్రశంసనీయము గాదనియు, నవియున్నపుడే జాతికి ప్రాశస్త్య మనియు వృత్తరక్షణమే బ్రాహ్మణజాతికి ముఖ్యమనియు స్పష్టమైనది.

ఇంతవరకు కుంతీదేవికి పాండురాజనియోగప్రకారమును పరిశీలించునపుడు ప్రసక్తమైన శ్వేతకేతుగాథ ననుసరించి ప్రతివాదులు చేసిన ప్రసంగములను— అనగా "శ్వేతకేతువే వివాహబంధ మేర్పరచెను" "ఏస్త్రీతోనైనను పురుషుడు బలాత్కరించి కలియవచ్చు నని

యున్నది" "మహాభారతమునాటికి సంకరసంతాన మెక్కువయైనది" "దేశమునం దెవ డేవర్ణపువాఁడో తెలిసికొనలేమని నహుషధర్మజ సంవాదములో నున్నది" ఇత్యాదులను ప్రమాణోపపత్తులతో ప్రస క్తానుప్రసక్తముగా నిరాకరించుచు వచ్చినాము.

ఇక పాండురాజనియోగమును సంబంధించిన ప్రస్తుతాంశమునే పరిశీలింతము —

## —♦ పాండవోత్పత్తి ♦—

కుంతీదేవికి పాండురాజు శ్వేతకేతుమహర్షికృతవ్యవస్థను వెల్లడించి తరువాత—

తే. భర్తచేత నియోగింపఁబడక సతికి
నెద్దియును జేయఁగాఁ దగ దెట్టిదైన
భర్తచేత నియోగింపఁబడినదాని
జేయకునికి దోషంబని చెప్పె మనువు.

అని బోధించి యాపై భర్తృనియోగము ననువర్తించినవారల నిదర్శనములు చూపి "నీవిన్ని కారణంబులు విచారించి నానియోగంబు సేయుము. నీకు దోసిలి యొగ్గెదను" అని పలుకఁగా నప్పుడు భర్తృ ప్రియహితకారిణియైన కుంతీదేవి తనకు బాల్యములో మంత్రి మనుగ్రహించిన దుర్వాసోమహర్షి యుపదేశించిన విషయమును చెప్పుచు—

"మంత్రం త్విమం చ మే ప్రాదా దబ్రవీ చ్చైవ మా మిదమ్ ।
యం యం దేవం త్వ మేతేన మన్త్రేణా వాహయిష్యసి ॥
అకామో వా సకామో వా వశం తే సముపైష్యతి ।
తస్య తస్య ప్రసాదా త్తే రాజ్ఞి పుత్రో భవిష్యతి ॥
ఇత్యుక్తాఽహం తదాఽనేన పితృ వేశ్మని భారత ।
బ్రాహ్మణస్య వచ స్తథ్యం తస్య కాలోఽయ మాగతః ।
ఆవాహయామి కం దేవం బ్రూహి సత్యవతాం వర ॥"

నీ వీమంత్రముతో దేవతలలో నెవ్వ రెవ్వరి నావాహనను చేయుదువో వా రకాముల్రైనను, సకాము లైనను నీకు వశవర్తులై పుత్రసంతతి ననుగ్రహింతురు. అని మహర్షి చెప్పియుండెను. అట్టి సమయము ప్రాప్తించినదికాబోలు. ఏదేవు నాహ్వానింపవలెనో ఆజ్ఞాపింపుము. అని కోరగా ధర్మదేవత నాహ్వానింప నాజ్ఞాపించెను.

అపుడు భర్తకు ప్రదక్షిణనమస్కారములు చేసి కుంతీదేవి సమాహితచిత్తయై యామంత్రము జపింప—

"ఆజగామ తతో దేవో ధర్మో మంత్రబలా త్తతః ।
విమానే సూర్యసంకాశే కున్తీ యత్ర జపస్థితా ॥"

ఆమంత్రబలమున ధర్మదేవత విమానముతో వచ్చెను. అపుడు—

"సంయుక్తా సా హి ధర్మేణ యోగమూర్తిధరేణ హ ।
లేభే పుత్రం వరారోహా సర్వప్రాణభృతాం హితమ్ ॥"

యోగమూర్తిధారియైన ధర్మదేవునివలన సర్వప్రాణిహితకరుడైన పుత్రుని కనెను.

"తత స్తథోక్తా భర్త్రా తు వాయు మేవాజుహావ సా ।
తస్మా జ్జజ్ఞే మహాబాహు ర్భీమో భీమపరాక్రమః ॥"

తరువాత భర్త్రాజ్ఞచేతనే వాయుదేవు నాహ్వానించి యాతని వలన భీమసేనుని కనెను.

"ఏవ ముక్త్వా తత శ్శక్ర మాజుహావ యశస్వినీ ।
అథాఽఽజగామ దేవేన్ద్రో జనయామాస చార్జునమ్ ॥"

తరువాత భర్త్రాజ్ఞను బట్టియే యింద్రు నాహ్వానించి యాతని వలన అర్జునుని కనెను. తరువాత మాద్రికి గూడ పాండురాజు ఆజ్ఞాపింప—

"తతో మాద్రీ విచా ర్యైవం జగామ మనసాఽశ్వినా ।
తావాగమ్యసుతౌ తస్యాం జనయామాసతు ర్యమౌ ॥"

(ఆది. అ. 124)

మాద్రి అశ్వినీదేవతలను సంకల్పింప వారు వచ్చి సుతులను కలిగించిరి.

ఈపాండవజన్మమునకు సంబంధించిన పూర్వోక్త విషయముల నొక్కసారి యనుసంధింతము — పాండురాజు మునిబృందముతో నే నపుత్రకుడనైతి నేమి సేయుదు నని మొఱపెట్టుకొనగా వారు దివ్య దృష్టిచే భవిష్యత్తును గ్రహించి, నీకు దైవోద్దిష్టము, దేవోపమము, అనఘము, శుభము అయిన సంతతి కలుగును. యత్నింపుము. అని చెప్పియున్నారు. త్రికాలజ్ఞాననిధి యగు దుర్వాసోమహర్షి కుంతీదేవికి బాల్యమందే ఆపద్ధర్మసంరక్షణార్థము పాండవోత్పత్త్యుపయుక్తముగా దేవతల నాకర్షింపదగిన మంత్రము నామె కోరనిదే యుపదేశించి యుండెను. మునిగణోపదిష్టుడైన పాండురాజు అప్పు డాపద్ధర్మముగా శాస్త్రోక్తమై యున్న క్షేత్రజసంతతి నపేక్షించి భార్యల కాజ్ఞాపించి యుండెను. నియోగవిధిపరిపాలన మావశ్యకమని యెన్నియో నిదర్శనములు చూపియుండెను దోసిలి యొగ్గెదనని చెప్పుకొనియుండెను. ఆపై భర్త యొక్క ప్రియహితములనుగోరి భర్తచే నిర్దేశింపబడిన దేవతల నాహ్వానించుచు కుంతీమాద్రులు పుత్రులను గనిరి.

ఆపుత్రులుదయించినపుడెల్ల వారిభావిపరిస్థితులును, యోగ్యతావిశేషములును ఆకాశవాణిచే వెల్లడింపబడియే యుండెను.

ఆదేవతలవలన పాండవపంచకము జన్మించుటలోగూడ కారణ విశేష మున్నది. పంచేంద్రోపాఖ్యానములో జెప్పబడినట్లు పూర్వ మింద్రపదవినొందిన విశ్వభుక్, భూతధామ, శిబి, శాంతి అనువారు నలువురును, అప్పటియింద్రు డొకడును కలిసి పంచేంద్రులును పరమేశ్వరునిచే మీరు మనుష్యలోకమున జన్మింపు డని యాజ్ఞాపింపబడి నపుడు ఆపరమేశ్వరునితో నిట్లు చెప్పుకొనిరి—

"గమిష్యామో మానుషం దేవలోకా ద్దురాధరో విహితో యత్ర మోక్షః దేవా స్త్వస్మా న్నాదధీరన్ జనన్యాం ధర్మోవాయు

ర్మశుభా నశ్వినౌ చ॥ అస్త్రైర్దివ్యైర్మానుషాంశ్చ యోధయిత్వా
అగన్తారః పున ర్దేవేన్ద్రలోకమ్ పత చ్ఛ్రుత్వా వజ్రపాణి ర్వచ స్తు
దేవశ్రేష్ఠం పున రేవేద మాహ॥ వీర్యేణాహం పురుషం కార్య
హేతో ర్దద్యా మేషాం పంచమం మత్ప్రసూతమ్ ॥

నీలకంఠీయమ్—దురాధర్షో దుష్ప్రాపః, వీర్యేణ శుక్రద్వారా
పురుషమ్ అంశభూతమ్, దద్యాం స్వయమ్, అధికారికత్వాదిహైవ
తిష్ఠేయ మితి భావః ।

మేము మనుష్యలోకమం దట్లే జన్మింతుము. మమ్ములను
మాతృగర్భమందు ధర్మదేవవాయుదేవాదులు ప్రవేశపెట్టుటకై కోరు
చున్నాము. మే మట్లు జన్మించి దివ్యాస్త్రములతో యుద్ధముచేసి తిరిగి
యింద్రలోకమునకు వత్తుము. అని చెప్పుచుండగా నప్పటి యింద్రుడు
తా నాధికారికపురుషుడై యుండుటచే నా తేజస్సుచేతనే కార్యార్థము
పుత్రుని గలిగింతు నని పలికెను.

"తేషాం కామం భగవా నుగ్రధన్వా ప్రాదాదిష్టం సన్నిసర్గా
ద్యథోక్తమ్ ।"

అపుడు పరమేశ్వరుడు సుస్వభావముచేత్వారికోరికనంగీకరించెను.

ఇది గ్రంథస్థమైన విషయము. ఇట్లు పరమేశ్వరప్రేరణము,
దుర్వాసోమహర్షి మంత్రబలము, మునిబృందముచే భావిపుత్రప్రాప్తి
ప్రతిపాదనము, పాండురాజప్రోత్సాహనము, ఇన్ని యదృష్టఘటనలతో
గూడియున్నది యీపాండవోత్పత్తి. ఇక భర్తృవియోగమూలకమే
కుంతీదేవి ప్రవృత్తి యని స్పష్టమేకదా. ఇట్టి విషయములో ప్రతి
వాదుల వ్రాత యెట్లున్నది?

"కుంతీదేవి అర్జునుని తప్ప, మిగిలిన నలుగుర నెటులనో సంపా
దించి కాని, లేక వ్యభిచారముచే దాను ముగ్గుర గని సవతిచే గూడ
నటుల గనిపించి కాని కౌరవులతో భాగస్వాములుగా దీసికొని
వచ్చియుండును" (పు. 117)

"కుంతి రహస్యముగాను, బహిరంగముగాను పరులకే గంగ నోవువలె బిడ్డలం గనినది. సవతి తన్ను నాక్షేపింపకుండగా నామె కిరువురం దార్చినది" (పు. 231)

ఆహా! గ్రంథమును ధిక్కరించి వ్రాతనాగించిన ప్రతివాదులు మొదట 'కుంతీదేవి సంపాదించియో, లేక, వ్యభిచరించియో పుత్రులను దెచ్చియుండును' అని కల్పించియుండుటలో వారొక నిర్ణయమునకు రాలేకపోయినారు. వారికి పాపము గ్రంథస్థవిషయమును తోసివేయుటయందే సంకల్పముకాని విషయనిర్ధారణమునందు సంకల్పము అంత లేదన్నమాట.

రెండవవ్రాతలో 'కుంతి పరులకే బిడ్డలంగనినది. సవతి తన్ను నాక్షేపింపకుండగ నామె కిరువురం దార్చినది' అందురే.

నియోగవిధి నవలంబించినదని సవతి యాక్షేపించునందురా? కాముకురాలై ప్రవర్తించినదని సవతి యాక్షేపించు నందురా? నియోగవిధి నవలంబించుట అంబికాదులయందును సుప్రసిద్ధమైన యాపద్ధర్మమేకనుకదానినిసవతి యాక్షేపించుటయసంభవము. కాముకురాలై ప్రవర్తించినదని యాక్షేపించెడి సవతి తనకు గూడ దార్చుచున్నదని క్రుద్ధురాలై దూషింపక సమ్మతించుట అసంభవము. ఏ పక్షమందైనను తానాక్షేపించు పనిని తానే చేయుట అసంభవము. ఒకవేళ సవతికూడ కాముకురాలై కుంతి తనకు దార్చుటవలన ఆక్షేపింపలేదందురా? అట్లైనను తనసవతికి ముగ్గురును తన కిద్దరునా? అను ఆక్షేపము సిద్ధమేకనుక సవతి యుపేక్షించుట అసంభవము. కనుక ప్రమాణవిరుద్ధమే కాక అసంబద్ధమై యున్న ప్రతివాదుల వ్రాత హేయము.

ఈప్రతివాదులే 1948 సంవత్సరములో ఉత్తరభారతమని యొక పుస్తకమును వ్రాసినారు. అందెట్లున్నదో చూడుడు—

"పాండుడు స్త్రీధమదార యగు కుంతిని నియోగించి, ధర్మాని లేంద్రులవలన యుధిష్ఠిరభీమార్జును లను ముగ్గురు సుతులను, ద్వితీయపత్నియగు మాద్రినినియోగించి, యశ్వినులవలన కవలలగు నకులసహదేవు లను పుత్రులను బడసి కల్పవృక్షపంచకలాభము దితుండువోలె పాండుభూపతి యానందాక్రాంతహృదయుం డయ్యె. కాలక్రమమున బాండుభూపతి పుత్రపంచకమునకు నుపనీత సంస్కారముం జేసి మునులకడ వారికి విద్యాభ్యాసముం జేయిం చుచుండ" (పు. 3)

ఈ ప్రతివాదుల ధోరణి మహాభారతచరిత్రము వ్రాసిననాటికి చాల విసురుగా నడచినదిగాని, ఉత్తరభారతము వ్రాయునప్పటికి ఆవి సురు తగ్గి కొంత తిన్నబడినట్లు కనబడుచున్నది.

మహాభారతచరిత్రములో పాండవులు వ్యభిచారజాతు లనిన వీరు ఉత్తరభారతములో నట్లనుటకు నోరాడక మూలములో నున్నట్లే నియోగజాతులని వ్రాయుట వాని బుద్ధిపరివర్తనమునకు నిదర్శనమే. కనుక వ్యభిచారజాతు లను తమమాట తప్పని తామే చెప్పుకొని నారు. కనుక వీరివ్రాత హేయము.

— ♦ పాండవుల జన్మమునకు నాటివారు సందేహింపలేదా?
అను ప్రసంగము-తన్నిరాకరణము ♦ —

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— "పాండవుల జన్మములకు నాటివారు సందేహింపలేదా? పాండవుల జన్మములు హస్తినాపురవాసులకు గూఢపరచి మునులచేజెప్పబడినవి. వారెట్లు చెప్పిరో చూడుడు—

"బ్రహ్మచర్యవ్రతస్థస్య తస్య దివ్యేన హేతునా ।
సాక్షా ద్ధర్మాదయం పుత్ర స్తత్ర జాతో యుధిష్ఠిరః ॥
తథైవం బలినాం శ్రేష్ఠం తస్య రాజ్ఞో మహాత్మనః ।
మాతరిశ్వాదదా పుత్రం భీమం నామ మహాబలమ్ ॥

పురుహూతా దయం జజ్ఞే కుంత్యా మేవ ధనంజయః ।
యా తు మాద్రీ మహేష్వాసా వనూత పురుషోత్తమా ॥
అశ్విభ్యాం పురుషవ్యాఘ్రౌ విమా తావపి పశ్యత ।"
(ఆది- అ 126)

"బ్రహ్మచర్యవ్రతమునందుండిన యీ పాండురాజునకు దివ్యమైన హేతువుచే ధర్మునివలన బ్రత్యక్షముగ నీ యుధిష్ఠిరు డచట బుట్టి యున్నాడు. అట్లే భీము డను నీ మహాబలవంతుని వాయువా పాండురాజున కిచ్చెను. ఇంద్రునివలన గుంతియందే యీ యర్జు నుడు పుట్టెను. మాద్రి యశ్వనీదేవతలవలన నీ శ్రేష్ఠులగు నకుల సహదేవుల గనినది" పై వాక్యములు మునులు పాండవుల గుంతితో దీసికొనివచ్చి హాస్తిపురిలో భీష్మాదుల కొప్పగించునపుడు చెప్పినవి"
(పు. 113)

ఇచ్చట పాండవు లేవిధముగా జన్మించిరో ఏయే దేవతలవలన నేయే భార్యలయందె దెవరెవరు జన్మించిరో స్పష్టముగానే మునులు చెప్పినట్లున్నశ్లోకములను చూపి మునులు గూఢపరచి చెప్పినారని, అది యేదో తేల్పలేదు. "దివ్యేన హేతునా" అనుమాట ప్రతివాదు లకు గూఢముగా నున్నదేమో! దానికి నీలకంఠీయములో నిట్లు వ్రాయ బడినది— "దివ్యేన హేతునా। మంత్రేణ దేవతాహ్వానా ద్యలౌకిక కారణేన" అని. కనుక మునులు జరిగినట్లే చెప్పినారు. గూఢపరచి చెప్పలేదు. అందుచే నీ యంశ మపాస్తము.

ఇక నాటివారు సందేహించినారట. అదేదో చూతము—

"ఋషిభి ర్యత్ర దానీతా ధార్తరాష్ట్రాన్ ప్రతి స్వయమ్,
శిశవ శ్చాఽభిరూపాశ్చ జటిలా బ్రహ్మచారిణః॥
నీలకంఠీయమ్— తదా ధార్తరాష్ట్రాన్ ధృతరాష్ట్రసంబంధిగృహాన్
ప్రతి ఆనీతా ఇత్యర్థః।

పుత్రాశ్చ భ్రాతర శ్చేమే శిష్యాశ్చ సుహృదశ్చ వః,
పాండవా ఏత ఇత్యుక్త్వా మునయోఽన్తర్హితా స్తతః॥
నీలకంఠీయమ్—పుత్రా శ్చేత్యాది ధృతరాష్ట్రాదీ న్ప్రతి యథాయోగ్యం యోజ్యం, పాండవాః పాండోః పుత్రా ఏతే।
తాం స్తై ర్నివేదితా న్దృష్ట్వా పాండవా న్కౌరవాస్తదా,
శిష్టాశ్చ వర్ణాః పౌరా యేతే హర్షా చ్చుక్రుశు ర్భృశమ్॥
నీలకంఠీయమ్— తానితి। శిష్టాః సాధవః॥
"ఆహుః కేచి న్న తస్యైతే తస్యైత ఇతి చాపరే।
యదా చిరమృతః పాండుః కథం తస్యేతి చాపరే॥"
నీలకంఠీయమ్— న తస్యైత ఇతి- పితృపేక్షయాఽత్యుదార మూర్తిత్వాత్। తస్యైత ఇతి- మాతృ స్తుతిత్వాత్। అతిదుష్టానా ముక్తి ర్యదేతి- చిరమృతః చిరం శాపదగ్ధః అల్పకాలాశ్చ శిశవ ఇతి సందేహబీజమ్।
"స్వాగతం సర్వథా దిష్ట్యా పాండోః పశ్యామ సన్తతిమ్।
ఉచ్యతాం స్వాగత మితి వాచోఽశ్రూయన్త సర్వశః॥"
నీలకంఠీయమ్— స్వాగతం శోభన మాగమనం యుష్మాకం యతో వయం దిష్ట్యా భాగ్యేన పాండో స్సంతతిం పశ్యా మేతి పౌరై రుక్తే సమ్య గాగత మస్మాభి ర్యుష్మా న్ప్రతీతి ఉచ్యతాం వదతాం పాండవానా మపి వాచః అశ్రూయన్త సర్వశ స్సర్వైః।
"తస్మి న్నుపరతే శబ్దే దిశ స్సర్వా నినాదయ న్।
అన్తర్హితానాం భూతానాం నిస్వన స్తుములోఽభవత్॥"
నీలకంఠీయమ్— సందిగ్ధానాం సందేహాపనోదకం తదా దేవ చేష్టిత మాహ ద్వాభ్యాం— నిఃస్వనః నిశ్చితస్వనః పాండవా ఏత ఇ త్యేవంరూప శ్శబ్దః।
"పుష్పవృష్టి శ్శుభా గంధా శ్శంఖదుందుభినిస్వనాః।
ఆస న్ప్రవేశే పార్థానాం తదద్భుత మివాఽభవత్॥

...అద్భుతా పుష్పవృష్ట్యాది అత్యాశ్చర్యమ్ ।
తత్ప్రీత్యా చైవ సర్వేషాం పౌరాణాం హర్షసంభవః ।
శబ్ద ఆసీ న్మహాం స్తత్ర దివస్పృక్కీర్తివర్ధనః ॥" (ఆది అ-1)

...తత్ప్రీత్యా తేషు పాండవేషు ప్రీత్యా ప్రేమ్ణా హర్ష సంభవః సాధుశబ్దః ॥

ఇచ్చట జెప్పబడిన విషయ మిది— మనోహరమూర్తు లైన పాండుపుత్రులను ధృతరాష్ట్రభవనమునకు దీసికొనివచ్చి, ఋషులు వీరు పాండుపుత్రులని చెప్పి, యచ్చటివారితో వీరు మీకు పుత్రులనియు, మీకు భ్రాతలనియు, మీకు శిష్యులనియు, మిత్రులనియు యథోచితముగా జెప్పి యంతర్హితులైరి.

ఋషులచే దెలుపబడిన పాండుపుత్రులను చూచి సాధువులైన పౌరులు కౌరవులు హర్షధ్వనులు చేసిరి. ఆకుమారులు తండ్రికంటెను అత్యుదారమూర్తులై యున్నందున వీరు పాండుపుత్రులు కానేర రని కొందరును, తల్లులగు కుంతీమాద్రులు సతీమణులగుటవలన తప్పక పాండుపుత్రులే యని మరికొందరును ఆయా హేతువులనుబట్టి యనుకొనిరి. ఆ హేతువులను గణింపకయే చిరకాలమై పాండురాజు శాపదగ్ధుడై యుండ నల్పవయస్సుగల యీ శిశువులు పాండుపుత్రు లెట్లగుదురని అతిదుష్టులైనవా రనుకొనిరి. పౌరులు పాండవులను స్వాగత మడిగి పాండుపుత్రులను దర్శింపగలుగుట మా భాగ్యమనగా వారికి తమ శుభాగమనమును జెప్పెడి పాండవులమాట లందరిచే వినబడినవి.

తరువాత పాండవులనుగూర్చి సందిగ్ధులైనవారి సందేహమును తొలగింపబూనిన దేవత లంతర్హితులై యుండి వీరు పాండుపుత్రులే అని వెల్లడించిరి. ఆపై పాండవు లున్న ప్రదేశములో దివ్యపుష్పముల వృష్టియు, సుగంధపరిమళము ఆశ్చర్యముగా జరిగినది. అంతట పాండవప్రేమచే పౌరుల హర్షధ్వనులు విజృంభించినవి. అని.

పై శ్లోకములలోని “తాం స్త్రై ర్న వేదితాః” “ఆహుః కేచి న్న తస్యైతే” అను శ్లోకములను మాత్రమే ప్రతివాదులు ప్రదర్శించి వాని టీకను గాని, సంశయనివారకనిదర్శనము లగు శ్లోకములు గాని ప్రదర్శింపలేదు ప్రజల కపోహాలు కలిగింపబూనువారి దిదియే కదా సైఖరి. ప్రతివాదులు వ్రాసినట్లు పాండవోత్పత్తిగూర్చి సందేహము నాడు సర్వజనులకు గలిగినట్లున్నదా? కొందరి కే కలిగినట్లున్నదా? అని కలిగినవా రెట్టివారు? ఆసందేహము వారికిగూడ తొలగినట్లున్నదా? లేదా? అను విషయములు పరిశీలింపతగియున్నవి.

మహర్షులు తీసికొనివచ్చి వీరు దేవతాకటాక్షమున కుంతీ మాద్రులయందు జన్మించిన పాండుపుత్రులు. అని జరిగినది జరిగినట్లు చెప్పగా, యథార్థవాదు లగుటచే నాప్తు లనబడు మహర్షుల వాక్యములుఆప్తవాక్యములుకనుకను, అప్రత్యక్షవిషయములనునిర్ధారణచేయుటకు ఆప్తవాక్యములే ప్రమాణములుకనుకను నాడు సభలోనియుత్తములందరు నిస్సంశయముగా విశ్వసించి హర్షధ్వనులుచేసినట్లున్నది. ఆప్తవాక్యముల నంతగా బరిగణింపక తమ యూహాలతో నప్రత్యక్షాంశముల నిర్ధారణజేసెడి రెండవతరగతివారికి పాండురాజునుపోలని యింతటి యుదారమూర్తులు పాండుపుత్రు లగుదురా? అని సందేహముకలిగినట్లున్నది. ఆపై కుంతీమాద్రుల సతీత్వమును బట్టి అపోహకవకాశము లేనందున పాండుపుత్రులే యని మరికొంద రనిన ట్లున్నది. అటుపై మహర్షుల వాక్యములను విశ్వసింపక, కుంతీమాద్రుల సతీత్వమును పాటింపక, పాండురాజు శాపగ్రస్తుడై నను అతని నియోగముచే క్షేత్రజులై వీరు పాండుపుత్రులు కావచ్చును. అని యాలోచింపక, కేవల పాండురాజశాపమునే గ్రహించి కొందరు, వీరు పాండుపుత్రులు కారనిన ట్లున్నది. వీరు ఆప్తవాక్యమును త్రోసివేయుటచేతను, కుంతీమాద్రుల సతీత్వమును తిరస్కరించుటచేతను వీరు అతి దుష్టులు.

ఇట్లు గ్రంథసందర్భము నవలోకింపగా నాకుసందేహము కొందరికే కలిగినదనియు, ఆకొందఱైనను ఉత్తమమగు తరగతికి జెందినవారు కాని, మధ్యమతరగతికి జెందినవారుకాని, కాక అతిదుష్టులనియు స్పష్టమగునది.

అట్టివారి సందేహమునుగూడ పోగొట్టుటకై దేవతలు పాండుపుత్రులే యని అంతరిక్షస్థులై యుండి చెప్పుట, పాండవులున్న ప్రదేశములో దివ్యపుష్పవృష్ట్యాదులు కలుగజేయుట జరిగినట్లున్నది. దీనిని బట్టి ఆసందేహించినవారికి గూడ సందేహనివృత్తియైనదని తేలినది. ఇట్టిస్థితిలోగూడ ప్రతివాదులకు సందేహమే యుండుట నిచిత్రాంశము. నాటివారికి దేవతాకృతమగు పుష్పవృష్ట్యాదికము ప్రత్యక్షమగుటచే సందేహనివృత్తికి మార్గము దొరకినది. అదంతయు ప్రతివాదుల కప్రత్యక్షమే కనుక వీరి సందేహనివృత్తికి మార్గము లేదు.

నాడెవ్వరికోగలిగిన సందేహముకూడ వీరి కప్రత్యక్షమెయైనను గ్రంథములో నున్నంతమాత్రమున వీ రాసందేహము నంటించుకొని, వారి సందేహనివృత్తి యాగ్రంథమందే యున్నను, వీరానివృత్తిని చేసికొనకపోవుట గమనింపదగిన విషయము.

ప్రతివాదులు పై నుదాహరింపబడిన మహాభారతశ్లోకములను, అట్టివే దేవీభాగవతశ్లోకములనుచూపి తుదకు తమయభిప్రాయము నిట్లు తేల్చిరి—

"నిజమునకు పాండవులు కృత్రిమజన్మముకలవారే. నాటికాలమున వైదిక దేవతలయందు మహిమలను జనసామాన్యము తలచుచుండుటచే గుంతి యెటులనో 5గురు బిడ్డలను సంపాదించెనని కాని, కుంతీమాద్రుల కితరులవలన బిడ్డలు కలుగగా వారు దేవమహిమల వలన బుట్టినవారని మిష పెట్టినదని కాని చెప్పవలసియున్నది"

"పాండవులు సంవత్సరసంవత్సరము వ్యవధిగ బుట్టినను అందరు

నైదుసంవత్సరములప్రాయముగలవారుగానే కాన్పించిరట! అనగా నైదేండ్ల యీడుగలపిల్లల గుంతి సంపాదింపలేదుకద" (పు 115)

ఈప్రతివాదుల దెంత విరుద్ధాభిప్రాయమో, అది యెంత అప్రామాణికమో, వెనుకజూపిన ఉత్తరభారతపువ్రాత లెంత విరుద్ధమో ప్రాజ్ఞు లూహింతురుగాక! గ్రంథమున కేతమాత్రము సంబంధింపక నిరాధారమై యున్న వీరి ధోరణి యాస్తికులకు హేయము.

ఈప్రతివాదుల దాస్తిక్యబుద్ధియేనా? ప్రమాణబద్ధముకాని దాస్తిక్యబుద్ధియగునా? ఆప్తోపదేశములను విశ్వసింపని దాస్తిక్యబుద్ధియగునా? అప్రత్యక్షవిషయముల నంగీకరింపని దాస్తిక్యబుద్ధియగునా? వంద్యులను నింద్యు లనున దాస్తిక్యబుద్ధి యగునా?

నాటివారు దేవతలయందు మహిమలను తలచుచుండువారట. అందుచే నెవ్వరివలననో బిడ్డలను గని దేవమహిమలవలన బుట్టినవారని మిషపెట్టి చెప్పినదట. ఆహా! ఇది యాస్తికలక్షణమా? నాస్తిక లక్షణమా?

ఈచరకసంహితావచనములను చూడుడు —

"న పరీక్షా న పారీక్ష్యం న కర్తా కారణం న చ ।
న దేవా నర్షయ స్సిద్ధాః కర్మ కర్మఫలం న చ ॥
నాస్తిక స్యాఽస్తి నైవాత్మా యదృచ్ఛోపహతాత్మనః ।
పాతకేభ్యః పరం చైత త్పాతకం నాస్తికగ్రహః ॥
తస్మా న్మతిం ప్రముచ్యైతా మమార్గప్రసృతాం బుధః ।
సతాం బుద్ధిప్రదీపేన పశ్యే త్సర్వం యథాతథమ్ ॥"

ద్వివిధ మేవ ఖలు సర్వం సచ్చాఽసచ్చ । తస్య చతుర్విధా పరీక్షా । ఆప్తోపదేశః, ప్రత్యక్షమ్, అనుమానం, యుక్తిశ్చేతి । ఆప్తాస్తావత్ —

"రజ స్తమోభ్యాం నిర్ముక్తా స్తపోజ్ఞానబలేన యే ।
యేషాం త్రికాల మమలం జ్ఞాన మవ్యాహతం తథా ॥

"ఆప్తాః శిష్టా విబుద్ధా స్తే తేషాం వాక్య మసంశయమ్ ।
సత్యం వక్ష్యన్తి తే కస్మా దసత్యం నీరజస్తమాః ॥"

తత్రాప్తాగమస్తావ ద్వేదః । యశ్చాఽన్యోఽపి కశ్చి ద్వేదార్థా దవిపరీతః పరీక్షకైః ప్రణీత శ్శిష్టానుమతో లోకానుగ్రహప్రవృత్త శ్శాస్త్రవాద స్సచాప్తాగమః" (త్రిస్రైషణీయాధ్యాయః)

ఇచ్చట జెప్పబడినవిషయ మిది— నాస్తికునకు పరీక్ష లేదు, పరీక్ష్యము లేదు కర్త లేదు. కారణము లేదు. దేవతలు లేరు. ఋషులు లేరు. సిద్ధులు లేరు. కర్మ లేదు. కర్మ ఫలము లేదు. స్వభావవాదోపహతాత్ముడగు నాస్తికునకు దేహాతిరిక్తమైన ఆత్మకూడ లేదు. పాతకము లన్నిటికంటె మహాపాతకము నాస్తికత్వము. కనుక తెలివిగలవాడు, అపమార్గమునబడిన యీ నాస్తిక్యబుద్ధిని విడిచి సత్పురుషుల యొక్క బుద్ధియను ప్రదీపము నాశ్రయించి సర్వము యథాతథముగా గ్రహింపవలయు. సదసత్పదార్థములను పరీక్షింపదగిన విధములలో ఆప్తోపదేశ మొకటి.

ఆప్తు లెవ్వరనగా, తపోబలజ్ఞానబలములచే నెవ్వారు రజస్తమస్సుల నంతరింపజేసినవారో, ఎవ్వరు అవ్యాహతమైన త్రికాలజ్ఞానము కలవారో, ఎవ్వరు శిష్టులనియు, జ్ఞానులనియు ప్రశంసిపబడువారో వారే ఆప్తులు. వారి వాక్యము నిస్సంశయము. వారు సత్యమునే చెప్పుదురు. రజస్తమోరహితులు చెప్పున దసత్య మెట్లగును?

వేదము ఆప్తాగమము. వేదార్థమున కవిరుద్ధము, ప్రామాణిక ప్రణీతము, శిష్టానుమతము, లోకానుగ్రహప్రవృత్తము అగు శాస్త్రవాదము కూడ ఆప్తాగమమే. అని.

ఇపుడు చూడుడు— కుంతీదేవితో పాండవులను హాస్తినాపురమునకు దీసికొనివచ్చి మహాజనసంఘములో యథాతథముగా పాండవోత్పత్తిప్రకారమును తెలపి యంతర్హితులైన ఋషులు చరక సంహితోక్తలక్షణములుగల ఆప్తులు. ఆవిషయము నంతను గ్రంథస్థము

చేసి మనకు వెల్లడించిన వేదవ్యాసభగవానుడు ఆలక్షణములు కల ఆప్తుడు. వేదార్థావిరుద్ధము; ప్రామాణికపరిణీతము; శిష్టానుమతము; లోకానుగ్రహాపరివృత్తము నయి, చరకసంహితోక్తయూ వల్లక్షణములు కల మహాభారము ఆప్తాగమము, ఈయాప్తాగమమును ధిక్కరించెడి ప్రతివాదుల గ్రంథములు ఆప్తాగమములు కావు. ఆప్తోపదేశముల ధిక్కరించెడి ప్రతివాదు లాప్తులు కారు. ప్రతివాదుల వ్రాతలలో చరకసంహితోక్తనాస్తికలక్షణములే గోచరించుచున్నవి. కనుక ఆస్తిక లోకమునకు వీరివ్రాత హేయము.

పతినిర్బంధమున దేవతానుగ్రహముచే పుత్రవతులైన కుంతీ మాద్రులను కులటలని భావించిన ప్రతివాదుల హృదయమునకు తమ పతి మరణించినపుడు సహగమనము నేను చేయుదును, నేను చేయుదు నని సంరంభము వహించిన కుంతీమాద్రుల పవిత్రత తెలియకుండుట శోచనీయము. పతితో సహగమనము చేయనిశ్చయించిన మాద్రితో కుంతీదేవి యిట్లనెను—

"అహం జ్యేష్ఠా ధర్మపత్నీ జ్యేష్ఠం ధర్మఫలం మమ ।
అవశ్యం భావినో భావా న్మా మాం మాద్రి నివర్తయ ॥
అన్విష్యా మీహ భర్తార మహం ప్రేతవశంగతమ్ ।
ఉత్తిష్ఠ త్వం విసృజ్యైన మిమాన్ పాలయ దారకాన్ ॥"

మాద్రీ! ధర్మపత్నులలో జ్యేష్ఠురాలను నేను. ఈ సహగమన ధర్మఫలము నాకు దెండవలయును. కనుక నీవు లేచి యీ బిడ్డలను పాలించుచుండుము. అని. ఆపై మాద్రి యిట్లనినది—

"అహ మేవానుయాస్యామి భర్తార మపలాయినమ్ ।
... ... ... ... ... జ్యేష్ఠా మా మనుమన్యతామ్ ॥
మాం హ్యభిగమ్య క్షీణోఽయం కామాద్భరతసత్తమః ।

న చాఽస్యహాం వర్తయన్తీ నిర్విశేషం సుతేషు తే ॥
వృత్తి మార్యే చరిష్యామి స్పృశే దేన స్తథా చ మామ్ ॥"
(ఆది. అ-1?5)

కుంతీదేవీ! నానిమిత్తమున మరణించిన పతితో నేనే సహగమనము చేయుదును. నీవు నాకనుమతి యివ్వవలయును. నీవే సహగమనము చేసి యీ పుత్రులను కాపాడెడిభారము నాపై బెట్టితివేని నాపుత్రులతో సమానముగా నీపుత్రులను నిష్పక్షపాతముగా నేను కాపాడలేను. అప్పుడు నాకు దోషమంటును. కనుక నీవుండి నాకనుజ్ఞ నిమ్ము. అని. ఇట్లుండుటచే కుంతీదేవి చరిత్రము నిష్కళంకము పాండవోత్పత్తి నిష్కళంకము. దేవతల యొక్కయు, ఋషుల యొక్కయు ప్రసంగమే యీవిషయములలో ప్రబలమైన సాక్ష్యము.

—:'వేమన కూడ పాండవులయందు గౌరవముజూపుట వెఱ్ఱి
యని నుడివె' నను ప్రసంగము—తన్నిరాకరణము:—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— "ప్రఖ్యాతమహాకవియగు వేమన కూడ పాండవులయందు గౌరవముజూపుట వెఱ్ఱి యని యిటులు నుడివియున్నాడు—

ఉ. తాత జనించె గన్యకకు దండ్రియు దాసికి కుండగోళకుల్
మాత పరానుకూల మతి మక్కువ ద్రౌపదిభర్త లేవురా
నీతులుసెప్ప బాండవులనేమను లిట్టివి యంచు నెన్నుచున్
భూతలమందు వారలకు బూజలజేతురు వెఱ్ఱివేమనా. (పు-294)

ఇచ్చట వేమనకవి పాండవులు పూజ్యులు కారని తాను చెప్ప దలచి ఈపద్యమును చెప్పెనా? సామాన్యజనమునకు గూడ పాండవులయం దెట్టి పూజ్యభావ మున్నదో చెప్పదలచి యీ పద్యమును చెప్పెనా? అనునది విచారణీయాంశము.

వేమనకవికి పాండవులు పూజ్యులు కారనియే తాత్పర్యమను పక్షములో—

"ధర్మపరుడు పాండు ధర్మరాజాదులు ధర్మమార్గప్రవృత్తి నిలుపుకొనిరి,
ధర్మమే నృపులకు తారకయోగంబు విశ్వదాభిరామ వినురవేమ"

అనుచు ధర్మరాజాదులు ధర్మాత్ములనియు, కీర్తికలవారనియు ఆ వేమనకవియే యెట్లు చెప్పును? కనుక పద్దెములోని వెర్రిని వెనుక కన్వయించి ప్రతివాదులుచెప్పిన యర్థము వేమనకవి తాత్పర్యమునకు విరుద్ధము.

ఇక నా వెర్రిని వేమనయందే యన్వయించినపుడు "ఓ వెర్రి వేమనా! పాండవుల నేమము లిట్టివని యెన్నుచు భూతలమందు వార లకు బూజలు జేతురు" అని యర్థములభించును.

ఈయర్థములో పాండవులను ఆవిధముగా నెన్నుచున్నవారే వారిని పూజింతురు. అని సిద్ధించుటవలన సామాన్యజనమునకుగూడ పాండవులయందున్న పూజ్యభావమే విశదీకరింపబడినట్లయినది.

పాండవులచరిత్రము విలక్షణముగా గనబడినను "ధర్మస్య సూక్ష్మా గతిః" అను న్యాయమున వారి పూజ్యత ప్రకటింపబడిన ట్లయినది. ధర్మరాజాదులయందు పూర్వోక్తపద్యములో గౌరవము జూపిన వేమనకవి తాత్పర్యమున కీయర్థ మవిరుద్ధమై యున్నది.

వేమనకవి, తనపేరు వెర్రివేమన యనికూడ వాడెనా? అని ప్రశ్నింతురు కాబోలు. వాడెను చూడుడు—

ఆ. సిగ్గుగలదటండ్రు సృష్టిలోపలివారు వెర్రివేమనగని వెరగుపడిరి,
తనకుగలుగుసిగ్గు దైవ మెరుంగడా విశ్వదాభిరామ వినురవేమ.

చ. తరుణిని బెండ్లియాడి తగదమ్ములు నన్నలు బావయం చనర్
వరుసలజిక్కి సొక్కి మరివాంఛలచేతనె తేనెటీగయై
సరవిమునింగి నాతనికి సత్పథ మబ్బునె నిన్నుగాన కీ
ధరణిని ముక్తి లేదు ఇక దాపక చెప్పమి వెర్రివేమనా"

ఇట్లు వేమనకవికూడ బాండవులను గౌరవించియే యుండుటచే ప్రతివాదిప్రసంగ మపాస్తమైనది.

## —♦కుండగోళకశబ్దార్థనిరూపణము♦—

ఇచ్చట ప్రసంగవశమున గోళకు లని ధృతరాష్ట్రపాండురాజులను, కుండులని పాండవులను అనుట యుక్తమా? అయుక్తమా? అను విషయమును పరిశీలింతము—

పరాశరమాధవీయం- అ. 4. కుండగోళకలక్షణమ్.

"ఓఘవాతాహృతం బీజం యస్య క్షేత్రే ప్రరోహతి,
స క్షేత్రీ లభతే బీజం న బీజీ భాగ మర్హతి ॥
తద్వత్పరస్త్రియాః పుత్రౌ ద్వౌ స్మృతౌ కుండగోళకౌ,
పత్యౌ జీవతి కుండస్తు మృతే భర్తరి గోళకః ॥

మాధవీయమ్— అథ బీజి క్షేత్రిణోః పిత్రోః ప్రత్యవాయప్రాయశ్చిత్తసద్భావసూచనార్థ మస్మిన్ ప్రాయశ్చిత్తప్రసంగే కుండగోళకౌ సదృష్టాన్త ముపన్యస్యతి— ఓఘవాతేతి ద్వాభ్యామ్। ఓఘో జలప్రవాహః, వాతః, ప్రచండవాయుః తయోరన్యతరేణాఽఽహృతం పరకీయం శాల్యాదిబీజం యస్యాఽన్యస్య క్షేత్రే ప్రరోహతి స క్షేత్రీ బీజం బీజఫలం లభతే, నతు బీజీ, తదేతల్లోకప్రసిద్ధమ్। అనేనైవ న్యాయేన క్షేత్రిణో భార్యాయాం బీజినోత్పాదితౌ కుండగోళకౌ క్షేత్రిణ ఏవ పుత్రౌ భవతః, నతు బీజినః। తయోః పుత్రయోర్మధ్యే క్షేత్రిణ్యమృతే జారజః కుండః, మృతే తస్మిన్ జారజో గోళకః

తథాచ స్మృత్యంతరే—

"అమృతే చ మృతే చైవ జారజౌ కుండగోళకౌ" ఇతి, జారజశబ్దేన దేవరాదయో వ్యావర్త్యన్తే, న హి తేషాం జారత్వ మస్తి తేషాం గుర్వనుజ్ఞాతత్వాత్, అనుజ్ఞాతత్వంచ యాజ్ఞవల్క్యేన దర్శితమ్-

"అపుత్రాం గుర్వనుజ్ఞాతో దేవరః పుత్రకామ్యయా।
సపిండో వా సగోత్రో వా ఘృతాఽభ్యక్త ఋతా వియాత్ ॥"

ఇతి॥

ఇచ్చట జెప్పబడిన విషయ మిది— పరస్త్రీయందు జారుని వలన పుత్రులు కలిగినయెడల ఆమెకు పతి జీవించియుండగా గలిగిన వాడు కుండు డనియు, పతి గతించినపిమ్మట గలిగినవాడు గోళకు డనియు చెప్పబడుదురు. అప్పుడు ఆమె భర్తకు, జారునకుగూడ పాత కమే. ఆ కుండగోళకసంతతి యాజారునకు జెందక ఆమె భర్తకే చెంది యుండును.

కుండగోళకవ్యవహారము జారజులకే చెప్పబడుటచే జారులు కాక నియోగవిధిననుసరించి గురుజననియుక్తులైనవారిచే నియోగ జాతులగు క్షేత్రజులకు కుండగోళకవ్యవహారము లేదని తేలినది. జార జులే కుండగోళకులని స్మృత్యుక్తమై యున్నది. అని.

ఈస్మృత్యుక్తవిషయమే "అమృతే జారజః కుండో మృతే భర్తరి గోళకః" అని అమరకోశములో గూడ జెప్పబడియున్నది. ఇచ్చట 'అన్యజః' అని సామాన్యముగా జెప్పక 'జారజః' అని చెప్పబడనది. దానినిబట్టి ఆజారజశబ్దములోని జారశబ్దము నియుక్త లను గ్రహింపకుండజేయుటకే అని స్పష్టము. కనుక నియోగజాతులు కూడ జారజులే అను వారి వాదము ప్రమాణవిరుద్ధము. ఇంకొకటి. నియోగజాతులు జారజులే అను పక్షములో నియోగజాతులైన క్షేత్ర జులలో కుండులో, గోళకులో కాసట్టివా రుండనేయుండరు. అప్పుడు కుండగోళకులకంటె వేరుగా క్షేత్రజులను ఆయావచనములలో జేర్కొ-నుట అసంగతమగును.

ఈ దేవీభాగవతవచనము జూడుడు—

"ఔరసః పుత్రికా పుత్రః క్షేత్రజో గోలక స్తథా ।
కుండ స్సహోఢః కానీనః క్రీతః ప్రాప్త స్తథా వనే ॥
దత్తః కేనాపి చాశక్తో ధనగ్రాహీ సుతా స్మృతాః । (స్క-2 అ6)

ఇచ్చట ఔరసుడు, పుత్రికాపుత్రుడు, క్షేత్రజుడు, గోళకుడు,

కుండుడు. అని వేరువేరుగా జెప్పబడినది. కనుక నియోగజాతులు జారజులే అనువాదము నిరస్తమైనది.

ఇట్లు నియోగజాతులు జారజులు కారు కనుకనే నియోగజాతులైన ధృతరాష్ట్రపాండురాజులను గోళకులనుటయు, నియోగజాతులైన పాండవులను కుండులనుటయు అయుక్తము. వారలయందుగూడ నా శబ్దప్రయోగము క్వాచిత్కముగా నున్నయెడల "గౌర్వాహీకః" అను చోట గోవుకానట్టి వాహీకునియందు గోశబ్దప్రయోగము వలె అన్యపురుషజాతత్వలక్షణమున గౌణార్థకముకాని ముఖ్యార్థకముకాదని తెలిసికొనవలయును. అంశాంతర మందుకొందము.

— "అంగారపర్ణుడు పాండవులను భారతీయాచారయుక్తులుగా లేరని ధిక్కరించె" నను ప్రసంగము—తన్నిరాకరణము —

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— "అంగారపర్ణుడను గంధర్వుడు కూడ వీరు (పాండవులు) భారతీయాచారయుక్తులుగా లేరని ధిక్కరించియున్నాడు. ఆదిపర్వ-170 అధ్యా. (పు 236)

అసలువిషయ మేమనగా అంగారపర్ణుడను గంధర్వుడు స్త్రీ సంఘముతో జలక్రీడకై రాత్రి గంగానదికి వచ్చియుండ మార్గవశమున కుంతీదేవితో పాండవులుకూడ నచ్చటికి జేరినపుడు గంధర్వుడు క్రుద్ధుడై పాండవులను పొమ్మనుటయు, అర్జునుడు ఎదుర్కొనుటయు, తరువాత గంధర్వు డోడిపోవుటయు జరిగినమీదట సఖ్యము వహించి వారు సంభాషించుకొనుటలో అర్జును డిట్లడిగెను— ఆంధ్రభారతము—

"మమ్ము బరమధార్మికులం బరమబ్రహ్మణ్యుల నేమికారణంబున నుదరిపలికి తనిన గంధర్వుం డిట్లనియె.

క. విమలములయిలోకత్రిత, యమునబ్రవర్తిల్లుమీమహాగుణములు ని
త్యము విందు నారదప్రముఖ, మునీశ్వరసిద్ధసాధ్యగణములవలన,

క. మేరునగోత్తంసమహీ, భారధురంధరుల మిమ్ము బాండవుల గుణో
దారుల ధీరుల నెరుగని, వా రెవ్వరు గలరె భరతవంశోత్తములన్.

వ. ఏను మిమ్ము నెఱింగియు మీకు నగ్నిపరిగ్రహంబును బ్రాహ్మణ
సంగ్రహంబును లేమింజేసి పరుసంబులు పలికితి.

ఇదియే కాబోలు ప్రతివాదులు సూచించిన విషయము. సంస్కృత భారతమును గూడ జూచిన యీ మాటలకు అభిప్రాయ మేమో తెలియును.

గంధర్వః—

"అనగ్నయోఽనాహుతయో న చ విప్రపురస్కృతాః ।
యూయం తతో ధర్షితాస్స్థ మయా వై పాండునందనాః ॥"

నీలకంఠీయమ్— అనగ్నయః దారహీనత్వాత్ । అనాహుతయః సమావృత్తత్వాత్ । ఆశ్రమవిశేషహీనోఽబ్రాహ్మణో ధర్షణీయ ఇత్యర్థః ॥

ఇచ్చట గంధర్వుడు పాండవులను బెదరించుటలో వారియందొక న్యూనతను తాను కనిపెట్టి యట్లు చేసినట్లు చెప్పబడినది. అది యేదనగా అగ్నిపరిగ్రహము, బ్రాహ్మణసంగ్రహము, వారికప్పుడు లేకుండుట, అవియే వారియం దప్పు డున్నయెడల తనకు తృణీకరింప శక్యముకాకపోవు నని సూచింపబడినది. వారి కప్పటికి వివాహము కాకుండుటచే నగ్నిపరిగ్రహము లేకుండెను. వివాహానంతరము అగ్నిపరిగ్రహము కలిగెను. బ్రాహ్మణసంగ్రహము కూడ తరువాత జరిగెను.

ఇట్లుండ ప్రతివాదు లేమని వ్రాసినారు? పాండవులు భారతీయాచారయుక్తులు కారనినట్లు వ్రాసినారు. గంధర్వు డన్న దేమి? అగ్నిపరిగ్రహాదులు లేకుండె నని, గంధర్వుడు చెప్పిన ఆరెండే భారతీయాచారములా? ఆరెండును లేనివారు భారతీయులు కానివారేనా? అట్లైనయెడల గంధర్వుడు మీరు భారతీయులు కాకుండుటచే కారణ

మని కంఠోక్తిగా జెప్పక, అవి రెండు లేకుండుటే కారణ మని చెప్ప నేల? అవి రెండు తప్ప మిగిలిన భారతీయాచారములు వారియందున్న వన్నమాట. అవియేవి? క్షత్రియులకు విహితమైన ఉపనయనసంస్కార వేదాధ్యయనాదులు. కనుక ప్రతివాదుల వ్రాత హేయము.

పాండవులు భారతీయులు కారను వాద మెవ్వ రిను గ్రహించి నదో మ. భా. చ. కారులే వ్రాసియున్నారు చూడుడు —

"హాప్కిన్సు" "విన్సెంటుస్మిత్తు" అనువారు పాండవులు టిబెతు దేశమునుండి భరతఖండమునకు వచ్చిన విజాతీయు లనియు, అందు వలననే టిబెతుదేశమునందుండిన బహుపతిత్వమే ద్రౌపదిని వరించుటలో వారవలంబించి రనియు వ్రాసియున్నారు. (పు-232)

ఆహా! ఆర్షసంప్రదాయమునకు జెందియున్న ప్రతివాదులకు ఆర్షగ్రంథములు, ఆర్షవిద్యాధురంధరుల గ్రంథములు, అప్రమాణములై ఆర్షసంప్రదాయానభిజ్ఞుల కపోలకల్పితములు శరణ్యాము లగుట శోచనీయము. ఆమాటల నాధారపడియే పాండవులు భారతీయులు కారనుటకు లేనిపోని యసంగతప్రసంగము లెన్నియో చేసినారు. అందు ముఖ్యాంశములు నిరాకరింపబడును.

—: పాండవులకు గోత్రమే లేదను ప్రసంగము-తన్నిరాకరణము :—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది — "పాండవుల గోత్ర మేమి? వైయాఘ్రపద్యగోత్రమని ధర్మజుడు విరటునికడ నుడివి నాడు. రాజులకు బురోహితుని పేరుగల గోత్రమె పెట్టబడు నని శ్రౌతసూత్రమున గలదు. ధౌమ్యుడు వ్యాఘ్రపాదు డనువాని పుత్రుడు. అందువలన వైయాఘ్రపద్యుడై ధర్మజుడు ధౌమ్యుని పేరిగోత్రముతో నొప్పిన ధౌమ్యుడు పురోహితుడు కానపుడు పాండవులకు గోత్రనామమె లేదు. ఇది భారతీయాచారవిరుద్ధము.

భీష్మునకు వైయాఘ్రపద్యగోత్రము సాంకృతిప్రవరము. భీష్మ తర్పణవిధిలో నిటీవల ధర్మశాస్త్రనిబంధనగ్రంథకర్తలు మార్చిరి. భాగవతమునను నొక్కచోటున గలదు. కానియది ఇటీవల గల్పింప బడెనని తలతును. గోత్రప్రవరఖండములో వైయాఘ్రపద్యగోత్రము కాని సాంకృతిప్రవరమున నాగోత్రముకాని కాన్పింపదు"(పు237)

ఆహా! వీరికి కనబడని విషయమును లేదని త్రోసివేయుటయు, కనబడిన విషయమును కల్పితమని త్రోపివేయుటయు నైజము. వీరి నోటిమాటలనే పరిశీలింతము— రాజులకు పెట్టబడునది పురోహితుని గోత్రము కాక పురోహితునిపేరుగల గోత్ర మొకటా? పాండవుల పురోహితుడైన ధౌమ్యునకు వైయాఘ్రపద్యుడని పేరా? అది వ్యాఘ్రపాదుని పుత్త్రుడగుటచే వచ్చినదా?

ప్రతివాదులన్నట్లు ధౌమ్యుడు వ్యాఘ్రపాదుని పుత్త్రుడే యైన నాడు వైయాఘ్రపద్యశబ్ద మా ధౌమ్యుని చెప్పజాలదు. ఏమనగా వైయాఘ్రపద్యశబ్దము, "గర్గాదిభ్యోయఞ్" అను పాణిని సూత్ర ముచే 'యఞ్' ప్రత్యయమురాగాసిద్ధించును. ఆప్రత్యయము గోత్రా పత్యమునే చెప్పును. గోత్రాపత్య మనగా "అపత్యం పౌత్రప్రభృతి గోత్రమ్" అను పాణిని సూత్రముచె పౌత్త్రుడు మొదలుగాగల సంతతి యని యర్థము. కనుక వైయాఘ్రపద్యశబ్దము వ్యాఘ్రపాదునిపౌత్రా దులను చెప్పునే కానివ్యాఘ్రపాదుని పుత్త్రుడని ప్రతివాదులచే జెప్ప బడిన ధౌమ్యుని చెప్పదు. అందుచే వైయాఘ్రపద్యనామము ఆ ధౌమ్యునకుసంభవింపదు. ఒకవేళ సంభవింప జేసిననుకృతయుగములోని వాడువ్యాఘ్రపాదుడు. ఆవ్యాఘ్రపాదునకుఉపమన్యువు,ధౌమ్యుడు,అని యిద్దరు పుత్రులు ఈవిషయ ముపమన్యునిచే నిట్లు చెప్పబడెను—

"పురా కృతయుగే తాత ఋషి రాసీ న్మహాయశాః ।
వ్యాఘ్రపాద ఇతి ఖ్యాతో వేదవేదాంగపారగః ॥
తస్యాఽహ మభవం పుత్రో ధౌమ్య శ్చాపి మమానుజః ।"

(అనుశా-అ 14)

దీనిని బట్టి ఉపమన్యువుకూడ వైయాఘ్రపద్యుడే యయ్యెను. మరియు వైయాఘ్రపద్యశబ్దము వ్యాఘ్రపాదుని సంతతికి జెందినవారి నందరను చెప్పెడిదగుటవలన పాండవపురోహితునకు ధౌమ్యుడనునది పేరయినట్లు వైయాఘ్రపద్యుడనునది పేరు కానేరదు. మరియు పాండవ పురోహితుడగు ధౌమ్యుడు- "యవీయాన్ దేవలస్యైష వనే భ్రాతా తపస్యతి । ధౌమ్యఉత్కోచకే తీర్థే తం వృణుధ్వం యదీచ్ఛథ" (ఆది- అ 18 ) అని యుండుటనుబట్టి దేవలసోదరుడుగాని, ఉపమన్యు సోదరుడు గాడు, వ్యాఘ్రపాదపుత్త్రుడును గాడు దానివలన పాండ వుల వైయాఘ్రపద్యగోత్రము పాండవపురోహితుడగు ధౌమ్యుని పేర గలదనుటకు వీలులేదు.

మరియు పురోహితుని పేరుగల గోత్రమె రాజులకు పెట్టబడు ననునది అర్థములేనిమాట. ప్రతివాదుల కున్నది వైయాఘ్రపద్యశబ్ద మొకటే. అది పేరైన గోత్రమేది? గోత్రమైనపేరేది? పేరును గోత్ర ముగూడ నదే యైనపక్షములో పేరుగల గోత్రమేది? ఇట్లు చూడగా విరటునితో ధర్మజుడు చెప్పియున్న పాండవుల వైయాఘ్రపద్యగోత్ర మునకును, ధౌమ్యుడు పురోహితుడై యుండుటకును ఏమియు సంబం ధము లేనందున ధౌమ్యుడు పురోహితుడు కానపుడుకూడ పాండవులు వైయాఘ్రపద్యగోత్రులే. అందుచేతనే ధౌమ్యసంబంధమునకుబూర్వ ము వారి కుపనయనాదిసంస్కారసిద్ధి కనుక భారతీయాచారవిరుద్ధము ప్రతివాదిచర్యయే కాని పాండవచర్యకాదు. కురువంశధురంధరుడగు భీష్ముడు వైయాఘ్రపద్యగోత్రుడని ప్రమాణగ్రంథములు చెప్పుచుండ శిష్టులందరు "వైయాఘ్రపద్యగోత్రాయ" అని కీర్తించుచు భీష్మతర్ప ణము చేయుచుండ పాండవులనుగూర్చి చేసిన తమ కుకల్పన నాధా రముచేసికొని యదంతయు నిటీవల మార్చబడినదను ప్రతివాదుల దెంత నిరంకుశత్వమో! మ. భా. చ. కారులే భీష్మునిగూర్చి వ్రా యుచు — "ఈభీష్మున కాసేతుహిమాచలమును గల పూర్వాచార

పరులు మాఘశుద్ధైకాదశినాడు భీష్మతర్పణము చేయుచున్నారు. వారిలో నీగ్రంథకర్త కూడ నొకడు" (పు 150) అని వ్రాసి తాము కూడ పూర్వాచారపరులతోపాటు భీష్మతర్పణము చేయుచున్నట్లు తెలిపినారు. ఆతర్పణములో వాడబడునది 'వైయాఘ్రపద్యగోత్రాయ' అను వచనమే. దానితో వీరితర్పణమట! అది ఇటీవల దూర్చబడిన దట! ఇది యేమిపాండిత్యమో!

పాండవులకు వైయాఘ్రపద్యగోత్రమును ఎట్లో సిద్ధింపజేసి భీష్మునిగూర్చి వ్రాయునపుడు 'వైయాఘ్రపద్యగోత్రము గోత్రప్రవర ఖండలో గాన్పింపదు' అని వ్రాయుట విచిత్రాంశము.

"ప్రతీతి వ్యవహారాభ్యా మర్థసిద్ధిః" అను న్యాయమున లోక ప్రతీతిని, లోకవ్యవహారమును అనుసరించియే అర్థసిద్ధికనుక ధర్మశాస్త్ర నిబంధనగ్రంథములలోనుండి, మహాభారతములోనుండి శిష్టవ్యవహార మైయున్న భీష్ముని వైయాఘ్రపద్యగోత్రము కల్పిత మనుట అసంగతము. గోత్రప్రవరఖండలో నది వారికి కనబడకుండుట కారణ మని నారు. అందులో వారికి గనబడినయెడల, వారికి గనబడిన గ్రంథముల కేగతిపట్టినదో ఆగతియే పట్టును వారికి గనబడకున్న నెంతవిశేషమో కనబడినను అంతే.

వేలకొలది గోత్రములలో నెవ్వరి దేయేగోత్రమో తెలిసికొనుటకు పరంపరా ప్రాప్తమైన వారివారి వ్యవహారమే శరణ్యమైయుండ వీరు వీరు గోత్రఋషులని తెలుపుటకుమాత్ర మా వ్యవహార మేల శరణ్యముకాదు? వ్యవహారసిద్ధమై, ప్రమాణగ్రంథప్రసిద్ధమై యున్న కురువంశీయుల గోత్రము తద్వంశీయులగు భీష్మునియందును, పాండవుల యందును వర్తించియుండ దానిని త్రోసివేయబూనిన ప్రతివాదుల చర్య గర్హ్యము.

ప్రసక్తమైనదికనుక ప్రవరమంజరిలో జెప్పబడిన గోత్రశబ్దార్థముయొక్క సంగ్రహము, ప్రవరశబ్దార్థము ప్రదర్శింపబడుచుచున్నది—

—: గోత్రప్రవరస్వరూపసంగ్రహము :—

"అగస్త్యాష్టమానాం సప్తఋషీణాం పుత్రపౌత్రప్రభృతి యదపత్యమృషిత్వం ప్రాప్తం మన్త్రద్రుగమన్త్రద్రుగ్వా తత్తస్య గోత్రమ్।

యథా జగమదగ్నే ర్మార్కండేయాది, యథా విశ్వామిత్రస్య దేవరాతాది, గోత్రఋషీణాం యదపత్యం పుత్రపౌత్రాదికమృషిత్వం ప్రాప్తం తస్యాపి తదేవ గోత్రమ్ ।

ఏత దుక్తం భవతి— అగస్త్యాష్టమస ప్తర్ష్యపత్యానా మృషీణాం గోత్రత్వ ముభయథాఽభిమతమ్। పితాదీనా మృషీణాం పుత్రాదీనా మృషీణాం తదేవ గోత్రమితి ॥

"విశ్వామిత్రో జమదగ్ని ర్భరద్వాజోఽథగౌతమః ।
అత్రి ర్వశిష్ఠః కశ్యప ఇత్యేతే సప్తర్షయః ॥"

"సప్తానా మృషీణా మగస్త్యాష్టమానాం యదపత్యం తద్గోత్రముచ్యతే" (బోధాయనః)

ఏవం చ సతి "మార్కండేయగోత్రా వయమ్" ఇత్యాది లోకవ్యవహారః "కిం గోత్రోనుసౌమ్య" ఇత్యాదీని శ్రుతిలింగాని చోపపన్నాని భవన్తి పుత్రాదీన్ ప్రతి గోత్రత్వే। తథా పితాదీన్ ప్రతి గోత్రత్వే "అపత్యం పౌత్రప్రభృతి గోత్రమ్" ఇతి పాణినీయసూత్రమ్ "అగస్త్యాష్టమానాం యదపత్యం తద్గోత్రమితి చ బోధాయనసూత్రముపపన్నార్థం భవతీతి ॥

"పాణినీయన్తు సామాన్యం విశేషే పర్యవస్యతి ।
బోధాయనీయే తదపి సామాన్యమృషిసంజ్ఞకమ్ ॥
సప్తర్ష్యగస్త్యాఽపత్యం యదృషిసంజ్ఞం తదుచ్యతే ।
గోత్ర మిత్యేవ పిండార్థో గోత్రలక్షణయో ర్ద్వయోః ॥"

అనగా సప్తర్షులయొక్కయు, అగస్త్యునియొక్కయు పుత్రపౌత్రాదిసంతతిలో మంత్రద్రష్ట కాకున్నను, ఋషిత్వమును పొందిన

వారు ఆఋషులకు గోత్రమగును. జమదగ్నికి మార్కండేయాదులు, విశ్వామిత్రునకు దేవరాతాదులు గోత్రము లైనట్లు, ఆగోత్రఋషుల పుత్రపౌత్రాదిసంతతిలో ఋషిత్వమును పొందినవానికిగూడ నదే గోత్రమగును. సారాంశ మిది—

సప్తర్షులయొక్కయు, అగస్త్యునియొక్కయు సంతతిలోని గోత్రఋషులు తమ పితాదిఋషులకును, తమ పుత్రాదిఋషులకునుగూడ గోత్రమగుదురు, అని.

ఈనిర్ణయమునుబట్టి జమదగ్నిసంతతిలోని మార్కండేయుడు ఆ జమదగ్నికిని, నేటి యావంశీయులకును గోత్రఋషియగుటచే 'జమదగ్నిసగోత్రః' అను వ్యవహార ముపపన్నము. 'మార్కండేయగోత్రా వయమ్' అను లోకవ్యవహారము బహువ్రీహిసమాసముచే నుపపన్నము? ఇక సప్తర్షులకు గోత్రసంజ్ఞ లేనియెడల 'విశ్వామిత్రగోత్రా వయమ్' ఇత్యాదివ్యవహారోపపత్తి యెట్లనగా—

"గోత్రశబ్దస్యోభయలింగత్వాదవిరుద్ధం పుత్రశబ్దవత్ । యథా చ వసిష్ఠస్య పుత్రః కుండినః । తథా వశిష్ఠస్య గోత్రః కుండిన ఇతి ॥

అనుటచే గోత్రశబ్ద ముభయలింగముగనుక బాధ లేదని గ్రహింపవలెను.

ప్రవరవిషయము ప్రవరదర్పణ ప్రవరమంజరుల యందిట్లున్నది—

గోత్రభూతస్య ఋషేః పితృపితామహప్రపితామహాదయ ఏవ ప్రవరాః । శతపథశ్రుతౌ ప్రవరా నను క్రమ్యోక్తం— పిత్రైవాగ్రేఽథ పుత్రోఽథ పౌత్ర ఇతి । అత ఏవాంగిరస, బార్హస్పత్య, భారద్వాజేత్యాదౌ తథైవ దృశ్యతే । ఆంగిరసేత్యాదితద్ధితస్తు యజమానస్య ఋషిసంబన్ధద్యోతనార్థః । పితాదీనా మపి మన్త్రకృతామేవ ప్రవరత్వాన్ । "యదర్షి మన్త్రకృతో వృణీతే" ఇతి సూత్రకారవచనాత్ ॥

"ఆహవనీయ స్యాఽగ్నే ర్హవ్యవాహనామ్నః సప్తర్షీణా మగ స్త్యాష్టమానామపత్యసంబన్ధేన తత్సాదృశ్యసంబన్ధేనవాప్రకర్షేణవరణాని ప్రార్థనానిప్రవరాః। తే చ హోతురధ్వర్యోశ్చ విహితా ద్విప్రకారాః। హోతుస్తావద్యథా— వత్సానాం భార్గవచ్యావనాప్నవానౌర్వజామదగ్న్యేతిపంచార్షేయప్రవరే పంచభి ర్మంత్రదృగ్భి ర్దేవప్రసిద్ధై రాహవనీయోఽగ్ని స్సంబోధ్యతే।

తథా సంబోధితోఽగ్ని ర్దేవేభ్యో హవ్యం వక్ష్యతి నాన్యథేతి కృత్వా త మగ్నిం హోతా వృణీతే ప్రార్థయతే। తథా తైరేవ మన్త్రదృగ్భిః పంచభి స్తద్విపర్యయక్రమేణ సాదృశ్యసంబన్ధేన తమే వాఽహవనీయ మగ్ని మధ్వర్యు ర్వృణీతే ప్రార్థయతే।

యథా—జమదగ్నివ దూర్వవ దప్నువానవ చ్చ్యవనవద్భృగువదితి। అస్యాఽయమర్థః— యథా జమదగ్న్యాదయో యోగ్యతయా భోజ్యాన్నతయా చ దేవై ర్జ్ఞాతత్వాద్దేవా నుద్దిశ్య త్వయి హవిః ప్రక్షేపయోగ్యాః। తథాఽయమపి యజమానో వత్స స్తదపత్యత్వా త్తహోత్పాదకత్వేన పితృస్థానీయత్వాచ్చ త్వయి హవిఃప్రక్షేపయోగ్య ఏవేతి॥"

నిర్ణయసింధుః— "తచ్చ వరణం యద్యపి గోత్రభూతస్యాఽపి క్వచి ద్దృశ్యతే। తథాపి పూర్వవ దృషిభేదో ద్రష్టవ్యః॥"

వ్యాఖ్యా— ఋషిభేదః వృద్ధవశిష్ఠోఽన్యః, యువవసిష్ఠోఽన్యః॥

ఇచ్చట చెప్పబడిన దేమనగా, గోత్రఋషియొక్క పితృపితామహప్రపితామహాదులే మంత్రద్రష్టలైనవారు ప్రవరములో కీర్తింపబడుదురు. వారినట్లు కీర్తించి వారి సంతతిలోనివాడని యజమానుని వెల్లడించినపుడే యాతని హవిస్సును దేవతలు గ్రహింతురు. కొన్నిచోట్ల గోత్రఋషికిగూడ ప్రవరములో సంబంధ మున్నట్లు నామసామ్యమువలన కనబడును. కాని యిచ్చట ఋషిభేదమే. అని.

దీనినిబట్టి ప్రవరములో గోత్రఋషికీర్తన ముండు ననుకొనుట భ్రాంతియగుటచే "వైయాఘ్రపద్యగోత్రము సాంకృతిప్రవరమున గాన్పింపదు" అను వ్రాత పరాస్తము.

—: "పాండవులు తిబెతుదేశీయు" లనుప్రసంగము—తన్నిరాకరణము: —

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— "నిజమునకు ధర్మరాజాదులు తిబెతుదేశీయులై యుందురు. తిబెతుదేశమున బెక్కండ్రొక్కవనిత బెండ్లియాడు నాచారము ప్రాచీనకాలమునుండి నేటివరకు గలదు. ద్రౌపదీపరిణయసమయమున ద్రుపదుడు పెక్కండ్రొక్కవనిత బెండ్లియాడుట యుక్తమా? యన ధర్మజుడిట్లనినాడు—

"సూక్ష్మో ధర్మో మహారాజ నాస్య విద్మో గతిం వయమ్ ।
పూర్వేషా మానుపూర్వ్యేణ యాతం వర్త్మాను యామహే॥"
(ఆది- అ 195)

ఓ ద్రుపదరాజా! ధర్మము సూక్ష్మమైనది. దీనిగతిని మే మెరుగము. (మాయొక్క) పూర్వులు వెళ్ళినదారినే మేము పోవుచున్నాము. ధర్మజుడు మాపూర్వులు పోయినదారిని మేము పోయెదమనుటలో తిబేతీయులని ధ్వని కలుగుచున్నది. కారణ మేమన, కురువంశములో నెవ్వరును ఒకతె ననేకులు పెండ్లియాడలేదుగాన"
(పు 116)

ఇచ్చట ధర్మజు డన్నట్లున్న శ్లోకములో 'పూర్వేషామ్' అను పద మున్నది. దానికి ప్రతివాదులు 'మాయొక్క' అనుమాటనుచేర్చి తాము చెప్పదలచుకొనిన యర్థము జెప్పినారు. అది ధర్మజునివాక్యమగుటచే నాతడు వాడిన 'పూర్వ' శబ్దమునకు అతని పూర్వులని యర్థము చెప్పవలెనందురా? అట్లైన అధర్మజుని మాటపై—

ద్రుపద ఉవాచ— "నచాప్యాచరితః పూర్వై రయం ధర్మో మహాత్మభిః" అను ద్రుపదవాక్యములో, ఇది పూర్వులైన మహాత్ములచే నాచరింపబడిన ధర్మము కాదు. అనునపుడు పూర్వులనగా ద్రుపదునియొక్క పూర్వులని యర్థముచెప్పవలె నన్నమాట. అప్పుడు మా పూర్వులలో నున్నదని ధర్మజుడనగా, మాపూర్వులలో లేదని ద్రుపదుడన్నట్లా?

ద్రుపదుడు, పూర్వులలో నెచ్చటను లేదని యనక మాపూర్వులలో లేదని మాత్రమే చెప్పెనను పక్షములో ధర్మజునిపూర్వులలో నున్నట్లంగీకరించె నని తేలును. అట్లంగీకరించిన ద్రుపదునకు పూర్వులలో నట్టి యాచార మున్నదనుటకై నిదర్శనముగా గొందరిని చూపిన ధర్మజుడు తన పూర్వులలోనివారిని చూపవలసినపని లేదు కనుక, ద్రుపదునిపూర్వులలోనివారిని చూపినట్లు ప్రతివాదు లనవలసి యుండును. అప్పుడు తిబేతీయులుగా ప్రతివాదులచే నూహింపబడు పాండవులపూర్వులలోనే కాక, తిబేతీయుడుకాని ద్రుపదునిపూర్వులలోగూడ నట్టి యాచార మున్నటు లొప్పుకొనవలెను. ఈస్థితిలో నొక్కతె ననేకులు పెండ్లియాడుట భారతీయాచారముగాగూడ సిద్ధించి యుండ తన్మూలమున పాండవులు తిబేతీయులను ప్రతివాదుల భావన దుర్భావన కాదా?

పూర్వులలో నిది యున్నదని ధర్మజుడు చూపిన నిదర్శనము చూడుడు—

"శ్రూయతే హి పురాణేఽపి జటిలానామ గౌతమీ ।
ఋషీ నధ్యాసితవతీ సప్త ధర్మభృతాం వరా ॥
తథైవ మునిజా వార్క్షీ తపోభి ర్భావితాత్మనః ।
సంగతాఽభూ ద్దశభ్రాతౄ నేకనామ్నః ప్రచేతస ॥

వ. "మరియుం దొల్లి గౌతముం డను జటిలుడను ఋషి కూతురు

తపఃప్రభావంబున నేడ్వురు ఋషులకు నొక్కతియ భార్యయయ్యె
ననియును, దాక్షాయణి యను మునికన్యక యేకనామంబున ప్రచే
తసు లనంబరగిన పదుండ్రకు నొక్కతియ భార్యయయ్యెననియును
గథల వినంబడు" (ఆంధ్రభారతము)

ప్రతివాదులిచ్చట నా మునికన్యకలు టిబేటీయులే, ఆఋషులును,
ప్రచేతసులును టిబేటీయులే, వారిచరిత్రముగల ఆపురాణము టిబేటీయు
లదే. అందురాయేమి? ఎంత యన్యాయము!

—: టిబెట్టు దేశచరిత్రాంశము :—

ఇంకొకటి. టిబెట్టుదేశచరిత్రము దెలిపెడి గ్రంథములోని విష
యము లిట్లున్నవి— "టిబెట్టుదేశప్రజలందరును ఒకవిచిత్రమైన బౌద్ధ
మతము ననుసరించుచున్నారు. ఒక్క ఆచారముమాత్రము టిబెట్టు
దేశమున ప్రత్యేకముగ విఖ్యాతి గాంచినది. ఒకస్త్రీ ఇరువురనుగాని,
అంతకంటె ఎక్కువమందినిగాని భర్తల గలిగియుండుట. తన తలి
దండ్రులు నిర్ణయించినవరులనే స్త్రీ పెండ్లిచేసికొనవలయును. వివాహ
సంబంధము నిశ్చయమైన విషయముకూడ కుమార్తెలకు తలితండ్రులు
తెలుపరు. ఇట్టి నిర్బంధవివాహములు విడాకులతో నంతమొందును.
కుటుంబపుబౌద్ధపురోహితులు గ్రామదేవతలకును, గృహదేవతలకును
ప్రీతిగ పూజలు చేయుదురు. అదేకాలమున కన్యాగృహమున నేటి
టిబెట్టుదేశపు పూర్వమతమైన "బాన్" మతానుసారముగ వివాహ
సంస్కారము జరుపబడును" (పీపుల్ ఆఫ్ నేషన్సు).

దీనినిబట్టి టిబెట్టుదేశస్థులది అవైదికమైన బౌద్ధమతము. పాండ
వులది వైదికమతము. టిబెట్టుదేశస్థుల వివాహవిధానము 'బాన్'
మతానుబద్ధము. పాండవుల వివాహవిధానము వేదమంత్రానుబద్ధము.
టిబెట్టుదేశస్థులకు బౌద్ధుడు పురోహితుడు. పాండవులకు ఋషి పురో
హితుడు. టిబెట్టుదేశమున కన్యకకు దెలుపకయే తల్లిదండ్రులచే

స్వయముగా నిర్ణయింపబడిన వరులు. పాండవులో స్వయంవరపూర్వకముగా పరిగ్రహింపబడినవారు. ఇట్టి పాండవులనుబట్టికొని అట్టిటిబెట్టు దేశస్థు లనుటకంటె నన్యాయ మున్నదా?

ఇంత యంతర మున్నను పాండవులు తిబేతీయులే అను ప్రతివాదిప్రసంగముజూడగా నొకానొక మహాకవిసూక్తి జ్ఞప్తికి వచ్చుచున్నది—

"కాకే కార్ష్ణ్య మలౌకికం ధవళతా హంసే నిసర్గస్థితా
గాంభీర్యే మహ దన్తరం వచసి యో భేద స్స కిం కథ్యతే ।
ఏతావ త్సువిశేషణెవ్వపి సఖె య త్రేద మాలోక్యతే
కే కాకాః ఖలు కే చ హంసశిశవో దేశాయ తస్మై నమః ॥"

కాకమునకు నలుపు హంసమునకు తెలుపు, స్వభావసిద్ధములు. ఆరెంటికి గల గాంభీర్యములో గొప్ప అంతర మున్నది. పలుకులోని భేదము చెప్పనక్కరయే లేదు. ఇట్లున్నను కాకములకును, హంసములకును ఏమిభేద మనువారెచ్చట నుందురో ఆదేశమున కొక్క నమస్కారము. అనితాత్పర్యము. అంశాంతరమందుకొందము.

—: 'పాండవులలో ఆర్యావర్తస్మృతిధర్మములకు విరుద్ధముగా వివాహములు జరిగె' నను ప్రసంగము—తన్నిరాకరణము:—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— "పాండవులలో ఆర్యావర్తస్మృతిధర్మములకు విరుద్ధముగా మేనమామకూతు రగు సుభద్రను అర్జునుడును, విజయను సహదేవుడును పెండ్లియాడిరి. విజయ యన్యజాతిస్త్రీయందు శల్యునకు బుట్టియుండును. శిశుపాలుడు పాండవులకు బినతల్లికుమారుడు ఆతని కుమార్తె వావిచే బాండవులకు గూతురు కావలసియున్నది. కాని శిశుపాలుని కుమార్తెయగు 'కరేణుమతిని' నకులుడు పెండ్లియాడెను. (పు—241)

ప్రతివాదుల మహాపురుషదూషణధోరణి సర్వతోముఖముగా సాగుచున్నది. తాము చేయు మహాపురుషదూషణముల కుపయోగించునట్లు తమకు దోచినపుడు గ్రంథములు ప్రమాణములగుచున్నవి. ఆ గ్రంథములే తమ బుద్ధికి విరుద్ధముగా మహాపురుషపూజ్యతాప్రతిపాదకములై కనబడినపుడు అప్రమాణములై పోవుచున్నవి. కానిండు, అర్జునునకు సుభద్రావివాహము మాతులకన్యావివాహమగుటచే స్మృతివిరుద్ధ మనుచున్నారు. ఈవిషయమై పరాశరమాధవీయములో విశేషముగ చర్చించి విరుద్ధము కాదని నిరూపింపబడినది—

"తస్మా చ్ఛ్రుతా వనుగృహీతో౽యం వివాహః। స్మృతయస్తు బ్రాహ్మాదిషు సాపిండ్యనిరాకరణేన మాతులసుతావివాహప్రాపకతయా ప్రదర్శితాః। శిష్టాచారశ్చ దాక్షిణాత్యానా మవిగీత ఉదాహృతః" అని.

ధర్మసింధువులో నిట్లున్నది—

"మాతులకన్యాపరిణయనే౽పి "మాతులస్యేవ యోషాభాగస్తే పైతృష్వసేయీ౦వపా మివ" (అస్య వ్యాఖ్యానభూతం వచనమ్—మహాభారతటీకాయామ్— "యోషా౽పత్యం మాతులీయం యథా భాగః పితృష్వసుః। పుత్రీస్త్వేవం వపాంతే ౽౦శం జుషస్వేన్ద్రో త్వ్రపి ర్జగా ॥) ఇతి మన్త్రలింగైః। మాతులస్య సుతా మూఢ్వా మాతృగోత్రాం తథైవ చ। సమానప్రవరాం చైవ త్యక్త్వా చాన్ద్రాయణం చరేత్। ఇత్యాది స్మృతీనాం బాధాత్ యేషాం కులే మాతులకన్యాపరిణయః పరంపరాప్రాప్తః తైః స కార్యః। మాతులకన్యావివాహస్య కలివర్జ్యత్వవచన మపి యేషాం కులే దేశే మాతులకన్యావివాహో నాస్తి తత్పరం। మాతులకన్యాపరిణయనస్యానేకశ్రుతిస్మృతిసిద్ధత్వాత్। ఇత్యాది కౌస్తుభే బహూపపాదితమ్" అని.

మరియు రుక్మిణీశ్రీకృష్ణపుత్రుడగు ప్రద్యుమ్నునకును, రుక్మిణీ సోదరుడగు రుక్మికి పుత్రికయైన రుక్మవతికిని జరిగినది మాతులకన్యావివాహమే. శ్రీమద్భాగవతమును జూడుడు—

"యద్యప్యనుస్మరన్ వైరం రుక్మీ కృష్ణావమానితః ।
వ్యతరద్భాగినేయాయ సుతాం కుర్వన్ స్వసుః ప్రియమ్ ॥"

కనుక సుభద్రావివాహము ప్రతివాదు లన్నట్లు స్మృతివిరుద్ధము, లోకవిరుద్ధము కాదని తెలినది.

ఇక రెండవది — 'సహదేవుడు విజయను వివాహమాడెను. ఆ విజయ సహదేవుని మేనమామయగు శల్యుని పుత్రిక. కనుక నది మాతులకన్యావివాహము' అని వ్రాసినారు. అపై "విజయ అన్యజాతి స్త్రీయందు శల్యునకు బుట్టియుండును" అని యూహాగానముచేసినారు. ఈయూహాగాన మెంతశ్లాఘ్యమో, ఎంతశ్రావ్యమో నిర్ణయించు భారము విజ్ఞులకే వదలి, విజయ మాతులసుత కాదనియే నిరూపించుచున్నాము—

"సహదేవోఽపి మాద్రీమేవ స్వయంవరే విజయాం నామోపయేమే, మద్రరాజస్య ద్యుతిమతో దుహితరమ్" (ఆది–అ95)

దీనిచే విజయ మద్రరాజగు ద్యుతిమంతుని కుమార్తెకాని, శల్యుని కుమార్తె కాదని స్పష్టము.

ఇక మూడవది — "నకులస్తు చైద్యాం కరేణుమతీం నామ భార్యాముదావహత్" (ఆది–అ95)

అనియే యున్నది. ఇచ్చట చైద్యాశబ్దము చేదిదేశపురాజు కుమార్తెను జెప్పును. ఆచేదిదేశపురాజు శిశుపాలుడే కాక అన్యుడని తెలిసికొనవలయును. సహదేవుని భార్యయగు విజయయందు ప్రయోగింపబడిన మాద్రీశబ్దము మద్రదేశపురాజు పుత్రికయని చెప్పుచున్నది. ఆమద్రదేశపురాజు శల్యుడేకాక ద్యుతిమంతుడని పూర్వోక్తవాక్య

ములో జెప్పబడలేదా? కనుక కరేణుమతీవివాహము విరుద్ధము కానిదే యని గ్రహింపవలయును.

ఇంకొకటి. ప్రతివాదులు తమచే టిబెటుదేశీయులుగా భావింప బడిన పాండవులు విధినిషేధములు లేకుండ వివాహములు చేసికొని నట్లు చెప్పగలరుకాని యట్టి పాండవులకు తమతమ కుమార్తెల నిచ్చి మహర్షిసమ్మతములుగా వివాహములుచేసిన భారతీయక్షత్రియోత్త ములు కూడ విధినిషేధములు లేకుండ సంచరించినారని చెప్పుటకు నో రెట్లువచ్చును.

"ధర్మ మరసి పూని ధర్మరాజాదులు నిర్మలంపుకీర్తి నిలుపుకొనిరి" అని వేమనకవిచేగూడ ధర్మాత్ములని కీర్తింపబడిన పాండవులను అధర్మపరులని వ్రాసిన ప్రతివాదులవ్రాత హేయము.

—: 'అర్జును డైదేండ్లు టిబెటులోనె యుండె' ననుప్రసంగము— తన్నిరాకరణము :—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— "పాండవులు ద్యూతజితులై కౌరవులను జయించుటకొరకు యుద్ధసన్నాహముల జేయుట కర్జును డైదేండ్లు 'త్రివిష్ట' దేశము (టిబెటు)లోనె యుండి పరికరములను సంపాదించెను" (పు 241)

మహాభారతములోని అవాంతరపర్వములలో నొకటి ఇంద్ర లోకాభిగమనపర్వము. అందు అర్జునుడు పాశుపతాస్త్రము నీశ్వరు డనుగ్రహించినతరువాత నింద్రలోకమునకు వెళ్ళుట, మహాస్త్రము లను గ్రహించుట, ఐదుసంవత్సరము లచ్చటనే యుండుమని యాజ్ఞను బట్టి యుండుట చెప్పబడినది చూడుడు—

"ఏవం సంపూజితో జిష్ణు రువాస భవనే పితుః ।
ఉపశిక్ష న్మహాస్త్రాణి స సంహారాణి పాడవః ।
శక్రస్య హస్తా ద్దయితం వజ్ర మస్త్రం చ దుస్సహమ్ ।

అశనిశ్చ మహానాదా మేఘపఙ్క్తిర్విలక్షణా ॥
గృహీతాస్త్రస్తు కౌన్తేయో భ్రాతౄన్ సస్మార పాండవః ।
పురందరనియోగాచ్చ పంచాబ్దా నవస త్సుఖీ ॥" (వనప-అ 44)

విషయ మిట్లుండ ప్రతివాదు లేమని వ్రాసినారు? 'అర్జును డైదేండ్లు త్రివిష్టదేశము (తిబెతు) లోనె యుండి పరికరములను సంపాదించెను' అని. వీరు చేసిన మోసము చూడుడు. అమరకోశములో 'స్వర్గ, నాక, త్రిదివ, త్రిదశాలయ, సురలోక, త్రివిష్టప' శబ్దములు స్వర్గమునకు పేరులని చెప్పబడినది. 'తృతీయం విష్టపం(భువనం) త్రివిష్టపమ్' అని వ్యుత్పత్తి. అట్టి త్రివిష్టపశబ్దములోనుండి నిరర్థకమైన 'త్రివిష్ట' అనుదానిని విడలాగి దానికి తిబెతు అర్థమని చెప్పి అర్జును డా తిబెతులోనే యుండెనని లోకులకు దెలిపినారు.

## —: స్వర్గలోకము తిబెతుదేశము కాదు :—

అసలు స్వర్గమర్త్యపాతాళము లని మూడు లోకములు. స్వర్గ మూర్ధ్వలోకము. పాతాళ మధోలోకము. ఇది మర్త్యలోకము. ప్రతివాదుల తిబెతుదేశము ఈమర్త్యలోకములోనేక దేశము. స్వర్గలోకమం దుండువారుఅమర్త్యులు మరణధర్మములేనివారు. ఈలోకములోనివారు మర్త్యులు మరణధర్మముగలవారు. తిబెతులోనివారు మర్త్యులే. ఇట్టి తిబెతుదేశము స్వర్గమా?

"హతో వా ప్రాప్స్యసి స్వర్గమ్" అని చెప్పబడిన స్వర్గము తిబెతుదేశమా? మరణించినవారిని స్వర్గస్థులైనా రనగా తిబెతులో నున్నారనియే యర్థమా? పుణ్యాత్ములకు స్వర్గప్రాప్తి యనగా తిబెతు దేశప్రాప్తియని యర్థమా? వీరిధోరణి లోకవిరుద్ధము.

స్వర్గలోకవిషయము మహాభారతమం దెట్లు చెప్పబడెనో చూడుడు—

"ఉపరిష్టాచ్చ స్వర్లోకో యోఽయం స్వరితి సంజ్ఞితః ।
ఊర్ధ్వగ స్సత్పథ శ్శశ్వ ద్దేవయానచరో మునే ॥
నాఽతప్తతపసః పుంసో నామహాయజ్ఞయాజినః ।
నానృతా నాస్తికా శ్చైవ తత్ర గచ్ఛన్తి ముద్గల ॥
ధర్మాత్మానో జితాత్మాన శ్శాన్తాదాన్తా విమత్సరాః ।
దానధర్మరతాః పుంస శ్శూరా శ్చాహవలక్షణాః ॥
తత్ర గచ్ఛన్తి ధర్మాగ్ర్యం కృత్వా శమదమాత్మకమ్ ।
దేవా స్సాధ్యా స్తథా విశ్వే తథైవ చ మహర్షయః ॥
యామాధామాశ్చ మౌద్గల్య గన్ధర్వాప్సరస స్తథా ।
ఏషాం దేవనికాయానాం పృథ క్పృథ గనేకశః ॥
భాస్వంతః కామసంపన్నా లోకా స్తేజోమయా శ్శుభాః ।
న క్షుత్పిపాసే న గ్లాని ర్న శీతోష్ణే భయం తథా ॥
బీభత్స మశుభం వాపి తత్ర కించి న్న విద్యతే ।
న శోకో న జరా తత్ర నాయాసపరిదేవనే ॥
ఈదృశ స్స మునే లోక స్స్వకర్మఫలహేతుకః ।
తైజసాని శరీరాణి భవ న్త్యత్రోపపద్యతామ్ ॥
కర్మజా న్యేవ మౌద్గల్య న మాతృపితృజా న్యుత ।
న సంస్వేదో న దౌర్గన్ధ్యం పురీషం మూత్రమేవ చ ॥

(వనప-అ261)

ఆంధ్రభారతము—

క. ఈలోకమునకు మీఁదై, చాలగ వెలుఁగొందుచుండు స్వర్లోకము నా
నాలంకారయుతము ది,వ్యాలోకము దేవయాన మది మునినాథా.

చ. అమలతపోనివాసులు మహాధ్వరశీలురు సత్యసంధు లు
త్తములు జితేంద్రియుల్ సములు దానపరుల్ రణశూరులందు హ,
ర్షమున వసింతు రచ్చరలు సాధ్యులు దేవమునుల్ మరుద్వసు
ప్రముఖులు వేలువేల తగు పట్టులనుండుదు రంద యిమ్ములన్.

వ. అయ్యెడల నాకలియు, నీరువట్టును, శీతోష్ణభయంబులును, జరా రోగవికృతులును బుట్ట వెయ్యెడలం జూచిన నతిమనోహరంబై, సకలేంద్రియతర్పణంబై యుండు నిట్టిలోకంబునకు నర్హు లయిన పుణ్యపురుషులు విధినియోగపక్వంబు లయిన మానుషశరీరములు విడిచి తేజోమయంబులగు దివ్యదేహంబులు ధరియించి, వివిధాంబరాభరణభూషితులును, నమ్లానకుసుమమాలికామనోహరులు నునై కనకవిమానంబులందు దేవమాతలచేత గొనిపోవంబడి యందు శోకశ్రమాయాసవిరహితులై వివిధ సుఖంబు లనుభవించుచుండుదురు"

ఇట్లు జరామరణరోగమూత్రపురీషాదిదుర్గుణములు లేని తేజోమయశరీరములతో విరాజిల్లు పుణ్యమూర్తులును, అణిమాదిశక్తిసంపన్నులును అగు దేవతల కాస్పదమై నాస్తికుల కప్రియమైన స్వర్గలోక మెక్కడ, ప్రతివాదుల తిబెతుదేశ మెక్కడ, అద్వైదికసంప్రదాయస్థుడైన అమరసింహుడుకూడ స్వర్గము ఈలోకముకంటె భిన్నమైన దేవలోకమని చెప్పియుండ ప్రతివాదులు తిబెతుదేశమును స్వర్గలోకమనుట వెఱ్ఱి. కనుక ప్రతివాదిప్రసంగమునకు త్రోసిపేత యైనది.

"నిస్పృహాయుల్లగు పాండవులు ఈ దేశమున నుండిన మాటదక్కదని రాజ్యమును పరీక్షిత్తునకు వశపరచి, హిమాలయాదుల నతిక్రమించి, తిబెత్తునందే మృతి నొందిరి" (పు 249)

అని మ. భా. చ కారులు వ్రాసినారు. పాండవులు మహాప్రస్థానము చేసి స్వర్గము నధిష్ఠించినట్లున్న విషయమునకు ప్రతివాదులు కల్పించిన ప్రక్రియ యిది. పాండవుల జననమరణములను తిబెతుదేశములోనే ముడిపెట్టి, యీ ప్రబుద్ధులెంతో అవినీతిగా వ్రాసినారు. వెనుక జూపిన చరకసంహితావచనములనుబట్టి యిది నాస్తిక్యబుద్ధికి జెందిన ధోరణికనుక హేయము. సుయోధనవిజయములోని యొక ఆక్షేపము నందుకొందము—

—: "భీమార్జునులు ద్రౌపదిని దీసికొనివచ్చి భిక్ష దెచ్చితి
మనుట తప్పను ప్రసంగము-తన్నిరాకరణము :—

"భిక్షయంచు నివేదించిరట మీరా, తల్లితో నవ్వు డధర్మవృత్తి,
భిక్షగా నిడెనొక్క వెలదిని మీమామ, బిచ్చంబుగా మీరు దెచ్చుకొనిరె
అని గెల్చి తెచ్చిన యతివ భిక్షం బౌనె, మనుజుల భిక్షంబు మహిని గలదె"

ఇది పాండవులను, కవి దుర్యోధనునిచే నిందింపజేసినవిషయము.

"భీమార్జునులు ద్రౌపదీసహితులయి చనుదెంచి మ్రొక్కి మే మొక్కభిక్ష దెచ్చితిమని తల్లికి నివేదించిన" (ఆంధ్రభారతము)

అని యుండుటచే వారట్లనుట తప్పని కవిగారి యూహ. వీరు భిక్ష యనగా తినెడి పదార్థమే యని యూహించిన ట్లున్నది. అమర కోశములో "యాచ్ఞా భిక్షార్థనార్దనా" అడుగుటపేళ్లు. "భిక్షా సేవార్థనా భృతిః" భిక్షాశబ్దము సేవించుటకును యాచించుటకును కూలికిని పేరు. అని యున్నది. ఇందేయర్థము జూచినను క్రియా రూపమే యగుటచేతను కూలి యనునది ప్రకృతోపయుక్తముకాకుం డుటచేతను 'భిక్ష దెచ్చితిమి' అనునపు డీయర్థమ్ములు సరిపడవు. ఇక "భిక్షా భిక్షితవస్తుషు" అనియుండుటవలన భిక్షయనగా భిక్షితవస్తువు. భిక్షితవస్తువనగా కోరబడినవస్తువని యర్థము, అది తినదగినదే కానక్కఱలేదు. వారప్పుడు తెచ్చిన ద్రౌపది కోరబడినదే కనుక భిక్షిత వస్తువగుటచే భిక్ష దెచ్చితిమని వారు చెప్పినారు. కనుక నామాటలో తప్పు లేదు.

ఇంకొకటి— కుంభకారగృహమునకు వారు ద్రౌపదిని తీసికొనివచ్చునప్పటికి కుంతీదేవి యెదుట లేదు. గృహాభ్యంతరమం దున్నది. ఆమెను దర్శింపకయే వారు సంతోషముతో కేకవేసి యట్లు "భిక్ష దెచ్చితి" మని చెప్పినారు. అప్పటికే కుంతీదేవి—

"తేషాం మాతా బహువిధం వినాశం పర్యచిన్తయత్ ।
అనాగచ్ఛత్సు పుత్రేషు భైక్షకాలేఽభిగచ్ఛతి ॥" (ఆది-అ. 19:)

భిక్షాకాలము అతిక్రమించుచున్నది. వారింకను రాలేదు. ఏమి కష్టము కలిగెనో! అని పరితపించుచుండెను. అట్టి స్థితిలో వెళ్ళి యీ మాట జెప్పగా—

"కుటీగతా సా త్వనవేక్ష్య పుత్రౌ ప్రోవాచ భుంక్తేతిసమేత్య సర్వే । పశ్చాచ్చ కున్తీ ప్రసమీక్ష్య కృష్ణాం కష్టం మయా భాషిత మిత్యువాచ ॥

ఇంటిలోనున్న కుంతీదేవి వారిని చూడకయే మీరందరు గలిసి యనుభవింపుడని చెప్పి యీవలకువచ్చి ద్రౌపదీదేవినిజూచి 'అయ్యో నేనెంత తప్పుమాటాడితిని' అని తా నాలోచింపకపలికినందుకు పరితపించినది. అంతేకాని మీరు ద్రౌపదినిదెచ్చి భిక్షదెచ్చితి మన వచ్చునా? అని కుమారులు తప్పుమాటాడినారని మందలింపలేదు. కనుక వారు భిక్షదెచ్చితిమనుటలో తప్పులేదన్నమాట. అది తప్పను ప్రతివాదుల యూహాయే తప్పు.

అది యట్లుండ 'మీరందరు గలిసి యనుభవింపుడు' అను కుంతీదేవిమాట అయత్నసిద్ధముకాని బుద్ధిపూర్వముకాదని స్పష్టము. ఇట్లుండ—

మ. భా. చ. కారులు— "కుంతీదేవికూడ పాండురాజు కాక సూర్యాదులను నల్వురను వరించినదిగాన సమానస్కంధురాలగు కోడలుండిన మంచిదేయని తలచిన దలంచి కొంత ప్రోత్సాహము జేసియుండును" (పు 225) అని వ్రాసినారు.

వీరి దెంతదురభిప్రాయమోచూడుడు. "దోషోఽప్యవిద్యమానో ఽపి తచ్చిత్తానాం ప్రకాశతే" అను న్యాయమున నది, పవిత్రతగల కుంతీదేవియం దున్నదికాక వీరి చిత్తమందున్న దోషమే. ఏకైక

భర్తృకలగు సుభద్రాదులయెడ జేయని ప్రోత్సాహమును ద్రౌపదీదేవి యెడ జేయునా? అనియైన వీరికి తోచలేదు. కనుక వీరిది యప్రసంగము.

ఇక కవిగారి యాక్షేపములో "మనుజులభిక్షంబు మహిని గలదె" అను విషయ మున్నది. వారి కీ యాంధ్రభాగవతములోని పద్యమును జూపుదము—

మ. తతమత్తద్విపయానయై కుచనిరుంధచ్చోళసంవ్యానయై
ధృతబాష్పాంబువితానయై కరయుగాధీనాళికస్థానయై
"పతిభిక్షాం మమ దేహి కోమలమతే" పద్మాపతే" యంచు ద
త్సతి వింధ్యావళి చేరవచ్చె ద్విజగద్రక్షామనుక్ వామనున్.

ఇందున్న పతిభిక్షాశబ్దమునకు పతిరూపమైనభిక్షయని యర్థము కనుక కవిగారు 'మనుజులభిక్షంబు మహినిగలదు' అని గ్రహింతురుగాక. మరల మ. భా. చ. కారులవ్రాతనే అందుకొందము.

—: "వీరికి ధర్మరాజేకాని యాతని చేత లధర్మయుక్తములని వేమన చెప్పె" ననుప్రసంగము—తన్నిరాకరణము: —

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— "వీరికి ధర్మరాజె కాని యాతని చేతలుమాత్రము అధర్మయుక్తము లని యొక తెనుగుకవి ప్రాచీనకాలమున నుడివెను— "పేరు ధర్మరాజు పెద వేపవిత్తయూ విశ్వదాభిరామ వినురవేమ" (పు 24)

వేమనకవి పాండవజ్యేష్ఠుడగు ధర్మరాజును గూర్చియే అట్లు చెప్పెనని ప్రతివాదుల భ్రాంతి. వారి కొకింత తెలుపుదము—

"ధర్మమరసి పూని ధర్మరాజాదులు నిర్మలంపుకీర్తి నిలుపుకొనిరి,
ధర్మమే నృపులకు తారకయోగంబు విశ్వదాభిరామ వినురవేమ.

అనుచు నే ధర్మరాజును ధర్మాత్ముడని వేమనకవి శ్లాఘించెనో ఆధర్మరాజునే ఆవేమనకవి యధర్మపరుడని యెట్లు నిరసించును? వేమన కవి ప్రతివాదులవలె స్వవచనవ్యాఘాతముగా మాటలాడువాడేనా?

ఆపద్దెములలో నొకటి, అసలు ధర్మరాజునుగూర్చియు నొకటి, పేరు ధర్మరాజునుగూర్చియు జెప్పబడెను. ఆ అసలుధర్మరాజే ఈ పాండవ జ్యేష్ఠుఁడును, ఈప్రతివాదుల నింద్యప్రసంగములకు గురిచేయబడుచున్న వాఁడును. ఆధర్మరాజునే "ధర్మమరసి పూని ధర్మరాజాదులు" అను పద్దెముచే వేమనకవి మెచ్చుకొని శ్లాఘించెను. ఇక ప్రతివాదు లెత్తుకొనినది పేరుధర్మరాజునుగూర్చి చెప్పబడినదే. అనగా, ఆధర్మరాజు పేరు పెట్టబడినవా డన్నమాట. అతడే "పేరుధర్మరాజు పెనవేప విత్తండ్రు" అని చెప్పబడెను. పేరుపెట్టుకొనినంతమాత్రమున ఆధర్మరాజుయొక్క ధర్మనిష్ఠ యెక్కడ నుండు నని తాత్పర్యము. కనుకనే—

"అనురో మరణవ్యాధి రీశ్వరో భారవాహకః ।
సావిత్రీ బాలవిధవా నామధేయం న సార్థకమ్ ॥"

అని చెప్పబడినది. కనుక పేరుధర్మరాజు. పద్దెము అసలు ధర్మరాజు నెంతమాత్రము స్పృశింపజాలదు. కాబట్టి ప్రతివాదిప్రసంగము సాప్తమైనది. కృష్ణభగవానుడు ధర్మరాజునుగూర్చి చెప్పిన విషయము జూడుఁడు—

"న కామ్యధర్మేషు రతి స్తవాఽస్తి
కామా న్న కించిత్కురుషే నరేన్ద్ర ।
న చాఽర్థలోభా త్ప్రజహాసి ధర్మం
తస్మా త్ప్రభావా దసి ధర్మరాజః ॥" (వనప-అ183)

అర్థలోభమున ధర్మము నతిక్రమింపక, విధుల నుల్లంఘింపక నీవు నిష్కామధర్మరతుఁడ వగుటను బట్టి ధర్మరాజు వైతివి. అని తాత్పర్యము. ఇట్టి ధర్మరాజు ప్రతివాదులకు నింద్యుఁడయిపోయెను. 'శాంతం పాపమ్' ... ... ధర్మరాజును ధర్మాత్ముడని చెప్పిన వేమన కవియే దుర్యోధనుడు కులఘాతకుడని చెప్పినమాటను దుర్యోధన పక్షపాతులకు విన్నవించుచున్నాము —

ఆ. రాము డొకడు పుట్టి రవికుల మీడేర్చె
కురుపతి జనియించి కులము జెరిచె,
ఇలను పుణ్యపాప మీలాగు గాదొకో
విశ్వదాభిరామ వినుర వేమ.

—: "ధర్మరాజు ద్యూతసమయములో బుద్ధిహీనముగా బ్రవర్తించి ఛీఛీ యనిపించుకొనెను" అనుప్రసంగము-తన్నిరాకరణము :—

మ. భా. చ. కారులవ్రాత యిట్లున్నది— "ధర్మాత్ముడు, బుద్ధిశాలి, రాజకీయవేత్త యని ప్రసిద్ధికెక్కిన ధర్మరాజు ద్యూత సమయమున నధర్మముగా బుద్ధిహీనముగా ప్రవర్తించి పెద్దలచే సభయందు ఛీఛీ యనిపించుకొనుట వింతగ నున్నది. ధర్మజుడు ద్రౌపది నొడ్డినపు డేమనెనో చూడుడు—

పొట్టిది పొడుగుది కానట్టియు ...లక్ష్మీసమానురాలైనట్టియు... సత్యము, రూపసంపత్తి, శీలసంపత్తి కలిగినట్టిదియు సర్వగుణము లతో గూడినట్టిదియు...అట్టి పాంచాలితో పందెమువేయుచు న్నాను. శకునీ! ఎంతకష్టము? అనెను. (పెండ్లామును జూదమున నొడ్డువాడు పెండ్లామును మిగుల వర్ణింపవలయుంగాబోలు) ఇట్లు బుద్ధిమంతుడగు ధర్మజుడు పలుకగా సభయందుండిన పెద్దలందరు ఛీఛీ యనిరి. ఆసభ క్షోభించెను. రాజులకు విచారము కలిగెను" (పు 247)

"అట్టి పాంచాలితో బందెమువేయుచున్నాను. శకునీ ఎంత కష్టము?" అని ధర్మజుడు డన్నట్లు వ్రాసిన ప్రతివాదులకు 'శకునీ ఎంతకష్టము' అని పలికిన యాధర్మజునికష్టమును గ్రహింపగల యోగ్యతలేకపోవుటే కాక 'జూదమున పెండ్లామును వర్ణింపవలయుం గా బోలు' అనుటలో వారి రసగ్రహణయోగ్యతకూడ స్పష్టమయినది.

ద్రౌపదిని పణముగా మొదట ధర్మజుడు పెట్టక, తన్నే పెట్టు కొని యోడిపోయినతరువాత శకుని "పణస్వ కృష్ణాం పాంచాలీం

తయాత్మానం పునర్జయ" అనుచు ద్రౌపదిని పణముగా బెట్టుమని నియోగించెను. అప్పటి కోడిపోయి, పరాధీనుడై యున్న ధర్మజుడు వారు చెప్పినట్లు చేయవలసివచ్చుటచే బరితపించుచు, పణముగా ద్రౌపది నొడ్డునప్పు డొక్కసారి యాసాధ్వి స్వరూపస్వభావముల గీర్తించుచు "నైవ హ్రస్వా న మహతీ" ఇత్యాద్యుత్తమలక్షణములు వెల్లడించి "గ్లహం దీవ్యామి చార్వంగ్యా పాంచాల్యా హంత సౌబల" అనుచు, శకునీ! కష్టము. అట్టి పాంచాలిని పణముగా బెట్టుచున్నాను. అనెను. ఆపై —

"ఏవ ముక్తే తు వచనే ధర్మరాజేన ధీమతా ।
ధిగ్ధిగిత్యేవ వృద్ధానాం సభ్యానాం నిస్సృతా గిరః ॥
చుక్షుభే సా సభా రాజన్ రాజ్ఞాం సంజజ్ఞిరే శుచః ।
భీష్మద్రోణకృపాదీనాం స్వేదశ్చ సమజాయత ॥
ఇతరేషాన్తు సభ్యానాం నేత్రేభ్యః ప్రాపత జ్జలమ్ ।"

ధీమంతు డగు ధర్మరాజిట్లనగానే సభ్యులలో నిందావచనములు, దుఃఖము, కన్నీరు బయలుదేరినవి.

ఇచ్చట బరిశీలింపవలసియున్నది. ధర్మజుడు ద్రౌపదిని తా నెంత తప్పింపదలచినను తనోడినతరువాత పరప్రేరణను బట్టి తప్పినది కాదు. ఆమె నొడ్డకుండుటకే సమ్మతించువారు సభ్యులు. పరప్రేరణను బట్టి ధర్మజ్ఞుడగు ధర్మజుడు పరితపించుచు, ఆమె యుత్తమలక్షణసంకీర్తనము జేసి కష్టముతో 'శకునీ! యామెనొడ్డుచున్నా'నని పలికినతోడనే యాసభ్యుల హృదయములు చలించినవి. అప్పు డామె నొడ్డుమని ప్రేరేపించినవానిని కొందరు నిందించిరి; కొందరు క్షోభించిరి; కొందరు శోకించిరి. అంతియకాని వారు నిందించినది ధర్మజుని కాదు. పరప్రేరణను బట్టి యవశుడై యామె నొడ్డిన ధర్మజుని తప్పేమున్నదని నిందింతురు? ఆమెను గూడ తుదకు ఒడ్డక తప్పినదికాదే యని ఖేదపడుచు

నప్పుడు స్మృతికి వచ్చిన యామె యుత్తమగుణములను ఆకష్టసమయ ములో నొక్కసారి కీర్తించిన ధర్మజుని తప్పే మున్నదని నిందింతురు? అప్పుడా ధర్మజునియం దేమియు తప్పు లేదనుటకే "ధర్మరాజేన ధీమతా" అని శ్లోకములో జెప్పబడెను.

అట్టి యుత్తమకాంతను దుష్టులు స్వాధీనముచేసికొనెదరని సభ క్షోభించెను. ఆరాజపుత్రికి రాదగని యాపద వచ్చెనని రాజులు శోకించిరి. కొందరు కన్నీరుగార్చిరి. ఇది దీనిపరమార్థము. ప్రతివాదులన్నట్లు ధర్మజునే నిందించినపక్షములో 'చుక్షుభే సా సభా రాజన్ రాజ్ఞాం సంజజ్ఞిరే శుచః' 'ఇతరేషా న్తు సభ్యానాం నేత్రేభ్యః ప్రాపత జ్జలమ్' అని చెప్పబడినట్లు ఆధర్మజుని నిందించువారు క్షోభిం తురా? శోకింతురా? కన్నీరు విడుతురా?

ధర్మజుని ఇంతగా నిందించిన ప్రతివాదుల కాలక్షణములు కలి గినవా? కనుక ప్రతివాదుల దసంగతప్రసంగము.

ఇంకొకటి. వెనుకజూపబడిన యీప్రతివాదుల వ్రాతలో—

"ధర్మజుడు ద్రౌపది నొడ్డినపు డేమనెనో చూడుడు— పొట్టిది పొడుగుది కానట్టియు ... సర్వసుగుణములతో గూడినట్టిదియు ... అట్టి పాంచాలితో బందెము వేయుచున్నాను. ఇట్లు బుద్ధిమంతుడగు ధర్మజుడు పలుకగా సభయందుండిన పెద్దలందరు చీచీ యనిరి"

అని యున్నది. దీనినిబట్టి యామె నప్పుడు వర్ణించుటవలన ధర్మజుని నిందించినట్లు తేల్చినారు. వీరే తమయుత్తరభారతములో—

"రాజసూయావభృథస్నానపవిత్రీకృతాంగియు, సర్వాంగ సుందరియు సమ్రాజ్ఞికిం దగిన సమస్తగుణములుగలదియు నగు ద్రౌపదినిగూడ బణముగా నొడ్డి యోటువడెను. ధర్మజుడు మహా రాణిని బణముగ నొడ్డుటజూచి సభలోని భీష్మాదులాతనిని ధిక్కు ధిక్కని నిందించిరి" (పు 12)

అని వ్రాసి, ఆమెను పణవముగా నోడుటజూచి నిందించినట్లు వ్రాసినారు. ఇందేది నిజము? కనుక వీరివ్రాతలకు శుద్ధి, బద్ధము లేదు. పరాధీనుడై పరప్రేరణచేనోడ్డిన ధర్మజుని స్థితిని జూచుచున్న సభ్యులు ఆతనిని నిందించిరనుట అవివేకము.

ఇంకొకటి. ధర్మజునిచే గీర్తింపబడిన ద్రౌపదీలక్షణములను మ. భా. చ. కారులు రసాభాసములోనికి దింపినారో ఆ ద్రౌపదీలక్షణములనే చూపి మహాభారతమీమాంసాకారు లెట్లు వ్రాసియున్నారో చూడుడు— 'మహాభారతమందున్న స్త్రీపురుష వర్ణనము లతిమనోహరములు, మర్యాదాయుక్తములు నగుచున్నవి ... యుధిష్ఠిరుడు ద్రౌపదిని వర్ణించెను అదిచూడదగియున్నది' (సంపు 16)

ఆహా! అది మ భా. మీ. కారులకు మనోహరముగను, మర్యాదాయుక్తముగను నున్నది. మ. భా. చ. కారులకు బుద్ధిహీనముగ నున్నది. ఈవైలక్షణ్యము ప్రతివాదుల బుద్ధియందు దున్నదా? గ్రంథమందున్నదా?

—: "ద్యూతమందు ధర్మజుని అపేక్షిమయేగాని దుర్యోధనుని యన్యాయము కాన్పింపదు" అనుప్రసంగము-తన్నిరాకరణము: —

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— 'ద్యూతమున కాహ్వానింపబడిన ధర్మజుడు ప్రొద్దుటవలె సభలోనుండినవారిలో నెవరు నాతో ద్యూతమునకు గడగెదరనినపుడు సుయోధనుడు నాకై శకుని యాడునని తన యపేక్షిమను సత్యముగానె చెప్పియున్నాడు. అందాతనిలోపము గాన్పింపదు. శకుని ఒడ్డినపణములనన్నిటిని గెలిచెను. ఇందు ధర్మజుని యపేక్షిమయేగాని దుర్యోధనుని యన్యాయము కాన్పింపదు. దీనిని విరటుని సభలో బలరాముడుకూడ స్పష్టపరచియున్నాడు" (పు 261)

దుర్యోధనుని యన్యాయము గాన్పిపదను ప్రతివాదులకు గన బరచుచున్నాము— పాండవుల రాజసూయయాగమున పాండవా ఖండైశ్వర్యము జూచి దుఃఖపడి దుర్యోధనుడు శకునితో నిట్లనెను—

" వహ్నిమేవ ప్రవేక్ష్యామి భక్షయిష్యామి వా విషమ్ ।
అపోవాపి ప్రవేక్ష్యామి న హి శక్ష్యామి జీవితుమ్ ॥
సోఽహం న స్త్రీ న చాఽప్యస్త్రీ న పుమా న్నాఽపుమా నపి ।
యోఽహం తాం మర్షయా మ్యద్య తాదృశీం శ్రియమాగతామ్॥
ఈశ్వరత్వం పృథివ్యాశ్చ వసుమత్తాం చ తాదృశీమ్ ।
యజ్ఞం చ తాదృశం దృష్ట్వా మాదృశః కో న సంజ్వరేత్ ॥
అశక్తశ్చైక ఏవాహం తా మాహర్తుం నృపశ్రియమ్ ।
సహాయాంశ్చ న పశ్యామి తేన మృత్యుం విచిన్తయే ॥
కృతో యత్నో మయా పూర్వం వినాశే తస్య సౌబల ।
తచ్చ సర్వ మతిక్రమ్య సంవృద్ధోఽప్స్వివ పంకజమ్ ॥"

(సభాప_అ47)

శకునీ! నే నగ్నిలోనో, జలములోనో పడిపోవుదును; విషమైన తిందును; జీవింపజాలను. నేను సవతి యైశ్వర్యముజూచి సహించి పడియుండెడి స్త్రీని కాను; యుద్ధముచే పాండవుల జయించుటకు అస్త్ర బలముకలవాడనుకాను; అస్త్రబలముసంపాదింపసమర్థతకల పురుషుడను గాను; శత్రుసంపదనుసహించియుండుటకు క్లీబు(అత్యంతాసమర్థు)డను గాను; ఆపృథివీశ్వరత్వము, ఆయైశ్వర్యము, ఆయజ్ఞముజూచినావంటి వాడు పరితపింపకుండునా? ఆరాజ్యలక్ష్మిని నేనొక్కడనే అపహరింప లేను.సహాయపడువారు కనబడరు. అందుచే మరణించుటే మంచిదను కొనుచున్నానుఅధర్మజుని వినాశనమునకై నేనెంతయో యత్నించితిని. దానినంతనుఅతిక్రమించి నీటిలోని పద్మమువలె వృద్ధిపొందెను, అని. ఆపై శకునియిట్లనెను—

"యా మేతా మతులాం లక్ష్మీం దృష్టవా నసి పాండవే ।
తస్యాః ప్రాప్తా వుపాయం మే శృణు సత్యపరాక్రమ ॥
అహ మక్షే ష్వభిజ్ఞాతః పృథివ్యా మపి భారత ।
హృదయజ్ఞః పణజ్ఞశ్చ విశేషజ్ఞశ్చ దేవనే ॥
ద్యూతప్రియశ్చ కౌన్తేయో న చ జానాతి దేవితుమ్ ।
ఆహూత శ్చైష్యతి వ్యక్తం ద్యూతా దపి రణా దపి ॥
నియతం తం విజేష్యామి కృత్వా తు కపటం విభో ।
ఆనయామి సమృద్ధిం తాం దివ్యాం చోపాహ్వయస్వ తమ్ ॥"

(అ 49)

దుర్యోధనా! లోకోత్తరమైన పాండవసంపద నీకు ప్రాప్తించుటకు నే నుపాయము జెప్పెదను. పృథివిలో నే నక్షవిద్యయం దధికుడను, ధర్మజునకు ద్యూతమందు ప్రీతి; ఆతనికందు కౌశలము లేదు; ఆహ్వానించిన ద్యూతమునకుగాని, యుద్ధమునకుగాని యాత డిష్టపడును. నేను కపటము జేసి తప్పక ఓడింతును; ఆదివ్యసంపద నీకు రప్పింతును; ఆతని నాహ్వానింపుము. అని.

ఇట్లు శకునిదుర్యోధను లిరువురును కూడబలుకుకొని, తాము పిలిచిన రాడని ధృతరాష్ట్రునిచే నాహ్వానింపజేసి ధర్మజుని ద్యూతములోనికి దింపిన శకునిదుర్యోధనుల లోపము, అన్యాయము ప్రతివాదుల కిప్పుడు కనబడుచున్నదా?

ధర్మజుని యైశ్వర్య మపహరింపదలచి, శకుని సహాయుపడునట్లు చేసికొనుటకై చచ్చెద నని సాకు గల్పించి, శకుని యుభయహస్త మిచ్చుటవలన కృతార్థుడ నైతి ననుకొని, ధర్మజుని ద్యూతములోనికి దింపిన దుర్యోధనుడు- నాకై శకుని యాడునని చెప్పక మరేమి చెప్పును?

'ధర్మజుడు ప్రౌఢుడువోలె నాతో నెవరు ద్యూతమునకు గడగెద రనెనట' దీనిసందర్భము నవలోకింతము.

శకునిదుర్యోధనులు ధృతరాష్ట్రునితో నీవు ద్యూతము జరిపింపక తప్పదని పట్టుబట్టినపుడు ధృతరాష్ట్రుడు తలయూపి విదురునితో నాలోచింప, విదురుడు ఆపని మంచిదికాదు. అది కలహహేతువు. అని చెప్పగా ధృతరాష్ట్రుడు దైవమనుకూలమైన కలహమురాదనుచు-

"తదద్య విదుర ప్రాప్య రాజానం మమ శాసనాత్ ।
క్షిప్ర మానయ దుర్ధర్షం కుంతీపుత్రం యుధిష్ఠిరమ్ ॥"

అనుచు నా శాసనప్రకారము నీవు త్వరగా వెళ్ళి యుధిష్ఠిరుని తీసికొనిరమ్ము. అని విదురుని కాజ్ఞాపించెను. తరువాత నిర్బంధముచే విదురుడు వెళ్ళి ధృతరాష్ట్రుడు చెప్పుమనిన మాటల నిట్లుచెప్పెను—

యుధిష్ఠిరా! నీవిక్కడకువచ్చి నీసభతో సమానమైన నీసోదర దుర్యోధనాదుల సభనుజూచి యాసభలో నీసోదరులతో గలిసి సుహృద్ద్యూతము జరుపవలసినది. ("సమాగమ్య భ్రాతృభిః పార్థ తస్యాం సుహృద్ద్యూతం క్రియాతామ్.") మీసాంగత్యముజూచి మేమందరము సంతోషింతుము. అని. ఈధృతరాష్ట్రసందేశముపై యుధిష్ఠిరు డిట్లనెను—

"ద్యూతే క్షత్తః కలహో విద్యతే నః
కో వై ద్యూతం రోచతే బుధ్యమానః ।
కిం వా భవా న్మన్యతే యుక్తరూపం
భవద్వాక్యే సర్వ ఏవ స్థితాః స్మ ॥"

మహనీయా! ద్యూతము కలహహేతువు. తెలిసినవాడు దాని కిష్టపడునా? మేమిప్పు డేమిచేయుట యుక్తమనెదవు. మేము నీమాటకు బద్ధులము. అని. అపుడు విదురుడు—

"జానా మ్యహం ద్యూత మనర్థమూలం
కృత శ్చ యత్నోఽస్య మయా నివారణే ।
రాజా చ మాం ప్రాహిణో త్త్వత్సకాశం
శ్రుత్వా విద్వన్ శ్రేయ ఇహాచరస్వ ॥"

ద్యూత మనర్థహేతువని యెరుగుదును. దానిని వారింప యత్నముగూడ జేసితిని. ధృతరాష్ట్రుడు నీయొద్దకు నన్నుబంపెను. నీవు ఆలోచించి యెట్లుచేయుట మంచిదో అట్లుచేయుము. అని.

ఆపై యుధిష్ఠిరుడు అచ్చట ధృతరాష్ట్రపుత్రులుకాక ఇతర కితవులు ఎవ్వరుండిరని యడుగ శకుని మొదలగువారుండిరని చెప్పెను. ఆపై యుధిష్ఠిరు డిట్లనెను—

"మహామాయాః కితవా స్సన్నివిష్టా
మాయోపధా దేవితారోఽత్ర సన్తి ।
ధాత్రా తు దిష్టస్య వశే కిమేదం
సర్వం జగ త్తిష్ఠతి న స్వతంత్రమ్ ॥
నాహం రాజ్ఞో ధృతరాష్ట్రస్య శాసనా
న్న గన్తు మిచ్ఛామి కవే దురోదరమ్ ।
ఇష్టో హి పుత్రస్య పితా సదైవ
తదస్మి కర్తా విదురాత్థ మాం యథా ॥
న చాఽకామ శ్శకునినా దేవితాఽహం
న చే న్మాం ధృష్ట ఆహ్వాయితా సభాయామ్ ।
ఆహూతోఽహం న నివర్తే కదాచి
త్తదా హితం శాశ్వతం వై వ్రతం మే ॥"

ఈద్యూతమునకు మహామాయావులు సంసిద్ధులై యున్నారు. జగత్తు విధికివశమై అస్వతంత్రమై యున్నది. ధృతరాష్ట్రాజ్ఞయగుటచేత ద్యూతమునకై వెళ్ళకుండుటకు నే నిష్టపడలేకున్నాను. పుత్రునకు తండ్రి యెప్పుడు నిష్టుడేకనుక నేనాహ్వానప్రకారము చేయుచున్నాను. నన్ను సభలో శకుని తనతో ద్యూతమాడుమని పిలువకున్న యెడల నేనాశకునితో ద్యూత మాడను. అతనిచే పిలువబడినపుడు మాన లేను. అది నా శాశ్వతవ్రతము. అని.

ఇచ్చట గమనింపవలసిన దేమనగా దుర్యోధనుడు ద్యూతము నకు స్వయముగా ధర్మరాజు నాహ్వానింపక తండ్రిని వేధించి యాతనిచే నాహ్వానింపజేయుటనుబట్టి ధర్మజుడు ద్యూతవ్యసని కాడన్నమాట. ద్యూతవ్యసని, జూదగాండ్రపిలుపుతో వచ్చిపడువాడే. ధర్మజుడు పితాజ్ఞనుబట్టి వచ్చినవాడు కాని ద్యూతవ్యసనమునుబట్టి కాదు, తన పౌఢిని ప్రదర్శించు సంకల్పమునుబట్టియు కాదు. అని.

ధర్మజుడు ఆహ్వానము ననుసరించి ద్యూతములో పాల్గొనుటకును, పాండవులు మరలింపక ధర్మజు ననువర్తించుచుండుటకును కారణాంతరముకూడ గలదు. రాజసూయయాగ మైనతరువాత వేదవ్యాస భగవానుడు దర్శనమీయగా ధర్మజుడు పూజించి మహర్షీ! వెనుక నారదు డుత్పాతములు గోచరించుచున్నవని చెప్పెను. అవి శిశుపాల పతనముచే శాంతిచినట్లా? అని యడుగ వ్యాసభగవాను డిట్లు చెప్పెను—

"త్రయోదశ సమా రాజ న్నుత్పాతానాం ఫలం మహత్ ।
సర్వక్షత్రవినాశాయ భవిష్యతి విశాంపతే ॥" (సభా-అ46)

పదమూడుసంవత్సరము లీయుత్పాతఫలము సర్వక్షత్రవినాశకరముగ నుండును. అనిచెప్పి యందు నీవు నిమిత్త మగుదువుకనుక జాగరూకుడవై యుండుమని చెప్పెను. అపుడు ధర్మజుడు చింతించి సోదరులతో నిట్లనెను—

"అద్య ప్రభృతి భద్రం వః ప్రతిజ్ఞాం మే నిబోధత ।
త్రయోదశ సమాస్తాత కో మమార్థోఽస్తి జీవతః ॥
న ప్రవక్ష్యామి పరుషం భ్రాతౄన్ నన్యాంశ్చ పార్థివాన్ ।
స్థితో నిదేశే జ్ఞాతీనాం యోక్ష్యే తత్సముదాహరన్ ॥
ఏవం మే వర్తమానస్య స్వసుతే ష్వితరేషు చ ।
భేదో న భవితా లోకే భేదమూలో హి విగ్రహః ॥

విగ్రహం భారతో రక్షణ ప్రియాణ్యేవ సమాచరణ ।
వాచ్యతాం న గమిష్యామి లోకేషు మనుజర్షభాః ॥
భ్రాతు ర్జ్యేష్ఠస్య వచనం పాండవా స్సంనిశమ్య తత్ ।
తమేవ సమవర్తన్త ధర్మరాజహితే రతాః ॥"

ఇదిమొదలు 13 సంవత్సరములు సోదరులనుగూర్చికాని, యితర రాజులనుగూర్చికాని పరుష మాడను; జ్ఞాతులయొక్క ఆజ్ఞ ననువర్తించుచు వారి కిష్టములను కూర్చెదను; ఇది నాప్రతిజ్ఞ. ఇట్లున్నయెడల విరోధమునకు మూలమైన భేదభావము కలుగబోదు. విరోధమును దూరీకరించుచు, ప్రియముగా సంచరించిన నాకు లోకములో నింద కలుగనేరదు ఈయుధిష్ఠిరవాక్యము విని పాండవులు ధర్మజహితాను రక్తులై యాతనినే యనువర్తించి యుండిరి.

ఇట్టి కారణమునుబట్టికూడ ధర్మజుడు వారి యాజ్ఞానుసారము ద్యూతమునకు వెళ్ళుట, సోదరులు మరుమాటాడక అనువర్తించివెళ్ళుట జరిగినదని గ్రహింపవలయును.

ధర్మజుడు ప్రౌఢుడువోలె సభలో ప్రసంగించెనట! అక్కడ నేమి జరిగినదో చూడుడు— ద్యూతసభలోనికి పాండవులు ప్రవేశించుట తడవుగా శకుని—

"ఉపస్తీర్ణా సభా రాజణ సర్వే త్వయి కృతక్షణాః ।
అక్షా నుప్త్వా దేవనస్య సమయోస్తు యుధిష్ఠిర ॥"

యుధిష్ఠిరా! సభ సిద్ధముగా నున్నది. నీకై యందరు వేచియున్నారు. ఇది సమయము. అని ప్రోత్సహించెను. అపుడు యుధిష్ఠిరుడు—

"నికృతి ర్దేవనం పాపం న క్షాత్రో౽త్ర పరాక్రమః ।
న చ నీతి ర్ధ్రువా రాజణ కిం త్వం ద్యూతం ప్రశంససి ॥
న హి మానం ప్రశంస న్తి నికృతౌ కితవస్య హి ।
శకునే మైవ నో జైషీ రమార్గేణ నృశంసవత్ ॥

ద్యూతము మోసము, పాపము; ఇందు పరాక్రమముగాని, నీతి గాని లేదు. నీవు ద్యూతమును శ్లాఘించుటవేమి? జూదగాని మోసము లోని ఘనత ప్రశంసాపాత్రము కాదు. శకునీ! ఘాతుకునివలె నీవు మమ్ము పమార్గముచే నోడింపబోకుము. అని పలికెను.

ఇది ప్రతివాదు లన్నట్లు ధర్మజుడు ప్రౌఢుడువలె ప్రసంగించి నట్లే యున్నదా? ఆపై శకుని యిట్లనెను—

"ఏవం త్వం మా మిహాభ్యేత్య నికృతిం యది మన్యసే ।
దేవనా ద్వినివ ర్తస్వ యది తే విద్యతే భయమ్ ॥"

నీవిట్లు వచ్చి నన్ను మోసగానిగా దలచి భయపడుదువేని ద్యూతమునుండి తొలగుము. అని. ఆపై యుధిష్ఠిరు డిట్లనెను—

"ఆహూతో న నివర్తేయ మితి మే వ్రత మాహితమ్ ।
విధి శ్చ బలవాన్ రాజన్ దిష్టస్యాఽస్మి వశే స్థితః ॥
అస్మిన్ సమాగమే కేన దేవనం మే భవిష్యతి ।
ప్రతిపాణ శ్చ కోఽన్యోఽస్తి తతో ద్యూతం ప్రవర్తతామ్ ॥"

ఆహూతుడనై నప్పుడు నివర్తింపనని నా వ్రతము. బలిష్ఠమైన విధికి వశుడనై యున్నాను. ఈసమావేశములో నాకు ద్యూత మెవ్వనితో జరుగవలయును? ఎదుట పందెము కాచువాడెవ్వడు? అది తెలిసమీద ద్యూతారంభము. అని. ఆపై దుర్యోధనుడిట్లుపలికెను—

"అహం దాతాస్మి రత్నానాం ధనానాం చ విశాంపతే ।
మదర్థే దేవితా చాయం శకుని ర్మాతులో మమ ॥"

ప్రతిపణ ముంచువాడను నేను. నాపక్షమున మామశకుని యాడును. అని. ఆమాటపై యుధిష్ఠిరు డిట్లనెను—

"అన్యే నాఽన్యస్య వై ద్యూతం విషమం ప్రతిభాతి మే ।
ఏత ద్విద్వ న్నుపాదత్స్వ కామ మేవం ప్రవర్తతామ్ ॥"

ద్యూత మొకనిదైయుండ మఱియొక డాడుట యనునది నాకు విషమముగా గనబడుచున్నది. అట్లే కానిమ్ము. అని.

ఇట్లు శకునిదుర్యోధనుల కుట్రితో ద్యూతములో ప్రవేశపెట్ట బడిన ధర్మజుడు తనపూర్వప్రతిజ్ఞను, పితాజ్ఞను పురస్కరించుకొనియే ప్రవర్తించి తన యపౌఢినే సభలో వెల్లడించియుండ పౌఢునువోలె ప్రసంగించెనను ప్రతివాదుల వ్రాత నింద్యము.

ఇదియే కాక మ. భా. చ. కారులు మరియొకచోట వ్రాయు టలో—

"మొదటిజూదమున పరాభవ మొందినను, రెండవసారి ధర్మ జుడుద్యూతమునకు సిద్ధపడుట సుయోధనుని జయింతునను దురాశ చేతనే యై యున్నది. మొదటిజూదములో నోడి రెండవసారి తిరిగి జూదమునకు సిద్ధపడు నన్న జూచి భీమార్జునాదులుగాని, ద్రౌపది గాని యేల వారింపలేదు. ఈసారి ధర్మజుడే జయించును. దుర్యో ధనుని వనమునకు పండ్రెండేడులు పంపుదుమను దురాశచేతనె నివారింపరైరి" (పు 262)

అను వ్రాతకూడ నింద్యము. వారు పునర్ద్యూతమున కెట్లు వచ్చినట్లున్నదో చూడుడు— మొదట సర్వస్వము నపహరించి పాండ వులగూడ గెల్చి తమయధీనముచేసికొని ద్రౌపదీదేవిని వస్త్రాకర్షణాది దుర్వ్యాపారములచే దుర్యోధనాదులు వేధించినతరువాత నుత్పాత ములు గోచరింప ధృతరాష్ట్రుడు భయపడి, అమ్మా! నీకు వరములిచ్చె దను. నీవుత్తమరాలవు. కోరికొనుమని ద్రౌపదీదేవిని ప్రోత్సహించి యామె కోరికపై పాండవులను వారి వాహనాభరణాదులతో విడి పించి పంపెను. అంతట మరల దుష్టచతుష్టయము దురాలోచనముచేసి యిట్లు పాండవులను విడిచివేసినయెడల పరాభవింపబడిన కారణముచే మనకు హానిగలిగింతురు. మరల పిలిపించి వేరొకమార్గమున వారి నోడించి విడువవలెను. అని యాలోచించి ధృతరాష్ట్రుని మరల పిలు పింపుమని పట్టుబట్టగా ప్రాతిగామి నాతడు పంపి పిలిపించెను. అప్పుడు ధర్మజునితో ప్రాతిగామి—

"ఉవాచ వచనా ద్రాజ్ఞో ధృతరాష్ట్రస్య ధీమతః ।
ఉపా స్తీర్ణా సభా రాజ న్నక్షా నుప్త్వా యుధిష్ఠిర ॥
ఏహి పాండవదీవ్యేతి పితా త్వాహేతి భారత ।

నీతండ్రి మరల ద్యూతసభకువచ్చి ద్యూతమాడుమని నీతో చెప్పుమనెను. అని పలుకగా విని ధర్మజుడు—

"ధాతు ర్నియోగా ద్భూతాని ప్రాప్నువంతి శుభాశుభమ్ ।
న నివృ త్తి స్తయో ర స్తి దేవితవ్యం పున ర్యది ॥
అక్షద్యూతే సమాహ్వానం నియోగాత్ స్థవిరస్య చ ।
జాన న్నపి క్షయకరం నాతిక్రమితు ముత్సహే ॥
ఇతి బ్రువ న్నివవృతే భ్రాతృభి స్సహపాండవః ।
జానం శ్చ శకునే ర్మాయాం పార్థో ద్యూతమియా త్పునః ॥"

భూతకోటికి శుభాశుభప్రాప్తి విధిబలమున కలుగును. ఇంకను జూదమాడ వలసియున్నయెడల నది యింకను నివర్తింప లేదన్న మాట. ఈసమాహ్వానము వినాశహేతువే యని తెలిసియుండియు, వృద్ధుడగు తండ్రియాజ్ఞయగుటచే త్రోసివేయజాలను. అని పలుకుచు, శకుని మాయను తెలిసికొనియుండియు, సోదరులతో పునర్ద్యూతము నకు వచ్చెను. ఇట్లు తండ్రియాజ్ఞయనియే వచ్చిన ధర్మజుని యీసారి దుర్యోధనుని జయించుటను దురాశచేతనె వచ్చెనని ప్రతివాదు లనుట నీతియేనా? ఆధర్మజుని కష్టతగులక పూర్వప్రతిజ్ఞాప్రకారము ధర్మజా ననువర్తించుచుండుటకే నిశ్చయించుకొనియున్న భీమసేనాదు లట్లే వెళ్ళియుండ దుర్యోధనుని వనమునకు పండ్రెండేడులు పంపుదుమను దురాశచేతనె నివారింప లేదనుట నింద్యము. పండ్రెండేడులు వనవాస మను పణమును కల్పించినవారు శకునిదుర్యోధనులు. ఆపణము పున ర్ద్యూతారంభమున సభలో పాండవులకు తెలుపబడినది. అట్టిస్థితిలో పునర్ద్యూతమునకు రాబోవునపుడే మార్గములో నున్న పాండవులకు

దుర్యోధనుని పండ్రెండేడులు వనవాసమునకు పంపుదుమను దురాశ కలిగెననుట అసంబద్ధప్రలాపము.

పాండవులకు ధృతరాష్ట్రునియందున్న పితృభక్తివిశేషమే వారి నట్లు ప్రవర్తింపజేసినది. దీనికి నిదర్శనముకూడ గలదు—

ధర్మజునకు పట్టాభిషేకము జరుగవలయునని పౌరులుత్సహించు చున్నట్లు దుర్యోధనుడు గ్రహించి యది కాకుండుటకై తండ్రితో నాలోచింపగా ధృతరాష్ట్రుడు పాండవులను కుంతీదేవితో వారణావత మునకు పంపెను. అప్పుడు పౌరులందరు చింతింపుచు పాండవులతో బయలుదేర యుధిష్ఠిరుడు వారి నాగవలసినదని చెప్పి యిట్లనెను—

"పితా మాన్యో గురు శ్శ్రేష్ఠో యదాహ పృథివీపతిః ।
అశంకమానై స్తత్కార్య మస్మాభి రితి నో వ్రతమ్ ॥ "

పూజ్యుడు, శ్రేష్ఠుడునైన తండ్రి మాకేమిచెప్పినను నిశ్శం కగా జేయుటే మావ్రతము. అని.

కనుకనే ధృతరాష్ట్రుడు వారణావతమునకు వెళ్ళి యుండు డనగా నట్లే యని వెళ్ళి యుండిరి. అర్ధరాజ్యము దీసికొని ఖాండవ ప్రస్థమం దుండుడనగా నట్లే చేసిరి. సుహృద్ద్యూతమునకు రండని కబు రంపగా నట్లే వచ్చి యిష్టములేకున్నను ద్యూతములో బాల్గొనిరి. తరు వాత మీామీా ఆయుధవాహనాదులతో మీారు వెళ్ళుడని పంపగా నట్లే వెళ్ళిరి. అంతలోనే మరల పునర్ద్యూతమునకు రమ్మనికబురంపగా నట్లే వచ్చిరి.

కనుక ధర్మజుడు వ్యసనియై ద్యూతమందు ప్రవర్తింపలేదు. శకునిప్రభృతుల నోడింతునని ప్రవర్తింపలేదు. పాండవులు వారిని ధర్మజు డోడింపగలడని యనుకొనలేదు. అందుచే ప్రతివాదిదుష్ప్ర సంగము దూరాపాస్తమైనది.

ప్రతివాదిప్రసంగమునకు విరటునిసభలోని బలరామవాక్యము

లాధారమట! ఈచూపబడిన గాథమంతయు వీరికి ప్రతికూలమేకద.
ఇక బలరాముని యభిప్రాయ మెట్టిదో చూతము—

పాండవులు ద్యూతజితులై వనవాసముచేయుచు ప్రభాసతీర్థము
నకు జేరినపుడు శ్రీకృష్ణబలరాములు వారిని చూచుటకై సపరివార
ముగా వచ్చిరి. అప్పుడు పాండవుల యవస్థనుజూచి శ్రీకృష్ణునితో బల
రామస్వామి యిట్లనెను—

"న కృష్ణ ధర్మ శ్చరితో భవాయ
జన్తో రధర్మ శ్చ పరాభవాయ ।
యుధిష్ఠిరో యత్ర జటీ మహాత్మా
వనాశ్రయః క్లిశ్యతి చీరవాసాః ॥
దుర్యోధన శ్చాపి మహీం ప్రశాస్తి
న చా స్య భూమి ర్వివరం దదాతి ।
ధర్మా దధర్మ శ్చరితో వరీయా
నితీవ మన్యేత నరోఽల్పబుద్ధిః ॥
కిం నామ వక్ష్య త్యవనిప్రధానః
పితృర్ణా సమాగమ్య పరత్ర పాపః ।
పుత్రేషు సమ్య క్చరితం మయేతి
పుత్రా నపాపా న్వ్యపరోప్య, రాజ్యాత్ ॥
నాసౌ ధియా సంప్రతి పశ్యతి స్మ
కిం నామ కృత్వాహ మచక్షు రేవమ్ ।
జాత పృథివ్యా మితి పార్థివేషు
ప్రవ్రాజ్య కౌన్తేయ్యా మితి స్మ రాజ్యాత్ ॥"

సీ॥ కిం నామ పాపం కృత్వాఽహ మచక్షుర్జాతః కౌన్తేయం
ప్రవ్రాజ్య కీదృశో భవిష్యామి ఇతి ధియా నాసౌ పశ్యతీత్యధ్యాహృత్య
త్యాజ్యమ్ ॥

"జితే హి ధర్మస్య సుతే సభార్యే సభ్రాతృకే సానుచరే నిరస్తే,
దుర్యోధనే చాపి వివర్ధమానే కథం న సీద త్యవని స్స శైలా ॥"
(వనప_అ120)

కృష్ణా! మహాత్ముడగు యుధిష్ఠిరుడు జటాధారియై నారచీరలు కట్టి వనము నాశ్రయించి, కష్టపడుచుండుటవలన ధర్మాచరణము అభ్యుదయ హేతువనియు, అధర్మాచరణము పతన హేతువనియుజెప్పుట యుక్తము గాదనపించుచున్నది. ఆదుర్యోధనునకు రాజ్యాధిపత్యమును, ఈధర్మజునకు రక్షణము లేకపోవుటను జూచి యల్పులు ధర్మాచరణము కంటె నధర్మాచరణమే మంచిదని భావింతురు. ఏపాప మెరుగని పుత్రులగు పాండవులను రాజ్యమునుండి పారదోలిన పాపియగు ధృతరాష్ట్రుడు రేపు పరలోకములో పితరులను కలిసినపుడు నేను పుత్రులగు పాండవులయెడ యుక్తముగా సంచరించితి నని యెట్లు చెప్పగలుగునో, ధృతరాష్ట్రుడు నేనేమిపాపముచేసి యిట్లంధుడనైపోతినో, ధర్మజుని రాజ్యమునుండి పారదోలి యిక ముందెట్టివాడనైపోవుదునో అను వివేకము లేనివాడయ్యెను.

ధర్మజుడు భార్యతో, సోదరులతో, అనుచరులతో రాజ్యము నుండి త్రోసివేయబడియుండ, దుర్యోధనుడు ప్రవర్ధమానుడైయుండ లోకమునకు హాని కాదా, అని.

దీనితో ధర్మజుడు పుణ్యాతుడనియు, దుర్యోధనధృతరాష్ట్రులు పాపాత్ములనియు, పాండవు లేపాప మెరుగనివారనియు బలరామస్వామి కంఠోక్తిగా జెప్పియుండెను. ఈబలరామవాక్యము లన్నియు ప్రతివాదులు జ్ఞప్తిలో నుంచుకొనవలసినవే.

ఇచ్చట బలరాముడు ధర్మజుని ప్రతివాదులన్నట్లు నీవు ప్రౌఢుడవలె ద్యూతమునకు ప్రీతితో సిద్ధపడుట నీతప్పుగాని వారితప్పేమున్నదని యనలేదు ఒకసారి మోసపోయి మరల వారిని జయింతు మను దురాశచే పునర్ద్యూతమునకు సిద్ధమై మీరింత కష్టము దెచ్చుకొనినా

రని అనలేదు. పితాజ్ఞనుబట్టియే వారు ప్రవర్తించుటచే పాండవులట్లు ప్రవర్తించుట ధర్మమనియే బలరాముడు గ్రహించెను.

ఇక విరాటసభలోని విషయ మనుకొనవలసియున్నది—

అభిమన్యు వివాహానంతరము మహోగ్రాజమండలిలో కృష్ణభగవానుడు పాండవుల గతవృత్తాంత మెత్తుకొని యిట్లు పలికెను—

పాండవులు కపటద్యూతజితు లగుటయు, రాజ్య మపహరింప బడుటయు, వనవాసాజ్ఞాతవాసములను సక్రమముగా నిర్వహించుటయు, కష్టములకోర్చి ధర్మబద్ధులై యుండుటయు మీకందరకు దెలివిసిన విషయమే ద్యూతకాలనిర్ణయప్రకార మిటుపై వీరిరాజ్యమును వీరికి కౌరవులీయనియెడల ధార్తరాష్ట్రులను పాండవులు హింసింతురు. అపుడు పాండవులకు ధార్తరాష్ట్రులు చేసిన యపకారములను తెలిసికొనినవారందరు పాండవులకు దోడ్పడుదురు. ఇట్టిస్థితిలో దుర్యోధనుని మతమేమో తెలియనిదే మనమేమియు నిర్ణయింపలేము. కనుక ప్రస్తుతమొక ధర్మశీలుడు దూతగా వెళ్ళి ధార్తరాష్ట్రశాంతి, యుధిష్ఠిరరాజ్యప్రాప్తి కలుగునట్లు సంభాషింపవలసియున్నది. అని.

అపుడు బలరామస్వామి యిట్లనెను—

క. హరివాక్యము వింటిరె యది,
యిరుదెరగులజనములకును హితమును ధర్మో,
త్తరమును నై యున్నది యీ
వెరవున శక్యంబు మనకు వీరల దీర్పన్.

చ. తమ సగపాలు గోలుపడి దానిన యిప్పుడు గోరు వీరికిన్
సముచితవృత్తి నిచ్చి తమసామున సంతసమంది యున్కియు,
త్తము ధృతరాష్ట్రసూనునకు దాన నపాయము లేక యుండు గో
పము డిగి వీరు సేయుదురు బాంధవ మిజ్జగముం బ్రియం బడన్.

వ. కావున నిక్కార్యంబె వడ సేయక, యొక్కరుం బనుపవలయు వాడునుం జని యభిమతంబు సాధించు నప్పుడు.

ఆ. మాటపొందెడి జేసి యోటమై నల్లన, చేరి కౌరవేంద్రు చిత్తవృత్తి
కనుగుణంబు గాగ నాతఁ డగుచు బ్రార్థించి యడుగకున్న
దెరగుపడదు.

వ. అది యెట్లనిన ధర్మనందనుం డతని యుద్ధతికిం బురులోడి మొఱ
వడిగల నడవడిం బ్రవర్తిల్లుచుండియు, జూదంబు వెంట మోసపోయి
తొడరి చిక్కనంబడియె. నదియును నతం డక్షవిద్యాపాటవంబు
దనకు మిగుల లేమిం జేసియు, బంధుజనంబులు దన్ను వారించు
టయు, దానాడుట మాని, గాంధారరాజు నియమించినం దత్కళా
కౌశలంబునం బరిణతుండు గావున నాశకుని యాడి యుధిష్ఠిరుం
డోడ్డిన యొడ్డిమియు గెలుచుచు వచ్చినట్లగుట నాతనియందును
గొఱంతలే దిత్తెఱంగున వార లధర్మపరులని నిందింపరాకునికి
కారణంబుగా వీరలు పుచ్చిన మానిసివినయంబుతోన యిక్కా
ర్యంబు దీర్చికొనిరావలయును. (ఆంధ్రభారతము)

ఈబలరామస్వామి వాక్యములకు తాత్పర్యము ప్రతివాదు
లనుకొనినట్లు కాదు. ఇచ్చట పదమూడేండ్లకు బూర్వము జరిగిన
ద్యూతములో తప్పు పాండవులదో, కౌరవులదో నిర్ణయించుట కీప్రస్తా
వము కాదు. మరేమనగా ద్యూతకాలనిర్ణయప్రకారము వనవాసా
జ్ఞాతవాసములను గడపిన పాండవులకు ఇప్పుడు రావలసిన రాజ్యమును
గూర్చి దుర్యోధనమత మెట్లున్నదో తెలిసికొనుటకై దూతను పంప
వలయు ననుననదే ప్రస్తుతాంశము.

దానినే కృష్ణభగవానుడు ప్రస్తావించుటలో శకునిదుర్యోధనుల
కపటద్యూతములో నోడిపోయిన రాజ్యము పాండవుల కిప్పుడు రావలసి
యున్న దనుచు దుర్యోధనునియొద్దకుఁ దూతనుఁబంపి తెలిసికొనవలెనని
పలికెను.

బలరామస్వామి అట్లు దూతను బంపుట యుక్తమే యనియు,
దుర్యోధనుడు పాండవుల రాజ్యమును పాండవుల కిచ్చి తన సగముతో

దాను సంతుష్టుడగుట యుక్తమనియు, నదియే జగద్ధితమనియు బలికి దుర్యోధనునియొద్దకు వెళ్ళిన దూతమాత్రము దుర్యోధనుని చిత్త వృత్తి కనుగుణముగా వినయవిధేయతలు కలిగి, మాటపొం దెరిగి ప్రార్థించినగాని కార్యము చక్కబడదని పలికెను.

బలరామస్వామి దుర్యోధనునిమరభిమానము, దురాగ్రహము, లౌభ్యము నెరిగినవాడుకనుకనే అట్లు పలికెను.

ఆవెళ్ళిన దూతకు, ఆమాటపొందిక, ఆనమ్రత, దూతనుబంపిన వారి యుపదేశమునుబట్టికూడ గలుగవలసియుండుననియు, ఆనాటి ద్యూతము కపటము గనే నడచినను దాని నట్లుద్ఘాటించినయెడల కార్య హాని యగుననియు భావించి యది కపటద్యూతమను దృష్టిని సభ్యు లకు దొలగింపదలచి, ప్రీతితో ధర్మజుడు ద్యూతమున కంగీకరింప, నిపుణు లగుటచే వారు గెల్చికొనినారుకనుక "వారధర్మపరు లని నిందింపరాకునికి కారణంబుగా వీరలు పుచ్చిన మానిసివినయంబు తోన యిక్కార్యంబు దీర్చికొనరావలయును" అని చెప్పెను.

ఇచ్చట శకునిదుర్యోధనుల తప్పు లేదనినట్లున్న అవాంతర ప్రసంగము దూత వినయవిధేయతలతో సంభాషింపవలయు నను ముఖ్యాంశసిద్ధికే యుపయుక్తముగాని యన్యముగాదని బలరామస్వామి వాక్యములలోని, యన్యముగాదని బలరామస్వామి వాక్యములలోని యుపక్రమోపసంహారముల నవలోకించిన మతిమంతులకు స్పష్టమే.

ఇట్లు గ్రంథ మంతయు నేకవాక్యతాపన్నమై, యవిరుద్ధమై శకునిదుర్యోధనుల దుస్తంత్రముతో గూడిన కపటద్యూతమును, పితృ భక్తితో కూడిన పాండవుల నిష్కపటవృత్తిని చాటుచుండ దమకు దోచినట్లు గ్రంథవిరుద్ధముగా ప్రతివాదులు చేసిన ప్రసంగము అప్రా మాణికము, నసంబద్ధము నగుటచే హేయము.

సుయోధనవిజయములో దుర్యోధనవాక్యముగా కవిగారు—
"మాయజూదం బనుమాట యసత్యంబు; ఇది మాయ యని మీకు నెప్పుడు తోచె, జూదంబునకు ముందు శోధించి పాచిక లాడంగ వలసె; మీయన్న యపుడు, తన కోటమి గలిగె నని చెప్పె; తా దెచ్చి సర్వంబు మాచేత జిక్కనుంచె; నాట గెల్చిన దాను నఖిల రాజ్యంబుల గ్రహియించి యేలుకోగలడె; యపుడు, ఆట మోసకుట జేసి యనుచిత మ్మాతమై తాగెల్చు ద్యూతంబు ధర్మమగునె"
అని తోచినట్లు వ్రాసినారు ద్యూతముయొక్క ఆనుపూర్వియంతయు వెనుక ప్రదర్శింపబడియున్నందున నీవ్రాతకూడ పరాస్తమైనది.

—: "ద్రౌపదికి రజస్వలవై రమ్మని ధర్మజుడు కబురంపెను" అను ప్రసంగము—తన్నిరాకరణము :—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— "ఆమె యేకవస్త్రయై రజస్వలగా నుండుటకూడ సత్యము కాదనియు, ధార్తరాష్ట్రుల కపఖ్యాతిని దెచ్చుటకు అట్లు ధర్మజు నుపదేశముచే ద్యూతకాలమున జేసిన దనియు నీక్రిందిశ్లోకార్థములు స్పష్టపరచుచున్నవి—

"యుధిష్ఠిరస్తు తచ్ఛ్రుత్వా దుర్యోధనచికీర్షితమ్ !
ద్రౌపద్యా స్సమ్మతం దూతం ప్రాహిణో ద్భరతర్షభ ।
ఏకవస్త్రా త్వధోనీవీ రోదమానా రజస్వలా ।
సభా మాగమ్య పాంచాలి శ్వశురస్యాఽగ్రతో భవ ॥
అథ త్వా మాగతాం దృష్ట్వా రాజపుత్రీం సభాం తథా ।
సభ్యా స్సర్వే వినిందేరన్ మనోభి ర్ధృతరాష్ట్రజమ్ ॥
స గత్వా త్వరితం దూతః కృష్ణాయా భవనం నృప ।
న్యవేదయ న్మతం ధీమాన్ ధర్మరాజస్య నిశ్చితమ్ ॥ (సభా—అ67)
ధర్మరాజు ప్రాతిగామితో దుర్యోధనుడు చెప్ప నంశమును

(ద్రౌపదిని సభకు దోడ్తెమ్మనుట) విని ద్రౌపదికి నమ్మకముకలిగిన మాతచే నామెకీవార్త నంపెను. ఓపాంచాలీ! నీవు ఏకవస్త్రమునే ధరించినదానవై, కట్టుబట్ట ముడిజారునట్లు చేసినదానవై, ఏడ్చు చున్నదానవై, రజస్వలవై సభకు వచ్చి ధృతరాష్ట్రుని యెదుట నుండుము. పిమ్మట నట్లు సభనుగూర్చి వచ్చిన రాజపుత్రివగు నిన్ను జూచి ద్యూతసభయందున్నవారందరును మనస్సులచే దుర్యో ధనుని నిందింతురు. (ఇట్లు ధర్మరాజు చెప్పగా) ఆదూత త్వరిత ముగా ద్రౌపది గృహమున కేగి ధర్మరాజుయొక్క యేర్పాటు నామెకు జెప్పెను" (పుట 90)

ప్రతివాదులు చూపిన శ్లోకములకు పూర్వమందున్న విషయ మేమన- ద్యూతములో ద్రౌపతిని శకుని మాజ్ఞపై ధర్మజు డొడ్డి యోడినతోడనే దుర్యోధనుడు విదురునితో—

"ఏహి క్షత్తః ద్రౌపదీ మానయస్వ ప్రియాం భార్యాం సంమ తాం పాండవానాం, సంమార్జతాం వేశ్మ పరైతు శీఘ్రం తత్రా స్తు దాసీభి రపుణ్యశీలా".

టీ "పరైతు పరాకృతా ధిక్కృతా సతీ ఏతు ఆయాతు" నీవు పాండవభార్యయగు ద్రౌపదిని తీసికొనిరమ్ము. ఆమె ధిక్కృతురాలై రావలయును. ఆమెయిల్లు తుడువవలయును. అపాపాత్మురాలు దాసీ జనముతో గలిసి యుండవలయును.

అని చెప్పగా విదురుడు ఓమందమతీ! నీవు ప్రకోపింపకుము. యమసదనమున కేగుటకై యత్నింపకుము. ఓడియున్న ధర్మజున కామెను పణముగా బెట్టుట కధికారములేదని నానిశ్చయము. అనుచు చాలవరకు జెప్పగా దుర్యోధను డావిదురుని తృణీకరించి మదమత్తుడై ప్రాతికామితో—

"ప్రాతికామిన్ ద్రౌపదీ మానయస్వ న తే భయం విద్యతే

పాండవేభ్యః। క్షత్తా హ్యాయం వివదత్యే భీతో నచాస్మాకం వృద్ధి కామ స్సదైవ"

ఓప్రాతికామీ! ద్రౌపదిని నీవు తీసికొనిరమ్ము. నీకు పాండవుల భయము లేదు. ఈవిదురుడు భయపడి విరుద్ధముగా మాటలాడుచున్నాడు. ఈతడెన్నడును మనయభివృద్ధిని కోరినవాడు కాడు.

ఇట్లాజ్ఞాపింప ప్రాతికామి ద్రౌపదీభవనమున కేగి, ద్యూతవృత్తాంతమును జరిగిన క్రమమును చెప్పి, నిన్నుదుర్యోధనుడు గెల్చుకొనుటచే నీవు దుర్యోధనగృహమునకు రావలయు నని చెప్పగా ద్రౌపది—ధర్మజుడు తన్నోడి నన్నోడెనో, నన్నోడి తన్నోడెనో తెలిసికొనిరమ్మని పలుక నాత డాసభకుబోయి ధర్మజు నడుగ నాధర్మజుడేమియు బలుకకుండెను.

అపుడు దుర్యోధనుడు ఆమె యిక్కడకువచ్చియే ప్రశ్నించవలయును సభ్యు లిరువురప్రసంగము వినెదరు. తీసికొని రమ్మని పంపెను. అపుడు ప్రాతికామి మరల బోయి రాజపుత్రీ! నిన్ను సభ్యు లాహ్వానించుచున్నారు. నీవు ప్రశ్నించిన విషయముపై సంశయము కలిగినట్లు తోచుచున్నది అని చెప్పెను. అంతట ద్రౌపది నీ వామాటను సభ్యులనే యడిగి రమ్ము, ధర్మాత్ములగు వారు ఎట్లు నిశ్చయించి చెప్పుదురో అట్లు చేయుదును అని పలుక,

"శ్రుత్వా సూత స్తద్వచో యాజ్ఞసేన్యా స్సభాం గత్వా ప్రాహ వాక్యం తదానీమ్। అధోముఖా స్తే న చకించి దూచు ర్నిర్బంధం తం ధార్తరాష్ట్రస్య బుద్ధ్వా"

ప్రాతికామి మరల వెళ్ళి సభ్యుల నడుగ నాదుర్యోధననిర్బంధము గ్రహించి సభ్యులు తలలు వంచి యేమియు జెప్పరైరి.

ఈస్థితిలో నుండగా ధర్మజుడు ద్రౌపది యెట్లున్నను సభకు వచ్చి యుండుటే మంచిదనియు తనయాజ్ఞ లేనిదే ఆమె రానేరదనియు భావించి ద్రౌపదికి విశ్వసనీయుడగు దూతచే సభకు రావలసిన

దని యామెకు తెలియపరచెను. ఆవిషయమును చెప్పుచు చెప్పుచు న్నవే ప్రతివాదు లుదహరించిన శ్లోకములు

అందు "యుధిష్ఠిరస్తు తచ్ఛ్రుత్వా దుర్యోధనచికీర్షితమ్" అను శ్లోకములో యుధిష్ఠిరుడు దుర్యోధనుని చికీర్షితమును (చేయదలచిన పనిని) గ్రహించి దూతను పంపె నని యున్నది. అతని చికీర్షితము, విదురునితో ద్రౌపది యవమానింపబడి రావలె ననుటయు, ప్రాతి కామితో నీకెవ్వనిభయము లేదు ఆమెను తీసికొని రమ్మనుటయు, ఆమె సభకు వచ్చియే అడుగవలె ననుటయు జూడగా బలాత్కార ముగా నామెను సభకు లాగుటే యని స్పష్టమైనది. అట్టి చికీర్షిత మును గ్రహించి సభకు రాదగిన స్థితిలో ద్రౌపది లేదని తెలిసి యుం డిన ధర్మజుడు దుర్యోధననిర్బంధముచే నేమి యమర్యాద జరుగునో యని భయపడి నీవెట్టి స్థితిలో నున్నను సభకు వచ్చి ధృతరాష్ట్రుని యెదుట నిలువుము. సభ్యులు నిన్నప్పుడు చూచి దుర్యోధనుడు చేసినది తప్పని యనుకొందురు. అని చెప్పి దూతచే తెలియబరచెను. ఇది యుధిష్ఠిరసందేశముయొక్క పరిస్థితి

ఇక యుధిష్ఠిరోపదేశముగానున్న ద్వితీయశ్లోకము. దానికి ప్రతి వాదులువ్రాసిన యర్థము పరిశీలింపదగియున్నది.

"ఏకవస్త్రా త్వధోనీవీ రోదమానా రజస్వలా।
సభా మాగమ్య పాంచాలి శ్వశుర స్యాగ్రతో భవ॥"

ఈశ్లోకమునకు ప్రతివాదులు వ్రాసిన యర్థ మిది—ఓపాంచాలీ! నీ వేకవస్త్రమునే ధరించినదానవై కట్టుబట్ట మునీజారునట్లు చేసినదా నవై, ఏడ్చుచున్నదానవై, రజస్వలవై సభకు వచ్చి ధృతరాష్ట్రుని యెదుట నుండుము' అని.

ఇచ్చట విధేయాంశములు ఇన్నియని వ్రాసిన ప్రతివాదుల నడుగ వలసియున్నది— రజఃప్రవృత్తినిబట్టి రజస్వలయనదగిన స్త్రీ. రజస్వలవై

నీవు రమ్మనుటను బట్టి యెట్లు రజస్వలయగును? ఇక రజస్వలవై ర మ్మను మాటను రజస్వలావేషముకలదానవై రమ్మని యర్థమందురా? అప్పుడు నీవేకవస్త్రముననే ధరించి రమ్మనుటకూడ ఎందులకు? రజస్వలా స్త్రీకి అనేకవస్త్రధారణ ముండునని గాని మెనేకవస్త్రమునే ధరించి ర మ్మనె నందురా? అప్పుడది మీరన్న రజస్వలావేషము కాకనేపోవును. ఇక రజస్వలాస్త్రీకి ఏకవస్త్రధారణము చిహ్నముకనుక నట్లు చెప్పె నందురా? అప్పుడు రజస్వలావేషము ధరించి రమ్మనుటలో నది చెప్ప బడినట్లేకనుక ఏకవస్త్రమునే ధరించి రమ్మనుట వ్యర్థము. ఏకవస్త్ర మునే ధరించి రమ్మనినపుడు రజస్వలావేష ముక్తప్రాయమేకనుక నీవు రజస్వలావేషముకూడ ధరించి రమ్మనుట వ్యర్థము. అది యట్లుండ కట్టుబట్ట ముడిజారినట్లుచేసి రమ్మనినట్లుకూడ జెప్పెనారే. అదిరజస్వలా స్త్రీకి చిహ్నమని యత డట్లు చెప్పెనందురా? అట్లైన రజస్వలా వేషము ధరించి రమ్మనుటలోనే అది గతార్థ మగుచుండ దానిని మరల జెప్పుట వ్యర్థము.

ఇంకొకటి. 'కట్టుబట్ట ముడిజారునట్లు చేసినదానవై' అని వ్రాసినది 'అధోనీవి' శబ్దార్థము కాబోలు. నీవీశబ్దమునకు కట్టుబట్టముడి యర్థమైతే అధశ్శబ్దమునకు జారుట యర్థమా? ఆహా! మీరాసిన దాటయు పాడినది పాటయునా?

కట్టుబట్టముడి జారునట్లు చేసిన బట్టకట్టు నిలుచునా? అది నిలువవలెనని ధర్మజుని భావము కాదనుటకుకూడ మీరు సాహ సించినపక్షములో మీది మానవప్రకృతికాదని లోక మనకుండునా? సుయోధనవిజయకర్తగారు —

"అప్పు డధోనీవి యైనట్టి యాకాంత వస్త్రంబు తనయంత బడెను క్రింద నంతమాత్రంబున నలివను పరిభవించితి మంచు నగ్గలెత్తి చెప్ప రకట".

అని కవిత్వమల్లినారు. మ. భా. చ. కారులు, కట్టుబట్ట ముడి జారునట్లు చేసిన దనుటకును, కవిగారు ఆమె కట్టుబట్ట దానికదే క్రింద బడిపోయినదనుటకును ఇద్దరికి సరిపోయినది. వీరిరువురిజ్ఞానము లోకాతీతము.

దీని నిటుంచి యీ మ. భా. చ. కారులే యీశ్లోకమునకే సంబంధింపజేసి ఇటీవల పత్రికలో ప్రకటించిన విషయమునుగూడ బరామర్శింతము—

ఆంధ్రపత్రిక, సచిత్రవారపత్రిక— ?-2-1949

"ప్రాచీనకాలమున ఆర్యస్త్రీలకుగాని, నాగద్రవిడాద్యనార్య స్త్రీలకుగాని 'రవికలు' అనునవి లేవు. ఆర్యస్త్రీలు పురుషులవలెనే రెండువస్త్రములను ధరించుచుండువారు... కొన్నిసమయములందార్యస్త్రీలు పైవస్త్రమును ధరింపరాదను నిబంధనము కాన్పించు చున్నది. అది స్త్రీ బహిష్ఠయైన కాలము.

ఇందులకు నిదర్శనము— ధర్మరాజు ద్యూతమున ద్రౌపదిని యొడ్డి యోటువడగా దుశ్శాసనుడు ద్రౌపదిని సభలోనికి దీసికొనిరా బంచుటను ధర్మజు డెరింగి ద్రౌపదికి నీక్రిందిరీతిని వర్తమాన మంపియున్నాడు—

"ఏకవస్త్రా త్వధోనీవీ-శ్వశురస్యాగ్రతో భవ"

ఓద్రౌపదీ! నీవొక్కటిబట్టనే ధరించి రజస్వలావేషధారిణివై ఏడ్చుచు ధృతరాష్ట్రు నెదుట నిలిచియుండుమా? అనెను.

ఇచ్చట రజస్వలయైన స్త్రీ, పైని బట్టలేకుండ ఒక్కబట్టనే బొడ్డుక్రిందికి కోక ముడివైచుకొని యుండుటచెప్పబడెను. ప్రాచీన సనాతనధర్మస్త్రీలును ఇట్లే యుండెడివారు. ఈయంశమును మాయూరి పౌరాణికు డెరుంగక అధోనీవీశబ్దమునకు ఏదేదో తెలిపి తక్కువ అర్థము చెప్పుచున్నాడు"

ఈప్రతివాదులు ఆపౌరాణికుడు చెప్పిన అర్థమేదో తెలిసికొన

కరమే అది తెలివితక్కువ అర్థమని వ్రాయుట చిత్రము. ఈమహాభారత తత్త్వకథనకర్తయే ప్రతివాదులన్న పౌరాణికుడు. ఇచ్చట వ్రాసిన ఆ యర్థమును చూడకుండ పాప మా ప్రతివాదులు పరలోకగతులైనా రని విచారించుచున్నాము. తాము తెలియనిస్థితిలోనుండి యెదుట వానిది తెలివితక్కువ యనుటలో వీరు ఘనులు. అదియటుండనిండు.

అథోనీవీశబ్దమునకు 'బొడ్డుక్రిందికి కోకముడి' యని పత్రికలో వ్రాసిన యర్థమునుబట్టి అథోనీవీశబ్దముబోని అథశ్శబ్దమునకు బొడ్డు క్రింది అని యర్థము చెప్పినట్లయినది. ఈ అథశ్శబ్దమునకే జారుట అర్థ మని వీరే వెనుక చెప్పియున్నారు. ఇది తెలివితక్కువ కా దన్న మాట.

ఇంకొకటి. ప్రాచీనకాలమున ఆర్య స్త్రీలకు రవిక లనునవి లే వట. పురుషులవలె రెండువస్త్రములను ధరించుచుండువారట! బహిష్ఠ యైన కాలములో పైని బట్టలేకుండ వారుండువారట! దానికి నిదర్శ నము 'ఏకవస్త్రా' అను శ్లోకమేయట! ఐతే ద్రౌపదీదేవిని రవికలేక పైని బట్టలేక సభాస్థలికి రమ్మని ధర్మజుడు చెప్పినా డందురా? ఏమి తెలివి? తుదకు లోకజ్ఞానముకూడ మృగ్యమైపోయెనే!

ప్రాచీనకాలమున ఆర్యస్త్రీలకు రవికలు లేవని అప్రమాణముగా వ్రాసినారు. ప్రాచీనకాలమునుండియు ఆర్యస్త్రీలకు (సువాసినీలకు) రవిక లున్నవని ప్రమాణములను చూపుచున్నాము. చూడుడు—

స్కాందము కాశీఖండము—అ 4.

"హరిద్రాం కుంకుమం చైవ సిందూరం కజ్జలం తథా ।
కూర్పాసకం చ తాంబూలం మాంగల్యాభరణం తథా ॥
కేశసంస్కారకబరీకరకర్ణాదిభూషణమ్ ।
భర్తు రాయుష్య మిచ్ఛన్తీ దూరయే న్న పతివ్రతా ॥
న చాంగోద్వర్తనం కార్యా స్త్రియా విధవయా క్వచిత్ ।

గన్ధపత్రివ్యస్య సంయోగో నైవ కార్య స్తయా పునః ॥
కంచుకం న పరీదధ్యా ద్వాసో న వికృతం న్యసేత్ ॥''

ఇచ్చట భర్తయొక్క ఆయుష్యమునుగోరెడి స్త్రీ పసుపు, కుంకుమము, సిందూరము, కాటుక, రవిక, తాంబూలము, మంగళసూత్రము, కేశసంస్కారము, హస్తకర్ణా ద్యాభరణములు అనువానిని విడిచి యుండరాదు.

పూర్వసువాసిని— కంచుకము (రవికను) ధరింపరాదు. అని చెప్పబడినది. ఈప్రమాణములనుబట్టి ప్రాచీనకాలమునుండియుపసుపు కుంకుమములతోబాటు రవిక సువాసినీస్త్రీలకు అవశ్యధార్యముగా నున్నదని స్పష్టము. కనుక పూర్వకాలములో స్త్రీలకు రవికలు లేవను ప్రతివాదుల వ్రాత ఆర్షసంప్రదాయానభిజ్ఞతను వెల్లడించుచున్నది. అదియు నటుండనిండు.

''ధర్మజుడు కృత్రిమాలోచనము చేసి రజస్వలయై యుండని ద్రౌపదీదేవిని రజస్వలవై రమ్మనెను'' అను ప్రతివాదిప్రసంగముపై యొక్క టాలోచింపవలసియున్నది.

ధర్మజుడు కృత్రిమాలోచనమే చేసినయెడల నట్టి యాలోచన మన్యునితో చెప్పి పంపునా? అదికూడ సభలోనె చెప్పునా? ఆసభలో గూడ వీరాగ్రగణ్యులై దైవవశమున నవశులై పడియున్న పాండవులను తమ సంకల్పము సిద్ధించినదని దర్పితులై తదేకదృష్టితో జూచుచున్న దుష్టుల సమక్షములోనే చెప్పునా? ఏద్రౌపదిని అవమానించి తీసికొనిరమ్మని మాటిమాటికి దుర్యోధనుడు పంపుచునే యుండెనో ఏద్రౌపదియొద్దకు ప్రాతికామి వెళ్ళుచు వచ్చుచు నుండెనో ఆద్రౌపదీదేవికి ఆదుర్యోధనసమక్షమందే మహాసభామధ్యములో నున్న ధర్మజుడు కృత్రిమాలోచనము నెవ్వని చెవిలోనో చెప్పుట సంభవమా? అది సంభవించినపక్షములో దుర్యోధనాదులు తమ యత్నమున కేమి

విఘాతము దెచ్చుటకో చెవిలో జెప్పుచుండెనని ధర్మజుని మందలించుటో, మాతను కదలనీక నిరోధించుటో మాని యాసభలో నుండియే ద్రౌపదియొద్దకు వెళ్లుచున్న దూత నుపేక్షించి యుండుట సంభవమా? ఇదియంతయు ప్రతివాదులు చెప్పిన అర్థములో నసంభవము. ధర్మజుడు రజస్వలయై యున్న ద్రౌపదీదేవికి నీవెట్లున్నను రమ్మని సందేశమును బహిరంగముగా దూతకు చెప్పి పంపినపుడే ఇదియంతయు సంభవమగును. కనుక నసంబద్ధముగా ప్రతివాదులు చెప్పిన శ్లోకార్థమును త్రోసివేసి వారి యూరి పౌరాణికుడు చెప్పుచున్న యర్థము నవలోకింపుడు —

ఆశ్లోకములోని యుత్తరార్థముచే ద్రౌపదీదేవి నుద్దేశించి సభకు వచ్చి ధృతరాష్ట్రుని యెదుట నుండుటమాత్రమే ధర్మజునిచే బోధింపబడినదని తెలిసికొనవలయును. పూర్వార్థములోని యంశములు రజస్వలయై, ఓడిపోయినట్లు ప్రాతికామి తెలిపి యుండుటచే దుఃఖాక్రాంతురాలై యున్న ద్రౌపదీదేవియొక్క తాత్కాలికస్వరూపానువాదపరములే. 'ఏకవస్త్రాతు' అను 'తు' శబ్దము ధర్మజునిచే బోధింపబడు విషయమునకు విరుద్ధస్థితిబోధకము. 'తు' శబ్దమున కిట్లు చెప్పుట "తత్తు సమన్వయాత్" తు శబ్దః పక్షం వ్యావర్తయతి" ఇత్యాదులలో ప్రసిద్ధము. ఆవిరుద్ధస్థితియే ఏకవస్త్రాదిశబ్దములచే జెప్పబడినది. అనగా ఏకవస్త్రయై, అధోనీవియై, రోదమానయై ,రజస్వలయై సభకు రాదగని స్థితిలోనున్న ద్రౌపదీదేవిని రమ్మని బోధించెనని సారాంశము. ఇక పదార్థవివరణము—

రజస్వలాస్త్రీకి రజఃప్రవృత్తి మొదలు శుద్ధిపర్యంత మేకవస్త్రమె కాని దానిని మార్చి వస్త్రాంతరము కూడదు కనుక ఆమె యేకవస్త్ర యనబడినది. కనుకనే రజస్వలావ్రతము లుపదేశించుటలో— "త్రిరాత్రింమలవద్వస్త్రధారణం న స్నాయాత్" అని చెప్పబడినది. అథో

నీవి అనునపుడు నీవీశబ్దము నకు కటిసూత్రస్థానీయమై కౌపీనాధారమైన వస్త్రఖండ మర్థము. అది యాసమయమున స్త్రీధార్యమై యుండును. అది వస్త్రాధోభాగమందుండునుకనుక అధోనీవియనబడినది. చూడుడు—

నీవి— ***A piece of cloth wapped round thc waist (Especially as worn by woman)***

**C. F. *Vamana puranam 1-3-5***
***Monier wiliams.***

నీవి— ఎ పీస్ ఆఫ్ క్లాత్ రాప్డ్ రౌండు ది వెయిష్టు (ఎస్పెషల్లీ, యాజ్, వోర్న, బై. వుమన్)

సి. యఫ్. వామనపురాణము 1_3_5
మోనియర్ విలియమ్స్

ఇవి రజస్వలాస్త్రీలక్షణముతో అగుటచే రజస్వలాపదముచే గతార్థములైన వని యాపదములకు వైయర్థ్యమును శంకింపరాదు. అవి విధేయాంశములు (బోధ్యాంశములు)గా జెప్పబడినపుడే అట్టి శంక. తాత్కాలికస్వరూపానువాదపరము లైనపు డాశంక కవకాశము లేదు.

ధర్మజు డట్టి యనువాదము చేయుటలో ఫల మేమనగా నేను ద్యూతవ్యసనములో బడి నీ ప్రస్తుతస్థితిని మరచి యిట్లు నిన్ను రమ్మని చెప్పుట కాదు. ఈ యీ యవస్థలో నీ వున్నా వని యెరిగియుండియు తప్పదుకనుక నిన్ను రమ్మని చెప్పుచున్నా నని ద్రౌపదీదేవికి తెలుపుట ఫలము. ఇది బహిరంగముగా దూతకు చెప్పుటలో నిట్టి యామెను రప్పించుచున్నాడని సభ్యులకుగూడ తెలుపుట ఫలము. ఇక వాక్య సమన్వయము—

"హే పాంచాలి! త్వం తు రజస్వలా ఏకవస్త్రా అధోనీవీ రోద మానా చ। తథాపి సభా మాగమ్య శ్వశుర స్యాగ్రతో భవ" అని.

ఈసందేశము బహిరంగముగా సభలో దూతకు చెప్పబడినట్టి దియు, నట్టి కృత్రిమము లేనట్టిదియు, ద్రౌపది సభకు వచ్చుటకే

యుపయోగించునట్టిదియు నగుటచే దుర్యోధనాదుల యవరోధము లేకుండ నడచినదని గ్రహింపవలయును.

"అథ త్వా మాగతాం దృష్ట్వా...సభ్యా స్సర్వే వినిందేరన్ మనోభిః ధృతరాష్ట్రజమ్"

అట్లు వచ్చిన నిన్నుజూచి దుర్యోధనుడు చేసినది నింద్య మని సభ్యు లనుకొందురు. అని చెప్పిన ధర్మజునిమాట యైనను దుర్యోధనుడు సహింపలేనిది కాదు. శకునిదుర్యోధనులు కుట్రతో నడిపిన ద్యూతములో ద్రౌపదిని యొడ్డు మని ప్రేరేపించి గెల్చుకొనునపుడు "ధిగ్ధిగిత్యేవ వృద్ధానాం సభ్యానాం నిస్సృతా గిరః" అని చెప్పబడిన సభ్యుల నిందావచనములకు తల యొగ్గి యెవ్వ రేమనిన మన కేమని త్రొదుబారి కూర్చుండిన దుర్యోధనున కది యొక లెక్కలోనిదా? కనుకనే యుధిష్ఠిరసందేశము నిరాటంకముగా నడచినది.

ప్రతివాదు లనినట్లు అది కృత్రిమాలోచనగర్భితమే యైన యెడల నట్టి సభామధ్యమునుండి యట్టి సందేశమును పంపుట అసంభవమే.

ఆశ్లోకమునకు తాము చెప్పినట్లే అర్థమును తంత్రవార్తికకారుడు చెప్పియున్నాడని ప్రతివాదులు చూపియున్నారు. దానిని జూతము—

"కుమారిలభట్టు తన తంత్రవార్తికమునందు ఈ యంశమునే చెప్పియున్నాడు. ఆవాక్యార్థము నిట సూచించుచున్నాడను—

"యుధిష్ఠిరోపదేశా త్సభామధ్య మానీయమానా సహస్తైవ రజస్వలా వేషం సపుత్రస్య ధృతరాష్ట్రస్యాఽయశ ఉత్పాదయితు మాత్మానం చాఽన్యాయ్యమానం ప్రఖ్యాపయితుం ద్రౌపదీ కృతవతీ"

"ధర్మజు నుపదేశముచే సభామధ్యమునకు దీసికొని తేబడిన ద్రౌపది పుత్రులతోగూడిన ధృతరాష్ట్రున కపకీర్తి దెచ్చుటకును,

తక కన్యాయము జేసిరని లోకమునకు వెల్లడిచేయుటకును తత్తృ
ణము రజస్వలావేషమును ధరించినది" (పు 91)

ప్రతివాదు లర్థము జెప్పుటలో తత్క్షణమని యొక మాటను చేర్చినారు. వారు చూపినవాక్యములలో ఆయర్థ మిచ్చు పదము లేదు. అది సహసాపదమున కర్థముగా జెప్పినారు కాబోలు. అది యక్రమము:

గణవ్యాఖ్యానములో "సహసే త్వాకస్మికావిమర్శయోః" అనియు, అమరకోశములో "అతర్కితే తు సహసా" అనియు నున్నందున వారు చెప్పిన దప్రమాణము. ఇచ్చట సహసా శబ్దశ్రవణప్రసంగమున ప్రతివాదులు నన్నుసంబంధించి వ్రాసియున్న యొక విషయము వారిధోరణి తెలియబడుటకై ప్రదర్శింపబడుచున్నది—

గోలకొండపత్రిక — 14-10-1946

"సుబ్రహ్మణ్యశాస్త్రిగారు నేను వ్రాసిన 'సాహసించితిని' అనుదాని నాక్షేపించుటకై తాము వర్ణించిన నిఘంటువు ప్రతిభ జూపుటకు "సహసే త్వాకస్మికావిమర్శయోః" అని వ్రాసిరి. సాహసశబ్దమునకును, సహసా అను యవ్యయమునకును సంబంధమేమో?".

వీరికి గొంచెము చెప్పుదము — సుష్ఠు అను అవ్యయమునకును సౌష్ఠవశబ్దమునకును ఏమి సంబంధమో, పశ్చాత్ అను అవ్యయమునకును, పాశ్చాత్యశబ్దమునకును యేమిసంబంధమో; సహసా, అను అవ్యయమునకు సాహసశబ్దమునకును అదే సంబంధము, ఇక ప్రస్తుతాంశమునకువచ్చుచున్నాము.

తంత్రవార్త్తికవాక్యములకు ప్రతివాదులు వ్రాసిన అర్థములో "సభామధ్యమునకు దీసికొని తేబడిన ద్రోవది అపకీర్తి దెచ్చుటకు తత్క్షణము రజస్వలావేషము ధరించినది" అనుటలో తత్క్షణ మనగా సభామధ్య

మునకు దీసికొని తేబడిన క్షణమే కద, అప్పుడక్కడ ఆమె రజస్వలా వేషమును ధరించినదా? ఇది యత్యంతవిరుద్ధము. అది యటుండనిండు,

ప్రతివాదులు తాము ప్రమాణముగా జూపిన తంత్రవార్త్తికము, భారతశ్లోకమునకు తాము చెప్పినట్టే అర్థమని చెప్పుచున్న దనుచున్నారు, అట్లేయైనయెడల తాము చెప్పిన అర్థమునకు దట స్థించిన అనుపత్తు లన్నియు దానికిని దటస్థింపవలసివచ్చును. మరియు మహాభారతమున బహుస్థలములలో నిజముగా రజస్వలయై యున్న ద్రౌపదియే బలాత్కారమున సభ కీడ్వబడినదని స్పష్టవచనములు (అవి ముందు ప్రదర్శింపబడుచున్నవి) చాటుచుండ దానికి విరుద్ధముగా కృత్రిమమున రజస్వలా వేషమును ద్రౌపది వేసినదని పూర్వమీమాంసాశాస్త్రకర్త యగు తంత్రవార్త్తికకారుడు వ్రాసినట్లు చెప్పుట కంటె దుర్న్యాయ ముండదు. కనుక శ్లోకమునకు నిర్దుష్టార్థముగా వెనుక నిరూపింపబడిన విషయమే తంత్రవార్త్తికముచే ప్రతిపాదింపబడుచున్న దని చెప్పక తప్పదు.

తంత్రవార్త్తికములో "ద్రౌపదీ రజస్వలావేషం కృతవతీ" అని వేషశబ్దప్రయోగమువలన ప్రతివాదులకు భ్రాంతి కలిగినవి.

ఆయాపరిస్థితుల కనుగుణమగు వస్త్రాదిధారణము వేష మనబడును. స్త్రీ రజస్వలయై యున్న పరిస్థితిలో తదనుగుణమగు ఏకవస్త్రాధోనీవ్యాదిధారణమే రజస్వలావేష మగును. ఆపరిస్థితియే ధర్మజునిచే ననువాదము చేయబడి, నీవు వచ్చుటవలన నీవట్టి దురవస్థలో నుండగా నిన్ను బలాత్కారముగా రప్పించువారే అపఖ్యాతికి పాత్రులై పోవుదురు. నీవు వెనుదీయక రమ్మని బోధించెను.

'సహాసైవ' అను మాటలోని సహసాపదమును ఆనీయమాన పదముతో నన్వయించి ఏవకారమును 'రజస్వలావేషమేవ' అని యన్వయించినయెడల 'యుధిష్ఠిరోపదేశాత్ రజస్వలావేష మేవ కృతవతీ

నతు వేషాన్తరమ్' అని రజస్వలాస్త్రీ కుచితమైన ఏకవస్త్రాధోనీవ్యాది ధారణమునే చేసియున్న ద్రౌపది యుధిష్ఠిరోపదేశమునుబట్టి యట్లే యుండెను. కాని సభాస్థలప్రవేశమున కుచితమైన వస్త్రాదిధారణమును చేసి యుండలేదని సిద్ధించును. కనుక తంత్రవార్త్తికగ్రంథము ప్రతివాదుల కనుకూలము కాదు. ఇంకొకటి. తంత్రవార్త్తికకారునకు ఆయుధిష్ఠిరోపదేశము కృత్రిమాలోచన మనియే భావ మున్నయెడల నది ధర్మవ్యతిక్రమములలో జేరునుకనుక పూర్వపక్షగ్రంథములో యుధిష్ఠిరుని ధర్మవ్యతిక్రమములను తాను జేర్కొనునపుడు ఈ యుధిష్ఠిరోపదేశమునుగూడ జేర్కొనవలసియున్నది పేర్కొనలేదు. చూడుడు—

"తథా యుధిష్ఠిరస్య కనీయోఽర్జితభ్రాతృజాయాపరిణయన మాచార్యబ్రాహ్మణవధార్థ మనృతభాషణం చ"

ఇచ్చట అర్జునుడు సంపాదించిన ద్రౌపదిని తానుగూడ పెండ్లియాడుట, ద్రోణవధసందర్భములో ననృతమాడుట అను రెండే ధర్మవ్యతిక్రమములుగా శంకింపబడి సమాధానములు చెప్పబడినవి. కనుక నీయుధిష్ఠిరోపదేశము యథార్థకథనమేకాని కృత్రిమాలోచనము కాదని తంత్రవార్త్తికతాత్పర్యము స్పష్టమగుచున్నది.

ఇక "యుధిష్ఠిరోపదేశాత్ ...కృతవతీ" అను తంత్రవార్త్తికగ్రంథమున కేమిసందర్భము? అని యడుగుదురేమో వినుడు—

ద్రౌపదీపంచపతిత్వవిషయమును నిరూపించినతరువాత నావిషయమును విశ్వసింపనివారిని గూర్చి అభ్యుపేతవాదముగా ప్రకారాంతరమున సమాధానము జెప్పునపుడు—

"యద్వా నార్యర్జునస్యైవ కేవలస్య భవిష్యతి।
సాధారణాప్రసిద్ధి స్తు నిశ్చిద్రత్వాయ దర్శితా ॥"

యథా యుధిష్ఠిరోపదేశాత్ ... ద్రౌపదీ కృతవతీ। తథైవ కేవలార్జునభార్యాయా ఏవ సత్యాః... సాధారణ్య ప్రఖ్యాపనమ్ ॥

అని చెప్పబడినది. దీనిని బట్టి నీతిశాస్త్రనిపుణులగు పాండవుల యొక్కయు, ద్రౌపదియొక్కయు వ్యవహారము నిశ్ఛిద్రముగా నుండె ననుటలో రజస్వలయై యున్న ద్రౌపది యుధిష్ఠిరోపదేశమున నట్లే యుండెను కాని, ఆవేషమును మార్చ లేదను విషయము దృష్టాంతముగా జూపెడి సందర్భములోని దని గ్రహింపుడు. అందుచే ప్రతివాదులకు తంత్రవార్తికము ప్రతికూలమే.

**—:‘ద్రౌపదీదేవి అప్పటికి రజస్వల నిజముగా నయియున్నది’ అనుటకు ప్రమాణములు :—**

ఇంకొకటి— ఆమె నిజముగా రజస్వలయై యుండగనే సభకీడ్చి తెచ్చినారు. యది కృత్రిమవేషము కాదు. అనుటకై నిదర్శనముగా బహుస్థలములలోని ప్రసంగముల నుదాహరించుచున్నాము—

రజస్వలా వేషము వేసికొని రమ్మనుచు కృత్రిమోపదేశము చేసినాడని యేయుధిష్ఠిరు ననిరో, ఆయుధిష్ఠిరునితో కృష్ణభగవానుడు నీవు గతించిన విషయముల దలపోసి ఖేదపడవలదని బోధించునపుడిట్లనెను—

“దృష్ట్వా సభాగతాం కృష్ణా మేకవస్త్రాం రజస్వలామ్ ।
మిషతాం పాండవేయానాం న తస్య స్మర్తు మర్హసి ॥”

(అశ్వమే- అ12)

మరియు శ్రీకృష్ణునితో ద్రౌపదీదేవి యిట్లు చెప్పుకొనినది—

“స్త్రీధర్మిణీ వేపమానా శోణితేన సముక్షితా ।
ఏకవస్త్రా వికృష్టాస్మి దుఃఖితా కురుసంసది ॥
రాజ్ఞాం మధ్యే సభాయాన్తు రజసాఽభిపరిప్లుతాం ।
దృష్ట్వా చ మాం ధార్తరాష్ట్రాః ప్రాహసన్ పాపచేతసః ॥”

(వన- అ 2)

మరియు యుద్ధమృతులను జూడవచ్చి దుఃఖించు గాంధారితో దుర్యోధనుని తానట్లు వధించుటకు చెప్పెడి కారణములలో భీమసేను డిట్లు చెప్పి యుండెను—

రాజపుత్రీం చ పాంచాలీ మేకవస్త్రాం రజస్వలామ్ ।
భవత్యా విదితం సర్వ ముక్తవాక్య త్సుత స్తవ ॥ "
(స్త్రీపర్వ-అ 15)

మరియు యుద్ధభూమిలో బడిన దుర్యోధనుడు తన్నునిందించి నపు డాదుర్యోధనునితో శ్రీకృష్ణభగవాను డిట్లనెను—

"సభయాం యాజ్ఞసేనీచ కృష్ణా ద్యూతే రజస్వలా ।
తదైవ తావ ద్దుష్టాత్మ న్వధ్య స్త్వం నిరపత్రప ॥
(శల్యప-అ6)

మరియు ద్యూతమైన వెంటనే కుంతీదేవి యనుజ్ఞదీసికొని వన వాసమునకు వెళ్ళునపుడు ద్రౌపదీదేవి యేయవస్థలో నున్నదో ఇట్లు చెప్పబడినది—

"తథే త్యుక్త్వా తు సా దేవీ ప్రవవ్రాజ త్రిజలావిలా ।
శోణితాక్తైకవసనా ముక్తకేశీ వినిర్యయౌ ॥
(అనుద్యూత-అ79)

మరియు ఎనిమిదవరోజుయుద్ధములో దుర్యోధనునితో ఘటో త్కచు డిట్లనెను—

"అద్యాఽనృణ్యం గమిష్యామి పితౄణాం మాతు రేవ చ,
యే త్వయా సునృశంసేన దీర్ఘకాలం ప్రవాసితాః॥
యచ్చ తే పాండవా రాజం శ్ఛలద్యూతే పరాజితాః,
యచ్చైవ ద్రౌపదీ కృష్ణా ఏకవస్త్రా రజస్వలా,
సభా మానీయ దుర్బుద్ధే బహుధా క్లేశితా త్వయా॥
ఏతేషా మవమానానా మన్యేషాం చ కులాధమ।
అస్త మద్య గమిష్యామి యది నోత్సృజసే రణమ్ ॥
(భీష్మ-అ91)

మరియు కర్ణదుర్యోధనుల నిందెంచుచు అశ్వత్థామయిట్లనెను—

"ఇంద్రప్రస్థం త్వయా కస్మిన్ సంగ్రామే నిర్జితం పురా ।
తత్రైవ కతమ ద్యుద్ధం యస్మిన్ కృష్ణా జితా త్వయా ॥
ఏకవస్త్రా సభాం నీతా దుష్టకర్మన్ రజస్వలా । (విరాటప-అ50)

మరియు భీమసేనుడు ధార్తరాష్ట్రులను సంహరించి యిట్లనెను-

"రజస్వలాం ద్రౌపదీ మానయన్ యే యే చా ప్యకుర్వన్త సద స్యవస్త్రామ్ । తాన్ పశ్యధ్వం పాండవై ర్ధార్తరాష్ట్రాన్ రణే హతాం స్తపసా యాజ్ఞసేన్యాః" (శల్య-అ50)

మరియు కర్ణవధదుఃఖితుడై యున్న దుర్యోధనునితో కృపాచార్యులు ఇపుడైన సంధిజేసికొను మని చెప్పినపుడు పాండవు లందుకంగీకరింపరనుచు దుర్యోధనుడు చెప్పిన మాట లిట్లున్నవి—

"దుశ్శాసనేన య త్కృష్ణా ఏకవస్త్రా రజస్వలా ।
పరిక్లిష్టా సభామధ్యే సర్వలోకస్య పశ్యతః ॥
తథా వివసనాం దీనాం స్మర న్త్యద్యాపి పాండవాః ।
న నివారయితుం శక్యా స్సంగ్రామా త్తే పరంతపాః॥" (శల్య-అ4)

ఇట్లు బహుస్థలములలో ద్రౌపది నిజముగా రజస్వలయె యై యున్నదని కంఠోక్తిగా చెప్పబడియుండుటేగాక దుర్యోధనునిచేగూడ జెప్పబడియున్నపుడు తంత్రవార్తికకారుడు గ్రంథమునకు విరుద్ధముగా జెప్పెనను టెట్లు? ధర్మజుడు- నీవు రజస్వలావేషము నేసికొని రమ్మని కబురంపినాడను టెట్లు? కనుక ప్రతివాదులది తెలివితక్కువవ్రాత యనుటే నిశ్చయము. ఇంతవరకు జూపిన ప్రమాణోపపత్తులతో ప్రతివాదిప్రసంగము ప్రతిహతమైనది. ఈ యుధిష్ఠిరోపదేశముగూర్చి రహస్యకర్త లిట్లు వ్రాసినారు—

"దుర్యోధనుని యాద్ధత్యమును చూచుచున్న ధర్మజుడు-ద్రౌపదీ సంరక్షణార్థము తగిన యుపాయము నూహించి తన కాప్తుడైన సేవకుని బిలిచి రహస్యముగా ద్రౌపది రజస్వలావేషము ధరించి

వెంటనే సభకేతెంచి ధృతరాష్ట్రుని సమీపమున నిలువవలసినదిగా వానిచేత నామెకు జెప్పి పంపెను. ధర్మజు డాపన్నివారణార్థము సద్యఃకాలానుసారముగా నవలంబించిన కృత్యము, కార్యగౌరవము, గ్రహింపలేని మనశాస్త్రిగారికి (మ. భా. చ. కారులకు) కపట కృత్యముగా దోచినదికాని అందు కపటమేమియు లేదు" (పు603)

"సాధారణముగా కృషీవలుల భూములలో పసుగ్రాసాదులను దొంగిలించుచున్న యే ప్రాకృతస్త్రీ నైనను కృషీవలుడు చూచి దానిం బట్టుకొనుటకు పరుగిడినపుడు అది తన ముప్పును తప్పించు కొనుటకై తాను రజస్వలనియు తన్నంటగూడదనియు చెప్పుచుం డును. అది సత్యము గానీ, అసత్యముగానీ; వాడు సమీపంపనే లేడు. అఖండభూమండలసార్వభౌముని రాణియగు ద్రౌపదిని ఒకనీచు డవ మానించుటకై సమీపించుచుండ వానిబారినుండి తప్పించుకొను టకై 'నేను రజస్వలను, నన్నంటరాకుము' అని చెప్పినపుడు నిశ్శం కగా జుట్టుపట్టి యీడ్చినవాడు పశువనుటకుగూడ దగడు"(పు602)

ఈవ్రాతలలో యుధిష్ఠిరుడు రహస్యముగా జెప్పి పంపెననుట- ఆపన్నివారణార్థము అవలంబించిన కృత్యమనుట, ద్రౌపది అఖండ భూమండలసార్వభౌముని రాణియనుట ఆమె, పసుగ్రాసాదుల దొంగి లించు ప్రాకృతస్త్రీ "నేను రజస్వలను నన్నంటకుము" అని నిజముగానీ కాకపోనీ తప్పించుకొనుటకై చెప్పినట్లు దుశ్శాసనునివలన తప్పించుకొనుటకై "నేను రజస్వలను" అని చెప్పినదనుట అసంగత ప్రసంగములు. ధర్మజుడు రహస్యముగా జెప్పి పంపుట అసంభవ మని వెనుక నిరూపించియే యున్నాము. ఆమె రజస్వలయై యుండుట నిజమే అని ప్రమాణములు ప్రదర్శించి యున్నాము. "ఏకవస్త్రా" అను శ్లోకమునకు నిర్దుష్టార్థమును నిరూపించి యున్నాము. తంత్ర వార్తికగ్రంథము ప్రతివాదులకు ప్రతికూలమే అని చూపియున్నాము.

కాబట్టి ఉత్తరభారతములోగూడ మ. భా. చ. కారులు వ్రాయుటలో—

"దుర్యోధనుడు పాంచాలిని సభలోనికి గొనితేర దుశ్శాసను నంపుచుండుట జూచి ద్యూతసర్జితుడగు ధర్మజుడు అనాలోచితుడై రహస్యముగ ద్రౌపదికి 'నీవు రజస్వలారూపిణివై, యేకవస్త్రవై, రుదితముఖివై సభలోనికి రమ్మని యామెకు వర్తమానమంపెను. దురోదరి కుచితానుచితపరిజ్ఞానము సున్నగదా! ఈ కృత్రిమముం దెలిసికొనికాబోలును దుశ్శాసనుడు సోదరు నాజ్ఞానిర్వాహణమే యుత్తమధర్మముగా నెంచి సభలోనికి వచ్చుట నుచితమని చెప్పి ద్రౌపదిని కేశాకర్షణ మొనర్చుచు సభకీడ్చి యవమానితం జేసెను" (పుట 13)

అనుమాటలు కూడ నసంగతము లగుటచే బరాస్తములైనవి.

"శ్రీమదాంధ్రమహాభారతసంశయవిచ్ఛేదము" అనుగ్రంథములోని పీఠికలో గ్రంథకారు లిట్లు వ్రాసియున్నారు—

"ఈగ్రంథమునందు ద్రోవది ప్రాతిగామివెంట సభకు బోవునపుడు దుర్మార్గులగు దుర్యోధనాదుల భయమున రజస్వల కాకయే రజస్వలాలక్షణములతో నేకవస్త్రయై నడిచి పోయినట్లు చెప్పబడినది.

దీనికి శాంతిపర్వము ౧ ఆశ్వాసములో ద్రోవది ధర్మజునితో—

సీ. నృపునందు...సభ కేకవస్త్ర రజస్వలయనక నన్ దలవట్టి యీడ్చిన తప్పు... అను దానిం బట్టి నిజముగా దాను రజస్వలయైనట్లు చెప్పెనని తోచిన దోచనచ్చు. నిజముగా నేను రజస్వల ననుటగాదు. విమర్శించిన నయ్యర్థము లేదు. ఏకవస్త్రన్ = రజస్వలయైనట్లు ఏకవస్త్రచిహ్నముతో నగబడుచు (నోట జెప్పుచు) నున్న నన్ను; ఇది ద్వితీయ. ఇక ప్రథమ—ఏకవస్త్ర=ఏకవస్త్రము గలది; రజస్వల యనక తాకి సిగవట్టి సభ కీడ్చినాడనుటగాని నిజముగా దాను రజస్వల ననుట గాదు.

వెంటనే సభకేతెంచి ధృతరాష్ట్రుని సమీపమున నిలువవలసినదిగా వానిచేత నామెకు జెప్పి పంపెను. ధర్మజు డాపన్నివారణార్థము సద్యఃకాలానుసారముగా నవలంబించిన కృత్యము, కార్యగౌరవము, గ్రహింపలేని మనశాస్త్రిగారికి (మ. భా. చ. కారులకు) కపట కృత్యముగా దోచినదికాని అందు కపటమేమియు లేదు" (పు603)

"సాధారణముగా కృషీవలుల భూములలో పశుగ్రాసాదులను దొంగిలించుచున్న యే ప్రాకృతస్త్రీ నైనను కృషీవలుడు చూచి దానిం బట్టుకొనుటకు పరుగిడినపుడు అది తన ముప్పును తప్పించు కొనుటకై తాను రజస్వలనియు తన్నంటగూడదనియు చెప్పుచుం డును. అది సత్యముగానీ, అసత్యముగానీ; వాడు సమీపంపనే లేడు. అఖండభూమండలసార్వభౌముని రాణియగు ద్రౌపదిని ఒకనీచు డవ మానించుటకై సమీపించుచుండ వానిబారినుండి తప్పించుకొను టకై 'నేను రజస్వలను, నన్నంటరాకుము' అని చెప్పినపుడు నిశ్శం కగా జుట్టుపట్టి యీడ్చినవాడు పశువనుటకుగూడ దగడు"(పు602)

ఈవ్రాతలలో యుధిష్ఠిరుడు రహస్యముగా జెప్పి పంపెననుట- ఆపన్నివారణార్థము అవలంబించిన కృత్యమనుట, ద్రౌపది అఖండ భూమండలసార్వభౌముని రాణియనుట ఆమె, పశుగ్రాసాదుల దొంగి లించు ప్రాకృతస్త్రీ "నేను రజస్వలను నన్నంటకుము" అని నిజము గానీ కాకపోనీ తప్పించుకొనుటకై చెప్పినట్లు దుశ్శాసనునివలన తప్పించుకొనుటకై "నేను రజస్వలను" అని చెప్పినదనుట అసంగత ప్రసంగములు. ధర్మజుడు రహస్యముగా జెప్పి పంపుట అసంభవ మని వెనుక నిరూపించియే యున్నాము. ఆమె రజస్వలయై యుండుట నిజమే అని ప్రమాణములు ప్రదర్శించి యున్నాము. "ఏకవస్త్రా" అను శ్లోకమునకు నిర్దుష్టార్థమును నిరూపించి యున్నాము. తంత్ర వార్తికగ్రంథము ప్రతివాదులకు ప్రతికూలమే అని చూపియున్నాము.

కాబట్టి ఉత్తరభారతములోగూడ మ. భా. చ. కారులు వ్రాయుటలో—

"దుర్యోధనుడు పాంచాలిని సభలోనికి గొనితేర దుశ్శాసను నంపుచుండుట జూచి ద్యూతపరిజితుడగు ధర్మజుడు అనాలోచితుడై రహస్యముగ ద్రౌపదికి 'నీవు రజస్వలారూపిణివై, యేకవస్త్రవై, రుదితముఖివై సభలోనికి రమ్మని యామెకు వర్తమానమంపెను. దురోదరి కుచితానుచితపరిజ్ఞానము సున్నగదా! ఈ కృత్రిమమును దెలిసికొనికాబోలును దుశ్శాసనుడు సోదరు నాజ్ఞానిర్వహణమే యుత్తమధర్మముగా నెంచి సభలోనికి వచ్చుట నుచితమని చెప్ప ద్రౌపదిని కేశాకర్షణ మొనర్చుచు సభకీడ్చి యవమానితం జేసెను" (పుట 13)

అనుమాటలు కూడ నసంగతము లగుటచే బరాస్తములైనవి.

"శ్రీమదాంధ్ర మహాభారతసంశయవిచ్ఛేదము" అనుగ్రంథములోని పీఠికలో గ్రంథకారు లిట్లు వ్రాసియున్నారు—

"ఈగ్రంథమునందు ద్రోవది ప్రాతిగామివెంట సభకు బోవునపుడు దుర్మార్గులగు దుర్యోధనాదుల భయమున రజస్వల కాకయే రజస్వలాలక్షణములతో నేకవస్త్రయై నడచి పోయినట్లు చెప్పబడినది.

దీనికి శాంతిపర్వము ౧ ఆశ్వాసములో ద్రోవది ధర్మజునితో—

సీ. నృపునందు... సభ కేకవస్త్ర రజస్వలయనక వక్ర దలపట్టి యీడ్చిన తప్పు... అను దానిం బట్టి నిజముగా దాను రజస్వలయైనట్లు చెప్పెనని తోచిన దోచనచ్చు. నిజముగా నేను రజస్వల ననుటగాదు. విమర్శించిన నయ్యర్థము లేదు. ఏకవస్త్రక = రజస్వలయైనట్లు ఏకవస్త్రచిహ్నముతో నగబడుచు (నోట చెప్పుచు) నున్న నన్ను; ఇది ద్వితీయ. ఇక ప్రథమ—ఏకవస్త్రు=ఏకవస్త్రము గలది; రజస్వల యనక తాకి సిగపట్టి సభ కీడ్చినాడనుటగాని నిజముగా దాను రజస్వల ననుట గాదు.

రజస్వల నను నోటిమాటం బట్టి తనచేతం బడకుండ దప్పించు కొనుటకు నే ననుచుంటివని దుశ్శాసను డూహింపవచ్చుంగాని రజ స్వలాచిహ్నమైన ఏకవస్త్రమును జూచియు, నీ నీచుడు పై వచ్చు టేమి? నేనట్లు నేవముతో నటించుచుంటినని యత డూహించుట కెట్లని ద్రౌపది భావము" అని.

ఈవిషయమై చర్చించి ఆమె నిజముగా రజస్వలయేయని బహు ప్రమాణములతో నిరూపించియే యున్నాము.

మరికొన్నిమాట లిక్కడ జెప్పవలసియున్నది—

వీరు సమన్వయించినది ఆంధ్రభారతవాక్యము. అది సంస్కృత భారతమున కాంధ్రీకరణముగాని స్వతంత్రము గాదు ఆ సంస్కృత భారతములో బహుస్థలములలో నిస్సంశయముగా నున్న విషయము నకు విరుద్ధముగా నామె రజస్వలయై యుండ లేదని యాంధ్రభారత మెట్లు చెప్పును?

వీరు చూపిన శాంతిపర్వమందలి యాంధ్రభారతవాక్యమునకు మూలమం దట్లున్నదేమో చూడుడు—

శాంతిపర్వ—కుంభకోణప్రతి—అ 12

"సర్వేషాం పాపబుద్ధీనాం పాపకర్మైవ కుర్వతామ్ ।
ధృతరాష్ట్రస్య పుత్రాణాం దండో నిర్దోష ఇష్యతే ॥
పశ్యతాం చైవ శూరాణాం యాఽహం ద్యూతే సభాం గతా ।
రజస్వలా సమానీతా భవతాం పశ్యతాం నృప ॥
వాసస్యైకేన సంవీతా"

ఇచ్చట వారూహించిన యన్వయమున కవకాశ మేమియు లేదు. కాబట్టి ఆంధ్రభారతవాక్యమునకు వారు రజస్వల కాదనుటకై చేసిన యన్వయము కల్పనామాత్రముకాని గ్రంథతాత్పర్యము కాదు.

ఆంధ్రభారతములోనే ఆమె రజస్వలాస్థితిని జెప్పుచున్న స్థలాం తరవిషయములనుగూడ జూడుడు—

ధర్మజునితో వెనుకటికష్టములు స్మరింపక మరచిపొమ్మని కృష్ణ భగవానుడు చెప్పుచున్నసందర్భము— అశ్వమేధప-అ ౧.

సీ. ...సభ కేకవస్త్ర రజస్వల పాంచాలి
గొనిరాక మఱవు కాననములోన
నిడుములు గుడుచుట నెడ్డబెట్టకు జ
టాసుర సైంధవాదుల దుర్విక్రుతులు దలపకుము.

మరియు కర్ణవధానంతరము ఇకనైన సంధికర్తవ్యమని చెప్పిన కృపాచార్యునితో దుర్యోధను డిట్లనెను— "సంధి కర్తవ్యం బని పలికితివిగాని యప్పలుకులు నాకు రుచియింప వెల్లంలేని—

సీ. కపటంపుజూదంబు ఘటియించి రాజ్యంబు
గొని ధర్మజని మది గుందజేసి
సభ కేకవస్త్ర రజస్వల నమ్మయి
బాంచాలి ముందలపట్టి యీడ్చి
సంధిసేయగ బూని శౌరి యేతెంచిన
నవ్విధంబున కప్రియం బొనర్చి
పలువురుగూడి సౌభద్రు నొక్కని
బాలు గిట్టి యత్తెరగున గీటడంచి
తే. నేడు దుశ్శాసనుని బొమ్మ నెత్తుఁక్రనిల
సుతుడు ముదమున ద్రావుట సూచి కొరత
పతిత్రిన దీర్చు నతం డని భయము బొంది
పొందు గోరిన నదియేల పొసగు జెపుమ. (శల్యప-అ౧)

ఈస్థలములలో వారు శాంతిపర్వవాక్యమునకు అన్వయించిన ట్లన్వయించుట కవకాశములేనందున ఆంధ్రభారతముగూడ ద్రౌపది ఆనాడు నిజముగా రజస్వలయై యున్నదనియే చెప్పుచున్నదని గ్రహింప వలయును.

మరియు దుర్యోధనుని గదాఘాతమున బడగొట్టి యాతనితో భీమసేను డిట్లనియె — (శల్యప-ఆ2)

తే. ఏకవస్త్ర బాంచాలి న ట్లీడ్చి తేర
బనిచి సభలోన బరచిన పాపఫలము,
ననుభవింపుము దుష్టాత్మ యనుచు వామ
చరణమున బెట్టిదము గాగ శిరము దన్నె.

తరువాత ధర్మనందనాదుల నవలోకించి—

ఆ. శంక లేక కడగి సభ కట్లు పాంచాలి
నంటరానిదాని నొంటి చీర,
తోన యున్న సాధ్వి వేనలి వట్టి యీ
డ్పించి నతని జూడు డంచు బొదలి.

ఇట్లాంధ్రభారతముగూడ నామె రజస్వలయై యుండుటే నిజమని చాటుచున్నది. కనుక 'ఆంధ్రభారతసంశయవిచ్ఛేద'కర్తలు శాంతి పర్వపద్యమునకు జేసిన క్లిష్టాన్వయ మకాండతాండవము. కనుక ప్రతివాదుల విరుద్ధప్రసంగములు హేయములు. ఇంతటితో దీనిని విడిచి అంశాంతర మందుకొందము—

—: "భీముడు ధర్మజుని నీచేతులు తగులబెట్టవలయు ననినా"
డను ప్రసంగము—తన్నిరాకరణము :—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— "ద్యూతకాలమున ధర్మజుని యకృత్యములకు రోసియే సోదరప్రియత్వము, అగ్రజుని యం దత్యంతభక్తియు గల భీముడును ధర్మజుని నీచేతులు తగుల బెట్టవలయు ననినాడు" (పు ౪47)

మన మిప్పుడు భీమసేను డేమనెనో ఎప్పు డనెనో పరిశీలింతము. ద్రౌపదీదేవిని పరప్రేరణచే నొడ్డి యోడినతరువాత దుశ్శాసనుడు పోయి ఆమెను యీడ్చి తెచ్చి దుస్సహాముగా పీడించుచుండెను.

"తాం కృష్యమాణాం చ రజస్వలాం చ
స్రస్తోత్తరీయామతదర్హమాణాం ।
వృకోదరః ప్రేక్ష్య యుధిష్ఠిరం చ
చకార కోపం పరమార్తరూపః ॥"

రజస్వలయై, జారిన యుత్తరీయముకలదై, దుశ్శాసనునిచే లాగ బడుచున్న ఆద్రౌపదీదేవినిజూచి, యిటు యుధిష్ఠిరునిజూచి భీమసేనుడు కోపోద్దీపితుడై యుధిష్ఠిరునితో నిట్లనెను—

"వాహనాని ధనం చైవ కవచా న్యాయుధాని చ ।
రాజ్య మాత్మా వయం చైవ కైతవేన హృతాః పరైః ॥
న చ మే తత్ర కోపోఽభూ త్సర్వస్యేశోహి నో భవాన్ ।
ఇమం త్వతిక్రమం మన్యే ద్రౌపదీ యత్ర పణ్యతే ॥
ఏషా హ్యనర్హతీ బాలా పాండవాన్ ప్రాప్య కౌరవైః ।
త్వత్కృతే క్లిశ్యతే క్షుద్రై ర్నృశంసై రకృతాత్మభిః ॥
అస్యాః కృతే మన్యు రయం త్వయి రాజ న్నిపాత్యతే ।
బాహూ తే సంప్రధక్ష్యామి సహదేవాఽగ్ని మానయ ॥"

నీలకంఠీయమ్— తే తవ పుర ఇతి శేషః, సంప్రధక్ష్యామి ।

ధనవాహనాయుధకవచాదికము, రాజ్యము, మేము, నీవు శత్రువులచే గపటమున నపహరింపబడితిమి. నీవు సర్వాధిపతి వగుటచే నా కావిషయమై కోపము రాలేదు. ద్రౌపదిని పణముగాబెట్టుట వ్యతిక్రమమని తలచుచున్నాను. పాండవధర్మపత్నియై యున్న యీయామె నీమూలమున క్షుద్రులచే క్లేశపెట్టబడుచున్నది. ఈమెనుబట్టి కలిగిన యీకోపము నీయందు పడవేయబడుచున్నది. యుధిష్ఠిరా! నీయెదుట నా బాహువులను తగులబెట్టుకొనుచున్నాను. సహదేవా! అగ్నిని దెమ్ము. అని.

దీనినిబట్టి చూడగా ద్రౌపది నోడినపుడుగాని, యామె నోడినపుడుగాని భీమసేనునకు దానట్టి కోపము దుశ్శాసను డామెను బట్టి

కొని పీడించుటవలన వచ్చినదని స్పష్టము. ఇప్పు డాకోపమునకు గుఱి కావలసినవాడు దుశ్శాసనుడా? యుధిష్ఠిరుడా? అనునదివిచారణీయము.

యుధిష్ఠిరుడె యైనచో నది ద్రౌపదిని పణముగా నుంచినపుడే రావలయును. ఆమె నోడినపుడైన రావలయును. అట్లు రాక దుశ్శాసనుని దౌర్జన్యకాలములో వచ్చినది. ఆదౌర్జన్యము నాతడు చేయుటకు ద్రౌపదిని పణముగా బెట్టుట కారణమైనదని నీవామెను పణముగా బెట్టుట అక్రమమని వెనుకటి విషయ మెత్తుకొనవలసివచ్చినది.

భీమసేనున కప్పుడు తన బాహుబలమున దుశ్శాసనుని వధింపవలె నని కోపము వచ్చినది. ఆవిషయమై తన కప్పుడు ధర్మజుని యంగీకార మపేక్షితమైనది. కనుకనే ఆ ద్రౌపదివైపు, ఈ ధర్మజునివైపు చూచుచువచ్చెను. అది లభింపలేదు. అప్పుడీ వీరపత్నికి భరింపరాని యింతకష్టము నాకనులయెదుట ప్రాప్తింప బరిహరింపలేని నా యీబాహువులు కాల్పనా. అని భీమసేనున కనిపించి తాను వ్యగ్రుడై పోవుటకు ధర్మజుని యనంగీకారమే మూలముకదా యని భావించి నా యీకోపము నీయందు విడిచివేయబడుచున్న దని చెప్పి—

"బాహూ తే సంప్రధక్ష్యామి సహదేవాగ్ని మానయ"

అని పలికెను. ఇచ్చట 'తే' అనుదానికి 'పురః' అని యధ్యాహారముచేసి నీయెదుట బాహువులను తగులబెట్టుకొనుచున్నాను. అని యర్థము నీలకంఠాచార్యునిచే బోధింపబడినది.

ప్రతివాదులు వ్రాసినట్లు నీబాహువులను తగులబెట్టుదునన్నట్లే అర్థమైనయెడల నాధర్మజుని బాహువులను తగులబెట్టుటకు సహదేవుని యగ్నిని దెమ్మనుట అసంగతమగును. యుధిష్ఠిరునియందు భక్తిశ్రద్ధలతోనుండిన ఆసహదేవుడు యుధిష్ఠిరుని శిక్షించుటలో దనకు సహాయపడునని యెట్లనుకొనును? ఆప్రయత్నము తనవిషయమే అయినపుడు ఆతనితో జెప్పుటలో నసాంగత్య ముండనేరదు.

ఇంకొకటి- పూర్వోక్తప్రకారము దుశ్శాసనుని గుఱియై యున్న భీమసేనక్రోధమునకు ధర్మజుని గురిచేయుట అసంగతము.

ఇంకొకటి- ధర్మజుని బాహువుల కట్టి శిక్షచేయుదుననుట కేమి యౌచిత్య మున్నది? ద్రౌపదీపణములో వాగ్వ్యాపారము తప్ప ధర్మజుని బాహువ్యాపారము లేదే. దుశ్శాసనుని బాహుబలమున బడ గొట్టకపోయె నని ధర్మజుని బాహువులకు శిక్షయందురా?

ధర్మజునిది ధర్మబలము. అర్జునునిది శస్త్రాస్త్రబలము. భీమునిది బాహుబలము. అని ప్రసిద్ధమై యుండ బాహుబలము జూపవలసిన భీముడు చూపలేక ధర్మజుని బాహువులకు శిక్షజేయుదుననినట్లు చెప్పుట యుక్తమా?

మరియు. అతీతమైనట్టియు అప్పుడు తనచే నుపేక్షింపబడినట్టియు, ఇప్పుడేమునినను కలిసినట్టియు ద్రౌపదీపణము నెత్తుకొని అగ్రజునియం దత్యంతభక్తిగలవాడని ప్రతివాదులచేగూడ ప్రశంసింపబడిన భీమసేనుడు- ధర్మజునిచేతులగాల్చెదననినట్లు అర్థముచెప్పుట అత్యంతాసంగతము. తత్కాలప్రాప్తమై తత్కాలమందు వేషొనర్చమైనాను విజృంభించిన తొలగుచున్నదైయున్న దుశ్శాసన దౌర్జన్యమును ఉన్మూలించుటకై సంరంభము కలిగినపుడు తనకత్యంతమునుజ్ఞనీయకుండిన యాధర్మజునియెదుట వ్యర్థములైన తనబాహువులను కాల్చుకొనెదననినట్లు చెప్పుటే అత్యంతోపపన్నము. కనుకనే ఆభీమసేనుని మాటపై అర్జునుడు బోధించునపుడు ధర్మజుని బాహువులగాల్చెదనను యంత తప్పుమాటాడవచ్చునా? అని మందలింపలేదు. ఇట్లర్జునుడు బోధించెను

—చూడుడు—

"న పురా భీమసేన త్వ మీదృశీ ర్వదితా గిరః ।
పరైస్తేనాశితం నూనం నృశంసై ర్ధర్మగౌరవమ్ ॥
న సకామాః పరే కార్యా ధర్మ మే వాచరోత్తమమ్ ।
భ్రాతరం ధార్మికం జ్యేష్ఠం కోఽతివర్తితు మర్హతి ॥

ఆహూతో హి పరై రాజా క్షాత్రం వ్రత మనుస్మరన్ ।
దీవ్యతే పరకామేన త న్నః కీర్తికరం మహత్ ॥"

భీమసేనా! నీవెన్నడు నిట్లు మాటలాడి యెరుగవు నీధర్మగౌరవము పరులచే నశింపజేయబడినది. పరులకు సంకల్పసిద్ధి కలిగింపక ధర్మమునే ఆచరింపుము. ధార్మికుడగు సోదరుని యెవ్వ డతిక్రమించి ప్రవర్తించును? పరు లాహ్వానించుటవలన క్షాత్రవృత్తమునుబట్టి ద్యూతము నంగీకరించెను. అది మనకు కీర్తికరమే. అని.

ఈమాటలు విని భీమసేను డిట్లు పలికెను —

"ఏవ మస్మిన్ కృతం విద్యాం యది నాహం ధనంజయ,
దీప్తే౽గ్నౌ సహితౌ బాహూ నిర్దహేయం బలాదివ॥"

నీలకంఠీయమ్—ఏవం త్వదుక్తప్రకారేణ, అస్మిన్ ప్రస్తుతే విషయే. కృతం కుశలం ధర్మపాలనాఖ్యం, యది న విద్యాం నజానీయామ్. తర్హి బాహూ దహేయమేవ. యతో జానా మ్యతో న దహామీత్యర్థః ।

అర్జునా! నేనీవిధముగా తెలిసికొనకున్న యెడల బాహువులను తెగులబెట్టుకొనియుందును. అని, ఇట్లు శాంతించినపుడు అయ్యో ధర్మజుని బాహువులను గాల్చెద నని యెంత తప్పు మాటాడితి నని పరితపింపవలసిన భీమసేనుడు పరితపింపలేదు; క్షమింపుమని ధర్మజుని వేడుకొనలేదు. కనుక నది ధర్మజుని బాహువులనుగూర్చిన మాట కాదని గ్రహింపవలయును.

మరియు, ఈబాహుదాహమునుగూర్చిన ప్రసంగము స్థలాంతరములోగూడ స్మరింపబడినది—పాండవులు వనవాసము జేయుచు ద్వైతవనములో నున్నపుడు ధర్మజునితో భీమసేనుడు, మనమీవనవాసక్లేశములనిట్లనుభవించుచుండవలసిన దేనా? దీనికివిముక్తి యున్నదా? పౌరుషము జూపి శత్రుక్షయము జేయక యిది యేమిపని? అనుచు మాటలాడగా ధర్మజు డిట్లనెను —

"తం సన్ధి మాస్థాయ సతాం సకాశే కోనామ జహ్యా దిహ రాజ్య హేతోః । ఆర్యస్య మన్యే మరణా ద్గరీయో యద్ధర్మ ముత్క్రమ్య మహీం ప్రశాసేత్ ॥ తదైవ చే ద్వీరకర్మాఽకరిష్యో యదా ద్యూతే పరిఘం పర్యమృక్షః । బాహూ దిధక్షన్ వారితః ఫాల్గునేన కిం దుష్కృతం భీమ తథాఽభవిష్యత్ ॥ ప్రాగేవ చైవం సమయక్రియాయాః కిం నాబ్రవీః పౌరుష మావిదానః । ప్రాప్తం తు కాలం త్వభిపద్య పశ్చా త్కిం మా మిదానీ మతివేలమాత్థ ।· భూయోఽపి దుఃఖం మమ భీమసేన దూయే విషస్యేవ రసం హి పీత్వా । య ద్యాజ్ఞసేనీం పరిక్లిశ్యమానాం సందృశ్య తత్ క్షాన్త మితిస్మ భీమ ॥

(వన-అ34)

భీమసేనా! వనవాసాజ్ఞాతవాసములను గూర్చి చేసిన ఆశపథమును రాజ్యమునిమిత్తము విడిచివేయు టెట్లు? పూజ్యునకు ధర్మము నతిక్రమించి రాజ్యము నేలుటకంటె మరణము మంచిది. ఆనాటి ద్యూతసమయమున నీవు పరిఘము (ఆయుధము)పై హస్తము నుంచినపుడు బాహువులను దగ్ధముచేసికొనదలచి యర్జునునిచే నివారింపబడినపుడు పరాక్రమముజూపుట కేమి యడ్డము వచ్చినది? మన మాశపథము జేయుటకు పూర్వమే నీవు పౌరుషప్రకటనమున కేల సంకల్పింపకపోతివి? అట్టి ఆపద నుపేక్షించియుండిన నీవు నన్నిప్పు డిట్లనుటా? అట్టి కష్టము నకు పాలైన ద్రౌపదిని చూచి సహించుట నా కతిదుఃఖకరమై యున్నది. అని.

ఈప్రబోధములో నాడు నీవు ఏధర్మమునకు గట్టుబడి శాంతి వహించియుంటివో ఆధర్మమునకే కట్టుబడి నేడును ద్యూతకాలశపథము నిర్వహించుటకై శాంతివహించి యుండు మనుటే ధర్మజుని తాత్పర్యము.

ఇచ్చట "బాహూ దిధక్షన్ వారితః ఫాల్గునేన" అన్నపుడు నా బాహువులను అని చెప్పబడలేదు. "బాహూ తే సంప్రధక్ష్యామి"

అనినపుడు 'తే' అను పదమునకు బాహుపదముతో సంబంధము లేద నుట కిదికూడ నిదర్శనము. అట్టి సంబంధమే అచ్చట యుండి యున్న యెడల నిచ్చట భీమసేనుని ధర్మజుడే మందలించునపుడు ఆనాడు నా బాహువులను దగ్ధముచేయుడు నంటివికాని యాదుశ్శాసనుని యుక్కడ గింపకపోతివేమి? అని యవశ్య మనవలసియున్నది. "ప్రాప్తం తు కాలం త్వభిపద్య పశ్చాత్ కిం మా మిదానీ మతివేల మాత్థ" అనుట సరిపడదు.

మరియు ప్రతివాదు లన్నట్లు నాడు భీమసేనుడు ధర్మజుని ధిక్కరించుటే నిజమైనయెడల దుశ్శాసనునిపై తప్పక దూకియుండును. ఎంతక్రోధములో నైనను ధర్మజుని యనుజ్ఞలేనిదే యేపనిని జేయని వాడుకనుకనే దుశ్శాసనునిపై బడలేదు. ఆ బలాఢ్యుని యందున్న మహాగుణ మది. ధర్మజునే ధిక్కరించినట్లు చెప్పువారు అపుడు ఆ దుశ్శాసనునిపై బడకుండుటకు గారణము జెప్పగలరా? కనుక ప్రతివా దుల దపోహ. అందుచే ప్రతివాదిప్రసంగమునకు త్రోసిపేతయైనది.

భీమసేనుడు తన బాహువులను దగ్ధముచేసికొనెద ననియే అనెను కాని ధర్మజుని బాహువుల నట్లు చేసెద నని యనలే దనునది విద్వత్సిద్ధాంతము.

—: లోకులు సుయోధనకృతాపరాధములనే లెక్కింతురుగాని భీమకృతాపకారముల నేలొకో లెక్కింపరు? అనుప్రసంగము—తన్నిరాకరణము :—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— "భీముడు చిన్న తనపుటాటలలో గౌరవులను బాధించుటచేతనె కురుపాండవులకు విరోధబీజ మేర్పడెను. ఈబాధల బడలేకయే దుర్యోధను డీతని జంపుటకు మహాపకారముల దలపెట్టెను, లోకులు సుయోధన కృతాపరాధములను లెక్కింతురేగాని భీమకృతాపకారముల నేలొకో

లెక్కింపరు? అపకారబుద్ధిలేక బాల్యముచేతనె యాత డట్టిబాధల గౌరవులకు జేసియుండెనని మహాభారతమున గలదు. కాని బాల్యమైన నబాల్యమైనపకారబుద్ధి యుండిన నుండకుండిన బెట్టినబాధలు బాధలేకదా? అపకారబుద్ధి లేక యొక డగ్ని దటికొలిపిన నిండ్లు కాలకుండునా?" (పు 25)

ఇచ్చట ప్రతివాదులు కౌరవులను భీముడు బాధించినది చిన్నతనపు టాటలలో నని చెప్పుచునే యున్నారు. ఆమాటలలోని విషయమునకే దుర్యోధనుడు చాపదలపెట్టినట్లుకూడ జెప్పుచున్నారు. లోకులు దుర్యోధనకృతాపరాధములనే లెక్కించుటలో గారణమింకను దెలియవలసియే యున్నదా? భీమునివలన వారి కట్టిబాధలు కలుగుట బాల్యముచేతగాని, అపకారబుద్ధిచేత గాదని గ్రంథముం దున్నట్లు చెప్పుచు నెటులైనను పెట్టినబాధలు బాధలేకదా. అనుచున్నారు. వారి కవి బాధలుకావచ్చునేకాని వారిని బాధింపవలె నని పెట్టబడిన బాధలుమాత్రము కావని గ్రంథతాత్పర్యము. మహాభారతకర్త, ఏవ్యక్తి హృదయ మెట్టిదో స్పష్టముగా దెలిసిన వేదవ్యాసభగవానుడు కాని సామాన్యుడుకాడు. ఈవిషయమై ప్రతివాదుల కొకసంగతి జ్ఞాపకము జేయుచున్నాము. "ద్యూతమం దోడిపోవుటకు ధర్మజుని అపరాధియే కారణముగాని, దుర్యోధనుని యన్యాయము కాదు" అని వారన్నట్లుగా చిన్నతనపుటాటలలో బాధలు కలుగుటకు కౌరవులు దుర్బలు లగుటే కారణముగాని భీమసేనుని దుర్వృత్తి కారణము గాదని మేమనుచున్నాము. గ్రంథసందర్భ మవలోకింతము—

"ధార్తరాష్ట్రైశ్చ సహితాః క్రీడన్తో ముదితా స్సుఖమ్।
బాలక్రీడాసు సర్వాసు విశిష్టా స్తేజసాఽభవన్ ॥
జవే లక్ష్యాభిహరణే భోజ్యే పాంసువికర్షణే ।
ధార్తరాష్ట్రాన్ భీమసేన స్సర్వాన్ సపరిమర్దతి ॥

నీల॥ జవే ధావనక్రీడాయాం లత్యాభిహారణే అహం పూర్వ మహం పూర్వ మితి దృష్టఫలాదిగ్రహణే భోజ్యే పాంసువికర్షణే బాల క్రీడావిశేషే. పరిమర్దని సర్వత్ర ఉపమృద్నాతి ॥

"నతే నియుద్ధే న జవే న యోగ్యాసు కదాచన ।
కుమారా ఉత్తరం చక్రుః స్పర్ధమానా వృకోదరమ్ ॥

నీల॥ యోగ్యాసు శిక్షాభ్యాసేషు ఉత్తరమ్ ఉత్కర్షమ్.

"ఏవం స ధార్తరాష్ట్రాంశ్చ స్పర్ధమానో వృకోదరః ।
అప్రియేఽతిష్ఠ దత్యన్తం బాల్యా న్నద్రోహచేతసా ॥
తతో బల మతిఖ్యాతం ధార్తరాష్ట్రః ప్రతాపవాన్ ।
భీమసేనస్య తద్జ్ఞాత్వా దుష్టభావ మదర్శయత్ ॥
తస్య ధర్మా దపేతస్య పాపాని పరిపశ్యతః ।
మోహా దైశ్వర్యలోభాచ్చ పాపా మతి రజాయత ॥
అయం బలవతాం శ్రేష్ఠః కుంతీపుత్రో వృకోదరః ।
మధ్యమః పాండుపుత్రాణాం నికృత్యా స నిగృహ్యతామ్ ॥
ప్రాణవాన్ విక్రమీ చైవ శౌర్యేణ మహతాఽన్వితః ।
స్పర్ధతే చాపి సహితా నస్మా నేకో వృకోదరః ॥
తం తు సుప్తం పురోద్యానే గంగాయాం ప్రక్షిపామహే ।
అథ తస్మా దవరజం శ్రేష్ఠం చైవ యుధిష్ఠిరమ్ ॥
ప్రసహ్య బన్ధనే బద్ధ్వా ప్రశాసిష్యే వసున్ధరామ్ ।
ఏవం స నిశ్చయం పాపః కృత్వా దుర్యోధన స్తదా ॥
నిత్య మేవాన్తరప్రేక్షీ భీమస్యాసీ న్మహాత్మనః ।" (ఆది-అ128)

పాండవులు ధార్తరాష్ట్రులతో గలసి బాలక్రీడలు చేయుచు సర్వవిధములైన క్రీడలయందును విశిష్టతనే వహించియుండువారు. పరుగులు పెట్టుటలో దూరముగానున్న ఫలములనుజూచి నేను ముందు, నేను ముందని యందుకొనుటలో, వానిని భుజించుటలో గొంవుల సందరను భీమసేనుడు త్రోసివేయుచుండువాడు. కౌరవులు బాహు

యుద్ధములోగాని, పరుగులలోగాని, భీమసేనునితో స్పర్ధ వహించి అతి శయింపలేక యోడిపోవుచుండువారు. భీమసేనుడుగూడ కౌరవులపై స్పర్ధవహించి సర్వక్రీడలయందు నధికుడై ద్రోహబుద్ధిచేగాక బాల్యము చేత కౌరవులకు అప్రియుడై యుండువాడు. తరువాత దుర్యోధనుడు భీమసేనుని బలాఢ్యతనుజూచి దుష్టభావమును వహించెను. మోహ మును బట్టియు, నైశ్వర్యలోభమునుబట్టియు పాపబుద్ధి యిట్లు కలిగినది.

బలాధికుడైన ఈభీముని గపటముచే నిగ్రహింపవలయును. ఈతడు బలశాలి, పరాక్రమశాలి, శౌర్యశాలి; మమ్ములనందరను స్పర్థతో నీత డొకడతిశయించుచు నుండెను' ఈతడుద్యానవనములో నిద్రించునపుడు పట్టి తీసికొనిపోయి గంగానదిలో పారవేయవలయును. తరువాత నర్జు నుని, ధర్మజుని బలాత్కారముగా బంధించి బంధనాగారములోనుంచి రాజ్య మేలుకొనవలయును. ఇట్లు పాపబుద్ధికలవాడై దుర్యోధనుడు తన సంకల్పము నెరవేర్చుకొనుటకు నిత్యము నవకాశము వెదుకుచునే యుండువాడు.

ఈగ్రంథసందర్భమును జూడ భీమసేనుడు తమకంటె నధికబలు డైయుండె ననునదియే దుర్యోధనునకు గలిగినబాధ యని స్పష్టమగు చున్నది. ఇక జలక్రీడలో నీటిలో ముంచుట, స్థలక్రీడలో చెట్లెక్కిన వారిని చెట్టును దన్ని నేలపడునట్లు చేయుట, మొదలగు భీమసేనుని పనులలో వారికి శరీరములు నొచ్చినను, వారు రణరంగములలో శూరులై పోరదగిన క్షత్రియకుమారులుగాని సుకుమారులుగారు. కనుక నవి వారికి సహజక్రీడలే. శరీరము ఛిన్నభిన్న మగుచున్నను వెనుదీయక పోరుటకు దగిన శిక్షాపద్ధతులు బాల్యమునుండియు వా రభ్యాసములో బెట్టుకొనునట్టివే. కనుక దుర్యోధనునకు గలిగినది భీము డధికుడై యుండె నను చింతయే. ఏది యెట్లున్నను మొత్తముమీద బాలక్రీడలలోని భీమసేనుని చర్యలు తమ కప్రియములైనవని యాత నిని జంపుటకు దలపెట్టినమాట నిజముకద.

ఈప్రతివాదులు ద్యూతజితులైన పాండవులనుగూర్చి యిట్లు వ్రాసిరి___

"పాండవులు 'పరుగెత్త లేక బలాదూరు' అను సామెతచొప్పున రెండవసారికూడ ద్యూతమున జయింపలేక కురుకులము నున్మూలించు ప్రతిజ్ఞలు చేసిరి. వీరి ప్రతినలు "తాయివిసరిన గుండ్లం బారుజేసెడి" నేటి క్వాచిత్క రాజనీతికి సరిపడియున్నవి" (పు262)

ఇట్లు వ్రాసిన ప్రతివాదుల నిట్లు డడుగుచున్నాము___ బలవంతుడగు భీమసేనుని బాలక్రీడాచర్యలను దుర్బలులైన కౌరవులు తట్టించుకొనలేక విషము బెట్టి, నీటిలో బారవైచి భీమసేనుని జంపుటకై చేసిన దుర్మార్గములు, "పరుగెత్త లేక బలాదూరు" అన్నట్లును, "తాయవిసరిన గుండ్లం బారుచేసినట్లును" నున్నవా? లేవా? అట్లున్నవి యీదుర్యోధనుని దుర్మార్గములా? లేక ద్రౌపదీవస్త్రాపహరణాదిఘోరకార్యములను నిండుసభలో మదోన్మత్తులై చేసిన దుష్టులమద మడచుటకై చేసిన యీపాండవుల ప్రతిజ్ఞలా? అని.

ఇంకొకటి- ప్రతివాదు లన్నట్లు భీము డపకారముచేయుటను బట్టియే వారికట్టి బుద్ధి పుట్టిన దని యనుకొందము. ఏ యపకారను జేసి యెరుగని ధర్మజుని, అర్జునుని కట్టి పడవేయవలయు నని దుస్సంకల్ప మేల కలిగినది? ఆపై "శ్రీఘ్రం చైవ యుధిష్ఠిరం ప్రసహ్యా బంధనే బద్ధ్వా ప్రశాశిష్యే వసుంధరామ్"

అట్లుచేసి రాజ్య మేలుకొనవలె నని బుద్ధి యేలపుట్టినది. వారట్లయిపోయినగాని తనకు రాజ్యము రాదని యింత యెత్తెత్తినాడు. ఇంత దురాలోచనమునుబట్టియే దుర్యోధనునిది ద్రోహబుద్ధి యనబడినది. కనుక దుర్యోధనాపకారములనే ప్రాజ్ఞతగల లోకులు లెక్కింతు రని ప్రతివాదులకు తెలుపుచున్నాము.

తన్ను జంపుటకై విషముబెట్టినను, నిద్రించినపుడు నీటిలో పారవేసినను దుర్యోధనాదులను జంపవలె నను బుద్ధి భీమసేనునకు గలుగనే

లేదు. అందుచే భీమునిది ద్రోహబుద్ధి కాదని ప్రాజ్ఞతగల లోకు లను కొనుచున్నా రనికూడ ప్రతివాదులకు దెలుపుచున్నాము.

సుయోధనవిజయపీఠికలోని వ్రాత యిట్లున్నది — ... "భీము డును, సుయోధనుడును సమానవయస్కు లని భారతము చెప్పు చున్నపుడు సుయోధనుని చర్యలుకూడ బాల్యచేష్ట లేల కాగూ డదు? అతని చర్యలకు ద్రోహబుద్ధి నారోపింపవలసిన కారణ మేమి? (పు2౬)

ఆకారణము నిరూపించినాము.

మరియు, పాండవుల రూపుమాపి రాజ్య మేలుకొనవలె నని చేయు దుర్మార్గములు ఏకోత్తరాభివృద్ధిగా దుర్యోధనుని జీవితాంతము జరుగుచునే యున్నపుడు అవి సుయోధనుని బాల్యచేష్టలే అనుటెట్లో?

భీమసేనునిది ద్రోహబుద్ధి కాదనియు, బాల్యచేష్టలే యనియు, వారెన్నికష్టములు పెట్టినను కౌరవవినాశనమునకు భీమసేను డుద్యమిం పకయే పడియుండె ననియు కృష్ణునిరాయభారపుసమయములో శ్రీకృ ష్ణునితో జెప్పిన భీమసేనుని యీమాటలుకూడ ధ్రువపరచుచున్నవి—

"యథా యథైవ శాన్తి స్స్యా త్కురూణాం మధుసూదన ।
తథా తథైవ భాషేథా మాస్మ యుద్ధేన భీషయేః ॥
అమర్షీ జాతసంరమ్భ శ్శ్రేయోద్వేషీ మహామనాః ।
నోగ్రం దుర్యోధనో వాచ్య స్సామ్నైవైనం సమాచరేః ।
భ్రాతౄణా మస్తు సౌభ్రాత్రం ధార్తరాష్ట్రైః ప్రశామ్యతామ్ ॥

కృష్ణా! ద్వేషస్వభావము, దురభిమానము గల దుర్యోధను నితో కఠినముగాగాక శాంతముగనే సంభాషించి యాతడు ప్రశాంతు డగునట్లును, మాకు వారలతో సౌభ్రాత్రము నిలచియుండునట్లును జేయుము" అని. ఇట్టిమాట దుర్యోధనుని నోటినుండి ఎన్నడైన వచ్చినదా? అని ప్రతివాదుల నడుగుచున్నాము.

ఇట్లు పరిశీలింపగా భీమసేనునిది సద్వృత్తి, దుర్యోధనునిది దుర్వృత్తి అని తేలుటచే ప్రతివాదిప్రసంగములకు తోసివేత యైనది.

—♦ “భీమార్జునులసహాయశూరులని తలచువారు- వారు భీతులై పలాయితులగుట కేమిసందర్భము గల్పింతురో” అను ప్రసంగము—తన్నిరాకరణము ♦—

మ. భా. చ. కారులవ్రాత యిట్లున్నది—“ద్యూతజితులై వనమున కేగినపుడు ధర్మజాదులు సమయబద్ధులగుటచే నటులు వనమున నుండిరేగాని లేకుండిన నొక్క-భీముడుగాని యర్జునుడు గాని కౌరవులను జయింపలేడా? యని భారతపాఠకులు తలతురు, అట్టివారు లాక్షాగృహదహనానంతరము భీతులై నిస్సహాయులై యనదలై పలాయితు లగుట కేమి సందర్భము గల్పింతురో” (పు237)

ఇదిగో చెప్పుచున్నాము— పాండవులను జంపుటకై వారణావతమున లాక్షాగృహము నిర్మింపజేసి వారి నచ్చటికి బంపుటకు ధృతరాష్ట్రునిచే జెప్పించి పితృవాక్యమునుబట్టి వెళ్ళిన పాండవులను పురోచనునిద్వారా మర్యాదగా లాక్షాగృహమున బ్రవేశపెట్టించి ఆపురోచనుడే ఆయింటికి నిప్పంటించి గుప్తముగా వారిని దగ్ధముజేయుట కేర్పాటుచేసినదుర్యోధనునిదురంతకృత్యమును వారణావతప్రయాణసమయమందే విదురునివలన ధర్మజుడు తెలిసికొనియున్నను నిర్భయముగా వారణావతమునకు వెళ్ళి ఆలాక్షాగృహమందే నివసించి తమకు ప్రాణాపాయము లేకుండ జేసికొనుచు దుర్యోధనుని దుర్మార్గమును తాము గ్రహించినట్లు తెలియనీయక తన సంకల్పము సిద్ధించినదని దుర్యోధనుడు శాంతించుట కుపాయముగా లాక్షాగృహమునుగూర్చి ఏమిజరిగినదో తెలియకుండుటకై పురోచనుడు చేయు పనిని తామె చేయ దలచి పురోచనునితోబాటు గృహమును ఒకనాటి యర్ధరాత్రమున దగ్ధముజేసి గుప్తముగా గొంతకాలము సంచరించినారు.

పాండవులు కౌరవవినాశము జేయ దలపెట్టనివారు. దుర్యోధనుని దురంతములు మెచ్చుపెరిగిపోయినవి. అందు లాక్షాగృహదహనోద్యమమే పరమావధి. దానిని గూఢముగా నడిపిన దుర్యోధనుని దుర్మార్గము బయటబడినప్పుడు ఎదుర్కొనియే ఆతడు పాండవులను జంపదలచును. అప్పుడు పాండవులు వారిని వధింపవలసివచ్చును. అది వారి కిష్టము లేనిపని. అందుచే తమచేతులతో కౌరవవినాశనము చేయవలసివచ్చునని భయపడి గూఢముగా పాండవులు కొంతకాలము సంచరించినారు. కనుక పాండవులకు గలిగినది కురువంశవిధ్వంసభీతి గాని కౌరవభీతి గాదు.

ద్రోణాచార్యాజ్ఞపై ద్రుపదుని బట్టి మేము తెచ్చెదమని వెళ్ళి డీకొనిన దుర్యోధనాదులను చదమడచి పారదోలినట్టి ద్రుపదుని చతురంగబలసమేతుని అసహాయులై వెళ్ళి జయించి, పట్టితెచ్చి ద్రోణాచార్యాధీనము జేసిన భీమార్జునులకు కౌరవభీతియా? హిడింబ, బకాసుర, కిమ్మీర, కీచక, జరాసంధాదులను అసహాయుడై యవలీలగా వధించిన భీమునకు కౌరవభీతియా? ఉత్తరగోగ్రహణకాలమందసహాయుడై వచ్చి రణరంగమున జతురంగసేనాపరివృతులైన కౌరవులను పడగొట్టి యాకౌరవవీరుల యుత్తరీయాదులను విలాసముగా గ్రహించి గోవులమందలను తోలించుకొని వెళ్ళిన అర్జునునకు కౌరవభీతియా? వనవాసకాలములో ద్వైతవనసరోవరసమీపమందున్న పాండవుల దీనదశను చూచి సంతోషింపవలెనను సంకల్పముతో ఘోషయాత్రి యను పేరుపెట్టుకొని కుటుంబములతోగూడ కర్ణపురస్కృతులై వెళ్లిన కౌరవులను గంధర్వు లోడించి భార్యలతోగూడ దుర్యోధనాదులను బంధించి తీసికొనిపోవునపుడు కర్ణుడు విరథుడై పలాయితుడైనపుడు, గంధర్వుల నోడించి, యాకౌరవులను విడిపించిన భీమార్జునులకు కౌరవభీతియా?

కనుక పాండవు లధర్మభీతులుగాని, కౌరవభీతులుగారు. పాండవు లసహాయశూరులుగాని, యనదలుగారు. అందుచే ప్రతివాదుల విరుద్ధ ప్రసంగ మప్రస్తుతమైనది.

—: "ఘోషయాత్రాగాథ మృష" యను ప్రసంగము—
తన్నిరాకరణము :—

పాండవదూషకులును, కౌరవపక్షపాతులును అగు మ. భా. చ. కారులు ఘోషయాత్రనుగూర్చి వ్రాసినది యిట్లున్నది—

"ఘోషయాత్రాగాథ మృష, నిజమని తలచినను కర్ణుడంతటి యోధుడు రాజును వదలి పలాయితు డగునా?" (పు 263)

"అర్జునకృత్యములగు ఘోషయాత్రాసందర్భపు గంధర్వవిజయము, ఉత్తరగోగ్రహణము కల్పితములని కొందరు తలతురు" (పు 266)

మహాభారతములోని అవాంతరపర్వశతములో ఘోషయాత్రాపర్వ మొకటి యని, గోగ్రహణపర్వ మొకటి యని పర్వానుక్రమణికలో చెప్పబడియుండ నది మృషయట! కల్పితమట! వీరాడిన దాటయు, బాడినది పాటయు నైయున్నది.

దుర్యోధనాదులు గంధర్వులచే బంధింపబడుట, కర్ణుడు పలాయితు డగుట, పాండవులు గంధర్వుల జయించి, దుర్యోధనాదుల విడిపించుట, ఉత్తరగోగ్రహణములో కౌరవవీరులందరును అర్జునున కోడిపోవుట, ఇత్యాదివిషయములు కౌరవపక్షీయు లాయాప్రసంగములలో నుద్ఘాటించుచునే వచ్చిరి. అందు కొన్ని ప్రదర్శింపబడుచున్నవి—

భీష్మయుద్ధములో నెనిమిదవనాటిరాత్రి కర్ణుడు దుర్యోధనునితో— నీవు శీఘ్రముగా భీష్మశిబిరమునకు వెళ్ళి భీష్ముని సమ్మతింపజేసి యాతనిచే అస్త్రసన్యాసము చేయించినయెడల నేనొక్కడను రేపు పరివారసహితముగా బాండవులను వధింతు నని పలుక దుర్యోధనుడు

వెంటనే భీష్మశిబిరమునకు వచ్చినీవు అస్త్రము తేయుటకు కర్ణుని ననుజ్ఞ నిచ్చిన పాండవులను సపరివారముగా నాతడు వధింపగలడని చెప్పిన పుడు భీష్ము డిట్లనెను—

"యదా చ త్వాం మహాబాహో గంధర్వై ర్హృత మోజసా ।
అమోచయ త్పాండుసుతః పర్యాప్తం తన్నిదర్శనమ్ ॥
ద్రవమాణేషు శూరేషు సోదరేషు తవ ప్రభో ।
సూతపుత్రే చ రాధేయే పర్యాప్తం తన్నిదర్శనమ్ ॥
యచ్చ న స్సహితాన్ సర్వాన్ విరాటనగరే తదా ।
ఏక ఏవ సముద్యాతః పర్యాప్తం తన్నిదర్శనమ్ ॥
ఉత్తరాయై తదా వస్త్రం పర్యాప్తం తన్నిదర్శనమ్ ।"

(భీష్మ-అ 7)

ఇచ్చట ఘోషయాత్రలో గంధర్వులు దుర్యోధనుని బట్టి బంధించుట, అర్జునుడు విడిపించుట, కర్ణుడు పలాయితుడగుట ఉద్ఘాటింపబడినవి. ఉత్తరగోగ్రహణములో చతురంగబలసహితులైన కౌరవవీరుల నందరను ఒక్క యర్జునుడే డీకొని జయించుట, కర్ణునోడించి యాతని పైవస్త్రము నుత్తర కిచ్చుట, నుద్ఘాటింపబడినవి.

ద్రోణసైన్యాధిపత్యముతో జరిగిన నాలుగవనాటి రాత్రి యుద్ధములో 'నేను జీవించియుండ నీకు భయమేల? పాండవులను అందరను నేను జయించి నీకు రాజ్య మిచ్చెద' నని దుర్యోధనునితో కర్ణుడు పలికినపుడు కృపాచార్యు డిట్లనెను—

"సమాగమః పాండుసుతైః దృష్ట స్తే బహుశో యుధి ।
సర్వత్ర నిర్జిత శ్చాసి పాండవై స్సూతనందన ॥
హ్రియమాణే తదా కర్ణ గంధర్వై ర్ధృతరాష్ట్రజే ।
తదాఽయుధ్యన్త సైన్యాని త్వ మేకోఽగ్రేఽ పలాయథాః ॥
విరాటనగరే చాపి సమేతా స్సర్వకౌరవాః ।

పార్థేన నిర్జితా యుద్ధే త్వం చ కర్ణ సహానుజః ॥
ఏకస్యాప్యసమర్థ స్త్వం ఫాల్గునస్య రణాజిరే ।
కథ ముత్సహసే జేతుం సకృష్ణాన్ సర్వపాండవాన్ ॥"

(ద్రోణప-అ 158)

ఇచ్చటగూడ ఘోషయాత్రలో గంధర్వులకోడిపోయిన దుర్యోధనుడు తీసికొనిపోబడుట, కర్ణుడు పలాయితుడగుట, ఉత్తరగోగ్రహణములో నొక్క అర్జునునిచేతనే కర్ణుడు జయింపబడుట ఉద్ఘాటింపబడినవి. కర్ణునితో శల్యు డిట్లనెను—

"తథా ద్వైతవనే కర్ణ గంధర్వై స్సమభిద్రుతః ।
కురూన్ సమగ్రా నుత్సృజ్య ప్రథమం త్వం పలాయితః ॥
హత్వా జిత్వా చ గంధర్వాం శ్చిత్రసేనముఖా న్రణే ।
కర్ణ దుర్యోధనం పార్థ స్సభార్యం సమమోక్షయత్ ॥"(కర్ణ-అ41)

ఇచ్చటకూడ కర్ణుడు పలాయితు డగుట, అర్జునుడే దుర్యోధనుని, భార్యను విడిపించుట ఉద్ఘాటింపబడినవి.

ఇట్లు బహుస్థలములలో నుండుటవలన ఘోషయాత్రాగాథ మృష కాదు. సత్యమే. కర్ణుడు పలాయితుడైనమాట నిజమే. ఉత్తరగోగ్రహణగాథ సత్యమే. అందర్జున విజయము, కౌరవ పరాజయము సత్యమే. ప్రతివాది విరుద్ధప్రసంగము హేయమే.

—: "నేలబడిన దుర్యోధనుని తలపై దన్నిన భీముడు క్రూరుడు" అను ప్రసంగము—తన్నిరాకరణము :—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది — "దుర్యోధను బడగొట్టి యాతనితలను రెండుసారులు తన్నుటలో భీముని క్రూరత్వము విఖ్యాతి నొందినది. తల నన్యాయముగా దన్నినపుడు అది గర్హ్యమని ధర్మరాజుకూడ వి:గుల గర్హించి విలపించియున్నాడు" (పు 254)

భీమసేనుడు దుర్యోధనుని తలపై దన్నుటకు హేతువు, దుష్ట శిక్షణపరికారములలో నదియొకటి నీతిశాస్త్రోక్తమై యుండుటచే. నీల కంఠీయములో నొకచోట నుదాహృతములైన యీ శ్లోకములను జూడుడు—

"వామపాణికచోత్పీడా భూమౌ నిష్పేషణం బలాత్ ।
మూర్ధ్ని పాదప్రహారణం జానునోదరమర్దనమ్ ॥
మాలూరాకారయా ముష్ట్యా కపోలే దృఢతాడనమ్ ।
కఫోణిపాతోఽప్యసకృ త్సర్వత స్తలతాడనమ్ ॥
తావేన యుద్ధే భ్రమణం మారణం స్మృత మష్టధా ।
చతుర్భిః క్షత్రియం హన్యా త్పంచభిః క్షత్రియాధమమ్ ॥"

ఇట్లు శాస్త్రోక్తమైన దుష్టశిక్షణపరికారము నవలంబించుట అన్యాయము కానందున నది క్రౌర్య మనబడదు. ద్యూతసభలో ద్రౌపదీదేవికి తనతొడను జూపుట మొదలగు నీచకృత్యములు చేసిన దుర్యోధనునితో భీమసేను డప్పుడే నిన్నిట్లు యుద్ధభూమిలో చేయు దును చూడు మని చెప్పియుండెను—

"సుయోధన మిమం పాపం హన్తాస్మి గదయా యుధి ।
శిరః పాదేన చాఽస్యాహ మధిష్ఠాస్యామి భూతలే ॥"

ఇట్లు శపథముచేసి నెరవేర్చుకొనెను. భీమసేను డపుడు ద్రౌపదీవిషయకములగు దుర్యోధనుని దుర్మార్గముల నుద్ఘాటించియేతన్నెను. చూడుడు—

"గౌ ర్గౌ రితి పురా మన్ద ద్రౌపదీ మేకవాససమ్।
య త్సభాయాం హసన్నస్మాం స్తదా వదసి దుర్మతే ॥
తస్యావహాసస్య ఫల మద్య త్వం సమవాప్నుహి ।
ఏవ ముక్త్వా స వామేన పదా మౌలి ముపాస్పృశత్ ॥
శిరశ్చ రాజసింహస్య పాదేన సమలోడయత్ ।"

ఆసమయములో నీవట్లు చేయరాదని భీమునితో ధర్మజుడనుట, దుర్యోధనునిజూచి విలపించుట అనునది ధర్మజుని అజాతశత్రుత్వమును, దుర్యోధనునియందుగూడ దన కున్న దయను ప్రకటించునుగాని దుర్యోధనుని నిర్దుష్టత్వమును ప్రకటింపదు. కనుక ప్రతివాదిప్రసంగము పరాస్తము.

"అర్జునునకు విధవావివాహ" మను ప్రసంగము—
తన్నిరాకరణము:— —

1. మ–భా–చ– కారుల వ్రాత యిట్లున్నది. "అర్జునుడు విధవయు నాగకన్యయు నగు ఉలూపిని బెండ్లి యాడి యా వితంతువు నందు ఇలావంతుడను కుమారుని గనెను" (పు–238)

2. 'అర్జునుని ఉలూపియను నాగకన్య మోహించి స్వభవనమునకు మాయచే దీసికొనిపోయి యాతనివలన ఇలా వంతు డను కుమారుని గనెను"

3. ఈ నాగులను పాతాళలోకమున నుండు దేవసంబంధులనుగా బౌరాణికులు నుడువుదురు. కాని నాగులు భరతఖండమున నుండు మిశ్రజాతీయులనుగా దలపవలసి యున్నది, ఇంత యే ల మన యాంధ్ర దేశములో నాగజాతి వేశ్యాస్త్రీలున్నారు. అర్జునుని వరించిన నాగకన్యకకు వైధవ్య దోషములేనటుల వేశ్యలలోని నాగకన్యకలకును వైధవ్య దోషము లేదట" (పు–83)

4 "కుంతి తండ్రి శూరుడనువాడు, కుంతిభోజుడు సంతతి లేక ఈమెను దత్తతచేసికొనుట కనుగగా నిచ్చెను. కుంతిభోజుడో శూరుడో నాగులలోని ఆర్యకు డనువాని దౌహిత్రు డని చెప్పబడి యున్నది. నాగు లనార్యు లనియు, నాగవనితలు వేశ్యలుగా గూడ నుండిరనియు నదివరలోనె చెప్పబడెను.

కుంతి యట్టి వేశ్యాకులసంపర్కము కలదగుటచేతనే రహస్యము గాను, బహిరంగముగాను పరులకే బిడ్డలం గనినది" (పు 231)

5 "నాగుల ప్రతిమలు మనుష్యాకారసర్పములుగా చిత్రింప బడియున్నవి. అమరుని భోగివర్గములో నాగులకు మనుష్యత్వము నిచ్చి వర్ణించుట గమనింపదగియున్నది" (పు 84)

6 "ప్రాచీననాగవిగ్రహముల శిరస్సులపైనున్న సర్పచిహ్నము లానాటివారుధరించు శిరోవేష్టనరూపములనియు, అనుగుననుండిన సర్పచిహ్నములు పాశ్చాత్యజాతిస్త్రీల లుంగీలపట్టీవనియు,గొందరు తలచుచున్నారు" (పు 85)

7 ఉలూపి అర్జునని వరించుట.- నియోగము (సంతానము కొరకు తాత్కాలికవరణము) కాని వివాహము కాదని శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు భారతచరిత్రనిరాకరణములో వ్రాసిరి. అది తప్పు. నియోగ మైనచో బుత్రోత్పత్తికి బిమ్మట నా పురుషుని దిరిగి కూడరాదు. ఉలూపియట్లుకాక మహాభారతయుద్ధానంతరము మహా ప్రస్థానము చేరువరకు నర్జునునితోడనె 36 సంవత్సరములు కాపురము జేసినది. కాన ఉలూపీవరణము వివాహమెకాని నియోగము కాదు" (పు 84)

ప్రతివాదుల వ్రాతలోనివి యే డంశములు. మొదటి యంశములో విధవయు, నాగకన్యకయు నగు ఉలూపిని అర్జునుడు పెండ్లియాడినట్లు చెప్పబడినది. ద్వితీయాంశములో నర్జునుని మోహించి మాయజేసి స్వభవనమునకు దీసికొనిపోయి యాతనితో ఉలూపి కూడినట్లు చెప్పబడినది. దీనినిబట్టి యర్జును డామెను ప్రేమించి కూడినట్లో, లేక, యామె నిర్బంధమునుబట్టి కూడినట్లో, పెండ్లియాడి కూడినట్లో, పెండ్లియాడకయె కూడినట్లో తేలలేదు.

ఇక తృతీయాంశములో, నాగులు పాతాళలోకవాసులని దుంను దేవసంబంధులని పురాణములయం దున్నదనుచు, తాము నాగులు

మిశ్రజాతిమనుష్యు లనియు, నాగజాతి వేశ్యాస్త్రీ లున్నారనియు జెప్పి అర్జునుని వరించిన నాగకన్యకకు వైధవ్యదోషము లేనట్లు వేశ్యలలోని నాగకన్యకలకును వైధవ్యదోషము లేదని చెప్పినారు. దీనినిబట్టి ఉలూపికి వైధవ్యదోషము లేదని వారే తేల్చినారు. కాని ప్రతివాదు లన్నట్లు ఆమె వేశ్యాస్త్రీయా? పౌరాణికు లన్నట్లు పాతాళలోకమందుండు స్త్రీయా? అనునది తేలలేదు.

కనుక చతుర్థాంశములో కుంతీదేవికి దెచ్చిపెట్టిన వేశ్యాకుల సంపర్కముకూడ నిజమో? కాదో? తేలలేదు.

ఇక ఐదవయాంశములో నాగుల ప్రతిమలు మనుష్యాకారసర్పములుగా చిత్రింపబడినట్లు చెప్పి, అమరుడు నాగులకుమనుష్యత్వమిచ్చుటగమనింపదగియున్నదని యన్నారు. నాగప్రతిమలు మనుష్యాకార సర్పములుగా నుండుటను బట్టియు, అమరుడు నాగులను మనుష్యత్వమిచ్చి వర్ణించుటను బట్టియు నాగస్త్రీలు మనుష్యులే యని ప్రతివాదులూహించినారు.

ఆపై యారవయంశములో ప్రాచీననాగవిగ్రహముల శిరస్సులపై నున్న సర్పచిహ్నములు నాటిమనుష్యులు ధరించు శిరోవేష్టనములనియు, అడుగున సర్పచిహ్నములు వారు ధరించు లుంగీ లనియు కల్పించినారు. దీనిచే వీరి వాదమంతయు ప్రాచీననాగవిగ్రహములను అమరకోశమును ఆధారపడియున్నట్లు తేలినందున వానినేపరీక్షింతము—

అమరకోశము:—భోగివర్గము

"నాగాః కాద్రవేయాః" వ్యాఖ్యా- నాగకాద్రవేయశబ్దా మానుషాకారేషు ఫణాలాంగూలాదియుక్తేషు దేవయోనిషు భోగిషు వర్తేతే"

"అధోభువన పాతాళ బలిసద్మ రసాతలం, నాగలోకః"

ఈగ్రంథముచే పాతాళము నాగలోకమనియు, నాగము లనగా

పడగలు, తోకలు కలిసి మనుష్యాకారములు దేవయోనులు సగు సర్పములనియు చెప్పబడినది. ప్రతివాదులు మూడవయంశములో—"ఈనాగులను పాతాళలోకమున నుండు దేవసంబంధులనుగా పౌరాణికులు నుడువుదురు" అని వ్రాసియుండి, ఆమాట ప్రమాణము కాదని, అమరకోశము తమవాదమునకు ప్రమాణమైనట్లు ఐదవయంశములో జెప్పియున్నారు.

మన మాయమరకోశము జూచునప్పటికి అమరుడు చెప్పినదియు, పౌరాణికులు చెప్పినదియు నొక్కటే యైనది. అందుచే నమరకోశము ప్రతివాదుల కెదురుతిరిగినది. పౌరాణికోక్తికి బలకరమైనది.

దీనిచే రహస్యకర్తలు అర్జునోలూపుల సంబంధమునుగూర్చి వ్రాయుటలో "భరతఖండాచారమును పాటించుట కీమె నాగకాంత (అమెరికాదేశపు యువతి) గాని భారతీయయువతి గాదు" (పు 36) అని యున్న వ్రాత పరాస్తము. వీ రమరకోశమునైన నవలోకింపలేదన్నమాట.

ఇక నాగవిగ్రహములగూర్చి చెప్పవలసియున్నది— ఈప్రతివాదులకు మన పురాణము లప్రమాణములుకనుక బౌద్ధగ్రంథములలో నాగులనుగూర్చి యేమి చెప్పబడినట్లున్నదో చూతుకు—

భారతి—విరోధిజ్యేష్ఠము—నాగశిల్పి.

"బుద్ధుడు... ధ్యానసమాధిని కొన్నివారములు గడపె నని "వినయపిటకము"న గలదు... ముచిలిందుడను నాగరాజు తన నివాసముననుండి వెలుపలికివచ్చి బుద్ధుని శరీరముచుట్టును ఏడుమారులు తన తోకను చుట్టలుచుట్టి తన పెద్దపడగలను ఆమహాత్ముని తలమీద గొడుగువిధమున బట్టి యిట్లనుకొనెనట...

ఆకాశము తెరపిగానుండుట జూచి నాగరాజు ముచిలిందుడు

బుద్ధుని శరీరమునకు సంఘటించిన తనచుట్టలను తీసివేసి బ్రాహ్మణయువకుని రూపమును ధరించి నమస్కారిం చుచు బుద్ధునియెదు రు నిలబడెను. బుద్ధుని గాలివాననుంచి కాపాడిన యీ ముచిలిందగాథ సంక్షేపముగా "నిదానకథ" అను బౌద్ధగ్రంథమున గూడ గలదు. "లలిత విస్తరము" బుద్ధుని జీవితమును తెలుపుగ్రంథము. దీనిలో గూడ నీముచిలిందగాథ కలదు విశేష మేమనగ ఇందు బుద్ధునిముచిలిందు డొక్కడే కాక నాలుగుదిశలనుంచి వచ్చి యితరనాగరాజులు కూడ కాపాడిరని చెప్పబడినది. సాంచీస్తూపమున దక్షిణసింహ ద్వారపురాతికమ్ములమీద నీ(ముచిలింద)గాథ విచిత్రమై యున్నది. ......ఆయాసనమునకు ముందు శిలలమీద అయిదుపడగలు ధరించి మానవాకృతిని నాగరా జుపవిష్టుడై యున్నాడు".

ఇట్లు 'వినయపిటకము, 'నిదానకథ, "లలితవిస్తరము" అను బౌధగ్రంథములుకూడ పడగలు తోకలు కలవి నాగము లనియు, బ్రాహ్మణయువకుని రూపమును ధరించినట్లుండుటవలన నవి కామ రూపము కలవనియు జెప్పుచున్నట్లు స్పష్టము. సాంచీస్తూపము సింహ ద్వారశిలలమీద నాగరాజువిగ్రహము అయిదు పడగలు ధరించి మానవాకృతితో నున్నట్లు స్పష్టము. ఇదంతయు పురాణోక్తులకును, అమ రకోశమునకును సరిపడియే యున్నది. నాగవిగ్రహమునకు పడగలే శిరస్సుగా జెప్పబడియుండ ప్రతివాదులు "శిరస్సుల పై నున్న సర్ప చిహ్నములు ఆనాటి మనుష్యుల శిరోవేష్టనము" లనుటయు, అడు గున సర్పచిహ్నములు (తోకలు)ఆమనుష్యుల లుంగీ లనుటయు, నెంత యుక్తముగా నున్నదో చూడుడు. బౌద్ధగ్రంథములలో నున్నదైన భావింపలేని వీరి బుద్ధి యెంత విరుద్ధమైనదో?

ఇట్లు చూడగా బౌద్ధగ్రంథములు, అమరకోశము, పురాణ ములు ఏకవిధముగా జెప్పుచుండుటనుబట్టియు, నాగవిగ్రహములు

ఆవిధముగనే కనబడుచుండుటంబట్టియు ఆనాగవనితలు నాగలోకము లోనివారుకాని ప్రతివాదులన్నట్లు అమెరికాస్త్రీలును ఇచ్చట వేశ్యా స్త్రీలును కారు. అందుచే కుంతీదేవికి ప్రతివాదులు తెచ్చిపెట్టిన వేశ్యా కులసంపర్కము కుతర్కమగుటవలన హేయము.

ఇక ప్రతివాదుల యేడవ యంశము జూతము—"ఉలూపి యుద్ధానంతరము మహాప్రస్థానమువరకు 36 సంవత్సరములు అర్జును నితో కాపురముచేసినదికాన ఉలూపీవరణము, వివాహమే కాని నియోగము కాదు" అని యున్నది.

36 సంవత్సరములు చేసినట్లు చెప్పబడినది పాండవులరాజ్యపరి పాలనమా? అర్జునునితో ఉలూపి కాపురమా?

ఆదిపర్వ, భీష్మపర్వ, ఆశ్వమేధికపర్వములలో ఉలూపీప్రశంస కనబడుచున్నది. ఒక్కరాత్రిమాత్రమే కలిసియున్నట్లు ఆదిపర్వ ములో చెప్పబడినది. చూడుడు—

బ్రాహ్మణబృందము తనవెంట వచ్చుచుండ తీర్థయాత్రజే యుచున్న అర్జునుడు గంగాస్నానము చేత యొడ్డునకు రాబోవుచుండె ను. అప్పుడు—

"అపకృష్టో మహాబాహు ర్నాగరాజస్య కన్యయా ।
అన్తర్జలే మహారాజ ఉలూప్యా కామయానయా ॥
అగ్నికార్యం స కృత్వా తు నాగరాజసుతాం తదా ।
ప్రహస న్నివ కౌన్తేయ ఇదం వచన మబ్రవీత్ ॥
కి మిదం సాహసం భీరు కృతవత్యసి భామిని ।
క శ్చాయం సుభగే దేశః కా చ త్వం కస్య వాత్మజా ॥

ఉలూప్యువాచ—

"ఐరావతకులే జాతః కౌరవ్యో నామ పన్నగః ।
త స్యాస్మి దుహితా రాజ న్నులూపీనామ పన్నగీ ॥

సాహం త్వా మభిషేకార్థ మవతీర్ణం సముద్రగామ్ ।
దృష్ట్వైవ పురుషవ్యాఘ్ర కందర్పే ణాభిమూర్ఛితా ॥
తాం మా మనంగగ్లపితాం త్వత్కృతే కురునందన ।
అనన్యాం నందయస్వాఽద్య ప్రదానే నాత్మనోఽనఘ ॥"

అర్జున ఉవాచ—

"బ్రహ్మచర్య మిదం భద్రే మమ ద్వాదశవార్షికమ్ ।
ధర్మరాజేన చాదిష్టం నాహ మస్మి స్వయంవశః ॥
తవ చాపి ప్రియం కర్తు మిచ్ఛామి జలచారిణి ।
అనృతం నోక్తపూర్వం చ మయా కించన కర్హిచిత్ ॥
కథం చ నానృతం మే స్యా త్తవ చాపి ప్రియం భవేత్ ।
న చ పీడ్యేత మే ధర్మ స్తథా కుర్యా భుజంగమే ॥"

ఉలూ ప్యువాచ—

"జానా మ్యహం పాండవేయ యథా చరసి మేదినీమ్ ।
యథా చ తే బ్రహ్మచర్య మిద మాదిష్టవాన్ గురుః ॥
పరస్పరం వర్తమానానాం ద్రుపదస్యాత్మజాం ప్రతి ।
యో నోఽనుప్రవిశే న్మోహా త్స వై ద్వాదశవార్షికమ్ ॥
వనే చరే ద్బ్రహ్మచర్య మితి వ స్సమయః కృతః ।
తదిదం ద్రౌపదీహేతో రన్యోఽన్యస్య ప్రవాసనమ్ ॥
కృతవాం స్తత్ర ధర్మార్థ మత్ర ధర్మో న దుష్యతి ।

నీలకంఠీయమ్— జానా మ్యహం పాండవేయేత్యాదినా స్వస్యాఽతీంద్రియజ్ఞానం దర్శయన్తీ ద్రౌపదీనిమిత్త మేవ తవ బ్రహ్మచర్యం, నాన్యత్రేత్యాహ- అతఏవాఽన్యేఽపి చిత్రాంగదాసుభద్రయోః పాణిగ్రహణం సంగచ్ఛతే ॥

"పరిత్రాణం చ కర్తవ్య మార్తానాం పృథులోచన ।
కృత్వా మమ పరిత్రాణం తవ ధర్మో న లుప్యతే ॥

భర్తారం చ భజ మాం పార్థ సతా మేతత్ కృతం ప్రభో ।
న కరిష్యసి చే దేవం మృతాం మా ముపధారయ ॥
శరణం చ ప్రపన్నాస్మి త్వా మద్య పురుషోత్తమ ।
యాచే త్వా మభికామాహం తస్మా త్కురు మమ ప్రియమ్ ॥
స త్వ మాత్మప్రదానేన సకామాం కర్తు మర్హసి ।
ఏవ ముక్తస్తు కౌన్తేయః పన్నగేశ్వరకన్యయా ॥
కృతవాం స్త త్తథా సర్వం ధర్మ ముద్దిశ్య కారణమ్ ॥
స నాగభవనే రాత్రిం తా ముషిత్వా ప్రతాపవాన్ ।
ఉదితేఽభ్యుత్థిత స్సూర్యే కౌరవ్యస్య నివేశనాత్ ॥
ఆగతస్తు పున స్తత్ర గంగాద్వారం తయా సహ ।
పరిత్యజ్య గతా సాధ్వీ ఉలూపీ నిజమందిరమ్ ॥
దత్త్వా వర మజేయత్వం జలే సర్వత్ర భారత ।
కథయిత్వా చ తత్సర్వం బ్రాహ్మణేభ్య స్స భారత ॥
ప్రయయౌ హిమవత్పార్శ్వం తతో వజ్రధరాత్మజః ॥" (అ214)

అర్జునుని కామించిన ఉలూపిచేత జలమునుండియే అడుగునకు దీసికొనిపోబడిన అర్జునుడు-'మానినీ! నీవిట్టిసాహసము జేసితివేమి? ఇది యేదేశము? నీ వెవ్వరిదానవు?' అని యడుగ నామె యిట్లు చెప్పెను- ఐరావతకులములోని కౌరవ్యుడను నాగరాజు నాతండ్రి; నేను ఉలూపి యను నాగకన్యకను; నీవు స్నానముచేయునప్పుడు చూచి నిన్ను ప్రేమించితిని. అనన్యనైన నన్ను అనుగ్రహింపవలయును అని. అటు పై నర్జును డిట్లనెను— "ధర్మరాజుచేత ద్వాదశవార్షికబ్రహ్మచర్యము నా కాజ్ఞాపింపబడినది. నీకు ప్రీతిగలిగించుటకు నే నవశుడను. నే ననృత మాడువాడనుగాను నా కనృతదోషము, ధర్మహాని లేకుండుట యెట్లో, నీకు ప్రియముగలుగుటయెట్లో అట్లు చేయుము" అని.

అపై ఉలూపి తనకుగల అతీంద్రియజ్ఞానము నుపయోగించుచు ని ట్లనెను- ద్వాదశవార్షికబ్రహ్మచర్యమును సమయబద్ధము వీరు ద్రౌపదీ

దేవినిగూర్చి చేసికొనినదియే, నేనెరుగుదును; ధర్మజునిచే నాజ్ఞాపింప బడిన దదియే; నామూలమున దానికి భంగము కలుగదు. ధర్మలోపము లేదు; ఆర్తరక్షణ మవశ్యకర్తవ్యము; ఆర్తురాలనగు నన్ననుగ్రహించుటలో నీకు ధర్మలోపము లేదు; ఇది సత్పురుషసమ్మతము; నీవుపేక్షించిన నేను మరణింతును; శరణుపొందితిని; నన్ను కృతార్థురాలను జేయుము. అని.

అటుమీద నర్జునుడు ధర్మము నుద్దేశించియే యామె చెప్పినట్లు చేసి యానాగభవనమునం దారాత్రియుండి మరునాడు సూర్యోదయ మగునప్పటికి ఆమె సహాయముతో గంగాద్వారమునకు జేరెను. ఆమె యర్జునునకు జలమం దప్రతిహతగతి కలుగునట్లు వరమిచ్చి స్వస్థానమునకు వెళ్ళిపోయెను. ఆయర్జునుడు తొలినాడు స్నానమునకు దిగినతరువాత తా నక్కడకు వచ్చువరకు జరిగిన యావద్వృత్తాంతమును ఆ బ్రాహ్మణులకు జెప్పెను.

ఈగ్రంథసందర్భమును జూడగా ఉలూపి నర్జునుడు వివాహము జేసికొని కూడె ననుట కవకాశము లేదని స్పష్టము. మరియు, అర్జునుని కామించినది యులూపిగాని, యులూపిని కామించినవాడు అర్జునుడు కాడని స్పష్టము. ధర్మమునకు కట్టుబడియే అర్జును డామెకు ప్రియము గలిగించెనుగాని వివాహము చేసికొనలేదని స్పష్టము.

విషయ మిట్లుండ ది. ౧౨-8-45 ఆంధ్రపత్రికలో మ. భా. చ. కారులు ఇట్లు వ్రాసినారు — అర్జునుని వితంతూద్వాహము —

"ఉలూపి తన పుత్రుడు మృతిపొందినపిమ్మటగూడ పాండవాశ్వమేధానంతరమువరకు అర్జునుకడనే యుండినట్లు అశ్వమేధమహాప్రస్థానిక పర్వములలో నుండుటచేత పార్థు డులూపిని వరించుట వితంతూద్వాహమే యని తలచితిని. చేమకూర వెంకటపతి మహాకవియొక్క ఉలూపీపార్థసమాగమశృంగారవర్ణనములు నా వాదమును మిగుల బలపరుపగలవు" అని.

ఇది యంతయు గ్రంథవిరుద్ధము. పార్థు డులూపిని వరింపలేదు. ఉలూపి పార్థునివరించి నాగలోకమునకు తెలియకుండ జేర్చినది. చేమకూర వెంకటపతిమహాకవియొక్క విజయవిలాసమునే చూడుడు—

చ. ......వ్రతముగై కొని యుండెడి నన్ను నేల దో
డ్కొని యిట దెచ్చె నీ వెకుగు గోమలి భూజగమేడ మారుతా
శనజగమేడ నెంత ఘనసాహస మింతులు కించు నెంచుచున్.

క. కాముకుడగాక వ్రతినై, భూమి ప్రదక్షిణము సేయబోయెడివానిం
గామించి తోడితే దగ, వా మగున వివేక మించుకైనను గలదా.

తే. అనిన ఫణిజాతి నీ వేను మనుజజాతి
నన్యజాతి బరివర్తించు టర్హమగునె
యేల యీకోర్కి యనిన రాచూలి కవియె
జిలువ చెలువంపు బల్కుల జిలువచెలువ.

ఉ. ఏమనబోయెదం దగుల మెంచక నీవిటులాడ దొల్లి శ్రీ
రామకుమారుడైన కుశరాజు వరింపడె మా కుముద్వతిన్
గోమలచారుమూర్తి పురుకుత్సుడు నర్మద బెండ్లియాడడే
నీమన సొక్కటే కరగనేరదుగాని నృపాలకాగ్రణీ.

ఈపద్దెములనుబట్టి పార్థు డామెను వరింపలేదనియు, నామెయే పార్థుని నిర్బంధించినదనియు రహస్యకర్త లన్నట్లు ఆమె అమెరికా దేశపు యువతిగాని, మ. భా. చ. కారులన్నట్లు వేశ్యాస్త్రీగాని కాక ఫణిజాతికాంత యనియు, మనుష్యజాతికాంత గాదనియు స్పష్టము. కనుక ప్రతివాదుల వ్రాత హేయము. విజయవిలాసకర్త ఆమె కన్యక యని వ్రాసియుండెను—

ఉ. కన్నియగాని వేరొకతెగాను మనోహరరూప నీవు నీ
జన్నియవట్టి యుంటి నెల జవ్వన మంతయు నేటిదాక నా
కన్నులరూవ నావలపు గస్తురినామముతోడు నమ్ము కా
దన్నను నీదుమోవి మధురామృతమానిట బాసనేసెదన్."

ఇట్లు కన్యక యని విజయవిలాసకర్త శృంగారవర్ణనము చేసి యుండెను. మ. భా. చ. కారులు ఆమెను పతితంతు వని, వేశ్య యని ఆశృంగారవర్ణనమును దెచ్చి యామె కతుకుచున్నారు. కనుక ప్రతి వాదుల దసంగతప్రసంగము.

మరియు ఆగంగాద్వారమునుండి బయలుదేరి వెళ్ళి అర్జునుడు చిత్రాంగదను వరించి యామె తండ్రినిగోరి తానామెను వివాహము జేసికొని యచ్చట మూడుసంవత్సరము లున్నట్లు చెప్పబడినది—

"స తథేతి ప్రతిజ్ఞాయ తాం కన్యాం ప్రతిగృహ్య చ ।
ఉవాస నగరే తస్మిం స్త్రిస్రః కనీస్తుత స్సమాః ॥" (ఆది_అ215)

తరువాత చిత్రాంగదతో నీ వీ పుత్రుడగు బభ్రువాహనుని సంరక్షించుచు నిక్కడనే యుండుము. నే నింద్రప్రస్థమున నివసించి యున్నపుడు నీవు వచ్చి నాతో నుండవచ్చును. అని చెప్పెను- చూడుడు—

"చిత్రాంగదాం పున ర్వాక్య మబ్రవీ త్పాండునందనః ।
ఇహ వై భవ భద్రం తే వర్ధేథా బభ్రువాహనమ్ ॥
ఇన్ద్రప్రస్థనివాసే మే త్వం తత్రాఽగత్య రంస్యసి ।" (అ 247)

ఇట్లు చిత్రాంగదతో జెప్పిన అర్జునుడు ఉలూపితో నట్లు జెప్ప లేదని స్పష్టమే. దీనిబట్టికూడ ఉలూపిని వివాహముజేసికొనినట్లు గాని, యామె కాపురముచేసినట్లుగాని చెప్పుట కవకాశము గాన్పించుట లేదు.

ఇక భీష్మపర్వములో సంజయుడు ధృతరాష్ట్రునకు జెప్పు సందర్భములో నిట్లున్నది—

"అర్జునస్య సుత శ్శ్రీమా నిరావా న్నామ వీర్యవాన్ ।
సుతాయాం నాగరాజస్య జాతః పార్థేన ధీమతా ॥
ఐరావతేన సా దత్తా అనపత్యా మహాత్మనా ।
పత్యౌ హతే సుపర్ణేన కృపణా దీనచేతనా ॥

భార్య (భర్త్ర్యా)ర్థం తాం చ జగ్రాహ పార్థః కామవశానుగామ్।
ఏవ మేవ సముత్పన్నః పరక్షేత్రేఽర్జునాత్మజః ॥
స నాగలోకే సంవృద్ధో మాత్రా చ పరిరక్షితః ।
ఇన్ద్రలోకం జగామాశు శ్రుత్వా తత్రార్జునం గతమ్ ॥
సోఽభిగమ్య మహాబాహుః పితరం సత్యవిక్రమః ।
అభ్యవాదయ దవ్యగ్రో వినయేన కృతాంజలిః ॥
న్యవేదయత చాత్మాన మర్జునస్య మహాత్మనః ।
ఇరావా నస్మి భద్రం తే పుత్ర శ్చాఽహం తవ ప్రభో ॥
మాతు స్సమాగమో య శ్చ తత్సర్వం ప్రత్యవేదయత్ ।
తచ్చ సర్వం యథా వృత్త మనుసస్మార పాండవః ॥
సోఽర్జునేన సమాజ్ఞప్తో దేవలోకే తదా నృప ।
ప్రీతిపూర్వం మహాబాహు స్స్వకార్యం ప్రతి భారత ॥
యుద్ధకాలే త్వయా స్మాకం సాహ్యం దేయ మితి ప్రభో ।
బాఢ మిత్యేవ ముక్త్వా తు యుద్ధకాల ఇహాగతః ॥" (అ90)

నాగరాజు పుత్రికయైన ఉలూపియందు ఇరావంతుడను పుత్రుడు పార్థునివలన జన్మించెను. ఆమెపతి గరుడునివలన హతుడు కాగా సంతతి లేక కామించినట్టి యామెను తండ్రియనుజ్ఞపై పార్థుడు గ్రహించెను. ఇట్లు పరక్షేత్రమైన ఉలూపియందు అర్జునాత్మజుడు జన్మించెను. ఆ ఇరావంతుడు నాగలోకమందే పెరుగుచుండి, యింద్రలోకమందు అర్జును డున్నప్పుడు తెలిసికొని యచ్చటికేగి వందనముజేసి, నేను ఇరావంతుడ ననియు, ఉలూపిసంభూతుడ ననియు, నీ పుత్రుడ ననియుజెప్పి ఉలూపిసంబంధప్రకారము నా పార్థున కెరుకపరచెను.

పార్థుడు ఆ పూర్వవృత్తాంతమును స్మరించి ప్రీతుడై రాబోవు యుద్ధములో నీవు సహాయపడవలయు నని యాజ్ఞాపింప నట్లే యని వెళ్ళి, ఇప్పుడువచ్చి యుద్ధములో బాల్గొనినాడు. అని చెప్పబడినది.

ఇచ్చట పరిశీలింపవలసినదిది— 12 సంవత్సరములు అర్జునుని తీర్థయాత్రాకాలము; తీర్థయాత్రారంభములో నొక్కరాత్రి ఉలూపీ సమాగమము. తరువాత చిత్రాంగదా సుభద్రాపాణిగ్రహణములు; తరువాత నింద్రప్రస్థపురప్రవేశము; తరువాత ఖాండవదహనాదికము; తరువాత దిగ్విజయపూర్వకముగా రాజసూయయాగము; తరువాత ద్యూతము, వనవాసము; ఆవనవాసములో గొంతకాలమునకు ఇంద్రలోకగమనము; ఆ యింద్రలోకగమనమునందు ఇరావంతునితో సమావేశము; ఆ సమావేశములో నిరావంతుడు పార్థునకు ఉలూపీసంబంధమును, తన యుత్పత్తిని దెలిపినట్లు చెప్పబడియున్నది.

దీనినిబట్టి పార్థున కంతవరకు నులూపీపునరవలోకనము లేనట్లె ధ్రువ మగుచున్నది. పూర్వోక్తప్రకారము చిత్రాంగదతో తీర్థయాత్రానంతరము ఇంద్రప్రస్థములో నీవు నాయొద్ద నుండగల వని చెప్పుటచే చిత్రాంగదాసుభద్రలు పార్థునియొద్ద నుండుచున్నట్లే స్పష్టము. ఉలూపి యట్లుండకుండుటకు వివాహిత కాకుండుటే కారణమనుట కంటె వేరొకటి కనుపింపదు. ఇంతేగాక—

"ఏవ మేవ సముత్పన్నః పరక్షేత్రేఽర్జునాత్మజః ।"

అని యులూపి పరక్షేత్ర మని చెప్పబడినది. ఆమె వివాహిత యైనపక్షములో స్వక్షేత్ర మెగాని పరక్షేత్ర మెట్లగును? కనుక దీనిని బట్టికూడ నులూపీసంబంధము వివాహపూర్వకమె అనుట యుక్తముగా గనబడుటలేదు. ఇట్లుండ రహస్యకర్తలు ఉలూపినిగూర్చి వ్రాయునపుడు ఈభీష్మపర్వశ్లోకములనే సూచించి, "అర్జునుని వివాహమాడిన పిదప తన బంధువులకడనే యుండి కుమారునిం గనెను" (భీష్మ-అ90) అని వ్రాసినవిషయము నిరస్తమైనది.

ఇక. ఆశ్వమేధికపర్వములోని విషయము జూతము— అర్జునుడశ్వరక్షకుడై వెళ్ళుచుండ మణిపురప్రాంతమున మణిపురాధీశ్వరుడగు

బభ్రువాహనుడు పితృగౌరవమును ప్రదర్శించుచు బ్రాహ్మణపరివేష్టితుడై వినయవిధేయతలతో వచ్చుటను జూచి యర్జునుడు—

"సంరక్ష్యమాణం తురగం యౌవనాశ్విర ముపాగతమ్ ।
యజ్ఞీయం విషయాన్తే మాం నాయోత్సీః కిన్ను పుత్రక ॥
ధిక్ త్వా మస్తు సుదుర్బుద్ధిం క్షత్రధర్మబహిష్కృతమ్ ।"

అశ్వరక్షకుడనై వచ్చిన నాతో యుద్ధముచేయక ఇట్లువచ్చుట నింద్యము. నీవు క్షత్రధర్మబహిష్కృతుడవు.

ఇది నేను శస్త్రమువిడిచివచ్చినపుడు నీవు చూపవలసినప్రక్రియ. అని కఠినోక్తు లాడుచుండెను. అప్పుడు—

"త మేవ ముక్తం భర్త్రాతు విదిత్వా పన్నగాత్మజా ।
అమృష్యమాణా భిత్వోర్వీ ములూపీ సముపాగమత్ ॥
సా దదర్శ తతః పుత్రం విమృశన్త మధోముఖమ్ ।
సంతర్జ్యమాన మసకృ త్పిత్రా యుద్ధార్థినా ప్రభో ॥
ఉలూపీ ప్రాహ వచనం ధర్మజ్ఞం ధర్మవిశారదమ్ ।
ఉలూపీం మాం నిబోధ త్వం మాతరం పన్నగాత్మజామ్ ॥
యుధ్యస్వైనం కురు శ్రేష్ఠం పితరం యుద్ధదుర్మదమ్ ।
ఏవ మేవ హి తే ప్రీతో భవిష్యతి న సంశయః ॥" (అ 79)

ఉలూపి భూమిని భేదించుకొని వచ్చి యేమిచేయుటకును దోచక తలవంచుకొని యున్న బభ్రువాహనుని జూచి, నేను నాగకాంతను, నీకు తల్లినని తెలిసికొనుము. నీవుతప్పక నీతండ్రితో యుద్ధము జేయుము. ఆమార్గముననే అతనికి నీయెడల ప్రీతి కలుగును. అని బోధించి యుద్ధమునకు బురికొల్పినది.

ఆమె యిట్లు పురికొల్పుటకు కారణ మేమనగా, యుద్ధములో శిఖండి నెదుర్కొని భీష్మునిపై బాణములను ప్రయోగించునపుడు తనతో యుద్ధము జేయనట్టి భీష్ముని బడగొట్టినకారణమున పార్థునకు

వసువులు గంగాతీరమందుండి శాపమిచ్చిరి. అప్పు డక్కడనుండి యులూపి విని తనతండ్రితో నావిషయము జెప్పగా నాతడు వసువుల దగ్గరకు వెళ్ళి పార్థుని విషయమై ప్రార్థింప వసువు లిట్లు చెప్పిరి—

"పుత్ర స్తస్య మహాభాగ మణిపూరేశ్వరో యువా ।
స ఏనం రణమధ్యస్థ శ్శరైః పాతయితా భువి ॥
ఏవం కృతే స నాగేన్ద్ర ముక్తశాపో భవిష్యతి ।" (అ 81)

మణిపురాధీశ్వరుడగు పార్థపుత్రునిచే యుద్ధములో బాణాఘాతమున పార్థుడు నేలబడిపోయినపుడు శాపవిముక్తి యగును. అని.

అందుకొరకై యామె ప్రేరేపించుట, పార్థు డట్లు పడిపోవుట, మణిప్రభావమున ఉలూపి పార్థుని యుజ్జీవింపజేయుట జరిగెను.

పార్థపతనమునకు జింతిల్లుచు చిత్రాంగద యుద్ధభూమికే వచ్చి యుండెను. మూర్ఛనుండి లేచిన పార్థుడు ఉలూపిని, చిత్రాంగదను జూచి యులూపివలన శాపవృత్తాంతమును, శాపవిముక్తిని, ఉలూపి చేసిన సహాయమును తెలిసికొని సంతోషించి పుత్రుని మెచ్చుకొని చిత్రాంగదయు ఉలూపియు వినుచుండ పుత్రుని కిట్లు చెప్పెను—

యుధిష్ఠిరస్యాఽశ్వమేధః పరిచైత్రీం భవిష్యతి ।
తత్రాగచ్ఛేః సహామాత్యో మాతృభ్యాం సహితో నృప ॥"

జరుగబోవు యుధిష్ఠిరాశ్వమేధమునకు నీవు తల్లులతోడను, పరివారముతోడను రావలసినది. అని.

ఇచ్చట ఉలూపియందు కృతజ్ఞత జూపుచు నామెనుగూడ నశ్వమేధమునకు దీసికొనిరమ్మని పార్థుడు చెప్పెను.

ఉలూపి అర్జునునకు శాపవృత్తాంతమును జెప్పి—

"తస్య శాన్తి మకృత్వా త్వం త్యజేథా యది జీవితమ్ ।
కర్మణా తేన పాపేన పతేథా నిరయే ధ్రువమ్ ॥
ఏషాతు విహితా శాన్తిః పుత్రాద్యాం ప్రాప్తవానసి ।

అనుచు శాపనిమిత్తమున నీకు నరకము రాకుండుటకై యీ దోషశాంతి చేయబడినది. శాంతి జేసికొనకయే జీవితమును త్యజించిన యెడల తప్పక నరకము ప్రాప్తించును. అని పలికినది.

దీనిచేత నాగమె యెంత ధర్మాధర్మపరిశీలనముగల పుణ్యాకాంతయో స్పష్టము. "భిత్త్వోర్వీ ములూపీ సముపాగమత్" నాగలోకము నుండి భూమిని భేదించుకొని యులూపి వచ్చిన దనుటచే నాగమె యమానుషశక్తియు, దివ్యదృష్టియు స్పష్టమగుచున్నవి.

ఇచ్చట నొకశంక కలుగవచ్చును— ఉలూపీపార్థులకు వివాహము జరుగనిపక్షములో నులూపియందు భార్యాశబ్దము, పార్థునియందు భర్తృశబ్దము వాడబడునా? అని. ఈవిషయమై మనుస్మృతి నవలోకింతము —

"భర్తుః పుత్రం విజానన్తి శ్రుతి ద్వైధం తు భర్తరి ।
ఆహు రుత్పాదకం కేచి దపరే క్షేత్రిణం విదుః ॥" (అ9–32)

వ్యాఖ్యా– భర్తుః పుత్రో భవతీతి మునయో మన్యన్తే భర్తరి ద్విప్రకారా శ్రుతి ర్వర్తతే । కేచి దుత్పాదక మవోఢార మపి భర్తారం తేన పుత్రేణ పుత్రిణమాహుః । అన్యే తు వోఢారం భర్తార మనుత్పాదక మపి అన్యజనితేన పుత్రేణ పుత్రిణ మాహుః ॥

ఇచ్చట వివాహము జేసికొనినవాడేగాక వివాహము జేసికొనక సంతతిగలిగించినవాడుగూడ భర్త యనబడు నని చెప్పబడినది. కనుక వివాహము జేసికొనకపోయినను ఉలూపీపార్థులయందు భార్యాభర్తృ శబ్దములు వాడబడుట యుక్తమే. ఉలూపి పార్థుని గోరుటలో—

"కృత్వా మమ పరిత్రాణం తవ ధర్మో న లుప్యతే ।
శరణంచ ప్రపన్నాస్మి త్వా మద్య పురుషోత్తమ ॥
యాచే త్వా మభికామాహం తస్మా త్కురు మమ ప్రియం ।"

నీకు నా పరిత్రాణమువలన ధర్మలోపము కలుగదు. నే నభికామనై నిన్ను యాచించుచుంటిని. అని చెప్పుకొనినది.

"అభికామాం స్త్రియం యశ్చ గమ్యాం రహసి యాచితః ।
నోపైతి స చ ధర్మేషు భ్రూణహే త్యుచ్యతే బుధైః ॥"

అని వచన మున్నది. ఈ మహాభారతవచనమునకు అభికామయు గమ్యయు నైన స్త్రీచే రహస్యమందు యాచింపబడి యెవ్వడు తిరస్కరించునో, ఆతడు భ్రూణహత్యాపాతకమును పొందునని యర్థము. దీనినిబట్టి యూపార్థుడు కూడిన నాగకాంత గమ్యస్త్రీ యని తేలినది. ఆ నాగకాంతచే బ్రార్థితుడైన పార్థుడు—

"కృతవాం స్త త్తథా సర్వం ధర్మ ముద్దిశ్య కారణమ్।"

ధర్మబద్ధుడై యంగీకరించె నని చెప్పబడినది.

ఈసందర్భము ప్రతివాదుల వివాహవాదమున కెంతమాత్రము సహకారి కానేరదు.

"ఏవ మేవ సముత్పన్నః పరక్షేత్రేఽర్జునాత్మజః"

అను భీష్మపర్వోక్త వచనమునకు విరుద్ధము కూడను.

తీర్థయాత్రాసందర్భములో చిత్రాంగదావివాహానంతరము మూడు సంవత్సరము లచ్చటనే యుండి యింద్రప్రస్థమునకు తిరిగి వచ్చినపుడు నీవు రావలసిన దని చెప్పి వెళ్ళిన పార్థుడు ఉలూపితో నట్లు చెప్పకపోవుటయు, నేకరాత్రము మాత్రమే యుండి వెళ్ళిపోవుటయు, నెప్పుడో బహుకాలమునకు యింద్రలోకములో నున్న సమయమున నులూపీపుత్రుడు వెళ్ళి తనవిషయము జెప్పుకొని యులూపీసంబంధము ను పార్థునకు జ్ఞాపకము జేసి యుండుటయు నను విషయములు— ఉలూపి పార్థునితో గాపురము చేసిన దను ప్రతివాదుల వాదమును త్రోసివేయుచున్నది.

అశ్వమేధయాగమునకు వచ్చినట్లున్నను బంధుమర్యాదగా వచ్చినట్లగునుగాని గాపురము చేయుటకు వచ్చినట్లు కానేరదు.

పూర్వోక్తప్రకారము అతీంద్రియజ్ఞానము గల యులూపి, యే యితరసందర్భమునందో వచ్చి వెళ్ళి యుండవచ్చును. అంతమాత్ర

మున గా ప్రరము చేసినదని గ్రంథమునకు విరుద్ధముగా ప్రతివాదులు వ్రాయుట హేయము. కనుక "ఉలూపీవరణము వివాహమే" అను ప్రతివాదుల వ్రాత పరాస్తము. వీరే ఉత్తమభారతములో నిట్లు వ్రాసిరి —

"ఫల్గునుడు తీర్థయాత్రలం జేయుచు నాగకన్యక యగు "ఉలూపి" వరింప నామెయందు ఇలావంతు డను పుత్రుని, మణులూరుపు రాధీశు డగు మలయధ్వజుని పుత్రిక యైన "చిత్ర" నుద్వాహమై బభ్రువాహనుం డను పుత్రుని బడసెను". (పు 10)

ఇచ్చట, చిత్రాంగద నుద్వాహమైనట్లు వ్రాసినారేగాని ఉలూపి నుద్వాహమైనట్లు వ్రాయలేదు. దీనిచేకూడ వీరి విధవావివాహప్రసంగము నింద్యము. వీరిచ్చట ఉలూపియే పార్థుని వరించినట్లు వ్రాసినారు గాని పార్థు డులూపిని వరించినట్లు వ్రాయలేదుగనుక దీనితో వీరి వెనుకటి వ్రాత లన్నియు తప్పని వీరే స్పష్టపరచినారు.

— ♦ "భారతమందు ధర్మము కౌరవపక్షమం దున్నది. పాండవులకు వారసత్వమే లేదు" అను ప్రసంగము—తన్నిరాకరణము—

సుయోధనవిజయకర్తల వ్రాత యిట్లున్నది— "మామామ గారైన కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రులుగారితో భారతవిషయక ప్రశంస వచ్చినప్పుడెల్ల భారతమందలి ధర్మము కౌరవపక్షమున నున్నదని చెప్పుచు వచ్చిరి. అంతియె కాక కురుపాండవదాయభాగము గూర్చి వారు విపులముగా జర్చించి యందు పాండవులకు వారసత్వమే లేనట్లు రచించి యుండిరి. వారి వాదములును వ్రాతలును తెలిసికొనిన పిదప భారతమును తిరిగి జాగ్రత్తగా చదువుటచే భారతయుద్ధమందలి నిజమైన ధర్మము విజయము సుయోధనునకే వచ్చినదని దృఢాభిప్రాయుడనై యీ సుయోధనవిజయమును వ్రాయుటకు బూనుకొంటిని.

"భారతమునందలి యితివృత్తమునందలి లోపములగూర్చి ప్రజలకు దెలుపునుద్దేశముతోడను, విషయమును శాంతముగ గ్రహించి చక్కగ విమర్శించి, మంచిచెడుగుల నెల్ల వివరించి తెలుపు పెద్దలయభిప్రాయము లాయా విషయములపై తెలిసికొనవలె నను నభిప్రాయముతోడను నే నీగ్రంథమును రచించి ప్రకటించుటకు సాహసించితిని" (తొలిపలుకు— పు12).

ఈవ్రాతచే తాము చేసినది సాహస మనియు, తమగ్రంథమునకు మూలము బ్రహ్మయ్యశాస్త్రిలుగారి వాదములు, వ్రాతలు ననియు ప్రతివాదులు తెలుపుచున్నారు. కాని పూజ్యులును ఆస్తికాగ్రణులును అగు బ్రహ్మయ్యశాస్త్రిలుగారి వాదములు గాని; వ్రాతలుగాని యట్లుండునని భావింపజాలము.

బ్రహ్మయ్యశాస్త్రిలుగారి "కురుపాండవదాయభాగవినిర్ణయము"లో దుర్యోధనుని గూర్చి వ్రాసిన మాటలను జూడుడు—

1. "దుర్మార్గుడగు దుర్యోధనుడు ధర్మజుని యశస్సును భీమార్జునుల బలపరాక్రమములను గని యోర్వజాలక వారిని గపటోపాయముచే జంపి యాభాగమును గూడ దానె కబళింప బ్రయత్నము జేసినాడు.

2. ఖాండవప్రస్థమున రాజ్యము చేయుచున్న ధర్మజుడు రాజసూయాదిమహామఖముల జేసి దిగంతవిశ్రాంతకీర్తియై ప్రకాశించుచుండగా మూలరాజ్యమునకు రాజగు దుర్యోధనుడు పేరులేనివాడు కావలసివచ్చె. అందుమూలముచే నాదుష్టునకు యుధిష్ఠిరరాజ్యము నపహరింప దురూహాపుట్టె. ఆహేతువుచే మాయాద్యూతమున నాయర్ధరాజ్యము నపహరించె.

3. రాజ్యము నపహరించుటతో దృప్తి నందక కులాంగనయగు ద్రౌపదిని మానభంగము జేసి ధార్తరాష్ట్రులవమానించిరి. హిందు

వులు మొదటినుండియు దేనిని సహించినను స్త్రీల మానసష్టమును మాత్రము సహింపలేరు. ఈఘోరదుష్కారకార్యముచే రాష్ట్రమంతయు నాగ్రహావేశము నందెను. అంబికేయుడు తదుపశమార్థమై మరల బాండవుల యర్థరాజ్యమును వారికి నిచ్చివేసె.

4. దుర్మార్గుడగు దుర్యోధనుడు తన కోరిక సిద్ధింపనందుకు చింతించి, మరల మాయాద్యూతము పెట్టి యీమారు రాజ్యమును పణముగా బెట్టగ దేశమునుండి పాండవుల దొలగించుటకై యరణ్యావాసాది కుటిలపణములను బెట్టి మాయాజయంబు నంది పాండవుల నడవుల పాలుజేసె.

5. పాండవులు స్వదేశమును విడిచి యుతెరత్ర నుండవలసిన గడువైనతరువాత తిరిగివచ్చి తమ యర్థరాజ్యమును దమకీయవలయునని కోరిరి. ఈలోపల దుర్యోధనుడు లేని సౌజన్యమును తత్కాలమునకు సరిపడున ట్లవలంబించి ప్రజలను మిక్కిలి చక్కగా పరిపాలించి వారి హృదయముల నాకర్షించుకొని రాజ్యమవిభాజ్యముగాన భాగమీయనవసరము లేదనియె" (పు 28).

ఇటు లైదంశములుగా నున్న బ్రహ్మయ్యశాస్త్రిగారి వాక్యములలో దుర్యోధనుడు దుర్మార్గుడనియు, బాండవుల కీర్తి బలపరాక్రమముల జూచి యోర్వలేక, వారిని గపటోపాయమున జంపబ్రయత్నించినాడనియు, మాయద్యూతమున వారి రాజ్య మపహరించినాడనియు, కులాంగనయగు ద్రౌపదీదేవికి మానభంగము జేసినాడనియు, మరల మాయాద్యూతమున మాయాజయ మొంది పాండవుల నడవుల పాలుజేసినా డనియు, తరువాత వారి యర్థరాజ్య మీయనవసరము లేదని చెప్పినాడనియు, లేనిసౌజన్యము నభినయించినాడనియు స్పష్టముగా నున్నది.

దీనినిబట్టి "భారతమందలి ధర్మము కౌరవపక్షమం దున్నదని

బ్రహ్మయ్యశాస్త్రులుగారు చెప్పుచు వచ్చిరి" అని సుయోధనవిజయ కర్తలనుట అయుక్తము.

బ్రహ్మయ్యశాస్త్రులుగారు దుర్యోధనునిది మాయజూదమని నారు. సుయోధనవిజయకర్తలు దుర్యోధనవాక్యముగా "మాయ జూదం బనుమాట యసత్యంబు" అని వ్రాసినారు.

బ్రహ్మయ్యశాస్త్రులుగారు ద్రౌపదీదేవిని కులసతి యనినారు. సుయోధనవిజయకర్తలు "కులసతిగా దట్టి కోమలాంగి" అని వ్రాత సాగించినారు.

బ్రహ్మయ్యశాస్త్రులుగారు ద్రౌపతీదేవిని మానభంగము జేసి ధార్తరాష్ట్రులు పరిభవించినారని చెప్పినారు. సుయోధనవిజయ కర్తలు "అప్పు డధోనీవి యైనట్టి యా కాంతవస్త్రంబు తనయంత బడెను క్రింద, అంతమాత్రంబున నతివను పరిభవించితి మంచు నెగ్గెత్తి చెప్ప రకట" అని కవిత్వ మల్లినారు

ఇట్టి సుయోధనవిజయకర్తల వ్రాత, బ్రహ్మయ్యశాస్త్రిగారి వాక్యముల కత్యంతవిరుద్ధ మగుటవలన సుయోధనవిజయములోని విష యమునకు బ్రహ్మయ్యశాస్త్రులుగారి సమ్మతి కలదనుట అయుక్తము.

ఇక పాండవులకు వారసత్వమే లేదని "కురుపాండవదాయభాగ వినిర్ణయము"లో బ్రహ్మయ్యశాస్త్రులుగారు చర్చించి యున్నా రని సుయోధనవిజయకర్త లనుటచే నాగ్రంథపరిశీలన మావశ్యకమైనది.

ఆగ్రంథాదియందున్న విషయ మేమనగా— "గుడ్డివాడగు ధృతరాష్ట్రుడు రాజయ్యె ననుటయు, పాండవులు తమ తండ్రిభాగ మును తమకు బంచిపెట్టనోరి రనుటయు, నాంధ్రభారతమునందలి గొప్ప తప్పులని యాచార్యులవారు (పనప్పాకమనంతాచార్యులవారు) నొక్కి వ్రాయించిరి ...... దుర్మార్గులగు ధార్తరాష్ట్రుల పక్ష మవ లంబించుటకు గాదుకాని నేను నన్నయభట్టారకుని చారిత్రమును వ్రాయుచున్నవాడ నగుటచేతను ఆచార్యులవారు నన్నయభట్టారకుని

గూడ బ్రతివాదులలో జేర్చి యాతని నధిక్షేపించి యుండుటచేతను నా పక్ష్యుడు నిర్దోషియని వాదించుట నాకవసరమైనది"

అని యున్నది. దీనినిబట్టి నన్నయభట్టారకుడు నిర్దోషి యని వాదించుటయందే వారికి తాత్పర్యమని తేలినది. ఎట్లైనను ఆగ్రంథమునందు ధృతరాష్ట్రుడే రాజయ్యెనను వాదమును బహువిధముల బల పరచియున్నారు, 1907 క్రీ॥ సంవత్సరములో బ్రకటింపబడియున్న ఆ వాదమునే ప్రతివాదు లందరు నవలంబించియున్నారు. కనుక 'కురు పాండవదాయభాగవినిర్ణయ' మను గ్రంథమునే బ్రమాణోపపత్తులతో బరీక్షించి తత్త్వమును గ్రహింతము—

అస లిచ్చట కురురాజ్యాధిపతి ధృతరాష్ట్రుడా? పాండురాజా? అనునది వివాదాంశము. ఇది గ్రంథముల నాధారముజేసికొని నిర్ణయింపవలసిన విషయమైయున్నది. ఆగ్రంథములలో ధృతరాష్ట్రుడే అధిపతి యని యాంధ్రభారతాదులును, పాండురాజే అధిపతి యని సంస్కృతభారతాదులును బోధించుచున్నవి. అందుచే గొందరు ధృతరాష్ట్రరాజ్యవాదులును, గొందరు పాండురాజరాజ్యవాదులును అయి యుండిరి. అందు ధృతరాష్ట్రరాజ్యవాదము పూర్వపక్ష మనియు, పాండురాజరాజ్యవాదము సిద్ధాంతమనియు నిరూపింపబడుచున్నది.

—: "ధృతరాష్ట్రుడే రాజ్యాధిపతియనుటకు ఆంధ్రభారతము ప్రమాణ" మను ప్రసంగము—తన్నిరాకరణము :—

ఆంధ్రభారతము—

వ. "ఇట్లు బ్రహ్మోత్తరంబుగా బ్రజావృద్ధియు, సస్యసమృద్ధియు నగుచు డ నాంబికేయు ధృతరాష్ట్రు రాజ్యాభిషిక్తుంజేసి భీష్ముండు దనదు విల్లును, విదురు బుద్ధియును సహాయంబులుగా రాజ్యంబు రక్షించుచున్నంత" (ఆ 5)

ఇట్లు పంచమాశ్వాసారంభమందు భీష్ముడే ధృతరాష్ట్రుని రాజ్యాభిషిక్తునిజేసినట్లు చెప్పబడినది. ఇక షష్ఠాశ్వాసమందిట్లున్నది—

"ధృతరాష్ట్రుం డిట్లనియె... రాజయ్యెడువాఁడు తన రాజ్య
భారంబు దాన చూచి యరయవలయును. నేను షడంగసహితం
బుగా వేదాధ్యయనంబు సేసి యర్థశాస్త్రంబులందు గృతనిశ్చ
యుండ నయి బలంబు గలిగియు నంగవైకల్యంబునం బరచక్రంబు
లకుం బ్రతివ్యూహంబులు రచియింపనేరమిం జేసి రాజ్యంబునకు
దగకున్న—

ఉ. లోకనుతుండు పాండుఁడమలుండు మహాగుణరత్నపూర్ణర
త్నాకరుఁ డత్యుదారమతి నంధుఁడ నైనను నన్ను రాజుగాఁ
జేకొని నాకు భక్తిఁ బనిసేయుచు సర్వజగజ్జిగీషుఁడై
యీ కురువంశరాజ్యభర మింతయు దాల్చె బరాక్రమంబునన్.

వ. మరియు వానికంటె గుణంబుల మిక్కిలియయి జనంబులకు నను
రక్తుండై పరగుచున్న పాండురాజుకుమారుల నెవ్విధంబున బాపనేర్తు
నని దుఃఖించిన ధృతరాష్ట్రునకు దుర్యోధనుం డిట్లనియె.

సీ. పైతృకం బగు లక్ష్మి పాండుభూపతి మున్ను
దాల్చుటజేసి తత్తనయుఁ డైన
ధర్మజుఁ డిప్పుడు దాల్చిన నాతని
తనయుండు దాల్చు మీఁద
నిప్పాట పాండువంశేశులు వసుమతీ
రాజ్యార్హు లగుదురు రాజ్యమునకు
బరువడి మేమింత బాసిన మాపుత్ర
పౌత్రవర్గంబును బాయు నింక

ఆ. నొరుల గొలిచి కుడువ నోప మేమెల్లఁగా
కుండ మమ్ము జేయ నోపుదేని
పాండురాజు తొంటిభక్తియు నప్పాండు
తనయులంగు దయయు దలపకుండు.

వ. ఈరాజ్యంబు మొదలింటంగోలె భవదీయంబయిన బ్రకృతిజనులు వశ్యులుగాకున్నను గ్రమాగతంబయి మాకు నప్రయత్నలభ్యంబగు తొల్లి పాండురాజు రాజై గుణంబులం బ్రజానురాగంబు వడయుటంజేసి యెల్లవారును ధర్మరాజు రాజ్యంబు వలతురు దాని నెఱింగి కాదె దానసమ్మానంబులం బ్రకృతిజనంబులకు సంతోషంబు జేయుచునుండుదు. నీదుల దుష్టజనంబుల పక్షపాతవచనంబులును నంతకు నుపాయంబున గొంతిని, బాండవులను దదీయభృత్యామాత్యవర్గంబుతో వారణావతంబునకుం బుత్తము. మనకు రాజ్యంబు సుప్రతిష్ఠితంబైన మఱి వారలిందులకు వత్తురనిన.

ఇచ్చట నీ ధృతరాష్ట్రవాక్యములు గమనింపదగియున్నవి—
"రాజయ్యెడువాడు తన రాజ్యభారంబు దాన చూచి యరయవలయు. నే నధ్యయనము సేసి బలముగలిగియునంగవైకల్యంబునం బ్రతివ్యూహంబులు రచియింపనేరమింజేసి రాజ్యంబునకు దగకున్న పాండురాజు నన్నంధుడనైయున్నను రాజుగా జేకొని నాకు భక్తి బనిసేయుచు నీ కురువంశరాజ్యభర మంతయు దాల్చెను".

ఈవాక్యములలో దాను రాజ్యంబునకు దగనివాడనని చెప్పబడెను. అనర్హుడనైన నన్ను బాండురాజు రాజుగా జేకొని నాకు విధేయుడై యీకురురాజ్య మేలెనని చెప్పబడినది.

ఇట్టి యనర్హుడు రాజ్యాభిషిక్తుడెట్లగును? రాజ్యాభిషిక్తుడగుటే నిజమైనయెడల దానే రాజయియుండ బాండురాజు నన్ను రాజుగా జేకొనినాడనుటయు, నాకు విధేయుడై యీరాజ్య మేలెననుటయు నెట్లు సంగతమగును?

ధృతరాష్ట్రుడు రాజుకాక, పాండురాజే రాజైయున్నప్పుడు పాండురాజు నన్ను రాజుగా జేకొనినాడనుటయు, నాతడు స్వాతంత్ర్యము వహింపక నాకు విధేయుడై రాజ్యమేలె ననుటయు సంగతమగును.

కనుక నీధృతరాష్ట్రవాక్యములు ధృతరాష్ట్రుడు రాజ్యాభిషిక్తు డయ్యె ననుమాటను త్రోసివేయుచున్నవి.

ఆపై జూపబడిన యీదుర్యోధనవాక్యములుగూడ గమనింప దగినవే—"పైతృకంబగు లక్ష్మి బాండుభూపతి మున్ను దాల్చుట జేసితత్తనయుడైన ధర్మజు డిప్పుడు దాల్చిన నాతని తనయుండు దాల్చు మీద ఇట్లు పాండువంశేశులే వసుమతీరాజ్యార్హు లగుదురు. మేము రాజ్యము బాసిన మాపుత్రపౌత్రవర్గంబును బాయు నింక, మే మొరుల గొలిచి జీవింపజాలము. ఈరాజ్యంబు మొదలింటగోలె భవదీయంబయిన బ్రకృతిజనులు వశ్యులుగాకున్నను క్రమాగతం బయి మాకు నప్రియత్నలభ్యంబగు, తొల్లి పాండురాజు రాజై ప్రజానురాగంబు వడయుటంజేసి యెల్లవారును ధర్మరాజు రాజ్యంబు వలతురు"

ఈ దుర్యోధనవాక్యములలో పాండుభూపతి పైతృకమైన రాజ్యమును మున్ను ధరించె నని చెప్పబడినది కాని నీరాజ్యమును (ధృతరాష్ట్రరాజ్యమును) ధరించె నని చెప్పబడలేదు. ధృతరాష్ట్రుడు రాజ్యాభిషిక్తు డగుటే నిజమైనయెడల ధృతరాష్ట్రరాజ్యమునే పాండు భూపతి రాజప్రతినిధియై ధరించినట్లు చెప్పబడియుండును. అట్లు చెప్ప బడకుండుటచే ధృతరాష్ట్రుడు రాజ్యాభిషిక్తుడు కాలేదనియు, బాండు భూపతియే రాజయి తన పిత్ర్యమయిన కురురాజ్యమును బాలించె ననియు స్పష్టమగుచున్నది.

మఱియు, "బాండుభూపతి యేలిన రాజ్యము నిప్పుడు ధర్మ జుడు ధరించినయెడల ముందు వారిసంతతికే యది చెందును. ఇట్లు బాండువంశీయులే వసుమతీరాజ్యార్హు లగుదురు. మాకును మాసంత తికిని రాజ్యసంబంధము తొలగిపోవును. మే మొరుల గొలిచి జీవింప జాలము." అని చెప్ప బడినది. ధృతరాష్ట్రుడే రాజ్యాభిషిక్తుడై రాజ ప్రతినిధియే బాండుభూపతియై యున్ననాడు ధార్తరాష్ట్రులకు సంక్రమిం

పవలసియున్న రాజ్యము పాండువంశీయులకే సంక్రమించిపోవు నని దుర్యోధను డెట్లనును? అట్లనుటచే పాండుభూపతి రాజప్రతినిధి కాక రాజ్యాధిపతియే యని ధ్రువమగుచున్నది. దాయభాగనిర్ణయములో వ్రాయబడినట్లు "మూలరాజ్యము ధృతరాష్ట్రునిది. స్వోత్పన్నసంపాదిత రాజ్యము పాండురాజుది" అగుచో నిజమైనయెడల "వసుమతీరాజ్యార్హులు పాండువంశీయులే యగుదురు. మాకు రాజ్యము సంక్రమింపక యేపోవును. మే మొరుల గొలిచి జీవింపజాలము" అని తండ్రితో దుర్యోధను డనుట యెట్లు సంగతమగును? అది యేకరాజ్యమే యై యుండి యీరాజ్యాధిపతి పాండుభూపతి యైనపుడే యీదుర్యోధనుని మాట సంగతమగును. కనుక ధృతరాష్ట్రుడు రాజ్యాభిషిక్తు డయ్యె నను మాటను ఈదుర్యోధనవాక్యముగూడ త్రోసివేయుచున్నది.

మరియొకటి. "ఈరాజ్యంబు మొదలెంటంగోలె భవదీయం బయినచో బ్రకృతిజనులు వశ్యులుగాకున్నను క్రమాగతంబయి మా ప్రయత్నలభ్యం బగు. తొల్లి పాండురాజు రాజై ప్రజానురాగంబు వడయుటంజేసి యెల్లవారును ధర్మరాజు రాజ్యంబు వలతురు".

అని దుర్యోధను డనుటలో, ఈరాజ్యము మొదటినుండియు భవదీయము గాకపోయెనని స్పష్టముగా జెప్పబడినది. అనగా పాండురాజు వనగతుడైనప్పటినుండియే యీరాజ్యము నీచేతికివచ్చినది. కాని మొదట నీది కాకపోయినది యని యర్థము. ధృతరాష్ట్రుడు రాజ్యాభిషిక్తు డయ్యెననుమాటయే నిజమైనయెడల పాండురాజు వనగతుడు కానపుడుమాత్రము రాజ్యము ధృతరాష్ట్రుని దేల గాదు? పాండుభూపతియే రాజ్యాధిపతి యగుటనుబట్టి మొదట ధృతరాష్ట్రునిది గాకపోయినది. పాండుభూపతి వనవాసమునకు వెళ్ళినపుడు ధృతరాష్ట్రునకును, విదురునకును రాజ్యము వప్పగించి వెళ్ళి యచ్చట శాపగ్రస్తుడై మరల రాకయే స్వర్గస్థు డయ్యెను. అందుచే నప్పటి

నుండియు రాజ్యము ధృతరాష్ట్రుని చేతికి వచ్చియున్నది. ఆరాజ్యాధిపత్యము ధృతరాష్ట్రునియందు లోపించుటచేతనే రాజ్యము తమకు క్రమాగతము గాకపోయిన దనియు, ధర్మజునకు క్రమాగత మగుటను బట్టి ప్రజలు ధర్మజుని రాజ్యమునే కోరుచున్నారనియు దుర్యోధనుడు విలపించినాడు. కనుక నీదుర్యోధనవాక్యము గూడ ధృతరాష్ట్రుడు రాజ్యాభిషిక్తుడయ్యె ననుమాటను త్రోసివేయుచున్నది.

ఇట్లు ధృతరాష్ట్ర దుర్యోధనుల పరస్పరప్రసంగములే ధృతరాష్ట్రుడు రాజ్యాభిషిక్తుడు కాడని ధ్రువపరచుటవలన ధృతరాష్ట్రుడే రాజ్యాధిపతియనుటకు ఆంధ్రభారతము ప్రమాణ మను వాదము నిరస్తమైనది

—: ధృతరాష్ట్రుడు రాజ్యాభిషిక్తు డనుటకు సంస్కృతభారతముగూడ ప్రమాణ మను ప్రసంగము-తన్నిరాకరణము :—

దాయభాగవినిర్ణయములో నిట్లున్నది— "అంబికేయుడే రాజాయె ననుటకు గొప్పయాధారము వ్యాసకృతమహాభారతము యొక్క మరియొక ప్రతియే. ఈనడుమ టి. ఆర్. కృష్ణాచార్యుల వారును, టి. ఆర్. వ్యాసాచార్యులవారును నిర్ణయసాగరముద్రాశాలయందచ్చొత్తించిప్రచురించుచున్నమహాభారతమునుజూడుడు—

"భీష్మేణ రాజా కౌరవ్యో ధృతరాష్ట్రోఽభిషేచితః ।
ధనుర్వేదేఽశ్వపృష్ఠే చ గదాయుద్ధేఽసిచర్మణి ॥
... ... ... ... ... ... ... ... ... ... ... ... ... ।
గతః పారం యదా పాండు స్తదా సేనాపతిః కృతః ॥" అని.

మన మిప్పు డానిర్ణయసాగరపుప్రతిలో బాఠక్రమ మెట్లున్నదో చూతము—

"వైదికాధ్యయనే యుక్తో నీతిశాస్త్రేషు పారగః ।
భీష్మేణ రాజా కౌరవ్యో ధృతరాష్ట్రోఽభిషేచితః ॥

ధనుర్వేదేశ్వపృష్ఠే చ గదాయుద్ధేఽసిచర్మణి ।
తథైవ గజశిక్షాసు నీతౌ మస్త్రేషు వివిధేషు చ ॥ 22.
అర్థధర్మప్రధానాసు విద్యాసు వివిధాసు చ ।
గతః పారం యదా పాండు స్తదా సేనాపతిః కృతః ॥" 23.

... ... ... ... ... ... ... ... ... ... ... ...

"ధృతరాష్ట్ర స్త్వచక్షుష్ట్వా ద్రాజ్యం న ప్రత్యపద్యత ।
పారసవత్వా ద్విదురో రాజా పాండు ర్బభూవహ ॥" 30.

(ఆది-అ 18)

ఇట్లాప్రతిలో నొక్కస్థలములోనే ధృతరాష్ట్రుడు రాజ్యాభిషిక్తుడును, పాండురాజు సేనాపతియు నగు రనియు, నంధుడగుటచే రాజ్యమును ధృతరాష్ట్రుడు పొందలేదు. పాండురాజే రాజయ్యెననియు బరస్పరవిరుద్ధముగా వ్రాయబడియున్నది ఈప్రదర్శింపబడిన నాల్గుశ్లోకములలో మొదటిశ్లోకమున గాదియందును, మూడవశ్లోకమున కంతమందును ఆప్రతిలో రేఖ లుంచబడినవి. నాల్గవశ్లోకమున కట్టి చిహ్నము లేదు. అందుచే నాల్గవశ్లోకమే సాంప్రదాయికపాఠ మనియు, పైమూడుశ్లోకములు క్వాచిత్కములనియు, వానిసంబంధ మనపేక్షితములగుటచే విరోధములేదనియు సూచింపబడినది.

ఆప్రతిలో నట్టిగుర్తు క్వాచిత్కపాఠబోధకముగా నచ్చటచ్చట వాడబడియున్నది. కనుక వారు చూపు మనిన ప్రతిలోనే — "ధృతరాష్ట్ర స్త్వచక్షుష్ట్వా ద్రాజ్యం న ప్రత్యపద్యత । రాజా పాండుర్బభూవహ ॥ అను సార్వత్రికపాఠముండుటచేతను "ధృతరాష్ట్రోఽభిషేచితః పాండు స్సేనాపతిః కృతః" అను పాఠమున్నను అది క్వాచిత్కపాఠమని రేఖాంకితముజేసి చూపబడుటచేతను, యావద్గ్రంథమున కది విరుద్ధమగుటచేతను, ఇతరప్రతులలో నట్టి పాఠమే లేకుండుటచేతను ధృతరాష్ట్రుడు రాజ్యాభిషిక్తుడయ్యె ననుటకు సంస్కృతభారతము గూడ ప్రమాణ మను వాదము నిరస్తమైనది.

రాజ్యాధిపతి పాండుభూపతియే గాని ధృతరాష్ట్రుడు గాడని దుర్యోధనునితో—స్పష్టముగా జెప్పబడియున్న భీష్మధృతరాష్ట్ర గాంధారీవచనముల నుదాహరించుచున్నాము. చూడుడు—

ఉద్యోగపర్వము. భీష్మః—

"అన్ధః కరణహీనత్వా న్న వై రాజా పితా తవ ।
రాజా తు పాండు రభవ న్మహాత్మా లోకవిశ్రుతః ॥
స రాజా తస్య తే పుత్రాః పితు ర్దాయాద్యహారిణః ।
మా తాత కలహం కార్షీ రాజ్యస్యార్ధం ప్రదీయతామ్ ॥"(అ147)

ధృతరాష్ట్రః—

పాండుస్తు రాజ్యం సంప్రాప్తః కనీయా నపి సన్నృపః ।
వినాశే తస్య పుత్రాణా మిదం రాజ్య మరిందమ ॥
మయ్యభాగిని రాజ్యాయ కథం త్వం రాజ్య మిచ్ఛసి ॥" (అ149)

గాంధారీ—

"రాజ్యన్తు పాండో రిద మప్రధృష్యం
తస్యాద్య పుత్రాః ప్రభవన్తి నాన్యే ।
రాజ్యం తదేత న్నిఖిలం పాండవానాం
పై తామహం పుత్రపౌత్రానుగామి ॥" (అ 148)

ఇది దాయభాగవినిర్ణయకర్తలు చూడుడని చెప్పిన ప్రతిలో గూడ నున్న గ్రంథమే. దీనిని బట్టి 'ధృతరాష్ట్రోఽభిషేచితః... పాండు స్సేనాపతిః కృతః' అనునది యపపాఠమని నిస్సంశయముగా దేలినది. ఈమాపబడిన భీష్మ, ధృతరాష్ట్ర, గాంధారీవాక్యరూపమై యున్న గ్రంథమన్నిప్రతులలోనున్నదే. ప్రస్తుతము భండార్కరు ప్రాచ్యవిద్యా పరిశోధనాలయ ముద్రితము, యస్. సుక్తంకరుశోధితము నగు యున్న మహాభారతపుప్రతిలోగూడ— "ధృతరాష్ట్ర స్త్వచక్షుష్ట్వా ద్రాజ్యం న ప్రత్యపద్యత ... ... రాజా పాండు ర్బభూవహ ॥" అను పాఠమే యున్నది.

భీష్మోక్తిలో— 'అన్తః కరణహీనత్వాత్' 'స రాజా తస్య తే పుత్రాః' అను శ్లోకద్వయము వెనుకజూపబడినట్లే యున్నది (పు519)

గాంధారీవాక్యములలో— "రాజ్యన్తు పాండో రిద మప్రధృష్యమ్" అను శ్లోకము పూర్వోక్తప్రకారమే యున్నది (పు 523)

ధృతరాష్ట్రవాక్యములో— "పాండుస్తు రాజ్యం సంప్రాప్తః కనీయా నపి సన్నృపః" అను శ్లోకము పాదత్రయముతో పూర్వోక్తప్రకారమే యున్నది. (పు 526)

"యుధిష్ఠిరో రాజపుత్రో మహాత్మా న్యాయాగతం రాజ్య మిదం చ తస్య" అనికూడ జెప్పబడియున్నది.

ఇట్టి యీప్రమాణములనుబట్టి ప్రతివాదు లనునట్లు మూల రాజ్య మొకటి, సంపాదితరాజ్య మొకటి యను విభేదముగాని, అర్ధరాజ్యమునకు ధృతరాష్ట్రుడు, అర్ధరాజ్యమునకు పాండుభూపతి యధిపతులను విభాగముగాని, లేక యావత్కురురాజ్యమునకు నొక్క పాండుభూపతియే రాజై యుండె ననియు, నాతని కారాజ్యము పితృపితామహక్రమాగతమైన దనియు, నిప్పు డారాజ్యాధికారము పాండవులదే యనియు స్పష్టమైనది. కనుక ధృతరాష్ట్రరాజ్యవాదము మహాభారతవిరుద్ధమే

ఇక ధృతరాష్ట్రరాజ్యవాదులు పాండురాజరాజ్యవాగముపై జేసిన యాక్షేపములు పరిహరింపబడుచున్నవి—

—: పాండురోగియైన పాండురాజునకు రాజ్యార్హత యెట్లు? అని యాక్షేపము—తన్నిరాకరణము :—

•దాయభాగవినిర్ణయములో నిట్లున్నది— "గ్రుడ్డివాడను కారణమున ధృతరాష్ట్రునకు రాజ్యము రాకపోయినచో పాండురోగి యను కారణమున పాండురాజునుకూడ రాజ్యము చెంద లేదని చెప్పవలెను. దాయభాగార్హతను దొలగించుదోష మాపాండురాజు నందు లేదనుటకు వీలు లేదు. పాండురాజు దాయప్రాప్తి కర్హుడే

యగునెడల వేదవ్యాసుని నియోగముచే విచిత్రవీర్యక్షేత్రమందు నిక నొకపుత్రుని బుట్టింపగోరనేల? నియోగము బహునియమము లతో గూడినదిగాని యిచ్చవచ్చినట్లు ఆచరింపదగినది కాదు. నియోగవిధులలో "ఏక ముత్పాదయే త్పుత్రం న ద్వితీయం కథంచన" అని నొక్కి చెప్పబడియున్నది. ధర్మ మిట్లుండగా దలచిన కార్య మైనపుడు మరల నియోగించుట యుచితమా? వ్యాసు డంగీకరించునా? కావున పాండువును రాజ్యార్హుడు కాడు. ఈ పాండుత యనునది బొల్లి కాదు. కుష్ఠరోగమే" (పు 3)

పూర్వోక్త ప్రమాణములచే రాజు పాండుభూపతియే యని నిర్ధారితమై యుండ నీయాక్షేప మయుక్తము.

ఇక ధృతరాష్ట్రపాండువిదురుల జన్మసందర్భములో ధృతరాష్ట్రునియందలి దోషముచే ద్వితీయపుత్రాపేక్ష కలిగినట్లు ద్వితీయుడైన పాండురాజునందలి దోషముచేతనే తృతీయపుత్రాపేక్ష కలిగిన దని చెప్పవలయును గదా. పాండురాజు రాజ్యార్హుడె యైనయెడల తృతీయ పుత్రాపేక్ష యేల కలిగినది? అను శంకకు సమాధాన మేమనగా: వంశవిచ్ఛేదము, అరాజకము కాకుండుటకై విచిత్రవీర్యభార్యలయందు నా నియోగమును బట్టి సంతానము నీవనుగ్రహింపవలసినదని వ్యాస భగవానుని మొదట సత్యవతీదేవి భీష్మానుమతితో గోరినపుడే—

"యవీయస స్తవ భ్రాతు ర్భార్యే సురసుతోపమే ।
తయో రుత్పాదయా పత్యం సమర్థో హ్యసి పుత్రక ॥"

అని విచిత్రవీర్యుని భార్య లిరువురియందును సంతాన మను గ్రహింపుమని కోరినదిగాని యొక్క పుత్రుని మాత్రమే కోరలేదు. వ్యాసమహర్షియు—

"తస్మా దహం త్వ న్నియోగా ద్ధర్మ ముద్దిశ్య కారణమ్ ॥"
భ్రాతుః పుత్రా న్ప్రదాస్యామి మిత్రావరుణయో స్సమాన్ ॥"

అని తల్లీ! నీనియోగమువలన ధర్మము నుద్దేశించి పుత్రుల నిచ్చెదను. అనుటలో 'పుత్రాన్' అను బహువచనముచే 'త్రిత్వే బహుత్వ సిద్ధిః' అను న్యాయమున నొక్కనినే యనిగాని, యిద్దరి నని గాని యనక ముగ్గుర నిచ్చెద నని పలికియుండెను. ఆంధ్రభారతములో గూడ సత్యవతి —

క. ధృతి నీ యనుజుండై వి,
శ్రుతుడైన విచిత్రవీర్యు సుక్షేత్రములన్
సుతులం బడయుము కుల మవి
రతసంతతి నెగడ దేవరన్యాయమునన్.

అని యేకపుత్రునిగాక యనేకపుత్రులనే కోరినట్లున్నది.

దీనినిబట్టి సత్యవతీదేవి కనేకపుత్రాపేక్ష, ఆదిలో గలిగినదియె గాని పుట్టినవారియందు గోచరించుచువచ్చినదోషములనుపట్టి యప్పటి కప్పుడు కలుగుచువచ్చినది కాదని స్పష్టము.

మరియు అంబికయందు నియోగవిధి ననుసరించిన వ్యాసమహార్షిని, సత్యవతీదేవి పుట్టబోవు పుత్రునిగూర్చి యడుగగా మాతృవైగుణ్యమువలన నాత డంధుడై పుట్టునని చెప్పినపుడు సత్యవతీదేవి —

"నాంధః కురూణాం నృపతి రనురూప స్తపోధన ।
జ్ఞాతివంశస్య గోప్తారం పితౄణాం వంశవర్ధనమ్ ॥
ద్వితీయం కురువంశస్య రాజానం-దాతు మర్హసి ।"

అనుచు అంధుడు కురురాజు కాదగడు కురువంశపురాజగు రెండవవాని ననుగ్రహింపు మని కోరినది. దాని కంగీకరించిన తరువాత వ్యాసమహర్షి అంబాలికయందు బుట్టువానినిగూర్చి —

"శశంస స పున ర్మాత్రే తస్య బాలస్య పాండుతామ్ ,"

సత్యవతీదేవితో నాబాలుడు పాండుత్వము కలిగియుండు నని చెప్పెను.

"తం మాతా పున రేవాన్య మేకం పుత్త్ర మయాచత ।"

మరియొక పుత్త్రు ననుగ్రహింపుమని తల్లి మరల గోరినది. అని యున్నది. ఆంధ్రభారతమునం దిట్లున్నది—

"కృష్ణద్వైపాయనుండును దానికిం బుత్త్రదానంబు సేసి యా యంబికయందు బలపరాక్రమవంతుండైన కొడుకు పుట్టె వాడు మాతృ దోషంబున నంధుం డగునని విని విషణ్ణచిత్తయయి సత్యవతి వెండియుం గృష్ణద్వైపాయనుం బ్రార్థించి యింక నంబాలికయందొక్క కొడుకుం బడయు మని నియోగించిన, నెప్పటియట్ల నమ్మునివరుండు నంబాలిక కడకుం జనిన నదియుం దనవేషంబునకు వెఱచి వెల్లనై యున్న నక్కో మలికిం బుత్త్రదానంబు సేసి యాయంబాలికయందు మహాబలపరా క్రమగుణవంతుండు, వంశకరుండు నగు పుత్త్రుండు పుట్టె, వాడును మాతృదోషంబున పాండుదేహుం డగు నని చెప్పి యరిగిన ......... అంత నాంబికేయు జాత్యంధుం జూచి దుఃఖితయయి సత్యవతి వెండియు బారాశర్యుం దలంచుడు నాక్షణంబ నమ్మునివరుండు వచ్చి పనియేమి యన్న నీయంబికకు ప్రథమపుత్త్రుం డంధుడయ్యె నింకొక్క కొడుకు రూపవంతుం బడయు మనిన"

ఇది చూడగా ధృతరాష్ట్రుం డంధుడగునని చెప్పినపుడు సత్యవతీ దేవి "నాంధః కురూణాం నృపతి రనురూపః" అనుచు నాతడు కురు రాజు కాదగడని పలికినట్లు మహాభారతమునందున్నది. ఆంధ్రభార తమునందు విషణ్ణచిత్తయైన ట్లున్నది.

ఇక పాండురాజు పాండుత్వముకలవాడగునని చెప్పినపుడు ఆతని గూర్చికూడ కురురాజు కాదగడని యన్నట్లుగాని, విషణ్ణచిత్తయైనట్లు గాని లేదు. అట్లు లేకయే అంబికకు పుత్త్రుడంధుడగుటచే నామెకు మరియొక పుత్త్రు నిమ్మని కోరిన ట్లున్నది. ధృతరాష్ట్రరాజ్యవాదు లన్నట్లు ఆపాండుత్వము కుష్ఠురోగమె యైనయెడల సత్యవతీదేవి పరిత

పింపకుండునా? ఆమె పరితపింపనికారణమున నది ప్రతివాదు లన్నట్లు కుష్ఠురోగ మెంతమాత్రము కాదు.

కనుక నే ఆంధ్రభారతములో "పాండు దేహుం డగు నని చెప్పె యరిగిన" యని యున్నదిగాని పాండురోగి యని లేదు. పాండు దేహ మనగా దేహకాంతివిశేష మగునేగాని రోగవిశేషము కాదు.

మఱియు సత్యవతీదేవి ద్వితీయపర్యాయము కోరినపుడు 'రాజానం దాతు మర్హసి' అని రాజు నిమ్మని కోరినది. తృతీయపర్యాయము కోరినపుడు "అంబికకు ప్రథమపుత్రుం డంధుం డయ్యె, నింక నొక్క కొడుకు రూపవంతుం బడయుము" అని కోరినది. అంతియ కాని ద్వితీయుడు పాండు డగుటనుబట్టి రాజ్యార్హుడు కాడుగనుక తృతీయు నిమ్మని కోరలేదు. ఈకారణముచేగూడ నాతని పాండుత్వము దేహకాంతివిశేషమె కాని రాజ్యప్రతిబంధకరోగవిశేషముకాదు. మఱియు—

"ఋషిం దృష్ట్వా చ సాపి తం। వివర్ణా పాండుసంకాశా సమపద్యత భారత"

"తాం భీతాం పాండుసంకాశాం విషణ్ణాం ప్రేక్ష్య భారత।
యస్మా త్పాండుత్వ మాపన్నా విరూపం ప్రేక్ష్య మా మిహ॥
తస్మా దేష సుత స్తే వై పాండు రేవ భవిష్యతి"

అని యున్నగ్రంథము, నా డంబాలిక మహర్షిని జూచి వివర్ణురాలై, పాండుసంకాశ యైనదనియు, నదిజూచి మహర్షి నీవు పాండుత్వమును వహించితివికనుక నీపుత్రుడు పాండువే యగునని పలికెననియు బోధించుచున్నది. ఆమె యాసమయమున బొందిన పాండుత్వము రోగము కాకుండుటచేతను, అప్పటి ఆమెస్థితియే పుత్రునియందు సంక్రమించుటచేతను పాండురాజునందున్న పాండుత్వము ప్రతివాదులన్న రోగము కాదు. దేహకాంతివిశేషమే.

"ఏక ముత్పాదయే త్పుత్రమ్" అను నియోగవిధిమాట యేమని యడుగుదురేమో వినుడు—

"దేవరాద్వా సపిండాద్వా స్త్రియా సమ్యఙ్నియుక్తయా ।
ప్రజేప్సితాఽధిగంతవ్యా సంతానస్య పరిక్షయే ॥" (మను. అ9)

వ్యాఖ్యా— సంతానాభావే స్త్రియా పత్యాదిగురునియుక్తయా దేవరా దన్యస్మాద్వా సపిండా ద్వక్ష్యమాణఘృతాక్తాదినియమవ త్పురుషగమనే నేష్టా ప్రజోత్పాదయితవ్యా । ఈప్సితే త్యభిధానా ద్గార్హ్యాక్షమపుత్రోత్పత్తౌ పునర్గమనార్థమ్ ॥

"విధవాయాం నియుక్తస్తు ఘృతాక్తో వాగ్యతో నిశి ।
ఏక ముత్పాదయే త్పుత్రం న ద్వితీయం కథంచన ॥"

వ్యాఖ్యా— విధవాయా మిత్యపత్యోత్పాదనయోగ్యపత్యభావపర మిదం । జీవత్యపి పత్యౌ అయోగ్యపత్యాదిగురునియుక్తో ఘృతాక్తసర్వగాత్రో మౌనీ రాత్రా వేకం పుత్రం జనయేత్ న కథంచి ద్ద్వితీయం ॥

"ద్వితీయ మేకే ప్రజనం మన్యన్తే స్త్రీషు తద్విదః ।
అనిర్వృతం నియోగార్థం పశ్యన్తో ధర్మత స్తయోః ॥

వ్యాఖ్యా— అన్యే పున రాచార్యా నియోగా త్పుత్రోత్పాదనవిధజ్ఞా 'అపుత్ర ఏకపుత్ర' ఇతి శిష్టప్రవాదా దనిష్పన్నం నియోగప్రయోజనం మన్యమానాః స్త్రీషు పుత్రోత్పాదనం ద్వితీయం ధర్మతో మన్యన్తే ।"

ఇచ్చట ప్రథమశ్లోకముచేత, సంతానాభావములో గురుజననియుక్తురాలగు స్త్రీ ఘృతవిలేపనాదినియమములు గల పురుషునివలన నిష్టమైన సంతతి నొందవచ్చుననియు, నిష్టమయిన సంతతి యనుటచే గార్హ్యసమర్థుడుకాని పుత్రుడు కలిగెనేని పునర్గమనమున కనుజ్ఞ యీయబడిన దనియు జెప్పబడినది. ద్వితీయశ్లోకముచేత, పుత్రోత్పాదనయోగ్యత గల పతి లేనట్టి స్త్రీయందు పతి జీవించియున్నను పత్యాదిగురుజననియుక్తుడగు పురుషుడు- ఘృతాక్తసర్వగాత్రుడు, మౌనియునయి యేకపుత్రునే కలిగింపవలెను. ద్వితీయుని గూడదు. అని చెప్ప

బడినది. తృతీయశ్లోకముచేత, ఈ యోగవిధితత్త్వజ్ఞులైన కొంద రా చార్యులు ఏకపుత్రు డపుత్రుడను శిష్టప్రవాదమును బట్టి యేకపుత్రునితో నియోగప్రయోజన మనిప్పన్న మని భావించి ద్వితీయపుత్రోత్పాదనముగూడ ధర్మముగా సమ్మతించిరి. అని చెప్పబడినది.

దీనివలన "ఏక ముత్పాదయే త్పుత్రమ్" అనిమాత్రమే గాక "ద్వితీయ మేకే ప్రజనం మన్యన్తే" అనికూడ నుండుటచే దోషము లేదు.

ఇంకొకటి. అంబికయందును, అంబాలికయందునుగూడ సంతానము గోరి సత్యవతీదేవి నియోగించినది. అంబాలికయందు సమర్థుడే జన్మించుటనుబట్టి యచ్చట పునర్నియోగము జరుగనేలేదు. అంబికయందుమాత్రమే ప్రథముడు కార్యాసమర్థు డగుటవలన "ప్రజేప్సితాధిగంతవ్యా" అను వచనప్రకారము పునర్నియోగము జరిగినది. కనుక వచనవిరోధము లేనందున వారి యాక్షేప మపాస్తమైనది.

—♦"పాండురాజరాజ్యవాదము దేవీభాగవతవిరుద్ధము"
అని యాక్షేపము—తన్నిరాకరణము♦—

దాయభాగవినిర్ణయములో నిట్లున్నది— "రాజ్యానర్హతను కలిగించు కుష్ఠరోగము వీనికి గలదు. కావున మరియొక పుత్రునకై ప్రయత్నించుట కలిగినది. ఈయంశమును దేవీభాగవతము రూఢిచేయుచున్నది. అందు—

"ఋతుకాలేఽథ సంప్రాప్తే వ్యాసేన సహ సంగతా।
తథా చాంబాలికా రాత్రౌ గర్భం నారీ దధార హ॥
సోఽపి పాండు స్సుతో జాతో రాజ్యయోగ్యో న సమ్మతః।
పుత్రార్థే ప్రేరయామాస వర్షా న్తే చ పున ర్వధూమ్॥
ఆహూయ చ తతో వ్యాసం"

"కావున ధృతరాష్ట్రుడు గ్రుడ్డివా డగుటచేత రాజ్యయోగ్యుడు

గాకుండిన పాండురాజు పాండురోగి యగుటచే రాజ్యయోగ్యుడు కాడాయె. అంగవికలత్వకారణమునుబట్టి యుభయులును నసర్హులే యగుచున్నారు" (పు 4)

మీరు చూపిన యీ దేవీభాగవతశ్లోకములు ప్రథమస్కంధాంతమం దున్నవి. ఇచ్చట ధృతరాష్ట్రపాండువిదురుల జన్మమాత్రమే చెప్పబడి ద్వితీయస్కంధషష్ఠాధ్యాయారంభమున రాజ్యాధికార మెవ్వని దయ్యెనో చెప్పబడినది. చూడుడు—

"రాజ్యే సంస్థాపితః పాండుః కనీయా నపి మంత్రిభిః ।
అంధత్వా ద్ధృతరాష్ట్రోఽసౌ నాధికారే నియోజితః ॥
భీష్మస్యానుమతే రాజ్యం ప్రాప్తః పాండు ర్మహాబలః ।
విదురోఽప్యథ మేధావీ మంత్రికార్యే నియోజితః ॥"

అంధు డగుటచే ధృతరాష్ట్రుడు రాజ్యాధికారి కాలేదనియు, మహాబలుడైన పాండురాజే కనిష్ఠుడైనను భీష్మానుమతిని రాజ్యాధికారి యయ్యెననియు నీశ్లోకములలో జెప్పబడినది

ధృతరాష్ట్రరాజ్యవాదుల కీదేవీభాగవతవచనవిరోధ మప్రతిహతము. "సోపి పాండుస్సుతో జాతో రాజ్యయోగ్యో నసమ్మతః" అను వచనవిరోధము పాండురాజరాజ్యవాదులకుమాత్రము లేదా? అని యడుగుదురేమో, లేదు. వినుడు—

"రాజ్యయోగ్యో న సమ్మతః" అనునప్పుడు రాజ్యయోగ్యుడు కాకపోయె నని యర్థముకాదు. అట్లైన 'రాజ్యయోగ్యో న చాభవత్' అని చెప్పబడియుండును అట్లు లేకుండుటచే రాజ్యయోగ్య శబ్దము రాజ్యయోగ్యతను, సమ్మతశబ్దము సమ్మతత్వమును బోధించును. ఇచ్చట సమ్మతత్వ మనగా సౌందర్యమని యర్థము.

కనుకనే మొదట సత్యవతీదేవి మహర్షిని కోరునపుడు—

"త మువాచ మునిం మాతా పుత్ర ముత్పాదయాధునా ।
క్షేత్రే విచిత్రవీర్యస్య సుందరం తవ వీర్యజమ్ ॥"

(దేవీభా స్క 1 అ 20)

సౌందర్యవంతునిగా పుత్రునిగోరియున్నది. ఆనాడు తల్లివహించిన వైవర్ణ్యమును బట్టి పాండురాజునందు వైవర్ణ్య మేర్పడినది. దానిచే పుత్రునియం దపేక్షితమైన రాజ్యయోగ్యత, సమ్మతత్వము అను ధర్మద్వయములో సమ్మతత్వమను ధర్మమునకు లోపమువచ్చినది. అందుచే 'న సమ్మతః' సమ్మతుడు కాకపోయెనని చెప్పబడినది. రాజ్యయోగ్యతకుగూడ లోపము వచ్చినటు లర్థము జెప్పుటకై నఞ్ శబ్దమును రాజ్యయోగ్యశబ్దముతోగూడ నన్వయించుట, "రాజ్యే సంస్థాపితః పాండుః కనీయా నపి మంత్రిభిః" అను వచనమునకు విరుద్ధము.

ప్రతివాదులు పాండురాజునందు రాజ్యయోగ్యతావిరుద్ధధర్మముగా పాండుత్వమును చెప్పుదురు. అది యయుక్తము. పై వచనములో "రాజ్యే సంస్థాపితః పాండుః కనీయా నపి" అని యెట్లు చెప్పబడెను? కాబట్టి యీపాండుత్వము రాజ్యయోగ్యతకు ప్రతిబంధకమయినది కాదని స్పష్టమైనది. అందుచేగూడ 'రాజ్యయోగ్యో న సమ్మతః' అన్నపుడు నఞ్ శబ్దమునకురాజ్యయోగ్యశబ్దముతో నన్వయమయుక్తము. కనుక శ్లోకాన్వయ మెట్లో వినుడు.

"సోఽపి పాండు స్సుతో జాతో రాజ్యయోగ్యో న సమ్మతః"

రాజ్యయోగ్యోఽపి స సుతః పాండు ర్జాతః, అతో న సమ్మతః అని. అనగా రాజ్యయోగ్యుడయ్యు నాతడు పాండువగుటవలన సమ్మతుడు (సౌందర్యవంతుడు) కాకపోయెను. అని యర్థము. ఇట్లర్థము కనుకనే దేవీభాగవతములో పూర్వోత్తరవిరోధము లేదని తెలిసికొనవలయును.

షష్ఠస్కంధములోగూడ "రాజ్యం ప్రాప తతః పాండు ర్బలవాన్ భీష్మసంమతః" "పాండు ర్నిర్వేద మాపన్నః స్త్యక్త్వా రాజ్యం వనం గతః" (అ 25) ఇత్యాదివచనములు రాజ్యము పాండురాజుదేయని ప్రతిపాదించుచున్నవి.

ఫలితార్థ మేమనగా ధృతరాష్ట్రరాజ్యవాదము దేవీభాగవత విరుద్ధము. పాండురాజ్యవాదమే దేవీభాగవతప్రోక్తము. కనుక నీ యాక్షేప మపాస్తము.

—♦పాండురాజే రాజైనయెడల దాదెచ్చిన ధనమును ధృతరాష్ట్రాభ్యనుజ్ఞకు లోబరుపనేల? అనియాక్షేపము-తన్నిరాకరణము♦—

దాయభాగవినిర్ణయములో నిట్లున్నది— 'ధృతరాష్ట్రుడు రాజును, పాండురాజాతనిపక్షమున బనిచేయు ప్రతినిధియును కావునసే పాండురాజు దిగ్విజయము జేసి తెచ్చిన ద్రవ్యము ధృతరాష్ట్రు నిష్టానుసారముగా జేయబడిన ట్లీక్రిందిరీతిని మూలములో జెప్పబడియున్నది—

"ధృతరాష్ట్రాభ్యనుజ్ఞాత స్స్వ బాహువిజితం ధనమ్।
భీష్మాయ సత్యవత్యై చ మాత్రే చోపజహార సః ॥
విదురాయ చ వై పాండుః ప్రేషయామాస తద్ధనమ్ ।"

పాండురాజే రాజునయెడల దాదెచ్చిన ధనమును ధృతరాష్ట్రాభ్యనుజ్ఞకు లోబరుపనేల? పెద్దవాడను కారణమున నందురేని భీష్మాదు లంతకంటెను బెద్దవారు. విశేషించి పెంచి పెద్దవారిని చేసినవారు. ఇక ధృతరాష్ట్రు నాజ్ఞ యెందుకు? అతడే రాజు కావున ననవలెను" (పు. 7)

ఐతే ఒకడు దిగ్విజయముచేసి తెచ్చినద్రవ్యము ఎవ్వని యిష్టానుసారము చేయబడునో అతడు రాజు కావలయునా! ఆ తెచ్చినవాడు గుణవంతుడైనపుడు తనకెవ్వనియందు భక్తిశ్రద్ధలుండునో ఎవ్వడుచెప్పకపోయె నని పరితపించునో అట్టివానితో జెప్పి వానియాజ్ఞానుసారము చేయుచుండును.

రాజు కావలసిన జ్యేష్ఠుడగు ధృతరాష్ట్రుడు అంధత్వమువలన రాజ్యాధికారి కాకుండుటనుబట్టి రాజైనపాండుభూపతి యాతనికి మనో

వ్యథకలుగకుండుటకై సర్వమాతనితో చెప్పి యాతని యాజ్ఞానుసారము వ్యవహరించువాడు. భీష్మాదులు-రాజ్యకాంక్ష లేనివారును, ధృతరాష్ట్రాజ్ఞానువర్తియై పాండురాజు వ్యవహరింపవలెనని కోరువారు నగుటచే తదనుగుణముగనే వ్యవహరించిన ట్లాశ్లోకములో జెప్పబడినది. కనుక ధృతరాష్ట్ర రాజ్యవాదమున కీశ్లోకములు సాధకములు కానేరవు.

ఈ ధృతరాష్ట్రాజ్ఞానువర్తనవిషయము ఆశ్రమవాసపర్వములో గూడ జెప్పబడినది. అచ్చట, వనవాసము జేయ సంకల్పించిన ధృతరాష్ట్రుని గూర్చి యాతనిసంకల్పము నెరవేర్పుమని యుధిష్ఠిరునితో జెప్పునపుడు వ్యాసభగవాను డిట్లు చెప్పెను—

"పితా తు తవ రాజేన్ద్ర పాండునా పృథివీక్షితా ।
శిష్యవృత్తేన రాజాయం గురువత్పర్యుపాసితః ॥
క్రతుభి ర్దక్షిణావద్భి రత్నపర్వతశోభితైః ।
మహద్భి రిష్టం గౌ ర్భుక్తా ప్రజాశ్చ పరిపాలితాః ॥
పుత్రసంస్థం చ విపులం రాజ్యం విప్రోషితే త్వయి ।
త్రయోదశ సమా భుక్తం దత్తం చ వివిధం వసు ॥
అనుజానీహి పితరం సమయోఽస్య తపోవిధౌ ।
న మన్యు ర్విద్యతే చాస్య సుసూక్ష్మోఽపి యుధిష్ఠిర ॥ (ఆశ్ర-అ5)

పృథివీపతియైన నీతండ్రి పాండురాజు ఈ ధృతరాష్ట్రుని, శిష్యుడు గురువునుపాసించినటు లుపాసించెను. ఈతడు క్రతువులుచేసినాడు. భూమిననుభవించినాడు. ప్రజలను పరిపాలించినాడు. నీవువనవాసాదులుచేయునపుడు పుత్రాధీనమైన యావద్రాజ్యము నీతడు 13 సంవత్సరములు అనుభవించినాడు. ఈతనికిప్పుడు తపస్సుచేసికొనదగిన కాలమే, యుధిష్ఠిరా! ఈతనికి వనవాససంకల్పము కోపమూలకమైనది గాదు. నీవంగీకరింపుము. అని

ధృతరాష్ట్రరాజ్యవాదములో 'పాండుస్సేనాపతిస్తస్య...' అని సేనాపతియైన పాండురాజు రాజ్యాధిపతి యనుజ్ఞ నొంది యేమి చేసెనుట

సహజముకనుక పాండురాజేతనిని గురువును శిష్యుడుపాసించినటు లుపాసించెనని చెప్పుటలో ప్రస్తుతోపయుక్తముగా నేమి విశేషము చెప్పినట్లు!

పాండురాజే రాజ్యాధిపతియైయుండియు, జ్యేష్ఠసోదరునియందు భక్తిశ్రద్ధలుకలిగి యాతని యనుజ్ఞదీసికొనియే పనిజేయువాడని చెప్పుటలో ధృతరాష్ట్రుని సుఖజీవనము, పాండురాజు గుణాఢ్యత్వము అను ప్రస్తుతోపయుక్తవిశేషము చెప్పబడినట్లగును. కనుక ధృతరాష్ట్రాభ్యనుజ్ఞాతుడై వ్యవహరించెనను విషయముకూడ పాండురాజే రాజనుటకు బలకరము. పూర్వోక్తవ్యాసవాక్యములలోని "గార్భక్తా ప్రజాశ్చ పరిపాలితాః" ధృతరాష్ట్రుడు భూమి ననుభవించుట, ప్రజలను పాలించుట అను విషయము పాండురాజు అరణ్యమునకు వెళ్ళినపుడు రాజ్యమును ధృతరాష్ట్రునకును, విదురునకును నొప్పగించి వెళ్ళియుండుటచే నప్పటినుండి జరిగిన వృత్తాంతమన్నమాట.

ఈసంగతి శ్రీకృష్ణరాయబారపుసందర్భమున కురుసభలో దుర్యోధనునకు జెప్పబడిన ద్రోణవచనముగా నుద్యోగపర్వములో నిట్లు చెప్పబడినది—

"ప్రాతీప శ్శంతను స్తాత కులస్యార్థే యథాస్థితః ।
యథా దేవవ్రతో భీష్మః కులస్యార్థే స్థితోఽభవత్ ॥
తథా పాండు ర్నరపతి స్సత్యసంధో జితేన్ద్రియః ।
రాజా కురూణాం ధర్మాత్మా సువ్రత స్సుసమాహితః ॥
జ్యేష్ఠాయ రాజ్య మదద ద్ధృతరాష్ట్రాయ ధీమతే ।
యవీయసే తథా క్షత్త్రే కురూణాం వంశవర్ధనః ॥"

నీలకంఠీయమ్— జ్యేష్ఠాఽన్ధత్వా దనర్హః । క్షత్తా పితా నిజత్వా దనర్హ ఇతి సూచయన్ యథాజ్యేష్ఠా యాదద త్తథా క్షత్త్రే విదురాయాపి న్యాసభూత మదద దితి భావః ॥

"తతః సింహాసనే రాజన్ స్థాపయిత్వైన మచ్యుతమ్ ।
వనం జగామ కౌరవ్యో భార్యాభ్యాం సహితో నృప ॥

నీచై స్థిత్వా తు విదుర ఉపాస్తే స్మ వినీతవత్ ।
ప్రేష్యవ త్పురుషవ్యాఘ్రో వాలవ్యజన ముత్క్షిపన్ ॥
తత స్సర్వాః ప్రజా స్తాత ధృతరాష్ట్రం జనేశ్వరమ్ ।
అన్వపద్యంత విధివ ద్యథా పాండుం జనాధిపమ్ ॥
విసృజ్య ధృతరాష్ట్రాయ రాజ్యం స విదురాయ చ ।
చచార పృథివీం పాండు స్సర్వాం పరపురంజయః ॥" (ఉ-అ148)

దుర్యోధనా! కురువంశములో శంతనమహారాజువలెను, భీష్ముని వలెను పాండుభూపతి వర్తించెను. కురురాజును, ధర్మాత్ముడు నగు పాండుభూపతి ధృతరాష్ట్రునకును, విదురునకును రాజ్యము న్యాసభూతముగా నొప్పగించి ధృతరాష్ట్రుని సింహాసనాసీనుని జేసి భార్యలతో వనమునకు వెళ్ళెను. విదురుడు చామరహస్తుడై ధృతరాష్ట్రుని సేవించుచు వచ్చెను. తరువాత ప్రజలందరు పాండుభూపతి ననువర్తించినట్లే ధృతరాష్ట్రు ననువర్తించిరి. ధృతరాష్ట్రవిదురులకు రాజ్యము విడిచి పాండుభూపతి పృథివియందంతటను సంచరించెను. అని.

దీనిచే భార్యాసహితుడై పాండురాజు అరణ్యమునకు వెళ్ళినది మొదలు ధృతరాష్ట్రుడు రాజ్యపరిపాలనము చేసినట్లు స్పష్టమగునది. ఈవిధముగా రాష్ట్రధారణముచేసినవాడు కనుక పాండురాజరాజ్యవాదములోగూడ నాతని కాధృతరాష్ట్రనామము ప్రతివాదు లనినట్లు అన్వర్థనామమైనది. అందుచేత ప్రతివాదుల వ్రాతలో—

"బుద్ధివిభవముకలవాడగుటచే విదురుడనియు, పాండుత్వముకలవాడగుటచే పాండువనియు, నన్వర్థనామము లైనట్లు ధృతరాష్ట్రనామ మన్వర్థనామము కావలెను కనుక ధృతరాష్ట్రుడే రాజు కాని పాండువు రాజు కాడు"

అనుమాట నిరస్తమైనది. ధృతరాష్ట్రరాజ్యవాదులకు పూర్వోక్తద్రోణవచనములు ప్రతికూలములు. చూడుడు—

వారి స్వీయపుస్తకారము సేనాధిపతియగు పాండురాజు రాజ్యాధిపతియగు ధృతరాష్ట్రునకు రాజ్య మిచ్చి వెళ్ళెనను టెట్లు? ఆయిచ్చుటలో ధృతరాష్ట్రునకిచ్చినట్లే విదురున కిచ్చెనను టెట్లు? ఆదినుండియు రాజ్యాధిపతియై సింహాసనస్థుడై యున్న ధృతరాష్ట్రుని, వనమున కేగునపుడు పాండురాజు సింహాసనస్థుని జేసి వెళ్ళెనను టెట్లు? పాండురాజు ననువర్తించినట్లే తరువాత ప్రజలందరును ధృతరాష్ట్రు ననువర్తించిరని చెప్పు టెట్లు? రాజ్యము ధృతరాష్ట్రునిదై యుండ విదురధృతరాష్ట్రులకు రాజ్యము విడిచి పాండురాజు భూభ్రమణము చేసెనను టెట్లు?

ఇవన్నియును పాండురాజు రాజ్యవాదములోనే సంగతములగును. కనుక రాజ్యము పాండుభూపతిదే పాండుభూపతి యరణ్యమునకు వెళ్ళినదిమొదలు రాజ్యము ధృతరాష్ట్రుని చేతికి వచ్చినదిగాని యాదినుండియు లేదు. అందుచేతనే ఆంధ్రభారతములోని దుర్యోధన వాక్యములలో "పైతృకం బగు లక్ష్మి పాండుభూపతి మున్నుదాల్చుట జేసి" అనియు, "ఈరాజ్యంబు మొదలింటం గోలె భవదీయంబయినం...గ్రమాగతం బయి మాకు నప్రయత్నలభ్యం బగు. తొల్లి పాండురాజు రాజై ..." అనియు జెప్పబడినది.

మరియు ధృతరాష్ట్రుడు వనవాసమునకు వెళ్ళునపుడు తన కనుజ్ఞ నిమ్మని కోరుచు బ్రజలతో నిట్లనెను—

"శంతనుః పాలయామాస యథావ ద్వసుధా మిమామ్ ।
తథా విచిత్రవీర్యశ్చ భీష్మేణ పరిపాలితః ॥
పాలయామాస స స్తాతో విదితార్థో న సంశయః ।
యథా చ పాండు ర్భ్రాతా మే దయితో భవతా మభూత్ ॥
స చాపి పాలయామాస యథావ త్తచ్చ వేత్థ హ ।
మయా చ భవతాం సమ్యక్ శుశ్రూషాయా కృతానఘాః ॥
అసమ్యగ్వా మహాభాగా స్తత్ క్షన్తవ్య మతన్ద్రితైః ।
తన్మయా సాధువాసీదం యది వాఽసాధు వై కృతమ్ ॥

తదోఽ హ్యాది న క ర్తవ్యం మయా బద్ధోఽయ మంజలిః ।
వృద్ధోఽయం హతపుత్రోఽయం దుఃఖితోఽయం నరాధిపః ॥
పూర్వరాజ్ఞాం చ పుత్రోఽయ మితి కృత్వాఽనుజానథ ।"

(ఆశ్రమ. అ9)

శంతనమహారాజు ఈభూమినంతను యథోక్తముగా నెట్లు పరిపాలించెనో, నాతండ్రియగు విచిత్రవీర్యుడు భీష్మరక్షితుడై యథోక్తముగా నెట్లు పరిపాలించెనో, నాసోదరుడగు పాండుభూపతి మీాక్షిష్టుడై యథోక్తముగా నెట్లు పరిపాలించెనో అది యంతయు మీాకు దెలిసిన విషయమే. పూజ్యులారా' మీాకు నేను చేసిన శుశ్రూష యుక్తమో అయుక్తమో క్షమింపుడు. నామంచిచెడ్డలను మీారేమియు దలచుకొనకుండ గోరెదను. ఇదిగో దోసిలి యొగ్గితిని. ఈతడు వృద్ధుడు; హతపుత్రుడు; దుఃఖితుడు; పూర్వరాజుల పుత్రుడు; అని భావించి మీారు నాకు వనవాసమున కనుజ్ఞ నీయవలయును అని.

ఈస్థలమందే ఆంధ్రభారతములో ధృతరాష్ట్రవాక్యము—

సీ. ప్రజ ముద మొందంగ బాలించె బుడమి శం
తను డనంతరము శాంతనవుచేత
రక్షితు డగుచు మీారలు బ్రీతి బొదల వి
చిత్రవీర్యుండు నిద్ధాత్రి యేలె
బదపడి పాండునృపాలుండు మీారు హ
ర్షింపగ భూమి రక్షించె బిదప
ధర్మనందనునిచందము మీా రెఱింగిన
యది సత్యధర్మాత్ముడైన యితని.

తే. ననుసరింపక యన్యాయ మాచరించి
దుర్నయంబున నిల యేలి తుంచె గులము,
నుర్విగల భూపతులను దుర్యోధనుండు
వాని దుశ్చేష్టలకు మూాల మేన కాదె.

వ. అని మిూనుగంబులం బెట్టక.

క. మహి నెప్పగ రక్షించిన
మహితగుణుల యన్న కొడుకు మనుమండని నా
కు హితంబు గోరి కరుణా
సహితులరై యిండనుజ్ఞ సద్వ్రతమునకున్. (ఆశ్రమ-౧)

వెనుకజూపబడిన ఆంధ్రభారతషష్ఠాశ్వాసములోని ధృతరాష్ట్ర దుర్యోధనుల పరస్పరసంభాషణములోవలెనే యున్న ఈ ధృతరాష్ట్రోక్తులు పాండురాజే రాజను సిద్ధాంతమును బలపరచుచున్నవి. కనుక వారియాక్షేప మపాస్తము.

—♦ 'ధృతరాష్ట్రుడు రాజుకానియెడల నశ్వమేధముల నెట్లుచేసెను?' అని యాక్షేపము—తన్నిరాకరణము ♦—

దాయభాగవినిర్ణయములో నిట్లున్నది—"ధృతరాష్ట్రుడు అశ్వమేధాది మహామఖములు చేసినట్లుకూడ చెప్పబడినది—

"తస్య వీరస్య విక్రాన్తైః సహస్రశతదక్షిణైః ।
అశ్వమేధశతైరీజే ధృతరాష్ట్రో మహామఖైః ॥"

అశ్వమేధముచేయువాడు రాజు కావలెనుగదా, కావున నిచట ధృతరాష్ట్రు డశ్వమేధముల నొనర్చినట్లు చెప్పబడుటచేత నాతడే రాజైనట్లు స్పష్టమగుచున్నది" (పు7)

ధృతరాష్ట్రుడు రాజుకాడను విషయనుమాత్రమే ప్రతివాదుల కసమ్మతముగాని యాతడు జాత్యంధుడను విషయముగూడ వారి కసమ్మతముగాదు.

రాజుకానివాని కశ్వమేధాధికారము లేదని ప్రతివాదు లనునట్లు అంధునకు శ్రౌతయజ్ఞములయం దధికారము లేదని కూడనుండుటచే ధృతరాష్ట్రుని ప్రతివాదులు రాజునుజేసినను అంధుడగుటచే ధృతరాష్ట్రున కశ్వమేధాధికారసిద్ధి లేదు. కనుకనే ఉదాహృతశ్లోకవ్యా

ఖ్యాన మిట్లున్నది— నీలకంఠీయము—(ఆది—అ114-శ్లో5).

"అశ్వమేధశతైః తత్తుల్యైః మహామఖైః పంచమహాయజ్ఞైః ।
గర్భాంధస్య శ్రౌతయజ్ఞే ష్వనధికారాత్ ॥"

ఈనీలకంఠీయములోని విషయము పూర్వమీమాంసాశాస్త్రోక్తము. చూడుడు—"ఫలార్థత్వాత్కర్మణ శ్శాస్త్రం సర్వాధికారం స్యాత్.

"కర్తుర్వా శ్రుతిసంయోగాద్విధిః కార్త్స్న్యేన గమ్యతే, శాస్త్ర దీపికా—న హి స్వాతన్త్ర్యేణాఙ్గవాక్యాని పురుషైః సంబధ్యన్తే ప్రధానవాక్యశేషత్వాత్తేషాం, తద్యుక్తేనతు ప్రధానవాక్యేన తదఙ్గయుక్తః క్రతుః పురుషైః సంయుజ్యమానోఽసమర్థానప హాయ సమర్థాన్ ప్రతివిజ్ఞాయతే. అతోఽన్ధస్య క్రతురేవావిహితః న త్వాజ్యావేక్షణమేవావిహిత మితరచ్చ విహిత మితి మన్తవ్యమ్"

శాస్త్ర మిట్లుండుటచే ధృతరాష్ట్రుడే రాజను ప్రతివాదిపక్షములో గూడ నంధుడగుటచే నాధృతరాష్ట్రున కశ్వమేధాధికారము లేనందున నాతనిచే జేయబడినట్లు చెప్పబడిన యశ్వమేధములు-అశ్వమేధతుల్యములగు పంచమహాయజ్ఞము లని నీలకంఠీయములో నున్నట్లు లాక్షణికార్థమునే చెప్పితీరవలెను. ఆ పంచమహాయజ్ఞములు రాజుకాకుండియు జేయదగినవే. కనుక నిది పాండురాజ రాజ్యవాదమునకు బాధకము కానందున నీయాక్షేప మపాస్తము.

—: "రాజవత్తువుగా పాండువున కుత్తరక్రియలు చేయవలె నని యేల జెప్పబడినది?" అని యాక్షేపము-తన్నిరాకరణము :—

దాయభాగవినిర్ణయములో నిట్లున్నది— "పాండువున కుత్తర క్రియలు చేయు సందర్భములో ధృతరాష్ట్రుడు విదురునితో నిట్లు చెప్పియున్నాడు——

"పాణ్డో ర్విదుర సర్వాణి ప్రేతకార్యాణి కారయ ।
రాజవ ద్రాజసింహస్య మాద్ర్యాశ్చైవ విశేషతః ॥"

ఇందు రాజవత్తుగా బాండువునకు ప్రేతకార్యములు చేయవలయు నని తెలుపబడియున్నది. 'ఇవార్హే వతి' యని యుండుటచే పాండువు రాజసదృశుడుగాని రాజు కాడని తెలియవచ్చుచున్నది" (పు 9)

శ్లోకములో 'రాజవత్' అని యుండుటచే పాండువు రాజు కాడని తెలియవచ్చినట్లు ఆపైనున్న 'రాజసింహాస్య' అను పదముచే నాతడు రాజేగాడు రాజసింహుడని తెలియవచ్చుటలేదా? ఐతే 'రాజవత్' అని యేల చెప్పబడెను? అని యడుగుదురా? వినుడు—

పత్నీసమేతుడై శతశృంగపర్వతమునొద్ద నివసించు పాండుభూపతి, పుత్రులుకలిగిన కొంతకాలమునకు స్వర్గస్థుడు కాగా మాద్రి భర్తతో సహగమనము చేసినది. అప్పు డచ్చటి మహర్షులు ఇట్లాలోచించిరి—

"హిత్వా రాజ్యం చ రాష్ట్రం చ స మహాత్మా మహాయశాః।
అస్మిన్ స్థానే తప స్తప్త్వా తాపసాన్ శరణం గతః ॥
స జాతమాత్రాన్ పుత్రాంశ్చ దారాంశ్చ భవతా మిహ ।
ప్రాదాయోపనిధిం రాజా పాండు స్స్వర్గ మితో గతః।
తస్యేమా నాత్మజాన్ దేహం భార్యాంచ సుమహాత్మనః ॥
స్వరాష్ట్రం గృహ్య గచ్ఛామో ధర్మ ఏష హి న స్స్మృతః।

నీలకంఠీయమ్— దేహం దేహాయో రస్థీని, అగ్నిహోత్రాగ్నిభి స్సంస్కారలంభనార్థమ్"

పాండుభూపతి రాజ్యమును విడిచి తనరాష్ట్రము నతిక్రమించి వచ్చి యిచ్చట తపస్సుచేసి తాపసులనే శరణము జేసికొని తన పుత్రులను భార్యను మన రక్షణములో నుంచి స్వర్గస్థు డయ్యెను. ఆ మహనీయునియొక్కయు, మాద్రియొక్కయు దేహసంబంధములైన అస్థులను శ్రౌతాగ్నిసంస్కారార్థము తీసికొని యీపాండుపుత్రులను, కుంతీ

దేవిని వెంటబెట్టుకొని హస్తినాపురమునకు వెళ్ళవలసియున్నది. ఇది మన ధర్మము. అని. తరువాత వారిని దీసికొనివచ్చి భీష్మాదులతో పాండవుల జన్మవృత్తాంతమును జెప్పి యిట్లుపదేశించిరి—

"వర్తమాన స్సుతాం వృత్తే పుత్రలాభ మవాప్య చ ।
పితృలోకం గతః పాండు రిత స్సప్తదశేఽహాని ॥
తం చితాగత మాజ్ఞాయ వైశ్వానరముఖే హుతమ్ ।
ప్రవిష్టా పావకం మాద్రీ హిత్వా జీవిత మాత్మనః ॥
సా గతా సహ తేనైవ పతిలోక మనువ్రతా ।
తస్యా స్తస్య చ యత్కార్యం క్రియతాం తదనంతరమ్ ॥
ఇమే తయో శ్శరీరే ద్వే పుత్రా శ్చేమే తయో ర్వరాః ।"

సన్మార్గవర్తియైన పాండుభూపతి పుత్రలాభము గలిగినతరువాత స్వర్గస్థు డయ్యెను మాద్రి సహగమనము చేసినది. ఇప్పటికి పదునేడు రోజు లయినవి. ఇవి వారల శరీరములు (అస్థులు). వారల కనంతర కార్యములు గావింపవలసినది. అని చెప్పి యంతర్హితులైరి. అప్పుడు విదురునితో ధృతరాష్ట్రుడు—

"పాండో ర్విదుర సర్వాణి ప్రేతకార్యాణి కారయ ।
రాజవ ద్రాజసింహస్య మాద్ర్యాశ్చైవ విశేషతః ॥"

అని చెప్పెను. అప్పుడు జరుగబోవు సంస్కారము అస్థులకే యయియుండుటచే, అసలు పాండురాజ శరీరమునకు జరగవలసిన విధానముతోడనే యీ యస్థులకుగూడ జరిపింపవలసిన దను తాత్పర్యముతో 'రాజవద్రాజసింహస్య' అని చెప్పబడెను.

కనుకనే ఆయస్థులను శిబికయం దుంచుట, పుష్పములతో శిబిక నలంకరించుట, శ్వేతచ్ఛత్రచామరాదిరాజలక్షణములతో శిబికను దీసికొనివెళ్ళుట జరిగినట్లు చెప్పబడినది. ఆశ్లోకము లివిగో—

"అథైనా మార్తవైః పుష్పై ర్గంధై శ్చ వివిధై ర్వరైః ।
శిబికాం తా మలంకృత్య వాససాచ్ఛాద్య సర్వశః ॥

తాం తథా శోభితాం మాల్యై ర్వాసోభిశ్చ మహాధనైః ।
అమాత్యా జ్ఞాతయ శ్చైనం సుహృద శ్చోపతస్థిరే ॥
నృసింహం నరయుక్తేన పరమాలంకృతేన తమ్ ।
అవహన్ యానముఖ్యేన సహ మాంద్యా సుసంవృతమ్ ॥
పాండురేణాఽఽతపత్రేణ చామరవ్యజనేన చ ।
సర్వవాదిత్రనాదైశ్చ సమలంచకిరే తతః ॥"

దీనినిబట్టి వారి యాక్షేప మపాస్తమైనది. ఇంతవరకు ధృతరాష్ట్రరాజ్యవాదులు పాండురాజరాజ్యవాదముపై జూపిన యాక్షేపములలో ముఖ్యమైనవానిని పరిహరించి, పాండురాజుదే రాజ్య మని ప్రమాణములతో నిరూపించియున్నాము. ఇక ప్రతివాదులు తమ ధృతరాష్ట్రరాజ్యవాదముపై గల బాధకములను శంకించి పరిహరించియున్నందున దానిని బరీక్షింపవలసియున్నది.

—: "ధర్మజుని యువరాజుజేయుట ధృతరాష్ట్రరాజ్యవాదమునకు బాధకరము గా" దను ప్రసంగము—తన్నిరాకరణము :—

దాయభాగవినిర్ణయములోనిట్లున్నది— 1. "ఇక ధృతరాష్ట్రుడు రాజగుటకుగల యభ్యంతరముల విచారింతము—పాండువు రాజుగాక ధృతరాష్ట్రుడే రాజైనయెడల ధృతరాష్ట్రపుత్రుడగు దుర్యోధనుని యువరాజుగాజేయక పాండుపుత్రుడగు ధర్మజుని యువరాజుగా జేయుటకు గారణమేమి? అని యడుగుచున్నారు. ఇందులకు దగుసమాధానము భారతమందే తెలుపబడియున్నది. భారతమునందు ధర్మజుని యువరాజుగాజేయుటకు గలకారణము ధృతరాష్ట్రునకు పాండవులందు గల స్థిరసౌహార్దమని తెలుపబడియున్నది గాని పాండవులదాయాద్యము కారణమని తెలుపబడి యుండలేదు. ఆవాక్యముల నీక్రింద నిచ్చుచున్నాడను —

"తత స్సంవత్సరస్యాన్తే యౌవరాజ్యాయ పార్థివ।
స్థాపితో ధృతరాష్ట్రేణ పాండుపుత్రో యుధిష్ఠిరః ॥
ధృతి స్థైర్య సహిష్ణుత్వా దానృశంస్యా త్తథార్జవాత్ ।
భృత్యానా మనుకంపార్థం తథైవ స్థిరసౌహృదాత్ ॥"

ధర్మజుని గుణసంపద లోకులహృదయముల వశపరచుకొనినది. లోకు లెల్లరు నాతని యుత్తమగుణములనుబట్టి రాజుకావలె నని కోరుకొను స్థితికి వచ్చియుండిరి. అట్టి లోకుల యనుకంపార్థమును, తనకు వారియందు గల స్థిరసౌహార్దమును బట్టియును ధర్మజుని యువరాజు జేసినాడు. అని మూలము తెలుపుచున్నది. (పు 13)

2. దాయాద్యమునుబట్టియే యౌవరాజ్య మిచ్చినయెడల భారత మట్లే తెలిపియుండును. అట్లు తెలుపలేదు. కాన దాయాద్యము కారణమని తెలుపుట నిర్మూలము. (పు 14)

3. ధర్మజుని యువరాజుగా జేసినపుడు దుర్యోధను డేల యంగీకరించి యూరకుండె నని ప్రశ్న వేసిరి. వీరి ప్రశ్న కుద్యోగపర్వములో దుర్యోధనునిచేతనే సమాధాన మీయబడియున్నది—

"అప్రదేయం పురా దత్తం రాజ్యం పరవతో మమ।
అజ్ఞానాద్వా భయాద్వాపి మయి బాలే జనార్దన ।
న తదద్య పునర్లభ్యం పాండవై ర్వృష్ణినందన ॥

నేను బాలుడనగుటచేత నజ్ఞానమునను పరాధీనుడనగుటచేత భయమునను నప్రదేయమైన రాజ్యము నిచ్చి నప్పుడూరకుంటిని. అది యిప్పుడు మరల నీబడదు. అని దుర్యోధనుడు చెప్పియేయున్నాడు. అప్పటికి దుర్యోధనుడు బాలుడేయై యున్నాడుకదా,

(పు 14)

4. తనకు ప్రతినిధిగా నుండి పాండురాజు జయించిన రాజ్యమును ధృతరాష్ట్రుడు పాండురాజునకిచ్చివేసెను. అయ్యది సగపాలు

కలదు. అందుమూలముచే పాండవులు మాతండ్రిపాలు మాకీయ వలయునని కోరుటకు జోటుకలిగినది. కనుక ధర్మజుని యువరాజును జేసినాడన రాజ్యమున కంతికును జేసినాడని భ్రమపడవలదు. తన తండ్రి పాలగు నర్ధభాగమునకు యాత్రమే చేసినాడని గ్రహించు కొనవలెను. (పు-17)

ఈనాలుగంశములను పరీక్షింతము. మొదటియంశములో ధర్మజుని యువరాజుగా జేయుటకు గారణము, ధృతరాష్ట్రునకు పాండవుల యందున్న స్థిరసౌహార్దమే కాని పాండవుల దాయాద్యము కాదని వ్రాసి దానికి శ్లోకముల నుదాహరించినారు.

అందు ద్వితీయశ్లోకములో "ధృతిస్థైర్యసహిష్ణుత్వాత్, అనృశంస్యాత్, తథార్జవాత్, తథైవ స్థిరసౌహృదాత్" అని హేతుచతుష్టయ ముల్లేఖింపబడినది. ప్రథమశ్లోకములోని "ధృతరాష్ట్రేణ యుధిష్ఠిరః యౌవరాజ్యాయ స్థాపితః" అను వాక్యార్థములో నీనాల్గు హేతువుల కన్వయము చెప్పవలయును. ఆవాక్యార్థములో ధృతరాష్ట్రుడును యుధిష్ఠిరుడునుగూడ బేర్కొనబడియున్నారు. ఆనాల్గు హేతువులలో నొక్క స్థిరసౌహార్దమను హేతువును ధృతరాష్ట్రునియందు ప్రతివాదు లన్వయించినారు. మిగిలినవానికి యుధిష్ఠిరునియందే యన్వయ మని వారి తాత్పర్యము. కాని శ్లోకరీతి నాలోచింపగా 'తథార్జవాత్ తథైవ స్థిరసౌహృదాత్' అను తథాశబ్దప్రయోగమునుబట్టి మొదటి మూడు హేతువులకు నెవ్వని యందన్వయమో వానియందే నాలుగవ స్థిరసౌహార్దహేతువునకుగూడ నన్వయము చెప్పితీరవలయును. కనుక ధృతరాష్ట్రునియందు ప్రతివాదులు స్థిరసౌహార్దము నన్వయించుట అయుక్తము అందుచే ధర్మజుని యువరాజుగా చేయుటకు ధృతరాష్ట్రుని స్థిరసౌహార్దమే కారణ మనుమాట గ్రంథవిరుద్ధము. ఇచ్చట ఆంధ్రభారతముగూడ జూడుడు—

"ధృతరాష్ట్రుండు యుధిష్ఠిరు రాజ్యభారధురంధరుఁగా నెఱింగి భీష్మవిదురులతో విచారించి యౌవరాజ్యాభిషిక్తుం జేసెను"

దీనినిబట్టి ధర్మరాజుడు రాజ్యభారధురంధరు డగుటనుబట్టియే యౌవరాజ్యాభిషిక్తుఁడగుటగాని, ధృతరాష్ట్రుని స్థిరసౌహార్దమునుబట్టి కాదని తేలినది. ధర్మజుని యీరాజ్యభారధురంధరత్వమే శ్లోకోక్త హేతుచతుష్టయముచే విశదీకరింపబడినది.

ఎట్లనగా ధృతి (ప్రజాధారణము) స్థైర్య (అచాపలము) సహిష్ణుత్వ (తితిక్ష) ఆనృశంస్య (అనైష్ఠుర్యము) ఆర్జవ (అవక్రత) స్థిరసౌహృదము లను గుణములనుబట్టి రాజ్యభారధురంధరుడై యున్న యుధిష్ఠిరుడు యౌవరాజ్యాభిషిక్తుఁడు చేయబడెను. అని.

ఇంకొకటి'భృత్యానామనుకంపార్థంయుధిష్ఠిరఃయౌవరాజ్యాయ స్థాపితః' అనుటలో లోకుల యనుకంపార్థము అనగా ప్రీతికొరకు ధృతరాష్ట్రుడు యౌవరాజ్య మిచ్చినట్లున్నది. దీనివలన యుధిష్ఠిరుని యువరాజు జేయుట, ప్రజల కది యిష్టమగుటనుబట్టి జరిగిన దని స్పష్టము. అది యుధిష్ఠిరునకు దాయాద్యము గనుకనే ప్రజల కతని యౌవరాజ్య మిష్టమయినది. లేకున్న యెంత గుణవంతుడైనను అనధికారికి యౌవరాజ్యమును ప్రజలెట్లు కోరుదురు? ఎంత సౌహార్ద మున్నను ధృతరాష్ట్రు డాయనధికారికి యౌవరాజ్య మెట్లిచ్చును? కనుక దాయాద్యమే యుధిష్ఠిరయౌవరాజ్యమునకు గారణ మని చెప్పక తప్పదు.

"దాయాద్యమునుబట్టియే యౌవరాజ్య మిచ్చినయెడల భారత మట్లే తెలిపియుండును. అట్లు తెలుపలేదు"

అను ప్రతివాదులకు భారతమందామాట అనగా దాయాద్యముమాట ధృతరాష్ట్రునొద్ద దుర్యోధనునిచేతనే చెప్పబడిన దని చూపుచున్నాము—

"పితృతః ప్రాప్తవాన్ రాజ్యం పాండు రాత్మగుణైః స్వహ ।
త్వ మన్ధగుణసంయోగా త్ప్రాప్తం రాజ్యం న లబ్ధవాన్ ॥84

స ఏష పాండో ర్దాయాద్యం యది ప్రాప్నోతి పాండవః।
తస్య పుత్రో ధ్రువం ప్రాప్త స్తస్య తస్యాపి చాపరః ॥35

(ఆది-అ141

నీలకంఠీయమ్—ప్రాప్తం జ్యేష్ఠత్వా త్ప్రాప్తమపి, 34దాయాద్యం, దాయాదః పుత్రః తద్యోగ్యం రాజ్యం, తస్యపాండవస్య ॥ 35.

ఇచ్చట, పాండురాజు తండ్రినుండి రాజ్యమును పొందెను, జ్యేష్ఠత్వమును బట్టి ప్రాప్తించినను అంధత్వముచే నీవు రాజ్యమును పొందలేక పోతివి. యుధిష్ఠిరుడు, తన తండ్రినిబట్టి తనకు దాయాద్యమైన రాజ్యమును పొందునేని వారి సంతతి కే రాజ్యము చెందిపోవును. అని చెప్పబడినది.

మరియు వెనుకజూపబడియున్న ఉద్యోగపర్వములోని భీష్మవాక్యముచేతగూడ దాయాద్య మనియే చెప్పబడినది—

"అన్ధః కరణహీనత్వా న్న వై రాజా పితా తవ।
రాజా తు పాండు రభవ న్మహాత్మా లోకవిశ్రుతః ॥
స రాజా తస్య తే పుత్రాః పితు ర్దాయాద్యహారిణః।"

దీనివలన రాజ్యము పాండవులకు దాయాద్యమని భారతము చెప్పియున్నట్లు స్పష్టము.

ఇంకొకటి— నాలుగవ యంశములో "తనకుప్రతినిధిగా నుండి పాండురాజు జయించిన రాజ్యమును ధృతరాష్ట్రుడు పాండురాజున కిచ్చివేసెను. అయ్యది సగపాలు కలదు. కనుక ధర్మజుని యువరాజును జేసినాడన రాజ్యమున కంతకునుగాక తన తండ్రిపాలకు నర్ధభాగమునకు మాత్రమే చేసినాడని గ్రహించుకొనవలెను".

అనుచు ప్రతివాదులు చేసిన కల్పనను బట్టియైనను ధర్మజుడు యువరాజుగా జేయబడినది తనతండ్రిభాగమునకే అని యొకమూల జెప్పుచు నది దాయాద్యము గాదనుట వారిమాటకే విరుద్ధము. కనుక

ప్రతివాదుల వ్రాతలోని 1-2 అంశము లప్రస్తుతములైనవి. ఇక మూడవ యంశమును పరిశీలింతము—

ధర్మజుని యువరాజుగా జేసినపుడు దుర్యోధను డంగీకరించి యూరకుండుటకు గారణము దుర్యోధనునిచేతనే—

"అప్రిదేయం పురా దత్తం రాజ్యం పరవశో మమ ।
అజ్ఞానా ద్వా భయాద్వాపి మయి బాలే జనార్దన ॥
న త దద్య పున ర్లభ్యం పాండవై ర్వృష్ణినందన ।"

అనుచు బాలుడ నగుటచేత రాజ్యము మున్నిచ్చినపు డూర కుంటిని. అని చెప్పబడినదట! ఇచ్చట ప్రతివాదులకు బోధింపవలసి యున్నవి— ఇది యువరాజుగా ధర్మజుడు చేయబడినపుడు తా నూర కుండుటను గూర్చి చెప్పినమాట కానే కాదు. శ్రీకృష్ణుని రాయబార ములో "ద్యూతములో నిర్ణయించుకొనినట్లు నీవు వారి రాజ్యమును వారి కిచ్చివేయు" మని కృష్ణభగవానుడు చెప్పినపుడు వారి కది ఇంక నీయబడదు. నేను బాలుడనై యున్నప్పు డది యీయబడినది. అనుచు పాండవులకు రాజ్యమిచ్చి పంపినపుడు తానూరకుండుటను గూర్చి చెప్పిన మాటయే.

కనుకనే ఆశ్లోకములో "అప్రిదేయం రాజ్యం పురా దత్తమ్" అని చెప్పబడినది. ధర్మజుడు యువరాజెప్పుడు చేయబడెనో పాండవు లకు రాజ్య మెప్పు డీయబడెనో తెలుపుచున్నాము.

కుమారాస్త్రవిద్యాప్రదర్శన మైన తరువాత ద్రోణాచార్యుడు, ద్రుపదు నోడించి తీసికొని రావలయు నని కౌరవపాండవవర్గముతో జెప్పగా దుర్యోధనుడు సహాయసంపత్తితో ద్రుపదుని మీదికి వెళ్ళి యోడిపోయి వెనుకకు వచ్చిన తరువాత భీమార్జునులు వెళ్ళి ద్రుపదు నోడించి తెచ్చి ద్రోణాచార్యాజ్ఞను నిర్వహించిరి. ఈపని యైన తరు వాత సంవత్సరమునకు ధర్మజుడు యువరాజుగా జేయబడెను. ఈవిష యమే ప్రతివాదు లుదాహరించియున్న "తత స్సంవత్సరస్యాన్తే

యావద్రాజ్యాయ పార్థివ । స్థాపితో ధృతరాష్ట్రేణ" అను శ్లోకముచే దెలుపబడినది.

ఇక రాజ్య మెట్లు డీయబడిన దనగా, ధర్మజుడు యువరాజైన తరువాత పాండవులు తమబాహుబలమున జయించి ధనరాసుల దెచ్చి ధృతరాష్ట్రున కిచ్చుచుండ వారిబలపరాక్రమముల జూచి సహింపని దుర్యోధనుడు పాండవుల నిర్మూలింపదలచి వారణావతమున లక్క-యింటిని గూఢముగా నిర్మింపజేసి పాండవు లక్కడకు వెళ్ళి నివసించునటులు ధృతరాష్ట్రునిచేత చెప్పించినప్పుడు కుంతీదేవితోకూడ పాండవులు వారణావతములో గొంత కాలముండి తరువాత నాలక్క-యింటిముప్పునుండి తప్పించుకొనిపోయి గూఢముగా గొంతకాలము సంచరించి, తరువాత ప్రచ్ఛన్నవేషములతో ద్రౌపదీస్వయంవరసమయమునకు ద్రుపదపురము జేరి యచ్చట ద్రౌపదీవివాహము జేసికొని నివసించియుండగా పాండవులు జీవించియున్నారని తెలిసికొని భీష్మద్రోణాదుల యుపదేశముచుబట్టి ధృతరాష్ట్రుడు పాండవులను రప్పించి వారి కప్పుడు అర్ధరాజ్యమిచ్చెను-ఆవిషయమిదిగో—

"భ్రాతృభి స్సహ కౌంతేయ నిబోధ గదతో మమ ।
పున ర్నో విగ్రహో మాభూత్ ఖాండవప్రస్థ మావిశ ॥
అర్ధం రాజ్యస్య సంప్రాప్య ఖాండవప్రస్థ మావిశ ॥ (ఆది-అ207)

ఇట్లీయగా దీసికొనిన పాండవు లచ్చటకు వెళ్ళి నివసించుట, అది యింద్రప్రస్థ మను పేరితో విశ్వకర్మనిర్మితమై విరాజిల్లుట, ఆపై దిగ్విజయపూర్వకముగా రాజసూయము చేయుట జరిగినవి.

తరువాత దుర్యోధనుడు వారి రాజ్యమును కపటద్యూతముచే నపహరించి పాండవులను, అరణ్యవాసాజ్ఞాతవాసములకు పాలుచేసెను. ఆపాండవులు ద్యూతకాలనిర్ణయప్రకారము 13సంవత్సరములు సక్రమముగా గడపివచ్చి యుపప్లావ్యమందుండగా కృష్ణభగవానుడు కురుసభకు వచ్చి దుర్యోధనునితో—

"మా తాత శ్రియమాయాస్తి మవమన్తా స్వయుజ్యతామ్ ।
అర్ధం ప్రదాయ పార్థేభ్యో మహతీం శ్రియ మాప్నుహి ॥
(ఉద్యో-అ 125)

పాండవులకు వారిసగ మిచ్చి మిగిలినదానిని నీవనుభవింపు మనగా దుర్యోధనుడు—

"రాజ్యాంశ శ్చాఽభ్యనుజ్ఞాతో యో మే పిత్రా పురాఽభవత్ ।
న స లభ్యః పున ర్జాతు మయి జీవతి కేశవ ॥"

టీకా— అభ్యనుజ్ఞాతః- దత్తః.

"అప్రదేయం పురా దత్తం రాజ్యం పరవతో మమ ।
అజ్ఞానా ద్వా భయా ద్వాపి మయి బాలే జనార్దన ॥"
(ఉద్యో- అ 127)

నాతండ్రిచే వారికి పూర్వ మీయబడిన యర్ధరాజ్యము నేను జీవించియుండగా మరల వారికి ప్రాప్తింపదు. అప్పుడు నేను బాలుడనై యజ్ఞానము భయము కలవాడనై యుండుటచే వారి కీయదగని రాజ్యము నాతండ్రిచే నీయబడినది. అని బదులు చెప్పెను.

ఈదుర్యోధనవాక్యము పాండవుల కర్ధరాజ్య మీయబడినపుడు తాన గీకరించి యూరకుండుటను హేతువును కల్పించి చెప్పబడినట్లు స్పష్టము కచుండ దీనిని యువరాజు చేయబడినపు డూరకుండుటకు కారణముగా జెప్పబడినట్లు ప్రతివాదులు వర్ణించుట అయుక్తము.

మరియు తాను ధర్మజుని యువరాజు జేయుటకు పూర్వమే ద్రుపదునిమీదికి యుద్ధమునకు వెళ్ళిన ప్రౌఢుడై యుండియు వారి కర్ధరాజ్య మిచ్చునప్పటికి కూడ నాది బాల్యమని చెప్పుకొనిన దుర్యోధనుని మాటను ప్రతివాదులు ప్రమాణముగా గ్రహించుట అయుక్తము.

ధర్మజుడు యువరాజు గాకపూర్వమే భీముని వధించి, పాండవులను, బంధించి తాను రాజ్య మేలుకొనవలె నను దుర్బుద్ధి దుర్యోధనున కుండెడిది. చూడుడు — ఆంధ్రభాగతము— ఆ 5.

వ. ఒక్కనాడు దుర్యోధనుండు శకుని దుశ్శాసనాదులతో విచారించి యిట్లనియె.

పృథ్వి. ఉపాంశువధ జేసి మధ్యము మ, దోద్ధతుం జంపి ని
స్సపత్నముగ ధర్మనందను న, శక్తు బంధించి యే
నపాండముగా సముద్రివల, యాఖిలక్షోణి మ
త్కృపాపటుశక్తి నత్యధిక, కీర్తి నై యేలెదన్.

ఇట్టి యూహ గలిగి భీముని వధింప దుస్తంత్రములు పన్నుచు వ్యవహరించిన దుర్యోధనుడు ఆనాటికి బాలుడా? కుమారాస్త్రవిద్యా ప్రదర్శన కాలములోనే అర్జునునిపై డీకొనవచ్చిన కర్ణున కప్పటి కప్పుడు అంగరాజ్య మిచ్చి యర్జునునిపై గత్తి కట్టించిన దుర్యోధనుడు ఆనాటికి బాలుడా?

ఈయంగరాజ్యప్రదాన కాలమందు పాండవపక్ష మాక్షేపింప కుండుటకు గారణము ముందు వివరింపబడును.

ధర్మజునకు జరిగిన యౌవరాజ్యాభిషేకము జూచి దుర్యోధనుని మనస్సునం దెంత కలత గలిగెనో చూడుడు—

ఆంధ్రభారతము-ఆది. ఆ 6.

వ. దుర్యోధనుండు యుధిష్ఠిరు యౌవరాజ్యాభిషేకంబునకు, భీమార్జున యముల పరాక్రమంబునకు సహింపక కర్ణశకునిదుశ్శాసనులతో మంతనంబుండి యిట్లనియె.

సీ. ......భయ మందుచుండుదు బాండవులకు
దానిపై నిప్పుడు ధర్మజు యువరాజు
జేసె రాజే నేనేమిసేయువాడ.

ఇట్లు విలపించిన దుర్యోధనుడు ఆనాటికి బాలుడా?

అంత ద్రోహబుద్ధి, అంత రాజ్యతృష్ణ, అంత ద్వేషి, అంత యసహనము ఆ చిన్నంతనుండియు గలిగి వ్యవహరించిన దుర్యోధనుడు నేచప్ప

టికి బాలుఁడ నని యప్రమాణముగా జెప్పిన మాటను ప్రతివాదులు తమవాదమునకు బ్రమాణముగా గ్రహించుటే మొదటి తప్పు.

ఆపై పాండవుల కర్ధరాజ్యమీయఁబడిన సందర్భమునకు సంబంధించిన యీదుర్యోధనవాక్యమును యుధిష్ఠిరుని యౌవరాజ్యాభిషేక సందర్భమునకు ప్రతివాదులు ముడిపెట్టి దుర్యోధనుఁడే సమాధానము చెప్పియున్నాఁడనుట రెండవ తప్పు.

పూర్వోక్తప్రకారము దాయాద్యమునుబట్టియే యువరాజుగా జేయబడినట్లు భారతము తెలుపుచుండ దాయాద్యము కారణ మని తెలుపఁబడి యుండలేదనుట మూఁడవతప్పు.

ఇంకొకటి ప్రతివాదులు మూఁడవయంశములో దుర్యోధన వాక్యముగా నిట్లు వ్రాసియున్నారు—

"నేను బాలుడ నగుటచేత నప్రదేయమైన రాజ్యము నున్నిచ్చి నపు డూరకుంటిని" అని.

ఇక నాలుగవయంశములో నిట్లు వ్రాసియున్నారు—

"పాండురాజు జయించిన రాజ్యమును ధృతరాష్ట్రుఁడు పాండురాజున కిచ్చివేసెను. అది సగపాలు కలదు. కనుక ధర్మజుని యువరాజును జేసినాడన తనతండ్రిపాలగు నర్ధభాగమునకు మాత్రమే చేసినాడని గ్రహింపవలెను" అని.

ప్రతివాదిమతప్రకారము నాలుగవయంశములో నున్నట్లు ధృతరాష్ట్రుఁడు పాండురాజునకు రాజ్యమిచ్చిన దెప్పుడు? దుర్యోధనాదులు పుట్టకపూర్వము. ఆయియ్యఁబడిన రాజ్య మెట్టిది? మూలరాజ్యముగాక పాండుభూపతి తనబాహుబలమున జయించినది. ధర్మజుఁడు యువరాజుగా జేయబడిన దే రాజ్యము? తండ్రియగు పాండుభూపతి రాజ్యము ఆరాజ్యమునకు జరిగిన యుధిష్ఠిరయౌవరాజ్యాభిషేకమును గూర్చి కురుసభలో కృష్ణభగవానునితో దుర్యోధనుఁడు చెప్పినమాట

యేమి? "అది యప్రదేయమైన రాజ్యమనియు, నేను బాలుడ నగు యుండుటచే నట్లు జరిగినదనియు".

తాను పుట్టకపూర్వము పాండురాజుచే జయింపబడినమహారాజగు తనతండ్రిచే దత్తమైయున్న యారాజ్యము పాండురాజున కప్రదేయము కాదుగద, ఆపాండురాజు సొత్తు పాండుపుత్రుల కప్రదేయ మెట్లగును? ఇట్టి దుర్యోధనుని యసంగతప్రసంగమును ప్రతివాదులు ప్రమాణముగా జూపుట నాలుగవ తప్పు. కనుక ప్రతివాదులు మూడవయంశము పరాస్తమగుచున్నది.

దుర్యోధనుని యామాటయైనను పాండవుల కర్ధరాజ్య మిచ్చుటకు సంబంధించినదిగాని యువరాజగుటకు సంబంధించినదిగాదని వెనుక నిరూపించియే యున్నాము.

ఇక ప్రతివాదులవ్రాతలోని నాలుగవయంశమును పరీక్షింతము. పాండురాజు జయించినదే పాండురాజున కీయబడెనదట, అది సగపాలు కలదట, దానికే ధర్మజుడు యువరాజుగా జేయబడెనట, ద్రౌపదీవివాహానంతరము పాండవుల కీయబడిన యర్ధరాజ్య మదియే యన్నమాట.

ధృతరాష్ట్రుడు పాండవుల కర్ధరాజ్య మిచ్చిన సందర్భ మిట్లున్నది—

అర్ధం రాజ్యస్య సంప్రాప్య ఖాండవప్రస్థ మావిశ ।
ప్రతిగృహ్యాతు తద్వాక్యం నృపం సర్వే ప్రణమ్య చ ॥
ప్రతస్థిరే తతో ఘోరం వనం తన్మనుజర్షభాః ।

నీలకంఠీయమ్—ఘోరం వన మితి, భూమే రర్ధం సస్యశూన్యో దేశః పాండవేభ్యో దత్త ఇతి జ్ఞాయతే॥

"అర్ధం రాజ్యస్య సంప్రాప్య ఖాండవప్రస్థ మావిశ"॥(ఆ_అ207)

ఇచ్చుట, రాజ్యము యొక్క అర్ధభాగమును తీసికొని మీరు ఖాండవప్రస్థమునం దుండవలసిన దని చెప్పిన ధృతరాష్ట్రుని మాటకు

బద్ధులై యాతనికి వారు నమస్కరించి ఘోరమైన యాఖాండవప్రస్థ మను వనమునకు వెళ్ళి ప్రవేశించిరి. అని చెప్పబడినది. అది 'ఘోర వన' మనుటచే భూమిలో నర్ధభాగమైన సస్యశూన్యదేశము పాండవుల కీయబడిన దని తెలియుచున్నదని నీలకంఠీయములో జెప్పబడినది.

పాండవుల కర్ధరాజ్యముగా నీయబడిన యాఘోరవనమే గా! పాండుభూపతి యర్ధభాగము, పాండుభూపతిచే జయింపబడి యనురాగముతో ధృతరాష్ట్రునిచే దత్తమైన పాండుభూపతి యర్ధరాజ్యమాఘోరవనమేగా! పాండవుల కీయబడినదే పాండుభూపతిభాగమని ప్రతివాదులనుట అయుక్తము.

"పితృతః ప్రాప్తవాన్ రాజ్యం పాండు రాత్మగుణైః పురా"

అని ధృతరాష్ట్రునితో దుర్యోధనుడు చెప్పినట్లున్న మహాభారత వచనముచేతను, "పైతృకంబగు లక్ష్మి పాండుభూపతి మున్ను దాల్చుట జేసి" అని యాస్థలమందే యున్న ఆంధ్రభారతవాక్యముచేతను పాండుభూపతికి సంక్రమించిన రాజ్యము పిత్ర్యమని చెప్పబడియుండ నది ధృతరాష్ట్రదత్తమైన నూతనరాజ్యమని ప్రతివాదు లనుట అయుక్తము.

"ధనౌఘం ప్రాపయామాస కురురాష్ట్రం ధనంజయః ।
ఏవం సర్వే మహాత్మానః పాండవా మనుజోత్తమాః ॥
పరరాష్ట్రాణి నిర్జిత్య స్వరాష్ట్రం వవృధుః పురా । " (ఆది-అ।39)

అను గ్రంథము, పాండవులు పరరాష్ట్రములజయించి ధనరాసులతో నింపి కురురాష్ట్రమనబడు స్వరాష్ట్రమును వృద్ధిపొందించి రని చెప్పుచుండుటవలన కురురాష్ట్రమే పాండవులకు స్వరాష్ట్రమయియుండ మూలరాజ్య మనబడు కురురాష్ట్రము ధృతరాష్ట్రునిదేగాని పాండురాజుది, పాండవులది కాదని ప్రతివాదు లనుట అయుక్తము.

మరియు, ధర్మజుడు యువరాజైనతరువాత పరరాష్ట్రముల జయించుచున్న పాండవుల జూచి వారి నల్లరైన కడ తేర్పవలయు నను దుర్బుద్ధితో నున్న దుర్యోధనుని ప్రేరణచే ధృతరాష్ట్రుడు వారిని

వారణావతమునకు వెళ్ళుడని బోధింపగా నాపాండవులు ప్రయాణమై
వెళ్ళుచుండ వెంటబడి పౌరు లిట్లనుకొనిరి—

"పౌరాశ్చ పురుషవ్యాఘ్రా నన్వీయు శ్శోకకర్శితాః ।
తత్ర కేచి ద్బ్రువన్తి స్మ బ్రాహ్మణా నిర్భయా స్తదా ॥
దీనాన్ దృష్ట్వా పాండుసుతా నతీవ భృశదుఃఖితాః ।
విషమం పశ్యతే రాజా సర్వథా స సుమందధీః ॥
కౌరవ్యో ధృతరాష్ట్రస్తు న చ ధర్మం ప్రపశ్యతి ।
తాన్ రాజ్యం పితృతః ప్రాప్తాన్ ధృతరాష్ట్రో న మృష్యతే॥
అధర్మ్య మిద మత్యన్తం కథం భీష్మోఽనుమన్యతే ।
వివాస్యమానా న స్థానే నగరే యోఽభిమన్యతే ॥
పితేవహి నృపోఽస్మాక మభూ చ్ఛాన్తనవః పురా ।
విచిత్రవీర్యో రాజర్షిః పాండుశ్చ కురునందనః ॥
సతస్మిన్ పురుషవ్యాఘ్రే దేవభావంగతే సతి ।
రాజపుత్రా నిమాన్ బాలాన్ ధృతరాష్ట్రో న మృష్యతే ॥
వయ మేత దనిచ్ఛన్త స్సర్వఏవ పురోత్తమాత్ ।
గృహాన్ విహాయ గచ్ఛామో యత్ర గన్తా యుధిష్ఠిరః"

(ఆది-అ145)

ఇచ్చట, దీనులై వెళ్ళుచున్న పాండవులను జూచి పౌరులు దుఃఖితులై వెంటబడినపుడు కొందరు బ్రాహ్మణులు నిర్భయముగా బలుకుచు, విషమముగా జూచుచున్న ధృతరాష్ట్రుడు ధర్మదృష్టికలవాడు కాడనియు, తండ్రివలన ప్రాప్తమైన రాజ్యముగల పాండవుల యందు సహనములేనివాడై యుండెననియు, వీరిని యాపురమునుండి పంపివేయుట యను నధర్మమునకు భీష్ము డెట్లు సమ్మతించెనో అనియు, పూర్వము ప్రభువైన విచిత్రవీర్యుడును పాండుభూపతియును మనకు తండ్రివలె రతులైనారనియు, పాండుభూపతి స్వర్గతుడైన పిమ్మట నీరాజపుత్రులను ధృతరాష్ట్రుడు సహింపకుండెననియు, మన

మందరము నీపురమును విడిచిపెట్టి యుధిష్ఠిరు డెక్కడకు వెళ్ళునో అక్కడకే వెళ్ళుద మనియు ప్రసంగించుకొనినట్లు చెప్పబడినది.

ఇందు పూర్వప్రభువులుగా విచిత్రవీర్యుడును, పాండుభూపతి యును పేర్కొనబడుచేగాని ధృతరాష్ట్రుడు పేర్కొనబడకుండుటయు, ఈస్థలములోనే ఆంధ్రభారతములో గూడ,

"పితృపితామహులచే భృతపూర్వమై క్రమా
గతమైన రాజ్యంబు గరము నెమ్మి బొందు
సుతజ్యేష్ఠు భరతకులశ్రేష్ఠు ధర్మజు బూన్పక"

అని యుండుటవలన పాండవులకు సంక్రమించిన రాజ్యము పితృపితామహపరంపరాప్రాప్తమైన దగుటయు, మూలరాజ్యమునకు జెందిన హస్తినాపురమునందలి ప్రజలు యుధిష్ఠిరుండుండు స్థానమందే మన మందరము వెళ్ళియుందుద మనుకొనుటనుబట్టి యుధిష్ఠిరుడు మూలరాజ్యప్రజలకే ప్రభువైనట్లుండుటయు జూడ యుధిష్ఠిరుడు యావద్రాజ్యమునకు యువరాజు చేయబడె ననియే చెప్పితీరవలెను. కనుక "ధర్మజుని యువరాజును జేసినాడన రాజ్యమున కంతకును జేసినాడని భ్రమపడవలదు" అను నాలుగవయంశములోని వ్రాత పరాస్తమైనది.

ఇట్లు పరీక్షింపగా యుధిష్ఠిరుడు యావద్రాజ్యమునకు యువరాజు చేయబడుట, అది దాయాద్యమునుబట్టియే జరుగుట, అప్పుడు దుర్యోధను డాటంకపెట్టకుండుట, అనునవి ధృతరాష్ట్ర రాజ్యవాదమునకపరిహార్యములైన బాధకములని స్థిరపడినది.

—"ధృతరాష్ట్రుడు రాజు కాడను ప్రజల మాటలు ధర్మసర్ణయమునకు బనికిరా" వను ప్రసంగము— తన్నిరాకరణము—

దాయభాగవినిర్ణయములో నిట్లున్నది —"ఇక రెండవ యభ్యంతర మేమనగా పౌరులాడుకొనిన మాటలు, పాండవధార్తరాష్ట్రులనుగూర్చి చర్చించుటలో పౌరులు చెప్పుకొనిన మాట లీక్రింద రీతి నీబడియున్నవి —

"గుణైస్సముదితాన్ దృష్ట్వా పౌరాః పాండుసుతాం స్తథా!
కథయాంచక్రి రేతేషాం గుణాన్ సంసత్సు భారత ॥
రాజ్యప్రాప్తిం చ సంప్రాప్తం జ్యేష్ఠం పాండుసుతం తదా ।
కథయన్తి స్మ సంభూయ చత్వరేషు సభాసు చ ॥
ప్రజ్ఞాచక్షు రచక్షుష్ట్వా ద్ధృతరాష్ట్రో నరేశ్వరః ।
రాజ్యం న ప్రాప్తవాన్ పూర్వం స కథం నృపతి ర్భవేత్ ॥
తథా శాన్తనవో భీష్మ స్సత్యసన్ధో మహావ్రత ।
ప్రత్యాఖ్యాయ పురా రాజ్యం న స జాతు గ్రహీష్యతి ॥
తే వయం పాండవజ్యేష్ఠం తరుణం యుద్ధశీలినమ్ ।
అభిషించామ సాధ్వద్య సత్యకారుణ్యవేదినమ్ ॥"

పాండవుల గుణములం గని సమ్మోదము నంది పౌరులు సభలలో వారిని బాగడజొచ్చిరి. పౌరులు సభలందును, చత్వరములందును నిలిచి మున్ను గ్రుడ్డివాడగుటచే ధృతరాష్ట్రుడు రాజు కాలేదు. ఇప్పుడు మాత్రి మెట్లు కాగలడు! భీష్ముడు తొల్లి రాజ్యము సేయనని భీష్మించియున్నాడు. కాన నిప్పు డాతడును రాజ్యము చేకొనడు. ఇక మేము ధర్మజుని పట్టాభిషిక్తుని జేయుదుము. అని పౌరులు చెప్పుకొనిరి గదా, ధృతరాష్ట్రుని రాజుగా జెప్ప బెట్టని యడుగుచున్నారు. ఈవాక్యములు పాండవుల గుణసంపత్తికి వశులైన ప్రజలు పక్షపాతముచేత ననుకొనినవిగాని వేఱు కాదు. ఇవి ధర్మనిర్ణయమునకు దీసికొనదగినవి కావు.

ధర్మనిర్ణయరతులై వీరు ప్రసంగించి రందురేని భీష్ముని మాట నెత్త నవసరమే లేదు. దాయాద్యమును బట్టి పాండవులేగాని భీష్ముడు రాజగుటకు నవకాశము లేనే లేదు. అట్టిస్థితిలో భీష్ముడు ప్రత్యాఖ్యానము చేసి మరల జేకొనడు కాబట్టి మనము పాండవుల నభిషేకింతము. అని చెప్పుకొననేల?

రాజ్యమును మొదట పొందకపోయినను నిప్పుడు పొందగోరు కొనుచుండిన ధృతరాష్ట్రునిదొలగింప బౌరులు తలంచుకొనుచుండి నట్లే దాయాద్యము పాండవులవశమైనందున నొకవేళభీష్ముడు తన నియమమును విడిచిరాజ్యముచేకొనదలంచినను గూడనాతనికి నిగాదని ధర్మజునకే యిప్పింపవలసియుండునుగదా. కాన నిది దాయాద్య నిర్ణయచర్చ కానేకాదు. ఇక నేమన మంచివానిని రాజుగా జేకొన నిచ్ఛ.

ఒకవేళ భీష్ముడు రాజ్యము స్వీకరింపనెంచునేని అప్పుడు పాండవులే రాజు కావలెనని వీరు కోరరు. ఏమన, భీష్ముడును నుత్తముడే కావున" అని. (పు 15).

పౌరు లట్లు ప్రసంగించుకొనుటకు బూర్వస్థితి యేవిధముగా నున్నదో ముందు మన మెఱుకొనవలసియున్నది.

ధర్మజుడు యువరాజైన తరువాత పాండవులు పరరాష్ట్రముల జయించి కురురాష్ట్రమనబడు స్వరాష్ట్రమును వృద్ధినొందించుచుండ ధృతరాష్ట్రునకు పాండవులయందు దుర్భావ ముద్భవించినది. అపుడాతడు చింతాక్రాంతుడై నిద్రపట్టనంతటి స్థితిలో నుండి నీతిజ్ఞుడైన కణికుని రప్పించి యాతనితో దనకు పాండవులయందు గలిగిన అసూయను వెల్లడించి చెప్పి పాండవులయెడ ప్రస్తుతము నన్నెట్లు వర్తింపుమని నీవు చెప్పుదువో అట్లు వర్తింతు నని పలుకగా కణికుడు రాజనీతి నుపదేశించి, తుదకు పాండవులనుండి హానికలుగకుండ నాత్మరక్షణము చేసికొను మనియు, నీకు పశ్చాత్తాప మెట్లు కలుగకుండునో అట్లు నీతి నాశ్రయింపు మనియు బోధించెను. ఈ విషయమునకు సంబంధించిన శ్లోకము లివిగో—

"ఏవం సర్వే మహాత్మానః పాండవా మనుజోత్తమాః।
పరరాష్ట్రాణి నిర్జిత్య స్వరాష్ట్రం వవృధుః పురా ॥

తతో బల మతిఖ్యాతం విజ్ఞాయ ధృతధన్వినామ్ ।
దూషిత స్సహసా భావో ధృతరాష్ట్రస్య పాంసుషు ॥
సచింతా పరమో రాజా న నిద్రా మలభ న్నిశి । (ఆది-అ 139)
"తత ఆహూయ మంత్రిజ్ఞం రాజశాస్త్రార్థవిత్తమమ్ ।
కణికం మంత్రిణం శ్రేష్ఠం ధృతరాష్ట్రోఽబ్రవీ ద్వచః ॥
ఉత్సృక్తాః పాండవా నిత్యం తేభ్యోఽసూయే ద్విజోత్తమ ।

నీలకంఠీయమ్:— ఉత్సృక్తాః ఉత్కర్షేణ సర్వతో వ్యాప్తాః, "షంజసంగే" అస్య రూపమ్. అసూయే గుణవత్త్వేఽపి దోషవత్త్వేన పశ్యామి. తేభ్య ఇతి చతుర్థ్యా తేషు కోపా దేవం పశ్యామి. న-త్వజ్ఞానా దితి గమ్యతే కృధద్రుహేతి స్మరణాత్ ॥

తత్ర మేనిశ్చితతమం సంధివిగ్రహకారణమ్ ।
కణిక త్వం సమాచక్ష్వ కరిష్యే వచనం తవ ॥

కణికః—

తస్మా త్త్వం పాండుపుత్రేభ్యో రక్షాత్మానం నరాధిప ।
భ్రాతృవ్యా బలినో యస్మా త్పాండుపుత్రా నరాధిప ॥
పశ్చాత్తాపో యథా న స్యా త్తథా నీతి ర్విధీయతామ్ ।"

(ఆది- అ 140)

ఇట్లు పాండవులయందు దురుద్దేశము గలిగి ధృతరాష్ట్రుడును వారిని నిర్మూలింపవలె నను దుర్బుద్ధి గలిగి దుర్యోధనుడును వ్యవహరించుచున్న స్థితిలో పౌరు లావిధముగా బ్రసంగించుకొనిరి. ఆప్రసంగములలో ప్రతివాదు లుదాహరించిన మైదుశ్లోకములలో మొదటిది-పాండవుల గుణగణమును కీర్తించుకొనినట్లును, రెండవది- "రాజ్య ప్రాప్తిం- రాజ్యయోగ్యతాం సంప్రాప్తః" (టీకా) యుధిష్ఠిరుడు రాజ్యాభిషేకయోగ్యత వహించియున్నా డనుకొనినట్లును, మూడవది-

"ప్రజ్ఞాచక్షు రచక్షుష్ట్వా ద్ధృతరాష్ట్రో నరేశ్వరః ।
రాజ్యం న ప్రాప్తవాన్ పూర్వం స కథం నృపతి ర్భవేత్ ॥"

సిలకం(ంశీయ వ్— ప్రజ్ఞాచక్షు రంధః అతఏవానధికారా ద్రాజ్యం న ప్రాప్తవాన్. స ఇదానీ మపి పుత్రద్వారా కథం నృపతి ర్భవేత్, న కథమపి ద్వారలోపా దిత్యర్థః ||

అంధత్వమునుబట్టి యనధికారి యగుటచే ధృతరాష్ట్రుడు పూర్వము రాజ్యమును పొందనే లేదు. ఆరాజ్యాధిపత్యము తన యొద్దనే లుప్తమైపోయినపుడు, ఇప్పడు తన పుత్రుని బురస్కరించు కొనియైనను తనకు రాజ్యాధిపత్య మెక్కడనుండి వచ్చును? అనుచు ధృతరాష్ట్రునకుగాని, దుర్యోధనునకుగాని రాజ్యముతో దాయాద్య సంబంధము లేదనుకొనినట్లును, నాలుగవది— మొట్టమొదటనేప్రత్యా ఖ్యానము చేసియున్న భీష్ముడు ఎన్నడును రాజ్యాధిపత్యము నపేక్షింప బోడని యనుకొనినట్లును, అయిదవది.

ఇట్లు పరిశీలింపగా మహారాజపదవి నాశ్రయింపదగిన యితరు లెవ్వరు లేనప్పుడును ఆపదవిని ధర్మజుడే యధిష్ఠింపదగియున్నప్పుడును కాలహరణము చేయబడుటకు గారణ మేమున్నది? మనము ధర్మజుని రాజ్యాభిషిక్తుని జేయవలయునని యనుకొనినట్లును చెప్పుచున్నవి. ఇట్లు దాయాద్యము ధృతరాష్ట్రధార్తరాష్ట్రులకు లేనే లేదనుటవలన పరిశేషన్యాయమున నాదాయాద్యము పాండురాజుదే యనియు, నిప్పు డది పాండవుల దనియు వారు చర్చించియుండ వారికి "మంచివానిని రాజుగా జేకొన నిచ్ఛయేగాని యది దాయాద్యనిర్ణయచర్చ గాదని ప్రతివాదులనుట అయుక్తము. "దాయాద్యమునుబట్టి పాండవులే గాని భీష్ముడు రాజగుటకు నవకాశమే లేనప్పుడు వారు భీష్ముని మాట నెత్తనేల"

అను ప్రతివాదుల నడుగవలసియున్నది— మీామతప్రకారము ఆపౌరులకు మంచివానిని రాజుగా జేకొన నిచ్ఛ తప్ప వేరొక భావమే లేనపుడు ధృతరాష్ట్రుని రాజ్యానధికారమును వారెత్తుకొనవలసిన పని

యేమి వచ్చినది? అని. కనుక దాయాద్యనిర్ణయమునకే దానినెత్తుకొన వలసివచ్చినదని చెప్పి తీరవలయును.

అట్టి దాయాద్యనిర్ణయము భీష్మునిమాట నెత్తుకొనవలసినంత మాత్రమున గాకపోయెనా? ఆపెద్దలిద్దరిలో మహారాజ పదవిని, యన ధికారియగుటచే ధృతరాష్ట్రుకును రాజ్యపరిత్యాగి యగుటచే భీష్ము నకును, అధిష్ఠింపరానపుడు, దాయాద్యమును బట్టియు గుణసంపదను బట్టియు దాని నధిష్ఠింపదగిన యుధిష్ఠిరునకే రాజ్యాభిషేకముచేయుట కిప్పుడభ్యంతరమేమున్నదని విచారించుటలో భీష్ముని మాటనెత్తుకొని నారని గ్రహింపవలయును.

అందుచే "ఇవిధర్మనిర్ణయమునకు దీసికొనదగినవికావు. అవి పాండవపక్షపాతముచే ననుకొనినమాటలు".

అని ప్రతివాదులనుట. అయుక్తము.—ఇం-కొకటి—ఆపౌరులే—

"తే వయం పాండుజ్యేష్ఠం తరుణం వృద్ధశీలినమ్ ।
అభిషించామ సాధ్వద్య సత్యకారుణ్యవేదినమ్ ॥
నీలకంఠీయమ్—సత్యం కారుణ్యం వేదశ్చ తద్వేత్తారమ్ ।
సహి భీష్మం శాన్తనవం ధృతరాష్ట్రం చ ధర్మవిత్ ॥
సపుత్రం వివిధై ర్భోగై ర్యోజయిష్యతి పూజయన్ ।"

దయ, సత్యము, వేదవిజ్ఞానము గలిగి పూజ్యుడైయున్న యుధి ష్ఠిరుని రాజ్యాభిషిక్తుని జేయుదము, ఆతడు భీష్ముని ధృతరాష్ట్రుని ధృతరాష్ట్రసంతతిని బూజించుచు వివిధభోగములతో నోలలాడిం చును. అని కూడ ప్రసంగించుకొనినారు.

దీనినిబట్టి కూడ ధృతరాష్ట్రునిది మూలరాజ్యము పాండురా జుది సంపాదితరాజ్యము అను ప్రతివాదులు కల్పించినది యప్రా మాణిక మనియు, యావద్రాజ్యమునకు యువరాజుగా ధర్మజుడు చేయబడె ననియు, గనుకనే దానికే మహారాజుగా ధర్మజు నభిషిక్తు

జేయుటకై పౌరు లాలోచించుటలో ధృతరాష్ట్రాదుల సందరను ధర్మ జుడే పోషించునని యనుకొనిరా రనియు గ్రహింపవలయును.

ప్రతివాదు లన్నట్లు వారు ధర్మనిర్ణయరతులుగాక కేవలపాండవపక్షపాతులే యైనయెడల ధృతరాష్ట్రధార్తరాష్ట్రుల యోగక్షేమములను భోగభాగ్యములను గూర్చి వారు చింతింతురా?

కనుక పౌరులు ధర్మనిర్ణయరతులై! ప్రసంగింపలేదని ప్రతివాదు లనుట అయుక్తము.

ఇంకొకటి— కురుసభలో కృష్ణభగవానునితో దుర్యోధనుడు చెప్పినట్టిదియు, నది యసంగతప్రసంగ మని వెనుకనిరూపితమై యున్నదిట్టియు నగు—

"అప్రదేయం పురా దత్తం రాజ్యం పరవతో మమ"

అనువాక్యము దుర్యోధనదాయాద్యనిర్ణయరూపమైన తమ ధర్మనిర్ణయములో గ్రాహ్యమని తీసికొనిన ప్రతివాదులు, ఉభయపక్ష యోగచింతతో ధర్మానుబద్ధముగా చర్చించి యాపౌరుల వాక్యము లగ్రాహ్యము లనుట అయుక్తము.

ఇట్లు పరిశీలింపగా "నాటి పౌరుల మాటలు ధర్మనిర్ణయమునకు దీసికొనదగినవి కావు" అను ప్రతివాదుల వ్రాత పరాస్తమైనది. కనుక ప్రతివాదులు పరిహరింపబూనిన యీరెండవయభ్యంతరముగూడ మొదటిదానివలె నపరిహార్యమే యైనది.

—దుర్యోధనుడు తన తండ్రికి రాజ్యము రాలేదనుట, తనంత తాననినది కాదను ప్రసంగము—తన్నిరాకరణము—

దాయభాగవినిర్ణయములో నిట్లున్నది— ఇక మూడవయభ్యంతర మేదనగ? దుర్యోధనుడే తనతండ్రికి రాజ్యము రాలేదని యంగీకరించినాడనునది ఆవాక్యము లేవన—

"శ్రుతా మే జల్పతాం తాత పౌరాణా మశివా గిరః ।

పిత్రైతః ప్రాప్తవాన్ రాజ్యం పాండు రాత్మగుణైః పురా॥
త్వం మన్ధగుణసంయోగాత్ ప్రాప్తం రాజ్యం న లబ్ధవాన్ ।
స ఏవ పాండో ర్దాయాద్యం యది ప్రాప్నోతి పాండవః ॥
తస్య పుత్రో ధ్రువం ప్రాప్తః తస్య తస్యాపి చాపరః ।"

అనునదియైయున్నది. ఇవి పైపౌరులవాక్యముల ననుసరించి పలికినవికాని దుర్యోధనుడు తనంత తాననినవి కావు. గాన నివి గ్రాహ్యములు కావు ఈకారణములచే సంస్కృతభారతమును బట్టికూడ ధృతరాష్ట్రుడే రాజని స్పష్టముగా జెప్పకొనవచ్చును"
(పు|6)

ప్రతివాదులు ఆపౌరులవాక్యము లప్రమాణములని తీసివేసి వాని ననుసరించినవే యీదుర్యోధనవాక్యములని సద్దినారు. ఆపౌరవాక్యములు ప్రమాణములే యని నిరూపించియున్నాము. వాని ననుసరించిన దుర్యోధనవాక్యములుకూడ ప్రమాణమే.

అవి యటుండనిచ్చి ప్రతివాదిమతమునే యంగీకరించి ఆవాక్యములు దుర్యోధనుడు తనంత తాననినవో కావో చూతము.

"శ్రుతా మే జల్పతాం తాత పౌరాణా మశివా గిరః ।
త్వా మనాదృత్య భీష్మం చ పతి మిచ్ఛన్తి పాండవమ్ ॥
మత మేతచ్చ భీష్మస్య న స రాజ్యం బుభుక్షతి ।
అస్మాకన్తు పరాం పీడాం చికీర్షన్తి పురే జనాః ॥" (ఆ-141)

నీలకంఠీయమ్—అస్మాకన్తు పరాం పీడా మితి మిథ్యైవోక్తం రాజ్ఞః పాండవేషు ద్వేష ముత్పాదయితుం రాజ్యాపహరణాద్యా పీడాను'

ఇచ్చట మొదటిశ్లోకముచేత పౌరులనుకొనిన హేతువులతో యుధిష్ఠిరరాజ్యాభిషేకముమాట చెప్పబడినట్లును, ద్వితీయశ్లోకముచేత నది భీష్మునకు సమ్మతమే, ప్రజలు మనకు గొప్పహానిని చేయదలచినారు. అని చెప్పబడినట్లును స్పష్టము.

వెనుక జూపబడిన పౌరులవాక్యములలో నుభయపక్షయోగ క్షేమములను వారు విచారించినట్లుండ, వారు మనకు గొప్ప హాని జేయదలచినారని తండ్రితో దాను జెప్పినాడు.

ప్రతివాదు లుదాహరించినశ్లోకములలో "పితృతః ప్రాప్తవాన్ రాజ్యం పాండుః, త్వ మన్యగుణసంయోగా ద్రాజ్యం న లబ్ధవాన్, స ఏష పాండో ర్దాయాద్యం యది ప్రాప్నోతి పాండవ, తస్య పుత్రో ధ్రువం ప్రాప్త స్తస్య తస్యాపి చాపరః"

పితృప్రాప్తమైన రాజ్యమును పాండురాజు పొందెను. నీవంధుడవై పొందలేకపోతివి. ఈధర్మరాజు డాపాండుభూపతియొక్క దాయాద్యమును పొందునేని క్రమముగా నాతని సంతతికే రాజ్యము చెంది పోవును. అని దాయాద్యమునుగూర్చియున్న దుర్యోధనుని మాటలు ప్రతివాదు లన్నట్లు పౌరుల వాక్యముల ననుసరించి పలికినవే యైన పక్షములో "వారిది దాయాద్యనిర్ణయచర్చ కానేకాదు" అని పౌరుల వాక్యములనుగూర్చి చెప్పిన ప్రతివాదుల మాటకు భంగము.

అవి దుర్యోధనుడు స్వయముగా నన్నవే యనుపక్షములో "ఇవి పౌరుల వాక్యముల ననుసరించి పలికినవి కాని దుర్యోధనుడు తనంత తాననినవి కావు" అను ప్రతివాదుల మాటకు భంగము. అవి వస్తుస్థితికనుకనే యా పౌరులైనను, దుర్యోధనుడైనను అట్లు నిజమునే పలికినారని చెప్పకతప్పదు. అది అటుండనిండు. పూర్వోక్తశ్లోకములకు తరువాత—

"తే వయం రాజవంశేన హీనా స్సహ సుతైరపి ।
అవజ్ఞాతా భవిష్యామో లోకస్య జగతీపతే ।
సతతం నిరయం ప్రాప్తాః పరపిండోపజీవినః ।
న భవేమ యథా రాజం స్తథా నీతి ర్విధీయతామ్ ॥
యది త్వం హి పురా రాజ న్నిదం రాజ్య మవాప్తవాన్ ।
ధ్రువం ప్రాప్స్యామ చ వయం రాజ్య మప్యవశే జనే ।"

తండ్రీ! మేమిక మా సంతానముతో గూడ రాజవంశమునకుచెం దనివారమై లోకమునకు తిరస్కృతులమై పోవుదుము. మేము పరపిం డోపజీవులమై, దుఃఖితులమై యుండకుండుటకు దగిన నీతి నవలంబింపుము. మొదట నీవేగనుక రాజ్యమును పొందియుంటివేని యీ ప్రజలు వ్యతిరేకించియున్నను, మేము ధ్రువముగా రాజ్యమును పొందియుండుదుము. అని దుర్యోధను డనెను. ఈకడపటిశ్లోకార్థమే—

"ఈరాజ్యంబు మొదలింటంగోలె భవదీయంబయినం బ్రకృతిజను లు వశ్యులు గాకున్నను గ్రమాగతంబయి మాకు నప్రయత్నలభ్యం బగు" అని యాంధ్రభారతములో జెప్పబడినది. దీనిని బట్టి తనకు రాజ్యప్రాప్తి యోగ్యత యేమాత్ర మున్నను ప్రజల వ్యతిరేకమును లె క్కపెట్టనట్టి దుర్యోధనుడు, ప్రతివాదిమతప్రకారము అప్రమాణము గను, పాండవపక్షపాతముగను ప్రసంగించిన పౌరుల వాక్యముల ననుస రించి రాజ్యము నీది కాకపోయె నని తండ్రియొద్ద మాటలాడు నంతటి యప్రయోజకుడా?

నిజముగా రాజ్యము ధృతరాష్ట్రుని ది కాదుగనుకనే దుర్యోధ నుడుగూడ నట్లనినాడు. తమకు రాజ్యప్రాప్తి యోగ్యత యేమాత్రము లేదుకనుకనే యది కలుగుట కేదేని తంత్రము నడుపుమని తండ్రిం గోరినాడు. మేము పరపిండోపజీవులము కాకుండునట్లు చూడుమని విలపించినాడు. ప్రతివాదులన్నట్లు ధృతరాష్ట్రునిదే మూలరాజ్యము కాని, యావద్రాజ్యము కాని యైనయెడల నట్టి రాజధానిలో నట్లు సభాస్థలములో నాపౌరులు "రాజ్యం న ప్రాప్తవాన్ పూర్వం స కథం నృపతి ర్భవేత్" తనది కాని రాజ్యమునకు తానిపుడు రాజెట్లగును? అని ధృతరాష్ట్రు నుద్దేశించి యనగలరా? ధృతరాష్ట్ర ధార్తరాష్ట్రులు శిక్షింప కుపేక్షింపగలరా? కనుక రాజ్యము పాండుభూపతిది, పాండవు లదికాని ధృతరాష్ట్రునిది, ధార్తరాష్ట్రులది కాదని చెప్పితీరవలయును. కనుకనే—

"ఏవం శ్రుత్వా తు పుత్రస్య ప్రజ్ఞాచక్షు ర్నరాధిపః ।
ధృతరాష్ట్రో ద్విధాచిత్త శ్శోకార్త స్సమపద్యత ॥"

పుత్రునిమాటలువిని యెటుతోచక తండ్రి శోకార్తు డయ్యెను. అంతియకాని నాది రాజ్యము కాకపోవుటేమి? అని యనలేదు.

దుర్యోధనుడుకూడ మాదే రాజ్యమని నిరూపించుట మాని తనతండ్రితో మనకు పాండవులనుండి భయము గలుగును. వారి నిక్కడనుండి యుపాయముతో వారణావతమునకు బంపివేయుమని చెప్పెను. చూడుడు—

"పాండవేభ్యో భయం న స్యాత్తా న్వివాసయతాం భవాన్ ।
నిపుణే నాఽభ్యుపాయేన నగరం వారణావతమ్ ॥"

అది విని ధృతరాష్ట్రుడు మనరాజ్యమునకు పాండవులనుండి యేమి భయము? అని పలుకక—

"స కథం శక్యతేఽస్మాభి రపాకర్తుం బలా దితః ।
పితృపైతామహా ద్రాజ్యా త్ససహాయో విశేషతః ॥" (ఆదిఅ 42)

ధర్మజుడు పితృపితామహపారంపర్యాగతరాజ్యము గలవాడు; ఆపై సహాయసంపత్తిగలవాడు; అట్టివాని నిక్కడనుండి బలాత్కారముగ మన మెట్లు తొలగింపగలుగుదుము? అనెను.

కనుక ధృతరాష్ట్రుడుకూడ ధర్మజునిదే రాజ్యాధికార మని కంఠోక్తిగా జెప్పియుండెను. వెనుక 'ధృతరాష్ట్రుడు రాజ్యాభిషిక్తుడనుటకు సంస్కృతభారతముగూడ బ్రమాణము' అనుప్రసంగమును నిరాకరించునపుడు ప్రదర్శింపబడియున్న యుద్యోగపర్వవచనములచే రాజ్యము ధృతరాష్ట్రునిదికాదు. పాండుభూపతిదే యని భీష్ముడు కంఠోక్తిగా జెప్పియుండెను. గాంధారి కంఠోక్తిగా జెప్పియుండెను. అదియే దుర్యోధనునిచే దాడ్రియొద్ద జెప్పబడినది. అదియే పౌరులచే సభాస్థలములలో బ్రసంగింపబడినది. అది వస్తుస్థితియేగాని వేరొకటి

కాదు. అందుచేత దుర్యోధనుకు తనతండ్రికి రాజ్యము రాలేదనుట యుక్తమే. కాబట్టి ప్రతివాదుల వ్రాత పరాస్తము.

ఇంతవరకు సంస్కృతాంధ్రభారతపర్యాలోచనముచేత, ధృత రాష్ట్రరాజ్యవాదమున కేవే యభ్యంతరముల నుదాహరించి ప్రతి వాదులు పరిహరింపబూనిరో అవి యేవియు బరిహరింపబడక యపరి హార్యములై ధృతరాష్ట్రరాజ్యవాదమును త్రోసివేసి పాండురాజరాజ్య వాదమునే స్థిరపరచుచున్నవని గ్రహింపవలయును.

—: "భీష్ముడు కోపమువచ్చి దుర్యోధనునితో పాండుభూపతియే రాజయ్యెను పాండవులదే రాజ్యము, అని చెప్పె" నను ప్రసంగము—తన్నిరాకరణము: —

దాయభాగవినిర్ణయములో నిట్లున్నది—"దుర్యోధనుడు రాజ్య మంతయు దానే మ్రింగవలె నను దురాశచే మూర్ఖపుపట్టు బట్టగ గోపము వచ్చి భీష్ముడు పౌరులమాటల ననుకరించి—

"రాజా తు పాండు రభవ న్మహాత్మా లోకవిశ్రుతః ।
స రాజా తస్య తే పుత్రాః పితు ర్దాయాద్యహారిణః ॥
మా తాత కలహం కార్షీ రాజ్యస్యార్థం ప్రదీయతామ్ "

అనిపలికినాడు. లోకవిశ్రుతు డగు రాజు పాండువై నాడు. అతని తరువాత నాతని పుత్రులు రాజు లగుదురు. కాన రాజ్యమంతయు నాది యని పెంకిపట్టు పట్టక యర్ధరాజ్యము పాండవుల కిమ్ము. అని పలికియున్నాడు" (పు—26)

ఇచ్చట వీరు చూపిన వచనములు ఉద్యోగపర్వములో 147 అధ్యాయములోని 39—40 శ్లోకములు. అందు 39 శ్లోకములోని యుత్త రార్థము మాత్రమే చూపబడినది. దానిపూర్వార్థము—

"అన్ధః కరణహీనత్వా న్న వై రాజా పితా తవ"

అనునది, ఇప్పుడు ధృతరాష్ట్రుడు రాజు కాక పోవు ట కు

హేతువు, అంధత్వ మని చెప్పియే పాండురాజు రాజయ్యె నని సహేతు కముగా భీష్ముడు చెప్పినట్లు స్పష్టము.

ఈస్థితిలో నాతని యంధత్వమునుబట్టి రాజు కాలేదని చెప్పి నట్లా? తనకోపమునుబట్టి రాజు కాలేదని చెప్పినట్లా? ఆతని కాయంధ త్వముగూడ భీష్మునికోపమునుబట్టియే వచ్చినదని చెప్పడురాయేమి! కనుక నది వస్తుస్థితి యగుటచేతనే అట్లు చెప్పెనని యొప్పుకొనకతీరదు.

ఇంకొకటి. ప్రతివాదిమతప్రకారము ధృతరాష్ట్రుని రాజ్యాభిషి క్తుని జేసినట్టియు, సకలధర్మవేత్త యని ప్రతివాదులచే గీర్తింపబడి నట్టియు, భీష్ముడు తనకు గోపము వచ్చినపుడు రాజు ధృతరాష్ట్రుడు కాడనియు. గోపము రానప్పుడు ధృతరాష్ట్రుడే యనియు జెప్పెడి ధర్మ వేత్త యగునురా! రాజ్య మంతయు తనదే యని కూర్చుండిన దుర్యో ధనుడు నిజస్థితికి విరుద్ధమైన భీష్ముని మాటపై ఆక్షేపింపక పలుకకుం డునందురా!

ఇంకొకటి— భీష్ము డామాటను శ్రీకృష్ణుని రాయభారసందర్భ ములో జెప్పియున్నాడు ఆ సందర్భములోనే ధృతరాష్ట్రుడుకూడ పుత్రున కేమి చెప్పెనో చూడుడు —

—♦ ఉద్యోగపర్వము—అ 149 ♦—

మన కురువంశమందలి పూర్వపురుషులలో యయాతికి జ్యేష్ఠ పుత్రుడు యదువు, కనిష్ఠపుత్రుడు పురువు, ఆజ్యేష్ఠుడు తండ్రి యిష్టా నుసారము వర్తింపకపోవుటచే తండ్రి యాతనికి రాజ్య మీయక, తనకు విధేయుడై సంచరించిన కనిష్ఠునకే రాజ్య మిచ్చెను.

"ఏవం జ్యేష్ఠోఽప్యథోత్సిక్తో న రాజ్య మభిజాయతే ।
యవీయాంసోఽపి జాయన్తే రాజ్యం వృద్ధోపసేవయా"

నీలకంఠీయమ్—అభిజాయతే—ప్రాప్నోతి, జాయన్తే—లభన్తే। ఇట్లు జ్యేష్ఠుడైనను గర్వితుడు రాజ్యార్హుడు కానేరడు. పెద్దలయెడ వినయ విధేయతలు గలవాడు కనిష్ఠుడైనను రాజ్యమును బొందును.

నా తండ్రియగు విచిత్రవీర్యునకు పితామహుడు ప్రతీపమహారాజు. అతని పుత్రులలో ప్రథముడు దేవాపి, ద్వితీయుడు బాహ్లీకుడు, తృతీయుడు శంతనుడు.

"దేవాపిస్తు మహాతేజా స్త్వగ్దోషీ రాజసత్తమః ।
ధార్మిక స్సత్యవాదీ చ పితు శ్శుశ్రూషణే రతః ॥"

నీలకంఠీయమ్ — త్వగ్దోషీ — కుష్ఠీ

ఆదేవాపి, మహాతేజశ్శాలియై, ధార్మికుడై, సత్యవాదియై, పితృశుశ్రూషాపరాయణుడై యుండువాడు. అతనికి కుష్ఠవ్యాధి యుండెను. తండ్రి, అతని రాజ్యాభిషిక్తుని జేయ సంకల్పింపగా పౌరులును జానపదులును పెద్దలును గలిసి యట్లు చేయగూడదని నిషేధించిరి.

"ఏవం వదాన్యో ధర్మజ్ఞ స్సత్యసంధశ్చసోఽభవత్ ।
ప్రియః ప్రజానామపి సన్ త్వగ్దోషేణ ప్రదూషితః ॥
హీనాంగం పృథివీపాలం నాఽభినన్దన్తి దేవతాః ।
ఇతి కృత్వా నృపశ్రేష్ఠం ప్రత్యషేధన్ ద్విజర్షభాః ॥"

ఇట్లు దాతయై ధర్మజ్ఞుడై సత్యసంధుడై ప్రజాప్రియుడై యుండియు వ్యాధిదోషముచే దూషితుడయ్యెను. అంగహీనుడు రాజగుటను దేవత లభినందింపరని యానృపశ్రేష్ఠుని రాజ్యాభిషేకమును నిషేధించిరి.

"బాహ్లీకో మాతులకులం త్యక్త్వా రాజ్యం సమాశ్రితః ।
పితృభ్రాతౄన్ పరిత్యజ్య ప్రాప్తవాన్ పరమర్ధివత్ ॥
బాహ్లీకేన త్వనుజ్ఞాత శ్శంతను ర్లోకవిశ్రుతః ।
పిత ర్యుపరతే రాజన్ రాజా రాజ్య మకారయత్ ॥"

ఇక ద్వితీయుడవగు బాహ్లీకుడు రాజ్యము నపేక్షింపక పితృభ్రాతృవర్గమును విడిచి సర్వైశ్వర్యసమృద్ధమైన మాతామహవంశమునకు జేరియుండెను. తృతీయుడగు శంతనుమహారాజు తండ్రి గతించి

నతరువాత అన్నయగు బాహ్లీకుని యనుజ్ఞపై తాను రాజయి రాజ్య మును పరిపాలించెను.

“తథైవాఽహం మతిమతా పరిచింత్యేహ పాండునా |
జ్యేష్ఠః ప్రభ్రంశితో రాజ్యాద్ధీనాంగ ఇతి భారత ||
పాండుస్తు రాజ్యం సంప్రాప్తః కనీయానపి స న్నృపః |
వినాశే తస్య పుత్రాణా మిదం రాజ్య మరిందమ ||
మయ్యభాగిని రాజ్యాయ కథం త్వం రాజ్య మిచ్ఛసి |
అరాజపుత్రో హ్యస్వామీ పరస్వం హర్తు మిచ్ఛసి ||
క్రమాగతం రాజ్య మిదం పరేషాం హర్తుం కథం శక్ష్యసి దుర్వినీత”

అట్లే జ్యేష్ఠుడనైన నేను హీనాంగుడ నగుటచే రాజ్యభ్రంశితు డనైతిని, కనిష్ఠుడైనను యోగ్యుడగు పాండురాజు రాజ్యమును బొం దెను. ఆతడు పోవుటవలన నీరాజ్యము పాండుపుత్రులదే, నేనే రాజ్య భాక్కును కానపుడు నీవెట్లు రాజ్యము నపేక్షించెదవు?

రాజపుత్రుడవు కాకపోవుటచే రాజ్యాధికారము (హక్కు) లేనట్టినీవు పరులసొత్తునపహరింపదలచుచున్నావు. పాండవులకిది క్రమా గతమైన రాజ్యము. నీవు దాని నెట్లపహరింపగలుగుదువు? అని కుల సంప్రదాయము నుదాహరించుచు వచ్చి తనకుగాని దుర్యోధనునకు గాని రాజ్యము నం దధికారము(హక్కు) లేదనియే స్పష్టముగా జెప్పి యుండెను.

ఈధృతరాష్ట్రోక్తులలో “హీనాంగం పృథివీపాలం నాభినన్దన్తి దేవతాః” అను వాక్యము గమనింపగదగినది. పట్టాభిషిక్తుడగు రాజు అన్నియోగ్యతలు గలవాడయినపుడు దేవతానుగ్రహపాత్రుడగును. దేవతానుగ్రహపాత్రుడయినపుడు రాజ్యమందు దుర్భిక్షాదిదోష ములు సంభవింపకుండును. అవి సంభవింపనపుడే ప్రజలు అన్నోదక సమృద్ధితో వివిధభోగము లనుభవించుచు రాజునం దనురక్తులును, రాజాజ్ఞానువర్తులు నయి ధర్మబద్ధులయి వ్యవహరింతురు.

ఇట్లు రాజ్యాస్థైర్యమునకు దేవతానుగ్రహము ముఖ్యము. దానికి రాజు నిర్దుష్టత్వము కారణము. ఆదోషములలో హీనాంగత్వ మొక పెద్దదోషము. అది ధృతరాష్ట్రునకు దటస్థించినది. అందుచేనాతడు రాజగుట శాస్త్రనూష్యమైనది, అంతియకాని యాతనికి రాజ్యము చేయు సామర్థ్య ముండదని శాస్త్రదూష్యమగుట కాదు. అట్టి సామర్థ్యము ప్రతినిధుల ద్వారా కలుగనే వచ్చును.

కనుక దాయభాగవినిర్ణయములో "గ్రుడ్డివాడు రాజ్యార్హుడు గాడన వాడు రాజ్యయి చేసిన బాపము వచ్చునని తాత్పర్యముగాదు, రాజ్యము చేయు సామర్థ్య ముండదుగాన వాడు రాజ్యానర్హు డని శాస్త్రములు చెప్పినవి" (పు 5) అను వ్రాత పరాస్తమైనది.

రాజ్యాభిషేక మనునది యొక శాస్త్రీయసంస్కారము. అట్టి సంస్కారముతో గూడిన రాజ్యాధిపత్యమె హీనాంగునకు శాస్త్రనిషిద్ధముగాని కేవల మాధిపత్యము నిషిద్ధము గాదు. అందుచేతనే పాండురాజుచే విదురధృతరాష్ట్రులకు వప్పగింపబడిన రాజ్యమునకు ఆతడు ఆధిపత్యమునుమాత్రము వహించినాడు. దీనిచేత దాయభాగవినిర్ణయములో—

"గ్రుడ్డివాడు బొత్తుగా రాజ్యార్హుడు కాడని చెప్పకొందుమేని మొదటికే మోసమువచ్చును ఏమన:— పాండురాజానంతరమున నైన రాజ్యము స్వీకరించెనుగద. మొదట బనికిరానివాడప్పుడెట్లు పనికివచ్చినాడు" (పు 12)

అనునది పరాస్తమయినది. అది రాజ్యాభిషేకపూర్వకమైనరాజ్య స్వీకారము కాదుగనుక పనికివచ్చినదని తెలిసికొనవలయును.

ఇక ప్రకృతమునకు వత్తము— పూర్వోక్తప్రకారము ధృతరాష్ట్రుడు చెప్పినట్లే నిజస్థితిని జెప్పిన భీష్ముడు కోపమువచ్చి యట్లు చెప్పెనని ప్రతివాదులనుట అయుక్తము.

కురుసభనుండి కృష్ణభగవానుడు పాండవులయొద్దకు వెళ్ళి కురుసభావృత్తాంతమును జెప్పునపుడు దుర్యోధనున కెవ్వ రెవ్వ రేయేవిధముగా బోధించిరో వివరించి యుధిష్ఠిరునకు దెలిపెను. ఆవిషయము ఉద్యోగపర్వము_ 147_148_149 అధ్యాయములలో నున్నది. దానిని సంగ్రహించి లక్ష్మణసూరి తనగ్రంథములో నిట్లుచెప్పెను చూడుడు—

భారతసంగ్రహము——

"కృష్ణస్తు యుధిష్ఠిర మాసాద్య సభావృత్తం వర్ణయితు మారేభే, శృణు రాజ న్నజాతశత్రో! సర్వ మపి వక్తవ్యం మయోక్తం, తేన దురాత్మనా న గృహీత మితి నాద్భుతం, కిన్తు 'తాత దుర్యోధన! మమేదం పిత్ర్యం రాజ్యం మదుపేక్షయా విచిత్రవీర్యం, తతః పాణ్డుం, తత స్తవ పితరం చాగాత్, మయి స్థితే న కస్యాఽప్యత్ర స్వాతన్త్ర్యం, తస్మా న్మద్వచనా త్పాండవేభ్యో భాగం ప్రయచ్ఛ' ఇతి న్యాయవాదిని భీష్మే,

'యత్ర భీష్మ స్తత్ర ద్రోణః తిష్ఠ పితామహవచనే, తథైవ వయం తవాధీనాః' ఇతి శాస త్యాచార్యే,

'పిత శ్శాన్తవ! కోఽయం దుర్యోధనోనామ, త్వయా వర్ధితం కులం నశ్య త్కథ ముపేక్షసే, తదిమం నిగృహ్య స్వయం శాధి' ఇతి తర్జయతి క్షత్తరి.

'వత్స! కథం భీష్మాదీ నతీత్య తవ స్వాతన్త్ర్యం, తేషాం వచసి తిష్ఠ. అల మర్ధం రాజ్యం సవర్గస్య తవ భోగాయ' ఇత్యనునయన్త్యాం మాతరి.

'భద్ర! పూర్వం జ్యేష్ఠే యదా స్థితేఽపి పితురిష్టతయా కనిష్ఠః పురుః రాజా బభూవ తథా త్వగ్దోషేణ జ్యేష్ఠమపి దేవాపి మతీత్య కనిష్ఠ మస్మత్పితామహం శన్తనుమేవ రాజ్యశ్రీః శిశ్రియే పితుకనిష్ఠో హీనాంగో వా న రాజ్యార్హ ఇత్యస్మత్కులమర్యాదా అనేనైవ న్యాయేన మమ రాజ్యం నాభూత్ అభాగిన స్తవాఽర్ధ మప్యధికమే

వ, తస్మా చ్ఛ్రాద్ధావత్యా ఇతి కులసంప్రదాయ ముపదిశతి రాజని ధృతరాష్ట్రే సర్వమేత త్స మూర్ధ్న ఆకాశభాషిత మివాఽనవధార్య....
...... సేనాం నివేశయామాస ||

ఈగ్రంథమునకు సంబంధించిన మహాభారతవచనములు వెనుక నాయాస్థలములలో నుదాహరింపబడినవి. మొత్తముమీద భీష్మాదులుగాని, గాంధారీధృతరాష్ట్రులుగాని, పౌరులుగాని, రాజ్యము పాండురాజుదే యనియు, నందుచే బాండవులదే రాజ్యాధికారమనియు సహేతుకముగా జెప్పినారనుట నిర్వివాదము.

పాండవులను వారణావతమునకు దురాలోచనముతో బంపదలచి తనతండ్రితో మాటలాడినపుడు దుర్యోధనుడుకూడ నట్లేచెప్పెను కనుక రాజ్యాధికారము తనదే యని దుర్యోధనుని యూహకాదు. మరేమనగా-ఎట్లో తనతండ్రిచేతికి చిక్కియున్న రాజ్యమును పాండవులకీయకుండ తానే కబళింపవలెనని యూహ, ఇది యంతర్గతవిషయము. బహిర్గతముగా మాటలాడునపుడు "అప్రదేయం పురా దత్తం రాజ్యం పరవతో మమ" అని ఈవిధముగా మాటలాడినాడు.

ఇట్టిమాటల నందుకొని దుర్యోధనపక్షపాతులు దుర్యోధనునిదే రాజ్యమని మెచ్చి యావద్గ్రంథమునకును అపార్థములు చెప్పసాగిరి. అది యప్రామాణిక మనియు, ననుపపన్నమనియు నిరూపించియున్నాముగాబట్టి 'కోపమువచ్చి భీష్ముడు పాండుభూపతిదే రాజ్యమని చెప్పెను' అను ప్రతివాదుల వ్రాతకు తోసివేతయైనది.

— ♦పాండుధృతరాష్ట్రుల రాజ్యభాగములు వేరుగానున్నవని ధృతరాష్ట్ర వాక్యముచే దెలియుచున్నదను ప్రసంగము—

తన్నిరాకరణము—

దాయభాగవినిర్ణయములో నిట్లున్నది—"ధర్మజ దుర్యోధనాదులుపుట్టినతరువాత ధృతరాష్ట్రు డీక్రిందివాక్యముల బలికినాడు—

"యుధిష్ఠిరో రాజపుత్రో జ్యేష్ఠో నః కులవర్ధనః ।
ప్రాప్త స్స్వగుణతో రాజ్యం న తస్మిన్ వాచ్య మస్తి నః ॥
అయం త్వనన్తర స్తస్మా దపి రాజా భవిష్యతి ॥"

యుధిష్ఠిరుడు జ్యేష్ఠుడుగాన స్వగుణముచే రాజ్యమునుబొందెను. అనంతరుడైన దుర్యోధనుడును రాజు కాగలడా? అని ధృతరాష్ట్రు డడిగినాడు. ఉభయులును రాజులగుట యెట్లన పాండుపుత్రులలో జ్యేష్ఠుడగు ధర్మజుడు పాండుభాగమునకు రాజగుననియు, దనభాగమునకు దుర్యోధనుడు రాజగునా? అనియు దీని కర్థమై తీరవలెను. లేకున్న నర్థమే లేదు.

ధృతరాష్ట్రునకు భాగమే యున్నయెడల నయ్యది దుర్యోధనునకు వచ్చునా? అని ప్రశ్న వేయనేల? యందురేని దుర్నిమిత్తకారణమున నట్లడుగవలసివచ్చె నని గ్రహించునది" (పు 18)

ప్రతివాదులచే పాండుధృతరాష్ట్రులకు గల్పింపబడిన రాజ్య విభాగము ప్రమాణాంతరసిద్ధమై యున్నప్పుడు వారి ప్రశ్నసందర్భమును దానికి బలకరముగా జూపిన జూపవచ్చునుగాని, ప్రమాణవిరుద్ధమై యున్న వారి విభాగకల్పన కిది ప్రమాణ మనుట యుక్తము కాదు. ధృతరాష్ట్రప్రశ్నము 'అపి రాజా భవిష్యతి' దుర్యోధనుడు రాజగునా? అనునది. దీనికి అతడు రాజ్యమును బొందునా! అని యర్థ మనుటకు వీలులేదు. "రాజపుత్రః యుధిష్ఠిరః రాజ్యం ప్రాప్తః" అని రాజపుత్రుడగు యుధిష్ఠిరుడు రాజ్యమును బొందె ననుటలో రాజ్యప్రాప్తి యుధిష్ఠిరునకే యని నిర్ధారణ చేయబడినది.

ఇక నీ రాజశబ్దమున కేమి యర్థమో విచారింతము—

"ప్రభౌ భూమిపతౌ రాజా క్షత్రియే రజనీపతౌ" అనుకోశమునుబట్టి యిచ్చటి రాజశబ్దమునకు భూమిపతి యర్థముగాక ప్రభువని యర్థము ప్రభువనగా—

"అధిభూ ర్నాయకో నేతా ప్రభుః పరివృఢోఽధిపః"

అనుకోశమునుబట్టి 'ప్రభవతి సమర్థో భవతీతి ప్రభుః' అను వ్యుత్పత్తిచే నాయకుడని యర్థము. అందుచే నీతడు కౌరవనాయకుడై కులపాలకు డగునా? అని తెలిసికొనుటకై యట్లు ప్రశ్నించెను. కను కనే విప్రుల సమాధానములో—

"తేఽబ్రువన్ బ్రాహ్మణా రాజన్ విదురశ్చ మహామతిః ।
యథేమాని నిమిత్తాని ఘోరాణి మనుజాధిప ॥
ఉత్థితాని సుతే జాతే జ్యేష్ఠే తే పురుషర్షభ ।
వ్యక్తం కులాన్తకరణో భవితైష సుత స్తవ ॥ " (ఆది-అ 115)

నీపుత్రుని జన్మకాలమందలి దుర్నిమిత్తములనుబట్టి జూడగా నీతడు తప్పక కులాంతకు డగునని చెప్పబడినది

రాజ్యమును బొందునా? అని ప్రశ్నతాత్పర్యమైన యెడల ప్రతివాదిమతప్రకారము ధృతరాష్ట్రుని రాజ్యమును, తరువాత పాండవుల రాజ్యమునుగూడ పొందునని యే జెప్పవలసియుండ దాని కేమియు సంబంధములేకుండ సమాధానము చెప్పుట అసంగతముకాదా! కనుక ప్రతివాదులు చెప్పిన యర్థములో ప్రశ్నోత్తరముల కానుగుణ్యము లేకపోవుటవలన నది యపార్థము. అందుచేత వారివాద పరాస్తమైనది.

—: "రాజ్యము ధార్తరాష్ట్రులకును, పాండవులకునుగూడ పిత్ర్య మని భీష్ముడు చెప్పె" నను ప్రసంగము—తన్నిరాకరణము :—

దాయభాగవినిర్ణయములో నిట్లున్నది— "రాజ్య ముభయులకునుగూడ సమముగా పిత్ర్యమైన దని భారతమే స్పష్టముగా దెలుపుచున్నది. సకలధర్మవేత్త యగు భీష్ముడే యీరహస్యమును విడగొట్టినాడు. ఆతడు ప్రప్రథమంబుననే దుర్యోధనునకు బుద్ధులు చెప్పుటలో నీక్రిందివాక్యములను బలికియున్నాడు—

"దుర్యోధన యథా రాజ్యం త్వ మిదం తాత పశ్యసి ।
మమ పైతృక మిత్యేవం తేఽపి పశ్యన్తి పాండవాః ॥

యది రాజ్యం న తే ప్రాప్తాః పాండవేయా యశస్వినః ।
కుత ఏవ తవాఽఽదం భారతస్యాఽపి కస్యచిత్ ॥
అథ ధర్మేణ రాజ్యం త్వం ప్రాప్తవాన్ భరతర్షభ ।
తేఽపి రాజ్య మనుప్రాప్తాః పూర్వ మేవేతి మే మతిః ॥

దుర్యోధనా! ఈరాజ్యము నీపైతృక మని నీవెట్లు తలచుచున్నావో యట్లే మాపైతృకమని పాండవులునుదలచుచున్నారు. రాజ్యము పాండవులకు ప్రాప్తింపనియెడల నీకు మాత్రమెట్లు లభించినది. ధర్మముచేతనే నీకు రాజ్యప్రాప్తి కలిగినది. అట్లనే వారికిని గలిగినది.

ఈవాక్యములవలన నీరాజ్య ముభయులకునుగూడ పైతృకముగానే చెందినట్లును ఉభయులునుగూడ ధర్మముచేతనే పొందినట్లును విస్పష్టమగుచున్నది" (పు 19)

ఈభీష్మోపదేశ మెప్పుడు జరిగిన దనగా ధర్మజుడు యువరాజు చేయబడినతరువాత వారణావతమునకు పాండవులను బంపివేసినపిమ్మట నచ్చట దుర్యోధనకృతమైన యుపద్రవమునుండి తప్పించుకొని వారు క్రమముగా ద్రుపదపురమునకు జేరి ద్రౌపదీవివాహము జేసికొని యచ్చటనే యుండగా వారిని రప్పించి, వారికి రాజ్య మిచ్చి కలుపుకొని వారితో విరోధము మాని సఖ్యముగా నుండుమని బోధించు సందర్భములో జరిగినది.

అసలు రాజ్యమునుగూర్చి ప్రతివాదుల మత మేమనగా—రాజ్యాభిషిక్తుడు ధృతరాష్ట్రుడే; ప్రతినిధి పాండురాజు; మూలరాజ్యము ధృతరాష్ట్రునిది; ధృతరాష్ట్రదత్తమైన సంపాదితరాజ్యము పాండురాజుది; ధర్మజుడు యువరాజుగా జేయబడినది యీ పాండురాజుభాగమునకే. అని.

ఇట్టిస్థితిలో భీష్మవాక్యములుగా జూపబడిన గ్రంథమునందలి ప్రథమశ్లోకములో 'ఇదం రాజ్యం మమ పైతృక మితి త్వం యథా

పశ్యసి, ఏనం మమ పైతృక మితి తేఽపి పశ్యన్తి' అనునపుడు 'తేఽపి కిం పశ్యన్తి' అను కర్మాకాంక్షలో 'ఇదం రాజ్యమ్' అనునదే కర్మగా నన్వయించును. అంతియుకాని నీభాగమును నీ వనుకొనుచున్నట్లు వారి భాగమును వా రనుకొనుచున్నారు అని యర్థము వర్ణించుటకు వీలు లేదు. పాండుధృతరాష్ట్రులకు రాజ్యభాగములు వేరుగా నున్నవనుట గ్రంథవిరుద్ధమనికూడ నిరూపించియేయున్నాము. ఇప్పుడ్డు దుర్యోధను డేరాజ్యము నా పైతృక మనుకొనుచుండెనో, ఆరాజ్యమే మా పైతృక మని పాండవు లనుకొనుచున్నారని చెప్పె నని యర్థము.

ఇది రహస్యమును విడగొట్టినా డన్న భీష్ముడు అవిభక్తమై యున్న రాజ్యమునుగూర్చి చెప్పినట్లా? లేక విభక్తమైయున్న రాజ్యమునుగూర్చి చెప్పినట్లా?

ప్రథమపక్షములో, ప్రతివాదిమతప్రకారము రాజ్యాభిషిక్తుడు ధృతరాష్ట్రుడు గనుక దుర్యోధనున కది పైతృక మగును (హక్కు కల దగును) గాని పాండవులకు పైతృకముగాదు.

విభక్తరాజ్యమునుగూర్చి చెప్పె నను పక్షములో ధృతరాష్ట్ర రాజ్యము దుర్యోధనునకును, పాండురాజరాజ్యము పాండవులకును పైతృక మగునుగాని యేయొకరాజ్య మిరువురకును పైతృకము గానేరదు.

ఇక ధృతరాష్ట్రరాజ్యము పాండవులకుగూడ పైతృకము గాకున్నను, ధృతరాష్ట్రదత్త పాండురాజరాజ్యము మాత్రము ధృతరాష్ట్రుని దాన ము చెల్లదనియో, అది పాండురాజు యావజ్జీవితానుభవమునకుమాత్రమే అనియో తగవులాడుపక్షములో దుర్యోధనునకుగూడ పైతృకము కాదగునుగనుక విభక్తరాజ్యపక్షములో నా భీష్మోక్తి సరిపడు నందురా?

అప్పుడైనను ధృతరాష్ట్రదత్తము యావజ్జీవితమే యైనయెడల నది దుర్యోధనునకే పైతృక మగును. అది పుత్రపౌత్రపారంపర్యముగా జెందునట్టి దయినపుడు పాండవులకే పైతృక మగును. ఉభయులకును

జైత్రుకమగుట విరుద్ధము. ఆపై ధృతరాష్ట్రదత్తము పాండవులకు జెందునట్టి దగునో కాదో నిర్ధారణచేసి చెప్పవలసిన భీష్ముడు తేల్చి చెప్పక నీవనుకొనుచున్నట్లే వారును అనుకొనుచున్నా రని చెప్పుట విరుద్ధము. కనుక ప్రథమశ్లోకము అసంగత మగుచున్నది.

'రాజ్యము పాండవులకు ప్రాప్తింపనియెడల నీకు మాత్ర మెట్లు లభించినది?' అను ద్వితీయశ్లోకముగూడ విరుద్ధమే.

అవిభక్తమో విభక్తమో అయి యుండి పాండవులకు ప్రాప్తింపనట్టి ధృతరాష్ట్రరాజ్యము దుర్యోధనునకు లభింపకపోవు టేమి! "అథ ధర్మేణ రాజ్యం త్వం ప్రాప్తవాన్" అను తృతీయశ్లోకములోని 'అథ' శబ్దము ప్రశ్నార్థకము. అంచే, నీకు రాజ్యప్రాప్తి ధర్మముచేత గలిగెనా! వారికిని పూర్వమే కలిగినది. అని దాని కర్థము. "ధర్మము చేతనే నీకు రాజ్యప్రాప్తి కలిగినది. అట్లే వారికిని గలిగినది" అని వారు వ్రాసిన యర్థము సరియైనది కాదు. వారు వ్రాసినట్లు చూచి నయెడల ధర్మముచేత దుర్యోధనునకు ప్రాప్తించినట్లు రాజ్యము పూర్వమే పాండవులకు ధర్మముచే ప్రాప్తించిన దనుట విరుద్ధమే.

వారికి పూర్వమే ప్రాప్తించిన దనుటలో ధర్మజునకు జరిగిన యౌవరాజ్యాభిషేకము, దుర్యోధనుని పుట్టుకకు పూర్వము జరిగిన పాండురాజరాజ్యాభిషేకము స్ఫురింపజేయబడినది.

ప్రతివాదులు వర్ణించిన భీష్మవాక్యతాత్పర్యమునుబట్టి యాశ్లోకము లసంగతము లగుచుండుటచే నాశ్లోకములనుజూపి యారాజ్యము ధార్తరాష్ట్రులకును, పాండవులకును సమముగా పిత్ర్యమైన దనుట యును, ఈరహస్యమును భీష్ముడే విడగొట్టినా డనుటయును ప్రతి వాదుల కయుక్తము.

ఇక పాండురాజరాజ్యవాదు లాభీష్మవాక్యతాత్పర్య మెట్లు వర్ణింతురో వినుడు—

రాజ్యాధికారము పాండవులదే యని దుర్యోధనధృతరాష్ట్రులే తమ పరస్పరప్రసంగములలో జెప్పుకొని యున్నట్లు సంస్కృతాంధ్ర భారతములవలన దెలిసిన విషయమే. కనుక రాజ్యాధికారమును నిర్ణయించుటకై యీభీష్మోపదేశము కాదు.

మఱేమనః- రాజ్యాధికార మెవరిదైనను ఒకరాజకుటుంబము లోనివా రందరును అనుభవయోగ్యత కలవారే యని శాస్త్రసమ్మతము గనుక నీపైతృకమై నీకనుభవయోగ్యమైనట్లు వారి పైతృకమై వారికిని అనుభవయోగ్యమే అయినది. మీరంద రేకకుటుంబమునకు జెందినవారు కాదా అనియు, అనుభవవిషయమైగాని అధికారవిషయమైగాని వారికి లేని యర్హత నీకేమి కలదో చెప్పు మనియు బోధించుట కీయుపదేశము.

రాజ్యతృష్ణతో పాండవవైరియై వారు రాజ్యమనుభవింపకుండునట్లు దుర్యోధను డనేకప్రయత్నములు చేయుచున్నాడు. అట్టిదుర్యోధనునకు, నీవలె వారు మాత్రి మీరాజ్య మనుభవింపదగరా? అనియు, వారియందు లేని యర్హత నీయందేమున్నదనియు, వారిని నిరాకరించుటకు హేతువు నీవేమి చెప్పగలవనియు, మందలించుటకు గాను భీష్ముడీయుపదేశ మారంభించి దుర్యోధనాభిప్రాయోద్ఘాటనపూర్వకముగా నీకు గల రాజ్యానుభవయోగ్యత వారికి లేకపోలేదని యిటు లాశ్లోకత్రయముతో నిరూపించెను.

దుర్యోధనా! ఈరాజ్యము నాపైతృకము గనుక నాకనుభవయోగ్య మనుకొనుచుంటివా? వారును ఇదిమాపైతృకముగనుక మాకనుభవయోగ్య మనుకొనుచున్నారు. అని ప్రథమశ్లోకముచే జెప్పెను. ఈచెప్పుటలో రాజ్య ముభయులకు పైతృక మగుటవలన మీరంద రేకకుటుంబములోనివారుగనుక ననుభవయోగ్యత సమానమే యనుట భీష్మతాత్పర్యము.

ఇక ద్వితీయశ్లోకము — పాండురాజునకు క్షేత్రజులు పాండవులు. ధృతరాష్ట్రుని కౌరసుడను నేను కాబట్టి వారికి లేని యర్ధాంత రాజ్యప్రాప్తివిషయమై నాకే కలదు. క్షేత్రజులైనట్టి పాండవులకు రాజ్యప్రాప్తి లేనే లేదు. అని నీవందువా?

"యది రాజ్యం న తే ప్రాప్తాః పాండవేయా యశస్వినః।
కుత ఏవ తవాపీదం భారతస్యాఽపి కస్య చిత్ ॥

క్షేత్రజులకు నీవన్నట్లు రాజ్యప్రాప్తి లేకుండినచో "కస్య చిత్ భారతస్యేదం తవాపి కుతః" ఒకానొకభరతవంశోద్భవుడగు విచిత్రవీర్యుని యీరాజ్యము నీకుమాత్ర మెట్లుప్రాప్తించును.

ఆవిచిత్రవీర్యుని క్షేత్రజుడే నీతండ్రి. క్షేత్రజునకు రాజ్యప్రాప్తి లేదాయె. మరి నీసిద్ధాంతమునుబట్టి నీతండ్రికే ప్రాప్తించని రాజ్యము నీకు ప్రాప్తించు టెట్లు? అని తాత్పర్యము.

ఇక తృతీయశ్లోకము — నాతండ్రి క్షేత్రజు డయినను క్షేత్రజునకు రాజ్యప్రాప్తి శాస్త్రీయమే కనుక నాకు రాజ్యము ధర్మముచేతనే ప్రాప్తించిన దని నీవందువా?

"అథ ధర్మేణ రాజ్యం త్వం ప్రాప్తవాన్ భరతర్షభ।
తేఽపి రాజ్య మనుప్రాప్తాః పూర్వమేవేతి మే మతిః ॥

అట్లైన యాధర్మము నుబట్టి వారును పూర్వమే రాజ్యమును బొందినారు. నాకు రాజ్యము ప్రాప్తించినదని నీవిప్పుడనుచున్నావుగాని పూర్వము యువరాజు నప్పుడే ధర్మజునకు రాజ్యము ప్రాప్తించినది. నీవు పుట్టకపూర్వమే రాజ్యాభిషిక్తు డయిన పాండురాజునకు ప్రాప్తించినది. అట్టివారిని నిరాకరించి యీరాజ్యమును నీవాక్రమించుట యేమి యుక్తము? అని తాత్పర్యము. దీనిచేత రాజ్యాధికారము పాండవులదే యని సూచింపబడినది. అనుభవయోగ్యతయే నీకు గలదని ప్రథమశ్లోకముచే జెప్పబడినది. కనుక ప్రతివాదులు చెప్పిన యర్థములో దటస్థించిన విరోధము లిప్పు డాశ్లోకములకు లేవు. ఉద్యోగప

ర్వములోని పూర్వోక్త భీష్మాదివచనములకుగూడ విరోధము లేదు. పూర్వోక్త పౌరవాక్యములకు దుర్యోధనధృతరాష్ట్రుల పూర్వోక్త వాక్యములకుగూడ విరోధము లేదు.

ఈభీష్మవచనతాత్పర్యమును మనమ్ములో బెట్టికొనికాబోలు "దూతవాక్యము" అను తనగ్రంథములో దుర్యోధనశ్రీకృష్ణుల వాక్యోపవాక్యములుగా భాసమహాకవి యిట్లు వ్రాసియుండెను—

దుర్యోధనః— కథం కథం దాయాద్య మితి ।

"వనే పితృవ్యో మృగయాప్రసంగతః
కృతాపరాధో మునిశాప మాప్తవాన్ ।
తదాప్రభృత్యేవ సదారనిస్పృహః
పరాత్మజానాం పితృతాం కథం వ్రజేత్ ॥

వాసుదేవః—పురావిదం భవన్తం పృచ్ఛామి—

"విచిత్రవీర్యో విషయీ విపత్తిం
క్షయేణ యాతః పున రంబికాయాం
వ్యాసేన జాతో ధృతరాష్ట్ర ఏష
లభేత రాజ్యం జనకః కథం తే ॥ "

ఇచ్చట దుర్యోధనుడు చెప్పిన దేమనగా, మునిశాపమును బొంది భార్యాసంబంధమును విసర్జించియున్న పాండురాజు, క్షేత్రజులగు పాండవులకు పిత కానపుడు వారికెట్లు దాయాద్యము, అని.

ఆపై కృష్ణభగవాను డన్న దేమనగా, విచిత్రవీర్యుడు గతించిన తరువాత క్షేత్రజుడై జన్మించిన నీతండ్రికి నీవన్నట్లు పిత కానట్టి విచిత్రవీర్యుని రాజ్యమును నీతండ్రి యెట్లు పొందగలుగును, అని.

ఇట్లు పరిశీలింపగా పాండుధృతరాష్ట్రులకువేరు వేరు రాజ్యభాగము లున్నవనియు, పాండవులకును ధార్తరాష్ట్రులకును ఆయాభాగములకు సమానముగా రాజ్యాధికారము కలదనియు, భీష్మవాక్యములే దీనికి ప్రమాణములనియు వ్రాసినది ఘరాస్త్రమయింది

— "పాండవుల కర్ధరాజ్య మిమ్మనియు, నది వారికి పిత్రంశ
మనియు, భీష్ముడు దుర్యోధనునితో జెప్పినాడు. ఇంత
కంటె నేమి రుజువుకావలెను?" అనుప్రసంగము —
తన్నిరాకరణము—

దాయభాగవినిర్ణయములో నిట్లున్నది—
1. "నచాపి తేషాం వీరాణాం జీవతాం కురునందన ।
పిత్ర్యోంశ శ్శక్య ఆదాతు మపి వజ్రభృతా స్వయమ్ ॥
అధర్మేణ నిరస్తాశ్చ తుల్యే రాజ్యే విశేషతః ।
యది ధర్మ స్త్వయా కార్యో యది కార్యం ప్రియం చ మే ॥
క్షేమం చ యది కర్తవ్యం తేషా మర్ధం ప్రదీయతామ్ '"
పాండవులు జీవించియుండగా వారి తండ్రిభాగమును నాక్రమిం
చుకొనుట కిందునికైనను శక్యము కాదు... వారికి నర్ధరాజ్య మిమ్మ
ని స్పష్టముగా జెప్పియున్నాడు. ఈయర్ధరాజ్యము పిత్రంశము
తండ్రిభాగము) అనికూడ జెప్పియున్నాడు. ఇంతకంటె నేమి ఋజువు
కావలెను?" (పు-20)

2. ఈవాక్యములు వినినతరువాత ధృతరాష్ట్రుడు—
"యథైవ మమ పుత్రాణా మిదం రాజ్యం విధీయతే ।
తథైవ పాండుపుత్రాణా మిదం రాజ్యం న సంశయః ॥"
ఈరాజ్యము నాపుత్రుల దెట్లుయియున్నదో యట్లే పాండు
పుత్రులదియును నైయున్నది. సంశయములేదు. అని చెప్పినాడు.
3. గాంధారి దుర్యోధనునకు జేసిన బోధలోగూడ నిట్లు చెప్ప
బడియున్నది —
"ప్రయచ్ఛ పాండుపుత్రాణాం యథోచిత మరిందమ ।
అల మర్ధం పృథివ్యాస్తే సహామాత్యస్య జీవితుమ్ ॥"
దుర్యోధనా! పాండుపుత్రుల కేది యుచితమో యది యిమ్ము.

అని చెప్పినది. ఆయుచితభాగ మేదనిన- నీకర్ధరాజ్యము చాలును. అని తెలుపుటచేత వారికి నీయదగినది యర్ధభాగ మని తేలినది. ఆయర్ధరాజ్యము వారి యంశ మనికూడ నీ క్రిందివాక్యములో గాంధారి చెప్పినది—

"స్వ మంశం పాండుపుత్రేభ్యః ప్రదాయ భరతర్షభ ।"

పాండవుల స్వభాగమును వారికిచ్చి యనుటచే వారికి రాదగినది యర్ధరాజ్యమే యని తేలుచున్నది" (పు 21)

ఈమూడంశములను బరీక్షింతము— ప్రథమాంశములోని భీష్మ వాక్యములో 'తేషాం తో ప్యంశః' అనియుండెనని పాండవుల తండ్రి భాగము కురురాజ్యముకంటె వేరుగా నున్నట్లు ప్రతివాదులు భావించు చున్నారు.

ఈభీష్మోపదేశ మెప్పటిదనగా— ద్రౌపదీవివాహము జేసికొని పాండవులు ద్రుపదపురమం దున్నసమయమున వారిని రప్పించి యర్ధ రాజ్య మిచ్చి యాదరింపవలసినదని చెప్పు సందర్భములోనిది. "దుర్యో ధన యథా రాజ్యం త్వ మిదం తాత పశ్యసి" అనుచు జెప్పబడిన ట్టియు, పూర్వము చర్చింపబడినట్టియు ఆదిపర్వము 203అధ్యాయము లోని గ్రంథమున కుత్తరగ్రంథమే యిది.

యీరాజ్యవిభాగప్రసక్తి యిప్పుడు సంభవించిన దేకాని యిం తకు బూర్వ మేమియు లేదు. పాండురాజకాలములోగాని ధర్మజునో యౌవరాజ్యకాలములోగాని రాజ్యవిభాగమై యున్నట్లు ప్రమాణవ చన మేదియు లేదు. ప్రతివాదులుమాత్రమున్నట్లు కల్పించినారు. ఆకల్పన ప్రమాణవిరుద్ధము. ఏమనగా—

యువరాజై యున్న యుధిష్ఠిరునకు రాజ్యాభిషేకము చేయుద మని పూర్వోత్తరపర్యాలోచనము చేయునపుడు పౌరులు—

"సహి భీష్మం శాన్తనవం ధృతరాష్ట్రం చ ధర్మవిత్ ।
సపుత్రం వివిధై ర్భోగై ర్యోజయిష్యతి పూజయన్ ॥

భీష్మధృతరాష్ట్రిధార్త్రరాష్ట్రిలను యుధిష్ఠిరుడే పూజింపుచు వారికి వివిధభోగములను కల్పించును. అని యాలోచించిరి.

ప్రతివాదిమతప్రకారము ధృతరాష్ట్రిని కురురాజ్యముకంటె పాండుభూపతి రాజ్యము విభిన్నమైయుండి దానికే ధర్మజుడు యువరాజుగా జేయబడి యుండి దానికే యిప్పుడు మహారాజుగా జేయబడుటకు పౌరు లాలోచించినపక్షములో కురురాజ్యము నాశ్రియించి యున్న ధృతరాష్ట్రిధార్త్రరాష్ట్రుల భోగభాగ్యములకు ధర్మజుని యవసర మేమున్నది? ఏకరాజ్యమే యగుటచేతను, దానికి యువరాజైన ధర్మజుడు మహారాజగుచుండుటచేతను, ధృతరాష్ట్రాదుల భోగభాగ్యములు ధర్మజుని యధీనము లగు నని పౌరు లాలోచించినారు. కనుక ప్రతివాదుల రాజ్యవిభాగకల్పన పౌరవాక్యవిరుద్ధము, సంస్కృతాంధ్రి భారతములలోని పూర్వోక్తదుర్యోధధృతరాష్ట్రిపరస్పరప్రిసంగ విరుద్ధము.

ఉద్యోగపర్వములో వెనుకజూపబడిన గాంధారీధృతరాష్ట్రాది వాక్యములకు విరుద్ధము.

కనుక ద్రుపదపురమునుండి పాండవులు రప్పింపబడునంతవరకును రాజ్యవిభాగము జరుగనే లేదు. దుర్యోధనుని పోరు దీర్పుట కిప్పుడుమాత్రిము విభజింప నెంచి భీష్ముడు వారి కర్ధరాజ్య మిమ్మని చెప్పెను వారికి పిత్ర్యమైన యంశమది అనిచెప్పెను. అప్పుడు ద్రోణాచార్యులుకూడ—

"మమాప్యేషా మతి స్తాత యా భీష్మస్య మహాత్మనః ।
సంవిభజ్యాస్తు కౌన్తేయా ధర్మ ఏష సనాతనః ॥" (ఆది_అ 204)

భీష్ముడు చెప్పినట్లు పాండవులకు విభజించి యిచ్చుటే నాకును సమ్మతము ఇది సనాతనధర్మము అని చెప్పెను.

పాండవుల కర్ధరాజ్య మిమ్మని యని వారికి పిత్ర్యమైన యంశమని జెప్పిన భీష్ముడు మిగిలిన యర్ధరాజ్యము నీకు పిత్ర్యమైన యంశ

మని దుర్యోధనునితో జెప్పలేదు. తాత్పర్య మేమనగా:— దుర్యోధనునకు విడువబడిన యర్ధరాజ్యము పాండవుల యర్ధరాజ్యమువలె సర్వాధికారములు గలది కాదనియు, యావజ్జీవోపభోగ్యమే యనియు సూచించుచున్న దని గ్రహింపవలయును.

తృతీయాంశములో ప్రతివాదు లుదాహరించిన గాంధారీవాక్యములో "అల మర్ధం పృథివ్యాస్తే సహామాత్యస్య జీవితుమ్" దుర్యోధనా! సపరివారముగా నీవు జీవించుట కర్ధరాజ్యము చాలును. అని చెప్పబడుటచేత దుర్యోధనాదులకు జీవనార్థము విడువబడినదే యర్ధరాజ్యమని గాంధారి స్పష్టపరచినదే యున్నది. అట్లు కౌరవుల కుపభోగార్థమై యొక భాగము విడువబడినది కనుక మిగిలిన భాగమే పాండవులు పరిగ్రహించినది కనుక పాండవుల భాగము పాండవుల కిమ్మని యుద్ధోద్యుక్తుడగు దుర్యోధనునకు బోధించిన గాంధారి మాట, పాండవుల యావద్రాజ్యాధికారమునకు విరోధించునది కాదు ఇక ద్వితీయాంశములో—

"యథైవ మమ పుత్రాణా మిదం రాజ్యం, తథైవ పాండుపుత్రాణా మిదం రాజ్యమ్" అను వాక్య ముభయులకును రాజ్యమొక్కటే యనియు, దుర్యోధనాదులతో దుల్యమైన యనుభవయోగ్యత వారికి లేకపోలేదనియు, వారిని రప్పించి రాజ్య మీయవలయుననియు వెల్లడించుచున్నది కనుక నదికూడ పాండవుల యావద్రాజ్యాధికారమునకు విరోధించునది కాదు.

ఇచ్చట నర్ధరాజ్య మనియు, నంశమనియు నుండుటచే పాండవులంతమాత్రమునకే అర్హు లని భ్రాంతిపడరాదు. యావద్రాజ్యమునకును పాండవు లర్హులే అయియున్నను ధృతరాష్ట్రధార్తరాష్ట్రాదుల పోషణభారము వారిదే యగుటవలన కౌరవగణోపభోగార్థమై యర్ధరాజ్యము విడిచిపెట్టబడిన దని తెలిసికొనవలయును.

దీనిచేత ప్రతివాదుల వ్రాతలో—

"అంశ మనగా భాగమని యర్థముగాని యంతయు నని యర్థము కాదు. మరియు భాగవతములో దాయపదము వాడబడియున్నది. తృతీయస్కంధములో—

"అజాతశత్రోః ప్రతియచ్ఛ దాయమ్ ।"

దాయమనగా 'పంచుకొనదగిన తండ్రి సొత్తు' అని శబ్ద రత్నాకరము. కానపాండవులుఅంశమునకుమాత్రమేయర్హులనిభారతభాగవతములు నొక్కి చెప్పుచున్నవి" (పు24).

అను విషయము పరాస్తమైనది. దాయశబ్దమున కర్థము భాగవతవ్యాఖ్యానమగు వంశీధరీయములో నిట్లున్నది—

దాయంస్వప్రాప్తియోగ్యం పితృధనమ్" అని.

విజ్ఞానేశ్వరీయములో నిట్లున్నది—

"దాయశబ్దేన యద్ధనం స్వామిసంబన్ధాదేవ నిమిత్తా దన్యస్య స్వం భవతి తదుచ్యతే" అని.

ఏధనము ధనస్వామిసంబంధమును బట్టి యన్యునకు సొత్తగుచున్నదో ఆధనము దాయ మనబడు నని దీనియర్థము. పంచుకొనినపుడే దాయ మగు నని లేదు. కనుక పాండుభూపతి రాజ్యము పాండవులకు బ్రాప్తించిన పితృధనమై దాయమైనది. అందుచే భాగవతము పాండవుల యావద్రాజ్యార్హతకు ఎంతమాత్రము విరోధించుటలేదు. సరికదా పాండవుల కారాజ్యము పితృపితామహపరంపరాగతమనియే చెప్పుచున్నది. చూడుడు—

"తతో యుధిష్ఠిరో గత్వా సహ కృష్ణా గజాహ్వయమ్ ।
పితరం సాంత్వయామాస గాంధారీం చ తపస్వినీమ్ ॥
పిత్రా చానుమతో రాజా వాసుదేవానుమోదితః ।
చకార రాజ్యం ధర్మేణ పితృపైతామహం విభుః ॥" (స్క-1-అ9)

ఇట్లుపరిశీలింపగా అర్ధరాజ్యమే పాండవులకు పిత్ర్యాంశమని భీష్మాదులు చెప్పినారను ప్రతివాదుల వ్రాత పరాస్తమైనది.

—"పాండవపక్షపాతి యగు శ్రీకృష్ణుని మాత్రమే అర్ధ
భాగముకొఱకై యున్న" దనుప్రసంగము-
తన్నిరాకరణము.

న్యాయభాగవినిర్ణయములోనిట్లున్నది-"వారిమాటలను వీరిమాటలను దీసికొననేల! పాండవపక్షపాతియగు శ్రీకృష్ణపరమాత్మ యొక్క మాత్రమే అర్ధభాగముకొఱకై యున్నది.

మొదట నర్ధరాజ్యము బుచ్చుకొని ఖాండవప్రస్థమునకు పాండవులు చనినపుడు కృష్ణుడుకూడనుండినాడు. అప్పుడే యభ్యంతరము చెప్పలేదు. ధార్తరాష్ట్రసభలోగూడ "అర్ధం ప్రదాయ పార్థేభ్యో మహతీం శ్రియ మాప్నుహి" అనియే ప్రసంగించియే యున్నాడు.

పాండవు లెన్నడును రాజ్యమంతయును మాకు రావలయునని వాదించియుండలేదు. వారి పక్షమున ప్రసంగములు జరిపిన శ్రీకృష్ణాదులును రాజ్యమంతయును పాండవులకు రావలయు నని వాదించియుండలేదు. ఉభయపక్షములవారునుగూడ పాండవులకర్ధరాజ్యము రావలయు ననియే వాదించియుండిరి.

దీనినిబట్టి తమచేతను తమతండ్రిచేతను సంపాదితమైనదానిని మాత్రమే వారు కోరుకొనుచున్నారను భావము తేలుచున్నది."

(పు21_24)

ప్రతివాదులకిచ్చుట పూర్వవృత్తాంతమొకింత తెలుపుచున్నాము. రాజ్యాధికారులగుపాండవులకేధృతరాష్ట్రధార్తరాష్ట్రాదిపోషణావశ్యకత శాస్త్రోక్తమై యుండుటను బట్టియు, ధృతరాష్ట్రుని కుటుంబములో (పుత్రు)లేమి వారిభార్యలేమి వారి సంతతియేమి వందలకొలది యుండు

టనుబట్టియు, దుర్యోధనుడు పాండవద్రోహియై యుండుటనుబట్టియు, న్యూనాధిక భావమును బరిశీలింపక అర్ధభాగమును దుర్యోధనాధీనముగ నుంచి యర్ధభాగమే పాండవుల కిచ్చునట్లు భీష్ముడు చేసిన నిర్ణయము-శాస్త్రసమ్మతము లోకసమ్మతము నగుటవలన దానికి కృష్ణభగవాను డభ్యంతరము జెప్పక సమ్మతించెను. ఆయర్ధభాగముగా ధృతరాష్ట్రునిచే ఖాండవప్రస్థ మీయబడినది. అది సస్యశూన్యప్రదేశమని వెనుక జెప్పబడినది. అచ్చట సర్వాతిశాయియైన యింద్రప్రస్థ మను పురము ను నిర్మించుకొని పాండవులుండిరి.

తరువాత దిగ్విజయపూర్వకముగా రాజసూయము జరిగినది. ఆతరువాతనే యాపాండ వైశ్వర్యము నపహరింప గపటద్యూతమును గల్పించి, పాండవుల నాహ్వానింపజేసిన శకునిదుర్యోధనులు పణనిర్ణ యము జేయునపుడు, ఎవ్వ రోడిపోయినను అరణ్యాజ్ఞాతవాసములు 13 సంవత్సరములు సక్రమముగా జేయవలయును అట్లు చేసివచ్చినమీదట వారి రాజ్యము వారు తీసుకొనవచ్చును. అని నిర్ణయించి, కపటము తో వారి నోడించి రాజ్యమునుండి పాండవుల నరణ్యములకు బంపిరి. వారు వనవాసాజ్ఞాతవాసములను యుక్తముగా జరిపినతరువాత దుర్యో ధనుడు వారి రాజ్యము వారికీయక యుద్ధముజేసి వారిని సంహారింతు నని కూర్చుండెను. ద్యూతకాలనిర్ణయమునుబట్టి పాండవులకు రావలసి నది వారి యర్ధరాజ్యమే, దానినే వారికిచ్చి నీవు సుఖింపు మని చెప్పు టకై కృష్ణభగవానుడు, వెళ్ళి ధార్తరాష్ట్రసభలో "అర్ధం ప్రదాయ పార్థేభ్యో మహతీం శ్రియ మాప్నుహి" అనిచెప్పెను.

ధార్తరాష్ట్రాదులపోషణమునకై కొంతభాగము విడిచిపెట్టబ డుటచే ధర్మాత్ములగుపాండవులుగాని, శ్రీకృష్ణాదులుగాని రాజ్యమం తయు రావలయునని వాదింపలేదుగాని యావద్రాజ్యాధికారము వారికి లేకపోవుటచేగాదని తెలిసికొనవలయును.

అర్ధరాజ్యమునే కోరుటనుబట్టి తావన్మాత్రమే వారిరాజ్యమను పక్షములో నేవేని యైదుగ్రామముల నిచ్చినను మేము తుదకు సంతోషింతుమని ధర్మజుడు గోరుటనుబట్టి వారి కర్ధరాజ్యాధికారముగూడ లేదని వాదించువారెందు కుండరు?

కనుక శ్రీకృష్ణపరమాత్మయొక్క యర్ధభాగమునకైన దూత్యమునుబట్టి యావద్రాజ్యాధికారము పాండవులకు లేదను ప్రతివాదుల వ్రాత పరాస్తము.

—దుర్యోధనుడు కర్ణున కంగరాజ్యమిచ్చి నపుడు పాండవు లాక్షేపింపలేదేమి, అను ప్రసంగము-తన్నిరాకరణము—

దాయభాగవినిర్ణయములో నిట్లున్నది— "అస్త్రదర్శనకాలము నందు కర్ణుడు రాజుకాడుగాన రాజపుత్రుడగు నర్జునునితో యుద్ధము జేయదగ డను నాక్షేపము రాగా దుర్యోధను డాలోపము పూర్తియగుటకై యాతని నంగదేశాధీశునిజేసెద నని జెప్పి తత్క్షణ మంగదేశమునకు పట్టాభిషేకము జేసినాడు. రాజ్యము పాండవులదాయె. దుర్యోధనునకం దెంతమాత్రము నంశము లేదాయె. అట్టిచో పాండవులుగాని తత్పక్షమువారుకాని కర్ణున కంగదేశ మిచ్చుటకు నీకధికార మెక్కడనున్నదని యెందుకు బ్రశ్నవేయరైరి! అనిన నిరుత్తరమగునుకదా!" (పు-14)

ఇటీవల నాకు సమస్తపురాణసాగరమందరాయమానమానసులగు పూజ్యమధ్వాచార్యులవారిచే వ్రాయబడిన "మహాభారతతాత్పర్యనిర్ణయము" అను సంస్కృతగ్రంథరాజ మొకటిలభించినది. ఆగ్రంథము నాచెప్పినదానినే (ధృతరాష్ట్రునకే పట్టాభిషేకము కావింపబడినదనియు ప్రతినిధిగా పాండువు నియోగింపబడెననియు) సరిగ బలపరచుచున్నది" (పు 21).

పాండవుల కర్ధరాజ్య మిచ్చుటకు బూర్వమునను ధర్మజుని

యువరాజుగా జేయుటకు బూర్వమునను ఆకుమారాస్త్రవిద్యాప్రదర్శ నము జరిగినది. అప్పుడు కర్ణున కంగరాజ్య మిచ్చుటకు దుర్యోధనున కేమి యధికార మున్నదని ధృతరాష్ట్రరాజ్యవాదుల నడుగు చున్నాము. ఇంకొకటి—

"అప్రదేయం పురాదత్తం రాజ్యం పరవతో మమ ।
అజ్ఞానాద్వా భయాద్వాపి మయి బాలే జనార్దన ॥"

అనుచు పాండవులకు రాజ్య మిచ్చునప్పటికి దాను బాలుడ ననియు, నజ్ఞాని ననియు జెప్పినట్టి దుర్యోధనుడు అస్త్రవిద్యాప్రదర్శన కాలమున కతిబాలుడుగదా! ప్రతివాదిమతప్రకారము జూచినను ధర్మ జుడు యువరాజుగా జేయబడునప్పటికి బాలుడును, అజ్ఞానియు నగు దుర్యోధను డంగరాజ్యమిచ్చునప్పటి కతిబాలుడుగదా! అత డెట్లిచ్చెను? అనర్హుడై యుండియు ధృతరాష్ట్రానుమతి నొందియే దుర్యోధను డిచ్చె నని ధృతరాష్ట్రరాజ్యవాదులు చెప్పితీరవలయును. ఆంధ్రభారతమం దామాట చెప్పబడియున్నది. చూడుడు—

"ఎల్లవారును జూడంగ నీక్షణంబ రాజుజేసెద నేనంగరాజ్య మిచ్చి.
వ. అని యప్పుడ భీష్మధృతరాష్ట్రులకుంజెప్పి వారి యనుమతంబున ...
అంగరాజ్యంబున కభిషిక్తుం జేసిన"

ప్రతివాదులు ప్రమాణముగా గ్రహించిన మధ్వాచార్యుల వారి మహాభారతతాత్పర్యనిర్ణయములోగూడ నెట్లున్నదో చూడుడు—

"నిరుత్తరే కృతే కర్ణే భీమేనైవ సుయోధనః ।
అభ్యషేచయ దంగేషు రాజానం పితృనుజ్ఞయా ॥
ధృతరాష్ట్రః పక్షపాతా త్పుత్రస్యాఽనువశోఽభవత్ ।"
(అ 18_ శ్లో 39)

పక్షపాతబుద్ధిచే పుత్రునకు వశుడై యున్న ధృతరాష్ట్రుని యనుజ్ఞపై యంగరాజ్యమును దుర్యోధను డిచ్చె నని చెప్పబడినది.

దుర్యోధనుడు చెప్పినదానికి బద్ధుడై సమ్మతించువాడు ధృతరాష్ట్రుడు. ధృతరాష్ట్రుడు చెప్పినదానికి బద్ధులై ప్రవర్తించువారు పాండవులు. కష్టమయినను నష్టమయినను తప్పయినను ఒప్పయినను ధృతరాష్ట్రుడు చెప్పినదానికి కట్టుబడి శంకింపకుండ ప్రవర్తించుట పాండవులకు వ్రతమే. ఈసంగతి నాడు ధృతరాష్ట్రునిచే వారణావతము నకు బంపివేయబడు పాండవులను జూచి దుఃఖితులై వెటంబడిన పౌరులతో యుధిష్ఠిరుడే చెప్పియుండెను—

'తాం స్తథా వాదినః పౌరాన్ దుఃఖితాన్ దుఃఖకర్శితః।
ఉవాచ మనసా ధ్యాత్వా ధర్మరాజో యుధిష్ఠిరః॥
పితా మాన్యో గురు శ్శ్రేష్ఠో యదాహ పృథివీపతిః॥
అశంకమానై స్తత్కార్య మస్మాభి రితి నో వ్రతమ్।' (ఆదిఅ145)

అట్టి వ్రతమునుబట్టియే ధృతరాష్ట్రుడు వారణావతమునకు వెళ్ళియుండుడనగా నట్లేయని వెళ్ళియుండిరి. మరియొకప్పుడు అర్ధరాజ్యము గ్రహించి ఖాండవప్రస్థమున నుండుడని చెప్పగా నట్లే గ్రహించియుండిరి. మరియొకప్పుడు దుర్యోధనప్రేరితుడై సుహృద్ద్యూతమునకు రండని యాహ్వానింపగా నట్లే వచ్చి ద్యూతమునకు సిద్ధపడిరి. ఆద్యూతములో ధనహానియై, మానహానియై తుద కెట్టులనో గట్టెక్కి ధృతరాష్ట్రానుజ్ఞ దీసికొని వెడలిపోవుచుండ దురాలోచనముగల దుర్యోధనునిచే వేధి పబడి మరల పునర్ద్యూతమునకు రమ్మని ధృతరాష్ట్రుడు పంపిన వార్తను 'ఏహి పాండవ దీవ్యేతి పితా త్వాహేతి భారత' అనుచు ప్రాతికామి చెప్పగా వెనుకకు వచ్చి పునర్ద్యూతమునకు సిద్ధపడిరి. అంతియకాని దేనిని వారాక్షేపించి యెఱుగరు.

ఇంత పితృభక్తి, ఇంత సౌశీల్యము గలిగి ధృతరాష్ట్రాభిప్రాయమునకు ఎన్నడును వ్యతిరేకించి యెఱుగని పాండవులు, ధృతరాష్ట్రాభిప్రాయమును బట్టియే జరిగిన యర్ధరాజ్యప్రదానము నాక్షేపింపలేదని ప్రతివాదులు తెలిసికొందురుగాక.

రాజ్యము పాండవులదే. దుర్యోధనున కధికారము లేదు మాట నిజమే. అయినను పాండుభూపతిచే న్యాయభూతముగా వప్పగింపబడి ధృతరాష్ట్రాధీనమై యున్నది రాజ్యము. ఆధృతరాష్ట్రునియందు పాండవుల కన్నది యసాధారణమైన భక్తి. ఈ కారణములబట్టి యప్పుడెవ్వరు నాక్షేపింపలేదను పదుత్తరముండుటనుబట్టి "నీకధికార మెక్కడ నున్నదని యెందుకు ప్రశ్నవేయరైరి? అనిన నిదుత్తర మగునుగదా," అను ప్రతివాదుల వ్రాత ప్రతిహతమైనది.

ఇక ప్రతివాదులు ప్రమాణముగా గ్రహించిన మధ్వాచార్యుల వారి మహాభాగతతాత్పర్యనిర్ణయములో ధర్మజుని యౌవరాజ్యమును గూర్చి తండ్రితో దుర్యోధను డన్నది యెట్లున్నదో చూతుము- అ19-

"సంపూర్ణధర్మతి రసౌ ధృతరాష్ట్రసూను స్తాతస్యమానహృదయో నిఖిలా స్యహాని। దృష్ట్వా శ్రియాం పరమికాం విజయంచ పార్థే ష్వాహేద మేత్య పితరం సహ సౌబలేన। జ్యేష్ఠస్య తేఽపిహి వయం హృదయప్రజాతా నార్హత్వమేవ గమితా భవతైవ రాజ్యే। భ్రాతుః కనీయస ఉతాపి హి దారజాతా అన్యైశ్చ రాజ్యపదవీం భవతైవ నీతాః"

వ్యాఖ్యా-హృదయప్రజాతా ఔరసాఽర్హత్వం యోగ్యత్వమ్, ఉత, కనీయసః కనిష్ఠస్య భ్రాతుః పాండోః, అన్యైగన్యపురుషైః, దారజాతాః క్షేత్రజాః ధర్మాదయః, రాజ్యపదవీం రాజ్యమార్గం యౌవరాజ్య మిత్యర్థః। భవతైవ త్వయైవ నీతాః ప్రాపితాః ॥

"రాజ్యం మహచ్చ సమవాప్స్యతి ధర్మసూను
స్త్వత్తోఽథవానుజబలా త్ప్రసభం వయస్తు।
దాసా భవేమ నిజతంతుభిరేవ నాకం
కుస్తీసుతస్య పరతోఽపి లేదన్వయస్య ॥

వ్యాఖ్యా- స ధర్మసూనుస్త్వత్తః త్వత్ప్రసాదాత్, అథవా అనుజబలాత్ ప్రసభం బలాత్కారేణ వా మహత్ సంపూర్ణం

రాజ్యం సామ్రాజ్యం సమవాప్స్యతి, నిజతః తుభిరేవసాకం స్వసంతా నైరేవ సాకం కున్తీసుతస్య దాసా భవేమ ॥

"నాత్మార్థ మస్తి మమ దుఃఖ మథాతిశుద్ధ
లోకప్రసిద్ధయశస స్తవ కీర్తినాశః ।
అస్మన్నిమిత్త మితి దుఃఖమతో హి సర్వేఽ-
పీచ్ఛామ మర్తు మధనాః కురు చాప్యనుజ్ఞామ్ ॥

వ్యాఖ్య— ఆత్మార్థం స్వస్య సామ్రాజ్యప్రాప్త్యర్థమ్......

అనగా జ్యేష్ఠుడవైన నీకు ఔరసులమైనమేము నీచేతనే రాజ్యార్హులము కావింపబడకపోతిమి. కనిష్ఠుడైన పాండురాజునకు క్షేత్రజులైనట్టి పాండవులు నీచేతనే రాజ్యపదవిని (యౌవరాజ్యమును) పొందింపబడిరి. ఇక నీయనుగ్రహముచేతను, ఆత్మబలముచేతను వారు సామ్రాజ్యమును బొందగలరు. మేము ధర్మజునకు దాసులమై యుందుము. నాకు సామ్రాజ్యప్రాప్తి లేకపోయె నని దుఃఖముకాదు. మానిమిత్తమున నీకీర్తికి నాశన మని దుఃఖము. నిర్ధనులమైన మేమందరము మరణింతుము. అనుజ్ఞనిమ్ము. అని విలపించెను.

ఈవాక్యములలో ధర్మజునకు రాజ్యపదవి నిచ్చుటచేత దనకు రాజ్యార్హత లేకుండ జేయబడిన దని దుర్యోధనుడు చింతించెనని యున్నది. ప్రతివాదిమత మేమనగా:— మూలరాజ్యము అనగా హస్తినాపురము రాజధానిగా గల రాజ్యము ధృతరాష్ట్రునిది. సంపాదితరాజ్యము పాండురాజుది, ధర్మజుడు యువరాజుగా జేయబడినది యా పాండురాజుభాగమునకే గాని యావద్రాజ్యమునకు గాదు" అని.

వీరి విభాగప్రకారము ధృతరాష్ట్రుని రాజ్యము తనదై యుండ పాండురాజుభాగమునకు ధర్మజుడుయువరాజుగా జేయబడినపుడు తనకు రాజ్యార్హత లేకుండ జేయబడిన దని యెట్లు చెప్పును? యావద్రాజ్యమునకును యువరాజుగా ధర్మజుడు జేయబడెనుగనుకనే అట్లు విలపించె నని

చెప్పక తప్పదు. అందుచే ప్రతివాదిమతము మధ్వాచార్యులవారి గ్రంథమునకు విరుద్ధము.

ఇక ధృతరాష్ట్రుడే రాజ్యాధికారి యను తమ వాదమును మధ్వాచార్యులవారి గ్రంథము బలపరచుచున్నదని ప్రతివాదులు వ్రాసిన విషయము నవలోకింతము —

"పెద్దవాడగు నాంబికేయునకే పట్టాభిషేకము కావింపబడియున్నదనియు, నాతడు గ్రుడ్డివాడై యున్నందున నాతని ప్రతినిధిగా నుండి రాజ్యమును సాగించుటకు పాండువు నియోగింపబడెననియు నేనిదివరకు వ్రాసియుంటిని.

ఈభావమునే మహాభారతతాత్పర్యనిర్ణయమును సీక్రిందివాక్యములచే బోధించుచున్నది —

"భీష్మో హి రాష్ట్రే ధృతరాష్ట్ర మేవ
సంస్థాప్య పాండుం యువరాజ మేవ ।
చక్రే తథా ప్యన్ధ ఇతి స్మ రాజ్యం
చకార నాసా వకరోచ్చ పాండుః ॥
భీష్మాంబికేయో క్తిపరి స్స్వదైవ
పాండు శ్శశాసావని మేకవీరః ।"

భీష్ముడు ధృతరాష్ట్రునే రాజుగాజేసి పాండువును యువరాజుగా జేసినాడు. అయినను గ్రుడ్డివాడగుటచే నాంబికేయుడు వ్యవహారమును నడుపలేదు పాండువు ధృతరాష్ట్రాజ్ఞానుసారముగా బరిపాలనమును గావించెను. ఈమహాగ్రంథముచే ధృతరాష్ట్రుడేరాజనియు, పాండువు తత్ప్రతినిధి యనియు బాగుగా దేలుచున్నది" (పు 27).

ప్రతివాదులు చూపిన గ్రంథము తమ మతమునకు సంబంధించియుండలేదు. ధృతరాష్ట్రుడు పట్టాభిషిక్తుడని ప్రతివాదులమతము. రాజ్యమందు స్థాపింపబడెనని మాత్రమే చెప్పుచున్న దాగ్రంథము. దానికి పట్టాభిషిక్తు డనియే యర్థమందురేని దేవాపివృత్తాంతమును

జెప్పినపుడు 'హీనాంగుడని దేవాపికి పట్టాభిషేకమును నిషేధించిరి. అట్లే నేనుకూడ హీనాంగుడ నని రాజ్యమునుండి తొలగింపబడితిని'. అని చెప్పిన ధృతరాష్ట్రుని చెనకజూపబడిన వాక్యములకు విరుద్ధమగును ఇక పాండువు ప్రతినిధి యని ప్రతివాదుల మతము. ఆతడు యువరాజని వారుచూపిన గ్రంథము చెప్పుచున్నది. ప్రతినిధిని యువరాజందురా? అదియు నటుం డనిండు.

ఆగ్రంథములో "అంధ ఇతి స్మ రాజ్యం చకార నాసౌ" వ్యాఖ్యా— అహం మన్ద ఇతి బుద్ధ్యా రాజ్యం న చకార || అని యున్నది. అనగా నేనంధుడ నను యాతడు రాజ్యమును చేయలేదు. 'అకరోచ్చ పాండుః' పాండువు చేసెను. అని యర్థము. ఆత డంధుడని యే ప్రతివాదిమతప్రకారము పాండురాజ ప్రతినిధిగా నియోగింపబడినపుడు తానంధుడనని ధృతరాష్ట్రుడు రాజ్యమును చేయలేదను మాట కర్థమేమి? అట్లు రాజ్యముజేయని యంధునకు రాజ్యాభిషేకమెట్లు చేయబడినది? అంధునకు గూడ రాజ్యాభిషేకమై యుండ భక్తిశ్రద్ధలుగల ప్రతినిధియొక్క సాహాయ్యముండ ధృతరాష్ట్రుడు రాజ్యమేల చేయలేదు? అంధత్వమునుబట్టి యాతనికి రాజ్యాధికారము లోపించుటవలన రాజ్యము చేయలేదని చెప్పవలయును. కనుకనే రాజ్యాభిషేకముగూడ జరుగలేదని చెప్పవలయు. నిజముగా రాజుకానట్టి జ్యేష్ఠసోదరుని తాను రాజుగా భావించి రాజగు పాండురాజు ధృతరాష్ట్రాజ్ఞానుసారము పరిపాలించె నని చెప్పవలయును. కనుక ప్రతివాదిమతమునకు మధ్వాచార్యులవారి గ్రంథము సాధకము గాదు. కాబట్టి ప్రతివాదుల వ్రాత పరాస్తమైనది.

## —♦ ధృతరాష్ట్రరాజ్యానర్హతావిషయమై మనుస్మృత్యాది ప్రమాణప్రదర్శనము ♦—

జాత్యంధాదులకు దాయగ్రహణాధికారము లేదనియు, వారు కేవలము అన్నవస్త్రాదు లిచ్చి పోషింపదగినవా రనియు మనుస్మృత్యాదు లుద్ఘోషించుచున్నవి. చూడుడు—

మనుస్మృతి—అ9.

"అనంశౌ క్లీబపతితౌ జాత్యన్ధబధిరౌ తథా।
ఉన్మత్తజడమూకాశ్చ యేచ కేచి న్నిరిన్ద్రియాః॥

వ్యాఖ్యా—నపుంసక పతిత జాత్యన్ధ శ్రోత్రవిక లోన్మత్త జడ మూకాశ్చ యే చ కుణి సంగ్వాదయో వికలేన్ద్రియా స్తే పిత్రాది ధనహరా న భవన్తి, కిన్తు గ్రాసాచ్ఛాదనభాగినః।

"సర్వేషా మ పి తు న్యాయ్యం దాతుం శక్త్యా మనీషిణా।
గ్రాసాచ్ఛాదన మత్యన్తం పతితో హ్యదద ద్భవేత్॥"

వ్యాఖ్యా-తిదేవాహ- సర్వేషామితి సర్వేష మేషాం క్లీబాదీనాం శాస్త్రజ్ఞేన రిక్థహారిణా యా వజ్జీవం స్వశక్త్యా గ్రాసచ్ఛాదనం దేయం, అదదత్పాపీ స్యాత్.

యాజ్ఞవల్క్యస్మృతి—

"క్లీబో౽థ పతిత స్తజ్జః పంగు రున్మత్తకో జడః।
అన్ధో౽చికిత్స్యరోగాద్యా భర్తవ్యా స్స్యు ర్నిరంశకాః"॥

విజ్ఞానేశ్వరీయమ్— పుత్రపౌత్రిక త్వాద్యదిసంసృష్టీనాం యద్దాయగ్రహణ ముక్తం తస్యాపవాద మాహ క్లీబ ఇతి—

ఏతే క్లీబాధయో నిరంశకాః రిక్థభాజో న భవన్తి కేవలమశనాచ్ఛాదనేన పోషణీయా భవేయుః అభరణా త్పాతిత్యదోషణీ ఏతేషాం విభాగా త్ప్రాగేవ దోషప్రాప్త వన శత్వం వేదితవ్యం. న పున ర్విభక్తస్య విభాగోత్తరకాల వత్యాధ్యాదినా దోషస్యాకరణే భాగప్రాప్తి రస్త్యేవ" ఈవచనములనుబట్టి జాత్యంధుడగు ధృతరాష్ట్రునకు దాయగ్రహణమం దధికారము లేదని స్పష్టమైనది.

మరియు రాజ్యము యొక్క అవిభాజ్యస్థితినిగూర్చియు, రాజ్యాధిపత్యమునుగూర్చియు శ్రీమద్రామాయణమహాభారతాదివచనోదాహరణములతో సిద్ధాంతమును నిరూపించెద యాగ్రహము జూడుడు—

వీరమిత్రోదయము రాజనీతిప్రకారము—

"ప్రతే భోక్త్రే రాజ్యం విభజ్య న దేయమ్। తథాచ రామాయణే కైకేయీం ప్రతి వాక్యమ్—

"న హి రాజ్ఞ స్సుతాః సర్వే రాజ్యే తిష్ఠన్తి భామిని ।
స్థాప్యమానేషు సర్వేషు మహా నవినయో భవేత్ ॥
తస్మా జ్జ్యేష్ఠేషు పుత్త్రేషు రాజ్యతన్త్రాణి పార్థివాః ।
ఆసజ్జ న్త్యనవద్యాంగి గుణవ త్స్వితరేషు చ ॥
తేషు జ్యేష్ఠేషు పుత్త్రేషు జ్యేష్ఠే ష్వేవ న సంశయః ।
ఆసజ్జ న్త్యఖిలం రాజ్యం న భ్రాతృషు కథంచన ॥"

గుణవ త్స్వితరేష్వితి, జ్యాయసి దోషసద్భావే కనీయసాం మధ్యే ఏకస్య కస్యచిత్ రాజ్యదానే గుణవత్త్వం హేతుత్వేనోపన్యస్తమ్ ॥

జ్యేష్ఠస్యాఽన్ధత్వాదిదోషసద్భావే న రాజ్యభాక్త్వం, తదుక్తం మహాభారతే— "నాన్ధః కురూణాం నృపతి రనురూప స్తపోధన"

తథా— "ధృతరాష్ట్ర స్త్వచక్షుష్ట్వా ద్రాజ్యం న ప్రత్యపద్యత।
పారశవత్వా ద్విదురో రాజా పాణ్డు ర్బభూవ హ ॥ "

అత్రాఽన్ధ్య ముపలక్షణం బధిరమూకషణ్డాదీనాం, తేషాం గ్రాసాచ్ఛాదనమాత్రాశిత్వేన రాజ్యప్రాప్తిప్రసంగస్యాఽప్యభావాత్, యథోక్తం మనునా—

"అనంశౌ క్లీబపతితౌ జాత్యన్ధబధిరౌ తథా ।
ఉన్మత్తజడమూకాశ్చ యే చ కేచి న్నిరిన్ద్రియాః ॥
సర్వేషా మపి తు న్యాయ్యం దాతుం శక్త్యా మనీషిణా ।
గ్రాసాచ్ఛాదన మత్యన్తం పతితో హ్యదద ద్భవేత్ ॥"

నిరిన్ద్రియో వ్యాధ్యాది నోపహతేన్ద్రియః అత్యన్తం యావజ్జీవమ్ । అన్ధత్వాదిదోషేణ కుతశ్చిత్కారణాద్వా త్యక్తరాజ్యానాం జ్యేష్ఠానాం రాజ్యాభావేఽపి తత్పుత్త్రాణాం రాజ్యం భవత్యేవ। యథాఽసమంజః పుత్త్రస్యాఽంశుమతః, ఇదన్తు రాజ్యాభిషేకాత్పూర్వ ముత్పన్నస్యాఽన్ధాదిపుత్త్రస్య। యదా తు కనీయసోఽభిషేకానన్తరం జ్యాయ

సోఽంధాదే రౌరప స్తదా కనీయసోఽభిషిక్తస్త్యైవ పుత్రాదేః, యథా పాండుపుత్రస్య యుధిష్ఠిరస్య, నాన్ధపుత్రస్య దుర్యోధనాదేః ॥

తథాచ— మహాభారతే—

"గుణై స్సముదితాన్ దృష్ట్వా పౌరాః పాండుసుతాం స్తదా ।
కథయాంచక్రిరే తేషాం గుణాన్ సంసత్సు భారత ।
రాజ్యప్రాప్తిం చ సంప్రాప్తం జ్యేష్ఠం పాండుసుతం తథా ॥
కథయన్తి స్మ సంభూయ చత్వరేషు సభాసు చ ।
ప్రజ్ఞాచక్షు రచక్షుష్ట్వా ద్ధృతరాష్ట్రో జనేశ్వరః ॥
రాజ్యం స ప్రాప్తవాన్ పూర్వం స కథం నృపతి ర్భవేత్ ।
తథా శాన్తనవో భీష్మ స్సత్యసన్ధో మహావ్రతః ॥
ప్రత్యాఖ్యాయ పురా రాజ్యం న స జాతు గ్రహీష్యతి ।
తే వయం పాండవజ్యేష్ఠం తరుణం వృద్ధశీలినమ్ ॥
అభిషించామ సాధ్వగ్ర్యం సత్యకారుణ్యవేదినమ్ ।"

తథాఽన్యదపి పౌరవాక్యమ్—

"తాన్ రాజ్యం పితృతః ప్రాప్తాన్ ధృతరాష్ట్రో న మృష్యతి"

తథా— "రాజపుత్రా నిమాన్ బాలాన్ ధృతరాష్ట్రో న మృష్యతి ॥
వయ మేత దనిచ్ఛాను స్సర్వ ఏవ పురోత్తమాత్ ।
గృహా న్విహాయ గచ్ఛామో యత్ర గన్తా యుధిష్ఠిరః ॥"

తథా— "తత సంవత్సరస్యాన్తే యౌవరాజ్యాయ పార్థివ ।
స్థాపితో ధృతరాష్ట్రేణ పాండుపుత్రో యుధిష్ఠిరః ॥"

తాత్పర్యము— "రాజపుత్రు లందరును రాజ్యభాక్కులు కారు. అట్లగుట నీతివిరుద్ధము. కనుకనే మహాపతులు జ్యేష్ఠపుత్రులయందే రాజ్యములను సంక్రమింపజేయుచున్నారు. జ్యేష్ఠునియందు దోషమున్నపుడు కనిష్ఠులలో గుణవంతులయందు రాజ్యమును సంక్రమింపజేయుచున్నారు" అను రామాయణవచనములనుబట్టి రాజ్యము విభజించి పుత్రుల కీయదగినది కాదు.

"అంధుడగుటవలన ధృతరాష్ట్రుడు రాజ్యమును పొందలేదు. పాండురాజే రాజ్యమును పొందెను" ఇత్యాదిమహాభారతవచనములను

బట్టియు, "జాత్యంధాదులు పిత్రాదిధనభాక్కులు కారు. గ్రాసాచ్ఛాదనాములనుమాత్రమే యావజ్జీవము బొందదగినవారు" అను మనుస్మృతివచనములనుబట్టియు, అంధత్వాదిదోషముకల జ్యేష్ఠుడు రాజ్యభాక్కు కాడు.

అంధత్వాదిదోషముగాని, కారణాంతరముచగాని రాజ్యప్రాప్తి లేనట్టి జ్యేష్ఠులకు రాజ్యము లేకపోయినను, వారిపుత్రులకు అసమంజసుని పుత్రుడగు అంశుమంతునకు వలె రాజ్యము ప్రాప్తించును. ఆప్రాప్తించుట—ఆరాజ్యమునకన్యుఁ డభిషిక్తుడు కాకపూర్వమే పుత్రుడు పుట్టియున్నపుడు సంభవించును. కనిష్ఠునకు రాజ్యాభిషేకానంతరము అట్టి జ్యేష్ఠునకు పుత్రులు కలిగినను వారికి రాజ్యము ప్రాప్తింపక రాజ్యాభిషిక్తుడైన కనిష్ఠ పుత్రులకే ప్రాప్తించును. ఈవిషయమై మహాభారతములోని పౌరవాక్యాది ప్రమాణాలనుబట్టి రాజ్యాభిషిక్తుడైన కనిష్ఠుడైన పాండుభూపతియొక్క పుత్రుడగు యుధిష్ఠిరునకే రాజ్యప్రాప్తి యగుటయు, అంధుని పుత్రుడగు దుర్యోధనునకు రాజ్యప్రాప్తి లేకుండుటయు నిదర్శనము, అని.

ఈవిధముగా మనుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి, వీరమిత్రోదయములనుప్రమాణగ్రంథములు ధృతరాష్ట్రునకును, దుర్యోధనునకును రాజ్యాధికారము లేదనియు, పాండుభూపతిది, తరువాత పాండవులది, రాజ్య మనియు, ధృతగాష్ట్రధార్తరాష్ట్రులు పోష్యవర్గములోనివారనియు సిద్ధాంతమును ప్రదర్శించియున్నవి, యీసిద్ధాంతమునే ప్రతివాదిప్రసంగనిరాకరణపూర్వకముగా మహాభారతవచనములతోగూడ నిరూపించియున్నాము. దేవీభాగవతశ్రీమద్భాగవతవచనములతో కూడ నిరూపించియున్నాము. కనుక ధృతరాష్ట్రుడు రాజనుచు, దుర్యోధనుడు మూలరాజ్యమున కధికారియనుచు జేసిన ప్రతివాదుల కోలాహలము ప్రతిహతమైనది.

ఇప్పుడు దుర్యోధనశ్రీకృష్ణాదుల వాదస్వరూపమును ప్రతి వాదు లెట్లు ప్రదర్శించిరో చూడుడు—

"ధర్మజుడుగాని, యాతని యాప్తులుగాని రాజ్యమంతయును దమకు రావలయు నని వాదించియుండలేదు. దుర్యోధనుడు మాత్రము రాజ్యమంతయు దనది యనియును, పాండవులకు భాగము లేదనియును. ధర్మజుని యువరాజు చేయుట (అర్ధమున కైనను) తగదనియు, దన యజ్ఞానదశలో నట్లొనర్పబడినదిగాన దానందులకు బాధ్యుడు గాడనియు మొదటినుండి చివరదనుక వాదించియున్నాడు.

రాజ్య మవిభాజ్యమనియు, నయ్యది పెద్దవాడగు తనతండ్రికి జెందె తరువాత దనకు వచ్చిన దనియు, బ్రతిపక్షిగా నుండి పాండువు సంపాదించినదికూడ మూలరాజ్యములో జేరవలయు ననియు నెఱిగియో యెఱుగకయో తనతండ్రియిచ్చిన భాగమైన వారలకు రావలయు నందులేని దానిని వారు జూదమున నోడిపోయిరి గాన నదియును రాదగదనియు నొక్కి వాదించియున్నాడు.

ఈతని వాదమునందు గొంత సత్యముండినను దత్తమైనదానిని దుష్టబుద్ధిచే నన్యాయమార్గమున దాను బొందినాడుగాన నయ్యది పాండవులకు మరల రావలయు నని కృష్ణాదుల వాదము" (పు25)

రాజ్యమంతయు దమకు రావలయునని పాండవులు వాదింపక పోవుటకు గారణము ధార్తరాష్ట్రుల జీవికకై యర్ధరాజ్యమును విడిచి పెట్టుటేకాని యావద్రాజ్యాధికారము లేకుండుట గాదని పూర్వము నిరూపించియున్నాము.

రాజ్యమంతయును తనదే యనుట, పాండవులకు భాగము లేద నుట, ధర్మజుని యువరాజునా చేసినప్పుడు తనది యజ్ఞానదశ యనుట, దుర్యోధనుని దుర్వృత్తికి నిదర్శనములు.

రాజ్యము తన తండ్రినిచెంది, తరువాత తనకు వచ్చినదనుట, "పైతృకంబగు లక్ష్మి పాండుభూపతి మున్ను దాల్చుటజేసి" "ఈరాజ్యంబు మొదలింటంగోలె భవదధీనంబయిన మాకు నప్రియత్నలభ్యంబగు తొల్లి పాండురాజు రాజై" అనుచు దనతండ్రితో దుర్యోధనుడు ప్రసంగించినట్లున్న ఆంధ్రభారతాదులకును, ఉద్యోగపర్వములో—

"పాండుస్తు రాజ్యం సంప్రాప్తః కనీయా నపి సన్నృపః ।
వినాశే తస్య పుత్రాణా మిదం రాజ్య మరిందమ ॥
మయ్యభాగిని రాజ్యాయ కథం త్వం రాజ్య మిచ్ఛసి ।
అరాజపుత్రో హ్యస్వామీ పరస్వం హర్తు మిచ్ఛసి ॥

అనుచు కనిష్ఠుడైనను పాండుభూపతియే రాజ్యమును పొందెను. ఆతని యనంతరము పాండుపుత్రులదే రాజ్యము. నేనే రాజ్యభాక్కును కానపుడు నీకు రాజ్య మెట్లు? అనధికారివై పరధనమును నీవు హరింప దలచుచున్నావు, అని పుత్రునికి ధృతరాష్ట్రుడు బోధించినట్లున్న సంస్కృతభారతమునకును విరుద్ధ మగుటచే నది కూడ దుర్యోధనుని దుర్వృత్తినే బలపరచుచున్నది. కనుక దుర్యోధనుని దసత్యవాద మని గ్రహింపవలయును.

దుర్యోధనుని వాదమందు గొంతసత్యమున్నను దత్తమైనదాని నన్యాయమార్గమున బొందినాడుగాన నది మరల రావలయు నని కృష్ణాదుల వాదమనుట' అయుక్తము. అన్యాయముగా బొందినాడు గాన మరలరావలయునని కాదు. సుహృద్ద్యూతమను పేరుతో జరిపిన ద్యూతములో—

"త్రయోదశే చ నిర్వృత్తే పున రేవ యథోచితమ్ ।
స్వరాజ్యం ప్రతిపత్తవ్య మితరై రథ వేతరైః ॥"

అని చేసిన దుర్యోధనాదుల నిర్ణయమునుబట్టి 13సంవత్సరములు యథాక్రమముగా నడపి వచ్చిన పాండవులకు వారి యర్ధరాజ్యము

నిచ్చివేయవలయు నని కృష్ణాదుల వాదము! దీనికి దుర్యోధనుడు శ్రీకృష్ణునితో చెప్పినసమాధాన మిది—

ఉ. ఏమును వారు బంచికొని యేలుట గల్గదు పల్కుసుంతయుం
కేమియు వాడిసూదిమొన యించుక మోపినయంతమాత్రియుర్వీ
భూమి యొనర్చి పాండునృపపుత్రుల కిత్తునె యెవ్వరైన సం
గ్రామమునన్ జయంబు గొని రాజ్యము జేయుట నిశ్చయించితిన్.

ఇట్టి దుర్బుద్ధికల దుర్యోధనుని వాదమునందు గొంత సత్యము న్నట్లు ప్రతివాదులు వ్రాయుట అయుక్తము. కాబట్టి ప్రతివాదులు దుర్యోధనాదివాదములనుగూర్చి వ్రాసినది పరాస్తమైనది.

రాజ్యము పాండవులదిగనుకనే వారిని జంపి రాజ్యమును హరింపవలె నని యాదినుండియు నెన్నియో ప్రయత్నములు దుర్యోధనుడు చేయుచు వచ్చినాడు. పాండవులు కడతేరుట, తనకు రాజ్యము వచ్చుట, అను మనోరథమును దుశ్శాసనునితో స్వయముగా నొకప్పుడు చెప్పియున్నాడు. అదెప్పు డనగా—

భీష్మయుద్ధములో నెనిమిదవనాటి రాత్రి భీష్ముని యొద్ద మొరపెట్టిన సందర్భములో భీష్ముడు- రేపటి యుద్ధములో పాండవపక్షవీరులను బడగొట్టెద నని చెప్పగా విని దుర్యోధనుడు దుశ్శాసనునితో నుత్సహించుచు నిట్లనెను—

"అయం హి సమనుప్రాప్తో వర్షపూగాభిచింతితః ।
పాండవానాం ససైన్యానాం వధో రాజ్యస్య చాగమః ॥

(భీష్మ అ98)

పాండవమరణము, రాజ్యప్రాప్తి యను చిరకాలమునుండి యున్న మన మనోరథము ఇదిగో ప్రాప్తించినది, అని.

దీనినిబట్టి "దుర్యోధనుడు పాండవుల జంప బ్రయత్నించుటకు- రాజ్యము పాండవుల దగుట కారణము గాదు. అసహనాదికము కారణము" అను దాయభాగవినిర్ణయములోని వ్రాత నిరస్తము.

ఇంతవరకు ప్రతివాదులుద్ధృతశాస్త్రరాజ్యవాదము అప్రామాణిక మనియు, ననుపపన్న మనియు నిరూపించుచు దాయభాగవినిర్ణయము లోనివిషయములను నిరాకరించుచు పాండురాజరాజ్యవాదమే సిద్ధాంత మని ప్రమాణోపపత్తులతో ప్రదర్శించియున్నాము.

—: "గ్రంథములో తానొక పాత్రగా నుండి తానే కవియైనట్టి వ్యాసుని వ్రాత సత్యముకా"దను ప్రసంగము— తన్నిరాకరణము: —

"విశ్వాసహీనులై భీష్ముని రాజ్యంబు గ్రహియించి పాలించె కౌరవతతి యను నింద పాల్జేయ వ్యాసు డట్లని" "ఇట్లు ధర్మం బులను దెల్ప పాడియౌనాకొకో మీవ్యాసునకును" "కథకుండు కవియును, కథ నొక పాత్రగా నుండిన, సత్యంబు నుండ దందు" "ధర్మమంతయు తనదిగా నందు లిఖించుచు".

ఇది సుయోధనవిజయకర్తల వ్రాత. కౌరవులను నిందపాలు చేసి వ్యాసుడు వ్రాసెనట! కౌరవుల దధర్మమని తెలిపెనట! ధర్మ మంతయు తనదిగా లిఖించెనట!

ఆహా! ఆభారతగాథ, ఇప్పటి కైదువేలయేండ్లకు వెనుకటిగాథ, అది నేటియీకవికి అప్రత్యక్షగాథ, దానికి వేదవ్యాసగ్రంథము తప్ప నితరాధార మేమియులేని గాథ, అట్టిగాథ నసత్యమనుట కీకవి కధికార మేమున్నది? ఆమహర్షి వ్రాత అసత్యమనియు, నీకవి వ్రాత సత్య మనియు ననుకొను వెర్రివా డెవడు? నోటికి వచ్చినట్లనుటేనా? కథలో తానొక పాత్రగా నుండి కవియు తానె యైనపుడు అందు సత్యముండ దట, ఇది వారి నిర్ణయము. అయితే నేడెందరో తమకథలను తామె స్వయముగా "ఆత్మకథ" అనుచు వ్రాయుచుండిరే, వానిని లోకులాద రించుచుండిరే, అవన్నియు వారి నిర్ణయప్రకార మసత్యములుకనుక మూలబడవలసినవేనా? మనుష్యమాత్రుల 'ఆత్మకథ'లకే ప్రామాణ్య

మున్నపుడు మహర్షిప్రవరుల మహాగ్రంథముల కదిలేకపోవునా? కనుక ప్రతివాదుల వ్రాత హేయము.

ఈసుయోధనవిజయకర్తలు—

"మా మామగారైన బ్రహ్మయ్యశాస్త్రిగారు భారతమందలి ధర్మము కౌరవపక్షమున నున్న దని చెప్పుచువచ్చిరి, కురుపాండవ దాయభాగముగూర్చి వారు విపులముగా జర్చించి యందు పాండవులకు వారసత్వమే లేనట్లు రచించియుండిరి".

విషయమును శాంతముగ గ్రహించి చక్కగ విమర్శించి మంచి చెడ్డలనెల్లవివరించి తెలుపు పెద్దలయభిప్రాయము లాయావిషయములపై తెలిసికొనవలె నను నభిప్రాయముతో నేనీగ్రంథమును రచింప సాహసించితిని".

అని వ్రాయుటచే వారికి మంచిచెడ్డల దెలుపుటకే దాయభాగవినిర్ణయము నింతగా బరిశీలించి తత్త్వనిర్ణయము చేయబడినది.

సుయోధనవిజయములోని విషయములు, తాము ప్రమాణముగా గ్రహించిన తమ మామగారివ్రాతకే విరుద్ధముగా నున్నవని కూడ వెనుక చూపియున్నాము. భారతమందలి ధర్మము పాండవపక్షమందే యున్నదనియు, వారసత్వము, విజయము పాండవులదే యనియు, ద్రోహంబుద్ధి, అధర్మము; అపజయము దుర్యోధనాదులదనియు సుయోధనవిజయకర్తలు, ఇకనైన తెలిసికొందురుగాక.

ఆసుయోధనవిజయమును శ్లాఘించుచు పీఠిక వ్రాసిన గరిగిపాటి రామమూర్తి బి. యే. గారి వ్రాతలోని యంశములు—

"భారతముంగూర్చి ప్రజలలో బ్రస్తుత మనేకవాదములు బ్రబలియున్నవి. సాధారణముగ పాండవుల ధర్మపరతవలననే జయము కలిగిన దని యందరు ననుకొనుచున్నారు. ఈభావము మూఢజనుల మనస్సునుండి తగినన్ని కారణములు జూపించినైన మరల్ప సాధ్యము కాదు. ధర్మరాజాదుల ధర్మ మెంతవరకున్నదో సుయో

ధనాము లెందువలన నోడింపబడిరో సుయోధనవిజయగ్రంథ కర్తలు ఆమూలాగ్రముగ నాలోచించి చక్కని గ్రంథము నాంధ్ర లోకమున కర్పించుకొనియున్నారు.

భారతయుద్ధము కృష్ణునివలననే ప్రభవించినది. ...కృష్ణుడు... అధర్మ మెట్లయినను జయింపబడవలె ననియు, కావున సుయోధను నెన్నియో మాయోపాయములచేతనైన మడియింపవలసివచ్చిన దనియు ప్రత్యుత్తర మిచ్చుటయు...

పాండురాజునకుగూడ పాండిమమువలన రాజ్యార్హత నశించె... ధర్మవేత్తలు ధృతరాష్ట్ర డగ్రజన్ముడుకాన నతనిని జక్రవర్తిగ నియమించి పాండురాజును సైన్యాధిపతిగ నొసరించినారు...

ఇత్యాదులును—

వజ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారి కర్ణచరిత్రములో—

"భీష్మేణ రాజా కౌరవ్యో ధృతరాష్ట్రోఽభిషేచితః... పాండు స్సేనాపతిః కృతః ॥ అను వాక్యమునుబట్టి చూడగా జ్యేష్ఠుడును, పట్టాభిషిక్తుడును నగు ధృతరాష్ట్రుని పుత్రుడైనదుర్యోధనునకే కురురాజ్యమునందు సంపూర్ణమగు నౌరసత్వపు (వారసత్వపు) హక్కు గలదనియు, పాండవులకు లేదనియు విశదమగుచున్నది" (ఉపోద్ఘాతము— పు5)

అను మాటలును—

మ. భా. చ. కారుల నవీనగ్రంథమైన ఉత్తరభారతములో—

"విచిత్రవీర్యుని ప్రథమపుత్రుడును, నాగాయుతబలుండును నగు నంబికాసూనుండు నేత్రరోగి యయ్యు వేదమున జ్యేష్ఠపుత్రుడే పితృస్వత్వమునకు నర్హుడని యుండుటచేత కురురాజ్యాధికారము వహించి ధృతరాష్ట్రుడను సార్థకనామము కలవా డయ్యెను. ఆతడు రాజ్యపరిరక్షణమునకు పాండురాజును, మంత్రిత్వమునకు విదురుని భీష్ముని యానతిచే నియమించె" (పు 1)

అను మాటలును- పూర్వోక్త ప్రకారము అప్రామాణికములును, అనుపపన్నములు నగుటచే హేయములు.

—• "రాజ్యాధికారము పాండవులకు లేనేలేదని 'కురుక్షేత్రసంగ్రామము' అను గ్రంథమందలి ప్రసంగము"
తన్నిరాకరణము—

శతావధాని బారిష్టర్, త్రిపురనేని రామస్వామిచౌదరిగారి 'కురుక్షేత్రసంగ్రామము'నందు పాండవులకు రాజ్యాధికారము లేనట్లును, వారు రాజ్యకాంక్షచే దుష్కార్యమైన యుద్ధమును తలపెట్టినట్లును, అధర్మవిజయము నొందినట్లును వ్రాయబడియున్నది.

అందు గ్రంథకర్త వాక్యమిట్లున్నది—

"సుయోధనుడు యువరాజో రాజో కాకయున్నచో కుమార విద్యాప్రదర్శనకాలమునందు కర్ణునకు నంగరాజ్యమిచ్చుట కెట్లర్హుడు? బాల్యచాపల్యముచే సుయోధను డిచ్చితి మన్న భీష్మాదు లేలమాటాడకుండిరి?" అని.

పై గ్రంథమునకు ఉద్గ్రంథకర్తయగు అడవి సాంబశివకవిగారుపోద్ఘాతము వ్రాసియున్నారు. అందు వారు-గ్రంథకర్త పాండవులకు రాజ్యాధికారము లేదనుటకును, ద్యూతములో నోడిపోయినదాని మరల గోరుటకుగూడ హక్కు లేదనుటకును గల హేతువు లుదాహరించియున్నారు. అందలి ముఖ్యాంశములలోని సంగ్రహమిది—

"1. జాత్యంధుడగుటచే ధృతరాష్ట్రునకును, పాండురోగపీడితుడగుటచే పాండురాజునకును రాజ్యానర్హత ప్రాప్తించియుండగా నెటులైన ధృతరాష్ట్రుడు సింహాసనాసీను డయ్యెగదా! అప్పుడు జ్యేష్ఠానుక్రమముగల రాజ్యపీఠమునకు సుయోధనుడే హక్కుదారుడై యుండును.

పాండవాగ్రజు డట్టి రాజ్యమునుగాని, యది యవిభాజ్యమగుటచే

నందలి భాగమునుగాని కోరుట కర్తవ్యము కాదు. ఇది ధర్మశాస్త్రానుగుణమైన పద్ధతి.

2. ధృతరాష్ట్రపాండురాజులు ఇరువురు రాజ్యానర్హులు గామిచే భీష్ముడు ధృతరాష్ట్రుని నామమాత్రరాజుం గావించి తానే రక్షించుచుండుటచే వారిసంతానమగు యుధిష్ఠిరదుర్యోధనులలో నెవ్వరు పెద్దవారో వారు రాజ్యపీఠము నధిరోహించుట కర్హులందురేని సర్వజ్యేష్ఠుడగు ధర్మరాజే రాజ్యమునకు నుత్తరాధికారి యగు గదా!

అట్లగుటచేతనే ధృతరాష్ట్రుడు తన సుతు డుండగా ధర్మరాజునకే యౌవరాజ్యపట్టాభిషేకము జేసెను. యౌవరాజ్యపట్టాభిషిక్తుడెవడో వాడే రాజ్యమునకు నుత్తరాధికారి. ఇట్లుండగా ధృతరాష్ట్రుడు ధర్మరాజున కర్ధరాజ్యం బిచ్చి పంపుటకు గారణమేమి? ఇది శాస్త్రగర్హితము కాదా! ఎట్లు చూచినను ధర్మరాజునకు నర్ధరాజ్య మిమ్మని కోరు నధికారము లేశము లేదు. అధికార మున్న సర్వరాజ్యమును గోరు నధికారమే యుండవలయును.

3. అట్లు సర్వరాజ్యాధికారమే గలదు. పెద్దతండ్రియందలి గౌరవముచేత నతనికి సగము వదలె నందురా? అవిభాజ్యరాజ్యమును విభజించుటకు యోగ్యత లేదు.

4 పాండురాజు సింహాసనాసీనుడు కాలేదు. ధృతరాష్ట్రుడే రాజయినాడు, "ధృతరాష్ట్రుడు రాజ్యముచేసె" అని కంఠోక్తిగా జెప్పబడియున్నది.

పాండురాజే రాజ్యాధికారి కానపుడు తత్సుతులు "తమయయ్యసగం బిల పంచియిమ్ము" అని యడుగుట కధికారము లేదు ఈ కారణములవలన పాండవులకు రాజ్యాధికారము లేనట్లు స్పష్టమగుచున్నది.

5 ఏది యెట్లున్నను అంధనృపతి తమ్ముని బిడ్డలయందలి పక్షపాతముచేత గొంతరాజ్య మిచ్చినందున దుర్యోధను డారాజ్యవిభాగ

మంగీకరింపక తండ్రి కేమురాజలేక అప్పటి కేమియు ననక పదం పడి ద్యూతవ్యాపారముచే దానిని మరల దీసికొనియె. అట్లు తీసి కొనునపుడు పండ్రెండేళ్ళు వనవాసము, నొక్కయే డజ్ఞాతవాస మును పాండవులు చేయవలయు నని నిబంధన మేర్పరుపబడెను.

ఇట్లు చేయుటకు గల సూచ్యాభిప్రాయము — సాధారణ ముగా బండ్రెండు సంవత్సరము లొకరి యాస్తి వారియనుభవ ములో నుండి తొలగి పరాధీనమై యుండినయెడల వారికి దాని యందలి స్వత్వము నశించునను ధర్మశాస్త్రాంశమే. ఇట్లుచూచినను పాండవులకు బదుమూడేడులు తను యనుభవములో లేని రాజ్య మునందు హక్కు నశించెం గావున నద్దాని వారు మరల గోర కూడదు.

ఎన్నివిధముల నాలోచించినను బాండవులకు రాజ్యాధికారము లేదనియు, వారు దానిం గోరి యుద్ధము సేయుట అన్యాయ మనియు గనిపించుటకు సందియము లేదు.

6. అందుచేతనే పాండవుల విజయము న్యాయవిరుద్ధ మని గ్రంథకర్త పడిన యభిప్రాయములో బొరపా టేమియు లేదు.

ఇవి యారంభములు. వీనికి సంబంధించిన చర్చ, వెనుక 'కురు పాండవదాయభాగవినిర్ణయము'ను చర్చించినపుడు చే య బ డి యు న్నది. అయినను ఈవిద్యాధికుల వాదమును పరిశీలింపక విడిచిపెట్టిన యెడల పాండవసందానిరాకరణప్రకరణములోని దాయభాగ చర్చ పరిపూర్ణతను బొందదు గనుక వీరివాదమునుగూడ పరామర్శించు చున్నాము.

'కర్ణుని కంగరాజ్యము నిరాక్షేపముగ నిచ్చుటనుబట్టి సుయో ధనుడు రాజో యువరాజో అయియుండును' అని గ్రంథకర్తలు యూ హించి వ్రాసి యుండెను.

కాని ఆయూహకు గ్రంథప్రమాణము లేదు. ఆయిచ్చినదికూడ

కుమారవిద్యాప్రదర్శన కాలమం దని వారే చెప్పుచున్నారు. ఆ కాలమునకు దుర్యోధనుడు రాజై యుండు ననుట అసంగతము.

ఇంకొకటి- ఉపోద్ఘాతములోని ద్వితీయాంశములో నున్నట్లు "ధృతరాష్ట్రుడు తన సుతు డుండగా ధర్మరాజునకే యువరాజ్యపట్టాభిషేకము చేసెను" అను గ్రంథస్థమెకూడ నున్న విషయమునకు విరుద్ధము. దుర్యోధనుడే రాజై యున్నపుడు 'సుతు డుండగా ధర్మరాజునకే యువరాజ్య మీయబడినది ధృతరాష్ట్రునిచే' ననుట యెట్లు సరిపడును?

ఇంకొకటి- ద్వితీయాంశములో నున్నట్లు "యువరాజ్యపట్టాభిషిక్తుడే రాజ్యమున కుత్తరాధికారి" యగునుకదా. అట్టి స్థితిలో యువరాజు ధర్మజుడై యుండ రాజు దుర్యోధను డెట్లగును?

ఇక యువరాజై యుండు ననుటకూడ నయుక్తమే. దుర్యోధనునికంటె పెద్దవాడు ధర్మజుడు. అట్టి ధర్మజుడే కుమారవిద్యాప్రదర్శనకాలమునకు యువరాజు గావింపబడ లేనప్పుడు దుర్యోధనుడు యువరాజై యెట్లుండును?

ఇంకొకటి- భారతములో నిర్వివాదమై యున్న యుధిష్ఠిర యౌవరాజ్యవిషయమునకు విరుద్ధమైన దుర్యోధనయౌవరాజ్యకల్పన అయుక్తము. కనుక దుర్యోధను డానాటికి గాదేనాటికిని రాజై కాని, యువరాజై కాని యుండలేదు.

అట్లనధికారియైన దుర్యోధనుడు తండ్రిని ప్రేరేపించి తండ్రి యనుమతిపై యంగరాజ్య మిచ్చినట్లు చెప్పుటకంటె ప్రతివాదులకైనను గత్యంతరము లేదు. ధృతరాష్ట్రున కారాజ్యాధికార మున్ననో రాజ్యాభిషిక్తుడగు పాండురాజు వనమునకు వెళ్ళునపుడు ధృతరాష్ట్రవిదురులకు రాజ్యము నప్పగించి వెళ్లుటచే నాటినుండియు విదురుని మంత్రిత్వపూర్వకముగ ధృతరాష్ట్రుని యధీనములో రాజ్యముండుట

వలన నేర్పడినది. అట్టి ధృతరాష్ట్రుని యనుమతిపై జరిగిన దాయంగ రాజ్యప్రదానము.

పుత్రప్రేమచే దుర్యోధనునకు వశుడై వర్తించుట ధృతరాష్ట్రునకు సహజము. పితృభక్తిచే ధృతరాష్ట్రునకు వశులై వర్తించు పాండవులకు సహజము. అందుచే కర్ణుని కంగరాజ్యప్రదానము నిరాక్షేపముగా జరిగినది. ఈవిషయము విశేషించి— "దుర్యోధనుడు కర్ణునకంగరాజ్య మిచ్చినపుడు పాండవు లాక్షేపింపలేదేమి?" అను ప్రసంగమును నిరాకరించినపుడు నిరూపింపబడియున్నందున నచ్చట జూడవలయును. ఇట్లు పరిశీలింపగా నీయంశము నిరస్తమయినది.

ఇక ఉపోద్ఘాతములోని ప్రథమాంశములో 'పాండురాజు పాండురోగపీడితుడు' అనుమాటఅయుక్తము. ఈవిషయము "పాండురోగియైన పాండురాజునకు రాజ్యార్హత యెట్లు?" అను ఆక్షేపము నిరాకరింపబడినపుడు స్పష్టీకరింపబడినది.

> "ఎటులైన ధృతరాష్ట్రుడు సింహాసనాసీను డయ్యెనుగదా! అప్పుడు జ్యేష్ఠానుక్రమముగల రాజ్యపీఠమునకు సుయోధనుడే హక్కుదారుడై యుండును. పాండవాగ్రజుడు రాజ్యముగాని, భాగమునుగాని కోరుట కర్హుడు కాడు. ఇది ధర్మశాస్త్రానుగుణమైన పద్ధతి"

అనుమాటకూడ నయుక్తమే. రాజ్యాభిషిక్తుడు పాండురాజే కాని, ధృతరాష్ట్రుడు కాడని బహుప్రమాణములతో వెనుక నిరూపించియున్నాము. రాజ్యాభిషేకపూర్వకముగా ప్రాప్తించిన రాజ్యమే తన పుత్రులకు సంక్రమించునుగాని యన్యవిధమున వచ్చినది యట్లు సంక్రమింపదనియే ధర్మశాస్త్రపద్ధతి. కనుక దుర్యోధను డెంతమాత్రము హక్కుదారుడు కాడు. ఈవిషయము వెనుక ప్రమాణప్రదర్శనసందర్భములో మనుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి, వీరమిత్రోదయము మొదలగు గ్రంథముల నుదాహరించి నిరూపింపబడినది.

"పాండవాగ్రజుడు రాజ్యమును గోరుట కర్హుడు కాడు" అను మాట "ధృతరాష్ట్రుడు తన సుతుడుండగా ధర్మరాజునకే యువ రాజ్యపట్టాభిషేకము జేసెను" అను ద్వితీయాంశములోని తమ మాటకే విరుద్ధము. ఇట్లు పరిశీలింపగా ప్రథమాంశము నిరస్తమైనది.

ఇక ద్వితీయ తృతీయాంశములు—

"యువరాజ్యపట్టాభిషిక్తుడే రాజ్యమున కుత్తరాధికారి. ఇట్లుండగా ధర్మరాజున కర్ధరాజ్య మిచ్చి పంపుటకు గారణమేమి? అధికారమున్న సర్వరాజ్యము నుంచవలయును. పెద్దతండ్రియందలి గౌరవముచేత సగము వదలె నందురా? అవిభాజ్య రాజ్యమును విభజించుటకు యోగ్యత లేదు" అని.

ఇచ్చట రాజ్యము విభజింప లీలు లేగని, అందుచే సగము ధర్మజుడు వదలె ననుట అయుక్తమని వ్రాసిన వీరే పంచమాంశములో 'అంధనృపతి తమ్ముని బిడ్డలయందలి పక్షపాతముచే గొంత రాజ్య మిచ్చెను' అని వ్రాయుటలో విభాగము నంగీకరించుటచే తమవ్రాతకే యిది విరుద్ధము. ధృతరాష్ట్రుడు విభజించి యీయవచ్చు ననియు, ధర్మజు డట్లీయగూడ దనియు నున్నదా? సర్వరాజ్యాధికారియే ధర్మజుడు. అయినను ధృతరాష్ట్రధార్తరాష్ట్రాదిపోషణభారము తన దేయగుటచే సగము వారిజీవనార్థము విడిచి సగమునే తాను స్వీకరించెను. ఇదియే అర్ధరాజ్యమునే స్వీకరించుటలోని పరమార్థము. ఈ విషయము విశేషించి ప్రమాణములతో వెనుక నిరూపించియున్నాము ఇట్లు పరిశీలింప 2, 3, 4 అంశములు నిరస్తము లయినవి.

చతుర్థాంశములో "పాండవులకు రాజ్యాధికారము లేనట్లు స్పష్టమగుచున్నది" అనుమాట అసంగతము. తామే ద్వితీయాంశములో "ధృతరాష్ట్రుడు తన సుతు డుండగా ధర్మరాజునకే యువరాజ్యపట్టాభిషేకము జేసెను" అని వ్రాయలేదా? రాజ్యాధికారము లేని పాండుపుత్రునకు యువరాజ్యపట్టాభిషేక మెట్లు జరిగినది? కనుక నీయంశము నిరస్తమైనది.

—: "ద్యూతములో పోయి 13ఏండ్లు కౌరవులకు భుక్తమైన రాజ్యమందు పాండవులకు హక్కు నశించినందున వారు మరల దానిని కోరనేకూడ" దను ప్రసంగము-తన్నిరాకరణము :—

ఇక పంచమాంశము— "అంధనృపతి తమ్ముని బిడ్డలయందు పక్షపాతముచే గొంతరాజ్య మిచ్చెను. దుర్యోధను డప్పుడేమియు ననలేక తరువాత ద్యూతవ్యాపారముచే దానిని మరల దీసికొనెను. ఆ తీసికొనునపుడు 12 ఏండ్లు వనవాసము, 1 ఏ డజ్ఞాతవాసము పాండవులు చేయవలయు నని నిబంధన యేర్పరుపబడినది.

12 సంవత్సరములు ఒకరి యాస్తి వారి యనుభవములోనుండి తొలగి పరాధీనమై యున్నయెడల వారికి దానియందు స్వత్వము నశించు నని ధర్మశాస్త్రాంశమే. కనుక 13 ఏడులు తమ యనుభవములో లేని రాజ్యమునందు పాండవులకు హక్కు నశించినది కావున నద్దానిని వారు మరల గోరకూడదు." అని.

ఇది యపూర్వవిషయము. రాజ్యమం దెట్టి యధికారము పాండవులకు లేనట్లును, వారికి దయాధర్మభిక్షగా గొంత రాజ్య మీయబడినట్లును, అదియు ద్యూతములో బోగొట్టుకొనబడి 12 ఏండ్లు పరులకు భుక్తమైయుండుటవలన దానియందు పాండవులకు హక్కు పోయినట్లును, అందుచే వారికి దాని నడుగుటకే హక్కు లేనట్లును చెప్పుచున్న ప్రతివాదుల నడుగవలసియున్నది—

12 ఏండ్లకే పాండవుల హక్కుపోవుట నిజమైనయెడల ద్యూతనిబంధనలో 13వ యేడుకూడ ఎందుకు జేర్పబడినది?

ఆ చేర్పబడుటలోగూడ నజ్ఞాతవాసముగా నెందుకు జేర్పబడినది? అదియు వనములోగాక, పురములో జేయునట్లేల నిబంధన చేయబడినది? అపై యజ్ఞాతవాసకాలము లో దెలియబడినయెడల మరల యథాపూర్వముగా వనవాసాజ్ఞాతవాసములు తప్పనివే యని యేల నియమింపబడినది? _ అపై —

"త్రయోదశే చ నిర్వృత్తే పున రేవ యథోచితమ్ ।
స్వరాజ్యం ప్రతిపత్తవ్య మితరై రథవేతరైః "

అనుచు త్రయోదశవత్సరము యథాక్రమముగా నడచిపోయిన పక్షమున స్వారాజ్యము బొందవచ్చు నని యెట్లు చెప్పబడినది?

12, లేక, 13 ఏండ్లు తమకు భుక్తమైనను దానియందు పాండవులకు హక్కు పోదు గనుకనే యీచిత్రబంధమును గల్పించి అజ్ఞాతవాసములో నవశ్యము తెలియబడి తీరుదు రని యెంచి వారిని మరల బంపివేయుచు తాము రాజ్య మనుభవించుచుండవచ్చు నని భావించి దుర్యోధను డింత యెత్తెత్తినాడు.

ఇంకొకటి— ఈవనవాసాజ్ఞాతవాసపణము పునర్ద్యూతములోనిది. ప్రథమద్యూతములో పాండవులు సర్వస్వము నోడిపోవుటచే రాజ్యమందు హక్కు వారి కప్పుడే పోయినది. ఎట్లో గెల్చుకొనిన దుర్యోధనునకే హక్కు సంక్రమించినది అట్టిస్థితిలో పునర్ద్యూతమున కేమి ప్రసక్తి?

ఉత్పాతములకు భీతిల్లి ధృతరాష్ట్రుడు వారిది వారికిచ్చి పంపుట చేతననియేకదా చెప్పవలయును. దుర్యోధనుని హక్కు ధృతరాష్ట్రు డిచ్చుటచే పోయినదా లేదా? పోయినదిగనుకనే పునర్ద్యూతప్రసక్తి కలిగిన దని చెప్పక తప్పదుకద. తాను గెల్చుకొనుటచే గలిగిన తన హక్కు తనతండ్రి యీవిచే బోయి పాండవులకు హక్కు గలిగినదన్న ప్పుడు పదుమూడవత్సరము గడచిన తరువాత తమ రాజ్యమును తాము తీసికొనవచ్చు నని కంఠోక్తిగా జెప్పి పున ర్ద్యూతమాడినపుడు ఆపదమూడువత్సరములు గడచినతరువాత పాండవుల హక్కు పోవు టెట్లు? దుర్యోధనునకు హక్కు కలుగుటెట్లు?

ఇంకొకటి— ప్రథమద్యూతములో ధృతరాష్ట్రు డిచ్చివేసిన దానికి మేమంగీకరించినాము. మరల దానినే యొడ్డుట కాదు. అని చెప్పిన శకునివాక్యము పునర్ద్యూతారంభమున నిట్లున్నది—

క. ధనసంపద రాజ్యంబున
దినకర తేజుండు మిమ్ము ధృతరాష్ట్రుడు పెం
పున బూజించెం గావున
జన దింకను వాని నొడ్డి సరి గ్రీడింపన్.

(ఆంధ్రభారతము)

ఇట్లు చెప్పి వనవాసాజ్ఞాతవాసపణము 13 ఏండ్లు యేర్పరచెను.

దీనినిబట్టిచూడగా పాండవులకు రాజ్యమందలి హక్కును హరించుటకై గాక యీసారి వారి కనుభవము లేకుండ జేయుటకే పున ర్ద్యూతము జరుపబడినదని స్పష్టము. ఇట్టి స్థితిలో పాండవులకు హక్కు పోవు టెట్లు? 12 ఏండ్లు తనయాస్తి తనయనుభవములోనుంచి తొలగినయెడల దానియందలి తన స్వత్వము నశించునని ధర్మశాస్త్రము నందున్నదా? పొరపాటు. ఇదిగో ధర్మశాస్త్రము చూడుడు—

యాజ్ఞవల్క్యస్మృతి—వ్యవహారకాండము—

"పశ్యతోఽబ్రువతో హాని ర్భూమే ర్వింశతివార్షికీ ।
పరేణ భుజ్యమానాయా ధనస్య దశవార్షికీ ॥

మితాక్షరా— పరేణాఽసంబద్ధేన భుజ్యమానాం భువం ధనం వా పశ్యతః అబ్రువతః మదీయేయం భూ స్త్వయా న భోక్తవ్యే త్యప్రతిషేధత స్తస్యా భూమేః వింశతివార్షికీ । అప్రతిరవవింశతి వర్షోపభోగనిమిత్తా హాని ర్భవతి । ధనస్య తు హ స్త్యశ్వాదే ర్దశ వార్షికీ హానిః... ... ...భూమేర్ధనస్య చ ఫలహాని రిహ వివక్షితా న వస్తుహాని ర్నాపి వ్యవహారహానిః। తథా హి—

నిరాక్రోశం వింశతివర్షోపభోగా దూర్ధ్వం యద్యపి స్వామీ న్యాయతః క్షేత్రం లభతే । తథాపి ఫలానుసరణం న లభతే । అప్రతిషేధలక్షణా త్స్వాపరాధా దస్మా చ్చ వచనాత్ । పరోక్షభోగేతు వింశతే రూర్ధ్వమపి ఫలానుసరణం లభత ఏవ । పశ్యత ఇతి వచనాత్ ప్రత్యక్షభోగే చ సానుక్రోశే, అబ్రువత ఇతి వచనాత్ ।

వింశతేః ప్రత్యక్షే నిరాక్రోశే చ లభతే వింశతిగ్రహణాత్।
నను తదుత్పన్నస్యాఽపి ఫలస్య స్వత్వాత్తద్ధానిరనుపపన్నైవ। బాఢం,
తస్య స్వరూపాఽవినాశేన తత్రైవాఽవస్థానాత్ । యథా తదుత్పన్న
పూగపనసవృక్షాదీనాం యత్నేన స్తదుత్పన్న ముపభోగా న్నష్టం
తత్ర స్వరూపనాశాదేవ స్వత్వనాశః... ... ... ... ... ...

తాను చూచుచుండ తనభూమి నిరాక్షేపముగా నన్యునిచే
నిరువదిసంవత్సరము లనుభవింపబడినపుడు తన స్వత్వమునకు హాని
కలుగును. గజాశ్వాదిరూపధనము పదిసంవత్సరము లట్లనుభవింపబడి
నపుడు తన స్వత్వమునకు హాని కలుగును. ఈ చెప్పబడిన స్వత్వహాని
గతఫలవిషయమె కాని స్వరూపవిషయము వ్యవహారవిషయముగాదు.

అనగా నిర్వివాదముగా నన్యునిచే నిరువదిసంవత్సరము లనుభ
వింపబడినతరువాతగూడ న్యాయముగా తనభూమి తనకు ప్రాప్తిం
చును. కాని తాను చూచుచు నిరాక్షేపణముగ నూరకున్న తనదోష
ముచే గతఫలముమాత్రము ప్రాప్తింపదు. తన పరోక్షములో నట్లను
భవింపబడినపుడును, ప్రత్యక్షములో వివాదపూర్వకముగ నట్లనుభవింప
బడినపుడును ఇరువదిసంవత్సరముల పైనగూడ గతఫలము ప్రాప్తించును.

ఇరువదిసంవత్సరములలోపల, ప్రత్యక్షములో నిర్వివాదముగా
ననుభవింపబడినను, గతఫలముకూడ ప్రాప్తించును. స్వత్వహానిగల ఫల
మెట్టిదనగా దేని స్వరూప మనుభవముచె నష్టమగునో అట్టిదే!
ఆభూమిలో బుట్టిన ఫలవృక్షాదిరూపఫలము గాదు. అని తాత్పర్యము.

ఈధర్మశాస్త్రమునుబట్టికూడ 13 ఏండ్లు పాండవరాజ్యమును
దుర్యోధను డనుభవించినను పాండవులకు హక్కుపోలేదు. దుర్యోధను
నకు హక్కు రాలేదు. కనుక "పాండవులకు 13 ఏండ్లు తమ యనుభవ
ములో లేని రాజ్యమందు హక్కు నశించెగావున నద్దానిని వారు మరల
గోరకూడదు" "దానిం గోరి యుద్ధము సేయుట అన్యాయ మనిపిం
చుటకు సందియము లేదు" "పాండవుల విజయము న్యాయవిరుద్ధ మని

గ్రంథకర్త పడిన యభిప్రాయములో పొరపా టేమియు లేదు" అను 5-6. అంశములలోని మాట లసంగతము లగుటచే నిరస్తమైనవి. రాజ్యము పాండవులదే యని ధ్రువమైనది.

విద్వన్మార్గము నుల్లంఘించి, భారతకథాంశములను వ్యత్యస్తము చేసి, శబ్దమర్యాద నతిక్రమించి, యపార్థములను చెప్పి, యవినీతిగ వ్రాసి, పూజ్యులను దూషించి, అపూజ్యునుభూషించి, తోచినట్లువ్రాసిన విమర్శనములవలన సారస్వతమున కెంత హాని కలిగెనో లోకములో నెంత యవినీతి ప్రబలెనో ప్రాజ్ఞులు గ్రహింతురుగాక!

"అపూజ్యా యత్ర పూజ్యన్తే పూజ్యానాం చ వ్యతిక్రమః ।
త్రీణి తత్ర భవిష్యన్తి దుర్భిక్షం మరణం భయమ్ ॥"

అను స్కాందవచనము- అపూజ్యులను పూజించుటయు, పూజ్యులను దూషించుటయు జరిగినచోట, లోకులకు దుర్భిక్షము, మరణములు, ప్రాణభయములు, ప్రాప్తించునని తెలుపుచుండ లోక హానికరములగు నారెండుపనులనే పట్టుదలతో జేయుచు వ్రాతలు సాగించుచున్నట్టి మూర్ఖసంప్రదాయానభిజ్ఞులవలన లోకమున కభ్యుదయము, నీతి, యెట్లు కలుగునో అభిజ్ఞు లాలోచింతురుగాక.

—• "పాండవులలో దోసము లేదా? అర్ధరాత్రమున భీష్ముని సమీపించి యాతనిసంహారరహస్యము దెలిసికొనిన ధర్మరాజేమి సజ్జనుడు?"

అనుప్రసంగము —తన్నిరాకరణము—

ఒక కవి ఖండకావ్యములోని 'చనవు' అనుభాగములో నిట్లున్నది—

"వ్యాసమునీ భారతమును వ్రాసిన కవినాథ! పాండురాజసుతులలో దోసము లేదా? యేదీ, నాసంశయములు నివారణము సేయగదే" "మనలోమాటను జెప్పుకొందము తలంపగా ధర్మరాజేమి సజ్జనుడో చెప్పుము? తాతపాదముల పజ్జ జేరి యుబ్బించి

యాతనిసంహారరహస్యమునా తెలియలేదా? యర్ధరాత్రాన నెవ్వని
కేనిన్ వినరింపు మిట్టి కుటిలవ్యాపారముల్ మెత్తురే"

ఇచ్చట మొదటిపద్యములో "పాండురాజసుతులలో దోసము
లేదా? ఏదీ చెప్పుము" అని కవి వ్యాసముని నడుగుట జూడ, వారిలో
దోసము లేదని వ్యాసముని చెప్పియున్నట్లును, దోసము లేదా? అని
యీకవి యడుగుచున్నట్లును గోచరించుచున్నది. ఈయడుగుటలో
పేరునుబట్టి వ్యాసమునియం దీకవికిగల చనవే కారణమని తెలియు
చున్నది. అవనువు వ్యాసమునిభారతముతో కవికిగల పరిచయ మన్న
మాట.

ఐతే ఆవ్యాసముని కనబడి యీవిధముగా దోసము లేదని
తనకు జెప్ప నని యీకవి యూహించుట కవకాశము లేదుకనుక వ్యాస
భారతమునే యీకవి వ్యాసమునినిగా భావించి యాభారతమునే దోస
మెట్లు లేదో తెలుపుచు నాసంశయముల దీర్పుమని యడిగినట్లు తేలు
చున్నది. ఇట్టిస్థితిలో భారతవచనసందర్భమును పరిదర్శించి యావిషయ
మును వివరించుట యుక్తము—

ఆరెండవపద్దెములోని ప్రశ్న మేమనగా—

"అర్ధరాత్రిమున భీష్మునియొద్దకు జేరి యాతని నుబ్బించి
యాతని సంహారరహస్యమును తెలిసికొనిన ధర్మరా జేమి సజ్జ
నుడో చెప్పుము" అని.

మఱియొక పద్దెములో "ద్రోణు డస్త్రసన్యాసము జేయుటకై
ధర్మరా జసత్యమాడె" నని యీకవియే వ్రాసెను. (అది ముందు
చర్చించబడును).

దీనివలన, అర్ధరాత్రిమున భీష్ము నాశ్రయించి యాతని సంహా
రరహస్యమును దెలిసికొనెను. ద్రోణుని ఆపనికై యాశ్రయింప లేదు.
అసత్య మాడి కార్యము సాధించుకొనెను. అని తేలినది.

అప్రతిహతముగా జరుగుచున్న ఘోరసంగ్రామసమయములో నాడర్ధరాత్రిమున భీష్ముని నాశ్రయించిన యెడల తనసంహారరహస్యమును తప్పక జెప్పునని ధర్మజున కెట్లనుపించినది? ద్రోణునిగూర్చి యట్లనిపించక పోవుటేమి? తనతో కత్తిగట్టి యుద్ధముచేయువానిని నీవెట్లు మరణింతువని యడుగుటయు, నాతడు చెప్పుటయు నెక్కడనైన గలదా? ఈప్రక్రియ యొక్క భీష్మునియందే సంభవింపనేల? అను విషయములు ముందాలోచింపదగినవి.

భీష్ముడు స్వచ్ఛందమరణవరము గలవాడు. అనగా తనయిష్టమునుబట్టి మరణింపవలసినవాడు, రాజ్యము పాండవులది కాని కౌరవులది కాదని తెలిసినవాడు, కౌరవుల పాండవద్రోహచర్యలను మొదటినుండియు గ్రహించుచున్నవాడు. లాక్షాగృహమున పాండవులను జంపుటకై చేసిన కౌరవుల దుర్మార్గము నెరిగినవాడు. ద్రౌపదీవివాహానంతరము పాండవులు జీవించియున్నారని లోకులకు దెలిసినతరువాత ధృతరాష్ట్రధార్తరాష్ట్రులకు బోధించి పాండవులను రప్పించి వారి కర్ధరాజ్య మిప్పించినవాడు. అట్టి పాండవులను ద్యూతమున కాహ్వానించి వారి సర్వైశ్వర్యమును కపటద్యూతమున నపహరించి నిండుసభలో ద్రౌపదీమానభంగము జేసి ద్రౌపదీసహితముగా పాండవుల నరణ్యమునకు బంపిన కౌరవుల దురంతమును కనులార చూచినవాడు, వనవాసాజ్ఞాతవాసదీక్ష యథాక్రమముగా బూర్తి యగుటవలన ద్యూతకాలనిర్ణయప్రకారము పాండవుల రాజ్యమును పాండవుల కీయవలసియుండ దాని నీయకుండిన కౌరవుల దుర్వృత్తి నెరిగినవాడు. అజ్ఞాతవాసములో నుత్తరగోగ్రహణసమయమున యుద్ధమునకు వచ్చి యర్జునుడు కనబడినపుడు అజ్ఞాతవాసము ముగియకపూర్వమే కనబడెననియు, వీరిని మరల వనవాసాదులకు పంపవచ్చుననియు భావించిన దుర్యోధనుడు ఈవిషయములను భీష్ముని నడిగి తెల్పవలె నని వచ్చి యడిగినపుడు అధికమాసములు కలపవలయు ననియు, వానితో గడువు

పూర్తియైనదనియు, కనుకనే కనబడెననియు, పదమూడుసంవత్సరము లట్లు పడియున్నవారు గడువుదాటనిదే కనబడుదురా! అనియు, చెప్పిన తనమాటను, తృణీకరించి పాండవులు మరల వనవాసము చేయవలసినవారే యని ప్రసంగించిన దుర్యోధనుని దుష్ప్రవృత్తి నెరిగినవాడు,

రాయబారిగా బంపబడిన ద్రుపదపురోహితుడు వారి రాజ్యమును వారి కివ్వవలసినదని వచ్చి చెప్పినపుడు వారికి రాజ్యకాంక్ష యున్నయెడల మరల వనవాసాజ్ఞాతవాసములు చేసి రావలసినదే యని పలికిన కర్ణదుర్యోధనుల వాక్యములు చెవులతో వినినవాడు,

పాండవులయొద్దకు రాయబారిగా వెళ్ళిన సంజయునితో అయిదుగురి కయిదుగ్రామముల నిచ్చినను మేము సంతోషింతుమని చెప్పిన ధర్మజుని మాటలు విని ధర్మజుని వ్యవహారము అయిదుగ్రామములను యాచించుటవరకు వచ్చినది, నాప్రభావమునకు, నాసైన్యమునకు భీతిల్లినాడని పలికిన దుర్యోధనుని మాటలాలకించినవాడు.

ధృతరాష్ట్రుడు, నీయర్ధరాజ్యము నీకు జాలును. నీవు యుద్ధమునకు దిగకుము. భీష్మద్రోణకృపాశ్వత్థామవిదురసంజయప్రభృతు లెవ్వరును యుద్ధమున కిష్టపడువారు కారు. పుత్రకా? యుద్ధముచేయు బుద్ధి నీకు పుట్టినదే కాదు, కర్ణ శకుని దుశ్శాసనులు నీకు ప్రోత్సాహకులు. అని మందలించినపుడు తండ్రితో—

"అహం చ తాత కర్ణశ్చ భ్రాతా దుశ్శాసనశ్చ మే ।
ఏతే వయం హనిష్యామః పాండవాన్ సమరే త్రయః ॥"

నేను, కర్ణుడు, దుశ్శాసనుడు, అను మేము ముగ్గురమే పాండవులను వధింపగలము, అని పలికిన దుర్యోధనుని ధోరణి తెలిసినవాడు,

సాక్షాద్భగవంతుడను తన యనుభవమునకు విషయమైయున్న కృష్ణభగవానుడు రాయబారిగా వచ్చి హితోపదేశము చేసి చెప్పినపుడు 'సంధి కుదరదు. వారిని వధించి మేమో, మమ్ము వధించి వారో రాజ్య మేలుకొనుటే నిశ్చయించితిని. వారికి యీ మన్మాత్రము నేనీయ, నని పలికిన దుర్యోధనుని మాటలు చెవులతో వినినవాడు.

అట్లు యుద్ధమునకు గాలుదువ్వి రణరంగమునకు వెళ్ళబోవు నపుడు భీష్మునియొద్దకు జేరి "నీవు శుక్రునితో తుల్యుడవు. స్వచ్ఛంద మరణవరము గలవాడవు నాహితముగోరువాడవు. మాకు సేనా నాయకుడవై యుండి మమ్ములను కాపాడుచున్నపుడు మేము దేవతలను గూడ లక్ష్యపెట్టము నీవు ముందు నడచిన నీవెంట మేము వచ్చు చున్నాము." అని కోరినపుడు—

"ఏవ మేత న్మహాబాహో యథా వదసి భారత।
యథైవ హి భవన్తో మే తథైవ మమ పాండవాః ॥
అపి చైవ మయా శ్రేయో వాచ్యం తేషాం నరాధిప।
సంయోద్ధవ్యం తవార్థాయ యథా మే సమయః కృతః ॥
నత్వేవోత్పాదనీయా మే పాండోః పుత్రా జనాధిప।"

నీవన్నది నిజమే. నాకు మీరెట్టివారో పాండవులు నట్టివారే. నానిర్ణయప్రకారము పాండవులకు శ్రేయస్సు నుపదేశింపవలయును. మీనిమిత్తము యుద్ధముచేయవలయును. పాండవులు నాకు నశింప జేయ శక్యముకాని వారు. అని దుర్యోధనునితో కంఠోక్తిగా జెప్పిన వాడు.

(పైవిషయములు 'శ్రీకృష్ణనిందానిరాకరణము' అను తృతీయ భాగములో వచనోదాహరణములతో నిరూపింపబడియున్నవి).

అట్టి భీష్ముడు రణరంగమున వ్యూహము బన్ని సేనానాయ కత్వము వహించి యుద్ధసన్నద్ధుడై యున్న సమయమున, గీతోపదేశ ముచే మోహము తొలగి పార్థుడు గాండీవము జేతబట్టిన సమయ మున, సేనలు యుద్ధోత్సుకతను ప్రకటించుచున్న సమయమున, ధర్మ జుడు—ధరించియున్న కవచమును విడిచి ధనస్సు రథమందుంచి తాను రథము దిగి భీష్మపితామహు నుద్దేశించి కృతాంజలియై మౌనము వహించి నడచి శత్రుసేనలో బ్రవేశింపబోవునపుడు, భీమసేనాదు

లును, కృష్ణభగవానుడును వెనుక వెళ్ళుచున్నపుడు, ఈవెళ్లుటలో నీ యభిప్రాయ మేమని యడుగుచున్న సోదరులకు మౌనమున బదులు చెప్పకయే ధర్మజుడు నడచుచున్నపుడు భీమసేనాదులకు శ్రీకృష్ణభగవాను డిట్లుచెప్పెను —

"తా నువాచ మహాప్రాజ్ఞో వాసుదేవో మహామతిః ।
అభిప్రాయోఽస్య విజ్ఞాతో మయేతి ప్రహసన్నివ ॥
ఏష భీష్మం తథా ద్రోణం గౌతమం శల్య మేవ చ ।
అనుమాన్య గురూన్ సర్వాన్ యోత్స్యతే పార్థివోఽరిభిః ॥
శ్రూయతే హి పురా కల్పే గురూ ననసుమాన్య యః ।
యుధ్యతే స భవే ద్వ్యక్తం మపధ్యాతో మహత్తరైః ।
అనుమాన్య యథా శాస్త్రం యస్తు యుధ్యే న్మహత్తరైః ॥
ధ్రువ స్తస్య జయో యుద్ధే భవే దితి మతి ర్మమ ।" (భీష్మ-అ43)

ఈతని యభిప్రాయము నాకు దెలిసినది. గురువులగు భీష్మ ద్రోణకృపశల్యుల అనుమతి దీసికొని యుద్ధము చేయును. గురువుల అనుమతి దీసికొనక వారితో యుద్ధముచేసినయెడల జేటు కలుగు నని శాస్త్రమం దున్నది. యథాశాస్త్రముగ పూజ్యుల అనుమతిపై యుద్ధము చేసినవానికి జయము ధ్రువము. అని.

ఇట్లు కృష్ణభగవానుడు ధర్మజుని మనోగతము భీమార్జునాదులకు జెప్పుచు వెళ్లుచుండ ధర్మజుని యారాకను జూచిన కౌరవసేన-ఈతనికి భీతిపుట్టిన దనియు, నీతనికి బుద్ధి మెక్కడకి అనియు దూషించుచు హర్షధ్వనులు చేసి యాపై —

"నిశ్శబ్ద మభవ త్తూర్ణం పున రేవ విశాంపతే ।
కిన్ను వక్ష్యతి రాజాఽసౌ కిం భీష్మః ప్రతివక్ష్యతి ।
కిం భీమ స్సమరశ్లాఘీ కిన్ను కృష్ణార్జునా వితి ।
వివక్షితం కి మస్యేతి సంశయ స్సుమహా నభూత్ ॥
ఉభయో స్సేనయో రాజన్ యుధిష్ఠిరకృతే తదా ।"

సేన నిశ్శబ్దముగా నుండెను. ఉభయపక్షసేనలును ధర్మజు డేమనునో, భీష్ము డేమి బదులుచెప్పునో, భీమసేను డేమనునో, కృష్ణా ర్జును లేమందురో అని ధర్మజునిగూర్చిగొప్పసంశయము గలిగియుండెను

అంతట ఆయుధపాణులైన సైనికులచే నుద్దీపించుచున్న శత్రు సేనలో సోదరులతో బ్రవేశించి భీష్ముని యొద్దకు వెళ్ళి ధర్మజుడు—

"త మువాచ తతఃపాదౌ కరాభ్యాం పీడ్య పాండవః ।
భీష్మం శాన్తనవం రాజా యుద్ధాయ సముపస్థితమ్ ॥
ఆమన్త్రయే త్వాం దుర్ధర్ష త్వయా యోత్స్యామహే సహ ।
అనుజానీహి మాం తాత ఆశిషశ్చ ప్రయోజయ ॥

యుద్ధసన్నద్ధుడైయున్న భీష్మపితామహుని పాదము లొత్తి పితామహా! నీతో యుద్ధము చేయబోవుచున్నాము, అనుజ్ఞ నిమ్ము, ఆశీర్వదింపుము, అని పలుకగా భీష్ము డిట్లనెను—

"యద్యేవం నాభిగచ్ఛేథా యుధి మాం పృథివీపతే ।
శపేయం త్వాం మహారాజ పరాభావాయ భారత ॥
టీ. పరాభావాయపరాకృతో నిరస్తో భావ స్సత్తాయత్ర సః ।
తస్మైమరణాయేత్యర్థః పరశ్చాఽసావభావశ్చేతివిగ్రహేపిసఏవార్థః।
"ప్రీతోఽహం పుత్ర యుధ్యస్వ జయ మాప్నుహి పాండవ ।
యత్తేఽభిలషితం చాన్య త్త దవాప్నుహి సంయుగే ॥
వ్రియతాం చ వరః పార్థ కిమస్మత్తోఽభికాంక్షసి ॥
ఏవంగతే మహారాజ న తవాస్తి పరాజయః ।"
టీ. ఏవంగతే ఈదృశాచరణవ తి।
"అర్థస్య పురుషో దాసో దాస స్త్వర్థో న కస్యచిత్ ।
ఇతి సత్యం మహారాజ బద్ధోఽస్మ్యర్థేన కౌరవైః ॥
అత స్త్వాం క్లీబవ ద్వాక్యం బ్రవీమి కురునందన ।
భృతోస్మ్యర్థేన కౌరవ్య యుద్ధా దన్య త్కిమిచ్ఛసి ॥
టీ. క్లీబవత్ సోక్తస్య వరస్య యుద్ధా దన్య దితి స్వయమేవ సంకోచనా త్కాతరవత్, భృతః పోషితః యుద్ధాత్ ప్రతిభట్యాత్"

"ధర్మజా! నీవిట్లు రాకుంటివేని అనగా ఈపక్షములో నేనుండు టకు గల కారణమును గ్రహింపగల నీవు, శత్రుపక్షములో నున్న నన్ను శత్రువుగనే భావించి ఇట్లు రాకుంటివేని నీకు చేటుకలుగునట్లు శపించియుందును. పుత్రా! సంతోషించితిని, యుద్ధము చేయుము. జయము నొందుము. యుద్ధమును సంబంధించి మరేయభిలాషములు నీకున్నవో వాని నన్నిటిని బొందుము. నావలన నీకేమి కావలయునో వరము గోరుము. ఇట్టి యాచరణము గల నీకు పరాజయ ముండదు. పురుషుడర్థమునకుదాసుడు(బద్ధుడు)అనునది సత్యము. అర్థముతో నేను కౌరవులచే బద్ధుడనైతిని; నేనర్థముచే బోషింపబడితిని; అందుచేతగా తనేను సంకుచితముచేసిమినహాయించి)నిన్ను వరము గోరుమనుచున్నాను నేను నీకు ప్రతిభటుడనై యుద్ధము చేయుచున్న విషయములో మాత్రము మార్పునుగోరక మరేమి కావలయునో కోరుము" ఈమాటలపై ధర్మజు డిట్లనెను—

"మన్త్రియస్వ మహాబాహో హితైషీ మమ నిత్యశః।
యుధ్యస్వ కౌరవస్యార్థే మమైష సతతం వరః॥"

మహనీయా! నీవు కౌరవపక్షమందే యుద్ధము చేయుము, నాహితమును గోరెడి నీవు నాకాలోచనము చెప్పుము. ఎప్పుడును నేనుకోరెడి వర మిదియే, భీష్ముడు—

"రాజన్ కిం మత్రసాహ్యం తే కరోమి కురునందన।
కామం యోత్స్యే పరస్యార్థే బ్రూహి యత్తే వివక్షితమ్॥"

కౌరవపక్షమున యుద్ధము చేయుదును. నీకేమి సహాయము చేయవలయును, నీయభిప్రాయమేమి?

ధర్మజుడు—"కథం జయేయం సంగ్రామే భవన్తమపరాజితమ్।
ఏత న్మే మన్త్రయ హితం యది శ్రేయః ప్రపశ్యసి"

టీ॥ శ్రేయః ప్రపశ్యసి యది, వక్తుం యోగ్య మితి మన్యతే యది వదేత్యర్థః॥

మహానీయా! యుద్ధమం దజేయుడ వయిన నిన్ను జయించు టెట్లు? ఈవిషయమును చెప్పవచ్చు నని తోచినయెడల జెప్పుము.

భీష్ముడు—"నైనంపశ్యామికౌన్తేయయోమాంయుధ్యన్త మాహవే, విజయేత పుమాన్ కశ్చి త్సాక్షా దపిశతక్రతుః ।

ధర్మజా! ఇంద్రుడైన గానిమ్ము. నేను రణరంగమున నిలిచి యుద్ధముచేయుచున్నకాలములో నన్ను జయింపగల పురుషుడు లేడు.

ధర్మజుడు—

"హన్త పృచ్ఛామి తస్మా త్త్వాం పితామహ నమోఽస్తు తే ।
వధోపాయం బ్రవీహి త్వ మాత్మన స్సమరే పరైః ॥

నిన్ను జయించువాడు లేనందుటచేతను, నీవు నాకు జయము నాశీర్వదించుటచేతను, నిన్ను నమస్కరించి యడుగుచున్నాను —పితామహా! నీవధోపాయ మేమి?

భీష్ముడు—

"న స్మతం తాత పశ్యామి సమరే యో జయేత మామ్ ।
న తావ న్మృత్యుకాలోఽపి పునరాగమనం కురు" ॥

ధర్మజా! యుద్ధములో నన్నుజయింపగలవాడుకనబడడు. ఇప్పుడు మరణసమయము గాదు. మరల రమ్ము.

ఇచ్చట భీష్ముని వధోపాయమును ధర్మజు డడుగుట అసంగత మనిపించును కాబోలు! భీష్మునకు మాత్రి మట్లనిపింపలేదు. మొదట సేనానాయకత్వము వహించి మాకు రక్షకుడవై యుద్ధము నడుపవలసినదని కోరిన దుర్యోధనునితో "అపి చైవ మయా శ్రేయో వాచ్యం తేషాం నరాధిప" అనుచు పాండవులకు శ్రేయస్సు నుపదేశింతును. మీకొరకు యుద్ధము చేయుదును. అని స్పష్టముగా జెప్పిన మాటలో శ్రేయస్సు నుపదేశించుట, తన వధోపాయమును వారికి చెప్పుటే యని తెలిసియుండెను. దాని కనుగుణముగనే నావలన

నీ కేమి కావలెనో కోరుకొనుము. ఇచ్చెద నని సేనాముఖమున ధర్మ జుని ప్రోత్సహించుటయు, నీకు జయము కలుగు నని యాశీర్వదించు టయు జరిగినది.

తనకు జేసిన వరప్రోత్సాహమును, జయాశీర్వచనమును ఆధార ముజేసికొని అజేయుడైన భీష్ముని జయించుట, ధర్మప్రాణుడైన ఆతడు తనవధోపాయమును వెల్లడించినపుడే సంభవించుననియు, దానిని వెల్లడించు సంకల్పము పూర్తిగా గలిగియే యిట్లు సంభాషిం చుచున్నాడనియు, గ్రహించియే వధోపాయ మేమని ధర్మజుడడిగినాడు. కనుకనే తొమ్మిదవనాటి రాత్రి భీష్మునియొద్దకు సోదరులతోడను కృష్ణ భగవానునితోడను వెళ్ళిన ధర్మజునితో సంభాషించుచు భీష్ముడు—

"న కథంచన కౌన్తేయ మయి జీవతి సంయుగే ।
జయో భవతి స్సర్వజ్ఞ సత్య మేత ద్బ్రవీమి తే ॥
నిర్జితే మయి యుద్ధేన రణే జేష్యథ పాండవాః ।
క్షిప్రం మయి ప్రహారధ్వం యదీచ్ఛథ రణే జయమ్ ॥"

(భీష్మప. అ. 107)

నేను జీవించియుండ మీకు జయము కలుగదు, ఇది నిజము యుద్ధములో నన్ను నిర్జించినప్పుడు మీరు జయింపగలరు. మీకు జయాభిలాష మున్నపుడు నన్నుపడగొట్టవలసినదే అని చెప్పెను. ఇట్లుభీష్మాభిప్రాయానుగుణమైనధర్మజుని మాట అసంగత మెట్లగును?

మరియు క్షత్రియునకు యుద్ధమరణము శ్లాఘ్యము, శయ్యామ రణము నింద్యము ఈవిషయమును రాజధర్మప్రస్తావములో భీష్ముడే యిట్లుచెప్పెను—

"అధర్మః క్షత్రియస్యైష యచ్ఛయ్యామరణం భవేత్ ।
విసృజన్ శ్లేష్మమూత్రాణి కృపణం పరిదేవయన్ ॥
న గృహే మరణం తాత క్షత్రియాణాం ప్రశస్యతే ।
రణేషు కదనం కృత్వా జ్ఞాతిభిః పరివారితః ॥

తీక్ష్ణైః శస్త్రైరభిక్లిష్టః క్షత్రియో మృత్యుమర్హతి ।
శూరో హి కామమన్యుభ్యా మావిష్టో యుధ్యతే భృశమ్ ॥
హన్యమానాని గాత్రాణి పరై ర్నైవావబుధ్యతే ।
స సంఖ్యే నిధనం ప్రాప్య ప్రశస్తం లోకపూజితమ్ ॥
స్వధర్మం విపులం ప్రాప్య శక్రస్యైతి సలోకతామ్ ॥"

(శాన్తి. అ97)

క్షత్రియునకు శయ్యామరణ మధర్మము, రణరంగమున యుద్ధముచేసి శస్త్రహతుడై మరణించుట ప్రశస్తము. అని.

ఇట్టి ధర్మము నెఱిగియున్నవాడు కనుకనే యుద్ధమరణమునే తానపేక్షించి ధర్మప్రధాన మగు పాండవపక్షమున కెదురుగా నిలచియుండెను. పాండవులకు తన వధోపాయము నుపదేశించియుండెను. కాబట్టి, "ధర్మాత్ముడగు భీష్ము డుండుటనుబట్టి ధర్మము కౌరవపక్షమందే యున్నది" అను ప్రతివాదుల వాదము నిరస్తము.

భీష్మాభిప్రాయము ననుసరించియే మాటలాడిన ధర్మజుడట్లడుగుటలో నసాంగత్య మేమున్నది?

ఇట్లు యుద్ధారంభకాలమందే వధోపాయమును దెలిసికొనుటకై (పునరాగమనం కురు) అనుచు మరెప్పుడు రమ్మని అందరు వినుచుండ భీష్ముడు వచించియుండుటచేత దానిని తెలిసికొనుటకై భీష్ముని యాజ్ఞనుబట్టి యర్ధరాత్రిమున భీష్మునియొద్దకు వెళ్ళవలెనని ధర్మజున కనిపించినది, ధర్మప్రాణుడైన భీష్ముడావిషయమును వివరించుటయు సంభవించినది.

విషయ మిట్లున్నది. ఇక కవివాక్యములో "ధర్మరాజేమి సజ్జనుడో చెప్పుము? తాత పాదముల పజ్జ జేరి యుబ్బించి యాతని సంహారరహస్యముల్ తెలియలేదా? అర్ధరాత్రిన, ఇట్లు కుటిలవ్యాపారముల్ మెత్తురే" అని యున్నది. ఇచ్చట కవి నడుగవలసియున్నది—

ప్రథమమున సైనికపక్షములో "న తావన్మృత్యుకాలో౽పి పునరాగమనం కురు" మృత్యుకాల మిప్పుడు కాదు. మరల రమ్ము, అని యుద్ధమరణము నపేక్షించియున్న భీష్ముడు తన కాదేశించియుండుటనుబట్టి తొమ్మిది రోజులు భీష్మయుద్ధము ప్రచండముగా జరిగిన మీద నాటిరాత్రి భీష్ముని యాజ్ఞ ననుసరించి వెళ్ళి భీష్ముని యిచ్ఛనుబట్టి జరుగవలసినదియు, భీష్ముని కపేక్షితమైనదియు, నగు యుద్ధమరణమున కుపాయము నాతడు చెప్పగా ధర్మజుడు తెలిసికొనుట, ధర్మజుని కుటిలవ్యాపార మగునా?

దశమదివసయుద్ధములో సమీపములో నున్న యుధిష్ఠిరుని జూచి భీష్ముడు—

"యుధిష్ఠిర మహాప్రాజ్ఞ సర్వశాస్త్రవిశారద ।
శృణుష్వ వచనం తాత ధర్మ్యం స్వర్గ్యం చ జల్పతః ॥
నిర్విణ్ణో౽స్మి భృశం తాత దేహేనా౽నేన భారత ।
ఘ్నతశ్చ మే గతః కాల స్సుబహూన్ ప్రాణినో రణే ॥
తస్మా త్పార్థం పురోధాయ పంచాలాన్ సృంజయాంస్తథా ।
మద్వధే క్రియతాం యత్నో మమ చే దిచ్ఛసి ప్రియమ్ ॥

(భీష్మ-అ 115)

సర్వశాస్త్రవిశారదుడవగు యుధిష్ఠిరా! ధర్మబద్ధము స్వర్గసాధనమునగున నాయీమాటను వినుము, రణరంగమం దసంఖ్యాకముగా వధించుచున్న నాకు కాలము గతించినది, ఈశరీరముతో నా కత్యంత విరక్తి గలిగినది కనుక నాకు ప్రీతి గలిగింపదలచితివేని పార్థుని బురస్కరించుకొని పాంచాలాది మహావీరులతో నన్నిక వధించుటకై యత్నింపవలయును. అని యుద్ధమరణమును గోరి ప్రోత్సహించిన మీద నాతనియాజ్ఞను నెరవేర్చిన ధర్మజునిది కుటిలవ్యాపారమగునా?

ప్రథమమున మాకు రక్షకుడవై సేనానాయకుడవై యుండి యుద్ధము నడిపింపవలసినదని దుర్యోధనుడు కోరినపుడే మీపక్షమున

యుద్ధము చేయుదును. పాండవులకు శ్రేయస్సు (తనసంహారమూలక మగు జయోపాయము) నుపదేశింతు నని చెప్పియుండిన భీష్ముడు అదే విధముగా నుపదేశింపదలచి తనతో యుద్ధమునకు తన యనుజ్ఞ దీసికొన దలచివచ్చిన ధర్మజుని నీకు వరమిచ్చెదనుయుద్ధమునకు సంబంధించినది నీకేమి కావలయునో కోరికొను మని ప్రోత్సహించి స్వయముగా తనసంహారరహస్యమును దెలుపుటనుబట్టి తెలిసికొనిన ధర్మజుడు తాతనుబ్బించి తెలిసికొనినవా డగునా? అది ధర్మజుని కుటిలవ్యాపారమగునా?

ఒకని నుబ్బించినంతమాత్రమున నాతని సంహారరహస్యము తెలిసికొనుట సులభమైనపుడు ద్రోణాచార్యుని సంహారరహస్యమును ద్రోణాచార్యు నుబ్బించి తెలిసికొనలే దేమి?

ఆంధ్రభారతమందు భీష్ము డేమి చెప్పినట్లున్నదో చూడుడు—

ఉ "చుట్టఱికంబునన్ మనము సొచ్చి నను౦ గరగించి వేఁడినన్ దిట్టతనంబు వోవిడిచి తీవ్రరణంబు కడంక దక్కి నేబట్టిన యాయుధంబు నెఱబాసినగాని వధింపబోల దిట్టిటన కేను మిమ్మరున యింతకు గాలము గాదు. దానికిన్"

తే "శ్రమ్మరంగ నే తెంచెదు గాక యనుడు
నతిముదంబున బ్రణమిల్లి యతనివాక్య
మపుడు తలనిడుకొనినవాఁడగుచు నచ్చి
తాతమహుని నెమ్మి వీడ్కొని ధర్మసుతుడు"

రణోద్రేకము తగ్గి సేనాయుధము విడిచిపెట్టినపుడు దప్ప చుట్టఱికమునగాని కరగించినగాని నన్ను వధింపజాల రని చెప్పిన భీష్ముడు ఒక డుబ్బించినస్వాధీన మగువాడా?

ఇక యుద్ధారంభమున భీష్మునియొద్దకు వెళ్ళి వందనము చేయుటే కుటిలవ్యాపార మందురా? గురువులతో యుద్ధము జేయవలసిన

ప్పుడు వారి యనుజ్ఞ దీసికొనియే చేయవలయు నని శాస్త్రోక్తమై యుండుటవలన వెళ్ళినట్టి ధర్మజునిది కుటిలవ్యాపార మగునా?

యద్యేవం నాభిగచ్ఛేథా యుధి మాం పృథివీపతే ।
శపేయం త్వాం మహారాజ" "ప్రీతోఽస్మి తాత యుధ్యస్వ ।"

ధర్మజా! నీవు నాయొద్ద కిట్లు రాకున్నయెడల నిన్ను నే శపించి యుందును. సంతోషించితిని, వత్సా! యుద్ధము చేయుము. అనుభీష్ముని ప్రసంగము తన యొద్ద కట్లు రాకుండుట కుటిలవ్యాపార మగు ననియు, దుర్జనలక్షణ మగుననియు, సూచించుచుండ నాయొద్దకు వెళ్ళుట, కుటిలవ్యాపార మనియు, "ధర్మరాజేమి సజ్జనుడో చెప్పుము" అనియు వ్రాయుట అయుక్తము కాదా?

కనుక వ్యాసముని, సంశయము లేకుండునట్లు స్పష్టముగా జెప్పి యుండ దానిని తెలిసికొనలేక "ఏదీ నాసంశయముల నివారింపుము" అని కవి యడుగుటలో లాభ మేమున్నది? శ్రద్ధతో గ్రంథమును బహుపర్యాయము లవలోకించి తెలిసికొనినకొలది సంశయవిచ్ఛేద మగు నని తెలుపుచున్నాము.

ఈప్రస్తావములో మ, భా, చ, కారులు—

"భీష్ముడు సమయమువచ్చినపుడెల్ల పాండవపక్షమును జెప్పుచు బదిదినములుసర్వసైన్యాధిపత్యముజేసియు,తుదకుతొమ్మిదవనాటిరాత్రి ధర్మజునకు దనగుట్టు నంతయు జెప్పి కపటపుజావు చచ్చెను" (పు 120)

అని వ్రాయుట యెంత హేయమో! ఇట్టి దుర్భాషణము దుర్యోధనుడైన చేయలేదే! భీష్ముని పూజ్యతను గ్రహింపగల యోగ్యత ప్రతివాదుల కేది? శాంతం పాపమ్, భీష్ముడు పాండవపక్షమున చెప్పుచుండుటకును తన వధోపాయము ధర్మజునకు జెప్పుటకును దగిన హేతువు లన్నియు వెనుక నిరూపింపబడియున్నందున ప్రతివాదిదుష్ట ప్రసంగము మూరాపాస్త మయినది.

— ♦ పాండవులలో దోసము లేదా? ద్రోణవధార్థము ధర్మజు డసత్య
మాడ లేదా? ద్రోణకంఠము నర్జునుడు ఖండింప లేదా?"
అను ప్రసంగము—తన్నిరాకరణము ♦ —

ఖండకావ్యములోని 'చనవు'లో నిట్లున్నది—

"గురు డస్త్రంబులు పారవైచు నని యేన్గన్ ద్రోణిగా బోల్చి కుం
జర మన్నందుకు ధర్మరాజును మహీచక్రంబు నిందించెడిన్
నరు డంతన్ నరకెన్ గురూత్తముని కంఠం బిందులో నున్న ధ
ర్మరహస్యం బెరిగింపవే దయ దలిర్పన్ మానిలేఖర్షభా."

ఇచ్చట తా నసత్యమాడినచో ద్రోణు డస్త్రసంన్యాసము జేయు నని ధర్మజున కెట్లనిపించినది? అతని యసత్యవచనము విని ద్రోణు డస్త్రసంన్యాస మెట్లుచేసి హతు డయ్యెను? అను విషయములను ముందుగా కవి తెలిసికొనవలయును.

యుద్ధారంభసమయమున ధర్మజుడు భీష్ముని సమీపించి యాతనియనుజ్ఞ దీసికొని, ద్రోణాచార్యునియొద్దకు వెళ్ళి ప్రదక్షిణనమస్కారములు చేసి "ఆమన్త్రయే త్వాం భగవన్ యోత్స్యే విగతకల్మషః" అనుచు యుద్ధమున కనుజ్ఞ నిమ్మని కోరగా ద్రోణు డిట్లనెను—

"యది మాం నాభిగచ్ఛేథా యుద్ధాయ కృతనిశ్చయః ।
శపేయం త్వాం మహారాజ పగాభావాయ సర్వశః ॥
తద్యుధిష్ఠిర తుష్టోఽస్మి పూజితశ్చ త్వయాఽనఘ ।
అనుజానామి యుధ్యస్వ విజయం సమవాప్నుహి ॥
కరవాణి చ తే కామం బ్రూహి త్వ మభికాంక్షితమ్ ।
ఏవం గతే మహారాజ యుద్ధా దన్యత్కి మిచ్ఛసి ॥
అర్థస్య పురుషో దాసో దాస స్త్వర్థో న కస్యచిత్ ।
ఇతి సత్యం మహారాజ బద్ధోఽస్మ్యర్థేన కౌరవైః ॥
బ్రవీ మ్యేతత్క్లీబవ త్త్వాం యుద్ధా దన్యత్కి మిచ్ఛసి ॥
యోత్స్యేఽహం కౌరవస్యార్థే తవాశాస్యో జయో మయా ॥

యుద్ధసన్నద్ధుడవైన నీవు నాయొద్ద కిట్లు రాకుంటివేని నీకు చేటుకలుగునట్లు శపించియుందును. యుధిష్ఠిరా? నీవు నన్ను పూజించినందుకు సంతోషించితిని. నీకనుజ్ఞ నిచ్చుచున్నాను యుద్ధము జేయుము, విజయమునొందుము నీకేమి కోరిక గలదో చెప్పుము; చేయుదును. నేను కౌరవులచే నర్థముతో బద్ధుడనైతిని, అందుచే నీకు ప్రతిభటుడనై నిలువవలసివచ్చినది. కౌరవులనిమిత్తము యుద్ధము చేయుదును. నీకు జయము నాశీర్వదింతును.

ధర్మజుడు—

"జయ మాశాస్వ మే బ్రహ్మ న్మన్త్రయస్వ చ మద్ధితమ్ ।
యుధ్యస్వ కౌరవస్యార్థే వర ఏష వృతో మయా ॥

మహానీయా! కౌరవపక్షమున యుద్ధము జేయుము. నాకు జయ మాశీర్వదించి హితముపదేశింపుము. నేను కోరెడి వర మిదియే.

ద్రోణుడు—

"ధ్రువ స్తే విజయో రాజ న్యస్య మన్త్రీ హరి స్తవ ।
అహం త్వా మభిజానామి రణే శత్రూ న్విమోక్ష్యసే ॥

టీ:- అభిజానామి, అనుజానామి, విమోక్ష్యసేశత్రూన్, జీవితా దితి శేషః ॥

"యతో ధర్మ స్తతః కృష్ణో యతః కృష్ణ స్తతో జయః ।
యుధ్యస్వ గచ్ఛ కౌన్తేయ పృచ్ఛ మాం కిం బ్రవీమి తే ॥

యుధిష్ఠిరా! శ్రీహరి మంత్రియైయున్న నీకు తప్పక విజయము గలుగును. నీకనుజ్ఞనిచ్చుచున్నాను యుద్ధమందు నీవు శత్రుక్షయము జేయుదువు ధర్మ మెచ్చటనో శ్రీకృష్ణు డచ్చట, శ్రీకృష్ణు డెచ్చటనో విజయ మచ్చట, వెళ్ళి యుద్ధము జేయుము. నీకు నేనేమి చెప్పవలయునో అడుగుము.

ధర్మరాజు:—

"పృచ్ఛామి త్వాం ద్విజశ్రేష్ఠ తత్త్వేన యన్మేఽభికాంక్షితమ్ ।
కథం జయేయం సంగ్రామే భవన్త మపరాజితమ్ ॥"

మహానీయా! అడుగుచున్నాను. యుద్ధములో పరాజయము లేనట్టి నిన్నెట్లు జయింపగలుగుదును?

ద్రోణుడు:—

"న తేఽస్తి విజయ స్తావ ద్యావ ద్యుధ్యా మ్యహం రణే ।
మమాశు నిధనే రాజన్ యతస్వ సహ సోదరైః ॥"

ధర్మజా! నేను యుద్ధము చేయునంతసేపు నీకు విజయము కలుగదు కనుక సోదరులతో గలసి నీవు త్వరలో నన్ను వధించుటకు యత్నింపుము.

ధర్మజుడు:—

"హన్త తస్మా న్మహాబాహో వధోపాయం వదాత్మనః ।
ఆచార్య ప్రణిపత్యైవ పృచ్ఛామి త్వాం నమోఽస్తు తే ॥

మహానీయా! కష్టము! దోసిలియొగ్గి యడుగుచున్నాను. నీవధోపాయమును జెప్పుము. నమస్కారము.

ద్రోణుడు:—

"న శత్రుం తాత పశ్యామి యో మాం హన్యా ద్రథే స్థితమ్ ।
యుధ్యమానం సుసంరబ్ధం శరవర్షౌఘవర్షిణమ్ ॥
ఋతే ప్రాయగతం రాజన్ న్న్యస్తశస్త్ర మచేతనమ్ ।
హన్యా న్మాం యుధి యోధానాం సత్య మేత ద్బ్రవీమి తే ॥
శస్త్రం చాహం రణే జహ్యాం శ్రుత్వా తు మహ దప్రియమ్ ।
శ్రద్ధేయవాక్యా త్పురుషా దేత త్సత్యం బ్రవీమి తే ॥

(భీష్మ- అ 43)

ధర్మజా! నేను శస్త్రమును విడిచి ప్రాయోపవేశమును బొంది చైతన్యము లేకున్నట్లున్నప్పుడుదప్ప శరవర్షము గురిపించుచు సంరం

భముతో యుద్ధముచేయుచుండునంతసేపు నన్ను వధి పగలవాడు లేడు. నేను శస్త్రమును విడుచుట ఎప్పు డనగా విశ్వాసపాతునివలన గొప్ప అప్రియవార్తను వినినపుడు నేను శస్త్రమును విడిచివేయుదును. ఇది నిజము.

ఇట్లు ద్రోణాచార్యుడు తన వధోపాయమును యుధిష్ఠిరు డడుగు నట్లు ప్రోత్సహించి యాతడు కష్టముతో నడిగిన మీాద తాను వెల్ల డించెను.

ఇాతకును ధర్మపక్షము పాండవుల దే యై యుండుటయు, కౌర వుల దధర్మపక్ష మగుటయు భీష్మునివలె తానుగూడ క్షాత్రధర్మ మునుబట్టి యుద్ధమరణము నపేక్షించియే పాండవపక్షమున కెదురుగా నిలుచుటయు, శ్రీకృష్ణుడు పరమేశ్వరు డని యెరిగియుండుటయు, నను విషయములు తనవధోపాయ ప్రకటనమునకు మూలములు.

శ్రీకృష్ణుని రాయబారమును త్రోసివేసి యుద్ధమునకు గాలు దువ్వుచున్న దుర్యోధనునకు భీష్మద్రోణులు నీది తప్పుదారి యని చెప్పినతరువాత ద్రోణుడు మరల నిట్లనెను—

“దత్తం హుత మధీతం చ బ్రాహ్మణా స్తర్పితా ధనైః ।
అవయో ర్గత మాయుశ్చ కృతకృత్యౌ చ విద్ధి నౌ ॥
త్వం తు హిత్వా సుఖం రాజ్యం మిత్రాణి చ ధనాని చ ।
విగ్రహం పాండవైః కృత్వా మహ ద్వ్యసన మాప్స్యసి ॥
మన్త్రీ జనార్దనో యస్య భ్రాతా యస్య ధనంజయః ।
సర్వశస్త్రభృతాం శ్రేష్ఠః కథం జేష్యసి పాండవమ్ ॥ ”

(ఉద్యోగప—అ 139)

దుర్యోధనా! భీష్ముడును నేనును అధ్యయన, దాన, హోమాది జన్మసార్థక హేతువులగు సత్కార్యముల జేసికొనినాము. మాకాయువు గూడ గతించినది. మేము కృతార్థుల మైతిమి. నీవుమాత్రము సుఖ మును, రాజ్యమును, మిత్రులను, ధనమును విడిచి పాండవవిరోధ

మూలమున గొప్ప ఆపదకు పాలు గాగలవు. ఎవ్వానికి మంత్రి శ్రీకృష్ణుడో, సర్వశస్త్రాస్త్రకోవిదుడగు పార్థుడు సోదరుడో అధర్మజుని నీ వెట్లు జయింపగలవు? అని.

ఈమాటలలో తమ పరిసమాప్తికే యీయుద్ధము సూచక మని మొట్టమొదటనే ద్రోణుడు దుర్యోధనునకు వెల్లడించియుండెను.

అట్టి ద్రోణుడు విశ్వాసనీయునివలన అప్రియవార్తాశ్రవణము జరిగినపుడు శస్త్రసంన్యాసము చేయుదు నని చెప్పియుండుటవలన నట్టి విశ్వాసనీయుడు ధర్మజుడే యగుటనుబట్టియు, నట్టి గొప్పఅప్రియవార్త అశ్వత్థామమరణవార్తయే యగుటనుబట్టియు, దానిని శ్రీకృష్ణుడు విశదీకరించుటనుబట్టియు, ధర్మజు డెట్టకేలకు ఆమాటాడెను. ఆసందర్భ మేమనగా—

ద్రోణుడు పైదవనాటి యుద్ధములో నుగ్రుడై దివ్యాస్త్రములను ప్రయోగించుచు సర్వసంహారము చేయుచున్న ద్రోణుని జూచి కృష్ణభగవానుడు ధర్మజునితో నిట్లనెను—

"యద్యర్ధదివసం ద్రోణో యుధ్యతే మన్యు మాస్థితః ।
సత్యం బ్రవీమి తే సేనా వినాశం సముపైష్యతి ॥
స భవాం స్త్రాతు నో ద్రోణాత్సత్యా జ్జ్యాయోఽనృతం వచః।

ద్రోణు డీవిధముగా క్రుద్ధుడై యింకొకపూట యుద్ధము చేసిన యెడల నీసేన కంతకును వినాశము తప్పదు. కనుక ద్రోణునివలన మమ్మందరిని నీవు కాపాడవలయును. ఇప్పుడు సత్యముకంటె అనృతమే యుక్తము. అని, మరియు—

నైష యుద్ధేన సంగ్రామే జేతుం శక్యః కథంచన ।
సధను ర్ధన్వినాం శ్రేష్ఠో దేవై రపి సవాసవైః ॥
న్యస్తశస్త్రస్తు సంగ్రామే శక్యో హన్తుం భవే న్నృభిః ।
ఆస్థీయతాం జయే యోగో ధర్మ ముత్సృజ్య పాండవాః ॥
యథా న స్సంయుగే సర్వా న్న హన్యా ద్రుక్మవాహనః ।

అశ్వత్థామ్ని హతే నైవ యుధ్యే దితి మతిర్మమ ||
తం హతం సంయుగే కశ్చి దస్మై శంసతు మానవః |
ఏత న్నారోచయ ద్రాజన్ కున్తీపుత్రో ధనంజయః ||
అన్యే త్వరోచయన్ సర్వే కృచ్ఛ్రేణ తు యుధిష్ఠిరః |"
(ద్రోణప-అ 1 0)

ఈతడు ధనుర్ధరుడై యున్నంతసేపు ఇంద్రాదులుకూడ జయింపలేరు. శస్త్రము విడిచినపుడుమాత్రమే వధింప శక్యమగును. ఈతడు సర్వసంహారము చేయకుండుటకై పాండవులారా! ఇపుడు ధర్మమును విడిచి జయోపాయము నాశ్రయింపవలయును. అశ్వత్థామ హతుడైనపు డీతడు యుద్ధమునుండి విరమించు నని తోచుచున్నది. ఆ యశ్వత్థామ యుద్ధములో హతుడయ్యె నని ద్రోణునకు జెప్పవల యును. అని కృష్ణభగవానుడు తెలుపగా దాని కర్జును డంగీకరింప లేదు. ధర్మజుడు కష్టము మీద నంగీకరించెను.

అప్పుడు ప్రాప్తించిన పరిస్థితి యెట్టి దనగా—

ద్రోణు డస్త్రసంన్యాసము చేసిన గాని, పాండవపక్షమునకు రక్షణము లేదు. అశ్వత్థామ హతుడయ్యె నని వినినపుడుగాని, యాత డస్త్రసంన్యాసము చేయడు. అసత్య మాడినగాని ద్రోణుడట్టి మాటను వినుట సంభవించదు, ఆయసత్యము విశ్వసనీయుడు చెప్పినపుడుగాని కార్యకారి కానేరదు.

అట్టి యాపత్సమయములో నసంఖ్యాకులగు పాండవపక్షయో ధుల ప్రాణరక్షణము ధర్మజుని యసత్యవచనముమీదనే ఆధారపడియు యున్నది. తన స్వాభావికసత్యవ్రతమును ఆక్షణమున ధర్మజుడు విడువ నియెడల సర్వయోధప్రాణహానినిమిత్తదోషము ధర్మజునకు ఘటింప నైయున్నది. అది రాకుండుటకై యసత్య మాడిన అసత్యవచనదో షము వచ్చిపడుచున్నది. ఎటు చూచినను దోషమే ప్రాప్తించుటను బట్టి యేదోషము గొప్పదో దానిని తొలగించుకొనుట వివేకుల లక్షణ

మగుటచే అంతమంది ప్రాణములను ద్రోణాచార్యమహాస్త్రజ్వాలల కర్పణము జేయుటచే వచ్చెడి మహాదోషమునకన్న తాత్కాలికాసత్య వచనదోషమల్ప మని యెంచి "ధర్మాజ్జేతు మశక్యం చేద్ధర్మం త్యక్త్వా ప్యరిం జయేత్" అనున్యాయమున ధర్మముచే జయించుట శక్యము కానపుడు ధర్మమును విడిచియైనను శత్రువును జయింపవలె నను పద్ధతి నవలంబించి—

"జ్యాయాంస మపి చేద్వృద్ధం గుణై రపి సమన్వితమ్ ।
ఆతతాయిన మాయాన్తం హన్యా ద్ఘాతక మాత్మనః ॥"

టీ:- ఆతతాయిన మిత్యస్య ఘాతక మితి విశేషణ మన్యేభ్య ఆతతాయిభ్యో వ్యవచ్ఛేదా యోక్తమ్ ॥

పూజ్యుడయినను, వృద్ధుడయినను, గుణవంతుడయినను, తన్ను హింసింపవచ్చువానిని వధింపవలసినదే, అను బృహస్పతివచన మను సంధించి, కృష్ణపరమాత్మ మాట ననుసరించి, ద్రోణాచార్యుడు తనకు దెలిపియున్న విజయోపాయప్రక్రియ నవలంబించి, యంతకు పూర్వ ము అశ్వత్థామ యను పేరుగల యేనుగు భీమసేనునిచే హతమైయుండ దానిని నిమిత్తముగా జేసికొని "అశ్వత్థామా హతః కుంజరః" అని తన్ను ద్రోణు డడిగినపుడు ధర్మజు డనినాడు.

ఆద్రోణున కశ్వత్థామవిషయమై సందేహ మేల కలిగినదనగా కౌరవసేనలోని మాలవభూపాలుని అశ్వత్థామనామముగల గజమును వధించి వచ్చి భీమసేనుడు ద్రోణుడు వినునట్లు "అశ్వత్థామాహత ఇతి శబ్ద ముచ్చై శ్చకార హ" 'అశ్వత్థామా హతః' అని బిగ్గరగా రంకె వేసెను. అది విని ద్రోణునికి సందేహము కలిగినది, కాని యుద్ధమప్రతిహతముగా చేయుచు పదివేలగజములను, పదివేల అశ్వములను, ఆరు వేల సృంజయులను ఐదువందల మత్స్యులను వధించి సర్వసంహారోద్యుక్తుడై ప్రజ్వలించు సమయమున విశ్వామిత్రజమదగ్నిభారద్వాజ గౌతమవసిష్ఠకశ్యపాత్రిప్రభృతు లగు మహర్షులు గోచరించి—

“న్యస్యాయుధం రణే ద్రోణ సమేత్యాఽస్మా నవస్థితాన్ ।
నాఽతః క్రూరతరం కర్మ పునః కర్తుం మిహార్హసి ॥
పరిపూర్ణశ్చ కాల స్తే వస్తుం లోకేఽద్య మానుషే ।”

ద్రోణాచార్యా! ఆయుధము విడిచి మమ్ములను చూచుచు యుద్ధము మానుము. మనుష్యలోకములో నీవుండెడి కాలము పూర్తి యైనది. అని బోధించిరి.

తరువాత, వెనుకటి భీమసేనుని మాటను దలచుకొని ధర్మరాజు నడిగెను. ధర్మరాజు డావిధముగ జెప్పెను.

ఈవిషయమై కర్ణపర్వారంభమున నీలకంఠాచార్యు లిట్లు వ్రాసెను —

“శరణాగతస్వసైనికత్రాణార్థ మన్యాయేనాపి కృతో బ్రహ్మవధో నేతరబ్రహ్మవధవ దనర్థోఽపి తు అనర్థాభాస ఏవ । “న తేన బ్రహ్మహా భవేత్” ఇత్యాతతాయివధే దోషాభావస్మరణాత్ ’

ఇచ్చట శరణాగతస్వసైనికత్రాణార్థమై అన్యాయముగా జేయబడినను బ్రహ్మవధము, ఇతరబ్రహ్మవధమువలె అనర్థకరము గాదు. అనర్థాభాసమె. ఆతతాయివధ అంత దోషావహము కాదని యున్నది. అని భావము. అధర్మము లేకుండ సంచరించు ధార్మికుడు అధర్మమాచరింపక తప్పని యాపత్కాలములో నాయాపదను అధర్మాచరణముచేనైన దాటి దానికి పశ్చాత్తప్తు డగుచు దానికి ప్రాయశ్చిత్తములు చేసికొని పరిశుద్ధు డగుచుండును.

ధర్మరాజు భీష్మద్రోణులనుగూర్చియే కాదు, కర్ణదుర్యోధనాదులనుగూర్చికూడ యుద్ధములో వధించినందుల కెంత పరితపించెనో, గీతోపదేశమునకు బూర్వ మర్జునుడు యుద్ధము జేయుటకును, దుర్యోధనాదిసోదరులను, భీష్మద్రోణాదిగురువులను వధించుటకును ఎంతపరితపించెనో మహాభారతపాఠకులకు విశదమే. ధార్మికలక్షణ మదియే. కర్ణదుర్యోధనాదుల కా లక్షణ మేకోశమందునను లేదనియు, మహాభారతపాఠకులకు విశదమే

ఇంకొకటి— పాండవులు స్వర్గారోహణము చేసిన తరువాత సోదరులును, ద్రౌపదియు నరకయాతన ననుభవించుచున్నట్లు ధర్మజన కొక దృశ్యమొక ముహూర్తకాలము ఇంద్రుడు ప్రదర్శించి యిది యేమని ధర్మజు డడుగగా నింద్రు డిట్లు చెప్పెను—

“వ్యాజేన హి త్వయా ద్రోణ ఉపచీర్ణ స్సుతం ప్రతి”

టీ— హతః కుంజర ఇత్యశ్వత్థామవధే ద్రోణ ఉపచీర్ణః వంచితః । గజవాచీ శబ్దో మనుష్యపరత్వేన జ్ఞాపిత ఇత్యుపచారచ్ఛలే నేత్యర్థః ॥

“వ్యాజేనైవ తతో రాజన్ దర్శితో నరక స్తవ ।
యథైవ త్వం తథా భీమ స్తథా పార్థో యమౌ తథా ।
ద్రౌపదీ చ తథా కృష్ణా వ్యాజేన నరకం గతాః ॥”

అశ్వత్థామనుగూర్చి నీవు ద్రోణునకు జెప్పినపుడు వ్యాజముతో దెలుపుటవలన నీకును వ్యాజము చేతనె నరకము ప్రదర్శింపబడినది. నీకువలెనే ద్రౌపదికిని భీమసేనాదులకును ప్రదర్శింపబడినది. అని.

తరువాత ధర్మదేవత యిట్లు చెప్పెను—

“విశుద్ధోఽసి మహాభాగ సుఖీ విగతకల్మషః ।
న చ తే భ్రాతరః పార్థ నరకార్హా విశాంపతే ॥
న కృష్ణా రాజపుత్రీ చ నరకార్హా కథంచన ।
మాయైషా దేవరాజేన మహేన్ద్రేణ ప్రయోజితా ॥
అవశ్యం నరకా స్తాత ద్రష్టవ్యా స్సర్వరాజభిః ।
తత స్త్వయా ప్రాప్త మిదం ముహూర్తం దుఃఖ ముత్తమమ్ ॥”

ధర్మజా! నీవు పాపరహితుడవు. పరిశుద్ధుడవు, నీసోదరులును ద్రౌపదియు నరకార్హు లెంతమాత్రము కారు. ఇది యింద్రునిచే గల్పితమైన మాయ అని”.

ఇదియే ద్రోణాచార్యానుజ్ఞపై ద్రోణవధాంగముగ ధర్మజు డాడిన అసత్యవచనములోని ధర్మరహస్యమని వ్యాసమునిని ప్రశ్నించిన కవికి దెలుపుచున్నాము.

ఈకవి పూర్వోక్త ప్రశ్నములోని రెండవయంశ మిట్లున్నది—

"నరుండంతట నరకేశి గురూత్తముని కంఠంబు ఇందుబో నున్న ధర్మరహస్యం బెఱిగింపవే".

ద్రోణాచార్యు డస్త్రసన్యాసము చేసినంతనె అర్జును డాద్రోణుని కంఠమును ఖండించె నని యీకవి వ్రాతలోని విషయము.

ఇది కవిచేసిన కల్పనయేగాని వాస్తవము గాదు. ఈవ్రాతచే మహాభారతముతో కవి కెంత పరిచయము గలదో విదితమగుచున్నది. గ్రంథస్థవిషయమును తెలిసికొనలేక గ్రంథకర్త యగు వ్యాసునిని ప్రశ్నించు పద్ధతిని కవిత్వము జెప్పుట లోకుల కపోహలు కలిగించుటకే కదా, ఇది కవికి యుక్తమా?

ప్రాయోపవేశమును పొందియున్న ద్రోణుని శిరస్సును ఖండించినవాడు ధృష్టద్యుమ్నుడు. గురువును వధింపక జీవించియున్న ఆచార్యుని తీసికొనిరమ్మని ఆధృష్టద్యుమ్నునితో గోలపెట్టినవా డర్జునుడు.

ఆశ్లోకము లివిగో చూడుడు—

"విత్నున్నాంగం శరవ్రాతై ర్న్యస్తాఽయుధ మసృక్క్షరమ్ ।
ధిక్కృతః పార్షత స్త్వం తు సంభ్రమాత్తైః పరామృశత్ ॥
తస్య మూర్ధాన మాలంబ్య గతసత్త్వస్య దేహినః ।
కించి దబ్రువతః కాయా ద్వ్యచకర్తాఽసినా శిరః ॥
ఉక్తవాంశ్చ మహాబాహుః కున్తీపుత్రో ధనంజయః ।
జీవన్త మానయాచార్యం మావధీ ర్ద్రుపదాత్మజ ।
క్రోశమానేఽర్జునే చైవ పార్థివేషు చ సర్వశః ॥
ధృష్టద్యుమ్నోఽవధీ ద్ద్రోణం రథతల్పే నరర్షభమ్ ॥

(ద్రో ణ-అ 19.)

ఇట్లుండుటచే కవివ్రాతలోని ద్వితీయాంశము నిరస్తమైనది.

'అశ్వత్థామ్నుడు ద్రోణశవకంఠమును ఖండించినాడు' అను కొందరుప్రతివాదులమాట అసంగతమనియు, ద్రోణకంఠమునే ఖండించినట్లు గ్రంథము చెప్పుచున్నదనియు, పంచమభాగమగు ద్రౌపదీనిందానిరాకరణములో నిరూపింపబడును.

—:"పాండవులలో దోసము లేదా? ద్యూతములో గెల్చుకొన్న దానిని తండ్రిమాటపై దుర్యోధను డీయలేదా? ఇచ్చినదే మేలని ధర్మజుడు చేయి చాపలేదా?" అను ప్రసంగము–తన్నిరాకరణము:—

ఖండకావ్యములోని 'చనువు' లో నిట్లున్నది—

"తనయుఁ జూదపుసొమ్ముకూడ దనిసంతన్ రాజరాజాంబికే
యునివాచాపరిబద్ధుడై యొసఁగలేదో గెల్చుకొన్నట్టి భూ
మిని గౌంతేయులకిందులో సుగుణమేమీ లేమ కాబోలు ని
చ్చినదే మేలని చేయిసాపడె మహర్షీ ధర్మజుం డోడియున్"

ఆహా! వ్యాసమహర్షిగ్రంథములో చెప్పిన దొకటి; ఈకవియను కొనిన దొకటి.

గ్రంథస్థవిషయ మిది—

దుర్యోధనుడు శకునిసహాయముతో కపటద్యూతమున పాండవైశ్వర్య మపహరింపదలచి నీవు పాండవుల నాహ్వానింపు మని తండ్రిని వేధింపగా తుదకు ధృతరాష్ట్రుడు సుహృద్ద్యూత మను పేరుతో నాహ్వానించిన తండ్రిమాట నుల్లంఘింపలేక వచ్చి పాండవులు సర్వస్వము నోడిపోయిన వెంటనే ద్రౌపదిని సభ కీడ్చి తెచ్చి వస్త్రాపహరణాదిదుర్వ్యాపారములు చేసినపుడు ఘోరములైన ఉత్పాతములు గోచరించినవి. అప్పుడు—

"తతో గాంధారీ విదురశ్చాపి విద్వాం
స్తముత్పాతంఘోర మాలక్ష్య రాజ్ఞే; ।

నివేదయామాసతు రార్త వత్తదా
తతో రాజా వాక్య మిదం బభాషే ॥"

గాంధారియు, విదురుడును ఆయుత్పాతములను చెప్పి గోలపెట్టినమీద ధృతరాష్ట్రుడు "హతోఽసి దుర్యోధన మన్దబుద్ధే" అని దుర్యోధనుని మందలించి ద్రౌపదీదేవితో—

"వరం వృణీష్వ పాంచాలి మత్తో యదభివాంఛసి ।
వధూనాం హి విశిష్టా మే త్వం ధర్మపరమా సతీ ॥"

నీవు నాకోడండ్రందరిలో నుత్తమురాలవు. ధర్మతత్త్వగురాలవు. పాంచాలీ!! నీకు వరమిచ్చెదను కోరుము. అని చెప్పి ప్రేరేపింపగా, ద్యూతమునుబట్టి సంభవించిన దాస్యమునుండి పాండవులకు విముక్తిని యామె కోరినది. ధృతరాష్ట్రుడిచ్చెను. తరువాత ధర్మజుడు ధృతరాష్ట్రునితో—

"రాజన్ కిం కరవామస్తే ప్రశాధ్యస్మాం స్త్వ మీశ్వరః ।
నిత్యం హి స్థాతు మిచ్ఛామ స్తవ భారత శాసనే ॥"

మహారాజా! మేము నీయాజ్ఞకు బద్ధులము, నాకేమి యాజ్ఞాపింతువు? అని యడిగినపుడు—

అజాతశత్రో భద్రం తే అరిష్టం స్వస్తి గచ్ఛత ।
అనుజ్ఞాతా స్సహధనా స్స్వరాజ్య మనుశాసత ॥"

ఓఅజాతశత్రూ! నీకు శుభ మగుగాక. నేననుజ్ఞ నిచ్చితిని, మీరు వెళ్ళి మీసొత్తుతో మీరాజ్య మేలుకొనుడు. అని యుత్పాతభీతుడై సుహృద్ద్యూతమని పెట్టిన పేరు సార్థక మగునట్లు వారిది వారికిచ్చి వెళ్ళుమనుచు, చేసిన దుండగములకు సిగ్గుపడుచు—

"భద్రం తే౽స్తు సౌభ్రాత్రం ధర్మే తే ధీయతాం మనః ।"

అని చెప్పి పంపెను. అట్లు ధృతరాష్ట్రానుజ్ఞ దీసుకొని పాండవులు వెళ్ళుచున్నపుడు దుశ్శాసనుడు చూచి కర్ణశకునులతో గలిసి కూర్చుండిన దుర్యోధనునియొద్దకు బోయి యిట్లనెను—

"దుఃఖే నైత త్సమానీతం స్థవిరో నాశయ త్యసౌ ।
శత్రుసాద్గమయ ద్ద్రవ్యం తద్బుధ్యధ్వం మహారథాః ॥"

(సభా॥ అ74)

టీ, స్థవిరో వృద్ధ ఇతి సాధిక్షేప ముక్తం। శత్రుసాత్ శత్రువశం గమయ దగమయత్ ప్రాపితవాన్.

కష్టపడి సంపాదించిన సొత్తును ముసలివాడు శత్రువుల కిచ్చి వేసెను. అం. అది విని కర్ణశకునిదుర్యోధను లాలోచించి త్వరపడి ధృతరాష్ట్రుని యొద్దకు జేరి పాండవుల నట్లు విడిచివేయుట మహాప్రమాదమనియు, పగబట్టియున్న కాలసర్పములను ఎవ్వరైన నెత్తిపై నెక్కించుకొనునా? అనియు" వారిప్పుడు సేనలతో వచ్చి మనపై, బడుటకు సంకల్పించి వెళ్ళుచున్నారనియు, మనము వారికి గలిగించిన బాధలను, ద్రౌపదీపరిభవమును, వారెవ్వరు సహింపబోరనియు, వారిని వెంటనే పిలిపించి ద్యూతములో వనవాసమునకు బంపి వారిని మన యధీనమునం దుంచుకొనుటకంటె కర్తవ్యము మరొకటి లేదనియు బోధించిరి. ఆశ్లోకము లివిగో.

"అథ దుర్యోధనః కర్ణ శ్శకుని శ్చాపి సౌబలః ।
మిథ స్సంగమ్య సహితాః పాండవాన్ ప్రతి మానితాః ॥
వైచిత్రవీర్యం రాజానం ధృతరాష్ట్రం మనీషిణమ్ ।
అభిగమ్య త్వరాయుక్తాః శ్లక్ష్ణం వచన మబ్రువన్ ॥
అహీ నాశీవిషాన్ క్రుద్ధా న్నాశాయ సముపస్థితాన్ ।
కృత్వా కంఠే చ పృష్ఠే చ క స్సముత్స్రష్టు మర్హతి ॥
తే త్వాస్థాయ రథాన్ సర్వే బహుశస్త్రపరిచ్ఛదాన్ ।
అభిఘ్నన్తో రథవ్రాతాన్ సేనాయోగాయ నిర్యయుః ॥
న క్షంస్యన్తే తథాఽస్మాభి ర్జాతు విప్రకృతా హి తే ।
ద్రౌపద్యాశ్చ పరిక్లేశం క స్తేషాం క్షన్తు మర్హతి ॥
పున ర్దీవ్యామ భద్రం తే వనవాసాయ పాండవైః ।
ఏవ మేతాన్ వశేకర్తుం శక్ష్యామః పురుషర్షభ ॥" (సభా, అ74)

ఇట్లు బోధింపబడిన ధృతరాష్ట్రుడు, భీష్మద్రోణకృపాచార్యవిదురులు, బాహ్లీకసోమదత్తభూరిశ్రవులు, యుయుత్సువికర్ణులు—

"మా ద్యూత మిత్యభాషన్త శమోఽస్త్వితి చ సర్వశః" మరల ద్యూతము వలదు వలదని మొరపెట్టుచుండ గాంధారి దుఃఖించుచు

"మా బాలానా మశిష్టానా మభిమంస్థా మతిం ప్రభో ।
మా కులస్య క్షయే ఘోరే కారణం త్వం భవిష్యసి ॥"

టీ॥ మతిం మాభిమంస్థాః అభిమతాం మా కురు ।

నాథా! అజ్ఞానులు అయోగ్యులు నగు వారి బుద్ధిని నీవభిమతింపకుము. అట్లైన కులక్షయకారణము నీవు కాకుందువు. అని గోల పెట్టుచుండ.

"అథాఽబ్రవీ న్మహారాజో గాంధారీం ధర్మదర్శినీమ్ ।
అన్తః కామం కులస్యాఽస్తు న శక్నోమి నివారితుమ్ ।
యథేచ్ఛన్తి తథైవాస్తు ప్రత్యాగచ్ఛన్తు పాండవాః ।
పునర్ద్యూతం చ కుర్వన్తు మామకాః పాండవైః సహ ॥"

ధృతరాష్ట్రుడు గాంధారితో కులక్షయము కానిమ్ము నేను నివారింపలేను. వీరన్నట్లు పాండవులు తిరిగి రావలసినదే. మనవారు వారితో పునర్ద్యూత మాడవలసినదే. అని చెప్పుచు—

"అకామానాం చ సర్వేషాం సుహృదా మర్థదర్శినామ్ ।
అకరో త్పాండవాహ్వానం ధృతరాష్ట్రః సుతప్రియః ॥"

దూరదృష్టి, సుహృద్భావము గలవా రందరు వలదు వలదనుచున్నను, పుత్రప్రియుడగు ధృతరాష్ట్రుడు దూరగతులైన పాండవులను ప్రీతికామిచే నాహ్వానించెను. అప్పుడు పాండవులకు ప్రాప్తించినది వనవాసమే. ఇదియే వ్యాసముని గ్రంథములోని విషయము.

ఇక కవిమాటలు తీరెట్లున్నదో చూడుడు — "తనయా జూదపు సొమ్ము కూడ దని ధృతరాష్ట్రుడు దుర్యోధనునితో ననెనట. దుర్యోధను డాతండ్రిమాటకు బద్ధుడై గెల్చుకొన్న భూమిని పాండ

వుల కిడెనట! ఇందుగో సుగుణమేమియు లేదు కాబోలు" అని కవి వ్యాసముని నడుగుచున్నాడు.

జూదప్రసొమ్ము కూడదు ఇచ్చివేయుమని దుర్యోధనునకు తండ్రి చెప్పనూలేదు: దుర్యోధను డీయనులేదు; ధృతరాష్ట్రుడును పాండవద్రోహనిమిత్తమున గోచరించిన యుత్పాతములకు భీతిల్లి, పాండవులను పూజించినగాని తన వంశమునకు క్షేమ ముండదని యెంచి మీరాజ్యమును మీరేలుకొనుడనుచు వారి సౌభ్రాత్రమును గోరి యియ్యగలిగెనుగాని జూదప్రసొమ్ము కూడదని యిచ్చియుండ లేదు ఎట్లిచ్చినను పాండవుల కీయరాదని దుష్టచతుష్టయ మాలోచించినతరువాత ధృతరాష్ట్రుని మనస్సును మార్చి మార్గమధ్యము నుండియే వారు వచ్చునట్లు పిలిపించి వారి నరణ్యములకు పాలుచేసిన ప్రబుద్ధుడు దుర్యోధనుడు అట్టి దుర్యోధనునియందు "సుగుణమేమియు లేదుకాబోలు" అని కవి యనుట హాస్యాస్పదము.

"ఇచ్చినదే మేలని చేయిసాపడె మహర్షీ ధర్మజు డోడియుఁ" అని యొకమాట, ధర్మజున కిచ్చినదేమి? అతడు స్వీకరించిన దేమి? ప్రథమద్యూతమున నానారసాభాసము చేసి కపటమున సర్వస్వమపహరించి, ధృతరాష్ట్రాజ్ఞాతులై యింద్రప్రస్థమునకు శాంతులై వారు వెళ్ళుచుండ దురూహతో మరల రప్పించి వారిని వనవాసాజ్ఞాతవాసములకు పాలుచేసి యాపైగూడ సూదిమొన మోపినంతైన నేనియ్యనని కూర్చుండిన దుర్యోధనుడు ధర్మజున కిచ్చెనా? ధర్మజుడు చేయిసాపెనా? విషయము దెలియక తోచినట్లు వ్రాసి లోకులకు భ్రాంతి గలిగించెడి యీకవి వ్రాత నిరస్తము.

—♦ "పాండవులలో దోసము లేదా? దుర్యోధను డర్జునునివంటి స్వార్థపరుడా?" అను ప్రసంగము—తన్నిరాకరణము ♦—

ఖండకావ్యములోని 'చనవు'లో నిట్లున్నది—

"అకటా ద్రోణుని మట్టిబొమ్మకడ విద్యాస్వీకృతిం జెందినా

దుకు పాఙ్గుం డల యేకలవ్యుని నిషాదుం జూచి మన్నింపనో
పక యఙ్గుష్ఠము గోరుకొమ్మనియె బాహుచార్యునిఁ మత్స్యగం
ధికుమారా కురురాజు స్వార్థపరుడౌనె కిరీటితో బోల్చినన్"

ఇచ్చట, ద్రోణుని మట్టిబొమ్మ నాధారముజేసికొని ధనుర్విద్యా
భ్యాసముజేసిన యేకలవ్యుని యంగుష్ఠమును నీవు కోరుకొమ్మని
ద్రోణాచార్యుని ప్రేరేపించిన స్వార్థపరు డర్జును డని కవి వ్రాసిన విష
యము మృష.

కథాసందర్భము వినుడు—

ద్రోణాచార్యుడు, తన బాల్యసఖుడు, పంచాలదేశాధీశ్వరుడు
నగు ద్రుపదమహారాజు నొద్దకు అశ్వత్థామపోషణార్థము ధనమునపే
క్షించి వెళ్ళి "రాజన్ సఖాయం విద్ధి మా మిహ" నేను నీసఖుడ నని
ప్రీతిపూర్వకముగా విన్నవింప నాద్రుపదుడు—

"అకృతేయం తవ ప్రజ్ఞా బ్రహ్మ న్నాతిసమంజసా ।
య న్మాం బ్రవీషి ప్రసభం సఖా తేఽహ మితి ద్విజ ॥
న హి రాజ్ఞా ముదీర్ణానా మేవం భూతై ర్నరైః క్వచిత్ ।
సఖ్యం భవతి మన్దాత్మన్ శ్రియా హీనై ర్ధనచ్యుతైః ॥
అపి త్సఖ్యం ద్విజశ్రేష్ఠ త్వయా మేఽర్థనిబన్ధనమ్ ।
న దరిద్రో వసుమతో నావిద్వాన్ విదుష స్సఖా ॥
న శూరస్య సఖా క్లీబ స్సఖి పూర్వం కి మిష్యతే ।
నాశ్రోత్రియ శ్శ్రోత్రియస్య నారథీ రథిన స్సఖా ॥
నారాజా పార్థివస్యాపి సఖిపూర్వం కి మిష్యతే ।

టీ. పూర్వం సఖా ఇతి సఖిపూర్వం, జీర్ణం సఖ్యం త త్కిం మిష్యతే ।
అపితు నైవేతి కాకా యోజ్యమ్ ॥

నేను నీసఖుడ నని పలికెదవు నీదేమి బుద్ధి? మహారాజుల కిట్టి
నిర్ధనులతో సఖ్యమా? ఆసఖ్యమూనాటిదే. ధనవంతునకు దరిద్రుడు,
విద్వాంసున కవిద్వాంసుడు శూరునకు భీరువు, శ్రోత్రియున కశ్రోత్రి

యుడు రాజునను రాజేతరుడు సఖు డెట్లగును? అని గర్వితుడై యవ మానించు కృష్ణునైన ద్రోణుడు ఒక్కరుముకూర్త మాత్రి మళ్లే యుండి చింతించి యా దురపదునిగూర్చి కర్తవ్యమును మనస్సులో నిశ్చయించి హాస్తినపురమున కేగెను.

అచ్చట, ప్రత్యుత్థానాభివాదనపూర్వకముగ సంభాషించు భీష్మునితో తనకు ద్రుపదుడు చేసిన యవమానప్రకారమును వివరించి చెప్పుచు—

"ద్రుపదేనైవ ముక్తోఽహం మన్యునాఽభిపరిప్లుతః ।
అభ్యాగచ్ఛం కురూన్ భీష్మ శిష్యైరర్థీ గుణాన్వితైః

ద్రుపదునిచే నిట్లు పరిభవింపబడిన నేను కోపము వహించి గుణవంతులయినశిష్యుల కొరకు కిట్లు వచ్చితి నని చెప్పెను.

అపుడు భీష్ముడు మహానీయా! నీవు మాఅదృష్టవిశేషముచే లభించినావు. "త్వమేవ పరమో రాజా సర్వే చ కురవస్తవ" ఈరా జ్యమునకు నీవే మహారాజవు. ఈకురువంశీయు లందరు నీవారు. అని. పరమానందముతో బూచించి—

"విశ్రాన్తేఽథ గతే తస్మిన్ పౌత్రా నాదాయ కౌరవాన్ ।
శిష్యత్వేన దదౌ భీష్మో వసూని వివిధాని చ ॥"

ద్రోణాచార్యుడు విశ్రమించినతరువాత తన పౌత్రుల నందరను దీసికొనివచ్చి కానుక లిచ్చి వీరందరు నీశిష్యు లని వప్పగించెను.

ద్రోణాచార్యుడు పాండవులను, కౌరవులను శిష్యులుగ బరిగ్రహించి సంతుష్టుడై వారందరు తనకు పాదాభివందనముచేసి యున్నపుడు ఇట్లనెను—

'కార్యం మే కాంక్షితం కించి ద్ధృది సంపరివర్తతే ।
కృతాస్త్రైస్తత్ప్రదేయం మే తదేతద్వదతాఽనఘాః ॥

పూజ్యులారా! నేను కాంక్షించినట్టియు, నాహృదయమును కలతబెట్టుచున్నట్టియు, కార్య మొకటి కలదు. అస్త్రవిద్యయందు మీరుతీర్ణులైనతరువాత నాకది చేసిపెట్టవలయును మీరు వాగ్దానము చేయుడు. అని.

'తచ్ఛ్రుత్వా కౌరవేయాస్తే తూష్ణీమాసన్ విశాంపతే ।
అర్జునస్తు తత స్సర్వం ప్రతిజజ్ఞే పరంతప ॥
తతోఽర్జునం తదా మూర్ధ్ని సమాఘ్రాయ పునఃపునః ।
ప్రీతిపూర్వం పరిష్వజ్య ప్రరురోద ముదా తదా ॥

అది విని కౌరవులందరు తూష్ణీంభావమును వహించియుండ పార్థుడు నీయాజ్ఞప్రకారము నేనాకార్యము నిర్వహింతు నని వాగ్దానము జేసెను. అప్పుడు ద్రోణాచార్యుడాయర్జునుని ప్రీతితో కౌగలించుకొని శిరము మూర్కొని యానందబాష్పములు విడిచెను. తరువాత నందరకు నస్త్రవిద్య నేర్పుచుండెను. అందరిలో నర్జును డన్నివిధముల మిన్నయై యుండెను.

ఆచార్యుడొకప్పుడు శిష్యబుద్ధిపరీక్ష నిట్లు చేసెను.
"కమండలుం చ సర్వేషాం ప్రాయచ్ఛచ్చిరకారణాత్ ।
పుత్రాయ చ దదౌ కుంభ మవిలంబనకారణాత్ ॥
యావత్తే నోపగచ్ఛన్తి తావదస్మై పరాం క్రియాం ।
ద్రోణ ఆచష్ట పుత్రాయ తత్కర్మ జిష్ణు రాహత ॥
తత స్సవారుణాస్త్రేణ పూరయిత్వా కమండలుమ్ ।
సమమాచార్యపుత్రేణ గురు మభ్యేతి ఫాల్గునః ॥"

టీ:—కమండలుం సూక్ష్మముఖత్వా ద్విలంబేన పూరణీయమ్, కుంభం విస్తీర్ణముఖత్వా త్సద్యః పూరణీయం, తస్య ఫల మాహ, యావదతి. ఔహత త్కృతవాన్,

నీటిలో ముంచునపుడు విలంబముగా నీటితో పూరింపబడు సూక్ష్మరంధ్రముగల కమండలువు (కూజా) లందరకిచ్చి పుత్రుడైన అశ్వత్థామకు త్వరలో పూరింపబడు విస్తృతరంధ్రముగల కడవ నిచ్చి ముందెవ్వరు నీరుముంచి తెత్తురో వారికొక విశేష ముపదేశింపదలచి ద్రోణుడు మీరందరు నీరుతీసికొని రండని పంపగా, ఆచార్యాభిప్రాయమును గుర్తించిన అర్జునుడు తనకమండలువును వారుణాస్త్రముచే బూరించి యశ్వత్థామతో సమానముగ నేవచ్చుచుండువాడు. మరియు—

"అర్జునః పరమం యత్న మాతిష్ఠ ద్గురుపూజనే ।
అస్త్రే చ పరమం యోగం ప్రియో ద్రోణస్య చాఽభవత్ ॥
తం దృష్ట్వా నిత్య ముద్యుక్త మిష్వస్త్రం ప్రతి ఫాల్గునమ్ ।
ఆహూయ వచనం ద్రోణో రహః సూద మభాషత ।
అన్ధకారేఽర్జునాయాన్నం న దేయం తే కదాచన ।
నచాఖ్యేయ మిదం చాఽపి మద్వాక్యం విజయే త్వయా ॥

టీ:- సూదం సూపకారం ప్రతి, అన్నం న దేయం, కిన్త్వన్ధకారేముఖాదన్యత్ర గ్రాసాః పతిష్యన్తీతి నాన్నం దదామీతి స త్వయా వాచ్య ఇతి భావః, విజయే= అర్జునే, అయం భావః—అత్యభ్యాసాన్ముఖా దన్యత్ర గ్రాసా న పతన్త్యేవ ఏవం తమసి శబ్దాదిలక్ష్యాదన్యత్ర శరా అపి న పతేయురితి, ఉక్తోఽర్జునో యది కేనేద ముక్తమితి పృచ్ఛేత్ తర్హి లౌకికప్రవాహోఽయ మర్థ ఇతి తం ప్రతివక్తవ్యం న తు ద్రోణవాక్య మేత దితి।

"తతః కదాచి ద్భుఞ్జానే ప్రవవౌ వాయు రర్జునే ।
తేన తత్ర ప్రదీప స్స దీప్యమానో విలోపితః ॥
భుఙ్క్త ఏవ తు కౌన్తేయో నాస్యా దన్యత్ర వర్తతే ।
హస్త స్తేజస్విన స్తస్య అనుగ్రహణకారణాత్ ॥
తదభ్యాసకృతం మత్వా రాత్రా వపి స పాణ్డవః ।
యోగ్యాం చక్రే మహాబాహు ర్ధనుషా పాణ్డునన్దనః ॥

టీ. ఏవం గురుణా శిష్యాభ్యాసే ప్రవృత్తౌ జ్ఞాపితాయాం తతః ప్రాగేవార్జునః స్వదృష్టాన్తేనై వతజ్జ్ఞాతవానిత్యాహ ద్వాభ్యాం– తత ఇతి। అనుగ్రహణ మభ్యాసః యోగ్యా మభ్యాసమ్,

"తస్య జ్యాతలనిర్ఘోషం ద్రోణ శ్శుశ్రావ భారత ।
ఉపేత్య చైన ముత్థాయ పరిష్వజ్యేద మబ్రవీత్ ॥
ప్రయతిష్యే తథా కర్తుం యథానాఽన్యో ధనుర్ధరః ।
త్వత్సమో భవితా లోకే సత్య మేత ద్బ్రవీమి తే ॥
టీ. శ్రవణోత్తర ముత్థా యోపేత్యేతి క్రమః ।"

అర్జునుడు గురుశుశ్రూష నఖండముగా జేయుచు నస్త్రములయం దేకాగ్రత వహించి యాచార్యునకు ప్రీతిపాత్రుడై యుండెను.

ఒకప్పు డాచార్యుడు అర్జునునివంటవానితో రహస్యముగా నిట్లు చెప్పెను. నీవెప్పుడును చీకటిలో నర్జునున కన్నము (తినుబండన స్తువు) పెట్టక పెట్టుమని కోరిన మొదల చీకటిలో నాపదార్థము నోటికిబోక మరెక్కడకుబోవునో యందుచే నపెట్టను అని యాతనితో ననుము. ఆత డీమాటజెప్పినవా రెవ్వరని యడిగినచో నను చెప్పినట్లు చెప్పక యిది లోకప్రసిద్ధమే యని చెప్పుము. అని. ఆచార్యు డిట్లు చెప్పుటలో తాత్పర్య మేమనగా—

అభ్యాసాతిశయమున నెంత చీకటిలోనైనను తిను వస్తువు నోటిలోనికే గాని మరియొకస్థానమునకు బోకుండునట్లు చీకటిలోగూడ ధ్వనిని గురిచేసి వేసిన బాణములు అభ్యాసాతిశయమున లక్ష్యమును గొట్టితీరు నని బోధించుటే.

ఆవంటవా డర్జునున కీవిషయము దెలుపకపూర్వమే యొకప్పు డర్జునుడు రాత్రి భుజించుచుండ పెద్ద గాలి వీచి దీపమారిపోయినది. అయినను భుజించుచున్న తనహస్తము నోటికే బోవుటను గమనించి యిది యభ్యాసవిశేషమున గదా కలిగిన దని భావించి యర్జునుడు రాత్రియందుగూడ ధనుష్టంకారపూర్వకముగ బాణప్రయోగము నభ్యసింప మొదలిడెను.

ద్రోణాచార్యుడా శబ్దమువిని లేచి వచ్చి హర్షముతో పార్థుని కౌగలించుకొని యిట్లనెను. అర్జునా లోకములో నీతో సమానుడైన ధనుర్ధరుడు నాశిష్యులలో మరియొకడు లేడనిపింతును. ఇది సత్యము, అని.

అశ్వత్థామయందైన గలుగని యంతవాత్సల్యము అంతశిష్య సంఘములో నొక్క పార్థునియందు గలుగుట కాతని గురుభక్తి, ఆతని గురుకార్యనిర్వహణప్రతిజ్ఞ, ఆతని బుద్ధికుశలత, అసాధారణములై యుండుటే కారణము. కనుకనే అనన్యసాధారణమైన పార్థుని యోగ్య

తన మెచ్చి శిష్యవత్సలుడగు ద్రోణాచార్యుడు "పార్థ ఏవ ధనుర్ధరః" అని లోకములో నేననిపించుదు నని స్వయముగా ప్రతిజ్ఞ జేసెను.

అప్పటికి యేకలవ్యుని ప్రశంసయే లేదు. ఇట్లుండ నొకప్పుడు ఏకలవ్యు డను నిషాదుడు ధనుర్విద్యాభ్యాసమునకై యాచార్యునియొద్దకు రాగా నిషాదుడని యాచార్యు డాతనిని బరిగ్రహింపలేదు. అప్పుడాయేకలవ్యుడు ద్రోణునకు సాష్టాంగ ప్రణామమును చేసి యరణ్యమునకు వెళ్ళి ద్రోణాచార్యుని మృణ్మయవిగ్రహమును నిర్మించి దానిని యాచార్యస్వరూపముగా భావించి పూజించుచు నేకాగ్రతతో బాణ ప్రయోగాదులలో నతికుశలతను గడించియుండెను.

ఒకప్పుడు ఆచార్యానుజ్ఞపై శిష్యులైన రాజకుమారు లందరు వేటకై వెళ్ళిరి. అందు పాండవులతో ననుచరు డొకడు కుక్కను వెంటబెట్టుకొని వెళ్ళెను. వా రరణ్యసంచారము చేయుచుండ కుక్క అటు నిటు దిరుగుచు నేకలవ్యుడున్న చోటుకు వెళ్ళి యాతని జూచి మొరుగుచు నిలిచెను. ఏకలవ్యుడు దానికి చేటులేకుండ నోటిలో నొక పర్యాయమే యేడుబాణములను ప్రవేశపెట్టెను. ఆకుక్క బాణములతో నింపబడిన నోటితో పాండవులయొద్దకు రాగా వారు చూచి యాప్రయోగకౌశలమున కాశ్చర్యపడి యాతనియొద్దకు వెదకుచు వెళ్ళి చూచి నీవెవ్వడవు? నీగురు వెవ్వడు? అని యడుగ నాత డిట్లు చెప్పెను—

"నిషాదాధిపతే ర్వీరా హిరణ్యధనుష స్సుతమ్ ।
ద్రోణశిష్యం చ మాం విత్త ధనుర్వేదకృతశ్రమమ్ ॥"

నేను హిరణ్యధను వను నిషాదరాజు కుమారుడను. ద్రోణాచార్యశిష్యుడను. అని.

తరువాత వారందరు నింటికి వచ్చి ఆయాశ్చర్యమును ద్రోణునితో జెప్పిరి. అర్జును డొక్కడును ద్రోణునితో గలిసి యిట్లనెను—

"తదాఽహం పరిష్వజ్యైకః ప్రీతిపూర్వ మిదం వచః ।
భవతోఽన్యో న మే శిష్య స్త్వద్విశిష్టో భవిష్యతి ॥
అథ కస్మా న్మద్విశిష్టో లోకా దపి చ వీర్యవా౯ ।
అన్యోఽస్తి భవత శ్శిష్యో నిషాదాధిపతే స్సుతః ॥

ఆచార్యా! నాడు నన్ను నీవాలింగనము జేసికొని నాశిష్యులలో నిన్ను మించిన ధనుర్ధరు డుండబోడని ప్రీతితో బలికియుంటివి. నన్నుమించిన పరాక్రమశాలి యేకలవ్యు డను నీశిష్యు డొక డుండెనే, అని—

ఈమాటలలో ఏకలవ్యుని ఘనతనుమించిన ఘనతను నాకు నీవనుగ్రహింపవలయునని ప్రార్థించుటే పార్థుని యభిప్రాయము.

ఏకలవ్యుడు ద్రోణశిష్యుడ నని ప్రకటించుటయు, నాశిష్యులలో నిన్నధికుని జేయుదు నని అవ్యాజప్రేమతో ద్రోణుడు ప్రతిజ్ఞ జేసి యుండుటయు పార్థుని యీ ప్రార్థనకు మూలములు.

అప్పు డాచార్యు డొక్క ముహూర్తమాత్రకాల మాలోచించి పార్థుని వెంటబెట్టుకొని యేకలవ్యునియొద్దకు వెళ్ళగా నావచ్చుచున్నద్రోణుని జూచి యెదురుగా వెళ్ళి సాష్టాంగనమస్కారము చేసి పూజించి నేను నీశిష్యుడ నని చెప్పి యాతడు దోసిలియొగ్గియుండ ద్రోణు డాతనితో నిట్లనెను—

"యదిశిష్యోఽసి మే వీర వేతనం దీయతాం మమ ।
టీ:- వేతనం గురుదక్షిణారూపమ్ ॥

నాశిష్యుడవే యైనయెడల నాకు గురుదక్షిణ నిమ్ము. అని—

దీనినిబట్టి తాను ద్రోణశిష్యుడ నని యేకలవ్యు డననిచో ద్రోణ ప్రతిజ్ఞకు హాని లేనందున తనప్రతిజ్ఞానిర్వాహణమునకై ఈతాపత్రయము ద్రోణునకు లేకయేపోవునని స్పష్టము.

సత్యమునకు గట్టుబడియే యేకలవ్యుడు శిష్యుడ నని చెప్పవలసి వచ్చెను. సత్యమునకు గట్టుబడియే ద్రోణుడు గురుదక్షిణ నడుగవలసి వచ్చెను.

"ఏకలవ్యస్తు తచ్ఛ్రుత్వా ప్రీయమాణోఽబ్రవీ దిదమ్ ।
కిం ప్రయచ్ఛామి భగవ న్నాజ్ఞాపయతు మాం గురుః ॥
నహి కించి దదేయం మే గురవే బ్రహ్మవిత్తమ ।।"

ఏకలవ్యుఁ డామాటకు సంతోషించి మహానీయా! ఏమియియ్య వలయునో ఆజ్ఞాపింపుము. నాకు గురువున కీయదగని వస్తువనునది లేదు. అని చెప్పెను.

అపుడు—

"త మబ్రవీ త్త్వయాఽఙ్గుష్ఠో దక్షిణో దీయతా మితి ।
ఏకలవ్య స్తు త చ్ఛ్రుత్వా వచో ద్రోణస్య దారుణమ్ ॥
ప్రతిజ్ఞా మాత్మనో రక్ష న్సత్యే చ నియత స్సదా ।
తథైవ హృష్టవదన స్తథైవాఽదీనమానసః ॥
ఛిత్త్వాఽవిచార్య తం ప్రాదా ద్ద్రోణాయాఽఙ్గుష్ఠ మాత్మనః ।
స సత్యసంధం నైషాదిం దృష్ట్వా ప్రీతోఽబ్రవీ దిదమ్ ॥
ఏవం కర్తవ్య మితి వా ఏకలవ్య మభాషత ।

టీ:—ఏవం కర్తవ్య మితి, తర్జనీమధ్యమాభ్యాం శరం ధృత్వా జ్యాకర్షణం కర్తవ్య మిత్యభినీయ దర్శయతి ॥

తత శ్శరం తు నైషాది రంగుళీభి ర్వ్యకర్షత ।
(ద్రోణశ్చ సత్యవా గాసీ న్నాన్యోఽభిభవితాఽర్జునమ్ ॥

ద్రోణు డాతనితో నీదక్షిణాంగుష్ఠము నిమ్మని చెప్పగా ఏకలవ్యు డాభయంకరమైన ద్రోణవాక్యమువిని యేమడిగినను గురువున కిచ్చెదనని మొదట జేసిన తనప్రతిజ్ఞను కాపాడుకొనుచు ఆప్రసన్నతకును, ఆయుదారతకును లోపములేక నిర్వికారచిత్తుడై యంగుష్ఠమును ఛేదించి యిచ్చెను. సత్యసంధుడైన ఆఏకలవ్యుని జూచి ప్రీతుడయిన ద్రోణుడు నీవిటుపై శరసంధాన మిట్లు చేయవలసిన దని తర్జనీమధ్యమాంగుళులచే శరసంధానము తాను చేసి చూపెను. ఏకలవ్యు డట్లే శరసంధానము చేయుచువచ్చెను. ద్రోణు డర్జునుని గూర్చి చేసిన తన ప్రతిజ్ఞ నిలువబెట్టుకొనెను.

కథాసంగ్రహ మిటులుండ కవివాక్య మెట్లున్నది? "పార్థుని అంగుష్ఠమును గోరుకొమ్మనియె ద్రోణాచార్యుండు" అని యున్నది. ఇది మృష కాదా? ధనుర్విద్యలో నాశిష్యులలో నిన్నధికుని జేయుదు నని వాత్సల్యముతో నాడు నాదు వాగ్దానము చేసి యుంటివి నీశిష్యుడేక లవ్యుడు నన్ను మించియుండెను, అని చెప్పుకొనెనా? లేకఅతని యంగుష్ఠమును గోరుకొమ్మని కోరెనా? కను కవివ్రాత నిరస్తము.

"కురురాజు స్వార్థపరుడౌనే కిరీటితో బోల్చినట" అని వ్రాసిన యీకవి, పార్థుని స్వార్థపరునిగను దుర్యోధనుని స్వార్థత్యాగిగను తలచుట చింత్యము, ఈమాటచే కవికి మహాభారతపరిజ్ఞాన మెంతకలదో విదితమయినది.

ద్యూతప్రక్రియచే పాండవైశ్వర్య మపహరింపదలచి తండ్రికా సంకల్పమును విశదపరచిన దుర్యోధనునితో ధృతరాష్ట్రుడది యధర్మము వద్దని చెప్పినపుడు దుర్యోధనుడు చెప్పిన సమాధాన మిది—

"లోకవృత్తా ద్రాజవృత్త మన్య దాహ బృహస్పతిః ।
తస్మా ద్రాజ్ఞా ప్రయత్నేన స్వార్థ శ్చిన్త్య స్సదైవ హి ॥
క్షత్రియస్య మహారాజ జయే వృత్తి స్సమాహితా ।
స వై ధర్మ స్త్వధర్మో వా స్వవృత్తౌ కా పరీక్షణా ॥"

(సభా—అ55)

తండ్రీ! లోకవ్యవహారము వేరు, రాజ్యవ్యవహారము వేరు. అని బృహస్పతిచెప్పెను. కనుక రాజు అప్రమత్తుడై స్వార్థచింతన సదా చేయుచుండవలయును. క్షత్రియునకు జయించుటే స్వవృత్తి. అది ధర్మము కానిమ్ము, అధర్మము కానిమ్ము. అని—

ఇట్టి దుర్యోధనుడు స్వార్థత్యాగి యనిపించుట చింత్యము.

ఇక ద్రోణుడట్లు కోరుట అన్యాయ మని ప్రతివాదుల కనిపించును కాబోలు! ఆ యేకలవ్యుని కట్లనిపింపనిది వీరి కెందు కనిపింపవలెనో!

ఒక ప్రతిజ్ఞ చేసియున్న మహాపురుషుడు ఆడి తప్పలేక దాని నెట్లో నిర్వహించుకొనుచుండుట స్వాభావికము.

నీవు కోరినంత ధనము నిచ్చెద నని ప్రీతితో విశ్వామిత్రునకు ప్రతిజ్ఞ జేసిన హరిశ్చంద్రుడు పత్నీపుత్రుల నొకని కమ్ముడయి తుదకు కాటికాపరితనమునకుగూడ సిద్ధపడినది ఆడి తప్పలేకయే.

నీవు కోరినప్పుడు రెండువరములు నీకిచ్చెద నని ప్రీతితో కైకేయికి యెన్నడో ప్రతిజ్ఞజేసిన దశరథుడు తనకు ప్రాణమైయున్న రామచంద్రభగవానునికి వనవాసప్రాప్తిని వరముగా గోరిన కైకేయి మాటకు మారుపలుకలేక బద్ధుడైపడియున్నది ఆడి తప్పలేకయే.

ఇంత యెందులకు? నీవేమడిగినను గురుదక్షిణ నిచ్చెదనని ప్రీతితో ప్రతిజ్ఞజేసిన యీ యేకలవ్యుడు ద్రోణాచార్యున కంగుష్ఠ మిచ్చినది ఆడితప్పలేకయే.

అట్లే "పార్థ ఏవ ధనుర్ధరః" అను లోకవిఖ్యాతి నీకు గలిగింతు నని ప్రీతితో పార్థునకు ప్రతిజ్ఞజేసియున్న ద్రోణుడు ఆయేకలవ్యుని యంగుష్ఠమును కోరినదికూడ ఆడితప్పకయే అని ప్రతివాదులు తెలిసి కొందురుగాక. నాటి యేకలవ్యునికి లేని బాధ నేటి ప్రతివాదులకు గలుగుట చిత్రము.

ఈయేకలవ్యుని చరిత్రములోని విశేష మేమనగా—

ఆత డారాధించినది సాక్షా ద్ద్రోణుని గాదు. మృన్మయద్రోణ విగ్రహమును. అందులోగూడ విద్యోపదేశమునకై తన్ను పరిగ్రహింపనట్టి ద్రోణుని విగ్రహమును. దాని ననన్యభక్తితో నారాధింపగా నాతనికి ప్రాప్తించినది సామాన్యశక్తి కాదు. లోకోత్తరశక్తి. అది స్వయంకృషిలబ్ధమని కాక గురుకటాక్షసిద్ధ మనియే యాతని నిశ్చయము. అది సిద్ధించిన తరువాత గురువున కీయరానిది లేదని గురుదక్షిణగా గోరిన దాని నిచ్చిన ధీరు డాయేకలవ్యుడు. కనుక, విగ్రహారాధ

నములోని విశిష్టతను, అనన్యభక్తిలోని యత్కృష్టతను ఏకలవ్యుని దర్శనముచే ప్రతివాదులు తెలిసికొందురుగాక.

ఈర్ష్యాసూయాదులతో దూషింపక పూజ్యుల నాదరించి విధినిషేధముల బాటించి యిహపరసుఖముల నొందుదురుగాక.

—♦"పాండవులలో దోసము లేదా? దుర్యోధనుని భీముఁడు దొండిచేసి పడగొట్టలేదా?" అను ప్రసంగము—తన్నిరాకరణము♦—

కవి ఖండవాక్యములోని 'చనువు' లో నిట్లున్నది—

"తన సాపాటుబలంబు నమ్ముకొని యుద్దండంబుగన్ దట్టిగ
ట్టిన భీముండును దొండిచేసి పడగొట్టెం బాప మారాజరా
జును కౌరవ్యుల దుష్టకార్యములతో జోడించిరన్ దీజెనే
వినువారుం డిన జెప్పువారలకు లేవే వ్యర్థవాదాంశముల్"

భీముడు గదాయుద్ధములో దుర్యోధనుని తొడలు విఱుగగొట్టుట తప్పని యీకవి యాక్షేపము.

నాడు దుర్యోధనుడు ద్రౌపదిదేవికి తన తొడ జూపిన దుండగమునకు శాస్తిగా నీతొడలు తెగగొట్టెద నని ప్రతిజ్ఞజేసిన భీమసేనుడు ఆపని జేసి కృతకృత్యుడయ్యెను. అది తప్పెట్లగును?

ఈకవియే దుర్యోధనుడు తుంటరిపనులు చేసినట్లు 'రాజరాజు' అను పేరుతో వ్రాసిన యీపద్దెములు చూడుడు—

"అంటగరాని యగ్నికెనద్మైనది ద్రౌపది యట్టి సాధ్వి ప
య్యంట మొగానబూని యకటా యని యశ్రులు రాల నేడ్చినన్
దుంటరివై సహోదరులతో సభలోన బరాభవించి నా
వంట మఱిందివై వదినకా మొనగానితనంబు సూపుటల్"

అట్టి తుంటరికి శాస్తి జేయ ప్రతిజ్ఞ బూని నిర్వహించిన మానధనుడగు భీమసేనుడు దోషి యగునా!

"కురుభూపాలుఁడు బుద్ధిమంతుఁ డని వాక్రోఁ బూనితిఁ గాని యా
దరణీయంబులు హేతువుల్ గలుఁ బవద్గానిచరిత్రంబునన్
గరళాన్నంబును మాయజూదమును లాక్షాగేహముం ద్రౌపదీ
పరిభావంబు భయంకరంబులగుచుం బాపట్టెఁ గుంతీపతీ"

ఈకవి, దుర్యోధనుఁడు బుద్ధిమంతుఁడు (ఉత్తముఁడు) అని చెప్ప బూనెనట, కాని యాతనిది దుశ్చరిత్ర మగుటచేత నట్లు చెప్పలేక పోయెనట.

దీనినిబట్టి చూడగా దుర్యోధనుఁడు దుష్టుఁడు గాఁడని యాకవి చెప్పలేక, పాండవుల విశిష్టతను త్రోసివేసి వారిపై దోషముల నారోపించి వారిలో మాత్రము దోషములు లేవా? అని వ్రాతసాగించి పాండవులుగూడ దుర్యోధనునితో సమానులే అని చెప్పి పాండవదోషారోపణమూలమున తన దుర్యోధనాభిమానమును గతార్థము చేసికొనినట్లు స్పష్టము.

ఇట్టి లక్షణము గలిగియుండి మహాభారతకర్తయగు వేదవ్యాసమహర్షి నాక్షేపించు పద్ధతిని వ్రాతసాగించుట యుక్తమైన పని కాదని తెలుపుచు దీనినింతటితో విడిచివేయుచున్నాము.

ఋషిప్రభావ మరయక ఆర్షగ్రంథస్వభావ మెఱుఁగక, ఆర్షగ్రంథము లామూలాగ్ర మవలోకింపక, శాస్త్రపరిజ్ఞానము లేక, ఆర్షగ్రంథము లర్థము జేసికొనలేక, శబ్దమర్యాదను పాటింపక, విద్వన్మార్గమును గమనింపక, చెప్పినదానికి వ్యతిరేకముగ తమచిత్తవృత్తుల కనుగుణముగునట్లు కల్పించి పూజ్యుల నపూజ్యులని వ్రాతసాగించి సారస్వతమునకు కళంకమాపాదించి లోకులకు సద్భావములను దొలగించుటకు జేసినప్రతివాదుల కోలాహలము నిరస్తమైనది.

ఇంతవరకు. 1 మహాభారతచరిత్రము, 2 ఉత్తరభారతము, 3 మహాభారతరహస్యము, 4 సుయోధనవిజయము, 5 ఆంధ్రమహాభారతసంశయవిచ్ఛేదము, 6 కురుపాండవదాయభాగవినిర్ణయము, 7 కర్ణచరి

త్రిక, 8 ఖండకావ్యము (చనవు) 9 కురుక్షేత్రసంగ్రామము, అను విమర్శకగ్రంథములలో గల ప్రసంగాగతములైన విరుద్ధాంశములు నిరాకరింపబడినవి.

సారాంశ మిది—

"ఏవం పాండవనిన్దా స్తా విమర్శకముఖోద్గతాః ।
నిరాకృ త్యార్షసిద్ధాన్తసరణి స్సంప్రదర్శితా ॥
కృష్ణ్వాన్తు నిశ్చితార్థం భారతముఖ్యేషు పాండవాః పూజ్యాః ।
తచ్చరితం పాపహరం లోకహితం మహర్షిభి ర్గీతమ్ ॥
కృష్ణపరమాత్మసమ్మత మీశ్వరసంకల్పవరబలోజ్జ్వలితమ్ ।
శమదమశౌర్యౌదార్యై రభిరామం ధర్మసూక్ష్మసంబద్ధమ్ ॥
తాదృశ మసదృశచరితం నిన్ద్యం యో మన్యతే స వై శోచ్యః ।
సత్పురుషదూషణం కిల దూషకదురదృష్టసూచకం భవతి ॥

'బాలవ్యాస, న్యాయవ్యాకరణవేదాంతవిద్యాపారీణ' వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిప్రణీతమైన, మహాభారత తత్త్వకథనమున పాండవనిందానిరాకరణ మనెడి

చతుర్థ భాగము.

సమాప్తము.

———

శ్రీ గురుభ్యో నమః.

# మహాభారత తత్త్వకథనము.

## ద్రౌపదీ నిందా నిరాకరణము.

పంచమ భాగము.



'బాలవ్యాస, తర్క, వ్యాకరణ, వేదాన్త పారీణ'

వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే

రచింపబడి,

భట్నవిల్లి గ్రామస్థాపిత శ్రీ శారదాముద్రాలయమునందు

ముద్రింపబడి,

ప్రకటింపబడెను.

ప్రతులు: 1000.

2-8-1952



మూల్యం: 2-0-0

# విషయసూచిక.

శ్రీ మహాగణాధిపతయే నమః.

# మహాభారత తత్త్వకథనము.



## ద్రౌపదీ నిందా నిరాకరణము.



"కుమారీ చాఽపి పాంచాలీ వేదీమధ్యా త్సముత్థితా,
సుభగా దర్శనీయాంగీ స్వసితాయతలోచనా.
మానుషం విగ్రహం కృత్వా సాక్షా దమరవర్ణినీ,"
టీ. అమరవర్ణినీ దేవకుమారీ; దుష్టవధాయోద్యతా దుర్గేత్యర్థః.

(ఆది_అ 167)

"యాః కృతా ద్రౌపదీదేవ్యాం నిందాః కైశ్చి న్నిరంకుశమ్,
తన్నిరాకరణం కుర్మః ప్రమాణై రుపపత్తిభిః",

—: ద్రౌపదీ పూర్వజన్మవృత్తాంతము :—

నాలాయన్యుపాఖ్యానమందును, పంచేంద్రోపాఖ్యానమందును ద్రౌపదీ పూర్వజన్మవృత్తాంతము చెప్పబడియున్నది. అందు నాలాయన్యుపాఖ్యానమం దున్న విషయ మిది—

ఆంధ్రభారతము_ఆది_ 7ఆ.

"ఇది దొల్లి నాలాయనియైన యింద్రసేన యనంబరగిన పరమ పతివ్రత, మౌద్గల్యుండను మహామునికి భార్యయయి కర్మవశంబున

నమ్మునిం గుష్ఠవ్యాధిబాధితత్వగస్థిభూతశరీరు, వయోవృద్ధు, వలీపలిత ధరు, దుర్గంధవదను, దుఃఖజీవు, నతికోపను, విశీర్యమాణనఖత్వచుం బరమభక్తి నారాధించి తదుచ్ఛిష్టంబు కుడుచుచున్న నొక్కనాడు.

తే. కుడుచునెడ వాని పెనువ్రేలు కూటిలోన
దునిసి పడియున్న వ్రేల్ పుచ్చి తోయజాక్షి
యేవగింపక యుచ్ఛిష్ట మిష్టలీల
దగిలి కుడుచుచున్నంత నత్తరుణి జూచి.

వ. దానిదయిన పతిభక్తిగుణంబునకు మెచ్చి మౌద్గల్యుండుపన్నుండై-
(సంస్కృతభారతము—ఆది. అ. 212 కుంభకోణప్రతి)
"నాహం వృద్ధో న కటుకో నేర్ష్యావా నైవ కోపనః,
నచ దుర్గంధవదనో న కృశో న చ లోలుపః.
కథం త్వాం రమయామీహా కథం త్వాం వాసయామ్యహం,
వద కల్యాణి భద్రంతే యథా త్వా మనసేచ్ఛసి."

మానినీ! నేను వృద్ధుడనుగాను, కటుభాషినిగాను, కోపినిగాను, దుర్గంధవదనుండనుగాను, కుష్ఠవ్యాధిగ్రస్తుడనుగాను. నిన్నెట్లు సంతోష పెట్టుమనెదవో చెప్పుము. నీకోరిక నీడేర్తును. అని పలుక నాపతివ్రత యగు నాలాయని యిట్లు కోరెను—

"పంచధా ప్రవిభక్తాత్మా భగవన్ లోకవిశ్రుతః,
రమయ త్వ మచింత్యాత్మన్ పున శ్చైకత్వ మాగతః".

అచింత్యప్రభావముగల నీవు అయిదుమూర్తులను ధరించియు నేకమూర్తిని ధరించియు నన్ను సంతోషపెట్టుము. అని,

"తాం తథే త్యబ్రవీ ద్ధీమా న్మహర్షి ర్వై మహాతపాః,
స పంచధాతు భూత్వా తాం రమయామాస సర్వతః.
స చ తాం తపసా దేవీం రమయామాస యోగతః,

మౌద్గల్యస్య మహర్షేశ్చ రమమాణస్య వై తదా.
సంవత్సరగణా రాజన్ వ్యతీయుః క్షణవత్తదా,
తతః కదాచి ద్ధర్మాత్మా తృప్తః కామై ర్వ్యరజ్యత.
అన్విచ్ఛన్ పరమం ధర్మం బ్రహ్మయోగపరోఽభవత్,
ఉత్ససర్జ స తాం విప్రస్సా తదా చాఽపతద్భువి.

నాలాయనీ—

ప్రసీద భగవన్ మహ్యాం న మా ముత్స్రష్టు మర్హసి,
అవితృప్తాస్మి బ్రహ్మర్షే కామానాం కామసేవనాత్.

మౌద్గల్యః—

యస్మా త్త్వం మాం తు నిశ్శంకా హ్యావక్తవ్యం ప్రభాషసే,
ఆచరంతీ తపోవిఘ్నం తస్మా చ్ఛృణు వచో మమ.
భవిష్యసి నృలోకే త్వం రాజపుత్రీ యశస్వినీ,
పాంచాలరాజస్య సుతా ద్రుపదస్య మహాత్మనః.
భవితార స్తత్ర తవ పతయః పంచ విశ్రుతాః,
తై స్సార్థం మధురాకారై శ్చిరం రతి మవాప్స్యసి''.

ఆమహర్షి యట్లే యని తన తపశ్శక్తిచేతను యోగశక్తిచేతను అయిదుమూర్తులు ధరించి యామెను సంతోషపెట్టుచు చిరకాలము గడపెను. తరువాత నొకప్పుడు కామసుఖవిరక్తుడై బ్రహ్మనిష్ఠాసక్తుడై ఆమెను విడిచి నివృత్తిమార్గమవలంబించెను. అప్పుడామె నీవు నన్ను విడిచిపెట్టదగదనియు, విషయసుఖసేవనమువలన నాకు సుఖాసక్తి నివర్తింపలేదనియు బ్రార్థించెను.

అప్పుడు మహర్షి నా తపోనిష్ఠకు విఘ్నముచేయుచు నాకవక్తవ్యమును చెప్పితివి కనుక నా వాక్యమును వినుము. నీవు ద్రుపద మహారాజునకు బుత్రికవై పుట్టి కీర్తికలదానవై యుండగలవు. అప్పుడు

నీకు లోకవిఖ్యాతులగు పంచపతు లుండగలరు మధురమూర్తులగు వారితో నీవు చిరకాలసౌఖ్యము ననుభవింపగలవు. అని చెప్పెను.

"సైవం శప్తా తు విమనా వనం ప్రాగా ద్యశస్వినీ,
భోగై రతృప్తా, దేవేశం తపసా ఽఽరాధయత్తదా.
నిరాశీ ర్మారుతాహారా నిరాహారా తథైవ చ,
తీవ్రేణ తపసా తస్యా స్తుష్టః పశుపతి స్స్వయమ్.
వరం ప్రాదా త్తదా రుద్ర స్సర్వలోకేశ్వరః ప్రభుః,
భవిష్యతి పరం జన్మ భవిష్యసి వరాంగనా.
భవిష్యన్తి పరం భద్రే పతయః పంచ విశ్రుతాః,
మహేన్ద్రవపుష స్సర్వే మహేన్ద్రసమవిక్రమాః.
తత్రస్థా చ మహత్కర్మ సురాణాం త్వం కరిష్యసి,"

భోగములకు విరక్తి వహింపని యానాలాయని యిట్లు శపింపబడి ఖిన్నురాలై వనమునకుబోయి పరమేశ్వరునిగూర్చి తీవ్రమైనతపము జేసెను. అప్పుడు పరమేశ్వరుడు మెచ్చి సాక్షాత్కరించి ఆమెకోరికనడిగి యామెపై యిట్లు వర మిచ్చెను. నీవు పైజన్మములో నుత్తమస్త్రీవై యుండగలవు. అప్పుడు మహేన్ద్రసమానస్వరూపులును, మహేంద్రసమానవిక్రములును, లోకవిఖ్యాతులు నగు పతులు నీకైదుగురు కాగలరు. నీ వప్పుడు దేవతాపక్షమున జరుగు మహాకార్యమునకు నిమిత్తము కాగలవు. అని.

స్త్ర్యువాచ—

"ఏకః ఖలు మయా భర్తా వృతః పంచ త్వమే కథమ్,
ఏకో భవతి నైకస్యా బహవ స్త ద్బ్రవీహి మే."

అది విని నాలాయని యిట్లనెను. నేనేకభర్తనే కోరియుండగా నైదుగురు భర్తలంటివేమి? ఒక స్త్రీ కొకభర్తయేగాని బహుభర్తలుండరాదే. ఇది నాకు చెప్పుము అని.

మహేశ్వరః—

"పంచకృత్వ స్త్వయా చోక్తః పతిం దేహీ త్యహం పునః,
పంచ తే పతయో భద్రే భవిష్యన్తి సుఖావహాః."

ఆపై పరమేశ్వరు డిట్లనెను- నీకోరికను నాకు వెల్లడించుటలో 'పతిం దేహి' అని యైదుసార్లు నీవనుటచే నీకట్టి వరమీయవలసి వచ్చినది.

స్త్ర్యువాచ—

"ధర్మ ఏకః పతిః స్త్రీణాం పూర్వమేవ ప్రకల్పితః,
బహుపత్నీకృతా పుంసో ధర్మశ్చ బహుభిః కృతః.
స్త్రీధర్మః పూర్వమేవాయం నిర్మితో మునిభి స్సదా,
సహధర్మచరీ భర్తు రేకా ఏకస్య చోచ్యతే.
ఏకో హి భర్తా నారీణాం కౌమార ఇతి లౌకికః,
ఆపత్సుచ నియోగేన భర్తు ర్భార్యాః పరస్స్మృతః.
గచ్ఛేత యా తృతీయ న్తు తస్యా నిష్కృతి రుచ్యతే,
చతుర్థే పతితా నారి పంచమే బన్ధకీ భవేత్.
ఏవం గతే ధర్మపథే న వృణే బహుపుంస్కతామ్.
అలోకాచరితా త్తస్మా త్కథం ముచ్యేయ సంకరాత్,

ఆపై నాలాయని యిట్లనెను—స్త్రీ కొక్కడే పతియగుట ధర్మమనియు, బహుపత్నులు కలిగియుండుట పురుషునకు ధర్మమనియు, మునులచే బూర్వము నిర్ణయింపబడినది. స్త్రీ కొక్కడే పతియగుట లోకప్రసిద్ధము. ఆపత్కాలమందు నియోగవిధినిబట్టి భర్తకంటె నన్యుడైన పురుషుడు చెప్పబడెను. తృతీయపురుషసంబంధము ప్రాయశ్చిత్తావహము. చతుర్థపురుషసంబంధమున పతితురాలగును. పంచమపురుషసంబంధముచే బన్ధకి యగును. ధర్మమార్గ మిట్లుండుటచే నేను బహుపురుషులను గోరజాలను. లోకవిరుద్ధమైన యీదోషమునుండి నాకు విముక్తి యెట్లు?

"యది మే పతయః పంచ వర మిచ్ఛామి యాచితుమ్,
కౌమారం చ భవే త్సర్వ్వే స్సంగమే సంగమే చ మే

నాకాపంచపతిత్వము తప్పనియెడల— పరమేశ్వరా! నాయాచన నాలకించి యొకవర మనుగ్రహింపుము– ఏకైకపతి సాంగత్యమునందు నాకు గన్యాత్వసిద్ధి కలుగుచుండునట్లు వరమిమ్ము.

రుద్రఉవాచ—

"భోగా నాప్స్యసి సిద్ధించ యోగేన చ మహత్త్వతామ్.
అన్యదేహాన్తరేచైవ రూపభాగ్యగుణాన్వితా.
పంచభిః ప్రాప్య కౌమారం మహాభాగా భవిష్యసి,
గచ్ఛ గంగాం జలస్థా చ నరం పశ్యసి యం శుభే.
త మానయ మమాభ్యాశం సురరాజం శుచిస్మితే,
ఇత్యుక్తా విశ్వరూపేణ రుద్రం కృత్వా ప్రదక్షిణమ్
జగామ గంగా ముద్దిశ్య పుణ్యాం త్రిపథగాం నదీమ్॥

అప్పుడు పరమేశ్వరు డట్లేవరమిచ్చి నీవుజన్మాంతరమందు రూపభాగ్యగుణాన్వితురాలవై యేకైకపతిసాంగత్యములో కన్యాత్వమునే వహించుచు పంచపతులతో బూజ్యురాలవై యుందువని యనుగ్రహించి నీవిప్పుడు గంగానదిలో నుండి యక్కడ నీకు గోచరించిన దేవేంద్రుని నా యొద్దకు దీసుకొనిరమ్మని చెప్పగా నామె పరమేశ్వరునకు బ్రదక్షిణనమస్కారములు చేసి వెళ్ళెను.

ఆంధ్రభారతములో కూడ నిట్లున్నది— ఆది. అ7.

"అదియును అత్యుగ్రతపంబుసేసిన నీశ్వరుండు ప్రసన్నుండై యు వరంబు వేడుమనిన నక్కన్యక నాకుం బతిదానంబు బ్రసాదింపుమని యుత్కృష్టంబున నేనుమాఱులు వేడినం గరుణించి యీశ్వరుండు నీకు దేహాంతరంబున నేవురు పతు లగుదు రనిన నది, యిట్లనియె.—

ఆ. సతికి నొక్కరుండ పతిగాక యేడును
బతులు పలువు రగుట కతల గలదె
లోకనాథయిట్టి లోకవిరుద్ధంపు
వరము వడయ నమరవరద యొల్ల.

వ. అనిన దానికి రుద్రుం డిట్లనియె.

క. నావచనంబున నీక,
య్యేవురు పతులందు ధర్మ మెడపకయుండన్
గావున నిట్టి వరంబిం
దీవరదళనేత్రి యిచ్చితిని దయతోడన్.

వ. అనిన నది యట్లేని నయ్యేవురు పతులందును బ్రత్యేకసంగమంబు నను నాకు గౌమారంబును బతిశుశ్రూషాసిద్ధియు సౌభాగ్యంబునుం బ్రసాదింపవలయు ననిన రుద్రుండు దాని కోరిన వరంబు లెల్ల నిచ్చిగంగ తీరంబున నున్న యింద్రు నా యొద్దకు దోడ్కొని రమ్మని పంచిన.

ఇది నాలాయన్యుపాఖ్యానము. ఈయుపాఖ్యానమునుగూర్చి నీలకంఠాచార్యు లిట్లు వ్రాసియుండెను—

"యథా చ తే దదు"రిత్యాదినా"త్రిపథగాం నదీమ్"ఇత్యన్తో నాలాయన్యుపాఖ్యానగ్రన్థో౽ధ్యాయద్వయాత్మకః క్వచిత్పుస్తకే పఠ్యతే"

ఈయుపాఖ్యానగ్రంథ మొక్కపుస్తకమునందు గనబడుచున్నది. అని గ్రంథసందర్భ మిట్లుండ ప్రతివాదుల ధోరణి యట్లున్నదో చూడుడు—

—: ప్రతివాదిప్రసంగ పరామర్శము :—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది— "ఆంధ్రలిపిలో ముద్రితమగు సంస్కృతభారతమున నాలాయన్యుపాఖ్యానమాది

"ప్రసీద భగవన్ మహ్యం నమా ముత్సృష్టు మర్హసి,
అవితృప్తాస్మి బ్రహ్మర్షే కామానాం కామసేవనాత్."

విషయసుఖసేవనమున కలనడుటనుబట్టి నాకు విరక్తి కలుగ లేదు, నాథా! నన్ను విడువదగదు. అనుగ్రహింపుము. అని యామె ప్రార్థించినట్లు గ్రంథమునం దుండ, వీరు— "నీరతిచే నాగుహ్యేంద్రియము తృప్తినొందక బాధనొందుచున్నది. ఏరీతినైన తృప్తినొందింపు మని పతిని వేధించినది" అని వ్రాసి తమ వెకిలితనమును వెల్లడించి నారు ఇంతకంటె నింద్యమున్నదా? ఆమె మాటపై మహర్షి—

"యస్మా త్త్వం మాం తు నిశ్శంకా హ్యవక్తవ్యం ప్రభాషసే,
ఆచరన్తీ తపోవిఘ్నం తస్మా చ్ఛృణు వచో మమ."

నాతపమునకు విఘ్నకరమై నా కిప్పుడు అవక్తవ్యమైనట్టి మాటను నిశ్శంకగా (నివృత్తిమార్గ మవలంబించియున్నపుడు ప్రవృత్తి మార్గ ముపదేశించుట తగదను శంకలేక) చెప్పితివి. కనుక నీకు ముందుజన్మములో పంచపతిత్వము సంభవించు నని ప్రసంగించి నట్లున్నది. ఇందు 'అవక్తవ్యం ప్రభాషసే' అనుటలో గుహ్యేంద్రియతృప్తి కాలే దను మాటయే అవక్తవ్యమును దురభిప్రాయముతో ప్రతివాదిధోరణి హేయముగా నడచినది.

విద్యాగంధము లేనివారి కంతకంటె దూరముగా బుద్ధిపోవునా?

విరక్తావస్థలో సుఖ మేదియో, దుఃఖ మేదియో శుకయోగి చెప్పిన విషయము దేవీభాగవతమం దిట్లున్నది—

"విరక్త స్యాత్మరక్తస్య సుఖ మేకాన్త సేవనమ్,
ఆత్మానుచిన్తనం చైవ వేదాన్తస్య చ చిన్తనమ్,
దుఃఖం తదేత త్సర్వం హి సంసారకథనాదికమ్,"

దీనినిబట్టి విషయసుఖవిరక్తునకు విషయసుఖోపదేశము, నివృత్తి మార్గనిష్ఠునకు ప్రవృత్తిమార్గోపదేశము దుఃఖకరమగుటచేత విరక్తావస్థ

యందున్న మౌద్గల్యమహర్షికి అసమయమందు సంసారమునకు సంబంధించిన నాలాయనీవాక్యము దుఃఖహేతువగుటచే అవక్తవ్యమైనది. ప్రవృత్తిమార్గములో నామెను సంతోషపెట్టదలచిన మహర్షి "కథం త్వాం రమయామి హా" అని యామె నడిగినపుడు "పంచధా ప్రవిభక్తాత్మా రమయ త్వమ్" అను నాలాయనీవాక్యము అప్పటిప్రవృత్త్యవస్థలో వక్తవ్యమే యైనది. ఆవాక్యమే విరక్తావస్థనుబట్టి అవక్తవ్యమైనది. ఇది దీని పరమార్థము ఇది విద్వద్వేద్యమే కాని విమర్శక వేద్యము గాదు కనుకనే యీవిమర్శకుడు అట్టి యసభ్యప్రసంగమును జేసెను.

మౌద్గల్యునిచే, పంచపతిత్వము గలుగునట్లు శప్తురాలైన నాలాయని ఆలోకవిరుద్ధవిషయమును సవరణజేసికొనుటకై తపము జేసి తన శాపపంచపతిత్వమును అధర్మము గానట్లును, ప్రత్యేకపతిసాంగత్యమున గన్యాత్వము సిద్ధించునట్లును పొందిన యీశ్వరవరమునుబట్టి సవరణ జేసికొనినట్లు గ్రంథము బోధించుచుండ మౌద్గల్యునిచే పంచపతిత్వమునకు శప్తురాలై ఆపంచపతిత్వమునకె రుద్రునిగూర్చి తపముజేసినదని తేల్చుచు—

"మౌద్గల్యునిచే బంచపతిత్వమునకు శప్తురాలైన నాలాయని రుద్రునిగూర్చి పంచపతిత్వమునకై యేల తపముచేయవలసి వచ్చెనో" అని గ్రంథము నాక్షేపించిరి. ఇది కేవల మజ్ఞానము.

ఇట్లా నాలాయనీకథాస్వరూపమును వ్యత్యస్తము జేసి చూపి యటుపై స్వాభిప్రాయము నెట్లు ప్రకటించినారు?

"పైయుపాఖ్యానములను విమర్శించి చూడగా ద్రౌపది హిమవత్పర్వతోత్తరభాగమున మౌద్గల్యుని వరించి దుర్భగరోగిణి యగుటచే మౌద్గల్యునివలన దృష్టిలేక వెడలగొట్టబడి భరతఖండమున కేతెంచి యాజ్ఞద్రుపదుని సంతతికై హోమము జేసినట్టి

వాని) నాశ్రయించి ద్రుపదుని యజ్ఞవేదికకు గొనితేబడియుండు నని తోచుచున్నది.'' అని.

వెనుక చూపిన కథలో ద్రౌపది పూర్వజన్మములో నాలాయని యనియు, అనాలాయనికి భర్త మౌద్గల్యుడనియు, నుండగా ద్రౌపదికి భర్త మొదట మౌద్గల్యుడని ప్రతివాదులకు విమర్శించిచూడగా దోచినదట! "కుమారీచాపి పాంచాలీ వేదీమధ్యాత్సముత్థితా" అని యాజో పయాజు లనబడు మహర్షుల మంత్రశక్తివలన వేదీమధ్యమునుండి ద్రౌపది యుద్భవించినదని గ్రంథమునం దుండగా మొదటి భర్తయగు మౌద్గల్యునివలన తృప్తివడనట్టి ద్రౌపది వెడలగొట్టబడి భరతఖండమునకు వచ్చి యాజు నాశ్రయించి ద్రుపదుని యజ్ఞవేదికకు గొనితేబడి యుండు నని విమర్శించి చూడగా వీరికి దోచినదట ఆహా! విమర్శకుని చూపు ఇట్లుండు నన్న మాట. ఇట్టి చూపున్నవాడే విమర్శకు డన్నమాట! ఇట్టి విమర్శకుడే విద్యాధికుడైన పండితుడన్నమాట. ఇట్టివాడే ఉన్నదున్నట్లు చెప్పువాడన్న మాట. ఇట్టివాడే విద్యాధికులనిపించుకొనువారి కాదరపాత్రు డన్న మాట. ఇట్టివాని వ్రాతలే పాఠ్యగ్రంథము లన్నమాట! "శాంతంపాపమ్."

ఈవిమర్శకుని వెనుకకు బెట్టి మఱియొకవిమర్శకుని ధోరణి నవ లోకింతము——కోటమర్తి చినరఘుపతిరావుగారి సుయోధనవిజయము ఇది సీసమాలికగా వ్రాయబడినది. అందు దుర్యోధనముఖమున ద్రౌపదీపాండవ శ్రీకృష్ణవేదవ్యాసప్రముఖులు నిందింపబడి దుర్యోధను డభినందింపబడినాడు. అందు "తగ పతివ్రత యంచు ద్రౌపది నన రాదు. కులకాంత కాదట్టి కోమలాంగి" అని కవిత్వమల్లినారు. ఆవ్రాత నవలోకింతుము——

——:"నాలాయని కామజిత" యనుప్రసంగము—తన్నిరాకరణము:——

"పూర్వజన్మంబులో పొలతి మౌద్గల్యుని భార్య యామె నటంచు వ్యాసుడనడె! అప్పు డామౌద్గల్యు డధిక రోగంబున బాధ

లోఁ దుచునుండ పడతియపుడు, వానిని యుపచారవర్తనాదికముల
దనుపఁగ సంతసమున నతఁడు, నీవుకోరెడి వరం బిచ్చెద గైకొను
మని చెల్ప కాంతయు మదిని మెచ్చి, కామరూపంబును గ్రహించి
కామభోగంబుల నొనగూర్ప కాంత గోరె, మౌద్గల్యు డక్కాంత
మది గల్గు కోరిక లొనరించి తుష్టుడై యుర్వి విడిచె కాని కామిని
తృప్తిగాంచంగలేదష్ట కామ జిత యనంగ కాంతకు తగు, కులకాంత
కామంబు గెలువంగవలె గాక యీరీతి కామార్తి యింతి కగునె!!

ఈవిమర్శకుని వ్రాత గాథకు సంబంధించియే నడచినది. కాని 'మౌద్గల్యుడు తుష్టుడై యుర్వి విడిచెకాని కామిని తృప్తిగాచంగలేదు' అని వ్రాయుటలో ఉర్విని (భూమిని) మౌద్గల్యుడువిడిచెను కాని కామిని తృప్తిగాంచలేదు. అని యర్థము స్ఫురించి భర్తగతించిన పిమ్మట గూడ నామె కాముకురాలై యుండె నను దురభిప్రాయము గలిగించుచున్నది. కనుకనే ఆపుస్తకములోని, తొలిపలుకులో గరగిపాటిరామమూర్తి బి. యే. గారు— "పూర్వజన్మములో ద్రౌపది మౌద్గల్యుని భార్య. అతడు పరిచర్యలు చేయు ద్రౌపదిని వరము కోరుకొమ్మన కామభోగంబులం గోర నత డామె కోర్కె దీర్చి దివి కేగె. కాని యామె భోగంబులం దృప్తి గాంచలేదు" అనియే దానియర్థము వ్రాసినారు.

ఆంధ్రభారతములో "తృప్తుండై మౌద్గల్యుండు దానివిడిచి ఘోరతపంబు సేసి" అనియే యుండుటచే నాతడు భార్యను విడిచెను. గాని భూమిని విడువలేదు అందుచే "ఒనరించి తుష్టుడై యుర్విడిచె" అనికాక 'ఉవిద విడిచె' అనిప్రతివాదులు దిద్దుకొనవలయును.

దాంపత్యానుబంధమున మౌద్గల్యుడు కామోపభోగము లనుభవించి విరక్తుడై తపోనిష్ఠ నవలంబింప నట్టి విరక్తి యామెకు లేకుండె

ననియు, ఆంధ్రభారతోక్తి ననుసరించి "కాలవశంబున శరీరంబు విడిచి కాశిరాజను రాజర్షికిం బుట్టెను." అనియు తేలినది.

ఆమెకుగల కామోపభోగలాలసత్వము భర్తృసంబంధపురస్కృతమైనదిగాని యన్యవిధమైనది కాదు. అదియే కులకాంతాలక్షణము.

"ధర్మే చ, అర్థే చ, త్వయైషా నాతిచరితవ్యా. నాతిచరామి,"

అను శపథములో జరిగిన వివాహవిధినిబట్టి ఒక్క మోక్షములో దప్ప తక్కిన ధర్మార్థకామములనబడు త్రివిధపురుషార్థములందును సతీపతుల కవినాభావసంబంధము శాస్త్రీయము. అందు విషయసుఖరూపమైన కామము అనుభవింపబడుటకై వివాహాదిపూర్వకమైన భార్యాభర్తృభావము ధర్మానుబద్ధము.

ఈ సిద్ధాంతమునుబట్టి స్వేచ్ఛగా గాక ధర్మానుబద్ధముగా కామసుఖ మనుభవింపబూనువారు కామమును జయించినవారును స్వేచ్ఛగా కామసుఖ మనుభవింపబూనువారు, కామముచే జయింపబడినవారును అగుదురు. తనకవశ్యానుసరణీయమైన శాస్త్రీయమార్గములో తన కామమును నడుపుట కామమును జయించుట కాదా! తన కామముచే తన కనుసరణీయమైయున్న శాస్త్రీయమార్గమును విడిచి యపమార్గమున బడుట కామముచే జయింపబడుట కాదా!

కనుక మాద్గల్యముని పత్ని తన పతితోడనే కామసుఖానుభవము నపేక్షించి శాస్త్రీయమార్గము నందే కామమును నడిపినదగుటచే కామమును జయించినదియౌ కాని కామజిత(కామముచేజయింపబడినది) కాదు. అందుచే—

"కామజిత యనంగ కాంతకు దగు, కులకాంత కామంబు గెలువంగ వలెగాక యారీతి కామార్తి యింతికగునె"

అను వ్రాత పరాస్తమైనది.

—: "నాలాయని యుత్తరజన్మములో కామంబు దీర్చెడి కాంతునికై తపము జేసె" ననుప్రసంగము—తన్నిరాకరణము :—

"మఱియొండు జన్మంబు మానిని తా దాల్చి కామంబు దీర్చెడి కాంతుని కయి! యీశుని ప్రార్థింప నెపగెనా తుచ్ఛమౌ కామంబు దీర్చెడి కాంతునికయి! యేనాతి యీశుని ప్రార్థింప దేనాడు అందు లకై జన్మ లందరెవరు"

ఈప్రతివాదులు చూపిన యీజన్మపరంపర సంస్కృతభార తోక్తముకాకపోయినను ఆంధ్రభారతానుగుణమై యున్నందున నాగ్రంథమునుబట్టియె పరిశీలింతము—

"అది... కాలవంశంబున శరీరంబు విడిచి కాశిరాజను రాజర్షికిం బుట్టి పెరుగుచుం గన్యాత్వమున బెద్దకాలంబుండి తన దౌర్భాగ్యంబునకు నిర్వేదించి పతింగోరి పశుపతి నుద్దేశించి యుగ్రతపంబు సేయుచు న్నంత"(ఆంధ్రభా)

ఇచ్చట మౌద్గల్యపత్ని యగు నాలాయని మరచటి జన్మమున రాజర్షికి పుత్రికయై పుట్టి కన్యాత్వముతోడనే కాలముగడపుచు దురదృష్టము వలన వివాహముకాక పతినుద్దేశించి తపముచేసిన దని యున్నది.

ఈప్రతివాదులవ్రాతలో "కామంబు దీర్చెడి కాంతునికయి యీశుని ప్రార్థించిన" దని యున్నది. ఈకామప్రసక్తి ప్రతివాదిధోరణిలోనిది గాని యారాజర్షిపుత్రికాహృదయములో నున్నది గాదు. మూలమునకు విరుద్ధముగా నున్న వీరి యీవ్రాత హేయము.

"తుచ్ఛమౌ కామంబు దీర్చెడి కాంతునికయి! యేనాతి యీశుని ప్రార్థింప దేనాడు అందులకై జన్మ లందరెవరు"

అని ప్రతివాదులన్నట్లు ఈనాతికూడ అందుకై ప్రార్థింపలేదు. అందులకై జన్మింపనులేదు.

"భర్తా నాథో గురు ర్భర్తా దేవతా దైవతై స్సహ,
భర్తా తీర్థశ్చ పుణ్యం చ నారీణాం నృపనందన.!!

అను పద్మపురాణవచనానుసారము, ప్రభుగురుదేవతాతీర్థపుణ్యస్వరూపు డగు భర్తయొక్క ప్రాప్తి స్త్రీలకు ముఖ్యముగా విహిత మగుటచే నామె పతికై తపముచేయుట అక్రమ మనువా డుండడు. అందుచే నామె పూజ్యురాలు. పైన జూతము—

"ఈకాంత ప్రార్థన లీశుండు వినుచు సాక్షాత్కరింప మగువ సంభ్రమమున పతి పతి యని తాను పలుసార్లు పలవించె భగవంతు దర్శనభాగ్య మబ్బ మోక్షంబు గోరక మఁగుదయు కామార్తయై తాను పలవింప నగునె"

భగవంతుడు ఆకాంత ప్రార్థన విని సాక్షాత్కరించెనట. ఆమె పతి పతి యని పలుసార్లు పలికినదట. భగవంతుని దర్శనమైనపుడు మోక్షమును గోరక పతినిగోరుట కామార్తురాలిలక్షణము కాదా అని వీరి యాక్షేపము. అసలు స్త్రీకి ఉపాస్యదేవత పతి. ఆమె ప్రార్థించిన దాపతికొరకు. ఈశ్వరుడు సాక్షాత్కరించినది ఆమె యొక్క ఆ ప్రార్థనను సఫలముచేయుటకు. ఇట్టిస్థితిలో సాక్షాత్కరించిన యీశ్వరుడు నీసంకల్ప మేమని యడిగినపుడు పతి యని చెప్పవలయునా? మోక్ష మని చెప్పవలయునా? భగవంతుని దర్శనము కలిగినవారందరు మోక్షమునే కోరినారా? పతికొరకు భగవంతు నారాధించిన సాధ్వి ధర్మాత్మురాలా? కామార్తురాలా? కనుకనీ యాక్షేపము నిరస్తమైనది.

'శివుడు దయ గల్గి తన్వికి దర్శనం బిచ్చినచిత్తశాంతంబునుచేర్చుకొనక, సంభ్రమింపదగునె సాక్షాత్కరించిన శివుడీమెమాటలు చేరివినడా''

శివుడు దయతో దర్శనమిచ్చినపుడు చిత్తశాంతి వహింపక సంభ్రమింపదగునా? అని యాక్షేపము. ఐతే ఆమెకు చిత్తశాంతి

కలదో లేదో గ్రహింపగలవాడు సాక్షాత్కరించి యామెకు గోరినవర మిచ్చిన ఆశివుడా? ఈచినరఘుపతిరావుగారా?

"సాక్షాత్కరించిన శివు డీమె మాటలు చేరి వినడా?" అనుచున్నారు. శివుడు సాక్షాత్కరించుటచేత నామె మాటలు వినినట్లా? ఆమె మాటలు వినుటకై సాక్షాత్కరించినట్లా? సర్వజ్ఞుడైన శివుడు, అలభ్యమైన తన సాక్షాత్కారమును ఏసాధ్వికి గలుగజేసెనో ఆసాధ్వి యోగ్యతను గుర్తింపలేకపోవుట, ప్రతివాదుల దురదృష్టము. పైన జూతము—

"కామాంధురాలైన కాంత యీయామె యటంచు వనితకు వలసిన పతుల నొసగె! దానిచే మీరలు తన్వికి పతులైరి కాంత కామార్తిని గడనబెట్టి నమచు వ్యాసుడు దెల్పె నతివ చరిత్రంబు".

ఇచ్చట, ఆమె కామాంధురా లని శివుడు గ్రహించి యామెకు కావలసిన పతుల నొసగుటనుబట్టి యామె కామార్తిని తొలగించుటకై మీరామెకు పతులై రని పాండవులతో వ్యాసుడు చెప్పియున్నట్లు వ్రాయుచున్నారు. మన మిప్పుడు పరిశీలింపవలసిన దేమనగా ఆమె కామాంధురా లని శివుడు పంచపతిత్వవర మామె కిచ్చెనని వ్యాసుడు చెప్పినట్లున్నదా? 'పతిం దేహి' అనుమాటను ఏకపతితాత్పర్యముతోడనే అయిదుసార్లు ప్రయత్నముగా ననుటనుబట్టి యామెకు పంచపతిత్వవర మిచ్చెనని వ్యాసుడు చెప్పినట్లున్నదా? అనువిమర్శము. ఆవ్యాసవాక్యము లివి —

"ఆసీ త్తపోవనే కాచి దృషేః కన్యా మహాత్మనః,
విలగ్నమధ్యా సుశ్రోణీ సుభ్రూ స్సర్వగుణాన్వితా,
కర్మభి స్స్వకృతైః స్సా తు దుర్భగా సమపద్యత,
నాధ్యగచ్ఛ త్పతిం సా తు కన్యా రూపవతీ సతీ

తపస్తప్త్వా మథారేభే పత్యర్థమసుఖా తతః,
తోషయామాస తపసా సా కిలోగ్రేణ శంకరమ్.
తస్యాస్స భగవాం స్తుష్ట స్తా మువాచ యశస్వినీమ్,
వరం వరయ భద్రం తే వరదోఽస్మీతి శంకరః.
అథేశ్వర మువాచేద మాత్మన స్సా వచో హితమ్,
పతిం సర్వగుణోపేత మిచ్ఛామీతి పునః పునః.
తామథ ప్రత్యువాచేద మీశానో వదతాం వరః,
పంచ తే పతయో భద్రే భవిష్యన్తీతి భారతాః.
ఏవ ముక్తా తతః కన్యా దేవం వరద మబ్రవీత్,
ఏక మిచ్ఛా మ్యహం దేవ త్వత్ప్రసాదా త్పతిం ప్రభో.
పునరేవాబ్రవీ ద్దేవ ఇదం వచన ముత్తమమ్,
పంచకృత్వ స్త్వయా హ్యుక్తః పతిం దేహీ త్యహం పునః.
దేహ మన్యం గతాయాస్తే యథోక్తం తద్భవిష్యతి,
ద్రుపదస్య కులే జజ్ఞే సా కన్యా దేవరూపిణీ.
నిర్దిష్టా భవతాం పత్నీ కృష్ణా పార్షత్యనిన్దితా,
పాంచాలనగరే తస్మా న్నివసధ్వం మహాబలాః."

(ఆది- అ169)

తపోవనమందు శుభలక్షణములు గలిగి గుణవతియైన ఋషి కన్య యుండెను. ఆమె రూపవతియై యుండియు దురదృష్టముచేత వివాహము కాక పతికొరకు శంకరునిగూర్చి తపముచేయ సంతుష్టుడై శంకరుడు సాక్షాత్కరించి వరమ్చెదను. కోరు మని చెప్పెను. అప్పు డామె సర్వగుణాన్వితుడగు పతిని గోరుచున్నా నని పునః పునః పలికెను. అప్పుడు శంకరుడు నీకు భరతవంశోద్భవులగు పంచపతులు ప్రాప్తింతు రని చెప్పెను. అది విని యామె నీయనుగ్రహముతో నేనొక్క పతినే కోరుచున్నాను. అని నంతట శంకరుడు 'పతిం దేహి'

అని నీవైదుసారులు పలుకుటనుబట్టి నీకట్టి వరమిచ్చితిని. నీకాపంచపతిత్వము పైజన్మమందు లభించును. అని చెప్పెను. అట్టి వరమును పొందిన ఆఋషికన్య ద్రుపదపుత్రికయై జన్మించినది. మీకు పత్నియై నిర్దిష్టయైనది మీరు పాంచాలనగరమున కేగియుండుడు. అని యేకచక్రపురమం దున్న పాండవులతో వ్యాసమహర్షి చెప్పెను.

ఈచెప్పిన మాటలలో ఋషికన్యకకు ఏకపతివాంఛయేగాని బహుపతివాంఛ యెంతమాత్రము లేదని స్పష్టీకరింపబడినది. దీనివలన ఆమెను తమనైజమును బట్టి విమర్శకమ్మన్యులు కామాంధురాలనుటయె గాని యామె కామాంధురాలు కాదని తేలినది.

మూలములో లేని విషయ మున్నట్లుగా వ్రాసి యాపుణ్యావని తను గామాంధురా లని ప్రకటించుట నీతిబాహ్యము.

కామాంధురాలు తపము చేయునా? జన్మాంతరములో పంచపతిప్రాప్తి యగు ననునది కామాంధురాలి కిచ్చెడి వర మగునా? నేనొక్కపతినే కోరుచున్నా ననునది కామాంధురా లగునా? కనుక నీవ్రాత హేయము.

—:దుర్భగశబ్దముపై మ భా. చ. కారుల అసభ్యప్రసంగము—
తన్నిరాకరణము:—

"ఋషికన్య దుర్భగ యనినాడు. దుర్భగ యనగా దుష్టమైన గూఢావయవము కలది యని యర్థమగును. నాలాయన్యుపాఖ్యానములోగూడ (ద్రౌపది పూర్వరూపమున నాలాయని) నాలా యని మౌద్గల్యుని నారహాస్యావయవము నీరతిచే దృప్తినొందలేదనుటచే నాతడు నీకైదుగురు భర్త లగుదురుగాక. అని శపించెనని కలదు. స్త్రీరోగములలో గొందరకు గూఢావయవ ముష్ణోత్తుంగ నుండుననియు రతియందసంతృప్తి కలవారై బహుపతిత్వము గోరు

దురనియు ఆరోగనివృత్తిని విద్యుత్సాధనములచే వైద్యులు చేతురనియు కలదు. అట్టిరోగమే ద్రౌపదికి పూర్వరూపమున నుండెను. నని తలపవలసియున్నది "(పు. 155)

ఈప్రతివాదులు గ్రహించిన దుర్భగము, పూర్వోక్తవ్యాపవాక్యగ్రంథములో "కర్మభి స్స్వకృతై స్సా తు దుర్భగా సమపద్యత" అనువాక్యములోనిది దీని యర్థ మాంధ్రభారత మందిట్లున్నది—

సీ. తా నొక్కమునికన్య తనకర్మవశమున
బతిబడయంగ నోపక యుపేత
దౌర్భాగ్యయై ఘోరతప మొనరించిన ...

ఇట్లు దుర్భగాశబ్దమునకు ఉపేతదౌర్భాగ్యయై(దురదృష్టవతియై) అనివ్రాసిన ఆంధ్రభారతకారునియర్థము, విమర్శకమ్మన్యునకు రుచించునా? శ్లోకములో "దుర్భగా సమపద్యత, నాధ్యగచ్ఛత్పతిమ్" అని దుర్భగయై పతిని బొందలేకపోయినదని చెప్పబడినది. ఆమెకు చెప్పిన విశేషణములు:— మహాత్మనః ఋషేః కన్యా, విలగ్నమధ్యా, సుశ్రోణీ, సుభ్రూః, సర్వగుణాన్వితా రూపవతీ, సతీ, అనునవి. ఇవి పతిప్రాప్తికై దృష్టకారణసామగ్రి యీయామెయందు సమగ్రముగా నున్నదని వెల్లడించుచున్నవి. ఇట్లుండియు దురదృష్టముచే పతిని బొందలేకపోయిన దని శ్లోకతాత్పర్యము.

ప్రతివాదులు చెప్పిన యర్థము గ్రహించినయెడల బహుపతిత్వమును గోరు రోగము గలఆమె పతిని బొందలేదు. ఉగ్రతపమును చేసినది. నాకొక్కపతియే కావలె నన్నది. అను విషయ మంతయు నసంగత మగును.

ఇంకొకటి—వెనుక నాలాయనున్యపాఖ్యానపరిశీలన సందర్భములో జూపబడిన యీప్రతివాదివ్రాతలో— "ద్రౌపది మౌద్గల్యుని వరించి

దుర్భగరోగిణి యగుటచే తృప్తి లేక వెడలగొట్టబడి యాజు నాశ్రయించి ద్రుపదుని యజ్ఞవేదికకు గొనితేబడియుండు నని విమర్శించి చూడగా తోచుచున్నది'' అనియున్నది.

ప్రస్తుతపువ్రాతలో— "దుర్భగరోగము ద్రౌపదికి పూర్వరూపమున నుండె నని తలపవలసియున్నది." అనియున్నది.

ఈవ్రాతలకు గల పరస్పరవిరోధము మాట అటుండనిండు. వీరినిర్ణయము 'ద్రౌపదియే దుర్భగరోగిణి' అని దీనికి ప్రమాణము—

"అసీ త్తపోవనే కాచి దృషేః కన్యా మహాత్మనః,
......సా తు దుర్భగా సమపద్యత"

అను వాక్యముకద! ఇది ద్రౌపది దుర్భగ యని చెప్పుచున్నదన్నమాటా! ఐతే—

"కుమారీ చాపి పాంచాలీ వేదీమధ్యాత్సముత్థితా,
సుభగా దర్శనీయాంగీ స్వసితాయతలోచనా".

(ఆది. 1167)

అనువాక్యము ద్రౌపది సుభగ యని చెప్పుచున్నదే. కనుక ద్రౌపది సుభగయేగాని దుర్భగ కాదు. దుర్భగ యని చెప్పబడినది, ఋషికన్యయె కాని ద్రౌపదికాదు. ఆదుర్భగశబ్దమునకు దురదృష్టమర్థము కాని ప్రతివాదికి తోచిన యర్థము కాదు. సౌభాగ్యశబ్దప్రకృతి సుభగశబ్దము దౌర్భాగ్యశబ్దప్రకృతి దుర్భగశబ్దము. కనుక ప్రతివాది దసభ్యప్రసంగమగుటచే హేయము.

—: "పతివ్రత యని ద్రౌపది ననరా"దను ప్రసంగము—
తన్నిరాకరణము :—

"ఇహాలోకసౌఖ్యంబు నింతి వీడగ లేక మూడుజన్మంబులు ముగుద దాల్చె! ఇంద్రియంబుల గెల్వ నెరుగని యీకాంత మీాతోడ

పొత్తుండి మెలగగలదె ! ఈలేమ కామార్తి నెరుగదు తనహద్దు విశ్వ నింద్యంబుగా వెలయుచుంట ! అంత కామార్త యూ అతివ మానస మెప్పు వ్యభిచరింపకుండు టరుదుగాన! తగ పతివ్రతయంచు ద్రౌపది ననరాదు. కులసతి గాదట్టి కోమలాంగి."

ఇచ్చట, ద్రౌపది యిహలోకసౌఖ్యము వీడలేక మూడుజన్మము లెత్తిన దని యొక యాక్షేపము. వీరి కొకింత బోధింతము.—

పరమార్థమునకు బాధకమైన ఇహలోకసౌఖ్యము త్యాజ్యమనియు, పరమార్థమునకు బాధకము కానట్టి యిహలోకసౌఖ్యము పూజ్యమనియు శాస్త్రమర్యాద.

భర్తా నాథో గురు ర్భర్తా దేవతా దైవతై స్సహ,
భర్తా తీర్థశ్చ పుణ్యాం చ నారీణాం నృపనందన.

అను వచనానుసారము స్త్రీకిభర్తృసేవయే పరమార్థసాధనము. భర్తృసే ..మూలకమైన ఐహికసుఖము స్త్రీకి పూజ్యము. కనుక భర్త్రధీనురాలై యుండి పూజ్యమైన యైహికసుఖమును గోరినట్టి సాధ్విని, ఇహలోకసౌఖ్యము వీడలేకపోయిన దని యాక్షేపించుట అజ్ఞానము.

"మూడు జన్మంబులు ముగుద దాల్చె" నట! ఇహలోకసౌఖ్యము వీడలేకనట! ఆమూడుజన్మములు ఆంధ్రభారతానుసారము మౌద్గల్యమునిపత్ని, రాజర్షిపుత్రి, పాండవపత్ని అనునవి. అందు మొదటిది.—

"ఇది వొల్లి నాలాయని యైన యింద్రసేన యనంబరగిన పరమపతివ్రత. మౌద్గల్యుండను మహామునికి భార్య యయి యమ్మునిం గుష్ఠవ్యాధితత్త్వగస్థిభూతశరీరు, వయోవృద్ధు, వలీపలితధరు, దుర్గంధవదను, దుఃఖజీవు, నతికోపను, విశీర్యమాణనఖత్వచుం బరమభక్తి నారాధించి తదుచ్ఛిష్టంబు గుడుచుచు"

కాలము గడిపిన పరమపతివ్రతాజన్మము. రెండవది—

"కాశీరాజను రాజర్షికిం బుట్టి పెరుగుచు గన్యాత్వమున బెద్ద కాలంబుండి పతింగోరి పశుపతి నుద్దేశించి యుగ్రతపంబు సేయుచు"

కాలము గడిపిన యుత్తమజన్మము మూడవది- ద్రుపదుని యజ్ఞవేదికనుండి యావిర్భవించి పాండవధర్మపత్నియై విరాజిల్లినద్రౌపదీజన్మము. అస్వతంత్రురాలై యొక భర్త యాజ్ఞకు లోనై పడియుండ దలచి పతికొరకు జన్మము ధారపోసి తపముచేసి పరమేశ్వరానుగ్రహపాత్రియై వెలసిన సాధ్విని, ఇహలోకసౌఖ్యమును వీడలేకపోయిన దనుట అజ్ఞానము. ఆమె ఇంద్రియంబుల గెల్వ నెరుగని దనుటగూడ నట్టిదే.

కుష్ఠవ్యాధిదుర్గంధాదియుక్తుడైన భర్తను ఉచ్ఛిష్టాన్నభక్షణాదిశుశ్రూషణములచే ననన్యసాధారణముగా నారాధించినట్టిది, యింద్రియంబుల గెల్వ నెరుగనిదియా? "జలానిలాహారయై, నిరాహారయై, యేకపాదంబున నిల్చి పంచాగ్నిమధ్యంబున నుండి పశుపతి నుద్దేశించి యత్యుగ్రతపము చేసినట్టిది ఇంద్రియంబుల గెల్వ నెరుగనిదియా?

ఇంద్రియపారవశ్యమున గాక పరమేశ్వరవరరూపమగు విధిబలమున పంచపతిత్వమును ధర్మానుబద్ధముగా వహించి సకలమునిజనసంస్తుతయై, పూర్వజన్మశుభవాసనావాసితాంతఃకరణయై, అయోనిజయై, లోకోత్తరమహిమాన్వితయై విలసిల్లిన పాండవధర్మపత్ని యింద్రియంబుల గెల్వ నెరుగనిదియా?

"ఈలేమ కామార్తి యెరుగదు తనహద్దు విశ్వనింద్యంబుగా వెలయుచుంట" అట! విశ్వనింద్యముగా వెలయుట అనగా నేమి? ద్రౌపదికి పంచపతిత్వము విశ్వనింద్యమనియా? ఆమె పంచపతిత్వము విశ్వనింద్యమనుట- ఆమెనాకట్టి సంకల్పములేదు. అది ధర్మవిరుద్ధము. అని చెప్పుకొనుచుండ, నీకు నేనొసగెడి పంచపతిత్వము ధర్మ్యము, నీకు

ప్రత్యేకపతిసాంగత్యమున కన్యాత్వ మనుగ్రహించితిని, అని వరమిచ్చిన పరమేశ్వరుడువిశ్వనింద్యుడనుటే. కనుక పరమేశ్వరప్రసాదితమైన ఆమె పంచపతిత్వము విశ్వవంద్యముగాని విశ్వనింద్యముగాదు.

ఇట్టిస్థితిలో "ఆమె కామార్తురాలు, ఆమె మానసము వ్యభిచరింపకుండు టరుదు, ద్రౌపది పతివ్రత యనరాదు, కులసతిగా నట్టి కోమలాంగి" ఇత్యాదిప్రతివాదిదురుక్తులు నింద్యములు.

ఈప్రతివాదిధోరణి—

యథా స్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనో జనః,
దేవ్యా అపి హి వైదేహ్యా స్సాపవాదో యతో జనః.
రక్షోగృహస్థితి ర్మూలం వహ్నిశుద్ధౌ త్వనిశ్చయః,

అని యుత్తరరామచరిత్రములో భవభూతి మహాకవి చెప్పినట్లున్నది. పాతివ్రత్యమున కాదర్శమై పరమపవిత్రురాలైన సీతామహాదేవియెడల జనుడు దోషదృష్టి గలిగియున్నపుడు స్త్రీల పాతివ్రత్యము పట్ల జనుడు దౌర్జన్యముగలిగియుండుననుట కభ్యంతరమున్నదా?

నాడు సీతామహాదేవికి సంభవించిన రాక్షసగృహస్థితి ఆదోష దృష్టి కాధారమై నాడామె ప్రదర్శించిన అగ్నిశుద్ధి గణ్యత లేని దయి పోయినది. ఇదియే దౌర్జన్యలక్షణము.

లోకములో తా నే విషయమును నూహించునో దాని కసాధారణ కారణముండవలయును. దానికి బాధకప్రమాణము లేకుండవలయును. ఇట్టిస్థితిలో పరస్త్రీని బలాత్కరించిన చచ్చెద వని రావణాసురున కున్న శాపములబట్టి సీతామహాదేవికి ప్రాప్తించిన రాక్షసగృహస్థితి ఆమె యందూహింపబడు పాతివ్రత్యహానికి అసాధారణకారణము కానేరదు. దాని కగ్నిశుద్ధిరూపమైన బాధకప్రమాణము లేకపోలేదు ఆహా!

లేనిదోష ముద్ఘోషించుట దుర్జనకృత్యము. వ్యక్తిప్రభావము గణింపక లేనిదోష ముద్ఘోషించుట అంతకంటె దుర్జనకృత్యము. అసాధారణకారణము గ్రహింపక వ్యక్తిప్రభావము గణింపక లేనిదోషముద్ఘోషించుట అంతకంటె దుర్జనకృత్యము. బాధకప్రమాణము విశ్వసింపక అసాధారణకారణము గ్రహింపక వ్యక్తిప్రభావము గణింపక లేనిదోష ముద్ఘోషించుట అంతకంటె దుర్జనకృత్యము.

ద్రౌపదికి పంచపతిత్వము ధర్మవిరుద్ధ మగు నని భావించిన ద్రుపదమహారాజుతో—

"నను వక్ష్యామి సర్వేషాం పాంచాల శృణు మే స్వయమ్,
యథాఽయం విహితో ధర్మో యతశ్చాఽయం సనాతనః."

అని యుపక్రమించి చెప్పిన వేదవ్యాసభగవానుఁడు— ధర్మవిరుద్ధముగాదు. ధర్మ్యమే యని పూర్వవృత్తాంతముతో నిరూపించి, ద్రుపదునకు దివ్యదృష్టి ననుగ్రహించి ద్రౌపదీపాండవుల పూర్వరూప సందర్శనభాగ్య మాతనికి గలిగించి ఆపంచపతిత్వ మామెకు ధర్మవిరుద్ధముగాదను నిరూఢిని ప్రత్యక్షసిద్ధము గావించుటచేతను, అదిపరమేశ్వరవరప్రాప్తమగుటచేతను ధర్మ్యమైన పంచపతిత్వము "ద్రౌపదిపతివ్రతకాదు" అను ప్రతివాదుల యూహకు అసాధారణకారణము కాదు.

ఆపంచపతిత్వవర మిచ్చునపుడు—
"అన్యదేహాంతరే చైవ రూపభాగ్యగుణాన్వితా,
పంచభిః ప్రాప్య కౌమారం మహాభాగా భవిష్యసి."

అని నీవు ప్రత్యేకపతిసాంగత్యమున కన్యాత్వమును వహించుచు పూజ్యురాలవై యుందు వని పరమేశ్వరుడు ప్రతిపాదించుటచే నట్టి పరమేశ్వరుని యమోఘవచనము "ఆమె పతివ్రతకా"దను ప్రతివాదుల యూహకు బాధకప్రమాణమై యున్నది.

నాడు కురుసభలో దుశ్శాసనుడు చేయు వస్త్రాపహరణదుష్కార్యములో ద్రౌపదీమహత్త్వమే యీతని దుండగములు నణచివేయు నని భీష్మాదు లుపేక్షించియుండ అనంతవస్త్రావిర్భావమున దన్ను దానే కాచికొనిన ద్రౌపదియొక్క పాతివ్రత్యప్రభావము జగద్విదితమయి యున్నది.

ఇట్లుండ తమయూహకు అసాధారణకారణ మరయక, బాధక ప్రమాణము విశ్వసింపక, ద్రౌపదీప్రభావము గణింపక 'ద్రౌపది పతివ్రత గాదు' అని ప్రతివాదులుచేయు ప్రసంగము సీతామహాదేవినిగూర్చి నాడు చేసిన రజకప్రసంగమువంటిదే కనుక ప్రాజ్ఞులకు పరిత్యాజ్యము.

ఇంతవరకు ద్రౌపదీపూర్వజన్మవృత్తాంతముపవిత్రమైనదని ప్రతివాదిప్రసంగనిరాకరణపూర్వకముగా నిరూపింపబడినది. ఇక ద్రౌపదీ జన్మవృత్తాంతము నిరూపింపబడుచున్నది—

—: ద్రౌపదీజన్మవృత్తాంతము :—

ద్రుపదమహారాజు తాను ద్రోణునకు జేసిన యవమానమును బట్టి దనకు ద్రోణాచార్యులశిష్యులచే జేయించిన న్యూనతకు బరితపించి ద్రోణాంతకుడగు పుత్రు నుద్దేశించి బ్రహ్మనిష్ఠులును మంత్రద్రష్టలును అగు యాజోపయాజు లను మహర్షుల నాశ్రయించి శ్రౌతాగ్ని సాధ్యమై పుత్రోత్పత్తిసాధనమై యున్న కర్మవిశేషమును యాజోపయాజుల ఆర్త్విజ్యమున గొంతకాలము జరిపినపుడు ధృష్టద్యుమ్నుడు యగ్నికుండమునుండియు, ద్రౌపది వేదీమధ్యమునుండియు నావిర్భవించిరి. ఈవిషయమిట్లు చెప్పబడినది—

"భారద్వాజస్య హన్తారం సోఽభిసన్ధాయ భూపతిః,
ఆజహ్రే తత్తథా సర్వం ద్రుపదః కర్మసిద్ధయే.
యాజస్తు హవన స్యాన్తే దేవీ మాజ్ఞాపయ త్తదా,

ప్రేహి మాం రాజ్ఞి పృషతి మిథునం త్వా ముపస్థితమ్."
వ్యా-ప్రేహి=ప్రకర్షేణ శీఘ్రమేహి; హవి ర్గ్రహీతు మితి శేషః॥

ద్రోణాంతకుడైన పుత్రునికొఱకు ద్రుపదుడు సంకల్పించి కర్మసిద్ధికై సర్వము నిర్వహించెను. హోమాంతమందు భవిష్యద్విషయగ్రహణశక్తిగల యాజుడు-నీకు స్త్రీపురుషయుగ్మము జన్మింపగలదు. హవిస్సును గ్రహించుటకై శీఘ్రముగా రమ్మని ద్రుపదభార్య నాహ్వానింపజేసెను. అప్పుడు—

"అవలిప్తం ముఖం బిభర్మి దివ్యాన్ గన్ధాన్ బిభర్మి చ,
సుతార్థే నోపలబ్ధాస్మి తిష్ఠ యాజ మమ ప్రియే."
వ్యా—అవలిప్తం=దూషితం; లాలాదినా; అప్రక్షాలితత్వాదితిభావః.
"అవలేప స్తు గర్వే స్యా ల్లేపనే దూషణేపి చ" ఇతిమేదినీ.
గంధాన్, అంగరాగాదిజాన్, అస్నాతాస్మీతి భావః। "యాదత్తో
భావతే తస్యై శ్యావదన్, యా స్నాతి తస్యై అప్సు మారుకః"
ఇత్యాద్యుక్త్వా "త్రిరాత్రం వ్రతం చరేత్" ఇతి విహితా
వస్పృశ్యాధర్మావేతౌ, తదేవాహ- నోపలబ్ధాస్మి= ఉపలబ్ధుం
స్ప్రష్టుం యోగ్యా నాస్మి। తస్మాన్మలవద్వాససా న సంవదేత
ఇతి తయా సహ సంవాదస్యాపి నిషేధాత్।
"అతో హేతోః హే యాజ! మమ ప్రియే ఇష్టే, సుతార్థే సుతి
రూపే ప్రయోజనే. తిష్ఠ కాలం ప్రతీక్షస్వేత్యర్థః"

నేను రజస్వలనై అస్పృశ్యురాలనై యుంటిని, స్నానపర్యంతము నిరీక్షింపవలసినది. అని ద్రుపదభార్య వార్త నంపెను.

యాజ ఉవాచ—

"యాజేన శ్రపితం హవ్య ముపయాజాభిమన్త్రితమ్,
కథం కామం న సందధ్యా త్సా త్వం విప్రేహి తిష్ఠ వా".

టీ. "క్షేత్రం రేతస్సేకం చ వినాఽఽనయోస్సామర్థ్యా న్మిథున ముత్ప త్స్యత ఇత్యర్థః. విప్రేహి మారం వా గచ్ఛ! తిష్ఠ వా ప్రయోగ విధిస్తు న విలంబం సహత ఇత్యర్థః!

అప్పుడు యాజుడు ఇట్లనెను— యాజునిచే సిద్ధపరుపబడి ఉప యాజునిచే నభిమంత్రితమై యున్న యీహవ్యము సంకల్పసిద్ధిని గావింపకుండునా? నీవెట్లున్నను సరియే, ప్రయోగవిధి విలంబమును సహింపదు శుక్రశోణితసంబంధముతో బనిలేకయే మాసామర్థ్యముచే స్త్రీపురుషయుగ్మ ముద్భవింపగలదు. అని.

"ఏవ ముక్త్వా తు యాజేన హుతే హవిషి సంస్కృతే,
ఉత్తస్థౌ పావకా త్తస్మా త్కుమారో దేవసన్నిభః.
జ్వాలావర్ణో ఘోరరూపః కిరీటీ వర్మ చోత్తమమ్,
బిభ్ర త్సఖడ్గ స్సశరో ధనుష్మాన్ వినదన్ ముహుః.
కుమారీ చాపి పాంచాలీ వేదీమధ్యా త్సముత్థితా,
సుభగా దర్శనీయాంగీ స్వసితాయతలోచనా.
శ్యామా పద్మపలాశాక్షీ నీలకుంచితమూర్ధజా,
తామ్రతుంగనఖీ సుభ్రూ శ్చారుపీనపయోధరా.
మానుషం విగ్రహం కృత్వా సాక్షా దమరవర్ణినీ,
నీలోత్పలసమో గన్ధో యస్యాః క్రోశా త్ప్రధావతి.
యా బిభర్తి పరం రూపం యస్యా నాస్త్యుపమా భువి,
దేవదానవయక్షాణా మీప్సితాం దేవరూపిణీమ్.
తాం చాపి జాతాం సుశ్రోణీం వాగువాచాఽశరీరిణీ,
సర్వయోషిద్వరా కృష్ణా నినీషుః క్షత్రియాన్ క్షయమ్.
సురకార్య మియం కాలే కరిష్యతి సుమధ్యమా,
అస్యా హేతోః కౌరవాణాం మహ దుత్పత్స్యతే భయమ్",

(ఆది. అ 1167)

యాజు డిట్లు చెప్పి సంస్కృతమైన హవిస్సును హోమము చేసినతోడనే కిరీటకవచాలంకృతుడై, ఖడ్గబాణధనుర్ధరుడై, జ్వాలావర్ణుడై యున్న పురుషుడు గర్జించుచు అగ్నినుండి యుద్భవించెను.

సర్వావయవనిరుపమానసౌందర్యము గలిగి, క్రోశపర్యంతవ్యాప్తమైన శరీరసౌగంధ్యము గలిగి, సాక్షాత్స్వర్గలక్ష్మియొక్క మానుషవిగ్రహమై యున్న స్త్రీరత్నము వేదీమధ్యమునుండి యుద్భవించెను. అప్పుడామె నుద్దేశించి అశరీరవాణి యిట్లు వినబడినది. ఈమె క్షత్రియక్షయమునకు నిమిత్తమై సురకార్యనిర్వాహణము జేయును. ఈమె నిమిత్తమున కౌరవులకు మహాభయ ముద్భవించును. అని.

ఇట్లు దివ్యదృష్టిచే భవిష్యద్విషయము దెలిసికొని, సంకల్పించిన పుత్రు డొక్కడే గాక పుత్రిక గూడనుద్భవించుచున్నదని చెప్పి, తదనుగుణముగ హవిస్సును మంత్రసంస్కృతము చేసి, నీవు వచ్చి యీ హవిస్సును బరిగ్రహింపు మని ద్రుపదపత్నికి దెలిపి ఆపై యామెవచ్చుట కవకాశము లేనిసమయమై యున్నదని తెలుపుటను బట్టియు, ప్రయోగవిధి విలంబమును సహింపనిదగుటనుబట్టియు వెంటనే ఆ హవిస్సును అగ్నియందే యాజుడు హోమము జేయగా నమోఘమైన ఆ హవిస్సును బట్టి అయోనిజులై ద్రౌపదీధృష్టద్యుమ్ను లుద్భవించి రని యార్షవచనములు బోధించుచున్నవి. ఇక నీవిషయమై ప్రతివాదిప్రసంగముల నవలోకింతము—

—: ద్రౌపదీధృష్టద్యుమ్నుల జన్మములపై మహాభారత రహస్యకర్తల ప్రసంగము—తన్నిరాకరణము :—

రహస్యకర్తల వ్రాత యిట్లున్నది. "ఇతడు (ధృష్టద్యుమ్నుడు) అగ్నిగుండమున జన్మించెనని మహాభారతములో నున్నది. కాని ద్రోణసంహారమే ప్రయోజనముగా నగ్నియం దయోనిజుడై

జన్మించిన ధృష్టద్యుమ్నుడు యుద్ధములో ద్రోణుని జయించి వధించి యుండవలెను. అట్లు గాకితడు అస్త్రసంన్యాసము గావించి యోగశక్తిచే ప్రాణములు విడిచిన ద్రోణశవకంఠమును మాత్రము ఖండించియున్నాడు. ద్రోణవధ కితడునిమిత్తమాత్రుడై యున్నాడుగాని యితనివలన నైన దేమియు లేదు. ఇంతమాత్రమున కితడగ్నియందయోనిజుడై యేల జన్మించెనో తెలియకున్నది.

(2) మరియు నగ్నికుండమునందు దివ్యధనుర్బాణములతో జన్మించినవానికి తిరిగి ద్రోణధనుర్విద్యోపదేశ మేల? సకలవిద్యాపరిపూర్ణుండై జన్మించిన శ్రీకృష్ణుడు తిరిగి సాందీపుని కడ విద్యోపదేశము నెట్లుపొందెనో అట్లే దివ్యపురుషుండై జన్మించిన ధృష్టద్యుమ్నునిగూడా లోకవిడంబనార్థము ద్రోణుని కడ ధనుర్విద్యోపదేశమును పొందెనని పూర్వాచారపరులైన పండితులు చెప్పుచున్నారుగాని యిది కేవల మవిచారపూర్ణమైన వాక్యము. శ్రీకృష్ణుడు ధృష్టద్యుమ్నునివలె నగ్నియందు శస్త్రాస్త్రములతో కిరీటకవచాదిభూషణభూషితాంగుడై జన్మింపక ప్రకృతి ధర్మానుకూలముగా దేవకికి జన్మించి క్రమక్రమముగా వృద్ధినొంది విద్యాభ్యాసముచేసెను. కావున ధృష్టద్యుమ్నుడు శ్రీకృష్ణునితో పోల్చబడుటకు అర్హుడు గాడు.

(3) మరియు కొందరు నవనాగరికులు ద్రుపదుడు ద్రోణుని జయించుటకు తగిన పుత్రునింగోరి పుత్రేష్టిని జేసి తన్మాహాత్మ్యముచే నగ్నియను తనభార్యయందు ధృష్టద్యుమ్నునిం గనెనని చెప్పుచున్నారు. కాని యిదియు సమంజసముగా లేదు. ఏలన? ద్రుపదునకు పరాభవమైనపిదప రెండుసంవత్సరములకు ధృష్టద్యుమ్నుడు జన్మించి యుండవలెను. ద్రుపదపరాభవమైన పిమ్మట ధర్మజునకు యౌవరాజ్యపట్టాభిషేకము మొదలు ఏకచక్రపురనివాసాంతమువరకు

పదిసంవత్సరములకు మించదు. ఇచ్చటనుండియే పాండవులు ద్రౌపదీ స్వయంవరమును విని ద్రుపదపురమునకరిగిరి. స్వయంవరమునాటికి ధృష్టద్యుమ్ను డారూఢయౌవను డనిమహాభారతముచెప్పుచున్నది. ఈ హేతువులచే నవనాగరికుల యభిప్రాయముగూడ యుక్తము కాదు.

(4) మరియు నతడు ద్రోణవధార్థము నే నగ్నిగుండములో బుట్టితి నని చెప్పియున్నాడు. అయినచో నుదకములోబుట్టిన యగ్నిని నుదక మెట్లార్ప లేదో అట్లె యగ్నిలో బుట్టినవానిని నగ్నిదహింప లేదు. ఆటువంటి ధృష్టద్యుమ్నుడు అశ్వత్థామచే ప్రయోగింప బడిన నారాయణాస్త్రప్రభావమువలన జనించిన యగ్నిని శమింపజేయలేక దాని కగ్గమయ్యెను, కావున నాత డగ్నిలో జనించె ననుటకు సంశయముగానున్నది. అగ్నియను భార్యయం దుత్పత్తియయ్యె ననుటయు తగియుండలేదు.

(5) కావున నితడు ద్రోణవధార్థము దత్తతగా స్వీకరింపబడినవాడ నియు, నితని యుత్పత్తికి సంబంధించిన దివ్యగాధ యాధిద్రైవికత త్వానుకూలముగా వ్రాయబడు గ్రంథస్వభావ మనియు తలంచు చున్నాను " (పు581)

(6) ద్రౌపది ద్రుపదునకు ధృష్టద్యుమ్నునితోబాటు దత్తపుత్రిక యనినాయభిప్రాయము. పుత్రేష్టినిబట్టియు,పంచేంద్రోపాఖ్యానమును బట్టియు విచారించి చూడగా ఋషికన్యకయైన యీమెను ద్రుప దుడు దత్తపుత్రికగా స్వీకరించె ననియే తోచుచున్నది." (పు590)

ఈప్రతివాది వ్రాతలోని యాంశములను బరిశీలింతము—

మొదటియంశములో "ద్రోణసంహారమే ప్రయోజనముగా నగ్నియందు జన్మించిన ధృష్టద్యుమ్నుడు యుద్ధములో ద్రోణుని వధిం

పక అస్త్రసంన్యాసము గావించి యోగశక్తిచే ప్రాణములు విడిచిన ద్రోణశవకంఠమును ఖండించినాడు. ద్రోణవధ కితడు నిమిత్తమాత్రుడై యున్నాడు. ఇతనివలన నైన దేమియు లేదు. ఇంతమాత్రమున కిత డయోనిజుడై యగ్నియందేల జన్మించెనో?" అను మాటలు విరుద్ధములు.

ప్రతివాదు లన్నట్లయినను ద్రోణవధ కాతడు నిమిత్తభూతుడే కద! ఇట్టిస్థితిలో "ఇతనివలన నైన దేమియు లేదు" అనుమాట కర్థమున్నదా?

ఆతడు ద్రోణాంతకుడై పుట్టినవాడుగనుకనే ద్రోణుడాతనిని వధింపలేకపోయెను ఈసంగతి ద్రోణుడే దుర్యోధనునితో జెప్పెను—

పార్షతం తు రణే రాజ న్న హనిష్యే కథంచన,
సహి సృష్టో వధార్థాయ మమైవ పురుషర్షభః

(ద్రోణ-౭7)

"ఇతమాత్రమున కిత డగ్నియందేల జన్మించెనో?" అనియిదేమిశంక? ఇంతపనిచేయగలవాడైనపుడే అగ్నియందు జన్మించునని యున్నదా యేమి? మంత్రసంస్కృతమైన హవిస్సునందు ద్రోణాంతకుడగు పుత్రుని జన్మింపజేయ గల అమోఘశక్తి యేర్పడినది. అట్టి హవిస్సు, అగ్నియందుంచబడినది. అందుచే నగ్నినుండియే జన్మించెను. దీనికి శంక యేమున్నది? "అస్త్రసంన్యాసముచేసి యోగశక్తిచే ప్రాణములు విడిచిన ద్రోణశవకంఠమును ఖండించినాడా? ఎంతభ్రాంతి! ద్రోణు డస్త్రసంన్యాసము చేయుట కేమిహేతువు చెప్పబడినదో చూడుడు—

"య ఇష్ట్వా మనుజేంద్రేణ ద్రుపదేన మహామఖే,
లబ్ధో ద్రోణవినాశాయ సమిద్ధా ద్ధవ్యవాహనాత్.
సధను ర్జైత్ర మాదాయ ఘోరం జలదనిస్స్వనమ్,

దృఢజ్యమజరం దివ్యం శరం చాశీవిషోపమమ్.
పార్షతేన పరామృష్టం జ్వలన్త మివ తద్ధనుః,
అన్తకాల మనుప్రాప్తం మేనిరే వీక్ష్య సైనికాః.
తె మిషుం సంహితం తేన భారద్వాజః ప్రతాపవాన్,
దృష్ట్వాఽమన్యత దేహస్య కాలపర్యాయ మాగతమ్.
తతః ప్రయత్న మాతిష్ఠ దాచార్య స్తస్య వారణే,
నచాఽస్యాస్త్రాణి రాజేన్ద్ర ప్రాదురాసన్ మహాత్మనః.
తస్య త్వహాని చత్వారి క్షపా చైకాఽస్యతో గతా,
తస్య చాహ్న స్త్రిభాగేన క్షయం జగ్ముః పతత్రిణః
స శరక్షయ మాసాద్య పుత్రశోకేన చార్దితః,
వివిధానాం చ దివ్యానా మస్త్రాణా మప్రసాదతః.
ఉత్స్రష్టుకామ శ్శస్త్రాణి ఋషివాక్యప్రచోదితః,
తేజసా పూర్యమాణశ్చ యుయుధే న యథా పురా.

(ద్రో- అ 191)

ద్రుపదుడు ద్రోణవినాశమునకై సంకల్పించి చేసిన యజ్ఞములో అగ్నినుండి యుద్భవించిన ధృష్టద్యుమ్నుడు ద్రోణయుద్ధములో ఘోరమైన ధనుస్సును, కాలసర్పమువంటి శరమును బట్టి యెదుట నున్నపుడు సైనికులు చూచి అంతకాలము వచ్చినదని తలచిరి ద్రోణాచార్యులు తన దేహమునకు అవసానసమయము సమీపించిన దని తలచెను ఆధృష్టద్యుమ్నుని ప్రయోగమును వారించుటకై ద్రోణుడు ప్రయత్నించెను. అస్త్రములు ప్రాదుర్భవింపలేదు. అప్పటికి నాలుగు దినములు, ఒకరాత్రియు నవిచ్ఛిన్నముగా నుజ్జ్వలమూర్తియై పోరిన ద్రోణాచార్యునకు ఆ అయిదవరోజున యుద్ధము కొంతగడచి ధృష్టద్యుమ్నుడెదుర్కొనినతరువాత బాణములు క్షీణించినవి. అశ్వత్థామ మరణవార్తాశ్రవణమున సంతాపము కలిగినది. ఋషులు గోచరించి విరమింపు మనిరి. ఇట్టిస్థితి తటస్థింపగా జూచి శస్త్రసంన్యాసము చేయ దలచెను.

ఈ గ్రంథసందర్భమునుబట్టి ద్రోణుఁ డస్త్రసంన్యాసముచేయుటకు హేతువులలో ధృష్టద్యుమ్నుఁడొకఁడని స్పష్టమయినది.

—: ధృష్టద్యుమ్నునిచే ఖండింపబడినది ద్రోణకంఠమే.
ద్రోణశవకంఠము కాదు :—

ఇక యోగశక్తిచే ప్రాణములు విడిచిన ద్రోణశవకంఠమును ఖండించినాఁడా? ఆసందర్భ మెట్లున్నదో చూడుఁడు:—

"ఉత్సృజ్య చ రణే శస్త్రం రథోపస్థే నివిశ్య చ,
అభయం సర్వభూతానాం ప్రదదౌ యోగ మీయివాన్.
తస్య తచ్ఛిద్ర మాజ్ఞాయ ధృష్టద్యుమ్నః ప్రతాపవాన్,
సశరం తద్ధను ర్ఘోరం సంన్యస్యాఽథ రథే తతః.
ఖడ్గీ రథా దవప్లుత్య సహసా ద్రోణ మభ్యయాత్,
హాహాకృతాని భూతాని మానుషా ణీతరాణి చ.
ద్రోణం తథాగతం దృష్ట్వా ధృష్టద్యుమ్నవశం గతమ్,
ద్రోణోపి శస్త్రా ణ్యుత్సృజ్య పరమం సాంఖ్య మాస్థితః."

ఇచ్చట, శస్త్రసంన్యాసము చేసి సర్వభూతముల కభయదానము చేసి రథమందే యోగనిష్ఠను వహించి ద్రోణుఁ డుండె ననియు, అప్పుడు ఖడ్గపాణియై తనరథమునుండి యురికి ధృష్టద్యుమ్నుఁడు ద్రోణునిమీఁదికి బోయె ననియు, ధృష్టద్యుమ్నవశమైయున్న ద్రోణుని జూచి భూతములు హాహాకారము చేసె ననియు, ద్రోణుఁడు జ్ఞాననిష్ఠుఁడై యుండె ననియు చెప్పఁబడినది.

ఈ చెప్పుటలో ద్రోణవధోద్యుక్తుఁడై తీవ్రత వహించిన ధృష్టద్యుమ్నుని కృత్యమును, యోగనిష్ఠుఁడైయున్న ద్రోణుని కృత్యమును వివరించుసందర్భములో ముందు గ్రంథమున ద్రోణుని స్థితియే వివరింపబడి యోగధారణ, ప్రణవాలంబమున పురాణపురుషస్మరణము, తేజోరూపమున బ్రహ్మలోకప్రాప్తి, ప్రతిపాదింపబడి ఆపై ధృష్టద్యు

ద్యుమ్నుని కృత్యము చెప్పబడినది. ఆక్రమమునుబట్టి ప్రాణము విడిచిన ద్రోణుని కంఠమును ఖండించినాడని చెప్పుట అజ్ఞానము.

"అగ్నిహోత్రం జుహోతి, యవాగూం పచతి." అనుచోట శబ్దక్రమమునుబట్టి ముందు హోమము, తరువాత యవాగూపచనము అని యర్థము స్ఫురించుచున్నను "శబ్దక్రమా దర్థక్రమో బలీయాన్" అనున్యాయమున ముందు యవాగూపచనము, ఆపైని హోమము నిర్ణయించినట్లు ముందు ధృష్టద్యుమ్నుని కృత్యమునే యోజన చేయవలయును. అట్లు చేయకున్న గ్రంథవిరోధము. చూడుడు___

ద్రోణకంఠమును ఛేదింపబూనిన ధృష్టద్యుమ్నునితో "జీవన్త మానయాచార్యమ్" అనుచు పార్థు డుద్ఘోషించెను. అప్పటికే ద్రోణుడు నిర్గతప్రాణు డను పక్షములో నది విరుద్ధ మగును. జీవించియుండె నను భ్రాంతిచే నట్లనె నను పక్షములో ద్రోణుడు పరమగతిని బొందినప్పుడు మేమైదుగురముమాత్రము చూడగల్గితిమని చెప్పిన సంజయుని వాక్యములో నర్జును డొక్కడై యుండెను___

"వయమేవ తదాఽద్రాక్ష్మ పంచ మానుషయోనయః,
యోగయుక్తం మహాత్మానం గచ్ఛన్తం పరమాం గతిమ్.
అహం ధనంజయః పార్థో భారద్వాజస్య చాత్మజః,
వాసుదేవశ్చ వార్ష్ణేయో ధర్మపుత్రశ్చ పాండవః.

(ద్రోణ- అ. 192)

ఇట్లు ద్రోణుని ప్రాణనిర్గమనమును చూచినవానికి, జీవించి యున్నట్లు భ్రాంతి కలిగెననుట విరుద్ధమగును.

ధృష్టద్యుమ్నుని కృత్యము ఇట్లు వివరింపబడినది___

"వితున్నాంగం శరవ్రాతై ర్న్యస్తాయుధ, మసృక్ క్షరమ్,
ధిక్కృతః పార్షత స్తం తు సర్వభూతైః పరామృశత్.
తస్య మూర్ధాన మాలంబ్య గతసత్త్వస్య దేహినః,

కించి దబ్రువతః కాయా ద్విచకర్తాఽసినా శిరః.
ఉక్తవాంశ్చ మహాబాహుః కున్తీపుత్రో ధనంజయః,
జీవన్త మానయాచార్యం మావధీ ర్ద్రుపదాత్మజ.
న హన్తవ్యో న హన్తవ్య ఇతి తే సైనికాశ్చ హ,
ఆక్రోశ న్నర్జునశ్చైవ సానుక్రోశస్త మావ్రజత్.
క్రోశమానేఽర్జునేచైవ పార్థివేషు చ సర్వశః,
ధృష్టద్యుమ్నోఽవధీద్ద్రోణం రథతల్పే నరర్షభమ్.

(ద్రోణ- అ. 192)

బాణాఘాతములచే చిల్లులుపడి రక్తముస్రవించు శరీరము గలిగి శస్త్రసంన్యాసము చేసి యున్నట్టి ద్రోణుని బట్టుకొనినపుడు ధృష్ట ద్యుమ్నుని సర్వభూతములు గర్హించెను. అర్జునుడు "వధింపకుము వధిం పకుము జీవించియున్న యాచార్యుని దీసికొనిరమ్ము" అని యాక్రోశిం చుచు పరుగిడివచ్చెను. ధృష్టద్యుమ్నుడు గణనచేయక "గతసత్త్వస్య కించి దబ్రువతః తస్య దేహినః మూర్ధాన మాలంబ్య శిరః విచకర్త" గత సత్త్వుడై మౌనము వహించియున్న ఆదేహియొక్క జుట్టుపట్టుకొని శిరస్సును ఛేదించెను. అని చెప్పబడినది.

ఇచ్చట 'గతసత్త్వస్య' అనుపదమునకు ప్రాణము విడిచినవాడని యర్థము కాదు అట్లైన 'కించి దబ్రువతః' అనియు, 'దేహినః' అనియు చెప్పుట విరుద్ధ మగును ఏమియు మాటాడనివాడని 'కించ దబ్రువతః' అనుదానికర్థము. 'సంభవవ్యభిచారాభ్యాం స్యా ద్విశేషణ మర్థవత్' అని న్యాయము. ప్రాణముపోయినవాడు మాటాడుట అసంభ వమే "కించిదబ్రువతః" అను విశేషణమునకు సంభవముండవలెను. అది ప్రాణమున్నప్పుడే ఘటించును. కాబట్టి అది యోగనిష్ఠనుబట్టి వచ్చినదిగాని ప్రాణమును విడుచుటనుబట్టి వచ్చినది కాదు కనుక "గత సత్త్వస్య" అనుమాటకు క్షీణించిన బలము గలవాడనియే అర్థము.

కనుకనే వధింపబోవు ధృష్టద్యుమ్నునితో "జీవన్తమానయాచార్యమ్" "మావధీర్ద్రుపదాత్మజ" అని యర్జును డనెను

మరియు, కృపాచార్యులు ద్రోణవధక్రమము నశ్వత్థామ కెట్లు చెప్పెనో చూడుడు—

"పాంచాలరాజస్య సుతః క్రూరకర్మా సమాద్రవత్,
తం దృష్ట్వా విహితం మృత్యుం లోకతత్త్వవిచక్షణః,
దివ్యాన్యస్త్రా ణ్యథోత్సృజ్య రణే ప్రాయ ముపావిశత్'
తతోఽస్య కేశాన్ సవ్యేన గృహీత్వా పాణినా తదా,
పార్షతః క్రోశమానానాం వీరాణా మచ్ఛిన చ్ఛిరః,

ద్రోణుడు తనమీదకు వచ్చిపడినట్టియు, తనకు మృత్యుస్వరూపుడైనట్టియు, ధృష్టద్యుమ్నుని జూచి లోకతత్త్వజ్ఞుడగనుక నస్త్ర సంన్యాసము జేసి ప్రాయోపవేశము జేసెను. అప్పుడు శిరస్సును ఛేదించెను. అని చెప్పబడెను.

ఈస్థలములోనే ఆంధ్రభారతమునం దెట్లున్నదో చూడుడు—

క. గురు డమలయోగనిష్ఠం
దిరమై యుండంగ వచ్చి ధృష్టద్యుమ్నుం
డరదముమీదకి జని త
చ్ఛిరోజములువట్టికొని యసిం దునుముటయున్.

ఇట్లు యోగనిష్ఠయం దుండగా వధించినట్లు చెప్పబడినది. అంతియకాని ప్రాణములు విడిచియున్నవానిని వధించినట్లు లేదు.

మరియు, ద్రోణుని వధించినందులకై యాతని నిందించిచిన అర్జునుడుగాని సాత్యకిగాని ప్రతివాది వ్రాసిన విధముగా ద్రోణశవకంఠమును ఖండించితి వని నిందింపలేదు. గురువుయొక్క జుట్టుపట్టుకొనినావని శస్త్రసంన్యాసము చేసినవానిని వధించినావని నిందించినారు.

మరియు ఆంధ్రభారతమం దిట్లున్నది—

"ధృష్టద్యుమ్నుని జూచుచుఁ ...... చేష్టాహీనత బొంది
యగ్గురుఁడు సంక్షిప్తాంగుఁడై యున్నెడఁ" అతని వధంబు
నకై పాంచాలవిభుని వేలిమింబుట్టినవాఁడగుట నప్పార్షతుఁడు"

ఇచ్చట ధృష్టద్యుమ్నుఁడు ద్రోణవధార్థము పుట్టినట్లు చెప్పబడి నది. ద్రోణుఁ డను పేరు జీవద్దేహమునకా? నిర్జీవదేహమునకా? నామ కరణమనునది నిర్జీవదేహమునకు గాదని జగద్విదితము.

కనుక జీవద్దేహమునకే ద్రోణుఁ డని పేరు. ఈవిధమున జీవద్దేహ మును ఛేదించినపుడే ద్రోణవధ ధృష్టద్యుమ్నుఁడు చేసినట్లగును. అతఁడు ద్రోణశవకంఠమును ఖండించినాఁ డనుపక్షములో ఆతఁడు ద్రోణవధా ర్థము పుట్టినట్లు చెప్పుచున్న గ్రంథ మసంగత మగును. ఇన్ని బాధ కము లుండుటవలన ధృష్టద్యుమ్నుఁడు చేసినది ద్రోణశవకంఠచ్ఛేదనము కాదు.

ఇట్టిస్థితిలో ఆంధ్రభారతమున, "ద్రోణుశవంబు కేశముల్, కర మున బట్టమర్చికొని ఖడ్గహతిఁ మెడ దుంచివైచె" అని యెట్లు వ్రాయఁబడెనో తెలియకున్నది.

కనుక ప్రథమాంశము నిరస్తమైనది.

ఇక ద్వితీయాంశము—"అగ్నికుండమునుండు దివ్యధనుర్బాణ ములతో జన్మించినవానికి తిరిగి ద్రోణధనుర్విద్యోపదేశ మేల? శ్రీకృ ష్ణునకు విద్యోపదేశము వంటిదే ధృష్టద్యుమ్నునకుఁగూడ విద్యోపదేశ మని పండితులు చెప్పుచున్నారు కాని అది కేవల మవిచారపూర్ణ మైన వాక్యము శ్రీకృష్ణుఁడు ధృష్టద్యుమ్నునివలె కిరీటకవచాదిభూషణా దులతో జన్మింపలేదు ప్రకృతిధర్మానుకూలముగా దేవకికి జన్మించి క్రమముగా వృద్ధి నొందెను ధృష్టద్యుమ్నుని శ్రీకృష్ణునితోఁ బోల్చుటకు వీలు లేదు" అని,

స్థలాంతరములోని యీప్రతివాది వాక్యములనే చూడుడు:—
"స్థితప్రజ్ఞుడు, మహాయోగేశ్వరేశ్వరుడు నగు శ్రీకృష్ణుడు" 1
"శ్రీకృష్ణుని యుత్పత్తి మొదలు జీవితాంతమువరకు నతని గుణకర్మలన్నియు దివ్యమహిమలతోనే కూడియున్నవి." 2

శ్రీకృష్ణునియందు సంపూర్ణమైన పరబ్రహ్మత్వమే ప్రకాశించుచున్నదిగాని ప్రకృతిగుణములందు సంసక్తుడైయున్న ట్లొకక్షణమేనియు నాతని జీవితములో గానరాదు." 3

శ్రీకృష్ణుని స్వరూపప్రభావములు శ్రీమద్భాగవతమహాభారతములలో వ్యాసమహర్షి సంపూర్ణముగా వివరించియున్నాడు. కాని ఈకాలములో నిర్వీర్యులమైన మనకు ఆ దివ్యభాషయొక్క భావార్థములు గోచరింపకపోవుటచేతను, కాలవశమున సత్త్వగుణప్రధానములైన దివ్యకృత్యములందు మన కపనమ్మకము కలుగుటచేతను మనము గ్రహింపలేని స్థితిలో నున్నాము." 4

"నిర్వీర్యులు అల్పబుద్ధులు గల యీకాలపువిమర్శకులు ఈవిషయమును గ్రహింపకపోవుటచేతనే మహాభారతార్థ మంతయు తలక్రిందు లగుచున్నది. శ్రీకృష్ణుని స్వస్వరూపమును గ్రహింపకపోవుటచేతను, ధర్మరహస్యములను గుర్తెరుంగక పోవుటచేతను, మహాభారతమునందుమహామహిమాన్వితములైన కొన్ని యమానుషకృత్యములు అతిశయోక్తులుగా మూఢవాక్యములుగాప్రక్షిప్తములుగా తలంపబడుచున్నవి." 5 (పు205—211)

ఇచ్చట నాలుగవవాక్యములో ప్రతివాది వ్రాసినట్లు శ్రీమద్భాగవతములో శ్రీకృష్ణునిప్రాదుర్భావము, యోగిధ్యేయమై వైకుంఠస్థమైన యీశ్వరస్వరూపముతో వనమాలాకిరీటకుండలాదిదివ్యోపకరణములతో జరిగి, తరువాత లీలామానుషవిగ్రహ మావిర్భవించినదని చెప్పబడి యుండ దానికి విరుద్ధముగాను, మూడవవాక్యములో—

"శ్రీకృష్ణునియందు సంపూర్ణపరబ్రహ్మత్వమే ప్రకాశించుచున్నది. ప్రకృతిగుణములందు సంసక్తుడై యున్న ట్లొకక్షణమేనియు నాతని జీవితములో గానరాదు." అని వ్రాసి దానికి విరుద్ధముగను రెండవవాక్యములో "శ్రీకృష్ణుని యుత్పత్తి మొదలు ఆతని గుణకర్మము లన్నియు దివ్యమహిమలతోనే కూడియున్నవి." అని చెప్పి దానికి విరుద్ధముగను "శ్రీకృష్ణుడు ధృష్టద్యుమ్నునివలె కిరీటాదిభూషణములతో జన్మింపలేదు ప్రకృతిధర్మానుకూలముగా దేవకికి జన్మించెను." అని ద్వితీయాంశములో వ్రాయుట అజ్ఞానము.

"జన్మ కర్మ చ మే దివ్యమ్" "అవజానన్తి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్" "నాహం ప్రకాశ స్సర్వేషాం యోగ మాయాసమావృతః"

అని బోధించిన కృష్ణపరమాత్మకు విద్యోపదేశము వంటిచే ధృష్టద్యుమ్నునకును గావచ్చు నని పండితులు చెప్పినట్లు వ్రాసి అది యవిచారపూర్ణమైన వాక్య మని వ్రాయుటగూడ నజ్ఞానవిలసితమే.

ఇక 4-5 వాక్యములలో "ఆదివ్యభావముయొక్క భావార్థములు గోచరింపకపోవుటచేతను, కాలవశమున దివ్యకృత్యములయందు మనకు నమ్మకము కలుగుటచేతను మనము గ్రహింపలేని స్థితిలో నున్నాము. నిర్వీర్యులు అల్పబుద్ధులు అగు ఈకాలపువిమర్శకులచే మహాభారతార్థ మంతయు తలక్రిందు లగుచున్నది. మహాభారతమందు మహా మహిమాన్వితములైన కొన్ని యమానుషకృత్యములు అతిశయోక్తులుగా మూఢవాక్యములుగా ప్రక్షిప్తములుగా తలంపబడుచున్నవి."

అని యీప్రతివాదియే ఇప్పటి విమర్శకశైఖరిని వెల్లడించి నందున, ద్రౌపదీధృష్టద్యుమ్నుల ఉత్పత్తినిగూర్చి మహాభారతార్థమును తలక్రిందుచేసి వారిరువురు ద్రుపదునకు దత్తు లని వెనుకటి

5–6 అంశములలో వ్రాసిన యీప్రతివాది తాను చెప్పిన విమర్శక జాతికే చెందియున్నట్లు స్పష్టమయినది. కనుక నట్టి యాఙ్ఞాత హేయము. అందుచే 2–5–6 అంశము లపాస్తమయినవి.

ఇక తృతీయాంశము— ద్రోణుకు పుత్రేష్టిని జేసి అగ్ని యను తన భార్యయందు ధృష్టద్యుమ్నుని గనె నని నవనాగరికులు చెప్పుచున్నారట కాని ద్రౌపదీస్వయంవరమునాటికి ధృష్టద్యుమ్ను డారూఢయౌవను డని భారతము చెప్పుచున్నందున ద్రుపదపరాభవా నంతరము ఏరెండేండ్లలో పుట్టినట్టియు, నదిమొదలు పాండవుల ద్రౌప దీస్వయంవరసమయమునకు పదిసంవత్సరములకు మించని కాలమును బట్టి 10, 12· సంవత్సరములవయస్సు మాత్రమె కలిగియుండవలసి నట్టియు, ధృష్టద్యుమ్ను డారూఢయౌవను డనుట విరుద్ధమగును. గనుక నవనాగరికుల యభిప్రాయ మయుక్తమట!

ఇచ్చట, ఆరూఢయౌవను డను భారతోక్తికి విరుద్ధమని మాత్రమె నవనాగరికకల్పనను తిరస్కరించిన యీప్రతివాదికి, మంత్ర సంస్కృతహావిస్సును వచ్చితీసికొనుమని ద్రుపదభార్యకు దెలిపినపుడు నేను ఋతుమతినై యుంటి నని యామె వర్తమాన మంపగా నాహావి స్సును వెంటనే అగ్నియందు హోమముజేయ ధృష్టద్యుమ్ను డాయ గ్నినుండి యావిర్భవించెను. అని స్పష్టముగా నున్న భారతోక్తికి. ద్రుపదభార్యకే అగ్ని యను పేరని కల్పించిన యీనవనాగరికుల మాట విరుద్ధమని యెంతమాత్ర మనిపించలేదన్నమాట!

వీరివిగూడ నవనాగరికజాతికి జెందిన కల్పనలే గనుక విరుద్ధ మనిపించలేదు. శుకయోగి అయోనిజుడై అరణినుండి యావిర్భవించె నని భారత దేవీభాగవతాదిగ్రంథము లుద్ఘోషించుచుండ దానికి విరు ద్ధముగా నీ రహస్యకర్తలు— "అరణి కాదు. అరణ్యయను నొక ఋషికన్యయందు శుకుడు కలిగెను" (పు 83)

అనివార్యము లేదా? ఈప్రస్తావమంతయు ద్వితీయభాగములో నిరూపించి నిరసింపబడినది. ఇక ప్రస్తుతాంశమేమనగా— ద్రౌపదీస్వయంవరమునాటికి ఆయూథయౌవనుడను భారతోక్తికి నవనాగరికుల వాదము విరుద్ధమగుటచే నయుక్తమని ప్రతివాది చెప్పినట్లే ఈప్రతివాదివాదముగూడ ధృష్టద్యుమ్నోత్పత్తిప్రకారమును బోధించు మహాభారతోక్తి కత్యంతవిరుద్ధ మగుటచే నయుక్తము.

ద్రోణాచార్యుడు వధింపలేకపోవుటయు, ద్రోణాంతకుడాతడగుటయు ద్రౌపదీస్వయంవరమున కారూథయౌవను డగుటయు, నను విషయము లాధృష్టద్యుమ్నుడు మహాభారతోక్తప్రకారము అగ్నికుండమునుండి జన్మించినట్లు భావించినపుడే సంగతము లగునుగాని ప్రతివాది యన్నట్లు దత్తపుత్రుడని భావించినపు డసంగతములే యగును. కనుక ప్రతివాదిప్రసంగము హేయము.

ఇక చతుర్థాంశము—అగ్నిలో బుట్టినవాని నగ్ని దహింపలేదట. ధృష్టద్యుమ్నుడు— అశ్వత్థామనారాయణాస్త్రప్రభావమున జన్మించిన యగ్నిని శమింపజేయలేక దానికగ్గమయ్యెనట. కావున నాతడగ్నిలో జనించెననుటకు సంశయముగా నున్నదట!

ఈప్రతివాది యన్నట్లు ధృష్టద్యుమ్ను డేయగ్నినుండి యుద్భవించెనో ఆయగ్ని యాతని దహింపనే లేదు. ఇక నారాణాస్త్ర మాతనికి బాధకమగుటకు అమోఘము, నప్రతిహతమునగు మహాస్త్రశక్తి హేతువగునుగాని యగ్నినుండి పుట్టక దత్తుడగుట హేతువు కాదు.

నారాయణుడు ద్రోణాచార్యునకు నారాయణాస్త్ర మనుగ్రహించునపు డిట్లు చెప్పెను:—

"న త్విదం సహసా బ్రహ్మన్ ప్రయోక్తవ్యం కథం చన,
న హ్యేత దస్త్ర మన్యత్ర వధా చ్ఛత్రో ర్నివర్తతే.

అవధ్య మపి హన్యాద్ధి తస్మా న్నైతత్ప్రయోజయేత్,
అథ సంఖ్యే రథస్యైవ శస్త్రాణాం చ విసర్జనమ్.
ప్రయాచతాం చ శత్రూణాం గమనం శరణస్య చ,
ఏతే ప్రశమనే యోగా మహాస్త్రస్య పరంతప.
సర్వథా పీడితో హింస్యా దవధ్యాన్ పీడయన్ రణే."

(ద్రోణ- అ195)

ఈయస్త్రము ననాలోచనముగా బ్రయోగింపరాదు ఇది శత్రువును వధింపనిదే నివర్తింపదు. అవధ్యులనుగూడ నిది వధించును. రథమునుండి క్రిందకి దిగుట, శస్త్రములనువిడుచుట, మమ్ము వధింపకు మని ప్రార్థించుచు శరణుపొందుట అనునవియే యీమహాస్త్రము ప్రశమించుట కుపాయములు. దీనిని ప్రతిఘటించినకొలది యిది విజృంభించి యవధ్యులను గూడ హింసించితీరును. అని.

ఇట్టి మహాస్త్రము అగ్నిసంభూతునిగూడ బాధించునట్టిదగుటచే ధృష్టద్యుమ్నునకుగూడ దాని కధీనమయ్యెను కనుక నీచతుర్థాంశము గూడ నిరస్తమైనది.

ఇంక పంచమాంశము:—ధృష్టద్యుమ్నుడు ద్రోణవధార్థము దత్తతగా స్వీకరింపబడినవాడట! ఇతని యుత్పత్తికి సంబంధించిన దివ్యగాథ యాధిదైవికతత్త్వానుకూలముగా వ్రాయబడు గ్రంథస్వభావమట! ఆహా! దత్తుడైనయెడల ద్రోణాంతకుడును, ద్రోణునకు వధింప శక్యము కానివాడను అగును కాబోలు! ఇది వీరి విజ్ఞానములోని విచిత్రాంశము. "అతని యుత్పత్తికి సంబంధించిన దివ్యగాథ అధిదైవికతత్త్వానుకూలముగా వ్రాయబడు గ్రంథస్వభావము" అనునది తమకసంభావితముగా దోచిన యంశములలో నెల్ల వాడబడు పడికట్టుమాట. ఈమాట కర్థమేమో? అసలు తత్త్వమా? ఆపై యాధిదైవికతత్త్వమా? ఆపై దానికనుకూలముగనే వ్రాయబడుటా? అది గ్రంథమునకు స్వభావమే అగుటా? అది తమ కసంభావిత మనిపించుటా? ఏమి విజ్ఞానము?

ఈద్రౌపదీధృష్టద్యుమ్నాద్యుత్పత్తులు దివ్యకృత్యములు. ఆ దివ్య కృత్యములను బోధించుచున్న భాష దివ్యభాష. అట్టి మహాభారత మును తలక్రిందుచేసినవారు విమర్శకులు. ఇట్టిస్థితిలో ఆదివ్యభాషను గూర్చియు, ఆదివ్యకృత్యములను గూర్చియు, ఆవిమర్శకులనుగూర్చియు, స్థలాంతరములో నీప్రతివాదియే వ్రాసినవాక్యములను మరొక్కసారి యుద్ఘాటించుచున్నాము—

"ఈకాలములో నిర్వీర్యులమైన మనకు ఆదివ్యభాషయొక్క భావా ర్థములు గోచరింపకపోవుటచేతను, కాలవశమున సత్వగుణప్రధాన ములైన దివ్యకృత్యములయందు మన కపనమ్మకము కలుగుట చేతను, మనము గ్రహింపలేని స్థితిలో నున్నాము" "నిర్వీర్యులు అల్పబుద్ధులు గల యీకాలపువిమర్శకులు ఈవిషయమును గ్రహిం పకపోవుటచేతనే మహాభారతార్థ మంతయు తలక్రిందులగుచున్నది. ధర్మరహస్యమును గుర్తెరుంగకపోవుటచేత మహాభారతమందు మహామహిమాన్వితములైన కొన్ని యమానుషకృత్యములు అతి శయోక్తులుగా మూఢవాక్యములుగా ప్రక్షిప్తములుగా తలపబడు చున్నవి." (పు 205—206)

"విమర్శకుడొక గ్రంథమును విమర్శించుటకు ముందుగా ధర్మ సూక్ష్మ మతిగహనము అను వాక్యమును సర్వదా జ్ఞాపక ముంచు కొనవలెను." (పు 141)

ఈవాక్యములసారాంశము— మహాభారతమందలి దివ్యభాష నర్థముజేసికొనగల శక్తిలేనట్టివారును, దివ్యకృత్యములయందు నమ్మ కము లేనట్టివారును, ధర్మసూక్ష్మ మతిగహన మని తెలియనివారును మహామహిమాన్వితములైన మహాభారతమందలి యమానుషకృత్య ములు అతిశయోక్తు లని, మూఢవాక్యము లని, ప్రక్షిప్తములని

యనుకొనువారును, నిర్వీర్యులును అల్పబుద్ధులును అగు విమర్శకులచేత మహాభారతార్థ మంతయు తలక్రిందులగుచున్నది. అని.

ఇట్లు విమర్శకస్వరూపమును చక్కగా వర్ణించియున్న యీవిమర్శకు డగు ప్రతివాదికూడ ద్రౌపదీధృష్టద్యుమ్నాద్యుత్పత్త్యాది విషయములలో మహాభారతార్థమును తలక్రిందుచేసియున్నందున స్వవచనవ్యాఘాతము గల వీరి ధోరణి నింద్యము ధృష్టద్యుమ్నుడు పూర్వోక్తప్రకారము అగ్నికుండమునుండియే యుద్భవించె ననుట నిశ్చయము.

ఇక వష్ఠాంశము— ద్రౌపది ద్రుపదునకు దత్తపుత్త్రిక యట! పుత్త్రేష్టినిబట్టియు, పంచేంద్రోపాఖ్యానమునుబట్టియు, విచారించి చూడగా ఋషికన్యకయైన యీమెను దత్తపుత్త్రికగా స్వీకరించినట్లు తోచినదట! ఆహా! తలక్రిందుగా దోచుట వీరికి నైజము.

పంచేంద్రోపాఖ్యానసందర్భములో వ్యాసమహర్షి ద్రుపదునితో—

"ద్రుపదైషా హి సా జజ్ఞే సుతా వై దేవరూపిణీ,
పంచానాం విహితా పత్నీ కృష్ణా పార్షత్యనిందితా.
స్వర్గశ్రీః పాండవార్థ న్తు సముత్పన్నా మహామఖే,"

పరమేశ్వరునిగూర్చి తపముచేసి "దేహ మన్యం గతాయా స్తే సర్వ మేత ద్భవిష్యతి" నీకు జన్మాంతరమందు పంచపతిత్వము ప్రాప్తించు నని యీశ్వరునిచే వరమీయబడినట్టి యాఋషికన్యక యగు స్వర్గలక్ష్మియే నీయజ్ఞమందు నీపుత్త్రికయై జన్మించిన దని చెప్పిన యీ పంచేంద్రోపాఖ్యానసందర్భ మేమి? దానినిబట్టి యీమె దత్తపుత్త్రిక యని యీ ప్రతివాదికి తోచుటేమి? ఇది యసంగతప్రసంగము గనుక పరాస్తమైనది ద్రౌపదీదేవి అయోనిజయై పూర్వోక్తప్రకారము యజ్ఞవేదికనుండియే యుద్భవించినదనుట నిశ్చయము.

ఇంతవరకు ద్రౌపదీజన్మమునకు సంబంధించిన ప్రతివాదుల దురుక్తులన్నియు దూరోత్సారితము లయినవి.

—: "శుక్లశోణితసమ్మేళనము లేకుండ నయోనిజులై జన్మించుట సంభవింప"దను ప్రసంగము — తన్నిరాకరణము :—

ద్రోణోత్పత్తినిగూర్చి మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది–
"స్త్రీపురుషుల శుక్రశోణితసమ్మేళనము లేకుండగ జన్మ మొక్క శుక్లముచేతనె కలుగు నని పూర్వపాశ్చాత్త్యశాస్త్రము లేవియు నంగీకరింపవు. ద్రోణజన్మకథ జూడగ ఘృతాచి యను నప్సరస భరద్వాజునకు ద్రోణుని గని యాబాలుని ద్రోణకలశములో బెట్టగ భరద్వాజుడే పెంచి పెద్దవానిని జేసి యాతనికి ద్రోణు డను పేరు బెట్టియుండె నని తోచును" (పు 122)

ఈవిషయమునుగూర్చియే రహస్యకర్త్రల వ్రాత యిట్లున్నది—
"ఇచ్చట మనవిమర్శకులు (మ. భా. చ. కారులు) శుక్లశోణితసమ్మేళనము లేక పిండోత్పత్తి యెట్లగు ననియు, నివి ప్రకృతియు సందర్భపుగాథలనియు నాక్షేపించుచున్నారు.
ఇట శోణితసంబంధము లేక శుక్రముతోడనే యుత్పత్తి యయ్యె ననుటమాత్రము విచారణీయాంశము. చరకసుశ్రుతశారీరాది శాస్త్రము లేవియు నిందు కంగీకరింపవు. ఇచ్చట నాయభిప్రాయ మేమనగా భరద్వాజునివలన ఘృతాచి యందే ద్రోణుడు జన్మించి యుండవచ్చును." (పు 409).

ఈరహస్యకర్తలు, ఆ మ. భా. చ. కారు లాక్షేపించుచున్నారని వ్రాసిన దానినే దుదకు స్థిరపరచి ద్రోణు డయోనిజుడు కాడు ఘృతాచియందు జన్మించినాడు. అని మ. భా. చ. కారులు వ్రాసి యుండ నాయభిప్రాయము నదియే యని రహస్యకర్తలు వ్రాసి వారిలోనే చేరినారు. వీరిద్దరి ధోరణియు నొక్కరకమే.

అయోనిజులై జన్మించుట సంభవింపదనియు, నందుకు శాస్త్రము లేవియు నంగీకరింపవనియు సర్వశాస్త్రవేత్తలవలె జెప్పిన యీప్రతి వాదులకు శాస్త్రములనే ప్రదర్శించుచున్నాము—

వైశేషికదర్శనము— సూత్రము 174.

"తత్ర శరీరం ద్వివిధం యోనిజ మయోనిజం చ"

భాష్యమ్- తత్రాఽయోనిజ మనపేక్ష్యశుక్రశోణితం దేవర్షీణాం శరీరం ధర్మవిశేషసహితేభ్యోఽణుభ్యో జాయతే, క్షుద్రజన్తూనాం యాతనాశరీరాణ్యధర్మవిశేషసహితేభ్యోఽణుభ్యో జాయన్తే"

సూత్రోపస్కారః— అయోనిజం చ దేవానా మృషీణాం చ. శ్రూయతే హి బ్రహ్మణో మానసా మన్వాదయ ఇతి। కారణ మన్తరేణ కథం కార్య మితి చేత్- యోనేశ్శరీరత్వా వచ్ఛేదేనాఽకారణత్వాత్. ఊష్మజకృమిమశకాదిశరీరే వ్యభిచారాత్.

"స్తన్యయోనిజాః" సూ, 179

ఇచ్చట, యోనిజము, అయోనిజము, అని శరీరము ద్వివిధ మనియు, శుక్రశోణితసంబంధము లేకయే ధర్మవిశేషముచే కలుగు నట్టి దయోనిజ మనియు, నట్టిది దేవతలయొక్కయు ఋషులయొక్కయు శరీరమనియు, నట్టియయోనిజు లుండి రనియు జెప్పబడినది.

శుక్లశోణితసంబంధము లేకుండ శరీరము కలుగ దను ప్రతి వాదుల నడుగుచున్నాము. జరాయుజ, అండజ, స్వేదజ, ఉద్భిజ్జము లనబడు చతుర్విధప్రాణులలో నేప్రాణి శరీరముగూడ శుక్లశోణిత సంబంధము లేనిదే కలుగ దందురా? మనుష్యశరీరముమాత్రమె కలుగ దందురా? ప్రథమపక్ష మయుక్తము. స్వేదజము లనబడు కృమికీట మశకాదులు యొక్కయు, ఉద్భిజ్జము లనబడు వృక్షాదులయొక్కయు నుత్పత్తికి శుక్లశోణితసంబంధ మున్నదనుట లోకవిరుద్ధముగనుక.

ఈవిషయము వేదాంతదర్శనములో నిట్లు చెప్పబడినది.—

"దర్శనాచ్చ (బ్ర-సూ-3-1-20)

భాష్యమ్ "అపిచ చతుర్విధే భూతగ్రామే జరాయుజాండజస్వేద జోద్భిజ్జలక్షణే స్వేదజోద్భిజ్జయో రన్తరేణైవ గ్రామ్యధర్మ ముత్పత్తిదర్శనా దాహుతిసంఖ్యాఽనాదరో భవతి. ఏవ మన్య త్రాపి భవిష్యతి"

ఇక మనుష్యశరీరోత్పత్తికి శుక్రశోణితసమ్మేళన మావశ్యక మను ద్వితీయపక్షమును బరిశీలింతము:—

ఛాందోగ్యోపనిషత్తులో పంచాగ్నివిద్యలో పరలోకగమనము నకై దేవయానమార్గము, పితృయాణమార్గము అని రెండుమార్గము లుపదేశింపబడి, యామార్గములకు గ్రమముగా విద్యాకర్మలు సాధన ములుగా జెప్పబడినవి. తరువాత విద్యాకర్మవిహీనులును, మార్గద్వయ భ్రష్టులును అగువారికి జననమరణావృత్తిరూపమైన తృతీయస్థానము చెప్పబడినది—

"అథైతయోః పథో ర్న కతరేణ చన తానీమాని క్షుద్రాణ్య సకృదావర్తీని భూతాని భవన్తి జాయస్వ మ్రియస్వేత్యేతత్తృతీయం స్థానమ్" అని.

మరియు, ఇష్టాపూర్తాదికర్మలు చేసినవారు ఈశరీరమును విడి చిన తరువాత చంద్రలోకమునకు జేరి యచ్చట భోగానుభవమైన పిమ్మట నీలోకములో జన్మించుటకై అవరోహణక్రమ ముపదేశింపబ డుటలో ద్యు పర్జన్య, పృథివీ, పురుష, యోషిత్, అను అయిదు స్థానములు చెప్పబడి అయిదవస్థానమై యున్నస్త్రీయందు నాలుగవస్థా నమైన పురుషుని ద్వారా రేతోరూపమున బ్రవేశించి యచ్చట జన్మించు నని చెప్పబడినది.

"పంచమ్యా మాహుతా వాపః పురుషవచసో భవన్తి" అని ఈశ్రుత్యర్థమును ప్రతిపాదించుచు వేదవ్యాసభగవానుని బ్రహ్మసూత్రములు తద్భాష్యము ఇట్లున్నవి —

"న తృతీయే తథోపలబ్ధేః" సూ. 3. 1. 18

భాష్యమ్— యత్పునరుక్తం దేహలాభోపపత్తయే సర్వే చన్ద్రమసం గన్తుమర్హన్తి, "పంచమ్యామాహుతౌ" ఇత్యాహుతిసంఖ్యానియమాదితి తత్ప్రత్యుచ్యతే— న తృతీయే స్థానే దేహలాభాయ పంచసంఖ్యానియమ ఆహుతీనా మాదర్తవ్యః కుతః? తథోపలబ్ధేః, తథా హ్యన్తరేణైవాఽఽహుతిసంఖ్యానియమం, వర్ణితేన ప్రకారేణ తృతీయస్థానప్రాప్తిరుపలభ్యతే. "జాయస్వ మ్రియస్వేత్యేతత్తృతీయం స్థానం" ఇతి.

అపిచ పంచమ్యా మాహుతా వాపః పురుషవచసో భవన్తీతి మనుష్యశరీరహేతుత్వేనాఽఽహుతిసంఖ్యా సంకీర్త్యతే, న కీటపతంగాదిశరీరహేతుత్వేన. పురుషశబ్దస్య మనుష్యజాతివచనత్వాత్.

అపిచ. పంచమ్యా మాహుతా వపాం పురుషవచస్త్వ ముపదిశ్యతే, నాఽపంచమ్యా మాహుతౌ పురుషవచస్త్వం ప్రతిషిధ్యతే వాక్యస్య ద్వ్యర్థతాదోషాత్.

తత్ర యేషా మారోహాఽవరోహా సంభవత స్తేషాం పంచమ్యా మాహుతౌ దేహ ఉద్భవిష్యతి, అన్యేషా న్తు వినైవాహుతిసంఖ్యయా భూతాంతరోపసృష్టాభి రద్భి ర్దేహ ఆరభ్యతే।

"స్మర్యతేఽపి చ లోకే" సూ 3.1.19

భాష్యమ్—అపి చ స్మర్యతే లోకే-ద్రోణ, ధృష్టద్యుమ్న, ప్రభృతీనాం సీతాద్రౌపదీప్రభృతీనాం చాఽయోనిజత్వమ్, తత్ర

ద్రోణాదీనాం యోషిద్విషయైకాహుతి ర్నాస్తి. ధృష్టద్యుమ్నా దీనాం స్తు యోషిత్పురుషవిషయే ద్వే అప్యాహుతీ న స్తః. యథా చ తత్రాహుతి సంఖ్యానాదరో భవతి. ఏవ మన్యత్రాపి భవిష్యతి. బలాకాఽప్యంత రేణైవ రేతస్సేకం గర్భం ధత్త ఇతి లోకే రూఢిః''

దీని సారాంశము—పుణ్యాత్ములు చంద్రలోకమునకు వెళ్ళి అక్కడ భోగము లనుభవించి మరల జన్మింతురో వారికి మాత్రమె ఆద్యులోకము, దానినుండి పర్జన్యుడు, ఆపై వర్షధారలద్వారా భూమిలోని సస్యములు, ఆపైని అన్నముద్వారా పురుషుడు, ఆతని నుండి శుక్లముద్వారా స్త్రీ అను ఐదుస్థానములందు యథాక్రమముగా ప్రవేశము కలుగునుగాని అన్యులకు గలుగు జన్మములతో నా ఐదు స్థానములతో సంబంధ మపేక్షితము కాదు.

ఆశ్రుతిలోనయిదవస్థానమైన స్త్రీయందు దేహోత్పత్తి చెప్పబడినదే గాని 4. 3. మొదలగు నితరస్థానములలో దేహోత్పత్తి కలుగదని చెప్పబడలేదు.

మరియు ద్రోణ, ధృష్టద్యుమ్నాదులయొక్కయు, సీతాద్రౌపదీప్రభృతులయొక్కయు, అయోనిజత్వము లోకప్రసిద్ధమై యున్నది. ద్రోణాదులకు ఐదవస్థానమైన స్త్రీయందు ప్రవేశములేకయే దేహోత్పత్తి యైనది. ధృష్టద్యుమ్నాదులకు స్త్రీపురుషరూపములైన 5. 4స్థానములతో నిమిత్తములేకుండగనే దేహోత్పత్తి యైనది. అట్లే అన్యుల విషయమైనకూడ నగును. బలాకపక్షికి రేతస్సేకము లేకయే గర్భధారణ మగునని లోకప్రసిద్ధి అని.

ఈయంశమే నీలకంఠీయములో నిట్లు చెప్పబడినది—

''అగ్నౌ పంచక్రమా త్ప్రాప్య హావ్య మేతి మనుష్యతామ్,
అగ్నయ స్త్వగ్ని రర్కః త్మా పురుషో యోషి దిత్యపి.

అగ్నౌ ప్రాస్తాహుతి స్సమ్య గాదిత్య ముపతిష్ఠతే,
ఆదిత్యా జ్జాయతే వృష్టి ర్వృష్టే రన్నం తతః ప్రజాః.
ద్రోణో వహ్నిచతుష్టోత్థో యోపి × గ్నే రభావతః,
అగ్నితియోత్థితా సీతా భూత్వా పిత్రో రభావతః.
క్షిప్తమాత్రం హవి ర్వహ్నౌ మిథునత్వ ముపాగతమ్,
ప్రాగ్నిజా వతః ఫుత్రౌ ద్రుపదస్య సురాధిపౌ."

ఇట్లు ప్రతివాదుల కశాస్త్రీయము లనిపించిన ద్రోణ ద్రౌపదీధృష్ట ద్యుమ్నాద్యుత్పత్తులే అయోనిజజన్మములకు నిదర్శనములని కంఠో క్తిగా శాస్త్రము లుద్ఘోషించుచుండ నట్లు జన్మించుటను శాస్త్రము లంగీకరింపవనుచు వారల యుత్పత్తులనుగూర్చి కుకల్పనలు చేసి యేమేమో వ్రాసిన ప్రతివాదుల చర్య నింద్యము.

అనేకవిధములుగా వారివారి జన్మములు కలిగినట్లు ఆర్షగ్రంథము లుద్ఘోషించుచుండ నవి తమ కసంభావితములుగా దోచినంత మాత్రమున నసత్యములును, కల్పితములు నయిపోవునా! వారివారి జన్మములలోని వైచిత్ర్యములనుగూర్చి యొకమహాపురుషుడు లోకు లకు బోధించిన పురాణస్థమైయున్నయీవిషయము నవలోకింపుడు—

స్కాన్దము— బ్రహ్మోత్తరఖండము. అ 19

"ఇతి సర్వాన్ సభ్యజనాన్ సంశయావిష్టచేతసః,
విలోక్య వృద్ధ స్తత్రైక స్సర్వజ్ఞో లోకతత్త్వవిత్.
మాయామయ మిదం విశ్వం దృశ్యతే శ్రూయతే చ యత్,
కిం భావ్యం కి మభావ్యం చ సంసారేఽస్మిన్ క్షణాత్మకే,
అనిరూప్య మభూతార్థం మాయయా జాయతే స్ఫుటమ్.
ఈశ్వరస్య వశే మాయా తస్య కో వేద చేష్టితమ్,
యథాపకేతో శ్చ రాజర్షే శ్శుక్రం నిపతితం జలే,

సమున్త్రం తజ్జలం పీత్వా వేశ్యా గర్భం దధౌ కిల.
మునే ర్విభాండకస్యాపి శుక్రం పీత్వా సహాంభసా.
హారిణీ గర్భిణీ భూత్వా ఋశ్యశృంగ మసూయత,
సురాష్ట్రస్య తథా రాజ్ఞః కరం స్పృష్ట్వా మృగాంగనా.
తత్క్షణా ద్గర్భిణీ భూత్వా మునిం ప్రాసూత తాపసమ్,
తథా సత్యవతీ నారీ శఫరీగర్భసంభవా.
తథైవ మహిషీగర్భే జాతశ్చ మహిషాసురః,
తథా సన్తి పురా నార్యః కారుణ్యా ద్గర్భసంభవాః.
తథాహి వసుదేవేన రోహిణ్యా స్తనయోఽభవత్,
దేవతానాం మహర్షీణాం శాపేన చ వరేణ చ.
అయుక్త మపి యత్కర్మ యుజ్యతే నాత్ర సంశయః,
సాంబస్య జఠరా జ్జాతం ముసలం మునిశాపతః.
యువనాశ్వస్య గర్భోఽభూ న్మునీనాం మన్త్రగౌరవాత్".

ఉత్పత్తులలోని యఘటితఘటనలనుగూర్చి సందేహించులోకులకు వృద్ధుడును, సర్వజ్ఞుడును, లోకతత్త్వవేత్తయు నగు నొక మహాపురుషు డిట్లు బోధించెను —

"ఈవిశ్వమంతయు మాయామయము. అనాదియై క్షణభంగురమైన యీసంసారములో నెప్పుడో యేమూలనో పుట్టి పోవుమంసువాడు ఇది సంభావ్యము, ఇది యసంభావ్యము అని నిర్ధారణ మెట్లు చేయగలుగును? అభూతపూర్వములై నిరూపింప శక్యముగాని విషయములు మాయావశమున గలుగుచున్నవి. అట్టి మాయ, ఈశ్వరునకు వశమై యున్నది. అట్టి ఈశ్వరుని చేష్టిత మెవ్వని కెరుక? చూడుడు— రాజర్షియగు యూపకేతువుయొక్క శుక్రముతో మిళితమయిన జలమును త్రాగి వేశ్య గర్భవతియైనది. విభాండకమునియొక్క శుక్రముతో మిళితమైన జలమును త్రాగి యొక హారిణి (ఆడలేడి) గర్భము

ధరించి ఋశ్యశృంగుని కనినది సురాష్ట్రభూపతియొక్క హస్తమును స్పృశించి యొక హరిణి గర్భవతియై యొక తాపసుని గనినది. అట్లే మత్స్యగర్భమునుండి సత్యవతీదేవి జన్మించినది మహిషీగర్భమునుండి మహిషాసురుడు జన్మించెను. వసుదేవునివలన దేవకీదేవి ధరించిన గర్భము అతని మరియొకభార్య యైన రోహిణీదేవియందు యోగమాయచే ప్రవేశపెట్టబడగా నామెయందు బలరాముడు జన్మించెను. దేవతలయొక్కయు, మహర్షులయొక్కయు శాపప్రభావమునగాని, వరప్రభావమునగాని అఘటితఘటనలు జరుగుచుండును. సంశయము లేదు. సాంబుని కడుపునుండి మునిశాపమున ముసలము పుట్టినది. ముని మన్త్రప్రభావమున యువనాశ్వునకు గర్భము కలిగినది." అని.

ఇట్లు వేదశాస్త్రపురాణేతిహాసము లుత్పత్తులలోని వైచిత్ర్యము లనంతము లని బోధించుచుండ ప్రతివాదులు వాని నసంభావితము లనుట, అవైదికసంప్రదాయప్రసాదమూలకమైన యజ్ఞాన మగుటచే నింద్యము

శిఖండినిగూర్చిన మ. భా. చ. కారులవ్రాతలో "ఈతడు ప్రథమమున స్త్రీగా జన్మించి పిమ్మట పురుషుడై భీష్ముని బడగొట్టెననియు, నీతనికి బెక్కండ్రు పుత్రులుగూడ గలరనియు, మహాభారతమున గలదు. ఈగాధలోని సత్య మెంతవరకో? స్త్రీలు పుంభావముతో మెలగిన బురువనిర్వేశ మగుదురని భారతీపత్రికయొక్క ప్రభవమార్గశిరసంచికలో ప్రకటింపబడెను. శిఖండియొక్క పుంస్త్వ మట్టిదే యని విశద మగును" (పు 220) అనుధోరణి పూర్వోక్తదృష్టాంతములచే నిరస్తమైనది.

ఆర్షగ్రంథము లప్రమాణము లనియు, పత్రికలు ప్రమాణము లనియు భావించెడి యీప్రతివాదికి స్త్రీకి పుంస్త్వము ప్రాప్తించిన పత్రికానిదర్శనమునే చూపుచున్నాము.

—: సంస్కృతపత్రికా— 7-12-1948. స్త్రియాః పురుషత్వమ్ :—

"కలకత్తామహిలాహాస్పిటలస్య శల్యచికిత్సావిభాగే ఏకా 26 వర్షీయా వంగమహిలా ఆగతాఽఽస్తే! ఏతస్యా వివాహ అష్టవర్ష పూర్వం జాత ఆసీత్, ఇయ మధునా సౌభాగ్యవతీ మస్తకే సిందూరం హస్తయో ర్హస్తిదన్తవలయాని సౌభాగ్యవత్యా ధారణీయాం శాటీం పరిదధాతి. అస్యాః కించిద్దినేభ్యః స్త్రీచిహ్నస్య స్థానే పురుషచిహ్నముదేతి."

సంస్కృతపత్రికా (8-4-52).

—: లింగపరివర్తనమ్ :—

"కొలంబో సమాచారోఽయమ్. ఉవామండలస్య కోసాపోసా గ్రామే ఏకపురుష స్యైకా పత్నీ శనై శ్శనైః స్త్రీత్వం విహాయ పురుషత్వ మాభజత.

డాక్టరై స్తస్యాః పరీక్షా కృతా. సా పురుష ఆసీత్. అనేన పంచదశవర్షవయస్కయా కయాచి త్కన్యయాసహ వివాహః కృతః. కొలంబోసరకారస్య వసతినిర్మాణయోజనాయాం స కార్యం కరోతి. ఏకేన పత్రేణ తస్య తత్పత్న్యాశ్చ చిత్రం ప్రకాశితమ్."

ఇట్లు వార్తాపత్రికలుకూడ అఘటితఘటనలు జరుగుచున్నట్లు ప్రకటించుచుండ ఆర్షగ్రంథము లట్టివిషయముల నుదాహరించినపుడు వాని నసంభవము లని త్రోసివేయు ప్రతివాదుల చర్య నింద్యము.

ఇంతవరకు వైశేషికవేదాంతదర్శనములనుబట్టి శుక్రశోణితసమ్మేళనముతో బనిలేకుండ నయోనిజులై జన్మించుట, శాస్త్రసిద్ధమే అనియు, నిట్లుజన్మించినవారే ద్రోణాచాపదీధృష్టద్యుమ్నాదు లనియు, మహాభారతోక్తమైయున్న వారలయుత్పత్తిప్రకారము సత్యమనియు,

ద్రౌపదీధృష్టద్యుమ్నులు ద్రుపదునకు దత్తులను ప్రతివాదులమాట అసంబద్ధప్రలాపమనియు నిరూపించినాము. దీనిచే—

"ధృష్టద్యుమ్నునితో నయోనిజగా ద్రౌపదికూడ పుట్టె నని యాజు డగ్నివేదికమీద ద్రౌపదిని గూర్చుండబెట్టియుండును." (పు 224.)

"ధృష్టద్యుమ్నుడుమాత్రము ద్రుపదరాజకుటుంబమున జన్మింపక, యేసంకీర్ణబ్రాహ్మణునకో జన్మించెను. ద్రౌపది ధృష్టద్యుమ్నునకు దగిన సోదరియె. ఇరువురును యాజోపయాజులసంబంధులే యని తోచును. ద్రుపదుడు సంకీర్ణు డగుటచేతను తత్సదృశుడగు ధృష్టద్యుమ్నుడు పుత్రుడగుటయు, ద్రౌపది పుత్రికయగుటయు, నేతాదృశులగు పాండవులతో వారికి సంబంధము సరిపడినది." (పు 220)

అను మ. భా. చ. కారుల దురుక్తులు నిరస్తములు.

పర్యవసానమేమనగా, శ్రీమద్రామాయణోక్తప్రకారము పూర్వజన్మములో కుశధ్వజుడను బ్రహ్మర్షికి—

"కుశధ్వజో మమ పితా బ్రహ్మర్షి రతులప్రభః,
తస్యాఽహం కుర్వతో నిత్యం వేదాభ్యాసం మహాత్మనః
సంభూతా వాఙ్మయీ కన్యా నామ్నా వేదవతీ స్మృతా,"

అనిచెప్పబడిన విధముగా వాఙ్మయకన్యయై జన్మించి తపము జేయుచుండిన వేదవతి తనను బలాత్కరింపబోయిన రావణుని ధిక్కరించి—

"యది త్వస్తి మయా కించి త్సుకృతం దత్తం హుతం తథా,
తస్మా త్త్వయోనిజా సాధ్వీ భవేయం ధర్మిణస్సుతా.
ఏవముక్త్వా ప్రవిష్టా సా జ్వలితం జాతవేదసమ్."

నిన్ను వధించుటకు నిమిత్తముగా నేనయోనిజనయి యొకానొక ధర్మాత్మునకు పుత్రికగా బుట్టుదు నని చెప్పి ప్రజ్వలించుచున్న

యగ్నిలో తన దేహము నాహుతిజేసి తరువాత నయోనిజయయి జనకపుత్రికగా నావిర్భవించిన సీతామహాదేవివలె మహాభారతమందలి పార్వతిప్రకపాత్రప్రకారము పూర్వజన్మములో నొకానొక ఋషికి కన్యకయై పుట్టి వివాహముగాక పతికొరకు పరమేశ్వరు నారాధించి యప్రయత్నముగా నయిదుసారులు పతినను గ్రహింపుమని కోరియీశ్వరునిచే పంచ పతులు నీకు పైజన్మములో గలుగుదు రను వరము నొంది ఆశరీరమును విడిచి తరువాత ద్రుపదయజ్ఞవేదికనుండి అయోనిజయై భూభారహరణమునకై ద్రౌపది యావిర్భవించినది. ఆద్రౌపదిని గూర్చి—

"స్వర్గశ్రీః పాండవార్థాయ సముత్పన్నా మహామఖే,
సేహ తప్త్వా తపో ఘోరం దుహితృత్వం తవాగతా." (ఆది_అ 97)

అని ద్రుపదునితో వ్యాసమహర్షి చెప్పుటనుబట్టి అసలామె స్వర్గలక్ష్మియనియు, అస్వర్గలక్ష్మికే "ద్రౌపదీ త్వథ సంజజ్ఞే శచీభాగాదనిందితా" అను సంభవపర్వవచనమునుబట్టి శచీదేవి యను నామమనియు, నామెయే ఋషికన్యయై పుట్టి వేదవతీదేవివలె తపము జేసి యీశ్వరవరమునొంది శ్రీరామచంద్రునికొరకు జనకపుత్రియై సీతయుద్భవించినట్లు ద్రుపదుని యజ్ఞములో, పాండవులకొరకు ద్రుపదపుత్రికగా ద్రౌపదియను పేరుతో నుద్భవించిన దనియు దెలిసికొనవలయును.

"రాఘవత్వేఽభవ త్సీతా రుక్మిణీ కృష్ణజన్మని"

అని చెప్పబడినట్లు విష్ణుపత్నియగు లక్ష్మీదేవియే ముందు వేదవతియై యుద్భవించి పిమ్మట శ్రీరామపత్నియగు సీతయై యుద్భవించినట్లు స్వర్గలక్ష్మియే ముందు ఋషికన్యయై యుద్భవించి పిమ్మట పంచేంద్ర స్వరూపులగు పాండవులకు పత్నియగు ద్రౌపదియై యుద్భవించిన దని సిద్ధాంతము. దేవీభాగవతమునందుగూడ ద్రౌపది వేదవ

మధ్యమునుండి జన్మించె ననియు, నామె లక్ష్మ్యంశసంభూతురా లనియు జెప్పబడినది—

"ద్రౌపదీ చ మహాభాగా కథం దుఃఖస్య భాగినీ,
వేదీమధ్యాచ్చ సంజాతా లక్ష్మ్యంశసంభవా కిల" (స్క-4-అ17)

మరియు సీతాప్రతికృతియే ద్రౌపదీదేవి యనియు, కృతత్రేతా ద్వాపరములలో వేదవతీసీతాద్రౌపదీస్వరూపములతో నావిర్భావము జరిగిన దనియు నా దేవీభాగవతమందే చెప్పబడినది—

"కృతే యుగే వేదవతీ కుశధ్వజసుతా శుభా,
త్రేతాయాం రామపత్నీ చ సీతేతి జనకాత్మజా.
తచ్ఛాయా ద్రౌపదీదేవీ ద్వాపరే ద్రుపదాత్మజా,
త్రిహాయణీచ సా ప్రోక్తా విద్యమానా యుగత్రయే" (స్క-9-అ16)

"వ్యా—యతో యుగత్రయే వర్తమానాఽత స్త్రిహాయణీతి నామ. హాయనశబ్దోఽత్ర యుగపరః"

మరియు శ్రీరామపత్నియగు సీతామహాదేవిని రావణుడపహరించుటకు బూర్వము అగ్నిదేవుడు విప్రరూపమున గోచరించి శ్రీరామునితో నిట్లుచెప్పెను— దేవీభాగవతము—(స్క-9. అ16)

"భగవన్ శ్రూయతాం రామ కాలోఽయం యదుపస్థితః,
సీతాహరణకాలోఽయం తవైవ సముపస్థితః.
జగత్ప్రసూం మయి న్యస్య ఛాయాం రక్షాఽంతికేఽధునా,
దాస్యామి సీతాం తుభ్యం చ పరీక్షాసమయే పునః"

రామచంద్రా! ఈజగన్మాతయగు సీతను నారక్షణములో నుంచి నేనిచ్చెడి ఛాయాసీతను నీ రక్షణములో నుంచుకొనుము ముందు జరుగబోవు అగ్నిపరీక్షలో ఈజగన్మాతను నీకు సమర్పించుకొందును అని అడియంతయు నట్లే జరిగినతరువాత ఛాయాసీత యిక నేను చేయ

వలసిన పనిని విధింపు డని యగ్నిదేవుని, శ్రీరాముని గోరగా వా రిట్లుపదేశించిరి—

"త్వం గచ్ఛ తపసే దేవి పుష్కరం చ సుపుణ్యదం,
కృత్వా తపస్యాం తత్రైవ స్వర్గలక్ష్మీ ర్భవిష్యసి.
సాచ తద్వచనం శ్రుత్వా ప్రతప్య పుష్కరే తపః,
దివ్యం త్రిలక్షవర్షం చ స్వర్గలక్ష్మీ ర్బభూవ హ.
సాచ కాలేన తపసా యజ్ఞకుండసముద్భవా,
కామినీ పాండవానాం చ ద్రౌపదీ ద్రుపదాత్మజా."

దేవీ! నీవు పుష్కరక్షేత్రమున తపముచేయుము. అపై నీవు స్వర్గలక్ష్మివగుదువు. ఇట్లుపదేశింపబడిన యామె దీర్ఘకాలము తపము చేసి అట్టే స్వర్గలక్ష్మి యయ్యెను. ఆస్వర్గలక్ష్మియే కొంతకాలమునకు ద్రుపదుని యజ్ఞవేదికనుండి యావిర్భవించి పాండవులకు పత్నియైనది.

ఈ దేవీభాగవతగాథకూడ వేదవ్యాసోక్తిగ వెనుక జూపబడినది—

"స్వర్గశ్రీః పాండవార్థాయ సముత్పన్నా మహామఖే,
సేహ తప్త్వా తపో ఘోరం దుహితృత్వం తవాగతా"

అను మహాభారతోక్తికి పోషకమగుచున్నది. కనుక ద్రౌపదీ జన్మమునుగూర్చిన ప్రతివాదుల రభసవాదము లన్నియు హేయములు.

ద్రౌపదీదేవినిగూర్చి నోటికివచ్చినట్లు దుర్భాష లాడిన విమర్శక మ్మన్యుల కామె స్వరూపము నొకింత నిరూపించుచున్నాము—

## —: లోకోత్తరద్రౌపదీస్వరూపము :—

"నీలోత్పలసమో గన్ధో యస్యాః క్రోశా త్ప్రధావతి,
యా బిభర్తి పరం రూపం యస్యా నాస్త్యుపమా భువి"

ఆమె శరీరమునుండి నీలోత్పలములతో సమానమైన పరిమళము క్రోశపర్యంతమువ్యాపించుచుండెడిది. ఆమె రూప మద్భుతమైనది. ఆమెకు సాటి పృథివిలోలేదు

మరియు, ఉత్తమస్త్రీ ద్వాత్రింశత్ (32) లక్షణములు కలదై యుండును. హరిశ్చంద్రుడు విశ్వామిత్రకృతపరీక్షలో తన పత్నిని విక్రయింపబూనినపుడు కొనుటకు వచ్చిన విప్రుడు ఆమెకు మూల్యము నిర్ణయించుచు నిట్లుచెప్పెను—

దేవీభాగవతము. స్క 7. అ22:—

"అనురూప మిదం విత్తం గృహాణాఽర్పయ మేఽబలామ్,
ధర్మశాస్త్రేషు యద్దృష్టం స్త్రియో మూల్యం నరస్యచ.
ద్వాత్రింశల్లక్షణోపేతా దక్షా శీలగుణాన్వితా,
కోటిమూల్యంసువర్ణస్య స్త్రియః పుంస స్తథాఽర్బుదమ్.

వ్యా—స్త్రియో మూల్యం సువర్ణస్య కోటిః, పుంసస్తు సువర్ణస్య అర్బుదం; దశకోట్యో మూల్యమిత్యర్థః. స్త్రియో ద్వాత్రింశల్లక్షణాని తు విరాటపర్వణి ద్రౌపదీవర్ణనే స్పష్టాని.

పుంసస్య ద్వాత్రింశల్లక్షణాని తు కాశీఖండ ఏకాదశాధ్యాయే స్పష్టాని"

"సచ్చరిత్రము సద్గుణములు కలిగి ద్వాత్రింశత్ 32లక్షణములు గలస్త్రీకి మూల్యము సువర్ణకోటి యనియు నట్లే ద్వాత్రింశల్లక్షణములుగల పురుషునకు మూల్యము పదిసువర్ణకోటు లనియు, ధర్మశాస్త్రములలో మూల్యము నిర్ణయింపబడియున్నది ఆప్రకారము మూల్యము నీమె కొరకిచ్చుచున్నాను ఈమెను నాకు సమర్పింపుము" అని ఇచ్చట వ్యాఖ్యాత పురుషుని ద్వాత్రింశల్లక్షణములు కాశీఖండములోను, స్త్రీద్వాత్రింశల్లక్షణములు విరాటపర్వములోను స్పష్టములు. అని చెప్పుటచే నాస్థలములలోని గ్రంథసందర్భము ప్రదర్శింపబడు చున్నది—

కాశీఖండము— అ 11.

"పంచసూక్ష్మః పంచదీర్ఘ స్సప్తరక్త ష్షడున్నతః,
త్రిపృథు ర్లఘుగంభీరో ద్వాత్రింశల్లక్షణ స్స్వితి.

వ్యాఖ్యా-తాన్యేన ద్వాత్రింశల్లక్షణాని మక్బిర్విశేషస్తై ర్దర్శయతి-

పంచసూక్ష్మః పంచ- త్వక్కేశాంగుళిదశనాంగుళిపర్వాణి సూక్ష్మాణి యస్య స తథా, పంచదీర్ఘః పంచ-భుజనేత్రహనుజానునాసా దీర్ఘా యస్య స తథా, సప్తరక్తః- సప్తపాణితలనేత్రాంతతాలుజిహ్వాఽధరోష్ఠనఖా రక్తా యస్య స తథా, షడున్నతః-షట్-వక్షః కుక్ష్యలకస్కంధకరవక్త్రాణి ఉన్నతాని యస్య స తథా, త్రిపృథుః త్రీణి-లలాటకటివక్షాంసి పృథూని విస్తీర్ణాని యస్య స తథా, లఘుగంభీరః-లఘుశ్చాసౌగంభీరశ్చేతి లఘుగంభీరః అత్ర త్రిశబ్దావధ్యాహర్తవ్యౌ, త్రిలఘుః త్రిగంభీర ఇత్యర్థః. త్రిలఘుః త్రీణి గ్రీవాజంఘామేహనాని లఘూని హ్రస్వాని యస్య స తథా. త్రిగంభీరః-త్రయః- స్వరసత్త్వనాభయోగంభీరా యస్య స తథా"

ఇట్లు ద్వాత్రింశల్లక్షణములు గల పురుషు డుత్తమపురుషుడని గ్రహింపవలయును.

ఇక విరాటపర్వోక్తస్త్రీలక్షణసందర్భ మెట్టి దనగా-వనవాసమును పూర్తిచేసి విరాటనగరములో నజ్ఞాతవాసము జేయ నిశ్చయించి పాండవులు తమ వేషములు మార్చుకొని యొక్కొక్కరే ప్రవేశించుటలో యుధిష్ఠిరభీమసేనుల ప్రవేశ మయినతరువాత సైరంధ్రీవేషముతో ద్రౌపదీదేవి ప్రవేశించునపుడు విరాటపత్ని యగు సుదేష్ణ ప్రాసాదమునుండి చూచి యాహ్వానించి ప్రశ్నింప నాకేదేని పని చెప్పిన చేయుదు నని ద్రౌపదీదేవి పలుకగా సుదేష్ణ యిట్లనును-

"నైవం రూపా భవన్త్యేవ యథా వదసి భామిని,
ప్రేషయన్తీవవై దాసీ ర్దాసాంశ్చ వివిధాన్ బహూన్.

టీ- "నైవంరూపా త్వమసి, కిన్తు దాసాన్ దాసీశ్చ ప్రేషయన్తీవ. బహూనాం స్వామిన్యసీత్యర్థః.

"నోచ్ఛగుల్ఫా సంహతోరు స్త్రిగంభీరా షడున్నతా,
రక్తా పంచసు రక్తేషు హంసగద్గదభాషిణీ.

టీ— నోచ్ఛౌ న బహి ర్నిర్గతౌ గూఢా విత్యర్థః. నోచ్ఛౌ గుల్ఫౌ పాదగ్రన్థీ యస్యా స్సా తథా. త్రిగంభీరా-త్రిషు శబ్దబుద్ధినాభిషు గహనా. షడున్నతా-షట్సునాసికాఽక్షిద్వయ శ్రోత్రినఖస్తన కృకాటికాసు ఉన్నతా. పంచసుస్థానేషు పాణిపాదతలనేత్రాన్తోష్ఠజిహ్వానఖేషు ఏతాన్యేవ సంజ్ఞయా పంచరక్తాని తేషు రక్తా హంసవద్గద్గదం కించిల్లుప్తాక్షరం మధురం వా భాషతే సా హంసగద్గదభాషిణీ.

"సుకేశీ సుస్తనీ శ్యామా పీనశ్రోణిపయోధరా,
తేన తేనైవ సంపన్నాకాశ్మీరీవ తురంగమీ,

టీ— తేన తేన లక్షణేన-మన్దగతిత్యాదినా। అర్జునమిశ్రీయమ్— కాశ్మీరీ. కాశ్మీరదేశోద్భవా తురంగమీ యథా అశ్వపరీక్షా శాస్త్రే ప్రతిపాదితలక్షణేన సంపన్నా, తథా స్త్రీణాం సాముద్రికాదా యల్లక్షణం ప్రతిపాదితం తేన తేన సంపన్నా॥

"అరాలపక్ష్మనయనా బింబోష్ఠీ తనుమధ్యమా,
కంబుగ్రీవా గూఢశిరా పూర్ణచన్ద్రనిభాననా.

టీ— అరాళే వక్రే కృష్ణే వా పక్ష్మణీ యయో స్తాదృశే నయనే యస్యాస్సా తథా. కంబుగ్రీవా శంఖవద్రేఖాత్రయాఽఙ్కిత గ్రీవా, గూఢశిరా గుప్తనాడికా॥"

"శారదోత్పలపత్రాక్ష్యా శారదోత్పలగన్ధయా,
శారదోత్పలసేవిన్యా రూపేణ సదృశీ శ్రియా.

టీ. శారదోత్పలం హస్తద్వయం. తేన సేవిన్యా.

"కా త్వం బ్రూహి యథా భద్రే నాఽసి దాసీ కథంచన,

యక్షీ వా యది వా దేవీ గన్ధర్వీ యదివాఽప్సరాః.
దేవకన్యా భుజంగీ వా నగరస్యాఽధిదేవతా,
విద్యాధరీ కిన్నరీ వా యది వా రోహిణీ స్వయమ్.
అలంబుసా మిశ్రకేశీ పుండరీకాఽథ మాలినీ,
ఇన్ద్రాణీ వారుణీ వా త్వం త్వష్టు ర్ధాతుః ప్రజాపతేః,
దేవ్యో దేవేషు విఖ్యాతా స్తాసాం త్వం కతమా శుభే.''

మానినీ! ఇట్టినీస్వరూపము దాస్యము చేయుటకు తగినదికాదు. దాసదాసీవర్గమును బోషింపదగిన స్వరూపము నీది

ఆనేత్రములు, ఆశ్రోత్రములు, ఆనఖములు, ఆనాసిక, ఆహస్తములు, ఆపాదములు, ఆఓష్ఠము, ఆవాక్కు, చెప్పవలసిన దేమున్నది? ఉత్తమస్త్రీకి సాముద్రికశాస్త్రములో జెప్పబడిన సర్వలక్షణములు నీయందు గోచరించుచున్నవి. నీది శ్రీదేవీరూపముతో సమానమై యున్నది. నీవు దాసివికావు. యథార్థముచెప్పుము. నీవువిఖ్యాతిగల దేవతాస్త్రీలలో నెవ్వతెవో తెల్పుము. అని ఇట్టి మనుష్యదుర్లభను యిన దివ్యస్వరూపము ద్రౌపదీదేవిది.

ఆమె పూర్వజన్మగాథలను పరిశీలించినయెడల నాలాయనీ జన్మములో పూర్వోక్తప్రకారము సీతాఽరుంధతీ ప్రభృతులతో తులదూగిన మహాపతివ్రత. ఋషికన్యకాజన్మములో పతిప్రాప్తికై శంకరునిగూర్చి యఖండతపముజేసి శంకరానుగ్రహపాత్రమై మరుచటి జన్మలో సంకల్పసిద్ధి యగునట్లు వరమునొందిన మహాసాధ్వి ఆపై భూభారహరణార్థము సీతాదేవివలె అయోనిజయై ద్రౌపదిగా నావిర్భవించిన స్వర్గలక్ష్మి. ఇట్టి విశేషములు గల ద్రౌపదీదేవిని కులట యని దుర్భాషలాడిన విమర్శకంమన్యుల నేమనవలెనో ప్రాజ్ఞు లాలోచింతురుగాక. స్త్రీలలో నెట్టివారు దుశ్శీల లగుదురో సాముద్రికోక్తదుష్టలక్ష

ణములనుబట్టి గ్రహింప నగు నని యుధిష్ఠిరునితో భీష్ముడు చెప్పెను—

"అసాధ్వ్యశ్చాఽపి దుర్వృత్తాః కులఘ్నాః పాపనిశ్చయాః,
విజ్ఞేయా లక్షణై ర్దుష్టైః స్వగాత్రసహజై ర్నృప!"
(అనుశా— అ 4?)

టీ "సహజైః పాణిపాదరేఖాదిభిః"

ద్రౌపదీదేవియందు పరమపతివ్రతలయందుండునట్టి యుత్తమములయిన ద్వాత్రింశల్లక్షణము లున్నట్లు గ్రంథ ముద్ఘోషించుచుండ కులటలయందుండు దుర్లక్షణము లున్నట్లు ప్రకటించు ప్రతివాదుల ప్రాత హేయము.

ఏవి కులటాలక్షణములో, ఏవి కులకాంతాలక్షణములో, ఏవి మహాపతివ్రతాలక్షణములో ఎంత మాత్ర మెరుగక నోటికి వచ్చినట్లు వాకొను విమర్శకుల వైఖరి గర్హ్యము.

—: ఆస్తికనాస్తికవిభేదము :—

లోకములో ఆస్తికు లనియు, నాస్తికు లనియు రెండురకములు. అందు వేదశాస్త్రపురాణేతిహాసాత్మకమయిన ఆర్షవాఙ్మయమును ప్రమాణముగా నమ్మి శాస్త్రసమ్మతమైనదాని యర్థమును గ్రహించి దానికి లోకప్రసిద్ధినవలోకించి అనాదిసిద్ధ సంప్రదాయము ననుసరించి విద్వత్పరంపర నవలంబించి తన్మూలమున అతీంద్రియవిషయములను నిస్సంశయముగా విశ్వసించి సంచరించువా రాస్తికులు

శాస్త్రసిద్ధాంతము లసంభావితము లనుచు, లోకప్రసిద్ధి మూఢవిశ్వాస మనుచు, విద్వాంసులు ఛాందసు లనుచు, అతీంద్రియవిషయము లవిశ్వసనీయము లనుచు, ఇది ప్రక్షిప్త మనుచు, ఇది యిట్లుయుండు నని నాకు విమర్శింపగా తోచుచున్నదనుచు, ఇచ్చట నాయు

భిప్రాయ మిది యనుచు, గ్రంథకారుడైన మహర్షి యిచ్చట పక్షపాతముగా వ్రాసినా డనుచు, పూజ్యుల నపూజ్యులనుచు, అపూజ్యులను పూజ్యులనుచు, మలినాంతః కరణలముతో నూహించి ఆవైదికసంప్రదాయ మవలంబించి అపార్థములు కల్పించి పాపభీతిని వర్జించి ఆర్ష వాఙ్మయమున కవ్యవస్థ నాపాదించి యుక్తిప్రమాణవిరోధములను పాటింపక స్వవచనవ్యాఘాతములను గణింపక అసత్యమునకు జంకక, యథేష్టముగా ప్రసంగించుచు తాము చెడి లోకులను చెడగొట్టుట కుద్యమించువారు నాస్తికులు. కనుకనే స్కాందములో—

"స్వభావ ఏవ క్రూరాణాం నాస్తికానాం దురాత్మనామ్,
ఆత్మానం పాతయన్త్యేవ పాతయ న్త్యపరం చ యత్."

అని చెప్పబడినది. చరకసంహితలో నాస్తికలక్షణములు చెప్పి నాస్తిక్యబుద్ధి పాపిష్ఠమని చెప్పి దానిని విడిచిపెట్టవలయు ననియు, సత్పురుషుల (శాస్త్రకర్తలగు మహర్షుల) బుద్ధి యను ప్రదీపమును బట్టి సర్వము తెలిసికొనవలయుననియు నిట్లుపదేశింపబడెను —

"న పరీక్షా న పారీక్ష్యం న కర్తా కారణం నచ,
న దేవా నర్షయ స్సిద్ధాః కర్మ కర్మఫలం నచ.
నాస్తికస్యాస్తి నైవాత్మా యదృచ్ఛోపహతాత్మనః,
పాతకానాం పరం చైతత్పాతకం నాస్తికగ్రహః.
తస్మా న్మతిం ప్రముచ్యైతా మమార్గప్రసృతాం బుధః,
సతాం బుద్ధిప్రదీపేన పశ్యే త్సర్వం యథాతథమ్!!

మరియు— వేదములయం దప్రామాణ్యము శాస్త్రములయందు నిరసనభావము సర్వవిషయములయందును అవ్యవస్థ అనునవి ఆత్మ నాశనహేతువు లని చెప్పబడినది.—

"అప్రామాణ్యం చ వేదానాం శాస్త్రాణాంచాఽభిలంఘనమ్,
అవ్యవస్థా చ సర్వత్ర ఏతన్నాశన మాత్మనః. (అనుశా।। అ.7)

ఈస్థలమందే యుక్తకను ఇట్లుచెప్పబడినది-

"సర్వాభిశంకీ మూఢశ్చ బాలః కటుకవాగపి,
బోద్ధవ్య స్తాదృశ స్తాత నరః శ్వానం హి తం విదుః,
యథా శ్వా భషితుం చైవ హన్తుం చైవాఽవసజ్జతే,
ఏవం సంభాషణార్థాయ సర్వశాస్త్రవధాయ చ."

శునకము మొరుగుటకును, హింసించుటకును సిద్ధపడునట్లు ఎలుగెత్తి తోచినట్లు మాటలాడుటకును, శాస్త్రములను హింసించుటకును సిద్ధపడువాడు యోగ్యత లేనివాడని తాత్పర్యము.

నృశంసకలక్షణములను భీష్ముడుపదేశించుచు నిట్లు చెప్పెను-

"ధర్మశీలం గుణోపేతం పాప మిత్యవగచ్ఛతి,
ఆత్మశీలప్రమాణేన న విశ్వసితి కస్యచిత్" (శాంతిఅ- 164)

ఒకనిమాటను విశ్వసింపక తన స్వభావమునే ఆధారముచేసికొని ధర్మాత్ములను గుణవంతులను పాపాత్ములని భావించుట నృశంసకలక్షణ మని తాత్పర్యము.

ఇట్లుండుటచే వేదశాస్త్రోల్లంఘనము ఆర్షగ్రంథతిరస్కారము ధర్మశీలదూషణము శ్రేయస్కాములకు తగని పని యని సారాంశము.

—:ద్రౌపదీస్వయంవరవృత్తాంతము:—

"యజ్ఞసేనస్య కామస్తు పాండవాయ కిరీటినే,
కృష్ణాం దద్యా మితి సదా నచైత ద్వివృణోతి సః.
సోఽన్వేషమాణః కౌన్తేయం పాంచాల్యో జనమేజయ,
దృఢం ధను రనానమ్యం కారయామాస భారత.
యన్త్రం వైహాయసం చాఽపి కారయామాస కృత్రిమమ్,
తేన యన్త్రేణ సహితం రాజా లక్ష్యం చకార సః. (ఆది. అ185)

సీ-వైహాయసమ్. అన్తరిక్షగతం యన్త్రం తీవ్రవేగవత్తయా భ్రమణేన లక్ష్యమార్గసంకోచక మన్తరాబద్ధం, సహితం యన్త్రచ్ఛిద్ర

ద్వారా ఉపలక్షితం, లక్ష్యమపి నైహాయస మిత్యర్థః.

అస్త్రశిక్షాయా మేకేనాఽర్జునేనైవ చలలక్ష్యపాతనం కృత మత స్స ఏవ చలయన్త్రద్వారా లక్ష్యం ఛేత్స్యతి నాన్య ఇతి తదన్వేషణాయాయం యత్నో ద్రుపదేన కృతః. యద్యపి కర్ణస్యా ప్యేత త్సుకరం, తథాపి హీనకులత్వా త్స సుపరిహార ఇతి భావః.

ద్రుపదమహారాజునకు ద్రౌపదీదేవిని పార్థునకిచ్చి వివాహము చేయవలె నని సంకల్పము. దాని నన్యులకు తెలుపలేదు. లాక్షాగృహ దహనానంతరము పాండవులు జాడ తెలియుటలేదు అందుచేత నన్వే షించుచు ఎక్కుపెట్టుటకు శక్యముకాని దృఢమైన ధనుస్సును చేయించి అంతరిక్షమందొక లక్ష్యము నేర్పరచి దానికి క్రిందుగా నొక యంత్రము ఛిద్రముగలిగి తీవ్రవేగమున తిరుగుచు లక్ష్యము నాచ్ఛాదించుచుండు నట్లు కల్పించి ఆయంత్రచ్ఛిద్రమునుండి లక్ష్యమును కొట్టవలయు నని స్థిరపరచినాడు. ఇట్టి వీర్యశుల్కస్వయంవరము నేర్పరచిన ద్రుపదుని యభిప్రాయ మేమనగా వెనుక అస్త్రవిద్యాప్రదర్శనకాలములో నొక్క యర్జునుడే చలలక్ష్యమును గొట్టినవాడగుటవలన నాతని యన్వేషణ మున కిది యుపాయమనియు, కర్ణునకుగూడ నిది సుకరమైనను కులహీనుడగుటచే పరిహారణీయు డగు ననియు నభిప్రాయము. అని తాత్పర్యము.

తరువాత ద్రుపదుడు స్వయంవరసందర్భము చాటింపజేయు టలో నిట్లు వెల్లడించెను—

"ఇదం సజ్యం ధనుః కృత్వా సజ్జై రేభిశ్చ సాయకైః,
అతీత్య లక్ష్యం యో వేద్ధా సలబ్ధా మత్సుతా మితి.
ఇతి స ద్రుపదో రాజా స్వయంవర మఘోషయత్,
టీ— సజ్యం ధనుః కృత్వా ఇదం యన్త్ర మతీత్యలక్ష్యం యో వేద్ధా వేద్ధుం సమర్థః"

ధనుస్సు నెక్కు పెట్టి యీ బాణములచే నీయంత్రమునుండి లక్ష్య మును గొట్టగలవాడు నాకుమార్తెను స్వీకరింపవచ్చును అని.

అది విని సర్వదేశములనుండియు క్షత్రియవీరులు వచ్చినారు. కర్ణునితో దుర్యోధనాదులును వచ్చినారు. బ్రాహ్మణవేషములతో పాండవులును వచ్చియున్నారు. అంతట రంగస్థలమునకు వచ్చి ధృష్ట ద్యుమ్నుడు ఇట్లుచెప్పెను—

"ఇదం ధను ర్లక్ష్య మిమే చ బాణా
శ్శృణ్వన్తు మే భూపతయ స్సమేతాః,
ఛిద్రేణ యన్త్రస్య సమర్పయధ్వమ్
శరై శ్శితై ర్వ్యోమచరై ర్దశార్ధైః.
ఏత న్మహా త్కర్మ కరోతి యో వై
కులేన రూపేణ బలేన యుక్తః,
తస్యాఽద్య భార్యా భగినీ మమేయం
కృష్ణా భవిత్రీ న మృషా బ్రవీమి.

నీల— "ఇదం ధనుః ఇదం చ లక్ష్యం ఇమే చ బాణాః చలయన్త్ర చ్ఛిద్రద్వారా యుగప త్పంచ బాణాన్ లక్ష్యే య స్సమర్పయతి తస్యాద్య భార్యా భగినీ మమేయ మితి ద్వయో స్సంబన్ధః. వ్యోమ చరై ర్బాణైః"

భూపతులారా! ఇది ధనుస్సు, ఇది లక్ష్యము, ఇవి బాణములు, ఈ అయిదుబాణముల నొక్కసారి ప్రయోగించి ఈ చలయంత్రచ్ఛిద్ర మునుండి లక్ష్యమును గొట్టవలయును కులమునకుగాని, బలమునకుగాని, రూపమునకుగాని తీసిపోనట్టి వాడెవ్వడీపనిని జేయునో ఆతనికి నా యీసోదరి భార్య యగును అని.

ఆపై ధృష్టద్యుమ్నుడు వచ్చినవారిని జూపి వారివారి స్వరూప స్వభావాదులను ద్రౌపదీదేవికి తెలిపెను,

ఆపై క్షత్రియులందరును క్రమముగా లేచి యత్నించియు ధనుస్సునే యెక్కు పెట్టలేకపోయిరి. అంతట కర్ణుడు లేచి యెక్కు పెట్టి నపుడు ద్రౌపదీ దేవి యిట్లనెను—

"దృష్ట్వా తు తం ద్రౌపదీ వాక్య ముచ్చైర్జగాద నాఽహం వర యామి సూతమ్, సామర్షహాసం ప్రసమీక్ష్య సూర్యం తత్యాజ కర్ణః స్ఫురితం ధను స్తత్"

టీ— "సామర్షహాసం, నీచకులయోగా దమర్ష స్స్వార్యాపరాధత్వాత్ హాసః"

నేను సూతుని వరింపను అనెను. ఆమాట విని రోషహాస ములతో ధనుస్సు విడిచి సూర్యుని వైపు చూచి నివర్తించెను

విషయ మిట్లుండ ప్రతివాదు లేమి వ్రాసిరో చూడుడు—

—: మత్స్యయంత్రము గొట్టినవానిని వరింపవలసిన ద్రౌపదిసూత పుత్రుని నేను వరింప నన్నదను ప్రసంగము—

తన్నిరాకరణము :—

మ. భా. చ. కారుల వ్రాత యిట్లున్నది. 1 "ద్రౌపదీస్వయం వరమునకు బూర్వమె ద్రౌపది పాండవుల నైదుగుర బెండ్లియాడు టకును వారామెను బెండ్లియాడుటకును వ్యాసయాజోపయాజులచే నిశ్చయింపబడి యంగీకరింపజేయబడియుండును. 2 ద్రుపదుడును తొలుత నీవృత్తాంత మెరుగక బలవంతుడగు నర్జునుడు తన కల్లు డైన శోభించు నని ప్రచ్ఛన్ను లగు పాండవుల కొరకు వెదకించెను. వారు కాన్పింపనందున వీర్యశుల్క స్వయంవరమును జాటింపించెను. ఆస్వయంవరమునుజాటుటలో నెవ్వడైన నైదు బాణములతో నీమత్స్యయంత్రము గొట్టిననాతడు నాపుత్రిక నొందనచ్చునని నెను.

3 పై చాటింపుప్రకారము ఎవడు మత్స్యయంత్రము గొట్టినవానినే ద్రౌపది వరింపవలసియున్నది. కాని మత్స్యయంత్రము గొట్ట

గర్ణుడు ధనుస్సును సజ్యముచేయుచుండగా ద్రౌపది సూతపుత్రుని నేను వరింపను. అనుటచే నంతకు బూర్వమె పాంచాలి పాండవులకు వ్యాసాదులచే ప్రదానము చేయబడియున్నదని దృఢము ముగా చెప్పవలసియున్నది." (పు 225)

ఆహా! పెండ్లియాడుటకై ద్రౌపదిని, పాండవులను, వ్యాసయాజోపయాజులు స్వయంవరమునకు బూర్వమె అంగీకరింపజేసియుండు రట! అది యెరుగక అర్జునుడు తనకల్లుడు కావలెనను సంకల్పముతో వీర్యశుల్కస్వయంవరమును చాటింపించిన ద్రుపదుడును మత్స్యయంత్రము నెవ్వడు గొట్టిన నాతడు నా పుత్రిక నొందవచ్చునని చాటింపజేసెనట! కర్ణుడాపనికి సిద్ధపడగా సూతపుత్రుని నేను వరింప నను ద్రౌపది మాటపై కర్ణుడు విరమించెనట! ద్రౌపది సూతపుత్రుని వరింప నను టనుబట్టి యామె పూర్వమె పాండవులకు వ్యాసాదులచే ప్రదానము చేయబడి యున్నదని దృఢముగా చెప్పవలసియున్నదట! ఇచ్చట ప్రతి వాదుల నడుగవలసియున్నది—

అర్జును డల్లుడగులే దుపదుని సంకల్పమై యున్నప్పుడు వివాహవిషయమై వ్యాసాదులు స్వయంవరమునకు పూర్వమె ద్రౌపదీ పాండవుల నంగీకరింపజేసియున్నప్పుడు ద్రుపదు డావిషయ మెరుగకుండుటకు గారణ మేమి? ద్రుపదునియొక్కయు, ద్రౌపదియొక్కయు, వ్యాసాదులయొక్కయు సంకల్ప మేక మే కదా.

మరియు అర్జునుని కొరకే వీర్యశుల్కస్వయంవరమును కల్పించిన ద్రుపదుడు మత్స్యయంత్రము నెవ్వడు గొట్టినను నాపుత్రిక నొందవచ్చునని కర్ణునికి గూడ నవకాశము నిచ్చుచు సంకల్పవిరుద్ధముగా నెట్లు చాటింపజేసెను? ఆచాటింపు జేసినపుడైన నీసంకల్పము సిద్ధించియే యున్నది. ఈస్వయంవరప్రయత్న మనవసరమనియు, నీవు చాటింపజేయు పద్ధతి కర్ణుని బట్టి విరుద్ధముగా పరిణమింపగల దనియు

వ్యాసాదులో ద్రౌపదియో యేల చెప్పలేదు? మీరన్నట్లు పైచాటింపుప్రకార మెవడు మత్స్యయంత్రము గొట్టిన వానినే వరింపవలసి యున్న ద్రౌపది, సూతపుత్రుని నేను వరింప నని యారంగస్థలములో నెట్లనగలిగినది? ఆమె యనినను చాటింపున కిది విరుద్ధమని యెదురాడవలసిన కర్ణుడు కిక్కురు మనక యెట్లూరకుండెను?

ఆత డూరకుండుటనుబట్టి చాటింపులో కులీనతకూడ అంతర్భూతమయి యున్నదని యాకర్ణుడు గ్రహించినట్లు తెలిసికొనవలయును. ఆవిషయము రంగస్థలములో మొదట "కులేన, రూపేణ, బలేన యుక్తః" అను ధృష్టద్యుమ్న వాక్యముచే స్పష్టపరుపబడిన దని తెలిసికొనవలయును, కనుకనే సూతపుత్రుని వరింప నని ద్రౌపది యనిన దని తెలిసికొనవలయును. తన కులహీనతను బట్టియే కర్ణు డూరకుండె నని తెలిసికొనవలయును.

కర్ణుని హృదయములో మొట్టమొదటే కులప్రసక్తి యున్న యెడల స్వయంవరమున కేలవచ్చెను? ధనుస్సు నెక్కుపెట్టుట కేల సిద్ధపడును? అందురా? తనకు ప్రాణమైన దుర్యోధనుడు వచ్చుటను బట్టి యాతనితో వచ్చెను క్షత్రియవీరులెవ్వరును ధనుస్సు నెత్తలేక పోవుట జూచి తాను సమర్థుడగుటచే తనసామర్థ్యప్రదర్శనవృత్తితో లేచి సిద్ధపడి ద్రౌపదిచే వివాహమునకు సంబంధించిన కులప్రసక్తి యుద్ఘాటింపబడినతోడనే మరుమాటాడక నివర్తించె నని తెలిసికొనుడు.

దీనిచే "పైచాటింపు ప్రకారము ఎవడు మత్స్యయంత్రము గొట్టిన వానినే ద్రౌపది వరింపవలసియున్నది" అను ప్రతివాదివ్రాత నిరస్తము.

"స్వయంవరమునకు బూర్వమె వ్యాసాదులచే పాంచాలి పాండవులకు ప్రధానము చేయబడిన దని దృఢముగా చెప్పవలసియున్నది." అను ప్రతివాదుల కొకింత బోధింతము—

ఆ ప్రిధానము చేయబడుట స్వయంవరమునకు బూర్వమే కాదు ద్రౌపదీజన్మమునకు బూర్వమే చేయబడెను. ఆచేయబడుట వ్యాసాదులచేతనే గాదు. తపఃఫలముగా వరమిచ్చిన పరమేశ్వరునిచేత జేయబడినది. పరమేశ్వరనిర్దిష్టమై భూభారహరణార్థ మావిర్భవింప బోవు ద్రౌపదియొక్క స్థితిని ముందే కనిపెట్టినవారు దివ్యదృష్టిగల యాజోపయాజులు. ఆద్రౌపదీపాండవుల పూర్వజన్మవృత్తాంతములను, వారలకు భార్యాభర్తృభావము ఘటింపజేసిన పరమేశ్వరవరమును, దివ్యదృష్టిచే గ్రహించి వెల్లడించినవాడు వేదవ్యాసభగవానుడు. కనుక ప్రతివాది దసంగతప్రసంగము.

ఇక దీనిని విడిచి పైకథ నవలోకింతము—

కర్ణుడు నివర్తించిన తరువాత, బ్రాహ్మణవేషధారియై బ్రాహ్మణసంఘములో గూర్చుండిన అర్జునుడు లేచి వచ్చి ధనుస్సు నెక్కుపెట్టి మత్స్యయంత్రమును గొట్టెను. ద్రుపదుడు సంతోషించెను. ద్రౌపదీదేవి పుష్పమాలాదులను గ్రహించి వచ్చి యథోచితముగా నాచరించి యర్జునుని పార్శ్వమునకు జేరియుండెను. తరువాత ద్రౌపదీదేవి వెంట వచ్చుచుండ రంగస్థలమునుండి పార్థుడు నిర్గమించుచుండెను. అంతట క్షత్రియవీరులు ప్రసంగించుకొనుటలో ద్రుపదుడీస్త్రీరత్నమును మనల నందరను తృణీకరించి విప్రున కిచ్చుచున్నాడు. మనల నాహ్వానించి యిట్టియవమానము చేసిన యీతనిని వధింతము.

"స్వయంవరః క్షత్రియాణామిత్యేషా ప్రథితా శ్రుతిః,
నచ విప్రేష్వధీకారో విద్యతే వరణం ప్రతి,"

స్వయంవరాధికారము క్షత్రియులకేగాని విప్రులకు లేదు. ఈవిప్రుడు తెలిసియో తెలియకయో యీపని జేసినను ఈతడు వధ్యుడు గాడు మరెన్నడు నిట్లు స్వయంవరము జరుగకుండుటకై ద్రుపదుని వధింతము. అని కూడబలుకుకొని ఆయుధములు తీసి ద్రుప

దునిమిాదికి సన్నద్ధులైరి. అప్పుడు వారినందరను భీమార్జును లెదుర్కొనిరి. అంతట శల్యభీమసేనులకును కర్ణార్జునులకును ద్వంద్వయుద్ధము జరిగినది. కర్ణుడు తనతో యుద్ధముచేయు విప్రుని పరాక్రమాతిశయమున కాశ్చర్యపడి యిట్లనెను—

"తుష్యామి తే విప్రముఖ్య భుజవీర్యస్య సంయుగే,
అవిషాదస్య చైవాస్య శస్త్రాస్త్రవిజయస్య చ.
కిం త్వం సాక్షాద్ధనుర్వేదో రామో వా విప్రసత్తమ,
అథ సాక్షాద్ధరిహయః సాక్షాద్వా విష్ణురచ్యుతః.
ఆత్మప్రచ్ఛాదనార్థం వై బాహువీర్య ముపాశ్రితః,
విప్రరూపం విధాయేదం మన్యే మాం ప్రతి యుధ్యసే.
నహి మా మాహవే క్రుద్ధ మన్య స్సాక్షా చ్ఛచీపతేః,
పుమాన్ యోధయితుం శక్తః పాండవాద్వా కిరీటినః"

విప్రవర్యా! నీపరాక్రమమునకు మెచ్చితిని నీవు మూర్తీభవించిన ధనుర్వేదమా? పరశురాముడవా? ఇంద్రుడవా? ఉపేంద్రుడవా? యుద్ధభూమిలో క్రుద్ధుడనైన నన్ను డీకొనుట ఇంద్రునికంటెను పార్థునికంటెను మరియొకని కశక్యము.

ఇట్లని "యుద్ధా త్కర్ణో న్యవర్తత బ్రాహ్మం తేజ స్తదాఽజయ్యం మన్యమానో మహారథః" బ్రాహ్మతేజస్సు జయింపనశక్యమని యుద్ధమునుండి కర్ణుడు నివర్తించెను. శల్యుని భీమసేను డోడించెను.

—: ద్రౌపదీపరిణయమును గూర్చి విధిప్రేరణము :—

అంతట యుద్ధము శాంతింప ద్రౌపదీదేవి వెంట వచ్చుచుండ భీమార్జునులు తమ నివాసస్థానమునకు జేరుకొనిరి. ఆలోపల కుంతీదేవి భిక్షాకాల మతిక్రమించినది. ఏమి చిక్కు తటస్థించెనో బిడ్డలు రాలేదని పరితపించుచున్నది. ద్రౌపదీదేవిని వెంటబెట్టుకొని వెళ్ళిన

భీమార్జునులు తమకు గనబడకుండ నప్పటికి గృహాంతరమందున్న తల్లితో కేకవేసి భిక్షదెచ్చితిమని చెప్పిరి. ఆమె యక్కడనుండియే అందరును గలిసి యనుభవింపుడని చెప్పి యీవలకు వచ్చి చూచి అయ్యో? నేనిట్టి మాట పలికితి నేమని పరితపించినది.

భిక్ష దెచ్చితి మని చెప్పిన మాటపై ప్రతివాదులుచేసిన ఆక్షేపములు పాండవనిందానిరాకరణములో పరిహరింపబడినవిగనుక నచ్చట జూడవలయును

కుంతీదేవి ప్రమాదపతితమైన తనమాటకు పరితపించుచు ద్రౌపదీదేవి హస్తమును బట్టుకొని ధర్మజునియొద్దకు తీసుకొని వెళ్ళి యీమెనుగూర్చి నేనుచూడక మీరందరు గలిసి యనుభవింపుడని యధర్మమైన మాట ప్రమాదవశమున బలికితిని నానోటినుండి యనృతవాక్య మెన్నడు రాలేదు. ఈమెకు బహుపతిత్వరూపమైన అధర్మము ప్రాప్తించునా యేమి? అని భయపడుచున్నాను. అని పరితపించు తల్లిమాటలు విని యీమెనోదార్చి తానొకింతసేపు ఆలోచించి యర్జునునితో ధర్మజు డిట్లనెను—

"త్వయా జితా ఫాల్గున యాజ్ఞసేనీ ... గృహాణ
పాణిం విధివ త్త్వ మస్యాః.

ఈమె నీచే జయింపబడినదిగనుక నీవే యీమె పాణిగ్రహణము చేయుము అని. అది విని యర్జును డిట్లనెను—

"మా మాం నరేన్ద్ర త్వ మధర్మభాజం
కృథా న ధర్మోఽయ మశిష్టదృష్టః,
భవా న్నివేశ్యః ప్రథమం తతోఽయం
భీమో మహాబాహు రచిన్త్యకర్మా,
అహం తతో నకులోఽనన్తరం మే
పశ్చాదయం సహదేవ స్తరస్వీ,

టీ—న ధర్మోఽయం దృష్టః. అయం కః, యం మాం భవా నశిష్ట శాసితవాన్, సవేశ్యః వివాహ్యః,

మహాసీయా! జ్యేష్ఠుడు వివాహముజేసుకొనకుండ కనిష్ఠుడు వివాహముజేసికొనుట అను అధర్మమునకు నన్ను పాలుచేయకుము. ముందు నీవు వివాహముచేసికొనవలసినవాడవు. తరువాత భీమసేనుడు. ఆపైనేను. ఆపైనకులసహదేవులు ఇట్లు యథాక్రమముగా జరుగవలయును. అని.

"జిష్ణో ర్వచన మాజ్ఞాయ భక్తిస్నేహసమన్వితమ్,
దృష్టిం నివేశయామాసుః పాంచాల్యాం పాండునందనాః
తేషా న్తు ద్రౌపదీం దృష్ట్వా సర్వేషా మమితౌజసామ్,
సంప్రమథ్యేన్ద్రియగ్రామం ప్రాదురాసీ న్మనోభవః..
తేషా మాకారభావజ్ఞః కున్తీపుత్రో యుధిష్ఠిరః,
ద్వైపాయనవచః కృత్స్నం సస్మార మనుజర్షభః,
అబ్రవీత్సహితా న్భ్రాతౄ న్మిథో భేదభయా న్నృపః,
సర్వేషాం ద్రౌపదీ భార్యా భవిష్యతి హి న శ్శుభా"

అభక్తిస్నేహపూరితమైన పార్థుని మాట విని పాండవులందరు పాంచాలిని జూచినంతట వారందర కేకవిధమైన యనురాగమే విధిప్రేరణమున ఆమెయం దుద్భవించినది అప్పు డందరి మనోగతమును ఆకారవిశేషమును పరిశీలించిన ధర్మజుడు ఏకచక్రపురమందు తామున్నపుడు దర్శనమిచ్చి చెప్పిన వ్యాసభగవానుని మాటలను స్మరించి సోదరులతో, ఈద్రౌపది మన కందరకును భార్య కావలసియున్నది. అని చెప్పెను.

ఈవిషయమై ఆంధ్రభారతము—ఆది—అ7.

వ. తల్లియొద్దకు ధర్మరాజును గవలవారు వచ్చియున్న దద నంతరంబ భీమార్జునులు ద్రౌపదీసహితులయి చనుదెంచి మ్రొక్కి—

మే మొక్క భిక్ష దెచ్చితిమని తల్లికి నివేదించిన నెఱుంగక యెప్ప టియట్లుకా వగచి కుంతీదేవి సంతసిల్లి దాని మీరేవురు నుపయో గింపుడని కొడుకుల నియోగించి భువనత్రయరాజ్యలక్ష్మియుం బోలె నున్న యక్కన్నియం జూచి లజ్జించి యధర్మభీత యయి ధర్మతనయున కిట్లనియె.

సీ. ఈతన్వి దోడ్కొని సీతమ్ము లిరువురు
ప్రీతినే తెంచి యీభిక్షయొప్ప
గొనుమని నాకు జెప్పిననునేవురు నుప
యోగింపుడంటి నాయుక్తి దొల్లి
యనృత మెన్నండు గా దనఘ మీరెప్పుడు
మద్వచనాతిక్రమంబు సేయ
రిది లోకమున లేని యది యేమి సేయంగ
నగు నని చింతాకులాత్మయైన
తే. దల్లి నూరార్చి వాసవతనయు జూచి
పార్థ నీచేత బడయంగబడిన దీని
నగ్నిసన్నిధి బాణిగ్రహణంబు నీవ
చేయు మను ధర్మజునకును జిష్ణు డనియె.

వ. పెద్దవాడుండ గొండుకవాడు వివాహం బగుట ధర్మవిరుద్ధంబు గావున దీని నీ వగ్రమహిషిగా బరిగ్రహింపుము. మానలువుర యనుమతంబును నిట్టిద యనుచున్న యవసరంబున విధిప్రేరణ వశంబున—

ఉ. "ఆలలితాంగియందు హృదయంబులు దృష్టులు నిల్పి పాండుభూ పాలతనూజపంచకము పంచశరాహతి బొందె నొక్కతక బాలిక దొల్లి యేవురకు భామినిగా సృజియించి యున్న య య్యాలరి బ్రహ్మ చెయ్వు పరమార్థముగా కది యేల యొండగుఁ"

వ ఇట్లు పాంచాలియందు బద్ధానురాగులయియున్న తమ యేపుర యభిప్రాయం బెరింగి వేదవ్యాసవచనంబులు దలంచి ధర్మతన యుండు దమ్ముల కిట్లనియె.

క. గురువచనస్థితి మనకే
గురకును నిది పత్నిగా దగుంగావున ని
త్తరుణిని బరిగ్రహింతము
తిరముగ గురువచన మొండు దెరగేలయగుర్.

ధర్మజు డట్లు పలికినతరువాత, భీమార్జునాదులు వెళ్ళి తెచ్చిన భిక్షాన్నము యథోచితముగా భుజించి యానాడు దర్భాస్తరణముపై బరచిన కృష్ణాజినములపై యందరు బరుండిరి.

ఆ. కరకుదర్భపూరిపఱపులు భిక్షాన్న
మశన మట్టివారి నతిముదమున
నాదరించె బ్రీతి నాదిగర్భేశ్వరి
యయ్యు నేవగింపదయ్యె గృష్ణ.

క. కడవసములు గోలలు గ
ప్పడములు వీరల ధనంబు పరికింపగ నె
క్కడిదేశకులని వగవక
మడవక తనుమధ్య నిండుమనమున నుండెన్.

(ఆంధ్రభారతము).

ఈ గ్రంథసందర్భమునుబట్టి తేలిన ముఖ్యాంశము లివి—

1 మీరందరు నుపయోగింపు డని ప్రమాదవశమున నోరుజారి వచ్చిన ధర్మవిరుద్ధ మగు తనమాటకు కుంతీదేవి పరితపించినది.

2 నీచే బొందబడిన యీమెను నీవే పాణిగ్రహణము చేయుమని యర్జునునితో ధర్మజుడు చెప్పెను.

3 పెద్దవా డుండ చిన్నవాడు ముందు వివాహ మాడుట ధర్మ విరుద్ధ మనుచు నీవే పరిగ్రహింపు మని ధర్మజునితో అర్జునుడు పలికెను.

4 అప్పు డంకరును ద్రౌపదీదేవియందు తనదృష్టిని ప్రసరింపజేసి చూచి తమ యంతఃకరణవృత్తులను పరీక్షించుకొనగా నామెయం దందరకు నేకవిధమైన యనురాగ ముద్భవింప నది కనిపెట్టి, వెనుక నేకచక్రపురములో నున్నపుడు ద్రౌపది యైదుగురకు పత్ని కాగలదని యీశ్వరవరమునుబట్టి వ్యాసభగవాను డానతిచ్చిన మాట దలచుకొని అట్టి భవితవ్యబలముననే తల్లి యప్రయత్నముగా నట్లనుటయు, మా కందరకు నీమె యందట్టి భావమే కలుగుటయు దటస్థించిన దని నిశ్చయించి అందరము బరిగ్రహింపదగిన దే యని సోదరులతో ధర్మజు డనెను.

విషయ మిట్లుండ కుంతీదేవిని గూర్చి వ్రాయుటలో—

"సమానస్కంధురాలగు కోడలుండిన మంచిదని దలంచి కొంత ప్రోత్సాహము జేసియుండును." (పు 225)

అను మ. భా చ కారుల అసంగతప్రసంగము ఇచ్చటజూపిన ప్రథమాంశముచే బరాస్తము.

ఇక ధర్మజునిగూర్చియు పాండవులగూర్చియు వ్రాయుటలో

"అర్జునుం డప్పుడు ద్రౌపది గోనిరాగ దన్వి జూచి మోహవిభ్రాంతులై ముగుదను బెండ్లాడ, మదినెంచి దానికి మాతకారణం బంచు దెల్పుట న్యాయంబె మీకు"

"ద్రుపదుండు సతి నీయ దొలుతనె వారింప నగ్రజన్మువివాహమైనగాని, అర్జునుండు వివాహ మాడంగరాదంచు సాకొందు గల్పింప జాలిరపుడు".

అను సుయోధనవిజయకర్త వ్రాత యిచ్చటజూపిన ద్వితీయ తృతీయాంశములచే నిరస్తము.

విధిప్రేరితులైన పాండవులపట్ల "చపలచిత్తులవలె మోహావిభ్రాంతులైరి" అను ప్రతివాదులమాట ఇచ్చటి చతుర్థాంశముచే నిరస్తము.

—: సందిగ్ధాంశనిర్ణయహేతువు యొక్క సత్పురుషుల అంతఃకరణ ప్రవృత్తి. అనువిషయము:—

ధర్మజుడు తమ యంతఃకరణప్రవృత్తినిబట్టి ద్రౌపదీదేవి తను కైదుగురికిని పత్ని కాదగియున్నదని నిర్ణయించెను.

దానికి తథ్యముగనే అంతకు బూర్వము తల్లి అప్రయత్నముగా నట్టి మాటనే పలికినది. దానికిని తథ్యముగా నంతకు ముందు వ్యాసభగవాను డట్లు జరుగగలదని చెప్పియుండెను. దానికిని తథ్యముగా ద్రౌపదికి బూర్వజన్మమందే యీశ్వరు డట్టి వరమును ధర్మ్యముగా నిచ్చియుండెను.

ఆయీశ్వరవరబలమే ఆయాపరిస్థితులకును ధర్మజుని యంతఃకరణ మావిధముగా బ్రవర్తించుటకును మూలము. సత్పురుషులఅంతఃకరణములు దుర్జనాంతఃకరణములవలె నిషిద్ధవిషయములపై ప్రసరింపవు శాస్త్రపద్ధతిని, యమనియమాదులతో జేసిన వారిచిరకాలాభ్యాసమే దానికి కారణము. అట్టి పుణ్యాత్ముల అంతఃకరణప్రవృత్తి శాస్త్రానురుద్ధమె అగుచుండునుగనుక వారి యంతఃకరణప్రవృత్తి విషయనిర్ణయముపట్ల ప్రమాణమె యగుచుండును ఈవిషయము పూర్వమీమాంసాశాస్త్రమం దిట్లు చెప్పబడినది—

"ఏతేన వైదికానన్తధర్మధీసంస్కృతాత్మనామ్,
ఆత్మతుష్టేః ప్రమాణత్వం ప్రసిద్ధం ధర్మసిద్ధయే,,"

తథైవ బహుకాలాభ్యస్తవేదతదర్థజ్ఞానాహితసంస్కారాణాం వేదనియతమార్గానుసారిప్రతిభానాం నోన్మార్గేణ ప్రతిభానం సంభవతీ "

త్వాశ్రితోచ్యతే-'యదేవ కించనాఽనూచానోఽభ్యూహత్యార్షం తద్భవతీతి' వైదికవాసనాజనితత్వాద్వేద ఏవ స భవతి తథాహి—

"యథా రుమాయాం లవణాకరేషు మేరౌ యథాచోజ్జ్వలరుక్మభూమౌ, యజ్జాయతే తన్మయమేవ తత్స్యాత్తథా భవే ద్వేదవిదాత్మతుష్టిః॥

(తంత్రవార్త్తికమ్-అ1 పా3)

చిరకాలాభ్యస్తమయిన వేదముచేతను, వేదార్థజ్ఞానముచేతనుకలిగిన దృఢతరసంస్కారమునుబట్టి వేదనియతమార్గానుసారియైన ప్రతిభగల పుణ్యాత్ముల అంతఃకరణప్రవృత్తి యపమార్గమునకెన్నడును బోదు. కనుకనే అనూచానుడనబడు నట్టివాడూహించినది యార్షమే యగునని వేదము చెప్పుచున్నది.

లవణభూములయం దుద్భవించిన మొలక లవణమయమును, స్వర్ణభూములయం దుద్భవించిన మొలక స్వర్ణమయము నగుట లోకప్రసిద్ధముకాదా. కనుకనే వేదవేత్తల ఆత్మతుష్టి వేదానురుద్ధమే అని తాత్పర్యము.

తంత్రవార్త్తికమ్—

"యథా వా సర్పసిద్ధాన్తే నకులోయాం కిలౌషధిమ్,
దన్తైర్గృహ్ణాతి తా మాహు స్సమస్తవిషహారిణీమ్.
యథా వా యాం భువం కశ్చిదధ్యావసతి పుణ్యకృత్,
తత్సంపర్కపవిత్రత్వాత్సేష్యతే పుణ్యకారణమ్.
తథాచారాత్మతుష్ట్యాదిధర్మ్యం ధర్మమయాత్మనామ్,
వేదోక్తమితి నిశ్చిత్య గ్రాహ్యం ధర్మబుభుత్సుభిః.

న్యాయసుధా—భిన్నానా మపి మన్త్రాణాముచ్చారయితృయోగాదోషధీనాం నకులదంష్ట్రాయోగా ద్భువాం పుణ్యకృద్యోగా ద్దేశకత్వావిర్భావ ఇత్యర్థః

అనగానకులము(ముంగి) తన దంతములచే నే యోషధిని కొరుకునో అదిసమస్త విషహారి. అని సర్పసిద్ధాంత మందున్నది.

పుణ్యాత్ము డేస్థలమందు నివసించునో అది పుణ్యస్థలమగుచున్నది. ఉచ్చరించువాని పవిత్రతావిశేషమునుబట్టి మంత్రములందొకానొకశక్తి యావిర్భవించుచున్నట్లును, నకులదన్తసంబంధమునుబట్టి యోషధుల యందొకానొకశక్తి యావిర్భవించుచున్నట్లును, పుణ్యాత్ముల సంపర్కమునుబట్టి ఆయాస్థలముల యందొకానొకశక్తి యావిర్భవించుచున్నట్లును ధర్మాత్ముల అంతఃకరణవృత్తులయందును, ఆచరణమందును ధర్మ్యత కలిగియే యుండు నని తాత్పర్యము.

పంచపతిత్వము ద్రౌపదీదేవివిషయమై విధికృతమని తెలిసికొనుటలో, తనయంతఃకరణప్రవృత్తిని ప్రమాణముగా దీసికొనినవా డొక్కధర్మజుడే కాడు. దుష్యంతుడుగూడ శకుంతలావిషయమై తనయంతఃకరణప్రవృత్తినే ప్రమాణముగా దీసికొనినాడు.

కణ్వమహర్షి యాశ్రమమందున్న శకుంతలను జూచి యామె రూపలావణ్యాదుల కాశ్చర్యపడి తన హృదయ మామె నభిలషించుటను గనిపెట్టి యీయామె కణ్వపుత్రిక యగుటనుబట్టి బ్రాహ్మణియా? యీరూపలావణ్యాదులనుబట్టి క్షత్రియయా? అని సంశయించి అధర్మమం దెన్నడును ప్రవర్తింపని పూజ్యమైన నామనస్సు యీయామె నభిలషించుచుండుటనుబట్టి ఈమె నేనుపరిగ్రహింపదగిన క్షత్రియయే యగునని నిశ్చయించెను. అతడు నిశ్చయించినట్లామె క్షత్రియ యగుట సత్యమే ఆదుష్యంతుడనుకొనిన విషయమిట్లు కాళిదాసమహాకవిచే జెప్పబడినది——.

"అసంశయం క్షత్రపరిగ్రహక్షమా యదార్యమస్యా మభిలాషి మేమనః,
సతాంహి సందేహపదేషు వస్తుషు ప్రమాణ మన్తఃకరణప్రవృత్తయః,
అని"

తంత్రవార్తికమం దిట్లు చెప్పబడినది:—

"బహ్వాదినాభ్యస్తధర్మవ్యాప్తాత్మనో హి న కథంచి ద్ధర్మకారణరూపాత్మతుష్టిః అన్యత్ర సంభవతీతి ధర్మత్వేనాభ్యనుజ్ఞాయతే.

లోకములో వేదశాస్త్రములను దిరస్కరించి విధినిషేధములు లేకుండ యథేష్టముగా బ్రవర్తించువారికి అధర్మమందే చిరకాలాభ్యాసమునుబట్టి యభిరుచి కలుగునట్లు వేదశాస్త్రములకు వశులై విధినిషేధములకు బద్ధులై యమనియమాదులతో బ్రవర్తించువారికి ధర్మమందే చిరకాలాభ్యాసమునుబట్టి యభిరుచి కలుగును. కాబట్టి అట్టి మహాపురుషుల అంతఃకరణప్రవృత్తియే ధర్మనిర్ణయముపట్ల ప్రమాణమగు నని చెప్పబడినది.

కనుకనే ఆదుష్యంతుఖివలెనే ధర్మరాజుడు, సందిగ్ధమై యున్న ద్రౌపదీవివాహముపట్ల తమ యంతఃకరణప్రవృత్తినిగూడ ప్రమాణముగా తీసుకొనెను.

## —:ద్రౌపదీ పాణిగ్రహణచర్చ:—

ఆమరునాడు ద్రుపదుని యాహ్వానముపై పాండవులు తల్లితోడను, ద్రౌపదీదేవితోడను ద్రుపదభవనమునకు వెళ్ళి భుజించిన తరువాత బ్రాహ్మణవేషధారులై యుండుటనుబట్టి వారు పాండవులా? కారా? అనుసందేహమును బోగొట్టుకొనుటకై పరీక్షించుచున్న ద్రుపదుడు తుదకు ధర్మరాజు నిట్లడిగెను—

"కథం జానీమ భవతః క్షత్రియాన్ బ్రాహ్మణాను త,
బ్రవీతు నో భవాన్ సత్యం సందేహో హ్యత్ర నో మహాన్.

మహానీయా! మేము మిమ్ము క్షత్రియులనుకొనవలెనా? బ్రాహ్మణు లనుకొనవలయునా? నిజముచెప్పి యీసందేహమును తీర్పుము అని. ఆపై ధర్మరాజిట్లనెను—

"మా రాజన్ విమనా భూ స్త్వం పాంచాల్య ప్రీతి రస్తు తే,
వయం హి క్షత్రియా రాజన్ పాండోః పుత్రా మహాత్మనః
జ్యేష్ఠం మాం విద్ధి కౌన్తేయం భీమసేనార్జునా వినౌ,
అభ్యాం తవ సుతా రాజ న్నిర్జితా రాజసంసది.
యమౌ చ తత్ర కున్తీ చ యత్ర కృష్ణా వ్యవస్థితా,
వ్యేతు తే మానసం దుఃఖం క్షత్రియా స్స్మ నరర్షభ"

మహారాజా! నీకు వైమనస్యముతో బని లేదు. మేము క్షత్రియులము, పాండుమహారాజపుత్రులము. అందు నేను జ్యేష్ఠుడను. రాజసభలో నీపుత్రికను విజయముతో స్వాధీనముచేసికొనిన వీరే భీమార్జునులు, వీరు నకులసహదేవులు, మా ద్రౌపదియున్నచోట నున్న ఆమెయే కుంతీదేవి, మేముక్షత్రియులము, నీవు పరితపింపవలసినపని లేదు. అని.

"ప్రీత్యాశ్వస్త స్తతో రాజా సహ పుత్రై రువాచ తమ్,
గృహ్ణాతు విధివ త్పాణి మద్యాఽయం కురునందనః.
పుణ్యేఽహాని మహాబాహు రర్జునః కురుతాం క్షణమ్,
టీ: క్షణం దేవపూజాదిపర్వోత్సవం, వివాహాత్ప్రాక్కాలీనం కులధర్మం,

అప్పుడు పుత్రులతో గూడ ద్రుపదమహారాజు సంతోషించి యీయర్జునుడు విధ్యుక్తముగా పాణిగ్రహణము చేయవలసియున్నది. గనుక వివాహమునకు పూర్వాంగముగా జరుగవలసియున్న దేవపూజాదికులధర్మము నీతడు నెరవేర్చుగాక, అని పలికెను.

"త మబ్రవీ త్తతో రాజా ధర్మాత్మా చ యుధిష్ఠిరః,
మమాఽపి దారసంబన్ధః కార్య స్తావ ద్విశాంపతే."

ధర్మాత్ముడైన యుధిష్ఠిరుడు అద్రుపదునితో నిట్లనెను. నాకు గూడ వివాహ మిప్పుడు కావలసియున్నది. అని.

"భవా న్వా విధివత్పాణిం గృహ్ణాతు దుహితు ర్మమ,
యస్య వా మన్యసే వీర తస్య కృష్ణా ముపాదిశ."

అప్పుడు ద్రుపదు డనెను నీవైనను సరే. ద్రౌపదీపాణిగ్రహణ మెవ్వనికి యుక్త మని నీవు తలచెదవో ఆతనినిగూర్చియే చెప్పుము. అని.

"సర్వేషాం మహిషీ రాజన్ ద్రౌపదీ నో భవిష్యతి,
ఏవం ప్రవ్యాహృతం పూర్వం మమ మాత్రా విశాంపతే.
అహం చాప్యనివిష్టో వై భీమసేనశ్చ పాండవః,
పార్థేన విజితా చైషా రత్నభూతా సుతా తవ.
సర్వేషాం ధర్మతః కృష్ణా మహిషీ నో భవిష్యతి.
ఆనుపూర్వ్యేణ సర్వేషాం గృహ్ణాతు జ్వలనే కరాన్,"

టీ. జ్వలనే, జ్వలనసమీపే, కరాన్ గృహ్ణాతు పంచపాణిగ్రహణాని కరోతు.

ఆపై ధర్మజు డిట్లు చెప్పెను— మహారాజా! మాకందరకు నీమె పత్ని కాదగును. మాతల్లి యట్లు పలికినది. నేనుగూడ నవివాహితుడను భీమసేనుడును నట్టివాడే. అర్జునునిచే నీపుత్రికారత్నము జయింపబడినది. ఈసందర్భమునుబట్టి మాకందరకు నీమె పత్ని కాదగి యున్నది. అగ్నిసమీపమున యథాక్రమముగా పాణిగ్రహణములు జరుగుగాక. అని.

అది విని ద్రుపదు డిట్లనెను—

"ఏకస్య బహ్వ్యో విహితా మహిష్యః కురునందన,
నైకస్యా బహవః పుంస శ్రూయన్తే పతయః క్వచిత్
లోకవేదవిరుద్ధం త్వం నాఽధర్మం ధర్మవి చ్ఛుచిః,
కర్తు మర్హసి కౌన్తేయ కస్మా త్తే బుద్ధి రీదృశీ."

టీ. పుంసః పుమాంసః యద్వా వేదకర్తుః పరమాత్మన స్సకాశాన్న శ్రూయన్తే "తస్మా న్నైకా ద్వౌ పతీ విన్దతే" ఇతి వేదవిరుద్ధం చ అవిహితం నిషిద్ధం చైతి దిత్యర్థః.

ధర్మజా! ఒకనికి బహుపత్నులు విధింపబడినారు గాని యొక స్త్రీకి బహుపతులు విధింపబడలేదు. ఇది యవిహితమేగాక "ఒక స్త్రీ యనేకపతులను పొందరాదు." అను వేదవాక్యముచే నిషిద్ధము కూడను. పరిశుద్ధుడవు. ధర్మవిదుడవు నైన నీవు లోకవేదవిరుద్ధమైన యీ యధర్మము నాచరింపదగదు. నీకిట్టి బుద్ధి యేల కలిగినది? ఈద్రుపదునిమాటలపై ధర్మజు డిట్లనెను—

"సూక్ష్మో ధర్మో మహారాజ నాఽస్య విద్మో వయం గతిమ్,
పూర్వేషా మానుపూర్వ్యేణ యాతం వర్త్మాఽనుయామహే.
న మే వా గనృతం ప్రాహ నాఽధర్మే ధీయతే మతిః,
ఏవం చైవ వద త్యంబా మమ చైత న్మనోగతిమ్."

టీ. సూక్ష్మః 'నైకస్యై బహవ స్సహ పతయః' ఇతిశ్రుత్యా సహేతి యుగపద్బహుపతిత్వనిషేధో విహితో నతు సమయభేదేన, తతశ్చాఽనిషిద్ధం, మాత్రా సమేత్య భుజ్క్తేత్యాజ్ఞప్తం చ న లంఘనీయమ్! పితో రాజ్ఞయా నిషిద్ధమపి కర్తవ్యం, పరశురామ కృతమాతృవధవత్, కిముతానిషిద్ధ మితి భావః "పూర్వేషాం ప్రచేతః ప్రభృతీనాం, త్రై ర్యాతం వర్త్మ బహూనా మేకపత్నీత్వ మనుయామహే, తచ్చానుపూర్వ్యేణైవ న త్వక్రమేణ"

మహారాజా! ఇది స్థూలదృష్టికి గోచరింపని సూక్ష్మధర్మము. దీని గతిని మనము గ్రహింపజాలము. వేదములో 'నైకస్యై బహవస్సహ పతయః తస్మా న్నైకా ద్వౌ పతీ విన్దతే' అనునపుడు 'సహపతయః' అను 'సహ'శబ్దమునుబట్టి యేకకాలమం దనేకపతిత్వనిషేధమె కాని సమయభేదమున నిషేధము కాజాలదు. కనుక నిషిద్ధమనుటకు వీలులేదు. కలిసి యనుభవింపుడు అను మాతల్లి యాజ్ఞ అనుల్లంఘనీయము. నాది యనృతవాక్కు కాదు. నాది యధర్మబుద్ధి కాదు బహుపురుషుల కేకపత్నీత్వ మనుపద్ధతి, పూర్వులగు ప్రచేతఃప్రభృతుల యందున్నదే

"ఏష ధర్మో ధ్రువో రాజం శ్చరైన మవిచారయన్,
మా చ శంకా తత్ర తే స్యా త్కథంచిదపి పార్థివ"

మహారాజా! ఇది ధ్రువముగా ధర్మమే. దీని నాచరించుటలోనీవు సందేహింపకుము. నీకీవిషయమై యేవిధమునను శంకింపబనిలేదు. అని.

ఆపై ద్రుపదు డిట్లనెను—

"త్వం చ కున్తీ చ కౌన్తేయ ధృష్టద్యుమ్న శ్చ మే సుతః,
కథయ న్త్వితికర్తవ్యం శ్వః కాలే కరవామహే"

యుధిష్ఠిరా! నీవు, కున్తీదేవి, మాధృష్టద్యుమ్నుడు, ఆలోచించి చెప్పుడు. రేపు యుక్తకాలమందు కార్యము జరుపుదము. అని.

"తే సమేత్య తత స్సర్వే కథయన్తి స్మ భారత,
అథ ద్వైపాయనో రాజ న్నభ్యాగచ్ఛ ద్యదృచ్ఛయా."

తరువాత వారందరు గలిసి ప్రసంగించుచుండ వ్యాసభగవానుడు సాక్షాత్కరించెను. అపుడు వారందరును లేచి ప్రత్యుత్థానాభివాదనములతో బూజింప వారి నాశీర్వదించి కుశల మడిగి ద్రుపదనిర్దిష్టమైన సువర్ణాసనమును వ్యాసభగవాను డధిష్ఠించియుండ నామహనీయుని యనుజ్ఞగొని యందరు నుచితాసనములపై గూర్చుండినతరువాత—

"పప్రచ్ఛ తం మహాత్మానం ద్రౌపద్యర్థం విశాంపతే,
కథ మేకా బహూనాం స్యా ద్ధర్మపత్నీ న సంకరః,
ఏత న్మే భగవా న్సర్వం ప్రబ్రవీతు యథాతథమ్."

ద్రుపదమహారాజు ద్రౌపదిసుగూర్చి వ్యాసభగవాను నిట్లడిగెను— మహనీయా! బహుపురుషుల కొకస్త్రీ ధర్మపత్ని యగు టెట్లు? అది దోషము కాకుండు టెట్లు? ఈవిషయమై త్రికాలజ్ఞానసంపన్నుడ వగు నీవు మాకు యథార్థము విశదీకరింపవలయును. అని.

అపుడు వ్యాసభగవాను డిట్లనెను—

"అస్మిన్ ధర్మే విప్రలబ్ధే లోకవేదవిరోధకే,

యస్య యస్య మతం యద్య చ్ఛ్రోతు మిచ్ఛామి తస్య తత్."

టీ. విప్రలబ్ధే. అతిగహనతయా శాస్త్రీయేణ కాపట్యేన హతే, అత ఏవ లోకవేదవిరోధకే"

దురవగాహమై దుర్జ్ఞేయమైన శాస్త్రనిర్ణయము గలదై యున్నందున లోకవేదవిరుద్ధముగా గనబడెడి యీధర్మమునుగూర్చి యెవ్వని మత మెట్టిదో తెలుపవలసినది అని.

అప్పుడు ద్రుపదు డిట్లనెను—

"అధర్మోఽయం మమ మతో విరుద్ధో లోకవేదయోః,

నహ్యేకా విద్యతే పత్నీ బహూనాం ద్విజసత్తమ.

నచా ప్యాచరితః పూర్వై రయం ధర్మో మహాత్మభిః,

నచా ప్యధర్మో విద్వద్భి శ్చరితవ్యః కథంచన.

తతోఽహం న కరో మ్యేనం వ్యవసాయం క్రియాం ప్రతి,

ధర్మ స్సదైవ సందిగ్ధః ప్రతిభాతి హి మే త్వయమ్."

టీ. క్రియాంప్రతి వ్యవసాయం నిశ్చయమ్,

మహర్షీ! లోకవేదవిరుద్ధమైయున్న యిది యధర్మమని నామతము. బహుపురుషుల కొకస్త్రీ పత్నియగుట యెచ్చటను లేదు. ఇట్టిది పూర్వులచే నాచరింపబడలేదు. అధర్మము నాచరించుట తెలిసినవారికి లక్షణముకాదు. కనుక ఈవివాహమునుగూర్చి నేను నిశ్చయింపజాలకున్నాను. నాకిది సందిగ్ధముగనే తోచుచున్నది. అని.

ధృష్టద్యుమ్నుడు డిట్లనెను—

"యవీయసః కథం భార్యాం జ్యేష్ఠో భ్రాతా ద్విజర్షభ,

బ్రహ్మన్ సమభివ ర్తేత సద్వృత్త స్సంస్తపోధన.

నతు ధర్మస్య సూక్ష్మత్వా ద్గతిం విద్మః కథంచన,
అధర్మో ధర్మ ఇతివా వ్యవసాయో న శక్యతే.
కర్తు మస్మ ద్విధై ర్బ్రహ్మం స్తతోఽయం న వ్యవస్యతే,
పంచానాం మహిషీ కృష్ణా భవత్వితి కథంచన."

మహర్షీ! అనుజుని భార్యను సచ్చరిత్రము గల జ్యేష్ఠుఁడు భార్యనుగా బరిగ్రహించు టెట్లు? ధర్మము సూక్ష్మమగుటవలన దానిని గ్రహింపలేకున్నాము. ఇది. ధర్మ మనిగాని, అధర్మ మనిగానిమా బోంట్లు నిశ్చయింప నలవిగాదు కనుక పాండవుల కైదుగురికి యామె పత్నియగుటను మేము సమ్మతింప లేకున్నాము. అని.

ఆపై యుధిష్ఠిరుడిట్లనెను—

"న మే వా గనృతం ప్రాహ నాఽధర్మే ధీయతే మతిః,
వర్తతే హి మనో మేఽత్ర నైషోఽధర్మః కథంచన."

టీ— నమేఇతి. వక్తృత్వం వాచ ఏవ ధర్మో న పురుషస్య నిర్విశేషస్య అత ఉక్తం నమేవాగితి. ఏవం మతిమనసోరపి జ్ఞేయమ్. వాగాదీనాం వక్తృత్వాదిధర్మవతా మసంగేన పుంసా సంబన్ధ స్తు న వాస్తవిక స్సంభవతి. అతఏవోక్తమ్—

"నిస్సంగస్య ససంగేన కూటస్థస్య వికారిణా,
ఆత్మనోఽనాత్మనా యోగో వాస్తవో నోపపద్యతే." ఇతి.

అత్ర పంచానామేకపత్నీత్వే—

"శ్రూయతే హి పురాణేఽపి జటిలా నామ గౌతమీ,
ఋషీ నధ్యాసితవతీ సప్త ధర్మభృతాం వరా.
తథైవ మునిజా వార్క్షీ తపోభి ర్భావితాత్మనః,
సంగతాఽభూద్దశభ్రాతౄ నేకనామ్నః ప్రచేతసః.
గురోర్హి వచనం మాతు ర్ధర్మ్యం ధర్మజ్ఞసత్తమ,
గురూణాం చైవ సర్వేషాం మాతా పరమకో గురుః.

సా చాప్యుక్తవతీ వాచం భైక్షవ ద్భుజ్యతా మితి.
తస్మా దేత దహం మన్యే పరం ధర్మ్యం ద్విజోత్తమ"

మహర్షీ! నావాక్కు అన్ృత మాడి యెఱుగదు. నాబుద్ధి యధర్మమునకుబోదు. పంచకమున కేకపత్నీత్వవిషయమై నామనస్సు ప్రవర్తించుచున్నది. కనుక నిది యేవిధముగను అధర్మము కానేరదు.

ఇది యెచ్చటను లేనిది గాదు. మహాధర్మాత్ముకురాలగు జటిల యను స్త్రీ ఋషిసప్తకమునకు పత్నియయ్యెననియు, తపస్సంపన్నులును సోదరులును ఏకనామము గలవారును అగు పదిమంది ప్రచేతసులకు మునికన్య యగు వార్క్షి పత్నియయ్యె ననియు పురాణములలో వినబడుచున్నది.

గురువులలో పరమగురువు మాత. ఆమెవాక్యము ధర్మబద్ధము. ఆమెకూడ కలిసి యనుభవింపుడని పలికినది. ఇన్నివిధముల జూడగా నిది ధర్మమనియే నేను తలచుచున్నాను. అని.

ఆపై కుంతీదేవి యిట్లనెను—

"ఏవ మేత ద్యథా ప్రాహ ధర్మచారీ యుధిష్ఠిరః,
అనృతా న్మే భయం తీవ్రం ముచ్యే హ మనృతా త్కథమ్."

మహర్షీ! యుధిష్ఠిరు డన్నట్లు నానోటినుండి యామాట వచ్చిన సంగతి నిజమే. నా కనృతభయము అధికము. అనృతమునుండి నే నెట్లు విముక్తురాల నగుదునో. అని.

వ్యాసభగవాను డిట్లనెను—

"అనృతా న్మోక్ష్యసే భద్రే ధర్మ శ్చైష సనాతనః,
నను వక్ష్యామి సర్వేషాం పాంచాల శృణు మే స్వయమ్.
యథాఽయం విహితో ధర్మో యత శ్చాయం సనాతనః,
యథా చ ప్రాహ కౌన్తేయ స్తథా ధర్మో న సంశయః."

కుంతీదేవీ! నీకవృతభయముతో బనిలేదు. ఇది సనాతనమైన ధర్మము. ద్రుపదమహారాజా! ధర్మజుడు చెప్పినట్లు ఇది ధర్మమే. సంశయములేదు. ఈధర్మమెట్లు విహితమైనదో ఎట్లుసనాతనమైనదో అందరకును చెప్పుదును వినుము-

"తత ఉత్థాయ భగవాన్ వ్యాసో ద్వైపాయనః ప్రభుః,
కరే గృహీత్వా రాజానం రాజవేశ్మ సమావిశత్.
పాండవాశ్చాపి కున్తీ చ ధృష్టద్యుమ్నశ్చ పార్షతః,
వివిశు ర్యత్ర తత్రైవ ప్రతీక్షన్తే స్మ తౌ వుభౌ."

టీ. రాజానం ద్రుపదమ్, ఉభౌ వ్యాసద్రుపదౌ,
"తతో ద్వైపాయన స్తస్మై నరేన్ద్రాయ మహాత్మనే,
ఆచఖ్యౌ తద్యథా ధర్మో బహూనా మేకపత్నితా".

టీ. అత్ర "యత్ర ద్దేవా"దదురిత్యాదినా "త్రిపథగాం నదీం" ఇత్యన్తో నారాయణ్యుపాఖ్యానగ్రన్థోఽధ్యాయద్వయాత్మకః క్వచిత్పుస్తకే పఠ్యతే,

ఇట్లు చెప్పి వేదవ్యాసభగవానుడు లేచి ద్రుపదునిహస్తము గ్రహించి యంతర్భవనములోనికి దీసికొనివెళ్ళెను. పాండవులును, కుంతీదేవియు, ధృష్టద్యుమ్నుడును అక్కడకే వ్యాసద్రుపదులను నిరీక్షించుచుండిరి. అంతట వ్యాసభగవానుడు పాండవుల కేకపత్నిత్వము ధర్మమగుటనుగూర్చి ద్రుపదునితో నిట్లు చెప్ప నారంభించెను.

ఈస్థలమందే నారాయణ్యుపాఖ్యాన మను రెండధ్యాయముల గ్రంథము ఒకప్రతిలో నున్నదని నీలకంఠాచార్యులు వ్రాసియుండెను. ఆగ్రంథసందర్భ మాదిలో ప్రదర్శించియే యున్నాము.

ద్రుపదునకు మహర్షి పంచేంద్రోపాఖ్యానమును ఇట్లు చెప్పెను—

—: పంచేంద్రోపాఖ్యానము :—

ద్రుపదమహారాజా! పూర్వము నైమిశారణ్యమందు యమధర్మరాజుసత్రయాగదీక్షితుడై యున్నపుడు ప్రజలకు మరణము లేకుండుట జూచి యింద్రాదిదేవతలు బ్రహ్మనడుగగా నాతడిట్లు చెప్పెను—

"వైవస్వతో వ్యాపృత స్సత్రహేతో స్తేన త్వమే న మ్రియన్తే మనుష్యాః, తస్మి న్నైకాగ్రే కృతసర్వకార్యే తత ఏషాం భవితై వాఽన్తకాలః"

టీ—తస్మిన్ కృతసర్వకార్యే సమాపితయజ్ఞేసతి. ఏషాం లోకానామన్తకాలో భవితా.

"వైవస్వతస్యైవ తనుర్విభక్తా వీర్యేణ యుష్మాక ముత ప్రవృద్ధా, సైషా మన్తో భవితా హ్యన్తకాలే న తత్ర వీర్యం భవితా నరేషు."

టీ—వైవస్వతస్యైవ తనుః ప్రవృద్ధా యోగబలేన విపులా విభక్తా ద్వైధీభావం గతాసతీ సా ఏషామన్తో వినాశో భవితా వీర్యం దేవతాసామ్యమ్.

దేవతలారా! యమధర్మరాజు సత్రయాగసమాప్తి జేసినతరువాత యోగబలముచే నాతనికి వేరొకశరీర మేర్పడి యది మీవీర్యముచే ప్రవృద్ధమై లోకులకు వినాశహేతు వగును. అపుడు మర్త్యులకు అమర్త్యత్వము లేకపోవును. అని.

ఇట్లు భవిష్యద్వృత్తాంతము బ్రహ్మవలన విని ఆయింద్రాదులు ఆసత్రయాగస్థలమునకు వెళ్లుచుండ గంగాజలమున నొక తేజశ్శాలి యగు స్త్రీరత్నము గోచరించినది. ఇంద్రుడామెయొద్దకు వెళ్లి

చూడగా నామె కన్నీటిబిందువు జలములో బడి కనకమయమైన పద్మమయినది. అది చూచి యింద్రుడు నీవెవ్వతెవు? నీవు రోదనముచేయు చున్నట్లుంటివి యేమి కారణము? చెప్పు మనియడుగ నాసంగతి నీకు తెలియగలదు నావెంట రమ్ము అని ఆమె చెప్పగా—

"తాం గచ్ఛన్తీ మన్వగచ్ఛ త్తదానీం
సోఽపశ్య ద్దారా త్తరుణం దర్శనీయమ్,
సిద్ధాసనస్థం యువతీసహాయం
క్రీడన్త మక్షై ర్గిరిరాజమూర్ధ్ని.
త మబ్రవీ ద్దేవరాజో మమేదం
త్వం విద్ధి విద్వ న్భువనం వశే స్థితమ్,
ఈశోఽహ మస్మీతి స మన్యురబ్రవీ
ద్దృష్ట్వా త మక్షై స్సుభృశం ప్రమత్తమ్."

ఇంద్రు డామె వెంట వెళ్ళి పర్వతాగ్రమందు తరుణవయస్కుడును దర్శనీయుడును, సిద్ధాసనస్థుడును, యువతీసహితుడు నయి పాచికలాడుచు తనరాకను లక్ష్యముచేయక యున్న యొకపురుషుని జూచి కుపితుడై నేనీభువనమున కధిపతిని. ఇది నాయధీనమైయున్నది. అని పలుకుచు వజ్రముతో గొట్టుట కుద్యమింప జూచి యాపురుషుడు మందహాసముచేసి తనదృష్టిప్రసారముచేతనే యింద్రుని స్తంభింపజేసెను పరమేశ్వరుడే అపురుషుడు.

అట్లు స్తంభింపజేసి అక్షక్రీడ పూర్తియైన పిమ్మట ఇంద్రుని తీసికొనివచ్చిన ఆస్త్రీతో, దర్పితుడై యున్న ఆయింద్రుని నాయొద్దకు నీవు తీసికొనిరమ్మని చెప్పగా నామె స్పృశించినంతమాత్రమున శరీరము పట్టుతప్పి యింద్రుడు నేలబడెను.

అపు డాయింద్రుని మందలించి నీవు లేచి యీపర్వతగుహ కడ్డుగా బెట్టబడిన పర్వతమును తొలగించి యీగుహలో నీవంటివారున్నారు. వారితో గలిసి నీవుకూడ నుండుము. అని ఆజ్ఞాపించెను.

"స తత్ర ద్వివృత్యక్షి వివరం మహాగిరే స్తుల్యద్యుతీం
శ్చతురో౽న్యాన్ దదర్శ సతా నభివీక్ష్య బభూవ
దుఃఖితః కచ్చిన్నా౽హం భవితా వై యథేమే."

ఇంద్రు డాగిరిగుహను వివరించి తనతో సమానులైయున్న నలుగురి నాగుహలో జూచి తనకుగూడ నట్టి యవస్థయే వచ్చునని దుఃఖించెను. ఆపై నీవే సర్వేశ్వరుడ వని ఈశ్వరుని వేడుకొనెను. తరువాత పరమేశ్వరు డిట్లు చెప్పెను—

"యోనిం సర్వే మానుషీ మావిశధ్వం తత్ర యూయం,
కర్మ కృత్వా౽విషహ్యం, బహూ నన్యా న్నిధనం ప్రాపయిత్వా
ఆగన్తారః పున రేవేన్ద్రలోకం, స్వకర్మణా పూర్వజితం మహార్హమ్."

మీరైదుగురును మనుష్యజన్మ మెత్తవలయును. అంద సాధారణకారణములు చేసి యన్యుల ననేకులను వధించి తరువాత మీరు సంపాదించుకొనిన యింద్రలోకమునకు మరల మీరు రాగలరు, అని. అపుడు పూర్వేంద్రు లిట్లనిరి—

"గమిష్యామో మానుషం దేవలోకా
ద్దురాధరో విహితో యత్ర మోక్షః,
దేవా స్త్వస్మా నాదధీరన్ జనన్యాం
ధర్మో వాయు ర్మఘవా నశ్వినౌ చ".

"అస్త్రై ర్దివ్యై ర్మానుషాన్ యోధయిత్వా ఆగన్తారః పునరేవేన్ద్రలోకమ్."

"ఏత చ్ఛ్రుత్వా వజ్రపాణి ర్వచ స్తు దేవశ్రేష్ఠం పునరేవేద మాహ, వీర్యేణా౽హం పురుషం కార్యహేతో ర్దద్యా మేషాం పఞ్చమం మత్ప్రసూతమ్."

టీ వీర్యేణ శుక్రద్వారా పురుష మంశభూతం దద్యాం స్వయంతు ఆధికారికత్వా దిహైవ తిష్ఠేయ మితి భావః.

పరమేశ్వరా! నీయాజ్ఞానుసారము మేము మనుష్యలోకమున జన్మింతుము. మమ్ము జననీగర్భమున ధర్మదేవ, వాయుదేవ, దేవేంద్ర, అశ్వనీదేవతలు ప్రవేశపెట్టునట్లనుగ్రహింపుము. మే మచ్చట దివ్యాస్త్రములతో యుద్ధముజేసి కృతకృత్యులమై తిరిగి యింద్రలోకమునకు వత్తుము. అని చెప్పగా నప్పటి యింద్రుడు తానాధికారిక పురుషుడై యున్నందున స్వయముగా జన్మించుట గాక శుక్రము ద్వారా తన యంశమును జన్మింపజేయుదు నని చెప్పకొనెను.

"విశ్వభుక్ భూతధామా చ శిబి రిన్ద్రః ప్రతాపవాన్,
శాన్తి శ్చతుర్థ స్తేషాం వై తేజస్వీ పంచమ స్స్మృతః."

టీ. తేజస్వీ ఇన్ద్రాంశః.

పూర్వమింద్రపదవి నధిష్ఠించి విరమించిన విశ్వభుక్, భూతధామ, శిబి, శాంతి, అనువారు నలుగురును అప్పటి యింద్రుని యంశ మొకటియును గలిసి పంచేంద్రులైరి.

"తేషాం కామం భగవా నుగ్రధన్వా
ప్రాదా దిష్టం సన్నిసర్గా ద్యథోక్తం,
తాంచాప్యేషాం యోషితం లోకకాన్తాం
శ్రియం భార్యాం వ్యదధా న్మానుషేషు."

టీ. సన్నిసర్గాత్ సుస్వభావాత్ శ్రియమితి ద్రౌపదీ స్వర్గశ్రీః తామ్.

ఆపంచేంద్రులు కోరుకొనినట్లె సుస్వభావముతో పరమేశ్వరుడు సమ్మతించి యట్లు జన్మించి నపుడు వారందరుకు లోకకాంతయగు స్వర్గలక్ష్మిని భార్యగా విధించెను.

తరువాత నావిశ్వ భుక్ప్రభృతులతో గలసి యాపరమేశ్వరుడు నారాయణసమక్షమునకు వెళ్ళి చెప్పగా నాపురాణపురుషుడు వట్లే

యాజ్ఞాపించి పిమ్మట దేవకీరోహిణుల యందు శ్రీకృష్ణబలరామస్వ రూపములతో తా నుద్భవించెను.

"ఇహైవ తే పాండవా వీర్యవన్తశ్శక్రస్యాంశః పాండవస్సవ్యసాచీ। ఏవ మేతేపాండవాస్సంబభూవుర్యే తే రాజన్పూర్వమిన్ద్రా బభూవుః.

"లక్ష్మీశ్చైషాం పూర్వ మేవోపదిష్టా భార్యాయైషా ద్రౌపదీ దివ్య రూపా, కథం హి స్త్రీకర్మణా తే మహీతలా త్సముత్తిష్ఠే దన్యతో దైవయోగాత్. యస్యా రూపం సోమసూర్యప్రకాశం గన్ధశ్చాస్యాః క్రోశమాత్రా త్ప్రవాతి"

ఇదం చాన్యత్ప్రీతిపూర్వం నరేన్ద్ర దదాని తే వరమత్యద్భుతం చ, దివ్యం చక్షుః పశ్య కున్తీ సుతాంస్త్వం పుణ్యై ర్దివ్యైః పూర్వ దేహై రుపేతాన్.

అపూర్వేంద్రులే యీపరాక్రమశాలులయిన పాండవులు ఆయింద్రాంశమే యీయర్జునుడు. వీరికి భార్యగా పరమేశ్వరనిర్దిష్టమైన ఆస్వర్గలక్ష్మియే దివ్యరూపనుగల యీద్రౌపది.

సోమసూర్యప్రకాశమైన రూపము క్రోశపర్యంతవ్యాప్తిగల సుగంధము గల యీస్త్రీరత్నము నీయజ్ఞకర్మనుబట్టి దైవయోగమున గాక భూతలమునుండి యెట్లావిర్భవించునో చెప్పుము ద్రుపదమహా రాజా! నీకు దివ్యదృష్టి నిచ్చుచున్నాను. పాండవులు దివ్యములైన పూర్వదేహములతో గనబడుచున్నారో లేదో చూడుము అని వ్యాస భగవానుడు ద్రుపదునకు దివ్యదృష్టి ననుగ్రహించెను.

తతో వ్యాసః పరమోదారకర్మా శుచి ర్విప్రః స్తపసా తస్య రాజ్ఞః, చక్షు ర్దివ్యం ప్రదదౌ తాంశ్చ సర్వాన్ రాజాఽపశ్య త్పూర్వ దేహై ర్యథావత్.

తతో దివ్యాన్ హేమకిరీటమాలిన శ్శక్రప్రఖ్యాన్ పావ కాదిత్యవర్ణాన్, బద్ధాపీడాం శ్చారురూపాంశ్చ యూనో వ్యూఢోర స్కాంస్తాలమాత్రాన్ దదర్శ"

దివ్యై ర్వస్త్రై రరజోభిస్సుగంధై ర్మాల్యైశ్చాగ్ర్యై శ్శోభ మానానతీవ, తాన్ పూర్వేన్ద్రానభివీక్ష్యాఽభిరూపాన్ శక్రాత్మజం చేన్ద్ర రూపం నిశమ్య, ప్రీతో రాజా ద్రుపదో విస్మితశ్చ దివ్యాం మాయాం తా మవేక్ష్యాఽ ప్రమేయామ్"

"తాం చైవాగ్ర్యాం స్త్రియ మతిరూపయుక్తాం దివ్యాం సాక్షా త్సోమవహ్నిప్రకాశామ్ యోగ్యాం తేషాం రూపతేజోయశోభిః పత్నీం మత్వా హృష్టవాన్ పార్థివేన్ద్రః"
స త ద్దృష్ట్వా మహదాశ్చర్యరూపం జగ్రాహ పాదౌ సత్యవత్యా స్సుతస్య, నైత చ్చిత్రం పరమర్షే త్వయీతి ప్రసన్నచేతా స్స ఉవాచ చైనమ్"

అపుడు వారు దివ్యరూపధారులు, హేమకిరీటశోభితులు, సూర్యాగ్ని తుల్యతేజశ్శాలులు, వ్యూఢోరస్కులు, అత్యున్నతదేహులు, దివ్యవస్త్రమాల్యవిరాజితులు నయి పూర్వదివ్యదేహములతో దివ్యదృష్టి ప్రభావమున మహర్షి చెప్పినట్లే గోచరింప ద్రుపదుడు ప్రీతుడు విస్మితుడు నయ్యెను. ఆద్రౌపదీదేవికూడ మహర్షి చెప్పినట్టి దివ్యరూపముతో గోచరింప వీరికి యీమె అన్నివిధముల బత్నియగుటకు యోగ్యురాలని ద్రుపదుడుభావించి సంతోషించి ఆయద్భుతఘటనను జూచి వ్యాసభగవానుని పాదములు బట్టుకొని ప్రసన్నచిత్తుడయి మహర్షీ! నీయెడ నిది యొక చిత్రమా? నీవు మహాప్రభావసంపన్నుడవని పలికెను.

అంతట వ్యాసభగవానుడు ఆయింద్రుని పరమేశ్వరుని యొద్దకు దీసుకొనివెళ్ళినస్త్రీయొక్క పూర్వవృత్తాంతమునుగూడ ద్రుపదమహారాజున కిట్లు చెప్పెను—

"ఆసీ త్తపోవనే కాచి దృషేః కన్యా మహాత్మనః,
నాధ్యగచ్ఛ త్పతిం సాతు కన్యా రూపవతీ సతీ.
తోషయామాస తపసా సా కిలోగ్రేణ శంకరమ్,
తా ముహాచేశ్వరః ప్రీతో వృణు కామమితి స్వయమ్.
సైవ ముక్తాఽబ్రవీ త్కన్యా దేవం వరద మీశ్వరమ్,
పతిం సర్వగుణోపేత మిచ్ఛామీతి పునః పునః
దదౌ తస్యై సదేవేశ స్తం వరం ప్రీతమానసః,
పంచ తే పతయో భద్రే భవిష్యన్తీతి శంకరః.
సా ప్రసాదయతీ దేవ మిదం భూయోఽభ్యభాషత,
ఏకం పతిం గుణోపేతం త్వత్తోఽర్హామీతి శంకర.
తాం దేవదేవః ప్రీతాత్మా పునః ప్రాహ శుభం వచః,
పంచకృత్వ స్త్వయోక్తోఽహం పతిం దేహీతి వై పునః.
తత్తథా భవితా భద్రే వచ స్తద్భద్ర మస్తు తే,
దేహ మన్యంగతాయా స్తే సర్వ మేత ద్భవిష్యతి.
ద్రుపదస్యైషా హి సా జజ్ఞే సుతా వై దేవరూపిణీ,
పంచానాం విహితా పత్నీ కృష్ణా పార్ష త్యనిన్దితా,
స్వర్గశ్రీః పాండవార్థ న్తు సముత్పన్నా మహామఖే.
సేహ తప్త్వా తపో ఘోరం దుహితృత్వం తవాగతా, సైషా
దేవీ రుచిరా దేవజుష్టా పంచానా మేకా స్వకృతే నేహ
కర్మణా, సృష్టా స్వయందేవపత్నీ స్వయంభువా శ్రుత్వా రాజా
ద్రుపదేష్టం కురుష్వ"

తపోవనమందు మహాత్ముడైన యొకఋషికి గన్యక యుండెను
ఆమె రూపవతియై యున్నను వివాహము కాలేదు. ఆమె శంకరుని
గూర్చియుగ్రతపము జేసినది. శంకరుడు సాక్షాత్కరించి వరము గోరు
కొను మనెను, ఆమె సర్వగుణోపేతుడైన పతిని కటాక్షింపుమని

పునః పునః అనినది. నీకు పంచపతులు కలుగుదు రని శంకరుడు చెప్పగా గుణవంతుడైన యొక్కపతినే నేను కోరినాను. అట్లను గ్రహింపు మని వేడుకొనగా శంకరుడు 'పతిం దేహి' అని నీవైదు సారు లనుటనుబట్టి యట్లే నీకు వరమీయబడినది. నీకాపంచపతిత్వము దేహాంతరమందు సంభవించును. నీకు శుభమగును. అని చెప్పెను.

ద్రుపదమహారాజా! ఆమెయే నీపుత్రికయై పాండవపంచకము నకు బత్నిగా విధింపబడినదై పూజ్యురాలై జన్మించినది.

స్వర్గలక్ష్మియే మునికన్యయై పుట్టి ఘోరతపముచేసి పాండవార్థము నీపుత్రికగా నుద్భవించినది. ఈమె స్వకర్మచే పంచకమునకు బత్నిగా సృజింపబడినది. కనుక నీవిష్టపడుము. అని.

ఇచ్చట స్వర్గలక్ష్మియే మునికన్య యనియు. ఆమునికన్యయే యీశ్వరునిగూర్చి తపము జేసి దేహాంతరమందు పంచపతిత్వవరమును పొందినట్టిదనియు, ఆమునికన్యయే వరము పొందినతరువాత వెనుక జూపిన నాలాయన్యుపాఖ్యానములో నున్నట్లు—

"గచ్ఛ గంగాం జలస్థా చ నరం పశ్యసి యం శుభే,
త మానయ మమాఽభ్యాశం సురరాజం శుచిస్మితే."

అనుచు, నీవు గంగాజలమందుండి యక్కడ నీకు గనబడిన యింద్రుని నాయొద్దకు దీసుకొనిరమ్మని శంకరునిచే నాజ్ఞాపింపబడిన దనియు తెలిసికొనవలయును.

—: పంచపతిత్వమునుగూర్చి ద్రుపదసమ్మతి :—

వ్యాసభగవానుని యుపదేశము విని ద్రుపదు డిట్లనెను—

"అశ్రుత్వైవం వచనం తే మహర్షే
మయా పూర్వం యతితం సంవిధాతుం,
న వై శక్యం విహితస్యాఽపయానం
తదేవేద ముపపన్నం విధానమ్."

టీ. అశ్రుత్వేతి- విహితస్య దైవోపస్థాపితస్య అపయాన ముపేతో తదేవవిధానం ప్రాక్కృతం ఉపపన్నం కర్తుం యుక్తమ్.

"దిష్టస్య గ్రన్థి రనివర్తనీయః స్వకర్మణా విహితం నేహ కించిత్,
కృతం నిమిత్తం హి వరైక హేతో స్తదేవేద ముపపన్నం విధానమ్"

టీ. గ్రన్థి ర్గ్రథనా స్వకర్మణా ఇదానీన్తనేన విహితం సిద్ధమ్ నిమిత్తం తపః.

"యథైవ కృష్ణోక్తవతీ పురస్తా న్నైకశః పతీ న్మే భగవా న్దదాతు,
సచాప్యేవం వరమిత్యబ్రవీ త్తాం దేవోహి వేత్తా పరమం యదత్ర.
యదిచైవం విహితశ్శంకరేణధర్మోఽధర్మోవానాత్రమమాపరాధః,
గృహ్ణన్త్విమేవిధివత్పాణిమస్యా యథోపజోషంవిహితైషాం హి కృష్ణా"

మహర్షీ'నేనింతవిషయమున్నదని యెఱుగక అన్యథా చేయనెంచితిని. విధిప్రాప్తమైనదానిని త్రోసివేయుట శక్యముకాని పని కనుక నావిధమున జేయుటే యుక్తము. దైవఘటన అనివార్యము. ఇప్పుడేమిప్రయత్నించినను సిద్ధింపదు తపముజేసి వరమును పొందినపుడు అట్లుచేయుటే యుచితము. ఆమె 'పతిం దేహి' అని పునఃపునః పలుకుట, తదనుగుణముగా పరమేశ్వరుడు పంచపతిత్వవర మిచ్చుట జరిగినవుడు దాని పరమార్థము పరమేశ్వరునికే యెఱుక.

శంకరుడే యట్లు విధించినపుడు అది ధర్మమైనగానిమ్ము, అధర్మమైనగానిమ్ము నేనపరాధినిగాను. వీరికీమె పత్నిగా విధింపబడినది. గనుక నీమెపాణిగ్రహణమును పాండవులువిధ్యుక్తముగా జేయుదురుగాక. అని.

—: ద్రౌపదీపాణిగ్రహణము :—

అటుపై వ్యాసభగవానుడు ధర్మజునితో 'అద్యైవ పుణ్యాహమ్' "పాణిం కృష్ణాయా స్త్వం గృహాణాఽద్య పూర్వమ్" నేడు మంచి ముహూర్తము. ద్రౌపదీపాణిగ్రహణము జ్యేష్ఠుడవైన నీవు ముందు

చేయుము. అని చెప్పెను. ద్రుపదమహారాజు తన పుత్రులతో గలిసి పాణిగ్రహణమహోత్సవమునకు దగిన సన్నాహము జేసియుండ పౌరులతోడను, మహాజనులతోడను సభాస్థలము క్రిక్కిరిసియుండ మంగళస్నానపూర్వకముగ సర్వాభరణభూషితురాలైన ద్రౌపదీదేవి వివాహమండపమున ప్రవేశపెట్టబడియుండ మంగళక్రియలను నిర్వర్తించుకొని యమూల్యవస్త్రాభరణశోభితులై అగ్నివలె తేజస్వియైన పురోహితుడగు ధౌమ్యునితోగూడ పాండవులొకని వెనుక నొకరుగా వచ్చి సభనలంకరించి యుండిరి.

"తత స్సమాధాయ స వేదపారగో
జుహావ మన్త్రై ర్జ్వలితం హుతాశనం,
యుధిష్ఠిరం చాప్యుపనీయ మన్త్రవి
న్నియోజయామాస సహైవ కృష్ణయా."
ప్రదక్షిణం తౌ ప్రగృహీతపాణీ
పరిణాయయామాస స వేదపారగః,
తతోభ్యనుజ్ఞాయ త మాజిశోభినం
పురోహితో రాజగృహా ద్వినిర్యయౌ"
"క్రమేణ చానేన నరాధిపాత్మజా
వరస్త్రియ స్తే జగృహు స్తదా కరమ్,
అహన్యహ న్యుత్తమరూపధారిణో
మహారథాః కౌరవవంశవర్ధనాః"

అంతట వేదపారంగతుడైన ధౌమ్యుడు మంత్రపూర్వకముగ హోమము జేసి యుధిష్ఠిరునిచే ద్రౌపదీపాణిగ్రహణము జేయించి యాదంపతులచే హస్తగ్రహణపూర్వకముగ నగ్నికి ప్రదక్షిణము జేయించి, నాడు వైవాహికవిధిని నిర్వర్తింపజేసెను.

అదే క్రమముగా పాండవులొక్కొక్కరోజున నొక్కొక్కరు చొప్పున ద్రౌపదీపాణిగ్రహణమును జేసిరి.

ఏకదినమునందే యీపాణిగ్రహణము పాండవు లందరిచే జేయింపక దినభేదముచే జేయించుటకు ఈశ్వరవరప్రభావమున ద్రౌపదీదేవి కేదినమున కాదినమే కన్యాత్వసిద్ధి యగుచుండుట కారణ మని చెప్పబడినది. చూడుడు—

"ఇదం చ తత్రా ఉద్భుతరూప ముత్తమం
జగాద విప్రర్షి రతీతమానుషమ్,
మహానుభావా కిల సా సుమధ్యమా
బభూవ కన్యైవ గతేగతే ఒహని"

ఆంధ్రభారతము— "ముందట ధర్మపుత్రునకు ద్రుపద రాజపుత్రిం బాణిగ్రహణంబు సేయించి తొల్లి యేవురకు వివాహంబు సేయునపుడు కన్యాత్వంబు దూషితంబు గాకుండ నీశ్వరు వరంబునం గౌమారత్వంబువడసిన యక్కన్యకంగ్రమంబున భీమార్జుననకులసహదేవులకుం బాణిగ్రహణంబు సేయించిన"

ఇది పాండవులయొక్క ద్రౌపదీపాణిగ్రహణప్రకారము. దీనికై కూడునని కూడదని చర్చించుట, ద్రుపదధృష్టద్యుమ్ను లిట్లుపడకపోవుట, వ్యాసమహర్షి యిది ఈశ్వరనిర్దిష్టమని బహునిదర్శనములు చెప్పి దివ్యదృష్టి నిచ్చి ద్రుపదునకు ద్రౌపదీపాండవుల పూర్వస్వరూపముల గోచరింపజేయుట, ఆపై విధివిహితమైన యీకార్య మనుల్లంఘనీయమనియు, నేనపరాధిని కాననియు జెప్పి ద్రుపదుడు పంచపాండవులకిచ్చి వివాహము జరిపించుటకలిగినదని స్పష్టము. దీనిచే "ద్రౌపది నిడనెంచు ద్రుపదరాజేంద్రుడు పంచపాండవులకు పడతి నిడెను" అను వ్రాత పరాస్తము.

ఈవివాహ మైన వెంటనే భీష్మప్రేరితుడయి ధృతరాష్ట్రుడు ద్రౌపదీసహితముగా పాండవులను, కుంతీదేవిని విదురునిచే హస్తినా

పురమునకు బిలిపించి వారికర్ధరాజ్య మిచ్చి పంపగా వారువెళ్లి యింద్రప్రస్థములో నున్నపుడు నారదమహర్షి దర్శన మిచ్చి యేకాంతమున బాండవులతో నిట్లు చెప్పెను.

"పాంచాలీ భవతా మేకా ధర్మపత్నీ యశస్వినీ,
యథా వో నాత్ర భేద స్స్యా త్తథా నీతి ర్విధీయ తామ్"

ఒక్క ద్రౌపదీదేవి మీకందరకు ధర్మపత్నియై యున్నది. అందువలన మీలో మీకు భేదభావము కలుగకుండుటకై యొకనిర్ణయమును మీరు చేసికొనవలయును. అని.

"ఏవ ముక్తా మహాత్మానో నారదేన మహర్షిణా,
సమయం చక్రిరే రాజం స్తేఽన్యోన్యవశమాగతాః.
సమక్షం తస్య దేవర్షే ర్నారదస్యాఽమితౌజసః,
ద్రౌపద్యా న స్సహాసీనా నన్యోన్యం యోఽభిదర్శయేత్.
స నో ద్వాదశవర్షాణి బ్రహ్మచారీ వనే వసేత్".

ఇట్లు చెప్పగా విని పాండవులు నారదమహర్షి సమక్షములో నొకనిర్ణయమును జేసికొనినారు. ద్రౌపది యొక్కొక్కనియింట యింత కాలముండవలయును. ఆకాలములో ద్రౌపదియున్నయింటిలోనికి అన్యుడు మనలో వెళ్లినయెడల నాతడు ద్వాదశవర్షబ్రహ్మచర్యము చేయవలయును. అని.

ఇట్టి శపథము నవలంబించి యవిచ్ఛిన్నపరస్పరానురాగముతో, భక్తివిశ్వాసములతో, లోకోత్తరసౌమనస్యముతో నభేద్యముగా ద్రౌపదీధర్మపత్నితో వర్తించుచుండిరి.

ఆపాండవులు ద్రౌపదీదేవికి పతు లగుటే కాదు, మరదులును మామలునుగూడ నయి యుండిరి "పితృసమో జ్యేష్ఠః" అను న్యాయమున సోదరులలో చిన్నవారికి పెద్దవారు పితృస్థానీయులు కనుక పెద్ద

వాడు తన తమ్ముని భార్యకు శ్వశురుడు (మామగారు) అగును. పెద్ద వాని భార్యకు అతని తమ్ముడు దేవరుడు (మరిది) అగును. ఈపద్ధతిని బట్టి సర్వజ్యేష్ఠుడైన ధర్మజుడు ద్రౌపదీదేవికి స్వయముగా పతియు, తమ్ములను బట్టి శ్వశురుడు నయ్యెను సర్వకనిష్ఠుడైన సహదేవుడు స్వయముగా బతియు, నన్నలను బట్టి దేవరుడునయ్యెను. ఇకమధ్యములు ముగ్గురును స్వయముగా బతులును, అన్ననుబట్టి మరదులును తమ్ముని బట్టి మామలును అయిరి. ఈవిషయమును జెప్పెడి శ్లోక మిదిగో—

"జ్యేష్ఠేపతిశ్వశురతా పతిదేవరతాఽనుజే,
మధ్యమేషు చ పాంచాల్యా స్త్రితయం త్రితయం త్రిషు"

ఇట్లుండుటనుబట్టి ధర్మజునితో వర్తించు కాలములో మిగిలిన వారిని మరదులనుగా వాత్సల్యముతో జూచుచుండెడిది. భీమసేనాదులతో వర్తించు కాలములో నాధర్మజుని శ్వశురునిగా పూజ్యభావముతో జూచుచుండెడిది. ఇట్లే యన్యులపట్లకూడ జూచుచుండెడిది.ఇందు అనురాగ హేతువైనపతిత్వమును, పూజ్యతా హేతువైన శ్వశురత్వమును వాత్సల్య హేతువైన దేవరత్వమును అవిరుద్ధముగా ననుసంధించి అనన్యసాధారణముగా నభేద్యముగా పాండవపంచకముతో గాపురము చేసి సత్కీర్తిని వెలయించిన సాధ్వీమతల్లి ద్రౌపదీదేవి. అనన్యసాధారణమైన ఈమె సచ్చరిత్రము ఆస్తికులైన భారతీయులకు పాపహరము.

ఇటుపై ద్రౌపదీవివాహమును గూర్చిన ప్రతివాదిప్రసంగమును పరామర్శింతము—

—:ద్రౌపదీవివాహము "ధర్మశాస్త్రానుమతము కా"దను సుయోధనవిజయకర్త ప్రసంగము —తన్నిరాకరణము:—

"ఏధర్మశాస్త్రంబు లీయుంతి యుద్వాహమున కనుమతి నిడవనుట నిజము, ఏదేశమందున నిట్టి యాచారంబు కలదని చెప్పంగ గడగ

రెవరు, స్మృతులందు శ్రుతులందు జెప్పలే దీ వివాహము కూర్చి శాస్త్రదూష్యంబుగాన"

ఇచ్చట గొంచెము చెప్పవలసియున్నది. ద్రౌపదీపాండవులకు మాత్రమే ప్రత్యేకవిధానముగా నీశ్వరనిర్దిష్టమైనది యీవివాహము. సర్వసాధారణమైన వివాహవిధిని లోకసామాన్యమునకు బోధించునవి ధర్మశాస్త్రములు. అట్టి ధర్మశాస్త్రములు సర్వసాధారణము కాని హేతువుచే నట్టివి వాహము ననుమతింపక బోవచ్చును. అంతమాత్రమున నీశ్వర నిర్దిష్టమైన యీవివాహము దూష్యమనుట అయుక్తము.

ఇంకొక్కటి– పూర్వోక్తప్రకారము "అధర్మో౽యం మమ మతో విరుద్ధో లోకవేదయోః" అని మొదట ద్రుపదు డన్నమాటనే యీప్రతివాదు లనియున్నారు. ఆపైవచ్చిన చర్చపై యంగీకరించి యాద్రుపదుడే నిస్సంశయుడై యీవివాహమును జేసియుండ నేసంబంధము లేని యీప్రతివాదులు దాని నధర్మమనుట అసంగతము.

ఇంకొకటి– ధర్మశాస్త్రము లనుమతింప వనునది ప్రతివాదుల మాట. దీనిని బట్టి ధర్మశాస్త్రములందు ప్రామణ్యమును ప్రతివాదు లంగీకరించినట్లే. ధర్మశాస్త్రముల కట్టి ప్రామాణ్యము ధర్మశాస్త్రకర్తల ప్రామాణ్యమునుబట్టి వచ్చినదే. ఆధర్మశాస్త్రకర్త లిట్లు కీర్తింపబడి యున్నారు. చూడుడు.

"మన్వత్రివిష్ణుహారీతయాజ్ఞవల్క్యోశనోంగిరాః,
యమాపస్తంబ సంవర్తాః కాత్యాయనబృహస్పతీ.
పరాశర వ్యాసశంఖలిఖితా దక్షగౌతమౌ,
శాతాతపో వసిష్ఠశ్చ ధర్మశాస్త్రప్రయోజకాః,

ఈధర్మశాస్త్రకర్తలలో పేర్కొనబడినవాడు వ్యాసమహర్షియొకడు. ఆవ్యాసమహర్షియే ద్రుపదునకు బోధించునపుడు–

"తతో ద్వైపాయన స్తస్మై నరేన్ద్రాయ మహాత్మనే,
ఆచఖ్యౌ తద్యథా ధర్మో బహూనా మేకపత్నితా."

అని చెప్పబడినట్లు బహునిదర్శనములతో నది ధర్మమే యని నిరూపించి యావివాహమున కనుమతి నిచ్చియుండుటచే ధర్మశాస్త్రకర్త కనుమతమైన యావివాహము ధర్మశాస్త్రానుమతమేలకాదు? ధర్మశాస్త్రకర్తల వాక్యములే కదా ధర్మశాస్త్రములు.

ఇంకొకటి- స్థూలధర్మమనియు, సూక్ష్మధర్మమనియు, ధర్మము ద్వివిధము. అందు స్థూలధర్మము లోకసామాన్యమునకు గ్రాహ్యము కావచ్చునుగాని, సూక్ష్మధర్మము కాదు. అట్టి సూక్ష్మధర్మములోనిదే ద్రౌపదీవివాహము. చూడుడు-

పరాశరమాధవీయము -

"చతుర్ణామపి వర్ణానాం కర్తవ్యం ధర్మకోవిదైః,
బ్రూహి ధర్మస్వరూపజ్ఞ సూక్ష్మం స్థూలం చ విస్తరాత్."

వ్యాఖ్యా- చతుర్ణాం వర్ణానాం మధ్యే ధర్మకోవిదై రసాధారణ ధర్మాభిజ్ఞైః కర్తవ్యం విస్తరా ద్బ్రూహి. సచ కర్తవ్యో ధర్మో ద్వివిధః స్థూల స్సూక్ష్మశ్చ. మన్దమతిభిరపి సుఖేన బుధ్యమాన శ్శౌచాఽఽచమనసంధ్యావందనాదిః స్థూలో ధర్మః. శాస్త్రపారఙ్గతైః పణ్డితై రేవ బోద్ధుం యోగ్యః ఇతరేషా మధర్మత్వ భ్రాన్తివిషయః ద్రౌపదీవివాహాది స్సూక్ష్మో ధర్మః. తథాచ భారతే-

ద్రుపద ఏకస్యా ఞ్చూషితో బహుపతిత్వం లోకవేదవిరుద్ధం మన్వాన ఆచచక్షే. తత్ర లోకవిరోధ స్స్ఫుట ఏవ. తిర్యక్ష్వప్యేకస్యాం గవి వృషభద్వయ యుద్ధదర్శనాత్. వేదే ప్యేవం శ్రూయతే-'ఏకస్య బహ్వ్యో జాయా భవన్తి, నైకస్యా బహవః

స్రుహా పతయః ఇతి, యదేకస్మిన్ యూపే ద్వేరశనే పరివ్యయతి
తస్మాదేకో ద్వే జాయే విన్దతే యన్నైకాగ్ం రశనాం ద్వయో
ర్యూపయోః పరివ్యయతి తస్మాన్నైకా ద్వౌ పతీ విన్దతే"ఇతి.

తత్ర ద్రుపదభ్రాన్తినివృత్తయే యుధిష్ఠిర ఆహ—

"లోకవేదవిరుద్ధోఽయం ధర్మో ధర్మవతాం వర,
సూక్ష్మో ధర్మో మహారాజ నాస్య విద్మో గతిం వయమ్"

ఇతి ధర్మత్వంచ బహుపతిత్వస్య తత్రైవ బహుధా ప్రపంచితమ్.
ఏవం ధర్మవ్యాధోపాఖ్యానే విద్యాభ్యాసా ద్గరీయసీ మాతాపితృ
శుశ్రూషా వినాప్యభ్యాసం తచ్ఛుశ్రూషయైవ తస్య జ్ఞానోత్పత్తేః
ఇతి ప్రతిపాద్య "సూక్ష్మ ఏవ ద్విజోత్తమ"ఇతి.

దీని తాత్పర్యము— "మందమతులకుగూడసుఖముగా తెలియబడునట్టిది
స్థూలధర్మము. శాస్త్రపారంగతులగు పండితులకు మాత్రమె తెలిసి
కొనదగినదై అన్యుల కధర్మత్వభ్రాంతిని గలిగించునట్టి ద్రాపదీవివాహా
దికము సూక్ష్మధర్మము. కనుకనే మొదటద్రుపదున కావివాహము అధ
ర్మమనిపించినది. అది ధర్మమే యని భారతములో బహువిధముల
ప్రతిపాదింపబడినది. అందుచే నది సూక్ష్మధర్మమైనది.

ధర్మవ్యాధోపాఖ్యానములో గూడ విద్యాభ్యాసములేని ధర్మ
వ్యాధునకు మాతాపితృశుశ్రూషచేతనే జ్ఞానోత్పత్తి యగుటనుబట్టి
విద్యాభ్యాసముకంటెమాతాపితృశుశ్రూషయే జ్ఞానోత్పత్తికిగొప్పసాధ
నమని ప్రతిపాదించి యది సూక్ష్మధర్మమని చెప్పబడినది. అని"

ఇపుడు చూడుడు-విద్యాభ్యాసమే జ్ఞానోత్పత్తికిసాధనమని లోక
సామాన్యమునకు దెలిసియుండ లోకసామాన్యమునకు దెలియని
కేవల మాతాపితృశుశ్రూషయే ధర్మవ్యాధునకు జ్ఞానోత్పాదకమగుట
వలన నది సూక్ష్మధర్మమయినట్లు స్త్రీకి యేకపతిత్వమే ధర్మమని లోక
సామాన్యమునకు దెలిసియుండ ద్రాపదీదేవికి లోకసామాన్యమునకు

దెలియని పంచపతిత్వధర్మమును వ్యాసభగవానుడు నిరూపించుటను బట్టి యిదియు సూక్ష్మధర్మమైనది.

పర్యవసాన మేమనగా—

వేదవ్యాసాదులచే ధర్మముగా నిర్ణయింపబడిన ద్రౌపదీపంచపతిత్వమును ప్రతివాదులు అధర్మ మధర్మమని భావించుచుండుట ఆద్రౌపదీపంచపతిత్వము సూక్ష్మధర్మమని నిర్ణయించుటకే బలకరమైనది కనుక ప్రతివాదుల విరుద్ధప్రసంగములు పరాస్తమైనవి.

—:"ద్రౌపదీపంచపతిత్వముచే ద్రౌపదీజన్మకారణము భగ్నమై—
దైవనిర్దిష్టము తప్పిపోయిన"దను ప్రసంగము—
తన్నిరాకరణము:—

"ద్రోణుని వధియించు ద్రోణారి నొకనిని, జిష్ణుని బెండ్లాడు చెలువ నొర్తు బడయుంగదలచి నృపాలుండు తపమును, జేయంగ వానిని శివుడు మెచ్చి, తగువరంబుల నిచ్చె దాని ద్రుపదరాజు, గని సుతుని సుతను కాన వాని, తపమున బుట్టిన తన్వి యాఫల్గునుకు నకు భార్యయై యుంట న్యాయ మగును ఆరీతి గాకుండ నానాతి ధర్మజు, కర్ధాంగి యాటచే నబల జన్మ, కారణంబెన్న భగ్నంబుగా జొచ్చె నా శివుని వరంబులు చేరె బదడు, దైవనిర్దిష్టంబు తప్పె నీనాటికి, పురుషప్రయత్నంబు భువిని గెలిచె"

ఇది సుయోధనవిజయకర్త వ్రాత. ఇచ్చట అర్జునునకు భార్యకాదగిన కుమార్తెను, ద్రోణుని వధింపగల కుమారుని, గోరి ద్రుపదుడు శివునిగూర్చి తపముజేసి వరమునుబొంది కుమార్తెను, కుమారుని గని నని వ్రాసినారు.

ఈవిషయమై మ. భా. చ. కారులు—

"ద్రుపదుడు ద్రోణుని జయించు కుమారుడు కావలె నని పలవరించెనేకాని, యర్జునునకు, భార్యగాదగిన కుమార్తెను

మొదట కోరియుండలేదు. ధృష్టద్యుమ్నునితో నయోనిజగా ద్రౌపదికూడ పుట్టెనని యాజుడగ్నివేదికమీద ద్రౌపదినిగూర్చుండ బెట్టియుండును.'' అని వ్రాసినారు. (పు.224)

ఇక మహాభారత రహస్యకారులు—

"ద్రౌపదీధృష్టద్యుమ్నులు ద్రుపదునకు దత్తులు" అని వ్రాసినారు ఈవ్రాత లోకదాని నొకటి త్రోసివేయుచున్నవి. విమర్శకుల వైఖరి యిట్లున్నదని తెలియుటకై యిది ప్రదర్శింపబడినది.

ఆంధ్రభారతములో నయినను— "ద్రోణునివధియించునట్టి కొడుకును, నర్జునునకు దేవియగు నట్టి కూతునుం బడయుదు నని బ్రాహ్మవిదులైన బ్రాహ్మణుల నివాసంబులకుం జని నిత్యంబును బ్రాహ్మణోపాస్తి సేయుచు... యాజోపయాజులనువారి నిద్దర... గని నమస్కరించి—

క. మునినాథ నాకు సత్సుత, జననంబగునట్టి క్రతువు సద్విధి గావించిన కృతకృత్యుడ నగుదుక్ ... ... ...

అని కోరి వారివలన మంత్రాహుతిబలమున సంకల్పసిద్ధుడయ్యెను. అనియే యున్నదికాని తపముచేసి శివుని వరమున గనెనని ప్రతివాదివ్రాసినట్లు లేదు. కాబట్టి యావ్రాతతప్పు. పోనిండు, ఆవ్రాత నంగీకరించియే చెప్పుచున్నాము.

అర్జునునిపెండ్లాడు కూతుని గోరి తపముచేసి శివునివరమున గనినపుడు ఆమె యర్జునునకు భార్యయై యుండుట న్యాయమైయుండ ధర్మజున కర్ధాంగియగుటచే నామె జన్మకారణము భగ్నమై శివుని వరము చెడినదట! ఆమె ధర్మజునకే అర్ధాంగియైనదా? ధర్మజునకు గూడ నర్ధాంగియైనదా? ద్రుపదుడుకోరినది. యర్జునుని పెండ్లాడుకూతునా? ధర్మజుని పెండ్లాడనికూతునా? పంచపాండవులను పెండ్లాడినపుడు అందులోనయర్జునుని పెండ్లాడుట సిద్ధింపకపోయెనా? కనుక ధర్మ

జున కర్ధాంగియగుటచే నామె జన్మకారణ మేమిః భగ్నమైనది? శివుని వర మేమి చెడినది?

'దైవనిర్దిష్టంబు తప్పె నీనాటికి' అందురే. వీరు ఏనాడైన దైవ నిర్దిష్టము తప్పు నందురా? ఏనాడును తప్పదందురా? ఏనాడైన తప్పు నను పక్షములో నదియీనాడును తప్పవచ్చునుగనుక వీరి కాశ్చర్య మేల? ఏనాడును తప్పనిపక్షములో నీనాడు మాత్రి మెట్లు తప్పును?

ద్రుపదునకు అర్జునుని పెండ్లాడు పుత్త్రిక కలుగునట్లు వరమిచ్చి నట్టి యాశివుడు ద్రౌపదికి పంచపతిత్వవరమిచ్చినశివుడు కాక మరి యొకడా యేమి? ఆశివుడే యీశివుడైనపుడు ఆద్రౌపదివరములో నీద్రుపదునివరము గతార్థముచేయుక విరుద్ధవరము లిచ్చునా? కనుక ప్రతివాది దసంగతప్రసంగమగుటచే నిరస్తము.

"భీష్ముడు ద్రౌపది పెండ్లికొప్పగ లేదు. కులసతి యం యామె దలప డెపుడు" అనునదికూడ అసంగతప్రసంగమే ద్రౌపదీవివాహము గూర్చి భీష్మునడిగినట్లుగాని, భీష్ముడొప్పుకొనక దూష్యమన్నట్లుగాని యెచ్చటను లేదు. అంతే కాక ద్రౌపదీవివాహమునకు పూర్తిగా సమ్మతించినట్లే కనబడుచున్నది. ఏమన అట్టివివాహము జేసికొనిన వాడు ధర్మజుడయియుండ నాధర్మజునిగూర్చి దుర్యోధనునితో జెప్పు నపుడు కామక్రోధలోభాదులకు వశమయి ధర్మము నుల్లంఘింపని పూజ్యుడు ధర్మజుడని కంఠోక్తిగా జెప్పియుండెను. చూడుడు—

"కామా ల్లోభాచ్చ లోభాచ్చ కామక్రోధభయాదపి,
స్నేహాద్వా యది వా మోహా ద్ధర్మం నాత్యేతి ధర్మజః"

(విరాట. అ౫౩)

మరియు భీష్మోపదేశ మపేక్షించి ధర్మజుడుసన్నిధికివచ్చియుండ శరతల్పగతుడై యున్న భీష్ముడు ధర్మజు నడుగు మనినపు డిట్లనెను—

"యో న కామా న్న సంరంభా న్నభయా న్నార్థకారణాత్,
కుర్యా దధర్మం ధర్మాత్మా స మాం పృచ్ఛతు పాండవః.

(శాంతి, అ55

మరియు నాద్రౌపదీవివాహమైనవెంటనే ధృతరాష్ట్రునికి బోధించి విదురుని ద్వారా ద్రౌపదీపాండవులను రప్పించి వారికి ధృతరాష్ట్రునిచే రాజ్యమిప్పించిన భీష్ముడు ద్రౌపదీవివాహము నొప్పనివాడనుట దుర్నయము.

ఇక రెండవమాట— భీష్ముడు ద్రౌపది కులసతి యని తలపనివాడట! అట్లైయైనచో కులసతి కాక ప్రతివాదిమతప్రకారము కులటయైన ఆమెతో గూడి ధర్మజుడు చేసిన రాజసూయాధ్వరమునకు వెళ్లి భీష్ముడా కార్యకరాలాపములో పాల్గొని యాదరించెనే. దాన కేమి చెప్పెదరని ప్రతివాదుల నడుగుచున్నాము. ఆమె కులసతి కాదనుట పాపహేతు వని ప్రతివాదులకు తెలుపుచున్నాము.

ఇంత వరకు ద్రౌపదీవివాహమును గూర్చి ప్రతివాదులు చేసిన దుష్టప్రసంగములు దూరీకరింపబడి యది ధర్మ్యమని ప్రమాణోపపత్తులతో ప్రదర్శింపబడినది. ఇక దీనిని విడిచి యంశాంతరమందుకొనుచున్నాము.

—: మయసభలో సుయోధనుడు క్రిందబడినపుడు ద్రౌపది
యుపచారము చేయక నవ్వి పరిహాసము చేయుట
నింద్యమను ప్రసంగము— తన్నిరాకరణము :—

సుయోధనవిజయములోని తొలిపలుకులలో నిట్లున్నది—

"ద్రౌపది— ఈమెను చిత్రించుటలో కవి తనతర్కచాతుర్య మెల్ల గనబరచినాడు... మయసభలో సుయోధనుడు క్రిందబడినపుడు కరుణార్ద్రహృదయముతో నుపచారము లొనర్పవలయును

గాని పకపక నవ్వుచు వినోదముగా జూచుట నింద్య మని వచించెను ”

ఇది గరిగిపాటి రామమూర్తి బి. యే. గారి వ్రాత, వీరిచే పొగడబడిన కవిగారి వ్రాత యిదిగో—

“ఆకాంత తన మేర నరయంగలేకుండె తనయంతవారలీధరణి లేర, టంచు మమ్మల పరిహాసంబు జేసెను మయసభాలోకనము యుల మాట, నాఫాలభాగంబు నవ్యమణిస్తంభమునను దగిలి నొవ్వముగుద చూచి, పరిహసించెనుగాని బాంధవంబరసెనే యిది యెల్ల ధర్మమై యెసగగలదె, పగవారు బాధింపబడినప్డు పరిహసింతురుగాక బంధులై మరియుమరది, హై యుండిబాధల నందెడు వేళల పరిహాసమును చేయ పాడి యగునె, ఆమెకు నేనెంత యాప్తుండనో నాకు నామెయు నంతయే యాప్తురాలు.”

ఇది సుయోధనుని నోటితో చెప్పించిన కవిగారి వాక్యములు. ఇందులో సుయోధనుడు మయసభలో పడినపుడు దెబ్బతగుల్చుకొనినపుడు ద్రౌపది నవ్వినట్లు వ్రాయబడినది. ఇది మూలస్థలము లో సంస్కృతభారతములో లేని విషయము. చూడుడు—

“జలే నిపతితం దృష్ట్వా భీమసేనో మహాబలః,
జహాస జహసుశ్చైవ కింకరాశ్చ సుయోధనమ్.
వాసాంసి చ శుభాన్యస్మై ప్రదదూ రాజశాసనాత్,
తథాగతం తు తం దృష్ట్వా భీమసేనో మహాబలః,
అర్జునశ్చ యమౌ చోభౌ సర్వే తే ప్రాహసం స్తదా,”

(సభా. అ_ 47

జలములో పడిన సుయోధనుని చూచి భీమార్జుననకుల సహదేవులును మయసభారక్షకులైన కింకరులును నవ్విరి. ధర్మజుని యాజ్ఞ ననుసరించి యాకింకరులు మంచివస్త్రములు తెచ్చి ధరింప

నాతని కప్పు జెప్పినారు. అనియే వైశంపాయనవాక్యముగా నున్న గ్రంథమందున్నది. ద్రౌపదీదేవి మాట లేదు.

ఇంకొకటి— అక్కడనుండి బయలుదేరి శకునితో గలిసి సుయోధనుడు వెళ్ళునప్పుడు చింతాక్రాంతుడై యుండుటను చూచి యదేమి యని యడిగిన శకునికి సుయోధను డిట్లు చెప్పెను—

"సోఽహం శ్రియం చ తాం దృష్ట్వా సభాం తాం చ తథావిధామ్,
రక్షిభిశ్చావహాసం తం పరితప్యే యథాగ్నినా."

(సభా. అ-47)

నే నాధర్మజుని యైశ్వర్యసమృద్ధిని చూచియు, అపూర్వమైన ఆమయసభను చూచియు, ఆరక్షకుల అపహాసమునుచూచియు పరితపించుచున్నాను. అని. ఇచ్చటగూడ ద్రౌపదీదేవి మాట లేదు.

మయసభలో నేమి జరిగినదియు దగ్గరనుండి స్వయముగా జూచిన శకునితో జెప్పునప్పుడు దుర్యోధనుడు ద్రౌపదీ దేవి మాటనెత్తకొనుటపోవుటచే నది జరిగియుండ లేదనియే చెప్పవలసియున్నది. దుర్యోధనుడు పరిహాసమునకు దుఃఖించుటే కాదు. పాండవైశ్వర్యమునకు గూడ దుఃఖించినాడని స్పష్టము.

అధర్మటానకు ప్రాప్తించిన హద్దులేని యాధనరాశిని చూచి శత్రువున కింత యైశ్వర్యమా! అని చింతించుచున్నాను. అని చెప్పి—

"వస్త్రముత్కర్షతి మయి ప్రాహస త్స వృకోదరః,
శత్రోర్ఋద్ధివిశేషేణ విమూఢం రత్నవర్జితమ్.
మత్వా శిలాసమాం తోయే పతితోఽస్మి నరాధిప,
తత్ర మాం ప్రాహస త్కృష్ణః పార్థేన సహ సుస్వరమ్.
ద్రౌపదీ చ సహస్త్రీభి ర్వ్యథయన్తీ మనో మమ"

(సభా. అ. 50)

శత్రుసంపదనుజూచి విమూఢుడనైననేను బట్టపై కత్తి పట్టుకొనినపుడు భీముడును, నీటిలోబడినపుడు కృష్ణార్జునులు ద్రౌపదియితరస్త్రీలును నవ్విరి. అని చెప్పెను.

ఇది కల్పించికూడ చెప్పినాడనవచ్చును. ఏమైనను పాండవులు శత్రువులని మాటిమాటికి చెప్పుచునేయుండెను.

ఆంధ్రమహాభారతములో—

"జలాశయంబు స్థలంబుగా వగచి కట్టిన పుట్టంబు దడియం జొచ్చి క్రమ్మఱిన, వానిం జూచి పాంచాలియు పాండుకుమారులును నగిరి"

అని యున్నది. దీని ననుసరించి వ్రాసిన కవికి మేముకూడ దీని ననుసరించియే తెలుపుచున్నాము.

కవి వ్రాతలో—

"పగవారు బాధింపబడినప్డు పరిహాసింతురుగాక బంధువై మరియు, మరదియైయుండి బాధల నందెడు వేళల పరిహాసమును చేయ పాడె యగునె"

అని యున్నది. దీనిని బట్టి పగవారికి బాధకలిగినపుడు పరిహాసింపవచ్చునని కవి యొప్పుకొనెను కద, ఇప్పుడు పరిహాసించిన పాంచాలీపాండవులకు సుయోధనుడు పగవాడా? బంధువా? అను విషయము తేలవలయును.

మయసభనుండి యింటికి వెళ్ళునపుడు శకునితో సుయోధనుడిట్లనెను—

చ. "అతులపరాక్రమార్జితములైన ధనంబుల పేర్మి జేసి యు, న్నతమగుచున్న పాండునరనాథతనూజులలక్ష్మి నా కస, మ్మతమై నూ వెలింగెవిను మాతుల మానధనాఢ్యుడైన భూ, పతి సహియింపనోపునె సపత్నుల వృద్ధియు నాత్మహానియు॥"

ఇచ్చుట, సపత్నుల (శత్రువుల)వృద్ధిని సహించుట యెట్లని పలికి నాడు. దుర్యోధను డట్లనుట, మయసభలో తన్ను వారుపరిహాసించిన హేతువును బట్టి జరిగిన దని ప్రతివాదు లందురేమో, ఆతనికి పాండవులపై పగ యీ నాటిది కాదు. లక్క-యింటిలో వారు దగ్ధులైనట్లు తెలిసినపుడు ధృతరాష్ట్రుడు దుఃఖించె నని చెప్పి "మరియు గాంధారిం దొట్టి దేవీజనుల యాక్రందనధ్వను లొక్క-పెట్ట యంతఃపురంబున నెగసె భీష్మాదికురువృద్ధులును విప్రులుం బౌరులును శోకాక్రాంతు లయిరి" అని చెప్పి దుర్యోధనుని వైఖరి యిట్లు చెప్పబడినది—

క. మతి బాండుకుమారుల పంచతవిని దుర్యోధనుండు సంతసపడియెన్, హితుడయిన పురోచను పం, చతకెంతయుజాతదుఃఖచంచలుడయ్యెన్.

పాండవుల మరణవార్త విని సంతోషించిన దుర్యోధనునకు పాండవులయందెంతపగయున్నదో తెలిసినదా? ఇట్లు దుర్యోధనునకు పాండవులు పగవారైనపుడు పాండవులకు దుర్యోధనుడు కూడ పగ వాడే కదా!

కవిగారు చెప్పుటలో—"ఆమెకు నేనెంత యాప్తుండనో నాకు నామెయు నంతయే యాప్తురాలు." అని యొకన్యాయమును వెల్లడించియేయున్నారు కనుక బంధుత్వముగాక పగవహించిన దుర్యోధనుడు పాండవులకుగాని, పాండవధర్మపత్నికిగాని పగవాడుగాక బంధువెట్లగును? అట్టి పగవానిని పరిహాసింపవచ్చునని ప్రతివాదులే చెప్పినారు. ఇప్పుడు పాంచాలీపాండవులు నవ్విన తప్పేమున్న దని యడుగుచున్నాము.

అట్టి దుర్యోధనునకు ద్రౌపది యుపచారముచేయక నవ్వుట నింద్యమట! తొలిపలుకులోని యీవ్రాత యెంతనింద్యమో, దుర్యోధనునకుపచారముచేయుటకు ఆద్రౌపదీదేవి యెట్టి దని వీరనుకొనుచున్నారో విమయపరిజ్ఞానముకూడ లేకుండ వ్రాయుట శోచనీయము.

అసలు మయసభలో దుర్యోధనున కట్టి పాటు ఏలవచ్చెనో! పాండవద్వేషియైన దుర్యోధనుడు ధర్మజుని రాజసూయమునకు వచ్చి వారి లోకోత్తరైశ్వర్యము జూచి పరితపించి వచ్చినవారందరు వెళ్ళినను తానుమాత్రము శకునితో నిలచి మయసభాదర్శనార్థము వెళ్ళెను. అది యభూతపూర్వము అదృష్టచరమునై యున్నసభ.

అట్టి సభలోని విషయములను చూడదలచినపుడు స్థానికులను పురస్కరించుకొని వెళ్ళవలసియుండ నన్యసహాయముగోరుట తనకు న్యూనత యను దురభిమానముతో దర్పితుడై స్వయముగా బోయెను.

అప్పుడు "వివృతంబైన ద్వారదేశంబు సంవృతంబుగా వగచి చొరనొల్లక సంవృతంబైన దాని వివృతంబుగా వగచి చొరంబోయి లలాటఘట్టితగృహద్వారుండయి సమప్రదేశంబున్నతంబుగా వగచి యెక్కసమకట్టి నీలాశ్మరశ్మిస్థగితంబైన విమలమణిస్థలంబు జలాశయంబుగా వగచి పరిధానం బెగదోచికొని స్ఫటికదీప్తిజాలపరివృతంబైన జలాశయంబు స్థలంబుగా వగచి కట్టినపుట్టంబుదడియంజొచ్చి" అని చెప్పబడినట్లు నానాదురవస్థలకు పాలయ్యెను.

ఇది యెవ్వడైన తెచ్చిపెట్టినదా? నేనెరుగని చిత్రము లేమున్నవను గర్వముతో విసవిసలాడుచు జొరబడిన తనస్వయంకృతాపరాధము కాదా! అడుగడుగునకు విభ్రాంతు డగుచు తెరవబడిన ద్వారము మూయబడినట్లు, మూయబడిన ద్వారము తెరవబడినట్లు భావించి దెబ్బతగుల్చుకొని సమప్రదేశ మున్నతప్రదేశ మనుకొని యెక్కబోయి స్థలమును జలమనుకొని, బట్టయెగదోచికొని, జలమును స్థలమనుకొని వెళ్ళి బట్టలు తడుపుకొనునట్టివానిని జూచిన నవ్వు రాదా? అతని కాంధ్యమున్నదా? అస్థలమందు దంధకారమున్నదా? ఆవృత్తాంతము వినుచున్న వారికే నవ్వువచ్చుచుండు నే! ఆనవ్వుటలో దోషదృష్టి యేమున్నది? దోషదృష్టి లేకయే వచ్చిన నవ్వు పరిహాస మెట్లగును.

సారాంశము—— ద్రౌపదీదేవి నవ్వనే లేదు. నవ్వినట్లు చెప్పినను అది నవ్వేకాని పరిహాసముగాదు. పరిహాసమే అన్నను పగవానిని జూచి పరిహసింప వచ్చునని ప్రతివాదివ్రాయుటచే నది తప్పుకాదు. అప్పుడు నవ్విన పాండవుల నవ్వుకూడ నిట్టిదే. దుర్యోధనుడు ద్రౌపదిని కచగ్రహణవస్త్రాపహారణాదులచే పరాభవించుటకు ద్రౌపద యానాడు నవ్వుటే కారణ మని ప్రతివాదు లనుచుందురు. వారికి ఈభర్తృహరి సూక్తిని వినిపించుచున్నాము.

"మృగమీనసజ్జనానాం తృణజలసంతోషవిహితవృత్తీనాం,
లుబ్ధకధీవరపిశునా నిష్కారణమేవ వైరిణో జగతి"

తృణభక్షణము చేసి బ్రతుకు మృగములపై కిరాతులకును, జలముతో బ్రదుకు మత్స్యములపై మత్స్యభుక్కులకును, సంతుష్టితో జీవించుసజ్జనులపై దుర్జనులకును నిష్కారణవైరమని యర్థము. దుర్యోధనునిది యిట్టివైరమే. కారణ కల్పనచే దుర్యోధనునకు ప్రతివాదులు కట్టబెట్టిన దేమున్నది.

ప్రతివాదు లనునట్లు ఆమె నవ్వుటనుబట్టియే దుర్యోధను డట్టి దురంతమును తలపెట్టినయెడల ఆనాడు నన్నుజూచి నవ్వినందులకు నీకీశాస్తి చేసినామని యాదుర్యోధను డనడా? అట్లనకుండుటనుబట్టి కూడ ఆమె నవ్వలేదనిఆదుర్యోధనదుర్మార్గమునకది కారణముకాదని స్పష్టము.

కాబట్టి కర్ణచరిత్రములో——

"ద్రౌపదియు, నలువురును జూచుచుండగా నాతనిం (దుర్యోధనుని) జూచి నవ్వి యాతనిమనస్సు నొప్పించెను. మహారాజపుత్రు డట్టి తిరస్కారమును సహించునా?" (పు42)

"దుర్యోధనుడు తన పగదీర్చుకొనుటకు దలచి ద్రౌపదిని సభకు రావించి కట్టుపుట్టముల నొలువ దుశ్శాసనుని నియోగించియామెను తనతొడపై గూర్చుండుమని సంజ్ఞచేసెను" పు 43.

అనువ్రాతకూడ నిరస్తమైనది. దుర్యోధనుని ఆదుర్మార్గమునకు సిగ్గుపడియుండక, దానికి లేనిపోని కారణ మొకదానిని అతుకుపెట్టి ఆదుర్మార్గమును సమర్థింపబూను ఈప్రతివాది మనస్సు ఎంత విశుద్ధమో తెలిసినది.

కనుక నిట్లు ప్రతివాదిప్రసంగములు నిరస్తమైనవి. ద్రౌపదీదేవి నిర్దుష్టురాలు. అంశాంతర మందుకొనుచున్నాము.—

—: "జూదమున తనోడి నన్నోడ దగునా? అని ప్రశ్నించిన ద్రౌపదిది అప్రస్తుతప్రసంగము." అనుప్రసంగము — తన్నిరాకరణము—

"జూదంబున నతండు సుదతిని గోల్పోవ తనోడి నన్నోడ దగునె యంచు, సభవారిబ్రశ్నింప సాహసించెనుగాని యప్రస్తుతం బని యరయబోదు, పతితోడ కష్టములే భరియింప సిద్ధమై యుండంగవలెగాని యూరకున్న, యతివ పతివ్రత యని ప్రాజ్ఞు లెన్నరు ఆనాతి కులపతి యనగదగదు."

యీసుయోధనవిజయములోని తొలిపలుకులో నిట్లున్నది—

1 ద్రౌపదిని సభకుదీసుకొనిరమ్మని నప్పుడామె "ఏయుగంబుల యందు నెట్టి దుష్కృతవుండు" అని భర్తను దుష్కృతవునిగా జేసివైచినది.

2 మరియు 'మున్ను నన్నోటువడి' యని ధర్మసందేహము తీసికొని వచ్చినది. ఈధర్మసందేహము ప్రత్యుత్తరమీయదగినదియే మై యుండినయెడల సభలో నున్న ధర్మవిదులేరును ప్రత్యుత్తరమూ

యరో? ఒక్క వికర్ణుడు మాత్రమే యీపని కేలపూనుకొనెను? భీష్మాదులు నిజము చెప్పుట కేల జంకవలయును? అట్లొనర్చిన గాని వారిపొట్ట గడువదా యేమి?"

ఇచ్చట యాక్షేపములో భర్తను ద్రౌపది దుష్కృతవునిగా జేసివైచినది. అనున దొకటి, దానికి ఆంధ్రభారతపద్యము ప్రమాణముగా జూపబడినది.

"ఏయుగంబునందు నెట్టి దుష్కృతవుండు
భార్య నొడ్డి యోటువడిన భర్త,
గలడె యిది వినంగ గడు నపూర్వం బయ్యె
సిట్లు సేయ నొక్క యిందుకులుడు"

ఇదియే ఆపద్యము ఇందు, భార్య నొడ్డుట, యెట్టి దుష్కృతవుడును ఏనాడును చేయలేదే. నాభర్త అట్లుచేయునా? అని యామె పలికినట్లు స్పష్టము. దీనిచే నామె భర్తయందు పూజ్యత గనుపరచియుంట నిరసించిన దని వ్రాయుట దుర్నయము.

రెండవది— 'మున్ను ననొడ్డిఓటువడి' అని ద్రౌపది తీసికొని వచ్చిన ధర్మసందేహము ప్రత్యుత్తర మీయదగినది కాదు. అనునది.

అది సందేహమై, అపై ధర్మసందేహమై, అపై ధర్మవిదుల సభలో దీసికొనివచ్చిన ధర్మసందేహమై యున్నపుడు ప్రత్యుత్తర మీయదగినది యేలకాదు? అయితే ధర్మవిదు లెవ్వరును ప్రత్యుత్తర మీయలేదేమని యడుగుదురా? ప్రత్యుత్తర మీయదగినది కాదని మీరన్నట్లు అధర్మవిదు లనలేదేమి? అని మిమ్మడుగరా?

'ఒక్క వికర్ణుడు మాత్రమే ప్రత్యుత్తరమిచ్చుటకు ఏలపూనుకొనెను' అని ప్రశ్నించుచున్న మీకు, ఆవికర్ణుడు. అందులో దుర్యోధనునితమ్ముడైన వికర్ణుడు, ప్రత్యుత్తర మిచ్చితీరవలసినది కనుకనే యిచ్చుటకు బూనుకొనె నని యేల యనుపింపలేదు?

అట్టి వికర్ణునకే అది ప్రత్యుత్తరమిచ్చితీరవలసిన ప్రశ్నయని పించినపుడు అంతకంటె పెద్దలగు సభ్యుల కట్లనిపించకుండునా? అని మీ కేల తోచలేదు.

అయితే భీష్మాదులు నిజముచెప్పుట కేలజంకవలయును? పొట్ట గడువకా? అని యడిగెదరు కాబోలు, పొట్టగడువదని నిజము చెప్ప కుండుట యనునది నేటి ప్రబుద్ధుల ధోరణి, వారి దది కాదు. వివా దగ్రస్తమైన విషయములో నొకపక్షమువారు మాత్రమే దీని ధర్మ మును చెప్పు మని యుభయపక్షములవారిసమక్షములో మధ్యస్థుల నడిగినపుడు, రెండవపక్షమువారు అట్లడుగకుండుటేగాక అందలి ధర్మ మిదియని కలుగజేసికొని చెప్పుచున్నవారిమాటలను తృణీకరించి తన దే ధర్మమని నిశ్శంకగా బ్రవర్తించుచు ఆమధ్యవర్తులను లక్ష్యపెట్టకున్న పుడు వారి దధర్మమని యామధ్యస్థులకు తెలిసినపుడుకూడ వీరు మనము చెప్పినను వినరనియు నిన్నెవ్వరడిగినారనియు తిరస్కరింతుర నియు జెప్పబోరు.

ఇట్టిస్థితియే భీష్మద్రోణాదులకు సంభవించినదని తెలిసికొనుడు. భీష్మాదు లసలు చెప్పిరో లేదో, యెట్లు చెప్పిరో తెలియుటకు గ్రంథ సందర్భము ప్రదర్శింపబడుచున్నది.

పాండవులు రాజసూయయాగము జూచి వారియైశ్వర్యమునకు దుఃఖితుడై వచ్చిన దుర్యోధనుడు శకునితో నేను వారియైశ్వర్యము జూచి సహింపలేను. దాని నపహరించుటకు మార్గముకనబడ లేదు. కనుక మరణింతు నని చెప్పినపుడు శకుని బోధించి తుద కిట్లు చెప్పెను—

"యామేతాం మతులాం లక్ష్మీం దృష్టవా నసి పాండవే,
తస్యాః ప్రాప్తా వుపాయం మే శృణు సత్యపరాక్రమ.

అహా మక్షే ష్వభిజ్ఞాతః పృథివ్యా మపి భారత,
హృదయజ్ఞః పణజ్ఞశ్చ విశేషజ్ఞశ్చ దేవనే.

నీ—అక్షేషు, పాశేషు, అభిజ్ఞాతః కుశలః, హృదయజ్ఞః పాత
యిష్యమాణానా మక్షాణాం జయపరాజయావహాత్వాభిజ్ఞః,
పణజ్ఞః తదనుసారేణ ద్రవ్యప్రయోగవిత్. విశేషజ్ఞః దిక్కా-
లాద్యానుకూల్యాభిజ్ఞః"

"ద్యూతప్రియశ్చ కౌన్తేయో నచ జానాతి దేవితుమ్,
ఆహూత శ్చైష్యతి వ్యక్తం ద్యూతా దపి రణాదపి.
నియతం తం విజేష్యామి కృత్వా తు కపటం విభో,
ఆనయామి సమృద్ధిం తాం దివ్యాం చోపాహ్వయస్వ తమ్."

నీలకంఠీయమ్— కపటమ్ అక్షాధిష్ఠాత్రీదేవతాయా వశీ
కరణమ్. యద్వా, సర్వతశ్చతుష్కోణతయా ద్వాదశాధారేష్వ
క్షేషు షట్తలాని భవన్తి, యేషు త్రిషు త్రిషు దేవయితో
ర్నామనీ లిఖ్యేతే తత్ర కపటమ్, అన్తస్సుషిర మక్షం కృత్వా
పరనామాంకితప్రదేశం గర్భే గురుద్రవ్యసంశ్లిష్టం కృత్వా పాతి
తస్యాక్షస్య స్వనామైవోపరి భవతి, తదా స్వస్య జయః పరస్య
నామాఽధస్థం భవతి తస్య పరాజయ ఇతి".

దుర్యోధనా! పాండవులకు గల నిరుపమానసంపద నంతను
నీవు పొందుటకు మార్గము చెప్పెదను వినుము. నేను అక్షక్రీడలో
కుశలుడను. అందు యుధిష్ఠిరునకు ప్రీతికలదు. కాని కుశలత లేదు.
అతడు ద్యూతమునకుగాని యుద్ధమునకుగాని యాహ్వానించినపుడు
వచ్చితీరును. నేనాతని గపటము జేసి తప్పక జయించి యాసంపద
నంతను నీకు ప్రాప్తింపజేయుదును. ఆతని బిలిపింపుము. అని.

ఇచ్చట కపటముజేయుదుననుటలో భావము— అక్షాధిష్ఠాన దేవతను వశీకరించుకొనెదననియైన గావచ్చును లేదా, నలుఫలకలుగా నున్న అక్షమున నుండెడి యారుభాగములలో మూడుభాగములం దొకని పేరు, మూడుభాగములం దింకొకని పేరు వ్రాయబడును. అందు ఎదుటివాని పేరున్నవైపు రంధ్రముచేసి యందు బరువైన పదార్థ ముంచి యాఅక్షమును వేసినయెడల తనపేరున్నవైపు పైకివచ్చును. అప్పుడు తనకు జయము. ఎదుటివాని పేరున్న వైపు అడుగున బడును. అప్పుడాతనికి పరాజయము కనుక నిట్లు చేయుదుననియైన గావచ్చును.

యీశకుని చెప్పిన మాటపై ధృతరాష్ట్రునియొద్దకు వెళ్ళి యాత నిని ప్రేరేపించి పాండవులను బిలిపింపజేసి వారిని కపటద్యూతమందు దుర్యోధను డోడించెను.

పాండవు లాద్యూతమునకు వచ్చి తీరవలసిన హేతువులన్నియు వెనుకటి పాండవనిందానిరాకరణములో నిరూపింపబడినవి. అవి శేషము లచ్చట చూడవలయును.

ఆకపటద్యూతములో సర్వస్వము నోడ్డి తమ్ముల నోడ్డి ఆపై తనొడ్డి ధర్మజు డోడిపోయినపుడు శకుని—

"ఏత త్పాపిష్ఠ మకరో ర్యదాత్మానం పరాజయేః,
శిష్టేసతి ధనే రాజ న్ పాప ఆత్మపరాజయః.
ఏవ ముక్త్వా మతాక్షస్తా న్ గ్లహే సర్వా నవస్థితాన్,
పరాజయం లోకవీరా నుక్త్వా రాజ్ఞాం పృథ క్పృథక్.

టీ—గ్లహే పణవిషయే రాజానం ప్రతి ఏవ ముక్త్వా రాజ్ఞాం పాండవానాం పరాజయం చ లోకవీరాన్ ప్రతి ఉక్త్వా శకుని రువాచేతి ఉత్తరేణ సంబన్ధః.

"అస్తి తే వై ప్రియా రాజన్ గ్లహ ఏకోఽ పరాజితః,
పణస్వ కృష్ణాం పాంచాలీం తయాఽత్మానం పునర్జయ"

ధర్మరాజా! నిన్నొడ్డుకొని యోడిపోయిన నీవు చేసినది మంచిపని కాదు. పందె మొడ్డుటకు వేరొకటి యుండగా ఆత్మపరాజయము పాప హేతువు అని మరల పందెమును కూర్చి ధర్మజునకు చెప్పి అప్పటి కోడిపోయి యున్నపాండవుల పరాజయమును సభ్యులకు వెల్లడించి యాపై ధర్మజునితో నీవోడిపోనట్టి పణము నీభార్య యున్నది. ఆద్రౌపదిని పందె మొడ్డుము. నీవు నెగ్గెదవా? ఆమెమూలమున నీదా స్యమును తొలిగించుకొనుము. ఓడిపోయెదవా? ఆమెమాకు దాసి యగును అని చెప్పెను. ఆమెను పణముగా బెట్టకూడదనియె మొదట మానివేసిన ధర్మజుడు తానప్పుడు వారికి దాసుడై యున్న కారణమున వారు ప్రేరేపించినపని జేయవలసిన పరిస్థితి తటస్థించుటచే ఆసాధ్వీమణి స్వరూపస్వభావసంకీర్తన మాకష్టకాలములో నొక్కసారి చేసి,

"తయైవం విధయా రాజన్ పాంచాల్యాఽహం సుమధ్యయా,
గ్లహం దీవ్యామి చార్వంగ్యా ద్రౌపద్యా హంత సౌబల."

అట్టి ద్రౌపదిని కష్టము. శకునీ యొడ్డుచున్నాను. అనెను.

ఆమె నట్లు కీర్తించి యొడ్డుచున్నా నని యెప్పు డనెనో, అప్పుడు—

"చుక్షుభే సా సభా రాజన్ రాజ్ఞాం సంజజ్ఞిరే శుచః,
భీష్మద్రోణకృపాదీనాం స్వేదశ్చ సమజాయత.
శిరో గృహీత్వా విదురో గతసత్త్వ ఇవాఽభవత్,
ఆస్తే ధ్యాయ న్నధోవక్త్రో నిశ్శ్వసన్నివ పన్నగః.
ధృతరాష్ట్రస్తు తం హృష్టః పర్యపృచ్ఛ త్పునః పునః,
కిం జితం కిం జిత మితి హ్యాకారం నాభ్యరక్షత.
జహర్ష కర్ణోఽతిభృశం సహ దుశ్శాసనాదిభిః,
ఇతరేషా న్తు సభ్యానాం నేత్రేభ్యః ప్రాప తజ్జలమ్."

ఆసభ క్షోభించెను. రాజులు శోకించిరి. భీష్మద్రోణకృపాచా ర్యాదుల శరీరములు చెమర్చినవి. విదురుఁడు తలపట్టుకొని ముఖము వంచుకొని ధ్యానించుచుండెను. ధృతరాష్ట్రుఁడు హర్షించి తనమనోగ తము దాచలేక, ఓడెనా? ఓడెనా? అని యడిగెను కర్ణ, దుశ్శాస నాదులు సంతోషించిరి. ఇతరసభ్యుల కన్నులనుండి నీరు పడెను.

ఆపై ధర్మజు డామె నోడిపోయినతోడనే దుర్యోధనుఁడు విదు రున కిట్లనెను.

> "ఏహి క్షత్త ర్ద్రౌపదీ మానయస్వ ప్రియాం భార్యాం సమ్మతాం పాండవానామ్, సంమార్జతాం వేశ్మ పరైతు శీఘ్రం తత్రాస్తు దాసీభి రపుణ్యశీలా"

టీ___ ఏహీతి. వేశ్మ సంమార్జతాం పరైతు పరాకృతా ధిక్కృతా సతీ ఏతు ఆయాతు.

విదురుడా! పాండవులకు ప్రియురాలు భార్యయు నైన ద్రౌప దిని తీసికొనిరమ్ము. ఆమె యిల్లు తుడువవలెను. ఆమె ధిక్కృతురాలై రావలయును. ఆమె దాసీలతో గలిసియుండవలయును. అని.

అప్పుడు విదురుఁడు. నీవు దురుక్తులాడుచున్నావు. నీ వేమియు దెలిసికొనలేకున్నావు. మృగము వ్యాఘ్రముఁను ప్రకోపింపజేసిన ట్లున్నది నీవ్యవహారము.

> "ఆశీవిషా స్తే శిరసి పూర్ణకోపా మహావిషాః,
> మాకోపిష్ఠా సుమన్దాత్మ న్మాగమ స్త్వం యమక్షయమ్.
> నహి దాసీత్వ మాపన్నా కృష్ణా భవితు మర్హతి,
> అనీశేన హి రాజ్ఞైషా పణే న్యస్తేతి మే మతిః."

పూర్ణకోపము మహావిషము గల కాలసర్పములు నీశిరముపై నున్నవి. వానిని ప్రకోపింపజేసి మందమతీ! నీవు యమసదనమున కేగ కుము.

ద్రౌపది దాసి కాదగినది కాదు. ఆమె యనధికారియై యున్న ధర్మజునిచే పణముగా నుంచబడిన దని నానిశ్చయము.

"మూఢో రాజా ధృతరాష్ట్రస్య పుత్రో న మే వాచః పథ్యరూపాః శృణోతి, అన్తో నూనం భవితాఽయం కురూణాం సుదారుణ స్సర్వహరో వినాశః, వాచః కావ్యా స్సుహృదాం పథ్యరూపా న శ్రూయన్తే వర్ధతే లోభ ఏవ"

మూఢుడైన యీదుర్యోధనుడు పథ్యములయిన నామాటలు వినిపించుకొనకున్నాడు శుక్రనీతిని సంబంధించియున్న సుహృద్వర్గముయొక్క హితోపదేశము చెవి కెక్కుటలేదు. లోభము హెచ్చుపెరిగిపోయినది ఇది కురువంశ మంతమగుటకే వచ్చినది. అని దుర్యోధనునకును, సభ్యులకును జెప్పెను అప్పుడు—

"ధిగస్తు క్షత్తార మితి బ్రువాణో దర్పేణ మత్తో ధృతరాష్ట్రస్య పుత్రః, అవైక్షత ప్రాతికామీం సభాయా మువాచ చైవం పరమార్యమధ్యే."

"ప్రాతికామిన్ ద్రౌపదీ మానయస్వ న తే భయం విద్యతే పాండవేభ్యః, క్షత్తాహ్యయం వివదత్యేవ భీతో నచాఽస్మాకం వృద్ధికామ స్సదైవ."

మదమత్తుడై యుండిన దుర్యోధనుడు, విదురుడు నింద్యుడని ఆపరమపూజ్యుల సమక్షములో పలుకుచు ప్రాతికామిని బిలిచి నీవు ద్రౌపదిని దీసికొనిరమ్ము. నీకు పాండవులవలన భయ మేమియు లేదు. ఈవిదురుడు భయపడి విరుద్ధముగా బలుకుచున్నాడు. ఈతడు మన యభివృద్ధి నెప్పుడును కోరినవాడుకాడు. అని యాజ్ఞాపింపగా వెంటనే "ప్రవిశ్య స శ్వేవ హి సింహగోష్ఠమ్" ఆప్రాతికామి పాండవధర్మపత్నీభవనమున సింహగోష్ఠమందు శునకమువలె బ్రవేశించి ద్రౌపదీదేవిని సమీపించి యిట్లు వినయముతో చెప్పెను—

"ధనసంపదలు నిజధరణీరాజ్యంబు, దనయులం దమ్ముల దన్నును నిన్ను. దనర జూదంబాడి ధార్తరాష్ట్రులకు, ధర్మతనూజుండు దా నోటువడియె వనజాక్షి కౌరవవరు పని నిన్ను. వడి దోడుకొని పోవ వచ్చితి నిపుడ చను దెమ్ము కౌరవేశ్వరు కడకనిన, జలజాయతాక్షి పాంచాలి యిట్లనియె."

"ఏయుగంబు నందు నెట్టి దుష్కృతవుండు భార్య నొడ్డి యోటు వడిన భర్త, గలడె యిది వినంగ గడు నపూర్వం బయ్యె నిట్లు సేయ నోర్వ యెందు కలుడు, మున్న దనోటువడి మఱి నన్ను నోటు, వడియెనో నన్ను మున్నోటు వడి విభుండు, గ్రన్న దనోటువడియెనో యన్న నాకు నెఱుగ చెప్పుము దీని నీ వెఱుక దేని."

వ. ఎఱుంగవేని నక్కృతవు నడిగివచ్చి మఱి నన్నుం దోడ్కొనిపోవ నగునేని దోడ్కొని పొమ్మనిన. (ఆంధ్రభారతము)

గ్రంథసందర్భ మీవిధముగా నున్నది. ఇందు పణముగా ద్రౌపదిని బెట్టుమని ధర్మజుని తాము ప్రేరేపించి యప్పటికే తనోడిపోయి కూర్చుండిన ధర్మజుడు వారికి వశవర్తియై నందున పెట్టిన యాపణమును తాము గెల్చుకొనినామని ప్రకటించి యాపై యామెను తనయింటికి రప్పించి దాసీకృత్యము లామెచే జేయింపదలపెట్టి ఆ విషయమును మహాసభలోనే నిశ్శంకగా వెల్లడించి యామె కొరకు ప్రాతికామిని బంపినపుడు ప్రాతికామి చెప్పుటలో "తమ్ముల దన్నును నిన్ను నోటువడియె" అని క్రమమును తెలిపి ఆపై నీవు దుర్యోధనునికడకు రమ్మని చెప్పినపుడు ప్రాతికామి చెప్పినక్రమమునుబట్టి వారి కామె యధీనురాలై యుండవలసిన దురవస్థ లేదని యామెకు తట్టినపుడు "మున్న దనోటువడి" అనుచు నోడిపోవుటలోని క్రమమును ప్రాతికామిని చెప్పుమనుటయు, నీకు దెలియకున్న వెళ్ళి యడిగివచ్చి యప్పుడు రావలసి యున్న దీసికొనిపెళ్ళు మనుటయు ద్రౌపదీదేవి కప్రస్తుతప్రసంగమా?

దీని నిటుండనిండు. సభలోనే ఆమెచేత ఇల్లు తుడిపించవలెను నీవు వెళ్ళి తీసికొనిరమ్మని విదురునితో జెప్పినపుడు "అనధికారియైన ధర్మజుడు పెట్టిన దాపణము" అని పలికిన విదురునిది కూడ నప్రస్తుత ప్రసంగమేనా? ఆమెకు గలిగింప నెంచిన దాస్యపరిస్థితికి పణము లుంచుటలోని క్రమము మూలాధారము. దానిని తెల్పుకొనుటకై యామె ప్రశ్నించుట అప్రస్తుతమైనదా? మాటాడక దుర్యోధనుని కడకు వచ్చి యాతని యిల్లు తుడిచిన యీప్రతివాదులు హర్షింతురా? ఇచ్చట ప్రతివాదులదే అసభ్యప్రసంగము కాని, ద్రౌపదీదేవిది యప్రస్తుతప్రసంగము కాదు.

ఆమె ప్రశ్న ప్రత్యుత్తర మీయదగినది కాదను మాటపై యిక చెప్పవలసియున్నది—

ఆప్రాతికామి యాద్రౌపదీదేవి మాటపై "క్రమ్మరి వచ్చి పాంచాలి పలుకులు ధర్మరాజునకుం జెప్పిన దురోదరపరాజయదుఃఖితచేతస్కుండగుటం జేసి యతడు వానికి నదత్తప్రతివచనుండైన బ్రాతికామికి దుర్యోధను డిట్లనియె"-

క. సందిగ్ధమయిన యర్థము నిందరసన్నిధిన యడిగి తెంద యెఱుంగన్,
సుందరి బాంచాలేంద్రసుతం దోడ్కొనిరమ్ము పొమ్ము తడయక యనినన్,

ఇది యాంధ్రభారతసందర్భము. ఇందు ద్రౌపదీసందేహమునకు సమాధానము ధర్మజుడు చెప్పకున్నపుడు దుర్యోధనుడు ఇది ప్రత్యుత్తర మీయదగిన విషయము కాదని కాని, యిది యప్రస్తుతప్రసంగమని కాని ప్రతివాదులనిన ట్లనలేదు. ఇచ్చటికివచ్చియే యడిగి తెలిసికొనవచ్చు ననెను.

"ఇహైవ వాగత్య పాంచాలీ ప్రశ్న మేనం ప్రభాషతామ్.
ఇహైవ సర్వే శృణ్వన్తు తస్యాశ్చైతస్య యద్వచః"

అని సంస్కృతములో గూడ నిక్కడకు వచ్చియే యడుగ వచ్చు నని దుర్యోధనుడు పలికినట్లున్నది. దుర్యోధనున కప్రస్తుతమని

పింపని ఆద్రౌపదీప్రశ్నను ప్రతివాదు లప్రస్తుత మనుట యసంబద్ధ ప్రలాపము.

అట్లు దుర్యోధనునిచే మరల బంపబడిన ప్రాతికామి ద్రౌపదీదేవితో—

"సభ్యా స్త్వమీ రాజపు త్ర్యుహ్వాయన్తి, మన్యే ప్రాప్త స్సంశయః కౌరవాణామ్, న వై సమృద్ధిం పాలయతే లఘీయా౯ యస్త్వాం సభాం నేష్యతి రాజపుత్రి" టీ— లఘీయా౯ నీచతరః.

అమ్మా! సభ్యులు నిన్నాహ్వానించుచున్నారు. నీవడిగినవిషయముపై కౌరవులకు సంశయము కలిగిన దని తలచుచున్నాను నిన్ను సభకు దీసికొనిపోవు నీచుడు నీసమృద్ధిని పాలించువాడు కాడు అని పలికెను.

అప్పుడు ద్రౌపదీదేవి యిట్లనెను. సుఖదుఃఖములు పండితులకును మూర్ఖులకును తటస్థించుచునే యుండును. ధర్మ మొక్కటి రక్షింపబడుచున్నయెడల స్వాస్థ్యము నదియె కలిగించుచుండును అట్టిధర్మము కౌరవుల నతిక్రమించి పోరాదు. కనుక.

"సభ్యా౯ గత్వా పృచ్ఛ ధర్మ్యం వచో మే, మాం బ్రూయు ర్నిశ్చితం తత్కరిష్యే, ధర్మాత్మానో నీతిమన్తో వరిష్ఠాః"

నీవు వెళ్ళి నాసందేహమునుగూర్చి సభ్యుల నడుగుము. ధర్మాత్ములైన ఆపెద్దలు చెప్పినట్లు నేను తప్పక చేయుదును అని.

అప్పుడు ప్రాతికామి మరల సభకు వెళ్ళి ద్రౌపదీప్రశ్నను దెలుపగా.

"అధోముఖా స్తే నచ కించి దూచు ర్నిర్బంధం తం ధార్తరాష్ట్రస్య బుద్ధ్వా"

ఆసభ్యులు, పెద్ద లేమని యందురో అనుభూతి లేక కార్యాకార్య వివేకము లేక తమయెదుటనే యట్లు వర్తించుచున్న దుర్యోధనుని యా నిర్బంధమును చూచి తలలు వంచుకొని యేమియు బలుకక యూరకుం

డిరి. అంతియకాని అదిప్రత్యుత్తరమీయదగిన విషయముకాదని కాని, అది యప్రస్తుతప్రసంగ మని కాని ప్రతివాదు లన్నట్లు నలేదు.

ఈప్రస్తావములో ద్రౌపదీదేవికి బంపిన "ఏకవస్త్రాత్వధోనీవి" అను ధర్మజుని సందేహమును గూర్చి కొందరు ప్రతివాదులు చేసిన యాక్షేపములు 'పాండవనిందానిరాకరణము' అనుచతుర్థభాగములో విపులముగా జర్చించి నిరాకరింపబడినవి. అవిశేషము లచ్చట జూడవలయును.

అప్పుడు స్వభు లట్లు విచారగ్రస్తులై యేమాట చెప్పినను నిష్ప్రయోజన మని యుపేక్షించి యుండ సత్యమునకు గట్టువడి పాండవులు దైన్యము వహించియుండ దుర్యోధనుడు హర్షించుచు—

"ఇహై వైతా మానయ ప్రాతికామిన్ ప్రత్యక్ష మస్యాః కురవో బ్రువన్తు"

ప్రాతికామీ! ఆమె యెదుటనే సభ్యులు చెప్పుదురు. ఆమెను తీసికొనిరమ్ము. అని యాజ్ఞాపింప ప్రాతికామి—

"తత స్సూత స్తస్య వశానుగామీ భీతశ్చ కోపా ద్ద్రుపదాత్మజాయాః, విహాయ మానం పునరేవ సభ్యా నువాచ కృష్ణాం కిమహం బ్రవీమి"

టీ— మానం, దుర్యోధనస్యాజ్ఞాభంగేన తస్య శ్రేష్ఠత్వం, విహాయ తిరస్కృత్య.

దుర్యోధనునకు తాను వశవర్తియైనను ద్రౌపదీకోపమునకు భీతుడై దుర్యోధనాజ్ఞను గణింపక, ద్రౌపదీదేవికి నేనేమిచెప్పవలయునో తెలుపుడని తాను మరల సభ్యుల నడిగెను.

అది చూచి దుర్యోధనుడు—

"దుశ్శాసనై ష మమ సూతపుత్రో వృకోదరా దుద్విజతేఽల్పచేతాః, స్వయం ప్రగృహ్యానయ యాజ్ఞసేనీం కిం తే కరిష్యన్త్య వశా స్సపత్నాః"

దుశ్శాసనా! దుర్బలహృదయుఁడైన యీప్రాతికామి భీమసేనునకు భయపడుచున్నాఁడు. నీవు స్వయముగా వెళ్ళి ద్రౌపదిని పట్టి తీసికొనిరమ్ము. మనకు దాసులై పడియున్న యీశత్రువులు చేయున దేమున్నది? అని చెప్పినతోడనే లేచి యాదుశ్శాసనుఁడు వెళ్ళి ద్రౌపదీదేవితో నిట్లనెను—

"ఏహ్యేహి పాంచాలి జితాసి కృష్ణే దుర్యోధనం పశ్య విముక్త లజ్జా, కురూన్ భజస్వాయతపత్రనేత్రే ధర్మేణ లబ్ధాసి సభాం పరైహి."

ద్రౌపదీ! రమ్ము రమ్ము నిన్ను గెలుచుకొన్నాము. ఇక సిగ్గు విడిచి దుర్యోధనుని దర్శింపుము. కౌరవులను సేవింపుము. రమ్ము సభకు.

ఇట్లనినతోడనే చింతాక్రాంతురాలైన ఆసాధ్వీమణి దిగ్గున లేచి—"ఆర్తా ప్రదుద్రావ యతః స్త్రియస్తా వృద్ధస్య రాజ్ఞః కురుపుంగవస్య" భయపడినదై గాంధారీప్రభృతులైన స్త్రీలుండెడి తావునకు పరుగు పెట్టినది.

"తతో జవేనాభిససార రోషా ద్దుశ్శాసన స్తా మభిగర్జమానః,
దీర్ఘేషు నీలేష్వథ చోర్మిమత్సు జగ్రాహ కేశేషు నరేన్ద్రపత్నీమ్".
"యే రాజసూయావభృథే జలేన మహాక్రతౌ మన్త్రపూతేన సిక్తాః,
తే పాండవానాం పరిభూయవీర్యం బలాత్ప్రమృష్టా ధృతరాష్ట్రజేన."
"సతాం పరాకృష్య సభాసమీప మానీయ కృష్ణా మతిదీర్ఘ కేశీమ్, దుశ్శాసనో నాథవతీ మనాథవ చ్చకర్ష వాయుః కదలీ మివార్తామ్".

అప్పుడు దుశ్శాసనుఁడు గర్జించుచు నంతకంటె వేగముగా బరుగుపెట్టి యాద్రౌపదీదేవియొక్క శిరోజములను, రాజసూయమహాక్రతువునందు మంత్రపూతజలాభిషిక్తములైనశిరోజములనుపట్టుకొని పాండవ

పరాక్రమమునైన గణింపక సభాసమీపమున కీడ్చి తెచ్చి యనాథ నుగా నెంచి వాయువు కదళీవృక్షము నూపివేసినట్లు గుంజినాడు.

> సా కృష్యమాణా నమితాంగయష్టిః శ్నైరువాచాఽథ రజస్వలాఽస్మి, ఏకంచ వాసో మమ మందబుద్ధే సభాం నేతుం నార్హసి మా మనార్య"

ఆమె దుశ్శాసనునిచే పట్టుకొనబడినపుడే సంకుచితశరీరయై మెల్లగా నిట్లనెను. నేను రజస్వలనై యున్నదానను. మందమతీ! నన్ను సభకు జేర్చుట తగదు. అని. "తతోఽబ్రవీ త్తాం ప్రసభం నిగృహ్య కేశేషు" ఆమె యట్లు చెప్పుచుండగనే బలాత్కారముగా జుట్టు బట్టుకొని దుశ్శాసనుడిట్లనెను—

> "రజస్వలా వా భవ యాజ్ఞసేని ఏకాంబరా వాప్యథవా వివస్త్రా,
> ద్యూతే జితాచాసికృతా చ దాసీదాసీషువాసశ్చయథోపజోషమ్."

నీవు రజస్వలవైనను సరే, ఏకవస్త్రవైననుసరే! తుదకు వివస్త్రవైననుసరే! ద్యూతమందు నిన్ను గెలుచుకొనినాము. నీవుదాసివైతివి. దాసీస్త్రీలయందు వస్త్రపరిస్థితి యభిరుచినిబట్టి యుండును అని.

ఇట్లు నిశ్శంకగా బలుకుచు ఆమెను జుట్టుపట్టి తీసుకొనివచ్చి యట్లు గుంజుచుండగా నామె యిట్లు గోలపెట్టినది—

> "ఇమే సభాయా ముపనీతశాస్త్రాః క్రియావన్తః సర్వఏ వేన్ద్రకల్పాః,
> గురుస్థానాగురవశ్చైవసర్వే తేషామగ్రే నోత్సహే స్థాతుమేవమ్."

టీ—ఉపనీతశాస్త్రాః అధ్యాపితశాస్త్రాః, గురుస్థానాః గురుతుల్యస్థానాః, పిత్రాదితుల్యాః ఏవమ్ ఏకవస్త్రత్వేన.

ఈసభలోనివారందరు శాస్త్రపారంగతులు శాస్త్రముల నుపదేశించినవారు పితృసమానులు. ఇట్టివారియెదుట యేకవస్త్రను రజస్వల నయి యున్న నేను ఈవిధముగా నుండజాలను.

"నృశంసకర్మం స్త్వమనార్యవృత్త మామావివస్త్రాంకురుమావి కార్షీః,
నమర్షయేయుస్తవరాజపుత్రా స్సేన్ద్రాపి దేవా యది తేసహాయాః"
"ధర్మేస్థితో ధర్మసుతో మహాత్మా; ధర్మశ్చసూక్ష్మోనిపుణోపలక్ష్యః,
వాచాపిభర్తుః పరమాణుమాత్రమిచ్ఛామిదోషం నగుణాన్విసృజ్య."

టీ-నిపుణోపలక్ష్యః సూక్ష్మబుద్ధిమద్భిరేవ జ్ఞేయః, వాచేతి నాహమప
రాధినాం భార్యాస్మీతి భావః.

ఓదుష్టచరిత్రుడా! ఓఘాతుకుడా! నన్ను వివస్త్రను జేయనెంచ
కుము. నీదుండగములను పాండవులు సహించియుండలేరు ఇంద్రా
దులుసహాయపడినను నీకు రక్షణము జరుగబోదు ధర్మజుడు ధర్మనిర
తుడు,అధర్మము సూక్ష్మబుద్ధులకేగ్రాహ్యము. నాభర్తయందుదోషము
పరమాణుమాత్రము లేదు. నాభర్తలపరాధులు గారు. నేనపరాధుల
భార్యను గాను. అని.

ఈద్రౌపదీవాక్యమునుబట్టి "ద్రౌపది తనభర్తను దుష్కృతవు
నిగా జేసివైచినది." అని వ్రాయుటలో పెడదారిని బడిన తమబుద్ధిని
ప్రతివాదులు దిద్దుకొందురుగాక.

"ఇదం త్వకార్యంకురువీరమధ్యే రజస్వలాం యత్పరికర్షసే మామ్,
నచాపి కశ్చిత్కురుతేఽత్ర కుత్సాం ధ్రువం తవేదం మత మభ్యుపేత."

కురువీరులసమక్షమున నన్ను రజస్వలనై యున్నదానిని పట్టి
బాధించుచుంటివే! ఇంతకంటెదుండగ మున్నదా? నిన్నుమందలించు
వాడొక్కడును లేడే, ఇది యందరకు సమ్మతమే కాబోలు.

ద్రౌపదీదేవి రజస్వలయే అనువిషయము పాండవనిందానిరాకర
ణములో బహువచనోదాహరణములతో నిరూపించియున్నాము. కనుక
"ఆమెరజస్వలయగుట సత్యము కాదు. రజస్వలావేషము వేసినది"
అనుచు పెడదారినిబడిన తమబుద్ధిని ప్రతివాదులు దిద్దుకొందురుగాక.

"ధిగస్తు నష్టః ఖలు భారతానాం
ధర్మ స్తథా క్షత్రవిదాం చ వృత్తమ్,
యత్ర త్వతీతాం కురుధర్మవేలాం
ప్రేక్షన్తి సర్వే కురవ స్సభాయామ్."

ఛీ! భరతవంశోద్భవుల ధర్మము భగ్నమైనది. క్షాత్రము నశించినది. లేనిచో ఛిన్నభిన్నమైపోవుచున్న కురుధర్మసేతువును సభలో జూచుచు కురువీరు లుపేక్షింతురా?

"ద్రోణస్య భీష్మస్య చ నాస్తి సత్త్వం
క్షత్తు స్తథైవాఽస్య మహాత్మనోఽపి,
రాజ్ఞ స్తథా హీమ మధర్మ ముగ్రం
న లక్షయన్తే కురువీరముఖ్యాః."

భీష్మద్రోణవిదురులకును, ధృతరాష్ట్రప్రభువునకును సమర్థత లేదు కనుక నేడుగ్రమైన యీ అధర్మమువైపు దృష్టి వారు పెట్టనేలేదు.

అని యీవిధముగా ద్రౌపదీదేవి గోలపెట్టి దైన్యముతో పాండవులవైపుచూచినది అప్పుడు రాజ్యము పోయినను సర్వస్వము పోయినను కలుగని దుఃఖము లజ్జాకోపములతో మిళితమైన ఆద్రౌపదీ వీక్షణముచే పాండవుల కావహించినది, అట్టి స్థితిలో—

'దుశ్శాసనశ్చాపిసమీక్ష్యకృష్ణామవేక్షమాణాంకృపణాన్పతీంస్తాన్
ఆధూయ వేగేన విసంజ్ఞకల్పా మువాచ దాసీతి హసన్ సశబ్దమ్.
కర్ణస్తు తద్వాక్య మతీవ హృష్ట స్సంపూజయామాస హసన్సశబ్దమ్,
గాన్ధారరాజ స్సుబలస్య పుత్ర స్తథైవ దుశ్శాసన మభ్యనన్దత్.
సభ్యాస్తు యే తత్ర బభూవు రన్యేతాభ్యామృతేధార్తరాష్ట్రేణచైవ,
తేషామభూద్దుఃఖమతీవకృష్ణాందృష్ట్వాసభాయాంపరికృష్యమాణామ్'

పాండవులవైపు చూచుచున్న ద్రౌపదీదేవిని, సత్యమునకు గట్టువడి దీనులైయున్న పాండవులను జూచి యీ దుశ్శాసనుడు ద్రౌపదీ

దేవిని గుంజి స్మృతితప్పెనా అనునట్లున్న ద్రౌపదీదేవిని దాసి యనుచు పకపక నవ్వెను. ఆదుశ్శాసను డట్లనినందుకు కర్ణుడు పరమానందభరితుడై యభినందించి తానుకూడ పకపక నవ్వెను. శకుని కూడ కర్ణుని వలెనే యానందించి దుశ్శాసను నభినందించి పకపక నవ్వెను. ఆదుశ్శాసనుని దురంతకృత్యమునకు కర్ణశకునిదుర్యోధనులు తప్ప మిగిలిన సభ్యు లెల్లరును మిక్కిలి దుఃఖించిరి.

ఈదుష్టచతుష్టయచర్యను ప్రతివాదులు మనస్సులో పెట్టుకొనవలయును.

—: ద్రౌపదీప్రశ్నపై భీష్ముని ప్రత్యుత్తరము :—

ఇట్లు జరుగుచున్నసమయములో నన్ను గెల్చుకొనుట సత్యమా? అసత్యమా? పందెము లెట్లు పెట్టబడినవి? నేను దాసి నగుదునా? కానా? మీరు తేల్చిచెప్పవలెనని మొదటినుండియు సభ్యులనడుగుచు భీష్మాదు లుపేక్షించినారని ఖేదపడుచున్న ద్రౌపదీదేవితో భీష్ము డిట్లనెను—

"న ధర్మసౌక్ష్మ్యా త్సుభగే వివేక్తుం
శక్నోమి తే ప్రశ్న మిమం యథావత్,
అస్వామ్యశక్తః పణితుం పరస్వం
స్త్రియాశ్చ భర్తుర్వశతాం సమీక్ష్య"

టీ— భర్తుర్వశతాం, దాసభార్యాపి దాస్యేవేతి భావః.

"త్యజేత సర్వాం పృథివీం సమృద్ధాం
యుధిష్ఠిరో ధర్మ మథో న జహ్యాత్,
ఉక్తం జితోఽస్మీతి చ పాండవేన
తస్మా న్న శక్నోమి వివేక్తు మేతత్"

టీ—జితోఽస్మీతి వదతాత్మైవ పరాజితో న తు స్త్రీ

"ద్యూతేఽద్వితీయ శ్శకుని ర్నరేషు

కస్త్రీ సుత స్తేన నిస్సృష్టకామః,
న మన్యతే తాం నికృతిం యుధిష్ఠిర
స్తస్మా న్న తే ప్రశ్న మిమం బ్రవీమి ”

టీ— నచ రాజజయేనైవ త్వజ్జయ స్సిధ్యతి. ద్యూతమర్యాదావిదా శకునినైవ తవ పృథక్పణీకరణా దిత్యాహ–న్యూ తే ఇతి.

రాజా తు పరాజ్ఞయా త్వాం పణీకృతవాన్, న స్వేచ్ఛయా, అతః, అస్వామీ కథం పణితవానితి రాజ్ఞోఽపి దోషా నాస్తి. తథాచ, శకునిబుద్ధ్యైవ త్వ మజితా, తచ్చ శకుని ర్న మన్యతే ఇత్యాహ, నేతి, యతః పణీకృతా తతః ప్రాగజితా, యతశ్చ పరదానేన పణీకృతా తతోఽప్యజితైవేతి భావః.

అమ్మా! ధర్మము సూక్ష్మమగుటచే నీప్రశ్నమునకు ఇదమిత్థమని వివేచించి చెప్పలేకున్నాను. ద్యూతచర్యజూడగా విషమముగా గనబడుచున్నది.

తన్ను దానోడి యాపై నిన్ను పణముగా బెట్టుటకు ధర్మజునకు అధికారమా కనబడదు. ఆపై పరులసొత్తయియున్న నిన్ను పందె మొడ్డుటకును అధికారము లేదు. ఇక భర్తతో బాటే భార్య అను పద్ధతిని “దాసభార్యాపి దాస్యేవ” అని యనుకొందమన్నను ఎవ్వడు పృథివినైన త్యజించునుగాని ధర్మము నెంతమాత్రము త్యజింపనివాడో అట్టి ధర్మజుడు “జితౌ స్వః” అని యనక “జితోఽస్మి” అని యనుటచే తన్నొక్కనినే యోడినట్లును నీసంబంధ మందు లేనట్లును తెలిపి యుండెను. ఆధర్మజుని మాట నటుండనిచ్చి శకుని తాత్పర్యము నాలోచింతము. ద్యూతధర్మ మెరిగినవారిలో శకుని మొదటివాడు. అట్టివాడే ద్రౌపదిని పందెమొడ్డు మని విడిగా పందెము బెట్టించుటచే ధర్మజుని గెల్చుకొనుటలో ద్రౌపదిని గెల్చుకొనినట్లే యను తాత్ప

ర్యము శకునికి కలుగలేదు. ఇట్లు శకునిమతప్రకారమే ధర్మజునిగూర్చిన గెలుపులో నీగెలుపు చేరలేదని తేలినది. అయినను శకునిమాత్రమట్లు భావింపకుండెను. ధర్మజుడు కొట్టకొనసనిను పందె మొడ్డుట కనధికారియై యుండియు, తనయంతట దానొడ్డక పరుల ఆజ్ఞచే నొడ్డుటనుబట్టి యనధికారి యెటులొడ్డినాడు? అనిశంకించుటకును వీలులేదు. అని భావము. ఇచ్చట పూర్వోక్త హేతువులచే నిన్ను గెల్చుకొనినామని వారనుట చెల్లదని భీష్ముని యాంతర్యము.

ఇక బాహ్యార్థము— నిన్నొడ్డుటలో ధర్మజు డనధికారియే కాని 'దాసభార్యాపి దాస్యేవ" అనికూడ గలదు, అందుచే జెప్పజాలకున్నాను. ధర్మజుడు ధర్మము విడిచి మాటలాడువాడు గాడు. ఆతడు జితోఽస్మి అనిపలికెను, అందుచేగూడ జెప్పజాలకున్నాను. ద్యూతములో నద్వితీయుడు శకుని. ఆతనిప్రేరణచే నిన్నొడ్డుటకు ధర్మజుడు పూనుకొనెను. ఆధర్మజుడు శకుని తన్నట్లు ప్రేరేపించుట అయుక్తమని భావింపలేదు. అందుచేగూడ జెప్పజాలకున్నాను. అని.

ఆపై ద్రౌపదీదేవి యిట్లనెను—

"అక్షస్థభావై ర్నికృతిప్రవృత్తైరబుధ్యమానః కురుపాండవాగ్ర్యైః,
సంభూయ సర్వైశ్చ జితోపి కస్మాత్పశ్చాదయం కైతవమభ్యుపేతః

టీ. జితోఽస్మీతి ఆత్మపరాజయావసానత్వా ద్ద్యూతస్య కథం తతోప్యుపరి దేవితవా నిత్యర్థః"

"తిష్ఠన్తి చేమే కురవ స్సభాయా
మీశా స్సుతానాం చ తథా స్నుషాణామ్,

సమీక్ష్య సర్వే మమచాపి వాక్యం
విబ్రూత మే ప్రశ్న మిమం యథావత్."

ఆత్మపరాజయానంతమే ద్యూతమైయుండ జితుడైన ధర్మజుడు ఆపై నన్నెట్లు పందెమొడ్డెను? ఈయంశమును విమర్శించి మాకంద రకును ప్రభువులైన సభాదులు నాప్రశ్నమును వివరించి చెప్పగోరుచు న్నాను. అని.

"తథా బ్రువన్తీం కరుణం రుదన్తీ
మవేక్షమాణాం కృపణాఽపతీం స్తాన్,
దుశ్శాసనః పరుషా ణ్యప్రియాణి
వాక్యా న్యువాచాఽమధురాణి చైవ."

టీ— భీష్మేణ ద్రౌపదీమాహాత్మ్యఖ్యాపనాయ ప్రశ్నస్యోత్తరం నోక్తం, దుశ్శాసన స్తు పాండవపక్షపాతినాపి భీష్మేణ సంశయో పన్యాసాదస్మాక మేవ జయ ఇతి మన్వానో యత్కించి త్ప్రలా పేత్యర్థః.

ఆవిధముగా బలుకుచు దీనురాలై రోదనము జేయుచు తన పతులవైపు చూచుచునున్న ద్రౌపదీదేవిని దుశ్శాసనుడు దుర్భాష లాడెను.

భీష్ముడు- దుర్యోధనాదులు తనను లక్ష్యపెట్టక తనయెదుటనే మదోన్మత్తులై యొడలెరుగక చెలరేగి చేయుచున్న దుండగములను చూచి, ధర్మవిదుడైన విదురుడు ప్రప్రథమునవే తనోడి యనధికా రియై యున్న ధర్మజుడు పెట్టిన ద్రౌపదీపణము చెల్లదని యుద్ఘోషించి నపుడు ఆవిదురుని నిరసించి నిందించిన దుర్యోధనుని దుశ్చేష్టలను జూచి, తనకైన నదేగతి యని గ్రహించి యీద్రౌపదీదేవియే తన్ను దాను రక్షించుకొనగల మాహాత్మ్యము కలిగియున్నదని నిశ్చయించి యీదుర్మార్గులకు కావలసిన శాస్తి యెవ్వరును కలుగజేసికొనకయే ఇప్పుడే ప్రశాంతముగా జరుగుపద్ధతి గోచరించుచుండ మనము ద్రౌప

దీపరీక్షమున కుత్తరము విప్పి చెప్పి కలుగజేసికొని కోలాహలమై పోవునట్లు చేయుట మంచిదికాదని దూరదృష్టి నాలోచించి ద్రౌపదీ మాహాత్మ్యప్రకటనతాత్పర్యముతో ద్రౌపదీపరీక్షనుపై స్పష్టమైన ప్రత్యుత్తర మీయక సంశయాస్పదముగనె పైకి చెప్పెను.

ఇట్లుండుటచే "ద్యూతజిత యగుదునో కాదో నేను చెప్పలేను. అది ధర్మరాజుడే చెప్పగలడు. అనుభీష్ముని మాటనుబట్టి ఆమె ధర్మజిత యనియే భీష్ముని మతమని ఊహింపవలసియున్నది. కనుకనే కేశగ్రహణాదికము తప్పనిమందలింపలేదు భీష్ముడు" అను కొందరి వ్రాత అయుక్తము. రాజసూయసమయములో భీష్మునిపై శిశుపాలుడు లేని పోని నిందలు చేసినపుడు భీమసేనునితో భీష్ముడిట్లనెను—

"కో హి మాం భీమసేనాద్య క్షితౌ వర్హాతి పార్థివః,
క్షేప్తుం కాలపరీతాత్మా యథైవ కులపాంసనః."

భీమసేనా! కాలమూన్నమై శిశుపాలుడు నిందింపబూనెను కాని యీభూమండలములో నన్ను నిందించువా డెవడున్నాడు? అని.

అట్టి జగత్పూజ్యుని అట్లనుట అయుక్తము.

దుశ్శాసనుడు— పాండవపక్షపాతియగు భీష్ముడు సంశయాస్పదముగ జెప్పుటనుబట్టి గెలుపుమనదే యనుకొని యేమేమో ప్రలపించెను.

అప్పుడు భీమసేనుడు, ద్రౌపదీదేవి రజస్వలయై యుండి దుశ్శాసనునిచే లాగబడుచు పీడింపబడుచు దూషింపబడుచు పరిహసింపబడుచు నుండుటను జూచి ఆదుశ్శాసనుని మదమణచుటకుద్యమించెడి తనకు ధర్మజుని యనుజ్ఞ లేకుండుటను జూచి యీదుశ్శాసన పాపిని బరిమార్పలేని నాబాహుదండములు కాల్పనా? అనుకొని ఓధర్మజా? నీయెదుట నాబాహువులను కాల్చుకొనుచున్నా నని పలికినపుడు అర్జునుడు భీమసేనుని ప్రశాంతుని జేసెను

ఈసందర్భములో ధర్మజుని చేతులను గాల్చెద నని భీమసేను డనినట్లు ప్రతివాదులు వ్రాసినది యసంగత మనియు, అది సంస్కృత భారతగ్రంథవిరుద్ధమనియు, పైని పాండవనిందానిరాకరణములో విపులముగా నిరూపించియున్నాము. ఆవిశేషము లచ్చట జూడవల యును.

—:ద్రౌపదీప్రశ్నముపై వికర్ణుని ప్రత్యుత్తరము:—

"తథా తాన్ దుఃఖతాన్ దృష్ట్వా పాండవాన్ ధృతరాష్ట్రజః,
కృష్యమాణాం చ పాంచాలీం వికర్ణ ఇద మబ్రవీత్.
యాజ్ఞసేన్యా యదుక్తం త ద్వాక్యం విబ్రూత పార్థివాః,
అవివేకేన వాక్యస్య నరకః సద్య ఏవ నః.
భీష్మశ్చ ధృతరాష్ట్రశ్చ కురువృద్ధతమా వుభౌ,
సమేత్య నాహతుః కించి ద్విదురశ్చ మహామతిః.
భారద్వాజశ్చ సర్వేషా మాచార్యః కృప ఏవచ,
యేత్వన్యే పృథివీపాలా స్సమేతా స్సర్వతో దిశమ్.
య దిదం ద్రౌపదీ వాక్య ముక్తవ త్యసకృ చ్ఛుభా,
విమృశ్య కస్య కః పక్షః పార్థివా వదతోత్తరమ్.
ఏవం స బహుధా సర్వా నుక్తవాం స్తాన్ సభాసదః,
న చ తే పృథివీపాలా స్త మూచు స్సా ధ్వసాధు వా.
ఉక్త్వాఽసకృ త్తథా సర్వా న్వికర్ణః పృథివీపతీన్,
పాణౌ పాణిం వినిష్పిష్య నిశ్శ్వస న్నిద మబ్రవీత్.
విబ్రూత పృథివీపాలా వాక్యం మా వా కథంచన,
మన్యే న్యాయ్యం య దత్రాహం తద్ధి వక్ష్యామి కౌరవాః.
తదయం పాండుపుత్రేణ వ్యసనే వర్తతా భృశమ్,
సమాహూతేన కితవై రాస్థితో ద్రౌపదీపణః.
సాధారణీ చ సర్వేషాం పాండవానా మనిన్దితా,

జితేన పూర్వం చానేన పాండవేన కృతః పణః,
ఇయం చ కీర్తితా కృష్ణా సౌబలేన పణార్థినా,
ఏత త్సర్వం విచార్యాఽహం మన్యే న విజితా మిమామ్.
ఏత చ్ఛ్రుత్వా మహా న్నాద స్సభ్యానా ముదతిష్ఠత్,
వికర్ణం శంసమానానాం సౌబలం చాఽపి నిన్దతామ్.

టీ—సమాహూతేన ప్రేరితేన సర్వేషాం భార్యా కథ మేకేన పణీ కర్తుం శక్యేత్యాహ-సాధారణీతి. ఏతత్సర్వం రాజ్ఞో వ్యసనిత్వం జితత్వం పరప్రవర్తితత్వం ద్రౌపద్యా స్సాధారణత్వం చేతి హేతు చతుష్టయమ్"

అప్పుడు ధృతరాష్ట్రపుత్రుడైన వికర్ణుడు అదుఃఖితులైన పాండవులను జూచి యీదుశ్శాసనునిచే లాగబడుచున్న ద్రౌపదీదేవిని జూచి యిట్లనెను—సభ్యులారా! ద్రౌపదీదేవి ప్రశ్నించినదానికి సమాధానము వివరించి చెప్పుడు. లేకున్న వెంటనే మనకు నరకము పెద్దలయిన భీష్మధృతరాష్ట్రులు, విదురుడు, ద్రోణాచార్యకృపాచార్యాదులు సర్వదేశీయులైన పృథివీపతులు జెప్పకుండుట మంచిదికాదు. ఆమె అనేకపర్యాయము లడిగినది. మీమీయభిప్రాయములను జెప్పుడు. అని తా నెన్నిసార్లు ప్రోత్సహించినను సభ్యులు మంచి యని గాని, చెడ్డ యని గాని యేమియు జెప్పలేదు.

అప్పుడు వికర్ణుడే చేతులు పిసుకొని నిట్టూర్పు విడిచి సభ్యులారా! మీరు చెప్పుడు మానుడు. నా కీవిషయమై గోచరించిన న్యాయము చెప్పుచున్నాను—

ధర్మజుడు కితవ(జూదరి)ప్రేరితుడై ద్యూతవ్యసనములో బడి ద్రౌపదిని పందె మొడ్డెను. అందులోకూడ నైదుగురకు భార్యయై యున్న ఆమెను తాను పందెముపెట్టెను. అపై నుందు తనోడియుండి

యీ మెను పందెము బెట్టెను. అదికూడ స్వయముగా బెట్టక శకుని పణముగా ద్రౌపదని బెట్టుమని నియోగించినప్పుడు పెట్టెను. ఇకంతయు జూడగా ధర్మరాజుడు వ్యసనియై యుండుట, జితుడై యుండుట, పరప్రేరితుడై యుండుట, ద్రౌపది యైదుగురికి భార్య యైయుండుట అను హేతుచతుష్టయమునుబట్టి యీద్రౌపదీపణము చెల్లదు ఈద్రౌపదీదేవి జితురాలు కాదు అని నానిశ్చయము. అని.

ఈమాటలు విని యా వికర్ణుని ప్రశంసించునట్టియు, శకునిని నిందించునట్టియు సభ్యులయొక్క మహానాద ముద్భవించినది.

ఇప్పుడు ధర్మవిదులైన సభ్యులు ద్రౌపదీధర్మసందేహము ప్రతివాదు లన్నట్లు ప్రత్యుత్తర మీయదగినదికాదని సమాధానము చెప్పనట్లో, మనము చెప్పినను వినిపించుకొనని యీదుష్టులు చెలరేగినపుడు చెప్పిన లాభ మేమని యూరకున్నట్లో ప్రతివాదులకు తెలిసినదా?

ప్రతివాదిమతప్రకారము నీది ప్రత్యుత్తర మీయదగిన ప్రశ్న కాదని ద్రౌపదీదేవితో నైన జెప్పవలెను. మీరనుకొనినట్లు ఆమె జితురాలు కాలేదని యీదుష్టులతోనైన జెప్పవలెను అందు ద్రౌపదీదేవితో జెప్పుట, మీరుజెప్పినట్లు నేను నడుచుకొందు నని విధేయురాలై యడిగిన యామెకు జెప్పుట, ప్రబలమైన రెండవపక్షము హాస్యించునట్లు చెప్పుట, సభ్యులకు సురకమైన విషయము. ఇక దుష్టులకు చెప్పుట, తమ్మెమియు నడుగనివారికి చెప్పుట, జితురాలు కానిద్రౌపదిని జితురాలనుకొనుచున్న వారికిచెప్పుట, తమయెదుటనే చూడలేని దురంతములు చేయువారికి చెప్పుట, మదోన్మత్తుల బాధలను పాలగుచున్న ద్రౌపదీదేవి కనుకూలముగా దుర్మార్గులతో జెప్పుట, మానధనులకు దుష్కరమైన విషయము. ఇట్లు చూడగా శకునిప్రభృతుల దన్యాయమగుటయు, చెప్పి చెయింపలేని పరిస్థితిలో తాముండుటయు సభ

వించుటచే వారు చెప్పక దుఃఖాక్రాంతులై యుండిరి కాని, ద్రౌపదీ దేవి ప్రశ్న ప్రత్యుత్తర మీయదగినది కాదని యట్లుండ లేదు.

కనుకనే ఆవికర్ణుడు నేను చెప్పుచున్నా నని యీమె జితురాలు కాదని యుద్ఘోషించినపుడు సభ్యులందరు మెచ్చుకొనుట, శకునిని నిందించుట జరిగిన దని ప్రతివాదులు తెలిసికొందురుగాక.

—: వికర్ణోక్తులపై కర్ణుని సంభావణము :—

"దృశ్యన్తే వై వికర్ణేహ వైకృతాని బహూన్యపి,
తజ్జాత స్తద్వినాశాయ యథాగ్ని రరణిప్రజః.
ఏతే న కించి దప్యాహు శ్చోదితా హ్యపి కృష్ణయా,
ధర్మేణ విజితా మేతాం మన్యన్తే ద్రుపదాత్మజామ్.
త్వం తు కేవలబాల్యేన ధార్తరాష్ట్ర విదీర్యసే,
య ద్బ్రవీషి సభామధ్యే బాలః స్థవిరభాషితమ్.
నచ ధర్మం యథావ త్త్వం వేత్సి దుర్యోధనాఽవర,
య ద్బ్రవీషి జితాం కృష్ణాం న జితేతి సుమన్దధీః,
కథం హ్యవిజితాం కృష్ణాం మన్యసే ధృతరాష్ట్రజ.
యదా సభాయాం సర్వస్వం న్యస్తవాన్ పాండవాగ్రజః,
అభ్యన్తరా చ సర్వస్వే ద్రౌపదీ భరతర్షభ.
ఏవం ధర్మజితాం కృష్ణాం మన్యసే న జితాం కథమ్,
కీర్తితా ద్రౌపదీ వాచా అనుజ్ఞాతా చ పాండవైః.
భవత్యవిజితా కేన హేతు నైషా మతా తవ,
మన్యసే వా సభా మేతా మానీతా మేకవాససమ్.
అధర్మేణేతి తత్రాపి శృణు మే వాక్య ముత్తమమ్,
ఏకో భర్తా స్త్రియా దేవై ర్విహితః కురునన్దన
ఇయం త్వనేకవశగా బన్ధకీతి వినిశ్చితా,

అస్యా స్సభా మానయనం న చిత్రమితి మే మతిః.
ఏకాంబరధరత్వం వా ప్యథవా పి వివస్త్రతా,
య శ్చైషాం ద్రవిణం కించి ద్యాచైషా యే చ పాండవాః.
సౌబలేనేహా తత్సర్వం ధర్మేణ విజితం వసు,"

(సభా. అ-68)

ఓవికర్ణుడా! నీధోరణి విపరీతముగా నున్నది. అరణిలో బుట్టిన అగ్నివలె నీవును బుట్టిన చోటు నశింపజేయువాడవె. ద్రౌపదిచే బ్రశ్నింపబడిన వీరందరు నేమైన బలికిరా? ఈమె ధర్మజితురాలనియే వీరందరు దెలిసికొనిరి. ఏమియు నెరుగని నీవుమాత్రము పెద్దపెద్దమాటలు చెప్పుచున్నావు ఓదుర్యోధనసోదరుడా! నీవు ధర్మ మెరుగనివాడవు లేనియెడల జితురాలైన ద్రౌపదిని జితురాలు కాదని మందమతీ! యెట్లు చెప్పెదువు? ఓధృతరాష్ట్రపుత్రా! ద్రౌపది జితురాలు కాదని నీవెట్లనుకొనగలిగితివి? సభలో ధర్మజుడు సర్వస్వము నొడ్డియోడెను. అందులో నీద్రౌపది యంతర్భూతురాలు కాదా? ఇట్లు ధర్మజితురాలైన ద్రౌపదిని కాదని నీవెట్లనుకొనగలిగితివి? ద్రౌపది మాట నెత్తుకొని పందె ముంచుట, పాండవులు సమ్మతించుట, జరిగినపుడు నీ వేకారణముచే జితురాలు కాదని యనుకొంటివి?

సభ కేకవస్త్ర నీడ్చి తెచ్చుట, అధర్మ మని యనుకొంటివా? ఆవిషయమై చెప్పుచున్నాను వినుము. స్త్రీకి యేకభర్తయే దేవతలచే విధింపబడెను ఈమె యనేకులకు వశమై యున్నది. కనుక నీమె బంధకియని నిశ్చయము. ఇట్టిదానిని సభకు లాగుకొనివచ్చుట, యేకవస్త్రమైన నుతు దకు వివస్త్రమైన నుస రేవిచిత్రము కానేర దని నానిశ్చయము. పాండవుల సొత్తు ద్రౌపది. పాండవులు శకునిచే ధర్మముగా గెల్చుకొనబడెను. అని కర్ణు డుపన్యసించి వికర్ణుని నిరసించి యాపై యిట్లనెను—

"దుశ్శాసన సుబాలోఽయం వికర్ణః ప్రాజ్ఞవాదికః,
పాండవానాం చ వాసాంసి ద్రౌపద్యా శ్చాప్యుపాహర."

ఓదుశ్శాసనా! ప్రాజ్ఞత్వాభిమానముగల యీవికర్ణు డజ్ఞాని. నీవు పాండవులయొక్క వస్త్రాపహరణమును, ద్రౌపదియొక్క వస్త్రాపహరణమును జేయుము. అని.

ఇట్లు ప్రేలపించి వస్త్రాపహరణమునకు ప్రోత్సహించిన కర్ణుని దుర్నయమును కర్ణస్తుతిపరాయణులగు ప్రతివాదులందరు మనస్సులో బెట్టుకొనవలయును.

ద్రౌపదీ దేవి కట్టుపుట్టముల నొలవ దుశ్శాసనుని నియోగించిన వాడు కర్ణుడయియుండ, కర్ణాభిమానులగు కర్ణచరిత్రకారులు—

"దుర్యోధనుడు ఆమెకట్టుపుట్టముల నొలువ దుశ్శాసనుని నియోగించి" (పు43)అని వ్రాయుట హేయము.

—: వికర్ణోక్తుల కేదో మొండిజబాబు చెప్పిన కర్ణుని మాటలను అభినందించు ప్రతివాదుల ప్రసంగము—తన్నిరాకరణము :—

సుయోధనవిజయము— తొలిపలుకు— "కర్ణుడిట్లు ప్రత్యుత్తర మిచ్చినాడు— ధర్మజుండు దన సర్వస్వమునొడ్డి యోటువడినప్పుడిది దానికి వెలితి కాదు కావున ధర్మవిజితయు. అట్లుగానినాడు

ఈపాండవు లిందరును విజితిగా నేల యొడంబడుదురు?" అని. ఆవికర్ణుని ధర్మనిర్ణయమునకును, ఈకర్ణుని మాటలకును సంబ ధమే లేదు. వికర్ణుడు నిర్ణయించినదిది— "కితవాహూతుండై వ్యసనవర్తియయి పరాజితుం డయిన పాండవాగ్రజుండు పాండవుల కందరకు సాధారణధనంబయిన పాంచాలిం బణంబు జేసెం గావున ద్రౌపది యధర్మవిజిత, యట్లగుటంజేసి యేకవస్త్ర నిట దోడ్తెచ్చుట యన్యాయంబు" (ఆంధ్రభారతము)

ఇచ్చుట ద్రౌపదిని పందె మొడ్డిన ధర్మజుడు వ్యసనవర్తి, పర ప్రేరితుడు, పరాజితుడు నయి యుండెననియు, ద్రౌపది పాండవులలదరి సొత్తయి యుండెననియు, నీకారణములచే ఆపందెము చెల్లదనియు, వికర్ణుడు నిర్ణయించెను. దీనిపై యాకారణములు సరియైనవి కావని నిరూపింపవలసిన కర్ణు డాపని జేయలేక చెప్పిన దేమి?

"ధర్మజుడు తన సర్వస్వము నొడ్డి యోటువడినప్పుడు ద్రౌపది యెట్లు మిగులును?" అని.

ఈకర్ణునిమాట వికర్ణు డన్నట్లు ధర్మజుడు వ్యసనవర్తి కాడనుట కుపయోగించునా? పరప్రేరితుడు కాడనుట కుపయోగించునా? పరా జితుడు కాడనుట కుపయోగించునా? ద్రౌపది పాండవులయందరి సొత్తు కాదనుట కుపయోగించునా? ఇది యెందునకు బొందని ప్రలాపము.

ఇక "పాండవులందరు విజితగా నేల యొడంబడుదురు?" అను మాటమాత్ర మేమి బాగున్నది? పరాజితులు, పరప్రేరితులు నయి యుండుటచే నేమనుటకు వీలులేక వారూరకున్నారా? విజితగా నొడంబడినారా? మరియు కర్ణు డన్నట్లు తన సర్వస్వము నోడుటలోనే ద్రౌపదినిగూడ ధర్మజు డోడె ననుట నిజమైనయెడల ద్యూతములో మొనగాడైన శకుని మరల విడిగా ద్రౌపదీపణము నేల పెట్టించెను? ఆమె జితురాలు కాకున్నదనియే పెట్టించెను. అప్పు డీకర్ణు డేమయి నాడు? ఇంతకు బూర్వమే సర్వస్వముతోబాటు జితురాలై యున్న ద్రౌపదినిగూర్చి మరల పణము బెట్టించుట యెందుల కని యాశకునికి జెప్పలేదేమి? ఆమె జితురాలు కాకున్న దనియే శకుని ఆమెను గూర్చి పణము బెట్టించినపుడు దానికి కర్ణాదు లొడంబడియే మారుపలుకలేదు. అట్టి కర్ణుని వాదము తమలోని శకుని చర్యకే విరుద్ధము వికర్ణుని ధర్మ నిర్ణయమునకు విరుద్ధమనియు, నసంబద్ధమనియు వేరే చెప్పవలయునా!

సారాంశము—జితుడై యున్న ధర్మజునిచే ద్రౌపదీపణమును విడిగా బెట్టించిన శకుని చర్యచేత నంతకు బూర్వమె జితురాలను కర్ణుని వాదము ఖండితమైనది. వికర్ణు డామె జితురాలు కాదని సహేతుకముగ జేసిన సిద్ధాంత మప్రతిహతమై యున్నది.

—: ఏకవస్త్రను సభ కీడ్చుటలో నధర్మము లేదను కర్ణుని మాటలకు అభినందించు ప్రతివాదుల ప్రసంగము— తన్నిరాకరణము :—

సుయోధనవిజయము— తొలిపలుకు— "మరి యేకవస్త్రయై యున్న దీని సభకుం దోడ్కొనివచ్చుట యధర్మంబంటి, భార్యకు దైవాధిష్ఠితుండయిన భర్త యొక్కరుండ, ఇది యనేకభర్తృక గావున బంధకి యనంబడు నిట్టిదాని విగతవస్త్రం జేసి తెచ్చిన ధర్మ విరోధంబు లేదని కర్ణుండు వికర్ణవచనంబులకుం బ్రత్యాఖ్యానంబు సేసిన" (ఆంధ్రభారతము) ఈగ్రంథములో "బంధకి యనంబడు" అనునంతవరకు మాత్రమే యుల్లేఖించి పైమాటను వదలివేసి ప్రతివాదు లిట్లు వ్రాసినారు—

"కర్ణుడు చెప్పిన పలుకులలో నధర్మము కాని, యసత్యము కాని యున్నయెడల భీష్మద్రోణవిదురులును పంచపాండవులు నూరకొని యుందురా? దీనికి దగిన ప్రత్యుత్తరమిచ్చియె యుందురు. కాని కర్ణుమాటల కొక్కరైన నెదురు చెప్పలేదు.

అదియుంగాక "ధర్మశాస్త్రంబందు ధర్మజుం డెక్కడో ద్రౌపది యెక్కడో ధర్మరతుల కెరుంగరాదొక్కో" అని శ్రీరఘుపతి రావుగారు వేయించిన ప్రశ్న బహుశ్లాఘనీయముగనున్నది"

ఈప్రతివాదులు చూపిన ఆకర్ణునిమాట వికర్ణుని మాటను నిరసించుటకై చెప్పినదికద, వికర్ణు డన్నదేమి? "ఏకవస్త్రయై (రజ

స్వలయై యున్న దీని సభకుం దోడ్కొనివచ్చుట ధర్మువుగాదు" అని.
దీనిపై కర్ణుని ప్రత్యుత్తరమేమి? "ఇది యనేకభర్తృక గావున బంధకి" అని యొకటి, "ఇట్టిదాని విగతవస్త్రం జేసి తెచ్చినను ధర్మ విరోధంబు లేదు" అని యొకటి.

ఇందలి రెండవమాటకు పాపము ప్రతివాదులు సిగ్గుపడి కాబోలు ప్రదర్శింపక మానివేసిరి. వారు తీసికొనినది బంధకి యను మాటనే. ఇప్పుడు రజస్వలను సభకు లాగుట ధర్మముకాదను వికర్ణుని యాక్షేపమునకు 'ఈమె బంధకి' అను కర్ణునిమాట సమాధానమగునా? ఇది యామె రజస్వల కాదనుట కుపయోగించునా? రజస్వలాస్త్రీని స్పృశింపవచ్చు నుట కుపయోగించునా? ఆమె జుట్టుపట్టుకొని యీడ్చి గుంజి దుర్భాషలాడి వేధింపవచ్చుననుట కుపయోగించునా? ఇది యెందునకు బొందని ప్రలాపము. ఇట్టి మొండిమాటను తగుదుమమ్మా యని ప్రతివాదులు ప్రదర్శించి కర్ణుని శ్లాఘింపబూనుట శోచనీయము. ఇక కర్ణుని రెండవమాటయేమి? "విగతవస్త్రం జేసి తెచ్చినను ధర్మ విరోధంబు లేదు." ఇది యెంత మొండిమాట? "రజస్వలను సభకు లాగుట ధర్మముకాదు." అను వికర్ణుని యాక్షేపమేమి? "బంధకిని విగత వస్త్రం జేసి తెచ్చినను తప్పు లే"దని కర్ణుని సమాధానమేమి? ఇది యసంబద్ధప్రలాపము కాదా! ఇంతకంటె మొండితన మున్నదా! ద్రౌపదీదేవి బంధకియా? ఆశబ్దమున కర్థము— "బధ్నాతి ఉదాసీనమపి పురుషం స్వవశం కరోతీతి బన్ధకీ" అను వ్యుత్పత్తిచే జారిణి యని యర్థము. ఆమె జారిణియా?

కర్ణు డన్నది "భార్యకు దైవవిహితుడైన భర్త యొక్క రంకు" అనికాదా! ఇది భర్తృనియమమునకు దైవవిధానము మూలాధారమని చెప్పినట్లయినది. ఇట్టి స్థితిలో స్త్రీసామాన్యమునకు దైవవిధానమున నేకైకభర్తయైనను ద్రౌపదీదేవికి మాత్రము పంచపతిత్వ మాదైవ విధానముచేతనే నియమితమైనప్పుడు, అది వాదోపవాదపరిష్కృతమై

నప్పుడు, అది యార్షదృష్టిగోచరమైనప్పుడు, అది సకలమహీపాలాభ్యాప గతమైనప్పుడు, అది సకలమునిజనసంస్తుతమైనప్పుడు, అది యీశ్వర దత్త ప్రతిదినకన్యాత్వవరపవిత్రితమైనప్పుడు నింద్యమెట్లగును? ఆమె జారిణి యెట్లగును? కనుక బంధకి యనుట తప్పు.

మరియు కర్ణుడు, ఏసాధ్విని బంధకి యనెనో ఆమె యర్ధాంగియై యుండ ధర్మజుడు రాజసూయయాగమును చేసెను. ఆ యాగమునకు వెళ్ళినప్రముఖు లసంఖ్యాకులు. అందు—

"ధృతరాష్ట్రశ్చ భీష్మశ్చ విదురశ్చ మహామతిః,
దుర్యోధనపురోగాశ్చ భ్రాతర స్సర్వ ఏవ తే,
గాంధారరాజ స్సుబల శ్శకునిశ్చ మహాబలః,
అచలో వృషకశ్చైవ కర్ణశ్చ రథినాం వరః." (సభా. అ34)

వీరందరు వెళ్ళినవారే. "ఇట్లువచ్చిన భీష్మధృతరాష్ట్రవిదుర ద్రోణకృపాశ్వత్థామసోమదత్తకర్ణభూరిశ్రవశ్శల్యశకునిసైంధవదుర్యోధన దుశ్శాసనవికర్ణాదుల నెల్లం బ్రియసత్కారంబులం బూజించి వార లతో ధర్మరా జిట్లనియె" (ఆంధ్రభారతము)

వీరందరు నచ్చట సత్కారములు గ్రహించినవారే. ఈనాడు బంధకి యనబడిన యామె ధర్మపత్నిగాగ జరిగిన యారాజసూయము నకు ఈకర్ణుడు, శకునిదుర్యోధనదుశ్శాసనులు ఏమొగము పెట్టుకొని వెళ్ళిరో? నాడు ద్రౌపదీదేవి కులకాంతయై నేడు కులట అయ్యెనా? సిగ్గుసిగ్గు. కనుక బంధకి యనుట తప్పు.

పూజ్యురాలైన సాధ్వీమతల్లిని బంధకి యనుటే మహాపాపము. ఆపై వివస్త్రను చేసినను తప్పు లేదనుటకంటె ఘోర మున్నదా? ఏబంధకినైన సభలో వివస్త్రను చేయుట ధర్మవిరుద్ధము కాదనుట మనుష్యలక్షణమేనా? ఒడ లెరుగక యింత నగ్ననృత్యము మహాస భలో జేసినట్టి కర్ణుని మెచ్చుకొనువారిది వెఱ్ఱియా? బుద్ధియా?

కర్ణుడు చెప్పిన పల్కులలో నధర్మముకాని, యసత్యముకాని లేదట! సభలో నెవ్వరును పలుకకుండుటే నిదర్శనమట! ప్రతివాదిధోరణి యేమిబాగున్నది? పలికిన లాభము లేదనియు, వికర్ణుడు పలికిన దాని కేమిలాభము కలిగె ననియు, భావించి "దుర్యోధను భయంబున సభ్యు లెవ్వరుం బలుకరయిరి." అను యాంధ్రభారతములో జెప్పినట్లు పలుకకుండిరి. ఇంతదురంతమున కొడిగట్టిన వీరికి శాస్తి నేడు జరిగితీరు నని తన మహాత్మ్యముచే ద్రౌపదీదేవి తన్ను దానే కాచుకొనగలుగు నని దైవశోధన కింతకంటె తరుణ మిక లేదని యాస్తికశిఖామణు లగు సభ్యులు నిరీక్షించుచుండి రని ప్రతివాదులు తెలిసికొందురుగాక.

"ధర్మశాస్త్రమందు ధర్మజు డెక్కువా? ద్రౌపది యెక్కువా? అని శ్రీరఘుపతిరావుగారు వేయించిన ప్రశ్న బహుశ్లాఘనీయముగ నున్నదట" అనగా ధర్మశాస్త్రము దెలిసినవాడు ధర్మజుడా? ద్రౌపదియా? అనునది యావేయించిన ప్రశ్న. అనగా ద్రౌపది నొడ్డి యోడిన ధర్మజుడు, ధర్మము తెలియనివాడును, ఆపణము చెల్లునా? అని యడిగినద్రౌపదీదేవి ధర్మము తెలిసినట్టిదియునా? అని యాక్షేప మన్నమాట! ఇచ్చట గొంచెము బోధింపవలసియున్నది—— తనోడి పరాధీనుడై యున్న స్థితిలో బరుల ఆజ్ఞాప్రకారము చేయుట తనకు ధర్మమని తెలిసినవాడు గనుక "పణస్వ కృష్ణాం పాంచాలీమ్" అని శకుని యాజ్ఞాపించినపుడు ధర్మజుడు ద్రౌపదిని బణముగా బెట్టెను. ఆత్మపరాజయాంతమే ద్యూతము గనుక తనోడిన ధర్మజునిచే బెట్టించిన పణము చెల్లునది కాదను ధర్మము దెలిసినది గనుక ద్రౌపదీదేవి ప్రశ్నించెను.

ఇచ్చట జితుడైన ధర్మజునిచే పందెము బెట్టించుట న్యాయ్యమగునా? అని యడిగినదికాని నన్ను ధర్మజుడు అసలు పందెముబెట్టుటే యన్యాయ మనలేదు. కనుక ద్రౌపదీధర్మజుల ధర్మజ్ఞానములు పర

స్పరవిరుద్ధములు గావు. అట్టి స్థితిలో వారిరువురిలో నొకరెక్కువ, ఒకరు తక్కువ కావలసిన పని యేమున్నది?

ధర్మజునిది తప్పు అను భావము ద్రౌపదీదేవికి లేనే లేదు. ఆతనిచే పందెముబెట్టించినవానిది తప్పనియే యామె భావము. ఆమె ప్రశ్న మర్థము చేసికొనలేక ధర్మజునిదే ఆమె తప్పనినట్లు భ్రాంతి పడి ధర్మశాస్త్రములో ధర్మజు డెక్కువా? ద్రౌపది యెక్కువా? అని వెర్రిమొర్రిప్రశ్న వేయించిన రఘుపతిరావుగారి యసంబద్ధమైన వ్రాతయు, "అది బహుశ్లాఘనీయముగా నున్న దని" "ద్రౌపదిదేవిని చిత్రించుటలో కవి తనరత్కచాతుర్య మెల్ల గనపరచినాడు" అని ఆకవిని గొనియాడిన తొలిపలుకువారి వైఖరియు హేయము.

సారాంశము—

రజస్వలను సభకు లాగుట, దుర్నయ మని వికర్ణుడు గర్హించెను. ఆమె బంధకి, అట్టి దానిని వివస్త్రను జేసినను తప్పులేదని కర్ణుడా వికర్ణునకు బదులుచెప్పెను. ఆపై యాకర్ణుడు "పాండవానాం చ వాసాంసి ద్రౌపద్యా శ్చాప్యుపాహర" దుశ్శాసనా? వికర్ణునిమాటల కేమి, ద్రౌపదిని వివస్త్రనుచేయుము. అని ప్రోత్సహించెను.

ఇదంతయు పాండవులు లోకములో తలయెత్తలేకుండుటకును, తన్మూలమున దుర్యోధనునకు ప్రీతి కలిగించుటకును జేసిన పని.

ఇట్టి కర్ణుని దుర్నయమును మెచ్చుకొను ప్రతివాదుల దెంత సద్భావమో గమనింతురుగాక.

ధర్మనిరతులైన పాండవులనుగూర్చియు, ద్రౌపదీదేవినిగూర్చి యు, తాను నాడు దుర్యోధనప్రీతికై దుర్భాషలాడినట్లును, ఆదుష్కా ర్యమునకు తాను పరితపించుచున్నట్లును కృష్ణభగవానునితో రాయ భారమునకు వచ్చి వెళ్ళిపోవునపుడు తానొంటరిగా గలిసిన సందర్భ ములో కర్ణుడే చెప్పుకొనెను. చూడుడు—

"యదబ్రువ మహం కృష్ణ కటుకాని స్మ పాండవాన్,
ప్రియార్థం ధార్తరాష్ట్రస్య తేన తప్యే హ్యకర్మణా.
(ఉద్యో. అ141)

ఇట్లు కర్ణుడే తానుచేసినది దుర్న్యాయమని స్వయముగా జెప్పియుండ, ఆదుర్న్యాయమును సమర్థించుటకై పూనుకొను ప్రతివాదుల నేమనవలయునో! ద్రౌపదీపాండవులను గర్హించినవారందరు కర్ణునివలె నెప్పుడో పరితపించెడి యవస్థకు పాలుకావలసినవారే. అని తెలుపుచు దీని నింతటితో విడిచిపెట్టుచున్నాము.

—: కర్ణుడు ద్రౌపదీదేవిని బంధకి యనుటను సమర్థించు
మ. భా. చ. కారుల ప్రసంగము— తన్నిరాకరణము :—

"ద్రౌపదిని ద్యూతసభలో బంధకి యనుట మిగుల గటువుగా గాన్పించును బంధకి యన జారిణి యని నిఘంటువుల గాన్పించును. కాని పంచభర్తృకయే బంధకి యని ధర్మశాస్త్రపుగారికలలో గలదు. చూడుడు—

"ఏకో భర్తా హి నారీణాం కౌమారః ఇతి లౌకికః,
ఆపత్సు చ నియోగేన సంతానార్థే పరస్స్మృతః.
గచ్ఛేత యా తృతీయ స్తు తస్యా నిష్కృతి రుచ్యతే,
చతుర్థే పతితా ధర్మా త్పంచమే బంధకీ భవేత్." (స్మృతికారిక)
ద్రౌపది పంచభర్తృక యగుటచే నామె నట్లు కర్ణుడు చెప్పియున్నాడు. (మ. భా. చ. పు 284)

ప్రతివాదులీవ్రాతచే నిఘంటువులలో బంధకీశబ్దమునకు జారిణి యని యర్థము చెప్పబడినట్లును, స్మృతికారికలో జారిణి యని కాక పంచభర్తృక యని యర్థము చెప్పబడినట్లును తెలుపుచున్నారు. దీనిచే వీరు, ద్రౌపదీదేవి పంచభర్తృకయె కాని జారిణి కాదని చెప్పినట్లే. సంతోషము.

వివాహితపతిసంబంధముగాక అన్యులతో సంబంధము గలది జారిణి యనబడును. వివాహితపతిసంబంధమే కలది పతివ్రత యనబడును. ద్రౌపదీదేవి కైదుగురును వివాహితపతులే చూడుడు— ఆంధ్రభారతము.

"మొదట ధర్మపుత్రునకు ద్రుపదరాజపుత్రిం బాణిగ్రహణంబు సేయించి తొల్లి యేవురకు వివాహము సేయునప్పుడు కన్యాత్వంబు దూషితంబు గాకుండ నీశ్వరువరంబునం గామారత్వంబు వడసిన యక్కన్యకం గ్రమంబున భీమార్జుననకులసహదేవులకుం బాణి గ్రహణంబు సేయించిరి"

ఆద్రౌపదీదేవి పంచభర్తృక యగుట యిట్టిది. ఇట్టి పంచభర్తృ కాత్వమును మనస్సులో బెట్టుకొనియే బంధకీశబ్దము నాకర్ణుడు వాడి నట్లు ప్రతివాదులు చెప్పగలరా? ఈప్రతివాదియే వ్రాసిన యీవిష యమును జూడుడు—

"మరియు నాతడిట్లు ఎకసక్కెము నాడుట యధర్మముగా గా న్పించును. కర్ణుడు సభలో నవమానింపబడిన ద్రౌపదిం జూచి యిట్లనినాడు—

గీ. తరుణి యేవురుకంటె నొక్కరుడు భర్త
యగుట లగ్గు జూదంబునందాలినోటు
వడనివానిగా దగు భర్త బడయు మింక
ననుచు రాధేయు డుల్లస మాడె నంత". (పు284)

ఈపద్దెములోని విషయ మేమనగా— ఏవురు భర్తలగుట కంటె నొక్కడు భర్తయగుట మంచిది గనుక జూదములో నాలి నోడనట్టి తగు భర్త నింక తరుణీ నీవుపొందుము. అని.

ఈయనుటలో అయిదుగురిని కాదని ఆలి నోడిపోయినవారిని కాదని, పాండవులను త్రోసివేసి యిక దుర్యోధనుని భర్తగా స్వీకరింపు

మని తానసూచించెను. ఈసూచించినవాఁడు స్వామిభక్తిపరాయణుఁ డని ప్రతివాదులచే కీర్తింపఁబడు కర్ణుఁడు. ఈతఁడు పూర్వాచారపరాయణుఁ డని యీప్రతివాదిచే కీర్తింపఁబడినట్టి తనస్వామియగు దుర్యోధనునకు భక్తిసూచకముగా ఘటింపఁజేయఁదలఁపెట్టునది బంధకీ సంబంధము. ఆహా! కర్ణునిది ఏమిస్వామిభక్తి? దుర్యోధనునిది యేమి పూర్వాచారపరాయణత్వము? సిగ్గు సిగ్గు!

ఈకర్ణుని మాటలో ద్రౌపదికి దుర్యోధనుని భర్తనుజేయఁబూనుట వివాహవిధి ననుసరించినది కాదనియు, వివాహితపతుల కంటె నన్యునితో సంబంధము గల్పించుభావమనియు నదియే జారిణీలక్షణమనియు, అట్టి జారిణియే ద్రౌపదియనియు, కనుకనే పంచభర్తృకయనియు స్పష్టీకరించి నట్లయినది. ఇట్టి భావ మాతనికుండియే ఆమెను బంధకి యనెను. ఆమె పంచభర్తృక యగుటకూడ జారిణి గనుకనే యని యీ కర్ణునియూహ. కనుకనే ఇట్టి బంధకిని వివస్త్రను జేసినను తప్పు లేదని ప్రలపించినాఁడు. కనుక జారిణి యను అర్థమందే కర్ణుఁ డాబంధకీశబ్దమును వాడెను. కాబట్టి మ. భా. చ. కారుల వ్రాఁత కర్ణుని తాత్పర్యమునకు విరుద్ధము.

ఇంకొకటి. నిఘంటువులలో బంధకి యనగా జారిణి యనియే చెప్పఁబడినదట! స్మృతికారికలలో మాత్రము పంచభర్తృకయనియే కాని జారిణి యని చెప్పఁబడలేదట!

ప్రతివాది కిచ్చట గొంచెము చెప్పవలసియున్నది. ఏపదమునకేయేయర్థములు శాస్త్రసిద్ధములై యుండునో, శాస్త్రజ్ఞులచే బోధింపఁబడియుండునో ఆయా అర్థముల నాయాపదములకు ప్రకటించునవి నిఘంటువులు. ఆనిఘంటువులు బంధకీశబ్దమునకు పంచభర్తృక యను వేరొక యర్థ మున్నయెడల ప్రకటించి తీరవలసినవియే. పంచభర్తృక యనినను, జారిణీయనినను.ఒక్కటియైనపుడే ప్రకటింపవలసిన పని లేకుం

డును. అందుచే బంధకి యనిన జారిణి యనియే చెప్పిన నిఘంటువులు ప్రతివాదులు చెప్పినట్లు దాని కింకొకయర్థము లేదనియే ధృవపరుచు చున్నవి.

ఇక స్మృతికారికలలో నున్నదందురు కాబోలు! దానిలో నున్న యెడల నిఘంటువు లేల చెప్పవు? ఆకారికలోగూడ జారిణి యని యర్థమే. చూడుడు—

"ఏకో భర్తా హి నారీణాం" అనునపుడు వివాహవిధినిబట్టి స్త్రీకొక్కడే భర్త, (వివాహితపతి) అని చెప్పబడినది. ఆపై—

"ఆపత్సు చ నియోగేన సంతానార్థే పరః స్మృతః,"

"ఆపత్సు చ నియోగేన భర్తుర్భార్యాః పరఃస్మృతః."

(పాఠాంతరము).

నియోగవిధినిబట్టి యాపత్కాలమున సంతానముకొరకు భర్తకంటె అన్యుడు విధింపబడెను. అని చెప్పబడినది. ఇచ్చట "పరః స్మృతః," అనునపుడు భర్తకంటె అన్యుడు అని యర్థమేకాని ప్రతివాది యనుకొనినట్లు అన్యభర్త (మరియొకవివాహితపతి) యని యర్థముకాదు. ఈవిషయమును "భర్తుర్భార్యాః పరః స్మృతః" అను పాఠాంతరము స్పష్టీకరించుచున్నది. నియోగవిధి వివాహితపతికి సంబంధించినది కాదని స్పష్టమే. కనుక పరపురుషుడనియే దానికర్థము. ఆపై 'గచ్ఛేత యా తృతీయన్తు తస్యా నిష్కృతి రుచ్యతే' వివాహవిధికి సంబంధించిన భర్తను, నియోగవిధికి సంబంధించిన పరపురుషుని గాక తృతీయుని అనగా మూడవపరపురుషుని గూడిన స్త్రీకి ప్రాయశ్చిత్తము విధింపబడినది. అని చెప్పబడినది. ఆపై— "చతుర్థే పతితా" 'పంచమే బంధకీ' చతుర్థపరపురుషుని గూడిన పతితురాలగును. పంచమపరపురుషుని గూడిన బంధకి యగును. అని చెప్పబడినది.

ఇచ్చట వివాహవిధికిగాని, నియోగవిధికిగాని, సంబంధింపక పరపురుషులతో వర్తించునట్టి స్త్రీని గూర్చి చెప్పబడినది. కనుక నిచ్చట బంధకీశబ్దము కూడ జారిణినే చెప్పుచున్నది.

ఇంకొకటి. మ. భా. చ. కారులు గ్రంథము పేరు చెప్పక స్మృతికారిక లనుచు చిత్రముగా జూపిన ఆకారిక లెక్కడివో ఏప్రస్తావము లోనివో, ఎవ్వ రనినవో చెప్పుచున్నాము. వినుడు—

ఆకారికలు మహాభారత మందలి నాలాయన్యుపాఖ్యానము లోనివి. ఆప్రస్తావము పరమేశ్వరుని కొరకు తపముచేసిన నాలాయనికి సాక్షాత్కరించిన పరమేశ్వరుడు "పంచ తే పతయో భద్రే భవిష్యన్తి" అనిచెప్పినపుడు దాని కిష్టపడక అది దోషమని చెప్పుకొను ప్రస్తావము. ఆచెప్పుకొనినది ఆనాలాయనియే. ఆమె యుదారించినవియే ఆకారికలు. అదంతయు వెనుకప్రదర్శింపబడియే యున్నది

ఆమె "పంచమే బంధకీ భవేత్" అని. యీాపై
ఏవం గతే ధర్మపథే న వృణే బహుపుంస్కతామ్,
అలోకాచరితా త్తస్మా త్కథం ముచ్యేయ సంకరాత్"

ధర్మము కాని బహుపురుషసంబంధము నేనొల్లను. నాకీ దోషము నుండి విముక్తి యెట్లు అని పరితపించినది. దీనినిబట్టి తనకు జారిణీస్థితి సంభవించిపోవుననియే (పంచమే బంధకీ భవేత్) అని గోలపెట్టినది. కనుక ఆబంధకీశబ్దమునకు జారిణియేఅర్థము. కనుక ప్రతివాది చేసిన తనపాండిత్యాభినయము హేయము. కర్ణుడు బంధకి యనుట జారిణి యనుటే. ఆనాలాయనీప్రార్థనపై పరమేశ్వరుడు ఇట్లనుగ్రహించెను.

"అన్య దేహాన్తరే చైవ రూపభాగ్యగుణాన్వితా,
పంచభిః ప్రాప్య కౌమారం మహాభాగా భవిష్యసి"

నాలాయనీ! నీకు దోషము లేకుండుటకై చెప్పుచున్నాను. నీవు పైజన్మములో రూపభాగ్యగుణాన్వితురాలవై పంచపతులతోనీవెప్పటి కప్పుడు కన్యాత్వమును పొందుచు నీవనుకొను బంధకీత్వము లేకుండ పూజ్యురాలవై యుండగలవు. అని.

అట్టి యసాధారణవరమును బొందిన నాలాయనియొక్క జన్మాంతరస్వరూపమే యీాద్రౌపదీదేవి. ఆమెను బంధకి యని నిందుస

భలో ప్రలపించిన కర్ణుని దుర్నయమును కర్ణాభిమానులగు ప్రతివాదులు మనస్సులో నుంచుకొందురుగాత.

ప్రకృతమునకు వత్తము-అద్రౌపదీదేవి ప్రశ్నకు వికర్ణుడు విస్పష్టముగా సమాధానము చెప్పి దుశ్శాసనాదులు చేయుచున్నది దుండగమని యుద్ఘోషించినపుడు కర్ణుడు కలుగజేసికొని అసంబద్ధప్రలాపములతో వికర్ణుని ధిక్కరించి ద్రౌపదిని వివస్త్రను చేయుమని దుశ్శాసనుని కుపదేశింప నాదుష్టు డాపనికి బూనుకొనెను. 'ఆకృష్యమాణే వసనే ద్రౌపద్యా చింతితో హరిః' తనవస్త్రము లాగబడుచున్నప్పు డాసాధ్వీమణి దుఃఖించుచు శ్రీకృష్ణభగవానుని స్మరించి ప్రార్థించినది. అప్పుడాభగవానుని యనుగ్రహముచే అక్షయవస్త్రము లామె శరీరమునుండి యావిర్భవించినవి. దుశ్శాసనుడు విఫలమనోరథు డయ్యెను. దుష్టచతుష్టయమునకు తలవంపులు కలిగెను. సభ్యు లాయద్భుతమును జూచి 'శశంసు ర్ద్రౌపదీం తత్ర కుత్సన్తో ధృతరాష్ట్రజమ్.' ద్రౌపదీదేవిని స్తుతించువారును, దుశ్శాసనుని దూషించువారు నయిరి. భీమసేనుడుగ్రుడై—

మ. కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్ సూచుచుండఁగ మదో
  ద్ధురుడై ద్రౌపది నిట్లు సేసిన ఖలుఁ దుశ్శాసనుఁ లోకభీ
  కరలీలఁ వధియించి తద్విపులవక్షశ్శైలరక్తౌఘముని
  ర్ఝరముర్వీపతి సూచుచుండ నని నాస్వాదింతు సుగ్రాకృతిఁ.'

అని ప్రతిజ్ఞ చేసెను.

ఈవిషయములో మ. భా. చ. కారులును, మహాభారతరహస్యకారులును 'వస్త్రాపహరణము జరుగనులేదు. శ్రీకృష్ణు డక్షయవస్త్రములివ్వను లేదు' అనిచేసిన యసంగతప్రసంగములను విపులముగా 'శ్రీకృష్ణనిందానిరాకరణము' అను తృతీయభాగములో చర్చించి ప్రమాణోపపత్తులతో నిరాకరించియున్నాము. అవి శేషము లచ్చట జూడవలయును.

సుయోధనవిజయకర్త వ్రాత వైఖరి జూడుడు—

'జూదంబులో నోడ సుదతిని మావారు రమ్మనిబిల్వంగ రాకనిలచె.
బంధుజనంబుచే పరివృతంబైనట్టి సభలోనికిని రాక చాన నిలచె.
మానినిరాకుంట మావారలోర్వకతివిరియామెను గొనితెచ్చినార
లప్పుడఖోసివిర్మై నట్టియాకాంత వస్త్రంబు తనయంతబడెనుక్రింద
నంతమాత్రంబున నతివను పరిభవించితి మని యొల్గితిచెప్పిరకట
నిక్కంబుగనిది మా నేరమంచుదలంపమరయుంగనిదియయధార్థము'

ఇది దుర్యోధనుని నోటితో జెప్పించిన కవివాక్యము. ఇంతకంటె అసంబద్ధపుప్రలాప ముండునా! ఇంతకంటె అసభ్యప్రసంగ ముండునా! సిగ్గుసిగ్గు.

దుష్టులదుస్సంకల్పముభగ్నమయ్యెను. అటుపై విదురుడు లేచియిట్లనెను—

"ఈవికర్ణుడు బాలుడయ్యును నేర్పరించి యథావిధిన్,
దేవమంత్రియుపోవె ధర్మవు దెల్పె నీతని బుద్ధి మీ
రేవగింపక చేకొనుం డిది యెల్లయందును ధర్మస
ద్భావ మొక్కని కేర్పరింపగ బ్రహ్మకైనను బోలునే.

అని పలికి మీరుకూడ జెప్పుడని సభ్యులకు ప్రోత్సహించెను. కాని "దుర్యోధను భయంబున సభ్యు లెవ్వరుం బలుకరయిరి" అప్పుడు కర్ణుడు దుశ్శాసనునితో దాసియైన యీద్రౌపదిని యింటికి జేర్చుమని చెప్పగా నాత డామెను లాగెను. చూడుడు.
"విదురస్య వచ శ్శ్రుత్వా నోచుః కించన పార్థివాః,
కర్ణో దుశ్శాసనం త్వాహ కృష్ణాం దాసీం గృహాన్నయ.
తాం వేపమానాం సవ్రీడాం ప్రలపన్తీం స్మ పాండవాన్,
దుశ్శాసన స్సభామధ్యే విచకర్ష తపస్వినీమ్"
(సభా ప. అ. 68)

అప్పుడు ద్రౌపదీదేవి విహ్వలురాలై సభ్యులారా! నేను ముందు చేయదగిన దేదియో చెప్పుడు. మీకు నమస్కారము.

"తా మిమాం ధర్మరాజస్య భార్యాం సదృశవర్ణజామ్,
బ్రూత దాసీ మదాసీం వా తత్కరిష్యామి కౌరవాః.
అయం మాం సుదృఢం క్షుద్రః కౌరవాణాం యశోహరః,
క్లిశ్నాతి నాహం తత్సోఢుం చిరం శక్ష్యామి కౌరవాః.
జితాం వా ప్యజితాం వాపి మన్యధ్వం మాం యథా నృపాః,
తథా ప్రత్యుక్త మిచ్ఛామి తత్కరిష్యామి కౌరవాః,

ఓకురువంశోద్భవులారా! నన్ను దాసి యని యందురో, కాదని యందురో చెప్పుడు మీరు చెప్పినట్లు నడచుకొందును.

ఈక్షుద్రుడు నన్నధికముగా గష్టపెట్టుచున్నాడు. నేను దానిని సహించుకొనలేకున్నాను. మీరు నన్ను జితురాలని భావించుచుండిరో, అజితురాలని భావించుచుండిరో నిజము చెప్పుడు. మీరు చెప్పినట్లు నే నడచుకొందును. అని ప్రార్థింప భీష్ము డిట్లనియె —

—: ద్రౌపదీప్రశ్నపై భీష్ముని పునఃప్రత్యుత్తరము :—

"ఉక్తవా నస్మి కల్యాణి! ధర్మస్య పరమా గతిః,
లోకే న శక్యతే జ్ఞాతు మపి విప్రై ర్మహాత్మభిః.
బలవాంశ్చ యథా ధర్మం లోకే పశ్యతి పూరుషః,
స ధర్మో ధర్మవేలాయాం భవత్యభిహతః పరః.

టీ— కిమజ్ఞత్వా న్న వివేక్తు మర్హసి, నేత్యాహ బలవానితి. బలవాన్ కర్ణదుర్యోధనాదిర్యద్బ్రూతే స ఏవ ధర్మః, పరస్తు దుర్బలేనోక్తః అభిహతః ధర్మోఽప్యధర్మో భవతీతి భావః.

"న వివేక్తుం చ తే ప్రశ్న మిమం శక్నోమి నిశ్చయాత్,
సూక్ష్మత్వా ద్గహనత్వాచ్చ కార్యస్యాఽస్య చ గౌరవాత్.

టీ— నను బలవత్తర స్త్వమేవ సత్యం బ్రూహీత్యత ఆహ—నేతి. వివేక్తుం వివిచ్య వక్తుమ్. అయ మస్యాశయః— యద్యేతా మజితా ఽసీతి వక్ష్యే తదా న్యాయం వినా పీడ్యమానైషా సద్యః కోపేన కౌరవా న్నాశయేత్, తథాచ ద్రౌపద్యవమానజో వా కురునాశజో వా దోషో

మహానితి సంశయే ధర్మతత్త్వస్య సూక్ష్మత్వా ద్దుర్వివేకత్వం, దేవ కార్య మేవ కౌరవనాశేన భవతీత్యశక్యం, సర్వేషాం వధ్యానా మిహ సంప్రయోగాభావాత్ గహన మిదమ్, పాండవానా మశక్తత్వా త్పరదాసత్వాచ్చ తత్స్వామినాం కౌరవాణాం నాశనం ద్రౌపద్యా అపి దోషాయ, స్వామిస్వామినాశస్య సుతరా మకార్యత్వా దితి హేతుత్రయం వివిచ్యాఽకథనే. ఇతి.

"నూన మన్తః కులస్యాఽయం భవితా న చిరాదివ,
తథా హి కురవ స్సర్వే లోభమోహపరాయణాః.

టీ— నను బలవత్కృతిరేవ ధర్మశ్చేత్. స్వధర్మేణ బలవత్తరాఽహ మేతాన్ శాపాగ్నినా ధక్ష్యే ఇత్యాశంక్యాహ— నూనమితి. అవశ్యభావిని కార్యే న త్వయా తపోవ్యయః కర్తవ్య ఇతిభావః.

"కులేషు జాతాః కల్యాణి వ్యసనై రాహతా భృశమ్,
ధర్మ్యా న్మార్గా న్న చ్యవన్తే యేషాం న స్త్వం వధూః స్థితా.
ఉపపన్నం చ పాంచాలి తవేదం వృత్త మీదృశమ్,
య త్కృచ్ఛ్ర మపి సంప్రాప్తా ధర్మ మేవాఽన్వవేక్షసే."

టీ— ఇద మేవ వృత్తం త్వద్భర్తారోఽప్యాస్థితాః, అత స్త్వమపి తథైవాతిష్ఠస్వేతి ద్యోతయ న్నాహ—కులేష్వితి.

ఈభీష్మవాక్యములలోని గూఢార్థమిది— అమ్మా! నేను వివేచించి చెప్పలేకున్నా నని యిదివరలో జెప్పియే యున్నాను. ధర్మగతి సూక్ష్మ మగుటచే నది యెంతవారికిని దెలిసికొనుటకు శక్యము కాదు. నీ వజ్ఞతచేతనే చెప్పలేకుంటివా? అని యడుగుదువేమో! కాదు. ధర్మాధర్మవిచారణ వచ్చినపుడు కర్ణదుర్యోధనాదిబలవంతులు ధర్మ మని చెప్పినదే ధర్మ మగును. దుర్బలుడు చెప్పినది ధర్మ మయినను అధర్మమైపోవును.

ఐతే నీవు బలవత్తరుడవు గనుక సత్యము జెప్పు మందువా? సూక్ష్మ మగుటవలనను, గహన మగుటవలనను, కార్యగురుత్వమువలనను ఇదమిత్థమని వివేచించి చెప్పలేకున్నాను.

ఇచ్చట భీష్ముని గూఢాభిప్రాయ మిది—ఈమెతో నీవు జితురాలవు కావని చెప్పుదు నేని అన్యాయముగా బీడింపబడిన యీయామె తప్పక వెంటనే కోపముచేత కౌరవులను నశింపజేయును. ఈస్థితిలో నేను చెప్పితినా? కౌరవవినాశజన్యదోషము ఘటించును. చెప్పకుందునా? ద్రౌపద్యవమానజన్యదోషము, ఈరెండుదోషములలో నేది మహాదోషమో నిర్ణయించుట అశక్యము. ధర్మతత్త్వము సూక్ష్మమగుటచేత, అను భావముతో 'సూక్ష్మత్వాత్' అను హేతువును చెప్పెను.

ఒకవేళ, కౌరవవినాశముచే దేవకార్యసిద్ధి యగు ననుకొనుటకైనను వీలులేదు. వధ్యులైనవారందరి సమావేశము సంబంధము ఇచ్చట లేదు. పాండవులా నిరాయుధులు, కనుక నది గహన మను భావముతో 'గహనత్వాత్' అను హేతువును చెప్పెను.

పాండవులు కౌరవులకు దాసులై యున్న యీస్థితిలో కౌరవులు పాండవుల కధిపతు లయి యున్నారు. ఈపరిస్థితిలో తన పతుల కధిపతులై యున్న కౌరవులను నశింపజేయుట, ద్రౌపదీదేవికి గూడ దోషమే అగును. కార్యముయొక్క గురుత్వమట్లున్నది. అనుభావముతో 'కార్యస్యాస్య చ గౌరవాత్' అను హేతువును చెప్పెను. ఇట్లు తాను వివేచించి చెప్పలేకున్నా ననుట కీమూడు హేతువుల నుదాహరించెను. తరువాత, బలవంతుడు చేసినదే ధర్మమైన యెడల స్వధర్మముచే బలవత్తరురాల నైన నేను శాపాగ్నిచే వీరిని దగ్ధముచేయుదు నందువేమో అమ్మా! వినుము. తప్పక వంశనాశనము త్వరలోనే కానై యున్నది. కనుకనే, కౌరవు లందరు లోభమోహపరాయణులైనారు. తప్పక జరిగెడి యీపనిలో నీవు తపశ్శక్తిని వ్యయపరచుకొనవద్దు.

సత్కులప్రసూతులైన నీపతులు చెప్పలేని కష్టములకు పాలై యుండియు, ధర్మమునకు కట్టుపడి యోర్చి యుండుట, అవశ్యము కానై యున్న కౌరవవినాశమునకు మనము వూనుకొను టెందు కనియే. నీవుకూడ వారివలెనే యోర్చియుండుము. ఇంతకష్టమునకు పాలై ధర్మమునే అపేక్షించుచున్న నీచరిత్రము ప్రశంసనీయము. అని.

భీష్ముఁ డిట్లు ద్రౌపది జితురాలు కాదని యెరిగియుండియు నట్లు స్పష్టముగా జెప్పినయెడల ద్రౌపదీదేవివలన వారికి ముప్పు వచ్చితీరు ననియు, నది యావిషమపరిస్థితినిబట్టి తనకు, పాండవులకు, ద్రౌపదికిగూడ దోషావహ మగుననియు, దూర మాలోచించి ద్రౌపదీదేవి యడిగిన ధర్మనిర్ణయమును సందేహాస్పదముగా నుంచి నేను వివేచించి చెప్పలేకున్నా నని ప్రకటించి ఆమె ప్రకోపింపకుండుటకై సందేహావస్థలోనే ఆమెనుంచి నిన్నిట్లవమానించుచున్న కౌరవులకు వినాశకాల మాసన్నమైన దని వెల్లడించి పాండవులూరకున్నట్లు నీవు కూడ ప్రతిక్రియకు బూనుకొనక యూరకుండుట శ్లాఘనీయ మని చెప్పెను. ఆపై—

"ఏతే ద్రోణాదయశ్చైవ వృద్ధా ధర్మవిదో జనాః,
శూన్యైః శరీరై స్తిష్ఠన్తి గతాసవ ఇవానతాః.

అమ్మా! ధర్మవిదులైన యీద్రోణాచార్యాదులు తలలు వంచుకొని నిర్జీవప్రతిమలవలె నున్నారు. అనుచు. తానే కాక ధర్మవిదు లందరు నీయాపదకు దుఃఖితులై యున్నారని చెప్పి.

"యుధిష్ఠిరస్తు ప్రశ్నే உస్మిన్ ప్రమాణ మితి మే మతిః,
అజితాం వా జితాం వేతి స్వయం వ్యాహర్తు మర్హతి"

నీప్రశ్నకు సమాధానముగా నీవు జితురాల వనియో, అజితురాలవనియో చెప్పగలవాడు యుధిష్ఠిరుడే అనిచెప్పెను.

తనకు తీసిపోని దూరదృష్టి కలవాడు యుధిష్ఠిరు డని యెరిగినవాడు కనుక భీష్ముఁ డాతనిమీద బెట్టి యూరకుండెను.
అప్పుడు దుర్యోధనుడు ద్రౌపదీదేవితో నిట్లనెను—

నీప్రశ్నకు సమాధానము నీపతులు భీమార్జుననకులసహదేవులు చెప్పుదురుగాక. నీవిషయమై ధర్మజు డనధికారి. ఆతడట్లు చేయుట అయుక్తము. వారుచెప్పినయెడల నీవుదాస్యమునుండి విముక్తురాలవగుదువు. అని.

అప్పుడు భీమసేనుడు లేచి యిట్లనెను-

"యద్యేష గురు రస్మాకం ధర్మరాజో మహామనాః,
న ప్రభుః స్యాత్కులస్యాస్య న వయం మర్షయేమహి.

టీ యద్యయం నః కులస్య ప్రభు ర్న స్యాత్తర్హి నమర్షయేమ హి
యతోఽయం ప్రభు స్తతో మర్షయామహే ఇత్యర్థః"

"ఈశో నః పుణ్యతపసాం ప్రాణానా మపి చేశ్వరః.
మన్యతేఽజితమాత్మానం యద్యేషవిజితా వయమ్"

టీ. ఈశఇతి. అజితమితి చ్ఛేదః. ద్రౌపదీపణనా త్ప్రాగితి శేషః, యద్యయ
మాత్మాన మజితం మన్యతే, తర్హి వయం పూర్వ మేవ భవద్భి ర్జితా
స్సన్త ఇదానీం విజితాఃద్రౌపద్యర్థేమిథ్యా వాదేన సుతరాం జితా
స్స్మ ఇత్యర్థః. అతో ద్రౌపదీ న దాసభావ మాపన్నేతి భావః.

"నహి ముచ్యేత మే జీవన్ పదా భూమి ముపస్పృశన్.
మర్త్యధర్మాపరామృశ్య ద్రౌపద్యా మూర్ధజా నిమాన్"

టీ. "నన్వజితేనాపి త్వయా కిం స్యా త్తత్రాహ నహీత్యాది"
"పశ్యధ్వం త్వాయతౌ వృత్తౌ భుజౌ మే పరిఘా వివ,
నైతయో రన్తరం ప్రాప్య ముచ్యేతాఽపి శతక్రతుః.
ధర్మపాశసిత స్త్వేవం నాధిగచ్ఛామి సంకటమ్,
గౌరవేణ విరుద్ధశ్చ నిగ్రహా దర్జునస్య చ.

టీ-పాశసితః పాశబద్ధః.

"ధర్మరాజనిసృష్ట స్తు సింహః క్షుద్రమృగా నివ,
ధార్తరాష్ట్రా నిమాన్ పాపా న్నిష్పిషేయం తలాసిభిః.

టీ-తలాసిభిః చపేటాఖడ్గైః.

మాధర్మజుడు మాకందరకును ప్రభువే కానియెడల మేమిట్లు
సహించి యుండబోము. మా కాతడు ప్రభువు గనుకనే యిట్లు సహించి
పడియున్నాము.

మా ప్రాణములకును మా పుణ్యతపస్సులకును ఆతడే ప్రభువు. ద్రౌపదిని పందె మొడ్డుటకు బూర్వము తా నజితుడ నని ధర్మరాజు డనుకొనినయెడల అంతకు బూర్వము జితులమై యున్న మేము ఇప్పుడు ద్రౌపదీవిషయమై మిథ్యావాదము నవలంబించుటచే నింకను జితులమై నట్లే. (జితుడైన ధర్మరాజునిచే పందెముంచబడుటవలన ద్రౌపదీదేవి జితురాలు కాదని భావము.)

నీవు జితుడవు కాకుండిన చేయున దేమని యడుగుదురేమో వినుడు—మరణధర్మము గల మనుజుడు యీద్రౌపదీకేశములను పట్టుకొనిన వాడు జీవించి యుండబోడు. పరిఘలవంటి నా యీ భుజదండము లెట్లున్నవో చూడుడు—ఈదోర్దండముల మధ్య బడిన పురందరుడైన మరణింపవలసినదే. ధర్మపాశబద్ధుడనై యున్న నేను మాధర్మజుని గౌరవమునుబట్టియు, మా అర్జునుని యాటంకమును బట్టియు, సహించియున్నాను. మాధర్మజుడు విడిచిపెట్టినయెడల క్షుద్రమృగములపై సింహమువలె పడి పాపాత్ములగు ధార్తరాష్ట్రులను చపేటలను ఖడ్గప్రహారములచే రూపుమాపుదును. అని. అప్పుడు—

“త మువాచ తదా భీష్మో ద్రోణో విదుర ఏవ చ,
క్షమ్యతా మిద మిత్యేవం సర్వం సంభావ్యతే త్వయి.”

భీమసేనా! నీవన్నది నిజమే. సహింపుము సహింపుము. అని భీష్మద్రోణవిదురులు పలికిరి. అప్పుడు కర్ణు డిట్లనెను.

—: కర్ణుని పున స్సంభాషణము :—

“త్రయః కిలేమే సధనా స్సభాయాం
భీష్మః క్షత్తా కౌరవాణాం గురుశ్చ,
యే స్వామినం దుష్టతమం వదన్తి
వాంఛన్తి వృద్ధిం న చ విక్షిపన్తి.”

టీ—సధనాః సమర్థాః ధర్మోల్లంఘనే ఇత్యర్థః. వృద్ధిం స్వామినో మూలచ్ఛేదనం, నచ విక్షిపన్తి పాపకరణే వ్యాకులాశ్చ న భవన్తి.

"త్రియః కిలేమే త్వధనా భవన్తి
దాసః పుత్రి శ్చాఽస్వతన్త్రా చ నారీ.
దాసస్య పత్నీ త్వధనస్య భద్రే
హీనేశ్వరా దాసధనం చ సర్వమ్."

టీ-దాసస్య పత్నీ హీనేశ్వరా, దాసధనం చ సర్వం హీనేశ్వరం సత్, భద్రే కల్యాణభాజి, తయోరీశ్వరే, ద్వయమపి తత్ న్యసనీయమిత్యర్థః. తథా చ స్మృతిః.-

"త్రియ ఏవాఽధనా లోకే భార్యా దాస స్తథా సుతః.
యత్తే సమధిగచ్ఛన్తి యస్యైతే తస్య తద్ధనమ్" ఇతి.
తథాచ రాజజయేనైవ తత్పత్న్యపి జితైవ, నతు తత్రి అ జితేన జితేన వా పరాజితేతి విమర్శ స్సంభవతీతి భావః.

తమ ప్రభువును దుష్టతముడనుచు ప్రభువు యొక్క మూలచ్ఛేదమును కోరుచు స్వామిద్రోహమునకు జంకని యీ భీష్మద్రోణవిదురులు ముగ్గురును సభయందు సధనులు. అనగా ధర్మోల్లంఘనమునందు సమర్థులు.

దాసుడు, పుత్రుడు, అస్వతంత్రురాలగు పత్ని, అను ముగ్గురును అధనులు. వారికి సొత్తనునది లేదు. అట్టి అధనుడైన దాసుని భార్య ఆదాసుని పాలనలోనిది కాదు. అట్టి దాసుని ధనముకూడ ఆదాసుని పాలనములోనిది కాదు. ఆరెండును ఆదాసునికి పాలకుడైనవానికి సమర్పింపదగినవే. కనుకనే భార్య, దాసుడు,సుతుడు, అనువారికి నాది యనదగిన దేమియు లేదనియు వారు సంపాదించిన దేదియునను వారెవ్వని యధీనములో నుందురో వానికే చెందు ననియు స్మృతి చెప్పుచున్నది. కనుక పతి జితుడైనపుడు పత్ని జితురాలే. కాబట్టి ఈమె పతిజితుడు కాకున్నపుడు జితురాలా? జితుడై యున్నపుడు జితురాలా? అను విమర్శముతో బనిలేదు. అని.

ఇది కర్ణుని తీర్పు, ఈతని వాదములో ధర్మజుడు జితుడు కాకున్నపుడే ఆమె జితురాలైనదని చెప్పబడలేదు. ఆవివాదములోని ప్రధానాంశమే అది. దానినే, విమర్శింపబడలేదని త్రోసివేయుట ధార్ష్ట్యము. ఇంకొకటి పాండవులు దాసులైనారనియు, దాసులకు 'నాది' యనదగిన దేదియు లేదనియు దాసభార్య దాసియే యనియు గదా కర్ణుని నిర్ణయము. అట్లయినచో దాసుడై నాది యనదగినది యేమియు లేక ఆటకట్టుయియున్న ధర్మజునిచే "పణస్వ కృష్ణాం పాంచాలీమ్" అనుచు శకుని, ద్రౌపదీపణము నెందులకు బెట్టించెను? ద్రౌపది యాధర్మజుని సొత్తు కాదే. దుర్యోధనుని సొత్తయిపోయియుండెనే. శకుని పొరపడినాడా? అప్పుడింత ధర్మ మెరిగిన యాకర్ణు డేమయినాడు?

కనుక. వ. సీతారామశాస్త్రిగారి కర్ణచరిత్రలో—

"ధర్మరాజు తనొడ్డిన పిదప ద్రౌపది నోడెను. గాన ద్రౌపది గెలుపు చెల్లనేర దను ప్రశ్నము రాగా, ధర్మరాజాదులందరును దాసులైనపుడు వారిసొత్తగు ద్రౌపదియు దాసి యగుట వింత కానేర దని కర్ణుడు సమాధానమును జెప్పెను. ఈసమాధానము మాత్రము కొంతవరకు సయుక్తికముగా నున్నను ద్రౌపదిని బంధకియనుట యుచితముగా నుండలేదు." (పు 44)

అను వ్రాత పరాస్తము. ద్రౌపది బంధకి యని కర్ణు డనుట యంతయనుచితమో ద్రౌపది గెలుపు చెల్లును. ఆమె దాసియే అనుట కూడ నంత యనుచితమే. అని యీ ప్రతివాదికి తోచకపోవుట చిత్రము.

తాము నిజముచెప్పిన అప్పుడే కౌరవులకు తప్పక ముప్పువచ్చునని దూర మాలోచించి కురువంశక్షేమమును గోరి తత్కాలశాంతికై యత్నించుచు అట్లు దుఃఖాక్రాంతులై పడియున్న భీష్మద్రోణాదులను యుక్తాయుక్తవివేకములేక స్వామిద్రోహు లని తానేమో స్వామి నుద్ధరించువాడనని యసంబద్ధముగా మాటలాడిన కర్ణునిది దుర్నయము. ప్రతివాదులు దీనిని మనస్సులో నుంచుకొనవలయును.

ఆపై కర్ణుడు ద్రౌపదీదేవితో "ప్రవిశ్య రాజ్ఞః పరివారం భజస్వ" నీవు దుర్యోధనుని యింట బ్రవేశించి యాతని భార్యను పాద సంవాహనాదులచే సేవింపుము 'అన్యం వృణీష్వపతి మాశు భావిని' నీవు మఱియొక పతిని వరింపుము. దాసివై యున్న నిన్ను జితులై యున్న నీపతులు మాచే నిషేధింపబడినపుడు సంతోషపెట్టగలవారు కారు. అని పలికి, ద్రౌపదిని పందె మొడ్డిన ధర్మజుడు జన్మపౌరుషపరాక్రమముల సాఫల్యమును భావించినవాడు, అనెను.

ఆకర్ణుని ధోరణి జూచి భీమసేను డుగ్రుడై పెద్ద నిట్టూర్పు విడిచి ధర్మపాశబద్ధుడై యిట్లనెను. ఈ సూతపుత్రుని మాటలకు నేను కోపింపను. ఈతడు దుర్యోధనదాసుడు. ప్రభువు నెట్లో కీర్తించుటే దాసుని లక్షణము. యుధిష్ఠిరప్రభూ! ద్రౌపదిని నీవు పందెమే పెట్టకున్న యెడల శత్రువు లిట్టి దుష్ప్రసంగములు చేయక ందురుకదా! అని. అప్పు డేమియు బలుకకుండిన ధర్మజునితో దుర్యోధనుడు నీసోదరులు నీమాటకే కట్టుబడియుండిరి. కనుక నీవు —

"ప్రశ్నం బ్రూహి బ్రూహి చ కృష్ణాం త్వ మజితాం యది మన్యసే"

ద్రౌపది జితురాలు కాదని తలచెదవేని ప్రశ్న కుత్తరము చెప్పుము. అని పలికి తన తొడపై వస్త్రమును కొంచెము తొలగించి కర్ణునికి ప్రోత్సాహ మిచ్చుచు భీమసేనుని తృణీకరించుచు ద్రౌపదీదేవికి తన యెడమతొడను జూపెను. అప్పుడు—

"భీమసేన స్త మాలోక్య నేత్రే ఉత్ఫాల్య లోహితే,
ప్రోవాచ రాజమధ్యే తం సభాం విశ్రావయ న్నివ.
పితృభి స్సహ సాలోక్యం మాస్మ గచ్ఛే ద్వృకోదరః,
య ద్యేత మూరుం గదయా న భింద్యాం తే మహాహవే."

భీమసేను డాస్థితిని జూచి మండిపడి యెర్రనై యుజ్వలించుచున్న నేత్రములు విప్పి దుర్యోధనుని జూచి నీ యీతొడను గదాఘాతమున యుద్ధభూమిలో విరుగగొట్టనియెడల ఈ భీమసేనుడు ఉత్తర లోకములకు దూరమైపోవు నని చెప్పుచున్నాను. అని యుద్ఘోషించెను.

అప్పుడు విదురుడు, సభ్యులారా! తుదకు ఎంత ఆపద ప్రాప్తించినదో చూడుడు. చెప్పలేనంతటి అవినీతి యేర్పడినది.

"అతిద్యూతం కృత మిదం ధార్తరాష్ట్రా
యస్మాత్ స్త్రియం వివదధ్వం సభాయాం,
యోగక్షేమా నశ్యతో వ స్సమగ్రా
పాపా న్మంత్రా౯ కురవో మన్త్రయన్తి."

టీ—అతిద్యూతం, పణితద్రవ్యమర్యాదా మతిక్రాంతమ్.

ఈకౌరవులు దురాలోచనములు చేయుచున్నారు. ఓధార్త రాష్ట్రులారా! స్త్రీని గూర్చి సభలో నింత అమర్యాదగా మితిమీరి ప్రసంగించుచున్న మీకు యోగక్షేమములు పూర్తిగా నశించుచున్నవి.

"ఇమం ధర్మం కురవో జానతాఽను
ధ్వస్తే ధర్మే పరిష త్సంప్రదుష్యేత్.
ఇమాం చే త్పూర్వం కితవోఽగ్లహిష్య
దీశోఽభవిష్య దపరాజితాత్మా.

టీ—పరిషత్ సభా. సంప్రదుష్యేత్, ధర్మాతిక్రమాదితి శేషః, కితవోయుధిష్ఠిరః అపరాజితాత్మాస౯. పూర్వంచేత్ అగ్లహిష్యత్, పణీకృతవా నభవిష్య త్ర్హి సా భవద్దాసీ స్యాదేవేతి భావః.

"స్వప్నే యథైత ద్విజితం ధనం స్యా
దేవం మన్యే యస్య దీవ్య త్యనీశః.
గాంధారరాజస్య వచో నిశమ్య
ధర్మా దస్మాత్కురవో మాపయాత."

టీ—యస్య యేన ధనే నాఽనీశో దీవ్యతి. తత్ స్వప్నే యథా ధన మాభాసజితం తద్వదిత్యర్థః. "యస్యైతే తస్య తద్ధనమ్." ఇతి స్మృతిస్తు దాసభానేఽర్జితం ధనం స్వామిగామీత్యాహ—నతు తతః ప్రాక్తనమపీతి, మాఽపయాత, మాగచ్ఛత."

ఓ కౌరవులారా! ఈధర్మమును గుర్తింపుడు. ధర్మహాని కలిగినపుడు సభ దూషిత మగును. తాను పరాజితుడు కాకపూర్వము యుధిష్ఠిరుడు ఈ ద్రౌపదీదేవిని పందె మొడ్డియుండెనేని అప్పుడీమె మీకు దాసి కాదగియుండును. పరాజితుడైనవానిచే పణముగా బెట్టబడిన వస్తువు, స్వప్నములో గెల్చుకొనినట్లు కనబడిన వస్తువుతో సమానము. దాసునకు నాది యనదగిన వస్తువనునది లేదనియు, నెవ్వని కాతడు దాసుడో అతనికే ఆదాసుని సొత్తు చెందు ననియు చెప్పెడి స్మృతి, దాసుడైన తరువాత నాతడు సంపాదించిన సొత్తునుగూర్చి చెప్పుచున్నదికాని దాసుడుకాకపూర్వము అతనికున్న సొత్తునుగూర్చి చెప్పుటలేదు. కౌరవులారా! శకునిమాటను విని ధర్మమునుండి తొలగి పోకుడు. అని పలికెను.

అపుడు దుర్యోధనుడు, ద్రౌపదీ! ధర్మజు డనధికారి యని భీమార్జుననకులసహదేవు లందురేని నీకు దాస్యము తొలగిపోగలదు. అని పలుక అర్జును డిట్లనెను—

"ఈశో రాజా పూర్వ మాసీ ద్గ్లహే వః
కున్తీసుతో ధర్మరాజో మహాత్మా.
ఈశ స్త్వయం కస్య పరాజితాత్మా,
త జ్జానీధ్వం కురవ స్సర్వ ఏవ."

మమ్ములను పణముగా బెట్టినపుడు ధర్మజు డధికారియే. పరాజితుడైనతరువాత నధికారి దేని కగునో ఆలోచింపుడు. అని.

ఈవిధముగా ఆదినుండి అంతమువరకు సభను కలచివేయుచున్న ద్రౌపదీప్రశ్న, విదురభీష్మవికర్ణపార్థులచే యుక్తముగా సమాధానము చెప్పబడుచువచ్చిన ద్రౌపదీప్రశ్న, కర్ణదుర్యోధనులచే నయోగ్యములైన ప్రతివచనములు చెప్పబడుచువచ్చిన ద్రౌపదీప ప్రశ్న, 'సాహసప్రశ్న' యని, సమాధానమీయదగిన ప్రశ్న కాదని, అప్పుడెవ్వరును సమాధానము చెప్పనేలేదని, వ్రాసిన ప్రతివా

దుల ధోరణి హేయము. ప్రతివాదు లన్నది యొక్కమాటయే కాని దానిపై జెప్పుట కెంత గ్రంథమైనదో చూడుడు. ఇట్టి సారస్వతద్రోహ మెంతయైన ప్రతివాదులు చేసియున్నారు.

ఆనాడు నిరపరాధులై ధురంధరులై యున్న పాండవులకు దుష్ట చతుష్టయమూలమున ప్రాప్తించినసాటిలేని యాకష్టములు, ఆకష్టము లలో ద్రౌపదీదేవివిషయమై మహాసభలో దుష్టచతుష్టయము చేసిన స్మరింపశక్యముగాని యాదుండగములు, అట్టి దుర్భరావస్థలో ధర్మము నకే కట్టుబడియుండి పాండవులును ద్రౌపదీదేవియు వహించిన ఆలో కోత్తరశాంతి, యెట్టివారిహృదయములనైనను ద్రవింపజేసి వినినంత మాత్రమున శ్రోతలను దుఃఖితలను చేయునట్టివై యుండ నట్టిపరమ పవిత్రులనే దూషింప మొదలిడినవారివి హృదయములా? పాషాణ ములా? శాంతం పాపమ్."

ఇక ప్రకృత్తమునకు వృత్తము—

—: దుష్టచతుష్టయదుర్మార్గములనుబట్టి యుత్పాతములుగోచరించుట, ధృతరాష్ట్రుడు ద్రౌపదీదేవిని పూజించుట :—

"తతో రాజ్ఞో ధృతరాష్ట్రస్య గేహే గోమాయు రుచ్చై ర్వ్యాహర దగ్నిహోత్రే. తం రాసభాః ప్రత్యభాషన్త రాజన్ సమన్తతః పక్షిణశ్చైవ రౌద్రాః॥

తం వై శబ్దం విదురస్తత్త్వవేదీ శుశ్రావ ఘోరం సుబలాత్మజాచ। భీష్మో ద్రోణో గౌతమశ్చాపి విద్వాన్ స్వస్తి స్వస్తీత్యపి చైవాహు రుచ్చైః"

అంతట కురుసభలో వైఖరి యట్లుండ ధృతరాష్ట్రునిగృహ ములో గృహాగ్నిసమీపమున నక్క కూసినట్లువినబడెను. దానిని సం బంధించి గాడిద లరచుట రౌద్రములైన పక్షులు అంతటను కూయుట జరిగెను.

ఉత్పాతరూపమైన ఆఘోరశబ్దమును విదురగాంధారీభీష్మ ద్రోణకృపాచార్యప్రభృతులు విని 'స్వస్తిస్వస్తి' యని యుచ్చైస్స్వరముతో బలికిరి.

"తతో గాన్ధారీ విదురశ్చాపి విద్వాంస్త ముత్పాతం ఘోర మాలక్ష్య రాజ్ఞే! నివేదయామాసతు రార్త వ త్తదా తతో రాజా వాక్య మిదం బభాషే"

అంతట గాంధారియు విదురుడును ఘోరమైన ఆయుత్పాతమును జూచి భయపడి ధృతరాష్ట్రునకు నివేదింపగా నాతడిట్లనెను.

"హతోఽసి దుర్యోధన మన్దబుద్ధే యస్త్వం సభాయాం కురుపుంగవానాం! స్త్రియం సమాభాషసి దుర్వినీత విశేషతో ద్రౌపదీం ధర్మపత్నీమ్"

ఓదుర్యోధన! ఓదుర్వినీత! ఓమందమతీ! నీవు హతుడవై పోతివి. కురుపుంగవులయొక్క నిండుసభలో స్త్రీని విశేషించి ద్రౌపదీదేవిని పాండవధర్మపత్నిని అట్లు మాటలాడుచుంటివి.

పరమపతివ్రతక్ సభకు దపస్విని బాండవధర్మపత్ని ధ
ర్మరత నయోనిజం బ్రకృతిమానవభామినిగా దలంచి దె
ప్పరములు వల్కగా దగునె బాల్యము నాదిగ దుష్టభావనక్
బెరిగితి నీనిమిత్తమున బెద్దయు దుఃఖితులైరి పాండవుల్."

(ఆంధ్రభారతము.)

అని యిట్లు దుర్యోధనుని నిందిచి ద్రౌపదీదేవితో నిట్లనెను—

"వరం వృణీష్వ పాంచాలి మత్తో యదభివాంఛసి'
వధూనాం హి విశిష్టా మే త్వం ధర్మపరమా సతీ.

అమ్మా! నీవు నాకోడండ్రందరిలో నుత్తమురాలవు. నీవుధర్మాత్మురాలవు. పతివ్రతవు. నావలన నీకేమికావలయునో కోరికొనుము, ఇచ్చుచున్నాను. అని.

ఇచ్చట ప్రతివాదుల నొక మాట నడుగుచున్నాము.—

ద్రౌపదీదేవి, కర్ణుడన్నట్లు బంధకి యగునా? ధృతరాష్ట్రుడన్నట్లు పరమపతివ్రతయగునా? మీకిప్పుడైన తెలిసెనా? లేదా? మీకు తెలియు జెప్పుడు; అని.

అప్పు డాధృతరాష్ట్రుని ప్రేరణచే ద్రౌపదీదేవి యిట్లు కోరెను—

ఆ. కరుణతోడ నాకు వరము ప్రసాదింప
బుద్ధియేని లోకపూజితుండు,
మనునిభుండు ధర్మతనయుండు దాస్యంబు
వలన బాయవలయు వసుమతీశ.

వ. .........ఇచ్చితి నింక రెండవ వరంబు వేడు మనిన—

క. నెమ్మని ధర్మజు నలువురు
దమ్ములు దమయాయుధములు తమవర్మవరూ
థమ్ములయు దోడ సకలహి
తమ్ముగ బాయంగవలయు దాస్యమువలనన్.

వ. అనిన ధృతరాష్ట్రుండు నీకోరిన వరంబిచ్చితి నింక మూడవవరంబు వేడు మనిన ద్రౌపది యిట్లనియె—

ఆ. వైశ్యసతికి నొక్క వరము సత్త్రియ
సతికి రెండు శూద్రసతికి మూడు
విప్రసతికి నూరు వేడజన్వరములు
గాన యింక నేడగాదు నాకు.

వ. అనిన ధృతరాష్ట్రుండు కోడలి గుణంబులకు ధర్మం బెరుంగుటకు సంతసిల్లి యనుజసహితుండైన యుధిష్ఠిరు రావించి నీవు సర్వసంపదలు స్వారాజ్యంబును నొప్పుగొని యెప్పటి యట్ల యింద్రప్రస్థపురంబునకరిగి సుఖం బుండుము,

ఈవిధముగ ద్రౌపదీమహాత్మ్యమును గుర్తించిన ధృతరాష్ట్రుడప్పుడు తటస్థించినఉత్పాతములకు బెదరి వరములిచ్చి పూజించెను.

తరువాత ద్రౌపదీసహితులై పాండవులు వెళ్ళునపుడు దుష్ట చతుష్టయము మరల దురాలోచనము చేసి ధృతరాష్ట్రునితో వారి నట్లుపంపినయెడల పగదీర్చుకొనుటకు సేనలతో వచ్చిపడుదురు. వన వాసాజ్ఞాతవాసపణములను పెట్టి మరల ద్యూతము జరిపి వారి నరణ్యాము లకు పంపినగాని మనకు సుఖములేదు. వెంటనే మరల పిలిపింపుము. అని చెప్పుటయు ధృతరాష్ట్రుడు పిలిపింప సిద్ధపడుటయు, గాంధారి దుఃఖించుచు వద్దు వద్దని చెప్పి—

"త్వన్నేత్రా స్సన్తు తే పుత్రా మా త్వాం దీర్ణాః ప్రహాసిషుః
తస్మా దయం మద్వచనా త్త్యజ్యతాం కులపాంసనః."

టీ—త్వన్నేత్రాః త్వమేవ నేతా యేషాం తే త్వన్నేత్రాః దీర్ణాః త్వత్తో భిన్నమర్యాదాః సన్తః ప్రహాసిషుః జీవితత్యాగే నేతి శేషః.

నాథా! నీపుత్రులను నీ యాధిపత్యములో నడుపుము. వారు నీవలన అమర్యాదగా సంచరించి జీవితములకు హాని దెచ్చుకొని నిన్ను విడిచిపోవునట్లు చేయకుము. కులపాంసనుడైన యీ దుర్యోధనుని నామాట విని పరిత్యజింపుము. అని చెప్పుకొనుటయు ధృతరాష్ట్రుడు గాంధారితో—

"అన్తః కామం కులస్యాస్తు న శక్నోమి నివారితుమ్."

కులక్షయము కానిమ్ము! నేను మాత్రము నివారింపలేను. అని చెప్పి పిలిపించుటయు, వారు పితృవాక్యమునకు కట్టుపడి మరల వచ్చి పునర్ద్యూతములో శకునిప్రేరణచేత వనవాసాజ్ఞాతవాసపణములు బెట్టి యోడిపోవుటయు జరిగి వనవాసమునకు వెళ్ళునపుడు దుశ్శాసనుడు ఒడలెరుగని మదముతో ద్రౌపదీ! అరణ్యములకు పాలై నిర్ధనులైన పతులతో నీకేమి సుఖము? "పతిం వృణీష్వేహ యమన్య మిచ్ఛసి" ఇక్కడ నీయిష్టమువచ్చిన మరియొకపతిని గోరికొనుము. ఇత్యాది దుర్భాషలాడెను. అప్పుడు భీమసేను డిట్లనెను—

"ధార్తరాష్ట్రాన్ రణే హత్వా మిషతాం సర్వధన్వినామ్,
శమం గన్తాస్మి న చిరా త్సత్య మేత ద్బ్రవీమి తే.
అహం దుర్యోధనం హన్తా కర్ణం హన్తా ధనంజయః,
శకునిం చాఽక్షకితవం సహదేవో హనిష్యతి.
ఇదం చ భూయో వక్ష్యామి సభామధ్యే బృహ ద్వచః,
సత్యం దేవాః కరిష్యన్తి యన్నో యుద్ధం భవిష్యతి.
సుయోధన మిమం పాపం హన్తాస్మి గదయా యుధి,
శిరః పాదేన చాఽస్యాహ మధిష్ఠాస్యామి భూతలే.
వాక్యశూరస్య చైవాస్య పరుషస్య దురాత్మనః,
దుశ్శాసనస్య రుధిరం పాతాస్మి మృగరా డివ."

యుద్ధములో ధనుర్ధరులందరు చూచుచుండ, ధార్తరాష్ట్రులను వధించి నేను శాంతింతును. ఇది సత్యము. దుర్యోధనుని నేను, కర్ణుని అర్జునుడు, శకునిని సహదేవుడు వధించుట సత్యము. ఇంకొకమాట జెప్పుచున్నాను. దేవతలు మాకు యుద్ధమును ప్రాప్తింపజేయుదురు గాక! ఈపాపాత్ముడైన దుర్యోధనుని యుద్ధభూమిలో గదాఘాతమున బడగొట్టి పాదముతో నెత్తిపై దన్నుదును. పరుషవచనములాడుటలో ఘనుడైన యీదుశ్శాసనుని వక్షస్థలము చీల్చి నెత్తురు త్రాగుదును. అటుపై అర్జును డిట్లనెను—

"నైవం వాచా వ్యవసితం భీమ విజ్ఞాయతే సతామ్,
ఇత శ్చతుర్దశే వర్షే ద్రష్టారో య ద్భవిష్యతి."

భీమసేనా! నిర్ణితాంశము క్రియచే గాని మాటచే దెలిసికొనలేరు. నేటినుండి పదునాలుగవసంవత్సరములో నేమి జరుగునో చూడగలరు. "భీమసేన నియోగా త్తే హన్తాఽహం కర్ణ మాహవే." భీమసేనా! నీయాజ్ఞాప్రకారము కర్ణుని వధించితీరుదును.

ఇట్లు దుష్టచతుష్టయమును బట్టి తీవ్రప్రతిజ్ఞలు చేసి తుద కాప్రతిజ్ఞలను పాండవులు సఫలపరచుకొనినారు. ద్యూతసభలో దుష్ట

చతుష్టయము చేసిన దురంతకృత్యములను సహించియుండుట, పరాజితులమై ధర్మబద్ధులమై యుండుటచేతనేకాని, దుర్బలులమై యుండుట చేత గాదని చాటినారు.

అట్టి పరమపావనులగు పాండవులయొక్కయు, పాండవధర్మపత్నియొక్కయు లోకోత్తరసౌశీల్యమును, ధర్మనిష్ఠను గ్రహింపలేక వారిని నిందించునారియొక్కయు, దుష్టచతుష్టయము నభినందించు వారియొక్కయు లక్షణ మెట్టిదో పాఠకులు గ్రహింతురుగాక.

—: విదురుని హితోపదేశమును తిరస్కరించి ద్యూతసభలో నీవు చేసిన దుష్కార్యముల ఫలితము నీ కిప్పు డనుభవమున కందుకొనిన దని ద్రోణుడు దుర్యోధనుని ఖండలించుట :—

ద్రోణాచార్యుని సైన్యాధిపత్యములో సైంధవుని పార్థుడు వధించినపుడు దుర్యోధనుడు ద్రోణాచార్యునియొద్దకు వెళ్ళి మనసైంధవుడు పార్థునిచే వధింపబడె నని దుఃఖితుడై చెప్పినపుడు ద్రోణు డిట్లనెను—

"యా౯ స్మ తా౯ గ్లహతే తాత శకునిః కురుసంసది,
అక్షా న్న తేఽక్షా నిశితా బాణా స్తే శత్రుతాపనాః.
త ఏతే ఘ్నన్తి న స్తాత విశిఖాః పార్థచోదితాః,
తాం స్తదాఖ్యాయమాన స్త్వం విదురేణ న బుద్ధవా౯.
యా స్తా విజయత శ్చాపి విదురస్య మహాత్మనః,
ధీరస్య వాచో నాశ్రౌషీః క్షేమాయ వదత శ్శివాః.
త దిదం వర్తతే ఘోర మాగతం వైశసం మహత్,
తస్యాఽవమానా ద్వాక్యస్య దుర్యోధనకృతే తవ.
యోఽవమన్య వచః పథ్యం సుహృదా మాప్తకారిణామ్,
స్వమతం కురుతే మూఢ స్సశోచ్యో న చిరా దివ.
యచ్చ నః ప్రేక్షమాణానాం కృష్ణా మానాయ్య తత్సభామ్,
అనర్హాన్తీం కులే జాతాం సర్వధర్మానుచారిణీమ్.
తస్యాఽధర్మస్య గాంధారే ఫలం ప్రాప్త మిదం మహత్,
నోచే త్పాపం పరే లోకే త్వమృచ్ఛేథా స్తతోఽధికమ్.

టీ - నోచేదితి పరలోకేఽధికః పాపినాం క్లేశ ఇహ స్వల్పేనైవ భోగేన నిస్తార ఇతి భావః.

"యచ్చ తాన్ పాండవాన్ ద్యూతే విషమేణ విజిత్యహ,
ప్రావ్రాజయ స్త్వ దారణ్యే రౌరవాజినవాససః.
పుత్రాణా మివ చైతేషాం ధర్మ మాచరతాం సదా,
ద్రుహ్యే తాన్ను నరో లోకే మదన్యో బ్రాహ్మణబ్రువః.
పాండవానా మయం కోప స్త్వయా శకునినా సహ.
ఆహృతో ధృతరాష్ట్రస్య సమ్మతే కురుసంసది,
దుశ్శాసనేన సంయుక్తః కర్ణేన పరివర్థితః.
క్షత్తు ర్వాక్య మనాదృత్య త్వయాఽభ్యస్తః పునః పునః,"

టీ- అభ్యస్తః ఆవర్తితః.

"మయ్యేవ హి విశేషేణ తథా దుర్యోధన త్వయి,
ఆశంసత పరిత్రాణ మర్జునా త్స మహీపతిః.
తన్మాం కి మభితప్యన్తం వాక్శరై రేవ కృన్తసి,
అశక్త స్సింధురాజస్య భూత్వా త్రాణాయ భారత."

(ద్రోణ. అ 151)

దుర్యోధనా! నాడు కురుసభలో ద్యూతసందర్భమున శకుని పడవైచినవి పాండవమర్మభేదకములైన నిశితశరములుగాని, పాచికలు గావు. అవి యీనాడు పార్థప్రయుక్తబాణములుగా పరిణమించి మన లను హింసించుచున్నవి. ఇట్టిస్థితి వచ్చునని దూరదర్శియు నీక్షేమ మును గోరినవాడును మహాత్ముడు నగు విదురుడు నీ కప్పుడు చెప్పినను నీవాతని మాటను త్రోసివేసితివి. ఆమహనీయుని మాటను ధిక్క రించుటచే నీకీఘోరమైన మహావిపత్తు ప్రాప్తించినది. ఆప్తులు సుహృ ద్భావముతో జెప్పిన మంచిమాటలను ధిక్కరించి తనకు దోచినట్లు చేసిన మూఢుడు త్వరలో దురవస్థకు పాలగును.

ఆనాడు మే మందరము జూచుచుండగా ధర్మాత్ము రాలు కుల సతియు నగు ద్రౌపదీదేవిని సభ కీడ్పించి దుర్యోధనా! నీ వేయధర్మ మును చేసితివో దాని మహాఫల మిప్పు డందుకొనినది. అది యిచ్చట నీవిధముగా ననుభవింపబడుచుండెనుగనుక సరిపోయెనుగాని లేకున్న పరలోకములో నది యత్యధికమై యుండెడిది.

ఆనాడు పాండవులను కపటద్యూతముచే నోడించి అజినములు వారిచే గట్టించి వారి నరణ్యములకు బంపివేసిన నీ యధర్మముయొక్క ఫలిత మిప్పు డందుకొనినది.

నాకు పుత్రతుల్యులై యెప్పుడు ధర్మాత్ములే యై యున్న యీపాండవులకు శత్రుపక్షములో నిలిచి వారికి ద్రోహముచేయు టకు నేను సిద్ధపడితిని గాని యిట్టి పని జేయు మరియొక బ్రాహ్మ ణుడు లోకములో నుండునా?

పాండవుల కింతకోపము, ధృతరాష్ట్రసమ్మతిపై కురుసభలో జరిపిన ద్యూతములో నీచేతను, శకునిచేతను, దుశ్శాసనునిచేతను, కర్ణునిచేతను గలిగింపబడినది. విదురుని మాటలను ధిక్కరించి పాండ వులను పీడించుటే నీ కభ్యాసమైపోయినది.

దుర్యోధనా! సైంధవుడు సంహరింపబడె నని నన్నెత్తిపొడుచు టకు జెప్పవచ్చితివా? ఆ సైంధవుడు తన్ను సంహరించుటకు శపథము జేసిన అర్జునునివలన తన రక్షణభారమును నాయందును నీయందును గూడ బెట్టుకొనియుండెను. అట్టిస్థితిలో సైంధవుని సమీపములో నున్న నీవు ఆతనిని రక్షించుట కసమర్థుడవై పోయి సేనాముఖములో నున్నట్టియు, పరితపించుచున్నట్టియు నన్ను మాటలచే గష్టపెట్టెద వేల? అని.

ఈ ద్రోణాచార్యోక్తులలో విదురుని హితోపదేశమును నీవు తిరస్కరించితి వనుటనుబట్టి విదురుని మతమే తన మతమనియు నీది తప్పనుచు హితము జెప్పిన విదురుము తిరస్కరింపబడినట్లు తానుగూడ

తిరస్కరింపబడుదు ననియే నాడు భావించి యూరకుండె ననియు తెలుపబడినది. ఆపై ద్రౌపదీదేవినిగూర్చి దుష్టచతుష్టయముచేసిన తుంటరిపనులను, పాండవులను కపటముచే నోడించి యరణ్యములకు బంపిన తుంటరిపనులను గర్హించినట్లు స్పష్టము.

ఇట్లున్నందున నాడు ద్యూతసభలో చెలరేగిన దుష్టచతుష్టయముయొక్క దుర్మార్గములకుగాని, ద్రౌపదీప్రశ్నకుగాని, మందలింపు మాటలను సమాధానవాక్యములను చెప్పుచునేయున్న విదురుని ధిక్కరించుచున్న దుష్టులు, తాము చెప్పినను అట్లే చేయుదు రని గ్రహించి మానధనులైన భీష్మాదులలో భీష్ముడు గూఢముగ ద్రౌపదికి చెప్పెను. ద్రోణుడు ఖిన్నుడై అప్పు డనక యుద్ధసమయములో దుర్యోధనునితో నా డనవలసిన దంతయు అనెను.

కనుక, ద్యూతసభలో భీష్మద్రోణాదులు దుష్టచతుష్టయచర్యను హర్షించియే ద్రౌపదీప్రశ్నకు సమాధానము చెప్ప లేదన్నట్లు ప్రతివాదులు వ్రాయుట దుర్నయము.

గ్రంథసందర్భ మెట్లున్నదో ప్రతివాదుల వ్రాత లెట్లున్నవో సారస్వతమున కెంతద్రోహము జరిగినదో లోకమున కెంత హాని కలిగినదో ప్రాజ్ఞులు కనిపెట్టుదురుగాక.

—: "నలు డోడినపుడు అధర్మ మని దమయంతి యనినదా? ద్రౌపది యట్లనినది కాని" అను ప్రసంగము—తన్నిరాకరణము :—

"ధర్మజుం డానాడు ద్రౌపది నోడుచో ధర్మేతరంబని తన్వి పలికె
జూదంబునాటికి సుదతి ధర్మజునకు యర్ధాంగియై యలరారుచుంట
మరచెనో పతియయ్యె,మహిగోలుపోవంగధర్మజుభర్తగాదలపబోదొ
ధర్మంబు గాదంచు దమయంతిబలికెనేతనపతియోడజూదంబునందు
శ్రీరామచంద్రుని సీత వెన్నంటదేఘోరకాననమందు గ్రుమ్మరిల్ల
లేమచంద్రమతిహరిశ్చంద్రుతోనేగుటన్యాయమంచుదాననిమెన్నొ

ఇది సుయోధనవిజయకర్త వ్రాత. ఈకవికి మరియొకసారిచెప్పు చున్నాము. ధర్మజుడు ద్రౌపదినోడుట ధర్మేతరమని యామె యనలేదు. ముందు తనన్నోడిపోయియున్న ధర్మజుడు — పిమ్మట ద్రౌపది నొడ్డుట కధికారి కానేరడన్నది. ఆత్మపరాజయాంతమే ద్యూతము గనుక పరాజితుడు పందె మొడ్డుట అధర్మమన్నది. ఆయనుట– పరాధీనుడై పరులయాజ్ఞకు బద్ధుడై మెలగవలసిన ధర్మజుని గూర్చి కాదు. అట్టి ధర్మజునికి ద్రౌపదినొడ్డుమని యాజ్ఞాపించినవానినిగూర్చి.

కనుక ద్రౌపదీదేవి జూదమునాటికి ధర్మజున కర్ధాంగి యగుటను మరువలేదు. సర్వస్వ మోడిపోయిన ధర్మజుని భర్తగా దలపకపోలేదు. ధర్మజుడు తనకంటె ముందుగా ద్రౌపది నొడ్డి యోడినచో ద్రౌపదీదేవి మారుపలుకునా? ధర్మజుని సోదరులు మారుపలికిరా?

జూదములో నోడిన తనపతియైన నలమహారాజును దమయంతి యట్లన్నదా? అందురా! ఆనలమహారాజు ధర్మజునివలెతన్నుముందోడెనా? యాపై తనపత్నియగు దమయంతినొడ్డియోడెనా? అని కవిని మేమడుగుచున్నాము. ద్రౌపదీదేవియన్నట్లు దమయంతి యనకుండుటకు ద్రౌపదీదేవికిగలిగిన పరిస్థితి దమయంతికి గలుగకుండుటే కారణమని తెలుపుచున్నాము.

శ్రీరామచంద్రుని సీతవెన్నంటి ఘోరకాననమందు గుమ్మరిల్లలేదా? అందురా? 12 సంవత్సరములరణ్యవాసము, 1 సంవత్సరమజ్ఞాతవాసము అష్టకష్టములకు పాలై పాండవులను వెన్నంటిచేసినది ద్రౌపదీదేవి కాదా! అని మేము కవి నడుగుచున్నాము.

హరిశ్చంద్రునితో నేగుటన్యాయమని చంద్రమతి యన్నదా? అందురా? పాండవులతో నేగుట అన్యాయమని ద్రౌపదీదేవియన్నదా? యని మేము కవి నడుగుచున్నాము.

ఇంకను కవి వ్రాతయిట్లున్నది.—

"తన్నోడి నన్నోడ ధర్మంబు గాదని ద్రౌపదియనుటయధర్మమెందు సంన్యాసికిని జూదనకు నోడిపోవబడినవానికిని యిది తనది యనెడి యధికారమావంతయైన నుండదనుట జగమెరిగినట్టి సత్యమయ్యే లేమ చంద్రమతి హరిశ్చంద్రుడమ్మగా చంద్రమతికి నెట్టి శాస్త్రసమ్మతంబైన నధికారధర్మంబు లేమియు నేరీతి సుతునిలోహితునిగొంచు బోవంగ జాలెనో పూబోడినారీతి ధర్మజుం డోడంగదగునుగాన నువిదవైచిన ప్రశ్నముత్తమదాంపత్య లక్షణమందున లక్ష్యమెంచి చూచుచో నదియెల్ల చోద్యమై యప్రస్తుతంబు నై మరియు
సంభ్యంబునగుచు
నుండెడు గావున నువిదపతివ్రతయని చెప్పసాహసంబగును నెపుడు"

ఈకవి నడుగుచున్నాము— తన్నోడి నన్నోడధర్మంబుగాదని ద్రౌపదియనుట అధర్మమా! ఎందుచేత? సంన్యాసికిని జూదనకును ఓడిపోవబడినవానికిని యిదినాది యనెడి యధికారము లేదని జగద్విదితము గనుకనా? దానినిబట్టి ఓడిపోబడిన ద్రౌపది మరుమాటాడరాదు గనుకనా? ఐతే ద్రౌపది యోడిపోబడుట స్థిరపడినపుడు ఈకవిమాట చెల్లునేమో, అదిస్థిరపడుట, ఆ ద్రౌపదినొడ్డినధర్మజునియధికారముమీద నాధారపడియున్నది. ఆధర్మజుడు అప్పటికోడిపోబడినవాడును, జూదనయునై యున్నవాడును. అట్టివానికి ద్రౌపదినొడ్డుట కధికారము లేదని, నాది యనదగిన దాతని కేమియు లేదని కవి చెప్పిన న్యాయమే ధ్రువపరచుచున్నది. ఇట్టిస్థితిలో ద్రౌపది నొడ్డుట కనధికారియై యున్న ధర్మజునిచేత ద్రౌపదిని పణముబెట్టించుకొని గెల్చుకొనినా మనుకొని యామెచే దాసీకృత్యములు చేయింపదలచుకొని హద్దుమీరి సంచరించినవారి దధర్మమని ద్రౌపదీదేవి యనుట యధర్మమయ్యెనా? అధర్మమును అధర్మమని పలుకుట, అధర్మమనిపించిన కవిది యెంత అధర్మస్వభావమో, హరిశ్చంద్రుడమ్మగా చంద్రమతి మరుమాటా

డకుండ కుమారుని వెంటబెట్టుకొని వెళ్ళినదట! హరిశ్చంద్రునివలె ధర్మరాజు ద్రౌపది నొడ్డి యోడవచ్చునట! ఆమె చంద్రమతివలె మాటాడక వెళ్ళి కౌరవులకు దాస్యము చేయవలయునట!

ఆహా! ఓడిపోబడి బానిసయైన ధర్మజున కధికారముండ దన్న ట్లొక మూలచెప్పుచు నట్టిధర్మజుడు హరిశ్చంద్రునివలె ద్రౌపది నొడ్డ వచ్చుననుట విరుద్ధము. హరిశ్చంద్రుడు ముందుగా తనభార్యను అమ్మి యాపై తాను చండాలున కమ్ముడైనాడు. ధర్మజుడు ముందు తనోడి యాపై తన భార్య నోడినాడు. హరిశ్చంద్రు డెట్లనుకొనెనో క్రమము చూడుడు—

"రాజ్యనాశ స్సుహృత్త్యాగో భార్యాతనయవిక్రియః,
తత శ్చండాలతా చేయ మహో! కష్టపరంపరా."

(దేవీభా. స్క-7 అ24)

కనుక ధర్మజుని వ్యవహారము హరిశ్చంద్రుని వ్యవహారము వంటిది కాకపోయినది. అందుచే చంద్రమతివలె మాటాడకుండుటకు ద్రౌపదీదేవికి వీలులేక వారు చేసిన దధర్మమా కాదా? అని ప్రశ్నింప వలసివచ్చి ఆమె ప్రశ్నించినది. అది యాదినుంచి యంతమువరకు సభను కలచివేసిన ప్రశ్న. అది శకునిప్రభృతులకు మూకీభావము గలిగించిన ప్రశ్న. ఆమె ప్రశ్న అప్రస్తుతము కాదు. ఈకవి వ్రాత అట్టిది. ఆమె ప్రశ్న అసభ్యము కాదు. ఈకవి వ్రాత అట్టిది. ఆమె పతివ్రత కాదనువారు మతిలేనివారు.

ఆపుణ్యాత్ముల సచ్చరిత్రములేమి? ఈవిమర్శకనామధారుల అసంబద్ధప్రలాపము లేమి? ఔరా! ఎంత దుష్కాలము?

ఇంతటితో నీవిషయమును విడిచిపెట్టి విషయాంతర మందు కొనుచున్నాము.

—: "కర్ణునితో శ్రీకృష్ణుడుచెప్పిన మాటలనుబట్టి ద్రౌపది యన్యు లను గూడ బొందుటకు సిద్ధముగనే యున్నది"—
అనుప్రసంగము—తన్నిరాకరణము :—

సుయోధనవిజయము—తొలిపలుకులో నిట్లున్నది—

"మరియు నీమె గుణముల నుగ్గడించుట కిక నొక్క యుదాహరణ మిచ్చెదను. శ్రీకృష్ణుని రాయబారము వ్యర్థమై వెడలిపోవు చున్నప్పు డితడు కర్ణుని బిల్చి పూర్వవృత్తాంత మెఱింగించి ఏను నిన్ను సామ్రాజ్యంబునకు నభిషిక్తుం జేయుదు. మహీచక్రం బేలు మని చెప్పి—

క. పాంచాలరాజపుత్రియు
నంచితమున నిన్ను బొందు నాఱవవరుసన్
సంచితపుణ్యుడ వీవొక
యించుకయును వేఱుసేయ కేతె మ్మెలమిన్.

అని ప్రార్థించినాడు. దీనివలన ద్రౌపది యేవురు భర్తలనే కాక అధికభర్తలబడయుటకు సిద్ధముగనేయున్నదని తేలినది"(పుట౪౫)

ప్రతివాదులు చూపిన యీవిషయము ఎక్కడనో కర్ణునితో శ్రీకృష్ణుడు చెప్పిన విషయము. ఆపై క్రియాశూన్యమైన విషయము. వానిని తీసికొని, యేపాప మెఱుగని ద్రౌపదీదేవియందు— వెనుకటి ద్యూతసభలో దురంతముగా సంచరించిన కర్ణుని విషముగా జూచు చున్న ద్రౌపదీదేవియందు—

ఆ. కర్ణు నగవు లోకగర్హితుండగు దుస్స
సేను చెయిది కంటె శిఖయపోలె
నడరి నామనంబు నతిదారుణక్రియ
నేర్చుచున్నయది మహీధరుండ. (ఆంధ్రభారతము)

అని కర్ణునిగూర్చి శ్రీకృష్ణునితో జెప్పుకొనిన ద్రౌపదీదేవి యందు దురభిప్రాయముతో ప్రతివాదులు దోషారోపణము చేయ

బూనుట మహాపాపము. ఆవిధముగా శ్రీకృష్ణుఁడప్పు డేకర్ణునితో మాటలాడెనో ఆకర్ణుఁడు, నాడు ద్రౌపదీదేవిని జుట్టుపట్టుకొని సభ కీడ్చి గంజి దాసి యని దూషించిన దుశ్శాసనుని ఘోరకృత్యమున కభినందించుచు పకపకలాడిన కర్ణుడు. ఆ నిండుసభలో ద్రౌపదీదేవిని బంధకి (జారిణి) యని దూషించిన కర్ణుడు. ద్రౌపదీదేవిని వివస్త్రను జేసినను తప్పులేదని పలికిన కర్ణుడు. ద్రౌపదీదేవిని వివస్త్రను జేయుమని దుశ్శాసనుని ప్రోత్సహించిన కర్ణుడు. ద్రౌపదీవస్త్రాపహారణమహాకార్యమందు దుశ్శాసనుని ప్రవర్తింపజేసిన కర్ణుడు. సంధి జేయదలచి వెళ్ళి కురుసభలో మహర్షిగణసముక్షమున ప్రసంగించుచున్న శ్రీకృష్ణుని వెనుకటికిక్షణములో బంధింపవలె నని దురాలోచనముచేసిన దుష్టచతుష్టయములో నొకఁడైన కర్ణుడు.

అట్టికర్ణునితో నావిధముగా మాటలాడిన శ్రీకృష్ణుడు, వనవాసక్లేశ మనుభవించుచున్న ద్రౌపదీపాండవులను జూచుటకై యాదవులతో గూడ వెళ్ళినపుడు ఆపాండవుల నోదార్చుచు.

"దుర్యోధనస్య కర్ణస్య శకునేశ్చ దురాత్మనః,
దుశ్శాసనచతుర్థానాం భూమిః పాస్యతి శోణితమ్." (వన. అ 12)

క. అని గర్ణశకునిదుర్యోధనదుశ్శాసన నవాస్రధారాపాతం
బున దృప్తి నొందు వసుధాంగన రాక్షసకాకగృధ్రగణములతోడన్
(ఆంధ్రభారతము)

అనుచు కర్ణప్రభృతిదుష్టచతుష్టయముయొక్క రక్తముచే రణభూమి తడుపబడునని పలికిన శ్రీకృష్ణుడు. పూర్వము సంజయురాయబారములో సంజయుడు, నేనువెళ్ళుచున్నాను. నీసందేశమును చెప్పుమని కోరనపుడు ధృతరాష్ట్రాదులతో నీయీవిధముగా జెప్పవలసినదని చెప్పుచు—

"ఋణ మేత త్ప్రవృద్ధం మే హృదయా న్నాపసర్పతి,
యద్గోవిన్దేతి చుక్రోశ కృష్ణా మాం దూరవాసినమ్."
(ఉద్యో. అ 59)

టీ॥ వస్త్రాపహారణకాలే గోవిందేతి చుక్రోశ తద్వస్త్రమా
త్రేణ తస్యాక్రోశస్య ఋణం న పరిహృతం, కిన్తు కౌరవాణా
ముచ్ఛేదం వినా తద్హృదయా న్నాపసర్పతీత్యర్థః."

సంజయా! నాడు ద్యూతసభలో ద్రౌపదీదేవి తనవస్త్రాపహా
రణసందర్భములో గోవిందా! రక్షింపుమని యెక్కడనో ఉన్న నన్ను
తలచుకొని యాక్రోశించినది. అందుచే నే నామెకు ఋణపడియు
న్నాను. అది నాటి వస్త్రప్రదానమాత్రమున తీరలేదు. కౌరవోచ్ఛేద
మునగాని యారుణబాధ నాకు తీరునది కాదు. అని యాకర్ణదుశ్శాస
నాదులు వధింపదగిన దురాత్ము లని యాద్రౌపదీదేవి సమక్షములోనే
తన హృదయమును సంజయునకు వెల్లడించిన శ్రీకృష్ణుడు. రాయబా
రిగా తాను వెళ్ళినపుడు తన మాటలు చెవిని బెట్ట రాదుష్టు లని
ముందే చెప్పిన విదురునితో, అకార్యముల కొడిగట్టినవానితో తన
జుట్టుపట్టుకొని యాతడు కొట్టునంతవరకు మిత్రుడు చెప్పుచుండవలసి
నదే యని చెప్పి, తాను చెప్పలేదని మూఢలోకమనిపోవునని తన
ధర్మము నిర్వహించుటకై ఆదుష్టులకు జెప్పబూనిన శ్రీకృష్ణుడు,
ఆదుష్టులు తనమాటలను చెవినిబెట్టక సభనుండి లేచిపోయి తనను
బంధింప దురాలోచనము చేసి ధృతరాష్ట్రుడు పిలిపింప మరలవచ్చి
యున్నపుడు ఆదుష్టులు తబ్బిబ్బై నిస్తేజస్కులై తమ దుస్సంకల్ప
మును సాగింపలేమని భావించుటకును, తన సర్వేశ్వరత్వమును చాటు
టకును విశ్వరూపమును ప్రదర్శించిన శ్రీకృష్ణుడు. ఇట్టి శ్రీకృష్ణుడు అట్టి
కర్ణునితో అట్టి ద్రౌపదీదేవినిగూర్చి చెప్పినది యామాట, దానిచే
ద్రౌపదిగుణ మెట్టిదో ప్రతివాదులకు దెలిసినదట!
శ్రీకృష్ణుడప్పుడు కర్ణునితో జెప్పినమాట లివి—

"కానీనశ్చ సహోఢశ్చ కన్యాయాం యశ్చ జాయతే,
వోఢారం పితరం తస్య ప్రాహు శ్శాస్త్రవిదో జనాః."

టీ॥ కానీనో ద్వివిధః సహోఢః వివాహాదూర్ధ్వం జాతః వివా

హా త్వాం గ్రాతశ్చ తన్మాతు ర్యోధారం తస్య పితరం ప్రాహుః.
"సోఽసి కర్ణ తథా జాతః పాండోః పుత్రోఽసి ధర్మతః."

నీవు కుంతీదేవికి సూర్యానుగ్రహమున కన్యాదశయందు బుట్టినవాడవు. కన్యాసుతుడు ఆకన్యను వివాహముజేసికొనినవానికే చెందునని శాస్త్రనిర్ణయము. ఆవిధమున నీవు పాండుపుత్రులలో జ్యేష్ఠుడవైతివి.

నీవు వచ్చినయెడల పాండవులు నీకు రాజ్యమిచ్చివేయుదురు.
"షష్ఠే త్వాం చ తథా కాలే ద్రౌపద్యుపగమిష్యతి."
ద్రౌపది నిన్నారవవానినిగా భావించును. అని.

దీనిపై కర్ణుడిట్లు పలికెను—
"కన్యా గర్భం సమాధత్త భాస్కరా న్మాం జనార్దన,
ఆదిత్యవచనా చ్చైవ జాతం మాం సా వ్యసర్జయత్.
సోఽస్మి కృష్ణ తథా జాతః పాండోః పుత్రోఽస్మి ధర్మతః,"
(ఉద్యో. అ. 141)

శ్రీకృష్ణా! నీవు చెప్పినది నిజమే. సూర్యునివలన కని సూర్యోపదేశముననే, పుట్టినతోడనే నన్ను ఆమె విసర్జించినది. కుంతీదేవి నన్ను విడిచివేయుటవలన నేను సూతకులమునకు జేరి రాధా, అధిరథుడు అను దంపతులచేత బోషింపబడి వారినే తల్లిదండ్రులుగా భావించి వారిచేతనే పుత్రప్రేమతో పెంచి వివాహాదులు చేయబడి ఆకులమునకు జెందిన కన్యలను పెండ్లాడి పుత్రులను పౌత్రులను గని యున్నట్టివాడను, దుర్యోధను నాశ్రయించి పదమూడుసంవత్సరములు నిష్కంటకముగా రాజ్యభోగము లనుభవించినవాడను. ('మయా త్రయోదశ సమా భుక్తం రాజ్య మకంటకమ్.')

'మాం చ కృష్ణ సమాసాద్య కృతశ్శస్త్రసముద్యమః. దుర్యోధనేన'

నన్ను జూచుకొనియే దుర్యోధనుడు పాండవులమీద కత్తిగట్టినాడు. అందుచేతనే నేనర్జునునిపై వైరము వహించినాను. నేనర్జునునితో యుద్ధముచేయకున్నయెడల అపకీర్తికి పాలై పోవుదును.

"అసంశయం హితార్థాయ బ్రూయా స్త్వం మధుసూదన,
సర్వం చ పాండవాః కుర్యు స్త్వద్వశిత్వా న్న సంశయః.
మన్త్రస్య నియమం కుర్యా స్త్వ మత్ర మధుసూదన,
ఏత దత్ర హితం మన్యే సర్వం యాదవనన్దన."

టీ-మన్త్రస్య 'కర్ణః కున్తీసుతః' ఇత్యేవంవిధస్య అపవా ర్గుప్తపరిభాషణస్య నియమం గోపనం యుధిష్ఠిరేఽప్రకాశన మితి యావత్."

"యది జానాతి మాం రాజా ధర్మాత్మా సంయతేన్ద్రియః,
కున్త్యాః ప్రథమజం పుత్త్రం న స రాజ్యం గ్రహీష్యతి.
ప్రాప్య చాపి మహ ద్రాజ్యం తదహం మధుసూదన,
స్ఫీతం దుర్యోధనాయైవ సంప్రదద్యా మరిన్దమ.

టీ-అధర్మిష్ఠస్య దుర్యోధనస్య రాజ్యం లోకనాశకర మితిభావః.
"స ఏవ రాజా ధర్మాత్మా శాశ్వతోఽస్తు యుధిష్ఠిరః"

(ఉద్యో అ141

శ్రీకృష్ణా! నీవు నాహితము గోరి చెప్పినమాట నిస్సంశయమైనదే. నీవు చెప్పినట్లు పాండవులునాపట్ల వర్తించుటయునిజమేలుకాని. కర్ణుడు కుంతీసుతుడు అను రహస్యమును యుధిష్ఠిరునకు దెలియనీయవద్దని కోరుచున్నాను. ఈరహస్యమును నాతడు తెలిసికొనినయెడల తానురాజ్యమును స్వీకరింపక నాకే యివ్వబోవును. నాకు రాజ్యము ప్రాప్తించినయెడల నేను దుర్యోధనున కివ్వవలసినదే. దుర్యోధనునకు రాజ్యప్రాప్తి లోకానర్థకరము. ఆధర్మాత్ముడైన యుధిష్ఠిరుడే శాశ్వతముగా రాజ్యపాలకుడై యుండుగాక. సర్వక్షత్త్రియసంహారహేతువైన రణయజ్ఞము జరుగనై యున్నది. అని చెప్పుచు ఆయజ్ఞస్వరూపమును వర్ణించెను. ఇదె శ్రీకృష్ణుడు నీవటువచ్చిన పాండవులు నీకే రాజ్యమిచ్చెదరని చెప్పినమాటపై యిష్టపడక తాను రానను చు నింతవరకు జెప్పెను.

ఈపై కర్ణుడీమాట జెప్పెను—

"య దబ్రువ మహం కృష్ణ కటుకాని స్మ పాండవాన్,
ప్రియార్థం ధార్తరాష్ట్రస్య తేన తప్యే హ్యకర్మణా.

శ్రీకృష్ణా! నేను దుర్యోధనప్రీతికై పాండవులనుగూర్చి యేదు రుక్తులు పలికితినో ఆదుష్కార్యమునకు పరితపించుచున్నాడను.

"యదా ద్రక్ష్యసి మాం కృష్ణ నిహతం సవ్యసాచినా,
పున శ్చితి స్తదా చాస్య యజ్ఞస్యాథ భవిష్యతి"

అర్జునునిచే హతుడ నైన నన్ను నీవెప్పుడు చూచెదవో అప్పుడు రణయజ్ఞములో చయన మయినట్లు. అని పలికెను.

పాండవులను గూర్చి దుర్భావ లాడినందుకు పరితపించుచు న్నాను. అని శ్రీకృష్ణునితో కర్ణుడన్నది ద్రౌపది నిన్నారవవానినిగా భావించునని పలికిన శ్రీకృష్ణుని రెండవమాటపై చెప్పిన విషయమై యున్నది. అట్లుకానియెడల నీవు పాండవులనుగూర్చి దుర్భావలాడి తివే యని శ్రీకృష్ణు డనవపుడు పాండవులనుగూర్చి దుర్భావలాడినం దుకు నేను పశ్చాత్తాపపడుచున్నా నని అప్పుడప్రస్తుతవిషయమునెత్తు కుని కర్ణుడనవలసిన పని యేమున్నది?

ద్రౌపది నెత్తుకొని శ్రీకృష్ణుడనగా పాండవులనెత్తుకొని కర్ణుడ నుటేమనగా నాడు ద్యూతసభలో పాండవధర్మపత్ని యగు ద్రౌపది ననుట పాండవుల ననుటే కాదా! కర్ణుడప్పు డేమనెను.

ఈమెను వివస్త్రను జేసినను తప్పులేదనెను. బంధకి (జారిణి) యనెను. దాసియనెను. ఈమెను వివస్త్రనుజేయు మనెను. మేమునిషే ధించినపుడు నిన్ను పాండవులు సంతోషపెట్టలేరు కనుక నీవు మరి యొక భర్తను పరిగ్రహింపుమనెను.

ఇట్లనిన కర్ణునకు బుద్ధిచెప్పుటకే శ్రీకృష్ణుడు కర్ణుని యొద్ద ద్రౌ పదీదేవిమాట నావిధముగా నెత్తుకొనెను. పాండవులను కటూక్తులాడితి వని కర్ణుడన్నది ద్యూతసభలోని విషయము. అప్పుడు ప్రత్యేకము పాం

డవులను సంబోధించి కర్ణుడనలేదు. అదంతయు పాండవమర్మభేదకముగ ద్రౌపదిని సంబోధించియే కర్ణుడనెను. కనుకనే శ్రీకృష్ణుడు తెచ్చిన ద్రౌపదీప్రసక్తిని వినునప్పటికి అదంతయు తనకు స్మృతికిరాగా "స్వరూపవ్యాకీర్త్యైవ పరాకీర్త్యా" అను న్యాయమునతన్నెత్తిపొడుచుటకే శ్రీకృష్ణుడామె మాట నావిధముగా నెత్తుకొనెనని గ్రహించియే కర్ణుడు సిగ్గుపడి ఆమె మాటను తలపెట్టలేక పాండవులను దుర్భాషలాడి పొరపాటు చేసినా నని చెప్పుకొనెను.

లేకున్న కౌరవపక్షమును తాను విడిచివచ్చుట తన కధర్మమని యపకీర్తి యని చెప్పిన కర్ణుడు శ్రీకృష్ణుడు తెచ్చిన ద్రౌపదీప్రసక్తి తన కధర్మమని అపకీర్తి యని కంఠోక్తిగా చెప్పకుండునా? నాతో నీవిట్టి దుష్టప్రసంగమును చేయవచ్చునా? నీకిది తగునా? ఇది యసభ్యముకాదా? అని యాశ్రీకృష్ణునన కుండునా?

ఆమాటకు శ్రీకృష్ణుని తాత్పర్య మదికాదుకనుకనే కర్ణుడు సిగ్గుపడి కిక్కురు మనకుండెను.

అది తనదోషోద్ఘాటనమునకు శ్రీకృష్ణుడనియుండెనని తెలిసికొనియే తాను సిగ్గుపడి క్షమాపనమార్గమున భంగ్యంతరముగా నది నాపొరపాటని వెల్లడించెను. ఆపై నాటి తన దుర్నయమునకు క్రుద్ధుడై తనను వధింప ప్రతిజ్ఞ జేసిన అర్జునునిచే గలుగబోవు తన మృతినిగూడ స్పష్టీకరించెను. కర్ణుడింత పశ్చాత్తాపమును శ్రీకృష్ణునియొద్ద వెలుబుచ్చుటకు ఆశ్రీకృష్ణుడు కర్ణునియొద్ద తెచ్చిన ద్రౌపదీప్రసక్తియే కారణ మనక తప్పదు. శ్రీకృష్ణుని ఆద్రౌపదీప్రసంగముతో ఆకర్ణునకు, తాను వెనుక ద్రౌపది నాడిన దుర్భాషలు, ఆదుర్భాషలు విని పార్థుడు తన్ను వధింప జేసి యున్న ప్రతిజ్ఞ స్మృతికి వచ్చినందున పశ్చాత్తప్తుడై దానికి సూచకముగా పార్థుని చేతిలో తనకు మరణము తప్పదనికూడ వెల్లడించెను.

ఇట్టి యీకర్ణుడు ఇంతకు బూర్వము కురుసభలో శ్రీకృష్ణునే బాధింప దలపెట్టినవారిలో నొకడు. అట్టివాడు శ్రీకృష్ణసమక్షములో నసహాయుడై యుండి తన పశ్చాత్తాపమును ప్రకటించినాడు. దీనినిబట్టి దుష్టసంగత్యమునుబట్టి వచ్చినదే కర్ణుని దుష్టత్వ మనియు, స్వాయముగా గుణగ్రాహి యనియు తెలియుచున్నది. కర్ణుని యీస్వభావమును గ్రహించియే కృష్ణభగవానుడు విడిగా కర్ణునితో మాటలాడి కర్ణునిప శ్చాత్తాపప్రకటనవాక్యములమున ద్రౌపదీదేవి పవిత్రతను జగద్వి దితము చేసెను.

కర్ణునియొద్ద ద్రౌపదీప్రసక్తి నట్లు తెచ్చుటలోని శ్రీకృష్ణుని భావము కర్ణుని మందలించుటే కాక ద్రౌపదీదేవి పంచపతిత్వము యొక్క పవిత్రతాప్రకటనముగూడ నయియున్నది. ఆనాడు కర్ణుడు పంచభర్తృకగనుక ద్రౌపది బంధకి యనినాడు. మఱియొకభర్తను కట్టు కొమ్మనినాడు. దానికి జవాబుగా నిన్ను ఆరవవానినిగాగూడభావించునని శ్రీకృష్ణుడనియున్నాడు. దాని తాత్పర్య మేమనగా. ఆమె పంచపతి త్వము నీవనుకొనునట్లు దూష్యమైనది కాదు. ఆమె పంచపతిత్వము ప్రతిదినకన్యాత్వవరపవిత్రీకృతము. ఆమె సామాన్యమానవస్త్రీ కాదు. స్వర్గలక్ష్మి. ఆమె శుక్లశోణితసంబంధమున జన్మింపలేదు. వేదీమధ్య మునుండి అయోనిజయై యువతిగా అద్భుతరూపముతో ఆవిర్భవించి నది. ఆమె కాపంచపతిత్వము ఈశ్వరవరముచే పూజ్యమేకాని నిషి ద్ధముకాదు. అని యాకర్ణుని మనస్సునకు స్ఫురింజేయుటకు గూడ నని తెలిసికొనవలయును. ఈవిషయము తంత్రవార్త్తికములో నిట్లు చెప్ప బడినది.

"యా చోక్తా పాండుపుత్రాణా మేకపత్నీవిరుద్ధతా,
సాపి ద్వైపాయనేనైవ వ్యుత్పాద్య ప్రతిపాదితా.
యౌవనస్థైవ కృష్ణా హి వేదిమధ్యా త్సముత్థితా,
సా చ శ్రీః శ్రీశ్చ భూయోభి ర్భుజ్యమానా న దుష్యతి.

అత ఏవ చోక్తమ్—

“ఇత్థం చ తత్రాద్భుతరూపముత్తమం జగాద విప్రర్షి రతీతమానుషం,
మహానుభావా కిల సా సుమధ్యమా బభూవ కన్యైవ గతే గతేఽహని.”

టీ—ఇతి నహి మానుషీష్వేవ ముపపద్యతే, తేనాఽతీతమానుష మిత్యుక్తం, అతఏవ వాసుదేవేన కర్ణ ఉక్తః. షష్ఠే చ త్వా మహాని ద్రౌపదీ పర్యుపస్థాస్యతీతి. ఇతరథా హి కథం ప్రమాణభూత స్సన్నేవం వదేత్. (అ.1 పా3.)

న్యాయసుధా వ్యాఖ్యా—

ద్వైపాయనీయ ముపపాదనప్రకార మాహ [illegible]వనేతి.—

“కుమారీ చైవ తన్వంగీ వేదీమధ్యా త్సముత్థితా,
శ్యామా పద్మపలాశాక్షీ నీలోన్నతపయోధరా.
ద్రౌపద్యేషా హి సా జజ్ఞే సుతా తే దేవరూపిణీ,
పంచానాం విహితా పత్నీ కృష్ణా పార్షత్య నిందితా.
స్వర్గశ్రీః పాండవార్థాయ సముత్పన్నా మహామఖే.”

ఇత్యాదిబహుప్రకారమమనుష్యత్వోపపాదనా దవిరోధ ఇత్యాశయః. నన్వమనుష్యత్వే తస్యా నిషేధాభావేపి పాండవానాం మనుష్యకున్తీమాద్రీయోనిజత్వేన మనుష్యత్వా న్నిషేధోభవిష్యతీత్యాశంక్యాహ—సా చేతి.

‘లక్ష్మీశ్చైషా పూర్వమేవోపదిష్టా భార్యా చైషా ద్రౌపదీ దివ్యరూపా
కథం హి స్త్రీ కర్మణోఽన్తే మహీతలాత్సముత్తిష్ఠేదన్యథా దైవయోగాత్’

ఇతి ద్వైపాయనేనైవ తస్యాః శ్రీత్వ వ్యుత్పాదనా చ్ఛ్రియ స్సర్వసేవ్యత్వా దనిషేధ ఇత్యర్థః. ద్వైపాయనీయస్య వేదిమధ్యోద్భవత్వాద్యభిధానస్యాఽనిషిద్ధవత్త్వాయాఽమనుష్యత్వోపపాదనార్థతా మభియుక్తవచనేన ద్రఢయితు మాహ— అత ఏవ చేతి.

“యది మే పతయః పఞ్చ వర మిచ్ఛామి యాచితుమ్,
కౌమార మేవ తత్సర్వసంగమే సంగమే భవేత్.”

ఇతి, పూర్వజన్మని తయా చ పంచకృత్వః పతిం మే దేహీతి యాచితే నేశ్వరేణ పంచ తే పతయో భవిష్యన్తీత్యుక్తే పురుషసం యోగజయోనిక్షతాఽభావరూపం కౌమారం ప్రార్థిత మిత్యభిధానా త్ప్రీత్యాహ మత్కృతయోనిత్వరూపం కన్యాత్వం తస్యా స్సూచిత మితి మత్వా 'జగాద విప్రర్షిః' కృష్ణద్వైపాయన ఇత్యుక్తం. కృష్ణేనాపి కర్ణం భేదయితుం పాండవా స్త్వా మేవ మాతృసంబన్ధాజ్జ్యేష్ఠం భ్రాతరం మత్వా రాజ్యేఽభిషేక్ష్యన్తీత్యాది ప్రలోభయిత్వా షష్ఠే చత్వా మహానిద్రౌప ద్యాగమిష్యతీత్యభిధానా దమనుష్యత్వేనాఽనిపి ద్ధత్వం తస్యాస్సూచిత మిత్యాహ. అత ఏవచేతి."

పైగ్రంథమునకు తాత్పర్యమిది—

ద్రౌపది పాండవుల కేకపత్నియగుట విరుద్ధమనిపించును. కాని వేదవ్యాసమహర్షి ఆమెను గూర్చి ద్రుపదునితో జెప్పినపుడు, సర్వాంగ సౌందర్యసమన్వితయై దేవరూపిణియై యువతియై వేదీమధ్యమునుండి అయోనిజయై యుద్భవించిన యీయామె పాండవపంచకమునకు పత్నిగా పరమేశ్వరునిచే నిర్దేశింపబడిన స్వర్గలక్ష్మియనియు దైవయోగమున నీయజ్ఞమందు పాండవార్థముద్భవించిన దనియు మొదలగువిషయములు చెప్పి ఆమె మనుష్యస్త్రీ యను భావముతో చూడదగినది కాదని నిరూపించియుండుటచే ద్రౌపదీదేవిపట్ల పంచపతిత్వము విరుద్ధముకాదు. కుంతీమాద్రీగర్భసంభూతులగుపాండవులకు మనుష్యధర్మమునుబట్టి అది విరుద్ధమనియు భావింపరాదు. పాండవులకు భార్యగా పూర్వము నిర్దే శింపబడిన స్వర్గలక్ష్మియే యీయామెయని వేదవ్యాసమహర్షి చెప్పియుండు టచేత లక్ష్మి సర్వసేవ్యురాలగుటచేత పాండవపంచకమునకది విరుద్ధము కాదు. ద్రౌపదిపూర్వజన్మములో తపముజేసి తనకు సాక్షాత్కరించిన పరమేశ్వరుని వరము కోరునపుడు 'పతిందేహి' అనుమాటను అయిదు సార్లు ఆమెయనుట చేతఁ దీర్పింప నీకైదుగురుపతులు పైజన్మములో గలు గుదురని పరమేశ్వరుడన్నపుడు నాకేకపతినే ప్రసాదింపుమని యామె

చెప్పుకొనినను నీకది ధర్మ్యము గనే యుండును. తప్పదని పరమేశ్వరుడు చెప్పియుండ నాకట్లైన ప్రతిదినము కన్యాత్వము సిద్ధించుచున్నట్లు వరమనుగ్రహింపుమని యామె కోరగా ఆమెప్రార్థననుబట్టి అక్షతయోనిత్వరూపమైన కన్యాత్వమును పరమేశ్వరు డామెకు ప్రసాదించె నని వేదవ్యాసమహర్షి చెప్పి యామెకుగల అసాధారణ కన్యాత్వ లక్షణమును తెలిపి యుండెను. శ్రీకృష్ణుడుకూడ భేదోపాయమున కౌరవపక్షము నుండి కర్ణుని విడదీయుటకై తనప్రయాణసమయమున తటస్థించిన కర్ణుని తనరథముమీదకి తీసుకొని పాండవులు నీకే రాజ్యాభిషేకము జేయుదురని యుపదేశించి ద్రౌపది నిన్నారవవానిగా భావించుననికూడ అనుటలో ఆమె పంచపతిత్వము పూజ్యమనియు, ఆమె పరమపవిత్రురాలనియు, ఆమెను (జారిణి)యనినీవనుట చాలతప్పు అనియు సూచించి యుండెను. లేకున్న ప్రమాణ భూతుడైన శ్రీకృష్ణు డట్లుచెప్పునా? అని."

సారాంశము—జగదీశ్వరుడైనశ్రీకృష్ణభగవానుడు—

"మనసైవ జగత్సృష్టిం సంహారం చ కరోతి యః,
తస్యాఽరిపక్షక్షపణే కియా నుద్యమవిస్తరః.
తథాపి యో మనుష్యాణాం ధర్మ స్త మనువర్తతే,
కుర్వన్ బలవతా సన్ధిం హీనై ర్యుద్ధం కరో త్యసౌ.
సామ చోపప్రదానం చ తథా భేదం చ దర్శయన్,
మనుష్యదేహినాం చేష్టా మిత్యేవ మనువర్తతే.
లీలా జగత్పతే స్తస్య ఛన్దతః పరివర్తతే,"

అని చెప్పబడినట్లు తన సంకల్పమాత్రముచేతనే సృష్టిస్థితిసంహారములు చేయగల అకుంఠితశక్తి కలవాడైనను మనుష్యశరీరధారియై వ్యవహరించుచున్నకారణమున సన్ధికై ప్రయత్నించుట, సామదాన భేదోపాయములను ప్రదర్శించుట, మున్నగు విషయములలో మనుష్య లక్షణముల ననువర్తించుచు దురాత్ములగు కౌరవులను హితోపదే

శము చేయదలచి సంధిచేయుటకై వెళ్ళెను. వారు తన మాటలను వినిపించుకొనరని తెలిసియుండియు—

"న మాం బ్రూయు రధర్మిష్ఠా మూఢా హ్యసుహృదన్తథా,
శక్తో నావారయ త్కృష్ణ స్సంరబ్ధాన్ కురుపాండవాన్."

అధర్మపరులు దుస్స్వభావులునగు మూఢులు— శ్రీకృష్ణుడు సర్వసమర్థుడై యుండియు, కురుపాండవులకు యుద్ధము లేకుండునట్లు కౌరవులకు జెప్పి నివారింపగలవాడై యుండియు నివారింపకపోయె నని నన్ననిపోవుదురు. అని భావించి స్వయముగా వెళ్ళి కురుసభలో చెప్పి ఆదుష్టచతుష్టయము తనమాటను తిరస్కరించిన పిమ్మట తాను వెళ్ళి పోవుచు కర్ణుని బలము చూచుకొని దుర్యోధనుకు కత్తిగట్టుచున్నం దున భేదోపాయమున కర్ణుని మనస్సు మార్చుటకుగూడ దలపెట్టి యాతనికి బోధించి అదికూడ కర్ణునిచే తిరస్కరింపబడినపుడు దైవో పహతులగు కౌరవులకు దండోపాయమే అవసరమని తెల్పి కౌరవుల లోపముకాని శ్రీకృష్ణుని లోప మేమున్న దని లోకు లనుకొనునట్లు చేసెను.

కర్ణునికి బోధించుటలో ద్యూతసభయందు ద్రౌపదినిగూర్చి చేసిన కర్ణుని దుష్ప్రసంగమును తలచుకొని యాకర్ణుడు సిగ్గుపడి క్షమా పనము జెప్పునట్లు చేసెను. ద్రౌపదిని సంబంధించిన అట్టి శ్రీకృష్ణప్ర సంగమువలన ద్రౌపది గుణ మెట్టిదో ప్రతివాదులకు దెలిసినదట! ఆమె అయిదుగురు భర్తలనే కాక అధికభర్తలను బొందుటకు సిద్ధ ముగా నున్న దని ప్రతివాదులకు తెలినదట! ఆహా! విద్యాగంధము లేనివారు తగుదుమని యార్షగ్రంథముల కడ్డువడుటలో వచ్చిన ప్రమాద మిది.

శ్రీకృష్ణుడు కర్ణునితో జెప్పిన విషయములు రెండు, ఒకటి— నీవటు వచ్చి రాజ్యమును స్వీకరింపుమనునది. రెండవది, ద్రౌపదీ దే విని సంబంధించినది. అందు రెండవదానికి సిగ్గుపడి పశ్చాత్తాపపడు

చున్నట్లు చెప్పి రాజ్యపరిగ్రహము నాకు వద్దని నేను దుర్యోధనుని విడువ నని చెప్పెను. అటుపై మందహాసముతో రాజ్యముమాట మాత్రమె యెత్తుకొని శ్రీకృష్ణు డిట్లనెను—

"కర్ణస్య వచనం శ్రుత్వా కేశవః పరవీరహా,
ఉవాచ ప్రహసన్ వాక్యం స్మితపూర్వ మిదం యథా.
అపి త్వాం న లభే త్కర్ణ రాజ్యలంభోపపాదనమ్,
మయా దత్తాం హి పృథివీం న ప్రశాసితు మిచ్ఛసి."

టీ— రాజ్యలంభోపపాదనం, రాజ్యప్రాప్త్యుపాయః త్వాం న లభేత్ న స్పృశేత్ తం న స్వీయం మన్యసే ఇత్యర్థః.
'ధ్రువో జయః పాండవానా మిత్రిదం న సంశయః కశ్చన విద్యతేత్ర'
"యదా ద్రక్ష్యసి సంగ్రామే శ్వేతాశ్వం కృష్ణసారథిమ్,
ఐన్ద్ర మస్త్రం వికుర్వాణ ముభే చాప్యగ్నిమారుతే.
గాండీవస్య చ నిర్ఘోషం విస్ఫూర్జిత మివాశనేః,
న తదా భవితా త్రేతా న కృతం ద్వాపరం న చ."

(ఉద్యో. అ. 142)

"టీ—న తదేతి. కృతే హి సర్వే కృతకృత్యా ఏవేతి న త్రివర్గం కశ్చి దపేక్షతే. త్రేతాయాన్తు ధర్మం ప్రాధాన్యేనాఽర్థకామా వానుషంగికత్వేన చాఽపేక్షన్తే. ద్వాపరే తు అర్థకామౌ ప్రాధాన్యేన ధర్మం చ తదంగత్వేన. తత్ర కృతం నభవితేతి మోక్షాద్భ్రంశ ఉక్తః. నత్రేతేతి ధర్మాద్భ్రంశ ఉక్తః. సచ దుర్యోధనాదీనా మస్త్యేవ ద్వాపరం నభవితేతి తేషా మర్థకామా వపి నభవిష్యతో యుద్ధేన మరణస్యాఽవశ్యంభావా దిత్యర్థః."

ఓకర్ణుడా! రాజ్యప్రాప్త్యుపాయము నీకురుచింపలేదు. నేనిచ్చెద ననిన రాజ్యమును నీవు స్వీకరించుట కిష్టపడక దుర్యోధనుడే స్వీకరింపవలయు నని చెప్పుచున్నావు కాని పాండవులకే జయము ధ్రువము. సంశయము లేదు. రణరంగమందు ఐంద్రాగ్నేయాద్యస్త్రముల

నుపయోగించు కృష్ణసారథి యగు పార్థుడు నీకు గోచరించినపుడు పిడుగులవంటి గాండీవనినాదములు కర్ణరంధ్రముల జొరబడునపుడు మీకు మరణ మవశ్యంభావి యగుట వలన మీరనుకొనిన అర్థకామములనుండి మీకు భ్రంశముతప్పదు. అని ఇట్లు మరలరాజ్యముమాటదప్ప ద్రౌపదిమాట నెత్తనేలేదు. చూడుడు.

అది విని కర్ణు డిట్లనెను—

"జానన్ మాం కిం మహాబాహో సంమోహయితు మిచ్ఛసి,
యోఽయం పృథివ్యాః కార్త్స్న్యేన వినాశస్సముపస్థితః.
నిమిత్తం తత్ర శకుని రహం దుశ్శాసన స్తథా.
దుర్యోధనశ్చ నృపతి ర్ధృతరాష్ట్రసుతోఽభవత్.
అసంశయ మిదం కృష్ణ మహా ద్యుద్ధ ముపస్థితమ్,
రాజానో రాజపుత్రాశ్చ దుర్యోధనవశానుగాః.
రణేశ స్త్రాగ్నినా దగ్ధాః ప్రాప్స్యన్తియమసాదనమ్.
స్వప్నా హి బహవో ఘోరా దృశ్యన్తే మధుసూదన,
నిమిత్తాని చ ఘోరాణి తథోత్పాతా స్సుదారుణాః.
పరాజయం ధార్తరాష్ట్రే విజయం చ యుధిష్ఠిరే,
శంసన్త ఇవ వార్ష్ణేయ వివిధా రోమహర్షణాః. (ఉద్యో అ148)

శ్రీకృష్ణా! సర్వము తెలిసిన నీవు రాజ్యము స్వీకరింపుమని నన్ను వ్యామోహింపజేయుదువేల? మహాసంగ్రామమూలమున పృథివికి వినాశనము సన్నిహితమై యున్నది. ఆసర్వనాశనమునకు శకుని, నేను, దుశ్శాసనుడు, దుర్యోధనుడు నిమిత్తభూతులమై యున్నాము. దుర్యోధనపక్షములోని వారందరు రణరంగమున శస్త్రాగ్నిదగ్ధులై తప్పక మరణింతురు. ఆస్థితిని సూచించుచున్న ఘోరములైన స్వప్నములు నాకెన్నియో గోచరించుచున్నవి. దారుణములైన ఉత్పాతము లెన్నియో గోచరించుచున్నవి. అవన్నియు దుర్యోధనుని యపజయమును యుధిష్ఠిరుని విజయమును చాటుచున్నవి, అని" ఇట్లు పలికిన కర్ణుడు తనకుగోచరించుచున్న దుస్స్వప్నములను ఉత్పాతములను వివరించి

'విదితం మే హృషీకేశ యతో ధర్మ స్తతో జయః' అని పలుకగా విని శ్రీకృష్ణు డాతని నాలింగనము జేసికొని విడిచిపెట్టగా శ్రీకృష్ణరథము నుండి దిగి కర్ణుడు దీనమనస్కుడై వెనుకకు వెళ్ళిపోయెను.

ఇప్పుడు "కర్ణునితో ద్రౌపదినిగూర్చి పలికిన శ్రీకృష్ణునిమాటయే ఆద్రౌపదివైఖరి యెట్టిదో స్పష్టీకరించుచున్నది." అని వ్రాసిన ప్రతివాదుల నడుగుచున్నాము.

ద్రౌపదీదేవికి సర్వవిధముల రక్షకుడైన శ్రీకృష్ణుని మాటను బట్టి ద్రౌపదీస్వభావము తెలిసిన దనుకొనుచున్న మీకు, దుర్యోధనున కంగరక్షకుడైన కర్ణుడు శ్రీకృష్ణునితో జెప్పిన యీయామాటలనుబట్టి దుర్యోధనుని పరిస్థితియు పరాజయము తెలిసినట్లా? తెలియనట్లా? సర్వనాశనమునకు మూలకారణ మెవ్వరో తెలిసినట్లా? తెలియనట్లా? కౌరవపాండవపక్షములలో నేపక్షమందు ధర్మ మున్నదో తెలిసినట్లా? తెలియనట్లా?

మీకు దెలిసినయెడల కర్ణుడు సుయోధనపరాజయమును కంఠోక్తిగా జెప్పియుండ 'సుయోధనవిజయము' అనుచు కవిత్వ మల్లుట సంభవించునా?

మీకు దెలిసినయెడల, సర్వనాశనమునకు మూలకారణము మా దుష్టచతుష్టయమే యని కర్ణుడు కంఠోక్తిగా శ్రీకృష్ణునితో జెప్పియుండ____

"కర్ణాదిప్రముఖులు, యోధానయోధులు నృపతులు
నుభయ పక్షంబుల నుండియు సమసిరి వీరలేక భువి నిర్వీర్యమయ్యె
నింత చేటున కెల్ల సీకృష్ణుడే మూలకందంబటంచు జగం బెరుంగు'

అని కవిత్వమల్లుట సంభవించునా?

మీకు దెలిసినయెడల 'దుర్యోధనవశానుగాః ప్రాప్స్యన్తి యమసాదనమ్.' 'పరాజయం ధార్తరాష్ట్రే విజయం చ యుధిష్ఠిరే' 'విదితం మే హృషీకేశ యతో ధర్మ స్తతో జయః' అని కర్ణుడు కంఠోక్తిగా శ్రీకృ

ష్ణునితో జెప్పియుండ, శ్రీకృష్ణుడే దారుణములు చేసినట్లు దుర్యోధనునితో—

"నీ యేపు సహియింపనేరమి దానిట్టి దారుణంబుల జేయదలచినాడు,
ధర్మంబు నీది యధర్మము పాండవపతులది."

అని బలరామస్వామి చెప్పినట్లును, శ్రీకృష్ణభగవానుడు—

"ఓసుయోధన నీవె యుత్తమపురుషుండ వఖిలధర్మములు నీయందె
గలవు, ధర్మంబు వీడి యధర్మయుద్ధంబున నన్యాయమార్గంబునందు
నిన్ను, నొంటిగా జేయుచు నుక్కడగించితి నిది యెల్ల నాకృత్యమే"
"నైతికవిజయంబు న్యాయంబుగా నీది ధర్మరాజున కధర్మజయము"

అని చెప్పినట్లును కవిత్వమల్లుట సంభవించునా?

మీకు దెలిసినయెడల భీష్ముడు కౌరవపక్షమందుండుటనుబట్టి కౌరవులదే ధర్మపక్షమనియు, 'వ్యాసుండు పాండవపక్షంబువాడను సర్థంబు జగతి శిలాక్షరంబు.' అనియు కవిత్వమల్లుట సంభవించునా?

ఇప్పటికి అయిదువేలయేండ్లకు పూర్వము జరిగిన కురుపాండవ సంఘర్షణ వృత్తాంతమును వేదవ్యాసమహర్షి గ్రంథరూపమున దెలిపియుండ అగ్రంథమునుబట్టియే ఆయావ్యక్తుల స్వరూపస్వభావములు గ్రహింపదగియుండ నేటికి పుట్టి అగ్రంథము నర్థము చేసికొనలేక ఆమహర్షి గ్రంథమును పక్షపాతబుద్ధితో వ్రాసెనని వాకొనుటకంటె తెలివితక్కువకలదా? పరమపావనులను పడదిట్టుచు కవిత్వ మల్లినారే!

మీకేమియు దెలియక అల్లిన కవిత్వమిది. అంతకంటెను దెలియని 'తొలిపలుకు'వారు మీయెడల జేసిన ప్రశంసావచనములవి. తమ తెలివి యెంతయో గ్రహింపలేక సాహసమున కొడిగట్టిన వారి వ్రాతలచేతను, మాటలచేతను అమాయకలోకము మోసపోవును. అది లోకద్రోహము, సారస్వతద్రోహమును.

కర్ణుడు శ్రీకృష్ణునితో స్పష్టముగా తా నపరాధి నని తనకు పార్థుని చేతులలో మరణ మాసన్నమైన దని తమ దధర్మమని చెప్పిన

మాటలనే అవగాహనము చేసికొనలేని యీప్రతివాదులకు, శ్రీకృష్ణుడు కర్ణునితో ద్రౌపదీదేవిని సంబంధించి అతి నిగూఢముగా బలికి యా కర్ణుని మందలించిన ఆమాట. అవగాహన యెట్లగును?

ద్రాపదీదేవి దుష్టురాలని, శ్రీకృష్ణుడు దుష్టుడని పలుకుటకు తెగించిన ప్రతివాదులు కర్ణుడుత్తమపురుషు డని చెప్పుదురుకదా॥అయితే నేది యుత్తములతో జెప్పరానిదో ఏది యవినీతికి మూలమైనదో ఆపరస్త్రీసంబంధప్రసక్తిని శ్రీకృష్ణుడు ప్రతివాదులచే నుత్తము డనబడు కర్ణునితో నెట్లు చెప్పగలిగెను?

అట్లు చెప్పుటకు కర్ణుడట్టి చాపల్యముగలవాడు కావలయును. ఆతని యాచాపల్యము నప్పుడావిధముగా నాతని హృదయ మెరిగి శ్రీకృష్ణుడు తీర్చువాడు కావలయును. ఆమాటకు కర్ణుడు హర్షించువాడు కావలయును. కర్ణుడు హర్షింపలేదనియు, నాత డట్టి చాపల్యముగల వాడు కాడనియు, పూజ్యుడనియు ప్రతివాదు లంకరును వ్రాసియు న్నారు. అట్టివానితో శ్రీకృష్ణు డట్టి నింద్యమైన వ్యర్థప్రసంగ మెట్లు చేసినాడు? అను విషయము ప్రతివాదుల మనస్సునకు తట్టనే లేదు. ఆశ్చర్యము.

ప్రతివాదుల వ్రాతల నుదాహరించుచున్నాము—

1 మహాభారతచరిత్రము—"శ్రీకృష్ణుడు కర్ణునితో రహస్యముగా, భేదవాక్యము లాడునపుడు ద్రౌపది నిన్నారవవానినిగా బొందు నన, నాకు సూతకన్యలు భార్యలు కలరు. వారియందే నాకతిశయ ప్రేమమనినాడు. కాన కర్ణుడు కామియై ద్రౌపదిని మనంబునన్నైన గోరినవాడుకాడు" (పు285).

2 మహాభారతరహస్యము— "శ్రీకృష్ణుడు కర్ణుని భేదింపజేయదలచి జన్మరహస్యమును జెప్పి సిదపయాపటత్సామ్రాజ్యాధిపత్యమునకాస గొలిపి తరువాత ద్రౌపదీపరిగ్రహమునకుగూడ నవకాశ మొసంగెను కాని కర్ణుడు సమ్మతింపలేదు. మోహము నొందలేదు. (పు264)

"శ్రీకృష్ణుడు కర్ణుని దన తేరి మీఁదం గొనిపోయి చెప్పిన వాక్యములకు కర్ణుడు చలింపక పోవుటమాత్రము శ్లాఘాపాత్రము" (పు446)

3 ఖండకావ్యము— భారతవీరుడు—

ఉ. ఒక పాంచాలికి భర్త లేవురని మర్త్యుల్ గూడి మాటాడు వా
డుక యే కర్ణకఠోరమై మసలుచుండన్ డెందమం దట్టి వా
నికి నాకాలవభర్తృనామము ధర న్నిర్మింప కంచు న్మురా
రికి వాక్రుచ్చి యశంబు జాటవె ధరిత్రీమండలిన్ భానుజా"

4 ఆంధ్రభారతసంశయవిచ్ఛేదము—

"పాండుధరణీశునకు గర్ణుండు సుతుండౌట యెప్పుడురాధిపతి యె నిం
కొండనగనేల యప్పుడ, యుండదతని గలియ కృష్ణకొక దోషంబున్

ఇందు మొదటివారివ్రాతలో ద్రౌపది నిన్నారవానినిగా బొందు ననిన మాటపై, నాకు భార్యలుకలరు. వారియందే నాకధిక ప్రేమ మని కర్ణు డన్నట్లువ్రాయబడినది. కర్ణు డన్నది యది కాదు. పాండవపక్షమునకు రమ్మను మాటపై చెప్పిన సమాధాన మది.

ఆంధ్రభారతము—

క. సోదరులు బ్రియులుననుజులునా దెస బెక్కండ్రుసందఅవిశువం
గాదని యూహింపక దామోదర నన్నిట్లుపిలుచుటుచిత మెచెపుమా

మహాభారతములో గూడ నన్ను పెంచిన సూతుడు నన్నుపుత్రుడని భావించుచుండెను. నేనాతని దండ్రి యని భావించుచుంటిని. ఆకులాచారమునుబట్టియే నాకాతడు జాతకర్మాదిసంస్కారములు చేసి వసుషేణుడని నామకరణము చేసెను. ఆకులమునకు జెందినవారినే పెండ్లి చేసికొని పుత్రపౌత్రాదులను గనియున్నాను. వారియందు ప్రీతికలిగియున్నాను. శ్రీకృష్ణా! నాకీభూమండల మంతయు ప్రాప్తించినను, వసురాశులు ప్రాప్తించినను నేనీ సూతకులముతోగల అనుబంధమును తెంచుకొని యీ పక్షమునకు రాజాలను. అనియే కర్ణు డన్నట్లున్నది. చూడుడు—

"తథా మా మభిజానాతి సూత శ్చాధిరథ స్సుతమ్,
పితరం చాభిజానామి తమహం సౌహృదాత్సదా.
సహి మే జాతకర్మాది కారయామాస మాధవ,
శాస్త్రదృష్టేన విధినా పుత్రప్రీత్యా జనార్దనః.
నామ వై వసుషేణేతి కారయామాస వై ద్విజైః,
భార్యాశ్చోఢా మమ ప్రాప్తే యౌవనే తత్పరిగ్రహాత్.
తాసు పుత్రాశ్చ పౌత్రాశ్చ మమ జాతా జనార్దన,
తాసు వై హృదయం కృష్ణ సంజాతం కామబంధనమ్.
న పృథివ్యా సకలయా న సువర్ణస్య రాశిభిః,
హర్షాద్భయాద్వా గోవింద మిథ్యా కర్తుం తదుత్సహే."

(ఉద్యో-అ 141)

ఇట్లుండుటచే ద్రౌపది నిన్నారవవానినిగా బొందుననినమాట కిది సమాధానము కాదని స్పష్టము. ఈ ప్రతివాది కర్ణుడు ద్రౌపదిని మనంబున నైన గోరినవాడు కాడు. అని వ్రాసియుండి అట్టివానితో పరస్త్రీప్రశంసను శ్రీకృష్ణు డెందుకు దెచ్చినా డని యాలోచింపలేక పోయెను.

ఇక రెండవవారు కూడ యావత్సామ్రాజ్యమున కాశ గొలిపి నను ద్రౌపదీపరిగ్రహమున కవకాశ మొసగినను కర్ణుడు సమ్మతింప లేదు; మోహపడలేదు. అని వ్రాసి అట్టివానితో పరస్త్రీప్రశంసను శ్రీకృష్ణు డెందుకుచేసె నను ఆలోచనకే పోలేదు.

ఇక మూడవవారు ఒక స్త్రీకి అయిదుగురు భర్తలనుమాటయే కర్ణకఠోరముగా నున్న నాకు అపరభర్త యను పేరు తెచ్చిపెట్టకు మని కర్ణు డన్నట్లు కవిత్వ మల్లినారు. అట్లని కర్ణుడు కీర్తిని చాటినా డని వ్రాసినారు. ఆకర్ణుడే ద్యూతసభలో ద్రౌపది నేమన్న ట్లున్నదో చూతుడు——

తే. "తరుణి యేవురకంటె నొక్కరుడు భర్త
యగుట లగ్గు జూదంబున నాలి నోటు
వడని వానిగా దగు భర్త బడియు మింక
ననుచు రాధేయు డుల్లసమాడె నంత." (ఆంధ్రభారతము)

దీనిలో జూదములో నోడిన నైదుగురుని విడిచి యోడనట్టి ఆరవభర్తను కట్టుకొమ్మని చెప్పెనుకదా. అట్టి యారవభర్త తాను కావలయుననియా? తన ప్రభువగు దుర్యోధనుడు కావలయుననియా? ఆవెంటనే—

ఉ. "అమ్ముదితక విభీతహారిణాక్షి లాపవిభాసి కేశభా
రమ్మున నొప్పుదాని తనరమ్యపృథూరుతలంబు నెక్కగా
రమ్మని సన్న సేసె ధృతరాష్ట్రసుతాగ్రజు డప్పు"

అని యుండుటచే తన మాటపై తొడ జూపి ద్రౌపదీదేవిని రమ్మనిన దుర్యోధనుడే ఆరవభర్త కావలయు ననికర్ణుని తాత్పర్యము కావచ్చును.

దుర్యోధను డారవ భర్త యనుమాట కర్ణునకు ప్రతివాది చెప్పినట్లు కర్ణకఠోరము గాక, కర్ణపేయ మెట్లయ్యెను? కర్ణు డామాటాడి తన కీర్తిని చాటినాడా? అపకీర్తిని చాటినాడా? అట్టి కర్ణుని యెత్తిపొడుచుటకు శ్రీకృష్ణుడు తెచ్చిన ద్రౌపదీప్రశంసపై తన తప్పును స్మరించి సిగ్గుపడి కర్ణుడు పరితపించె ననుటకంటె గత్యంతరము లేదు. ఎట్లయినను కర్ణునికి మనస్సులో లేని విషయమును శ్రీకృష్ణు డెందుకు దెచ్చె నని యీప్రతివాదికూడ విచారించలేదు.

ఇక నాలుగవవారు కర్ణుడు పాండుసుతు డని రూఢియైనపుడు ఆకర్ణుని ద్రౌపది కలియుట దోషము కాదన్నారు. పాండవపంచకమునకే పత్నిగా సృజింపబడిన ద్రౌపదీదేవినిగూర్చి యట్లనుట యనుచితమని వీరనుకొనలేదు.

దేవరాజసుధీప్రణీతమైన 'కర్ణుడు' అను పుస్తకములోకూడ శ్రీకృష్ణకర్ణసంభాషణ మిట్లు వ్రాయబడినది—

"మహైంద్రవైభవముతో భూచక్రమంతయు నేలుము. జగదేకసుందరి యగు ద్రౌపది నిన్నారవపతిగా బొందగలదు. మాటాడక మరియొకటి తలంపక నాతోడ కదలిరమ్ము.

కర్ణుడంతయు విని శ్రీకృష్ణునితో రాధయు నతిరథుండును ధర్మంబున నాకు తలిదండ్రులైరి. వారినివిడుచుట ధర్మముకాదని తలంపక రమ్మనెదవే దామోదరా! ఇది నీకుతగునా? దుర్యోధనుడు నన్ను దనయంతవానినిగా జేసెను. అట్టిదొర నట్టి యుదారుని యేధర్మమునుబట్టి విడిచి వత్తును? నీవే చెప్పుము" (పు.84) అని.

ఇందు ద్రౌపదీసంబంధమునుగూర్చి కర్ణుని ప్రతివచనమే లేదు. శ్రీకృష్ణుడట్టి తేలికమాట నెందుకు దెచ్చె నని యీగ్రంథకర్తకూడ నాలోచింపలేదు.

వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారి "కర్ణచరిత్రము"లో కూడ నిట్లున్నది—

"శ్రీకృష్ణుడు కర్ణుని పాండవపక్షమునకు రాదీయదలంచి జ్యేష్ఠుడగు నాతనికే రాజ్యాభిషేకము జరుగగలదనియు ద్రౌపది కూడ నాతనిని యథాంశముగ బరిగ్రహింపగలదనియు బోధపఱచెను. కాని ధర్మాత్ముడును వైషయికభోగవిరాగియు నగు కర్ణుడందులకు సమ్మతింపక ఇట్లు ప్రసంగించెను... ..." (పు. 74) అని.

ఆకర్ణుని ప్రసంగములో ద్రౌపదీసంబంధమునుగూర్చిన ప్రతివచనము చూపబడలేదు. అట్టి ధర్మాత్ముడు విషయసుఖవిరాగి యగు కర్ణునియొద్ద శ్రీకృష్ణు డామాట నెందుకు దెచ్చెనని యీగ్రంథకర్త కూడ నాలోచింపలేదు.

పర్యవసితార్థ మేమనగా ద్రౌపదీదేవికి ఆరవభర్త యగు కోరిక కర్ణుని కున్నదని కాని, అతని కాపరిస్థితిని తాను కలిగింపదలచి

కాని, ఆతని నెట్లో చేపట్టిన గాని పాండవులకు జయము కలుగదని కాని శ్రీకృష్ణ డాద్రౌపదీప్రశంసను కర్ణునియొద్ద చేయలేదు. ద్యూత సభలో కర్ణుడు మదోన్మత్తుడై ద్రౌపదీదేవిని బంధకి యని నీ వారవ భర్తను చేపట్టుమని దుర్భాషలాడెను. అది కృష్ణభగవానుని బాధించు చున్నది. ఆబాధ దీర్చుకొనుచు కర్ణునకు బుద్ధిచెప్పదలచి, నాడు కర్ణు డన్న మాటనే యుద్ఘాటించి ద్రౌపది ని న్నారవవానినిగా గ్రహించు ననెను. ఆ నిగూఢాభిప్రాయముగల మాటచే నాటి తన దుర్వ్యాపార మును స్మరించుకొని కిక్కురుమనక సిగ్గుపడి భంగ్యంతరమున నేను పాండవులను దుర్భాషలాడినందుకు పశ్చాత్తాపపడుచున్నా నని చెప్పు కొని ఆదుర్భాషలనుబట్టియే నాడు తనను వధింప శపథముచేసిన పార్థునిచే గలిగెడి తన మృతినిగూడ వెల్లడించెను. ఇది దీని పరమా ర్థము. ఇట్లుచూడ శ్రీకృష్ణుడు తెచ్చిన ద్రౌపదీప్రశంస సార్థకమెగాని నిరర్థకము కాదు; విరుద్ధమును గాదు.

ఇంకొకటి కూడ చూడుడు——కర్ణునితో ఇట్టి ప్రసంగము జరిపి నది కృష్ణపరమాత్మ.రాయబారమునకు వెళ్ళినప్పుడు ఈ కృష్ణరాయ బారము సంజయురాయబారమైన వెంటనే జరిగినది. ఆసంజయురాయ బారసమయములో ధృతరాష్ట్రసందేశము వినిపించు సంజయునితో ద్యూతసభావృత్తాంతమెత్తుకొని ప్రసంగించుచు ద్రౌపదీదేవి నాడు పడిన కష్టము లుగ్గడించు నపుడు కృష్ణభగవాను డిట్లనెను.

'యత్రాఽబ్రవీ త్సూతపుత్రస్సభాయాం కృష్ణాం స్థితాం శ్వశు రాణాం సమీపే, నతే గతిర్విద్యతే యాజ్ఞసేని, ప్రపద్య దాసీ ధార్తరాష్ట్రస్య వేశ్మ"

పరాజితా స్తే పతయో న సన్తి పతిం చాన్యం భామిని త్వం వృణీష్వ యో బీభత్సోః హృదయే ప్రౌత ఆసీ, దస్థిచ్ఛింద న్మర్మఘాతీసుఘోరః 'కర్ణాచ్ఛ రోవాఙ్మయ స్తిగ్మ తేజాః ప్రతిష్ఠితో హృదయేఫాల్గునస్య'

(ఉద్యో-అ29)

నాటిసభలో పెద్దలసమీపములో నున్న ద్రౌపదితో సూత పుత్రుడు, నీకింక గతిలేదు. దాసివై దుర్యోధనగృహమునకు చేరుము. పరాజితులైన నీపతులు లేనివారిలోనే జమ. మఱియొకపతిని వరింపుము. అని పలికెను. సంజయా! కర్ణుని ఆవాఙ్మయశరము మర్మభేదకమై పార్థుని హృదయములో నాటికొని యున్నది అని. సంజయునితో నట్లు మాటాడిన శ్రీకృష్ణభగవానుడే కర్ణునితోనిట్లు మాటాడినాడు. ఈమాట ద్రౌపదిని తార్చుటకా? కర్ణుని పేగులుత్తోడుటకా? మతి మంతులాలోచింతురుగాక.

కర్ణుడు శ్రీకృష్ణాంతర్యము గ్రహించియే పాండవులను దుర్భాష లాడిన తన పశ్చాత్తాపమును, పార్థునిచే గలుగు తనమరణమును వెల్ల డించుటమూలమున కృష్ణభగవానుని క్షమింపగోరె నన్నమాట.

ఇట్లు ద్యూతసభలో దుర్యోధనప్రీతికై ద్రౌపదిని దుర్భాష లాడిన కర్ణుని మెత్తిపొడుచుటకును, నేను చేసినది తప్పే యని కర్ణు డొప్పుకొని క్షమాపనము గోరునట్లు చేయుటకును ఉపయోగించబడిన శ్రీకృష్ణుని యీమాటను బట్టుకొని—

“దీనివలన ద్రౌపది యధికభర్తలను బడయుటకు సిద్ధముగనే యున్నదని తేలిన”దని యొకరును

“కర్ణుడు కామియై ద్రౌపదిని మనంబుననైన గోరినవాడు కాడు” అని మఱియొకరును,

“ద్రౌపదీపరిగ్రహమునకుగూడ నవకాశ ముసంగెనుకాని కర్ణుడు మోహము నొందలేదు, కర్ణుడు చలింపకపోవుటమాత్రము శ్లాఘాపాత్రము” అని మఱియొకరును,

“ఒక ద్రౌపదికై దుగురు భర్తలను మాట కర్ణకఠోరముగా గనబడు నట్టి నాకు కర్ణుడారవభర్త యను దుష్కీర్తిని తెచ్చిపెట్టకు మని కర్ణుడు చెప్పెను” అని మఱియొకరును,

కర్ణుడు పాండుసుతు డని రూఢియైనపుడు ద్రౌపది యాతని గలిసినను దోషము లేదు'' అని యింకొకరును వ్రాసిన వసంబద్ధప్రలాపము లగుటచే హేయములు. హరికథలలోగాని, అన్యగోష్ఠులలోగాని ప్రస్తావించునపుడు 'శ్రీకృష్ణుడు ద్రౌపదీవిషయమును కర్ణునితో చెప్పెను.' అను తేలికమాటను అనాలోచనగా వాడుచు భారతీయ సంస్కృతి సభ్యతాసంప్రదాయముల మహత్త్వమును భగ్నముచేయక, పరమపావనమైన ద్రౌపదీచరిత్రము నుకళంకితమునుజేయక, భగవంతుడగు కృష్ణపరమాత్మయొక్క సూక్తిని అపహాసాస్పదము చేయక, ఆకృష్ణపరమాత్మ సూక్తులలోని ఈనిగూఢార్థమును వివరించి కృతార్థత వహింపవలసినదని పాఠకమహాశయులను కోరుచున్నాము ఇంతటితో దీనిని విడిచి విషయాంతరమందుకొనుచున్నాము.

—:"ద్రౌపది సత్యభామతో జెప్పిన తనపాతివ్రత్యవిశేషములు శ్రీరంగనీతు" లను ప్రసంగము—తన్నిరాకరణము:—

మ. భా. చ. కారులవ్రాత యిట్లున్నది—"ద్రౌపది సత్యభామతో దనపాతివ్రత్యవిశేషమునుగూర్చి శ్రీరంగనీతు లెన్నియైన జెప్పినది. భర్తల యడుగులకు మడుగు లొత్తుచు వారి కనుసన్నల మెలగుచుండు ననినది. కాని పాండవులే ఆమెకు జంకుచుండు రని కొన్నిసందర్భములచే జెప్పవలసియున్నది." (పు228)

ఏసత్యభామకు ద్రౌపదీదేవి చెప్పినదో ఆసత్యభామ నీవన్నియు శ్రీరంగనీతులు లే అని యేమైన అనెనా? ముక్కు మొగమెరుగని యీప్రబుద్ధు డాడిన మాటకు గణన యేమున్నది? సత్యభామతో ద్రౌపదీదేవి చెప్పిన ప్రస్తావమేమో ఆవిషయమేమో వినుడు—

పాండవు లరణ్యవాసముచేయుచు కామ్యకవనమందు నివసించు నపుడు వారిని జూచుటకై సత్యభామతో కృష్ణభగవానుడు వెళ్ళియుండెను. అంతట మార్కండేయమహర్షి యేతెంచెను. ఆపై నారద మహర్షి వచ్చెను. అప్పుడు ప్రత్యుత్థానాభివాదనము లైనతరువాత

కృష్ణభగవానుని కోరికపై పురాణకథలను మార్కండేయమహార్షి యుధిష్ఠిరప్రశ్నానుగణముగా జెప్పుచుండెను. ద్రౌపదీదేవియు సత్యభామయు నొకచోట కూర్చుండి ప్రసంగించుకొనుటలో సత్యభామ ద్రౌపదితో నిట్లనెను—

సీ. నీప్రియభర్తల నిర్మలచరితుల
బ్రకట తేజుల లోకపాలనిభుల
బార్థుల నీవొకభంగిన నెదలక
చెలువ యెబ్బంగి భజింతు దగిలి
యొక్క డొక్కని కంటె నువిద నీకేవురు
ననువర్తులగుట యత్యద్భుతంబు
నగు మొగంబులకాని నాతి నీదెస నెప్డు
బతులకు గింకిరిపాటు లేదు.

తే. వ్రతము పెంపొ మంత్రౌషధవైభవంబొ
సరసనైపథ్యకర్మకౌశలమొ చతుర
విభ్రమోల్లాసరేఖయొ వెలది నీవి
శేషసౌభాగ్యహేతువు సెప్పుమ నాకు.

క. ఏనును నీవలన నిజముగా
నిది యెంతయును నెఱిగి కమలదళాక్షుం
బూని వశగతుని జేసి యు
ననూనస్నేహానుభోగయుక్తి దలిర్తున్.

క. అని యడిగిన మది నించుక
గినుక వొడమ నడచుకొనుచు గృష్ణ మృదులహా
సిని యగుచు గృష్ణభామిని, గనుగొని
యిట్లనియె నిర్వికారాకృతియై

క. నను నిట్లు దుష్టవనితాజనమునటులుగా దలంప జనునే నీకుఁ
మనసొప్పదు పురుషోత్తము వనితవు గాదగవు నీవు వనరుహనయనా.

చ. అలయక మంత్రతంత్రవివిధౌషధభంగుల జేసి యెంతయుఁ
వలతురు నాథులంట మగువా కను బేలతనంబు దాన నుఁ
గలిగిన ప్రేమయుం బొలియు గాని యొకంపును సిద్ధి బొందద
ప్పొలతులతోడి మన్కి యహి పొత్తుగ జూచు విభుం డెటింగినన్

చ. మగువ యొనర్చు వశ్యవిధి మందులు మాయలు నొంకు చందమై
మగనికి దెచ్చు రోగములు మానక మూకజడాదిభావముల్
మొగి నొనరించు నద్దురితముల్ దన చేసిన చేతలై తుదిన్
జగమున కెక్కు నిందయును సద్గతిహానియు వచ్చు నింతికిన్.

వ. పాండవులయెడ నే నెట్టిదాననై యుట్టి సౌభాగ్యంబు నందితి నది
నీ కెఱింగించెద నేర్పడ వినుము.

సీ. పతులాత్మ నొండొక్క పడతుల గలసిన
నలుగ నెయ్యెడల నహంకరింప
మదము ప్రమాదంబు మాని వారికి జిత్త
మేకముఖంబుగ నెల్లప్రొద్దు
భక్తి సేయుదు జూపు బలుకును
గోర్కియు జెయ్వును వింతగా జేయనెపుడు
సమర గంధర్వయక్షాదులందైనను
బురుషు నన్యుని దృణంబుగ దలంతు

తే. స్నానభోజనశయనాదిసంప్రయోగ
మర్థి బతులకు మున్నెందు నాచరింప
బతులు వచ్చిన నాసనపాద్యవిధుల
భక్తితో నేన కావింతు బనుప నొరుల.

చ. తగియెడు వేళలందు నియతంబుగ మజ్జనభోజనక్రియల్
దగ నొడఁగూర్తు భర్తలకు ధాన్యధనంబులు రిత్తమై వ్యయం
బగుటకు నోర్వ నెప్పుడు గృహస్థల భాండ విశోధనంబు లి
మ్ముగ నొకనాఁడు నేమఱ బ్రమోదము సల్పుదు బంధుకోటికిన్.

క. పలుమాఱుం దలవాకిట మెలఁగుట యసతీజనైకమిత్రిత కలహం
బుల కెలయుట నగుఁ బలుకుల బెలుచ నగుట నాకుఁ గాని పేరివి మగువా.

క. పతు లిచ్చమెయి బ్రవాసస్థితులైనం బుష్పగంధదీప్తాభరణ
ప్రతతి ధరియింపఁ దద్గతమతి నగుచు దదాగమంబ మదిఁ గాంక్షింతున్.

ఉ. అత్తకు భక్తి గల్గి మది నాయమ సెప్పిన మాడ్కి జీవికా
వృత్తము లావహింతు గురువిప్రసురాతిథిపూజనంబు ల
త్యుత్తమభక్తి నేన తగ నోపి యొనర్తు బ్రియంబు దాల్మియున్
మెత్తదనంబు సంతతము మేలుగ దాల్తు సమస్తభంగులన్.

క. కడుమృదువులనుచు దేకువ సెడి యెప్పుడు భజింప భరతసింహులు గోపం
బడరిన నాశీవిషముల వడువునఁ గ్రూరులని వెఱవు వదలక కొల్తున్.

సీ. మాయత్త పృథ్వీసమాన పృథాదేవి
కుంతిభోజాత్మజ కోమలాంగి
సతతంబు భోజనస్నానాదికములయం
దిమ్ముగ బరిచర్య యేన చేసి
సంప్రీతఁ జేయుదు జనవంద్యుఁడగు ధర్మ
తనయుని బంతి నిత్యంబు బసిఁడి
పళ్ళెరంబుల గుడ్చు బ్రాహ్మణు లతిపుణ్యు
లెనిమిదవేలు సమిద్ధమతులు
తే. యతులు పదివేలు వారల కనుదినంబు
నన్నపానంబు లర్థిసహాయ నగుచు

నొడికముగ నేన కావింతు నుచితవస్త్ర
భూషణాదుల బరితోషముగ నొనర్తు.

వ. మఱియు ధర్మరాజు నగరియందు గనకమణిమయభూషణాలంకృ
తులయిన పరిచారకులు నూరువేలు రేయును బగలును బాత్రీహ
స్తులై యభ్యాగతభోజనంబు లొడగూర్చువారు నందర కలరు.
వీరెల్ల నిట్టిట్టు మెలకువమెలంగుదు రని తత్కృతాకృతంబు లేన
యెఱుంగుదు. నిరంతరమదధారాతరంగితకపోలంబులయిన భద్రగజ
శతసహస్రంబులు బ్రభూతజవసత్త్వసన్నుతంబులయిన యుత్తమా
శ్వశతసహస్రంబులుం గలవు. వానికి నన్నింటికి నిత్యోచితంబులైన
ఖాద్యంబు లొనరింపను బాలింపను దగినవారి నేన నియమింతు
నఖండభాండాగారపూరితంబులైన యగణ్యమణికనకాదివస్తువులును
బ్రతిదినవిహితంబులయిన యాయవ్యయంబులు నాయెఱుంగని
యవియు లేవు. గోపాలజనంబులు తుదిగా గల సకలభృత్యజ
నంబుల జీవితంబుల నరసి యేన నడపుదుం బరమయశోధను లగు
పాండునందనులు నిజకుటుంబభారంబు సర్వంబును నాయందు సమ
ర్పించి తారు నిర్భరులై యిష్టవిహారంబుల నుండుదు రేనెల్ల
వెంటల నప్రమత్తనై వర్తింతు.

ఆ. వేగ జాము గలుగ వెడ నిద్రవోందుదు
గాని రాజ్యభారకార్యయుక్తి
నబ్జనయన నాకు నాహారనిద్రల
కెడయు లేదు సువ్వె యెల్లప్రొద్దు.

ఆ. ఇట్టి వర్తనముల నెపుడ పాండవులకు
దగిలి ప్రియము సేయు దగితి గాని
మగువ నీవు సెప్పు మందులు మంత్రంబు
లింద్రజాలములును నేనెఱుంగ.

వ. అనిన విని లజ్జాకలితచిత్త యగుచు సత్యభామ పాండవభామిని కిట్లనియె.

క. ఏ నెఱుగమి నిట్లాడితి నానేరమి సైపవలయు నగవుగ గొనుమీ మానిని నాపలుకులు సన్మానితము భవచ్చరిత్రమహిమధరిత్రిన్॥"

(ఆంధ్రభారతము)

ఇట్లుపతిశుశ్రూషాదికము గృహకృత్య స్వయం నిర్వహణసామర్థ్యము మొదలగు గుణములే పత్నియందు పతికి ప్రీతి అతిశయించుటకు మూలమని ద్రౌపదీదేవి చెప్పగా, నిజమే నీచరిత్రము జగత్పూజ్యమని నేను తెలియక అడిగిన విషయముగనుక క్షమింపుమని సత్యభామ పలుకగా ప్రతివాదులు ఆవెఱ్ఱిధోరణి యేమి?

ఆద్రౌపదీదేవి చెప్పినది నిజమే అతిశయోక్తి కాదనుటకు దుర్యోధనుని మాటను గూడ సాక్ష్యముగా జూపుచున్నాము.

రాజసూయయాగములో పాండవైశ్వర్యమును జూచి వ్యథతో వచ్చిన దుర్యోధనుడు తనకు గలిగినదుఃఖమునకు గారణములు ధృతరాష్ట్రునితో జెప్పు సందర్భములో నిట్లున్నది.—

"ఉచ్చావచా నుపగ్రాహాన్ రాజభిః ప్రాపితాన్ బహూన్,
శత్రూణాం పశ్యతో దుఃఖా న్ముమూర్ఛా మే వ్యజాయత.
నాభుక్తవన్తం నాప్రీతం నాలంకృత మసత్కృతమ్,
అపశ్యం సర్వవర్ణానాం యుధిష్ఠిరనివేశనే.
అష్టాశీతిసహస్రాణి స్నాతకా గృహమేధినః,
త్రింశద్దాసీక ఏకైకో యా న్బిభర్తి యుధిష్ఠిరః.
సుప్రీతాః పరితుష్టాశ్చ తే హ్యాశంస న్త్యరిక్షయమ్,
దశాఽన్యాని సహస్రాణి యతీనా మూర్ధ్వరేతసామ్.
భుంజతే రుక్మపాత్రీభి ర్యుధిష్ఠిరనివేశనే,
అభుక్తం భుక్తవద్వాపి సర్వ మాకుబ్జవామనమ్.
అభుంజానా యాజ్ఞసేనీ ప్రత్యవైక్ష ద్విశాంపతే" (సభా. అ52)

శతుృవులగు పాండవులకు రాజులందరు ననేకములైన కానుక లిచ్చినపుడు చూచుచున్ననాకు మరణింపవలె ననిపించినది. యుధిష్ఠిరభవనమందు సర్వవర్ణములలో నన్నపానముల చేతను ఆభరణముల చేతను ఆదరింపబడనివాడొక్కడును గనుపింప లేదు. ఎనుబది వేలమంది స్నాతకులు యుధిష్ఠిరునిచే బోషింపబడుచుండిరి. పది వేలమంది యతులు సువర్ణపాత్రములతో భుజింపజేయబడుచుండిరి. వికలాంగులవరకు నెవ్వరు భుజించిరో ఎవ్వరుభుజింపలేదో ద్రౌపదీదేవి తాను భుజింపకయే స్వయముగా బరీక్షించుచుండెను. అని.
ఆంధ్రభారతముగూడ జూడుడు—

సీ. జన్నంబు సూడంగ సకలభూములనుండి
వచ్చిన రాజన్యవరుల నవని
సురులను వైశ్యుల శూద్రుల నాత్మీయ
బంధుసుహృద్వీరభటనియోగ
జనులను బేదల సాధుల నిత్యంబు
దాన పరీక్షించి తగ వెలింగి
యన్నంబు దయ బెట్టి యందరు గుడిచిన
దనుమధ్య యర్ధరాత్రంబునపుడు.
ఆ. గాని కుడువ దట్టి కమలాక్షి ద్రౌపది
యదియు గాక యమ్మహాధ్వరమున
నధముడయ్యు గడు బ్రియంబున
నభ్యర్చితుండ కాని వంచితుండు లేడు.

ఇట్లు శతుృశ్లాఘ్యపవిత్రచరిత్రకల ద్రౌపదీదేవి యొక్క సూక్తులు స్త్రీయపవివర్తనరీతులె కాని శ్రీరంగనీతులు కావు. కాబట్టి యామె పాతివ్రత్య మసాధారణము.

స్త్రీధర్మముల నుపదేశించుచు యాజ్ఞవల్క్యస్మృతిలో నిట్లు చెప్పబడినది—

'సంయతోపస్కరా దక్షా హృష్టా వ్యయపరాఙ్ముఖీ,
కుర్యా చ్ఛ్వశురయోః పాదవందనం భర్తృతత్పరా.'

గృహోపకరణములను పదిలపరుచుకొనుట. శీఘ్రకారిణియై యుండుట, ప్రాప్తించిన ద్రవ్యముతో సంతోషించుచుండుట, దుర్వ్యయము చేయకుండుట, శ్వశ్రూశ్వశురపాదాభివందనము చేయుచుండుట, భర్తృపరాధీనయై యుండుట అనునవి స్త్రీధర్మములు. అని.
విష్ణుస్మృతియం దిట్లున్నది—

అథ స్త్రీధర్మాః— "భర్తు స్సమానవ్రతచారిత్వం శ్వశ్రూశ్వశుర గురుదేవతాఽతిథీనాం పూజనం, సుసంయతోపస్కరతా, అముక్తహస్తతా, సుగుప్తభాండతా, మూలక్రియా(వశీకరణ) స్వనభిరతి ర్మంగలాచారతత్పరతా."

ఈచెప్పబడిన లక్షణము లన్నిటికి లక్ష్యము ద్రౌపదీదేవి యని వెనుకజూపబడిన గ్రంథముచే స్పష్ట మయినది.

ఆమె పతులే ఆమెకు జంకుచుండిరని ప్రతివాది యనెను. ధర్మజుని యనుజులు ధర్మజునకు జంకుచుండుట యెట్లుచితమో అట్లు ధర్మజుని భార్య యను భావనతో ద్రౌపదీదేవికి జంకుచుండుటగూడ భీమసేనాదుల కుచితమే.
ఇంకొకటి—

"కార్యేషు దాసీ కరణేషు మన్త్రీ రూపే చ లక్ష్మీః క్షమయాధరిత్రీ,
భోజ్యే చ మాతా శయనే చ రంభా షడ్ధర్మయుక్తా కులధర్మపత్నీ."

అని చెప్పబడిన అన్నిలక్షణములతో బ్రవర్తించిన యుత్తమస్త్రీ గనుక నానాసందర్భములలో యుధిష్ఠిరాదులకు కర్తవ్యాకర్తవ్యముల నుపదేశించుట, శౌర్యము నుద్దీపింపజేయుట, మొదలగువిషయములలో మంత్రివలెకూడ శాసించిన దని తెలిసికొనవలయును.

—: "విరటుని సభలో ద్రౌపది నిందించి ధర్మజార్జునుల దెప్పి పొడిచిన" దను ప్రసంగము—తన్నిరాకరణము :—

మ. భా. చ. కారులవ్రాత యిట్లున్నది— "కీచకుని వ్యవహారములో విరటుని దత్సభ వారిని నిందించుచు సభలో నిలిచియుండిన ద్రౌపదికి ధర్మరాజు తమ రహస్యము బయలగునేమో యను భయముతో నామె నచటనుండి పొమ్మని సూచించినాడు. ఆమె యచట నుండి కదలకపోవుటచే నాట్యమాడుదానివలె గులస్త్రీ సభలో నిలిచి యుండరాదు. పొమ్మనగా ద్రౌపది గూఢముగా ధర్మజార్జునుల నిట్లు దెప్పిపొడిచినది—

తే. నాదు వల్లభుండు నటు డింత నిక్కంబు పెద్దవారి యట్ల పిన్నవారు
గాన బతుల విధముగాక యే శైలూషి గా దనంగరాదు కంకభట్ట.

వ. అట్లగుటం జేసి నాకు నాట్యంబును బరిచితంబు. మత్పతి శైలూషుండ కాడు గితవుండును గావున జూదరి యాలికి గరువతనం బెక్కడిది." అనినది. (పు. 230)

అస లిచ్చట కథాసందర్భ మేమనగా— అజ్ఞాతవాసకాలములో ద్రౌపదీపాండవులు విరటు నాశ్రయించి గూఢముగా తమ జీవయాత్రను నడుపుకొనుచున్నారు. వారు మొదట విరాటనగరములో వర్తించునపు డెవ్వరేయే పనులు చేయుటో, ఏయే పేరులు చెప్పుకొనుటో నిశ్చయించుకొను నవసరమున పాండవులు తమతమ విషయములను చెప్పుకొనిన మీదట ధర్మజుడు ద్రౌపదిని జూచి—

"సుకుమారీ చ బాలా చ రాజపుత్రీ యశస్వినీ,
పతివ్రతా మహాభాగా కథం ను విచరిష్యతి."

టీ— బాలా నిత్యనూతనా.

ఈరాజపుత్రి, యీసుకుమారి, యీపతివ్రత యెట్లు సంచరింప గలుగునో అని పలుకగా ద్రౌపదీదేవి యిట్లనెను—

"సైరంధ్ర్యో రక్షితా లోకే భుజిష్యా స్సన్తి, భారత,
నైవ మన్యాః స్త్రియో యాన్తి ఇతి లోకస్య నిశ్చయః.
సాఽహం బ్రువాణా సైరంధ్రీ కుశలా కేశకర్మణి."

టీ-సైరంధ్రీతి సీరం, ప్రతిసీరా న్తః పటః. ధ్రియతేఽనయాఽస్యావేతి సీరంధ్రా సైవ సైరంధ్రీ స్వార్థే తద్ధితః. అన్తఃపురపరిచారికా రాజభార్యా వా. "సైరంధ్రీ పరవేశ్మస్థా శిల్పకృత్స్వవశా స్త్రియాం, వర్ణసంకరసంభూతస్త్రీ మహిల్లికయోరపి ఇతి విశ్వః 'మతల్లికయో'రితి మేదినీపాఠః. ఆద్యే- మహిల్లికా రాజదారాః ద్వితీయే, మతల్లికాః ప్రశస్తస్త్రియ ఇత్యర్థః. దాసీపక్షే అరక్షితా ఇతి ఛేదః. స్వవశా ఇత్యుక్తే, పక్షే రక్షితా ఇత్యేవ, భుజిష్యా, పాలనీయా పాలయతీ చ. భుజపాలనాభ్యవహారయో రిత్యస్య రూపం. నైవ మన్యాః స్త్రియో రూపవతీ ర్యాన్తి ప్రాప్నువన్తి పశ్యన్తీతరే ఇత్యర్థః. దాసీరితి భావః. పక్షే నైవం ప్రకాశే యాన్తి సంచరన్తీత్యర్థః.

"యుధిష్ఠిరస్య గేహే వై ద్రౌపద్యాః పరిచారికా,
ఉషితాఽస్మీతి వక్ష్యామి పృష్టా రాజ్ఞా చ భారత."

టీ- ద్రౌపద్యాః పరిచారికేతి రాహోశ్శిరఇతివదభేదేఽపి భేదోపచారః. ద్రౌపదీరూపా యుధిష్ఠిరస్య పరిచారికేత్యర్థః.

"ఆత్మగుప్తా చరిష్యామి య న్మాం త్వం పరిపృచ్ఛసి,
సుదేష్ణాం ప్రత్యుపస్థాస్యే రాజభార్యాం యశస్వినీమ్.
సా రక్షిష్యతి మాం ప్రాప్తాం మాభూత్తే దుఃఖ మీదృశమ్,"

మహారాజా! నేను సైరంధ్రి నని చెప్పుదును. (సైరంధ్రీశబ్దమునకు పరిచారికయనియు, రాజభార్య యనియు రెండర్థములు.) సైరంధ్రులు భుజిష్యలై యుందురు. పరిచారికాపక్షములో పాలింపదగినవారని యర్థము. రాజభార్యాపక్షములో పాలించునట్టిది యని యర్థము. జుట్టుదువ్వుట మొదలగుపనులలో కుశలత కలదాన నని

చెప్పెదును. యుధిష్ఠిరగృహమందు ద్రౌపదికి పరిచారికనై యున్న దాన నని చెప్పెదును. "ద్రౌపద్యాః పరిచారికా" అన్నపుడు అభేదార్థకము షష్ఠియగుటచే యుధిష్ఠిరునకు ద్రౌపదీస్వరూపపరిచారిక నని చెప్పెద నని గూఢార్థము. విరాటభార్య యగు సుదేష్ణ నాశ్రయించి యుందును. ఆమె నన్ను కాపాడును. నాథా! నీవు దుఃఖింపవద్దు. అని.

ఇదే విధముగా విరాటునితో పాండవులు చెప్పిన మాటలు వారుపెట్టుకొనిన పేరులు రెండర్థములు కలిగియే యున్నవి. అది వేద వ్యాసమహాభారతమును నీలకంఠీయటీకతో బరిశీలించువారికే విదిత మగును.

అట్లు చెప్పి ద్రౌపదీదేవి సుదేష్ణయొద్ద కాలక్షేపము చేయుచు తనకైదుగురు భర్తలనియు, వారు గంధర్వులనియు, పరపురుషుడెవ్వడైన నన్ను కాంక్షించెనేని నన్ను ప్రచ్ఛన్నముగా నుండి రక్షించుచున్న నాపతులువానిని వధించి తీరెద రనియు చెప్పి కాలము గడుపుచుండ నొకప్పుడు కీచకుని నిర్బంధము ద్రౌపదీదేవికి తటస్థించినది. అది యెట్లనగా— సుదేష్ణ ప్రేరణచేత ద్రౌపదీదేవి కీచకుని యెదుటకు వెళ్ళవలసి వచ్చినది. ఆవెళ్ళినపు డామె భయపడుచు

"యథాఽహ మన్యం భర్తృభ్యో నాభిజానామి కంచన,
తేన సత్యేన మాం ప్రాప్తాం మా కుర్యాత్కీచకో వశే.
ఉపాతిష్ఠత సా సూర్యం ముహూర్త మబలా తతః,
స తస్యా స్తనుమధ్యాయాః సర్వం సూర్యోఽవబుద్ధవాన్.
అన్తర్హితం తత స్తస్యా రక్షో రక్షార్థ మాదిశత్,
తచ్చైనాం నాఽజహా త్తత్ర సర్వావస్థా స్వనిన్దితామ్."

నేను నాపతులను దప్ప అన్యపురుషుని స్మరించి యెరుగను, ఆసత్యమే నన్నీకీచకుని ముష్టినుండి తప్పించుగాక. అనికీర్తించి యొక ముహూర్తకాల మామె సూర్యు నుపాసించెను. ఆమె యార్తిని గ్రహించి సూర్యుడు అంతర్హితముగా నుండి యామెను రక్షించుట

కొక రక్షస్సును నియోగించెను. ఆరక్షస్సు సర్వావస్థలయందును
విడువక ఆమె నంటి యుండెను. తరువాత కీచకునియెదుటకు వెళ్ళుట,
ఆతడుకామాంధుడై యామెను పట్టబోవుట జరిగెను.

'జగ్రాహ తా ముత్తరవస్త్రదేశే స కీచక స్తాం సహసాక్షిపన్తీమ్'
ప్రగృహ్యమాణా తు మహాజవేన మహుర్వినిశ్వస్య చ రాజపుత్రీ.
తయా సమాసాక్షిప్త తను స్స పాపః పపాత శాఖీవ నికృత్తమూలః.
సా గృహీతా విధున్వానా భూమా వాక్షిప్య కీచకమ్,
సభాం శరణ మాగచ్ఛ ద్యత్ర రాజా యుధిష్ఠిరః.
తాం కీచకః ప్రధావన్తీం కేశపాశే పరామృశత్,
అథైనాం పశ్యతో రాజ్ఞః పాతయిత్వా పదాఽవధీత్.
తస్యా యోఽసౌ తదాఽర్కేణ రాక్షస స్సంనియోజితః,
స కీచక మపోవాహ వాతవేగేన భారత.
స పపాత తదా భూమౌ రక్షోబలసమాహతః,
విఘూర్ణమానో నిశ్చేష్ట శ్ఛిన్నమూల ఇవ ద్రుమః."

నిరాకరించుచున్న ద్రౌపదీదేవి వస్త్రమును కీచకుడు పట్టుకొనగా ఆర్తురాలైన ద్రౌపదీదేవి చేత విదల్పబడి కీచకుడు నేలబడెను. (అట్లుపడుటలో నామె కంగరక్షగా నున్న రక్షస్సు యొక్కబలము కారణము.) అంతలో నామె పరుగిడి యుధిష్ఠిరుడుండిన విరాటసభ లోనికి బోవుచుండెను. మరల కీచకుడు పరుగిడి యామె జుట్టుపట్టుకొని సభాసమక్షములో విరాటరాజు చూచుచుండగా పడద్రోసి పాదముతో దన్నెను. అప్పుడామె కంగరక్షగా నున్నరక్షస్సు కీచకుని వాయువేగమున త్రోసివేయగా రక్షోబలముచేత కీచకుడు నేల గూలెను.

ఆంధ్రభారతముగూడ జూడుడు—

వ. సింహబలుండు పయింబడి పట్టుకొనిన.

క. తను గాచి వెనుకకు వచ్చినదనుజమహాబలము తనదుతనువొందిననా
తని చే విదిల్చి రథసంబున దన్మందిరము ద్రుపదపుత్రి వెడలెన్.

తే. సింహబలు డత్యుదగ్రుడై చిగురుబోడి
పజ్జ గడువడి దగిలి కోపంబు గదుర
నొడిచి తలపట్టి తిగిచి మహోగ్రవృత్తి
గొంకు కొసరించుకయు లేక కూలదాచె.

వ. అట్టి యెడ పాంచాలీరక్షకుండైన రాక్షసుం డతని ద్రొల్ల వ్రేసిన.

క. కీచకుడు వ్రేటువడి తన నీచపు దెస యొరు లెరుంగ నేరకయుండన్
లేచి వెనుక జని విస్మయగోచరుడై యసురకతన గుంతితుడగుచున్.

ఇట్లుండగా, మ. భా. చ. కారుడెట్లు వ్రాసెనో చూడుడు—

"ద్రౌపది బలవతి, తను బట్టవచ్చిన కీచకుని బడగొట్టి గీచు మని పించినది. కీచకుని బడగొట్టుటలో నొక దైవమహిమము కవిచే గల్పింపబడెను గాని యది సందర్భశుద్ధిగా లేదు." పు. (230)

అశుద్ధమనస్కునకు సందర్భశుద్ధి గోచరించుటకూడనా? విరాటరాజ్యరక్షకుడై వీరాధివీరుడై యున్న కీచకుడు ద్రౌపదిచేతిలో కీచుమనెనా? ఆకీచకుని పడగొట్టి కీచుమనిపించినది ద్రౌపదీదేవియా? అట్లయిన అట్టి ద్రౌపదీదేవి అంతదుర్బలుని సంహరించుటకై భీమసేనుని యొద్ద దుఃఖించి యాతని ప్రోత్సహింపవలసిన పని యేమున్నది? కనుక నిది దుర్నయము. ప్రకృతమునకు వత్తము—

అట్లు ద్రౌపదీదేవియెడల కీచకుడు చేసిన దుస్సహమైన దుర్మార్గమును సభలో నున్న యుధిష్ఠిరభీమసేనులు చూచిరి. భీమసేనుని యందు దుగ్రత గోచరించుచుండెను. క్రమముగా నాతడు కూర్చుండ లేక లేచుట కుద్యమించు నవసరమున భీముని పరిస్థితిని గనిపెట్టి ధర్మజుడు—

"అథాఽవమృద్నా దంగుష్ఠ మంగుష్ఠేన యుధిష్ఠిరః,
ప్రబోధనభయా ద్రాజా భీమం తం ప్రత్యషేధయత్."

టీ— అంగుష్ఠం పాదాంగుష్ఠ మంగుష్ఠేన హస్తాంగుష్ఠేన ఆచారా దేవం జ్ఞేయమ్.

తమవిషయము తెలిసిపోవునను భయముతో, తన యనుజ్ఞకై చూచుచున్న భీమసేనునకు కదలవద్దని సూచించుటకై ఆధర్మజుడు తన కాలిబొటనవ్రేలుమీద తనచేతి బొటనవ్రేలు పెట్టి నొక్కుకొనెను. అది గూచి భీమసేనుడు కదలక కూర్చుండెను. ఇదియిట్లుండగా ద్రౌపదీదేవి—

"సా సభాద్వార మాసాద్య రుదతీ మత్స్య మబ్రవీత్,
అవేక్షమాణా సుశ్రోణీ పతీం స్తాన్ దీనచేతసః.
ఆకార మభిరక్షన్తీ ప్రతిజ్ఞాధర్మసంహితా,
దహ్యమానేవ రౌద్రేణచక్షుషా ద్రుపదాత్మజా,"

టీ—అభిరక్షన్తీ గూహమానా ధర్మసంహితా ధర్మబద్ధా.

"యే దద్యు ర్న చ యాచేయు ర్బ్రహ్మణ్యా స్సత్యవాదినః,
తేషాం మాం మానినీం భార్యాం సూతపుత్రః పదాఽవధీత్.
సర్వలోక మిమం హన్యు ర్ధర్మపాశసితాస్తు యే,
తేషాం మాం మానినీం భార్యాం సూతపుత్రః పదాఽవధీత్.
శరణం యే ప్రపన్నానాం భవన్తి శరణార్థినామ్,
చరన్తి లోకే ప్రచ్ఛన్నాః క్వ ను తేఽద్య మహారథాః.
మయాఽత్ర శక్యం కిం కర్తుం విరాటే ధర్మదూషకే,
యః పశ్యన్ మాం మర్షయతి వధ్యమానా మనాగసమ్.
న రాజా రాజవత్కించి త్సమాచరతి కీచకే,
దస్యూనా మివ ధర్మ స్తే న హి సంసది శోభతే.
నాహ మేతేన యుక్తం వై హన్తుం మత్స్య తవాన్తికే,
సభాసదోఽత్ర పశ్యన్తు కీచకస్య వ్యతిక్రమమ్."

సభాద్వారమందుండి రోదనముచేయుచు తన యాకృతి గనుపడనీయక గోపనము జేసికొనుచు దీనమనస్కులైన పతులను తీవ్రదృష్టితో జూచుచు ధర్మబద్ధురాలై విరాటరాజునుగూర్చి యిట్లనెను,

ఎవ్వరు దాతలేకాని యాచకులు కారో, ఎవ్వరు బ్రహ్మణ్యులో, ఎవ్వరు సత్యవాదులో, ఎవ్వరు తలచుకొనిన ఈలోకమునంతను భస్మము జేయగలరో, ఎవ్వరు ధర్మపాశబద్ధులై యుండిరో, ఎవ్వరు శరణార్థులకు శరణ్యులై ప్రచ్ఛన్నముగా సంచరించుచుండిరో అట్టివారి భార్యనై యున్న నన్ను సూతపుత్రుడు తన్నెను. నాపతులైన ఆమహారథు లిప్పు డెక్కడనుండిరో.

తన యెదుట నన్ను దన్నుటను జూచి యుపేక్షించి ధర్మదూష కుడై విరాటరాజున్నపుడు నాకేమిచేయ శక్యమగును? కీచకుని పట్ల రాజు రాజువలె వర్తించుటలేదు. ఇట్టి దస్యుధర్మము సభకు దగదు. ఓవిరాటరాజా? నీయెదుట నేనిట్లు తన్నబడుట యుక్తము కాదు. కీచకుని దుర్మార్గమును సభ్యులందురు నాలోచింతురుగాక. అని ద్రౌప దీదేవి మొఱ్ఱబెట్టగా విరాటరాజు, నాపరోక్షములో మీలో మీకేమి జరిగెనో తెలియనపుడు నేనేమి చెప్పగలుగుదు నని పలికెను. అప్పు డామెను జూచి సభ్యులు—

“నహీదృశీ మనుష్యేషు సులభా వరవర్ణినీ,
నారీ సర్వానవద్యాంగీ దేవీం మన్యామహే వయమ్.”

ఇట్టి లోకోత్తరలక్షణములుగలది మనుష్యస్త్రీ కానేరదు. ఈమె దేవియని తలచుచున్నాము. అని ప్రశంసించుచుండ—

“అథాఽబ్రవీ ద్రాజపుత్రీం కౌరవ్యో మహిషీం ప్రియామ్,
గచ్ఛ సైరంధ్రి మాఽత్రస్థా స్సుదేష్ణాయా నివేశనమ్.
భర్తార మనురుధ్యన్త్యః క్లిశ్యన్తే వీరపత్నయః,
మన్యే న కాలం క్రోధస్య పశ్యన్తి పతయ స్తవ.
తేన త్వాం నాభిధావన్తి గన్ధర్వా స్సూర్యవర్చసః,
అకాలజ్ఞాసి సైరంధ్రి శైలూషీవ విరోదిషి.
విఘ్నం కరోషి మత్స్యానాం దీవ్యతాం రాజసంసది,
గచ్ఛ సైరంధ్రి గన్ధర్వాః కరిష్యన్తి తవ ప్రియమ్,
వ్యపనేష్యన్తి తే దుఃఖం యేన తే విప్రియం కృతమ్.”

యుధిష్ఠిరు డామెతో నిట్లనెను. సైరంధ్రీ! నీవిక్కడ నుండక సుదేష్ణాభవనమునకు వెళ్ళుము. వీరపత్నులైన పతివ్రతలకు క్లేశములు ప్రాప్తించుచుండును. నీపతులైన గంధర్వులు ఇది క్రోధమునకు కాలము కాదని భావించియే నీయొద్దకు పరుగిడి రాలేదని తలచుచు న్నాను. నీవు కాలమును గుర్తింపక నటస్త్రీవలె విశేషముగా దుఃఖించు చున్నావు. నీవీరాజసభయందు జరుగుచున్న ద్యూతవినోదమునకు విఘ్నము గలిగించుచున్నావు. సైరంధ్రీ ! నీవు వెళ్లుము. గంధర్వులైన నీపతులు నీయభీష్టమును సిద్ధింపజేయుదురు. నీకెవ్వనిచే హాని కలిగెనో ఆతనిని వారు శిక్షింతురు. అని పలికెను అప్పు డాసైరంధ్రి యిట్లనెను–

"అతీవ తేషాం ఘృణినా మర్థేఽహం ధర్మచారిణీ,
తస్య తస్యైవ తే వధ్యా యేషాం జ్యేష్ఠోఽక్షదేవితా."

టీ– ఘృణినాం, దయావతాం, తేషా మర్థే తస్యతస్య సర్వ స్యైవ తే వధ్యాః స్యుః.

"ఇత్యుక్త్వా ప్రాద్రవ త్కృష్ణా సుదేష్ణాయా నివేశనమ్,
కేశా న్ముక్త్వా చ సుశ్రోణీ సంరంభా ల్లోహితేక్షణా."

ఎవ్వరిలో జ్యేష్ఠుడు అక్షక్రీడాకుశలుడో దయాళువులైన వారందరి కొరకు నేను ధర్మచారిణినై యుంటిని. నాకిట్టి హాని గలిగించినవారు నాపతు లెల్లరకు వధ్యులే అగుదురు. అని పలికి వెంటనే సుదేష్ణా భవనమునకు వెళ్ళిపోయెను.

ఇది గ్రంథస్థమైన విషయము. ఇట్లుండగా, ప్రతివాది ధర్మ జుడు ద్రౌపది నచటనుండి పొమ్మని సూచించె ననియు, నామెకదల లేదనియు, మరల పొమ్మనె ననియు నామె ధర్మజార్జునుల దెప్పిపొడి చిన దనియు వ్రాసి దెప్పినట్లున్నదనుటకు ఆంధ్రభారతవిషయమును జూపియుండెను. సూర్యభగవానునిచే ద్రౌపదీదేవి కంగరక్షగా నొక రక్షస్సు నియోగింపబడి కీచకుని బడద్రోయుచు వచ్చెనని సంస్కృ తాంధ్రభారతములలో నున్న విషయము సందర్భశుద్ధిగా లేదని వ్రాసిన

ప్రతివాదికి ద్రౌపదీదేవి చెప్పినట్లు ఆంధ్రభారతములో నున్న విషయము సందర్భశుద్ధిగా లేదని యేల తోచకపోయెనో! ద్రౌపదీపాండవుల మహత్త్వమును ప్రకటించు గ్రంథమునుపదో పేరు పెట్టి త్రోసివేయుట, వారికి న్యూనత నాపాదించు విషయములు కల్పించుచుండుట అనునవి ప్రతివాదులకు గల దుర్లక్షణములు. మూలములో లేనట్టివి వ్యాఖ్యాతలచే సాంప్రదాయికపాఠముగా బరిగణింపబడనట్టివి యగు కొన్నివిషయము లాంధ్రభారతములో నచ్చటచ్చట గోచరించును. అట్టి విషయములను బట్టుకొని పుణ్యపురుషుల సచ్చరిత్రములకు గళంక మాపాదింపబోవుట అయుక్తము. ఆంధ్రభారతకర్త లగు మహాకవుల తాత్పర్యము నైన గనిపెట్టక తోచినట్లు వ్రాయుట మరియు నయుక్తము. ఆపై విషయమెట్లునదో ఆంధ్రభారతము జూడుడు—

రాత్రి వేళ ద్రౌపది భీమసేనుని యొద్దకు వెళ్ళి ప్రసంగించు సందర్భము—

'నన్ను గీచకుండుదన్నంగ నెట్టులు నూడనేర్చె ధర్మసూనుడపుడు'

వ. అనిన విని యతం డిట్లనెయె.

ఉ. కీచకు డట్లు మీాదు పరికింపక నిన్ను బరాభవింపగా
జూచి మహోగ్రకోపవివశుండగు నన్నును జూచి ధైర్యహే
మాచలుడైన ధర్మసుతు డమ్మెయి వారణసేయుకున్న నే
నీచత వాని మత్స్యవిభునిం బరివారము నుగ్గు సేసినక"

వ. ఆసంరంభంబున సమయభంగంబుగా జనంబులు మనల యెఱింగి రయేని.

క. ముందటి భంగిన 'కానల, యందు వశింపంగవలదె యది నీవును నే నుం దెచ్చిన యాపదగా నిందింపరె యెల్లవారు నీరజవదనా"

వ. కావున సత్యవ్రతనిష్ఠుండగు యుధిష్ఠిరుండు పొగడ్తకుం దగు వాడు గాని దూఱువడ నర్హుండు గాడని వెండియు నిట్లనియె.

వ. మనల నెవ్వరు నెఱుగనట్టి తెఱంగు దలపోయువలయుగాక పగతుని భజించుట యెంతటి పనియనిన విని యమ్మానిని యిట్లనియె.

చ. కినుకకు జాలకెంతయును గీడ్పడి నాపడు వాటు లెల్ల వ
మ్మునన గలయంగ నిట్టు లొక మూర్ఖునిచే దుది బోయి కోలుపో
యెనె యభిమాన మన్వగపు నేడ్తెఱ డెందము గొందలంబు బొం
దిన ధృతి మాని యేబలికితిం దగ వెల్ల వెఱింగి యుండియున్.

వ. ఇట్టిదకాని సమస్తజనస్తవనీయుండగు పాండవాగ్రజు నిక్కంబ నిం
దించినదాన నగానని పలికి మఱియును.

క. ధర్మతనూభవు సంతత ధర్మనిరతి మనము బ్రదుకదలచుట యురుదే
నిర్మలుడగు నాతని సత్కర్మంబునగాదె బ్రదుకు ధాత్రికి నెల్లన్.

తే. అతడు భూరిప్రతాపమహాప్రదీప దూరవిఘటితగర్వాంధకారవైరి
వీరకోటీరమణిఘృణివేష్టితాంఘ్రితలుడు కేవలమర్త్యుడె ధర్మసుతుడు

ఈగ్రంథమువలన ద్రౌపదీదేవి తాను ధర్మజుని నిందింపలేదని
చెప్పినట్లు స్పష్టమగుచుండ దీనినితీసికొనకుండుట ప్రతివాదికయుక్తము.
ద్రౌపదీదేవి పతిభక్తిగల పతివ్రతామతల్లి యని పర్యవసానము.

అర్జునుడు సుభద్రావివాహముజేసికొని ఆమెను వెంటబెట్టుకొని
వచ్చినపుడు ద్రౌపదీదేవి సౌమనస్యము జూడుడు—

వ. సుభద్రయు నింద్రప్రస్థపురంబునకుం బోయి కుంతీదేవికి ద్రౌపదికి
మ్రొక్కిన.

తే. పంకజాక్షి నీపతి ప్రతిపక్షవీర విజయు డయ్యెడు నీవును వీరపుత్ర
జనని వగుమనిదీవించె సంతసంబుతోడవసుదేవపుత్రినా ద్రుపదపుత్రి

మరియు ద్రౌపదీసత్యభామాసంవాదములో—

"అసత్ స్త్రీణాం సమాచారం నాహం కుర్యాం న కామయే."

దుష్టస్త్రీల సమాచారము నాకెంతమాత్రము కిట్టదని ద్రౌపదీ
దేవి కంఠోక్తిగా జెప్పినది.

ఇన్ని నిదర్శనములుండ ప్రతివాదులు వెనుకముందుచూడక
ద్రౌపదీదేవిని దుష్టస్త్రీ యని వ్రాయుట నింద్యము. ద్రౌపదీదేవి పతి
వ్రతామతల్లియే.

## —: ద్రౌపదీపాండవులదాంపత్యానుబంధ మశక్య మని కర్ణదుర్యోధనుల సంభాషణము :—

ద్రౌపదీస్వయంవరమునకు కర్ణశకునిదుశ్శాసనాదులను వెంట బెట్టుకొని వెళ్ళిన దుర్యోధనుడు ద్రౌపదీదేవి యర్జునుని వరించినతరువాత విఫలమనోరథుడై సపరివారముగా నింటికి వచ్చెను.

"విదుర స్త్వథ తాం శ్రుత్వా ద్రౌపదీం పాండవై ర్వృతామ్,
వ్రీడితాం ధార్తరాష్ట్రాంశ్చ భగ్నదర్పా నుపాగతాన్.
తతః ప్రీతమనాః క్షత్తా ధృతరాష్ట్రం విశాంపతే,
ఉవాచ దిష్ట్యా కురవో వర్ధన్త ఇతి విస్మితః.
వైచిత్రవీర్యస్తు నృపో నిశమ్య విదురస్య తత్,
అబ్రవీ త్పరమప్రీతో దిష్ట్యా దిష్ట్యేతి భారత.
మన్యతే సవృతం పుత్రం జ్యేష్ఠం ద్రుపదకన్యయా,
దుర్యోధన మవిజ్ఞానా త్ప్రజ్ఞాచక్షు ర్నరేశ్వరః.
అథ త్వాజ్ఞాపయామాస ద్రౌపద్యా భూషణం బహు,
ఆనీయతాం వై కృష్ణేతి పుత్రం దుర్యోధనం తదా.
అథాఽస్య పశ్చా ద్విదుర ఆచఖ్యౌ పాండవాన్ వృతాన్,
సర్వాన్ కుశలినో వీరాన్ పూజితాన్ ద్రుపదేన హ."

విదురు డావిషయ మంతయు గ్రహించి కౌరవులు, లేపాండవులను లక్కయింట జంపదలచిరో ఆ పాండవులు సురక్షితులై యుండి ద్రౌపదీవివాహోత్సవానందములో నున్నందులకును, దుర్యోధనాదులు సిగ్గుపడుచు దర్ప ముడిగి యింటికి వచ్చినందులకును సంతోషించుచు ధృతరాష్ట్రునితో "కురువంశజాతులు వర్ధమానులై యున్నారు. ఆనందము" అని పలికెను.

ధృతరాష్ట్రుడు, దుర్యోధనాదులు ద్రౌపదీస్వయంవరమునకు వెళ్ళినసంగతి యెరిగినాడు గనుకను, పాండవులు గతించినారని యంతకు

బూర్వామె తెలిసియున్నవాడు గనుకను సందర్భమునుబట్టి ఆవిదు రునిమాట నర్థముచేసికొనుటలో ద్రౌపదీదేవిచే తనపుత్రుడగు దుర్యోధనుడు వరింపబడినాడనుకొని పరమసంతోషముతో ఆనంద మానంద మనుచు దుర్యోధనుని బిలిచి ద్రౌపదీదేవి ధరింపదగిన ఆభరణములను ద్రౌపదీదేవిని యిటు తీసుకరావలసినదని పలికెను.

ఆమాటపై విదురుడు ద్రౌపదిచే పాండవులు వరింపబడినట్లును వారుకుశలులై దుృపదపూజితులై యున్నట్లును తనమాట కదియే యర్థ మన్నట్లును తెలిపెను. అప్పుడు ధృతరాష్ట్రుడు తన భ్రాంతిని దెలియనీయక,

యథైవ పాండోః పుత్రాస్తు తథైవాఽభ్యధికా మమ"

పాండవులు పాండురాజున కెట్టి ప్రేమపాత్రులో నాకును అట్టి ప్రేమపాత్రులే అనెను. నీకు మాకేండ్లకు నట్లే యుండవలయు ననుచు విదురు డింటికి వెళ్ళెను.

ఆవెంటనే కర్ణదుర్యోధనులు ధృతరాష్ట్రుని యొద్దకు వచ్చి యిట్లనిరి—

"సంనిధౌ విదురస్య త్వాం దోషం వక్తుం న శక్నువః,
వివిక్త మితి వక్ష్యావః కిం తవేదం చికీర్షితమ్.
సపత్నవృద్ధిం యత్తాత మన్యసే వృద్ధిమాత్మనః"

విదురుని యెదుట నీకు మాయభిప్రాయమును జెప్పలేకు న్నాము. ఇప్పు డితరులు లేరు గనుక మాటలాడుచున్నాము. నీవుశత్రు వృద్ధినే ఆత్మవృద్ధిగా భావించుచున్నావు. నీయభిప్రాయమేమి? అని. ఆపై ధృతరాష్ట్రుడు.—

"అహ మప్యేవ మేవైత చ్చికీర్షామి యథా యువామ్,
వివేక్తుం నాహమిచ్ఛామి త్వాకారం విదురంప్రతి.
తత స్తేషాం గుణా నేవ కీర్తయామి విశేషతః,
నావబుధ్యేత విదురో మమాఽభిప్రాయ మింగితైః.
యచ్చ త్వం మన్యసే ప్రాప్తం తద్బ్రవీహి సుయోధన,
రాధేయ మన్యసే యచ్చ ప్రాప్తకాలం వదాశు మే"

నేనుగూడ మీయభిప్రాయములో జేరినవాడనే. విదురునకావిషయము తెలియకుండుటకై యాతనియొద్ద పాండవుల గుణములనే కీర్తించుచుందును. ఓసుయోధనా! ఓకర్ణుడా! ఇప్పుడు చేయవలసిన పని యేమని మీరు తలచిరో చెప్పుడు. అనిఅడిగిన మీదట దుర్యోధను డిట్లు చెప్పదొడగెను—

మనయాప్తులైన విప్రులను పంపి కుంతీపుత్రులకును, మాద్రీపుత్రులకును అన్యోన్యకలహము బుట్టింపవలయును. లేదా, ద్రుపదమహారాజును, అతని పుత్రులను మంత్రులనుమహాధన మిచ్చి స్వాధీనపరచుకొని యచ్చటనుండి పాండవులను పొమ్మని వారనునట్లు చేయవలయును. అట్లుజరుగక పాండవు లక్కడనే యున్నను ఆద్రుపదపురములో నివసించుటకుపాండవు లిష్టపడనట్లు చేయవలయును. లేదా పరస్పరవైమనస్యములతో నచ్చటనే యుండునట్లైన చేయవలయును.

"అథవా కుశలాః కేచి దుపాయనిపుణా నరాః,
ఇతరేతరతః పార్థాన్ భేదయ న్త్వనురాగతః.
వ్యుత్థాపయన్తు వా కృష్ణాం బహుత్వా త్సుకరం హి తత్,
అథవా పాండవాం స్తస్యాం భేదయన్తు తత శ్చతామ్.

టీ—వ్యుత్థాపనం తు స్వభర్తౄణాంత్యాగః. సచ బహుత్వాదోషేణ సుకరః, అథవేతి—తస్యాః భర్తృషు వైమమ్యం ప్రదర్శ్య పాండవానేవ వా తస్యాం భేదయన్తు. తతశ్చ తాం లప్స్యామహే ఇతి శేషః.

"ఇహాగతేషు వా తేషు నివేశవశవర్తిషు,
ప్రవర్తిష్యామహే రాజన్ యథా శాస్త్రం నిబర్హణమ్.
అథవా ధర్శనీయాభిః ప్రమదాభి ర్విలోభ్యతామ్,
ఏకైక స్తత్ర కౌన్తేయ స్తత కృష్ణా విరజ్యతామ్.
ప్రేష్యతాం చైవ రాధేయ స్తేషా మాగమనాయ వై,
ఏతేషా మప్యుపాయానాం యస్తే నిర్దోషవా న్మతః.

తస్య ప్రియోగ మాతిష్ఠ పురా కాలోఽతివర్తతే,
ఏషా మమ మతి స్తాత నిగ్రహోయ ప్రివర్తతే.
సాధ్వీ వా యది వాఽసాధ్వీ కిం వా రాధేయ మన్యసే.''

ఉపాయజ్ఞులచేత పాండవులలో పరస్పరానురాగమును తొల గించి వారిలో వారికి భేదాభిప్రాయమునైన పుట్టింపవలయును. లేదా, ద్రౌపది తనపతులను విడిచిపెట్టునట్లయినను చేయవలయును. బహుపతి త్వదోషమునుబట్టి యది సుకరమైన మార్గము.

లేదా, భర్తలయందామెకు వైషమ్య మున్నట్లు ప్రదర్శించుచు పాండవులకే ఆమెయందు భేదాభిప్రాయము కలుగునట్లుచేయవలయును. అపై ఆమెను స్వాధీనము చేసికొనవచ్చును.

లేదా, వారి నిక్కడకే రప్పించి మనస్వాధీనములో నుంచుకొని యథాశాస్త్రముగా వారియెడల నిగ్రహోపాయములను నడుపవయును.

లేదా, స్త్రీరత్నములను పాండవులలో నొక్కొక్కనికి సంధా నముచేసి యామార్గమున స్త్రీలోలురైన యొక్కొక్కనినుండి ద్రౌపది విరక్తి నొందునట్లైన చేయువలయును.

వారి నిక్కడకు దీసికొని వచ్చుటకు గర్ణుని బంపవలయును. తండ్రీ! ఈఉపాయములలో నేదిమంచిదో దానినే నీవవలంబింపవలయును. కాలాతిక్రమణమైనయెడల ద్రుపదునితో వారి కనుబంధము పెరిగిపో వును. ఇది నేనాలోచించినది. కర్ణుడా! ఇది బాగున్నదో లేదో నీవు చెప్పుము. అనెను.

అది విని కర్ణుడిట్లనెను—

దుర్యోధన తవ ప్రజ్ఞా న సమ్యగితి మే మతిః,
నహ్యుపాయేన తే శక్యాః పాండవాః కురువర్ధన.
పూర్వ మేవ హి తే సూక్ష్మై రుపాయై ర్యతితా స్త్వయా,
నిగ్రహీతుం తదా వీర నచైవ శకితాస్త్వయా.
ఇహైవ వర్తమానా స్తే సమీపే తవ పార్థివ,

అజాతపక్షా శ్శిశవ శ్శకితా నైవ బాధితుమ్.
జాతపక్షా విదేశస్థా వివృద్ధా స్సర్వశోఽద్య తే,
నోపాయసాధ్యాః కౌన్తేయా మమైషా మతి రచ్యుత.
నచ తే వ్యసనై ర్యోక్తుం శక్యా దిష్టకృతేన చ,
శకితా శ్చేప్సవ శ్చైవ పితృపైతామహం పదమ్.
పరస్పరేణ భేదశ్చ నాధాతుం తేషు శక్యతే,
ఏకస్యాం యే రతాః పత్న్యాం న భిద్యన్తే పరస్పరమ్.
నచాపి కృష్ణా శక్యేత తేభ్యో భేదయితుం పరైః,
పరిద్యూనాన్ వృతవతీ కిముతాఽద్య మృజావతః.
ఈప్సితశ్చ గుణః స్త్రీణా మేకస్యా బహుభర్తృతా,
తం చ ప్రాప్తవతీ కృష్ణా న సా భేదయితుం క్షమా.

టీ— దిష్టకృతేన=దైవనిర్మాణేన. శకితాః=శక్తిమన్తః. జతుగృహాదిభ్య ఆత్మానం మోచయితుం శక్తా అభూవ న్నిత్యర్థః. పరిద్యూనాన్=శోచ్యాన్. భిక్షాభోజిత్వాదినా మృజావతః=సువేషాన్.

"తస్మా న్నోపాయసాధ్యాం స్తా నహం మన్యే కథఞ్చన,
ఆర్యవ్రత శ్చ పాంచాల్యో న స రాజా ధనప్రియః.
న సంత్యక్ష్యతి కౌన్తేయాన్ రాజ్యదానై రపి ధ్రువమ్,
నహి సామ్నా న దానేన న భేదేన చ పాండవాః.
శక్యా స్సాధయితుం తస్మా ద్విక్రమేణైవ తాన్ జహి (ఆది అ 202)

ఓదుర్యోధనా! నీయూహ సరియైనది కాదు. ఉపాయములచే పాండవులను నిగ్రహించుట శక్యము కాదు. పూర్వము నీసమీపమం దున్నప్పుడు బాలురై యున్నప్పుడు అసహాయులై యున్నప్పుడు వారిని నిగ్రహించుటకు నీవవలంబించిన యుపాయములలో నొక్కటియైన ఫలించినదా? నేడు విదేశస్థులై ససహాయులై సర్వవిధముల ప్రవర్ధమానులై యున్నట్టి పాండవులయం దుపాయములు ఫలించునా?

వారి కాపదలు కలిగించుటకూడ శక్యము కాదు. అట్టి లక్క-యింటినుండి దైవనిర్మాణమును బట్టి యాత్మరక్షణముజేసికొనిన శక్తిమంతులు వారు. వారు పితృపితామహక్రమాగతమగు రాజ్యమును బొందదలచిన వారు.

వారిలో వారికి వైషమ్యము కలిగించుట కూడ శక్యముకాని పనియే. ఏకపత్నియందనురక్తులై యున్నవారికి వైషమ్య మసంభవము ద్రౌపదికి వారియందు వైషమ్యము కలిగించుటయు నశక్యమే. భిక్షాన్నభుక్కులై యున్న దురవస్థలోనే వారిని వరించినట్టి ద్రౌపదికి సర్వవైభవసమృద్ధులై యున్నదశలో వారియందు వైషమ్యము కలుగుట అసంభవము. ఇంతేకాక స్త్రీల కిష్టమయినట్టి బహుపతిత్వ మామెకు లభించినది. అందుచేగూడ పాండవులయందు ద్రౌపదికి గల అనుబంధ మభేద్యము.

ధనలుబ్ధుడు కాక పూజ్యుడైనట్టి ద్రుపదుడు రాజ్య మిచ్చినను పాండవులను పరిత్యజించడు నిజము; కనుక పాండవు మొడల సామదానభేదోపాయములు ఫలించవు పరాక్రమము జూపి వారిని వధించి రాజ్య మనుభవింపుము అని.

ఈకర్ణదుర్యోధనసంభాషణములో పాండవుల సౌజన్యము, సౌభ్రాత్రము, సౌహార్దము, అసదృశములనియు; ద్రౌపదీదేవి సౌముఖ్యము, సౌభాగ్యము, సౌశీల్యము అసదృశములనియు ద్రౌపదీపాండవదాంపత్యానుబంధము అసదృశము, అభేద్యము అనియు సారాంశము.

ఒక స్త్రీయందనురక్తులై పాండవు లున్నారనియు స్త్రీకి బహుపతిత్వ మిష్టము. అది ద్రౌపదికి సంభవించిన దనియు కర్ణుడనియున్నాడు. ఆవిషయమై కొంచె మనుకొనవలసియున్నది.

—: సుందోపసుందచర్య :—

అనేకులకు ఏకకాంతానురక్తి, ఏకకాంతకుఅనేకపురుషానువృత్తి ప్రాణహానికరములుకాని, సుకరములు కావు. ఇది లోకానుభవసిద్ధమైన విషయము.

దీనికి నిదర్శనము సుందోపసుందచర్య— హిరణ్యకశిపువు వంశములోని నికుంభునకు సుందుడు ఉపసుందుడు అని యిరువురు పుత్రులుండిరి.

"తావేకనిశ్చయౌ దైత్యావేకకార్యార్థసమ్మతౌ,
నిరన్తర మవర్తేతాం సమదుఃఖసుఖా వుభౌ.
వినాఽన్యోన్యం న భుఞ్జాతే వినాఽన్యోన్యం న జల్పతః,
అన్యోన్యస్య ప్రియకరా వన్యోన్యస్య ప్రియంవదౌ.
ఏకశీలసమాచారౌ ద్విధైవైకోఽభవ త్కృతః,
తౌ వివృద్ధౌ మహావీర్యౌ కార్యే ష్వప్యేకనిశ్చయౌ."

ఆసుందోపసుందులు ఒకే సంకల్పము, ఒకే నిశ్చయము కలిగి, యెడతెగని గాఢానురాగముతో సమానమైన సుఖదుఃఖములు కలిగి యుండిరి. వారొకని విడిచి యొకరు భుజించి యెరుగరు. ఒకని విడిచి యొకరు మాట్లాడియెరుగరు. పరస్పరప్రియభాషణులై పరస్పరప్రియకరులై యేకశీలము, నేకాచరణము కలిగియుండువారు. రెండుగా జేయబడిన ఒకే వస్తువువలె నుండువారు.

అట్టివారొకప్పుడు వింధ్యపర్వతప్రాంతవనములో సుఖాసీనులై యుండ నచ్చటకు వచ్చి విహరించు తిలోత్తమ వారికి గోచరించినది. అప్పుడు—

"తాం వృష్ట్వా యాసనం హిత్వా జగ్మతు ర్యత్ర సా స్థితా,
ఉభౌ చ కామసమ్మత్తౌ వుభౌ ప్రార్థయతశ్చ తామ్.
దక్షిణే తాం కరే సుభ్రూం సుందో జగ్రాహ పాణినా,
ఉపసుందోపి జగ్రాహ వామే పాణౌ తిలోత్తమామ్,

మదకామసమావిష్టౌ పరస్పర మథోచతుః,
మమ భార్యా తవ గురు రితి సుందోఽభ్యభాషత.
మమ భార్యా తవ వధూ రుపసుందోఽభ్యభాషత,
నైషా తవ మమైషేతి తత స్తౌ మన్యు రావిశత్.
తస్యా రూపేణ సంమత్తౌ విగతస్నేహ సౌహృదౌ,
తస్యా హేతో ర్గదే భీమే సంగృహ్ణీతా ముభౌ తదా.
ప్రగృహ్య చ గదే భీమే తస్యాం తౌ కామమోహితౌ,
అహం పూర్వం నహం పూర్వ మిత్యన్యోన్యం నిజఘ్నతుః.
తౌ గదాభిహతౌ భీమౌ పేతతు ర్ధరణీతలే," (ఆది. అ. 212)

వారు తిలోత్తమను జూచిన వెంటనే దిగ్గున లేచి యామె యొద్దకు వెళ్లి కామావిష్టులై యిరువురు నామెను ప్రార్థించిరి. అందులో జ్యేష్ఠు డగు సుందుడు ఆమె దక్షిణహస్తమును గ్రహించి యర్థించు చుండ, వామహస్తమును గ్రహించి ఉపసుందు డర్థింపసాగెను. కామ మదావిష్టులైన వారిరువురును ఒకరితో నొకరిట్లు సంభాషించిరి. ఈమె నాభార్యకనుక గురుస్థానీయురాలైన యీమె నీకు వావి కాదు.. స్పృశింపకుమని సుందు డనెను. ఈమె నాభార్య కనుక కోడలయిన యీమె నీకు వావి కాదు. నీవు స్పృశింపకు మని యుపసుందు డనెను. ఈమె నాభార్యయని యొకడు, నాభార్యయే యని యొకడు, ఈమెను ముందు నేను గ్రహించితి నని యొకడు, నేనేగ్రహించితి నని యొకడు, కలహమునకు దిగి ఆగ్రహావిష్టులై ఆమె రూపలావణ్యములచే మోహితులై తమకు గల స్నేహసౌహార్ద ములను ఆమెనిమిత్తమై భగ్నముచేసికొని ఆయిరువురును తమతమ గదలు తీసికొని యొకరి నొకరు కొట్టుకొనుచు ద్వంద్వయుద్ధము జేసి పరస్పరప్రహారములచే నిరువురును మరణించిరి. ఇదియే 'సుందోప సుందచర్య' ఇదియే అనేకుల కేకకాంతయందు కలిగిన అనురాగము యొక్క ఫలితము. ఆ సుందోపసుందుల స్నేహసౌహార్దములు తిలోత్త

మాదర్శనపర్యంతము వర్ణనాతీతములు. అట్టివి యామెపై యనురాగము కలిగినంతమాత్రమున అంతరించిపోయినవి.

తిలోత్తమ యేమైన మిత్రభేదముచేసెనా? ఆమె అధరస్పంద మైన చేసినట్లు లేదు. కనుక అనేకుల కేకకాంతానురక్తి ప్రాణహాని కరము.

ఇట్టిస్థితిలో ఏకపత్నియైన ద్రౌపదీదేవియందు అవిచ్ఛిన్నాను రక్తి కలిగిన పాండవపంచకమునకు గల పరస్పరస్నేహసౌహార్దములు అభేద్యము లని శత్రువులచే గూడ కీర్తింపబడినపుడు ఆపాండవు లెంత లోకోత్తరమహత్త్వముకలవారో ఆపంచపతులతో న్యూనాధికభావ మిసుమంతయు లేక గాఢానురాగముతో సమానప్రీతిపత్తితో శత్రు వులుకూడ శ్లాఘించునట్లు మెలగిన ద్రౌపదీదేవి యెంత లోకోత్తర మహత్త్వము కలదో, ద్రౌపదీపాండవదాంపత్యానుబంధ మెంతలోకో త్తర మైనదో, ఎంత సంస్తవనీయమైనదో, ఎంత అనితరసాధారణమై నదో బుద్ధిమంతులు గ్రహింతురుగాక!

స్త్రీకి యిష్టమైన బహుభర్తృత్వము ద్రౌపదీదేవికి సిద్ధించిన దని కర్ణుడనినాడు. బహుభర్తృత్వమున కిష్టపడు స్త్రీ ఆబహుభర్తృ త్వముతో ప్రాణాపాయము దెచ్చుకొనక, వైరుద్ధ్యము గలిగింపక మెలగినట్లు లోకానుభవములో గాని, కథలలో గాని కనబడదు. ఒక ద్రౌపదీదేవికే అది చెల్లినది. కనుక బహుభర్తృత్వము నభిలషించెడి పామరస్త్రీలతో ద్రౌపదీదేవిని పోల్చుట మతిమంతులకు దగదు.

పాండవులు పంచేంద్రులు కాని మానవమాత్రులు కారు. ద్రౌపదీదేవి స్వర్గలక్ష్మి కాని సామాన్యస్త్రీ కాదు. కనుకనే వారిదాంప త్యానుబంధ మసదృశమనియు, నభేద్యమనియు శత్రువులగు కర్ణదుర్యో ధనులే చెప్పుకొనినారు.

—: ద్రౌపదీపాండవదాంపత్యమును టిబెట్టుదేశీయ
దాంపత్యమనుట నింద్యము :—

ఇట్టి యనన్యసామాన్యమైన ద్రౌపదీపాండవదాంపత్యమును టిబెట్టుదేశమందలి పామరజనదాంపత్యముతో పోల్చి, వీరును టిబెట్టుదేశస్థులే అను ప్రతివాదుల ధోరణి నింద్యము.

'పీపుల్ ఆఫ్ నేషన్సు' అను టిబెట్టుదేశచరిత్రాత్మకగ్రంథములో నచ్చటి దాంపత్యవైభవ మెట్లు చెప్పబడెనో చూడుడు—

"కుటుంబమునకు తల్లియగు స్త్రీ మరణించినపుడు తండ్రిగాని, కుమారుడుగాని, మరొకతెను వివాహ మాడును. ఆమె యేకకాలమందు ఆకుటుంబమందలి పురుషులందరికిని భార్యయగును. అన్నలు చెల్లెండ్రును గాని, పినతండ్రి పెదతండ్రి పిల్లలు పరస్పరము గాని వివాహమాడుట చట్టముచే నిషేధింపబడినది. భర్తలు సంపాదించిన ధనమంతయు భార్యకు నప్పచెప్పవలయును. తిరిగి భర్తకు గావలసినచో ఆమెను బ్రతిమాలి తీసికొనవలయును.

భర్తలలో నెవరైన తమ సంపాదన భార్యకీయక దాచుకున్నాడని కనుపెట్టినచో ఆమె చాల కోపపడి అతని చెంపలు వాయించును.

భార్యకుగాని భర్తకుగాని వైముఖ్య మేర్పడినపుడు విడాకులిచ్చుకొని వివాహసంబంధమును తెగగొట్టికొనుట, వివాహపుటొడంబడికలో చట్టసమ్మతమైన షరతు.

ఇట్టి నికృష్టమైన పామరజనదాంపత్యముతో ఈశ్వరనిర్దిష్టమై, పరమపవిత్రమై, అనన్యసాధారణమయిన ద్రౌపదీపాండవదాంపత్యమును భారతీయుడే పోల్చుట యెంతనింద్యము?

—: "పంచ మే పతయ స్సన్తి మహ్యాం షష్ఠోపి రోచతే"
అనునది ద్రౌపదీవాక్యమనుప్రసంగము—
తన్నిరాకరణము :—

నీతిశాస్త్రము అను పేరుగలిగి 1911 క్రీ॥సం॥లో ముద్రితమై అక్కడక్కడ శ్లోకములను సంగ్రహించి వానికి తాత్పర్యము వ్రాయబడి యున్న యొక చిన్నపుస్తకములో నిట్లున్నది—

ద్రౌపద్యువాచ—

"పంచ మే పతయ స్సన్తి మహ్యాం షష్ఠోఽపి రోచతే,
పురుషాణా మభావేన సర్వా నార్యః పతివ్రతాః."

ఆగ్రంథమున ముఖపత్రమందిట్లు వ్రాయబడినది— "అశేష విద్వజ్జనవిరచితగ్రంథస్థనీతిప్రబోధకగ్రంథములనుండి క్రోడీకరింపబడిన శ్లోకంబులు గలది" ఈపరిస్థితిని బట్టి పైశ్లోకము ఆర్షగ్రంథస్థ మను టకు వీలు లేదు. అది యెక్కడిదో ఆపుస్తకములో చెప్పబడ లేదు.

ఇట్లుండగా నాశ్లోకములోని పూర్వార్థము సందుకొని తనకు అయిదుగురు పతు లున్నను ఆరవవానియం దభిరుచి యున్నట్లు ద్రౌపది చెప్పె నని యా ఆరవవాడు కర్ణుడని దాని కేదో తాత్పర్య మని కొందరు కోలాహలము చేయుచున్నారు.

అస లది ద్రౌపదీవాక్య మనుట కేమి ప్రమాణ మని మే మడు గుచున్నాము. అజ్ఞాతవాసములో విరాటపత్ని యగు సుదేష్ణకు తాను పరిచారికయై కాలము గడుపుచున్నపుడు, నీవు వెళ్ళి కీచకుని యింటి నుండి భక్ష్యాదులను తెమ్మని సుదేష్ణ యాజ్ఞాపింప, తానక్కడకు తప్పక వెళ్ళవలసివచ్చుటయు, అంతకు బూర్వమె కీచకుడు తనయెడల కామాంధుడై యున్న సంగతి తెలిసియే యుండుటయు నను క్లిష్టప రిస్థితిలో జిక్కుకొనియే ద్రౌపదీ దేవి—

"యథాహ మన్యం భర్తృభ్యో నాభిజానామి కంచన,
తేన సత్యేన మాం ప్రాప్తాం మా కుర్యాత్కీచకో వశే."

నాపతులకంటె అన్యుని నేను భావింపనిదానినై తినేని ఆసత్యమే నన్ను కీచకుని ముప్పునుండి కాపాడితీరును. అని తనపాతివ్రత్యమునే శరణుపొందినదో ఆద్రౌపదీదేవి "మహ్యాం షష్ఠోపి రోచతే" అని చెప్పి నదా? ఏద్రౌపదీదేవి సత్యభామతో—

"దేవో మనుష్యో గంధర్వో యువా చాపి స్వలంకృతః,
ద్రవ్యవా నభిరూపో వా న మేఽన్యః పురుషో మతః."

(వనప. అ. 233)

దేవగంధర్వాదులలోనివాడైనను, ఎంతవాడైనను పరపురుషుని నేను భావింప నని చెప్పినదో ఆ ద్రౌపదీదేవి "మహ్యాం షష్ఠాపి రోచతే" అని చెప్పినదా?

మత్స్యయంత్రమును గొట్టుట కుద్యమించిన కర్ణుని జూచి—

"దృష్ట్వా తు తం ద్రౌపదీవాక్య ముచ్చై ర్జగాద నాఽహం వరయామి సూతమ్." (ఆది. అ. 187)

సూతుని నేను వరింప నని కంఠమెత్తి యే ద్రౌపదీదేవి యని నదో ఆ ద్రౌపదీ దేవి "మహ్యాం షష్ఠాఽపి రోచతే" అని నాకు కర్ణునియం దభిలాష కలదని చెప్పినదా?

ద్యూతసభలో తాను పడిన కష్టములు కృష్ణభగవానునితో జెప్పుకొనునపుడు—

"న చ మే శామ్యతే దుఃఖం కర్ణో యత్ప్రాహ స త్తదా." (వనప. అ. 12)

ఆ. "కర్ణు నగవు లోకగర్హితుండగు దుస్ససేను చెయిదికంటె శిఖయుపోలె నడరి నామనంబు నతిదారుణక్రియ నేడ్చుచున్నయాదిమహీధరుండ" (ఆంధ్రభారతము.)

అనుచు, అప్పుడు కర్ణుడు కష్టస్థితిలోనున్న నన్ను జూచి నవ్వి నపుడు కలిగిన నా దుఃఖము చల్లారకున్న దని చెప్పిన ద్రౌపదీదేవి "మహ్యాం షష్ఠాపి రోచతే" అనుచు నాకు కర్ణునియం దభిలాషకలదని చెప్పినదా?

ఏ ద్రౌపదీదేవినిగూర్చి దుర్యోధనునితో కర్ణుడు—

"నచాపి కృష్ణా శక్యేత తేభ్యో భేదయితుం పరైః."

పాండవులనుండి ద్రౌపదిని విడదీయుట యెవ్వనికిని శక్యము కాదని చెప్పియుండెనో ఆద్రౌపదీదేవి "మహ్యాం షష్ఠాఽపి రోచతే." అని చెప్పినదా?

మరియు, నా కైదుగురు పతులున్నను పరపురుషునియందే అభిరుచి కలదు. కాబట్టి స్త్రీలందరు పరపురుషులు దొరకనపుడే పతివ్రతలగుదురు. అని పవిత్రమైన ద్రౌపదియన్నమాటేనా? మనోవాక్కాయములలో దేనిచేతను పరపురుషసంబంధ మెరుగనట్టి సతీమతల్లులే జగద్విఖ్యాతి వహించిన పతివ్రతలై యుండ, పరపురుషవాంఛయను మానసిక ప్రవృత్తియుండి, పరపురుషులు దొరకక తత్సాంగత్యము లేకుండిన స్త్రీలే పతివ్రత లగుచున్నా రనుటకంటె అక్రమ మున్నదా? అది పతివ్రతయైన ద్రౌపదీదేవి యన్న దనుటకంటె తప్పున్నదా?

జగద్విఖ్యాతి వహించిన సీతాఽనసూయాసత్యవతీదమయంతీప్రభృతిసతీమతల్లులు పరపురుషులు దొరకక పతివ్రతలైనవారేనా?

కనుక నది ద్రౌపదీవాక్య మనుట అత్యంతవిరుద్ధము. 'పంచమే పతయస్సన్తి' అనుమాటనుబట్టి పంచపతులు కలది ద్రౌపది యనుకొని యది ద్రౌపదీవాక్యముగా భ్రాంతిపడినారు. పూర్వోక్తవిరుద్ధములనుబట్టి యది ద్రౌపదీవాక్యము కాదనితెలియవలయును.

అది యనేకపతిసంబంధము కల యొకానొకజారిణి వాక్య మనవలయును. అప్పుడామె తన పరిస్థితి కనుగుణముగా లోకమును దలచి స్త్రీలందరియొక్క చరిత్రమును ప్రతిపాదించినట్లు ఆశ్లోకము సమన్వితమగును. అప్పు డాశ్లోకార్థ మేమనగా? నాకయిదుగురు పతులుగలరు. ఆరవవానియందు మనస్సు ప్రసరించుచునేయున్నది. దీనిని బట్టి స్త్రీలందరు పరపురుషులు దొరికనప్పుడే పతివ్రత లగుచుందురు అని.

ఇది మనోనిగ్రహము దుర్ఘట మనుటకు గావచ్చును. దైహికపరపురుషసాంగత్యము లేకుండినట్టి స్త్రీసామాన్యముయొక్క పతివ్రతాలక్షణకథనము కావచ్చును. అది తన వృత్తి కనుగుణముగా చెప్పబడిన మాటయు గావచ్చును.

అందుచే త్రికరణశుద్ధి గల సీతాసత్యవతీద్రౌపదీదమయంతీప్రభృతుల నావాక్యము స్పృశింపనేరదు; కనుక విరోధ ముండదు.

ఇదియే శ్లోకమునకు పరమార్థము కనుక నాశ్లోకము ద్రౌపదీవాక్యము కాదని గ్రహింపవలయును.

—: "మహ్యం మప్యేష రోచతే' అనునది ద్రౌపదీవాక్యమే అని దానిని బలపరచు కర్ణచరిత్రకారుల ప్రసంగము— తన్నిరాకరణము :—

వడ్లమూడి చినసీతారామశాస్త్రిగారి కర్ణచరిత్రలో నిట్లున్నది—

1. "అట్లామె (నాలాయని) వరము కోరుటలో బతి యని మొదట మాటలు బలుకునపు డుచ్చారణస్వభావమున నైదుపర్యాయములు పతిశబ్దమును, నొకపకారమును నామెనోటనుండి వచ్చె ననియు, నాకారణమువనె యామెకు శుల్కముగు మత్స్యయంత్రపు మథన సమయమున సమర్థుడై కుంతికి బుత్రుడై కర్ణుడును శుల్కార్థమును నెఱవేర్చె ననియు నీకారణమునవె ద్రౌపదకిని గర్ణుసంగమును నభి ప్రాయ ముండెననియు గాథలు గలవు.

2. ఈగాథల బండుపాట యను నొకపాట బలపరుచుచున్నది—

"అర్జును డొకనా డొక చెట్టున నాటు యోజనములమీదను వ్రేలు చున్న యొకపండును దునిమెను. ఆసమయమున శ్రీకృష్ణుడు వచ్చి అయ్యో! ఎంతపనిచేసితివి? ఈచెట్టున ప్రతిదినమును నొకపండు పండుచుండును. అది యొకఋషి కాహారము. దానిని నీవెఱుగక తెగ వేసితివి కాన నాఋషి శపింపగలడు. అయినను నేనొక యుపాయము జెప్పెదను మీరాఱుగురును మీమనస్సులలో నున్న సత్యమైనయుద్దే శమును నాయెదుట వెల్లడింపుడు. అట్లయిన నీపండు మరల నెప్పటి యట్ల వృక్షము నంటుకొనును. అని పలికెను. అప్పుడు వారు తమ తమ యుద్దేశములను వెల్లడించుటలో ద్రౌపది—

"పంచ మే పతయ స్సన్తి మహ్యం మప్యేష రోచతే"

నాకయిదుగురు భర్తలు గలరు. ఆఱవవానియం దభిరుచిగలదు అను మొదలగు సంశయములాపాటలో నున్నవి.

3. మనవారు ప్రమాణములుగా గ్రహించుచున్న పురాణములందే పెక్కువిషయములు యుక్తిశూన్యమై యుండగా నీపాట సయుక్తికముగా లేకుండుట యొక వింతకాదు.

4. కాని యిందలి యంశములలో బయి నుదహరించిన ద్రౌపదీ వాక్యములకు "పశ్చే త్వాం చ తథా కాలే ద్రౌప ద్యుపగమిష్యతి" అను మహాభారతములోని శ్రీకృష్ణవాక్యము సంవాదముగా నగపడుచున్నది. దీనికి తిక్కయజ్వ భాషాంతరీకరించియున్నాడు.

5. పైనుదాహరించిన పంచుపాటలో జెప్పబడినట్లు శ్రీకృష్ణుడు ద్రౌపదివల్ల నామె యభిప్రాయమును విని యే యుండకున్న నిట్లు పలుక సాహసించునా?

ఈమొదంశములను బరిశీలింతము—

యోగశక్తులు గల మౌద్గల్యమహర్షి, తాను కుష్ఠవ్యాధిగ్రస్తుడై గోచరించునపుడు పత్నియగు నాలాయని తనకు జేసిన శుశ్రూషకు అమితానంద మొంది మానినీ! నేను నిన్నెట్లు సంతోషపెట్టవలయునో చెప్పుము. అట్లు చేయుదు నని యడిగినపుడు—

"పంచధా ప్రవిభక్తాత్మా భగవన్ లోకవిశ్రుతః,
రమయ త్వం మచిన్త్యాత్మన్ పున శ్చైకత్వ మాగతః."

అపారమహిమకల మహానీయా! నీవయిదుమూర్తులు ధరించియు, మరల ఏకమూర్తినిధరించియు నన్ను సంతోషపెట్టుమని యానాలాయని కోరినది.

"స పంచధా తు భూత్వా తాం రమయామాస యోగతః."

ఆముని అదేవిధముగా సంతోషపెట్టెను. కొంతకాలమునకు ముని విరక్తుడై యామెను విడిచి యోగనిష్ఠను వహించునపుడు విరక్తి కలుగని యా నాలాయని నన్ను విడువబోకుమని వేడగా నా మౌద్గల్యముని యామె కిట్లు చెప్పెను—

"భవిష్యసి నృలోకే త్వం రాజపుత్రీ యశస్వినీ,
పాంచాలరాజస్య సుతా ద్రుపదస్య మహాత్మనః.
భవితార స్తత్ర తవ పతయః పంచ విశ్రుతాః,
తై స్సార్థం మధురాకారై శ్చిరం రతి మవాప్స్యసి."

నీవు ముందు ద్రుపదపుత్రికవై జన్మించి యశశ్శాలినివై యుందువు. అపుడు లోకవిఖ్యాతులగు పంచపతులు కలిగి నీ వుందువు. వారితో చిరకాలము నీ వానందింతువు. అని.

ఆమాట విని చింతించినది. తరువాత శరీరము చాలించి మరుజన్మమున కాశిరాజపుత్రికయై జన్మించి, పతికై యీశ్వరుని గూర్చి తపము చేసినది. అంతట నీశ్వరుడు ప్రత్యక్షమై వరము కోరుమనగా, నామె 'పతిం దేహి' అని యైదుసారు లన్నది. అట్లనుటకు వెనుకటి మునివాక్యమమోఘ మగుటే కారణము. ఆపై యీశ్వరుడు—

"పంచకృత్వ స్త్వయా చోక్తః పతిం దేహీ త్యహం పునః,
పంచ తే పతయో భద్రే భవిష్యన్తి సుఖావహాః."

నీవయిదుసారు లనుటవలన నీకు పంచపతులు కలుగగల రనెను; అప్పు డామె నా కస్లైన నిత్యము కన్యాత్వము సిద్ధించున ట్లను గ్రహింపుమని ప్రార్థించెను. ఆపై యీశ్వరు డట్లే—
"పంచభిః ప్రాప్య కౌమారం మహాభాగా భవిష్యసి"

అని వరమిచ్చెను. విమయ మిట్లుండగా. పతిశబ్ద మయిదుపర్యాయములు వచ్చి ఆపై పకారము కూడ వచ్చె ననుటేమి ? దానిని మత్స్యయంత్రకాలమున శుల్కార్థమును కర్ణుడు నెరవేర్చె ననుట యేమి? ఆకారణమున ద్రౌపదికిని కర్ణునం దభిప్రాయముండె ననుటేమి? ఆమె యుచ్చరించిన పతిశబ్దములకు పాండవు లర్థమైతే పకారమునకు కర్ణుడర్థమా? మత్స్యయంత్రమును గొట్టుటకై కర్ణుడు సిద్ధపడినపుడు "అధమకులు డగు సూతుని నేను వరింపను" అని ద్రౌపది పలికినందున నాతడు లజ్జించి సూర్యునివైపు సాభ్యసూయముగ జూచుచు వింటిని విడిచి మరలిపోయెను. (పు ౪౭)

అని వ్రాసిన యీకర్ణచరిత్రకారులే ద్రౌపదికిని కర్ణునం దభిప్రాయ ముండెనని వ్రాయుట, శల్యార్థ మాతడు నెరవేర్చె ననుట అసంగతము. కనుక ప్రథమాంశము పరాస్తమయినది.

ఇక ద్వితీయాంశము—పండుపాట—పండును గొట్టినవా డర్జును డట! అది మరల వృక్షము నంటుకొనుటకు సత్యమైన ఉద్దేశములను చెప్పవలసినవారు పాండవులు, ద్రౌపదియు నట! పాండవులు వెల్లడించిన యుద్దేశము లెట్టివో తెలియదుకాని ద్రౌపదిమాత్రము 'మహ్యం షష్ఠోపి రోచతే' అని వెల్లడించినదట! దీనితో పండు రివ్వునపోయి ఆ చెట్టు నంటుకొన్న దన్నమాట. అసలు ఆశ్లోకస్వరూప మిది—

"పంచ మే పతయ స్సన్తి మహ్యం షష్ఠోపి రోచతే,
పురుషాణా మభావేన సర్వా నార్యః పతివ్రతాః."

ఈశ్లోకము మహాభారతములో లేదు. ఉన్నదని ప్రతివాదులును అనలేదు. ఇచ్చట ప్రతివాదిమతప్రకారము 'మహ్యం షష్ఠోపి రోచతే' అనునది ఆమెకు సత్యమైన యుద్దేశ మనియే అనుకొన్నను 'పురుషుల అభావములోనే సర్వస్త్రీలు పతివ్రతలు' అని ఆమె సర్వస్త్రీల నెత్తుకొను టెందులకు? స్త్రీలకు పాతివ్రత్యము దుర్ఘట మని ఆత్మదృష్టాంతములో జెప్పుట కేర్పడిన దాశ్లోకము. శ్రీకృష్ణుడు సర్వస్త్రీల నుద్దేశించి యామె నడుగలేదు. ఆమెను మాత్రమె నీమనస్సులో గల సత్యమైన యుద్దేశ మేమని యడిగినట్లు ప్రతివాదులు వ్రాసినారు.

దానికి "మహ్యం షష్ఠోపి రోచతే" అని యామె చెప్పిన దని వ్రాసి యుత్తరార్థమును కప్పిపుచ్చుట ప్రతివాదుల కన్యాయ్యము.

ఒకవేళ సర్వస్త్రీల పాతివ్రత్య మిట్టిదే యని యామె మనస్సులోని యుద్దేశమనియు, ద్రౌపది పతివ్రత కాదనియు నందురా? అట్లైన కర్ణచరిత్రములోనే—

'ఈశ్వరప్రసాదవశమున నైదుగురు భర్తల నందినట్టియు, ననేక జన్మములనుండియు మహాపతివ్రతయై యున్నట్టియు ద్రౌపదిని బంధకి యనుట యుచితముగా నుండలేదు' (పు. 44).

అనువ్రతకు విరుద్ధము కాదా? ద్రౌపది పతివ్రత యని మాత్రమె కాక మహాపతివ్రత యనికూడ వ్రాసిన ప్రతివాదులు 'మహ్యాం పఞ్చాపి రోచతే' అని యామహాపతివ్రతయే అన్నదనుటయు, నట్లనుట జగదేకవీరులగు తన పతులసమక్షమందే అనుటయు, నదియు కృష్ణభగవానునితో నన్న దనుటయు నింతకంటె విరుద్ధమున్నదా? కనుక ప్రతివాదు లుదాహరించినది ద్రౌపదీవాక్యము కాదనితీరవల యును. కనుక ద్వితీయాంశము నిరస్తము.

పంచుపాట సయుక్తికముగా లేదని ప్రతివాదే ఒప్పుకొనినారు. కాని "మనవారు ప్రమాణములుగా గ్రహించుచున్న పురాణము లందే పెక్కువిషయములు యుక్తిశూన్యములై యున్నవి" అన్నారు. ఐతే మనవారిచే ప్రమాణములుగా గ్రహింపబడినవి అయుక్త(యుక్తి శూన్య)ము లగునా? అయుక్తము లైనచో మనవారిచే ప్రమాణము లుగా గ్రహింపబడునా? అను వివేచన వీరికి కలుగనేలేదు. ప్రతి వాదులు మాత్రమె అయుక్తమనుచు పంచుపాటను ప్రమాణీకరించి నారు. అది తప్పు. 'పురాణములు యుక్తిశూన్యములై యున్నవని మహాపురాణములను తృణీకరించు ఈమహాత్ములు తాము వ్రాసిన 'కర్ణచరిత్ర' అను ఒక లఘుగ్రంథములో పూర్వోత్తరవిరుద్ధములు యుక్తిశూన్యములు అయినవిషయముల నెట్లు వ్రాసినారో! వీరికి బుద్ధిబలము ఒకరి ననుటలోనె కాని తమపరిస్థితిని ఆలోచించుకొనుటలో లేదని తెలియుచున్నది.'

మహాపురాణములు యుక్తిశూన్యములు అప్రమాణములునా? ఆహా!

"పురాణన్యాయమీమాంసా ధర్మశాస్త్రాంగమిశ్రితాః,
వేదాః స్థానాని విద్యానాం ధర్మస్య చ చతుర్దశ".

అను యాజ్ఞవల్క్యవచనము చతుర్దశవిద్యాస్థానములలో చేరి నవి పురాణము లని, అవి ధర్మాధర్మప్రతిపాదకము లని వెల్లడించు

విషయము పాప మీ ప్రతివాదులకు తెలియదన్నమాట ! కనుక తృతీయాంశము పరాస్తము.

ఇక 4. 5. అంశములు—

ద్రౌపదీవాక్యమని ప్రతివాదు లుదాహరించిన "మహ్యాం మత్తోపి రోచతే" అనుమాటకు "షష్ఠే చ త్వాం తథా కాలే ద్రౌప ద్యుపగమిష్యతి" అని కర్ణునితో శ్రీకృష్ణుడు చెప్పినట్లున్న మహాభారతవచనము బలకరమగుచున్నదట. 'పంచుపాటలో జెప్పబడినట్లు ద్రౌపదివల్ల నామె యభిప్రాయము శ్రీకృష్ణుడు వినియే యుండకున్న నిట్లు పలుక సాహసించునా?' అట!

ఇచ్చట ప్రతివాదుల నడుగుచున్నాము—

మీయూహ ననుసరించి ద్రౌపది 'పంచ మే పతయ స్సన్తి మహ్యాం మత్తోపి రోచతే' అనికదా శ్రీకృష్ణునితో చెప్పినమాట. 'నాకైదుగురు భర్తలుగలరు. ఆరవవానియం దభిరుచి గలదు' అనియే కదా? మీరు దానికి వ్రాసినయర్థము? ఆ యారవవాడెవ్వడో ఆమె చెప్పలేదు కద. అట్లు చెప్పకుండుట కేమికారణము? ఒక వ్యక్తివిశేషము ఆమె యుద్దేశములో లేకుండుటా? ఉన్నను చెప్పుటకు జంకుటా? ఆమె యుద్దేశములో నున్న వ్యక్తివిశేషమును చెప్పుటకు జంకినదను పక్షములో 'మీమనసులలో నున్న సత్యమైన యుద్దేశములను నాయెదుట వెల్లడింపుడు.' అని శ్రీకృష్ణుడు చెప్పిన పద్ధతిని ఆమె తన సత్యమైన ఉద్దేశమును అనగా తన మనసులోనున్న వ్యక్తివిశేషమును వెల్లడింపని దగును. అప్పుడా రాలిన పండు మరల వృక్షము నంటుకొనక నేపోవును. అప్పుడా పంచుపాటగతి యేమి? ఇక ఆమెమనస్సులో వ్యక్తివిశేషమును గూర్చిన యుద్దేశము లేదను పక్షములో ఆమెకు లేని యభిప్రాయమును కర్ణునితో నిన్ను ద్రౌపది పొందును. అని శ్రీకృష్ణుడు చెప్పెనను టెట్లు? ఆమహాభారతములోని శ్రీకృష్ణవచనము పంచుపాటకు బలకర మగు టెట్లు? ద్రౌపదివల్ల నామెయభిప్రాయము శ్రీకృష్ణుడు వినియే యుండ

కున్న కర్ణునితో నట్లు పలుకఁ సాహసించునా? అంకురా? వినియుంచిన శ్రీకృష్ణుఁ డట్లుపలుకఁ సాహసించునని మీా కనిపించినదా ?

అట్లుపలికిన శ్రీకృష్ణుడెట్టివాడు? 'పరాత్పరుడగు శ్రీకృష్ణుఁడు సహాయుఁడై యుండ బాండవుల కెట్లాపదలు సంభవించును?(పు. 95) అని మీాచే గీర్తింపబడిన పరాత్పరుడే కద. ఆపరాత్పరుడు ద్రౌపదీదేవిని కర్ణునికి తార్చుటకై ప్రసంగించెననుటకంటె నింద్యమున్నదా?

ఇంకొకటి— మీా మతప్రకారము పండుపాటను బట్టి వెనుక జెప్పినట్లు, ద్రౌపది తనకు సత్యమైన యుద్దేశము కర్ణునియందు కాక మష్ఠునియందని వెల్లడించి యుండ, దానిని పరాత్పరుడు కర్ణునియందని గ్రహించి కర్ణునితో జెప్పెననుట, ఆచెప్పుట ద్రౌపదీవాక్యమును బట్టియే యనుట అసంబద్ధము. కనుక 4. 5.అంశములు పరాస్తములు.

'మహ్యాం మష్ఠాపి రోచతే' అనునది ద్రౌపదీవాక్యము కానే కాదనియు, కృష్ణభగవానుడు కర్ణునితో జెప్పిన మాటకు తాత్పర్యము లేదనియు వెనుక నిరూపించియున్నాము.

—: 'పంచ మే పతయ స్సన్తి' అనునది ద్రౌపదీ వాక్యమేఅనియు, 'ద్రౌపదికి భర్త ఒకడే' అనియు దేవరాజ్యమను గ్రంథము లోని ప్రసంగము— తన్నిరాకరణము :—

ప్రభాకర ఉమామహేశ్వరపండితులు "దేవరాజ్యము (ద్రౌపదికి భర్త ఒక్కడే)" అను గ్రంథము రచించి దాని యుపోద్ఘాతములో నిట్లు వ్రాసినారు—

"ద్రౌపదికి అయిదుగురు భర్త లుండినను ఆరవవాని ప్రేమించినటుల ఆరోపింపబడిన దోషమును నివర్తిచేయుటకు ఈ గ్రంథము వెలువడినది." అని.

దీనినిబట్టి వీరు ద్రౌపదీదేవియొక్క పవిత్రతాప్రతిష్ఠలను ప్రకటించుటకే గ్రంథము రచించినారని స్పష్టమగుచున్నది. వీరు "పంచ మే పతయ స్సన్తి" అనునది ద్రౌపదీవాక్యమనియే ప్రతిపాదించి దాని కర్థముచెప్పుటలో వేదాంతములోనికి దింపి అన్వయించినారు.

పాండవు లైదుగురు ఒక యింద్రుని రూపములే అని, ఒక యింద్రుడే పంచపాండవులై జన్మించుటవలన ద్రౌపదికి భర్త ఒక్కడే అని, సంస్కృతాంధ్రమహాభారతములు, మార్కండేయపురాణవచనములు అందుకు ప్రమాణములని వ్రాసియున్నారు.

ఆగ్రంథములోని విషయసూచికలో—

'దేవేంద్రుడు పంచపాండవులై జన్మించుట'

'పంచేంద్రులు పంచపాండవు లగుట'

ఇత్యాది పరస్పరవిరుద్ధవిషయములు ప్రతిపాదింపబడియున్నవి. పంచపాండవులు ఒక్క దేవేంద్రుని స్వరూపులే అను పక్షములో ఆ దేవేంద్రు డొక్కడేకనుక 'ద్రౌపదికి భర్త ఒక్కడే' అని చెప్పిన చెప్పవచ్చునేమోకాని పంచేంద్రులు పంచపాండవు లనుపక్షములో అట్లు చెప్పుటకు యుక్తి యేమున్నది?

ఒక్క దేవేంద్రుని స్వరూపములే అనుపక్షములో నయినను వారికి జన్మసిద్ధమైన భేద మపరిహార్యమై యుండ, నాలాయనికి మౌద్గల్యముని 'భవితార స్తతో తవ పతయః పంచ విశ్రుతాః' అని నీకు ముందు ద్రౌపదీజన్మములో పంచపతులు సంభవింతు రని చెప్పియుండ, పంచపతులు కారు. ద్రౌపదికి భర్త ఒక్కడే అను టెట్లు? మరియు— 'ఇంద్రుడు కారణాంతరమున మౌద్గల్యమునియందు జేరి నాలాయనిని పెండ్లాడెను' (పు. 33) అను దేవరాజ్యవచనమునుబట్టి ఆమౌద్గల్యముని యింద్రుడే అయియుండి తన భార్యయే అయియున్న నాలాయనితో ముందు ద్రౌపదివై జన్మింతువనియు, అప్పుడు పంచపతులు సంభవింతు రనియు చెప్పినవాడు— అప్పుడు ఇప్పటివలెనే అనగా పంచరూపములతోడను మరల ఏకరూపముతోడను నేను వర్తించుచున్న విధముననే ముందుకూడ నీకు నేనే భర్తనై యుందును. అని చెప్పవలసియుండ, ఆముని అట్లు చెప్పకుండుట కేమికారణము? పంచరూపములతోడను, ఏకరూపముతోడను విహరించుచువచ్చిన మౌద్గల్య

మని వ్యవహారమువంటిది పంచపాండవవ్యవహారము కాదనియే అట్లు చెప్పలేదని చెప్పితీరవలయును.

మాద్గల్యముని మధ్యమధ్య పంచరూపములు ధరించి వ్యవహరించినను జన్మసిద్ధమైన యేకత్వమునుబట్టి నాలాయనీభర్త యొక్కడనియే ప్రసిద్ధి.

పాండవుల యందు జన్మసిద్ధమైన అనేకత్వమునుబట్టి ద్రౌపదీ భర్తలనేకులని ప్రసిద్ధి. ఇట్టి స్థితిలో ఒక్క దేవేంద్రుని స్వరూపములే పాండవులయినను ద్రౌపదికి పతులైదుగురు అను వ్యవహారము అనివార్యమే. కనుకనే మార్కండేయ పురాణములో గూడ ప్రశ్న స్వరూప మిట్లున్నది—

"కస్మాచ్చ పాండుపుత్రాణా మేకా సా ద్రుపదాత్మజా,
పంచానాం మహిషీ కృష్ణా సుమహా నత్ర సంశయః."

ఒక్క ద్రౌపది అయిదుగురు పాండవులకు పత్ని యెట్లైనది? ఇది గొప్పసంశయము. అని.

ఆపై సమాధానము చెప్పుటలో అయిదుగురు దేవేంద్రుని యంశములే అనియు, ద్రౌపది శచీదేవి యంశమే అనియు, పంచపాండవుల కేకపత్నీత్వ మీవిధముగా వచ్చినదనియు బోధింపబడెను. అంతియు కాని ద్రౌపది కొక్కడే భర్త, అయిదుగురు కారు అని చెప్పబడలేదు. ఆ యైదుగురును ఇంద్రాంశావతారములే, వేరు కాదు. అనునదియే సమాధానము.

ఆ మార్కండేయపురాణవిషయ మిది—

ఒకప్పుడు దేవేంద్రుడు త్రిశిరుని వధింపగా బ్రహ్మహత్యను బట్టి యింద్రుని తేజస్సుపోయి యమధర్మరాజు నందు ప్రవేశించెను. మఱియొకప్పుడు వృత్రుని వధింపగా నాదోషమును బట్టి యింద్రుని బలముపోయి వాయుదేవుని యందు ప్రవేశించెను. మఱియొకప్పుడు అహల్య యొద్దకు వెళ్లగా నాదోషమున ఇంద్రుని రూపము పోయి

అశ్వినీ దేవతలందు ప్రవేశించెను. తరువాత నొకప్పుడు భూభారహరణమునకై ఆయా దేవతాంశము లుద్భవించునపుడు ఇంద్రుని తేజస్సును యమధర్మరాజు విడువగా యుధిష్ఠిరుడును, ఇంద్రుని బలమును వాయుదేవుడు విడువగా భీమసేనుడును, ఇంద్రుని రూపమును అశ్వినీ దేవతలు విడువగా నకులసహదేవులును, ఇంద్రుని వీర్యముచేతనే అర్జునుడును జన్మించిరి. ఈ అయిదుగురు ఇంద్రుని స్వరూపములే. ఆయింద్రుని భార్య యగు శచీదేవి యంశమే ద్రౌపదీదేవి. యోగీశ్వరులు అనేక శరీరములు ధరించుచుందురు. పాండవపంచకమునకు ఏకపత్నీత్వ మిట్టిది. అని.

ఆంధ్రలిపి మార్కండేయపురాణమందలి యా శ్లోకము లివిగో—

"బ్రహ్మహత్యాభిభూతస్య పరా హాని రజాయత,
తదా ధర్మం వివేశాథ శాక్రం తేజోఽపచారతః.
బ్రహ్మహత్యాభిభూతస్య తదా బల మశీర్యత,
తచ్ఛక్రదేహవిభ్రష్టం బలం వాయు మథాఽవిశత్.
గౌతమస్యాఽశ్రితో రూప మహల్యాం చ యదా వృషా,
ధర్షయామాస దేవేన్ద్ర స్తదా రూప మహీయత.
విహాయ దుష్టం దేవేన్ద్రం నాసత్యావగమత్తు తత్,
తేజోభాగై స్తతో దేవా అవతేరు ర్దివో మహీమ్.
ప్రజానా ముపకారార్థం భూభారహరణాయ చ,
యదిన్ద్రదేహజం తేజస్స్వన్ముమోచ స్వయం వృషః.
కున్త్యాం జాతో మహాతేజా స్తతో రాజా యుధిష్ఠిరః,
బలం ముమోచ పవన స్తతో భీమో వ్యజాయత.
ఉత్పన్నౌ యమళౌ మాద్ర్యాం శక్రరూపౌ మహాద్యుతీ,
శక్రస్య వీర్యత శ్చైవ జజ్ఞే పార్థో ధనంజయః.
ధర్మః పృథ్వ్యనిలో భీమో జలం పార్థోఽనలః స్మృతః,
నకులో రూపత శ్చాగ్నే స్సహదేవో నభస్స్మృతః."

పంచధా భగవా నిత్థ మవతీర్ణ శ్శతక్రతుః,
పౌలోమీ యా తు సంభూతా సా త్వియం ద్రుపదాత్మజా.
పంచానాం మహిషీ చైషాఽభూ దిన్ద్రాంశావతారిణామ్,
శక్ర స్యైకస్య సా పత్నీ కృష్ణా నాన్యస్య కస్యచిత్.
యోగీశ్వరా శ్శరీరాణి కుర్వన్తి బహులాన్యపి,
పంచానా మేకపత్నీత్వ మిత్యేవం కథితం తవ."

ఇచ్చట నొక్కవిషయ మాలోచింపవలసియున్నది. పాండవులు ఇంద్రుని యంశములే, అన్యులు కారు. అని చెప్పునట్టిదే పైజూపిన గ్రంథసందర్భము. అందు 'శక్రస్య వీర్యత శ్చైవ జజ్ఞే పార్థో ధనంజయః' 'పంచధా భగవా నిత్థ మవతీర్ణ శ్శతక్రతుః' అను వాక్యములకు మధ్య నున్న 'ధర్మః పృథ్వ్యనిలో భీమః' అను శ్లోకము సందర్భ విరుద్ధమగుటచే గ్రంథఘటకము కాదనవలసియున్నది. ఆశ్లోకము పంచపాండవులు పంచభూతము లని తెలుపుచున్నది. గ్రంథసందర్భ మన్ననో ఒక్క యింద్రునియంశములే వారు. అని తెలుపుచున్నది. కనుక సందర్భవిరుద్ధము.

ఇదియునుగాక పాండవపంచకమున కేకపత్నీత్వము యుక్తమా? అను ప్రశ్నపై చెప్పునట్టి సమాధానములో వారు ఒక్క దేవేంద్రుని యంశములే, ద్రౌపది యింద్రపత్ని యగు శచీదేవి యంశమే అని చెప్పుటే యుక్తముకాని, వారైదుగురు అయిదు (పంచభూత) స్వరూపములు అని చెప్పు టేమియుక్తము? అది యేమిసమాధాన మగును.

కనుక నాశ్లోకము గ్రంథఘటకము కాదు. అందుచేతనే నాగర లిపిగ్రంథములో నాశ్లోకము లేదు.

ఇటువంటి "ధర్మః పృథ్వ్యనిలో భీమః" అను శ్లోకమునే ఆధారముచేసికొని "పంచ మే పతయ స్సన్తి" అనునది ద్రౌపదీవాక్యమే అనుచు దాని కేమేమో భావపరంపరను దేవరాజ్యకారులు కల్పించిరి. ఇంతవరకు "ధర్మః పృథ్వీ" అను శ్లోకము గ్రంథఘటకము కానందున నది ప్రామాణికముగా స్వీకరింపదగినది కాదని తేలినది.

దేవరాజ్యములో—"ఇక భారతగ్రంథము దిలకింతము" అనుచు "పంచేంద్రులు పంచపాండవు లగుట" అని వ్రాసి పంచేంద్రోపాఖ్యానములోని విషయము సంగ్రహముగా చూపబడినది. అందు ఆంధ్రభారతములోని యీపద్య ముదాహరింపబడినది—

సీ. "హరువచనమున నా గిరిరాజవివరంబు
కరముల బట్టి చెచ్చెర దినేశ
చండమయూఖముల్ రెండు విధంబులై
యుండంగ జేసి యాఖండలుండు
తనయట్టివారల ఘనశరీరుల నంద
నలువుర నన్యుల వెలయ జూచి
యే నిట్టు లేలకో యేను(5)ప్రకారంబు
లయితి నిం దనుచు విస్మయము బొంది

ఆ. యున్నవాని జూచి గ్రిన్న నయ్యింద్రుల
నేవురను మహానుభావ మెసగ
మనుజయోని బుట్టు డని పంచె గీర్వాణ
హితముసేయు పొంటె మతి దలంచి".

ఈ పద్యములో శంకరుని యాజ్ఞపై యింద్రుడు పర్వతగుహను వివరించి చూడగా తనవంటివారు అందు నలువురు గోచరించినట్లును నే నిట్లు ఏలనో అయిదువిధములుగా నైతి నని ఆ యింద్రుడు విస్మయము నొందినట్లును చెప్పబడినది. ఈ పద్యమునకు మూలమైన శ్లోకములో నిట్లు లేదు చూడుడు—

"స త ద్వివృత్య వివరం మహాగిరే స్తుల్యద్యుతీం శ్చతురోఽన్యాన్ దదర్శ. స తా నభిప్రేక్ష్య బభూవ దుఃఖితః కచ్చి న్నాహం భవితా వై యథే మే".

ఆ యింద్రుడు గిరివివరమందు అన్యుల నలువురును తనతో సమానులై యున్నవారిని జూచి నేను గూడ వీరివలెనే యుం దుంచబడను కద! అని దుఃఖితు డయ్యెను. అని తాత్పర్యము.

దుఃఖితుడైనట్లు శ్లోకమం దుండగా విస్మితుడైనట్లు పద్యమం దున్నది. అచ్చట వారితోబాటు తాను కూడ పడియుండవలసి వచ్చునా యేమి? అని యనుకొనినట్లు శ్లోకమందుండగా నేనిట్లయిదు విధములుగా నైపోతి నేమి? అని యనుకొనినట్లు పద్యమం దున్నది. ఈ భేద మెట్లువచ్చినదో!

ఇంకొకటి, తన వంటివారి నన్యులను జూచినప్పుడు వీ రెవ్వ రను కొనుట సహజమా? ఇందరుగా నే నెట్లయితి నని యనుకొనుట సహజమా? ప్రతివాదులు చెప్పినట్లు ఆ యింద్రుడంతకుబూర్వమే అయిదు భాగములుగ జీల్పబడినట్టివాడుకానక నట్టివాని కది తెలిసిన విషయమైనపుడు నే నిట్టు లయిదుప్రకారము లెందుకైతి నని విస్మితు డగుట అసంభవము. అది యాతనికి దెలియనివిషయమైనపుడు కూడ వీ రెవ్వ రనుకొనక నే నిట్లయితి నేమనుకొనుట అసంభవమే. కనుక పద్యములోని విషయము సముచితముగా కూడ గనబడదు.

అందుచేత, ఇంద్రుడు మహేశునిచే నైదుభాగములుగ జీల్పబడినట్లు దేవరాజ్యము (పు. 30)లో వ్రాయబడిన విషయము యుక్తము కాదు. పంచేంద్రోపాఖ్యానములో "పూర్వేన్ద్రా ఊచుః" అని యుండుటను బట్టి యా గిరివివరములో గోచరించినవారు పూర్వ మింద్రులనియు, వారిని జూచినవాడు అప్పటి యింద్రుడనియు స్పష్ట మగుచున్నది.

ఆ యింద్రుల నామములు కూడ నిట్లు చెప్పబడినవి—

"విశ్వభు గ్భూతధామా చ శిబి రిన్ద్రః ప్రతాపవాన్,
శాన్తి శ్చతుర్థ స్తేషాం వై తేజస్వీ పంచమః స్మృతః."

ఇట్లుండుటచే నొక్క యింద్రుడే ఐదుభాగములుగా జీల్పబడె ననుటయు, దానికి భారతము ప్రమాణ మనుటయు నయుక్తము.

మహాభారతములో ద్రౌపదికి భర్త ఒక్కడే అని లేదు. ఆ పాండవులు ఒక్కయింద్రుని స్వరూపములే అనియు లేదు. ద్రుపదుడు,

ఒకవనితకు బహుపతులు కూడదు. అది మెచ్చుటను లేనివిషయము. అని పలికినపుడు- యుధిష్ఠిరుడు శేకపోవుటేమి? చూడు మని నిదర్శనములు చూపెను—

"శ్రూయతే హి పురాణేపి జటిలా నామ గౌతమీ,
ఋషీ నధ్యాసితవతీ సప్త ధర్మభృతాం వరా.
తథైవ మునిజావార్క్షీ తపోభి ర్భావితాత్మనః,
సంగతాఽభూ ద్దశ భ్రాతౄ నేకనామ్నః ప్రచేతసః."

ఇచ్చట, ఏడుగురు ఋషులు పతులుగా గల జటిలయు, సోదరులై యున్న పదిమంది ప్రచేతసులు పతులుగా గల వార్క్షియు నిదర్శనముగా జూపబడిరి. ఈ నిదర్శనములు దేవరాజ్యము (పు. 22)లో పేర్కొనబడినవే.

ఆ జటిలకును ఆవార్క్షికిని యేకపతిత్వమే అనుటకు వీలులేదు కదా! పాండవులయొద్ద కల్పించినట్లు ఆఋషు లేడుగురు ఒక్కని స్వరూపములే, ఆ ప్రచేతసులు పదుగురు ఒక్కని స్వరూపములే అని కల్పించుట కవకాశము లేదుకదా!

ఇట్టి స్థితిలో పంచేంద్రియలు పంచపాండవు లని స్పష్టముగా నున్నవిషయములో ఆ పంచేంద్రియలు నొకయింద్రుని స్వరూపములే అని కల్పింపవలసిన అవసర మేమివచ్చినది? ద్రౌపదికి భర్త ఒక్కడే అని సాధించుట కందురా? అది యెట్లుసాధ్య మగును?

దేవరాజ్యము (పు. 25)లో "శ్రీ వ్యాసమునీంద్రుని తీర్పు" అనుచు వ్రాయుటలో నుదాహరింపబడిన—

"తతో ద్వైపాయన స్తస్మై నరేన్ద్రాయ మహాత్మనే,
ఆచఖ్యౌ త ద్యథా ధర్మః పంచానా మేకపత్నితా."

అనుశ్లోకము- పంచపాండవులకు ద్రౌపదీదేవి పత్ని యగుట, యెట్లు ధర్మమో వ్యాసమహర్షి చెప్పెను. అని తెలుపుచుండ

ఆమెకు భర్త ఒక్కడే అనుట సాధ్యమా? ఆమహర్షి ఆ పాండవులు ఒక్కయిందు్రని స్వరూపములే కనుక నది ధర్మ మని యేమైన చెప్పెనా? అది యీశ్వరవరమును బట్టి ధర్మమనియే చెప్పెను. ఈ విషయ మంతయు వెనుక పంచేంద్రోపాఖ్యానప్రస్తావములో విశదీక రింపబడినది.

దేవరాజ్యములో గూడ నిట్లున్నది— "అయిదుగురు పతులను వరింపక తప్ప దని శివుడు హెచ్చరించుట"

క. నావచనంబున నీ క య్యేవురు పతులందు ధర్మ్మవెషపక యుండం
గావున నిట్టివరం బిం దీవరదళనేత్రి యిచ్చితిని దయతోడన్.

(ఆంధ్రభారతము.)

"నావరప్రసాదమున లేశమైనను దోష మావహింపదు" (పు. 29)

"అయిదుగురు భర్తలను కలియుచున్నను పూర్వము నీయందు గల కన్యాత్వమునే పొందుచు పరిశుద్ధచరితవు కాగలవు. అని యభయ మొసగెను."

ఇచ్చట ఆశివుడు, ద్రౌపది పూర్వజన్మములో జేసిన తపము నకు ఫల మిచ్చునపుడు పంచపతిత్వము కలుగునటయు, సతికి బహు పతిత్వము అధర్మతము కనుక నా కది లేకుండ జేసి రక్షింపు మని యామె యనుటయు, నా వాక్యముచే నీకు ధర్మహాని లేకుండును. నీకు కన్యాత్వ సిద్ధి యెప్పటికప్పు డగుచుండును. అని యా శివుడు వరమిచ్చుటయు జరిగినట్లే వ్రాసినారుకాని, నీకు బహుపతిత్వము కాదు. ఏకపతిత్వమే. ఆ యైదుగురు ఒక్కయింద్రుని స్వరూపములే అగుటచే నీకు భర్త యొక్కడే యన్నమాట కనుక నీకు ధర్మహాని యేమున్నది? అని యా శివుడు ఆమెకు బోధించినట్లు వ్రాయలేదు. కనుక ద్రౌపదికి భర్త యొక్కడే అని సాధింపబూనుట, దానికై పంచేంద్రులు నొక్క యింద్రుని స్వరూపములే యనుట యట్టి పంచేంద్రుల స్వరూపములే పాండవు లగుటవలన మొట్టమొదట యింద్రుని బట్టి ద్రౌపదికి భర్త యొక్కడే అనుట ఇదంతయు నకాండతాండవము. ఇక—

"శక్తి స్సైకస్య సా పత్నీ కృష్ణా నాన్యస్య కస్యచిత్."

అను మార్కండేయపురాణోక్తికి సరిపడునట్లు మహాభారత వచనములను అన్వయించుటకై పంచేంద్రులు నొక్కయింద్రుని భాగములే యని చెప్పవలసి వచ్చినది. లేకున్న గ్రంథములకు పరస్పర విరోధము కాదా? అని యందురా?

అట్లైన మహాభారతములోనే పూర్వోత్తర విరోధము ప్రాప్తించును— ఆ పంచేంద్రులలో నలువురు పూర్వేంద్రులనుట, ఒకడు అప్పటి యింద్రుడనుట, వారలకు వేరువేరు పేరులు చెప్పుట సతికి బహుపతిత్వము జటిల వార్క్షి అను వారి దృష్టాంతముచే క్వాచిత్కముగా నున్నదని చెప్పుట, 'వ్యాసమునీంద్రుని తీర్పు'లో గాని 'శివుడు హెచ్చరించుట'లో గాని పాండవు లొకయింద్రుని స్వరూపములే యని చెప్పబడకుండుట ఇత్యాది విషయములతో విరోధము వచ్చును.

మరియు, ఆ పంచేంద్రు లొక్కయింద్రుని భాగములే అని చెప్పుట కాధారముగా జూపిన ఆంధ్రభారతములోని సీసపద్యము మూలశ్లోకవిరుద్ధమనియు, నసంగతార్థ మనియు నిరూపించియే యున్నాము. కనుక మహాభారతమం దట్లు కల్పింపరాదు.

ఐతే గ్రంథాంతరవిరోధముమాట యే మందురా? వినుడు— పాండవుల పూర్వస్వరూపవిషయమై మార్కండేయపురాణోక్తప్రక్రియయు, మహాభారతోక్తప్రక్రియయు విభిన్నముగా నున్నవి. ఆ విభేద మొకకాలములోని పాండవులను గూర్చి వచ్చినదే యని భావింపదగదు. అది కాలభేదమున భిన్నులై యుండెడి పాండవులకు సంబంధించిన దని భావింపవలయును.

పాండవజన్మము అనేకపర్యాయములు తటస్థించిన దనుటకు నిదర్శన మొకటి కనబడుచున్నది.—

లోకపాలసభాఖ్యానపర్వములో యమసభావర్ణనప్రస్తావము—

"ధృతరాష్ట్రై శ్చైకశత మశీతి ర్జనమేజయాః,
భీష్మాణాం ద్వే శతే ప్రతి భీమానాం తు తథా శతమ్."
(సభాప. అ. 8)

నీలకంఠీయమ్ — ధృతరాష్ట్రై శ్చైకశత మితి. పురాణేషు ప్రాయే ణాధికారిణా మేవ కీర్తనా త్తేషాం చ ప్రతికల్పం సమానానాము రూపకర్మత్వా దనేకకల్పం ధర్మసభావాసినాం తేషాం బహుత్వం యుక్తం సేనాపత్యాదిశబ్దవ దధికారవాచిత్వా ద్ధృతరాష్ట్రాది శబ్దానామ్.

ఆ యమసభలోని ధృతరాష్ట్ర జనమేజయ భీష్మ భీమసేన ప్రభృతులకు బహుత్వము చెప్పబడినది. అది యె ట్లుపపన్నమగు ననగా — పురాణములలో తరచుగా ఆధికారికపురుషులనే కీర్తించుచుం డుటవలన వారు ప్రతికల్పము సమాననామరూపకర్మలు కలిగియే యుండువా రగుటవలన అనేకకల్పములలో ధర్మసభావాసు లైనట్టి వారికాబహుత్వ ముపపన్నము. అని యాగ్రంథమునకు తాత్పర్యము. ఇట్లనేక పర్యాయములు పాండవజన్మములు సంభవించి యుండును. అందొకప్పుడు పంచేంద్రులస్వరూపములుగను, మరొకప్పు డొక యింద్రునిస్వరూపములుగను పాండవులు ఆవిర్భవించియుందురు. ఆభేద మునే మహాభారతము, మార్కండేయపురాణము ప్రతిపాదించినవి.

కనుకనే — "కల్పభేదం సమాశ్రిత్య కథాభేదం జగాద హ."

అనుచు కల్పభేదమును బట్టి కథాభేదము వచ్చిన దని బోధింప బడినది.

రామోపాఖ్యానమున కుంభకర్ణవధాంశములో వాల్మీకి రామా యణ మహాభారతములకు గలిగిన కథాభేదము కల్పభేదమూలక మని విష్ణుధర్మోత్తరవచనప్రమాణములతో 'అనేకకర్తృత్వనిరాకరణము' అను ప్రథమభాగములో నిరూపించియున్నాము. అట్లే పాండవుల

పూర్వస్వరూపవిషయమై మార్కండేయపురాణ మహాభారతము లకు గలిగిన భేదము కల్పభేదమూలక మని గ్రహింపవలయును. ఇంత టితో నీయంశము విడిచి యంశాంతర మవలోకింతము.

దేవరాజ్యములో నిట్లున్నది—

"ద్రౌపదీహృదయము పరపురుషునందు లగ్నమగుట— వీరలగు పాండుపుత్రులు ద్రుపదతనయయు అరణ్యవాస మొనర్చుచుండిరి. ఆసమయమున కృష్ణభగవానుడు వారిమనముల పరిశీలించెను. వృక్షాగ్రమునుండి పతనమైన ఒకానొకఫలమును జూపి మరల యథాస్థలమున నుంచగలరా యని యడిగెను. మనసులో నుండు మర్మమును బహిరంగ మొనర్పగల్గిన నటుల కాగల దని యుపా యమును సైతము దెల్పెను.

పంచపాండవులు తమభావముల వివరించినపిదప ద్రౌపది— అన్నా! పురుషసింహులగు నేవురు భర్తలున్నను తృప్తి యను నది వెనుకకు బోవుచున్నది.

"పంచ మే పతయ స్సన్తి మహ్యం షష్ఠోపి రోచతే,
పురుషాణా మభావేన సర్వా నార్యః పతివ్రతాః"

ఐశ్వర్యవంతుడును, సంపూర్ణసద్గుణభూషితుండును, వీరాగ్రేసరుం డును, యశోమూర్తియు, లక్ష్మీయుక్తుడును, జ్ఞాననిధియు, వైరా గ్యమున మిన్న యగు మేటియు నగు షడ్గుణరాశియైన కర్ణుడు నామనమున హత్తుకొనియుండెను. ఇంతకు మించి మరియొక మర్మము గానరాదు. అని సవినయముగ మనవి జేసెను. ఈ కథ బాహ్యమునకు చరిత్రాత్మకముగ గోచరించినను జీవేశ్వరైక్యమును నిరూపించుటయం దద్వితీయమై యలరారుచున్నది." (పు. 38)

ఇచ్చట వీరిచే ద్రౌపదీవాక్యముగా నుదాహరింపబడిన శ్లోకము మహాభారతములో లేనిది. వీరు కర్ణుడన్నది ఆశ్లోకములోని షష్ఠశబ్ద మునకు వాచ్యార్థము కానిది. ఆ కర్ణునకు వీరు వేసిన విశేషణములు

ఆశ్లోకములో లేనివి. ఆశ్లోకములోని యుక్తార్థము వీరు సమన్వయము చేయక విడిచివేసినది.

కర్ణునియందు వీరు వాడినవిశేషణము లన్నియు భగవచ్ఛబ్దార్థములోనివి కనుకనే భగవచ్ఛబ్దనిర్వచనములో—

"ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశస శ్శ్రియః,
జ్ఞానవైరాగ్యయో శ్చైవ షణ్ణాం భగ ఇతీరణా."

అని చెప్పబడినది. అట్టి భగవచ్ఛబ్ద మాశ్లోకములో లేదు. కర్ణశబ్దము కూడ లేదు. ఉన్నది షష్ఠశబ్దమే. దానికి కర్ణుడే అర్థమైనచో "మహ్యం కర్ణోఽపి రోచతే" అని కంఠోక్తిగా నేల చెప్పలేదు?

దేవరాజ్యము (పృ. 62)లో 'కర్ణుడు దేవుడు' అని వారు వ్రాసియున్నారు. అదియే నిజమైనయెడల స్పష్టముగా నామె "మహ్యం దేవోఽపి రోచతే" అని యేల చెప్పలేదు?

వారు వ్రాసినట్లు మనసులోని మర్మమును బహిరంగ మొనర్పబూనినట్లె యామె మర్మము విడచి కర్ణుడని, లేక దేవు డని, ముక్తకంఠముతో చెప్పవద్దా? వారు వ్రాసినట్లు కర్ణుడు దేవుడే కనుక కర్ణు డనియో, దేవు డనియో, చెప్పుటలో నామె కా మర్మ మెందులకు? కనుక వారు చెప్పినది అపార్థము.

ఆశ్లోకార్థముగా వారు వ్రాసినదిది—

పంచ మే పతయ స్సన్తి= పురుషసింహము లగు నేవురు భర్తలున్నను తృప్తి యనునది వెనుకకు బోవుచున్నది.

మహ్యం షష్ఠోపి రోచతే= షడ్గుణరాశి యైన కర్ణుడు నామనమున హత్తుకొనియుండెను.

ఈ వ్రాతలో భర్తలవలన కలుగకున్నట్టి తృప్తికొరకే ఆమె మనస్సు కర్ణునియందు హత్తుకొనినట్లు తేలినది.

ఆమె యపేక్షించిన యాతృప్తి, భర్తలవల్ల కలుగదగిన తృప్తియా? లేక దేవునివల్ల కలుగదగిన తృప్తియా? దేవునివల్ల కలుగదగిన దే

యైనపక్షములో నది భర్తృలవల్ల కలుగునది కానేరదుకనుక "ఏవురు భర్త లున్నను తృప్తియనునది వెనుకకుబోవుచున్నది" అని భర్తల మాట నెత్తుకొనవలసిన పని యేమున్నది? భర్తల నెత్తుకొనుటనుబట్టి యదిభర్తృవలన కలుగదగిన తృప్తియేకాని, దేవునివలన కలుగదగి నది కాదని తేలుచున్నది. ఇట్టి స్థితిలో ఆమె మనస్సులో హత్తుకొని నా డన్న కర్ణుడు దేవు డెట్లగును?

మరియు "మహ్యం షష్ఠోపి రోచతే" అనువాక్యములోని 'అపి' శబ్దము షష్ఠునియందే అభిలాషకాక, షష్ఠునియందు కూడ అభిలాష యని తెలుపుచున్నది. ఇప్పుడు వారువ్రాసినరీతిని యేతృప్తికై యామె షష్ఠునిగోరుచుండెనో ఆతృప్తికై యున్నపతులను కూడ గోరుచునే యున్న దని స్పష్ట మగుచుండ ఆషష్ఠుడు దేవు డెట్లగును?

మరియు "పురుషాణా మభావేన సర్వా నార్యః పతివ్రతాః" అనునది యాశ్లోకములోని యుత్తరార్థము. పురుషులు లభింపనపుడే స్త్రీ లందరు పతివ్రత లగుదురు. అని దాని యర్థము. శ్లోకమున కంతకు తేలిన యర్థ మిది—

నా కయిదుగురు పతులున్నారు. షష్ఠుని (ఆరవవాని) యందు కూడ అభిరుచి కలుగుచున్నది. పురుషాభావముచేతనే స్త్రీలందరు పతి వ్రతలగుదురు. అని

ఇందు స్త్రీలకు పాతివ్రత్యము దుష్కర మని చెప్పుటకై పంచ పతులున్న తనకుషష్ఠునియందు కలిగిన అభిలాషయే హేతువని చెప్ప బడినది. అట్టి యాషష్ఠుడు దేవు డెట్లగును?

ఇక షష్ఠశబ్దమున కర్థము దేవు డనుటకు వారు ప్రదర్శించిన ప్రణాళికను గూడ జూతము,

షష్ఠః=కర్ణః' కర్ణము, (కర్ణుడు)
కర్ణము=శ్రోత్రము.
శ్రోత్రము=దైవము (శ్రోత్రగ్ం హి దైవం)
దైవము=దేవుడు. (పు. 68)

ఇది వారి ప్రణాళిక. ఇందు ప్రథమకక్ష్యలోని షష్ఠశబ్దమునకు చతుర్థకక్ష్యలోని దేవుడు అర్థమని ఫలింపజేసినారు. ఇది యెట్టి యన్వయమో? వారి యీప్రయత్న మంతయు ద్రౌపదీదేవియొక్క పవిత్రతను ప్రకటించుటకే. వారు "పంచ మే పతయ స్సన్తి" అనునది ద్రౌపదీవాక్యముగా గ్రహించి షష్ఠశబ్దమునకు కర్ణు డర్థమని గ్రహించిన కారణమున నిట్లు ప్రయాస పడవలసివచ్చినది.

ఆ శ్లోకమునకు జీవేశ్వరైక్య నిరూపణమందే తాత్పర్య మని వారు చెప్పినట్లు భావించువారుఉన్నపక్షములో వారు మాకు మాన్యులే.

అది చరిత్రకు సంబంధించినదే యని, అది ద్రౌపదీవాక్యమే యని, ఆషష్ఠుడు కర్ణుడే యని ప్రసంగించుచు ద్రౌపదీదేవి పవిత్రతకు కళంక మాపాదింపబూనువారికి సమాధానము చెప్పుటకు మా ప్రయత్నము.

మా సమాధానసారాంశ మేమనగా- ఆశ్లోకము ద్రౌపదీవాక్యము కానేకాదు. షష్ఠశబ్దమునకు కర్ణు డర్థము కానేకాదు. అని.

ఆ విషయమై విశేషముగా చర్చించి యనేక హేతువులు సప్రమాణముగా వెనుక నిరూపించియే యున్నాము. కనుక మతిమంతులు పరిశీలింతురు గాక.

ప్రతివాదులు తలకొకవిధమున ద్రౌపదీదేవిని గూర్చి చేసిన నిందాప్రసంగములు నిరాధారము లనియు, నిర్యుక్తికములనియు, నిస్సారము లనియు నిరూపింప బడినవి.

ఇంతవరకు మా దృక్పథములో బడిన గ్రంథములు—

1 మహాభారతచరిత్రము. 2 సుయోధనవిజయము-దానితోలి పలుకు. 3 మహాభారతరహస్యము. 4 కర్ణచరిత్రము. 5 ఖండకావ్యము-భారతవీరుడు. 6 ఆంధ్రభారతసంశయవిచ్ఛేదము, 7 కర్ణుడు.

8 దేవరాజ్యము. అనునవి. వీనిలోప్రసంగాగతములైన విరుద్ధాంశములు నిరాకరింపబడినవి. ద్రౌపదీచరిత్రము పరమపావన మని పాపహర మని నిరూపింపబడినది.

"అనయా ద్రౌపదీనిన్దా నిరాకృత్యా సుధీశ్వయా,
ప్రీయతాం కృష్ణభగవాన్ ద్రౌపదీమానరక్షకః.
ఇతి వేదవ్యాసమునిః శ్రీకృష్ణః పాండవాశ్చ పాంచాలీ,
పుణ్యాచరిత్రా ఇతి ఖలు సిద్ధం ప్రతివాదినః పరాస్తాశ్చ.
విమర్శకమ్మన్యమానై రసంబద్ధానృతోక్తిభిః,
కృత స్సారత్వతద్రోహో యావా నద్య విచిన్త్యతామ్.
యేషా మద్భుతచారిత్రై స్సారస్వత మలంకృతమ్,
తే సర్వే నిన్దితా ధూర్తై ర్విద్యాగన్ధవివర్జితైః.
వ్యాసమహామునినిన్దా పూజ్య శ్రీకృష్ణభగవతో నిన్దా,
పాండుసుతోత్తమనిన్దా స్వర్గశ్రీ ద్రౌపదీసతీనిన్దా,
సర్వజ్ఞభీష్మనిన్దా ద్రోణాచార్యోత్తమస్య వై నిన్దా.
ఇతి పుణ్యపురుషనిన్దా బత నిశ్శంకం కృతా కై శ్చిత్,
కిం చాఽన్యా ద్దుర్యోధన, దుశ్శాసన, కర్ణ, శకునిషు శ్లాఘా.
దుష్టచతుష్టయనామ్నా ప్రథితే ష్వవలోకయన్తు దౌర్భాగ్యమ్,
ఏతావతాప్రబన్ధేన తత్తన్నిన్దా నిరాకృతాః,
ఇతఃపర న్తు త ద్దుష్టచతుష్టయకథోచ్యతే."



శ్రీ గురుభ్యో నమః.

# మహాభారత తత్త్వకథనము.

## దుష్టచతుష్టయచర్య.

షష్ఠభాగము.

'బాలవ్యాస, తర్క, వ్యాకరణ, వేదాన్తపారీణ'

వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిచే

రచియింపఁబడి,

భట్నవిల్లి గ్రామసంస్థాపిత శ్రీ శారదాముద్రాలయమునందు

ముద్రింపఁబడి,

ప్రకటింపఁబడియె.

ప్రతులు:

1-3-54

 [మూల్యం: 3-0-0

# ఓ వి మ ర్శ కా !

ఉ. కౌరవపాండవుల్ పొడము కాలమునందున యుంటఁ జేసి క
న్నారఁగఁ జూచి వ్రాసితి నటంచును వ్యాసుఁడు వ్రాయువ్రాఁత నా
ధారముగాఁ గ్రహించి, స్వమతంబునకున్ సరిపోని యంశముల్
కాఱు లటందు నీ వపుడు కంటివె యుంటివె యోవిమర్శకా !

ఆ. 'పాఁడియా వటంచుఁ బల్కంగ వింటివాఁ
డనృత మిద్ది గొడ్డుటా' వటంచు
ఇరుగువాఁడు పల్కు తెఱఁగున నీనాఁటి
హ్రస్వదృష్టి నాఁటి దనృత మనెను.

ఉ. "వ్యాసుఁడు పక్షపాతి యయి పాండవులన్ బయి కెత్తి, కర్ణదు
శ్శాసనసౌబలాదులను జాఱ్చె లటంచు నధఃకరించి వ్య
త్యాసములన్ లిఖించె నని" దా ఋషి భారతమున్ రచింపఁడే
నీసరిగాని వ్రాఁత లిఖియింతువె ? నోరు కదల్పనేర్తువే ?

సీ. "కల్పించె వ్యాసుఁ డీకథ" యందువేని లో
పము లెంచు మాకల్పనమున నరసి
"కాదు వాస్తవమె యీగాథ" యన్నచొ సాక్షి
యగు వ్యాసుపల్కు లనృత మనెదు
పక్షపాతముఁ బూనె వ్యాసుఁ డెంచెనె నాఁడు
నీవ్వంశి చూచితివా వచింపు
తొంటి రాజులు పండితులు మెచ్చి రద్దాని
లేనదౌ నీపాటి ధీకౌశలత.

జాతి కిది వన్నెయా ? స్వదేశమున కిద్ది
ఖ్యాతియా ? యేమి యెంచి నీవ వ్రాఁత చెపుమ!
ఓవిమర్శక ! ప్రఖ్యాతి నొందఁ గోర్కె
యేని యిదె మార్గ మౌనె యూహించుకొనుము.

ఉ. భారతసూక్త ధర్మములపట్లఁ బ్రమాణమతిన్ దొలంత నీ
తీరున దుర్విమర్శముల దెంపరివై రచియించితేమొ ? యా
భారత మేమియడ్డపడి బాధ యొనర్చెను నీ కనిష్టమే
నూరకయుండలేక భరతోర్వికిఁ గళంకమువాఙ్ధిఁ దోసితువా ?

శా. ఆనాఁ డేల్చజనించినారు కరునాథా ! కర్ణ ! మీయున్కి నేఁ
డైనన్ బట్టము మీకె కట్టి శ్రమలే కప్పాండువంశంబు పే
రైనన్ లేనటు లిక్కలిప్రజలు నూయన్ జేయరే ? నేఁటికిన్
మీ నైర్మల్యము వెల్లడింప శ్రమమేనిన్ మానిరే కాంచుడీ.

శా. వీరస్వర్గముచేరి వేల్పులదరిన్ విజ్ఞానులై —తొంటి దు
శ్చారిత్రంబు స్మరించి మీరె మొదఁ బశ్చాత్తప్తులైనన్ సరే
మీరే యోగ్యులు, మీదె రాజ్యమని కూర్మి న్మీ యొసన్ నించు వా
ర్నూరుల్ వేనకువేలు గల్గ నిఁక మీకున్ లోప మొందుంకునో !

"కవితాభూషణ, విద్వత్కవిశేఖర"
వెంపరాల సూర్యనారాయణశాస్త్రి.

# విషయసూచిక.

విషయము. పుట.

విషయము. పుట.

విషయము. పుట.

# విజ్ఞప్తి.

"విద్యావిహీనః పశుః" అని ఆర్యోక్తి.

విద్య అనగా, ధర్మ-అధర్మములను; అర్థ-అనర్థములను; వైషయిక-సుఖదుఃఖములను; బంధ-మోక్షములను; భగవత్స్వరూపమును, జన్మాంతరమును విశదీకరింపగల జ్ఞానము. ఇట్టి విద్యకు ఆధారభూతమైన గ్రంథములు (విద్యాస్థానములు) పురాణ-న్యాయ-మీమాంసా-ధర్మశాస్త్ర-వేదాంగ-మిశ్రితములగు వేదములు.

ఈ గ్రంథములయందు ఎంత కృషియో అంత విద్య; ఎంత విద్యయో అంత అవిద్యానివృత్తి; అంత మనశ్శాంతి; అంత భగవద్భక్తి; అంత పరమార్థదృష్టి; అంత పాపభీతి.

ఈ లక్షణము లున్నపుడే మనుజునకు సత్ప్రవర్తన, కష్టసహిష్ణుత్వము, మనోధైర్యము, యథాలాభసంతుష్టి సంభవించును. ఇట్లు మనుజుని జీవయాత్రలో ముఖ్యసాధనము విద్య. వేదశాస్త్రములవంటి ప్రమాణము లన్యములగునా? మహర్షులవంటి ప్రామాణికులును, జగద్ధితకారులును, సత్యవాదులును, విజ్ఞాననిధులును అన్యు లగుదురా?

వేదవ్యాసమహర్షి— కురుపాండవచరిత్రవ్యాఖ్యాముఖమున వేదార్థ వివరణరూపము, పురుషార్థ ప్రకాశకము నగు మహాభారతమును చతుర్దశ విద్యాస్థానరహస్యములతో కూర్చి లోకమున కనుగ్రహించెను.

ఇది ఎంత కని వినినను తృప్తి తీరకుండునట్టి తద్భుతకథాసందేశములతో, లోకజ్ఞానదాయకహితోపదేశములతో, దైవపురుషాకార— బలాబల ప్రదర్శనములతో, భగవదకుంఠిత—జ్ఞాన—శక్తి నిరూపణములతో, అపూర్వవిషయములతో నిరుపమానమై విరాజిల్లుచున్నది.

ఈ మహాభారతకర్తయే బ్రహ్మసూత్రకర్తయు, అష్టాదశపురాణకర్తయు నయియుండుటచే వేదాంతాధ్యయనసమయమందేమి, పురాణప్రవచనసమయమందేమి నిత్యకృత్యముగా శ్రీవేదవ్యాసకీర్తన— నమస్కారములు ఆస్తికలోకములో చేయబడుచునే యున్నవి.

ఇట్లు విద్వాంసులకును, విద్యాభ్యాసకులకును, విద్యాభిమానులకును, విద్యోపజీవులకును నిత్యస్మరణీయుడగు వేదవ్యాసుని మహాభారతము మహాచార్యులచేతను, మహాపండితులచేతను ప్రమాణముగా పరిగ్రహింపబడియున్నది.

ఆధునికులు మాత్రము కొందరు మహాభారతముపై, మహర్షిపై, కృష్ణభగవానునిపై, పాండవులపై, మహాపురుషులపై లేనిపోని ఆక్షేపములు లేవదీసి గ్రంథస్థమైనది, జరిగియున్నది కాదని స్వకపోలకల్పనలతో, మహాజనదూషణోక్తులతో తలకొకవిధమున పుస్తకములు రచింపసాగినారు.

అది అక్రమమని నిరూపించి మహర్షియొక్కయు, మహాభారతముయొక్కయు, మహాపురుషులయొక్కయు పవిత్రతాప్రతిష్ఠలను లోకమునకు ప్రకటించుట, ప్రతివాదుల భ్రాంతిని తొలగించుట— ఆర్జించిన విద్యకు, ఆవిర్భవించిన గురుదేవతాభక్తికి, ఆచరించిన అక్షసారస్వతోపాసనకు సార్థక్యమని "మహాభారతతత్త్వకథనము" రచింపవలసినవాడనైతిని.

మహాభారతపరిశీలనములో స్వాభిప్రాయము లేవో పెట్టుకొని వానికి సరిపడునట్లు కనబడు వచనములనే తీసుకొని తావన్మాత్రముచే వచనాంతర— పూర్వోత్తర—విరోధములు లక్ష్యపెట్టకుండ విషయనిర్ణయము చేసివేయుట విమర్శకపద్ధతి.

స్వాభిప్రాయములని యేమియు లేక గ్రంథతాత్పర్యము గ్రహించుటకే తమ బుద్ధిని వినియోగించి యావద్గ్రంథమునకు ఏకవాక్యత నాలోచించి ప్రమాణాంతర-పూర్వోత్తర-విరోధము లేకుండ జూచి విషయనిర్ణయము చేయుచుండుట విద్వత్పద్ధతి. ఈ విద్వత్పద్ధతినే అవలంబించి వ్యాఖ్యానాధారమున గ్రంథసమన్వయప్రదర్శనముతో విమర్శకపద్ధతిలోని దోషములు వెల్లడించి, తత్తన్నిందానిరాకరణ మూలమున మహాభారతవిషయము నిర్దుష్టమని నిరూపింపబడినది.

ఆయా సందర్భములలో ప్రతివాదులు వాడిన మాటలకు బదులు చెప్పునపుడు వాడబడిన మాటలలో గొన్ని మృదువుగా లేనట్లు కొందరభిప్రాయపడినారు.

మరికొందరిట్లు వ్రాసియున్నారు—"మీ పుస్తకము (పంచమ భాగము) చదువుచుంటిని. చాలా బాగున్నది. వాళ్ళు వ్రాసినదానికి మీరు చాలా మృదువుగా వ్రాసినారు. ఆమార్దవ మట్టివారియెడ చాలదని తోచినది." అని.

మహాభారతోక్త మహాత్ములయెడ అభిమాన మేర్పడినవారికి తోచునట్టి యభిప్రాయ మిది. అది యేర్పడనివారికి తోచునట్టిది పై యభిప్రాయము. మాది తత్త్వశోధనతాత్పర్యమె కాని వ్యక్తినిరసన తాత్పర్యము కాదని గ్రహింపవలయును.

ఫలపుష్పముల నిచ్చునట్టి యొక మహావృక్షము నాశ్రయించి జీవించుటలో వృక్షమునకు చేటు రాకుండ కాపాడుకొనుచు ఆపుష్పాదులను సంగ్రహించి లోకుల కందించుచు జీవించుట యొకపద్ధతి. ఆవృక్షశాఖలనే ఛేదించుచు కాల్చి బొగ్గులుచేయుచు వానిని లోకుల కందించుచు జీవించుట యొకపద్ధతి. ఇందు మొదటిపద్ధతి వంద్యము; రెండవపద్ధతి నింద్యము.

వేదవ్యాసభగవానునిచే మన కనుగ్రహింపబడినది మహాభారత కల్పవృక్షము. దీనిని జీవనాధారముగా జేసికొనుటలో పై జెప్పబడిన రెండవపద్ధతి నవలంబింపక మొదటిపద్ధతినే అవలంబించి ఫలపుష్పప్రాయములైన పుణ్యపురుషచరిత్రములను యథాతథముగా స్వీయరచనలతోగూడ లోకులకందించుచుపురాతనపుణ్యపురుషులకీర్తిప్రతిష్ఠలను లోకమున చాటుచు భారతదేశౌన్నత్యమును నిలవబెట్టుచు విద్యాలోపముచే మన ఆర్షగ్రంథములపట్ల దాపరించిన దుస్థితిని, లోకములో గోచరించు అవినీతిని, అవలోకించి సద్గ్రంథములద్వారా మనభారతీయులలో విద్యావ్యాప్తియగుటకై పాఠకమహాశయులు పూనికొనవలయును. ఇదియే మా విజ్ఞప్తి.

ఇట్లు,
గ్రంథకర్త.



శ్రీ మహాగణాధిపతయే నమః.

శ్రీ గురుభ్యో నమః.

# మహాభారత తత్త్వకథనము.

## దుష్టచతుష్టయచర్య.

"పాండవపూజ్యత్వాభివ్యక్తి స్తద్వైరికృత్యవిజ్ఞానాత్ ।
స్యా దితి దుష్టచతుష్టయచర్యా సంగృహ్యతేఽత్ర పశ్యన్తు ॥

"దుర్యోధనో మన్యుమయో మహాద్రుమః స్కన్ధః కర్ణః శకుని స్తస్య శాఖాః ।
దుశ్శాసనః ఫలపుష్పే సమృద్ధే మూలం రాజా ధృతరాష్ట్రోఽమనీషీ" ।

"యుధిష్ఠిరో ధర్మమయో మహాద్రుమః స్కన్ధోఽర్జునో భీమసేనోఽస్య శాఖాః।
మాద్రీసుతౌ పుష్పఫలే సమృద్ధే మూలం కృష్ణో బ్రహ్మ చ బ్రాహ్మణాశ్చ" ॥
(ఆది- ౧)

### —♦ దుష్టచతుష్టయము ♦—

దుర్యోధనుడు, దుశ్శాసనుడు, కర్ణుడు, శకుని వీరు దుష్టచతుష్టయమని చెప్పబడెను. ధర్మాత్ములగు పాండవుల కనేకబాధలుకలిగించి వారి రాజ్య మపహరించి వారిపై యుద్ధమునకు కాలుదువ్వి తుదకు కౌరవవంశనాశనమునకు కారణమైనది యీ దుష్టచతుష్టయమే అనియు, పాండవులు నిరపరాధులనియు మహాభారత ముద్ఘోషించుచున్నది. ఈ విషయమును గాంధారియే స్పష్టముగా జెప్పినది.

—♦ 'కురువంశనాశనమునకు దుర్యోధనాదుల దుష్టత్వమే కారణము. పాండవులు నిరపరాధులేలని' గాంధారిచెప్పుట ♦—

యుద్ధమృతులను గూర్చి దుఃఖించుచు పుత్రశోకములో మునిగియున్న గాంధారి, తనకు ధర్మజుడు నమస్కరింపవచ్చినపుడు తత్కాలాగతుడై తనోదార్చునట్టి వ్యాసభగవానునితో పరిస్తాంచుచు నిట్లు చెప్పినది—

"దుశ్శాసనాపరాధేన శకునే స్సౌబలస్య చ ।
కర్ణదుర్యోధనాభ్యాం చ కృతోఽయం కులసంక్షయః ॥
నాపరాధ్యతి బీభత్సుః న చ పార్థో వృకోదరః ।
నకుల స్సహదేవ శ్చ నైవ రాజా యుధిష్ఠిరః" ॥ (స్త్రీ- పర్వ)

దుర్యోధన, దుశ్శాసన, కర్ణ శకును దుర్మార్గులచేతనే కులక్షయమైనది. పాండవుల తప్పేమియు లేదు అని.

ఆంధ్రభారతము— ధర్మంబు పరిగ్రహించి సోదరులగు పాండవుల నాస రోసంబు నిగ్రహింపుమనిన గంధవతీనందనునకు గాంధారరాజనందన యిట్లనియె—

సీ. "ఏననూయాగ్రస్తగాను వీరల జెడ దలచెద నెట్లు లమ్మౌలిక జేసి
కలిగితి గాక యి క్రాంతియేమవర్గంబు నాంతి కెట్లును నాకును ధరింప
వలదె దుర్యోధను తులువతనంబున శకునియు గర్ణదుశ్శాసనులును
దుష్టాత్ము లగుటను దుర్మిగె గౌరవకుల మవరి పాండవులు గయ్యంబు పాశి
జంపి రందఱ నది మది నొంపజాలదు"

—♦ పుత్రశోకముతో దుఃఖించు ధృతరాష్ట్రునితో దుర్మంత్రుల మాటలు నీవు వినుటచే నింత చేటువచ్చెనని సంజయుడు చెప్పుట ♦—

"న త్వయా సుహృదాం వాక్యం బ్రువతా మవధారితమ్ ।
అసి నైషైకభారేణ స్వబుద్ధ్యా తు విచేష్టితమ్ ॥
ప్రాయశోఽకృతసంపన్నా స్తవతం పర్యుపాసితాః ।
యస్య దుశ్శాసనో మంత్రీ రాధేయ శ్చ దురాత్మవాన్ ॥
శకుని శ్చైవ దుష్టాత్మా చిత్రసేన శ్చ దుర్మతిః"

ఆప్తోపదేశములు చెవిని బెట్టక పదునైన కత్తివంటి స్వబుద్ధిచే వ్యవహరించితివి. నీవెప్పుడుదుశ్చరిత్రులనే ఉపాసించితివి. దుష్టాత్ములైన దుశ్శాసనుడు, కర్ణుడు, శకుని, చిత్రసేనుడు నీకు మంత్రులైరి.

ఆంధ్రభారతము — సుయోధనుఁడు ఉపదేశించిన మాటలు వినవైతి నని నీవుచెప్పె దుమ్మలించం బనియేమి. నీకును నీ కొడుకులకు మంత్రులు దుశ్శాసనుండును, కర్ణుండును, శకునియు నట యేమి సెప్పఁగల దవధరింపుము.

—♦ కుంతీసమేతముగా పాండవులను లక్కయింట దగ్ధముచేయ సంకల్పించినది దుష్టచతుష్టయమే ♦—

తత స్సుబలపుత్రస్తు రాజా దుర్యోధన శ్చ హ ।
దుశ్శాసన శ్చ కర్ణ శ్చ దుష్టం మన్త్ర మమన్త్రయన్ ॥
తే కౌరవ్య మనుజ్ఞాప్య ధృతరాష్ట్రం నరాధిపమ్ ।
దహనే తు సపుత్రాయాః కున్త్యా బుద్ధి మకారయన్ ॥ (ఆది- అ14)

కర్ణ శకుని దుర్యోధన దుశ్శాసనులు దురాలోచనము చేసి ధృతరాష్ట్రుని అనుజ్ఞపై పాండవులు వారణావతమునకు తల్లితోఁగూడ వెళ్ళునట్లు చేసి అక్కడ వారింందరను దగ్ధముచేయవలెనని సంకల్పించిరి.

—♦ ద్రౌపదీవివాహముతో ద్రుపదుని బలము పాండవులకు సంభవించియుండ బలవిఘాతము వారికి కలిగింపవలెనని కర్ణదుర్యోధనులు ధృతరాష్ట్రునితో చెప్పుట ♦—

“తతో దుర్యోధన శ్చాపి రాధేయ శ్చ విశాంపతే ।
ధృతరాష్ట్ర ముపాగమ్య వచో ఽబ్రూతా మిదం తదా ॥
సన్నిధౌ విదురస్య త్వాం దోషం వక్తుం న శక్నుమః ।
వివిక్త మితి వక్ష్యావః కిం తవేదం చికీర్షితమ్ ॥
సపత్నవృద్ధిం య త్తాత మన్యసే వృద్ధి మాత్మనః ।
అభిష్టౌషి చ య త్క్షత్తు స్సమీపే ద్విషతాం వర ॥
తేషాం బలవిఘాతో హి కర్తవ్య స్తాత నిత్యశః ।
తే వయం ప్రాప్తకాలస్య చికీర్షాం మన్త్రయామహే ।
యథా నో న గ్రసేయు స్తే సపుత్రబలబాన్ధవాన్ ॥ (ఆది. అ 200)

పాండవులు ద్రౌపదీపాణిగ్రహణము చేసి ద్రుపదపురమున నున్న వార్త దెలిసికొని విదురుఁడు ధృతరాష్ట్రునితో వారినిగూర్చి ముచ్చటించి వెళ్ళినతరువాత కర్ణుడు, దుర్యోధనుడు ధృతరాష్ట్రుని యొద్దకు జేరి యిట్లనిరి. మహారాజా! విదురుని సమక్షములో మేము

నీ కేమియు మారుమాట జెప్పలేకున్నాము. ఇప్పు డన్యులు లేరుకనుక మాటలాడుచున్నాము. నీవు శత్రువృద్ధినే ఆత్మవృద్ధిగా భావించుచున్నావు. ఆశత్రువులను విదురునియొద్ద స్తుతించుచున్నావు. నీ సంకల్పమేమి? వారు మనల నందరిని కబళింపకుండుటకై వారికి చేకూరిన బలమునకు విఘాతము కలిగించుటే మనకు నిత్యకర్తవ్యము. ఈ సమయమున మనకు కర్తవ్యమిది అని మేమాలోచించినాము. అని. దీనిపై ధృతరాష్ట్రు డిట్లనెను—

"అహ మప్యేవ మేవైత చ్చికీర్షామి యథా యువామ్ ।
వివేక్తుం నాహ మిచ్ఛామి త్వాకారం విదురంప్రతి ॥
తత స్తేషాం గుణానేవ కీర్తయామి విశేషతః ।
నావబుధ్యేత విదురో మమాభిప్రాయ మింగితైః ॥
యచ్చ త్వం మన్యసే ప్రాప్తం త ద్బ్రవీహి సుయోధన ।
రాధేయ మన్యసే యచ్చ ప్రాప్తకాలం వదాశు మే ॥ (ఆది. అ 201)

నా మనోగతము మీ మనోగతము నొక్కటే. నా హృదయము విదురునకు వెల్లడికాకుండుటకై పాండవుల గుణములనే విశేషముగా విదురునియొద్ద కీర్తించుచుందును. ఓ కర్ణదుర్యోధనులారా! ఇప్పుడు చేయవలసిన పని యేమి మీ రాలోచించినారో చెప్పుడు? అని.

ఆంధ్రభారతము— "దుర్యోధనుండు పాండవపాంచాలవిభేదనోపాయంబు చింతించుచుండె నంత విదురుండు పాండవాభ్యుదయంబును, పాంచాలీస్వయంవరంబును, దుర్యోధనాదులు భగ్నదర్పులగుటయు విని సంతసిల్లి పాండవులు ద్రుపదరాజపుత్రిం బెండ్లియై ద్రుపదుపురంబున నున్నవారని ధృతరాష్ట్రునకుం జెప్పిన నతం డిట్లనియె—

ఆ. యజ్ఞసేను కూతు నభిజాత నాతని యజ్ఞవేది నుదితయయినదాని
ననఘ విధివివాహ మయి పాండునందనుల్ మిగుల మిత్రబలసమృద్ధులైరి.

క. కొడుకుల యభ్యుదయము విని, కడుసంతసమయ్యె నిపుడు కౌరవకుల మే
ర్పడ వెలిగె నెల్లరాజుల, నొడిచిన భుజవీర్యమును మహోత్సాహమునన్.

వ. అని విదురునకు బ్రియంబుగా బలికి యంతఃపురంబునకుం జని యంతస్తాపం
బేర్పడకుండ నుండునంత కర్ణదుర్యోధనులు ధృతరాష్ట్రుపాలికిం జని యిట్లనిరి—

క. రేయును బగలును విదురుఁడు, నీయొద్దన యునికిఁజేసి నేరముపలుకన్
మాయిష్టం బెఱిఁగింపగ, ధీయుత యొడగంటి మిన్న దివసంబులకున్.

క. విదురుఁడు పాండవహితుఁడని, మొదలన యెఱిఁగియును నతివిమోహంబునన
న్విదురు వచనంబ నిలుపుదు, హృదయంబున నతఁడు పెద్ద యిష్టుఁడు మాకున్.

వ. అనిన వారలకు ధృతరాష్ట్రుం డిట్లనియె.

సీ. పలుకుల నెయ్యుఁ బాండవులకు బ్రీతి, గలయట్లయుండుదుగాని నాదు
హృదయంబు విదురున కెన్నఁడు నెఱిఁగింప, నేను మీతలఁచిన యివ్విధంబ
తలఁచుచునుండుదు దైవసంపదగల, వారల బాండవవరుల నేమి
సేయంగనగు నెద్ది సెప్పు డిష్టం బింక"

ఈ కర్ణదుర్యోధనధృతరాష్ట్రుల సమాలోచనమునకు బూర్వ వృత్తాంతమేమి? పాండవులు ధృతరాష్ట్రోపదేశమున వారణావతమునకు వెళ్ళి అక్కడ దుష్టచతుష్టయకల్పితమైన లక్కయింటి ముప్పునుండి తప్పించుకొని, దుష్టులు హత్యకై తలపెట్టిన దుస్తంత్రమును తెలిసికొని తప్పించుకొనిన మన మిప్పుడు బహిర్గతులమే అయినయెడల తమదుస్తంత్రము వెల్లడియైనది కదా యని యిక ఆయుధములతోడనే వధింపవచ్చి వారు మనపై బడుదురనియు, అప్పుడు వారిపై మనము చేయి చేసికొనవలసివచ్చుననియు, తత్కాలమున వారిని వధింపవలసివచ్చుననియు, అట్లు జరుగకుండుటకై మనము కొంతకాల మజ్ఞాతచర్యగా సంచరించిన పక్షములో పాండవులు మరణించినారని వారు భావింతురనియు, అందువలన "మరణాంతాని వైరాణి" అన్నట్లు వారిహృదయములు శాంతింపవచ్చుననియు ఈవిధముగా దూరదృష్టితో నాలోచించి ఆ పాండవులు అజ్ఞాతముగనే కొంతకాలము సంచరించినారు.

అప్పుడు లక్కయింట పాండవులను దుష్టులగు దుర్యోధనాదులు దగ్ధముచేసినారను లోకాపవాదము కురువంశీయులకు దుర్భరమైపోయినది. అట్టి లోకాపవాదముతో భీష్మధృతరాష్ట్రాదులు కుందుచుండిరి. దుర్యోధనాదులు సంతోషించిరి.

అంతట పాండవులు బ్రాహ్మణవేషములతో క్రమక్రమముగా ద్రుపదీస్వయంవరసమయమునకు ద్రుపదపురమున కేగి, అచ్చట మత్స్యయంత్రభంజనపూర్వకముగా ద్రౌపదిని పరిగ్రహించి, ఆసమయములో నెదుర్కొనిన కర్ణాదుల నోడించి, ద్రౌపదీపాణిగ్రహణము చేసి ద్రుపదపురమున సుఖముగా నుండ నప్పుడు పాండవులు జీవించి యుండుటెగాక అభ్యుదయాభివృద్ధిగా గూడ నున్నట్లు వినిన దుర్యోధనాదులకు గలిగిన చింతకు మేర లేదు. వారికప్పుడు కలిగిన దురూహలివి — ద్రుపదునకు బాండవులకు మిత్రభేదము కలిగింపవలయు ననియు, లేక ద్రౌపదీనిమిత్తమున పాండవులలో బరస్పరకలహము కలిగింపవలెననియు, లేదా పాండవులకు వేర్వేరుగా స్త్రీరత్నములను లొగ్గి వారికి ద్రౌపదియందు విరక్తి బుట్టింపవలెననియు, లేదా అందరితో కాపురముచేయుట కష్టమని ద్రౌపదికే పాండవులపై విరక్తి కలిగింపవలె ననియు, మాయోపాయముల భీముని వధించి వారల బలహీనుల జేయుదమనియు దుర్యోధను డనెను. దీనిపై కర్ణుడిట్లనెను—

ఆంధ్రభారతము— "ఈ యుపాయప్రయోగంబులన్నియు మడిగి యిప్పుడె పాండవులయందు విక్రమంబు ప్రయోగించుట కార్యంబు. చతురంగబలసాధనసన్నద్ధులమయి యుద్ధంబునం బాంచాలు భంజించి పాండవుల నొండుగడ నుండనీక తోడ్కొని తెత్తమనిన గర్ణు పలుకు లాకర్ణించి"

"తే బలేన వయం రాజన్ మహతా చతురంగిణా ।
ప్రమథ్య ద్రుపదం శీఘ్ర మానయామేహ పాండవాన్ ॥
నహి సామ్నా న దానేన న భేదేన చ పాండవాః ।
శక్యా సాధయితుం తస్మా ద్విక్రమేణైవ తాన్ జహి ॥
తా న్విక్రమేణ జిత్వేమా మఖిలాం భుంక్ష్వ మేదినీమ్ ।
అతో నాన్యం ప్రపశ్యామి కార్యోపాయం జనాధిప ॥ (ఆది. అ 202)

దుర్యోధనా ! నీవూహించిన విధముగా పాండవులను సామదానభేదములతో జయించుట శక్యము కాదు. మనమిప్పుడు సేనలతో వెళ్ళి ద్రుపదుని జయించి పాండవుల నిక్కడకు తీసుకొనివత్తము. నీవు

వారిని పరాక్రమముచేతనే వధించి యీ అఖండభూమండలమును అనుభవింపుము.

ఇట్లు దుర్యోధనుడు, కర్ణుడు తనయొద్ద వెల్లడించిన పాండవ నిగ్రహపద్ధతులను విని ధృతరాష్ట్రుడు కర్ణునిధోరణి కభినందించి మీరును భీష్మద్రోణవిదురులును కలిసి మరొకసారి ఆలోచించి చేసి నది శ్రేయస్కరమని చెప్పి వెంటనే భీష్మాదులను పిలిపించి ఆ విషయ మును వారియొద్ద వెల్లడింపగా భీష్మాదు లిట్లు బోధించిరి.

—♦ అపకీర్తికి పాలుకాక పాండవులను ప్రేమించి వారి కర్ధరాజ్య మిచ్చి వర్తిల్లు డని భీష్మాదులు దుర్యోధనునకు బోధించుట ♦—

భీష్ము డిట్లు చెప్పెను— మీరు పాండవులతో విరోధించు టకు నే నంగీకరింపను. నాకు ధృతరాష్ట్రు డెట్టివాడో పాండురాజును అట్టివాడే. నాకు గాంధారీపుత్రు లెట్టివారో కుంతీపుత్రులును అట్టి వారే. పాండవులు నాకు ఎట్లు రక్షింపదగినవారో ధృతరాష్ట్రా! నీకును అట్లే రక్షింపదగినవారు. నాకును ధృతరాష్ట్రునకును పాండవులు ఎట్లు రక్షింపదగినవారో దుర్యోధనా! నీకును అట్లే రక్షింపదగినవారు. కురువంశీయులందరకు ఇది తప్పనిది.

"ఏతం న తే విగ్రహం తైర్న రోచే సంధాయ వీరైర్దీయతామర్థభూమిః ।
తేషా మపీదం ప్రపితామహానాం రాజ్యం పితుశ్చైవ కురూత్తమానామ్ ॥
దుర్యోధన యథా రాజ్యం త్వ మిదం తాత పశ్యసి ।
మమ పైతృక మిత్యేవం తేపి పశ్యన్తి పాండవాః ॥
యది రాజ్యం న తే ప్రాప్తాః పాండవేయా యశస్వినః ।
కుత ఏవ తవాపీదం భారతస్యాపి కస్యచిత్ ।
అధ ధర్మేణ రాజ్యం త్వం ప్రాప్తవాన్ భరతర్షభ ॥
తేపి రాజ్య మనుప్రాప్తాః పూర్వ మేవేతి మే మతిః ।
మధురేణైవ రాజ్యస్య తేషా మర్ధం ప్రదీయతామ్ ॥
ఏతద్ధి పురుషవ్యాఘ్ర హితం సర్వజనస్య చ ।

అతోఽన్యథా చేత్క్రియతే న హితం నో భవిష్యతి ॥
తవా ప్యకీర్తి స్సకలా భవిష్యతి న సంశయః ।
నష్టకీర్తే ర్మనుష్యస్య జీవితం హ్యఫలం స్మృతమ్ ॥
దిష్ట్యా ధ్రియన్తే పార్థా హి దిష్ట్యా జీవతి సా పృథా ।
దిష్ట్యా పురోచనః పాపో న సకామోఽత్యయం గతః ॥
యదా ప్రభృతి దగ్ధా స్తే కున్తిభోజసుతా సుతాః ।
తదాప్రభృతి గాన్ధారే న శక్నో మ్యభివీక్షితుమ్ ॥
త దిదం జీవితం తేషాం తవ కిల్బిషనాశనమ్ ।
సంమన్తవ్యం మహారాజ పాండవానాం చ దర్శనమ్ ॥
నచాపి తేషాం వీరాణాం జీవతాం కురునందన ।
పిత్ర్యోఽంశ శ్శక్య ఆదాతు మపి వజ్రభృతా స్వయమ్ ॥
తే సర్వేఽవస్థితా ధర్మే సర్వే చైవైకచేతసః ।
అధర్మేణ నిరస్తా శ్చ తుల్యే రాజ్యే విశేషతః ॥
యది ధర్మ స్త్వయా కార్యో యది కార్యం ప్రియం చ మే ।
క్షేమం చ యది కర్తవ్యం తేషా మర్ధం ప్రదీయతామ్ ॥ (ఆది. అ 203)

దుర్యోధనా! అధర్మము తగదు. కనుక నీవు పాండవులతో శత్రుత్వము పెట్టుకొనుట నా కిష్టము కానిపని. ఆ వీరులతో సఖ్యపడి అర్ధభూమి వారికిమ్ము. కురూత్తములైన పాండవులకు ప్రపితా మహానుక్రమముగా వచ్చి పిత్ర్యమైన రాజ్యమే యిది.

దుర్యోధనా! నా పిత్ర్యమని నీవనుకొనుచున్న రాజ్యమునే మా పిత్ర్యమని వారనుకొనుచున్నారు. పాండురాజునకు ఔరససంతానముకాక క్షేత్రజసంతానమైన పాండవులు రాజ్యము మా పిత్ర్యమని యెట్లు పొందగలరు? ధృతరాష్ట్రుని యౌరససంతానమైన నేను పిత్ర్యమని పొందగలను. అని నీకూహ కలదేమో! నీ యూహను బట్టి చూచినయెడల నీ పితామహుడైన విచిత్రవీర్యుని రాజ్యము ఆ విచిత్రవీర్యుని యౌరససంతానముకాక క్షేత్రజసంతానమైన నీ తండ్రి ధృతరాష్ట్రునకు పిత్ర్యముగా ప్రాప్తింపనేలేదు. నీ తండ్రికి ప్రాప్తింపని రాజ్యము పిత్ర్యముగా నాకు ప్రాప్తించినదని నీవనుకొను టెట్లు?

ఇక నీతండ్రికి ధర్మముగనే ప్రాప్తించి పిత్ర్యమై నీకు ప్రాప్తించిన దందువా? అట్లైన పాండవులకు ముందే ప్రాప్తించినది. ఏమందువా? నీ తండ్రి అంధుడగుటచేత కనిష్ఠుడైనను పాండురాజే రాజ్యాభిషిక్తుడయ్యెను. అందుచే పాండవులకు ప్రాప్తించియున్నది. ఆపై యింతకు బూర్వమే ధర్మజుడు యువరాజు కావింపబడెను.

కనుక ప్రీతితో వారి కర్ధరాజ్య మిమ్ము. ఇది సర్వలోకహితము. దీనికి భిన్నముగా జేయుట మనకు శ్రేయస్సు కాదు. నీకును గొప్ప అపకీర్తి వచ్చును. కీర్తి పోయినపుడు జీవించుట వ్యర్థము. మన అదృష్టముచేత పాండవులు, కుంతీదేవి జీవించియున్నారు. వారిని దగ్ధము చేయదలచిన పాపియగు పురోచనుడు మరణించినాడు. ఆ పాండవులు దగ్ధులయినారను వార్త తెలిసినది మొదలు నేను ప్రజలముఖము చూడలేకున్నాను. పాండవులు జీవించియుండుట, వారిని దర్శించుట నిపాపపరిహారహేతు వని తెలిసికొనుము. వీరులైన ఆ పాండవులు జీవించియుండ వారిపిత్ర్యమైన అంశము (భాగము) ఇంద్రుడైన తీసికొనజాలడు. ఆ పాండవులు ధర్మనిష్ఠులై యున్నారు. ఏకచిత్తముకలిగి యున్నారు. అట్టివారు కేవల మధర్మముగా త్రోసివేయుబడినారు. విశేషించి నీతో తుల్యముగా రాజ్య మనుభవింపదగియుండగా త్రోసి వేయుబడినారు. దుర్యోధనా! నీవు ధర్మాత్ముడవైన- నాప్రీతిని నీవు కోరువాడవైన- లోకక్షేమము నీవపేక్షించువాడవైన పాండవుల కర్ధరాజ్య మిచ్చివేయుము. అని.

ఈ భీష్మవాక్యములలో "దుర్యోధన యథా రాజ్యం" అని యున్న మూడు శ్లోకములకును "కురుపాండవదాయభాగవినిర్ణయము" అనుగ్రంథములో ఏదో అర్థము చెప్పి—

"ఈ వాక్యములవలన నీరాజ్య ముభయులకునుగూడ పైతృకముగానే చెందినట్లును, ఉభయులును గూడ ధర్మముచేతనే పొందినట్లును విస్పష్ట మగుచున్నది". (పు- 19)

అని వ్రాయబడినది. ఈయర్థములో వచ్చెడి విరోధములు, ఆవాదమునకు గల అప్రామాణికత్వము మొదలగునవి. "పాండవ నిందానిరాకరణము" అను చతుర్థభాగములో నిరూపింపబడినవి కనుక అచ్చట జూడవలెను.

ఈ భీష్మవాక్యములలో పాండవుల కర్ధరాజ్య మిమ్మనియు, వారికి అది పిత్ర్యమైన అంశ మనియు జెప్పబడినదిగాని మిగిలిన యర్ధ రాజ్యము నీకు పిత్ర్యయమైన యంశమని దుర్యోధనునకు చెప్పబడలేదు. తాత్పర్య మేమనగా— దుర్యోధనునకు విడువదలచిన అర్ధరాజ్యము పాండవుల అర్ధరాజ్యమువలె సర్వాధికారములు కలది కాదనియు, పాండవుల పోష్యవర్గములోని దుర్యోధనాదుల కది యావజ్జీవోపభోగ్యమే అనియు సూచించుటే అని తెలిసికొనవలయును.

గాంధారి దుర్యోధనున కుపదేశించునపుడు కూడ—

"అల మర్ధం పృథివ్యా స్తే సహామాత్యస్య జీవితుమ్" ।

సపరివారముగా జీవించుటకు నీ కర్ధరాజ్యము చాలును. అనియే చెప్పినది. యావద్రాజ్యము పాండవులదే అయియున్నను ధృతరాష్ట్ర ధార్తరాష్ట్రాదుల పోషణభారము పాండవులదే కనుక వారిపోషణము నకై అర్ధరాజ్యము దుర్యోధనాదుల అనుభవములో నుంచనిచ్చి మిగి లిన అర్ధరాజ్యము పాండవులు పరిగ్రహించునట్లు చేయదలచి భీష్ముడు దుర్యోధనునితో వారి కర్ధరాజ్య మిమ్మని చెప్పెనేకాని పాండవుల కున్నది అర్ధరాజ్యాధికారమే అని కాదు. తలకొకవిధముగా ప్రతివాదు లన్నట్లు అర్ధరాజ్యము వారికి పిత్ర్యము, అర్ధరాజ్యము దుర్యోధనునకు పిత్ర్యమనియు గాదు. అవిభాజ్యమైన రాజ్యమును రెండుముక్కలు చేయవలయు ననియు గాదు. యావద్రాజ్యాధికారము దుర్యోధనునిది, స్వవంశీయులైన పాండవులపోషణభారముకూడ దుర్యోధనునిదే, కనుక పాండవుల కర్ధరాజ్య మిప్పింపవలె ననియు గాదు. ఇక పాండవులు కురువంశీయులు కారు. భారతీయులే కారు. అయినను ఇక్కడ పెరి

గినవారు కనుక నిరాధారులై యున్న పాండవులకు దయాధర్మభిక్షగా అర్ధరాజ్య మిప్పింపవలె ననియు గాదు. కనుకనే దుర్యోధనునకు పిత్ర్యమనక పాండవులకు పిత్ర్యమని, పితృపైతామహమని భీష్ముడు చెప్పెను.

ఆంధ్రభారతము— భీష్ముడు బుద్ధి సెప్పుట- "అప్పాండవులతో విగ్రహంబు సేయుట కెన్నండును నొడంబడ. పితృపైతామహంబయిన రాజ్యంబునకు నీయట్ల వారు నర్హులుగావున వారికి నర్ధరాజ్యం బిచ్చిన నీకును, నీబాంధవులకును, లోకంబునకును బ్రియం బగు నట్లు గానినా డపకీర్తి యగు. కీర్తియు నపకీర్తియు జనులకు స్వర్గనరకనిమిత్తంబులుగావున నపకీర్తి పరిహరించి పైతృకంబగు రాజ్యంబు పాండవుల కిచ్చి వారితోడ బద్ధప్రీతియుండవయి కీర్తి నిలుపుమనిన భీష్ముపలుకులకు".

ఇచ్చట "పితృపైతామహంబైన రాజ్యంబునకు నీయట్ల వారు నర్హులు" అనుమాటకు నీపితృపైతామహరాజ్యమునకు నీవర్హుడవయి నట్లు వారును వారి పితృపైతామహరాజ్యమునకు అర్హులు అని యర్థము చేయరాదు. "ధృతరాష్ట్రుడే రాజ్యాభిషిక్తుడు, పాండురాజు ప్రతినిధి. పాండురాజు తనభుజబలముచే నార్జించినదానిని ధృతరాష్ట్రుడు ప్రీతిచే పాండురాజున కిచ్చెను. అది కురురాజ్యములో సగమున్నది". అను వారి వాదములోనైను అది పాండురాజునుండి పాండవులకు వచ్చినదే! అగుటచే పిత్ర్యమగునుకాని పితృపైతామహ మెట్లగును.

పాండవులకు పిత పాండురాజు. పితామహుడు విచిత్రవీర్యుడు. ఇట్టి పితృపితామహులనుండి ప్రాప్తించినదే పితృపైతామహమగును. ప్రతివాదిమతప్రకారము పాండురాజు భుజబలముచే ప్రాప్తించుటచే స్వార్జితమైన ఆరాజ్యము పాండవులకు పితృపైతామహ మనుట అత్యంతవిరుద్ధ మగును. కనుక విచిత్రవీర్యునుండి పాండురాజునకు, పాండురాజునుండి పాండవులకు ఆరాజ్యము సంక్రమించి వారి కది పితృపైతామహమైన దనవలయును. అప్పుడు పాండురాజే రాజ్యాభిషిక్తు డనితీరవలయును. ఇప్పుడు దుర్యోధనునకు పితృపైతామహమగు టెట్లు? రెండురాజ్యములను కల్పించు టెట్లు ?

ఇక దుర్యోధనునకే అది పితృపైతామహము. ధృతరాష్ట్రుని రాజ్యాభిషిక్తు డగుటే దానికి హేతువు అని భావించి, "దుర్యోధనా ! నీపితృపైతామహరాజ్యమునకు నీవలె పాండవులు నర్హులు" అని యాభీష్మవాక్యమున కర్థము చెప్పుదురా ? అట్లయిన దుర్యోధనుని పితృపైతామహరాజ్యమునకు, దుర్యోధనునకు గల అర్హతతో సమానార్హత పాండవుల కెట్లుండును ? పాండవుల కర్ధరాజ్య మీయని యెడల నరకహేతువైన అపకీర్తికి పాలైపోదు వని భీష్ముడు దుర్యోధనున కెట్లు చెప్పగలిగెను.

ఇక పాండవులదే రాజ్యమనువారికైనను ఈయాక్షేపము తప్పదు. పాండవుల పితృపైతామహరాజ్యమునకు "నీవలె పాండవులు నర్హులు" అని దుర్యోధనునితో సమానార్హత పాండవులకు జెప్పు టెట్లు ? అని యందురేమో వినుడు—

పాండవరాజ్యములో దుర్యోధనునకు గల అర్హత అనుభవార్హత. దుర్యోధనరాజ్యపక్షములో పాండవులకుగల అర్హతకూడ అనుభవార్హతయే. కాని దుర్యోధనరాజ్యపక్షములో "నీవలె పాండవులు నర్హులు" అని దుర్యోధనునితో భీష్ము డనుట. సంగతము కానేరదు. సర్వవిధార్హతలుగల దుర్యోధనునితో అనుభవమాత్రార్హతకల పాండవులకు సమానార్హత యేది ?

పాండవరాజ్యపక్షములో సర్వవిధార్హతలు గల పాండవులకు అనుభవమాత్రార్హత కల దుర్యోధనునితో సమానార్హత 'అధికస్య ప్రవిష్టం న తద్ధానికరం' అను న్యాయమున లేకపోలేదు. దాన పరిపాలనానుభవాది సర్వవిధార్హతలు కలిగియున్నవారికి దుర్యోధనునకున్న అనుభవార్హత ఉండనే యున్నది. కనుక ఆక్షేపములేదు. పర్యవసాన మేమనగా ఈ భీష్మవాక్యములు పాండవులదే రాజ్య మని స్పష్టపరచుచున్నవి.

ద్రోణాచార్యు డిట్లు చెప్పెను—

"మమా ప్యేషా మతి స్తాత యా భీష్మస్య మహాత్మనః ।
సంవిభాజ్యా స్తు కౌన్తేయా ధర్మ ఏష సనాతనః ॥

.............................................................................................

తత స్తే పాండవా శ్చైవ స్థాః పూజ్యమానా స్సదా త్వయా ।
ప్రకృతీనా మనుమతే పదే స్వాస్యన్తి పైతృకే ॥ (ఆదిప- అ204)

దుర్యోధనా ! మహానుభావుడైన భీష్ముడు చెప్పినట్లు చేయుటే నాకును సమ్మతము. పాండవుల కర్ధరాజ్యమియ్యవలసినదే ! ఇది సనాతనధర్మము. ద్రుపదపురమునుండి వారిని సబహుమానముగా రప్పింపుము. తరువాత వారు నీచేత పూజింపబడుచు ప్రజల కనుమతమై పిత్ర్యమైన వారి రాజ్యమందు స్థిరపడుదురు.

ఆంధ్రభారతము— "ద్రోణుండు దుర్యోధనున కిట్లనియె... భగవ్రితామహువచనంబు సేకొనుము. మానుగ వారలతోడ నీవు విగ్రహ మొనరింప నేమిటికి గౌరవసౌబలకర్ణశిక్షలన్"

'అయ్యనఘుల పైతృకం బయిన యంశము మిన్నక వజ్రపాణికైనను గొనబోలునయ్య'

ఈద్రోణవాక్యములో పైతృకమనుమాటకు పితృపైతామహమని యర్థమే. ఇచ్చట సిద్ధాంతమిది—

అవిభాజ్యమే రాజ్యము. అది సమానముగా సర్వాధికారములతో పంచి యివ్వబడినపుడే రాజ్యవిభాగ మగును. అట్లు కాక పోష్యవర్గము జీవించుటకై నిర్దేశించి కొంత, సర్వాధికారములతో నిర్దేశించి కొంత యివ్వబడినపుడు రాజ్యవిభాగము కానేరదు.

ఈదృష్టిచేతనే భీష్ముడు పాండవులకు పిత్ర్యమైన అర్ధరాజ్యమిమ్మనుట, ద్రోణుడది సనాతనధర్మమనుట, గాంధారి నీకర్ధరాజ్యము సపరివారముగా జీవించుటకు చాలు నని దుర్యోధనునకు జెప్పుట. ధృతరాష్ట్రునిచే నట్లు నిరాక్షేపణముగా పాండవుల కర్ధరాజ్యమని యివ్వబడుట జరిగినది. ఇది రాజ్యవిభాగమని భ్రాంతిపడరాదు.

—: భీష్మాదుల మాటపై రాజ్యాధికారము నాదే అని
చెప్పలేక దుర్యోధను డూరకుండుట :—

ఇట్లు ద్రోణాచార్యులు, భీష్ముడు చెప్పినట్లే చేయుమని దుర్యో

ధనునకు బోధించెను. భీష్మునకు నీవంటి అర్హత వారికి లేకపోలేదు. పాండవులకు లేనట్టియు నీకున్నట్టియు, రాజ్యార్హత యెట్టిది? వారిపిత్రు పైతామహమైన రాజ్యములో సగము వారి కిమ్ము. అని దుర్యోధనునకు చెప్పినపుడు ఆదుర్యోధనుడు—

ప్రతివాదులన్నట్లు ఆపాండవు లెట్లో పుట్టినవారు. వారు కురువంశీయులు కారు. భారతీయులే కారు. వారికి రాజ్యము పిత్రుపైతామహ మగు టెట్లు? అని కాని, నాతండ్రి జ్యేష్ఠుడు, ప్రజ్ఞాశీలుడు అగుటవలన రాజ్యము నాకు పిత్రుపైతామహమైయుండ 'రాజ్యంబునకు నీయట్ల వారును అర్హులు' అని నీవెట్లనగలిగితివి? అని కాని, అవిభాజ్యమై జ్యేష్ఠానుక్రమముగా వచ్చు రాజ్యమును రెండుముక్కలు చేయుట, న్యాయమేనా? అనికాని, వారు పాండుపుత్రులు కానందున పాండురాజునకు నాతండ్రి ప్రీతితో ఇచ్చినదయినను వారికి చెందు టెట్లు? అనికాని, ఇట్టి వెఱ్ఱిమొఱ్ఱిమాటలతో భీష్మునిపై ఎదుర్కొనలేదు.

కారణమేమి? ఈయుక్తులు దుర్యోధనునకు స్ఫురింపకా? అతడీభాగములో ప్రతివాదులకంటె ఎన్నిరెట్లో రెట్లు ఎక్కువ నేర్చినవాడు. అట్టివాడు—

ఇవియుక్తులు కావు కుయుక్తులని, ఈయుక్తులతో తెలిసినపెద్దల సమక్షములో తనదే రాజ్యాధికారమని నిరూపింపజాలనని, తనదే రాజ్యాధికార మనుటకు తగిన సబబులు ఏమియు లేవని, పాండవులు కురువంశీయులు కారని చెప్పద మన్న తన తండ్రిని బట్టి తనకును అట్టి పరిస్థితియే ప్రాప్తించు నని ఆలోచించి అధరస్పందము చేయక మిన్నకుండెను. దుర్యోధనుడు రాజ్యాధికారికాడనునది కంఠోక్తియే. చూడుడు—

—: దుర్యోధనుడు నేను రాజ్యాధికారిని కాకపోతి నని తండ్రియొద్ద దుఃఖించుట :—

ఆంధ్రభారతము— "ధృతరాష్ట్రుండు యుధిష్ఠిరు రాజ్యభారధురంధరుంగా నెఱింగి భీష్మవిదురులతో విచారించి యౌవరాజ్యాభిషిక్తుం జేసిన".

"దుర్యోధనుండు యుధిష్ఠిర యౌవరాజ్యాభిషేకంబునకు, భీమార్జునయముల పరాక్రమంబునకు సహింపక కర్ణశకునిదుశ్శాసనులతో మంతనంబుండి యిట్లనియె"

దుర్యోధనుడు దండ్రితో దన మనోదుఃఖంబు చెల్పుట.—

తే. "వీరులని పాండుసుతులకు వెఱతు నేను వెఱమటకు దగగ నిపుడు విభుడ నీవు
పాండవజ్యేష్ఠునకు బ్రీతి బరమయౌవరాజ్య మిచ్చితి గురువృద్ధరాజులొద్ద.

దానవచేసి పౌరజానపద బ్రాహ్మణప్రధానవరులు ధర్మజున కనురక్తులయి... యుధిష్ఠిరునకు రాజ్యాభిషేకంబు సేయుదమతండు పితామహుండైన...భీష్ముని, సపుత్రకుండైన ధృతరాష్ట్రుని నతిభక్తి నభీష్టభోగానుభవపరులంగా సుఖంబనుచు... ననియెప్పుడు దమలో విచారింతురు. దినివింటె కర్ణశూలాయమానంబులైన మూఢప్రకృతుల పలుకులు విననోప".

సీ. పైతృకంబగులక్ష్మి పాండుభూపతి మున్ను తాల్చుటజేసి తత్తనయుడైన
ధర్మజుడిప్పుడు దాల్చిన నాతనితనయుండు మఱిదాని దాల్చుమీద
నిప్పాట పాండువంశేశుల వసుమతీరాజ్యస్థులగుదురు, రాజ్యమునకు
బరువడి మేమింత బాసిన మాపుత్రపౌత్రవర్గంబును బాయునింక.

ఆ. నొరులగొలిచి కుడువనోప మే మ్ముగాకుండ మమ్ము జేయనోపుదేని
పాండురాజు తొంటిభక్తియు న ప్పాండుతనయులందు దయయు దలపకుండు.

ఈరాజ్యంబు మొదలింటంగోలె భవదీయంబయినం బ్రకృతిజనులు వశ్యులు గాకున్నను గ్రమాగతంబయి మాకు నప్రయత్నలభ్యంబగు. దొల్లి పాండురాజు రాజై గుణంబులం బ్రజానురాగంబు వడయుటంజేసి యెల్లవారును ధర్మరాజు రాజ్యంబ వలతురు. దాని నెఱింగి కాని దానసమ్మానంబులం బ్రకృతి జనంబులకు సంతోషంబు సేయుచునుండుదు. నిందుల దుష్టజనుల పక్షపాతవచనంబు లుడుగునంతకు నుపాయంబున గొంతిని పాండవులను దదీయ భృత్యామాత్యవర్గంబుతో వారణావతంబునకు బుత్తము. రాజ్యంబు సుప్రతిష్ఠితంబైన మఱి వార లిందులకు వత్తురు."

ఇవి దుర్యోధనుని కంఠోక్తులు. ఇందలి అంశములను పరిశీలింపుడు. "ధృతరాష్ట్రుడు భీష్మవిదురులతో విచారించి యుధిష్ఠిరుని యౌవరాజ్యపట్టాభిషిక్తుని జేసెను".

ఇచ్చట ఆరాజ్యమున కవి, ఈరాజ్యమున కని లేక యుధిష్ఠిరుడు యౌవరాజ్యపట్టాభిషిక్తుడై చేయబడెను. అని యుండుటచేత కురు రాజ్యమున కంతకును యువరాజనియే స్పష్టమగుచున్నది. ఆపై దుర్యోధనుని కూడ యువరాజును చేసినట్లు ఎచ్చటను లేకుండుటను బట్టి

కూడ యుధిష్ఠిరుని ఆ యౌవరాజ్యాభిషేకము యావదార్యావర్తమున కని తెలియుచున్నది.

ఆ యౌవరాజ్యాభిషేకము జరిపించినవాడు ధృతరాష్ట్రుడే. అసలు కురురాజ్యాభిషిక్తుడు ధృతరాష్ట్రుడే అయి యున్నయెడల తన కుమారునకు జరిపింపవలసియున్న ఆ యభిషేకమును పాండురాజ కుమారునకు జరిపించుట సంభవింపదు. కనుక అసలు కురురాజ్యాభిషిక్తుడు పాండురాజే అనియు, అతని పుత్రున కివ్వవలసినదికనుకనే ఆ యౌవరాజ్య మిచ్చె ననియు ధ్రువ మగుచున్నది.

రెండవయంశము—'ప్రజలు- ధర్మజున కనురక్తులై, యుధిష్ఠిరునకు రాజ్యాభిషేకము చేయుదము. ఆతడు భీష్ముని, సపుత్రకుడైన ధృతరాష్ట్రుని అతిభక్తి నభీష్టభోగానుభవపరులనుగా సుఖింపజేయుచు నని యెప్పుడు తమలో విచారింతురు'. ఇచ్చట యుధిష్ఠిరునకు రాజ్యాభిషేకము జరుపుటకై ప్రజ లుద్యమించుటకు హేతువు సర్వవిధార్హతలు కలిగి ధురంధరుడై రాజ్యాధికారియై యున్న యుధిష్ఠిరునకు పట్టాభిషేకము జరుగక కాలహరణ మగుచుండుటయు, దుర్యోధనుడు పాండవులయెడ దుర్వృత్తి కలిగియుండుటయును. ఈ పరిస్థితిని కనిపెట్టి రాజ్యాధికారి యగు ధర్మజునకు పట్టాభిషేకము జరుప ప్రజలు తల పెట్టిరి.

ఇట్టి ప్రజలసంరంభము నుబట్టికూడ రాజ్యము పాండురాజుదై పాండురాజునుండి అనంతరాధికారముగా పాండవులకు చెందినట్లు స్పష్టమగుచున్నది. ధృతరాష్ట్రునిదే రాజ్యమైయున్నయెడల అనంతరాధికారి దుర్యోధనుడై యుండ, అపై అంగబలము అర్థబలము పూర్ణముగా కలవాడై యుండ, ఎట్టి యపకారములును ప్రజలపట్ల యెంతమాత్రము చేయనివాడై యుండ, అట్టి దుర్యోధనుని కాదని ధర్మదృష్టి, నిష్పక్షపాతబుద్ధి కల ప్రజలు అనధికారియైన ధర్మజుని పట్టాభిషిక్తునిజేయ తలపెట్టుదురా ? కనుక ప్రజల సంరంభమును

బట్టి కూడ దుర్యోధను డనధికారి. యుధిష్ఠిరుడే రాజ్యాధికారియని విశదమగుచున్నది.

మూడవ యంశము— "యుధిష్ఠిరుఁ‌డు భీష్ముని, సపుత్రకుడైన ధృతరాష్ట్రుని అతిభక్తితో అభీష్ట భోగానుభవపరులను చేసి సుఖ పెట్టును. అని యెప్పుడును ప్రజలు తలపోయుచుందురు".

ఇచ్చట యుధిష్ఠిరునకు రాజ్యాభిషేకమును తలపెట్టిన ప్రజలు ధృత రాష్ట్రధార్తరాష్ట్రులయందు ద్వేషభావముకలవారు కారు. కనుకనే వారి యోగక్షేమములనుగూర్చి కూడ ఆలోచించినారు. ధర్మజుడు భక్తితో వారిని సేవించుచు వారి అభీష్టములు నెరవేర్చుచు సుఖపెట్టు నని నిశ్చయించినారు.

ఇట్లు ధృతరాష్ట్రధార్తరాష్ట్రులయోగక్షేమములను ధర్మజుడే కనిపెట్టునని ప్రజ లనుకొనుటవలన ధృతరాష్ట్రధార్తరాష్ట్రులకు యావ ద్రాజ్యాధికారముకాని, యత్కించిద్రాజ్యాధికారముకాని లేదనియు, సర్వాధికారియైన ధర్మజుని పోష్యవర్గమై యున్నవారనియు, స్పష్టమగు చున్నది.

నాల్గవయంశము— "పైతృకమైన రాజ్యము మొదట పాండు భూపతి ధరించుటనుబట్టి అతని పుత్రుడైన ధర్మజుడు ఇప్పుడు ధరించె నేని ఇటుపై ధర్మజుని పుత్రుడే ధరింపవలసినవా డగును. ఈవిధమున పాండువంశీయులే వసుమతీరాజ్యార్హు లగుదురు. మేమిప్పుడు రాజ్యము నకు దూరమైపోయినయెడల మాపుత్రపౌత్రాదులు కూడ దూరమై పోవుదురు. మే మొరులను గొల్చి బ్రతుకలేము తండ్రీ! మమ్ముద్ధ రింపదలచితివేని ఆపాండురాజుభక్తిని, యీ పాండుపుత్రులపై దయ యును తలపోయకుండుము".

ఇచ్చట పాండుభూపతి ధరించిన రాజ్యము పిత్ర్యమని చెప్ప బడుటచే ప్రతివాదు లన్నట్లది పాండుభూపతి స్వార్జితము, ధృతరాష్ట్ర

దత్తమూకూడ కాదనియు, అది వంశానుగతమై వచ్చుచున్న కురు
రాజ్యమే అనియు స్పష్ట మగుచున్నది.

ఆ పాండుభూపతి ధరించిన ఆరాజ్య మిప్పుడు పాండుపుత్రుడు
ధరించినయెడల ఇకముందు ఈతని పుత్రుడే ధరించును. అని చెప్పబడు
టచే, కురురాజ్యమునకు పట్టాభిషిక్తుడు పాండుభూపతియె కాని, ప్రతి
వాదులన్నట్లు ధృతరాష్ట్రుడు కాడనియు, ప్రతివాదులు కల్పించినట్లు
పాండుభూపతి ధృతరాష్ట్రుని ప్రతినిధి కాడనియు, ధర్మజుడు పాండు
పుత్రుడె కాని ప్రతివాదులన్నట్లు ఎవ్వడో కాడనియు స్పష్టమగుచున్నది.

ఈవిధమున "పాండువంశీయులే వసుమతీరాజ్యార్హులగుదురు"
అని చెప్పబడుటచేత. పాండవులకు ప్రతివాదులన్నట్లు అన్నరాజ్యా
ర్హతకాని, రాజ్యానర్హతకాని కాక, యావద్రాజ్యార్హతయే అని స్పష్ట
మగుచున్నది.

"మే మిప్పుడు రాజ్యమునకు దూరమైపోయినయెడల మా
పుత్రపౌత్రాదులుకూడ దూరమై పోదురు. మే మొరులగొల్చి బ్రతు
కలేము".

అని చెప్పబడుటచే ధృతరాష్ట్రధార్తరాష్ట్రులకు పాండవరాజ్య
ముకంటె ప్రతివాదు లన్నట్లు ఎట్టిరాజ్యము హక్కుగలది లేదనియు,
పాండవపోష్యవర్గమై భోగము లనుభవింపవలసినవారె అనియు స్పష్ట
మగుచున్నది.

అయిదవ యంశము— "ఈరాజ్యంబు మొదలింటగోలె
భవదీయంబయినయెడల ప్రజలు వశ్యులు గాకున్నను క్రమాగతంబు
మాకు నప్రయత్నలభ్యంబగు. తొల్లి పాండురాజు రాజై ప్రజానురా
గంబు వడయుటంజేసి యెల్లవారును ధర్మరాజు రాజ్యంబ వలతురు".

ఇప్పుడు ఈరాజ్యము మొదటినుండియు నీదే ఐనయెడల
ప్రజ లెట్లున్నను క్రమాగతమై మాకు అప్రయత్నలభ్య మగును.
అని చెప్పబడుటచే దుర్యోధనునకు రాజ్యము క్రమాగతము కాలేద

నియు, దానికి కారణము. మొదట రాజ్యము ధృతరాష్ట్రునకు చెంద లేదనియు, ఇప్పుడుమాత్రము ధృతరాష్ట్రాధీనమై రాజ్యమున్నను మొదటనుండియు లేకపోవుటచే క్రమము తప్పిపోయిన దనియు, జ్యేష్ఠుడై యున్నను మొదట రాజ్యము చెందకపోవుటకు కారణము ధృతరాష్ట్రుని అంధత్వమే అనియు, అదికారణముగా కనిష్ఠుడైనను పాండుభూపతికే రాజ్యాభిషేకపూర్వకమయిన రాజ్యప్రాప్తి కలుగుటనుబట్టి జ్యేష్ఠానుక్రమముగా రావలసిన క్రమము తప్పిపోయినదనియు, క్రమాగతమైన రాజ్యమైనపుడు ప్రజల యిష్టానిష్టములతో పని లేకయే హక్కు కలిగితీరు ననియు, దానికి విచ్ఛేదము వచ్చెననియే దుర్యోధనుని యీ దుఃఖమనియు స్పష్టమగుచున్నది. కనుక దుర్యోధనుడు రాజ్యాధికారి కాడు.

## — ♦ ప్రతివాదుల ఆక్షేపముపై సమాధానము ♦ —

"గ్రుడ్డివాడు బొత్తిగా రాజ్యార్హుడు కాడని చెప్పుకొందుమేని మొదటికే మోసము వచ్చును. ఏమన— పాండురాజానంతరమున నైన రాజ్యము స్వీకరించెను గదా! మొదట పనికిరానివా డప్పు డెట్లు పనికివచ్చినాడు ?

(దాయభాగవినిర్ణయము)

ఈ యాక్షేపము ఈ దుర్యోధనోక్తులచేతనే ప్రతిహతమైనది. ప్రతివాదు లనిన యీ మాటను నిజముగా అనవలసినవాడు దుర్యోధనుడు. ప్రతివాదులు ధృతరాష్ట్రరాజ్యవాదమును మాత్రమె నిలవబెట్టబూనుకొనినవారు. దుర్యోధనుడన్ననో అప్పటికి తన తండ్రి చేతికి చిక్కియున్న రాజ్యమును దాటిపోకుండ నిలవబెట్టుకొనుటకై అనేక కుయుక్తులు కతంత్రములు పన్నుచున్నవాడు. అట్టి దుర్యోధనుడు ప్రతివాదులన్నమాటను ఎత్తుకొనలేదు. కారణమేమి ? పట్టాభిషేకము ధృతరాష్ట్రునకు కాకుండుటే. పట్టాభిషేకమనునది రాజునకు కావలసిన శాస్త్రీయసంస్కారము. తన్మూలకముగా స్వీకరింపబడుచు వచ్చిన రాజ్యమే క్రమాగతరాజ్యమగును.

అది పాండుభూపతిద్వారా పాండవులకు క్రమాగతమైనది. దానికే దుర్యోధనుని దుఃఖము. పాండురాజానంతరము ధృతరాష్ట్రుడు స్వీకరించెనుకదా! అనర్హు డప్పు డెట్లుస్వీకరించెను? అని ప్రతివాదులు అనుచున్నారు. అప్పుడుడైనను రాజ్యాభిషేకపూర్వకముగా స్వీకారము కానేకాదు. పాండురాజు వనమునకు వెళ్ళునపుడు తనరాజ్యమును ధృతరాష్ట్రునకును, విదురునకును కనిపెట్టుడని అప్పగించి వెళ్ళెను. అప్పుడు ధృతరాష్ట్రుడు రాజై విదురుడు మంత్రియై వ్యవహరించెను. చూడుడు—

"తథా పాండు ర్నరపతి స్సత్యసన్ధో జితేంద్రియః ।
రాజా కురూణాం ధర్మాత్మా సుపరిత స్సుసమాహితః ॥
విసృజ్య ధృతరాష్ట్రాయ రాజ్యం స విదురాయ చ ।
చచార పృథివీం పాండు స్సర్వాం పరపురంజయః ॥" (ఉద్యో-అ 148)

ఇదియే ధృతరాష్ట్రుడు రాజ్యము స్వీకరించిన పద్ధతి. కనుకనే మొదటినుండియు రాజ్యము నీది కాకపోవుటచే మాకు క్రమాగతము కాకపోయె నని దుర్యోధనుడు తండ్రియొద్ద దుఃఖపడెను. కనుక దుర్యోధనుడు రాజ్యాధికారి కాడు.

ఇచ్చట ప్రతివాదుల ఆక్షేపము లిట్లున్నవి—

### —♦ దుర్యోధను డంగరాజ్య మిచ్చుట ఎత్తుకొని చేసిన ప్రతివాదుల ఆక్షేపములపై సమాధానము ♦—

దాయభాగవినిర్ణయము—"అస్త్రదర్శనకాలమందు కర్ణుడు రాజు కాడు గాన రాజపుత్రు డగు నర్జునునితో యుద్ధముచేయ దగడను నాక్షేపము రాగా దుర్యోధను డాలోపము పూర్తియగుటకై యాతని నంగదేశాధీశుని జేసెద నని చెప్పి తత్క్షణ మంగదేశమునకు పట్టాభిషేకము జేసినాడు. రాజ్యము పాండవుల దాయె; దుర్యోధనున కంతెంతమాత్రము నంశము లేదాయె. అట్లైనచో పాండవులుగాని, తత్పక్షమువారుకాని కర్ణున కంగదేశ మిచ్చుటకు నీ కధికార మెక్కడ నున్నదని యొందుకు బ్రశ్న వేయరైరి? అనిన నిరుత్తర మగునుకదా!"

కురుక్షేత్రసంగ్రామము— "సుయోధనుడు యువరాజో రాజో కాక

యున్నచో గుమారవిద్యాప్రదర్శనకాలమందు కర్ణునకు నంగరాజ్య మిచ్చుట కెట్లర్హుడు ?"

ఇట్లు ప్రతివాదు లనుచున్నారు. వీరు ఏ దుర్యోధనునకు రాజ్యాధికార మున్నదని చెప్పుచున్నారో ఆదుర్యోధనుడు- రాజ్యమో రాజ్యమో అని కొట్టుకొనుచున్న ఆ దుర్యోధనుడు- రాజ్యముకొరకే పాండవులను సమూలనాశనముచేయుటకు ఎన్నియో యెత్తు లెత్తుచున్న ఆ దుర్యోధనుడు- తన చిన్ననాడే కర్ణునకు అంగరాజ్యము స్వయముగా నిచ్చిన ఆ దుర్యోధనుడు- ఆ నాటికే ప్రతివాదు లన్నట్లు రాజో యువ రాజో అయియున్న ఆ దుర్యోధనుడు వీరుచేసిన యీ నిరుత్తరపూర్వ పక్షమును ఎందు కెత్తుకొనలేదని ప్రతివాదుల నడుగుచున్నాము.

అది చూడగా కుమారాస్త్రవిద్యాప్రదర్శనకాలము. అప్పటికి ధర్మజుడే యువరాజుగా జేయబడలేదు. దుర్యోధనుడు అప్పటికి గాదు మరెప్పటికిని రాజుగా గాని, యువరాజుగా గాని చేయబడలేదు. అట్టి దుర్యోధనుడు తగుదు నని కర్ణున కంగరాజ్య మిచ్చు టెట్లు? అది చెల్లు టెట్లు ? దాని యాధారమున రాజు కానట్టి కర్ణుడు రాజై నిలవ బడు టెట్లు ? అని ప్రతివాదుల నడుగుచున్నాము.

"అప్పుడ భీష్మధృతరాష్ట్రులకుం జెప్పి వారి యనుమతంబున......కర్ణుం గాంచనపీఠంబున నునిచి యంగరాజ్యంబున కభిషిక్తుం జేసిన" (ఆంధ్రభారతము).

అని యుండుటచే తన సంకల్పము ధృతరాష్ట్రునకు జెప్పుకొని ఆ ధృతరాష్ట్రుని యనుమతి దీసికొని యప్పు డాకార్యము దుర్యోధనుడు చేసె నని కదా చెప్పవలయును. ఇందులో ప్రతివాదులచే వర్ణింపబడుచున్న రాజ్యాధికారము దుర్యోధనునియం దేమి సిద్ధించి నట్లు ? ఒకని యనుమతిపై అనధికారి చేయునట్టిదే ఆ పని.

ఇక ధృతరాష్ట్రానుమతిపై జరిగినది అంగరాజ్యప్రదానము కనుక ధృతరాష్ట్రుడు రాజ్యాధికారి యని యందురు కాబోలు. ఒక్క- ధృతరాష్ట్రానుమతియేగాక, భీష్మానుమతికూడ్ద్వప్పుడు గ్రహింపబడినట్లు లేదయు

బడుటచేత భీష్మునకుగూడ రాజ్యాధికారము వర్ణింపవలసియుండునే. కనుక భీష్మునితో బాటు ధృతరాష్ట్రుడును రాజ్యాధికారి కాడు.

అట్లయిన వారి యనుమతి యెందుకనగా—రాజ్యమును చేసి యున్నవాడును, అసాధారణపితృభక్తితో పాండవులచే బూజింపబడు చున్నవాడును ధృతరాష్ట్రుడు. ఆ ధృతరాష్ట్రునకు, ఆ పాండవులకు, ఈ కౌరవులకు అంగరక్షకుడై యున్నవాడు భీష్మపితామహుడు. అట్టివారి యనుమతిపై జరిపినపుడు ఆక్షేపణ ముండదని దుర్యోధను డట్లు చేసి యున్నాడు.

ధృతరాష్ట్రునియందు పాండవులకు గల భక్తిశ్రద్ధ లెంతటివో వారణావతప్రస్థానసమయమున తమవెంటబడి వచ్చినట్టి పౌరులతో ధర్మరాజు చెప్పిన యీమాట వెల్లడించుచున్నది—

"పితా మాన్యో గురు శ్శ్రేష్ఠో యదాహ పృథివీపతిః ।
అశంకమానై స్తత్కార్య మస్మాభి రితి నో వ్రతమ్ ॥" (ఆది-అ 145)

సర్వవిధముల పూజ్యుడైన తండ్రియగు ధృతరాష్ట్రప్రభువు మాకెప్పుడేమి చెప్పినను దానిని శంకింపకుండ చేయుటే మాకు వ్రతము. అని.

ఇట్లు పాండవులు ధృతరాష్ట్రునకు వశవర్తు లనియు, ఆధృతరాష్ట్రుడు తనకు వశవర్తి యనియు దుర్యోధనుడు గుర్తించియే వారి నావిధముగా ననుమతింపజేసికొని తాను సంకల్పించిన అంగరాజ్యప్రదాన కార్యమును కొనసాగించెను. ఇది ధృతరాష్ట్రునకును, దుర్యోధనునకును రాజ్యాధికార ముండి జరిగిన పని కాదు. పాండవుల భక్తిశ్రద్ధలే అది నెరవేరుటకు గారణము.

కనుకనే తనదే రాజ్యాధికారమనుటకై ఈయంగరాజ్య మిచ్చిన విషయమును ప్రతివాదులవలె ఎన్నడును దుర్యోధను డెత్తుకొనలేదు సరికదా. "మాకు రాజ్యము క్రమాగతము కాకపోయెను, మాపుత్రి

పౌత్రులు రాజ్యమునకు దూరమైపోవలసిన గతి పట్టినది. మేము న్యాల (పాండవుల) గొల్చి బ్రతుకలేము. తండ్రీ! రాజ్యము మొదటి నుండియు నీది కాకపోయెను". అనియే ఏకాంతములో తండ్రియొద్ద దుఃఖపడెను. కనుక దుర్యోధనుడు రాజ్యాధికారి కాడు.

—: ధృతరాష్ట్రుడు రాజ్యాభిషిక్తుడయినట్లున్న ఆంధ్రభారతవచనములకు పూర్వోత్తరసందర్భశుద్ధిపర్యాలోచనము :—

ఈవిషయమై ప్రతివాదు లొక ప్రశ్న వేయుచున్నారు— "పాండురాజునకు రాజ్యాభిషేకమయినట్లు ఆంధ్రభారతములో నెచ్చటను లేదు. ధృతరాష్ట్రునకు రాజ్యాభిషేకమయినట్లు స్పష్టముగా జెప్పబడినది—

"అంబికేయు ధృతరాష్ట్రు రాజ్యాభిషిక్తుం జేసి భీష్ముండు ... రాజ్యంబు రక్షించుచున్నంత.

ఉ. ఆయము గర్వమున్ విడిచి యన్యపతుల్ పనిసేయ నిట్లు గాం
గేయభుజాబలంబున నికృత్తవిరోధిసమాజుడై కుమా
రాయితశక్తిశాలి ధృతరాష్ట్రుడు రాజ్యము సేయుచుండె న
త్యాయతకీర్తితో దనకు హస్తిపురం బది రాజధానిగాన్." (ఆంధ్రభారతము)

ఇట్టిస్థితిలో రాజ్యము దుర్యోధనునకు క్రమాగతము కాకపోవుటేమి? మొదటినుండియు ధృతరాష్ట్రునిది కాకపోవుటేమి"? అని. నిజమే ఇట్లు చెప్పిన ఆంధ్రభారతమే ఆవిధముగా జెప్పుచున్నది. ఇచ్చట రాజ్యాభిషిక్తు డని చెప్పి రాజ్యాభిషేకప్రతిబంధకముగా నాతడంధుడని రాజ్యంబునకు దగకున్నవాడనికూడ జెప్పుచున్నది.

భీష్ముడు ధృతరాష్ట్రుని రాజ్యాభిషిక్తుని జేసినట్లు చెప్పి, ఆభీష్ముడే రాజ్యము పాండవులకు పిత్ర్యపైతామహమని దుర్యోధనునితో ఆధృతరాష్ట్రసమక్షమందే చెప్పినట్లు చెప్పుచున్నది.

ధృతరాష్ట్రుడు రాజ్యాభిషిక్తుడని చెప్పి, ఆ ధృతరాష్ట్రుడే—

"రాజయ్యెడువాడు దన రాజ్యభారంబు దాన చూచి యారయవలయు నేను......అంగవైకల్యంబునం బరచక్రంబులకుం బ్రతివ్యూహంబులు రచియింప నేరమిం జేసి రాజ్యంబునకు దగకున్న.

ఉ. లోకనుతుండు పాండుఁ డమలుండు మహాగుణరత్నపూర్ణర
త్నాకరు డత్యుదారమతి సంధుఁడ నైననునైనన్ను రాజుగా
జేకొని నాకు భక్తి బనిసేయుచు సర్వజగజ్జిగీషుడై
యాకురువంశరాజ్యభర మింతయు దాల్చె బరాక్రమంబునన్".

అని దుర్యోధనునకు బోధించినట్లు చెప్పుచున్నది.

ఇచ్చట అంధత్వమున ధృతరాష్ట్రుఁడు రాజ్యమునకు దగ కుండుట, పాండుభూపతి రాజ్యమేలుట, అన్నయందు భక్తిశ్రద్ధలు కలిగియుండుట స్పష్టము.

పాండుభూపతికి రాజ్యాభిషేకము స్పష్టముగా జెప్పబడలేదు కాని, భీష్మధృతరాష్ట్రదుర్యోధనులప్రసంగములలో నది సూచింప బడుచునే యున్నది. అప్రకంప్యమైన యుధిష్ఠిరయౌవరాజ్యముచే నది బలపడుచునే యున్నది. ఇంకొకటి—

"మఱియు నప్పాండురాజు వినయవిధేయత్వంబున ధృతరాష్ట్రునకు, అభిమతకార్యకరణంబున బాంధవులకు, ననుకూలత్వంబున సుహృజ్జనులకు, బరిశ్రమజ్ఞానంబున విద్వాంసులకు, గారుణ్యదానంబున ననాథులకు, నయంబున మహీపతులకు సంతోషంబు సేయుచు.

క. మండితగుణసంపద నధికుం డగుచుం గూరుభరతకురుపతులకు దు
ల్యుండయి వంశకరుం డగు బాండుమహీశు డని బుధసభలు దను బొగడన్."

ఇచ్చట రాజ్యాభిషిక్తులగు పూరువు, భరతుడు, శంతనువు, విచిత్రవీర్యుడు అను వారితో తుల్యుడు పాండుభూపతి యని చెప్ప బడుటచే పాండుభూపతి రాజ్యాభిషేకము ధ్రువ మగుచున్నది.

ఇంకొకటి— ఆదిపర్వము పంచమాశ్వాసమున ధృతరాష్ట్రుని రాజ్యాభిషేక మారంభించి చెప్పబడిన విషయములను సంగ్రహముగా పేర్కొను ఆశ్వాసాంతగద్యములో—

"ఇది...నన్నయభట్టప్రణీతంబైన శ్రీమహాభారతంబునం దాదిపర్వంబున ధృతరాష్ట్రపాండురాజుల వివాహంబును, బాండురాజదిగ్విజయంబును, బాండవ ధార్తరాష్ట్రసంభవంబును, బాండురాజనిర్యాణంబును, గృపద్రోణజన్మకథనంబును కుమారాస్త్రవిద్యాగ్రహణంబును నన్నది పంచమాశ్వాసము."

అని చెప్పునపుడు మొదటనున్న ధృతరాష్ట్రుని రాజ్యాభిషేకము చెప్పబడలేదు. పాండురాజు దిగ్విజయమే చెప్పబడినది.

ఇంకొకటి— ఆదిపర్వము ప్రథమాశ్వాసమున "పర్వసంగ్రహము" అని వ్రాయబడిన స్థలములో నిట్లున్నది—

> "వ్యాసజన్మంబును... రాజవంశానుకీర్తనంబును... గాంగేయజన్మంబును, దద్రాజ్యనివర్తనంబును... చిత్రాంగద విచిత్రవీర్య జన్మంబును, చిత్రాంగద రాజ్యాభిషేకంబును, చిత్రాంగద మరణానంతరంబున భీష్ముండు విచిత్రవీర్యు గౌరవరాజ్యంబున నభిషిక్తుం జేయుటయు ... ధృతరాష్ట్రపాండురాజుల జన్మంబు...... ధృతరాష్ట్రపాండురాజుల వివాహంబును, పాండవధార్తరాష్ట్రసంభవంబును, పాండునిర్యాణంబును......కుమారాస్త్రవిద్యాగ్రహణంబును,......యుధిష్ఠిర యౌవరాజ్యాభిషిక్తుం జేయుటయు, దుర్యోధను దుర్మంత్రంబును"

ఇచ్చట చిత్రాంగదుని రాజ్యాభిషేకము చెప్పబడినది. ఆతని యనంతరము విచిత్రవీర్యుని భీష్ముడు రాజ్యాభిషిక్తుని జేసినట్లు చెప్పబడినది ఆవిచిత్రవీర్యుని యనంతరముమాత్రము ధృతరాష్ట్రుని ఆభీష్ముడు రాజ్యాభిషిక్తుని జేసినట్లు చెప్పబడలేదు. పాండురాజరాజ్యాభిభిషేకము చెప్పబడలేదుకాని, యుధిష్ఠిర యౌవరాజ్యాభిషేకము చెప్పబడుటచేత నది చెప్పబడినట్లే! దుర్యోధనయౌవరాజ్యాభిషేకము చెప్పబడలేదుకనుక ధృతరాష్ట్రునకు రాజ్యాభిషేకము జరుగలేదన్నమాటే. ఇంకొకటి—

> ఆదిపర్వము షష్ఠాశ్వాసము—"పాండవులు.........ధృతరాష్ట్రనియోగంబున వారణావతంబునకు జననీసహితంబుగా బోవ సమకట్టి.........హాస్తిపురంబు వెలువడు నపుడు అప్పురంబునం గల బ్రాహ్మణక్షత్రియప్రముఖానేక జనంబులు శోకసంతప్తహృదయు లయి.

సీ. ఇప్పాండుపుత్రుల నేలకో ధృతరాష్ట్రుడేకత మనుపంగ నిచ్చగించె
నిది యధర్మం బని యెఱిగి గాంగేయాదు లేల వారింపరో యెఱుంగ మొక్కొ—
పితృపితామహులచే ధృతపూర్వమై క్రమాగతమైన రాజ్యంబు గరము నెమ్మి
బాండుసుతజ్యేష్ఠు భరతకులశ్రేష్ఠు ధర్మజు బూన్పక ధర్మ్మ వుడిపి.

ఆ. యేల వృద్ధరాజు లెడసేసిరో పార్థు లరిగి నెడకమనము నరిగి యతని
యున్నచోన ప్రీతి నుందుద మిందుండనేల యనుచు బౌర లెల్ల దెరలి",

ఇచ్చట ధర్మజునకు పితృపితామహాక్రమాగతమైన రాజ్యమీయక ఉండ నిట్లు చేయుట యేమిపని? అని పౌరులనుకొనుటలో కురురాజ్యము పాండురాజుద్వారా పాండవులకు క్రమాగతమని స్పష్టము. ఈ ధర్మజునితో మనముకూడ పోవుదమని హాస్తిపురపౌరులే అనుకొనుట వలనహాస్తినాపురము రాజధానిగా గల రాజ్యమే ధర్మజుని దని స్పష్టము. కనుక ధృతరాష్ట్రునకు రాజ్యాభిషేకము జరుగ లేదన్నమాటే.

ఇంకొకటి—ఆదిపర్వము— అష్టమాశ్వాసము.

"మహోత్సవంబుతో పాండవులు గజపురప్రవేశంబు సేయునప్పుడు వారలం జూచి—

సీ. పురజను లెల్లను గర మనురక్తులై ధర్మస్వరూపు డీధర్మతనయు
డనుజులు దానును జనుదెంచె పాండుభూజనపతి జీవించి మనల గావ
కీర్తితో దానిప్పు డేతెంచె మేలయ్యె నిమ్మహాత్ములకు స్థైర్యమ్ము బుద్ధి
కారంబు గలుగంగ ధారుణీరాజ్యంబు వాయునే యాపదల్ వాయు గాక.

ఆ. దానహోమజపవిధానముల్ మనకివి గలవయేని ధరణివలయరాజ్య
మింద యుండి ధర్మనందను డొనరించుచుండు గావుతమయఖండితము".

ఇచ్చట హాస్తినాపురజనులు ఈమహాత్ములగు పాండవులకు ఆపదలు పోవునేకాని ధారుణీరాజ్యము పోవునా? అనియనుకొనుటలో యావద్రాజ్యాధికారము పాండుపుత్రులదేయని స్పష్టము. తమ సుకృతమంతయు ధర్మస్వరూపుడైన ధర్మజుడు హాస్తినాపురవాసియై ధరణీవలయరాజ్య మేలునట్లు ఫలింపవలెనని కోరుటచేత పూర్వము యువరాజై యున్న ధర్మజునిదే హాస్తినాపురసామ్రాజ్య మని స్పష్టము. కనుక ధృతరాష్ట్రునకు రాజ్యాభిషేకము జరుగలేదన్నమాటే.

ఇంకొకటి— కృష్ణభగవానుడు కురుసభలో సంధికై మాటలాడి దుర్యోధనవైముఖ్యము జూచి యిక వీరిపై దండోపాయమే కర్తవ్య మని నిశ్చయించి, పాండవులయొద్దకు వచ్చి కురుసభావృత్తాంతమును చెప్పునపుడు దుర్యోధనునకు ధృతరాష్ట్రుడు, భీష్ముడు, గాంధారి, చెప్పినమాట లిట్లు వివరించెను—

సీ. "శంతను పుణ్యవంశం బంకురించిన చందంబు నంబికానందనుండు
జాత్యంధుడై యుండ సామ్రాజ్య మంతయు బాలించి పాండునృపాలు డవని
గెలిచి యుండుటయును గురుకులంబున కెల్ల దేజంబుగా మీరు దిగ్విజయము
సేసి కావించిన సిరి వారు వంచనగొనుటయు సత్య మనుచితముగ
తే. నీవు సమయంబు నడపిన నెఱియును దండ్రి పాలు నీకు నీదగుటయు బాడిలేమి
నరయ జెడుదురు కౌరవు లనియు బెద్దలెల్ల జెప్పిరి మొగమోట మింతలేక
క. అలయక యందఱు జెప్పం, గలయంతయు జెప్ప రతడు గటకటబడి య
క్కొలువు వెడలి పోయెం దమ్ములు గర్ణుడు రాజలోకముం దోనరుగన్.
వ. ఇట్లు గొడుకు ముష్కరుండై యరిగిన ధృతరాష్ట్రుండు గాంధారి రావించి—
క. తగ విదురు బంచి యాతని, మగుడగ బిలిపించె నాయమను దనయునకున్,
దగయును గూర్మియు వెరవును, మిగిలిన వచనముల సంధి మెయికొన జెప్పెన్.
వ. "ఎవ్వ రెంత సెప్పినను గైకొనక కడంగి దుర్యోధనుండు దనకుం గలవారల నెల్ల
రను గురుక్షేత్రంబునకు నడవుం డని చెప్పం బనిచె.

ఇచ్చట ధృతరాష్ట్రుడు జాత్యంధుడై యుండ సామ్రాజ్య మంతయు పాండుభూపతి పాలించుట మొదలగు విషయములు కురుసభలో బెద్దలందరు దుర్యోధనునకు బోధించినారనియు, అందఱును చెప్పగలిగినంత జెప్పినారనియు, గాంధారి కూడ జెప్పదగినంత జెప్పిన దనియు ఆకురుసభావృత్తాంతము సంక్షేపపరచి చెప్పబడినది.

దీనికి మూలమైన సంస్కృతమహాభారతములో నుద్యోగపర్వమున 147, 148, 149 అధ్యాయములలో భీష్మద్రోణవిదురగాంధారీధృతరాష్ట్రులు రాజ్య మేక్రమముగా ప్రాప్తించినదో, ఎవ్వనిది యిప్పుడు రాజ్యాధికారమో స్పష్టముగా వివరించి చెప్పిన విషయము లున్నవి. అందు ముఖ్యాంశములు కొన్ని యుదాహరింపబడుచున్నవి—

భీష్మ ఉవాచ—
"అంధః కరణహీనత్వా న్న వై రాజా పితా తవ ।
రాజా తు పాండు రభవ న్మహాత్మా లోకవిశ్రుతః ॥
స రాజా తస్య తే పుత్రాః పితు ర్దాయాద్యహారిణః ।
మా తాత కలహం కార్షీ రాజ్యస్యార్ధం ప్రదీయతామ్ ॥
మయి జీవతి రాజ్యం కః స్సంప్రశాసే త్పుమా నిహ ।

మా వమంస్థా వచో మహ్యం శమ మిచ్ఛామి వ స్సదా ॥
న విశేషోఽస్తి మే పుత్ర త్వయి తేషు చ పార్థివ ।
మత మేత త్పితు స్తుభ్యం గాంధార్యా విదురస్య చ ॥
శ్రోతవ్యం ఖలు వృద్ధానాం నాభిశంకీ ర్వచో ర్మమ ।
నాశయిష్యసి మా సర్వ మాత్మానం పృథివీం తథా ॥" (అ 147)

దుర్యోధనా! అంధుడైన నీతండ్రి హీనాంగుడగుటచేత రాజు కాలేదు. లోకవిఖ్యాతుడైన పాండుభూపతియే రాజయ్యెను. అట్టి రాజుయొక్క పుత్రులైన పాండవులు తండ్రిరాజ్యమునకు అధికారులు. నీవు కలహింపక అర్ధరాజ్య మిచ్చివేయుము. నేను జీవించియుండ రాజ్యము నాదని అనువాడెవడు? నా మాటను తిరస్కరింపకుము; మీ శ్రేయస్సునే సదా నేను కోరుచున్నాను; నాకు నీవును వారును సమానులే; నీతండ్రికి, తల్లికి విదురునకు ఇదియే సమ్మతము; పెద్దల మాట వినవలయును; నా మాటపై శంకింపకుము; ఆత్మనాశనము, సర్వనాశనము జేయకుము.

ఈ భీష్మోక్తులలో రాజ్యాభిషిక్తుడు ధృతరాష్ట్రుడు కాడు; పాండురాజే అని స్పష్టమయినది. ఇప్పటి రాజ్యాధికారము పాండవులదే; దుర్యోధనునిది కాదని స్పష్టమయినది.

కనుకనే వెనుకజూపబడిన ఆంధ్రభారతములోని భీష్మోక్తి—"పితృపైతామహంబయిన రాజ్యంబునకు నీయట్ల వారు నర్హులు" అనునపుడు పాండవులకు పితృపైతామహ మని యర్థమేకాని, దుర్యోధనునకు పితృపైతామహమని యర్థముకాదని స్పష్టమగుచున్నది. కనుకనే—

"పైతృకంబగు లక్ష్మి పాండుభూపతి మున్ను దాల్చుటజేసి......పాండువంశజుల వసుమతీరాజ్యార్హు లగుదురు......ఒరుల గొలిచి కుడువనోప మేము".

అని దుర్యోధనుడు తండ్రియొద్ద విలపించినాడు. ఇట్లు పూర్వోత్తరవాక్యముల కేకవాక్యత సంభవించుచున్నది.

"భీష్మే ణోక్తే తతో ద్రోణో దుర్యోధన మభాషత ।
ప్రాతీప శ్శంతన స్తాత కులస్యార్థే యథా స్థితః ॥
యథా దేవవ్రతో భీష్మః కులస్యార్థే స్థితోఽభవత్ ।

తథా పాండు ర్నరపతి స్సత్యసంధో జితేంద్రియః ॥
రాజా కురాణాం ధర్మాత్మా సువ్రత స్సుసమాహితః ।
జ్యేష్ఠాయ రాజ్య మదదా ద్ధృతరాష్ట్రాయ ధీమతే ॥
యవీయసే తథా క్షత్రే కురూణాం వంశవర్ధనః ।

నీలకంఠీయమ్—జ్యేష్ఠోంధత్వా దనర్హః. క్షత్తా వియోనిజత్వా దనర్హ ఇతి సూచయన్ యథా జ్యేష్ఠాయాఽదదాత్, తథా క్షత్రే విదురాయాపి న్యాస భూత మదదా దితి భావః.

"తత స్సింహాసనే రాజన్ స్థాపయిత్వైన మచ్యుతమ్ ।
వనం జగామ కౌరవ్యో భార్యాభ్యాం సహితో నృపః ॥
తత స్సర్వాః ప్రజా స్తాత ధృతరాష్ట్రం జనేశ్వరమ్ ।
అన్వపద్యంత విధివ ద్యథా పాండుం జనాధిపమ్ ॥
విసృజ్య ధృతరాష్ట్రాయ రాజ్యం స విదురాయ చ ।
చచార పృథివీం పాండు స్సర్వాం పరపురంజయః ।
కథం తస్య కులే జాతః కులభేదం వ్యవస్యసి ॥
సంభూయ భ్రాతృభి స్సార్ధం భుంక్ష్వ భోగాన్ జనాధిప ॥" (అ 148)

భీష్ముడు చెప్పినతరువాత ద్రోణాచార్యు డిట్లు చెప్పెను—దుర్యోధనా! ఈకురువంశమునకు శంతనమహారాజువలె, భీష్మునివలె అలంకారభూతుడై సద్గుణరాశియైన పాండుభూపతి రాజై కొంత కాలము గడచినతరువాత వనవాసమును సంకల్పించి రాజ్యమును ధృత రాష్ట్రవిదురులకు న్యాసభూతముగా నప్పగించి ధృతరాష్ట్రుని సింహా సనాసీనుని జేసి తన భార్యలతో వనమునకు వెళ్ళెను.

తరువాత ప్రజలు పాండుభూపాలుని యనువర్తించియున్నట్లే ధృతరాష్ట్రుని గూడ ననువర్తించుచు వచ్చిరి. ధృతరాష్ట్రవిదురులకు రాజ్యము నప్పగించి పాండుభూపాలుడు వెళ్ళియుండ అతని కులమున జన్మించి నీవు కులభేద మెట్లు చేయుదువు. పాండవులతో గలసి యుండి భోగము లనుభవింపుము. అని.

ఈద్రోణవచనములను బట్టి రాజ్యము ధృతరాష్ట్రునకు రాజ్యాభి షేకపూర్వకముగా వచ్చినది కాదనియు, పాండురాజు న్యాసభూత ముగా నప్పగించుటచె చేతికి వచ్చినదనియు స్పష్ట మగుచున్నది. కను

కనే- "ఈరాజ్యంబు మొదలింటంగోలె భవదీయం బయినం......
క్రమాగతంబయి మాకు నప్రియత్నలభ్యం బగు. దొల్లి పాండురాజు
రాజై" అని దుర్యోధనుకు తండ్రియొద్ద విలపించినాడు.

"తతో౽థ రాజ్ఞః సుబలస్య పుత్రీ ధర్మార్థయుక్తం కులనాశభీతా ।
దుర్యోధనం పాపమతిం నృశంసం రాజ్ఞాం సమక్షం సుత మాహ కోపాత్ ॥
యే పార్థివా రాజసభాం ప్రవిష్టా బ్రహ్మర్షయో యే చ సభాసదో౽న్యే।
శృణ్వంతు వక్ష్యామి తవాపరాధం పాపస్య సామాత్యపరిచ్ఛదస్య ॥
రాజ్యం కురూణా మనుపూర్వభోజ్యం క్రమాగతో నః కులధర్మ ఏషః ।
త్వం పాపబుద్ధే౽తినృశంసకర్మన్ రాజ్యం కురూణా మనయా ద్విహాంసి ॥
రాజ్యం తు పాండో రిద మప్రధృష్యం తస్యాద్య పుత్రాః ప్రభవన్తి నాన్యే।
రాజ్యం తదేత న్నిఖిలం పాండవానాం పైతామహం పుత్రపౌత్రానుగామి॥
న్యాయాగతం రాజ్య మిదం కురూణాం యుధిష్ఠిర శ్శాస్తు వై ధర్మపుత్రః ,
ప్రచోదితో ధృతరాష్ట్రేణ రాజ్ఞా పురస్కృత శ్శాంతనవేన చైవ ॥"(అ158)

తరువాత కులనాశభీతితో గాంధారి- ఘాతుకస్వభావము, పాప
బుద్ధి కల పుత్రుని గూర్చి కోపముతో రాజసమక్షమున నిట్లు ధర్మార్థ
యుక్తముగా జెప్పెను.

ఈసభలోని మహారాజులు, బ్రహ్మర్షులు మొదలగువారు
సపరివారుడవై పాపబుద్ధికల నీయొక్క అపరాధమును గ్రహింతురు
గాక. దుర్యోధనా! చెప్పుచున్నాను.

కురురాజ్యము అనుపూర్విగా అనుభవింపబడుట మనకు కుల
ధర్మము. ఓపాపబుద్ధీ! ఆకురురాజ్యమర్యాదను నీవు చెడగొట్టుచున్నావు.
ఈరాజ్యము పాండుభూపాలునిది. ఇప్పుడు అతనిపుత్రులే ఈరాజ్యము
నకు ప్రభువులు; అన్యులు కారు. ఈ యావద్రాజ్యము పాండవులకు
పితృపితామహాక్రమాగతము, పుత్రపౌత్రానుగతము నయియున్నది.

న్యాయాగతమైన యీకురురాజ్యమును ధృతరాష్ట్రప్రేరితుడు
భీష్మపురస్కృతుడు నయి ధర్మజుడు పాలించుగాక! అని.

ఈగాంధారీవచనములలో— "రాజ్యం తదేత న్నిఖిలం పాండ
వానాం పైతామహం పుత్రపౌత్రానుగామి" అను విషయమే—

"పితృపైతామహమైన రాజ్యమునకు పాండవులు అర్హులు" అని భీష్మునిచే జెప్పబడినది. ఈవిషయమే— "పాండువంశేశుల వసుమతీరాజ్యార్హు లగుదురు", అని దుర్యోధను డనెను.

"ఏవ ముక్తే తు గాన్ధార్యా ధృతరాష్ట్రో జనేశ్వరః।
దుర్యోధన మువాచేదం రాజమధ్యే జనాధిప ॥
దుర్యోధన నిబోధేదం యత్త్వాం వక్ష్యామి పుత్రక ।
తథా తత్కురు భద్రం తే యద్యస్తి పితృగౌరవమ్ ॥
.......................................
జ్యేష్ఠః ప్రభ్రంశితో రాజ్యా ద్ధీనాంగ ఇతి భారత ।
పాండు స్తు రాజ్యం సంప్రాప్తః కనీయా నపి సన్నృపః ॥
వినాశే తస్య పుత్రాణా మిదం రాజ్య మరిన్దమ ।
మయ్యభాగిని రాజ్యాయ కథం త్వం రాజ్య మిచ్ఛసి ॥
అరాజపుత్రో హ్యస్వామీ పరస్వం హర్తు మిచ్ఛసి ।
యుధిష్ఠిరో రాజపుత్రో మహాత్మా న్యాయాగతం రాజ్య మిదం చ తస్య ।
స కౌరవస్యాస్య కులస్య భర్తా ప్రశాసితా చైవ మహానుభావః ॥
స సత్యసన్ధ స్స తథాఽప్రమత్తః శాస్త్రే స్థితో బంధుజనస్య సాధుః ।
ప్రియః ప్రజానాం సుహృదానుకంపీ జితేన్ద్రియ స్సాధుజనస్య భర్తా ॥
క్షమా తితిక్షా దమ ఆర్జవం చ సత్యవ్రతత్వం శ్రుత మప్రమాదః ।
భూతానుకంపా హ్యనుశాసనం చ యుధిష్ఠిరే రాజగుణా స్సమస్తాః ॥
అనార్యపుత్ర స్త్వ మనార్యవృత్తో లుబ్ధ స్సదా బంధుషు పాపబుద్ధిః ।
క్రమాగతం రాజ్య మిదం పరేషాం హర్తుం కథం శక్ష్యసి దుర్వినీత ॥
ప్రయచ్ఛ రాజ్యార్ధ మపేతమోహః సవాహనం త్వం సపరిచ్ఛదం చ ।
తతోఽవశేషం తవ జీవితస్య సహానుజస్యైవ భవే న్నరేంద్ర ॥" (ఆ 149)

గాంధారి చెప్పిన తరువాత ధృతరాష్ట్రుడు రాజమండలిలో దుర్యోధనున కిట్లు చెప్పెను— దుర్యోధనా! నామాట లాలకింపుము. నీకు పితృభక్తి యున్నయెడల నేను చెప్పినట్లు చేయుము.

జ్యేష్ఠుడ నయినను అంధత్వమును బట్టి నేను రాజ్యమునకు దూరమైపోతిని. కనిష్ఠుడయినను పాండురాజు రాజ్యము స్వీకరించెను. ఆతని యనంతరాధికారము ఆతని పుత్రులదై యున్నది. నాదికానట్టి రాజ్య

మును నీ వెట్లు కోరెదవు? నీవు రాజపుత్త్రుడవా? కావు. రాజువా? కావు. పరుల (పాండవుల) సొత్తును హరింపదలచుచున్నావు.

యుధిష్ఠిరుడు రాజపుత్త్రుడు. ఆతనికి ఈరాజ్యము న్యాయాగతము. ఆతడు సత్యసంధుడు. బంధుజనముయొక్క ఆజ్ఞకు ఆతడు బద్ధుడు. సమస్తరాజగుణములు యుధిష్ఠిరునియం దున్నవి. నీవు రాజపుత్త్రుడవు కానట్టివాడవు; ఆర్యలక్షణములు లేనట్టివాడవు; లుబ్ధుడవు; బంధువులయందు సదా పాపబుద్ధికలవాడవు. ఓమచ్ఛేసీతుడా! క్రమాగతమైన యీపాండవరాజ్యమును నీవెట్లు హరింపగలవు?

మూఢత్వమును విడిచి వారి యర్ధరాజ్యము వారి కిమ్ము. శేషించినది పోదరసహితముగా నీవు జీవించుటకు చాలును. అని.

ఈ ధృతరాష్ట్రోక్తవిషయమే వెనుక జూపబడియున్నట్లు— "నేను అంగవైకల్యమున...రాజ్యంబునకు దగకున్న పాండుడు... ఈ కురువంశరాజ్యభర మింతయు దాల్చె." అని దుర్యోధనునితో ధృతరాష్ట్రుడు చెప్పిన విషయము.

ఈ ధృతరాష్ట్రోక్తినిబట్టి అర్ధరాజ్యము పాండవుల కీయగా శేషించినది దుర్యోధనునికి జీవనార్థము విడువబడినదని స్పష్టమగుచున్నది.

దుర్యోధనుడు రాజు కాడు, యువరాజు కాడు, సరికదా. రాజపుత్త్రుడుకూడ (ధృతరాష్ట్రుడు రాజు కానందున) కాడని స్పష్టమయినది. ధృతరాష్ట్రునకు రాజ్యాభిషేకము జరుగలేదని స్పష్టమైనది.

ఇట్టి స్థితిలో కర్ణునకిచ్చిన అంగరాజ్యమును బట్టి దుర్యోధనుడు రాజో, యువరాజో అయి యుండెననుట కేవలము భ్రాంతి యని స్పష్టమైనది.

ధృతరాష్ట్రసమ్మతిపై అనధికారికృతమైన ఆ అంగరాజ్యప్రదానము నిరాక్షేపణముగా కొనసాగుట పాండవుల పితృభక్తి సౌశీల్య సౌమనస్యములకు తార్కాణ మని ఈ ధృతరాష్ట్రవాక్యములే చాటుచున్నవి.

ఇట్టి యీసంస్కృతమహాభారతములోని భీష్మద్రోణగాంధారీ ధృతరాష్ట్రుల మాట లన్నియును ఆంధ్రభారతములో అతిసంక్షిప్తము జేసి కొద్దిమాటలతో వెల్లడింపబడెను. ఆమాట లివి—

"అంబికానందనుండు జాత్యంధుఁడైయుండ సామ్రాజ్య మంతయు బాలించి పాండునృపాలు డతని గొలిచియుండుటయును......పెద్ద లెల్ల జెప్పిరి కుఱక మాట మింతలేక......అందరు జెప్పంగలయంతయు జెప్పిరి......అయనయ దనయునకున్......సంధి మేయికొన జెప్పెన్".

ఈయాంధ్రభారతగ్రంథమున కర్థము ఆసంస్కృతభారతవాక్యముల అర్థమే అని బుద్ధిమంతు లెరుగనిది కాదు. కనుక నీయుద్యోగపర్వగతమైన ఆంధ్రభారతగ్రంథమునకు-ధృతరాష్ట్రునకు రాజ్యాభిషేకమయినట్లున్న ఆదిపర్వగతగ్రంథము విరుద్ధము.

పూర్వోక్తదుర్యోధనధృతరాష్ట్రప్రసంగరూపమైన ఆంధ్రభారతగ్రంథమునకు-ఈయుద్యోగపర్వగతమైన ఆంధ్రభారతగ్రంథము అవిరుద్ధము. ఆ దుర్యోధనధృతరాష్ట్రప్రసంగరూపమైన గ్రంథమునకును, ఈ యుద్యోగపర్వగ్రంథమునకును ధృతరాష్ట్రరాజ్యాభిషేకగ్రంథము విరుద్ధము.

ఇంకొకటి— వారణావతగండమునుండి తప్పించుకొని కుంతీదేవితో వనగతులై యున్న పాండవులకు దర్శన మిచ్చిన వ్యాసభగవానుడు వారిని దీవించి కుంతీదేవితో నిట్లు చెప్పెను—

ఆంధ్రభారతము-ఆదిపర్వము. 6వ అశ్వాసము— "నీకొడుకు ధర్మనిత్యుండీయుధిష్ఠిరుండు......సార్వభౌముండై రాజసూయాశ్వమేధాదిక్రతువులు సేసి పితృపైతామహంబైన రాజ్యలక్ష్మి ననుభవించుచుం గురుకులంబు నెల్ల బవిత్రంబు సేయు" అని.

ఈవ్యాసవాక్యము ధర్మజునకే రాజ్యము పితృపైతామహమని స్పష్టీకరించుటను బట్టి దీనికి గూడ ధృతరాష్ట్రరాజ్యాభిషేకగ్రంథము విరుద్ధమే. కనుక దుర్యోధనుడు రాజ్యాధికారి కాడు.

ఇంకొకటి— ధృతరాష్ట్రుడు వనవాసమునకు వెళ్ళునపుడు తన కనుజ్ఞ నిమ్మని ప్రజలను గోరుచు నిట్లనెను—

ఆంధ్రభారతము—ఆశ్రమవాసపర్వము.

“సీ. ప్రజ ముద మొందంగ బాలించె బుడమి శంతను డనంతరము శాంతనవుచేత
రక్షితు డగుచు మీరలు బ్రీతి బొదల విచిత్రవీర్యుండు ని[illegible]త్రి యేలె
పదపడి పాండునృపాలుండు మీరు హర్షింపగ భూమి రక్షించె నిదప
ధర్మనందనునిచందము మీ రెఱింగినయది సత్యధర్మాత్ము డైన యితని
తే. ననుసరింపక యన్యాయ మాచరించి దుర్నయంబున నిల యేలి త్రుంచె గులము
నుర్విగల భూపతులను దుర్యోధనుండు వాని దుశ్చేష్టలకు మూల మేన కాన.
వ. అది మీమనంబులం బెట్టక.
క. మహి లెస్సగ రక్షించిన మహితగుణుల యన్నకొడుకు మనుమం డని నా
కు హితంబు గోరి కరుణాసహితులరై యిం దనుజ్ఞ సద్ప్రీతమునకున్”.

ఇచ్చట రాజ్యపరిపాలకుల క్రమము చెప్పబడుటలో— శంతను మహారాజు, విచిత్రవీర్యుడు, పాండుభూపతి, ధర్మజుడు చెప్పబడినారు. ధృతరాష్ట్రునిమాట లేదు.

ధృతరాష్ట్రుడు రాజ్యపాలకులలో నొకనికి (పాండుభూపతికి) అన్నయనియు, నొకనికి (విచిత్రవీర్యునకు) కొడుకనియు, నొకనికి (శంతనమహారాజునకు) మనుమ డనియు జెప్పబడెను. దుర్యోధనుడు ధర్మజునితో విరోధించి, యన్యాయమాచరించి దుర్నయముతో సర్వ నాశనము చేసినాడని చెప్పబడినది.

ఈచెప్పినవాడు ధృతరాష్ట్రుడే. ఈ ధృతరాష్ట్రవాక్యములకు ధృతరాష్ట్రరాజ్యాభిషేకగ్రంథము విరుద్ధము. ఇట్లు అనుగతమై యున్న బహుస్థలములలోని గ్రంథమునకును, అందును దుర్యోధనధృతరాష్ట్ర న్యోన్యప్రసంగరూపమైన గ్రంథమునకును అత్యంతవిరుద్ధమై స్థలాంతరములలో చెప్పబడనిదై యున్న ధృతరాష్ట్రాభిషేకవృత్తాంతమును ప్రమాణముగా బట్టుకొని యావదాంధ్రభారతగ్రంథమునకును అప్రామాణ్యమును చెప్పుటా? లేక యావద్గ్రంథవిరుద్ధముకనుక ధృతరాష్ట్రరాజ్యాభిషేకగ్రంథమునకుమాత్రమే అప్రామాణ్యమునుచెప్పుటా? బుద్ధిమంతులాలోచింతురుగాక !

ఇంతవరకు ఆంధ్రభారతచ్ఛాయనే ఆశ్రయించి చేసిన పర్యా

లోచనములో ధృతరాష్ట్రరాజ్యాభిషేకము ఆంధ్రభారతతాత్పర్యము కాదనుటకు హేతువులు బహుళముగా గన్పట్టినవి. అది యటుండనిచ్చి మరియొక విషయముకూడ గమనింపవలయును.

ఆంధ్రభారతమునకు మూలము వేదవ్యాసకృతసంస్కృతమహాభారతము. అందాదిపర్వము 109అధ్యాయములో 'పాండురాజ్యాభిషేకే నవాధికశతతమోధ్యాయః. అని వ్రాయబడిన స్థలములో—

"ధృతరాష్ట్ర స్త్వచక్షుష్ట్వా ద్రాజ్యం న ప్రత్యపద్యత ।
పారశవత్వా ద్విదురో రాజా పాండు ర్బభూవ హ ॥

అంధత్వముచే రాజ్యయోగ్యత ధృతరాష్ట్రునకు లేకపోయినది. పాండుభూపతియే రాజయ్యెను. అని స్పష్టముగా జెప్పబడినది.

కుంభకోణప్రతిలో 118 అధ్యాయములో—"ధృతరాష్ట్రోఽభిషేచితః" "పాండుస్సేనాపతిః కృతః" అని ప్రతివాదు లాధారపడిన క్వాచిత్కపాఠము కుండలీకరణముతో జూపబడి దానిక్రిందనే "ధృతరాష్ట్ర స్త్వచక్షుష్ట్వా ద్రాజ్యం న ప్రత్యపద్యత ... రాజాపాండుర్బభూవ హ" అను సార్వత్రికపాఠము ప్రదర్శింపబడి, దానికి తథ్యముగా ఆ 118 అధ్యాయములోని విషయమును సూచించుచు అధ్యాయారంభమున— "కంచిత్కాలం భీష్మేణ రాజ్యపరిపాలనానంతరం పాండో రాజ్యాభిషేకః" అని స్పష్టముగా జెప్పబడినది. "ధృతరాష్ట్రరాజ్యాభిషేకః" అని ఆప్రతిలోనైనను చెప్పబడలేదు. ఆంధ్రభారతములో యుధిష్ఠిరయౌవరాజ్యాభిషేకము స్పష్టముగా జెప్పబడినది. రాజ్యము దుర్యోధనునకు క్రమాగతము కాలేదని చెప్పబడినది ఇవన్నియు యోజనచేసి చూచినయెడల ధృతరాష్ట్రరాజ్యాభిషేక మెంతమాత్రము మహాభారతసమ్మతము కాదని, అది యపపాఠమని బుద్ధిమంతులను తోచితీరును.

పాండురాజ రాజ్యవాదముపై ప్రతివాదుల ఆక్షేపములు, తత్పరిహారములు 'పాండవనిందానిరాకరణము' అను చతుర్థభాగములో విపులముగా నిరూపింపబడినవికనుక ఆచర్చను అచ్చట జూడవలయును.

పర్యవసానములో దుర్యోధను డనధికారి. యావ ద్రాజ్యాధికారము పాండవులది. అట్టి పాండవులను సమూలనాశనము జేసి వారి రాజ్యమును కబళింపవలె నని సంకల్పించి వారణావతములో లక్కయింటిని నిర్మింపజేసి అందు వారిని ప్రవేశింపజేసినవాడు దుర్యోధనుడు. ఆముప్పునుండి తప్పించుకొని అజ్ఞాతముగా సంచరించి తుదకు ద్రౌపదీ పాణిగ్రహణము జేసి వెల్లడియైనతరువాత మరల వారలను వధింప సంకల్పించిన కర్ణదుర్యోధనుల ఆలోచనముపై భీష్మాదులను రప్పించి నపుడు ధృతరాష్ట్రునియెదుట దుర్యోధనునితో భీష్మాదులు పాండవుల కర్ధరాజ్యమిచ్చి వారితో సఖ్యపడి సుఖింపు మని బుద్ధిచెప్పినమీద ద్రుపదపురమునుండి పాండవులను రావించి ధృతరాష్ట్రుడు వారి కర్ధ రాజ్యముగా ఖాండవప్రస్థ మిచ్చెను.

అదియే యింద్రప్రస్థరాజ్య మైనది. ఆపై గూడ వారియభివృద్ధిని సహింపలేక దుర్యోధనుడు సుహృద్ద్యూతమున కాహ్వానింపజేసి కపట ద్యూతము నడిపి పాండవుల నోడించి వనవాసాజ్ఞాతవాసములు చేయించెను. పాండవులు ద్యూతమునకు వచ్చుటకు గల కారణములు చతుర్థ భాగములో నిరూపింపబడినవి. అచ్చట జూడవలయును.

ఆపై ద్యూతకాలనిర్ణయప్రకారము వారి కివ్వవలసిన రాజ్య మివ్వనని యుద్ధమునకు సిద్ధపడి సర్వనాశనము జేసినవాడు దుర్యోధనుడు; రాజ్యాధికారము లేనివాడు దుర్యోధనుడు; రాజ్యాధికారులగు పాండవులను వధించి రాజ్యము కబళింపదలచినవాడు దుర్యోధనుడు. ఇట్టి దుర్యోధనుని రాజ్యాధికారమును గూర్చి ప్రతివాదుల వ్రాత లెట్లున్నవో చూడుడు—

—: రాజ్యాధికారమును గూర్చి ప్రతివాదుల ప్రసంగములు—

అందు ప్రథమప్రతివాదిప్రసంగము—తన్నిరాకరణము :—

దాయభాగవినిర్ణయము—

"గ్రంథమంతయు బాగుగా బరికించిచూచినచో నీక్రిందియంశములు తేలకపోవు.

జన్మాంధుడైన కారణమున అంబికేయుడును, పాండురోగియైన కారణమున పాండువునుగూడ రాజ్యానర్హులైరి. అయినను గౌరవ్యవంశమునందు క్షత్రియుల కున్న విశ్వాసముచే అంబికేయుని రాజుగను, పాండువును తత్ప్రతినిధిగను భీష్మాదులు గావించిరి.

పాండువు రాజ్యాభివృద్ధి చేసినందులకై అంబికేయుడు సంతోషించి నూత్న సంపాదితరాజ్యము పాండురాజునిగా నేర్పరచినాడు.

హస్తిపురము రాజధానిగా గల ప్రాతరాజ్యము ధార్తరాష్ట్రులదియును, ఖాండవప్రస్థము రాజధానిగా గల క్రొత్తరాజ్యము పాండవులదియు నైయున్నవి. పాండుభాగమునకు ధర్మజుడును, అంబికేయభాగమునకు దుర్యోధనుడును యువరాజులుగా జేయబడిరి.

దుర్మార్గుడగు దుర్యోధనుడు వారిని గపటోపాయముచే జంపి యాభాగమును గూడ దానె కబళింప బ్రయత్నము చేసినాడు. మాయాద్యూతమున నాయర్ధ రాజ్య మపహరించె.

రాజ్య మవిభాజ్యము గాన భాగమీయ నవసరము లేదనియె. అర్ధరాజ్యమును గూర్చి కురుపాండవులకు యుద్ధము జరిగినది''.

వీరు సంస్కృతాంధ్రభారతములలో బహుస్థలములలోని వచనములకు విరుద్ధమగుటచే నపపాఠమని తేలిన ధృతరాష్ట్రరాజ్యాభిషేకమునే ఆధారము చేసికొని రాజ్యానర్హతకు ప్రతిబంధక మైనదని చెప్పబడిన ధృతరాష్ట్రుని జాత్యంధత్వముతో బాటు ఎక్కడను జెప్పబడని పాండురోగమును పాండురాజునకు గల్పించి, ఎక్కడను జెప్పబడని రెండురాజ్యములను ప్రాతది, క్రొత్తది సమానముగా ఆయిరువురకు గల్పించి, యువరాజని చెప్పబడిన యుధిష్ఠిరునితో బాటు చెప్పబడని దుర్యోధనుని గూడ యువరాజగా గల్పించినారు.

ఆపై పాండవులను కపటోపాయమున జంపి వారి భాగమును గూడ కబళింప బ్రయత్నించినాడు. మాయాద్యూతమున వారి యర్ధరాజ్య మపహరించినాడు. రాజ్య మవిభాజ్యముగాన వారికి భాగమీయ నవసరము లేదనినాడు. దుర్యోధనుడు దుర్మార్గుడు. అని వ్రాసినారు. పై కల్పన లన్నియు ధృతరాష్ట్రరాజ్యవాదమును స్థిరపరచుటకే అన్నమాట.

ఈపనికై వీరు చేసిన కల్పన లెన్నియో చూడుడు—గ్రంథాంతరములలోని పౌర, భీష్మ, గాంధారీ, ధృతరాష్ట్ర, దుర్యోధనోక్తుల కును, యుధిష్ఠిరయౌవరాజ్యాభిషేకమునకును అత్యంతవిరుద్ధమై యున్న ధృతరాష్ట్రరాజ్యాభిషేకమును నిలవబెట్టుటకై పాండురాజునకు మహాక రాజ్యకల్పన.

ధృతరాష్ట్రు డంధుడగుటచే రాజ్యాభిషిక్తుడు పాండురాజే అని యనకుండుటకై అతని కొక పాండురోగకల్పన. అట్టివాడే రాజప్రతినిధి యని కల్పన.

అతడే మహాపరాక్రమశాలియై దిగ్విజయము జేసె నని చెప్పి, యాతడు నూతనరాజ్యము సంపాదించె నని కల్పన. అదియే ఖాండవ ప్రస్థరాజ్య మని కల్పన. ఆఖాండవప్రస్థము, పాండవుల కిచ్చు నప్పటికి రాజ్యమో ఘోరవనమో చూడుడు—

"అర్ధం రాజ్యస్య సంప్రాప్య ఖాండవప్రస్థ మావిశ ।
ప్రతిగృహ్య తు తద్వాక్యం నృపం సర్వే ప్రణమ్య చ ॥
ప్రతస్థిరే తతో ఘోరం వనం త న్మనుజర్షభాః ।
అర్ధం రాజ్యస్య సంప్రాప్య ఖాండవప్రస్థ మావిశన్ ॥
మండయాంచక్రిరే తద్వై పురం స్వర్గవ దచ్యుతాః" ।

నీలకంఠీయమ్— ఘోరం వనమితి భూమే రర్ధం సస్యశూన్యో దేశః పాండవేభ్యో దత్త ఇతి జ్ఞాయతే, తద్వై తద్ఘోరం వనం స్వర్గవ న్మండయాంచక్రిరే.

ఇట్టి ఘోరవనమును ఖాండవప్రస్థము రాజధానిగా గలిగి పాండురాజసంపాదితమైయున్న క్రొత్త రాజ్య మని కల్పన.

పాండవుల కీయబడిన అర్ధరాజ్యమును సరిపుచ్చుటకై అదియే పాండవుల దని కల్పన. యుధిష్ఠిరుడు యువరాజయినది ఆపాండురాజు భాగమునకేనని కల్పన. నేనేమియు పాండవుల కీయనని దుర్యోధనుడనుటకు రాజ్య మవిభాజ్య మగుటే కారణ మని కల్పన. ఇవన్నియును అప్రకృతకల్పనలు, గ్రంథవిరుద్ధములు.

ఇంతకును పాండురాజు నూతనరాజ్యమును సంపాదించుట

నిదమై అర్ధరాజ్యముగా పాండవుల కీయబడినది అదియే యని ఋజువు చేయగలిగినపుడుగదా ! యీకల్పన లయినను నిలుచుట. అదియే అసాధ్యము.

పాండురాజు నూతనరాజ్యమును సంపాదింపలేదు. ఖాండవ ప్రస్థము కురురాజ్యములోనిదే కాని, నూతనరాజ్యము కాదు. అది నూతనరాజ్యమైననాడు దాని నర్ధరాజ్యమనుటకును వీలు లేదు.

—: దిగ్విజయములో పాండుభూపతి క్రొత్తరాజ్యమును సంపాదించియుండలేదు :—

పాండురాజు దిగ్విజయములో రాజ్యసంపాదనము చేసినట్లు ప్రతివాదు లనుచున్నారు కాని, అది సంస్కృతాంధ్రభారతములలో లేని విషయము. వారు చెప్పినట్టి రాజ్యసంపాదన మయినను ఒక్క ఖాండవప్రస్థమే. మరొకటి లేదు.

ఖాండవప్రస్థమునుగూర్చి మహాభారతచరిత్రకారులు వ్రాసిన మాట చూడుడు—

"ఈఖాండవప్రస్థము హస్తినాపురికి దక్షిణముననుండిన యమునానదీప్రాంత మహారణ్యము". (పు- 112)

ఇట్టి మహారణ్యమును బట్టుకొని దీనిని, దిగ్విజయములో పాండుభూపతి చేసిన రాజ్యసంపాదన మని చెప్పుట యనుచితము.

సంస్కృతభారతము ఆది-అ 113లో పాండుభూపతి దిగ్విజయకాలములో దశార్ణ, మగధ,మిథిలా, కాశీ, సుహ్మ, పుండ్ర దేశాధిపతులను జయించినట్లు చెప్పబడినది. రాజ్యము సంపాదించినట్లు చెప్పబడలేదు.

ఇంక ఏరాజ్యములోని దండు రాఖాండవప్రస్థము ?

ఆంధ్రభారతము- పంచమాశ్వాసము—"పాండురాజు ... భరతకులరత్నాకరుండై......అపారచతురంగబలసమన్వితుండై......సర్వదిగ్విజయార్థంబరిగెం గురుప్రభుడు.........ప్రాగ్దక్షిణాపరోత్తరదిగ్భూపతుల నిజశాసనవశీకృతులం గావించి దనదు కీర్తి వెలుంగిన్......నానావిధోపాయనములు గొని...జయశ్రీ శ్రితబాహుం గానగా వచ్చిరి సకలజగత్సేవ్యమానున్ మహేంద్రప్రతిముం గదవ్యగంశప్రభు నఖిలమహీపాలుం రాంబాలికేయున్.

చ. లలితహయద్విపంబుల విలాసినులన్ మణిరూప్యకాంచనా
వలుల నజావిగోమహిషవర్గములన్ బహుభూషణంబులన్
బలువిడి గప్పముల్ ధరణిపాలురచే గొని నాలువేల్ గజం
బుల పెటికించి తెచ్చె గురుముఖ్యు డపూర్వధనమ్ము లిమ్ములన్".

దీనినిబట్టి పాండుభూపతి యనేకరాజులను జయించి తనశాసనమునకు వారు బద్ధులై వర్తించునట్లు చేసి తనకీర్తిని దిగంతవిశ్రాంతము చేసి జయింపబడిన రాజులవలన కప్పములు, కానుకలు తీసుకొనివచ్చెను. కాని, వారి రాజ్యము హరింపలేదనియు, క్రొత్తరాజ్యము సంపాదింపలేదనియు స్పష్ట మగుచున్నది.

కాబట్టి పాండురాజు క్రొత్తరాజ్యమును సంపాదింపలేదు. అందుచే ప్రతివాదులన్నట్లు పాండురాజుదిగా నేర్పడిన నూతనరాజ్య మొకటి లేదు. ఇక నున్నది పితృపితామహక్రమాగతమైన ఆకురురాజ్యమే. ప్రతివాదులు ఖాండవప్రస్థరాజ్యము పాండురాజుది అని పెట్టుకొని, యుధిష్ఠిరయౌవరాజ్యాభిషేకము దానికే అని, అర్ధరాజ్యమని, యిచ్చినది అదియే యని కల్పనలు సాగించినారు. పరిశీలింపగా ఖాండవప్రస్థము కురురాజ్యాన్తర్గతమే, అన్యము కాదని క్షోదక్షమముగా సిద్ధాంతిత మయినది.

ఇప్పుడు నిర్వివాదమైన యుధిష్ఠిరయౌవరాజ్యాభిషేకము, ఆకురురాజ్యమునకే, అర్ధరాజ్య మని పాండవులకీయబడినది ఆకురురాజ్యార్ధభాగమే. అని యంగీకరించితీరవలయును.

కురురాజ్యమునకు జేయబడిన యుధిష్ఠిరయౌవరాజ్యాభిషేకమును బట్టి ఆకురురాజ్యము పాండవులకు పితృపితామహక్రమాగతమని దుర్యోధనుడు చెప్పినవిధముగా అంగీకరించితీరవలయును. ఆపై కురురాజ్యాభిషిక్తుడు దిగ్విజయశాలియైన పాండుభూపతియే యని పౌరభీష్మగాంధారీధృతరాష్ట్రులు చెప్పినవిధముగా అంగీకరించితీరవలయును.

ఇంతేకాక దిగ్విజయప్రస్తావములో రేఖాంకితముగా జూపబడిన పాండురాజవిశేషణములు- పాండుభూపతి సామ్రాజ్యాధీశు డని చాటు

చున్నవో, లేక ప్రతివాదు లన్నట్లు "పాండురోగి రాజప్రతినిధి, సేనాధిపతి" అని చెప్పుచున్నవో బుద్ధిమంతు లాలోచింపవలయును.

వెనుక "ఆంధ్రభారతమునకు పూర్వోత్తరసందర్భశుద్ధిపర్యాలోచనము" అను ప్రస్తావములో నిరూపింపబడినట్లు అంధత్వముచే ధృతరాష్ట్రునకు రాజ్యాభిషేకము జరుగలేదు. అట్టివానికి రాజ్యార్హత లేదని స్మృతులును చెప్పుచున్నవి.

వీరమిత్రోదయములో నీచర్చ విశేషముగా చేసి ధృతరాష్ట్రుని రాజ్యానధికారము, పాండుభూపతి రాజ్యాధికారము నిరూపింపబడినది. అనంతయు చతుర్థభాగములో ప్రదర్శింపబడినది.

ఇట్లు ధృతరాష్ట్రరాజ్యవాదము సంస్కృతాంధ్రభారతవిరుద్ధము. మనుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి, వీరమిత్రోదయము అను ప్రమాణగ్రంథములకు విరుద్ధ మగుటచే హేయము.

రాజ్య మవిభాజ్యముగనుక పాండవుల కీయ నవసరములేదని దుర్యోధనుని వాద మనుచున్నారు ప్రతివాదులు. రాజ్య మవిభాజ్య మగుట శాస్త్రసిద్ధము కనుక సర్వసమ్మతము. అది కారణముగా జేసికొని ఏ రాజ్యాధికారిగాని అన్యులకు అనగా పోష్యవర్గమునకు ఈయ నవసరము లేదనుట అక్రమమగుచుండ, అనధికారియైన దుర్యోధనుడు రాజ్యాధికారులైన పాండవులకు ఈయ నవసరము లేదనుట యెంత అక్రమమో !

జ్యేష్ఠుడై పుట్టియు, జాత్యంధుడయి వందలకొలది పుత్రపౌత్రాది వర్గము కలవాడయి, మన్వాదిస్మృతులనుబట్టి రాజ్యాధికారము లేకుండి, రాజ్యాధికారికి పోష్యుడయియున్న ధృతరాష్ట్రునకు సర్వసంపత్సమృద్ధమైన అర్ధరాజ్యమును యావజ్జీవోపభోగార్థము విడిచి, మిగిలిన ఖాండవవనప్రస్థమై యున్న అర్ధరాజ్యమును పితృభక్తితో పరిగ్రహించి, దానినే యింద్రప్రస్థముగా స్వశక్తిచే జేసికొని, దుర్యోధనుని కపటద్యూతములో దాని నోడిపోయి, దుష్టచతుష్టయ మోసమయమున

చేసిన దుండగములకు శాంతముతో తల యొగ్గి, త్రయోదశవర్షవనవా
సాజ్ఞాతవాసపణముతో జరిపిన పునర్ద్యూతమునందు ఓడినవారు 13
సంవత్సరములు గడిపి వచ్చి తమరాజ్యమును తీసికొనవచ్చు నను
నిర్ణయప్రకారము 13 సంవత్సరములు యథాక్రమముగా గడపి, అష్ట
కష్టము లనుభవించికూడ శాంతముతోనే మా అర్ధరాజ్యము మా
కిమ్మనియే కోరినట్టి పాండవులది ఎంత సౌజన్యమో !

రాజ్య మంతయు నాదే అని దుర్యోధను డన్నాడని దుర్యో
ధనునకే రాజ్యాధికారమును కట్టబెట్టుచున్నారు ప్రతివాదులు. ఆత
డట్లనుటను బట్టి రాజ్యాధికారము కలుగునా? రాజ్యాధికారమును బట్టి
ఆత డట్లనెనా ? తనకు రాజ్యాధికారము లేకపోయె నని యాతడే
తండ్రియొద్ద విలపింపలేదా ? కాబట్టి అనధికారియైన దుర్యోధనుడు
రాజ్యతృష్ణతో, స్వతస్సిద్ధపాండవవిద్వేషముతో అనినమాటయే అది.
దానిని బట్టుకొని ప్రతివాదు లాతనిదే రాజ్యాధికారమనుట పొరబాటు,

ఇంకొకటి- అర్ధరాజ్యమునే మొదట పుచ్చుకొని, ఎప్పుడు కోరి
నను ఆయర్ధరాజ్యమునే కోరుచు యావద్రాజ్యముమాట యెన్నడును
ఎత్తని పాండవులకు అర్ధరాజ్యాధికారమే అని ప్రతివాదులనుచున్నారు.

అయితే ఇది యాదుర్యోధను డనినమాటా? ప్రతివాదులనుచున్న
మాటా? దుర్యోధనునిమాటే అయిన పక్షములో నిక తగవే లేదు.
కనుక "రాజ్యస్యార్ధం ప్రదీయతామ్" అని చెప్పిన కృష్ణభగవానుని
రాయబారమును తోసిపుచ్చి—

"ఏమను వారు బంచికొని యేలుట గల్గదు పల్కకుండు మిం
కేమియు వాడిసూదిమొనయించుక మోపినయంతమాత్రమున్
భూమి యొనర్చి పాండునృపపుత్రుల కిత్తునె యెవ్వరైన సం
గ్రామమునన్ జయంబు గొని రాజ్యము సేయుట నిశ్చయించితిన్."

అని యాకృష్ణభగవానునితో చెప్పి యుద్ధమున కేల కాలు
దువ్వినాడు? మరియు- 'పాండవులే వసుమతీరాజ్యార్హులు' 'రాజ్యము
మాకు క్రమాగతము కాకపోయినది' అని తండ్రియొద్ద విలపించిన

దుర్యోధనుడు పాండవుల యావద్రాజ్యాధికార మవగతము కానట్టి వాడా ? ఇక ఆ అర్ధరాజ్యాధికారముమాట ప్రతివాదు లనుచున్న పక్షములో ఆదుర్యోధనున కవగతమై ఆకని కంఠోక్తులచే విశదీకరింపబడి యున్న పాండవుల యావద్రాజ్యాధికారమును ఈ ప్రతివాదు లవగతము జేసికొనలేకపోయినారను న్యూనత తప్ప మరేమున్నది ?

మరియు- యావద్రాజ్యాధికారము వారిదే అయియుండి, వారి కేమియు నీయ నని దుర్యోధను డనినపు డది యెంత దుర్మార్గమో, వారి కర్ధరాజ్యాధికారమే అయియుండి నేను వారి కేమియు నీయ నని దుర్యోధను డనినప్పు డది కూడ నంత దుర్మార్గమే. రాజ్యపరిమితిని బట్టి యది తగ్గదు.

కాని గ్రంథసమ్మతమై ఆదుర్యోధనునకు గూడ నవగతమై యున్న పాండవుల యావద్రాజ్యాధికారమును, వారర్ధరాజ్యమునే కోరుచుండుటను ప్రతివాదు లవగతముజేసికొనినయెడల ఆ పాండవుల సౌజన్యసౌశీల్యసౌహార్దసౌభ్రాత్రాదులు ఈ ప్రతివాదులమూలమున లోకమునకు గూడ తెలిసియుండెడివి. పాండవద్వేష్యుడైన దుర్యోధనుడు పోషకులయెడ జూపిన ద్రోహము తెలిసియుండెడిది.

పర్యవసానములో పాండవుల యావద్రాజ్యాధికారము దుర్యోధనున కవగతమే కాని, అనుమతముమాత్రము కాకపోయిన దని తెలిసికొందురుగాక !

ఇంతవరకు 'దాయభాగవినిర్ణయము'లోని విషయము పూర్వపక్షము జేసి సంస్కృతాంధ్రభారతానుగతమైన సిద్ధాంతము పాండురాజరాజ్యాభిషేకపాండవరాజ్యాధికారములే యని బహూదాహరణములతో నిరూపించినాము

ఈ...వినిర్ణయగ్రంథకర్తలు వ్రాసినది పరమతమె కాని స్వమతము కాదని మానిశ్చయము. "ధర్మనిర్ణయార్థము వాదింపదగినది వాదించితిరవలయునుగదా" అనుటచే వీరు పూర్వపక్షకోటి నంతను కూర్చిపెట్టినారని మా యూహ.

వీరార్షగ్రంథప్రామాణ్యవాదులు; ఆర్షసిద్ధాంతానువర్తులు; ఆర్ష సంప్రదాయాభిమానులు; వీరు మాకు పూజ్యులు. వీరికిని, మాకును నన్నయభట్టారకుడు పూజ్యుడు. ఆ నన్నయభట్టారకునకును, వీరికిని, మాకును వేదవ్యాసమహర్షి పూజ్యుడు. ఆనన్నయభట్టారకుడు—

ఆ. "వివిధవేదతత్త్వవేది వేదవ్యాసు డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై పరగుచుండ జేసె భారతంబు."

అని కీర్తించినాడు. అట్టి వేదవ్యాసమహర్షికృతమైన గ్రంథము నకే అనువాదము చేసిన నన్నయభట్టారకుని గ్రంథములో "ధృత రాష్ట్రోఽభిషేచితః" అనియున్న అపపాఠము పడినది. ఆ అపపాఠము వ్యాసమహర్షి కెట్లు దోషావహముకాదో అట్లే నన్నయభట్టారకునకును దోషావహము కాదు. అది యపపాఠము కాదనికూర్చున్న వారికి మాత్రమె దోషావహ మగును.

"నన్నయభట్టారకుడు నిర్దోషి యని వాదించుట నాకవసరము" అని వ్రాసినట్టియు, "ధర్మనిర్ణయార్థము వాదింపతగినది వాదించితీర వలయునుగదా" అని వ్రాసినట్టియు కీర్తిశేషులగు బ్రహ్మయ్యశాస్త్రి గారి యభీష్టము మాతత్త్వకథనముచే సిద్ధించినట్లే.

—: ద్వితీయవాదిప్రసంగము—తన్నిరాకరణము :—

మహాభారతచరిత్రము— 2.

"పైవాక్యసందర్భముల (భీష్మ దర్ధరాజ్య మిమ్మని చెప్పినవి) నాలోచింపగా ధృతరాష్ట్రపాండురాజులనాడు రాజ్యము కలిసి పాలింపబడె ననియు, అది ద్రుపదు పురమునుండి పాండవులను రప్పించువఱకు సమష్టిరాజ్యముగానె యుండె ననియు స్పష్టమగుచున్నది.

అందువలననే సామర్థ్యాతిశయముకలవా డగుటచే ధర్మజుని ధృతరాష్ట్రుడు యౌవరాజ్యాభిషిక్తు జేసియున్నాడు.

పూర్వ మెటుల నుండినను పాండవుల కర్ధరాజ్యార్హత నపుడు కలుగజేసి నటుల స్పష్ట మగుచున్నది". (పు 111)

వీరు ధృతరాష్ట్రపాండురాజుల నాటినుండి ద్రౌపదీపాణిగ్రహ ణానంతరము ద్రుపదపురమునుండి పాండవులను రప్పించువఱకు సమష్టి

రాజ్యముగానె యున్న దన్నారు. కనుకనే సమష్టుడైన ధర్మజుని ధృత రాష్ట్రుడు యువరాజుగా జేసినా డన్నారు.

మొదటివారివలె రెండురాజ్యము లనియు, నిద్దరు యువరాజు లనియు వీరు చెప్పలేదు.

సమష్టిరాజ్యమునకు యౌవరాజ్యాభిషిక్తుడైన ధర్మజునకు— "పూర్వ మెట్లున్నను అర్ధరాజ్యార్హత నప్పుడు కలుగజేసిరి" అనుచున్న వీరు అది యెట్లు సంభవించు నని ఆలోచింపలేదు.

ఉత్తరభారతము—3.

"హస్తిపురిని విచిత్రవీర్యుని ప్రథమపుత్రుండును, నాగాయుతబలుండును నగు నంబికానూనుండు నేత్రరోగియయ్యు వేదమున జ్యేష్ఠపుత్రుడే పితృ స్వత్వమునకు నర్హు డని యుండుటచేత కురురాజ్యాధికారము వహించి ధృత రాష్ట్రు డను సార్థకనామము కలవా డయ్యెను."

ఈ 2, 3 గ్రంథములకు కర్త పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రిగారే. వీరు అంధుడైనను జ్యేష్ఠుడే పితృస్వత్వమున కధికారి యని వేదోక్త మనుచు, కురురాజ్యాధికారమును ధృతరాష్ట్రుడే వహించె ననుచు, నది సమష్టిరాజ్యమే అనుచు, ఆధృతరాష్ట్రుడే తన కుమారునకుగాక పాండుపుత్రునకు యౌవరాజ్యాభిషేకము జేసెనని వ్రాసినారే. ఇది యెట్లు సరిపడును? మొత్తముమీద వీరును ధృత రాష్ట్రరాజ్యాభిషేకపాఠముపై ఆధారపడినవారే. కాని మొదటివారి కల్పనలతో వీ రేకీభవించినట్లు కనబడదు.

వీరి మాటలలో 'ధృతరాష్ట్రుడు రాజ్యాధికారి' అనునది యొకటి, 'యుధిష్ఠిరుడు యౌవరాజ్యాభిషిక్తుడు' అనునది యొకటి. ఇవి పరస్పరవిరుద్ధములు. రాజ్యాధికారి ధృతరాష్ట్రు డగుటే నిజమైన యెడల యౌవరాజ్యాభిషిక్తుడు దుర్యోధనుడు కావలసియుండ యుధి ష్ఠిరు డెట్లయ్యెను? ఇక యౌవరాజ్యాభిషిక్తుడు యుధిష్ఠిరుడు (పాండు పుత్రుడు) అయిన పక్షములో రాజ్యాధికారము పాండురాజుది కాక ధృతరాష్ట్రునిది యెట్లయ్యెను?

ఈ రెండంశములలో 'ధృతరాష్ట్రుడు రాజ్యాధికారి' అనునది వివాదాంశము. ప్రతివాదిచేగూడ సంగీకరింపబడినట్టి యుధిష్ఠిరయౌవ రాజ్యాభిషేకము నిర్వివాదాంశము. ఈ నిర్వివాదాంశమే 'రాజ్యాధి కారము ధృతరాష్ట్రునిదా? పాండురాజుదా?' అను వివాదమును ధృతరాష్ట్రునిది కాదనుచు పరిష్కరించుచున్నది. కనుక ధృతరాష్ట్రుడు గాని, దుర్యోధనుడుగాని రాజ్యాధికారులు ఎంతమాత్రము కారని ధ్రువమైనది.

ధృతరాష్ట్రరాజ్యాభిషేకపాఠము సంస్కృతాంధ్రభారతము లలో గనబడినను ప్రామాణికము కాదని వెనుక నిరూపింపబడినది. కాబట్టి యీప్రతివాదిప్రసంగము నిరస్తమైనది.

—: తృతీయప్రతివాది ప్రసంగము - తన్నిరాకరణము :—

కర్ణచరిత్రము—4.

1. "భీష్మేణ రాజా కౌరవ్యో ధృతరాష్ట్రోఽభిషేచితః ।
... ... ... పాండు స్సేనాపతిః కృతః ॥

అను వాక్యములనుబట్టి చూడగా జ్యేష్ఠుడును, పట్టాభిషిక్తుడును నగు ధృత రాష్ట్రుని పుత్రుడైన దుర్యోధనునకే కురురాజ్యమునందు సంపూర్ణమగు దాయ సత్వపు (వారసత్వపు) హక్కు గలదనియు, పాండవులకు లేదనియు విశద మగుచున్నది.

2. అయినను బలవంతులగు రాజులు పరరాజులను జయించి వారి రాజ్యముల నాక్రమించుకొనుట రాజధర్మమై యుండెను.

3. సంజయురాయబారపుగాలమున శ్రీకృష్ణుడు ధర్మనిర్ణయము చేయు సందర్భము లోని—

"ఉతాహో త్వం మన్యసే శామ్య మేవ రాజ్ఞాం యుద్ధే వర్తతే ధర్మతంత్రమ్ ।
అయుద్ధే వా వర్తతే ధర్మతంత్రం తథైవ తే వాచ మిమాం శృణోమి ॥"

(ఉద్యో-అ 29)

అను వాక్యమే పైయంశమును వ్యక్తపరచుచున్నది.

4. ఇట్టిధర్మము నవలంబించి ప్రబలులగు పాండవులు దుర్యోధనుని జయించి రాజ్యము నాక్రమింతు రనియు, నట్టియెడ బొసగు యుద్ధమున నుభయపక్షములు నశించు

ననియు దలచి పాండవులకు గొంత రాజ్య మిప్పించుట కర్తవ్య మని భీష్ము డట్లుపదేశించెను." (ఉపోద్ఘాతము పు 5-6)

5. "రాజ్యస్వత్వవిషయమున నించుకేనియు హక్కులేని పాండవులు." (పు 43)

ఈగ్రంథము వ్రాసినవారు చిరసీతారామశాస్త్రిగారిది. ఇంకలి అయి దంశములను పరిశీలింతము.

ప్రథమాంశము—"ధృతరాష్ట్రోఽభిషేచితః" అని యుండుటను బట్టి పట్టాభిషిక్తుడు ధృతరాష్ట్రుడుగనుక రాజ్యమందు సంపూర్ణమైన హక్కు దుర్యోధనునిదే కాని, పాండవులది కాదు; అని.

ఈ ధృతరాష్ట్రాభిషేకపాఠము- 'రాజా పాండుర్బభూవ హ' "ధృతరాష్ట్ర స్త్వచక్షుష్ట్వా ద్రాజ్యం న ప్రత్యపద్యత" అను సార్వత్రిక పాఠమునకు, సంస్కృతాంధ్రభారతములలోని పూర్వోత్తరానేకవచనములకు విరుద్ధమగుటచే అపపాఠమని వెనుక నిరూపించియున్నాము. ఆపాఠమును బట్టికొని గ్రంథవిరోధ మాలోచింపక వీరిట్లు వ్రాయుట యుక్తము కాదు.

సంస్కృతాంధ్రభారతములలో చెప్పబడినట్టియు, వెనుకటి 1,2 ప్రతివాదు లొప్పుకొనియున్నట్టియు, యుధిష్ఠిరయౌవరాజ్యమువూట స్మరింపక, రాజ్యమందు పాండవులకు హక్కులేదని వ్రాయుట సాహసము. కనుక 1, 5 అంశములు నిరస్తములు.

ద్వితీయాంశము-'బలవంతులగు రాజులు పరరాజులను జయించి వారి రాజ్యముల నాక్రమించుకొనుట రాజధర్మమై యుండెనట" ఈ మాటలను బట్టి పరరాజులు - దుర్యోధనాదులు వారి రాజ్యము నాక్రమించుకొనుట రాజధర్మమని, బలవంతులైన రాజులగు పాండవులు దండెత్తినారని వీరి యభిప్రాయ మని తెలియుచున్నది. పాండవులు స్వరాజ్యసంపాదనాపేక్షులా? పరరాజ్యాక్రమణాపేక్షులా? దుర్యోధనునకు రాజ్య మొకటే యున్నపుడుగదా! పరరాజ్యాక్రమణాపేక్షు లని పాండవుల ననుట. రాజ్యము పాండవులదాయె; హక్కులేని దుర్యోధనుడు దాని నాక్రమించియుండె. ఇట్టిస్థితిలో పాండవులకు స్వరాజ్య

సంపాదనాపేక్షులనవలెనా? పరరాజ్యాక్రమణాపేక్షులనవలెనా ? పర రాజ్యాక్రమణాపేక్ష దుర్యోధనునిది అనిన చెల్లును గాని, పాండవుల దనిన చెల్లదు. చిన్ననాటినుండి పాండవహత్యకై బహువిధప్రయత్నములు చేయుచు వచ్చిన దుర్యోధనునిది పరరాజ్యాక్రమణాపేక్ష కాదని చెప్పగలవా డెవ్వడు ?

దుర్యోధనాదులు పరు లను బుద్ధి పాండవుల కుండెనా? పాండవులు పరు లను బుద్ధి దుర్యోధనాదుల కుండెనా ? దుర్యోధనాదులు చేయు హత్యాప్రయత్నములకు అధరస్పందము చేయక ఒదిగి పడియున్న పాండవులకు దుర్యోధనాదులయం దున్నది ఆత్మీయు లను బుద్ధి. నిర్దాక్షిణ్యముగా కొట్టకొనవరకు పాండవహత్యకే పూనుకొనిన దుర్యోధనాదులకు పాండవులయం దున్నది పరులు (శత్రులు) అను బుద్ధి. ఇట్టి బుద్ధితో తాము బలవంతుల మని పాండవులను నిర్మూలింప గల మని పాండవరాజ్యము నను కబళింపవచ్చు నని పాండవులపై యుద్ధమునకు దండెత్తినవారు దుర్యోధనాదులే. కనుక పాండవులది స్వరాజ్యసంపాదనప్రయత్నము. కౌరవులది పరరాజ్యాక్రమణప్రయత్నము. అందుచే పాండవులకు సం బంధింపనట్టి యీ ద్వితీయాంశము నిరస్తము.

తృతీయాంశము— బలవంతులు పరరాజులను జయించి వారి రాజ్యము లాక్రమించుకొనుట రాజధర్మమే అని సంజయురాయబార రపుసమయమున శ్రీకృష్ణుడు— "ఉతాహో త్వం మన్యసే" అను శ్లోకార్థముగా వెల్లడించె నట. దీనిని పరిశీలింతము.

అసలు సంజయుని రాయబారమునకు ఏమి ప్రసక్తియో ముందు తెలిసికొనవలసియున్నది. కపటద్యూతముచే నోడింపబడిన పాండవులు వనవాసాజ్ఞాతవాసములు 13 సంవత్సరములు యథాక్రమముగా గడపినతరువాత ద్యూతకాలనిర్ణయప్రకారము మా రాజ్యము మాకి వ్వవలసిన దని దుపదపురోహితునిద్వారా సందేశము బంపినారు.

దానికి సమాధానముగా ధృతరాష్ట్రుడు తన సందేశమును సంజయు నితో చెప్పి పంపినాడు.

ఆధృతరాష్ట్రుని సందేశసారాంశ మేమనగా—

"య ద్యత్ర త్వం ప్రాప్తకాలం పరేభ్య స్త్వం మన్యేథా భారతానాం హితం చ।
తం భాషేథా స్సంజయ రాజమధ్యే న మూర్ఛయే ద్య న్న చ యుద్ధహేతుః॥"
(ఉద్యో-అ 22)

టీ॥ న మూర్ఛయేత్ । వర్ధయేత్ క్రోధ మితి శేషః ।

సంజయా! నీ వక్కడకు వెళ్ళి రాజమండలిలో వారితో సంభాషింపుము. ఆసంభాషణము- వారియొద్ద చెప్పుటకు సముచితమై యుండవలయును. కౌరవులకు క్షేమకరమై యుండవలయును. పాండవులకు క్రోధోద్దీపకము కానిదై యుండవలయును. యుద్ధము రానీయకుండ జేయునట్టిదై యుండవలయును. అట్లు సంభాషింపుము. అని.

తే. "నీవు ధర్మజు పాలికి నెమ్మి నరుగు మతడు పేరోలగం బున్న యవసరమున
గాన్పు మతనికి ననుజవర్గంబునకును బంధులకు నింపు పుట్టంగ బలుకు మచట.

క. నెయ్యము వాటించి కడుం దియ్యము పెంపగ నలుక లెల్ల దీఱెడునటుగా
గయ్యము తలపు లోనుగ నయ్యమనందనుడు మానునట్టి తెఱుగు గాన్."
(ఆంధ్రభారతము)

ఇది యాధృతరాష్ట్రసందేశసారాంశము.

ఇక దీనిననుసరించి సంజయుడు వెళ్ళి చెప్పినమాటలసారాంశము—

"న చే ద్భాగం కురవోఽన్యత్ర యుద్ధా త్ప్రయచ్ఛేరం స్తుభ్య మజాతశత్రో।
భైక్షచర్యా మన్ధకవృష్ణిరాజ్యే శ్రేయో మన్యే న తు యుద్ధేన రాజ్యమ్ ॥"
(ఉద్యో-అ 27)

యుధిష్ఠిరా! యుద్ధము లేకుండ కౌరవులు మీరాజ్యము మీ కివ్వని పక్షములో యుద్ధము చేసి రాజ్యము రాబట్టుకొనుటకై నీవు సంకల్పింపకుము. యుద్ధ మధర్మము. మీరు జీవించుటకు మార్గమా? అంధకవృష్ణిరాజ్యములలో భిక్షాచర్యము చేయవచ్చును. ధర్మాత్ముడవైన నీకు అదియే ఉత్తమము, ధర్మము అని నేను తలచుచున్నాను. అని.

క. పాలిక కౌరవులు దుశ్శీలత జెడదలచిరేని జెప్పెద రథిరా
భీలాన్నముకంటెను గడు మేలగు భిక్షాన్నమైన మీ నడవడికిన్.

క. తుది బోయి క్షాత్రకర్మాస్పద మగు తెఱగున దొడంగి బంధుల గురులన్
వెదకి వధియించు సౌఖ్యంబదియేటికి నార్యనింద్య మస్థిర మగుచున్. (ఇంద్రప్రభా)

ఇట్టి సంజయుని విచిత్రోక్తులపై ధర్మజుడు సంభాషించుచు ధర్మాధర్మపద్ధతి నిరూపించుచు ఈ విషయమై యేది ధర్మమో నిర్ణయించుమా డీత డని సభలో నున్న కృష్ణభగవానుని నిర్దేశించెను. అప్పుడు కృష్ణభగవాను డిట్లనెను—

"తే చే దిమే కౌరవాణా ముపాయ మవగచ్ఛేయు రవధేనైవ పాణ్డోః।
ధర్మత్రాణం పుణ్య మేషాం కృతం స్యా దార్యే వృత్తే భీమసేనం నిగృహ్య".

టీ—కౌరవాణా మవధేనేత్యన్వయః. ఉపాయాన్ జీవనస్య సాధనానీతి యావత్. భీమసేనం తన్మారణప్రవృత్తం నిగృహ్య స్థాపయిత్వా ఆర్యే వృత్తే అహింసాయామ్.

సంజయా! కౌరవులను వధింపకుండ పాండవులకు జీవనోపాయము సామదానాదులచే సిద్ధించు పక్షములో భీమసేనుని శాంతింప జేసి వీరు పుణ్యకార్యము చేసినవారు కాగలుగుదురు.

"ఉతాహో త్వం మన్యసే శాశ్వ మేవ రాజ్ఞాం యుద్ధే వర్తతే ధర్మతంత్రమ్।
అయుద్ధే వా వర్తతే ధర్మతంత్రం తథైవ తే వాచ మిమాం శృణోమి॥"

ఈశ్లోకమే ప్రతివాదు లెత్తుకొనినది. దీని తాత్పర్యము— సంజయా! యుద్ధమునకు సంకల్పింపక శాంతింపు మనుచున్న నీవు, క్షత్రియులకు యుద్ధమే ధర్మమో, నీవన్న భిక్షాచర్యము ధర్మమో వినగోరుచున్నాను చెప్పుము; అని.

ప్రతివాదులు ఈ శ్లోకముదహరించి— "బలవంతులు పరరాజులను జయించి వారి రాజ్యము లాక్రమించుకొనుట రాజధర్మ" మని శ్రీకృష్ణుడు చెప్పినట్లు వ్రాసినారు.

శ్రీకృష్ణుడు చెప్పిన దదియేనా? క్షత్రియులు స్వరాజ్యసంపాదనమునకై అవసరమైన పక్షములో యుద్ధము చేయుటే ధర్మము. భిక్షాచర్యము చేయుట గాదు. అను తాత్పర్యముతో ఈ మాట

చెప్పెనా ? పరరాజ్యము లాక్రమించుకొనుట ధర్మ మని చెప్పెనా ? అట్లు చెప్పుటకు అట్టి ప్రస్తావ మేమి వచ్చినది? మీ రాజ్యమును కౌరవు లివ్వనిపక్షములో యుద్ధముచేయవద్దు. మీరు భిక్షాచర్యము చేయుట మంచిది. అని కదా సంజయుడు ప్రస్తావించెను.

కనుక నిచ్చట స్వరాజ్యప్రాప్తిప్రస్తావమేకాని, పరరాజ్యాక్రమణప్రస్తావము కాదు. ప్రతివాదులు రాజ్యములో పాండవులకు హక్కులేదనుభ్రాంతితో శ్లోకమునకు తాత్పర్యము విరుద్ధముగా వర్ణించినారు.

పాండవులపట్ల కర్ణదుర్యోధనులు చేసిన అన్యాయ్య మేమియు లేదని కర్ణచరిత్రము వ్రాయుటలో ఈప్రతివాదు లిట్లు వ్రాసినారు. దుర్యోధనుడు పాండవులకు అన్యాయ్యము జేసెనో లేదో తెలియుటకై అనంతరము ఆప్రస్తావములోనే సంజయుడు జెప్పిన శ్రీకృష్ణుని వచన ములు నుదాహరించుచున్నాము—

"యదా గృధ్యే త్పరభూతో నృశంసో విధిప్రకోపా ద్బల మాదధానః ।
తతో రాజ్ఞా మభవ ద్యుద్ధ మేత త్తత్ర జాతం వర్మ శస్త్రం ధను శ్చ ॥
ఇన్ద్రే ణైత ద్దస్యువధాయ కర్మ ఉత్పాదితం వర్మ శస్త్రం ధను శ్చ ।
టీ॥ నృశంసత్వా ద్దుర్యోధనో ధార్మికేణ రాజ్ఞా వధ్య ఏవేతి సూచయన్నాహ—యదేత్యాదినా సార్ధేన । పరభూతో పరైశ్వర్యే నృశంస శ్చోర కల్పో రాజా విధిప్రకోపాత్ దైవప్రాతికూల్యాత్ గృధ్యేత్, తతో హేతోః, రాజ్ఞాం పరస్పరం యుద్ధం సమభవత్. అనేన యుద్ధాఖ్యస్య కర్మణ ఉత్పత్తిరుక్తా।
కర్మ యుద్ధం తతో<sup></sup>త్పత్తిశిష్టం గుణత్రయ మాహ—వర్మ కవచం శస్త్రం ఖడ్గాది ధనుశ్చేతి యత ఇంద్రేణ దస్యువధార్థమేత త్త్రయ ముత్పాదిత మత ఏతై రేవ దస్యుం దుర్యోధనం యది హన్యాత్ స ఏవ ధర్మ ఇతి భావః ।"

సంజయా! యుద్ధ మెప్పుడుపుట్టినదనగా ఒకరాజు దురదృష్టవశమున పరుల యైశ్వర్యమును చోరునివలె ఎప్పు డాశించి హరించునో అప్పుడు రాజులకు పరస్పరము యుద్ధము పుట్టినది. ఆ యుద్ధమునకే ఉపకరణములుగా ధనుస్సు, కవచము, ఆయుధములు పుట్టినవి. దస్యు (చోర)వధకొరకే యివన్నియు ఇంద్రునిచే నుత్పాదింపబడినవి.

"తత్ర పుణ్యం దస్యువధేన లభ్యతే సోఽయం దోషః కురుభి స్తీవ్రరూపః ।
అధర్మజ్ఞై ర్ధర్మ మబుధ్యమానైః ప్రాదుర్భూత స్సంజయ సాధు తన్న ॥
టీ—దుర్యోధనే దస్యుత్వం నిరూపయతి—తత్రేత్యాదినా । కురుభిః నిమిత్తభూతై రయందోషః వంచనాఖ్యః ప్రాదుర్భూతః ॥

అట్టి దస్యుధర్మము దుర్యోధనునియం దున్నది. దస్యువధచేత పుణ్యము కలుగును. అధర్మతత్పరులైన కౌరవ్యులనుబట్టి పాండవులకు గొప్ప హానికలిగినది. సంజయా! అది మంచిపని కాదు.

"తత్రరాజా ధృతరాష్ట్ర స్సపుత్రో ధర్మ్యం హరే త్పాండవానా మకస్మాత్ ।
నావేక్షన్తే రాజధర్మం పురాణం తదన్వయాః కురవ స్సర్వ ఏవ ॥
టీ— ధర్మ్యం ధర్మా దాగతం పిత్ర్యం రాజ్యం। తదన్వయా స్తదనుసారిణః ॥

పాండవులకు పిత్ర్యమైన రాజ్యమును సపుత్రుడైన ధృతరాష్ట్రుడు హరించెను. వారు రాజధర్మ మెరుగకున్నారు; అందరును వారి ననుసరించినవారే.

"స్తేనో హరే ద్యత్ర ధనం హ్యదృష్టః ప్రసహ్య వా యత్ర హరేత దృష్టః ।
ఉభౌ గర్హ్యౌ భవత స్సంజయైతౌ కిం వై పృథక్త్వం ధృతరాష్ట్రస్య పుత్రే ॥

సంజయా! పరుల సొత్తును చూడకుండగా హరించువాడొకడు, చూచుచుండగా బలాత్కారమున హరించువాడొకడు. ఈయిద్దరును చోరులే; నింద్యులే; చూచుచుండగా హరించినవాడు చోరుడు కాక పోవునా? ఇట్టిచోరునికంటె భేదము దుర్యోధనునియం దేమియున్నది?

"సోఽయం లోభా న్మన్యతే ధర్మ మేతం య మిచ్ఛతి క్రోధవశానుగామీ ।
భాగః పునః పాండవానాం నివిష్టః తం నః కస్మా దాదదీరన్ పరే వై ॥
టీ—ఏతం ఛలేన రాజ్యాపహారం। నివిష్టః వనవాసా దూర్ధ్వం రాజ్యం గ్రాహ్య మితి కౌరవేషు న్యాసరూపేణ స్థితః। తం భాగం నః అస్మాకం పరే కస్మా దాదదీరన్ గృహీతవన్తః ॥

లోభియు, క్రోధవశుడు నయిన దుర్యోధనుడు కపటమున రాజ్యాపహరణము ధర్మ మనుకొనుచున్నాడు. అయితే వనవాసా ద్యనంతరము మీరాజ్యము మీరు తీసుకొనవచ్చు నని చెప్పి నిర్ణయించి తమయొద్ద బెట్టుకొనిన పాండవరాజ్యమును వారు పాండవుల కెందుకీయరు ?

"అస్మిన్ పదే యుధ్యతాం నో వధోఽపి శ్లాఘ్యః పిత్ర్యం పరరాజ్యా ద్విశిష్టమ్।
ఏతాన్ ధర్మాన్ కౌరవాణాం పురాణాన్ ఆచక్షీథా స్సంజయ రాజమధ్యే" ॥
టీ—పదే పదనీయేఽవశ్యగ్రాహ్యే భాగే నిమిత్తే ॥

అవశ్యగ్రాహ్యమైన పాండవరాజ్యమునిమిత్తము ప్రాణహాని మాకైనను శ్లాఘనీయమే. పరరాజ్యగ్రహణముకంటె పితృరాజ్యగ్రహణమే ఉత్తమము. (పరరాజ్యగ్రహణములో పరులసొత్తును గ్రహించిన దోషముండును. పితృరాజ్యము స్వరాజ్యమగుటచే ఆ దోష ముండదు.) ఈధర్మములను సంజయా! నీవు రాజసభలో కౌరవులకు జెప్పుము.

ఈ శ్రీకృష్ణశ్లోకములలోని సారాంశములు ప్రతివాదులకు హృద్గతము గాకుటకై యెత్తి చూపబడుచున్నవి—

పితృపితామహాక్రమాగతమైన పాండవుల రాజ్యమును కపట ద్యూతమున దుర్యోధనుడు హరించినాడు. దుర్యోధనునియం దున్నవి దస్యులక్షణములు. దస్యువధలో పుణ్యము గలుగును. ద్యూతికాల నిర్ణయప్రకారము వనవాసాద్యనంతరము ఇచ్చితీరవలసిన పాండవ రాజ్య మివ్వక దుర్యోధను డాక్రమించియున్నాడు. ఒకని సొత్తు నింకొక డాక్రమించినపుడు శిక్షించుటకే కవచధనుఃఖడ్గాదు లేర్పడి నవి. స్వరాజ్యసిద్ధికే అవసరమైనయెడల యుద్ధముచేయుటే క్షత్రియ ధర్మముగాని, యెట్లో భిక్షాన్నముతో జీవించుట క్షత్రియధర్మము గాదు. పరరాజ్యగ్రహణముకంటె నిర్దుష్టమగు స్వరాజ్యగ్రహణమే ఉత్తమము. ఇవి సారాంశములు.

ఇట్లు చెప్పిన శ్రీకృష్ణుడు—"బలవంతులు పరరాజ్యము లాక్రమించుకొనుట రాజధర్మమే" అని చెప్పెను. అని ప్రతివాదులు వ్రాసినారే! ఇది యుక్తమేనా?

దుర్యోధనునిదే రాజ్యమైనట్లు, ఆరాజ్యమును దుర్యోధనుని జయించి పాండవులు ఆక్రమించుకొనినట్లు, ఇట్లు చేయుటే రాజధర్మ మని పాండవులకు శ్రీకృష్ణుడు బోధించినట్లు యీప్రతివాదులు

వ్రాయుట మంచిపనికాదు. ఏది యెట్లున్నను తాము చూపిన శ్రీకృష్ణుని వాక్యములను అత్యంతవిరుద్ధమగుటచే తృతీయాంశము నిరస్తమైనది.

చతుర్థాంశము—"ప్రబలు లగు పాండవులు దుర్యోధనుని జయించి రాజ్యము నాక్రమింతు రనియు, అట్టియెడ జొరఁగుయుద్ధమున నుభయపక్షములు నశించు ననియు దలచి పాండవులకు గొంత రాజ్యము భీష్ము డిప్పించెను".

ఇక్కడ ప్రతివాదుల నడుగవలసియున్నది— ధృతరాష్ట్రునిచే యువరాజపట్టాభిషేకమునొందిన ధర్మజునిది రాజ్యము గాక యువరాజుగానైన జేయబడని దుర్యోధనునిది రాజ్య మెట్లయినది? మీ మత ప్రకారము దుర్యోధనునిదే రాజ్యమైనయెడల ధర్మజు డెట్లు యువ రాజుగా జేయబడెను?

కుమారాస్త్రవిద్యాప్రదర్శనకాలములో పదుగురి సమక్షమున కర్ణుని కంగరాజ్యమిచ్చిన దుర్యోధనునిదే రాజ్యమందురు కాబోలు. అదిమైన సంవత్సరమునకు- "తత స్సంవత్సరస్యాంతే యౌవరాజ్యాయ పార్థివ। స్థాపితో ధృతరాష్ట్రేణ పాండుపుత్రో యుధిష్ఠిరః"అని ధృత రాష్ట్రునిచే యువరాజుగా జేయబడిన యుధిష్ఠిరునిదా రాజ్యము? అనధికారియైన దుర్యోధనునిదా? ఈ యుధిష్ఠిరయౌవరాజ్యాభిషేకమే దుర్యోధనుడు రాజ్యానధికారి యని, అది ధృతరాష్ట్రరాజ్యానధికార మూలకమని ధ్రువపరచుచున్నది.

దుర్యోధనుడు రాజ్యానధికారియే అయినయెడల నాడు కర్ణుని కంగరాజ్య మెట్లు ఇచ్చెను? అని యడిగెదరా.

మీమతప్రకారము కర్ణుని కంగరాజ్యమిచ్చుటను బట్టి యూహ్య మైన రాజ్యాధికారముగలవాడు దుర్యోధనుడైయుండ, అతని తండ్రియై రాజ్యాభిషిక్తుడగు ధృతరాష్ట్రుడుండ, ఆధృతరాష్ట్రుడు తన కుమారుని గాక, అనధికారియైన యుధిష్ఠిరుని యువరాజుగా నేల జేసినా డని

మే మడుగుచున్నాము. ధృతరాష్ట్రుని చేతులతో నీయబడిన యీ యుధిష్ఠిరయౌవరాజ్యమే దుర్యోధనునియందు కల్పింపబడు హక్కును తోసివేయుచున్నదని చెప్పుచున్నాము. అయితే హక్కులేని దుర్యోధనుడు కర్ణునికంగరాజ్యమిచ్చినపుడు హక్కుగల పాండవులు చూచుచు నూరకుండిరేమి? అని యడుగుదురా?

మీమతప్రకారము హక్కు లేని యుధిష్ఠిరుడు యువరాజుగా జేయబడినపుడు హక్కుగల దుర్యోధనుడు చూచుచు నూరకున్నాడేమి? అని మే మడుగున్నాము. భీష్మధృతరాష్ట్రులను గోరి వారి యనుమతి తీసికొని దుర్యోధను డంగరాజ్య మిచ్చినందున పితృభక్తితో మెలగెడి పాండవులు మరుమాటాడ లేదని చెప్పుచున్నాము. పితృభక్తి లేనట్టియు, ఇతరులను లక్ష్యపెట్టనట్టియు, తనయిష్టానుసారము తండ్రిని నడిపించునట్టియు, రాజ్యతృష్ణ కలిగియున్నట్టియు దుర్యోధనుడు యుధిష్ఠిరునకు ధృతరాష్ట్రుడు యౌవరాజ్యమిచ్చినపుడు మరుమాటాడకుండుటకు గారణము మాత్రము తనకు హక్కు లేకుండుటే తప్ప మరొకటి చెప్ప వీలులేదని తెలుపుచున్నాము.

అయితే పుత్రాధీనుడైన ధృతరాష్ట్రుడు దుర్యోధనుని అంగరాజ్యప్రదానసంకల్పమునకు సమ్మతించినను భీష్మాదు లెట్లు సమ్మతించినారు అందురా? వినుడు—

అది కుమారాస్త్రవిద్యాప్రదర్శనసమయము. ఆ ప్రదర్శనము చేయించుచున్నవాడు ద్రోణాచార్యుడు. ఆతడు అంతకు బూర్వము చేసిన శిష్యపరీక్షలో ఉత్తీర్ణతను పొందినవాడు అర్జునుడు. అట్టి అర్జునునకు బ్రహ్మశిరోనామకాస్త్ర మిచ్చినతరువాత—

"జగ్రాహ పరమాస్త్రం త దాహ చైనం పున ర్గురుః।
భవితా త్వత్సమో నాన్యః పుమాన్ లోకే ధనుర్ధరః ॥"

నీతో సమానమైన ధనుర్ధరుడు లోకములో నుండబోడని అనుగ్రహించియున్నాడు. ఆద్రోణాచార్యుడు రంగస్థలమం దిట్లనినాడు—

"యో మే పుత్రాత్ప్రియతరః సర్వశస్త్రవిశారదః ।
ఐంద్రి రింద్రానుజసమః స పార్థో దృశ్యతా మితి ॥"

నాపుత్రునికంటె నధికప్రియుడు, సర్వశాస్త్రవిశారదుడు నగు పార్థుని ప్రజ్ఞాతిశయము జూడుడు; అని.

అటుపై తన అస్త్రలాఘవమును పార్థుడు ప్రదర్శించి ప్రేక్షకులను విస్మితులను జేసియున్న సమయమునకు కర్ణుడు రంగస్థలమునకు వచ్చి పార్థా! నీకంటె విశేషము నేను జూపెద నని పలుకుటయు, ద్రోణాచార్యానుజ్ఞ దీసికొని పార్థుడు చూపిన విశేషములు చూపుటయు, ధర్యోధను డాతని నాలింగనము జేసికొని కర్ణుడా! అదృష్ట వశమున వచ్చినావు. నన్ను, కురురాజ్యమును నీవు యథేష్టముగా వినియోగించుకొనుము. అని ప్రోత్సహించుటయు జరిగినతరువాత కర్ణుడు—"ద్వంద్వయుద్ధం చ పార్థేన కర్తు మిచ్ఛా మ్యహం ప్రభో" అని పార్థునితో ద్వంద్వయుద్ధమునకు సిద్ధపడుటయు, ద్రోణాచార్యానుజ్ఞపై పార్థుడు తలపడుటయు, అంత కృపాచార్యుడు నీవు నీరాజవంశమును జెప్పి, నీ వేరాజవో వెల్లడించి యాపై యుద్ధము కానిమ్మనుటయు, అప్పుడు దుర్యోధను డాతనిని రాజనిపించుటకై అంగరాజ్య మివ్వదలచుటయు తటస్థించినది. ఈస్థితిలో అంగరాజ్య మిచ్చుటకు నీ కేమి హక్కున్నదని భీష్మద్రోణులు దుర్యోధనుని నిషేధించియున్నయెడల వీరీనిమిత్తమును గల్పించి కర్ణుని తొలగించినారుగాని లేకున్న కర్ణుడే జయించియుండు నని కర్ణునియం దొక ఘనతను, పార్థునియందు ఒక న్యూనతను లోకము కల్పించు నని భావించి, ఎదటివానిచేతికి తన శస్త్ర మిచ్చికూడ తాను జయించుట మహావీరమర్యాద యగుటచే నాపద్ధతిని ఆకర్ణునకు రాజ్య మిచ్చి రాజును జేసి నిలవబెట్టుటే పార్థునకు ప్రతిష్ఠావహ మనియు, "పార్థ ఏవ ధనుర్ధరః" అను ద్రోణాచార్యానుగ్రహోక్తి కిది సార్థక్యసంపాదక మగు ననియు దూర మాలోచించి భీష్మద్రోణులు దుర్యోధనుని నిషేధింపలేదు.

దుర్యోధనునకు హక్కుండుటనుబట్టియే వారు నిషేధింపలేక పోయినారు. అనుపక్షములో యువరాజుగా నాతడే చేయబడి యుండును. అట్లు చేయబడకపోవుటచేత ఆతనికి హక్కులేదని తెలిసి కొనవలయును.

మరియు దుర్యోధనుడే రాజ్యాధికారియైన పక్షములో అర్థ బలము, అంగబలము తనదే గనుక తనచేతిక్రింద మసలవలసియున్న ట్టియు, ఇతరసహాయము లేనట్టియు పాండవులను సమూలముగా నిర్మూలింపవలయు నను దుస్సంకల్పము, దానికై లాక్షాగృహనిర్మా ణము, అక్కడకు జేర్చుటకై పాండవులకు వారణావతప్రయాణకల్ప నము అను దుర్వ్యాపారములు దుర్యోధనున కేల సంభవించినవి? ఈదుర్వ్యాపారములనుబట్టికూడ పాండవులదే రాజ్యమనియు, అంగ బలము, అర్థబలము పాండవులకే గలదనియు, తాను పాండవుల చేతి క్రింద బ్రతుకవలసివచ్చిన దని, పాండవులను నిర్మూలించినగాని రాజ్యము తనచేతికి రాదని దుర్యోధనుడు తలచియే యింత దుర్మార్గ మున కొడిగట్టినా డనియు స్పష్టమగుచున్నది. కనుక రాజ్యమందు హక్కు దుర్యోధనునకు లేదు.

అయితే రాజ్యమందు సంపూర్ణమైన హక్కు గల పాండవులకు భీష్ముడు బోధించి—అర్థరాజ్యము మాత్రమే యిప్పించుటకు గారణ మేమి? అని యడిగెదరా?

మీమతప్రకారము యావద్రాజ్యము దుర్యోధనుని దయి యుండ హక్కులేని పాండవులకు అర్ధరాజ్య మిచ్చుటకు గారణమేమని మేమడుగుచున్నాము. ప్రబలు లగు పాండవులు దుర్యోధనుని జయించి రాజ్యము నాక్రమింతు రని వారి కర్ధరాజ్య మీయ బడిన దందురా! తాను అర్ధరాజ్యమిచ్చునప్పటికి పాండవులు ప్రబలులు అనుబుద్ధి దుర్యోధనున కుండుటే నిజమై, తన రాజ్యమును వారాక్ర మింపకుండుటకే దుర్యోధను డర్ధరాజ్య మిచ్చుట నిజమైనయెడల, తన

అర్ధరాజ్యమును స్వీకరించినతరువాత ఇంద్రప్రస్థరాజ్యమును విస్తరింప జేసి అక్షయతూణీరగాండీవాద్యసాధారణపరికరముల నార్జించి దిగ్విజయపూర్వకముగా రాజసూయమహాక్రతువు గావించి తేజరిల్లుచున్న పాండవుల రాజ్య మపహరించుట, దాని నింక నీయననుట, యుద్ధమే కర్తవ్యమనుట దుర్యోధనునకు సంభవించునా ?

అర్ధరాజ్య మిచ్చునప్పటికే దుర్యోధనునకు ప్రబలు లనిపించి దాని నపహరించునాటికి శతగుణితైశ్వర్యబలాఢ్యులై యున్న పాండవులు దుర్బలు లనిపించినారా ? కాబట్టి వారు ప్రబలు లని, తన రాజ్యమును వారాక్రమింతు రని దుర్యోధనుడు అర్ధరాజ్య మిచ్చెననుట అసంగతము. ఆపద్ధతిలో దానిని ద్యూతమునిమిత్తమున తాను అపహరించుట అసంభవమే. కనుక మీరు చెప్పినమాట అయుక్తము.

మేము చెప్పున దేమనగా— యావద్రాజ్యము పాండవులదే. అర్ధరాజ్యమే భీష్ముడు చెప్పి యిప్పించుట, దానినే పాండవులు తీసికొని అర్ధరాజ్యము విడిచిపెట్టుట, ధృతరాష్ట్రధార్తరాష్ట్రాదిపోషణభారము తమదై యుండుటచేతనే హక్కులేని దుర్యోధనుడు నోరు మెదపుటకు వీలులేక తన కది యిష్టము లేకున్నను ఒప్పుకొనవలసివచ్చినది. తన కిష్టము లేని పని జరిగినదికనుకనే దానిని కపటద్యూతమున హరించి నేనింక యివ్వ నని కూర్చుండినాడు. ఇదియే దీని పరమార్థము. కనుక చతుర్థాంశము నిరస్తము. పంచమాంశము ప్రథమాంశముతో బాటు నిరసింపబడినదే.

—♦ చతుర్థప్రతివాదిప్రసంగము— తన్నిరాకరణము ♦—

సుయోధనవిజయము— 5.

1 సుయోధనుడు— "రాజుగా ధృతరాష్ట్రి పాండుసుధీనిధులను నొక్కని చేయంగ నుత్సహించుచు. కుద కగ్రజున్మండొ నధిపతి ధృతరాష్ట్రుం డౌ నంచు వచియించిరి. పాండురాజును బిల్చి ధృతరాష్ట్రు పాలనంబున నుండి నీవు వానికి సైన్యాధికారివై చరించు మనుచు చెల్పిరి.

2 అవిభక్తరాజ్యముగా విరాజిల్లుటచేసి పాండవు లీవాడు పాలుగోర, కౌరవ రాజ్యంబు ఖండంబులను జేయు ధర్మవిరుద్ధమై దనరు. పాండవపతులకు పాలీయ కుండుటే పరమధర్మము. పూర్వమర్యాదల పూజింపవలె రాజు పూర్వవిధుల ధర్మంబు బాటింపవలె నెప్డు.

3 ఆచక్రవర్తికి నౌరసపుత్రుండ యువరాజు నేనౌదు నుర్వి నేల. ధర్మ జుం డిక నగ్రతనయుండు పాండురాజునకు గాన నతండు తన జనకుని సొత్తున కెప్పుడు పెత్తనంబును గల్గి వర్తింపవచ్చును. పాండురాజపుత్రులు ధృతరాష్ట్ర భూమికి దాయాదు లెన్నడు కాజాల రిది నిజంబు.

4 వ్యాసుండు పాండవపక్షపాతి కనుక నతనిమాట వినగదగదు. ధృతరాష్ట్ర రాజుగా దొలుత దా జేసియు పాండవులకు రాజ్యభాగమును పాలీయవలె నంచు బలుక నధర్మంబు.

భీష్ముండు, ద్రోణుండు విభజించి రాజ్యంబు పాలింపటంచును బలుక రెపుడు. మిము జేరి వ్యాసుండు మీపక్షమున నుండి భీష్ముండు పాలోరె వేవిధముల నని చెల్పెనవివింటె ఆదియు సత్యం బెప్డు వృద్ధుడై కురువంశమున శ్రేష్ఠుడై రాజ్యమును త్యజించి మాతండ్రి కొసగిన మహాత్ముడే చెల్ప పాండవపతులకు పాలుగాక. భారతవర్షంబు పాలింప నొపగడె మాతండ్రి, కావున భీష్ముండు కౌరవసభలోన బాండవపక్షంబు బలుకలేదు. చెప్పిన కౌరవుల్ చేయకుండుట యెప్డు సంభ వింపదు. సంభవించె నేని మమ్ముల వీడి యేగడె అనాడె. అన్యాయముగ బల్కె వ్యాసమహర్షి.

5. కథకుండు కవియును కథ నొక పాత్రగా నుండిన సత్యంబు నుండ దండు. తన పక్షమున నుంచు ఘనతయు కీర్తియు మరి లాతివారికి మసిని బూయు తన పక్షమున నుంచు ఘనజయాదుల నెల్ల పరుల కపజయంబు ప్రాప్తి జేయు. కథ లోని పాత్రగా కవి యున్న తనపక్షవిజయంబు వర్ణించు వేవిధముల. కథ గమనిక మార్చు కావ్యంబు నందలి యితివృత్త మెల్ల గ్రహించి ధర్మ మంతయు తనదిగా నందు లిఖించును కావున సత్యంబు గ్రాల దండు. జరిగిన వృత్తంబు జరిగినరీతిగా గ్రహియించి చెలిపెడి కవి కథకులు. ధన్యులు కవి యెప్డు తీర్పరిగా గ్రాలుచుండును. తీర్పరి వాదిగా నుండి వాదించి పదపడి తీర్పరియైన నాతీర్పు నందు నెంత సత్యం బది యొసగునో అరీతి కథలోని పాత్రగా కవియె యున్న నాకవి గ్రంథంబునందున నంతియే సత్యంబు గననగు.

6 సత్యరతిని బాయుట వ్యాసుండు పాపశాంతికి భాగవతంబును వ్రాయ దొడగె. వ్యాసుండు పాండవపక్షంబువా డను వర్ణంబు జగతి శిలాక్షరంబు.

7. నాంది-సూత్రధారుడు— పాండవవంశంబువాడైన జనమేజయుని రాజ్యపాలనమున లిఖింపబడినట్టి యీమహాభారతంబున గవి దుర్యోధనపక్షీయుఁ డై యున్న గోరంత ధర్మము కొండంత జేయుచు సుయోధనుని మహోన్నతగుణములను ధర్మములను మరుగు బెట్టె ననిన యసంభవం జగునే.''

ఈగ్రంథము కోటమర్తి చినరఘుపతిరావుగారిది. ఇది నాటకముగా సీసమాలికతో గూర్చబడినది. ఇది ఊరుభంగమై పడియున్న దుర్యోధనుని నోటిమాటలుగా గల్పింపబడినది. గ్రంథకర్త అభూతకల్పనాపాటవము తెలియుటకై పై 7 అంశములును పరిశీలింపబడు చున్నవి—

ప్రథమాంశము—ధృతరాష్ట్రుడు రాజ్యాధిపతిగను, పాండురాజు సైన్యాధిపతిగను చేయబడి రట !

ఇది—"ధృతరాష్ట్రోఽభిషేచితః" "పాండుః సేనాపతిః కృతః" అనుపాఠమును అవలంబించి చెప్పినమాట. అది అపపాఠ మని, అది సంస్కృతాంధ్రభారతతాత్పర్యవిరుద్ధ మని బహువిధముల ప్రమాణోపపత్తులతో వెనుక నిరూపించియున్నాము.

"ధృతరాష్ట్రః స్వచక్షుష్ట్వా ద్రాజ్యం న ప్రత్యపద్యత ।
... ... ... రాజా పాండు ర్బభూవ హ ॥"

అనియే సార్వత్రికపాఠము. నవీనమై భండార్కరు ప్రాచ్యవిద్యాపరిశోధనాలయముద్రితమై యున్. సుప్రంశరశోధితమై యున్న మహాభారతప్రతిలో నున్నది కూడ ఈపాఠమే. ఇతరమైన ప్రతులలో నున్నట్లే ఈప్రతిలోగూడ— దుర్యోధనునిగూర్చి భీష్మవాక్యము, ఉద్యోగపర్వములో—

"అన్ధః కరణహీనత్వా న్న వై రాజా పితా తవ ।
రాజా తు పాండు రభవత్''

గాంధారీవాక్యము—"రాజ్యం తు పాండో రిద మప్రధృష్యమ్"
ధృతరాష్ట్రవాక్యము—"పాండుస్తు రాజ్యం సంప్రాప్తః కనీయాన్ స న్విశాంపతే"
"యుధిష్ఠిరో రాజపుత్రో మహాత్మా న్యాయాగతం రాజ్య మిదం చ తస్య"

అని యీగ్రంథమంతయు నున్నది. ఈగ్రంథమున కంతకు ధృతరాష్ట్రాభిషేకపాఠము విరుద్ధము.

ఇంకొకటి— "ధృతరాష్ట్రోఽభిషేచితః" అనుటకు ప్రతివాది జ్యేష్ఠత్వముచే కారణముగా జెప్పెను. అంధత్వము లేకుండుట కారణముగా గల్పింపలేదు. కనుక అంధత్వమును వీరొప్పుకొనినారు. ఆ అంధత్వమే అతని రాజ్యాభిషేకమునకు ప్రతిబంధక మని వచనము లుద్ఘోషించుచున్నవి. అది కాదనుట యెట్లు?

గ్రంథమందు ఎక్కడజూచినను రాజ్యము పాండుభూపాలునిదను వచనములే కనబడుచుండ వీరు కాదనిచెప్పుట యేమి బాగున్నది? "రాజా పాండు ర్బభూవ హ" ఇత్యాది వచనములచే సిద్ధించుచున్న పాండురాజరాజ్యాభిషేకమునకు పాండురోగ మొకదానిని ప్రతిబంధకముగా ప్రతివాదులు కల్పించినారు.

గ్రంథస్థముగు తా మొప్పుకొనియున్న అంధత్వము ధృతరాష్ట్రాభిషేకమునకు ప్రతిబంధకము కాదనుచు, గ్రంథస్థము గానట్టియు సంప్రతిపన్నము గానట్టియు పాండురోగమును గల్పించి, అది పాండురాజ్యాభిషేకమునకు ప్రతిబంధక మనుట అసంగతము. ద్వితీయపుత్రుడు పాండురాజు కలిగిన తరువాత తృతీయపుత్రు డపేక్షింపబడుటవలన పాండునామమున కనుగుణ్యమైన పాండురోగ మూహింపబడుచున్న దందురా? పాండుశబ్దమునకు రోగవిశేష మర్థము కాదు: కాంతివిశేషము. కనుకనే— "పాండుదేహుండగునని చెప్పె యునిగిపు" అని యున్నది. చూడుడు ఆంధ్రభారతము. అట్లు దేహకాంతివిశేషమును బట్టి పాండునామము సార్థకమే.

ఇక తృతీయపుత్రాపేక్షమాట యేమందురా? వినుడు! పుట్టినవానియందు గనబడు దోషమునుబట్టి మఱియొకని నపేక్షించుట జరుగలేదు. మొట్టమొదటనే— "విచిత్రవీర్యు సుక్షేత్రములఁ సుతులం బడయుము" (ఆంధ్రభా.) అని అనేకపుత్రాపేక్ష నెల్లడింపబడినది. తృతీయుని గోరినప్పుడు— "అంబికకు ప్రథమపుత్రుం డంధు డయ్యె. నింక నొక్కకొడుకు రూపవంతుం బడయుము" (ఆంధ్రభా.) అని కోరుటలో

అంబికకు అంధుడు కానట్టివాడు, రూపవంతుడు కోరబడెను. ప్రతివాదిమతప్రకారము ద్వితీయునియందలి పాండురోగమునుబట్టియే తృతీయుని గోరినయెడల పాండురోగములేనివాడు అప్పుడు కోరియుండును. అట్లు కోరకుండుటచే తృతీయపుత్రాపేక్షకు, ప్రతివాదుల పాండురోగ కల్పనకు సంబంధమే లేదు. కనుక ప్రతివాదులది అపోహయే. ఈ విషయము విపులముగా చతుర్థభాగములో నిరూపింపబడినది. విశేషము లచ్చట జూడవలయును.

పర్వావసానము ధృతరాష్ట్రుడు రాజ్యాధిపతి యనుట యుక్తి విరుద్ధము, ప్రమాణవిరుద్ధము. పాండురాజు రాజ్యాధిపతి యనుట యుక్తియుక్తము,ప్రమాణసమ్మతము; కాబట్టి ప్రథమాంశమునిరస్తము.

ద్వితీయాంశము—అవిభక్తమైన కౌరవరాజ్యములో పాండవులు ఈనాడు భాగము గోరుట ధర్మవిరుద్ధమట ! పాండవులకు పాలీయకుండుటే పరమధర్మమట ! పూర్వమర్యాదలను, పూర్వవిధులను రాజులు పాటింపవలెనట !

ఈప్రతివాదులకు కురువంశముయొక్క పూర్వమర్యాదలనే తెలుపుచున్నాము—"జ్యేష్ఠుడయిన 'యదువు' అను రాజుండగా తండ్రియిష్టమునుబట్టి కనిష్ఠుడయిన 'పురువు' అను నాతడే రాజ్యాభిషిక్తుడయ్యెను. జ్యేష్ఠుడయిన 'దేవాపి' త్వగ్దోషముకలవాడగుటచే కనిష్ఠుడయిన శంతనుడే రాజ్యాభిషిక్తుడయ్యెను. ఇట్లు తండ్రికి యిష్టుడు గాకున్నపుడు, హీనాంగుడైనపుడు జ్యేష్ఠుడు రాజ్యార్హుడు గాకుండుట కురువంశమర్యాద. ఈపద్ధతినే జ్యేష్ఠుడయినను హీనాంగుడగుటచే రాజ్యము నాది కాకపోయినది."

ఇవి ధృతరాష్ట్రుని మాటలు. వచనములు చతుర్థభాగములో ప్రదర్శింపబడినవి. రాజ్యమర్యాదలు ఇట్లుండగ పూర్వమర్యాదలను, పూర్వవిధులను పాటింపవలె ననుచున్న యీ ప్రతివాదులు జ్యేష్ఠుడని రాజ్యము ధృతరాష్ట్రునకు గట్టబెట్టుట తప్పు. దానిని పురస్కరించు

కొని అది కౌరవరాజ్య మనుట తప్పు. అట్లని పాండవులకు పాలీయు కుండుటే పరమధర్మ మనుట తప్పు. పాండవరాజ్యమా ? అందులో వారు గ్రహించినది అర్ధభాగమా ? దానిని కపటద్యూత మున హరించుటా ? 13 ఏండ్లపైన దానిని తీసికొనవచ్చు నని నిర్ణ యమా ? పాండవుల కది యివ్వకుండుటే పరమధర్మ మని ప్రతివాది తీర్పు చెప్పుటా ? ఎంత ధర్మము !

పాండవు లీనాడు భాగము గోరుట ధర్మవిరుద్ధమట. ఏనాడు? వనవాసాజ్ఞాతవాసములు చేసి వచ్చిననాడా? అది ధర్మవిరుద్ధమయ్యెనా? ఇది ప్రతివాది తీర్పా? అసంగతమగుటచే ఈద్వితీయాంశము నిరస్తము.

తృతీయాంశము— ధృతరాష్ట్రుడు చక్రవర్తియట ! అతని యౌరసపుత్రు డగు దుర్యోధనుడు యువరాజు అగునట ! ధర్మజుడు పాండురాజు సొత్తునకు అధికారి కావచ్చునట ! పాండవులు ధృత రాష్ట్రుని సొత్తునకు దాయాదులు కాజాలరట.

ధృతరాష్ట్రుడు చక్రవర్తియైనయెడల ఈకల్పన నిలువబడు నేమో. రాజ్యాధిపతి నేను గానని యాతడు మొరబెట్టుచుండ, నీవు గాకపోవుటే చిక్కువచ్చిన దని దుర్యోధనుడు మొఖపడియుండ ధృత రాష్ట్రుడే చక్రవర్తి యనుట యెట్లు ?

ధర్మజునకు ధృతరాష్ట్రుడే యౌవరాజ్య మిచ్చియుండ దుర్యో ధనుడు యువరాజని ప్రతివాది యనుట యేమి బాగున్నది ? ధృత రాష్ట్రుని సొత్తునకు పాండవులు దాయాదులు కానట్లే, పాండురాజు సొత్తునకు కౌరవులు దాయాదులు కారుగదా ! పాండురాజు రాజ్య మును దుర్యోధను డాక్రమించుట యుక్త మని యీప్రతివాది యెట్లు చెప్పగలుగును ? ధృతరాష్ట్రునిదే రాజ్య మను తమ మతములో పాండురాజునకు సొత్తు ఎక్కడిది ? పాండురాజునకు భూము లున్నవా? భవనము లున్నవా ? గ్రామము లున్నవా ? ఉన్నయెడల నీది

మీరు తీసికొనుడు, నాది నేను తీసికొందు నని సుయోధనుడు చెప్ప లేదేమి ? పాండవుల సొత్తు వేరుగా ఉన్నయెడల మా కయిదుగురకు అయిదు స్థానములైన ఇచ్చి నిలవబెట్టు మని పాండవులు కోరవలసిన పని యేమి వచ్చినది ?

అట్లు కోరుట వారు తమసొత్తుతో సంతుష్టిపడకనా? ఆసొత్తును కూడ దుర్యోధను డాక్రమించుటచేతనా ? సంతుష్టిపడకనే అను పక్షములో మీసొత్తుతో మీరు సంతుష్టిపడుడు. అనిచెప్పక సూదిమొన మోపినంతమాత్రమైన మీకియ్య నని దుర్యోధను డెందు కనినాడు. ఈయనుటలోనే వారిసొత్తును ఆక్రమించినాడని స్పష్టమగుచున్నది. ప్రతివాదిమతప్రకారము రాజ్యము దుర్యోధనుని దగుట, పాండురాజు సొత్తు వేరుగానుండుట, దానినిగూడ దుర్యోధనుడే ఆక్రమించి పాండవుల కివ్వననుట మరియు విరుద్ధము. "ధర్మజుడు పాండురాజు సొత్తునకు అధికారి కావచ్చును" అను ప్రతివాదిమాట అర్థములేనిమాట. ఇట్లు అసంబద్ధమగుటచే తృతీయాంశము నిరస్తము.

చతుర్థాంశము— వ్యాసుడు పాండవపక్షపాతియుట; ఆతనిమాట వినదగదట. తాను మొదట రాజుగా ధృతరాష్ట్రుని జేసియుండి, రాజ్యభాగము పాండవుల కివ్వవలె నని అధర్మముగా జెప్పెనట. భీష్మద్రోణులు అట్టిమాటను ఎన్నడును చెప్పనేలేదట. పాండవపక్షముం దున్న వ్యాసుడు పాండవుల కర్ధరాజ్య మిమ్మని భీష్ము డనేకవిధముల జెప్పినట్లు అసత్యముగా దెలిపినాడట. భీష్ముడు చెప్పుటే నిజమైన యెడల కౌరవులు వినకుండుట అసంభవమట. కౌరవులు వినకుండుటే నిజమైనయెడల భీష్ముడు వారి నంటిపెట్టుకొనియుండుట అసంభవమట. వ్యాసమహర్షి చెప్పిన దన్యాయమట !

ఆహా! తుద కీప్రతివాది మహాభారతకర్త యగు మహర్షిమీద బడెను. దీనికి— "ధృతరాష్ట్రోఽభిషేచితః" అని యుండుట, దానికి

విరుద్ధమయి భీష్మవచనముగా— "అంధః కరణహీనత్వా న్న వై రాజా పితా తవ। రాజా తు పాండు రభవ న్మహాత్మా లోకవిశ్రుతః ॥ మా తాత కలహం కార్షీ రాజ్యస్యార్ధం ప్రదీయతామ్।" అని దుర్యోధనునకు జెప్పబడియుండుట కారణ మన్నమాట. అయితే— "ధృతరాష్ట్రోఽభిషేచితః" అను మాటకు విరుద్ధమువి "రాజా తు పాండు రభవత్" అనుమాటను తీసికొనరాదనుచున్న ప్రతివాదులు ఆమాటకు విరుద్ధమైన 'ధృతరాష్ట్రోఽభిషేచితః' అనుమాటనుమాత్ర మెట్లు తీసికొనెదరు? ఇట్టి సందర్భములో ఏవాక్యము దీసికొనిన యావద్గ్రంథము విరోధము లేకుండ సమన్వితమగునో, స్థలాంతరములలో ప్రసంగమువచ్చినపు డెల్ల ఏది చెప్పబడుచువచ్చెనో దానినే గ్రహించుట, రెండవదాని నపపాఠ మనుట భాషాజ్ఞానముకలవారి మర్యాద. అట్లు గ్రహింపదగినది పాండురాజరాజ్యవాదమే.

అది యెక్కడెక్కడ చెప్పబడుచు వచ్చెననగా— ఆదిపర్వమున ధృతరాష్ట్రదుర్యోధనుల పరస్పరసంభాషణములలో, పాండురాజదిగ్విజయప్రతిపాదనములో, పౌరుల ప్రసంగములలో చెప్పబడుచు వచ్చెను. ఉద్యోగపర్వమున— భీష్మోపదేశములో, గాంధారీధృతరాష్ట్రోపదేశములలో చెప్పబడుచు వచ్చెను. ఆశ్రమవాసపర్వమున— ధృతరాష్ట్రవాక్యములలో చెప్పబడుచు వచ్చెను. ఇదంతయు వెనుక ప్రదర్శింపబడినది.

ఇట్లు అనేకస్థలములలో ప్రస్తావింపబడినదియు, యావద్గ్రంథమునకు అవిరుద్ధమయినదియు— 'రాజా పాండు ర్బభూవ హ' అనునదియే. 'ధృతరాష్ట్రోఽభిషేచితః' అనునది యితరత్ర చెప్పబడనట్టిదియు, యావద్గ్రంథమునకు విరుద్ధమైనట్టిదియు గనుక అది అపపాఠమే. అనగా వేదవ్యాసగ్రంథమునకు సంబంధించినది కాదు. అందువలన "రాజుగా ధృతరాష్ట్రుని వ్యాసుడు మొదట జేసెను" అనుమాట త్రోసివేయబడినది.

ఇక వ్యాసుడు పాండవపక్షపాతియట! అధర్మముగా జెప్పెనట!

అది యెట్లో చూతము— ప్రతివాదిమతప్రకారము రాజ్యము ధృత రాష్ట్రునిది యని మొదట జెప్పి తరువాత పాండవులకు అర్ధరాజ్య మిమ్మని చెప్పుటలో పాండవపక్షపాతము కనబడినదంటరా ?

అయితే సిద్ధాంతములో రాజ్యము పాండురాజుదని మొదట చెప్పి తరువాత పాండవులకు అర్ధరాజ్య మియ్యవలయును. అనగా కౌరవులు అర్ధరాజ్యము దీసికొనవలయును. అని చెప్పుటలో కౌరవపక్షపాతము కనబడుటలేదా ?

రాజ్య మెవ్వని దని చెప్పినను ఆరాజకుటుంబమునకు చెందిన స్వజన మనుభవించుటకై యియ్యవలయు ననియే వ్యాసుడు చెప్పెను. ఇది పక్షపాత మగునా ? నిష్పక్షపాత మగునా ? ఇది యధర్మముగా జెప్పినట్లా ? ధర్మముగా జెప్పినట్లా ? ఇది వినదగినమాటా? వినదగని మాటా ? కనుక ప్రతివాదిమతప్రకారము చూచినను వ్యాసునిది నిష్పక్షపాతమే. ప్రతివాదియే కౌరవపక్షపాతి.

ప్రతివాదిమతము నిర్మూల మని నిరూపించియున్నాముగనుక సిద్ధాంతములో- రాజ్యము పాండురాజుది, పాండవులది అయియున్నది. అట్టి రాజ్యములో సగము- రాజ్యానధికారులైన కౌరవులకు ఇవ్వవలసినదిగా జెప్పినట్టి వ్యాసమహర్షికి కౌరవులయం దెంత యభిమాన మున్నదో తెలిసికొనలేక ఆమహర్షిని నిందించిన ప్రతివాదులు శోచనీయులు.

అర్ధరాజ్య మిమ్మనుమాట భీష్ముడు చెప్పనే లేదట! చెప్పినట్లు మాత్రము వ్యాసుడు వ్రాసినాడట! ఓహో ! వీరి దేమి కల్పన ! అట్లయినచో ధృతరాష్ట్రు డంధుడు కానిదే అంధు డని వ్రాసి నన వచ్చును. యుధిష్ఠిరాదులు దుర్యోధనాదులు ఏకోదరులే. దుర్యోధనుడే పెద్ద. అట్టివానిని చిన్నవాడని భిన్నోదరు లని వ్రాసి నన వచ్చును. యుధిష్ఠిరాదులును ధృతరాష్ట్రుని యౌరసులే. పాండురాజ క్షేత్రజు లని వ్రాసె ననవచ్చును. అసలు ధృతరాష్ట్రునకు తమ్ముడే

లేను, ఉన్నాడని వ్రాసె ననవచ్చును. "నిరంకుశత్వాత్తు తుండస్య" అన్నట్లు నోటికి అడ్డేమున్నది? ఈమాట లెట్టినో, భీష్ముడు చెప్పనిదే చెప్పినట్లు వ్రాసె నను మాటయు నట్టిదే.

"బుద్ధి ర్యథావిధా యస్య స తథా మన్యతే జగత్" (తన బుద్ధి యేవిధముగనుండునో ఆవిధముగనే తాను లోకమును తలచుచుండును) అను న్యాయమున దుర్యోధను డనని మాటలను అనినట్లు వ్రాసిన యీప్రతివాది బుద్ధికి భీష్ము డనని మాటలను అనినట్లు వ్యాసుడు వ్రాసినా డనిపించినది.

ఉభయపక్షములయందు సమానదృష్టిగలవాడు, ధర్మాత్ముడు అగు భీష్మునకు రాజ్యము పాండవుల దని తెలిసినవాడుగాని తెలియని వాడు కాడాయె. స్వజనమైన కౌరవులను రాజ్యాధికారు లగు పాండవులే పోషింపవలసినవారని తెలిసినవాడుగాని తెలియనివాడు కాడాయె. అట్టి భీష్ముడు ధృతరాష్ట్రాధార్తరాష్ట్రాదు లనుభవించుటకు అర్ధరాజ్య ముంచుకొని అర్ధరాజ్యము పాండవుల కివ్వవలసిన దని దుర్యోధనునకు చెప్పి మొదట యిప్పించినాడని, దాని నపహరించిన తరువాతగూడ ఇమ్మని చెప్పినాడని వ్యాసమహర్షి చెప్పుచుండ చెప్పలేదు, ఇమ్మన లేదు అనుటకు వీరెవరు?

అర్ధరాజ్య మిమ్మను మాట భీష్ముడు చెప్పలేదనుచున్నారు గదా! ద్రౌపదీవివాహానంతరము చెప్పలేదా? ద్యూతాపహృతమైన రాజ్యమును వనవాసాదులు చేసివచ్చినతరువాత పాండవుల కిమ్మని చెప్పలేదా? మొదట చెప్పుట, ఇప్పించుట జరుగనియెడల దాని నపహరించుటకై ద్యూతమే పుట్టదు. కనుక చెప్పి యిప్పించె నని తీరవలెను.

ఆతరువాత చెప్పలేదనుపక్షములో, మొదట జెప్పినవాడు తరువాత ఎందుకు చెప్పడు వనవాసాదులు చేసి వచ్చినతరువాత వారి రాజ్యము వారు తీసికొనవచ్చు నని ద్యూతకర్త నిర్ణయించియుండ ఆనిర్ణయప్రకార మిమ్మని భీష్ము డేల జెప్పడు? చెప్పకుండుట భీష్ముని

కప్రతిష్ఠ కాదా? అప్రతిష్ఠ కొనితెగట్లునా భీష్ముడు? భీష్ముని అప్రతిష్ఠ పాలు చేయుటకై ప్రతివాది యిట్లల్లెను. కాని వేరొకటి కాదు

భీష్ముడు కౌరవసభలో పాండవులది పాండవుల కిమ్మని చెప్పిన యెడల కౌరవులు చేయకుండుట అసంభవమగుట.

అయితే, చేయకుండుటచే చెప్పలేదనియా? భీష్ముడు చెప్పినట్లును కౌరవులు చేయనట్లును గ్రంథము ఘోషించుచుండ చెప్పలేదనుట అపోహ. కౌరవచేష్టలు భీష్మసమ్మతములనుటే ప్రతివాది తాత్పర్యముకద!

లాక్షాగృహనిర్మాణాదిచేష్టలు భీష్మసమ్మతములేనా? ద్యూతనిమిత్తక రాజ్యాపహరణాదిచేష్టలు భీష్మసమ్మతములేనా? ద్రౌపదీకేశాంబరాకర్షణాది చేష్టలు భీష్మసమ్మతములేనా? దుర్యోధనాదులు చేసిన వన్నియు భీష్మున కసమ్మతములే. వానితో బాటిదే రాజ్యాపహరణము. తాను చెప్పినట్లు చేయని కౌరవులను విడిచి భీష్ముడేల వెళ్ళిపోలేదు అని శంకింతురా? విదురుడు వెళ్ళిపోయెనా? ద్రోణాచార్యుడు వెళ్ళిపోయెనా? కృపాచార్యుడు వెళ్ళిపోయెనా? వీరందరు గూడ గాంధారీధృతరాష్ట్రులను విడిచి వెళ్ళుట ధర్మము గాదని వెళ్ళలేదు. అట్లే భీష్ముడును, యుద్ధమరణమే క్షాత్రధర్మమునుకూడ తలచి భీష్ముడు వెళ్ళిపోలేదు. కనుక వ్యాసమహర్షిచెప్పినదే న్యాయము. ఈ ప్రతివాది వ్రాసినది కేవలమన్యాయము. వ్యాసమహర్షి బోధించినదే ధర్మము. ఈప్రతివాది వ్రాసినది కేవల మధర్మము. వ్యాసమహర్షి మాటలే వినదగినవి. ఈప్రతివాదిమాటలు వినరానివి. వ్యాసమహర్షికి పాండవపక్షపాతము కాదు. ఈప్రతివాదికే కౌరవపక్షపాతము. కాబట్టి చతుర్థాంశము నిరస్తమయినది.

పంచమాంశము— కథలోని పాత్రగా కవి యున్న యెడల స్వపక్షమునకే విజయము వర్ణించి పరపక్షమునకు పరాజయము వర్ణించునట. కథగమనిక మార్చునట, కావ్యమందలి యితివృత్తముజూచి

ధర్మసంస్థయు తనదిగా లిఖించునట. జరిగినది జరిగినట్లుగా గ్రహించి తెలిపెడి కవి ధన్యుడట. కవి తీర్పరిగా నుండవలయునే కాని, వాదియు తీర్పరియు కవియే యైనయెడల ఆగ్రంథమందు సత్యము గానబడదట.

ఈవ్రాత వేదవ్యాసమహాభారతము సత్యము కాదనుటకై పుట్టినది. ఈయనుటలో ప్రతివాది మహాభారతకథలో ఆ మహాభారతకవియైన వ్యాసుడు ఒక పాత్రగా నుండుటే కారణ మనుచుండెను. అట్లున్న వ్యాసుడు కథగమనిక మార్చి స్వపక్షవిజయము, పరపక్ష పరాజయము మొదలగు విషయములు వ్రాసె ననుచుండెను.

ఆహా! మహాభారతకర్త "కో హ్యన్యః పుండరీకాక్షా న్మహాభారతకృ ద్భవేత" అని భగవదవతారమైన మహర్షి. ఆమహర్షియే జగద్గురుపరంపరలో— "నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తిం చ తత్పుత్రపరాశరం చ వ్యాసమ్" అని కీర్తింపబడి, విద్యాసంప్రదాయ ప్రవర్తకుడై, ప్రామాణికమూర్ధన్యుడై, జగద్వంద్యుడై, ఆధికారిక పురుషుడై, తపోనిష్ఠుడై, బ్రహ్మజ్ఞాననిధియై, రజస్తమోరహితుడై లోకానుగ్రహార్థము అష్టాదశమహాపురాణబ్రహ్మసూత్రమహాభారత రూపమైన వాఙ్మయము నొసగెను.

ఆమహాభారతమును ప్రామాణికులైన మహాపురుషులెల్లరు శిరసా వహించుచున్నారు. అట్టి గ్రంథమును సత్యము కాదని, వ్యాసమహర్షి యథార్థవాది గాదని భ్రాంతు లేదో అనినంతమాత్రమున మహర్షి కేమి లోపము? గ్రంథమున కేమి లోపము ?

రజస్తమోగ్రస్తులు రజస్తమోరహితుడగు మహర్షిని నిరసించి చెప్పు మాటలను ప్రమాణముగా దీసికొను అస్తికు డెవ్వడు ?

వ్యాసమహర్షికి పాండవవర్గము స్వపక్ష మని, కౌరవపక్షము పరపక్షమని ప్రతివాదు లెట్లనగలరు? ధృతరాష్ట్రునితో వ్యాసమహర్షి—

"పాండోః స్వసా యాదృశా మే తాదృశా స్త్వవ భారత !
దీనా ఇతిశ మే బుద్ధి రభిపన్నా ౽ద్య తాన్ ప్రతి ॥"

నాకు పాండుపుత్రు లెట్టివారో నీపుత్రులును నట్టివారే. కాని పాండవులు దీనులై యున్నారని నా కిప్పుడు వారియెడల జాలి కలుగు చున్నది. అని చెప్పియుండెను.

పాండవులు పడిన పాట్లకు మనసు కరుగని కఠినచిత్తులకు వ్యాస భగవానుని దీనదయాపరత్వము, ఆపద్బాంధవత్వము, సర్వసమవృత్తిమత్వము, ఆగతానాగతవేదిత్వము, అసంగత్వము, సర్వసమత్వము తెలిసికొనుటకు అర్హత యెట్లుండును ? వ్యాసమహర్షి స్వరూపస్వభావములు తెలియనివానికి ఆమహాభారతతాత్పర్య మెట్లు తెలియును?

వ్యాసమహర్షి తపోనిష్ఠుడు, యోగనిష్ఠుడు, బ్రహ్మనిష్ఠుడు అయి యున్న అసంసారియే గాని, సంసారి కాడు. సంసారికే స్వపక్షపరపక్ష కల్పన. అసంసారి సర్వసముడు. కనుక ప్రతివాది స్వపక్ష (పాండవ) విజయము, పరపక్ష (కౌరవ) పరాజయము వ్యాసుడు పక్షపాతముతో వ్రాసె ననుట హేయము.

ప్రత్యక్షదర్శియైన ఆనాటి మహర్షి సుయోధనపరాజయము జరిగినట్లు చెప్పుచుండ, కాదు సుయోధనవిజయమే జరిగిన దని యీనాటి ప్రతివాది యనుట హాస్యాస్పదము.

ఇంకొకటి— భారతకథ కల్పిత మందురా? జరిగిన దందురా? కల్పిత మనుపక్షములో కథలోని పాత్రలు గూడ కల్పితము లగును గనుక నట్టి పాత్రలతో గ్రంథకర్తకు స్వపక్షపరపక్షోపాదనము అత్యంతాసంగతము.

జరిగినదే అనుపక్షములో ఎట్లు జరిగినది ? మహాభారతములో నున్నట్లు జరిగినదా ? లేనట్లు జరిగినదా ? ఉన్నట్లే జరిగినయెడల జరిగినది జరిగినట్లు చెప్పిన వ్యాసునకు పక్షపాత మెట్లంటింతురు ?

లేనట్లు జరిగినదనుపక్షములో అజరిగిన క్రమమును తెలుపు ప్రమాణ మేది? మహాభారతకథను గ్రహించుటకు దిక్కు ఎవ్వనికైన

మహాభారతముకంటె మరియొకటి కలదా ? కనుక ప్రతివాది వ్రాత హేయము.

కవియైన వ్యాసుడు కథలో నొకపాత్రగా నుండుటచే నాతని గ్రంథ మసత్య మనునది కుకల్పన. గ్రంథమందలి ప్రామాణ్యము ఆ కవియందు గల ప్రామాణ్యమునుబట్టి యుండును. కవియందు ప్రామాణ్యము ప్రమాణగ్రంథము లయిన శ్రుతిస్మృతి పురాణేతిహాసముల ననుసరించుటను బట్టి యుండును. ప్రమాణగ్రంథముల ననుసరింపని కవి అప్రామాణికుడు; అతని కావ్యము అప్రమాణము; అసత్యము.

శ్రుతిస్మృత్యాద్యనుసారియైన వేదవ్యాసమహర్షి ప్రామాణికుడు. ప్రమాణములను త్రోసివేసి, ప్రామాణికులను ధిక్కరించిన కవి అప్రామాణికుడు. వేదవ్యాసప్రోక్త మహాభారతేతిహాసము ప్రమాణము. కవికల్పితసుయోధనవిజయము అప్రమాణము. ఇట్లు అత్యంతా సంగతమైన పంచమాంశము పరాస్తము.

షష్ఠాంశము— సత్యరతిని బాయుటచే వ్యాసుండు పాపశాంతికి భాగవతము వ్రాయ దొడగెనట. వ్యాసుండు పాండవపక్షంబు వాడను నర్థంబు జగతి శిలాక్షరం బట.

ఆహా ! భారతమును పక్షపాతముతో వ్రాసి దానిమూలమున పాపము సంపాదించి దానిని భాగవతరచనచే పోగొట్టుకొనినాడు వ్యాసు డనికదా వీరనుచున్నారు. భారతములో రాజ్యము పాండవులదని వ్రాసి భాగవతములో కౌరవులదని వ్రాసెనా ? భారతములో పాండవులు పూజ్యులని వ్రాసి భాగవతములో నింద్యులని వ్రాసెనా ? భారతములో దుర్యోధనుడు దుష్టుడని వ్రాసి భాగవతములో శిష్టుడని వ్రాసెనా ? భాగవతము జూడుడు—

"యదా తు రాజా స్వసుతా న సాధూన్ పుష్ణ న్నధర్మేణ వినష్ట దృష్టిః ।
భ్రాతు ర్యవిష్ఠస్య సుతా న్విబన్ధూన్ ప్రవేశ్య లాక్షాభవనే దదాహ ॥
యదా సభాయాం కురుదేవదేవ్యాః కేశాభిమర్శం సుతకర్మగర్హ్యమ్ ।
న వారయామాస నృప స్స్నుషాయాః స్వాస్రై ర్హరన్త్యాః కుచకుంకుమాని ॥

ద్యూతే త్వధర్మేణ జితస్య సాధోః సత్యావలంబస్య వనాగతస్య ।
న యాచతోఽదాత్సమయేన దాయం తమో జుషాణో యదజాతశత్రోః ।
యదా చ పార్థప్రహిత స్సభాయాం జగద్గురుర్యాని జగాద కృష్ణః ।
న తాని పుంసా మమృతాయనాని రాజోరు మేనే క్షతపుణ్యలేశః ॥
అజాతశత్రోః ప్రతియచ్ఛ దాయం తితిక్షతో దుర్విషహం తవాగః ।
విహ న్మహాగ్నేః పురుషాదదర్శనా దసత్సభాయా వనవాసకృచ్ఛ్రైః ॥
మృధే మృధేఽనేకమహారథాస్త్రతో ద్రౌణ్యస్త్రత శ్చాస్మి హరేఽ[illegible] తా ।
సుయోధన నిసృష్టోధర్మాత్మా పాయాఽమర్షణో మునిః ॥
పత్రైశ్చాఽతృప్యత సహ త్రిలోకై శ్చరంతాం వనే ।
సాధయిత్వాఽజాతశత్రోః స్వం రాజ్యం కితవై ర్హృతమ్ ॥
అజీహన ద్రాజ్ఞ సేన్యాః కచస్పర్శక్షతాయుషః ।"

ఈగ్రంథము భారతములోని దుర్యోధనదుష్కృత్యము లన్నిటిని వెల్లడించుచున్నది. కడపటిశ్లోకము యుధిష్ఠిరుని స్వరాజ్యము శ్రీకృష్ణ పరమాత్మచే సాధింపబడినదని తెలుపుచున్నది. కనుక భాగవతములో గూడ భారతములో నున్నట్లే చెప్పిన వ్యాసమహర్షి సత్యవచనుడు, యథార్థవాది యని ప్రతివాదులకు తెలుపుచున్నాము. పతితపావను డైన మహర్షికి పాపమాపాదించి తూలనాడుటలో మహర్షికి నష్టమేమియు రాలేదు కాని, తమకు శ్రేయస్కరముమాత్రము కాక పోయినదని తెలుపుచున్నాము. "వ్యాసుడు నిష్పక్షపాతి పూజ్యుం డను సర్థంబు జగతి శిలాక్షరంబు" కనుక షష్ఠాంశము నిరస్తము.

సప్తమాంశము—భారతము జనమేజయుని రాజ్యకాలమున లిఖింపబడినదట! అందుచే కవి జనమేజయుని వంశీయులనే కొండంతగా వర్ణించెనట! సుయోధనుని మహోన్నతగుణములను, ధర్మము లను మరుగుపెట్టెనట! ఔరా! సుయోధనపక్షపాతము ప్రతివాదుల నెట్టిమాటలాడించుచున్నదో! వారి కంత బాధగా నున్నది కాబోలు. ఇక్కడ గొన్నిమాటలు చెప్పుచున్నాము—భారతము లిఖింపబడుట జనమేజయుని కాలములో గాదు; ద్వాపరయుగాంతమందు; కల్యాదిని పరీక్షిత్తు; అతని యనంతరమువాడు జనమేజయుడు; అతనికి మహాభారతము వినిపించినవాడు వైశంపాయనుడు; ఈ వైశంపాయనుడు

వ్యాసమహర్షి శిష్యులగు సుమంతు జైమిన్యాదులలో నొకడు. వీరంద రకు చతుర్వేదములతో గలిపి మహర్షి మహాభారతము పాఠము జెప్పెను. కనుక వీరు పఠించుటకుబూర్వమే భారతము లిఖింపబడినది.

భాగవతమునకు బూర్వమే మహాభారతము వ్రాయబడి దని యీ ప్రతివాదులే వ్రాసియున్నారుకదా! మహాభారతానంతర కాలిక మైన భాగవతమునే ద్వాపరాంతమందు వ్యాసమహర్షి యొద్ద తానధ్య యనముచేసినట్లు శుకయోగి చెప్పినవిషయము భాగవతమందున్నది.

ఈ పద్ధతిని భాగవతరచన, భాగవతాధ్యాపనము, భారతరచన, భారతాధ్యాపనము ద్వాపరయుగాంతమందే జరిగినందున జనమే జయుని సంతోషపెట్టదలచి పాండవులను కొంచెంతగా వర్ణించి సుయోధనుని మహోన్నతగుణములను మరుగుపరచినట్లు ప్రతి వాదులు వ్రాయుట హేయము. భారతరచనకాలము, శంకాసమాధానములు, అర్షగ్రంథశైలి ఇత్యాదివిషయములు ప్రథమ భాగము— అనేకకర్తృత్వనిరాకరణములో విశదీకరింపబడినవి. అచ్చటచూడవలయును. ఆర్షగ్రంథమర్యాద యెరుగక వ్యాసమహర్షి అంతరము తెలియక తమచిత్తవృత్తులవంటివే వ్యాసమహర్షి చిత్తవృత్తు లని యెంచి తోచినట్లు మాటలాడుట ప్రాజ్ఞులకు లక్షణముగాదు. అసం గతమైన యీ సప్తమాంశము నిరస్తము.

— ♦ పంచమ ప్రతివాది ప్రసంగము—తన్నిరాకరణము ♦ —

కురుక్షేత్ర సంగ్రామము—6

ఉపప్లావ్యనగరమందున్న పాండవులయొద్దకు వచ్చిన సంజయుని మాటలు—

"మీ రాజ్యభాగమును గుఱించి సుయోధను డాడు మన్న తెలుంగు సావ ధానులరై వినుడు—

1 చ. పనిపడి ధర్మశాస్త్రములు స్పష్టముగా జదియింపుచుండ దో

చినకొలదిం బ్రసంగములు జేయుటమూడదు గాన శైశిమా

లిన తమిమాని పెద్దలు బలే యనునట్లుగ ధర్మసూక్ష్మముల్
మనమున బాజుజూచి చెపుమా సగపా లెటు మీకు వచ్చునో.

ఉ. మీరు వచించుమాట నిజమే యగుచో ధృతరాష్ట్రపాండుపృ
థ్వీరమణేంద్రులం దెవరు పెద్దలో వారలె భూమిభర్తలు
వ్వారి యనంతరమ్ము మఱి వారికుమారులె దానికర్తలే
దారిని బాజుజూచినను దక్కునె మీకు ధరాధిపత్యమున్.

గీ. పుట్టు గ్రుడ్డు సామ్రాజ్యంబు బొందరామి
శాస్త్రసమ్మతమె సరె! యాజన్మపాండు
రోగి కెట్లధికారంబు రూఢమగునొ
మీరె యోజించి చెప్పుడీ ధీరులార.

ఉ కన్నుల గట్టినట్లు పొడకట్టుచునుండిన దాని నెవ్వరే
పన్నికపన్ని యెట్లు చెరుపం దమకించెద రున్నవాక్కు ఛా
మ్మన్నను బోదు లేని దణుబైనను రమ్మనినంత రాదు మా
కున్నది యన్నమాత్రి లెటు లొప్పెడు శాస్త్రము వింత ధర్మజా.

పట్టమహిషి గర్భమందు కల్గినకతమున నాంబికేయు డవని కధిపుడయ్యె. మీ జనకుండైన పాండుమహీజానికే దూరస్థం బగుటంజేసి తత్తేత్రిజా లగు మీ కయ్యది పాప్తమెట్లగు? ప్రతినిధియై సన్నుతికెక్కె గాని భూపతి యయి పాండుమహీంద్రుడు రాజ్యమేలెనే.

2 ధర్మపుత్రా! కరుణార్ద్రహృదయాంచితుడగు నాంబికేయుడు తన తమ్ముని యందు గల యనురాగమును లోకమునకు సూచించు నిమిత్తమున నర్ధరాజ్య ప్రదానకాలమం దూరకుండిరి. ఇది సుయోధనాదుల కిష్టముకాకుండుట జగద్వి దితంబె. లేకున్న ద్యూతం బేల పొసగును? త్రయోదశాబ్దములు రాజ్య పద భ్రష్టత్వం బేల కలుగును?

3 మ. పదుమూడేడులు భుక్తమైన పిదపం బాలెట్లు పోకుండునో
యది మున్నెంచిరొ కాదె జూదమున నా రాసంబెముం బెట్టి సం
పద సర్వంబును గొల్లగొట్టి రది మీవారెల్ల రూహింపకే
తుది రాజ్యమ్ము సగమ్ము నిట్లడుగ గా దోతెంచునే ధర్మజా!
ఇట్లని నాతో జెప్పి:—(దుర్యోధనరాజుగారు)

4 చ. ఒకనికి దండ్రి ధర్ముడు మఱొక్కనికిం బిత గాలివేల్పు వే
ఱొకనికి నయ్య వజ్రధరు డొండొక జోడున కబ్బలాసుర
ప్రకరభిషక్కు లంచెఱిగి పాలెటు లిచ్చెద బట్టమంచు భో
రిక నడుముల్ బిగించిన సతే చెయిసాపుచు కేడిసన్ సఖే."

ఈ గ్రంథము త్రిపురనేని రామస్వామి శతావధాని, బారిష్టర్ గారిది. ఇది నాటకముగా కూర్చబడినది. కురురాజ్యాధిపత్యము కౌరవులదే యనుచున్న వీరి వ్రాతలోని నాలుగంశములు పరిశీలింపబడుచున్నవి —

ప్రథమాంశము— ధృతరాష్ట్రుడు జ్యేష్ఠుడు, జ్యేష్ఠభార్యాసంభూతుడు అగుటచే అంధుడైనను నాతడే రాజయ్యెనట! పాండురాజు కనిష్ఠుడు, కనిష్ఠభార్యాసంభూతుడు, పాండురోగి యగుటచే రాజు కాలేదట! ప్రతినిధియై మాత్ర ముండెనట! ఇదంతయు వెనుకటి ప్రతివాదులు పాడిన పాటయే. దీనికి సమాధానములు చెప్పియే యున్నాను.

రాజ్యాభిషిక్తు డెవ్వరయినదియు తెలిసికొనుటకు దిక్కు ఒక్క మహాభారతమే. దాని పూర్వోత్తరము లాలోచింపక యావద్గ్రంథ విరుద్ధమైన అపచారము నందుకొని దానిపై యూహాగానము లారంభించుట ప్రాజ్ఞలక్షణము గాదు.

వీరు మొదటిపద్దెములో— ధర్మశాస్త్రములు స్పష్టముగా వచింపుచుండ దోచినట్లు ప్రసంగములు చేయరాదన్నారు. ధర్మసూక్ష్మము లాలోచింపవలె నన్నారు. ఆ ధర్మశాస్త్రములే పాండురాజే అభిషిక్తు డని స్పష్టముగా చెప్పుచుండ, జ్యేష్ఠు డనర్హుడైనపుడు కనిష్ఠు డభిషిక్తుడగుట ధర్మసూక్ష్మమైయుండ వీరు తోచినట్లు ప్రసంగించుట స్వవచనవ్యాఘాతము.

వీరు నాలుగవపద్దెములో జెప్పినట్లు— ఉన్నహక్కు పొమ్మన్నను పోదు. లేనిది రమ్మన్నను రాదుకదా! దుర్యోధనునిదే హక్కు, పాండవులది కాదని మీరన్నంతమాత్రమున శాస్త్రము లెటులొప్పునని వీరనే అడుగుచున్నారము. వీరన్నట్లు కన్నులగట్టినట్లు పొడకట్టుచున్నది యేది? పాండవులహక్కు. అది సంస్కృతాంధ్రభారతములలో కన్నుల

గట్టినట్లున్నది. దానిని చెరుపుట యెవ్వరికి శక్యము? అని మే మడుగుచున్నాము. పాండుమహీంద్రుని రాజ్యమేలెరా? ఆతనికే న్యాయార్హమైన రాజ్యము పాండురాజక్షేత్రజులకు ఎట్లు ప్రాప్తించును? అనుచున్నారు.

పాండురాజు రాజ్యమేలకుండుటచే నిజమై క్షేత్రజులకు రాజ్యప్రాప్తి లేకుండుటచే నిజమైనయెడల ద్వితీయాంశములో మీరు చెప్పినట్లు పాండవుల కర్ధరాజ్య మేల యివ్వబడినది? క్షేత్రజుడగు ధృతరాష్ట్రునకు మొదట రాజ్యప్రాప్తి యెట్లయినది? అని మే మడుగుచున్నాము. పాండవుల రాజ్యాధికారము వారి కర్ధరాజ్య మిచ్చుటచేతనే ధ్రువపడినదికనుక ప్రథమాంశము నిరస్తము.

ద్వితీయాంశము — తమ్మునియందలి అనురాగమునుబట్టి కరుణార్ద్రహృదయుడుగనుక దుర్యోధనాదులకు ఇష్టము లేకున్నను పాండవుల కర్ధరాజ్యమును ధృతరాష్ట్రు డిచ్చెనట!

అర్ధరాజ్యమిచ్చుటకు కరుణార్ద్రహృదయు డని హేతువును కల్పించినారు. మొట్టమొదట యౌవరాజ్య మిచ్చుటకును ఇదియే హేతువందురా? యౌవరాజ్యపదవి హక్కునుబట్టి వచ్చునా? కరుణార్ద్రహృదయమునుబట్టి వచ్చునా? ఆ యౌవరాజ్యపదవి నధిష్ఠింపజేసిన హక్కే ఈ యర్ధరాజ్యప్రదానమునకును హేతువనక తప్పదు.

యువరాజు యుధిష్ఠిరు డగుటనుబట్టి యాతని హక్కు కన్నులగట్టినట్లు కనబడుచునే యున్నది. ప్రతివాది మతప్రకారము రాజ్యము ధృతరాష్ట్రునిది. అనంతిరపుహక్కు దుర్యోధనునిది. యువరాజుగా యుధిష్ఠిరు డెట్లుచేయబడెనో? ఆ యౌవరాజ్యమునకు మూలమైయున్న హక్కే అర్ధరాజ్య ప్రదానమునకును మూలమైనది.

ఇంకొకటి — ధృతరాష్ట్రుడు కరుణార్ద్రహృదయుడు-దుర్యోధనునియందా? పాండవులయందా? ఉభయులయందునా? దుర్యోధనునియం దయినపుడు యౌవరాజ్యము, అర్ధరాజ్యము పాండవుల

కిచ్చుట అసంభవము. పాండవులయం దయినపుడు ద్యూతనిమిత్తమున దత్తాపహారము అసంభవము. ఉభయులయం దయినపుడు వనవాసానంతరము వారి యర్ధరాజ్యము వారి కివ్వకుండుట అసంభవము. కనుక పాండవులకు యౌవరాజ్యము, అర్ధరాజ్యము వారి హక్కును బట్టి వచ్చినవే. దత్తాపహారము దుర్యోధనప్రీతినిబట్టి సంభవించినది. కాబట్టి ద్వితీయాంశము నిరస్తము.

తృతీయాంశము—పదుమూడేండ్లపాటు కౌరవులకు భుక్తమై పోయినట్టి పాండవరాజ్యముపై పాండవులకు కాలదోషమునుబట్టి హక్కు పోయినందున మాది మాకిమ్మని వారడుగుటే తప్పట !

ఇది వీరి యభూతకల్పన. వీరు ప్రథమాంశములో చెప్పినట్లు ధర్మశాస్త్రములు చెప్పుచున్నదానికి విరుద్ధముగా తోచినట్లు ప్రసంగము చేయుట తప్పైకనుక ధర్మశాస్త్రనిర్ణయమునే తెలుపుచున్నాము—

"తన భూమి నిర్వివాదముగా 20 సంవత్సరములు అన్యునిచే అనుభవింపబడిన తరువాతకూడ న్యాయముగా తనకు ప్రాప్తించును. తాను నిరాక్షేపణముగా చూచుచు నూరకుండిన తన దోషముచే గతఫలము మాత్రము ప్రాప్తింపదు. తన పరోక్షములో అనుభవింపబడినపుడుగాని, ప్రత్యక్షములో వివాదపూర్వకముగా అనుభవింపబడినపుడుగాని 20 సంవత్సరములపైనకూడ గతఫలము ప్రాప్తించును. 20 సంవత్సరములోపల ప్రత్యక్షములో నిర్వివాదముగా అనుభవింపబడినను గతఫలము కూడ ప్రాప్తించును." (యాజ్ఞ॥స్మృతి మితాక్షరా)

ఈవిషయము చతుర్థభాగము—పాండవనిందానిరాకరణములో ప్రతిపాదింపబడినది. విశేషము లచ్చట జూడనలయును.

ఈ ధర్మశాస్త్రనిర్ణయమునుబట్టి కాలదోషము పట్టలేదు. పాండవరాజ్యముపై పాండవుల కున్న హక్కు పోలేదు. భుక్తమును బట్టి కౌరవులకు హక్కు కలుగలేదు. కనుక తృతీయాంశము నిరస్తము.

చతుర్థాంశము—పాండురాజునకు గాక యెవ్వరెవ్వరో ధర్మదేవ, వాయుదేవ, దేవేంద్ర, అశ్వినీదేవులకు జన్మించిన పాండవులకు రాజ్యమెటు లిచ్చుట ! అట ! దండెత్తినను సరే, దేహీ అని చేయి చాపినను సరే యివ్వకూడదట !

ఓహో! ఇది యెప్పటిమాట!. వనవాసాజ్ఞాతవాసములు పూర్తియైనతరువాత మాది మాకిమ్మని పాండవులు అడిగినపుడు దుర్యోధనుడు నేనివ్వ ననుటకై చెప్పినమాట. అయితే పాండుపుత్రులు గానివారికి మొదట యౌవరాజ్యార్ధరాజ్యము లేల యివ్వబడినవో? ఇది యెంతమాత్రము అతుకని మాట.

"ఏమును బాండునందనులు నేకకులంబున బుట్టి యొక్కచో
నేకుంకడైన జేసి గెడ కెప్డు చరించినయట్టి వారము
ద్దామబలంబు శౌర్యమును దర్పము వారికి కల్గి వార సం
గ్రామమునం జయింతు రనగా నొక నిశ్చయ మెట్లు గల్గెడున్." (ఆంధ్రభా)

అని దుర్యోధనుడు తామును పాండునందనులును ఏకవంశము లోని వారము. "ఉభౌ స్వ ఏకజాతీయౌ" ఏకజాతివారము అని తండ్రితో జెప్పియుండ పాండవులు ఈవంశమునకు సంబంధింపనివారన్నట్లు దుర్యోధనముఖమున జెప్పించుట ప్రతివాదులకు దగదు. కనుక చతుర్థాంశము నిరస్తము.

— ♦ మత్ప్రతివాదిప్రసంగము—తన్నిరాకరణము ♦ —

భగవద్గీతానాటకము—7

కౌరవస్కంధావారములో సుయోధనునితో ప్రసంగింప వచ్చిన వ్యాసునితో రాజ్యవిషయమై సుయోధను డాడిన మాటలు—

1. "కురురాజ్య మవిభాజ్య మని యెరుగుదురా? అగ్రజుడే రాజ్యాధినేత యని తెలియునా? కనిష్ఠులకు రాజ్యార్హతయా? ఎన్నడును లేని న్యాయ మీనాడు వచ్చినదేమి? కౌరవపాండవులకొరకు భరతసామ్రాజ్యమును ఖండఖండములుగ చీల్చివేయుటయే మీ అభిమతమా?

ఏమి? ధృతరాష్ట్రునకు ప్రతినిధిగ రాజ్యమేలినంతమాత్రమున అన్నకొరకు యుద్ధముల పాల్గొనినంతమాత్రమున అర్ధరాజ్యాధిపత్యమా? ఇదేటి న్యాయము?

2. అయిదు గ్రామముల నిచ్చిన సంతుష్టుల మగుదు మని సామమున గోరినపుడు నీ వంగీకరించినంతలో సామ్రాజ్యము విచ్ఛిన్న మగునా? అనుచున్నారా? మానీంద్రా? ఇదియే కృష్ణయుధిష్ఠిరుల రాజకీయతంత్రము.

ఆ అయిదు గ్రామముల నాటకము తమకు తెలియునా? కుశస్థలి, మాకంది, వారణావతము, హస్తినాపురము, ఇంద్రప్రస్థము; ఇవిగదా పాండవు లాశించిన గ్రామములు. వీని చరిత్రముల నాలింపుడు—కుశస్థలి యాదవుల నోడించి కర్ణుడు స్వాధీనము గావించుకొన్నది; మాకంది మేము ద్రుపదుని జయించి ద్రోణాచార్యులకు గురుదక్షిణగా సమర్పించిన అహిచ్ఛత్రమండలమునకు రాజధాని; వారణావతమున్న నో ఒకప్పుడు పాంచాలుర నురుమాడి విజయస్మారకముగ భీష్ముడు క్రైవశము గావించుకొన్నది; హస్తినాపురము కౌరవసామ్రాజ్యమునకే గుండెకాయగదా! ఇక ఇంద్రప్రస్థము పాండవులదే కావచ్చును. అదియు నేను ద్యూతమున గెల్చుకొన్నదే! ఇప్పుడు తామే సెలవీయుడు. పాండవులు కోరినవి గ్రామములా? సంగ్రామములా?

3. లాక్షాగృహమున తమ్ము దహింపజూచితి మనియు, కపటద్యూతము కల్పించి రాజ్యాపహారణము గావించితి మనియు, పాంచాలిని సభలో పరాభవించితి మనియు, మాపై అవినీతికరములగు పెక్కు నపవాదములు ప్రచారించి మా జీవితముల కళంకము గావించు పాండవులతో మాకెట్లు పొత్తు కలియును?

4. మహాత్మా! నా నిశ్చయము వ్యక్తీకరింతును—ధర్మరాజాదులు పాండవులే కారు; భారతీయులును కారు; విలాయితులు, త్రివిష్టపులు. వారికి కురువంశమున గాదు, భారతవర్షమునం దెచ్చటను స్థానము లేదు. వారివలెనే సంకీర్ణులగు యాదవపాంచాలాదులను గూర్చుకొని నాసార్వభౌమత్వమును భగ్నముచేయుటకు చూచుచున్నారు.

5. నా పినతండ్రి కొడుకులే నాకిరీటమును నేలపాలు గావింపవలె నని యుద్యమించుటయా?

ఈగ్రంథము చంద్రపట్ల రామరావుగారిది. వీరు మహాభారత కర్తయగు మహర్షినే మృదువుగా సుయోధనుడు ఎదిరించినట్లు కవిత్వ మల్లినారు. వీరి వ్రాతలోని అయిదంశములను పరిశీలించుచున్నాము—

ప్రథమాంశము—ఇది వెనుకటి ప్రతివాదులు పాడినపాటయే. దీని నిరాకరణము వెనుక చేయబడినది.

అర్ధరాజ్యాధిపత్యమా? ఇదేటి న్యాయము? అనుచున్నారే! వనవాసాజ్ఞాతవాసములు పూర్తిచేసి వచ్చిన పాండవులకు—అర్ధరాజ్యాధిపత్యమా? అని యుద్ధసమయములో సుయోధను డనినట్లు వ్రాసిన యీప్రతివాదులు ద్యూతమునకు బూర్వము పాండవులకు

అర్ధరాజ్యాధిపత్య మున్న దందురా? లేదందురా? ఉన్నయెడల అది యిప్పు డెట్లు పోవును? ఓడిపోవుటచేత నందురా? ఆమాట చెప్పలేదేమి? ఓడిపోవుటకూడ 13 సంవత్సరములుమాత్రము వారి రాజ్యము వారి స్వాధీనములో లేకుండుటే కదా. ఆతరువాత ఆరాజ్యము పాండవులదే కదా. ఇట్టి స్థితిలో 'వారికి అర్ధరాజ్యాధిపత్యమా? ఇదేటిన్యాయము?' అనుట ఏమి బాగున్నది? ద్యూతమునకు బూర్వముకూడ వారికి అర్ధరాజ్యాధిపత్యము లేదందురా? నిర్ధనులైన పాండవులతో తన కేమి లబ్ధియుండు నని దుర్యోధనుడు ద్యూతము నడిపినాడు? కనుక నిది యసంగతిప్రసంగము. ఈప్రతివాదుల నొకటి యడుగవలసి యున్నది— మీసుయోధనుడు—

"పైతృకం బగు లక్ష్మి పాండుభూపతి మున్ను దాల్చుట జేసి తత్తనయుడైన ధర్మజు డిప్పుడు దాల్చిన......పాండువంశేషు: వసుమతీ రాజ్యార్హు లగుదురు......ఒరుల గొలిచి కుడువ నోపమేము...... ఈరాజ్యంబు మొదలింటంగోలె భవదీయం బయినం...క్రమాగతం బయి మాకు నప్రయత్నలభ్యం బగు. తొల్లి పాండురాజు రాజయి..."

అని ధృతరాష్ట్రునితో నీవు రాజు కాకపోవుటచే రాజ్యము మాకు క్రమాగతము కాకపోయినది. పాండవులకే క్రమాగతమైపోయినది. అని దుఃఖించిన సుయోధనుడేనా? మరియొక సుయోధనుడా? మీసుయోధనుడు—

"ధృతరాష్ట్రుండు యుధిష్ఠిరు రాజ్యభారధురంధరుంగా నెఱింగి భీష్మవిదురులతో విచారించి యౌవరాజ్యాభిషిక్తుం జేసిన."

అని యువరాజుగా యుధిష్ఠిరుని జేసినట్టి ధృతరాష్ట్రుని పుత్రుడైన సుయోధనుడేనా? మరియొక సుయోధనుడా?

ఆసుయోధనుడే అయినయెడల ఆతని ఆమాటలనే యుదాహరింపరేమి? సుయోధను డాతడును, మాటలు మీవియునా? ఇదేటి న్యాయము? ఇక మీసుయోధనుడు మరియొక డయినయెడల, మీ

సుయోధనుడు సంభాషించిన ఆవ్యాసుడును మరియొకడే కావల యును. మీసుయోధనని గనిన ధృతరాష్ట్రుడును మరియొకడే కావల యును. నేయేల! ఆనాటి సుయోధనునితో సంబంధము కలిగియున్న ఆవేదవ్యాసమహాభారతపాత్రలతో ఈనాటి మీసుయోధనునకు ఏమియు సంబంధము లేదు. కనుక మీసుయోధనాదిపాత్రలతో గూడిన మీనాటకమే వేరు. కాబట్టి దీనికి భగవద్గీత అని మీరు పేరుపెట్టుకొనుటే అసంగతము. ఆమహాభారతకారుడైన వ్యాసునితో ఆనాటి సుయోధను డిట్లు సంభాషింపలేదు. ఈనాటి మీసుయోధను నకు ఆవ్యాసునితో సంభాషించు యోగము లేదు. కనుక నిది యసంగతప్రసంగము. ఇట్లు ప్రథమాంశము నిరస్తమైనది.

—♦ పంచగ్రామసంధినిగూర్చి విపరీతోక్తులు ♦—

ద్వితీయాంశము — అయిదుగ్రామముల నాటకమట, 1 కుశ స్థలి, 2 మాకంది, 3 వారణావతము, 4 హాస్తినాపురము, 5 ఇంద్ర ప్రస్థము అట! యాదవులను జయించి కర్ణుడు సంపాదించుకొనినది కుశస్థలి యట! ద్రుపదుని జయించి సుయోధనాదులు గురుదక్షిణగా సమర్పించుటచే మాకంది యను రాజధాని ద్రోణాచార్యునిదట! పాంచాలురను జయించి స్వయముగా సంపాదించుకొనిన వారణావ తము భీష్మునిదట! హాస్తినాపురము సుయోధనుని రాజధానియట! ఇక ఇంద్రప్రస్థము పాండవులదే కావచ్చునట! కాని ద్యూతములో సుయోధనుడు గెల్చుకొన్న దట! ఇచ్చట పాండవులు పంచగ్రామ ములను కోరినవారని యొకమూల జెప్పుచు నందులోనివి రెండు రాజ ధానులని యీనాటకకర్త వర్ణించుట విరుద్ధము. గ్రామమును రాజ ధాని యందురా? రాజధానిని గ్రామమందురా?

ఇంకొకటి— తమకల్పనకు ఆధార మేమియు లేకుండ కుశస్థలి కర్ణుని దని, వారడిగిన మాకంది ద్రోణుని దని, వారణావతము భీష్ముని

దని, చెప్పుట తప్పు. ద్రుపదుని కోడి పారిపోయిన దుర్యోధనాదులు, ద్రుపదుని జయించి గురుదక్షిణగా దాని నిచ్చినా రనుట రెండవతప్పు.

ఆంధ్రభారతము జూడుడు— "పాంచాలుర బాణవృష్టికి నిలుపోపక కురుకుమారులు కెలుచ తిచి పాండవుల యొద్దకుం బఱతెంచినం జూచి యర్జునుండు ఆచార్యధర్మజులకు నమస్కరించి... భీమసేనుండు దనకు సేనాగ్రచరుండు గా... ద్రుపదరాజవాహినీసముద్రంబు దఱియం జొచ్చి..." "ప్రతీక్షణదర్పు ద్రుపదు రథాక్షముతో గట్టి తెచ్చి యర్జునుడు క్రియా, దక్షుండయి గురునకు గురుదక్షిణగా నిచ్చి చేసె తత్సమ్మదమున్".

ఇట్లు ద్రుపదుని జయించినవారును, గురుదక్షిణగా నిచ్చిన వారును పాండవులే అయియుండ ఆగురువు సొత్తునే గురుభక్తిగల పాండవులు తమ కిమ్మనుచు సుయోధనుని అడిగినా రని చెప్పుట మూడవ తప్పు.

సంధి చేసికొనవలసినవాడు సుయోధనుడై యుండ సుయోధనునిదిగా నున్న సొత్తులోనుండియే ఈమాత్రమైన నిమ్మని యడుగు వారు పాండవులై యుండ, ఆసుయోధనుని సొత్తు గాకుండ ఎక్కడనో కర్ణునిసొత్తు ద్రోణునిసొత్తు భీష్మునిసొత్తు మాకిమ్మని అసంబద్ధముగా సుయోధనునికోరినట్లు వ్రాయుట నాలుగవ తప్పు.

వెనుక తృతీయప్రతివాదిప్రసంగనిరాకరణసందర్భములో చెప్ప బడినట్లు— "పిత్ర్యం పరరాజ్యాద్విశిష్టమ్" అని నిరూఢి గలిగియున్న పాండవులు పరుల సొత్తును కోరినారనుట అసంగతముకాదా?

ధృతరాష్ట్రధార్తరాష్ట్రాదుల పోషణార్థము హస్తినాపురమునకు సంబంధించియున్న అర్ధరాజ్యమును విడిచిపెట్టియున్న పాండవులు ఆ హస్తినాపురము నిమ్మని కోరినారని చెప్పుట అయిదవ తప్పు.

ఇంద్రప్రస్థము పాండవులదే అనుచు దానిని సుయోధనుడు ద్యూతములో గెల్చుకొనినా డనుట ఆరవతప్పు.

ప్రథమద్యూతములో గెల్చుకొనినను మరల ధృతరాష్ట్రుడు వారిది వారికిచ్చివేసి పంపినపుడు సుయోధనుడు మొరపెట్టి తండ్రిచే మరల బిలిపించి పునర్ద్యూత మారంభించుటలో—

క. ధనసంపద రాజ్యంబున దినకర తేజుఁడు మిమ్ము ధృతరాష్ట్రుడు పెం
పున బూజించెం గావున జనదిఁకను దాని నొడ్డి సరి గ్రీడింపన్ (అం. భా)॥

అనుచు వారిసొత్తును పణముగా బెట్టింపక, వనవాసాజ్ఞాతవాస పణమును నిర్ణయించి నడిపిన ద్యూతములో పాండవుల ఇంద్రప్రస్థ మును సుయోధను డెట్లు గెలుచుకొనెను ?

మా ఇంద్రప్రస్థరాజ్యము మాకిమ్ము. లేదా పంచగ్రామము లిమ్ము. అని కోరిన గ్రామములలో ఇంద్రప్రస్థమును మార్చుట, ఆపై రాజధానియైన యింద్రప్రస్థమును మార్చుట, పెడవతప్పు.

వీరి మాటలలో ఇన్ని తప్పు లున్నవి; అవి యటుండనిండు.

1950 క్రీ॥ సంవత్సరములోని యీపుస్తకమునకు ప్రాచీనమై, కొన్ని విషయములలో ఈనాటకకర్తకు ఆదర్శమైయున్న 'మహాభారత చరిత్రములో వ్రాత యిట్లున్నది—

"ఆ ఆయిదూళ్ళేవి ? కుశస్థలము 1, వృకస్థలము 2, మాకంది 3, వారణావతము 4, ఏదేని మఱియొక గ్రామము 5. కుశస్థలము—కర్ణుడు యాదవులనుండి పుచ్చుకొనినది. మాకందీవారణావతములు పాంచాలురనుండి లాగికొని ద్రోణుడు, కౌరవులు ననుభవించుచున్నవి. వృకస్థలమునకు గూడ నిట్టి సంబంధమేదియేని కలిగి యుండును. కర్ణద్రోణు లనుభవించు భాగములను దుర్యోధనున కిచ్చుట కెటులు సాధ్యమగును. (పు. 244)

ఈమ.భా.చ.కారుని వ్రాతలో లేనట్టి హస్తినాపురమును ఇంద్రప్రస్థమును నాటకకారులు మార్చినారు. మాకందీవారణావతములు, ద్రోణకౌరవు లుభయులవి. అని మ.భా.చ.కారులును, కాదు— మాకంది. ద్రోణునిది, వారణావతము భీష్మునిది అని నాటకకారులును చెప్పుచున్నారు.

ఈగ్రంథముల కిట్టి పరస్పరవిరోధము, అప్రామాణికముగా తోచినట్లు వ్రాయుటచేతనే కదా! మ.భా.చ.కారులు — వృక్షస్థలము ఎవ్వనిదో చెప్పలేక అదియు నెవ్వనిదో అయియుండు నన్నారు. నాటకకారులును అది చెప్పలేకయే దాని పేరు తీసివేసి తాము చెప్పగలవానినే ఉదాహరించినారు. మ.భా.చ.కారులు అయిదవగ్రామము పేరు పాండవులే నిర్దేశింపలేదని చెప్పినారు. నాటకకారులు నిర్దేశించినట్లే చెప్పి తమబుద్ధికుశలతను చూపినారు.

ఒకప్రమాణమునకు కట్టుబడక యథేచ్ఛగా కల్పించుచున్నట్టి ప్రతివాదుల కల్పనలు యుక్తిశూన్యములనికూడ నిరూపించుటకే మా ప్రయత్నము.

కురురాజ్యములో హస్తినాపురరాజ్య మొక అర్ధభాగము. ఇంద్రప్రస్థరాజ్య మొక అర్ధభాగము. హస్తినాపురరాజ్యము కౌరవులనుభవించుటకై పాండవులు విడిచిపెట్టినది. ఇంద్రప్రస్థరాజ్యము పాండవులది. ఇది ద్యూతములో సుయోధనునిచే గెల్చుకొనబడినదనుట తప్పుమాట యని వెనుక ప్రతిపాదించియున్నాము. "ఇంద్రప్రస్థము పాండవులదే" అని నాటకకర్త కూడ చెప్పెను.

పాండవుల వనవాసాజ్ఞాతవాసకాలములో వారి యింద్రప్రస్థరాజ్యము దుర్యోధనుని అధీనములో నుండిపోయినది. వారు ఆ దీక్షను పూర్తిచేసి వచ్చి దుర్యోధనుని మా రాజ్యము మాకిమ్మని యడిగినారు. మయసభాదిమహావైభవోపేతమైన యింద్రప్రస్థరాజ్య మిచ్చుటకు నీకు మనసొప్పదేమో? ఆ పక్షములో మా కయిదుగురికి ఐదు గ్రామముల నైన యిమ్ము. అంతమాత్రముతో తృప్తిపడుదు మని చెప్పినారు. పవిత్రమైన తమ సొత్తునే తప్ప పరులసొత్తు నపేక్షింపని వారు పాండవులు.

దుర్యోధనుడు ప్రతివాదిమతప్రకారము తన యధీనములో

లేనట్టి అన్యుల సొత్తును ఇవ్వలేనివాడును, తన యధీనములో నున్న దాని నివ్వగలవాడునుగదా!

ఇట్టి దుర్యోధనుని పరులసొత్తును అపేక్షింపనట్టి పాండవు లిమ్మని యడిగిన పంచగ్రామములు కర్ణభీష్మద్రోణులకు జెందినవి గాక దుర్యోధనాధీనములో లేనట్టివియు గాక ఇంద్రప్రస్థ హాస్తినాపుర మాకందీ రాజధానులును గాక దుర్యోధనాధీనములోనుండి తమ సొత్తయియున్న గ్రామములే. ఇట్టి పరిస్థితిలో దుర్యోధనుని పాండవు లడిగినవి గ్రామములుకాని రాజధానులా? తమసొత్తు నడుగుట మాని యెవ్వని సొత్తునో పాండవు లడుగుదురా? దుర్యోధనాధీనములో లేనివానిని దుర్యోధను నిమ్మని యడిగెదరా? అని యాలోచింపక ప్రతివాదులు చేసిన ప్రసంగము నింద్యము.

అసలుగ్రంథమం దెట్లున్నదో కూడ చూతము—

"ఉచితం స్వకం భాగం లభేమహి పరన్తప!
నివర్తయ పరద్రవ్యా ద్బుద్ధిం గృద్ధాం నరర్షభ॥
శాన్తి రేవం భవే ద్రాజన్ ప్రీతి శ్చైవ పరస్పరమ్।
రాజ్యైకదేశ మపి నః ప్రయచ్ఛ శమ మిచ్ఛతామ్॥
అవిస్థలం వృకస్థలం మాకన్దీం వారణావతమ్॥
అవసానం భవ త్వత్ర కించి దేకం చ పంచమమ్।
భ్రాతౄణాం దేహి పంచానాం పంచగ్రామాన్ సుయోధన।

టీ- గృద్ధాం=లుబ్ధామ్. అవసానం=వసతిస్థానమ్.

ఇది ఉపప్లావ్యములో నున్న పాండవులు సంజయునితో చెప్పిన మాట.

ఇందులో మా భాగమును మేము తీసుకొనెదము. దుర్యోధనా! పరద్రవ్యమునందు లోభబుద్ధిని తొలగించుకొనుము. అట్లైన శాంతి, బరస్పరప్రీతి కలుగును. శాంతినిగోరుచున్న మాకు మా రాజ్య భాగమంతయు గాకపోయిన గొంతయైన ఇమ్ము. మా సోదరులయిదు గురకు అవిస్థలము, వృకస్థలము, మాకంది, వారణావతము, నీకు

తోచిన మఱియొకవసతిస్థానము ఇట్టు పంచగ్రామములనిమ్ము. అని సుయోధనునితో చెప్పవలసినది అని కోరబడినది. స్థలాంతరములో నిట్లున్నవి. శ్రీకృష్ణునితో చెప్పుకొనుచున్న యుధిష్ఠిరుని మాటలు-

"ఇతో దుఃఖతరం కిన్ను యదహాం మాతరం తతః।
సంవిధాతుం న శక్నోమి మిత్రాణాం వా జనార్దన ॥

టీ-మాతరం సంవిధాతుం, సమ్యక్పోషయితుం। తతః తత్రోస్థా మిత్యర్థః।
మిత్రాణాం కర్మణి గష్ఠీ॥

"............పంచ గ్రామా వృతా మయా।
అవిస్థలం వృకస్థలం మాకన్దీ వారణావతమ్॥
అవసానం చ గోవిన్ద కించిదేవాత్ర పంచమమ్॥
పఞ్చ న స్తాత దీయన్తాం గ్రామా వా నగరాణి వా।
వసేమ సహితా యేషు మాచ నో భరతానశన్।
నచ తా నపి దుష్టాత్మా ధార్తరాష్ట్రోనుమన్యతే॥" (ఉద్యో. అ. 72)

శ్రీకృష్ణా! అక్కడనే ఉంకిపోయిన మా తల్లిని, మిత్రులను పోషించుకొను శక్తి లేనివారమైపోతిమి. ఇంతకంటె దుఃఖ మేమున్నది? పంచగ్రామములుగాని, నగరములుగాని యిమ్మని కోరినాము. ఆ దుష్టాత్ముడు దానికిని ఒప్పుకొనుట లేదు. అని.

ఇచ్చట గ్రామములకు సమకక్ష్యగా చెప్పబడిన నగరములు శాఖానగరము లనుకొనవలసియున్నది. అవి యించుమించుగా గ్రామములతోసమానమైనవే. ఇట్లు రెండుస్థలములలోను పేర్కొనబడినవి గ్రామములేకాని పురములుకావు. అంగడివీధులు గలిగియున్నవి పురములు. అవి లేనివి గ్రామములు. పల్లెటూళ్ళన్నమాట. ఆగ్రామముల పేర్లు రెండుస్థలములలోను ఒకవిధముగనే యున్నవి.

స్థలాంతరములోగూడ ధృతరాష్ట్రునితో విదురుడు చెప్పినమాట-

"ప్రసాదం కురు వీరాణాం పాండవానాం విశాంపతే।
దీయన్తాం గ్రామకాః కేచి త్తేషాం వృత్త్యర్థ మీశ్వర" ॥ (ఉద్యో అ- 39)

ఇక్కడకూడ పాండవులకు జీవనార్థమై ఏవేని గ్రామము లిమ్మనియే చెప్పబడినది. ఇక్కడ నామనిర్దేశము కూడ లేదు.

ఆంధ్రభారతమం దిట్లున్నది— "ఒరుల సొమ్మునకు నాసపడదగదు. ఇమ్ము వారిపాలు, వారలతో గూడి బ్రదుకుము... పెద్దయా నోపడయేని కుశస్థలంబును వృకస్థలంబును వాసంతియు వారణావతంబును జాలు. గాదేని మఱియు నొండేనియు నొక్కటి యగునట్లుగా దనతోడబుట్టువు లేవురకు నిలువ తావులయి దిచ్చిన సర్వశాంతి యగు...

ఇందు పేరుపెట్టి కోరబడినవి నాలుగే. పేరుబెట్టకుండ వారికి దోచినవయినను సరే. అని కోరబడినవి అయిదు.

ఇందు పేర్కొనబడిన గ్రామముల పేర్లలో సంస్కృతభారతములోని పేర్లకు వ్యతిరేకముగా నున్నవి— రెండుగ్రామముల పేర్లు అవి కుశస్థలము, వాసంతి, అనునవి. అది పేర్లలోవచ్చిన వ్యతిరేకమే కాని గ్రామములనుటలో వ్యతిరేకము లేదు. కాబట్టి సంస్కృతాంధ్రభారతములలో దేనినిబట్టిచూచినను పాండవులు కోరినవి గ్రామములే అనియు, పాండవులసొత్తునే దుర్యోధనుడాక్రమించియున్నాడనియు, పాండవులు జీవనాధారము లేకుండ నున్నారనియు, అయినను, శాంతులై తమ సొత్తు నంతనుగూడ కాక కొన్నిగ్రామము లిచ్చినచాలునని సంజయునిచే కబురుచేసినారనియు స్పష్టమగుచున్నది.

ఇక ప్రతివాదులు చేసిన చిత్రము చూడుడు—

మ. భా. చ. కారులు. స్వకపోలకల్పనకు అనుకూలముగా ఆంధ్రభారతములోనుండి ఒక్క కుశస్థలమునుమాత్రము దీసుకొని మిగిలినవన్నియు సంస్కృతభారతమునుండియే, తీసికొనినారు.

నాటకకారులు— సంస్కృతభారతములోని మాకంది, వారణావతములను, ఆంధ్రభారతములోని కుశస్థలమును తీసుకొని యీ రెండింటిలోను లేని యింద్రప్రస్థమును, హస్తినాపురమును స్వయముగా జేర్చి నాటకమాడించినారు.

వీరిరువురుగూడ దుర్యోధనుని యధీనములో లేనట్టి యెవ్వరి సొత్తునో నీవు మాకివ్వవలసినదనియు, పంచగ్రామసంధపేరుతో తమ అర్థభాగముకంటె అధిక మివ్వవలసినదనియు దుర్యోధనుని పాండవులు కోరినట్లు వ్రాసినారు.

పంచగ్రామసంధి ప్రస్తావము విని దుర్యోధనుడు తండ్రితో నేమనెనో చూడుడు—

"యుధిష్ఠిరః పురం హిత్వా పంచగ్రామాన్ స యాచతే।
భీతో హి మామకా త్సైన్యా త్ప్రభావా చ్చైవ మే విభో॥"(ఉద్యో. అ. 55)

నా సైన్యమునకు, నా ప్రభావమునకు భయపడి యుధిష్ఠిరుడు ఇంద్రప్రస్థమును వదలుకొని పంచగ్రామములను యాచించువంతవరకు వచ్చినాడు. చూచితివా? తండ్రీ! మనము జయింపగలము. నీవు భయపడకుము.

"ఎఱిఁగి వెఱచి కాదె యేనూళ్ళ నైనను దమకు జాలు ననియె ధర్మసుతుడు" దుర్యోధను డీవిధముగా జెప్పియుండ ప్రతివాదు లన్యవిధముగా వ్రాయుట సారస్వతద్రోహము కాదా!

తనయధీనములో లేనట్టి యన్యులసొత్తును దుర్యోధను డెట్లు లివ్వగలుగును? అనుచు దుర్యోధను డననట్టి మాటను దుర్యోధనుని వెనుక వేసికొనివచ్చి యీ ప్రతివాదు లనుచున్నారు. ఎవ్వ రెవ్వరిసొత్తునో దుర్యోధను నిమ్మనికోరునట్టి అవివేకులా పాండవు లని యీ వివేకవంతులకు దోచనే లేదు.

"ఒరులసొమ్మున కాసపడదగదు", అని తెలుపుచు పంచగ్రామములనైన యిమ్మని కోరిన పాండవులు, కర్ణద్రోణభీష్ములసొత్తును కోరినారనుటకంటె అన్యాయ మున్నదా? ఇంతకును పాండవులపద్ధతి పాపము వీరికి నచ్చనే లేదు. దుర్యోధనుని పద్ధతియే బాగుగా నచ్చినది. కనుకనే "యే భువి యజ్జాతీయా స్తజ్జాతీయేషు తేఽనురజ్యన్తే" అని యొక మహాకవి చెప్పినాడు.

ప్రతివాదుల కింకొక ముఖ్యవిషయము దెలుపుచున్నాము— దుర్యోధనుడు పంచగ్రామసంధి కంగీకరింపకుండుటలో ప్రతివాదు లన్నట్లు ఆపంచగ్రామములు వారి యర్ధరాజ్యముకంటె నధికమై యుండుటకాని, అవి యన్యుల సొత్తైయుండుట కాని కారణము

కానే కాదు. మరేమనగా? పాండవులను ప్రకోపింపచేసి తనకు గల యుద్ధోత్సాహమును తీర్చుకొనదలచుటయే కారణము. ఈవిషయము నులూకునిద్వారా పాండవులకు పంపిన తన సందేశములో దుర్యోధనుడే వెల్లడించియుండెను. చూడుడు—

"పంచగ్రామా వృతా యత్నా న్నాస్మాభి రపవర్జితాః ।
యుధ్యామహే కథం సంఖ్యే కోపయేమ చ పాండవాన్" ॥ (ఉద్యో॥అ. 160)

అహా! కురురాజ్యాధిపతులై యౌవరాజ్యాభిషిక్తులై, దుర్యోధనాదుల బహువిధహత్యాప్రయత్నములకు గుఱియగుచు, దైవబలమున నుత్తీర్ణులగుచు పెద్దలు పిలిచియిచ్చిన ఖాండవప్రస్థరూపమైన అర్ధరాజ్యమునే పరిగ్రహించి, కపటద్యూతములో దుష్టులుచేసిన దురంతములను సహించి, దుర్యోధనుడు గెల్చినదాని నంతను మరల ధృతరాష్ట్రుడీయగా పరిగ్రహించి, మరల పునర్ద్యూతములో గూర్చుండ బెట్టబడి, వనవాసాజ్ఞాతవాసపణముతో నడుపబడిన అద్యూతములో మరల ఓడి, అష్టకష్టములుపడి, వనవాసాదులను నిర్వహించి వచ్చి, మాది మా కిమ్మని, పంచగ్రామములనైన యిమ్మని కోరిన పాండవుల పరిస్థితులకు జాలిపడని వారివి గుండెలా? అయఃపిండములా?

పాండవుల శాంతిసౌజన్యాదిమూలకమైన యీపంచగ్రామసంధి కుట్రతో గూడినదను ప్రతివాదుల వ్రాత నిర్మూలము, నిర్యుక్తికము, నిహీనము నగుటచే పరాస్తమయినది.

పాండవులు ధర్మాత్ములు, దుర్యోధనాదులు దురాత్ములు అని దిగంతములకు వ్యాపించిన వేదవ్యాసమహాభారతడిండిమధ్వానములు భారతీయులై యున్న ప్రతివాదుల యెడ అంధేంధూదయములును, మహాబధిరశంఖారావములును అయ్యెగదా! అనియే మాచింత. ఇట్లు ద్వితీయాంశము నిరస్తము.

—: దుర్యోధను డేతప్పును జేయలేదను మాటలపై సమాధానము :—

తృతీయాంశము—పాండవులు తమ్ము దుర్యోధనాదులు లాక్షాగృహమున దహింపజూచినట్లు, కపటద్యూతమును కల్పించి రాజ్యాప

హరణము గావించినట్లు, పాంచాలిని సభలో పరాభవించినట్లు పెక్కు అపవాదములు ప్రచారించి దుర్యోధనాదుల జీవితముల గళంకపరచినారట! అట్టి వారితో సుయోధనునకు ఎట్లు పొత్తు కలియును? అట!

ఇవి సుయోధనవాక్యములుగా కవి యల్లినవి. అందులో వ్యాసునితో సుయోధను డనినట్లు కల్పించినవి. అయితే పాండవు లట్లు ప్రచారముచేసినారుకాని, దుర్యోధనాదు లట్టి పనులు చేయలేదన్నట్లు చెప్పుచున్న యీప్రతివాదుల నడుగుచున్నాము—

ఇవి మీమాటలా? ఆ దుర్యోధనునిమాటలా? మీమాటలయినయెడల ఈనాటి మీమాటలు ఆనాటి దుర్యోధనుడు ఆనాటి వ్యాసునితో చెప్పెననుట అసంబద్ధము. ఆదుర్యోధనుని మాట లైనపుడు- అవి కురుసభలో కృష్ణభగవానునితో దుర్యోధనుడు—

క. "వనితం బట్టిచి రరణ్యంబున నిడుముల బడితి మనుచు బోటరులై చం
పను జెరుపదలచి మాదెస గనలుదు రప్పాండుసుతు లకారణము కదున్.

మ. అరయం దప్పొకయింత నావలన లే దాధర్మపుత్రుండు జూ
దరి కెంటం దమకించి సౌబలునిచేతన్ భూమి గోల్పోయి ము
న్కరులై కొండియు నొద్దగా నతడు నక్షప్రౌఢిమై గెల్చె నే
తెరుకాన్నం దన యిచ్చతో బడియె యింతే గాక యే బూటకమే.

తే. మాత్స్యపాంచాలపాండ్యాదిమనుజపతుల
గూర్చికొని తార కయ్యంబు గోరి రొత్తి,
విడిచి రింతియ కాక యివ్విధము నగ్ర
కర్మమున శేము దొడగుట గలదె చెప్పుమ".

అని చెప్పినవేకద! ఆమాటలపై కృష్ణభగవానుడు ఏమనెనో మీరు చూడలేదా? చూడుడు—

సీ. "అరయంగ దప్పు లేదంటి నీవలన గీ డొకనాడు నేనియు నొక్కనాడు
నేయక నీజనించినయదియాదిగా నుడుగక పాండవేయులకు జాల
కెగ్గుసేసితి విషమిడి పెనుబాముల గఱపించి నీరిలో గట్టి త్రోచి
లక్కయింటను గాలిచి పెక్కుభంగుల జంపదలచిన జావక ధర్మరక్ష

ఆ. జేసి కెగడి రాచసిరి నొందియున్న బాపోప కీవు తీవ్రపాపబుద్ధి
గనమి జూద మొకటి కల్పించి కపటంబు చేయ దాన నెల్ల జేటువుట్టె.

తే. అన్నదమ్ముల నెత్తంబులాడి సతులతలలు వట్టి సభాస్థలంబులకు నీడ్చి
చీర లొలిపింతురే యిట్టివారి నెందు దడవుమా నీ వొకండవు దక్క నధిప.
ఉ. అప్పుడు నీవు గర్ణుడును నాడినమాటలు గొల్వులోపలం
జెప్పెడునట్టిశేళి? కులము శీలము గల్గిన పుణ్యకాంత క
ట్లొప్పమి నేయుశెల్ల గనియున్న జనంబులు వించునుండగా
దప్పొకయింత లేదను విధం బది నీక చనుం గుమారకా.
తే. ఎత్తి విడిచినవారని యెల్లతప్పు పాండవులమీద బెట్టిన బ్రిదుకు గలదె
ద్రోణభీష్ములు దండ్రియు దోడుతోడ జెప్పతగుమాట లేమియు జెవులుసారవు"

చూచితిరా ! యీకృష్ణభగవానుని మాటలు, నీవు చేయని దుష్కార్య మున్నదా ? నీవును కర్ణుడును ద్యూతసభలో ఆడిన మాటలు నోటితో నుచ్చరింపదగినవేనా ? నీవు చేసిన దుష్కార్యము లన్నియు గన్నులతో జూచిన యింతమంది పెద్దల సమక్షమున 'నేనే మియు జేయలేదు. అది పాండవులు తెచ్చిపెట్టిన అల్లరి' అని యను చున్న నీ వెంటి మొండివాడున్నాడా ? అని సభ్యులనే సాక్షులుగా జూపి కృష్ణభగవానుడు మందలించెను. ఆమొండివాని మాటలే మీరు చెప్పించినవి; ఆకృష్ణభగవానుని మాటలే ఆమాటలకు సమాధానము.

మీకొకవేళ కృష్ణభగవానుని మాటలు అంత ప్రామాణ్యము కావేమో ? మీకర్ణుని మాటలనే మీకు చూపుచున్నాము—

సైంధవవధానంతరము ద్రోణుడు పాండవపక్షపాతముజూపి సైంధవుని కాపాడినాడు కాడని తనతో జెప్పునట్టి దుర్యోధనునకు కర్ణుడు చెప్పిన సమాధానము—

"ఆచార్యం మా విగర్హస్వ శక్త్యాసౌ యుధ్యతే ద్విజః ।
యథా బలం యథోత్సాహం త్యక్త్వా జీవిత మాత్మనః ॥
యతో నో యుధ్యమానానాం పరం శక్త్యా సుయోధన !
సైంధవో నిహతో యుద్ధే దైవ మత్ర పరం స్మృతమ్ ॥
పరం యత్నం కుర్వతాం చ త్వయా సహ రణాజిరే ।
హత్వాఽస్మాకం పౌరుషం హి దైవం పశ్చా త్కరోతి నః ॥
సతతం చేష్టమానానాం నికృత్యా విక్రమేణ చ ।
నికృత్యా వంచితాః పార్థా విగ్రహాశ్చ భారత ॥

దగ్ధా జతుగృహే చాపి ద్యూతేన చ పరాజితాః ।
రాజనీతిం వ్యపాశ్రిత్య ప్రహితా శ్చైవ కాననమ్ ॥
యత్నేన చ కృతం తత్ర దైవేన వినిపాతితమ్" ॥ (ద్రోణ. అ. 152)

దుర్యోధనా ! తనప్రాణము లొడ్డి యావచ్ఛక్తి యుద్ధముచేయు చున్న ద్రోణాచార్యుని నీవట్లు గర్హింపకుము. మన మాటచెప్పుము- మన మెంత శక్తిని వినియోగించినను సైంధవుని గాపాడగలిగినామా? దైవబలము లేక మనపౌరుష మంతయు వ్యర్థమైనది. మన మవలంబించిన కపటోపాయములుగాని, పరాక్రమములుగాని ఫలింప లేదు.

పాండవులు కపటముచే, విషప్రయోగములచే వంచింపబడినారు. లాక్షాగృహదహనమునకు గురిచేయబడినారు; ద్యూతముచేత నోడింపబడినారు; రాజనీతిచే అరణ్యములకు బంపబడినారు. ఆయాపురుష ప్రయత్న మంతయు దైవముచే ప్రతిహతమైపోయినది.

ఆంధ్రభారతము—ద్రోణపర్వము. అ. 5.

చ. "అన విని కర్ణు డిట్లనియె నగ్గురు దూఱగ నేల నాత డో
పినగతి బోరగాక నరు బీరము లావును నెక్కుడైన వా
ని నడుపవచ్చునే విధియ నేర్చు విషం బిడి యిల్లుగాల్చి కా
ననమున కేగజేసి యొక నాశము గంటిమె గొంతి సంతతిన్".

ఈకర్ణునిమాటలనుబట్టి అన్నిదుష్కార్యములు దుర్యోధనుడు చేసినట్లేకద! ఆదుర్యోధనుని దుష్కార్యములనే కురుసభలో కృష్ణభగవాను డుద్ఘాటించి యింతమందిలో నీవు చేసి చేయలేదనుచుంటివే. ఎంత మొండివాడవు ? అని మందలించెను. అట్టి మొండివానిమాటలనే మీరు ఆలాపన జేయుంచినారు.

ఇంకొకటి- తాను ఏతప్పులను చేయలేదని కృష్ణభగవానునితో దుర్యోధనుడు పలికెనో, ప్రతివాదులును ఏవి చేయలేదని చెప్పబూనిరో, అవన్నియు తానుచేసినా ననియు, దానికి మీరేమి చేయగలరో రండనియు, పాండవులయొద్ద యుద్ధము కే పగునగా ఉలూకునిచే దుర్యోధనుడే చెప్పించినాడు. చూడుడు—

"జాతుషే చ గృహే దాహం స్మర తం పురుషో భవ।
తస్యాయ మాగతః కాల స్సమయస్య నరాధిప ॥
ఏతదర్థం మయా సర్వం కృత మేత ద్యుధిష్ఠిర!
పరాజితో౽పి ద్యూతేన కృష్ణా చానాయితా సభామ్ ॥
ద్వాదశైవ తు వర్షాణి వనే ధిష్ణ్యా ద్వివాసితః।
సంవత్సరం విరాటస్య దాస్య మాస్థాయ చోషితః ॥
అమర్షం రాజ్యహరణం వనవాసం చ పాండవ!
ద్రౌపద్యాశ్చ పరిక్లేశం సంస్మరన్ పురుషో భవ ॥" (ఉద్యో. అ 160-161)

లాక్షాగృహదహనము, ద్యూతపరాజయము, ద్రౌపదీపరిభవము, రాజ్యాపహరణము, వనవాసాజ్ఞాతవాసకల్పనము, ఇవంతయు నేను జేసినాను. అది తలచుకొని మీరు పౌరుషము దెచ్చుకొని యుద్ధమునకు రండు. ఇది దుర్యోధనుని ధోరణి. ఈతడు మొండివాడుకాడా?

మరియు ద్రోణవధానంతరమునాటిరాత్రి దుర్యోధనుని బసలో సమావేశమై దుఃఖశోకములతో దుష్టచతుష్టయము— మహాత్ములగు పాండవులకు తాము కలిగించిన కష్టములను, ద్యూతకాలములో ద్రౌపదీదేవిని సభకు లాగికొనివచ్చి దుశ్శాసనవస్త్రాపహరణాదులచే ఆమెను దుఃఖపెట్టిన విషయములను తలపోసికొని చింతించుచునే ఆరాత్రి నంతను గడిపెను. చూడుడు—

"చింతయంతః క్షయం తీవ్రం దుఃఖశోకసమన్వితాః।
విశేషత స్సూతపుత్రో రాజా చైవ సుయోధనః ॥
దుశ్శాసనశ్చ శకుని స్సౌబలశ్చ మహాబలః।
ఉషితా స్తే నిశాం తాం తు దుర్యోధననివేశనే ॥
చింతయంతః పరిక్లేశాన్ పాండవానాం మహాత్మనామ్।
య త్తద్ద్యూతే పరిక్లిష్టా కృష్ణా చానాయితా సభామ్ ॥
తత్స్మరంతో౽నుశోచంతో భృశ ముద్విగ్నచేతసః।" (కర్ణ అ 1)

కనుక దుష్కార్యములను దుర్యోధనాదులు తెగించి చేసినారు. తన్మూలముననే తమకు అపజయము వచ్చుచున్నదని దుఃఖించుచు వచ్చినారు. ఇట్టిస్థితిలో, తా నెఱుగని విషయములను కల్పించి పాండ

వులు తనపై అపవాదములు వేసినారని వ్యాసునితో దుర్యోధను డన్న ట్లును, ఆవ్యాసుడు మాటలాడలేక ఖిన్నుడై పోయినట్లును మీరు చిత్రించుటకంటె అక్రమ మున్నదా ?

—: ప్రతివాదులకు వేదవ్యాసస్వరూపప్రకటనము :—

ఇంకొకటి-అట్లు మీచే చిత్రింపబడిన ఆవ్యాసుడు ఏ వ్యాసుడు ?

ఆ. "వివిధవేదతత్త్వవేది వేదవ్యాసు డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై పరగుచుండ జేసె భారతంబు".

అని కీర్తింపబడిన మహాభారతకర్తయైన వేదవ్యాసుడేనా ?

మ. ప్రాంశుపయోదనీలతనుభాసితు నుజ్జ్వలదండధారు బింబ
గాంశుజటాచ్ఛటాభరణు నాగమపుంజపదాగ్రతత్త్వని
స్సంశయ కారు గృష్ణమృగచర్మకృతాంబరకృత్యు భారతీ
శంశవివర్ధనుం ద్రిదశవందితు సాత్యవతేయు గొల్చెదన్.

అని కీర్తింపబడిన ఆగమతత్త్వనిస్సంశయకారియగు వేదవ్యాసుడేనా ?

"జయతి పరాశరసూను స్సత్యవతీహృదయనందనో వ్యాసః ।
యస్యాస్య కమలగళితం వాఙ్మయ మమృతం జగ త్పిబతి" ॥

అని కీర్తింపబడి తన ముఖకమలనిర్గళితమైన వాఙ్మయామృత మును జగత్తున కందించిన వేదవ్యాసుడేనా ?

"నమోస్తు తే వ్యాస విశాలబుద్ధే ఫుల్లారవిందాయతపత్రనేత్ర !
యేన త్వయా భారతతైలపూర్ణః ప్రజ్వాలితో జ్ఞానమయః ప్రదీపః" ॥

అని కీర్తింపబడి భారత-తైలపూర్ణమగు జ్ఞానమయప్రదీపమును శాశ్వతముగా ప్రజ్వలింపజేసిన వేదవ్యాసుడేనా ?

"నమ్య జ్ఞానైర్యయశలాపేన మహతా భారతేన చ ।
ఉపబృంహితవేదాయ నమో వ్యాసాయ విష్ణవే" ॥

అని కీర్తింపబడి, బ్రహ్మసూత్రములచేతను, మహాభారతము చేతను వేదార్థములను వివరించి చెప్పిన వేదవ్యాసుడేనా ?

"పుణ్యోఽయ మితి హాసాఖ్యః పవిత్రం వేద ముత్తమమ్ ।
కృష్ణేన మునినా విప్ర నిర్మితం సత్యవాదినా ॥
సైకతజ్ఞ్ఞేనవిబుద్ధేన దృష్ట్వా దివ్యేన చక్షుషా" ।

అని కీర్తింపబడి తన దివ్యదృష్టిచే కనిపెట్టిన విషయములతో పవిత్రమైన భారతేతిహాసమును రచించినట్టి సత్యవాది యైన వేదవ్యాసుడేనా ?

"అచతుర్వదనో బ్రహ్మా ద్వి బాహు రపరో హరిః ।
అఫాలలోచన శ్శంభు ర్భగవాన్ బాదరాయణః ॥"

అని కీర్తింపబడి బదరీవనవాసముచే బాదరాయణనామాంతరము గలిగినట్టి త్రిమూర్త్యాత్మకుడైన వేదవ్యాసుడేనా ?

"కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణం ప్రభుమ్ ।
కో హ్యన్యః పుండరీకాక్షా న్మహాభారతకృ ద్భవేత్ ॥"

అని కీర్తింపబడిన నారాయణస్వరూపుడైన వేదవ్యాసుడేనా ?

"అష్టాదశ పురాణాని కృత్వా సత్యవతీసుతః ।
భారతాఖ్యాన మకరో ద్వేదార్థై రుపబృంహితమ్ ॥
లక్షేణైకేన తత్ప్రోక్తం ద్వాపరాన్తే మహాత్మనా ।"

అని కీర్తింపబడి ద్వాపరయుగాంతమున అష్టాదశపురాణకర్తయు లక్షగ్రంథాత్మకమహాభారతకర్తయు నై యున్న వేదవ్యాసుడేనా ?

"మతిమన్థాన మావిధ్య యేనాఽసౌ శ్రుతిసాగరాత్ ।
ప్రకాశో జనితో లోకే మహాభారతచంద్రమాః ॥
భారతం భానుమా నిన్దు ర్యది న స్యు రమీ త్రయః ।
తతోఽజ్ఞానతమోన్ధస్య కాఽవస్థా జగతో భవేత్ ॥"

అని కీర్తింపబడి జగత్తునకు అజ్ఞాననాశకమైన మహాభారతచంద్రబింబమును వేదసాగరమునుండి ప్రాదుర్భవింపజేసిన వేదవ్యాసుడేనా ?

"అయం సాక్షా న్మహాయోగీ వ్యాస స్సర్వజ్ఞ ఈశ్వరః ।
మహాభారత మాశ్చర్యం నిర్మమే భగవాన్ గురుః ॥"

అని కీర్తింపబడిన మహాయోగియు, భగవానుడును, సర్వజ్ఞుడును అగు వేదవ్యాసుడేనా ?

"భగవన్ భారతాఖ్యానం వ్యాసే నోక్తం మహాత్మనా ।
పూర్ణ మస్తమహైశ్వర్యై ర్నానాశాస్త్ర సముచ్చయైః ॥

పూర్వపక్షోక్తిసిద్ధాన్తపరినిష్ఠాసమన్వితమ్ ।
అత్రార్థశ్చైవ ధర్మశ్చ కామో మోక్షశ్చ కథ్యతే ॥
ధర్మశాస్త్ర మిదం శ్రేష్ఠ మర్థశాస్త్ర మిదం పరమ్ ।
కామశాస్త్ర మిదం చాగ్ర్యం మోక్షశాస్త్రం తథోత్తమమ్ ॥
వ్యాసవాక్యజలౌఘేన కుతర్కతరుహారిణా ।
వేదశైలావతీర్ణేవ నీరజస్కా మహీ కృతా ॥

అని కీర్తింపబడి, నానాశాస్త్రసంప్రదాయగర్భితమై, పూర్వపక్ష సిద్ధాన్తశోభితమై, ధర్మశాస్త్రముగా అర్థశాస్త్రముగా కామశాస్త్రముగా మోక్షశాస్త్రముగా పరిగణింపబడునట్టిదై, కుతర్కతరువుల నన్మూలించునట్టిదై, వేదశైలమునుండి అవతరించినదై యున్న మహాభారతగంగాఝరిని లోకకల్యాణముగా మహీమండలమున ప్రవర్తింప జేసిన వేదవ్యాసుడేనా ?

వేదవ్యాసస్వరూపపరిజ్ఞానము, వేదవ్యాసమహాభారతార్థపరిజ్ఞానము సామాన్యముగా కలుగునదికాదు. అది గురుశుశ్రూషాపూర్వక విద్యావిశేషముచేతను, అస్తిక్యవిశేషముచేతను కలుగును. దుర్యోధనుని వాచాలతలో వేదవ్యాసునికి మౌనముద్ర వేసి కూర్చుండబెట్టిన మీనాటకము అమాయకలోకమునకు సద్భావమును పోగొట్టును. అది శ్రేయస్కరమైనపనికాదని తెలుపుచున్నాము. ఇట్లు తృతీయాంశము నిరస్తమైనది.

చతుర్థాంశము — ధర్మరాజాదులు పాండుపుత్రులే కారట, భారతీయులును కారట, వారు టిబెట్టువారట, వారికి కురువంశమున కాదు భారతవర్షమునందెచ్చటను స్థానములేదట, వారు సంకీర్ణులట, వారు తమవలెనే సంకీర్ణులైన యాదవులను పాంచాలాదులను కూర్చుకొని దుర్యోధనసార్వభౌముని మీద బడుటకై చూచుచున్నారట. ఈ మాటలు దుర్యోధనుడు వ్యాసునితో జెప్పినవట.

మ.భా.చ.కారులు తమగ్రంథములో, పాండవులను గూర్చి పాడినపాటనే ఈనాటకకర్త యిక్కడ పాడియుండెను.

ఈనాటకకర్త—తమ "నివేదనము"లో- "చిన్ననాటినుండియు నా శ్రేయస్సునుకోరి, భగవద్గీతానాటకమునకు సంతుష్టులై పీఠిక వ్రాసి యిత్తునని వాగ్దానము గావించి నా దురదృష్టవశమున బ్రహ్మైక్యము నొందిన శ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రులవారి ముక్తాత్మకు నా నతులు" అని వ్రాసియుండుటచే వీరికి వారిగ్రంథ మాదర్శమని తెలియుచున్నది.

ఆగ్రంథములోని మ.భా.చ. కారుల వ్రాత హేయమని సర్వథా నిరూపించుచు వచ్చి పాండవుల జన్మాదులను గూర్చి పాండవనిందా నిరాకరణములో ప్రతివాదిప్రసంగములను నిరాకరించియున్నాము. గనుక దానిచే నిదికూడ నిరాకృతమైనది.

ఈప్రతివాదివ్రాతపై కొన్నిమాటలు చెప్పవలసియున్నవి— ధర్మరాజాదులు పాండుపుత్రులే కారట! భారతీయులును కారట! వారు త్రివిష్టపులు (టిబెట్టువారు) అట! విలాయితులట! వారికి కురువంశమున కాదు, భారతవర్షమం దెచ్చటను స్థానము లేదట!

ఇవి దుర్యోధనుని మాటలుగా కల్పింపబడినవి. ఇట్టి దుర్యోధనుడే పంచమాంశములో జూపబడినట్లు, భారతీయులు కానట్టి పాండవులను— 'నాపినతండ్రి కొడుకులు' అని చెప్పుటనుబట్టి స్వవచనవ్యాఘాతము, ఆపై యిది పంచమాంశవిరుద్ధము. 'ఇంద్రప్రస్థము పాండవులదే' అను ద్వితీయాంశమునకు ఇది విరుద్ధము. వారు పాండుపుత్రులే కానప్పుడు- "కౌరవ పాండవులకొరకు భరతసామ్రాజ్యమును ఖండఖండములుగా చీల్చివేయుటా"? అను ప్రథమాంశమునకును ఇది విరుద్ధము, 'ఇంద్రప్రస్థము నేను ద్యూతమున జేకొన్నదే' అనుమాట కిది విరుద్ధము. తాను ఇంద్రప్రస్థమును గెల్చుకొన్నది పాండవులనుండియే. ఆపాండవులు భారతవర్షమం దెచ్చటను స్థానమే లేనివారాయె. అట్టివారికి ఆయింద్రప్రస్థ మెట్లువచ్చినది? ఇంద్రప్రస్థము వారిదే అయినప్పుడు వారికి భారతవర్షమందు స్థానమే లేకపోవుట యెట్లు? వారు భారతీయులు కాకుండుట యెట్లు?

పాండవుల ఆయింద్రప్రస్థరాజ్యమే వారు భారతవర్షవాసులని, వారు భారతీయులని, త్రివిష్టపులు విలాయితీలు కారని ధ్రువపరచుచున్నది. కురురాజ్యాన్తర్భాగమైన ఆయింద్రప్రస్థరాజ్యమే పాండవులు కురువంశీయులని ధ్రువపరచుచున్నది. కురువంశీయుడైన పాండురాజునకు పుత్రులని ధ్రువపరచుచున్నది. వారు కురురాజ్యాధిపతు లని ధ్రువపరచుచున్నది. వారు దుర్యోధనునకు పినతండ్రి కుమారులే యని అన్యులు కారని ధ్రువపరచుచున్నది.

పంచమప్రతివాదిప్రసంగనిరాకరణసందర్భములో నుదాహరించినట్లు దుర్యోధనుడు— 'వయము పాండునందనులు నేకకులంబున బుట్టి' 'ఉభౌ స్వ ఏకజాతీయౌ' అనుచు తాను పాండవులును ఏకకులమున బుట్టినవారమే అనియు, ఏకజాతివారమే అనియు చెప్పుటచేత దుర్యోధనుని జాతి యేదియో పాండవులజాతి యదియే. పాండవుల జాతి యేదియో దుర్యోధనుని జాతి యదియే. కాబట్టి పాండవులతో సమానకులజాతులు దుర్యోధనునివై యుండ పాండవులను ప్రతివాదులు సంకీర్ణు లనుట వారిసంబంధముగల పాంచాలులు, యాదవులు సంకీర్ణులనుట, అజ్ఞానము. యాదవులు సంకీర్ణులైనయెడల—

"దుర్యోధనసుతాం రాజన్ లక్ష్మణాం సమితింజయః ।
స్వయంవరస్థా మహర త్సాంబో జాంబవతీసుతః" ॥ (భా-స్క-10. అ68)

ఆయాదవులలోనివాడు, శ్రీకృష్ణపుత్రుడు, జాంబవతీసంభూతుడు అగు సాంబుడే దుర్యోధనుని పుత్రికయగు లక్ష్మణకు భర్తయగుటచే ఆయాదవుల సంబంధము జేసికొనిన దుర్యోధను డెట్టివాడు కావలయును? కనుక ప్రతివాదులది అసంబద్ధప్రలాపము.

ఈనాటకకర్తకు గురుతుల్యులగు మ.భా.చ.గారులు— భీష్ముని, ద్రోణుని, కృపాచార్యుని, విదురుని, వ్యాసుని పాండవులను సంకీర్ణజాతీయు లనియే సెలవిచ్చినారు. అదుర్వాద మంతయు 'వేదవ్యాసనిందానిరాకరణము' అను ద్వితీయభాగములో నిరాకరింపబడినది. దుర్యోధనసార్వభౌమునిపై బడుటకు పాండవులు చూచుచున్నారట!

యుధిష్ఠిరసార్వభౌమునిపై బడుటకు దుర్యోధనుడు చూచుచుండుట లేదేమి? మూఁడి వూఁ కిమ్మని. పంచగ్రామముల నైన యిమ్మని అని రాయబారములు జరుపుచున్న పాండవులు యుద్ధోద్యుక్తులా? సూది మొన మోపినంతైన నేను మీకియ్య ననిన దుర్యోధనుడు యుద్ధోద్యుక్తుడా? కనుక ప్రతివాదివాక్యత అయుక్తము.

ఇట్లు స్వవచనవ్యాఘాతదోషదుష్టము, నిష్ప్రమాణము,నిర్యుక్తికము, నిస్సారము, నిహీనము నయిన యీచతుర్థాంశము నిరస్తము.

పంచమాంశము — నా పినతండ్రికొడుకులే నా కిరీటమును నేల పాలు గావింపవలె నని యుద్యమించుటయా? అని దుర్యోధను డనినాడట! ఈదుర్యోధనుడే ధర్మరాజాదులు పాండుపుత్రులేకారు. అనగా తన పినతండ్రికుమారులు కానేకారు. అనిచెప్పి మరల నాపినతండ్రికుమారులనుట విరుద్ధము.

దుర్యోధను డన్నట్లు తనకు పాండవులు పినతండ్రికుమారులగుట నిజము. వారు తన కిరీటమును పడగొట్టదలచినా రనుట అబద్ధము. తనకు రాజ్యాధికారము లేకపోయె నని, రాజ్యము పాండవులదే అయిపోయె నని, యౌవరాజ్యాభిషేకము యుధిష్ఠిరునకు చేయబడిన దని, అర్ధరాజ్యము పాండవుల కివ్వఁబడె నని దుఃఖపడుచున్న దుర్యోధనునకు కిరీటమును వీరు పెట్టినారు.

కిరీటము పాండవులది; యౌవరాజ్యాభిషిక్తులు పాండవులు. పెదతండ్రి కుమారులకు సర్వసంపత్సమృద్ధమైన అర్ధరాజ్యమును విడిచి తమకై ఖాండవప్రస్థారణ్యమును పరిగ్రహించినవారు పాండవులు. పెదతండ్రికుమారులు పెట్టిన కష్టములను సహించినవారు పాండవులు. పెదతండ్రికుమారుల తలంపి పడగొట్టకుండ తమ యర్ధరాజ్యమునే తమ కిమ్మని కోరినవారు పాండవులు. పంచగ్రామముల నైన ఇమ్మని కోరినవారు పాండవులు. పరుల సొత్తును అపేక్షింపనివారు పాండవులు. దత్తాపహారము అధర్మమని యెంచినవారు పాండవులు.

దస్యుధర్మమున కొడిగట్టినవాడు దుర్యోధనుడు; పరుల సొత్తు నాశించినవాడు దుర్యోధనుడు; పంచగాత్రియముల నైన నే నివ్వ నని కూర్చుండినవాడు దుర్యోధనుడు; పాండవుల తిండి పడగొట్టినవాడు దుర్యోధనుడు; పాండవుల నరణ్యములకు పాలుచేసినవాడు దుర్యోధనుడు; పాండవులను నశింపజేయు నెన్నియో తంత్రములు నడిపిన వాడు దుర్యోధనుడు; పాండవులపై యుద్ధమునకు కాలుదువ్వినవాడు దుర్యోధనుడు.

ఇట్లు తానెట్టివాడైనను తమయందు సద్భావమే కలిగియున్న పాండవుల కిరీటమును తాను కృతఘ్నుడై పడగొట్టదలచి యుద్ధమునకు సిద్ధపడి తుదకు మనోరథము తీరక పాపోపహతు డైనవాడు దుర్యోధనుడు. గనుక పాండవులు నిరపరాధులుగనుక పంచమాంశము నిరస్తమైనది.

ఇంతవరకు అర్ధరుప్రతివాదులును కౌరవులచే రాజ్యాధికారమని చేసిన కోలాహలము సంస్కృతాంధ్రభారతములకు విరుద్ధమగుటచేతను, స్వవచనవిరుద్ధమగుటచేతను, యుక్తివిరుద్ధ మగుటచేతను, లోకప్రసిద్ధికి విరుద్ధమగుటచేతను హేయమని నిరూపింపబడి, పాండవులదే రాజ్యాధికార మని నిరాతంకముగా నిర్ణయింపబడినది.

పాపము ప్రతివాదులు- కౌరవులే రాజ్యాధికారు లనుకొని, వారిరాజ్య మపహరించుటకై వారిపై పాండవులు దండెత్తినారనుకొని, పాండవులదే దోషమనుకొని, కౌరవపక్షమును ప్రశంసించుచు వ్రాతలు సాగించినారు. అట్టి ప్రతివాదుల భ్రాంతిని తొలగించుటకే రాజ్యాధికారచర్చ యింత చేయవలసివచ్చినది. ఇప్పుడు కౌరవపక్షము ప్రశంసనీయమో, పాండవపక్షము ప్రశంసనీయమో ప్రతివాదులు తెలిసికొందురుగాక!

—: దుర్యోధనుడు కలిపురుషుడు :—

"కలే రంశస్తు సంజజ్ఞే భువి దుర్యోధనో నృపః ।
దుర్బుద్ధి ర్దుర్మతి శ్చైవ కురూణా మయశస్కరః ॥

జగతో యస్తు సర్వస్య విద్విష్టః కలిపూరుషః ।
య స్సర్వాం ఘాతయామాస పృథివీం పృథివీపతే ॥
ఉద్దీపితం యేన వైరం భూతాన్తకరణం మహత్ ।
పౌలస్త్యా భ్రాతర శ్చాస్య జజ్ఞిరే మనుజే ష్విహ ॥
శతం దుశ్శాసనాదీనాం సర్వేషాం క్రూరకర్మణామ్ ॥" (ఆదిప. అ 67)

దుర్యోధనుడు కలిపురుషాంశసంభూతుడై, దుర్మతియై, కురువంశాపకీర్తికారకుడై, లోకవిద్విష్టుడై, లోకవినాశహేతువైన మహావైరము నుద్దీపింపజేసి సర్వలోకక్షయము గావించెను.

ఈదుర్యోధనునకు పులస్త్యసంతతికి జెందుటచే పౌలస్త్యులనబడు రాక్షసుల అంశములు దుశ్శాసనాదిసోదరశతమై క్రూరస్వభావము కలిగియుండెను. "పులస్త్యుం డను మానసపుత్రునకు ననేక రాక్షస పుత్రులు పుట్టిరి" అని ఆంధ్రభారతము.

"కలియంశంబున దుర్యోధనుండు పుట్టె. పౌలస్త్యభ్రాతృవర్గంబు దుర్యోధనానుజశతంబై పుట్టె." (ఆంధ్రభా.)

"అస్మి న్నహని దుర్ధర్షో జజ్ఞే దుర్యోధనో నృపః ।
స జాతమాత్ర ఏవాథ ధృతరాష్ట్రసుతో నృప ॥
రాసభారావసదృశం రురావ చ ననాద చ ।
టీ. వ్యక్తమవ్యక్తం చ శబ్దం ఖరసదృశ మేవాఽకరోత్ ॥
"తం ఖరాః ప్రత్యభాషన్త గృధ్రగోమాయువాయసాః ।
వాతాశ్చ ప్రవవు శ్చాపి దిగ్దాహ శ్చాఽభవ త్తదా ॥
తత స్తు భీతవ ద్రాజా ధృతరాష్ట్రోఽబ్రవీ దిదమ్ ।
తేఽబ్రువన్ బ్రాహ్మణా రాజన్ విదుర శ్చ మహామతిః ॥
ఉత్థితాని సుతే జాతే జ్యేష్ఠే తే భరతర్షభ ।
వ్యక్తం కులాన్తకరణో భవితైష సుత స్తవ ॥ (ఆది. అ115)

దుర్యోధనుడు పుట్టినపుడు గర్దభమువలె అరచెను. ఉత్పాతములు గోచరించినవి. అప్పుడు ధృతరాష్ట్రుడు భీతుడై యిదేమి యని యడుగగా బ్రాహ్మణులును, విదురుడును నీజ్యేష్ఠపుత్రుడు పుట్టిన తోడనే యివన్నియు గలిగినవి. ఈనీపుత్రుడు కులాంతకుడు కాగలడని చెప్పిరి.

ఆంధ్రభారతము—

శా. అరుదెంచెన్ దుర్యోధను డుద్భవిల్లుడును గర్భవ్యాదారవంబున్ శివా
నాదంబున్ మదఘూకఘూంకృతియు నానారాసభధ్వానమున్
భూదిక్కంపముగా జెలంగె విగతాంభోభృన్నభోవీథియం
దాదిత్యద్యుతి మాయగా గురిసె నుగ్రాసృఙ్మహావర్షముల్

వ. ధృతరాష్ట్రునకడకు...బంధుజనంబులు...బ్రాహ్మణవరులును వచ్చి యేకాంతంబ యిట్లనిరి.

క. మన దుర్యోధను జన్మంబున బెక్కులు దుర్నిమిత్తములు పుట్టె జగజ్జనసంక్షయజనకుండగు నని పలికిరి తెలుగుగల మహాత్ములు నానిన్.

—: కర్ణుడు సూర్యాంశసంభూతుడు :—

యదుశ్రేష్ఠుడును వసుదేవుని తండ్రియు నగు శూరభూపాలునకు ప్రథమసంతానముగా 'పృథ' అను కన్యక మిక్కిలి రూపవతి జన్మించెను. ఈమెకే కుంతీదేవి యని నామాంతరము. ఈమెను తనకు మేనత్తకుమారుడును, మహాత్ముడును, సఖుడును సంతతిలేకుండ కోరినవాడును అగు కుంతిభోజునకు శూరభూపాలుడు పెంచుకొనుటకిచ్చెను.

ఆకుంతీకన్యక కుంతిభోజునియింట పెరుగుచుండ నొకప్పుడు ఆ రాజభవనమునకు త్రికాలజ్ఞానసంపన్నుడు, తపోనిధియైన దుర్వాసో మహర్షి అనుగ్రహదృష్టితో వచ్చియుండెను. కుంతిభోజుని యాజ్ఞపై కుంతీకన్యక ఉగ్రస్వభావుడై కనబడు ఆమహర్షికి అతిశాంతముతో శుశ్రూషచేసినది. ఆమహర్షి తోచినట్లు వెళ్ళిపోవుచు ఒకప్పుడు వచ్చెద నని మరియొకప్పుడు వచ్చుచు, ప్రాతఃకాలము వత్తునని రాత్రి వచ్చుచు, దుర్లభములగు ఆహారపదార్థముల నడుగుచు నెంత చిక్కులు పెట్టినను దాను చిరాకుపడక భక్తిశ్రద్ధలతో ఒకసంవత్సరము సేవ చేసినది.

"తత స్సంవత్సరే పూర్ణే యదాఽసౌ జపతాంవరః।
నాఽపశ్య ద్దుష్కృతం కించి త్పృథాయా స్సౌహృదే రతః॥

సంవత్సరము పూర్తియైనతరువాత నేవిధమైన లోపము కుంతీకన్య లేకుండనే సంచరింపగా అది చూచి ఆమె యోగ్యతకు మహర్షి మెచ్చుకొని—

"తస్యై స ప్రదదౌ మన్త్రి మాపద్ధర్మాన్వవేక్షయా॥
టీ. భావిసంతానప్రతిబన్ధస్య అనాగతావేక్షణేన.

ఆమెకు ముందు రాబోవు సంతానప్రతిబంధమును దివ్యదృష్టిచే గ్రహించి ఆమెకు సంతానము కలుగుట కుపాయముగా నెట్టికోరికలు లేని కుంతీకన్యకకు స్వయముగా నొకమంత్ర ముపదేశించి—

"యం యం దేవం త్వ మేతేన మన్త్రే ణాహ్వయిష్యసి।
తస్య తస్య ప్రభావేణ తవ పుత్రో భవిష్యతి॥"

అమ్మా! నీవీమంత్రముచే నేయేదేవతలను ఆహ్వానింతువో ఆయాదేవతయొక్క ప్రభావముతో నీకు పుత్రుడు కలుగును అని చెప్పి అంతర్ధానమయ్యె. తరువాత ఆమెకు చిన్నతనముగనుక ఆమంత్ర శక్తి యెట్టిదో అని కుతూహలపడుచు "కన్యా సతీ దేవ మర్క మాజుహావ యశస్వినీ" ఆమంత్రోచ్చారణమున కుంతీకన్యక ప్రాసాద మందుండి సూర్యదేవు నాహ్వానించెను. అంతట సూర్యదేవుడు కవచ కుండలాలంకృతమగు మనోజ్ఞమైన మూర్తిని ధరించి రాగా ఆమె విస్మయపడి ముని నాకిచ్చిన మంత్రశక్తియందలి జిజ్ఞాసతో నేనాహ్వా నించినాను. నాతప్పు క్షమింపవలయును; అపరాధిని. అని వేడుకొనగా సూర్యదేవుడు నన్ను నీవాహ్వానించి నావు. నాదర్శన మమోఘము. నన్ను గూర్చిన నీయాహ్వానము వ్యర్థ మైనయెడల నీకు దోష మంటును. నిన్ను, నీతండ్రిని, నీకామంత్రము పదేశించిన ఋషిని శపింతును. నీకిప్పుడు నాసంబంధమున పుత్రుడు కలుగవలయును. అని చెప్పినమీదట ఆమె భయపడి నేను కన్యకను మహానుభావా! నన్ను మన్నింపు మని ప్రార్థించినది.

అప్పుడు సూర్యదేవుడు నీకన్యాత్వమునకు భంగము లేకుండ నే ననుగ్రహింతు నని చెప్పి అమోఘమైన ఆమంత్రశక్తికి తాను వశుడయి స్వసంబంధమున సద్యోగర్భ మామెకు ప్రసాదించి పుత్రోత్ప త్త్యనంతరము ఆమెకు తిరిగి "ప్రాదాచ్చ తస్యై కన్యాత్వం పునస్స పరమద్యుతిః" కన్యాత్వము సిద్ధించునట్లు వరమిచ్చి యంతర్హితు డయ్యెను. తరువాత నామెకు పుత్రుడు కలిగెను.

"సహజం కవచం బిభ్రత్ కుండలోద్ద్యోతితాననః ।"

ఆ పుత్రుడు సహజకవచకుండలములతో విరాజిల్లుచుండెను.

"దృష్ట్వా కుమారం జాతం సా వార్ష్ణేయీ దీనమానసా ।
ఏకాగ్రం చిన్తయామాస కిం కృత్వా సుకృతం భవేత్ ॥
గూహమానాఽపచారం సా బంధుపక్షభయాత్తదా ।
ఉత్ససర్జ కుమారం తం జలే కున్తీ మహాబలమ్ ॥"

అట్టి పుత్రుని జూచి దీనురాలై బంధువర్గమునకు భయపడి యేమిచేయుదునా? అని యేకాగ్రతతో దీర్ఘ మాలోచించి లోకమునకు దెలియకుండ నదీజలమునందు ఆశిశువుని విడిచిపెట్టినది.

ఆపై ఆమెకు సూర్యవరప్రభావమున యథాప్రకారముగా కన్యాత్వము ప్రాప్తించినది. ఇచ్చట కన్యాశబ్దమునకు కర్ణచరిత్రకారు లన్నట్లు అవివాహిత యని యర్థము గాదు. "ప్రాదాచ్చ తస్యై కన్యాత్వమ్" అనియున్న సూర్యవరము అవివాహితత్వమే అని చెప్పిన యెడల అది యంతకుబూర్వము ప్రసవానంతరము కూడ నున్నదే కనుక నావరమున కర్థము లేకపోవును. ఆపై ముందు ఆమెకు వివాహమైనది గనుక కన్యకవే, (అవివాహితవే) అగుదువు అను వరమున కది విరుద్ధముకూడను. అందుచేత బాల్యావస్థారూపమే ఆకన్యాత్వము. దానికి గర్భధారణాదులచే భంగము కలుగకుండ సూర్యవరముచే యథాపూర్వముగా నాబాల్యావస్థయే ఆమెకు ప్రాప్తించినది. వివాహము గూడ నాపై జరిగినది; వరము సార్థకమైనది; కర్ణోత్పత్తి సందర్భ మంతయు స్వప్నదృశ్యమైనది; కుంతీకన్యక లోకములోని బాలికలవలెనే గోచరించుచున్నది; ఇదంతయు దేవరహస్యము.

రహస్యకర్తలు—"దుర్వాసమహర్షి యామెకు మంత్రోపదేశ మొనరించినపుడు కుంతి యౌవనవతి" (పు 349) అని వ్రాయుట నింద్యము. మహర్షికి శుశ్రూషజేసి సంతోషించునట్లు నీ యాజ్ఞాప్రకారము నేను జేసెద నని జెప్పినపుడు తండ్రి కుంతీకన్యకను—

"ఏవం బ్రువన్తీం బహుశః పరిష్వజ్య సమర్థ్య చ ।
ఇతి చేతి కర్తవ్యం రాజా సర్వ మథాఽదిశత్ ॥ (వన. అ.304)

ఆలింగనము చేసికొని శుశ్రూషాపద్ధతి నంతను బోధించె నని యున్నది. తండ్రియైనను పుత్రిక యువతియైయుండ- ఆలింగనము చేసికొనుట విరుద్ధము. బాల్యావస్థలోనే అది సంభవము. "ఇయం బ్రహ్మన్ మమ సుతా బాలా" అని అప్పగించెను.

ఆంధ్రభారతము— "పసిబిడ్డ వయ్యును బడతి వీవెంతయు గుణవంతురాలవు గురులయందు" అని కుంతిభోజుడు (తండ్రి) కుంతీ కన్యక పసిబిడ్డ యనియే చెప్పెను. అందుచే మహర్షి మంత్రోపదేశ కాలమున కామె యువతి కాదు, పసిబిడ్డ.

కర్ణోత్పత్తినిగూర్చి యీరహస్యకర్తల దుర్వాదము ద్వితీయ భాగము వేదవ్యాసనిందానిరాకరణములో విశేషముగా నిరాకరింప బడినది. ఆవిశేషము లచ్చట జూడవలయును.

మంత్రోపదేశకాలమునకు కుంతీకన్యది బాల్యావస్థ. కర్ణోత్ప త్త్యనంతరము సూర్యానుగ్రహమూలమున బాల్యావస్థయే సిద్ధించినది.

కర్ణోత్పత్త్యనంతరము బాల్యావస్థ అనునది అసంభావితమని భావించు ప్రతివాదులకు సహజకవచకుండలములతో కర్ణుడు పుట్టుట మాత్ర మసంభావితము కాదా? అదియును అసంభావితమే అను పక్షములో తన సహజకవచమును ఛేదించి యిచ్చిన మహాదాత కర్ణు డని ప్రతివాదులుచేయు స్తోత్ర మసంగత మగును. ఇంకొకటి—

"సా బాంధవభయా ద్బాలా గర్భం తం వినిగూహతీ ।
ధారయామాస సుశ్రోణీ నచైనాం బుబుధే జనః ॥
నహి తాం వేద నార్యన్యా కాచి ద్ధాత్రేయికా మృతే ।
కన్యాపురగతాం బాలాం నిపుణాం పరిరక్షణే ॥
తతః కాలేన సా గర్భం సుషువే వరవర్ణినీ ।
కన్యైవ తస్య దేవస్య ప్రసాదా దమరప్రభమ్ ॥" (వన-అ 308)

ఆంధ్రభారతము—"పూర్వపక్షంబున చంద్రిందునుంబోలె గర్భంబున గ్రమంబున బ్రవర్ధనంబు నొందుచు గర్భం బభివ్యక్తం బయ్యును బ్రభాకరు మహిమంజేసి లోకవిదితంబు గాకుండం దత్ప్రకారంబు దాదికూతు రొక్కతియ

యెఱుంగు నిట్లు వర్ధిల్లుచుం బదియగు మాసంబున నొక్కనాటి నిశాసమయం బునం గన్యాంతఃపురంబునందు కొడుకుం గనియె".

ఇట్లు ఆమె గర్భధారణ చేసి పదిమాసములకు ప్రసవించి యుండ అది యెవ్వనికి దెలియకుండుట మాత్రము ప్రతివాదులకు అసంభావిత మనిపింపకుండునా? దీని నసంభావిత మని ప్రతివాదు లంగీకరింపనియెడల కర్ణుడు సూతపుత్రు డగుటే అసంభవము. కుంతీ కన్యక పుత్రుని విసర్జించుట అసంభవము. అప్పుడు కర్ణస్తుతి, కుంతీ నింద, బహుముఖముల జేయుచున్న ప్రతివాదులది అకాండ తాండవమై 'అహో మూలచ్ఛేదీ తవ పాండిత్యప్రకర్షః" అన్నట్లు అయిపోవును.

కనుక కర్ణోత్పత్తి లోకమున కజ్ఞాత మనియే ప్రతివాదులు ఒప్పుకొనితీరవలయును. అది సూర్యానుగ్రహమూలకమే అని యొప్పు కొనితీరవలయును. గత్యంతరము లేక యొక అసంభావితాంశము నెప్పు డొప్పుకొనిరో దానితోబాటు శిశువునకు సహజకవచకుండల ములు, ఆమెకు బాల్యావస్థాప్రాప్తి గ్రంథోక్త ప్రకారము ఒప్పుకొనక తప్పునా? మనకు దెలియని విషయములను సహేతుకముగా దెలుపు నట్టిదికదా ఆర్షగ్రంథము.

కర్ణచరిత్రకారులు—"నేను గన్యకను; వివాహము లేనిదానను; నాకు నీదయ వలన గర్భము గలిగినయెడల నాతల్లిదండ్రులును, నితరబంధువులును నన్ను నిందింపరా? (పు 13)

అని సూర్యునితో కుంతీకన్యక చెప్పుకొనినట్లు వ్రాసినారు. ఇందు వివాహము లేనిదానను, గర్భము కలిగిన నింద్యురాలనై పోవు దును. అని చెప్పుకొనెననుట అసంగతము. గర్భప్రాప్తిచే నింద్యు రాలు వివాహము లేనప్పు డెట్లగునో అట్లు వివాహమైయున్నను పర సంబంధమూలకగర్భప్రాప్తిచే నింద్యురాలే అగును. అట్టిస్థితిలో లోకనిందకు వివాహము లేకుండుట కారణ మగు టెట్లు? సూర్యుడు కూడ—"నీకన్యాత్వమునకును హాని కలుగదు".. అని బోధించె నని

వ్రాసినారు. ఈకన్యాత్వ మెట్టిది ? కుంతీకన్యక ఏకన్యాత్వమునకు హానికలుగునని భీతిల్లెనో ఆకన్యాత్వమే కద. అది వివాహము లేనం దులకే అయినపుడు ముందు నీకు వివాహము లేకుండుటే సిద్ధించు నని సూర్యుడు చెప్పినట్లగును. ఈమాట ఆమె నెటు లొప్పింపగలుగును ? అది వరమైయుండ అమెకు వివాహ మెట్లయ్యెను ? కనుక నిది యసంబద్ధము.

ఆకన్యాత్వము బాల్యావస్థయే. దానికి భంగము కలుగుననియే ఆమె భీతిల్లినది. దానికి భంగము కలుగదనియే సూర్యుని వరము. ఆ వరమును బట్టియే ఆమెకు వివాహసిద్ధి. అది బాలికావివాహమే కాని బిడ్డతల్లివివాహముకాదు. ఆమె కన్యాత్వము నిష్కలంకమేగాని కలంకితము గాదు. ఆమెకు శిశూత్పత్తి భవితవ్యబలముచే గూఢముగా జరిగినను యథాపూర్వపరిస్థితియే వరప్రాప్తమైనందున స్వప్నప్రాయ మయినట్టి ఆ ఘటనచే ఆమె పవిత్రురాలు కాకపోలేదు. ఆమె కన్యాత్వము కళంకిత మనుకొనుట తప్పు.

ఇట్లు పరిశీలింపగా మంత్రశక్తిమూలమైన సూర్యానుగ్రహ ముచే ఆమెకు బాల్యమందే కర్ణుడు కవచసహితుడై పుట్టుట, అది యతిగుప్తమైయుండుట, ఆమెకు తిరిగి బాల్యదశయే ప్రాప్తించుట అను అసాధారణవిషయములు అఘటితఘటనగా సిద్ధించినవని తేలినది.

—♦ కర్ణునకు సహజకవచము అను మాటకు బలిష్ఠమైన చర్మ మని అర్థము అను ప్రసంగము— తన్నిరాకరణము ♦—

మహాభారతరహస్యకారుల వ్రాత యిట్లున్నది—

"కర్ణుడు కవచకుండలములతో పుట్టు టెట్లో నా కవగతమగుటలేదు. గర్భ గోళములో కవచకుండలములతో పిండ మభివృద్ధి యెట్లగును ? పుట్టినప్పుడు ప్రాణికి కవచకుండలము లెట్లుండును ? అది శరీరమునకు సహజముగా కప్ప బడియున్నచో శరీరపోషణ మెట్లుజరుగును ? కుండలములవలన నేమి యుపయోగ

గమో తెలియదు. ఇచ్చుట నా యభిప్రాయ మేమనగా? శరీరముమీద నొక విధమగు బలిష్ఠమైన చర్మముతో కర్ణుడు పుట్టియుండు నని తలంచుచున్నాను"
(పు 446)

ఆహా! నారికేళఫలములో కొబ్బరికాయ, ఆ కొబ్బరికాయలో కొబ్బరి, ఆ కొబ్బరికి పైన పెంకు, ఆ పెంకుచేత ఆచ్ఛాదింపబడియే దాని అభివృద్ధి. అందులో నీరు. కొబ్బరినుండి పెంకు విడదీయుబడుట. ఇదంతయు ఘటించుట యెట్లో యీ ప్రతివాదులకు అవగతమైనది కాబోలు. అక్కడలేని సందేహ మిక్కడమాత్రమెందు కుండవలెను? శరీరమునకు సహజములై భేదింపబడినను శరీరమున కపాయము గలిగింపనివై పెరుగుచుండు స్వభావము కలవై యున్న నఖరోమకేశముల వలె సహజమై కర్ణుని కవచ ముండుటకు అభ్యంతర మేమున్నది.

ఈ ప్రతివాదు లన్నట్లు అది చర్మవిశేష మయినయెడల దానినే యింద్రు డడుగుట, దానినే ఛేదించి కర్ణు డిచ్చుట జరిగినదని చెప్ప వలసివచ్చును. శరీరముపై చర్మమంతయును ఛేదించి యిచ్చి జీవించుట సంభావ్య మెట్లగును? "సహజకవచమును కోసి యిచ్చుటచేత కర్ణు డనుట యుక్తముగా నున్న దని నా యభిప్రాయము." (పు 443) అని వ్రాసినట్టి వీరికి ఛేదించి యివ్వని దే కర్ణుడను పేరే కుదరదు. ఛేదించి చర్మమంతయు నిచ్చినపుడు జీవించుట కుదరదు. కనుక నది సహజ కవచమే యని యొప్పుకొని తీరవలయును.

"సహజకవచకర్తనాత్ కర్ణః" అని యున్నందున నది కవచమే, అదియే ఛేదించి యివ్వబడిన దని చెప్పక తప్పదు. "కుండలముల వలన నేమి యుపయోగమో తెలియదట." కర్ణుడు ఇంద్రునితో—

"కుండలాభ్యాం విముక్తోఽహం వర్మణా సహజేన చ।
గమనీయో భవిష్యామి శత్రూణాం ద్విజసత్తమ॥" (వన అ 310)
టీ—గమనీయో వధ్యః.

ఈ సహజకవచకుండలములను విడిచియున్నపుడు నేను శత్రువులకు వధ్యుడనయిపోవుదును. అని చెప్పియుండెను. కనుక మరణము

లేకుండ జేయుటకవి యేర్పడిన వని తెలిసికొనవలయును. అవి అమృత మయములని వాని ప్రయోజనము సూర్యుడే చెప్పియుండెను. అట్లు సూర్యానుగ్రహమున సహజకవచకుండలశోభితుడగు శిశువు కుంతీ కన్యకకు జన్మించెను.

—♦ కుంతీకన్యక శిశువును పరిత్యజించిన విధానము ♦—

"జాతమాత్రం చ తం గర్భం ధాత్ర్యా సంమన్త్ర్య భావినీ।
మంజూషాయాం సమాధాయ స్వాస్తీర్ణాయాం సమన్తతః॥
మధూచ్ఛిష్టస్థితాయాం సా సుఖాయాం రుదతీ తథా।
శ్లక్ష్ణాయాం సువిధానాయా మశ్వనద్యా మవాసృజత్॥ (వన అ 308)

టీ—మధూచ్ఛిష్టం, సిక్థకం, మయనమితి భాషాయాం। తేన స్థితాయాం సర్వతో లిప్తాయాం, మంజూషాయాం జలప్రవేశో న భవే దిత్యర్థః॥

శిశువు జన్మించినతోడనే పరిచారికతో ఆలోచించి చక్కని ఆస్తరణము కలిగియున్నట్టియు, జలములోపల ప్రవేశింపకుండ సర్వత్ర మయనముచే పూయబడినట్టియు, మృదువై సుఖకరమై మూతకలిగి యున్నట్టి యొక పెట్టియందు శిశువును పదిలముగా పరుండబెట్టి అశ్వ నదిలో ఆపెట్టెను విడచిపెట్టినది.

"దత్తరక్షాప్రతిసరా మన్వాలంభనశోభనామ్" (వనప-అ 309)

టీ. దత్తో రక్షార్థం ప్రతిసరో మార్వాకంకణాదిరూపో యస్యాం తాం, అన్వాలంభినం కుంకుమహస్తదానమ్।

ఆపెట్టెమీద దూర్వాంకురకంకణముచే రక్షాబంధము జేసి కుంకుమములో అద్దిన తన హస్తములను పెట్టెపై అద్దినది.

ఆపెట్టెను విడుచునపుడు ఖేదపడుచు శిశురక్షణార్థ మిట్లుపలికినది—

"స్వస్తి తే చాన్తరిక్షేభ్యః పార్థివేభ్య శ్చ పుత్రక।
దివ్యేభ్య శ్చైవ భూతేభ్య స్తథా తోయచరాశ్చ యే॥
శివా స్తే సన్తు పంథానో మా చ తే పరిపన్థినః।
ఆగతాశ్చ తథా పుత్ర భవ న్త్వద్రోహచేతసః॥
పాతు త్వాం వరుణో రాజా సలిలే సలిలేశ్వరః।
అంతరిక్షేఽంతరిక్షస్థః పవన స్సర్వగ స్తథా॥

పితా త్వాం పాతు సర్వత్ర తపన స్తపతాం వరః ।
యేన దత్తోఽసి మే పుత్ర దివ్యేన విధినా కిల ॥
రక్షంతు త్వాం సురా స్సర్వే సమేషు విషమేషు చ ।
వేత్స్యామి త్వాం విదేశేఽపి కవచే నాభిసూచితమ్ ॥
ధన్యా సా ప్రమదా యా త్వాం పుత్రత్వే కల్పయిష్యతి ।
యస్యా స్త్వం తృషితః పుత్ర స్తనం పాస్యసి దేవజ ॥
ఏవం బహువిధం రాజన్ విలప్య కరుణం పృథా ।
అవాసృజత మంజూషా మశ్వనద్యాం తదా జలే ॥
రుదతీ పుత్రశోకార్తా నిశీథే కమలేక్షణా ।" (వనప-అ 308)

పుత్రకా! పృథివీజలాంతరిక్షగతము లగు సర్వభూతములవల నను నీకు స్వస్తి యగుగాక. మార్గములు నీకు మంగళప్రదము లగు గాక. నీకు ఎవ్వరును హాని గలిగింపకుందురుగాక. నీయొద్దకు వచ్చిన వారికి నీయెడల ద్రోహబుద్ధి పుట్టకుండుగాక. జలమందుండి వరుణ దేవుడు, అంతరిక్షమందుండి వాయుదేవుడు, నిన్ను రక్షింతురుగాక. దివ్యవిధానమున నీ వెవ్వనిచే ప్రసాదింపబడితివో తండ్రియైన ఆసూర్య భగవానుడు సర్వత్ర నిన్ను రక్షించుచుండుగాక. సర్వసమయముల యందును నిన్ను దేవత లందరును రక్షించుచుందురుగాక.

నీ వేదేశమం దున్నను నీకవచమునుబట్టి నిన్ను నేను గుర్తింప గలుగుదును. నిన్ను పుత్రునిగా గ్రహించి నీకు స్తన్య మిచ్చి పోషించిన స్త్రీ ధన్యురాలు. అనుచు బహువిధముల విలపించి ఆకుంతీకన్యక అశ్వనదీజలమునందు నిశీథమున ఆపెట్టెను వదలి శోకార్తయై తన భవనమునకు వెళ్ళినది.

కుంతీకన్యక పుట్టినతోడనే శిశువును అట్లు విడిచిపెట్టుట స్వతంత్రించి చేసిన పనియా? సూర్యోపదేశమున జేసిన పనియా? అని కూడ తెలిసికొనవలసియున్నది. సూర్యోపదేశమునుబట్టి చేసినపనియే అని కర్ణుని వాక్యమే ధ్రువపరచుచున్నది—

కృష్ణపరమాత్మ రాయబారమునకై వెళ్ళి వచ్చునపుడు కర్ణు

నితో నీవు కుంతీకన్యాగర్భసంభూతుడవు అని తెలిపి చెప్పినపుడు కర్ణుడు—

"కన్యా గర్భం సమాధత్త భాస్కరా న్మాం జనార్దన ।
ఆదిత్యవచనా చ్చైవ జాతం మాం సా వ్యసర్జయత్ ॥" (ఉద్యో-అ 141)

శ్రీకృష్ణా ! నీవు చెప్పినది నిజమే. ఆమె నన్ను సూర్యునివలన కని సూర్యోపదేశముచేతనే నన్ను విడిచినది. అని చెప్పియుండెను.

ఇదంతయు జూడగా భూభారహరణమునకై భగవదాజ్ఞానుసారము తమతమ యంశములతో ఆయా దేవతలు భూలోకమం దవతరింపవలసివచ్చి యవతరించుటలో ప్రచండయుద్ధము అనివార్యమై ప్రాప్తించుటను, ఆనాటికి క్షత్రియాద్యాకారములతో లోకము నలుముకొనియున్న అసురాంశముల నున్మూలించుటకును, యుద్ధకారణమైన కౌరవుల దుర్వృత్తిని బలపరచుటకును తగిన మహాతేజశ్శాలిని తన యంశముచే సూర్యదేవు డుద్భవింపజేయదలచి, ఆనాటికి దుర్వాసోమహర్షి యవ్యాజానుగ్రహమున మంత్రసిద్ధిగలిగి పుణ్యశీలయై యున్న కుంతీకన్యకయందు మంత్రాహూతుడై వచ్చి తన తేజస్సును ప్రవేశపెట్టి, ఆమె ప్రసవగర్భధారణాదులు లోకమునకు దెలియకుండ జేసి, పుట్టినతరువాత శిశువు నిట్లు విడిచివేయు మని కూడ ఆమెకు జెప్పి, ఆమెకు నిష్కళంకకన్యాత్వ మనుగ్రహించిన విషయ మంతయు దేవరహస్యమై, భూభారహరణోపయుక్తమై నడచిన దని స్పష్ట మగుచున్నది.

—♦ మొదట కర్ణజన్మవిషయము వెల్లడింపని కుంతీదేవియందు
"స్త్రీబుద్ధిః ప్రళయాన్తికా" అనుమాట బూటకము కాదు.
అను ప్రసంగము-తన్నిరాకరణము ♦—

కర్ణచరిత్రకారుల వ్రాత యిట్లున్నది—

"తొలుదొల్త దన కన్యాత్వమునకు భంజకమయి వివాహప్రతిబంధక మగు నని కర్ణజన్మవిషయక మగు నా దేవరహస్యమును వెల్లడింపదయ్యె. ఆ మీద గర్ణుడు దుర్యోధనునకు బ్రాణమిత్రుడగుటం జేసి తన మానమును గోలుపోయి

జెల్లడించినను నాతడు దుర్యోధనుని విడుచువాడు కాకుండుటచే జ్యేష్ఠుడగు కర్ణుడు దుర్యోధనసేవకుడైయుండ గనిష్ఠులగు ధర్మరాజాదులకును నట్లు సేవకత్వము దుర్లంఘ్యమే యగు ననియు, నట్లయిన దన్నెన్నో బాముజం జెట్టిన బావగారి సంతతిపై బగ తీరకపోవు ననియు గావలయు నట్టి రహస్యమును ధర్మరాజాదులకు దెలుపదయ్యె.

ఔరా! స్త్రీబుద్ధిః ప్రళయాన్తికా। అనునట ఈ విషయమున బూటకము కాదని చెప్పక తప్పదు గదా!" (పు 126)

ఇచ్చట గొన్నిమాటలు చెప్పవలసియున్నవి. భవిష్యత్తు నెరిగి దుర్వాసోమహర్షి కోరిక లేని కుంతీకన్యకు సంతతిప్రదమైన మంత్ర ముపదేశించి యుండెను. ఆ మంత్రప్రభావమున సూర్యదేవుడు పుత్రు నిచ్చుట కేతెంచి నిష్కామురాలైన ఆమెను నిర్బంధపరచినపుడు ఆమె అవశురాలై గ్రహించినది. ఆ సూర్యదేవుని మాటకు బద్ధురాలై శిశువును విడిచిపెట్టినది. సూర్యదేవుని యనుగ్రహముచేతనే లోకములో దాగనట్టి ఆ వృత్తాంత మెవ్వనికిని దెలియలేదు. ఆ పుత్రుడు వెల్లడి కాకుండ అన్యస్థలములో పెరుగుట దైవనిర్దిష్టముగా సంభవించినది కాని, ఆమె స్వబుద్ధిచే సంభవించినది కాదు. యుద్ధానంతరము నారద మహర్షి ధర్మజునితో నేమి చెప్పెనో చూడుడు—

"గుహ్య మేత త్తు దేవానాం కథయిష్యామి తేఽనఘ।
త న్నిబోధ మహాబాహో యథావృత్త మిదం పురా॥
క్షత్రం స్వర్గం కథం గచ్ఛే చ్ఛస్త్రపూత మితి ప్రభో।
సంఘర్ష జనన స్తస్మా త్కన్యాగర్భో వినిర్మితః॥
స బాల స్తేజసా యుక్త స్సూతపుత్రత్వ మాగతః।

టీ—కి మర్థం దేవైః కర్ణార్జునయో ర్వైర ముత్పాదిత మిత్యాశంక్యాహ—గుహ్యమితి, క్షత్రియమితి. సంఘర్ష జననో వైరాగ్న్యుద్దీపకః కన్యాగర్భో దేవైః క్షత్రస్య స్వర్గమనాయ నిర్మిత ఇత్యర్థః.

"స సఖ్య మకరో ద్బాల్యే రాజ్ఞా దుర్యోధనేన చ।
యుష్మాభి ర్నిత్యసంద్విష్టో దైవా చ్చాపి స్వభావతః॥ (శాన్తి అ 2)

టీ—దైవాచ్చాపి స్వభావతఇతి, దైవాత్ దేవానాం సంకల్పాత్ పూర్వోక్తాత్ స్వభావతః—"వీర్యాధికో నీచకులో దుస్సంగేన సమేధితః। మహాజనైః స్పర్ధమానో హన్తి రాష్ట్రం సరాజకమ్॥" ఇతి శ్లోకోక్తాత్.

ధర్మజా! కర్ణార్జునులకు మహావైరము దేవతలచే నెందు నిమిత్తము ఉత్పాదింపబడిన దనగా క్షత్రియజాతి శస్త్రహతమై స్వర్గతిని పొందుటకు సాధనముగా నది యుత్పాదింపబడినది. అట్టి కార్యసిద్ధికే వైరాగ్నుద్దీపక మగు కన్యాగర్భము నిర్మాణము చేయబడినది. ఇదంతయు దేవరహస్యము. తేజశ్శాలియైన ఆబాలుడు సూతపుత్త్రత్వమును పొందినాడు. బాల్యమునుండియు దుర్యోధనునితో సఖ్యము చేసినాడు. దేవతాసంకల్పమునుబట్టియు, "వీర్యాధిక్యము, నీచకుల సంబంధము, దుస్సాంగత్యము, మహాజనస్పర్ధ అను లక్షణములు కల వాడు రాజసహితముగా రాష్ట్రమును నశింపజేయును" అని చెప్ప బడిన స్వభావమునుబట్టియు నాతడు ధర్మజా! మీయెడల నిత్య ద్వేషియై వ్యవహరించినాడు. అని చెప్పియుండెను.

ఇట్లు కన్యాగర్భనిర్మాణము, సూతపుత్త్రత్వఘటన, అజ్ఞాత చర్యగా అమోఘమైన దేవతాసంకల్పమునుబట్టి జరిగియుండగా నిర్దుష్టురాలైన కుంతీకన్యకను స్త్రీబుద్ధి యనుచు దూషింపబూనుట, మొదట వెల్లడింపకుండుట ఆమె తప్పనుట యుక్తము కాదు.

తరువాత దుర్యోధనప్రాణమిత్త్రుడై కర్ణుడున్నస్థితిలో కర్ణుని కామె వెల్లడించినను దుర్యోధనుని ఆతడు విడువకున్నపుడు ధర్మరా జాదుల కామె తెలిపినదికాదనియు, వారికి తెలిపినయెడల వారికిగూడ కర్ణునితోబాటు దుర్యోధనసేవకత్వమే వచ్చిపడునని, అప్పుడు ధార్త రాష్ట్రులపై తాను పగదీర్చుకొనుట కవకాశము లేకపోవు నని భావించియే కర్ణోత్పత్తిరహస్యము ధర్మరాజాదులకు తెలిపినది కాదు. అనియు ప్రతివాదు లనుట అయుక్తము.

ఆమె చెప్పినను కర్ణుడు వినిపించుకొనలేదనుచున్న ప్రతివాదులు తమపై మహాశత్రుత్వము వహించియున్న కర్ణదుర్యోధనులయెడ ధర్మరాజాదులు విసమాత్రము సౌహార్దము వహింతురని యెట్లనుకొని నారు? సౌహార్దమును వారు వహించువారే అని తోచినపుడు,

మాతృవాక్యముకంటె దుర్యోధనసఖ్యమే తనకు ముఖ్య మనుకొనిన కర్ణునికంటె మాతృవాక్యమే మనకు ముఖ్యమను పాండవులు శ్రేష్ఠులని ప్రతివాదులు తెలిసికొనినా రన్నమాటే.

ప్రతివాదులు- దుర్యోధనాదులపై పగదీర్చుకొనుటకై పాండవులతో కర్ణోత్పత్తి విషయము కుంతీదేవి చెప్పదయ్యె అని కదా వ్రాసినారు. ఆమెకు పగతీరుట యెప్పుడు ? పాండవులు వారిని హింసించినప్పుడు. అట్టి హింస వారికి లేకుండుటకు కర్ణునితో ఆమె చెప్పినదా ? హింస కలిగించుటకు చెప్పినదా ? కర్ణుడు దుర్యోధనునకు గుండెకాయ. పాండవుల కనువర్తియగువాడు. అట్టివాడు ఎవ్వనికిని హింస లేకుండ జేయవచ్చునుగదా. పాండవులది పాండవుల కిప్పింపవచ్చునుగదా. తనకు పంచగ్రామముల నిప్పించినైన వారికోరిక తీర్పవచ్చునుగదా. ఆపనిచేత దుర్యోధనునకు నష్టముగాని, న్యూనతగాని లేదుకదా. యుద్ధము లేకుండ జనక్షయము కాకుండ తాను చేయవచ్చునుకదా. ఆవిధమున తన దుర్యోధనభక్తిని ప్రకటించుకొనవచ్చునుకదా.

కుంతీదేవి మాటను, ఆసమయమందలి సూర్యదేవుని వాక్యమునుగూడ త్రోసివేసి దుర్యోధనునిలోనే చేరినాడను అపకీర్తి లేకుండ జేసికొనవచ్చునుగదా. అట్టిస్థితిలో తత్త్వము తెలిసిన కర్ణుడెందు కుపేక్షించెను.

ఇది చూడగా పాండవులను హింసించి పగ దీర్చుకొను తలంపున్నవాడు కర్ణుడుగాని, దుర్యోధనాదులను హింసించి పగదీర్చుకొను తలంపున్నది కుంతీదేవి కాదని తెలియుటలేదా?

ధర్మరాజాదులతో అప్పుడు కుంతీదేవి చెప్పలేదని నెపమా ? కర్ణుని ఆనుకూల్యము చూచుకొని ఆపై వారితో చెప్పవచ్చునని ఆమె యూహించియుండును. కర్ణుని బుద్ధి తిరుగలేదు. అప్పుడు వారితో

జెప్పుట అనర్థావహము కాదా ? దూరదృష్టికలిగి లోకక్షేమము గోరియున్న సాధ్వి, కౌరవపాండవపురోభివృద్ధికై యెక్కడ జెప్పవల యునో అక్కడ జెప్పినది. అట్టి కుంతీదేవిని గూర్చి 'స్త్రీబుద్ధిః ప్రళ యాంతికా' అని ప్రతివాదు లనుట నింద్యము. అప్రళయాంతకబుద్ధి కర్ణునిదై యుండుటచే—"పుంబుద్ధిః ప్రళయాంతికా" అనియే చెప్ప వలయును. కనుక ప్రతివాదిప్రసంగము నిరస్తమైనది.

—♦ కర్ణుడు సూతకులమునకు జేరిన విధము ♦—

నాడు కుంతీకన్యకచే రక్షాబంధనదేవతాప్రార్థనాంగరక్షా విధానపూర్వకముగా శిశువును పదిలముగా పరుండబెట్టి మూతవేసి దైవముపై భారమువైచి అశ్వనదీప్రవాహమున విడువబడినమంజూష—

"మంజూషా త్వశ్వనద్యాః సా యయౌ చర్మణ్వతీం నదీమ్।
చర్మణ్వత్యాశ్చ యమునాం తతో గంగాం జగామ హ॥
గంగాయాః సూతవిషయం చంపా మనుయయౌ పురీమ్।
స మంజూషాగతో గర్భ స్తరంగై రుహ్యమానకః॥
అమృతా దుత్థితం దివ్యం తనువర్మ సకుండలమ్।
ధారయామాస తం గర్భం దైవం చ విధినిర్మితమ్॥ (వన. అ. 308)
టీ—దైవం దేవజం విధినా ఈశ్వరేణ నిర్మితమ్.

అశ్వనదినుండి ప్రవాహానుగతముగా చర్మణ్వతీనదిలో ప్రవే శించి, దానినుండి యమునానదిలో, దానినుండి గంగానదిలో ప్రవే శించి, దానినుండి క్రమముగా సూతుని నివాసస్థానమైన చంపాపుర ప్రాంతమునకు జేరినది. అందున్న శిశువును దేవసంభూతుని, ఈశ్వర నిర్మితమై అమృతోద్భూతమై యున్న కవచకుండలములు కాపాడు చున్నవి. ఆసమయమునకు ధృతరాష్ట్రుని సఖుడగు అధిరథుడను సూతుడు సంతతిలేకున్నట్టి తన భార్య యగు రాధతోగూడ గంగా నదికి స్నానమునకై వెళ్ళియుండెను. ఆరాధ సంతతికై దేవతల నారాధించుచు వ్రతాదులతో కాలము గడుపుచున్న సాధ్వి.

"సా దదర్శాఽథ మంజూషా ముహ్యమానాం యదృచ్ఛయా ।
ఊర్మితరంగై ర్జాహ్నవ్యా స్సమానీతా ముపహ్వరమ్ ॥
సా తు కౌతూహలా త్ప్రాప్తాం గ్రాహయామాస భావినీ ।"

ఆమె తరంగపంక్తిద్వారా పుణ్యవిశేషమున తన సమీపమునకు గంగచే తీసికొనిరాబడిన ఆ మంజూషను రక్షాబంధకుంకుమచిహ్నయుక్తమై యున్నదానిని చూచి కుతూహలముతో భర్తకు జెప్పి తీయించెను.

"స తా ముద్ధృత్య మంజూషా ముత్సార్య జల మంతికాత్ ।
యన్త్రై రుద్ఘాటయామాస సోఽపశ్య త్తత్ర బాలకమ్ ॥
తరుణాదిత్యసంకాశం హేమవర్మధరం తథా ।
మృష్టకుండలయుక్తేన వదనేన విరాజతా ॥
అంక మారోప్య తం బాలం భార్యాం వచన మబ్రవీత్ ।
అనపత్యస్య పుత్రోఽయం దేవై ర్దత్తో ధ్రువం మమ ॥
ఇత్యుక్త్వా తం దదౌ పుత్రం రాధాయై స మహీపతే ।
ప్రతిజగ్రాహ తం రాధా విధివ ద్దివ్యరూపిణమ్ ।
పుత్రం కమలగర్భాభం దేవగర్భం శ్రియా వృతమ్ ॥
పుపోష చైనం విధివ ద్వవృధే స తు వీర్యవాన్ ।
తతః ప్రభృతి చాప్యన్యే ప్రాభవ న్నౌరసా స్సుతాః ॥ (వన. అ. 309)

అనూతుడు ఆమంజూషను ఒడ్డునకు దెచ్చి యంత్రములచే దాని మూతను తెరచి అందు బాలసూర్యసమానుడు, సువర్ణకవచకుండలవిరాజితుడు అగు బాలుని జూచి ఆశ్చర్యపడి తొడపై బెట్టుకొని భార్యతో నిట్లనెను— మానినీ! సంతతి లేనట్టి నాకు దేవతలు ఈపుత్రుని ప్రసాదించినారు; ఇది నిజము. ఇట్లనుచు భార్యచేతికందింపగా నామె పరమానందముతో గ్రహించి పోషించుచుండ ఆబాలుడు పెరుగుచుండెను. అక్కడనుండి అనూతదంపతులకు ఔరసపుత్రులును కలిగిరి.

"వసువర్మధరం దృష్ట్వా తం బాలం హేమకుండలమ్ ।
నామాఽస్య వసుషేణేతి తత శ్చక్రు ర్ద్విజాతయః ॥

ఏవం స సూతపుత్రత్వం జగామాఽమితవిక్రమః।
సూతస్య వవృధేఽంగేషు శ్రేష్ఠః పుత్రః స్స వీర్యవాన్॥
టీ—అంగేషు జనపదవిశేషేషు।
చారేణ విదిత శ్చాసీ త్పృథయా దివ్యవర్మభృతత్।

ఆబాలుడు సువర్ణకవచాదులు కలిగియుండుటను బట్టి ద్విజులు ఆబాలునకు వసుషేణుడని నామకరణము చేయించినారు. ఇట్లు ఆ బాలుడు సూతపుత్రత్వమును పొంది అంగదేశములో పెరుగుచుండెను. కుంతీకన్యక చారులవలన సహజకవచకుండలములను బట్టి ఆబాలుని యోగక్షేమములు తెలిసికొనియుండెను.

—: సూతపుత్రుని విద్యాభ్యాసము, దుర్యోధనసఖ్యము, అర్జున వైరము :—

"సూత స్త్వధిరథః పుత్రం వివృద్ధం సమయేన తమ్।
దృష్ట్వా ప్రస్థాపయామాస పురం వారణసాహ్వయమ్॥
తతో్రపసదనం చక్రే ద్రోణ స్యేష్వస్త్రకర్మణి।
టీ—ఉపసదనం=గురూపసదనమ్.
సఖ్యం దుర్యోధనేనైవ మగమ త్స చ వీర్యవాన్।
ద్రోణాత్ కృపా చ్చ రామాచ్చ సోఽస్త్రగ్రామం చతుర్విధమ్॥
లబ్ధ్వా లోకేఽభవత్ ఖ్యాతః పరమేష్వాసతాం గతః।
సన్ధాయ ధార్తరాష్ట్రేణ పార్థానాం విప్రియే రతః॥
యోద్ధు మాశంసతే నిత్యం ఫాల్గునేన మహాత్మనా।
సదాహి తస్య స్పర్థాసీ దర్జునేన విశాంపతే॥
అర్జునస్య చ కర్ణేన యతో దృష్టో బభూవ సః॥
ఏత ద్గుహ్యం మహారాజ సూర్యస్యాసీ న్న సంశయః।
య స్సూర్యసంభవః కర్ణః కుస్త్యాం సూతకులే తథా॥ (వన. అ. 309)

అధిరథు డను పేరుగల ఆసూతుడు విద్యాభ్యాసమునకు తగిన వయస్సు కలిగియున్న తన పుత్రుని హాస్తినాపురమునకు బంపగా నాతడు ద్రోణాచార్యునియొద్ద ధనుర్విద్యాభ్యాసము జేయుచుండెను. అనిమిత్తమున దుర్యోధనసహవాస మాతని కబ్బెను. ఆతడు ద్రోణా

చార్య కృపాచార్యులయొద్దనే కాక పరశురామస్వామియొద్ద గూడ శిష్యత్వము జేసి చతుర్విధాస్త్రగ్రామమును పొంది మహాధనుర్ధరుడని ఖ్యాతి వహించెను. దుర్యోధనునియందు ప్రీతి, పాండవులయందు ద్రోహచింత కలిగి మహాత్ముడైన అర్జునునితో డీకొనుటకై నిత్యము తలపోయుచుండువాడు. ఎప్పుడు జూచినను అతనికి అర్జునస్పర్ధయే ఉండెడిది. ఆసూతపుత్రుని చూచినది మొదలు అర్జునునకును అతని యందు స్పర్ధ యుండెడిది.

కుంతీకన్యకయందు సూర్యసంభూతుడైన కర్ణుడు ఆవిధముగా సూతకులమునకు జెంది యీపద్ధతినుండుట నిస్సంశయముగా సూర్య దేవుని గుప్తసంకల్పమే అని భావము.

—: సూతపుత్రుడు ద్రోణాచార్యుని విడిచి పరశురాము నాశ్రయించుట :—

యుద్ధానంతరము ధర్మజునకు కర్ణవృత్తాంతము నారదు డిట్లు చెప్పెను—

"వీర్యాధిక మథాలక్ష్య ధనుర్వేదే ధనంజయమ్ ।
ద్రోణం రహ స్యుపాగమ్య కర్ణో వచన మబ్రవీత్ ॥
బ్రహ్మాస్త్రం వేత్తు మిచ్ఛామి సరహస్యనివర్తనమ్ ।
అర్జునేన సమం చాహం యుధ్యేయ మితి మే మతిః ॥
సమః శిష్యేషు వః స్నేహః పుత్రే చైవ తథా ధ్రువమ్ ।
త్వత్ప్రసాదా న్న మాం బ్రూయు రకృతాస్త్రం విచక్షణాః ॥
ద్రోణ స్తథోక్తః కర్ణేన సాపేక్షః ఫాల్గునం ప్రతి ।
దౌరాత్మ్యం చైవ కర్ణస్య విదిత్వా త మువాచ హ ॥
బ్రహ్మాస్త్రం బ్రాహ్మణో విద్యా ద్యథావచ్చరితవ్రతః ।
క్షత్రియో వా తపస్వీ యో నాన్యో విద్యా త్కథంచన ॥
ఇత్యుక్తోఽంగిరసాం శ్రేష్ఠ మామన్త్ర్య ప్రతిపూజ్య చ ।
జగామ సహసా రామం మహేన్ద్రం పర్వతం ప్రతి ॥" (శాంతి-అ 2)

ధనుర్వేదమందు అధికప్రావీణ్యము వహించిన పార్థుని జూచి ద్రోణాచార్యునితో రహస్యముగా కర్ణు డిట్లు ప్రసంగించెను—

మహాత్మా! నేను బ్రహ్మాస్త్రము ప్రయోగోపసంహారములతో నీయొద్ద నుపదేశము నొందఁగోరియున్నాను. తీసిపోకుండ అర్జునితో యుద్ధముచేయు సంకల్పము నాకున్నది. నీవు పుత్రునియందును, శిష్యులయందును సమానదయగలవాఁడవు. నేను బ్రహ్మాస్త్రము తెలియనివాఁడ నని లోకులు నన్ననకుండునట్లు అనుగ్రహింపుము. అని.
అది విని పార్థునియందు ప్రేమాతిశయముగల ద్రోణాచార్యుఁడు కర్ణుని దుర్వృత్తిని తెలిసికొని యిట్లు చెప్పెను—వ్రతాచరణముగల బ్రాహ్మణుఁడు, తపస్వియైన క్షత్రియుఁడు తప్ప అన్యుఁడు బ్రహ్మాస్త్రగ్రహణమున కధికారి కాఁడు. అని.

అది విని కర్ణుఁడు నమస్కరించి సెలవు దీసికొని వెంటనే పరశురాము నాశ్రయించుటకై మహేంద్రపర్వతమునకు వెళ్లెను.

—♦ నేను బ్రాహ్మణుఁడ నని చెప్పి కర్ణుఁడు పరశురామునియొద్ద ప్రవేశించుట ♦—

"స తు రామ ముపాగమ్య శిరసాఽభిప్రణమ్య చ ।
బ్రాహ్మణో భార్గవోఽస్మీతి గౌరవేణాఽభ్యగచ్ఛత ॥
టీ. గురురేవ పితేత్యభిసన్ధాయాహం బ్రాహ్మణో భార్గవోఽస్మీతి ।
"రామ స్తం ప్రతిజగ్రాహ పృష్ట్వా గోత్రాది సర్వశః ।
ఉష్యతాం స్వాగతం చేతి ప్రీతిమాం శ్చాఽభవ ద్భృశమ్ ॥
తత్ర కర్ణస్య వసతో మహేన్ద్రే స్వర్గసన్నిభే ।
గన్ధర్వై రాక్షసై ర్యక్షై ర్దేవై శ్చాసీ త్సమాగమః ॥
స తత్రేష్వస్త్ర మకరోత్ భృగుశ్రేష్ఠా ద్యథావిధి ।
ప్రియ శ్చాఽభవ దత్యర్థం దేవదానవరక్షసామ్ ॥" (శాంతి-అ 2)

కర్ణుఁడు పరశురామునియొద్దకు వెళ్ళి సాష్టాంగనమస్కారము చేసినపుడు ఆపరశురాముఁడు కుశలప్రశ్నపూర్వకముగా కులగోత్రముల నడుగ బ్రాహ్మణుఁడను భృగువంశసంభూతుఁడను అని కర్ణుఁడు చెప్పెను. ఇట్లు చెప్పుటలో తాత్పర్య మేమనగా గురువే తండ్రి; అట్టి గురువు పరశురాముఁడు; ఆతని కులగోత్రములే తనవి అను తాత్పర్యముతో మనసుపెట్టి కర్ణుఁడట్లు చెప్పియుండెను.

అది విని యాకర్ణుని స్వీకరించి యాతనియందు పరశురాము డధికప్రీతి కలిగియుండెను. ఆమహేంద్రపర్వతమందు అస్త్రము లభ్యసించుచుండ దేవగంధర్వరాక్షసులతో సమావేశము, కర్ణునియందు వారి కధికప్రీతి సంభవించినవి.

—: కర్ణునకు బ్రాహ్మణశాపప్రాప్తి :—

"స కదాచి త్సముద్రాన్తే విచర న్నాశ్రమాంతికే ।
ఏకః ఖడ్గధనుష్పాణిః పరిచక్రామ సూర్యజః ॥
సోఽగ్నిహోత్రప్రసక్తస్య కస్యచి ద్బ్రహ్మవాదినః ।
జఘానాఽజ్ఞానతః పార్థ హోమధేనుం యదృచ్ఛయా ॥
త దజ్ఞానకృతం మత్వా బ్రాహ్మణాయ న్యవేదయత్ ।
తం స విప్రోఽబ్రవీత్ క్రుద్ధో వాచా నిర్భర్త్సయ న్నిద ॥
దురాచార వధార్హ స్త్వం ఫలం ప్రాప్నుహి దుర్మతే ।
యేన విస్పర్ధసే నిత్యం యదర్థం ఘటసేఽనిశమ్ ॥
యుధ్యత స్తేన తే పాప భూమి శ్చక్రం గ్రసిష్యతి ।
తత శ్చక్రే మహీగ్రస్తే మూర్ధానం తే విచేతసః ॥
పాతయిష్యతి విక్రమ్య శత్రు ర్గచ్ఛ నరాధమ ।
యథేయం గౌ ర్హతా మూఢ ప్రమత్తేన త్వయా మమ ॥
ప్రమత్తస్య తథాఽరాతి శ్శిర స్తే పాతయిష్యతి ।
ఇత్యుక్తో బ్రాహ్మణేనాథ కర్ణో దైన్యా దధోముఖః ॥
రామ మభ్యగమ ద్భీత స్త దేవ మనసా స్మరన్ ।" (శాంతి. అ 2)

కర్ణు డొకప్పుడు దక్షిణసముద్రసమీపమందు ఆశ్రమప్రాంతమున ఖడ్గధనుర్ధారియై తానొక్కడే సంచరించుచు, అగ్నిహోత్రానుష్ఠానపరుడును బ్రహ్మవాదియు నగు నొకబ్రాహ్మణుని హోమధేనువును (అనగా హోమధేనువత్సమును) బాణప్రయోగములో తెలియక వధించెను. అది తెలియక చేసితి నని యాబ్రాహ్మణోత్తమునియొద్ద చెప్పుకొనెను. కాని విప్రోత్తముడు క్రుద్ధుడై ఓదుర్మతీ ! నీవు వధ్యుడవు. ఆఫలము నీవు పొందవలసినదే. యెవ్వనితో నీవు విశేషముగా స్పర్ధ పెట్టుకొని యున్నావో, ఎవ్వని నిమిత్తము ఈబాణప్రయోగా

భ్యాసము సతతము నీవు చేయుచున్నావో ఆతనితో యుద్ధము చేయు నప్పుడు నీరథచక్రము భూమిలో దిగబడును. ఆసమయమందే వికలహృదయుడవై యున్న నీశిరస్సును విక్రమించి నీశత్రువు ఛేదించును పొమ్ము. ఈగోవత్సము ప్రమత్తుడవైన నీచేత ఎట్లు హింసింపబడినదో అట్లే ప్రమత్తుడవై యున్న నిన్ను శిరచ్ఛేదము చేసి నీశత్రువు హింసించును. అని శాపముపెట్టగా కర్ణుడు దీనుడై తలవంచుకొని ఆవిషయమునే మనస్సులో తలపోసికొనుచు భీతుడై పరశురామసన్నిధికి వెళ్ళెను. ఈవిషయమును శల్యునితో కర్ణుడు గూడ చెప్పియుండెను—

"కదాచి ద్విజయస్యాఽహ మస్త్రహేతో రటన్నృప।
అజ్ఞానాద్ధి క్షిపన్ బాణాన్ ఘోరరూపాన్ భయానకాన్॥
హోమధేన్వా వత్స మస్య ప్రమత్త ఇషుణాఽహనమ్।
చరంతం విజనే శల్య తతోఽనువ్యాజహార మామ్॥
యస్మాత్త్వయా ప్రమత్తేన హోమధేన్వా హత స్సుతః।
శ్వభ్రే తే పతతాం చక్ర మితి మాం బ్రాహ్మణోఽబ్రవీత్॥
యుధ్యమానస్య సంగ్రామే ప్రాప్త స్యైకాయనం భయమ్।
తస్మాద్బిభేమి బలవ ద్బ్రాహ్మణవ్యాహృతా దహమ్॥" (కర్ణ. అ 41)

ఒకప్పుడునేను బాణములను ప్రయోగించుచున్నసమయములో విజనప్రదేశములో సంచరించుచున్న హోమధేనువత్సము నెరుగక వధింపగా నీవిట్లు చేసినందుకు భయంకరసంగ్రామములో నీరథచక్రము దించుకొనిపోవునని బ్రాహ్మణుడు శపించెను. ఆవాక్యమునకు నేను భయపడుచున్నాను; అని.

—: కర్ణునకు పరశురామశాపప్రాప్తి :—

"కర్ణస్య బాహువీర్యేణ ప్రణయేన దమేన చ।
తుతోష భృగుశార్దూలో గురుశుశ్రూషయా తథా॥
తస్మై స విధివత్ కృత్స్నం బ్రహ్మాస్త్రం సనివర్తనమ్।
ప్రోవాచాఖిల మవ్యగ్రం తపస్వీ త త్తపస్వినే॥

టీ—కృత్స్నం సరహస్యం నతు మంత్రమాత్రమ్। [illegible]
దేవతారాధనసహితమ్. అవ్యగ్రం యథా స్యాత్తథా తపస్వీ [illegible]

విదితాస్త్రః తతః కర్ణో రమమాణోఽశ్రమే భృగోః।
చకార వై ధనుర్వేదే యత్న మద్భుతవిక్రమః॥ (శాన్తి. అ. 3)

కర్ణునియొక్క బాహుబలము, ఇంద్రియజయము, గురుశుశ్రూష ఇత్యాదులకు సంతుష్టుడై పరశురాముడు బ్రహ్మాస్త్ర మా కర్ణున కుప దేశింపగా ధనుర్వేదమందు కృషిచేయుచు పరశురామాశ్రమమందు కర్ణు డుండెను.

“జామదగ్న్యుండు శపించిన తెఱంగును జెప్పెద - నవ్వీరుం డతనికి భక్తుండై పరిశ్రమంబాచరింప నతండు బ్రహ్మాస్త్రంబులోనుగా ననేకాస్త్రంబు లొసంగి బడంపడి యొక్కనాడు.

తే. కర్ణు నుత్సంగమున మస్తకంబు జేర్చి గురుడు నిద్రింప వికృతాతిఘోరరూప
1. మళక మనియెడు నొక కీట మర్కనేంద్ర తనయు క్రిందొడ దొలిచెను త్వరము గాగ
వ. అతండును గురునకు నిద్రాభంగం బగుట కోర్వక ధైర్యంబునం గీటకృత్యం బున కోర్చి యచలుండై యుండె నెత్తు గొండొండ పరగి పంశురాము శరీరంబు సోకిన నమ్మహాత్ముండు మేల్కని రక్తం బెక్కడి దని యడిగిన దొడ యొత్తి కీటంబుం జూపి యిది దొలుచుచుండ మీ నిదుర చెడుటకుం జాలక కదలకుండితి ననియె. నమ్మౌని గనుంగొనిన నక్కీటంబు.
క. మృతి బొంది రాక్షసుండై ఖతలంబున నుండి పలుకెఁ గరుణాకర నీ
కతమున దారుణశాపప్రతిహతి వాటిల్లె నిపుడు ప్రకృతి వడసితిన్.
వ. 2. గ్రిస్తుండను పేరం బరగు నొక్క రక్కసుండ భృగుపత్ని నపహరించి తదీయశాపంబునం గీటంబనై యుండి భవదీయవిశోకనామృతసేకంబున సుఖి నైతి నని చెప్పి నమస్కరించి నిజేచ్ఛం జనియె. (ఆంధ్రభారతము)

సంస్కృతములో-1 “అలర్కం నామ నామతః కృమిమ్” 2 “అహమాసం దంశో నామ మహాసురః” “శాపస్యాన్తో భవితా భార్గవా ద్రామా దితి మా మబ్రవీ ద్భృగుః” అని యున్నది.

“రామః కర్ణం చ సక్రోధ మిదం వచన మబ్రవీత్।
అతిదుఃఖ మిదం మూఢ న జాతు బ్రాహ్మణ స్సహేత్॥
క్షత్రియస్యేవ తే ధైర్యం కామయా సత్య ముచ్యతామ్।
టీ. కామయా స్వరసేన।
త ముపాచ తతః కర్ణ శ్శాపా ద్భీతః ప్రసాదయన్।
బ్రహ్మక్షత్రాంతరే జాతం సూతం మాం విద్ధి భార్గవ॥

రాధేయః కర్ణ ఇతి మాం ప్రవదంతి జనా భువి ।
ప్రసాదం కురు మే బ్రహ్మన్ అస్త్రలుబ్ధస్య భార్గవ ॥
పితా గురు ర్న సందేహో వేదవిద్యాప్రదః ప్రభుః ।
అతో భార్గవ ఇత్యుక్తం మయా గోత్రం తవాంతికే ॥

టీ. బ్రహ్మక్షత్రియా రంతరే అన్యత్ర జాతం, తదేవాహ—సూతం మాం విద్ధీతి । కథం తర్హి "బ్రాహ్మణో భార్గవో౽స్మీతి" మిథ్యావచనం త్వయోక్త మిత్యత ఆహ— పితా గురురితి ।

తరువాత పరశురాముడు- అతిదుఃఖకరమైన ఈపనిని బ్రాహ్మణుడు సహింపలేడు. ఇట్టిది క్షత్రియునకు చెల్లును. మూఢుడా ! నీ వెవ్వడవో నిజముచెప్పుమని క్రుద్ధుడై కర్ణునడుగ శాపభీతుడై కర్ణుడు వేడుకొనుచు నిట్లు చెప్పుకొనెను— నేను సూతుడను, రాధేయు డని, కర్ణు డని నన్ను లోకు లనుచుందురు. అస్త్రలోభమున ప్రవర్తించిన నన్ను అనుగ్రహింపుము. గురువే తండ్రి కనుక నేను బ్రాహ్మణుడను, భార్గవుడను అని నీయొద్ద చెప్పియున్నాను. అని.

"త మువాచ భృగుశ్రేష్ఠ స్సరోషః ప్రహస న్నివ ।
భూమౌ నిపతితం దీనం వేపమానం కృతాంజలిమ్ ॥
యస్మా న్మిథ్యోపచరితో హ్యస్త్రలోభా దిహ త్వయా ।
తస్మా దేత న్న తే మూఢ బ్రహ్మాస్త్రం ప్రతిభాస్యతి ॥
అన్యత్ర వధకాలా త్తే సదృశే న సమీయుషః ।

టీ. తస్మాదితి, హేమూఢ తే తవ వధకాలా దన్యత్ర బ్రహ్మాస్త్రం న ప్రతిభాస్యతీతి న, కింతు వధకాల ఏవ న ప్రతిభాస్యతి । కాలాంతరే తు ప్రతిభాస్యత్యేవేత్యర్థ ఇత్యుత్తరేణ సంబంధః ।

సదృశే అర్జునాదౌ శూరే పురతః స్థితే సమీయుషః యుధ్యమానస్య "సమిత్యాజి సమిద్యుధః" ఇతి సంపూర్వస్య ఇణో యుద్ధార్థత్వదర్శనాత్ ।

అబ్రాహ్మణే నహి బ్రహ్మ ధ్రువం తిష్ఠే త్కదాచన ।

టీ. ధ్రువం మరణావధి న తిష్ఠేత్ బ్రహ్మ బ్రహ్మాస్త్రమ్ ।

గచ్ఛేదానీం న తే స్థాన మనృతస్యేహ విద్యతే ।
ఏవ ముక్త స్స రామేణ న్యాయే నోపజగామ హ ॥

టీ. న్యాయేన అభివందనాదిపూర్వకం ఉపజగామ ఇష్టం దేశ మితి శేషః ।

దుర్యోధన ముపాగమ్య కృతాస్త్రో౽స్మీతి చాబ్రవీత్ ।

కర్ణ స్తు సమవాప్యైవ మస్త్రం భార్గవనందనాత్ ॥
దుర్యోధనేన సహితో ముముదే భరతర్షభ ॥" (శాంతి-అ 3-4)

కర్ణుడట్లు చెప్పి గజగజలాడుచు దీనుడై పాదములపై బడ రోషముతో పరశురాముడిట్లనెను—అస్త్రలోభమున నీవు నన్ను మోసపుచ్చినావు కనుక నీవు శూరునితో తలపడి యుద్ధముచేయుచు వధింపబడునపుడు నీకీబ్రహ్మాస్త్రము స్ఫురింపకుండుగాక. అబ్రాహ్మణుని యందు బ్రహ్మాస్త్రము మరణావధి నిలువదు. అనృత మాడిన నీకిక్కడ స్థానము లేదు. వెంటనే వెళ్ళుము. అని. అప్పుడు కర్ణుడు అభివందనపూర్వకముగా నచ్చటనుండి వచ్చి దుర్యోధనునితో కృతాస్త్రుడనైతి నని చెప్పి యాతనితో గలిసి సంతోషించెను.

ఈ పరశురామశాపప్రకారము శాంతిపర్వమందే కాక కర్ణపర్వమందును, ఉద్యోగపర్వమందును గూడ ప్రశంసింపబడినది. కర్ణపర్వములో శల్యునితో కర్ణవాక్యము—

"స మాం నిశమ్యాథ మహాతపస్వీ సంశప్తవాన్ రోషపరీతచేతాః।
సూతోపధావాప్త మిదం త్వయాస్త్రం న కర్మకాలే ప్రతిభాస్యతి త్వామ్ ॥
అన్యత్ర తు స్యా త్తవ మృత్యుకాలా దబ్రాహ్మణే బ్రహ్మ న హి ధ్రువం స్యాత్ ।
టీ—సూతోపధా=సూతత్వపిధాననిమిత్తం. కర్మకాలే=స్వప్రతిజ్ఞారక్షణకాలే ॥

"తదద్యపర్యాప్త మతీవ చాస్త్ర మస్మిన్ సంగ్రామే తుములేఽతీవ భీమే।
టీ—పర్యాప్తం=సమాప్తం, విస్మృతమిత్యర్థః।
"అస్త్రం తతోఽన్యత్ప్రతిపన్న మద్య యేన క్షేప్స్యే సమరే శత్రుపూగాన్।
టీ—అస్త్రం తతో రామదత్తా దస్త్రా దన్యత్ప్రతిపన్నం ప్రాప్తమ్। అహిబాణాఖ్య మిత్యర్థః ॥

ఆ పరశురామతపస్వి నన్నిట్లు శపించెను—సూతత్వమును కప్పిపుచ్చి నావలన నీవు పొందిన అస్త్రము మృత్యుకాలేతరకాలమందు తప్ప నీ ప్రతిజ్ఞారక్షణకాలములో నీకు స్ఫురింపకుండుగాక. అని. ఆ అస్త్రము నా కిప్పుడు విస్మృతమైనది. అయినను పరశురామదత్తమైన అస్త్రముకంటె మరియొక సర్పాస్త్రమున్నది. దానిచే శత్రుక్షయము

జేయ దును. అని. ఉద్యోగపర్వములో నిట్లున్నది— దుర్యోధనునితో కర్ణవాక్యము—

"మిథ్యాప్రతిజ్ఞాయ మయా యదస్త్రం రామాత్కృతం బ్రహ్మమయం పురస్తాత్ ।
విజ్ఞాయ తే నాస్మి తదైవ ముక్తః స్తేనాఽన్త కాలే ప్రతిభాస్యతీతి ॥"

టీ॥ స్తేనేన అంతకాలే ప్రతిభా అస్త్రస్మృతిః అస్యతి క్షిపతి త్వాం త్యక్ష్యతీత్యర్థః ।

"మహాపరాధే హ్యాపి యన్న తేన మహర్షిణాఽహం గురుణా చ శప్తః ।
శక్తః ప్రదగ్ధుం హ్యాపి తిగ్మతేజా స్ససాగరా మప్యవనిం మహర్షిః ॥
ప్రసాదితం హ్యస్య మయా మనోఽభూ చ్ఛుశ్రూషయా స్వేన చ పౌరుషేణ।
తదస్తి చాఽస్త్రం మమ సావశేషం తస్మాత్సమర్థోఽస్మి మమైష భారః॥(అ62)

టీ— సావశేషం మమాయు రస్తి అతోఽన్తకాలస్యాఽనుపస్థితత్వా త్తదస్త్రం మమాస్తీతి అహం సమర్థోఽస్మి అర్జునం జేతు మిత్యర్థః ।

దుర్యోధనా ! నే నసత్యమాడి పొందిన బ్రహ్మాస్త్రమును గూర్చి పరశురామమహర్షి— ఓచోరుడా ! నీకిది అంతకాలములో స్మృతికి రాదని పలికెను. నేను చేసినది మహాపరాధమైనను ఆమహర్షి ప్రపంచము దగ్ధముచేయగలవాడైనను నాశుశ్రూషాపౌరుషములను బట్టియు, నాప్రార్థనను బట్టియు ప్రసన్నుడగుటచే ఇంతకంటె యధికముగా నన్ను శపించలేదు. నేనింకను ఆయుశ్శేషము కలవాడ నగుటచే అంత కాల మిప్పుడు కానందున ఆ అస్త్రబలము నాకున్నది. అర్జునుని జయించుటకు నేను సమర్థుడను. అని.

ఇట్లు మూడుస్థలములలోను పరశురామశాపప్రకారము అంత కాలములో స్ఫురింపక ఇతర కాలములో స్ఫురించునట్లే శ్లోకములను సమన్వయించి నీలకంఠాచార్యులు ప్రకర్శించియుండెను.

—♦ ఆంధ్రభారతోక్తపరశురామశాపప్రకారము ♦—

శాంతిపర్వము—1అ— "నీవు బ్రాహ్మణుండ నని కపటంబున మత్పరిగ్రహంబు వడసితి. తత్ఫలం బనుభవింపు మని యస్త్రవిభవంబు వికలంబుగా శపియించె గర్ణుండును జేయునదిలేక వగచుచు వచ్చి దుర్యోధనుం గాంచి.

ఆ. అధిప పరశురాము నాశ్రయించితి గృతాస్త్రుండ నైతి నన్ను భండనమున
మార్కొనంగలేరు మగలిజ్జగంబున ననుడు నతడు ప్రమదితాత్ము డయ్యె.

ఇచ్చట అస్త్రము ఫలింపదని శపింపబడి వచ్చి దుర్యోధనునితో నేను కృతాస్త్రుడ నైతిని. నన్నెవ్వరు నెదుర్కొనలేరు. అని కర్ణుడు చెప్పినట్లున్నది. ఇది కర్ణుని దుర్నయమును ప్రకటించును.

ఇది మూలశ్లోకసమన్వయములో వచ్చిన భేదము చూడుడు—

"యస్మా న్మిథ్యోపచరితో హ్యస్త్రలోభా దిహ త్వయా।
తస్మా దేత న్న తే మూఢ బ్రహ్మాస్త్రం ప్రతిభాస్యతి॥"

'తే బ్రహ్మాస్త్రం న ప్రతిభాస్యతి' అని యన్వయించి 'అస్త్ర విభవము వికలంబుగా శపియించె' అని యాంధ్రీకరింపబడినది.

"అన్యత్ర వధకాలా త్తే సదృశేన సమీయుషః" సదృశేన సమీయుష స్తే వధకాలా దన్యత్ర" అని యన్వయించి సమానునితో డీకొనిన నీకు వధకాలములో తప్ప ప్రతిభాసింపదని యర్థముచేసి వధకాలములో ప్రతిభాసించినను వ్యర్థమే యని యటు లాంధ్రీకరింపబడినది.

నీలకంఠాచార్యసమన్వయములో—"సదృశే న" అని విడదీసి సదృశే పురస్థితేసతి అని అధ్యాహారముతో నన్వయించి పూర్వవాక్యములోని 'న' కారమును ఉత్తరవాక్యములోని 'న'కారముతో కలిపి "తే వధకాలా దన్యత్ర బ్రహ్మాస్త్రం న ప్రతిభాస్యతీతి న, కింతు వధకాల ఏవ న ప్రతిభాస్యతి, కాలాంతరే తు ప్రతిభాస్య త్యేవ" అని యర్థము చేయబడినది. ఈపక్షములో కర్ణుడు దుర్యోధనునితో కృతాస్త్రుడ నైతి నని చెప్పుట యుక్త మగును.

కర్ణపర్వము-2 ఆ—"అసంయమి గోపించి కపటంబున బ్రహ్మాస్త్రంబు పరిగ్రహించి తది నీకు వలయు కాలంబున దోపమియు, మృత్యు వాసన్నంబైనం దోచుటయు నాపద మట్టినయెడ భార్గవాస్త్రంబు దోపకుండుటయుం గలిగెడు మని శపించె నిది జామదగ్న్య కోపంబు తెఱంగు"

ఇది మూలశ్లోకపాఠభేదముచే వచ్చిన భేదము. చూడుడు—

"తవాస్త్రం న కర్మకాలే ప్రతిభాస్యతి త్వాం। అన్యత్ర తస్మా త్తవ మృత్యుకాలాత్" అను శ్లోకములో 'తస్మాత్' అనుపాఠములో

"తస్మాత్ మృత్యుకాలాత్ అన్యత్ర కర్మకాలే న ప్రతిభాస్యతి" అని యన్వయించి మృత్యుకాలములో తోచునట్లు, ఇతర కాలములో స్ఫురింపనట్లు అంధ్రీకరింపబడినది.

నీలకంఠాచార్య సమ్మతపాఠము— 'అన్యత్ర తస్మాత్' అని కాదు. 'అన్యత్ర తు స్యాత్త్వవ మృత్యుకాలాత్' అని. అందుచే మృత్యుకాలమందు తప్ప యితరకాలమందు స్ఫురించునని యే సమన్వయము చేయబడినది. ఈపక్షములోనే కృతాస్త్రిఉ నైతి నని దుర్యోధనునకు జెప్పుట యుచితమగును.

ఉద్యోగపర్వము— ఆ 2. "కర్ణుండు ధార్తరాష్ట్రునకుం బ్రియంబుగా నిట్లనియె—

క. గురు నలుక నాకు నస్త్రస్ఫురణవెకలె నందుఱ జనులు బొంకరిది పూజా
పరత మెయి నమ్మునీశ్వరు కరుణ గ్రాజవి మగుడ బడయుగాంచితి బ్రీతిన్.

ఉ. కావున నస్త్రశస్త్రము లఖండితసంపద నొందియుండ దే
వావలిక్కైన నన్ను జెనయన్ భరమే గలుగంగ నర్జునుం
జే విడిపించు మేదిని గడింది మగంటిమి యుల్లసిల్లగా
నీవు బలంబు మెచ్చ నని నిల్చెద గెల్చెద బాండవేయులన్."

ఇచ్చట అస్త్రస్ఫూర్తి వికలమైన దని లోకులనుకొనుట అసత్యము. గురువును ప్రార్థించి మరల పొందినాను. పాండవులను జయించు భారము నాది. అని చెప్పినట్లున్నది. ఇది వెనుకజూపిన కర్ణపర్వశాంతి పర్వములలోని గ్రంథములకు విరుద్ధముగనే యున్నది.

మూలములో మూడుస్థలములలోను నీలకంఠీయటీకాసమన్వయసరణిని బట్టి విరోధము లేదు. అదియే వ్యాఖ్యాతలోని విశిష్టత. దీనినిబట్టి ప్రతివాదులు వ్యాఖ్యాతయొక్క ఘనతను గ్రహింతురుగాక!

## —: పాండవవిద్వేషులగు కర్ణదుర్యోధనుల బాల్యస్నేహము అర్థసంబంధమూలమున ప్రబలుట :—

విద్యాభ్యాసమునకు దగిన వయస్సు వచ్చినతరువాత హస్తినాపురమునకు జేరి అచ్చట కృపాచార్యద్రోణాచార్యసన్నిధిని పాండవుల

తోడను, కౌరవులతోడను గలిసి ధనుర్విద్యాభ్యాసము చేయుచున్న పుడు— "సంధాయ ధార్తరాష్ట్రేణ పార్థానాం విప్రియే రతః" దుర్యోధనునితో సఖ్యము జేసి పాండవవిద్వేషము వహించిన కర్ణుడు, బ్రహ్మాస్త్రసంపాదనమునకై పరశురామసన్నిధికి బోయి అచ్చట గొంతకాలము సేవించి యెట్లో అస్త్రమును సంపాదించుకొని అనృత మాడిన నీవిక్కడనుండి వెళ్ళుమనిన మాటపై పరశురామసన్నిధినుండి లేచి వచ్చెను.

అప్పటికి హాస్తినాపురములో కుమారాస్త్రవిద్యాప్రదర్శనము లకు ఏర్పాటు చేయబడి ఆప్రదర్శనము జరుగుచున్నది. ప్రేక్షకమహా జనసంఘముయొక్క కౌతూహలముతోడను, మంగళవాద్యఘోష ములతోడను విరాజిల్లుచున్న రంగస్థలములో—

"తత శ్శుక్లాంబరధర శ్శుక్లయజ్ఞోపవీతవాన్ ।
శుక్లకేశ స్సితశ్మశ్రు శ్శుక్లమాల్యానులేపనః ॥
రంగమధ్యం తదాచార్య స్సపుత్రః ప్రవివేశ హ ।"

శుక్లవస్త్రములను, శుక్లయజ్ఞోపవీతమును, శుక్లశ్మశ్రుకేశము లను శుక్లమాల్యానులేపనములను ధరించి ద్రోణాచార్యుడు అశ్వత్థా మతో గూడ రంగస్థలమధ్యమునకు వచ్చెను.

ద్రోణాచార్యానుజ్ఞపై రాజకుమారులు తమతమ ప్రావీణ్య మును ప్రదర్శించుచుండ భీమసేనదుర్యోధనులు మల్లయుద్ధమునకు దిగిన తరువాత కొంతసేపటికి వారిని అశ్వత్థామచే నివారింపజేసి ఆపై ద్రోణాచార్యుడు అర్జునున కనుజ్ఞ నీయ నాతడు తన వివిధాస్త్రశక్తు లను అద్భుతముగా ప్రదర్శించి యుండ—

"తత స్సమాప్తభూయిష్ఠే తస్మిన్ కర్మణి భారత ।
ద్వారదేశా త్సముద్భూతో మాహాత్మ్యబలసూచకః ॥
వజ్రనిష్పేషసదృశః శుశ్రువే భుజనిస్స్వనః ।
ద్వారం చాఽభిముఖా స్సర్వే బభూవుః ప్రేక్షకా స్తదా ॥"

ఆ ప్రదర్శనము సమాప్తము కాబోవునంతలో ద్వారదేశము

నుండి బలాతిశయసూచకమైన భుజాస్ఫాలనమహాధ్వని యొకటి విన బడగా ప్రేక్షకు లందరు ద్వారమువైపు చూచుచుండిరి.

అంతట కర్ణుడాద్వారమునుండి యుజ్జ్వలరూపముతో వచ్చి స్పర్ధతో పార్థుని సంబోధించి నీవు చేసిన పనులకంటె విశేషముగా నేను చేయుదు ననెను. అపై ద్రోణాచార్యానుమతిపై—"యత్కృతం తత్ర పార్థేన త చ్చకార మహాబలః" అర్జునుడు చేసిన పను లన్నియు కర్ణుడును చేసెను.

"అథ దుర్యోధన స్తత్ర భ్రాతృభి స్సహ భారత !
కర్ణం పరిష్వజ్య ముదా తతో వచన మబ్రవీత్ ॥
స్వాగతం తే మహాబాహో దిష్ట్యా ప్రాప్తో౽సి మానద ।
అహం చ కురురాజ్యం చ యథేష్ట ముపభుజ్యతామ్ ॥

అప్పుడు దుర్యోధనుడు కర్ణుని కౌగలించుకొని నీరాక నాకు సంతోషకరము. నన్ను, కురురాజ్యమును నీయిష్టప్రకారము వినియోగించుకొనుము. అని పలికెను.

ఈకురురాజ్యసమర్పణవచనముతో పాండవులద్వైయుండి తన హస్తగతమయియున్న రాజ్యమును కర్ణుడే తమకు స్థిరపరుపగలడనియు, అర్థసంబంధముతో కర్ణుని కట్టుకొనవలయు ననియు, తనవలె పాండవ విద్వేషముగల కర్ణుడే తన్నుద్ధరింపగలడనియు, పార్థుని సంహరింపగల వీరుడు కర్ణుడనియు దుర్యోధనుని యాంతర్యము. అట్లు కాకున్నచో పార్థునితో సమానముగా స్వశక్తిని ప్రకటించినంతమాత్రమున సంతోషపడవచ్చునే కాని, కురురాజ్యార్పణోక్తి యెందులకు ? అపై కర్ణుడిట్లనెను—

"కృతం సర్వ మహం మన్యే సఖిత్వం చ త్వయా వృణే ।
ద్వంద్వయుద్ధం చ పార్థేన కర్తు మిచ్ఛా మ్యహం ప్రభో ॥"

నీవిచ్చినట్లే తలచుచున్నాను, నీసఖ్యమునే నేను గోరుచున్నాను; పార్థునితో ద్వంద్వయుద్ధము జేయదలచినాను; అని. ఈ యనుటలో కర్ణుని యాంతర్య మిది—నీ మనోరథము నేను నెరవేర్తును; నీకు

రాజ్యము స్థిరపరతును; నీసఖ్యము నాకున్న జాలును. ఎప్పుడో కాదు; ఇప్పుడే పార్థునితో ద్వంద్వయుద్ధము చేసెదను; అని. ఆపై దుర్యోధను డిట్లనెను—

"భుంక్ష్వ భోగాన్ మయా సార్థం బంధూనాం ప్రియకృ ద్భవ ।
దుర్హృదాం కురు సర్వేషాం మూర్ధ్ని పాద మరిందమ ॥"

కర్ణుడా! నాతోబాటు సమస్తభోగములను నీవనుభవింపుము; నాబంధువర్గమునకు ప్రీతిని గలిగింపుము; శత్రువుల శిరస్సుపై నీ పాదము పెట్టి అణచుము; అని. ఇట్లనుటలో అంతర్యమిది—రాజ్యము మన మనుభవింతము; నీవు శత్రుక్షయము జేయుము; అని.

అంతట తన్ను ధిక్కరించుచు మాటలాడు కర్ణునితో—పార్థుడు కలుగజేసుకొని మాటలాడుటలో కొంత వాక్కలహ మేర్పడినది. ఆపై ద్రోణాచార్యానుమతిపై పార్థుడు ద్వంద్వయుద్ధమున కుద్యమించునంతట ద్వంద్వయుద్ధమర్యాదను తెలిసియున్న కృపాచార్యులు కర్ణునితో నీవు ఏరాజకులమునకు జెందినవాడవో చెప్పి ఆపై తలపడు మనియు, కర్ణుడు ఖిన్నుడగుటయు జూచి దుర్యోధనుడు—'తస్మా దేషోఽంగవిషయే మయా రాజ్యేఽభిషిచ్యతే' అట్లయిన నేనీకర్ణుని యిప్పుడే అంగరాజ్యాభిషిక్తుని జేయుచున్నా నని అట్లు చేసెను. అంగరాజ్య మందుకొని కర్ణుడు—

"ఉవాచ కౌరవం రాజన్ వచనం వృషస్తదా ।
అస్య రాజ్యప్రదానస్య సదృశం కిం దదామి తే ॥
ప్రబ్రూహి రాజశార్దూల కర్తా హ్యస్మి తథా నృప ।
అత్యంతం సఖ్య మిచ్ఛామీ త్యాహ తం స సుయోధనః ॥
ఏవ ముక్త స్తతః కర్ణ స్తథేతి ప్రత్యువాచ తమ్ ।
హర్షా చ్చోభౌ సమాశ్లిష్య పరాం ముద మవాపతుః ॥" (ఆది-అ 136)

దుర్యోధనా! నీవు నాకు జేసిన యీరాజ్యప్రదానమునకు ప్రతిఫలముగా నేను నీకేమి చేయవలెనో చెప్పుము. నేనది చేసెదను. అను కర్ణునిమాటపై నీయత్యంతసఖ్యమునే నేను గోరుచున్నాను అని దుర్యోధనుడు చెప్పగా తథాస్తు అని కర్ణు డనుటయు, కర్ణదుర్యో

ధనులు పరస్పరాలింగనము చేసికొని పరమానందము నొందుటయు జరిగినది.

దీనిని బట్టి కర్ణుడు దుర్యోధనునిపట్ల ప్రాణస్నేహము కలిగి యుండుటకు అంగరాజ్యస్వీకారరూపమైన అర్థసంబంధమే మూల మనియు, కర్ణునిపట్ల దుర్యోధను డట్లుండుటకును, పాండవరాజ్యాక్రమణసంకల్పమే మూల మనియు, ఆదినుండియు స్వతస్సిద్ధపాండవవిద్వేషమే యిరువురి సఖ్యమునకు పునాది యనియు, ఇరువురును చేపట్టిన రాజ్యములు పాండవులవే అనియు, అట్టి పాండవులసొత్తునే పరిగ్రహించి కర్ణుడు పాండవులను హింసించుటకును, దుర్యోధనునకు మూర్ధాభిషేకము జేయుటకును ప్రతిజ్ఞ చేసినా డనియు తెలిసికొనవల యును. కర్ణదుర్యోధనుల ప్రాణస్నేహము అర్థసంబంధమూలక మని సారాంశము.

అనధికారికృతమైన అంగరాజ్యప్రదానము నిరాక్షేపణముగా నెట్లు జరిగెనదో, వెనుక 'తృతీయప్రతివాదిప్రసంగనిరాకరణ' సందర్భములోను, పాండవనిందానిరాకరణము అను చతుర్థభాగములోను నిరూపింపబడినది. ఆవిశేషము లచ్చట జూడవలయును.

—: దుర్యోధనుడు భీమునకు విషాన్నము పెట్టించుట
మొదలగుపనులు కర్ణమైత్రికి పూర్వముజరిగినవే
అను ప్రసంగము—తన్నిరాకరణము :—

కర్ణచరిత్రకారుల వ్రాత యిట్లున్నది— "కర్ణమైత్రికి బూర్వమె దుర్యోధనుడు తన మేనమామ యగు శకునిప్రేరణమున పాండవులను జంప యత్నించుచుండెను. భీముని గంగలో ద్రోయించుట, పాములచేత గఱపించుట, విషాన్నము పెట్టించుట మొదలగునవి కర్ణదుర్యోధనుల మైత్రికి బూర్వమె జరుపబడినవి". (పు. 41)

వీరిట్లు వ్రాయుటకు గారణము ఆ పాండవమహాత్మ్యప్రయత్నములలో కర్ణుని సంబంధ మున్నయెడల కర్ణుని కది దుష్టత్వహేతువై అప్రతిష్ఠావహ మగు నను తాత్పర్యమే. ఈప్రతివాదులు, శకుని

దుర్యోధనులు ఆపనులు చేసినట్లు వ్రాసినారు. కనుక వారినుభ్రమను దుష్టులని వీరొప్పుకొనినట్లే. అట్టి దుష్టుని సాంగత్యము కలవాడే కర్ణుడు గనుక "తత్సంసర్గీ చ పంచమః" అనున్యాయమున కర్ణునకును దుష్టత్వమే ప్రాప్తమైన దనక తప్పదు.

ఇంకొకటి- లాక్షాగృహనిర్మాణాదివిధానమున కుంతీదేవితో బాటు పాండవులను దగ్ధము చేయుట కాలోచించినవారిలో—

"తత స్సుబలపుత్రి స్తు రాజా దుర్యోధనశ్చ హ ।
దుశ్శాసన శ్చ కర్ణ శ్చ దుష్టం మంత్ర మమంత్రయన్ ॥
దహనే తు సపుత్రాయాః కుస్త్యా బుద్ధి మకారయన్ । (ఆది-అ 14)

కర్ణుడును ముఖ్యపాత్రనే వహించినాడుగనుక దుస్సాంగత్యమును బట్టి వచ్చిన దుష్టత్వమేకాదు. దుష్టత్వ మాతనికి నైజ మని చెప్పవలసిన దే.

ఇక భీమునకు విషముబెట్టుట, గంగలో ద్రోయుట అను దుర్యోధనుని దుష్కార్యములు కర్ణదుర్యోధనుల మైత్రికి బూర్వమె జరిగిన వను మాటపై చెప్పవలసియున్నది.

కౌరవపాండవులకంటె గొన్ని సంవత్సరములకు ముందే పుట్టినవాడు కర్ణుడు. వారికంటె ముందే విద్యాభ్యాసవయస్సు వచ్చినవాడు గర్ణుడు. విద్యాభ్యాసమునకు ధృతరాష్ట్రసఖుడగుట కారణముచే సూతునిచే హాస్తినాపురమునకే పంపబడినవాడు కర్ణుడు. అట్టి కర్ణుని సాంగత్యము దుర్యోధనునకు చిన్ననాటినుండి యనుసంధవించి యున్నపుడు భీమసేనహత్యాప్రయత్నమునాటికి కర్ణునితో మైత్రి యేర్పడ లేదని ప్రతివాదులు ఎట్లనగలరు ?

ఆదుర్యోధనదురంతము లన్నియు ఆదిపర్వము 128, 129 అధ్యాయములలో చెప్పుచు వచ్చుటలో—

"తం తు సుప్తం పురోద్యానే గంగాయాం ప్రక్షిప్య హ ।
అథ తస్మా దవరజం శ్రేష్ఠం చైవ యుధిష్ఠిరమ్ ॥
ప్రసహ్య బన్ధనే బద్ధ్వా ప్రశాసిష్యే వసుంధరామ్" ।

భీమసేనుడు వనములో నిద్రించునప్పుడు గంగలో దోసివేయు దము. ఆమీఁద అర్జునిని యుధిష్ఠిరుని బలాత్కారముగా బధించిపడ వేసి రాజ్య మేలుకొనెదను. అని దురాలోచన చేసినట్లు చెప్పబడినది.

యుధిష్ఠిరుని బంధనములో బెట్టి తాను రాజ్య మేలుకొనవల చుటకూడ రాజ్యము పాండవులదే యనుటకు నిదర్శనము.

భీమసేనుడు పెట్టిన బాధలు పడలేక దుర్యోధనుడు అట్లు తలపెట్టినాడు. అను ప్రతివాదులను- ఏబాధలు పెట్టని యుధిష్ఠిరుని అర్జునుని నిగ్రహింపవలయు నను దుర్బుద్ధి యేల కలిగినదో చెప్పగ లరా ? యని మేమడుగుచున్నాము. పాండవనిందానిరాకరణములో భీమసేనునిది సుస్వభావమో దుస్స్వభావమో వివరింపబడినది. ఆవిశే షము లచ్చట జూడవలయును.

అట్లు దురాలోచనచేసిన దుర్యోధనుడు 'ప్రమాణకోటి' అను గంగాతీరప్రదేశములో ప్రవేశించి అచ్చటనే భోజ్యవస్తువులను ఏర్పా టుచేయించి కౌరవపాండవులు ఉపవిష్టులైయుండగా భీమసేనునికొరకు విషమిశ్రితపదార్థమును ప్రత్యేకము తయారుచేయించి—

"స్వయం ప్రక్షిపతే భక్ష్యం బహు భీమస్య పాపకృత్ ।
ప్రతీక్షితం చ భీమేన తం వై దోష మజానతా" ॥

స్వహస్తముతో భీమసేనునకు పెట్టుచుండ ఏమాయామర్మము లెరుగని భీమసేనుడు పూర్తిగా భక్షించె నని చెప్పబడినది.

తరువాత జలక్రీడ నందరును సాయంకాలమువరకు జరిపినారు. అంతట విషభక్షణముచేతను జలక్రీడావ్యాయామముచేతను డస్సి పోయిన భీమసేనుడు అక్కడనే ఒక స్థానమందు మైమరచి నిద్రపోయెను.

"తతో బద్ధ్వా లతాపాశై ర్భీమం దుర్యోధన స్స్వయం ।
మృతకల్పం తదా వీరం స్థలా జ్జల మపాతయత్" ॥

అంతట మృతకల్పుడై గాఢనిద్రలో నున్న భీమసేనుని పాశ ములతో దుర్యోధనుడు స్వయముగా బంధించి అన్యులకు తెలియ కుండ గంగలో పడవేయించెను.

ఆపై యందరును పురమునకు వచ్చినారు. ఆవచ్చుటలో దుర్యోధనానుయాయులు— "బ్రువన్తో భీమసేన స్తు యాతోఽగ్రే హ్యాగ్రత ఏవ నః" భీమసేనుడు ముందు వెళ్ళినాడని చెప్పుచుండగా పాండవులు నిజమే అనుకొని యింటికి వచ్చి తల్లియొద్ద లేకుంట జూచి ధర్మజుడు—

"క్వ గతో భవితా మాత ర్నేహ పశ్యామి తం శుభే ।
ఉద్యానాని వనం చైవ విచితాని సమంతతః ॥
ఆగతాస్మ మహాభాగే వ్యాకులే నాంతరాత్మనా ।
ఇహాగమ్య క్వ ను గతః త్వయా వా ప్రేషితః క్వ ను ॥"

అమ్మా! భీమసేను డెక్కడ గనబడ డేమయ్యెను? మేమెక్కడ వెదకి వెదకి ముందే వచ్చినాడనుకొని వ్యాకులముతో వచ్చినాము. వచ్చి మరెక్కడకైన వెళ్ళెనా? నీవెక్కడకైన పంపినావా? అని యాతురతతో నడుగగా కుంతీదేవి హాహాకారము చేయుచు రాలేదు, వెదకుడనుచు విదురుని రప్పించి జరిగిన గాథ జెప్పి దుర్యోధను డేమిచేసెనో అని భయముకలుగుచున్నదని ఖేదపడుచుండ దూరదృష్టిగల విదురుడు—

"మైవం వదస్వ కల్యాణి శేషసంరక్షణం కురు ।
ప్రత్యాదిష్టా హి దుష్టాత్మా శేషేఽపి ప్రహరే త్తవ ॥
దీర్ఘాయుష స్తవ సుతా యథోవాచ మహామునిః ।
ఆగమిష్యతి తే పుత్రః ప్రీతిం చోత్పాదయిష్యతి ॥"

అమ్మా! అధరస్పందము చేయవలదు. శేషించినవారిని రక్షించుకొనుము. ఆదుష్టునిగూర్చి యేమనినను మిగిలినవారిని హింసింపబూనును. నీపుత్రులు దీర్ఘాయుష్మంతులు అని నాకు మహర్షి చెప్పియుండెను. నీపుత్రుడు సుఖముగా వచ్చును. సంతోషపెట్టును. అని బోధించె నని చెప్పబడినది. ఈవిధమైన హత్యాప్రయత్నములు చేసినవారు—

"ఏవం దుర్యోధనః కర్ణః శకుని శ్చాపి సౌబలః ।
అనేకై రభ్యుపాయై స్తాన్ జిఘాంసంతి స్మ పాండవాన్ ॥"

దుర్యోధనుడు, కర్ణుడు, శకుని అని కంఠోక్తిగా జెప్పబడుటచేత గూడ దుర్యోధనకృత్యములలో కర్ణుడు కలిసియే యున్నాడు.

ఇంకొకటి— సైంధవవధానంతరము ద్రోణుడు పక్షపాతము జూపి అర్జునుని విడిచిపెట్టెను చూచితివా ! అని తనతో చెప్పవచ్చిన దుర్యోధనునితో కర్ణుడు —

చ. "అన విని కర్ణుఁ డి ట్లనియె నగ్గురు దూఱఁగ నేల నాతఁ డో
పినగతి బోరుగాక నరు బీరము లావును నెక్కు డైన వా
ని నుడుపవచ్చునే విధియ నేర్చు విషం బిడి యిల్లు గాల్చి కా
ననమున కేఁగఁజేసి యొకనాఁడు గంటిమె గొంతిసంతతిన్". (ఆంధ్ర. భా.)

పాండవవినాశనమునకై విషము బెట్టుట మొదలగుపనులు మనము చేసి నశింపజేయగలిగినామా ? ద్రోణాచార్యు ననరాదు. వారికి దైవబల మున్నది. అని చెప్పుటచేత భీమునకు విషాన్నము పెట్టించుట మొదలగు పనులు కర్ణదుర్యోధనమైత్రికి పరమందే కాని పూర్వమందు జరిగినవి కావుకనుక ప్రతివాదిప్రసంగము నిరస్తమైనది.

—: భీమసేనుడు అష్టకుండపరిమితరసము ద్రాగి నాగలోక మునుండి వజ్రశరీరుడై వచ్చుట :—

గంగలో బడవేయబడిన భీమసేనుడు అటుగంటి నాగలోకము నకు బోవ నచ్చటి సర్పములపై బడిన ఆశరీరముపై కాట్లు వేయు నంతట సర్పవిషముచేత వెనుకటి విషముయొక్క దోషము పోయి తెలివి వచ్చుటయు నచ్చట ఆర్యకు డను నాగరాజు—

"ఆర్యకేణ చ దృష్ట స్స పృథాయా ఆర్యకేణ చ ।
తదా దౌహిత్రదౌహిత్రః పరిష్వక్త స్సుపీడితమ్ ॥"

టీ॥ ఆర్యకేణ నాగరాజేన, పృథాయా ఆర్యకేణ మాతామహేన కుంతి భోజద్వారాఽయం సంబంధ ఇతి గమ్యతే । దౌహిత్రదౌహిత్ర ఇతి తు ఆర్యకనాగస్య దౌహిత్రీ శ్శూర స్తద్దౌహిత్రో భీమ ఇత్యవిరుద్ధ మేతత్ । అన్యే తు శూరమాతామహ ఏవ ఉపచారా త్కుంతీమాతామహోఽపీ త్యాహుః ॥

తనకు దౌహిత్రిదౌహిత్రుఁడగు భీమసేనుని జూచి అత్యాదర ముతో నాలింగనము జేసికొని నాగాధిపతియగు వాసుకితో నిట్లనెను—

"రసం పిబే త్కుమారోఽయం త్వయి ప్రీతే మహాబలః ।
బలం నాగసహస్రస్య యస్మిన్ కుండే ప్రతిష్ఠితమ్ ॥"

ప్రీతుఁడవైన నీయనుజ్ఞపై యీతఁడు ఒక్కొక్క కుండమునందు గల వేయియేనుగుల బలమిచ్చెడి రసమును ద్రాగునట్లు ప్రసాదింప వలయును.

"యావ త్పిబతి బాలోఽయం తావ దస్మై ప్రదీయతామ్ ।
ఏవ మస్త్వితి తం నాగం వాసుకిః ప్రత్యభాషత ॥
తతో భీమ స్తదా నాగైః కృతస్వస్త్యయన శ్శుచిః ।
ఏకోచ్ఛ్వాసా త్తతః కుండం పిబతి స్మ మహాబలః ॥
ఏవ మష్టౌ సకుండాని హ్యపిబ త్పాండునందనః ।"

ఈతఁడు త్రాగఁగలిగినంతను ఇప్పింపవలయును. అని ప్రార్థింప వాసుకి అట్లే అనుజ్ఞ నీయఁగా భీమసేనుఁడు శుచియై ఒక్కొక్క ఉచ్ఛ్వాసమునకు ఒక్కొక్కకుండము చొప్పున ఎనిమిదికుండములు రసము ద్రాగి నిద్రించి—

"తతోఽష్టమే తు దివసే ప్రత్యబుద్ధ్యత పాండవః ।
తస్మిం స్తదా రసే జీర్ణే సోఽప్రమేయబలో బలీ ॥"

ఎనిమిదవరోజునకు త్రాగిన రసము జీర్ణముకాఁగా మేలుకొని నాఁడు. తరువాత విషహరములైన ఓషధులతోఁ గూడిన పరమాన్నము భుజించి ఆనాగులచే ఆశీర్వాదపూర్వకముగా నాగలోకమునుండి యథాపూర్వవనప్రదేశమునందు ప్రవేశపెట్టఁబడి యింటికి చేరెను.

—♦ దుర్యోధనునకు సమ్మతముగా బ్రవర్తించుట కర్ణున కొక యవ గుణము కానేరదు. అనుప్రసంగము—తన్నిరాకరణము ♦—

కర్ణచరిత్రకారులు వ్రాసిన యిట్లున్నది—

1. "దుర్యోధనుని కార్యములయం దాతనికి సమ్మతముగా బ్రవర్తించుట స్వామిభక్తుఁడగు కర్ణున కొక యవగుణము కానేరదు. అదియు నదియు నదియు కాతని సుగుణపరంపరలోనే లెక్కింపఁ దగియుండును." (ఉపోద్ఘాతము)

2. స్వామిభక్తులకు తమ యధీశుల వ్యాపారములలోని మంచిచెడ్డలను విమర్శించుట లక్షణము గాకుండుటచేత గావలయును కర్ణు డట్టి విషయమున (ద్రౌపదీవిషయమున) నమ్మహాసభలో దుర్యోధనుని వ్యాపారమున కేవగింపక యాతని కనుకూలముగా బ్రసంగించి మహానిపద్దశ నున్న యాద్రౌపది నుల్లసము లాడెను; బంధకి యనెను. మహాపతివ్రతయైనట్టి ద్రౌపదిని బంధకియనుట యుచితముగా నుండలేదు" (పు 43)

ఇచ్చట ప్రథమాంశమును బరిశీలింతము—— దుర్యోధనుని కార్యము లెట్టివి? పాండవహత్యోద్యమము, పాండవరాజ్యాక్రమణము, పాండవదారాక్రమణము ఇత్యాదులు. హత్యోద్యమములో గూడ ఆహారములో విషము బెట్టుట, యింటికి నిప్పుబెట్టుట, నిద్రించు నపుడు కాలుసేతులు గట్టి గంగలో బడవేయుట; ఇత్యాదులు.

ఇట్టి కార్యములలో దుర్యోధనసమ్మతముగా సహకరించినవాడు కర్ణుడు; అట్టి కర్ణుడు స్వామిభక్తు డగుటచే నది యాతని కవగుణము కాక సుగుణములలోనే లెక్కకు వచ్చునట!

అయితే అట్టి కృత్యములు చేయుట సుగుణమే అయిననాడు లోకములో ఇక దుర్గుణ మేదియగును? మరియు కర్ణుడు స్వామిభక్తు డగుటచే నట్టికృత్యములు చేసెనా? అట్టి కృత్యములు చేయుటచే స్వామభక్తు డయ్యెనా? ఆకృత్యములను విడిచినచో చెప్పుకొనతగిన స్వామిభక్తి యాతనియం దేమున్నది? మరియు అర్థార్థసంబంధమూలకమైన పరస్పరానుబంధముతో, రాగద్వేషములతో, నైసర్గిక పాండవద్రోహచింతతో దుర్యోధనానువర్తియైన కర్ణుని స్వామిభక్తు డనుట యేమిబాగున్నది. ఆత్మవినాశహేతువులైన దుర్యోధన దుశ్చేష్టలకు ప్రోద్బల మిచ్చుట స్వామిభక్తియగునా? అపకీర్తికరములైన పాపకార్యములలో దుర్యోధనునకు సహకారి యగుట స్వామిభక్తి యగునా?

పాపకార్యములు కూడ జేయుట కర్ణుని స్వామిభక్తికి చిహ్నమన్నట్లు ప్రతివాదులు వ్రాయుట లోకవిరుద్ధము, లోకోపద్రవకరము నగుటచే హేయమైనందున ప్రథమాంశము నిరస్తము.

ద్వితీయాంశము — ద్రౌపదీవిషయమున మహాసభలోని దుర్యోధనవ్యాపారమునకు తా నేవగింపక యాతని కనుకూలముగా ప్రసంగించి ద్రౌపది నుల్లసములాడుట, బంధకి యనుట మొదలగు పనులు తమయధీశుల వ్యాపారములోని మంచిచెడ్డలువిమర్శించుట స్వామిభక్తులకు లక్షణము కాకుండుటచేత కాబోలును కర్ణుడు చేసినాడట! మహాపతివ్రతను బంధకి యనుట యుచితముగా నుండ లేదట !

కర్ణుడు చేసిన పనులనుబట్టి స్వామిభక్తుల కది లక్షణమేమో అని ప్రతివాదులు భావించుచు నది యుచితముగా నుండ లేదని వారే చెప్పుచున్నారు. కర్ణుడు పాండవులపట్ల చేసిన వనుచితకార్యము లనియే మావాదము. కొన్నియే అనుచితములున్నవని వారి వాదము కాబోలు. ప్రతివాదిమతప్రకారము స్వామికార్యములలోని మంచిచెడ్డలను విమర్శించుట స్వామిభక్తులకు లక్షణము కానట్లు స్వామిభక్తుల కార్యములలోని మంచిచెడ్డలను విమర్శించుటకూడ వివేకవంతులకు లక్షణము కాదేమో. ఏదో ఒకభక్తిని అడ్డమువేసికొని విధినిషేధములు లేకుండ ఎవ్వ డేదిచేసినను అది భక్తిలక్షణ మనిన చెల్లవలసినదేనా? ఈదుష్కార్యమున కిది శిక్ష యని చెప్పు శిష్టాస్మృతులు మూలబడవలసినదేనా? తమ ప్రభువుల వ్యాపారములలోని మంచిచెడ్డలను విమర్శించి చెప్పి మంచిపనులయందే ప్రభువులను ప్రవర్తింపజేయుట ప్రభుభక్తికి లక్షణము. కనుకనే భారవిమహాకవి—

"స కింసఖా సాధు న శాస్తి యోఽధిపం ।
హితాన్న యస్సంశృణుతే స కింప్రభుః" ॥

ప్రభువునకు సన్మార్గరూపమైన హితోపదేశము జేయని సఖుడు కుత్సితసఖుడనియు, అట్టి హితోపదేశమును చెవిని బెట్టక సంచరించు ప్రభువు కుత్సితప్రభువనియు జెప్పియుండెను. కర్ణదుర్యోధను లిట్టివారే.

"ద్యూతసభలో ద్రౌపది గెలుపు చెల్లనేరదను ప్రశ్నముపై ధర్మరాజాదులు దాసులైనపుడు వారిసొత్తగు ద్రౌపదియు దాసియగుట వింత కానేర దని చెప్పిన కర్ణుని సమాధానము మాత్రము కొంతవరకు సయుక్తికముగ నున్నది". (తృ. 44)

అను ఈప్రతివాదులవ్రాత అయుక్తమని 'ద్రౌపదీనిందానిరాకరణము' అను పంచమభాగములో విపులముగా చర్చించి నిరాకరింపబడినందున అవిశేషము లచ్చట జూడవలయును. ఇట్లు పరిశీలింపగా యుక్తాయుక్తములు లేక దుర్యోధనసమ్మతముగా ప్రవర్తించుట కర్ణునకు గొప్ప అవగుణమనియే తేలినందున ప్రతివాదిప్రసంగ మసాస్త్రమైనది.

పాండవహత్యకై దుర్మార్గము లవలంబించుట, నాటి కపట ద్యూతసభలో ద్రౌపదీపాండవులను దుర్భాషలాడుట; మొదలగు దుర్వ్యాపారములనుబట్టియే దుష్టచతుష్టయాంతర్గతుడు కర్ణుడని ప్రసిద్ధి కెక్కెను. ఇంకను గలవు చూడుడు___

___: వనవాసులై యున్న పాండవులను మనము వెళ్ళి వధింత మని కర్ణుడు దుర్యోధనున కాలోచన చెప్పుట :___

కపటద్యూతమున నోడించి యరణ్యమునకు బంపబడిన పాండవులు నాటి సాయంకాలమునకు గంగాతీర మందలి మహావటమునకు జేరియుండ వారి ననుగమించిన బ్రహ్మవాదులైన విప్రులు పాండవులను పరివేష్టించి యథోచితగోష్ఠితో నారాత్రి గడపిరి.

ప్రభాతకాలమున వనప్రవేశమునకు ప్రయాణ మగుచున్న పాండవులకు ముందుగా ఆవిప్రులును ప్రయాణ మగుట జూచి యుధిష్ఠిరుడు, మహానీయులారా ! నాతో వచ్చి కష్టపడక మీరు వెనుకకు వెళ్ళి సుఖముగా నుండుడు. మావెంట వచ్చిన మీకేమి సుఖము ? అని బోధింప ఆవిప్రోత్తములు__ మమ్ము వెంటరానిమ్ము. పొమ్మనకుము. మాపోషణభారము నీకు గలుగనీయము.

> "అస్మత్పోషణజా చిన్తా మా భూత్తే హృది పార్థివ ।
> స్వయ మాహృత్య చాఽన్నాని త్వాఽనుయాస్యామహే వయమ్ ॥
> అనుధ్యానేన జప్యేన విధాస్యామ శ్శివం తవ ।
> కథాభి శ్చాభిరమ్యాభి స్సహ రంస్యామహే వయమ్" ॥

టీ. అనుధ్యానేన ఇష్టచిన్తనేన జప్యేన స్వస్త్యయనేనేతి. అదృష్టద్వారా ఉపకార
ముక్త్వా దృష్టద్వారాపి త మాహు:—కథాభిరితి.

మమ్ములను పోషించుటకై నీవు చింతింపవద్దు; మా ఆహారము మేము సంపాదించుకొనుచు నీవెంట వచ్చెదము. మేము మీనిమిత్తము శుభాశంసనము స్వస్తివాచనము జరుపుచు కష్టములను మరపించెడి కథాగోష్ఠితో మీకు గాలక్షేపము గావింతుము. అనుచు అనుసరించిరి. తరువాత యుధిష్ఠిరుడు వారినందరను పోషించుట కుపాయము ధౌమ్యమహర్షివలన దెలిసికొని సూర్యోపాసన జేసి—

"అహ మన్నం ప్రదాస్యామి సప్తపంచ చ తే సమా: ॥
గృహ్ణీష్వ పిఠరం తామ్రం మయా దత్తం నరాధిప" ।

అన్నమక్షయముగా నీయగలయీపాత్రను మీకిచ్చుచున్నాను. దీనిచే 12 సంవత్సరములు అన్నసమృద్ధి కలుగునని సూర్యదేవుడు చెప్పి యిచ్చిన పాత్రచే ద్రౌపదీదేవి సర్వులకు సమృద్ధిగా పెట్టుచుండ కాలము గడుపుచు కామ్యకవనమందు పాండవు లుండిరి.

ధృతరాష్ట్రుడు పాండవప్రవాసమూలమున పౌరులలో గలిగిన సంరంభమును గ్రహించి విదురునితో—

"పౌరాశ్చ మే కథ మస్మాన్ భజేరన్ తే చా ప్యస్మా న్నోద్ధరేయు స్సమూలాన్ । తత్త్వం బ్రూయా స్సాధు కార్యాణి వేత్సి"

మన పౌరులు మనపై ప్రీతికలిగియుండుట యెట్లో, పాండవులు మనల నున్మూలింపకుండుట యెట్లో చెప్పుమని ప్రశంసింపగా నాతడు ఇట్లు చెప్పెను—పాండవుల రాజ్యము పాండవుల కిచ్చివేయుట, వారి సొత్తు నాశింపక చేసిన దుర్నయములను క్షమింపు డని దుర్యోధనాదులు వారిని వేడుకొనుట, దుర్యోధను డందుల కంగీకరింపనియెడల నీవు దుర్యోధనుని విడిచివేసి పాండవులను చేరదీసుకొనుట. ఇంతకంటె నేను చెప్పున దేమున్నది? అని.

ఆమాటలపై ధృతరాష్ట్రుడు నాపుత్రుని విడిచివేయుమందువా? అని క్రుద్ధుడై నీయిష్టమువచ్చిన చోటునకు నీవు పొమ్మని నిరసించెను.

ఆవెంటనే విదురుడు పాండవులయొద్దకు వెళ్ళగా మరల ధృతరాష్ట్రుడు కంగారుపడి సంజయుని బంపి విదురుని రప్పించెను. ఆవిదురునితో యథాప్రకారము గోష్ఠి నడుపుచుండెను.

దుర్యోధను డది చూచి కర్ణశకునిదుశ్శాసనులయొద్ద నిట్లు ప్రసంగించెను —

"యావ దస్య పున ర్బుద్ధిం విదురో నాపకర్షతి ।
పాండవానయనే తావ న్మన్త్రయధ్వం హితం మమ ॥
అథ పశ్యా మ్యహం పార్థాన్ ప్రాప్తా నిహ కథంచన ।
పున శ్శోషం గమిష్యామి నిరంబు ర్నిరవగ్రహః ॥
విష ముద్బంధనం చైవ శస్త్ర మగ్నిప్రవేశనమ్ ।
కరిష్యే న హి తా నృద్ధాన్ పునర్ద్రష్టు మిహోత్సహే ॥" (వన. అ 7)

టీ—నిరవగ్రహః ప్రతిబంధాఽభావేఽపి నిరంబుః నిరాహారో భూత్వా శోషం గమిష్యామీత్యర్థః । ప్రతిబంధే ప్యవగ్రహ ఇతి విశ్వః । మరణార్థం విషాదికం కరిష్యే స్వీకరిష్యే ॥"

ఈవిదురుడు నాతండ్రియొక్క బుద్ధిని మార్చి పాండవులను రప్పింపకుండ మీరు నాకు తగిన ఆలోచన చెప్పవలయును. ఏవిధమున నైన వారిచ్చటకు వచ్చుట తటస్థించినయెడల నేను తిండి తినిన ఒట్టు. విషశస్త్రాదులద్వారా మరణింతునుగాని వారి లభివృద్ధిగా నుండుట నేను చూడజాలను; అని. ఆపై శకుని యిట్లనెను—

ఆంధ్రభారతము—

"ఇట్టిల బాలిశంబైన మతి దలంచితివి. విదురధృతరాష్ట్రులు విపరీతమతులై రావించినను నిత్యసత్యనిరతులైన యప్పాండవులు దమచేసిన సమయంబు సలుపక యేల వచ్చువా రగుదురు."

అని. ఆపై దుశ్శాసనుడు, శకునిచెప్పినది నిజమే అని అంగీకరించెను. ఆపై కర్ణు డిట్లు చెప్పెను—

"నాగమిష్యంతి తే వీరా అకృత్వా కాలసంవిదమ్ ।
ఆగమిష్యంతి చే న్మోహా త్పున ర్ద్యూతేన తాన్ జయ ॥"

దుర్యోధనా! ప్రతిజ్ఞను పూర్తిచేయక వారు రానే రారు. ఒకవేళ వచ్చినను మరల ద్యూతముచేత నోడించుము. అని.

"ఏవ ముక్త స్తు కర్ణేన రాజా దుర్యోధన స్తదా ।
నా తిహృష్టమనాః క్షిప్ర మభవ త్స పరాఙ్ముఖః ॥"

టీ॥ నాతిహృష్టమనాః పాండవానాం నిందాయాం సత్యామపి అగమనాఽసహిష్ణుత్వాత్ । కర్ణేన స్వపరాక్రమయోగ్యస్య వచన స్యాఽనుక్తే శ్చ ।

ఆకర్ణుని మాట వినిన దుర్యోధనుడు పాండవనిరసనములో కర్ణుని సమ్మతి కనబడినను, పరాక్రమయుక్తమైన మాట కర్ణుని నోటి నుండి రాకపోవుటచేతను, పాండవుల రాకయే కిట్టనివాడయి తానుండుటచేతను అంత సంతోషపడక ముఖము త్రిప్పికొని యుండెను. అది చూచి కర్ణుడు పౌరుషముతో నిట్లనెను—

"వయం తు శస్త్రా ణ్యాదాయ రథా నాస్థాయ దంశితాః ।
గచ్ఛామ స్సహితా హంతుం పాండవాన్ వనగోచరాన్ ॥
తేషు సర్వేషు శాన్తేషు గతే ష్వవిదితాం గతిమ్ ।
నిర్వివాదా భవిష్యంతి ధార్తరాష్ట్రా స్తథా వయమ్ ।
యావదేవపరిద్యూనా యావ చ్ఛోకపరాయణాః ।
యావ న్మిత్రవిహీనా శ్చ తావ చ్ఛక్యా మతం మమ ॥

అయితే మనమందర మిప్పుడే శస్త్రములతో, రథములతో వెళ్ళి వనగతులైన పాండవులను వధింతము. ఆపై మనము నిర్వివాదముగా నుండవచ్చును. వారు ఖిన్నులై, శోకగ్రస్తులై, అసహాయులై యున్నపుడే మన కది శక్యమని తలచుచున్నాను; అని.

ఆమాటకు సంతోషించి వారందరు రథముల నాయత్తపరచుకొని—"సర్వేయుః పాండవాన్ హంతుం సహితాః కృతనిశ్చయాః" పాండవసంహారమునకై బయలుదేరిరి. ఈలక్షణములను బట్టియే కర్ణుడు దుష్టచతుష్టయాంతర్గతు డని ప్రసిద్ధికెక్కెను. అట్టి దుష్టులుకూడ పాండవులు సత్యసంధులని, ప్రతిజ్ఞను నిర్వహింపనిదే రారని ప్రశంసించుకొనిన విషయమును మాత్రము ప్రతివాదులు మరువరాదు.

—: పాండవహత్యకై దుర్వృత్తితో బయలుదేరిన దుష్టులను వేదవ్యాసభగవానుడు నివారించుట :—

"తాన్ ప్రస్థితాన్ పరిజ్ఞాయ కృష్ణద్వైపాయనప్రభుః ।
ఆజగామ విశుద్ధాత్మా దృష్ట్వా దివ్యేన చక్షుషా ॥
ప్రతిషిధ్యాఽథ తాన్ సర్వాన్ భగవాన్ లోకపూజితః ।
ప్రజ్ఞాచక్షుష మాసీన మువాచాఽభ్యేత్య సత్వరమ్ ॥
తదయం కిం ను పాపాత్మా తవ పుత్రః సుమందధీః ।
పాండవా న్నిత్యసంక్రుద్ధో రాజ్యహేతో ర్జిఘాంసతి ॥
వార్యతాం సాధ్వయం మూఢ శ్శమం గచ్ఛతు తే సుతః ।"

అట్లు దుర్యోధనాదులు పాండవహత్యకై సంకల్పించి బయలు దేరిన విషయము వేదవ్యాసభగవానుడు దివ్యదృష్టిచే గ్రహించి దుర్యోధనాదులయొద్దకు వచ్చి వారిని నివారించి ధృతరాష్ట్రుని సమీపించి నీపుత్రుడు పాపాత్ముడై రాజ్యతృష్ణతో నింకను పాండవులను హింసింపజూచుచున్నాడు. నీవు బుద్ధిచెప్పి నివారింపుము. అని చెప్పి సురభ్యుపాఖ్యాన ముపదేశించి పుత్రులందరు సమానులే అయినను దీనులైన పుత్రులయెడ అధికదయ యుండవలయు నని బోధింపగా ధృతరాష్ట్రుడు—

"అన్వశాధి దురాత్మానం పుత్రం దుర్యోధనం మమ ।"

దురాత్ముడైన దుర్యోధనునకు మహాత్మా! నీవు బుద్ధిజెప్పు మని ప్రార్థించెను. అప్పుడు నేను కాదు; మైత్రేయమహర్షి వచ్చుచున్నాడు. ఆతడు చెప్పు నని వ్యాసమహర్షి అంతర్ధాన మయ్యెను.

—♦ దుర్యోధనునకు మైత్రేయమహర్షి శాపము ♦—

తరువాత మైత్రేయమహర్షి దర్శన మీయగా ధృతరాష్ట్రుడు సపుత్రకుడై పూజించి స్వాగతప్రశ్నచేయ మహర్షి యిట్లు చెప్పెను—

నేను తీర్థయాత్రగా పర్యటనముచేయుచు కురుజాంగలదేశములకు వెళ్ళి యాదృచ్ఛికముగా కామ్యకవనమం దున్న ధర్మరాజును దర్శించితిని. జటాజినధారియై తపోవనవాసియై యున్న ఆమహాత్ముని దర్శించుటకై అక్కడ మునిబృందము సమావేశమైనది.

ఆగోష్ఠిలో నీపుత్రుడు జరిపిన ద్యూతక్రీడాదిదుర్నయములు విని నీయం దధికప్రీతి కలవాడ నగుటచే నీకు హితము చెప్పదలచి యిక్కడకు వచ్చితిని. ధృతరాష్ట్రా! నీవట్టి దుర్నయము లెందు కుపేక్షించితివి? తాపసలోకములో నీకీర్తికి లోపము వచ్చినదే! అనిపలికి దుర్యోధనునితో నిట్లనెను—

ఆంధ్రభారతము—

క. "అయ్యా! పాండవులతో విరోధం బుడుగు మట్లయిన నీకును వారికిం గురు కులంబునకు లగ్గగు నాపలుకు జేకొనుము.

సీ. వజ్రసంహనను లవార్యపరాక్రమముల్ పాండుకుమారు లాఖండలాభు లందఱు నాగశతాయుతప్రాణు లుగ్రహవకాంక్షు లుత్సాహపరులు వారలలో బలవంతుండు బకహిడింబాసురు లనువారి నాసురమున జంపె నాగాయుతసత్త్వు జరాసంధు నెక్కటి యోర్చిన యక్కజుండు

తే. ఘోరవనమున నీకు గిమ్మీరు డను సురారి నిశ్చల ఘనభీకరాంగు బట్టి పోర వధియించి నట్టి సమీరజునకు భూరిభుజునకు మార్కొనువారు గలరె".

అని బోధించి నామాట విని పాండవవిద్వేషము మానుమని చెప్పగా—

"ఏవం తు బ్రువత స్తస్య మైత్రేయస్య విశాంపతే।
ఊరుం గజకరాకారం కరేణాఽభిజఘాన సః॥
దుర్యోధనః స్మితం కృత్వా చరణే నోల్లిఖ న్మహీమ్।
న కించి దుక్త్వా దుర్మేధా స్తస్థౌ కించి దవాఙ్ముఖః॥"

దుర్యోధను డామహర్షి మాటను అలక్ష్యము చేసి తన తొడను చరచి మందస్మితము చేసి యేమియు పలుకక తలవాల్చి కాలుతో నేలను రాయుచు గూర్చుండెను. అట్లు ఉద్ధతుడై తిరస్కారభావముతో వినిపించుకొనకుండుటను జూడగా మహర్షికి గోపము వచ్చి కను లెర్రపడినవి. తరువాత—

"తత స్స వార్యుపస్పృశ్య కోపసంరక్తలోచనః।
మైత్రేయో ధార్తరాష్ట్రం త మశప ద్దుష్టచేతసమ్॥
యస్మా త్త్వం మా మనాదృత్య నేమాం వాచం చికీర్షసి।
తస్మా దస్యాఽభిమానస్య సద్యః ఫల మవాప్నుహి॥

త్వదభిద్రోహసంయుక్తం యుద్ధ ముత్పత్స్యతే మహత్ ।
తత్ర భీమో గదాఘాతైః తవోరుం భేత్స్యతే బలీ ॥

మైత్రేయమహర్షి ఉదకమును స్పృశించి 'నీ దర్పమునకు సద్యఃఫలమును పొందుము—నీద్రోహబుద్ధిని బట్టి మహాయుద్ధ మేర్పడును. అందు భీమసేనుడు గదాఘాతములచే నీతొడను విరుగగొట్టును' అని శపించెను.

అది విని ధృతరాష్ట్రుడు అనుగ్రహింపుమని మహర్షిని ప్రార్థింప—
"శమం యాస్యతి చే త్పుత్ర స్తవ రాజన్ యదా తదా ।
శాపో న భవితా తాత విపరీతే భవిష్యతి ॥" (వన అ 10)

నీపుత్రుడు పాండవద్రోహబుద్ధి మాని శాంతి వహించినప్పుడు నాశాప మంటదు. లేనియెడల తప్పదు. అని మైత్రేయమహర్షి చెప్పెను. ఇట్టి దుర్యోధనుని దుస్సాంగత్యముచే కర్ణుడు దుష్టచతుష్టయాంతర్గతు డని ప్రసిద్ధి కెక్కెను.

—♦ ఘోషయాత్ర యను పేరుతో అరణ్యమునకు వెళ్ళి అక్కడ కష్టములకు పాలై యున్న పాండవులకు నీవైభవమును జూపి వారి నేడిపింపవలయును. అని కర్ణుడు దుర్యోధనుని ప్రోత్సహించుట ♦—

పాండవులు శీతోష్ణవాతాతపములకు కృశించుచు వనవాసము చేయుచు ద్వైతవనమం దున్న పరిస్థితిలో శకుని సహితుడై కర్ణుడు దుర్యోధనున కిట్లుపదేశించెను—

"స ప్రియాహి మహారాజ శ్రియా పరమయా యుతః ।
తాపయన్ పాండుపుత్రాం స్త్వం రశ్మివా నివ తేజసా ॥
స్థితో రాజ్యే చ్యుతాన్ రాజ్యా చ్ఛ్రియా హీనాన్ శ్రియా వృతః ।
అసమృద్ధాన్ సమృద్ధార్థః పశ్య పాండుసుతా న్నృప ॥
సమస్థో విషమస్థాన్ హి దుర్గస్థో యోఽభివీక్షతే ।
జగతీస్థాని వాఽద్రిస్థః కిం మతః పరమం సుఖమ్ ॥
న పుత్రధనలాభేన న రాజ్యేనాపి విందతి ।
ప్రీతిం నృపతిశార్దూల యా మమిత్రాఘదర్శనాత్ ॥

కిన్ను తస్య సుఖం న స్యా దాశ్రమే యో ధనంజయమ్ ।
అభివీక్షేత సిద్ధార్థో వల్కలాజినవాససమ్ ॥
సువాససో హి తే భార్యా వల్కలాజినసంవృతామ్ ।
పశ్యంతు దుఃఖితాం కృష్ణాం సా చ నిర్విద్యతాం పునః ॥
వినిందతాం తథాత్మానం జీవితం చ ధనచ్యుతమ్ ।
న తథా హి సభా మధ్యే తస్యా భవితు మర్హతి ॥
వైమనస్యం యథా దృష్ట్వా తవ భార్యాః స్వలంకృతాః । (వన. అ. 237)

దుర్యోధనా! తేజస్సుచే సూర్యునివలె మహావైభవముచే పాండవులకు సంతాపము గలిగించుటకై నీవు బయలుదేరుము.

రాజ్యభ్రష్టులై, సంపద్విహీనులై, నిర్ధనులైయున్న పాండవులను రాజ్యస్థితుడవై, సర్వవైభవసమృద్ధుడవైయున్న నీవొకసారి చూడవలయును. పర్వతముపై నున్న వాడు నేలపై నున్నవానివలె అత్యున్నత స్థితిలోనున్న నీవు నీచస్థితిలో నున్న శత్రువులను కనులార జూచుట కంటె పరమానంద మే మున్నది!

శత్రువుల దైన్యస్థితిని జూచుటచే గలుగు ఆనందము పుత్రలాభముచేగాని, రాజ్యలాభముచేగాని, ధనలాభముచేగాని కలుగునట్టిది కాదు వల్కలాజినములు ధరించి వనవాసియై యున్న పార్థుని గనులార జూచుటచే కలుగు ఆనందమునకు మేర యుండదు.

సర్వాలంకారశోభితలైన నీ భార్యలు నారబట్టలు గట్టి దుఃఖితురాలై యున్న ద్రౌపతిని జూడవలయును. ఆమె వైమనస్యము వహించి తన నిర్ధనపుబ్రతుకును నిందించుకొని దుఃఖపడవలయును. నాడు ద్యూతసభలో బొందినదానికంటెను ఎక్కువ వైమనస్యమును అలంకరించుకొని యున్న నీ భార్యలను జూచి యామె పొందవలయును. అని.

ఇట్టి దుర్లక్షణములను బట్టియే కర్ణుడు దుష్టచతుష్టయాంతర్గతుడని ప్రసిద్ధి కెక్కెను.

కర్ణస్య వచనం శ్రుత్వా రాజా దుర్యోధన స్తతః ।
హృష్టో భూత్వా పున ర్దీన ఇదం వచన మబ్రవీత్ ॥

బ్రవీషి య దిదం కర్ణ స్వరం మనసి మే స్థితమ్।
న త్వభ్యనుజ్ఞాం లప్స్యామి గమనే యత్ర పాండవాః ॥"

కర్ణుని యీమాటలు విని హర్షించిన దుర్యోధనుడు- కర్ణుడా! అట్టి కుతూహలము నాకును కలిగినదిసుమా! కాని మన మట్లు చేయుటకు తండ్రి సమ్మతింపడు. అనెను. ఆపై మీరు మన సంకల్పము సాగుటకును, తండ్రి యనుజ్ఞను పొందుటకును తగిన ఉపాయము నాలోచింపుడని చెప్పినమీదట యెవరి యిండ్లకు వారు వెళ్ళి ఆ రాత్రి గడిపి తెల్లవారినతరువాత దుర్యోధనుని గలిసికొనుటలో ముందు కలిసికొనిన కర్ణుడు—"ఘోషయాత్రాప్రదేశేన గమిష్యామో న సంశయః" ఘోషయాత్ర అను పేరుతో మనము చెప్పి వెళ్ళవచ్చును. అని యుపాయము జెప్పెను.

ఘోషయాత్ర అనగా. గోవులను లెక్కపెట్టి, వానివయస్సు, వర్ణము, జాతి, నామము వీనిని వ్రాసి యుంచుటకై గొల్లపల్లెలకు వెళ్ళుట. ఇట్లు కర్ణుడు చెప్పిన మఱికొంతసేపటికి వచ్చిన శకుని కూడ ఘోషయాత్ర అని చెప్పి వెళ్ళుద మనియే ఉపాయము జెప్పెను. కనుక నే వీరియందరి చిత్తవృత్తులును ఏకవిధమై నడచినవి.

ఆపై ధృతరాష్ట్రునియొద్ద ఘోషయాత్రమాట చెప్పి ఎట్టకేలకు అనుజ్ఞ దీసుకొని వారందరు బయలుదేరినారు.

ఆంధ్రభారతము—"ఆమ్మహీపతి పయనంబున కనురూపంబుగా నెనిమిది వేలు రథంబులు ముప్పదివే లేనుంగులు తొంబదివేలు గుఱ్ఱంబులు శతసహస్ర సంఖ్య కాల్బలం గల మహాసైన్యంబుతోడ నడచె" "తత్ప్రియప్రమదలు బహుసహస్రములు సనిరి".

ఇట్లు బయలుదేరి గోవులవ్యవహారము జూచుకొనుచు క్రమముగా ద్వైతవనమందలి సరోవరప్రాంతమునకు జేరు నంతలో వీరికంటె బూర్వమె చిత్రసేను డను గంధర్వరాజు సపరివారుడై అప్సరోగణపరివృతుడై విహారార్థ మక్కడకు వచ్చి నివసించి యుండెను.

ఆసమీపమందే ధర్మరాజు ద్రౌపదీసహితుడై "ఈజే రాజర్షి ర్యజ్ఞేన సాద్యస్కేన (ఏకాహసాధ్యేన) విశాంపతే" ఏకాహక్రతువు నొకదానిని జేయుచుండెను.

—♦ పాండవులను దుఃఖపెట్టదలచి వెళ్ళిన దుష్టులు అక్కడ గంధర్వులతో డీకొని అపహరింపబడుట - పాండవులచే రక్షింపబడుట ♦—

కౌరవులు నివసింపదలచిన ఆసరోవరప్రాంతమందున్న గంధర్వులను అక్కడనుండి పొమ్మని సైనికులును, మీరే పొండని గంధర్వులును వాక్కలహములోనికి దిగి క్రమముగా యుద్ధమునకు తలపడిరి. క్రమముగా మహాయుద్ధము జరిగినది. ఉభయపక్షములును అఖండముగా పోరిరి.

ఆంధ్రభారతము—"అప్పుడు రాధేయుండచలేయుండై కులశైలంబునుం బోలె గదలక నిలిచి గంధర్వులు గురియు శరవర్షంబున మునుగుచు దనచేయాపినంత పెనంగుచుండె. సోదరసౌబలసహాయుండై దుర్యోధనుండు కర్ణసాహాయ్యంబు వదలక నిలిచె నంత ననంతసత్త్వులైన గంధర్వ బలంబులు సుట్టుముట్టి.

ఉ. కొందఱు సూతు నశ్వముల గొందఱు గొందఱు చాపదండమున్
కొందఱు చక్రయుగ్మకము గొందఱు విస్ఫురితాతపత్రముం
గొందఱు కూబరంబు మఱికొందఱు కేతువు కొంద ఱక్షమున్
దందడి దున్మిచైచి విరథత్వ మొనర్చిరి సూతసూతికిన్".

ఇట్లు విరథుడైన కర్ణుడు వికర్ణుని రథ మెక్కి రణభూమినుండి పలాయితు డయ్యెను.

"దుర్యోధనుండు విముఖుండుగాక పరబలంబు మార్కొని పెనంగబోవం గినం గినిసి చిత్రసేనుండు వానిం దలపడి తదీయస్యందనంబు రాధేయురథంబు నట్లు భగ్నంబుగా జేయించి విరథుం డగు నమ్మహీవిభుం గేశాకర్షణంబున నేలం బడఁద్రోచి పెడకేలు గట్టి సింహనాదంబు సేసినం దక్కిన గంధర్వులు... అతని వనితాజనంబులను దత్సోదరులగు దుశ్శాసనదుర్విషహదుర్ముఖవివింశతి చిత్రసేన విందానువిందులను, దత్సూనులను తదీయమంత్రులను బట్టి బంధించి" తీసికొనిపోవుచుండ— "పూర్వం ప్రభగ్నా స్సహితాః

పాండవా నభ్యయు స్తదా" "శరణం పాండవా న్జగ్ము ర్ద్రియ మాణే మహీపతౌ" ఓడిపోయి చెదరియున్నవారు కలిసి పాండవులను శరణుపొంది—

"గన్ధర్వై ర్ర్హియతే రాజా పార్థా స్తమనుధావత।
బద్ధ్వా హ్రియన్తే గన్ధర్వై రాజదారా శ్చ సర్వశః॥

ఓ పాండవులారా! దుర్యోధనాదులను, రాజభార్యలను గంధర్వులు కట్టి తీసికొనుపోవుచున్నారు. మీరు కాపాడవలయును అని ధర్మజునియొద్ద ఆక్రోశించుచుండ భీమసేను డిట్లనెను—

అస్మాభి ర్య దనుష్ఠేయం గన్ధర్వై స్త దనుష్ఠితమ్।
శీతవాతాతపసహాం స్తపసా చైవ కర్శితాన్॥
సమస్థో విషమస్థాన్ హి ద్రష్టు మిచ్ఛతి దుర్మతిః।
అధర్మో హి కృత స్తేన యేనైత దుపశిక్షితమ్।
అనృశంసా స్తు కౌన్తేయా స్తత్ప్రత్యక్షం బ్రవీమి వః॥"

యుద్ధసన్నాహములో మే మెప్పుడో చేయవలసిన పనిని గంధర్వులే చేసినారు. మేము శీతవాతాతపములను సహించుచు తపించుచు కృశించుచున్న పరిస్థితిలోనుండ నే నెంతవైభవము కలిగి యున్నానో చూచినారా! అని తెలుపుటకై యీ దుర్మతి మమ్ములను జూడవచ్చినాడు. అతడు చేసిన పాపమునకు ఫల మనుభవించుచున్నాడు. పాండవులు నిరపరాధులనుటకు ఇంతకంటె ప్రత్యక్ష నిదర్శన మేమి కావలయును! అని. అది విని యుధిష్ఠిరు డిట్లనెను—

"అస్మా నభిగతాం స్తాత భయార్తాన్ శరణైషిణః।
కౌరవాన్ విషమప్రాప్తాన్ కథం బ్రూయా స్త్వమీదృశమ్॥
భవంతి భేదా జ్ఞాతీనాం కలహాశ్చ వృకోదర।
ప్రసక్తాని చ వైరాణి కులధర్మో న నశ్యతి॥
దుర్యోధనస్య గ్రహణా ద్గంధర్వేణ బలా త్ప్రభో।
స్త్రీణాం బాహ్యాభిమర్శా చ్చ హతం భవతి నః కులమ్॥
శరణం చ ప్రపన్నానాం త్రాణార్థం చ కులస్య చ।
ఉత్తిష్ఠధ్వం నరవ్యాఘ్రాః సజ్జీభవత మా చిరమ్॥"

భీమసేనా! ఆపన్నులై ప్రాణాపాయస్థితిలోబడి శరణార్థులై మనల నాశ్రయించిన కౌరవులను నీ విట్లనవచ్చునా? జ్ఞాతులలో భేదములు పుట్టినను, కలహములు కలిగినను, శతృత్వము లేర్పడినను కులధర్మమును మాత్రము కాపాడుకొనుచుండవలసినదే. గంధర్వులు దుర్యోధనుని బలాత్కారముగా తీసికొనిపోవుచుండుటచేతను, కుల స్త్రీలను అట్లు తీసికొనిపోవుచుండుటచేతను మనకులధర్మము హాతమై పోవుచున్నది. శరణాగతులను రక్షించుటకును, కులము నుద్ధరించుట కును మీరు త్వరపడుడు. సన్నద్ధులై లెండు. అని.

ఈయుధిష్ఠిరోపదేశసారాంశమే ఇట్లు చెప్పబడినది—

“పరైః పరిభవే ప్రాప్తే వయం పంచోత్తరం శతమ్ ।
పరస్పరవిరోధే తు వయం పంచైవ తే శతమ్ ॥”

అన్యులవలన అపాయమువచ్చినపుడు మనము నూటఐదుగు రము. మనలో మనకు గల విరోధములో మాత్రము మన మయిదు గురమే. వారు నూర్గురే. అని.

అప్పుడు భీమార్జుననకులసహదేవులు గంధర్వసేనపై తలపడిరి. అర్జునుడు గంధర్వులతో నిట్లనెను—

“ఉత్సృజ్యధ్వం మహావీర్యాన్ ధృతరాష్ట్రసుతా నిమాన్ ।
దారాం శ్చైషాం విముంచధ్వం ధర్మరాజస్య శాసనాత్ ॥”

ఈధార్తరాష్ట్రులను, వీరిభార్యలను ధర్మరాజశాసనము శిరసా వహించి మీరు విడిచిపెట్టవలయును. అని.

గంధర్వు లామాటను లక్ష్యపెట్టక యుద్ధముచేయుటయు, భీమసేనాదులు వారలను వధింపబూనుటయు, కౌరవులనుపట్టుకొని గంధర్వు లాకాశగతులగుటయు, అర్జునుడు దివ్యాస్త్రప్రయోగములచే గంధర్వులను గదలనీక అరికట్టుటయు, గంధర్వరాజు మాయాబలమున అంతర్ధానమై యుద్ధముచేయుటయు—“అన్తర్ధానవధం చాఽస్య చక్రే క్రుద్ధోఽర్జున స్తదా” అంతర్ధానమైయున్న గంధర్వరాజునే క్రుద్ధుడైన

పార్థుడు శబ్దవేధపద్ధతి నాశ్రయించి కొట్టుటయు, అప్పుడు గంధర్వ రాజగు చిత్రసేనుడు తన స్వరూపమును పార్థునకు ప్రదర్శించి— "సఖాయం యుధి విద్ధి మామ్" నేను నీ సఖుడను గాని శత్రువుడు గానని చెప్పుటయు—'సంజహారాఽస్త్రమథ తత్ప్రసృష్టం పాండవర్షభః' అప్పుడు పార్థుడు తాను ప్రయోగించిన దివ్యాస్త్రము నుపహరించుటయు జరిగినతరువాత పార్థు డిట్లడిగెను—

"కిం తే వ్యవసితం వీర కౌరవాణాం వినిగ్రహే।
కిమర్థం చ సదారోఽయం నిగృహీత స్సుయోధనః॥

చిత్రసేనా! కౌరవులను నీవు నిగ్రహించుట కేమి కారణము? సభార్యుడైన సుయోధనుని నీ వెందుకు నిగ్రహించినావు? అని.

అప్పుడా చిత్రసేను డిట్లు చెప్పెను—

విదితోఽయ మభిప్రాయ స్తత్రస్థేన దురాత్మనః।
దుర్యోధనస్య పాపస్య కర్ణస్య చ ధనంజయ॥
వనస్థాన్ భవతో జ్ఞాత్వా క్లిశ్యమానా ననాథవత్।
ఇమేఽవహసితుం ప్రాప్తా ద్రౌపదీం చ యశస్వినీమ్॥
జ్ఞాత్వా చికీర్షితం చైషాం మా మువాచ సురేశ్వరః।
గచ్ఛ దుర్యోధనం బద్ధ్వా సహాఽమాత్య మిహాయన॥
ధనంజయశ్చ తే రక్ష్య స్సహ భ్రాతృభి రాహవే।
స చ ప్రియస్సఖా తుభ్యం శిష్య శ్చ తవ పాండవః॥
వచనా ద్దేవరాజస్య తతోఽస్మీహ గతో ద్రుతమ్।
అయం దురాత్మా బద్ధశ్చ గమిష్యామి సురాలయమ్॥
నేష్యా మ్యేనం దురాత్మానం పాకశాసనశాసనాత్।

అర్జునా! దురాత్ములగు కర్ణదుర్యోధనుల దుర్వృత్తి నాకవగతమైనది—వనవాసక్లేశములను అనాథులవలె అనుభవించుచున్న మిమ్ములను, యశశ్శాలిని యగు ద్రౌపదీదేవిని చూచి అపహాసము చేయదలచి వీరందరితో బయలుదేరి వచ్చినారు. వీరి దుస్సంకల్పమును దెలిసికొనిన యింద్రుడు నాతో, నీవు వెళ్ళి సపరివారముగా దుర్యోధనుని బంధించి యిక్కడకు దీసికొనిరమ్మనియు, సోదరసహితు

వైన పార్థుడు నీప్రియసఖుడు, శిష్యుడు నగుటచే నాతడు రక్షణీయు డనియు జెప్పి పంపెను.

అర్జునా ! దేవేంద్రుని యాజ్ఞపై వెంటనే నేనిక్కడకు వచ్చి యుంటిని. ఈదురాత్ముడు బంధింపబడినాడు. ఈతని నింక దేవేంద్ర సన్నిధికి దీసికొనిపోవుచున్నాను. అని.

అది విని యర్జునుడు– సుయోధనుడు మా సోదరుడు. కనుక నాప్రీతిని నీవు కోరెదవేని ధర్మరాజాదేశానుసారము నీ వీతనిని విడిచిపెట్టవలసినదే. అని పలుకగా గంధర్వరాజు ఈదుర్యోధనుడు పాపాత్ముడు, విడవతగినవాడు గాడు. ధర్మరాజు ఈతని దుస్సంకల్ప మెరుగడు. నీవాలోచింపు మనుటయు, అందరును ధర్మరాజసమక్షము నకు వెళ్ళుటయు, అక్కడ గంధర్వరాజు యావద్వృత్తాంతము జెప్పుటయు, అజాతశత్రువగు ధర్మరాజు దుర్యోధనాదులను విడిపించి గంధర్వులను కొనియాడినతరువాత గంధర్వులు యథాస్థానములకు వెళ్లుటయు జరిగినది. మృతులైన గంధర్వులను ఇంద్రుడమృతవర్షముచే జీవింపజేసెను.

"తతో దుర్యోధనం ముక్తం భ్రాతృభి స్సహిత స్తదా ।
యుధిష్ఠిర స్తు ప్రణయా దిదం వచన మబ్రవీత్ ॥
మాస్మ తాత పునః కార్షీ రీదృశం సాహసం క్వచిత్ ।
నహి సాహసకర్తార స్సుఖ మేధంతి భారత ॥
స్వస్తిమాన్ సహితః సర్వై ర్భ్రాతృభిః కురునందన ।
గృహాన్ వ్రజ యథా కామం వైమనస్యం చ మా కృథాః ॥"

టీ: వైమనస్యం వైరం. ఖేదచిత్తహ మాకృథాః మా కురు ।

తరువాత విముక్తుడయి యున్న దుర్యోధనునితో ప్రణయ పూర్వకముగా యుధిష్ఠిరు డిట్లనెను—నాయనా ! ఇట్టి సాహసము నీ వెన్నడును జేయకుము. సాహసము జేయువారు కష్టములకు పాలగు దురు. నీవెవ్వనితోడను వైరము బెట్టుకొనకుము. నీపరివారమును

వెంటబెట్టుకొని సుఖముగా నింటికి వెళ్ళుము, అని. అటుపై దుర్యోధనుడు ధర్మజునకు నమస్కరించి వెళ్ళెను.

"సాధూ నభిబుభూషు ర్భ్రా స్త్వయమే వాభిభూయతే ।
ఇతి సందర్శయ న్నాహ ఘోషయాత్రాం మహామునిః ॥" (నీలకంఠీయం)

—: గంధర్వులు అర్జునవిషయమున సరిగా తమబలము చూపి యుద్ధముచేయలేదు. అనుప్రసంగము-తన్నిరాకరణము:—

కర్ణచరిత్రకారుల వ్రాత యిట్లున్నది—"కర్ణాదిమహావీరులను జయించుటకై యింద్రునిచే బంపబడిన గంధర్వులు మహాబలశాలులయిరే యుందు రనుటకు సందేహములేదు. ఈసందర్భమున గర్ణునిజయించిన గంధర్వుల నర్జునుడు జయించుటచే గర్ణునికంటె నర్జునుడు అధికు డని చెప్పవలసియున్నను ఇంద్రుడు గంధర్వుల నంపునపుడు—

"గచ్ఛ దుర్యోధనం బద్ధ్వా సహామాత్య మిహానయ ।
ధనంజయ శ్చ తే రక్ష్యః సహ భ్రాతృభి రాహవే ॥
స నః ప్రియ స్సఖా తుభ్యం శిష్య శ్చ తవ పాండవః ।"

అర్జునుడు రక్షింపదగినవాడని వారికి జెప్పియున్నందున గంధర్వు లర్జునవిషయమున సరిగా దమ బలమునుజూపి యుద్ధము చేసిరని చెప్పుటకు సందేహింపవలసియున్నది" (పు 48)

ఈప్రతివాదులు కర్ణు నోడించిన గంధర్వులు కర్ణునికంటె మహాబలశాలు లనుటలో సందేహము లేదన్నారు. అట్టి గంధర్వుల నోడించిన అర్జునుడు ఆగంధర్వులకంటె మహాబలశాలి యనుటలోమాత్రము సందేహ మన్నారు. ఇట్లనుటకు కర్ణునికంటె అర్జునుడు మహాబలశాలి అను పేరు రాకుండ జేయవలయు నను సంకల్పమే కారణము.

వీరి కొకింత బోధింపవలసియున్నది— ఆంధ్రభారతము—

వ. కౌంతేయులచేతం బీడితులై గంధర్వులు దుర్యోధనాదుల జెఱ లేమఱక కొనుచు గగనంబునకు నెగసి తో్రచి పోవ నుంకించిన నెఱింగి సవ్యసాచి రయంబున నతినిబిడబాణజాలంబులం జేసి దిఙ్నభోమార్గంబులు నీరంధ్రంబులుగా గప్పిన నగ్గగనచరులు వలలోనం జిక్కిన పులుగులుంబోలె బోవ నేరక శరపంజరంబునం జిక్కియు నుక్కెడక యన్నలువురమీద వివిధాయుధపరంపరలు ప్రయోగించిన.

మ. అవి యెల్లం దునుమాడి కిరీటి ఘనరోషాభీలుడై శాతభ
ల్లవితానం బపరించినం దలలు డొల్లం గాయముల్ మింట నుం
డి వసెం గుంభినిమీఁదగా రుధిరవృష్టిం గాలువల్ వాఱగా
జవి గంధర్వులు క్రిందఁడంగె జగ ముద్వేగంబునం బొందగన్.

"చిత్రసేను సర్వగాత్రంబు భేదించి యొక్క-మాత్రలోన నుడిపె గడక"

ఇంత గాఢముగా జరిగిన యుద్ధములో నొకమూల పాతుపై పోవుచున్న గంధర్వులు సరిగా దమబలము జూపి యుద్ధము జేయ లేదేమో! అని చెప్పుటకంటె అన్యాయ మున్నదా ?

అంతర్ధానమై యుండి పోరుచు పార్థుని దివ్యాస్త్రబంధములో బడి తప్పించుకొనజాలక తన స్వరూపమును గోచరింపజేసి "సఖాయం యుధి విద్ధి మామ్" ఈకౌరవయుద్ధములో నన్ను నీసఖునిగా దెలిసి కొనుము. నేను శత్రువును గానని చెప్పుకొనిన గంధర్వరాజు మాట పార్థుని పరాక్రమాతిశయమును తెలుపుచున్నదా? గంధర్వరాజు సరిగా యుద్ధము చేసి యుండలేదని తెలుపుచున్నదా ?

గంధర్వరాజు చేసిన సఖ్యప్రకటనముపై "సంజహారాఽస్త్ర మథ తత్ప్రిసృష్టం పాండవర్షభః" అప్రయోగింపబడిన అస్త్రమును పార్థు డుపసంహరించెను. అని చెప్పబడుటచేత గంధర్వరాజు ఆ యస్త్రమునకు బద్ధుడైపోయి దానిని స్వయముగా పరిహరించుకొనలేక పార్థసఖ్యప్రకటనమూలమున దానిని తొలగింపజేసికొనినాడని తెలియు చున్నదా? గంధర్వరాజు సరిగా యుద్ధము చేయలేదని తెలియు చున్నదా?

అయితే "ధనంజయ శ్చ తే రక్ష్యః" అని యింద్రుడు చెప్ప నేల? అని శంకింతురుగాబోలు. అది యింద్రునకు పార్థునియందు గల ప్రేమాతిశయమునకు సూచకము. గంధర్వరాజు పరాక్రమాతి శయమునకును సూచకము. అంతియకాని పార్థదౌర్బల్యసూచకము గాదు. ఇంకొకటి—ఇంద్రుడు గంధర్వరాజునకు చెప్పిన విషయములు రెండని ప్రతివాదులు చూపియున్నారు.

"గచ్ఛ దుర్యోధనం బద్ధ్వా సహామాత్య మిహానయ"
"ధనంజయ శ్చ తే రక్ష్యః"

సపరివారముగా దుర్యోధనుని బంధించి యిక్కడకు దీసికొని రావలయును. అనునది యొకటి, పార్థుని రక్షింపవలయును అనునది యొకటి. ఇవి రెండును గంధర్వరాజునకు కర్తవ్యములే. అట్టి స్థితిలో ప్రబలుడైన గంధర్వరాజు దుర్బలుడగు పార్థుని రక్షించినట్లు ప్రతివాదులు చెప్పినను దుర్యోధనుని తీసికొని యింద్రసన్నిధికి వెళ్ళక పోవుటకు కారణ మేమి చెప్పెదరు?

ప్రతివాదిమతప్రకారము గంధర్వరాజు పార్థునికంటెను ప్రబలుడాయె. దుర్యోధనుని తీసికొనిపోవుట అను ఇంద్రాజ్ఞను నెరవేర్పవలసినవాడాయె. నెరవేర్పలేదేమి ?

పార్థుని అవరోధముచేతనే అత డాపని నెరవేర్పలేకపోయినాడని చెప్పితీరవలయును. గంధర్వరాజుకంటె పార్థుడు మహాబలశాలి యగుటచేతనే పార్థుని ఆ అవరోధమని చెప్పితీరవలయును.

ఇంకొకటి— పార్థుడు గంధర్వులను పారదోలినట్లే ఆంధ్రభాగవతపద్యము బోధించుచున్నది. చూడుడు—

"ప్రాభవస్కన్నుండై చను కౌరవేంద్రుని కై గంధర్వులం దోలుచో" కాబట్టి ప్రతివాదిప్రసంగము పరాస్తమయినది.

పర్యవసానము — కర్ణునికంటెను, కర్ణుని పారదోలిన గంధర్వులకంటెను పార్థుడు మహాబలశాలి. అసాధారణదివ్యాస్త్రసంపన్నుడు.

—: పాండవరక్షితులై బ్రతికివచ్చిన దుర్యోధనాదులయొక్కయు కర్ణునియొక్కయు సంభాషణము :—

దుర్యోధనుడు పాండవులయొద్దనుండి దుఃఖితుడయి సపరివారముగా లేచి వచ్చుచు ఒకానొకప్రదేశమందు సేనలను ఆపి ఖిన్నుడై కూర్చుండిన సందర్భములో రణరంగమునుండి అదృశ్యుడై వెళ్ళిపోయిన కర్ణుడు వచ్చి సంతోషముతో నిట్లనెను—

మీరు జీవించియుండుటయు, మనము మరల కలసికొనుటయు సంతోషకరము. కామరూపులైన గంధర్వులను నీవు జయించుట ప్రశంసనీయము; నేను క్షతాంగుడనై పీడితుడనై రణరంగమునుండి తొలగితిని. ఈయమానుషయుద్ధమునుండి మీరు విముక్తులై పదిలముగా నుండుట నీప్రభావబలమే; అని.

ఈమాటలు విని దుఃఖితుడై యున్న దుర్యోధను డిట్లనెను—

"అజానత స్తే రాధేయ నాభ్యసూయా మ్యహం వచః"

రాధేయా! విషయమెరుగక ప్రసంగించుచున్న నీమాటను తప్పుగా నేను భావింపను. ఆయుపద్రవమునుండి మమ్ముఁ గాపాడిన వారు పాండవులు. నన్ను పట్టుకొనియున్న గంధర్వరాజు మన మేమి సంకల్పించి వచ్చినామో ఆరహస్య మంతయు వారియొద్ద జెప్పినపుడు నేనెంత ఖిన్నుడనై పోతినో చెప్పలేను.

"స్త్రీసమక్షం మహం దీనో బద్ధ శ్శత్రువశం గతః ।
యుధిష్ఠిర స్యోపహృతః కిన్ను దుఃఖ మతఃపరమ్ ॥
యే మే నిరాకృతా నిత్యం రిపు ర్యేషా మహం సదా ।
తై ర్మోక్షితో౽హం దుర్బుద్ధి ర్దత్తం తై రేవ జీవితమ్ ॥
ప్రాప్త స్స్యాం యద్యహం వీర వధం తస్మి న్మహారణే ।
శ్రేయ స్త ద్భవితా మహ్యం నైవంభూతస్య జీవితమ్ ॥"

నేను స్త్రీలసమక్షములో బంధింపబడి దీనుడనై శత్రుహస్తగతుడనై యుధిష్ఠిరునియొద్దకు తీసికొనిపోబడినాను. ఇంతకంటె దుఃఖమున్నదా? ఏపాండవులు నాచే రాజ్యభ్రష్టులై నిరాకరింపబడినారో, ఏపాండవులకు నేను నిత్యశత్రువునో ఆపాండవులచేతనే నాకు ప్రాణదానము చేయబడినది; గండము తప్పినది. రాధేయా! నేను ఆగంధర్వులచే వధింపబడియుంటినేని శ్రేయస్సు కలిగెడిది. ఈవిధముగా బ్రతుకుట చాల నింద్యము.

ఆంధ్రభారతము—"నేను ప్రాయోపవేశంబున ప్రాణపరిత్యాగంబు సేసెద. మీరందరు దుశ్శాసనుం బురస్కరించుకొని పురంబున కరుగునది. మిత్రులకు బ్రమోదంబును శత్రులకు నిర్వేదంబునుం జేయుచు మనునట్టి రేను బోడిమి సెడి

పగతురచేత శిరస్తాడనంబు సేయంబడి సిగ్గువడక బంధుజనంబులలోని క్షేమని యరు గుదు; నాంబికేయుం గని యేమని పలుకుదు; గురువృద్ధు లయిన భీష్మబాహ్లీకు లయు, నాచార్యు లయిన కృపద్రోణులయు సమ్ముఖంబున నెట్లు నిలుతు. నిది యాత్మదోషంబున నైన యపాయంబు నాకవశ్యభోక్తవ్యంబు".

"దుర్వినీతా శ్శ్రియం ప్రాప్య విద్యా మైశ్వర్య మేవ చ ।
తిష్ఠంతి న చిరం భద్రే యథాఽహం మదగర్వితః ॥
అహో నార్హ మిదం కర్మ కష్టం దుశ్చరితం కృతమ్ ।
స్వయం దుర్బుద్ధినా మోహా ద్యేన ప్రాప్తోఽస్మి సంశయమ్ ॥
తస్మా త్ప్రాయ ముపాసిష్యే న హి శక్ష్యామి జీవితుమ్ ।"

రాధేయూ! దుర్వినీతులు సంపత్తునుగాని, విద్యనుగాని, ప్రాభ వమునుగాని పొందియు తన్మూలమున పొందవలసిన శుభములను చిర కాలము పొందలేరు. దీనికి మదమత్తుడ నైన నేనే నిదర్శనము.

చేయరాని యీదుష్కార్యమును స్వయంకృతాపరాధముగా జేసి యీదురవస్థ దెచ్చికొనినాను. కాబట్టి నేను బ్రతుకలేను. అని. తరువాత దుశ్శాసనునితో నిట్లు చెప్పెను—

"అన్న దుశ్శాసన నిన్ను రాజ్యమునకు బట్టంబు గట్టెద బతివి గమ్ము...
బాహుదర్ప మొప్ప బగఱ నుక్కడగింపుము" (ఆం॥ భా)

అది విని దుశ్శాసనుడు నీవట్లు చెప్పదగ దనుచు చింతించెను. అంతట కర్ణు డిట్లు చెప్ప నారంభించెను—పాండవులను బట్టి బ్రతికినా మను అపకీర్తి వచ్చిన దని నీవు చింతింపకుము. అది అపకీర్తి కాదు.

"కర్తవ్యం హి కృతం రాజన్ పాండవై స్తత్ర మోక్షణమ్ ।
నిత్య మేవ ప్రియం కార్యం రాజ్ఞో విషయవాసిభిః ॥
పాల్యమానా స్త్వయా తే హి నివసంతి గతజ్వరాః ।
క మత్ర చిత్రం యద్వీర మోక్షితః పాండవై రసి ॥
సేనాజీవై శ్చ కౌరవ్య తథా విషయవాసిభిః ।
అజ్ఞాతై ర్యది వా జ్ఞాతైః కర్తవ్యం నృపతేః ప్రియమ్ ॥
ప్రాయః ప్రధానాః పురుషాః క్షోభయం త్యరివాహినీమ్ ।
నిగృహ్యంతే చ యుద్ధేషు మోక్ష్యన్తే చైవ సైనికైః ॥
యద్యేవం పాండవై రాజన్ భవద్విషయవాసిభిః ।

యదృచ్ఛయా మోక్షితోఽసి తత్ర కా పరివేదనా ॥
న చైత త్సాధు యద్రాజన్ పాండవా స్త్వాం నృపోత్తమమ్ ।
స్వసేనయా సంప్రయాన్తం నానుయాన్తి స్మ పృష్ఠతః ॥
భవత స్తే సహాయా వై ప్రేష్యతాం పూర్వ మాగతాః ।
పాండవేయాని రత్నాని త్వ మద్యా ప్యుపభుంజసే ॥
సత్వస్థాన్ పాండవాన్ పశ్య న తే ప్రాయ ముపావిశన్ ।"

దుర్యోధనా ! నీరాజ్యములో నివసించుచు నీప్రీతికై నిత్యము పాటుపడవలసియున్న పాండవులకు నిన్నువిడిపించుట అవశ్యకర్తవ్యమే. ఎట్టి యుపద్రవము లేకుండ నీచే రక్షింపబడుచున్న పాండవులు నిన్ను విడిపించుటలో చిత్రమేమున్నది ? సైనికులవలె రాష్ట్రప్రజలు కూడ తెలియబడియో తెలియబడకయో ప్రభువునకు ప్రీతిని గలిగింపవలసిన వారే. నీవు గంధర్వులచే నిగ్రహింపబడినందుకు చింతింపవలదు. ప్రభువులు శత్రుసేనలను క్షోభింపజేయుట, శత్రువులచే నిగ్రహింపబడుట, తమసైనికులచేత విడిపింపబడుట సహజములే. అట్టిస్థితిలో నీ రాష్ట్రప్రజలైన పాండవులచే యాదృచ్ఛికముగా నీవు విడిపింపబడుటలో చింత నీకేల ? మహారాజువైన నిన్ను సేనతో పర్యటనము చేయుచున్న సందర్భములో వెనుక ద్యూతములో నీకు దాసులయిన పాండవులు సహాయభూతులై నీవెనువెంట సంచరింపకుండుట వారిదే తప్పు. దుర్యోధనప్రభూ ! నేటికి గూడ పాండవుల సర్వస్వము నీవే అనుభవించుచున్నను వారు జీవితము నిలవబెట్టుకొనియే యున్నారు గాని మరణమునకై ప్రాయోపవేశము జేసినారేమో చూడుము; అని.

ఇట్లు చెప్పి నీవు మరణింతువేని నేనును నీతో బాటువాడనే. నిన్నువిడిచి నేను జీవింపను. అని కర్ణుడు చాల జెప్పినను దుర్యోధనుని మరణసంకల్పము మారలేదు. అది చూచి శకుని యిట్లనెను —

"మయా హృతాం శ్రియం స్ఫీతాం తాం మోహా దపయాసి కిమ్ ।
త్వ మల్పబుద్ధ్యా నృపతే ప్రాణా నోన్మ త్స్రష్టు మర్హసి ॥
సత్కృతస్య హి తే శోకో విపరీతే కథం భవేత్ ।

మా కృతం శోభనం పార్థై శ్శోక మాలంబ్య నాశయ ॥
యత్ర హర్ష స్త్వయా కార్య స్సత్కర్తవ్యా శ్చ పాండవాః ।
తత్ర శోచసి రాజేన్ద్ర విపరీత మిదం తవ ॥
ప్రసీద మాత్యజాత్మానం తుష్ట శ్చ సుకృతం స్మర ।
ప్రయచ్ఛ రాజ్యం పార్థానాం యశో ధర్మ మవాప్నుహి ॥
క్రియా మేతాం సమాజ్ఞాయ కృతజ్ఞ స్త్వం భవిష్యసి ।
సౌభ్రాత్రం పాండవైః కృత్వా సమవస్థాప్య చైవ తాన్ ॥
పిత్ర్యం రాజ్యం ప్రయ చ్ఛైషాం తత స్సుఖ మవాప్స్యసి ।''

దుర్యోధనా ! నాచే హరింపబడి నీకర్పింపబడిన ఆ మహైశ్వర్యమును మూఢత్వముచేత నీవు విడిచిపెట్టెదవాయేమి ? నీవు అల్పబుద్ధిచేత ప్రాణత్యాగము చేయుట మంచిపనిగాదు. పాండవులు నిన్ను రక్షించి యాదరించినపుడే నీకిట్టి శోకము కలిగినదే. వారు అనాదరణ చేసియే యున్నయెడల నిక జెప్పవలసిన దేమున్నది ? నీవు శోకించి పాండవులు చేసిన మేలును భగ్నము జేయకుము. వారు నిన్ను రక్షించినందుకు నీవు సంతోషించి వారి నాదరింపవలసియుండ విరుద్ధముగా బ్రవర్తించుట యుక్తమా ? నీవు శాంతింపుము. ప్రాణత్యాగము చేయక సంతుష్టుడవై కృతజ్ఞతకలిగియుండి పాండవుల రాజ్యము పాండవుల కిచ్చివేసి కీర్తిని, పుణ్యమును బొందుము. పాండవు లిప్పుడు చేసిన యీమేలును గుర్తించి వారితో సౌభ్రాత్రమును వహించి వారిపిత్రియమైన రాజ్యము వారికిచ్చి నీవు సుఖపడుము. అని.

చ. "కృతము దలంచి చిత్తమున గిల్బిష మంతయు నుజ్జగించి స
మ్మతుల బృథాతనూజుల నమానుష తేజుల బిల్వబంచి త
త్పితృధనమైన రాజ్యము నభీష్టముగా దగ నిమ్ము నీకు నీ
క్షితివలయంబునం బరమకీర్తియు బుణ్యము గల్గు భూవరా! (ఆంధ్రభారతము)

ఈశకునిమాటలకు గాని, ఆకర్ణునిమాటలకు గాని దుర్యోధనుని మరణసంకల్పము మారనేలేదు.

శకుని, నీవు కృతజ్ఞతను చూపి పాండవుల పిత్రియమైన రాజ్యమును వారి కిచ్చివేయు మని బోధింపగా దాని కిష్టపడకపోయె. పోనీ

కర్ణుడు, వారిది వారికిమ్మని గాని, వారియెడ కృతజ్ఞత జూపుమని గాని చెప్పక నిన్ను రక్షించుట వారికి విధి. వారు నీచే రక్షింపబడుచు నీ రాష్ట్రములో నున్న ప్రజలు; నీకు దాసు లయినవారు; నీకు వచ్చిన న్యూనత యేమియు లేదు. అని బోధింపగా దానికి నిష్కపటకపోయె. ఈ రెండుమార్గములకంటె సమాధానపడుటకు మరియొక మార్గము లేదాయె. దుర్యోధను డేల సమాధానపడలేదు? ఇచ్చట దుర్యోధనాభిప్రాయ మిది—

తాను చచ్చుటే తనకు సమ్మతము గాని, పాండవుల కిచ్చుట సమ్మతము కానందున శకుని మాటలకు సమాధానపడలేదు. అసంగతములై యుండుటచేగాబోలు కర్ణునిమాటలకు సమాధానపడలేదు.

అవి యసంగతము లెట్లనగా (1) నిన్ను విడిపించుట నీరాజ్యములో నున్నవారికి విధి. అనుమాట అసంగతము. పాండవరాజ్యములోని వాడు దుర్యోధనుడు గాని, దుర్యోధనరాజ్యములోనివారు పాండవులు కారుగనుక. (2) నీచే రక్షింపబడుచున్నవారు పాండవులు అనుమాట అసంగతము. వారు దుర్యోధనునిచే హింసింపబడుచున్నారుగనుక. (3) నీచే రక్షితులగు పాండవులు నిన్నువిడిపించుటలో చిత్రమేమున్నది అను మాట అసంగతము. దుర్యోధనునిచే హింసింపబడు పాండవులు దుర్యోధనుని రక్షించుట చిత్రమ్మేగనుక. (4) నీరాష్ట్రప్రజలైన పాండవులచే నీవు విడిపింపబడిన నీకేమి చింత? అను మాట అసంగతము. పాండవులయెడ ప్రజాదృష్టి కాక ప్రబలమైన శత్రుత్వదృష్టికలవాడు దుర్యోధనుడుగనుక. (5) నీకు దాసులయియుండి నీపర్యటనములో నీ వెనువెంట రాకుండుట పాండవులదే తప్పు అనుమాట అసంగతము. ప్రథమద్యూతములో తమ్ముతొడ్డి యోడిపోయి దాసులగుట నిజమయినను ద్రౌపదీదేవిపట్ల దుష్టచతుష్టయము జేసిన దురంతకృత్యముల వలన గోచరించిన ఉత్పాతములకు భీతిల్లి ధృతరాష్ట్రుడు ద్రౌపదీదేవి కిచ్చిన వరములుగా పాండవదాస్యవిముక్తి, పాండవరాజ్యప్రాప్తి

మరల గలిగియే వనవాసాజ్ఞాతవాసపణముతో మాత్రిమె పునర్ధ్యాత మేర్పడినందున పాండవు లిప్పుడు దాసులు కారుగనుక. (6) నీవు పాండవుల సర్వస్వము ననుభవించుచున్నను నేటికి గూడ వారు మర ణమునకు సంకల్పింపక జీవితము నిలవబెట్టుకొనలేవా. నీవును అట్లే యుండవలయు ననుమాట అసంగతము. పాండవులు నిరపరాధులు, పుణ్యశ్లోకులు, ధర్మనిష్ఠులు, సత్యసంధులు, కీర్తికాములు, రాజ్యప్రతిష్ఠి తులు, కష్టసహిష్ణువులును; దుర్యోధనుడు మహాపరాధి, పాపసంక ల్పుడు, అధర్మనిష్ఠుడు, అసత్యశీలుడు, అర్థకాముడు, రాజ్యలుబ్ధుడు, ఘాతుకస్వభావుడు.

అపకారులయందును ఉపకారబుద్ధి గలవారు పాండవులు. ఉప కారులయందును అపకారబుద్ధి గలవాడు దుర్యోధనుడు. ఇంత భేద మాయికువురిలో నుండుటనుబట్టి యెన్ని కష్టములకైన తలయొగ్గి పరమశాంతులై, సర్వలోకవంద్యులై, లోకాదర్శజీవనులై, శ్రుతి స్మృతివచనలక్ష్యభూతులై వర్తించిన ధన్యజీవులగు పాండవులవలె పాపాత్ముడు, పాండవవిద్వేషి, నిషిద్ధవర్తనుడు, లోకనింద్యుడు అగు దుర్యోధనుడు ఇప్పటికిని ప్రాణరక్షకులైన పాండవులపై వైరము తొలగని దుర్యోధనుడు లోకములో తల యెత్తి తిరుగలేడు గనుక.

ఇట్టి అసంగతప్రసంగము కర్ణుని దగుటచేతనే దుర్యోధనుడు సమాధానపడకపోయెను; అని చెప్పవలసియున్నది.

దుర్యోధనుడు చనిపోకుండుటకై చెప్పినవే అయినను పాండవుల యెడ కృతజ్ఞత జూపుము. వారి రాజ్యము వారి కిచ్చివేయుము. అను శకుని మాటలలో న్యాయ మున్నది.

కృతజ్ఞతాబుద్ధి లేదు సరికదా తప్పు పాండవులయందే యున్నట్లు కూడ అసంగతముగా ప్రసంగించిన కర్ణునిమాటలలో అతని అశక్తి దుర్జనత్వములు స్పష్టమగుచున్నవి. దుర్యోధనుని అశక్తిదుర్జనత్వ ములమాట చెప్పనక్కరయే లేదు.

—॥ లౌకికుఁడగు ధర్మరాజు చేసిన యుపకారము దుర్యోధనునకు దురంతమగు వైరము గలిగించుట వింత కాదు. అను ప్రసంగము—తన్నిరాకరణము ॥—

కర్ణచరిత్రకారుల వ్రాత యిట్లున్నది—

1. పాండవులను బరాభవించి తన వైభవమును జూపఁబోయిన సుయోధనునకు గంధర్వులతో నోడుటకంటె పాండవులు తన్ను రక్షించుటయే దుస్సహమగు పరాభవ మయ్యెను.
2. ధర్మరాజు దుర్యోధనునకు జేసినది మహోపకారమే యనదగియున్నను నది మానవంతులలో నగ్రగణ్యుఁడగు దుర్యోధనునకు మహాపకార మయ్యెను.
3. గంధర్వుల బారినుండి తప్పించి యుపకారము చేసిన ధర్మరాజునకు దోచనె రాజ్యభాగ మిచ్చి దుర్యోధనుడు కృతజ్ఞతను జూపుట యుచిత మని సామాన్యముగ దోచును గాని లౌకికుఁడగు ధర్మరాజు చేసిన యీసందర్భములోని యుపకారము మహామాని యగు దుర్యోధనునకు దురంతమగు వైరమును గలిగించుటయు వింత కాదు.
4. మానవంతుఁడగు పురుషునకు దైవవశమున దైన్యస్థితి గలిగినప్పుడు విరోధి చేయు నుపకారము అపకారశతముకన్న నధిక మనుట అనుభవవిరుద్ధము కానేరదు. కావుననే లోకజ్ఞుఁడగు ధర్మజుడు చేసిన యుపకారము దుర్యోధనున కాత్మహత్య చేసికొనవలసినంత యావశ్యకతను సంఘటించెను.
5. ఇట్టి గొప్ప యాపద సంభవించుటలో కర్ణుడే మూలకారణమై యుండెనుగదా. నిజమైన స్వామిభక్తి గలవాని కింతకంటె దురంతమగు దుఃఖము వేరొకటి యుండునా ? ఎన్నెన్నో మాయోపాయములను బన్ని యెన్నెన్నో యనుచిత కార్యముల నెందరెందరో చేసిన గాని జయింపరాని కర్ణుడు ఇట్లు పాండవులచే జయింపబడిన గంధర్వుల కోడుట నరయగా యుద్ధము నందలి జయాపజయములు కాకతాళీయము లని స్ఫురింపకపోదు. అర్జునుడును నొకప్పుడు కర్ణు తేజమున కోహటించి "జీవన్ భద్రాణి పశ్యతి" అని పలుకుచు యుద్ధభూమినుండి తొలగిపోయెను గాదె.
6. అకల్పమును జీవింపకతీరని కర్ణదుర్యోధనుల కీర్తిశరీరములకు సంభవించిన యీ మాలిన్యమును తేజఃప్రదర్శనమున సాధ్య మగునంతవరకైన దుడిచి ప్రకాశింప జేయుటయు నాటికి నిష్కళంకమై యున్న శత్రువుల కీర్తిశరీరమునకు సాధ్యమగునంతవరకు మాలిన్యమును గూర్చుటయు వారికి గర్తవ్యములు కాకపోవు. కావుననే కర్ణుడు ధైర్యశాలియై యూరడిల్లి దుర్యోధను నూఱడింపబోయెను"

(పు 49-50)

ఈ యీరంశములను బరిశీలింతము—

ప్రథమాంశము—దుర్యోధనుడు తన వైభవమును జూపి పాండవులను పరాభవించుటకై వెళ్ళగా తనకే పరాభవమైనదని వ్రాసినారు. బాగున్నది, ఆపరాభవము. గంధర్వకృతమానప్రాణహానిరూపము అనుటకు బదులు పాండవులు రక్షించుటయె. అది వ్రాయుట చిత్రముగా నున్నది. ఇది దుర్యోధనుని భావమా? ప్రతివాదుల భావమా? దుర్యోధనుని భావమైనయెడల తనకు గలిగిన గంధర్వకృతమానహానిని అంత పరాభవముగా భావింపని దుర్యోధనుడు మానవంతు డనబడడు గనుక ద్వితీయాంశములో— "మానవంతులలో నగ్రగణ్యుడు" అని కీర్తించుట తప్పు. రక్షించినవానిని పరాభవించినవానిగా భావించుట అశక్తి దుర్జనత్వలక్షణమె కాని మానవంతునికి లక్షణముకాదు.

ఇక ప్రతివాదుల భావ మదియైనపక్షములో నైనను రక్షించుటను పరాభవించుటయనుట లోకవిరుద్ధ మగుటచేతను, పరాభవించె ననియె వ్రాయక ధర్మరాజు రక్షించె నని ప్రతివాదులు వ్రాయుటచేతను, రక్షించిన ధర్మరాజును పరాభవించినట్లు శకునివంటివాడుగూడ చెప్పియుండఁబోవుటచేతను అసంగతమగుటచే ప్రథమాంశము నిరస్తమైనది.

ద్వితీయాంశము—ధర్మరాజు చేసినది మహోపకారమే అనదగి యున్నదట! మానవంతులలో నగ్రగణ్యుడగు దుర్యోధనునకు అది మహాపకార మయ్యెనట!

అయితే ధర్మరాజు చేసినది అపకారబుద్ధితో చేసెనట్లా? ఉపకారబుద్ధితో చేసినట్లా? అపకారబుద్ధితో చేసినపక్షములో అది మహోపకారమే అనదగియున్నదనుట అసంగతము. ఉపకారబుద్ధితో జేసినదే అను పక్షములో అది మహాపకార మగు టెట్లు? ధర్మరాజుని మహోపకారమును మహాపకారముగా భావించినట్టి దుర్యోధనుని మానవంతులలో నగ్రగణ్యుడని ప్రతివాదులు వర్ణించుట అయుక్తము.

ఉపకారమును అపకారముగా భావించుట మానవంతుల లక్షణమా ? దుర్జనలక్షణమా ? కనుక ద్వితీయాంశ మపాస్తము.

తృతీయాంశము - గంధర్వులనుండి తప్పించి యుపకారముజేసిన ధర్మరాజునకు దోడనె రాజ్యభాగమిచ్చి దుర్యోధనుడు కృతజ్ఞతను జూపుట యుచితమని సామాన్యముగ దోచునట ! కాని లౌకికు డగు ధర్మరాజుచేసిన యీసందర్భములోని యుపకారము మహామానియగు దుర్యోధనునకు దురంతమగు వైరమునుగలిగించుటయు వింతకాదట !

ఓహో ! వీరి వ్రాత వింతగా నున్నది. సర్వసామాన్యముగ దోచునది యేమి ? ఉపకారముజేసిన ధర్మరాజునకు రాజ్యభాగమిచ్చి దుర్యోధనుడు కృతజ్ఞతనుచూపుట యుచితమనియేకదా ! ఇక విశేష మేమి ? దుర్యోధనునకు అది దురంతవైరమును కలిగించుటా ? అతని కది వైరోద్దీపక మగుటకు అతడు మహామాని యగుట యొక కార ణమా ? అది లౌకికుడగు ధర్మరాజుచేసిన యుపకార మగుట మరి యొక కారణమా ? అది యీసందర్భములోని యుపకారమగుట యింకొక కారణమా ?

అయితే యిన్నికారణములను బట్టి ధర్మజుని యుపకారము దుర్యోధనవైరోద్దీపక మయియుండ దుర్యోధనుడు కృతజ్ఞతను జూపుట యుచితమని సర్వసామాన్యముగా నెట్లుతోచుచుండెను ? సర్వసామా న్యముగా దోచు విషయమునుకాదని అప్రమాణముగా ప్రసంగించుట సజ్జనలక్షణము కాదుకదా !

ప్రతివాదులు చూపిన కారణము లెట్టివో చూతము- దుర్యో ధనుడు మహామాని యనదగడని చెప్పియున్నాము. గంధర్వకృతమహా వమానమును గణింపనివాడు మహామాని యెట్లగును ? పాండవకృత మానరక్షణమునకు ప్రకోపించువాడు మహామాని యెట్లగును ?

ఉపకారము చేసిన ధర్మజుడు లౌకికుడట ! దీని కర్థము చతు ర్థాంశములో "లోకజ్ఞ డగు ధర్మజుడు" అను వాక్యమునుబట్టి లోకజ్ఞ

డన్నమాట. ఇప్పుడు ఇహపరలోకజ్ఞానముకలవాడు లోకజ్ఞ డనబడును. ఆ యిహపరలోకజ్ఞానము గలవారే పుణ్యాత్ము లనబడుదురు. అట్టి లోకజ్ఞుడు ధర్మజు డాయె. అట్టి ధర్మజుడు చేసినది ఉపకార మాయె. దాని నపకార మనుట యెట్లు ? అది వైరోద్దీపక మనుట యెట్లు ? లోకజ్ఞానము గల ధర్మజుడు చేసిన మహోపకారమును మహోపకార మని లోకజ్ఞానము లేనివాడే అనుకొనవలయును.

ఆయుపకారము ఈసందర్భములోని దయ్యె నట ! ఏసంద ర్భములోనిది ? పాండవులను పరాభవింపదలచి వెళ్ళిన సందర్భము లోనిది; గంధర్వకృతమానప్రాణహానిసందర్భములోనిది; కర్ణు డంతటి వాడు పలాయనమైపోయిన సందర్భములోనిది; కులకాంతలను మాన హానికరముగా ఎత్తుకొనిపోవుచున్న సందర్భములోనిది; దుర్యోధనుడు బంధింపబడి తీసికొనిపోబడుచున్న సందర్భములోనిది. ఇట్టి సందర్భము లోని యుపకారము దుర్యోధనునకు ఆ పాండవులయందే వైరోద్దీపక మగుట దుర్జనలక్షణమా ? సజ్జనలక్షణమా ? దుర్యోధనున కది వైర మును కలిగించుట వింతకా దనుచు దుర్యోధనుని వెనుకవేసికొని ప్రసంగించుట, పాండవుల యోగ్యతను నిరాకరించుట ప్రతివాదులకు భావ్యమైన పని కాదు. ఇట్టి కుకల్పనలతో సర్వసామాన్యముగ దోచు నట్టి అనగా లోకప్రసిద్ధమైనట్టి కర్ణదుర్యోధనుల దుర్వృత్తిని సమర్థింప బూనుట యుక్తికి, ప్రమాణమునకు, లోకప్రసిద్ధికిగూడ విరుద్ధ మగు టచే హేయము. "నాగల కార్యమును గంధర్వులే తీర్చినారు" అన్నది లోకప్రసిద్ధము. కనుక తృతీయాంశము నిరస్తము.

చతుర్థాంశము—మానవజంతునకు దైవవశమున దైన్యస్థితి గలిగినపుడు విరోధి చేయు నుపకారము అపకారముకన్న నధికమనుట అనుభవవిరుద్ధము కానేరదట ! కావుననే లోకజ్ఞ డగు ధర్మజుడు చేసిన యుపకారము దుర్యోధనున కాత్మహత్య చేసికొనవలసినంత యావశ్య కతను సంఘటించెనట !

అయితే దుర్యోధనునకు ఆదైన్యస్థితి దైవవశమున గలిగిన దన వలెనా ? దుర్బుద్ధివశమున గలిగిన దనవలెనా ?

సద్బుద్ధితో ప్రవర్తించువానికి అనర్థము ఎప్పుడైన ప్రాప్తించు పక్షములో అది దైవవశమున గలిగిన దనవలయును. దుర్బుద్ధితోనే ప్రవర్తించువానికి ప్రాప్తించిన అనర్థము దుర్బుద్ధివశమున గలిగిన దనియే అనవలయును. ఇది లోకమర్యాద.

దైవవశ మను మాటకు అదృష్టవశ మని యర్థము. అనర్థా వహము కాని దృష్టకారణసామగ్రి యుండగా అనర్థము గలిగినప్పుడు అది యదృష్టకారణవశ మనబడును. దుర్బుద్ధ్యాదిరూపదృష్టకారణము తోడనే ప్రవర్తించినపుడు కలిగిన అనర్థము దుర్బుద్ధివశ మనబడునే గాని దైవ (అదృష్ట) వశ మనబడదు.

"అహో నార్హ మిదం కర్మ కష్టం దుశ్చరితం కృతమ్ ।
స్వయం దుర్బుద్ధినా మోహా ద్యేన ప్రాప్తోఽస్మి సంశయమ్ ॥"

అనుచు అనర్హమైన యీపనిని దుర్బుద్ధితో స్వయముగా జేసి యీప్రాణసంకటములో బడితిని. అని దుర్యోధనుడు స్వయంకృతాప రాధమని చెప్పగా- ప్రతివాదులు దానిని దైవవశ మని సవరించుట నింద్యము.

కనుక దుర్యోధనునకు దైన్యస్థితి దైవవశమున గలిగిన దనుట తప్పు. ఆతడు మానవంతు డనుటగూడ తప్పే అని చెప్పియున్నాము.

ఇక "విరోధి చేయు నుపకారము" అను మాట యున్నది— విరోధియే అయినయెడల నాతడు చేసినది యుపకార మెట్లగును? అది యుపకారమే అయినయెడ ఆచేసినవాడు విరోధి యెట్లగును ? కనుక నీవాక్యము విరుద్ధము. ఇంకొకటి— "మానవంతునకు ... విరోధిచేయు నుపకారము" అనువాక్యములో దుర్యోధనునకు ధర్మజుడు విరోధియని తేలినను, ధర్మజునకు దుర్యోధనుడు విరోధి యని లేదు కనుకనే- ఆ వాక్యములోని ఉపకారము అనుమాట సంగతమయినది. విరోధి విరోధికి అపకారముచేయుటేగాని, యుపకారముచేయుట సంభవముగాదు.

ధర్మజుఁడు చేసినది ఉపకారమని ప్రతివాదులే వ్రాసినారు. కాబట్టి
దుర్యోధనుఁడు ధర్మజునకు విరోధి కాఁడని తీరవలెను. అందుచేతనే
ధర్మజునకు అజాతశత్రునామము సార్థకము.

ఇట్టి స్థితిలో దుర్యోధనునకు జేసినది యుపకారమై యుండ, ఆ
చేసిన ధర్మజుఁడు దుర్యోధనునియందు విరోధిభావము లేనివాఁడై
యుండ "అట్టియుపకారము అపకారశతముకన్న నధికమనుట అనుభవ
విరుద్ధము కాదనుట నింద్యము. అది దుర్యోధనునివంటివానికి అనుభవ
సిద్ధమేమో కాని, సర్వసామాన్యముగా అనుభవసిద్ధమనుట తప్పు.
అట్టి ధర్మజునిచే యావిధమైన యుపకారమును బొందిన దుర్యోధనుఁడు
తరువాతదాని నపకారశతముకన్న నధికముగా భావించి యాత్మహత్య
జేసుకొనదలచుటచే యాతని యశక్తిదుర్జనత్వములను వెల్లడించుచుండ
ఆదుర్యోధనకృత్యములను సమర్థింపబూనుట అశక్యమగుటచేతను, ప్రతి
వాదులుచేసిన కల్పనలు నిలువకపోవుటచేతను చతుర్థాంశమునిరస్తము.

పంచమాంశము—"ఇట్టి గొప్ప యాపద సంభవించుటలో
కర్ణుడే మూలకారణమై యుండెనుగదా" ఔను, "నిజమైన స్వామిభక్తి
గలవాని కింతకంటె దుఃఖము వేరొకటి యుండునా"

ఉండదు. ఇది తన కట్టి యాపద కలిగినప్పుడును, తాను ప్రోత్స
హించినవానికి గలిగినప్పుడును ఉద్ధతుఁడగువాని కెల్ల గలుగునట్టి
దుఃఖమే కనుక "స్వామిభక్తి గలవానికి" అని విశేషించుట వ్యర్థము.
దుష్కార్యములలో దుర్యోధనుని ప్రోత్సహించు కర్ణునిది స్వామిభక్తి
యనుట విరుద్ధము కూడను.

సహజపాండవవిద్వేషి యగు కర్ణుడు అట్టి దుర్యోధనునితో
నేకమై యుండుట స్వామిభక్తియా ? పాండవరాజ్యాక్రమణరూపమైన
అర్థసంబంధముతో దుర్యోధను నాశ్రయించియున్న కర్ణునిది స్వామి
భక్తియా ? కనుక విరుద్ధము.

"కర్ణుడు పాండవులచే జయింపబడిన గంధర్వులకోడుట జూడగా

యుద్ధమునందలి జయపరాజయములు కాకతాళీయములని స్ఫురింపక పోదట!"

అకర్ణుడెట్టివాడు?—"ఎన్నెన్నో మాయోపాయములను బన్ని యెన్నెన్నో యనుచితకార్యముల నెందరెందరో చేసినగాని జయింప రాని కర్ణుడట !"

అయితే మత్స్యయంత్రభంజనానంతరము పార్థునిపై డీకొని యోడిపోయిన కర్ణునిపట్ల మాయోపాయములుగాని, అనుచితకార్యములుగాని యేమి చేయబడినవి? ఉత్తరగోగ్రహణకాలములో పార్థున కోడిపోయిన కర్ణునిపట్ల అవి యేమి చేయబడినవి ? పార్థునివలన కర్ణ పరాజయము స్వాభావికమే.

ప్రతివాదు లన్న మాయోపాయములు, అనుచితకార్యములు పాండవులపట్ల కర్ణాదు లవలంబించినవే.

భీమసేనునకు విషముపెట్టి గంగలో బడవేసినవా రెవరు ? పాండవహత్యకై లాక్షాగృహనిర్మాణాదిఘోరకార్యములు చేసినవా రెవరు ? కపటద్యూతమున పాండవసర్వస్వమును హరించినవా రెవరు? ద్రౌపదీదేవిపట్ల అనుచితకార్యములు చేసినవా రెవరు ? వనవా సాజ్ఞాతవాసరూపకుటిలపణములతో పాండవులను అరణ్యముల పాలు చేసి వారిరాజ్యమును చేపట్టినవా రెవరు ? అరణ్యములో వారిపాట్లు వారే పడుచుండ వారిని దుఃఖపెట్టదలచి ఘోషయాత్రావ్యాజమున తరలివచ్చినవా రెవరు ? దుర్వాసోమహర్షి నారాధించి సంతోషపెట్టి వనవాసులైన పాండవులను శాపహతులను జేయింపదలచి ఆమహర్షిని పాండవులయొద్దకు బంపినవా రెవరు ? (ఈవిషయము ముందు విశదీకరింపబడును) ఇట్టి యకార్యములనే ఆదినుండియు కర్ణాదులు చేయుచువచ్చినారు. పాండవు లేమియు జేసి యెరుగరు. ప్రకృతమునకు వత్తము.

కర్ణాదుల కుటిలకృత్యములనుబట్టియే కర్ణాదులను మించిన పరాక్రమము పాండవుల దని ఘుసిన మగుచున్నది. ప్రతివాదులు- 'కర్ణుడు గంధర్వులకోడుట' అనిమాత్రమె అనక 'పాండవులచే జయింపబడిన గంధర్వుల కోడుట' అనుటవలన కర్ణుడు గంధర్వుల కోడుటలో వీరికి గలిగిన చింతకంటె ఆగంధర్వులను పాండవు లోడించుటలో హెచ్చు చింత కలిగినట్లు కనబడుచున్నది. ఆగంధర్వులను పాండవులు జయింపనినాడు మన దుర్యోధనుడే లేడు.

ఆకర్ణు డట్లు ఓడుట జూడ యుద్ధమునందలి జయపరాజయములు కాకతాళీయములని అనిపించుచున్న దన్నారు. కాకతాళీయము లను మాటకు అదృష్టాధీనములని యర్థమే. ఈమాట ఎన్నడును, ఎవ్వనికిని యోడిపోనట్టివాడు తనకంటె దుర్బలునకు ఒకప్పు డోడుట తటస్థించెనేని అప్పు డనవలసినమాట. ఈ కర్ణుడు పాండవులచే జయింపబడిన వారి కోడిపోవుట, యిది యొక్కటే కాదు, పాండవజితుడైన ద్రుపద మహారాజునకును ఓడిపోయినాడు. అసహాయుడై యుండి యోడిపోవుట కాదు. కౌరవవీరసహితుడై యోడిపోయినాడు. చూడుడు—

కుమారాస్త్రవిద్యాప్రదర్శనానంతరము గురుదక్షిణగా ద్రుపదుని బట్టి తెచ్చుటకై ద్రోణాచార్యాజ్ఞ దీసికొని అహమహమికతో వెళ్ళిన కౌరవులలోని ప్రముఖులను—

"వ్యధమ త్తా న్యనీకాని తత్ క్షణా దేవ భారత ।
దుర్యోధనం వికర్ణం చ కర్ణం చాపి మహాబలమ్ ॥"

ద్రుపదమహారాజు పీడించి పారదోలెను. అందులో కర్ణు డొకడు. ఆంధ్రభారతము—"ఇట్లు పాంచాలు బాణవృష్టికి నిలువోపక కురుకుమారులు...తెఱచఱచి పాండవులయొద్దకుం బఱతెంచిన"

తరువాత పాండవుల కా ద్రుపదు డోడిపోయినాడు. ఇట్లు పాండవజితుల కోడిపోవుచుండుట, పార్థుని కోడిపోవుచుండుట కర్ణునకు సార్వదికమై యుండ నది కాకతాళీయ మనుట అయుక్తము.

ఇక "అర్జునుడును ఒకప్పుడు కర్ణుతేజమున కోహటించి "జీనర్

భద్రాణి పశ్యతి" అని పలుకుచు యుద్ధభూమినుండి తొలగిపోయెను గాదె" అనుమాట యున్నది. ఈవిషయము కర్ణార్జునయుద్ధనిరూపణ సందర్భములో ముందు వివరింపబడును.

ప్రతివాదిమతప్రకారము చూచినను పార్థుడు కర్ణుని తేజమునకు బెదరి యుద్ధభూమినుండి తనకు దాను తొలగిపోయె నని వ్రాసినారు గాని కర్ణార్జునద్వంద్వయుద్ధమునుండి తొలగిపోయినట్లు గాని, కర్ణునిచే పారదోలబడి తొలగిపోయినట్లుగాని వ్రాయలేదు. కర్ణుడుమాత్రము ద్రుపదపార్థగంధర్వులచే ద్వంద్వయుద్ధములో పారదోలబడినవాడే. కనుక జయాపజయములు కాకతాళీయము లని, కర్ణుని యపజయ మట్టిదే యని, దానికి పార్థుని తిరోగమనము నిదర్శనమని ప్రతివాదులు వ్రాయుట అసంగతము.

ప్రతివాదు లన్నట్లు "జీవన్ భద్రాణి పశ్యతి" జీవించుట శుభావహమని పార్థు డనినాడు. మరణించుటే శుభావహమని దుర్యోధను డనినాడుకద! తనపట్టు తాను విడువక దుర్వృత్తితో సంచరించు దురాశాగ్రస్తుడైన దురభిమాని ఆశాభంగమైనపుడు తలయెత్తి లోకములో దిరుగలేక మరణింపదలచును. సుజను డట్లు తలపడు.

మొత్తముమీద కర్ణునిపరాజయము కాకతాళీయము కానేరదు. ఆతనికి గలుగు జయము కాకతాళీయము. కనుక పంచమాంశము నిరస్తమైనది.

షష్ఠాంశము— కర్ణదుర్యోధనుల కీర్తిశరీరములకు గలిగిన యీ మాలిన్యమును తుడిచి ప్రకాశింపజేయుటయు, నావఱకు నిష్కళంకమై యున్న శత్రువుల కీర్తిశరీరమునకు మాలిన్యము గూర్చుటయు వారికి గర్తవ్యములు గాకపోవట!

వీరు ఈ వ్రాతలో కర్ణదుర్యోధనులవి కీర్తిశరీరము లన్నారు. వానికి మాలిన్యము అనగా గంధర్వపరాజయము, పాండవరక్షణము అను మాలిన్యము కలిగినదన్నారు. దానిని తుడిచి ప్రకాశింపజేయుట

వారికి గర్తవ్యమే అన్నారు. పరాజయమాలిన్యము వారి కెప్పుడు నున్నదే. అది వారి యుత్తరోత్తరచర్యలలో ఘనీభవించిపోయినదే. ఏమి తుడిచివేయబడినది? మఱియు కర్ణదుర్యోధనులవి కీర్తిశరీరములా? పరక్షేత్రపిత్రాపహారపాండవహాత్యోద్యమాదికృత్యములను బట్టి సంభవించినవేనా అవి ? అట్టి కృత్యములచే సంభవించినవి కీర్తిశరీరములైనపక్షములో అపకీర్తిశరీరము లేకృత్యములచే సంభవించును ?

పాండవులది కీర్తిశరీరమనియే అన్నారు. అది యావఱకు నిష్కళంకమే అన్నారు. దానికి మాలిన్యముగూర్చుట కర్ణదుర్యోధనులకు కర్తవ్యమే అన్నారు. పాండవుల కీర్తిశరీరము అవరకెకాదు, ఈవరకు నిష్కళంకమే. ప్రతివాదుల అసంగతప్రసంగములు ఆకీర్తిశరీరమును కళంకిత మెన్నడును జేయలేవుగనుక పాండవుల కీర్తిశరీర మేవరకయిన నిష్కళంకమే. కర్ణదుర్యోధను లాకీర్తిశరీరమునకు మాలిన్య మేమి కూర్చగలిగినారు ? కనుక పక్షాంశము కూడ నిరస్తమైనది. ఘోషయాత్రలో పాండవులు మానప్రాణరక్షణమూలమున దుర్యోధనునకు మహోపకారము చేసినా రనునది సారాంశము.

—: దైత్యదానవులు దుర్యోధనుని మరణింపకుండజేసి నిన్ను నమ్ముకొనియే మే మున్నామని చెప్పి నరకాసురునిఆత్మ కర్ణునియం దావిష్టమగు నని చెప్పి హెచ్చరించుట :—

దుర్యోధనుడు మరణమునకు కృతనిశ్చయుడై దర్భలు పరచుకొని కూర్చుండిననాటిరాత్రి దేవతలచే నిర్జితులై పాతాళవాసులై యున్న దైత్యదానవులు ఆదుర్యోధనుని తమయొద్దకు రప్పించుటకై హోమప్రక్రియను అథర్వవేదోక్తపద్ధతిని నడిపి దానినుండి కృత్యను (ఆజ్ఞాకరీదేవతా) ఆవిర్భవింపజేసి దుర్యోధనుని యిచ్చటకు దీసికొని రమ్మని నియోగింప నాటిరాత్రి ఆకృత్య ఆతని నవలీలగా నచ్చట ప్రవేశపెట్టినది. ఆశ్లోకము లివిగో—

"అథ తం నిశ్చయం తస్య బుద్ధ్వా దైతేయదానవాః ।
పాతాలవాసినో రౌద్రాః పూర్వం దేవై ర్వినిర్జితాః ॥
తే స్వపక్షక్షయం తం తు జ్ఞాత్వా దుర్యోధనస్య వై ।
ఆహ్వానాయ తదా చక్రుః కర్మ వైతానసంభవమ్ ॥

టీ॥ వైతానసంభవం అగ్నివిస్తారసాధ్యం నవకుండ్యాదివిధాన మాథర్వణికం, న తు త్రియీరూపమ్ ।

"కర్మసిద్ధా తదా తత్ర జృంభమాణా మహాద్భుతా ।
కృత్యా సముత్థితా రాజన్ కిం కరోమీతి చాబ్రవీత్ ॥
ఆహు ర్దైత్యాశ్చ తాం తత్ర సుప్రీతే నాంతరాత్మనా ।
ప్రాయోపవిష్టం రాజానం ధార్తరాష్ట్ర మిహానయ ॥
సమాదాయ చ రాజానం ప్రవివేశ రసాతలమ్ ।"

అట్లు ప్రవేశపెట్టబడిన దుర్యోధనుని చూచి— (ఆంధ్రభా.)

"ప్రీతులై వారు వానిం గౌగలించుకొని కళలం బడిగి యిట్లనిరి. అయ్యా! నీవు తూరుండవు...ఇట్టి సాహసం బేల చేసితివి ... నీ వఖిలధర్మార్థయశోభోగ నాశంబైన యీదుర్విచారంబు విడువుము. ధైర్యంబును బ్రతాపంబును బాటింపుము. శత్రుజనభంజనంబు సేయుము. నీవు మనుష్యమాత్రుండవు గావు"

"భో స్సుయోధన రాజేన్ద్ర భరతానాం కులోద్వహ ।
అకార్షీ స్సాహస మిదం కస్మా త్ప్రాయోపవేశనమ్ ॥
శ్రూయతాం తు ప్రభో తత్త్వం దివ్యతాం చాత్మనో నృప ।
నిర్మాణం చ శరీరస్య తతో ధైర్య మవాప్నుహి ॥
పురా త్వం తపసాఽస్మాభి ర్లబ్ధో రాజన్ మహేశ్వరాత్ ।
పూర్వకాయ శ్చ సర్వ స్తే నిర్మితో వజ్రసంచయైః ॥
అస్త్రై రభేద్య శ్శస్త్రై శ్చాప్యధఃకాయశ్చ తేఽనఘ ।
కృతః పుష్పమయో దేవ్యా రూపతః స్త్రీమనోహరః ॥
ఏవ మీశ్వరసంయుక్త స్తవ దేహో నృపోత్తమ ।
దేవ్యా చ రాజశార్దూల దివ్య స్త్వం హి న మానుషః ॥
తదలం తే విషాదేన భయం తవ న విద్యతే ।
సహాయార్థం చ తే వీరా స్సంభూతా భువి దానవాః ॥
భీష్మద్రోణకృపాదీంశ్చ ప్రవేక్ష్యం త్యపరేఽసురాః ।
యై రావిష్టా ఘృణాం త్యక్త్వా యోత్స్యన్తే తవ వైరిభిః ॥
నిస్స్నేహా దానవాఽవిష్టా స్సమాక్రాన్తేఽన్తరాత్మని ।

ప్రహరిష్యన్తి వివశాః స్నేహ ముత్సృజ్య దూరతః ॥
దైత్యరక్షోగణా శ్చైవ సంభూతాః క్షత్రయోనిషు ।
యోత్స్యన్తి యుధి విక్రమ్య శత్రుభి స్తవ పార్థివ ॥
యచ్చ తేఽన్తర్గతం వీర భయ మర్జునసంభవమ్ ।
తత్రాపి విహితోఽస్మాభి ర్వధోపాయోఽర్జునస్య వై ॥
హతస్య నరకస్యాత్మా కర్ణమూర్తి ముపాశ్రితః ।
తద్వైరం సంస్మరన్ వీర యోత్స్యతే కేశవాఽర్జునౌ ॥
స తే విక్రమశౌటీరో రణే పార్థం విజేష్యతి ।''

సుయోధనా! నీ విట్టి సాహసము చేయుట మంచిది కాదు. నీ యుత్పత్తి, నీ శరీరనిర్మాణము ఎట్టిదో చెప్పుచున్నాము వినుము.

దేవనిర్జితులమైన మేము తపస్సు చేసి మహేశ్వరునివలన నిన్ను సంపాదించుకొనినాము. నీశరీరనిర్మాణము మహేశ్వరునిచే జేయబడినది. ఆనిర్మాణములో నీనాభికి పైభాగము వజ్రమయమై శస్త్రాస్త్రముల కభేద్యమై యుండునట్లును, దిగువభాగము పుష్పకోమలమై యుండునట్లును, రూపము స్త్రీజనమనోహరమై యుండునట్లును నిర్మింపబడినది. ఇట్లు పరమేశ్వరీపరమేశ్వరులచే సంయోజన చేయబడిన దివ్యస్వరూపుడవుకాని నీవు మనుష్యమాత్రుడవు గావు.

నీవు చింతగాని, భయముగాని పెట్టుకొనవలసిన పని లేదు. నీకు సహాయార్థమై దానవవీరులు లోకములో జన్మించియున్నారు.

మరికొంద రసురులు భీష్మద్రోణకృపాదులను ఆవేశింతురు. వారి యావేశమున నిర్దయులై భీష్మాదులు నీశత్రువులనుసంహరింతురు.

దైత్యదానవులు కొందరు క్షత్రియజన్మము లెత్తియున్నారు. వారందరు నీకు సహాయపడుదురు. నీ కర్జునభయ మేది కలదో దానిని బోగొట్టుటకై అర్జునవధోపాయమునుగూడ మేము నిశ్చయించి యున్నాము. శ్రీకృష్ణహతుడైన నరకాసురుని ఆత్మ కర్ణునియం దావేశించి యుండి వెనుకటి పగను దీర్చుకొనదలచుచు కృష్ణార్జునులను ప్రతిఘటించును. పరాక్రమశాలి యగు కర్ణుడు పార్థుని జయించును.

"అసపత్నా త్వయా హీయం భోక్తవ్యా వసుధా నృప ।
వినష్టే త్వయి చాఽస్మాకం పక్షో హీయేత కౌరవ ॥
త్వ మస్మాకం గతి ర్నిత్యం దేవతానాం చ పాండవాః ।"

నీవు నిస్సపత్నముగా భూమండల మనుభవింపుము. నీవు మరణించినయెడల మా దైత్యదానవపక్షమే పడిపోవును. దేవతాపక్షమునకు పాండవులు దిక్కు. మాకు నీవు దిక్కయియున్నావు.

ఈ విధముగా దైత్యదానవవర్గము దుర్యోధనుని పురికొల్పి ఆతనిబుద్ధిని స్థిరపరచినతరువాత దుర్యోధనుని ఆకృత్య యథాస్థానమున ప్రవేశపెట్టి యంతర్ధాన మయ్యెను.

"న చాచచక్షే కస్మైచి దేత ద్రాజా సుయోధనః ।"

ఈవృత్తాంత మెవ్వనికిని దుర్యోధనుడు చెప్పనేలేదు. తన మనస్సులో బెట్టుకొని పాండవులను తప్పక జయింతు నని దృఢముగా నమ్మినాడు.

"కర్ణోఽప్యావిష్టచిత్తాత్మా నరక స్యాంతరాత్మనా ।
అర్జునస్య వధే క్రూరాం కరోతిస్మ తదా మతిమ్ ॥
భీష్మద్రోణకృపాద్యాశ్చ దానవాక్రాంతచేతసః ।
న తథా పాండుపుత్రాణాం స్నేహవంతో విశాంపతే ॥" (వన. అ. 252)

కర్ణుడు నరకాసురుని యాత్మచేత ఆవిష్టచిత్తుడై అర్జునుని వధించుటలో క్రూరబుద్ధిని వహించియుండెను. భీష్మద్రోణకృపాదులు దానవావిష్టచిత్తులయి పాండవులయెడ పూర్వమున్నంత ప్రీతి లేకుండ వర్తింప నారంభించిరి.

ఆరాత్రి అట్లు గడచిపోగా మరునాడు ప్రాతఃకాలమున దుర్యోధనునియొద్దకు వచ్చి కర్ణుడు బోధించెను. తుదకు శపథము చేసి పలికెను.

"సత్యం తే ప్రతిజానామి వధిష్యామి రణేఽర్జునమ్ ।
గతే త్రయోదశే వర్షే సత్యేనాయుధ మాలభే ॥"

పదుమూడవసంవత్సరము గడచినతోడనే రణరంగమున నర్జునుని వధించితీరెదను. ఇదిగో ఆయుధమునుబట్టి ప్రమాణము చేయుచున్నాను. అని. అప్పుడు దుర్యోధనుడు సమాధానపడి సపరివార

ముగా హస్తినాపురములో ప్రవేశించెను. కౌరవపక్షీయులు అసుర తత్త్వమునకు జెందినవా రనియు, పాండవపక్షీయులు దైవతత్త్వము నకు జెందినవా రనియు సారాంశము.

ఈకర్ణశపథమును, దుర్యోధనోత్సాహమును జూడ వీరు పున ర్ద్యూతములో బెట్టిన పణము లోని రహస్యము—ద్వాదశవత్సరవన వాసములో పాండవులకు అవశ్యము ప్రాణహాని కలిగితీరు ననియు, ఒకవేళ దాటినను అజ్ఞాతవాసములో అవశ్యము తెలియబడ దురుగనుక మరల వనవాసము, అందు ప్రాణహాని అయితీరు ననియు దురాలోచ నమె కాని, ఆపై వారిది వారి కిచ్చు సంకల్ప మెంతమాత్రము లే దనియు, కనుకనే కర్ణుడు త్రయోదశవర్షము గతించిన వెంటనే సంభ వించు యుద్ధములో పార్థుని వధింతు నని శపథము చేసెననియు, స్పష్ట ముగా గనబడుచున్నది. కనుకనే వీరు దుష్టచతుష్టయముగా గణింప బడినారు.

—: ఘోషయాత్రపరాభవమును గూర్చి చేసిన భీష్ముని పరా
మర్శపై కర్ణు డలిగి చేసిన దిగ్విజయము, దుర్యోధనుని విష్ణు
యాగాచరణము—కర్ణశపథము :—

ఘోషయాత్రనుండి పాండవరక్షితుడై హస్తినాపురమందు ప్రవేశించిన దుర్యోధనునితో భీష్ము డిట్లనెను—ఆతపోవనమునకు మీరు వెళ్ళవద్దని నేను చెప్పినను నీవు వినక అక్కడకు వెళ్ళి గంధర్వులచే బలాత్కారమున బట్టికొనబడి ధర్మాత్ములైన పాండవులచేత విడిపింప బడితివికదా ! గంధర్వయుద్ధములో కర్ణుడు పలాయనముచేసెనుకదా ! కర్ణునియొక్కయు, మహాత్ములైన పాండవులయొక్కయు పరాక్రమ ములు నీకు ప్రత్యక్షమైనవికదా !

"తస్మా దహం క్షమం మన్యే పాండవై స్సై ర్మహాత్మభిః ।
సంధిం సంధివిదాం శ్రేష్ఠ కులస్యాఽస్య వివృద్ధయే ।"

కనుక నీవు ఆపాండవులతో సంధి జేసికొనుట యీ కురువంశ మునకు క్షేమకరము; అని.

ద్యూతేన చ జితోఽస్త్యేవేత్యాశంక్యాహ—దీర్ఘాయు రితి । పిత ర్యకృతరాజసూయే జీవతి సతి స్వయం తం స కుర్యా దిత్యర్థః ।

అన్ధస్య పితు రనధికారాత్ తత్సత్త్వం యద్యప్యధికారప్రతిబన్ధకం న భవతి కింతు యుధిష్ఠిరజయాఽసామర్థ్య మేవ । తథాపి తత్కీర్తయితు మశక్య మిత్యేత దుదాహృతమ్ । తథా చ వక్ష్యతి—"హతేషు యుధి పార్థేషు రాజసూయే తథా త్వయా । ఆహృతేఽహం నరశ్రేష్ఠ త్వాం సభాజయితా పునః ॥" ఇతి ।

పురోహితోత్తమా! నీవు నాచే యథావిధిగా రాజసూయము యాగము జేయింపవలయును. అని కోరగా పురోహితు డిట్లనెను—నీవు రాజసూయము చేయుటకు రెండు చిక్కు లున్నవి. (1) నీవంశములో రాజసూయము జేసిన యుధిష్ఠిరుడు జీవించియుండ నీవుచేయుట శక్యముకాదు. (2) రాజసూయముచేయని తండ్రి జీవించియుండ నీవు చేయుట విరుద్ధము; అని.

ఇచ్చట యుధిష్ఠిరునికిసంబంధించిన మొదటి ప్రతిబంధకములో ఒకవంశములో రెండు రాజసూయములు కూడ వని గాని, ఆ యుధిష్ఠిరుడు శత్రువగుటచే ఆతని జయింపక చేయకూడదనిగాని తాత్పర్యము. రెండవప్రతిబంధకము ధృతరాష్ట్రునిది. ఆలోచింపగా ఆతడు అంధు డగుటను బట్టి అనధికారి యైనందున నది ప్రతిబంధకము కానేరదు. ఉన్న ప్రతిబంధకము యుధిష్ఠిరజయాసామర్థ్యమే. అది చెప్పుటకు వీలులేనందున ధృతరాష్ట్రునిమాట చెప్పబడినది. కనుకనే ముందు కర్ణవాక్యముగా-పాండవులు హతులైనతరువాత నీవు చేయు రాజసూయములో నిన్ను మరల నేను పూజింతు నని చెప్పబడినది.

ఇట్లు దుర్యోధనపురోహితుడు రాజసూయకర్తృత నీకు లేదని చెప్పి—"అస్తి త్వన్య న్మహత్సత్రం రాజసూయసమం ప్రభో... ఏష తే వైష్ణవో నామ యజ్ఞ స్సత్పురుషోచితః" రాజసూయమువంటిదే వైష్ణవయాగము; దానినే జేయుమని జెప్పెను.

తరువాత ఆయాగమునకే సంకల్పముచేసి రాజులను, బ్రాహ్మణులను ఆహ్వానించుటకు దూతలను పంపునపుడు—

"తతః కంచిత్ప్రియాతం తు దూతం దుశ్శాసనో౽బ్రవీత్ ।
గచ్ఛ ద్వైతవనం శీఘ్రం పాండవాన్ పాపపూరుషాన్ ॥
నిమన్త్ర్య యథాన్యాయం విప్రాం స్తస్మిన్ వనే తదా ।"

దుశ్శాసనుడు ఒకదూత కిట్లు చెప్పెను—నీవు ద్వైతవనమునకు వెళ్ళి పాపాత్ములగు పాండవులను పిలిచి, అక్కడ నున్న విప్రులను యథాన్యాయముగా పిలువుము. అని.

ఇచ్చట తమ్ము రక్షించినట్టి నిరపరాధులగు పాండవులు పాపాత్ములను మాట దుశ్శాసనుని దుష్టత్వమును చాటుచున్నది. ఆదూత వెళ్ళి చెప్పగా ధర్మరాజు— సుయోధనుని యజ్ఞాచరణము సంతోషకరము. కాని మేము రాదగిన స్థితిలో లేము.

"సమయః పరిపాల్యో నో యావద్వర్షం త్రయోదశమ్"

త్రయోదశవత్సరము గడపినతరునాత రావలపివారము. అని చెప్పెను. భీమసేను డిట్లు చెప్పెను—(ఆంధ్రభారతము)

"భీమసేనుం డాదూతం జూచి యోరి వినుము. పదుమూడగునేటి కడపట బాంధవాగ్రజుండు దీప్తంబగు శస్త్రప్రదహనంబునందు ధార్తరాష్ట్రసుతశతంబును పశువరించి వేల్చి రణసత్త్రంబు సేయుటకునై వచ్చుం గాని యుండాకం జనుదెంచుట గలుగదు" అని.

భీమసేనుడు నాటి కపటద్యూతములో దుర్యోధనాదులు ద్రౌపదీదేవిపట్ల చేసిన స్మరింపశక్యముగాని దుండగమునకు క్రుద్ధుడై మీకు తగిన శాస్తి నేను చేయునట్టి దినములు వచ్చుననియు, ధార్తరాష్ట్రశతమును వధింతు ననియు జేసిన ప్రతిజ్ఞను బట్టి, దుర్యోధనాదుల దుర్వృత్తిని బట్టి అట్లు మాతతో చెప్పి పంపెను.

తరువాత విష్ణుయాగమును మహావైభవముతో నెరవేర్చి లోకులచే శ్లాఘింపబడుచు పురమునకు వచ్చి తల్లిదండ్రులకును, భీష్మాదులకును వందనము చేసి సోదరపరివేష్టితుడై దుర్యోధనుడు సింహాసనాసీనుడై యున్న సమయమున—

"త ముత్థాయ మహారాజం సూతపుత్రోఽబ్రవీ ద్వచః ।
దిష్ట్యా తే భరతశ్రేష్ఠ సమాప్తోయం మహాక్రతుః ॥
హతేషు యుధి పార్థేషు రాజసూయే తథా త్వయా ।
ఆహృతేఽహం నరశ్రేష్ఠ త్వాం సభాజయితా పునః ॥"

కర్ణుడు లేచి యిట్లనెను—మహారాజ ! ఈ మహాక్రతువు నెరవేరినది; సంతోషము. ఇక పాండవులు యుద్ధములో హతులైనతరువాత నీవు రాజసూయము చేయవలయును. నిన్ను నేనప్పుడు మరల పూజింపవలయును; అని. అటుపై దుర్యోధనుడు నిజమే అని కర్ణుని కౌగలించుకొని కౌరవులను జూచి నేను పాండవులను వధించి రాజసూయము చేయుట యెన్నడో ! అనినతోడనే—

"త మబ్రవీ త్తదా కర్ణః శృణు మే రాజకుంజర ।
పాదౌ న ధావయే తావ ద్యావ న్న నిహతోఽర్జునః
టీ॥ ధావయే పరేణేతి శేషః ।
కీలాలజం నఖాదేయం కరిష్యే చాఽసురవ్రతమ్ ।
నాస్తీతి నైవ వక్ష్యామి యాచితో యేన కేనచిత్ ॥
టీ॥ కీలాలజం మాంసం, తద్ధి ఘనీభూతం రుధిర మేవ । "కీలాలం రుధిరే తోయే" ఇతి మేదినీ । అసురం సురారహితం చ వ్రతం స్వనియమం కరిష్యే । మద్యం మాంసం చ త్యక్ష్యే ఇత్యర్థః ।"

కర్ణు డిట్లు ప్రతిజ్ఞ చేసెను—మహారాజా ! ఈ నాశపథము వినుము. నేను అర్జునుని వధింపనంతవరకు ఒరులచే పాదములు కడిగించుకొనను; మద్యమాంసములను వర్జింతును; యెవ్వాడు దేనికై నన్ను యాచించినను 'నాస్తి' అని పంపను, అని.

ఈకర్ణశపథము విని కౌరవులు పాండవపరాజయ మైనటులే సంతోషించిరి. ఈకర్ణశపథమును చారులవలన విని ధర్మజుడు చింతాగ్రస్తు డయ్యెను.

ఇచ్చట దిగ్విజయశాలి, తన బహిఃప్రాణము అయిన కర్ణుని సహాయ మున్నను రాజసూయదృఢసంకల్పము గల దుర్యోధనునకు అది యశక్య మగుటలో పాండవులను జయింపగల సమర్థత కర్ణదుర్యోధనాదులకు లేకుండుటే కారణ మని సారాంశము.

—: పాండవులు శాపహతు లగుటకై దుష్టచతుష్టయము దురాలోచ
నము చేసి దుర్వాసోమహర్షిని ప్రేరేపించుట—అముప్పునుండి
పాండవులను కృష్ణపరమాత్మ రక్షించుట :—

పాండవులు వనవాసముచేయుచు సూర్యదేవానుగ్రహాలబ్ధము, ప్రతిదినము ద్రౌపదీభోజనపర్యంతసిద్ధము అయిన అక్షయాన్నముచే విప్రోత్తములను తృప్తిపరచుచు అవ్యాజానుగ్రహముతో తమకు దర్శనమిచ్చుచున్న మునుల సద్గోష్ఠులతో కష్టములను మరచి కాలము గడుపుచుండ—

"శ్రుత్వా తేషాం తథా వృత్తిం నగరే వసతా మివ ।
దుర్యోధనో మహారాజ తేషు పాప మరోచయత్ ॥
తథా వై నికృతిప్రజ్ఞైః కర్ణదుశ్శాసనాదిభిః ।"

పురమందున్నట్లు నిరాతంకముగా వ్యవహరించుచున్న పాండవుల వృత్తాంతము దెలిసికొని కర్ణదుర్యోధనాదులు దురాలోచన చేయుచున్న సందర్భములో. పదివేలమంది శిష్యులతో దుర్వాసో మహర్షి వచ్చి దర్శనమీయగా దుర్యోధనుడు సంతసించి పరిచర్యచేసి ఆతిథ్యమిచ్చి భృత్యునివలె మసలుచుండ మహర్షి కొన్నిదినము లక్కే నిలచిపోగా వినయవిధేయతలతో శాపభయమున ఏమనినను పడి, యేమిచేసినను సహించి దివారాత్రములు శాంతిని వహించి దుర్యోధనుడు శుశ్రూషచేయగా— మహర్షి సంతోషించి—

"వరం వరయ భద్రం తే యత్తే మనసి వర్తతే ।"

నీమనస్సునం దేమున్నదో వరము గోరుము. ఇచ్చెదనని పలుక—

"ప్రాగేవ మన్త్రితం చాసీ త్కర్ణదుశ్శాసనాదిభిః ।
యాచనీయం మునే స్తుష్టా దితి నిశ్చిత్య దుర్మతిః ॥
అతిహర్షాన్వితో రాజన్ వర మేన మయాచత ।"

ఇంతకు పూర్వమే ఇట్టి వరమును మనము మహర్షివలన బొందవలయు నని కర్ణదుశ్శాసనాదివర్గము ఆలోచించియున్నందున దుర్మతియైన దుర్యోధనుడు ఈవిధముగా వరము గోరెను—

"శిష్యైస్సహ మమ బ్రహ్మన్ యథా జాతోఽతిథి ర్భవాన్ ।
అస్మత్కులే మహారాజో జ్యేష్ఠ శ్శ్రేష్ఠో యుధిష్ఠిరః ॥
వనే వసతి ధర్మాత్మా భ్రాతృభిః పరివారితః ।
గుణవాన్ శీలసంపన్న స్తస్య త్వ మతిథి ర్భవ ॥
యదా చ రాజపుత్రీ సా సుకుమారీ యశస్వినీ ।
భోజయిత్వా ద్విజాన్ సర్వాన్ పతీంశ్చ వరవర్ణినీ ॥
విశ్రాన్తా చ స్వయం భుక్త్వా సుఖాసీనా భవే ద్యదా ।
తదా త్వం తత్ర గచ్ఛేథా యద్యనుగ్రాహ్యతా మయి ॥"

మావంశమునందు మహారాజు, శ్రేష్ఠుడు, జ్యేష్ఠుడు నయిన యుధిష్ఠిరుడు గుణవంతుడును, ధర్మాత్ముడును, సుశీలుడు నయి వనమందు సోదరసహితుడై యుండెను. అట్టి యుధిష్ఠిరునకుగూడ శిష్యసమేతముగా నీవతిథివి కావలయును. ఆ అగుటలోగూడ సుకుమారియైన ద్రౌపది ద్విజులను, పతులను భుజింపజేసి తాను భుజించి విశ్రాంతి దీసికొనినతరువాత నీ వతిథి వగుట నాకోరిక. అని.

ఇచ్చట మహర్షియొద్ద దుర్యోధను డాడిన మాటలలో– "అస్మత్కులే మహారాజః, శ్రేష్ఠః, ధర్మాత్మా, గుణవాన్, శీలసంపన్నః" అను యుధిష్ఠిరవిశేషణములను పరికించి పాండవుల జన్మములను గూర్చి, రాజ్యాధికారమునుగూర్చి, యోగ్యతను గూర్చి అపోహలు గల ప్రతివాదులు తమ బుద్ధులను దిద్దుకొందురుగాక! అట్లే "రాజపుత్రీ యశస్వినీ" అను ద్రౌపదీవిశేషణములను పరికించి ద్రౌపదీదేవిని గూర్చిన దురభిప్రాయములను తొలగించుకొనెదరుగాక!

దుర్యోధనుని వరము విని "తథా కరిష్యే త్వత్ప్రీత్యా" అట్లే చేయుదు నని చెప్పి మహర్షి వెళ్ళిపోయెను.

"కృతార్థ మపి చాత్మానం తదా మేనే సుయోధనః ।
కరేణ చ కరం గృహ్య కర్ణస్య ముదితో భృశమ్ ॥
కర్ణోఽపి భ్రాతృసహిత మిత్యువాచ నృపం ముదా ।
దిష్ట్యా కామ స్సుసంవృత్తో దిష్ట్యా కౌరవ వర్ధసే ॥
దిష్ట్యా తే శత్రవో మగ్నా దుస్తరే వ్యసనార్ణవే ।

దుర్వాసఃక్రోధజే వహ్నౌ పతితాః పాండునందనాః ॥
స్వైరేవ తే మహాపాపైః గతా వై దుస్తరం తమః ।" (వనప. అ. 262)

దుర్యోధనుడు కృతార్థుడనైతి నని కర్ణుని హస్తము బట్టుకొని చాల సంతోషించెను. అప్పుడు కర్ణుడిట్లనెను—మహాభాగ్యము; కోరిక నెరవేరినది; నీవు వర్ధిల్లుదువు; నీశత్రువులు వ్యసనార్ణవములో మునిగి నారు; దుర్వాసుని క్రోధాగ్నిలో పాండవులు పడినారు; తమ మహా పాపములనుబట్టియే వారు దుస్తరమైన ఆపదలో పడిపోయినారు; అని.

ఇచ్చట ప్రతివాదు లన్నట్లు భారతవీరుడు, దిగ్విజయశీలుడు, మహోదాత్త, మహాధార్మికుడు, అయినట్టి యీకర్ణుని ధోరణి అతని యశక్తిదుర్జనత్వములను చాటుచున్న దనుట కభ్యంతర మున్నదా? ఇది వీరలక్షణమా? హీనలక్షణమా? పాండవులు పాపాత్ములా?

ఇకె వర మిచ్చి వెళ్లిన దుర్వాసోమహర్షి యొకప్పుడు వన వాసము చేయు పాండవులును, ద్రౌపదియు భుజించియున్న సమయ మును కనిపెట్టి పదివేల శిష్యులతో పాండవనివాసస్థానమునకు వచ్చెను. అప్పుడు ధర్మజుడు సోదరసహితుడై ప్రత్యుత్థానాభివాదములు చేసి పూజించి ఆహ్నికము నెరవేర్చికొని దయచేసి మా ఆతిథ్యము గ్రహింప వలసిన దని ప్రార్థింపగా మహర్షి అట్లే యని శిష్యులతో స్నానమునకు వెళ్ళెను. ఈపరిస్థితిలో—

"ఏతస్మి న్నంతరే రాజన్ ద్రౌపదీ యోషితాం వరా ।
చిన్తా మవాప పరమా మన్నహేతోః పతివ్రతా ॥
సా చింతయంతీ చ యదా నాన్నహేతు మవిందత ।
మనసా చింతయామాస కృష్ణం కంసనిషూదనమ్ ॥
కృష్ణ! కృష్ణ! మహాబాహో! దేవకీనన్దనాఽవ్యయ! ।
వాసుదేవ! జగన్నాథ! ప్రణతార్తివినాశన! ॥
విశ్వాత్మన్ విశ్వజనక విశ్వహర్తః ప్రభోఽవ్యయ! ।
ప్రపన్నపాల గోపాల ప్రజాపాల పరాత్పర ॥
వరేణ్య వరదాఽనంత అగతీనాం గతి ర్భవ ।
పురాణపురుష ప్రాణమనోవృత్త్యాద్యగోచర ॥

సర్వాధ్యక్షే పరాధ్యక్షే త్వా మహం శరణం గతా ।
పాహి మాం కృపయా దేవ శరణాగతవత్సల ॥
త్వయా నాథేన దేవేశ సర్వాపద్భ్యో భయం నహి ।
దుశ్శాసనా దహం పూర్వం సభాయాం మోచితా యథా ॥
తథైవ సంకటా దస్మా న్మా ముద్ధర్తు మిహార్హసి ।”

ద్రౌపదీదేవి పతి సంకల్పసిద్ధియే తనకు సర్వార్థసిద్ధి యని భావించు పతివ్రతకనుక మునిబృందమునకు ఆతిథ్య మిచ్చుట యెట్లని చింతించి గత్యంతరము తోచక మనస్సులో కృష్ణపరమాత్మను ధ్యానించి యిట్లు ప్రార్థించెను— ఓపరాత్పరా! ఓవరదా! ఓపురాణ పురుషా! ఓ అవాఙ్మానసగోచరా! ఓ సర్వాధ్యక్షా! ఓ శరణాగత వత్సలా! శరణాగతురాలను రక్షింపుము! గతిలేనివారికి నీవే గతి. నిన్నాశ్రయించినవారికి ఆపదలు కలుగవు. నాడు సభలో దుశ్శాసనుని ముప్పునుండి న న్నెటు లుద్ధరించియుంటివో అట్లే యీముప్పునుండి గూడ నుద్ధరింపుము; అని.

“ఏవం స్తుత స్తదా దేవః కృపయా భక్తవత్సలః ।
ద్రౌపద్యా స్సంకటం జ్ఞాత్వా దేవదేవో జగత్పతిః ॥
తత్రాజగామ త్వరితో హ్యచింత్యగతి రీశ్వరః ।
తత స్తం ద్రౌపదీ దృష్ట్వా ప్రణమ్య పరయా ముదా ॥
అబ్రవీ ద్వాసుదేవాయ మునే రాగమనాదికమ్ ।
తత స్తా మబ్రవీ త్కృష్ణః క్షుధితోఽస్మి భృశాతురః ॥
శీఘ్రం భోజయ మాం కృష్ణే పశ్చా త్సర్వం కరిష్యసి ।
నిశమ్య తద్వచః కృష్ణా లజ్జితా వాక్య మబ్రవీత్ ॥
స్థాల్యాం భాస్కరదత్తాయా మన్నం మద్భోజనావధి ।
భుక్తవ త్యస్మ్యహం దేవ తస్మా దన్నం న విద్యతే ॥
తతః ప్రోవాచ భగవాన్ కృష్ణాం కమలలోచనః ।
శీఘ్రం గచ్ఛ మమ స్థాలీ మానయిత్వా ప్రదర్శయ ॥
ఇతి నిర్బంధత స్స్థాలీ మానాయ్య స యదూద్వహః ।
స్థాల్యాః కంఠేఽథ సంలగ్నం శాకాన్నం వీక్ష్య కేశవః ॥
ఉపయుజ్యాఽబ్రవీ దేనా మనేన హరి రీశ్వరః ।
విశ్వాత్మా ప్రీయతాం దేవ స్తుష్ట శ్చాఽస్త్వితి యజ్ఞభుక్ ॥
ఆకారయ మునీన్ సర్వాన్ భోజనాయేతి చాబ్రవీత్ ।”

అట్లు స్తుతింపబడిన కృష్ణపరమాత్మ ద్రౌపదీదేవికి ప్రాప్తించిన ఆపదను తెలిసికొని, వెంటనే ఆమెకు ప్రత్యక్షముకాగా ఆమె పరమానందముతో నమస్కరించి ఆమునిబృందము రాకను గూర్చి చెప్పకొనగా కృష్ణపరమాత్మ అమ్మా! నే నాకలిగొనియున్నాను. ముందు నాకు భోజనము పెట్టుము. ఆపై సర్వము చేయగలవు. అని పలుకుచుండ ద్రౌపదీదేవి లజ్జించి యిట్లనెను—దేవా! సూర్యదత్తస్థాలియందు అన్నము ఏనాటి కానాడు నాభోజనపర్యంతమే యుండును నేను నా భోజన మైపోయినందున అన్న మింక లేదు. అని యామె చెప్పకొనగా అట్లుకాదు, ఆస్థాలిని యిటు దీసికొనివచ్చి నాకు జూపు మని నిర్బంధించి యామె తెచ్చి చూపినతోడనే ఆస్థాలియం దంటుకొని యున్న శాకలేశమును జూచి దానిని తనచేతిలో పెట్టించుకొని నోటిలో వేసికొని "విశ్వాత్మా ప్రీయతాం దేవః" అని పలికి ద్రౌపదీదేవితో భోజనమునకై ఆమునిబృందమును పిలిపింపు మని చెప్పెను.

ఇది యిట్లుండ స్నానము చేయుచున్న మునుల కందరకు క్షుత్తు తీరి భోజనజన్యతృప్తి సంభవింపగా భోజనాపేక్ష మాకు లేదు; మాకు లేదని పరస్పరము చెప్పకొనుటలో మహర్షి యిట్లనెను— పాండవుల యెడ మనము అపరాధము చేసినాము. మననిమిత్తము వారు చాల ప్రయత్నము చేసియుందురు.

"స్మృత్వాఽనుభావం రాజర్షే రంబరీషస్య ధీమతః ।
బిభేమి సుతరాం విప్రా హరిపాదాశ్రయా జ్జనాత్ ॥
పాండవాశ్చ మహాత్మాన స్సర్వే ధర్మపరాయణాః ।
శూరాశ్చ కృతవిద్యాశ్చ వ్రతిన స్తపసి స్థితాః ॥
సదాచారరతా నిత్యం వాసుదేవపరాయణాః ।
క్రుద్ధా స్తే నిర్దహేయు ర్వై తూలరాశి మివాఽనలః ॥
తత ఏతా నపృష్ట్వైవ శిష్యా శ్శీఘ్రం పలాయత ।

రాజర్షియగు అంబరీషుని మహిమ దలచుకొనిన శ్రీహరిభక్తులనగా భయము కలుగుచుండును. పాండవులు- మహాత్ములు, ధర్మా

త్ములు, శూరులు, విద్యాధికులు, వ్రతనిష్ఠులు, తపోనిష్ఠులు, సదాచార సంపన్నులు, శ్రీకృష్ణభక్తులు; వారు క్రుద్ధులైన సర్వమును దగ్ధముచేయ గలరు. కనుక పాండవులకు దెలియకుండ శిష్యులారా! మీరు పలాయనము శీఘ్రముగా జేయుడు; అని. అంతట మునిబృందము పలాయన మగుట, సహదేవుడు వారికొరకు వెళ్ళి వెదకి అక్కడ నున్న తాపసులవలన వారు వెళ్ళిపోయినసంగతి దెలిసికొనివచ్చి ధర్మజునితో చెప్పుట, పాండవులు మునిబృంద మెప్పుడు వచ్చునో, ఆమహర్షి ఏ నిశీధమునకు వచ్చిపడునో, అకస్మాత్తుగా వచ్చి యేమికోరునో, మనకీ గండ మెట్లుతప్పునో అని చింతాక్రాంతులయి యుండుట సంభవించి నపుడు పాండవులకు ప్రత్యక్షమై శ్రీకృష్ణు డిట్లనెను —

"భవతా మాపదం జ్ఞాత్వా ఋషేః పరమకోపనాత్ ।
ద్రౌపద్యా చింతితః పార్థా అహం సత్వర మాగతః ॥
న భయం విద్యతే తస్మా ద్ఋషే ర్దుర్వాససోఽల్పకమ్ ।
తేజసా భవతాం భీతః పూర్వ మేవ పలాయితః ॥
ధర్మనిత్యా స్తు యే కేచి న్న తే సీదంతి కర్హిచిత్ ।
ఆపృచ్ఛే వో గమిష్యామి నియతం భద్ర మస్తు వః ॥"

మహాకోపస్వభావుడైన మహర్షివలన రాబోవు ఆపదను తెలిసికొని ద్రౌపదిచే చింతింపబడిన తోడనే త్వరపడి వచ్చితిని. ఆమహర్షి భయము మీకెంతమాత్రము లేదు. మీతేజస్సునకు భయపడి మునిబృందము పలాయన మయ్యెను. ధర్మనిష్ఠుల కెవ్వరికిని యెన్నడును చేటు కలుగదు. మీకు శుభమగుగాక! నేను వెళ్ళుచున్నాను అని అంతర్ధాన మయ్యెను.

"ఏవం విధా న్యలీకాని ధార్తరాష్ట్రై ర్దురాత్మభిః ।
పాండవేషు వనస్థేషు ప్రయుక్తాని వృథాఽభవన్ ॥" (వన. అ 263)

ఈవిధములైన దుర్మార్గములు దురాత్ములగు దుర్యోధనాదులు వనవాసముచేయు పాండవులయందు ప్రవర్తింపజేయుచుండువారు. కాని అవన్నియు వ్యర్థమైపోవుచుండెడివి.

ఇచ్చట ద్రౌపదీదేవి పాతివ్రత్యవిశేషమును, దుర్వాసోమహర్షి చేసిన పాండవప్రశంసను పరిశీలించి ప్రతివాదులు ద్రౌపదీపాండవు లెంతపూజ్యులో తెలిసికొందురుగాక! దుష్టచతుష్టయనికృష్టస్వభావమును గ్రహింతురుగాక!

"దౌర్వాసనే తు సార్వాత్మ్యం కారుణ్యం చేరితం హరేః ।
తత్తృప్త్యా హి జగత్తృప్త మత్యల్పేనాపి తృప్యతః ॥" (నీలకంఠీయము)

ప్రతివాదులు— దుర్వాసుని గాధ మృష యని, ఆంధ్రభారతములో లేకుండుటే కారణ మని, ఆగాధ అసందర్భముగా నున్న దని చేసిన ప్రసంగము- తృతీయభాగము శ్రీకృష్ణనిందానిరాకరణములో శ్రీమద్భాగవతశివపురాణాదివచనసంవాదప్రదర్శనముతో నీలకంఠాచార్యప్రదర్శితసందర్భశుద్ధిప్రశంసతో నిరాకరింపబడినది. ఆవిశేషము లచ్చట జూడవలయును.

—: సైంధవుడు ద్రౌపదిని బలాత్కారముగా నెత్తికొనిపోవుచు పాండవులచే శిక్షింపబడుట, ఈశ్వరు నారాధించి పార్థుని దప్ప మిగిలిన వారి నొకనాడు జయింపగల వర మొందుట :—

వనవాసముచేయుచు నొకప్పుడు పాండవులు ఆహారపదార్థ సంగ్రహమునకై నలువైపులకు వెళ్ళియుండ ద్రౌపదీదేవి పర్ణశాలా ద్వారమందున్నస్థితిలో సేనలతో నెక్కడకో బోవుచున్న సైంధవు డామెను జూచి మోహించి యామెయొద్దకు వెళ్ళి క్రమముగా తన దుర్వృత్తిని వెల్లడించి ఆమె మందలించినను వినకున్నపుడు ద్రౌపదీదేవి యిట్లనెను—

"యథాప్యహం నాతిచరే కథంచిత్ పతీన్ మహార్హాన్ మనసాపి జాతు ।
తేనాద్య సత్యేన వశీకృతం త్వాం ద్రష్టాస్మి పార్థైః పరికృష్యమాణమ్॥"

నేను మనస్సుచే గూడ నెన్నడు పతుల నతిక్రమింపని పాతివ్రత్యము గలిగియుంటినేని ఆసత్యమే నీవిప్పుడు నాకనులయెదుట పాండవులచేతిలోబడి శిక్షింపబడు దురవస్థకు పాలగునట్లు చేయు నని.

క. నను బెలవనితల చందంబున నవమానింప నీకు బోలదు మత్స్వా
వనపాతివ్రత్యమహిమ ననిశము నేకీడు నెందు నందదు నన్నున్. (ఆంధ్రభా.)

సైంధవు డామె మాటలు వినిపించుకొనక బలాత్కారమున రథముపై గూర్చుండబెట్టుకొని పోవుచుండ ధౌమ్యుడు తగదు తగదనుచుండ పాండవు లెదురుగా వచ్చుట, సైంధవసేనను పడగొట్టుట సంభవింప ద్రౌపదీదేవిని విడిచి సైంధవుడు పారిపోవునపుడు భీమసేనుని చేతిలో బడుట. యుధిష్ఠిరుడు—

"న హన్తవ్యో మహాబాహో దురాత్మాపి స సైన్ధవః ।
దుశ్శలా మభిసంస్మృత్య గాంధారీం చ యశస్వినీమ్ ॥"

దురాత్ముడైనను సైంధవుని వధింపవద్దు. మన దుశ్శలను (దుర్యోధన సోదరి), మనగాంధారిని స్మరించుకొనవలయును. అని చెప్పుట జరిగినతరువాత భీమసేనుడు అట్టి దుష్కార్యము చేసిన క్షత్రియాధమునకు శిక్షింపవలసినవిధముగా శిక్షించి పంచశిఖ లుంచిన తరువాత ధర్మరాజుడు హితోపదేశము చేసి పంపెను.

అంతట మనస్తాపముతో సైంధవుడు గంగాద్వారమున కేగి యీశ్వరునిగూర్చి గొప్ప తపముచేయ నీశ్వరుడు ప్రత్యక్షమై వరము గోరు మనగా సైంధవు డిట్లు కోరెను—

"సమస్తాన్ సరథాన్ పంచ జయేయం యుధి పాండవాన్ ।
ఇతి రాజాఽబ్రవీ ద్దేవం నేతి దేవ స్త మబ్రవీత్ ॥
అజయ్యాం శ్చాప్యవధ్యాం శ్చ వారయిష్యసి తాన్ యుధి ।
ఋతేఽర్జునం మహాబాహుం నరం నామ సురేశ్వరమ్ ॥
మయా దత్తం పాశుపతం దివ్య మప్రతిమం శరమ్ ।
అవాప లోకపాలేభ్యో వజ్రాదీన్ స మహాశరాన్ ।
సహాయః పుండరీకాక్షః శ్రీమా నతులవిక్రమః ॥
త మేకం వర్జయిత్వా తు సర్వం యౌధిష్ఠిరం బలమ్ ।
చతురః పాండవాన్ రాజన్ దినైకం జేష్యసే రిపూన్ ॥" (వన. అ. 272)

దేవా! సేనలతో గూడ పాండవపంచకమును నేను జయించునట్లు వర మిమ్ము. అని కోరగా ఈశ్వరుడు అట్లుకాదు, నాచేలను

పాశుపతాస్త్రమును పొంది, లోకపాలకులవలన బహువిధాస్త్రములను పొంది, అకుంఠితానంతశక్తులు గల కృష్ణభగవానుని సహాయమును పొందియున్నట్టి పార్థుని దప్ప మిగిలిన నలువురుపాండవులను, సేనలను నీ వొక్కనాడు మాత్రము జయింపగలవు; అని వరమిచ్చి అంతర్ధాన మయ్యెను.

పాండవుల కిట్టి కష్టములు తటస్థించుచున్నను వారు దైవరక్షితు లగుచు ధర్మనిష్ఠను విడువక అష్టకష్టముల కోర్చి వనవాసదీక్షను నడపుచుండిరి.

—: కర్ణుడు బ్రాహ్మణవేషముతో యాచింపవచ్చిన దేవేంద్రుని వలన ఏకవీరఘ్నిని దీసికొని తన కవచకుండలములు దేవేంద్రున కిచ్చుట :—

దుర్యోధనుని విష్ణుయాగానంతరము పార్థసంహారమునకై శపథము జేసినపుడు కర్ణుడు—"నాస్తీతి నైవ వక్ష్యామి యాచితో యేన కేనచిత్" ఎవ్వ డేమడిగినను నాస్తి అని నాజిహ్వతో నేను అనని శపథముచేసియుండెను. అంతట—

"ద్వాదశే సమతిక్రాన్తే వర్షే ప్రాప్తే త్రయోదశే ।
పాండూనాం హితకృ చ్ఛక్రః కర్ణం భిక్షితు ముద్యతః ॥"

పాండవుల వనవాసదీక్ష 12 సంవత్సరములు గడచినతోడనే పాండవహితకారి యగు దేవేంద్రుడు కర్ణుని కవచకుండలములు యాచింప నుద్యమించెను. ఆవిషయము గ్రహించిన సూర్యదేవుడు పుత్రప్రేమతోడను, భక్తవాత్సల్యముతోడను కర్ణునకు బోధింపనెంచి—

"స్వప్నాన్తే నిశి రాజేన్ద్ర దర్శయామాస రశ్మిమాన్ ।
బ్రాహ్మణో వేదవి ద్భూత్వా సూర్యో యోగర్ధిరూపవాన్ ॥"

బ్రాహ్మణరూపము ధరించి నిద్రించు కర్ణునకు స్వప్నములో గోచరించి యిట్లనెను—ఏమికోరినను ఇచ్చెద నను నీప్రతిజ్ఞ జగద్విదిత మగుటచేత—

"త్వాం తు చైవం విధం జ్ఞాత్వా స్వయం వై పాకశాసనః ।
అగన్తా కుండలార్థాయ కవచం చైవ భిక్షితుమ్ ॥
తస్మై ప్రయాచమానాయ న దేయే కుండలే త్వయా ।
యది దాస్యసి కర్ణ త్వం సహజే కుండలే శుభే ॥
ఆయుషః ప్రక్షయం గత్వా మృత్యో ర్వశ ముపైష్యసి ।
కవచేన సమాయుక్తః కుండలాభ్యాం చ మానద ॥
అవధ్య స్త్వం రణే౽రీణా మితి విద్ధి వచో మమ ॥"

అది గ్రహించి యింద్రుడు నీకవచకుండలములను యాచించు టకై రాబోవుచుండెను. అవి మాత్ర మాతని కీయకుము. అవి లేన ప్పుడు నీకు మరణభయము తప్పదు. అవి యున్నపుడు నీవు శత్రువుల కవధ్యుడ వగుదువు. అని. అది విని కర్ణు డాస్వప్నములో నీవింత దయతో చెప్పుచుంటివి. నీ వెవ్వరని యడుగ సూర్యదేవుడ నని తెలి సినమీద నీవు నాకు వందనీయుడవే. కాని నావ్రతమునకు భంగము కలుగరాదు. ఇంద్రు డట్లు వచ్చి యడిగినయెడల నేనిచ్చితీరెదను. నాకు కీర్తియే ప్రధానము. అని చెప్పగా సూర్యుడు—

"త్వం హి నిత్యం నరవ్యాఘ్ర స్పర్ధసే సవ్యసాచినా ।
న తు త్వా మర్జున శ్శక్తః కుండలాభ్యాం సమన్వితమ్ ॥
విజేతుం యుధి యద్యస్య స్వయ మింద్ర స్సఖా భవేత్ ।"

కర్ణుడా! నీవు పార్థునితో ఎడతెగని స్పర్ధ పెట్టుకొనియున్నావు. ఆపార్థుడు నీ కీకవచకుండలము లున్నపుడే నిన్ను జయింపలేనివా డగును. కనుక నీ విన్వకుము. అని బోధింపగా కర్ణుడు—

"బిభేమి న తథా మృత్యో ర్యథా బిభ్యే౽నృతా దహమ్ ।
విశేషేణ ద్విజాతీనాం సర్వేషాం సర్వదా సతామ్ ।
ప్రదానే జీవితస్యాపి న మే౽త్రాస్తి విచారణా ।
యచ్చ మా మాత్థ దేవ త్వం పాండవం ఫాల్గునం ప్రతి ॥
వ్యేతు సన్తాపజం దుఃఖం తవ భాస్కర మానసమ్ ।
అర్జునం ప్రతి మాం చైవ విజేష్యామి రణే౽ర్జునమ్ ॥
తవాపి విదితం దేవ మమా ప్యస్త్రబలం మహత్ ।
జామదగ్న్యా దుపాత్తం యత్తథా ద్రోణా న్మహాత్మనః ॥

ఇదం త్వ మనుజానీహి సురశ్రేష్ఠ వ్రతం మమ ।
భిక్షతే వజ్రిణే దద్యా మపి జీవిత మాత్మనః ॥"

దేవా! నే నన్నృతమునకు భయపడినట్లు మరణమునకు భయపడను. విశేషించి ద్విజులకు ప్రాణమైన ఇచ్చుటకు వెనుదీయను. నీవు పార్థుని దలచుకొని నావిషయమై సంతాపపడవద్దు. యుద్ధములో నే నాతని జయింపగలను. నాకుగల అస్త్రబలము నీకు విదితమే. నా వ్రతము నిలుపుకొనుటకై నాకనుజ్ఞ నిమ్ము. యాచించు దేవేంద్రునకు ప్రాణ మైనను ఇచ్చెదను; అని చెప్పెను. అప్పుడు సూర్యదేవు డిట్లు చెప్పెను—

"యది తాత దదా స్యేతే వజ్రిణే కుండలే శుభే ।
త్వ మప్యేన మథో బ్రూయా విజయార్థం మహాబలమ్ ॥
అమోఘాం దేహి మే శక్తి మమిత్రవినిబర్హణీమ్ ।
దాస్యామి తే సహస్రాక్ష కుండలే వర్మ చోత్తమమ్ ॥
ఇత్యేవ నియమేన త్వం దద్యాః శక్రాయ కుండలే ।
తయా త్వం కర్ణసంగ్రామే హనిష్యసి రణే రిపూన్ ॥"

కర్ణుడా! కవచకుండలము లింద్రునకు ఇవ్వక తప్పనిపక్షములో నీవు ఇంద్రుని యిట్లు కోరుము—నీయొద్ద నున్న అమోఘమైన శక్తిని నాకిమ్ము. నేను కవచకుండలము లిచ్చెదను; అని. అట్లు తీసికొనిన ఆ శక్తిచే నీవు శత్రువులను జయింపగలుగుదువు.

ఈవిధముగా బోధించి సూర్యదేవు డంతర్థానమయ్యెను. కర్ణుడు తరువాత లేచి నిత్యకృత్యముగా సూర్యు నుపాసించి తన స్వప్న వృత్తాంతమును సూర్యదేవునకు విన్నవించుకొనగా నది నిజమే అని సూర్యదేవుడు బోధింపగా నప్పుడు—

"తత స్తత్త్వ మితి జ్ఞాత్వా రాధేయః పరవీరహా ।
శక్తి మేవాభికాంక్షన్ వై వాసవం ప్రత్యపాలయత్ ॥"

కర్ణు డది సత్యముగా గ్రహించి యింద్రశక్తిని సంగ్రహింపదలచి యింద్రుని రాకకై నిరీక్షించుచుండెను. మధ్యందినమున సూర్య

స్తుతి గావించు కర్ణునియొద్దకు విప్రులు ధనార్థులై వచ్చుచుండ, ఆసమయమున వారేమడిగినను వెనుదీయక కర్ణు డిచ్చుచుండ, బ్రాహ్మణ వేషముతో దేవేంద్రుడు రాగా స్వాగత మడిగి నీకేమికావలయు నని కర్ణు డడిగినపుడు దేవేంద్రు డిట్లనెను—

"య దేత త్సహజం వర్మ కుండలే చ తవా౽నఘ ।
ఏత దుత్కృత్య మే దేహి యది సత్యవ్రతో భవాన్ ॥"

నీసహజకవచకుండలములను ఛేదించి నాకివ్వవలసిన దని కోరుచున్నాను. నీవు సత్యవ్రతుడ వయినయెడల నాకవి యిమ్ము; అని. అప్పుడు కర్ణుడు అవికాక మరే మైనను కోరుము. ఇచ్చెద ననియు, అమృతమయములై నా కమృతత్వమునుగలిగించువానిని నేను విడువజాల ననియు, వానిని విడిచిన నాకు మరణము ప్రాప్తించు ననియు బహువిధముల జెప్పి చూచెను.

ఇంద్రుడు మరొకటి కోరనపుడు గ్రహించి కర్ణు డిట్లనెను— నీ వింద్రుడవని నేను గ్రహించితిని; నీవు దేవతల కధిపతివి; నీవు నాకు వర మివ్వదగినవాడవు; నీకు నే నిచ్చుట న్యాయముకాదు; నీవు కోరినట్లు నే నిచ్చుటలో నాకు ప్రాణహాని; నీకు మానహాని. కనుక వినిమయము చేసికొందము.

"వర్మణా కుండలాభ్యాం చ శక్తిం మే దేహి వాసవ ।
అమోఘాం శత్రుసంఘానాం ఘాతినీం పృతనాముఖే ॥
తత స్సంచిన్త్య మనసా ముహూర్త మివ వాసవః ।
శక్త్యర్థం పృథివీపాల కర్ణం వాక్య మథా౽బ్రవీత్ ॥
గృహాణ కర్ణ శక్తిం త్వ మనేన సమయేన చ ।
అమోఘా హంతి శతశ శ్శత్రూన్ మమ కరచ్యుతా ॥
పునశ్చ పాణి మభ్యేతి మమ దైత్యాన్ వినిఘ్నతః ।
సేయం తవ కరప్రాప్తా హత్వైకం రిపు మూర్జితమ్ ॥
గర్జంతం ప్రతపంతం చ మామేవైష్యతి సూతజ ।"

నాకవచకుండలములు నీవుతీసికొని శత్రుహరమైన నీయమోఘ శక్తిని నాకిమ్ము. అని పలుక దేవేంద్రుడు కొంచెం మాలోచించి

యిట్లు పలికెను—కర్ణుడా! నీవు కోరిన శక్తిని యీనిబంధనముపై తీసికొనుము.

ఈశక్తి నాహస్తముచే విడువబడి వందలకొలది శత్రువులను కూల్చి మరల నాహస్తగత మగుచుండును. అట్టి శక్తి నీహస్తగతమై యుండి ప్రయోగింపబడి ప్రబలుడై గర్జించుచున్న ప్రతాపశాలియగు నొక్క శత్రువును మాత్రము వధించి వెంటనే నాయొద్దకే చేరును. అని చెప్పినమీదట కర్ణు డిట్లనెను—

"ఏక మేవాహ మిచ్ఛామి రిపుం హన్తుం మహాహవే।
గర్జంతం ప్రతపంతం చ యతో మమ భయం భవేత్ ॥"

దేవా! నాకు భయహేతువై యున్నశత్రు వొక్కడే. ఆతనినే వధింప నాసంకల్పము. అని. ఆపై యింద్రు డిట్లనెను—

"ఏకం హనిష్యసి రిపుం గర్జంతం బలినం రణే।
త్వం తు యం ప్రార్థయ స్యేకం రక్ష్యతే స మహాత్మనా ॥
య మాహు ర్వేదవిద్వాంసో వరాహ మపరాజితమ్।
నారాయణ మచింత్యం చ తేన కృష్ణేన రక్ష్యతే ॥"

నీవు ప్రబలుడైన యొక శత్రువును యుద్ధములో వధింతువు. నీవెవ్వనికై సంకల్పించితివో ఆతని పట్ల వేదవిదులచే ప్రశంసింపబడు అచిన్త్యశక్తిగల శ్రీకృష్ణభగవానుడు అంగరక్షకుడై యుండెను. అని. అది విని కర్ణుడు "ఏవ మప్యస్తు భగవ న్నేకవీరవధే మమ। అమోఘాం దేహి మే శక్తిమ్" అనుచు ఏమయిననుసరే. ఆయేక వీరఘ్నిని నాకిమ్ము. అని కోరి, నాకవచకుండలములను ఛేదించి యిచ్చెదను. నాశరీరము బీభత్సముగా నుండ కుండునట్లు అనుగ్రహింపుమని యడుగ ఇంద్రు డిట్లనియె—

"న తే బీభత్సతా కర్ణ భవిష్యతి కథంచన।
వ్రణ శ్చైవ న గాత్రేషు య స్త్వం నానృత మిచ్ఛసి ॥
యాదృశ స్తే పితు ర్వర్ణ స్తేజ శ్చ వదతాం వర।
తాదృశేనైవ వర్ణేన త్వం కర్ణ భవితా పునః ॥
విద్యమానేషు శస్త్రేషు యద్యమోఘా మసంశయే।
ప్రమత్తో మోక్ష్యసే చాపి త్వయ్యేవైషా పతిష్యతి ॥"

కర్ణుడా! శరీరము బీభత్సముగా నెంతమాత్ర ముండదు. శరీరముపై వ్రణముకూడ గలుగదు. సత్యవ్రతుడవైన నీకు సూర్యునితో సమానమైన వర్ణము, తేజస్సు సంభవించును.

నీ వొకవిషయము జ్ఞప్తియం దుంచుకొనుము. శత్రువును నిర్జించుటకు సమర్థమైన యితరశస్త్రము లున్నపుడు గాని, నీకు ప్రాణహాని సమయము ప్రాప్తింపనపుడుగాని యీయేకవీరఘ్ని ప్రమాదమున ప్రయోగింపబడినయెడల నది యప్పుడు నీపై బడునుసుమా. అని.

తరువాత కర్ణుడు సరే యని యాశక్తిని దీసికొని తనశరీరమును ఛేదించి నిర్వికారుడై కవచకుండలము లాయింద్రున కిచ్చెను.

"తత శ్శక్రః ప్రహసన్ వంచయిత్వా కర్ణం లోకే యశసా యోజయిత్వా।
కృతం కార్యం పాండవానాం హి మేనే తతః పశ్చా ద్దివ మేవోత్పపాత॥
శ్రుత్వా కర్ణం ముషితం ధార్తరాష్ట్రా దీనా స్సర్వే భగ్నదర్పా ఇవాసన్।
తాం చావస్థాం గమితం సూతపుత్రం శ్రుత్వా పార్థా జహృషుః కాననస్థాః॥"
(వనప. అ. 310)

ఆయింద్రుడు వంచనచే (రూపాంతరధారణచే) కవచకుండలములు స్వీకరించి యాకర్ణునకు లోకములో యశస్సును ఘటింపజేసి పాండవకార్యము సిద్ధించినట్లు తలచి స్వస్థానమున కేగెను. ఆవిషయము విని కౌరవులు భగ్నదర్పులై దీనులై యుండిరి. వనవాసులైన పాండవులు విని సంతోషించిరి. అని చెప్పబడినది.

ఇచ్చట విశేషము—పార్థునిపట్ల క్రూరస్వభావుడై యున్న కర్ణునకు ఏకవీరఘ్ని నిచ్చి నీదృష్టిలోనున్న శత్రువు శ్రీకృష్ణరక్షితు డని చెప్పి, ప్రబలుడైన యొకశత్రువును నీవు వధింపగలవని చెప్పియున్నట్టి యింద్రుడు అనాగతవేదిగనుక భవిష్యత్తును గ్రహించి యాశక్తికి గురి యగుటకై భీమసేనునివలన హిడింబయందు మహావీరుడగు ఘటోత్కచుని పూర్వమే సంభవింపజేసి యుండెను. ఈవిషయ మిట్లు చెప్పబడినది—

"సహి సృష్టో మఘవతా శక్తిహేతో ర్మహాత్మనా ।
కర్ణ స్యాఽప్రతివీర్యస్య ప్రతియోద్ధా మహారథః ॥
యథా హి రావణో లోకే ఇంద్రజి చ్చ మహాబలః ।" (ఆది. అ. 155)

ఇంద్రజిత్తుతో, రావణునితో తుల్యుడగు ఘటోత్కచుడు ఇంద్రునిచే కర్ణుని యేకవీరఘ్నినిమిత్తము కర్ణునికి ప్రతియోద్ధగా సృష్టింపబడెను. అని.

ఇట్టి యపూర్వఘటనలనే దైవబల మందురు. అట్టి దైవబలముతో గూడిన పౌరుషమే ప్రశంసనీయము. అది పాండవులదై యున్నది. దైవబలరహితమైన పౌరుషము ప్రమాదకరమే. అది కర్ణదుర్యోధనాదులదై యున్నది. అట్టి దైవబలమునకు మూలము వారి ధర్మనిష్ఠయే. కర్ణదుర్యోధనాదుల దైవబలరాహిత్యమునను గారణము పాండవులపట్ల వారి యధర్మత్వమే. ఈవిషయమునే— "ధర్మ ఏవ హతో హంతి ధర్మో రక్షతి రక్షితః" అనునూక్తి ఘోషించుచున్నది.

కర్ణదుర్యోధనుల సంకల్పములు గాని, పురుషప్రయత్నములు గాని ధర్మహానికరములు గనుకనే అవి వారి కపాయకరములే యగుచు వచ్చినవి. పాండవకౌరవపక్షములలోని ధర్మాధర్మములను గ్రహించుట కివియే నిదర్శనములు.

—: ఇంద్రు డుచితానుచితముల పాటింపక కర్ణుని కవచకుండలములను భిక్షించెను. అనుప్రసంగము—తన్నిరాకరణము :—

కర్ణచరిత్రకారుల వ్రాత యిట్లున్నది—

1. "పాండవపక్షపాతి యగు నింద్రుడు కర్ణునివలన దన పుత్రుడగు నర్జునున కెట్టి యపాయము వాటిల్లునో యను భీతిని బొగులుచు ఉచితానుచితములుగాని, తన దేవత్వమునుగాని పాటింపక కర్ణుని కవచకుండలములను హరింప నెంచి కపట బ్రాహ్మణవేషమును ధరించి కర్ణుని భిక్షించెను" (పు 61)
2. ఇంద్రుడు కపటియై తన్ను మోసముచేయవచ్చినవాడని యెఱింగి తనప్రాణముల దృణముగానైన దలపక కవచకుండలముల నొలిచి యాతనికి దానముచేసిన యా

మహానుభావుని సత్యవ్రతము, దానశీలతయును లోకోత్తరము లనుట యతిశయోక్తి కానేరదు" (ఉపో. పు 10).

ఈ రెండంశములను బరిశీలింతము. ప్రథమాంశము—ఇంద్రుడు పాండవపక్షపాతియట! తనపుత్రుడగు అర్జునునకు అపాయము రాకుండ జేయదలచెనట !

అయితే పుత్రుడగు పార్థున కపాయము రాకుండ జేయదలచుటచే నింద్రుడు పాండవపక్షపాతి యందురా? లేక పాండవపక్షపాతముచే బుత్రున కపాయము రాకుండ జేయదలచినా డందురా? పుత్రప్రేమచేతనే పాండవపక్షపాతి యనుపక్షములో తనపుత్రు డగు కర్ణుని కపాయము రాకుండ జేయుటకై ప్రయత్నించిన సూర్యభగవానుడు కర్ణపక్షపాతి యనవలసివచ్చును. తన్మూలమున కౌరవపక్షపాతి యనవలసివచ్చును. దాని నంగీకరింతు మనుట అయుక్తము.

కర్ణదుర్యోధనాదులచే నరణ్యవాసమునకు బంపబడినస్థితిలో తన్ననుసరించియున్న బ్రాహ్మణోత్తముల పోషణమునకై సూర్యారాధన చేసిన ధర్మజునకు అక్షయాన్నప్రదమైన స్థాలి ననుగ్రహించిన సూర్యభగవానుడు కర్ణపక్షపాతి యనజెల్లునా? కర్ణదుర్యోధననిందితురాలైన ద్రౌపదీదేవి విరాటనగరవాసములో నిర్బంధమునుబట్టి దుర్వృత్తిగల కీచకుని యెదుటకు వెళ్ళవలసివచ్చినపుడు—

"ఉపాతిష్ఠత సా సూర్యం ముహూర్త మబలా తతః ।
స తస్యా స్తనుమధ్యాయాః సర్వం సూర్యోఽవబుద్ధవాన్ ॥
అంతర్హితం తత స్తస్యా రక్షో రక్షార్థ మాదిశత్ ।

ఆమె సూర్యు నుపాసింప నామె కంగరక్షగా నంతర్హితమై యుండునట్లు ఒక రక్షస్సును నియోగించి యాద్రౌపదీదేవిని కాపాడిన సూర్యభగవానుడు కర్ణపక్షపాతి యన జెల్లునా? కర్ణవిద్వేషులను ద్వేషించువాడేకదా కర్ణపక్షపాతి. ఇట్లు పుత్రు డగు కర్ణునియందు ప్రేమాతిశయముతో ప్రవర్తించినను సూర్యుడు కర్ణపక్షపాతి గాక ధర్మపక్షపాతి యైనవిధముగా పుత్రుడైన పార్థునియందు ప్రేమాతి

శయముతో ప్రవర్తించిన యింద్రుడును ధర్మపక్షపాతి యనదగునే కాని కేవలపాండవపక్షపాతి యనదగదు. కనుక ప్రథమపక్ష మసంగతము.

ఇక పాండవపక్షపాతమునుబట్టియే పార్థుని రక్షింప దేవేంద్రుడు ప్రయత్నించె నను పక్షములో ఇంద్రున కాపాండవపక్షపాతము నకు గారణ మేమి? తనకు ప్రాణప్రియమైన ఖాండవవనమును అగ్ని దేవున కాహుతిగా సమర్పించినట్టి పార్థునియందు ఇంద్రునకు పక్షపాత ముండుటకు గారణ మేమి? వారి ధర్మనిష్ఠయే దానికి గారణము. కనుక నింద్రుడు ధర్మపక్షపాతి గాని, కేవలపాండవపక్షపాతి గానేరడు. కాబట్టి ద్వితీయపక్ష మసంగతము.

"ఇంద్రు డుచితానుచితములుగాని, తనదేవత్వమును గాని పాటింపక కపట బ్రాహ్మణవేషమును ధరించి కర్ణుని భిక్షించెనట!"

"యతో ధర్మ స్తతో జయః" అను సిద్ధాంతమును బట్టి ధర్మ పక్షమునకు జయము, అధర్మపక్షమునకు అపజయము సముచిత మగు టచే ధర్మపక్షోద్ధరణ ముచితమనియు, అధర్మపక్షము నణచివేయ కుండుట అనుచిత మనియు, భిక్షించుటకు రూపాంతరగ్రహణ ముచి తము, స్వస్వరూపప్రదర్శన మనుచిత మనియు నుచితానుచితములు పాటించియే యింద్రు డావని జేసెను.

తన దేవత్వమును పాటింపకపోలేదు. పాటించియే అసురపక్షీయ మైన అధర్మము నణచుటకును, దేవపక్షీయమైన ధర్మము నుద్ధరించుట కును ప్రయత్నించెను. ధర్మపక్షానువర్తిత్వమే దేవత్వము. శ్రీమ ద్రామాయణములో మాల్యవంతుడు రావణునితో జెప్పిన యీవిష యము జూడుడు——

"అసృజ ద్భగవాన్ పక్షౌ ద్వావేవ హి పితామహః।
సురాణా మసురాణాం చ ధర్మాఽధర్మౌ తదాశ్రయౌ ॥
ధర్మో హి శ్రూయతే పక్షో హ్యమరాణాం మహాత్మనామ్।
అధర్మో రక్షసాం పక్షో హ్యసురాణాం చ రావణ ॥" (యుద్ధకాం॥ స. 35)

దీనిచే ధర్మపక్షము దేవతల దనియు, అధర్మపక్ష మసురులది

(రాక్షసుఁడ) యనియు స్పష్టమైనది. ఇట్లు ధర్మపక్షానుగ్రాహకత్వ రూపమైన దేవత్వమును పాటించియే యింద్రు డుద్యమించెను.

కపటబ్రాహ్మణవేషము ధరించి భిక్షించుట తగ దందురా ? తాను త్రైలోక్యాధిపతియైయుండి, అధర్మపక్షము నణచుట తనకు విధియై యుండి, ఎవ్వ డేవ్రత మవలంబించునో ఆవ్రతములోనే వానిని పరీక్షించి కృతార్థతనో, వ్రతభంగమునో కలుగజేయుట తన కృత్యమై యుండినట్టి యింద్రుడు- ఏమడిగినను బ్రాహ్మణున కిచ్చుటే నావ్రత మని కూర్చుండిన కర్ణుని బ్రాహ్మణవేషముతో భిక్షించుట తగని పని యెట్లగును ? బలిచక్రవర్తిని కపటవటువేషముతో శ్రీహరి భిక్షింప లేదా ? ఇంతకును ఆ యింద్రునకు నిర్వికారుడై కర్ణు డీయగా ప్రతి వాదుల కీవికార మెందులకు ? కనుక ప్రథమాంశము నిరస్తము.

ద్వితీయాంశము—ఇంద్రుడు కపటియై కర్ణుని మోసముచేయ వచ్చినవాడట ! అది యెరిగియు తనకవచకుండలముల నొలిచి దానము చేసిన మహానుభావుడు కర్ణుడట ! అతని సత్యవ్రతము, దానశీలత లోకోత్తరములట !

అయితే ఇంద్రుడు కపటియై కర్ణుని మోసముచేయుట- కర్ణ దుర్యోధనాదులు కపటులై పాండవులను వారణావతమునకు బంపుట లోను; లాక్షాగృహదహనోద్యమములోను మోసముచేయుటవంటిదా? కపటులై ద్యూతమున కాహ్వానించి సర్వస్వ మపహరించుటలోను, వనవాసాజ్ఞాతవాసపణములతో పునర్ద్యూతములో గూర్చుండబెట్టి అర ణ్యముల పాలు చేయుటలోను మోసము చేయుటవంటిదా? కపటులై విషప్రయోగాదులలో మోసముచేయుట వంటిదా ?

ఇంద్రుడు మోస మేమిచేసెను? నీకవచకుండలములు యాచిం చుటకై యింద్రుడు రాబోవుచున్నా డని, నీ వివ్వవ ద్దని ముందే సూర్యుడు బోధించియుండెను. తరువాతనే రూపాంతరముతో వచ్చి యింద్రు డడిగెను. మోస మేమున్నది ? అత డింద్రుడని తెలిసియే

అవి యివ్వకుండుట కుద్యమించి తుదకు వ్రతభంగము కాకుండుటకై యిచ్చుటకే సిద్ధపడెను. ఆయిచ్చుటలో ప్రతిఫలము గోరి యిచ్చెను. నిరీహుడై యివ్వలేదు. ఆప్రతిఫలమును ప్రార్థనాపేక్షతో గోరెను. అది ప్రతిఫలము గ్రహించి యిచ్చిన దానముగనుకనే కర్ణునకు కార్యకారి కాకపోయినది.

"కర్ణో దాతా పాత్రి మిన్ద్రో దేయం స్వాత్మసమం ధనమ్ ।
కర్తృత్వ వినిమయాత్మజ్ఞో ధర్మో నాభ్యభవ ద్ధ్రువమ్ ॥" (నీలకంఠీయము.)

ఇచ్చి పుచ్చుకొనుటతో గూడిన యీ యీవి కర్ణుని దానశీలతకు అంత నిదర్శనము కాదేమో అనుపించుచున్నది. కనుక ద్వితీయాంశము నిరస్తము. ఈప్రతివాదులుగూడ—"కర్ణుడు దుర్యోధనుని కార్యమునకు గావలయును. తన కీర్తిశరీరమునకు కళంకమును దెచ్చుకొనుటకును సాహసించెను. ఇట్లు ప్రతిఫలము గోరుటచేతకదా "చండాంశు సుతుపోల్కి కుండమార్చులు గాక" అని యాతని నిరసించుటకు కవులకు సందుదొరకె (పుట66) నని వ్రాసియేయున్నారు.

—: ఉత్తరగోగ్రహణకాలమందైన కర్ణపరాజయమునుగూర్చి ప్రతివాదుల కారణకల్పన—తన్నిరాకరణము :—

కర్ణచరిత్రకారుల వ్రాత యిట్లున్నది—

1 "కర్ణుడు శరీరమును గోసి దానము చేయుటచే జన్మమున బటుత్వము తగ్గెను. కావుననె యుద్ధములందు శత్రుల బాణములచే గాయపడినప్పు డోర్చి నిలిచియుండు సామర్థ్యము తగ్గిపోయెను." (పు. 68)

2 "పాండవులను బయలుపెట్టుటయె ప్రయోజన మని వచ్చిన దుర్యోధనునకు హఠాత్తుగా భీష్ముడు వారిసమయము పూర్తి యయ్యె నని చెప్పుటచేతను, భీష్మాదియోధులు పరాజితులై పారిపోవుటచేతను, తొట్రుపడియున్నట్టియు, నప్పు డర్జునునితో యుద్ధము సంభవించునని తలచియుండనట్టియు, విరాటు నోడించుటకుమాత్రము తగిన సన్నాహముతో వచ్చినట్టియు, గర్ణుడు పరాజితుడగుట వింత కాదు."

3 "కష్టములు పడి మిక్కిలి కినిసియున్న యర్జునుని శాతనారసములను ఓడలు కోసికొనియున్నట్టియు, నెట్లయిన జీవించియుండి యర్జునుని వధించి తన ప్రతిజ్ఞను నెఱవేర్పగోరియున్నట్టియు కర్ణు డొక్కరుడు నిలువరింపజాలకుండుట యద్భుత మెట్లగును?" (పు. 70)

ఈమూడంశములను బరిశీలింతము. ప్రథమాంశము—కర్ణుడు తనకవచమును గోసియిచ్చుటచే చర్మమునకు పటుత్వము తగ్గి శత్రు బాణములకు గాయపడినప్పుడు సహించి నిలిచియుండు సామర్థ్యము తగ్గిపోయెనట! అహా! అట్టియెడ సంధికుదరనీయక ఆవెంటనే యుద్ధమున కెట్లు సిద్ధపడినాడు ? ఆతగ్గిపోయిన దన్న సామర్థ్య మప్పుడుమాత్ర మెట్లు కలిగినది ?

ఇంకొకటి—కుమారాస్త్రవిద్యాప్రదర్శనానంతరము ద్రుపదుని వలన పరాజయము, ద్రౌపదీస్వయంవరకాలమున పార్థునివలన పరా జయము, ఘోషయాత్రసమయమున గంధర్వులవలన పరాజయము కవచముండగనే కర్ణుని కెట్లు సంభవించినవి ? సహజకవచ ముండియు పరాజితు డగుచుండు కర్ణుని యీపరాజయమునకు ఆకవచము లేకుం డుట కారణ మనుట యేమి బాగున్నది ? పోనిండు- ఆకవచమునకు బదులు పార్థసంహారమునకై యేకవీరఘ్నిని చేపట్టినవానికి పరాజయ మేల వచ్చినది ? కర్ణసారథ్యములోనేగాక ఉత్తరసారథ్యములోనే దానిని ప్రయోగించి కృతార్థుడు కాలేదేమి ?

"సత్యం తే ప్రతిజానామి వధిష్యామి రణేఽర్జునమ్ ।
గతే త్రయోదశే వర్షే సత్యేనా యుధ మాలభే ॥"

అనుచు ఘోషయాత్రాంతసంభాషణములో పదమూడవ సంవత్సరము గడచిపోనిమ్ము. ఆపై వచ్చు యుద్ధములో పార్థుని వధించెదను. అని ఆయుధముపట్టి ప్రమాణముచేసిన కర్ణుడు- భార్గవాస్త్రము, సర్పముఖాస్త్రము, ఇంద్రదత్తశక్తి నావిజయసాధనములని గర్జించు కర్ణుడు-"ఒకట గాకున్నను నొకటనైన నర్జునుని వధింపనగునని యాతడే కాక యెవ్వరైన నూహింపక తీఱదుగదా !" (పు 84) అని యీప్రతి వాదులచే సమర్థింపబడిన ధోరణిగల కర్ణుడు- ఈయుత్తరగోగ్రహణ ములో పదమూడవ వత్సరము గడచినతరువాత వచ్చిన యుద్ధములో భార్గవాస్త్రాద్యమోఘసాధనములను యథేష్టముగా వాడవలసిన యుద్ధ ములో- శ్రీకృష్ణసన్నిధానము లేనట్టి యుద్ధములో- నిస్సహాయుడై

వచ్చిన పార్థుని యుద్ధములో శత్రుసంహారము చేయలేకపోయినాడేమి? కనుక ప్రథమాంశము నిరస్తము.

ద్వితీయాంశము—కర్ణుడు- భీష్మాదియోధులు పరాజితులై పారిపోవుటచేత, పాండవుల సమయము పూర్తియైనదని హఠాత్తుగా వినుటచేత తొట్రుపడియుండెనట ! అర్జునునితో యుద్ధము సంఘటించునని తలచియుండలేదట ! విరాటు నోడించుటకు తగిన సన్నాహముతో మాత్రమె వచ్చియుండెనట! పాండవులను బయలుపెట్టదలచియె వచ్చెనట ! అట్టి కర్ణుడు పరాజితు డగుట వింతకాదట !

అయితే భీష్మాదులు పరాజితులై పారిపోయినచో కర్ణునకు తొట్రుపాటేల ? భీష్మద్రోణాదులను అల్పులుగా మాటలాడుచు తానే శత్రుక్షయము చేయగలనని గర్జించు కర్ణునకు తొట్రుపాటేమి ? పాండవుల సమయము పూర్తియైనట్లు హఠాత్తుగా వినుటచే తొట్రుపాటా ? అది పూర్తియై యెదుట బడనిమ్ము. పడగొట్టెద ననువానికి తొట్రుపాటేమి ? అసలచ్చటి ప్రస్తావ మెట్లున్నదో చూడుడు—

గోపాలకులను పారదోలి విరాటుని గోవులగుంపులను కౌరవులాక్రమించుకొనినారు. ఆగోవులను మరలించుకొని పోవుటకే ఉత్తరునకు సహాయముగా పార్థుడు వచ్చి దూరములో దేవదత్తమును పూరింప ద్రోణాచార్యు డాధ్వని విని, తత్కాలగోచరము లయిన యుత్పాతముల గని ఆ వచ్చువాడు పార్థు డనియు, మన కపజయసూచనములు కనబడుచున్న వనియు బలికెను. అంత దుర్యోధనుడు అజ్ఞాతవాసవత్సరము పూర్తి కాకుండ పార్థుడు వచ్చునా ? అనుచు కొంత ప్రసంగము చేసి తుద కిట్లనెను—

"యద్యేష రాజా మత్స్యానాం యది బీభత్సు రాగతః ।
సర్వైర్యోద్ధవ్య మస్మాభి రితి నస్సమయః కృతః ॥"

ఆవచ్చువాడు విరాటరాజు కానిమ్ము; పార్థుడే కానిమ్ము. మనకు యుద్ధము కర్తవ్యమే అని నిశ్చయింపబడినది. అని.

"దుర్యోధనశ్చ పృష్ఠతో కృత్వా రాధేయ స్త్వబ్రవీ ద్వచః ।
ఆచార్యం పృష్ఠతః కృత్వా తథా నీతి ర్విధీయతామ్ ॥
య ద్యేష రాజా మత్స్యానాం యది బీభత్సు రాగతః ।
అహ మావారయిష్యామి వేలేవ మకరాలయమ్ ॥
అద్యాహ మృణ మక్షయ్యం పురా వాచా ప్రతిశ్రుతమ్ ।
ధార్తరాష్ట్రాయ దాస్యామి నిహత్య సమరే ఽర్జునమ్ ॥
జామదగ్న్యా ద్య న్మయా హ్యస్త్రం యత్ప్రాప్త మృషిసత్తమాత్ ।
తదుపాశ్రిత్య వీర్యం చ యుధ్యేయ మపి వాసవమ్ ॥" (విరాటప. అ. 48)

ఆదుర్యోధనుని మాట విని కర్ణు డిట్లనెను—ఆచార్యుని వెనుక నుంచుము. ఈవచ్చువాడు విరాటు డయినను, పార్థుడే అయినను నే నడ్డుకొనెదను. నేనిప్పు డర్జునుని సంహరించి నాప్రతిజ్ఞాప్రకారము దుర్యోధనుని ఋణము దీర్చికొనెదను. నాభార్గవాస్త్రమును, నాపరాక్రమమును పురస్కరించుకొని వాసవు నయిన డీకొనెదను. అని.

ఆపై వచ్చిన ప్రసంగములో పాండవులకు సమయము పూర్తియైన దని భీష్ముడు చెప్పెను.

ఇట్లు పార్థునిపై కాలు దువ్విన కర్ణుడు తొట్రుపడె ననుట అయుక్తము. అర్జునునితో యుద్ధము సంభవించు నని యనుకొన లేదనుట అయుక్తము. పార్థు నోడించుటకు దగిన సన్నాహముతో రాలేదనుట అయుక్తము. ఇట్లు ద్వితీయాంశము నిరస్తము. అంత గర్జించిన కర్ణుడు పరాజితు డగుటే వింతయైయుండ అది విడ్డూరము కాదనుట విరుద్ధము.

తృతీయాంశము—కష్టములు పడి కినిసియున్నవాడు అర్జును డట! ఒడలు కోసికొనియు, ఎట్లయిన జీవించియుండి అర్జునుని వధించి ప్రతిజ్ఞను చెల్లించుకొనదలచియు నున్నవాడు కర్ణుడట! ఇట్టికర్ణు డట్టి యర్జునుని స్తంభింపజేయలేకపోవుట అద్భుత మెట్లగును? అట!

ఓహో! అసహాయుడై వచ్చిన పార్థునకు వీరాలాపములతో ద్రోణాదులను నిరసించి ప్రగల్భములాడిన కర్ణు డోడిపోయి, మహా

సంగ్రామములో శ్రీకృష్ణసహితుడైన పార్థుని వధించుటకై తన జీవితము నిలవబెట్టుకొనె ననుట అపహాసాస్పదము కాదా!

ఉత్తరగోగ్రహణసమయమందలి కర్ణపరాజయమే కర్ణుని అసమర్థతకు నిదర్శనము. అప్పటి పార్థవిజయమే పార్థుని అప్రతిహతపరాక్రమమునకు నిదర్శనము.

శ్రీకృష్ణాదులును, భీష్మాదులును, ధృతరాష్ట్రుడును పార్థకర్ణుల ప్రబలదుర్బలభావమునకు ఉత్తరగోగ్రహణసంఘర్షణఫలితమునే నిదర్శనముగా కీర్తించుచు వచ్చిరి. దానినిబట్టియే పార్థునిపట్ల కర్ణు డసమర్థుడని లోక మనుకొనుట సంభవించినది. ఇట్టి లోకప్రసిద్ధిని త్రోసివేసి గ్రంథమునకు వ్యతిరేకముగా కర్ణచర్యను సమర్థింప నెంచుట ప్రతివాదుల కశక్యమైన పని. ఇట్లు తృతీయాంశము నిరస్తము.

—: సూర్యపుత్రు డగు కర్ణుని పరాజయములనుగూర్చి
నీలకంఠాచార్యోక్త కారణము :—

ఉత్తరగోగ్రహణసందర్భములో వచ్చిపడుచున్న పార్థుని ప్రశంసించునట్టి ద్రోణాచార్యుని కర్ణుడు తృణీకరించి మాటలాడినపుడు ఆ మాటలను గర్హించు అశ్వత్థామ ఆకర్ణుని 'సూత' అని సంబోధించిన ప్రస్తావము—

నీలకంఠీయమ్—సూతేతి సంబోధయ న్నక్షత్రియత్వాదస్య యుద్ధే ష్వకౌశలం వ్యనక్తి। నను "అదిత్యో వై దైవం క్షత్రం" ఇతి శ్రుతేః దివ్యాత్ క్షత్రాత్ కన్యాయాం జాతస్యాఽస్య కథ మక్షత్రిత్వం యుద్ధాఽకౌశలం చేతి విదుషా ప్యశ్వత్థామ్నా వక్తుం యుక్తమితి చే చ్ఛృణు।

సర్వేషాం హి వర్ణానాం ద్వివిధం జన్మ యోనిజం, సంస్కారజం చ। తత్ర యా ఏవ యోనిః స ఏవ సంస్కర్తా చేత్స ఏకజో న ప్రకృతిక శ్చ్యవతే, కర్ణస్తు దైవక్షత్రజోపి అక్షత్రియేణ సూతేన సంస్కృత ఇతి ద్విజాతత్వాత్ క్షత్రియత్వేన ప్రవర్తితుం కుశలోఽపి సూతత్వేన పరకీయప్రహారం సోఢు మశక్త ఇతి యుద్ధా త్పలాయతే ఇత్యాశయే నైనం సూర్యపుత్రం జానన్నపి సూతేతి సంబోధయతి। తథా చ మన్త్రవర్ణః—సహాస్య మన్యోః.....ఏకజ త్వమ్"...

ఏకజ ఏకస్మాజ్జాత........తథా చ లోకే అభాణకః—యస్య ద్వే వచసే స ద్విపితృక ఇతి। వక్తారో భవంతి, అత ఏకశేష్యోర్థద్వ్యచనమ్। దత్తకక్రీతాదౌ తు శాస్త్రీయ సంస్కారస్త్వైకస్యస్తీతి నాసౌ కందతుల్య ఇతి దిక్। (విరా అ50)

కర్ణుని సూతశబ్దముచే సంబోధించుటలో క్షత్రియుడు కానందున ఈతనికి యుద్ధకుశలత లేదని అశ్వత్థామ వ్యక్తీకరించెను.

శ్రుతిలో దేవగణమందు సూర్యుడు క్షత్రియుడని యున్నందున అట్టి సూర్యునివలన క్షత్రియకన్యయందే జన్మించినట్టి కర్ణుని యందు క్షత్రియత్వము లేదని, యుద్ధకుశలత లేదని అశ్వత్థామ యంతటివాడనుట తగునా? అని శంకింతువేమో, వినుము—జన్మ-పుట్టుకనుబట్టియు, సంస్కారమును బట్టియు రెండువిధములై యున్నది. ఇది చాతుర్వర్ణ్యసాధారణము.

అందు పుట్టుకనుబట్టి కలుగు వర్ణవ్యవస్థలో జనకుడే స్వజాతి విహితసంస్కారములు పుత్రునకు జేసియున్నపుడు ఆతడు ఏకజాతుడే అయి ప్రకృతి కనుగుణుడై యుండును.

కర్ణుడన్ననో పుట్టుకను బట్టి క్షత్రియుడయినను క్షత్రియుడు కానట్టి సూతుడు-స్వజాతివిహితసంస్కారము లాతనికి జేసియుండుటను బట్టి సంస్కారమూలకమైన జన్మ మరొకటగుటచే ఏకజాతుడు గాక ద్విజాతుడై యున్నకారణమున క్షత్రియత్వముచేత ప్రహరింపగలిగియుండియు, సూతత్వముచేత శత్రుప్రహారములకు తట్టుకొనియుండలేక పలాయన మగుచుండు నను తాత్పర్యముతో అశ్వత్థామ కర్ణుని సూతశబ్దముచే సంబోధించియుండెను.

ఏకజాతుడు ప్రశంసనీయుడనుటకు మన్యుసూక్తములోని 'ఏకజ' శబ్దవిశేషణము నిదర్శన మగుచున్నది.

రెండుమాటలాడువానిని ద్విపితృకు డనుట లోకప్రసిద్ధము. దత్తపుత్రాదులవిషయమై శాస్త్రసిద్ధమైన పుత్రత్వము ప్రతిగ్రహీతను చెందినదేకనుకను, సంస్కారము లాతడే చేయునుగనుకను ఏకజాతత్వమే యని గ్రహింపవలయును; అని భావము.

ఇచ్చట జన్మ- సంస్కార- వైలక్షణ్యము కర్ణునకు తటస్థించి నట్లే పాండవులకును తటస్థింపలేదా? అని శంకింపరాదు. దత్తపుత్రుడు గోత్రముకూరి ప్రతిగ్రహీతకే చెందుట శాస్త్రసిద్ధమైనట్లు క్షేత్రజ సంతతి క్షేత్రికే చెందుట శాస్త్రసిద్ధమైనందున పాండురాజునకు క్షేత్రజులైన పాండవులు పాండురాజసంతతియే అయియుండి పాండురాజుచే క్షత్రియోచితసంస్కారములనే పొందియుండుటవలన పాండవులయందట్టి సాంకర్యము సంభవింపలేదు. అది కర్ణునియందే సంభవించినది.

కనుకనే కర్ణుడు కుంతీదేవితో సంభాషించినపుడు తనకు క్షత్రియోచితసంస్కారము లేకపోయినదనియు, హీనసంస్కారము ప్రాప్తించినదనియు తనకుగల సంతాపమును ఇట్లు వెల్లడించినాడు—

"అహం చేత్ క్షత్రియో జాతో న ప్రాప్తః క్షత్రసత్క్రియామ్ ।
క్రియాకాలే త్వనుక్రోశ మకృత్వా త్వ మిదం మమ ॥
హీనసంస్కారసమయ మద్య మాం సమచూచుదః ।" (ఉద్యో అ 146)
టీ॥ క్రియాకాలే క్షత్రియోచితసంస్కారకాలే అనుక్రోశం దయామ్ ।

దేవీ! జన్మచే క్షత్రియుడనే అయినను అట్టి సత్క్రియ నాకు ప్రాప్తింపకపోయినది. క్షత్రియోచితసంస్కారకాలములో నీవు దయను నాపై జూపక హీనసంస్కార-ఆచారములు గలిగియున్న నన్నిపుడు నీవు ఇట్లు ప్రేరేపించుచున్నావు. అని.

క. క్షత్రియసంస్కారమునకు పాత్రముగా నీవు నన్ను పాటింప విహా
మత్రిఫలమునకు నీకే బుత్రుడ నని వచ్చుటింక బొసగునె చెపుమా. (ఆంధ్రభా)

ఇట్టి జన్మ-సంస్కార-సాంకర్యము కర్ణునియందేకాక విశ్వామిత్రునియందును సంభవించినది.

విశ్వామిత్రుడు క్షత్రియుడగు గాధియొక్క పుత్రుడు. ఆగాధి భార్య ఋచీకమహర్షిచే తపశ్శ్రద్ధాదిబ్రాహ్మణలక్షణములు కలుగునట్లు మంత్రసంస్కృతిని చేసి యుంచబడిన హవిస్సును దైవికముగా భుజించుటవలన ఆమెయందు జన్మించిన విశ్వామిత్రుడు జన్మమూలక

మైన తెూత్రము, మంత్రసంస్కారమూలకమైన తపోనిష్ఠాదికము గలిగి యుండెను.

ఈవిషయమే నీలకంఠీయశ్లోకముచే ప్రతిపాదింపబడినది—

"క్షారే క్షారత్వతపనీ రాధేయే శౌర్యభీరుతే ।
ఖలే చ వాచి మాధుర్యం బీజసంస్కారసంకరాత్ ॥"

ఈసందర్భమును బట్టి స్వజాత్యుచితసంస్కారమే జాత్యుత్కర్షా ధాయక మనునది పర్యవసితమని పాఠకులు గ్రహింతురుగాక !

—: కౌరవులు పెట్టిన కష్టములలో పాండవులకు ప్రాప్తించిన శ్రేయస్సులు :—

దుష్టచతుష్టయచర్యలలో బాలక్రీడాసందర్భమున భీమసేన హత్యాప్రయత్న మొకటి. వారణావతప్రస్థానసందర్భమున సమూల పాండవహత్యాప్రయత్న మొకటి. కపటద్యూతసందర్భమున వనవాసా జ్ఞాతవాసనిర్బంధవిధాన మొకటి. దీనిలో పాండవులకు ప్రాప్తించిన విశేషములు— (1) భీమసేనునకు విషముబెట్టి ఒడలెరుగకుండ నిద్రించునప్పుడు కాలుచేతులు గట్టి గంగలో దింపినప్పుడు అతడు నాగ లోకమునకు జేరి అచ్చట నాగదష్టుడగుటలో జంగమవిషము, స్థావర విషమునకు విరుగుడగుటవలన తెలివివచ్చి క్రమముగా నాగులచే నాదరింపబడి వారిచే సమర్పింపబడిన అష్టకుండపరిమితమైన రసమును త్రాగి వజ్రశరీరుడై పదివేలయేనుగుల బలము గలవాడై నాగులచేతనే యథాస్థానమందు ప్రవేశపెట్టబడి సుఖముగా నింటికి వచ్చెను. ఇట్లీ భీమసేనహత్యాప్రయత్నఘట్టము మంగళాంతముగా నడచినది.

(2) ధర్మజునకు యౌవరాజ్య మిచ్చినతరువాత పాండవులు విజయశీలురై కురురాష్ట్రము నభివృద్ధిచేయుచుండగా— "ధృతరాష్ట్రో మహీపాలః శ్రుత్వా మహమ దాతురః" ధృతరాష్ట్రుడు చింతాగ్రస్తు డయ్యెను. అప్పుడు పాండవహత్యకై దుష్టచతుష్టయము దురాలోచన చేసెను. అది ధృతరాష్ట్రునకు దెలియజేయక, పాండవులు కొంతకాల-

మన్నత్రి నివసించునట్లు చేయుమని ధృతరాష్ట్రునకు జెప్పి యాతనిచే బ్రహ్మోత్సవము లనుపేరుతో వారణావతమునకు వెళ్ళునట్లు పాండవుల కుపదేశింపజేయగా పాండవులు తల్లితో గూడ వారణావతమునకు వెళ్ళిరి. అక్కడ లక్కయింటి ముప్పునుండి తప్పించుకొని సురంగము నుండి పదిలముగా దాటుకొని పోయిరి.

"విషవా ర్యగ్నిభి ర్లబ్ధ్వా ఘాతయంతి స్మ బాంధవాన్ ।
ఈశ్వర స్తా నవత్యేవే త్యుక్తం జాతుషపర్వణి ॥" (నీలకంఠీయమ్)

తరువాత అజ్ఞాతముగా గొంతకాలము సంచరింపదలచి వనసంచారము చేయుటలో హిడింబాసురునితో సంఘర్షణము రాగా నాతని భీమసేనుడు వధించుటయు, ఇంద్రుని సంకల్పమువలన కర్ణుని చేతికి ముందురాబోవు ఏకవీరఘ్నికొరకు భీమసేనునిద్వారా ఘటోత్కచుడు సృష్టింపబడుటయు జరిగినది.

తరువాత వేదవ్యాసభగవానుడు దర్శన మిచ్చి కుంతీదేవికి ధైర్యము చెప్పి పాండవుల నాశీర్వదించి కర్తవ్య ముపదేశించి అంతర్ధానము కాగా వేదవ్యాసోపదేశప్రకారము ఒకమాసము ఏకచక్రపురవాస మొకబ్రాహ్మణుని యింట బ్రాహ్మణవేషములతో పాండవులు చేయుచుండ ఆపురమునకు తటస్థించియున్న బకాసురబాధను బట్టి ఆయింటి బ్రాహ్మణుని కుటుంబములోనుండియే యొక వ్యక్తి ఆబకాసురునకు బలిదానము కావలసిన రోజు రాగా కుంతీదేవి యుపదేశముపై భీమసేనుడే ఆపనికి సిద్ధపడి వెళ్ళి ఆబకాసురుని వధించి బ్రాహ్మణకుటుంబము నుద్ధరించి పౌరుల నిత్యదుఃఖమును బోగొట్టి కృతార్థు డయ్యెను.

"యస్మిన్ గేహే పురేవాపి వసే త్ప్రాణ్యతథా జనః ।
ఉపకుర్యా త్త మిత్యేవ ముక్తం బకవధే౽పి చ ॥ (నీలకంఠీయము)

తరువాత నాపురమునుండి బయలువెడలి 'సోమాశ్రయాయణ' మనబడు ఈశ్వరస్థానమైన గంగాతీర్థమునకు జేరినపుడు అక్కడ పార్థునకును, అంగారపర్ణుడను గంధర్వునకును గలిగిన సంఘర్షణములో

పార్థునకు గంధర్వుఁ డోడిపోయి, పార్థుని యాగ్నేయాస్త్రముచే విరథుఁడయి పార్థునిచే పట్టుకొనఁబడి విడువఁబడినతోడనే మెచ్చుకొని యిట్లనెను — నాయొద్ద చాక్షుషీవిద్య కలదు.

"య చ్చక్షుషా ద్రష్టు మిచ్ఛే త్త్రిషు లోకేషు కించన ।
తత్పశ్యే ద్యాదృశం చే చ్ఛే త్తాదృశం ద్రష్టు మర్హతి ॥
ఏకపాదేన షణ్మాసాన్ స్థితో విద్యాం లభే దిమామ్ ।
అనునేష్యా మ్యహం విద్యాం స్వయం తుభ్యం వ్రతే కృతే ॥"

టీ॥ యదితి । తత్ ధర్మిస్వరూపం పశ్యేత్, యాదృశం యద్ధర్మవిశిష్టం సామాన్యతో విశేషతశ్చ । సర్వం సర్వావస్థం వస్తు సర్వదా స్వసంకల్పానుసారేణ పశ్యేదిత్యర్థః । అనునేష్యామి పశ్చా త్ప్రాపయిష్యామి ।

"గంధర్వజానా మశ్వానా మహం పురుషసత్తమ ।
భ్రాతృభ్య స్తవ తుభ్యం చ పృథ గ్దాతా శతం శతమ్ ॥
కామవర్ణాః కామజవాః కామత స్సముపస్థితాః ।
ఇతి గంధర్వజాః కామం పూరయిష్యంతి మే హయాః ॥"

టీ॥ గంధర్వజాః=గంధర్వలోకజాః ।

ఆచాక్షుషీవిద్యచేత త్రిలోకములలో నేవస్తువునయినను సంకల్పించినయెడల జూడవచ్చును. ఆరుమాసములు ఏకపాదముమీఁద నిలిచి వ్రతము చేసినమీఁదట ఆవిద్యను పొందుట కధికారి యగును. నీ వావ్రతమును చేసినపిమ్మట నీకావిద్య నిచ్చెదను.

మరియు గంధర్వలోకమందలి యశ్వములు మీయైదుగురికి ఒక్కొక్కని కొక్కొకశతముచొప్పున నిచ్చెదను. కామగమనాది దివ్యలక్షణములు గల ఆయశ్వములు మీకోరిక లీడేర్చును. అని.

అది విని యర్జునుఁడు ప్రతిదానము లేకుండఁ బుచ్చుకొనుట అపకీర్తి యని పలుక, గంధర్వుఁడు—

"జీవితస్య ప్రదానేన ప్రీతో విద్యాం దదామి తే ।
త్వత్తోఽప్యహం గ్రహీష్యామి అస్త్ర మాగ్నేయ ముత్తమమ్ ॥"

నీవు చేసిన ప్రాణదానమునకు బదులు చాక్షుషీవిద్య నిచ్చెదను. నీవలన ఆగ్నేయాస్త్రము స్వీకరించి యశ్వముల నిచ్చెదను, అని

చెప్పగా విని యాగంధర్వుని కోరికపై తనయాగ్నేయాస్త్రము నిచ్చి యిట్లనెను—

"త్వయ్యేవ తావ త్తిష్ఠన్తు హయా గంధర్వసత్తమ।
కార్యకాలే గ్రహీష్యామః స్వస్తి తేఽస్త్వితి చాబ్రవీత్ ॥"

నీవిచ్చెడి యశ్వములను వానిపని వచ్చినపుడు గ్రహింతుము. అంతవరకు నీయొద్దనే యుండనిమ్ము; అని.

తరువాత ఉత్కోచకతీర్థమునందు తపస్సు జేయు ధౌమ్య మహర్షి దర్శనముచేసి వేదార్థతత్త్వజ్ఞుడగు ఆమహర్షిని పురోహితునిగా వరించి యాపై ద్రుపదపురమునకు జేరి యచ్చట ద్రౌపదీపాణిగ్రహణము చేసి పాండవులు సుఖముగా నుండిరి.

అప్పుడు మరల పాండవులయెడ దురాలోచనచేయు కర్ణదుర్యోధనుల ధోరణి జూచి ధృతరాష్ట్రుడు భీష్మద్రోణాదులను సమావేశపరచి కర్తవ్య మాలోచించినప్పుడు భీష్ముడు— మీపోషణమునకు మీ రర్ధరాజ్య ముంచుకొని పాండవుల కర్ధరాజ్య మిచ్చుట ధర్మమనియు, నది మీకు క్షేమ మనియు జెప్పగా దానినే ద్రోణాచార్యుడును బలపరచి చెప్పుటలో— ద్రౌపదీదేవి, పాండవులు, కుంతీదేవి, ద్రుపద మహారాజు మొదలగువారికి యథోచితముగా వస్త్రాభరణాదులను పంప యభినందనము దెలుపవలయు నని చెప్పగా దానికి కర్ణు డడ్డు తగులుటయు, ఆపై విదురుడు తిరుగదోలి ధృతరాష్ట్రున కుపదేశించుటయు జరిగినమీదట ధృతరాష్ట్రుడు, భీష్మద్రోణులును— నీవును జెప్పినట్లు చేయుటే మంచిదనియు, పాండవులును రాజ్య మనుభవింపవలసినవారే అనియు బలికి నీవే వెళ్ళి వారిని సత్కరించి యిచ్చటికి దీసికొనిరమ్మని చెప్పి పంపగా విదురుడు వస్త్రాభరణాదులను తీసికొని వెళ్ళి శ్రీకృష్ణసహితులై యున్న పాండవులను జూచి కౌగలించుకొని వారివారి కాయాకానుక లందించి ద్రౌపదీదేవితో గూడ పాండవు లమ్ముఖంపవలసినదనియు, ధృతరాష్ట్రాదులును, గాంధారీప్రభృతులును

వీరిని జూచుట కుత్సహించుచున్నా రనియు ద్రుపదునితో జెప్పి యాతని సమ్మతిపై శ్రీకృష్ణసహితముగా విదురుడు వారి నందరను వెంటబెట్టుకొని వచ్చెను.

ఆపాండవులు తమ కెదురుగా వచ్చిన భీష్మద్రోణకృపాచార్యాదిప్రముఖులతో గలిసి పౌరుల హర్షధ్వను లాకర్ణించుచు రాజభవనములో బ్రవేశించి పెద్దలకు పాదాభివందనములుచేసి కొన్ని రోజు లుండిరి.

అపై వారి కర్ధరాజ్యముగా ఖాండవప్రస్థ మిచ్చి మీరచ్చట నివసింపవలసినదని చెప్పి ధృతరాష్ట్రుడు పంపగా పాండవులు శ్రీకృష్ణసహితులై వెళ్ళి వేదవ్యాసపురస్కృతులై శాంతిపూర్వకముగా పుణ్యప్రదేశమందు లోకోత్తరవైభవము గల ఇంద్రప్రస్థమును నిర్మించి పాండవు లందు సుఖముగా నుండిరి. ఇట్లీ వారణావతయాత్రాఘట్టము కూడ మంగళాంతముగ నడచినది.

> "ప్రీణయంతి జిఘాంసంతో ప్యనుకూలే విధాతరి ।
> పాండుపుత్రాన్ ధార్తరాష్ట్రా ఇత్యుక్తం విదురాగమే ॥
> యాన్ ఖలా దగ్ధు మిచ్ఛంతి తా న్వర్ధయతి కేశవః ।
> నిరస్తాః పాండవా దారాన్ రాజ్యం కీర్తిం చ లేభిరే ॥ (నీలకంఠీయమ్)

ఒకప్పుడు కృష్ణార్జునులు విహరించుచుండ అగ్నిదేవుడు బ్రాహ్మణరూపముతో సమీపించి తాను ఓషధులతోగూడిన ఖాండవవనమును ఆహుతిగా దీసికొనుటకై యింద్రుని యడ్డులేకుండ గాపాడుడని వరము గోరి వారు దానిని సాధించుటకు దగిన పరికరము లను సంపాదించుటకు వరుణదేవు నాశ్రయించి తెచ్చి లోకోత్తరమైన గాండీవ మను ధనుస్సును, అక్షయతూణీరములను, దివ్యాశ్వసంపన్నము కపిధ్వజాలంకృతము విశ్వకర్మతపోనిర్మితము అగు దివ్యరథమును, పార్థునకిచ్చి అమోఘమై శత్రుసంహారము చేసి మరల హస్తగతమగుచుండు చక్రమును, కౌమోదకి యను గదను శ్రీకృష్ణున కిచ్చి యగ్నిదేవుడు పదునైదు రోజులు కృష్ణార్జునరక్షితుడై ఖాండవదహనముచేసి కృతార్థుడయ్యెను.

ఈవిధముగా పార్థుడు అత్యద్భుతపరికరములతో పరాక్రమముతో విరాజిల్లుచుండెను.

3 తరువాత పాండవు లసహాయశూరులై దిగ్విజయము జేసి యనంతమైన ధన మార్జింప ద్రౌపదీధర్మజులు మహర్షిగణపురస్కృతులై మహావైభవముతో రాజసూయము చేసిరి.

"విత్తార్జనం ముఖ్యార్థమేవ మహతా మిత్రి దర్శయన్ ।
ఊచే దిగ్విజయా దూర్ధ్వం రాజసూయక్రతుక్రియామ్ ॥" (నీలకంఠీయము)

అందు సభాపూజాసందర్భమున ప్రథమపూజ్యనిగూర్చి వచ్చిన చర్చలో సర్వజ్ఞుడగు భీష్మునిచే పరాత్పరుడని నిరూపింపబడి నారద మహర్షిచే బలపరుపబడిన కృష్ణపరమాత్మ కర్ఘ్య మిచ్చి పూజించుటయు, శ్రీకృష్ణద్రోహకుడైన శిశుపాలుడు ద్వేషించి నశించుటయు, ప్రత్యక్షముగా శ్రీకృష్ణునియందు దైక్యమగుటయు సంభవించినవి.

"తత్రైవాఽర్ఘాభిహరణే విష్ణు ర్దేవనరర్షిషు ।
ఆదౌ పూజ్యోఽథ తద్ద్వేష్టా సద్యో నశ్యేదితీరితమ్ ॥
గోప్యః కామా ద్భయా త్కంసో ద్వేషా చ్చైద్యాదయో నృపాః ।
తీవ్రధ్యానా ద్ధరే స్సామ్యం లేభిరే కీటభృంగవత్ " (నీలకంఠీయమ్)

అట్లు లోకోత్తరమైన రాజసూయక్రతువు నిర్వహించి అఖండైశ్వర్యసంపన్నులై విరాజిల్లు పాండవుల దివ్యవైభవము జూచి సహింపలేక దుర్యోధను డెంతయో దుఃఖపడెను.

"న తథా శూలయక్ష్మాద్యాః పీడయంతి గదా నరాన్ ।
యథా పరేషా ముత్కర్షః పాపినం ధార్తరాష్ట్రవత్ ॥" (నీలకంఠీయమ్)

ఆపై దుష్టచతుష్టయము ఆపాండవైశ్వర్య మపహరించుట కుపాయ మాలోచించి సుహృద్ద్యూత మను పేరుతో ధృతరాష్ట్రుడు పాండవుల నాహ్వానించునట్లు చేసి పితృవాక్యమును త్రోసివేయలేక వచ్చిన పాండవులను తమ కపటద్యూతములో గూర్చుండబెట్టి శకుని ద్యూత మాడుట కేర్పరచి పాండవుల సర్వస్వమును, ఆపై పాండవులను గెల్చుకొని, ఆపై ద్రౌపదీపణము ధర్మజునిచే బెట్టించి గెల్చుకొనినా మని

చెప్పి ద్రౌపదీపణము చెల్లదని పెద్దలు చెప్పుచున్నను వినిపించుకొనక అప్పటికి రజస్వలయైకూడ నున్న ద్రౌపదీదేవిని బలాత్కారమున సభాస్థలికి యీడ్చి, దుర్భాషలాడి, తుదకు వస్త్రాపహరణదుష్కార్యమున కొడిగట్టినారు. పాండవులు ఖిన్నులై శాంతినే వహింప అప్పుడు ద్రౌపదీదేవి ఆర్తితో కృష్ణపరమాత్మను గూర్చి యాక్రోశించుటయు, తత్క్షణము తీయుచున్నకొలది సీరూరినట్లు ద్రౌపదీదేవి శరీరమునుండి అనంతవస్త్రము లుద్భవించుటయు, తన్మూలమున ద్రౌపదీదేవి పాతివ్రత్యమహిమ, కృష్ణపరమాత్మ భక్తరక్షణపారవశ్యము జగద్విదితము లగుటయు గలిగినది.

"నాస్త్యకార్యం కదర్యాణాం నాస్త్యశక్యం మహాత్మనామ్ ।
నాస్త్యపేక్షో హరేర్భక్త ఇతి ద్యూతే ప్రదర్శితమ్ ॥" (నీలకంఠీయము)

ఆపై యుత్పాతములు గోచరింప ధృతరాష్ట్రుడు భీతిల్లి ద్రౌపదీదేవి నాదరించి ఆమెకు వరములుగా పాండవదాస్య విముక్తి యగుట, పాండవులు తమ సొత్తును స్వీకరించుట అను విషయముల కభ్యనుజ్ఞ నిచ్చి వారిని మంచిమాటలాడి పంపెను.

అప్పటికిని దుర్వృత్తినే వహించియున్న దుష్టచతుష్టయము ధృతరాష్ట్రుని వేధించి యాతనిచే పాండవులను మరల పిలిపించి వెనుకకు రప్పించి పునర్ద్యూతములో గూర్చుండబెట్టి వనవాసాజ్ఞాతవాస పణముతో ఓడినవారు త్రయోదశవత్సరములు యథాక్రమముగా గడపి వచ్చి తమ రాజ్యము తాము తీసికొనవచ్చు నను నిబంధనముతో వంచించి పాండవుల నోడించి అరణ్యమునకు బంపెను.

"జ్ఞాత్వాపి పరమాహాత్మ్యం న ఖలః ఖలతాం త్యజేత్ ।
దృష్ట్వాపి కృష్ణమాహాత్మ్యం నైవాఽశామ్య త్సుయోధనః ॥
సత్యం సతాం మహాన్ పాశో యేన బద్ధాః పదాత్పదమ్ ।
వంచితా అపి నో చేలు స్సమర్థా అపి పాండవాః ॥" (నీలకంఠీయము)

పాండవులు హస్తినాపురమునుండి బయలువెడలి మూడురోజులకు కామ్యకవనమున బ్రవేశించిరి. అచ్చట నివసించు కామరూపి,

బకాసురభ్రాత అగు కిమ్మీరు డను రక్కసుడు నిశీధమున బాండవులపై వచ్చి పడునంతట భీమసేను డాతని సంహరించి యావనము నిష్కంటకముగా జేసెను.

ఇట్లు వనవాసారంభము శత్రునిర్మూలనముతో మంగళాదిగా ప్రారంభ మయినది.

"ప్రవ్రాజితః పథి రిపుం య ద్ధన్యా న్మంగళాయ తత్ ।
పాండవానాం ప్రవసతాం కిమ్మీరోన్మథనం యథా ॥" (నీలకంఠీయము)

అట్లు వనవాసమునకు వెళ్ళిన పాండవులను బురస్కరించుకొని గృహస్థులేమి, స్నాతకులేమి, బ్రహ్మచారులేమి, మహానుభావు లెందరో వెళ్ళిరి. వారిని బోషించుటకై ధర్మజుడు సూర్యునారాధించి తదనుగ్రహలబ్ధమైన 'స్థాలి'చే వారి నందరను పోషించుచువచ్చెను.

"విప్రార్థం భాస్కరం భేజే న తు రాజ్యాయ ధర్మరాట్ ।
ధర్మాయాఽభ్యర్చయే ద్దేవం న రాజ్యాయేతి దర్శయన్ ॥" (నీలకంఠీయము)

ఒకప్పుడు వనవాసులైన పాండవులను హింసింపదలచి కర్ణదుర్యోధనాదులు ప్రయాణము కాగా, వ్యాసభగవానుడు దివ్యదృష్టిచే గ్రహించి ప్రత్యక్షమై వారిని నివారించెను.

ఒకప్పుడు కృష్ణపరమాత్మ సపరివారముగా వచ్చి ద్రౌపదీ పాండవులకు ధైర్యము జెప్పి వెళ్లెను.

ద్వైతవననివాసములో మార్కండేయమహర్షి దర్శన మిచ్చి ధర్మము నతిక్రమింపకుండుటే సజ్జనలక్షణ మని బోధించి—

"యథా ప్రతిజ్ఞం చ మహానుభావ కృచ్ఛ్రం వనే వాస మిమం నిరస్య ।
తత శ్శ్రియం తేజసా తేన దీప్తా మాదాస్యసే పార్థివ కౌరవేభ్యః ॥"

ధర్మజా ! నీ వీవనవాసదీక్షను నడపి ప్రతిజ్ఞను పూర్తి జేసి తరువాత కౌరవులనుండి నీరాజ్యము నీవు సంగ్రహింతువుగాక. అని యాశీర్వదించి వెళ్ళెను.

ఒకప్పుడు వ్యాసమహర్షి దర్శనమిచ్చి ధర్మజునకు ధైర్యము చెప్పి "ప్రతిస్మృతి" అను విద్య నుపదేశించి దీనిని నీవు పార్థున కుపదే

శించి పంపు మనియు, దివ్యాస్త్రములను పార్థుడు సంపాదించి వచ్చు ననియుఁ జెప్పి, కర్తవ్య ముపదేశించి అంతర్ధానము కాగా ధర్మరాజు పార్థున కుపదేశించి పంపెను. ఆపార్థుడు ఈశ్వరునివలన పాశుపతాస్త్రమును, లోకపాలకులవలన బహువిధదివ్యాస్త్రములను బొంది, ఇంద్రునియాజ్ఞపై దేవలోకమున కేగి ఇంద్రునివలన దివ్యాస్త్రములను బొంది, అచ్చట నయిదుసంవత్సరము లుండి సురక్షితుడై వచ్చెను.

ఈలోపల నొకప్పుడు ధర్మజునితో ప్రసంగించుచు భీమసేను డిట్లనెను—మహాత్మా! మన మజ్ఞాతవాసమును గూడ పూర్తి చేసిన తోడనే నిన్ను దుర్యోధనుడు మరల ద్యూతమున కాహ్వానించును. ఆహ్వానించినను నేను వెళ్ళనందువా? అట్లయిన ప్రథమద్యూత మయి వెళ్ళినపుడు మరల జేసిన ఆహ్వానముపై పునర్ద్యూతమునకు వెళ్ళవల సిన పని యేమివచ్చినది? కనుక నిటుపై గూడ నాత డాహ్వానింపక మానడు; నీవు వెళ్ళక మానవు. మనకీయవస్థ తొలగు టెట్లు? అని.

ఆశ్లోకము లివిగో చూడుడు—

"అజ్ఞాతచర్యా ముత్తీర్ణాన్ దృష్ట్వా చ పున రాహ్వయేత్ ।
ద్యూతేన తే మహారాజ పునర్ద్యూత మవర్తత ॥
భవాంశ్చ పున రాహూతో ద్యూతే నైవాఽపనేష్యతి ।

టీ॥ ద్యూతేన ద్యూతార్థం పునరాహ్వయేత్ । నహ్యాహూతోఽప్యహం న గమిష్యామీత్యాశంక్యాహ—పునర్ద్యూత మవర్తత । పూర్వ మప్యనుద్యూతస్య కృతత్వా త్పునరపి ద్యూతం కరిష్యస్యేవేత్యర్థః । అపనేష్యతి దూరీకరిష్యతి శ్రియమితి శేషః । (వన. అ 52)

ఇట్లు ప్రసంగించుచున్న సమయమునకు బృహదశ్వమహర్షి వచ్చి పూజింపబడి ద్యూతనిమిత్తమున తమకు సంభవించిన కష్టమును ధర్మజుడు చెప్పుకొనగా విని మహర్షి ధైర్యమును జెప్పుచు నలోపాఖ్యానము చెప్పి తుద కిట్లనెను—

"భయా త్త్రస్యసి యచ్చ త్వ మాహ్వయిష్యతి మాం పునః ।
అక్షజ్ఞ ఇతి కర్తాఽహం నాశయిష్యామి పార్థివ ॥

తేనా౽క్షహృదయం కృత్స్నం మహాం సత్యపరాక్రమ।
ఉపపద్యస్వ కౌన్తేయ ప్రసన్నో౽హం బ్రవీమి తే ॥
తతో౽క్షహృదయం ప్రాదా త్పాండవాయ మహాత్మనే ।''

ధర్మజా! అక్షజ్ఞుడగు శకుని మరల నాహ్వానించునేమో అని నీకు గల భయమును నేను తొలగింతును. నేను సంపూర్ణముగ నక్షహృదయ మెరిగినవాడను; నీ కుపదేశించుచున్నాను; అని యుపదేశించి వెళ్ళెను. భీమసేను డన్నట్లు మరల ద్యూతములో నోడించు దురుద్దేశము దుర్యోధనున కుంపుట నిజమే. ఇది ద్రోణాచార్య సైన్యాధిపత్యారంభమున దుర్యోధనుడే వెల్లడించెను. అది ముందు తెలుపబడును. అట్టి చిక్కు కూడ రాకుండ నందులోగూడ విజయము ధర్మజుడే పొందునట్లు అక్షహృదయమును బృహదశ్వమహర్షి యుపదేశించి యుండెను.

ఒకప్పుడు తీర్థయాత్రలో గంధమాదనపర్వతసానువులపై సంచరించునపుడు ద్రౌపదీదేవి కోరిన సౌగంధికపుష్పములకై భీమసేను డాపర్వత మెక్కి యచ్చట దర్శనమిచ్చిన హనుమంతునితో దన స్వరూపము జెప్పి తన కోరికపై హనుమంతుడు సముద్రలంఘనమునాటి హనుమన్మూర్తిని ప్రదర్శింప జూచి యాశ్చర్యపడినతరువాత భీమసేనునితో హనుమంతు డిట్లనెను—

"తదస్మ ద్దర్శనం వీర కౌంతేయా౽మోఘ మస్తు తే ।
భ్రాతృత్వం త్వం పురస్కృత్య వరం వరయ భారత! ॥
యది తావ న్మయా క్షుద్రా గత్వా వారణసాహ్వయమ్ ।
ధార్తరాష్ట్రా నిహంతవ్యా యావ దేత త్కరో మ్యహమ్ ॥
శిలయా నగరం వాపి మర్దితవ్యం మయా యది హి।
బద్ధ్వా దుర్యోధనం చాద్య ఆనయామి తవాంతికమ్ ॥
యావ దేత త్కరో మ్యద్య కామం తవ మహాబల!

భీమసేనా! నాదర్శనము నీకమోఘ మగుగాక! వరము గోరుము. హస్తినాపురమునకు వెళ్ళి క్షుద్రులైన ధార్తరాష్ట్రులను

హాతము జేయుమందువా? శిలాపాతముచే ఆపురమును మర్దింప మందువా? ఆదుర్యోధనుని కట్టి తెచ్చి యిప్పుడు నీపాదములకడ బడ వేయుమందువా? అని. భీమసేను డది విని యిట్లనెను—నీ యను గ్రహముచేత మేమే శత్రువులను జయింపగలుదుము; అని. అటుపై హనుమంతుడు—

"భ్రాతృత్వా త్సౌహృదా చ్చైవ కరిష్యామి ప్రియం తవ ।
చమూం విగాహ్య శత్రూణాం పరశక్తిసమాకులామ్ ॥
యదా సింహరవం వీర కరిష్యసి మహాబల ।
తదాఽహం బృంహయిష్యామి స్వరవేణ రవం తవ ॥
విజయస్య ధ్వజస్థ శ్చ నాదాన్ మోక్ష్యామి దారుణాన్ ।
శత్రూణాం యే ప్రాణహరాః సుఖం యేన హనిష్యథ ॥" (వన. అ 151)

నీకు నేను ప్రియము గలిగింతును. నీవు శత్రుసేనలో బ్రవే సించి సింహనాదము జేయునపుడు దానిని నా సింహనాదముతో రెట్టింపజేయుదును. పార్థుని రథధ్వజముపై నధిష్ఠించి శత్రుప్రాణహార ములు, మీకు విజయహేతువులు నగు దారుణనాదములను చేయు చుందును. అని యనుగ్రహించి యంతర్ధాన మయ్యెను.

ఒకప్పుడు జటాసురుడు కపటబ్రాహ్మణరూపముతో పాండవుల నాశ్రయించి, వారిని విశ్వసింపజేసి, వారి యాయుధములను గూడ సంగ్రహించి, భీమసేనుడు దగ్గరలేనిసమయములో ద్రౌపదీధర్మజాదు లను ఎత్తుకొనిపోవుచుండ భీమసేను డెదురై జటాసురుని వధించెను.

దేవలోకనివాసము జేయు పార్థుడు ఇంద్రప్రేరణముచే వెళ్ళి నివాతకవచులు, హిరణ్యపురవాసులగు కాలకంజులు అనబడు ప్రచండ పరాక్రమశాలు లగు వేలకొలది రాక్షసులను సంహరించెను. ఆపై వచ్చి బదరీక్షేత్రములో పాండవులను గలిసికొనెను.

ఒకప్పుడు ఒకసరస్సునకు దాహము తీర్చుకొనుటకై భీమార్జున నకులసహదేవులు క్రమముగా వెళ్ళుటయు, నొకయక్ష దక్కడ లట ఠించి మీరీయుదకము త్రాగిన ప్రాణాపాయము కలుగు ననియు, వా

ప్రశ్నలకు సమాధానము చెప్పి యాపై తాగివచ్చును. తీసుకొని వెళ్ళవచ్చును. అనియు చెప్పుచుండుటయు, వెళ్ళినవారు నీరుతాగి పడిపోవుచుండుటయు సంభవింప తుదకు యుధిష్ఠిరుడు వెళ్ళి 34యక్ష ప్రశ్నలకు సరియైన సమాధానములను తన విద్యాబలమునుబట్టి అను గుణ తడవుగా జెప్పునప్పటికి యక్షుడు సంతోషించి వారి నుజ్జీవింప జేసెను. దీనిచే శారీరాదిబలము విద్యాబలమునకు సాటి కాదని స్పష్ట మయినది.

ఆపై యుధిష్ఠిరుడు— మహాత్మా ! నీవు సామాన్యుడవు గావు, నీ వెవ్వరివో చెప్పవలసినదని కోరగా— యక్షుడు—

అహం తే జనక స్తాత ధర్మో మృదుపరాక్రమ ।
త్వాం దిదృక్షు రనుప్రాప్తో విద్ధి మాం భరతర్షభ ॥
వరం వృణీష్వ రాజేన్ద్ర దాతా హ్యస్మి తవానఘ ।

నేను నీ జనకుడైన ధర్మదేవతను. నిన్ను జూడదలచి వచ్చినాను. వరముగోరు మిచ్చెదను. అని ప్రేరేపించెను. అపుడు. ధర్మజుడు—

వర్షాణి ద్వాదశాఽరణ్యే త్రయోదశ ముపస్థితమ్ ।
తత్ర నో నాభిజానీయు ర్వసతో మనుజాః క్వచిత్ ॥

మహానుభావా ! ద్వాదశవత్సరవనవాసకాలము పూర్తి కావచ్చి నది. అజ్ఞాతవాసప్రారంభసమయము సమీపించినది. మేము అజ్ఞాత వాసములో లోకులకు దెలియబడకుండునట్లు వర మిమ్ము. అని కోరగా ధర్మదేవత—

దదానీత్యేవ భగవా నుత్తరం ప్రత్యపద్యత ।
భూయ శ్చాశ్వాసయామాస కౌన్తేయం సత్యవిక్రమమ్ ॥
యద్యపి స్వేన రూపేణ చరిష్యథ మహీ మిమామ్ ।
న వో విజ్ఞాస్యతే కశ్చి త్త్రిషు లోకేషు భారత ॥
వర్షం త్రయోదశ మిదం మత్ప్రసాదా త్కురూద్వహాః ।
విరాటనగరే గూఢా అవిజ్ఞాతా శ్చరిష్యథ ॥
య ద్వ స్సంకల్పితం రూపం మనసా యస్య యాదృశమ్ ।
తాదృశం తాదృశం సర్వే ఛన్దతో ధారయిష్యథ ॥ (వన. అ. 314)

అట్లే యిచ్చితి నని చెప్పి యింకను జెప్పెను. మీరు స్వస్వరూపములతో భూమిపై సంచరించినను మిమ్ముల నెవ్వరును దెలిసికొనలేకుండును. ఈ త్రయోదశవర్షము విరాటనగరమున నా యనుగ్రహముచే గూఢముగా మీరు అజ్ఞాతవాసము జేయగలరు. మీ రెట్టి రూపము వహింపదలతురో అట్టి రూపమును మీరు సంకల్పమాత్రమున ధరింపగలరు. అని చెప్పి యంతర్ధానమయ్యెను.

తరువాత విరాటనగరములో అజ్ఞాతవాసము కీచకసంహారాద్యత్యద్భుతకృత్యములతో గడిపి గోగ్రహణసంఘట్టనములో ఒకవైపు శతుగ్రులను నిర్జించి భీమసేనాదులును, ఒకవైపు కౌరవసేనలను నిర్జించి పారద్రోలి పార్థుడును తమ యప్రతిహతపరాక్రమమును జూపి విరాటరాజు నుద్ధరించి అపై తమ స్వస్వరూపములను ప్రకటించుటయు, విరాటరాజు బ్రహ్మానందముతోతన పుత్రికయైన ఉత్తరను అభిమన్యున కిచ్చి వివాహముచేయుటయు జరిగినది. పాండవులు ధర్మనిష్ఠచేతనే ఆపదలు దాటి శుభములను పొందిరి.

ధర్మేణా వాపదం తీర్త్వా పరం సౌభాగ్య మశ్నుతే ।
అభిమన్యో ర్వివాహోత్స్యే పర్వ ణ్యేత త్ప్రదర్శితమ్ ॥ (నీలకంఠీయము)

ఇట్లే వనవాసాజ్ఞాతవాసఘట్టముకూడ మంగళాంతముగ నడచినది.

—♦ పాండవవిద్వేషములో కర్ణదుర్యోధనులకు సంభవించిన అనర్థములు ♦—

పాండవులయందు ఎడతెగని ద్రోహబుద్ధితో వర్తించునట్టి కర్ణదుర్యోధనులకు అనర్థపరంపరయే సంభవించుచు వచ్చినది.

కర్ణునకు బ్రాహ్మణశాపప్రాప్తి, పరశురామశాపప్రాప్తి, కవచకుండలశూన్యతాప్రాప్తి, దుర్యోధనునకు మైత్రేయశాపప్రాప్తి, కర్ణదుర్యోధనులకు ఘోషయాత్రాసందర్భమున గంధర్వకృతపరాజయప్రాప్తి, ఉత్తరగోగ్రహణసందర్భమున పార్థకృతపరాజయప్రాప్తి, ఇత్యాదులు. దీనినిబట్టికూడ పాండవులది ధర్మమో కర్ణదుర్యోధనాదులది ధర్మమో తెలియుటలేదా ?

— కౌరవులతో సంధిచేసికొనుటకై పాండవులుచేసిన ప్రయత్నములు,
కర్ణ దుర్యోధనాదులుచేసిన ప్రతిఘటనములు —

మభిమన్యు వివాహకాలమునకు సమావేశమయిన పాండవ బంధువర్గము పాండవహితము గోరి యాలోచించుటలో ద్యూతకాల నిర్ణయప్రకారము, త్రయోదశవత్సరములు గడపిన పాండవులకు తమ రాజ్యము నొసఁగవలసియున్నదనియు, అవిషయమై దుర్యోధనాభిప్రాయ మేమో తెలిసికొనవలసియున్నదనియు, పెద్దవారికి దుర్యోధనుఁ డున్నట్లు తెలియుచున్నను మన మొక మాటను జెప్పి వారు చెప్పు సమాధానము గ్రహింపవలెననియు, దుర్యోధనుఁడు యుద్ధసన్నాహములో నున్నట్లు తోఁచుచున్నందున మనముకూడ నొకవైపు యుద్ధ సన్నాహము జేయుచునే యుండవలెననియు, నిర్ణయించిన తరువాత ద్రుపదపురోహితుఁడు దూతగా కౌరవులయొద్దకు బంపబడెను,

అతఁడు వెళ్ళి సభలో గతవృత్తాంతమంతయు జెప్పి అంత వరకు పాండవు లనుభవించిన కష్టములు వెల్లడించి.

తే సర్వం పృష్ఠతః కృత్వా తత్సర్వం పూర్వకిల్బిషమ్ ।
సామ్నైవ కురుభి స్సార్థ మిచ్ఛన్తి కురుపుంగవాః ॥
న హి తే విగ్రహం వీరాః కుర్వన్తి కురుభి స్సహ ।
అవినాశేన లోకస్య కాంక్షన్తే పాండవా స్స్వకమ్ ॥

ఆపాండవులు, వెనుకటి దుర్యోధనచర్యలను, తాము పడిన కష్టములను మనస్సులో బెట్టుకొనక కౌరవులతో సంధి చేసికొనదల చియే యున్నారనియు, వారు వీరులై యుండియు కౌరవులతో యుద్ధ మున కిష్టపడక లోకక్షేమము కొనసద్ధతిని తమరాజ్యము నపేక్షించు చున్నారమనియు చెప్పెను.

తే భవన్తో యథా ధర్మం యథా సమయమేవ చ ।
ప్రయచ్ఛన్తు ప్రదాతవ్యం మా వః కాలోఽత్యగా దయమ్ ॥(ఉద్యో.అ.20)

ఆపై మీరందరు కాలహరణము చేయుండక ధర్మప్రకారము ద్యూతకాలనిర్ణయప్రకారము పాండవుల కీయవలసియున్నదాని నిచ్చి వేయుఁ డని చెప్పెను.

భీష్ముం డది విని "దిష్ట్యా చ సన్ధికామా స్తే" పాండవులు సంధిచేసికొనదలచుట గొప్ప భాగ్యమని, నీవు చెప్పినది సత్యమని "ప్రాప్తాశ్చ ధర్మత స్సర్వం పితు ర్ధన మసంశయమ్" పాండవులు తమ పిత్ర్యమైన సొత్తును ధర్మప్రకారము పొందియున్నా రని ప్రసంగించెను. అప్పుడు—

దుర్యోధనం సమాలోక్య కర్ణో వచన మబ్రవీత్.।
దుర్యోధనార్థే శకుని ర్ద్యూతే నిర్జితవాన్ పురా ॥
సమయేన గతోఽరణ్యం పాండుపుత్రో యుధిష్ఠిరః ।
స తం సమయ మాశ్రిత్య రాజ్యం నేచ్ఛతి పైతృకమ్ ।
బల మాశ్రిత్య మత్స్యానాం పాంచాలానాం చ మూర్ఖవత్ ॥
దుర్యోధనో భయా ద్విద్వ న్నదద్యా త్పాద మన్తతః ।
ధర్మతస్తు మహీం కృత్స్నాం ప్రదద్యా చ్ఛత్రవేఽపి చ ।
యది కాంక్షన్తి తే రాజ్యం పితృపైతామహం పునః ॥
యథాప్రతిజ్ఞం కాలం తం చరన్తు వన మాశ్రితాః ॥
అధార్మికీ న్తు మా బుద్ధిం మౌర్ఖ్యా త్కుర్వన్తు కేవలాత్ ॥

కర్ణుడు దుర్యోధనుని ముఖ మవలోకించి తు్రపదపురోహితునితో నిట్లనెను— వెనుక దుర్యోదనపక్షమున శకుని కూర్చుండి ద్యూతములో నోడింప ధర్మజుడు ఆ ద్యూతకాలనిర్ణయమునుబట్టి అరణ్యావాసమునకు వెళ్ళెను. అతడిప్పుడు ఆనిబంధనము ననుసరించి తన పిత్ర్యమైన రాజ్యము నడుగుట మాని మత్స్యపాంచాలబలము జూచుకొని మూర్ఖునివలె రాజ్య మపేక్షింపబూనినాడు. దుర్యోధనుడు శతృవునకయినను ధర్మప్రకారము సర్వస్వ మిచ్చువాడుగాని, భయపడిమాత్రము కించిత్తయిన నిచ్చువాడు గాడు. ఆ పాండవులు తమ పితృపైతామహ రాజ్యమును పొందగోరుదురేని ద్యూతనిబన్ధనప్రకారము మరల అంత కాలము వారు వనవాసము చేయవలసినదే. వారు కేవలమూర్ఖతచే అధార్మికమైన బుద్ధితో వర్తింపకుందురుగాక. అని.

ఈకర్ణుని మాటలలో అజ్ఞాతవాసము పూర్తి కాకుండగనే తమకు ఉత్తరగోగ్రహణములో పార్థుడు తెలియబడెననియు, కనుక మరల వన

వాసమునకు బోవుట వారికి విధి యనియు కర్ణదుర్యోధనుల భావమని స్పష్ట మగుచున్నది.

ఉత్తరగోగ్రహణకాలమందే అజ్ఞాతవాసపూర్తి యైనదా? లేదా? అను సంశయముతో భీష్ము నడుగటయు, అధికమాసములను లెక్కపెట్టవలసియున్నందున పూర్తియైనదని భీష్ముడు సహేతుకముగా జెప్పుటయు జరిగియున్నది. అట్టిభీష్ముని సమక్షమందే ద్రుపదపురోహితునితో అజ్ఞాతవాసపూర్తి కాలేదని తెగించి చెప్పుట, దానికి తగిన హేతువ లేవో ప్రకటింపకుండుట. రాజ్యమడిగిన ధర్మజుని దధర్మ మనుట. కర్ణదుర్యోధనుల దుష్టత్వమునకు తార్కాణము.

అజ్ఞాతవాసకాలములో మీరెవ్వరికి తెలియబడరని ధర్మదేవత యిచ్చిన వర ముండగా తెలియబడినాటికి, అది యెట్లు పూర్తికాకుండునో ప్రతివాదు లాలోచింపవలసిన విషయము. అది యట్లుండనిండు.

పైనుదాహరించిన కర్ణునివాక్యములలో — "రాజ్యం నేచ్ఛతి పైతృకమ్" "యది కాంక్షన్తి తే రాజ్యం పితృపైతామహం పునః" అనుటలో పాండవు లపేక్షించు రాజ్యము వారిపిత్ర్యమనియు. వారి కది పితృపైతామహ మనియు వెల్లడింపబడుటచే కర్ణదుర్యోధనులు తమ కెంత రాజ్యతృష్ణ యున్నను గూడ రాజ్యము తమకు పిత్ర్యమని పితృపైతామహమని చెప్పలేకుండుట, రాజ్యము పాండవులదే అయియున్న దని కంఠోక్తిగా చెప్పుచుండుట, ప్రతివాదులు గమనించి రాజ్యాధికారమునుగూర్చి వెనుక నిరూపింపబడిన విషయముల ననుసంధించి తమ ధృతరాష్ట్రరాజ్యాభిషేకవాదాభినివేశము వదలుకొని విద్వన్మార్గమునకు వచ్చుట శ్రేయస్కర మని తెలుపుచున్నాము.

ప్రకృతమునకు వత్తము —

కర్ణుడు ద్రుపదపురోహితునితో పాండవులు మరల వనవాసమునకు బోవలసినదే యని చెప్పి, సంధిచేసికొనదలచిన పాండవుల సత్సంక

ల్పమును అనుచితప్రసంగముతో నిరాకరించి యుద్ధమునకు కాలుదు వ్వుచుండె ననునది సారాంశము.

భీష్ముడా కర్ణుని ధోరణి విని ఉత్తరగోగ్రహణపరాజయమును జ్ఞప్తికి దెచ్చి సంధిచేసికొనక యుద్ధమునకు దిగినపక్షములో రాధేయా! మనకు మరణము తప్పదుసుమా! అని పలికెను. అప్పుడు ధృతరాష్ట్రు డు కర్ణుని మందలించి నేను ఆలోచించి పాండవుల యొద్దకు సంజయుని బంపుచున్నానని చెప్పి ద్రుపదపురోహితుని బంపి, ఆపై తనసందేశము నిచ్చి సంజయుని బంపెను.

పాండవుల యొద్దకు వెళ్ళిన సంజయుని స్వాగతమడిగి హస్తి నాపురవాస్తవ్యులనుగూర్చి కుశలప్రశ్నచేయుచు యుధిష్ఠిరు డిట్లడిగెను.

నాడు ద్వైతవనములో ఘోషయాత్రాసందర్భమున సంభవిం చిన సంఘర్షణములో శత్రువశమైపోయిన కౌరవులను మేము విడిపించి శత్రువులను పారద్రోలినసమాచారమునువారు స్మరించుచుందురా? అని.

అటుపై సందర్భానుగుణముగా సంజయుడు సంభా షించుచు, కౌరవులు రాజ్య మివ్వకున్నను ధర్మాత్ములైన మీరుమా త్రము అధర్మమైన యుద్ధమునకు సంకల్పింపక వృష్ణ్యంధకరాజ్యములలో భిక్షాటన మయిన జేసి జీవయాత్ర నడుపుకొనుట మంచి దని ధృతరా ష్ట్రసందేశసారాంశముగా బోధించెను.

అది విని ధర్మజుడును కృష్ణభగవానుడును ధర్మాధర్మస్వరూప నిర్ణయములో, ఉపాయాంతరము సంభవింపనపుడు యుద్ధమున దుష్టని గ్రహమే క్షత్రియధర్మము, భిక్షాటనము కాదు అని చెప్పి బోధించిరి.

అటుపై ధర్మజుడు —

"నివర్తయ పరద్రవ్యా ద్బుద్ధిం గృద్ధాం నరర్షభ ।
దదస్వ వా శక్రపురీం మమైవ యుధ్యస్వ వా భారతముఖ్యవీర ।
భ్రాతౄణాం దేహి పంచానాం పంచగ్రామాన్ సుయోధన ।
అలమేవ శమాయాఽస్మి తథా యుద్ధాయ సంజయ ॥"

మా యింద్రప్రస్థరాజ్యము మాకిప్పించుము. లేదా యుద్ధమే చేయుమనుము. మాచేతులతో కురువంశనాశనము జరుగకుండుటకై సంజయా! ఒకమాట జెప్పుచున్నాను— అయిదుగురకు నయిదుగ్రామముల నయినను ఇప్పించుము. నేను సంధికై గాని యుద్ధమునకై గాని సంసిద్ధుడనే అని సందేశము బంపెను. సంజయుడు తిరిగి వెళ్ళి కురుసభలో విషయమంతయు వివరించి చెప్పగా ధృతరాష్ట్రునితో దుర్యోధనుడు చెప్పిన సారాంశ మిది—

"యుధిష్ఠిరః పురం హిత్వా పంచగ్రామాన్ స యాచతే ।
భీతో హి మామకాత్సైన్యాత్ ప్రభావాచ్చైవ మే విభో ॥"

తండ్రీ! యుధిష్ఠిరుడు నాప్రభావమునకు, నాసైన్యమునకు భయపడి యింద్రప్రస్థము వదలుకొని పంచగ్రామములను మాత్రమె యాచించువరకు వచ్చినాడు. యుద్ధములో వారిని తప్పక జయింపగలను. నీవు భయపడకుము; అని.

ఇట్లు పంచగ్రామసంధికైనను సిద్ధపడిన పాండవుల సత్సంకల్పమును త్రోసివేసి యుద్ధమునకు కాలుదువ్వినవాడు దుర్యోధనుడు అని ప్రతివాదులు తెలిసికొందురుగాక!

తరువాత కృష్ణభగవానుడే స్వయముగా కురుసభలో హితోపదేశము జేయదలచి హస్తినాపురమునకు వెళ్ళెను. ఈవెళ్ళుటలో కర్ణదుర్యోధనాదులు పాండవులుకోరినట్లు ఇచ్చి సంధిజేసుకొను తలంపు లేనివారనియు, తన మాటలను గూడ వారు వినిపించుకొన రనియు తెలిసియుండియు—

"న మాం బ్రూయు రధర్మిష్ఠా మూఢా హ్యసుహృద స్తథా ।
శక్తో నావారయ త్కృష్ణ స్సంరబ్ధాన్ కురుపాండవాన్ ॥"

కురుపాండవులకు సంధిచేసి యుద్ధము లేకుండ జేయుగల సమర్థత తనకుండియు శ్రీకృష్ణుడుపేక్షించినాడని అధర్మపరులు మూఢులు తన్ను అనిపోదురని, అట్టి యపవాదము లేకుండునట్లు చేసికొనదలచి వెళ్ళియుండెను. యావచ్ఛక్తి వినియోగించి సామదానభేదోపాయము

లను నడపి, నయమునను, భయమునను బోధించెను. ఆ దుష్టచతుష్ట యము తమ పురమునకు భగవానుడు చేరకమునుపే శ్రీకృష్ణుడు వచ్చి నపుడు మన మిక్కడ బంధించిపడ వేయవలె నని దురాలోచనము చేసి యుండి సభలో హితోపదేశముచేయుచున్న కృష్ణభగవానునిమాటలు వినిపించుకొననే లేదు. శ్రీకృష్ణుడు బ్రతిమాలుచు దుర్యోధనున కిట్లు చెప్పెను—

దుర్యోధన నిబోధేదం మద్వాక్యం కురుసత్తమ ।
శమార్థం తే విశేషేణ సానుబన్ధస్య భారత ॥
కామార్థౌ లిప్సమానస్తు ధర్మమేవాదితశ్చరేత్ ।
న హి ధర్మా దపైత్యర్థః కామో వాపి కదాచన ॥
దృశ్యతాం వా పుమాన్ కశ్చిత్ సమగ్రే పార్థివే బలే ।
యోఽర్జునం సమరే ప్రాప్య స్వస్తిమా నావ్రజేద్గృహాన్ ॥
కిం తే జనక్షయేణేహ కృతేన భరతర్షభ ।
యస్మిన్ జితే జితం తే స్యాత్ పుమా నేకః స దృశ్యతామ్ ॥
(ఉద్యో. అ. 124)

దుర్యోధనా! నీక్షేమము గోరి చెప్పుచున్న నామాట వినుము. అర్థకాముల నపేక్షించువాడు ధర్మ మాచరింపవలసినదే. ధర్మవిరుద్ధముగా ప్రవర్తించువానికి అర్థకామము లెన్నడును సిద్ధింపవు. నీవు అధర్మముజేయుచు అర్థకామములను అపేక్షించుచున్నావు. ఇంకొకటి వినుము— యుద్ధములో పాండవపక్షమును జయింతు నని యాశపడు చున్న నీవు ఒకపని జేయుము. నీపక్షములో గల యావద్వీరులలో పార్థుని జయింపగల ఒక్కవీరుని నీ వెన్నుకొనుము. ఆ యిరువురకు ద్వంద్వయుద్ధము. అందు ఏపక్షమువాడు ఓడిపోవునో ఆపక్షమంతయు నోడినట్లే నిర్ణయము. ఆవిధముగా జేసి నీయాశను నీవు నెరవేర్చి కొనుము. జనక్షయమునకు నీవొడిగట్టకుము; అని. దుర్యోధనుడు వినిపించుకొనలేదు. దీనినిబట్టి యుద్ధనిమిత్తమున జనక్షయము జేసిన వాడు కృష్ణభగవానుడా? కర్ణదుర్యోధనాదులా? ప్రతివాడు లాలో చింతురుగాక!

నాటి కురుసభలో కృష్ణభగవానుడు చెప్పినట్లు వినుట నీకు శ్రేయస్కరమని, పాండవులను నీవు జయింపలేవని, పాండవులపట్ల నీవుచేసిన దధర్మమని దుర్యోధనునకు అనేకనిదర్శనములతో మహర్షు లుపదేశించి యున్నారు. జామదగ్న్యమహర్షి, కణ్వమహర్షి, నారదమహర్షి చేసిన హితోపదేశములను దుర్యోధనుడు వినిపించుకొనలేదు. తుదకు దుష్టచతుష్టయము సభనుండి లేచిపోయి కృష్ణభగవానుని బంధించుటకై దురాలోచనముచేయుట, సాత్యకి దానిని గ్రహించి సభలో జెప్పుట, ఆపై విదురుడు ధృతరాష్ట్రునకు దెలుపుట, ఆపై ధృతరాష్ట్రుడు—

"క్షిప్రమానయ తం పాపం రాజ్యలుబ్ధం సుయోధనమ్ ।
సహమిత్రం సహామాత్యం ససోదర్యం సహానుగమ్ ॥"

ఆపాపాత్ముడగు దుర్యోధనుని సపరివారముగా నీవు వెంటనే తీసికొనిరమ్మని విదురుని బంపి దుష్టచతుష్టయమును రప్పించుట, ఆ మీద కృష్ణభగవానుడు విశ్వరూపమును ప్రదర్శించుట, ఇదంతయు జరిగినది.

—: పాండవులు లోకనిందను మాపికొనుటకు రాయబారములు సాగించిరి. అనుప్రసంగము—తన్నిరాకరణము:—

కర్ణచరిత్రకారుల వ్రాత యిట్లున్నది.

"పాండవులు యుద్ధప్రయత్నములు చేయుచు దూతల నంపుచు లోకనిందను మాపికొనుటకు గౌరవులతో సంధికై రాయబారములు నడుపసాగిరి." (పు 71)

ఈ ప్రతివాదులు పాండవులపై యాపాదించునట్టి లోకనిందకు కారణమేమి? యుద్ధప్రయత్నము చేయుచుండుటా? సంధికై రాయబారములు నడుపుట ఆలోకనింద లేకుండ జేసికొనుటకా?

అయితే పాండవుల కాలోకనింద పోయెనా? లేదా? వారిరాయబారములను తిరస్కరించి యుద్ధమునకే కాలుదువ్విన కర్ణదుర్యోధనా

దులు ఆలోకనిందకు పాలయినారా? లేదా? ప్రతివాదు లావిషయ మెందు కెత్తుకొనరో?

ఇంకొకటి— పాండవుల యుద్ధప్రయత్నము కర్ణదుర్యోధనాదుల యుద్ధప్రయత్నమునుబట్టి తటస్థించియుండ లోకనింద పాండవుల కెట్లు? లోకులు అంత అజ్ఞానులా?

ఇంకొకటి. అసలు రాజ్యము పాండవులది. ఆపాండవులను నశింపజేసి యారాజ్యమును కబళింప నెంచి వారియెడల హత్యాప్రయత్నములు ఆదినుండియు జరిపినవారు కర్ణదుర్యోధనాదులు. ఆకర్ణదుర్యోధనాదులపై సౌజన్యమునే వహించి కౌరవపోషణార్థము అర్ధరాజ్యము కౌరవులకు విడిచి అర్ధరాజ్యమునే (ఖాండవప్రస్థారణ్యమును) పరిగ్రహించినవారు పాండవులు. ఆపాండవుల రాజ్యమునుగూడ వారి ననుభవింపనీయక కపటద్యూతమున నోడించి వారిని వనవాసాజ్ఞాతవాసములకు పాలుచేసినవారు కర్ణదుర్యోధనాదులు. ఆవనవాసములో గూడ వారిని నశింపజేయుటకై దుస్తంత్రము లవలంబించినవారు కర్ణదుర్యోధనాదులు. '13సంవత్సరములు గడచినతోడనే పార్థుని వధించువాడను నేను. పాండవులను వధించి నీచే రాజసూయయాగము చేయించువాడను నేను' అని ముందే ప్రతిజ్ఞలుచేసినవాడును, ఆయుధముబట్టి ప్రమాణముచేసినవాడును కర్ణుడు. ద్యూతకాలనిర్ణయప్రకారము వనవాసాజ్ఞాతవాసములను యథాక్రమముగా నిర్వహించి వచ్చిన పాండవులకు మరల వనవాసమే కర్తవ్యమని ప్రసంగించినవాడు కర్ణుడు. ఆకర్ణదుర్యోధనాదుల దురూహలను దెలిసికొని వారి యుద్ధసన్నాహమును గ్రహించి దానికి దగిన ప్రయత్నములో నున్నవారు పాండవులు. అట్టి పాండవులపై లోకనిందా? ఆదుష్టచతుష్టయముపై లోకనింద. ఆపాండవుల సౌజన్య సౌశీల్యాదులను తెలిసికొనలేక వారిపై దోషారోపణము చేయువారికి లోకనింద. దుష్టచతుష్టయచర్యను శ్లాఘింపబూనువారికి లోకనింద. కనుక ప్రతివాదిప్రసంగ మపాస్తము.

—: భీష్ముడు, అర్ధరథుడని కర్ణుని నిరసించియు, కర్ణజన్మమును గూర్చిన కుంతీచరిత్రమును వెల్లడించియు తన ఘనమైన చరిత్రమును మాపికొనెను. అను ప్రసంగము—

తన్నిరాకరణము :—

కర్ణచరిత్రకారుల వ్రాత యిట్లున్నది —

1. కులనాశనము కాకుండ జేసికొనుటకై భీష్ముడు పవిత్రమగు తన చరిత్రమును గళంకిత మగుటకును సంగీకరించెను. కావుననేకదా! సంధికాలములలో దుర్యోధనుని జెఱపించుటకై కర్ణుడు మహారథుడని యెఱింగియు నాతని నర్ధరథుడని నిరసించెను. (ఉపో)

భీష్ముడంపశయ్యపై బడినపిదప గర్ణుడాతని జూడబోయినపుడు ఈ విషయము వెల్లడించియున్నాడు. వేయేల ? పిరికిపందయగు నుత్తరుని మహారథుడని చెప్పిన భీష్ముడు కర్ణు డర్ధరథుడని తలంచునా ? ఈ విషయమునం దనేకులు భీష్ముని సమ్మతింపకున్నారు.

> కర్ణు నర్ధరథుడుగ బలుకుటయు, నాజి
> ధర్మసుతునితోడ దాను జచ్చు
> తెఱగు జెప్పుటయును గుఱితింప గాంగేయు
> పక్షపాతబుద్ధి బయలుపడదె.

ఉ. ఉత్త ప్రగల్భముల్ పలుకు నుత్తరుకంటెను భారతమ్ములో
నెత్తఱి బంద గానబడ డెవ్వడు నీనిని నిందుకొల్వులో
నెత్తి మహారథుం డనియె నీ కురువృద్ధుడు వానికంటె లో
కోత్తరుడైన కర్ణు డసదో తన కర్ధరథుం డటంటకున్ .(కౌరవగౌరవముపు90)

2. తన కులమునకు గళంకము నాపాదించు కర్ణజన్మవిషయకమగు కుంతీచరిత్రమును వెల్లడించుటకు సాహసించియు, యుద్ధసంకటమందు దుర్యోధనుని విడిచి పాండవులలో జేరుమని కర్ణునకు బోధచేసియు దన ఘనమైన చరిత్రమును మాపుకొనెను.

3. కర్ణుడు దుర్యోధనుని విడుచుటయే కాక పాండవులలో జేరుటయు సంభవించినయెడల దుర్యోధనుడు నిరాశుడై నిరాటంకముగా సంధి కంగీకరించు నని తలచి భీష్ము డిట్టిపనికైన దలపడెను. (ఉపో)

ఈ మూడంశములను బరిశీలింతము—

ప్రథమాంశము— పవిత్రమైన తన చరిత్రము కళంకిత మగుట కును భీష్ము డంగీకరించెనట! మహారథుడని దెలిసియుండియు అర్ధ రథుడని కర్ణుని నిరసించుట! ఒక కళంకమట ఆ నిరసించుట కులనాశ నము కాకుండ జేసికొనుటకేనట!

ఈమాటలనుబట్టి కులనాశకారకుడు కర్ణుడని ప్రతివాదులు గ్రహించినట్లే. అట్టి కులనాశకారకుని నిరసించుట భీష్మునకు గళంక మెట్లగును? కులము నుద్ధరించుటకును కులనాశదోషము కర్ణునకు దట స్థింపకుండుటకును నిరసించియు, సత్యమును ప్రకటించియు ననేకవిధముల నయమునను భయమునను చెప్పి నివారింప బూనిన భీష్మున కొక కళంకముగూడనా? కనుక భీష్మునిది నిష్కళంకమైన పవిత్రచరిత్రము.

అంపశయ్యపై బడియున్న భీష్ముని దర్శించుటకై వెళ్ళినపుడు కర్ణు డేమనెనో భీష్ము డేమనెనో ఆప్రస్తావము చూడుడు— అంపశయ్యపై నుండి దుర్యోధనునితో భీష్ము డిట్లనెను—

యుద్ధం మదన్త మేవాస్తు తాత సంశామ్య పాండవైః ।
ఏతత్ క్షేమ మహం మన్యే తవచైవ కులస్యచ ॥
భీష్మస్యాన్తా దస్తు వ స్సౌహృదం చ జీవన్తు శేషా స్సాధు రాజన్ ప్రసీద ।
రాజ్యస్యార్థం దీయతాం పాండవానా మిన్ద్రప్రస్థం ధర్మరాజోఽభియాతు॥

దుర్యోధనా! నా అంతముతో యుద్ధము నంతమొందింపుము. పాండవులతో సంధి జేసికొనుము; ఇది నీకును కురువంశమునకును క్షేమ కరము. భీష్ముని అంతముతో మీయుభయపక్షములకు వైరము పోయి పరస్పరసౌహార్దము సంభవించుగాక! శేషించినవారు జీవించియుందు రుగాక; నీవు శాంతింపుము. పాండవుల కర్ధరాజ్య మిమ్ము; ధర్మరా జును ఇంద్రప్రస్థమున బ్రవేశింపనిమ్ము.

ఇట్లు అందరు వినునట్లు వాత్సల్యముతో జెప్పి బాణఘాతసంత ప్తగాత్రుడై యోగధారణతో వేదనను గమనింపకుండుటకై నిమీలిత

నేతు్రడై యుండెను, అంతట నక్కడినుండి యందరును తొలగిరి. ఆ
మీాద కర్ణుడు—

శు్రత్వా తు నిహతం భీష్మం రాధేయః పురుషర్షభః ।
ఈష దాగతసంత్రాస స్త్వర యోపజగామహ ॥
స దదర్శ మహాత్మానం శరతల్పగతం తదా ।
నిమీలితాక్షం తం వీరం సాశ్రుకంఠ స్తదా వృషః ॥
భీష్మ భీష్మ మహాబాహో ఇత్యువాచ మహాద్యుతిః ।
రాధేయోఽహం కురుశ్రేష్ఠ నిత్య మక్షిగత స్తవ ॥
ద్వేష్యోఽహం తవ సర్వత్ర ఇతి చైన మువాచ హ ।

భీష్ముడు నిహతుడైనట్లు తెలిసికొని భయపడుచు త్వరపడివచ్చి ఆశరతల్పగతుని- అనిమీాలితనేతు్రని ఆ మహావీరుని, ఆమహాత్ముని గని దుఃఖ మాపుకొని, ఓభీష్మ! ఓభీష్మ! ఓకురుశ్రేష్ఠ! ఓమహావీర! నేను రాధేయుడను; నిత్యము నీదృష్టిలోనున్నవాడను. సర్వత్ర నీకు ద్వేష్యుడనై వర్తించుచున్నవాడను; అని పలుకరించెను. అప్పుడు భీష్ముడు —

శనై రుద్వీక్ష్య సస్నేహ మిదం వచన మబ్రవీత్ ।
పితేవ పుత్రం గాంగేయః పరిరభ్యైక పాణినా ॥
ఏహ్యేహి మే విప్రతీప స్పర్ధసే త్వం మయా సహ ।
కౌన్తేయ స్త్వం న రాధేయో న తవాఽధిరథః పితా ॥
సూర్యజ స్త్వం మహాబాహో విదితో నారదా న్మయా ।
కృష్ణద్వైపాయనా చ్చైవ తచ్చ సత్యం న సంశయః ॥
న చ ద్వేషోఽస్తి మే తాత త్వయి సత్యం బ్రవీమి తే ।
తేజోవధనిమిత్తం తు పురుషం త్వాఽహ మబ్రువమ్ ॥
అకస్మా త్పాండవాన్ సర్వా నవాక్షిపసి సువ్రత ।
యేనాఽసి బహుశో రాజ్ఞా చోదిత స్సూతనందన ॥
జాఽతోఽసి ధర్మలోపేన తత స్తే బుద్ధి రీదృశీ ।
నీచాశ్రయా న్మత్సరేణ ద్వేషిణీ గుణినా మపి ॥
తేనాసి బహుశో రూక్షం శ్రావితః కురుసంసది ।
జానామి సమరే వీర్యం శతు్రభి ర్దుస్సహం భువి ॥

బ్రహ్మణ్యతాం చ శౌర్యం చ దానే చ పరమాం స్థితిమ్ ।
న త్వయా సదృశః కశ్చి త్పురుషే ష్వమరోపమ ॥
కులభేదభయా చ్చాహం సదా పరుష ముక్తవాన్ ॥

టీ॥ పురుషేషు మానుషేషు. ఏవం సత్యపి అతిసంభావితః పాండవా నతిపీడయే రితి నిశ్చిత్య అతిరథో౽ప్యర్ధరథేష్వన గణిత ఇతి భావః ॥

"వ్యపనీతో౽ద్య మన్యు ర్మే యస్త్వాం ప్రతి పురా కృతః ।
దైవం పురుషకారేణ న శక్య మతివర్తితుమ్"
సోదర్యాః పాండవా వీరా భ్రాతర స్తే౽రిసూదన ।
సంగచ్ఛ తై ర్మహాబాహో మమ చే దిచ్ఛసి ప్రియమ్ ॥
మయా భవతు నిర్వృత్తం వైర మాదిత్యనన్దన"

కర్ణునిమాటలు విని నెమ్మదిగా కనులు విప్పి చూచి పుత్రుని తండ్రివలె నొక హస్తముతో కర్ణుని రమ్ము రమ్మనుచు దగ్గరకు దీసు కొని యిట్లనెను— నాపై స్పర్థవహించి నాకు విరుద్ధవర్తనుడ వయి యున్న నీవు రాధేయుడవు కావు. కౌన్తేయుడవే. నీతండ్రి అధిర థుడు (సూతుడు)గాడు. సూర్యుడే. ఈవిషయము నారద వేదవ్యాస మహర్షులవలన వినియుంటిని. నిజము చెప్పుచున్నాను.— నీయందు నాకు ద్వేషము లేదు. నీదర్పమును తగ్గించుటకై నిన్ను గూర్చి పరు షముగా మాట లాడుచు వచ్చితిని. దుర్యోధనప్రేరితుడవై నిష్కారణ ముగా నీవు పాండవుల నందరను బహువిధముల నిరసించుచు వచ్చుటే నే నట్లు మాటలాడుటకు గారణము.

నీవు ధర్మలోపముచే (జాతి ధర్మలోపము కలుగునట్లు) గూఢ ముగా జన్మించి నీచకులము నాశ్రయించుటచేత నీబుద్ధి యిట్టిదయినది. మత్సరముచే గుణవంతులనుగూడ ద్వేషించు స్వభావము కలిగియు న్నది. కనుకనే నేను పరుషోక్తులతో మందలింపవలసివచ్చుచుండెడిది. శత్రుదుస్సహమైన నీపరాక్రమమును, నీబ్రహ్మణ్యతను, నీదాతృత్వ నిష్ఠను నేనెరుగుదును. నీతో సమానుడు లేడు. అయినను సంభా వింపబడినచో పాండవులను ఇంకను పీడింతు వను తాత్పర్యముతో

అతిరథుఁ డవయిన నిన్ను అర్ధరథుఁడ వని పరిగణించితిని. పురుషప్రయత్న ముచే దైవమును ప్రతిఘటించుట అశక్యమని గ్రహించిన నాకు నీపై కోపము పోయినది. నాప్రీతిని నీవు కోరెదవేని సోదరు లగు పాండవు లతో సఖ్యపడుము, ఓ సూర్యనందనా! మీవైరమును నాతో అంత మొందింపుము. అని బోధింపగా కర్ణుఁ డిట్లనెను—

"జానా మ్యేవ మహాబాహో సర్వ మేత న్న సంశయః।
యథా వదసి మే భీష్మ కౌన్తేయో౽హం న సూతజః॥
అవకీర్ణ స్త్వహం కున్త్యా సూతేన చ వివర్ధితః।
భుక్త్వా దుర్యోధనైశ్వర్యం న మిథ్యా కర్తు ముత్సహే॥
వసు చైవ శరీరం చ పుత్రదారం తథా యశః।
సర్వం దుర్యోధనస్యార్థే త్యక్తం మే భూరిదక్షిణ॥
మా చైత ద్వ్యాధిమరణం క్షత్రం స్యా దితి కౌరవ।
కోపితాః పాండవా నిత్యం సమాశ్రిత్య సుయోధనమ్॥
అవశ్యభావీ హ్యర్థో౽యం యో న శక్యో నివర్తితుమ్।
దైవం పురుషకారేణ కో నివర్తితు ముత్సహేత్॥
పృథివీక్షయశంసీని నిమిత్తాని పితామహ।
భవద్భి రుపలబ్ధాని కథితాని చ సంసది॥
పాండవా వాసుదేవ శ్చ విదితా మమ సర్వశః।
అజేయాః పురుషై రన్యై రితి తాం శ్చోత్సహామహే॥
విజయిష్యే రణే పాండూ నితి మే నిశ్చితం మనః।
న చ శక్య మవసృష్టుం వైర మేత త్సుదారుణమ్॥
ధనంజయేన యోత్స్యే౽హం స్వధర్మప్రీతమానసః।
అనుజానీష్వ మాం తాత యుద్ధాయ కృతనిశ్చయమ్॥
దురుక్తం విప్రతీపం వా రభసా చ్చాపలా త్తథా।
యన్మయేహ కృతం కించి త్తన్మే త్వం క్షన్తు మర్హసి॥"

భీష్మపితామహా! నీవుచెప్పినట్లు నిజముగా నేను కౌన్తేయు డనే. కున్తీదేవి విడిచిపెట్టగా సూతునిచే పెంచబడితిని. దుర్యోధనై శ్వర్య మనుభవించిన నేను మఱొకవిధముగా వర్తింపజాలను. నా సర్వ స్వము దుర్యోధనున కర్పించితిని.

క్షత్రియజాతి వ్యాధిమూలకముగా మరణింపకుండుటకై దుర్యోధను నాశ్రయించిన నాచే పాండవులు నిత్యము ప్రకోపింపజేయబడి నారు. ఈ యుద్ధము అవశ్యంభావి. దైవనిర్దిష్టమై వచ్చినదానిని ఎవ్వ డతిక్రమింపగలడు?

జనక్షయసూచకము లయిన నిమిత్తములను మీరు కనిపెట్టి సభలో చెప్పియుండలేదా? పాండవులును శ్రీకృష్ణుడును అన్యుల కజే యులని నాకు తెలిసిన విషయమే. వారిని జయింప గలుగుదు నని నాకు నిశ్చయమున్నది. ఈ వైరమును విడుచుట అశక్యము. అర్జును నితో యుద్ధము చేయుదును. యుద్ధమునకు కృతనిశ్చయుడనయి యున్న నాకు నీవనుజ్ఞ నిమ్ము.

పితామహా! తొందరచేతనో చాపల్యముచేతనో నీయెడల నేను ఏదుర్భాషలాడితినో ఏవిరుద్ధము లాచరించితినో వానిని నీవు క్షమింప వలయును. అని. అది విని భీష్ముడు—

" నచే చ్ఛక్య మథసృష్టుం వైర మేత త్సుదారుణమ్ ।
అనుజానామి కర్ణ త్వాం యుధ్యస్వ స్వర్గకామ్యయా ॥
ప్రశమే హి కృతో యత్న స్సుమహాన్ సుచిరం మయా ।
నచైవ శకితః కర్తుం కర్ణ సత్యం బ్రవీమి తే ॥

ఈదారుణవైరమును విడుచుట నీకశక్యమైనయెడల నీకనుజ్ఞ నిచ్చుచున్నాను. స్వర్గప్రాప్తిసంకల్పముతో యుద్ధముజేయుము. నేను శాంతి కలిగించుటకై చిరకాలము చాలప్రయత్నము జేసినాను. నాకు శక్యము కాకపోయినది. అని చెప్పగా కర్ణుడు భీష్మునకు పాదాభివంద నము జేసి సెలవు దీసికొని వెళ్ళిపోయెను

ఇది భీష్మకర్ణుల సంభాషణము. ఇందు భీష్ముడు, తాను కర్ణుని నిరసించుచు వచ్చుటలో కర్ణునకు పాండవులపై గల నిష్కారణవైర మునే హేతువుగా జెప్పెను— చూడుడు—

"అకస్మా త్పాండవాన సర్వా నవాక్షిపసి సువ్రత॥"

దీనిపై తనది నిష్కారణవైరము కాదని, వైరకారణ మిదియని కర్ణు డేమియు జెప్పక ఒప్పుకొని యుండెను.

భీష్ముడు- కర్ణునిది సరియైన బుద్ధి కాదనియు, నీచాశ్రయణము వలన మత్సరముతో గుణవంతులగు పాండవులను ద్వేషించు బుద్ధి యనియు జెప్పెను— చూడుడు—

"తత స్తే బుద్ధి రీదృశీ। నీచాశ్రయా న్మత్సరేణ ద్వేషిణీ గుణినామపి"

దీనిపై తనది సద్బుద్ధియే యని, పాండవులు గుణవంతులుగారు, వారియం దిట్టిదోషము లున్నవని, కర్ణుడేమియు జెప్పక ఒప్పుకొనియుం డెను. భీష్ముడు నిన్ను సంభావించినయెడల నీవింకను పాండవులను పీడింతువని యెంచి కులభేదభీతిచే అర్ధరథుడవని నిన్నంటి నని కర్ణునితో జెప్పెను. చూడుడు—

"కులభేదభయా చ్చాహం సదా పరుష ముక్తవాన్"

దీనికిని కర్ణుడేమియు జెప్పక ఒప్పుకొనియుండెను.

దీనినిబట్టి భీష్ముని నిరసనము సహేతుకము, కర్ణునివైరము నిర్హేతుకము నగుటచే కర్ణనిరసనముచే భీష్ముని చరిత్రము కళంకితమైనదను ప్రతివాదుల మాట త్రోసివేయబడినది.

కర్ణుడు తన తప్పును తానే భీష్మునియొద్ద నొప్పుకొనియుండ ప్రతి వాదులు చేయునట్టి యల్లరి అర్థము లేనిది.

ప్రతివాదు లన్నట్లు అంపశయ్యపై నున్న భీష్ముడు కర్ణునియొద్ద నాతని మహాపరాక్రమాదుల నెట్లు వెల్లడించెనో అట్లు కర్ణుని దుర్వృత్తిని, పాండవద్రోహబుద్ధిని గూడ నెల్లడించియున్నపుడు కర్ణుని పరాక్రమమును వర్ణించుటకు మాత్రమె ఆభీష్మోక్తిని ప్రమాణముగా దీసికొని, కర్ణుని దోషములను గ్రహించుటలో దానిని ప్రమాణముగా దీసికొనకపోవుటకు గారణమేమని ప్రతివాదుల నడుగుచున్నాము.

ఇకపైన జాతము—నీకు సోదరులగు పాండవులతో నీవు సఖ్యమువహించుట, వైరము విడుచుట, ఇంతటితో యుద్ధమాపుట. నాకోరిక యని భీష్ముడు చెప్పెను.

కర్ణుడు– నేను దుర్యోధనునివలన బోషింపబడి యాతనికి సర్వ మర్పించియుంటిని. అన్యథా చేయజాలను. క్షత్త్రియ వర్గమంతయు వ్యాధిమూలమునగాక యుద్ధమూలమున మరణించుటకు సంకల్పించియే దుర్యోధను నాశ్రయించిన నేను నిత్యము పాండవులను ప్రకోపింపజే యుచువచ్చితిని అని చెప్పెను. చూడుడు —

"భుక్త్వా దుర్యోధనైశ్వర్యం న మిథ్యాకర్తు ముత్సహే।
సర్వం దుర్యోధనస్యార్థే త్యక్తం మే భూరిదక్షిణ।
మా చైత ద్వ్యాధిమరణం క్షత్త్రం స్యా దితి కౌరవ।
కోపితాః పాండవా నిత్యం సమాశ్రిత్య సుయోధనమ్॥"

దీనివలన దుర్యోధనానువర్తనము తనకు తప్పదనియు, తమ పాండవవిద్రోహాచర్యలు యుద్ధసంపాదననిమిత్తకము లేకాని, పాండవాపరాధనిమిత్తకములు కావనియు స్వోక్తిగా కర్ణుడు చెప్పినట్లు స్పష్టము. ఇట్టి స్థితిలో లేనిపోని దోషములు పాండవులపై యారోపించు ప్రతివాదుల చర్య నింద్యము.

భీష్ముడు కర్ణు నాదరించి దగ్గరకు తీసికొని తా నప్పుడప్పుడు పరుషముగా కర్ణుని మందలింపవలసివచ్చిన హేతువులను బోధించి నే నెంత నివారింపబూనినను దైవనిర్దిష్టమై యీయుద్ధము వచ్చిపడినది. నీపై నాకు కోపము పోయినది. అని చెప్పెనే కాని నాతప్పులను క్షమింపుమని కర్ణుని ప్రార్థింపలేదు.

కర్ణుడుమాత్రము తాను తొందరపడి చాపలమునుబట్టి దురుక్తు లాడితిననియు, విరుద్ధముగా వర్తించితిననియు, అట్టి నాతప్పులను నీవు క్షమింపవలెననియు ప్రార్థించెను. చూడుడు—

"దురుక్తం విప్రతీపం వా రభసా చ్చాపలా త్తథా।
యన్మయేహ కృతం కించి త్తన్మే త్వం క్షన్తు మర్హసి॥"

దీనినిబట్టి భీష్ముడెట్లు వ్యవహరించెనో, కర్ణుడెట్లు వ్యవహరించెనో ప్రతివాదులు తెలిసికొందురుగాక.

భీష్ముని సమ్మతింపనివా రనేకు లున్నారని కర్ణచరిత్రకారులు (కౌరవగౌరవ) కర్తల పద్దెముల నుదాహరించియున్నారు.

కర్ణు నర్ధరథుడుగ బలుకుటయు, ధర్మసుతునితోడదానుజచ్చు తెలుగు జెప్పుటయు భీష్ముని పక్షపాతబుద్ధికి నిదర్శనము అని మొదటిపద్దెములో నున్నది.

ఇందు ప్రథమనిదర్శనము నిరాకృతమైనది. ద్వితీయనిదర్శనము నిర్దుష్టమని చతుర్థభాగము — పాండవనిందానిరాకరణములో ఖండకావ్యోక్తి నిరాకరణఘట్టములో నిరూపింపబడినది. అవి శేషములచ్చట జూడవలయును.

ఇంకొకటి. ప్రతివాదులు భీష్మునిది పక్షపాతబుద్ధి యందురే! కర్ణదుర్యోధనాదులయందు ఈ ప్రతివాదులకు పక్షపాతబుద్ధి యున్నదా? లేదా? "పక్షపాతబుద్ధి" అను వీరి మాట కర్థము — దోషమున్నచోట దోషమును కప్పిపుచ్చి తమ యభిమానముచే దానినిగుణముక్రింద వర్ణించుచుండుటకదా!

ఇట్టిలక్షణము ప్రతివాదులయం దున్నదా? భీష్మునియం దున్నదా? పాండవులయం దిట్టిదోషమున్న దని కర్ణుడే చెప్పలేదు. భీష్ముడు పక్షపాతి యెట్లగును? కర్ణదుర్యోధనాదులయం దనేకదోషములున్నవని స్పష్టము. తదభిమానులగు ప్రతివాదులు పక్షపాతులు కాకుండు టెట్లు?

ఇక ప్రతివాదులు తమది ధర్మపక్షపాత మందురేమో! అప్పుడయినను ధర్మపక్ష మేదో తెలిసినవారు ప్రతివాదులా? భీష్ముడా? రాజ్యము కౌరవులదే అను భ్రాంతితో ప్రతివాదులు కౌరవులదే ధర్మపక్ష మని యూహించి తమది ధర్మపక్షపాత మనుకొనినారు. పాండవులదే రాజ్యమని తెలిసియున్న భీష్ముడు పాండవులదే ధర్మపక్ష మగుటవలన తాను ధర్మపక్షమునకు సంబంధించియే వ్యవహరించినాడు. కనుక భీష్మునిదే ధర్మపక్షపాతము. ప్రతివాదులది కాదు. దుర్యోధనుని దధర్మపక్ష మనుటకు గాంధారీసూక్తి కూడ నిదర్శనము.

యుద్ధోద్యుక్తుఁడై విజయాశీర్వచనాపేక్షతో దుర్యోధనుడు తల్లికి నమస్కరింప గాంధారి 'విజయీభవ' అని యనక 'యతో ధర్మ స్తతో జయః' అని యన్నది. జయకరమైనది ధర్మమనియు, నట్టి ధర్మ మే పక్షమందున్నదో ఆపక్షమునకే జయము కలుగుననియు నామె తెలిపినది. దీనివలన దుర్యోధనునిది ధర్మపక్షము కాదని యామె విశదీకరించినది. అందుచేఁగూడ భీష్మునిది ప్రశంసనీయమైన ధర్మపక్షపాతబుద్ధి. ప్రతివాదులది యధర్మపక్షపాతబుద్ధి కనుక మొదటిపద్దెము నిరస్తము.

రెండవపద్దెము — నికృష్టుఁడయిన యుత్తరుని మహారథుఁడని, లోకోత్తరుఁడయిన కర్ణుని యర్థరథుఁడని భీష్ముఁడు చెప్పుట యుక్తమా? అని. అట్లే "పిరికిపందయగు నుత్తరుని మహారథుడని చెప్పిన భీష్ముఁడు కర్ణు డర్ధరథుడని తలంచునా? " (కర్ణచరిత్రకారులు) అనియు ప్రతివాదు"లనుచున్నారు.

ప్రతివాదులకు ఉత్తరుని మహారథు డన్నందుకు చింతా? కర్ణునర్ధరథుడన్నందుకు చింతా? కర్ణుఁడు తన్నర్ధరథు డన్నందుకే ఆనాఁ డాగ్రహించెను. ముందు కౌరవపక్షమునందే నాడు భీష్ముఁడు పరిగణించెను. అప్పుడే కర్ణున కాగ్రహము వచ్చి—

నాహం జీవతి గాంగేయే యోత్స్యే రాజన్ కథంచన।
హతే భీష్మే తు యోద్ధాస్మి సర్వై రేవ మహారథైః॥

భీష్ముఁడు జీవించియుండగా నేను యుద్ధము చేయను. భీష్ముఁడు హతుఁడయిన పిమ్మట మహారథులందరితో యుద్ధముచేయుదును. అని పలికెను. తరువాత భీష్మకర్ణులకు గొంత వాక్కలహము జరిగినది. దుర్యోధనుడు బ్రతిమాలి శాంతింపజేసి పాండవపక్షములోని బలాబలములు చెప్పుమని కోరగా భీష్ము డప్పుడు ఆ పక్షమును గూర్చి చెప్పుచువచ్చి—

ద్రౌపదేయా మహారాజ సర్వే పంచ మహారథాః।
వైరాటి రుత్తర శ్చైవ రథోదారో మతో మమ॥ "

అనుచు ఉపపాండవులు మహారథు లని, ఉత్తరుడు రథోదారు డని చెప్పెను. రథోదారశబ్దమునకు రథులలో శ్రేష్ఠుడని యర్థమే కాని మహారథు డని యర్థము కాదు. ఈవిలక్షణీయము జూడుడు—

"రథోదారః రథే ష్వేవోదారః నతు మహారథః"

రథమహారథాదిలక్షణ మీావిధముగా నున్నది. చూడుడు—

"ఏకో దశసహస్రాణి యోధయే ద్యస్తు ధన్వినామ్ ।
శస్త్రశాస్త్రప్రవీణ శ్చ మహారథ ఇతి స్మృతః ॥
అమితా న్యోధయే ద్యస్తు స ప్రోక్తో౽తిరథస్తు సః ।
రథ స్త్వేకేన యో యోద్ధా తన్న్యూనో౽ర్థరథస్స్మృతః"

(గీతావ్యాఖ్యా మధుసూదనీ)

శస్త్రశాస్త్రప్రవీణుడై పదివేలధనుర్ధరులతో యుద్ధము చేయగలవాడు మహారథుడు. అసంఖ్యాకులగు ధనుర్ధరులతో యుద్ధము చేయగలవాడు అతిరథుడు. ఒక్కనితో యుద్ధము చేయగలవాడు రథుడు. రథునకు దీసిపోవువాడు అర్థరథుడు.

ఈనిర్ణయమునుబట్టి ఉత్తరుడు రథోదారుడనియే కాని మహారథు డని చెప్పబడనందున ప్రతివాదుల మాట అసంగతము.

ఇంకొకటి. పాండవసేనలోని వారిని చెప్పుచు భీష్ముడు—

"ఉత్తమౌజా స్తథా రాజన్ రథోదారో మతో మమ ।
యుధామన్యుశ్చ విక్రాన్తో రథోదారో మతో మమ ॥" (ఉద్యో. అ 170)

ఉత్తమౌజుడును యుధామన్యుడును రథోదారులనియే దుర్యోధనునితో జెప్పియుండ దుర్యోధనుడు యుద్ధారంభమున భగవద్గీతాప్రథమాధ్యాయోక్త ప్రకారము ద్రోణాచార్యునితో—

"దృష్ట్వా తు పాండవానీకమ్...దుర్యోధనస్తదా, ఆచార్య ముపసంగమ్య... వచనమబ్రవీత్ ...పశ్యైతాం పాండుపుత్రాణామ్ ॥ యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః ... యుధామన్యుశ్చ విక్రాన్త ఉత్తమౌజాశ్చ వీర్యవాన్ ... సర్వ ఏవ మహారథాః"

ఆయిరువురుగూడ మహారథు లనియే కంఠోక్తిగా జెప్పినాడు.

ప్రతివాదులు దీని కేమందురు?

"శూరం కాపురుషో హన్తి అయశస్వీ యశస్వినమ్"

అను న్యాయమున సామాన్యుడుగూడ శూరుని బడగొట్టవచ్చును గనుక శత్రుపక్షములోని సామాన్యులనుగూడ పెద్దదృష్టితో జూచి స్వపక్షమున కుత్తేజనము గలిగించుటకై దుర్యోధను డట్లు రథోదారు లనే మహారథులని ద్రోణాచార్యునియొద్ద ప్రశంసించె నని ప్రతివాదు లందురా? భీష్ముడును ఆదృష్టితోనె ఉత్తరుని ప్రశంసించియుండునని మే మనుచున్నాము.

ఇంకొకటి. ఉత్తరగోగ్రహణకాలములోని సంఘటన జూచి ప్రతివాదు లుత్తరుని పిరికిపంద యని, ఉత్తరప్రగల్భములు పలుకువా డని తీసివేయుచున్నారు. కాని యానాటి భీష్మద్రోణకృపాశ్వత్థామా ద్యతిరథమహారథాధిష్ఠితమై ప్రచండమైయున్న కౌరవసేనాసన్నివేశ మును రథులలో పరిగణింపబడునట్టియు, అసహాయుడై వచ్చినట్టియు నుత్తరుడు చూచి బెదరుట ఆతడు పనికి మాలినవాడనుటకు తార్కా ణమేనా? అప్రతిహతపరాక్రమశాలియగు పార్థున కొక్కనికిదప్ప అట్టి సన్నివేశము అసహాయస్థితిలో నెవ్వరికి భయావహము కాకుండును?

కనుక నె భీష్ము డాతనిని తీసివేయలేదు. రథోదారు డని పరిగ ణించెను. ఆపరిగణనము స్వరూపకీర్తనమే కాని కర్ణనిరసనమునకు సం బంధించినది కాదు. కనుకనే శ్రోత లామాటపై ప్రతివాదులవలె భీష్ముని దూషింపలేదు. ఇట్లు భీష్ముని వ్యవహారము నిర్దుష్టము, ప్రశం సనీయము నయి యున్నందున ప్రతివాదుల విపరీతోక్తులు పరాస్త మయినవి.

ద్వితీయాంశము— తన కులమునకు కళంక మాపాదించు కర్ణ జన్మవిషయక మగు కుంతీచరిత్రమును కర్ణునకు భీష్ముడు వెల్లడించినా డట! పాండవులతో జేరుమని యుద్ధసంకటములో కర్ణునకు బోధించినా డట! అందుచే తన ఘనమైన చరిత్రమును మాపికొనినాడట!

ఇచ్చట ప్రతివాదుల కొకింత బోధింపవలసియున్నది. నిమీలిత నేత్రుడై యున్న భీష్మునియొద్దకు వచ్చి నేను రాధేయుడనని కర్ణుడు పలుకరించినపుడు కనులు విప్పి చూచి దగ్గరకుదీసికొని నీవు రాధేయుడవు గావు. కౌన్తేయుడవు, సూర్యసుతుడవు అని కదా భీష్ముడనెను. ఇది తనకులమునకు కళంకాపాదకమా ?

"విదితో నారదా న్మయా, కృష్ణద్వైపాయనా చ్చైచ"

అనుచు నారదవేదవ్యాసుల వలన వినియుంటి నని చెప్పెను కదా! ఆవేదవ్యాసమహర్షి కుంతీదేవితో సూర్యసంబంధము నీకు దోషావహము కాదని, నీవప్పటికి కన్యకవై యుంటి వని, నీకు మనో వ్యథతో బనిలేదని చెప్పిన యీమాటలు చూడుడు—

"అపరాధ శ్చ తే నాస్తి కన్యాభావం గతా హ్యసి।
మనుష్యధర్మో దైవేన ధర్మేణ హి న దుష్యతి॥
ఇతి కున్తి విజానీహి వ్యేతు తే మానసో జ్వరః" (ఆశ్రమవాస...అ 30)

దీనినిబట్టి కుంతీచరిత్రము నిర్దుష్టమని వేదవ్యాసమహర్షిచే ప్రకటింపబడియుండగా ఆమహర్షివలననే తాను విన్నాననుచు భీష్ముడు వెల్లడించినపుడు అందు కళంక మేమున్నది.

శాస్త్రకర్తయై విద్యాప్రవర్తకుడై కర్తవ్యాకర్తవ్యముల నుపదేశించు అధికారికపురుషుడై ధర్మాధర్మపరిజ్ఞానియై ప్రామాణిక మూర్ధన్యుడై యున్న వేదవ్యాసమహర్షికి అది దోషమో కాదో తెలియునా ? ఏమియు దెలియక యథాజాతులమైయున్న మనకు దెలియునా ? అని ప్రతివాదులు భావింపకపోవుట శోచనీయము. భీష్ముని యంతర మెక్కడ ? మనయంతర మెక్కడ? అని యాలోచింపక నోటికి వచ్చినట్లు తెగించి మాటలాడుట హేయము. వేదవ్యాసోక్తిప్రకారము కర్ణోత్పత్తికి సంబంధించిన కుంతీవ్యాపారము నిర్దుష్టము. ఈవిషయము ఈభాగములోను, ద్వితీయభాగములోను నిరూపించియున్నాము. అది భీష్ముని కులమునకు కళంకాపాదకము గాదు.

ఇక "పాండవులలో జేరు మని యుద్ధసంకటములో కర్ణునకు బోధించినాడు" అను మాటపై చెప్పుచున్నాము—

పాండవులలో జేరి కౌరవపక్షమును హతముచేయుమని యేను యిన జెప్పినాడా ? యుద్ధమునే ఆపివేయుమని వారిది వారికిచ్చి సంధి చేసికొని సుఖింపుడని, కదా చెప్పినాడు.

ఈప్రతివాదులుకూడ తృతీయాంశములో—

"కర్ణుడు పాండవులలో జేరుట సంధివించినయెడల దుర్యోధనుడు నిరాశుడై సంధి కంగీకరించు నని తలచి భీష్ము డెట్టిపనికైన తలపడెను."

అనుచు సంధిని గోరి చెప్పినట్లే వ్రాయలేదా ? అట్లు ఇరుపక్షములకు క్షేమము గోరి అంత్యసందేశముగా కర్ణునకు బోధించినట్టి భీష్ముని ఘనమైన చరిత్రమేమి మాసిపోయినది.

ఆత డెట్టిపనికైన తలపడెనా ? అతడు చేసిన అకార్యమేమి ? ఉభయపక్షక్షేమాపేక్షతో వ్యవహరించుట తప్పని మీరు కనిపించినదా ? మహాపురుషదూషణము శ్రేయస్కరముకాదు. భీష్మపితామహునిది నిష్కళంక చరిత్రము; కనుక ద్వితీయతృతీయాంశములు నిరస్తములు.

—: భగవద్గీతానాటక పరామర్శము :—

భగవద్గీతానాటకకర్తలు ద్రౌపదిచేత భీష్ము ననిపించిన మాట లిట్లున్నవి—

"తన సమస్థాన తనకులాంగనకు మాన । భంగ మొనగూడు చెడ శిలాప్రతిమ వోలె । కదలకుండిన పెద్దరికంబు నతని। రాచరికమును గౌరవార్హములె?..."

వీరిట్లువ్రాయుట తప్పు. ద్రౌపదీవిషయమై ఆనాడు భీష్ము డెంత పరితపించెనో ద్రౌపదీప్రశ్నముపై భీష్ముని యుత్తర మెట్లున్నదో పంచమభాగములో నిరూపించియున్నాము. చరిత్రకు విరుద్ధముగా కల్పించుట భావ్యముకాదు.

ఇంకొకటి "భీష్ముగడ దేర్చు మదస్త్రనిశాతఘాతకుల" అనుచు, "పోరద నేన ఖడ్గమును బూనెద" అనుచు ద్రౌపదీదేవి భీష్మునిపై

బడుటకు ఆయత్తపడినట్లు కల్పించినారు. ఒకచోట కృష్ణవాక్యముగా శిఖండి భీష్ముని బరిమార్చుటకు జనసంబందేనని చెప్పినారు. ఇట్టి స్థితిలో ద్రౌపదీదేవికి యీ అకాండతాండవ కల్పనమెందులకో ?

"పడతిని సిగబట్టి నడి రచ్చ కీడ్చి నిర్భీతి క్రోకల నూడ బెరుకువాడు"

అని దుశ్శాసనదౌష్ట్యమును శ్రీకృష్ణు డుద్ఘాటించినట్లు వ్రాసినారు. తన సిగబట్టికొనిన దుశ్శాసనునిపై చూపలేని పౌరుషమును ఆమెకు బూజ్యుడైన భీష్మునిపై ద్రౌపదీదేవి చూపబూనెననుట కంటె అసాంగత్య మేమున్నది ?

ఈ కవి ద్రౌపదీదేవికి పౌరుషమును కల్పింపదలచి— "వినాయకం ప్రకుర్వాణో రచయామాస వానరమ్" అన్నట్లు పాత్రౌచిత్యమును భగ్నముచేసిపెట్టెను. భారతీయవనితామర్యాదలను పాటింపక యీ కవి స్త్రీలకు యుద్ధసంఘర్షణములలో ఆయుధముతోగూడ ప్రవేశము గల్పించి భారతీయవనితామతల్లుల పవిత్రతాప్రతిష్ఠలను భంగపరచెను.

"స్త్రీ పుంవచ్చ ప్రభవతి యదా తద్ధి గేహం వినష్టమ్"

అను మహాకవి సూక్తిప్రకారము స్త్రీ పురుషునివలె వ్యవహరించిననాడు నష్టమె కలుగు నని యీ కవి గ్రహింపలేదు.

ఇంతకును మహాభారతార్థమును తలక్రిందుజేసి, ఆమహావ్యక్తుల ఆదర్శచరిత్రములను కళంకితము చేయుట తప్ప పాత్రౌచిత్య మేది ? కనుక కవివ్రాత నిరస్తము. భీష్మునిది నిష్కళంక చరిత్రము.

ప్రసంగవశమున భీష్ముని బ్రహ్మచర్యమునుగూర్చి వివరించి ఆ మహాపురుషుని లోకోత్తరమహిమను దెలుపుచున్నాను.

—: 'భీష్ముని బ్రహ్మచర్య మనుమానాస్పదము' అను ప్రసంగము— తన్నిరాకరణము :—

మ. భా, చ. కారులవ్రాత యిట్లున్నది.— "భీష్ముని బ్రహ్మచర్యము అనుమానాస్పద మని పూర్వమీమాంసాశాస్త్రజ్ఞులలో కుమారిలభట్టు వ్రాసియున్నాడు. (పు. 121)

భీష్ముడు యాగముల జేసినటుల మహాభారతమున గాన్పించుచున్నది. అది యెట్లు సమర్థనీయ మని పూర్వమీమాంసాశాస్త్రజ్ఞులు చర్చించుకొని యెటు లనో సమాధానముల జెప్పుకొని యున్నారు.'' (పు 100)

ఇచ్చట భ్రాంతులగు ప్రతివాదులకు బోధింపవలసియున్నది- మహాభారతములో భీష్మునకు వివాహ మయినట్లు చెప్పబడ లేదు. ఆతడు క్రతువులు చేసినట్లు చెప్పబడినది. బ్రహ్మచర్యశపథము చేసి నట్లు చెప్పబడినది; ఊర్ధ్వరేతస్కుడని చెప్పబడినది. ఆ వాక్యములు చూడుడు- దుర్యోధనునితో భీష్ముడు—

"ప్రతిజ్ఞాం దుష్కరాం కృత్వా పితు రర్థే కులస్య చ ।
అరాజా చోర్ధ్వరేతాశ్చ యథా సువిదితం తవ॥ '' (ఉద్యో— అ147)

తన తండ్రి శంతనుమహారాజునకు సత్యవతీదేవి నిచ్చి వివాహము చేయవలసిన దని దాశరాజు నడిగినపుడు దాశరాజు కోరికలపై భీష్ముడు చేసిన ప్రతిజ్ఞలు—

"ఇదం మే వ్రత మాదత్స్వ సత్యం సత్యవతాం వర ।
యో౽స్యాం జనిష్యతే పుత్ర స్స నో రాజా భవిష్యతి ॥
అపత్యహేతో రపి చ కరిష్యే౽ద్య వినిశ్చయమ్ ।
అద్య ప్రభృతి మే దాశ బ్రహ్మచర్యం భవిష్యతి ''
అపుత్రస్యాపి మే లోకా భవిష్య న్త్యక్షయా దివి'' (ఆది. అ. 100)

ముక్తుడైన భీష్ముని శరీరమునకు సంస్కారముచేయుటకు పురమునుండి భీష్ముని అగ్నులను తీసుకొని ధర్మజుడు యుద్ధ భూమికి వచ్చినట్లున్నది—

"స్తూయమానో మహాతేజా భీష్మస్యాగ్నీ ననువ్రజన్ ।
నిశ్చక్రామ పురా త్తస్మా ద్యథా దేవపతి స్తథా ॥ (అను శా అ 167)
టీ. భీష్మస్యాగ్నీ నితి. తేన తస్యాపి పత్నీ ఆసీత్. యద్వా సంస్కారకా నగ్నీన్.''

ఇట్లున్నందున క్రతునిర్వహణమునకు పత్నీసంబంధ మావశ్యకమై కనబడుచున్నదనియు, ఊర్ధ్వరేతస్త్వ బ్రహ్మచర్యములకు పత్నీ సంబంధమే లేదనవలసినట్లు కనబడుచున్నదనియు భావించి కుమారిల భట్టు ఆ రెండింటికిని విరోధము లేనిపద్ధతి యిట్లు చెప్పెను—"... ...

కేవలయజ్ఞార్థపత్నీసంబన్ధ ఆసీదితి త్వర్థాపత్త్యా౽నుక్తమపి గమ్యతే"

అనగా భీష్మునకు పత్ని యున్నట్లు చెప్పబడకపోయినను చెప్ప బడిన విషయములకు విరోధము లేకుండుటకై కేవలయజ్ఞార్థము పత్ని యున్నదనియు, అర్థకామముల కయిన పత్ని కాదుకనుక ఊర్ధ్వరేతస్త్వ బ్రహ్మచర్యములకు భంగము లేదనియు, నిది యర్థాపత్తి ప్రమాణముచే గమ్యమాన మగుచున్న దనియు తాత్పర్యము.

అర్థాపత్తి యనగా— "పీనో దేవదత్తో దివా న భుఙ్క్తే" అని వాక్యమున్నది. దేవదత్తుడు పీను డయి (పుష్టికలవాడయి) యున్నాడు. పగలు భుజింపకున్నాడు. అన్నపుడు భోజనమునకును పీనత్వమునకును సంబంధ ముండుట వలన పీనత్వోపపత్తికై యూహింపబడు రాత్రి భోజనము అర్థాపత్తి యనబడును.

అట్లే యిటు ఊర్ధ్వరేతస్త్వసిద్ధికి, అటు క్రతుసిద్ధికి భంగకరము గానట్టి కేవల యజ్ఞార్థపత్నీసంబంధము కల్ప్యమని కుమారిలభట్టు చెప్పియుండెను కాని భీష్మబ్రహ్మచర్యమనుమానాస్పద మని చెప్పియుండలేదు.

వైయాకరణసిద్ధాన్తలఘుమంజూషలో నాగేశోపాధ్యాయుడు చెప్పిన విషయ మేమనగా—

"అపత్నీకో౽ప్యగ్నిహోత్రమాహరేత్" ఇత్యుక్తే రపత్నీకస్యాప్యగ్ని సాధ్యే కర్మణ్యధికారాత్ ...... అపత్నీకో౽పీత్యపినా తస్యా విద్యమానత్వే తాం వినా యజ్ఞాద్యభావం సూచయతి...

ఇత్యాదిగ్రన్థముచే, పత్నీపరిగ్రహము లేనివాడుగూడ యజ్ఞము చేయవచ్చు ననియు, క్రతుసిద్ధికై భీష్మునకు పత్నీపరిగ్రహకల్పన మన వసరమనియు నిర్ణయించెను. ఆపైన—

"వైయాఘ్రపద్యగోత్రాయ సాంకృత్యప్రవరాయ చ ।
గంగాపుత్రాయ భీష్మాయ ఆజన్మబ్రహ్మచారిణే ॥
అపుత్రాయ దదామ్యేత దుదకం భీష్మవర్మణే।

వసూనా మవతారాయ శన్తనో రాత్మజాయ చ ॥
అర్ఘ్యం దదామి భీష్మాయ ఆబాల్యబ్రహ్మచారిణే। ”

అనియున్న పద్మపురాణోక్త తర్పణమంత్ర అర్ఘ్యమంత్ర ములనుబట్టి భీష్ము డాజన్మబ్రహ్మచారి యనియు,

అందుచే—“అద్య ప్రభృతి ... బ్రహ్మచర్యం భవిష్యతి” అను నపుడు “పునరపి బ్రహ్మచర్యం భవిష్యతీత్యర్థః” అని వ్రాసి అంతకు బూర్వము గల బ్రహ్మచర్యమును ఇటుపై గూడ ననువర్తింపజేయుదు నని యర్థమె కాని పూర్వము లేని దానిని ఇప్పటినుండి వహింతు నని యర్థము కాదనియు, జెప్పి భీష్ము డాజన్మబ్రహ్మచారియే యని సిద్ధాంతము చేసెను. కనుక నీవిషయమయి ప్రతివాదుల విరుద్ధకల్పనలు ప్రతిహతము లయినవి.

ఇంకొకటి. “భీష్మునకు వైయాఘ్రపద్యగోత్రము తర్పణవిధిలో నిబంధనగ్రంథకర్తలు ఇటీవల దూర్చినారు. వైయాఘ్రపద్యగోత్ర మనునది లేదు. పాండవుల కొక గోత్రమే లేదు.”

అను మ. భా. చ. కారుల రభసవాదము పాండవనిందానిరాకరణము అను చతుర్థభాగములో నిరాకరింపబడినది.

ఇప్పు డిక్కడ కురువంశీయులు, వైయాఘ్రపాదగోత్రజు లనుటకు నిదర్శన మొకటి చూపబడుచున్నది—ఇది జనమేజయభూపాలుని దానశాసనపత్రము. ఇది శ్రీకోట వెంకటాచలముగారి కలికళవిజ్ఞానము— ద్వితీయభాగములో నుదాహరింపబడియున్నది. దాని స్వరూపసంగ్రహ మిది—

శ్రీ కురువంశావతంస శ్రీ జనమేజయభూపాలానాం దానశాసనపత్రమ్— స్వస్తి శ్రీ జయాభ్యుదయే యుధిష్ఠిరశకే ప్లవంగాఖ్యే ఏకోనవతివత్సరే సహస్యమాసి అమావాస్యాయాం సోమవాసరే శ్రీమన్మహారాజాధిరాజపరమేశ్వరో వైయాఘ్రపాదగోత్రజః శ్రీమజ్జనమేజయభూపః ... సింహాసనస్థః సకలవర్ణాశ్రమధర్మ ప్రతిపాలకః ... సీతారామస్య పూజార్థం కృతభూదానశాసనమ్. అస్మత్ప్రపితామహ యుధిష్ఠిరాధిష్ఠితమునిబృందక్షేత్రస్య చతుస్సీమాపరిమితిః ...

ఏతన్మధ్యస్థితమునిబృందశ్రేతృం ... స్వబుద్ధ్యాఽస్మత్పితౄణాం విష్ణులోక ప్రాప్త్యర్థం ... ధారాపూర్వకం ... దత్త్వా నస్మి॥

ఓప్రతివాదులారా! భీష్ముని ఆరాజ్యపరిత్యాగ మేమి? ఆ ఆజన్మబ్రహ్మచర్యనియమ మేమి? ఆ అప్రతిహతపరాక్రమ మేమి? ఆ నిష్కపటవర్తన మేమి? ఆ కూలంకషవిజ్ఞానవైభవ మేమి? ఆ ఆపాదమస్తకశరానువిద్ధశరీర మేమి? ఆ అనితరసాధారణ శరశయ్యాశయన మేమి? ఆ స్వచ్ఛందమరణసామర్థ్య మేమి? ఆ మహర్షిసంఘపరివేష్టితత్వ మేమి? ఆ కృష్ణపరమాత్మప్రశంసనీయత్వ మేమి? ఆ యోగధారణాబల మేమి? ఆ శాన్త్యనుశాసనవోక్త అద్భుతోపదేశ మేమి? ఆ జగద్వంద్య దివ్యచరిత్ర మేమి? మీ రామహాపురుషుని గర్హింపబూను టేమి? "శాంతం పాపమ్"

—: ధర్మరాజాదులు శుద్ధాత్ములని, దుర్యోధనాదులు దురాత్ములని భీష్ముని అంత్యకాల వాక్యములు :—

భీష్ముడు అంపశయ్యపైనుండి యుత్తరాయణ నిరీక్షణముతో— "అష్టపంచాశతం రాత్ర్య శ్శయానస్యాద్య మే గతాః" 58 రోజులు గడిపి నిర్యాణమునకు సంకల్పించి తనయొద్దకు వచ్చియున్న ధృతరాష్ట్రునితో నిట్లు చెప్పెను—

"యథా పాండో స్సుతా రాజన్ తథైవ తవ ధర్మతః।
తాన్ పాలయ స్థితో ధర్మే గురుశుశ్రూషణే రతాన్॥
ధర్మరాజో హి శుద్ధాత్మా నిదేశే స్థాస్యతే తవ।
అనృశంస్యపరం హ్యేనం జానామి గురువత్సలమ్॥
తవ పుత్రా దురాత్మానః క్రోధలోభపరాయణాః।
ఈర్ష్యాభిభూతా దుర్వృత్తా స్తా న్నశోచితు మర్హసి॥"

ధృతరాష్ట్రా! పాండుపుత్రులు నీకును పుత్రులే. నీవు ధర్మపరుడవై పెద్దలను సేవించు స్వభావముగల పాండవులను పాలింపుము. ధర్మరాజు శుద్ధాత్ముడు. నీ యాజ్ఞలో మసలుకొనును. అతని గురుభక్తిని, సద్భావమును నే నెరుగుదును.

నీ పుత్రులు దురాత్ములు, క్రోధలోభపరిధానులు, ఈర్ష్యాగ్రస్తులు, దుర్వృత్తులు వారినిగూర్చి శోకింపకుము. అని.

ఏతావ దుక్త్వా వచనం ధృతరాష్ట్రం మనీషిణమ్ ।
వాసుదేవం మహాబాహు మభ్యభాషత కౌరవః ॥

ఇంతమాత్రము ధృతరాష్ట్రునితో జెప్పి తరువాత కృష్ణభగవానునితో నిట్లు పలికెను—

"త్రాయస్వ పుండరీకాక్ష పురుషోత్తమ నిత్యశః ।
అనుజానీహి మాం కృష్ణ వైకుంఠ పురుషోత్తమ ॥
రక్ష్యాశ్చ తే పాండవేయా భవాన్ యేషాం పరాయణమ్ ।
ఉక్తవా నస్మి దుర్బుద్ధిం మన్దం దుర్యోధనం తదా ॥
యతః కృష్ణ స్తతో ధర్మో యతో ధర్మ స్తతోజయః ।
వాసుదేవేన తీర్థేన పుత్ర సంశామ్య పాండవైః ॥
సన్ధానస్య పరః కాల స్తవేతి చ పునః పునః ।
న చ మే తద్వచో మూఢః కృతవాన్ స సుమన్దధీః ॥
ఘాతయిత్వేహ పృథివీం తత స్స నిధనం గతః ।
స మాం త్వ మనుజానీహి కృష్ణ మోక్ష్యే కళేబరమ్ ॥
త్వయాఽహం సమనుజ్ఞాతో గచ్ఛేయం పరమాం గతిమ్ ।"

ఓ శ్రీకృష్ణా ! ఓ వైకుంఠవాసీ ! నన్ను రక్షింపుము. నా కనుజ్ఞనిమ్ము. నిన్ను ఆశ్రయించియున్న పాండవులను రక్షించుచుండుము. నేను దుర్బుద్ధిగల దుర్యోధనునకు మఱిమఱి చెప్పియుంటిని. కృష్ణుడున్నచోటనే ధర్మము, ధర్మ మున్నచోటనే జయము. నీవు శ్రీకృష్ణుని బురస్కరించుకొని పాండవులతో సంధి చేసికొనుము. ఇదియే సంధి చేసికొనుటకు సమయము. అని.

నే నెంతచెప్పినను మూఢుడై వినిపించుకొనక జనక్షయము చేసి ఆపై తాను మరణించెను.

శ్రీకృష్ణా! నే నీ కళేబరమును విడుచుచున్నాను. అనుజ్ఞ నిమ్ము. నీచేత ననుజ్ఞాతుడనయి సద్గతి నొందుదును. అని.

అది విని కృష్ణపరమాత్మ యిట్లనెను—

అనుజానామి భీష్మ త్వాం వసూన్ ప్రాప్నుహి పార్థివ।
న తేఽస్తి వృజినం కించి దిహాలోకే మహాద్యుతే ॥
పితృభక్తోఽసి రాజర్షే మార్కండేయ ఇవాఽపరః।
తేన మృత్యు స్తవ వశే స్థితో భృత్య ఇవానతః ॥ (అనుశా. అ 167)

ఓభీష్మా ! నీ కనుజ్ఞ నిచ్చుచున్నాను. నీవు వసువులస్వరూప మును బొందుము. నీది నిర్దుష్టమైన జీవితము; ఓరాజర్షీ ! నీవు అఖండ పితృభక్తుడవు. కనుక నే మార్కండేయునకువలె మృత్యువు నీకు వశమై యున్నది. అని.

ఇచ్చట ప్రతివాదులకు బోధించుచున్నాము. "లోకములో మరణకాలవాక్కులే యెక్కుడు ప్రమాణము లగుచున్నవి" (గరిగిపాటి రామమూర్తి బి. ఏ. గారి భారతవిమర్శన.) అనుచున్న ఓసుయోధన విజయాభిమానులారా ! మీమతప్రకారము ఈభీష్మవాక్యములు దుర్యోధనాదులు దురాత్ములని, పాండవులు మహాత్ములని, శ్రీకృష్ణుడు భగవంతు డని, దుర్యోధనుడె లోకక్షయకారకుడని పాండవు లదే ధర్మ మని పాండవులదే విజయ మని ప్రమాణములై చాటు చున్న వని తెలిసికొనుడు.

ఓ కర్ణచరిత్రాభిమానులారా !

"న తేఽస్తి వృజినం కించిత్" అను శ్రీకృష్ణవాక్యము భీష్మునిది నిష్కళంకచరిత్ర మని చాటుచున్న దని తెలిసికొనుడు.

భీష్ముని నిర్యాణసమయవాఙ్మాలములో దురాత్ముడని చెప్ప బడిన దుర్యోధనుని ప్రాణసఖుడే కర్ణు డని తెలిసికొనుడు.

—: కురుసభనుండి వెళ్ళిపోవునపుడు శ్రీకృష్ణునితో నీవు యుద్ధమునకు అవరోధము కల్పింపకు మని కర్ణుడు చెప్పుట :—

శ్రీకృష్ణుడు కర్ణుని జేరదీసి నీవు పాండవులకు సంబంధించిన వాడవు. నిన్ను వారు పూజించి నీకే వారి రాజ్య మిచ్చెదరు. నీవు వారిపై పగ మానుము. అని బోధింప కర్ణుడు దాని కంగీకరింపక-

దుర్యోధనుడు నన్ను జూచికొనియే వారిపై కత్తిగట్టినాడు. అతని నాశ్రయించియే నేను ఐశ్వర్య మనుభవించినాను. నేను స్వామి ద్రోహము చేసినవాడ నగుదును. నేను కుంతీసుతుడ నను రహస్యము వారికి దెలియనీయకుము.

"యది జానాతి మాం రాజా ధర్మాత్మా సంయతేన్ద్రియః।
కున్త్యాః ప్రథమజం పుత్రం న స రాజ్యం గ్రహీష్యతి॥

ఇది వారికి దెలిసినయెడల ధర్మాత్ముడగు ధర్మజుడు రాజ్యము గ్రహింపడు. నేను గ్రహించియు దుర్యోధనునకే అర్పింపవలసినవాడను. "స ఏవ రాజా ధర్మాత్మా శాశ్వతోఽస్తు యుధిష్ఠిరః" ధర్మాత్ముడగు యుధిష్ఠిరుడే శాశ్వతముగా రాజయి యుండవలయును. నేను దుర్యోధనప్రీతికై పాండవుల నాడిన దుర్భాషలకు పరితపించుచున్నాను. అని చెప్పి ఆపై ఇట్లనెను—

"విద్యావృద్ధా వయోవృద్ధాః క్షత్రియాః క్షత్రియర్షభ।
వృథామృత్యుం న కుర్వీరం స్త్వత్కృతే మధుసూదన॥
శస్త్రేణ నిధనం గచ్ఛే త్సమృద్ధం క్షత్రమండలమ్।
కురుక్షేత్రే పుణ్యతమే త్రైలోక్యస్యాపి కేశవ॥
తదత్ర పుండరీకాక్ష విధత్స్వ య దభీప్సితమ్।
యథా కార్త్స్న్యేన వార్ష్ణేయ క్షత్రం స్వర మవాప్నుయాత్॥
(ఉద్యో. అ. 141)

శ్రీకృష్ణా! విద్యావృద్ధులు, వయోవృద్ధులు అయియున్న క్షత్రియులకు నీ మూలమున శయ్యామరణముగాక పుణ్యతమమైన కురుక్షేత్రములో యుద్ధమరణము కలుగవలయును. కనుక క్షత్రియగణము అభీప్సితమైన స్వర్గమును పొందునట్లు చేయుము. అని చెప్పి, మఱి యొకమాట కూడ చెప్పెను—

"జానన్ మాం కిం మహాబాహో సంమోహయితు మిచ్ఛసి।
యోఽయం పృథివ్యాః కార్త్స్న్యేన వినాశ స్సముపస్థితః॥
నిమిత్తం తత్ర శకుని రహం దుశ్శాసన స్తథా।
దుర్యోధన శ్చ నృపతి ర్ధార్తరాష్ట్రసుతోఽభవత్॥ (ఉద్యో. అ. 143)

శ్రీకృష్ణా! తెలిసియుండియు నీవు నన్నేల వ్యామోహపెట్టెదవు? ఈ పృథివికి సంభవించు వినాశమునకు శకుని, నేను, దుశ్శాసనుడు, దుర్యోధనుడు నిమిత్తమయి యున్నాము. అని.

దీనినిబట్టి యుద్ధమునకు కారకులు కర్ణదుర్యోధనాదు లనియు, పాండవులు ధర్మాత్ములని కర్ణు డెరుగుననియు, ధర్మాత్ముడగు యుధిష్ఠిరుడే రాజ్యపాలకుడు గావలయునని యాతని సంకల్పమనియు, తాము మరణించునట్లును పాండవులు జయించునట్లును ఆతడు గ్రహించె ననియు, పాండవులపట్ల తాను చేసిన దౌష్ట్యమునకు పశ్చాత్తప్తుడయ్యె ననియు, పాండవుల నెట్లో ప్రకోపింపజేసి వారు యుద్ధోద్యుక్తులగు నట్లు చేసి తన్మూలమున క్షత్రియవీరవర్గమునకు ప్రశంసనీయమైన యుద్ధమరణము ఘటింపజేయుటే కర్ణుని ముఖ్యోద్దేశమనియు, ఈ విషయము నిప్పుడు శ్రీకృష్ణునితో జెప్పుటయే కాక వెనుకజూపబడినట్లు అంపశయ్యపై బడిన భీష్మునితో గూడ జెప్పియుండె ననియు, ప్రతివాదులు గ్రహింతురుగాక!

జనక్షయరూపమైన విప్లవమునకు దుష్టచతుష్టయమె కారణమైనట్లు కర్ణుడే వెల్లడించియుండుటచే, భగవద్గీతానాటకకర్త—

"శ్రీకృష్ణుడే యీవిప్లవమునకు కర్ణధారి" అని సుయోధనోక్తిగను' ఈభాతృహత్యల కెవరుకర్తలు? నేటి విశ్వవిక్షోభమునకు, ఈ దారుణరక్తపాతమునకు ఈ నీచహత్యాకాండలకు కర్తయైన దెవరు? నేను కాదా?' అని శ్రీకృష్ణోక్తిగను కవిత్వ మల్లుట హేయము.

సుయోధనవిజయకర్త— "దేవకీనందనా! భారతయుద్ధంబు ప్రభవించె నీమూలమున" అని సుయోధనోక్తిగ కవిత్వ మల్లుటయు హేయమే. గ్రంథవిరుద్ధమైన ప్రతివాదుల నిరంకుశప్రవృత్తి నింద్యము.

శ్రీకృష్ణుకు కర్ణునియొద్ద తెచ్చిన ద్రౌపదీసందర్భమునకు అభిప్రాయ మేమో పంచమభాగము— ద్రౌపదీనిందానిరాకరణములో

విశేషముగా నిరూపించియున్నాము. ఆవిశేషములు అచ్చట జూడవలయును.

—: కర్ణుడు కుంతీదేవితో పార్థుని దప్ప మిగిలిన పాండవులను నేను వధింప నని చెప్పి పంపుట :—

శ్రీకృష్ణుడు సంధికై చెప్పిన మాటలు వినిపించుకొనక యుద్ధోద్యుక్తుడై యున్న దుర్యోధనునకు ప్రోత్సాహకుడు కర్ణుడనియు, మహాసంగ్రామమూలమున జనక్షయము కాబోవుచున్న దనియు, నీవు పాండవులకు జెందినవాడవు. పాండవవైరము విడిచి వారితో సఖ్యము కలిగియుండు మని నేను స్వయముగా జెప్పినయెడల నామాట నాతడు తీసివేయునా? అనియు దూరమాలోచించి కుంతీదేవి- గంగాతీరమందు ప్రాఙ్ముఖుడు, ఊర్ధ్వబాహుడు నయి సూర్యు నుపాసించుచున్న కర్ణుని యొద్దకు వెళ్ళి ఆతని వెనుకవైపు ఆతనిజపము పూర్తియగువరకు ఎండలో కర్ణుని యుత్తరీయపునీడలో నిలువబడి యుండెను.

"అపృష్ఠతాపా జప్త్వా స పరివృత్య యతవ్రతః ।
దృష్ట్వా కున్తీ ముపాతిష్ఠ దభివాద్య కృతాంజలిః ॥"

కర్ణుడు తన వీపునకు ఎండతగులునంతవరకు జపించి ఆపై ముగించి వెనుకకు తిరిగి కున్తీదేవిని జూచి నమస్కరించి అంజలి ఘటించి- "ప్రాప్తా కి మర్థం భవతీ బ్రూహి కిం కరవాణి తే" దేవీ! నీవిటు లేల వచ్చినావు? నే నేమిచేయవలయును? చెప్పుము. అని యడుగ కుంతీదేవి కర్ణోత్పత్తివృత్తాంతము జెప్పి నీవు సూర్యసుతుడవు. నీవు పాండవులయెడ సౌభ్రాత్రము వహింపుము, యుధిష్ఠిరైశ్వర్యమును నీవే చేపట్టుము. అని బోధింప; అప్పుడు—

"సత్యా మాహ పృథావాక్యం కర్ణ మాతృవచః కురు ।
శ్రేయ స్తే స్యా న్నరవ్యాఘ్ర సర్వతాచరత స్తథా ॥"

అనుచు సూర్యమండలమునుండి — కుంతీదేవి చెప్పినమాట సత్యము. కర్ణుడా! నీవు మాతృవాక్యము ననుసరించి శ్రేయస్సును పొందుము. అను శబ్దము వినబడినది.

అయినను చెదరని మనస్సుతో కర్ణు డిట్లనెను—

"పాండవాన్ యది గచ్ఛామి కిం మాం క్షత్రం వదిష్యతి ।
ఉపనహ్య పరై ర్వైరం యే మాం నిత్య ముపాసతే ॥
మమ ప్రాణేన యే శత్రూన్ శక్తాః ప్రతిసమాసితుమ్ ।
మన్యన్తే తే కథం తేషా మహం భింద్యాం మనోరథమ్ ॥
మయా ప్లవేన సంగ్రామం తితీర్షన్తి దురత్యయమ్ ।
అపారే పారకామా యే త్యజేయం తా నహం కథమ్ ॥
అయం హి కాల స్సంప్రాప్తో ధార్తరాష్ట్రోపజీవినామ్ ।
నిర్వేష్టవ్యం మయా తత్ర ప్రాణా నపరిరక్షతా ॥

టీ. నిర్వేష్టవ్యం భుక్తస్య తదన్నాదే రానృణ్యం కర్తవ్యమ్ ।

ధృతరాష్ట్రస్య పుత్రాణా మర్థే యోత్స్యామి తే సుతైః ॥
అతోఽర్థకర మప్యేత న్నకరో మ్యద్య తే వచః ।
న చ తేఽయం సమారంభో మయి మోఘో భవిష్యతి ॥
వధ్యా న్విషహ్యాన్ సంగ్రామే న హనిష్యామి తే సుతాన్ ।

టీ. వధ్యాన్ వధార్హాన్ విషహ్యాన్ హంతుం శక్యానపీత్యర్థః ॥

యుధిష్ఠిరం చ భీమం చ యమౌ చైవాఽర్జునా దృతే ।
అర్జునం హి నిహత్యాజౌ సంప్రాప్తం స్యా త్ఫలం మయా ॥
యశసా చాపి యుజ్యేయం నిహత స్సవ్యసాచినా ।

దేవీ ! పాండవులలో జేరినయెడల క్షత్రియవర్గము నన్నేమనును? పాండవులతో వైరము కట్టుకొని నన్నుపాసించుచు, నామూలమున పాండవులను జయింప నెంచుచు నున్నవారి మనోరథము నెట్లు భగ్నము చేయగలుగుదును? యుద్ధమహార్ణవమును నన్నుబట్టుకొని దాటదలచియున్నవారిని నేనెట్లు విడువగలను? దుర్యోధనునివలన జీవించుచున్నవారికి తమకృతజ్ఞతను చూపవలసిన సమయము ప్రాప్తించినది. నేను ప్రాణముల నొడ్డి యాతని ఋణము దీర్చుకొనెదను. దుర్యోధనాదులనిమిత్తము నీపుత్రులతో యుద్ధముచేయుదును. ఈసందర్భము నుబట్టి నీమాట మంచిదయినను నేనిప్పు డనుసరింపను. నాయెడల నీయత్నము వ్యర్థము కాకూడదు. కనుక పార్థు నొక్కని దప్ప మిగిలిన

పాండవులను వధింపశక్యుఁడయినను వధింపకుందును. అర్జునుని హింసింతునా? ఫలప్రాప్తియగును. అర్జునునిచే హింసింపబడుదునా? యశస్సిద్ధి యగును. అని.

అది విని కుంతీదేవి యిట్లనెను—

"ఏవం వై భావ్య మేతేన క్షయం యాస్యన్తి కౌరవాః ।
యథా త్వం భాషసే కర్ణ దైవం తు బలవత్తరమ్ ॥
త్వయా చతుర్ణాం భ్రాతౄణా మభయం శత్రుకర్శన ।
దత్తం తత్ప్రతిజానీహి సంగరప్రతిమోచనమ్ ॥"

కర్ణుడా! అట్లేకానిమ్ము. ఇది కౌరవక్షయమునకే వచ్చినది. దైవము బలిష్ఠమై యున్నది. నీవు పాండవచతుష్టయమునకు అభయదానము చేసితివి. దానిని పాలింపుము. అని.

ఇచ్చట కర్ణుని తాత్పర్యము— తన్ను నమ్ముకొని పాండవులపై కాలుదువ్వుచున్న దుర్యోధనుని విడువకుండుట తనకు ధర్మమని, త్రయోదశవత్సరము గడచినతోడనే పార్థుని వధించితీరెద నని, వెనుక జెప్పినట్లు ఆయుధముబట్టి తానుచేసిన ప్రతిజ్ఞను నిర్వహించుట తనకు ధర్మమని, తనను బోషించు దుర్యోధనుని ఋణము తాను ప్రాణ మర్పించియైన తీర్చుకొనుట తనకు ధర్మమని తాత్పర్యము. ఆధర్మమును, జనని యగు కుంతీదేవి జనకు డగు సూర్యభగవానుడు తన కెంత బోధించినను విడువలేదు.

ఈవిషయమునే ఈస్థలములో నీలకంఠాచార్యు లిట్లు చెప్పెను—

"ధర్మాధర్మౌ న త్యజతో ధర్మాధర్మైకసంశ్రయౌ ।
ప్రార్థితా వపి పిత్రాద్యైః కర్ణదుర్యోధనా వివ ॥" అని.

దీనినిబట్టి కర్ణుని పాండవద్వేషము ధర్మమని భ్రాంతిపడరాదు. ఇచ్చట దుర్యోధనుని దధర్మ మనియే చెప్పబడెను. ఆ అధర్మము పాండవద్రోహమే. ఆపాండవద్రోహ మెల్ల కర్ణపురస్కృతమే. అట్టి యధర్మపరుడగు దుర్యోధనునకు గుండెకాయయైయున్న కర్ణుని పాండ

వద్రోహబుద్ధి ధర్మ మెట్లగును? కనుకనే పాండవులనుగూర్చి యాడిన నామాటలు తప్పే యని శ్రీకృష్ణునితో కర్ణుడే చెప్పెను. కనుక కర్ణుని ధర్మము, దుర్యోధనునకు స్వామిద్రోహము చేయకుండుటే. అని గ్రహింపవలెను.

—: "కర్ణుడు కీర్తి శరీరమును మాపికొనకుండుటకు స్వామిహితముగ సంధిచేసికొనవద్దని ప్రసంగించినను ప్రసంగింపవచ్చును"

అనుప్రసంగము — తన్నిరాకరణము :—

కర్ణచరిత్రకారుల వ్రాత యిట్లున్నది—

స్వామిభక్తుడగు కర్ణుడును శత్రువులకు పౌరుషహీనముగ గొంతరాజ్యభాగ మిచ్చి సంధిచేసికొనుట యుక్తము గాదని నిశ్చయించికొని రని చెప్పవచ్చును.

కర్ణుడు తనస్వామి సంధి కంగీకరించి కీర్తిశరీరమును కళంకితముగ జేసికొను నేమో యను భీతి నది యనుచితమని స్వామిహితముగ ప్రసంగించినను ప్రసంగింప వచ్చును.

క్షణభంగురమగు భౌతికశరీరపుసౌఖ్యమునకై యాచంద్రతార ముండవలసిన కీర్తిశరీరమును మాపికొనుట దుర్యోధనునకు హితముకాదని వీరపురుషు డగు కర్ణుడు తలంచుట యాతని స్వామిభక్తికి లోపమును గూర్పజాలదుగదా ! (పు. 83)

ఇచ్చట ప్రతివాదులు- కర్ణదుర్యోధనులు పాండవులకు గొంత రాజ్యభాగ మిచ్చుట పౌరషహీనముగ భావించి యివ్వనట్లు జెప్పుచున్నారు. ఇది దుర్యోధనునిదే రాజ్యమను భ్రాంతితో జెప్పిన మాట. ఆభ్రాంతి ప్రతివాదులు వదల్చుకొనవలసినదనియు, పాండవులదే రాజ్య మనియు ఘంటాఘోషముగా జెప్పియున్నాము. ఇట్టిస్థితిలో సంధిచేసికొనుట యుక్తము గాదని కర్ణదుర్యోధనులనుకొనుట వారి దుష్టత్వము నకే సూచకము. వారిది వారికివ్వనివారు దుష్టులుగాక యిరేమగుదురు?

కర్ణునకు- తన స్వామి సంధికంగీకరించి కీర్తిశరీరమును కళంకితము జేసికొనునేమో అని భీతియట !

ఈమాటచే సంధి చెడగొట్టినవాడు కర్ణుడని ప్రతివాదు లొప్పుకొని నట్లే. సంధి గానిక సర్వసంహారమునకు గారకు లెవ్వరయినారో సంజయునితో ధృతరాష్ట్రుడే చెప్పి విలపించినాడు—

"నేను ద్రోణుండు భీష్ముండు బూని చెప్ప
శౌరిమాటలు మీరాజు సరకుగొనడ
సంధి గానీకకర్ణుండు సౌబలుండు
దుస్ససేనుండు నందర దుర్మించికొనిరి."

భౌతికశరీరపుసౌఖ్యము క్షణభంగురమట! ఆచంద్రతారముగ నుండవలసినది కీర్తిశరీరమట! ఆకీర్తిశరీరము మాపికొనుట దుర్యోధనునకు హితము కాదని వీరుడగు కర్ణుడు తలంచెనట! అది యాతని స్వామిభక్తికి లోపము కూర్పదట!

ఆహా! అంత క్షణభంగురమైన భౌతికశరీరసౌఖ్యములో పాండవహత్యకై యెట్లు ప్రయత్నించిరో, కపటద్యూతమునకై యెట్లు సిద్ధపడిరో, వారి రాజ్యముగూడ వారి కివ్వమని, పంచగ్రామములుగూడ నివ్వమని యెట్లు భీష్మించిరో?

కర్ణదుర్యోధనులకు కీర్తిశరీరమా? అది పాండవహత్యాప్రయత్నమునుండి యుద్భవించినదేనా? అది పాండవుల తిండి పడగొట్టగా కలిగినదేనా? అది ద్రౌపదీకేశాంబరాకర్షణమూలకమేనా? ఆకీర్తిశరీరము పాండవులతో సంధి చేసికొనుటచే మాసిపోవు నని ప్రతివాదుల కనిపించుట శోచనీయము. సంధి కంగీకరింపు మని పోరిన పాండవులును, కృష్ణభగవానుడును, భీష్మద్రోణ కృపాశ్వత్థామ విదురప్రభృతులును, గాంధారీధృతరాష్ట్రులును, నారదాదిమహర్షులును తమ తమ కీర్తిశరీరమును మాపికొనినవారే కాబోలు, అసంగతమగుటచే వీరి వ్రాత నిరస్తము.

—: కృష్ణభగవానుడు వచ్చి కురుసభావృత్తాంతము జెప్పుట, యుద్ధము వచ్చిపడెనే అని ధర్మజుడు చింతించుట :—

కృష్ణభగవానుడు కురుసభనుండి నిర్గమించి కుంతీదర్శనము చేసి మధ్యమార్గమున కర్ణునితోగూడ సంభాషించి పాండవులయొద్దకు వచ్చి అక్కడ యావద్విషయములను వెల్లడించి పర్యవసానమిట్లు చెప్పెను—

"యథాహ రాజా గాంగేయో విదురశ్చ హితం తవ।
సర్వం భవతు తేరాజ్యం పంచ గ్రామా న్విసర్జయ॥
అవశ్యం భరణీయా హి పితు స్తే రాజసత్తమ।
ఏవ ముక్తోఽపి దుష్టాత్మా నైవ భాగం వ్యముఞ్చత॥
దండం చతుర్థం పశ్యామి తేషు పాపేషు నాన్యథా।
నిర్యాతాశ్చ వినాశాయ కురుక్షేత్రం నరాధిపాః॥
న తే రాజ్యం ప్రయచ్ఛన్తి వినా యుద్ధేన పాండవ॥" (ఉద్యో. అ 150)
"నైష కామయతే ధర్మం నైష కామయతే యశః।
జితం స మన్యతే సర్వం దుష్టాత్మా కర్ణ మాశ్రితః॥
బద్ధ మాజ్ఞాపయామాస మమ చాపి సుయోధనః।
నచ తం లబ్ధవాన్ కామం దురాత్మా పాపనిశ్చయః॥" (అ. 154)

భీష్ముడు చెప్పినట్లు, విదురుడు చెప్పినట్లు దుర్యోధనా! రాజ్యమంతయు నీవె యుంచుకొని పంచగ్రామములనే విడిచిపెట్టుము. పాండవులను బోషించుట నీతండ్రి కావశ్యకముకదా! అని చెప్పినను ఆదుష్టాత్ముడు సమ్మతింపలేదు. ఆపాపాత్ములయందు ఇక దండోపాయమే యుక్తము. వారు కురుక్షేత్రమునకు నశించుటకై ప్రయాణమయినారు. యుద్ధము లేకుండ వారు రాజ్య మీయరు.

దుర్యోధనునకు ధర్మ మక్కరలేదు; కీర్తి యక్కరలేదు. కర్ణునాశ్రయించి ఆదుష్టాత్ముడు సర్వము జిత మనియే తలచుచున్నాడు. ఆపాపాత్ముని సంకల్పము సిద్ధింపలేదుగాని నన్ను బంధించుటకుగూడ తలపెట్టినాడు. అని.

"అవధ్యానాం వధం పశ్యన్ ధర్మరాజో యుధిష్ఠిరః।
నిశ్శ్వసన్ భీమసేనం చ విజయం చేద మబ్రవీత్॥
యదర్థం వనవాసశ్చ ప్రాప్తం దుఃఖం చ యన్మయా।
సోఽయ మస్మా నుపైత్యేవ పరోఽనర్థః ప్రయత్నతః॥
టీ. యదర్థం యన్నివృత్త్యర్థం అనర్థః, కులక్షయః ప్రయత్నతో బలాత్.
తస్మిన్ యత్నః కృతోఽస్మాభి స్స నో హీనః ప్రయత్నతః।
అకృతే తు ప్రయత్నేఽస్మా నుపావృత్తః కలి ర్మహాన్॥

టీ. తస్మిన్నితి. తస్మిన్ననర్థే నిమిత్తేసతి యత్నః తత్పరిహారార్థ ఉపాయః సద్య శ్శత్రువధరూపో భీమస్య ద్యూతకాలే సమ్మతః స నోఽస్మాక మస్మాభిః క్షమాం కుర్వద్భిః ప్రయత్నతః బలాత్ హీనో వ్యర్థః కృతః. అకృతే తు అకృతేఽపి ప్రయత్నే యుద్ధార్థ ముద్యోగేఽస్మాన్ కలి రుపావృత్త ఆగతః.

"కథం హ్యవధ్యై స్సంగ్రామః కార్య స్సహ భవిష్యతి ।"

ధర్మజుడు శ్రీకృష్ణోక్తులను విని వధింపదగని వారిని వధింప వలసివచ్చెనే యని నిట్టూర్పు విడుచుచు భీమార్జునులతో నిట్లనెను— కులక్షయరూపమైన యే అనర్థము రాకుండుటకై వనవాసము చేయుట కును, కష్టము లనుభవించుటకునుగూడ నేను సమ్మతించితినో ఆయన ర్థము బలాత్కారముగా మనపై వచ్చి పడనేపడినది. ఆకులక్షయ కార్యమునకు నిమిత్తము ద్యూతకాలములో తటస్థించినపుడు దానిని పరిహరించుటకై తత్క్షణమే శత్రువధరూపమయిన యుపాయము భీమసేనునకు సమ్మతమైనను, అది సహించియున్న మనమూలమున వ్యర్థము చేయబడినది. యుద్ధమునకు ప్రయత్న మిన్నమును చేయని వార మయినను మన కదియే ప్రాప్తమయినది. వధింపదగనివారితో యుద్ధ మెట్లు కర్తవ్యమో ? అని యిట్లు చింతించెను.

దీనినిబట్టి కులక్షయకారకులు పాండవులో, కృష్ణభగవానుడో, కర్ణదుర్యోధనాదులో ప్రతివాదులు తెలిసికొందురు గాక !

—: దుర్యోధనుడు యుద్ధమునకు కాలుదువ్వుచు పాండవులను రెచ్చ గొట్టుచు ఉలూకునిచే సందేశ మంపినవిధము—

ప్రతివాదిపరామర్శము :—

కౌరవసేనలతోబాటు పాండవసేనలుగూడ కురుక్షేత్రమునకు జేరి హిరణ్వతియను ప్రదేశములో నివాసము లేర్పరచుకొనియుండ దుర్యోధనుడు కర్ణశకునిదుశ్శాసనులతో ఆలోచించి శకునిపుత్రుడగు ఉలూకుని తన సందేశము చెప్పి పాండవులయొద్దకు బంపెను. అయు లూకుడు పాండవసభలో ధర్మజునితో—

"దుర్యోధనవచనాత్ శృణు త్వాం న కౌరవ్య మర్దనం ।"

దుర్యోధనునిసందేశము వినుము. నాపై కోపింపకు మని చెప్పు కొనగా ధర్మజుడు- "ఉలూక న భయం తేఽస్తి బ్రూహి త్వం విగత జ్వరః" నీవు భయపడక విస్సంకోచముగా జెప్పు మని పలుక ఉలూకు డిట్లు చెప్ప నారంభించెను—

"ఇదం త్వా మబ్రవీ ద్రాజా ధార్తరాష్ట్రో మహామనాః ।
శ్రుణ్వతాం కురువీరాణాం తన్నిబోధ యుధిష్ఠిర ॥
పరాజితోఽసి ద్యూతేన కృష్ణా చానాయితా సభామ్ ।
శక్యోఽమర్షో మనుష్యేణ కర్తుం పురుషమానినా ॥
ద్వాదశైవ తు వర్షాణి వనే ధిష్ణ్యా ద్వివాసితః ।
సంవత్సరం విరాటస్య దాస్య మాస్థాయ చోషితః ॥
అమర్షం రాజ్యహరణం వనవాసం చ పాండవ ।
ద్రౌపద్యా శ్చ పరిక్లేశం సంస్మరన్ పురుషో భవ ॥"

యుధిష్ఠిరా ! కురువీరులు వినుచుండగా నీతో జెప్పు మని దుర్యోధనుడు నాకు జెప్పిన విషయములు- ద్యూతములో నీవోడింప బడితివి. ద్రౌపది సభ కీడ్వబడినది. పౌరుషముగల మనుష్యుడు ఆవిష యములకు క్రుద్ధుడు కావలసినదే. ద్వాదశవత్సరములు గృహమునుండి తొలగించి వనమందుంచబడితివి. సంవత్సరము విరాటునకు దాసు డవై యుంటివి. ఆక్రోధమును, రాజ్యహరణమును, వనవాసమును, ద్రౌపదీకేశాంబరాకర్షణమును తలచుకొనుచు నీవు పౌరుషము దెచ్చు కొనుము.

"పంచ గ్రామా వృతా యత్నా న్నాస్మాభి రపవర్జితాః ।
యుయుత్సమానైః కథం సంఖ్యే కోపయేమ చ పాండవాన్ ॥
జాతుషే చ గృహే దాహం స్మర తం పురుషో భవ ।
ఏతదర్థం మయా సర్వం కృత మేత ద్యుధిష్ఠిర ॥
కిన్ను యుద్ధా త్పరం లాభం క్షత్రియో బహుమన్యతే ।"

మీరు పంచగ్రామములనే అడిగినను మీకు గోపము రప్పింప వలెననియు, మిమ్ము యుద్ధములోనికి దింపవలెననియు దలచియే మే మివ్వలేదు. అలాగె గృహదహనమును తలచుకొనుము. నీవు

పౌరుషము దెచ్చికొనుము; మీయెడల నే నెప్పుడేమిచేసినను ఈ యుద్ధముకొరకే చేసినాను. యుద్ధముకంటె కోరదగినది క్షత్రియునకు మరే మున్నది ? అని.

భీమసేనునితో జెప్పు మనిన మాటలు—

"విరాటనగరే పార్థ యస్త్వం సూదో హ్యభూః పురా ।
బల్లవో నామ విఖ్యాత స్తన్మమైవ హి పౌరుషమ్ ॥
ప్రతిజ్ఞాతం సభామధ్యే న తన్మిథ్యా త్వయా పురా ।
దుశ్శాసనస్య రుధిరం పీయతాం యది శక్యతే ॥
య ద్బ్రవీషి చ కౌంతేయ ధార్తరాష్ట్రా నహం రణే ।
నిహనిష్యామి తరసా తస్య కాలోఽయ మాగతః ॥
త్వం హి భోజ్యే పురస్కార్యో భక్ష్యే పేయే చ భారత ।
క్వ యుద్ధం క్వ చ భోక్తవ్యం యుధ్యస్వ పురుషో భవ ॥"

ఓ భీమసేనా ! నీవు విరాటనగరములో వంటవాడవయినది నాపరాక్రమముచేతనే. నీవు ఆనాడు దుశ్శాసనుని రుధిరపానమును ప్రతిజ్ఞచేసితివి. చేతనైనచో నీవాపని జేయువలయును. ధార్తరాష్ట్రుల నందరను యుద్ధములో సంహరింతు నని నాడు పలికినావు. ఆసమయ మిదిగో వచ్చినది. నీవు భోజనమునకు ముందువాడవు. యుద్ధ మెక్కడ? భోజన మెక్కడ ? యుద్ధము చేసి నీపౌరుషము జూపుము. అని.

ఇట్లు రెచ్చగొట్టబడిన యీభీమసేను డెట్టివాడు ? 13 సంవత్సరములకు బూర్వము ద్యూతకాలమున దుర్యోధనాదుల దుండగములకు శిక్షగా యుద్ధభూమిలో మిమ్ములను ఈయీవిధముగా వధింతు నని ప్రతిజ్ఞచేసియు, ప్రస్తుత మట్టి యుద్ధము రాకుండవలయునని కోరుచు సంధికై వెళ్ళు కృష్ణభగవానునితో—

యథా యథైవ శాంతి స్స్యా త్కురూణాం మధుసూదన ।
తథా తథైవ భాషేథా మాస్మ యుద్ధేన భీషయేః ॥
నోగ్రం దుర్యోధనో వాచ్య స్సామ్నైవైనం సమాచరేః ।
అపి దుర్యోధనం కృష్ణ సర్వే వయ మధశ్చరాః ॥
నీచై ర్భూత్వాఽనుయాస్యామో మాస్మ నో భరతా నశన్"(ఉద్యో అ 74)

దుర్యోధనుడు సంధికంగీకరించునట్లు సామోపాయముననే చెప్పవలయును. యుద్ధమునకు సంబంధించుమాట లాడవద్దు. కురువంశము నశింపకుండుటకై మేమందరము దుర్యోధనునే అనుసరించియుందుము; అని చెప్పి తన సౌశీల్యమును ప్రకటించినవాడు.

ఓ ప్రతివాదులారా! "భీముడు సాధువా? పశుబలగర్వితమూర్ఖుడు; అవినీతిపరుడు; రాక్షసతుల్యుడు; ద్వేషైకప్రధానుడు" అని వ్రాసిన 'భారతవిమర్శన' కారులారా!

సాధువు శాంతినిగోరు భీముడా? నీవేమిచేయగలవో చేయుమనుచు ఆభీముని రెచ్చగొట్టు మీదుర్యోధనుడా? మూర్ఖుడు భీముడా? దుర్యోధనుడా? అవినీతిపరుడు భీముడా? దుర్యోధనుడా? రాక్షసతుల్యుడు భీముడా? దుర్యోధనుడా? ద్వేషైకప్రధానుడు భీముడా? దుర్యోధనుడా? తెలిసికొనుడు.

ప్రకృతము- అర్జునునితో జెప్పుమనిన మాటలు—

"జానామి తే వాసుదేవం సహాయం జానామి తే గాండీవం తాలమాత్రం।
జానామ్యహం త్వాదృశో నాస్తి యోద్ధా జానాన స్తే రాజ్య మేత ద్ధరామి॥
త్రయోదశసమా భుక్తం రాజ్యం విలపత స్తవ।
భూయ శ్చైవ ప్రశాసిష్యే త్వాం నిహత్య సబాంధవం॥
క్వ తదా గాండీవం తే౽భూ ద్యత్త్వం దాసపణే ర్జితః।
క్వ తదా భీమసేనస్య బల మాసీచ్చ ఫాల్గున॥
సగదా ద్భీమసేనా ద్వా ఫాల్గునాద్వా సగాండివాత్।
నవై మోక్ష స్తదా యోభూ ద్వినా కృష్ణా మనిన్దితామ్॥
సా వో దాస్యే సమాపన్నాన్ మోచయామాస పార్షతీ।
అవోచం యత్ షండతిలా నహం వ స్తథ్య మేవ తత్॥
ధృతా హి వేణీ పార్థేన విరాటనగరే తదా।
సూదకర్మణి చ శ్రాన్తం విరాటస్య మహానసే॥
భీమసేనేన కౌన్తేయ యత్తు తన్మను పౌరుషమ్।
ఏవ మేవ సదా దండం క్షత్రియాః క్షత్రియే దధుః॥
న భయా ద్వాసుదేవస్య నచా౽పి తవ ఫాల్గున।

రాజ్యం ప్రతిప్రదాస్యామి యుధ్యస్వ సహకేశవః॥
వాసుదేవసహస్రం వా ఫాల్గునానాం శతాని వా।
ఆసాద్య మా మమోఘేషుం ద్రవిష్యన్తి దిశో దశ॥
రాష్ట్రాన్నిర్వాసనక్లేశం వనవాసం చ పాండవ।
కృష్ణాయాశ్చ పరిక్లేశం సంస్మరన్ పురుషో భవ॥
యదర్థం క్షత్రియా సూతే సర్వం తదిద మాగతమ్।
బలం వీర్యం చ శౌర్యం చ పరం చాప్యస్త్రలాఘవమ్॥
పౌరుషం దర్శయన్ యుద్ధే కోపస్య కురు నిష్కృతిమ్।
పరిక్లిష్టస్య దీనస్య దీర్ఘకాలోషితస్య చ॥
హృదయం కస్య న స్ఫోటే దైశ్వర్యా ద్భ్రంశితస్య చ।
అమిత్రాణాం వశే స్థానం రాజ్యం చ పున రుద్ధర॥
పరాజితోఽసి ద్యూతేన కృష్ణా చానాయితా సభామ్।
శక్యోఽమర్షో మనుష్యేణ కర్తుం పురుషమానినా॥"

అర్జునా! నీకృష్ణసాహాయ్య మెరుగుదును; నీమహాగాండీవ మెరుగుదును; నీవంటి యోధుడు లేడని యెరుగుదును. ఇదంతయు నెరిగియుండియే నీరాజ్యమును హరించితిని.

నీవు విలపించుచుండగా 13 సంవత్సరములు రాజ్య మనుభవించితిని. మిమ్ముల నందరను వధించి యింకను అనుభవింతును.

ద్యూతములో నీవు దాసుడ వయి కూర్చుండినపుడు నీగాండీవ మేమయినది? మీ భీముని బల మేమయినది? ఆనాడు మీకు విముక్తి ద్రౌపదివలన గలిగెనుగాని నీవలన గలిగినదా? భీమునివలన గలిగినదా? ఆనాడు; మీరు పనికిమాలినవారని నేనన్నది నిజము. విరాటనగరములో జడ వేసికొని నీవు, వంటలవాడయి భీముడు సంచరింపలేదా? మిమ్ముల నట్లు సంచరింపజేసినది నాపౌరుషమే. క్షత్రియులు క్షత్రియులకు జేయున దిట్టిదండనమే.

నీకును, శ్రీకృష్ణునకును భయపడి రాజ్య మిచ్చువాడను గాను; యుద్ధమునకు రమ్ము; వేయిమంది కృష్ణులుగాని, వందలకొలది పార్థులుగాని నన్నెదిరించిననాడు దిక్కులకు పలాయనము కావలసినవారే.

అర్జునా ! నీవు రాజ్యభ్రంశక్లేశమును, వనవాసక్లేశమును, ద్రౌపదీ కేశాంబరాకర్షణక్లేశమును దలచుకొనుచు పౌరుషము దెచ్చికొనుము.

క్షత్రియస్త్రీ కనినందుకు సార్థకము కావలసిన సమయము వచ్చినది. నీబలపౌరుషాదులను యుద్ధములో ప్రకటించి నీకోపమును తీర్చికొనుము. ఐశ్వర్యభ్రష్టుడై దీనుడై దీర్ఘకాల మనేకకష్టములకు పాలైయున్న యెవ్వనికి హృదయము విచ్చిపోకుండును ? శత్రువశమై యున్నరాజ్యమును, జీవితమును పునరుద్ధరణము చేసికొనుము. నీవు ద్యూతములో నోడింపబడినావు; ద్రౌపది సభ కీడ్వబడినది. పౌరుష శాలికి క్రోధాగ్ని ప్రదీపింపవలసినదే. అని.

ఓ ప్రతివాదులారా ! ఈదుర్యోధనుని మాట లాలకించినారా ? పాండవరాజ్యము హరించుట, పాండవధర్మపత్నిని పరాభవించుట, పాండవులను వనవాసాదులచే దుఃఖపెట్టుట, పాండవహత్యకై ప్రయత్నములు చేయుట. ఇవన్నియు తనపౌరుషమునకు చిహ్నములేనట ! పాండవులు ప్రతిఘటింపక సహించుచువచ్చుట వారి నిర్వీర్యతకు నిదర్శన మట !

ఈమాట లాడుటకు అచిరకాలముక్రిందట ఉత్తరగోగ్రహణ సంఘర్షణములో తనకు ప్రత్యక్ష మయినట్టి పార్థుని అసహాయశూరత్వము, తమ పలాయనము మరపునకు వచ్చినవా ? అంతకు బూర్వము ఘోషయాత్రాసంఘటనములోని పాండవపరాక్రమము తమకు ప్రాణదానము చేసినది మరపుకు వచ్చెనా ? దుర్యోధనున కిది గుణమనియే మీకు అనిపించుచున్నదా ?

ఇంకొకటి— తాను చేసిన దుష్కార్యము లుద్ఘాటించునపుడు మీరు చేసిన ఈ యీ నేరమున కీయీపని నేను చేసినా నని చెప్పిన మాట యొక్కటియు గనబడదేమి ? పాండవులయందుగాని, ద్రౌపదీ దేవియందుగాని నేరము లున్నయెడల వాని నుద్ఘాటింపక మానునా ?

పాండవులను పౌరుషము లేనివారనుచు పౌరుషము దెచ్చుకొని మాపై కోపము దీర్చుకొనుటకు యుద్ధమునకు రండని ముష్కరము జూపుటలో వారు నిరపరాధు లని మీకు దోచుటలేదా ? అట్టి పాండవులపై నేరములను మీరెట్లు కల్పింపబూనినారు.

అప్రతిహతపరాక్రమవంతు లయియుండియు, పాండవులు ధర్మ బద్ధులయి దుష్టుల దుండగములను సహించుచువచ్చిన పూజ్యతములని మీ కేల దోచలేదు ? బుద్ధిపూర్వకముగా యుద్ధోపద్రవమును దెచ్చి పెట్టిన విప్లవకారులు దుష్టచతుష్టయ మని మీ రేల గ్రహింపలేదు ?

విప్లవకారులు పాండవు లని కొందరు, శ్రీకృష్ణు డని కొందరు వ్రాతలు సాగించి సారస్వతమున కపచారము చేయుదురా ? పూజ్యు లను అపూజ్యు లందురా ? అపూజ్యులను పూజ్యు లందురా ? శాంతం పాపం !

ప్రకృతము– కృష్ణభగవానునిగూర్చి చెప్పిన మాటలు——

"సభామధ్యే చ యద్రూపం మాయయా కృతవా నసి ।
తత్తథైవ పునః కృత్వా సార్జునో మా మభిద్రవ ॥
వయ మప్యుత్సహేమ ద్యాం ఖం న గచ్ఛేమ మాయయా ।
దర్శయేమ చ రూపాణి స్వశరీరే బహూ న్యపి ॥
యస్తు శత్రు మభిజ్ఞాయ శుద్ధం పౌరుష మాస్థితః ।
కరోతి ద్విషతాం శోకం స జీవతి సుజీవితమ్ ॥
అకస్మాచ్చైవ తే కృష్ణ ఖ్యాతం లోకే మహ ద్యశః ।
అద్యేదానీం విజానీమ స్సన్తి షండా స్స శృంగకాః ॥

టీ– సశృంగకాః=శృగం పుంస్త్వచిహ్నం శ్మశ్రుత్వ లింగవత్త్వాదికం తత్సహితాః షండాః నిర్వీర్యాస్సన్తి. యేషు తవ శౌర్యం ప్రఖ్యాత మితి భావః

"యద్విధో నాపి నృపతి స్త్వయి యుక్తః కథంచన ।
సన్నాహం సంయుగే కర్తుం కంసభృత్యే విశేషతః ॥

కృష్ణా ! నీవు కురుసభలో ధరించిన మాయారూపమును మరల ధరించి అర్జునునితోగూడ నామీదకు రమ్ము. మేము గూడ మాయలు చేయగలము. మా శరీరముపై బహురూపములను చూపగలము,

శత్రువును దెలిసికొని శుద్ధమైన పౌరుషముతో శత్రువులను శోకింప జేయువాని జీవితమే జీవితము. కృష్ణా! లోకములో విఖ్యాతమైన మహాయశస్సు నీకు అకస్మాత్తుగా (అదృష్టమునుబట్టి) వచ్చినది. నాడు నీచే నదుర్కొనబడినవారు పురుషాకృతితో నున్న నిర్వీర్యు లని నేడు నేను గ్రహించితిని. కంసభృత్యుడ వయిన నీయందు యుద్ధసన్నాహము చేయగల నావంటి నరపతి లేకపోయెను. అని.

ఓ ప్రతివాదులారా! ఇట్లు నకులసహదేవులను, విరాటద్రుపదులను, శిఖండిధృష్టద్యుమ్నులను మీ రేమి చేయగలరో వచ్చి చేయుడు అనుచు రెచ్చగొట్టెను.

ఈ దుర్యోధనుని ధోరణి- "వినాశకాలే విపరీతబుద్ధిః" "బుద్ధిః కర్మానుసారిణీ" అనుసూక్తులకు నిదర్శనముగా నున్నదా? లేదా?

ఈ దుర్యోధనుడు పుట్టినపుడు గోచరించిన యుత్పాతములను బట్టి యీతని భవితవ్య మెట్లుండు నని యడిగిన తండ్రితో—

"వ్యక్తం కులాన్తకరణో భవితైవ సుత స్తవ"

ఈ నీపుత్రుడు కులాంతకు డగునని చెప్పిన జ్యోతిర్విదుల వాక్యమునకు సరిపడియున్నదా? లేదా?

ఈ దుర్యోధనసందేశముపై భీమసేనుడు చెప్పిన మాటలు—

"అస్మాభిః ప్రీతికామై స్తు భ్రాతుః శ్రేష్ఠస్య నిత్యశః ।
మర్షితం తే దురాచార త త్త్వం న బహు మన్యసే ॥
ప్రేషితశ్చ హృషీకేశ శ్శమాకాంక్షీ కురూన్ ప్రతి ।
కులస్య హితకామేన ధర్మరాజేన ధీమతా ॥
త్వం కాలచోదితో నూనం గన్తుకామో యమక్షయమ్ ।
గచ్ఛ స్వ్వాహవ మస్మాభి స్తచ్చ శ్వో భవితా ధ్రువమ్ ॥

ఓ దుర్యోధనా! ఓ దురాచారా! మేము మాయుధిష్ఠిర ప్రభువుయొక్క ప్రీతికై నీదుశ్చేష్టలను సహించినాము. అది నీకు తెలియకున్నది. కురువంశక్షేమము గోరి మాధర్మప్రభువు సంధికై

శ్రీకృష్ణుని బంపెను. కాలప్రేరితుడ వైన నీవు యమసన్నిధినే కోరు చున్నావు. ఇక నీకిష్టమైన యుద్ధమునే కానిమ్ము; అది రేపే జరుగును. అని. ధర్మజుడు చెప్పిన మాటలు—

"న చాఽహం కామయే పాప మపి కీటపిపీలయోః ।
కింపున ర్జ్ఞాతిషు వధం కామయేయం కథంచన ॥
ఏతదర్థం మయా తాత పంచ గ్రామా వృతా పురా ।
కథం తవ సుదుర్బుద్ధే న ప్రేక్షేయ వ్యసనం మహత్ ॥
టీ- కథ మితి । హే సుదుర్బుద్ధే తవ వ్యసనం మరణాగమం కథ మపి న ప్రేక్షేయ ఇతి హేతోః పంచ గ్రామా వృతా ఇతి సంబంధః ।
త్వత్కృతం వాక్యం గృహీత్వోఽర్థో మతం యా త్తే తథాస్తు తత్ ।"

ఓదుర్బుద్ధీ! కృమికీటకముల కయినను హానిని గోరనట్టి నేను జ్ఞాతివర్గముయొక్క హాని జరుగకుండుటకై ఆలోచించి నీమరణ ప్రాప్తిని జూడలేక పంచగ్రామములను మాత్రమె కోరియున్నాను. దానినిగూడ త్రోసివేసిన నీధోరణి తెలిసినది. ఇక నీయుద్ధమనోరథ మునే తీర్చెదను. అని.

ఇది జూడగా యుద్ధోపద్రవమును బుద్ధిపూర్వకముగా తెచ్చి పెట్టినది దుష్టచతుష్టయ మని స్పష్టమగుచున్నది.

—♦ భగవద్గీతానాటకపరామర్శము ♦—

ఓభగవద్గీతానాటకకర్త లారా! ఈయుధిష్ఠిర, భీమసేనప్రతివచనము లాలకించినారా? దీనినిబట్టి దుష్టచతుష్టయుక్రూరహింసలకు పాండవులు ప్రతిహింస లాచరించినా రని మీకు అనిపించినదా? అహింస నవలంబించినా రని యనిపించినదా?

పాండవుల పంచగ్రామసంధి, శ్రీకృష్ణుని రాయబారము మీకు ప్రతిహింసాదృష్టి యనిపించినదా? అహింసాదృష్టి యనిపించినదా?

మీరు అశ్వత్థామవాక్యముగా—

"ఐదుగ్రామంబులని వాదులాడి రాయబార మని గొల్లబుద్దులు పలికి యూధ లోకమును మోసగింతువుగాక, రాజనీతివిమత నా? బుట్టలో వైతు వీవు"

అనుచు శ్రీకృష్ణుని నిరసించినారే!

"నీవు ధూర్తరాజమ్మన్యుడవు... నేటికి రాజకీయవేత్త వయినావు. నిర్వాణ ప్రదమగు బ్రహ్మవిద్యను కర్మయోగమను మిషతో అత్యాచారములకు ఘోర హింసాకర్మలకు ప్రాతిపదిక గావించిన మహాజ్ఞానివి."

అని హద్దుమీరి కవిత్వమల్లినారే! ఈయశ్వత్థామ వాక్యములకు—

"నీ వనినట్లు ఈమహాసంగ్రామమునకు నేనే కర్తను"

అని శ్రీకృష్ణునిచే అనిపించినారే! ఓహో! శ్రీకృష్ణస్వరూపమును అట్లు చిత్రించిన మీబుద్ధి చాల గొప్పది. శ్రీకృష్ణునిది మహాజ్ఞాన మనిపించిన మీజ్ఞానము లోకాతీతము. శ్రీకృష్ణోపదిష్టమగు భగవద్గీతయొక్క పరమతాత్పర్యము ఆశ్రీకృష్ణునకు గాక మీకే లోతుగా దెలిసిన దని మాకు బోధపడినది.

అయితే అది నిర్వాణప్రదమగు బహ్మవిద్యయా? దానిని కర్మయోగ మను మిషతో అత్యాచారములకు, ఘోరహింసలకు ప్రాతిపదిక గావించెనా? అయితే మీరు—

"నీమనోవైకల్యము నడంపజాలు ఉపనిషత్సారమును సంక్షేపముగ విశదీకరింతును"

అని శ్రీకృష్ణుడు పార్థునకు జెప్పి గీత నుపదేశించినట్లు వ్రాసిరే! ఈవ్రాతనుబట్టి ఉపనిషత్సారమే గీత యనియు, అది పార్థుని మనోవైకల్యనివారణమునకే ఉపదేశింపబడిన దనియు తేలినది.

ఇట్టి స్థితిలో అది అత్యాచారములకు ఘోరహింసలకు ప్రాతిపదిక గావింపబడిన దనుమాట యెట్లు సరిపడును?

అత్యాచారహింసలకే మనోవైకల్యము వహించి పార్థుడుండ అట్టి హింసనే బోధించు గీత యాతని మనోవైకల్యమును తొలగింపగలుగు టెట్లు?

యుద్ధము హింసాకృత్య మనిపించుటచే పార్థునకు మనోవైకల్యము (శోకమోహములు) ఏర్పడెను. అది హింసాకృత్యము కానేర దని ప్రతిపాదించియే గీత మనోవైకల్యమును తొలగింపగలిగిన దన వలయును. అది హింసాకృత్యము కాకపోవుటకు స్వధర్మ మగుటే హేతువని గీత నిరూపించిన దనవలయును. "చోదనాలక్షణోఽర్థో

ధర్మః" అను ధర్మనిర్వచనమునుబట్టి యెవ్వనిగూర్చి యేది విధింపబడెనో అదియే యాతనికి స్వధర్మ మని తెలిసికొనవలయును.

ఈవిషయమే— "శ్రేయాన్ స్వధర్మో విగుణః" అని, "స్వధర్మే నిధనం శ్రేయః" అని, "స్వధర్మమపి చావేక్ష్య న వికంపితుమర్హసి" అని, ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్ క్షత్రియస్య న విద్యతే" అని గీతచే ప్రతిపాదింపబడినదని గ్రహింపవలయును.

దీనికిసంబంధించియే ప్రవృత్తిధర్మమైన కర్మమార్గము, నివృత్తిధర్మమైన జ్ఞానమార్గము ఉపదేశింపబడిన దని తెలుసుకొనవలయును. ఈగీతోపదేశ మయినతరువాత పార్థుడు—

"నష్టో మోహః స్మృతి ర్లబ్ధా త్వత్ప్రసాదా న్మయాఽచ్యుత!
స్థితోఽస్మి గతసందేహః ... ... ... ॥"

అని చెప్పుటలో తన మనోవైకల్యము (శోకమోహములు) పోయి విషయజ్ఞాన మేర్పడి, అవశ్యకర్తవ్యమై వచ్చిపడిన యుద్ధము ధర్మమా? అధర్మమా? అని బాధించిన సందేహము తొలఁగిపోయినట్లు వెల్లడించుటచే శ్రీకృష్ణుని గీతోపదేశము, దుర్యోధనుని మూలమున తప్పక వచ్చిన యుద్ధములో స్వతః ప్రవృత్తుఁడయిన పార్థునకు ధర్మాధర్మసందేహనివారకమె కాని, బలాత్కారముగా ప్రవర్తింప జేసినది కాదని తెలిసికొనవలయును. ఆబలాత్కారముగా ప్రవర్తింప జేసినవారు కర్ణదుర్యోధనులని తెలిసికొనవలయును. అంతవరకు హింసకు ప్రతిహింసాపద్ధతి మాని అహింసాపద్ధతినే అవలంబించి 13 సంవత్సరములపాటు మీరన్నట్లు క్రాంతిని గాక శాంతినే వహించి మీరు మారాజ్యమంతయు నుంచుకొనినైనను మాకయిదు గ్రామముల నిచ్చినచో సంతోషింతుమని రాయబారములు పంపిన అజాతశత్రు వంతటివానికి కర్ణదుర్యోధనాదులపట్ల అహింసాపద్ధతి నిరుపయోగ మయ్యెను.

అంతకంటెను చిత్రము— పాండవుల అహింస మీబుద్ధులకు హింస యనిపించినది. పాండవుల పంచగ్రామప్రార్థనము మీబుద్ధులకు లోకవంచనార్థ మనిపించినది. శ్రీకృష్ణుని రాయబారము మీబుద్ధులకు గొల్లసుద్దు లనిపించినది.

పాండవులు పౌరుషహీనులని, శ్రీకృష్ణుడు వంచకుడని దుర్యోధనునకు అనిపించినపుడు మీకు మాత్రము ఎందుల కనిపింపదు? 'నేటికి రాజకీయవేత్త వయినావు' అని శ్రీకృష్ణునియందు మీరు వాడినమాట మీప్రాజ్ఞతావిశేషమును చాటుచున్నది.

"ఈ నీచహత్యాకాండలకు కర్తయైన దెవరు? నేను కాదా? నాగీతోపదేశమే మూలమంత్రము కాదా? అమాయక ప్రజాసంఘము దైవత్వము నారోపించి నన్ను పూజించినందులకు ఇదియా నావిధ్యుక్తధర్మము? ఎంత గర్హణీయము!"

అని శ్రీకృష్ణునిచే అనిపించిన మీమాటలు—"వచనం శ్రోత మాఖ్యాతి" అను న్యాయమున మీపాండిత్యమును ప్రకటించుటకు మచ్చుతునకలై యున్నవి.

ఆభగవద్గీత యేమి? ఆమహాభారత మేమి? వానియందు విపరీతభావన కలుగుట యేమి? "అరసికాయ కవిత్వనివేదనం శిరసి మాలిఖ మాలిఖ మాలిఖ" అను మహాకవినూక్తి స్మృతికి వచ్చుచున్నది.

అయ్యా! మీనాటకములో శ్రీకృష్ణుని వాక్యములు—

"హింస నరికట్టునది ప్రతిహింస కాదు-అహింస; శత్రుత్వమును నిగ్రహించునది మిత్రత్వము; క్రాంతిని దప్పించునది శాంతి"

అనికదా? ఈపద్ధతి దుర్యోధనునియందు వ్యర్థమైనదని మీరొప్పుకొనక తప్పదు. అహింసతో కార్యసిద్ధి, రాజ్యప్రాప్తి యెట్లు? యుద్ధమైపోయినతరువాత మీరు ఈమాట లనిపించుటలో విశేషమేమి?

అనివార్యముగా వచ్చిపడిన యుద్ధములో స్వధర్మ మగుటవలన ప్రవర్తింపక తప్పినదికాదు. యుద్ధానంతరము జయప్రదమైన ధర్మము పట్ల, స్వధర్మముపట్ల ధర్మస్వరూపాభిజ్ఞుడైన శ్రీకృష్ణునకు భిన్నాభిప్రాయ మేల? పశ్చాత్తాప మేల?

ఇట్టి పశ్చాత్తాపి, ఇట్టి స్వయంకృతాపరాధియు నయి "అమా

యకప్రజాసంఘము దైవత్వము నారోపించి నన్ను పూజించి నది" అని తుదకు తన్ను దేవుడనుకొని లోకము మోసపోయినట్లు ఖేద పడిన విధముగా చిత్రింపబడిన శ్రీకృష్ణునకు మీచే భావియవతార ముగా గల్పింపబడిన విషయమునందు ఏమి విశేషము ప్రాప్తించినట్లు?

మీరన్న భావియవతారముయొక్క ప్రతిష్ఠ కయినను శ్రీకృష్ణుడు మీమతమునుబట్టికూడ భగవంతు డనవలసినవాడే.

ఇట్టి స్థితిలో అభగవంతు డయిన శ్రీకృష్ణుడు ఆడినమాటలుగా- "నాభావియవతార మెంత వ్యత్యస్తమో గమనింపుడు. మోహనదేవు డను గాదు; మోహనదాసుడను" అని మీరనిపించుటలో అది భగ వంతునకు వ్యత్యస్తావతారము అను భావముగూడ కలిగిపోవుచున్నదే! ఇది యేమి బాగున్నది? మన మెవ్వని బూజింతుమో వానిని సాక్షా ద్భగవదవతార మందుము కాని వ్యత్యస్తావతార మందుమా? మత్స్య కూర్మవరాహావతారములనుగూడ వ్యత్యస్తావతారము లనక భగవ దవతారము లనియే అందుమే!

ఇంకొకటి- రాజకీయముగా వాడబడిన మీ అహింసాశబ్దము లోని హింస యెట్టిది? యెన్నివిధములు? చూడుడు—

వేదోక్తేనైవ మార్గేణ వినా సత్యతపోధన ।
కాయేన మనసా వాచా హింసా హింసా నచాఽన్యథా ॥

వ్యాఖ్యానము:— శారీరహింసాయా ఏవ హింసాత్వం, న పున ర్వాచికమానసి కయో రితి భ్రమనిరాసాయ తద్భేదానాహ కాయేనేతి.

సా ప్రత్యేకం త్రివిధా, స్వయంకృతా, అన్యేన కారితా, కేవలమనుమోదితా చేతి నవధా, తత్ర ప్రత్యేకం త్రివిధా—లోభమూలా, క్రోధమూలా, అజ్ఞాన మూలా చేతి సప్తవింశతిధా. తాసామప్యేకైకా త్రివిధా—మృదుమాత్రా, మధ్యమాత్రాధిమాత్రా చేతి ఏకాశీతిర్హింసాభేదాః.

(సూతసంహితా—మాధవీయవ్యాఖ్యా)

వేదోక్తము కానట్టిదే హింస యనబడును. ఆ హింస- కాయి కము, వాచికము, మానసికము అని మూడువిధములై యున్నది.

అందు ఒక్కటి స్వయంకృతమని, అన్యకారితమని, అనుమోదితమని త్రివిధమై, మొత్తము తొమ్మిదిరకములు. ఆతొమ్మిదికూడ ఒక్కొక్కటి లోభమూలకమని, క్రోధమూలకమని, అజ్ఞానమూలకమని త్రివిధమై యిరువదియేడురకములు. అవికూడ ఒక్కొక్కటి మృదుమాత్ర, మధ్యమాత్ర, అధికమాత్రభేదమున త్రివిధమై 81 రకములు కలిగి హింస యున్నది, అని చెప్పబడినది.

దీనినిబట్టి హింస శారీరమే అయియుండలేదు. మనోవ్యాపారములో హింస యున్నది. వాగ్వ్యాపారములో హింస యున్నది. అది స్వయంకృతముగా నున్నది. అన్యకారితముగా నున్నది. అనుమోదితముగా నున్నది. అట్టి హింసలేనట్టి అహింస హింస వరికట్టునా? అరికట్టునా? శతుత్వమును నిగ్రహించెనా? నిగ్రహించునా? అవి దుర్యోధనునిపట్ల పనికిరాలేదనియె మహాభారత ముద్ఘోషించుచున్నది. అహింసాసత్యశాంతులలో పరినిష్ఠితులు, పాండవులతో సమానులు లేరనియె చాటుచున్నది. కనుక మీరు వ్రాసిన దయుక్తము.

ఇంకొకటి—మీనాటకములో—పార్థునకు మాత్ర ముపదేశింపబడిన గీతతో నెట్టి సంబంధము లేనట్టి యశ్వత్థామ గీతను నిరసించినట్లు కల్పించుటలో అశ్వత్థామ పాత్ర పాడయినది. అశ్వత్థామయొక్క అసంబద్ధోక్తులకు మూకీభావము కల్పించి శ్రీకృష్ణుని కూర్చుండబెట్టుటలో శ్రీకృష్ణపాత్ర పాడయినది. భీష్ముని గూర్చి చెప్పుటలో మేము వెనుక జూపినట్లు—భీష్ముని నేను వధింతు నని ఖడ్గము దీసికొని ద్రౌపదీదేవి బయలుదేరినట్లు కల్పింపబడుటచే ద్రౌపదీపాత్ర పాడయినది. ఇట్లు పాత్రౌచిత్యమూ పాడయినది. భారతార్థమూ భగ్నమైనది. భగవద్గీతార్థమూ భ్రష్టమయినది. కాబట్టి భగవద్గీతానాటకము నిరస్తమైనది.

సారాంశము—సంజయుని రాయబారములోని ధృతరాష్ట్రోపదేశప్రకారము భిక్షాటనము చేసికొని జీవించుట పాండవులకు అధర్మ

మగుటచేత తమరాజ్యమునుగాని, అయిదుగ్రామములనుగాని యివ్వక యుద్ధమునకే కాలుదువ్విన దుర్యోధనునిబట్టి అనివార్యముగా వచ్చి పడిన యుద్ధములో స్వధర్మ మగుటచేత పాండవులు ప్రవేశించినారు.

—: భారత మహాయుద్ధఘట్టము-భీష్ముని సేనానాయకత్వము :—

దుర్యోధనుడు యుద్ధమునకు సిద్ధమయి భీష్మపితామహునియొద్దకు వెళ్ళి నీవు సేనానాయకుడవై మా కంగరక్షకుడవు కావలయును. అని ప్రార్థింప భీష్ము డిట్లనెను—

"ఏవ మేత న్మహాబాహో యథా వదసి భారత ।
యథైవ హి భవన్తో మే తథైవ మమ పాండవాః ॥
అపి చైవ మయా శ్రేయో వాచ్యం తేషాం నరాధిప ।
సంయోద్ధవ్యం తవార్థాయ యథా మే సమయః కృతః ॥
నహి పశ్యామి యోద్ధార మాత్మన స్సదృశం భువి ।
ఋతే తస్మా న్నరవ్యాఘ్రా త్కున్తీపుత్రా ద్ధనంజయాత్ ॥
స హి వేద మహాబుద్ధి ర్దివ్యా న్యస్త్రా ణ్యనేకశః ।
న తు మాం (1) వివృతో యుద్ధే జాతు యుధ్యేత పాండవః ॥
అహం చైవ క్షణేనైవ నిర్మనుష్య మిదం జగత్ ।
కుర్యాం శస్త్రబలేనైవ ససురాసురరాక్షసమ్ ॥
నత్వేవో (2) త్సాదనీయా మే పాండోః పుత్రా జనాధిప ।
(3) తస్మా ద్యోధాన్ హనిష్యామి ప్రయోగేణా ఽయుతం(3)సదా ॥
సేనాపతి స్త్వహం రాజన్ సమయేనా ఽపరేణ తే ।
భవిష్యామి యథా కామం త న్మే శ్రోతు మిహార్హసి ॥
కర్ణో వా యుధ్యతాం పూర్వ మహం వా పృథివీపతే ।
స్పర్ధతే హి సదా ఽత్యర్థం సూతపుత్రో మయా రణే ॥"

టీ. (1) విస్పష్టో భూత్వా, (2) నాశయితుం శక్యాః, 3 ప్రత్యహమ్.

దుర్యోధనా! నీవన్నట్లు చేసెదను. నేనొకటి నిశ్చయించుకొని యున్నాను. నాకు మీరెట్టివారో పాండవులును అట్టివారే. కనుక నీపక్షమున యుద్ధముచేయుచు పాండవులకు శ్రేయస్కరమగు మార్గమును ఉపదేశించుచుండుట నాకు కర్తవ్యముగా పెట్టుకొనినాను.

నాకు సమానమయిన ప్రతియోధుడు పార్థుడుతప్ప మరియొకడు కనబడడు. ఆపార్థుడు అనేకదివ్యాస్త్రసంపత్తిగలవాడు, మహాబుద్ధిగలవాడు, నాతో ప్రత్యక్షముగా యుద్ధము జేయదలంపనివాడు. నేను శస్త్రబలముచేతనే క్షణములో జగత్తును నిర్మానుష్యముగా జేయగలుగుదును. కాని పాండవులనుమాత్రము నశింపజేయుట శక్యముకాదు.

కాబట్టి నేను నిహతుడను కానంతవరకు ప్రతిదినము పదివేల మంది యోధులను వధింతును. ఈ నిర్ణయముపై నేను సేనానాయకత్వము వహింతును. ఇంకొక నిర్ణయ మున్నది వినుము— నాతో అత్యంతస్పర్ధ పెట్టుకొనియున్న కర్ణుడయినను ముందు యుద్ధములోనికి దిగవలయును. నేనయినను దిగవలయును. అని. అదివిని కర్ణుడిట్లనెను—

"నాహం జీవతి గాంగేయే రాజన్ యోత్స్యే కథంచన ।
హతే భీష్మే తు యోత్స్యామి సహ గాండీవధన్వనా ॥"

దుర్యోధనా! భీష్ముడు జీవించియుండగా నేను యుద్ధము జేయను. భీష్ముడు హతుడు కావలెను. నేను పార్థునితో యుద్ధము చేయవలెను. అని.

తరువాత భీష్ముడు చెప్పిన నిర్ణయమునకు బద్ధుడయి దుర్యోధనుడు భీష్మునకు సేనానాయకత్వ మిచ్చెను.

మహాయుద్ధము జరిగిన 18 రోజులలో 10 రోజులు భీష్ముని నాయకత్వము మీదనే గడచినవి.

అందు మూడవరోజున భీమసేనబాణాఘాతమున మూర్ఛితుడయిన దుర్యోధనుడు సారథిచేత దూరముగా దీసికొనిపోబడి తేప్పరిల్లినతరువాత యుద్ధమునకు వచ్చి పాండవవీరులచేత తనసేనలు తరుమబడుచుండుట జూచి—

"అబ్రవీత్ త్వరితో గత్వా భీష్మం శాన్తనవం వచః ।
నానురూప మహం మన్యే త్వయి జీవతి కౌరవ ॥
ద్రోణే చాఽస్త్రవిదాం శ్రేష్ఠే సపుత్రే ససుహృజ్జనే.

న పాండవాన్ ప్రతిబలాం స్తత మన్యే కథంచన ॥
అనుగ్రాహ్యాః పాండుసుతా స్తవ నూనం పితామహ ।
సోఽస్మి వాచ్య స్త్వయా రాజన్ పూర్వమేవ సమాగమే ॥
న యోత్స్యే పాండవాన్ సంఖ్యే నాపి పార్షతసాత్యకీ ।
శ్రుత్వా తు వచనం తుభ్య మాచార్యస్య కృపస్య చ॥
కర్ణేన సహితః కృత్యం చిన్తయాన స్తదైవ హి ॥"

టీ. చిన్తయానః అభవిష్య మితిశేషః .

భీష్మునియొద్దకు త్వరితముగా వెళ్ళి "పితామహా! నీవు జీవించి యుండ, సపుత్రకు డగు ద్రోణాచార్యుడు జీవించియుండ మన కిట్టి యప జయము భావ్యము గాదు. నీకు పాండవులు ఏవిధమునను జాలరు. నీవు నిజముగా వారి ననుగ్రహించుచున్నావు. పాండవసాత్యకిధృష్ట ద్యుమ్నులతో నేను యుద్ధముచేయ నని నీవు, ద్రోణుడు, కృపుడు ముందే చెప్పియున్నచో నేను కర్తవ్యమును కర్ణునితో ఆలోచించి యుండెడివాడను" అని పలికి పితామహా! నన్ను నీవు విడిచిపెట్టని వాడ వయినచో నీపరాక్రమమును ప్రకటింపవలయును. అని కోరెను. అప్పుడు రోషము వచ్చి భీష్ము డిట్లనెను—

"బహుశోఽపి మయా రాజం స్తథ్య ముక్తో హితం వచః ।
అజేయాః పాండవా యుద్ధే దేవై రపి సవాసవైః ॥
యత్తు శక్యం మయా కర్తుం వృద్ధేనాఽద్య నృపోత్తమ ।
కరిష్యామి యథా శక్తి ప్రేక్షేదానీం సబాన్ధవః ॥ (భీష్మ- అ 58)

దుర్యోధనా! పాండవులు అజేయు లని బహుపర్యాయములు నీకు నేను నిజము చెప్పియున్నాను. వృద్ధుడనైన నేనిప్పుడు ఎంతచేయ గలుగుదునో చేయుదును చూడుము. అని.

ఇట్లు చెప్పి భీష్ముడు విజృంభించి పాండవసేనలను పారదోలుచు బడగొట్టుచు వీరవిహారము చేయుచుండ—"తతస్తు కృష్ణ స్సమరే దృష్ట్వా భీష్మపరాక్రమమ్ । పార్థస్య మృదుయుద్ధతామ్ ।" శ్రీకృ ష్ణు డా భీష్ముని తైక్ష్ణ్యమును, పార్థుని మృదుయుద్ధమును పరిశీలించి

యిక లాభము లేదనియు, తానే భీష్మునిపై నురుకవలె ననియు సంక ల్పించి సాత్యకితో—"భీష్మం రథా త్పశ్య నిపాత్యమానం" ఇదిగో భీష్ముని రథమునుండి పడగొట్టుచున్నాను. చూడు మని చెప్పుచు—

"క్షురాన్త ముద్యమ్య భుజేన చక్రం రథా దవప్లుత్య విసృజ్య వాహాన్ ।
...... వేగేన కృష్ణః ప్రససార భీష్మమ్ ॥
ఉవాచ భీష్మ స్త మనన్తపౌరుషం గోవిన్ద మాజా వవిమూఢచేతాః ।
ఏహ్యేహి దేవేశ జగన్నివాస నమోఽస్తు తే మాధవ చక్రపాణే ॥
ప్రసహ్య మాం పాతయ లోకనాథ రథోత్తమాత్ సర్వశరణ్య సంఖ్యే ।
త్వయా హతస్యాపి మమాద్య కృష్ణ శ్రేయః పరస్మి న్నిహ చైవ లోకే ॥"

శ్రీకృష్ణుడు- చక్రముబట్టి అశ్వములను విడచి, రథమునుండి యురికి భీష్మునిమీదకు వేగముతో వెళ్ళుచుండ భీష్ముడు— ఓ జగ న్నివాసా ! ఓదేవదేవా ! ఓచక్రపాణీ ! వందనము. రారమ్ము. ఓసర్వ శరణ్యా ! రథమునుండి నన్ను బలాత్కారముగా బడగొట్టుము. నీచేత హతుడనయినను ఈభీష్మునకు శ్రేయస్సే. అని పలుకుచుండెను.

అంతలో శ్రీకృష్ణుని వెనువెంటనే రథమునుండి యురికి వచ్చు చున్న పార్థుడు– "జగ్రాహ పీనోత్తమలంబబాహుం బాహ్వో ర్హరిం వ్యాయతపీనబాహుః" శ్రీకృష్ణుని సందిట బట్టుకొనెను. శ్రీకృష్ణుడు పార్థునిగూడ లాగికొనిపోవుచుండెను.

పార్థ స్తు విష్టభ్య బలేన పాదౌ ... బలా న్నిజగ్రాహ హరిం కిరీటీ ।
... పదేఽథ రాజన్ దశమే కథంచిత్ ॥

పార్థు డప్పుడు శ్రీకృష్ణుని పాదములకు తనబాహువులను పెనివైచి పట్టి పదియవ అడుగులో అతికష్టముమీద ఆపకలిగెను. ఆపినమీదట పార్థుడు నమస్కరించి యిట్లనెను—

"న హాస్యతే కర్మ యథాప్రతిజ్ఞం పుత్రైశ్శపే కేశవ సోదరై శ్చ ।"

శ్రీకృష్ణా ! నాప్రతిజ్ఞను నిర్వహింతును; నే నుపేక్షింపబోను; నాపుత్రులతోడు; నాసోదరులతోడు. అని.

అటుపై శ్రీకృష్ణుడు వెనుకకు మరలి యథాప్రకారము రథ

మధిష్ఠింప పార్థు డుద్దీపించి భీష్మాది మహావీరులపై డీకొని వీరుల నెంద రినో వధించి కౌరవసేనలను పారదోలెను.

అష్టమదివసమునాటిరాత్రి—దుర్యోధనుడు కర్ణశకునిదుశ్శాస నులతోగూడి ఆలోచించుచు పాండవులను జయించుట యెట్లు ? మన బలము క్షీణించుచున్నది. అని యడుగ కర్ణు డిట్లనెను—

"నివృత్తే యుధి గాంగేయే న్యస్తశస్త్రే చ భారత।
అహం పార్థాన్ హనిష్యామి సహితాన్ సర్వసోమకైః॥
పశ్యతో యుధి భీష్మస్య శపే సత్యేన తే నృప।
పాండవేషు దయాం నిత్యం స హి భీష్మః కరోతి చ॥
అనుమాన్య గురుం వృద్ధం శస్త్రం న్యాసయ భారత।"

దుర్యోధనా ! భీష్ముడు శస్త్రసంన్యాసము జేసినయెడల భీష్ముడు జూచుచుండ నే నొక్కడనే పాండవుల నందరను వధింతును. సత్యము తోడు. భీష్ముడు నిత్యము పాండవులయందు దయజూపెడివాడు. పెద్ద వాడయి, వృద్ధుడయి యున్న భీష్ముని అనుమతింపజేసి నీవు అతనిచే శస్త్రసంన్యాసము జేయింపుము. అని.

దుర్యోధను డది విని అప్పుడే సపరివారముగా భీష్ముని శిబిరము నకు వెళ్ళి నమస్కరించి కన్నీరుపెట్టుకొనుచు—

"దయయా యది వా రాజన్ ద్వేష్యభావా న్మమ ప్రభో।
మన్దభాగ్యతయా వాపి మమ రక్షసి పాండవాన్॥
అనుజానీ హి సమరే కర్ణ మాహవశోభినమ్।
స జేష్యతి రణే పార్థాన్ ససుహృద్గణబాన్ధవాన్॥"

మహానీయా ! పాండవులయందు దయచేతనో, నాయందు ద్వేషముచేతనో, నాదురదృష్టముచేతనో నీవు పాండవులను రక్షించు చున్నావు. కర్ణునకు అనుజ్ఞ నిచ్చి నీవు తప్పుకొనుము. అతడు పాండవు లను అందరను జయించును. అని పలికెను. అది విని భీష్ముడు దుఃఖితుడై రోషముతో కొంచెము సేపు ధ్యానించి దుర్యోధనునితో నిట్లు పలికెను—

కిం త్వం దుర్యోధనైవం మాం వాక్శల్యై రవకృన్తసి।
ఘటమానం యథాశక్తి కుర్వాణం చ తవ ప్రియమ్॥
జుహోమ్యవం సమరే ప్రాణాన్ తవ వై ప్రియకామ్యయా।
యదా తు పాండవ శ్శూరః ఖాండవేఽగ్ని మతర్పయత్॥
పరాజిత్య రణే శక్రం పర్యాప్తం త న్నిదర్శనమ్।
యదా చ త్వాం మహాబాహో గన్ధర్వై ర్హృత మోజసా॥
అమోచయ త్పాండుసుతః పర్యాప్తం త న్నిదర్శనమ్।
ద్రవమాణేషు శూరేషు సోదరేషు తవ ప్రభో॥
సూతపుత్రే చ రాధేయే పర్యాప్తం త న్నిదర్శనమ్।
యచ్చ న స్సహితాన్ సర్వాన్ విరాటనగరే తదా॥
ఏక ఏవ సముద్యాతః పర్యాప్తం త న్నిదర్శనం।
ద్రోణం చ యుధి సంరబ్ధం మాం చ నిర్జిత్య సంయుగే॥
వాసాంసి స సమాదత్త పర్యాప్తం త న్నిదర్శనం।
తథా ద్రౌణిం మహేష్వాసం శారద్వత మథాపి చ॥
గోగ్రహే జితవాన్ పూర్వం పర్యాప్తం త న్నిదర్శనం।
విజిత్య చ యదా కర్ణం సదా పురుషమానినమ్॥
ఉత్తరాయై దదౌ వస్త్రం పర్యాప్తం త న్నిదర్శనం।
నివాతకవచాన్ యుద్ధే వాసవేనాపి దుర్జయాన్॥
జితవాన్ సమరే పార్థః పర్యాప్తం త న్నిదర్శనం।
కో హి శక్తో రణే జేతుం పాండవం రథినం తదా॥
యస్య గోప్తా జగద్గోప్తా శంఖచక్రగదాధరః।
వాసుదేవోఽనన్తశక్తి స్సృష్టిసంహారకారకః॥
సర్వేశ్వరో దేవదేవః పరమాత్మా సనాతనః।
ఉక్తోఽసి బహుశో రాజన్ నారదాద్యై ర్మహర్షిభిః॥
త్వం తు మోహా న్న జానీషే వాచ్యావాచ్యం సుయోధన।
స్వయం వైరం మహ త్కృత్వా పాండవై స్సహ సృంజయైః॥
యుధ్యస్వ తా నద్య రణే పశ్యామః పురుషో భవ।
సుఖం స్వపిహి గాన్ధారే శ్వోఽపి కర్తా మహారణమ్॥

ఓ దుర్యోధనా! నీప్రీతికై ప్రాణములొడ్డి యావచ్ఛక్తిని వినియోగించుచున్న నన్ను మాటలచే వేధించుచుంటివే! నా యుపే

డియో, పార్థుని పరాక్రమమో నీకు దెలియుటలేదా? నాడు ఇంద్రుని జయించి అగ్నిదేవునకు ఖాండవవనము నాహుతిగా నిచ్చుట పార్థ పరాక్రమమునకు నిదర్శనముకాదా? ఘోషయాత్రలో గంధర్వులచే హరింపబడు నిన్ను విడిపించుట పార్థపరాక్రమమునకు నిదర్శనము కాదా? నీసోదరులును, కర్ణుడును పలాయన మయినపుడు నిన్ను రక్షిం చుట పార్థపరాక్రమమునకు నిదర్శనము కాదా? నాడు విరాటనగర ములో అసహాయుడై మనల నందరను జయించుట పార్థపరాక్రమము నకు నిదర్శనము కాదా? నన్ను, ద్రోణుని, అశ్వత్థామను, కృపాచా ర్యుని, కర్ణుని జయించి, యుత్తరీయములను గ్రహించి యుత్తర కిచ్చుట పార్థపరాక్రమమునకు నిదర్శనము కాదా?

ఇంద్రునకు దుర్జయులైన నివాతకవచులను వధించుట పార్థ పరాక్రమమునకు నిదర్శనము కాదా? జగద్రక్షకుడు, సృష్టిసంహార కారకుడు, సర్వేశ్వరుడు నగు శ్రీకృష్ణుడు రక్షకుడుగా గల పార్థుని యుద్ధములో జయింపగలవా డెవ్వడు? నారదాదులు నీ కనేకవిధముల బోధించియున్నారు. నీవు మూఢత్వమున వాచ్యావాచ్యము లెరుగ కున్నావు. నీవు స్వయముగా పాండవులతో బద్ధవైరము పెట్టుకొని యున్నావు. వారి నిప్పుడు నీవు యుద్ధములో జయింపుము. మేము చూచెదము.

ఓదుర్యోధనా! నీవు వెళ్ళి సుఖముగా నిద్రింపుము. రేపు మహాయుద్ధము జేయుదును; అని.

ఆమాటపై వందనము చేసి వెళ్లి దుర్యోధనుడు దుశ్శాసనునకు జరిగిన వృత్తాంతము జెప్పి యిట్లనెను—

"ఇదం హి సమనుప్రాప్తం వర్షపూగాభిచిన్తితం।
పాండవానాం ససైన్యానాం వధో రాజ్యస్య చాగమః॥" (భీష్మ. అ. 98)

దుశ్శాసనా! బహుకాలమునుండి మనము కోరుచున్న పాండవ సంహారము, రాజ్యప్రాప్తి అనునవి భీష్మవిజృంభణమూలమున మనకు సిద్ధింపబోవుచున్నవి. అని.

ఈగ్రంథసందర్భమునుబట్టి పాండవసంహారపూర్వకముగా రాజ్య ప్రాప్తి కావలయు నను మనోరథము దుర్యోధనునకు బహుకాలము నుండి యున్నట్లు స్పష్టముగనుక రాజ్యము పాండవులదే యని ధ్రువ మగుచున్నది. వారి రాజ్యము నపహరించుట, వారిని హత్యచేయుటకు ప్రయత్నించుట, నీది దుర్మార్గమని భీష్మాదులు బోధించుచువచ్చి నారు. కనుకనే సైన్యాధిపత్యారంభమున భీష్ముడు దుర్యోధనప్రార్థ నముపై పాండవులకు శ్రేయస్కరమార్గము నుపదేశించుటకును,దుర్యో ధనపక్షమున యుద్ధము చేయుటకును తాను నిర్ణయించుకొనియున్నట్లు స్పష్టముగా జెప్పి ఆనిర్ణయము మీదనే తాను సేనానాయకత్వము నవలంబించెను.

యుద్ధారంభసమయమున ధర్మజుడు కౌరవసేనలో బ్రవేశించి భీష్మపితామహునకు నమస్కరించి యుద్ధముజేయుట కనుజ్ఞ నిమ్మని కోరినపుడు— "ప్రీతో౽హం పుత్ర యుధ్యస్వ జయ మాప్నుహి పాండవ" అని యాశీర్వదించుటయు, ఆజయము కలుగుట కుపాయ మేమి ? అని ధర్మజు డడుగుటయు, దాని కిప్పుడు సమయమునుగాదు- 'పున రాగమనం కురు' మరల రమ్మని భీష్ముడు చెప్పుటయు జరిగినది.

ఈప్రస్తావ మంతయు పాండవనిందానిరాకరణములో "భీష్ముని సంహారరహస్యము దెలిసికొనిన ధర్మరా జేమి సజ్జనుడు?" అను ప్రసం గమును నిరాకరించునపుడు విశేషముగా నిరూపింపబడినది. ఆవిశేష ములు అచ్చట జూడవలెను.

భీష్ముడు రణరంగములో హద్దుమీరి నిర్దాక్షిణ్యముగా వధిం చుచు వచ్చెను. అదియంతయు దానవావేశమున జరిగిన పని. ఇట్లు జరుగు నని ఘోషయాత్రాంతమందు దుర్యోధనునకు దానవులే ఇట్లు చెప్పియున్నారు—

"భీష్మద్రోణకృపాదీంశ్చ ప్రవేక్ష్య న్త్యపరే౽సురాః।
నిర్ఘృణా దానవావిష్టా స్సమాకాన్తే౽న్తరాత్మని॥
ప్రహరిష్యన్తి వివశాః స్నేహ ముత్సృజ్య దూరతః।" (వనప. అ. 252)

భీష్మపితామహుడు పదియవదినమున పార్థబాణవినిర్భిన్నశరీరుడై శరశయ్యపై వ్రాలెను.

—♦ ద్రోణాచార్యసేనానాయకత్వము—దుర్యోధనుడు వర మడిగిన విధము ♦—

మరునాటికి ద్రోణాచార్యుడు కర్ణుని ప్రోత్సాహముపై దుర్యోధనునిచే సేనానాయకత్వమున కభిషిక్తు డయ్యెను. ఆ సమయమున ద్రోణాచార్యుడు దుర్యోధనునితో నిట్లనెను—

"కరోమి కామం కం తేఽద్య ప్రవృణీష్వ య మిచ్ఛసి ।

దుర్యోధనా! నేను నీ మనోరథ మేమి తీర్పవలయునో, నీ కేది యిష్టమో కోరుము. అని.

"తతో దుర్యోధనో రాజా కర్ణదుశ్శాసనాదిభిః ।
సంమన్త్ర్యోవాచ దుర్ధర్ష మాచార్యం జయతాం వరమ్ ॥
దదాసి చే ద్వరం మహ్యం జీవగ్రాహం యుధిష్ఠిరం ।
గృహీత్వా రథినాం శ్రేష్ఠం మత్సమీప మిహానయ ॥"

అది విని దుర్యోధనుడు కర్ణ దుశ్శాసనాదులతో ఆలోచించి యిట్లు కోరెను— ఆచార్యా! జీవించియుండగనే యుధిష్ఠిరుని నీవు పట్టి నాయొద్దకు తీసికొనిరావలయును. ఇది నేను కోరెడి వరము. అని. ఆకోరికపై ద్రోణాచార్యు డిట్లనెను—

"ధన్యః కుంతీసుతో రాజన్ యస్య గ్రహణ మిచ్ఛసి ।
న వధార్థం సుదుర్ధర్షం వర మద్య ప్రయాచసే ॥
కిమర్థం చ నరవ్యాఘ్ర న వధం తస్య కాంక్షసే ।
నాశంససి క్రియా మేతాం మత్తో దుర్యోధన ధ్రువమ్ ॥
అహోస్వి ద్ధర్మరాజస్య ద్వేష్టా తస్య న విద్యతే ।
యదిచ్ఛసి త్వం జీవంతం కులం రక్షసి చాత్మనః ॥
అథ వా భరతశ్రేష్ఠ నిర్జిత్య యుధి పాండవాన్ ।
రాజ్యం సంప్రతి దత్త్వా చ సౌభ్రాత్రం కర్తు మిచ్ఛసి ॥
ధన్యః కుంతీసుతో రాజా సుజాతం చాఽస్య ధీమతః ।
అజాతశత్రుతా సత్యా తస్య యత్స్నిహ్యతే భవాన్ ॥"

దుర్యోధనా! యుధిష్ఠిరుని వధింపు మని నీవు వర మడుగక పట్టి తెమ్మనియే వరము కోరుటచేత యుధిష్ఠిరుడు ధన్యు డయ్యా!

నీవు ఆతని వధించుటకై యెందుకు గోరలేదు? ఆ పని నా వలన జరుగదనియా? ధర్మరాజును ద్వేషించునట్టివాడే లేడనియా? ఆతడు జీవించియుండుటలో నీ కులము సురక్షిత మగు ననియా? వారి నట్లు ఓడించి వారి రాజ్యము వారికిచ్చి సౌభ్రాత్రమును జూపవలె ననియా? దుర్యోధనా! ధర్మజునియందు నీకును స్నేహాభావ ముండుట వలన ధర్మరాజు ధన్యుడయ్యా! ఆతని జీవితము సుజీవితమయ్యా! ఆతని అజాతశత్రుత్వము సత్యమయ్యా!

ఇట్లు ద్రోణాచార్యునిచే ప్రశ్నింపబడిన దుర్యోధనునియొక్క భావము- "సహసా నిస్సృతో భావో యోఽస్య నిత్యం హృది స్థితః। నాకారో గూహితుం శక్యో బృహస్పతిసమై రపి॥" ఎంతవానికిని తన అంతర్గతము వెల్లడికాక తీరదు. కనుక తన హృద్గతమై యున్నది యిట్లు వెల్లడిచేయబడెను—

"వధే కున్తీసుతస్యాజౌ నాచార్య విజయో మమ।
హతే యుధిష్ఠిరే పార్థా హన్యు స్సర్వాన్ హి నో ధ్రువమ్॥
నచ శక్యా రణే సర్వే నిహన్తు మమరై రపి।
య ఏవ తేషాం శేష స్స్యాత్స ఏవాఽస్మాన్న శేషయేత్॥
సత్యప్రతిజ్ఞే త్వానీతే పునర్ద్యూతేన నిర్జితే।
పున ర్యాస్య న్త్యరణ్యాయ పాండవా స్త మనువ్రతాః॥
సోఽయం మమ జయో వ్యక్తం దీర్ఘకాలం భవిష్యతి।
అతో న వధ మిచ్ఛామి ధర్మరాజస్య కర్హిచిత్॥"

ఆచార్యా! ధర్మజుని వధించుటచే నాకు విజయము కలుగదు. పాండవులు మనల నందరను హింసించితీరుదురు. పాండవుల నందరను వధించుట అమరుల కయినను అశక్యమే. వారిలో నొక్కడు శేషించి నను మనల నందరను నిశ్శేషము చేయును. అందుచేత సత్యప్రతిజ్ఞుడైన ధర్మజుని పట్టి తీసికొనివచ్చుట, పునర్ద్యూతములో నోడించుట జరిగిన

యెడల పాండవు లందరును మరల వనవాసమునకు వెళ్ళుదురు. ఈ విధమయిన జయము మనకు చిరకాలస్థాయి యగును. ఇట్టి యాలోచన మీాదనే ధర్మరాజును వధింప నేను గోరలేదు, అని.

"తస్య జిహ్మ మభిప్రాయం జ్ఞాత్వా ద్రోణోఽర్థతత్త్వవిత్ ।
తం వరం సాన్తరం తస్మై దదౌ సంచిన్త్య బుద్ధిమాన్ ॥
నచే ద్యుధిష్ఠిరం వీరః పాలయ త్యర్జునో యుధి ।
మన్యస్వ పాండవశ్రేష్ఠ మానీతం వశ మాత్మనః ॥
నచాఽపక్రమ్యతాం యుద్ధా ద్యన్యో పాయేన శక్యతే ।
అహం గృహీత్వా రాజానం సత్యధర్మపరాయణమ్ ॥
ఆనయిష్యామి తే రాజన్ వశ మద్య న సంశయః ।
యది స్థాస్యతి సంగ్రామే ముహూర్త మపి మేఽగ్రతః ॥
అపనీతే నరవ్యాఘ్రే కున్తీపుత్రే ధనంజయే ।" (ద్రోణ. అ. 12)
"అర్జునేన విహీన స్తు యది నోత్సృజతే రణం ।
మా ముపాయాన్త మాలోక్య గృహీతం విద్ధి పాండవమ్ ॥
అథాఽపయాతి సంగ్రామా ద్విజయా త్ర ద్విశిష్యతే। " (అ. 17)

ఆదుర్యోధనుని కుటిలాభిప్రాయమును దెలిసికొని అవకాశ ముంచుచు ఆచార్యు డిట్లు వర మిచ్చెను.

యుధిష్ఠిరునకు అంగరక్షకుడై పార్థుడు యుద్ధభూమిలో లేకుం డుటయు, వెనుకకు బోకుండ నాయెదుట ముహూర్తమాత్రము ధర్మ జుడు నిలచుటయు దటస్థించినయెడల నీకు బట్టి యిచ్చెదను, అని. అది విని దుర్యోధనుడు—

"తతః ప్రతిజ్ఞా స్సైర్యార్థం స మన్త్రో బహులీకృతః ।
తతో దుర్యోధనేనాపి గ్రహణం పాండవస్య తత్ ॥
సైన్యస్థానేషు సర్వేషు సుఘోషిత మరిన్దమ ।" (ద్రోణ. అ. 12)

ద్రోణాచార్యుని ప్రతిజ్ఞను స్థిరపరుపదలచి ఆవిషయము పదు గురిలో వెల్లడించి ధర్మజుని పట్టి తెచ్చుటకు ద్రోణాచార్యుడు ప్రతిజ్ఞ చేసినా డని సైన్యస్థానములలో చాటింపజేసెను.

ఈగ్రంథసందర్భమునుబట్టి అజేయు లగు పాండవులను జయించుటకు ద్యూతమే తమకు సాధన మని, ధర్మరాజు సత్యసంధు డని, తమకు పాండవులవలన హాని లేకుండుటకు ధర్మరాజే కారణ మని కర్ణదుర్యోధనాదుల ఆంతర్యము స్పష్ట మయినందున ప్రతివాదు లీవిషయమును మనస్సులో బెట్టుకొనవలయును.

ద్రోణాచార్యుడు పార్థుని యుధిష్ఠిరునకు సన్నిధానవర్తి కాకుండ జేయుటకై తన సేనలోని సంశప్తకులతో వేరొక యుద్ధరంగమును కల్పింపజేసి అచ్చట యుద్ధములో పార్థుడు తగుల్కొనియున్నపుడు తాను యుధిష్ఠిరునిమీదకు బోవు సందర్భములో ప్రచండయుద్ధము జరుగుట, అనేకవీరులను ద్రోణుడు సంహరించి ధర్మజుని పట్టబోవునపుడు ధర్మజుడు వెనుకకు మరలిపోవుట తటస్థించుచు వచ్చుటచే ద్రోణాచార్యునిచే ధర్మజుడు పట్టుకొనబడలేదు; ద్రోణప్రతిజ్ఞకు భంగము కలుగనులేదు.

ఆంధ్రభారతములోగూడ నీవిషయమే మొదట—

చ. "......వాడు లేనిచో దిర మయి పోర నిల్చిన యుధిష్ఠిరు ద్రౌపది
పుట్టునింటి పేవురు తెలగంది చూడ నలవుం జలముం జెడబట్టి తెచ్చెదన్."

స్థలాంతరములో—

ఆ. "నరుడు లేనిచోట నను గని తెన్నిచ్చి పాఱకున్న బట్టువడియెగాగ
దలపు ధర్మపుత్రు ధరణీశ పాఱుట దలిగ సేని నంతకంటె మేలు."

అని యున్నది. ఈవిధమున జూడగా ద్రోణప్రతిజ్ఞ— యుద్ధములో తనయెదుట నిలచి ధర్మజు డున్నపుడు పట్టెద ననియే కాని పరాఙ్ముఖుడయి వెళ్ళునపుడుగూడ పట్టెద నని కాదని స్పష్టము.

సంశప్తకులమీదకు వెళ్ళుచు తనకు ప్రతినిధిగా సత్యజిత్తును రక్షకునిగా నియమించి ధర్మజునితో పార్థు డిట్లనెను—

"హతే తు పురుషవ్యాఘ్రే రణే సత్యజితి ప్రభో।
సర్వై రపి సమేతై ర్వా న స్థాతవ్యం కథంచన॥" (అ 17)

సత్యజిత్తు హతుడైనయెడల మీరందరు గలిసి రణరంగమున నిలువవద్దు. అని. అట్లే—

"తస్మిన్ హతే మహామాత్రే పంచాలానాం మహారథే ।
అపాయా జ్జవనై రశ్వై ర్ద్రోణా త్త్రస్తో యుధిష్ఠిరః ॥" (అ 21)

సత్యజిత్తు హతు డగుటతోడనే ద్రోణునకు భయపడి వెనుకకు వెళ్ళిపోయెను.

గ్రంథ మిట్లుండగా—ద్రోణు డంతటివాడు పట్టెద నని ప్రతిజ్ఞ చేయుటయు, పట్టలేకపోవుటయునా? అనుకొని ద్రోణుడు పట్టి తెచ్చి నట్లును, ధర్మజుడు ఎట్లో తప్పించుకొనిపోయినట్లును కథను నిర్మించుట యెంత సముచితమో పాఠకమహాశయు లాలోచింతురుగాక.

—: ద్రోణపరాక్రమమునకు మెచ్చి దుర్యోధనుడు కర్ణునియొద్ద భీమసేనాదులను నిరసించుట-కర్ణుడు భీమసేనాదులను ప్రశంసించుట :—

"పశ్య రాధేయ పంచాలాన్ ప్రణున్నాన్ ద్రోణసాయకైః ।
ఏష భీమో మహాక్రోధీ హీనః పాండవసృంజయైః ॥
మదీయై రావృతో యోధైః కర్ణ నన్దయతీవ మామ్ ।
వ్యక్తం ద్రోణమయం లోక మద్య పశ్యతి దుర్మతిః ॥
నిరాశో జీవితా న్నూన మద్య రాజ్యాచ్చ పాండవః ।"

రాధేయా! ద్రోణబాణములచే పాండవసేనలు ఎట్లు పారదోల బడుచున్నవో చూచితివా! మహాక్రోధియైన యీ భీముడు అసహాయుడై మన యోధులచే ఆవరింపబడియుండుట నాకు ఆనందము గలిగించుచున్నది. దుర్మతియైన భీము డిప్పుడు సర్వము ద్రోణమయముగా జూచి తన జీవితమునకు, రాజ్యమునకు నిరాశజెందును, అను దుర్యోధనుని మాటలపై కర్ణు డిట్లనెను—

"నైష జాతు మహాబాహు ర్జీవ న్నాహవ ముత్సృజేత్ ।
నచేమాన్ పురుషవ్యాఘ్ర సింహనాదాన్ సహిష్యతి ॥
నచాపి పాండవా యుద్ధే భజ్యేర న్నితి మే మతిః ।
శూరాశ్చ బలవంతశ్చ కృతాస్త్రా యుద్ధదుర్మదాః ॥

విషాగ్నిద్యూతసంక్లేశాన్ వనవాసం చ పాండవాః ।
స్మరమాణా న హాస్యంతి సంగ్రామ మితి మే మతిః ॥
నివృత్తో హి మహాబాహు రమితౌజా వృకోదరః ।
వరాన్ వరాన్ హి కౌంతేయో రథోదారాన్ హనిష్యతి ॥
అసినా ధనుషా శక్త్యా హయై ర్నాగై ర్నరై రథైః ।
అయసేన చ దండేన వ్రాతాన్ వ్రాతాన్ హనిష్యతి ॥ (ద్రోణ అ 22)

దుర్యోధనా! మహావీరు డగు భీమసేనుడు జీవించియుండగా యుద్ధము మానడు. ఈసింహనాదముల కాతడు రెచ్చిపోవునుగాని సహింపడు. శూరులగు పాండవులకు యుద్ధములో భంగపాటు వచ్చునని నే ననుకొనను. విషప్రయోగ, అగ్నిప్రయోగ, ద్యూత, వనవాస క్లేశములను వారు తలచుకొనుచు యుద్ధమును విడువరని నానమ్మకము.

భీమసేనుడు నివర్తించినట్లే యుండి యుత్తమయోధుల నందరను వధించును. ఖడ్గముచేత, ధనుస్సుచేత, శక్తిచేత, అశ్వములచేత, గజములచేత, నరులచేత, రథములచేత, గదచేత గుంపులుగుంపులుగ సంహరించును. అని. ఇట్లనుకొని ద్రోణాచార్యునకు సహాయార్థము వెళ్ళిరి.

ఈగ్రంథసందర్భనుబట్టి పాండవులయెడ దుష్టచతుష్టయము చేసిన దుష్కార్యములు, భీమసేనుని పరాక్రమపద్ధతి కర్ణునిచేతనే వెల్లడిచేయబడె నని ప్రతివాదులు తెలిసికొందురుగాక.

—: అసహాయుడయిన అభిమన్యుని ఆర్గురు మహాయోధులు ఏకీభవించి పడగొట్టుట :—

పద్మవ్యూహమును భేదించుకొని వెళ్ళు అభిమన్యుని వెంట పాండవులు వెళ్ళకుండ వెనుక జెప్పినట్లు ఈశ్వరవరము నొందియున్న సైంధవు డడ్డుటయు, అసహాయు డయిన అభిమన్యుడు ద్రోణాభిరక్షిత మయిన కౌరవసేనలో బ్రవేశించి అప్రతిహతపరాక్రమముతో దుశ్శాసను నోడించి, కర్ణు నోడించి, దుర్యోధను నోడించి, దుర్యోధనపుత్రుని వధించి, అసంఖ్యాకముగా మహాయోధులను వధించి వీరవిహారము చేయుచుండుటయు సంభవించినపుడు—

"తతో ద్రోణః కృపః కర్ణో ద్రోణపుత్రశ్చ బృహద్బలః ।
కృతవర్మా చ హార్దిక్యః షడ్రథాః పర్యవారయన్ ॥ "

ద్రోణుడు, కృపుడు, కర్ణుడు, అశ్వత్థామ, బృహద్బలుడు, కృతవర్మ అను ఆర్గురును చుట్టుకొనినారు.

"అథ కర్ణః పున ర్ద్రోణ మాహాఽఽర్జునిశరాహతః ।
స్థాతవ్య మితి తిష్ఠామి పీడ్యమానోఽభిమన్యునా ॥
తేజస్వినః కుమారస్య శరాః పరమదారుణాః ।
త మాచార్యోఽబ్రవీ త్కర్ణం శనకైః ప్రహస న్నివ ॥
అభేద్య మస్య కవచం యువా చాశుపరాక్రమః ।
శక్యం చాఽస్య ధను శ్ఛేత్తుం జ్యాం చ బాణైః సమాహితైః ॥
అభీషూం శ్చ హయాం శ్చైవ తథోభౌ పార్ష్ణిసారథీ ।
ఏత త్కురు మహేష్వాస రాధేయ యది శక్యతే ॥ "

అభిమన్యుశరపరంపరాహతుడగు కర్ణుడు ద్రోణునితో నిట్లనెను-నేను నిలిచియుండుట తప్పనివిధియై నిలిచినాను. ఈ యభిమన్యుకుమారుని బాణములు దారుణముగా నున్నవి. అని. అది విని నవ్వుచు ద్రోణు డిట్లనెను—

ఈతని దభేద్యకవచము. ఈతని ధనుస్సును, నారిని, పగ్గములను, అశ్వములను, సారథితోబాటు ఛేదింపవలయును. రాధేయా ! శక్యమైనచో నీవు ఆపనిని జేయుము. అని.

అప్పుడు అభిమన్యుకుమారుని ధనుస్సును కర్ణుడు ఛేదించెను. అశ్వములను కృతవర్మ వధించెను. పార్ష్ణిసారథులను ద్రోణుడు వధించెను.

"శేషాస్తు ఛిన్నధన్వానం శరవర్షై రవాకిరన్ ।
త్వరమాణా స్త్వరాకాలే విరథం షణ్మహారథాః ॥ "

మిగిలినవారు విరథుడై ధనుస్సు పోయియున్న అభిమన్యునిపై శరవర్షము కురిపించిరి.

తరువాత డాలు, ఖడ్గమును దీసికొనినపుడు ద్రోణుడు ఖడ్గమును, కర్ణుడు డాలును ఛేదించిరి. ఆపై చక్రము దీసికొనగా—

"త చ్చక్రం భృశ ముద్విగ్నాః సంచిచ్ఛిదు రనేకధా ।"

అందరును గలిసి యాచక్రమును ఛేదించిరి.

"మహారథ స్తతః కార్ష్ణి స్సంజగ్రాహ మహాగదామ్ ।"

అప్పుడు గదను తీసికొని అశ్వత్థామపై బడి యాతని విరథుని జేసి—"శరాచితాంగ స్సౌభద్రః శ్వావిద్వ త్సముదృశ్యత" ఏదుపంది శరీరము రోమములతో వ్యాప్తమై యున్నట్లు శరములతో అభిమన్యుని శరీరము వ్యాప్తమైయుండ—

"జఘాన గాంధారాన్ సప్త సప్తతిమ్" "వసాతీయాన్ జఘాన రథినో దశ" "కేకయానాం రథాన్ సప్తహత్వా చ దశ కుంజరాన్" "దౌశ్శాసని రథం సాశ్వం గదయా సమపోథయత్ ।"

77 మంది గాంధారులను, 10మంది వసాతీయరథికులను, 7గురు కేకయరథికులను, 10మంది గజయోధులను గదాఘాతములతో వధించి దుశ్శాసనపుత్రుని రథమును అశ్వములతోబాటు భగ్నము చేసెను. ఆపై దుశ్శాసనపుత్రునితో గదాయుద్ధము చేయుట, పరస్పరప్రహార ములచే నిరువురును పడిపోవుట, దుశ్శాసనపుత్రుడు ముందు లేచి— "ఉత్తిష్ఠమానం సౌభద్రం గదయా మూర్ధ్న్యతాడయత్" అభిమన్యుడు లేచుచున్నపుడు శిరస్సుపై తన గదతో గాఢముగా గొట్టుట జరిగినది—

"ఏవం వినిహతో రాజ న్నేకో బహుభి రాహవే ।"

ఈవిధముగా బహుయోధులు కలసి యొక్క అభిమన్యుకుమారు నంతమొందించిరి.

"అంతరిక్షే చ భూతాని ప్రాక్రోశన్త విశాంపతే ।
ద్రోణ కర్ణముఖైః షడ్భి ర్ధార్తరాష్ట్రై ర్మహారథైః ॥
ఏకోఽయం నిహత శ్శేతే నైష ధర్మో మతో హి నః ।"(ద్రోణ.,అ. 49)

అప్పుడు ఆర్గురు మహారథులు ఒక్కనిపైబడి వధించిన విధము అధర్మమని అంతరిక్షమునుండి వినవచ్చినది. ఇది యభిమన్యు యుద్ధములో కర్ణప్రభృతులు చేసిన అధర్మము.

—: ప్రతివాదిప్రసంగ పరామర్శము :—

ఈవిషయమై మ. భా. చ. కారులు—

"కర్ణు డభిమన్యుని విల్లు వెనుకనుండి కొట్టుట యనునది మఱియొక యధర్మ కార్యము. దీనిని కృష్ణార్జునులు పెక్కుసారు లుగ్గడించువారు. కాని యా యధర్మ కార్యమును బ్రోత్సహించినవాడు ద్రోణుడు. విల్లు విఱిగినచో బిమ్మట జూచు కొందమన గర్ణు డట్లు చేసియున్నాడు. ఒకవేళ నయుక్తముగా వెనుకనుండి ధను ర్భంగము జేసినను, పాండవులు యుద్ధములో జేసిన యయుక్త కార్యములలో నిది దశాంశమైన గాదు.

కాన కర్ణుడు నిర్దోషి, యోగ్యుడు, మహావీరుడు, త్యాగి, స్వధర్మ నిర్వాహ కుడు, ప్రభుభక్తిపరుడు. అట్టివానిని దుష్టు డనుట యయుక్తము." (పుట. 286)

కర్ణచరిత్రకారులు—

"మహాధర్మశాలి యని ప్రసిద్ధి కెక్కిన ధర్మరాజుసైతము ద్రోణవధాదివిషయ ములం దసత్యము, ననౌచిత్యమును నవలంబించుటకు సాహసించెనుగాని, కర్ణు డట్లు చేయజాలడయ్యె." (పుట. 78)

అని వ్రాసినది పరాస్తము. మ. భా. చ. కారులు—ఆచేసినది యధర్మమే యనుచు దానికి కర్ణుని బ్రోత్సహించినవాడు ద్రోణుడనుట అయుక్తము. నేను నిలువలేకున్నాను; గతి యేమి? అని యడిగిన కర్ణునకు గతి యిది యని చెప్పినవాడు ద్రోణుడు. అట్లుపై సిద్ధపడిన వాడు కర్ణుడు. కర్ణు డధర్మము చేయలే దనుట యెట్లు?

రణరంగములో ద్రోణాచార్యుడు చేసినట్లు కనబడు అధర్మ ములు అసురావేశమూలకములేగాని స్వయంకృతములు గావు. ఈవిష యము అసురులచేతనే దుర్యోధనునకు చెప్పబడినది—

"భీష్మద్రోణ కృపాదీంశ్చ ప్రవేక్ష్య న్త్యపరే౽సురాః।
యై రావిష్టా ఘృణాం త్యక్త్వా యోత్స్యన్తే తవ వైరిభిః॥
నైవ పుత్రా న్న చ భ్రాతౄ న్న పితౄ న్నచ బాన్ధవాన్।
నైవ శిష్యా న్న చ జ్ఞాతీ న్న బాలాన్ స్థవిరా న్నచ॥
యుధి సంప్రహరిష్యన్తో మోక్ష్యన్తి కురుసత్తమ।
నిస్స్నేహా దానవావిష్టాః......।
ప్రహరిష్యన్తి వివశాః స్నేహ ముత్సృజ్య దూరతః॥"

కర్ణు డొకవేళ జేసినను అది పాండవులు యుద్ధములో జేసిన అయుక్తకార్యములలో దశాంశమైన గాదట !

అయితే ప్రతివాదిమతప్రకారము యుద్ధములో పాండవులు చేసినంత చేయనట్టి కర్ణుడు నిర్దోషి, యోగ్యుడు అయినపక్షములో మేము నిరూపించిన సిద్ధాంతములో ఆదినుండియు కర్ణుడు చేసిన దుష్కార్యములలో పాండవులు యుద్ధములో జేసినది శతాంశమైన గాదని ప్రతివాదులు గ్రహింపవలసినదే. పాండవు లేమిచేసినను కర్ణదుర్యోధనాదుల దుండగములకు బ్రతిక్రియగా జేసినట్టివే. స్వయముగా జేసినట్టివి కావు. అని తెలిసికొనవలయును. ద్రోణవధవిషయములో ధర్మజుని దసత్యమో, అసత్యాభాసమో దాని పూర్వోత్తరములు చతుర్థభాగములో నిరూపించినాము; ముందుగూడ నిరూపింతుము. అవిశేషము లచ్చట జూడవలయును. కర్ణుడు దుష్టు డను వ్యవహారము లోకప్రసిద్ధమే.

—: సైంధవవధనాడు పార్థుని అద్భుతచర్య :—

అభిమన్యు వధమునకు నిమిత్తభూతుడైన సైంధవుని రేపు సూర్యు డస్తమించునప్పటికి వధించితీరెద నని తీవ్రప్రతిజ్ఞను పార్థుడు ఇట్లు చేసెను —

"సత్యం వః ప్రతిజానామి శ్వోఽస్మి హన్తా జయద్రథం।
నచే ద్వధభయా ద్భీతో ధార్తరాష్ట్రాన్ ప్రహాస్యతి॥
నచాఽస్మాన్ శరణం గచ్ఛేత్ కృష్ణం వా పురుషోత్తమం।
భవన్తం వా మహారాజ శ్వోఽస్మి హన్తా జయద్రథమ్॥"

యుధిష్ఠిరా! సైంధవుడు భయపడి కౌరవులను విడిచి పోవుటో, మనలను, లేదా శ్రీకృష్ణుని, లేదా నిన్ను శరణుపొందుటో జరుగని యెడల రేపు వధించితీరెదను; అని.

అది విని సైంధవుడు ప్రాణములు దక్కించుకొనదలచి యింటికి బోయెద ననియు— "అదర్శనం గమిష్యామి న మాం ద్రక్ష్యంతి

పాండవాః" (పాండవుల కంటబడకుండ బోయెద ననియు ప్రసంగింప దుర్యోధనుడు- నీకు భయము లేదు. నేనును, కర్ణుడు మొదలగువారును లేరా? అని ధైర్యముచెప్పి నిలబెట్టెను. అప్పుడు సైంధవరక్షణార్థము ద్రోణాచార్యుడు—

"దీర్ఘో ద్వాదశగవ్యూతిః పశ్చార్థే పంచవిస్తృతః।
వ్యూహస్తు చక్రశకటో భారద్వాజేన నిర్మితః॥
పశ్చార్థే తస్య పద్మస్తు గర్భవ్యూహ స్సుదుర్భిదః।
సూచీపద్మస్య గర్భస్థః గూఢో వ్యూహః కృతః పునః॥
ఏవ మేతం మహావ్యూహం వ్యూహ్య ద్రోణో వ్యవస్థితః।"
టీ. చక్రశకటః=చక్రగర్భ శ్శకటః.

ఒక మహావ్యూహము నిర్మించెను. అది 24 క్రోసుల పొడవు, 10 క్రోసుల వెడల్పుగల శకటవ్యూహమై యున్నది. దాని గర్భములో చక్రవ్యూహము; దానికి పశ్చాద్భాగమున గర్భవ్యూహముగా పద్మ వ్యూహము; దానికి గర్భవ్యూహముగ సూచీవ్యూహము. ఇట్లు రచించి సేనాముఖమున ద్రోణాచార్యు డుండెను. సూచీవ్యూహముఖమున మహారథు లుండిరి. అందరి వెనుక సైంధవుడు అంగరక్షకు డగు దుర్యోధనునితో గలిసియుండెను.

ఇట్టి స్థితిలో ఆహ్నికకృత్యము నెరవేర్చుకొని కృష్ణార్జునులు రథారూఢులై వ్యూహము భేదించుకొని సైన్యముపై బడి వధించుచు బోవునపుడు కృష్ణసారథ్యములో రథగతి యిట్లున్నది—

"రథస్థితో౽గ్రతః క్రోశం యా నస్య త్యర్జున శ్శరాన్।
రథే క్రోశ మతిక్రాన్తే తస్య తే ఘ్నన్తి శాత్రవాన్॥"

రథస్థితుడైన పార్థుడు క్రోశదూరములో నున్న శత్రువులపై ప్రయోగించిన బాణములు ఆక్రోశదూరము రథము దాటినతరువాతనే ఆశత్రువులపై బడి హింసించుచున్నవి.

ఇట్లు అద్భుతముగా రథము నడచుచున్నది. సైంధవుని జూడ లేదు. సూర్యబింబము పశ్చిమదిక్కునకు దిగినది. రథాశ్వములు డస్సి

యున్నవి. క్షుత్పిపాసలతో అతికష్టముగా నడచుచున్నవి. అప్పుడు అర్జునుడు శ్రీకృష్ణునితో నిట్లనెను.—

"శరార్దితాశ్చ గ్లానాశ్చ హయా దూరే చ సైన్ధవః ।
హయా న్విముచ్య హి సుఖం విశల్యాన్ కురు మాధవ ॥
అహ మావారయిష్యామి సర్వాన్సైన్యాని కేశవ ।"

శ్రీకృష్ణా! అశ్వములు అలసిపోయినవి; శరములు గుచ్చుకొని యున్నవి; సైంధవుడు చాలదూరములో నుండెను. అశ్వములను విడచి వానికి గుచ్చుకొనియున్న బాణములను దీసివేసి వానికి విశ్రాంతి కలిగింపుము. నేను క్రిందనే యుండి యీసేనలను పారదోలెదను. అని. అపుడు శ్రీకృష్ణు డిట్లనెను.—

"ఉదపాన మిహాశ్వానాం నాల మస్తి రణేఽర్జున ।
పరీప్సన్తే జలం చేమే పేయం న త్వవగాహనమ్ ॥"

పార్థా! అశ్వములు త్రాగుటకు జలము నపేక్షించుచున్నవి. ఈరణభూమిలో తగిన జలాశయము లేదు. అని. ఆమాటపై పార్థుడు—

"ఇద మస్తీ త్యసంభ్రాన్తో బ్రువ న్నస్త్రేణ మేదినీమ్ ।
అభిహత్యాఽర్జున శ్చక్రే వాజిపానం సర శ్శుభమ్ ॥
శరవంశం శరస్థూణం శరాచ్ఛాదన మద్భుతమ్ ।
శరవేశ్మాఽకరో త్పార్థ స్త్వష్టేవాఽద్భుతకర్మకృత్ ॥"
టీ. వంశః శాలాధారకాష్ఠం స్థూణా మధ్యస్తంభః ।

ఇదిగో అనుచు అస్త్రప్రయోగమున భూమిని భేదించి జలపూర్ణమైన సరస్సును నిర్మించి, దానికి చుట్టును శరపంజరము నిర్మించి అద్భుతప్రదర్శనము జేసెను. అప్పుడు శ్రీకృష్ణుడు అశ్వములను విప్పి వాని శరీరములనుండి బాణముల నూడదీసి వాని శరీరములపై నిమిరి నీరు త్రాగించి పురికొనిన తరువాత రథమునకు గట్టెను.

"అస్త్రవేగేన మహతా పార్థో బాహుబలేన చ ।
సర్వేషాం పార్థివేన్ద్రాణా మగ్రస త్తాన్ శరోత్తమాన్ ॥
తత్తు పార్థస్య విక్రాన్తం వాసుదేవస్య చోభయోః ।
అపూజయన్ మహారాజ కౌరవా మహ దద్భుతమ్ ॥" (ద్రోణప. అ. 100)

ఆకృష్ణార్జునుల అద్భుతచర్యను కౌరవు లందరును ప్రశంసించిరి. ఇట్టి పార్థుని భారతవీరు డనవలయునో, కర్ణుని భారతవీరు డనవలయునో ప్రతివాదు లాలోచింతురుగాక !

—: సైంధవవధనాడు కౌరవవ్యూహములో బ్రవేశించిన సాత్యకికి భయపడి పారిపోవు దుశ్శాసనుని ద్రోణుడు మందలించుట :—

సాత్యకి వ్యూహమును భేదించి చెండాడుచు బోవునపుడు దుర్యోధనుడు, దుశ్శాసనుడు, శకుని, చిత్రసేనుడు, దుస్సహుడు మొదలగు మహావీరులు చుట్టుకొని బాణవర్షమును కురిపించుచుండ వీరి నందరను పీడించి పారదోలగా దుశ్శాసనుడు ద్రోణుని సమీపమునకు వచ్చుట జూచి ద్రోణాచార్యు డిట్లనెను—

"రాజపుత్రో భవా నత్ర రాజభ్రాతా మహారథః ।
కిమర్థం ద్రవసే యుద్ధే యౌవరాజ్య మవాప్య హి ॥
దాసీ జితాసి ద్యూతే త్వం యథా కామచరీ భవ ।
వాససాం వాహికా రాజ్ఞో భ్రాతు ర్జ్యేష్ఠస్య మే భవ ॥
న సంతి పతయ స్సర్వే తే౽ద్య షండతిలై స్సమాః ।
దుశ్శాసనైవం కస్మా త్త్వం పూర్వ ముక్త్వా పలాయసే ॥
ఏకం సాత్యకి మాసాద్య కథం భీతో౽సి సంయుగే ।
ద్రౌపద్యాశ్చ పరిక్లేశ స్త్వన్మూలో హ్యభవ త్పురా ॥
ఆశీవిషసమాన్ పార్థాన్ కోపయిత్వా క్వ యాస్యసి ।
పృథివీ ధర్మరాజాయ శమేనైవ ప్రదీయతామ్ ॥
యావ త్ఫల్గునో మహాబాహు ర్విగాహ్య మహతీం చమూమ్ ।
సోదరాం స్తే న గృహ్ణాతి తావ త్సంశామ్య పాండవైః ॥
పూర్వ మక్షైశ్చ తే భ్రాతా భీష్మే ణాసౌ సుయోధనః ।
అజేయాః పాండవా స్సంఖ్యే సౌమ్య సంశామ్య తైస్సహ ॥" (ద్రో.అ.122)

దుశ్శాసనా! రాజపుత్రుడవై, యువరాజువై పారిపోవుట యేమి? నీవు ఆనాడు ద్రౌపదితో– "దాసివైన నీవు మాదుర్యోధనప్రభువు యొక్క వస్త్రములను మోయవలెను; నీపతులు లేనివారితో జమ కట్టవలసినవారే". అని పలికి నేడు ఒక సాత్యకికి భయపడి పారిపోవు

చున్నావేమి? ద్రౌపదీదేవిని దుఃఖపెట్టినవాడవు నీవు. పాండవుల నా విధముగా ప్రకోపింపజేసి యిప్పు డెక్కడకు బోయెదవు? భీమసేనుడు మిమ్ము వధింపకున్నపుడే వారి రాజ్యము వారి కిచ్చి సంధి జేసికొనుము. దుర్యోధనుడు విసిపించుకొనలేదుగాని పాండవు లజేయు లని, వారితో సంధి జేసుకొని సుఖంపుమని భీష్ముడు చెప్పిరయే యున్నాడు; అని.

— ♦ సైంధవవధనాడు ద్రోణరథములను భీమసేనుడు విసరివేసి సైన్యములో బ్రవేశించుట ♦—

కౌరవవ్యూహముఖమునందున్న ద్రోణాచార్యునియొద్దకు రథాధిష్ఠితుడై వచ్చియున్న భీమసేనునితో ద్రోణు డిట్లనెను—

"భీమసేన న తే శక్యా ప్రవేష్టు మరివాహినీ ।
మా మనిర్జిత్య సమరే శత్రు మద్య మహాబల ॥"

భీమసేనా! శత్రువైన నన్ను జయింపనిదే కౌరవసైన్యములో బ్రవేశించుట నీకు శక్యము గాదు. నన్నుమతింపజేసికొనియే పార్థుడు ప్రవేశింపగలిగెను. అని. ఆమాటపై భీమసేను డిట్లనెను—

"తేన త్వై పరమాం పూజాం కుర్వతా మానితో౽హ్యసి ।
నార్జునో౽హం ఘృణీ ద్రోణ భీమసేనో౽స్మి తే రిపుః ॥
పితా న స్త్వం గురు ర్బన్ధు స్తథా పుత్రాస్తు తే వయమ్ ।
ఇతి మన్యామహే సర్వే భవన్తం ప్రణతాః స్థితాః ॥
అద్య తద్విపరీతం తే వదతో౽స్మాసు దృశ్యతే ।
యది త్వం శత్రు మాత్మానం మన్యసే త త్తథా స్త్విహ ॥
ఏష తే సదృశం శత్రోః కర్మ భీమః కరో మ్యహమ్ ।"

ఆచార్యా! నీయందు పూజ్యభావముగల మాపార్థుడు నిన్నట్లు సంమానించినాడు. నేను జాలిగల అర్జునుడను గాను; భీమసేనుడను. నీవు మాకు తండ్రివి; గురువువు; బంధువవు. మేము నీబిడ్డలము. అని మేమందరము నీకు మ్రొక్కుచుందుము. నేడు "నేను శత్రువును" అని మాయెడల నీవనుటలో నది యంతయు విపరీత మయినది. నీవు శత్రుభావమునే వహింపదలతువేని అట్లే కానిమ్ము. శత్రువుపట్ల చేయ వలసిన పనినే భీమసేనుడు చేయుచున్నాడు. అని.

"తతో రథా దవప్లుత్య వేగ మాస్థాయ పాండవః ।
నిమీల్య నయనే రాజన్ పదాతి ర్ద్రోణ మభ్యయాత్ ॥
అంసే శిరో భీమసేనః కరౌ కృత్వోరసి స్థిరౌ ।
వేగ మాస్థాయ బలవాన్ మనోఽనిలగరుత్మతామ్ ।
యథా హి గోవృషో వర్షం ప్రతిగృహ్ణాతి లీలయా ॥
తథా భీమో నరవ్యాఘ్ర శ్శరవర్షం సమగ్రహీత్ ।
స వధ్యమాన స్సమరే రథం ద్రోణస్య మారిష ॥
ఈషాయాం పాణినా గృహ్య ప్రచిక్షేప మహాబలః ।
ద్రోణస్తు సత్వరో రాజన్ క్షిప్తో భీమేన సంయుగే ॥
రథ మన్యం సమారుహ్య వ్యూహద్వారం యయౌ పునః ॥
త మప్యతిరథం భీమ శ్చిక్షేప భృశరోషితః ।
ఏవ మష్టౌ రథాః క్షిప్తాః భీమసేనేన లీలయా ॥
తత స్స్వరథ మాస్థాయ భీమసేనో మహాబలః ।
అభ్యద్రవత వేగేన తవ పుత్రస్య వాహినీమ్ ॥" (అ 128)

భీమసేను డిట్లు పలికి తన రథమునుండి యురికి కనులు మూసి కొని శిరస్సునొక భుజముపై పునకు వంచి హస్తములను వక్షస్థలమున సంధించి వర్షధారాపరంపరను లెక్కబెట్టక చొచ్చుకొనిపోవు వృషభేం ద్రమువలె శీఘ్రగతితో ద్రోణాచార్యశరవర్షమును లెక్కబెట్టక ద్రోణునిమీదకు బోయి రథమెత్తి విసరివేయు, రథాంతర మధిష్ఠించి ద్రోణుడతిత్వరలో మరల నిలువ, దానినికూడ విసరివేసి ద్రోణు డధి ష్ఠించుచు వచ్చిన యెనిమిది రథములను అట్లు అవలీలగా విసరివేసి ఆయువకాశములో తుదకు తన రథ మధిష్ఠించి సైన్యములోపల బ్రవే శించెను.

## —: కర్ణభీమసేనుల యుద్ధములో భీమసేనుని బాణప్రయోగకుశలత :—

తతో భీమో మహాబాహు స్సూతపుత్రస్య భారత ।
క్షురప్రేణ ధను శ్ఛిత్వా ననాద పరవీరహా ॥
త దపాస్య ధను శ్ఛిన్నం సూతపుత్రో మహారథః ।
అన్య త్కార్ముక మాదత్త భారఘ్నం వేగవత్తరమ్ ॥

తద వ్యథ నిమేషార్థా చ్ఛిచ్ఛేదాఽస్య వృకోదరః ।
తృతీయం చ చతుర్థం చ పంచమం షష్ఠ మేవ చ ॥
సప్తమం చాష్టమం చైవ నవమం దశమం తథా ।
ఏకాదశం ద్వాదశం చ త్రయోదశ మథాపి చ ॥
చతుర్దశం పంచదశం షోడశం చ వృకోదరః ।
తథా సప్తదశం వేగా దష్టాదశ మథాపి వా ॥
బహూని భీమ శ్చిచ్ఛేద కర్ణస్యైవం ధనూంషి హి ।" (అ. 139)

సైంధవవధినాడు ఏకాకియై కౌరవవ్యూహములోబడి చెండాడు చున్న భీమసేనుని పరాక్రమము అప్రతిహతమైయుండ కర్ణుకు డీకొని- "కర్ణో భీమశరాహతః, ప్రాద్రవ జ్జవనై రశ్వై ర్రణం హిత్వా మహా భయాత్" భీమసేనబాణపీడితుడై నిలువలేక తొలగిపోయి మహారథు లతో గలసి మరల వచ్చి డీకొని- "పున రేవాఽభవ త్కర్ణో భీమసేనా త్పరాఙ్ముఖః" మరల పరాఙ్ముఖుడై పోయెను.

ఆమహాసంఘర్షణములో 31 మంది దుర్యోధనసోదరులను భీమ సేనుడు హతము జేసెను. అప్పుడు కర్ణుడు భీమసేనునితో బోరుటలో భీమసేనుడు కర్ణుని ధనస్సును ఛేదించుచుండ, మరియొకటి కర్ణుడు గ్రహించుచుండ విరామము లేకుండ 18ధనుస్సులను పట్టినది తడవుగా ఛేదించుచు వచ్చెను. బాణయుద్ధమందు భీమసేనుని నైపుణ్య మిట్టిది.

—: భీమసేనుని కర్ణుడు తూలనాడగా భీమసేనుని ప్రతివచనము :—

కర్ణుడు ప్రకోపించి భీమసేనుని నిరాయుధుని, విరథుని జేయు, విశ్రాంతి నపేక్షించిన భీమసేనుడు కర్ణుని రథగతికి అవరోధముగా పార్థునిచే హతములైన మహాగజములలో దాగియున్నపుడు సమీపిం చిన కర్ణుని— "శక్తోపి నావధీ త్కర్ణం సమర్థః పాండునందనః । రక్ష మాణః ప్రతిజ్ఞాం తాం యా కృతా సవ్యసాచినా ॥" భీమసేనుడు ముష్టిబంధమున వధింపగలవాడైయుండియు పార్థుని ప్రతిజ్ఞకు భంగము కలుగజేయరాదని వధింపలేదు.

కర్ణుడును—"వ్యాయుధం నావధీ చ్చైనం కర్ణః కున్త్యా వచ స్స్మరన్" కుంతీదేవికి తాను మాట నిచ్చిన విషయము దలచుకొని నిరాయుధుడై యున్న భీమసేనుని వధింపక విడిచెను. తన ధనుష్కోణముచే భీమసేనుని బొడిచెను. పొడిచినదానిపై క్రుద్ధుడై భీమసేనుడు—

అచ్ఛిద్య స ధను స్తస్య కర్ణం మూర్ధ న్యతాడయత్

కర్ణుని చేతినుండి ఆధనుస్సు లాగికొని యాతని నెత్తిపై నొక పెట్టు బెట్టెను. అప్పుడు కర్ణుడు—నీవు తిండిపోతు వని, నీవు నిర్వీర్యుడ వని, నీవు వనవాసము జేయదగినవాడ వని, నీవు యుద్ధభూమికి రాదగినవాడవు కావని, నీకు మాతో యుద్ధమా ? అని యేమేమో తూలనాడగా భీమసేను డిట్లనెను—

"జిత స్త్వ మసకృ ద్దుష్ట కత్థసే కిం వృథాత్మనా ।
మల్లయుద్ధం మయా సార్ధం కురు దుష్కుల సంభవ ॥
మహాబలో మహాభోగీ కీచకో నిహతో యథా ।
తథా త్వాం ఘాతయిష్యామి పశ్యత్సు సర్వరాజసు ।"

ఓదుష్టుడా ! నీ వెన్నిసార్లు నాకు ఓడి పారిపోలేదు ? నీవిప్పుడు నాతో మల్లయుద్ధము చేయుము. కీచకుని జేసినట్లు చేయుదును. అని.

భీమస్య మత మాజ్ఞాయ కర్ణో బుద్ధిమతాం వరః ।
విరరామ రణా త్తస్మా త్పశ్యతాం సర్వధన్వినామ్ ॥" (అ. 139)

కర్ణు డాభీమసేనుని అభిప్రాయ మిదికదా యని గ్రహించి యిక మాటదక్కడు; మీదబడు నని భీమసేనుని విడిచి తొలగిపోయెను.

—: భీమసేనబాణప్రహారములచే క్షతగాత్రుడైన కర్ణుడు తన యవస్థను దుర్యోధనునకు జెప్పుట :—

సైంధవుని వధించుటకు సంరంభించు పార్థునితో నీవు యుద్ధము జేసి సూర్యాస్తమయ మగువరకు పార్థుని స్తంభింపజేసినయెడల ఆపై ప్రతిజ్ఞాభంగమును బట్టి స్వయముగనే పార్థుడు ప్రాణత్యాగము జేయును. అతనినిబట్టి మిగిలిన పాండవులును సపరివారముగా ప్రాణ

త్యాగము జేయుదురు. అప్పుడు మనము రాజ్య మేలుకొనవచ్చును. అనుచు దుర్యోధనుడు కర్ణునితో నీవిధముగా జెప్పెను—

సైన్ధవే రక్ష్యమాణే తు సూర్యస్యాస్తమనం ప్రతి ।
మిథ్యాప్రతిజ్ఞః కౌన్తేయః ప్రవేక్ష్యతి హుతాశనమ్ ॥
అనర్జునాయాం చ భువి ముహూర్త మపి మానద ।
జీవితుం నోత్సహేర న్వై భ్రాతరోఽస్య సహానుగాః ॥
వినష్టైః పాండవేయైశ్చ సశైలవన కాననామ్ ।
వసున్ధరా మిమాం కర్ణ భోక్ష్యామో హతకంటకామ్ ॥”

ఈమాటలు విని కర్ణుడు దుర్యోధనునితో నిట్లనెను —

“దృఢలక్ష్యేణ వీరేణ భీమసేనేన ధన్వినా ।
భృశం భిన్నతను స్సంఖ్యే శరజాలై రనేకశః ॥
స్థాతవ్య మితి తిష్ఠామి రణే సంప్రతి మానద ।
నాంగ మింగతి కించి న్మే సన్తప్తస్య మహేషుభిః ॥
యోత్స్యామి తు యథాశక్త్యా త్వదర్థం జీవితం మమ ।
............జయో దైవే ప్రతిష్ఠితః ॥”

దుర్యోధనా! భీమసేనుని బాణాఘాతములకు క్షతగాత్రుడనై యున్న నేను రణభూమిలో నిలుచుట తప్పక నిలిచియున్నాను. భీమ బాణప్రహారములకు గురియైన నాశరీరము కించిత్తయినను కార్యకారి కానేరకున్నది. అయినను నీకొరకే నాజీవితముగనుగ యథాశక్తి యుద్ధము చేయుదును; జయము దైవాధీనము. అని.

దీనినిబట్టి భీమసేనునిపట్ల “తిండిపోత నీకు భండనా వేటికి” అను కర్ణుని నిరసనవాక్యములను బట్టికొని అది నిజమే అని భ్రాంతిపడు ప్రతివాదులు కర్ణునిగూడ ధనుర్ధరుడై తెరిమి క్షతగాత్రుని జేసిన భీమ సేనపరాక్రమమును గుర్తింతురుగాక!

— ♦ సాత్యకిని ఖండించుటకు ఖడ్గ మెత్తిన భూరిశ్రవస్సు భుజము పార్థునిచే ఖండింపబడినపుడు భూరిశ్రవస్సు ఆక్షేపము–
పార్థుని సమాధానము ♦—

సైంధవవధనాడు ధర్మజున కంగరక్షకునిగా సాత్యకిని నియమించి పార్థుడు కౌరవవ్యూహములోనికి దుమికి ప్రచండయుద్ధము

చేయుచు సైంధవుని కొరకు సంరంభించుచుండెను. ఆసందర్భములో సాత్యకినిగూడ ధర్మజుడు బంపగా నాతడు ద్రోణాదులను దాటి మహా యోధులను వధించుచు మృగవాతములో సింహమువలె విక్రమించుచు సేనలను పారద్రోలుచు తానొక్కడు శత్రుమధ్యములో బడి అసంఖ్యాకు లగు వీరులతో విరామము లేకుండ బోరుచు పార్థదర్శనాపేక్షియై రణరంగమున రక్తమును ప్రవహింపజేయుచు అప్రతిహతముగా వచ్చుచుండెను.

అప్పటికి సాత్యకి అలసియుండెను; సారథి అలసిపోయెను; అశ్వములు డస్సిపోయినవి. అట్టిస్థితిలో నూతనముగా భూరిశ్రవస్సు సహాయసంపత్తితో వచ్చి అసహాయుడై యున్న సాత్యకిపై బడెను. ఆపరిస్థితి అతి దూరములో నున్న కృష్ణార్జునులకు గోచరించినది. శ్రీకృష్ణుడు సాత్యకి రాకను తెలిపినపుడు పార్థు డిట్లనెను—

"జ్ఞాతవ్య శ్చ హి మే రాజా రక్షితవ్య శ్చ సాత్యకిః ।
జయద్రథశ్చ హన్తవ్యో లంబతే చ దివాకరః ॥"

శ్రీకృష్ణా! మాధర్మజుని క్షేమము తెలిసికొనవలయును. సాత్యకిని భూరిశ్రవస్సునుండి రక్షించుకొనవలయును. సైంధవుని సంహరింపవలయును. సూర్యు డస్తమింపబోవుచుండెను; అని.

కృష్ణార్జునసంభాషణ మిట్లుండగా సాత్యకిపై కురికిన భూరిశ్రవస్సు క్రోధావేశముతో నిట్లనెను—

"చిరాభిలషితం కామ మహం ప్రాప్స్యామి సంయుగే ।
అద్య మద్బాణనిర్దగ్ధం పతితం ధరణీతలే ॥
ద్రక్ష్యత స్త్వాం రణే వీరౌ సహితౌ కేశవార్జునౌ ।
అద్యమే విక్రమం పార్థో విజ్ఞాస్యతి ధనంజయః ॥"

సాత్యకీ! నాచిరకాలాభిలాషము నేడు తీరును. ఇప్పుడు నాబాణదగ్ధుడవై భూమిపై బడిన నిన్ను కృష్ణార్జునులు చూచెదరు. నా పరాక్రమ మిప్పుడు పార్థుడు తెలిసికొనగలడు.

"అద్య కృష్ణశ్చ పార్థశ్చ ధర్మరాజశ్చ మాధవ ।
హతే త్వయి నిరుత్సాహా రణం త్యక్ష్య న్త్యసంశయమ్ ॥"

నీవిప్పుడు హతుడవుకాగా కృష్ణార్జునులు, ధర్మరాజు నిరుత్సాహులై యుద్ధమును విడిచిపోవుదురు; అని.

ఇట్లు అని తలపడినతరువాత ప్రచండయుద్ధము జరిగినది. ఇరువురి రథములు, అశ్వములు, ధనువులు భగ్నమైనవి. అపై ఖడ్గయుద్ధము, అపై బాహుయుద్ధము జరుగుటలో భూరిశ్రవస్సు సాత్యకిని క్రింద బడవైచి కృష్ణార్జునులు దూరమునుండి చూచుచుండ—

"అథ కోశా ద్వినిష్కృష్య ఖడ్గం భూరిశ్రవా రణే ।
మూర్ధజేషు నిజగ్రాహ పదా చోర స్యతాడయత్ ॥"

గుండెపై పాదముతో దన్ని ఖడ్గము దీసి జుట్టుపట్టుకొని—
"తతోఽస్య ఛేత్తు మారబ్ధ శ్శిరః కాయా త్సకుండలమ్" సాత్యకి శిరస్సు ఛేదింప ఖడ్గ మెత్తెను. ఆస్థితిలో కృష్ణభగవానుడు—

"పశ్య వృష్ణ్యంధకవ్యాఘ్రం సోమదత్తి వశంగతమ్ ।
తవ శిష్యం మహాబాహో...... ॥"

అనుచు సాత్యకిని రక్షింపు మనుటయు, వెంటనే పార్థుడు ప్రయోగించిన బాణమువలన భూరిశ్రవస్సు భుజము ఛేదింపబడుటయు జరిగినది. అప్పుడు తన కదృశ్యుడై యున్న పార్థుని బాణప్రయోగమునుగూర్చి భూరిశ్రవస్సు ఇట్లు ఆక్షేపించెను—

"నృశంసం బత! కౌన్తేయ కర్మేదం కృతవా నసి ।
అపశ్యతో విషక్తస్య య న్మే బాహు మచిచ్ఛిదః ॥
నను నామాఽస్త్రధర్మజ్ఞ స్త్వం లోకేఽభ్యధికః పరైః ।
సోఽయుధ్యమానస్య కథం రణే ప్రహృతవా నసి ॥
న ప్రమత్తాయ భీతాయ విరథాయ ప్రయాచతే ।
వ్యసనే వర్తమానాయ ప్రహరన్తి మనస్వినః ॥
ఇద న్తు నీచాచరిత మసత్పురుషసేవితమ్ ।
కథ మాచరితం పార్థ పాపకర్మ సుదుష్కరమ్ ॥
కో హి నామ ప్రమత్తాయ పరేణసహ యుధ్యతే ।
ఈదృశం వ్యసనం దద్యా ద్యో న కృష్ణసఖా భవేత్ ॥"

పార్థా! నిన్నుజూడక అన్యాసక్తుడ నయి యున్న నాబాహువును నీవు ఛేదించుట నిందార్హమైన పని. లోకములో నీకంటె అస్త్రధర్మ మెరిగినవాడు లేడు కదా! అట్టి స్థితిలో నీతో యుద్ధము జేయునట్టి నాయందు బాణప్రహార మెట్లుచేసినావు ?

ప్రమత్తుని, భీతుని, విరథుని, యాచించువానిని, వ్యసనములో జిక్కుకొనినవానిని సత్పురుషులు ప్రహరింపరు. నీచాచరణీయమైన యీపాపకర్మను నీవెట్లు చేసినావు ? ప్రమత్తుడై యుద్ధము జేయునట్టి వానికి యిట్టి కష్టము గలిగించుట కృష్ణసఖునకే చెల్లినది. అని.

దీనిపై పార్థుడు సమాధాన మిట్లు జెప్పెను—

"వ్యక్తం హి జీర్యమాణోఽపి బుద్ధిం జరయతే నరః ।
అనర్థక మిదం సర్వం య త్త్వయా వ్యాహృతం ప్రభో ॥
జాన న్నేవ హృషీకేశం గర్హసే మాం చ పాండవమ్ ।
సంగ్రామాణాం హి ధర్మజ్ఞః సర్వశాస్త్రార్థపారగః ॥
నచాఽధర్మ మహం కుర్యాం జానం శ్చైవ హి ముహ్యసే ।
యుధ్యన్తి క్షత్రియా శ్శత్రూన్ స్వైః స్వైః పరివృతా నరైః ॥
వయస్సైర్రథ మిత్రైశ్చ తే చ బాహుం సమాశ్రితాః ।
స కథం సాత్యకిం శిష్యం సుఖసంబన్ధి మేవ చ ॥
అస్మదర్థే చ యుధ్యన్తం త్యక్త్వా ప్రాణాన్ సుదుస్త్యజాన్ ।
మమ బాహుం రణే రాజన్ దక్షిణం యుద్ధదుర్మదమ్ ॥
త్వయా నికృష్యమాణం చ దృష్ట్వా నస్మి నిష్క్రియమ్ ।
నచాత్మా రక్షితవ్యో వై రాజన్ రణగతేన హి ॥
యో యస్య యుజ్యతేఽర్థేషు స వై రక్ష్యో నరాధిప ।
తై రక్ష్యమాణై స్స నృపో రక్షితవ్యో మహామృధే ॥
యద్యహం సాత్యకిం దృష్ట్వా తూష్ణీ మాసిష్య ఆహవే ।
తత స్తేన వియోగశ్చ ప్రాప్స్యం నరక మేవ చ ॥
రక్షితశ్చ మయా యస్మా త్తస్మా త్క్రుధ్యసి కిం మయి ।"

ఓమహనీయా! తాను జీర్ణస్థితికి వచ్చినకొలది మనుజుడు తన బుద్ధినిగూడ జీర్ణస్థితిని బొందించుచుండును. నీవనిన మాట అర్థము

లేనిది. నీవు యుద్ధధర్మ మెరిగినవాడవు; సర్వశాస్త్రపారంగతుడవు. నీవు సందర్భ మెరిగియుండియు శిక్షిస్తిని, నన్ను గర్హించుచున్నావు. నేను అధర్మ మాచరించువాడను గాను. ఆవిషయము నీకు దెలిసియు మోహపడుచున్నావు.

క్షత్రియులు తమ పరివారవర్గముతోఁగూడి యుద్ధము జేయు చుందురు. ఆపరివారవర్గ మంతయు నాక్షత్రియవీరుని బాహువులనే అండగా జేసికొని ప్రవర్తించుచుండును. అట్టి స్థితిలో నాకు ముఖ్యు డును, శిష్యుడును, నానిమిత్తము ప్రాణము లొడ్డి యుద్ధముచేయు చున్నవాడును, నాకు కుడిబుజమై యున్నవాడును, నీచే ఖండింపబడు దురవస్థలో చిక్కుకొనినవాడును అగు సాత్యకిని జూచుచు నేనెట్లు ఊరకుండగలుగుదును. తన్ను దాను రక్షించుకొనుటయే యుద్ధ ధర్మము గాదు. తన నిమిత్తము ప్రాణము లొడ్డి యుద్ధముజేయువానిని రక్షించుట యుద్ధధర్మము.

తనచే తనవారు రక్షింపబడవలయును; తనవారిచే తాను రక్షింపబడవలయును. ఇదె యుద్ధక్రమము. నేను యుద్ధములో సాత్య కిని జూచి యూరకుంటినేని యాతనికి మరణము; నాకు నరకము ప్రాప్తించితీరును.

అట్టి యనర్థము రాకుండుటకై సాత్యకిని రక్షించిన నాపై నీకు క్రోధ మేమి ?

"య చ్చ మాం గర్హసే రాజన్ కృష్ణేన సహ సంగతమ్ ।
న స్తేన సంగమం నేచ్ఛే త్తత్ తే బుద్ధివిభ్రమః ॥
ఏకస్యైకేన హి కథం సంగ్రామ స్సంభవిష్యతి ।
బహుభి స్సహ సంగమ్య నిర్జిత్య చ మహారథాన్ ॥
శ్రాన్తశ్చ శ్రాన్తవాహశ్చ విమనా శ్శస్త్రపీడితః ।
య దిచ్ఛసి శిర శ్చాస్య అసినా హన్తు మాహవే ॥
తథా కృచ్ఛ్రగతం చైవ సాత్యకిం కః క్షమిష్యతి ।
త్వాం వై వినిర్హ్యా యాత్మాన మాత్మానం యో న రక్షసి ॥
కథం కరిష్యసే వీర యో వా త్వాం సంశ్రయే జ్జనః ।" (అ. 143)

ఓమహానీయా ! నాకుగల కృష్ణసాంగత్యమును నీవు గర్హించు చున్నావే. అశ్రీకృష్ణసాంగత్యము నపేక్షింపనివాడెవడు ? ఆవిషయమై నీబుద్ధి పొరబడినది. ఒకని కొక్కనితోడనే యుద్ధ మసంభవము. అట్టిది సాత్యకికి సంభవించినదా ? అత డొక్కడును అనేకమహారథులతో యుద్ధము జేసి యోడించి శస్త్రపీడితుడై అలసియుండ నీవాతని శిరస్సును ఛేదింపబూనినపుడు ఆకష్టస్థితిలోనున్న సాత్యకిని జూచి యెవ్వడు సహించి యుండగలడు ?

నిన్ను నీవు రక్షించుకొనలేకపోవుటచే ఆత్మగర్హణము జేసికొనవలసినదే కాని అన్యగర్హణము చేయుట భావ్యము గాదు. నన్నాశ్రయించియున్నవానికి యిట్టి కష్టస్థితి సంభవించినపుడు వీరుడ వగు నీ వేమిచేయుదువో చెప్పుము ? అని.

ఈమాటలపై భూరిశ్రవస్సు ఊరకుండెను. దుర్యోధనాదులు గర్హించుచునే యుండ వారి కిట్లు పార్థుడు సమాధాన మిచ్చెను—

"మమ సర్వేపి రాజానో జాన న్త్యేత మహావ్రతమ్ ।
న్యశక్యో మామకో హన్తుం యో మే స్యా ద్బాణగోచరే ॥
యూపకేతో ర్నిరీక్ష్యైత న్న మా మర్హథ గర్హితుమ్ ।
న హి ధర్మ మవిజ్ఞాయ యుక్తం గర్హయితుం పరమ్ ॥
ఆత్తశస్త్రస్య హి రణే వృష్ణివీరం జిఘాంసతః ।
యదహం బాహు మచ్ఛైత్సం న సధర్మో విగర్హితః ॥
న్యస్తశస్త్రస్య బాలస్య విరథస్య వివర్మణః ।
అభిమన్యో ర్వధం తాత ధార్మికః కో ను పూజయేత్ ॥
ఏవ ముక్త స్తతః పార్థేన తు వచ స్తత శ్ప్రుత్వా మహాద్యుతిః ।
యూపకేతు ర్మహారాజః తూష్ణీ మాసీ దవాఙ్ముఖః ॥"

ఓకౌరవులారా ! వినుడు—నాబాణము తగులునంతటి దూరములో మాకు సంబంధించి యున్నవానిని శత్రువునుండి కాపాడుట నాకు మహావ్రత మను సంగతి రాజు లెల్లరకు దెలిసినదే.

భూరిశ్రవస్సువిషయమై నన్ను గర్హించుట తగదు. ధర్మ మెరుగక పరులను గర్హించుట భావ్యము గాదు.

శస్త్రము చేతబట్టి రణరంగములో మాసాత్యకిని ఖండింపనెంచిన వాని భుజమును నేను ఛేదించుట ధర్మవిరుద్ధము కానేరదు.

నిరాయుధుడు, బాలుడు నగు అభిమన్యుని మీరు వధించినది ధర్మవిరుద్ధము. ఏధార్మికుడు డాకృత్యమును శ్లాఘించును. అని.

ఈపార్థుని మాటలు విని యూపకేతువు (భూరిశ్రవస్సు) తల వంచుకొని యూరకుండెను. భూరిశ్రవస్సు మొదట సాత్యకితో నిన్ను వధింతును. అనిమాత్రమే అనక పార్థుడు నాపరాక్రమము గుర్తించు ననియు, కృష్ణార్జునులకు తలవంపు లగు లనియు బలుకుటలో పార్థుని దృష్టిలో బెట్టుకొనవలసిన పని యేమి ? అతడు సాత్యకికి రక్షకు డనియే. ఆరక్షకత్వమునే పార్థుడు నిలువబెట్టుకొనెను. కనుకనే భూరిశ్రవస్సు మరుమాటాడ లేదు.

తరువాత భూరిశ్రవస్సు ప్రాయోపవేశము చేసి అక్కడనే యోగధారణతో గూర్చుండి యున్నపుడు సాత్యకి లేచి ఖడ్గము దీసి కృష్ణార్జునులు, కౌరవపక్షమువారు వద్దువద్దనుచుండ భూరిశ్రవస్సును ఛేదించెను. దానికి తనకు గల ప్రతిజ్ఞ నిట్లు కారణముగా జెప్పెను—

మయా త్వేత త్ప్రతిజ్ఞాతం క్షేపే కస్మిం శ్చిదేవ హి ।
యో మాం నిష్పిష్య సంగ్రామే జీవన్ హన్యాత్పదా రుషా ॥
స మే వధ్యో భవే చ్ఛత్రు ర్యద్యపి స్యా న్మునివ్రతః ।''

నేను ఒకానొక నిమిత్తములో ప్రతిజ్ఞ జేసియుంటిని—నన్ను నేల బడగొట్టి యెవ్వడు పాదముతో దన్నునో ఆశత్రువు మునివ్రత ధారియైనను నాచే వధ్యు డగును. అని. కనుక నేనిట్లు చేసితి ననెను.

అట్టి ప్రమాదము సాత్యకికి వచ్చుటకు హేతు విట్లు చెప్పబడి నది—సాత్యకి తండ్రి శిని. భూరిశ్రవస్సు తండ్రి సోమదత్తుడు. ఆయిరు వురకు ఒకానొకస్వయంవరస్థానములో సంఘర్షణము ప్రాప్తింప మహా రాజమండలిలో శిని సోమదత్తుని నేల బడగొట్టి పాదముతో దన్ని జుట్టుపట్టుకొని ఖడ్గ మెత్తి యాపైపోయి జీవింపు మని విడిచెను. అంతట సోమదత్తుడు తపముచేసి ఈశ్వరుని వర మడుగుటలో—

"పుత్ర మిచ్ఛామి భగవన్ యో నిపాత్య శినే స్సుతమ్ ।
మధ్యే రాజసహస్రాణాం పదా హన్యాచ్ఛ సంయుగే ॥"

శినియొక్క పుత్రుని మహారాజమండలిలో నేల బడగొట్టి కాలితో దన్నగల పుత్రు ననుగ్రహింపు మని కోరియుండెను. ఆతని పుత్రుడైన యీభూరిశ్రవస్సు ఆవరపఱిభావమున ఆసాత్యకిని అట్లు చేయగలిగెను. సాత్యకిది అప్రతిహతపరాక్రమము. అని చెప్పబడినది.

—♦ శ్రీకృష్ణోపదిష్టుడై పార్థుడు సైంధవుని వధించిన విధము ♦—

సాయంకాలము కాబోవుచున్నది. ఆర్గురు మహారథులు—కృప, అశ్వత్థామ, కర్ణ, శల్య, వృషసేన, దుర్యోధనులు పరివేష్టించి సేనలతో సైంధవుని కాపాడుచుండిరి. అప్పుడు కృష్ణపరమాత్మ పార్థునితో నిట్లనెను—పార్థా! సైంధవుడు ప్రాణభీతిచే మహారథషట్క మధ్యమున దూరియుండెను. ఈమహారథులను జయించినగాని యాతడు గోచరింపడు. పొద్దు లేదు. కనుక నేనొకయుపాయము జెప్పుచున్నాను—

"యోగ మత్ర విధాస్యామి సూర్య స్యావరణం ప్రతి ।
అస్తం గత ఇతి వ్యక్తం ద్రక్ష్య త్యేక స్స సింధురాట్ ॥
హర్షేణ జీవితాకాంక్షీ వినాశార్థం తవ ప్రభో ।
తత్ర చ్ఛిద్రే ప్రహర్తవ్యం త్వయా౽స్య కురుసత్తమ ॥
వ్యపేక్షా నైవ కర్తవ్యా గతో౽స్త మితి భాస్కరః ।"

నేనిప్పుడు సూర్యు డస్తమించె నని తోచునట్లు సూర్యునకు ఆవరణము గలిగింతును. అప్పుడు తనప్రాణము దక్కినదను సంతోషముతో నీవు నశింపవలయు నని తలయెత్తి నిన్ను సైంధవుడు చూడబోవును. అప్పుడు నీవు సూర్యు డస్తమించె నని భ్రాంతిపడక కొట్టవలయును. అని చెప్పి సమ్మతింపజేసి—

"తతో౽సృజ త్తమః కృష్ణ స్సూర్య స్యావరణం ప్రతి ।
యోగీ యోగేన సంయుక్తో యోగినా మీశ్వరో హరిః ॥
తే ప్రహృష్టా రణే రాజ న్నాపశ్యన్ సైనికా రవిమ్ ।"

యోగీశ్వరు డగు కృష్ణపరమాత్మ యోగశక్తిచే సూర్యుని

కావరణముగా తమస్సును గల్పింప కౌరవసైన్యము పార్థు డిక ప్రాణత్యాగము జేయు నని హర్షించుచు సూర్యునివైపు చూచుచుండెను. అట్లే సైంధవుడును జూచుచుండెను. అప్పుడు పార్థుడు ఆమహారథులను పారదోలుచు అద్భుతయుద్ధము చేసెను.

“తత్రాద్భుత మపశ్యామ కున్తీపుత్రస్య విక్రమమ్ ।
తాదృఙ్న భావీ భూతో వా య చ్చకార మహాయశాః ॥”

అట్టి యుద్ధములో పరివారవర్గము నంతను పారదోలిన తరువాత సైంధవుని వధించుటలో కృష్ణపరమాత్మ యొక విశేష మిట్లుచెప్పెను—

పార్థా! ఈసైంధవుని తండ్రి వృద్ధక్షత్రుడు. ఆతని కీతడు చిరకాలమునకు గలిగెను. ఆకలిగినపుడు తండ్రికి అశరీరవాక్కు ఇట్లు వినబడినది—

“తవాత్మజో మనుష్యేన్ద్ర కులశీలదమాదిభిః ।
గుణై ర్భవిష్యతి విభో సదృశో వంశయో ర్ద్వయోః ॥
కిం త్వస్య యుధ్యమానస్య సంగ్రామే క్షత్రియర్షభః ।
శిర శ్ఛేత్స్యతి సంక్రుద్ధ శ్శత్రు శ్చాఽలక్షితో భువి ॥”

ఓవృద్ధక్షత్రా! ఈనీపుత్రుడు కులశీలాదులచే నుత్తముడై యుండును. కాని యీతడు యుద్ధముచేయునపుడు ఒకానొక క్షత్రియ వీరుడు క్రుద్ధుడై యీతని శిరస్సును ఛేదించును. అని.

అది విని యావృద్ధక్షత్రుడు ధ్యానించి పుత్రస్నేహముతో “జ్ఞాతీ న్సర్వా నువాచేదమ్” తన స్వజనముతో నిట్లనెను—

“సంగ్రామే యుధ్యమానస్య వహతో మహతీం ధురమ్ ।
ధరణ్యాం మమ పుత్రస్య పాతయిష్యతి య శ్శిరః ॥
తస్యాఽపి శతధా మూర్ధా ఫలిష్యతి న సంశయః ।
ఏవ ముక్త్వా తతో రాజ్యే స్థాపయిత్వా జయద్రథమ్ ॥
వృద్ధక్షత్రో వనం యాత స్తప శ్చోగ్రం సమాస్థితః ।
సోఽయం తప్యతి తేజస్వీ తపో ఘోరం దురాసదమ్ ॥
సమన్తపంచకా దస్మా ద్బహి ర్వానరకేతన ।
తస్మా జ్జయద్రథస్య త్వం శిర శ్ఛిత్వా మహామృధే ॥
ఉత్సంగే పాతయస్వాఽస్య వృద్ధక్షత్రస్య భారత ।”

నాపుత్రుని శిరస్సును ఎవ్వఁడు భూమిపై బడవేయునో అతని శిరస్సు నూరు వ్రక్కలగును; నిస్సంశయము. అని.

ఇట్లు పలికి కుమారునకు రాజ్యమిచ్చి తాను వనమందు తపము చేయుచుండెను. అతఁడు ఈసమంతపంచక మను రణభూమికి వెలుపల తపోనిష్ఠలో నుండెను. నీవిప్పుడు సైంధవుని శిరస్సును ఛేదించి క్రింద బడనీయక దివ్యాస్త్రముచే అవృద్ధక్షత్రుని తొడపై ప్రవేశపెట్టవలయును. అని.

పార్థుఁ డట్లే చేసెను. అవృద్ధక్షత్రుఁడు తన తొడపై నున్న శిరస్సును ఎరుగకుండ జపనిష్ఠలో నుండెను. జపాంతమున దిగ్గున లేచుట, ఆశిరస్సు నేలబడుట, అతని శిరస్సు వ్రక్కలగుట జరిగినది.

"హతో వినిహతే రాజన్ సింధురాజే కిరీటినా ।
తమ స్తద్వాసుదేవేన సంహృతం భరతర్షభ ॥
పశ్చాత్ జ్ఞాతం మహీపాల తవ పుత్రైస్సహానుగైః ।
వాసుదేవప్రయుక్తేయం మాయేతి నృపసత్తమ ॥
ఏవం స నిహతో రాజన్ పార్థేనామితతేజసా ।
అక్షౌహిణీ రష్ట హత్వా జామాతా తవ సైంధవః ॥"

సైంధవవధానంతరము శ్రీకృష్ణపరమాత్మ సూర్యావరణమును తొలగింపజేసెను. అప్పుడు కౌరవసేన యిది శ్రీకృష్ణమాయ యని గ్రహింపగలిగెను. ఇట్లు పార్థుఁడు అప్రతిహతపరాక్రమముతో 8 అక్షౌహిణులసేనను ఆనాఁడు వధించి సైంధవుని సంహరించెను.

—♦ సైంధవసంహారమును గూర్చి వక్తవ్యవిశేషము ♦—

భగవంతునకు తన యిష్టమువచ్చినట్లు ప్రవర్తించుట స్వభావము గాదు. ఆయా వ్యక్తుల భవితవ్యమును, ఆయా మహాపురుషుల శాపానుగ్రహరూపము లగు అమోఘవాక్కులను పరస్పరవిరోధము లేకుండ అమలు జరుపుట భగవంతునకు లక్షణము. అది సంపూర్ణ సర్వశక్తులు గలిగి సమగ్రమైన సర్వవిషయజ్ఞానముగల భగవంతునికి దప్ప అన్యులకు సాధ్యము గాదు. సైంధవవిషయము జూడుడు—

సైంధవుని భవితవ్యము అశరీరవాణి ప్రకటించినట్లు పార్థుని మూలమున శిరచ్ఛేదము కావలసియున్నది. వృద్ధక్షత్రుని అమోఘ వాక్కునుబట్టి ఆశిరస్సు ఎవ్వనిమూలమున నేలబడునో వాని శిరస్సు భిన్నము కావలసి యున్నది. ఇక పార్థుని భవితవ్య మన్ననో—

జాతమాత్రే కుమారే తు వాగువాచాఽశరీరిణీ ।
భ్రాతృభి స్సహితో వీర శ్శ్రీమాన్ నైధా నాహరిష్యతి ॥
విప్రనష్టాం శ్రియం చాఽయ మాహర్తా పురుషర్షభః ।" (ఆది. అ.123)

అని అశరీరవాణి ప్రకటించినట్లు శత్రుక్షయపూర్వకముగా రాజ్యమును స్వీకరించి సోదరులతో మూడశ్వమేధయాగముల నాచరింపవలసియున్నవి. సూర్యు డస్తమింపక పూర్వమె సైంధవుని శిరశ్ఛేదము జేయుట పార్థుని ప్రతిజ్ఞ యైయున్నది.

ఇందు సూర్యు డస్తమించిపోయినను, సైంధవుని శిరస్సు నేల బడిపోయినను, పార్థునకు ప్రాణాపాయము. అది పార్థుని భవితవ్యమునకు విరుద్ధము. అట్టి విరోధము లేకుండుటకే తన అకుంఠితశక్తిచే సూర్యబింబమునకు ఆవరణము గలిగించి సైంధవముఖము గోచరించుటకును, సైంధవవిషయమైన అశరీరవాణి సార్థక మగుటకును మార్గమేర్పరచి, పార్థవిషయమైన అశరీరవాణి, వృద్ధక్షత్రుని అమోఘ వాక్కు సార్థకమగుటకు వృద్ధక్షత్రుని మూలముననే ఆసైంధవశిరస్సు నేలబడునట్లు సంఘటన గావించెను. ఇదియే భగవంతుని అమేయ ప్రభావము. ఒక విధానములో ఇన్నివిషయములను ఘటింపజేయ గలుగుటే భగవంతునియందలి అద్భుతశక్తి. "శ్రీకృష్ణుడు మాయచే సైంధవుని సంహరింపజేసెను" అను ప్రతివాదులు పైవిషయము నను సంధింతురుగాక.

## —♦ సైంధవసంహారములో ద్రోణు డన్యాయము జేసినట్లు చెప్పవచ్చిన దుర్యోధనుని ద్రోణాచార్యుడును, కర్ణుడును మందలించుట ♦—

దుర్యోధనుడు సైంధవసంహారమునకును, కర్ణపరాజయమునకును పరితపించి—

"యము పాశ్రిత్య సంగ్రామే కృత శ్శస్త్రసముద్యమః ।
స కర్ణో నిర్జిత స్సంఖ్యే హత శ్చైవ జయద్రథః ॥
యస్య వీర్యం సమాశ్రిత్య శమం యాచన్త మచ్యుతమ్ ।
తృణవ త్త మహం మన్యే స కర్ణో నిర్జితో యుధి ॥"

ఏకర్ణుని అండ జూచుకొని నేను యుద్ధమున నుద్యమించితినో-ఏకర్ణుని పరాక్రమము జూచుకొని నేను సంధిజేసుకొనను మని చెప్ప వచ్చిన శ్రీకృష్ణుని తృణీకరించితినో ఆకర్ణు డోడిపోయెను; సైంధవుడు చనిపోయెను. అని చింతించుచు వచ్చి ద్రోణునితో నిట్లనెను—

భవా నుపేక్షాం కురుతే శిష్యత్వా దర్జునస్య హి ।
అతో వినిహతా స్సర్వే యేఽస్మజ్జయచికీర్షవః ॥"

ఆచార్యా! నీవు పార్థునిపై పక్షపాతము వహించుటవలన నా జయముగోరువారు హతులైపోయినారు. అని. అటుపై ద్రోణు డిట్లనెను—

"దుర్యోధన కి మేవం మాం వాక్శరై రపి కృన్తసి ।
అజయ్యం సతతం సంఖ్యే బ్రువాణం సవ్యసాచినమ్ ॥
యాన్ స్మ తాన్ గ్లహతే తాత శకునిః కురుసంసది ।
అక్షా న్న తేఽక్షా నిశితా బాణా స్తే శత్రుతాపనాః ॥
త ఏతే ఘ్నన్తి న స్తాత విశిఖాః పార్థచోదితాః ।
తాం స్తదా ఖ్యాయమాన స్త్వం విదురేణ న బుద్ధవాన్ ॥
త దిదం వర్తతే ఘోర మాగతం వైశసం మహత్ ।
యోఽవమన్య వచః పథ్యం సుహృదా మాప్త కారిణామ్ ॥
స్వమతం కురుతే మూఢ స్స శోచ్యో న చిరాదివ ।
యచ్చ నః ప్రేక్షమాణానాం కృష్ణా మానాయ్య తత్సభామ్ ॥
అనర్హన్తీం కులే జాతాం సర్వధర్మానుచారిణీమ్ ।
తస్యాఽధర్మస్య గాన్ధారే ఫలం ప్రాప్త మిదం మహత్ ॥
య చ్చ తాన్ పాండవాన్ ద్యూతే విషమేణ విజిత్య హ ।
ప్రావ్రాజయ స్త దారణ్యే రౌరవాజినవాససః ॥
పుత్రాణా మివ చైతేషాం ధర్మ మాచరతాం సదా ।
ద్రుహ్యే త్కో ను నరో లోకే మదన్యో బ్రాహ్మణబ్రువః ॥
కథం త్వయి చ కర్ణే చ కృపే శల్యే చ జీవతి ।

అశ్వత్థామ్ని చ కౌరవ్య నిధనం సైన్ధవోఽగమత్ ॥
త న్మాం కి మభితప్యన్తం వాక్శరై శ్శేవ కృన్తసి ।
అశక్త స్సింధురాజస్య భూత్వా త్రాణాయ భారత ॥" (ద్రోణ. అ. 151)

దుర్యోధనా! పార్థు డజయ్యు డని నీ కెప్పుడును జెప్పుచున్న నన్ను మాటలతో బీకించెద వేమి? ఆనాడు శకుని ప్రయోగించిన పాచికలు ఈనాడు బాణములై పార్థప్రయుక్తములై వేధించుచున్నవి. నాడు విదురుడు ఇట్లు జరుగునని చెప్పినను నీవు వినిపించుకొనలేదు. ఆప్తుల హితోపదేశము తిరస్కరించి తోచినట్లు సంచరించు మూఢుడు పశ్చాత్తపించును.

ఆనాడు మేమందరము జూచుచుండ ద్రౌపదీదేవిని సభ పలాగి నీవు చేసిన అధర్మముయొక్క ఫలమే యీఘోరహత్యలు; ఆనాడు కపటద్యూతమున పాండవుల నోడించి అజినముల గట్టించి అరణ్యమునకు బంపిన అధర్మముయొక్క ఫలమే యిది.

పుత్రప్రాయులు, ధర్మాత్ములు నగు పాండవులపట్ల నేనుదప్ప బ్రాహ్మణబ్రువు డెవ్వడు ద్రోహము చేయగలడు?

నీవు, కర్ణుడు, కృపుడు, శల్యుడు, అశ్వత్థామ జీవించియుండ సైంధవు డెందుకు చనిపోయెను? దుర్యోధనా! సైంధవుని నీవు రక్షింపలేక నన్ననుచున్నావా? అని ద్రోణుడు ముందలించెను.

కర్ణునియొద్ద ద్రోణునిగూర్చి దుర్యోధను డిట్లనెను—

"అభయం సిన్ధురాజాయ దత్వా ద్రోణః పరన్తపః ।
ప్రాదా త్కిరీటినే ద్వారం పశ్య నిర్గుణతాం మయి ॥"

రాధేయా! ద్రోణుడు సైంధవునకు భయము లేదని చెప్పి పార్థునకు మార్గ మిచ్చెను. నాయెడల ద్రోణుని వైఖరి యెట్లున్నదో చూడుము. అని. ఆమాటపై కర్ణు డిట్లు చెప్పెను—

"ఆచార్యం మా విగర్హస్వ శక్త్యాఽసౌ యుధ్యతే ద్విజః ।
యథాబలం యథోత్సాహం త్యక్త్వా జీవిత మాత్మనః ॥
యద్యేనం సమతిక్రమ్య ప్రవిష్టః శ్వేతవాహనః ।

నాఽత్ర మన్యేఽపి దోష స్స్యా దాచార్యస్య కథంచన ॥
ఆచార్యః స్థవిరో రాజన్ శీఘ్రయానే తథాఽక్షమః ।
బాహువ్యాయామచేష్టాయా మశక్త స్తు నరాధిప ॥
తేనైవ మభ్యతిక్రాన్త శ్శ్వేతాశ్వః కృష్ణసారథిః ।
తస్య దోషం న పశ్యామి ద్రోణ స్యానేన హేతునా ॥
అజయ్యాన్ పాండవా న్మన్యే ద్రోణేనాఽస్త్రవిదా మృధే ।
యతో నో యుధ్యమానానాం పరం శక్త్యానుయోధన ॥
సైన్ధవో నిహతో యుద్ధే దైవ మత్ర పరం స్మృతమ్ ।
సతతం చేష్టమానానాం నికృత్యా విక్రమేణ చ ॥
హత్వాఽస్మాకం పౌరుషం వై దైవం పశ్చా త్కరోతి చ ।
నికృత్యా వంచితాః పార్థా విషయోగైశ్చ భారత ॥
దగ్ధా జతుగృహే చాపి ద్యూతేన చ పరాజితాః ।
రాజనీతిం వ్యపాశ్రిత్య ప్రహితా శ్చైవ కాననమ్ ॥
యత్నేన చ కృతం తత్త ద్దైవేన వినిపాతితమ్ ।” (అ. 152)

దుర్యోధనా! ఆచార్యుని గర్హింపకుము. ఆతడు తన ప్రాణములు నొడ్డి యావచ్ఛక్తిని వినియోగించుచుండెను. ఇట్టివానిని పార్థుడు అతిక్రమించి వ్యూహములో ప్రవేశించుటలో ద్రోణుని తప్పు ఏమియు లేదు. ఆచార్యుడు వృద్ధుడు. పార్థునకు గల శీఘ్రగతి ముదుసలికైనవి యెట్లుండును ? ద్రోణుడు పాండవులను జయింపగలవాడు కాడనియే నా నమ్మకము. మన మందరము ఎంత యుద్ధము చేసినాము ? సైంధవుని కాపాడగలిగినామా ? మనకు దైవబలము లేదు. కపటముచేగాని, పరాక్రమముచేగాని మన మెంత ప్రయత్నించినను దైవము (మన దురదృష్టము) మన ప్రయత్నములను చెడగొట్టుచున్నది.

కపటోపాయములచేత, విషప్రయోగములచేత, లాక్షాగృహ దహనోద్యమముచేత పాండవులు మనచే వంచింపబడినారు. ద్యూతముచే నోడింపబడినారు. అరణ్యమునకు బంపబడినారు. అదంతయు దైవముచే వ్యర్థము చేయబడినది. అని.

ఇక్కడ కర్ణుడు చెప్పినట్లు ద్రోణుడు వృద్ధు డనియు, 400 సం॥రముల వయస్సు వాడనియు, అయినను యువకునివలె శీఘ్రవిహారము చేసె ననియు స్థలాంతరములో జెప్పబడినది.

"అకర్ణపలి శ్యామో వయసాఽశీతిపంచకః ।
రణే పర్యచర ద్ద్రోణో వృద్ధః షోడశవర్షవత్ ॥
టీ. అశీతిపంచకః చతుశ్శతాబ్దః.

ఇట్లు కర్ణునిచేగూడ ద్రోణుని తప్పు లేదని దుర్యోధనుడు మందలింపబడెను. పాండవులపై తాము జేసిన దుష్కార్యములు వెల్లడింపబడెను. దీనిని ప్రతివాదులు గమనింతురుగాక.

—♦ కర్ణుని ఏకవీరఘ్ని పార్థునియందు ప్రయోగింపబడక పోవుటకు కారణము ♦—

ద్రోణాచార్యసైన్యాధిపత్యములోని చతుర్థదివసమునాటి రాత్రి యుద్ధములో ఘటోత్కచుడు డీకొని కౌరవసేనలను హతముచేయుచు కర్ణుని కటకటలాడింప కురువీరులు చూచి కర్ణునితో నిట్లనిరి—

"తస్మాదేనం రాక్షసం ఘోరరూపం శక్త్యా జహి త్వం దత్తయా వాసవేన ।
మా కౌరవా స్సర్వఏవే న్ద్రకల్పా రాత్రియుద్ధే కర్ణ నేశు స్సయోధాః ॥"

రాధేయా ! ఈగండము దాటిన చూచుకొనవచ్చును. ఆయేకవీరఘ్నిని యీ ఘటోత్కచునియందు ప్రయోగించి కౌరవయోధులను రక్షింపుము. అని. ఆమాటపై కర్ణుడట్లే చేసెను.

ఈవిషయము సంజయునివలన ధృతరాష్ట్రుడు విని యిట్లు ప్రశ్నించెను—సంజయా ! ఏకవీరఘ్ని కర్ణుని కున్నదాయె. అట్టి యేకవీరుడు పార్థుడాయె. "ఆహూతో న నివర్తేయ మితి తస్య మహావ్రతమ్" ఆహ్వానించినవానిమీదికి వెళ్ళితీరెద నని పార్థునకు వ్రతమాయె. అట్టి స్థితిలో కర్ణుడాపార్థుని యుద్ధమునకు బిలిచి యాశక్తిని బ్రయోగింపకపోవుటకు కారణ మేమి ? దుర్యోధనాదులుగాని, నీవుగాని యేల చెప్పలేదు ? అని.

దీనికి సమాధానము సంజయు డిట్లు చెప్పెను—

స్వగాత్రిమా ద్వినివృత్తానాం సర్వేషాం నో విశాం పతే ।
రాత్రౌ కురుకులశ్రేష్ఠ మన్త్రోఽయం సమజాయత ॥
ప్రభాతమాత్రే శ్వోభూతే కేశవాయాఽర్జునాయ వా ।
శక్తి రేషా హి మోక్తవ్యా కర్ణ కర్ణేతి నిత్యశః ॥

తతః ప్రభాతసమయే రాజన్ కర్ణస్య దైవతైః ।
అన్యేషాం చైవ యోధానాం సా బుద్ధి ర్నాశ్యతే పునః ॥
దైవ మేవ పరం మన్యే య త్కర్ణో హస్తసంస్థయా ।
న జఘాన రణే పార్థం కృష్ణం వా దేవకీసుతమ్ ॥"

ధృతరాష్ట్రా! ఏనాటి కానాడు యుద్ధము ఆపినతరువాత రాత్రి అందరును గలిసి యాలోచించుటలో రేపు యుద్ధములో రాధేయా! ఏకవీరఘ్నిని పార్థునిమీదనో, కృష్ణునిమీదనో ప్రయోగింపుము. అని నిత్యము అనుకొనుచుండుటయు, యుద్ధరంగమున బ్రవేశించినతరువాత కర్ణునకుగాని, యోధులకుగాని ఆబుద్ధియే పుట్టకపోవుచుండుటయు జరుగుచు వచ్చినది. అది దేవతలమూలమున జరిగిన పని. తన హస్తగతమైన శక్తిచేత పార్థుని, లేక కృష్ణుని వధింపవలసిన కర్ణుడు ఆపని జేయకపోవుట దురదృష్టము. అని.

ఇచ్చట ఆబుద్ధి పుట్టకుండ దేవతలు చేయుచువచ్చినారని చెప్ప బడినది. వారట్లు చేయుటకు దురదృష్టము కారణ మని చెప్పబడినది. కనుకనే—

"యస్మై దేవాః ప్రయచ్ఛన్తి పురుషాయ పరాభవమ్ ।
బుద్ధిం తస్యాఽపి కర్షన్తి సోఽవాచీనాని పశ్యతి ॥
బుద్ధౌ కలుషభూతాయాం వినాశే సముపస్థితే ।
అనయో నయసంకాశో హృదయా న్నాపసర్పతి ॥"

దేవతలు ఎవ్వనికి పరాభవము కలిగింప దలపెట్టెదరో ఆతని బుద్ధి పెడదారి బడును. దానిపై విరుద్ధభావము లుద్భవించును. బుద్ధి కలుషితమై వినాశ మాసన్నమైనపుడు అవినీతి నీతిగా దోచును. అని విదురనీతిలో చెప్పబడినది.

ఆశక్తి పార్థునిపై ప్రయోగింపబడకుండునట్లు తానే చేయుచు వచ్చితి నని శ్రీకృష్ణుం డిట్లు సాత్యకితో జెప్పెను—

"అహ మేవ తు రాధేయం మోహయామి యుధాం వర ।
తతో నా వాసృజ చ్ఛక్తిం పాండవే శ్వేతవాహనే ॥

ఈ వాక్యమునుబట్టి శ్రీకృష్ణుడు చేసినట్లును, ఆ సంజయుడు వాక్య

మనుబట్టి దేవతలుచేసినట్లును కనబడినను విరోధములేదు. కర్మఫల ప్రదాతయగు భగవంతునకు అనుచరులే దేవతలు. వారే యింద్రియాధిష్ఠానదేవతలు. భగవంతునిసంకల్పమును వారేనెరవేర్చుచుందురు.

ఇచ్చట వక్తవ్యాంశము.

భగవంతునకు వారివారి భవితవ్యములను, ఆయా మహాపురుషుల శాపానుగ్రహరూపములైన అమోఘవాక్యములను అన్యోన్యవిరోధము లేకుండ అమలుజరుపుట లక్షణముకదా !

ఇంద్రుడు కర్ణునకు ఏకవీరఘ్నిని యిచ్చియుండెను. ఇచ్చి

"త్వం తు యం ప్రార్థయ స్యేకం రక్ష్యతే స మహాత్మనా ।"

నీవెవ్వనిపై దృష్టిపెట్టుకొని యున్నావో అతడు శ్రీకృష్ణరక్షితుడై యుండు నని చెప్పెను. ఆ యింద్రుని యనుగ్రహవాక్యమునకు పార్థుని భవితవ్యమునకు హాని జరుగకూడదు. ఆ యేకవీరఘ్ని వ్యర్థము కాకూడదు.

"స హి సృష్టో మఘవతా శక్తిర్హేతో ర్మహాత్మనా ।
కర్ణస్యాఽప్రతివీర్యస్య ప్రతియోద్ధా మహారథః ॥"

ఆ కర్ణుని యేకవీరఘ్నికి గురియగుటకే యింద్రునిచే బుట్టింపబడియున్న ఘటోత్కచుడు ఆ శక్తికి గురికాకుండ నుండగూడదు. పార్థసంహారబుద్ధితో శత్రువర్గము ఆశక్తి నాధారముచేసికొనియున్నది. ఇట్టి పరిస్థితిలో శత్రువర్గ మెప్పటికప్పు డనుకొనుచునే మఱచిపోవునట్లును దానికొఱకే జన్మించిన ఘటోత్కచునిపై యది ప్రయోగింపబడునట్లును భగవంతుడు గనుకనే శ్రీకృష్ణుడు చేయగలిగెను. తమస్వాధీనములోని తమబుద్ధితమ యధీనములో లేక శ్రీకృష్ణుని యధీనమై నడచుట కంటె శ్రీకృష్ణుడు భగవంతు డనుటకు మఱొక నిదర్శన మేమి కావలయును? ఘటోత్కచుడు తమకు బహువిధోపకారములు చేసినవాడు చనిపోయె నని ఖేదపడు పార్థునకు కృష్ణభగవానుడిట్లు చెప్పెను—

"ఏష హి బ్రాహ్మణద్వేషీ యజ్ఞద్వేషీ చ రాక్షసః ।
ధర్మస్య లోప్తా పాపాత్మా తస్మా దేష నిపాతితః ॥
యే హి ధర్మస్య లోప్తారో వధ్యా స్తే మమ పాండవ ॥
ధర్మసంస్థాపనార్థం హి ప్రతిజ్ఞైషా మమాఽవ్యయా ।"

పార్థా ! ధర్మవ్యవస్థలను భగ్నము చేయువారు నాకు వధ్యులే. ధర్మసంస్థాపనమే నాకు ప్రధానకార్యము. అని.

దీనినిబట్టి భగవంతుని అనుగ్రహానిగ్రహములకు హేతువు ఉపకారాపకారములుగాక వారివారి ధర్మాధర్మము లని స్పష్టము.

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే ।"

అను భగవద్గీతాసూక్తి యీ భగవంతుని దేకదా !

—♦ ధర్మజునకు ద్రోణాచార్యునియొద్ద అసత్య మాడక తీరని పరిస్థితి ♦—

ద్రోణాచార్యుని సైన్యాధిపత్యములో పంచమదివసయుద్ధము ప్రచండమై ద్రోణుని విజృంభణము అనివార్యమై ద్రోణుని మహాస్త్ర జ్వాలలకు పాండవపక్షవీరులు ఆహుతియైపోవుచున్న స్థితి సంభవించినది. యుద్ధధర్మము జూడగా భూరిశ్రవస్సుతో పార్థుడు చెప్పిన విధముగా—

"నచాత్మా రక్షితవ్యో వై రాజన్ రణగతేన హి ।
యో యస్య యుజ్యతే ర్థేషు స వై రక్ష్యో నరాధిప ॥
తై రక్ష్యమాణై స్స నృపో రక్షితవ్యో మహామృధే ।"

సైనికులు ఎవ్వని విజయమునకై తమప్రాణము లొడ్డి యుద్ధము జేయుచుందురో ఆతడు వారి నందరను రక్షించుచుండి వారందరి చేతను తాను రక్షింపపడుచుండవలయును.

ద్రోణుని పరిస్థితి జూడగా కాలాంతకుడై యుండెను. అప్పుడు ధర్మజునితో కృష్ణభగవానుడు ఇట్లు చెప్పెను—

"తతో నిష్పాండవా మూర్వీం కరిష్యన్తం యుధాం పతిమ్ ।
ద్రోణం జ్ఞాత్వా ధర్మరాజం గోవిన్దో వ్యథితో ఽబ్రవీత్ ॥
యద్యర్ధదివసం ద్రోణో యుధ్యతే మన్యు మాస్థితః ।
సత్యం బ్రవీమి తే సేనా వినాశం సముపైష్యతి ॥
స భవాం స్త్రాతు నో ద్రోణా త్సత్యా జ్జ్యాయో ఽనృతం వచః ।"

ధర్మరాజా ! ద్రోణు డీవిధముగా నొకపూట యుద్ధము చేసిన యెడల నిజముగా నీ సేన యంతయు నశించిపోవును. కనుక నీవిప్పుడు మమ్ముల నందరును ద్రోణుని వలన కాపాడవలయును. ఈ విషమ

స్థితిలో సత్యముకంటె అనృతమె ఉచితము. అని. అసత్య మాడినంత మాత్రమున రక్షణ మగునని విశ్వాసమెట్లు? అనగా ఆదిలో ధర్మజునకు ద్రోణు డిట్లు చెప్పెను—

"ఋతే ప్రాయగతం రాజ న్న్యస్తశస్త్ర మచేతనమ్।
హన్యా న్మాం యుధి యోధానాం సత్య మేత ద్బ్రవీమి తే॥
న శత్రుం తాత పశ్యామి యో మాం హన్యా ద్రథే స్థితం।
శస్త్రం చాహం రణే జహ్యాం శ్రుత్వా తు మహ దప్రియమ్॥
శ్రద్ధేయవాక్యా త్పురుషా దేత త్సత్యం బ్రవీమి తే।"

ధర్మజా! నేను శస్త్రసంన్యాసము జేసి ప్రాయోపవేశము జేసి యున్నపుడు తప్ప, శస్త్రము చేతబట్టి యున్నంతసేపు నన్ను వధింప గలవాడు లేడు. నేను శస్త్రము విడుచుట యెప్పు డనగా? విశ్వస నీయునివలన అప్రియవార్త వినినప్పుడు. ఇది నిజము. అని.

ఈవిషయము ద్రోణుడు చెప్పిన దెప్పుడు? యుద్ధారంభములో ధర్మజుడు వెళ్ళి పాదాభివందనము చేసిన సందర్భమున—

ధ్రువ స్తే విజయో రాజన్ యస్య మన్త్రీ హరి స్తవ।"

శ్రీకృష్ణుడు మంత్రియై యున్న నీకు విజయము ధ్రువ మని యాశీర్వదింప ఆవిజయము కలుగుట యెట్లు? అను ధర్మజుని ప్రశ్నకు సమాధానము చెప్పినప్పుడు.

దీనినిబట్టి అప్రియవార్తాశ్రవణమున ద్రోణు డస్త్రసంన్యాసము జేయును. అట్టి వార్త ధర్మజునిమూలమున వినవలయును. దానికై ధర్మజు డసత్య మాడవలయును. అసత్య మాడనివాడు ధర్మజుడు. ఆడనిదే అస్త్రసంన్యాసము జేయనివాడు ద్రోణుడు. అది చేయనిదే జీవింపనిది సేన; ఫలింపనిది విజయాశీర్వాదము. ధర్మజునకు శరణాగత సైనికసంరక్షణము విధి; దానికి తన యసత్యవచనమే సాధనము గావలసివచ్చినది. అసత్య మాడునా? ఒక దోషము. ఆడకుండునా? ఒక దోషము. ఎట్లు చూచినను దోషమె ఘటించునట్టి యీవిషమ

స్థితిలో అల్పదోషమున కంగీకరించి యధికదోషము లేకుండ జేసికొనుట ప్రాజ్ఞలక్షణము. అందు శరణాగతస్సైనికులను రక్షింపకుండుట అధిక దోష మని, తదర్థ మసత్య మాడుట అల్పదోష మని కృష్ణభగవాను డుపదేశించెను. ఇదియే ధర్మజునకు అసత్య మాడక తీరని పరిస్థితి. ఈ పరిస్థితినిబట్టియే ధర్మజుడు ద్రోణప్రశ్నపై "అశ్వత్థామా హతః కుంజరః" అని పలుకుట, ద్రోణు డస్త్రసంన్యాసము జేయుట, ధృష్ట ద్యుమ్నుడు ద్రోణుని వధించుట జరిగినది.

మొదట భీమసేనుడు అశ్వత్థామ యనబడు గజమును వధించి ద్రోణుడు వినునట్లు "అశ్వత్థామా హతః" అని కేక వేసెను. దానిపై సందేహము కలిగి ధర్మజు నడుగ ధర్మజు డట్లు పలికెను. దీనికి వాక్ఛల మనిపేరు. ఛలము లెన్నివిధములో అందిది యేవిధమో నీలకంఠీయ ములో జెప్పబడినది—

"నిత్యం పంచోపధాతీతై ర్మన్త్రయేత్ సహ మన్త్రిభిః।" (శాన్తి. అ. 83)

టీ. ఉపధాః ఛలాని తాని పంచ తేషు కేవలం వాచికీ ద్రోణవధే— "హతో౽శ్వత్థామా కుంజరః" ఇత్యుక్తి ర్యుధిష్ఠిరస్య మనసి ఛలాభావాత్। భీమస్య తు తత్రైవ కాయికీ వాచికీ చ। కేవలం మానసికీ పాండవేషు। ధృత రాష్ట్రస్య వాచికాయ అభావాత్। తత్రైవ ధార్తరాష్ట్రాణాం కాయవాఙ్మనో భవా జతుగృహే। సౌప్తికే౽శ్వత్థామ్నః కాయికీతి పంచవిధా।

ఛలములు— కేవలకాయిక మని, కేవలవాచిక మని, కేవల మానసిక మని, కాయికవాచిక మని, మనోవాక్కాయకృత మని యైదు విధములు.

ఇందుద్రోణవధోద్దేశ్యకమైన యుధిష్ఠిరోక్తిలోని అశ్వత్థామ శబ్దము గజార్థకముగనే భావించి వాడబడుటచేత నది కేవలవాచికమైన ఛలమే, మానసికచ్ఛలము లేదు.

అవిషయమై అశ్వత్థామనామకగజమును వధించి "అశ్వత్థామా హతః" అని భీమసేను డనుటలో నది కాయికవాచికచ్ఛలము; అది గజార్థకముగనే భావించి వాడబడుటచేత మానసికచ్ఛలము లేదు.

ధృతరాష్ట్రునకు పాండవులపట్ల కేవలమానసికచ్ఛలము; వాక్కులలో గాని క్రియలలోగాని ఛలములేదు. అశ్వత్థామకు సౌప్తికవధవిషయములో తెలియకుండ వచ్చి వధించుటచే కాయకచ్ఛలము.

పాండవులనిమిత్తము లాక్షాగృహవిషయమై దుర్యోధనాదులది మనోవాక్కాయకృతచ్ఛలము. అని.

దీనినిబట్టి దుష్టచతుష్టయము చేసినంత ఛలము భీమసేనుడు చేయనే లేదు. ధర్మజునిమాట చెప్పవలసిన దేమున్నది ?

అదియైనను దుష్టచతుష్టయమువలె చేసినది కాక శరణాగత స్వసైనికరక్షణార్థము యుద్ధభూమిలో చేయవలసివచ్చి చేసిన పని; ద్రోణాచార్యుడు ఆ అశ్వత్థామవిషయమును సన్నిధానవర్తులగు తన పక్షమువారి నడుగక ధర్మజు నడిగినప్పుడు చేసిన పని; తానడుచున్న అశ్వత్థామ గజమని భావించియే చేసిన పని; ద్రోణాచార్యుని విజయాశీర్వచనకాలమందలి సూచన ననుసరించి చేసినపని; ఆపద్ధర్మము నవలంబించి చేసినపని; కృష్ణభగవానుని ప్రబోధము నవధరించి చేసిన పని.

ధర్మజు డసత్య మాడె నసత్యమాడె నను కోలాహలము జేయు ప్రతివాదు లీవిషయము నవధరించి తమ భ్రాంతిని తొలగించు కొందురు గాక !

కృష్ణభగవానునిగూర్చి చెప్పుచున్నాము — ఆయావ్యక్తుల భవితవ్యమునకును, ఆయామహాపురుషుల అమోఘవాక్కులకును పరస్పర విరోధము లేకుండ జగద్వ్యాపారమును నడిపింప గల అకుంఠితశక్తి భగవంతునిది.

"ఇష్ట్వా మనుజేన్ద్రేణ ద్రుపదేన ... లబ్ధో ద్రోణవినాశాయ"

అని ద్రోణాంతకుడుగా బుట్టినవాడు ధృష్టద్యుమ్నుడు.

"యతో ధర్మ స్తతః కృష్ణో యతః కృష్ణ స్తతో జయః ।
యుధ్యస్వ గచ్ఛ కౌన్తేయ పృచ్ఛ మాం కిం బ్రవీమి తే ॥

న తేఽస్తి విజయ స్తావ ద్యావ ద్యుధ్యా మ్యహం రణే।
మమాఽ_ఽశు నిధనే రాజన్ యతస్వ సహ సోదరైః॥
న శత్రుం తాత పశ్యామి యో మాం హన్యా ద్రథే స్థితం।
ఋతే ప్రాయగతం రాజన్ న్యస్తశస్త్రం ...॥
శస్త్రం చాఽహం రణే జహ్యాం శ్రుత్వా తు మహదప్రియమ్।"

నీకు విజయము కలుగును; నేను యుద్ధముచేయుచున్నంత వరకు గలుగదు. నీవు నీసోదరులతోగూడి నన్ను వధించుటకు ప్రయత్నింపుము. నేను శస్త్రమును విడిచివేసినప్పుడు తప్ప నన్నెవ్వడును వధింపలేడు. అప్రియవార్తను వినినపుడు నేను శస్త్రము విడిచివేయుదును. అని ధర్మజునకు జెప్పిన అమోఘవాక్కుగల మహాపురుషుడు ద్రోణాచార్యుడు.

ఇట్టి ద్రోణాచార్యుడు ధృష్టద్యుమ్నుని మూలమున శస్త్రము విడుచువాడు గాడు. శస్త్రము విడిచినగాని ధృష్టద్యుమ్నునకు స్వాధీనము గాడు. స్వాధీనమైనగాని ధృష్టద్యుమ్నజన్మమునకు సార్థక్యము రాదు. పాండవులకు ద్రోణాభిమతవిజయమును రాదు. అందుకై ద్రోణాచార్యానుజ్ఞాప్రకారము ధర్మజుని మూలమున ద్రోణుని శస్త్రసంన్యాసము; ధృష్టద్యుమ్నునిమూలమున ద్రోణవధము జరుగవలసియున్నందునను ఈఘటన కృష్ణభగవానుడు చేయగలుగు ననియే— "ధ్రువ స్తే విజయో రాజన్ యస్య మన్త్రీ హరి స్తవ" అని ద్రోణాచార్యుడు సూచించియున్నందునను ఆచార్యహృదయము తెలిసిన కృష్ణభగవానుడు అట్లు ప్రబోధించి యావిషయముల నన్నిటిని ఘటింపజేసెను. కనుక కృష్ణభగవానునిగూర్చి తమతమ యుహాపోహలను ప్రతివాదులు తొలగించుకొందురుగాక.

### —♦ ద్రోణవధానంతరము స్వయంకృతాపరాధముల దలచుకొని దుష్టచతుష్టయము పరితపించుట ♦—

తన సైన్యాధిపత్యములో నయిదవరోజు సాయంకాలమునకు

ద్రోణాచార్యుడు పరమపదము నొందగా నాటి రాత్రి కౌరవసేన శోకించినది—

"విశేషత స్సూతపుత్రో రాజా చైవ సుయోధనః।
దుశ్శాసన శ్చ శకుని స్సౌబల శ్చ మహాబలః॥
ఉషితా స్తే నిశాంతా స్తు దుర్యోధననివేశనే।
చిన్తయన్తః పరిక్లేశాన్ పాండవానాం మహాత్మనామ్॥
య త్త ద్ద్యూతే పరిక్లిష్టా కృష్ణా చానాయితా సభామ్।
త త్స్మరన్తో ౽నుశోచన్తో భృశ ముద్విగ్నచేతసః॥
తథా తు సంచిన్తయతాం తాన్ క్లేశాన్ ద్యూతకారితాన్।
దుఃఖేన క్షణదా రాజన్ జగామా౽బ్దశతోపమా॥" (కర్ణ. అ. 1)

టీ. క్లేశాన్=కచగ్రహణాదీన్।

కర్ణ, శకుని, దుర్యోధన, దుశ్శాసనులు దుర్యోధనశిబిరమందు గూర్చుండి మహాత్ములగు పాండవులకు దాము కలిగించిన కష్టములను, ద్యూతములో బెట్టిన బాధలను, ద్యూతసభకు ద్రౌపదీదేవిని లాగుటను, ఆమె కేశాకర్షణమును, ఆమె వస్త్రాపహరణమును దలపోసికొని చింతించుచుండ నాటి రాత్రి అతిదుఃఖముతో గడచినది. ద్రౌపదీదేవి యెన్నడో నవ్వినదని దానికి శాస్తిగా దుర్యోధనాదు లామె నట్లు చేసినా రని చెప్పు ప్రతివాదుల కొకింత బోధించుచున్నాము—

చేసిన పని తప్పయినపుడు దుర్యోధనాదులు పరితపింతురా? ఒప్పయినపుడు పరితపింతురా? ఒకరి తప్పుపనికి చేసిన శాస్తి ఒప్పగునా? తప్పగునా? నిర్హేతుకముగా జేసిన తప్పుపనికి పరితపింతురా? సహేతుకముగా జేసిన పనికిపరితపింతురా? ఎట్టిఘోరకృత్యములకును జంకి యెరుగని దుష్టచతుష్టయము నట్లు పరితపింపజేసినది— ద్రౌపదీనిమిత్తకమైన దుష్కార్యము; దానికి హేతువును గల్పించి సమర్థింపబూనుట నింద్యము.

## —♦ కర్ణుని సైన్యాధిపత్యము – శల్యసారథ్యవరణము– కర్ణశల్యసంవాదము ♦—

యుద్ధారంభమునుండి పదియారవరోజున కర్ణుడు సైన్యాధి

పత్యము వహించి ప్రచండయుద్ధము జేయుట, తుదకు పార్థుడు ప్రీతి ఘటించి కౌరవసేనలను పారదోలుట, అంతట సాయంకాలము కాగా ఆనాటియుద్ధ మాపుట జరిగినది.

మరుచటిరోజు యుద్ధమునుగూర్చి ప్రసంగించునపుడు నేను—"నిహనిష్యామి తం వీరం స వా మాం నిహనిష్యతి" పార్థుని నేను వధించుటో నన్ను పార్థుడు వధించుటో జరుగు నని చెప్పి యిట్లనెను—

"అవశ్య స్తు మయా వాచ్యం యేన హీనో౽స్మి ఫాల్గునాత్ ।
జాతస్య ధనుషో దివ్యా తథా౽క్షయ్యే మహేషుధీ ॥
సారథి స్తస్య గోవిన్దో మమ తాదృ ఙ్న విద్యతే ।
తస్య దివ్యం ధనుః శ్రేష్ఠం గాండీవ మజితం యుధి ॥
యేన చా౽ప్యధికో వీరః పాండవ స్తన్నిబోధ మే ।
రశ్మిగ్రాహ శ్చ దాశార్హ స్సర్వలోకనమస్కృతః ॥
అగ్నిదత్త శ్చ మే దివ్యో రథః కాంచనభూషణః ।
అచ్ఛేద్య స్సర్వతో వీర వాజిన శ్చ మనోజవాః ॥
ధ్వజ శ్చ దివ్యో ద్యుతిమాన్ వానరో విస్మయంకరః ।
కృష్ణశ్చ స్రష్టా జగతో రథం త మభిరక్షతి ।
ఏతై ర్ద్రవ్యై రహం హీనో యోద్ధు మిచ్ఛామి పాండవమ్ ॥
అయ స్తు సదృశ శ్శౌరే శ్శల్యస్సమితశోభనః ।
సారథ్యం యది మే కుర్యా ద్ధ్రువ స్తే విజయో భవేత్ ॥" (కర్ణ. అ. 31)

దుర్యోధనా! పార్థునికంటె నేను దేనిచే హీనుడనై యుంటినో నీకు అవశ్యము చెప్పవలసియున్నది. పార్థుని ధనుస్సు దివ్యము; దాని నారితాడు దివ్యము; అతని యక్షయ్యతూణీరములు దివ్యములు; పార్థసారథి శ్రీకృష్ణుడు. అట్టివాడు నాకు లేనేలేడు.

పార్థుడు ఏయే పరికరములచే నధికుడో వినుము:— సర్వలోక నమస్కృతుడయిన శ్రీకృష్ణుడు సారథి; అగ్నిదత్తమై అచ్ఛేద్యమై యున్న దివ్యమైన రథము; మనోవేగముగల అశ్వములు; మహాదీప్తి కలిగి విస్మయావహమైయున్న దివ్యమైన కపిధ్వజము; జగత్కర్తయైన శ్రీకృష్ణుడు రక్షించుకుడు.

ఈపరికరము లేమియు లేని నేను పార్థునితో యుద్ధము చేయ దలచినాను; శ్రీకృష్ణునకు తుల్యుడైన యీశల్యుడు నాకు సారథ్యము చేసినయెడల నీకు ధ్రువముగా విజయము కలుగును. అని. ఆమాటపై దుర్యోధనుడు నీవు కర్ణసారథివి కావలసిన దని స్తుతిపూర్వకముగా యాచించి శల్యు నంగీకరింపజేసినపుడు శల్యు డిట్లనెను—

"య త్తు కర్ణ మహం బ్రూయాం హిత కామః ప్రియాప్రియే।
మమ తత్ క్షమతాం సర్వం భవాన్ కర్ణ శ్చ సర్వశః॥"

హితమును గోరిన నేను కర్ణునిగూర్చి ప్రియాప్రియవిషయము లాడినపుడు నీవును కర్ణుడును సహించియుండవలెను. ఈనిర్ణయముపై నేను సారథ్యము జేయుదును. అని.

దాని కంగీకరించినతరువాత కర్ణశల్యులు రథారూఢులై యుద్ధభూమికి వచ్చునపుడు పార్థుని వధింతు నని కర్ణుడును, అది నీకు శక్యమా ? అని శల్యుడును వివాదము పెట్టుకొని యొకనినొకడు నిరసించుకొను సందర్భములో కర్ణు డిట్లనెను—

"శౌరే రథం వాహయతోఽర్జునస్య బలం మహాస్త్రాణి చ పాండవస్య।
అహం విజానామి ... తౌ చా ప్యహం ...॥
వ్యపేతభీ ర్యోధయిష్యామి కృష్ణౌ।
సంతాపయ త్యభ్యధికన్ను రామా చ్ఛాపోఽద్య మాం బ్రాహ్మణసత్తమాచ్చ॥"

నేను కృష్ణార్జునుల శక్తిసామర్థ్యముల నెరుగుదును. అయినను వారితో నిర్భయుడనై యుద్ధము జేయుదును.

పరశురామశాప మొకటియు, బ్రాహ్మణశాప మొకటియు నాకు మిక్కిలి సంతాపకరములై యున్నవి.

పరశురామశాపము:—"సూతోపధావాప్త మిదం తవాస్త్రం న కర్మకాలే ప్రతిభాస్యతి త్వామ్। అన్యత్ర తు స్యా త్తవ మృత్యుకాలాత్"

టీ. సూతోపధా సూతత్వపిధాననిమిత్తం కర్మకాలే స్వప్రతిజ్ఞారక్షణకాలే।

నీవు సూతత్వమును కప్పిపుచ్చి నావలన గ్రహించిన అస్త్రము

ప్రతిజ్ఞారక్షణకాలములో నీకు స్ఫురింపదు. నీకు మృత్యుకాలముకంటె నితరకాలమందే స్ఫురించును. అని.

బ్రాహ్మణశాపము:—

"యస్మాత్త్వయా ప్రమత్తేన హోమధేన్వా హత స్సుతః ।
శ్వభ్రే తే పతతాం చక్ర మితి మాం బ్రాహ్మణోఽబ్రవీత్ ॥
యుధ్యమానస్య సంగ్రామే ప్రాప్తస్యైకాయనం భయం ।"

నీవు ప్రమత్తుడవై నాహోమధేనువత్సమును వధించితివిగనుక భయంకరసంగ్రామములో యుద్ధము చేయునప్పుడు నీరథచక్రము భూమిలో దించుకొనిపోవుగాక. అని. ఈశాపములు నాకు సంతాపము గలిగించుచున్నవి.

—♦ పార్థుడు సంశప్తకులతో బోరుచున్నపుడు కర్ణుడు పాండవసేనలపై విజృంభించుట ♦—

సంకులయుద్ధము జరుగుచుండ కర్ణయుధిష్ఠిరులు తలపడిరి. కర్ణుని బాణాఘాతములచే పీడితుడైన యుధిష్ఠిరుడు—

"సమాధత్త శితం బాణం గిరీణా మపి దారణం ।
ముమోచ త్వరితో రాజా సూతపుత్రజిఘాంసయా ॥
స తు తేన ప్రహారేణ పీడితః ప్రముమోహ హై ।
స్రస్తగాత్రో మహాబాహు ర్ధను రుత్సృజ్య స్యన్దనే ॥
గతాసు రివ నిశ్చేతా శ్శల్య స్యాఽభిముఖోఽపతత్ ।
రాజాపి భూయో నాజఘ్నే కర్ణం పార్థహితేప్సయా ॥"

నిశితమైన బాణమును సంధించి ప్రయోగింప అగాధప్రహారముచే స్మృతి దప్పి ధనుస్సును వదలి మూర్ఛితుడై రథముమీద కర్ణుడు పడిపోయెను. అప్పుడు పార్థప్రతిజ్ఞనుబట్టి తాను మరల కర్ణునిపై బాణమును ప్రయోగింపలేదు.

తరువాత స్మృతి రాగా కర్ణుడు కుపితుడై యుధిష్ఠిరుని బాణములచే పీడింప—"ప్రాయా ద్రాజా పరాఙ్ముఖః" ధర్మరాజుడు మరలిపోయెను. ఆసమయమందు కర్ణుడు—

"అభిద్రుత్య తు రాధేయః పాండుపుత్రం యుధిష్ఠిరం।
పవిత్రీకర్తు మాత్మానం స్కన్ధే సంస్పృశ్య పాణినా ॥
గ్రహీతు మిచ్ఛన్ సబలా త్కున్తీవాక్యం చ సోఽస్మరత్ ।"

యుధిష్ఠిరుని మీదికి దుతగతితో బోయి ధర్మజుని భుజముపై తన హస్తముచేత స్పృశించి తన్ను పవిత్రీకరించుకొనుటకును, బలాత్కారమున గ్రహించుటకును దలపెట్టియు కున్తీవాక్యము దలచుకొని యుపేక్షించెను; నిరసనవాక్యము లాడెను. తరువాత కర్ణభీమసేనులు తలపడిరి.

"స భీమసేనాభిహత స్సూతపుత్రః కురూద్వహ ।
నిషసాద రథోపస్థే విసంజ్ఞః పృతనాపతిః ॥
తతో మద్రాధిపో దృష్ట్వా విసంజ్ఞం సూతనన్దనం ।
అపోవాహ రథేనాజౌ కర్ణ మాహవశోభినమ్ ॥"

భీమసేమనబాణాభిహతుడై స్మృతి తప్పి రథముపై మూర్ఛిల్లిన కర్ణుని శల్యుడు రథమును మరలించి తీసికొని వెళ్ళెను.

కర్ణుడు తెప్పరిల్లి మహాయుద్ధము జేయుచు పాండవసేనలోని యోధులను వందలకొలది వధించుచు, నకులసహదేవుల మధ్య క్షత గాత్రుడై యున్న ధర్మజుని మీదకు వెళ్ళి ధర్మజుని, నకులుని విరథులను, మిక్కిలి క్షతగాత్రులను జేయ వారిరువురును సహదేవుని రథ మధిష్ఠించిరి. శల్యుడు రాధేయా ! పార్థునిమీద జూపవలసిన పరాక్రమమును క్షతవిక్షతగాత్రుడును, విరథుడును, క్షీణశస్త్రకవచుడును అగు ధర్మజునిపై జూపెదవేమని యనుచున్నను వినిపించుకొనక నకుల సహదేవులను, ధర్మజుని గాఢముగా పరిహరించి—"దృష్ట్వా దుర్యోధనం చైవ భీమగ్రస్తం మహాహవే" భీమునిచే నాక్రమింపబడిన దుర్యోధనుని రక్షించుటకై అటు పోయెను.

ధర్మజుడు సోదరద్వయముతో శిబిరమున బ్రవేశించి శయనించి తన శరీరగతములైన ములుకులను వారు తీసివేసిన తరువాత భీనసేన సహాయార్థము నకులసహదేవులను బంపెను.

పార్థుడు సంశప్తకులతోఁ బోరి యాపై యశ్వత్థామతో మహా యుద్ధము జేసి అశ్వత్థామరథము పర్వాంతముగ మరుగునట్లు చేసి "ఆలోకయామాస తత స్స్వసైన్యం" తన సైన్యమువైపు చూచునప్పటికి కర్ణుడు భార్గవాస్త్రప్రయోగముచే తనసైన్యమునకు గలిగించుచున్న హాని గోచరింప శ్రీకృష్ణునితో నిట్లనెను —

"పశ్య కృష్ణ మహాబాహో భార్గవాస్త్రస్య విక్రమం।
నైత దస్త్రం హి సమరే శక్యం హన్తుం కథంచన ॥
సూతపుత్రం చ సంరబ్ధం పశ్య కృష్ణ మహారణే।
అన్తకప్రతిమం వీర్యే కుర్వాణం కర్మ దారుణమ్ ॥
అభీక్ష్ణం చోదయ న్నశ్వాన్ ప్రేక్షతే మాం ముహుర్ముహుః।
న చ పశ్యామి సమరే కర్ణం ప్రతిపలాయితుమ్ ॥"

టీ. కర్ణంప్రతి=లక్షీకృత్య పలాయితుం న పశ్యామి నిషిద్ధత్వాత్।

జీవన్ ప్రాప్నోతి పురుష స్సంఖ్యే జయపరాజయౌ।
మృతస్య తు హృషీకేశ భంగ ఏవ కుతో జయః ॥ (అ. 64)

శ్రీకృష్ణా! ఆ భార్గవాస్త్రముయొక్క ఉదగ్రస్థితిని జూడుము. దానిని పరిహరించుటకు ప్రత్యస్త్రము లేనే లేదు. ఆకర్ణుడు అంతకుని వలె మండిపడుచు నావంకకు జూచుచు నెట్లుండెనో చూడుము. నే నిప్పుడు కర్ణునకెదురయి ఆయస్త్ర మప్రతిహత మగుటవలన నిషిద్ధ మయిన పలాయనము జేయుట సాకిష్టము గాదు. జీవించియున్నవాడు జయమో, పరాజయమో కలుగవచ్చును. మరణించిన కేమున్నది? అని.

దీనినిబట్టి కర్ణార్జునద్వంద్వయుద్ధములో కర్ణుడు మరలిపోవుచు వచ్చినట్లు, పార్థుడెన్నడును మరలిపోలేదని ప్రతివాదులు తెలిసికొన వలయును.

## — ♦ భీమసేనుడు దుశ్శాసనుని వధించుట ♦ —

క్షతగాత్రుడై యున్న ధర్మరాజునొద్దకు కృష్ణార్జునులు వెళ్ళి చూచినపుడు ధర్మరాజుని ప్రసంగము విని కర్ణునిపై పార్థుడత్యాగ్ర హము వహించి యిక కర్ణుని వధించియే వచ్చెద నని శపథము జేసి

యుద్ధభూమికి వచ్చి సైన్యసాగరమధ్యమందున్న భీమసేనునకు సహాయ
పడుచు ముందునకు వెళ్ళుచుండ- పార్థునకు సహాయపడుచు భీమ
సేనుడు విజృంభించు సమయమున దుశ్శాసనుడు భీమసేనునిపై యెదు
ర్కొనుటయు, భీమసేనగద ఘాతిమైన దుశ్శాసనుడు నేలబడుటయు
సంభవింప భీమసేనుడు- దుశ్శాసనుడు చేసియున్న ద్రౌపదీకేశాకర్ష
ణాదులను తలచుకొని యుగ్రుడై సింహనాదము చేసి కర్ణదుర్యోధన
కృపాశ్వత్థామకృతవర్మలను సంబోధించి "నిహన్మి దుశ్శాసన మద్య
పాపం సంరక్ష్యతా మద్య సమస్తయోధాః!" ఈదుశ్శాసనపాపిని
వధించుచున్నాను. యోధులందరును కాపాడగలిగిన కాపాడుడు. అని
పలికి దుశ్శాసనునిపై కురికి, నాడు ద్రౌపదీకేశములను బట్టికొనిన
ఆబాహు వేది? అని యడిగి యిది యని యాతను చెప్పగా—"ఏవం
క్రుద్ధో భీమసేనః కరేణ ఉత్పాటయామాస భుజం మహాత్మా"
ఆభుజమును ఊడబెరికి వక్షస్థలమును విదళించి- "సత్యాం చికీర్షు ర్మతి
మాన్ ప్రతిజ్ఞాం భీమోఽపిబ చ్ఛోణిత మస్య కోష్ణమ్" ఆనాటి తన
ప్రతిజ్ఞను సార్థకము జేయుటకై యాతని రక్తము నోటితో పీల్చెను.

ఆస్థితిలో కౌరవసేనలు "సర్వే పలాయన్ భయాభిపన్నా
న వై మనుష్యోఽయ మితి బ్రువాణాః" "భీమం రక్షో భాషమాణా
భయార్తాః" భయపడి యాతడు మనుష్యుడు కాడనియు, రక్షస్సు
అనియు ననుకొనుచు పారిపోయినవి.

ఇచ్చట భీమసేనుడు చేసినది రాక్షసకృత్య మనునట్టి ప్రతి
వాదుల నడుగుచున్నాము—"నైవ స్మ సుకృతాన్ లోకాన్ గచ్ఛే
త్పార్థో వృకోదరః। యది వక్షో హి తే భిత్త్వా న పిబే చ్ఛోణితం
రణే" అని వెనుక ప్రతిజ్ఞజేసి దానిని నిర్వహించిన భీమసేనునిది రాక్షస
కృత్య మగునా? అట్టి ప్రతిజ్ఞ జేయుటకు నిరపరాధురాలై, రజ
స్వలయై యున్న ద్రౌపదీదేవియెడల నాడు దుశ్శాసనుడు చేసిన
దారుణకార్యములు రాక్షసకృత్యము లగునా?

"పౌలస్త్యా భ్రాతర శ్చాస్య జజ్ఞిరే మనుజే ష్విహ।
శతం దుశ్శాసనాదీనాం సర్వేషాం క్రూరకర్మణామ్॥"

అని రాక్షసాంశసంభూతు డయినట్టి దుశ్శాసనునిది రాక్షస కృత్యమా? దేవాంశసంభూతు డైనట్టి భీమసేనునిది రాక్షసకృత్యమా? ఆలోచింపుడు. ఎన్నడో 13 సంవత్సరములకు బూర్వము ప్రతిజ్ఞ జేసియు, వానిని మేము తలపెట్టకుందుము; పంచగ్రామముల నిచ్చి నను సంతోషింతుము. అని పాండవులు రాయబారములు పంప వానిని తిరస్కరించి దుర్యోధనాదులు ఉలూకునిచేత బంపిన సందే శములో భీమసేనునిగూర్చి—

"ప్రతిజ్ఞాతం సభామధ్యే న తన్మిథ్యా త్వయా పురా।
దుశ్శాసనస్య రుధిరం పీయతాం యది శక్యతే॥"

నీవు దుశ్శాసనుని రుధిర మెట్లు పానముచేయగలవో వచ్చి నీప్రతిజ్ఞ నిలుపుకొనుము. చూచెద మని చెప్పి రెచ్చగొట్టినమీాద భీమసేనుడు చేసినది చూపని. కనుక ప్రతివాదులు భీమసేనుని నిందింపబూనుట యుక్తము గాదు. ఆపీల్చిన రక్తము అధరోష్ఠము దాటి లోపలకు వెళ్ళలేదు. ఈవిషయము గాంధారితో భీమసేనుడే చెప్పెను—

"అన్యస్యాపి న పాతవ్యం రుధిరం కింపున స్స్వకం।
యథైవాత్మా తథా భ్రాతా విశేషో నాస్తి కశ్చన॥
రుధిరం న వ్యతిక్రామ దన్తోష్ఠౌ దంబ మా శుచః।
వైవస్వత స్తు తద్వేద హస్తౌ మే రుధిరోక్షితౌ॥"

—: సంధి జేసుకొను మని అశ్వత్థామ చెప్పుట, దుర్యోధనుడు సమ్మతింపకపోవుట :—

కర్ణార్జునయుద్ధసందర్భములో— "యతఃపార్థ స్తతో దేవా యతః కర్ణ స్తతో௨సురాః।" పార్థునివైపు దేవతలు, కర్ణునివైపు అసురులు జయాకాంక్షులై యుండిరి. అశ్వత్థామ దుర్యోధనుని హస్తము బట్టు కొని యిట్లనెను—

"ప్రసీద దుర్యోధన శామ్య పాండవై రలం విరోధేన ధిగస్తు విగ్రహం।
హతో గురు ర్బ్రహ్మసమో మహాస్త్రవి త్తథైవ భీష్మప్రముఖా మహారథాః॥
అహం త్వవధ్యో మమ చాపి మాతులః ప్రశాధి రాజ్యం సహ పాండవై శ్చిరం।
ధనంజయ శ్శామ్యతి వారితో మయా జనార్దనో నైవ విరోధ మిచ్ఛతి।
యుధిష్ఠిరో భూతహితే రత స్సదా వృకోదర స్తద్వశగ స్తథా యమౌ॥
న చే ద్వచ శ్శ్రోష్యసి మే నరాధిప ధ్రువం ప్రతప్స్యసి హతోఽరిభి ర్యుధి।
నివారయిష్యామి చ కర్ణమప్యహం యదా భవాన్ సప్రణయో భవిష్యతి॥"అ88

ఓదుర్యోధనా! విరోధము మాని పాండవులతో సంధి జేసి కొనుము. భీష్మద్రోణప్రముఖులు హతులయినారు. నేనును, కృపాచార్యుడును మరణింపనివారము. నీవు పాండవులతో గలసి రాజ్యమనుభవింపుము. పార్థుని నేను నివారింపగలను. శ్రీకృష్ణునకు విరోధమిష్టము గాదు. ధర్మజుడు భూతదయకలవాడు. భీమసేన, నకుల, సహదేవులు ధర్మరాజానువర్తులు.

నా మాట నీవు వినకున్నయెడల తప్పక శత్రుహతుడవై పరితపింతువు. నీవుశాంతించినయెడల నేను కర్ణుని శాంతింపజేయుగలను; అని.

దీనిపై దుర్యోధను డిట్లనెను— దుశ్శాసనుని వధించి భీమసేనుడు, ఇక దుర్యోధనుని హతముజేసి శిరస్సును కాలితో దన్నుదునని పలికిన మాట నామనస్సులో మెరుగుచున్నది.

"న చాపి కర్ణం ప్రసహే ద్రణేఽర్జునః......।"
"నచాఽఽశ్వసిష్యన్తి పృథాత్మజా మయి ప్రసహ్య వైరం బహుశో విచిన్త్య॥"
"నచాపి కర్ణం గురుపుత్రసంయుగా దుపారమే త్యర్హసి వక్తు మచ్యుత!
శ్రమేణ యుక్తో మహతాఽద్య ఫాల్గున స్త మేవ కర్ణః ప్రసభం హనిష్యతి॥"

కర్ణుని పార్థుడు జయింపలేడు; నా వైరానుబంధమును దలచుకొని పాండవులు గూడ నన్ను విశ్వసింపరు; కర్ణుని యుద్ధమునుండి విరమింపుమని చెప్పుటయు యుక్తముగాదు; శ్రమపడియున్న పార్థుని కర్ణుడు వధింపగలడు; అని.

ఇట్లు దుర్యోధనునకు ఆప్తులు కొసవరకు సంధిజేసుకొనుమని చెప్పుచుండుట, అతడు నిరాకరించుచుండుట జరుగుచునే వచ్చినందున పాండవులు నిర్దోషులని ప్రతివాదులు గ్రహింతురుగాక!

—: కర్ణుని సర్పముఖాస్త్రము వ్యర్థమగుట, రథచక్రమెత్తునంతవరకు నాపై బాణప్రయోగము జేయుట నీకధర్మ మను కర్ణుని మాటలపై కృష్ణభగవానుడు సమాధానముజెప్పుట: :—

కర్ణార్జునద్వంద్వయుద్ధ మతిఘోరముగా జరుగుచుండ సర్ప ముఖాస్త్రము కర్ణుడు సంధించెను. ఆబాణము యోగబలముగల నాగ ముచే నావిష్టమై యున్నది. అట్టి నాగాస్త్రము పార్థకంఠమునకు గురి పెట్టి కర్ణునిచే ప్రయోగింపబడినపుడు—

"తం ప్రేక్ష్య దీప్తం యుధి మాధవ స్తు త్వరాన్వితం సత్వరయైవ లీలయా।
పదా వినిష్పిష్య రథోత్తమం స ప్రావేశయ త్పృథివీం కించిదేవ॥
క్షితిం గతా జానుభి స్తేఽథ వాహాః హేమచ్ఛన్నా శ్చన్ద్రమరీచివర్ణాః।
తతోఽన్తరిక్షే సుమహా న్నినాద స్సంపూజనార్థం మధుసూదనస్య॥
దివ్యా శ్చ వాచ స్సహసా బభూవు ర్దివ్యాని పుష్పా ణ్యథ సింహనాదాః।
తస్మిం స్తథా వై ధరణీం నిమగ్నే రథే ప్రయత్నా న్మధుసూదనస్య॥
తత శ్శర స్సోఽభ్యహన త్కిరీటం తస్యేన్ద్రదత్తం సుదృఢం చ ధీమతః।
...... పపాత పార్థస్య కిరీట ముత్తమమ్॥"

కృష్ణభగవానుడు చూచి గురి దప్పింపదలచి లీలగా తనపాద ముచే రథమును నొక్కి భూమిలో గొంత దిగపోవునట్లు చేయగా నప్పు డశ్వములు నేలకు వ్రాలి మోకాళ్ళపై భూమి నానుకొని యున్నవి.

అప్పు డంతరిక్షమందు కృష్ణభగవానుని ప్రశంసించుచు దివ్య వాక్కులు దివ్యపుష్పవృష్టి సింహనాదములు గోచరించినవి.

అంతట నాగాస్త్రము ద్రుతగతిఁతో వచ్చి యాపార్థుని కిరీట మునుమాత్రము నేల బడగొట్టినది.

ఆపై కృతార్థత కలుగకపోయిన దని యానాగము కర్ణుని యొ ద్దకు వచ్చి యీసారి నన్ను ప్రయోగింపుము— "హన్తాస్మి శత్రుం తవ చాత్మనశ్చ" పార్థుని హింసింతు నని చెప్పగా నేనొకనిబలము నాధారముగా జేసికొని జయము గోరువాడను గానని యు, సంధించిన దానిని మరల సంధించు లక్షణము నాది కాదని యు, కర్ణుడు చెప్పి

నిరాకరింప ఆనాగమే స్వయముగా పార్థునిమీదకు రాగా—"చిచ్ఛేద మధ్యే త్వథ తం శితైః స్సుధార్త్తైః" ఆరు బాణములను ప్రయోగించి పార్థుడానాగమును ఛేదించెను.

"గతే చ తస్మిన్ భుజగే కిరీటినా స్వయం విభుః పార్థివ భూతలా దథ ।
సముజ్జహారాఽఽశు పునః పతన్తం రథం భుజాభ్యాం పురుషోత్తమ స్తతః ॥
తస్మిన్ ముహూర్తే ... వివ్యాధ కర్ణః ... ధనంజయమ్ ।"

నాగము హతమైన పిమ్మట కృష్ణభగవానుడు దిగబడియున్న రథమును తన భుజములచే పైకి యెత్తియుంచెను. ఆసమయమందే కర్ణుడు పార్థుని గాఢముగా ప్రహరించెను. ఇట్లు కర్ణుని సర్పశాస్త్రము వ్యర్థమైపోయినది.

"పరిత్రాణాయ సాధూనాం" అని సాధుపరిత్రాణధర్మసంస్థాపనములు నాకవశ్యకర్తవ్యములని లోకమునకు బోధించిన భగవంతుడు కర్ణబాణము లక్ష్యము తప్పిపోవుటకై చేసిన యుపాయముతో పార్థుని కాపాడిన విషయమును భగవద్గీతాప్రామాణ్యవాదులగు ప్రతివాదులు శ్లాఘించితీరవలసినదే.

తరువాత విషయ మేమనగా—

"తత స్తదస్త్రం మనసః ప్రనష్టం యద్భార్గవోఽస్మై ప్రదదౌ మహాత్మా ।
చక్రం చ వామం గ్రసతే భూమి రస్య ప్రాప్తే తస్మిన్వధకాలే నృవీర ॥
ఘూర్ణే రథే బ్రాహ్మణ స్యాభిశాపా ద్రామా దుపాత్తే త్వవిభాతి చాఽస్త్రే ।
ఛిన్నే శరే సర్పముఖే చ ఘోరే పార్థేన తస్మిన్ విషసాద కర్ణః ॥
ధర్మప్రధానం కిల పాతి ధర్మ ఇత్యబ్రువన్ ధర్మవిద స్సదైవ ।
వయం చ ధర్మే ప్రయతామ నిత్యం చర్తుం యథాశక్తి యథాశ్రుతం చ ॥
సచాపి నిఘ్నాతి న పాతి భక్తాన్ మన్యే న నిత్యం పరిపాతి ధర్మః ।
ఏవం బ్రువన్ ప్రస్ఖలితాశ్వసూతో విచాల్యమానోఽర్జునబాణపాతైః ॥
మర్మాభిఘాతా చ్ఛిథిలః క్రియాసు పునఃపున ర్ధర్మ మసౌ జగర్హ ।"

కర్ణవధకాలములో భార్గవాస్త్రము స్ఫురింపదని, రథచక్రమును భూమి కరచిపట్టునని కర్ణునకు గల భార్గవశాపబ్రాహ్మణ

శాపములనుబట్టి ఆస్థితి ప్రాప్తించినది. అప్పుడు కర్ణుడు విషాదగ్రస్తుడై యిట్లనుకొనెను—ధర్మప్రధానుని ధర్మము కాపాడు నని ధర్మవిదులు సదా చెప్పుచునే యున్నారు. మేము యథాశక్తిగా యథాజ్ఞానముగా నిత్యము ధర్మాచరణమునకే పూనుకొనినాము. ఇట్టి మాకు విపత్తు ప్రాప్తించుటవలన ధార్మికులను ధర్మము రక్షించును, హింసింపదు, అను మాట స్థిరమే యని నేను నమ్మజాలను. అని. ఇట్లనుకొనుచు పార్థబాణములచే నేమియు జేయలేక ధర్మమును గర్హించెను.

ఇచ్చట జూడగా తన ధర్మమె తన్ను కాపాడు నని కర్ణుడు నిశ్చయించుకొని యున్నట్లు స్పష్ట మగుచున్నది. అట్టి ధర్మము- తన సూర్యోపాసన, తన దాననిష్ఠ, తన దుర్యోధనభక్తి ఇత్యాదిక మని చెప్పవలసియున్నది. ఇదేదియు తన మనోరథమును ఫలింపజేయ లేదని కర్ణుడు పరితపించెను. దీనినిబట్టి ఆపత్కాలమందు ధర్మస్మరణము జేయుట యెట్టివానికిని దప్పదని తెలినది.

కర్ణునకట్టి యాపత్తు కలుగుటకు భార్గవశాపబ్రాహ్మణశాపములు కారణము. ఆశాపములకు మూలము నిరపరాధిపాండవవిద్రోహబుద్ధి. అట్టి ధర్మహానిని తాను చేసియున్నందున "ధర్మ ఏవ హతో హంతి" అన్నట్లు తానే తనకు హాని దెచ్చికొనినాడు. ఆయుధమును స్మరించుట మాని కర్ణు డప్పుడు ధర్మమును గర్హింపబూనెను.

ఆసమయమున కృష్ణభగవానుని ప్రేరణపై పార్థుడు అస్త్రము నభిమంత్రించుటయు, కర్ణుని రథచక్రమును భూమి కరచిపట్టుటయు జరుగ కర్ణుడు రథమునుండి దిగి—

"చక్రం భుజాభ్యా మాలంబ్య సముత్క్షేప్తు మియేష సః।
సప్తద్వీపా వసుమతీ సశైలవనకాననా॥
గీర్ణచక్రా సముత్క్షిప్తా కర్ణేన చతురంగులమ్।"

తనభుజములతో చక్ర మెత్తుటకు ప్రయత్నించెను. అప్పుడు చక్రమును కరచిపట్టిన భూమి నాలుగంగుళములు లేచినది, కాని చక్రము మాత్రము ఊడిరాలేదు.

అప్పుడు కర్ణుడు పార్థునితో నిట్లనెను.

"భో! భో! పార్థ! మహేష్వాస ముహూర్తం పరిపాలయ ।
యావ చ్చక్ర మిదం గ్రస్త ముద్ధరామి మహీతలాత్ ॥
సవ్యం చక్రం మహీగ్రస్తం దృష్ట్వా దైవా దిదం మమ ।
పార్థ! కాపురుషాచీర్ణ మభిసన్ధిం విసర్జయ ॥
ఖ్యాత స్త్వ మసి కౌంతేయ విశిష్టో రణకర్మసు ।
ప్రకీర్ణకేశే విముఖే బ్రాహ్మణేఽథ కృతాంజలౌ ॥
శరణాగతే న్యస్తశస్త్రే యాచమానే తథాఽర్జున ।
అబాణే భ్రష్టకవచే భ్రష్టభగ్నాయుధే తథా ॥
న విముంచంతి శస్త్రాణి శూరా స్సాధువ్రతే స్థితాః ।
త్వం చ శూరతమో లోకే సాధువృత్తశ్చ పాండవ ॥
యావ చ్చక్ర మిదం గ్రస్త ముద్ధరామి మహాభుజ ।
న మాం రథస్థో భూమిష్ఠం వికలం హంతు మర్హసి ॥
న వాసుదేవా త్త్వత్తో వా పాండవేయ బిభే మ్యహం ।"

ఓపార్థా ! నేను రథచక్ర మెత్తువరకు ముహూర్త కాలమాత్ర మాగును. దైవికముగా చక్రము దిగబడుటను జూచి నన్ను ప్రహరించుటకు దుష్టునివలె నీ వుద్యమింపకుము.

నీవు విఖ్యాతి వహించినవాడవు; యుద్ధధర్మ మెరిగినవాడవు; సాధువ్రతులగు శూరులలో జేరిన నీవు యుద్ధధర్మమును-(నిరాయుధుడు, కవచభ్రష్టుడు ఇత్యాదులపై శస్త్రములను ప్రయోగింపరా దను ధర్మమును) గమనింపుము. నేను చక్ర మెత్తునంతవరకు రథమందున్న నీవు భూమియందున్నట్టియు, వికలుడనై యున్నట్టియు నన్ను ప్రహరించుట ధర్మము గాదు. నేను నీకును, వాసుదేవునకును భయపడువాడను గాను. అని. అప్పుడు కృష్ణభగవాను డిట్లనెను—

"త మబ్రవీ ద్వాసుదేవో రథస్థో రాధేయ దిష్ట్యా స్మరసీహ ధర్మమ్ ।
ప్రాయేణ నీచా వ్యసనేషు మగ్నా నిన్దన్తి దైవం కుకృతం న తు స్వమ్ ॥"
య ద్ద్రౌపదీ మేకవస్త్రాం సభాయా మానాయయే స్త్వం చ సుయోధనశ్చ ।
దుశ్శాసన శ్శకుని స్సౌబలశ్చ న తే కర్ణ ప్రత్యభా త్తత్ర ధర్మః ॥
యదా సభాయాం రాజాన మనక్షజ్ఞం యుధిష్ఠిరం ।

అజైషీ చ్ఛకుని ర్జ్ఞానాత్ క్వ తే ధర్మ స్తదా గతః ॥
వనవాసే వ్యతీతే చ కర్ణ వర్షే త్రయోదశే।
న ప్రయచ్ఛసి య ద్రాజ్యం క్వ తే ధర్మ స్తదా గతః ॥
య ద్భీమసేనం సర్పైశ్చ విషయుక్తైశ్చ భోజనైః।
ఆచర త్త్వన్మతే రాజా క్వ తే ధర్మ స్తదా గతః ॥
య ద్వారణావతే పార్థాన్ సుప్తాన్ జతుగృహే తదా।
ఆదీపయ స్త్వం రాధేయ క్వ తే ధర్మ స్తదా గతః ॥
యదా రజస్వలాం కృష్ణాం దుశ్శాసనవశే స్థితాం।
సభాయాం ప్రాహసః కర్ణ క్వ తే ధర్మ స్తదా గతః ॥
య దనార్యైః పురా కృష్ణాం క్లిశ్యమానా మనాగసం।
ఉపప్రేక్షసి రాధేయ క్వ తే ధర్మ స్తదా గతః ॥
వినష్టాః పాండవాః కృష్ణే శాశ్వతం నరకం గతాః।
పతి మన్యం వృణీష్వేతి వదం స్త్వం గజగామినీమ్ ॥
ఉపప్రేక్షసి రాధేయ క్వ తే ధర్మ స్తదా గతః।
రాజ్యలుబ్ధః పునః కర్ణ సమాహ్వయసి పాండవాన్ ॥
యదా శకుని మాశ్రిత్య క్వ తే ధర్మ స్తదా గతః
యదాఽభిమన్యుం బహవో యుద్ధే జఘ్ను ర్మహారథాః ॥
పరివార్య రణే బాలం క్వ తే ధర్మ స్తదా గతః।
య ద్యేష ధర్మ స్తత్ర న విద్యతే హి కిం సర్వథా తాలువిశోషణేన।
అద్యేహ ధర్మ్యాణి విధత్స్వ సూత తథాపి జీవ న్న విమోక్ష్యసే హి ॥
ఏవ ముక్త స్తదా కర్ణో వాసుదేవేన భారత।
లజ్జయాఽవనతో భూత్వా నోత్తరం కించి దుక్తవాన్ ॥ ” (అ. 91)

రాధేయా ! ధర్మ మిప్పుడు కావలసివచ్చెనా ? నీచులు కష్టములకు పాలైనపుడు తమ దుష్కార్యములను నిందించుకొనక దైవమును నిందించుచుందురు. రజస్వలయైయున్న ద్రౌపదీదేవిని నీవు, దుర్యోధనుడు, దుశ్శాసనుడు, శకుని సభకు లాగిననాడు ధర్మ మేమయినది ? ద్యూతము తెలియని ధర్మజుని తెలిసిన శకుని సభలో నోడించినపుడు ధర్మ మేమయినది? వనవాసము గడిపి, అజ్ఞాతవాసము గడపి వచ్చిన పాండవులకు నీవు రాజ్య మీయబడ దంటివే! అప్పుడు

ధర్మ మేమయినది ? సర్పములచేత. విషాన్నముచేత నీయనుమతిపై దుర్యోధనుడు భీమసేనుని వధింపఁబూనినపుడు ధర్మ మేమయినది ? లక్కయింటిలో నిద్రించునపుడు పాండవులను అగ్నికి ఆహుతి గావింప దలపెట్టిననాడు ధర్మ మేమయినది ?

రజస్వలయై దుశ్శాసనునిచేతికి జిక్కియున్న ద్రౌపదీదేవిని జూచి సభలో నీవు పకపక నవ్వినపుడు ధర్మ మేమయినది ?

నిరపరాధురాలై దుష్టులచే వస్త్రాపహారణాదులతో బాధింపబడు ద్రౌపదీదేవిని నీవు చూచుచున్నపుడు ధర్మ మేమయినది ?

పాండవులు నశించి శాశ్వతనరకములో బడినారు. నీవు మరియొక పతిని గట్టుకొను మని ద్రౌపదీదేవినిగూర్చి నీవు పలికినపుడు ధర్మ మేమయినది ? ప్రథమద్యూతానంతరము వెళ్ళిపోవుచున్న పాండవులను, శకునిని బురస్కరించుకొని మరల బిలిచి పునర్ద్యూతములో గూర్చుండబెట్టినపుడు ధర్మ మేమయినది ? అసహాయుడు, బాలుడు నగు అభిమన్యుని ఆర్గురు మహారథులు చుట్టుకొని హింసించినపుడు ధర్మ మేమయినది ? ఈనాడు నీవనుచున్న ధర్మమును ఆనాడు నీ వుల్లంఘించి యిప్పుడు కంఠశోషపడిన లాభ మేమి ? ఇప్పుడు నీవు ధర్మము నవలంబించి మాటలాడినను నీకు జీవితము దక్కదు. ఈవిధముగా కృష్ణభగవానుడు పూర్వచర్యల నుద్ఘాటింప కర్ణుడు లజ్జితుడై తలవంచుకొని యుత్తరము చెప్పలేకపోయెను.

ఇచ్చట కృష్ణభగవానుడు కర్ణుని తప్పుల నుద్ఘాటించినపుడు ద్రౌపదీపాండవులు చేసిన ఆయా తప్పులకు ప్రతిక్రియగా మేమట్లు చేసినామని, మయసభలో దుర్యోధనుని జూచి నవ్విన నేరమునకు ద్రౌపది నట్లు చేసినామని, "పాంచాలరాజపుత్రియు నంచితముగ నిన్ను బొందు నాఁటివ వరుసన్" అనుచు నాతో వెనుక జెప్పిన నీకు మరియొక పతిని కట్టుకొమ్మని నేను ద్రౌపది ననుట తప్పయినదా ?

అని శ్రీకృష్ణునకు ప్రతివాదిమతప్రకారము బదులు చెప్పవలసిన కర్ణుడు నిరుత్తరుడై సిగ్గుపడి తలవంచుకొని యుండుట ప్రతివాదులు గమనింపవలయు. ద్రౌపదీదేవి నవ్వునుగూర్చి శ్రీకృష్ణుడు కర్ణునియొద్ద తెచ్చిన ఆనాటి ద్రౌపదీవిషయమునుగూర్చి ద్రౌపదీనిందానిరాకరణములో మేము చెప్పియున్నాము. ఆవిషయము లచ్చటజూడవలయును.

కర్ణు డట్లు రథచక్ర మెత్తుట కుద్యమించుచు యుద్ధముగూడ జేయుచు నున్నపుడు శ్రీకృష్ణప్రేరితుడై పార్థుడు—

"తతో ఽర్జున స్తస్య శిరో జహార వృత్రస్య వజ్రేణ యథా మహేన్ద్రః।
దేహా చ్చ కర్ణస్య నిపాతితస్య తేజ స్సూర్యం ఖం వితత్యావివేశ।
త దద్భుతం సర్వమనుష్యయోధా స్సందృష్టవన్తో నిహతే స్మ కర్ణే॥"

ఆకర్ణుని శిరస్సును ఛేదించెను. పడగొట్టబడిన కర్ణశరీరమునుండి తేజస్సు బయలుదేరి సూర్యమండలమున లగ్న మయ్యెను. ఆయద్భుతమును అందరు జూచినారు

ఇచ్చట రథచక్రోద్ధరణవ్యసనములో నున్నపుడు కర్ణుని వధింప శ్రీకృష్ణుడు ప్రోత్సహింపవచ్చునా ? అని శంకింతురేమో, వినుడు— కర్ణు డెత్తగా భూమి లేచినదిగాని చక్రము లేవలేదు. దానికి గారణము అమోఘమైన బ్రాహ్మణశాపము. ఆశాపస్వరూప మిట్లున్నది—

"యేన విస్పర్ధసే నిత్యం యదర్థం ఘటసేఽనిశమ్।
యుధ్యత స్తేన తే పాప భూమి శ్చక్రం గ్రసిష్యతి॥
తత శ్చక్రే మహీగ్రస్తే మూర్ధానం తే విచేతసః।
పాతయిష్యతి విక్రమ్య శత్రు ర్గచ్ఛ నరాధమ॥
ప్రమత్తస్య తథాఽరాతి శ్శిర స్తే పాతయిష్యతి।"

ఓకర్ణుడా! నీ వెవ్వనియందు నిత్యస్పర్ధ కలదో, ఎవ్వని జయించుటకై సతతము నీవు బాణప్రయోగము జేయుచున్నావో ఆతనితో యుద్ధము జేయునపుడు నీరథచక్రమును భూమి కరచిపట్టును. అప్పుడు నీవు ప్రమత్తుడవై యుండ నీశత్రువు నీశిరస్సును ఛేదించును; అని.

ఈశాపము సార్థకము గావలయును; రథచక్రము భూతలగ్రస్త

మయినపుడే మరణమని నిర్దేశింపబడుటవలన మరణకాలము నతిక్రమింపకుండ జేయవలెను; రథచక్రమెత్తుట కర్ణున కశక్యము; మరణమాసన్నము. ఇట్టి పరిస్థితిని సర్వజ్ఞుడగు భగవంతు డాలోచించియే శాపసార్థక్యమునకై ప్రమత్తుడై యున్నపుడే సమయము దాటకుండ బ్రోత్సహించెను.

శాపము లమోఘము లగుటచే నవి ఫలింపవలసివచ్చినపుడు వానికి ఇతరములైన ధర్మములుగాని, న్యాయములుగాని అడ్డు రాజాలవు. శాపములు పెట్టినవారు పెట్టి కూర్చుండుటే తప్ప అవి ఫలించుటకై వారు చేయు కృషి యేమియు నుండదు.

ఎవ్వ రెవ్వరిపై యెట్టి శాపమును లోకములో నెక్కడ బెట్టి యున్నను స్వయముగా దెలిసికొని ఎన్ని ప్రతిబంధకములు కల్పింపబడినను ప్రతిహతము గావించి ఆయాశాపములను ఫలింపజేయగల బాధ్యత, అకుంఠితశక్తి, సర్వజ్ఞత, భగవంతునికే గలదు. ఆభగవంతుడే సర్వకర్మఫలప్రదాత.

వారివారి భవితవ్యములను శాపానుగ్రహరూపములైన ఆయా మహాపురుషుల అమోఘవాక్కులను యథాతథముగా నిర్వహింపజేయు నిష్పక్షపాతబుద్ధి భగవంతునిదై యుండ—

"దుఃఖే జాతు చిరాగతే స్వకలితా ద్దుష్కర్మణః పక్త్రిమాత్ ।
సాధే హన్త నిరాగసి వ్యసనిభిః నైర్ఘృణ్య మారోప్యతే ॥"

అని విశ్వగుణాదర్శనములో చెప్పినట్లు మూఢలోకము నిరపరాధియైన భగవంతునే నిందించును. సాధారణకారణముగా ఈశ్వరుడు లేకుండ జరుగు కార్యమే లోకములో లేదు. ఆయీశ్వరుడే శ్రీకృష్ణు డని భగవద్గీతాపాఠకులకు తెలియనిది కాదు. ఆశ్రీకృష్ణుడే కర్ణునకు గల శాపమును సఫలపరచుటకై పార్థుని ప్రేరేపింప పార్థుడాకర్ణుని వధించెను. దీనినిబట్టి కర్ణచరిత్రకారులు—

"అర్జునుడు రథస్థుడైయుండి యుద్ధమర్యాదను వీడి భూమిష్ఠుడై యున్న కర్ణుని తాను రథ మెక్కువరకును బాణమేయుట తగదని మొఱపెట్టుచున్నవానిని నన్యాయముగ వధించెను." (పు. 127)

అని వ్రాసినది పరాస్తమయినది. భగవంతునకు తెలియని యుద్ధమర్యాద యేమున్నది ? భగవత్ప్రోక్తప్రకారము కర్ణుని వధించిన పార్థునియం దన్యాయ మేమున్నది ?

—: ప్రతివాది పరామర్శము :—

కర్ణు నర్జునుడు చంపుటకు గల కారణము లీక్రింది వని భారతమున జెప్పబడెను—

చ. వినుము నరేన్ద్ర విప్రు డలిగెన్ జమదగ్నిసుతుండు శాప మి
చ్చె నమరభర్త వంచనము సేసె వరంబని కోరి కుంతి మా
న్చె నలుక భీష్ము డర్ధరథు జేసి యడంచె గళించె మద్రరా
జనుచిత మాడి శౌరి విధి యయ్యె నరుం డట జంపె గర్ణునిన్.

క. హరసురపతియమవరుణులును గురుకృపులును దివ్యబాణకోటు లొసగుటన్
నరుశక్తి కర్ణతేజస్స్ఫురణము నార్పంగజాలె జూవె నృపాలా. (శాంతిపర్వం)

అని నారదుడు ధర్మజునకు జెప్పియున్నాడు. పై పద్దెములలో కర్ణునకు దటస్థించిన అనర్థములు, పార్థునకు ప్రాప్తించిన అభ్యుదయములు పేర్కొనబడినవి. కర్ణున కాయనర్థములు పాండవద్రోహబుద్ధిమూలకములు. పార్థున కాయభ్యుదయములు పాండవధర్మనిష్ఠామూలకములు. ఇట్లు వారివారి ధర్మాధర్మములే అభ్యుదయానర్థములకు మూల మగుచుండును. కర్ణునియెడల "ధర్మ ఏవ హతో హన్తి" అను సూక్తియు, పార్థునియెడల "ధర్మో రక్షతి రక్షితః" అను సూక్తియు సార్థకములైనవని ప్రతివాదులు గ్రహింపవలయును.

ఎంతవాని కయినను అధర్మము అనేకవిధముల ఆత్మనాశకరములయిన అనర్థములను తెచ్చిపెట్టు ననియు గ్రహింపవలయును.

పై విధముగా జెప్పిన నారదమహర్షియే కర్ణుని గూర్చి ధర్మజునితో నిటు లింకను జెప్పెను—

దేవగుహ్యమైన విషయము జెప్పుచున్నాను వినుము- క్షత్రియవర్గ మంతయు యుద్ధమరణము నొందుటకు వైరోద్దీపకమైన కన్యాగర్భము నిర్మింపబడినది. ఆబాలుడు తేజశ్శాలియై సూతపుత్రత్వము నొందెను; దుర్యోధనసఖ్యము సంపాదించెను. మీసోదరుల బలపరాక్రమబుద్ధివినయాదులకును, మీపై గల ప్రజానురాగమునకును చింతాక్రాంతుడై దేవసంకల్పముచేతను, తన స్వభావముచేతను మీతో నెడతెగని ద్వేషము వహించెను; అని. ఆశ్లోకము లివిగో—

"గుహ్య మేతత్తు దేవానాం కథయిష్యామి తే౽నఘ।
క్షత్రం స్వర్గం కథం గచ్ఛే చ్ఛస్త్రపూత మితి ప్రభో॥
సంఘర్షజనన స్తస్మా త్కన్యాగర్భో వినిర్మితః।
స బాల స్తేజసా యుక్త స్సూతపుత్రత్వ మాగతః॥
స బలం భీమసేనస్య ఫాల్గునస్య చ లాఘవమ్।
బుద్ధిం చ తవ రాజేన్ద్ర యమయో ర్వినయం తథా॥
ప్రజానా మనురాగం చ చిన్తయానో వ్యదహ్యత।
స సఖ్య మకరో ద్బాల్యే రాజ్ఞా దుర్యోధనేన చ॥
యుష్మాభి ర్నిత్యసంద్విష్టో దైవా చ్చాపి స్వభావతః।" (శాన్తి. అ. 2)
టీ. దైవాత్=దేవానాం సంకల్పాత్ పూర్వోక్తాత్ స్వభావతః।
"వీర్యాధికో నీచకులే దుస్సంగేన సమేధితః।
మహాజనైః స్పర్థమానో హన్తి రాష్ట్రం సరాజకమ్॥ ఇతి శ్లోకోక్తాత్।"

దీనినిబట్టి వీర్యాధిక్యదుస్సహవాసమహాజనస్పర్ధాది దోషములు గలిగి సర్వసంహారహేతువుగా బుట్టిన కర్ణునకు సంభవించిన యనర్థములకు పాండవద్రోహచింతయే మూల మని స్పష్టము.

పాండవవిద్వేషబుద్ధితో భారతయుద్ధమును దెచ్చిపెట్టినవా డగుటచేతచే "కర్ణుడు లేని భారతమా" అను సామెత పుట్టినది. ఇట్లుండ "కర్ణున కెనయగు వీరుడు లేడు. అందువలననె "కర్ణుడు లేని భారతమా" అను సామెత కలిగినది" అని మ. భా. చ. కారులును, "మహాభారతపాత్రలలో గర్ణుడు ప్రధానపాత్ర మయినటులు "కర్ణుడు లేని భారతమా?" అను సామెతయే విశదపఱుపగలదు" అని కర్ణచరిత్రకారులును వ్రాసినది అయుక్తము.

ఎందరు చెప్పినను పట్టినపట్టు విడువక తుదకు పదియేడవరోజు మహాయుద్ధములో కర్ణుడు పార్థబాణాఘాతముచే స్వర్గతు డయ్యెను. శ్రీకృష్ణుడుద్ఘాటించిన దోషములనుబట్టి కర్ణునిదుష్టత్వముస్పష్టమయ్యెను.

ఈకర్ణుని యుత్పత్తి మొదలు పరిసమాప్తిపర్యంతము గల చరిత్రము, దానితో సంబంధించిన కుంతీదేవిచరిత్రముగూడ వేదవ్యాస మహాభారతోక్తప్రకారము ప్రదర్శింపబడినది.

లోకులకు అప్రత్యక్షములును, ధర్మసందేహజనకములును అగు చరిత్రములపట్ల సర్వవిషయప్రత్యక్షముతో సర్వసందేహభంజకముగా, ధర్మాధర్మస్వరూపబోధకముగా, లోకహితముగా మహర్షిచే రచింపబడిన మహాభారతముకంటె యథార్థస్థితిని గ్రహించుటకును, గుణదోషములు నిర్ణయించుటకును మరియొక ఆధారము లేదని స్పష్టమే.

ఇట్టిస్థితిలో నవ్యులు స్వతంత్రులై ప్రమాణవాక్యముల నుల్లంఘించి మహర్షిని గూడ నిరసించి తమకు దెలియనట్టి కుంతీకర్ణ ప్రభృతుల చరిత్రలను యథేచ్ఛగా మహాభారతవిరుద్ధముగా రచించినారు; రచించుచున్నారు. అందు కుంతీదేవి నింద, కర్ణస్తుతి. ఇత్యాది విరుద్ధవిషయములు తాండవించుచున్నవి. అస్వాభావికములైన వర్ణనలు చేయబడినవి. గుణదోషములు వ్యత్యాసము చేయబడినవి. ఈనవ్యుల రచనలకు ఎట్లో లోకసామాన్యము నాహ్లాదింపజేయుటే ముఖ్యప్రయోజనము. వేదవ్యాసరచనకు ధర్మాధర్మ-గుణదోష-పరిజ్ఞానము గలిగించుటే ముఖ్యప్రయోజనము.

కనుక ఆపాతరమణీయము లగు నవ్యరచనలు చూచి అవియే నిజమని భ్రాంతిపడక, మహాభారతోక్తవ్యక్తులను వ్యత్యస్తముగా గ్రహింపక, అపుణ్యాత్ములయందు నిరాధారముగా దోషముల నారోపింపక మహాభారతతత్త్వమును పాఠకమహాశయులు అవగతముచేసికొని యిహపరసుఖముల నొందుదురుగాక.

—♦ ఇప్పుడైన సంధిజేసికొనుట మంచిదని కృపాచార్యుడును,
అది జరుగునది కాదని దుర్యోధనుడును సంభాషించుకొనుట ♦—

కర్ణవధానంతరము దుర్యోధనునకు కృపాచార్యు డిట్లుచెప్పెను—

"తదతః పాండవైః స్సార్ధం సన్ధిం మన్యే క్షమం ప్రభో।
వై చిత్రవీర్యవచనా త్కృపాశీలో యుధిష్ఠిరః ॥
వినియుంజీత రాజ్యే త్వాం గోవిన్ద వచనేన చ।
నాతిక్రమిష్యతే కృష్ణో వచనం కౌరవస్య తు ॥
ధృతరాష్ట్రస్య మన్యేఽహం నాపి కృష్ణస్య పాండవః।
ఏత త్క్షమ మహం మన్యే న చ పార్థై స్స విగ్రహమ్ ॥"

దుర్యోధనా! ఇప్పుడు పాండవులతో సంధిచేసికొనుటే మంచిది. ధృతరాష్ట్రుని మాటను శ్రీకృష్ణుడు మన్నించును. శ్రీకృష్ణుని మాటను ధర్మజుడు మన్నించును. దయగల ధర్మజుడు నిన్ను రాజ్యమందు నియోగింపగలడు. పాండవులతో విరోధము మంచిది కాదు. అని.

అది విని దుర్యోధను డిట్లనెను—

"రాజ్యా ద్వినికృతోఽస్మాభిః కథం సోఽస్మాసు విశ్వసేత్।
అక్షద్యూతే చ నృపతి ర్జితోఽస్మాభి ర్మహాధనః ॥
స కథం మమ వాక్యాని శ్రద్దధ్యా ద్భూయ ఏవ తు।
తథా దౌత్యేన సంప్రాప్తః కృష్ణః పార్థహితే రతః ॥
ప్రలబ్ధ శ్చ హృషీకేశ స్తచ్చ కర్మాఽవిచారితం।
స చ మే వచనం బ్రహ్మన్ కథ మేవాఽభిమన్యతే ॥
విలలాప చ యత్కృష్ణా సభామధ్యే సమేయుషీ।
న తన్మర్షయతే కృష్ణో న రాజ్యహరణం తథా ॥
దుశ్శాసనేన యత్కృష్ణా ఏకవస్త్రా రజస్వలా।
పరిక్లిష్టా సభామధ్యే సర్వలోకస్య పశ్యతః ॥
తథా వివసనాం దీనాం స్మర న్త్యద్యాపి పాండవాః।
న నివారయితుం శక్యా స్సంగ్రామా త్తే పరన్తపాః ॥
యదా చ ద్రౌపదీ క్లిష్టా మద్వినాశాయ దుఃఖితా।
స్థండిలే నిత్యదా శేతే యావ ద్వైరస్య యాతనమ్ ॥" (శల్య. అ. ౫)

కృపాచార్యా! ద్యూతమున దోచింపబడి, రాజ్యమునుండి తొల గింపబడినధర్మజుడు మనమాటల నెట్లు విశ్వసించును? మాతగా వచ్చిన కృష్ణునిపట్ల విరుద్ధముగా వర్తించిన నన్ను శ్రీకృష్ణు డెట్లభిమా నించును? సభామధ్యమందు జరిగిన ద్రౌపదీవిలాపము, రాజ్యహర ణము కృష్ణునకు సహింపరానివి. రజస్వలయైయున్న ద్రౌపదిని దుశ్శాసనుడు సభలో బాధించుట, వస్త్రాపహరణము జేయుట పాండ వులు మరువరానట్టివి. దుఃఖితురాలైన ద్రౌపది నావినాశమునిమి త్తము స్థండిలశాయినియై వైరము తీర్చికొనుటకు దీక్ష వహించినది. ఆపాండవులు యుద్ధమును మానరు. అని.

—: దుర్యోధనయుధిష్ఠిరుల వాక్యోపవాక్యములు :—

పదునెనిమిదవనాడు మధ్యాహ్నమునకు శల్యుడు ధర్మజునిచే వధింపబడెను. శకుని సహదేవునిచే వధింపబడెను. దుర్యోధనుడు విర థుడై అసహాయుడై గదాపాణియై పలాయనముచేసి హ్రదమందు దాగియుండెను. ఆవిషయము దెలిసినతరువాత శ్రీకృష్ణుడు యుధిష్ఠిరు నకు— "మాయావీ మాయయా వధ్య స్సత్య మేత ద్యుధిష్ఠిర" అని చెప్పి ధర్మ్యములుగాని, అధర్మ్యములుగాని శత్రువులక్రియలకు అనురూపము లైన ప్రతిక్రియ లాచరించి శత్రువుల వధింపవలె ననుచు ఇంద్రకృత దైత్యదానవ సంహారమును, శ్రీహరికృతములైన హిరణ్యాక్షహిరణ్య కశిపుసంహారములను, బలిబంధనమును, సుందోపసుందసంహారమును, రావణసంహార మును, నిదర్శనముగా జూపి బోధించినతరువాత నంద రును ఆ హ్రదముదగ్గరకు వెళ్ళిరి. అప్పుడు ధర్మజుడు—"క్వ తే తత్పౌరుషం యాతం క్వ చ మాన స్సుయోధన"సుయోధనా!నీపౌరుష మేమయ్యెను? నీయభిమాన మేమయ్యెను? అనియెత్తిపొడువ దుర్యోధను డిట్లనెను— నేను రథ-ఆయుధ-సారథి- విరహితుడనై విశ్రాంతిని గోరి యున్నాను.

"అస్త్వదానీ మియం రాజన్ కేవలా పృథివీ తవ।
అసహాయో హి కో రాజా రాజ్య మిచ్ఛే త్ప్రశాసితుమ్॥

భవద్భిశ్చ హృతే రాజ్యే కోను జీవేత మాదృశః ।
అహం వనం గమిష్యామి హ్యజినైః ప్రతివాసితః ॥
రతిర్హి నాస్తి మే రాజ్యే హతపక్షస్య భారత !
గచ్ఛ త్వం భుంక్ష్వ రాజేన్ద్ర పృథివీం నిహతేశ్వరామ్ ॥"

ధర్మరాజా! ఈ కేవలభూమిని నీవే తీసికొనుము. అసహాయుడైన రాజు ఎవ్వడు రాజ్యము నపేక్షించును? మీరు రాజ్యము హరించినపుడు నావంటివాడు జీవింపజాలడు. నేను అజినధారినై వనమునకు బోయెదను. నావారందరు హతులగుటచేత నాకు రాజ్యమందు ఆసక్తి పోయినది. నీవు వెళ్ళి వికలమైన యీ భూమిని యేలుకొనుము. అని.

అది విని ధర్మజు డిట్లనెను—

"అనీశ్వరశ్చ పృథివీం కథం త్వం దాతు మిచ్ఛసి ।
త్వయేయం పృథివీ రాజన్ కిం న దత్తా తదైవ హి ॥
ధర్మతో యాచమానానాం ప్రశమార్థం కులస్య నః ।
సూచ్యగ్రేణాపి యద్భూమే రపి భిద్యేత భారత ॥
తన్మాత్ర మపి తన్మహ్యం న దదాతి పురా భవాన్ ।
స కథం పృథివీ మేతాం ప్రదదాసి విశాంపతే ॥
జీవయేయ మహం కామం న తు త్వం జీవితుం క్షమః ।
దహనే హి కృతో యత్న స్త్వయాఽస్మాసు విశేషతః ॥
ఆశీవిషై ర్విషై శ్చాపి జలే చాపి ప్రవేశనైః ।
త్వయా వినికృతా రాజన్ రాజ్యస్య హరణేన చ ॥
అప్రియాణాం చ వచనైః ద్రౌపద్యాః కర్షణేన చ ।
ఏతస్మా త్కారణా త్పాప జీవితం తే న విద్యతే ॥
ఉత్తిష్ఠోత్తిష్ఠ యుధ్యస్వ యుద్ధే శ్రేయో భవిష్యతి ॥" (శల్య. అ. 31)

దుర్యోధనా! ఏమియు నివ్వలేని నీవు భూమి నెటు లివ్వదలచితివి? నీవు కులక్షేమముగోరి ధర్మముగా యాచించిన మాకు ఆనాడే యేల ఇవ్వలేదు? సూదిమొనమోపినంతయినను మీకివ్వనని చెప్పినవాడవు నీవే కదా! ఇప్పుడు పృథివి నంతను ఎట్లిచ్చెదవు? నిన్ను నేను జీవింపజేయుదునుగాని నీకు జీవించు యోగ్యత లేదు. ప్రహా-

దహనప్రియత్నముచేత, సర్పములచేత, విషాన్నముచేత, జలపాతము చేత, రాజ్యహరణముచేత, దుర్భాషణములచేత, ద్రౌపదీకేశాంబ రాకర్షణముచేత మాకు నీవెంతయో హాని జేసినావు. అందుచేత నీకు జీవనాదృష్టము లేదు. లెమ్ము లెమ్ము; యుద్ధము జేసి శ్రేయస్సును పొందుము. అని. దుర్యోధనుడు హ్రదమునుండి లేచివచ్చి యిట్లనెను—

"ఏకైకేన చ మాం యూయ మాసీదత యుధిష్ఠిర ।
నహ్యేకో బహుభి ర్న్యాయ్యో వీరో యోధయితుం యుధి ॥
న్యస్తవర్మా విశేషేణ శ్రాన్త శ్చాప్సు పరిప్లుతః ।
భృశం విక్షతగాత్ర శ్చ హతవాహనసైనికః ॥"

ధర్మజా ! మీలో ఒక్కొక్కరే నాతో యుద్ధము చేయుడు. ఒకనితో అనేకులు యుద్ధముచేయుట న్యాయము కాదు. అందులో నేను కవచము లేక క్షతగాత్రుడనై, హతవాహనుడనై, హతసైనికుడనై, అలసిపోయి యున్నాను. అని. అప్పుడు ధర్మజు డిట్లనెను—

"మాభూ దియం తవ ప్రజ్ఞా కథ మేవం సుయోధన ।
యదాఽభిమన్యుం బహవో జఘ్ను ర్యుధి మహారథాః ॥
య ద్యేక స్తు న హన్తవ్యో బహుభి ర్ధర్మ ఏవ తు ।
తదాఽభిమన్యుం బహవో నిజఘ్ను స్త్వన్మతే కథమ్ ॥
సర్వో విమృశతే జన్తుః కృచ్ఛ్రస్థో ధర్మదర్శనం ।
పదస్థః పిహితం ద్వారం పరలోకస్య పశ్యతి ॥

దుర్యోధనా ! మహారథషట్కము అభిమన్యుని చుట్టుకొని వధించిననాడు నీ యీన్యాయాన్యాయవిచక్షణబుద్ధి యేమయినది ? అనేకు లొక్కనిపై బడి వధింపకుండుట ధర్మమైనపుడు నీయనుమతిపై ననేకులు ఒక్క అభిమన్యునిపై బడి యెట్లు వధించినారు ?

ప్రతివాడును కష్టదశలో నున్నపుడు ధర్మశాస్త్రమును స్మరించును. మంచిస్థితిలో నున్నపుడు పరలోకమె లేదనుకొనును.

"ఇద మేకం చ తే కామం వీర భూయో దదా మ్యహం ।
తంచాపాం పాండవేయానాం యేన త్వం యోద్ధు మిచ్ఛసి ॥
హత్వా వైభవాన్ రాజా హతో వా స్వర్గ మాప్నుహి ।"

దుర్యోధనా ! నీవు కోరినట్లే నీకొకమాట చెప్పుచున్నాను. మా పాండవులలో నెవ్వనితో నీవు యుద్ధముచేయుదలచితివో ఆయొక్క నిని నీవు వధించిన రాజ్యము నీదే. అతనిచే నీవే హతుడ వగుదువేని నీకు స్వర్గప్రాప్తి. అని.

ఇచ్చట అభిమన్యునిపై కౌరవులు పడినట్లు పాండవులు దుర్యోధనునిపై బడకుండుటలోను, మీరొక్కరే నాతో యుద్ధము జేయుడని కోరిన దుర్యోధనునితో అట్లుకూడ కానక్కరలేదు నీయిష్టము వచ్చినవానిని మాలో నొక్కని నీవెన్నుకొని, ఆయొక్కనితో నీవు జయాపజయములు తేల్చుకొని కృతార్థుడవు కమ్మని పలుకుటలోను ధర్మజునకు గల దయాస్వభావమును ప్రతివాదులు గమనింపవలెను.

ఎంతమంది యెన్నివిధముల జెప్పినను పాండవులది పాండవుల కివ్వక అనేకద్రోహములు చేసి, యుద్ధములోగూడ భీష్మకృపఅశ్వత్థామప్రభృతులు ఇప్పుడైన సంధిజేసికొనుమనుచు జెప్పుమాటలను జయాశతో తిరస్కరించి, తన ప్రాణముమీదకు వచ్చినపుడు నీవే యీభూమి నేలుకొనుము; నేను అరణ్యమునకు బోవుదును. అని ప్రసంగించిన దుర్యోధనుని జీవితాశను ప్రతివాదులు గమనింపవలెను.

ఆదినుండియు పాండవులయెడ హింసాదృష్టితో తా నధర్మముగా ప్రవర్తించి తుదకు నిస్సహాయుడై పాండవులు తనపై బడెడి పరిస్థితి ప్రాప్తింప దుస్థితిలో నున్న నాపై మీరందరు బడుట అధర్మమని ధర్మశాస్త్రవచనము లెత్తుకొనిన దుర్యోధనుని వైఖరిని ప్రతివాదులు గమనింపవలెను.

—: భీమసేనదుర్యోధనయుద్ధము భీమసేనగదాఘాతమున దుర్యోధనోరుభంగము :—

దుర్యోధనాభిప్రాయప్రకారము భీమసేనునితో ద్వంద్వయుద్ధము జరుగు నపుడు దుర్యోధనునితో భీమసేను డిట్లనెను—

"రాజ్ఞాపి ధృతరాష్ట్రేణ త్వయా చాస్మాసు యత్కృతం ।
స్మర త ద్దుష్కృతం కర్మ య ద్వృత్తం వారణావతే ॥
ద్రౌపదీ చ పరిక్లిష్టా సభామధ్యే రజస్వలా ।
ద్యూతే య ద్విజితో రాజా శకునే ర్బుద్ధినిశ్చయాత్ ॥
యాని చాన్యాని దుష్టాత్మన్ పాపాని కృతవా నసి ।
అనాగస్సు చ పార్థేషు తస్య పశ్య మహ త్ఫలమ్ ॥
త్వత్కృతే నిహత శ్శేతే శరతల్పే మహాయశాః ।
గాంగేయో భరతశ్రేష్ఠః సర్వేషాం నః పితామహః ।
హతో ద్రోణశ్చ కర్ణశ్చ హత శ్శల్యః ప్రతాపవాన్ ॥
వైరస్య చాదికర్తాఽసౌ శకుని ర్నిహతో రణే ।
అవశిష్ట స్త్వమే వైకః కులఘ్నోఽధమపూరుషః ॥
త్వామ ప్యద్య హనిష్యామి గదయా నాత్ర సంశయః ।

దుర్యోధనా! నీతండ్రియు, నీవును మాయెడల జేసిన దుష్కర్మలను స్మరణకు దెచ్చికొనుము; వారణావతములో జేసిన పనిని, సభలో రజస్వలయైన ద్రౌపదియెడల చేసిన పనిని, ద్యూతములో శకుని బుద్ధితో జేసిన పనిని, నిరపరాధులమైన మాయెడల జేసియున్న ఆయాపనులను దలచికొనుము; నీకీ ప్రస్తుతస్థితి ఆదుష్కార్యఫలితమే అని గ్రహింపుము.

భరతకులశ్రేష్ఠుడు మన భీష్మపితామహుడు శరతల్పమున బడినది నీదుష్కృతఫలమే. నీమూలమున ద్రోణకర్ణశల్యశకునిప్రభృతులు హతులైనారు. ఇక కులఘ్నుడవైన నీవు శేషించినావు. నిన్ను గదచే హతుని జేయుచున్నాను; అని.

ఆపై ద్వంద్వయుద్ధము ప్రచండముగా జరుగునపుడు కృష్ణార్జునులు సంభాషించుకొనుటలో దుర్యోధనుడు 13 సంవత్సరముల నుండియు భీమసేనహింసాభిప్రాయముతో గదాయుద్ధకృషి జేయుచున్నా డనియు, నైపుణ్యమున దుర్యోధనుడును, బలములో భీమసేనుడును అధికులనియు, ద్యూతకాలములో భీమసేనుడు—

"ఊరూ భేత్స్యామి తే సంఖ్యే గదయేతి సుయోధనమ్ ।"

నాగదాఘాతమున నీయూరువుల భగ్నముజేయుదు నని చేసిన ప్రతిజ్ఞ ననుసరించి కృతార్థుడు కావలసిదేకాని యథాన్యాయముగ యుద్ధము జేయుట కృతార్థతావహము కాదనియు శ్రీకృష్ణుడు చెప్పగా పార్థుడు తొడ జూపి భీమసేనునకు సంజ్ఞ చేసెను. అది దుర్యోధను డును గ్రహించెను. భీమసేను డాపై జరిగిన యుద్ధములో దుర్యోధనుని యూరువులపై గొట్టి పడగొట్టెను.

గదాయుద్ధమర్యాద నాలోచింపగా తొడలపైగొట్టుట మర్యాద కాదు. కనుకనే తన గదాయుద్ధశిక్షాక్రమము ననువర్తించి యున్న భీమసేనుడు స్వయముగా నట్లు కొట్టియుండలేదు. శ్రీకృష్ణోపదిష్టమార్గ మున నట్లు చేసెను. శ్రీకృష్ణు డటు లుపదేశించుటకు ఆనాటి భీమసేన ప్రతిజ్ఞయే కారణము. భీమసేను డట్టి ప్రతిజ్ఞ జేయుటకు ద్యూత సభలో దుర్యోధనుడు ద్రౌపదీదేవికి తన యెడమతొడను జూపుటయే కారణ మని ప్రతివాదులు తెలిసికొందురుగాక.

భీమసేను డట్లు దుర్యోధనుని పడగొట్టి దుర్యోధనుని పురాతన దుశ్చేష్టల నుద్ఘాటించి ఆతని శిరముపై పాదాఘాతము గావించెను. అది చూచి ధర్మరాజు డట్లు చేయకుము, చేయకుము అని భీమసేనుని గూర్చి పలికి దుర్యోధనుని జూచి నీమూలమునగదా యింతకులక్షయ దుస్థితి వచ్చెనదనుచు చింతించెను. పాదాఘాతము చేసిన భీమసేనుడు క్రూరు డని ప్రతివాదు లనుట తప్పు. దుష్టశిక్షణవిధులలో పరస్త్రీల పట్ల దుర్నయముగా బ్రవర్తించినవాని కట్టి శిక్షకూడ విహితమై నీతి శాస్త్రమం దుండుటవలన ద్రౌపదీదేవిపట్ల అవినీతిగా ప్రవర్తించి తొడనజూపినపుడు దుర్యోధననిగూర్చి భీమసేనుడుచేసిన ప్రతిజ్ఞలోనే—

"సుయోధన మిమం పాపం హన్తాస్మి గదయా యుధి।
శిరః పాదేన చాఽస్యాహ మధిష్ఠాస్యామి భూతలే॥"

శిరస్సుపై పాదాఘాతముకూడ జేయుదు నని చెప్పియుండి అట్లే చేసెను. ఈవిషయము చతుర్థభాగములో నిరూపింపబడినది.

ఆసమయమునకు అక్కడకు వచ్చియున్న బలరాముడు భీమ సేనుడు చేసిన ఊరుభంగపాదాఘాతములను జూచి క్రుద్ధుడై "అధో నాభ్యా న హన్తవ్య ఇతి శాస్త్రస్య నిశ్చయః" నాభికి దిగువభాగ ములో గొట్టరాదని శాస్త్రము; భీమసేనుడు చేసిన దధర్మము; భీమ సేనుని శిక్షింతుననుచు లేచినపుడు శ్రీకృష్ణుడు పట్టుకొని ఉపపత్తులు చెప్పుటలో ఇట్లు బోధించెను—

"ప్రతిజ్ఞాపాలనం ధర్మః క్షత్రియస్యేహ వేద్మ్యహమ్ ।
సుయోధనస్య గదయా భఙ్క్తాస్మ్యూరూ మహాహవే ॥
ఇతి పూర్వం ప్రతిజ్ఞాతం భీమేన హి సభాతలే ।
టీ. "ప్రతిజ్ఞాపాలనరూపత్వా దప్యధో నాభిప్రహారో నాధర్మ ఇత్యర్థః।"
మైత్రేయే ణాభిశప్తశ్చ పూర్వమేవ మహర్షిణా ॥
ఊరూ తే భేత్స్యతే భీమో గదయేతి పరంతప !
అతో దోషం న పశ్యామి మా క్రుధ్యస్వ ప్రలంబహన్ ॥"

ప్రతిజ్ఞాపరిపాలనము క్షత్రియునకు ధర్మము; ఈభీమసేనుడు ద్యూతసభలో దుర్యోధనుడు చేసిన దుర్నయమునకు శాస్తిగా నీతొ డలను భగ్నము చేయుదు నని ప్రతిజ్ఞ చేసియుండెను.

ఈదుర్యోధనుడు మైత్రేయమహర్షియొద్ద చూపిన ముష్కర మునకు (తొడగొట్టుట) నీతొడలు భీమసేనగదాఘాతమున భగ్న మగు నని మహర్షిచే శపింపబడెను; కాబట్టి ఇది యధర్మము కానేరదు. అని.

ఇచ్చోట గదాయుద్ధసామాన్యధర్మమును బట్టి బలరాముని ఆక్షే పము, దుర్యోధనవిషయమై విశేషధర్మమునుబట్టి కృష్ణభగవానుని సమాధానము అని తెలిసికొనవలయును. వెనుక జూపబడిన ఘోష యాత్రాంతిమగాథలో దుర్యోధనునితో అసురులు చెప్పినట్లు దుర్యో ధనుని ఊర్ధ్వకాయము వజ్రసన్నిభమై అభేద్యముగను, అధఃకాయము కుసుమకోమలముగను సృజింపబడియున్నది. న్యాయముగా అతని యూర్ధ్వకాయము అభేద్యమే; కాని యాతడు ద్రౌపదీదేవికి తొడ

జూపుట, మైత్రేయమహర్షియొక్క తొడ గొట్టుట అను దుర్లక్షణము లచే స్వబుద్ధితో ప్రాణహానిస్థానము తొడలుగా చేసికొనినాడు; ఇది దుర్యోధనుని స్వయంకృతాపరాధమే కాని, భీమసేనుని అపరాధమే మియు లేదు; శ్రీకృష్ణుని దంతకంటు లేదు.

—♦ కృష్ణభగవానునిగూర్చి దుర్యోధనుడు పరుషోక్తు లాడుట, కృష్ణభగవానుడు మంగళించుట ♦—

భీమసేనగదాఘాతమున ఊరుభంగముతో నేలబడిన దుర్యోధనుని నిందించుచు, భీమసేను నభినందించుచున్న పాంచాలులతో శ్రీకృష్ణభగవానుడు దుర్యోధననిరసనము సూచింపుచు మాటలాడి నపుడు రోషముతో కృష్ణభగవానునిగూర్చి దుర్యోధను డిట్లనెను—

“కంసదాసస్య దాయాద న తే లజ్జా౽స్త్యనేన వై ।
అధర్మేణ గదాయుద్ధే య దహం వినిపాతితః ॥
ఊరూ భిన్ధీతి భీమస్య స్మృతిం మిథ్యాప్రియచ్ఛతా ।
కిం న విజ్ఞాత మేత న్మే య ద్దర్జున మవోచథాః ॥
ఘాతయిత్వా మహీపాలాన్ ఋజుయుద్ధాన్ సహస్రశః ।
జిహ్మై రుపాయై ర్బహుభి ర్న తే లజ్జా న తే ఘృణా ॥
అహ న్యహని శూరాణాం కుర్వాణః కదనం మహత్ ।
శిఖండినం పురస్కృత్య ఘాతిత స్తే పితామహః ॥
అశ్వత్థామ్నస్సనామానం హత్వా నాగం సుదుర్మతే ।
ఆచార్యో న్యాసిత శ్శస్త్రం కిం తన్న విదితం మయా ॥
స చానేన నృశంసేన ధృష్టద్యుమ్నేన వీర్యవాన్ ।
పాత్యమాన స్త్వయా దృష్టో న చైనం త్వ మవారయః ॥
వధార్థం పాండుపుత్రస్య యాచితాం శక్తి మేవ చ ।
ఘటోత్కచే వ్యంసయతః క స్త్వత్తః పాపకృత్తమః ॥
ఛిన్నబాహుః ప్రాయగత స్తథా భూరిశ్రవా బలీ ।
త్వయా౽భిసృష్టేన హత శ్శైనేయేన దురాత్మనా ॥
కుర్వాణ శ్చోత్తమం కర్మ కర్ణః పార్థజిగీషయా ।
వ్యంసనేనా౽శ్వసేనస్య పన్నగేంద్రస్య వై పునః ॥

పునశ్చ పతితే చక్రే వ్యసనార్తః పరాజితః ।
పాతిత స్సమరే కర్ణ శ్చక్రవ్యగ్రోఽగ్రణీ ర్నృణామ్ ॥
యది మాం చాపి కర్ణం చ భీష్మద్రోణౌ చ సంయుతౌ ।
ఋజునా ప్రతియుధ్యేథా న తే స్యా ద్విజయో ధ్రువమ్ ॥
త్వయా పున రనార్యేణ జిహ్మమార్గేణ పార్థివాః ।
స్వధర్మ మనుతిష్ఠన్తో వయం చాఽన్యే చ పాతితాః ॥"

ఓకృష్ణా! గదాయుద్ధములో అధర్మముచే నన్ను బడగొట్టించితివి. నీకు లజ్జ లేదా? ఊరుభంగము జేయుమనట్లు భీమునకు జ్ఞాపకముగా పార్థునకు నీవు చెప్పినది నేనెరుగనా? ఋజుమార్గమున యుద్ధముచేయు మాపక్షములోని వేలకొలది వీరులను అనేకకపటోపాయములచే వధింపజేసిన నీకు లజ్జలేదు; దయ లేదు. శిఖండిని పురస్కరించుకొని భీష్మపితామహుడు పడగొట్టబడినాడు. "అశ్వత్థామా హతః" అని పలికించి ద్రోణాచార్యునిచే శస్త్రసంన్యాసము చేయింపబడినది. అది నే నెరుగనా? ఆద్రోణాచార్యుని పడగొట్టు ఈధృష్టద్యుమ్నఘాతుకుని నీవు వారింపవైతివి. పార్థునధార్థమై సంపాదించుకొనిన కర్ణుని ఏకవీరఘ్నిని ఘటోత్కచునినిమిత్తమున వ్యర్థముగావించిన నీకంటె పాపకృత్తము డెవడు? ఛిన్నహస్తుడై ప్రాయోపవేశమును బూను భూరిశ్రవస్సును సాత్యకి వధించినది నీప్రేరణచేతనే.

పార్థునితో ఘోరయుద్ధము చేయు కర్ణుని నాగాస్త్రమును వ్యర్థము గావించి, చక్రము డించుకొనిపోయినపుడు కర్ణుని పడగొట్టించినవాడవు నీవు. నన్నుగాని, కర్ణునిగాని, భీష్మద్రోణులనుగాని ఋజుయుద్ధమున ప్రతిఘటించినవాడు నీకు విజయము కలుగదనుట ధ్రువము. స్వధర్మనిష్ఠులమైన మేమును, మాపక్షమువారును అపూజ్యుడవైన నీచే కపటమార్గమున బడగొట్టబడినాము. అని.

శ్రీకృష్ణుడు చేసినది కపట మనిన యీదుర్యోధనుడు ద్యూతములోగాని, వనవాసాజ్ఞాతవాసపణకల్పనలోగాని, లాక్షాగృహాదులలోగాని చేసియున్నది యేదో ప్రతివాదులు స్మరింపవలయును.

"మాయావీ మాయయా వధ్యః" అన్నట్లు కపటులను పడ
గొట్టుటకు కపటముగూడ నాశ్రయణీయమే అని శ్రీకృష్ణుడు చెప్పెను.

ఇచ్చట భీష్మద్రోణకర్ణదుర్యోధన,భూరిశ్రవస్సుల వధవిష
యమై శ్రీకృష్ణుఁ డన్యాయము చేసినట్లు దుర్యోధను డనెను.

భీష్మద్రోణులు పాండవపక్షీయమయిన ధర్మమునకు తమప్రా
ణము లర్పింపదలచి తమ వధోపాయమును తామే పాండవులకు దెలి
పియుండుటచే భీష్మద్రోణానుమతిపై జరుపబడిన ఆకార్యములో
శ్రీకృష్ణుని యన్యాయ మేమున్నది ?

కర్ణుని విషయమై నాగాస్త్రమును గురి తప్పింపజేయుట, సార
థ్యధర్మమగుటచే నందులో శ్రీకృష్ణుని అన్యాయ మేమున్నది ? ఏక
ఘ్నిని ఇచ్చిన యింద్రుడే దానికి గురియగుటకై ఘటోత్కచుని
సృజించియుండుటచే నందులో శ్రీకృష్ణుని యన్యాయ మేమున్నది ?

బ్రాహ్మణశాపమూలమున రథచక్రము దించుకొనిపోవుట,
అదియే అతని మరణసమయముగా నిర్దేశింపబడుట, సంభవించుటచే
నప్పుడు కర్ణుని వధింపజేయుటలో విధి నతిక్రమించకుండ జేయు కృష్ణ
భగవానుని అన్యాయ మేమున్నది ?

భీమసేనప్రతిజ్ఞనుబట్టియు, మైత్రేయశాపమునుబట్టియు, జరుప
బడిన దుర్యోధనోరుభంగములో శ్రీకృష్ణుని అన్యాయ మేమున్నది ?
భూరిశ్రవస్సును వధింపబూనిన సాత్యకి—

"వార్యమాణ స్స కృష్ణేన పార్థేన చ మహాత్మనా ।
విక్రోశతాం చ సైన్యానా మవధీ త్తం ధృతవ్రతమ్ ॥"

కృష్ణార్జునులు వద్దువద్దని వారించుచున్నను వధించె నని చెప్ప
బడియుండ అందు శ్రీకృష్ణుని ప్రేరణ యున్నట్లు దుర్యోధను డనుట
ఎంత అన్యాయము ? ఇట్లనుట దుర్యోధనునకు సహజము. పాండవుల
పట్ల మే మెన్నడును ఏతప్పును చేసియుండలేదు. అని కురుసభలో
కృష్ణభగవానునియొద్ద పలికినవా డీదుర్యోధనుడు కాడా ? పాండవుల

పట్ల తాము చేసిన అకార్యములను ఆసమానసమయమునందు తలపోసి కొని చింతించినవాడు ఈదుర్యోధనుడు కాడా ? నీకంటెను ఎక్కువ మాయలు మేము చేయగలము; నీవేమి చేయగలవో వచ్చి చేయవల సిన దని ఉలూకునిచే కృష్ణభగవానునకు కబురంపి కాలుదువ్వినవాడు దుర్యోధనుడు కాడా ? దుర్వృత్తిగల తన మనోరథము నెరవేరక కృష్ణభగవానుని తిట్టుట కుపక్రమించిన దుర్యోధనుని మాటలు పట్టు కొని ప్రతివాదులు దుర్యోధను నభినందించుచు శ్రీకృష్ణుని నిందించుచు వ్రాయుట హేయము.

ఆదుర్యోధనోక్తులపై కృష్ణభగవాను డిట్లు పలికెను—

ఆంధ్రభారతము— "అచ్యుతుం డతని యాననం బాలోకించి నీవు భీముని బాముల గఱపించియు, విషం బిడియు, నీటం ద్రోచియుఁ బలుమాఱు చంప జెకితివి. గొంతియు, గొడుకు లేవురును నిద్రించు సమయంబున జతుగృహంబున దహనంబు దరికొల్పితివి. ధర్మోత్తరుండగు నజాతశత్రుసంపదల గపటద్యూతం బాడి శకునికైతవంబున నపహరించి తంతబోక యాజ్ఞసేని నేకవస్త్రరజస్వలం గొలువులోపల భంగపెట్టి తాపార్చిద్ద నిన్ను నిట్టి దురవస్థలకు దేరం దగియుండ నట్లు పోయి సమయంబు నడిపి నీచేసిన సకలదుష్కృతంబులు సహించిన యి ప్పాండవాగ్రజు పనుపున నేను బుడమిపా లడుగవచ్చిన నా డీనేరక నీనేరమి నిల్పైతి. భవదీయంబగు లోభంబునం బాపనిశ్చయింబున మదంబున శాంతచిత్తు లగు శాంతనవద్రోణులకుం బ్రాణహాని వాటిల్లె. వినుము ద్రుపదుని తపోయజ్ఞ ప్రభావంబుల నదియు పనిగా జనియించిన శిఖండి ధృష్టద్యుమ్నులు ఆభీష్మగురు మరణంబులకుం గారణంబులుగాక తక్కరే. యనేకయోధప్రౌఢు లొక్కరుని బాలు సౌభద్రుం బొదివి చంపినం బూనిన పూన్కి నిఖిలోపాయంబుల నేఁపక పుణ్యాత్మురాలైన పాంచాలి నరణ్యంబునం బరిభవించిన పాపాత్ముని సైంధవుని బ్రతికిపోవిడిచి యర్జునుం డిన్నిం బ్రవేశించునే. యిన్నితిపరుల చరిత్రంబుల నిర్మలంబులు. ఘోషయాత్ర నిన్ను గంధర్వులు పట్టుకొనిపోవునప్పుడు నీవారెల్లం బాఱిన నర్జునుండు నిన్ను విడిపించుట రొయుంగవే. గాంగేయకుంభజకర్ణాశ్వ త్థామకృపు లుద్దామసమగ్రసైన్యంబులతోడ నడిచిరా నీవు విరటుని గోవులం బట్టికొని పోవుచోట మీరందఱు నర్జునుని సమ్మోహనాస్త్రంబున మూర్ఛితులైన సమయంబున నతండు మిమ్ముం గాచుట యెఱుంగరాదా. నీవాచరించిన పాపం

బలకొల్ల మూలంబైన కర్ణునరదంబు ధరణిం గ్రుంకినం గవ్వడి వానినేయ కేలకాచి కొనుయుండు. నుండెనేనియు భూసురశాప బున నల్లైన రథంబునను నిష్కృతి గలుగునే. కావున నన్నీచు సమయించుట సముచితంబు... పాండునందనులు పుట్టి నంతటినుండి నేడు తుదిగా నీయెడ ధర్మవిరోధం బాచరింపరు...పవనతనయుండు పట్టిన ప్రతిన యొఱుంగనె. గద నూరుభంగంబు సేయుదు నని పలికి పిడికిటం బొడుచునే. యవి యెల్లను వృథాజల్పంబు లూరకుండు మనుటయు...”

ఆశ్రీకృష్ణోక్తులకు బదులు చెప్పలేక ప్రస్తావము మార్చి దుర్యోధను డిట్లు పలికెను—

“అధీతం విధివ ద్దత్తం భూః ప్రశాస్తా ససాగరా ।
మూర్ధ్ని స్థిత మమిత్రాణాం కోను స్వంతతరో మయా ॥
యదిష్టం క్షత్రబన్ధూనాం స్వధర్మ మనుపశ్యతామ్ ।
తదిదం నిధనం ప్రాప్తం కో ను స్వంతతరో మయా ॥
ససుహృ త్సానుగ శ్చైవ స్వర్గం గన్తాఽహ మచ్యుత !
యూయం నిహతసంకల్పాః శోచన్తో వర్తయిష్యథ ॥
అస్య వాక్యస్య నిధనే కురురాజస్య ధీమతః ।
అపతత్సుమహ ద్వర్షం పుష్పాణాం పుణ్యగన్ధినామ్ ॥
సిద్ధాశ్చ ముముచు ర్వాచ స్సాధు సాధ్వితి పార్థివ ।
ప్రరాజంశ్చ దిశ స్సర్వా నభో వైదూర్యసన్నిభం॥”

ఓ అచ్యుతా ! నేను వేదశాస్త్రాధ్యయనము చేసినాను; దానములు చేసినాను; భూమి నేలినాను; శత్రువుల నణచినాను; క్షత్రియోచితమైన యుద్ధమరణము నొందినాను. నాకంటె నధికు డెవడు ? మీరు శోకించుచు బ్రతుకుడు. నేను సుహృద్వర్గముతో, అనుచర వర్గముతో స్వర్గమునకు వెళ్ళుచున్నాను. అని.

దుర్యోధనుని యీమాట ముగిసినతోడనే పుష్పవృష్టి సిద్ధుల సాధువాదములు జరిగినవి; దిక్కులు ప్రకాశించినవి.

ఈపుష్పవర్షాదులచే దుర్యోధనునకు ముందు స్వర్గప్రాప్తి యను విషయము తెలుపబడినది. “అస్య వాక్యస్య నిధనే” అనునపుడు ‘అస్య’ అను ఇదంశబ్దము “ఇదమస్తు సన్నికృష్టమ్” అని సన్నికృష్టపరామర్శ

కము. ఆపన్నికృష్టవాక్యము—"స్వర్గం గన్తాఽసి మచ్యుత" అను నది. పూర్వోక్తప్రకారము అధర్మముల కొడిగట్టిన దుర్యోధనునకు ప్రాప్తించునది నరకమా ? స్వర్గమా ? అను సందేహము పోగొట్టుటకై యుద్ధమరణనిమిత్తమున ముందుగా ప్రాప్తించునది స్వర్గమే అని సూచింపబడినది. శిశుపాలవధసందర్భమున శ్రీకృష్ణుడు జగద్వంద్యుడగునా ? కాడా ? అనుసందేహము పోగొట్టుటకు సంభవించిన పుష్పవృష్టి జగద్వంద్యుడని తెలిపినది. కాబట్టి యెప్పుడయినను ఒక సందేహనివృత్తికే పుష్పవర్షాదికము కలుగుచుండు నని తెలిసికొనవలెను. దుర్యోధనుడు పాపాత్ముడనుటలో సందేహము లేదు. నీవీ యీపాపకార్యములు చేసినావని యుద్ఘాటించిన శ్రీకృష్ణునకు దుర్యోధనుడు నేనవి చేయలేదని బదులు చెప్పనేలేదు. అట్టిస్థితిలో ఆతడు పుణ్యాత్ముడనుటకు పుష్పవర్షాదికము ప్రమాణమని ప్రతివాదులనుట అసంగతము కాదా ? ఈదుర్యోధనుడు పుట్టినపుడు గోచరించిన ఉత్పాతములు కులాంతకుడగుననియు, లోకోపద్రవకారి యగునని యు సూచించినవి. ఈతడు పరలోకమున కేగునపుడు గోచరించిన పుష్పవర్షాదికము ఈతనికి ముందుగా స్వర్గము ప్రాప్తించునని సూచించెను ఈరెండును నిజమే. ప్రతివాదిమతములో నీరెండును విరుద్ధములగును. దుర్యోధనపరిసమాప్తితో భూభారహరణ మగుటనుబట్టి సిద్ధసాధువాద-దివ్యప్రకాశములు సంభవించినవి.

ఆపుష్పవర్షాదికృతమైన దుర్యోధనపూజను చూచి శ్రీకృష్ణ ప్రభృతులు లజ్జితులైనట్లు చెప్పబడినది—

"వాసుదేవ పురోగమాః । దుర్యోధనస్య పూజాం తు దృష్ట్వా వ్రీడా ముపాగమన్ ।"

ఇచ్చట వాసుదేవునియందు చెప్పబడిన లజ్జ భగవానుని మనుష్యచేష్టాభినయమాత్రము. ఈవిషయము 'శ్రీకృష్ణనిందానిరాకరణము'లో ప్రతిపాదింపబడినది.

ఇక పాండవులయందలి. లజ్జ అధర్మభీతు లగు పాండవుల యోగ్యతావిశేషమునే చాటుచున్నది. యుద్ధమందలి సామాన్యధర్మ మునుబట్టి తాము చేసిన దధర్మ మనుకొని వారు లజ్జితులైనారు. కర్ణ దుర్యోధనాదులపట్ల విశేషధర్మము నుబట్టి వీరిట్లు వధింపబడవలసిన వారే. మీరు చింతింపవలసినపని లేదు. అని అప్పుడు కృష్ణపర మాత్మ బోధించియున్నాడు—

"మిథ్యా వధ్యా స్త్వ్రిపాయై ర్బహవ శ్శత్రవో౽ధికాః ।
పూర్వై రనుగతో మార్గో దేవై రసురఘాతిభిః ॥
సద్భిః శ్చానుగతః పన్థా స్స సర్వై రనుగమ్యతే ।" అని.

ఇంకొకవిశేషము—"స్వధర్మనిష్ఠులమైన మమ్ము నీవు అధర్మ మార్గమున బడగొట్టించినావు" అని శ్రీకృష్ణునితో బలికిన దుర్యో ధనుడు ద్యూత మధర్మమని చెప్పినతండ్రితో రాజధర్మమును చెప్పుచు- లోకవృత్తము వేరు, రాజవృత్తము వేరు. రాజు సదా స్వార్థచింతా పరుడై యుండవలెను. రాజునకు శత్రుజయము స్వవృత్తి. అది ధర్మము కానిమ్ము; అధర్మము కానిమ్ము. ప్రచ్ఛన్నముగాగాని, ప్రకాశముగా గాని శత్రుబాధకమైన యుపాయ మేదో అదియే శస్త్ర మనబడును. అని స్వసిద్ధాంతమును చెప్పియుండెను. (సభాప. అ ౕ౫)

ఈదుర్యోధనుడు స్వధర్మనిష్ఠుడట ! శ్రీకృష్ణుని దధర్మమట ! నిర్దోషులయందు శత్రుత్వము వహించి శత్రునిగ్రహోపాయములలో ధర్మాధర్మవిచక్షణముతో బనిలేదని సాగినంతవరకు ఘోరకృత్యము లతో ప్రవర్తించినవాడు దుర్యోధనుడు. దుష్టులయందును మిత్రభావ మునే వహించి, అష్టకష్టములు సహించి శాంతితో సంధికై ప్రయ త్నించి తప్పక వచ్చిపడిన యుద్ధములో, శత్రునిగ్రహపద్ధతులలో ధర్మము నతిక్రమింపక, ధర్మసంస్థాపకు డగు కృష్ణభగవానుని అను మతిపై తత్త్వచ్ఛాప- అనుగ్రహ- ప్రతిజ్ఞా- రూపవిశేష ధర్మావలంబన మున శత్రునిగ్రహము నాచరించినవారు పాండవులు.

దుర్వృత్తి కలిగియున్న దుర్యోధనుడు అర్థియై వెళ్ళి యుద్ధసాహాయ్యము గోరినపుడు లక్ష గోపాలనారాయణసేన నిచ్చి పంపినవాడు కృష్ణభగవానుడు. ఆకృష్ణభగవానుడు సంధికై వచ్చుచున్నాడని తెలిసి నపుడే ఆతని బంధించి పడవేయఁదలచితిని. ఇది సాగుట కుపాయము చెప్పవలసినదని భీష్మాదులతో పలికినవాడును, సాగలేదుగాని కురుసభలో బంధింప నుద్యమించినవాడును దుర్యోధనుడు.

అట్టి దుర్యోధనుని క్షేమముగోరి సంధిజేసుకొని నీవు సుఖింపుమని బోధించినవాడు కృష్ణభగవానుడు. ఆకృష్ణభగవానునితో నే నేతప్పులు చేసి యెరుగను; నే నేమియు పాండవుల కిచ్చువాడను గాను. యుద్ధములో జంపుటో, చచ్చుటో కావలసినదే. అని తెగించి మాటలాడినవాడు దుర్యోధనుడు.

ఇట్టి దుర్యోధనుడు ధర్మనిష్ఠుడా ? కృష్ణభగవానుడధర్మపరుడా ? లోకములో దుష్టశిక్షణము, శిష్టరక్షణము లోకక్షేమము గోరు ప్రభువునకు లక్షణము. ధర్మాత్ములు శిష్టులనియు, అధర్మాత్ములు దుష్టులనియు లోకవ్యవహారము. అందుచే శిష్టరక్షణమూలకముగా ధర్మస్థాపనము, దుష్టశిక్షణమూలకముగా అధర్మ నిర్మూలనము ప్రభువుయొక్క కృత్యమై యున్నది. ఆ కృత్యములలో ప్రభువు రాగద్వేషవశుడై యుండక శాస్త్రీయమైన ధర్మమందే దృష్టి కలిగి యుండును. అట్టి ప్రభువు యొక్క నిగ్రహానుగ్రహములకు వ్యక్తిగత పక్షపాతము హేతువు కాదనుట మతిమంతులకు తెలిసినవిషయమే.

ఇట్టిస్థితిలో జగత్ప్రభువై యుండి—

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే ॥"

అని లోకమునకు చాటిన కృష్ణభగవానుడు సాధుపరిత్రాణముగా పాండవరక్షణమును, అసాధువినాశముగా దుర్యోధనాది దుష్టనిగ్రహమును గావించి ధర్మసంస్థాపనము జేసెననియు, పై శ్లోకము

నకు లక్ష్యములే పాండవకౌరవచర్య లనియు, అధర్మనిర్మూలనపూర్వక ముగా కృష్ణభగవానుడు చేసినది ధర్మసంస్థాపనమే కాని మరియొకటి కాదనియు ప్రతివాదులు తెలిసికొందురుగాక.

—: పాండవులనుగూర్చి కృష్ణపరమాత్మ తెలిపిన ముఖ్యవిషయము :—

దూతగా వెళ్ళిన కృష్ణపరమాత్మను భోజనమునకై దుర్యోధనుడు ఆహ్వానించి అతని యనంగీకారమును గ్రహించి పాండవులకును, మాకును ద్వేషముకాని మనలో మన కేమున్నది ? అని ప్రశ్నించి నపుడు కృష్ణపరమాత్మ యిట్లు చెప్పెను—

"అకస్మా ద్ద్వేష్టి వై రాజన్ జన్మప్రభృతి పాండవాన్ ।
ధర్మే స్థితాః పాండవేయాః క స్తాన్ కిం వక్తు మర్హతి ॥
య స్తాన్ ద్వేష్టి స మాం ద్వేష్టి య స్తా నను స మా మను ।
ఐకాత్మ్యం మాం గతం విద్ధి పాండవై ర్ధర్మచారిభిః ॥" (ఉద్యో. అ. 91)

జన్మప్రభృతి నీవు నిష్కారణముగా పాండవులను ద్వేషించుచున్నాను. ధర్మనిష్ఠులైన పాండవులయందు ఈతప్పున్నదని అనగలవాడెవ్వడు ? ధర్మచారులైన పాండవులే నేనని తెలిసికొనుము. వారిని ద్వేషించుట నన్ను ద్వేషించుటే, వారిని పూజించుట నన్ను పూజించుటే; కనుక మన కేమి ద్వేషము ? అని నీవనుట తప్పు. అని. దీనిచే భగవంతుడు మెచ్చుకొనిన ధర్మనిష్ఠులు పాండవు లనియు, ధర్మమే భగవంతునకు ప్రాణ మనియు, ధర్మద్రోహులు భగవద్ద్రోహు లనియు స్పష్టమైనది.

ఈచెప్పిన శ్రీకృష్ణు డెట్టివాడు ? "పితాఽహ మస్య జగతః" "తపా మ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామి చ" (భగవద్గీత)

జగత్పితయై, సువృష్టి- అతివృష్టి- అనావృష్టులను కలిగించువాడై వారివారి ధర్మాధర్మానుగుణముగ ప్రజల కన్నోదకములు కల్పించువాడు. ఇట్టి కృష్ణభగవానుని, అట్టి పాండవులను నిందించు లోకమునకు అన్నోదకసమృద్ధి యెట్లో ప్రతివాదు లాలోచింపవలయు.

—: దుర్యోధనాశ్వత్థామాదిసంభాషణము; అశ్వత్థామకృతసౌప్తిక వధకార్యమునకు దుర్యోధనుని అభినందనము :—

ఊరుభంగమై పడియున్న దుర్యోధనుని విడిచి సేనలతో పాండవులు శ్రీకృష్ణపురస్కృతులై కౌరవశిబిరములకు వెళ్ళినతరువాత క్షతగాత్రులై యున్న కృప- అశ్వత్థామ- కృతవర్మలు దుర్యోధనుని సమీపించినపుడు దుర్యోధను డిట్లనెను—

"పృథివీం పాలయిత్వాఽహ మేతాం నిష్ఠా ముపాగతః ।
మా భవంతోఽత్ర తప్యన్తాం సౌహృదా న్నిధనేన మే ॥
యది వేదాః ప్రమాణం వో జితా లోకా మయాఽక్షయాః ।
మన్యమానః ప్రభావం చ కృష్ణస్యామితతేజసః ॥
తేన న చ్యావిత శ్చాహం క్షత్రధర్మా త్స్వనుష్ఠితాత్ ।
యతితం విజయే నిత్యం దైవం తు దురతిక్రమమ్ ॥"

మహనీయులారా! భూమిని పాలించి తుదకు నే నీస్థితికి వచ్చితిని. నా నిధనమునకు మీరు విచారింపకుడు. వేదములు ప్రమాణమైనపుడు నేను స్వర్గమును జయించితి ననుటలో సందేహ మేమి? మహాతేజశ్శాలియగు శ్రీకృష్ణుని ప్రభావము నే నెరిగియుండియు నా యుద్ధోద్యమమును మాన్పించుటకు శ్రీకృష్ణు డెంత చెప్పినను అది క్షత్రధర్మమని నేను మానలేను. విజయమునకై నిత్యప్రయత్నము చేయబడినది. దైవము దురతిక్రమముకదా! అని దుఃఖించెను.

అప్పుడు అశ్వత్థామ పాంచాలుల నందరును నేను వధింతును. నా కనుజ్ఞనిమ్మనగా దుర్యోధనుడు కృపాచార్యద్వారా అశ్వత్థామను సైన్యాధిపత్యమందు అభిషిక్తుని జేసి అనుజ్ఞనీయగా పాండవశిబిరములలో రాత్రి గాఢసుషుప్తిలోనున్న పాంచాలాదులను, పాండవసేనలను, ఉపపాండవులను (పాండవులు శ్రీకృష్ణసహితులై ఓఘవతీ నదీతీరమందున్నారు) రౌద్రావేశమున వధించి దుర్యోధనుని యొద్దకు చేరి యిట్లు చెప్పెను.

"దుర్యోధన జీవసి త్వం వాక్యం శ్రోత్రసుఖం శృణు ।
సప్త పాండవత శ్చేషా ధార్తరాష్ట్రా స్త్రయో వయమ్ ॥
తే చైవ భ్రాతరః పంచ వాసుదేవోఽథ సాత్యకిః ।
అహం చ కృతవర్మా చ కృప శ్శారద్వత స్తథా ॥
పంచాలా నిహతా స్సర్వే మత్స్యశేషం చ భారత !
కృతే ప్రతికృతం పశ్య హతపుత్రా హి పాండవాః ॥
సౌప్తికే శిబిరం తేషాం హతం సనరవాహనమ్ ।"

దుర్యోధనా! జీవించియున్నావుగనుక నీకు సంతోషవార్త చెప్పెదను వినుము. పాండవపక్షములో పాండవులు సాత్యకి, శ్రీకృష్ణుడు అను ఏడ్గురును కౌరవపక్షములో కృపాచార్యకృతవర్మలు, నేను అను ముగ్గురును శేషించినాము. మిగిలినవారందరిని రాత్రి నిద్రించుచున్నపుడు వధించితిని. అని.

"దుర్యోధనస్తు తాం వాచం నిశమ్య మనసః ప్రియాం ।
ప్రతిలభ్య పునశ్చేత ఇదం వచన మబ్రవీత్ ॥
న మేఽకరోత్ గాంగేయో న కర్ణో న చ తే పితా ।
య త్త్వయా కృపభోజాభ్యాం స హితే నాఽద్య మే కృతమ్ ।
స చ సేనాపతిః క్షుద్రో హత స్సార్థం శిఖండినా ॥
తేన మన్యే మఘవతా సమ మాత్మాన మద్య వై ।"

కంఠగతప్రాణుడై యున్న దుర్యోధనుడు ఆప్రియవచనమును విని, స్మృతిదెచ్చుకొని యిట్లనెను— అశ్వత్థామా! కృప కృతవర్మ సహితుడవైన నీవు నాకు చేసిన మేలు భీష్మద్రోణకర్ణులుగూడ చేయులేదు. ఆధృష్టద్యుమ్నశిఖండులు హతులైనారుకనుక ఇప్పుడు నేను ఇంద్రునితో తుల్యుడ నని తలచుచున్నాను; అని. ఇచ్చట "భీష్మద్రోణకృపాదీం శ్చ ప్రవేక్ష్య న్త్యపరేఽసురాః" అని చెప్పబడుటచే సౌప్తికవధవిషయకమైన కృపాచార్యాదిప్రవృత్తి ఆసురావేశమూలకమె అని తెలిసికొనవలయును. ఇట్లు తన సంతోషమును వెల్లడించి దుర్యోధనుడు శరీరము విడిచెను.

ఇచ్చట అశ్వత్థామకృతసౌప్తికవధము దుష్కార్యమైయుండ కంఠగతప్రాణుఁడై కూడ దాని కానందించినవాఁడు దుర్యోధనుఁడు; ఇదియే దుష్టలక్షణము. ఈవిషయమే ఇట్లు చెప్పఁబడినది—

పాపః కంఠగతప్రాణోఽప్యభినన్దతి పాపినం ।
ద్రోణిం ప్రసుప్తబాలఘ్నం పాంసుభుక్కురరాడివ ॥" (నీలకంఠీయమ్)

—: హతపుత్రమిత్రుఁడై యున్న ధృతరాష్ట్రునకు వేదవ్యాస భగవానుఁ డుపదేశించిన విధము :—

శోకాకులుఁడై యున్న ధృతరాష్ట్రుని విదురుఁడు బహువిధముల జెప్పి యోదార్చెను. వ్యాసభగవానుఁ డోదార్పులలో నిట్లు చెప్పెను—

ధృతరాష్ట్రా! వినుము— పూర్వము నేను దేవసభకు వెళ్ళి యున్నాను. అక్కడకు భూదేవి వచ్చి నాకార్యముమాట యేమని యడిగినపుడు విష్ణుభగవానుఁ డామె కిట్లు చెప్పెను—

"ధృతరాష్ట్రస్య పుత్రాణాం యస్తు జ్యేష్ఠశ్శతస్య వై ।
దుర్యోధన ఇతి ఖ్యాత స్స తే కార్యం కరిష్యతి ॥
తం చ ప్రాప్య మహీపాలం కృతకృత్యా భవిష్యసి ।
తస్యార్థే పృథివీపాలాః కురుక్షేత్రం సమాగతాః ॥
అన్యోన్యం ఘాతయిష్యంతి దృఢైశ్శస్త్రైః ప్రహారిణః ।
తత స్తే భవితా దేవి భారస్య యుధి నాశనమ్ ॥
గచ్ఛ శీఘ్రం స్వకం స్థానం లోకాన్ ధారయ శోభనే ।
స ఏష తే సుతో రాజన్ లోకసంహారకారణాత్ ॥
కలే రంశ స్సముత్పన్నో గాంధార్యా జఠరే నృప ।
అమర్షీ చపలశ్చాపి క్రోధనో దుష్ప్రసాధనః ॥
దైవయోగా త్సముత్పన్నా భ్రాతర శ్చాస్య తాదృశాః ।
శకుని ర్మాతుల శ్చైవ కర్ణశ్చ పరమ స్సఖా ॥
సముత్పన్నా వినాశార్థం పృథివ్యాం సహితా నృప !
యాదృశో జాయతే రాజా తాదృశోఽస్య జనో భవేత్ ॥
అధర్మో ధర్మతాం యాతి స్వామీ చే ద్ధార్మికో భవేత్ ।
స్వామినో గుణదోషాభ్యాం భృత్యా స్స్యు ర్నాత్ర సంశయః ॥

దుష్టరాజాన మాసాద్య గతా స్తే తనయా నృప !
న హి తే పాండవా స్స్వల్ప మపరాధ్యన్తి భారత ॥
పుత్రా స్తవ దురాత్మానో యై రియం ఘాతితా మహీ ।'' (స్త్రీపర్వము)

ఓ భూదేవీ ! ధృతరాష్ట్రుని జ్యేష్ఠపుత్రుడగు దుర్యోధనునిమూలమున నీ కార్యము చక్కబడును. అతని వలన ఘటించెడి యుద్ధములో పృథివీపతులు పరస్పరహతులగుదురు. నీకు భారహరణ మగును. నీవు స్వస్థానమునకు వెళ్ళుము. అని.

ధృతరాష్ట్రా ! అట్టి నీ యీ సుతుడు లోకసంహారనిమిత్తముగా కలియంశమున గాంధారీగర్భమున జన్మించి దుర్గుణములు గలిగి యుండెను. దైవయోగమున అతనిసోదరులుగూడ అతనివంటివారే పుట్టినారు. శకుని కర్ణుడు మొదలగువా రందరు లోకక్షయమునకే పుట్టినారు. రాజు గుణదోషములే అనుచరుల కంటును. ఆ పాండవులు కించిత్తును అపరాధము చేసి యెరుగరు. నీ పుత్రులు దురాత్ములై లోకహాని గలిగించినారు; అని.

ఇట్లు చెప్పి నీవు పుత్రశోకమున మరణింపబూనకుమా ? జీవించి పాండవులపై దయగలిగి కీర్తి గడింపు మని బోధించుటయు, ధృతరాష్ట్రుడు— "ధారయిష్యా మ్యహం ప్రాణాన్" అని అంగీకరించుటయు జరిగినతరువాత వ్యాసభగవాను డంతర్ధాన మయ్యెను.

గాంధారీధృతరాష్ట్రులు సపరివారముగా యుద్ధభూమికి వచ్చి శోకించుచున్నపుడు పాండవులు వెళ్ళి ధృతరాష్ట్రునకు పాదాభివందనము చేయుటయు, ధృతరాష్ట్రుని విరుద్ధభావము శ్రీకృష్ణోపదేశమున తొలగిపోవుటయు సంభవించినతరువాత—

"తత స్స భీమం చ ధనంజయం చ మాద్ర్యాశ్చ పుత్రౌ పురుషప్రవీరౌ ।
పస్పర్శ గాత్రై స్స రుదన్ సుగాత్రా నాశ్వాస్య కల్యాణ మువాచ చైతాన్ ॥"

ఆధృతరాష్ట్రుడు కంట తడిపెట్టుకొనుచు పాండవులను దగ్గరదీసి వారిశరీరములు నిమిరి మంగళాశీర్వచనములు చేసెను. తరువాత

గాంధారీసన్నిధికి పాండవులు వెళ్ళబోవునపుడు పుత్రశోకార్తురాలైన ఆమె యుధిష్ఠిరునిపై పెట్టుకొనియున్న విరుద్ధాభిప్రాయము తత్కాలగతుడైన వ్యాసభగవానుని ప్రబోధమును బట్టి తొలగిపోగా స్వస్థచిత్తురాలై యిట్లనినది—

"దుర్యోధనాపరాధేన శకునేః సౌబలస్య చ ।
కర్ణదుశ్శాసనాభ్యాం చ కృతోఽయం కురుసంక్షయః ॥
నాపరాధ్యతి బీభత్సుర్న చ పార్థో వృకోదరః ।
నకులః సహదేవశ్చ నైవ జాతు యుధిష్ఠిరః ॥"

కర్ణశకునిదుర్యోధనదుశ్శాసనుల అపరాధములచేతనే కులక్షయమిట్లయినది. పాండవుల తప్పేమియు లేదు; అని.

ఇది దుష్టచతుష్టయచర్యాసంగ్రహము. ఇది ప్రతివాది భ్రాంతి నిరాసపూర్వకముగా పాండవపూజ్యతాప్రకటనార్థమై యెత్తి చూపబడినది. ఈవిషయమే ఈభాగమున కాదిలో ప్రదర్శింపబడిన—"యుధిష్ఠిరో ధర్మమయో మహాద్రుమః" "దుర్యోధనో మన్యుమయో మహాద్రుమః" అను భారతసూత్రభూతములగు రెండుశ్లోకములచే మహర్షిచే ప్రతిపాదింపబడినది. కౌటిల్యార్థశాస్త్రములో ఇంద్రియజయప్రకరణమున కామ, క్రోధ, లోభ, మాన, మదాదిదోషములను బట్టి సపరివారముగా నశించినవారిని చెప్పునట్టి ప్రస్తావములో—

"మానాత్ రావణః పరదారాన ప్రయచ్ఛన్ । దుర్యోధనో రాజ్యాదంశం చ, సబంధురాష్ట్రో వినసాశ ।"

టీ. బాలిశ్యా దాత్మ న్యనుపమత్వబుద్ధి ర్మానః ।

అని చెప్పబడినది. దీనిచే పరదార నపహరించి రావణుడును, పరరాజ్య మపహరించి దుర్యోధనుడును చేటు దెచ్చికొనినా రని వెల్లడింపబడినది.

ఇట్లు ధర్మాత్ములగు పాండవులు, పాండవనిర్మాలనరాజ్యలాభదురాశతో కర్ణదుర్యోధనులు తెచ్చిపెట్టిన మహాసంగ్రామములో శ్రీకృష్ణరక్షితులై "యతో ధర్మ స్తతో జయః" అని గాంధారి యన్న.

ట్లును, "ప్రీతో౽హం పుత్ర యుధ్యస్వ జయ మాప్నుహి పాండవ" "యతః కృష్ణ స్తతో ధర్మో యతో ధర్మ స్తతో జయః" అని భీష్ముఁ డన్నట్లును, "అనుజానామి యుద్ధ్యస్వ విజయం సమవాప్నుహి" అని ద్రోణాచార్యు డన్నట్లును, విజయమునొంది స్వరాజ్యమందు మహర్షుల చేతను, ప్రజలచేతను జరుపబడిన పాండవపట్టాభిషేకమహోత్సవము నొంది దేదీప్యమానులై విరాజిల్లిరి.

"భీష్మద్రోణతటా జయద్రథజలా గాంధారనీలోత్పలా ।
శల్యగ్రాహవతీ కృపేణ వహనీ కర్ణేన వేలాకులా ॥
అశ్వత్థామవికర్ణఘోరమకరా దుర్యోధనావర్తినీ ।
సోత్తీర్ణా ఖలు పాండవై రణనదీ కైవర్తకః కేశవః ॥
జయతు జయతు దేవో దేవకీనన్దనో౽యం
జయతు జయతు కృష్ణో వృష్ణివంశప్రదీపః ।
జయతు జయతు మేఘశ్యామలః కోమలాంగో
జయతు జయతు పృథ్వీభారనాశో ముకున్దః ॥"

## —: భారత విమర్శన–నిరాకరణము :—

సుయోధనవిజయమునకు ప్రథమముద్రణములో 'తొలిపలుకు'ను, ద్వితీయముద్రణములో 'భారతవిమర్శన'ను గరిగిపాటి రామమూర్తి బి. ఏ. గారు వ్రాసియున్నారు. తొలిపలుకులోని విరుద్ధాంశములు పూర్వప్రసంగములలో నిరాకరింపబడినవి. ఈభారతవిమర్శన 42పుటలు కలిగి 'సుయోధనవిజయము'నకు వ్యాఖ్యానరూపముగా వ్రాయబడి యున్నది.

దీని పరీక్షించుచు సింహావలోకనన్యాయమున ఉక్తానుక్తచింత వలె విషయనిరూపణము చేయబడుచున్నది.

వీరివిమర్శనలో ప్రతిపాదింపబడిన అంశములు— (1) సుయోధన విజయశబ్దార్థము యుక్తమేనట! (2) వ్యాసచర్య నింద్యమట! (3) ధృతరాష్ట్రునకు పట్టాభిషేకమట! (4) పాండవుల దౌష్ట్యమట! (5) ద్రౌపది నవ్వినదట! (6) ద్యూత మన్యాయరహితమేనట! (7)ద్రౌపదీ

పంచపతిత్వము దూష్యమట! (8) శ్రీకృష్ణుడు ఆరవపతికి అవకాశ మిచ్చెనట! (9) ద్రౌపదికి ఆరవవానిపై దృష్టిపడెనట! (10) ద్రౌపది ద్యూతవిజితయే యట! (11) ధర్మరాజు ద్రౌపదిని రజస్వలావేషము ధరించి రమ్మనెనట! (12) ద్రౌపదీవస్త్రాపహరణము జరుగలేదట! (13) జయము, భారతము, మహాభారతము అని మూడు గ్రంథములు ముగ్గురిచే క్రమముగా పెంచి వ్రాయబడెనట! యథాక్రమముగా వీనిని పరిశీలించుచున్నాము—

1. సుయోధనవిజయశబ్దార్థము— ఇక్కడ కర్మణిషష్ఠీయని, విజయమనగా శత్రువును చంపుట యని. సుయోధనుడు భీమునిచే చంపబడె నని దాని కర్థమని చెప్పి, అపై భౌతికము, నైతికము అని విజయము రెండువిధము లనుచు భౌతికవిజయము పాండవుల దని నైతికవిజయము సుయోధనుని దని ఆ శబ్దమున కర్థము విమర్శనకర్తలు వ్రాసినారు. దీనిచే కర్మషష్ఠినేకాక కర్తృషష్ఠినిగూడ వీరు అంగీకరించి సుయోధనునకు విజయ మనికూడ అర్థము చెప్పినట్లయినది.

ఇచట వీరి నడుగవలసియున్నది— మీరు చెప్పినట్లు విజయ శబ్దమునకు చంపుట అర్థముకనుక కర్మషష్ఠీపక్షములో సుయోధనుని చంపుట అను అర్థముచే సుయోధనవిజయశబ్దమునకు పాండవవిజయ మని అర్థము తేలినది.

అట్లు కర్తృషష్ఠీపక్షములో ఎవ్వని జంపుటచే సుయోధనునకు విజయము? సుయోధనునకు ప్రతిద్వంద్వి భీమసేనుడు. భీమసేనునిచే సుయోధనుడు చంపబడినట్లు మీరే వ్రాసినారు. కనుక పాండవవిజయ మనక సుయోధనవిజయమనుట అయుక్తము.

ఇంకొకటి— నైతికవిజయము సుయోధనుని దంటిరే! ఆమాటకు ధర్మవిజయమని తాత్పర్యమా? అయితే విజయాశీర్వాద మపేక్షించి వచ్చిన పుత్రునకు గాంధారి 'విజయీ భవ' అని అనక "యతో ధర్మ

స్తతో జయః' అని యనుటచే సుయోధనుని దధర్మ మని, అది అపజయ కారియని సూచింపబడుటవలన అపజయ మనవలసియుండ విజయ మనుటే తప్పు. ధర్మవిజయమనుట అసలే తప్పు.

ఇంకొకటి— కురుసభనుండి వెళ్ళునప్పుడు శ్రీకృష్ణునితో కర్ణుడు— మహాయుద్ధము సర్వనాశహేతువై ప్రాప్తించుచున్నది.

"నిమిత్తం తత్ర శకుని రహం దుశ్శాసన స్తథా।
దుర్యోధన శ్చ నృపతి ర్ధృతరాష్ట్రసుతోఽభవత్ ॥"

దానికినిమిత్తము మా చతుష్టయమే అని చెప్పి ఆ యుద్ధము లోని జయాపజయములనుగూర్చి కూడ చెప్పుచు—

"స్వప్నా హి బహవో ఘోరా దృశ్యన్తే మధుసూదన।
పరాజయం ధార్తరాష్ట్రే విజయం చ యుధిష్ఠిరే॥
శంసన్త ఇవ వార్ష్ణేయ వివిధా రోమహర్షణాః।" (ఉద్యో. అ. 148)

ప్రస్తుతము గోచరించుచున్న స్వప్నాదినిమిత్తములు యుధిష్ఠిర విజయమును, దుర్యోధన పరాజయమును తెలుపుచున్నవి. అని చెప్పి యుండుటచే సుయోధనవిజయ మనుట తప్పే.

ఇంకొకటి.— సుయోధనునకు మీరన్నట్టి విజయము ద్యూత మందా? యుద్ధమందా? ద్యూతమందు చంపుట అను అర్థముగల విజయము లేనేలేదు. యుద్ధమందును అది లేదు. అందుచే గెలుపు అనియే అర్థము చెప్పవలయును. ఆ గెలుపు యుద్ధములో సుయోధను నకు లేనేలేదు. ద్యూతములోనున్నది. అచట మీరు కల్పించిన రెండిం టిలో సుయోధనుని గెలుపు భౌతికమా? నైతికమా?

'భీముడు సుయోధనుని తొడలు అన్యాయముగా విఱుగగొ ట్టుట ఘోరపాపకార్య మని సూచించు నుత్పాతములు బుట్టినవి' పు.40 అని మీరువ్రాసినట్లు ప్రథమద్యూతాంతమున— "ధృతరాష్ట్ర నగ్నిహోత్రాయతనంబున నఱచె నక్కలు" అని చెప్పబడిన మహో త్పాతములు సుయోధనునిది ఘోరపాపకార్య మని సూచించెనా?

